# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **తెలుగు భాగవతం** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భాగవతం** వారి వెబ్ సైట్: http://telugubhagavatam.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## తెలుగు భాగవతం వారి వెబ్ సైట్:

**http://telugubhagavatam.org/**

ముంగిలి : పోతన తెలుగు భాగ

telugubhagavatam.org

# పోతన తెలుగు భాగవతం

ముంగిలి | గ్రంథము | ప్రవేశిక | వివరణలు | కోశాలు | గణాంకాలు

ముంగిలి

ముంగిలి
ప్రవేశిక
వివరణలు
గ్రంథము
కోశాలు
గణాంకాలు
అలంకార
స్పందన
వ్యాకరణము

సహజ కవి పోతన గారి భాగవత గ్రంథం అనే విశ్వం అందాన్ని అంతటిని తెలుగు లిపిలో అందించాలనే ప్రయత్నమే మన ఈ తెలుగుభాగవతం.ఆర్గ్. ఇది పోతన భాగవతంలోని 9014 పద్యగద్యలు అన్నీ, ప్రతి పద్యగద్య శ్రవణదస్త్ర ప్రతిపదార్థములు, పదాల వివరణలు,ఛందో నియమాలు, సంబంధిత ఇతర గ్రంథాదులు అన్నిటి సమాహారం మన తెలుగుభాగవతం.ఆర్గ్. గణనాధ్యాయులోని అధ్యయనాలు కూడ ఇచ్చాము.వ్యాస కృతి సంస్కృత మాతృక నుండి ప్రాంతీయ భాషల లోకి తీసుకొచ్చినప్రథమ భాగవతం మనదే.

భాగవతం భక్తి ప్రపత్తులకి కాణాచి. ఇది పంచమ వేదం. అందుకే పోతన గ్రంథారంభం లోనే యిలా అన్నారు

శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకు నై చింతించెదన్.

శ్రీ వేదవ్యాసులు క్రీ. పూ. 3000 కన్నా పూర్వం వారు. బమ్మెర పోతనామాత్యులు క్రీ. శ. 1373 - 1460 మధ్య జీవించారు. పోతన తెలుగు భాగవతంలోని ప్రతి పద్యం సద్యోముక్తి సంధాయకం. పోతనది.

పలికెడిది భాగవత మట
పలికించెడి వాడు రామభద్రుండట

అన్న ప్రపత్తి. స్వేచ్ఛానువాద ప్రక్రియ.గంటం పంచదారలో అద్ది రాసాడేమో లేకపోతే ఇంత మాధుర్యం ఎలా వస్తుంది?అన దగ్గ రచనాశైలి. ఇప్పుడు పోతన కృతిగా ప్రసిద్ధ మైనా దీనిలో గంగన, సింగన, నారయ అనిమరొక ముగ్గురి కృషి కూడా కొంత ఉంది. పోతన ఇతర రచనలు

1. వీరభద్ర విజయము
2. నారాయణ శతకము
3. భోగినీ దండకము.

ఇట్టి తెలుగు భాగవతం పద్యగద్యాలు, శ్రవణ దస్త్రములు (ఆడియోలు) పోతన యితర రచనలు మొదలైన వాటన్నటిని తెలుగులోసంకలనం జేసి తెలుగుభాగవత.ఆర్గ జాలిక ఒకే చోట అందిస్తోంది. గణనాధ్యాయి ఊలపల్లి సాంబశివరావు, వెంకట కణాద, బండి శ్రీనివాస్, ఉమామహేశ్వర్, మురియాల దిలీప్ మరికొందరు సభ్యుల సహకారంతో ఇదంతా మీకు అందిస్తోంది.తెలుగు భాగవతం.ఆర్గ్. ఈ గ్రంథాదులు ప్రధానంగా ఎమ్ ఎస్ వర్డ్, ఎక్సెల్లులు వాడుట వలన వాడుకరులకు మిక్కిలి అనుకూలంగా ఉన్నాయి.

భాగవత ప్రియులు, సాహితీ అభిమానులు, రసజ్ఞులు, తెలుగువారు రండి. ఆస్వాదించండి.ఈ జాలికని సహృదయంతో ఆదరించండి. మీ సూచనలు, అభిప్రాయాలుసాదరంగా అందించండి. అవి మా కెంతో ముఖ్యమైనవి.మరిన్ని విషయాలు

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

గణానాధ్యాయం

# సంపూర్ణ పోతన తెలుగు భాగవతము

ఊలపల్లి సాంబశివ రావు

4/23/2014

పోతన తెలుగు భాగవతము – తృతీయ ప్రచురణ - 2014

ప్రథమ ప్రచురణ 2010

ద్వితీయ ప్రచురణ 2013

రచయిత బమ్మెర పోతన

సంకలన కర్త ఊలపల్లి సాంబశివ రావు.

vsrao50@gmail.com

+91 9959613690

ప్రచురణ తెలుగుభాగవతం.ఆర్గ్

**చదువుకుందా భాగవతం; బాగుపడదాం మనం అందరం**

# పోతన తెలుగు భాగవతము

## ఉపోద్ఘాతము

## చదువుకుందాం భాగవతం; బాగుపడదాం మనం అందరం

### భాగవతం – పురాణం

శ్రీమద్భాగవత మహాపురాణం అష్టాదశ పురాణాల లోనిది, కావ్యత్రయం లోనిది. ముందు పురాణం గురించి చూద్దాము. "పురా అపి నవ ఇతి పురాణః ". ఎంతో పురాతన మైనది అయ్యి ఉండి; ఎప్పటి కప్పుడు సరికొత్తగా స్ఫురిస్తుండేది పురాణం. సర్గ, ప్రతిసర్గ, మనువులు, మన్వంతరము, వంశాను చరితములు పురాణానికి పంచలక్షణాలు అంటారు కొందరు. సర్గ, విసర్గ, స్థాన, పోషణ, ఊతులు, మన్వంతర, ఈశానుకథా, నిరోధ, ముక్తి, ఆశ్రయాలు అని పురాణానికి దశలక్షణాలు అంటారు కొందరు. వాటిలో ప్రధానమైనవి మహాపురాణాలు. వీటిలో ప్రసిద్ధమైనవి **మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యత్, బ్రహ్మాండ, బ్రాహ్మ, బ్రహ్మ, వైవర్త, వామన, వాయవ్య, వైష్ణవ, వారాహ,అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాందములు** యని పద్దెనిమిదింటిని (18) అష్టాదశ పురాణాలు అంటారు. శ్లో. మద్వయం, భద్వయం, చైవ బ్రత్రయం, వచతుష్టయం. అ, నా, ప, లిం, గ, కూ, స్కాని పురాణాని పృథక్ పృథకే. ఇంకా **ఉశన, కపిల, కాళి, సనత్కుమార, శంభు, సౌర, దౌర్వాస, నందీయ, నారసింహ, నారదీయ, పారశర, అంగీరస సంహి, భృగు సంహిత, మారీచ, మానవ, వాశిష్ఠ, లింగ, వాయు** పురాణములు – యని పద్దెనిమిదింటిని (18) అష్టాదశ ఉపపురాణాలు. సమస్త పురాణాలను సంస్కృతంలో మూలరచన గావించిన వారు, వేదాలను విభాగించిన వారు వ్యాస భగవానులు. శ్రీమద్భాగవతంలో భగవంతుని గురించి భాగవతుల గురించి చెప్పబడింది. సద్యోముక్తి సాధనమిది.

## భాగవతం - కావ్యం

హైందవ సాహిత్యంలో ముఖ్యమైనవి మూడు రామాయణ భారత భాగవతాలు. వేదాలు పునాదిరాళ్ళు, ఈ కావ్య త్రయం స్తంభాలు లాంటివి. రామాయణం మూల రచయిత వాల్మీకి మహర్షి. భారత భాగవతాలకు మూల రచయత వ్యాస భగవానులు. ప్రధానంగా రామాయణం సూర్య వంశ రాజుల చరిత్ర. భారతం చంద్రవంశస్థులది. భాగవతం భగవంతుని, భక్తుల గురించినది అని అనుకోవచ్చు. రామాయణంలో జీవన విలువలకు ప్రాధాన్యం, భారతంలో ఫలవంతమైన జీవనానికి ప్రాధాన్యం. భాగవతంలో పారమార్థానికి ప్రాధాన్యం. అందుకే పోతనామాత్యులవారు గ్రంధారంభం లోనే అన్నారు.

1-1 *శ్రీ కైవల్యపదంబుఁజేరుటకునై చింతించెదన్, లోకర*
*క్షైకారంభకు, భక్తపాలనకళాసంరంభకున్, దానవో*
*ద్రేకస్తంభకుఁగేళిలోలవిలసద్దృగ్జాలసంభూతనా*
*నాకంజాతభవాండకుంభకు, మహానందాంగనాడింభకున్.*

భాగవతంలో రామాయణ భారత కథలు కూడ చెప్పబడతాయి. ప్రబంధ లక్షణ సమాలంకృతం, బహు కథారత్నాల సమాహారం భాగవతం. వీటిలో చాలా వాటికి వైయక్తిక సంపూర్ణత కూడ గోచరిస్తుంది. ఈ సమాహారానికి సూత్రంగా శుక మహర్షి పరీక్షిన్మహారాజు లనే స్వర్ణ రజత దారాలతో చక్కగ పేన బడ్డాయి. మధుర

శృంగారము మధుర వైరాగ్యము కలగలసిన పురాణమిది. అందుకే మధురాధిపతే రఖిలం మధురం శ్రీకృష్ణుల వారికి ప్రథమపీఠం వేసారు.

## వ్యాస భట్టారకుడు

ఈ మహాపురాణాన్ని వ్యాసమహర్షులవారు సంస్కృతంలో రచించారు. వేదాలను విభాగించటం, మహాభారతాన్ని రచించిన పిమ్మట సమస్తమైన పురాణాలు ఆ మహానుభావుడే రచించారు. వాటిలో ఉత్కృష్టమైనది శ్రీమద్భాగవతం. ఈ మూల భాగవత రచనా కాలాన్ని నిర్ణయించడం కష్టం. ఇది 5000 సంవత్సరాల కంటె అతి పురాతనమైనది అన్నది నిర్వివదాంశం. ఈ మూల భాగవతం పన్నెండు స్కంధాలలో పద్దెనిమిదివేల శ్లోకాల బృహద్గ్రంధం.

## పోతన

అట్టి మహాభాగవతానికి తెలుగుసేత బమ్మెర పోతన చేయుట తెలుగజాతి అదృష్టం. **పోతన గారి ప్రణీతము అంటే ప్రహితమే, ప్రాణిహితమే, పరహితమే.** వీరు హలం కలం రెంటికి పదును యున్న కవికుల తిలకులు. కావ్యకన్యకను రాజులకీయని ఆత్మాభిమానంగల హాలికులు. తెలుగుసేతలో ఎనిమిది స్కంధాలు (1, 2, 3, 4 మరియు 7, 8, 9, 10 స్కంధాలు) వీరి కృతి అని మిగిలిన 5, 6 స్కంధాలు గంగన, సింగనల కృతి అని, 11 మరియు 12 స్కంధాలు నారయ కృతి అని స్థూలముగా అనుకోవచ్చు. తెలుగు సేతలో పన్నెండు స్కంధాలలో ఐదు,

పది స్కంధాలు రెండేసి భాగాలుగా ఇవ్వబడ్డాయి. దీని రచనా శైలి పద్యగద్యాల మేలుకలయికతో పండిత పామరుల నిద్దరిని అలరారిస్తుంటుంది. 31 రకాల పద్యగద్య రీతులను ప్రయోగిస్తు మొత్తం 9014పద్యగద్యలలో సాగింది యీ మనోహర కావ్యం. ఆ మహాకవి పోతన జీవితకాలం క్రీ శ 1378 నుండి 1460 అని పలువురు పండితోత్తములచే నిర్ణయింపడినది. శైవమతానుయాయులైన ఆరువేల నియోగి బ్రాహ్మణ బమ్మెర వంశంలో పుట్టాడు. తన వంశాన్నేకాదు తన జాతిని దేశాన్ని కూడ ఉద్ధరించాడు. సంస్కృత మహాభాగవతాన్ని ప్రాంతీయ భాషాంతీకరణ చేసినవాటిలో వీరిదే ప్రప్రథమమైనది అంటారు. వీరి ఇతర కృతులు వీరభద్ర విజయము, నారాయణ శతకము, భోగినీ దండకము. వీటిలో వీరభద్ర విజయం శైవమతానుసార గ్రంధం. భాగవతమంత ప్రసిద్ధం కాకపోయినా

*జగదీశాయ! నమో నమో నవసుధాసంకాశ తాంగాయ! శ్రీ;*

*నగనాథాయ! నమో నమో శుభకరానందాయ! వేదార్థపా;*

*రగ వంద్యాయ! నమో నమో సురనదీరంగత్తరంగావళీ;*

*మకుటాగ్రాయ! నమో నమో మునిమనోమందార! సర్వేశ్వరా!*

లాంటి చోట్ల వారి కవితా పటుత్వం ప్రస్ఫుటం గానే పలుకుతుంది. నారాయణ మకుటంతో సాగింది నారాయణ శతకం. భోగినీ దండకం వీరి తొలి రచనే కాదు అందుబాటులో ఉన్న దండకాలలో ఇదే తొట్టతొలిది అంటారు. వీరు సహజ కవులు. వీరి భాగవత రచనాశైలి చక్కెరపాకం ఆపాతమధురమని మహాపండితులు పేర్కొంటారు. పండిత పామరుల నిరువరను మెప్పిస్తుంది. అలా చెప్పకోదగ్గ పద్యాలలో ఒకటి. **మందార మకరందమునఁ దేలు.** ఇష్టమైన పద్యం

లేదా ఇష్టమైన కథనం లేదా మొత్తం గ్రంథం ఏదైనా సరే విడిగా చదువుకోవచ్చు రసపూర్ణంగా స్వసంపూర్ణంగా ఉంటాయి. ఉదా. **అల వైకుంఠ పురంబులో పద్యం, రుక్మిణీ కల్యాణం, గజేంద్ర మోక్షం** ఘట్టాలు. ఇందుకు భాగవతంలోని ఒక పద్యమేనా రానివాడు తెలుగువాడేకాదనెడి నానుడే నిదర్శనము. భాగవతంలో కథలు, శృంగారాలు, వైరాగ్యాలు, పద్యాలే కాదు వివిధ విషయాల వివరాలు, సాహిత్య ప్రక్రియలు చాలా ఉన్నాయి. వీటిలో పోతన గారి విశిష్ఠత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

## ఈ అంతర్జాల పుటలు – కంప్యూటరు దస్త్రములు

పోతనప్రణీతమైన ఆంధ్రమహాభాగవతమును అనేక మహాపండితులు ప్రసిద్ధ సంస్థలు పుస్తక రూపంలో ముద్రించాయి. అయితే ప్రస్తుత కాలానికి అనువైన అంతర్జాలం, కంప్యూటర్లలలో చదువు కొనుటకు వీలుగా అందిస్తున్నాము. విండోస్ ఉండి ఎమ్ ఎస్ ఆఫీసు లో యూనికోడ్ లిపితో కావలసిన భాగం సులువుగా చదువుకొనుటకు వీలుగా చేసాము. భారతీయో వంటి ఓపెన్ ఆఫీసులలో కూడ పనిచేయును. ఏ భాగంకావాలంటే అది కాపీ-పేస్టు, వెదుకుటలకు వీలుగా ఉండేలా చేసాము.

## సంకలన కర్త

2014 ఏప్రిల్ 23 http://www.telugubhagavatam.org/

మా తల్లితండ్రులు ఇద్దరు పుట్టి బుద్దెరిగి పిల్లలను దండించి ఎరుగని సాత్వికులు. తల్లి వెంకటరత్నంగారు మహా పతివ్రత, పరమ ఉత్తమురాలు. తండ్రి అచ్యుత రామయ్య గారు రాష్ట్ర రివెన్యూ శాఖలో తూర్పుగోదావరి జిల్లాలో పనిచేసారు. గణితంలో ఉద్దండులు. అన్నగారు లక్ష్మీనారాయణదేవ్ సివిల్ ఇంజనీరు. వారి సోదరప్రేమ బహు దొడ్డది. మార్గదర్శకత్వం చేయుటలోను ఎన్నదగినవారు. చెల్లెళ్ళు శేష కుమారి, లక్ష్మి యిద్దరు యిరువంశాల పేరు నిలబెట్టారు అని మంచి పేరు తెచ్చుకున్నారు. మా పూర్వీకులది కరిణీకపు వంశము. పితామహులు చిట్టిరాజు గారు మాతామహులు సాంబశివరావు గారు కరణాలే. శ్రీమతి లలిత ఇవటూరి భాస్కర రావు, ఛార్టెడు ఎక్కౌంటెంటు గారి పుత్రిక. మాకు ఫణి కిరణ్, భాస్కర కిరణ్ అని ఇద్దరు చక్కటి పుత్రులు. అట్టి **ఊలపల్లి సాంబశివ రావు** అనబడే నేను గణనాధ్యాయం అని భావగ్రహణం (conceptualisation) చేసికొని, సంకల్పించి, సంకలనం (compile) చేసి ఈ సంకలన చాసాను. స్వభావ రీత్యా బహు గ్రంధ పాఠకుడను. పౌగండ వయస్సులోనే పూజారి తాతగారి చలవ వలన అనేకమైన ఆధ్యాత్మికాది పుస్తకాలతో పరిచయం కలిగినవాడిని. వృత్తి రీత్యా రాష్ట్ర విద్యుత్ సంస్థలో ఇంజనీరుగా జీవించి. తల్లిలాంటి ఆ సంస్థ చల్లని చూపుల వలన కుటుంబ బరువు బాధ్యతలు తీర్చి 2007లో పదవీ విరమణ అనంతరం, ఈ పరిశోధాత్మక చిరు యత్నానికి ధైర్యం చేసాను. నాటి నుండి అందుబాటులో ఉన్న సమయమంతా కేటాయిస్తు ఈ సంకలనం కాగితం కలం వాడకుండ, కంప్యూటరు పై యూనికోడ్ ఖతులు వాడి చేసాను. ప్రథమంగా 2008 – 2010 లలో

అంతర్జాలంలో స్ఫ్రిబ్డ్ అనే జాలగూడు (ఇంటర్నెట్ సైటు) నందు ప్రచురించాను. రెండవ ప్రతి తెలుగు భాగవతం అని ప్రత్యేకంగా సొంత జాలగూడు ఏర్పరచుకొని 2011-2013 లలో ప్రచురించాను. ఇది మూడవ ముద్రణ. షిరిడి సాయి అనుగ్రహం వలన వలసిన కావలసినవన్నీ ఆయనే అనుగ్రహిస్తారన్న ధైర్యం చేసాను. భాగవత గణనాధ్యాయిని యని చెప్పుకుంటు ఈ ప్రయత్నంలో భాగంగా ఈ తెలుగు భాగవతం సంకలనం చేసా.

## కృతజ్ఞతలు

ఈ కృషికి ఉపయోగపడిన వివిధ పుస్తకముల రచయితలు, ప్రచురణకర్తలకు మరియు ఈ కృషిని సాధ్యము చేసిన కంప్యూటరులు చేసిన హెచ్ సి ఎల్, డెల్, వ్యూసోనిక్ కంపెనీలకు మరియు సహకరించి ప్రోత్సాహించిన మిత్రులు, ఇతర వ్యక్తులు, అంతర్జాల సంస్థలకు. మా తెలుగుభాగవతం అంతర్జాల జాలగూడు ఆదులను నిర్మించుట నిర్వహించుటలలో తమ అమూల్యమైన సహాయ సహకారాలు అందించి సాకారం చేసారు. చేస్తున్నారు. ఇలా సహాయ సహకారాలు అందించిన అందరికి పేరుపేరునా కృతజ్ఞతలు.

**ఊలపల్లి సాంబశివ రావు, భాగవత గణనాధ్యాయి.**

# పోతన తెలుగు భాగవతము

## సంప్రదించిన ముఖ్య గ్రంథాదులు

**శ్రీమద్భాగవతము** : సుందర చైతన్య స్వామి : సెట్టు
**శ్రీమద్భాగవత ప్రకాశము** ( షష్ఠ స్కంధము వరకు) : 2003లో : మాస్టర్ ఇ కె బుక్ ట్రస్ట్, విశాఖపట్నం : సెట్టు
**శ్రీమదాంధ్రమహాభాగవతము**, దశమస్కంధము, (టీక తాత్పర్యాదుల సహితము) : 1992లో : శ్రీసర్వారాయ ధార్మిక విద్యాసంస్థ, కాకినాడ - 533001 : సెట్టు.
**శ్రీమదాంధ్రమహాభాగవతము** (12 స్కంధములు) : 1956లో : వెంకట్రామ అండ్ కో., బెజవాడ, మద్రాసు : సెట్టు
**శ్రీమదాంధ్రమహాభాగవతము** (12 స్కంధములు) : 1924లో : అమెరికన్ ముద్రాక్షరశాల, చెన్నపట్నము : పుస్తకము
**శ్రీమదాంధ్ర మహా భాగవత పురాణరాజము** (12 స్కంధములు) – వ్రాతప్రతి – కృషి ఎవరిదో తెలపబడనిది.
**శ్రీమదాంధ్ర భాగవతము**, సప్తమ స్కంధము టీక తాత్పర్య సహితము : 1968లో : వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్, చెన్నపురి : పుస్తకము
**శ్రీమదాంధ్ర భాగవతము** (అష్టమ నుండి ఏకాదశ స్కంధము వరకు) : వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్, చెన్నపురి : పుస్తకము
**శ్రీ మహాభాగవతము** (12 స్కంధములు) : 1983లో : ఆంధ్ర సాహిత్య ఎకడమి, హైదరాబాదు - 500004 : సెట్టు

**శబ్దార్థ చంద్రిక** : 1942లో : వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్, చెన్నపురి : పుస్తకము

**శబ్దరత్నాకరము** (బి. సీతారామాచార్యులువారి) : 2007లో : ఆసియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్, న్యూఢిల్లీ, చెన్నై : పుస్తకము

**విద్యార్థి కల్పతరువు** (విద్వాన్ ముసునూరి వెంకటశాస్త్రిగారి) : 1959లో : వెంకట్రామ అండ్ కో., బెజవాడ, మద్రాసు : పుస్తకము

**విక్టరీ తెలుగు వ్యాకరణము** : విక్టరీ పబ్లిషర్స్, విజయవాడ, 520002 : పుస్తకము

**లిటిల్ మాస్టర్స్ డిక్షనరీ** - ఇంగ్లీషు - తెలుగు : 1998లో : పుస్తకము

**బ్రౌన్స్ ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు** : పుస్తకము

**పోతన తెలుగు భాగవతము** (12 స్కంధములు) : 1990 దశకములో : తితిదే వారి ప్రచురణ : సెట్టు

**పెదబాలశిక్ష** (గాజుల రామారావు) : గాజుల రామారావు : పుస్తకము

**తెవికె** - (తెలుగు వికిపిడియా) : అంతర్జాలము

**తెలుగు పర్యాయపద నిఘంటువు** (ఆచార్య జి ఎన్ రెడ్డిగారి) : 1998లో : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు - 500001 : పుస్తకము

**గజేంద్రమోక్షము** : సుందర చైతన్య స్వామి : పుస్తకము

**అనంతుని ఛందము** : 1921లో : వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్, చెన్నపురి : పుస్తకము

**శ్రీసూర్యారాయాంధ్ర నిఘంటువు,** 1982 : సాహిత్య ఎకాడమీ వారి ముద్రణ.

# సంజ్ఞలు - చిహ్నాలు

పద్యగద్యలకు వాడిన సంజ్ఞ = **స$_1$-స$_2$-ప.**

**స$_1$** = స్కంధం సంఖ్య. 5, 10 ల దశాంశ స్థానం లోని 1, 2 పంచమ, దశమ స్కంధాల భాగాలని సూచిస్తుంది. మిగతా వాటికి దశాంశ స్థానం ఉండదు.

**స$_2$** = ఆ స్కంధలోని పద్యగద్య యొక్క వరుస సంఖ్య. దంశాశ స్థానంలో 1 ఉంటే అంది సీస పద్యం కింది తేటగీతి / ఆటవెలదిని సూచిస్తుంది. మిగతా వాటికి దశాంశ స్థానం ఉండదు.

**ప** = పద్యగద్య పేరు సూచిస్తుంది. పద్యగద్యల సంజ్ఞల జాబితా "పోతన తెలుగు భాగవతములో వాడబడిన ఛందోప్రక్రియలు. చిహ్నాలు, సంఖ్యలు"లో ఉన్నాయి.

ఈ జాబితాలోని సంఖ్య గ్రంధంలో ఆ పద్యగద్య లెన్నున్నాయో సూచిస్తుంది.

పద్యాలలోని అక్షరం కింది గీత యతి స్థానాలని సూచిస్తుంది.

పద్యాలలోని అక్షంరం **బొద్దుగా ఉండటం ప్రాస** స్థానాన్ని సూచిస్తుంది.

పోతన తెలుగు భాగవతములో వాడబడిన ఛందోప్రక్రియలు. సంజ్ఞలు, సంఖ్యలు

| క్ర. సం. | వృత్తము | చిహ్నం | సంఖ్య |
|---|---|---|---|
| 1 | వచనము | వ. | 2680 |
| 2 | కంద పద్యము | క. | 2611 |
| 3 | తేటగీత | తే. | 1061 |
| 4 | సీస పద్యము | సీ. | 1047 |
| 5 | ఆటవెలది | ఆ. | 703 |
| 6 | మత్తేభము | మ. | 586 |
| 7 | చంపకమాల | చ. | 486 |
| 8 | ఉత్పలమాల | ఉ. | 475 |
| 9 | శార్దూలము | శా. | 288 |
| 10 | మత్తేభము | మత్త. | 41 |
| 11 | తరలము | త. | 23 |
| 12 | గద్యము | గ. | 14 |
| 13 | మాలిని | మా. | 12 |
| 14 | లయగ్రాహి | లగ్రా. | 4 |
| 15 | ఇంద్రవజ్రము | ఇ. | 4 |
| 16 | స్రగ్ధర | స్రగ్ధ. | 3 |
| 17 | ఉత్సాహము | ఉత్సా. | 3 |
| 18 | లయవిభాతి | లవి. | 3 |

| క్ర. సం. | వృత్తము | చిహ్నం | సంఖ్య |
|---|---|---|---|
| 19 | కవిరాజవిరాజితము | కవి. | 3 |
| 20 | మహాస్రగ్ధర | మస్ర. | 2 |
| 21 | దండకము | దం. | 2 |
| 22 | వనమయూరము | వన. | 1 |
| 23 | శ్లోకము | శ్లో. | 1 |
| 24 | సర్వలఘు సీసము | ససీ. | 1 |
| 25 | తోటకము | తో. | 1 |
| 26 | మానిని | మాని. | 1 |
| 27 | ఉంపేంద్రవజ్రము | ఉపేం. | 1 |
| 28 | పంచచామరము | పంచ. | 1 |
| 29 | స్రగ్విణి | స్రగ్వి. | 1 |
| 30 | భుజంగప్రయాతము | భు. | 1 |
| 31 | మంగళమహాశ్రీ | మంగ. | 1 |

# బమ్మెర పోతనామాత్య విరచిత

# పోతన తెలుగు భాగవతము

## విషయ సూచిక

# బమ్మెర పోతనామాత్య విరచిత

# పోతన తెలుగు భాగవతము

## ప్రథమ స్కంధము

### 1-1-ఉపోద్ఘాతము

1-1-శార్దూల విక్రీడితము

శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోక ర
క్షైకారంభకు భక్త పాలన కళా సంరంభకున్ దానవో
ద్రేకస్తంభకుఁ గేళి లోల విలసద్దృగ్జాల సంభూత నా
నా కంజాత భవాండ కుంభకు మహానందాంగనాడింభకున్.

1-2-ఉత్పలమాల

వాలిన భక్తి మ్రొక్కెద నవారిత తాండవ కేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజా ముఖ పద్మ మయూఖ మాలికిన్
బాల శశాంక మౌళికిఁగ పాలికి మన్మథ గర్వ పర్వతో
న్మూలికి నారదాది మునిముఖ్య మనస్సరసీరుహాలికిన్.

1-3-ఉత్పలమాల

ఆతత సేవఁ జేసెద సమస్త చరాచర భూత సృష్టి వి
జ్ఞాతకు భారతీ హృదయ సౌఖ్య విధాతకు వేదరాశి ని
ర్ణేతకు దేవతా నికర నేతకుఁ గల్మష జేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిల తాపస లోక శుభప్రదాతకున్.

1-4-వచనము

అని నిఖిల భువన ప్రధాన దేవతా వందనంబు సేసి.

1-5-ఉత్పలమాల

ఆదర మొప్ప మ్రొక్కెదుదు నద్రి సుతా హృదయానురాగ సం
పాదికి దోషభేదికిఁ బ్రపన్న వినోదికి విఘ్న వల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేష జగజ్జన నంద వేదికిన్
మోదకఖాదికిన్ సమద మూషక సాదికి సుప్రసాదికిన్.

1-6-ఉత్పలమాల

క్షోణితలంబునన్ నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీక చయ సుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ చిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్య పాణికిన్.

1-7-శార్దూల విక్రీడితము

పుట్టం బుట్ట, శరంబునన్ మొలవ నంభోయానపాత్రంబునన్
నెట్టం గల్గను గాళిఁ గొల్వను బురాణింపన్ దొరంకొంటి మీఁ
దెట్టే వెంటఁ జరింతుఁ దత్సరణి నా కీవమ్మయో! యమ్మ మేల్
పట్టున్ నాకగుమమ్మనమ్మితిఁ జుమీబ్రాహ్మీ! దయాంభోనిధీ!

1-8-ఉత్పలమాల

శారదనీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హార తుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం

దార సుధాపయోధి సితతామర సామరవాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మదిఁ గానగ నెన్నఁడు గల్గు భారతీ!

1-9-ఉత్పలమాల

అంట, నవాంబుజోజ్వలకరాంబుజ, శారదచంద్రచంద్రికా
డంబర చారుమూర్తి, ప్రకటస్ఫుట భూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ, శృతిసూక్తి వివిక్త నిజప్రభావ, భా
వాంబరవీధి విశ్రుతవిహారిణి, నన్ గృపఁ జూడు భారతీ!

1-10-ఉత్పలమాల

అమ్మలఁ గన్నయమ్మ, ముగురమ్మలమూలపుటమ్మ, చాలఁ బె
ద్దమ్మ, సురారులమ్మ కడు పాఱడి వుచ్చిన యమ్మ, తన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ, మా
యమ్మ, కృపాబ్ధి యిచ్చుత మహత్త్వకవిత్వ పటుత్వ సంపదల్.

1-11-మత్తేభ విక్రీడితము

హరికిం బట్టపుదేవి, పున్నెముల ప్రో వర్థంపుఁ బెన్నిక్క, చం
దురు తోఁబుట్టువు, భారతీ గిరిసుతల్ తో నాడు పూఁబోఁడి, తా
మరలం దుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించు నిల్లాలు, భా
సురతన్ లేములు వాపు తల్లి, సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్.

1-12-వచనము

అని యిష్టదేవతలం జింతించి దినకర కుమార ప్రముఖులం దలంచిప్రథమ కవితా
విరచన విద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి, హయగ్రీవదనుజకర పరిమిళిత

నిగమ నివహ విభాగ నిర్ణయ నిపుణతా సముల్లాసునకు వ్యాసునకు మ్రొక్కి, శ్రీమహాభాగవత కథాసుధారసప్రయోగికి శుకయోగికి నమస్కరించి, మృదు మధురవచన వర్గ పల్లవిత స్థాణునకున్ బాణునకుం బ్రణమిల్లి, కతిపయ శ్లోక సమ్మోదితసూరు మయూరు నభినందించి, మహాకావ్యకరణ కళావిలాసుం గాళిదాసుం గొనియాడి కవి కమల రవిన్ భారవిన్ బొగడి విదళితాఘు మాఘు వినుతించి, యాంధ్రకవితాగౌరవజనమనోహరి నన్నయ సూరిం గైవారంబు సేసి, హరిహర చరణారవిందవందనాభిలాషిం దిక్కమనీషిన్ భూషించి, మఱియు నితర పూర్వ కవిజన సంభావనంబు గావించి, వర్తమాన కవులకుం బ్రియంబు వలికి,భావి కవుల బహూకరించి, యుభయకావ్యకరణ దక్షుండనై.

## 1-2-కృతిపతి నిర్ణయము

### 1-13-ఉత్పలమాల

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

### 1-14-తేటగీతి

చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁ జేటు.

1-15-వచనము

అని మఱియు మదీయ పూర్వజన్మ సహస్ర సంచిత తపఃఫలంబున శ్రీమన్నారాయణ కథా ప్రపంచవిరచనాకుతూహలుండనై యొక్క రాకా నిశాకాలంబున సోమోపరాగంబు రాకఁ గని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్ర సముత్తుంగభంగ యగు గంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులినతలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచుఁ గించి దున్మీలిత లోచనుండనై యున్న యెడ.

1-16-సీస పద్యము

మెఱుఁగు చెంగటనున్న మేఘంబు కైవడిఁ;
 నువిద చెంగట నుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారంబు పోలిక;
 ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుత తమాల వసుమతీజము భంగిఁ;
 బలువిల్లు మూఁపునఁబరఁగువాఁడు
నీలనగాగ్ర సన్నిహిత భానుని భంగి;
 ఘన కిరీటము దలఁ గలుగువాఁడు

1-16.1-ఆటవెలది

పుండరీకయుగముఁ బోలు కన్నుల వాఁడు
వెడఁద యురమువాఁడు విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.

1-17-వచనము

ఏను నా రాజశేఖరుం దేఱి చూచి భాషింప యత్నంబు సేయునెడ నతఁడు దా, "రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయుము;" నీకు భవబంధంబులు దెగు నని, యానతిచ్చి తిరోహితుం డయిన, సమున్మీలిత నయనుండనై వెఱఁగుపడి చిత్తంబున.

1-18-కంద పద్యము

పలికెడిది భాగవత మఁట,

పలికించెడివాడు రామభద్రుం డఁట, నేఁ

బలికిన భవహర మగునఁట,

పలికెద, వేఱొండు గాథ బలుకఁగ నేలా?

1-19-ఆటవెలది

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు,

శూలికైనఁ దమ్మిచూలికైన,

విబుధజనుల వలన విన్నంత కన్నంత

దెలియ వచ్చినంత దేటపఱతు.

1-20-కంద పద్యము

కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ

గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం

గొందఱికి గుణములగు నే

నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్.

1-21-మత్తేభ విక్రీడితము

ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్.

1-22-మత్తేభ విక్రీడితము

లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.

1-23-వచనము

ఇట్లు భాసిల్లెడు శ్రీ మహాభాగవతపురాణ పారిజాత పాదపసమాశ్రయంబునను, హరికరుణావిశేషంబునను గృతార్థత్వంబు సిద్ధించె నని, బుద్ధి నెఱింగి లేచి మరలి కొన్ని దినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి యందు గురు వృద్ధ బుధ బంధుజ నానుజ్ఞాతుండనై.

## 1-3-గ్రంథకర్త వంశవర్ణనము

1-24-సీస పద్యము

కౌండిన్యగోత్ర సంకలితుఁడాపస్తంభ;
 సూత్రుండు పుణ్యుండు సుభగుఁడైన
భీమన మంత్రికిఁ బ్రియపుత్త్రుఁ డన్నయ;

కలకంఠి తద్భార్య గౌరమాంబ
కమలాప్తు వరమునఁ గనియె సోమన మంత్రి;
వల్లభ మల్లమ వారి తనయుఁ
డెల్లన యతనికి నిల్లాలు మాచమ;
వారి పుత్త్రుఁడు వంశవర్ధనుండు

1-24.1-ఆటవెలది

లలిత మూర్తి బహుకళానిధి కేతన
దాన మాన నీతి ధనుఁడు ఘనుఁడు
దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ
మనియె శైవశాస్త్రమతముఁ గనియె.

1-25-కంద పద్యము

నడవదు నిలయము వెలువడి
తడవదు పరపురుషు గుణముఁ దనపతి నుడువుం
గడవదు వితరణ కరుణలు
విడువదు లక్కాంబ విబుధ విసరము వొగడన్.

1-26-ఉత్పలమాల

మానిను లీడుగారు బహుమాన నివారిత దీనమానస
గ్లానికి, దాన ధర్మ మతిగౌరవమంజులతాగభీరతా
స్థానికి, ముద్దుసానికి, సదాశివపాదయుగార్చనానుకం
పానయవాగ్భవానికిని, బమ్మెర కేసయ లక్కసానికిన్.

1-27-కంద పద్యము

ఆ మానినికిం బుట్టితి
మే మిరువుర మగ్రజాతుఁ డీశ్వరసేవా
కాముఁడు తిప్పన, పోతన
నామవ్యక్తుండ సాధునయ యుక్తుండన్.

1-28-వచనము

అయిన నేను, నా చిత్తంబున శ్రీరామచంద్రుని సన్నిధానంబు గల్పించుకొని.

## 1-4-షష్ఠ్యంతములు

1-29-ఉత్పలమాల

హారికి, నందగోకులవిహారికిఁ జక్రసమీరదైత్య సం
హారికి, భక్తదుఃఖపరిహారికి, గోపనితంబినీ మనో
హారికి, దుష్టసంపదపహారికి, ఘోషకుటీపయోఘృతా
హారికి, బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్.

1-30-ఉత్పలమాల

శీలికి, నీతిశాలికి, వశీకృతశూలికి, బాణ హస్త ని
ర్మూలికి, ఘోర నీరదవిముక్త శిలాహతగోపగోపికా
పాలికి, వర్ణధర్మపరిపాలికి నర్జునభూజయుగ్మ సం
చాలికి, మాలికిన్, విపుల చక్ర నిరుద్ధ మరీచి మాలికిన్.

1-31-ఉత్పలమాల

క్షంతకుఁ గాళియోరగవిశాలఫణావళినర్తనక్రియా
రంతకు నుల్లసన్మగధరాజ చతుర్విధ ఘోర వాహినీ
హంతకు నింద్ర నందన నియంతకు, సర్వచరాచరావళీ
మంతకు, నిర్జితేంద్రియసమంచితభక్తజనానుగంతకున్.

1-32-ఉత్పలమాల

న్యాయికి, భూసురేంద్రమృతనందనదాయికి, రుక్మిణీమన
స్థ్సాయికి, భూతసమ్మదవిధాయికి, సాధుజనానురాగ సం
ధాయికిఁ బీతవస్త్రపరిధాయికిఁ బద్మభవాండభాండ ని
ర్మాయికి, గోపికానివహ మందిరయాయికి, శేషశాయికిన్.

1-33-వచనము

సమర్పితంబుగా, నే నాంధ్రంబున రచియింపం బూనిన శ్రీమహా
భాగవతపురాణంబునకుం గథాప్రారంభం బెట్టి దనిన.

## 1-5-కథాప్రారంభము

1-34-సీస పద్యము

విశ్వ జన్మస్థితివిలయంబు లెవ్వని;
 వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై;
 తాన రాజగుచుఁ జిత్తమునఁ జేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె;
 నెవ్వఁడు బుధులు మోహింతురెవ్వ

నికి నెండమావుల నీటఁ గాచాదుల;
 నన్యోన్యబుద్ధి దా నడరునట్లు

1-34.1-ఆటవెలది

త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము
భంగిఁ దోఁచు స్వప్రభానిరస్త
కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద,
ననఘు సత్యుఁ బరుని ననుదినంబు.

1-35-వచనము

ఇట్లు "సత్యంపరంధీమహి" యను గాయత్రీ ప్రారంభమున గాయత్రీ నామబ్రహ్మ స్వరూపంబై మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసుర వధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతం బని పలుకుటం జేసి, యీ పురాణంబు శ్రీమహాభాగవతం బన నొప్పుచుండు.

1-36-సీస పద్యము

శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతంబైన;
 భాగవతంబు సద్భక్తితోడ
వినఁ గోరువారల విమలచిత్తంబులఁ;
 జెచ్చెర నీశుండు చిక్కుఁ గాక
యితరశాస్త్రంబుల నీశుండు చిక్కునే;
 మంచివారలకు నిర్మత్సరులకుఁ
గపట నిర్ముక్తులై కాంక్ష సేయకయును;
 దగిలి యుండుట మహాతత్త్వబుద్ధిఁ

1-36.1-తేటగీతి

బరఁగ నాధ్యాత్మికాది తాపత్రయంబు
నడఁచి పరమార్థభూతమై యధిక సుఖద
మై సమస్తంబుఁ గాకయు నయ్యు నుండు
వస్తు వెఱుఁగంగఁ దగు భాగవతమునందు.

1-37-ఆటవెలది

వేదకల్పవృక్షవిగళితమై శుక
ముఖసుధాద్రవమున మొనసి యున్న
భాగవతపురాణఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసికభావవిదులు.

## 1-6-నైమిశారణ్య వర్ణనము

1-38-కంద పద్యము

పుణ్యంబై మునివల్లభ
గణ్యంబై కుసుమ ఫల నికాయోత్థిత సా
ద్గుణ్యమయి నైమిశాఖ్యా
రణ్యంబు నుతింపఁ దగు నరణ్యంబులలోన్.

1-39-వచనము

మఱియును; మధువైరి మందిరంబునుం బోలె మాధవీమన్మథమహితంబై, బ్రహ్మగేహంబునుం బోలె శారదాన్వితంబై, నీలగళసభా నికేతనంబునుం బోలె వహ్ని వరుణ సమీరణ చంద్ర రుద్ర హైమవతీ కుబేర వృషభ గాలవ శాండిల్య

పాశుపత జటిపటల మండితంబై, బలభేది భవనంబునుం బోలె నైరావతామృత రంభా గణికాభిరామంబై, మురాసురు నిలయంబునుం బోలె నున్మత్తరాక్షసవంశ సంకులంబై, ధనదాగారంబునుం బోలె శంఖ పద్మ కుంద ముకుంద సుందరంబై, రఘురాము యుద్ధంబునుంబోలె నిరంతర శరానలశిఖాబహుళంబై, పరశురాము భండనంబునుం బోలె నర్జునోద్భేదంబై, దానవ సంగ్రామంబునుం బోలె నరిష్ట జంభ నికుంభ శక్తియుక్తంబై, కౌరవసంగరంబునుం బోలె ద్రోణార్జున కాంచనస్యందనకదంబ సమేతంబై, కర్ణుకలహంబునుం బోలె మహోన్నతశల్యసహకారంబై, సముద్రసేతుబంధనంబునుం బోలె నలనీల పనసాద్యద్రి ప్రదీపింతంబై, భర్గుభజనంబునుం బోలె నానాశోకలేఖా ఫలితంబై, మరుని కోదండంబునుం బోలెఁ బున్నాగశిలీముఖ భూషితంబై, నరసింహ రూపంబునుం బోలెఁ గేసరకరజకాంతంబై, నాట్యరంగంబునుం బోలె నటనటీ సుషిరాన్వితంబై, శైలజానిటలంబునుం బోలెఁ జందన కర్పూర తిలకాలంకృతంబై, వర్షాగమంబునుం బోలె నింద్రబాణాసన మేఘ కరక కమనీయంబై, నిగమంబునుం బోలె గాయత్రీ విరాజితంబై, మహాకావ్యంబునుం బోలె సరల మృదులతా కలితంబై, వినతానిలయంబునుం బోలె సుపర్ణ రుచిరంబై యమరావతీపురంబునుం బోలె సుమనోలలితంబై, కైటభోద్యోగంబునుం బోలె మధుమానితంబై, పురుషోత్తమ సేవనంబునుం బోలె నమృతఫలదంబై, ధనంజయ సమీకంబునుం బోలె నభ్రంకష పరాగంబై, వైకుంఠపురంబునుం బోలె హరి ఖడ్గ పుండరీక విలసితంబై, నందఘోషంబునుం బోలెఁ గృష్ణసార సుందరంబై లంకా నగరంబునుం బోలె రామమహిషీవంచక సమంచితంబై సుగ్రీవ సైన్యంబునుం బోలె గజగవయ శరభ శోభితంబై, నారాయణస్థానంబునుం బోలె నీలకంఠహంస కౌశిక భరద్వాజ తిత్తిరి భాసురంబై, మహాభారతంబునుం బోలె

నేకచక్ర బక కంక ధార్తరాష్ట్ర శకుని నకుల సంచార సమ్మిళితంబై, సూర్యరథంబునుం బోలె నురుతర ప్రవాహంబై, జలదకాల సంధ్యా ముహూర్తంబునుం బోలె బహువితత జాతిసౌమనస్యంబై యొప్పు నైమిశారణ్యం బను శ్రీవిష్ణుక్షేత్రంబు నందు శౌనకాది మహామునులు స్వర్లోకగీయమానుం డగు హరిం జేరుకొఱకు సహస్రవర్షంబు లనుష్ఠానకాలంబుగాఁ గల సత్త్రసంజ్ఞికం బైన యాగంబు సేయుచుండి రం దొక్కనాఁడు వారలు రేపకడ నిత్యనైమిత్తిక హోమంబు లాచరించి సత్కృతుండై సుఖాసీనుండై యున్న సూతుఁ జూచి.

## 1-7-శౌనకాదుల ప్రశ్నంబు

1-40-కంద పద్యము

ఆ తాపసు లిట్లనిరి, వి
నీతున్, విజ్ఞాన ఫణిత నిఖిల పురాణ
వ్రాతున్, నుత హరి గుణ సం
ఘాతున్, సూతున్, నితాంత కరుణోపేతున్.

1-41-మత్తేభ విక్రీడితము

సమతం దొల్లి పురాణపంక్తు లితిహాసశ్రేణులున్ ధర్మ శా
స్త్రములుం నీవ యుపన్యసింపుదువు వేదవ్యాసముఖ్యుల్మునుల్
సుమతుల్ సూచిన వెన్ని యన్నియును దోఁచున్ నీమదిం దత్ప్రసా
దమునం జేసి యెఱుంగనేర్తువు సమస్తంబున్ బుధేంద్రోత్తమా!

1-42-కంద పద్యము

గురువులు ప్రియశిష్యులకుం
బరమ రహస్యములు దెలియఁ బలుకుదు రచల
స్థిర కల్యాణం బెయ్యది
పురుషులకును నిశ్చయించి బోధింపు తగన్.

1-43-కంద పద్యము

మన్నాఁడవు చిరకాలము
గన్నాఁడవు పెక్కులైన గ్రంథార్థంబుల్
విన్నాఁడవు వినఁదగినవి
యున్నాఁడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్.

1-44-చంపకమాల

అలసులు మందబుద్ధియుతు లల్పతరాయువు లుగ్రరోగసం
కలితులు మందభాగ్యులు సుకర్మము లెవ్వియుఁ జేయఁజాల రీ
కలియుగమందు మానవులు గావున నెయ్యది సర్వసౌఖ్యమై
యలవడు? నేమిటం బొడము నాత్మకు? శాంతి మునీంద్ర! చెప్పవే.

1-45-సీస పద్యము

ఎవ్వని యవతార మెల్ల భూతములకు;
 సుఖమును వృద్ధియు నొరిదిఁజేయు;
నెవ్వని శుభనామ మేప్రొద్దు నుడువంగ;
 సంసార బంధంబు సమసిపోవు;
నెవ్వని చరితంబుఁ హృదయంబుఁ జేర్పంగ;
 భయమొంది మృత్యువు పరువువెట్టు;

నెవ్వని పదనది నేపాఱు జలముల;
సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ;

1-45.1-తేటగీతి

దపసులెవ్వాని పాదంబు దగిలి శాంతి
తెరువుఁగాంచిరి; వసుదేవదేవకులకు
నెవ్వఁ డుదయించెఁ దత్కథలెల్ల వినఁగ
నిచ్చ పుట్టెడు నెఱిఁగింపు మిద్ధచరిత!

1-46-కంద పద్యము

భూషణములు వాణికి నఘ
పేషణములు మృత్యుచిత్త భీషణములు హృ
త్తోషణములు కల్యాణ వి
శేషణములు హరి గుణోపచితభాషణముల్.

1-47-కంద పద్యము

కలిదోషనివారకమై
యలఘుయశుల్ వొగడునట్టి హరికథనము ని
ర్మలగతిఁ గోరెడు పురుషుఁడు
వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు? మహాత్మా!

1-48-ఆటవెలది

అనఘ! విను రసజ్ఞులై వినువారికి
మాటమాట కధికమధురమైన

యట్టి కృష్ణు కథన మాకర్ణనము సేయఁ
దలఁపు గలదు మాకుఁ దనివి లేదు.

1-49-మత్తేభ విక్రీడితము

వర గోవింద కథా సుధారస మహావర్షోరు ధారా పరం
పరలం గాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహ జనుస్సంభావితానేక దు
స్తర గంభీర కఠోర కల్మష కనద్దావానలం బాఱునే?

1-50-సీస పద్యము

హరినామ కథన దావానలజ్వాలచేఁ;
గాలవే ఘోరాఘ కాననములు;
వైకుంఠదర్శన వాయు సంఘంబుచేఁ;
దొలఁగవే భవదుఃఖ తోయదములు;
కమలనాభధ్యాన కంఠీరవంబుచేఁ;
గూలవే సంతాప కుంజరములు;
నారాయణస్మరణప్రభాకరదీప్తిఁ;
దీఱవే షడ్వర్గ తిమిర తతులు;

1-50.1-ఆటవెలది

నలిన నయన భక్తినావచేఁ గాక సం
సారజలధి దాఁటి చనఁగ రాదు;
వేయునేల; మాకు విష్ణుప్రభావంబుఁ
దెలుపవయ్య సూత! ధీసమేత!

1-51-వచనము

మఱియుఁ గపటమానవుండును గూఢుండు నైన మాధవుండు రామ సహితుం డై యతిమానుషంబు లైన పరాక్రమంబులు సేసె నఁట; వాని వివరింపుము; కలియుగంబు రాఁగల దని వైష్ణవక్షేత్రంబున దీర్ఘసత్ర నిమిత్తంబున హరికథలు విన నెడగలిగి నిలిచితిమి, దైవయోగంబున.

1-52-కంద పద్యము

జలరాశి దాఁటఁ గోరెడి
కలము జనుల్ కర్ణధారుఁ గాంచిన భంగిం
గలి దోష హరణ వాంఛా
కలితులమగు మేము నిన్నుఁ గంటిమి సూతా!

1-53-కంద పద్యము

చారుతర ధర్మరాశికి
భారకుఁడగు కృష్ణుఁ డాత్మపదమున కేఁగన్
భారకుఁడు లేక యెవ్వనిఁ
జేరును ధర్మంబు బలుపు సెడి మునినాథా!

## 1-8-కథా సూచనంబు

1-54-వచనము

అని యిట్లు మహనీయగుణగరిష్ఠు లయిన శౌనకాది మునిశ్రేష్ఠు లడిగిన రోమహర్షణపుత్త్రుం డయి యుగ్రశ్రవసుం డను పేర నొప్పి నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుం డైన సూతుండు.

1-55-మత్తేభ విక్రీడితము

సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిఁ బో
వ మహాభీతి నొహో కుమార! యనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు సక్కం జేసె మున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్.

1-56-సీస పద్యము

కార్యవర్గంబును గారణ సంఘంబు;
నధికరించి చరించు నాత్మతత్త్వ
మధ్యాత్మ మనఁబడు నట్టి యధ్యాత్మముఁ;
దెలియఁ జేఁయఁగఁ జాలు దీప మగుచు
సకలవేదములకు సారాంశమై యేక;
మై యసాధారణమగు ప్రభావ
రాజకంబైన పురాణ మర్మంబును;
గాఢ సంసారాంధకార పటలి

1-56.1-తేటగీతి

దాఁటఁ గోరెడివారికి దయ దలిర్ప
నే తపోనిధి వివరించె నేర్పడంగ
నట్టి శుకనామధేయు మహాత్మగేయు
విమల విజ్ఞాన రమణీయు వేడ్కఁ గొలుతు.

1-57-కంద పద్యము

నారాయణునకు నరునకు
భారతికిని మ్రొక్కి, వ్యాసు పదములకు నమ
స్కారము సేసి వచింతు ను
దారగ్రంథంబు, దళిత తను బంధంబున్.

1-58-వచనము

అని యిట్లు దేవతాగురు నమస్కారంబుసేసి యిట్లనియె
"మునీంద్రులారా! నన్ను మీరు నిఖిల లోక మంగళంబైన ప్రయోజనం బడిగితిరి; ఏమిటం కృష్ణ సంప్రశ్నంబు సేయంబడు? నెవ్విధంబున నాత్మ ప్రసన్నంబగు? నిర్విఘ్నయు నిర్హేతుకయునై హరిభక్తి యే రూపంబునం గలుగు? నది పురుషులకుఁ బరమ ధర్మం బగు, వాసుదేవుని యందుఁ బ్రయోగింపఁ బడిన భక్తియోగంబు వైరాగ్య విజ్ఞానంబులం బుట్టించు; నారాయణ కథలవలన నెయ్యే ధర్మంబులు దగులువడ వవి నిరర్థకంబులు; అపవర్గపర్యంతం బయిన పరధర్మంబునకు దృష్ట శ్రుత ప్రపంచార్థంబు ఫలంబు గాదు; ధర్మంబు నందవ్యభిచారి యైన యర్థంబునకుఁ గామంబు ఫలంబు గాదు; విషయభోగంబైన కామంబున కింద్రియప్రీతి ఫలంబు గాదు; ఎంత తడవు జీవించు నంతియ కామంబునకు ఫలంబు; తత్త్వజిజ్ఞాస గల జీవునకుఁ గర్మంబులచేత నెయ్యది సుప్రసిద్ధం బదియు నర్థంబు గాదు; తత్త్వజిజ్ఞాస యనునది ధర్మజిజ్ఞాస యగుటఁ గొందఱు ధర్మంబె తత్త్వం బని పలుకుదురు. తత్త్వవిదులు జ్ఞానం బనుపేర నద్వయం బైన యది తత్త్వ మని యెఱుంగుదురు; ఆ తత్త్వంబు నౌపనిషదులచేత బ్రహ్మ మనియు, హైరణ్యగర్భులచేతం బరమాత్మ యనియు, సాత్వతులచేత భగవంతుం డనియును బలుకంబడు; వేదాంత శ్రవణంబున గ్రహింపంబడి జ్ఞాన వైరాగ్యంబులతోడం గూడిన భక్తిచేతఁ దత్పరులైన పెద్దలు

క్షేత్రజ్ఞుండైన యాత్మ యందుఁ బరమాత్మం బొడగందురు; ధర్మంబునకు భక్తి ఫలంబు; పురుషులు వర్ణాశ్రమధర్మ భేదంబులం జేయు ధర్మంబునకు మాధవుండు సంతోషించుటయె సిద్ధి; ఏక చిత్తంబున నిత్యంబును గోవిందు నాకర్ణింపనుం వర్ణింపనుం దగుఁ; జక్రాయుధ ధ్యానం బను ఖడ్గంబున వివేకవంతు లహంకార నిబద్ధంబైన కర్మంబు ద్రుంచివైతురు; భగవంతుని యందలి శ్రద్ధయు నపవర్గదం బగు తత్కథాశ్రవణాదుల యం దత్యంతాసక్తియుఁ బుణ్యతీర్థావగాహన మహాత్సేవాదులచే సిద్ధించు కర్మనిర్మూలన హేతువు లైన కమలలోచను కథలం దెవ్వండు రతిసేయు విననిచ్చగించు, వాని కితరంబు లెవ్వియు రుచి పుట్టింపనేరవు; పుణ్యశ్రవణకీర్తనుం డైన కృష్ణుండు తనకథలు వినువారి హృదయంబు లందు నిలిచి, శుభంబు లాచరించు నశుభంబులు పరిహరించు; నశుభంబులు నష్టంబు లయిన భాగవతశాస్త్రసేవా విశేషంబున నిశ్చలభక్తి యుదయించు; భక్తి కలుగ రజస్తమోగుణ ప్రభూతంబు లైన కామ లోభాదులకు వశంబుగాక చిత్తంబు సత్త్వగుణంబునఁ బ్రసన్నం బగుఁ; ప్రసన్నమనస్కుం డైన ముక్తసంగుం డగు; ముక్తసంగుం డైన నీశ్వరతత్త్వజ్ఞానంబు సిద్ధించు; నీశ్వరుండు గానంబడినఁ జిజ్జడగ్రథనరూపం బైన యహంకారంబు భిన్నం బగు; నహంకారంబు భిన్నంబైన నసంభావనాది రూపంబు లగు సంశయంబులు విచ్ఛిన్నంబు లగు; సంశయవిచ్ఛేదం బైన నానారబ్ధఫలంబు లైన కర్మంబులు నిశ్శేషంబులై నశించుం గావున.

1-59-కంద పద్యము

గురుమతులు తపసు లంతః

కరణంబుల శుద్ధి సేయ ఘనతరభక్తిన్

హరియందు సమర్పింతురు
పరమానందమున భిన్నభవబంధనులై.

1-60-తరళము

పరమపూరుషుఁ డొక్కఁ డాఢ్యుఁడు పాలనోద్భవ నాశముల్
సొరిదిఁ జేయు ముకుంద పద్మజ శూలి సంజ్ఞలఁ బ్రాకృత
స్ఫురిత సత్త్వ రజస్తమంబులఁ బొందు నందు శుభస్థితుల్
హరి చరాచరకోటి కిచ్చు ననంత సత్త్వ నిరూఢుఁడై.

1-61-వచనము

మఱియు నొక్క విశేషంబు గలదు; కాష్ఠంబుకంటె ధూమంబు, ధూమంబుకంటెఁ త్రయీమయం బయిన వహ్ని యెట్లు విశేషంబగు నట్లు తమోగుణంబుకంటె రజోగుణంబు, రజోగుణంబుకంటె బ్రహ్మప్రకాశకం బగు సత్త్వగుణంబు విశిష్టం బగు; తొల్లి మునులు సత్త్వమయుం డని భగవంతు హరి నధోక్షజుం గొలిచిరి; కొందఱు సంసార మందలి మేలుకొఱకు నన్యుల సేవింతురు; మోక్షార్థు లయిన వారలు ఘోరరూపు లైన భూతపతుల విడిచి దేవతాంతర నిందసేయక శాంతులయి నారాయణ కథల యందే ప్రవర్తింతురు; కొందఱు రాజస తామసులయి సిరియు నైశ్వర్యంబును బ్రజలనుం గోరి పితృభూత ప్రజేశాదుల నారాధింతురు; మోక్ష మిచ్చుటం జేసి నారాయణుండు సేవ్యుండు; వేద యాగ యోగక్రియా జ్ఞాన తపోగతి ధర్మంబులు వాసుదేవ పరంబులు; నిర్గుణుం డయిన పరమేశ్వరుండు గలుగుచు, లేకుండుచు త్రిగుణంబుల తోడం గూడిన తన మాయచేత నింతయు సృజియించి, గుణవంతుని చందంబున నిజమాయా విలసితంబు లయిన గుణంబులలోఁ బ్రవేశించి విజ్ఞానవిజృంభితుండై వెలుఁగు;

నగ్ని యొక్కరుం డయ్యుఁ బెక్కు మ్రాఁకు లందుఁ దేజరిల్లుచుఁ బెక్కండ్రై తోఁచు తెఱంగున విశ్వాత్మకుం డైన పురుషుం డొక్కండ తనవలనం గలిగిన నిఖిల భూతంబు లందు నంతర్యామి రూపంబున దీపించు; మహాభూత సూక్ష్మేంద్రియంబులతోడం గూడి, గుణమయంబు లయిన భావంబులం దనచేత నిర్మితంబు లైన భూతంబు లందుఁ దగులు వడక తద్గుణంబు లనుభవంబు సేయుచు, లోకకర్త యైన యతండు దేవ తిర్యఙ్మనుష్యాది జాతు లందు లీల నవతరించి లోకంబుల రక్షించు" నని, మఱియు సూతుఁ డిట్లనియె.

1-62-సీస పద్యము

మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై;
 చారు షోడశ కళాసహితుఁ డగుచుఁ
బంచమహాభూత భాసితుండై శుద్ధ;
 సత్త్వుఁడై సర్వాతిశాయి యగుచుఁ
జరణోరు భుజ ముఖ శ్రవణాక్షి నాసా శి;
 రములు నానాసహస్రములు వెలుఁగ
నంబర కేయూర హార కుండల కిరీ;
 టాదులు పెక్కువేలమరుచుండఁ

1-62.1-తేటగీతి

బురుషరూపంబు ధరియించి పరుఁ డనంతుఁ
డఖిల భువనైకవర్తన యత్నమమర
మానితోదార జలరాశి మధ్యమునను
యోగ నిద్రా విలాసియై యొప్పుచుండు.

## 1-9-ఏకవింశత్యవతారములు

### 1-63-వచనము

అది సకలావతారంబులకు మొదలి గని యైన శ్రీమన్నారాయణ దేవుని విరాజమానం బయిన దివ్యరూపంబు; దానిం బరమ యోగీంద్రులు దర్శింతురు; అప్పరమేశ్వరు నాభీకమలంబువలన సృష్టికర్తలలోన శ్రేష్ఠుండైన బ్రహ్మ యుదయించె; నతని యవయవస్థానంబుల యందు లోకవిస్తారంబులు గల్పింపంబడియె; మొదల నద్దేవుండు కౌమారాఖ్య సర్గంబు నాశ్రయించి బ్రహ్మణ్యుండై దుశ్చరంబైన బ్రహ్మచర్యంబు చరియించె; రెండవ మాఱు జగజ్జననంబుకొఱకు రసాతలగత యయిన భూమి నెత్తుచు యజ్ఞేశుండయి వరాహదేహంబుఁ దాల్చె; మూడవ తోయంబున నారదుం డను దేవర్షియై కర్మనిర్మోచకంబైన వైష్ణవతంత్రంబు సెప్పె; నాలవ పరి ధర్మభార్యా సర్గంబు నందు నరనారాయణాభిధానుం డై దుష్కరంబైన తపంబు సేసెఁ బంచమావతారంబునం గపిలుం డను సిద్ధేశుం డయి యాసురి యను బ్రాహ్మణునకుఁ దత్త్వ గ్రామ నిర్ణయంబు గల సాంఖ్యంబు నుపదేశించె; నాఱవ శరీరంబున ననసూయాదేవి యందు నత్రిమహామునికిం గుమారుండై యలర్కునికిఁ బ్రహ్లాద ముఖ్యులకు నాత్మవిద్యఁ దెలిపె; నేడవ విగ్రహంబున నాకూతి యందు రుచికి జన్మించి,యజ్ఞుం డనఁ బ్రకాశమానుండై యమాది దేవతలం గూడి, స్వాయంభువమన్వంతరంబు రక్షించె; అష్టమ మూర్తిని మేరుదేవి యందు నాభికి జన్మించి యురుక్రముం డనం బ్రసిద్ధుండై విద్వజ్జనులకుఁ బరమహంస మార్గంబుం బ్రకటించె; ఋషులచేతఁ గోరంబడి తొమ్మిదవ జన్మంబునఁ బృథుచక్రవర్తియై భూమిని ధేనువుం జేసి సమస్త వస్తువులం బిదికె; చాక్షుష మన్వంతర సంప్లవంబున దశమం బైన మీనావతారంబు నొంది మహీరూపం బగు నావ నెక్కించి వైవస్వతమనువు

నుద్ధరించె; సముద్ర మథన కాలంబునం బదునొకొండవ మాఱు కమఠాకృతిని మందరాచలంబుఁ దన పృష్ఠకర్పరంబున నేర్పరియై నిలిపె; ధన్వంతరి యను పండ్రెండవ తనువున సురాసుర మధ్యమాన క్షీరపాథోధి మధ్య భాగంబున నమృత కలశ హస్తుండై వెడలెఁ; బదమూఁడవది యయిన మోహినీ వేషంబున నసురుల మోహితులం జేసి సురల నమృతాహారులం గావించెఁ బదునాలుగవది యైన నరసింహరూపంబునం గనకకశిపుని సంహరించెఁ; బదునేనవది యైన కపట వామనావతారంబున బలిని బదత్రయంబు యాచించి మూఁడులోకంబుల నాక్రమించెఁ; బదునాఱువది యైన భార్గవరామాకృతిని గుపితభావంబుఁ దాల్చి బ్రాహ్మణ ద్రోహు లయిన రాజుల నిరువదియొక్క మాఱు వధియించి భూమి నిఃక్షత్త్రంబు గావించె; బదునేడవది యైన వ్యాస గాత్రంబున నల్పమతు లయిన పురుషులం గరుణించి వేదవృక్షంబునకు శాఖ లేర్పఱచెఁ బదునెనిమిదవ దైన రామాభిధానంబున దేవకార్యార్థంబు రాజత్వంబు నొంది సముద్రనిగ్రహాది పరాక్రమంబు లాచరించె; నేకోనవింశతి వింశతితమంబు లైన రామకృష్ణ రూపంబులచే యదువంశంబు నందు సంభవించి; విశ్వంభరా భారంబు నివారించె; నేకవింశతితమం బైన బుద్ధనామధేయంబునం గలియు గాద్యవసరంబున రాక్షస సమ్మోహనంబుకొఱకు మధ్యగయా ప్రదేశంబున జినసుతుండయి దేజరిల్లు; యుగసంధి యందు వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరింప విష్ణుయశుం డను విప్రునికిఁ గల్కి యను పేర నుద్భవింపంగలం" డని; యిట్లనియె.

1-64-మత్తేభ విక్రీడితము

సరసిం బాసిన వేయు కాలువల యోజన్ విష్ణునం దైన శ్రీ

కర నానా ప్రకటావతారము లసంఖ్యాతంబు లుర్వీశులున్

సురలున్ బ్రాహ్మణసంయమీంద్రులు మహర్షుల్ విష్ణునంశాంశజుల్
హరి కృష్ణుండు బలానుజన్ముఁ డెడ లేఁ; దా విష్ణుఁడౌ నేర్పడన్.

1-65-కంద పద్యము

భగవంతుం డగు విష్ణుఁడు
జగముల కెవ్వేళ రాక్షసవ్యధ గలుగుం
దగ నవ్వేళలఁ దడయక
యుగయుగమునఁ బుట్టి కాచు నుద్యల్లీలన్.

1-66-ఆటవెలది

అతిరహస్యమైన హరిజన్మ కథనంబు
మనుజుఁ డెవ్వఁ డేని మాపు రేపుఁ
జాల భక్తితోడఁ జదివిన సంసార
దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు.

1-67-వచనము

వినుం డరూపుం డయి చిదాత్మకుం డయి పరఁగు జీవునికిం బరమేశ్వరు
మాయాగుణంబు లైన మహదాది రూపంబులచేత నాత్మస్థానంబుగా
స్థూలశరీరంబు విరచితం బైన, గగనంబు నందుఁ బవనాశ్రిత మేఘ
సమూహంబును, గాలి యందుఁ బార్థివధూళిధూసరత్వంబును నేరీతి నారీతి ద్రష్ట
యగు నాత్మ యందు దృశ్యత్వంబు బుద్ధిమంతులు గానివారిచేత
నారోపింపంబడు నీ స్థూలరూపంబుకంటె నదృష్టగుణం బయి యశ్రుతం బైన వస్తు
వగుటం జేసి వ్యక్తంబు గాక సూక్ష్మం బై కరచరణాదులు లేక జీవునికి నొండొక
రూపంబు విరచితంబై యుండు; సూక్ష్ముఁ డయిన జీవునివలన నుత్క్రాంతి

గమనాగమనంబులం బునర్జన్మంబు దోఁచు; నెప్పు డీ స్థూల సూక్ష్మ రూపంబులు రెండు స్వరూప సమ్యగ్జ్ఞానంబునఁ బ్రతిషేధింపఁ బడు; నపుడ నవిద్యం జేసి యాత్మను గల్పింపంబడు ననియుం దెలియు నప్పుడు జీవుండు బ్రహ్మ దర్శనంబున కధికారి యగు; దర్శనం బన జ్ఞానైక స్వరూపంబు; విశారదుం డైన యీశ్వరునిదై క్రీడించుచు నవిద్య యనంబడుచున్న మాయ యుపరతయై యెప్పుడు దాన విద్యారూపంబునం బరిణత యగు నప్పుడు జీవోపాధి యయిన స్థూలసూక్ష్మరూపంబు దహించి జీవుడు కాష్ఠంబు లేక తేజరిల్లు వహ్ని చందంబునం దాన యుపరతుం డయి బ్రహ్మస్వరూపంబునం బొంది పరమానందంబున విరాజమానుం డగు; ఇట్లు తత్త్వజ్ఞులు సెప్పుదు" రని సూతుం డిట్లనియె.

1-68-చంపకమాల

జననము లేక కర్మముల జాడలఁ బోక సమస్త చిత్త వ
ర్తనుఁడగు చక్రికిం గవు లుదార పదంబుల జన్మకర్మముల్
వినుతులు సేయుచుండుదురు వేదరహస్యములందు నెందుఁ జూ
చిన మఱి లేవు జీవునికిఁ జెప్పిన కైవడి జన్మకర్మముల్.

1-69-మత్తేభ విక్రీడితము

భువనశ్రేణి నమోఘలీలుఁ డగుచుం బుట్టించు రక్షించు నం
తవిధింజేయు మునుంగఁడందు; బహుభూతవ్రాతమం దాత్మతం
త్రవిహారస్థితుడై షడింద్రియ సమస్తప్రీతియున్ దవ్వులన్
దివిభంగిం గొనుఁ జిక్కఁ డింద్రియములం దిప్పున్ నిబంధించుచున్.

1-70-చంపకమాల

జగదధినాథుఁడైన హరిసంతతలీలలు నామరూపముల్
దగిలి మనోవచోగతులఁ దార్కికచాతురి యెంత గల్గినన్
మిగిలి కుతర్కవాది తగ మేరలు సేసి యెఱుంగ నేర్చునే?
యగణిత నర్తనక్రమము నజ్ఞుఁ డెఱింగి నుతింప నోపునే?

1-71-ఉత్పలమాల

ఇంచుక మాయలేక మది నెప్పుడు బాయని భక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁడేని హరిదివ్యపదాంబుజ గంధరాశి సే
వించు నతం డెఱుంగు నరవింద భవాదులకైన దుర్లభో
దంచితమైన యా హరి యుదార మహాద్భుత కర్మమార్గముల్.

1-72-మత్తేభ విక్రీడితము

హరిపాదద్వయభక్తి మీ వలన నిట్లారూఢమై యుండునే
తిరుగంబాఱదు చిత్తవృత్తి హరిపై దీపించి మీలోపలన్
ధరణీదేవతలార! మీరలు మహాధన్యుల్ సమస్తజ్ఞులున్
హరిచింతన్ మిముఁ జెంద వెన్నడును జన్మాంతర్వ్యథాయోగముల్

## 1-10-శుకుడుభాగవతంబుజెప్పుట

1-73-సీస పద్యము

పుణ్యకీర్తనుఁడైన భువనేశు చరితంబు;
బ్రహ్మతుల్యంబైన భాగవతము
సకలపురాణరాజము దొల్లి లోకభ;
ద్రముగ ధన్యముగ మోదముగఁ బ్రీతి

భగవంతుఁడగు వ్యాసభట్టారకుఁ డొనర్చి;
శుకుఁ డనియెడుఁ తన సుతునిచేతఁ
జదివించె నింతయు సకలవేదేతిహా;
సములలోపల నెల్ల సారమైన

1-73.1-ఆటవెలది

యీ పురాణమెల్ల నెలమి నా శుకయోగి
గంగ నడుమ నిల్చి ఘన విరక్తి
యొదవి మునులతోడ నుపవిష్టుఁ డగు పరీ
క్షిన్నరేంద్రుఁ డడుగఁ జెప్పె వినుఁడు.

1-74-వచనము

కృష్ణుండు ధర్మజ్ఞానాదులతోడం దన లోకంబునకుం జనిన పిమ్మటం గలికాల దోషాంధకారంబున నష్టదర్శను లైన జనులకు; నిప్పు డిప్పురాణంబు కమలబంధుని భంగి నున్నది; నాఁ డందు భూరి తేజుండయి కీర్తించుచున్న విప్రర్షివలన నేఁ బఠించిన క్రమంబున నామదికి గోచరించి నంతయు వినిపించెద" ననిన సూతునకు ముని వరుండయిన శౌనకుం డిట్లనియె.

1-75-శార్దూల విక్రీడితము

సూతా! యే యుగవేళ నేమిటికి నెచ్చోటన్ మునిశ్రేష్ఠు నే
శ్రోతల్ గోరిరి? యేమి హేతువునకై, శోధించి లోకైక వి
ఖ్యాతిన్ వ్యాసుఁడుఁ మున్ను భాగవతముం గల్పించెఁ? దత్పుత్రుఁడే
ప్రీతిన్ రాజునకీ పురాణకథఁ జెప్పెం? జెప్పవే యంతయున్.

1-76-వచనము

బుధేంద్రా! వ్యాసపుత్త్రుండైన శుకుండను మహాయోగి సమదర్శనుండేకాంతమతి మాయాశయనంబువలనం దెలిసిన వాఁడుగూఢుండు మూఢునిక్రియ నుండు నిరస్తఖేదుం డడియునుంగాక.

1-77-తరళము

శుకుఁడు గోఁచియు లేక పైఁ జనఁ జూచి తోయములందు ల
జ్జకుఁ జలింపక చీర లొల్లక చల్లులాడెడి దేవక
న్యకలు హా! శుక! యంచు వెన్క జనంగ వ్యాసునిఁ జూచి యం
శుకములన్ ధరియించి సిగ్గున స్రుక్కి రందఱు ధీనిధీ!

1-78-వచనము

మఱియు నగ్నుండుఁ దరుణుండునై చను తన కొడుకుం గని వస్త్రపరిధానం బొనరింపక వస్త్రధారియు వృద్ధుండును నైన తనుం జూచి చేలంబులు ధరియించు దేవరమణులం గని వ్యాసుండు కారణం బడిగిన వారలు, నీ పుత్రుండు "స్త్రీ పురుషు లనెడు భేదదృష్టి లేక యుండు; మఱియు నతండు నిర్వికల్పుండు గాన నీకు నతనికి మహాంతరంబు గల" దని రట్టి శుకుండు కురుజాంగల దేశంబుల నొచ్చి హస్తినాపురంబునఁ బౌరజనంబులచే నెట్లు జ్ఞాతుండయ్యె? మఱియు నున్మత్తుని క్రియ మూఁగ తెఱంగున జడుని భంగి నుండు నమ్మహాయోగికి రాజర్షి యైన పరీక్షిన్మహారాజు తోడ సంవాదం బెట్లుసిద్ధించె? బహుకాలకథనీయం బయిన శ్రీభాగవతనిగమ వ్యాఖ్యానం బేరీతి సాగె? నయ్యోగిముఖ్యుండు గృహస్థుల గృహంబుల గోవును బిదికిన యంత దడవు గాని నిలువంబడం; డతండు గోదోహనమాత్ర కాలంబు సంచరించిన స్థలంబులు తీర్థంబు లగు నండ్రు;

పెద్దకాలం బేక ప్రదేశంబున నెట్లుండె? భాగవతోత్తముం డైన జనపాలుని జన్మ కర్మంబు లే ప్రకారంబు? వివరింపుము.

1-79-సీస పద్యము

పాండవ వంశంబు బలము మానంబును;
 వర్ధిల్లఁ గడిమి నెవ్వాఁడు మనియెఁ;
బరిపంథిరాజులు భర్మాది ధనముల;
 నర్చింతు రెవ్వని యంఘ్రియుగముఁ;
గుంభజ కర్ణాది కురు భట వ్యూహంబు;
 నొచ్చి చెండాడెనే శూరు తండ్రి;
గాంగేయ సైనికాక్రాంత గోవర్గంబు;
 విడిపించి తెచ్చె నే వీరుతాత;

1-79.1-ఆటవెలది

యట్టి గాఢకీర్తి యగు పరీక్షిన్మహా
రాజు విడువరాని రాజ్యలక్ష్మిఁ
బరిహరించి గంగఁ బ్రాయోపవిష్టుఁడై
యసువు లుండ, నేల యడఁగి యుండె?

1-80-ఉత్పలమాల

ఉత్తమకీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నఁడుం
జిత్తములందుఁ గోరరు హసించియు, లోకుల కెల్ల నర్థ సం
పత్తియు భూతియున్ సుఖము భద్రముఁ గోరుదు రన్యరక్షణా
త్యుత్తమమైన మేను విభుఁ డూరక యేల విరక్తిఁ బాసెనో?

1-81-కంద పద్యము

సారముల నెల్ల నెఱుగుదు
పారగుఁడవు భాషలందు బహువిధ కథనో
దారుఁడవు మాకు సర్వముఁ
బారము ముట్టంగఁ దెలియఁబలుకు మహాత్మా!

## 1-11-వ్యాసచింత

1-82-వచనము

అని యడిగిన, శౌనకాది మునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియెఁ "దృతీయం బైన ద్వాపరయుగంబు దీఱు సమయంబున నుపరిచరవసువు వీర్యంబున జన్మించి, వాసవి నాఁ దగు సత్యవతి యందుఁ బరాశరునికి హరికళం జేసి, విజ్ఞాని యయిన వేదవ్యాసుండు జన్మించి యొక్కనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీనదీ జలంబుల స్నానాది కర్మంబులం దీర్చి శుచియై, పరులు లేని చోట నొంటిఁ గూర్చుండి సూర్యోదయవేళ నతీతానాగతవర్తమానజ్ఞుం డయిన యా ఋషి వ్యక్తంబు గాని వేగంబుగల కాలంబునం జేసి యుగధర్మంబులకు భువి సాంకర్యంబు వొందు; యుగయుగంబుల భౌతిక శరీరంబు లకు శక్తి సన్నంబగుఁ బురుషులు నిస్సత్త్వులు ధైర్యశూన్యులు మందప్రజ్ఞు లల్పాయువులు దుర్బలులు నయ్యెద రని, తన దివ్యదృష్టిం జూచి, సర్వవర్ణాశ్రమంబులకు హితంబు సేయం దలంచి, నలుగురు హోతలచేత ననుష్ఠింపందగి ప్రజలకు శుద్ధికరంబు లైన వైదిక కర్మంబు లగు, యజ్ఞంబు లెడతెగకుండుకొఱకు నేకం బయిన వేదంబు, ఋగ్యజుస్సామాథర్వణంబులను నాలుఁగు నామంబుల విభాగించి యితిహాస పురాణంబు లన్నియుఁ బంచమవేదం బని పల్కె నందు.

1-83-సీస పద్యము

పైలుండు ఋగ్వేద పఠనంబు దొరఁకొనె;
 సామంబు జైమిని సదువుచుండె
యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ;
 దుది నథర్వము సుమంతుఁడు పఠించె
నఖిల పురాణేతిహాసముల్ మా తండ్రి;
 రోమహర్షణుఁడు నిరూఢిఁ దాల్చెఁ
దమతమ వేద మా తపసులు భాగించి;
 శిష్యసంఘములకుఁ జెప్పి రంత

1-83.1-తేటగీతి

శిష్యు లెల్లను నాత్మీయశిష్యజనుల
కంత బహుమార్గములు సెప్పి యనుమతింపఁ
బెక్కుశాఖలు గలిగి యీ పృథివిలోన
నిగమ మొప్పారె భూసుర నివహమందు.

1-84-వచనము

ఇట్లు మేధావిహీను లయిన పురుషులచేత నట్టి వేదంబులు ధరియింపబడు చున్నవి; మఱియు దీనవత్సలుం డయిన వ్యాసుండు స్త్రీ శూద్రులకుం ద్రైవర్ణికాధములకు వేదంబులు విన నర్హంబులుగావు గావున మూఢుల కెల్ల మేలగు నని భారతాఖ్యానంబు చేసియు నమ్ముని భూతహితంబు నందుఁ దన హృదయంబు సంతసింపకున్న సరస్వతీతటంబున నొంటి యుండి, హేతువు వితర్కించుచుఁ దనలో నిట్లనియె.

1-85-సీస పద్యము

వ్రతధారినై వేదవహ్ని గురుశ్రేణి;
 మన్నింతు విహితకర్మములఁ గొఱఁత
పడకుండ నడుపుదు భారతమిషమునఁ;
 బలికితి వేదార్థభావ మెల్ల
మునుకొని స్త్రీశూద్రముఖ్యధర్మము లందుఁ;
 దెలిపితి నేఁజెల్ల దీనఁ జేసి
యాత్మ సంతస మంద దాత్మలో నీశుండు;
 సంతసింపక యున్న జాడ దోఁచె

1-85.1-ఆటవెలది

హరికి యోగివరుల కభిలషితంబైన
భాగవత విధంబుఁ బలుకనైతి
మోసమయ్యెఁ దెలివి మొనయదు మఱచితి
ననుచు వగచుచున్న యవసరమున.

## 1-12-నారదాగమనంబు

1-86-సీస పద్యము

తన చేతి వల్లకీతంత్రీ స్వనంబున; సతత నారాయణశబ్ద మొప్ప
నానన సంభూత హరిగీతరవ సుధా ;ధారల యోగీంద్రతతులు సొక్కఁ
గపిల జటాభార కాంతిపుంజంబుల ;దిశలు ప్రభాత దీధితి వహింపఁ
దనులగ్న తులసికా దామగంధంబులు; గగనాంతరాళంబు గప్పికొనఁగ

1-86.1-ఆటవెలది

వచ్చె మింటనుండి వాసవీనందను
కడకు మాటలాడఁ గడఁకతోడ
భద్రవిమలకీర్తిపారగుఁ డారూఢ
నయవిశారదుండు నారదుండు.

1-87-కంద పద్యము

కనియెన్ నారదుఁ డంతన్
వినయైక విలాసు నిగమ విభజన విద్యా
జనితోల్లాసున్ భవదుః
ఖనిరాసున్ గురుమనోవికాసున్ వ్యాసున్.

1-88-వచనము

ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెఱింగి లేచి వ్యాసుండు విధివత్ క్రమంబునం బూజించిన నతండు లేనగవు నెగడెడి మొగంబుతోడ విపంచికా తంత్రి వ్రేల మీటుచు నిట్లనియె.

1-89-ఉత్పలమాల

ధాతవు, భారతశ్రుతివిధాతవు, వేదపదార్థజాతవి
జ్ఞాతవు, కామముఖ్యరిపుషట్కవిజేతవు, బ్రహ్మతత్త్వని
ర్ణేతవు, యోగినేతవు, వినీతుఁడ వీవు చలించి చెల్లరే
కాతరుకైవడిన్ వగవఁ గారణ మేమి? పరాశరాత్మజా!

1-90-వచనము

అనినఁ బారాశర్యుం డిట్లనియె.

1-91-కంద పద్యము

పుట్టితి వజు తనువునఁ జే
పట్టితివి పురాణపురుషు భజనము పదముల్
మెట్టితివి దిక్కులం దుది
ముట్టితివి మహాప్రబోధమున మునినాథా!

1-92-వచనము

అదియునుం గాక, నీవు సూర్యునిభంగి మూఁడు లోకములం జరింతువు;
వాయువు పగిది నఖిలజనులలోన మెలంగుదువు; సర్వజ్ఞుండ వగుటం జేసి.

1-93-కంద పద్యము

నీ కెఱుఁగరాని ధర్మము
లోకములను లేదు బహువిలోకివి నీవున్
నా కొఱఁత యెట్టి దంతయు
నాకున్ వివరింపవయ్య నారద! కరుణన్.

1-94-వచనము

అనిన నారదుం డిట్లనియె.

1-95-ఉత్పలమాల

అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నిం
చించుక గాని విష్ణు కథ లేర్పడఁ జెప్పవు; ధర్మముల్ ప్రపం

చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁగాక నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా!

1-96-మత్తేభ విక్రీడితము

హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుండ; దయోగ్యదుర్మదనదత్కాకోల గర్తాకృతిన్.

1-97-మత్తేభ విక్రీడితము

అపశబ్దంబులఁ గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వపా
ప పరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచుం బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచుం
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా తత్త్వజ్ఞ! చింతింపుమా.

1-98-వచనము

మునీంద్రా! నిర్గతకర్మంబై నిరుపాధికం బైన జ్ఞానంబు హరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబు గాదు, ఫలంబు గోరక కర్మం బీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు; భక్తిహీనంబు లయిన జ్ఞాన వాచాకర్మ కౌశలంబులు నిరర్థంబులు; గావున,మహానుభావుండవు, యథార్థదర్శనుండవు, సకల దిగంత ధవళకీర్తివి, సత్యరతుండవు, ధృతవ్రతుండవు నగు నీవు నిఖిల బంధమోచనంబుకొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితోడ వర్ణింపుము; హరివర్ణనంబు సేయక ప్రకారాంతరంబున నర్థాంతరంబులు వీక్షించి తద్వివక్షాకృత రూప నామంబులంజేసి పృథగ్దర్శనుం డైనవాని మతి పెనుగాలిచేతం ద్రిప్పంబడి

తప్పంజను నావ చందంబున నెలవు సేర నేరదు; కామ్యకర్మంబు లందు రాగంబు గల ప్రాకృతజనులకు నియమించిన ధర్మంబులు సెప్పి శాసకుండ వగు నీవు వగచుట తగ; దది యెట్టు లనిన, వార లదియే ధర్మం బని జుగుప్సితంబు లగు కామ్యకర్మంబులు సేయుచుఁ దత్త్వజ్ఞానంబు మఱతురు; గావున, బుద్ధి మోహంబు జనియింపక తత్త్వజ్ఞుండవై వృథా వియోగంబు సేయు" మని మఱియు నిట్లనియె.

1-99-చంపకమాల

ఎఱిఁగెడువాఁడు కర్మచయ మెల్లను మాని హరిస్వరూపమున్
నెఱయ నెఱింగి యవ్వలన నేరుపు జూపు గుణానురక్తుఁడై
తెఱకువ లేక క్రుమ్మరుచు దేహధనాద్యభిమాన యుక్తుఁడై
యెఱుఁగని వానికిం దెలియ నీశ్వరలీల లెఱుంగ చెప్పవే.

1-100-చంపకమాల

తన కులధర్మమున్ విడిచి దానవవైరి పదారవిందముల్
పనిపడి సేవసేసి పరిపాకము వొందక యెవ్వఁడేనిఁ జ
చ్చిన మఱు మేన నైన నది సిద్ధి వహించుఁ దదీయ సేవఁ బా
సినఁ గుల ధర్మగౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులన్.

1-101-వచనము

అదిగావున నెఱుక గలవాఁడు హరిసేవకుం బ్రయత్నంబు సేయం దగు; గాలక్రమంబున సుఖదుఃఖంబులు ప్రాప్తంబు లయినను హరిసేవ విడువం దగదు; దానం జేసి యూర్ధ్వంబున బ్రహ్మ పర్యంతంబు గ్రింద స్థావర పర్యంతంబుఁ దిరుగుచున్న జీవులకు నెయ్యది వొందరా దట్టి, మేలు సిద్ధించుకొఱకు హరిసేవ

3-87-వచనము

మఱియు లలితనికషణవిరాజమాన మణిగణకిరణ సుషమావిశేష విడంబిత విమలసలిలంబు లందుఁ బ్రతిఫలిత సంపూర్ణచంద్రమండల రుచి నిరీక్షించి జలచరబుద్ధింజేసి తజ్జలవిలోలమీనంబు లనూన స్నేహంబునం దలంచు చందంబునఁ, గృష్ణానుచరులైన యదు వృష్ణి కుమారు లమ్మహనీయమూర్తిం దమకు నగ్రేసరుండని కాని లీలా మానుషవిగ్రహుండైన పరమాత్ముండని యెఱుంగక, హరిమాయా జనితంబగు నసద్భావంబునంజేసి భోజన శయనాసనానుగమనంబులం జేరి సహోదరాదిభావంబులం గూడి చరియింతురు; అద్దేవుని మాయాపయోనిధినిమగ్నులు గాకుండ నబ్జభవాదులకైనం దీఱదు సర్వగుణగరిష్ఠులును సత్పురుష శ్రేష్ఠులును నగు పరమభాగవతులకుం దక్కఁ దక్కినవారలకుం జెప్పనేల; అదియునుంగాక, యభిజన విద్యా ధన బల గర్వమదాంధీభూతచేతస్కులైన శిశుపాలాది భూపాలకు లమ్మహాత్మునిం బరతత్త్వంబని యెఱుంగక నిందించు దుర్భాషలు దలంచి మనస్తాపంబు నొందుచుండుదు" నని, వెండియు.

3-88-మత్తేభ విక్రీడితము

అవితృప్తేక్షణధీసమాహిత తపోవ్యాసంగులైనట్టి భా
గవతశ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖిలైకజ్యోతిమైఁజూపి శో
కవిశోకంబులు నిర్దహించి కమలాకాంతుండు శాంతుండు మా
నవరూపంబగు దేహమున్ వదలి యంతర్ధానుఁ డయ్యెం జుమీ.

3-89-సీస పద్యము

మానవైకవికాసమానమై తనకును;
విస్మయజనకమై వెలయునట్టి
యాత్మీయయోగమాయాశక్తిఁ జేపట్టి;
చూపుచు నత్యంతసుభగుఁ డగుచు
భూషణంబులకును భూషణంబై వివే;
కములకెల్లను బరకాష్ఠ యగుచు
సకలకల్యాణసంస్థానమై సత్యమై;
తేజరిల్లెడునట్టి దివ్యమూర్తి

3-89.1-తేటగీతి

తాన తనమూర్తి నిజశక్తిఁ దగ ధరించె
యమతనూభవు రాజసూయాధ్వరంబు
నందు నెవ్వని శుభమూర్తి నర్థితోడ
నిండువేడుకఁ జూచి వర్ణించుచుండు.

3-90-కంద పద్యము

ప్రకటముగఁ గమలభవస్తృ
ష్టికిఁ గారణ మిమ్మహాత్ముఁడే యనుచును ను
త్సుకులై తన్మూర్తిని ద
ప్పకచూచిరిగాదె తత్ప్రభాజనులెల్లన్.

3-91-వచనము

మఱియు శాంతోగ్రరూపధరుఁడైన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ, బరకృతాపరాధ నిపీడ్యమానసుండయ్యు ననుకంపాయత్త చిత్తుండై వర్తించు

పరాపరుండును బ్రకృతికార్యంబైన మహతత్త్వరూపుండును జననవిరహితుం డయ్యును దారువులువలన ననలంబు దోఁచు చందంబున జననంబు నొందుచుండు; అట్టి సరోజనాభుని హాసరాసలీలానురాగ విలోకన ప్రతిలబ్ధమానలైన గోపకామినులు దన్మూర్తిదర్శనానుషక్తమనీషలం గలిగి వర్తించి; రదియునుం గాక.

3-92-చంపకమాల

దివిజులకోర్కెఁదీర్ప వసుదేవుని యింట జనించి కంసదా
నవుఁడు వధించునన్భయమునంజని నందునియింటనుంటకున్
యవనజరాసుతాదులకు నాజినెదుర్పడలేక సజ్జన
స్తవమధురాపురిన్ విడిచి దాగుటకున్ మదిఁజింతనొందుదున్.

3-93-వచనము

అదియునుం గాక.

3-94-సీస పద్యము

కడఁగి పెక్కేడుమలఁ గుడుచుచుఁ జిత్తముల్;
కలఁగఁగ బంధనాగారములను
వనరిన దేవకీవసుదేవులను డాయఁ;
జనుదెంచి భక్తివందన మొనర్చి
" తలిదండ్రులార! యేఁ గలుగంగ మీరలు;
కంసుచే నలజడిఁ గ్రాగుచుండఁ
గడగి శత్రుని జంపఁగాలేక చూచుచు;
నున్న నాతప్పుఁ బ్రసన్ను లగుచుఁ

3-94.1-తేటగీతి

గావుఁ"డని యానతిచ్చిన దేవదేవు
నద్భుతావహ మధురవాక్యములఁ దలఁచి
తలఁచి నాచిత్తమునఁ బెద్దగలుగుచుండుఁ
బృథులపాతకభూమిభృద్భిదుర విదుర!

3-95-కంద పద్యము

విమలమతిఁదలఁప నెవ్వని
బొమముడి మాత్రమున నిఖిలభూదేవీభా
రము వాయునట్టి హరిపద
కమలమరందంబు గ్రోలు ఘనుఁడెవ్వాఁడో?

3-96-కంద పద్యము

మందప్రజ్ఞుఁడనై గో
విందుని మురదైత్యహరుని విష్ణునిఁ బరమా
నందుని నందతనూజుని
మందరధరుఁ జిత్తమందు మఱతునె యెందున్.

3-97-చంపకమాల

అదియునుఁ గాక, మీరు నృపులందఱుఁజూఁడగ ధర్మసూతి పెం
పొదవిన రాజసూయసవనోత్సవమందును జన్మమాదిగాఁ
బదపడి యెగ్గొనర్చు శిశుపాలుఁడు యోగిజనంబు లిట్టిద
ట్టిదని యెఱుంగనోపని కడిందిపదంబునునొందెనే కదా.

3-98-చంపకమాల

కురునృప పాండు నందను లకుంఠితకేళిఁ జమూసమేతులై
యరిగి రణోర్వి నెవ్వని ముఖాంబురుహామృత మాత్మలోచనో
త్కరములఁ గ్రోలి పార్థవిశిఖప్రకరక్షతపూతగాత్రులై
గురుతర మోక్షధామమునకుం జని సౌఖ్యము నొందిరో తుదిన్.

3-99-సీస పద్యము

అట్టి సరోజాక్షుఁ డాద్యంతశూన్యుండు;
సుభగుండు త్రైలోక్యసుందరుండు
గమనీయ సాగరకన్యకాకుచకుంకు;
మాంకిత విపులబాహాంతరుండు
సకలదిక్పాలభాస్వత్కిరీటన్యస్త;
పద్మరాగారుణపాదపీఠుఁ
డజుఁ డనంతుఁడు సమానాధికవిరహితుం;
డిద్ధమూర్తి త్రయాధీశ్వరుండు

3-99.1-తేటగీతి

నైన హరి యుగ్రసేనుని నఖిలరాజ్య
రుచిరసింహాసనమున గూర్చుండఁబెట్టి
భృత్యుభావంబునొంది సంప్రీతి నతని
పనుపుసేయుట కెపుడు నామనముగుందు."

3-100-వచనము

అని పెండియు నిట్లనియె "అనఘా! పరాత్పరుండును యోగీశ్వరుండును నగు కృష్ణుండు భగవద్భక్తుండును బరమ భాగవతోత్తముండును నైన యుగ్రసేనుని సేవించుట యాశ్చర్యంబు గాదు; తన్ను హరియింపం దలంచి కుచంబుల విషంబు ధరియించి స్తన్యపానంబు సేయించిన దుష్టచేతన యైన పూతనకుం జన్నిచ్చిపెంచిన యశోదాదేవికి నైన నందరాని నిజపదంబుఁ గారుణ్యచిత్తుండై యొసెంగె ననిన, నిజపాదధ్యానపరాయణు లగువారల ననుసరించి సేవించుట సెప్పనేల" యనిన నుద్ధవునికి విదురుం డిట్లనియె "భక్తవత్సలుండును గారుణ్యనిధియు నై భాగవతజనుల ననుగ్రహించు పుండరీకాక్షుండు నిజదాసలోకంబున కొసంగు పరమపదంబు నుగ్రకరులైన రాక్షసుల కెట్లొసంగె అత్తెఱం గెఱింపు" మనిన విదురునకు నుద్ధవుం డిట్లనియె.

3-101-మత్తేభ విక్రీడితము

" దనుజానీక మనేక వారములు దోర్దర్పంబు సంధిల్లఁగా
వినుతాసూను భుజావరోహుఁ డగు నవ్విష్ణున్ సునాభాస్త్రుఁ దా
రనిలో మార్కొని "పోకు పోకు హరి దైత్యారాతి!" యంచుం దదా
ననముం జూచుచుఁ గూలి మోక్షపదమున్ ప్రాపింతు రత్యున్నతిన్.

3-102-కంద పద్యము

ధీరజనోత్తమ! నవసిత
సారసలోచనుఁడు గృష్ణుజననంబును ద
చ్చారిత్రము నెఱిఁగింతును
దారత నీ విపుడు వినుము తద్విధమెల్లన్.

3-103-చంపకమాల

ధరణిభరంబు వాపుటకుఁ దామరసాసను ప్రార్థనన్ రమా
వరుఁ డల కంస బంధననివాసముననన్ వసుదేవదేవకీ
వరులకు నుద్భవింప బలవంతుఁడు గంసుఁడు హింససేయు న
న్నెరపున నర్ధరాత్రి సుతునిం గొని యవ్వసుదేవుఁ డిమ్ములన్.

3-104-కంద పద్యము

నందుని మందకుఁ జని త
త్సుందరితల్పమునఁ బరులు సూడకయుండన్
నందను నినునిచి యానక
దుందుభి మరలంగ నేగెఁ దొల్లిటి పురికిన్.

3-105-కంద పద్యము

హరి యేకాదశ సంవ
త్సరములు నందవ్రజమునఁ దను హరి యని యె
వ్వరు నెఱుఁగకుండ నా హల
ధరుతోఁ గ్రీడించుచుండె దద్దయు బ్రీతిన్.

3-106-కంద పద్యము

గోపాలవరులకైనను
నాపోవఁగ దన సమంచితాకార మొగిం
జూపని శ్రీపతి వేడుక
గోపాలురఁ గూడి కాచె గోవత్సములన్.

3-107-వచనము

అయ్యవసరంబునం గృష్ణుండు లీలావినోదంబులు తోడిగోపాలబాలురకుం జూపం దలంచి.

3-108-చంపకమాల

వర యమునానదీ సలిల వర్ధిత సౌరభ యుక్త పుష్ప మే
దుర మకరంద పానపరితుష్ట మధువ్రతయూధ మాధవీ
కురవక కుంద చందన నికుంజము లందు మయూర శారికా
పరభృత రాజకీర మృదుభాషల భంగిఁ జెలంగి పల్కుచున్.

3-109-ఉత్పలమాల

శ్రీరమణీమనోవిభుఁడు సింహకిశోరముఁబోలి లీలఁ గౌ
మారదశన్ రమావిమలమందిరముం బురుడించు గోతతిన్
వారక మేపుచుండెఁ దన వంశరవస్ఫుటమాధురీసుధా
సారముచేత గోపజనసంఘములన్ ముదమందఁజేయుచున్.

3-110-వచనము

మఱియును.

3-111-మత్తేభ విక్రీడితము

చిరకేళీరతి బాలకుల్ తృణములన్ సింహాది రూపంబులం
గరమొప్పన్ విరచించి వాని మరలన్ ఖండించు చందంబునన్
కరుణాతీతులఁ గామరూపు లగు నక్కంసప్రయుక్తక్షపా
చరులం గృష్ణుఁడు సంగరస్థలములం జక్కాడె లీలాగతిన్.

3-112-చంపకమాల

వరయమునానదీజల నివాస మహోరగ విస్తృతాస్య వి
స్ఫురిత విషానలప్రభల సోకునఁ గ్రాగిన గోప గోధనో
త్కరముల నెల్లఁ గాచి భుజగప్రవరున్ వెడలంగఁదోలి త
త్సరిదమలాంబు పానమున సంతసమందగఁ జేసె గోతతిన్.

3-113-మత్తేభ విక్రీడితము

దివిజాధీశుగుఱించి వానకొఱకై దీపింప నందాది వ
ల్లవు లేటేఁట ననూనసంపదల నుల్లాసంబునం జేయు ను
త్సవముం గృష్ణుఁడు మాన్పి గోపగణముల్ సంప్రీతినొందన్ శచీ
ధవు గర్వం బడఁపంగ నవ్యయముగాఁ దాఁ జేసె గోయాగమున్.

3-114-చంపకమాల

హరిహయుఁ డంత రోషవివశావిలమానసుఁడై సరోరుహో
దరు మహిమం బెఱుంగక మదం బడరంగ వలాహకాది భీ
కర ఘనపంక్తిఁ బంపిన నఖండశిలామయ భూరి వర్షముల్
కురిసె ననూన గర్జనల గోకుల మాకుల మౌచుఁ గుందఁగన్.

3-115-ఉత్పలమాల

ఆతఱి మంద గొందలము నందఁగ వల్లవు లెల్లఁ " గృష్ణ! యీ
చేతనులెల్ల నిట్టి జడిఁ జిందఱవందఱలై కలంగుచున్
కాతరు లైరి నీవు గృపఁ గావుము; కావు మనాథనాథ! ని
ర్ధూతకళంక! భక్తపరితోషణభూషణ! పాపశోషణా!"

3-116-మత్తేభ విక్రీడితము

అని యిబ్బంగి విపన్నులై పలుకఁ గుయ్యాలించి కృష్ణుండు స
జ్జనవర్ధిష్ణుఁడు గోపగోనివహరక్షాదక్షుడై దేవతా
జను లగ్గింపఁ గరాంబుజాతమున సచ్ఛత్రంబుగాఁ దాల్చె బో
రన గోవర్ధన శైలముం దటచరద్రమ్యామరీజాలమున్.

3-117-వచనము

వెండియు.

3-118-సీస పద్యము

శరదాగమారంభ సంపూర్ణపూర్ణిమా;
చంద్ర సాంద్రాతపోజ్జ్వలిత మగుచు
వెలయు బృందాటవీవీథి యందొకనాడు;
రాసకేళీ మహోల్లాసుఁ డగుచు
రుచిర సౌభాగ్యతారుణ్యమనోరము;
స్ఫూర్తిఁ జెన్నొందిన మూర్తి దనర
సలలితముఖచంద్రచంద్రికల్ గోపికా;
నయనోత్పలముల కానంద మొసగ

3-118.1-తేటగీతి

భవ్యచాతుర్యభంగిఁ ద్రిభంగి యగుచు
నబ్జనాభుండు సమ్మోద మతిశయిల్ల
లీలఁ బూరించు వరమురళీ నినాద
మర్థి వీతేర విని మోహితాత్ము లగుచు.

3-119-చంపకమాల

పతులు మఱుందులున్ సుతులు బావలు నత్తలు మామలున్ సము
న్నతి వలదన్న మానక మనంబునఁ గృష్ణపదాబ్జసేవనా
న్వితరతి గోపకామినులు వేచనుదేర దయాపయోధి శో
భితగతి రాసకేళి సలిపెం దరుణీనవపుష్పచాపుడై.

3-120-ఉత్పలమాల

రాముఁడు దానుఁగూడి మధురాపురికిం జని యందు వైభవో
ద్దామ నృపాసనంబున ముదంబున నున్న దురాత్ముఁ గంసు దు
ష్టామరశత్రుఁ ద్రుంచి ముదమారఁగఁ దల్లిని దండ్రి నంచిత
శ్రీమహితాత్ములై తనరఁజేసె సరోరుహనాభుఁ డున్నతిన్.

3-121-మత్తేభ విక్రీడితము

వలనొప్పంగ షడంగ యుక్త మహితామ్నాయంబు చౌషష్టివి
ద్యలు సాందీపనిచే నెఱింగెఁ జెలువొందన్ విన్నమాత్రంబులో
పలనే లోకగురుండు దాన తనకున్ భావింప నన్యుల్ గురు
ల్గలరే లోకవిడంబనార్థ మగు లీలల్ గావె యమ్మేటికిన్.

3-122-ఉత్పలమాల

మించి ప్రభాసతీర్థమున మృత్యువశంబునఁ బొంది పోయి యా
పంచజనోదరస్థుఁ డగు బాలకు దేశికునందనుం బ్రభో
దంచితలీలఁ దెచ్చి గురుదక్షిణగా నతిభక్తియుక్తి న
ర్పించె గురుండు చిత్తమునఁ బెంపెసలార మురారి వెండియున్.

3-123-సీస పద్యము

ఘనుఁడు విదర్భేశుఁడన నొప్పు భీష్మకు;
 వరసుతామణి నవవారిజాక్షి
పద్మాసమానరూపశ్రీవిభాసిత;
 కమనీయభూషణఁగంబుకంఠి
చతురస్స్వయంవరోత్సవ సమాగత చైద్య;
 సాల్వ మాగధ ముఖ్య జనవరేణ్య
నికరసమావృతఁ ప్రకట సచ్చారిత్ర;
 రుక్మిణి నసమానరుక్మకాంతి

3-123.1-తేటగీతి

నమర గుప్తామృతంబు విహంగవిభుఁడు
కొనినకైవడి మనుజేంద్రకోటిఁ దోలి
కమలనాభుండు నిజభుజాగర్వ మలరఁ
దెచ్చి వరియించె; నతని నుతింప వశమె?

3-124-చంపకమాల

పరువడిఁ బట్టి సప్తవృషభంబుల ముక్కులు గుట్టఁ దద్బల
స్ఫురణఁ సహింపఁజాలక నృపుల్ తలపడ్డ జయించి నగ్నజి
ద్ధరణిపునందనన్ వికచతామరసాక్షిఁ బ్రమోదియై స్వయం
వరమునఁ బెండ్లియాడె గుణవంతుఁ డనంతుఁ డనంత శక్తితోన్.

3-125-మత్తేభ విక్రీడితము

ప్రతివీరక్షయకారి నాబరఁగి సత్రాజిత్తనూజాహృదీ
ప్సితముం దీర్పఁ దలంచి నాకమునకుం బెంపారఁగా నేగి వ
ర్ణితశౌర్యోన్నతిఁ బారిజాత మిలకున్ లీలాగతిం దెచ్చె ను
ద్ధతి దేవేంద్రు జయించి కృష్ణుఁ డన నేతన్మాత్రుఁడే చూడగన్.

3-126-సీస పద్యము

మానితాఖిల జగన్మయ దేహమునఁ బొల్చు;
 ధరణిదేవికిఁ బ్రియతనయుఁ డైన
నరకదానవుని సునాభాఖ్యుఁ జెన్నొందు;
 ఘన చక్రధారా విఖండితోత్త
మాంగునిఁ జేయ నయ్యవనీలలామంబు;
 వేఁడినఁ దత్పుత్రు విపులరాజ్య
పదమున నిల్పి లోపలి మందిరంబులఁ;
 జిరముగ నరకుండు సెఱలఁ బెట్టి

3-126.1-తేటగీతి

నట్టి కన్యలు నూఱుఁబదాఱువేలు
నార్తభాంధవుఁడైన పద్మాక్షుఁ జూచి
హర్షభాష్పాంబుధారా ప్రవర్ష మొదవఁ
బంచశరబాణ నిర్భిన్నభావ లగుచు.

3-127-చంపకమాల

లలితఁ దదీయ సుందర విలాస విమోహితలైన వారినిం
బొలసిన గోర్కిఁదీర్చుటకు నొక్కముహూర్తమునన్ వరించి క

న్యల లలితావరోధభవనంబుల నందఱ కన్నిరూపులై
కలసి సుఖస్థితిం దనిపెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్.

3-128-కంద పద్యము

చతురతతో నందొక్కొక
యతివకుఁ బదురేసి సుతుల నాత్మసముల ను
న్నతభుజశక్తులఁ గాంచెను
వితతంబై కీర్తి దిశల వినుతుకి నెక్కన్.

3-129-సీస పద్యము

మథురాపురముఁ జతుర్విధ బలౌఘములతోఁ;
నావరించిన కాలయవన సాల్వ
మగధభూపాలాది మనుజేంద్ర లోకంబు;
సైన్యయుక్తముగాఁగ సంహరించి
తన బాహుశక్తిఁ జిత్తముల నర్థించిన;
భీమపార్థులకు నుద్దామ విజయ
మొసఁగి తద్వైరులనుక్కడంగఁగఁ ద్రుంచి;
బాణ శంబర ముర పల్వలాది

3-129.1-తేటగీతి

దనుజనాయక సేనావితానములను
హలధరాది సమేతుఁడై హతులఁ జేసె
దంతవక్త్రాది దైత్యులు దన్ను నెదుర
భండనములోనఁ ద్రుంచె దోర్బలము మెఱసి.

3-130-వచనము

వెండియుం, గృష్ణుండు గౌరవపాండవ భండనంబునకుం దోడ్పడి రాజన్యు లన్యోన్య మాత్సర్యోత్సాహ సమేతులై సైనికపాదఘట్టనంబుల ధరాచక్రంబు గంపింప నసమాన్యంబు లయిన శంఖభేరీ ప్రముఖ తూర్యఘోషంబులు నింగిఁ మ్రింగఁ దురంగమరింఖాసముద్ధూత ధూళిపటల పరిచ్ఛన్న భానుమండలంబునుంగాఁ జనుదెంచి కురుక్షేత్రంబున మొహరించిన నుభయపక్షంబులం దునుమాడి; నిఖిలరాజ్యవైభవ మదోన్మత్తుం డైన సుయోధనుండు నిఖిల రాజసమక్షంబునఁ గర్ణ శకుని దుశ్శాసనాదుల దుర్మంత్రంబున నిరంతరంబుఁ గుంతీనందనుల కెగ్గుసేసిన దోషంబునంజేసి సంగరరంగంబున భీముగదాఘాతంబునం దొడలు విరిగి పుడమింబడి గతాయుశ్శ్రీవిభవుండై యుండఁ జూచినం గదా పరితుష్టచిత్తుండ నగుదు; నని యపరిమిత బాహుబలోత్సాహు లైన భీష్మ ద్రోణ భీమార్జునులచేత నఖిల ధరాధిపతుల నష్టాదశాక్షౌహిణీ బలంబులతోడం దునిమించి; మఱియు స్వసమాన బలులయిన యదువీరుల జయింప నెంతవారలకైనం దీరదని మధుపానమద విఘూర్ణిత తామ్రలోచనులై వర్తించు యాదవుల కన్యోన్యవైరంబులు గల్పించి పోరించి యితరేతర కరాఘాతంబుల హతులై తన్నుఁ గలసినం గాని భూభారంబుడగ దని చిత్తంబున దలంచి; అంత ధర్మనందనునిచే నిస్సపత్నం బగు రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయించుచు మర్త్యులకుం గర్తవ్యంబులైన ధర్మపథంబులు సూపుచు బంధుమిత్రుల కెల్లఁ బరితోషంబు నొందించుచుం దత్పరోక్షంబున వారివంశం బుద్ధరింపఁ దలంచి యభిమన్యువలని నుత్తరయందు గర్భంబు నిలిపి గురుతనయప్రయుక్త మహిత బ్రహ్మాస్త్రపాతంబునం దద్గర్భదళనంబు గాకుండ నర్భకుని రక్షించి నిజపదారవింద

సేవారతుం డై న ధర్మసుతుచేఁ గీర్తి ప్రతాపంబులు నివ్వటిల్లం దురంగమేధంబులు మూఁడు సేయించి; వెండియు.

3-131-సీస పద్యము

వలనొప్ప లౌకికవైదికమార్గముల్;
 నడపుచు ద్వారకానగర మందు
నవిదితాత్మీయమాయా ప్రభావమున ని;
 స్సంగుఁడై యుండి సంసారిపగిదిఁ
జెంది కామంబులచేత విమోహితుం;
 డై సుఖించుచు ముదితాత్ముఁ డగుచు
నంచిత స్నిగ్ధస్మితావలోకముల సు;
 ధాపరిపూర్ణసల్లాపములను

3-131.1-తేటగీతి

శ్రీనికేతనమైన శరీరమునను
పొండునందన యదుకుల ప్రకరములను
లీలఁ గారుణ్య మొలయఁ బాలించుచుండె
నార్తరక్షాచణుండు నారాయణుండు.

3-132-సీస పద్యము

సంపూర్ణపూర్ణిమా చంద్రచంద్రిక నొప్పు;
 రమణీయశారదరాత్రు లందు
సలలితకాంచనస్తంభ సౌధోపరి;
 చంద్రకాంతోపలస్థలము లందు

మహిత కరేణుకా మధ్య దిగ్గజముల;
గతిని సౌదామినీలతల నడిమి
నీలమేఘంబులలీల ముక్తాఫల;
లలిత మధ్యస్థ నీలముల భాతి

3-132.1-తేటగీతి

సతత యౌవనసుందరీయుత విహారుఁ
డగుచు సతు లెంద ఱందఱ కన్నిరూప
ములనుఁ గ్రీడించె బెక్కబ్దములు సెలంగి
నందనందనుఁ డభినవానందలీల.

3-133-వచనము

అంతనొక్కనాఁడు.

3-134-చంపకమాల

మునివరు లేగుదేర యదుముఖ్యులు గొందఱు గూడి ముట్టఁబ
ల్కినఁ గనలొంది వారు దమకించి శపించినఁ గొన్నిమాసముల్
చనునెడ దైవయోగమున జాతరఁబో సమకట్టి వేడుకల్
మనములఁ దొంగిలింప గరిమన్ నిజయానము లెక్కి యాదవుల్.

3-135-ఉత్పలమాల

కోరి ప్రభాసతీర్థమునకుం జని తన్నదిఁ గ్రుంకి నిర్మలో
దారత నందు దేవ ముని తర్పణముల్ పితృతర్పణంబులున్

వారని భక్తిఁ జేసి నవవత్సలతోఁ బొలుపారు గోవులన్
భూరిసదక్షిణాకముగ భూసురకోటికి నిచ్చి వెండియున్.

3-136-కంద పద్యము

అజిన పట రత్న కంబళ
రజత మహారజత తిల ధరావరకన్యా
గజతురగ రథములను స
ద్విజకోటికి నిచ్చిఁ బెంపు దీపింపంగన్.

3-137-వచనము

ఇట్లు సఫలంబులైన భూదానంబు మొదలుగాఁగల దానంబు లనూనంబులుగా భగవదర్పణబుద్ధిం జేసి యనంతరంబ.

3-138-తేటగీతి

ఎసగు మోదంబు సంధిల్ల నిష్టమైన
రసిక మృదులాన్న మర్థిఁ బారణలుసేసి
మంజులాసవరసపానమత్తు లగుచుఁ
గడగి యన్యోన్యహాస్యవాక్యములఁ గలఁగి.

3-139-వచనము

ఇట్లు దమలోన మదిరాపాన మద విఘూర్ణిత తామ్రలోచను లయి మత్సరంబుల నొండొరులం బొడిచి సమస్త యాదవులును వేణూజాతానలంబునఁ దద్వంశ పరంపరలు దహనంబు నొందు చందంబునం బొలిసి రది యంతయుం గనుంగొని శ్రీకృష్ణుం డప్పుడు.

3-140-కంద పద్యము

చతురతతో నిజమాయా
గతిఁ జూచి లసద్విలోలకల్లోల సమం
చిత విమల కమల సార
స్వతజలముల విహితవిధులు సలిపినవాఁడై.

3-141-కంద పద్యము

ఒక వృక్ష మూలతలమున
నకలంక గుణాభిరాముఁ డాసీనుండై
యకుటిలమతి బదరీవని
కేఁక నీ వరుగు మని మొఱఁగి యేగిన నేనున్.

3-142-కంద పద్యము

క్రమమున నిజకులసంహా
రము సేయఁ గడంగు టెఱిగి రమణీయశ్రీ
రమణు చరణాబ్జయుగ విర
హమునకు మది నోర్వలేక యనుగమనుఁడనై.

3-143-కంద పద్యము

హరి నరయుచుఁ జనిచని యొక
తరుమూలతలంబు నందుఁ దన దేహరుచుల్
పరగఁగ నున్న మహాత్ముని
బరునిఁ బ్రపన్నార్తిహరుని భక్తవిధేయున్.

3-144-వచనము

మఱియును.

3-145-సీస పద్యము

అస్మత్ప్రియస్వామి నచ్యుతుఁ బరు సత్త్వ;
 గుణగరిష్ఠుని రజోగుణవిహీను
సురుచిరద్వారకాపురసమాశ్రయు ననా;
 శ్రయు నీలనీరదశ్యామవర్ణు
దళదరవిందసుందరపత్రనేత్రు ల;
 క్ష్మీయుతుఁ బీతకౌశేయవాసు
విలసితవామాంకవిన్యస్త దక్షిణ;
 చరణారవిందు శశ్వత్ప్రకాశు

3-145.1-తేటగీతి

ఘనచతుర్బాహు సుందరాకారు ధీరుఁ
జెన్నుగల లేతరావిపై వెన్నుమోపి
యున్న వీరాసనాసీను నన్నుఁగన్న
తండ్రి నానంద పరిపూర్ణు దనుజహరుని.

3-146-మత్తకోకిలము

కంటిఁగంటి భవాబ్ధి దాటఁగ గంటి నాశ్రితరక్షకుం
గంటి యోగిజనంబుడెందము గంటిఁ జుట్టముఁ గంటి ము
క్కంటికింగనరాని యొక్కటిఁ గంటిఁ దామరకంటిఁ జే
కొంటి ముక్తివిధానముం దలకొంటి సౌఖ్యము లందగన్.

3-147-వచనము

అయ్యవసరంబునం బరమ భాగవతోత్తముండును, మునిజన సత్తముండును, ద్వైపాయన సఖుండును, పరమ తపోధనుండును, నఘశూన్యుండును, యఖిలజన మాన్యుండును, బుధజనవిధేయుండును నగు మైత్రేయుండు తీర్థాచరణంబు సేయుచుం జనిచని.

3-148-మత్తేభ విక్రీడితము

కనియెం దాపసపుంగవుం డఖిలలోకఖ్యాతవర్ధిష్ణు శో
భనభాస్వత్పరిపూర్ణయౌవనకళాభ్రాజిష్ణు యోగీంద్రహృ
ద్వనజాత్రైకచరిష్ణు కౌస్తుభముఖోద్యద్భూషణాలంకరి
ష్ణు నిలింపాహితజిష్ణు విష్ణుఁ బ్రభవిష్ణుం గృష్ణు రోచిష్ణునిన్.

3-149-కంద పద్యము

తదనంతరంబ హరి దన
హృదయాబ్జము నందు ముకుళితేక్షణముల స
మ్మదమునఁ జూచుచు నానత
వదనుండై యుండె ముదము వఱలఁగ ననఘా!

3-150-వచనము

అంత దగ్గఱ నేతెంచి యున్న మైత్రేయుండు వినుచుండ దరహాస చంద్రికా సుందర వదనారవిందుండును, నానందసుధానిష్యంద కందళిత హృదయుండును, భక్తానురక్త దయాసక్త విలోకనుండును నగు పుండరీకాక్షుండు నన్ను నిరీక్షించి యిట్లని యానతిచ్చె "పూర్వ భవంబున వసుబ్రహ్మలుసేయు సత్త్రయాగంబున వసువై భవదీయ హృదయంబున నితర పదార్థంబులు గోరక

మదీయ పాదారవిందసేవం గాంక్షించితివి గావునఁ దన్నిమిత్తంబున నేను నీ హృదయంబున వసియించి సమస్తంబును గనుచుండుదు;
యాత్మారాముండనైన నన్ను నెవ్వరేనియు సదసద్వివేకులై యెఱుంగం జాలరు వారలకు నేను నగోచరుండనై యుండుదు; మత్పరిగ్రహంబు గల నీకు నీజన్మంబ కాని పునర్భవంబు నొందకుండుటకు భవదీయ పూర్వజన్మ కృతసుకృత విశేష ఫలంబు కతంబున నియ్యాశ్రమంబున మత్పాదారవింద సందర్శనంబు కలిగె; అదియునుంగాక పద్మకల్పంబు నందు మన్నాభిపద్మమధ్య నిషణ్ణుం డగు పద్మసంభవునకు జన్మమరణాది సంసృతి నివర్తకంబును యవిరతా నశ్వరసౌఖ్య ప్రవర్తకంబును నగు మన్మహత్త్వంబుఁ దెలియ జేయు నద్దివ్యజ్ఞానంబు నీకునెఱింగింతు." అని యమ్మహనీయ తేజోనిధి యానతిచ్చిన సుధాసమాన సరసాలాపంబులు కర్ణకలాంపంబులై మనస్తాపంబులం బాపిన రోమాంచ కంచుకిత శరీరుండను, నానందభాష్పధారాసిక్త కపోలుండను, పరితోష సాగరాంతర్నిమగ్న మానసుండను నయి యంజలిపుటంబు నిటలతటంబున ఘటియించి యిట్లంటి.

3-151-కంద పద్యము

" పురుషోత్తమ! నీ పదసర
సీరుహ ధ్యానామృతాభిషేకస్ఫురణం
గరమొప్పిన నా చిత్తమి
తర వస్తువు లందు వాంఛఁ దగులునె యెందున్.

3-152-చంపకమాల

జననములేని నీవు భవసంగతి నొందుట కేమి కారణం
బనియును, గాలసంహరుఁడపై జగముల్ వెలయించు నీవు పా
యని రిపుభీతికై సరిదుదంచిత దుర్గము నాశ్రయించు టె
ట్లనియును దేవ నామనము నందుఁ దలంతు సరోజలోచనా!

3-153-వచనము

అదియునుంగాక.

3-154-కంద పద్యము

శ్రీరమణీశ్వర నీ వా
త్మారాముఁడ వయ్యు లీలఁ దరుణీకోటిం
గోరి రమించితి వనియును
వారక యేఁ దలఁతు భక్తవత్సల! కృష్ణా!

3-155-కంద పద్యము

పరతత్త్వజ్ఞులు గరుణా
కర! నిను సంసారరహితుగా దలపోయ
న్నరసి నినుఁ గాంచు టెల్లను
గరమరుదు తలంచి చూడఁ గమలాధీశా!

3-156-వచనము

దేవా! నీ వఖండిత విజ్ఞాన రూపాంతఃకరణుండ వయ్యును ముగ్ధభావంబునఁ బ్రమత్తుని చందంబున విమోహికైవడిం బ్రవర్తించుచు నెందేని నొదిఁగి యుండుటం దలంచి నా డెందంబు గుందుచుండు; అరవిందలోచన! సురవందిత! ముకుంద!

ఇందిరాసుందరీరమణ! సరస్వతీరమణునకుం గరుణించిన సుజ్ఞానంబు ధరించు శక్తి నాకుం గలదేనిఁ గృపసేయుము భవదీయ శాసనంబు ధరియించి భూరి సంసారపారావారోత్తరణంబు సేయుదు'" అని విన్నవించి బహుభంగులం బ్రస్తుతించిన భగవంతుడునుఁ బ్రపన్నపారిజాతంబును నైన కృష్ణుండు పరతత్త్వనిర్ణయంబు నెఱింగిచిన.

3-157-కంద పద్యము

సరసిజలోచన కరుణా
పరిలబ్ధజ్ఞానకలిత భావుఁడ నగుటం
హరితత్త్వవేదినై త
చ్చరణసరోజముల కెరఁగి సమ్మతితోడన్.

3-158-కంద పద్యము

హరి పదజలరుహ విరహా
తురతన్ దుర్దాంత దుఃఖతోయధిఁ గడవన్
వెరవేది తిరుగవలసెను
సరసిజభవకల్పవిలయ సమయము దాఁకన్.

3-159-వచనము

ఇట్లు దిరుగుచు.

3-160-మత్తేభ విక్రీడితము

నరనారాయణ దాపసాశ్రమ పదౌన్నత్యంబునం బొల్చు భా
సుర మందార రసాల సాల వకుళాశోకామ్ల పున్నాగకే

సరళ జంబీర కదంబ నింబ కుటజాశ్వత్థస్ఫురన్మల్లికా
కరవీరక్షితిజాభిరామ బదరీకాంతార సేవారతిన్.

3-161-కంద పద్యము

చనుచున్నవాఁడ" నని ప
ల్కిన పలుకుల కులికి కళవళించుచు విదురుం
డనుపమశోకార్ణవమున
మునిఁగియు నిజయోగ సత్త్వమునఁ దరియించెన్.

3-162-వచనము

ఇట్లు విదురుండు శోకపావకునిం దన వివేకజలంబుల నార్చి యుద్ధవున కిట్లనియె.

3-163-మత్తేభ విక్రీడితము

" అనఘా! యుద్ధవ! నీకుఁ గృష్ణుఁ డసురేంద్రారాతి మన్నించి చె
ప్పిన యధ్యాత్మ రహస్యతత్త్వ విమలాభిజ్ఞానసారంబు బో
రన నన్నుం గరుణించి చెప్పినఁ గృతార్థత్వంబునం బొందెదన్
విను పుణ్యాత్ములు శిష్యసంఘముల నుర్విం బ్రోవరే? వెండియున్.

3-164-కంద పద్యము

భగవద్భక్తులు సుజనులుఁ
దగవెఱిఁగి పరోపకారతాత్పర్యవివే
కగరిష్ఠులై చరింతురు
జగతిం బొగడొంది వృష్టిసత్తమ యొందున్."

## 3-5-మైత్రేయునిం గనుగొనుట

3-165-కంద పద్యము

అనవుడు నుద్ధవుఁ డవ్విదు
రున కిట్లను "ననఘ! మునివరుఁడు సాక్షాద్వి
ష్ణునిభుండగు మైత్రేయుఁడు
దన మనమున మనుజగతి వదలఁ దలఁచి తగన్.

3-166-కంద పద్యము

హరి మురభేది పరాపరుఁ
గరుణాకరుఁ దలఁచు నట్టి ఘనుఁ డమ్మునికుం
జరు కడకేఁగిన నాతడు
గరమర్థిం దెలుపు సాత్త్వికజ్ఞానంబున్."

3-167-వచనము

అని యుద్ధవుండు విదురుం గూడి చనిచని.

3-168-ఉత్పలమాల

ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు హల్లకఫుల్లపద్మ ని
ష్యంద మరందపాన విలసన్మద భృంగ జలత్తరంగ మా
కంద లవంగ లుంగ లతికాచయ సంగ సురాంగనాశ్రితా
నందితపుణ్యసంగ యమునన్ భవభంగ శుభాంగ నర్మిలిన్.

3-169-కంద పద్యము

కని డాయనేఁగి మోదం
బునఁ దత్సరిదమల పులిన భూములఁ దగ నా
దినశేషము నివసించెను
వనజోదరపాదపద్మవశమానసుఁడై

3-170-కంద పద్యము

మఱునాఁడు రేపకడ భా
సురపుణ్యుఁడు ఘనుడు మధునిషూదనచరణ
స్మరణక్రీడాకలితుఁడు
దరియించెం గలుషగహనదహనన్ యమునన్.

3-171-వచనము

ఇట్లుద్ధవుండు యమునానది నుత్తరించి బదరికాశ్రమంబునకుం జనియె" అనిన విని రాజేంద్రుండు యోగీంద్రున కిట్లనియె.

3-172-కంద పద్యము

" శౌరియు నతిరథవరులు మ
హారథ సమరథులు యదుబలాధిపు లెల్లం
బోరిఁ మృతిఁబొంద నుద్ధవుఁ
డేరీతిన్ బ్రతికె నాకు నెఱిగింపు తగన్."

3-173-సీస పద్యము

నావుడు రాజేంద్రునకు శుకయోగీంద్రుఁ;
డిట్లను "మున్ను లోకేశుచేత

సంప్రార్థితుండైన జలరుహనాభుండు;
 వసుమతిపై యదువంశమందు
నుదయించి తనుఁదాన మదిలోనఁ జింతించి;
 తెలివొంది యాత్మీయకులవినాశ
మొనరించి తాను బంచోపనిషణ్మయ;
 మగు దివ్యదేహంబునందుఁ జెందఁ

3-173.1-తేటగీతి

దలఁచి విజ్ఞానతత్త్వంబు ధరణిమీఁద
దాల్చి జనకోటి కెఱిఁగింపఁ దగిన ధీరుఁ
డుద్ధవుఁడు దక్క నితరులేనోప రితఁడు
నిర్జితేంద్రియుఁ డాత్మసన్నిభుఁ డటంచు

3-174-తేటగీతి

క్షితిపై నిలిపిన కతమున
నతనికి మృతి దొరకదయ్యె నవనీశ! రమా
పతి యభిమానము గలిగిన
యతిపుణ్యుఁడు చనియె బదరికాశ్రమమునకున్.

3-175-వచనము

అంత.

3-176-కంద పద్యము

ఉద్ధవుఁ డరిగిన పిదప స
మిద్ధపరిజ్ఞాను సుజనహితు మైత్రేయున్
వృద్ధజనసేవ్యుఁ దాపస
వృద్ధశ్రవుఁ జూఁడగోరి విదురుఁడు గడఁకన్.

3-177-వచనము

యమునానది దాఁటి కతిపయప్రయాణంబులం బుణ్యనదులును హరిక్షేత్రంబులును దర్శించుచు నతి త్వరిత గమనంబున.

3-178-కంద పద్యము

చనిచని ముందటఁ గనుగొనె
ఘనపాపతమఃపతంగఁ గరుణాపాంగం
గనదుత్తుంగతరంగన్
జనవరనుతబహుళపుణ్యసంగన్ గంగన్.

3-179-కంద పద్యము

అందు నరవింద సౌరభ
నందిత పవమాన ధూత నటదూర్మి పరి
స్పందిత కందళశీకర
సందోహ లసత్ప్రవాహ జలమజ్జనుఁడై.

3-180-సీస పద్యము

ఘనసార రుచి వాలుకా సముదంచిత;
సైకతవేదికాస్థలము నందు

యమనియమాది యోగాంగ క్రియానిష్టఁ;
 బూని పద్మాసనాసీనుఁ డగుచు
హరిపాదసరసీరుహన్యస్త చిత్తుఁడై;
 బాహ్యేంద్రియవ్యాప్తిఁ బాఱఁదోలి
సకలవిద్వజ్జన స్తవనీయ సముచితా;
 చార వ్రతోపవాసములఁ గ్రుస్సి

3-180.1-తేటగీతి

యున్న పుణ్యాత్ము విగతవయోవికారు
వినుతసంచారు భువనపావనవిహారు
యోగిజనగేయు సత్తతిభాగధేయు
నాశ్రితవిధేయు మైత్రేయు నచటఁ గాంచె.

## 3-6-విదుర మైత్రేయ సంవాదంబు

3-181-వచనము

ఇట్లు గనుంగొని యమ్మునీంద్రుని పాదంబులకుం బ్రణమిల్లి ముకుళిత హస్తుండై యిట్లనియె "మునీంద్రా! లోకంబున సకల జనంబులు మనంబుల ఘనంబులగు సౌఖ్యంబు లందందలంచి తత్ఫలప్రాప్తి హేతువులైన కర్మంబు లాచరించి దైవోపహతులై తత్కర్మంబులచేత నిష్ఫలారంభు లగుదురు; కర్మంబులు బంధకంబులును దుఃఖ హేతువులునుం గాని సౌఖ్యదాయకంబులై పాపనివృత్తిఁ జేయనోపవు; అదియట్లుండె; భూరి దుఃఖానుసారంబైన సంసారచక్రంబు నందుఁ బరిభ్రమించుచుం గామ విమోహితులై పూర్వకర్మానుగతంబులైన శరీరంబులుఁ దాల్చుచుం జచ్చుచు మరలం బుట్టుచు నెంతకాలంబునకుం బాపనివృత్తిఁ గానక

మాతృయౌవనవనకుఠారులై జనియించి వర్తించు మూఢాత్ములం బశుప్రాయుల రక్షించుకొఱకుఁ గాదె నారాయణపరాయణులైన మీవంటి పుణ్యాత్ములు లోకంబునం జరియించుట; అదియునుంగాక.

3-182-మత్తేభ విక్రీడితము

అవివేకానుగతస్వకార్యజలవేలాకీర్ణమై మిత్రబం
ధువధూపుత్రజలగ్రహోగ్రయుతమై దుర్దాంతసంసార దు
ర్భవపాథోధిఁ దరించువారె? హరిసంబంధక్రియాలోల భా
గవతానుగ్రహనావ లేని యధముల్ కారుణ్యసంధాయకా!

3-183-కంద పద్యము

మునినాథచంద్ర! ననుఁ గై
కొని కాచు తలంపు బుద్ధిఁ గూడిన యేనిన్
వినుము; మదీప్సిత మది నా
చనువునఁ గావింపవయ్య! సజ్జనతిలకా!"

3-184-వచనము

అని వెండియు విదురుండు మైత్రేయుం జూచి "మునీంద్రా! త్రిగుణాత్మక మాయానియంత యగు భగవంతుండు స్వతంత్రుం డయ్యు నవతరించి యేయే యవతారంబుల నేయే కర్మంబు లాచరించె? అదియు నిష్క్రియుం డగు నీశుండు మొదలం బ్రపంచంబు నేవిధంబునం గల్పించె? ఏ పగిదిం బాలించె? మఱియు నీ విశ్వంబు నాత్మీయ హృదయాకాశగతముం జేసి నివృత్తవృత్తి యగుచు యోగమాయ యం దెట్లు వసియించె? బ్రహ్మాదిరూపంబులం బొంది బహుప్రకారంబుల నెట్లు క్రీడించె? భూసుర గోసురాదులఁ బరిరక్షించుటకై

మత్స్యాద్యవతారంబులు ధరియించి యేయే ప్రయోజనంబులం దీర్చె? పయోరుహగర్భాండకటాహాంతర్గతంబులై లోకపాలసహితంబులైన లోకంబులను, లోకాలోకపర్వతంబులను, బహిర్భాగంబులను నేయే తత్త్వభేదంబుల ముఁ నెత్తఱంగునఁ బుట్టించె? అందుఁ బ్రతిపితంబగు జీవకోటి యెవ్వనిం గొల్చి బ్రతుకు? జనులకుఁ గర్మనామరూపభేదంబు లెట్లు నిర్దేశించె? నింతయు సవిస్తారంబుగా వివరింపుము; ఉత్తమశ్లోకమౌళిమండనుండును యోగీశ్వరేశ్వరుండును నైన పుండరీకాక్షుని చరిత్రశ్రవణంబునం గాని జన్మమరణాది సకలదుఃఖకరంబులును దుష్కర్మప్రాప్తంబులును నగు భవబంధంబులు దెగవు;" అని వెండియు నిట్లనియె.

3-185-తరళము

" సతతమున్ సరసీరుహోదరసత్కథామృతపూరమున్
శ్రుతిపుటాంజలిచేత నిమ్ముల జుట్టియుం దనివోదు భా
రతకథామిష మూని విష్ణుఁ బరాశరప్రియసూతి స
న్మతి నుతించిన చోట సన్మునినాథ! నామది నుబ్బుదున్.

3-186-కంద పద్యము

ఇతర కథావర్ణనముల
నతి హేయత నొందె జిత్త మనఘాత్మ! రమా
పతి చరితామృతరతి సం
స్మృతివేదన లెల్లఁ బాయఁజేయు మునీంద్రా!

3-187-తేటగీతి

భూరివిజ్ఞాననిధు లగు నారదాది
నిర్మలాత్ముల కయిన వర్ణింపరాని
హరికథామృతపానంబు నందు విసివి
యొల్ల ననువాఁడె పో వెట్టిగొల్లఁ డనఁగ.

3-188-వచనము

అదియునుంగాక.

3-189-సీస పద్యము

అరవిందనాభుని యపరావతారమై;
జనన మందిన పరాశరసుతుండు
చతురవర్ణాశ్రమాచారధర్మంబులు;
దవణింప లోకవిడంబనంబు
లగు గ్రామ్యకథలు పెక్కర్థిఁగల్పించుచు;
హరికథావర్ణనమందులోన
నించుకించుకగాని యేర్పడఁ జెప్పమి;
నంచిత విజ్ఞాన మాత్మ నిలువ

3-189.1-తేటగీతి

కున్నఁ జింతించి మఱి నారదోపదిష్టుఁ
డగుచు హరివర్ణనామృత మాత్మఁ గ్రోలి
విమలసుజ్ఞాననిధి యన వినుతికెక్కి
ధన్యుఁ డయ్యెను లోకైకమాన్యుఁ డగుచు.

3-190-వచనము

కావున.

3-191-కంద పద్యము

సరసిరుహోదరు మంగళ

చరితామృత మాత్మఁ గ్రోలు జనుఁ డితర కథా

గరళముఁ గ్రోలునె హరిసం

స్మరణము జీవులకు నఖిల సౌఖ్యద మనఘా!

3-192-కంద పద్యము

శ్రీవనితాధిప నామక

థావిముఖుల కిహముఁ బరము దవ్వై పిదపం

బోవుదురు నరకమునకున్

వావిరి నే వారిఁ జూచి వగతు మునీంద్రా!

3-193-కంద పద్యము

ఏ నరుఁడే నొక నిమిషం

బైన వృథావాదగతిని హరిపదకమల

ధ్యానానందుఁడు గాడే

నా నరునకు నాయు వల్ప మగు మునినాథా!

3-194-చంపకమాల

మృదుగతిఁ బువ్వుదేనియ రమించుచుఁ బానముసేయఁ బాఱు ష

ట్పదమునుఁ బోలి యార్తజనబాంధవు విశ్వభవస్థితివ్యయా

స్పదమహితావతారుఁ డగు పంకరుహోదరు నిత్యమంగళ
ప్రదగుణకీర్తనామృతముఁ బాయకఁ గ్రోలెదఁ జెప్పవే దయన్."

3-195-కంద పద్యము

అని విదురుఁడు మైత్రేయుం
డను మునినాయకుని నడిగె" నని వేదవ్యా
సునితనయుం డభిమన్యుని
తనయునకుం జెప్పి మఱియుఁ దగ నిట్లనియెన్.

3-196-వచనము

" ఇట్లు విదురుండు మైత్రేయు నడిగిన నతం డతనిం గని యతి మృదు మధురవచనరచనుండై యిట్లనియె "అనఘా! కృష్ణకథాశ్రవణ తత్పరుండవై నీవు నన్నడిగితివి గావున భద్రంబయ్యె; నీవు భగవద్భక్తుండవు గావున హరికథాసక్తుండ వగుట విచిత్రంబుగాదు; అదియునుంగాక మాండవ్యశాపంబున సాత్యవతేయువలన భాతృక్షేత్రంబున శూద్రయోనింబుట్టినట్టి ప్రజాసంయమనుండవగు యముండవు పరమ జ్ఞానసంపన్నుండవు నారాయణునకుం బ్రియతముండవు గావునఁ గృష్ణుండు నిర్యాణకాలంబునం దన సన్నిధికిం జనిన నన్నుఁడాయంజీరి విజ్ఞానం బెల్ల నుపదేశించి నీకు నెఱింగింపు మని యానతిచ్చుటంజేసి యవశ్యంబును నీకు నెఱింగింతు దత్తావధానుండవై వినుము.

## 3-7-జగదుత్పత్తి లక్షణంబు

3-197-కంద పద్యము

వనజాక్షయోగమాయా
జనితం బగు విశ్వజననసంస్థానవినా
శనముల తెఱఁ గెఱిఁగించుచు
ననఘా! విష్ణుని మహత్త్వ మభివర్ణింతున్.

3-198-సీస పద్యము

సకలజీవుల కెల్లఁ బ్రకట దేహము నాత్మ;
 నాథుండుఁ బరుఁడు నానావిధైక
మత్యుపలక్షణమహితుండు నగు భగ;
 వంతుండు సృష్టిపూర్వంబు నందు
నాత్మీయమాయ లయంబు నొందిన విశ్వ;
 గర్భుఁడై తాన యొక్కటి వెలుంగు
పరమాత్ముఁ డభవుం డుపద్రష్ట యయ్యు వ;
 స్త్వంతర పరిశూన్యుఁ డగుటఁ జేసి

3-198.1-తేటగీతి

ద్రష్ట గాకుండు మాయాప్రధానశక్తి
నతుల చిచ్ఛక్తి గలవాఁడు నగుచుఁ దన్ను
లేనివానిఁగఁ జిత్తంబులోనఁ దలఁచి
ద్రష్ట యగుఁ దన భువననిర్మాణవాంఛ.

3-199-తేటగీతి

బుద్ధిఁ దోచిన నమ్మహాపురుషవరుఁడు
కార్యకారణరూపమై ఘనతకెక్కి

భూరిమాయాభిధాన విస్ఫురతశక్తి
వినుతికెక్కిన యట్టి యవిద్య యందు.

3-200-కంద పద్యము

పురుషాకృతి నాత్మాంశ
స్ఫురణము గల శక్తి నిలిపి పురుషోత్తముఁ డీ
శ్వరుఁ డభవుం డజుఁడు నిజో
దరసంస్థిత విశ్వ మపుడుఁ దగఁ బుట్టించెన్.

## 3-8-మహదాదుల సంభవంబు

3-201-సీస పద్యము

ధృతిఁ బూని కాలచోదితము నవ్యక్తంబుఁ;
బ్రకృతియు నని పేళ్ళఁ బరగు మాయ
వలన మహత్తత్త్వ మెలమిఁ బుట్టించె మా;
యాంశ కాలాది గుణాత్మకంబు
నైన మహత్తత్త్వ మచ్యుత దృగ్గోచ;
ర మగుచు విశ్వనిర్మాణవాంఛ
నందుటఁ జేసి రూపాంతరంబునఁ బొందె;
నట్టి మహత్తత్త్వ మందు నోలిఁ

3-201.1-తేటగీతి

గార్యకారణ కర్త్రాత్మకత్వ మైన
మహిత భూతేంద్రియక మనోమయ మనంగఁ

దగు నహంకారతత్త్వ ముత్పన్న మయ్యెఁ
గోరి సత్త్వరజస్తమోగుణక మగుచు.

3-202-వచనము

వెండియు; రూపాంతరంబులం బొందుచున్న సాత్త్వికాహంకారంబు వలన మనంబును వైకారికకార్యభూతంబు లైన దేవతాగణంబులును సంభవించె; ఇంద్రియాధిష్ఠాత లైన వాని వలన శబ్దంబు పూర్వంబునఁ బ్రకాశం బగుటం జేసి జ్ఞానేంద్రియంబు లయిన త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులునుఁ, గర్మేంద్రియంబు లయిన వాక్పాణి పాద పాయూపస్థములును, దైజసాహంకారంబు వలన శబ్దస్పర్శ రూపరస గంధంబు లుదయించె; అందు శబ్దంబు నిజగుణం బయిన శబ్దంబువలన నాకాశంబుఁ బుట్టించె; గగనంబు కాలమాయాంశయోగంబునం బుండరీకాక్షు నిరీక్షణంబున స్పర్శతన్మాత్రంబువలన వాయువుం గలిగించె; పవనుండు నభోబలంబున రూపతన్మాత్రాంశంబు వలన లోకలోచనం బైన తేజంబు నుత్పాదించె; తేజంబు కాలమాయాంశ యోగంబున నుత్తమశ్లోకుని విలోకనంబునఁ బవమాన యుక్తం బగుచు రసతన్మాంత్రంబువలన నంబువులం బుట్టించె; సలిలంబు కాలమాయాంశ యోగంబునం బరమేశ్వరానుగ్రహంబు గలిగి తేజోయుక్తం బైన గంధ గుణంబు వలనం బృథివిఁ గలిగించె; అందు గగనంబునకు శబ్దంబును, వాయువునకు శబ్ద స్పర్శంబులును, తేజంబునకు శబ్దస్పర్శ రూపంబులును, సలిలంబునకు శబ్దస్పర్శ రూపరసంబులును, పృథివికి శబ్దస్పర్శ రూపరస గంధంబులును, గుణంబులై యుండు; కాలమాయాంశ లింగంబులు గలిగి మహదాద్యభిమానంబులు నొందిన దేవతలు విష్ణుకళాకలితు లగుదురు; అట్టి మహదాది తత్త్వంబు లైక్యంబు సాలమిం బ్రపంచంబులు గల్పింప

సమర్థంబులుగాక కృతాంజలులై యోగీశ్వరేశ్వరుం డైన నారాయణు నిట్లని స్తుతియించె.

## 3-9-మహదాదులు హరి స్తుతి

### 3-203-దండకము

శ్రీనాథనాథా! జగన్నాథ! నమ్రైకరక్షా! విపక్షక్షమాభృత్సహస్రాక్ష! నీరేజ పత్రేక్షణా! దేవదేవా! భవద్దాస వర్గానుతాపంబులం బాపఁగా నోపు దివ్యాతపత్రంబునాఁ బొల్చు యుష్మత్పదాంభోజ మూలంబు పుణ్యాల వాలంబుగాఁ బొంది యోగీంద్రు లుద్దామ సంసారతాపంబులం బోవఁగా మీటి వర్తింతురో తండ్రి! ఈశా! సమస్తాఘ నిర్ణాశ! ఈ విశ్వమం దెల్ల జీవుల్ భవోదగ్ర దుర్వార తాపత్రయాభీల దావాగ్నిచేఁ గ్రాగి దుఃఖాబ్ధిలోఁ దోఁగి యేకర్మమున్ ధర్మముం బొందఁగా లేక సంసారచక్రంబు నందుం బరిభ్రామ్యమాణాత్ములై యుందు; రమ్మూఢ చేతస్కులం జెప్పఁగా నేల యో దేవ! విజ్ఞానదీపాంకురం బైన మీ పాదపంకేరుహచ్ఛాయఁ బ్రాపింతు మబ్జాక్ష! సన్మౌని సంఘంబు లైకాంతికస్వాంతతం బేర్చి దుర్దాంత పాపౌఘ నిర్ణాశకాంబుప్రవాహాభ్ర గంగానివాసంబుగాఁ నొప్పు నీ పాద యుగ్మంబు యుష్మన్ముఖాంభోజ నీడోద్గతం బైన వేదాండజశ్రేణిచేతం గవేషించి సంప్రాప్తులై యుందు; రో నాథ! వైరాగ్యశక్తిస్ఫుటజ్ఞాన బోధాత్ములైనట్టి ధీరోత్తముల్ నిత్య నైర్మల్య భవ్యాంతరంగంబు లందే పరంజ్యోతి పాదాబ్జపీఠంబు గీలించి కైవల్యసంప్రాప్తులై రట్టి నిర్వాణమూర్తిం బ్రశంసింతు మింద్రాదివంద్యా! ముకుందా సమస్తంబుఁ గల్పింపఁ బాలింపఁ దూలింపఁగాఁ బెక్కు దివ్యావతారంబులం బొందు నీ పాద పంకేరుహధ్యాన పారీణ సుస్వాంతులై యొప్పు భక్తావళిన్ మోక్షదం బైన నీ పాదకంజాతముల్ కొల్తు; మీశా! రమాధీశ! పుత్రాంగనా మిత్ర సంబంధ

బంధంబులం జెంది నిత్యంబు దుష్టక్రియాలోలురై దేహగేహంబులం దోలి వర్తించు దుర్మానవశ్రేణు లందంతరాత్ముండవై యుండియున్ దూరమై తోఁచు నీ పాదపద్మంబు లర్చింతు; మో దేవ! బాహ్యేంద్రియవ్యాప్తి నుద్వృత్తు లైనట్టి మూఢాత్ము లధ్యాత్మ తత్త్వప్రభావాఢ్యులై నీ పదాబ్జాత విన్యాస లక్ష్మీకళావాసముం గన్న యయ్యుత్తమశ్లోకులం గానఁగాఁజాల రప్పుణ్యు లా దుష్టులం జూడఁగా నొల్లరంభోధిరాట్కన్యకాకాంత వేదాంత శుద్ధాంత సిద్ధాంతమై యొప్పు నీ సత్కథాసార చంచత్సుధాసార పూరంబులం గ్రోలి సౌఖ్యోన్నతిన్ సోలి ధీయుక్తులై వ్రాలి తాపంబులం దోలి మోదంబులం దేలి సంపన్నులై మన్న నిత్యప్రసన్నుల్ మహోత్కంఠతం బేర్చి వైకుంఠధామంబు నల్పక్రియాలోలురై కాంతు రద్దివ్యవాసైక సంప్రాప్తికిం గోరుచున్నార; మో దేవ! వైరాగ్యవిజ్ఞాన భోధాత్మ యోగక్రియా రూఢి నంతర్బహిర్వ్యాప్తిఁ జాలించి శుద్ధాంతరంగంబుఁ గావించి హృత్పద్మ వాసుండ వై చిన్మయాకారమై యున్న నీ యున్న తానంత తేజో విలాసోల్లసన్మూర్తిఁ జిత్తంబు లం జేర్చి యానంద లోలాత్మతం బొల్చు యోగీశ్వరశ్రేణికిం దావకీ నానుకంపానులబ్ధస్ఫుటజ్ఞానముం గల్గుటం జేసి యాయాసముం జెంద; రో దేవతాచక్రవర్తీ! సదానందమూర్తీ! జగద్గీతకీర్తీ! లసద్భూతవర్తీ! భవద్దాసు లైనట్టి మమ్మున్ జగత్కల్పనాసక్త చిత్తుండవై నీవు త్రైగుణ్య విస్ఫూర్తిఁ బుట్టించినం బుట్టుటేకాక నీ దివ్య లీలానుమేయంబుగా సృష్టి నిర్మాణముం జేయ నేమెంతవారౌదు మీ శక్తి యుక్తిన్ భవత్పూజ గావింతు; మట్లుండె నీ సత్కళాజాతు లైనట్టి మమ్మెన్నఁగా నేల నధ్యాత్మ తత్త్వంబ వన్నం బరం జ్యోతి వన్నం బ్రపంచంబ వన్నన్నధిష్ఠాత వన్నన్ సదాసాక్షి వన్నన్ గుణాతీత! నీవే కదా పద్మపత్రాక్ష! సత్త్వాది త్రైగుణ్య మూలంబునా నొప్పు మాయాగుణం బందు నుద్యన్మహా తత్త్వ మైనట్టి నీ వీర్యముం బెట్టుటం జేసి నీ

వింతకుం గారణం బౌదు; నాయాయి కాలంబులన్నీకు సౌఖ్యంబు లేమెట్లు గావింతు; మేరీతి నన్నంబు భక్షింతు; మెట్బంగి వర్తింతు; మే నిల్కడన్నుందు; మీ జీవలోకంబె యాధారమై యుండి భోగంబులం బొందుచున్నన్న యిక్కార్య సంధాను లైనట్టి మాకుం జగత్కల్పనా శక్తికిన్ దేవ! నీ శక్తిఁ దోడ్పాటు గావించి విజ్ఞానముం జూపి కారుణ్య సంధాయివై మమ్ము రక్షింపు లక్ష్మీమనః పల్వలక్రోడ! యోగీంద్ర చేతస్సరో హంస! దేవాదిదేవా! నమస్తే! నమస్తే! నమః!

## 3-10-విరాడ్విగ్రహ ప్రకారంబు

### 3-204-సీస పద్యము

అనినఁ బ్రసన్నుఁడై హరి మహదాదుల;
 కన్యోన్యమిత్రత్వ మందకున్న
కతమున నిఖిల జగత్కల్పనాశక్తి;
 వొడమకుండుటఁ దన బుద్ధి నెఱిఁగి
కైకొని కాలవేగమున నుద్రేకంబు;
 నొందిన ప్రకృతితోఁ బొంది నిజబ
లము నిల్పి తా నురుక్రముఁ డన సప్తవిం;
 శతితత్త్వముల యందు సమత నొక్క

### 3-204.1-తేటగీతి

పరి ప్రవేశించి యాతత్త్వభవ్యగుణము
నందు జ్యేష్ఠానురూపంబు లలరఁ జెంది
యొకటి నొకటినిఁ గలయక యుండి విశ్వ
రచన నెఱుఁగని యాతత్త్వనిచయమునకు.

3-205-వచనము

ఇట్లు విశ్వనిర్మాణనిపుణత్వంబు నెఱుంగం జూపుచు నన్నింటికి నన్యోన్యతం గల్పించి తన యనుగ్రహంబునం బ్రేరితంబై కానంబడి క్రియాసామర్థ్యంబునం జెన్నొందిన తత్త్వవితానంబు దేవప్రేరితంబయి స్వకీయంబులగు నంశంబులచేతం బుట్టించిన విరాడ్విగ్రహంబై తత్త్వవితతి దమ యందుఁ జెందిన పుండరీకాక్షుని కళాంశంబున నొకటి కొకటికి నైక్యంబు వాటిల్లి పరిణతంబై రూపాంతరంబునుం జెందె; నే తత్త్వంబునఁ జరాచరలోక పుంజంబులు నిండి యుండు, నా హిరణ్మయంబైన విరాడ్విగ్రహంబు నొందిన పురుషుండు సర్వజీవసమేతుండై యుండె; అంత.

3-206-కంద పద్యము

జలములలోపల నిమ్మల
జలరుహజాతాండ మందు సాహస్రాబ్దం
బులు నిలిచెఁ గార్యరూపా
కలితం బగు నవ్విరాట్సుగర్భము వరుసన్.

3-207-తేటగీతి

దైవకర్మాత్మశక్తి వితానములను
దగిలి తనచేతఁ దనుఁదాన దైవశక్తి
యగుచు వెలుగొందుచును బ్రకారాంతరమునఁ
దనువు వితతంబుగాని చైతన్య మొంది.

3-208-తేటగీతి

రూపసంసక్తిఁ జేసి నిరూఢకర్మ
శక్తియును వృత్తిభేదసంసక్తి దశ వి
ధముల గలిగిన ప్రాణరూపమున నాత్మ
శక్తి బోధత్వ మగుచున్న శక్తి గలిగి.

3-209-కంద పద్యము

త్రివిధం బగుచును నాధ్యా
త్మ్య విభేదంబులను బాపి మఱి యధిభూతా
త్మ విరాడ్రూపమ్మగు నిది
వివిధప్రాణులకు నాత్మవిధమై మఱియున్.

3-210-కంద పద్యము

జీవంబై పరమాత్మకుఁ
దావలమై యాదిమావతారం బగు న
ద్దేవుని గర్భంబున భూ
తావలితోడం బ్రపంచ మర్థిం దోఁచెన్.

3-211-వచనము

ఇట్లు దోఁచిన విరాట్పురుషుం డాధ్యాత్మి కాధిదైవి కాధిభౌతికంబు లను భేదంబులచేఁ బూర్వోక్తక్రమంబున వెలుగొందు" ననుచు విదురునకు మైత్రేయుం డెఱింగించె" నని చెప్పి; వెండియు నిట్లనియె.

3-212-చంపకమాల

" హరి పరమాత్ముఁ డీశుఁ డజుఁ డాఢ్యుఁ డనంతుఁ డనంతమూర్తి సా
గరతనయాహృదీశుఁడు వికారవిదూరుఁడు నిత్యమంగళా
కరుఁడు గృపాపయోనిధి యకల్మషచిత్తుఁడు సర్వశక్తి దా
మరసవిలోచనుండు బుధమాన్యచరిత్రపవిత్రుఁ డిమ్ములన్.

3-213-వచనము

ఇత్తెఱంగున నీశుం డగు నధోక్షజుండు మహదాదితత్త్వంబుల మనంబుల ఘనంబులగు తలంపులు దానెఱింగి యట్టి తత్త్వంబుల వివిధ వృత్తిలాభంబునకై స్వకీయచిచ్ఛక్తిచే నిటు లొనర్తు నని చింతించి నిజకళాకలితం బగు విరాడ్విగ్రహంబు నందు నగ్ని ప్రముఖం బగు దేవతావళి కెల్ల నివాసం బగుచుఁ గానంబడిన వైరాజపురుషుని యాస్యాద్యవయవంబుల వినిపింతు దత్తావధానుండవై వినుము.

3-214-సీస పద్యము

నరనుత! యా దివ్యపురుషోత్తముని పృథ;
గ్భావంబు నొంది ముఖంబువలన
భువనపాలకుఁడైన పవమానసఖుఁ డంత;
రాత్ముఁ డీశ్వరునంశమైనవాని
కనయంబు ననుకూల మగుచు నిజస్థాన;
మునఁ బ్రవేశించిన ముఖము నందుఁ
బరఁగు జీవుండు శబ్దము నుచ్చరించుఁ బృ;
థగ్భావములను నేత్రముల నినుఁడు

3-214.1-తేటగీతి

చక్షురింద్రియ యుక్తుఁడై సరవిఁజెంది
రూపవిజ్ఞాన మహిమ నిరూఢి నొందు
మఱియుఁ జర్మంబునను బవమానుఁ డీశ్వ
రాంశమై తత్తగింద్రియ మందుఁ గూడి.

3-215-వచనము

నిజవాసంబు నాశ్రయించి జీవుండు స్పర్శేంద్రియగతుండై పృథగ్భావం బయ్యె; శ్రోత్రంబుల దిక్కు లచ్యుత కళాంశంబు లగు శ్రవణేంద్రియ యుక్తంబులై నిజస్థానంబునం బొంది జీవుండు శబ్దజ్ఞానగతుం డగు; వెండియుఁ దాలువు నిర్భిన్నంబయిన లోకపాలుఁ డగు వరుణుం డందుఁ బ్రవేశించి రసనేంద్రియంబుచేఁ బ్రకాశించినం బ్రాణి రసంబులం గ్రహించె; పరమేశ్వరుని నాసికేంద్రియంబు పృథగ్భావంబు నొంది యాశ్వినేయాధిష్టానంబై ఘ్రాణాంశంబు నొందిన జంతువు గంధగ్రహణ సమర్థం బయ్యె; వెండియు భిన్నంబయిన చర్మంబున నోషధులును బరమపురుషాంశంబు లయిన కేశంబులం గూడి నిజనివాసంబు నొందిన జీవుండు కండూయమానుం డగు; భిన్నభూతంబైన మేఢ్రంబునం బ్రజాపతి రేతంబున నిజస్థానంబు నొంది జీవుం డానందంబునం బొరయు; భిన్నభావం బైన గుదంబున మిత్రుం డచ్యుతాంశంబును బొంది పాయువుం గూడి నిజాస్థానంబు నొందుచు జీవుండు విసర్గంబుఁ జెందు; వేఱువేఱైన బాహువులం ద్రిదశాధీశ్వరుం డయిన పురంధరుండు క్రయవిక్రయాది శక్తియుక్తుం డగుచు నిజస్థానంబు నొంది జీవుండు వానిచేత జీవికం బొందు; మఱియుఁ బాదంబులు నిర్భిన్నంబు లయిన విష్ణుండు స్వావాసంబు గైకొని గతిశక్తిం బొందిన జీవుండు గమనాగమ నార్హుండయ్యె; వెండియు భిన్నభావం బయిన హృదయంబు మనంబుతోడం గలిసి నిజాధిష్టానంబునం జంద్రుండు

ప్రవేశించిన జీవుండు శరీరసంకల్పాది రూపం బగు వికారంబునుం బొందు; భిన్నభావంబైన యహంకారంబున నహంకృతి యుక్తుండై రుద్రుండు నిజస్థానంబుగా వసియించు; ఆ యహంకృతిచే శరీరకర్తవ్యంబులు నడపు బుద్ధి వాగీశ్వరావాసంబై హృదయంబుతోడం గలసి నిజాధిష్ఠానంబున బోధాంశంబుచే వెలింగిన శరీరి బోద్ధవ్యతం బొందు; భిన్నంబైన చిత్తంబు బ్రహ్మవాసంబై చేతనాంశంబు నొందినఁ బ్రాణి విజ్ఞానంబునుం బొందు; అట్టి విరాట్పురుషుని శీర్షంబున స్వర్గంబును, జరణంబుల వసుమతియు, నాభి యందు గగనంబును గలిగె సత్త్వాదిగుణ పరిణామంబుల నమరు లైరి; ఊర్జిత సత్త్వగుణంబున నద్దేవతలు త్రిదివంబును బొందిరి; రజోగుణంబున మనుజులును, గవాదులును ధరణిం బొందిరి; తామసంబున భూతాదులైన రుద్రపారిషదులు ద్యావాపృథివ్యంతరం బగు వియత్తలంబునుం బొందిరి ముఖంబువలన నామ్నాయంబు లుత్పన్నంబయ్యె; వెండియు.

3-216-కంద పద్యము

ధరణీదివిజులు శ్రుతులును
నరవర యమ్మేటి ముఖమునం బొడముట భూ
సురుఁ డఖిల వర్ణములకున్
గురుఁడున్ ముఖ్యుండు నయ్యె గుణరత్ననిధీ!

3-217-కంద పద్యము

ధరఁ బ్రాహ్మణాదికముఁ ద
స్కరబాధలఁ బొందకుండఁ గైకొని కావం

బురుషోత్తము బాహువులన్
నరనాథకులంబు పుట్టె నయతత్త్వనిధీ!

3-218-కంద పద్యము

గణుతింపఁగఁ గృషి గోర
క్షణ వాణిజ్యాది కర్మకలితంబుగ నా
గుణనిధి యూరువు లందుం
బ్రణుతింపగ వైశ్యజాతి ప్రభవం బయ్యెన్.

3-219-తేటగీతి

తివిరి సేవకధర్ములై దేవదేవు
పదములను శూద్రసంతతు లుదయ మైరి
వీర లందఱుఁ దమతమ విహితకర్మ
ములరఁ జేయుచు జనకుండు నాత్మ గురుఁడు.

3-220-కంద పద్యము

అగు సర్వేశుఁ బరాత్పరు
జగదేకప్రభుని పాదజలజాతంబుల్
తగిలి భజింతురు సతతము
నిగమోక్తిన్ భక్తియోగనిపుణాత్మకులై.

3-221-తేటగీతి

మహిమ దీపింపఁ గాల కర్మస్వభావ
శక్తి సంయుక్తుఁ డగు పరేశ్వరుని భూరి

యోగమాయావిజృంభణోద్యోగ మెవ్వఁ
డెఱిఁగి నుతియింపఁగా నోపు నిద్ధచరిత!

3-222-ఉత్పలమాల

అన్యకథానులాపము లహర్నిశముం బరియించి చాల మా
లిన్యము నాత్మశోభన విలీనత నొందు మదీయ జిహ్వ సౌ
జన్యముతోడఁ గ్రోలు హరి సద్గుణ దివ్యకథామృతంబు స
న్మాన్యచరిత్రమై నెగడు మద్గురువాక్యపదంబుఁ జెందఁగన్.

3-223-మత్తేభ విక్రీడితము

హరినామాంకిత సత్కథామృత రసవ్యాలోలుఁ డైనట్టి స
త్పురుషశ్రేష్ఠుఁ డసత్కథాలవణవాఃపూరంబుఁ దాఁ గ్రోలునే?
వరమందార మరందపాన కుతుకస్వాంతద్విరేఫంబు స
త్వరమై పోవునె చేఁదు వేములకుఁ దద్గంధానుమోదాత్మమై.

3-224-కంద పద్యము

హరిమహిమముఁ దన్నాభీ
సరసిజసంజాతుఁ డైన చతురాననుఁడుం
బరికించి యెఱుఁగఁ డన్న ని
తర మనుజులఁ జెప్పనేల తత్త్వజ్ఞనిధీ!

3-225-తేటగీతి

శ్రుతులు దమలోన వివరించి చూచి పుండ
రీకలోచను నుత్తమశ్లోకచరితు

నమరగణవంద్యమానపాదాబ్జయుగళు
వెదకి కనుఁగొనలే వండ్రు విమలమతులు.

3-226-కంద పద్యము

హరియుం దన మాయాగతిఁ
బరికించియుఁ గానడయ్యె బరిమితి లేమిన్
మఱి మాయా విమోహిత
చరితముఁ గనుఁగొందు రెట్లు చతురాస్యాదుల్.

3-227-కంద పద్యము

ఆ దివిజాధీశుఁడు మహా
దాదులు దిక్పతులుఁ బంకజాననుఁడున్ గౌ
రీదయితుఁడు గనఁజాలని
శ్రీదేవుని పదయుగంబుఁ జింతింతు మదిన్."

3-228-కంద పద్యము

అని మైత్రేయుం డవ్విదు
రున కెఱిఁగించిన తెఱంగు రుచిరముగా న
ర్జునపౌత్రునకుఁ బరాశర
మునిమనుమం డెఱుఁగజెప్పి ముదము దలిర్పన్.

3-229-వచనము

వెండియు నిట్లనియె.

3-230-కంద పద్యము

" భూమీశ్వర! మైత్రేయ మ
హాముని విదురునకు నట్లు హరిగుణ శుభలీ
లామాహాత్మ్యముఁ జెప్పిన
నా మైత్రేయునకు విదురుఁ డనియెన్ మఱియున్.

3-231-కంద పద్యము

" అగుణున కవికారునకున్
జగదవనోద్భవ వినాశ సత్కర్మములుం
దగులీలఁ బెట్టు లాతఁడు
సగుణుండై యుండు టెట్టు సౌజన్యనిధీ!

3-232-సీస పద్యము

అని యర్భకునిగతి యనుకొని మైత్రేయ;
 మునిఁ జూచి విదురుఁ డిట్లనియె మరల
బాలుఁడు క్రీడావిలోలమానసమున;
 దీపించు లీలానురూపుఁ డగుచుఁ
గానిచోఁ గామానుగతుఁడై రమించును;
 నర్భకుఁ డర్థి వస్త్వంతరమున
నర్భకాంతరమున నైనను బాలకే;
 ళీసంగుఁ డగుచు నోలినిఁ జరించు

3-232.1-తేటగీతి

హరియు నెపుడు నివృత్తుఁ డత్యంతతృప్తుఁ
డగుట వర్తించు టెట్లు క్రీడాదు లందు

మఱియుఁ ద్రిగుణాత్మకంబైన మాయఁ గూడి
యఖిల జగములఁ గల్పించె ననుట యెట్లు?

3-233-సీస పద్యము

అమ్మాయచేత నీ యఖిలంబు సృజియించి;
 పాలించి పొలియించి పరమపురుషు
డనఘాత్మ! దేశకాలావస్థ లందును;
 నితరుల యందునహీనమైన
జ్ఞానస్వభావంబుఁ బూని యాప్రకృతితో;
 నెబ్బంగిఁ గలసెఁ దానేక మయ్యుఁ
గోరి సమస్తశరీరంబు లందును;
 జీవరూపమున వసించి యున్న

3-233.1-తేటగీతి

జీవునకు దుర్భరక్లేశసిద్ధి యెట్టి
కర్మమున సంభవించెను? గడఁగి నాదు
చిత్త మజ్ఞాన దుర్గమస్థితిఁ గలంగి
యధికఖేదంబు నొందెడు ననఘచరిత!

3-234-వచనము

అదిగావున సూరిజనోత్తముండ వైన నీవు మదీయ మానసిక సంశ యంబులఁ దొలగింప నర్హుండవు" అని విదురుండు మైత్రేయమునీంద్రు నడిగెను" అని బాదరాయఁతనూభవుం డభిమన్యునందనున కిట్లనియె

3-235-కంద పద్యము

" సరసిరుహోదరు మంగళ
చరితామృతపానకుతుక సంగంబున ని
ర్భరుఁ డగు విదురునకు మునీ
శ్వరుఁ డగు మైత్రేయుఁ డనియె "సజ్జనతిలకా!

3-236-చంపకమాల

వినుము వితర్కవాదములు విష్ణుని ఫుల్లసరోజపత్రనే
త్రుని ఘనమాయ నెప్పుడు విరోధముసేయుఁ బరేశు నిత్యశో
భనయుతు బంధనాధిక విపద్దశలుం గృపణత్వ మెప్పుడే
ననయముఁ బొందలేవు విభుఁ డాద్యుఁ డనంతుఁడు నిత్యుఁ డౌటచేన్.

3-237-వచనము

మఱియును.

3-238-చంపకమాల

పురుషుఁడు నిద్రవోఁ గలల బొందు సమస్త సుఖంబు లాత్మసం
హరణ శిరోవిఖండనము లాదిగ జీవునికిం బ్రబోధమం
దరయఁగఁ దోఁచుచున్నగతి నాదిఁ బరేశుఁడు బంధనాదులం
బొరయక తక్కు టెట్లనుచు? బుద్ధిని సంశయ మందెదేనియున్.

3-239-వచనము

అవ్విధం బతనికిం గలుగనేరదు; అది యెట్లంటేని.

3-240-చంపకమాల

లలిత విలోల నిర్మలజలప్రతిబింబిత పూర్ణచంద్రమం
డలము దదంబుచాలన విడంబనహేతువు నొందియున్ వియ
త్తలమునఁ గంపమొందని విధంబున సర్వశరీరధర్మముల్
కలిగి రమించు నీశునకుఁ గల్గఁగ నేరవు కర్మబంధముల్.

3-241-వచనము

కావున జీవునకు నవిద్యామహిమం జేసి కర్మబంధనాదికంబు సంప్రాప్తం బగు గాని సర్వభూతాంతర్యామి యైన యీశ్వరునకు బ్రాప్తంబు గానేరదు; అని.

3-242-చంపకమాల

నరునకు నాత్మదేహజ గుణంబులఁ బాపఁగనోపు పంకజో
దరచరణారవింద మహితస్ఫుటభక్తియ యింద్రియంబు లీ
శ్వర విషయంబు లైన మది సంచిత నిశ్చలతత్త్వమైనచో
సరసిజనేత్రుకీర్తనమె చాలు విపద్దశలన్ జయింపఁగన్.

3-243-చంపకమాల

హరిచరణారవిందయుగళార్చన సన్నుతి భక్తియోగముల్
నిరతము గల్గువారు భవ నీరజగర్భుల కందరాని భా
సురపద మందుఁ జేరుదురు సూరిజనస్తవనీయ! యట్టి స
త్పురుషుల పూర్వజన్మఫలమున్ గణుతింపఁ దరంబె యేరికిన్."

3-244-వచనము

అని చెప్పిన విదురుండు మైత్రేయుం గనుంగొని ముకుళిత హస్తుండును వినమిత మస్తకుండును నగుచుఁ దన మనంబున శ్రీహరిం దలంచుచు

వినయవచనరచనుండై యిట్లనియె "మునీంద్రా! భవదీయ వాక్యములచేత నామనంబున నారాయణుండు లోకైకనాథుం డెట్లయ్యె ననియు, శరీరధారి యైన జీవునికిఁ గర్మబంధంబు లేరీతి సంభవించె ననియునుం బొడమిన సంశయంబు నేఁడు నివృత్తం బయ్యెఁ; ఎట్లనిన లోకంబున కీశ్వరుండు హరి యనియు, జీవుండు పరతంత్రుం డనియునుఁ దలంపుదు; నారాయణ భక్తి ప్రభావంబు ప్రాణిగోచరం బైన యవిద్యకు నాశనకారణం బనం దనరుచుండు; నారాయణుండు దనకు నాధారంబు లేక సమస్తంబునకుం దాన యాధారభూతుం డై విశ్వంబుం బొదివి యందుఁ దా నుండు తెఱం గెట్లు; శరీరాభిమానంబును బొంది యెవ్వఁడు మూఢతముం డై సంసారప్రవర్తకుం డగు; నెవ్వండు భక్తిమార్గంబునఁ బరమాత్ముం డైన పుండరీకాక్షునిఁ జెందు; వీర లిద్దఱును సంశయ క్లేశంబులు లేమింజేసి సుఖానంద పరిపూర్ణులై యభివృద్ధనొందువార లగుదురు; ఎవ్వండు సుఖదుఃఖాను సంధానంబుచే లోకానుగతుం డగుచుం బ్రమోద వేదనంబుల నొందు నతండు దుఃఖాశ్రయుండగు; నారాయణభజనంబున సమస్త దుఃఖనివారణం బగు నని భవదీయచరణసేవా నిమిత్తంబునం గంటి; ప్రపంచంబు ప్రతీతి మాత్రంబు గలిగియున్న దైన నందులకుఁ గారణంబు లేకుండుటంజేసి తెలియని వాడనై వర్తింతును;" అని వెండియు.

3-245-కంద పద్యము

" లలి నా మదిఁ దలఁపుదు సుమ
తులు గొనియాడంగఁ దగిన తోయజనాభుం
డలవడఁ డల్ప తపోనిర
తుల తలపోఁతలకు మిగుల దుర్లభుఁ డనియున్.

3-246-సీస పద్యము

ఇంద్రియంబులతోడ నెలమి నొప్పెడి మహ;
దాదుల నితరేతరానుషంగ
ముగఁ జేసి వానియం దొగి విరాడ్దేహంబు;
పుట్టించి యందుఁ జేపట్టి తాను
వసియించు నాతఁడు వరుస సహస్రసం;
ఖ్యాకంబులగు మస్తకాంఘ్రి బాహు
కలిత సత్పురుషునిఁగా బ్రహ్మవాదులు;
పలుకుదు రా విరాట్ప్రభువు నందు

3-246.1-తేటగీతి

భువన జాలంబు లలజడి బొరయకుండఁ
బ్రాణదశకంబు నింద్రియార్థములు నింద్రి
యాధిదైవతములుఁ గూడ ననఘ త్రివిధ
మగుచు విప్రాది వర్ణము లయ్యె నందు.

3-247-కంద పద్యము

ఇలఁ బుత్రపౌత్రసంపద
గలిగిన వంశములతోడఁ గడుఁ జోద్యముగా
లలిఁ బ్రజ లేగతిఁ గలిగిరి
కలిగిన యా ప్రజలచే జగము లెట్లుండెన్?

3-248-కంద పద్యము

చతురత దీపింపఁ బ్రజా
పతులకుఁ బతి యనఁగ వెలయు పద్మాపతి యే
గతిఁ బుట్టించెను? స్రష్ట
ప్రతతులచే నవవిధప్రపంచము మఱియున్.

3-249-తేటగీతి

వానిభేదంబులును మనువంశములును
మనుకులాధీశ్వరులును దన్మనుకులాను
చరితములునే విభూతినే జాడ దీని
నింతయును బుట్టఁజేసె? నా కెఱుఁగఁ బలుకు.

3-250-కంద పద్యము

సరవింగ్రిందన్ మీఁదం
ధరణికిఁ గల లోకములను దత్తద్విస్తులన్
వరుసం బరిణామంబుల
నెఱిఁగింపగదయ్య నాకు నిద్ధచరిత్రా!

3-251-కంద పద్యము

సుర తిర్యఙ్నర రాక్షస
గరుడోరగ సిద్ధసాధ్య గంధర్వ నభ
శ్చరముఖ భవములు మునికుం
జర! గర్భస్వేదజాండజముల తెఱంగున్.

3-252-కంద పద్యము

త్రిగుణప్రధానకంబులు
నగునవతారములఁ బూర్ణమై వెలసిన యా
జగదుత్పత్తిస్థితిలయ
నిగమముల విధంబు వాని నిలుకడలుఁ దగన్.

3-253-కంద పద్యము

చక్రాయుధు సౌందర్య ప
రాక్రమముఖ గుణములును ధరామరముఖ వ
ర్ణక్రమములు నాశ్రమధ
ర్మక్రియలును శీలవృత్తమతభావములున్.

3-254-తేటగీతి

యోగవిస్తార మహిమలు యాగములును
జ్ఞానమార్గంబులును బరిజ్ఞానసాధ
నములు నై యొప్పు సాంఖ్యయోగములు వికచ
జలజనయనకృతంబు లౌ శాస్త్రములును.

3-255-సీస పద్యము

పాషాండధర్మంబుఁ బ్రతిలోమకులవిభా;
గములు జీవుల గుణకర్మములును
పలుకులగతులునుఁ గలిగెడి ధర్మమో;
క్షముల యందలి పరస్పరవిరోధ
ములు లేని సాధనమును భూమిపాలక;
నీతివార్తలు దండనీతిజాడ

యును బృథగ్భావంబులును విధానములును;
బితృమేధములును దత్పిత్ప విసర్గ

3-255.1-తేటగీతి

గతులుఁ దారాగ్రహంబులుఁ గాలచక్ర
మున వసించిన నిలుకడలును దపములు
దానములుఁ దత్ఫలంబులఁ దనరు ప్రబల
ధర్మములుఁ బ్రజ లొనరించు కర్మములును

3-256-చంపకమాల

వదలక భూజనావళికి వచ్చు విపద్దశధర్మముల్ సరో
జదళనిభాక్షుఁ డేగతిని సంతసమందెడు నెట్టివారి మే
ల్వదలక కానవచ్చు గురులం బ్రియశిష్యులు గొల్వ వారు స
మ్మదమునఁ గోరునర్థములు మానుగ నెట్లెఱిఁగింతు రిమ్ములన్.

3-257-కంద పద్యము

విలయాది భేదముల న
య్యలఘునిఁ బరమేశు నెవ్వ రంచితభక్తిం
గొలుతు రదెవ్వరిలో ను
త్కలికన్ సుఖియించు జీవతత్త్వము మఱియున్.

3-258-కంద పద్యము

గోవిందుని రూపంబున
జీవబ్రహ్మలకు నైక్యసిద్ధియు నెటులౌ

భావన నుపనిషదర్థం
బై వెలసెడి జ్ఞాన మెట్టి దార్యస్తుత్యా!

3-259-తేటగీతి

ఉచిత మగు నట్టి శిష్యప్రయోజనములు
సజ్జనులచేత విజ్ఞానసాధనములు
నేమి పలుకంగఁబడు వాని నెల్ల మఱియుఁ
బొలుచు వైరాగ్యమునఁ దగు పురుషభక్తి.

3-260-తేటగీతి

ఇన్నియుఁ దెలియనానతి యిచ్చి నన్ను
నర్థి రక్షింపు యజ్ఞదానాది పుణ్య
ఫలము వేదంబు సదివిన ఫలము నార్త
జనులఁ గాచిన ఫలముతో సమముగావు."

3-261-కంద పద్యము

అని విదురుఁడు మైత్రేయుని
వినయంబునఁ దెలియ నడుగు విధ మెల్లను వ్యా
సునిసుతుఁ డభిమన్యునినం
దనున కెఱింగించి మఱియుఁ దగ నిట్లనియెన్.

3-262-చంపకమాల

" ఇలఁ గల మానవావళికి నెల్ల నుతింప భజింప యోగ్యమై
వెలసిన పూరువంశము పవిత్రముసేయఁగఁ బుట్టి సద్గుణా

కలిత యశఃప్రసూనలతికాతతికిం బ్రతివాసరంబుఁ బెం
పలరఁగ బ్రోదిపెట్టుదు గదయ్య ముకుందకథామృతంబునన్.

3-263-తేటగీతి

అల్పతరమైన సుఖముల నందుచున్న
జనుల దుఃఖంబు మాన్పంగఁ జాలునట్టి
పుండరీకాక్షు గుణకథా ప్రోతమైన
వితత నిగమార్థ మగు భాగవతము నీకు

3-264-వచనము

ఎఱింగింతు విను" మని యిట్లనియె.

3-265-సీస పద్యము

" అమ్మహాభాగవతామ్నాయ మొకనాఁడు;
గైకొని పాతాళలోక మందు
నప్రతీకజ్ఞానియై వాసుదేవాఖ్యుఁ;
బోలుచు సంకర్షణమూర్తి దివ్య
పురుషుండు దనుఁదాన బుద్ధిలోఁ జూచుచు;
సలలితధ్యాన ముకుళితనేత్రుఁ
డై సనందాభ్యుదయార్థంబు గనువిచ్చి;
చూచిన వారు సంస్తుతు లొనర్ప

3-265.1-తేటగీతి

నమర గంగావగాహనులై యహీంద్ర
కన్య లార్ద్రజటాబంధకలిత లగుచు
భర్తృ వాంఛానుబుద్ధి నప్పరమపురుషుఁ
గదియ నేతెంచి తత్పాదకమలయుగము.

3-266-కంద పద్యము

సేవించి భక్తితో నా
నావిధ పూజోపహార నతి నుతులను నా
దేవుని హృదయము వడసిరి
యా వేళ సనందనాదు లమ్మహితాత్ముల్.

3-267-మత్తేభ విక్రీడితము

ఘన సాహస్ర కిరీటరత్న విలసత్కాంతప్రసిద్ధప్రభా
జనితోదగ్ర రుచిప్రకాశిత ఫణాసాహస్రుఁ డౌ దేవతా
వనరక్షాచణు రూపకృత్యము లొగిన్ వాంఛం బ్రశంసించి వా
రనురాగస్ఖలితోక్తు లొప్ప నడుగన్ హర్షించి యా దేవుడున్.

3-268-తేటగీతి

భూరి నిగమార్థసార విచార మగుచుఁ
దనరు నీ భాగవతము సాదరతఁ బలికె
నలినభవసూతి యైన సనత్కుమార
కునకు నెఱిఁగించె సాంఖ్యాయనునకు నతఁడు.

3-269-కంద పద్యము

పరఁగ నతం డంతఁ బరా
శరునకు నుపదేశమిచ్చె; సన్మతి నతఁడున్
సురగురున కొసఁగె; నాతఁడు
గరమరుదుగ నాకుఁ జెప్పఁ గైకొని యేనున్.

3-270-కంద పద్యము
నీ కిప్పుడు వివరించెద
నాకర్ణింపుము సరోరుహాక్షుండగు సు
శ్లోకుని చరితామృతపరి
షేకుఁడ వై ముదము గదురఁ జెలగుము విదురా!

## 3-11-బ్రహ్మ జన్మ ప్రకారము

3-271-వచనము
ఇట్లు భగవత్ప్రోక్తంబును, ఋషిసంప్రదాయానుగతంబును, బురుషోత్తమ స్తోత్రంబును, బరమపవిత్రంబును, భవలతాలవిత్రంబును నయిన భాగవతకథాప్రపంచంబు శ్రద్ధాళుండవు భక్తుండవు నగు నీకు నుపన్యసించెద; వినుము.

3-272-సీస పద్యము
అనఘ! యేకోదకమై యున్నవేళ నం;
తర్నిరుద్ధానల దారు వితతి
భాతిఁ జిచ్ఛక్తి సమేతుఁడై కపట ని;
ద్రాలోలుఁ డగుచు నిమీలితాక్షుఁ

డైన నారాయణుం డంబు మధ్యమున భా;
సురసుధాఫేన పాండుర శరీర
రుచులు సహస్ర శిరోరత్నరుచులతోఁ;
జెలమిసేయఁగ నొప్పు శేషభోగ

3-272.1-తేటగీతి

తల్పమునఁ బవ్వళించి యనల్ప తత్త్వ
దీప్తిఁ జెన్నొందఁగా నద్వితీయుఁ డగుచు
నభిరతుం డయ్యుఁ గోర్కుల యందుఁ బాసి
ప్రవిమలాకృతి నానందభరితుఁ డగుచు.

3-273-తేటగీతి

యోగమాయా విదూరుఁడై యుగ సహస్ర
కాలపర్యంత మఖిల లోకములు మ్రింగి
పేర్చి మఱి కాలశక్త్యుపబృంహితమున
సమత సృష్టిక్రియాకలాపములఁ దగిలి.

3-274-కంద పద్యము

తన జఠరములోపలఁ దాఁ
చిన లోకనికాయముల సృజించుటకును సా
ధన మగు సూక్ష్మార్థము మన
సునఁ గని కాలానుగత రజోగుణ మంతన్.

3-275-సీస పద్యము

పుట్టించెఁ దద్గుణంబునఁ బరమేశ్వరు;
నాభిదేశము నందు నళిననాళ
ముదయించె మఱి య ప్పయోరుహముకుళంబు;
గర్మబోధితమైన కాల మందుఁ
దన తేజమునఁ బ్రవృద్ధంబైన జలముచే;
జలజాప్తుగతిఁ బ్రకాశంబు నొందఁ
జేసి లోకాశ్రయస్థితి సర్వగుణవిభా;
సితగతి నొప్పు రాజీవ మందు

3-275.1-తేటగీతి

నిజ కళాకలితాంశంబు నిలిపి దాని
వలన నామ్నాయమయుఁడును వరగుణుండు
నాత్మయోనియు నైన తోయజభవుండు
సరవిఁ జతురాననుండునా జనన మయ్యె.

3-276-తేటగీతి

అతఁడు దత్పద్మకర్ణిక యందు నిలిచి
వికచలోచనుడై లోకవితతి దిశలు
నంబరంబును నిజ చతురాననములఁ
గలయఁ బరికించి చూచుచుఁ గమలభవుఁడు.

3-277-చంపకమాల

అలఘు యుగాంతకాలపవనాహత సంచల దూర్మిజాల సం
కలిత జలప్రభూత మగు కంజముఁ దద్వనజాత కర్ణికా

తలమున నున్న తన్ను విశదక్రియఁ గల్గిన లోకతత్త్వమున్
నలిఁ దెలియంగనోపక మనంబునఁ జాల విచార మొందుచున్.

3-278-వచనము

ఇట్లని వితర్కించె.

3-279-ఉత్పలమాల

ఈ జలమందు నీ కమల మేగతి నుద్భవ మయ్యె నొంటి యే
నీ జలజాతపీఠమున నేగతి నుంటి మదాఖ్య మెద్ది నా
కీ జననంబు నొందుటకు నెయ్యది హేతువు బుద్ధిఁ జూడ నే
యోజ నెఱుంగలే నని పయోరుహగర్భుఁడు విస్మితాత్ముడై.

3-280-కంద పద్యము

ఆ వనజనాళమూలం
బా వనములలోన నర్థిఁ నరయుటకొఱకై
యావనజాతప్రభవుం
డా వనరుహనాళవివర మందభిముఖుఁడై.

3-281-మత్తేభ విక్రీడితము

అతి గంభీర విశాలవారినిధి తోయాంతర్నిమగ్నాంగుఁడై
చతురాస్యుం డొగి దివ్యవత్సర సహస్రం బబ్జమూలంబు స
న్మతి నీక్షించియుఁ గానలేక భగవన్మాయామహత్త్వంబు వి
స్మృతి గావింప విభీతుఁ డై మరలఁ జేరెం దత్సరోజాతమున్.

## 3-12-బ్రహ్మకు హరి ప్రత్యక్షమగుట

3-282-తేటగీతి

అట్లు గ్రమ్మఱఁ జేరి యయ్యబ్జపీఠ
మందు నష్టాంగయోగక్రియానురక్తిఁ
బవను బంధించి మహిత తపస్సమాధి
నుండి శతవర్షములు సనుచుండ నంత.

3-283-ఆటవెలది

అట్టి యోగజనిత మైన విజ్ఞానంబు
గలిగి యుండి దానఁ గమలనయనుఁ
గానలేక హృదయకమలకర్ణిక యందు
నున్నవానిఁ దన్నుఁ గన్నవాని.

3-284-మత్తేభ విక్రీడితము

కనియెన్ నిశ్చలభక్తియోగ మహిమం గంజాతగర్భుండు శో
భనచారిత్రు జగత్పవిత్రు విలసత్పద్మాకళత్రున్ సుధా
శనముఖ్యస్తుతిపాత్రు దానవచమూజైత్రున్ దళత్పద్మనే
త్రు నవీనోజ్జ్వలనీలమేఘనిభగాత్రుం బక్షిరాట్పత్రునిన్.

3-285-వచనము

మఱియును.

3-286-చంపకమాల

అలఘు ఫణాతపత్రనిచయాగ్ర సమంచిత నూత్నరత్న ని
ర్మలరుచిచే యుగాంత తిమిరంబు నడంచి యకల్మషోల్లస
జ్జలములఁ జేసి యందు నవసారసనాళసితైకభోగముం
గలిగిన శేషతల్పమును గైకొని యున్న మహాత్ము నొక్కనిన్.

3-287-సీస పద్యము

వర పీతకౌశేయపరిధానకాంతి సం;
ధ్యాంబుదరుచి నిచయంబుగాఁగఁ
గమనీయ నవహేమకలిత కిరీటంబు;
రమణఁ గాంచనశిఖరంబుగాఁగఁ
మానిత మౌక్తికమాలికారుచి సాను;
పతిత నిర్ఝర పరంపరలుగాఁగఁ
జెలువొందు నవతులసీదామకములు లా;
లిత తటజౌషధీ లతలుగాఁగఁ

3-287.1-తేటగీతి

వర భుజంబులు నికటస్థ వంశములుగఁ
బదము లంగణపాదప ప్రచయములుగ
లలితగతి నొప్పు మరకతాచల విడంబి
తాత్మదేహంబు గలుగు మహాత్ము; హరిని.

3-288-వచనము

మఱియు, నప్పరిచ్ఛిన్నంబును, నిరుపమానంబును, నిఖిలలోక
సంగ్రహంబును, నతి విస్తార వర్తులాయామంబును నై వివిధ విచిత్ర దివ్య

మణిభూషణంబుల నాత్మీయ నిర్మలద్యుతిచేతం బ్రకాశంబు నొందం జేయు దివ్యదేహంబు దనర; వివిధంబు లగు కామంబు లభిలషించి విశుద్ధం బైన వేదోక్తమార్గంబున భజియించు పురుషశ్రేష్ఠులకుఁ గామధేను వనం దగిన పాదపద్మయుగంబును, యలికఫలక లలితరుచి నిచయంబులకు నోటువడి కృపాపాత్రుండై చంద్రుండు బహురూపంబులఁ బదసరోజంబుల నాశ్రయించె నన నొప్పు పదనఖంబులును, కమలా భూకాంతలకు నుపధాన రూపంబు లనందగి నీలకదళీకా స్తంభంబుల డంబు విడంబించు నూరుయుగళంబును, కనకమణిమయ మేఖలాకలా పాభిరామంబుఁ గదంబ కింజల్క శోభిత పీతాంబ రాలంకృతంబునై విలసిల్లు కటిమండలంబును, శృంగారవాహినీ జలావర్తంబునాఁ బొలుపొందు నాభీవివరంబును, జఠరస్థ నిఖిల బ్రహ్మాండ ముహుర్ముహుఁరుద్భవ కృశీభూతం బనందగు మధ్య భాగంబును, మహిత ముక్తాఫలమాలికా విరచిత రంగవల్లీ విరాజితంబు నవతులసీదామ కిసలయ తల్పంబుఁ గుసుమమాలికాలంకృతంబు ఘనసార కస్తురికా చందన విలిప్తంబుఁ కౌస్తుభరత్న దీప్తి ప్రదీప్తంబు శ్రీవత్సలక్షణ లక్షితంబు నై యిందిరారమణికిఁ గేళీమందిరం బనం బొల్చు వక్షస్థలంబును, సుఖకేళీ సమారంభ పరిరంభ ణాంభోధిరాట్కన్యకా కరాంబుజ కీలిత కనకమణికంకణ నికషంబుల బొలుపారు రేఖాత్రయ విరాజమానం బైన కంధరంబును, సుమహితానర్ఘ దివ్యమణి ప్రభా విభాసిత కేయూర కంకణ ముద్రికాలంకృతంబు లయిన బాహువులును, సకల లోకార్తి నివారక దరహాసచంద్రికా ధవళితంబు లైన కర్ణకుండలమండన మణి మరీచులు నర్తనంబులు సలుంపం దనరి నిద్ధంబు లగు చెక్కుటద్దంబులును, పరిపక్వ బింబఫల ప్రవాళ పల్లవారుణాధరంబును, యఖిల భువన పరిపాలనంబునకు నేన చాలుదు నని నినదించు నయనయుగళంబునకు

సీమాస్తంభంబుఁ జంపకప్రసూన రుచి వి సంబు నగు నాసాదండంబును, కమలకుముదంబులకుం బెంపు సంపాదించుచుఁ గరుణామృత తరంగింతాపాంగంబు లై కర్ణాంతవిశ్రాంతంబు లై చెలువొందు నేత్రంబులును, సలలిత శ్రీకారంబునకు నక్షరత్వంబు సార్థకం బయ్యె ననం దగు కర్ణంబులును, నపరపక్షాష్టమీ శశాంక శంకాస్పద ఫాలఫలకంబును, నీలగిరీంద్రశృంగ సంగత బాలమార్తాండ మండల విడంబిత పద్మరాగమణిఖచిత కాంచనకిరీటంబునం బొలుపారి సూర్యేందు పవనానల ప్రకాశంబులకు నవకాశంబు సూపక త్రిలోక వ్యాపక సమర్థంబు లగు తేజోవిశేషంబులఁ జెలువొంది సంగర రంగంబుల దానవానీకంబుల హరింపం జాలు సుదర్శనాది దివ్యసాధనంబులచే దురాసదం బగు దివ్యరూపంబును గలిగి; మఱియును.

3-289-ఉత్పలమాల

హారకలాప పుష్పనిచయంబులఁ జంచ దనర్ఘరత్నకే
యూర కరాంగళీయక మహోజ్జ్వల బాహు సహస్రశాఖ లొ
ప్పారఁగఁ జూడ నొప్పి భువనాత్మక లీల నదృష్టమూల వి
స్ఫారిత భోగివేష్టిత విభాసిత చందనభూరుహాకృతిన్.

3-290-మత్తేభ విక్రీడితము

విలసత్కుండలిరాజ సఖ్యమున నుర్వీభృత్సమాఖ్యన్ సము
జ్జ్వలితోదార శిరోవిభూషణ సహస్రస్వర్ణకూటంబులన్
సలిలావాసతఁ జారు కౌస్తుభవిరాజద్రత్నగర్భంబునన్
నలినాక్షుండు గనుంగొనంగఁ దగె మైనాకావనీభృద్గతిన్.

3-291-కంద పద్యము

వితతార్థజ్ఞానజప
స్తుతి మకరందప్రహృష్ట శ్రుతిజాత మధు
వ్రతగణపరివృతశోభా
గతకీర్తిప్రసవమాలికలు గలవానిన్.

## 3-13-బ్రహ్మదేవుని విష్ణుస్తోత్రంబు

### 3-292-వచనము

కనుంగొని చతురాననుండు.

### 3-293-సీస పద్యము

అనఘు! సర్వేశ్వరు నాద్యంతశూన్యుని;
ధన్యుని జగదేకమాన్యచరితుఁ
దన్నాభిసరసిజోద్భవసరోజంబును;
నప్పుల ననిలుని నంబరమును
మానిత భువననిర్మాణదృష్టినిఁ బొడ;
గనెఁ గాని యితరముఁ గానలేక
యాత్మీయకర్మబీజాంకురంబును రజో;
గుణయుక్తుఁ డగుచు నకుంఠితప్ర

### 3-293.1-తేటగీతి

జాభిసర్గాభిముఖత నవ్యక్తమార్గుఁ
డైన హరి యందుఁ దన హృదయంబుఁ జేర్చి

యమ్మహాత్మునిఁ బరము ననంతు నభవు
నజు నమేయుని నిట్లని యభినుతించె.

3-294-సీస పద్యము

నలినాక్ష మాయాగుణవ్యతికరమునఁ;
 జేసి కార్యంబైన సృష్టిరూప
మునఁ బ్రకాశించు నీ ఘనరూపవిభవంబు;
 రూపింప దేహధారులకు దుర్వి
భావ్యంబుఁదలపోయ భగవంతుఁడవునైన;
 పద్మాక్ష నీ స్వరూపంబుకంటె
నన్యమొక్కటి సత్యమై బోధకంబైన;
 యది లేదుగాన నీ యతులదివ్య

3-294.1-తేటగీతి

మైన రూపంబు నాకుఁ బ్రత్యక్ష మయ్యె
నదియుఁగాక వివేకోదయమునఁ జేసి
వరద! నీ రూప మజ్ఞాన గురుతమో ని
వారకం బయ్యె నాకు శశ్వత్ప్రదీప!

3-295-కంద పద్యము

ఘన సత్పురుషానుగ్రహ
మునకై యమితావతార మూలం బగుచుం
దనరెడి నీ రూపము శో
భనమగు భవదీయ నాభిపద్మమువలనన్.

3-296-కంద పద్యము

జననం బందిన నాచే
ననయము మొదలనె గృహీతమయ్యె జగత్పా
వన నీదు సుస్వరూపము
ఘనరుచిరంబై స్వయంప్రకాశక మగుటన్.

3-297-వచనము

మఱియు, జ్ఞానానంద పరిపూర్ణమాత్రంబును, ననావృత ప్రకాశంబును, భేదరహితంబును, బ్రపంచజనకంబును, ప్రపంచవిలక్షణంబును, భూతేంద్రియాత్మకంబును, నేకంబును నైన రూపంబు నొందియు నెందును బొడగాన నట్టి నిన్ను నాశ్రయించెద; అదియునుంగాక జగన్మంగళ స్వరూపధరుండవై నీ యుపాసకుల మైన మా మంగళంబుకొఱకు నిరంతర ధ్యానంబుచేత నీ దివ్యరూపంబునం గానంబడితివి; ఇట్టి నీవు నిరయభాక్కు లై నిరీశ్వరవాదంబునంజేసి కుతర్కంబులు ప్రసంగించు భాగ్యరహితులచేత నాదృతుండవు గావు; మఱియుం గొందఱు కృతార్థు లైన మహాత్ములచేత భవదీయ శ్రీచరణారవిందకోశగంధంబు వేదమారుతానీతం బగుటంజేసి తమతమ కర్ణకుహరంబులచేత నాఘ్రాణించుచుందురు వారల హృదయకమలంబుల యందు భక్తిపారతంత్ర్యంబున గృహీత పాదారవిందంబులు గలిగి ప్రకాశింతువు; అదియునుం గాక ప్రాణులకు ద్రవ్యాగార సుహృన్నిమిత్తం బయిన భయంబును దన్నాశనిమిత్తం బయిన శోకంబును ద్రవ్యాది స్పృహయును దన్నిమిత్తం బయిన పరిభవంబును, మఱియు నందుఁ దృష్ణయు, నది ప్రయాసంబున లబ్దం బైన నార్తిమూలం బగు తదీయం బైన వృథాగ్రహంబును, నీ శ్రీపాదారవిందంబు లందు వైముఖ్యం బెంత కాలంబు గలుగు నంతకాలంబు బ్రాప్తంబు లగుం గాని,

మానవాత్మనాయకుండ వగు నిన్ను నాశ్ర యించిన భయనివృత్తిహేతు వైన మోక్షంబు గలుగు; మఱియునుం గొందఱు సకలపాపనివర్తకం బయిన త్వదీయ నామస్మరణ కీర్తనంబు లందు విముఖులై కామ్యకర్మ ప్రావీణ్యంబునంజేసి నష్టమతు లై యింద్రియపరతంత్రు లై యమంగళంబు లైన కార్యంబులు సేయుచుందురు; దానంజేసి వాతాది త్రిధాతుమూలం బైన క్షుత్తృడాది దుఃఖంబులచేతను శీతోష్ణ వర్ష వాతాది దుఃఖంబులచేతను నతి దీర్ఘం బైన కామాగ్నిచేతను నవిచ్ఛన్నం బగు క్రోధంబుచేతనుం దహ్యమానులగుదురు వారలఁ గనిన నా చిత్తంబు గలంకం బొందు; జీవుండు భవదీయ మాయాపరిభ్రామ్యమాణుం డై యాత్మ వేఱని యెప్పుడు దెలియు నంతకాలంబు నిరర్థకంబై దుస్తరంబైన సంసారసాగరంబుఁ దరియింపఁజాలకుండు; సన్మునీంద్రు లైనను భవదీయ నామస్మరణంబు మఱచి యితర విషయాసక్తు లైరేని, వారలు దివంబు లందు వృథాప్రయత్ను లై సంచరించుచు రాత్రుల యందు నిద్రాసక్తు లై, స్వప్న గోచరంబు లయిన బహువిధ సంపదలకు నానందించుచు శరీరపరిణామాది పీడలకు దుఃఖించుచుం బ్రతిహతంబు లైన యుద్యోగంబుల భూలోకంబున సంసారులై వర్తింతురు; నిష్కాము లై నిన్ను భజియించు సత్పురుషుల కర్ణమార్గంబులం బ్రవేశించి భవదీయ భక్తియోగ పరిశోధితం బైన హృత్సరోజకర్ణికాపీఠంబున వసియింతువు; అదియునుంగాక.

3-298-మత్తేభ విక్రీడితము

వరయోగీంద్రులు యోగమార్గముల భావంబందు నే నీ మనో
హరరూపంబుఁ దలంచి యే గుణగణధ్యానంబు గావింతు ర
ప్పురషశ్రేష్ఠ పరిగ్రహంబునకునై పొల్పారఁ దద్ధ్యాన గో
చరమూర్తిన్ ధరియింతుఁ గాదె పరమోత్సాహుండవై మాధవా!

3-299-తేటగీతి

అరయ నిష్కామధర్మ లైనట్టి భక్తు
లందు నీవు ప్రసన్నుండ వైనరీతి
హృదయముల బద్ధకాములై యెనయు దేవ
గణము లందుఁ బ్రసన్నతఁ గలుగ వీవు.

3-300-చంపకమాల

అరయ సమస్త జీవహృదయంబుల యందు వసించి యేకమై
పరఁగి సుహృత్ప్రియానుగుణభాసిత ధర్ముఁడవుం బరాపరే
శ్వరుఁడవునై తనర్చుచు నసజ్జన దుర్లభమైన యట్టి సు
స్థిర మగు సర్వభూతదయచేఁ బొడగానఁగవత్తు వచ్యుతా!

3-301-మత్తేభ విక్రీడితము

క్రతు దానోగ్రత పస్స్వమాధి జప సత్కర్మాగ్నిహోత్రాఖిల
వ్రతచర్యాదుల నాదరింప వఖిలవ్యాపారపారాయణ
స్థితి నొప్పారెడి పాదపద్మయుగళీసేవాభి పూజా సమ
ర్పిత ధర్ముండగు వాని భంగి నసురారీ! దేవచూడామణీ!

3-302-తేటగీతి

తవిలి శశ్వత్స్వరూప చైతన్య భూరి
మహిమచేత నపాస్త సమస్త భేద
మోహుఁడ వఖిల విజ్ఞానమునకు నాశ్ర
యుండ వగు నీకు మ్రొక్కెదనో రమేశ!

3-303-కంద పద్యము

జననస్థితివిలయంబుల
ననయంబును హేతుభూతమగు మాయాలీ
లను జెంది నటన సలిపెడు
ననఘాత్మక! నీకొనర్తు నభివందనముల్

3-304-సీస పద్యము

అనఘాత్మ! మఱి భవదవతార గుణకర్మ;
 ఘన విడంబన హేతుకంబు లయిన
రమణీయ మగు దాశరథి వసుదేవకు;
 మారాది దివ్యనామంబు లోలి
వెలయంగ మనుజులు వివశాత్ములై యవ;
 సానకాలంబున సంస్మరించి
జన్మజన్మాంతర సంచిత దురితంబుఁ;
 బాసి కైవల్యసంప్రాప్తు లగుదు

3-304.1-తేటగీతి

రట్టి దివ్యావతారంబుల వతరించు
నజుఁడ వగు నీకు మ్రొక్కెద ననఘచరిత!
చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార!
భక్తమందార! దుర్భవభయవిదూర!

3-305-తరళము

జననవృద్ధివినాశ హేతుక సంగతిం గల యేను నీ
వును హరుండు ద్రిశాఖలై మనువుల్ మరీచిముఖామరుల్
తనర నందుపశాఖలై చెలువొంద నింతకు మూలమై
యునయమున్ భువనద్రుమాకృతిపైన నీకిదె మ్రొక్కెదన్.

3-306-మత్తేభ విక్రీడితము

పురుషాధీశ! భవత్పదాబ్జయుగళీపూజాది కర్మక్రియా
పరతం జెందని మూఢచిత్తునిఁ బశుప్రాయున్ మనుష్యాధమున్
జరయున్ నాశము నొందఁ జేయు నతి దక్షంబైన కాలంబు త
ద్గురు కాలాత్ముఁడ వైన నీకు మది సంతోషంబునన్ మ్రొక్కెదన్.

3-307-సీస పద్యము

సర్వేశ! కల్పాంతసంస్థిత మగు జల;
 జాత మం దేను సంజనన మంది
భవదీయ సుస్వరూపముఁ జూడ నర్థించి;
 బహువత్సరములు దపంబుఁ జేసి
క్రతుకర్మములు పెక్కు గావించియును నినుఁ;
 బొడగానఁగాలేక బుద్ధి భీతిఁ
బొందిన నాకు నిప్పుడును నిర్హేతుక;
 కరుణచే నఖిలలోకైకవంద్య

3-307.1-తేటగీతి

మాన సతత ప్రసన్న కోమల ముఖాబ్జ
కలిత భవదీయ దివ్యమంగళవిలాస

మూర్తి దర్శింపఁ గలిగె భక్తార్తిహరణ
కరణ! తుభ్యంనమో విశ్వభరణ! దేవ!

3-308-సీస పద్యము

అమర తిర్యఙ్మనుష్యాది చేతన యోను;
లందు నాత్మేచ్ఛచేఁ జెందినట్టి
కమనీయ శుభమూర్తి గలవాడ వై ధర్మ;
సేతు వనంగఁ బ్రఖ్యాతి నొంది
విషయసుఖంబుల విడిచి సంతత నిజా;
నందానుభవ సమున్నతిఁ దనర్తు
వదిగాన పురుషోత్తమాఖ్యఁ జెన్నొందుదు;
వట్టి నిన్నెప్పుడు నభినుతింతు

3-308.1-తేటగీతి

నర్థి భవదీయపాదంబులాశ్రయింతు
మహితభక్తిని నీకు నమస్కరింతు
భక్తజనపోష! పరితోష! పరమపురుష!
ప్రవిమలాకార! సంసారభయవిదూర!

3-309-సీస పద్యము

తలకొని పంచభూతప్రవర్తకమైన;
భూరిమాయాగుణస్ఫురణఁ జిక్కు
వడక లోకంబులు భవదీయ జఠరంబు;
లో నిల్పి ఘనసమాలోల చటుల

సర్వంకషోర్మి భీషణ వార్ధి నడుమను;
 ఫణిరాజభోగతల్పంబు నందు
యోగనిద్రారతి నుండఁగ నొకకొంత;
 కాలంబు సనఁగ మేల్కనిన వేళ

3-309.1-తేటగీతి

నలఘు భవదీయనాభితోయజమువలనఁ
గలిగి ముల్లోకములు నోపకరణములుగఁ
బుట్టఁ జేసితి వతుల విభూతి మెఱసి
పుండరీకాక్ష! సంతతభువనరక్ష!

3-310-కంద పద్యము

నిగమస్తుత! లక్ష్మీపతి!
జగదంతర్యామి వగుచు సర్గము నెల్లం
దగు భవదైశ్వర్యంబున
నగణిత సౌఖ్యానుభవము నందింతు గదే.

3-311-సీస పద్యము

జలజాక్ష! యెట్టి విజ్ఞానబలంబునఁ;
 గల్పింతు వఖిలలోకంబు లోలి
నతజనప్రియుఁడవు నా కట్టి సుజ్ఞాన;
 మర్థిమైఁ గృపసేయు మయ్య వరద!
సృష్టినిర్మాణేచ్ఛఁ జెంది నా చిత్తంబుఁ;
 దత్కర్మకౌశలిఁ దగిలి యుండి

యును గర్మవైషమ్యమును బొందు కతమున;
దురితంబుఁ బొరయక తొలగు నట్టి

3-311.1-తేటగీతి

వెఱవు నా కెట్లు కలుగు నవ్విధముఁ దలచి
కర్మవర్తను నను భవత్కరుణ మెఱసి
తగఁ గృతార్థునిఁ జేయవే నిగమవినుత!
సత్కృపామూర్తి! యో దేవచక్రవర్తి!

3-312-చంపకమాల

భవ దుదరప్రభూత మగు పద్మము నందు వసించి యున్న నే
నవిరళ తావకీన కలితాంశమునం దనరారు విశ్వముం
దవిలి రచించుచున్ బహువిధంబులఁ బల్కెడి వేదజాలముల్
శివతరమై ఫలింపఁ గృపసేయుము భక్తఫలప్రదాయకా!"

3-313-చంపకమాల

అని యనుకంపదోఁప వినయంబునఁ జాఁగిలి మ్రొక్కి చారులో
చన సరసీరుహుం డగుచు సర్వజగత్పరికల్పనా రతిం
దనరిన నన్నుఁ బ్రోచుటకుఁ దా నిటు సన్నిధి యైన యీశ్వరుం
డనయము నాదు దుఃఖము దయామతిఁ బాపెడు నంచు నమ్ముడై

3-314-కంద పద్యము

వనరుహసంజాతుఁడు నె
మ్మనమున హర్షించె" ననుచు మైత్రేయమహా

ముని ఘనుఁడగు విదురునకున్
వినయంబున నెఱుఁగజెప్పి వెండియుఁ బలికెన్.

3-315-మత్తేభ విక్రీడితము

"వనజాతప్రభవుండు కేవలతపోవ్యాసంగుఁ డై పద్మలో
చను గోవిందు ననంతు నాఢ్యుఁ దన వాక్శక్తిన్ నుతింపన్ సుధా
శనవంద్యుండు ప్రసన్నుఁ డై నిఖిల విశ్వస్థాపనాలోకనం
బునఁ జూచెన్ విలయప్రభూత బహువాఃపూరంబులన్ వ్రేల్మిడిన్.

3-316-తేటగీతి

అట్లు వొడగని యార్తుఁ డైనట్టి పద్మ
భవుని వాంఛిత మాత్మఁ దీర్పఁగఁ దలంచి
యతని మోహనివారక మైన యట్టి
యమృతరసతుల్య మధురవాక్యముల ననియె.

3-317-చంపకమాల

" తలకొని నీ యొనర్చు పనిదప్పి మదిం దలపోయు దుఃఖముం
దలఁగుము నాదు లీలకుఁ బ్రధానగుణం బగు సృష్టికల్పనం
బలవడఁ జేయు బుద్ధి హృదయంబునఁ జొన్పి తపస్సమాధి ని
ష్టల నతిభక్తులన్ ననుఁ బ్రసన్నునిఁ జేయుము చెందు కోరికల్.

3-318-కంద పద్యము

నీ వొనరించు తపోవి
ద్యావిభవ విలోకనీయ మగు నీ సృష్టిం

గావింపుము లోకంబుల
లో వెలిఁగెడి నన్నుఁ గందు లోకస్తుత్యా!

3-319-కంద పద్యము

నాలోని జీవకోటులు
వాలాయము నీకుఁ గానవచ్చు నిపుడు నీ
వాలోకింపుము దారువి
లోల హుతాశనునికరణి లోకస్తుత్యా!

3-320-సీస పద్యము

నలువొంద నఖిలజీవుల యందుఁ గల నన్నుఁ;
దెలసి సేవింపుము నలినగర్భ!
భవదీయ దోషముల్ వాయును భూతేంద్రి;
యాశ్రయ విరహిత మై విశుద్ధ
మైన జీవుని విమలాంతరాత్ముఁడ నైన;
నను నేకముగఁ జూచు నరుఁడు మోక్ష
పదమార్గవర్తి యై భాసిల్లు బ్రహ్మాండ;
మందును వివిధకర్మానురూప

3-320.1-తేటగీతి

పద్ధతులఁ జేసి పెక్కురూపముల నొందు
జీవతతి రచియించు నీ చిత్త మెపుడు
మత్పదాంబుజయుగళంబు మరగి యున్న
కతన రాజసగుణమునఁ గలుగ దనఘ!

3-321-కంద పద్యము

విను మదియుఁ గాక ప్రాణుల
కనయము నెఱుఁగంగరాని యనఘుఁడఁ దేజో
ధనుఁడఁ బరేశుఁడ నీచే
తను గానంబడితి నిదె పితామహ! కంటే.

3-322-వచనము

మఱియు, భూతేంద్రియగుణాత్మకుం డనియు జగన్మయుం డనియు నన్ను నీ చిత్తంబు నందుఁ దలంపుము; తామరసనాళవివర పథంబు వెంటం జని జలంబులలోనం జూడం గోరి నట్టి మదీయ స్వరూపంబు.

3-323-కంద పద్యము

నీ కిప్పుఁడు గానంబడె
నాకులకును సురగపతి పినాకులకైనన్
వాకొనఁగం దలపోయను
రాకుండు మదీయ రూపరమ్యత్వంబుల్.

3-324-కంద పద్యము

కావున మచ్చారిత్ర క
థా విలసిత మైన సుమహితస్తవము జగ
త్పావనము విగతసంశయ
భావుఁడ వై బుద్ధినిలుపు పంకజజన్మా!

3-325-కంద పద్యము

సగుణుఁడ నై లీలార్థము
జగములఁ గల్పింపఁ దలచు చతురుని నన్నున్
సగుణునిఁగా నుతియించితి
తగ సంతస మయ్యె నాకుఁ దామరసభవా!

3-326-కంద పద్యము

ఈ మంజుస్తవరాజము
నీ మనమునఁ జింతఁ దక్కి నిలుపుము భక్తిన్
ధీమహిత! నీ మనంబునఁ
గామించిన కోర్కు లెల్లఁ గలుగుం జుమ్మీ.

3-327-కంద పద్యము

అనుదినమును ద్రిజగత్పా
వనమగు నీ మంగళస్తవంబుఁ బఠింపన్
వినినను జనులకు నేఁ బొడ
గనఁబడుదు నవాప్తసకలకాముఁడ నగుచున్.

3-328-తేటగీతి

వన తటాకోపనయన వివాహ దేవ
భవన నిర్మాణ భూమ్యాదివివిధదాన
జప తపోవ్రత యోగ యజ్ఞముల ఫలము
మామక స్తవఫలంబు సమంబు గాదు.

3-329-కంద పద్యము

జీవావలిఁ గల్పించుచుఁ
జీవావలిలోనఁ దగ వసించుచుఁ బ్రియవ
స్త్వావలిలోపలఁ బ్రియవ
స్త్వావలి యై యుండు నన్ను ననిశముఁ బ్రీతిన్.

3-330-కంద పద్యము

తలఁపుము మత్ప్రతికి నై
కలిగించితి నిన్ను భువనకారణ! నాలో
పల నడఁగి యేకమై ని
శ్చలగతి వసియించి యున్న జగముల నెల్లన్.

3-331-తేటగీతి

తగ నహంకారమూలతత్త్వంబు నొంది
నీవు పుట్టింపు మనుచు రాజీవభవుఁడు
వినఁగ నానతి యిచ్చి యవ్వనజనాభుఁ
డంత నంతర్హితుం డయ్యె ననఘచరిత!"

## 3-14-బ్రహ్మ మానస సర్గంబు

3-332-కంద పద్యము

అని చెప్పిన మైత్రేయునిఁ
గనుఁగొని విదురుండు పలికెఁ గడు ముదమొప్పన్
" జననుత! నలినదళాక్షుఁడు
సనినం బద్మజుఁడు దేహసంబంధమునన్.

3-333-కంద పద్యము

మానససంబంధంబును
బూనిన యీ సర్గ మెట్లు పుట్టించె దయాం
భోనిధిపై నా కింతయు
మానుగఁ నెఱిఁగింప వయ్య మహితవిచారా! "

3-334-వచనము

అనవుడు, నమ్మునివరేణ్యుండు విదురున కిట్లనియెఁ "బుండరీకాక్ష వ రదాన ప్రభావంబునం బంకజాసనుండు శత దివ్యవత్సరంబులు భగవత్పరంబుగాఁ దపంబుఁ గావించి, తత్కాలవాయువుచేఁ గంపితం బగు నిజనివాసం బయిన పద్మంబున వాయువును జలంబులను గనుంగొని, యాత్మీయ తపశ్శక్తిచేత నభివృద్ధిం బొందిన విద్యాబలంబున వాయువులు బంధించి తోయంబులతోడ నొక్క తోయంబు సమస్తంబునుం గ్రోలి, యంత గగనవ్యాప్తి యగు జలంబును గనుంగొని.

3-335-ఉత్పలమాల

వారిజసంభవుండు బుధవంధ్యుఁడు చిత్తమునం దలంచె దై
త్యారిఁ బయోవిహారి సముదంచితహారి నతాఖిలామృతా
హారి రమాసతీహృదయహారినుదారి విదూరభూరిసం
సారి భవప్రహారి విలసన్నుతసూరి నఘారి నయ్యెడన్.

3-336-తేటగీతి

అట్లు దలఁచి సరోజజుం డంబుజమును
గగనతలమునఁ జూచి యా కమలకోశ

లీనమై యున్న లోకవితానములను
నొయ్యఁ బొడఁగని హరిచే నియుక్తుఁ డైన.

3-337-తేటగీతి

వానిఁగాఁ దన్నుఁ దలఁచి యవ్వనరుహంబు
లోపలికిఁ బోయి మున్నందులోన నున్న
ముజ్జగంబులఁ జూచి యిమ్ముల సృజించె
మఱి చతుర్దశ భువనముల్ మహిమఁ జేసి.

3-338-కంద పద్యము

పరఁగ సుధాశన తిర్య
ఙ్నర వివిధస్థావరాది నానాసృష్టి
స్ఫురణ నజుం డొనరించెం
బరువడి నిష్కామధర్మఫలరూపమునన్.

3-339-వచనము

ఇట్లు భువనంబులఁ బద్మజుండు గల్పించె" నని మైత్రేయుండు విదురున కెఱింగించిన.

3-340-కంద పద్యము

విదురుఁడు దురితావనిభృ
ద్భిదురుఁడు మునివరునిఁ జూచి ప్రియము మనమునం
గదురఁగ నిట్లని పలికె న
తి దురంతం బయిన విష్ణుదేవుని మహిమన్.

3-341-తేటగీతి

" అమరె భువనంబు లతని కాలాఖ్యతయును
గణుతిసేయు తదీయ లక్షణము లర్థి
నాకు నెఱిఁగింపు మయ్య వివేకచరిత! "
యనిన మైత్రేయుఁ డవ్విదురునకు ననియె.

3-342-సీస పద్యము

" ఆద్యంతశూన్యంబు నవ్యయం బై తగు;
తత్త్వ మింతకు నుపాదాన మగుట
గుణవిషయములు గైకొని కాలమును మహా;
దాదిభూతములు దన్నాశ్రయింపఁ
గాలానురూపంబుఁ గైకొని యీశుండు;
దన లీలకై తనుఁదా సృజించె
గరమొప్ప నఖిల లోకము లందుఁ దా నుండుఁ;
దనలోన నఖిలంబుఁ దనరుచుండుఁ

3-342.1-తేటగీతి

గాన విశ్వమునకుఁ గార్యకారణములు
దాన యమ్మహాపురుషుని తనువువలనఁ
బాసి విశ్వంబు వెలియై ప్రభాస మొందె
మానితాచార! యీ వర్తమానసృష్టి.

3-343-కంద పద్యము

తెఁ గొప్ప నఖిల విశ్వముఁ
బురుషోత్తము మాయచేతఁ బుట్టుం బెరుఁగున్
విరతింబొందుచు నుండుం
గర మర్థిన్ భూతభావికాలము లందున్.

3-344-వచనము

అట్టి సర్గంబు నవవిధం; బందుఁ బ్రాకృత వైకృతంబులు గాల ద్రవ్య గుణంబులను త్రివిధం బగు భేదంబుచేఁ బ్రతిసంక్రమంబు లగుచు నుండు; అందు మహత్తత్త్వంబు ప్రథమసర్గంబు; అది నారాయణ సంకాశంబున గుణవైషమ్యంబునం బొందు; ద్రవ్య జ్ఞాన క్రియాత్మకంబైన యహంకారతత్త్వంబు ద్వితీయసర్గంబు; శబ్ద స్పర్శ రూప రస గంధంబు లను పంచతన్మాత్ర ద్రవ్యశక్తి యుక్తియుక్తంబైన పృథివ్యాది భూతసర్గంబు మూడవది యై యుండు; జ్ఞానేంద్రియంబు లైన త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులుఁ, గర్మేంద్రియంబు లైన వాక్పాణి పాద పాయూపస్థములు నను దశవిధేంద్రియ జననంబు చతుర్థసర్గంబు; సాత్త్వికాహంకార జనితం బైన సుమనోగణసర్గం బైదవ సర్గం బై యొప్పు; అది మనోమయంబై యుండు; జీవలోకంబునకు నబుద్ధికృతంబు లైన యావరణవిక్షేపంబులం జేయు తామససర్గం బాఱవ దై యుండు; ఇయ్యాఱు నీశ్వరునకు లీలార్థంబు లయిన ప్రాకృతసర్గంబు లయ్యె; ఇంక వైకృతసర్గంబు లేడవది మొదలుగాఁ గలుగు నవి వినిపింతు వినుము; పుష్పోత్పత్తి రహితంబు లై ఫలించెడు నశ్వత్థోదుంబర పనస న్యగ్రోధాదు లైన వనస్పతులును, బుష్పితంబు లైన ఫలపాకాంతంబు లయిన వ్రీహి యవ ముద్గా ద్యోషధులును, నారోహణానపేక్షంబు లయిన మాలతీ మల్లి కాది లతలును, ద్వక్సారంబు లైన వేణ్వాదులును, గఠినీభూత మూలంబులును, శిఖావిస్తృతంబులు నగు లతా

విశేషరూపంబు లైన వీరుధంబులును, బుష్పవంతంబు లయి ఫలప్రాప్తంబు లగు చూతాది ద్రుమంబులును, నవ్యక్తచైతన్యంబులు నూర్ధ్వస్రోతంబులు నంతస్స్పర్శంబులుఁ దమఃప్రాయంబులు నై స్థావరంబు లయిన యీ యాఱు నేడవ సర్గం బయ్యె; ఎనిమిదవ సర్గం బిరువదియెనిమిది భేదంబులు గలిగి శ్వస్తనాది జ్ఞానశూన్యంబు లై యాహారాది జ్ఞానమాత్ర నిష్టంబు లయి ఘ్రాణంబువలన నెఱుంగం దగినవాని నెఱుంగుచు హృదయంబున దీర్ఘానుసంధాన రహితంబు లై వర్తించు ద్విశఫంబులు గల వృషభ మహిషాజ కృష్ణ సూకరోష్ట్ర గవయ రురు మేష ముఖర నవకంబును, నేక శఫంబు గల ఖరాశ్వాశ్వతర గౌర శరభ చమర్యాది షట్కంబును, బంచనఖంబులు గల శునక సృగాల వృక వ్యాఘ్ర మార్జాల శశ శల్యక సింహ కపి గజ కూర్మ గోధా ముఖ భూచర ద్వాదశకంబును, మకరాది జలచరంబులును, గంక గృధ్ర బక శ్యేన భాస భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకోలూ కాది ఖేచరంబులును, మొదలుగాఁ గలది తిర్యక్సర్గం బయ్యె; అర్వాక్స్రోతం బై యేకవిధం బగు మానుషసర్గంబు రజోగుణ ప్రేరితంబై కర్మకరణదక్షంబై దుఃఖం బందును సుఖంబు గోరును; ఇది తొమ్మిదవ సర్గం బనం దగు। ఈ త్రివిధసర్గంబులు వైకృతసర్గంబు లనంబడు; ఇంక దేవసర్గంబు వినుము; అదియు నెనిమిది తెఱంగులు గలిగి యుండు; అందు విబుధ పితృ సురాదులు మూఁడును, గంధర్వాప్సరస లొకటియు, యక్ష రక్షస్సు లేకంబును, భూత ప్రేత పిశాచంబు లొకటియు, సిద్ధ చారణ విద్యాధరు లేకంబును, కిన్నర కింపురుషు లొకటియుంగా దేవసర్గం బయ్యె; ఇట్టి బ్రహ్మనిర్మితంబు లైన దశవిధసర్గంబులు నెఱింగించితి; ఇంక మనువులం దదంతరంబుల నెఱింగించెద; కల్పాదుల యందు నీ ప్రకారంబున స్వయంభూతుండును, నమోఘసంకల్పుండును నగు నప్పుండరీకాక్షుండు

రజోగుణయుక్తుం డై స్రష్ట యగుచు స్వస్వరూపం బయిన విశ్వంబు నాత్మీయ సామర్థ్యంబునం గల్పించె; అ య్యీశ్వరుని మాయావ్యాపారంబులచే నీ సృష్టి యందు నద్యావర్తంబులం బడి భ్రమించుచున్న మహీరుహంబులుం బోలెఁ, బూర్వాపరాభావంబు లెఱుంగంబడకుండ నీ కల్పంబు నందుండు దేవాసురాదులు ప్రతి మన్వంతరంబు నందును నిట్ల నామరూపంబులచే నిర్దేశింపబడుదురు; మఱియు నిందొక్క విశేషం బెఱింగించెదఁ; గౌమారసర్గం బను నది దేవసర్గాంతర్భూతం బయ్యును బ్రాకృత వైకృతోభయాత్మకం బై దైవత్వ మనుష్యత్వ రూపం బైన సనత్కుమారాది సర్గం బనంబడె; అమోఘసంకల్పుం డైన పుండరీకాక్షుండు తనుఁదాన యిట్లు విశ్వభేదంబును గల్పించె;" అని మైత్రేయుండు విదురునకుఁ జెప్పి కాలలక్షణం బెఱింగించువాఁ డై యిట్లనియె.

## 3-15-కాలనిర్ణయంబు

### 3-345-సీస పద్యము

భువిఁ దన కార్యాంశమునకు నంతము నన్య;
 వస్తుయోగంబు నేఁవలన లేఁక
ఘటపటాదిక జగత్కార్యంబునకు నిజ;
 సమవాయకారణత్వమునఁ బరగి
జాల సూర్యమరీచిసంగతగగనస్థ;
 మగు త్రసరేణు షడంశ మరయఁ
బరమాణు వయ్యెఁ దత్పరమాణు వం దర్క;
 గతి యెంత దడవు తత్కాల మగును

### 3-345.1-తేటగీతి

సూక్ష్మకాలంబు విను మది సూర్యమండ
లంబు ద్వాదశరాశ్యాత్మకం బనంగఁ
గలుగు జగమున నొక యేఁడు గడచి చనినఁ
గాల మొం తగు నది మహాత్మ్యాల మనఘ!

3-346-వచనము

అందుఁ, బరమాణుద్వయం బొక్క యణు వగు; నణుత్రిత్రయం బొక్క త్రసరేణు వగు; అవి మూఁడు గూడ నొక్క తృటి యగు; ఆ తృటి శతం బొక్క వేధ యనం బరఁగు; అట్టి వేధలు మూడు గూడ నొక్క లవం బనఁదగు; అవి మూ డైన నొక్క నిమేషం బనంజను; నిమేష త్రయం బొక్క క్షణం బగు; క్షణ పంచకం బొక్క కాష్ఠ యనందగు; నవి పది యైన నొక్క లఘు వననొప్పు; అట్టి లఘు పంచదశకం బొక్క నాడి యనంబరఁగు; అట్టి నాడికా ద్వయం బొక్క ముహూర్తం బయ్యె; అట్టి నాడిక లాఱైన నేడైన మనుష్యులకు నొక్క ప్రహరం బగు; అదియ యామం బనంజను; దివస పరిమాణ విజ్ఞేయం బగు నాడికోన్మాన లక్షణం బెఱింగింతు వినుము; షట్పల తామ్రంబునం బాత్రంబు రచియించి, చతుర్మాష సువర్ణంబునం చతురంగుళాయ శలాకంబుఁ గల్పించి, దానం దత్పాత్ర మూలంబున ఛిద్రంబుఁ గల్పించి, తచ్ఛిద్రంబునం బ్రస్థమాత్ర తోయంబు పరిపూర్ణంబు నొందు నంత కాలం బొక్క నాడిక యగు; యామంబులు నాలుగు సన నొక్క పగ లగు; రాత్రియు నిప్పగిది జరుగు; అట్టి యహర్నిశంబులు గూడ మర్త్యుల కొక దివసం బగు; అవి పదునేనైన నొక్క పక్షం బగు శుక్లకృష్ణ నామంబులం బరఁగిన యప్పక్షంబులు రెండు గూడ నొక్క మాసం బగు అది పితృదేవతలకు నొక్క దివసం బగు; అట్టి మాసంబులు రెండైన నొక్క ఋతు వగు; షణ్మాసం బరిగిన నొక్క యాయనం బగు; దక్షిణోత్తర నామంబులం బరఁగి నట్టి యాయనంబులు రెండు గూడి ద్వాదశ

మాసంబు లైన నొక్క సంవత్సరం బగు; అది దేవతలకు నొక్క దివసం బగు; అట్టి సంవత్సర శతంబు నరులకుం బరమాయు పై యుండు; కాలాత్ముండును నీశ్వరుండును నైన సూర్యుండు గ్రహ నక్షత్ర తారా చక్రస్థుండై పరమాణ్వాది సంవత్సరాత్మకం బైన కాలంబునం జేసి ద్వాదశరాశ్యాత్మకం బైన జగంబున సౌర బార్హస్పత్య సావన చాంద్ర నాక్షత్ర మానభేదంబులం గానంబడుచున్నవాఁ డై సంవత్సర పరీవృత్స రేడావత్స రానువత్సర వత్సర నామంబుల సృజ్యం బైన బీజాంకురంబుల శక్తిం గాలరూపం బైన స్వశక్తిచేత నభిముఖంబుగాఁ జేయుచుఁ బురుషులకు నాయురాది వ్యయనంబులం జేసి విషయాసక్తి నివర్తింపం జేయుచుం గోరికలు గల వారికి యజ్ఞముఖంబులం జేసి గుణమయంబు లైన స్వర్గాది ఫలంబుల విస్తరింపం జేయుచు గగనంబునఁ బరువు వెట్టు వత్సర పంచక ప్రవర్తకుం డగు మార్తాండునకుం బూజఁ గావింపుము;" అని మైత్రేయుండు పలికిన విదురుం డిట్లనియె.

3-347-కంద పద్యము

" నరపిత్రు సుర పరమాయుః

పరిమాణము లెఱుఁగ నాకుఁ బలికితివి మునీ

శ్వర యెఱిగింపు త్రిలోకో

పరిలోక విలోక నైక పరులగు వారిన్.

3-348-ఉత్పలమాల

పూనిన యోగసిద్ధి దగఁ బొందిన నేత్రయుగంబునన్ బహి

ర్జ్ఞానము గల్గి యుండి భువనంబులఁ జూచుచునుండు వారికి

న్మానుగఁ గల్గు కాలగతి నా కెఱిఁగింపు మునీంద్ర!" నావుడు
న్నా నయశాలి యవ్విదురు నాదర మొప్పఁగ జూచి యిట్లనున్.

## 3-16-చతుర్యుగపరిమాణంబు

3-349-సీస పద్యము

" జననుత కృతయుగ సంఖ్య నాలుగువేలు;
దివ్యవర్షములు. తదీయ సంధ్య
లెనుబదినూఱేండ్లు. విను త్రేత వత్సర;
త్రిసహస్రములగు, తదీయ సంధ్య
లాఱునూఱేఁడులు నగు. ద్వాపరము రెండు;
వేల వత్సరముల వెలయు. సంధ్య
లోలి నన్నూ ఱేఁడు లొగిఁ, గలియుగము స;
హస్ర వర్షములు సంధ్యాంశ మరయ

3-349.1-తేటగీతి

రెండునూఱేఁడులును నిల్చి యుండుఁ జువ్వె,
యనఘ! సంధ్యాంశ మధ్యంబు నందు ధర్మ
మతిశయించును సంధ్యాంశ మందు ధర్మ
మల్ప మై కానఁబడుచుండు ననఘచరిత!

3-350-వచనము

మఱియు ధర్మదేవత గృతయుగంబున నాలుగు పాదంబులును, ద్రేత యందు మూఁడు పాదంబులును, ద్వాపరంబునం బాద ద్వయంబును, గలియుగంబున నేక పాదంబును గలిగి సంచరించు అట్లగుటం జేసి.

3-351-కంద పద్యము

పాదవిభేదంబున మ
ర్త్యాదులును దఱుఁగు నధర్మ మాకొలదినె యు
త్పాదిల్లి వృద్ధిఁ బొందు ధ
రాదివిజులు పాద బుద్ధి రతు లగుదు రిలన్.

3-352-సీస పద్యము

భూర్భువస్స్వర్లోకములకంటెఁ బొడువునఁ;
గడు నొప్పు సత్యలోకంబు నందు
నుండు బ్రహ్మకుఁ జతుర్యుగ సహస్రము లేగ;
దిన మొక్కటి యగు, రాత్రియును నిట్ల
చన ధాత నిద్రవో జగము లడంగు, మేల్;
ల్కని చూడ మరల లోకములు పుట్టుఁ
దద్దినమ్మునఁ జతుర్దశ మను లగుదు రం;
దొక్కొక్క మనువున కొనర దివ్య

3-352.1-తేటగీతి

యుగము లోలిని డెబ్బదియొక్క మాఱు
సనిన మనుకాల మయ్యె, నమ్మనుకులంబు

సురలు మునులును సప్తర్షు లరయ భగవ
దంశమునఁ బుట్టి పాలింతు రఖిల జగము.

3-353-కంద పద్యము

హరి పితృ సుపర్వ తిర్య
జ్నర రూపములన్ జనించి నయమున మన్వం
తరముల నిజ సత్త్వంబునఁ
బరిపాలించును జగంబుఁ బౌరుష మొప్పన్.

3-354-కంద పద్యము

క్రమమునఁ ద్రైవర్గిక స
ర్గము సెప్పంబడె సరోజగర్భుఁడు దివసాం
తమునఁ దమఃపిహితపరా
క్రముఁ డై శయనించు నిద్రఁ గైకొని యంతన్.

3-355-సీస పద్యము

ఆ రాత్రి భువన త్రయము దమఃపిహితమై;
 భానుచంద్రులతో విలీనమైన
సర్వాత్ముఁ డగు హరి శక్తిరూపం బయి;
 కడఁగి వెలుంగు సంకర్షణాగ్ని
భువనత్రయంబును దవిలి దహింప న;
 య్యనలకీలలఁ బొడమిన మహోష్మ
మలమినఁ గమలి మహర్లోకవాసులు;
 జనలోకమునకును జనుదు రపుడు

3-355.1-తేటగీతి

విలయసమయ సముత్కట విపుల చండ
వాతధూతోర్మిజాల దుర్వార వార్ధి
భువనములు ముంచు నమ్మాడు భువనములను
దత్పయోరాశిమీఁదఁ బద్మావిభుండు.

3-356-ఉత్పలమాల

చారు పటీర హీర ఘనసార తుషార మరాళ చంద్రికా
పూర పృణాళహార పరిపూర్ణ సుధాకర కాశ మల్లికా
సార నిభాంగ శోభిత భుజంగమతల్పము నందు యోగని
ద్రారతిఁ జెంది యుండు జఠరస్థిత భూర్భువరాది లోకుఁ డై.

3-357-కంద పద్యము

జనలోక నివాసకు ల
ర్థిని వినుతింపంగ నతుల దివ్యప్రభచేఁ
దనరుచు మీలిత నిజలో
చనుఁడై వసియించు నతఁడు సముచితలీలన్.

3-358-వచనము

ఇవ్విధంబున.

3-359-సీస పద్యము

కైకొని బహువిధ కాలగత్యుపలక్షి;
తము లై యహోరాత్ర తతులు జరగ

శతవత్సరంబులు జనులకుఁ బరమాయు;
 వైన రీతిని బంకజాసనునకుఁ
బరమాయు వగు శతాబ్దంబు లందుల సగ;
 మరిగిన నదియ పరార్ధ మండ్రు
గాన పూర్వార్ధంబు గడచుటఁ జేసి ద్వి;
 తీయపరార్ధంబు దీని పేరు

3-359.1-తేటగీతి

కడఁగి పూర్వపరార్ధాది కాల మందు
బ్రహ్మకల్పాఖ్య నెంతయుఁ బరఁగు నందు
బ్రహ్మ యుదయించుటం జేసి బ్రహ్మకల్ప
మనియు శబ్దాత్మకబ్రహ్మ మనియు నెగడె.

3-360-కంద పద్యము

విను మెన్నఁడు పంకజనా
భుని నాభీసరసి యందు భువనాశ్రయ మై
తనరిన పద్మము వొడవడు
ననఘా యది పద్మకల్ప మన విలసిల్లున్.

3-361-వచనము

పూర్వార్ధాదినిం గలిగిన బ్రహ్మకల్పంబుఁ జెప్పితి; ఇంక ద్వితీయప రార్ధంబు మొదల నెన్నఁ డేని హరి సూకరాకారంబు దాల్చె నది వరాహకల్పం బనం దగు; అట్టి వరాహకల్పం బిపుడు వర్తమానం బగుచున్నది; వెండియు.

3-362-సీస పద్యము

దీపింపఁ గాలస్వరూపుఁ డైనట్టి ప;
ద్మాక్షుఁ డనంతుఁ డనాదిపురుషుఁ
డఖిలవిశ్వాత్మకుఁ డగు నీశునకుఁ బర;
మాణ్వాది యుగపరార్థాంత మగుచు
జరుగు నీ కాలంబు చర్చింప నొక్క ని;
మేష కాలం బయి మెలఁగుచుండుఁ
గాని యీశ్వరునకుఁ గర్త గాఁజాల ది;
క్కాలంబు విను మది గాక దేహా

3-362.1-తేటగీతి

మందిరార్థాది కర్మాభిమానశీలు
రైనవారికి నాశ్రయం బగుటఁజేసి
యరయ హరి తద్గుణవ్యతికరుఁడు గాన
కాల మమ్మేటి కెన్నఁడు గర్తగాదు.

3-363-వచనము

మఱియు షోడశవికారయుక్తంబై పృథివ్యాది పంచభూత పరివృతం బయి దశావరణంబులుగలిగి పంచశత్కోటి విస్తీర్ణంబై బ్రహ్మాండకోశంబు దనర్చుచుండు.

3-364-చంపకమాల

హరి పరమాణురూపమున నందు వసించి విరాజమానుఁడై
సరి వెలుఁగొందు నిమ్ముల నసంఖ్యము లైన మహాండకోశముల్

నెఱిఁ దన యందు డింద నవనీరజనేత్రుఁ డనంతుఁ డాఢ్యుఁ డ
క్షరుఁడు పరాపరుం డఖిలకారణకారణుఁ డప్రమేయుఁ డై.

3-365-కంద పద్యము

నిరతిశయోజ్జ్వల తేజ
స్స్ఫురణం దనరారు పరమపురుషుని విష్ణుం
బురుషోత్తము వర్ణింపను
సరసిజభవ భవులకైన శక్యమె? చెపుమా."

3-366-కంద పద్యము

అని మైత్రేయుఁడు విదురుం
గనుఁగొని వెండియును బలికెఁ " గాలాహ్వయుఁ డై
తనరిన హరి మహిమల నే
వినిపించితి; సృష్టిమహిమ విను మెఱిఁగింతున్.

## 3-17-సృష్టిభేదనంబు

3-367-వచనము

పరమేష్ఠి యీ సృష్ట్యాదిని అహమ్మను దేహాభిమానబుద్ధి గల మోహంబును, నంగనాసంగమ, స్రక్చందనాది గ్రామ్యభోగేచ్ఛలు గల మహామోహంబును, దత్ప్రతిఘాతం బైన క్రోధంబు నందు గలుగు నంధతామిస్రంబును, దన్నాశంబు నందు అహమేవమృతోఽస్మి యను తామిశ్రంబును, జిత్తవిభ్రమంబును నను నవిద్యా పంచక మిశ్రంబుగా సర్వభూతావలిం బుట్టించి యాత్మీయ చిత్తంబునఁ బాపసృష్టిఁ గల్పించుటకుఁ బశ్చాత్తాపంబు నొంది భగవద్ధ్యానామృత

పూతమానసుం డై యూర్ధ్వరేతస్కులును, బరమపవిత్రులును నైన సనక సనందన సన త్కుమార సనత్సుజాతు లను మునుల సత్త్వగరిష్ఠుల ధీరజనోత్తముల నార్యుల హరిప్రసన్నులంగా దివ్యదృష్టిం గల్పించి, వారలం జూచి మీమీ యంశంబులం బ్రజలం బుట్టించి ప్రపంచంబు వృద్ధిఁ బొందింపుం డనిన వారలు తద్వచనంబు లపహసించుచుఁ బద్మజుంగని మోక్షధర్ములును నారాయణపారాయణులునునై ప్రపంచ నిర్మాణంబునకుఁ బ్రతికూల వాక్యంబులు పలికిన నుదయించిన క్రోధంబు బుద్ధిచే నిగ్రహింపబడినను నరవిందసంభవుని భ్రూమధ్యంబువలనం గ్రోధస్వరూపంబున నీలలోహితుండు నిలఁ సురాగ్రజుండై యుదయించుచు నాక్రందనం బొనరించె నంత.

3-368-మత్తేభ విక్రీడితము

జననం బందిన నీలలోహితుఁడు గంజాతాసనుం జూచి యి
ట్లను "నో దేవ! మదాఖ్య లెట్టివి మదీ యావాసముల్ వీఁక నా
కనయంబున్నెఱిఁగింపవే" యనుడు నయ్యంభోజగర్భుండు లా
లనముం దోఁపఁ "గుమార! నీ జననవేళన్ రోదనం బిచ్చుటన్.

3-369-తేటగీతి

రుద్రనామంబు నీకు నిరూఢమయ్యెఁ
జంద్ర సూర్యానలానిల సలిల గగన
పృథివి ప్రాణ తపోహృదింద్రియము లనఁగఁ
గలుగు నేకాదశస్థానముల వసింపు."

3-370-వచనము

అని పెండియు "మన్యు మను మహాకాల మహ చ్ఛివ ఋతధ్వ జోరురేతో భవ కాల నామదేవ ధృతవ్రతు లను నేకాదశ నామంబులు గలిగి ధీర వృ త్త్యశ నోమా నియ త్సర్పి రి లాంబి కేరావతీ సుధా దీక్షా నామ పత్నీ సమేతుండవై పూర్వయుక్తంబు లయిన నామంబులం దత్తన్నివాసంబుల వసియించి ప్రజలం గల్పింపు" మని నిర్దేశించిన భగవంతుం డగు నీలలోహితుండు విశ్వగురుం డైన పితామహునిచే నియుక్తుండై సత్త్వాకృతి స్వభావంబుల నాత్మసము లైన ప్రజలం గల్పించె.

3-371-ఉత్పలమాల

రుద్రునిచేత నీగతి నిరూఢమతిన్ సృజియింపఁ బడ్డ యా
రుద్రగణంబు లోలి నవరుద్ధత విశ్వము మ్రింగె నమ్మహో
పద్రవశాంతి కై యజుఁడు భర్గులఁ జూచి "కుమారులార! మీ
రౌద్ర విలోక నానల భరంబునఁ గ్రాఁగె సమస్త లోకముల్.

3-372-కంద పద్యము

మీ సృష్టి సాలు నింకన్
ధీసత్తములార! వినుడు ధృతి మీరు తపో
వ్యాసంగచిత్తు లై చనుఁ
డా సన్మంగళము లగు దృఢంబుగ మీకున్.

3-373-మత్తేభ విక్రీడితము

భగవంతుం బురుషోత్తమున్ హరిఁ గృపాపాథోధి లక్ష్మీశ్వరున్
సుగుణభ్రాజితు నచ్యుతుం బరుఁ బరంజ్యోతిం బ్రభున్ సర్వభూ

తగణావాసు నధోక్షజున్ శ్రితజనత్రాణైకపారీణు నా
జగదాత్ముం గనుచుందు రార్యులు తపశ్శక్తిన్ స్ఫుటజ్ఞానులై."

3-374-వచనము

అనిన విని.

3-375-ఉత్పలమాల

కైకొని యిట్లు పంకరుహగర్భనియంత్రితు లైన రుద్రు లు
ద్రేకముఁ దక్కి కానలకు ధీమతు లై తపమాచరింప న
స్తోక చరిత్రు లేఁగిరి చతుర్ముఖుఁ డంతఁ బ్రపంచకల్పనా
లోకనుఁ డై సృజించె జనలోక శరణ్యుల ధీవరేణ్యులన్.

3-376-తేటగీతి

వినుము, భగవద్బలాన్విత వినుత గుణులు
భువన సంతానహేతు విస్ఫురణ కరులు
పద్మసంభవ తుల్య ప్రభావ యుతులు
పదురు గొడుకులు పుట్టిరి భవ్యయశులు.

3-377-సీస పద్యము

అరవింద సంభవు నంగుష్టమున దక్షుఁ;
 డూరువువలనను నారదుండు,
నాభిఁ బులహుఁడు, గర్ణములఁ బులస్త్యుండు;
 త్వక్కున భృగువు, హస్తమునఁ గ్రతువు,
నాస్యంబువలన నయ్యంగిరసుఁడు, ప్రాణ;

మున వసిష్ఠుఁడు, మనమున మరీచి,
గన్నుల నత్రియుఁ గాఁ బుత్రదశకంబు;
గలిగిరి వెండియు నలినగర్భ

3-377.1-తేటగీతి

దక్షిణస్తనమువలన ధర్మ మొదవె
వెన్నువలనను నుదయించె విశ్వభయద
మైన మృత్యు, వధర్మంబు నందఁ గలిగె,
నాత్మఁ గాముండు జననము నందె మఱియు.

3-378-సీస పద్యము

భ్రూయుగళంబునఁగ్రోధంబు నధరంబు;
నందు లోభంబు నాస్యమున వాణి
యును మేఢ్ర మందుఁ బయోధు లపానంబు;
నందు నఘాశ్రయుఁ డైన నిర్ఋతి
లాలితచ్ఛాయవలన దేవహూతివి;
భుండు గర్దముఁడును బుట్టి రంత
నబ్జజుఁ డాత్మదేహమున జనించిన;
భారతిఁ జూచి విభ్రాంతిఁ బొరసి

3-378.1-తేటగీతి

పంచశరబాణనిర్భిన్నభావుఁ డగుచుఁ
గూఁతు రని పాపమునకు సంకోచపడక

కవయఁ గోరిన జనకునిఁ గని మరీచి
మొదలుగాఁ గల యమ్మునిముఖ్యు లెఱిఁగి.

3-379-వచనము

ఇట్లనిరియ

3-380-ఉత్పలమాల

" చాలుఁ బురే సరోజభవ! సత్పథవృత్తిఁ దొఱంగి కూఁతు ని
ట్లాలరి పై రమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే
బేలరి వైతి నీ తగవుఁ బెద్దతనంబును నేలపాలుగా
శీలము వోవఁదట్టి యిటుసేసిన వారలు మున్ను గల్గిరే?

3-381-ఉత్పలమాల

నీవు మహానుభావుఁడ వనింద్యచరిత్రుఁడ విట్టిచోట రా
జీవభవుండు దా విధినిషేధము లాత్మ నెఱుంగఁ డయ్యె నీ
భావభవప్రసూన శర బాధితుఁ డై తన కూఁతుఁ బొందెఁబో
వావిదలంపలే కనుచు వారక లోకులు ప్రువ్వఁ దిట్టరే.

3-382-కంద పద్యము

పాపము దలఁపక నిమిషము
లోపలఁ జెడు సౌఖ్యమునకు లోనైతివె యిం
తే పో ధారుణిఁ గామా
న్ధోపి న పశ్యతి యనంగఁ దొల్లియు వినమే."

3-383-మత్తేభ విక్రీడితము

అని యిబ్భంగి మునీంద్రు లాడిన కఠోరాలాపముల్ వీనుల
న్విని లజ్జావనతాననుం డగుచు నా నీరేజగర్భుండు స
య్యన దేహంబు విసర్జనీయముగఁ జేయన్ దిక్కు లేతెంచి త
త్తనువుం గైకొనఁ బుట్టె దిక్కలితమై తామిస్ర నీహారముల్.

3-384-వచనము

అంత.

3-385-చంపకమాల

ఉడుగక పంకజాతభవుఁ డొండొక దేహముఁ దాల్చి ధైర్యమున్
విడువక సృష్టి పూర్వసమవేతముగన్ సృజియించు నేర్పు దాఁ
బొడమమి కాత్మలోనఁ దలపోయుచు నుండఁ జతుర్ముఖంబులన్
వెడలె ననూన రూపముల వేదము లంచిత ధర్మ యుక్తితోన్.

3-386-తేటగీతి

మఱియు మఖములు మహితకర్మములుఁ దంత్ర
ములును నడవళ్లు నాశ్రమములుఁ దదీయ
ముఖచతుష్కము నందున పొడమె" ననిన
విని మునీంద్రునిఁ జూచి యవ్విదురుఁ డనియె.

## 3-18-స్వాయంభువు జన్మంబు

3-387-కంద పద్యము

" తోయజసంభవుఁ డత్తఱి
నేయే ముఖమండలమున నేయే సృష్టిన్

ధీయుతుఁడై సృజియించెను
బాయక యత్తెఱఁగు దెలియఁ బలుకుము నాకున్."

3-388-వచనము

అని యిట్లు విదురుం డడిగిన మైత్రేయుం డతనితో నిట్లనియె "ఋగ్యజుస్సామాధర్వంబు లను వేదంబులును, హోతృకర్మంబు లయిన యప్రగీతమంత్రస్తోత్రంబు లగు శస్త్రంబులును, నధ్వర్యుకర్మంబైన యిజ్యయు, సంప్రగీతస్తోత్రం బయిన స్తుతియు, నుద్గాతృ ప్రయోజనం బైన ఋక్సముదాయ రూపం బగు స్తోమంబును, బ్రాయశ్చిత్తం బగు బ్రహ్మకర్మంబును, నాయుర్వేద ధనుర్వేద గాంధర్వ వేదంబులను, నుపవేదంబులును, విశ్వకర్మశాస్త్రం బగు స్థాపత్యంబును, బ్రాగాది ముఖంబుల నుత్పన్నంబు లయ్యె; పంచమవేదం బగు నితిహాస పురాణంబులు సర్వముఖంబులం గలిగె; మఱియుఁ గర్మతంత్రంబు లయిన షోడశ్యుక్థ్యలును, యజనాగ్నిష్టోమంబులును, నాప్తోర్యామాతిరాత్రంబులును, వాజపేయ గోసవంబులును, ధర్మపాదంబు లైన విద్యా దాన తపస్సత్యంబులును, బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ యత్యాశ్రమంబులును గల్గె; వీనికి నొక్కొక్కటికిం జతుర్విధంబు లైన వృత్తులును గలిగి యుండు; అందు సావిత్రం బన బ్రహ్మచర్యంబు యది యుపనయనం బాదిగా దివసత్రయంబు గాయత్రి జపించుటయు; ప్రాజాపత్యం బన వేదవ్రతచతుష్కయంబు యందు బ్రతివ్రతంబును వ్రతులు సంవత్సర పర్యంతంబుగా నాచరింప నగు; బ్రాహ్మంబు వేదగ్రహణాంతంబు నాచరింపం దగు; బృహత్తన నైష్టికం బియ్యగునవి బ్రహ్మచారి వృత్తిచతుష్టయంబును; ననిషిద్ధకృష్యాది వృత్తి యగు వార్తయు యజనాది కర్మోపయుక్తం బైన యాజ్ఞాది రూప ధనసంచయంబును, బరుల యాచింపకుండు నయాచితం బగు

శాలీనంబును, క్షేత్ర పతిత కణిశ కణ సంగ్రహణరూపం బగు శిలోంఛంబును నను గృహస్థవృత్తులు నాలుగును; నకృష్టపచ్యాహారు లగు వైఖానసులును, నూతనఫలంబు లబ్ధం బైనఁ బూర్వ సంచితపదార్థ త్యాగంబు గల వాలఖిల్యులును, బ్రాతః కాలంబున నే దిక్కు విలోకింతు రద్దిక్కునకుం జని యచ్చట లభించు పదార్థంబుల భుజించి జీవించు నౌదంబరులును, దమంత ఫలించి తరు పతితంబు లగు ఫలంబులఁ దినుచుండు ఫేనపులును నను చతుర్విధవృత్తులు గల వానప్రస్థులును; స్వాశ్రమవిహిత కర్మంబులం బ్రదానుం డగు కుటీచకుండును, గర్మం బుపసర్జనంబు సేసి జ్ఞానప్రధానుం డయిన బహూదుండును, గేవల జ్ఞానాభ్యాస నిష్ఠుం డగు హంసుండును, బ్రాప్తంబైన పరబ్రహ్మతత్త్వంబు గల నిష్క్రియుండును నను సన్యాసి చతుర్విధ వృత్తులును; మోక్షఫలప్రదం బై యాత్మానాత్మ వివేకవిద్యారూపం బగు నాన్వీక్షకియు, స్వర్గాది ఫలప్రదం బై కర్మవిద్యారూప మగు త్రయియు, జీవనఫల ప్రధానం బై కృష్యాది రూపం బగు వార్తయు, నర్థ సంపాదనైక ప్రయోజనం బగు దండనీతియు, మోక్ష ధర్మకామార్థంబు లైన న్యాయవిద్యా చతుష్కంబును, భూర్భువస్సువ యను వ్యాహృతులును, బూర్వాది ముఖంబులవలన నుదయించె; మఱియు నతని హృదయాకాశంబు వలనం బ్రణవంబును, రోమంబుల వలన నుష్ణిక్ఛందంబును, ద్వగింద్రియంబు వలన గాయత్రీఛందంబును, మాంసంబు వలనఁ ద్రిష్టుక్ఛందంబును, స్నాయువు వలన ననుష్టుప్ఛందంబును, నస్థి వలన జగతీచ్ఛందంబును, మజ్జ వలన పంక్తిచ్ఛందంబును, బ్రాణంబు వలన బృహతీఛందంబును, కకారాది పంచ వర్గాత్మకంబు లయిన స్పర్శంబులను, జీవుండును, నకారాది స్వరాత్మకం బైన దేహంబును, నూష్మంబు లను శ ష స హ వర్ణచతుష్టయ రూపంబు లగు నింద్రియంబులును, నంతస్థంబు లగు య ర

ల వ యను వర్ణంబులును, షడ్జాది సప్తస్వర రూపంబు నాత్మబలంబు నయిన శబ్దబ్రహ్మంబును, జతుర్ముఖుని లీలావిశేషంబున నుత్పన్నం బయ్యె; వ్యక్తావ్యక్తం బై వైఖరీ ప్రణవాత్మకం బైన శబ్దబ్రహ్మంబు వలనం బరమాత్మ యవ్యక్తాత్మకుం డగుటం జేసి పరిపూర్ణుండును వ్యక్తాత్మకుం డగుటంజేసి యింద్రాది శక్త్యుపబృంహితుండును నై కానంబడు; పదంపడి యజుండు భూరివీర్యవంతు లయిన ఋషిగణంబుల సంతతి యవిస్తృతం బని తలంచి, పూర్వతను పరిగ్రహంబు సాలించి, యనిషిద్ధ కామాసక్తం బైన దేహాంతర పరిగ్రహంబు సేసి, నిత్యంబుఁ బ్రజాసృష్టి యందు వ్యాసక్తుండ నైనం బ్రజ లభివృద్ధి నొందక యుండుట కేమి కారణం బగు నని యచ్చరువొంది; తద్వృద్ధి యగు విధం బాలోచించుచు, దైవం బిచ్చట విఘాతుకంబు గాన తదానుకూల్యం బావశ్యకం బని దాని నెదురుచూచుచు, యథోచిత కృత్య కరణదక్షుం డగుచుండు చతుర్ముఖుని దేహంబు ద్వివిధం బయిన యట్టి రూపద్వయ విభాగంబు స్వరాట్టగు స్వాయంభువ మనువును దన్మహిషి యగు శతరూప యను కన్యకయుంగా మిథునం బయి జనియించె; అమ్మిథునంబు వలన బ్రియవ్రతోత్తానపాదు లను పుత్రద్వయంబు నాకూతి దేవ హూతి ప్రసూతు లను కన్యకా త్రయంబునుం గలిగిరి; అందు నాకూతిని రుచికునకును, దేవహూతిం గర్దమునకును, బ్రసూతిం దక్షునకును నిచ్చె; వీరల వలనఁ గలుగు ప్రజా సంతతులచేత జగంబులు పరిపూర్ణంబు లయ్యె."

3-389-కంద పద్యము

అని మైత్రేయుఁడు పలికిన
విని మనమున హర్ష మొదవ విదురుఁడు మునినా

ఘునిఁ జూచి పలికెఁ గ్రమ్మఱ
వనజోదర పాదభక్తివశ మానసుఁ డై.

3-390-కంద పద్యము

"ఘనుఁడు స్వయంభువునకుఁ బ్రియ
తనయుఁడు స్వాయంభువుండు దైతేయవిభే
దనసేవాచతురుండును
జనవినుతుండాదిరాజ్యసత్తముఁడౌటన్

3-391-కంద పద్యము

అతని చరిత్రం బవ్యా
హత సుఖదము నిఖిల మంగళావహము సమం
చితముం గావున బుధసే
వితి! నా కెఱుఁగంగఁ బలుకవే మునితిలకా!

3-392-కంద పద్యము

అదియును గాక ముకుందుని
పదకమల మరందపాన పరవశులై పెం
పొదవినవారి చరిత్రము
సదమలమతి వినిన భవము సఫలము గాదే!"

3-393-చంపకమాల

అని విదురుండు పల్కిన దయాన్వితుఁ డై మునినాథచంద్రుఁ డి
ట్లను "శ్రుతిశాస్త్రపారకలితాత్మకుఁ డైన నరుండు పద్మలో

చన చరణారవిందయుగ సంగము గల్గిన సజ్జనుండు వొం
దినఫల మొందు భాగవతదివ్యకథాశ్రవణానురక్తిచేన్."

3-394-కంద పద్యము

అని చెప్పి మునికులాగ్రణి
దనుజారి కథాసుధాప్లుతస్వాతుం డై
తనవునఁ బులకాంకురములు
మొనయఁగ నానందబాష్పములు జడి గురియన్.

3-395-సీస పద్యము

వినిపింపఁ దొడఁగె "నా ఘనుఁడు స్వాయంభువుఁ;
డంగనాయుక్తుఁ డై యబ్జగర్భు
నకు మ్రొక్కి వినయవినమితోత్తమాంగుఁ డై;
హస్తముల్ మొగిచి యిట్లనియె బ్రీతి
జీవరాశులకు రాజీవసంభవ! నీవ;
జనన రక్షణ వినాశముల కరయ
హేతుభూతుఁడవు మా కెద్ది యాచరణీయ;
మైన కర్మము దాని నానతిమ్ము

3-395.1-తేటగీతి

ఎట్టి కర్మంబు సేసిన నెసఁగు నీకు
నవహితం బైన సంతోష మాత్మజుండు
జనకునకు భక్తిఁ బరిచర్య సలిపి కీర్తి
నంది నుతికెక్కి నర్తించు నందు నిందు.

3-396-వచనము

కావున నెఱింగింపు మట్టి సత్కర్మంబు."

3-397-కంద పద్యము

అని పలికిన స్వాయంభువ
మను మృదుభాషలకు నలరి మునమునఁ గమలా
సనుఁ డనురాగము ముప్పిరి
గొనఁ బ్రియతముఁ డైన సుతునకును నిట్లనియెన్.

3-398-చంపకమాల

" మునుకొని తండ్రియాజ్ఞఁదలమోచి నిజోచితకృత్యమేమి పం
చినఁ దన శక్తియుక్తి నెడసేయక చేయుట పుండరీకలో
చన పదసేవ సేయుట ప్రజాపరిపాలనశాలి యౌటయున్
జనకునకున్ సుతుండు పరిచర్య లొనర్చుట సువ్వె పుత్రకా!

3-399-వచనము

కావున.

3-400-మత్తేభ విక్రీడితము

వివరింపన్ హరి యజ్ఞమూర్తి బరమున్ విష్ణున్ హృషీకేశుఁ గే
శవుఁ బద్మాక్షు గుఱించి జన్మములు శశ్వద్భక్తిఁ గావింప మా
ధవుఁ డాత్మం బరితోష మొందు నతఁ డుద్యత్ప్రీతిఁ గైకొన్న లో
కవితానంబులు దుష్టి నొందు ననఘా! కావింపుమా యజ్ఞముల్.

3-401-చంపకమాల

అకుటిల భక్తిఁ గేశవ సమర్పణబుద్ధిఁ గ్రతుక్రియల్ వొన
ర్పక విపరీతు లై యుముకురాసులు దంచి ఫలంబు నందఁ గా
నక చెడురీతి నూరక ధనవ్యయ మౌటయ కాని మోక్షదా
యక మగుచున్నఁ దత్ఫలము నందరు విష్ణుపరాఙ్మఖక్రియుల్.

3-402-ఉత్పలమాల

కావున యజ్ఞముల్ హరి వికారవిదూరు గుఱించి చేయు నీ
భావము సూనృతవ్రత శుభస్థితిఁ జెందెడు నీ కుమారులున్
నీవును నీ ధరాభరము నెమ్మి వహింపుము సజ్జనావళిం
బ్రోవుము ధర్మమార్గమునఁ బుత్రక! దోషలతాలవిత్రకా!"

## 3-19-వరాహావతారంబు

3-403-కంద పద్యము

అనవుడు నతనికి నతఁ డి
ట్లనియెన్ " భవదీయమైన యానతి యెట్ల
ట్లొనరించెద నాకును నా
తనయులకు వసించి యుండఁ దగు నెల వెందున్.

3-404-తేటగీతి

అరయ లేదు విధాత! యీ యఖిల జంతు
జాతముల కెల్ల నాధారభూత మైన
ధరణి యిప్పుడు ఘనజలాంతర్నిమగ్న
మైన కతమునఁ జోటు లేదంటి దండ్రి!

3-405-కంద పద్యము

కావున భూమ్యుద్ధరణము
గావించు నుపాయ మిపుడు గైకొని నాకున్
దేవా నీ వెఱిఁగింపుము"
నావుడుఁ బద్మజుఁడు దన మనంబునఁ దలఁచెన్.

3-406-మత్తేభ విక్రీడితము

జలమధ్యంబున లీనమైుందిన ధరాచక్రంబు నే నేర్పునన్
నిలుపన్ వచ్చును బూర్వ మందు జగముల్ నిర్మించు నాఁ డాది న
ప్పులఁబుట్టించిన మీఁద నవ్వసుమతిం బుట్టించితిం బుత్ర య
ప్పులలోఁగ్రుంకి రసాతలాంతరమునం బొందెం గదా పృథ్వియున్

3-407-సీస పద్యము

అఖిల జగత్కల్పనాటోపములకుఁ బా;
 ల్పడిన నాచేత నెట్పంగి నిపుడు
దగిలి విశ్వంభరోద్ధరణంబుఁ గావింప;
 నగు నని సర్వభూతాంతరాత్ముఁ
బురుషోత్తముని నవపుండరీకాక్షు ల;
 క్ష్మీపతిఁ దన మనస్థితునిఁ జేసి
తలపోయుచున్నఁ బద్మజు నాసికా వివ;
 రమ్మున యజ్ఞవరాహమూర్తి

3-407.1-తేటగీతి

యర్థి నంగుష్ఠమాత్ర దేహంబుతోడ
జనన మంది వియత్తల స్థాయి యగుచు
క్షణము లోపల భూరి గజప్రమాణ
మయ్యె నచ్చటి జనముల కద్భుతముగ.

3-408-సీస పద్యము

అంతఁ బ్రజాసర్గ మందు నియుక్తులై;
నట్టి మరీచ్యాదు లైన మునులు
మనుకుమారకులు నమ్మను సహితంబుగ;
యజ్ఞవరాహంబు నర్థిఁ జూచి
యిట్టి యాశ్చర్య మెట్లిందేని గలదె నా;
సారంధ్రనిర్గత స్తబ్ధరోమ
తోకంబు మనము విలోకింప నంగుష్ఠ;
మాత్రమై యీ క్షణమాత్రలోన

3-408.1-తేటగీతి

మహిమ దీపింప దంతి ప్రమాణమున మ
హోన్నతంబైన గండశైలోపమంబు
నయ్యె ననుచు వితర్కించి రబ్జభవుఁడు
హర్ష మిగులొత్త నిట్లని యపుడు దలఁచె.

3-409-కంద పద్యము

నా మనమునఁ గల దుఃఖవి
రామము గావించుకొఱకు రాజీవాక్షుం

డీమేర యజ్ఞపోత్రి
శ్రీమూర్తి వహించె నిది విచిత్రము దలఁపన్.

3-410-వచనము

అని వితర్కించు సమయంబున సూకరాకారుండైన భగవంతుండు.

3-411-తేటగీతి

ప్రళయజీమూతసంఘాత భయద భూరి
గర్జనాటోపభిన్న దిగ్ఘన గభీర
రావ మడరింప నపుడు రాజీవభవుఁడు
మునులు నానందమును బొంది రనఘచరిత!

3-412-వచనము

అంత మాయామయ వరాహ ఘుర్ఘురారావంబు బ్రహ్మాండ కోటరపరి స్ఫోటనంబుఁ గావింప విని జనస్తప సత్యలోక నివాసు లయిన మునులు ఋగ్యజుస్సామ మంత్రంబుల వినుతించిరి; యజ్ఞవరాహ రూపధరుండ యిన సర్వేశ్వరుండు సత్పురుషపాలనదయాపరుఁడు గావున దిగ్గజేంద్ర లీలావిలోలుండై.

## 3-20-భూమ్యుద్ధరణంబు

3-413-సీస పద్యము

కఠిన సటాచ్ఛటోత్కట జాత వాత ని;
ర్ధూత జీమూత సంఘాత మగుచు
క్షురనిభ సునిశిత ఖురపుటాహత చల;
త్ఫణిరాజ దిగ్గజ ప్రచయ మగుచుఁ

జండ దంష్ట్రోత్థ వైశ్వాన రార్చిస్స్రవ;
ద్రజత హేమాద్రి విస్రంభ మగుచు
ఘోర గంభీర ఘుర్ఘుర ఘూరినిస్స్వన;
పంకి లాఖిల వార్ధి సంకులముగఁ

3-413.1-తేటగీతి

బొరలుఁ గెరలు నటించు నంబరము దెరల
రొప్పు నుప్పర మెగయును గొప్పరించు
ముట్టె బిగియించు మనమున మూరుకొనుచు
నడరు సంరక్షితక్షోణి యజ్ఞఘోణి.

3-414-వచనము

మఱియు నయ్యజ్ఞవరాహంబు.

3-415-సీస పద్యము

తివిరి చతుర్దశ భువనంబులను దొంతు;
లొరగఁ గొమ్ములఁ జిమ్ము నొక్కమాటు
పుత్తడికొండ మూఁపురమును నొరగంట;
నుఱుముగా రాపాడు నొక్కమాటు
ఖురముల సప్తసాగరములఁ రొంపిగా;
నుక్కించి మట్టాఁడు నొక్కమాటు
నాభీల వాలవాతా హతిచే మింటి;
నొరసి బ్రద్దలుసేయు నొక్కమాటు

3-415.1-తేటగీతి

గన్నుఁ గొనలను విస్ఫులింగములుసెదర
నురుభయంకర గతిఁ దోఁచు నొక్కమాటు
పరమయోగీంద్రజన సేవ్య భవ్యవిభవ
యోగ్య మై కానఁగా నగు నొక్కమాటు.

3-416-వచనము

ఇట్లు విహరించుచుఁ బ్రాతర్మధ్యందిన తృతీయసవనరూపుం డైన యజ్ఞవరాహమూర్తి యగు సర్వేశ్వరుండు మహాప్రళయంబు నందు యోగనిద్రా వివశుం డై యుండు నవసరంబున నుదకస్థం బైన భూమి రసాతలగతం బైన; దాని నుద్ధరించుటకు సముద్రోదరంబుఁ దరియం జొచ్చు వేగంబు సైరింపంజాలక, సముద్రుం డూర్ము లను భుజంబు లెత్తి వికీర్ణహృదయుం డై యార్తుని పగిది "యజ్ఞవరాహ నన్ను రక్షింపు రక్షింపు" మని యాక్రోశింప; నిశిత కరాళ క్షుర తీక్ష్ణంబు లైన ఖురాగ్రంబుల జలంబులు విచ్ఛిన్నంబులు గావించి యపారం బయిన రసాతలంబుఁ బ్రవేశించి భూమిం బొడగను నవసరంబున.

3-417-కంద పద్యము

శరనిధిలోన మహోగ్రా
మరకంటకుఁ డెదురఁ గాంచె మఖమయగాత్రిన్
ఖురవిదళితకులగోత్రిన్
ధరణీకళత్రిన్ గవేషధాత్రిన్ పోత్రిన్.

3-418-వచనము

ఇట్లు పొడగని దైత్యుండు రోషభీషణాకారు డై.

3-419-మత్తేభ విక్రీడితము

గద సారించి యసహ్యవిక్రమ సమగ్రస్ఫూర్తిచే వేయఁగా
నది దప్పించి వరాహమూర్తి నిజదంష్ట్రాగ్రాహతిం ద్రుంచెఁ బెం
పొదవం గ్రోధమదాతిరేక బలశౌర్యోదార విస్తార సం
పదఁ బంచాస్యము సామజేంద్రుఁ జల మొప్పం ద్రుంచు చందంబునన్.

3-420-మత్తేభ విక్రీడితము

దితిజాధీశుని నీ గతిం దునిమి యుద్వృత్తిం దదీయాంగ శో
ణితపంకాంకిత గండభాగుఁ డగుచున్విష్ణుండు దా నొప్పె వి
స్తృత సంధ్యాంబుద ధాతుచిత్రిత సముద్దీప్తక్షమాభృద్గతిన్
క్షితిఁ దంష్ట్రాగ్రమునన్ ధరించి జలరాశిం బాసి యేతేరఁగన్.

3-421-తేటగీతి

బాలశీతాంశురేఖా విభాసమాన
ధవళ దంష్ట్రాగ్రమున నున్న ధరణి యొప్పె
హరికి నిత్యానపాయిని యైన లక్ష్మి
నెఱయఁ బూసిన కస్తూరినికర మనఁగ.

## 3-21-విధాత వరాహస్తుతి

3-422-వచనము

అట్టి యజ్ఞపోత్రిమూర్తిం జూచి కమలాసన ప్రముఖు లిట్లని స్తుతియించిరి.

3-423-సీస పద్యము

" దేవ! జితం జితంతే పరమేశ్వర! ;
 సితయజ్ఞభావన! శ్రుతిశరీర!
కారణసూకరాకారుండ వగు నీకు;
 నతిభక్తి మ్రొక్కెద మయ్య వరద!
భవదీయ రోమకూపము లందు లీనంబు;
 లై యుండు నంబుధుఁ లట్టి యధ్వ
రాత్మక మై తనరారు నీ రూపంబు;
 గానంగరాదు దుష్కర్మపరుల

3-423.1-తేటగీతి

కట్టి నీకుఁబ్రణామంబు లాచరింతు
మఖిలజగదేకకీర్తి! దయానువర్తి!
భవ్యచారిత్ర! పంకజపత్రనేత్ర!
చిరశుభాకార! యిందిరాచిత్తచోర!"

3-424-వచనము

అని వెండియు నిట్లు స్తుతియించిరి.

3-425-సీస పద్యము

" త్వక్కున నఖిల వేదములు రోమంబుల;
 యందును బర్హిస్సు నక్షు లందు
నాజ్యంబు పాదంబు లందుఁ జాతుర్హోత్ర;
 కలితంబు లగు యజ్ఞకర్మములును
స్రుక్కు తుండంబున స్రువము నాసికను ని;

డాపాత్ర ముదరకోటరము నందుఁ
శ్రవణాస్య బిలములఁ జమస ప్రాశిత్రముల్;
గళమున నిష్టిత్రికంబు జిహ్వఁ

3-425.1-తేటగీతి

దగుఁ బ్రవర్గ్యము నగ్నిహోత్రములు నీదు
చర్వణంబును సభ్యావపధ్యు లుత్త
మాంగ మసువులు చయనము లగుఁ గిటీశ!"
యనుచు నుతియించి రత్తఱి యజ్ఞవిభుని.

3-426-వచనము

వెండియు "ముహుర్ముహుర్భవ దావిర్భావంబు దీక్షణీయేష్టి యగు; నీదు దంష్ట్రలు ప్రాయణీయం బను దీక్షానంతరేష్టియు, నుదయనీయం బను సమాప్తేష్టియు, యుష్మద్రేతంబు సోమంబును, ద్వదీయావస్థానంబు ప్రాతస్సవనాదులు; నీదు త్వఙ్మాంసాది సప్తధాతువు లగ్నిష్టోమాద్యగ్నిష్టోమోక్థ్యషోడశీ వాజపేయాతిరాత్రాప్తోర్యామంబు లను సంస్థాభేదంబులును, ద్వాదశాహాదిరూపంబులైన బహు యాగ సంఘాత రూపంబులు నగు; సర్వసత్త్రంబులు భవదీయ శరీరసంధులు; సనోమాసోమంబు లగు యజ్ఞక్రతువులు నీవ; మఱియును నీవు యజనబంధనంబులచే నొప్పుచుందువు; అదియునుం గాక.

3-427-కంద పద్యము

హావరూపివి హావనేతవు
హావభోక్తవు నిఖిలహావఫలాధారుఁడవున్

హావరక్షకుఁడవు నగు నీ
కవితతముగ నుతులొనర్తు మయ్య; ముకుందా!

3-428-తేటగీతి

సత్త్వగుణమున సద్భక్తి సంభవించు
భక్తియుతముగఁ జిత్తంబు భవ్య మగును
హృదయపద్మంబునం దోలి నెఱుఁగఁబడిన
యట్టి నీకు నమస్కారమయ్య; వరద!

3-429-మత్తేభ విక్రీడితము

అరవిందోదర తావకీనసితదంష్ట్రాగ్రావ లగ్నక్షమా
ధరనద్యబ్ధినదాటవీయుత సమిద్ధక్ష్మాతలంబొప్పె భా
సురకాసారజలావతీర్ణమదవచ్ఛుండాలరాడ్దంతశే
ఖరసంసక్త వినీలపంకజమురేఖంబొల్పు దీపింపఁగన్

3-430-వచనము

మఱియును.

3-431-మత్తేభ విక్రీడితము

చతురామ్నాయ వపుర్విశేష ధర! చంచత్సూకరాకార! నీ
సిత దంష్ట్రాగ్ర విలగ్నమై ధరణి రాజిల్లెం గులాద్రీంద్ర రా
జిత శృంగోపరిలగ్న మేఘము గతిం జాలం దగెన్ సజ్జనాం
చిత హృత్పల్వలలోల! భూరమణ! లక్ష్మీనాథ! దేవోత్తమా!

3-432-సీస పద్యము

సమధిక స్థావర జంగమాత్మక మైన;
 వసుమతీచక్ర మవక్ర లీల
నుద్ధరించితి కరుణోపేత చిత్తుండ;
 వగుచు నస్మన్మాత యయ్యె ధరణి
మాత యౌటెట్లని మదిఁ దలంచెద వేనిఁ;
 జర్చింప మాకు విశ్వమున కీవు
జనకుఁడ వగుట యుష్మత్పత్ని భూదేవి;
 యగుటఁ మాకును దల్లి యయ్యె నిపుడు

3-432.1-తేటగీతి

ధరకు నీతోడఁ గూడ వందన మొనర్తు
మరణి యందును యాజ్ఞికుఁ డగ్ని నిలుపు
కరణి నీ తేజమీ ధరాకాంత యందు
నిలుప ధరణి పవిత్రయై నెగడుఁ గాన.

3-433-చంపకమాల

తలఁప రసాతలాంతరగతక్షితిఁ గ్రమ్మఱ నిల్పినట్టి నీ
కలితన మెన్న విస్మయము గాదు సమస్త జగత్తు లోలి మై
గలుగఁగఁ జేయు టద్భుతము గాక మహోన్నతి నీ వొనర్చు పెం
పలరిన కార్యముల్ నడప నన్యులకుం దరమే? రమేశ్వరా!

3-434-చంపకమాల

సకల జగన్నియామక విచక్షణలీలఁ దనర్చు నట్టి నం
దకధర! తావకస్ఫుర దుదారరత మంత్రసమర్థుఁ డైన యా

క్షికుఁ దరణిన్ హుతాశనుని నిల్పిన కైవడి మన్నివాస మౌ
టకుఁ దలపోసి యా క్షితిఁ దృఢంబుగ నిల్పితి వయ్య; యీశ్వరా!

3-435-చంపకమాల

సలలిత వేదశాస్త్రమయ సూకరమూర్తిఁ దనర్చుచున్ రసా
తలమున నుండి వెల్వడు నుదారత మేను విదుర్పఁ దత్సటో
చ్ఛలితము లైన బిందువుల సాధు తపోజన సత్యలోక వా
సుల మగు మేము దోఁగి పరిశుద్ధి వహించితి మయ్య; మాధవా!

3-436-ఉత్పలమాల

విశ్వభవస్థితిప్రళయ వేళల యందు వికారసత్త్వమున్
విశ్వము నీవ యై నిఖిల విశ్వము లోలి సృజింతు విందిరా
ధీశ్వర! యీశ! కేశవ! త్రయీమయ! దివ్యశరీర! దేవ! నీ
శాశ్వతలీల లిట్టి వని సన్నుతిసేయఁగ మాకు శక్యమే?

3-437-సీస పద్యము

పంకజోదర! నీ వపారకర్ముండవు;
భవదీయకర్మాబ్ధి పార మరయ
నెఱిఁగెద నని మది నిచ్ఛగించిన వాఁడు;
పరికింపఁగా మతిభ్రష్టు గాఁక
విజ్ఞానియే చూడ విశ్వంబు నీ యోగ;
మాయాపయోనిధి మగ్న మౌటఁ
దెలిసియుఁ దమ బుద్ధిఁ దెలియని మూఢుల;
నే మన నఖిలలోకేశ్వరేశ!

3-437.1-తేటగీతి

దాసజనకోటి కతిసౌఖ్యదాయకములు
వితత కరుణాసుధాతరంగితము లైన
నీ కటాక్షేక్షణములచే నెఱయ మమ్ముఁ
జూచి సుఖులను జేయవో సుభగచరిత!"

3-438-కంద పద్యము

అని బ్రహ్మవాదు లగు స
న్మునివర్యులు భక్తియోగమున వినమితులై
మనమున మోదము ముప్పిరి
గొనఁ బొగడిరి ఖురవిదళితగోత్రిం బోత్రిన్.

3-439-ఉత్పలమాల

అంతట లీలఁబోలె జగదాత్ముఁడు యజ్ఞవరాహమూర్తి య
త్యంత గభీర భీషణ మహార్ణవతోయ సమూహమున్ ఖురా
క్రాంతముఁ జేసి క్రమ్మఱ ధరాతలమంబులమీఁద నిల్పి వి
శ్రాంతి వహింపఁ జేసి గుణశాలి దిరోహితుఁ డయ్యె నయ్యెడన్.

3-440-ఉత్పలమాల

మంగళమైన యీ కథ సమంచితభక్తి బఠింప విన్నవా
రిం గరుణార్ద్రదృష్టిఁ గని శ్రీహరి సాల బ్రసన్నుఁ డౌను స
త్సంగతుఁ డైన విష్ణుఁడు ప్రసన్నుఁడు దా నగునేని వారికిన్
మంగళముల్ లభించు ననుమానము లే దదిగాక వెండియున్.

3-441-చంపకమాల

హరి నిజదాసకోటికిఁ దదాశ్రయులై రమియించు నట్టి స
త్పురుషుల కిష్ట వస్తు పరిపూర్ణ మనోరథసిద్ధి గల్గు సు
స్థిర మగుచున్న ముక్తియును సిద్ధముగాఁ జెలువారు నన్న న
స్థిరతర తుచ్ఛ సౌఖ్యములు సేకురుటల్ మఱి చెప్పనేటికిన్.

3-442-ఉత్పలమాల

కాన సరోజలోచన! జగత్స్రవనీయ కథాసుధారసం
బానిన యట్టి జిహ్వ యసదన్యకథాలవణోదకంబులం
బానముసేయఁ జూచునె సుపర్వ మహీజ మరందపాన లా
భానుభవంబు నొందు మధుపంబునుఁ బోవునె వేపచెట్లకున్."

3-443-కంద పద్యము

అని మైత్రేయమునీంద్రుం
డనఘుఁడు విదురునకుఁ జెప్పి నట్టి తెఱంగ
ర్జునపౌత్రునకున్ వ్యాసుని
తనయుఁడు వినిపించి మఱియుఁ దగ నిట్లనియెన్.

3-444-కంద పద్యము

" అని చెప్పిన మైత్రేయుని
గనుగొనిఁ విదురుండు పల్కు ఘనతర మగు నా
దనుజకులాంతకు చరితము
విని తనియదు నామనంబు విమలచరిత్రా!

3-445-చంపకమాల

సవనవరాహమూర్తికథ సర్వము నీ దయ వింటి వెండియున్
వివరముగా వినం బలుకవే గుణసాంద్ర! మునీంద్రచంద్ర! మా
ధవ గుణకీర్తనామృత వితానముఁ గర్ణపుటాంజలిన్ వెసం
జవిఁగొన కేల మాను జన సంతతికిన్ భవతాపవేదనల్.

3-446-వచనము

కావున.

3-447-సీస పద్యము

శ్రీహరి యజ్ఞవరాహ రూపముఁ దాల్చి;
మించి హిరణ్యాక్షుఁ ద్రుంచె ననుచు
నప్పుడు మునినాథ చెప్పితి నాతోడ;
నవ్వరాహంబు దంష్ట్రాగ్రముునను
ధరణి నెబ్బంగిని ధరియించె హరికి హి;
రణ్యాక్షుతోడ వైరమున కేమి
కారణ మసుర నే గతి సంహరించెఁ దా;
నింతయు నెఱిఁగింపు మిద్ధచరిత!"

3-447.1-తేటగీతి

యనిన మైత్రేయముని విదురునకు ననియె
" హరికథాకర్ణనమునఁ బెంపార నీకు
జన్మఫలసిద్ధి యగుటకు సందియంబు
వలదు హరిమాయ విధికైన వశమె తెలియ?

3-448-కంద పద్యము

అనఘాత్మ నన్ను నీ వడి
గిన యీ కథ ధ్రువుఁడు విష్ణుకీర్తనపరతం
దనరిన నారదు నడుగ న
తని కతఁ డెఱిఁగింప హరికథాశ్రవణమునన్

3-449-తేటగీతి

దండధరుఁ బెల్చ డాకాలఁ దన్ని ధ్రువుఁడు
నిందు నందును వాసికి నెక్కె నట్టి
విష్ణుసంకీర్తనం బరవిందభవుఁడు
దివిజులకుఁ జెప్పె నది నీకుఁ దేటపఱతు.

## 3-22-దితికశ్యప సంవాదంబు

3-450-వచనము

ఆకర్ణింపుము.

3-451-సీస పద్యము

బలిసి దక్షప్రజాపతితనూభవ దితి;
సంతానరుచి మానసమునఁ బొడమ
నొకనాడు పుష్పసాయకశరనిర్భిన్న;
భావ యై విరహతాపమున వచ్చి
పతిసమాగమవాంఛ ప్రభవింప నిజనాథు;
సన్నిధి నిలిచి యస్ఖలితనియతి

నగ్నిజిహ్వుండును యజురధీశుండును;
 నగు విష్ణుఁ దన చిత్తమందు నిలిపి

3-451.1-తేటగీతి

తగఁ బయస్సున నగ్నిహోత్రంబు సేసి
కమలహితుఁ డస్తశైలసంగతుఁడు గాఁగ
హోమశాలాంగణమునఁ గూర్చున్న విభునిఁ
గశ్యపునిఁ గాంచి విమలవాక్యముల ననియె.

3-452-చంపకమాల

" గజవిభుఁ డుద్ధతిన్న నఁటికంబములన్ విదళించు లీలఁ జి
త్తజుఁడు ప్రసూనసాయకవితానముచేత మదీయచిత్తమున్
గజిబిజి సేసి నెవ్వగలఁ గాఱియవెట్టఁగ నాథ! నీ పదాం
బుజములఁ గానవచ్చితి బ్రభుత్వమెలర్పఁగ నన్నుఁ గావవే!

3-453-వచనము

అదియునుం గాక నా తోడిసవతు లెల్లను భవత్కృపావిశేషంబున గర్భాదానంబులు వడసి నిర్భరానందంబున నుండం జూచి శోకవ్యాకులితచిత్త నై యున్న నన్ను రక్షించుట పరమ ధర్మంబు నీవు విద్వాంసుడవు నీ యెఱుంగని యర్థంబు గలదే? నీ వంటి మహానుభావు లయిన సత్పురుషు లార్తులైన వారి కోర్కులు వ్యర్థంబులు గాకుండఁ దీర్చుట ధర్మం" బని; వెండియు నిట్లనియె.

3-454-కంద పద్యము

"పతిసమ్మానము వడసిన
సతులకు నభిమతపదార్థసంసిద్ధియు నూ
ర్జిత యశముఁ గలిగి లోక
స్తుత మై చెలువారుచుండు జువ్వె, మహాత్మా!

3-455-కంద పద్యము

తన ధర్మపత్ని వలనను
మునుకొని తాఁ బుత్రరూపమున నుదయించున్
విను దీప మందు ముట్టిం
చిన దీపము రెండు గావె శిఖి యొకటయ్యున్.

3-456-కంద పద్యము

కావున నీ యర్థమ యా
త్మాపై పుత్ర యని వేద తతులం దోలిన్
వావిరిఁ బలుకఁగ వినవే
ధీవర! నను గావు మధికదీనన్ కరుణన్.

3-457-చంపకమాల

వర కరుణామతిన్ దుహితృ వత్సలతం దనరారు నట్టి మ
ద్గురుఁ డొకనాడు మమ్ముఁ దన కూతుల నందఱఁ బిల్చి మీ మనో
హరునెఱిఁగింపుఁ డిత్తుఁ గమలాననలార! యటన్న నందులోఁ
బురుషవరేణ్య! యేము పదమువ్వుర మర్మిలినిన్ వరింపమే. "

3-458-కంద పద్యము

దితి యీాగతిఁ గామవిమో
హితమతి బహువచనముల హృదీశునిఁ బలుకన్
ధృతిఁ గృపణఁ బతివ్రత నిజ
సతిఁ గని కశ్యపుఁడు పలికె సల్లాపమునన్.

3-459-వచనము

"నీవు చెప్పిన యట్ల పురుషులకు నంగనలవలన ధర్మార్థకామంబులు సిద్ధించు; కర్ణధారుఁడు నావచేతం బయోధిఁ గడచు చందంబున వ్యసనార్ణవంబు దరియింపం జేయు భార్య పురుషునందు నర్ధంబు; భార్యయందు సకల గృహకార్య భారంబునుం జేర్చి పురుషుండు నిశ్చింతుండై సుఖియించుచుండు; మఱియు నితరాశ్రమ దుర్జయంబు లైన యింద్రియ శత్రువర్గంబుల భార్యాసమేతుం డైన గృహస్థుండు దుర్గాధిపతి యైన రాజు శత్రు సంఘంబుల జయించు చందంబున లీలామాత్రంబునం జయించు; ఇట్టి కళత్రంబునకుం బ్రత్యుపకారంబు సేయ సకలగుణాభిరాము లగు సత్పురుషులు నూఱేండ్లకును జన్మాంతరంబులకు నైన సమర్థులుగారు; అనిన మము బోఁటివారలు సేయ నోపుదురే? ఐన నీ మనంబునం గల దుఃఖంబు దక్కు" మని, యిట్లనియె.

3-460-తేటగీతి

" తరలలోచన! నీవు సంతానవాంఛఁ
జేసి వచ్చితి వౌఁ గుల శీల వర్త
నములు గల భార్యమనమున నమరు కోర్కిఁ
దవిలి తీర్చుట పతికిఁ గర్తవ్య మరయ.

## 3-23-కశ్యపుని రుద్రస్తోత్రంబు

### 3-461-మత్తేభ విక్రీడితము

తరుణీ! యొక్క ముహూర్త ముండు మిది సంధ్యాకాల మిక్కాల మం
దరయన్ భూతగణావృతుం డగుచుఁ గామారాతి లీలన్ వృషే
శ్వర యానంబున సంచరించుట నభావ్యం బయ్యె నీ యుగ్రవే
ళ రమింపంగ నిషిద్ధకర్మ మగు నేలా ధర్మమున్ వీడఁగన్?

### 3-462-మత్తేభ విక్రీడితము

అరవిందానన! వీఁడె నీ మఱఁది లీలాటోపరుద్రక్షమా
చరఝంఝానిలధూతపాంసుపటలచ్ఛన్నుండు ధూమ్రైకదు
ర్భరవిద్యోతితకీర్ణభీషణజటాబద్ధుండు భస్మావలి
ప్తరచిస్ఫారసువర్ణవర్ణుఁ డగుచున్ భాసిల్లు నత్యుగ్రుఁ డై.

### 3-463-కంద పద్యము

అనల సుధాకర రవి లో
చనముల వికసింపఁ జేసి సమధికరోషం
బునఁ జూచుచున్నవాఁ డదె
వనితా! బంధుత్వ మరయ వలవదు సుమ్మీ.

### 3-464-కంద పద్యము

అతనికిఁ దలపోయ హితా
హితులును సమ్మాన్యులును విహీనులు నతిగ

ర్హితులును లే రీశుఁడు సమ
మతియును నిఖిలైకభూతమయుఁ డై యుండన్.

3-465-కంద పద్యము

కావున, మద్భావిత భవ
ద్దేవరుఁ డని తరుణి! నీ మదిం జూడకుమా
దేవాదిదేవుఁ డ్రిజగ
త్పావను నిఖిలైకనేత భగవంతు హరున్.

3-466-వచనము

ఏమును సత్పురుషులైన విజ్ఞానవంతులును భుక్తభోగంబై దురతోన్యస్తం బైన పుష్పమాలికయునుం బోలె నమ్మహాత్ముని చరణారవింద వందనాభిలాషిణి యైన యవిద్యాదేవి ననుసరించి వర్తింతు; మదియునుంగాక.

3-467-సీస పద్యము

ఎవ్వని కరుణ బ్రహ్మేంద్రాది దిక్పాల;
వరు లాత్మపద వైభవములఁ దనరి
రెవ్వని యాజ్ఞ వహించి వర్తించును;
విశ్వనేత్రి యగు నవిద్య యెపుడు
నెవ్వని మహిమంబు లిట్టివట్టివి యని;
తర్కింప లేవు వేదంబు లయిన
నెవ్వని సేవింతు రెల్ల వారును సమా;
నాధికరహితుఁ డై యలరు నెవ్వఁ

3-467.1-తేటగీతి

డట్టి దేవునిఁద్రిపురసంహారకరుని
నస్థిమాలాధరుండు బిక్షాశనుండు
భూతిలిప్తాంగుఁ డుగ్రపరేతభూమి
వాసుఁ డని హాస్య మొనరించు వారు మఱియు.

3-468-కంద పద్యము

ధర శునకభోగ్యమును నిహ
పరదూరము నైన తనువు పాథేయముగా
నెఱి నమ్మి వస్త్ర మాల్యా
భరణంబు లలంకరించు పామర జనులన్

3-469-కంద పద్యము

ఘన నిర్భాగ్యులుగా మదిఁ
గను" మని యీరీతిఁ బ్రియకుఁ గశ్యపుఁ డెఱిగిం
చిన దితి గ్రమ్మఱఁ బలికెను
మనసిజసాయకవిభిన్నమానస యగుచున్.

## 3-24-దితి గర్భంబు ధరించుట

3-470-కంద పద్యము

మునుకొని లజ్జావనత వ
దన యై ప్రాణేశు కొంగుఁ దాలిమి దూలం

బెనఁగొనియె వారకామిని
యనువున వినిషిద్ధకర్మ మందభిముఖి యై.

3-471-వచనము

ఇట్లు సేసిన భార్యా నిర్బంధంబునకుం దొలంగ నేరక, యీశ్వరునకు నమస్కారం బొనరించి యేకాంతంబున నిజకాంతాసంగమంబు దీర్చి సంగమానంతరంబున వార్చి స్నాతుం డై ప్రాణాయామం బొనర్చి విరజంబును సనాతనంబును నైన బ్రహ్మగాయత్రి జపియించె నంత.

3-472-కంద పద్యము

దితియును నిషిద్ధకర్మ
స్థితి కై మదిలోన సిగ్గు చిట్టాడఁగ నా
నతవదన యగుచు నా పశు
పతివలని భయంబు గల్గి పరమప్రీతిన్.

3-473-వచనము

కశ్యపు గనుంగొని యిట్లనియె "సమస్తభూతపతి యైన పరమేశ్వరుండు నా చేసిన యపరాధంబు సహించి మద్గర్భ పరిపాలనంబు సేయుంగాక; రుద్రుండును, మహాత్ముండును, స్వయంప్రకాశుండును, నలఘ్యుండును, సకామజన ఫలప్రాపకుండును, దుష్టశిక్షకుండును, బరమాత్ముండును, జగదంతర్యామియు, నిర్గుణుడును, నిష్కాముండును, భక్తసులభుండును, భగవంతుండును నగు నప్పరమేశ్వరునకు నమస్కరించెద; మఱియు, షడ్గుణైశ్వర్య సంపన్నుండును, జగద్భర్తయు, మహానుగ్రహాశీలుండును,

నిర్దయాపరిపాల్యవధూ రక్షకుండును, సతీదేవిపతియు నైన యా పరమేశ్వరుండు నన్ను రక్షించుగాత" మని సన్నుతించి.

3-474-కంద పద్యము

అర్భకులు లేని దగుటను
గర్భము నిజనాథువలనఁ గమలానన కా
విర్భూత మైనఁ గర్మవి
నిర్భరపరితోష మాత్మ నెలకొని యుండెన్.

3-475-వచనము

అంతఁ గశ్యపుండు దత్కాల సముచిత సంధ్యావందనంబులు దీర్చి.

3-476-కంద పద్యము

ఆ చెలికి గర్భచిహ్నము
లేచినఁ బరితోషమాత్మ నేపారగ మా
రీచుండు నిజతలోదరిఁ
జూచి యకర్మమున కాత్మ స్రుక్కుచుఁ బలికెన్.

3-477-మత్తేభ విక్రీడితము

" సతి నీ వేగతి నిందకోడక మనోజాతేక్షు కోదండ ని
ర్గత నారాచపరంపరాహత వికీర్ణస్వాంతు వై పాపసం
గతి లజ్జాభయ ధర్మముల్ విడిచి దుష్కాలంబు నందే రమిం
చితి బల్మిన్ వెలయాలి కైవడిని దుశ్శీలక్రియాలోలతన్.

3-478-వచనము

అట్లగుటం జేసి.

3-479-కంద పద్యము

సతి విను భూతగణప్రే
రితులై రుద్రానుచరులు పృథుశక్తిసమ
న్వితు లుగ్రకర్ము లతిశౌ
ర్యతములు భద్రానుభద్రులను నామములన్

3-480-కంద పద్యము

పరఁగిన దర్పోద్ధతు లి
ద్ధరు గొడుకులు నీకుఁ బుట్టి ధరణికి ప్రేఁగై
నిరతము బుధజనపీడా
పరులై వర్తింతు రాత్మ బలగర్వమునన్.

3-481-తేటగీతి

అట్టి దుష్కర్ములకును మహాత్ము లలిగి
విశ్వవిదుఁ డైన హరికిని విన్నవింప
నతఁడు కోపించి హరి కులిశాయుధమున
గిరుల నఱకినగతి వారిఁ ధరణి గూల్చు."

3-482-కంద పద్యము

అని కశ్యపుఁ డెఱిఁగించిన
విని దితి భయ మంది చాల విహ్వలమతి యై

తన హృదయేశు ముఖాబ్జముఁ
గనుగొని యిట్లనియె విగతకౌతుక యగుచున్.

3-483-చంపకమాల

" ధర సుజనాపరాధు లగు తామసచిత్తుల కెందు నాయువున్
సిరియు నశించిపోవు మృతి సేకుఱు శత్రులచేత నింత యౌ
నరయఁగ నిక్కువంబు భవదాత్మజు లార్యుల కెగ్గు సేసినం
గరుణను వారు వారి మదిఁ గైకొని కావ ననుగ్రహింపరే."

3-484-చంపకమాల

అనవుడుఁ గశ్యపుండు గమలానన కిట్లను " నింతి! నీవు చే
సిన విపరీతకర్మమునఁ జేకుఱె నిట్టి యవస్థ దీనికిన్
మనమునఁ దాప మొందకుము మాధవుపాదసరోజయుగ్మచిం
తనమునఁ జేసియున్ నను ముదంబునఁ గొల్చుట జేసియుం దగన్.

3-485-తేటగీతి

రమణి! నా సుతు లందు హిరణ్యకశిపు
వలన నుదయించువారి లోపల ముకుంద
పదసరోజాత విన్యస్తభావుఁడైన
తనయుఁ డుదయింపగలఁ డతిధార్మికుండు.

3-486-వచనము

మఱియును.

3-487-కంద పద్యము

ఘనపుణ్యుఁడు నన్వయపా
వనుఁ డగు నప్పుణ్యతముని వరకీర్తిలతల్
వనజభవాండోదర మె
ల్లను నిండఁగ బర్వు బుధలలాముం డగుటన్.

3-488-తేటగీతి

వామలోచన! వినుము, దుర్వర్ణహేమ
మగ్నిపుటమునఁ బరిశుద్ధమై వెలుంగు
నట్లు దుష్టాత్మసంభవుఁ డయ్యు వంశ
పావనుం డగు హరిపాదభక్తుఁ డగుట.

3-489-తేటగీతి

అంచి తాష్టాంగయోగక్రియాకలాపు
లైన యోగీశ్వరులు నమ్మహానుభావు
నతులశీలస్వభావవిజ్ఞానసరణిఁ
దాముఁ జరియింప నాత్మలఁ దలతు రెపుడు.

3-490-ఉత్పలమాల

ఆ మహితాత్మకుండు సుగుణాంబుధి భాగవతోత్తముండు ల
క్ష్మీమహిళాధినాథుఁ దులసీదళదాముఁ బరేశు నాత్మహృ
త్తామరసంబు నందుఁ బ్రమదంబున నిల్పి తదన్యవస్తువుం
దా మదిలో హసించు హరిదాస్యవిహారవినిశ్చితాత్ముఁడై.

3-491-వచనము

అట్టి నీ పౌత్రుండు.

3-492-సీస పద్యము

మహిత దేహాద్యభిమానంబు దిగనాడి;
 చిరతరాలంపటశీలుఁ డగుచుఁ
బరసమృద్ధికి నాత్మఁ బరితోష మందుచుఁ;
 బర దుఃఖమునకుఁ దాపమును బొందు
నీ విశ్వ మంతయు నే విభుమయ మని;
 యెవ్వని కరుణచే నెఱుఁగ నయ్యె
నట్టి యీశ్వరునిఁ దా నాత్మసాక్షిగ మోద;
 ముడరంగఁ జూచు ననన్యదృష్టి

3-492.1-తేటగీతి

నతి నిదాఘోగ్ర సమయంబు నందు నిఖిల
జంతు సంతాప మడఁగించు చంద్రుమాడ్కి
నఖిల జగముల దుఃఖంబు లపనయించు
రూఢి నాతఁ డజాతవిరోధి యగుచు.

3-493-వచనము

మఱియు, హరిధ్యాననిష్టాగరిష్ఠుం డగు నమ్మహాభాగవతాగ్రగణ్యుండు.

3-494-కంద పద్యము

విమలాంతరంగ బహిరం
గములను స్వేచ్ఛానురూపకలితుం డగు నా

కమలాధీశ్వరు కుండల
రమణీయ ముఖంబుఁ జూచుఁ బ్రమదం బెసఁగన్.

3-495-తేటగీతి

మఱియు నీ విశ్వ మీ హరిమయము గాఁగ
మనములోపలఁ దలచు నమ్మునిభుండు
మను మహాత్ములలోన నీ మనుమఁ డధికుఁ
డనఁగ నుతికెక్కు" నంచుఁ గశ్యపుఁడు పలుక

3-496-కంద పద్యము

విని తన తనయులు మధుసూ
దనుచే హతు లగుదు రనుచుఁ దన మనుమఁడు స
జ్జననుత భాగవతుం డగు
ననుచు మదిం జాల దుఃఖ హర్షము లొదవన్.

3-497-వచనము

ఉండు నంత; నా దితియుఁ గశ్యపవీర్యసంభృతం బైన గర్భంబు దుర్భర తేజోభిరామంబును నన్య తేజోవిరామంబును దినదిన ప్రవర్ధమానంబును నై నివ్వటిల్ల నిజోదరస్థితు లైన కుమారులమరదమను లై వర్తింపఁ గలరని చింతించుచు గర్భంబు శతవర్షంబులు ధరియించి యున్న యనంతరంబ.

## 3-25-దితిగర్భప్రకారంబుజెప్పుట

3-498-ఉత్పలమాల

ఆ దితిగర్భ మందు రుచిరాకృతితో నొకతేజ మన్యతే
జోదము లీల వెల్వడి వసుంధరయున్ గగనంబు నిండి సం
ఛాదిత పద్మబాంధవ నిశాకర దీప్తులు గల్గి సూచికా
భేద మహోగ్ర సంతమసభీషణ మైన భయాకులాత్ము లై.

3-499-చంపకమాల

అమరగణంబు లెల్ల గమలాసను పాలికి నేఁగి తత్పదా
బ్జములకు మ్రొక్కి యంజలులు ఫాలములం గదియంగఁ జేర్చి చి
త్తముల భయంబు సంభ్రమముఁ దార్కొన నిట్లని విన్నవించి రో
యమరకులాగ్రగణ్య! దురితార్ణవతారణ! సృష్టికారణా!

3-500-ఉత్పలమాల

నీవు చరాచరప్రచయనేతవు, ధాతవు, సర్వలోకపా
లావళిమౌళిభూషణుఁడ, వంచితమూర్తివి, దేవదేవ! వా
ణీవర! యీ యజాండమున నీవు నెఱుంగని యర్థ మున్నదే?
భావమునం దలంపుము విపన్నుల మమ్ము భవత్ప్రపన్నులన్.

3-501-వచనము

దేవా కార్యరూపం బగు చేతనాచేతనాత్మక ప్రపంచంబునకుఁ గారణుండ వైన నీచేత సమస్త భువనంబులును సృజియింపఁ బడియె; నీవు సర్వభూతాత్మ భావవిదుండవు, లోకనాథ శిఖామణిభూతుండవు, విజ్ఞానవీర్యుండ, వవిద్యం జేసి యిట్టి స్రష్టరూపంబు నొందితి; గృహీత రజోగుణుండవు నీ యందుఁ బ్రపంచంబు లీనంబై యుండు; సుపక్వ యోగంబు నొంది నిష్కాములై ధ్యానంబున నిన్నరయుచు నిర్జిత శ్వాసేంద్రియాత్ము లై భవత్ప్రసాదంబు వడసిన వారలకుం

బరాభవంబు లెక్కడివి; ఎవ్వని వాగ్జాలంబుచేఁ బాశబద్ధంబులైన పశువుల చందంబున నిఖిల జీవులు వర్తింతు; రట్టి నీకు నమస్కరించెదము; అహోరాత్ర విభాగాభావంబున లుప్తకర్మంబు లగు లోకంబులకు సేమంబు గావింపుము; శరణాగతులమైన మమ్ము నతిశయ కరుణారసపరిపూర్ణంబు లగు కటాక్షంబుల నీక్షించి రక్షింపుము; కశ్యప వీర్యంబు దితిగర్భంబున నుండి సకల దిగ్వలయంబు నాక్రమించి దారువందువహ్ని చందంబున లీనంబై ప్రవృద్ధం బగుచున్నది;" అని విన్నవించిన బృందారక సందోహంబులకు నానందంబు గందళింప నరవిందనందనుం డిట్లనియె.

## 3-26-సనకాదులవైకుంఠగమనంబు

3-502-కంద పద్యము

" గీర్వాణులార! యుష్మ
త్పూర్వజు లాత్మీయసుతులు పుణ్యులు విచర
న్నిర్వాణులు సనకాదులు
సర్వంకషశేముషీవిచక్షణు లెందున్.

3-503-కంద పద్యము

వారలు నిస్పృహు లగుచు న
వారణ భువనంబు లెల్ల వడిఁ గ్రుమ్మరుచున్
ధీరు లొకనాఁడు భక్తిన్
శ్రీరమణీశ్వరపదాబ్జసేవానిరతిన్.

3-504-చంపకమాల

చనిచని కాంచిరంత బుధసత్తము లంచిత నిత్య దివ్యశో
భన విభవాభిరామముఁ బ్రపన్నజనస్తవనీయ నామమున్
జనన విరామమున్ సుజన సన్నుత భూమము భక్తలోకపా
లన గుణధామముం బురలలామముఁ జారువికుంఠధామమున్.

3-505-ఉత్పలమాల

ఆ మహనీయ పట్టణము నందు వసించెడు వార లాత్మఁ ని
ష్కామఫలంబె సత్ఫలముగాఁ దలపోసి ముముక్షుధర్ము లై
శ్రీమహిళాధిపాంఘ్రిసరసీరుహ పూజ లొనర్చుచున్ మహో
ద్దామఁ దదీయ రూపములఁ దాల్చి సుఖించుచు నుందు రెప్పుడున్.

3-506-చంపకమాల

విగతరజస్తమోగుణుఁడు విశ్రుతచారుయశుండు శుద్ధస
త్త్వగుణుఁడజుండనాదిభగవంతుఁడనంతుఁడనంతశక్తియున్
నిగమచయాంతవేద్యుఁడు వినిశ్చలనిర్మలధర్మమూర్తియు
న్నగు హరిపేరఁబెంపెసఁగునన్నగరోపవనమ్ములిమ్ములన్

3-507-వచనము

మఱియుఁ గైవల్యంబు మూర్తీభవించిన తెఱంగునం బొలుపారుచు "నైశ్శ్రేయస" నామంబున నభిరామంబై సతతంబును సకలర్తుధర్మంబులు గలిగి యర్థిజనంబుల మనంబుల ఘనంబులుగ నీరికలెత్తిన కోరికలు సారికలుగొన నొసంగుచు నితరతరు రహితంబులును గామదోహన సహితంబులును బుష్పఫల భరితంబులును నై తనర్చు సంతాన వనసంతానంబులును, సముచిత సౌభాగ్య సంపదభిశోభిత వాసంతికా కుసుమ విసర పరిమళ మిళిత గళిత మకరంద

లలితామోద ముదిత హృదయు లై యఖండ తేజోనిధి యగు పుండరీకాక్షు
చరిత్రంబు లుగ్గడింపలేక ఖండితజ్ఞాను లయ్యును నిరతిశయ
విషయసుఖానుభవ కారణం బగుట నిందిరాసుందరీరమణ చరణసేవా
విరమణకారియై యున్న దని తలంచి; తద్గంధ ప్రాపక గంధవహునిం దిరస్కరించి
నారాయణ భజనపరాయణు లై చరియించు సుందరీ యుక్తు లైన
వైమానికులును, వైమానిక మానసోత్సేకంబుగం బారావత హంస సారస శుక
పిక చాతక తిత్తిరి మయూర రథాంగముఖ్య విహంగ కోలాహల విరామంబుగా
నరవిందనయన కథాగానంబు లనూనంబుగా మొరయ మదవదిందిందిర
సందోహ కలిత పుష్పవల్లీమతల్లికలును, నకుంఠిత చరిత్రుం డైన
వికుంఠనిలయుని కంఠంబునం దేజరిల్లు విలసిత తులసీ దామంబుం గనుంగొని
యీ తులసీదామంబు హరి మంగళగళ విలగ్నంబై యుండు సౌభాగ్యంబు
వడయుట కేమి తపంబు గావించెనో యని బహూకరించు చందంబున నొప్పు
చందన మందార కుందారవింద పున్నాగ నాగ వకుళాశోక కురవకోత్పల
పారిజాతాది ప్రసూన మంజరులును, మంజరీ పుంజ రంజిత నికుంజంబుల
యందు నుత్తుంగ పీనకుచభారాకంపిత మధ్యంబులుఁ గటితట కనకఘటిత
మేఖలాకలాప నినదోపలాలిత నీల దుకూల శోభిత పృథు నితంబ భరాలసయాన
హసిత కలహంస మయూర గమనంబులు నసమశర కుసుమశర విలసితంబు
నపహసించు నయనకమలంబులుం గలిగిన సుందరీ సందోహంబులం దగిలి
కందర్పకేళీ విహారంబుల నానందంబు నొందక ముకుంద చరణారవింద
సేవాపరిలబ్ధ మరకత వైడూర్య హేమమయ విమానారూఢు లై హరిదాసులు
విహరించు పుణ్యప్రదేశంబులును, నిందిరాసుందరి త్రైలోక్య సౌందర్యఖని యైన
మనోహరమూర్తి ధరియించి రమణీయ రణిత మణినూపుర చరణారవింద యై

నిజహృదయేశ్వరుం డైన సర్వేశ్వరుని మందిరంబునం జాంచల్య దోషరాహిత్యంబుగ వర్తిపం గరకమల భ్రమణీకృత లీలాంబుజాత యై తన నీడ కాంచనస్ఫటికమయ కుడ్యప్రదేశంబులం బ్రతిఫలింప శ్రీనికేతనుని నికేతన సమ్మార్జన కైంకర్యంబ పరమధర్మం బని తెలుపు చందంబునం జూపట్టుచు నిజవనంబునం దనరు సౌరభాభిరామంబు లగు తులసీదళదామంబుల నాత్మనాయకుని చరణారవిందంబుల నర్పించుచు నొసలి మృగమదపు టసలున మసలుకొని తుంపెసలాడు కురులును, లలిత తిలప్రసూన రుచిరాభ నానం దనరు మోముఁదామర విమల సలిలంబులఁ బ్రతిబింబింప నిజమనోనాయకుచేతం జుంబితం బగుటగాఁ దలంచి లజ్జావనతవదన యై యుండంజేయు ప్రవాళ లతికాకులంబు లైన కూలంబులు గల నడబావులును గలిగి పుణ్యంబునకు శరణ్యంబును, ధర్మంబునకు నిర్మలస్థానంబును, సుకృతమూలంబునకు నాలవాలంబును నయి పొలుపొందుచుండు.

3-508-చంపకమాల

హరివిముఖాత్ము లన్యవిషయాదృత చిత్తులుఁ బాపకర్ములున్
నిరయనిపాత హేతువును నింద్యచరిత్రము నైన దుష్కథా
నిరతిఁ జరించువారలును నేరరు పొందఁగ నిందిరామనో
హర చరణారవింద భజనాత్మకు లుండెడు గొంది నారయన్.

3-509-వచనము

వెండియు.

3-510-చంపకమాల

హరిఁ బరమేశుఁ గేశవు ననంతు భజింపఁగ ధర్మతత్త్వధీ
పరిణతసాధనం బగు స్వభావముఁ దాల్చిన యట్టి మర్త్యులా
సరసిజనేత్రు మాయను భృశంబుగ మోహితు లై తదంఘ్రిపం
కరుహములర్థిమైఁ గొలువఁ గానమిఁ బొందరు తత్పదంబునన్.

3-511-చంపకమాల

మఱియు సరోరుహోదరుని మంగళదివ్యకథానులాప ని
ర్భర పరితోష బాష్ప కణ బంధుర చారు కపోల గద్గద
స్వర పులకాంకితాంగు లగువారలు నిస్పృహచిత్తు లత్యహం
కరణవిదూరు లుందురు సుకర్ములు యుండెడి పుణ్యభూములన్.

3-512-వచనము

అందు.

3-513-మత్తేభ విక్రీడితము

వరవైకుంఠము సారసాకరము దివ్యస్వర్ణశాలాంక గో
పుర హర్మ్యావృతమైన తద్భవన మంభోజంబు తన్మందిరాం
తర విభ్రాజిత భోగి గర్ణిక తదుద్యద్భోగ పర్యంకమం
దిరవొందన్ వసియించు మాధవుఁడు దా నేపారు భృంగాకృతిన్

3-514-వచనము

అంత.

3-515-మత్తేభ విక్రీడితము

హరిచేఁ బాలితమైన కాంచన విమానారూఢ మైనట్టి స
త్పురుషానీకముచేఁ దనర్చి విభవాపూర్ణప్రభావోన్నతిం
గర మొప్పారు తదీయ ధామము జగత్కల్యాణమూర్తుల్ మునీ
శ్వరు లర్థిన్ నిజయోగశక్తిఁ బరితుష్టస్వాంతులై చెచ్చెరన్.

3-516-వచనము

డాయంజని.

## 3-27-సనకాదుల శాపంబు

3-517-చంపకమాల

మరకతరత్న తోరణ సమంచిత కుడ్య కవాట గేహాళీ
విరచిత షట్సుకక్ష్య లరవిందదళాక్ష విలోకనోత్స వా
దరమతి నన్యముం గనక దాఁటి యనంతరకక్ష్య యందు ని
ద్ధఱను దదీయపాలుర నుదార సమాన వయో విశేషులన్.

3-518-సీస పద్యము

కాంచన నవరత్న కటకాంగుళీయక;
హార కేయూర మంజీర ధరులఁ
గమనీయ సౌరభాగత మత్త మధుకర;
కలిత సద్వనమాలికా విరాజి
తోరస్థ్సలుల గదాయుతులను ఘనచతు;
ర్భావుల నున్నతోత్సాహమతుల

నారూఢ రోషానలారుణితాక్షుల;
 భ్రూలతా కౌటిల్య ఫాలతలుల

3-518.1-తేటగీతి

వేత్రదండాభిరాముల వెలయు నమ్మ
కుంద శుద్ధాంత మందిరాళింద భూమి
నున్న యిద్దఱన్ సనకాది యోగివరులు
సూచుచును వృద్ధు లయ్యు నాసుభగమతులు.

3-519-కంద పద్యము

ధీరతఁ బంచాబ్దముల కు
మారకు లై కానఁబడుచు మనమున శంకం
గూరక చతురాత్మకు లని
వారిత గమనముల డాయవచ్చిన నెదురన్.

3-520-కంద పద్యము

శ్రీలలనేశ్వరదర్శన
లాలసు లై యేఁగు బుధలలాముల నతి దు
శ్శీలతఁ దద్వచనప్రతి
కూలమతిం బోవకుండఁ గుటిలాత్మకు లై.

3-521-కంద పద్యము

వారించిన వారలు బృం
దారకు లీక్షించుచుండ దారుణ పటు రో

షారుణితాంబకులై రొద
వారించుచు వారు నచటివారును వినగన్.

3-522-వచనము

ఇట్లనిరి.

3-523-చంపకమాల

పరము ననంతు భక్తపరిపాలు సుహృత్తము నిష్టు నీశ్వరే
శ్వరు భజియింపఁ గోరి యనివారణ నిం దరుదేర నిచ్చలున్
భరితముదాత్ములై కొలువఁ బాయక తద్భజనాంతరాయ త
త్పరమతి మాకు నిప్పు డరిపడ్డ దురాత్ముల నేఁడు గంటిరే.

3-524-వచనము

అని మఱియు; సనకసనందనాదులు జయవిజయులం జూచి యిట్లనిరి "మీ మనంబుల స్వామి హితార్థం బై నిష్కపటవర్తనుల మైన మాబోఁటులఁ గుహకవృత్తి గల యితర జనంబులు భగవత్సదనంబుఁ బ్రవేశింతురో యను శంకం జేసి కొందఱం బ్రవేశింపఁజేయుటయుఁ; గొందఱ వారించుటయు; దౌవారిక స్వభావం బని వారింప దలఁచితిరేని బ్రశాంత దివ్యమంగళవిగ్రహుండును, గతవిగ్రహుండును, భగవంతుడును, విశ్వగర్భుండును నైన యీశ్వరుండు ప్రాప్యంబును, బ్రాపకంబును, బ్రాప్తియు నను భేదశూన్యుండు గావున మహాకాశంబు నందు ఘటపటాద్యాకాశంబులు వేఱులేక యేకంబై తోఁచు చందంబున విద్వాంసు లగు వా రమ్మహాత్ముని సకలాత్మ భేదరహితునింగాఁ బొడ గందురు; అదియునుంగాక లోకంబు నందు రాజులు సాపరాధులైన కింకర జనంబుల నాజ్ఞాపించు చందంబున నీశ్వరుండు దండించునో యను

భయంబునం జేసి వారించితి మని తలంచితిరేని భూసురవేషధారుల మైన మాకును వైకుంఠనాయకుండైన సర్వేశ్వరునకును భేదంబు లేకుండుటం జేసి శంకసేయం బనిలేదు; ఇట్లగుట యెఱింగి మందబుద్ధులరై మమ్ము వారించిన యనుచితకర్ములగు మీరలు మదీయశాపార్హు లగుదురు; గావున భూలోకంబునం గామ క్రోధ లోభంబులను శత్రువులు బాధింపం బుట్టుం" డని పలికిన.

3-525-కంద పద్యము

వారలు విని తమ మనములు
భూరిస్ఫుట చండకాండపూగంబులచే
వారింపరాని భూసుర
దారుణవాక్యముల కులికి తల్లడపడుచున్.

3-526-కంద పద్యము

పరితాపంబును బొందుచు
సరసిజలోచనుని భటులు సనకాది మునీ
శ్వరుల పదాంబుజములకుం
గర మర్థిన్ మ్రొక్కి నిటలఘటితాంజలు లై.

3-527-వచనము

ఇట్లనిరి.

3-528-మత్తేభ విక్రీడితము

వరయోగీశ్వరులార! మమ్ము మది నొవ్వన్ మీర లిట్లన్న ని
ష్ఠుర వాక్యంబుల కింక మా మనములన్ శోకింపగా రాదు స
త్పురుషశ్రేణిఁ బరాభవించిన వృథాభూతాత్ములన్ మమ్ము మా
దురితం బింతకుఁ దెచ్చె మీఁద శుభముం దూకొందు మే మారయన్.

3-529-వచనము

అది యెట్లంటిరేని.

3-530-ఉత్పలమాల

మీ కరుణావలోకన సమేతులఁగా మముఁ జేయుఁ జిత్తముల్
దూకొనెనేని మాచనువుఁ ద్రోయక యీఁదగుఁ గామ లోభముల్
కైకొని పుట్టు చోట నవకంజదళాక్షుని నామవిస్మృతిం
బైకొనకుండ దాననె శుభం బగు మీఁది మదీయ జన్మముల్.

## 3-28-శ్రీహరిదర్శనంబు

3-531-వచనము

అను సమయంబున.

3-532-మత్తేభ విక్రీడితము

హరి సర్వేశుఁ డనంతుఁ డా కలకలం బాలించి పద్మాలయా
సరసాలాపవినోద సౌఖ్యరచనల్ చాలించి శుద్ధాంత మం
దిర మాణిక్య సుగేహళుల్ గడచి యేతెంచెం బ్రపన్నార్తి సం
హరుఁడై నిత్యవిభూతిశోభనకరుండై మానితాకారుఁడై.

3-533-వచనము

మఱియును.

3-534-చంపకమాల

శరనిధికన్యకామణియు సంభ్రమ మొప్పఁగఁ దోడరా మనో
హర నిజ లీలమైఁ బరమహంస మునీశ్వర వంద్య పాదపం
కరుహములన్ వినూత్న మణికాంచన నూపుర మంజు ఘోషముల్
వరుసఁ జెలంగ నార్యజనవంద్యుఁడు యోగిజనైకసేవ్యుఁడై.

3-535-చంపకమాల

కర మణి హేమ కంకణ నికాయ ఝణంకృతు లుల్లసిల్ల న
చ్చర లిడు హంసపక్ష సితచామర గంధవహోచ్చలత్సుధా
కర రుచి రాతపత్ర సుభగప్రవిలంబిత హారవల్లరీ
సరస గళత్తుషార కణజాల విరాజిత మంగళాంగుడై.

3-536-వచనము

మఱియును.

3-537-సీస పద్యము

నిఖిల మునీంద్ర వర్ణిత సస్మితప్రస;
న్నాననాంబుజముచే నలరు వాఁడు
విశ్రుత స్నేహార్ద్ర వీక్షణ నిజ భక్త;
జన గుహాశయుఁ డనఁ దనరు వాఁడు
మానిత శ్యామాయమాన వక్షమున నం;

చిత వైజయంతి రాజిల్లు వాఁడు
నతజనావన కృపామృత తరంగితములై;
భాసిల్లు లోచనాబ్జముల వాఁడు

3-537.1-తేటగీతి

నఖిల యోగీంద్రజన సేవ్యుఁ డైన వాఁడు
సాధుజనముల రక్షింపఁ జాలు వాడు
భువన చూడా విభూషయై భూరిమహిమ
మించు వైకుంఠపురము భూషించు వాఁడు.

3-538-సీస పద్యము

కటి విరాజిత పీతకౌశేయశాటితోఁ;
వితత కాంచీగుణ ద్యుతి నటింప
నాలంబి కంఠ హారావళి ప్రభలతోఁ;
గౌస్తుభరోచులుగ్రందుకొనఁగ
నిజకాంతి జిత తటిద్ధ్వజ కర్ణ కుండల;
రుచులు గండద్యుతుల్ ప్రోదిసేయ
మహనీయ నవరత్నమయ కిరీటప్రభా;
నిచయంబు దిక్కుల నిండఁ బర్వ

3-538.1-తేటగీతి

వైనతేయాంస విన్యస్త వామహస్త
కలిత కేయూర వలయ కంకణము లొప్ప

నన్యకరతల భ్రమణీకృతానుమోద
సుందరాకార లీలారవింద మమర.

3-539-వచనము

మఱియుఁ; జరణారవింద మంజు కింజల్కపుంజప్రభా రంజిత తులసీ మరంద బంధుర గంధానుబంధ సుగంధి గంధవహాస్వాద కలిత సేవాతత్పరులై చనుదెంచు యోగీంద్రులకు మానసానందకారియు బహిఃకరణాంతఃకరణ పరితోషప్రకీర్ణ రోమాంచ రుచిదాయకంబును ప్రభాపూర్తియుక్తంబును నగు మూర్తితోడ నిజ సౌందర్య వర కళావినిర్జిత శ్రీరమణీ సౌందర్య భాసమానుం డగుచుఁ; బాదచారి యై; యఖిల విశ్వగురుం డైన సర్వేశ్వరుండు వేంచేసె నప్పుడు.

3-540-చంపకమాల

స్థిర శుభలీల నట్లరుగుదెంచిన యవ్విభు విద్రుమారుణా
ధర నవపల్లవస్ఫురదుదంచిత కుంద రుచిస్మితైక సుం
దర వదనారవిందము ముదంబునఁ దప్పక చూచి యమ్మునీ
శ్వరులు నిజాత్మలం దనివిసొలక వెండియుఁ జూచి రిమ్ములన్.

3-541-చంపకమాల

సునిశిత భక్తిఁ దన్ముఖముఁ జూచిన చూడ్కులు ద్రిప్పలేకయుం
గనుఁగొని రెట్టకేలకు నకల్మష భక్త విధూత ఖేదముల్
మునిజన చిత్తమోదములు ముక్తినివాస కవాట భేదముల్
వినుత వి నూత్న నూపురిత వేదము లమ్మహనీయు పాదముల్.

3-542-చంపకమాల

కని నఖ పద్మరాగమణి కాంతివిభాసిత పాదపద్మము
ల్మనముల యందుఁ గీల్కొలిపి లబ్ధమనోరథ యుక్తు లై పునః
పునరభివందనంబులు విభూతి దలిర్ప నొనర్చి యోగమా
ర్గనిరత చిత్తులున్ వెదకి కానఁగలేని మహానుభావునిన్.

3-543-కంద పద్యము

మానసమున నిలిపిరి త
ద్ధ్యానాస్పదుఁడైన వానిఁ దత్త్వజ్ఞులకుం
గాన నగువాని భక్తజ
నానందకరైక మూర్తి నలరిన వానిన్.

## 3-29-సనకాదుల హరి స్తుతి

3-544-వచనము

మఱియుం; జక్షురింద్రియగ్రాహ్యం బగు దివ్యమంగళవిగ్రహంబు ధరియించి యున్న పురుషోత్తము నుదాత్తతేజోనిధిం జూచి సనకాదు లిట్లని స్తుతియించిరి.

3-545-చంపకమాల

" వనజదళాక్ష! భక్తజనవత్సల! దేవ! భవత్సుతుండు మ
జ్జనకుఁడు నైన పంకరుహజాతుడు మాకు రహస్య మొప్పఁ జె
ప్పిన భవదీయ మంగళగభీరపరిగ్రహ విగ్రహంబు మే
మనయముఁ జూడఁ గంటిమి కృతార్థులమై తగ మంటి మీశ్వరా!

3-546-సీస పద్యము

దేవ! దుర్జనులకు భావింప హృదయ సం;
గతుఁడవై యుండియుఁ గానఁబడవు
కడఁగి నీ దివ్యమంగళవిగ్రహంబున;
జేసి సమంచితాశ్రితుల నెల్లఁ
జేఁకొని సంప్రీతచిత్తులఁగాఁజేయు;
దతిశయ కారుణ్యమతిఁ దనర్చి
కమలాక్ష! సర్వలోకప్రజాధిప! భవ;
త్సందర్శనాభిలాషానులాప

3-546.1-తేటగీతి

విదిత దృఢభక్తియోగ ప్రవీణు లగుచు
నర్థిమై వీతరాగు లైనట్టి యోగి
జనమనః పంకజాత నిషణ్ణమూర్తి
వని యెఱుంగుదురయ్య! నిన్నాత్మ విదులు.

3-547-కంద పద్యము

యుక్తిం దలఁప భవద్వ్యతి
రిక్తము లైనట్టి యితర దృఢకర్మంబుల్
ముక్తిదము లయిన నీ పద
భక్తులు తత్కర్మములను బాటింప రిలన్.

3-548-ఉత్పలమాల

కావున గీర్తనీయ గతకల్మష మంగళ తీర్థ కీర్తి సు
శ్రీవిభవప్రశస్త సుచరిత్రుఁడ వైన భవత్పదాబ్జ సే

వా విమలాంతరంగ బుధవర్గ మనర్గళభంగి నన్యమున్
భావమునం దలంచునె కృపాగుణభూషణ! పాపశోషణా!

3-549-చంపకమాల

పరమతపో విధూత భవపాపులమై చరియించు మాకు నేఁ
డరయ భవత్పదాశ్రితుల నల్గి శపించిన భూరి దుష్కృత
స్ఫురణ నసత్పథైక పరిభూతులమై నిజధర్మహానిగా
నిరయము నొందఁగావలసె నేరము వెట్టక మమ్ముఁ గావవే.

3-550-చంపకమాల

కరమనురక్తి షట్పదము గమ్రసుగంధమరందవాంఛచేఁ
దరమిడి శాతకంటకవృతస్ఫుటనవ్యతరప్రసూనమం
జరులను డాయు పోల్కిని భృశంబగు విఘ్నములన్ జయించునీ
చరణసరోజముల్గొలువ సమ్మతి వచ్చితిమయ్య కేశవా!

3-551-చంపకమాల

అలరు భవత్పదాంబుజ యుగార్పితమై పొలుపొందునట్టి యీ
తులసి పవిత్రమైనగతిఁ దోయజనాభ! భవత్కథాసుధా
కలితములైన వాక్కుల నకల్మషయుక్తిని విన్నఁ గర్ణముల్
విలసిత లీలమై భువిఁ బవిత్రములై విలసిల్లు మాధవా!

3-552-చంపకమాల

మహిత యశోవిలాసగుణమండన! సర్వశరణ్య! యింద్రియ
స్పృహులకుఁ గానరాక యతసీ కుసుమద్యుతిఁ నొప్పుచున్న నీ

సహజ శరీర మిప్పుడు భృశంబుగఁ జూచి మదీయ దృక్కు లిం
దహహ కృతార్థతం బొరసె నచ్యుత! మ్రొక్కెద మాదరింపవే."

3-553-కంద పద్యము

అని సనకాదులు దత్పద
వనజములకు మ్రొక్కి భక్తివశమానసులై
వినిపించిన గోవిందుఁడు
మునివరులం జూచి పలికె ముదితాత్ముండై.

## 3-30-బ్రహ్మణ ప్రశంస

3-554-వచనము

" ఈ యిరువురు జయవిజయాభిధానంబులు గల మదీయ ద్వారపాలకులు వీరు మిమ్ముం గైకొనక మదీయాజ్ఞాతిక్రమణు లయి చేసిన యపరాధంబునకుఁ దగిన దండంబు గావించితిరి; అది నాకు నభిమతం బయ్యె; అదియునుం గాక భృత్యు వర్గంబు సేయు నపరాధంబు స్వామిదియ; కాన యీ తప్పునకు మాననీయుండ నైన నన్ను మన్నించి ప్రసన్ను లగుదురు గాక" యని వెండియు నిట్లనియె.

3-555-చంపకమాల

" తనువునఁబుట్టినట్టి బెడిదంబగు కుష్ఠుమహాగదంబుచే
వనరి తదీయచర్మము వివర్ణతనొందినరీతి భృత్యులొ
ప్పనిపనిసేసినన్ విభులు బంధురచారుయశంబుఁబేరుఁబెం
పునుజెడిపోయి దుర్యశముబొందుచునుందురు విష్టపంబులన్

3-556-చంపకమాల

అలవడ నాకు మీవలన నబ్బిన తీర్థ సుకీర్తనీయ స
ల్లలిత వినిర్మలామృత విలాస యశో విభవాభిరామమై
వెలయు వికుంఠనామ మపవిత్ర మనశ్శ్వపచాధమాది లో
కుల చెవి సోఁకఁ దత్క్షణమ కోరి పవిత్రులఁ జేయు వారలన్.

3-557-తేటగీతి

అట్టి నేను దలంప మీ యట్టి సాధు
జనుల కపకార మర్థిఁ జేసిన మదీయ
బాహుసము లైనఁ ద్రుంతు నుత్సాహలీల
నన్న నితరుల మీ మ్రోల నెన్న నేల?

3-558-కంద పద్యము

ధరణీసురోత్తమసేవా
పరిలబ్ధం బయిన యట్టి పాతక నాశం
కర నిఖిలభువన పూత
స్ఫురితాంఘ్రిసరోజ తోయములు గల నన్నున్.

3-559-కంద పద్యము

అలఘుమతి విరక్తునిఁగాఁ
దలఁపక నిజ శుభ కటాక్ష దామక కలితా
ఖిల సంపద్విభవశ్రీ
లలనారత్నం బురస్థలంబును జెందెన్.

3-560-చంపకమాల

క్రతువులు సేయుచో శిఖిముఖంబున వేలుచు నట్టి తద్ఘృత
ప్లుత చరుభక్షణన్ ముదముఁ బొందదు నిస్పృహధర్మమార్గ సం
గతుఁడగు భూసురోత్తము ముఖంబున వేడ్క భుజించు నయ్యవి
స్ర్తుతకబళంబునన్ మనము తృప్తి వహించినరీతి నిచ్చలున్

3-561-సీస పద్యము

సతతంబు నప్రతిహత యోగమాయా వి;
 భూతిచేఁబ్రఖ్యాతిఁ బొందు నేను
నే మహీసురుల సమిద్ధ నిర్మలపాద;
 నలిన రజోవితానములు భక్తి
హాటకనవరత్న కోటీరమునఁ దాల్తు;
 నట్టి నా చరణాంబుజాంబువులను
దవిలి ధరించి సద్యఃపవిత్రాత్ము లై;
 రర్థిఁ జంద్రావతం సాది దేవ

3-561.1-తేటగీతి

చయము లెవ్వాఁడు బ్రాహ్మణజనులు దమకు
నపకృతుల్ సేసిరేని మాఱలుగఁ డతఁడు
విప్రులను నన్నుఁగాఁగ భావించు నతఁడు
ధర్మపద్ధతి నా ప్రియతముఁడు వాఁడు.

3-562-ఉత్పలమాల

గోవితతిన్ ధరాదివిజకోటిని నన్నును దీనవర్గమున్
వావిరి భేదబుద్ధిఁ గనువార లధోగతిఁ బొంద నందు నా
శీవిషరోషవిస్ఫురణజెంది కృతాంత భటుల్ మహోగ్ర గృ
ధ్రావలివోలెఁ జంచువుల నంగము లుద్ధతిఁ జింతు రెప్పుడున్.

3-563-చంపకమాల

ధరణిసురోత్తముల్ బహువిధంబులఁ దమ్ముఁ బరాభవించినన్
దరహసితాస్యులై యతి ముదంబున నిచ్చలుఁ బూజసేయుచున్
సరస వచోవిలాసముల సన్నుతిసేయుచుఁ దండ్రి నాత్మజుల్
కర మనురక్తిఁ బిల్చుగతిఁ గైకొని పిల్చిన వారు నా సముల్.

3-564-కంద పద్యము

వినుఁ డయ్యనఘచరిత్రుల
కనయముఁ బ్రియతముఁడ నగుచు నమ్ముడువోదున్
మును నన్ను భృగువు దన్నినఁ
గనలక పరితోషవృత్తి గైకొంటిఁ గదే.

3-565-సీస పద్యము

పొలుచు నా మానసాంభోజాత భావంబు;
దెలియంగలేక యుద్వృత్తు లగుచుఁ
గడఁగి నా యానతిఁ గడచినఁ దద్దోష;
ఫలము వీరలకు సంప్రాప్త మయ్యె
మునులార! నా చిత్తమున నున్న నీతియు;
నిట్టిద భూమిపైఁ బుట్టి వీర

లచిరకాలమున నా యంతికంబున కోలి;
నరుదెంచునట్లుగా ననుమతింప

3-565.1-తేటగీతి

వలయు" నని యమ్ముకుందుడు వలుకుటయును
విని మనంబున సనకాది మునివరేణ్యు
లమ్మహాత్ముని మృదుల భాషామృతంబుఁ
దవిలి క్రోలియు రోష సందష్టు లగుచు.

3-566-సీస పద్యము

మునివరుల్ తమచిత్తములఁ దృప్తిఁబొందక;
పంకజాతాక్షుఁడు వలికినట్టి
పరిమిత గంభీర బహుళార్థ దురవగా;
హములను విస్ఫుర దమృతతుల్య
మాధుర్య సుగుణ సమన్వితమ్ములు విని;
ర్గత శబ్దదోష నికాయములును
నైన వాక్యములకు నాత్మలఁ బరితోష;
మంది యుల్లముల నెయ్యమున మనిచె

3-566.1-తేటగీతి

నొడయఁ డిప్పుడు నందించియో తలంప
నర్థి నిందించియో మత్కృతైకదండ
మునకు సంకోచ మొందియో యనుచు సంశ
యాత్ము లగుచు వివేకించి యంతలోన.

3-567-కంద పద్యము

నలినాక్షుఁడు దమదెసఁ గృప
గలిగిన భావంబుఁ దెలిసి కౌతుకమొలయం
బులకాంకితాంగులై యు
త్కలికన్ హర్షించి నిటలఘటితాంజలులై.

3-568-కంద పద్యము

భరిత నిజ యోగమాయా
స్ఫురణం దనరారు నతివిభూతియు బలముం
బరమోత్కర్షముఁ గల యీ
శ్వరునకు నిట్లనిరి మునులు సద్వినయమునన్.

3-569-తేటగీతి

" పొలుపు దీపింప నిత్యవిభూతి నాయ
కుడవు భగవంతుడవు ననఘుడవు నీవు
మత్కృతంబిప్డు నీకభిమత మటంటి
వీశ భవదీయ చారిత్ర మెఱుఁగఁ దరమె.

3-570-ఉత్పలమాల

దేవగణాళి కెల్లఁ బరదేవతలై తనరారు నట్టి వి
ప్రావలి కాత్మనాయకుఁడపై పెనుపొందిన నీకు నీ ధరా
దేవత లెల్ల నెన్న నధిదేవత లైరఁట యెట్టి చోద్యమో?
దేవ! సమస్తపావన! సుధీజనతావన! విశ్వభావనా!

3-571-చంపకమాల

కమలదళాక్ష! నీవలన గల్గిన ధర్మము దావకావతా
రముల సురక్షితం బగుఁ దిరం బగు నీశ్వర! నిర్వికారత
త్వమునఁ దనర్చు నిన్నరయఁ దత్పలరూపముఁ దత్ప్రధానగో
ప్యము నని పల్కుచుందురు కృపామయలోచన! పాపమోచనా!

3-572-చంపకమాల

మహిఁ దలపోయ నెవ్వని సమగ్ర పరిగ్రహమున్ లభింప ని
స్పృహమతులై మునీశ్వరులు మృత్యు భయంబునఁ బాతు రట్టి స
న్మహిత వివేకశాలి! గుణమండన! నీ కిల నన్య సత్పరి
గ్రహ మది యెట్టి చోద్యము జగత్పరిపాలన! నిత్యఖేలనా!

3-573-సీస పద్యము

సతతంబు నర్థార్థిజన శిరోలంకార;
పదరేణువులు గల పద్మ నేడు
జలజ కింజల్క నిష్యంద మరందలో;
భాగత భ్రమరనాయకుని పగిది
ధన్యజనార్పితోదంచిత తులసికా;
దామంబునకు నిజధామ మగుచు
భాసిల్లు భవదీయ పాదారవిందముల్;
విలసితభక్తి సేవించు చుండి

3-573.1-తేటగీతి

కమలనయన! కృపావలోకనము లొలయ
నర్థిఁ బొడసూపు భాగవతానురక్తిఁ
జేసి భవదీయ మహిమంబు చిత్ర మరయ
చిరశుభాకార! యిందిరాచిత్తచోర!

3-574-మత్తేభ విక్రీడితము

చిరభాగ్యోదయ! దేవదేవ! లలితశ్రీవత్సలక్ష్మాంగ! యీ
వరవిప్రానుపదైక పుణ్యరజ మే వర్ణింప నీ మేని కా
భరణం బంటివి సర్వలోకులకు విప్రశ్రేణి మాహత్త్య మీ
పెఱుగం జెప్పుటకై ధరించితి గదా యెన్నం బవిత్రాకృతిన్.

3-575-వచనము

అదియునుం గాక.

3-576-సీస పద్యము

ధర్మమూర్తివి జగత్కర్తవు నగు నీవు;
 ప్రోవంగఁ దగువారిఁ బ్రోవవేని
నవిరాళ వేదోక్త మగు ధర్మమార్గము;
 సన్మార్గ మగుఁ గాన సత్త్వగుణ వి
శిష్టుండ వగుచు నీ జీవసంఘముసేమ;
 మరసి రక్షింతు నీ దైన శక్తి
చేతను ధర్మవిఘాతుల దండించు;
 నీకు సంచిత మైన నిగమధర్మ

3-576.1-తేటగీతి

మార్గ నాశక విధములు మదికి నింపు
గావు విప్రుల యందు సత్కరుణ మెఱసి
ఘనతఁ బలికిన వినయవాక్యములు నీకు
యుక్త మగు చుండు సతతంబు భక్తవరద!

3-577-వచనము

అట్లయినఁ బరుల యెడ వినయంబులు వలికిన బ్రాభవహాని యగు నని తలంచితివేని.

3-578-తేటగీతి

విశ్వమున కెల్లఁ గర్తవు విశ్వనిధివి
విశ్వసంరక్షకుండ వై వెలయు నీకుఁ
గడగిఁ బ్రాభవహాని యెక్కడిది దలఁప
వినయములు నీకు లీలలై వెలయుఁ గాన.

3-579-తేటగీతి

మునుల మగు మమ్ము నతి మోదమునను నీవు
సత్కరించుట లెల్ల సజ్జన పరిగ్ర
హార్థమై యుండుఁ గాదె మహాత్మ! యొకటి
విన్నవించెద మీ జయవిజయులకును.

3-580-తేటగీతి

అలిగి యేము శపించితి మంతకంటె
బెడిద మగు నాజ్ఞసేయ నభీష్టమేని
జేయు మదికాక సమధికశ్రీ దనర్పఁ
జేసి రక్షించెదేని రక్షింపు మీశ!

3-581-వచనము

అట్లయిన మాకుం బ్రియం బగుం గావున ననపరాధులు నతి నిర్మలాంతఃకరణులు నైన వీరలకు ననృతంబులు పలికితి మేని మమ్మయినం జిత్తంబు కొలది నాజ్ఞాపింపు" మని కరకమలంబులు మొగిచి కృతాంజలులై యున్న మునులం గరుణార్ద్ర దృష్టిం గనుంగొని.

3-582-కంద పద్యము

అనఘుఁడు భగవంతుం డి
ట్లనియెన్ " మునులార! వీర లలరన్ భువికిం
జని యచట నసురయోనిన్
జనియింతురు లోభ మోహ సంగతు లగుచున్.

3-583-కంద పద్యము

దేవజనావళి కుపహతిఁ
గావించుచు నిఖిల భువనకంటక వృత్తిన్
జీవించుచు నా యెడ సం
భావిత వైరానుబంధ భావులు నగుచున్.

3-584-కంద పద్యము

ఆహవముఖమున నను నతి
సాహసమున నెదిరి పోరి చక్రనిశితధా
రాహతిఁ దెగి వచ్చెదరు
త్సాహ మెలర్పంగ నాదు సన్నిధి కంతన్.

3-585-వచనము

అదియునుం గాక.

3-586-కంద పద్యము

నను వైరంబున నైనను
మనమునఁ దలఁచుటను నా సముక్షమున మదా
నన మీక్షించుచు నీల్గుట
ననఘాత్మకులై వసింతు రస్మత్పదవిన్.

3-587-కంద పద్యము

వినుఁ డిలమీఁదఁ ని కెన్నఁటి
కిని బుట్టువు లేదు వీరికిని మీరలు ప
ల్కినయట్ల నాదు చిత్తము
నను దలఁతుం గాన మీ మనంబుల నింకన్

3-588-ఉత్పలమాల

దీనికిఁ జింతఁ దక్కుఁడు సుధీజనపుంగవు!" లన్నఁ బ్రీతులై
యా నలినాసనాత్మజు లనంతుని భావము దా మెఱింగి పెం

పూనిన వేడ్కఁ దేలి తెలివొందిన చిత్తములన్ నుతించి రం
భోనిధిశాయి! నార్తజనపోషణ భూషణుఁ! బాపశోషణున్

3-589-వచనము

మఱియును.

3-590-ఉత్పలమాల

ఆ సనకాదు లంతఁ బులకాంకురముల్ ననలొత్త బాష్పధా
రా సుభగాక్షులై మునిశరణ్యవరేణ్యు నగణ్యు దేవతా
గ్రేసరు దివ్యమంగళశరీరముఁ జారు తదీయ ధామమున్
భాసుర లీలఁ జూచి నవపద్మదళాక్షునకున్ వినమ్రులై.

3-591-కంద పద్యము

తమ పలికిన భాషణములు
కమలోదరు భాషణములుగా దలఁచుచు నె
య్యమునన్ వైష్ణవలక్ష్మిం
బ్రమదంబునఁ బ్రస్తుతించి పరమేశ్వరుచేన్.

3-592-కంద పద్యము

ఆమంత్రితులై తగ నిజ
ధామములకుఁ జనిరి వారు దడయక లక్ష్మీ
కాముడు జయవిజయుల నభి
రామంబుగఁ జూచి పలికె రయ మొప్పారన్.

3-593-కంద పద్యము

" మీ రసురయోని యం దని
వారితులై జనన మందవలసెను నే దు
ర్వార బలాఢ్యుడ నయ్యును
వారింపగనోప విప్రవచనము లెందున్.

3-594-కంద పద్యము

అదిగాన దనుజయోనిం
బదపడి జనియించి మద్విపక్షులరై మీ
మది నెపుడు నన్నె తలఁచుచు
వదలక నా చేతఁ జచ్చి వచ్చెద రిటకున్.

3-595-ఉత్పలమాల

పొం"డని యానతిచ్చి హరి ఫుల్లసరోరుహపత్రనేత్రుఁ డా
ఖండలముఖ్య దిగ్వరనికాయకిరీట లసన్మణిప్రభా
మండిత పాదపీఠుఁడు రమారమణీమణితోడ నేగుదే
నిండిన వేడ్క నేఁగె నిజనిర్మలపుణ్యనివాసభూమికిన్.

3-596-వచనము

అంత.

3-597-కంద పద్యము

నిజ తేజో హానిగ జయ
విజయులు ధరఁ గూలి రపుడు విహ్వాలు లగుచుం

ద్రిజగముల సురవిమాన
వ్రజముల హాహారవంబు గ్రందుగఁ జెలగన్.

3-598-కంద పద్యము

వారలె యా దితిగర్భా
గారంబున నున్నవారు గడగి తదీయో
దార ఘన తేజ మిప్పు డని
వారణ మీ తేజ మెల్ల వమ్ముగఁ జేసెన్.

3-599-ఉత్పలమాల

ఇంతకు మూల మా హరి రమేశ్వరుఁ డర్థి నొనర్చు కార్యముల్
వింతలె సర్వభూత భవ వృద్ధి వినాశన హేతుభూతుఁ డా
ద్యంత వికార శూన్యుఁడు దయానిధి మీ యెడ మేలుసేయు నీ
చింత దొఱంగి పేచనుఁడు చేకుఱు మీకు మనోరథార్థముల్."

3-600-కంద పద్యము

అని వనజాసనుఁ డాడిన
విని తద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకం
బున కేఁగిరి దితి నిజనా
థుని మాటలు దలఁచి యపరితోషముతోడన్.

## 3-31-హిరణ్యకశిపహిరణ్యాక్షులజన్మ

3-601-తేటగీతి

ఇంతి తన సుతుల్ సురలఁ గారింతు రనుచుఁ
దలచుచుండగ నంత వత్సర శతంబు
సనఁగ నటమీదఁ గనియెఁ గశ్యపునిదేవి
యఖిలలోకైక కంటకు లైన సుతుల.

3-602-వచనము

అయ్యవసరంబున,

3-603-తేటగీతి

ధరణి గంపించెఁ గులపర్వతములు వడఁకె
జలధులు గలంగెఁ దారకావళులు డుల్లె
గగన మగలెను మ్రొగ్గె దిక్కరులు దిశల
మిడుఁగుఱు లెగసెఁ బిడుగులు పుడమిఁ బడియె.

3-604-సీస పద్యము

హోమానలంబుల ధూమంబు లడరెను;
 బ్రతికూలవాయువుల్ బలసి వీచెఁ
దరువు లెల్లెడ విటతాటంబులై కూలె;
 గ్రహతారకావళి కాంతి మాసె
బెరసి మొగిళ్లు నెత్తురు వాన గురిసెను;
 మెఱుఁగులు దెసల మిర్మిట్లు గొలిపె
స్వర్భాను డొగి నపర్వమున భానునిఁ బట్టె;
 గైకొని చిమ్మ చీకట్లు పర్వె

3-604.1-తేటగీతి

మొనసి కుక్కలు మొఱిఁగెను మోరలెత్తి
పగలు నక్కలు వాపోయె ఖగము లార్త
రవము లిచ్చెను దేవతాప్రతిమ లొరగెఁ
గన్నులను నశ్రుకణములు గ్రందుకొనగ.

3-605-కంద పద్యము

మొదవులు నెత్తురుఁ జీమును
బిదికెన్ గార్దభరవంబు భీషణ మయ్యెన్
మద ముడిగెఁ గరుల కటములఁ
బొదివెఁ దురంగముల వాలముల నిప్పు లొగిన్.

3-606-కంద పద్యము

గుహలు రొద లిచ్చెఁ బాప
గ్రహమిత్రతఁ జెంది వక్రగతులను సౌమ్య
గ్రహములు వర్తించెను దు
స్సహ తేజో దితితనూజ సంభవ వేళన్.

3-607-మత్తేభ విక్రీడితము

భయదప్రక్రియ నట్లుదోచిన మహోత్పాదంబు లీక్షించి సం
క్షయకాలం బని కాని సాధు హననోగ్రక్రూర దేవాహి తో
దయ సంక్షోభముగా నెఱుంగఁగ సమస్తప్రాణి సంఘాతము
ల్భయ మందెన్ సనకాది యోగిజనముల్దక్కన్ బుధేంద్రోత్తమా!

3-608-వచనము

అట్లావిర్భవించిన యనంతరంబ.

3-609-మత్తేభ విక్రీడితము

కులశైలాభ శరీరముల్ తనర రక్షోనాథు లత్యుగ్ర దో
ర్బల మొప్పం బదఘట్టనన్ ధర చలింపన్ రత్న కేయూర కుం
డల కాంచీ కటకాంగుళీయక కిరీటస్స్వర్ణమంజీర ని
ర్మల కాంతుల్ దులగింప నాత్మరుచిచే మందీకృతార్కాంశులై.

3-610-వచనము

ఉన్న సమయంబునం గశ్యపుండు నిజ తనూభవులఁ జూడం దలంచి దితిమందిరంబునకుం జనుదెంచి; సుతులం గనుంగొని; వారలకు నామకరణంబు సేయం దలంచి.

3-611-చంపకమాల

దితి జఠరంబు నందుఁ దన తేజము మున్నిడి నట్టి పుత్త్రు న
ద్భుత చరితున్ హిరణ్యకశిపుం డను పేరఁ బ్రసూతివేళ నా
దితి మును గన్న పట్టి రవితేజునిఁ గాంచనలోచనుండు నా
హితమతిఁ బేరువెట్టి చనియెన్ నిజ నిర్మల పుణ్యభూమికిన్.

## 3-32-హిరణ్యాక్షుని దిగ్విజయము

3-612-వచనము

అయ్యవసరంబున, నతుల తేజోవిరాజితుం డైన హిరణ్యకశిపుండు హిరణ్యగర్భ వరదాన గర్వంబునను; దుర్వార పరిపంథి గర్వ నిర్వాపణాఖర్వ

భుజావిజృంభణంబునను; నిఖిల లోకపాలాదుల జయించి స్వవశం బొనర్చి సంతుష్టాంతరంగుం డై యెందునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖం బుండెఁ; దత్సోదరుం డైన హిరణ్యాక్షుండు ప్రతిదినంబుఁ జండవేదండశుండాదండమండిత భుజాదండంబున గదాదండంబు ధరియించి తన్నెదిరి కదనంబు సేయం జాలిన యరివీరునిం గానక; భూలోకం బెల్లఁ గ్రుమ్మరి దివంబునకు దాడి వెట్టి; యందు సమర విముఖులయిన బర్హిర్ముఖులం గనుంగొని వనజాసన వరప్రదానంబుఁ జింతించి; హితులు సెలంగ నహితులు గలంగ మహిత వైజయంతికాదామం బభిరామంబై వెలుంగం జరణంబుల మణినూపురంబులు మొరయ; నిజదేహద్యుతి దిక్కులం బిక్కటిల్లం జనుదెంచు వానిం గని; భీతచిత్తు లయి దేవతాగణంబులు గరుడునిం గని పఱచు నురగంబులుంబోలె నిజనివాసంబు లర్కనివాసంబులు గాంచనావాసంబులుంగా నొనర్చి యెక్కడికేనిం జనిన.

3-613-ఉత్పలమాల

శౌర్యము వోవఁదట్టి నిజసాధనముల్ దిగనాడి విక్రమౌ
దార్యపరాక్రమక్రమము దప్పఁగ భీతిలి పాఱి రక్కటా
కార్యముఁ దప్పి నాకులని గైకొని యార్చి సుమేరుపర్వత
స్థైర్యుఁడు వార్ధిఁ జొచ్చె నతి దర్పిత భూరి భుజావిజృంభియై.

3-614-వచనము

ఇట్లు సొచ్చిన.

3-615-కంద పద్యము

వరుణుని బలములు దనుజే
శ్వరుతేజముఁ దేఱి చూడజాలక శౌర్య
స్ఫురణము సెడి యొందేనిని
బఱచెం దజ్జలధి మధ్యభాగము నందున్.

3-616-కంద పద్యము

అమరారి విపుల నిశ్శ్వా
సములం బ్రభవించి నట్టి జలనిధి కల్లో
లములను విపుల గధాదం
డంబునఁ బోనడచె నతి దృఢం బగు శక్తిన్.

3-617-చంపకమాల

మఱియును నమ్మహాజలధి మధ్యమునన్ సురవైరి పెక్కు వ
త్సరములు గ్రీడసల్పి రిపు సైన్య విదారణ శౌర్యఖేలనా
పరతఁ జరించి యవ్వరుణపాలిత మైన లసద్విభావరీ
పురమున కేఁగి యందుఁ బరిపూర్ణత నున్న పయోధినాథునిన్.

3-618-వచనము

మఱియును.

3-619-సీస పద్యము

యాదోగణాధీశుఁ డగుచుఁ బాతాళభు;
వన పరిపాలుఁ డై తనరుచున్న
వరుణునిఁ గనుగొని పరిహాసితోక్తుల;

నిట్లను "విశ్వ మం దెన్నఁగలుగు
సకల లోకైకపాలకులలో నతిబలా;
ధికుఁడని జగము నుతింపఁదగిన
శూరుండ విపుడు నీ పౌరుష మొప్పంగఁ;
గదనరంగమున నన్నెదిరి చూడు

3-619.1-తేటగీతి

నీ భుజావిక్రమంబును బ్రాభవంబు
నడఁతు" నని పల్కుటయు విని యబ్ధివిభుఁడు
పగతు జయమును వృద్ధియు బలము నాత్మ
బలము దలపోసి దనుజతో బవరమునకు.

3-620-కంద పద్యము

సమసయము గాదని తన చి
త్తమునం గల రోషవహ్నిఁ దాలిమి యను తో
యములం దగనార్చుచు నుప
శమితోక్తులఁ బలికె దనుజసత్తముతోడన్.

3-621-చంపకమాల

" మనమున శాంతిఁ బూని నియమంబున సంగర ముజ్జగించి యే
ననయము నున్నవాఁడని పుడాహవకేళిఁ జరింపరాదు నీ
ఘన భుజ విక్రమస్ఫురిత గాఢ విజృంభణమున్ జయింపఁ జా
లిన ప్రతివీరు లెవ్వరును లేరు ముకుందుడు దక్క నెక్కడన్.

3-622-చంపకమాల

గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నున్నవాడు దా
ననిమొనఁ బెక్కుమాఱు లభియాతుల నోలి జయించి శక్తి పెం
పున సడిసన్నవీరు డని భూజనకోటి నుతించు నందు వే
చను మత డిచ్చు నీకు నని సర్వము దీఱెడు నంతమీదఁటన్.

3-623-ఉత్పలమాల

నిందకునోర్చి యాజిమొన నిల్వఁగనోపక వీఁగిపాఱు నీ
పందల వెంటఁబడ్డ మగపంతమె సర్వశరణ్యుఁడైన గో
విందుఁడు దీర్చు నీపని వివేకవిహీన చనంగనోపుదే
నందుల కేఁగు మాతఁ డమరారులఁ బోర జయించు నిచ్చలున్.

3-624-వచనము

అదియునుం గాక.

3-625-కంద పద్యము

పురుషాకృతిఁ బ్రతియుగమునఁ
బురుషోత్తముఁ డవతరించి భూరిభుజా వి
స్ఫురణన్ దుష్టనిశాటుల
హరియించుచు నుండు మునిగణార్చితపదుఁడై.

3-626-ఉత్పలమాల

కావున నా విభుం డొడరి కయ్యము దయ్య మెఱుంగఁ జేసి ర
క్షోవర నీ భుజాబలము సొంపఱి మేదినిఁ గూలి సారమే

యావళి కాశ్రయం బగుదు వచ్చటి కిప్పుడ యేఁగుదేని నీ
చేవయు లావు నేర్పడును జెప్పఁగ నేటికి మీఁది కార్యముల్."

3-627-చంపకమాల

అని వరుణుండు వల్కిన దురాగ్రహ మెత్తి హిరణ్యలోచనుం
డనయము మానసంబున భయం బొక యించుక లేక సంగరా
వని నెదిరింతు నేఁ డమరవర్ధను దుష్టవిమర్దనున్ జనా
ర్దను ననుచున్ వికుంఠనగరస్ఫుట నంచితమార్గవర్తియై.

3-628-కంద పద్యము

చను నవసరమున నారద
మునివరుఁ డెదు రేఁగుదెంచి ముదము దలిర్పన్
" దనుజేంద్ర! యెందుఁ బోయెద"
వని యడిగిన నారదునకు నతఁ డిట్లనియెన్.

3-629-చంపకమాల

" సరసిరుహోదరుం దొడరి సంగరమే నొనరించి యిందిరా
వరుని ననంతుఁ ద్రుంచి సురవైరికులంబుల కెల్ల మోద వి
స్ఫురణ ఘటింపఁ జేయుటకుఁ బూని వికుంఠపథానువర్తి నై
యరిగెద" నన్న నమ్మునికులాగ్రణి దానవనేత కిట్లనున్.

3-630-చంపకమాల

" గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేడు లేఁడు భూ
భరము వహింప నాదికిటి భావముఁ దాల్చి రసాతలంబునం

దిరవుగ నున్నవాఁ డచటి కేఁగఁగనోపుదువేని నేఁగు మం
దరయఁగ గల్గు నీకు నసురాంతకుతోడి రణం బవశ్యమున్."

## 3-33-హిరణ్యాక్షుని జన్మప్రకారంబు

3-631-చంపకమాల

అనవుడు దానవేంద్రుఁడు హుతాశనుకైవడి మండి పద్మలో
చను నెదిరించు వేడుకలు సందడిగొల్ప ననల్పతేజుఁడై
ఘనగదఁ గేలఁ బూని త్రిజగద్భయదాకృతిఁ దాల్చి వ్రేల్మిడిం
జనియె రసాతలంబునకుఁ జండ భుజాబల దర్ప మేర్పడన్.

3-632-వచనము

చని జలమధ్యంబున.

3-633-కంద పద్యము

దివిజారి యెదురఁ దగఁ గనె
సవిరళ దంష్ట్రాభిరాము నమరలలాముం
గువలయభరణోద్ధామున్
సవనమయస్తబ్ధరోము జలదశ్యామున్.

3-634-వచనము

అయ్యవసరంబున సూకరాకారుం డైన హరియు.

3-635-కంద పద్యము

వనజ రుచిసన్నిభము లగు
తన లోచనయుగళ దీప్తి దనరఁ దదాలో
కనముల దనుజాధీశుని
తనుకాంతి హరింపఁజేసెఁ దత్క్షణమాత్రన్.

3-636-వచనము

మఱియు నయ్యాదివరాహం బవార్యశౌర్యంబున మాఱులేని విహారంబున జరియించు నట్టియెడ.

3-637-సీస పద్యము

తుదమొదళ్ళకుఁ జిక్క దునిసి పాఱఁగ మోరఁ;
 గులశైలములఁ జిమ్ముఁ గొంత దడవు
బ్రహ్మాండభాండంబు పగిలి చిల్లులువోవఁ;
 గొమ్ములఁ దాటించుఁ గొంతద డవు
జలధు లేడును బంకసంకులం బై యింక;
 ఖురముల మట్టాడుఁ గొంత దడవు
నుడురాజు సూర్యుఁడు నొక్క మూలకుఁ బోవఁ;
 గుఱుచ వాలము ద్రిప్పుఁ గొంత దడవు

3-637.1-తేటగీతి

గునియుఁ గుప్పించి లంఘించుఁ గొప్పరించు
నెగయు ధరఁ ద్రవ్వ బొఱియఁగా నేపురేగి
దానవేంద్రుని గుండెలు దల్లడిల్లఁ
బంది మెల్లన రణపరిపంథి యగుచు.

3-638-వచనము

మఱియును.

3-639-కంద పద్యము

కనుఁగవ నిప్పులు రాలఁగ
సునిశిత దంష్ట్రాగ్ర యుత వసుంధరుఁ డగుచున్
తన కెదురేతేరఁగ నీ
వనచర మేరీతి నిపుడు వనచర మయ్యెన్.

3-640-కంద పద్యము

అని యాశ్చర్య భయంబులు
దన మనమునఁ దొంగిలింపఁ దనుజాధిపుఁ డి
ట్లనియెన్ భీకరసూకర
తనువొంది చరించు దనుజ దర్పాపహుతోన్

3-641-కంద పద్యము

" ఘనసూకర! మూఢాత్మక!
వనరుహసంభూత దత్త వరదానమునం
గనిన రసాతలగత భువి
యనయంబును నా యధీనమై వర్తించున్.

3-642-కంద పద్యము

గొనకొని నీ వీ ధరణిం
గొనిపోకుము విడుము కాక కొని యేఁగెదవేఁ

గొనియెద నీ ప్రాణముఁ గై
కొను మిదె నా మాట నలముగొనవేమిటికిన్.

3-643-కంద పద్యము

మాయావి వగుచు నిప్పుడు
వాయక యీ పుడమిఁ జోరభావంబున నీ
వీ యెడఁ గొని పోఁజూతువె
యాయతభుజబలముచేత నడపక? యనుచున్.

3-644-సీస పద్యము

అవిరళ యోగమాయాబలంబునఁ జేసి;
యల్ప పౌరుషమున నలరు నిన్ను
నర్థి సంస్థాపించి యస్మత్సుహృద్భృత్య;
కులుల కెల్లను మోద మొలయఁ జేయఁ
జెలువేది మద్గదాశీర్ణుఁడ వగు నిన్నుఁ;
గనుఁగొని దేవతాగణము లెల్ల
నిర్మాలు లై చాల నెఱి నశించెద" రన్న;
విని యజ్ఞపోత్రియై వెలయుచున్న

3-644.1-తేటగీతి

హరి సరోజాత భవ ముఖామరుల కెల్ల
వచ్చు దురవస్థ కాత్మలో వంత నొంది
నిశిత దంష్ట్రాగ్రలసితమై నెగడు ధరణి
దేవితో నొప్పె నా వాసుదేవుఁ డంత.

3-645-కంద పద్యము

సురరిపు వాక్యాంకుశముల

గురు కుపితస్వాంతు డగుచుఁ గోమరారె వసుం

ధరతోడ భీతినొందిన

కరణిం గల కరికులేంద్రు కరణిం బెలుచన్.

3-646-తేటగీతి

నిశిత సిత దంత రోచులు నింగిఁ బర్వఁ

గంధి వెడలి భయంకరాకార లీల

నరుగు భీషణ మఖవరాహావతార

మొనరఁ దాల్చిన పద్మలోచనుని వెనుక.

3-647-కంద పద్యము

కరి వెనుక దగులు నక్రము

కరణిం జని దైత్యవిభుఁడు గదిసి యిటులనున్

దురిత పయోనిధి తరికిన్

గిరికిన్ ఖురదళిత మేరుగిరికిన్ హరికిన్.

3-648-కంద పద్యము

" నిందకు రోయక లజ్జం

జెందక వంచనను రణముసేసి జయంబుం

బొందెద నని తలఁచుచు నిటు

పందగతిం బాఱు బంటుపంతమె నీకున్."

3-649-వచనము

అని యాక్షేపించినం బుండరీకాక్షుండు గోపోద్దీపిత మానసుం డై.

3-650-కంద పద్యము

తోయములమీఁద భూమిన

నాయాసత నిల్పి దానికాధారముగాఁ

దోయజనాభుఁడు దన బల

మాయతమతిఁ బెట్టి సురలు హర్షము వొందన్.

3-651-తేటగీతి

కుసుమములఁ వృష్టి బోరనఁ గురిసె నంత

విభవ మొప్పార దేవదుందుభులు మొరసెఁ

గడఁక వీతెంచె గంధర్వగాన రవము

నందితము లయ్యె నప్సరోనర్తనములు.

3-652-వచనము

అయ్యవసరంబున నయ్యజ్ఞవరాహమూర్తిధరుం డైన కమలలోచనుండు కనక కుండల గేయూర గ్రైవేయ గటకాంగుళీయక భూషణ రోచులు నింగిపర్వ సమరసన్నద్ధుం డై.

3-653-చంపకమాల

ఘనగదఁ గేలఁబూని మణికాంచన నవ్య విచిత్రవర్మమిం

పొనరగఁ దాల్చి దానవ నియుక్త దురుక్త నిశాతబాణముల్

దన ఘనమర్మములన్ కలఁప దానవహంత నితాంతశౌర్యుఁ డై
కనలుచు వచ్చు నద్దనుజుఁ గన్గొని రోషవిభీషణాకృతిన్.

3-654-వచనము

ఒప్పి నగుచు నిట్లనియె.

3-655-మత్తేభ విక్రీడితము

" వినరా; యోరి! యమంగళాచరణ! యుద్వృత్తిన్ ననున్ నీ మది
న్ననయంబున్ వనగోచరం బగు మృగం బంచుం దలం తౌర! నే
నెనయన్ వన్యమృగంబ యౌదు బలి యై యేతెంచు నీ బోఁటి యీ
శునకశ్రేణి వధింతు నేఁ డని మొనన్ సోఁకోర్చి వర్తించినన్.

3-656-కంద పద్యము

బలిమి గలదేని నాతోఁ
గలనను నెదిరించి పోరఁగడఁగుము నీ కో
ర్కులు నేఁడు దీర్తు నూరక
తలపోయ వికత్థనంబు దగదు దురాత్మా!

3-657-చంపకమాల

విను మదిగాక సంగరవివేకవిశారదు లైన యట్టి స
జ్జనములు మృత్యుపాశములఁ జాల నిబద్ధులు నయ్యు నీ వలెన్
గొనకొని యాత్మ సంస్తుతులకున్ ముదమందిరె యేల యీ విక
త్థనములు బంటుపంతములె దైత్యకులాధమ! యెన్ని చూడగన్.

3-658-మత్తేభ విక్రీడితము

ధృతిఁ బాతాళము నందు నీ వనెడి సందీప్తోగ్రనిక్షేపమే
నతి దర్పంబునఁ గొందుఁ జూడు మిదె దేవారాతి! నన్నెన్నెదో
గతలజ్జుం డన దాఁగి యుండి రణముం గావింతు యుష్మద్గదా
వితతద్రావితుఁ డన్న నన్నెదురుమా వేదీర్తు నీ కోరికల్.

3-659-ఉత్పలమాల

ఎన్నఁ బదాతియూధముల కెల్ల విభుండవు పోటుబంటవై
నన్ను రణోర్వి నేఁ డెదిరినన్ భవదీయ బలంబు నాయువున్
మిన్నక కొందుఁ జూడు మిది మేరగ మేదిని వీతదైత్యమై
వన్నెకు నెక్కఁ జేసెద నవార్యపరాక్రమ విక్రమంబునన్.

3-660-చంపకమాల

నను నెదురంగఁ జాలిన ఘనుం బగు శౌర్యము ధైర్యమున్ బలం
బును గలవేని నిల్వు రణభూమిని నీ హితులైన వారికిం
గనుఁగవ బాష్పపూరములు గ్రమ్మఁగ మాన్పఁగనోపుదేనిఁ జ
య్యనఁ జనఁబొమ్ము దానవకులాధమ! యూరక రజ్జులేటికిన్.

3-661-కంద పద్యము

నను నిట సంస్థాపించెద
నని పలికితి వంతవాఁడవౌదువు నీకున్
నెనరైన చుట్టములఁ బొడ
గని రా యిదె యముని పురికిఁ గాపుర మరుగన్."

3-662-మత్తేభ విక్రీడితము

అని యిబ్బంగి సరోరుహాక్షుఁడు హిరణ్యాక్షున్ విడంబించి ప
ల్కిన హాసోక్తుల కుల్కి రోషమదసంఘీభూతచేతస్కుఁ డై
కనుఁ గ్రేవన్ మిడుఁగుర్లు సాలఁ బొడమంగాఁ గిన్కమైఁ దోఁకఁ ద్రొ
క్కిన కృష్ణోరగరాజు మాడ్కి మదిలోఁ గీడ్పాటు వాటిల్లఁగన్.

3-663-కంద పద్యము

చలితేంద్రియుఁడై నిట్టూ
ర్పులు నిగడించుచును బొమలు ముడుపడ రోషా
కులమానసుఁడై గదఁగొని
జలజాక్షున కెదురు నడచె సాహసమొప్పన్.

3-664-వచనము

అత్తఱి హిరణ్యాక్షుం డతి భయంకరాకారుం డై.

3-665-మత్తేభ విక్రీడితము

గద సారించి మదాసురేంద్రుఁడు సమగ్రక్రోధుఁడై మాధవుం
గుదియన్ వ్రేసిన వ్రేటు గైకొనక రక్షోహంత శౌర్యోన్నతిన్
గదఁ గేలన్ ధరియించి దానిఁ దునుకల్ గావించినం దైత్యుఁ డు
న్మదుఁడై యొండు గదన్ రమావిభుని భీమప్రక్రియన్ వ్రేసినన్.

3-666-చంపకమాల

అది దనుఁ దాకకుండ దనుజారి గదారణకోవిదక్రియా
స్పద కరలాఘవక్రమముఁ బైకొని చూపి విరోధి పేరురం

బదరఁగ వ్రేయ వాఁడు వివశాకులభావము నొంది యంతలో
మదిఁ దెలివొంది వ్రేసె రిపుమానవిమర్దను నా జనార్దనున్.

3-667-వచనము

ఇట్లు దలపడి; యన్యోన్య జయకాంక్షల నితరేతర తుంగతరంగ తాడితంబు లగు దక్షిణోత్తర సముద్రంబుల రౌద్రంబునఁ బరస్పర శుండాదండ ఘట్టిత మదాంధ గంధసింధుర యుగంబు చందంబున రోషభీషణాటోపంబులం దలపడు బెబ్బులుల గబ్బున నతి దర్పాతిరేకంబున నెదిర్చి యంకెలు వైచు మదవృషభంబుల రభసంబున నసహ్యసింహపరాక్రమంబున విక్రమించి పోరునెడ; హిరణ్యాక్షుండు సవ్యమండల భ్రమణంబునం బరివేష్టించినం బుండరీకాక్షుండు దక్షిణ మండల భ్రమణంబునం దిరిగి విపక్షవక్షం బశనిసంకాశం బగు గదా దండంబునం బగిల్చిన; వాఁడు దెప్పఱి తెలివొంది లేచి; దనుజ పరిపంథి ఫాలంబు నొప్పించె; నప్పు డమ్మేటి వీరులు శోణితసిక్తాంగు లై పుష్పితాశోకంబులం బురుడించుచుం బాయుచు డాయుచు వ్రేయుచు రోయుచు నొండొరుల రుధిరంబు లాఘ్రాణించుచుఁ దిరస్కార పరిహాసోక్తుల నిచ్చుచుఁ బోరు సమయంబున; నమ్మహాబలుల సమరంబుఁ జూచువేడ్కఁ బద్మసంభవుండు నిఖిల మునీంద్ర సిద్ధ సాధ్య దేవ గణంబులతోడఁ జనుదెంచి; ధరిత్రీ నిమిత్తంబున నసురవరునితోడం బోరు యజ్ఞవరాహున కిట్లనియె.

## 3-34-బ్రహ్మస్తవంబు

3-668-ఉత్పలమాల

" అంచిత దివ్యమూర్తి! పరమాత్మక! యీ కలుషాత్ముఁ డైన న
క్తంచరుఁ డస్మదీయ వరగర్వమునన్ భువనంబు లెల్లఁ గా

రించు మదించి యిట్టి విపరీతచరిత్రునిఁ ద్రుంప కిట్లుపే
క్షించుటగాదు వీని బలిసేయు వసుంధరకున్ శుభంబగున్.

3-669-కంద పద్యము

బాలుఁడు గరమున నుగ్ర
వ్యాళము ధరియించి యాడు వడుపున రక్షః
పాలునిఁ ద్రుంపక యూరక
పాలార్చుట నీతియే శుభప్రద! యింకన్.

3-670-వచనము

అదియునుం గాక.

3-671-మత్తేభ విక్రీడితము

అనఘా! యీ యభిజిన్ముహూర్తమున దేవారాతి మర్దింపవే
ననయంబున్ మఱి దైత్యవేళ యగు సంధ్యాకాల మేతెంచినన్
ఘనమాయాబలశాలి యైన దనుజున్ ఖండింపఁగా రాదు గా
వున నీవేళన త్రుంపు సజ్జనహితప్రోద్యోగరక్తుండవై."

3-672-కంద పద్యము

అని సరసిజగర్భుఁడు ప
ల్కినవచనము లర్థి విని నిలింపులు గుంపుల్
కొనిచూడ సస్మితానన
వనజముసెలువొంద నసురవరు కభిముఖుఁడై.

3-673-తేటగీతి

పుండరీకాక్షుఁ డయ్యును భూరిరోష
నిరతిఁ దరుణారుణాంభోజనేత్రుఁ డగుచు
ఘనగదాదండ మెత్తి రాక్షసుని హనువు
నుగ్రగతి మొత్తె వాఁడును నోపరించె.

3-674-కంద పద్యము

పరువడి దితిసుతుఁ డతి భీ
కరగదఁ జేబూని చిత్రగతులను బద్మో
దరుఁ డాసి చేతిగద సా
గరమునఁ బడ నడిచె బాహుగర్వమెలర్పన్.

3-675-వచనము

అంత.

3-676-తేటగీతి

హరి నిరాయుధుఁడైన సురారి సమర
ధర్మ మాత్మను దలఁచి యుద్ధంబుఁ దక్కి
నిలిచి చూచుచునుండెను నింగి నమర
వరుల హాహా రవంబుల భరిత మయ్యె.

3-677-కంద పద్యము

సరసిజనేత్రుఁడు దనుజే
శ్వరు సంగరధర్మమునకు సమధికశౌర్య

స్ఫురణకుఁ దన చిత్తంబున
గరమాశ్చర్యంబు నొంది కడఁకదలిర్పన్.

3-678-మత్తేభ విక్రీడితము

కుతలోద్ధర్త మనంబునం దలఁచె రక్షోరాడ్వధార్థంబుగా
దితిసంతానకులాటవీమహితసందీప్తప్రభా శుక్రమున్
సతతోద్యజ్జయశబ్దసన్ముఖరభాస్వచ్చక్రమున్ సంతతా
శ్రితనిర్వక్రముఁ బాలితప్రకటధాత్రీచక్రముం జక్రమున్.

3-679-వచనము

అదియునుం, బ్రచండమార్తాండమండలప్రభాపటల చటుల విద్యోత మానంబును, పటునటజ్వాలికాపాస్త సమస్త కుపితారాతి బలాఖర్వ దుర్వార బాహాగర్వాంధకారంబును, యసహ్య కహకహ నినదాధరీకృత సాగరఘోషంబును, సకల దేవతాగణ జేగీయమానంబును, ననంత తేజోవిరాజితంబును, నిజ ప్రభాపటలపూరిత బ్రహ్మాండకటాహంబును నై; రయంబునం జనుదెంచి దనుజారి దక్షిణ కరసరోజంబు నలంకరించిన నా శుభాంగుండు రథాంగపాణియై దివంబున నమర గణంబులు జయజయశబ్దంబులు పలుక నసురవిభున కెదురుగా నడచిన.

3-680-కంద పద్యము

వొడగని దనుజుఁడు పెదవులు
దడుపుచుఁ బొలివోని బంటుతనమున బీరం
బుడుగక భీషణగదఁ గొని
యడిచెన్ మఖమయవరాహు నమితోత్సాహున్.

3-681-కంద పద్యము

త్రిదశారి దన్ను వ్రేసిన
గదఁ బదమునఁ బోవదన్ని కమలాక్షుఁడు పెం
పొదవగ మనమున మోదము
గదురగ లేనగవు వదనకమలము బొదువన్.

3-682-వచనము

ఇవ్విధంబున గదఁ బోవందన్ని యసురవిభునితో నిట్లనియె.

3-683-చంపకమాల

" ఘనగదఁ గేలఁబూని భుజగర్వమెలర్పఁగ నన్ను సంగరా
వని నెదిరింతు; రార; యనివారణ దైత్యకులేశ్వరాధమా!"
యనవుడు వాఁడు నుబ్బి గద నంబుజనాభుని వ్రేసె; వ్రేసినన్
దనుజవిభేది పట్టికొనెఁ దార్క్ష్యఁ డహీంద్రునిఁ బట్టుకైవడిన్.

3-684-కంద పద్యము

దితిజుఁడు దన బల మప్రతి
హతతేజం డగు సరోరుహాక్షుని శౌర్యో
న్నతిమీఁద బెట్టకుండుట
మతి నెఱిఁగియుఁ బెనఁగె దురభిమానముపేర్మిన్.

3-685-వచనము

అంత.

3-686-సీస పద్యము

కాలానలజ్వలజ్జ్వాలావిలోల క;
 రాళమై పెంపొందు శూల మంది
సురవైరి యజ్ఞసూకరరూపధరుఁ డైన;
 వనజనాభునిమీఁద వైవ నదియు
సద్విజోత్తముమీఁదఁ జపలత గావించు;
 నభిచారకర్మంబు నట్ల బెండు
పడి పఱితేఁ గని పద్మోదరుడు దానిఁ;
 జక్రధారాహతిఁ జండవిక్ర

3-686.1-తేటగీతి

మమున నడమున వడి ద్రుంచె నమరభర్త
మహిత దంభోళిచే గరుత్మంతు పక్ష
మతిరయంబునఁ ద్రుంచినగతిఁ జెలంగి
సురలు మోదింప నసురులు సొంపు డింప.

3-687-వచనము

అయ్యవసరంబున నయ్యసురుడు దన శూలంబు చక్రంబుచేత నిహతం బగుటం గని.

3-688-కంద పద్యము

దితిజుఁడు రోషోద్ధతుఁడై
యతి నిష్ఠుర ముష్టిఁ బొడిచె హరి నా లోకో
న్నతుఁ డొప్పెఁ గుసుమమాలా
హతి దిగ్గజరాజుఁ బోలె నతి దర్పితు డై.

3-689-మత్తేభ విక్రీడితము

హరిమీఁదన్ దితిసంభవుండు ఘనమాయాకోట్లు పుట్టించినన్
ధరణీచక్రము భూరి పాంసుపటలధ్వాంతంబునం గప్పె భీ
కర పాషాణ పురీష మూత్ర ఘనదుర్గంధాస్థి రక్తావళుల్
గురిసెన్ మేఘము లభ్రవీథిని మహాక్షోభక్రియాలోలమై.

3-690-వచనము

మఱియును.

3-691-చంపకమాల

తవిలి విముక్తకేశపరిధానము లుగ్రకరాళదంత తా
లువులును రక్తలోచనములుం గల భూత పిశాచ ఢాకినీ
నివహము లంతరిక్షమున నిల్చి నిజాయుధపాణులై మహా
రవముగ యక్ష దైత్య చతురంగ బలంబులఁ గూడి తోచినన్.

3-692-వచనము

అంత.

3-693-కంద పద్యము

త్రిసవనపాదుం డగు నా
బిసరుహనేత్రుండు లోకభీకర మగు నా
యసురాధిపు మాయావిని
రసనకరం బైన శస్త్రరాజముఁ బనిచెన్.

3-694-కంద పద్యము

ఆ చక్రభానుదీప్తి ధ
రాచక్రమునందు నిండిరయముననమ్మా
యాచక్రమునడఁగించెను
నీచక్రముఁడైన యామినీచరు నెదురన్

3-695-వచనము

అంత నిక్కడ.

3-696-కంద పద్యము

దితి దన విభువాక్యంబుల
గతిదప్పద యనుచుఁ దలఁపఁగాఁ జన్నుల శో
ణితధార లొలికె రక్షః
పతి యగు కనకాక్షుపతనభావము దోఁపన్.

3-697-వచనము

అయ్యవసరంబున, నసురవిభుండు దనచేసిన మాయాశతంబులు గృతఘ్నునకుం గావించిన యుపకారంబులుం బోలె హరిమీఁదఁ బనిసేయక విఫలంబు లయినం; బొలివోవని బంటుతనంబునఁ బుండరీకాక్షుఁ జేరం జనుదెంచి బాహుయుగళంబు సాఁచి పూఁచి పొడచి రక్షోవైరి వక్షంబుఁ బీడించిన; నయ్యధోక్షజుండు దప్పించుకొని తలంగినం జెలంగి దైత్యుండు నిష్ఠురం బగు ముష్టిం బొడచిన; నసురాంతకుండు మిసిమింతుడు గాక రోషభీషణాకారాంబున వాసవుండు వృత్రాసురుం దెగటార్చిన చందంబున వజ్రివజ్రసన్నిభం బగు నటచేతం గఱకు టసురకటితటంబుఁ జటులగతి వ్రేసిన నా హిరణ్యాక్షుండు దిర్దిరందిరిగి యుదస్తలోచనుండై సోలి; యొట్టకేలకు నెదుర నిలువంబడె; నంత.

## 3-35-హిరణ్యాక్షవధ

3-698-కంద పద్యము

దిటచెడి లోఁబడె దైత్యుఁడు
సటికిన్ దంష్ట్రావిభిన్న శత్రు మహోర
స్తటికిన్ ఖరఖురపుటికిం
గటితటహత కమలజాండఘటికిం గిటికిన్.

3-699-వచనము

ఇట్లు లోఁబడిన.

3-700-మత్తేభ విక్రీడితము

దివి నింద్రాదులు సంతసింప హరి మొత్తెం గర్ణమూలంబునం
బవిసంకాశకఠోరహస్తమున శుంభల్లీలమై దాన దా
నవలోకేశుఁడు రక్తనేత్రుఁ డగుచున్ దైన్యంబు వాటిల్లగా
భువిమీఁదంబడి వోలె మారుతహతోన్మూలావనీజాకృతిన్.

3-701-కంద పద్యము

బుడబుడ నెత్తురు గ్రక్కుచు
వెడరూపముదాల్చి గ్రుడ్లు వెలికుఱుక నిలం
బడి పండ్లు గీటుకొనుచును
విడిచెం బ్రాణములు దైత్యవీరుం డంతన్.

3-702-తేటగీతి

పడిన దనుజేశ్వరునిఁ జూచి పద్మసంభ
వాది దివిజులు వెఱగంది రాత్మ లందు
నితఁడు వొందుట యెట్లొకో యీ యవస్థ
నని తలంచుచు మఱియు నిట్లనిరి వరుస.

3-703-మత్తేభ విక్రీడితము

వరయోగీంద్రులు యోగమార్గముల నెవ్వానిన్ మనోవీథి సు
స్థిరతన్ లింగశరీరభంగమునకై చింతింతు రా పంకజో
దరు పాణ్యాహతిఁ దన్ముఖాంబురుహమున్ దర్శించుచుం జచ్చె దు
ర్భరితోత్తంసుఁని దైత్య వల్లభుని సౌభాగ్యంబు దా నెట్టిదో.

3-704-చంపకమాల

సమమతి వీరు దైత్యకులశాసను పారిషదుల్ మునీంద్ర శా
పమున నికృష్టజన్మమునఁ బైకొని పుట్టియు నేఁడు విష్ణుచే
సమయుటఁ జేసి మీఁదనగు జన్మమునన్ జలజాక్షు నిత్య వా
సమున వసింతు రెన్నటికిఁ జావును బుట్టువు లేవు వీరికిన్.

3-705-కంద పద్యము

అని వెఱగు నొంది త్రిసవన
తను వొందిన యట్టి వికచతామరసాక్షు
న్ననిమిష ముని యోగిజనా
వనదక్షున్ దనుజకరటివరహర్యక్షున్.

## 3-36-దేవతలు శ్రీహరినినుతించుట

3-706-వచనము

కనుంగొని.

3-707-చంపకమాల

" వనజదళాక్ష! యీ జగతి వారల మర్మము లీ వెఱింగి యీ
సునఁ బగబట్టు నీ దివిజసూదనుఁ జంపితి గాన యింక శో
భన మగు" నంచు హస్తములు ఫాలములం గదియించి యందఱున్
వినమితులై నుతించిరి వివేకవిశాలునిఁ బుణ్యశీలునిన్.

## 3-37-వరహావతార విసర్జనంబు

3-708-వచనము

అంత.

3-709-చంపకమాల

సవనవరాహమూర్తి సురశాత్రవుఁ ద్రుంచిన మీఁద భారతీ
ధవ ముఖ దేవతాముని కదంబము దన్ను నుతించు నట్టి సం
స్తవమున కాత్మలోనఁ బ్రమదంబునుఁ బొంది సమగ్ర మంగళో
త్సవము దలిర్ప నందఱఁ బ్రసాదవిలోకన మొప్పఁ జూచుచున్.

3-710-చంపకమాల

అరిగె వికుంఠధామమున కమ్మహితోత్సవసూచకంబుగా
మొరసె సుపర్వదుందుభు లమోఘములై ధరణీతలంబునం

గురిసెఁ బ్రసూనవృష్టి శిఖికుండము లెల్లెడఁ దేజరిల్లె భా
స్కరశశిమండలంబులు నిజద్యుతితో వెలుఁగొందె నత్తఱిన్."

3-711-కంద పద్యము

అని యీ పుణ్యచరిత్రము
వనరుహసంభవుఁడు త్రిదివవాసులకుం జె
ప్పిన యది మైత్రేయుఁడు విదు
రున కెఱిఁగించిన విధంబు రూఢము గాఁగన్.

3-712-కంద పద్యము

శుకయోగి పరీక్షిత్తున
కకుటిలమతి నెఱుఁగఁ జెప్పె" నని సూతుఁడు శౌ
నక ముఖ్యులైన మునివరు
లకుఁ దెలియగఁ జెప్పె మఱియు లాలనమొప్పన్.

3-713-వచనము

ఇవ్విధంబున మైత్రేయుండు సెప్పినవిని విదురుండు సంతసిల్లె నని.

3-714-కంద పద్యము

అనఘుంబగు నీ చరితము
వినినఁ బఠించిన లభించు విశ్రుతకీర్తుల్
వనజోదరుపదభక్తియు
మునుకొని యిహపర సుసౌఖ్యములు జనములకున్.

3-715-వచనము

అని చెప్పి; వెండియు సూతుండు మహర్షుల కిట్లనియె "అట్లు పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగీంద్రుం గనుంగొని "మునీంద్రా! హిరణ్యాక్ష వధానంతరంబున వసుంధర సమస్థితిం బొందిన విధంబును; స్వాయంభువమనువుఁ బుట్టించిన యనంతరంబున విరించి దిర్యగ్జాతి జంతుసృష్టి నిమిత్తంబు లైన మార్గంబు లెన్ని సృజించె; మహాభాగవతోత్తముం డయిన విదురుండు గృష్ణున కపకారంబులు దలంచిన పాపవర్తను లగు ధృతరాష్ట్రపుత్రులం బాసి జనకుం డగు కృష్ణద్వైపాయనునకు సముం డగుచుఁ దన మనోవాక్కాయకర్మంబులు గృష్ణునంద చేర్చి భాగవతజనోపాసకుండై పుణ్యతీర్థసేవాసమాలబ్ధ యశో విగతకల్మషుం డగుచు మైత్రేయ మహాముని నేమి ప్రశ్నంబు లడిగె; నవి యెల్లం దెలియ నానతి" మ్మనిన రాజేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

3-716-సీస పద్యము

" విమలాత్ముఁ డైన యవ్విదురుండు మైత్రేయ;
 మునివరుఁ జూచి యిట్లనియెఁ బ్రీతిఁ
 జతురాత్మ సకలప్రజాపతి యైనట్టి;
 జలజగర్భుఁడు ప్రజాసర్గ మందు
మును ప్రజాపతులను బుట్టించి వెండియు;
 జిత్త మం దేమి సృజింపఁ దలఁచె;
మును సృజించిన యట్టి మును లమ్మరీచాద్యు;
 లబ్జజు నాదేశ మాత్మనిలిపి

3-716.1-తేటగీతి

యర్థి నెట్లు సృజించిరి యఖిలజగము
మెఱసి మఱి వారు భార్యాసమేతు లగుచు
నేమి సృజియించి; రదిగాక కామినులను
బాసి యేమి సృజించి; రా భద్రయశులు.

3-717-కంద పద్యము

అందఱుఁ దమలో నైక్యముఁ
జెందినచో నేమి దగ సృజించిరి; కరుణా
కందళితహృదయ! యిన్నియుఁ
బొందుగ నెఱిగింపు మయ్య బుధనుత! నాకున్."

## 3-38-దేవమనుష్యాదుల సృష్టి

3-718-సీస పద్యము

అనిన మునీంద్రుఁ డిట్లనియె " జీవాదృష్ట;
 పరుఁడు మాయాయుక్త పురుషవరుఁడుఁ
గాలాత్మకుఁడు నను కారణంబున నిర్వి;
 కారుఁ డైనట్టి జగన్నివాసుఁ
డాది జాతక్షోభుఁ డయ్యె నమ్మెటి వ;
 లనను గుణత్రయంబును జనించె
నా గుణత్రయము నం దయ్యె మహత్తత్త్వ;
 మది రజోగుణహేతువైన దాని

3-718.1-తేటగీతి

యం దహంకార మొగిఁ ద్రిగుణాత్మకమునఁ
బొడమె మఱి దానివలనఁ బ్రభూత మయ్యె
బంచతన్మాత్ర లందు సంభవము నొందె
భూతపంచక మీ సృష్టిహేతు వగుచు.

3-719-వచనము

అవియును దమలోనఁ బ్రత్యేకంబ భువననిర్మాణకర్మంబునకు సమర్థంబులు గాక యన్నిటి సంఘాతంబునఁ బాంచభౌతికం బైన హిరణ్మయాండంబు సృజియించె; అదియును జలాంతర్వర్తియై వృద్ధిఁ బొందుచుండె; అంత.

3-720-సీస పద్యము

నారాయణాఖ్య నున్నతి నొప్పు బ్రహ్మంబు;
 సాహస్ర దివ్యవర్షంబులోలి
వసియించి యుండె నా వాసుదేవుని నాభి;
 యందు సహస్ర సూర్యప్రదీప్తిఁ
దనరుచు సకలజీవనికాయ యుత మగు;
 పంకజాతంబు సంభవము నొందెఁ
బరఁగంగ నందులో భగవదధిష్టితుం;
 డై స్వరాట్టగు చతురాననుండు

3-720.1-తేటగీతి

జనన మొందెను దత్పద్మసంభవుండు
నామరూపగుణాది సంజ్ఞాసమేతుఁ

డగుచు నిర్మాణ మొనరించె నఖిలజగము
వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు.

3-721-సీస పద్యము

తామిస్రమును నంధతామిస్రమును దమ;
మును మోహమును మహామోహనంబు
నను పంచమోహరూపాత్మకమైన య;
విద్యఁబుట్టించి యవ్వేళఁ దనకు
నది తమోమయ దేహ మని ధాత రోసి త;
త్తనువు విసర్జించె ధాత్రుముక్త
దేహంబు సతత క్షుత్తృష్ణల కావాస;
మును రాత్రిమయము నయ్యెను దలంప

3-721.1-తేటగీతి

నందులో యక్ష రక్షస్సు లన జనింప
వారి కప్పుడు క్షుత్తృషల్ వఱలఁ గొంద
ఱా చతుర్ముఖు భక్షింతు మనిరి కొంద
ఱతని రక్షింతు మని తగవాడి రంత.

3-722-వచనము

ఇట్లు పలుకుచు భక్షింతు మనువారలయి ధాత సన్నిధికిం జనిన; నతండు భయవిహ్వలుండై "యేను మీ జనకుండను మీరలు మత్పుత్రులరు నన్ను హింసింపకుం" డనుచు "మా మా జక్షత రక్షత" యను శబ్దంబులు పలుకం దన్నిమిత్తంబున వారలకుం గ్రమంబున యక్ష రక్షో నామంబులు ప్రకటం బయ్యె;

వెండియుం బ్రభావిభాసితం బైన యొక్క కాయంబు ధరించి సత్త్వగుణగరిష్ఠులుం, ప్రభావంతులు నగు సుపర్వులం బ్రముఖులంగా సృజియించి; తత్ప్రభామయ గాత్రవిసర్జనంబుసేసిన; నది యహోరూపంబై దేవతావళికి నాశ్రయం బయ్యె; మఱియు జఘనంబు వలన నతి లోలుపులైన యసురులం బుట్టింప వార లతికాముకు లగుటం జేసి; యయ్యజునిం జేరి మిథున కర్మం బపేక్షించిన; విరించి నగుచు నిర్లజ్జు లయిన యసురులు దన వెంటదగులం; బఱచి ప్రపన్నార్తి హారుండును భక్తజనానురూప సందర్శనుండును నైన నారాయణుం జేరి తత్పాదంబులకుం బ్రణమిల్లి యిట్లనియె.

3-723-కంద పద్యము

" రక్షింపుము రక్షింపు ము

పేక్షింపక వినుత నిఖిల బృందారక! వి

శ్వక్షేమంకర! విను మిటు

దక్షత నీ యాజ్ఞ నేను దలనిడి వరుసన్.

3-724-తేటగీతి

ఈ ప్రజాసృష్టి కల్పనం బే నొనర్ప

నందుఁ బాపాత్ము లైన యీ యసురు లిపుడు

నను రమింపఁగ డాయవచ్చినఁ గలంగి

యిటకు వచ్చితి ననుఁ గావు మిద్ధచరిత!

3-725-వచనము

అదియునుం గాక; లోకంబువారలకుం గ్లేశంబు లొనరింపం గ్లేశంబునం బొందిన వారల క్లేశంబు లపనయింపను నీవ కాక యితరులు గలరే?" యని

స్తుతియించినఁ బద్మజు కార్పణ్యం బెఱుంగ నవధరించి వివిక్తాధ్యాత్మదర్శనుం డగుచుఁ "గమలసంభవ! భవద్ఘోరతనుత్యాగంబు సేయు" మని యానతిచ్చిన నతండు నట్ల చేసె అంత నదియును.

3-726-సీస పద్యము

నవ్యకాంచనరణన్మణినూపురారావ;
 విలసిత పాదారవిందయుగళ
కాంచీకలాపసంకలిత దుకూలవ;
 స్త్రస్ఫారపులిన నితంబ బింబ
రాజితాన్యోన్యకర్కశపీనకరికుంభ;
 పృథుకుచభారకంపిత వలగ్న
మదిరారసాస్వాద మదవిఘూర్ణిత చారు;
 సిత నవవికచరాజీవనయన

3-726.1-తేటగీతి

యుపరపక్షాష్టమీ శశాంకాభ నిటల
మదవదలికులరుచిరోపమాన చికుర
లలితచంపకకుసుమవిలాస నాస
హాసలీలావలోకన యబ్జపాణి.

3-727-కంద పద్యము

అనఁదగి సంధ్యారూపం
బున లలనారత్న మపుడు పుట్టిన దానిం

గనుఁగొని దానవు లుపగూ
హనమొగిఁ గావించి పలికి రందఱు దమలోన్.

3-728-కంద పద్యము

ఈ సౌకుమార్య మీ వయ
సీ సౌందర్యక్రమంబు నీ ధైర్యంబు
న్నీ సౌభాగ్యవిశేషము
నే సతులకుఁ గలదు చూడనిది చిత్ర మగున్.

3-729-చంపకమాల

అని వెఱగంది యద్దనుజు లందఱు నిట్లని రీ తలోదరిం
గని మన మంతనుండియును గాముకవృత్తిఁ జరించుచుండగా
మన యెడ దీని చిత్తమున మక్కువలేమికి నేమి హేతువో
యని బహుభంగులం బలికి యా ప్రమదాకృతియైన సంధ్యతోన్.

3-730-వచనము

ఇట్లనిరి.

3-731-కంద పద్యము

" ఓ కదళీస్తంభోరువ!
యే కుల? మే జాడదాన? వెవ్వరి సుత? వి
ట్లేకాంతంబున నిచ్చట
నే కారణమునఁ జరించె? దెఱిఁగింపు తగన్.

3-732-కంద పద్యము

భవదీయ చారురూప
ద్రవిణలసత్పుణ్యభూమిఁ దగు మోహమునం
దవిలిన దుర్బలులను మముఁ
గవయవు పుష్పాస్త్రుబాధ ఘనమయ్యెఁ గదే!"

3-733-వచనము

మఱియుఁ దదీయ సౌందర్యం బుగ్గడింప నలవిగాక చింతించుచు.

3-734-సీస పద్యము

గురు కుచభార సంకుచితావలగ్నంబు;
 దనరారు నాకాశ తలము గాఁగ
లలిత పల్లవపాణితలమునఁ జెన్నొందు;
 చెండు పతత్పతంగుండు గాఁగ
సలలిత నీల పేశల పృథు ధమ్మిల్ల;
 బంధంబు ఘన తమఃపటలి గాఁగ
ప్రవిమలతర కాంత భావవిలోకన;
 జాలంబు దారకాసమితి గాఁగ

3-734.1-తేటగీతి

గడఁగి మెపూఁత సాంధ్యరాగంబు గాఁగఁ
నంగనాకృతి నొప్పు సంధ్యావధూటిఁ
గదిసి మనముల మోహంబు గడలుకొనఁగ
నసురు లందఱు గూడి యిట్లనిరి మఱియు.

3-735-కంద పద్యము

" వెలయఁగ బద్మం బేక
స్థలముననే యొప్పుఁ గాని త్వత్పదపద్మం
బిల బహుగతుల ననేక
స్థలముల దనరారుఁ గాదె తరుణాబ్జముఖీ!"

3-736-కంద పద్యము

అని దనుజులు దమ మనముల
ననురాగము లుప్పతిల్ల నందఱు నా సం
ధ్యను బట్టికొనిరి వనజా
సను డప్పుడు హృదయ మందు సంతస మందెన్.

3-737-కంద పద్యము

సరసిజభవుఁ డయ్యెడఁ దన
కరమాఘ్రాణింప నపుడు గంధర్వులు, న
ప్సరసలుఁ బుట్టిరి ధాతయుఁ
బరువడి నాత్మీయ తనువుఁ బాసిన నదియున్.

3-738-వచనము

చంద్రికారూపం బైన దద్గాత్రంబు విశ్వావసు పురోగము లగు గంధర్వాప్సరో గణంబులు గైకొనిరి; వెండియుం గమలగర్భుండు తంద్రోన్మాద జృంభికానిద్రారూపం బైన శరీరంబు దాల్చి; పిశాచ గుహ్యక సిద్ధ భూత గణంబులం బుట్టించిన; వారలు దిగంబరులు ముక్తకేశులు నయినం జూచి; ధాత లోచనంబులు ముకుళించి తద్గాత్రంబు విసర్జనంబు గావించిన నది వారలు

గైకొనిరి; వెండియు నజుండు దన్ను నన్నవంతునిగాఁ జింతించి యదృశ్య దేహుం డగుచుం బిత్రు సాధ్య గణంబులం బుట్టించిన; వారలు దమ్ముఁ బుట్టించిన యదృశ్య శరీరంబునకు గార్యం బగు దేవభాగంబు గైకొనినం దత్కారణంబునం బిత్రు సాధ్య గణంబుల నుద్దేశించి శ్రాద్ధంబుల హవ్యకవ్యంబు లాచరింతురు; మఱియును.

3-739-సీస పద్యము

సజ్జనస్తుత! విను చతురతఁ బంకజా;
 సనుఁడు దిరోధానశక్తివలన
నర సిద్ధ విబుధ కిన్నరలను బుట్టించి;
 తవిలి వారికిఁ దిరోధాననామ
ధేయమై నట్టి యా దేహంబు నిచ్చెను;
 వెండియు భారతీవిభుఁడు దనకుఁ
బ్రతిబింబ మగు శరీరమునఁ గిన్నరులఁ గిం;
 పురుషులఁ బుట్టింపఁ బూని వారు

3-739.1-తేటగీతి

ధాత్రు ప్రతిబింబ దేహముల్ దాల్చి వరుస
నిద్దఱిద్దఱు గలగూడి యింపులొదవ
బ్రహ్మపరమైన గీతముల్ వాడుచుండి
రంతఁ బంకజసంభవుఁ డాత్మలోన.

3-740-కంద పద్యము

తన సృష్టి వృద్ధిలేమికిఁ
గనలుచు శయనించి చింతఁ గర చరణాదుల్
గొనకొని కదలింపఁగ రా
లిన రోమము లుగ్రకుండలివ్రజ మయ్యెన్.

3-741-కంద పద్యము

వనజజుఁడు దన్నుఁ గృతకృ
త్యునిఁగా భావించి యాత్మఁ దుష్టివహింపన్
మనమున నిఖిల జగత్పా
వను లగు మునులం ద్రిలోకవరుల సృజించెన్.

3-742-సీస పద్యము

పుట్టించి వారికిఁ బురుషరూపం బైన;
 తన దేహ మిచ్చినఁ దగిలి వారు
గనుఁగొని మున్ను పుట్టినవారిఁ గూడి యా;
 వనజసంభవున కిట్లనిరి " దేవ!
యఖిలజగత్స్రష్ట వైన నీ చేతఁ గా;
 వింపంగఁబడిన యీ వితతసుకృత
మాశ్చర్యకరము యజ్ఞాదిక్రియాకాండ;
 మీ మనుసర్గ మం దీడ్యమయ్యెఁ

3-742.1-తేటగీతి

దద్దవిర్భాగములు మాకుఁ దవిలి జిహ్వ
లందు నాస్వాదనములు సేయంగఁగలిగె"

ననుచు మనముల హర్షంబు లతిశయిల్ల
వినుతిసేసిరి భారతీవిభుని మఱియు.

3-743-వచనము

వరతపోయోగవిద్యాసమాధి యుక్తుం డగుచు ఋషివేషధరుండును హృషీకాత్ముండును నై ఋషిగణంబులం బుట్టించి సమాధి యోగైశ్వర్య తపోవిద్యా విరక్తి యుక్తం బగు నాత్మీయ శరీరాంశంబు వారికిం గ్రమంబున నొక్కొక్కనికి నిచ్చె" నని మైత్రేయుండు సెప్పిన విని విదురుండు పరమానందంబునం బొంది గోవిందచరణారవిందంబులు డెందంబునం దలంచి వెండియు మైత్రేయునిం జూచి యిట్లనియె.

3-744-సీస పద్యము

" వరగుణ స్వాయంభువమనువంశం బిలఁ;
బరమ సమ్మతము దప్పదు తలంపఁ
గొనకొని తద్వంశమున మిథునక్రియఁ;
జేసి ప్రజావృద్ధిఁ జెప్పితీవు
అదియునుగాక స్వాయంభువ మనువుకుఁ;
బూని ప్రియవ్రతోత్తానపాదు
లను నందనులు గలరంటివి వారు స;
ప్తద్వీపవతి యైన ధాత్రినెల్ల

3-744.1-తేటగీతి

ధర్మమార్గంబు లేదియుఁ దప్పకుండ
ననఘులై యెట్లు పాలించి రయ్య! వారి

చరిత మెల్లను సత్కృపా నిరతబుద్ధి
నెఱుఁగ వినిపింపు నాకు మునీంద్రచంద్ర!

3-745-వచనము

అదియునుగాక; తన్మనుపుత్రియు యోగలక్షణసమేతయు నగు దేవహూతి యను కన్యకారత్నంబును స్వాయంభువుండు గర్దమునకు నే విధంబునం బెండ్లిచేసె; ఆ దేవహూతి యందు మహాయోగి యయిన కర్దముండు ప్రజల నేలాగునం బుట్టించె; అదియునుం గాక కర్దముండు రుచి యను కన్యను దక్షప్రజాతికి నిచ్చె నని చెప్పితివి; అవి యన్నియుఁ దెలియ నానతీయవలయు" నని యడిగిన విదురు నకు మైత్రేయుం డిట్లనియె.

## 3-39-కర్దమునికిహరిప్రత్యక్షంబగుట

3-746-కంద పద్యము

" విను; మనఘ! కృతయుగంబున
మునినాథుం డయిన కర్దముఁడు ప్రజల సృజిం
పను వనజసంభవునిచే
త నియుక్తుం డగుచు మది ముదము సంధిల్లన్.

3-747-తేటగీతి

ధీరగుణుఁడు సరస్వతీతీర మందుఁ
దవిలి పదివేల దివ్యవత్సరము లోలిఁ
దపముసేయుచు నొకనాఁడు జపసమాధి
నుండి యేకాగ్రచిత్తుఁడై నిండు వేడ్క.

3-748-కంద పద్యము

వరదుఁ బ్రసన్ను మనోరథ
వరదానసుశీలు నమరవంద్యు రమేశున్
దురితవిదూరు సుదర్శన
కరుఁ బూజించిన నతండు కరుణాకరుఁడై.

3-749-వచనము

అంతరిక్షంబునం బ్రత్యక్షం బైన.

3-750-సీస పద్యము

తరణి సుధాకర కిరణ సమంచిత;
 సరసీరుహోత్పల స్రగ్విలాసు
కంకణ నూపురగ్రైవేయ ముద్రికా;
 హారకుండల కిరీటాభిరాము
కమనీయ సాగరకన్యకా కౌస్తుభ;
 మణి భూషణోద్భాసమాన వక్షు
సలలిత దరహాస చంద్రికా ధవళిత;
 చారు దర్పణ విరాజత్కపోలు

3-750.1-తేటగీతి

శంఖ చక్ర గదాపద్మ చారు హస్తు
నలికులాలక రుచిభాస్వదలికఫలకు
పీతకౌశేయవాసుఁ గృపాతరంగి
తస్మితేక్షణుఁ బంకజోదరుని హరిని.

3-751-వచనము

మఱియు; శబ్దబ్రహ్మశరీరవంతుండును, సదాత్మకుండును, జ్ఞానైక వేద్యుండును, వైనతేయాంస విన్యస్త చరణారవిందుండును నయిన గోవిందుని గనుంగొని సంజాత హర్ష లహరీ పరవశుండును లబ్ద మనోరథుండును నగుచు సాష్టాంగదండప్రణామంబు లాచరించి; తదనంతరంబ.

3-752-కంద పద్యము

ముకుళిత కరకమలుండయి
యకుటిల సద్భక్తి పరవశాత్మకుఁ డగుచున్
వికచాంభోరుహలోచను
నకు నిట్లనియెం దదాననముఁ గనుఁ గొనుచున్.

3-753-సీస పద్యము

" అబ్జాక్ష! సకల భూతాంతరాత్ముఁడ వనఁ;
దనరుచుండెడి నీదు దర్శనంబుఁ
దలకొని సుకృతసత్ఫలభరితంబు లై;
నట్టి యనేక జన్మానుసరణ
ప్రకటయోగక్రియాభ్యాసనిరూఢు లై;
నట్టి యోగీశ్వరు లాత్మఁ గోరి
యెంతురు యోగీశ్వరేశ్వర యే భవ;
త్పాదారవింద సందర్శనంబు

3-753.1-తేటగీతి

గంటి భవవార్ధిఁ గడవంగఁ గంటి మంటిఁ
గడఁగి నా లోచనంబుల కలిమి నేఁడు
తవిలి సఫలత నొందె; మాధవ! ముకుంద!
చిరదయాకర! నిత్యలక్ష్మీవిహార!

3-754-వచనము

అదియునుం గాక; దేవా! భవదీయ మాయావిమోహితులై హత మేధస్కులై సంసారపారావారోత్తారకంబులైన భవదీయ పాదారవిందంబులు దుచ్ఛవృత్తి కాము లయి సేవించి నిరయగతులైన వారికిం దత్కాయ యోగ్యంబు లగు మనోరథంబుల నిత్తువు; అట్టి సకాము లైన వారిఁ నిందించు నేనును గృహమేధ ధేనువు నశేషమూలయుం,ద్రివర్గ కారణయుం, సమానశీలయు నయిన భార్యం బరిణయంబుగా నపేక్షించి కల్పతరుమూల సదృశంబు లైన భవదీయ పాదారవిందంబులు సేవించితి; అయిన నొక్క విశేషంబు గలదు; విన్నవించెద నవధరింపుము; బ్రహ్మాత్మకుండ వయిన నీదు వచస్తంతు నిబద్ధు లై లోకులు కామహతు లైరఁట; ఏనును వారల ననుసరించినవాఁడ నై కాలాత్మకుండ వైన నీకు నభిమతం బగునట్లుగాఁ గర్మమయం బైన భవదాజ్ఞాచక్రంబు ననుసరించుటకుఁ గాని మదీయ కామంబు కొఱకుఁ గాదు; భవదీయ మాయావినిర్మితంబును; గాలాత్మక భూరి వేగసమాయుక్తంబును; నధిమానస సమేత త్రయోదశ మాసాంరంబును; షష్ట్యుత్తరశతత్ర యాహోరాత్ర మయ పర్వంబును; ఋతుషట్క సమాకలిత నేమియుం; జాతుర్మాస్యత్రయ విరాజిత నాభియు; నపరిమిత క్షణలవాది పరికల్పిత పత్రశోభితంబునుం; గాలాత్మక భూరివేగ సమాయుక్తంబును నైన కాలచక్రంబు సకల జీవనికరాయుర్గ్రసన తత్పరం బగుం; గాని కామాభిభూత జనానుగత పశుప్రాయు లగు లోకుల విడిచి

భవ పరితాప నివారణ కారణం బయిన భవదీయ చరణాతపత్ర చ్ఛాయాసమాశ్రయులై తావకీన గుణకథన సుధాస్వాదన రుచిర లహరీ నిరసిత సకల దేహధర్ము లైన భగవద్భక్త జనాయుర్హరణ సమర్థంబు గాకుండు" నని వెండియు.

3-755-మత్తేభ విక్రీడితము

" అనఘా! యొక్కఁడ వయ్యు నాత్మకృత మాయాజాత సత్త్వాది శ
క్తినికాయస్థితి నీ జగజ్జనన వృద్ధిక్షోభ హేతుప్రభా
వని రూఢిం దగు దూర్ణనాభిగతి విశ్వస్తుత్య! సర్వేశ! నీ
ఘనలీలా మహిమార్ణవంబుఁ గడవంగా వచ్చునే? యెరికిన్.

3-756-వచనము

దేవ! శబ్దాది విషయ సుఖకరం బగు రూపంబు విస్తరింపఁ జేయు టెల్ల నస్మదనుగ్రహార్థంబు గాని నీ కొఱకుం గా దాత్మీయమాయా పరివర్తిత లోకతంత్రంబు గలిగి మదీయ మనోరథ సుధాప్రవర్తి వైన నీకు నమస్కరించెద."

3-757-మత్తేభ విక్రీడితము

అని యిబ్భంగి నుతించినన్ విని సరోజాక్షుండు మోదంబునన్
వినతానందన కంధరోపరిచరద్విభ్రాజమానాంగుఁడున్
యనురాగస్మితచంద్రికాకలితశోభాలోకుఁడై యమ్మునీం
ద్రునిఁగారుణ్యమెలర్పఁజూచి పలికెన్ రోచిష్ణుఁడై ప్రేల్మిడిన్

3-758-కంద పద్యము

" మునివర! యే కోరిక నీ
మనమునఁ గామించి నను సమంచిత భక్తిన్
నెనరునఁ బూజించితి నీ
కనయము నా కోర్కి సఫల మయ్యెడుఁ జుమ్మీ."

3-759-వచనము

అని యానతిచ్చి; "ప్రజాపతిపుత్రుండును సమ్రాట్టును నైన స్వాయంభువమనువు బ్రహ్మావర్తదేశంబు నందు సప్తార్ణవమేఖలా మండిత మహీమండలంబుఁ బరిపాలించుచున్నవాఁడు; అమ్మహాత్ముం డపరదివసంబున నిందులకు శతరూప యను భార్యాసమేతుండై భర్త్ర కామ యగు కూఁతుం దోడ్కొని భవదీయ సన్నిధికిం జనుదెంచి; నీకు ననురూప వయశ్శీల సంకల్ప గుణాకర యైన తన పుత్రిం బరిణయంబు గావించు; భవదీయ మనోరథంబు సిద్ధించు; ననుం జిత్తంబున సంస్మరించు చుండు; నమ్మనుకన్య నిను వరించి భవద్వీర్యంబు వలన నతి సౌందర్యవతు లయిన కన్యలం దొమ్మండ్రం గను; ఆ కన్యకానవకంబు నందు మునీంద్రులు పుత్రోత్పాదనంబులు సేయంగలరు; నీవు మదీయ శాసనంబును ధరియించి మదర్పితాశేషకర్ముండ వగుచు; నైకాంతిక స్వాంతంబున భూతాభయదానదయాచరిత జ్ఞానివై నా యందు జగంబులు గలవనియు; నీ యందు నేఁ గల ననియు; నెఱింగి సేవింపుము. చరమకాలంబున ననుం బొందగలవు. భవదీయ వీర్యంబువలన నేను నీ భార్యాగర్భంబుఁ బ్రవేశించి మత్కళాంశంబునఁ బుత్రుండనై సంభవించి నీకుం దత్త్వసంహిత నుపన్యసింతును;" అని జనార్దనుండు గర్దమున కెఱింగించి; యతండు గనుగొనుచుండ నంతర్హితుండై.

3-760-చంపకమాల

అతుల సరస్వతీసరిదుదంచిత బాలరసాలసాల శో
భిత తట తుంగరంగ మగు బిందుసరంబు వినిర్గమించి యం
చిత గరుడాధిరోహణముసేసి తదీయ గరుత్ప్రభూత ఋ
క్ప్రతతివిలక్షణక్రమవిరాజితనాదము వించు మోదియై.

3-761-చంపకమాల

అరిగె వికుంఠధామమున కంత సకామనుఁ డైన కర్దముం
డరయ విమోహియై మనము నందును ముందట వచ్చు కోరికల్
పిరిగొనుచుండఁ దత్క్షణమ బిందుసరంబున కేగి యుందిరా
వరుఁ దలపోయుచుండె జనవంద్యుఁడు భక్తినితాంతచిత్తుఁ డై.

## 3-40-దేవహూతి పరిణయంబు

3-762-వచనము

అంత స్వాయంభువుండు గనకరథారూఢుం డగుచు నిజభార్యా సమేతుం డై భర్తృవాంఛాపరయైన పుత్రికం దోడ్కొనుచు నిజ తనూజకుం దగిన వరు నన్వేషించుచు భువనంబునం గలయం గ్రుమ్మరి; యెందునుం గానక వచ్చివచ్చి.

3-763-ఉత్పలమాల

ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు విష్ణుఁడు గర్దమున్ మహా
నంద మెలర్పఁ జూచి నయనంబుల రాలిన బాష్పముల్ ధరన్
బిందువులై వెసం దొరఁగి పేర్చి సరస్వతిఁ జుట్టి పాఱుటన్
బిందుసరోవరం బనెడి పేరఁ దనర్చిన పుణ్యతీర్థమున్.

3-764-ఉత్పలమాల

అందుఁ దమాల సాల వకుళార్జున నింబ కదంబ పాటలీ
చందన నారికేళ ఘనసార శిరీష లవంగ లుంగ మా
కంద కుచందనక్రముక కాంచన బిల్వ కపిత్థ మల్లికా
కుంద మధూక మంజులనికుంజములం దనరారి వెండియున్

3-765-కంద పద్యము

పరిపక్వఫలభరానత
తరుశాఖానికర నివసితస్ఫుట విహగో
త్కర బహుకోలాహలరవ
భరితదిగంతములు గలిగి భవ్యం బగుచున్.

3-766-కంద పద్యము

అతి నిశిత చంచు దళన
క్షత నిర్గత పక్వఫలరసాస్వాదన మో
దిత రాజశుక వచోర్థ
శ్రుతఘోషము సెలఁగ శ్రవణసుఖదం బగుచున్.

3-767-కంద పద్యము

లలితసహకారపల్లవ
కలితాస్వాదన కషాయకంఠ విరాజ
త్కలకంఠ పంచమస్వర
కలనాదము లుల్లసిల్లఁ గడురమ్యములై.

3-768-కంద పద్యము

అతుల తమాల మహీజ
ప్రతతిక్షణజాత జలదపరిశంకాంగీ
కృత తాండవఖేలన విల
సితపింఛవిభాసమాన శిఖి సేవ్యంబై.

3-769-కంద పద్యము

కారండవ జలకుక్కుట
సారస బక చక్రవాక షట్పద హంసాం
భోరుహ కైరవ నవక
ల్హార విరాజిత సరోరుహాకర యుతమై.

3-770-కంద పద్యము

కరి పుండరీక వృక కా
సర శశ భల్లూక హరిణ చమరీ హరి సూ
కర ఖడ్గ గవయ వలిముఖ
శరభప్రముఖోగ్ర వన్యసత్త్వాశ్రయ మై.

3-771-వచనము

ఒప్పు నప్పురము తాపసోత్తముని యాశ్రమంబుఁ గనుంగొని మిత
పరిజనంబులతోడం జొచ్చి; యందు.

3-772-సీస పద్యము

అంచితబ్రహ్మచర్యవ్రతయోగ్యమై;
 విలసిల్లు ఘనతపోవృత్తిచేత
దేహంబు రుచిర సందీప్తమై చెలువొందఁ;
 గడుఁ గృశీభూతాత్మ కాయుఁ డయ్యు
నలినోదరాలాపనవసుధాపూరంబు;
 శ్రోత్రాంజలులఁ ద్రావి చొక్కి యున్న
కతనఁ గృశీభూతకాయుండు గాక జ;
 టావల్కలాజిన శ్రీ వెలుంగఁ

3-772.1-తేటగీతి

గమలపత్ర విశాలనేత్రములు దనర
నలిన సంస్కార సంచితానర్ఘ నూత్న
రత్నమును బోలి యున్న కర్దమునిఁ జూచి
భక్తి నమ్మను వెఱఁగెఁ దత్పాదములకు.

3-773-వచనము

ఇట్లు వందనంబు గావించినం గర్దముండు దన గృహంబునకు విందై చనుదెంచిన యమ్మనువు నాదరించి; యర్ఘ్యపాద్యాది విధులం బరితుష్టునిం గావించి; పూర్వోక్తంబైన భగవదాదేశంబు సంస్మరించి స్వాయంభువున కిట్లనియె.

3-774-సీస పద్యము

" వరగుణాకర! భగవద్భక్తి యుక్తుఁడ;
 వైన త్వదీయ పర్యటన మెల్ల
శిష్టపరిగ్రహదుష్టనిగ్రహముల;

కొలుకుఁ గదా పుణ్యపురుష! మఱియు
వనజహితాహిత వహ్నిసమీర పై;
వస్వత వార్ధిప వాసవాత్మ
కుఁడవు హరిస్వరూపుఁడ వైన నీకును;
మానితభక్తి నమస్కరింతు

3-774.1-తేటగీతి

ననఘ! నీ వెప్పుడేనేమి యఖిలలోక
జైత్ర మగు హేమమణిమయ స్యందనంబు
నెక్కి కోదండపాణివై యుద్ధ సైన్య
పదవిఘట్టనచే భూమిభాగ మగల.

3-775-మత్తేభ విక్రీడితము

తరణిం బోలెఁ జరింపకున్న ఘననిద్రం బొంది యుండేని భూ
వర! పద్మోదరకల్పితంబు లగు నీ వర్ణాశ్రమోదార వి
స్తర పాథోనిధిసేతుభూతమహిమాచారక్రియల్ తప్పి సం
కరమై చోరభయంబునన్ నిఖిల లోకంబుల్ నశించుం జుమీ."

3-776-వచనము

అని పలికి "భవదాగమనంబునకు నిమిత్తం బెయ్యది" యనవుడు సమాహిత సకలనిత్యకర్మానుష్ఠానుండైన మునీంద్రునకు స్వాయంభువుం డిట్లనియె.

3-777-కంద పద్యము

" సరసిజగర్భుఁడు దనచే
విరచిత మైనట్టి వేదవితతుల నెల్లన్
ధర వెలయించుటకై బుధ
వర మిమ్ముం దన ముఖంబువలన సృజించెన్.

3-778-కంద పద్యము

దురితస్వరూప పాట
చ్చరపీడం బొందకుండ సకలక్షోణిం
బరిపాలించుటకై మము
నరవిందభవుండు భుజము లందు సృజించెన్.

3-779-కంద పద్యము

నెఱి నట్టి జలజభవునకుఁ
గర మంతఃకరణ గాత్రకములై వరుసం
బరఁగిన బ్రహ్మక్షత్రము
లరయ రమాధీశ్వరునకు నవనీయంబుల్.

3-780-వచనము

కావున; హరిస్వరూపుండవై దుర్జనదుర్దర్శనుండ వయిన నినుం గనుట మదీయ భాగ్యంబున సిద్ధించె; భవత్పాదకంజ కింజల్కపుంజరంజితం బైన మదీయ మస్తకంబును దావక వచనసుధాపూరితంబు లైన శ్రవణంబులును మంగళకరత్వంబున సాఫల్యంబునుం బొందె; నేను కృతార్థుండ నైతి; దుహితృస్నేహదుఃఖ పరిక్లిన్నాంతఃకరణుండ నై సకలదేశ భ్రమణ ఖిన్నుండ నైన నా విన్నపం బవధరింపుము;" అని యిట్లనియె.

3-781-మత్తేభ విక్రీడితము

" వరయోగీశ్వర! దేవహూతి యను నీ వామాక్షి మత్పుత్రి దా
వర లావణ్య గుణాఢ్యులన్ వినియు నెవ్వారిన్ మదిం గోర కా
తురయై నారదు పంపునన్ మిము వరింతున్నంచు నేతెంచె నీ
తరుణీబిక్షఁ బరిగ్రహింపుము శుభోదాత్తక్రియాలోలతన్.

3-782-కంద పద్యము

అమలినగృహమేధిక క
ర్మములకు ననురూపగుణ విరాజితశీల
క్రమములఁ దనరిన తరుణిం
బ్రమదమున వరింపు మయ్య భవ్యచరిత్రా!

3-783-కంద పద్యము

అనఘ! విరక్తుల కైనం
దనయంత లభించు సౌఖ్యతతి వర్జింపం
జనదఁట కాముకులకు న
బ్బిన మానుదురే? లభించు ప్రియసౌఖ్యంబుల్.

3-784-కంద పద్యము

వినుము ఫలారంభుఁడు గృప
ణుని నడిగినఁ దన యశంబునుం దగు మానం
బును జెడుఁ గావునఁ దగ నీ
వెనయ వివాహేచ్ఛఁ దగులు టెఱిఁగి యిచటికిన్.

3-785-కంద పద్యము

చనుదెంచితి మస్మత్ప్రా
ర్థనఁ గైకొని మత్తనూజఁ దగ వరియింపుం"
డన ముని స్వాయంభువునిం
గనుఁగొని మరలంగ బలికెఁ గడు మోదమునన్.

3-786-సీస పద్యము

" అనఘ! నీచేత నన్యదత్తముగఁ బ్ర;
తిష్ఠితంబైన యీ తీవబోఁడి
కమనీయరూపరేఖావిలాసంబుల;
మానితలక్ష్మిసమాన యగుచు
నొకనాఁటి రాత్రి యం దుడురాజచంద్రికా;
ధవళిత నిజ సౌధతలము నందు
మహిత హిరణ్మయ మంజీర శోభిత;
చరణ యై నిజ సఖీ సహిత యగుచుఁ

3-786.1-తేటగీతి

గందుకక్రీడఁ జరియింప గగన మందు
వరవిమానస్థుఁ డగుచు విశ్వావసుండు
నాఁగఁ దనరిన గంధర్వనాయకుండు
తరుణిఁ జూచి విమోహియై ధరణిఁ బడియె.

3-787-తేటగీతి

పుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు
లీ తలోదరిఁ బొడగాన రేమిసెప్ప
నట్టి కొమరాలు భాగ్యోదయమునఁ దాన
వచ్చి కామింప నొల్లనివాఁడు గలఁడె.

3-788-కంద పద్యము

ఈ కన్యారత్నమునకు
నాకును గుణరూపవర్తనంబుల యెడ నా
లోకింప సమము కావునఁ
గైకొని వరియింతు విగతకల్మషవృత్తిన్.

3-789-కంద పద్యము

విమలాత్మ! దీని కొక సమ
యము గల దెఱిఁగింతు విను గుణాకర యగు నీ
రమణికి నపత్యపర్యం
తము వర్తింపుదు గృహస్థధర్మక్రియలన్.

3-790-ఆటవెలది

అంతమీఁద విష్ణు నాజ్ఞ యొాఁదలఁ దాల్చి
శమదమాదియోగసరణిఁ బొంది
సన్న్యసించువాఁడ జలజనేత్రుని వాక్య
కారణమునఁ జేసి ధీరచరిత!

3-791-కంద పద్యము

శ్రీవిభునివలన నీ లో
కావళి యుదయించుఁ బెరుఁగు నడఁగును విను రా
జీవ భవాదుల కతడే
భూవర! నిర్మాణహేతుభూతుం డరయన్.

3-792-వచనము

అదిగావున; నమ్మహాత్ముని యాజ్ఞోల్లంఘనంబు సేయరా" దని కర్దముండు పలికిన విని స్వాయంభువుండు నిజ భార్య యైన శతరూప తలంపును, బుత్రియైన దేవహూతి చిత్తంబును నెఱింగిన వాఁడై, ముని సమయంబున కియ్యకొని ప్రహృష్ట హృదయుం డగుచు సముంచిత గుణాఢ్యుం డయిన కర్దమునకు దేవహూతిని విధ్యుక్త ప్రకారంబున వివాహంబు సేయించె; తదనంతరంబ; శతరూపయును బారిబర్హసంజ్ఞికంబు లైన వివాహోచిత దివ్యాంబరాభరణంబులు దేవహూతి కర్దముల కొసంగె; ఇవ్విధంబున నిజ కులాచార సరణిం బరిణయంబు గావించి విగతచింతాభరుం డై స్వాయంభువుండు దుహితృ వియోగ వ్యాకులిత స్వాంతు డై; కూఁతుం గౌఁగలించుకొని, చుబుకంబుఁలు బుడుకుచుఁ, జెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని ప్రేమాతిరేకంబున బాష్పధారాసిక్తమస్తకం జేసి "తల్లీ! పోయివచ్చెద" నని చెప్పి, కర్దమునిచేత నామంత్రితుం డై నిజ భార్యా సమేతంబుగ రథం బెక్కి స పరివారుం డై.

3-793-చంపకమాల

తరళతరంగవీచి సముదంచిత బిందు సరస్సరస్వతీ
స రిదరవింద తుందిల లసత్తరు తీరనివాస సన్మునీ

శ్వర నికరాశ్రమా కలిత సంపదలం గనుఁగొంచు వేడ్క ము
ప్పిరిగొన నేగె నాత్మ పుటభేదన విస్ఫుటమార్గవర్తి యై.

3-794-వచనము

ఇట్లు చనిచని బ్రహ్మావర్తదేశంబు నందు.

3-795-సీస పద్యము

ఎందేనిఁ దొల్లి లక్ష్మీశుండు యజ్ఞసూ;
కరమూర్తిఁ గైకొని సరభసముగ
నొడలు జాడించినఁ బుడమిపై రాలిన;
రోమజాలంబులు రుచిర హరిత
వర్ణమై పొలుపార వరకు శకాశమ;
యంబును యజ్ఞక్రియాకలాప
యోగ్యంబు నై చాల నొప్పారి బర్హిస్సు;
సంభవించిన దాన సకలఋషులుఁ

3-795.1-తేటగీతి

గ్రతువు లొనరించి తద్విఘ్నకారు లైన
యసురులం ద్రుంచి రట్ల స్వాయంభువుండు
విష్ణుపరముగ మఖము గావించి రుచిర
మేధ సెలువొంద వచ్చి యాత్మీయపురము.

3-796-కంద పద్యము

డాయంజనఁ బురజనము లు
పాయనములు దెచ్చియిచ్చి బహుగతుల నుతుల్
సేయఁగ మంగళతూర్యము
లాయతగతి మ్రోయఁ జొచ్చె నంతఃపురమున్.

3-797-వచనము

ఇట్లు ప్రవేశించి; తాపత్రయోపశమనం బగు భగవద్భక్తి వృద్ధిఁ బొందించుచుఁ బుత్ర మిత్ర కళత్ర సుహృద్భావ సహితుం డై పరమానందంబున

3-798-మత్తేభ విక్రీడితము

అతి భక్తిం బ్రతివాసరంబును హరివ్యాసంగుఁ డై మాధవాం
కిత గంధర్వ విపంచికా కలిత సంగీతప్రబంధానుమో
దితుఁ డై యిష్ట విభూతు లందు ననురక్తిం బొంద కేప్రొద్దు న
చ్యుత సేవైకపరాయణుం డగుచు నస్తోకప్రభావోన్నతిన్

3-799-మత్తేభ విక్రీడితము

హరి పాదాంబురుహద్వయార్పిత తులస్యామోదముం గొంచుఁ ద
చ్చరితంబుల్ దలపోయుచుం బొగడుచుం జర్చించుచున్ వించుఁ ద
త్పరిచర్యావ్యతిరిక్త సంసరణ సద్ధర్మార్థకామంబులం
బరిభూతంబులు సేసి మోక్షపద సంప్రాప్తిక్రియారంభుఁ డై.

3-800-కంద పద్యము

నిగమార్థగోచరుం డనఁ
దగు హరిచరితప్రసంగతత్పర చిత్తుం

డగు నతనికి స్వాంతరగము
లగు యామము లొగి నయాతయామము లయ్యెన్.

3-801-సీస పద్యము

వెండియు నమ్మేటి విష్ణుమంగళకథా;
కర్ణన ధ్యానానుగాన నుతులు
సలుపుచు స్వస్వప్న జాగ్రత్సుషుప్తులఁ;
దలఁగించి యా పుణ్యతముఁడు దాను
జక్రిదాసుఁడు గాన శారీర మానస;
దివ్యమానుష భౌతికవ్యధలను
దగులక సన్మునీంద్రశ్రేణికిం దగఁ;
దనరు వర్ణాశ్రమధర్మగతులు

3-801.1-తేటగీతి

దప్పకుండంగ నడపుచుఁ దగిలి సర్వ
భూతహితవృత్తి నతుల విఖ్యాతలీల
నేకసప్తతియుగము లస్తోకచరితుఁ
డగుచు వర్తించె సమ్మోద మతిశయిల్ల."

3-802-కంద పద్యము

అని యమ్మనుచరితము విదు
రున కమ్మైత్రేయమునివరుఁడు దయతోడన్
వినిపించి కర్దమునికథ
దనరఁగ నెఱిఁగింతు నని ముదంబునఁ బలికెన్.

## 3-41-కర్దముని విమానయానంబు

### 3-803-వచనము

"ఇట్లు స్వాయంభువుండు దేవహూతిం గర్దమునికి వివాహంబుసేసి మరలిచనినం దదనంతరంబ; దేవహూతియుఁ బతిభక్తి గలిగి భవునికి భవాని పరిచర్యసేయు తెఱంగునఁ బతియ తనకు నేఁడుగడయుంగా నెఱింగి; యమ్మునీంద్రుని చిత్తవృత్తికొలఁది దినదినంబునకు భక్తితాత్పర్యస్నేహంబులు రెట్టింపం; బ్రియశుశ్రూషణంబులు గావించుచు ననూనతేజోవిరాజిత యగుచుఁ గామక్రోధ దంభలోభాది గుణవిరహిత యై; శరీరశుద్ధి వహించి మృదుమధుర వచనరచన యై; పతిభక్తి యేమఱక వర్తింప దైవయోగంబు నైననుం దప్పింప సమర్థుం డైన కర్దముండు నిజ సేవాయాసకృశీభూతదేహ యై యున్న దేవహూతిం గరుణా తరంగితాపాంగుం డై కనుంగొని మంజుభాషణంబుల నిట్లనియె.

### 3-804-ఉత్పలమాల

" మానిత ధర్మమార్గమహిమస్ఫుట భూరి తపస్సమాధి వి
ద్యానిభృతాత్మయోగ సముపార్జిత విష్ణుకటాక్షలబ్ధ శో
భానఘ దివ్యభోగ బహుభద్ర వితానము లస్మదీయ సే
వా నిరతిన్ లభించు ననివారణ నిత్తును దివ్యదృష్టియున్.

### 3-805-తేటగీతి

నెలఁత! తద్దివ్యదృష్టి నన్నియును నీకుఁ
గానవచ్చు విలోకింపు కమలపత్ర

నయను బొమముడి మాత్రన నాశ మందు
నితర మగు తుచ్ఛభోగంబు లేమిసెప్ప.

3-806-సీస పద్యము

అనుపమ రాజ్యదర్పాంధచేతస్కు లై;
 పాపవర్తను లైన పార్థివులకు
ధృతిఁ బొందరాని యీ దివ్యభోగంబులు;
 నీదు పాతివ్రత్యనిష్ఠఁజేసి
సంప్రాప్తములు నయ్యె సమత భోగింపుము;
 కార్యసిద్ధియు నగుగాక నీకు"
ననుటయు నతివయు ననుపమ యోగమా;
 యా విచక్షణవిభుండైన కర్ద

3-806.1-తేటగీతి

మునిఁ గనుంగొని విగతాధియును నపాంగ
కలిత లజ్జానతాస్యపంకజయు నగుచు
వినయ సౌహార్దములఁజేసి విహ్వలంబు
లయిన పలుకులఁ బతికి నిట్లనియెఁ బ్రీతి.

3-807-వచనము

" అనఘా! యమోఘయోగమాయావిభుండవు సమర్థుండవు నయిన నీయందు నీ యనుపమ దివ్యభోగంబులు గలుగుట నిక్కం బని యెఱుంగుదు; భవత్సంగతి నన్నియు నాకుం గలుగు; నయినను దేవా! నీ వానతిచ్చిన సంతానపర్యంతం బైన శరీరసంగమ సమయంబు చిత్తంబునం దలంచి భవదంగసంగమంబుఁ

గృపసేసి మన్నింపుము; భవదీయ సంయోగవాంఛాపరతం గృశీభూతం బయిన యీ దేహం బే విధంబున మజ్జన భోజన పాన సుఖంబులం బరితుష్టింబొందు నట్టి మన్మనోరథంబుఁ దీర్ప రతిరహస్య ప్రకాశంబగు కామశాస్త్ర ప్రకారం బుపశిక్షించి యందులకు నుచితంబు లయిన వివిధాంబరాభరణ మాల్యానులేపన మందిరారామ ప్రముఖ నిఖిల వస్తువిస్తారంబు గావించి నన్నుం గరుణింపుము" అనిన నమ్మహాత్ముండు నిజ యోగమాయా బలంబునం దత్క్షణంబ.

3-808-సీస పద్యము

దివ్యమణిస్తంభదీప్తిఁ జెన్నొందుచు;
 మరకతస్థలముల మహిమ దనర
వర వజ్రకుడ్యకవాట శోభితము లై;
 విద్రుమ దేహాళీవీథు లమరఁ
గొమరొప్ప నవశాతకుంభ కుంభములపై;
 హరినీలశకల విస్ఫురణ మెఱయఁ
దగఁ బద్మరాగంపు మొగడలఁ జెలువొందు;
 వైడూర్యవలభులు వన్నెఁ జూపఁ

3-808.1-తేటగీతి

దరళతర ధూతకేతుపతాక లొలయ
మంజుశింజత్సమంచిత మధుప కలిత
సురుచిరాలంబమాన ప్రసూనరాజి
మాలికల నొప్పు వివిధ గృహాళిఁ దనరి.

3-809-కంద పద్యము

మఱియును దుకూలచీనాం
బర కౌశేయాది వివిధ పటపరివృత మం
దిర సుభగాకారంబై
యరుదార విచిత్ర పట్టికాలంకృత మై.

3-810-మత్తేభ విక్రీడితము

లలితోద్యానవనాంత సంచరణలీలాలోల హంసాళి కో
కిల పారావత చక్రవాక శుక కేకీవ్యూహ మంచత్సము
త్కలికం గృత్రిమపక్షులన్ నిజవిహంగశ్రేణి యంచుం గుతూ
హలి యై పల్కుచు నాడుచుండుఁ బ్రతిశాఖారోహణవ్యాప్తులన్.

3-811-వచనము

వెండియు.

3-812-కంద పద్యము

ఘన సౌధాంతర శయ్యా
సన కేళీగేహ కృతక జగతీధర శో
భన చంద్రకాంత చారు భ
వన ఫలభరితావనీజవంతము లగుచున్.

3-813-కంద పద్యము

సకలర్తు శోభితంబును
సకల శుభావహము సకల సంపత్కరమున్

సకలోపభోగయోగ్యము
సకలేప్సితకామదంబు సదలంకృతమున్.

3-814-వచనము

అగుచు నొప్పు దివ్యవిమానంబుఁ గల్పించి తదీయ సుషమావిశేష విచిత్రంబులు నిర్మించిన తానునుఁ దెలియంజాలని యద్భుతకర్మంబు లైన విమానంబు దేవహూతికిం జూపినం జూచి యమ్ముద్దియ సంతసింపకుండుట యెఱింగి సర్వభూతాంతరాశ యాభిజ్ఞుండును సంతుష్టాంతరంగుండును నైన గర్దముం డిట్లనియె.

3-815-తేటగీతి

" అతివ భగవత్కృతంబును నఖిలమంగ
ళాకరంబును నగు నీ జలాశయమునఁ
దవిలి గ్రుంకిన జంతువితానములకుఁ
గామ్యఫలసిద్ధి సేకుఱుఁ గాన నీవు.

3-816-కంద పద్యము

ఇజ్జలముల నతి భక్తిని
మజ్జన మొనరించి యీ విమానము వేడ్కన్
లజ్జావతి యెక్కవె" యని
బుజ్జన మొనరంగఁ గర్దముఁడు పల్కుటయున్.

## 3-42-దేవహూతితోఁగ్రుమ్మరుట

3-817-వచనము

విని యాకువలయాక్షి పతిసేవాయాస మలినాంబరయు, వేణీభూత శిరోజయు, ధూళిధూసరితాతికృశీభూతాంగయు, శబలస్తనయు నై బిందుసరోవరంబుఁ బ్రవేశించి తజ్జలంబులఁ గ్రుంకులిడు సమయంబునఁ దద్వాఃపూర మధ్యంబున రుచిర సూక్ష్మాంశుకధారిణులుఁ, గిశోర వయఃపరిపాక శోభితలు, నుత్పలగంధులు నగు కన్యాసహస్రంబులు దేవహూతిం గనుంగొని యిట్లనిరి.

3-818-కంద పద్యము

" తరుణీ! సంచిత ధర్మా
చరణల మగు మేము నీకు సదమలభక్తిం
బరిచర్యసేయనేర్తుము
కరుణాకలితేక్షణములఁ గనుగొను మమ్మున్."

3-819-సీస పద్యము

అని పల్కి; డాసి యయ్యతివకు నభ్యంజ;
నోద్వర్తనములు పెంపొనరఁ జేసి
మలయజకర్పూర మహిత వాసిత హేమ;
కలశోదకంబుల జలక మార్చి
ధవళవస్త్రంబులఁ దడి యొత్తి సర్వాంగ;
ధూపంబు లొసఁగి కస్తూరి యలది
మంజు శింజన్మణి మంజీర కింకిణీ;
కలరావకలిత మేఖలలు రత్న

3-819.1-తేటగీతి

ఖచిత తాటంకముద్రికా కంకణాది
సముచితానర్ఘ్య హేమభూషణము లొసఁగి
భవ్య మాల్యానులేపనాంబరము లిచ్చి
షడ్రసోపేత వివిధాన్న సమితిఁ దనిసి.

3-820-వచనము

మఱియుం, గనకపాత్ర రచితంబు లయిన కర్పూరనీరజనంబు లిచ్చి; రుచిరాసనంబునఁ గూర్చుండఁ బెట్టి దర్పణంబు సేతి కిచ్చినం దత్ప్రతిఫలిత నిజ దేహంబు గనుంగొని; కర్దముని మనంబునం దలంచిన నతండునుం గన్యకాసహస్రంబును దత్క్షణంబునఁ దన సన్నిధి నుండుటం జూచి; నిజభర్తృయోగమాయా ప్రభావంబునకు నద్భుతంబు నొందె; అంతఁ గర్దముండునుం గృతస్నాన యైన దేవహూతిం గనుంగొని వివాహంబునకు ముందట నే నందంబునం దనరుచుండె నా చందంబునం జెన్నొందుచుండుటకు నానందభరితుం డై భార్యా సహితంబుగఁ దత్కన్యకాసహస్రంబు గొలువ నిజ విమానారూఢుం డై తారాగణ పరివృత రోహిణీ యుక్తుం డగు సుధాకరుండునుం బోలె నొప్పుచుఁ దదనంతరంబ.

3-821-చంపకమాల

చిర శుభమూర్తి యమ్ముని యశేష దిగీశ విహార యోగ్యమున్
సురుచిరమందగంధవహశోభితమున్ నికటప్రధాతు ని
ర్ఝరసరిదంబు శీతలతుషారమునై తనరారు మేరుకం
దరమునకేగి దేవవనితాయుతుఁడైన కుబేరుచాడ్పునన్

3-822-వచనము

మఱియును.

3-823-మత్తేభ విక్రీడితము

అమరోద్యానవనప్రదేశములు నవ్యారామభూముల్ దళ
త్కుముదాంభోజ విభాసిమానస సరఃకూలంబులున్ మంజుకుం
జములుం జైత్రరథంబు విస్ఫురిత విస్రంభంబునం జూచె నె
య్యమునం గర్దమయోగి కామగవిమానారూఢుఁ డై చెచ్చెరన్.

3-824-వచనము

ఇవ్విధంబున, సమస్త భూభాగంబును వాయువేగంబునం గలయం గ్రుమ్మరి నిఖిల వైమానికలోకంబు నతిశయించి లోకంబులం జరించె; మోక్షదాయకుండుఁ దీర్థపాదుండు నగు పుండరీకాక్షుని సన్నుతించి సేవించు పుణ్యాత్ములకుం బొందరాని పదార్థములు గలవే; ఇట్లు కర్దముండు దేవహూతికి నిఖిల ధరాచక్రం బంతయుఁ జూపి; మరల నిజ నివాసంబునకుం జనుదెంచి; కామకేళీవినోదాత్మిక యైయున్న భార్య నుపలక్షించి రతిప్రసంగంబు గైకొని బహు వత్సరంబు లొక్క ముహూర్తంబుగా జరుపుచు నన్యోన్య సరసావలోకనంబుల సముచి తాలింగన సంభాషణంబులం గాల నిరూపణంబు సేయనేరక శత వత్సరంబులు గడపి; తదనంతరంబ.

## 3-43-కపిలుని జన్మంబు

3-825-కంద పద్యము

మునివరుఁ డొకనాఁ డిమ్ములఁ
దన నిజదేహంబు నవవిధంబులు గావిం

చి నయంబునఁ దద్వీర్యముఁ
దన సతిగర్భమున నవవిధంబుగ నిలిపెన్.

3-826-కంద పద్యము

అది కారణంబుగాఁ బెం
పొదవిన మునివలన దేవహూతియుఁ గూఁతుల్
ముదమునఁ గనెఁ దొమ్మండ్రన్
ముదితయు మది సంతసించె మునివరుఁ డంతన్.

3-827-తేటగీతి

సన్యసింపఁగోరిన సతి యెఱింగి
యాత్మఁ బొడమిన సంతాప మగ్గలింపఁ
జింత వాటిల్లఁ జెక్కిటఁ జేయిసేర్చి
పదములను నేల వ్రాయుచుఁ బలికెఁ బతికి.

3-828-సీస పద్యము

" అనఘ! సంతాన పర్యంతంబు ననుఁ గూడి;
వర్తింతు ననుచుఁ బూర్వమునఁ బలికి
కూఁతుల నిచ్చితి కొమరార నిప్పు డీ;
తరుణులు పతులును దమకుఁ దార
యరసి వర్తింతురో యని భీతినొందెదఁ;
గావున నీ పుత్రికలకుఁ దగిన
వరుల సంపాదించి పరిణయంబులు సేసి;
తత్త్వసంహిత నాకుఁ దవిలి తెలుపు

3-828.1-తేటగీతి

సుతునిఁ గృపసేసి ననుఁ గావు సుజనవినుత!
యుర్థి సంసార దుఃఖంబు నపనయింప
నర్హుఁడవు నీవ కావె మోహమ్మున నింత
కాల మూరకపోయె నే గతియు లేక.

3-829-చంపకమాల

ఉపరతి పుట్టె నైహిక సుఖోపగతానుభవంబు లందు మున్
జపలతఁ గామభోగరతిసంగముఁ గోరి మహాత్మ! నిన్ను న
చ్చపుఁ దలపొప్పగాఁ దెలియఁజాలక యేవరియించుటన్ భవ
త్కృప ఫలియించె ముక్తి నినుఁ గేవలభక్తి భజింపఁ గల్గదే.

3-830-వచనము

అదియునుంగాక.

3-831-చంపకమాల

సమమతినొప్పు సత్పురుషసఖ్యము సద్గతి కారణంబు నీ
చమతి విలోలదుష్పురుష సఖ్యము దుర్గతిహేతు వంచుఁ జి
త్తమునఁ దలంచి యోగిజనతానుత! మిమ్ముభజింతుఁ బ్రాణిసం
గమమునఁ బుణ్యపాపములు గైకొని పొందవె యెట్టివారలన్."

3-832-కంద పద్యము

అని యిట్లు వేదనాభర
మున మునుకుచుఁ బలుకఁ గర్దముఁడు మనుపుత్రిం

గనుఁగొని సరసిజనయను వ
చనములు మది సంస్మరించి సతి కిట్లనియెన్.

3-833-కంద పద్యము

" మనుసుత! నీ మది దుఃఖం
బును బొందకు మచిరకాలమున భగవంతుం
డనఘుం డక్షరుఁడు జనా
ర్దనుఁడు భవద్గర్భమందు దగ వసియించున్.

3-834-కంద పద్యము

వర నియమవ్రత నిష్టా
చరణ నియుక్తాంతరంగ సమధిక పై సం
భరిత తపోధన దాన
స్ఫురితశ్రద్ధాను భక్తిపూర్వము గాఁగన్.

3-835-మత్తేభ విక్రీడితము

హరి నారాయణు పాదపద్మములు సమ్యగ్భక్తిఁ బూజింపు త
త్పురుషశ్రేష్ఠుఁడు మానసంబున భవత్పూజా సుసంప్రీతుడై
కరమర్థిం దరుణీశిరోమణి! భవద్గర్భస్థుఁడై యుండి తాఁ
గరుణం జేయు భవన్మనోజనిత శంకాగ్రంథి విచ్ఛేదమున్."

3-836-చంపకమాల

అనవుడు దేవహూతి హృదయంబున సంతస మంది యమ్మునీం
ద్రుని వచనక్రమంబునఁ బరున్ భగవంతు ననంతుఁ బద్మలో

చను హరి విష్ణు నర్చనము సల్పుచు నుండగఁ గొన్ని యబ్దముల్
చనునెడ దానవాంతకుఁడు సమ్మతిఁ గార్దమ మైన తేజమున్.

3-837-కంద పద్యము

ధరియించి యమ్మునీంద్రుని
తరుణీగర్భంబువలన దనుజారి శమీ
తరుకోటరమున పైశ్వా
నరుఁ డుదయించిన విధంబునన్ జనియించెన్.

3-838-సీస పద్యము

అయ్యవసరమున నాకాశమున దేవ;
తూర్యఘోషంబులు దుముల మయ్యె
నందిత దేవతాబృందంబు లందంద;
కురిసిరి మందారకుసుమ వృష్టి
గంధర్వ కిన్నర గానంబు వీతెంచె;
నప్సరోగణముల యాటలొప్పె
వావిరి దిక్కులఁ గావిరి విరిసెను;
దవిలి వార్ధుల కలంతలును మానె

3-838.1-తేటగీతి

సాధుజనముల మనములు సంతసిల్లె
హోమవహ్నులు ప్రభలఁజెన్నొంది వెలిఁగెఁ
గుసుమఫలభరములనొప్పెఁగుజములెల్ల
సర్వసస్యాళి చెన్నొందె జగతిలోన

3-839-వచనము

ఇట్టి మహోత్సవంబున దేవహూతికిం దత్త్వబోధంబుఁ గావించు కొఱకుఁ దదీయ గర్భంబున నుదయించిన పరబ్రహ్మస్వరూపుం డైన నారాయణుని దర్శించుకొఱకు మరీచి ప్రముఖ మునిగణ సమేతుం డై చతుర్ముఖుఁడు సనుదెంచి యమ్మహాత్ముని దర్శించి కర్దమ దేవహూతులం గనుంగొని యిట్లనియె.

3-840-కంద పద్యము

" నుతచరితులార! మీరలు
కృతకృత్యులు విష్ణుపూజఁ గేవలభక్తిన్
మతి నిష్కపటులరై చే
సితిరి తదర్చన ఫలంబు సేకుఱె మీకున్.

3-841-కంద పద్యము

శ్రితభయహరణుఁడు మునిజన
నుతచరితుఁడు పరుఁడు మీ మనోరథసిద్ధిన్
వితతంబుగఁ గావించుటఁ
జతురత మీ జన్మ మింక సఫలతఁ బొందెన్.

3-842-కంద పద్యము

వినుఁడు సకాములునై హరి
ననుపమభక్తిన్ భజించు నదె ముక్తికిఁ జా
లును మీ పుణ్యం బే మని
కొనియాడఁగ వచ్చు నీతికోవిదులారా!"

3-843-వచనము

అని పెండియుం గర్దముని గనుంగొని యిట్లను "భవదీయ తనూభవలం బ్రకటశీలవ్రతాచారసంపన్ను లైన మునివరేణ్యులకుం బెండ్లిసేయుము; అట్లయిన వారి వలన బ్రజాసృష్టి బహువిధంబుల వృద్ధిం బొందు" నని చెప్పి మఱియు నిట్లనియె.

3-844-చంపకమాల

" అనఘ! భవత్సుతుండు సముదంచిత తేజుఁడు నైన యిమ్మహా
త్ముని@ఁ బరమేశు నీశు నజితున్ నళినాక్షు నమేయు నచ్యుతున్
ఘనుని ననంతు నాద్యు నవికారుని నక్షరుఁగాఁ దలంపుమీ
ఘనుఁడు సమస్త చేతన నికాయ హృదీప్సితదాయి గావునన్.

3-845-సీస పద్యము

మానిత జ్ఞాన విజ్ఞాన యోగంబులు;
ననుపాయంబుల నొనరఁజేసి
యలవుమైఁ గర్మజీవుల నుద్ధరించుట;
కొఱకు నమ్మహితాత్మకుఁడు సమగ్ర
హాటకరుచిజటాజూటుండు సత్పుల్ల;
పంకజనేత్రుండు పద్మ వజ్ర
హల కులిశాంకుశ లలిత రేఖాంకిత;
చరణ తలుండును సత్త్వగుణుఁడు

3-845.1-తేటగీతి

నగుచు నిప్పుడు సరసీరుహాక్షి నీదు
గర్భ మం దుదయించెను ఘనుఁడు నీకుఁ
దత్త్వబోధంబుఁ గావించుఁ దావకీన
హృదయ సంగత సంశయ మెల్లఁ బాపు.

3-846-వచనము

మఱియును.

3-847-కంద పద్యము

నుతికెక్కి సిద్ధగణ సే
వితుఁడై ఘనసాంఖ్యయోగవిలసిత తత్త్వ
స్థితినిరతుఁ డగుచుఁ గపిలా
ఖ్యుతఁ దనరి చరించు నీ జగత్త్రయ మెల్లన్."

## 3-44-కన్యకానవకవివాహంబు

3-848-కంద పద్యము

అని పలికి యమ్మరీచిం
గని యుద్వాహార్థ మునిచి కమలజుఁ డంతం
దన నందను లగు నారద
సనకాదులఁ గూడి యాత్మసదనము కరిగెన్.

3-849-వచనము

అంత; నా కర్దముండు గమలసంభవ చోదితుం డగుచు యథోచితంబుగా
నాత్మీయ దుహితుల వివాహంబు సేయం దలంచి మరీచికిం గళ యను

కన్యకను; నత్రికి ననసూయను; నంగిరసునకు శ్రద్ధను; బులస్త్యునకు హవిర్భువును; బులహునకు గతిని; గ్రతువునకు శాంతినింగా నిజ కులాచార సరణిం బరిణయంబు గావించిన వారును గృత దాన పరిగ్రహులును గర్దమ కృత సంభావనా సంభావితు లగుచు నతని చేత ననుజ్ఞాతులై జాయాసహితు లగుచు నిజాశ్రమ భూములకుం జనిరి; అంతం గర్దముండు దేవోత్తముం డగు విష్ణుండు దన మందిరంబున నవతరించి వసించి యుంటం దన చిత్తంబున నెఱింగి; వివిక్త స్థలంబునకుం జని యచ్చటఁ గపిలునికి వందన బాచరించి యిట్లనియె.

3-850-సీస పద్యము

" చతురాత్మ! విను మాత్మ కృతము లైనట్టి య;
మంగళ భూత కర్మంబు లనెడి
దావాగ్ని శిఖలచే దందహ్యమాను లై;
నట్టి జీవులు దుదముట్టలేక
పాయక సంసారబద్ధులై యుందురు;
తద్భవహేతుభూతంబు లయిన
సకల దేవతలుఁ బ్రసన్నులు నగుదురు;
బహుజన్మ పరిచిత ప్రాప్త యోగ

3-850.1-తేటగీతి

చిరసమాధి తపోనిష్ఠచే వివిక్త
దేశముల యోగిజనములు ధృతుల నే మ
హానుభావు విలోకింతు రట్టి దివ్య
పురుషరత్నంబ! నా యింటఁ బుట్టి తీవు.

3-851-వచనము

మఱియు; సంసారచక్ర పరిభ్రామ్యమాణుల మగుచు గ్రామ్యుల మయిన మా వర్తనంబులను గణింపక మదీయ గృహంబునం బూర్వంబునం బ్రతిశ్రుతంబు లైన భవదీయ వాక్యంబులు దప్పకుండ ననుగ్రహింప నుదయించి" తని; వెండియు నిట్లనియె.

3-852-కంద పద్యము

" తలపోయఁగ నప్రాకృత
బలయుక్త చతుర్భుజాది భవదవతారం
బులు నీ కనురూపములై
పొలుపొందుం గాదె పరమపురుష! మహాత్మా!

3-853-వచనము

అదియునుం గాక.

3-854-కంద పద్యము

అనయము భవదీయాశ్రిత
జనసంరక్షణముకొఱకు సమ్మతితోఁ దా
ల్చిన మానవ రూపంబులు
ననురూపము లయ్యెఁ గాదె హరి! నీకెపుడున్.

3-855-కంద పద్యము

సుమహిత తత్త్వజ్ఞానా
ర్థము విద్వజ్జనగణంబు దవిలి నమస్క

రము లోలిఁ జేయు పదపీ
ఠము గల నినుఁ బొగడవశమె ధరణిల్లంగన్.

3-856-సీస పద్యము

సమధిక షడ్గుణైశ్వర్య కారణుఁడవు;
 పరమేశ్వరుండవు ప్రకృతిపురుష
మహదహంకార తన్మాత్ర తత్త్వక్షభక;
 హేతుకాలాత్మ విఖ్యాత ధృతివి
జగదాత్మకుఁడవు చిచ్ఛక్తివి నాత్మీయ;
 జఠర నిక్షిప్త విశ్వప్రపంచ
మును గల సర్వజ్ఞమూర్తివి స్వచ్ఛంద;
 శక్తి యుక్తుండవు సర్వసాక్షి

3-856.1-తేటగీతి

వగుచుఁ గపిలాఖ్య దనరారు నట్టి నీకు
ననఘ మ్రొక్కెదఁ బుత్రుండ వగుచు నీవు
నాకుఁ బుట్టిన కతన ఋణత్రయంబు
వలనఁ బాసితి నీక భక్తవరద! నేను.

3-857-తేటగీతి

మానితవ్రత యోగసమాధి నియతి
చెంది భవదీయ పాదారవింద యుగము
డెందమునఁ జేర్చి శోకంబు లందుఁ దొలఁగి
సంచరించెద నంచిత స్థలము లందు."

3-858-కంద పద్యము

అని యిట్లు విన్నవించిన
మునిపుంగవుఁ డైన కర్దముని వచనంబుల్
విని భగవంతుం డగు న
య్యనఘుఁడు కపిలుండు పలికె నర్మిలిదోఁపన్.

3-859-సీస పద్యము

" నాచేతఁ బూర్వంబునం బ్రతిశ్రుత మైన;
వచనముల్ దప్పక వరమునీంద్ర
నీ యింటఁ బుట్టితి నిర్హేతుకస్థితి;
భూరి దయాగుణంబున నవాప్త
సకల కాముఁడ నేను సన్మునివేషంబు;
ధరియించు టెల్ల నాకొఱకుఁ గాదు
విను మహాత్మకు లైన మునులకుఁ బరమాత్మ;
గురు సద్వివేకంబు నరసి చూపు

3-859.1-తేటగీతి

తత్త్వబోధంబుకొఱకును దాల్పఁబడిన
యంచితవ్యక్తమార్గమై నట్టి దేహ
మని తలంపుము మత్పదధ్యానభక్తి
దీపరాయణ మహిమంబు దేజరిల్లు.

3-860-కంద పద్యము

సమధిక నిష్ఠం గృతయో
గమునన్ సన్న్యస్త సకలకర్ముఁడవై మో
హముఁ బాసి భక్తిచే మో
క్షముకై భజియింపు నను వికారరహితుఁడై.

3-861-కంద పద్యము

ననుఁ బరమేశుఁ బరంజ్యో
తిని ననఘు ననంతు దేవదేవు సకలభూ
తనికాయగుహాశయు నా
ద్యుని నజు నాద్యంతశూన్యు దురితవిదూరున్.

3-862-కంద పద్యము

తిరముగ భవదీయాంతః
కరణసరోజాత కర్ణికాతలమున సు
స్థిరుఁ జేసి యింద్రియంబుల
నిరసించి మనోంబకమున నెఱిఁ గను మనఘా!

3-863-వచనము

అట్లేని.

3-864-కంద పద్యము

తనరిన మోక్షము నొందెద
వని పలికినఁ గర్దముండు నమ్మునికులచం

ధ్రుని వలగొని వందనములు
ఘనముగ నతిభక్తిఁ జేసి గౌతుక మలరన్.

## 3-45-కర్దముని తపోయాత్ర

3-865-కంద పద్యము

మునిగణ సేవిత మగు వన
మునకుం జని యందు మౌనమున నిస్సంగుం
డును వహ్నిరహితుఁ డనికే
తనుఁడై యాత్మైకశరణ తత్పరు డగుచున్.

3-866-వచనము

పరబ్రహ్మంబుఁ జిత్తంబున నిల్పి యహంకారంబు విడిచి మమత్వంబు నిరసించి దయాగుణంబునం జేసి సకల భూతంబు లందు సమత్వంబు భజియించి శాంతశేముషీ గరిష్ఠుం డగుచు నిస్తరంగం బగు వార్ధి చందంబున ధీరుండై నిఖిల ప్రపంచంబును వాసుదేవమయంబుగా దలంచుచు భక్తియోగంబున భాగవత గతిం బొందె" అని చెప్పి; వెండియు, మైత్రేయుండు విదురునిం గనుంగొని "కర్దముండు వనంబునకుం జనిన యనంతరంబ మాతృవత్సలుం డయిన కపిలుండు బిందుసరంబున వసియించి యుండ దేవహూతి తత్త్వమార్గ ప్రదర్శకుం డైన సుతునిం గనుంగొని బ్రహ్మవచనంబులు దలంచుచు నిట్లనియె.

## 3-46-కపిల దేవహూతిసంవాదంబు

3-867-కంద పద్యము

" అసదింద్రియ ఘూర్ణమున
వసుమతి నిర్విణ్ణ నగుచు వసరెడి నా కీ
యసదృశమోహతమో విని
రసనం బనఘుత్మ! యే పెరవున ఘటించున్.

3-868-కంద పద్యము

పటు ఘననీరంధ్ర తమః
పటల పరీవృత జగత్ప్రపంచమునకు నె
క్కటి లోచనమై మహితో
త్కటరుచి వెలుగుదువు భానుకైవడి ననఘా!

3-869-ఉత్పలమాల

భూరి మదీయ మోహతమముం బెడఁబాప సమర్థు లన్యు లె
వ్వారలు నీవకాక నిరవద్య! నిరంజన! నిర్వికార! సం
సారలతాలవిత్ర! బుధసత్తమ! సర్వశరణ్య! ధర్మవి
స్తారక! సర్వలోకశుభదాయక! నిత్యవిభూతినాయకా!

3-870-చంపకమాల

నిను శరణంబు జొచ్చెద ననింద్యతపోనిధి! నన్నుఁ గావవే"
యని తను దేవహూతి వినయంబున సన్నుతిసేసి వేడఁగా
ననుపమసత్కృపాకలితుఁ డై కపిలుం డనురాగ మొప్ప స
జ్జన నిచయోపవర్గ ఫలసాధనమై తగు తల్లివాక్యమున్.

3-871-కంద పద్యము

విని మందస్మిత లలితా
ననకమలుం డుగుచు నెమ్మనమునఁ బ్రమోదం
బనయంబు గడలుకొన నిజ
జననికి నిట్లనియెఁ బరమశాంతుం డగుచున్.

3-872-కంద పద్యము

" విను జీవుని చిత్తము దా
ఘన భవబంధాపవర్గకారణ మది యే
చినఁ ద్రిగుణాసక్తం బయి
నను సంసృతిబంధకారణం బగు మఱియున్.

3-873-తేటగీతి

అదియు నారాయణాసక్త మయ్యెనేని
మోక్షకారణ మగు నని మునికులాబ్ధి
చంద్రుఁ డన నొప్పు కపిలుండు జననితోడ
నర్థి వినఁ జెప్పి మఱియు నిట్లనియెఁ బ్రీతి.

3-874-వచనము

మఱియుఁ, జిత్తం బహంకార మమకార రూపాభిమానజాతంబు లగు
గామలోభాది కలుష వ్రాతంబులచేత నెప్పుడు విముక్తంబై పరిశుద్ధం బగు;
నప్పుడు సుఖదుఃఖ వివర్జితంబు నేకరూపంబు నై ప్రకృతి కంటెఁ బరుండును,
బరమ పురుషుండును, నిర్భేదనుండును, స్వయంజ్యోతియు,
సూక్ష్మస్వరూపుండును, నితరవస్త్వంతరా పరిచ్ఛిన్నుండును, నుదాసీనుండును
నైన పరమాత్మునిం దన్మయంబును హతౌజస్కంబు నైన ప్రపంచంబును జ్ఞాన

వైరాగ్య భక్తి యుక్తం బగు మనంబుచేఁ బొడగాంచి; యోగిజనులు
పరతత్త్వసిద్ధికొఱకు నిఖిలాత్మకుం డైన నారాయణు నందు నియుజ్యమానం
బయిన భక్తిభావంబువలన నుదయించిన మార్గంబునకు నితరమార్గంబులు సరి
గావండ్రు; విద్వాంసులు సంగం బింద్రియా ర్థాద్యసద్విషయంబుగ నొనరింపబడి
జీవునకు నశిధిలం బగు బంధంబునకుఁ గారణం బగు ననియు; నదియె
సద్విషయం బైన నంతఃకరణ సంయమన హేతుభూతం బగుచు సాధుజనులకు
ననర్గళ మోక్షద్వారం బగు ననియుఁ దెలియుదురు; సహనశీలురు సమస్త
శరీరధారులకు సుహృత్తులును బరమశాంతులును గారుణికులును నై పరిత్యక్త
కర్మఫల స్వభావులును విసృష్ట స్వజన బంధుజనులును నై
మత్పదాశ్రయులును, మద్గుణధ్యానపారీణులును, మత్కథాప్రసంగ సంభరిత
శ్రవణానందులును నగుచు మదీయ కథల నొడువుచు వినుచునుండు పరమ
భాగవతోత్తముల నాధ్యాత్మికాది తాపత్రయంబు దపింప జాలదు; అట్టి
సర్వసంగవివర్జితు లగు పరమభాగవతజనుల సంగం బపేక్షణీయంబు; అది
సకలదోష నివారకం బగు; అట్టి సత్సంగంబున సర్వప్రాణి హృత్కర్ణరసాయనంబు
లగు మదీయ కథా ప్రసంగంబులు గలుగు; మద్గుణాకర్ణనంబునం జేసి
శీఘ్రంబుగఁ గ్రమంబునం గైవల్య మార్గదంబు లగు శ్రద్ధాభక్తు లుదయించు;
అదియునుం గాక యే పురుషుం డైననేమి మద్విరచిత జగత్కల్పనాది
విహారచింతచే నుదయించిన భక్తింజేసి యింద్రియసుఖంబు వలనను దృష్ట
శ్రుతంబు లైన యైహి కాముష్మికంబుల వలనను విముక్తుం డగుచుఁ
జిత్తగ్రహణార్థంబు ఋజువు లైన యోగమార్గంబులచే సంయుక్తుం డగునట్టి యోగి
ప్రకృతిగుణ సేవనంబుచేత వైరాగ్యగుణ విజృంభితం బైన జ్ఞానయోగంబుచేతను

మదర్పిత భక్తియోగంబుచేతను బ్రత్యగాత్మకుండ నైన నన్ను నంతఃకరణ నియుక్తునిం గావించు" నని చెప్పిన విని దేవహూతి గపిలున కిట్లనియె.

3-875-కంద పద్యము

" ఏ భక్తి భవద్గుణపర
మై భవపాపప్రణాశమై ముక్తిశ్రీ
లాభము రయమునఁ జేయునొ
యా భక్తివిధంబుఁ దెలియ నానతి యీవే.

3-876-వచనము

అదియునుం గాక భవదుదితం బయిన యోగంబును దదంగంబులును దద్గత తత్త్వావబోధంబును సాకల్యంబుగ మందబుద్ధి నైన నాకు స్ఫుటంబుగాఁ దెలియ నానతి" మ్మనినఁ గపిలుం డిట్లనియె.

3-877-సీస పద్యము

" జననయిత్రి! విను మఱి సకల పదార్థప;
రిజ్ఞానతత్త్వపారీణ మైన
యామ్నాయ విహితకర్మాచారములు గల్గి;
త్రివుటమై వర్తించు దేవగణము
పూని నైసర్గికంబైన నిర్హేతుక;
మగు భగవత్సేవ మిగుల ముక్తి
కంటె గరిష్ఠంబు గావున నదియు భు;
క్తాన్నంబు జీర్ణంబు నందఁ జేయు

3-877.1-తేటగీతి

దీప్త జఠరాగ్ని గతి లింగదేహనాశ
కంబు గావించు నదియునుగాక విష్ణు
భక్తి వైభవములఁ దేటపఱతు వినుము
సద్గుణవ్రాత యోగలక్షణసమేత

3-878-చంపకమాల

అమలినభక్తిఁ గొందఱు మహాత్ములు మచ్చరణారవింద యు
గ్మము హృదయంబునన్ నిలిపి కౌతుకులై యితరేత రానులా
పముల మదీయ దివ్యతనుపౌరుషముల్ కొనియాడుచుండి మో
క్షము మదిఁ గోర నొల్ల రనిశంబు మదర్పిత సర్వకర్ములై.

3-879-సీస పద్యము

పరికింపఁ గొందఱు భాగవతోత్తముల్;
ఘనత కెక్కిన పురాతనము లైన
చారు ప్రసన్న వక్త్రారుణలోచన;
ములు గల్గి వరదాన కలితములుగఁ
దనరు మద్దివ్యావతార వైభవములు;
మదినొప్పఁ దమ యోగమహిమఁ జేసి
యనుభవించుచుఁ దదీయాలాపములు సన్ను;
తించుచుఁ దివుటఁ దద్దివ్య విలస

3-879.1-తేటగీతి

దవయవోదార సుందర నవవిలాస
మందహాస మనోహర మధుర వచన
రచనచే నపహృత మనఃప్రాణు లగుచు
నెలమి నుందురు నిశ్శ్రేయసేచ్ఛ లేక.

3-880-మత్తేభ విక్రీడితము

కణఁకన్ వారలు వెండి మోక్షనిరపేక్షస్వాంతులై యుండి తా
మణిమాద్యష్టవిభూతి సేవితము నిత్యానంద సంధాయియున్
గణనాతీతము నప్రమేయము సమగ్రశ్రీకమున్ సర్వల
క్షణయుక్తంబును నైన మోక్షపదవిం గైకొందు రత్యున్నతిన్.

3-881-వచనము

ఇట్లువొంది.

3-882-కంద పద్యము

తనరుదు రప్పుణ్యాత్ములు
జనయిత్రి! మదీయ కాలచక్రగ్రసనం
బును నొందక నిత్యం బగు
ననుపమ సుఖవృత్తి నుందు రది యెట్లన్నన్.

3-883-మత్తేభ విక్రీడితము

సముఁడై స్నేహముచే సుతత్వమును విశ్వాసంబుచేతన్ సఖి
త్వముఁ జాలన్ హితవృత్తిచేతను సుహృత్త్వంబున్ సుమంత్రోపదే

శముచేతన్ నిజదేశికుం డనఁగ నిచ్చల్ పూజ్యుఁ డౌ నిష్టదై
వమునై వారికిఁ గాలచక్రభయముల్ వారింపుదుం గావునన్."

3-884-వచనము

అని యిట్లు దెలుపుచు మఱియు నిట్లనియె.

3-885-చంపకమాల

" విను మదిగాక యీ భువిఁ దివిం బలుమాఱుఁ జరించు నాత్మ దా
ధన పశు పుత్ర మిత్ర వనితాతతిపైఁ దగులంబు మాని న
న్నసఘుని విశ్వతోముఖు ననన్యగతిన్ భజియించెనేని వా
నిని ఘనమృత్యురూప భవనీరధి నేఁ దరియింపఁ జేయుదున్.

3-886-సీస పద్యము

రూఢిఁ బ్రధానపూరుషనాయకుండను;
భగవంతుఁడను జగత్ప్రభుఁడ నైన
నాకంటె నన్యులఁ గైకొని తగిలిన;
యాత్మలు భవభయం బందుదు రది
గావున నా యాజ్ఞఁ గడవంగ నోడుట;
జేసి వాయువు వీచు శిఖి వెలుంగు
నినుఁడు దపించుఁ దా నింద్రుఁడు వర్షించు;
భయ మంది మృత్యువు పరువు పెట్టుఁ

3-886.1-తేటగీతి

గాన విజ్ఞాన వైరాగ్యకలిత మైన
భక్తియోగంబునం జేసి పరమపదము
కొఱకు నయ్యోగివరులు మచ్చరణభజను
లగుచుఁ జరియింపుదురు నిర్భయాత్ము లగుచు.

3-887-కంద పద్యము

గురుభక్తిం జిత్తము మ
త్పరమై విలసిల్లు నంతపర్యంతము స
త్పురుషుల కిహాలోకంబునఁ
జిరతర మోక్షోదయంబు సేకుఱుచుండున్."

3-888-కంద పద్యము

అని యిట్లు సన్మునీంద్రుఁడు
జననికి హరిభక్తియోగ సంగతి నెల్లన్
వినిపించుచు వెండియు ని
ట్లనియెన్ సమ్మోదచిత్తుఁ డగుచుఁ గడంకన్.

3-889-వచనము

" అవ్వా! యివ్విధంబున భక్తియోగప్రకారంబు సెప్పితి; ఇంక దత్త్వలక్షణంబు వేఱువేఱ యెఱింగింతు నే తత్త్వగుణంబుల నెఱింగి నరులు ప్రకృతి గుణంబులవలన విముక్తు లగుదురు; హృదయగ్రంథి విచ్ఛేదకంబు నాత్మదర్శనరూపంబు నగు నా జ్ఞానం బాత్మనిశ్శ్రేయస కారణంబు కావున దాని నెఱింగింతు; అందు నాత్మస్వరూపం బెట్టి దనిన; ననాదియుఁ, బురుషుండును, సత్త్వాది గుణశూన్యుండును, బ్రకృతిగుణ విలక్షణుండును, బ్రతక్స్వరూపుండును,

స్వయంప్రకాశుండును మఱియు నెవ్వనితోడ నీ విశ్వంబు సమన్వితం బగు నతండు గుణత్రయాత్మత్వంబు నవ్యక్తంబును భగవత్సంబంధియు నగు ప్రకృతి యందు యదృచ్ఛచే లీలావశంబునం బ్రవేశించిన నా ప్రకృతి గుణత్రయమయంబైన స్వరూపం బయిన ప్రజాసర్గంబుఁ జేయం గనుంగొని; యప్పుడు మోహితుం డయి విజ్ఞాన తిరోధానంబునం జేసి గుణత్రయాత్మకం బయిన ప్రకృత్యధ్యాసంబున నన్యోన్యమేళనం బగుటయు నంతం బ్రకృతిగుణంబుఁ దన యందు నారోపించుకొని క్రియామాణంబు లగు కార్యంబులవలనం గర్తృత్వంబు గలిగి సంసార బద్ధుండై పారతంత్ర్యంబు గలిగి యుండు; కర్తృత్వశూన్యం డగు నీశ్వరుండు సాక్షి యగుటం జేసి యాత్మకుం గార్యకారణ కర్తృత్వంబులు ప్రకృత్యధీనంబు లనియు; సుఖదుఃఖ భోక్తృత్వంబులు ప్రకృతి విలక్షణుం డయిన పురుషుని వనియు నెఱుంగుదురు" అని చెప్పిన విని దేవహూతి కపిలున కిట్లనియె "బురుషోత్తమా! ప్రకృతి పురుషులు సదసదాత్మక ప్రపంచంబునకుఁ గారణభూతులు గావున వాని లక్షణంబు సదసద్వివేక పూర్వకంబుగా నానతిమ్ము;" అనిన భగవంతుం డిట్లనియె.

3-890-కంద పద్యము

" క్రమమునఁ ద్రిగుణము నవ్య
క్తము నిత్యము సదసదాత్మకము మఱియుఁ బ్రధా
నము ననఁగాఁ బ్రకృతివిశే
షము లదియు విశిష్ట మనిరి సద్విదు లెలమిన్.

3-891-వచనము

అందుఁ బ్రకృతి చతుర్వింశతితత్త్వాత్మకంబై యుండు; అది యెట్లనినం బంచమహాభూతంబులును, బంచతన్మాత్రలును, జ్ఞానకర్మాత్మకంబు లయిన త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులు వాక్పాణి పాదపాయూపస్థంబులు నను దశేంద్రియంబులును, మనోబుద్ధి చిత్తాహంకారంబు లను నంతఃకరణచతుష్టయంబును నను చతుర్వింశతి తత్త్వాత్మకం బైన సగుణబ్రహ్మ సంస్థానంబు సెప్పితి; నిటమీఁదఁ గాలం బను పంచవింశకతత్త్వంబుసెప్పెద; అది గొందఱు పురుషశబ్దవాచ్యుం డైన యీశ్వరుని పౌరుషంబు గాలశబ్దంబునఁ జెప్పబడు నందురు; అందు నహంకార మోహితుండై ప్రకృతి నొంది జీవుండు భయంబుఁ జెందు; ప్రకృతిగుణసామ్యంబునం జేసి వర్తించి నిర్విశేషుం డగు భగవంతుని చేష్టా విశేషంబు దేనివలన నుత్పన్నుం బగు నదియ కాలం బని చెప్పంబడు; అదియు జీవరాశ్యంతర్గతం బగుటంజేసి పురుషుండనియు వాని బహిర్భాగ వ్యాప్తిం జేసి కాలం బనియుఁ జెప్పం బడు; ఆత్మ మాయం జేసి తత్త్వాంతర్గతుం డయిన జీవునివలన క్షుభితం బయి జగత్కారణం బగు ప్రకృతి యందు పరమపురుషుడు దన వీర్యంబు పెట్టిన నా ప్రకృతి హిరణ్మయం బైన మహత్తత్త్వంబు పుట్టించె; అంత సకల ప్రపంచబీజభూతుడును లయవిక్షేప శూన్యుండును నగు నీశ్వరుండు దన సూక్ష్మవిగ్రహంబు నందు నాత్మ గతం బైన మహదాది ప్రపంచంబుల వెలిగించుచు స్వతేజోవిపత్తిం జేసి యాత్మప్రస్వాపనంబు సేయు నట్టి తమంబును గ్రసించె" నని చెప్పి; వెండియు నిట్లనియె.

3-892-కంద పద్యము

" దివ్యమగు వాసుదేవా

దివ్యూహచతుష్టయంబు త్రిజగము లందున్

సేవ్యం బని చెప్పంబడు
భవ్యగుణా! దాని నెఱుఁగ బలికెద నీకున్.

3-893-సీస పద్యము

సత్త్వప్రధానమై స్వచ్ఛమై శాంతమై;
యూర్మిషట్కంబుల నోసరించి
సురుచిర షాడ్గుణ్య పరిపూర్ణమై నిత్య;
మై భక్తజన సేవ్యమై తనర్చి
వలనొప్పుచుండు నవ్వాసుదేవవ్యూహ;
మంత మహత్తత్త్వ మందు నోలి
రూఢిఁ గ్రియాశక్తిరూపంబు గల్గు న;
హంకార ముత్పన్న మయ్యె నదియ

3-893.1-తేటగీతి

సరవి వైకారికంబుఁ దైజసముఁ దామ
సంబు నా మూఁడు దెఱఁగుల బరగు నందుఁ
దనరు వైకారికము మనస్సునకు నింద్రి
యములకును గగనముఖ భూతముల కరయ

3-894-వచనము

అది దేవతారూపంబుల నుండు దైజసాహంకారంబు బుద్ధి ప్రాణంబులుం గలిగి యుండు తామసాహంకారం బింద్రియ మేళనంబున నర్థమాత్రం బై యుండు; మఱియును.

3-895-సీస పద్యము

అట్టి యహంకార మం దధిష్టించి సా;
 హస్రఫణామండలాభిరాముఁ
డై తనరారు ననంతుఁడు సంకర్ష;
 ణుం డనఁ దగు పురుషుండు ఘనుఁడు
మహిత భూతేంద్రియ మానస మయుఁడు నై;
 కర్తృత్వ కార్యత్వ కారణత్వ
ప్రకట శాంతత్వ ఘోరత్వ మూఢత్వాది;
 లక్షణ లక్షితోల్లాసి యగుచు

3-895.1-తేటగీతి

నుండు నమ్మేటి రెండవ వ్యూహ మనఁగ
ఘనవికారంబుఁ బొందు వైకారికంబు
వలన వినుము మనస్తత్త్వ మెలమిఁ బుట్టె
మఱియు వైకారికంబును మాత! వినుము.

## 3-47-బ్రహ్మాండోత్పత్తి

3-896-వచనము

అది యెట్టు లంటేని సామాన్యచింతయు విశేషచింతయు ననందగు సంకల్ప వికల్పంబులం జేసి కామసంభవం బనంబడు నెద్ది, యనిరుద్ధాఖ్యం బయిన వ్యూహం బదియ హృషీకంబులకు నధీశ్వరం బయి సకల యోగీంద్ర సేవ్యం బగుచు శరదిందీవర శ్యామం బయి యుండు; వెండియుం దైజసంబువలన బుద్ధితత్త్వంబు పుట్టె; దాని లక్షణంబులు ద్రవ్యప్రకాశం బైన జ్ఞానంబును,

నింద్రియానుగ్రహంబును, సంశయంబును, మిథ్యాజ్ఞానంబును, నిద్రయు, నిశ్చయంబును స్మృతియు ననందగి యుండు; మఱియుఁ దైజసాహంకారంబు వలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులును గ్రియాజ్ఞానసాధనంబులును గలిగి యుండుఁ; బ్రాణంబునకుం గ్రియాశక్తియు బుద్ధికి జ్ఞానశక్తియు నగుటం జేసి యింద్రియంబులకుఁ దైజసత్వంబు గలిగి యుండు; భగద్భక్తి ప్రేరితం బయిన తామసాహంకారంబువలన శబ్ద తన్మాత్రంబు పుట్టె; దానివలన నాకాశంబును నాకాశంబువలన శ్రోత్రేంద్రియంబును పుట్టె; శ్రోత్రంబు శబ్దగ్రాహి యయ్యె; శబ్దం బర్థంబునకు నాశ్రయంబై శ్రోతకు జ్ఞానజనకం బయ్యె మఱియు శబ్దతన్మాత్రంబువలన నాకాశం బయి యా యాకాశంబు భూతంబులకు బాహ్యాభ్యంతరంబుల నవకాశం బిచ్చుటయు నాత్మ ప్రాణేంద్రియాదులకు నాశ్రయం బగుటయు నను లక్షణంబులు గలిగి యుండు కాల గతిచే వికారంబు నొందు; శబ్దతన్మాత్ర లక్షణం బగు నభంబువలన స్పర్శంబును స్పర్శంబువలన వాయువును వాయువుచే స్పర్శగ్రాహియైన త్వగింద్రియంబును బుట్టె; మృదుత్వంబును గఠినత్వంబును శైత్యంబును నుష్ణత్వంబును నను నివి స్పర్శంబునకు స్పర్శత్వం బని చెప్పంబడు; మఱియు వాయువునకుఁ జాలనంబును పరస్పర విభాగకరణంబును దన్మేళనంబును ద్రవ్యశబ్దనేతృత్వంబు నగు; అందు గంధవంతం బగు ద్రవ్యంబును ఘ్రాణేద్రియంబు నొందించుట ద్రవ్యనేతృత్వంబు దూరస్థం బగు శబ్దంబును శ్రోత్రేంద్రియ గ్రాహ్య మగు; నట్లొనరించుట శబ్దనేతృత్వంబు సర్వేంద్రియాత్మకత్వంబు నననవి లక్షణంబులై యుండు; దైవప్రేరితంబై స్పర్శ తన్మాత్ర గుణకం బగు వాయువువలన రూపంబును దానివలనఁ దేజంబును బుట్టె; రూపంబు నేత్రేంద్రియ గ్రాహకం బయ్యె నేత్రగతం బయిన రూపంబునకు నుపలంభకత్వంబును

ద్రవ్యాకారసమత్వంబును ద్రవ్యంబునకు నుపసర్జనం బగుటయు ద్రవ్యపరిణామ ప్రతీతియు నివి రూపవృత్తు లనంబడు; తైజసంబునకు సాధారణంబు లగు ధర్మంబులు ద్యోతం బనఁ బ్రకాశంబు పచనం బనఁ దండులాదుల పాకంబు పిపాసా నిమిత్తం బైన పానంబు క్షున్నిమిత్తం బైన యోదనంబు హిమమర్దనం బగు శోషణంబు ననునివి వృత్తులై యుండు; రూపతన్మాత్రంబువలన దైవచోదితంబై వికారంబు నొందు తేజస్సు వలన రసతన్మాత్రంబు పుట్టె; రసతన్మాత్రంబువలన జలంబు పుట్టె; జిహ్వ యను రసనేంద్రియంబు రసగ్రాహకం బయ్యె; ఆ రసం బేకంబై యుండియు భూతవికారంబునం జేసి కషాయ తిక్త కట్వామ్ల మధురాది భేదంబుల ననేక విధం బయ్యె; వెండియు సాంసర్గిక ద్రవ్యవికారంబునంజేసి యార్ద్రం బగుటయు ముద్దగట్టుటయుఁ దృప్తి దాతృత్వంబును జీవంబును దద్వ్యక్లబ్య నివర్తనంబును మృదూకరణంబును దాపనివారణంబును గూపగతం బయిన జలంబు దివియ మఱియు నుద్గమించుటయు ననునివి జలవృత్తు లనంబడు; రసతన్మాత్రంబువలన దైవచోదితంబై వికారంబునం బొందిన జలంబు వలన గంధతన్మాత్రంబు పుట్టె; దానివలనం బృథ్వియు గలిగె ఘ్రాణంబు గంధగ్రాహకం బయ్యె; అందు గంధం బేకం బయ్యు వ్యంజనాదిగతం బయి హింగ్వాది నిమిత్తం బయిన మిశ్రమగంధంబును కరంభంబును గృంజనాదిగతం బయిన పూతిగంధంబును; ఘనసారాది నిమిత్తం బయిన సుగంధంబును శతపత్రాదిగతం బగు శాంత గంధంబును లశునాదిగతం బైన యుగ్రగంధంబును బరుష్యిత చిత్రాన్నాది గతం బయిన యామ్లగంధంబును ద్రవ్యావయవ వైషమ్యంబునం జేసి యనేకవిధంబై యుండు; అదియునుం గాక ప్రతిమాదిరూపంబులం జేసి సాకారతాపాదనం బగు భావంబును, జలాది విలక్షణ త్రయాంతర నిరపేక్షం బయిన స్థితియు

జలాద్యాధారత యను ధారణంబును, నాకాశాద్యవచ్ఛేదకత్వంబును, సకలప్రాణి పుంస్త్వాభి వ్యక్తీకరణంబును నను నివి పృథ్వీవృత్తు లనంబడు" అని చెప్పి వెండియు నిట్లనియె "నభో సాధారణగుణ శబ్దవిశేషగ్రాహకంబు శ్రోత్రంబును, వాయ్వ సాధారణగుణ విశేషగ్రాహకంబు స్పర్శంబును, దేజో సాధారణగుణ విశేషగ్రాహకంబు చక్షురింద్రియంబును, నంభో సాధారణగుణ విశేషగ్రాహకంబు రసనేంద్రియంబును, భూమ్య సాధారణగుణ విశేషగ్రాహకంబు ఘ్రాణేంద్రియంబును, నాకాశాది గుణంబులగుచు శబ్దాదికార్యంబు లగు వాయ్వాదు లందుఁ గారణాన్వయంబు ననన్నిఁటికిం బృథ్వీ సంబంధంబు గలుగుటంజేసి భూమి యందు శబ్దస్పర్శరూపరసగంధంబులు గలుగుట మహదాదిపృథివ్యంతంబు లగు నీ యేడు తత్త్వంబులు పరస్పర మిళితంబు లై భోగాయతనం బగు పురుషునిం గల్పింప సమర్థంబులై యున్నం జూచి కాలాదృష్టసత్త్వాదులం గూడి జగత్కారణుండును ద్రైగుణ్యవిశిష్టుండును నశేష నియామకుండును నిరంజనాకారుండును నగు సర్వే శ్వరుం డందు బ్రవేశించు; అంత నన్యోన్యక్షుభితంబు లై మిళితంబు లైన మహదాదుల వలన నధిష్ఠాతృచేతన రహితం బగు నొక యండంబు పుట్టె; అందు.

3-897-సీస పద్యము

గురుశక్తియౌ విరాట్పురుషుండు సంభవం;
బయ్యె నయ్యండంబు నర్థిఁ బొదవి
యంబు ముఖావరణంబు లొక్కొకటికి;
దశగుణితంబులై తవిలి యావ
రణములై యుండును గ్రమమున లోకంబు;
నకు మేలుకట్ల పోలికఁ దనర్చి

పంకజోదరుని రూపము విలసించును;
 లోలత జలములోఁ దేలుచున్న

3-897.1-తేటగీతి

హేమమయ మైన యండంబులో మహాను
భావుఁ డభవుండు హరి దేవదేవుఁ డఖిల
జేత నారాయణుఁడు ప్రవేశించి యపుడు
విష్ణుపద భేదనంబు గావించి యందు.

## 3-48-విరాట్పురుష ప్రకారంబు

3-898-సీస పద్యము

కరమొప్పఁగా విరాట్పురుషుండు వెలుఁగొందు;
 నా విరాట్పురుషుని యాననంబు
వలనను వాణియు వాణితో వహ్నియు;
 నాసంబువలనఁ బ్రాణములఁ గూడి
ఘ్రాణేంద్రియం బయ్యె ఘ్రాణంబువలనను;
 వాయువులును బ్రాణవాయువులును
నందు నక్షులు చక్షు వందు సూర్యుండును;
 నందభిధ్యానంబు నర్థిఁ జేయఁ

3-898.1-తేటగీతి

గర్ణములు జాత మయ్యెఁ దత్కర్ణసమితి
వలన శ్రోత్రేంద్రియంబు దిక్కులును గలిగెఁ

ద్వక్కుచే శ్మశ్రు రోమ వితానకములు
నోషధివ్రాతమును భవ మొందె; మఱియు.

3-899-తేటగీతి

దానివలనను మేఢ్రంబు గానఁబడియెఁ
బరఁగ రేతంబువలన నాపంబు పుట్టె
గుదమువలన నపానంబు నుదయ మయ్యె
దానివలనను మృత్యువు దగ జనించె.

3-900-కంద పద్యము

కరములవలనను బలమును
నిరవుగ నా రెంటివలన నింద్రుఁడుఁ బాదాం
బురుహంబులవలన గతియు
నరుదుగ నా రెంటివలన హరియును గలిగెన్.

3-901-కంద పద్యము

ఘన నాడీ పుంజమువల
నను రక్తము దానివలన నదులును జఠరం
బున నాకఁలియును దప్పియుఁ
ననయము నా రెంటివలన నబ్ధులు పుట్టెన్.

3-902-కంద పద్యము

విను హృదయమువలనను మన
మును మనమునఁ దుహినకరుఁడు బుద్ధియుఁ జిత్తం

బున బ్రహ్మయు క్షేత్రజ్ఞుం
డును గలిగిరి యవ్విరాజుఁడుం బూరుషతన్.

3-903-వచనము

మఱియు; విరాట్పురుషు నం దుదయించిన వ్యష్టిరూపంబు లగు నాకాశాది భూతంబులును శబ్దంబు మొదలగు భూతతన్మాత్రంబులును వాగాదీంద్రియ జాతంబును దదధిదేవతలును దమంతన సమిష్టిరూపుం డగు క్షేత్రజ్ఞుం బ్రవృత్తి ప్రవర్తకుం జేయ నసమర్థంబు లయ్యె; ఎట్లనిన దేవాధిష్ఠితంబు లగు నింద్రియంబులు దాము వేర్వేఱ యయ్యీశ్వరుం బ్రవృత్తున్ముఖుం జేయనోపక క్రమంబునం దత్తదధిష్ఠానాదుల నొందె; అందు నగ్ని వాగింద్రియంబుతోడ ముఖంబు నొంది ప్రవర్తించిన విరాట్కార్యం బగు వ్యష్టి శరీరజాతం బనుత్పన్నం బయ్యె; అంత నాసయు ఘ్రాణేంద్రియంబుతోడ వాయువుం గూడిన నట్టిది యయ్యె; నాదిత్యుఁడు చక్షురింద్రియంబుతోడ నేత్రంబులు నొందిన వృథాభూతం బయ్యె; దిగ్దేవతాకం బగు కర్ణంబు శ్రోత్రేంద్రియంబుతోఁ గూడిన విరాట్కార్య ప్రేరణాయోగ్యం బయ్యె ఓషధులు రోమంబులం ద్వగింద్రియంబుఁ జెంది విఫలం బయ్యె; అద్దైవం బగు మేఢ్రంబు రేతంబు నొందినఁ దత్కార్యకరణాదక్షం బయ్యెఁ; బదంపడి గుదంబు మృత్యువు తోడ నపానేంద్రియంబుఁ జేరిన నది హైన్యంబు నొందె; విష్ణు దేవతాకంబు లగు చరణంబులు గతితోఁ గూడిన ననీశ్వరంబు లయ్యెఁ; బాణీంద్రియంబు లింద్రదైవతంబు లగుచు బలంబు నొందిన శక్తిహీనంబు లయ్యె; మఱియు నాడులు సనదీకంబులై లోహితంబు వొందిన నిరర్థకంబు లయ్యె; నుదరంబు సింధువుల తోడఁ జేరి క్షుత్పి పాసలం బొందిన వ్యర్థం బయ్యె; హృదయంబు మనంబు తోడం జంద్రు నొందిన నూరక యుండె; బుద్ధి బ్రహ్మాది దైవతంబై హృదయంబు నొందిన నిష్ఫలం బయ్యెఁ జిత్తం బభిమానంబుతో

రుద్రునిం జెందిన విరాట్కార్య జాతం బనుభూతం బయ్యె; నంతఁ జైత్యుం డగు క్షేత్రజ్ఞుండు హృదయాధిష్ఠానంబు నొంది చిత్తంబు తోడం బ్రవేశించిన విరాట్పురుషుండు సలిల కార్యభూత బ్రహ్మాండంబు నొంది ప్రవృత్త్యున్ముఖక్షముం డయ్యె; సుప్తుం డగు పురుషునిం బ్రాణాదులు దమ బలంబుచే భగవదప్రేరితంబు లగుచు నుత్థాపనా సమర్థంబు లగు చందంబున నగ్న్యాదులు స్వాధిష్ఠాన భూతంబు లగు నింద్రియంబులతోడ దేవాది శరీరంబుల నొందియు నశక్తంబు లయ్యె" అని మఱియు "నవ్విరాట్పురుషుని ననవరతభక్తిం జేసి విరక్తులై యాత్మల యందు వివేకంబు గల మహాత్ములు చింతింపుదు రనియుఁ బ్రకృతిపురుష వివేకంబున మోక్షంబును బ్రకృతి సంబంధంబున సంసారంబును గలుగు" ననియుఁ జెప్పి మఱియు నిట్లనియె.

## 3-49-ప్రకృతి పురుష వివేకంబు

### 3-904-సీస పద్యము

" జననుత! సత్త్వరజస్తమో గుణమయ;
 మైన ప్రాకృతకార్య మగు శరీర
గతుఁ డయ్యుఁ బురుషుండు గడఁగి ప్రాకృతములు;
 నగు సుఖ దుఃఖ మోహముల వలనఁ
గర మనురక్తుండు గాఁడు వికారవి;
 హీనుఁడు ద్రిగుణరహితుఁడు నగుచు
బలసి నిర్మలజల ప్రతిబింబితుండైన;
 దినకరుభంగి వర్తించు నట్టి

### 3-904.1-తేటగీతి

యాత్మ ప్రకృతిగుణంబుల యందుఁ దగులు
వడి యహంకారమూఢుఁడై దొడరి యేను
గడఁగి నిఖిలంబునకు నెల్లఁ గర్త నని ప్ర
సంగవశతను బ్రకృతి దోషములఁ బొంది

3-905-కంద పద్యము

సుర తిర్యఙ్మనుజస్థా
వరరూపము లగుచుఁ గర్మవాసనచేతం
బరపైన మిశ్రయోనులఁ
దిరముగ జనియించి సంసృతిం గైకొని తాన్.

3-906-కంద పద్యము

పూని చరించుచు విషయ
ధ్యానంబునఁజేసి స్వాప్నికార్థాగమ సం
ధానము రీతి నసత్పథ
మానసుఁ డగుచున్ భ్రమించు మతిలోలుండై.

3-907-వచనము

అట్లు గావున.

3-908-తేటగీతి

పూని మోక్షార్థి యగు వాఁడు దీని దీవ్ర
భక్తియోగంబుచేత విరక్తిబొంది

మనము వశముగఁజేసి యమనియమాది
యోగమార్గక్రియాభ్యాస యుక్తిఁ జేసి.

3-909-సీస పద్యము

శ్రద్ధాగరిష్ఠుఁడై సత్య మైనట్టి మ;
 ద్భావంబు మత్పాద సేవనంబు
వర్ణిత మత్కథాకర్ణనంబును సర్వ;
 భూత సమత్వమజాతవైర
మును బ్రహ్మచర్యంబు ఘన మౌనమాదిగా;
 గల నిజ ధర్మసంగతులఁ జేసి
సంతుష్టుఁడును మితాశనుఁడు నేకాంతియు;
 మననశీలుఁడు వీత మత్సరుండు

3-909.1-తేటగీతి

నగుచు మిత్రత్వమున గృపఁ దగిలి యాత్మ
కలిత విజ్ఞాని యై బంధకంబు లైన
ఘన శరీర పరిగ్రహోత్కంఠ యందు
నాగ్రహము వాసి వర్తింప నగును మఱియు.

3-910-వచనము

జీవేశ్వర తత్త్వజ్ఞానంబునం జేసి నివృత్తం బయిన బుద్ధి దదవస్థానంబునుం గలిగి దూరీభూతేతరదర్శనుండై జీవాత్మజ్ఞానంబునం జేసి చక్షురింద్రియంబున సూర్యుని దర్శించు చందంబున నాత్మ నాయకుం డయిన శ్రీమన్నారాయణుని దర్శించి నిరుపాధికంబై మిథ్యాభూతం బగు నహంకారంబున సద్రూపంబుచేఁ

బ్రకాశమానం బగుచుఁ బ్రధాన కారణంబునకు నధిష్ఠానంబును గార్యంబునకుఁ జక్షువుం బోలెఁ బ్రకాశంబును సమస్త కార్యకారణానుస్యూతంబును బరిపూర్ణంబును సర్వవ్యాపకంబును నగు బ్రహ్మంబును బొందు" నని చెప్పి వెండియు నిట్లనియె.

3-911-సీస పద్యము

" విను మాత్మవేత్తకు విష్ణుస్వరూపంబు;
నెఱుఁగంగఁ బడునది యెట్లటన్న
గగనస్థుఁ డగు దినకరు కిరణచ్ఛాయ;
జలముల గృహకుడ్యజాలకముల
వలన దోఁచిన ప్రతిఫలితంబుచేత నూ;
హింపగఁ బడిన యయ్యినుని పగిది
నర్థి మనోబుద్ధ్యహంకరణత్రయ;
నాడీప్రకాశమునను నెఱుంగ

3-911.1-తేటగీతి

వచ్చు నాత్మస్వరూపంబు వలఁతిగాఁగ
జిత్తమునఁ దోచు నంచితశ్రీఁ దనర్చి
యమ్మహామూర్తి సర్వభూతాంతరాత్ముఁ
డగుచు నాత్మజ్ఞులకుఁ గాననగును మఱియు.

3-912-వచనము

జీవుండు పరమాత్మానుషక్తుండై భూతాది తత్త్వంబులు లీనంబులై ప్రకృతి యందు వాసనామాత్రంబు గలిగి యకార్యకరణంబులై యున్న సుషుప్తి

సమయంబునం దాను నిస్తంద్రుం డగుచు నితరంబుచేతఁ గప్పబడనివాఁ డై పరమాత్మానుభవంబు సేయుచుండును" అని చెప్పిన విని; దేవహూతి యిట్లనియె.

3-913-సీస పద్యము

" విమలాత్మ యీ పృథివికిని గంధమునకు;
సలిలంబునకును రసంబునకును
నన్యోన్య మగు నవినాభావసంబంధ;
మైన సంగతిఁ బ్రకృత్యాత్మలకును
సతతంబు నన్యోన్య సంబంధమై యుండు;
ప్రకృతి దా నయ్యాత్మఁ బాయు టెట్లు
దలపోయ నొకమాటు తత్త్వబోధముచేత;
భవభయంబుల నెల్లఁ బాయు టెట్లు

3-913.1-తేటగీతి

చచ్చి క్రమ్మఱఁ బుట్టని జాడ యేది
యిన్నియుఁ దెలియ నానతి యిచ్చి నన్నుఁ
గరుణ రక్షింపవే దేవగణసుసేవ్య!
భక్తలోకానుగంతవ్య! పరమపురుష!"

3-914-వచనము

అనిన భగవంతుం డిట్లనియె "అనిమిత్తం బయిన స్వధర్మంబునను, నిర్మలాంతఃకరణంబునను, సునిశ్చితంబైన మద్భక్తియోగంబునను, సత్కథాశ్రవణసంపాదితంబైన వైరాగ్యంబునను, దృష్ట ప్రకృతిపురుష

యాధ్యాత్మ్కంబగు జ్ఞానంబునను, బలిష్ఠం బయి కామానభిష్వంగం బగు విరక్తివలనఁ దపోయుక్తం బయిన యోగంబునను, దీవ్రం బయిన చిత్తైకాగ్రతం జేసి పురుషుని దగు ప్రకృతి దందహ్యమానం బై తిరోధానంబును బొందు; అదియునుం గాక యరణిగతం బైన వహ్నిచే నరణి దహింపఁ బడు చందంబున జ్ఞానంబునను దత్త్వదర్శనంబుననుం జేసి నిరంతరంబు బలవంతంబును దృష్టదోషంబును నగు ప్రకృతి జీవునిచేత భుక్తభోగమై విడువంబడు" అని చెప్పి.

3-915-కంద పద్యము

" వినుు ప్రకృతి నైజమహిమం
బునఁ దనలో నున్న యట్టి పురుషునకు మహా
శునకు నశుభవిస్ఫురణం
బనయముఁ గావింపజాల దది యెట్లనినన్.

3-916-చంపకమాల

పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందు ననర్థకముల్ ప్రబోధమం
దరయగఁ మిథ్యలై పురుషు నందు ఘటింపని కైవడిం బరే
శ్వరునకు నాత్మనాథునకు సర్వశరీరికిఁ గర్మసాక్షికిం
బరువడిఁ బొంద వెన్నఁటికిఁ బ్రాకృతదోషము లంగనామణీ!"

3-917-వచనము

అని వెండియు నిట్లనియె.

3-918-సీస పద్యము

" అధ్యాత్మ తత్పరుం డగు వాఁడు పెక్కు జ;
న్మంబులఁ బెక్కు కాలంబు లందు
బ్రహ్మపదప్రాప్తి పర్యంతమును బుట్టు;
సర్వార్థవైరాగ్యశాలి యగుచుఁ
బూని నా భక్తులచే నుపదేశింపఁ;
బడిన విజ్ఞానసంపత్తిచేత
బరఁగఁ బ్రబుద్ధుఁడై బహువారములు భూరి;
మత్ప్రసాదప్రాప్తిమతిఁ దనర్చ

3-918.1-తేటగీతి

నిజపరిజ్ఞాన విచ్ఛిన్న నిఖిలసంశ
యుండు నిర్ముక్తలింగదేహుండు నగుచు
ననఘ! యోగీంద్రహృద్గేయ మగు మదీయ
దివ్యధామంబు నొందు సందీప్తుఁ డగుచు.

3-919-వచనము

మఱియు; నణిమాద్యష్టైశ్వర్యంబులు మోక్షంబున కంతరాయంబులు గావున వాని యందు విగతసంగుండును మదీయ చరణసరోజస్థిత లలితాంతరంగుండును నగు వాడు మృత్యుదేవత నపహసించి మోక్షంబు నొందు" అని చెప్పి; వెండియు "యోగలక్షణప్రకారంబు వినిపింతు విను" మని భగవంతుం డైన కపిలుండు నృపాత్మజ కిట్లనియె.

3-920-కంద పద్యము

" ధీనిధులై యే యోగవి
ధానంబునఁ జేసి మనము దగ విమలంబై
మానిత మగు మత్పదముం
బూనుదు రా యోగధర్మములఁ దెలిపెదన్.

3-921-వచనము

అది యెట్లనిన, శక్తికొలఁది స్వధర్మాచరణంబును; శాస్త్ర వినిషిద్ధ ధర్మకర్మంబులు మానుటయు; దైవికంబై వచ్చిన యర్థంబువలన సంతోషించుటయు; మహాభాగవత శ్రీపాదారవిందార్చనంబును; గ్రామ్యధర్మ నివృత్తియు; మోక్షధర్మంబుల యందు రతియు; మితం బై శుద్ధం బయిన యాహార సేవయు; విజనం బయి నిర్బాధకం బయిన స్థానంబున నుండుటయు; హింసా రాహిత్యంబును; సత్యంబును; నస్తేయంబును; దన కెంత యర్థం బుపయోగించు నంత యర్థంబ స్వీకరించుటయు; బ్రహ్మచర్యంబును; తపశ్శౌచంబులును; స్వాధ్యాయ పఠనంబును; బరమ పురుషుం డైన సర్వేశ్వరుని యర్చనంబును; మౌనంబును; నాసన జయంబును; దానం జేసి స్థైర్యంబును; బ్రాణవాయు స్వవశీకరణంబును; నింద్రియ నిగ్రహరూపం బైన ప్రత్యాహారంబును; మనంబుచే నింద్రియంబుల విషయంబులవలన మరలించి హృదయ మందు నిలుపుటయు; దేహగతం బైన మూలాధారాది స్థానంబులలో నొక్క స్థానంబు నందు హృదయ గతం బయిన మనస్సుతోడంగూడఁ బ్రాణ ధారణంబును; వైకుంఠుం డైన సర్వేశ్వరుండు ప్రవర్తించిన దివ్య లీలాచరిత్ర ధ్యానంబును; మానసైకాగ్రీకరణంబును; బరమాత్మ యగు పద్మనాభుని సమానాకారతయును; నివియునుం గాక తక్కిన వ్రతదానాదులం జేసి మనోదుష్టం బయిన యసన్మార్గంబును బరిహరించి జితప్రాణుం డై, మెల్లన యోజించి శుచి యైన

దేశంబునం బ్రతిష్టించి విజితాసనుం డై, యభ్యస్త కుశాజిన చేలోత్తరాసనం బైన యాసనంబు సేసి, ఋజుకాయుం డై ప్రాణమా ర్గంబును గుంభక రేచక పూరకంబులం గోశశోధనంబు సేసి, కుంభక పూరకంబుల చేతం బ్రతికూలంబు గావించి, చంచలం బయిన చిత్తంబు సుస్థిరంబు గావించి, తీవ్రం బయిన యమంబునం బ్రతప్తం బయి విగత సమస్త దోషం బగు చామీకరంబు కరణి విరజంబు సేసి, జిత మారుతుం డగు యోగి గ్రమ్మఱం బ్రాణాయామం బను పావకుని చేత వాత పిత్త శ్లేష్మంబులను దోషంబుల భస్మీకరణంబు సేసి, ధారణంబు చేతఁ గిల్బిషంబులను బ్రత్యాహారంబు చేత సంసర్గంబులను దహనంబు సేసి ధ్యానంబుచేత రాగంబుల సత్త్వాదిగుణంబులను నివారించి స్వ నాసాగ్రావలోకనంబు సేయుచు.

## 3-50-విష్ణు సర్వాంగస్తోత్రంబు

### 3-922-సీస పద్యము

దళ దరవింద సుందర పత్రరుచిరాక్షు;
సలలిత శ్రీవత్సకలితవక్షు
నీలనీరద నీలనీలోత్పలశ్యాము;
నలికులాకుల మాలికాభిరాముఁ
గౌస్తుభకలిత ముక్తాహారయుతకంఠు;
యోగిమానస పంకజోపకంఠు
సతతప్రసన్న సస్మిత వదనాంభోజు;
దినకరకోటి సందీప్తతేజు

### 3-922.1-తేటగీతి

సలలితానర్ఘ్య రత్న కుండల కిరీట
హార కంకణ కటక కేయూర ముద్రి
కాతులాకోటి భూషు భక్తప్రపోషుఁ
గింకిణీయుత మేఖలాకీర్ణజఘను.

3-923-వచనము

మఱియు,

3-924-సీస పద్యము

కంజాతకింజల్క పుంజరంజిత పీత;
కౌశేయవాసు జగన్నివాసు
శత్రుభీకర చక్ర శంఖ గదాపద్మ;
విహిత చతుర్బాహు విగతమోహు
నుతభక్తలోక మనోనేత్రవర్ధిష్ణు;
లాలిత సద్గుణాలంకరిష్ణు
వరకుమారక వయఃపరిపాకు సుశ్లోకు;
సుందరాకారు యశోవిహారు

3-924.1-తేటగీతి

సకలలోక నమస్కృతచరణకమలు
భక్తలోక పరిగ్రహాప్రకటశీలు
దర్శనీయ మనోరథదాయిఁ గీర్త
నీయ తీర్థయశోమహనీయమూర్తి.

3-925-వచనము

వెండియు.

3-926-కంద పద్యము

అనుపమగుణ సంపూర్ణుని

ననఘుని సుస్థితుని గతుని నాసీను శయా

నుని భక్తహృద్గుహాశయు

నుని సర్వేశ్వరు ననంతు నుతసచ్చరితున్.

3-927-మత్తేభ విక్రీడితము

విమలంబై పరిశుద్ధమై తగు మనోవిజ్ఞాన తత్త్వప్రబో

ధమతిన్ నిల్పి తదీయమూర్తి విభవధ్యానంబు గావించి చి

త్తము సర్వాంగ విమర్శనక్రియలకుం దార్కొల్పి ప్రత్యంగమున్

సుమహాధ్యానము సేయఁగావలయుఁబో శుద్ధాంతరంగంబునన్.

3-928-వచనము

అది యెట్టి దనిన.

3-929-సీస పద్యము

హల కులిశాంకుశ జలజధ్వజచ్ఛత్ర;

 లాలిత లక్షణలక్షితములు

సలలిత నఖచంద్రచంద్రికా నిర్ధూత;

 భక్తమానస తమఃపటలములును

సురుచిరాంగుష్ఠ నిష్ఠ్యూత గంగాతీర్థ;

మండిత హారజటామండలములు
సంచిత ధ్యానపారాయణజన భూరి;
కలుష పర్వత దీపకులిశములును

3-929.1-తేటగీతి

దాసలోక మనోరథదాయకములు
జారుయోగి మనఃపద్మ షట్పదములు
ననగఁ దనరిన హరిచరణాబ్జములను
నిరుపమధ్యానమున మది నిలుపవలయు.

3-930-చంపకమాల

కమలజు మాతయై సురనికాయ సమంచిత సేవ్యమానయై
కమలదళాభనేత్రములు గల్గి హృదీశ్వర భక్తి నొప్పు న
క్కమల నిజాంకపీఠమునఁ గైకొని యొత్తు పరేశుజాను యు
గ్మము హృదయారవిందమున మక్కువఁ జేర్చి భజింపగా దగున్.

3-931-ఉత్పలమాల

చారు విహంగవల్లభు భుజంబులమీఁద విరాజమానను
శ్రీరుచినుల్లసిల్లి యతసీకుసుమద్యుతిఁ జాల నొప్పు పం
కేరుహనాభు నూరువుల కిల్బిషభక్తి భజించి మానసాం
భోరుహ మందు నిల్పఁదగుఁటో మునికోటికి నంగనామణీ!

3-932-కంద పద్యము

పరిలంబిత మృదుపీతాం
బర కాంచీగుణ నినాదభరితం బగున
ప్పురుషోత్తముని నితంబముఁ
దరుణీ! భజియింపవలయు దద్దయుఁ బ్రీతిన్

3-933-కంద పద్యము

విను భువనాధారత్వం
బునఁదగి విధిజననహేతుభూతంబగున
వ్వనజాతముచేఁగడుమిం
చిన హరినాభీసరస్సుఁజింతింపఁదగున్

3-934-తేటగీతి

దివ్య మరకతరత్న సందీప్త లలిత
కుచములను మౌక్తికావళిరుచులఁ దనరి
యుందిరాదేవి సదనమై యొసక మెసఁగు
వక్షమాత్మను దలపోయవలయుఁ జుమ్ము.

3-935-మత్తేభ విక్రీడితము

నిరతంబున్ భజియించు సజ్జన మనోనేత్రాభిరామైక సు
స్థిర దివ్యప్రభ గల్గు కౌస్తుభరుచిశ్లిష్టంబునై యొప్పు నా
వర యోగీశ్వరవంద్యమానుఁ డగు సర్వస్వామి లక్ష్మీశు కం
ధర మాత్మం గదియించి తద్గుణగణధ్యానంబుసేయం దగున్.

3-936-కంద పద్యము

ఘన మందరగిరి పరివ
ర్తన నికషోజ్జ్వలిత కనకరత్నాంగదముల్
దనరారు లోకపాలకు
లను గలిగిన బాహు శాఖలను దలఁపఁదగున్.

3-937-వచనము

మఱియు విమత జనాసహ్యంబులైన సహస్రారంబులు గలుగు సుదర్శనంబును, సరసిజోదరకరసరోరుహం బందు రాజహంస రుచిరం బయిన పాంచజన్యంబును, నరాతిభటశోణిత కర్దమలిప్తాంగంబై భగవత్ప్రీతికారణి యగు కౌమోదకియును, బంధుర సుగంధ గంధానుబంధ మంథర గంధవహాహూయమాన పుష్పంధయ ఝంకార నినద విరాజితం బైన వైజయంతీ వనమాలికయును, జీవతత్త్వం బైన కౌస్తుభమణియును, బ్రత్యేకంబ ధ్యానంబు సేయందగు; వెండియు, భక్త సంరక్షణార్థం బంగీకరించు దివ్యమంగళవిగ్రహంబున కనురూపంబును, మకరకుండల మణి నిచయ మండిత ముకురోపమాన నిర్మల గండమండలంబును, సంతత శ్రీనివాస లోచనపంకజకలితంబును, లాలిత భ్రూలతాజుష్టంబును, మధుకర సమానరుచి చికురవిరాజితంబును నైన ముఖకమలంబు ధ్యానంబు గావింపవలయు; మఱియు, శరణాగతుల కభయప్రదంబు లగుచు నెగడు పాణిపంకేరుహంబుల మనంబునఁ దలఁపవలయు.

3-938-కంద పద్యము

గురు ఘోరరూపకంబై
పరఁగెడు తాపత్రయం బుపశమింపఁగ శ్రీ

హరిచేత నిస్సృష్టము లగు
కరుణాలోకములఁ దలఁపఁగాఁదగు బుద్ధిన్.

3-939-కంద పద్యము

ఘనరుచిగల మందస్మిత
మున కనుగుణ మగు ప్రసాదమును జిత్తమునన్
మునుకొని ధ్యానముసేయం
జను యోగిజనాళి కెపుడు సౌజన్యనిధీ!

3-940-తేటగీతి

పూని నతశిరులైనట్టి భూజనముల
శోకబాష్పాంబుజలధి సంశోషకంబు
నత్యుదారతమము హరిహాస మెపుడుఁ
దలఁపఁగావలె నాత్మలోఁ దవిలి వినుము.

3-941-సీస పద్యము

మునులకు మకరకేతనునకు మోహనం;
బైన స్వకీయ మాయావిలాస
మున రచితం బైన భ్రూమండలంబును;
ముని మనఃకుహర సమ్మోదమానుఁ
డగు నీశ్వరుని మందహాసంబు నవపల్ల;
వాధర కాంతిచే నరుణ మైన
మొల్లమొగ్గల కాంతి నుల్లసం బాడెడు;
దంతపంక్తిని మదిఁ దలఁపవలయు

3-941.1-తేటగీతి

వెలయ నీరీతి నన్నియు వేఱువేఱ
సంచితధ్యాన నిర్మల స్థానములుగ
మనములోఁ గను మని చెప్పి మఱియుఁ బలికె
దేవహూతికిఁ గపిలుండు దేటపడఁగ.

## 3-51-సాంఖ్యయోగంబు

3-942-సీస పద్యము

ఈ ప్రకారమున సర్వేశ్వరు నందును;
ప్రతిలబ్ధ భావసంపన్నుఁ డగుచుఁ
జిరతర సద్భక్తిచేఁ బ్రవృద్ధం బైన;
యతి మోదమునఁ బులకితశరీరుఁ
డగుచు మహోత్కంఠ నానందబాష్పముల్;
జడిగొనఁ బరితోషజలధిఁ గ్రుంకి
భగవత్స్వరూప మై భవగుణగ్రాహక;
మగుచు మత్సంబంధ మనుకరించి

3-942.1-తేటగీతి

సుమహితధ్యానమునఁ బరంజ్యోతి యందు
మనముఁ జాల నియోజించి మహిమఁ దనరు
మోక్షపద మాత్మలోన నపేక్షసేయు
ననఘువర్తనుఁ డైన మహాత్ముఁ డెపుడు.

3-943-వచనము

అది గావున; ముక్తి నపేక్షించు మహాత్ముం డగు వాని చిత్తంబు విముక్తం బైన భగవద్వ్యతిరిక్తాశ్రయంబు గలిగి విషయాంతర శూన్యంబై విరక్తిం బొందుటంజేసి పురుషుండు శరీరభావంబుల ననన్యభావం బగు నిర్వాణపదంబు సూక్ష్మం బగు తేజంబు దన కంటె నధికంబగు తేజంబు తోడి సమానాకారంబు నగు చందంబున నిచ్చగించు; వెండియు.

3-944-సీస పద్యము

పురుషుఁడు చరమమై భువి నన్య విషయ ని;
 వృత్తమై తగ నివర్తించు చిత్త
వృత్తాదులను గల్గి వెలయంగ నాత్మీయ;
 మగు మహిమ సునిష్ఠుఁడై లభించు
సుఖదుఃఖముల మనస్సునఁ దలపక యహం;
 కారధర్మంబులుగాఁ దలంచి
యనయంబు సాక్షాత్కృతాత్మతత్త్వము గల్గు;
 నతఁడు జీవన్ముక్తుఁ డండ్రు ధీరు

3-944.1-తేటగీతి

లతఁడు నే చందమున నుండు ననిన వినుము
తన శరీరంబు నిలుచుటయును జరించు
టయును గూర్చుండుటయు నీఁకేమియు నెఱుంగ
కర్థి వర్తించు విను తల్లి! యతఁడు మఱియు.

3-945-వచనము

మదిరాపానంబునం జేసి మత్తుం డగు వాఁడు దనకు బరిధానంబగు నంబరంబు మఱచి వర్తించు చందంబునఁ, దన శరీరంబు దైవాధీనం బని నశ్వరం బని తలంచి యాత్మతత్త్వనిష్ఠుండై యుపేక్షించు; అది యునుం గాక సమాధియోగంబునం జేసి సాక్షాత్కృతాత్మతత్త్వంబు గల వాడయి స్వాప్నికశరీరంబు చందంబున యావత్కర్మఫలానుభవ పర్యంతంబు పుత్ర దార సమేతం బగు ప్రపంచంబు ననుభవించి; యటమీదఁ బుత్ర దారాది సంబంధంబువలనం బాసి వర్తించు.

3-946-సీస పద్యము

సుత దార మిత్రానుజులకంటె మర్త్యుండు;
 భిన్నుఁడై వర్తించుచున్నరీతి
విస్ఫులింగోల్మక విపులధూమములచే;
 హవ్యవాహనుఁడు వేఱయినరీతి
వలనొప్ప దేహంబువలన నీ జీవాత్మ;
 పరికింప భిన్నరూపమున నుండుఁ
దవిలి భూతేంద్రియాంతఃకరణంబుల;
 భాసిల్లుచున్న యీ ప్రకృతిరూప

3-946.1-తేటగీతి

బ్రహ్మమున కాత్మ దాఁ బృథగ్భావ మగుచు
ద్రష్టయయి బ్రహ్మ సంజ్ఞచేఁ దనరుచుండు
నఖిలభూరి ప్రపంచంబు లందుఁ దన్నుఁ
దవిలి తనయందు నఖిల భూతములఁ గనుచు.

3-947-వచనము

వెండియు.

3-948-సీస పద్యము

వరుస ననన్యభావంబునఁ జేసి భూ;
 తావళి యందుఁ దదాత్మకత్వ
మునఁ జూచు నాత్మీయ ఘనతరోపాదాన;
 ముల యందుఁ దవిలి యిమ్ముల వెలుంగు
నిట్టి దివ్యజ్యోతి యేకమయ్యును బహు;
 భావంబులను దోఁచు ప్రకృతిగతుఁడు
నగుచున్న యాత్మయుఁ బొగడొందు దేవ తి;
 ర్యఙ్మనుష్యస్థావరాది వివిధ

3-948.1-తేటగీతి

యోనులను భిన్నభావంబు నొందుటయును
జాలఁ గల్గు నిజగుణ వైషమ్యమునను
భిన్నుఁడై వెల్గుఁ గావున బేర్చి యదియు
దేహసంబంధి యగుచు వర్తించుచుండు.

3-949-కంద పద్యము

భావింప సదసదాత్మక
మై వెలయును దుర్విభావ్య మగుచు స్వకీయం
బై వర్తించుచుఁ బ్రకృతిని
భావమునఁ దిరస్కరించు భవ్యస్ఫూర్తిన్.

3-950-వచనము

ఈ యాత్మ నిజస్వరూపంబునం జేసి వర్తించు" నని కపిలుం డెఱింగించిన విని దేవహూతి వెండియు నిట్లనియె "మహాత్మా! మహదాది భూతంబులకుం బ్రకృతి పురుషులకుం గల్గిన పరస్పర లక్షణంబులను దత్స్వరూపంబులను నెఱింగించితివి; ఇంక నీ ప్రకారంబున సాంఖ్యంబు నందు నిరూపింపఁబడు నట్టి ప్రకారంబును, భక్తియోగ మహాత్మ్యంబును, బురుషుండు భక్తియోగంబునం జేసి సర్వలోక విరక్తుం డగునట్టి యోగంబును, బ్రాణిలోకంబునకు సంసారం బనేక విధం బయి యుండుఁ; గావున బరాపరుండవై కాలస్వరూపి వైన నీ స్వరూపంబును ఏ నీవలని భయంబునం జేసి జనులు పుణ్యకార్యంబులు సేయుచుండుదురు; మిథ్యాభూతం బైన దేహంబు నందు నాత్మాభిమానంబుసేయుచు మూఢుండై కర్మంబు లందు నాసక్తం బైన బుద్ధిం జేసి విభ్రాంతుం డగుచు సంసార స్వరూపం బగు మహాంధ కారంబు నందుఁ జిరకాల ప్రసుప్తుం డైన జనునిఁ బ్రబోధించుకొఱకు యోగభాస్కరుండవై యావిర్భవించిన పుణ్యాత్ముండవు నీవు; గావున, నాకు నిన్నియుం దెలియ సవిస్తరంబుగా నానతియ్యవలయు" ననిన దేవహూతికి గపిలుం డిట్లనియె.

## 3-52-భక్తియోగంబు

3-951-కంద పద్యము

" నలినాయతాక్షి! విను జన

ములఫలసంకల్పభేదమునఁ జేసి మదిం

గల భక్తియోగమహిమం

బలవడఁగ ననేకవిధము లనఁదగు నవియున్.

3-952-వచనము

వివరించెదఁ దామస రాజస సాత్త్వికాది భేదంబులం ద్రివిధం బై యుండు; అందుఁ దామసభక్తి ప్రకారం బెట్టిదనిన.

3-953-తేటగీతి

సతతహింసాతిదంభ మాత్సర్యరోష
తమములను జేయుచును భేదదర్శి యగుచుఁ
బరఁగ నా యందుఁ గావించు భక్తి దలఁప
దామసం బనఁదగు వాఁడు తామసుండు.

3-954-కంద పద్యము

ఘన విషయప్రావీణ్యము
లను సుమహైశ్వర్య యశములను బూజాద్య
ర్థుని నను నర్థి భజించుట
చను రాజసయోగ మనఁగ సౌజన్యనిధీ!

3-955-చంపకమాల

అనుపమ పాపకర్మపరిహారము కై భజనీయుఁ డైన శో
భనచరితుం డితం డనుచు భావమునం దలపోసి భక్తిచే
ననితర యోగ్యతన్ భగవదర్పణబుద్ధి నొనర్చి కర్మముల్
జనహితకారి యై నెగడ సాత్త్వికయోగమనంగఁ జొప్పడున్.

3-956-చంపకమాల

మనుసుత! మద్గుణశ్రవణమాత్ర లభించిన యట్టి భక్తిచే
ననఘుఁడ సర్వశోభనగుణాశ్రయుఁడన్ పరమేశ్వరుండ నై
తనరిన నన్నుఁ జెందిన యుదాత్త మనోగతులవ్యయంబులై
వననిధిగామి యైన సురవాహినిఁబోలె ఫలించు నిమ్ములన్.

3-957-కంద పద్యము

హేయగుణరహితుఁ డనఁగల
నా యందుల భక్తిలక్షణముఁ దెలిపితి నన్
బాయక నిర్హేతుకముగఁ
జేయు మదీయవ్రతైక చిరతరభక్తిన్.

3-958-వచనము

నిష్కాము లయిన మదీయ భక్తులకు నట్టి భక్తియోగంబు సాలోక్య సార్ష్టి సామీప్య సారూప్య సాయుజ్యంబులకు సాధనంబు; గావున, మహాత్ము లగు వారు నిజమనోరథఫలదాయకంబు లయిన మదీయ సేవావిరహితం బులయిన యితర కర్మంబు లాచరింప నొల్లరు; దీని నాత్యంతిక భక్తియోగం బని చెప్పుదురు; సత్త్వ రజస్తమోగుణ విహీనుం డయిన జనుండు మత్సమానాకారంబుఁ బొందు" నని చెప్పి మఱియు నిట్లనియె.

3-959-సీస పద్యము

" నిత్యనైమిత్తిక నిజధర్మమున గురు;
శ్రద్ధాగరిష్టతఁ జతుర పాంచ
రాత్రోక్త హరిసమారాధన క్రియలను;
నిష్కామనంబున నెఱి మదీయ

విగ్రహదర్శన వినుతి పూజా వంద;
నధ్యానసంశ్రవణములఁ గర్మ
సంగి గాకుండుట సజ్జనప్రకరాభి;
మానంబు నొందుట హీను లందు

3-959.1-తేటగీతి

జాల ననుకంపసేయుట సముల యందు
మైత్రి నెఱపుట యమనియమక్రియాది
యైన యోగంబుచేత నాధ్యాత్మికాధి
భౌతికాదులఁ దెలియుట పలుకుటయును.

3-960-వచనము

మఱియును.

3-961-కంద పద్యము

హరి గుణ మంగళ కీర్తన
పరుఁడై తగ నార్జవమున భగవత్పరులం
గర మనురక్తి భజించుట
నిరహంకారమున నుంట నిశ్చలుఁ డగుటన్.

3-962-కంద పద్యము

ఇవి మొదలుగాఁగ గలుగు భ
గవదుద్దేశస్వధర్మకలితుం డై వీ

నివలనఁ బరిశుద్ధగతిం
దవిలిన మది గలుగు పుణ్యతముఁ డెయ్యెడలన్.

3-963-తేటగీతి

గురుతరానేక కళ్యాణగుణవిశిష్టుఁ
డనఁగ నొప్పిన ననుఁ బొందు నండగొనక
పవనవశమునఁ బువ్వుల పరిమళంబు
ఘ్రాణమున నావరించినకరణి మెఱసి.

3-964-చంపకమాల

అనిశము సర్వభూతహృదయాంబుజవర్తి యనం దనర్చు నీ
శు నను నవజ్ఞసేసి మనుజుం డొగి మత్ప్రతిమార్చనా విడం
బనమున మూఢుఁడై యుచితభక్తిని నన్ను భజింపఁడేని న
మ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చిన యట్టివాఁ డగున్.

3-965-సీస పద్యము

అబ్జాక్షి నిఖిలభూతాంతరాత్ముఁడ నైన;
నా యందు భూతగణంబు నందు
నతిభేదదృష్టి మాయావులై సతతంబుఁ;
బాయక వైరానుబంధ నిరతు
లగువారి మనములఁ దగులదు శాంతి యె;
న్నఁటికైన నేను నా కుటిలజనుల
మానక యెపుడు సామాన్యాధికద్రవ్య;
సమితిచే మత్పదార్చన మొనర్ప

3-965.1-తేటగీతి

నర్థి నాచిత్తమున ముదం బందకుందు
ననుచు నెఱిఁగించి మఱియు నిట్లనియెఁ గరుణఁ
గలిత సద్గుణ జటిలుఁ డక్కపిలుఁ డెలమిఁ
దల్లితోడ గుణవతీమతల్లితోడ.

3-966-సీస పద్యము

తరళాక్షి! విను మచేతన దేహములకంటెఁ;
జేతన దేహముల్ శ్రేష్ఠ మందుఁ
బ్రాణవంతంబులై స్పర్శనజ్ఞానంబు;
గలుగు చైతన్యవృక్షములకంటె
ఘనరసజ్ఞానసంకలితచేతను లుత్త;
ములు రసజ్ఞానంబు గలుగు వాని
కంటె గంధజ్ఞానకలితబృందంబులు;
గడు శ్రేష్ఠములు వానికంటె శబ్ద

3-966.1-తేటగీతి

వేదు లగుదురు శ్రేష్ఠమై వెలయు శబ్ద
విదులకంటెను సద్రూపవేదు లైన
వాయసాదులు శ్రేష్ఠముల్ వానికంటె
వరుస బహుపాదు లుత్తముల్ వానికంటె

3-967-కంద పద్యము

తలఁపఁ జతుష్పదు లధికులు
బలకొని మఱి వానికంటెఁ బాదద్వయముం
గల మనుజు లలఘుతము లి
మ్ముల వారల యందు వర్ణములు నాల్గరయన్

3-968-వచనము

అందు.

3-969-సీస పద్యము

తలఁప బ్రాహ్మణు లుత్తములు వారికంటెను;
వేదవేత్తలు, వేదవిదులకంటె
విలసితవేదార్థవిదులు, వారలకంటె;
సమధిక శాస్త్రసంశయము మాన్పు
మీమాంసకులు, మఱి మీమాంసకులకంటె;
నిజధర్మవిజ్ఞాననిపుణు లరయ
వారికంటెను సంగవర్జితచిత్తులు;
దగ వారికంటె సద్ధర్మపరులు

3-969.1-తేటగీతి

ధార్మికులకంటె నుత్తమోత్తములు వినుము
మత్సమర్పిత సకలధర్మస్వభావ
మహిమములు గల్గి యితర ధర్మములు విడిచి
సమత వర్తించు నప్పుణ్యతముఁడు ఘనుఁడు.

3-970-వచనము

అట్టివాని.

3-971-కంద పద్యము

కని సకలభూతగణములు
మనమున నానందజలధిమగ్నము లగుచున్
ఘన బహుమాన పురస్సర
మనయముఁ బాటిల్ల వినుతు లర్థిం జేయున్.

3-972-వచనము

అంత; నీశ్వరుండు జీవస్వరూపానుప్రవిష్టుండై యుండు నట్టి భగ వంతుం జూచి భక్తియోగంబుననేని యోగంబుననేనిఁ బురుషుండు పరమాత్మఁ బొందు ప్రకృతిపురుషాత్మకంబును దద్వ్యతిరిక్తంబును నైన దైవంబు నై కర్మవిచేష్టితం బగుచు నుండు; అదియ భగవద్రూపంబు; ఇట్టి భగవద్రూపంబు భేదాస్పదం బగుచు నద్భుత ప్రభావంబు గల కాలం బనియుఁ జెప్పంబడు; అట్టి కాలంబు మహదాదిత త్త్వంబులకును మహత్తత్త్వాభిమాను లగు జీవులకును భయావహం బగుటంజేసి సకల భూతములకు నాశ్రయం బగుచు నంతర్గతంబై భూతంబులచేత భూతంబుల గ్రసించుచు యజ్ఞఫలప్రదాత గావున వశీకృతభూతుండై ప్రభుత్వంబు భజియించి విష్ణుండు ప్రకాశించుచుండు; అతనికి మిత్రుండును శత్రుండును బంధుండును లేఁడు; అట్టి విష్ణుండు సకలజనంబుల యందావేశించి యప్రమత్తుఁడై ప్రమత్తు లయిన జనంబులకు సంహారకుండై యుండు; అతని వలని భయంబునంజేసి వాయువు వీచు సూర్యుం డుదయించు, నింద్రుండు వర్షించు, నక్షత్ర గణంబు వెలుంగుఁ, జంద్రుండు ప్రకాశించు, దత్తత్కాలంబుల వృక్ష

లతాదులోషధుల తోడంగూడి పుష్ప ఫలభరితము లగు, సరిత్తులు ప్రవహించు, సముద్రంబులు మేరలు దప్పక యుండు; నగ్ని ప్రజ్వలించు, భూమి గిరులతోఁ గూడ బరువునఁ గ్రుంగ వెఱచు, ఆకాశంబు సకల జనంబులకు నవకాశం బిచ్చు, మహత్తత్త్వంబు జగత్తునకు నంకుర స్వరూపంబు గావున సప్తావరణావృతం బగు లోకం బను స్వదేహంబు విస్తరింపఁ జేయు; గుణాభిమాను లగు బ్రహ్మాదులు సర్వేశ్వరునిచేత జగత్సర్గంబు నందు నియోగింపఁబడి ప్రతిదినంబు నయ్యయి సర్గంబుసేయ నప్రమత్తులై యుండుదురు; పిత్రాదులు పుత్త్రోత్పత్తిఁ జేయుదురు; కాలుండు మృత్యుసహాయుండై మారకుండై యుండు" అని చెప్పి కపిలుండు వెండియు నిట్లనియె.

3-973-కంద పద్యము

" నెఱి నిట్టి నిఖిలలోకే
శ్వరుని పరాక్రమముఁ దెలియ సామర్థ్యంబె
వ్వరికినిఁగలుగదు మేఘము
గరువలి విక్రమముఁ దెలియఁగా లేని గతిన్.

3-974-కంద పద్యము

మగువా! విను సుఖహేతుక
మగు నర్థము దొరకమికి మహాదుఃఖమునం
దగులుదు రిది యంతయు నా
భగవంతుని యాజ్ఞఁజేసి ప్రాణులు మఱియున్.

3-975-సీస పద్యము

పూని యసత్యంబులైన గృహక్షేత్ర;
పశు ధన సుత వధూ బాంధవాది
వివిధ వస్తువులను ధ్రువముగా మది నమ్మి;
వఱలు దుర్మతి యగువాఁడు జంతు
సంఘాత మగు దేహసంబంధమున నిల్చి;
యర్థి నయ్యై యోను లందుఁ జొరఁగ
ననుగమించును వాని యందు విరక్తుండు;
కాక యుండును నరకస్థుఁ డైన

3-975.1-తేటగీతి

దేహి యాత్మీయదేహంబు దివిరి వదల
లేక తన కది పరమసౌఖ్యాకరంబు
గాఁగ వర్తించు నదియును గాక యతఁడు
దేవమాయావిమోహితభావుఁ డగుచు.

3-976-కంద పద్యము

ఘనముగఁ బుత్ర వధూపశు
ధన గృహరక్షణము నందు దత్తత్క్రియలన్
మనమునఁ దలపోయుచు దిన
దినమున్ దందహ్యమాన దేహుం డగుచున్.

3-977-కంద పద్యము

అతి మూఢహృదయుఁ డగుచు దు
రితకర్మారంభమునఁ జరించుచుఁ దరుణీ!

కృతగోప్యభాషణములను
సుతలాలనభాషణములఁ జొక్కుచు మఱియున్.

3-978-కంద పద్యము

విను, మింద్రియ పరవశుఁడై
మునుకొని తత్కూటధర్మములు గల దుఃఖం
బనయము సుఖరూపంబుగ
మనమునఁ దలపోసి తదభిమానుం డగుచున్.

3-979-కంద పద్యము

సతతముఁ దమతమ సంపా
దిత మగు నర్థములచేత ధృతిఁ బరులకుఁ గు
త్సితమతి హింసలు చేయుచు
నతి మూఢమనస్కుఁ డగుచు నాత్మజనములన్.

3-980-తేటగీతి

పూని రక్షించుచును వారిభుక్తశేష
మనుభవించుచు నంత జీవనమువోకఁ
గడఁగి మఱిమఱి యపరార్థకాముఁ డగుచు
సత్త్వమెడలి కుటుంబపోషణము నందు.

3-981-సీస పద్యము

బలిమి సాలక మందభాగ్యుఁడై కుమతి యై;
పూని యపుడు క్రియాహీనుఁ డగుచు

దవిలి వృథాప్రయత్నంబులు సేయుచు;
 మూఢుఁడై కార్పణ్యమునఁ జరించు
నట్టి యకించనుఁ డగువానిఁ జూచి త;
 ద్దారసుతాదు లాత్మలను వీఁడు
గడు నశక్తుఁడు ప్రోవఁగాఁజాలఁ డితఁ డని;
 సెగ్గింతు రర్థిఁ గృషీవలుండు

3-981.1-తేటగీతి

బడుగు ముసలెద్దు రోసిన పగిది నంత
నతఁడు సేవెంటలను సుఖం బందలేక
తాను పోషించు జనులు దన్ తనరఁ బ్రోవ
బ్రతుకు ముదిమియు మిక్కిలి బాధపఱుప.

3-982-కంద పద్యము

వెడరూపు దాల్చి బాంధవు
లడలఁగ నిర్యాణమునకు నభిముఖుఁడై యి
ల్వెడలఁగజాలక శునకము
వడువునఁ గుడుచుచును మేను వడవడ వడఁకన్

3-983-సీస పద్యము

అతిరోగ పీడితుండై మంద మగు జఠ;
 రాగ్నిచే మిగుల నల్పాశి యగుచు
మెఱసి వాయువుచేత మీఁదికి నెగసిన;
 కన్నులు కఫమునఁ గప్పుబడిన

నాళంబులను గంఠనాళంబునను ఘుర;
 ఘుర మను శబ్దము దొరయ బంధు
జనుల మధ్యంబున శయనించి బహువిధ;
 ములఁ దన్ను బిలువంగ బలుకలేక

3-983.1-తేటగీతి

చటులతర కాలపాశవశంగతాత్ముఁ
డగుచు బిడ్డలఁ బెండ్లాము నరసి ప్రోచు
చింత వికలములైన హృషీకములును
గలిగి విజ్ఞానమును బాసి కష్టుఁ డగుచు.

3-984-వచనము

అంత మరణావస్థం బొందు సమయంబున నతి భయంకరాకారులు సరభసేక్షణులు నగు యమదూత లిద్దఱు దన ముందఱ నిలిచినం జూచి; త్రస్తహృదయుండై శకృన్మూత్రంబులు విడుచుచు; యమపాశంబులచే గళంబున బద్ధుండై శరీరంబువలన నిర్గమించి; యాతనా శరీరంబు నవలంబించి బలాత్కారంబున దీర్ఘంబై దుర్గమం బగు మార్గంబును బొంది; రాజభటులచే నీయమానుం డగుచు; దండనంబున కభిముఖుండై చను నపరాధి చందంబునఁ జనుచుండి.

3-985-చంపకమాల

అనయము మూర్ఛ నొందు శునకావళిచేతను భక్ష్యమాణుఁడై
యనుపమ కాలకింకర భయంకర తర్జనగర్జనంబులన్

మనము గలంగ దేహము సమస్తముఁ గంపము వొందగాఁ బురా
తనభవ పాపకర్మసముదాయముఁ జిత్తములోఁ దలంచుచున్.

3-986-సీస పద్యము

అనుపమ క్షుత్తృష్ణ లంతర్వ్యధలఁ జేయ;
ఝంఝానిలజ్వలజ్జ్వలన చండ
భానుప్రదీప్త తప్తం బైన వాలుకా;
మార్గానుగత తప్యమాన గాత్రుఁ
డై వీఁపుఁ గశలచే నడువంగ వికలాంగుఁ;
డగుచు మార్గము నందు నచట నచటఁ
జాల మూర్ఛిల్లి యాశ్రయశూన్య మగు నీళ్ళ;
మునుఁగుచు లేచుచు మొనసి పాప

3-986.1-తేటగీతి

రూపమయిన తమముచే నిరూఢుఁ డగుచు
వెలయఁ దొంబదితొమ్మిదివేల యోజ
నముల దూరంబు గల యమనగరమునకుఁ
బూని యమభటుల్ కొంపోవఁ బోవు నంత.

3-987-వచనము

ఇట్లు మహాపాపాత్ముం డైనవాఁడు ముహూర్తత్రయ కాలంబునను సామాన్యదోషి యగువాఁడు ముహుర్తద్వయంబునను నేగి యాతనం బొందును; అందు.

3-988-కంద పద్యము

పట్టుదురు కొఱవులను వడిఁ
బెట్టుదు రసిపత్రికలను బెనుమంటల యం
దొట్టుదు రొడళ్ళు నలియన్
మట్టుదు రప్పాపచిత్తు మత్తుం బెలుచన్.

3-989-ఉత్పలమాల

ముంతురు తప్తతోయముల మొత్తుదు రుగ్రగదాసిధారలం
దెంతురు పొట్ట ప్రేవులు వధింతురు మీఁద నిభేంద్ర పంక్తి తో
ప్పింతురు ఘోర భంగిఁ గఱపింతురు పాములచేత బిట్టు ద్రొ
బ్బింతురు మీఁద గుండ్లు దినిపింతురు దేహముఁ గోసి కండలన్.

3-990-వచనము

మఱియుఁ గుటుంబపోషణంబునఁ గుక్షింభరుం డగుచు నధర్మపరుం డై భూతద్రోహంబున నతిపాపుండై నిరయంబునుం బొంది నిజ ధనంబులు గోలుపడి మొఱపెట్టు నాపన్నుని చందంబునం బరస్పర సంబంధంబునఁ గల్పింపబడిన తమిస్రాంధతామిస్ర రౌరవాదు లగు నరకంబులం బడి తీవ్రంబు లయిన బహుయాతనల ననుభవించి క్షీణపాపుండై పునర్నరత్వంబునుం బొందు" నని చెప్పి వెండియు నిట్లనియె.

## 3-53-గర్భసంభవ ప్రకారంబు

3-991-సీస పద్యము

" కైకొని మఱి పూర్వకర్మానుగుణమున;
శశ్వత్ప్రకాశకుం డీశ్వరుండు

ఘటకుండు గావునఁ గ్రమ్మఱ జీవుండు;
దేహసంబంధంబుఁ దివిరి తాల్ప
దొరఁకొని పురుషరేతోబిందుసంబంధి;
యై వధూగర్భంబు నందుఁ జొచ్చి
కైకొని యొకరాత్రి గలిలంబు పంచరా;
త్రముల బుద్బుదమును దశమ దివస

3-991.1-తేటగీతి

మందు గర్కంధు వంత యౌ నంతమీఁదఁ
బేశి యగు నంతమీఁదటఁ బేర్చి యండ
కల్ప మగు నొక్క నెల మస్తకమును మాస
యుమళమైనను గరచరణములుఁ బొడము

3-992-వచనము

మఱియు; మాసత్రయంబున నఖ రోమాస్థి చర్మంబులు లింగచ్ఛిద్రంబులు గలిగి నాలవ మాసంబున సప్తధాతువులును బంచమ మాసంబున క్షుత్తృష్ణలును గలిగి షష్ట మాసంబున మావిచేతం బొదువం బడి తల్లి కుక్షిని దక్షిణభాగంబునం దిరుగుచు మాతృభుక్తాన్న పానంబులవలనఁ దృప్తి బొందుచు నేధమానధాతువులు గల్గి జంతు సంకీర్ణంబగు విణ్మూత్రగర్తం బందుఁ దిరుగుచుఁ క్రిమిభక్షిత శరీరుండై మూర్ఛలం బొందుచుఁ దల్లి భక్షించిన కటుతిక్తోష్ణ లవణ క్షారామ్లాద్యుల్బణంబు లైన రసంబులచేత బరితప్తాంగుం డగుచు జరాయువునఁ గప్పంబడి బహిప్రదేశంబు నందు నాత్రంబులచేత బద్ధుండై కుక్షి యందు శిరంబు మోపికొని భుగ్నం బైన పృష్టగ్రీవోదరుండై స్వాంగ చలనంబు నందు నసమర్థుం

డగుచుఁ బంజరంబందుండు శకుంతంబు చందంబున నుండి దైవకృతంబైన జ్ఞానంబునం బూర్వజన్మ దుష్కృతంబుల దలంచుచు దీర్ఘోచ్ఛ్వాసంబు సేయుచు నే సుఖలేశంబునుం బొందక వర్తించు; అంత నేడవ నెల యందు లబ్ధజ్ఞానుండై చేష్టలు గలిగి విట్క్రిమి సోదరుండై యొక్క దిక్కున నుండక సంచరించుచుం బ్రసూతి మారుతంబులచేత నతి వేపితుం డగుచు యోచమానుండు దేహాత్మదర్శియుఁ బునర్గర్భ వాసంబునకు భీతుండు నగుచు బంధనభూతం బగు సప్తధాతువులచే బద్ధుం డై కృతాంజలి పుటుండు దీనవదనుండు నై జీవుండు దా నెవ్వనిచే నుదరంబున వసియింపఁబడె నట్టి సర్వేశ్వరుని నిట్లని స్తుతియించు.

3-993-కంద పద్యము

" అనయమును భువనరక్షణ
మునకై స్వేచ్ఛానురూపమునఁ బుట్టెడి వి
ష్ణుని భయవిరహిత మగు పద
వనజయుగం బర్థిఁ గొల్తు వారని భక్తిన్.

3-994-వచనము

అదియునుం గాక; పంచభూత విరహితుఁ డయ్యుం బంచభూత విరచితం బైన శరీరంబు నందుఁ గప్పంబడి యింద్రియ గుణార్థ చిదాభాస జ్ఞానుం డైన నేను.

3-995-సీస పద్యము

ఎవ్వఁడు నిఖిల భూతేంద్రియమయ మగు;
మాయావలంబున మహితకర్మ
బద్ధుఁడై వర్తించు పగిది దందహ్యమా;

నంబగు జీవ చిత్తంబు నందు
నవికారమై శుద్ధమై యఖండజ్ఞాన;
మున నుండు వానికి ముఖ్యచరితు
నకు నకుంఠితశౌర్యునకుఁ పరంజ్యోతికి;
సర్వజ్ఞునకుఁ గృపాశాంతమతికిఁ

3-995.1-తేటగీతి

గడఁగియుఁ బ్రకృతిపురుషుల కంటెఁ బరముఁ
డయిన వానికి మ్రొక్కెద నస్మదీయ
దుర్భరోదగ్ర భీకర గర్భనరక
వేదనలఁ జూచి శాంతిఁ గావించు కొఱకు.

3-996-సీస పద్యము

అనవుడు సుతునకు జనని యిట్లనుఁ దగ;
మహితాత్మ! యెవ్వని మహిమచేత
ఘనమోహులై గుణకర్మనిమిత్త సాం;
సారికమార్గ సంచారములను
ధృతిసెడి యలసి యేదిక్కు నెఱుంగక;
హరిపాద ధ్యానంబు నాత్మ మఱచి
యుండు వారలకు నే యుక్తియు నమ్మహా;
పురుషు ననుగ్రహబుద్ధి లేక

3-996.1-తేటగీతి

తద్గుణధ్యాన తన్మూర్తి దర్శనములు
గోచరించుట యెట్లు నాకునుఁ బ్రబోధ
కలితముగఁ బల్కు మనవుడుఁ గపిలుఁ డనియె
నంబతోడను సుగుణకదంబతోడ.

3-997-వచనము

అట్టి యీశ్వరుండు గాలత్రయంబు నందును జంగమ స్థావరాంత ర్యామి యగుటంజేసి జీవకర్మ మార్గంబులం బ్రవర్తించు వారు తాపత్రయ నివారణంబు కొఱకు భజియింతురు" అని చెప్పి మఱియు నిట్లనియె.

3-998-కంద పద్యము

" జనయిత్రి! గర్భ మందును
ఘన క్రిమి విణ్మూత్ర రక్త గర్తము లోనన్
మునుఁగుచు జఠరాగ్ని ని దిన
దినమును సంతప్యమానదేహుం డగుచున్.

3-999-ఆటవెలది

దీనవదనుఁ డగుచు దేహి యీ దేహంబు
వలన నిర్గమింపఁ దలఁచి చనిన
నెలల నెన్నికొనుచు నెలకొని గర్భంబు
వలన వెడలఁ ద్రోయువారు గలరె?

3-1000-వచనము

అని తలంచుచు దీనరక్షకుం డయిన పుండరీకాక్షుండు దన్ను గర్భనరకంబువలన విముక్తునిం జేయ నమ్మహాత్మునికిఁ బ్రత్యుపకారంబు సేయలేమికి నంజలి మాత్రంబు సేయందగునట్టి జీవుండ నైన నేను శమదమాది యుక్తం బైన శరీరంబు నందు విజ్ఞానదీపాంకురంబునం బురాణపురుషు నిరీక్షింతును" అని మఱియు

3-1001-సీస పద్యము

నెలకొని బహు దుఃఖములకు నాలయ మైన;
 యీ గర్భనరకము నేను వెడలఁ
జాల బహిఃప్రదేశమునకు వచ్చిన;
 ననుపమ దేవమాయా విమోహి
తాత్ముండనై ఘోరమైనట్టి సంసార;
 చక్ర మందును బరిశ్రమణశీలి
నై యుండవలయుఁ దా నదిగాక గర్భంబు;
 నందుండు శోకంబు నపనయించి

3-1001.1-తేటగీతి

యాత్మ కనయంబు సారథి యైన యట్టి
రుచిర విజ్ఞానమునఁ దమోరూపమైన
భూరి సంసారసాగరోత్తారణంబు
సేసి యీ యాత్మ నరసి రక్షించుకొందు.

3-1002-వచనము

మఱియును.

3-1003-చంపకమాల

పరఁగుచు నున్న దుర్వ్యసనభాజనమై ఘన దుఃఖమూలమై
యరయఁగ బెక్కుతూంట్లు గలదై క్రిమిసంభవ మైనయట్టి దు
స్తర బహు గర్భవాసముల సంగతి మాన్పుటకై భజించెదన్
సరసిజనాభ భూరి భవసాగరతారక పాదపద్మముల్."

3-1004-కంద పద్యము

అని కృతనిశ్చయుఁ డయి యే
చిన విమలజ్ఞాని యగుచు జీవుఁడు గర్భం
బున వెడల నొల్లకుండం
జనియెడు నవమాసములును జననీ! యంతన్.

3-1005-వచనము

దశమమాసంబున వాని నధోముఖుం గావించిన నుచ్ఛ్వాస నిశ్వాసంబులు లేక ఘన దుఃఖభాజనుండు విగత జ్ఞానుండు రక్తదిగ్ధాంగుండు నై విష్టాస్థక్రిమియుం బోలె నేలంబడి యేడ్చుచు జ్ఞానహీనుం డై జడుడునుం బోలె నుండి; యంత నిజ భావానభిజ్ఞు లగు నితరుల వలన వృద్ధిం బొందుచు నభిమతార్థంబులం జెప్పనేరక; యనేక కీటసంకులం బయిన పర్యంకంబు నందు శయానుండై; యవయవంబులు గండూయమానంబు లైనఁ గోఁకనేరక యాసనోత్థాన గమనంబుల నశక్తుండై; తన శరీరచర్మంబు మశక మత్కుణ మక్షికాదులు పొడువ గ్రిములచే వ్యధంబడు క్రిమియుంబోలె దోదూయమానుండై రోదనంబు సేయుచు విగతజ్ఞానుండై మెలంగుచు; శైశవంబునం దత్త త్రియానుభవంబుఁ గావించి పౌగండ వయస్సునఁ దదనురూపంబు లగు నధ్యయనాది దుఃఖంబు

లనుభవించి; తదనంతరంబ యౌవనంబు ప్రాప్తం బైన నభిమతార్థ ఫలప్రాప్తికి సాహసపూర్వకంబు లగు వృథాగ్రహంబులు సేయుచుఁ గాముకుండై; పంచమహాభూతారబ్ధం బగు దేహం బందుఁ బెక్కుమాఱు లహంకార మమకారంబులం జేయుచుఁ దదర్థంబులైన కర్మంబు లాచరించుచు సంసారబద్ధు డగచు దుష్పురుష సంగమంబున శిశ్నోదరపరాయణుండై వర్తించుచు నజ్ఞానంబునం జేసి వర్ధిష్యమాన రోషుం డగుచుఁ; దత్ఫలంబు లగు దుఃఖంబు లనుభవించుచుఁ గాముకుండై నిజనాశంబునకు హేతువు లగు కర్మంబులం బ్రవర్తించు చుండు; మఱియును.

3-1006-సీస పద్యము

జనయిత్రి! సత్యంబు శౌచంబు దయయును;
 ధృతియు మౌనంబు బుద్ధియును సిగ్గు
క్షమయును యశమును శమమును దమమును;
 మొదలుగాగల గుణంబులు నశించు
జనుల కసత్సంగమున నని యెఱిఁగించి;
 వెండియు నిట్లను వినుము, మూఢ
హృదయులు శాంతి విహీనులు దేహాత్మ;
 బుద్ధులు నంగనా మోహపాశ

3-1006.1-తేటగీతి

బద్ధ కేళీమృగంబుల పగిదిఁ దగిలి
పరవశస్వాంతముల శోచ్యభావు లైన

వారి సంగతి విడువంగ వలయు నందు
నంగనాసంగమము దోష మండ్రు గాన.

3-1007-వచనము

దీని కొక్క యితిహాసంబు గలదు; తొల్లి యొక్కనాడు ప్రజాపతి దన కూఁతు రయిన భారతి మృగీరూపధారిణి యై యుండం జూచి తదీయ రూపరేఖా విలాసంబులకు నోటువడి వివశీకృతాంతరంగుండును విగత త్రపుండును నై తానును మృగరూపంబు నొంది తదనుధావనంబు హేయం బని తలంపక ప్రవర్తించెం; గావున నంగనాసంగమంబు వలవ; దస్మదీయ నాభికమల సంజాత చతుర్ముఖ నిర్మిత మరీచ్యాద్యుద్భూత కశ్యపాది కల్పిత దేవ మనుష్యాదు లందు మాయా బలంబునం గామినీజన మధ్యంబున విఖండిత మనస్కుండు గాకుండఁ బుండరీకాక్షుండైన నారాయణఋషికిం దక్క నన్యులకు నెవ్వరికిం దీరదు" అని వెండియు నిట్లనియె.

3-1008-తేటగీతి

" రూఢి నా మాయ గామినీరూపమునను
బురుషులకు నెల్ల మోహంబుఁ బొందజేయుఁ
గాన పురుషులు సతులసంగంబు మాని
యోగవృత్తిఁ జరించుచు నుండవలయు.

3-1009-కంద పద్యము

ధీరతతో మత్పదసర
సీరుహసేవానురక్తిఁ జెందినవారల్

నారీసంగము నిరయ
ద్వారముగా మనము లందు దలఁపుదు రెపుడున్.

3-1010-కంద పద్యము

హరిమాయా విరచితమై
తరుణీరూపంబుఁ దాల్చి ధరఁ బర్విన బం
ధుర తృణపరివృత కూపము
కరణి నదియు మృత్యురూపకం బగు మఱియున్.

3-1011-చంపకమాల

ధన పశు మిత్ర పుత్ర వనితా గృహకారణభూత మైన యీ
తనువున నున్న జీవుఁడు పదంపడి యట్టి శరీర మెత్తి తా
ననుగతమైన కర్మఫల మందకపోవఁగరాదు మింటఁ బో
యిన భువిఁ దూరినన్ దిశల కేగిన నెచ్చట నైన డాగినన్.

3-1012-వచనము

అట్టి పురుషరూపంబు నొందిన జీవుండు నిరంతర స్త్రీసంగంబుచే విత్తాపత్య గృహాదిప్రదం బగు స్త్రీత్వంబు నొందు; ఈ క్రమంబున నంగనా రూపుం డగు జీవుండు మన్మాయచేఁ బురుషరూపంబు నొంది ధనాదిప్రదుం డగు భర్తను నాత్మబంధకారణం బగు మృత్యువునుగ నెఱుంగ వలయు; మఱియు జీవోపాధిభూతం బగు లింగదేహంబుచే స్వావాస భూతలోకంబున నుండి లోకాంతరంబు నొందుచుం బ్రారబ్ధ కర్మఫలంబుల ననుభవించుచు; మరలం గర్మాదులందాసక్తుఁ డగుచు మృగయుండు గాననంబున ననుకూల సుఖప్రదుం డైనను మృగంబునకు మృత్యు వగు చందంబున జీవుండు భూతేంద్రియ

మనోమయం బైన దేహంబు గలిగి యుండు; అట్టి దేహనిరోధంబె మరణంబు; ఆవిర్భావంబె జన్మంబునుం; గాన సకల వస్తువిషయ జ్ఞానంబు గలుగుటకు జీవునకు సాధనంబు చక్షురింద్రియం బగు ద్రష్టదర్శనీయ యోగ్యతాప్రకారంబున జీవునకు జన్మమరణంబులు లేవు; గావున భయకార్పణ్యంబులు విడిచి సంభ్రమంబు మాని జీవప్రకారంబు జ్ఞానంబునం దెలిసి ధీరుండై ముక్తసంగుం డగుచు యోగ వైరాగ్యయుక్తం బైన సమ్యగ్జ్ఞానంబున మాయావిరచితం బైన లోకంబున దేహాదులం దాసక్తి మాని వర్తింప వలయు" నని చెప్పి; వెండియు నిట్లనియె.

## 3-54-చంద్రసూర్యపితృ మార్గంబు

### 3-1013-సీస పద్యము

" గృహ మందు వర్తించు గృహమేధు లగువారు;
 మహిత ధర్మార్థకామముల కొఱకు
సంప్రీతు లగుచుఁ దత్సాధనానుష్ఠాన;
 నిరతులై వేదనిర్ణీత భూరి
భగవత్స్వధర్మ తద్భక్తి పరాఙ్ముఖు;
 లై దేవగణముల ననుదినంబు
భజియించుచును భక్తిఁ బైత్రుక కర్మముల్;
 సేయుచు నెప్పుడు శిష్టచరితు

### 3-1013.1-తేటగీతి

లగుచుఁ దగ దేవ పితృ సువ్రతాఢ్యు లయిన
కామ్యచిత్తులు ధూమాదిగతులఁ జంద్ర

లోకమును జెంది పుణ్యంబు లుప్త మయిన
మరలి వత్తురు భువికి జన్మంబు నొంద.

3-1014-వచనము

అదియునుం గాక.

3-1015-తేటగీతి

ప్రవిమలానంత భోగితల్పంబు నందు
యోగనిద్రాళుపై హరి యున్న వేళ
నఖిల లోకంబులును విలయంబు నొందు
నట్టి సర్వేశ్వరునిగూర్చి యలఘుమతులు.

3-1016-మత్తేభ విక్రీడితము

పరికింపన్ నిజభక్తి యుక్తిగరిమం బాటిల్లు పంకేరుహో
దరవిన్యస్త సమస్త ధర్మముల శాంతస్వాంతులై సంగముం
బరివర్జించి విశుద్ధచిత్తు లగుచుం బంకేజపత్రేక్షణే
తర ధర్మైక నివృత్తులై సతతమున్ దైత్యారిఁ జింతించుచున్.

3-1017-సీస పద్యము

మఱియు, నహంకార మమకార శూన్యులై;
 యర్థి వర్తించుచు నర్చిరాది
మార్గగతుండును మహనీయచరితుండు;
 విశ్వతోముఖుఁడును విమలయశుఁడు
జగదుద్భవస్థానసంహారకారణుం;

డవ్యయుం డజుఁడుఁ బరాపరుండుఁ
బురుషోత్తముఁడు నవపుండరీకాక్షుండు;
నైన సర్వేశ్వరు నందు బొంది

3-1017.1-తేటగీతి

మానితాపునరావృత్తి మార్గమయిన
ప్రవిమలానంద తేజోవిరాజమాన
దివ్యపదమున సుఖియించు ధీరమతులు
మరలిరారెన్నఁటికిని జన్మములఁ బొంద

3-1018-వచనము

మఱియుఁ, బరమేశ్వరదృష్టిచే హిరణ్యగర్భు నుపాసించువారు సత్యలోకంబున ద్విపరార్థావసానం బగు ప్రళయంబు దనుకఁ బరుండగు చతురాననుం బరమాత్మరూపంబున ధ్యానంబు సేయుచు నుండి పృథి వ్యాప్తేజోవాయ్వాకాశ మానసేంద్రియ శబ్దాది భూతాదుల తోడం గూడ లోకంబును బ్రకృతి యందు లీనంబుసేయ సర్వేశ్వరుండు సకల సంహర్త యగు సమయంబున గతాభిమానంబులు గలిగి బ్రహ్మలోకవాసు లగు నాత్మలు బ్రహ్మతోడం గూడి పరమానందరూపుండును సర్వోత్కృష్టుండును నగు పురాణపురుషుం బొందుదురు; కావున నీవు సర్వభూత హృదయపద్మ నివాసుండును శ్రుతానుభావుండును నిష్కళంకుడును నిరంజనుండును నిర్ద్వంద్వుండును నగు పురుషుని భావంబుచే శరణంబు నొందు" మని చెప్పి మఱియు నిట్లనియె.

3-1019-మత్తేభ విక్రీడితము

" సకలస్థావర జంగమప్రతతికిం జర్చింపఁ దా నాద్యుఁడై
యకలంకశ్రుతిగర్భుఁడుం బరముఁడున్నై నట్టి యీశుండు సే
వకయోగీంద్రకుమారసిద్ధమునిదేవశ్రేణియోగప్రవ
ర్తకమై తన్ను భజింపఁజూపు సగుణబ్రహ్మంబు లీలాగతిన్

3-1020-సీస పద్యము

అట్టి సర్వేశ్వరుం డయ్యయి కాలంబు;
లందును దద్గుణ వ్యతికరమున
జనియించు చుండు నీ చాడ్పున ఋషిదేవ;
గణములు దమతమ కర్మనిర్మి
తైశ్వర్య పారమేష్ఠ్యము లందుఁ బురుషత్వ;
మునఁబొంది యధికారములు వహించి
వర్తించి క్రమ్మఱ వత్తురు మఱికొంద;
ఱారూఢకర్మానుసార మైన

3-1020.1-తేటగీతి

మనములను జాల గలిగి ధర్మముల యందు
శ్రద్ధతోఁ గూడి యప్రతిసిద్ధమైన
నిత్యనైమిత్తికాచార నిపుణు లగుచుఁ
దగి రజోగుణ కలిత చిత్తములు గలిగి.

3-1021-వచనము

సకాములై యింద్రియజయంబు లేక పితృగణంబుల నెల్లప్పుడుఁ బూజించుచు గృహంబుల యందు వర్తించి హరిపరాఙ్ముఖు లగు వారు త్రైవర్గిక పురుషు లని చెప్పంబడుదురు.

3-1022-చంపకమాల

వినుతగుణోత్తరుండు నురువిక్రముఁ డైన హరిన్ భజించి త
న్మనన లసత్కథామృతము మానుగఁ గ్రోలుట మాని దుష్కథల్
విని ముద మందుచుందురు వివేకవిహీనత నూరఁబంది యా
త్మను మధురాజ్యభక్ష్యములు మాని పురీషము కేగు చాడ్పునన్.

3-1023-చంపకమాల

అలవడ ధూమమార్గగతులై పితృలోకముఁ బొంది పుణ్యముం
బొలిసినవారు దొంటి తమ పుత్రులకుం దగఁ దాము పుట్టి వి
హ్వలమతి గర్భగోళపతనాది పరేతధరాగతాంతమై
వెలసిన కర్మ మిం దనుభవింతురు గావున నీవు భామినీ!

3-1024-కంద పద్యము

విను, సర్వ భావములఁ బర
ముని నసఘు ననంతు నీశుఁ బురుషోత్తము స
న్మనమున భజియింపుము ముద
మున బునరావృత్తి లేని ముక్తి లభించున్."

3-1025-వచనము

అనిచెప్పి; వెండియు నిట్లనియె "భగవంతుం డగు వాసుదేవుని యందు బ్రయుక్తం బగు భక్తియోగంబు బ్రహ్మసాక్షాత్కార సాధనంబు లగు వైరాగ్య జ్ఞానంబులం జేయు; అట్టి భగవద్భక్తి యుక్తం బైన చిత్తం బింద్రియవృత్తులచే సమంబు లగు నర్థంబు లందు వైషమ్యంబును బ్రియాప్రియంబులును లేక నిస్సంగంబు సమదర్శనంబు హేయోపాదేయ విరహితంబునై యారూఢంబైన యాత్మపదంబు నాత్మచేఁ జూచుచుండు జ్ఞానపురుషుండును బరబ్రహ్మంబును బరమాత్ముండును నీశ్వరుండును నగు పరమపురుషుం డేకరూపంబు గలిగి యుండియు దృశ్యద్రష్టృ కరణంబులచేతం బృథగ్భావంబు బొందుచుండు; ఇదియ యోగికి సమగ్రం బగు యోగంబునం జేసి ప్రాప్యంబగు ఫలంబు; కావున విషయ విముఖంబు లగు నింద్రియంబులచేత జ్ఞానరూపంబును హేయగుణ రహితంబును నగు బ్రహ్మంబు మనోవిభ్రాంతిం జేసి శబ్దాది ధర్మం బగు నర్థరూపంబునం దోఁచు; అది యెట్టు లర్థాకారంబునం దోఁచు నని యడిగితివేని నహంకారంబు గుణరూపంబునం జేసి త్రివిధంబును భూతరూపంబునం బంచవిధంబును నింద్రియరూపంబున నేకాదశవిధంబును నై యుండు; జీవరూపుం డగు విరాట్పురుషుండు జీవవిగ్రహం బైన యండం బగు జగంబునం దోఁచుచుండు; దీని శ్రద్ధాయుక్తం బయిన భక్తిచేత యోగాభ్యాసంబునం జేసి సమాహితమనస్కుం డై నిస్సంగత్వంబున విరక్తుం డైనవాడు వొడగనుచుండు; అది యంతయు బుధజనపూజనీయ చరిత్రవు గావున నీకుం జెప్పితి; సర్వ యోగ సంప్రాప్యుం డగు నిర్గుణుండు భగవంతుం డని చెప్పిన జ్ఞానయోగంబును మదీయభక్తి యోగంబును నను రెండు నొకటియ యింద్రియంబులు భిన్నరూపంబులు గావున నేకరూపం బయిన యర్థం బనేక విధంబు లగు నట్లేకం బగు బ్రహ్మం బనేక విధంబులుగఁ దోఁచు; మఱియును.

3-1026-సీస పద్యము

అంబ! నారాయణుం డఖిలశాస్త్రములను;
 సమధికానుష్ఠిత సవన తీర్థ
దర్శన జప తపోధ్యయన యోగక్రియా;
 దానకర్మంబులఁ గానఁబడక
యేచిన మనము బాహ్యేంద్రియంబుల గెల్చి;
 సకల కర్మత్యాగసరణి నొప్పి
తలకొని యాత్మతత్త్వజ్ఞానమున మించి;
 యుడుగక వైరాగ్యయుక్తిఁ దనరి

3-1026.1-తేటగీతి

మహిత ఫలసంగరహిత ధర్మమునఁ దనరు
నట్టి పురుషుండు దలపోయ నఖిల హేయ
గుణములనుఁ బాసి కల్యాణగుణ విశిష్టుఁ
డైన హరి నొందుఁ బరమాత్ము ననఘుఁ డగుచు

3-1027-వచనము

అదిగావున, నీకుం జతుర్విధ భక్తియోగప్రకారంబుఁ దేటపడఁ నెఱింగించింతి; అదియునుం గాక, కామరూప యగు మదీయ గతి జంతువుల యందు నుత్పత్తి వినాశ రూపంబుల నుండు నవిద్యా కర్మ నిర్మితంబు లైన జీవునిగతు లనేక ప్రకారంబులై యుండు; అదియు జీవాత్మ వాని యందుం బ్రవర్తించి యాత్మగతి యుట్టిదని యెఱుంగక యుండు" నని చెప్పి, మఱియు నిట్లనియె "ఇట్టి యతి రహస్యం బగు సాంఖ్యయోగ ప్రకారంబు ఖలునకు నవినీతునకు జడునకు

దురాచారునకు డాంబికునకు నింద్రియలోలునకుఁ బుత్ర దారాగారాద్యంత్యతాసక్త చిత్తునకు భగవద్భక్తిహీనునకు విష్ణుదాసుల యందు ద్వేషపడు వానికి నుపదేశింప వలవదు; శ్రద్ధాసంపన్నుండును, భక్తుండును, వినీతుండును, నసూయారహితుండును, సర్వభూత మిత్రుండును, శుశ్రూషాభిరతుండును, బాహ్యార్థజాత విరక్తుండును, శాంతచిత్తుండును, నిర్మత్సరుండును, శుద్ధాత్ముండును, మద్భక్తుండును, నగు నధికారికి నుపదేశింప నర్హంబగు; ఈ యుపాఖ్యానం బే పురుషుండేనిఁ బతివ్రత యగు నుత్తమాంగన యేని శ్రద్ధాభక్తులు గలిగి మదర్పితచిత్తంబునన్ వినుఁ బఠియించు నట్టి పుణ్యాత్ములు మదీయ దివ్యస్వరూపంబుఁ బ్రాపింతు" రని చెప్పెను" అని మైత్రేయుండు విదురునకు వెండియు నిట్లనియె "ఈ ప్రకారంబునం గర్దమదయిత యైన దేవహూతి గపిలుని వచనంబులు విని నిర్ముక్తమోహ పటల యగుచు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి తత్త్వవిషయాంకిత సాంఖ్యజ్ఞానప్రవర్తకం బగు స్తోత్రంబుసేయ నుపక్రమించి కపిలున కిట్లనియె.

3-1028-సీస పద్యము

" అనయంబు విను, మింద్రియార్థ మనోమయం;
బును భూతచయ మయంబును నశేష
భూరి జగద్బీజభూతంబును గుణప్ర;
వాహ కారణమును వలనుమెఱయు
నారాయణాభిఖ్యనాఁ గల భవదీయ;
దివ్యమంగళమూర్తిఁ దేజరిల్లు
చారు భవద్గర్భసంజాతుఁ డగునట్టి;
కమలగర్భుండు సాక్షాత్కరింప

3-1028.1-తేటగీతి

లేక మనమునఁ గనియె ననేక శక్తి
వర్గములు గల్గి సుగుణప్రవాహరూప
మంది విశ్వంబు దాల్చి సహస్రశక్తి
కలితుఁడై సర్వకార్యముల్ కలుగఁజేయు.

3-1029-వచనము

అంత.

3-1030-తేటగీతి

అతుల భూరి యుగాంతంబు నందుఁ గపట
శిశువవై యొంటి కుక్షినిక్షిప్త నిఖిల
భువననిలయుండవై మహాంభోధి నడుమ
జారు వటపత్రతల్పసంస్థాయి వగుచు.

3-1031-తేటగీతి

లీల నాత్మీయ పాదాంగుళీ వినిర్గ
తామృతము గ్రోలినట్టి మహాత్మ! నీవు
గడఁగి నా పూర్వభాగ్యంబు కతన నిపుడు
పూని నా గర్భమున నేడు పుట్టితయ్య!

3-1032-వచనము

అట్టి పరమాత్ముండ వయిన నీవు.

3-1033-సీస పద్యము

వరుస విగ్రహపారవశ్యంబునను జేసి;
 రఘురామ కృష్ణ వరాహ నార
సింహాది మూర్తు లంచితలీల ధరియించి;
 దుష్టనిగ్రహమును శిష్టపాల
నమును గావించుచు నయమున సద్ధర్మ;
 నిరతచిత్తులకు వర్ణింపఁ దగిన
చతురాత్మతత్త్వ విజ్ఞానప్రదుండవై;
 వర్తింతు వనఘ! భవన్మహత్త్వ

3-1033.1-తేటగీతి

మజున కయినను వాక్రువ్వ నలవిగాదు
నిగమజాతంబు లయిన వర్ణింప లేవ
యొఱిఁగి సంస్తుతి చేయ నే నెంతదాన
వినుత గుణశీల! మాటలు వేయునేల?

3-1034-వచనము

అదియునుం గాక.

3-1035-కంద పద్యము

ధీమహిత! భవన్మంగళ
నామస్మరణానుకీర్తనము గల హీనుల్
శ్రీమంతు లగుదు రగ్ని
ష్టోమాదిక్రృదాళికంటె శుద్ధులు దలఁపన్.

3-1036-వచనము

అదియునుం గాక.

3-1037-కంద పద్యము

నీ నామస్తుతి శ్వపచుం
డైనను జిహ్వాగ్ర మందు ననుసంధింపన్
వానికి సరి భూసురుఁడుం
గానేరఁడు చిత్రమిది జగంబుల నరయన్.

3-1038-ఉత్పలమాల

ఈ విధ మాత్మలం దెలిసి యెప్పుడు సజ్జనసంఘముల్ జగ
త్పావనమైన నీ గుణకథామృత మాత్మలఁ గ్రోలి సర్వ తీ
ర్థావళిఁ గ్రుంకినట్టి ఫలమందుదు రంచు సమస్త వేదముల్
వావిరిఁ బల్కుఁ గావునను వారలు ధన్యులు మాన్యు లుత్తముల్.

3-1039-వచనము

అదిగావునఁ; బరబ్రహ్మంబవును, బరమపురుషుండవును, బ్రత్యక్మనో విభావ్యుండవును, సమస్తజన పాపనివారక స్వయంప్రకాశుండవును, వేదగర్భుండవును, శ్రీమహావిష్ణుడవును నగు నీకు వందనంబు లాచరించెదను" అని స్తుతించినం బరమపురుషుండును, మాతృ వత్సలుండును నగు కపిలుండు గరుణారసార్ద్రహృదయకమలుం డై జనని కిట్లనియె.

3-1040-తేటగీతి

" తవిలి సుఖరూపమును మోక్షదాయకంబు
నైన యీ యోగమార్గమే నంబ! నీకు
నెఱుఁగ వివరించి చెప్పితి నిది దృఢంబు
గాఁగ భక్తి ననుష్ఠింపు కమలనయన!

3-1041-కంద పద్యము

జీవన్ముక్తి లభించుం
గావున నేమఱక తలఁపు కైకొని దీనిన్
వావిరి నొల్లని వారికి
దావల మగు మృత్యుభయము దవ్వగు సుఖమున్."

3-1042-కంద పద్యము

అని యిట్లు దేవహూతికి
మనమలరఁగ గపిలుఁ డాత్మమార్గం బెల్లన్
వినిపించి చనియె" నని విదు
రునకున్ మైత్రేయముని వరుం డెఱిఁగించెన్.

## 3-55-దేవహూతి నిర్యాణంబు

3-1043-వచనము

అట్లు కపిలుం డేఁగినఁ బిదప దేవహూతియుం బుత్రుండు సెప్పిన యోగమార్గంబున విజ్ఞానంబు గలిగి యుండియుం బెనిమిటి యైన కర్దమునిం దనయుం డైన కపిలునిం బాసి నష్టవత్స యగు గోవు చందంబునం దల్లడిల్లుచుఁ గపిలమహామునిం దలంచుచుం గర్దమ తపస్సామర్థ్యంబున నైనయట్టి.

3-1044-ఉత్పలమాల

మానిత సౌరభప్రసవ మంజుల పక్వ ఫలప్రవాళ భా
రానత చూతపోత విటపాగ్ర నికేతన రాజకీర స
మ్మాని సుఖానులాప పరిమండిత కర్దమ తాపసాశ్రమో
ద్యానవనప్రదేశ కమలాకర తీర నికుంజ పుంజముల్.

3-1045-వచనము

వెండియు.

3-1046-సీస పద్యము

అంచిత స్ఫటికమయస్తంభ దీప్తిచేఁ;
గోమరారు మరకతకుడ్యములను
సజ్జాతివజ్రాలసజ్జాలరుచులచేఁ;
భాసిల్లు నీలసోపానములును
దీపించు చంద్రకాంతోపలవేదుల;
విద్రుమగేహాళీవిలసితముల
హాటకరత్నకవాటశోభితముల;
నలరిన సౌధశాలాంగణముల

3-1046.1-తేటగీతి

వర పయఃఫేనపటలపాండుర కరీంద్ర
దంతనిర్మిత ఖట్వాంగధవళపట్ట
రచిత శయ్యాళులును జతురంతయాన
కనకపీఠాది వస్తుసంఘముల నెల్ల.

3-1047-వచనము

మఱియు; వికచకమల కుముద సౌగంధిక బంధుర గంధానుబంధి గంధవహ శోభితంబును; యరవిందనిష్యంద కందళిత మరందరస పాన మదవదిందిందిర సందోహ ఝుంకార సంకులంబునునై చెలువారు బావులు గలిగి; పురందరసుందరీ వందితం బైన కర్దమాశ్రమంబుఁ బరిత్యజించి కుటిలంబు లైన కుంతలంబులు జటిలంబులుగా ధరియించి సరస్వతీ బిందుసరోవరంబులం ద్రిషవణస్నానంబు గావించుచు; నుగ్ర తపోభారంబునం గృశీభూత శరీర యై; నిజ కుమారుండును బ్రసన్న వదనుండును గపిలనామధేయుండును నగు నారాయణుని సమస్త న్యస్తచింతలచే ధ్యానంబు సేయుచుఁ; బ్రవాహరూపంబైన భక్తి యోగంబునను నధికవైరాగ్యంబునను యుక్తానుష్టానజాతంబై బ్రహ్మాత్మ్యాపాదకం బగు జ్ఞానంబును విశుద్ధమనంబును గలిగి.

3-1048-సీస పద్యము

అనయంబు నాత్మనాయకుఁడును విశ్వతో;
 ముఖుఁ డనంతుఁడు పరముఁడు నజుండు
చతురుండు నిజపరిజ్ఞానదీపాంకుర;
 మహిమ నిరస్త సమస్త భూరి
మాయాంధకారుఁ డమేయుఁ డీశ్వరుఁ డగు;
 నా పరబ్రహ్మంబు నం దవిరత
బద్ధతత్త్వజ్ఞానపరతచే నిర్ముక్త;
 జీవభావమున విశిష్టయోగ

3-1048.1-తేటగీతి

భవ్యసంప్రాప్త నిర్మల బ్రహ్మభావ
ములను గలిగి సమాధిచే నెలమిఁ దనరు
నపునరావృత్త మగు త్రిగుణప్రధాన
తత్త్వముల నొప్పి సంతతోదార నియతి.

3-1049-తేటగీతి

కలనఁ దోఁచిన వస్తుసంఘముల మేలు
కొని కనుంగొనలేని మనుజులపోల్కిఁ
బొలతి దనయాత్మ మఱచి యిమ్ముల సధూమ
మైన పావకుగతి నుండె నంతలోన.

3-1050-కంద పద్యము

గురు యోగశక్తిచే నం
బరతలమున కెగసి సత్కృపామయుఁ డగు నా
పరవాసుదేవు చరణాం
బురుహయుగన్యస్త చిత్తమును గల దగుచున్.

## 3-56-కపిలమహాముని తపంబు

3-1051-వచనము

ఇట్లు కపిలోక్తమార్గంబున దేవహూతి శ్రీహరి యందుఁ గలసె; అయ్యంగనారత్నంబు మోక్షంబునకుం జనిన క్షేత్రంబు సిద్ధిపదం బను పేరం బరఁగి ప్రసిద్ధి వహించె; అంత నక్కడఁ గపిలుండు తల్లిచేత ననుజ్ఞాతుం డై సిద్ధ చారణ గంధర్వాప్సరో ముని నివహ సంస్తూయమానుం డగుచు; సముద్రునిచేత

దత్తార్ఘణ పూజానికేతంబులు వడసి సాంఖ్యాచార్యాభిష్టుతం బగు యోగంబు నవలంభించి; లోకత్రయశాంతి కొఱకు సమాహితుండై; స్వపితాశ్రమంబు విడిచి యుదగ్భాగంబునకు జనియె" అని మైత్రేయమహాముని విదురున కిట్లనియె "తండ్రీ యీ యుపాఖ్యానంబు నాకు గోచరంచినరీతి నీకుం జెప్పితి; ఇది "కపిల దేవహూతి సంవాదం" బత్యంత పావనంబు కపిల ప్రణీతంబు నయిన యోగంబు దీనిం బరమ భక్తియుక్తుండై యెవ్వండు పఠించు; నెవ్వండు విను; నట్టి పుణ్యాత్ములు విగతపాపులై గరుడధ్వజుండైన పుండరీకాక్షుని శ్రీచరణారవిందంబులం బొందుదు" రని మైత్రేయుండు విదురున కెఱింగించిన విధంబున శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పెను" అని సూతుండు సెప్పిన విని ప్రహృష్ట హృదయులై "మునికులోత్తమా! భవద్వాక్పూరం బగు భగవత్కథామృతంబు గ్రోలుచుండ మా మానసంబులు దనివోవ వింకను దరువాతి వృత్తాంతంబులు మాకు విశదంబులుగ వినిపింప నీవ యర్హుండ" వని యడుగుటయు.

## 3-57-పూర్ణి

### 3-1052-చంపకమాల

జనకసుతా మనో విమల సారస కోమల చంచరీక! చం
దన శరదిందు కుంద హర తార మరాళ పటీర చంద్రికా
వినుత యశోవిశాల! రఘువీర! దరస్మిత పద్మపత్ర లో
చన! నిటలాంబకప్రకటచాపవిఖండన! వంశమండనా!

### 3-1053-తరళము

పరమపావన! విశ్వభావన! బాంధవప్రకరాననా!
శరధిశోషణ! సత్యభాషణ! సత్కృపామయ భూషణా!
దురితతారణ! సృష్టికారణ! దుష్టలోక విదారణా!
ధరణిపాలన! ధర్మశీలన! దైత్యమర్దన ఖేలనా!

3-1054-మాలిని

దివిజగణశరణ్యా! దీపితానంతపుణ్యా!
ప్రవిమల గుణజాలా! భక్తలోకానుపాలా!
భవ తిమిర దినేశా! భానుకోటిప్రకాశా!
కువలయహితకారీ! ఘోరదైత్యప్రహారీ!

3-1055-గద్యము

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబు నందు విదురనీతియు విదురుని తీర్థాగమనంబును యుద్ధవ సందర్శనంబును కౌరవ యాదవ కృష్ణాది నిర్యాణంబును గంగాద్వారంబున విదురుండు మైత్రేయునిం గనుగొనుటయు విదుర మైత్రేయ సంవాదంబును జగదుత్పత్తి లక్షణంబును మహదాదుల సంభవ ప్రకారంబును మహదాదులు నారాయణు నభినందించుటయు విరాడ్విగ్రహ ప్రకారంబును శ్రీమహాభాగవత భక్తి కారణంబగు పద్మసంభవు జన్మప్రకారంబును బ్రహ్మతపంబును బరమేష్టికిఁ బుండరీకాక్షుండు ప్రత్యక్షంబగుటయు బ్రహ్మకృతం బైన విష్ణుస్తోత్రంబును గమలసంభవుని మానససర్గంబును బరమాణువుల పుట్టువును భూర్భువస్సురాది లోకవిస్తారంబును గాల దివస మాస వత్సరాది నిర్ణయంబును

నాయుఃపరిమాణంబును జతుర్యుగ పరిమాణంబును బద్మసంభవు
సృష్టిభేదనంబును సనకాదుల జన్మంబును స్వాయంభువమనువు జన్మంబును
శ్రీహరి వరాహావతారంబును భూమ్యుద్ధరణంబును సూకరాకారుండైన హరిని
విధాత స్తుతించుటయు దితి కశ్యప సంవాదంబును గశ్యపుండు రుద్రుని
బ్రశంసించుటయుఁ గశ్యపువలన దితి గర్భంబు ధరించుటయుఁ
దత్ప్రభావంబునకు వెఱచి దేవతలు బ్రహ్మసన్నిధికిం జని దితిగర్భప్రకారంబు
విన్నవించుటయు సనకాదులు వైకుంఠంబున కరుగుటయు నందు
జయవిజయుల కలిగి సనకాదులు శపించుటయు శ్రీహరిదర్శనంబును
సనకాదులు హరిని నుతించుటయు బ్రాహ్మణ ప్రశంసయు హిరణ్యకశిపు
హిరణ్యాక్షుల జన్మప్రకారంబును హిరణ్యాక్షుని దిగ్విజయంబును సవనవరాహ
హిరణ్యాక్షుల యుద్ధంబును బ్రహ్మస్తవంబును హిరణ్యాక్ష వధయు
నమరగణంబులు శ్రీహరి నభినందించుటయు హరి వరాహావతార విసర్జనంబు
సేయుటయును దేవ తిర్యఙ్మనుష్యాదుల సంభవంబును గర్దమమహాముని
తపంబునకు సంతసించి శ్రీహరి ప్రత్యక్షంబగుటయుఁ గర్దముండు
స్వాయంభువమనుపుత్రి యైన దేవహూతిం బరిణయం బగుటయు దేవహూతి
పరిచర్యలకు సంతసిల్లి కర్దముండు నిజయోగ కలితం బగు విమానంబు నందు
నిలిచి సహస్రదాసీపరివృత యైన దేవహూతింగూడి భారతాది వర్షంబులు
గలయంగ్రుమ్మరుటయు దేవహూతి గర్దమునివలనఁ గన్యకానవకంబును
గపిలుని గనుటయు దత్కన్యకావివాహంబులును గర్దముని తపోయాత్రయుఁ
గపిల దేవహూతి సంవాదంబును శబ్దాదిపంచతన్మాత్రల జన్మప్రకారంబును
బ్రహ్మాండోత్పత్తియు విరాట్పురుష కర్మేంద్రియ పరమాత్మ ప్రకారంబును
బ్రకృతిపురుష వివేకంబును నారాయణుని సర్వాంగస్తోత్రంబును

సాంఖ్యయోగంబును భక్తియోగంబును జీవునకైన గర్భసంభవ ప్రకారంబును జంద్ర సూర్య మార్గంబును బిత్రుమార్గంబును దేవహూతి నిర్యాణంబును గపిలమహాముని తపంబునకు జనుటయు నను కథలు గల తృతీయస్కంధము సంపూర్ణము.

# పోతన తెలుగు భాగవతము

## చతుర్థ స్కంధము

### 4-1-ఉపోద్ఘాతము

4-1-కంద పద్యము

శ్రీ విలసితధరణీతన
యావదన సరోజ వాసరాధిప! సిత రా
జీవదళనయన! నిఖిల ధ
రావర నుత సుగుణధామ! రాఘువరామా!

4-2-వచనము

మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల
పురాణవ్యాఖ్యానవైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; అట్లు
ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

### 4-2-స్వాయంభువువంశవిస్తారము

4-3-సీస పద్యము

జననాథ! విను విదురునకును మైత్రేయ;
మునినాథచంద్రుఁ డిట్లనియె మరల

స్వాయంభువున కర్థి శతరూపవలనను;
గూఁతులు మువ్వు రాకూతి దేవ
హూతి ప్రసూతులు నొనరఁ బ్రియవ్రతో;
త్తానపాదులు నను తనయయుగము
జనియింప నం దగ్రసంభవ యైన యా;
కూతిని సుమహిత భ్రాతృమతినిఁ

4-3.1-తేటగీతి

దనకు సంతాన విస్తరార్థంబు గాఁగఁ
బుత్రికాధర్మ మొంది యా పువ్వుఁబోఁడిఁ
బ్రకటమూర్తి రుచిప్రజాపతికి నిచ్చె
మనువు ముదమొంది శతరూప యనుమతింప.

4-4-వచనము

అట్లు వివాహంబైన రుచిప్రజాపతి బ్రహ్మవర్చస్వియుఁ బరిపూర్ణగుణుండును గావునఁ జిత్తైకాగ్రతంజేసి యాకూతియందు శ్రీవిష్ణుండు యజ్ఞరూపధరుం డగు పురుషుండుగను జగదీశ్వరి యగు నాదిలక్ష్మి యమ్మహాత్మునకు నిత్యానపాయిని గావునఁ దదంశంబున దక్షిణ యను కన్యకారత్నంబుగను మిథునంబు సంభవించె; అందు స్వాయంభువుండు సంతుష్టాంతరంగుం డగుచుఁ బుత్రికాపుత్రుండును, వితతతేజోధనుండును, శ్రీవిష్ణుమూర్తి రూపుండును నగు యజ్ఞునిఁ దన గృహంబునకుఁ దెచ్చి యునిచె; రుచియుఁ గామగమన యైన దక్షిణ యను కన్యకాలలామంబును దన యొద్దన నిలిపె; అంత

సకలమంత్రాధిదేవత యగు శ్రీయజ్ఞుండు దనుఁ బతిఁగంగోరెడు దక్షిణ యను కన్యకం బరిణయం బయ్యె; వార లాదిమిథునంబు గావున నది నిషిద్ధంబు గాకుండె" నని చెప్పి మైత్రేయుండు వెండియు నిట్లనియె.

4-5-కంద పద్యము

ధీమహిత! యంత వారల
యామాఖ్యలు గలుగు దేవతావళి గడఁకన్
వేమఱు నభినందించుచు
నా మిథునమువలనఁ బుట్టె నతి బలయుతమై.

4-6-వచనము

వారు తోషుండును బ్రతోషుండును సంతోషుండును భద్రుండును శాంతియు నిడస్పతియు నిధ్మండును గవియు విభుండును వహ్నియు సుదేవుండును రోచనుండును నన నన్నిద్దఱు సంభవించిరి; వారలు స్వాయంభువాంతరంబునం దుషితు లను దేవగణంబులై వెలసిరి; మఱియు మరీచి ప్రముఖులైన మునీశ్వరులును యజ్ఞుండును దేవేంద్రుండును మహాతేజస్సంపన్ను లయిన ప్రియవ్రతోత్తాన పాదులునుం గలిగి పుత్రపౌత్ర నప్తృవంశంబులచే వ్యాప్తంబయి యా మన్వంతరంబు పాలితంబగుచు వర్తిల్లె; మనువు ద్వితీయపుత్రి యైన దేవహూతిం గర్దమున కిచ్చి తద్వంశ విస్తారంబు గావించె నని మున్న యెఱింగించితి; వెండియు నమ్మనువు మూఁడవచూలైన ప్రసూతి యను కన్యకను బ్రహ్మపుత్త్రుం డగు దక్షప్రజాపతికి నిచ్చె; ఆ దక్షునకుఁ బ్రసూతివలన నుదయించిన ప్రజాపరంపరల చేత ముల్లోకంబులు

విస్తృతంబు లయ్యె; మఱియుఁ గర్దమపుత్రికా సముదయంబు బ్రహ్మర్షిభార్య లగుటం జేసి వారివలనం గలిగిన సంతాన పరంపరల వివరించెద.

## 4-3-కర్దమప్రజాపతి వంశాభివృద్ధి

### 4-7-సీస పద్యము

ఘనుఁడౌ మరీచికిఁ గర్దమాత్మజ యగు;
 కళ యను నంగనవలనఁ గశ్య
పుం డను కొడుకును బూర్ణిమ యను నాఁడు;
 బిడ్డయుఁ బుట్టిరి పేర్చి వారి
వలనఁ బుట్టిన ప్రజావళి పరంపరలచే;
 భువనంబు లెల్ల నాపూర్ణ మగుచు
జరగెను; బూర్ణిమ జన్మాంతరంబున;
 హరిపదప్రక్షాళితాంబువు లను

### 4-7.1-తేటగీతి

గంగ యను పేరఁ బుట్టి యక్కన్య దేవ
కుల్య యను దాని నొక్కతె గూఁతు నఖిల
విష్టపవ్యాపకుం డగు విరజుఁ డనెడి
తనయు నొక్కనిఁ గాంచె మోదంబుతోడ.

### 4-8-కంద పద్యము

అనఘుం డత్రిమహాముని
యనసూయాదేవివలన నజ హరి పురసూ
దనుల కళాంశంబుల నం
దనులను ముయ్వురను గాంచెఁ దద్దయుఁ బ్రీతిన్.

4-9-కంద పద్యము

అనవుడు విదురుఁడు మైత్రే
యునిఁ గనుఁగొని పలికె మునిజనోత్తమ! జగతిన్
జననస్థితిలయకారణు
లన వెలసిన పద్మగర్భ హరి హరు లెలమిన్.

4-10-కంద పద్యము

ఏమి నిమిత్తం బత్రి మ
హాముని మందిరమునందు ననసూయకు ను
ద్దామగుణు లుదయమై రన
నా మైత్రేయుండు పలికె నవ్విదురునితోన్.

4-11-సీస పద్యము

సుచరిత్ర! విను విధిచోదితుండై యత్రి;
దప మాచరింపఁ గాంతా సమేతుఁ
డయి ఋక్షనామ కులాద్రి తటంబున;
ఘుమఘుమారావ సంకుల విలోల
కల్లోల జాల సంకలిత నిర్వింధ్యా న;

దీజల పరిపుష్ట రాజితప్ర
సూన గుచ్ఛస్వచ్ఛ మానితాశోక ప;
లాశ కాంతారస్థలమున కెలమి

4-11.1-తేటగీతి

నరిగి యచ్చట నిర్ద్వంద్వుఁ డగుచుఁ బ్రాణ
నియమమున నేక పదమున నిలిచి గాలిఁ
దివుటఁ గ్రోలి కృశీభూతదేహుఁ డగుచుఁ
దపముఁ గావించె దివ్యవత్సరశతంబు.

4-12-వచనము

ఇట్లతి ఘోరం బైన తపంబు చేయుచుఁ దన చిత్తంబున.

4-13-కంద పద్యము

ఏ విభుఁడు జగదధీశ్వరుఁ
డా విభు శరణంబు నొత్తు నతఁ డాత్మసమం
బై వెలసిన సంతతిని ద
యావరమతి నిచ్చుఁగాక యని తలఁచు నెడన్.

4-14-చంపకమాల

మునుకొని యత్తపోధనుని మూర్ధజమైన తపః కృశాను చే
తను ద్రిజగంబులుం గరఁగి తప్తము లైనను జూచి పంకజా
సన మురశాసనత్రిపురశాసను లచ్చటి కేఁగి రప్సరో
జన సుర సిద్ధ సాధ్య ముని సన్నుత భూరియశోభిరాములై.

4-15-వచనము

అట్లు మునీంద్రు నాశ్రమంబు డాయం జను నవసరంబున.

4-16-చంపకమాల

అనఘుతపోభిరాముఁ డగు నత్రి మునీంద్రుఁడు గాంచెఁ దప్తకాం
చన ఘన చంద్రికా రుచిర చారుశరీరుల హంస నాగసూ
దన వృషభేంద్ర వాహుల నుదారకమండలు చక్ర శూల సా
ధనుల విరించి విష్ణు పురదాహుల వాక్కమలాంబికేశులన్.

4-17-వచనము

మఱియుఁ గృపావలోకన మందహాస సుందర వదనారవిందంబులు గల మహాత్ముల సందర్శించి; యమందానంద కందళిత హృదయార విందుండై సాష్టాంగ దండప్రణామంబు లాచరించి పుష్పాంజలి గావించి నిటలతట ఘటిత కరపుటుం డై దుర్నిరీక్ష్యంబైన తత్తేజోవిశేషంబు దేఱి చూడంజాలక ముకుళితనేత్రుండై తత్పదాయత్త చిత్తుం డగుచు సర్వలోక గరిష్ఠంబు లైన మృదుమధుర గంభీర భాషణంబుల నిట్లని స్తుతియించె.

4-18-సీస పద్యము

" ప్రతి కల్పమందు సర్వప్రపంచోద్భవ;
స్థితి వినాశంబులఁ జేయునట్టి
మహిత మాయాగుణమయ దేహములఁ బొల్చు;
నజ వాసుదేవ శివాభిధాన
ములు గల్గు మీ పాదజలజాతములకు నే;

నతిభక్తి వందనం బాచరింతు;
యఖిల చేతన మానసాగమ్య మన నొప్పు;
మూర్తులు గల్గు మీ మువ్వురందుఁ

4-18.1-తేటగీతి

బరఁగ నాచేతఁ బిలువంగఁ బడిన ధీరుఁ
డెవ్వఁడే నొక్కరునిఁ బిల్వ నిపుడు మీరు
మువ్వు రేతెంచుటకు నాదు బుద్ధి విస్మ
యంబు గదిరెడిఁ జెప్పరే యనఘులార!

4-19-వచనము

అదియునుం గాక, సంతానార్థంబు నానావిధ పూజలు గావించి నా చిత్తంబున ధరియించిన మహాత్ముం డొక్కరుండ" యనిన నమ్మువ్వురు విబుధశ్రేష్టులు నతనిం గనుంగొని సుధామధురంబు లయిన వాక్యంబుల నిట్లనిరి.

4-20-కంద పద్యము

" వినుము మేము ముగుర మయ్యును
ననుపమమతిఁ దలఁప నేకమై యుందుము; నీ
మన మందు నేమి గోరితి
వనయము నా కోర్కి సఫల మయ్యెడుఁ జుమ్మీ.

4-21-కంద పద్యము

మా మువ్వుర యంశంబుల
ధీమంతులు సుతులు పుట్టి త్రిభువనములలో
నీ మంగళగుణకీర్తిన్
శ్రీమహితము చేయఁగలరు; సిద్ధము సుమ్మీ."

4-22-కంద పద్యము

అని మునిచంద్రుఁడు దన మన
మునఁ గామించిన వరంబు బుధవరులు ముదం
బున నొసఁగి యతనిచేఁ బూ
జనములఁ బరితృప్తు లగుచుఁ జనిరి యథేచ్ఛన్.

4-23-ఉత్పలమాల

ఆ సుచరిత్ర దంపతు లుదంచితలీలఁ గనుంగొనంగ న
బ్జాసను నంశమందు నమృతాంశుఁడు, విష్ణుకళన్ సుయోగ వి
ద్యాసుభగుండు దత్తుఁడుఁ, బురాంతకు భూరికళాంశమందు దు
ర్వాసుఁడు నై జనించి రనవద్య పవిత్ర చరిత్రు లిమ్ములన్.

4-24-కంద పద్యము

అంగిరసుఁ డనెడు మునికిఁ గు
లాంగన యగు శ్రద్ధ యందు నంచిత సౌంద
ర్యాంగులు గూఁతులు నలువురు
మంగళవతు లుదయమైరి మాన్యచరిత్రా!

4-25-కంద పద్యము

వారు సినీవాలి యనఁ గు
హూ రాకానుమతు లనఁగ నొప్పిరి; మఱియుం
గోర సుత యుగము గలిగెను
స్వారోచిషమనువు వేళ శస్తఖ్యాతిన్.

4-26-వచనము

వార లెవ్వ రనిన, భగవంతు డగు నుచథ్యుండును బ్రహ్మనిష్ఠుం డగు బృహస్పతియు ననం బ్రసిద్ధి వహించిరి; పులస్త్యుండు హవిర్భుక్కను నిజభార్య యందు నగస్త్యునిం బుట్టించె; నా యగస్త్యుండు జన్మాంతరంబున జఠరాగ్ని రూపంబై ప్రవర్తించె; వెండియు నా పులస్త్యుండు విశ్రవసునిం గలిగించె; ఆ విశ్రవసునకు నిలబిల యను భార్యవలనం గుబేరుండును, గైకసి యను దానివలన రావణ కుంభకర్ణ విభీషణులునుం బుట్టిరి; పులహునకు గతి యను భార్యవలనఁ గర్మశ్రేష్ఠుండును వరీయాంసుండును సహిష్ణుండును నను మువ్వురు గొడుకులు జనియించిరి; మఱియుఁ గ్రతువునకుఁ గ్రియ యను భార్య యందు బ్రహ్మతేజంబున జ్వలించుచున్న షష్టిసహస్ర సంఖ్యలుగల వాలఖిల్యు లను మహర్షులు గలిగిరి; వశిష్ఠుం డూర్జ యను భార్య యందుఁ జిత్రకేతుండును సురోచియు విరజుండును మిత్రుండును నుల్బణుండును వసుభృద్ధ్యానుండును ద్యుమంతుండును నను సప్తఋషులను, భార్యాంతరంబున శక్తి ప్రముఖ పుత్రులనుం బుట్టించె; అథర్వుం డనువానికిఁ జిత్తి యను భార్య యందు ధృతవ్రతుండు నశ్శిరస్కుండు నయిన దధ్యంచుండు పుట్టె; మహాత్ముం డగు భృగువు

ఖ్యాతి యను పత్ని యందు ధాతయు విధాతయు నను పుత్రద్వయంబును, భగవత్పరాయణ యగు "శ్రీ" యను కన్యకం బుట్టించె; ఆ ధాత్రువిధాతృలు మేరు వనువాని కూఁతు లైన యాయతి నియతు లను భార్యలవలన మృకండ ప్రాణులను కొడుకులం బుట్టించిరి: అందు మృకండునకు మార్కండేయుండును, బ్రాణునకు వేదశిరుం డను మునియుం బుట్టిరి ;భార్గవునకు నుశన యను కన్యయందుఁ గవి యనువాఁడు పుట్టె; ఇట్లు కర్దమదుహితలయిన కన్యకా నవకంబు వలనఁ గలిగిన సంతాన పరంపరలచేత సమస్తలోకంబులుఁ బరిపూర్ణంబు లయ్యె; అట్టి సద్యః పాపహరంబును శ్రేష్ఠతమంబును నైన కర్దమదౌహిత్రసంతాన ప్రకారంబు శ్రద్ధాగరిష్ఠచిత్తుండ వగు నీకుం జెప్పితి: ఇంక దక్షప్రజాపతి వంశం బెఱింగింతు వినుము.

## 4-4-దక్షప్రజాపతి వంశవిస్తారము

### 4-27-కంద పద్యము

వనజజునివలన భవ మం
దిన యా దక్షప్రజాపతికి మను నిజ నం
దన యగు ప్రసూతి సతి యం
దనఘా! పదయార్వు రుదయ మందిరి కన్యల్.

### 4-28-వచనము

ఇట్లావిర్భవించిన కన్యకలందు శ్రద్ధయు, మైత్రియు, దయయు, శాంతియుఁ, దుష్టియుఁ, బుష్టియుఁ, బ్రియయుఁ, నున్నతియు,

బుద్ధియు, మేధయుఁ, దితిక్షయు, హ్రీయు, మూర్తియు నను నామంబులు గల పదుమువ్వురను ధర్మరాజున కిచ్చె; ఒక్క కన్యక నగ్నిదేవునకును నొక్కతెం బితృదేవతలకును నొక్కతె జన్మమరణాది నివర్తకుం డగు నభవునకుం బెండ్లి చేసె; అంత నా ధర్ముని పత్నుల యందు శ్రద్ధవలన శ్రుతంబును, మైత్రివలనఁ బ్రసాదంబును, దయవలన నభయంబును, శాంతివలన సుఖంబును, దుష్టివలన ముదంబును, బుష్టివలన స్మయంబును, గ్రియవలన యోగంబును, నున్నతివలన దర్పంబును, బుద్ధివలన నర్థంబును, మేధవలన స్మృతియుఁ, దితిక్షవలన క్షేమంబును, హ్రీవలనఁ బ్రశ్రయంబును, మూర్తివలన సకలకల్యాణగుణోత్పత్తి స్థానభూతు లగు నరనారాయణు లను ఋషు లిద్దఱును సంభవించిరి; వారల జన్మకాలంబున.

4-29-సీస పద్యము

గంధవాహుఁడు మందగతి ననుకూలుఁడై;
 వీచె; నల్దిక్కులు విశద మయ్యె;
నఖిలలోకంబులు నానందమును బొందెఁ;
 దుములమై దేవదుందుభులు మ్రోసెఁ;
గరమొప్ప జలధుల కలఁక లడంగెను;
 మించినగతిఁ బ్రవహించె నదులు;
గంధర్వ కిన్నర గానముల్ వీతెంచె;
 నప్సరోజనముల నాట్యమొనరె

4-29.1-తేటగీతి

సురలు గురియించి రందంద విరులవాన;
మునిజనంబులు సంతోషమునఁ జెలంగి
వినుతు లొనరించి; రవ్వేళ విశ్వ మెల్లఁ
బరమమంగళమై యొప్పె భవ్యచరిత!

4-30-వచనము

ఆ సమయంబున బ్రహ్మాది దేవత లమ్మహాత్ములకడకుఁ జనుదెంచి యిట్లని స్తుతించిరి.

4-31-సీస పద్యము

గగనస్థలిం దోఁచు గంధర్వనగరాది;
 రూప భేదము లట్లు రూఢి మెఱసి
యే యాత్మయందేని యేపార మాయచే;
 నీ విశ్వ మిటు రచియింపఁబడియె
నట్టి యాత్మప్రకాశార్థమై మునిరూప;
 ముల ధర్మగృహమునఁ బుట్టినట్టి
పరమపురుష! నీకుఁ బ్రణమిల్లెద; మదియుఁ;
 గాక యీ సృష్టి దుష్కర్మవృత్తి

4-31.1-తేటగీతి

జరగనీకుండు కొఱకునై సత్త్వగుణము
చే సృజించిన మమ్మిట్లు శ్రీనివాస

మైన సరసీరుహప్రభ నపహసించు
నీ కృపాలోకనంబుల నెమ్మిఁ జూడు.

4-32-కంద పద్యము

అని యిట్లు దేవగణములు
వినుతింపఁ గృపాకటాక్షవీక్షణములచేఁ
గని వారు గంధమాదన
మున కేగిరి తండ్రి ముదము ముప్పిరిగొనఁగన్.

4-33-కంద పద్యము

ధరణీభర ముడుపుట కా
నరనారాయణులు భువి జనన మనయము నొం
దిరి యర్జున కృష్ణాఖ్యలఁ
గురుయదువంశముల సత్త్వగుణయుతు లగుచున్.

4-34-వచనము

మఱియు నగ్నిదేవునకు దక్షపుత్రియైన స్వాహాదేవి యను భార్య యందు హుతభోజనులగు పావకుండును బవమానుండును శుచియు నను మువ్వురు గొడుకులు గలిగిరి; వారివలనం బంచచత్వారింశత్సంఖ్యలం గల యగ్ను లుత్పన్నంబు లయ్యె; నిట్లు పితృపితామహ యుక్తంబుగా నేకోనపంచాశత్సంఖ్యలు గల యగ్నులు బ్రహ్మవాదులచే యజ్ఞకర్మంబులం దగ్నిదేవతాకంబు లైన యిష్టులు దత్తన్నామంబులచేతఁ జేయంబడుచుండు; ఆ యగ్ను లెవ్వరనిన

నగ్నిష్వాత్తులు బర్హిషదులు సౌమ్యులు బితలు నాజ్యపులు సాగ్నులు నిరగ్నులు నన నేడు దెఱంగులై యుందురు; దాక్షాయణి యగు స్వధ యను ధర్మపత్ని యందు వారలవలన వయునయు ధారిణియు నను నిద్దఱు కన్య లుదయించి జ్ఞానవిజ్ఞానపారగ లగుచు బ్రహ్మనిష్ఠ లయి పరఁగిరి; వెండియు.

## 4-5-ఈశ్వర దక్షుల విరోధము

### 4-35-సీస పద్యము

దక్షప్రజాపతి తనయ యా భవుని భా;
 ర్యయు నన దగు సతి యను లతాంగి
సతతంబుఁ బతిభక్తి సలుపు చుండియుఁ దనూ;
 జాతలాభము నందఁ జాలదయ్యె;
భర్గుని దెసఁ జాలఁ బ్రతికూలుఁ డైనట్టి;
 తమ తండ్రిమీఁది రోషమునఁ జేసి
వలనేది తా ముగ్ధవలె నిజయోగ మా;
 ర్గంబున నాత్మదేహంబు విడిచె;"

### 4-35.1-తేటగీతి

నని మునీంద్రుఁడు వినిపింప నమ్మహాత్ముఁ
డైన విదురుండు మనమున నద్భుతంబు
గదురఁ దత్కథ విన వేడ్క గడలుకొనఁగ
మునివరేణ్యునిఁ జూచి యిట్లనియె మఱియు.

4-36-సీస పద్యము

" చతురాత్మ! దుహితృవత్సలుఁడైన దక్షుండు;
 దన కూఁతు సతి ననాదరము చేసి
యనయంబు నఖిలచరాచర గురుఁడు ని;
 ర్వైరుండు శాంతవిగ్రహుఁడు ఘనుఁడు
జగముల కెల్లను జర్చింప దేవుండు;
 నంచితాత్మారాముఁ డలఘుమూర్తి
శీలవంతులలోన శ్రేష్ఠుండు నగునట్టి;
 భవునందు విద్వేషపడుట కేమి

4-36.1-తేటగీతి

కారణము? సతి దా నేమి కారణమున
విడువరానట్టి ప్రాణముల్ విడిచె? మఱియు
శ్వశుర జామాతృ విద్వేష సరణి నాకుఁ
దెలియ నానతి యిమ్ము సుధీవిధేయ! "

4-37-కంద పద్యము

అని యడిగిన నవ్విదురునిఁ
గనుఁగొని మైత్రేయుఁ డనియెఁ గౌతుక మొప్పన్
" విను మనఘ! తొల్లి బ్రహ్మలు
జన నుతముగఁ జేయునట్టి సత్రముఁ జూడన్.

4-38-చంపకమాల

సరసిజగర్భ యోగిజన శర్వ సుపర్వ మునీంద్ర హవ్యభు
క్స్వరము ఋషిప్రజాపతులు భక్తిఁ మెయిం జనుదెంచి యుండ న
త్తరణిసమాన తేజుఁడగు దక్షుఁడు వచ్చినఁ దత్సదస్యు లా
దరమున లేచి; రప్పుడు పితామహ భర్గులు దక్క నందఱున్.

4-39-కంద పద్యము

చనుదెంచిన యా దక్షుఁడు
వనజజునకు మ్రొక్కి భక్తివశులై సభ్యుల్
తన కిచ్చిన పూజలు గై
కొని యర్ఘాసనమునందుఁ గూర్చుండె తగన్.

4-40-తేటగీతి

తన్నుఁ బొడగని సభ్యు లందఱును లేవ
నాసనము దిగనట్టి పురారివలను
గన్నుఁ గొనలను విస్ఫులింగములు సెదరఁ
జూచి యిట్లను రోషవిస్ఫురణ మెఱయ.

4-41-తేటగీతి

" వినుఁడు మీరలు రొదమాని విబుధ ముని హు
తాశనాది సురోత్తములార! మోహ
మత్సరోక్తులు గావు నా మాట లనుచు
వారి కందఱ కా పురవైరిఁ జూపి.

4-42-సీస పద్యము

పరికింప నితఁడు దిక్పాలయశోహాని;
 కరుఁ డీ క్రియాశూన్యపరుని చేతఁ
గరమొప్ప సజ్జనాచరితమార్గము దూషి;
 తం బయ్యె; నెన్న గతత్రపుండు
మహితసావిత్రీ సమానను సాధ్వి న;
 స్మత్తనూజను మృగశాబనేత్ర
సకల భూమీసుర జన సమక్షమున మ;
 ర్కటలోచనుఁడు కరగ్రహణ మర్థిఁ

4-42.1-తేటగీతి

జేసి తా శిష్యభావంబుఁ జెందు టాత్మఁ
దలఁచి ప్రత్యుద్గమాభివందనము లెలమి
నడపకుండిన మాననీ; నన్నుఁ గన్న
నోరిమాటకుఁ దన కేమి గోరువోయె.

4-43-సీస పద్యము

అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మాన;
 హీనుఁడు మర్యాదలేని వాఁడు
మత్తప్రచారుఁ డున్మత్తప్రియుఁడు దిగం;
 బరుఁడు భూతప్రేత పరివృతుండు
దామస ప్రమథ భూతములకు నాథుండు;
 భూతలిప్తుం డస్థిభూషణుండు

నష్టశౌచుండు నున్మదనాథుఁడును దుష్ట
హృదయుఁ డుగ్రుఁడును బరేతభూ ని

4-43.1-తేటగీతి

కేతనుఁడు వితతప్రస్తకేశుఁ డశుచి
యయిన యితనికి శివనాముఁ డను ప్రవాద
మెటులు గలిగె? నశివుఁ డగు నితని నెఱిఁగి
యెఱిఁగి వేదంబు శూద్రున కిచ్చినటులు.

4-44-వచనము

ఇతనికి నస్మత్తనూజను విధిప్రేరితుండనై యిచ్చితి."

4-45-కంద పద్యము

అని యిట్టులు ప్రతికూల వ
చనములు దక్షుండు పలికి శపియింతును శ
ర్వుని నని జలములు గొని కర
మున నిలిపి యిటులనె రోషమున ననఘాత్మా!

4-46-కంద పద్యము

"ఇతఁ డింద్రోపేంద్ర పరీ
వృతుఁడై మఖసమయమున హవిర్భాగము దే
వతలం గూడఁగ మహిత ని
యతిఁ బొందక యుండుఁగాక యని శపియించెన్."

4-47-వచనము

ఇట్లు దక్షుండు పల్కిన గర్హితవాక్యంబులు వినిందితంబు లగుం గాని యాథార్థ్యంబున వాస్తవంబు లగుచు భగవంతుండగు రుద్రునందు నిందితంబులు గాక స్తుతి రూపంబున నొప్పెఁ; దదనంతరంబ రుద్రునకు శాపం బిచ్చిన కారణంబున దక్షుండు సదస్యముఖ్యులచే నకృత్యం బని నిషేధింపబడి ప్రవృద్ధంబయిన క్రోధంబుతోడ నిజనివాసంబునకుం జనియె; అంత గిరిశానుచరాగ్రేసరుం డగు నందికేశ్వరుండు దక్షుండు నిటలాక్షుని శపియించిన శాపంబు, నతనిఁ బల్కిన యనర్థ వాక్యంబులును విని కోపారుణితలోచనుండై యిట్లను "నీ దక్షుండు మర్త్యశరీరంబు శ్రేష్ఠంబు గాఁ దలఁచి యప్రతిద్రోహియైన భగవంతునందు భేదదర్శియై యపరాధంబుఁ గావించె; ఇట్టి మూఢాత్ముండు దత్త్వ విముఖుం డగు; మఱియుం గూటధర్మంబు లయిన నివాసంబుల గ్రామ్యసుఖకాంక్షలం జేసి సక్తుండై యర్థవాదంబు లైన వేదంబులచేత నష్టమనీషం గలిగి కర్మతంత్రంబు విస్తృతంబు చేయు; వెండియు దేహాదికంబు లుపాదేయంబులు గాఁ దలఁచుచు బుద్ధిచేత నాత్మతత్త్వంబు మఱచి వర్తించుచుఁ బశుప్రాయుండై స్త్రీకాముండు నగు; నిదియునుం గాక దక్షుం డచిరకాలంబున మేషముఖుం డగు" నని మఱియు.

4-48-మత్తేభ విక్రీడితము

అనయంబుం దన మానసంబున నవిద్యన్ ముఖ్యతత్త్వంబు గాఁ
గని గౌరీశుఁ దిరస్కరించిన యసత్కర్మాత్ము నీ దక్షుని

న్న నువర్తించినవారఁు సంసరణకర్మారంభుఁలై నిచ్చలున్
జననం బందుచుఁ జచ్చుచున్ మరల నోజం బుట్టుచున్ వర్తిలున్.

4-49-వచనము

అదియునుం గాక యీ హరద్వేషులైన ద్విజు లర్థవాద బహుళంబు లైన వేదవాక్యంబుల వలన మధుగంధ సమంబైన చిత్తక్షోభంబుచేత విమోహిత మనస్కులై కర్మాసక్తు లగుదురు; మఱియును భక్ష్యాభక్ష్య విచారశూన్యులై దేహాది పోషణంబుకొఱకు ధరియింపఁ బడిన విద్యా తపోవ్రతంబులు గలవారలై ధన దేహేంద్రియంబుల యందుఁ బ్రీతిం బొంది యాచకులై విహరింతురు;" అని నందికేశ్వరుండు బ్రాహ్మణజనంబుల శపియించిన వచనంబులు విని భృగుమహాముని మరల శపి యింపం బూని యిట్లనియె.

4-50-తేటగీతి

వసుధ నెవ్వారు ధూర్జటివ్రతులు వారు
వారి కనుకూలు రగుదు రెవ్వారు వారు
నట్టి సచ్ఛాస్త్ర పరిపంథు లైన వారు
నవనిఁ బాషండు లయ్యెద రని శపించె.

4-51-సీస పద్యము

సకల వర్ణాశ్రమాచార హేతువు, లోక;
మునకు మంగళమార్గమును, సనాత
నముఁ, బూర్వఋషిసమ్మతము, జనార్దనమూల;

మును, నిత్యమును, శుద్ధమును, శివంబు,
నార్యపథానుగం బగు వేదమును విప్ర;
గణము నిందించిన కారణమున
నే శివదీక్ష యందేని మధ్యమ పూజ్యుఁ;
డై భూతపతి దైవ మగుచు నుండు

4-51.1-తేటగీతి

నందు మీరలు భస్మజటాస్థిధార
ణములఁ దగి మూఢబుద్ధులు నష్టశౌచు
లై నశింతురు పాషండు లగుచు ననుచు
శాప మొనరించె నా ద్విజసత్తముండు.

4-52-వచనము

ఇట్లన్యోన్యంబును శాపంబులం బొందియు భగవదనుగ్రహంబు గల వారలగుటం జేసి నాశంబు నొందరైరి; అట్టి యెడ విమనస్కుం డగుచు ననుచర సమేతుం డై భవుండు చనియె నంత.

4-53-సీస పద్యము

అనఘాత్మ! యే యజ్ఞమందు సర్వశ్రేష్ఠుఁ;
డగు హరి సంపూజ్యుఁడై వెలుంగు
నట్టి యజ్ఞంబు సమ్యగ్విధానమున స;
హస్ర వత్సరములు నజుఁ డొనర్చెఁ
గరమొప్ప నమర గంగాయమునా సంగ;

మావనిఁ గలుగు ప్రయాగ యందు
నవభృథస్నానంబు లతిభక్తిఁ గావించి;
గతకల్మషాత్ములై ఘనత కెక్కి

4-53.1-తేటగీతి

తగ నిజాశ్రమభూములఁ దలఁచి వార
లందఱును వేడ్కతోఁ జని రనుచు విదురు
నకును మైత్రేయుఁ డను మునినాయకుండు
నెఱుఁగ వినిపించి వెండియు నిట్లు లనియె.

4-54-వచనము

"అంత శ్వశురుండగు దక్షునకు జామాత యైన భర్గునకు నన్యోన్య విరోధంబు పెరుఁగుచుండ నతిచిరంబగు కాలం బరిగె; నంత దక్షుండు రుద్రవిహీనంబగు యాగంబు లేనిది యైనను శర్వుతోడి పూర్వ విరోధంబునను బరమేష్టి కృతంబైన సకల ప్రజాపతి విభుత్వగర్వంబు ననుం జేసి బ్రహ్మనిష్ఠులగు నీశ్వరాదుల ధిక్కరించి యరుద్రకంబుగా వాజపేయ సవనంబు గావించి తదనంతరంబ బృహస్పతిసవన నామకం బైన మఖంబు చేయ నుపక్రమించిన నచ్చటికిం గ్రమంబున.

4-55-చంపకమాల

కర మనురక్తి నమ్మఖముఁ గన్గొను వేడుక తొంగలింపఁగాఁ
బరమమునిప్రజాపతి సుపర్వ మహర్షి వరుల్ సభార్యులై

పరువడి వచ్చి యందఱు శుభస్థితి దీవన లిచ్చి దక్షుచేఁ
బొరిఁబొరి నచ్చటన్ విహిత పూజల నొందిరి సమ్మదంబునన్.

## 4-6-దక్షయజ్ఞమునకరుగుట

### 4-56-తేటగీతి

దక్షతనయ సతీదేవి దవిలి యాత్మ
సదనమున నుండి జనకుని సవనమహిమ
గగన చరులు నుతింప నా కలకలంబు
విని కుతూహలిని యయి విస్వీథిఁ జూడ.

### 4-57-వచనము

అయ్యవసరంబునఁ దదుత్సవ దర్శన కుతూహలులై సర్వదిక్కుల
వారును జనుచుండి; రా సమయంబున.

### 4-58-సీస పద్యము

తనరారు నవరత్న తాటంక రోచులు;
 చెక్కుటద్దములతోఁ జెలిమి చేయఁ;
మహనీయ తపనీయమయ పదకద్యుతు;
 లంసభాగంబుల నావరింప;
నంచిత చీనిచీనాంబర ప్రభలతో;
 మేఖలాకాంతులు మేలమాడఁ;
జంచల సారంగ చారు విలోచన;
 ప్రభలు నల్దిక్కులఁ బ్రబ్బికొనఁగ;

4-58.1-తేటగీతి

మించు వేడుక భర్తృసమేత లగుచు
మానితంబుగ దివ్య విమానయాన
లగుచు నాకాశపథమున నరుగుచున్న
ఖచర గంధర్వ కిన్నరాంగనలఁ జూచి.

4-59-కంద పద్యము

సతి దన పతి యగు నా పశు
పతిఁ జూచి సముత్సుకతను భాషించె; ప్రజా
పతి మీ మామ మఖము సు
వ్రతమతి నొనరించుచున్న వాఁడఁట వింటే;

4-60-కంద పద్యము

కావున నయ్యజ్ఞమునకు
నీ విబుధగణంబు లర్థి నేఁగెద; రదిగో!
దేవ! మన మిప్పు డచటికిఁ
బోవలె నను వేడ్క నాకుఁ బుట్టెడు నభవా!

4-61-కంద పద్యము

ఆ యజ్ఞముఁ గనుఁగొనఁగా
నా యనుజలు భక్తిఁ బ్రాణనాథుల తోడం
బాయక వత్తురు; మనముం
బోయిన నే వారి నచటఁ బొడగనఁ గల్గున్.

4-62-కంద పద్యము

జనకుని మఖమున కర్థిం
జని నీతోఁ బారిబర్హ సంజ్ఞికతఁ గడుం
దనరిన భూషణములఁ గై
కొన వేడ్క జనించె నీశ! కుజనవినాశా!

4-63-కంద పద్యము

నాతోడను స్నేహము గల
మాతను దత్సోదరీ సమాజము ఋషి సం
ఘాతకృత మఖసమంచిత
కేతువుఁ గన వేడ్క గగనకేశ! జనించెన్.

4-64-వచనము

అదియునుం గాక; దేవా! మహాశ్చర్యకరంబై గుణత్రయాత్మకంబగు ప్రపంచంబు భవదీయ మాయా వినిర్మితం బగుటం జేసి నీకు నాశ్చర్యకరంబు గాదు; ఐనను భవదీయ తత్త్వం బెఱుంగఁ జాలక కామినీ స్వభావంబు గలిగి కృపణురాలనై మదీయ జన్మభూమిఁ గనుంగొన నిచ్ఛగించితి" నని వెండియు నిట్లనియె.

4-65-చంపకమాల

ముదమునఁ దన్మఖోద్భవ విభూతిఁ గనుంగొన నన్యకామినుల్
పదవులు గట్టి భూషణవిభాసితలై నిజనాథయుక్తలై

మదకలహంస పాండురసమంచిత దివ్య విమానయానలై
యదె చనుచున్నవారు గను మభ్రపథంబున నీలకంధరా!

4-66-కంద పద్యము

అనఘా! విను లోకంబుల
జనకుని గేహమునఁ గలుగు సకల సుఖంబుల్
తనయలు చని సంప్రీతిం
గనుఁగొన కే రీతి నిలుచుఁ గాయము లభవా!

4-67-కంద పద్యము

అనయముఁ బిలువక యుండం
జన ననుచిత మంటివేని జనక గురు సుహృ
జ్జననాయక గేహములకుఁ
జనుచుందురు పిలువకున్న సజ్జను లభవా!

4-68-వచనము

అని మఱియు నిట్లనియె "దేవా! నా యందుఁ బ్రసన్నుండవై మదీయ మనోరథంబుం దీర్ప నర్హుండవు; సమధిక జ్ఞానంబు గల నీచేత నేను భవదీయదేహంబు నందర్థంబున ధరియింపంబడితి; నట్టి నన్ను ననుగ్రహింపవలయు" నని ప్రార్థించిన మందస్మితవదనారవిందుం డగుచు జగత్స్రష్టల సమక్షంబున దక్షుండు తన్నాడిన మర్మభేదంబు లైన కుహక వాక్యసాయకంబులం దలంచుచు నిట్లనియె.

4-69-సీస పద్యము

కల్యాణి నీ మాట గడు నొప్పు; బంధువుల్;
 పిలువకుండినను సంప్రీతిఁ జనుదు
రంటి; విదియు లెస్స యైనను దేహాభి;
 మాన మదము ననమర్షమునను
గడఁగి యారోపిత ఘన కోపదృష్టులు;
 గారేనిఁ బోఁదగుఁ గాని వినుము
వినుత విద్యా తపోవిత్త వయో రూప;
 కులములు సుజనులకును గుణంబు;

4-69.1-తేటగీతి

లివియ కుజనులయెడ దోషహేతుకంబు
లై వివేకంబు చెఱుచు; మహాత్ములైన
వారి మాహాత్మ్యమాత్మ గర్వమునఁ జేసి
జడులు వొడగానఁ జాలరు జలజనేత్ర!

4-70-కంద పద్యము

వినుః మట్టి కుటిలు లగు దు
ర్జనుల గృహంబులకు బంధుసరణిని బోవం
జనదు; వినీతుల కది గడు
ననుచిత మైనట్ల యుండు; నది యెట్లనినన్.

4-71-ఆటవెలది

కుటిలబుద్ధు లయిన కుజనుల యిండ్లకు
నార్యు లేగ, వా రనాదరమున
బొమలు ముడిపడంగ భూరి రోషాక్షులై
చూతు; రదియుఁ గాక సుదతి! వినుము.

4-72-చంపకమాల

సమద రిపుప్రయుక్త పటుసాయక జర్జరితాంగుఁ డయ్యు దుః
ఖమును దొఱంగి నిద్రఁగనుఁ గాని కృశింపఁడు మానవుండు; నో!
యుమ! విను మిష్ట బాంధవదురుక్తులు మర్మము లంట నాఁటఁ జి
త్తమున నహర్నిశంబుఁ బరితాపము నొంది కృశించు నెప్పుడున్.

4-73-కంద పద్యము

విను లోకోత్కృష్టుఁడు ద
క్షునికిఁ దనూభవలలోనఁ గూరిమిసుతవై
నను నా సంబంధంబున
జనకునిచేఁ బూజఁ బడయఁజాలవు తరుణీ!

4-74-వచనము

అది యెట్లతనిచేత భవత్సంబంధంబునం జేసి పూజఁబడయమికి నతనికి నీకు విరోధంబునకు హేతు వెట్టి దని యంటివేని.

4-75-మత్తేభ విక్రీడితము

నిరహంకార నిరస్తపాప సుజనానింద్యోల్ల సత్కీర్తిఁ గొం
దఱు కామించి యశక్తులై మనములన్ దందహ్యమానేంద్రియా

తురులై యూరక మచ్చరింతురు; మహాత్ముం డీశ్వరుం డైన యా
హరితో బద్ధ విరోధముం దొడరు దైత్యశ్రేణి చందంబునన్.

4-76-వచనము

అదియునుం గాక, నీ వతనికిం బ్రత్యుత్థానాభివందనంబులు
గావింపకుండుటం జేసి యతండు తిరస్కృతుండయ్యె నంటివేని
లోకంబున జను లన్యోన్యంబును బ్రత్యుత్థానాభివందనంబులు గావింతు;
రదియ ప్రాజ్ఞ లయినవారు సర్వభూతాంతర్యామి యైన
పరమపురుషుండు నిత్యపరిపూర్ణుండు గావునఁ గాయికవ్యాపారం
బయుక్తం బని తదుద్దేశంబుగా మనంబునంద నమస్కారాదికంబులు
గావింతురు; గాని దేహాభిమానంబులు గలుగు పురుషులందుఁ
గావింపరు; కాన యేనును వాసుదేవ శబ్దవాచ్యుండు
శుద్ధసత్త్వమయుండు నంతఃకరణంబు నందు నావరణ విరహితుండు
నయి ప్రకాశించు వాసుదేవునకు నా హృదయంబున నెల్లప్పుడు
నమస్కరించుచుండుదు; ఇట్ల నపరాధినైన నన్నుఁ బూర్వంబున
బ్రహ్మలు చేయు సత్రంబు నందు దురుక్తులం జేసి పరాభవించి మద్ద్వేషి
యైన దక్షుండు భవజ్జనకుం డైన నతఁడును దదనువర్తు లయిన
వారలును జూడఁ దగరు; కావున మద్వచనాతిక్రమంబునం జేసి
యరిగితివేని నచట నీకుఁ బరాభవంబు సంప్రాప్తం బగు; లోకంబున
బంధుజనంబులవలనఁ బూజ బడయక తిరస్కారంబు వొందుట
చచ్చుటయ కాదే;" యని పలికి మఱియు నభవుండు, పొమ్మని
యనుజ్ఞ యిచ్చిన నచ్చట నవమానంబునం జేసి యశుభం బగు

ననియు; నిచ్చటఁ బొమ్మనక నివారించిన మనోవేదన యగు ననియు మనంబునం దలపోయుచు నూరకుండె; అంత.

4-77-సీస పద్యము

సతి సుహృద్దర్శనేచ్ఛా ప్రతికూల దుః;
ఖస్వాంత యగుచు నంగములు వడఁక
నందంద తొరఁగెడు నశ్రుపూరంబులు;
గండభాగంబులఁ గడలుకొనఁగ
నున్నత స్తనమండలోపరిహారముల్;
వేఁడి నిట్టూర్పుల వెచ్చఁ గంద
నతిశోకరో షాకులాత్యంత దోదూయ;
మానమై హృదయంబు మలఁగుచుండ

4-77.1-తేటగీతి

మఱియుఁ గుపితాత్మయై స్వసమానరహితు
నాత్మదేహంబు సగ మిచ్చి నట్టి భవుని
విడిచి మూఢాత్మ యగుచు న వ్వెలఁది జనియె
జనకుఁ జూచెడు వేడుక సందడింప.

4-78-వచనము

ఇ ట్లతి శీఘ్రగమనంబున.

4-79-సీస పద్యము

మానిని చనుచుండ మణిమన్మదాది స;
హస్ర సంఖ్యాత రుద్రానుచరులు
యక్షులు నిర్భయులై వృషభేంద్రుని;
మున్నిడు కొనుచు నమ్ముదిత దాల్చు
కందుకాంబుజ శారికా తాళవృంత ద;
ర్పణ ధవళాతపత్రప్రసూన
మాలికా సౌవర్ణమణివిభూషణ ఘన;
సార కస్తూరికా చందనాది

4-79.1-తేటగీతి

వస్తువులు గొంచు నేగి శర్వాణిఁ గదిసి
శంఖ దుందుభి వేణు నిస్స్వనము లొప్ప
మానితంబైన వృషభేంద్రయానఁ జేసి
యజ్ఞభూమార్గులై యర్థి నరిగియరిగి.

4-80-వచనము

ముందట.

4-81-చంపకమాల

మనమున మోదమందుచు నుమాతరుణీమణి గాంచెఁ జారు మృ
త్కనక కుశాజినాయస నికాయ వినిర్మిత పాత్ర సీమము
న్ననుపమ వేదఘోష సుమహత్పశు బంధన కర్మ భూమమున్
మునివిబుధాభిరామము సముజ్జ్వల హోమము యాగధామమున్.

4-82-వచనము

ఇట్లు గనుంగొని యజ్ఞశాలం బ్రవేశించిన.

4-83-కంద పద్యము

చనుదెంచిన యమ్మగువను
జననియు సోదరులుఁ దక్క సభఁ గల జను లె
ల్లను దక్షువలని భయమున
ననయము నపు డాదరింపరైరి మహాత్మా!

4-84-కంద పద్యము

నెఱిఁ దల్లియుఁ బినతల్లులుఁ
బరిరంభణ మాచరింపఁ బరితోషాశ్రుల్
దొరఁగఁగ డగ్గత్తికతో
సరసిజముఖి సేమ మరయ సతి దా నంతన్.

4-85-కంద పద్యము

జనకుం డవమానించుట
యును సోదరు లర్థిఁ దనకు నుచితక్రియఁ జే
సిన పూజల నందక శో
భన మరసిన మాఱుమాట పలుకక యుండెన్.

4-86-వచనము

ఇట్లు తండ్రిచే నాదరింపబడనిదై విభుండైన యీశ్వరు నందు నాహ్వాన క్రియాశూన్యత్వరూపంబైన తిరస్కారంబును, నరుద్ర భాగంబైన య

జ్ఞంబునుం గనుంగొని నిజరోషానలంబున లోకంబులు భస్మంబు చేయంబూనిన తెఱంగున నుద్రేకించి రుద్రద్వేషియుఁ గ్రతుకర్మాభ్యాస గర్విష్ఠుండు నగు దక్షుని వధియింతు మనుచు లేచిన భూతగణంబుల నివారించి రోషవ్యక్తభాషణంబుల నిట్లనియె; లోకంబున శరీరధారులైన జీవులకుఁ బ్రియాత్మకుండైన యీశ్వరునకుఁ బ్రియాప్రియులును నధికులును లేరు; అట్టి సకల కారణుండును నిర్మత్సరుండును నైన రుద్రు నందు నీవు దక్క నెవ్వండు ప్రతికూలం బాచరించు? నదియునుం గాక మిముబోఁటి వారలు పరులవలని గుణంబు లందు దుర్గుణంబులన యాపాదింతురు; మఱియుం గొందఱు మధ్యస్థులైన వారలు పరుల దుర్గుణంబుల యందు దోషంబుల నాపాదింపరు; కొందఱు సాధువర్తనంబు గలవారలు పరుల దోషంబుల నైన గుణంబులుగా ననుగ్రహింతురు; మఱియుం గొందఱుత్తమోత్తములు పరుల యందు దోషంబుల నాపాదింపక తుచ్ఛగుణంబులు గలిగినను సద్గుణంబులుగాఁ గైకొందురు; అట్టిమహాత్ముల యందు నీవు పాపబుద్ధి గల్పించితి" వని; వెండియు నిట్లను "మహాత్ములగు వారల పాదధూళిచే నిరస్తప్రభావులై జడ స్వభావంబుగల దేహంబునాత్మ యని పల్కు కుజను లగువారు మహాత్ముల నిందించుట కార్యంబు గాదు: అదియు వారి కనుచితం బగు" నని వెండియు నిట్లనియె.

4-87-సీస పద్యము

అనయంబు శివ యను నక్షరద్వయ మర్థి;
వాక్కునఁ బలుక భావమునఁ దలఁప

సర్వజీవుల పాపసంఘముల్ చెడు; నట్టి;
మహితాత్మునందు నమంగళుండ
వగు నీవు విద్వేషి వగుట కాశ్చర్యంబు;
నందెద; వినుము; నీ వదియుఁ గాక
చర్చింప నెవ్వని చరణపద్మంబుల;
నరసి బ్రహ్మానంద మను మరంద

4-87.1-తేటగీతి

మతుల భక్తిని దమ హృదయంబు లనెడి
తుమ్మెదలచేతఁ గ్రోలి సంతుష్టచిత్తు
లగుదు రత్యంత విజ్ఞాను; లట్టి దేవు
నందు ద్రోహంబు చేసి; తే మందు నిన్ను?

4-88-కంద పద్యము

మఱియును నమ్మహితాత్ముని
చరణ సరోజాత యుగము సకలజగంబుల్
నెఱఁ గొలువఁ గోరు కోర్కులు
దఱిమిడి వర్షించు నతనిఁ దగునే తెగడన్?

4-89-చంపకమాల

పరగఁ జితాస్థిభస్మ నృకపాలజటాధరుఁడుం బరేత భూ
చరుఁడు పిశాచయుక్తుఁ డని శర్వు నమంగళుగాఁ దలంప రె

వ్వరు; నొకఁ డీవు దక్క, మఱి వాక్పతి ముఖ్యులు నమ్మహాత్ము స
చ్చరణ సరోజ రేణువులు సమ్మతిఁ దాల్తురు మస్తకంబులన్.

4-90-చంపకమాల

నెలకొని ధర్మపాలన వినిర్మలు భర్గుఁ దిరస్కరించు న
క్కలుషుని జిహ్వఁ గోయఁ దగుఁ; గా కటు చేయఁగ నోపఁడేని దాఁ
బొలియుట యొప్పు; రెంటికిఁ బ్రభుత్వము చాలమిఁ గర్ణరంధ్రముల్
బలువుగ మూసికొంచుఁ జనఁ బాడి యటందురు ధర్మవర్తనుల్.

4-91-వచనము

అది గావున.

4-92-మత్తేభ విక్రీడితము

జనుఁ డజ్ఞానమునన్ భుజించిన జుగుప్సం బైన యన్నంబు స
య్యన వెళ్ళించి పవిత్రుఁడైన గతి దుష్టాత్ముండవై యీశ్వరున్
ఘను నిందించిన నీ తనూభవ యనం గా నోర్వ, నీ హేయ భా
జన మైనట్టి శరీరమున్ విడిచి భాస్వచ్ఛుద్ధిఁ బాటిల్లెదన్.

4-93-వచనము

అదియునుం గాక, దేవతల కాకాశగమనంబును, మనుష్యులకు భూతల గమనంబును, స్వాభావికంబు లయినట్లు ప్రవృత్తినివృత్తి లక్షణ కర్మంబులు రాగవైరాగ్యాధికారంబులుగా వేదంబులు విధించుటం జేసి రాగయుక్తులై కర్మతంత్రు లయిన సంసారులకు వైరాగ్యయుక్తు లయి యాత్మారాము లయిన యోగిజనులకు విధినిషేధరూపంబు లయిన

వైదిక కర్మంబులు గలుగుటయు లేకుండుటయు నైజంబు లగుటం జేసి స్వధర్మ నిష్ఠుండగువాని నిందింపం జనదు; ఆ యుభయకర్మ శూన్యుండు బ్రహ్మభూతుండు నయిన సదాశివునిఁ గ్రియా శూన్యుం డని నిందించుట పాపం బగు; దండ్రీ! సంకల్పమాత్ర ప్రభవంబు లగుటం జేసి మహాయోగిజన సేవ్యంబు లయిన యస్మదీయంబు లగు నణిమాద్యష్టైశ్వర్యంబులు నీకు సంభవింపవు; భవదీయంబు లగు నైశ్వర్యంబులు ధూమమార్గ ప్రవృత్తులై యాగాన్న భోక్తలైన వారి చేత యజ్ఞశాలయందె చాల నుతింపంబడి యుండుఁ గాన నీ మనంబున నే నధిక సంపన్నుండ ననియుఁ, జితాభస్మాస్థి ధారణుండైన రుద్రుండు దరిద్రుం డనియును గర్వింపం జన" దని; వెండియు నిట్లనియె.

4-94-ఉత్పలమాల

నీలగళాపరాధి యగు నీకుఁ దనూభవ నౌట చాలదా?
చాలుఁ గుమర్త్య! నీదు తనుజాత ననన్ మది సిగ్గు పుట్టెడి
న్నేల ధరన్ మహాత్ములకు నెగ్గొనరించెడి వారి జన్మముల్
గాలుపనే? తలంప జనకా! కుటిలాత్మక! యెన్ని చూడఁగన్.

4-95-చంపకమాల

వర వృషకేతనుండు భగవంతుఁడు నైన హరుండు నన్ను నా
దరపరిహాస వాక్యముల దక్షతనూభవ యంచుఁ బిల్వ నేఁ
బురపురఁ బొక్కుచున్ ముదముఁ బొందక నర్మవచస్స్మితంబులం
దొఱఁగుదు; నీ తనూజ నను దుఃఖముకంటెను జచ్చు టొప్పగున్.

4-96-వచనము

అని యిట్లు యజ్ఞసభా మధ్యంబునం బ్రతికూలుండగు దక్షు నుద్దేశించి పలికి కామక్రోధాది శత్రువిఘాతిని యగు సతీదేవి యుదఙ్ముఖి యయి జలంబుల నాచమనంబు చేసి శుచియై మౌనంబు ధరియించి జితాసనయై భూమియం దాసీన యగుచు యోగమార్గంబునం జేసి శరీరత్యాగంబు చేయం దలంచి.

4-97-సీస పద్యము

వరుసఁ బ్రాణాపాన వాయునిరోధంబు;
 గావించి వాని నేకముగ నాభి
తలమునఁ గూర్చి యంతట నుదానము దాఁక;
 నెగయించి బుద్ధితో హృదయపద్మ
మున నిల్పి వాని మెల్లన కంఠమార్గము;
 నను మఱి భ్రూమధ్యమున వసింపఁ
జేసి శివాంఘ్రి రాజీవ చింతనముచే;
 నాథునిఁ దక్క నన్యంబుఁ జూడ

4-97.1-తేటగీతి

కమ్మహాత్ముని యంక పీఠమ్మునందు
నాదరంబున నుండు దేహంబు దక్షు
వలని దోషంబునను విడువంగఁ దలఁచి
తాల్చెఁ దనువున ననిలాగ్ని ధారణములు.

4-98-వచనము

ఇట్లు ధరియించి గతకల్మషంబైన దేహంబు గల సతీదేవి నిజయోగ సమాధి జనితం బయిన వహ్నిచేఁ దత్‌క్షణంబ దగ్ధ యయ్యె; అంత.

4-99-కంద పద్యము

అది గనుఁగొని హాహాధ్వని
యొదలఁగ నిట్లనిరి మానవులుఁ ద్రిదశులు నీ
మదిరాక్షి యకట దేహము
వదలెఁ గదా! దక్షుతోడి వైరము కతనన్.

4-100-వచనము

మఱియు నిట్లనిరి.

4-101-సీస పద్యము

సకల చరాచర జనకుఁ డై నట్టి యీ;
దక్షుండు దన కూర్మి తనయ మాన
వతి పూజనీయ యీ సతి దనచే నవ;
మానంబు నొంది సమక్ష మందుఁ
గాయంబు దొఱఁగంగఁ గనుఁగొను చున్నవాఁ;
డిట్టి దురాత్ముఁ డెందేనిఁ గలఁడె?
యనుచుఁ జిత్తంబుల నాశ్చర్యములఁ బొంది,;
రదియునుఁ గాక యి ట్లనిరి యిట్టి

4-101.1-తేటగీతి

దుష్టచిత్తుండు బ్రహ్మబంధుండు నయిన
యీతఁ డనయంబుఁ దా నపఖ్యాతిఁ బొందు
నిందఁబడి మీఁద దుర్గతిఁ జెందుఁగాక
యనుచు జనములు పలుకు నయ్యవసరమున.

4-102-కంద పద్యము
దేహము విడిచిన సతిఁ గని
బాహాబల మొప్ప రుద్రపార్షదులును ద
ద్ద్రోహిం ద్రుంచుటకై యు
త్సాహంబున లేచి రసిగదాపాణులునై.

4-103-కంద పద్యము
ఆ రవ మపు డీక్షించి మ
హారోషముతోడ భృగుమహాముని క్రతు సం
హారక మారక మగు నభి
చారకహోమం బొనర్చె సరభసవృత్తిన్.

4-104-వచనము
ఇట్లు దక్షిణాగ్ని యందు వేల్చిన నందుఁ దపం బొనర్చి సోమలోకంబున నుండు సహస్ర సంఖ్యలు గల ఋభు నామధేయు లైన దేవత లుదయించి బ్రహ్మతేజంబునం జేసి దివ్య విమానులై యుల్ముకంబులు సాధనంబులుగా ధరియించి రుద్రపార్షదులయిన ప్రమథ గుహ్యక గణంబులఁ బాఱంద్రోలిన వారును బరాజితులైరి; తదనంతరంబ నారదు

వలన నభవుండు దండ్రిచే నసత్కృతురా లగుటం జేసి భవాని పంచత్వంబునొందుటయుం బ్రమథగణంబులు ఋభునామక దేవతలచేఁ బరాజితు లగుటయు విని.

## 4-7-దక్షధ్వర ధ్వంసంబు

### 4-105-శార్దూల విక్రీడితము

ఆద్యుం డుగ్రుఁడు నీలకంఠుఁ డిభదైత్యారాతి దష్టోష్ఠుఁడై
మాద్యద్భూరి మృగేంద్ర ఘోషమున భీమప్రక్రియన్ నవ్వుచున్
విద్యుద్వహ్ని శిఖాసముచ్ఛ్రయరుచిన్ వెల్గొందు చంచజ్జటన్
సద్యః క్రోధముతోడఁ ద్రుచ్చివయిచెన్ క్ష్మాచక్ర మధ్యంబునన్.

### 4-106-వచనము

ఇట్లు పెఱికి వైచిన రుద్రుని జట యందు.

### 4-107-సీస పద్యము

అభ్రంలిహోదభ్ర విభ్ర మాభ్రభ్రమ;
 కృన్నీలదీర్ఘ శరీర మమరఁ
బ్రజ్వలజ్జ్వలన దీప్తజ్వాలికా జాల;
 జాజ్వల్యమాన కేశములు మెఱయఁ
జండ దిగ్వేదండ శుండాభ దోర్దండ;
 సాహస్ర ధృత హేతిసంఘు మొప్ప
వీక్షణత్రయ లోకవీక్షణ ద్యుతి లోక;
 వీక్షణతతి దుర్నిరీక్ష్యముగను

4-107.1-తేటగీతి

గ్రకచ కఠిన కరాళ దంష్ట్రలు వెలుంగ
ఘన కపాలాస్థి వనమాలికలును దనర
నఖిలలోక భయంకరుఁ డగుచు వీర
భద్రుఁ డుదయించె మాఱట రుద్రుఁ డగుచు.

4-108-తేటగీతి

వీరభద్రుండు విహత విద్వేషి భద్రుఁ
డగుచుఁ దన వేయి చేతులు మొగిచి వినయ
మెసఁగ నే నేమి చేయుదు? నెఱుఁగ నాకు
నానతిమ్మన్న నతని కయ్యభవుఁ డనియె.

4-109-చంపకమాల

గురుభుజశౌర్య! భూరిరణకోవిద! మద్భటకోటి కెల్ల నీ
వరయ వరూధినీవరుఁడవై చని యజ్ఞము గూడ దక్షునిన్
బరువడిఁ ద్రుంపు; మీ వచట బ్రాహ్మణతేజ మజేయమంటివే
నరిది మదంశసంభవుఁడవై తగు నీకు నసాధ్య మెయ్యెడన్?

4-110-వచనము

అని కుపిత చిత్తుండై యాజ్ఞాపించిన "నట్లకాక" యని.

4-111-చంపకమాల

అనఘుఁడు రుద్రుఁ జేరి ముదమారఁ బ్రదక్షిణ మాచరించి వీ
డ్కొని యనివార్య వేగమునఁ గుంభిని గ్రక్కదలన్ ఝుళంఝుళ

ధ్వని మణినూపురంబులు పదంబుల మ్రోయఁగ భీషణప్రభల్
దనరఁ గృతాంత కాంతకశితస్ఫుట శూలముఁ బూని చెచ్చెరన్.

4-112-చంపకమాల

సరభసవృత్తి నట్లరుగు సైన్యపదాహత ధూత ధూళి ధూ
సరిత కుబేరదిక్తటము సభ్యులు దక్షుఁడుఁ జూచి యెట్టి భీ
కర తమ మం చనం దమముగాదు, రజఃపటలం బటంచు ని
వ్వెఱపడి పల్కి రాత్మల విపేకవిహీనతఁ బొంది వెండియున్.

4-113-సీస పద్యము

ఈ ధూళి పుట్టుట కెయ్యది హేతువో?;
 విలయ సమీరమా? వెలయ దిపుడు;
ప్రాచీనబర్హి ధరాపతి మహితోగ్ర;
 శాసనుఁ డిపుడు రాజ్యంబు చేయఁ
జోర సంఘములకో రారాదు; మఱి గోగ;
 ణాళి రాకకు సమయంబు గాదు;
కావున నిప్పుడు కల్పావసానంబు;
 గాఁబోలుఁ; గా దటు గాక యున్న

4-113.1-తేటగీతి

నిట్టి యౌత్పాతిక రజ మెందేనిఁ గలదె?
యనుచు మనముల భయమంది రచటి జనులు

సురలు దక్షుఁడు; నంతఁ బ్రసూతి ముఖ్యు
లయిన భూసురకాంత లిట్లనిరి మఱియు.

4-114-కంద పద్యము

తన కూఁతులు చూడఁగ నిజ
తనయను సతి ననపరాధఁ దగవఱి యిట్లె
గ్గొనరించిన యీ దక్షుని
ఘనపాప విపాక మిదియుఁ గాఁదగు ననుచున్.

4-115-వచనము

వెండియు నిట్లనిరి "కుపితాత్ముండైన దక్షుండు దన కూఁతుతో
విరోధంబు చాలక జగత్సంహార కారణుం డయిన రుద్రునిం గ్రోధింప జేసె;
అమ్మహాత్ముం డెంతటివాఁ డన్నం బ్రళయకాలంబున

4-116-సీస పద్యము

సుమహిత నిశిత త్రిశూలాగ్ర సంప్రోత;
నిఖిల దిక్కరి రాజనివహుఁ డగుచుఁ
జటులోగ్రనిష్ఠుర స్తనిత గంభీరాట్ట;
హాస నిర్భిన్నా ఖిలాశుఁ డగుచు
భూరి కరాళవిస్ఫార దంష్ట్రా హతి;
పతిత తారాగణ ప్రచయుఁ డగుచు
వివిధ హేతివ్రాత విపుల ప్రభాపుంజ;
మండిత చండ దోర్దండుఁ డగుచు

4-116.1-తేటగీతి

వికట రోష భయంకర భ్రుకుటి దుర్ని
రీక్ష్య దుస్సహ తేజోమహిమఁ దనర్చి
ఘన వికీర్ణ జటాబంధ కలితుఁ డగుచు
నఖిల సంహార కారణుఁ డయి నటించు.

4-117-తేటగీతి

అట్టి దేవునిఁ ద్రిపుర సంహార కరునిఁ
జంద్రశేఖరు సద్గుణసాంద్రు నభవు
మనము రోషింపఁ జేసిన మంగళములఁ
బొంద వచ్చునె పద్మగర్భునకునైన?

4-118-వచనము

అని యి వ్విధంబున భయవిహ్వలలోచనలై పలుకుచున్న సమయంబున మహాత్ముండైన దక్షునకు భయావహంబులై సహస్ర సంఖ్యాతంబు లైన మహోత్పాతంబులు భూనభోంతరంబులఁ గానంబడుచుండె; ఆ సమయంబున రుద్రానుచరులు నానావిధాయుధంబులు ధరియించి కపిల పీత వర్ణంబులు గలిగి వామనాకారులు, మకరోదరాననులు నై యజ్ఞశాలాప్రదేశంబునం బరువులుపెట్టుచుఁ గదియం జనుదెంచి దక్షాధ్వర వాటంబులు విటతాటంబులు చేయుచుం, గొందఱు ప్రాగ్వంశంబును, గొందఱు పత్నీశాలయు, కొందఱు సదస్య శాలయుఁ, గొంద ఱాగ్నీధ్ర శాలయు, కొందఱు యజమాన శాలయుఁ, గొందఱు మహానస గృహంబును

విధ్వంసంబులు గావించిరి; మఱియుఁ గొందఱు యజ్ఞపాత్రంబుల నగ్నులం జెఱచిరి; వెండియుఁ గొందఱు హోమాగ్ను లార్చిరి; పదంపడి కొందఱు హోమకుండంబుల యందు మూత్రంబులు విడిచిరి; కొంద ఱుత్తరవేదికా మేఖలలు ద్రెంచిరి; కొందఱు మునుల బాధించిరి; కొందఱు తత్పత్నుల వెఱపించిరి; మఱికొందఱు దేవతా నిరోధంబుఁ గావించిరి; అంత మణిమంతుండు భృగువును, వీరభద్రుండు దక్షునిఁ, జండీశుండు పూషుని, భగుని నందీశ్వరుండును బట్టిరి; ఇవ్విధంబున సదస్య దేవ ఋత్విజ్నికాయంబుల శిలల ఱువ్వియు, జానువులఁ బొడిచియు, నఱచేతుల నడచియు, గుల్ఫంబులఁ బొడిచియు వివిధ బాధలు పఱచిన వారు కాందిశీకు లై యెక్కడెక్క డేనిం జనిరి; మఱియును.

4-119-కంద పద్యము

మును దక్షుఁ డభవుఁ బలుకఁగఁ
గను గీఁటిన భగునిఁ బట్టి కన్నులు పెకలిం
చెను నందీశ్వరుఁ; డచ్చటి
జనముల హాహారవంబు సందడి గొలుపన్.

4-120-తేటగీతి

కుపితుఁడై నాఁడు భవుని దక్షుఁడు శపింపఁ
బరిహసించిన పూషుని పండ్లు డుల్లఁ
గొట్టె బలభద్రుఁ డా కళింగుని రదంబు
లెలమి డులిచిన పగిదిఁ జండీశ్వరుండు.

4-121-కంద పద్యము

తగవేది దక్షుఁ డా సభ
నగచాపుఁ దిరస్కరించునాఁ డట శ్మశ్రుల్
నగచుం జూపుట నా భృగు
పగకై శ్మశ్రువులు వీరభద్రుఁడు పెఱికెన్.

4-122-సీస పద్యము

అతుల దర్పోద్ధతుండై వీరభద్రుండు;
గైకొని దక్షు వక్షంబుఁ ద్రొక్కి
ఘనశితధారాసిఁ గొని మేను వొడచియు;
మంత్రసమన్విత మహిత శస్త్ర
జాలావినిర్భిన్న చర్మంబు గల దక్షుఁ;
జంపఁగా లేక విస్మయము నొంది
తద్వధోపాయంబు దన చిత్తమునఁ జూచి;
కంఠనిష్పీడనగతిఁ దలంచి

4-122.1-తేటగీతి

మస్తకముఁ దున్మి యంచితామర్షణమున
దక్షిణాలనమున వేల్చెఁ దదనుచరులు
హర్షమును బొంద; నచటి బ్రాహ్మణజనంబు
లాత్మలను జాల దుఃఖంబు లందుచుండ.

4-123-వచనము

ఇట్లు వీరభద్రుండు దక్షుని యాగంబు విధ్వంసంబు గావించి నిజ నివాసంబైన కైలసంబునకుఁ జనియె నయ్యవసరంబున.

4-124-చంపకమాల

హరభటకోటిచేత నిశి తాసి గదా కరవాల శూల ము
ద్గర ముసలాది సాధనవిదారిత జర్జరితాఖిలాంగులై
సురలు భయాకులాత్ము లగుచున్ సరసీరుహజాతుఁ జేరి త
చ్చరణ సరోరుహంబులకు సమ్మతిఁ జాఁగిలి మ్రొక్కి నమ్రులై.

4-125-కంద పద్యము

తము ధూర్జటి సైనికు లగు
ప్రమథులు దయమాలి పెలుచ బాధించుట స
ర్వముఁ జెప్పి రనుచు మైత్రే
య మునీంద్రుఁడు విదురుతోడ ననియెన్; మఱియున్.

## 4-8-శివుండనుగ్రహించుట

4-126-తేటగీతి

ఇంతయును మున్ను మనమున నెఱిఁగి యున్న
కతన విశ్వాత్మకుండును గమలలోచ
నుండు నన నొప్పు నారాయణుండు నజుఁడుఁ
జూడ రారైరి మున్ను దక్షుని మఖంబు.

4-127-వచనము

అని చెప్పి "సుర లిట్లు విన్నవించినఁ జతుర్ముఖుండు వారల కిట్లనియె.

4-128-కంద పద్యము

ఘన తేజోనిధి పురుషుం
డనయంబుఁ గృతాపరాధుఁ డయినను దా మ
ల్లన ప్రతికారముఁ గావిం
చిన జనులకు లోకమందు సేమము గలదే?

4-129-వచనము

అని మఱియు నిట్లనియె.

4-130-కంద పద్యము

క్రతుభాగార్హుం డగు పశు
పతి నీశ్వరు నభవు శర్వు భర్గుని దూరీ
కృత యజ్ఞభాగుఁ జేసిన
యతి దోషులు దుష్టమతులు నగు మీ రింకన్.

4-131-సీస పద్యము

పూని యే దేవుని బోమముడి మాత్రన;
లోకపాలకులును లోకములును
నాశ మొందుదు; రట్టి యీశుండు ఘన దురు;
క్త్యస్త్ర నికాయ విద్ధాంతరంగుఁ
డును బ్రియా విరహితుండును నైనవాఁ డమ్మ;
హాత్మునిఁ ద్రిపుర సంహారకరుని

ముఖపునస్సంధానమతి నపేక్షించు మీ;
రలు చేరి శుద్ధాంతరంగు లగుచు

4-131.1-తేటగీతి

భక్తినిష్ఠలఁ దత్పాద పద్మ యుగళ
ఘన పరిగ్రహ పూర్వంబుగాఁగ నతని
శరణ మొందుఁ డతండు ప్రసన్నుఁ డయినఁ
దివిరి మీ కోర్కి సిద్ధించు దివిజులార!

4-132-వచనము

అని మఱియు నిట్లనియె; "అద్దేవుని డాయం జన వెఱతు మని తలంపకుండు; అతనిఁ జేరు నుపాయం బెఱింగిపుమంటి రేని, నేను నింద్రుండును మునులును మీరలును మఱియు దేహధారు లెవ్వ రేని నమ్మహాత్ముని రూపంబు నతని బలపరాక్రమంబుల కొలఁదియు నెఱుంగజాలము; అతండు స్వతంత్రుండు గావునఁ దదుపాయం బెఱింగింప నెవ్వఁడు సమర్థుం డగు; అయిన నిపుడు భక్తపరాధీనుండును శరణాగత రక్షకుండు నగు నీశునిఁ జేరం బోవుదము;" అని పలికి పద్మసంభవుండు దేవ పితృగణ ప్రజాపతులం గూడి కైలాసాభిముఖుఁ డై చనిచని.

4-133-ఉత్పలమాల

భాసురలీలఁ గాంచిరి సుపర్వులు భక్తజనైక మానసో
ల్లాసముఁ గిన్నరీజన విలాసము నిత్యవిభూతి మంగళా

వాసము సిద్ధ గుహ్యక నివాసము రాజత భూవికాసి కై
లాసముఁ గాంతి నిర్జిత కులక్షితిభృత్సుమహద్విభాసమున్.

4-134-సీస పద్యము

ధాతు విచిత్రితోదాత్త రత్నప్రభా;
 సంగతోజ్జ్వల తుంగ శృంగములును;
గిన్నర గంధర్వ కింపురుషాప్సరో;
 జన నికరాకీర్ణ సానువులును;
మానిత నిఖిల వైమానిక మిథున స;
 ద్విహరణైక శుభ ప్రదేశములును;
గమనీయ నవమల్లికా సుమనోవల్లి;
 కా మతల్లీ లసత్కందరములు;

4-134.1-తేటగీతి

నమర సిద్ధాంగనా శోభితాశ్రమములు;
విబుధజన యోగ్య సంపన్నివేశములును
గలిగి బహువిధ పుణ్యభోగముల నొప్పు
వినుత సుకృతములకు దండ పెండికొండ.

4-135-వచనము

అది మఱియును, మందార పారిజాత సరళ తమాల సాల తాల తక్కోల
కోవిదార శిరీ షార్జున చూత కదంబ నీప నాగ పున్నాగ చంపక పాట
లాశోక వకుళ కుంద కురవక కన కామ్ర శతపత్ర కింశు కైలా లవంగ

మాలతీ మధూక మల్లికా పనస మాధవీ కుట జోదుంబు రాశ్వత్థ ప్లక్ష
వట హింగుళ భూర్జ పూగ జంబూ ఖర్జూ రామ్రాతక ప్రియాళు నారికే
ళేంగుద వేణు కీచక ముఖర తరు శోభితంబును, కలకంఠ కాలకంఠ
కలవింక రాజకీర మత్తమధుకర నానా విహంగ కోలాహల నినద
బధిరీభూత రోదోంతరాళంబును, సింహ తరక్షు శల్య గవయ శరభ
శాఖామృగ వరాహ వ్యాఘ్ర కుర్కుర రురు మహిష వృక సారంగ ప్రముఖ
వన్యసత్త్వ సమాశ్రయ విరాజితంబును, కదళీషండ మండిత కమల
కహ్లార కైరవ కలిత పులినతల లలిత కమలాకర విహరమాణ కలహంస
కారండవ సారస చక్రవాక బక జలకుక్కుటాది జలవిహంగకుల కూజిత
సంకులంబును, సలిలకేళీవిహరమాణ సతీరమణీ రమణీయ
కుచమండల విలిప్త మృగమద మిళిత హరిచందన గంధ సుగంధి
జలపూరిత గంగాతరంగణీ సమావృతంబును నైన కైలస పర్వతంబు
వొడగని, యరవిందసంభవ పురందరాది దేవగణంబు
లత్యద్భుతానందంబులం బొంది ముందటఁ దార హీర హేమమయ
విమాన సంకులంబును, పుణ్యజన మానినీ శోభితంబును నైన
యలకాపురంబు గడచి; తత్పుర బాహ్యప్రదేశంబునం దీర్థపాదుండైన
పుండరీకాక్షు పాదారవిందరజః పావనంబును, రతికేళీ వ్యాసంగ పరిశ్రమ
నివారక సలిల కేళీవిలోల దేవకామినీ పీనవక్షోజ విలిప్త కుంకుమపంక
సంగత పిశంగవర్ణ వారిపూర విలసితంబు నునై;
నందాలకనందాభిధానంబులు గల నదీ ద్వితయంబు దాఁటి
తత్పురోభాగంబున వనగజ సంఘృష్ట మలయజ పరిమిళిత
మలయపవనాస్వాదన ముహుర్ముహురున్మదిత మానస

పుణ్యజనకామినీ కదంబంబును, వైదూర్య సోపాన సమంచిత కనకోత్పల వాపీ విభాసితంబును, గింపురుష సంచార యోగ్యంబును నగు సౌగంధిక వన సమీపంబు నందు.

4-136-సీస పద్యము

ఉజ్జ్వలంబయి శతయోజనంబుల పొడ;
వోగఁ బంచసప్తతి యోజనముల
పఱపును గల్గి యే పట్టునఁ దఱుగని;
నీడ శోభిల్ల నిర్ణీత మగుచుఁ
బర్ణశాఖా సమాకీర్ణమై మాణిక్య;
ములఁ బోలఁగల ఫలములఁ దనర్చి
కమనీయ సిద్ధయోగక్రియామయ మయి;
యనఘ ముముక్షు జనాశ్రయంబు

4-136.1-తేటగీతి

భూరిసంసార తాప నివారకంబు
నగుచుఁ దరురాజ మనఁగఁ బెంపగ్గలించి
భక్తజనులకు నిచ్చలుఁ బ్రమద మెసఁగ
వలయు సంపద లందు నావటము వటము.

4-137-వచనము

ఆ వృక్షమూలతలంబున.

4-138-సీస పద్యము

ఇద్ధ సనందాది సిద్ధ సంసేవితు;
 శాంతవిగ్రహుని వాత్సల్యగుణునిఁ
గమనీయ లోకమంగళదాయకుని శివు;
 విశ్వబంధుని జగద్విసుత యశుని
గుహ్యక సాధ్య రక్షో యక్షనాథ కు;
 బేర సేవితుని దుర్వారబలుని
నుదిత విద్యాతపోయోగ యుక్తుని బాల;
 చంద్రభూషణుని మునీంద్రనుతునిఁ

4-138.1-తేటగీతి

దాపసాభీష్టకరు భస్మదండలింగ
ఘనజటాజిన ధరుని భక్తప్రసన్ను
వితత సంధ్యాభ్రరుచి విడంబిత వినూత్న
రక్తవర్ణు సనాతను బ్రహ్మమయుని.

4-139-వచనము

మఱియును.

4-140-సీస పద్యము

అంచిత వామపాదాంభోరుహము దక్షి;
 ణోరుతలంబున నొయ్య నునిచి
సవ్యజానువుమీఁద భవ్యబాహువు సాఁచి;
 వలపలి ముంజేత సలలితాక్ష

మాలిక ధరియించి మహనీయ తర్కము;
ద్రాయుక్తుఁ డగుచుఁ జిత్తంబులోన
నవ్యయం బయిన బ్రహ్మానందకలిత స;
మాధి నిష్ఠుఁడు వీతమత్సరుండు

4-140.1-తేటగీతి

యోగపట్టాభిరాముఁడై యుచిత వృత్తి
రోషసంగతిఁ బాసి కూర్చున్న జముని
యనువునను దర్భరచిత బృస్యాసనమున
నున్న మునిముఖ్యు నంచిత యోగనిరతు.

4-141-కంద పద్యము

అలఘుని నభవుని యోగీం
ద్రులు వినుచుండంగ నారదునితోఁ బ్రియ భా
షలు జరుపుచున్న రుద్రుని
సలలిత పన్నగ విభూషు సజ్జనపోషున్.

4-142-కంద పద్యము

కని లోకపాలురును ముని
జనులును సద్భక్తి నతని చరణంబులకున్
వినతు లయి, రప్పు డబ్జా
సనుఁ గని యయ్యభవుఁ డధిక సంభ్రమ మొప్పన్.

4-143-కంద పద్యము

అనఘ! మహాత్ముం డగు వా
మనుఁ డా కశ్యపునకొగి నమస్కారము చే
సినగతి నజునకు నభివం
దన మొగిఁ గావించె హరుఁడు దద్దయుఁ బ్రీతిన్.

4-144-తేటగీతి

అంత రుద్రానువర్తు లైనట్టి సిద్ధ
గణ మహర్షి జనంబులు గని పయోజ
గర్భునకు మ్రొక్కి; రంత నా కమలభవుఁడు
శర్వుఁ గని పల్కె మందహాసంబుతోడ.

4-145-తేటగీతి

జగములకు నెల్ల యోనిబీజంబు లైన
శక్తి శివకారణుండవై జగతి నిర్వి
కార బ్రహ్మంబ వగు నిన్నుఁ గడఁగి విశ్వ
నాథుఁ గా నెఱిఁగెద నా మనమున నభవ!

4-146-తేటగీతి

సమత నది గాక తావకాంశంబు లైన
శక్తి శివరూపములఁ గ్రీడ సలుపు దూర్ణ
నాభి గతి విశ్వ జనన వినాశ వృద్ధి
హేతుభూతుండ వగుచుందు వీశ! రుద్ర!

4-147-సీస పద్యము

అనఘ! లోకంబుల యందు వర్ణాశ్రమ;
సేతువు లనఁగఁ బ్రఖ్యాతి నొంది
బలసి మహాజన పరిగృహీతంబులై;
యఖిల ధర్మార్థదాయకము లైన
వేదంబులను మఱి వృద్ధి నొందించుట;
కొఱకునై నీవ దక్షుని నిమిత్త
మాత్రునిఁ జేసి యమ్మఖముఁ గావించితి;
వటుగాన శుభమూర్తివైన నీవు

4-147.1-తేటగీతి

గడఁగి జనముల మంగళకర్మ లయిన
వారి ముక్తి, నమంగళాచారు లయిన
వారి నరకంబు, నొందింతు భూరిమహిమ
భక్తజనపోష! రాజితఫణివిభూష!

4-148-వచనము

అట్లగుటం దత్కర్మంబు లొకానొకనికి విపర్యాసంబు నొందుటకుఁ గారణం బెయ్యదియో? భవదీయ రోషంబు హేతువని తలంచితినేనిఁ ద్వదీయ పాదారవింద నిహిత చిత్తులై సమస్తభూతంబుల యందు నినుం గనుంగొనుచు భూతంబుల నాత్మయందు వేఱుగాఁ జూడక వర్తించు మహాత్ముల యందు నజ్ఞులైనవారి యందుఁబోలె రోషంబు దఱచు వొరయ దఁట; నీకుఁ గ్రోధంబు గలదే?" యని.

4-149-సీస పద్యము

మఱి భేదబుద్ధిఁ గర్మప్రవర్తనముల;
 మదయుతు లయి దుష్టహృదయు లగుచుఁ
బరవిభవాసహ్య భవ మనో వ్యాధులఁ;
 దగిలి మర్మాత్మ భేదకము లయిన
బహు దురుక్తుల చేతఁ బరులఁ బీడించుచు;
 నుండు మూఢులను దైవోపహతులఁ
గాఁ దలపోసి య క్కపటచిత్తులకు నీ;
 వంటి సత్పురుషుఁ డేవలన నైన

4-149.1-తేటగీతి

హింసఁ గావింపకుండు సమిద్ధచరిత!
నీలలోహిత! మహితగుణాలవాల!
లోకపాలనకలిత! గంగాకలాప!
హర! జగన్నుతచారిత్ర! యదియుఁ గాక.

4-150-సీస పద్యము

అమర సమస్త దేశము లందు నఖిల కా;
 లములందుఁ దలఁప దుర్లంఘ్య మహిముఁ
డగు పద్మనాభు మాయా మోహితాత్మకు;
 లై భేదదర్శను లైనవారి
వలనను ద్రోహంబు గలిగిన నైనను;
 నది దైవకృత మని యన్యదుఃఖ

ముల కోర్వలేక సత్పురుషుండు దయచేయు;
గాని హింసింపఁడు గాన నీవు

4-150.1-తేటగీతి

నచ్యుతుని మాయమోహము నందకుంటఁ
జేసి సర్వజ్ఞుఁడవు; మాయచేత మోహి
తాత్ములై కర్మవర్తను లయినవారి
వలన ద్రోహంబుగలిగిన వలయుఁ బ్రోవ.

4-151-వచనము

అది గావున యజ్ఞభాగార్హుండ వయిన నీకు సవనభాగంబు సమర్పింపని కతన నీచేత విధ్వంస్తంబయి పరిసమాప్తి నొందని దక్షాధ్వరంబు మరల నుద్ధరించి దక్షునిఁ బునర్జీవితుం జేయుము; భగుని నేత్రంబులును, భృగుముని శ్మశ్రువులును, బూషుని దంతంబులును, గృపఁజేయుము; భగ్నాంగు లయిన దేవ ఋత్విజ్నికాయంబులకు నారోగ్యంబు గావింపుము; ఈ మఖావశిష్టంబు యజ్ఞ పరిపూర్తి హేతుభూతం బయిన భవదీయభాగం బగుం గాక."

4-152-చంపకమాల

అని చతురాననుండు వినయంబున వేఁడిన నిందుమౌళి స
య్యనఁ బరితుష్టిఁ బొంది దరహాసము మోమునఁ దొంగలింప ని
ట్లను హరిమాయచేత ననయంబును బామరు లైనవారు చే
సిన యపరాధ దోషములు చిత్తములోఁ గణియింప నెన్నఁడున్.

4-153-వచనము

అట్లయ్యును.

4-154-కంద పద్యము

బలియుర దండించుట దు
ర్బలజన రక్షణము ధర్మపద్ధతి యగుటం
గలుషాత్ముల నపరాధము
కొలఁదిని దండించుచుందుఁ గొనకొని యేనున్.

4-155-వచనము

అని దగ్ధశీర్షుం డయిన దక్షుం డజముఖుం డగు; భగుండు బర్హి స్సంబంధ భాగంబులు గలిగి మిత్రనామధేయ చక్షుస్సునం బొడగాంచు; పూషుండు పిష్టభుక్కగుచు యజమాన దంతంబులచే భక్షించు; దేవతలు యజ్ఞావశిష్టంబు నాకొసగుటంజేసి సర్వావయవ పూర్ణులై వర్తింతురు; ఖండితాంగులైన ఋత్విగాది జనంబు లశ్వనీదేవతల బాహువులచేతను బూషుని హస్తంబులచేతను లబ్ధబాహు హస్తులై జీవింతురు; భృగువు బస్తశ్మశ్రువులు గలిగి వర్తించు; అని శివుండా నతిచ్చిన సమస్తభూతంబులును సంతుష్టాంతరంగంబులై "తండ్రీ లెస్సయ్యె" నని సాధువాదంబుల నభినందించిరి: అంతనా శంభుని యామంత్రణంబు వడసి సునాసీర ప్రముఖులగు దేవతలు ఋషులతోడం గూడి రా నజుండును రుద్రునిం బురస్కరించుకొని దక్షాధ్వర వాటంబుకుం జనియె; అంత.

4-156-కంద పద్యము

శర్వుని యోగక్రమమున
సర్వావయవములుఁ గలిగి సన్ముని ఋత్వి
గ్గీర్వాణముఖ్యు లొప్పిరి
పూర్వతనుశ్రీల నార్యభూషణ! యంతన్.

4-157-కంద పద్యము

విను దక్షు నంత మేషము
ఖునిఁ జేసిన నిద్ర మేలుకొని లేచిన పో
ల్కిని నిలిచె దక్షుఁ, డభవుఁడు
కనుఁగొనుచుండంగ నాత్మఁ గౌతుక మొప్పన్.

4-158-వచనము

ఇట్లు లేచి నిలిచి ముందఱ నున్న శివునిం గనుంగొనిన మాత్రన శరత్కాలంబున నకల్మషంబైన సరస్సునుంబోలెఁ బూర్వరుద్రవిద్వేష జనితంబు లైన కల్మషంబులం బాసి నిర్మలుండై యభవుని నుతియింపం దొడంగి మృతిఁ బొందిన సతీ తనయం దలంచి యనురా గోత్కంఠ బాష్పపూరిత లోచనుండును, గద్గదకంఠుండునునై పలుకం జాలక యెట్టకేలకు దుఃఖంబు సంస్తంభించుకొని ప్రేమాతిరేక విహ్వాలుం డగుచు సర్వేశ్వరుం డగు హరున కిట్లనియె.

4-159-కంద పద్యము

విను; నీ కపరాధుఁడ నగు
నను దండించు టది దండనము గాదు మది
న్నను రక్షించుటగా మన
మునఁ దలఁతును దేవ! యభవ! పురహర! రుద్రా!

4-160-సీస పద్యము

అనఘాత్మ! తగ నీవు నబ్జనాభుండును;
బరికింపఁ బ్రాహ్మణాభాసు లయిన
వారల యెడల నెవ్వలన నుపేక్షింప;
రఁట! దృఢవ్రతచర్యు లైనవారి
యెడ నీకుపేక్ష యెక్కడిది? సర్గాదిని;
నామ్నాయ సంప్రదాయప్రవర్త
నము నెఱింగించుట కమర విద్యాతపో;
వ్రత పరాయణులైన బ్రాహ్మణులను

4-160.1-తేటగీతి

వరుసఁ బుట్టించితివి; కాన వారి నెపుడుఁ
గేల దండంబుఁ బూని గోపాలకుండు
బలసి గోవుల రక్షించు పగిది నీవు
నరసి రక్షించుచుందు గదయ్య రుద్ర!

4-161-సీస పద్యము

తలపోయ నవిదిత తత్త్వవిజ్ఞానుండ;
 నైన నాచేత సభాంతరమున
నతి దురుక్త్యంబక క్షతుఁడ వయ్యును మత్కృ;
 తాపరాధము హృదయంబు నందుఁ
దలఁపక సుజన నిందాదోషమున నధో;
 గతిఁ బొందుచున్న దుష్కర్ము నన్నుఁ
గరుణఁ గాచిన నీకుఁ గడఁగి ప్రత్యుపకార;
 మెఱిఁగి కావింప నే నెంతవాఁడ?

4-161.1-తేటగీతి

నుతచరిత్ర! భవత్పరానుగ్రహాను
రూప కార్యంబుచేత నిరూఢమైన
తుష్టి నీ చిత్తమందు నొందుదువు గాక;
క్షుద్రసంహార! కరుణాసముద్ర! రుద్ర!

4-162-వచనము

అని యిట్లు రుద్రక్షమాపణంబు గావించి పద్మసంభవుచేత ననుజ్ఞాతుండై దక్షుం డుపాధ్యాయ ఋత్విగ్గణ సమేతుం డగుచుఁ గ్రతుకర్మంబు నిర్వర్తించు సమయంబున, బ్రాహ్మణజనంబులు యజ్ఞంబులు నిర్విఘ్నంబులై సాగుటకుఁ బ్రమథాది వీర సంసర్గ కృత దోష నివృత్త్యర్థంబుగా విష్ణుదేవతాకంబును ద్రికపాలపురోడాశ ద్రవ్యకంబును నైన కర్మంబుఁ గావింప నధ్వర్యుకృత్య ప్రవిష్టుం డగు భృగువు తోడం

గూడి నిర్మలాంతఃకరణుం డగుచు దక్షుఁడు ద్రవ్యత్యాగంబుఁ గావింపఁ బ్రసన్నుండై సర్వేశ్వరుండు.

4-163-సీస పద్యము

మానిత శ్యామాయమాన శరీర దీ;
ధితులు నల్దిక్కుల దీటుకొనఁగఁ
గాంచన మేఖలా కాంతులతోడఁ గౌ;
శేయ చేలద్యుతుల్ చెలిమి చేయ
లక్ష్మీసమాయుక్త లలిత వక్షంబున;
వైజయంతీ ప్రభల్ వన్నెచూప
హాటకరత్న కిరీట కోటిప్రభల్;
బాలార్క రుచులతో మేలమాడ

4-163.1-తేటగీతి

లలితనీలాభ్రరుచిఁ గుంతలములు దనరఁ
బ్రవిమలాత్మీయ దేహజప్రభ సరోజ
భవ భవామర ముఖ్యుల ప్రభలు మాప
నఖిలలోకైక గురుఁడు నారాయణుండు.

4-164-చంపకమాల

సలలిత శంఖ చక్ర జలజాత గదా శర చాప ఖడ్గ ని
ర్మల రుచులున్ సువర్ణ రుచిమన్మణి కంకణ ముద్రికా ప్రభా

వళులును దేజరిల్లు భుజవర్గ మనర్గళ కాంతియుక్తమై
విలసిత కర్ణికార పృథివీరుహముం బురుడింపఁ బిట్టుగన్.

4-165-కంద పద్యము

సరసోదార సమంచిత
దరహాస విలోకనములఁ దగ లోకములం
బరితోషము నొందించుచుఁ
బరమోత్సవ మొప్ప విశ్వబంధుం డగుచున్.

4-166-చంపకమాల

మఱియును రాజహంస రుచిమద్భ్రమణీకృత తాలవృంత చా
మరములు వీవఁగా దివిజమానిను లచ్చసుధామరీచి వి
స్ఫురణ సితాతపత్ర రుచిపుంజము దిక్కులఁ బిక్కటిల్లఁగాఁ
గరివరదుండు వచ్చె సుభగస్తుతి వర్ణ సుపర్ణయానుఁడై.

## 4-9-దక్షాదుల శ్రీహరి స్తవంబు

4-167-చంపకమాల

ఘనరుచి నట్లు వచ్చిన వికారవిదూరు ముకుందుఁ జూచి బో
రన నరవిందనందన పురందర చంద్రకళాధ రామృతా
శనముఖు లర్థి లేచి యతి సంభ్రమ మొప్ప నమో నమో దయా
వననిధయే యటంచు ననివారణ మ్రొక్కిరి భక్తియుక్తులై.

4-168-వచనము

అట్లు కృతప్రణాములైన యనంతరంబ.

4-169-ఉత్పలమాల

ఆ నళినాయతాక్షుని యనంత పరాక్రమ దుర్నిరీక్ష్య తే
జో నిహతస్వదీప్తు లగుచున్నతిసేయ నశక్తులై భయ
గ్లాని వహించి బాష్పములు గ్రమ్మఁగ గద్గదకంఠులై తనుల్
మ్రానుపడంగ నవ్విభుని మన్ననఁ గైకొని యెట్టకేలకున్.

4-170-వచనము

నిటలతట ఘటిత కరపుటులై యమ్మహాత్ముని యపార మహిమం బెఱిఁగి నుతియింప శక్తులుగాక యుండియుఁ, గృతానుగ్రహవిగ్రహుం డగుటం జేసి తమతమ మతులకు గోచరించిన కొలంది నుతియింపఁ దొడంగిరి; అందు గృహీతంబు లగు పూజాద్యుపచారంబులు గలిగి బ్రహ్మాదులకు జనకుండును, సునంద నందాది పరమభాగవతజన సేవితుండును, యజ్ఞేశ్వరుండును నగు భగవంతుని శరణ్యునింగాఁ దలంచి దక్షుం డిట్లనియె; "దేవా! నీవు స్వస్వరూపంబునం దున్న యప్పు డుపరతంబులుగాని రాగాద్యఖిలబుద్ధ్యవస్థలచే విముక్తుండవును, నద్వితీయుండవును, జిద్రూపకుండవును, భయరహితుండవును నై మాయం దిరస్కరించి మఱియు నా మాయ ననుసరించుచు లీలామానుషరూపంబుల నంగీకరించి స్వతంత్రుండ వయ్యును, మాయా పరతంత్రుడవై రాగాది యుక్తుండునుం బోలె రామకృష్ణాద్యవతారంబులఁ గానంబడుచుందువు; కావున నీ లోకంబులకు నీవ యీశ్వరుండవనియు నితరులైన బ్రహ్మారుద్రాదులు

భవన్మాయా విభూతు లగుటం జేసి లోకంబులకు నీశ్వరులుగా రనియును భేదదృష్టి గల నన్ను రక్షింపుము; ఈ విశ్వకారణు లైన ఫాలలోచనుండును బ్రహ్మయు దిక్పాలురును సకల చరాచర జంతువులును నీవ; భవద్వ్యతిరిక్తంబు జగంబున లే" దని విన్నవించినం దదనంతరంబ ఋత్విగ్గణంబు లిట్లనిరి.

4-171-సీస పద్యము

వామదేవుని శాపవశమునఁ జేసి క;
ర్మానువర్తులము మే మైన కతన
బలసి వేదప్రతిపాద్య ధర్మోపల;
క్ష్యంబైన యట్టి మఖంబునందు
దీపింప నింద్రాది దేవతా కలిత రూ;
ప వ్యాజమునఁ బొంది పరఁగ నిన్ను
యజ్ఞస్వరూపుండ వని కాని కేవల;
నిర్గుణుండవు నిత్యనిర్మలుఁడవు

4-171.1-తేటగీతి

నరయ ననవద్యమూర్తివి యైన నీదు
లలిత తత్త్వస్వరూపంబుఁ దెలియఁజాల
మయ్య మాధవ! గోవింద! హరి! ముకుంద!
చిన్మయాకార! నిత్యలక్ష్మీవిహార!

4-172-వచనము

సదస్యు లిట్లనిరి.

4-173-సీస పద్యము

శోకదావాగ్ని శిఖాకులితంబు పృ;
థుక్లేశ ఘన దుర్గదుర్గమంబు
దండధరక్రూర కుండలిశ్లిష్టంబు;
పాపకర్మవ్యాఘ్ర పరివృతంబు
గురు సుఖ దుఃఖ కాకోలపూరిత గర్త;
మగుచు ననాశ్రయ మైన యట్టి
సంసార మార్గ సంచారులై మృగతృష్ణి;
కలఁ బోలు విషయ సంఘము నహమ్మ

4-173.1-తేటగీతి

మేతి హేతుక దేహ నికేతనములు
నయి మహాభారవహు లైన యట్టి మూఢ
జనము లేనాఁట మీ పదాబ్జములు గానఁ
జాలు వారలు? భక్తప్రసన్న! దేవ!

4-174-వచనము

రుద్రుం డిట్లనియె.

4-175-చంపకమాల

వరద! నిరీహ యోగిజన వర్గసు పూజిత! నీ పదాబ్జముల్
నిరతము నంతరంగమున నిల్పి భవత్పదనుగ్రహాదిక

స్ఫురణం దనర్చు నన్ను నతిమూఢుల విద్యలు మున్నమంగళా
వరణుం డటంచుం బల్కిన భవన్మతి నే గణియింప నచ్యుతా!

4-176-వచనము

భృగుం డిట్లనియె.

4-177-మత్తేభ విక్రీడితము

అరవిందోదర! తావకీన ఘన మాయామోహితస్వాంతులై
పరమంబైన భవన్మహామహిమముం బాటించి కానంగ నో
పరు బ్రహ్మాది శరీరు లజ్ఞులయి; యో పద్మాక్ష! భక్తార్తిసం
హరణాలోకన! నన్నుం గావందగు నిత్యానందసంధాయివై.

4-178-వచనము

బ్రహ్మ యిట్లనియె.

4-179-సీస పద్యము

తవిలి పదార్థభేదగ్రాహకము లైన;
 చక్షురింద్రియముల సరవిం జూడం
గలుగు నీ రూపంబు గడంగి మాయామయం;
 బగు; నసద్వ్యతిరిక్త మగుచు మఱియు
జ్ఞానార్థ కారణ సత్త్వాది గుణముల;
 కాశ్రయభూతమై యలరుచున్న
నిరుపమాకారంబు నీకు విలక్షణ;
 మై యుండు ననుచు నే నాత్మం దలంతు

4-179.1-తేటగీతి

నిర్వికార! నిరంజన! నిష్కళంక!
నిరతిశయ! నిష్క్రియారంభ! నిర్మలాత్మ!
విశ్వసంబోధ్య! నిరవద్య! వేదవేద్య!
ప్రవిమలానంద! సంసారభయవిదూర!

4-180-వచనము

ఇంద్రుఁ డిట్లనియె.

4-181-మత్తేభ విక్రీడితము

దితి సంతాన వినాశ సాధన సముద్దీప్తాష్ట బాహా సమ
న్వితమై యోగిమనోనురాగ పదమై పెల్గొందు నీ దేహ మా
యత మైనట్టి ప్రపంచముం బలెను మిథ్యాభూతముం గామి శా
శ్వతముంగా మదిలోఁ దలంతు హరి! దేవా! దైవచూడామణీ!

4-182-వచనము

ఋత్విక్కృతు్లి లిట్లనిరి.

4-183-చంపకమాల

కడఁగి భవత్పదార్చనకుఁ గా నిటు దక్షునిచే రచింపఁగాఁ
బడి శితికంఠరోషమున భస్మము నొంది పరేతభూమియై
చెడి కడు శాంతమేధమునఁ జెన్నఱియున్న మఖంబుఁ జూడు మే
ర్పడ జలజాభ నేత్రములఁ బావన మై విలసిల్లు నచ్యుతా!

4-184-వచనము

ఋషు లిట్లనిరి.

4-185-మత్తేభ విక్రీడితము

అనఘా! మాధవ! నీవు మావలెనె కర్మారంభివై యుండియున్
విను తత్కర్మ ఫలంబు నొంద; వితరుల్ విశ్వంబునన్ భూతికై
యనయంబున్ భజియించు నిందిర గరం బర్థిన్ నినుం జేరఁ గై
కొన; వే మందుము నీ చరిత్రమునకున్ గోవింద! పద్మోదరా!

4-186-వచనము

సిద్ధు లిట్లనిరి.

4-187-చంపకమాల

హరి! భవ దుఃఖ భీషణ దవానల దగ్ధతృషార్త మన్మనో
ద్విరదము శోభితంబును బవిత్రము నైన భవత్కథా సుధా
సరి దవగాహనంబునను సంసృతి తాపము వాసి క్రమ్మఱం
దిరుగదు బ్రహ్మముం గనిన ధీరుని భంగిఁ బయోరుహోదరా!

4-188-వచనము

యజమాని యగు ప్రసూతి యిట్లనియె.

4-189-చంపకమాల

కర చరణాదికాంగములు గల్గియు మస్తము లేని మొండెముం
బరువడి నొప్పకున్న గతిఁ బంకజలోచన! నీవు లేని య

ధ్వరము ప్రయాజులం గలిగి తద్దయు నొప్పక యున్న దీ యెడన్
హరి! యిటు నీదు రాక శుభ మయ్యె రమాధిప! మమ్ముఁ గావవే.

4-190-వచనము

లోకపాలకు లిట్లనిరి.

4-191-సీస పద్యము

దేవాదిదేవ! యీ దృశ్యరూపంబగు;
సుమహిత విశ్వంబుఁ జూచు ప్రత్య
గాత్మభూతుండ వై నట్టి నీవు నసత్ప్ర;
కాశ రూపంబులై గలుగు మామ
కేంద్రియంబులచేత నీశ్వర! నీ మాయ;
నొందించి పంచభూతోపలక్షి
తంబగు దేహ విధంబునఁ గానంగఁ;
బడుదువు గాని యేర్పడిన శుద్ధ

4-191.1-తేటగీతి

సత్త్వగుణ యుక్తమైన భాస్వత్స్వరూప
ధరుఁడవై కానఁబడవుగా? పరమపురుష!
యవ్యయానంద! గోవింద! యట్లు గాక
యెనయ మా జీవనము లింక నేమి కలవు?

4-192-వచనము

యోగీశ్వరు లిట్లనిరి.

4-193-సీస పద్యము

విశ్వాత్మ! నీ యందు వేఱుగా జీవులఁ;
గనఁ డెవ్వఁ; డటు వానికంటెఁ బ్రియుఁడు
నీకు లేఁ; డయినను నిఖిల విశ్వోద్భవ;
స్థితి విలయంబుల కతన దైవ
సంగతి నిర్భిన్న సత్త్వాది గుణవిశి;
ష్టాత్మీయ మాయచే నజ భవాది
వివిధ భేదము లొందుదువు స్వస్వరూపంబు;
నం దుండుదువు; వినిహత విమోహి

4-193.1-తేటగీతి

వగుచు నుందువు గద; ని న్ననన్యభక్తి
భృత్యభావంబుఁ దాల్చి సంప్రీతిఁ గొల్చు
మమ్ము రక్షింపవే; కృపామయ! రమేశ!
పుండరీకాక్ష! సంతతభువనరక్ష!

4-194-వచనము

శబ్దబ్రహ్మ యిట్లనియె.

4-195-చంపకమాల

హరి! భవదీయ తత్త్వము సమంచితభక్తి నెఱుంగ నేను నా
సరసిజ సంభవాదులును జాలము; సత్త్వగుణాశ్రయుండవున్

బరుఁడవు నిర్గుణుండవును బ్రహ్మముసై తగు నీకు నెప్డు నిం
దఱముఁ జతుర్విధార్థ ఫలదాయక! మ్రొక్కెద మాదరింపవే.

4-196-వచనము

అగ్నిదేవుం డిట్లనియె.

4-197-మత్తేభ విక్రీడితము

హవరక్షా చరణుండ వై నెగడు దీ; వయ్యగ్నిహోత్రాది పం
చవిధంబున్ మఱి మంత్రపంచక సుసృష్టంబై తగంబొల్చు నా
హవరూపం బగు నీకు మ్రొక్కెదను; నీ యాజ్ఞన్ భువిన్ హవ్యముల్
సవనవ్రాతములన్ వహింతు హరి! యుష్మత్తేజముం బూనుచున్.

4-198-వచనము

దేవత లిట్లనిరి.

4-199-మత్తేభ విక్రీడితము

మును కల్పాంతమునందుఁ గుక్షి నఖిలంబున్ దాఁచి యేకాకివై
జనలోకోపరి లోకవాసులును యుష్మత్తత్త్వమార్గంబు చిం
తనముం జేయఁ బయోధియందు నహిరాట్తల్పంబునం బవ్వళిం
చిన నీ రూపము నేఁడు చూపితివి లక్ష్మీనాథ! దేవోత్తమా!

4-200-వచనము

గంధర్వు లిట్లనిరి.

4-201-మత్తేభ విక్రీడితము

హార పంకేజభ వామరాదులు మరీచ్యాదిప్రజానాథు లో
యరవిందాక్ష! రమాహృదీశ! భవదీయాంశాంశ సంభూతులై
పరఁగం దావకలీలయై నెగడు నీ బ్రహ్మాండమున్; దేవ! యీ
శ్వర! నీ కే మతిభక్తి మ్రొక్కెదము దేవా! శ్రీశ! రక్షింపుమా.

4-202-వచనము

విద్యాధరు లిట్లనిరి.

4-203-సీస పద్యము

నళినాక్ష! విను; భవన్మాయా వశంబున;
దేహంబుఁ దాల్చి తద్దేహమందు
నాత్మ నహమ్మ మేత్యభిమానమును బొంది;
పుత్ర జాయా గృహ క్షేత్ర బంధు
ధన పశు ముఖ వస్తుతతుల సంయోగ వి;
యోగ దుఃఖంబుల నొందుచుండు
ధృతి విహీనుఁడు నసద్విషయాతిలాలసుఁ;
డతి దుష్టమతియు నై నట్టివాఁడు

4-203.1-తేటగీతి

దవిలి భవదీయ గుణ సత్కథా విలోలుఁ
డయ్యేనేనియు నాత్తమోహంబు వలనఁ
బాసి వర్తించు విజ్ఞానపరత గలిగి
చిరదయాకార! యిందిరాచిత్తచోర!

4-204-వచనము

బ్రాహ్మణజనంబు లిట్లనిరి "దేవా! యీ క్రతువును, హవ్యంబును, నగ్నియు, మంత్రంబులును, సమిద్దర్భాపాత్రంబులును, సదస్యులును, ఋత్విక్కులును, దంపతులును, దేవతలును, నగ్నిహోత్రంబులును, స్వధయు, సోమంబును, నాజ్యంబును, బశువును నీవ; నీవు దొల్లి వేదమయ సూకరాకారంబు ధరియించి దంష్ట్రాదండంబున వారణేంద్రంబు నళినంబు ధరియించు చందంబున రసాతలగత యైన భూమి నెత్తితివి; అట్టి యోగిజనస్తుత్యుండవును, యజ్ఞక్రతురూపకుండవును నైన నీవు పరిభ్రష్టకర్ములమై యాకాంక్షించు మాకుం బ్రసన్నుండ వగుము; భవదీయ నామకీర్తనంబుల సకల యజ్ఞ విఘ్నంబులు నాశంబునొందు; నట్టి నీకు నమస్కరింతుము."

4-205-కంద పద్యము

అని తన్ను సకల జనములు
వినుతించిన హరి భవుండు విఘ్నము గావిం
చిన యా దక్షుని యజ్ఞము
ఘనముగఁ జెల్లించెఁ గొఱఁత గాకుండంగన్.

4-206-కంద పద్యము

సకలాత్ముఁడు దా నగుటను
సకల హవిర్భోక్త యయ్యు జలజాక్షుండుం
బ్రకటస్వభాగమున న
య్యకళంకుఁడు తృప్తిఁ బొంది యనె దక్షునితోన్.

4-207-వచనము

“అనఘా! యేనును బ్రహ్మయు శివుండు నీ జగంబులకుఁ గారణభూతులము; అందు నీశ్వరుఁడును, నుపద్రష్టయు స్వయంప్రకాశుండు నైన నేను గుణమయం బయిన యాత్మీయ మాయం బ్రవేశించి జనన వృద్ధి విలయంబులకు హేతుభూతంబు లగు తత్తత్క్రియోచితంబు లయిన బ్రహ్మరుద్రాది నామధేయంబుల నొందుచుండు; దట్టి యద్వితీయ బ్రహ్మరూపకుండ నైన నా యందు నజ భవాదులను భూతగణంబులను మూఢుం డగువాడు వేఱుగాఁ జూచు; మనుజుండు శరీరంబునకుఁ గరచరణాదులు వేఱుగాఁ దలంపని చందంబున మద్భక్తుం డగువాఁడు నా యందు భూతజాలంబు భిన్నంబుగాఁ దలంపఁడు; కావున మా ముగ్గుర నెవ్వండు వేఱు చేయకుండు వాఁడు కృతార్థుండు” అని యానతిచ్చిన దక్షుండును.

4-208-కంద పద్యము

వి**ని** విష్ణు దేవతాకం
బనఁగాఁ ద్రికపాలకలిత మగు నా యాగం
బునఁ దగ నవ్విష్ణుని పద
వనజంబులు పూజ చేసి వారని భక్తిన్.

4-209-వచనము

మఱియును.

4-210-సీస పద్యము

అంగప్రధానక యాగంబులను జేసి;
యమరుల రుద్రుని నర్థిఁ బూజ
చేసి విశిష్టేష్ట శిష్టభాగమున ను;
దవసాన కర్మంబుఁ దవిలి తీర్చి
తాను బుత్త్విక్కులుఁ దగ సోమపులఁ గూడి;
యవభృథ స్నానంబు లాచరించి
కడఁక నవాప్త సకల ఫలకాముఁడై;
తనరు దక్షునిఁ జూచి ధర్మబుద్ధి

4-210.1-తేటగీతి

గలిగి సుఖవృత్తి జీవింతుఁగాక యనుచుఁ
బలికి దివిజులు మునులును బ్రాహ్మణులును
జనిరి నిజమందిరముల; కా జలజనయన
భవులు వేంచేసి రాత్మీయ భవనములకు.

4-211-వచనము

అంత దాక్షాయణి యయిన సతీదేవి పూర్వకళేబరంబు విడిచి హిమవంతునకు మేనక యందు జనియించి విలయకాలంబునం బ్రసుప్తం బయిన శక్తి సృష్టికాలంబున నీశ్వరునిఁ బొందు చందంబునఁ బూర్వదయితుండగు రుద్రుని వరించె నని దక్షాధ్వర ధ్వంసకుం డగు రుద్రుని చరిత్రంబు బృహస్పతి శిష్యుండైన యుద్ధవునకు నెఱింగించె; అతండు నాకుం జెప్పె; నేను నీకుం జెప్పితి;" అని మైత్రేయుండు వెండియు విదురున కిట్లనియె.

4-212-కంద పద్యము

ఈ యాఖ్యానముఁ జదివిన
ధీయుతులకు వినినయట్టి ధీరుల కైశ్వ
ర్యాయుః కీర్తులు గలుగును;
బాయును దురితములు; దొలఁగు భవబంధంబుల్.

4-213-వచనము

అని వెండియు నిట్లనియె.

4-214-కంద పద్యము

విను సనకాదులు నారదుఁ
డును హంసుఁడు నరుణియు ఋభుఁడు యతియుఁ గమలా
సనజులు నైష్టికు లనికే
తను లగుటన్ సొగవయ్యెఁ దద్వంశంబుల్.

4-215-వచనము

మఱియు నధర్మునకు 'మృష' యను భార్య యందు 'దంభుండు'ను, 'మాయ' యను నంగనయుం బుట్టిరి; అధర్మ సంతానం బగుట వారిరువురును మిథునం బైరి; వారిని సంతాన హీనుండగు నిర్ఋతి గైకొనియె; వారలకు 'లోభుండును' 'నికృతి' యను సతియునుం గలిగి మిథునం బైరి; ఆ మిథునంబునకుఁ 'క్రోధుండు' 'హింస' యను నంగనయుం బుట్టి మిథునం బైరి; ఆ మిథునంబునకుఁ 'గలి'యు 'దురుక్తి' యను నతివయుం జన్మించి దాంపత్యంబు గయికొనిరి; ఆ

దంపతులకు 'భయ' 'మృత్యువు' లను మిథునంబు గలిగె; దాని వలన 'యాతన'యు 'నిరయంబు'ను బుట్టిరి; వీరలు సంసార హేతువగు నధర్మ తరుశాఖ లయి నెగడిరి; వీని శ్రేయస్కాముండగు జనుం డీషణ్మాత్రంబు ననువర్తింపం జనదు; ఇవ్విధంబునం బ్రతిసర్గంబును సంగ్రహంబున వినిపించితి; ఇప్పుణ్యకథ నెవ్వండేని ముమ్మాఱు వినిన నతండు ముమ్మాటికి నిష్పాపుం డగును;" అని చెప్పి; మఱియు నిట్లనియె.

## 4-10-ధృవోపాఖ్యానము

4-216-కంద పద్యము

విను నిఖిలభువన పరిపా
లనమునకై చంద్రధరకళా కలితుండై
వనజజునకు స్వాయంభువ
మను వపు డుదయించెఁ గీర్తిమంతుం డగుచున్.

4-217-తేటగీతి

రూఢి నమ్మనునకు శతరూపవలన
భూనుతు లగు ప్రియవ్రతోత్తానపాదు
లనఁగ నిద్దఱు పుత్రులై రందులోనఁ
భవ్య చారిత్రుఁ డుత్తానపాదునకును.

4-218-కంద పద్యము

వినుము సునీతియు సురుచియు
నను భార్యలు గలరు; వారి యందును ధ్రువునిం

గనిన సునీతియు నప్రియ
యును, సురుచియుఁ బ్రియయు నగుచు నున్నట్టి యెడన్.

4-219-సీస పద్యము

ఒకనాఁడు సుఖలీల నుత్తానపాదుండు;
నెఱిఁ బ్రియురాలైన సురుచి గన్న
కొడుకు నుత్తముఁ దన తొడలపై నిడుకొని;
యుపలాలనము చేయుచున్న వేళ
నర్థిఁ దదారోహణాపేక్షితుం డైన;
ధ్రువునిఁ గనుంగొని తివక నాద
రింపకుండుటకు గర్వించి యా సురుచియు;
సవతి బిడ్డం డైన ధ్రువునిఁ జూచి

4-219.1-తేటగీతి

తండ్రి తొడ నెక్క వేడుక దగిలెనేనిఁ
బూని నా గర్భమున నాఁడె పుట్ట కన్య
గర్భమునఁ బుట్టి కోరినఁ గలదె నేఁడు
జనకు తొడ నెక్క భాగ్యంబు సవతి కొడుక!

4-220-కంద పద్యము

అదిగాన నీ వధోక్షజ
పదపద్మము లాశ్రయింపు; పాయక హరి నా

యుదరమునఁ బుట్టఁ జేయును,
వదలక యట్లయిన ముదము వఱలెడి నీకున్.

4-221-కంద పద్యము

అని యీ రీతి నసహ్యావ
చనములు పినతల్లి యపుడు జనకుఁడు వినగాఁ
దను నాడిన దుర్భాషా
ఘనశరములు మనము నాఁటి కాఁకయుపెట్టన్.

4-222-కంద పద్యము

తను నట్లుపేక్ష చేసిన
జనకునికడఁ బాసి దుఃఖ జలనిధిలోనన్
మునుఁగుచును దండతాడిత
ఘనభుజగముఁబోలె రోషకలితుం డగుచున్,

4-223-కంద పద్యము

ఘన రోదనంబు చేయుచుఁ
గనుఁగవలను శోకభాష్ప కణములు దొరఁగన్
జనని కడ కేగుటయు నిజ
తనయునిఁ గని యా సునీతి దద్దయుఁ బ్రేమన్.

4-224-వచనము

తొడలపై నిడుకొని.

4-225-కంద పద్యము

కర మనురక్తిని మోము ని
విరి తద్వృత్తాంత మెల్ల వెలఁదులు నంతః
పురవాసులుఁ జెప్పిన విని
పఱపుగ నిట్టూర్పు లెసఁగ భాష్పాకుల యై.

4-226-తేటగీతి

సవతి యాడిన మాటలు సారెఁ దలఁచి
కొనుచుఁ బేర్చిన దుఃఖాగ్నిఁ గుందుచుండెఁ
దావపావక శిఖలచేఁ దగిలి కాంతి
వితతిఁ గందిన మాధవీలతికబోలె.

4-227-వచనము

అంత నా సునీతి బాలునిం జూచి "తండ్రీ! దుఃఖింపకు" మని యిట్లనియె.

4-228-కంద పద్యము

అనఘా! యీ దుఃఖమునకుఁ
బనిలే దన్యులకు నొలయ బలవంతంబై
తన పూర్వ జన్మ దుష్కృత
ఘనకర్మము వెంటనంటఁగా నెవ్వలనన్.

4-229-వచనము

కావున.

4-230-కంద పద్యము

పెనిమిటి చేతను బెండ్లా
మని కాదు నికృష్టదాసి యనియును బిలువం
గను జాలని దుర్భగురా
లనఁగల నా కుక్షి నుదయ మందిన కతనన్.

4-231-కంద పద్యము

నిను నాడిన యా సురుచి వ
చనములు సత్యంబు లగును; సర్వశరణ్యుం
డనఁగల హరిచరణంబులు
గను జనకుని యంక మెక్కఁగాఁ దలఁతేనిన్.

4-232-వచనము

కావునం బినతల్లి యైన యా సురుచి యాదేశంబున నధోక్షజు
నాశ్రయింపుము" అని పెండియు నిట్లనియె.

4-233-సీస పద్యము

పరికింప నీ విశ్వపరిపాలనమునకై;
యర్థి గుణవ్యక్తుఁ డైనయట్టి
నారాయణుని పాదనళినముల్ సేవించి;
తగ బ్రహ్మ బ్రహ్మపదంబు నొందె;
ఘనుఁడు మీ తాత యా మనువు సర్వాంతర;
యామిత్వ మగు నేకమైన దృష్టిఁ

జేసి యాగముల యజించి తా భౌమ సు;
ఖములను దివ్యసుఖముల మోక్ష

4-233.1-తేటగీతి

సుఖములను బొందె నట్టి యచ్చ్యుతునిఁ బరుని
వితత యోగీంద్ర నికర గవేష్యమాణ
చరణ సరసిజ యుగళు శశ్వత్ప్రకాశు
భక్తవత్సలు విశ్వసంపాద్యు హరిని.

4-234-వచనము

మఱియును.

4-235-కంద పద్యము

కరతల గృహీత లీలాం
బురుహ యగుచుఁ బద్మగర్భముఖ గీర్వాణుల్
పరికింపం గల లక్ష్మీ
తరుణీమణిచేత వెదకఁ దగు పరమేశున్.

## 4-11-ధృవుండు తపంబు చేయుట

4-236-వచనము

నిజధర్మపరిశోభితంబైన యేకాగ్రచిత్తంబున నిలిపి సేవింపుము;
అమ్మహాత్ముని కంటె నీ దుఃఖం బపనయించువాఁ డన్యుం డొక్కరుండు
గలండే?" యని పలికినఁ బరమార్థ ప్రాప్తి హేతుకంబులైన

తల్లివాక్యంబులు విని తన్నుఁ దాన నియమించుకొని పురంబు వెడలి చను నవసరంబున నారదుండు తద్వృత్తాంతంబెఱింగి, యచ్చటికిం జనుదెంచి, యతని చికీర్షితంబు దెలిసి, పాపనాశకరం బైన తన కరతలంబు నా ధ్రువుని శిరంబునం బెట్టి "మానభంగంబునకు సహింపని క్షత్రియుల ప్రభావం బద్భుతంబు గదా? బాలకుం డయ్యుఁ బినతల్లి యాడిన దురు క్తులు చిత్తంబునం బెట్టి చనుచున్నవాఁ" డని మనంబున నాశ్చర్యంబు నొంది "యో బాలక! సకల సంపత్సమృద్ధం బగు మందిరంబు దెగడి యొంటి నెందు నేగెదవు? స్వజన కృతం బగు నవమానంబుచే నిను సంతప్తుంగాఁ దలంచెద" ననిన ధ్రువుం డిట్లనియె; "సపత్నీమాతృ వాగిషుక్షతం బగు వ్రణంబు భగవద్ధ్యానయోగ రసాయనంబున మాపి కొందు" ననిన విని ధ్రువునికి నారదుం డిట్లనియె.

4-237-కంద పద్యము

విను పుత్రక! బాలుఁడవై
యునయంబును గ్రీడలందు నాసక్తమనం
బునఁ దిరిగెడు నిక్కాలం
బున నీ కవమానమానములు లే వెందున్.

4-238-తేటగీతి

కాన మనమునఁ దద్వివేకంబు నీకుఁ
గలిగెనేనియు సంతోషకలితు లయిన

పురుషు లాత్మీయకర్మ విస్ఫురణఁ జేసి
వితత సుఖదుఃఖము లనుభవింతు రెపుడు.

4-239-వచనము

కావున వివేకంబు గల పురుషుండు దనకుం బ్రాప్తంబు లగు సుఖ దుఃఖంబులు దైవవశంబులుగాఁ దలంచి తావన్మాత్రంబునం బరితుష్టుం డగు; నీవును దల్లి చెప్పిన యోగమార్గ ప్రకారంబున సర్వేశ్వరానుగ్రహంబుఁ బొందెద నంటివేని.

4-240-సీస పద్యము

అనఘాత్మ! యోగీంద్రు లనయంబు ధరఁ బెక్కు;
 జన్మంబులందు నిస్సంగమైన
మతినిఁ బ్రయోగ సమాధినిష్ఠలఁ జేసి;
 యైనను దెలియ లే రతని మార్గ;
మది గాన నతఁడు దురారాధ్యుఁ డగు నీకు;
 నుడుగుము నిష్ఫలోద్యోగ మిపుడు
గాక నిశ్శ్రేయస కాముఁడ వగుదేనిఁ;
 దండ్రి! వర్తించు తత్కాలమందుఁ

4-240.1-తేటగీతి

బూని సుఖదుఃఖములు రెంటిలోన నెద్ది
దైవవశమునఁ జేకుఱు దానఁ జేసి

డెందమునఁ జాల సంతుష్టి నొందువాఁడు
విమలవిజ్ఞాని యన భువి వెలయుచుండు.

4-241-వచనము

మఱియు గుణాఢ్యుం డగువానిం జూచి సంతోషించుచు నాభాసుం డగు వానిం జూచి కరుణించుచు సమానుని యెడ మైత్రి సలుపుచు వర్తించు చున్నవాఁడు తాపత్రయాదికంబులం దొఱంగు" నని నారదుండు పలికిన విని ధ్రువుం డిట్లనియె; "అనఘా యీ శమంబు సుఖదుఃఖ హతాత్ము లగు పురుషులకు దుర్గమం బని కృపాయత్తుండవైన నీ చేత వినంబడె; అట్లయినం బరభయంకరం బగు క్షాత్త్ర ధర్మంబు నొందిన యవినీతుండనగు నేను సురుచి దురుక్తులను బాణంబుల వలన వినిర్భిన్నహృదయుండ నగుట మదీయచిత్తంబున శాంతి నిలువదు; కావునం ద్రిభువనోత్కృష్టంబు ననన్యాధిష్ఠితంబు నగు పదంబును బొంద నిశ్చయించిన నాకు సాధుమార్గంబు నెఱింగింపుము; నీవు భగవంతుం డగు నజుని యూరువు వలన జనించి వీణావాదన కుశలుండవై జగద్ధితార్థంబు సూర్యుండునుం బోలె వర్తింతువు;" అనిన విని.

4-242-కంద పద్యము

నారదుఁ డిట్లను ననఘ! కు
మారక! విను నిన్ను మోక్షమార్గంబునకున్
బ్రేరేచినవాఁ డిప్పుడు
ధీరజనోత్తముఁడు వాసుదేవుం డగుటన్.

4-243-వచనము

నీవు నమ్మహాత్ముని నజస్రధ్యాన ప్రవణ చిత్తుండవై భజియింపుము.

4-244-కంద పద్యము

పురుషుఁడు దవిలి చతుర్విధ
పురుషార్థశ్రేయ మాత్మఁ బొందెద ననినన్
ధరఁ దత్ప్రాప్తికి హేతువు
హరిపదయుగళంబు దక్క నన్యము గలదే?

4-245-వచనము

కావున.

4-246-కంద పద్యము

వర యమునానదితటమునఁ
హరి సాన్నిధ్యంబు శుచియు నతిపుణ్యమునై
పరఁగిన మధువనమునకును
సరసగుణా! చనుము మేలు సమకుఱు నచటన్.

4-247-కంద పద్యము

ఆ యమునా తటినీ శుభ
తోయములం గ్రుంకి నిష్ఠతో నచ్చట నా
రాయణునకును నమస్కృతు
లాయతమతిఁ జేసి చేయు యమనియమములన్.

4-248-వచనము

మఱియు బాలుండ వగుటం జేసి వేదాధ్యయనా ద్యుచిత కర్మానర్హుండ వయ్యు నుచితంబులగు కుశాజినంబులం జేసి స్వస్తిక ప్రముఖాసనంబులం గల్పించుకొని త్రివృత్ప్రాణాయామంబులచేతం బ్రాణేంద్రియ మనోమలంబులను చాంచల్య దోషంబులఁ బ్రత్యాహరించి స్థిరం బయిన చిత్తంబున.

4-249-సీస పద్యము

ఆశ్రిత సత్ప్రసాదాభి ముఖుండును;
స్నిగ్ధప్రసన్నా ననేక్షణుండు
సురుచిర నాసుండు సుభ్రూయుగుండును;
సుకపోల తలుఁడును సుందరుండు
హారినీల సంశోభితాంగుండుఁ దరుణుండు;
నరుణావలోక నోష్ఠాధరుండుఁ
గరుణాసముద్రుండుఁ బురుషార్థ నిధియును;
బ్రణతాశ్రయుండు శోభనకరుండు

4-249.1-తేటగీతి

లలిత శ్రీవత్సలక్షణ లక్షితుండు
సర్వలోక శరణ్యుండు సర్వసాక్షి
పురుష లక్షణ యుక్తుండుఁ బుణ్యశాలి
యసిత మేఘనిభశ్యాముఁ డవ్యయుండు.

4-250-వచనము

మఱియును.

4-251-సీస పద్యము

హార కిరీట కేయూర కంకణ ఘన;
 భూషణుం డాశ్రిత పోషణుండు
లాలిత కాంచీకలాప శోభిత కటి;
 మండలుం డంచిత కుండలుండు
మహనీయ కౌస్తుభమణి ఘృణిచారు గ్రై;
 వేయకుం డానంద దాయకుండు
సలలిత ఘన శంఖ చక్ర గదా పద్మ;
 హస్తుండు భువన ప్రశస్తుఁ డజుఁడు

4-251.1-తేటగీతి

కమ్ర సౌరభ వనమాలికా ధరుండు
హతవిమోహుండు నవ్యపీతాంబరుండు
లలిత కాంచన నూపురాలంకృతుండు
నిరతిశయసద్గుణుఁడు దర్శనీయతముఁడు.

4-252-కంద పద్యము

సరసమనోలోచన ము
త్కరుఁడును హృత్పద్మ కర్ణికా నివసిత వి

స్ఫుర దురునఖ మణిశోభిత
చరణ సరోజాతుఁ డతుల శాంతుఁడు ఘనుఁడున్.

4-253-వచనము

అయిన పురుషోత్తముఁ బూజించుచు హృదయగతుండును, సాను రాగవిలోకనుండును, వరదశ్రేష్ఠుండును నగు నారాయణు నేకాగ్రచిత్తంబునం ధ్యానంబు చేయుచు బరమ నివృత్తి మార్గంబున ధ్యాతుండైన పురుషోత్తముని దివ్యమంగళస్వరూపంబు చిత్తంబునం దగిలిన మరల మగుడ నేరదు; అదియునుం గాక, యే మంత్రంబేని సప్త వాసరంబులు పఠియించిన ఖేచరులం గనుంగొను సామర్థ్యంబు గలుగు; అట్టి ప్రణవయుక్తం బగు ద్వాదశాక్షర కలితంబును దేశకాల విభాగ వేది బుధానుష్ఠితంబును నయిన 'ఓం నమో భగవతే వాసుదేవాయ' యనెడి వాసుదేవ మంత్రంబునం జేసి.

4-254-సీస పద్యము

దూర్వాంకురంబుల దూర్వాంకురశ్యాము;
జలజంబులను జారుజలజనయనుఁ
దులసీ దళంబులఁ దులసికా దాముని;
మూల్యంబులను సునైర్మల్య చరితుఁ
బత్రంబులను బక్షిపత్రుని, గడు వన్య;
మూలంబులను నాది మూలఘనుని
నంచిత భూర్జత్వగాది నిర్మిత వివి;
దాంబరంబులను పీతాంబరధరుఁ

4-254.1-తేటగీతి

దనరు భక్తిని మృచ్ఛిలాదారు రచిత
రూపముల యందుఁ గాని నిరూఢమైన
సలిలముల యందుఁ గాని సుస్థలము లందుఁ
గాని పూజింపవలయు నక్కమలనాభు.

4-255-కంద పద్యము

ధృత చిత్తుఁడు శాంతుండు ని
యత పరిభాషణుఁడు సుమహితాచారుఁడు వ
ర్ణిత హరిమంగళ గుణుఁడును
మితవన్యాశనుఁడు నగుచు మెలఁగఁగ వలయున్.

4-256-వచనము

ఉత్తమశ్లోకుండగు పుండరీకాక్షుండు నిజమాయా స్వేచ్ఛావతార
చరితంబుల చేత నంచింత్యముగా నెద్దిచేయు నద్ది హృదయగతంబుగా
ధ్యానంబు చేయం దగు; మఱియుఁ గార్యబుద్ధిం జేసి చేయంబడు
పూజావిశేషంబులు వాసుదేవమంత్రంబున సర్వేశ్వరునికి సమర్పింప
వలయు; ఇట్లు మనోవాక్కాయ కర్మంబులచేత మనోగతం బగునట్లుగా
భక్తి యుక్తంబు లయిన పూజల చేతఁ బూజింపం బడి, సర్వేశ్వరుండు
మాయాభిభూతులు గాక సేవించు పురుషులకు ధర్మాది
పురుషార్థంబులలో నభిమతార్థంబు నిచ్చు; విరక్తుం డగువాఁడు
నిరంతర భావం బయిన భక్తియోగంబునం జేసి మోక్షంబుకొఱకు
భజియించు" నని చెప్పిన విని ధ్రువుండు నారదునకుం బ్రదక్షిణ

పూర్వకంబుగా నమస్కరించి మహర్షి జనసేవ్యంబై సకలసిద్ధుల నొసంగుచు భగవత్పాద సరోజాలంకృతం బయిన మధువనంబునకుం జనియె; అంత.

4-257-తేటగీతి

పద్మభవ సూనుఁ డుత్తానపాదు కడకు
నరిగి యా రాజుచే వివిధార్చనముల
నంది సంప్రీతుఁడై యున్నతాసనమున
నెలమిఁ గూర్చుండి యాతని వలను చూచి.

4-258-వచనము

ఇట్లనియె.

4-259-కంద పద్యము

" భూనాయక! నీ విపుడా
మ్లానాస్యుఁడ వగుచుఁజాల మదిలోఁ జింతం
బూనుట కేమి కతం? బన
నా నారదుతోడ నాతఁ డనియెన్ మరలన్.

4-260-కంద పద్యము

మునివర! వివేకశాలియు
ననఘుఁడు నైదేండ్ల బాలుఁ డస్మత్ప్రియ నం
దనుఁ డదయుఁడ నగు నాచే
తను బరిభవ మొంది చనియెఁ దల్లియుఁ దానున్.

4-261-మత్తేభ విక్రీడితము

చని యుగ్రాటవిఁ జొచ్చి యచ్చటఁ బరిశ్రాంతుండు క్షుత్పీడితుం
డును నామ్లాన ముఖాంబుజుండు ననఘుండున్ బాలకుం డైన మ
త్తనయున్ ఘోర వృ కాహి భల్ల ముఖ సత్త్వశ్రేణి నిర్జించెనో
యని దుఃఖించెద నాదు చిత్తమున నార్యస్తుత్య! యిట్లౌటకున్.

4-262-తేటగీతి

అట్టి యుత్తమబాలు నా యంకపీఠ
మందుఁ గూర్చుండనీక నిరాకరించి
యంగనాసక్త చిత్తుండ నైనయట్టి
నాదు దౌరాత్మ్య మిది మునినాథచంద్ర!"

4-263-ఉత్పలమాల

నా విని నారదుండు నరనాథున కిట్లను "నీ కుమారుఁ డా
దేవకిరీట రత్న రుచిదీపిత పాదసరోజుఁడైన రా
జీవదళాక్ష రక్షితుఁ డశేష జగత్పరికీర్తనీయ కీ
ర్తీవిభవప్రశస్త సుచరిత్రుఁడు; వానికి దుఃఖ మేటికిన్?

4-264-ఉత్పలమాల

కావున నమ్మహాత్ముఁడు సుకర్మము చేత సమస్త లోకపా
లావళి కందరాని సముదంచిత నిత్యపదంబునం బ్రభు
శ్రీ విలసిల్లఁ జెందుఁ దులసీదళదాము భజించి; యా జగ
త్పావనుఁడైన నీ సుతు ప్రభావ మెఱుంగవు నీవు భూవరా!

4-265-వచనము

అదియునుం గాక.

4-266-కంద పద్యము

నీ కీర్తియు జగముల యం
దాకల్పము నొందఁజేయు నంచిత గుణర
త్నాకరుఁ డిట కేతెంచును
శోకింపకు మతనిఁ గూర్చి సుభగచరిత్రా!"

4-267-కంద పద్యము

అని నారదుండు పలికిన
విని మనమున విశ్వసించి విభుఁడును బ్రియ నం
దనుఁ జింతించుచు నాదర
మునఁ జూడం డయ్యె రాజ్యమును బూజ్యముగన్.

4-268-వచనము

అంత నక్కడ నా ధ్రువుండు.

4-269-కంద పద్యము

చని ముందటఁ గనుఁగొనె మధు
వనమును ముని దేవ యోగి వర్ణిత గుణ పా
వనమును దుర్భవ జలద ప
వనమును నిఖిలైక పుణ్యవరభవనంబున్.

4-270-వచనము

అట్లు గని డాయంజని యమునానదిం గృతస్నానుండై నియతుండును, సమాహిత చిత్తుండును నై సర్వేశ్వరుని ధ్యానంబు చేయుచుం బ్రతిత్రిరాత్రాంతంబునఁ గృత కపిత్థ బదరీఫల పారణుం డగుచు దేహ స్థితి ననుసరించి యిటుల నొక్కమాసంబు హరిం బూజించి, యంత నుండి యాఱేసి దినంబుల కొక్కపరి కృతజీర్ణ తృణ పర్ణాహారుం డగుచు, రెండవ మాసంబున విష్ణుసమారాధనంబు చేసి, యంత నుండి నవరాత్రంబుల కొకమా ఱుదకభక్షణంబు చేయుచు, మూఁడవ మాసంబున మాధవు నర్చించి, యంతనుండి ద్వాదశ దినంబుల కొకమాఱు వాయుభక్షణం డగుచు, జితశ్వాసుండై నాలవ మాసంబునం, బుండరీకాక్షుని భజియించి, యంతనుండి మనంబున నలయక నిరుచ్ఛ్వాసుండై యేకపదంబున నిలిచి, పరమాత్మఁ జింతించుచు, నచేతనంబైన స్థాణువుంబోలె నైదవ మాసంబును జరిపె; అంత.

4-271-సీస పద్యము

సకల భూతేంద్రి యాశ్రయ మగు హృదయంబు;
 నందు విషయములఁ జెందనీక
మహదాది తత్త్వ సమాజమ్ములకును నా;
 ధార భూతమును బ్రధాన పూరు
షేశ్వరుఁ డైనట్టి శాశ్వత బ్రహ్మంబుఁ;
 దనదైన హృదయ పద్మమున నిలిపి

హరి రూపమున కంటె నన్యంబు నెఱుఁగక;
చిత్త మవ్విభునందుఁ జేర్చియున్న

4-271.1-తేటగీతి

కతన ముల్లోకములు చాలఁ గంపమొందె;
వెండియును బేర్చి యయ్యర్భకుండు ధరణి
నొక్కపాదంబు చేర్చి నిల్చున్నవేళఁ
బేర్చి యబ్బాలు నంగుష్ఠపీడఁ జేసి.

4-272-తేటగీతి

వసుమతీతల మర్ధము వంగఁ జొచ్చె
భూరిమద దుర్నివారణ వారణేంద్ర
మెడమఁ గుడి నొరగఁగ నడు గడుగునకును
జలన మొందు ఉదస్థిత కలము వోలె.

4-273-చంపకమాల

అతఁడు నన్యదృష్టిని జరాచర దేహిశరీర ధారణా
స్థితి గల యీశునందుఁ దన జీవితమున్ ఘటియింపఁ జేసి యే
కతఁ గనఁ దన్నిరోధమునఁ గైకొని కంపము నొందె నీశ్వరుం;
డతఁడు చలింప నిజ్జగము లన్నియుఁ జంచల మయ్యె భూవరా!

4-274-కంద పద్యము

ఆలోకభయంకర మగు
నా లోకమహావిపద్దశాలోకనులై

నా **లో**కపాలు రందఱు
నా **లో**కశరణ్యుఁ గాన నరిగిరి భీతిన్.

4-275-వచనము

అట్లరిగి నారాయణు నుద్దేశించి కృతప్రణాములై కరంబులు ముకుళించి యిట్లనిరి.

4-276-చంపకమాల

" హ**రి!** పరమాత్మ! కేశవ! చరాచర భూతశరీర ధారివై
ప**రఁ**గుదు వీవు; నిట్టులుగఁ బ్రాణనిరోధ మెఱుంగ మెందు ముం
ది**ర**వుగ దేవదేవ! జగదీశ్వర! సర్వశరణ్య! నీ పదాం
బు**రు**హము లర్థిమై శరణు బొందెద మార్తి హరించి కావవే!"

4-277-వచనము

అని దేవతలు విన్నవించిన నీశ్వరుండు వారల కిట్లనియె "ఉత్తానపాదుం డనువాని తనయుండు విశ్వరూపుండ నయిన నా యందుఁ దన చిత్తం బైక్యంబు చేసి తపంబు గావించుచుండ, దానంజేసి భవదీయ ప్రాణనిరోధం బయ్యెఁ; అట్టి దురత్యయం బైన తపంబు నివర్తింపఁ జేసెద: వెఱవక మీమీ నివాసంబులకుం జనుం" డని యానతిచ్చిన నా దేవతలు నిర్భయాత్ములై యీశ్వరునకుఁ బ్రణామంబు లాచరించి త్రివిష్టపంబునకుం జనిరి; తదనంతరంబ.

4-278-సీస పద్యము

హరి యీశ్వరుండు విహంగ కులేశ్వర;
యానుఁడై నిజభృత్యుఁడైన ధ్రువునిఁ
గనుఁగొను వేఁడుక జనియింప నా మధు;
వనమున కప్పుడు చని ధ్రువుండు
పరువడి యోగవిపాక తీవ్రంబైన;
బుద్ధిచే నిజమనోంబురుహ ముకుళ
మందుఁ దటిత్ప్రభాయత మూర్తి యటఁ దిరో;
ధానంబునను బొంది తత్క్షణంబ

4-278.1-తేటగీతి

తన పురోభాగమందు నిల్చినను బూర్వ
సమధికజ్ఞాన నయన గోచర సమగ్ర
మూర్తిఁ గనుఁగొని సంభ్రమమునను సమ్మ
దాశ్రువులు రాలఁ బులకీకృతాంగుఁ డగుచు

4-279-తేటగీతి

నయనముల విభుమూర్తిఁ బానంబు చేయు
పగిదిఁ దన ముఖమునను జుంబనము చేయు
లీలఁ దగ భుజములను నాలింగనంబు
చేయుగతి దండవన్నమస్కృతు లొనర్చె.

4-280-వచనము

ఇట్లు దండప్రణామంబు లాచరించి కృతాంజలి యై స్తోత్రంబు చేయ నిశ్చయించియు స్తుతిక్రియాకరణ సమర్థుండుఁ గాక యున్న ధ్రువునకును సమస్త భూతంబులకు నంతర్యామి యైన యీశ్వరుం డాతని తలంపెఱింగి వేదమయం బయిన తన శంఖంబు చేత నబ్బాలుని కపోలతలం బంటిన జీవేశ్వర నిర్ణయజ్ఞుండును, భక్తిభావ నిష్ఠుండును నగు ధ్రువుండు నిఖిలలోక విఖ్యాత కీర్తిగల యీశ్వరుని భగవత్ప్రతిపాదితంబు లగుచు వేదాత్మకంబులైన తన వాక్కుల నిట్లని స్తుతియించె “దేవా! నిఖిలశక్తి ధరుండవు నంతఃప్రవిష్టుండవు నైన నీవు లీనంబు లైన మదీయ వాక్యంబులం బ్రాణేంద్రియంబులం గరచరణ శ్రవణత్వ గాదులను జిచ్ఛక్తిచేఁ గృపంజేసి జీవింపం జేసిన భగవంతుం డవును, బరమపురుషుండవును నైన నీకు నమస్కరింతు; నీ వొక్కరుండవయ్యు మహదాద్యంబైన యీ యశేష విశ్వంబు మాయాఖ్యం బయిన యా త్మీయశక్తిచేతం గల్పించి యందుం బ్రవేశించి యింద్రియంబు లందు వసించుచుఁ దత్తద్దేవతారూపంబులచే నానా ప్రకారంబుల దారువు లందున్న వహ్ని చందంబునం బ్రకాశింతువు; అదియునుం గాక.

4-281-చంపకమాల

వరమతి నార్తబాంధవ! భవద్ఘన బోధసమేతుఁడై భవ
చ్ఛరణముఁ బొంది నట్టి విధి సర్గము సుప్తజనుండు బోధమం
దరయఁగఁ జూచురీతిఁ గనునట్టి ముముక్షు శరణ్యమైన నీ
చరణములం గృతజ్ఞుఁడగు సజ్జనుఁ డెట్లు దలంపకుండెడున్?

4-282-సీస పద్యము

మహితాత్మ! మఱి జన్మమరణ ప్రణాశన;
హేతు భూతుండవు నిద్ధకల్ప
తరువవు నగు నిన్నుఁ దగసెవ్వరే నేమి;
పూని నీ మాయా విమోహితాత్ము
లగుచు ధర్మార్థ కామాదుల కొఱకుఁ దా;
మర్చించుచును ద్రిగుణాభమైన
దేహోపభోగ్యమై దీపించు సుఖముల;
నెనయంగ మదిలోన నెంతు; రట్టి

4-282.1-తేటగీతి

విషయ సంబంధ జన్యమై వెలయు సుఖము
వారికి నిరయమందును వఱలు దేవ!
భూరి సంసార తాప నివార గుణ క
థామృతాపూర్ణ! యీశ! మాధవ! ముకుంద!

4-283-మత్తేభ విక్రీడితము

అరవిందోదర! తావకీన చరణధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణనజాత భూరిసుఖముల్ స్వానందకబ్రహ్మ మం
దరయన్ లేవఁట; దండ భృద్భట విమానాకీర్ణులై కూలు నా
సురలోకస్థులఁ జెప్పనేల? సుజనస్తోమైక చింతామణీ!

4-284-చంపకమాల

హరి! భజనీయ మార్గనియతాత్మకులై భవదీయ మూర్తిపై
వఱలిన భక్తియుక్తు లగువారల సంగతిఁ గల్గఁజేయు స
త్పురుష సుసంగతిన్ వ్యసనదుస్తర సాగర మప్రయత్నతన్
సరస భవత్కథామృత రసంబున మత్తుఁడనై తరించెదన్.

4-285-చంపకమాల

నిరతముఁ దావకీన భజనీయ పదాబ్జ సుగంధలబ్ధి నె
వ్వరి మది వొందఁగాఁ గలుగు, వారలు తత్ప్రియ మర్త్యదేహముం
గరము తదీయ దార సుత కామ సుహృద్గృహ బంధు వర్గమున్
మఱతురు విశ్వతోముఖ! రమాహృదయేశ! ముకుంద! మాధవా!

4-286-సీస పద్యము

పరమాత్మ! మర్త్య సుపర్వ తిర్యఙ్మృగ;
దితిజ సరీసృప ద్విజగణాది
సంవ్యాప్తమును సదసద్విశేషంబును;
గైకొని మహదాది కారణంబు
నైన విరాడ్విగ్రహంబు నే నెఱుఁగుదుఁ;
గాని తక్కిన సుమంగళమునైన
సంతత సుమహితైశ్వర్య రూపంబును;
భూరిశబ్దాది వ్యాపార శూన్య

4-286.1-తేటగీతి

మైన బ్రహ్మస్వరూప మే నాత్మ నెఱుఁగఁ
బ్రవిమలాకార! సంసార భయవిదూర!
పరమ మునిగేయ! సంతత భాగధేయ!
నళిన నేత్ర! రమా లలనా కళత్ర!

4-287-సీస పద్యము

సర్వేశ! కల్పాంత సమయంబు నందు నీ;
యఖిల ప్రపంచంబు నాహరించి
యనయంబు శేషసహాయుండవై శేష;
పర్యంక తలమునఁ బవ్వళించి
యోగనిద్రా రతి నుండి నాభీసింధు;
జస్వర్ణలోక కంజాత గర్భ
మందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు;
రుచి నొప్పు బ్రహ్మస్వరూపి వైన

4-287.1-తేటగీతి

నీకు మ్రొక్కెద నత్యంత నియమ మొప్ప
భవ్యచారిత్ర! పంకజపత్రనేత్ర!
చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార!
యవ్యయానంద! గోవింద! హరి! ముకుంద!

4-288-వచనము

అట్లు యోగనిద్రా పరవశుండ వయ్యును జీవులకంటె నత్యంత విలక్షణుండ వై యుండుదువు; అది యెట్లనిన బుద్ధ్యవస్థాభేదంబున నఖండితం బయిన స్వశక్తిం జేసి చూచు లోకపాలన నిమిత్తంబు యజ్ఞాధిష్ఠాతవు గావున నీవు నిత్యముక్తుండవును, బరిశుద్ధుండవును, సర్వజ్ఞుండవును, నాత్మవును, గూటస్థుండవును, నాదిపురుషుండవును, భగవంతుండవును, గుణత్రయాధీశ్వరుండవును నై వర్తింతువు; భాగ్యహీనుండైన జీవుని యందు నీ గుణంబులు గలుగవు; ఏ సర్వేశ్వరునం దేమి విరుద్ధగతులై వివిధ శక్తి యుక్తంబు లైన యవిద్యాదు లానుపూర్వ్యంబునం జేసి ప్రలీనంబు లగుచుండు; అట్టి విశ్వకారణంబు నేకంబు ననంతంబు నాద్యంబు నానందమాత్రంబు నవికారంబు నగు బ్రహ్మంబునకు నమస్కరించెద; మఱియు దేవా! నీవ సర్వవిధఫలం బని చింతించు నిష్కాము లయినవారికి రాజ్యాదికామితంబులలోనఁ బరమార్థం బయిన ఫలంబు సర్వార్థరూపుండవైన భవదీయ పాద పద్మ సేవనంబ; ఇట్లు నిశ్చితంబ యైనను సకాములయిన దీనులను గోవు వత్సంబును స్తన్యపానంబు చేయించుచు, వృకాది భయంబు వలన రక్షించు చందంబునం గామప్రదుండవై సంసార భయంబు వలన బాపుదువు;" అని యిట్లు సత్యసంకల్పుండును, సుజ్ఞానియు నయిన ధ్రువునిచేత వినుతింపంబడి భృత్యానురక్తుం డైన భగవంతుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె.

4-289-కంద పద్యము

" ధీరవ్రత! రాజన్య కు
మారక! నీ హృదయమందు మసలిన కార్యం
బారూఢిగా నెఱుంగుదు
నారయ నది వొందరాని దైనను నిత్తున్.

4-290-వచనము

అది యెట్టి దనిన నెందేని మేధియందుఁ బరిభ్రామ్యమాణ గోచక్రంబునుం బోలె గ్రహనక్ష త్రతారాగణ జ్యోతిశ్చక్రంబు నక్షత్ర రూపంబు లయిన ధర్మాగ్ని కశ్యప శక్రులును సప్తర్షులును, దారకా సమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుండుదురు; అట్టి దురాపంబును ననన్యాధిష్ఠితంబును లోకత్రయ ప్రళయకాలంబునందు నశ్వరంబుగాక ప్రకాశమానంబును నయిన ధ్రువక్షితి యను పదంబు ముందట నిరువది యాఱువేలేండ్లు చనం బ్రాపింతువు; తత్పద ప్రాప్తిపర్యంతంబు భవదీయ జనకుండు వనవాస గతుండైనం దద్రాజ్యంబు పూజ్యంబుగా ధర్మమార్గంబున జితేంద్రియుండవై చేయుదువు; భవదనుజుం డగు నుత్తముండు మృగయార్థంబు వనంబునకుం జని మృతుం డగు; తదన్వేషణార్థంబు తదాహిత చిత్త యై తన్మాతయు వనంబునకుం జని యందు దావదహన నిమగ్న యగు; వెండియు.

4-291-సీస పద్యము

అనఘాత్మ! మఱి నీవు యజ్ఞరూపుం డనఁ;
దగు నన్ను సంపూర్ణ దక్షిణంబు
లగు మఖంబులచేత నర్చించి సత్యంబు;

లగు నిహసౌఖ్యంబు లనుభవించి
యంత్యకాలమున నన్నాత్మఁ దలంచుచు;
మఱి సర్వలోక నమస్కృతమును
మహిఁ బునరావృత్తి రహితంబు సప్తర్షి;
మండలోన్నత మగు మామకీన

4-291.1-తేటగీతి

పదము దగఁ బొందఁగల" వని పరమపురుషుఁ
డతని యభిలషితార్థంబు లర్థి నిచ్చి
యతఁడు గనుఁగొను చుండంగ నాత్మపురికి
గరుడగమనుఁడు వేంచేసెఁ గౌతుకమున.

4-292-తేటగీతి

అంత ధ్రువుఁడునుఁ బంకేరుహాక్ష పాద
కమల సేవోపపాదిత ఘన మనోర
థములఁ దనరియుఁ దనదు చిత్తంబులోనఁ
దుష్టిఁ బొందక చనియె విశిష్టచరిత!"

4-293-కంద పద్యము

అని మైత్రేయుఁడు ధ్రువుఁ డ
ట్లనయము హరిచేఁ గృతార్థుఁడైన విధం బె
ల్లను వినిపించిన విదురుఁడు
విని మునివరుఁ జూచి పలికె వినయం బెసఁగన్.

4-294-కంద పద్యము

" మునినాయక! విను కాముక
జనదుష్ప్రాపంబు విష్ణు చరణాంబురుహా
ర్చన మునిజన సంప్రాప్యము
ననఁగల పంకేరుహాక్షు నవ్యయ పదమున్.

4-295-వచనము

పెక్కు జన్మంబులం గాని పొందరాని పదంబు దా నొక్క జన్మంబుననే పొందియుం దన మనంబునం దప్రాప్త మనోరథుండ నని పురుషార్థవేది యైన ధ్రువుం డెట్లు దలంచె" ననిన మైత్రేయుం డిట్లనియె

4-296-తేటగీతి

" అనఘ! పినతల్లి దన్నుఁ బల్కిన దురుక్తి
బాణవిద్ధాత్ముఁ డగుచుఁ దద్భాషణములు
చిత్తమందుఁ దలంచుటఁ జేసి ముక్తిఁ
గోరమికి నాత్మలో వగఁ గూరుచుండె.

4-297-వచనము

అంత నా ధ్రువుండు.

4-298-చంపకమాల

అనఘ! జితేంద్రియుల్ సుమహితాత్ములునైన సనందనాదు లెం
దనయ మనేక జన్మ సముపార్జిత యోగ సమాధిఁ జేసి యె

వ్వని చరణారవిందములు వారని భక్తి నెఱుంగుచుందు; రా
ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజేయు నాద్యునిన్.

4-299-వచనము

ఏను షణ్మాసంబులు భజియించి తత్పాదపద్మ చ్ఛాయం బ్రాపించియు భేదదర్శనుండ నైతి; నక్కటా! ఇట్టి భాగ్యహీనుండనైన యేను భవనాశకుండైన యతనిం బొడఁగనియు నశ్వరంబులైన కామ్యంబు లడిగితి; నిట్టి దౌరాత్మ్యం బెందేనిం గలదే? తమ పదంబులకంటె నున్నత పదంబు నొందుదునో యని సహింపంజాలని యీ దేవతలచేత మదీయ మతి గలుషితం బయ్యెం గాక; నాఁడు నారదుం డాడిన మాట తథ్యం బయ్యె; అతని వాక్యంబు లంగీకరింపక యే నసత్తముండనై స్వప్నావస్థలం బొందినవాఁడు దైవికంబైన మాయంజెంది భిన్న దర్శనుండగు చందంబున నే నద్వితీయుండ నైనను, భ్రాత యను శత్రువుచేఁ బ్రాప్తం బైన దుఃఖంబు నొంది జగదాత్మకుండును, సుప్రసాదుండును, భవనాశకుండును నైన యీశ్వరు నారాధించి తత్ప్రసాదంబు బడసియు నాయుర్విహీనుం డైన రోగికిం బ్రయోగించు నౌషధంబుం బోలె నిరర్థకంబులైన, నశ్వరంబులైన, యీ కామితంబులు గోరితి" నని; వెండియు.

4-300-మత్తేభ విక్రీడితము

" ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ ధాటిన్ ఫలీకార మి
మ్మని యర్థించినరీతి ముక్తిఫలదుం డై నట్టి పంకేజలో

చనుఁ డే చాలఁ బ్రసన్నుఁడైన నతనిన్ సాంసారికం బర్థిఁ గో
రిన నావంటి విమూఢమానసులు ధాత్రిం గల్గిరే యెవ్వరున్?"

## 4-12-ధృవుండు మరలివచ్చుట

### 4-301-సీస పద్యము

అని యిట్లు చింతించె" ననుచు నమ్మైత్రేయ;
 ముని విదురునకు నిట్లనియెఁ " దండ్రి!
కమనీయ హరిపాద కమల రజోభి సం;
 స్పృత శరీరులును యాదృచ్ఛికముగ
సంప్రాప్తమగు దాన సంతుష్టచిత్తులై;
 వఱలుచు నుండు మీవంటి వారు
దగ భగవత్పాద దాస్యంబు దక్కంగ;
 నితర పదార్థంబు లెడఁద లందు

### 4-301.1-తేటగీతి

మఱచియును గోర నొల్లరు మనుచరిత్ర!
తవిలి యిట్లు హరిప్రసాదంబు నొంది
మరలి వచ్చుచునున్న కుమారు వార్తఁ
జారుచే విని యుత్తానచరణుఁ డపుడు.

### 4-302-వచనము

మనమున నిట్లని తలంచె.

4-303-కంద పద్యము

చచ్చిన వారలుఁ గ్రమ్మఱ
వచ్చుటయే కాక యిట్టి వార్తలు గలవే?
నిచ్చలు నమంగళుఁడ నగు
నిచ్చట మఱి నాకు శుభము లేల ఘటించున్.

4-304-కంద పద్యము

అని విశ్వసింపకుండియు
మనమున నా నారదుఁడు గుమారుఁడు వేగం
బునఁ రాఁగలఁ డనుచును బలి
కిన పలుకులు దలఁచి నమ్మి కృతకృత్యుండై.

4-305-కంద పద్యము

తన సుతుని రాక చెప్పిన
ఘనునకు ధనములును మౌక్తికపు హారములున్
మన మలర నిచ్చి తనయునిఁ
గనుఁగొను సంతోష మాత్మఁ గడలుకొనంగన్

4-306-సీస పద్యము

వలను మీఱిన సైంధవంబులఁ బూన్చిన;
 కనక రథంబు నుత్కంఠ నెక్కి
బ్రాహ్మణ కుల వృద్ధ బంధు జనామాత్య;
 పరివృతుం డగుచు విస్ఫురణ మెఱసి

బ్రహ్మనిర్ఘోష తూర్యస్వన శంఖ కా;
హాళ వేణు రవము లందంద చెలఁగ
శిబిక లెక్కియు విభూషితలై సునీతి సు;
రుచు లుత్తముండు నారూఢి నడువ

4-306.1-తేటగీతి

గరిమ దీపింప నతిశీఘ్రగమున మొప్ప
నాత్మనగరంబు వెలువడి యరుగుచుండి
బలసి నగరోపవన సమీపంబు నందు
వచ్చు ధ్రువుఁ గని మేదినీశ్వరుఁడు నంత.

4-307-చంపకమాల

అరదము డిగ్గి ప్రేమ దొలఁకాడ ససంభ్రముఁడై రమామనో
హరు చరణారవింద యుగళార్చన నిర్దళితాఖి లాఘు నీ
శ్వర కరుణావలోకన సుజాత సమగ్ర మనోరథున్ సుతుం
గర మనురక్తి డాసి పులకల్ ననలొత్తఁ బ్రమోదితాత్ముఁడై.

4-308-తేటగీతి

బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నివిరి
శిరము మూర్కొని చుబుకంబు చేతఁ బుణికి
యవ్యయానంద బాష్ప ధారాభిషిక్తుఁ
జేసి యాశీర్వదింప నా చిరయశుండు.

4-309-కంద పద్యము

జనకుని యాశీర్వచనము
లనయముఁ గైకొని ప్రమోదియై తత్పదముల్
దన ఫాలతలము సోఁకఁగ
వినతులు గావించి భక్తి విహ్వలుఁ డగుచున్.

4-310-తేటగీతి

అంత నా సజ్జనాగ్రణి యైన ధ్రువుఁడు
దల్లులకు భక్తి వినతులు దగ నొనర్చి
సురుచికిని మ్రొక్క నర్భకుఁ జూచి యెత్తి
నగు మొగంబున నాలింగనంబు చేసి.

4-311-సీస పద్యము

కరమొప్ప నానంద గద్గద స్వరమున;
జీవింపు మనుచు నాశీర్వదించె;
భగవంతుఁ డెవ్వనిపై మైత్రి పాటించు;
సత్కృపానిరతిఁ బ్రసన్నుఁ డగుచు
నతనికిఁ దమయంత ననుకూలమై యుండు;
సర్వభూతంబులు సమతఁ బేర్చి
మహిఁ దలపోయ నిమ్నప్రదేశములకు;
ననయంబుఁ జేరు తోయముల పగిది

4-311.1-తేటగీతి

గాన ఘను నమ్మహాత్ముని గారవించె
సురుచి పూర్వంబు దలఁపక సుజనచరిత!
విష్ణుభక్తులు ధరను బవిత్రు లగుట
వారి కలుగరు ధరణి సెవ్వారు మఱియు.

4-312-వచనము

కావున నుత్తముండును ధ్రువుండును బ్రేమ విహ్వాలు లగుచు నన్యో న్యాలింగితులై పులకాంకురాలంకృత శరీరులై యానంద బాష్పముల నొప్పిరి; అంత సునీతియుం దన ప్రాణంబులకంటెఁ బ్రియుండైన సుతు నుపగూహనంబు చేసి తదవయవ స్పర్శనంబు చేత నానందంబు నొంది విగతశోక యయ్యె; నప్పుడు సంతోష బాష్ప ధారాసిక్తంబులై చనుఁబాలునుం గురిసె నంత.

4-313-సీస పద్యము

ఉన్నత సంతోష ముప్పతిల్లఁగఁ బౌర;
జనము లా ధ్రువుతల్లి నెనయఁ జూచి
తొడరిన భవదీయ దుఃఖనాశకుఁ డైన;
యిట్టి తనూజుఁ డెందేని పెద్ద
కాలంబు క్రిందటఁ గడఁగి నష్టుం డైన;
వాఁడిప్డు నీ భాగ్యవశము చేతఁ
బ్రతిలబ్ధుఁ డయ్యెను; నితఁడు భూమండల;
మెల్లను రక్షించు నిద్ధమహిమ;

4-313.1-తేటగీతి

కమల లోచనుఁ జింతించు ఘనులు లోక
దుర్జయం బైన యట్టి మృత్యువును గెల్తు;
రట్టి ప్రణతార్తి హరుఁడైన యబ్జనాభుఁ
డర్థి నీచేతఁ బూజితుం డగుట నిజము.

4-314-వచనము

అని ప్రశంసించిరి; అట్లు పౌరజనంబులచేత నుపలాల్య మానుండగు ధ్రువుని నుత్తాన పాదుం డుత్తమ సమేతంబుగా గజారూఢునిం జేసి సంస్తూయమానుండును, ప్రహృష్టాంతరంగుండును నగుచుఁ బురాభి ముఖుండై చనుదెంచి.

4-315-సీస పద్యము

స్వర్ణ పరిచ్ఛదస్వచ్ఛకుడ్యద్వార;
 లాలిత గోపురాట్టాలకంబు;
ఫల పుష్ప మంజరీ కలిత రంభా స్తంభ;
 పూగ పోతాది విభూషితంబు;
ఘన సార కస్తూరికా గంధ జలబంధు;
 రాసిక్త విపణి మార్గాంచితంబు;
మానిత నవరత్న మయ రంగవల్లీ వి;
 రాజిత ప్రతి గృహ ప్రాంగణంబు;

4-315.1-తేటగీతి

శుభ నదీజల కుంభ సంశోభితంబు;
తండులస్వర్ణలాజాక్షతప్రసూన
ఫల బలివ్రాత కలిత విభ్రాజితంబు;
నగుచు సర్వతో లంకృత మైన పురము.

4-316-వచనము

ప్రవేశించి రాజమార్గంబునఁ జనుదెంచు నప్పుడు.

4-317-మత్తేభ విక్రీడితము

హరిమధ్యల్ పురకామినీ తతులు సౌధాగ్రంబులందుండి భా
స్వర దిద్ధార్థ ఫలాక్షతప్రసవ దూర్వావ్రాత దధ్యంబువుల్
కరవల్లీ మణి హేమ కంకణ ఝణత్కారంబు శోభిల్లఁ జ
ల్లిరి యా భాగవతోత్తమోత్తమునిపై లీలాప్రమేయంబుగన్.

4-318-వచనము

ఇట్లు వాత్సల్యంబునను జల్లుచు సత్యవాక్యంబుల దీవించుచు సువర్ణ పాత్ర రచిత మణి దీప నీరాజనంబుల నివాళింపం బౌర జానపద మిత్రా మాత్య బంధుజన పరివృతుండై చనుదెంచి.

4-319-సీస పద్యము

కాంచన మయ మరకత కుడ్య మణిజాల;
సంచయ రాజిత సౌధములను
వరసుధాఫేన పాండుర రుక్మ పరికరో;
దాత్త పరిచ్ఛదతల్పములను

సురతరు శోభిత శుక పిక మిధునాళి;
గాన విభాసి తోద్యానములను
సుమహిత వైడూర్య సోపాన విమల శో;
భిత జలపూర్ణ వాపీచయముల

4-319.1-తేటగీతి

వికచ కహ్లార దర దరవింద కైర
వప్రదీపిత బక చక్రవాక రాజ
హంస సారస కారండవాది జల వి
హంగ నినదాభిరామ పద్మాకరముల.

4-320-వచనము

మఱియును.

4-321-తేటగీతి

చారు బహువిధ వస్తు విస్తార మొప్ప
నంగనాయుక్త మగుచుఁ బెం పగ్గలించి
యర్థిఁ దనరారు జనకుగృహంబు చొచ్చె
నెలమిఁ ద్రిదివంబు చొచ్చు దేవేంద్రు పగిది.

4-322-వచనము

ఇట్లు ప్రవేశించిన రాజర్షి యైన యుత్తానపాదుండు సుతుని యాశ్చర్య కరంబైన ప్రభావంబు వినియుం జూచియుం మనంబున విస్మయంబు నొంది ప్రజానురక్తుండును, బ్రజాసమ్మతుండును, నవయౌవ్వన

పరిపూర్ణుండును నైన ధ్రువుని రాజ్యాభిషిక్తుం జేసి వృద్ధవయస్కుండైన తన్నుఁదాన యెఱింగి యాత్మగతిఁ బొంద నిశ్చయించి విరక్తుండై వనంబునకుం జనియె; అంత నా ధ్రువుండు శింశుమార ప్రజాపతి కూఁతురైన భ్రమి యను దాని వివాహంబై దానివలనఁ గల్ప వత్సరులను నిద్దఱు గొడుకులం బడసి; వెండియు వాయుపుత్రియైన యిల యను భార్య యందు నుత్కల నామకుఁడైన కొడుకు నతి మనోహరయైన కన్యకారత్నంబునుం గనియె; అంత దద్భ్రాత యైన యుత్తముండు వివాహంబు లేకుండి మృగయార్థంబు వనంబున కరిగి హిమవంతంబున యక్షునిచేత హతుండయ్యె; అతని తల్లియుఁ దద్దుఃఖంబున వనంబునకేఁగి యందు గహనదహనంబున మృతిం బొందె; ధ్రువుండు భ్రాతృమరణంబు విని కోపామర్షశోకవ్యాకులిత చిత్తుండై జైత్రంబగు రథంబెక్కి యుత్తరాభిముఖుండై చని హిమవద్ద్రోణి యందు భూతగణ సేవితంబును గుహ్యక సంకులంబును నైన యలకాపురంబు బొడగని యమ్మహానుభావుండు.

## 4-13-ధృవయక్షుల యుద్ధము

### 4-323-మత్తేభ విక్రీడితము

ఘనశౌర్యోన్నతి తోడ సర్వ కకుభాకాశంబు లందుం బ్రతి
ధ్వనులోలిన్ నిగుడంగ శంఖము మహోద్యల్లీలఁ బూరింపఁ ద
న్నినదంబున్ విని యక్షకాంతలు భయాన్వీతాత్మలై రుగ్ర సా
ధనులై యక్షభటుల్ పురిన్ వెడలి రుత్సాహంబు సంధిల్లగన్.

4-324-వచనము

ఇట్లు వెడలి యా ధ్రువునిం దాఁకిన.

4-325-చంపకమాల

కరము మహారథుండు భుజగర్వ పరాక్రమశాలియున్ ధను
ర్ధరుఁడును శూరుఁడౌ ధ్రువుఁడు దన్ను నెదిర్చిన యక్షకోటిఁ జె
చ్చరఁ బదుమూఁడువేల నొకచేరికిఁ గైకొన కొక్కపెట్ట భీ
కరముగ మూఁడు మూఁడు శితకాండములం దగ గ్రువ్వనేసినన్

4-326-ఉత్పలమాల

వారు లలాటముల్ పగిలి వారక నొలియుఁ దేజి యమ్మహో
దారు పరాక్రమప్రకట ధైర్యముఁ దత్కర లాఘవంబుఁ బ
ల్మారు నుతించుచుం గుపితమానసులై పదతాడితప్రదు
ష్టోరగకోటిఁ బోలెఁ జటులోగ్ర భయంకర రోషమూర్తులై.

4-327-ఉత్పలమాల

ఆ రథికోత్తముం దొడరి యందఱు నొక్కటఁ జుట్టుముట్టి పెం
పారఁగ బాణషట్కముల నంగములం బగులంగనేసి వి
స్ఫార గదా శరక్షురిక పట్టిసతోమర శూలఖడ్గముల్
సారథియుక్తుడైన రథిసత్తముపైఁ గురిపించి రేపునన్.

4-328-వచనము

అట్లు గురియించిన నతండు.

4-329-కంద పద్యము

పెంపటి యుండెను ధారా
సంపాతచ్ఛన్నమైన శైలము భంగిన్
గుంపులు గొని యాకసమునఁ
గంపించుచు నపుడు సిద్ధగణములు వరుసన్.

4-330-కంద పద్యము

హాహాకారము లెసఁగఁగ
నోహో యీ రీతి ధ్రువపయోరుహహితుఁడు
త్సాహము చెడి యిటు దైత్య స
మూహార్ణవమందు నేఁడు మునిఁగెని యకటా!

4-331-వచనము

అని చింతించు సమయంబున.

4-332-కంద పద్యము

తామాతని గెలిచితి మని
యా మనుజాశనులు పలుక నట నీహార
స్తోమము సమయించు మహో
ద్దాముండగు సూర్యుఁ బోలి తద్ధయుఁ దోఁచెన్.

4-333-వచనము

అట్లు దోఁచిన.

4-334-మత్తేభ విక్రీడితము

అరి దుఃఖావహమైన కార్ముకము శౌర్యస్ఫూర్తితోఁ దాల్చి భీ
కర బాణావళిఁ బింజపింజఁ గఱవంగా నేసి ఝుంఝూనిలుం
డురు మేఘావళిఁ బాఱఁదోలుగతి నత్యుగ్రాహితక్రూరబం
ధుర శస్త్రావళి రూపుమాపె విలసద్ధోర్లీల సంధిల్లఁగన్.

4-335-చంపకమాల

మఱి యపు డమ్మహాత్ముఁ డసమానబలుండు మహోగ్రబాణముల్
కరగఱిఁ దాఁక నేసి భుజగర్వ మెలర్ప విరోధి మర్మముల్
పఱియలు చేసి యంగములు భంగమునొందఁగఁజేసె ప్రేల్మిడిన్
గిఱికొని పర్వతంబుల నొగిం దెగఁ గొట్టెడు నింద్రు కైవడిన్.

4-336-వచనము

అయ్యవసరంబున.

4-337-చంపకమాల

అలఘు చరిత్రుఁ డమ్మనుకులాగ్రణిచే వికలాంగు లైనవా
రల సకిరీట కుండల విరాజిత మస్తక కోటిచే సము
జ్జ్వల మణికంకణాంగద లసద్భుజవర్గముచేత సంగర
స్థల మతిరమ్యమై తనరె సంచిత వీరమనోహరాకృతిన్.

4-338-వచనము

అంత హతశేషులు.

4-339-కంద పద్యము

వరబలుఁడగు మను మనుమని
శరసంఛిన్నాంగు లగుచు సమరవిముఖులై
హరిరాజముఁ గని పఱచెడు
కరిబృందముఁ బోలెఁ జనిరి కళవళపడుచున్.

4-340-కంద పద్యము

అప్పుడు రాక్షసమాయలు
గప్పిన ధ్రువుఁ డసురవరుల కార్యం బెఱుఁగం
జొప్పడక, వారిఁ బొడగన
దెప్పర మగుటయును సారథిం గని, యంతన్.

4-341-కంద పద్యము

తలవోయఁగ, భువి మాయా
వుల కృత్యంబెఱుఁగనెవరువోలుదురనుచుం
బలుకుచుఁ, దత్పురిఁజొరఁగాఁ
దలఁపఁగ, నదిగానరాక తద్దయు మానెన్

4-342-వచనము

అట్లు పురంబున కరుగుట మాని చిత్రరథుండైన యా ధ్రువుండు సప్రయత్నుం డయ్యును బరప్రతియోగశంకితుండై యుండె; నయ్యెడ మహాజలధి ఘోషంబు ననుకరించు శబ్దంబు వినంబడె; నంత సకల దిక్తటంబుల వాయుజనితం బయిన రజః పటలంబు దోఁచె; దత్క్షణంబ

యాకాశంబున విస్ఫురత్తటిత్ప్రభా కలిత గర్జారవయుక్త మేఘంబు లమోఘంబులై భయంకరాకారంబులై తోఁచె; అంత.

4-343-మత్తేభ విక్రీడితము

అనయంబున్ ధ్రువుమీఁద దైత్యకృతమాయాజాలమట్లేచి, బో
రన మస్తిష్క పురీష మూత్ర పల దుర్గంధాస్థి మేదశ్శరా
సన నిస్త్రింశ శరాసి తోమర గదా చక్రత్రిశూలాది సా
ధన భూభృద్భుజగావళిం గురిసె నుద్దండక్రియాలోలతన్.

4-344-వచనము

మఱియు, మత్తగజ సింహవ్యాఘ్ర సమూహంబులును, నూర్మి భయంకరంబై సర్వతః ప్లవనం బయిన సముద్రంబును గానంబడియె; వెండియుం గల్పాంతంబునందుంబోలె భీషణంబైన మహాప్రాదంబునుం దోఁచె; నవ్విధంబున నానా విధంబులు ననేకంబులు నవిరళభయం కరంబులు నయిన యసురమాయలు గ్రూర ప్రవర్తునులగు యక్షుల చేత సృజ్యమానంబులై యడరె; నా సమయంబున.

4-345-కంద పద్యము

అనయంబును నయ్యక్షుల
ఘనమాయ నెఱింగి మునినికాయము వరుసన్
మనుమనుమని మను మను మని
మనమునఁ దలఁచుచును దత్సమక్షంబునకున్.

4-346-వచనము

చనుదెంచి యా ధ్రువుం గని యిట్లనిరి.

4-347-సీస పద్యము

" అనఘాత్మ లోకు లెవ్వని దివ్య నామంబు;
సమత నాకర్ణించి సంస్మరించి
దుస్తరంబైన మృత్యువు నైన సుఖవృత్తిఁ;
దరియింతు; రట్టి యీశ్వరుఁడు పరుఁడు
భగవంతుఁడును శార్ఙ్గపాణియు భక్తజ;
నార్తిహరుండును నైన విభుఁడు
భవదీయ విమతులఁ బరిమార్పఁగా" కని;
పలికిన మునుల సంభాషణములు

4-347.1-తేటగీతి

విని కృతాచమనుఁడయి యావిభుని పాద
కమలముఁ దలంచి రిపుభయంకరమహోగ్ర
కలిత నారాయణాస్త్రంబుఁ గార్ముకమునఁ
బూనఁ దడవఁ దదీయ సంధానమునను.

4-348-తేటగీతి

కడఁగి గుహ్యక మాయాంధకార మపుడు
పెరవుచెడి దవ్వుదవ్వుల విరిసిపోయె
విమలమైన వివేకోదయమునఁ జేసి
సమయు రాగాదికంబుల సరణి నంత.

4-349-మత్తేభ విక్రీడితము

వరనారాయణ దేవతాస్త్ర భవ దుర్వారప్రభాహేమపుం
ఖ రుచిస్ఫార మరాళ రాజసిత పక్షక్రూరధారాపత
చ్ఛర సాహస్రము లోలి భీషణ విపక్షశ్రేణిపై వ్రాలె భీ
కరరావంబునఁ గానఁ జొచ్చు శిఖిసంఘాతంబు చందంబునన్.

4-350-వచనము

అట్లేసిన.

4-351-చంపకమాల

ఖరనిశితప్రదీప్త ఘన కాండపరంపర వృష్టిచేఁ బొరిం
బొరి వికలాంగులై యడరి పుణ్యజనుల్ పృథుహేతిపాణులై
గరుడునిఁ జూచి భూరిభుజగప్రకరంబు లెదిర్చి పేర్చి చె
చ్చెర నడతెంచు చందమునఁ జిత్రరథున్ బలుపూని తాఁకినన్.

4-352-ఉత్పలమాల

వారలఁ జండతీవ్ర శరవర్గము చేత నికృత్తపాద జం
ఘోరు శిరోధరాంబక కరోదర కర్ణులఁ జేసి యోగి పం
కేరుహమిత్ర మండల సకృద్భిద నెట్టి పదంబుఁ జెందు నా
భూరిపదంబునం బెలుచఁ బొందఁగఁ బంపె భుజావిజృంభియై.

4-353-వచనము

ఇవ్విధంబున నా చిత్రరథుండగు ధ్రువునిచేత నిహన్యమానులును
నిరపరాధులును నయిన గుహ్యకులం జూచి యతని పితామహుండైన

స్వాయంభువుండు ఋషిగణ పరివృతుం డై చనుదెంచి ధ్రువునిం జూచి యిట్లనియె "వత్సా నిరపరాధులైన యీ పుణ్యజనుల నెట్టి రోషంబున వధియించితి, వట్టి నిరయహేతువైన రోషంబు చాలు; భ్రాతృవత్సల! భ్రాతృవధాభితప్తుండవై కావించు నీ యత్నం బుడుగుము.

4-354-కంద పద్యము

అనఘా! మనుకులమున కిది
యనుచిత కర్మంబు; యొకనికై పెక్కండ్రి
ట్లని మొనఁ ద్రుంగిరి; యిది నీ
కనయంబును వలవ; దుడుగు మయ్య! కుమారా!

4-355-వచనము

అదియునుం గాక, దేహాభిమానంబునం బశుప్రాయులై భూతహింస గావించుట హృషీకేశానువర్తను లైన సాధువులకుం దగదు; నీవ సర్వభూతంబుల నాత్మభావంబునఁ దలంచి సర్వభూతావాసుండును దురారాధ్యుండును నైన విష్ణుని పదంబులఁ బూజించి తత్పరమపదంబును బొందితివి; అట్టి భగవంతుని హృదయంబున ననుధ్యాతుండవు, భాగవతుల చిత్తంబులకును సమ్మతుండవు మఱియు సాధువర్తనుండ వన నొప్పు నీ వీ పాపకర్మం బెట్లు చేయ సమకట్టితివి? ఏ పురుషుండైననేమి మహాత్ముల యందుఁ దితిక్షయు, సముల యందు మైత్రియు, హీనుల యందుఁ గృపయు, నితరంబులగు సమస్త జంతువుల యందు సమత్వంబును గలిగి వర్తించు వానియందు సర్వాత్మకుం డైన భగవంతుడు ప్రసన్నుం డగు; అతండు ప్రసన్నుం

డయిన వాఁడు ప్రకృతి గుణంబులం బాసి లింగశరీరభంగంబు గావించి బ్రహ్మానందంబునుం బొందు; అదియునుం గాక, కార్య కారణ సంఘాత రూపంబైన విశ్వం బీశ్వరునందు నయస్కాంత సన్నిధానంబు గలిగిన లోహంబు చందంబున వర్తించు; అందు సర్వేశ్వరుండు నిమిత్తమాత్రంబుగాఁ బరిభ్రమించు; అట్టి యీశ్వరుని మాయా గుణ వ్యతికరంబున నారబ్ధంబు లైన పంచభూతంబుల చేత యోషిత్పురుషవ్యవాయంబు వలన యోషిత్పురుషాదిరూప సంభూతి యగు; ఇవ్విధంబునఁ దత్సర్గంబుఁ దత్సంస్థానంబుఁ దల్లయంబు నగుచు నుండు; ఇట్లు దుర్విభావ్యం బైన కాలశక్తిం జేసి గుణక్షోభంబున విభజ్యమాన వీర్యుండు ననంతుండు ననాదియు నై జనంబులచేత జనంబులం బుట్టించుచుండుటం జేసి యాదికరుండును, మృత్యుహేతువున జనంబుల లయంబు నొందించుటం జేసి యంతకరుండును,ననాది యగుటంజేసి యవ్యయుండును నైన భగవంతుండు జగత్కారణుం డగుం; గావున నీ సృష్టి పాలన విలయంబులకుం గర్తగానివాని వడుపున దానిఁ జేయుచుండు; ఇట్లు మృత్యురూపుండును బరుండును సమవర్తియు నైన యీశ్వరునికి స్వపక్ష పరపక్షంబులు లేవు; కర్మాధీనంబులైన భూతసంఘంబులు రజంబు మహావాయువు ననుసరించు చాడ్పున నస్వతంత్రంబు లగుచు నతని ననువర్తించు; నీశ్వరుండును జంతుచయాయు రుపచయాపచయ కరణంబులం దస్పృష్టుండును నగు జీవుండు గర్మబద్ధుం డగుటంజేసి కర్మంబ వానికి నాయురుపచయాపచయంబులం జేయుచుండు; మఱియు సర్వజగత్కర్మసాక్షి యగు సర్వేశ్వరుని.

4-356-కంద పద్యము

కొందఱు స్వభావ మందురు,
కొందఱు కర్మం బటండ్రు, కొందఱు కాలం
బందురు, కొందఱు దైవం
బందురు, కొంద ఱొగిఁ గామ మండ్రు మహాత్మా!

4-357-వచనము

ఇట్టు లవ్యక్తరూపుండును, నప్రమేయుండును, నానాశక్త్యుదయ హేతుభూతుండును నైన భగవంతుండు చేయు కార్యంబులు బ్రహ్మరుద్రాదు లెఱుంగ రఁన నతని తత్త్వంబు నెవ్వ రెఱుంగ నోపుదురు: అది గావునఁ బుత్రా! యిట్లుత్పత్తి స్థితి లయంబులకు దైవంబు కారణం బై యుండ నీ ధనదానుచరులు భవదీయ భాతృహంత లగుదురే? భూతాత్మకుండు భూతేశుండు భూతభావనుండు సర్వేశ్వరుండుఁ బరాపరుండు నగు నీశుండ మాయాయుక్తుండై స్వశక్తిచే సృష్టి స్థితి లయంబులం జేయును; ఐన ననహంకారంబునం జేసి గుణకర్మంబులచే నస్పృశ్యుం డగుచు వర్తించు; అదియునుం గాక, యీ ప్రజాపతులు విశ్వసృణ్ణామంబుల నియంత్రితు లై ముకుద్రాళ్ళ పెట్టిన పశువులుం బోలె నెవ్వని యాజ్ఞాధీనకృత్యులై వర్తింతు రట్టి దుష్టజన మృత్యువును, సుజనామృత స్వరూపుండును, సర్వాత్మకుండును, జగత్పరాయణుండును నైన యీశ్వరుని సర్వప్రకారంబుల శరణంబుఁ బొందుము; అదియునుం గాక.

4-358-సీస పద్యము

అనఘాత్మ! నీవు పంచాబ్ద వయస్కుండ;
 పై పినతల్లి నిన్నాడినట్టి
మాటల నిర్భిన్నమర్ముండ వగుచును;
 జనయిత్రి దిగనాడి వనము కేగి
తప మాచరించి యచ్చపు భక్తి నీశ్వరుఁ;
 బూజించి మహితవిభూతి మెఱసి
రమణఁ ద్రిలోకోత్తరంబైన పదమును;
 బొందితి, వది గాన భూరిభేద

4-358.1-తేటగీతి

రూప మైన ప్రపంచంబు రూఢి నే మ
హాత్మునందుఁ బ్రతీతమై యలరు నట్టి
యగుణుఁ డద్వితీయుండును నక్షరుండు
నైన యీశ్వరుఁ బరమాత్ము ననుదినంబు.

4-359-సీస పద్యము

కైకొని శుద్ధంబు గతమత్సరంబును;
 నమలంబు నగు హృదయంబునందు
నొలయ కన్వేషించుచును బ్రత్యగాత్ముండు;
 భగవంతుఁడును బరబ్రహ్మమయుఁడు
నానందమాత్రుండు నవ్యయుఁ డుపపన్న;
 సకలశక్తియుతుండు సగుణుఁడజుఁడు

నయిన సర్వేశ్వరునం దుత్తమంబైన;
 సద్భక్తిఁ జేయుచు సమత నొప్పి

4-359.1-తేటగీతి

రూఢి సోహమ్మమేతి ప్రరూఢ మగుచు
ఘనత కెక్కు నవిద్యయన్ గ్రంథి నీవు
ద్రెంచివైచితి; కావున ధీవరేణ్య!
సర్వశుభహాని యైన రోషంబు వలదు.

4-360-కంద పద్యము

విను రోషహృదయు చేతను
ననయము లోకము నశించు; నౌషధములచే
ఘనరోగములు నశించిన
యనువున; నది గాన రోష మడఁపు; మహాత్మా!

4-361-తేటగీతి

అనఘ! నీదు సహోదరహంత లనుచుఁ
బెనఁచి యీ పుణ్యజనులఁ జంపితి కడంగి
పరఁగ నిదియె సదాశివ భ్రాత యైన
యర్థవిభునకు నపరాధ మయ్యెఁ గాన.

4-362-కంద పద్యము

నతి నుతులచేత నీ విపు
డతనిఁ బ్రసన్నునిఁగఁ జేయు" మని మనువు దయా

మతిఁ జెప్పి ధ్రువునిచే స
త్కృతుఁడై నయ మొప్పఁ జనియె ఋషియుక్తుండై.

4-363-వచనము

అంత.

4-364-తేటగీతి

యక్షచారణసిద్ధ విద్యాధరాది
జనగణస్తూయమానుఁడై ధనదుఁ డంతఁ
బుణ్యజన వైశస నివృత్తు భూరిరోష
రహితుఁ డైనట్టి ధ్రువునిఁ జేరంగ వచ్చె

4-365-సీస పద్యము

చనుదెంచి వెసఁ గృతాంజలి యైన ధ్రువుఁ జూచి;
తివుట నిట్లనియె " క్షత్రియకుమార!
తగ భవదీయ పితామహాదేశంబు;
నను దుస్త్యజంబైన ఘనవిరోధ
ముడిగితి! వటు గాన నొనరంగ నిపుడు నీ;
యందుఁ బ్రసన్నుండనైతి, భూత
జనన లయంబుల కనయంబుఁ గాలంబె;
కర్త యై వర్తించుఁగాన యుష్మ

4-365.1-తేటగీతి

దనుజుఁ జంపినవార లీ యక్షవరులు
గారు! తలపోయ నీ యక్షగణము నిట్లు
నెఱి వధించిన వాఁడవు నీవు గావు
వినుతగుణశీల! మాటలు వేయునేల!

4-366-వచనము

అదియునుం గాక, యే బుద్ధింజేసి కర్మ సంబంధ దుఃఖాదికంబులు దేహాత్మానుసంధానంబునం జేసి సంభవించు, నట్టి యహంత్వమ్మను నపార్థజ్ఞానంబు స్వప్నమందుంబోలెఁ బురుషునకుం దోఁచు; అదిగావున సర్వభూతాత్మవిగ్రహుండును, నధోక్షజుండును, భవచ్ఛేదకుండును, భజనీయ పాదారవిందుండును, ననంతామేయశక్తి యుక్తుండును, గుణమయి యగు నాత్మమాయచే విరహితుండును నైన యీశ్వరుని సేవింపుము; నీకు భద్రం బయ్యెడు; భవదీయ మనోగతం బైన వరంబుఁ గోరుము; నీ వంబుజనాభ పాదారవింద సేవనంబుఁ దిరంబుగఁ జేయుదు వని యెఱుంగుదు" నని రాజరాజుచేత నట్లు మహామతియు, భాగవతోత్తముండునైన ధ్రువుండు ప్రేరేపింపంబడి "యే హరిస్మరణంబు చేత నప్రయత్నంబున దురత్యయంబైన యజ్ఞానంబుఁ దరియింతు రట్టి హరిస్మరణం బచలితం బగునట్లొసంగు" మని యడగిన "నట్లగాక" యని యంగీకరించి యంతం గుబేరుండు సంప్రీత చిత్తుండయి, ధ్రువునికి శ్రీహరిస్మరణం బట్ల యనుగ్రహించి యంతర్ధానంబు నొందె; అంత ధ్రువుండు యక్ష కిన్నర కింపురుషగణ సంస్తూయమాన వైభవుం డగుచు నాత్మీయ పురంబునకు మరలి చనుదెంచె.

4-367-సీస పద్యము

గణుతింప భూరిదక్షిణల చేఁ గడునొప్పు;
యజ్ఞముల్ చేయ నయ్యజ్ఞ విభుఁడు
ద్రవ్యక్రియా దేవతాఫల రూప స;
త్కర్మఫలప్రధాత యయి యొప్పు
పురుషోత్తముని నర్థిఁ బూజించి మఱియు స;
ర్వోపాధివర్జితుఁ డుత్తముండు
సర్వాత్మకుఁడు నగు జలజాక్షునందుఁ దీ;
వ్రంబై ప్రవాహరూపంబు నైన

4-367.1-తేటగీతి

భక్తి సలుపుచు నఖిల ప్రపంచమందు
నలరఁ దనయందు నున్న మహాత్ము హరినిఁ
జిదచిదానందమయుని లక్ష్మివరుఁ బరము
నీశ్వరేశ్వరుఁ బొడఁ గనె నిద్ధచరిత!

## 4-14-ధృవక్షితిని నిలుచుట

4-368-వచనము

ఇట్లు సుశీలసంపన్నుండును, బ్రహ్మణ్యుండును, ధర్మసేతురక్షకుండును, దీనవత్సలుండు నయి యవని పాలించు ధ్రువుండు దన్నుఁ బ్రజలు దండ్రి యని తలంప నిరువదియాఱువే లేండ్లు భోగంబుల చేతం బుణ్యక్షయంబును, నభోగంబులైన యాగాదులచేత

నశుభ క్షయంబునుం జేయుచు బహుకాలంబు దనుకఁ ద్రివర్గ సాధనంబుగా రాజ్యంబుచేసి కొడుకునకుఁ బట్టంబుగట్టి యచలితేంద్రియుండై యవిద్యారచిత స్వప్నగంధర్వ నగరోపమం బయిన దేహాదికం బగు విశ్వంబు భగవన్మాయారచితం బని, యాత్మం దలంచుచు వెండియు.

4-369-చంపకమాల

మను నిభుఁ డంత భృత్యజన మంత్రి పురోహిత బంధు మిత్ర నం
దన పశు విత్త రత్న వనితా గృహ రమ్యవిహార శైల వా
రినిధి పరీత భూతల హరిద్వప ముఖ్య పదార్థ జాలముల్
ఘనమతిచే ననిత్యములుగాఁ దలపోసి విరక్తచిత్తుఁడై.

4-370-సీస పద్యము

పురము వెల్వడి చని పుణ్యభూ బదరికా;
ఘన విశాలానదీకలిత మంగ
ళాంబుపూరంబుల ననురక్తిమైఁ గ్రుంకి;
కమనీయ పరిశుద్ధ కరణుఁ డగుచుఁ
బద్మాసనస్థుఁడై పవనుని బంధించి;
నెలకొని ముకుళితనేత్రుఁ డగుచు
హరిరూపవైభవ ధ్యానంబు చేయుచు;
భగవంతు నచ్యుతుఁ బద్మనేత్రు

4-370.1-తేటగీతి

నందు సతతంబు నిశ్చలమైన యట్టి
భక్తిఁ బ్రవహింపఁ జేయుచుఁ బరమమోద
బాష్పధారాభిషిక్తుండు భవ్యయశుఁడుఁ
బులకితాంగుండు నగుచు నిమ్ములఁ దనర్చి.

4-371-వచనము

మఱియు; విగత క్లేశుండును, ముక్తలింగుండునునై, ధ్రువుండు తన్నుఁదా మఱచి యుండు సమయంబున దశదిక్కుల నుద్యద్రాకానిశానాయకుండునుం బోలె వెలింగించుచు నాకాశంబున నుండి యొక్క విమానంబు చనుదేర నందు దేవశ్రేష్ఠులును, జతుర్భుజులును, రక్తాంబుజేక్షణులును, శ్యామవర్ణులును, గదాధరులును, సువాసులును, గిరీటహారాంగదకుండలధరులును, కౌమారవయస్కులును, నుత్తమశ్లోక కింకరులు నయిన వారల నిద్దఱం గని; సంభ్రమంబున లేచి మధుసూదను నామంబులు సంస్మరించుచు వారల భగవత్కింకరులంగాఁ దలంచి దండప్రణామంబు లాచరించినం గృష్ణపాదారవింద విన్యస్తచిత్తుండుఁ, గృతాంజలియు, వినమితకంధరుండు నైన ధ్రువునిం గనుంగొని పుష్కరనాభభక్తు లైన సునందనందులు ప్రీతియుక్తులై మందస్మితు లగుచు నిట్లనిరి.

4-372-ఉత్పలమాల

" ఓ నృప! నీకు భద్ర మగు; నొప్పుగుచున్న మదీయవాక్యముల్
వీనులయందుఁ జొన్పుము; వివేకముతో నయిదేండ్లనాఁడు మే

ధానిధిపై యొనర్చిన యుదాత్త తపోవ్రతనిష్ఠచేతఁ దే
జోనయశాలి యైన మధుసూదనుఁ దృష్టి వహింపఁ జేయవే!

4-373-ఆటవెలది

అట్టి శార్ఙ్గపాణి యఖిల జగద్భర్త
దేవదేవుఁ డతుల దివ్యమూర్తి
మమ్ముఁ బనుప మేము మాధవపదమున
కర్థి నిన్నుఁ గొనుచు నరుగుటకును.

4-374-వచనము

వచ్చితిమి; ఏ పదంబు నేని సూరిజనంబులు సర్వోత్తమం బని పొందుదురు; దేనిఁ జంద్ర దివాకర గ్రహ నక్షత్ర తారాగణంబులు ప్రదక్షిణంబుగాఁ దిరుగుచుండు; మఱియు నీదు పితరులచేతను నన్యులచేతను ననధి ష్ఠితంబును, జగద్వంద్యంబును, నభక్తజనాతిదుర్జయంబును నయిన విష్ణుపదంబుం బొందుదువు రమ్మిదె విమానశ్రేష్ఠం; బుత్తమశ్లోకజన మౌళిమణియైన శ్రీహరి పుత్తెంచె; దీని నెక్క నర్హుండ" వనిన నురుక్రమ ప్రియుం డయిన ధ్రువుండు తన్మధుర వాక్యంబులు విని కృతాభిషేకుం డయి యచ్చటి మునులకుఁ బ్రణమిల్లి తదాశీర్వాదంబులు గైకొని, విమానంబునకుం బ్రదక్షిణార్చనంబులు గావించి హరిపార్షదులైన సునందనందులకు వందనం బాచరించి భగవద్రూపవిన్యస్త చక్షురంతః కరణాదికుం డగుచు విమానాధిరోహణంబు గావించుటకు హిరణ్మయ రూపంబు ధరియించె; అప్పుడు.

4-375-కంద పద్యము

సురదుందుభి పణ వానక
మురజాదులు మొరసె; విరుల ముసురు గురిసె; గి
న్నెర గంధర్వుల పాటలు
భరితములై చెలఁగె నపుడు భవ్యచరిత్రా!

4-376-వచనము

అట్టి సమయంబున ధ్రువుండు దుర్గమంబగు త్రివిష్టపంబునకు నేగువాఁ డగుచు దీన యగు జననిం దిగనాడి యెట్లు వోవుదు? నని చింతించు వానిం బార్షదు లవలోకించి యగ్రభాగంబున విమానారూఢ యై యేగుచున్న జననిం జూపిన సంతుష్టాంతరంగుం డగుచు.

4-377-కంద పద్యము

జనని సునీతిని మును కనుఁ
గొని యవల విమాన మెక్కి గొనకొని విబుధుల్
దనమీఁదఁ బుష్పవర్షము
లనయముఁ గురియింప ధ్రువుఁడు హర్షముతోడన్.

4-378-కంద పద్యము

చనిచని వెస గ్రహమండల
మును దైలోక్యంబు సప్తమునిమండలమున్
ఘనుఁ డుత్తరించి యవ్వలఁ
దనరెడు హరిపదము నొందెఁ దద్దయుఁ బ్రీతిన్.

4-379-వచనము

అది మఱియు నిజకాంతిచేతం ద్రిలోకంబులం బ్రకాశింపంజేయుచు నిర్దయాగమ్యంబును శాంతులు సమదర్శనులు శుద్ధులు సర్వ భూతానురంజనులు నచ్యుతభక్తబాంధవులు నయిన భద్రాచారులకు సుగమ్యంబును నయి గంభీరవేగంబు ననిమిషంబు నగు జ్యోతిశ్చక్రంబు సమాహితంబై గోగణంబు మేధి యందుం బోలె నెందుఁ బరిభ్రమించుచుండు నట్టి యచ్యుతపదంబునుం బొంది, విష్ణుపరాయణుండైన ధ్రువుండు త్రిలోకచూడామణియై యొప్పుచుండె; అప్పుడు భగవంతుండైన నారదుండు ధ్రువుని మహిమం గనుంగొని ప్రచేతస్సత్త్రంబునందు వీణ వాయించుచు.

4-380-సీస పద్యము

పతియె దైవంబుగా భావంబులోపలఁ;
దలఁచు సునీతినందను తపః ప్ర
భావము క్రియ ధర్మభవ్య నిష్ఠలఁ బొందఁ;
జాలరు బ్రహ్మర్షి జనము లనిన
క్షత్రియకులు నెన్నఁగా నేల? యెవ్వఁడు;
పంచసంవత్సర ప్రాయమునను
సురుచి దురుక్త్యుగ్ర శరభిన్న హృదయుఁడై;
మద్వాక్యహిత బోధమతిఁ దనర్చి

4-380.1-తేటగీతి

వనమునకు నేగి హరిభక్తి వశత నొంది
యజితుఁ డగు హరిఁ తన వశుఁడై చరింపఁ
జేసి వెసఁ దత్పదంబును జెందె, నట్టి
హరిపదంబును బొంద నెవ్వరికిఁ దరము?

4-381-కంద పద్యము

అని పాడె"ననుచు విదురున
కనఘుఁడు మైత్రేయుఁ డనియె నంచిత భక్తిన్
వినుతోద్దామయశస్కుం
డనఁగల యా ధ్రువుని చరిత మార్యస్తుత్యా!

4-382-సీస పద్యము

మహితసత్పురుష సమ్మతమును ధన్యంబు;
స్వర్గప్రదంబు యశస్కరంబు
నాయుష్కరంబుఁ బుణ్యప్రదాయకమును;
మంగళకర మఘుమర్షణంబు
సౌమనస్యముఁ బ్రశంసాయోగ్యమును బాప;
హరమును ధ్రువపదప్రాపకంబు
నై యొప్పు నీ యుపాఖ్యానంబుఁ దగ నీకు;
నెఱిఁగించితిని; దీని నెవ్వఁడేని

4-382.1-తేటగీతి

తివుట శ్రద్ధాగరిష్ఠుఁడై తీర్థపాద
చరణ సరసీరుహద్వయాశ్రయుఁడు నైన
భవ్యచరితు దినాంత ప్రభాతవేళ
లను సినీవాలి పూర్ణిమ లందు మఱియు.

4-383-తేటగీతి

ద్వాదశినిఁ బద్మ బాంధవ వాసరమున
శ్రవణ నక్షత్రమున దినక్షయమునందుఁ
బరఁగ సంక్రమణవ్యతీపాత లందు
సభల భక్తిని వినునట్టి సజ్జనులకు.

4-384-వచనము

క్లేశనాశనంబును మహాప్రకాశంబును నైన భగవద్భక్తియు శీలాది గుణంబులును గలుగు; మఱియుఁ దేజఃకామునకుఁ దేజంబును, మనః కామునకు మనంబును, నిష్కామునకుఁ దత్త్వవిజ్ఞానంబును గలుగు; దీని వినిపించువారికి దేవతానుగ్రహంబు గలుగు: ఇట్టి యుపాఖ్యానంబు నీ కెఱింగించితి" నని మైత్రేయుండు విదురునకుఁ జెప్పిన క్రమంబున శుకయోగి పరీక్షితున కెఱింగించిన తెఱంగున సూతుండు శౌనకాదులకు వినిపించి వెండియు నిట్లనియె "అట్లు చెప్పిన మైత్రేయునిం గని విదురుం డిట్లనియె.

4-385-సీస పద్యము

" అనఘాత్మ! నారదమునిపతి ధ్రువ చరి;
త్రము ప్రచేతసుల సత్త్రంబునందు
నర్థిమై గీర్తించె నంటి; ప్రచేతసు;
లన నెవ్వ? రెవ్వరి తనయు? లెట్టి
వంశజుల్? సత్త్ర మె వ్వల నను జేసి? ర;
ధ్వరమందు నిజకుల ధర్మశీలు
రగు ప్రచేతసులచే యజియింపఁగాఁ బడె;
యజ్ఞపూరుషుఁ డెట్టు లచ్యుతాంఘ్రి

4-385.1-తేటగీతి

భక్తియుక్తుఁడు విదిత సద్భాగవతుఁడు
దివిరి హరిపాదసేవా విధిప్రయుక్త
దేవదర్శనుఁ డగు నట్టి దివ్యయోగి
నారదుం డెట్లు గొనియాడె శౌరికథలు?

4-386-కంద పద్యము

నా కిపు డెఱిఁగింపుము సు
శ్లోకుని చరితామృతంబు శ్రోత్రాంజలులం
బైకొని జుఱ్ఱియుఁ దనివిం
గైకొనకున్నది మనంబు గరుణోపేతా!"

4-387-కంద పద్యము

అని యడిగిన విదురునిఁ గనుఁ
గొని మైత్రేయుండు పలికె గొనకొని ధ్రువుఁడున్
వనమునకుఁ జనిన నాతని
తనయుం డగు నుత్కళుండు దళితాఘుండై.

4-388-సీస పద్యము

చతురుఁ డాజన్మ ప్రశాంతుండు నిస్సంగుఁ;
 డును సమదర్శనుండును ఘనుండు
నై యాత్మయందు లోకావళి, లోకంబు;
 లందు నాత్మను జూచు చనఘమైన
యనుపమయోగక్రియా పావకాదగ్ధ;
 కర్మ మలాశయ కలనఁ బేర్చి
జడుని కైవడిఁ జీఁకు చందంబునను మూఢు;
 పగిది నున్మత్తుని భంగిఁ జెవిటి

4-388.1-తేటగీతి

వడువునను గానఁబడుచు సర్వజ్ఞుఁడై ప్ర
శాంతకీల హుతాశను సరణిఁ బొల్చి
సతత శాంతంబు నంచిత జ్ఞానమయము
నైన బ్రహ్మస్వరూపంబు నాత్మఁ దలఁచి.

4-389-కంద పద్యము

తనకంటె నితర మొక టెఱుఁ
గని కతమున సార్వభౌమకశ్రీఁ బొందన్
మనమునఁ గోరక యుండుటఁ
గని కులవృద్ధులును మంత్రిగణములు నంతన్.

4-390-వచనము

అతని నున్మత్తునింగాఁ దెలసి తదనుజుం డైన వత్సరునికిఁ బట్టంబు గట్టిరి; ఆ వత్సరునికి సర్వర్ధి యను భార్య యందుఁ బుష్పార్ణుండును, జంద్రకేతుండును, నిషుండును, నూర్జుండును, వసువును, జయుండును నన నార్వురు తనయులు గలిగిరి; అందుఁ బుష్పార్ణుం డనువానికిఁ బ్రభయు దోషయు నను నిద్దఱు భార్య లైరి; అందుఁ బ్రభ యనుదానికిం బ్రాతర్మధ్యందిన సాయంబు లను సుతత్రయంబును, దోష యను దానికిం బ్రదోష నిశీథ వ్యుష్టు లనువారు ముగ్గురును బుట్టిరి; అందు వ్యుష్టుం డనువానికిఁ బుష్కరిణి యను పత్ని యందు సర్వతేజుం డను సుతుండు పుట్టె; వానికి నాకూతి యను మహిషి వలనఁ జక్షుస్సంజ్ఞుం డయిన మనువు జనియించె; వానికి నడ్వల యను భార్య యందుఁ బురువును, గుత్సుండును, ద్రితుండును, ద్యుమ్నుండును, సత్యవంతుండును, ఋతుండును, వ్రతుండును, నగ్నిష్టోముండును, నతిరాత్రుండును, సుద్యుమ్నుండును, శిబియును, నుల్ముకుండును నను పన్నిద్దఱు తనయులు గలిగిరి; అందు నుల్ముకునికిఁ బుష్కరిణి యనుదాని వలన నంగుండును, సుమనసుండును, ఖ్యాతియుఁ, గ్రతువును, నంగిరసుండును, గయుండును నను నార్వురు గొడుకులు

పుట్టిరి; అందు నంగునికి సునీథ యను ధర్మపత్నివలన వేనుం డను పుత్త్రుం డుదయించిన.

## 4-15-వేనుని చరిత్ర

### 4-391-మత్తేభ విక్రీడితము

క్షితినాథోత్తముఁ డాత్మనందనుని దుశ్శీలంబు వీక్షించి దుః
ఖితుఁడై యొంటిగఁ దత్పురిన్ వెడలి యేగెన్ వేగ మెందేనిఁ ద
ద్గతి వీక్షించి మునీశ్వరుల్గుపితులై దంభోళిసంకాశ వా
క్కృతతిం జావ శపింప వాఁ డపుడు వీఁకం గూలె, నమ్మేదినిన్

### 4-392-సీస పద్యము

కైకొని యపుడు లోకం బరాజకమైనఁ;
 బ్రజలు దస్కరపీడఁ బల్లటిల్లఁ
గనుఁగొని దుఃఖించి మునులు గతాసుఁడై;
 పడిన వేనుని వలపలి భుజంబు
నర్థి మథింప నారాయణాంశంబున;
 నాదిరాజన నొప్పునట్టి పృథుఁడు
జనియించె" ననవుడు విని విదురుఁడు మునిఁ;
 గనుఁగొని పలికె " నో యనఘచరిత!

### 4-392.1-తేటగీతి

సాధువు సుశీలనిధియును సజ్జనుండు
నలఘు బ్రహ్మణ్యుఁడును నైన యట్టి యంగ

ధరణివిభునకు దుష్టసంతాన మెట్లు
గలిగె? నయ్యంగపతి యేమి కారణమున

4-393-వచనము

విమనస్కుం డగుచుఁ బురంబు విడిచె? ధర్మకోవిదులైన మునులు దండవ్రతధరుండును, రాజును నగు వేనుని యందు నే పాపంబు నిరూపించి బ్రహ్మదండం బొనర్చి రదియునుం గాక లోకంబున రాజులు లోకపాల తేజోధరులు, ప్రజాపాలనాసక్తులుఁ గావునఁ గల్మషంబు గలిగినం బ్రజలచేత నవజ్ఞానర్హులై యుందురు; గావున నా వేనుని చరిత్రంబు శ్రద్ధాగరిష్ఠుండు భక్తుండు నైన నాకుం బరాపరవిధగ్రేసరుండ వయిన నీ వెఱింగింప నర్హుండ" వనిన మైత్రేయుం డతని కిట్లనియె.

4-394-సీస పద్యము

" అనఘాత్మ! రాజర్షి యైనట్టి యయ్యంగ;
మేదినీ విభుఁ డశ్వమేధమఖము
గావింప ఋత్విజ్ నికాయంబు చేత నా;
హూత మయ్యును సురవ్రాత మందు
నాత్మ హవిర్భాగ మంద రాకుండిన;
నప్పుడు ఋత్విక్కు లద్భుతంబు
నందుచు యజమానుఁడైన యయ్యంగ ము;
హీవరుఁ జూచి రాజేంద్ర! యిట్లు

4-394.1-తేటగీతి

త్రిదశు లిదె పిల్వబడియును దివిరి యాత్మ
భాగములఁ బొంద రా రైరి భవ్యచరిత!
యేమి హేతువొ యిది మాకు నెఱుఁగఁబడదు;
కనఁగ హోమంబు దుష్టంబు గాదు మఱియు.

4-395-వచనము

శ్రద్ధాయుక్తులై ధృతవ్రతులైన యీ బ్రహ్మవాదులచేత సంప్రయుక్తంబు లైన యీ ఛందస్సులు వీర్యవంతంబులయి యున్న యవి; ఇందు దేవతాపరాధం బణుమాత్రం బయిన నెఱుంగము; ఇట్టిచోటం గర్మసాక్షు లయిన దేవతలు స్వకీయ భాగంబు లంగీకరింపకుండుటకుఁ గతం బెయ్యదియో" యనిన న య్యంగుండు దుఃఖితస్వాంతుండై తన్నిమిత్తంబు సదస్యుల నడుగం దలంచి వారల యనుమతిం బడసి మౌనంబు మాని యిట్లనియె.

4-396-ఆటవెలది

" అనఘచరితులార! యాహూతు లయ్యు సు
పర్వగణము లాత్మ భాగములను
స్వీకరింప? రేను జేసిన యపరాధ
మెట్టి దనిన వార లిట్టు లనిరి.

4-397-కంద పద్యము

నరనాథా! యిది యిప్పుడు
వొరసిన దుష్కృతము గాదు పూర్వభవమునం

బరఁగిన దురితం బిది యా
దరమున నెఱిఁగింతు మింత ధన్యచరిత్రా;

4-398-కంద పద్యము

నీ వింతవాఁడ వయ్యును
భూవర! సంతానలాభమును బొందమి నా
దేవతలు యాగభాగము
లీ వేళ భుజింప రైరి యిందుకు నీవున్.

4-399-తేటగీతి

పుత్రకామేష్టిఁ గావించి పుత్త్రుఁ బడయు
మట్లొనర్చిన దేవత లాత్మభాగ
మర్థి నంగీకరింతు; ర య్యజ్ఞ పురుషు
హరి భజించిన సకల కార్యములుఁ గలుగు."

4-400-వచనము

అనిన నాతండు సంతానార్థంబు శిపివిష్టదేవతాకం బయిన పురోడాశంబుచే హోమంబుగావించినం దదీయ హోమకుండంబు నందు హేమమాల్యాంబరాభరణుం డయిన పురుషుండు హిరణ్మయ పాత్రంబున సిద్ధపాయసంబు గొనుచు నుదయించిన నప్పుడు విప్రానుమతంబున నా రాజు దత్పాయసంబు నంజలిచే గ్రహించి సంతోష యుక్తుండగుచు భార్య కొసంగె; అంత.

4-401-చంపకమాల

కమలదళాక్షి పాయసము గౌతుక మొప్ప భుజించి భర్తృ సం
గమమునఁ జేసి తత్క్షణమ గర్భముఁ దాల్చి కుమారుఁ గాంచె న
క్కొమరుఁడు నంత మాతృజనకుం డగు మృత్యువుఁ బోలి తా నధ
ర్మమునఁ జరించుచుండె గుణమండన! వేనుఁ డనంగ నిచ్చలున్

4-402-చంపకమాల

ఎనయఁగ బాల్యమందుఁ దన యీడు కుమారులఁ గ్రీడఁ బోలె నె
మ్మనమున భీతి లేక కృపమాలి పశుప్రకరంబు నొంచు పో
ల్కిని నరికట్టి చంపుచును గిల్బిషలుబ్ధక వృత్తిమై శరా
సనశరముల్ ధరించి మృగజాతి నసాధుగతిన్ వధించుచున్.

4-403-వచనము

ఇట్లు మాతామహ దోషంబునం బాపవర్తనుండై చరియించు కొడుకుం జూచి యంగుండు వివిధ శాసనంబుల దండించియు నతని దుశ్చేష్టితంబులు మానుపం జాలక దుఃఖితాత్ముండై మనంబున.

4-404-కంద పద్యము

అనయము నిట్టి కుపుత్రునిఁ
గని పరితాపంబుఁ బొందుకంటెను ధరలో
ననపత్యుం డగు టొప్పును
వనజాక్షు భజించునట్టి వాఁ డగువాఁడున్."

4-405-వచనము

అని వెండియు నిట్లనియె.

4-406-సీస పద్యము

" జనులకు దుష్పుత్రకునిచేత నపకీర్తి;
యును నధర్మమును సర్వజనవిరోధ
మును మనోవ్యథయును ననయంబు బ్రాపించు;
నట్టి కుపుత్రుమోహంబు విడువఁ
జాలక బహుమాన సంగతిఁ గను నెవ్వఁ;
డతని గేహంబు దుఃఖాలయంబు
నగు నని మఱియు నిట్లను మనుజుండు శో;
కస్థాన మగు పుత్రుకతనఁ జేసి

4-406.1-తేటగీతి

యనుపమక్లేశ భాజనం బయిన గృహము
విడుచుఁ గావున నిట్టి వివేకహీనుఁ
డగు కుపుత్రు సుపుత్రుఁగా నాత్మఁ దలఁతు
ననుచు నా రాజు బహుదుఃఖితాత్ముఁ డగుచు.

4-407-కంద పద్యము

తగు సుమహైశ్వర్యోదయ
మగు గృహమును బ్రజల, నిద్ర నందిన భార్యన్
దిగవిడిచి యెక్కడేనిని
జగతీశుఁడు చనె నిశీథి సమయము నందున్.

4-408-వచనము

అంతఁ దద్వృత్తాంత బంతయు సుహృద్బాంధవ పురోహితామాత్య ప్రభృతు లయిన ప్రజ లెఱిఁగి దుఃఖించుచున్న సమయంబున భూమి యందెల్ల యెడలఁ దదన్వేషణం బాచరించి గూఢుం డయిన పరమపురుషునిం గానలేని కుయోగి చందంబున నా రాజుం బొడగానలేక విఫలోద్యోగులయి మగిడి పురంబునకు వచ్చిరి; తదనంతరంబ.

4-409-సీస పద్యము

సమధిక బ్రహ్మనిష్ఠాతిగరిష్ఠులౌ;
 భృగ్వాది మౌనీంద్ర బృంద మపుడు
లోకావనై కావలోకనోత్సుకు లైన;
 జనులు స్వరక్షక జనవిభుండు
లేమిఁ బశుప్రాయులై మెలంగుటఁ గని;
 యంత వేనుని మాత యగు సునీథ
యనుమతి నఖిల ప్రజావళి కప్రియుం;
 డైన న వ్వేనుఁ బట్టాభిషిక్తుఁ

4-409.1-తేటగీతి

జేసి; రంతట మహితోగ్రశాసనుఁ డగు
వేనుఁ బట్టంబు గట్టుట విని సమస్త
తస్కరులు సర్పభీతిచేఁ దలఁగు మూషి
కముల కైవడి నడఁగిరి గహనములను.

4-410-వచనము

అంత నతండు.

4-411-చంపకమాల

పరువడి నష్ట లోకపరిపాలక ముఖ్య విభూతి యుక్తుఁడై
పరఁగి నృపాసనంబున విభాసితుఁ డౌట స్వభావసిద్ధమై
వఱలు మహావలేపమున వారక సంతత మాననీయ స
త్పురుషుల నెల్ల నెందుఁ బరిభూతులఁ జేయుచు నుండె నిచ్చలున్.

4-412-చంపకమాల

మఱియు నతండు భూగగనమార్గములం దొకవేళ నొక్కఁడే
యరదము నెక్కి క్రుమ్మరు నిరంకుశవృత్తిఁ జరించు మత్త సిం
ధురవిభు పోల్కి సత్పురుషదూషిత వర్తన నొప్పుచున్ నిరం
తర సుజనాపరాధకృతి తత్పర మానసుఁడై క్రమంబునన్.

4-413-కంద పద్యము

దివ్యులు వెఱఁగందఁగఁ బృ
థ్వీవ్యోమముల గల భేరి ప్రేయించె న య
ష్టవ్య మదాతవ్యమహో
తవ్యం విప్రా యనుచు నుదాత్తధ్వనులన్.

4-414-కంద పద్యము

అని యిట్టులు భేరీరవ
మునఁ జేసి సమస్త ధర్మములు వారింపన్

మును లవినీతుం డగు వే
నుని దుశ్చరితంబు జనమనోభయ మగుటన్.

4-415-తేటగీతి

కని కృపాయత్తు లగుచు నిట్లనిరి యిట్టి
రాజచోర భయంబు లీ భూజనులను
బలసి యిరువంకలను బాధ పఱుపఁ జొచ్చె
దారువందుల వహ్ని చందమునఁ దెలుచ.

4-416-చంపకమాల

అరయ నరాజకంబగు మహాభయముం దొలఁగింపఁగోరి యి
ట్లెఱుఁగక యీ యనర్హుని మహీపతిఁ జేసిన యట్టి దోషముం
బరువడిఁ జెందె దుగ్ధరస పానమునం బరివృద్ధినొందు న
య్యురగము భీతి పోషకుని నొందిన రీతి ననర్థహేతువై.

4-417-వచనము

అదియునుం గాక.

4-418-కంద పద్యము

మునుకొని సునీథ గర్భం
బున జనియించియు స్వభావమున దుర్జనుఁడై
యెనయఁ బ్రజాపాలనమున
కును బాల్పడి ప్రజల మన్నిగొనఁ జొచ్చెఁగదే.

4-419-వచనము

అదిగాన నీ వేనుండు పూర్వంబున జ్ఞాన సంపన్నులచేత రాజుగాఁ జేయంబడియెఁ; గావున నిట్టివాని మన మందఱమును గూడి ప్రార్థింతము; లోకరక్షణార్థం బగుటఁ దద్దోషంబు మనల స్పృశింపదు; సమీచీనోక్తులం జేసి వీని ననునయింప వాని గ్రహింపకుండెనేని మున్న లోకధిక్కారాగ్నిసందగ్ధుం డగు వీని మన తేజోమహాగ్నిచేత భస్మీభూతుంజేయుద" మని యాలోచించి గూఢమన్యు లగుచు వేనునిం గదియం జని యతని కిట్లనిరి.

4-420-కంద పద్యము

" నరపాలక! నీ కాయువు
సిరియును బలమును యశంబుఁ జేకఱు వృద్ధిం
బొరయుదుగా" కనుచు మనో
హరముగ నాశీర్వదించి యతివినయమునన్

4-421-వచనము

ఇట్లనిరి "నరేంద్రా! యే మొక్కటి విన్నవించెద; మవధరింపుము; పురుషులకు వాఙ్మనఃకాయ వృత్తుల వలన నాచరించు ధర్మంబు సమస్త లోకంబులను విశోకంబులం జేయు; నసంగు లయిన వారికి మోక్షంబు నిచ్చును; అట్టి ధర్మంబు ప్రజలకు క్షేమకారణంబు గావున నీ యందుఁ జెడకుండుం గాక" యని పలికి మఱియు "ధర్మంబు నాశంబు నొందిన నైశ్వర్యంబుచే రాజు విడువంబడు" నని చెప్పి వెండియు నిట్లనిరి "దుష్టచిత్తులగు నమాత్యులవలనను దస్కరులవలనను బ్రజలు

నాశంబు నొందకుండ రక్షించుచు యథాన్యాయంబుగ వారలచేఁ గరంబు గొనుచు నుండు మహీపతి యిహపరసౌఖ్యంబుల నందును; అదియునుం గాక యెవ్వని రాష్ట్రంబున నే పురంబున యజ్ఞేశ్వరుం డయిన పురుషోత్తముండు నిజవర్ణాశ్రమోచితం బయిన దర్మంబు గల వారిచేత యజియింపంబడు, నట్టి నిజశాసనవర్తి యగు రాజు వలన సర్వభూతభావనుండును, మహాభాగుండును, భగవంతుండు నగు సర్వేశ్వరుండు సంతుష్టుం డగును; అట్టి సకల జగదీశ్వరుం డైన సర్వేశ్వరుండు సంతోషించిన రాష్ట్రాధిపతికి సర్వసౌఖ్యంబులుఁ బ్రాపించు; లోకపాలకు లగువారు సర్వేశ్వరునికొఱకు బలిప్రదానంబులు చేయుదురు; సమస్తలోకదేవతాయజ్ఞాది సంగ్రహుండును, వేదమయుండును, ద్రవ్యమయుండును, దపోమయుండు నగు నారాయణుని విచిత్రంబులైన యజ్ఞంబులచేత యజనంబుచేసిన నీకు నభయం బగు; మోక్షంబునుం గలుగుం; గావున నీ రాజ్యంబున మఖంబులు చేయు మని యాజ్ఞాపింపుము; నీ దేశంబునఁ జేయంబడిన యజ్ఞంబులచేత హరికళాయుక్తంబు లగు దేవగణంబులు స్విష్టంబులై, తుష్టంబు లగుచు భవదీయవాంఛితార్థంబుల నిత్తురు; గావున దేవతాతిరస్కారంబు నీకు యుక్తంబు గాదు; వేదచోదితంబు లగు ధర్మంబులం దాసక్తుండవు గ" మ్మనిన వేనుం డిట్లనియె.

4-422-కంద పద్యము

" మునులార! మీర లిప్పుడు
నను నీ గతిఁ బడుచుఁదనమునం బలికితి; రై

నను నది యధర్మ; మందుల
నెనయఁగ ధర్మమనఁ గలదె? యెచ్చటనైనన్.

4-423-వచనము

అదియునుం గాక.

4-424-చంపకమాల

ఎనయఁగ జారకామిని నిజేశుని ముచ్చిలి జారపూరుషుం
దనపతిఁ గాఁ దలంచు గతిఁ దద్దయు మూఢమనస్కులై తన
ర్చిన నరపాలరూపము ధరించిన యీశ్వరు నన్నెఱుంగ క
న్యుని భజియింప మీ రిహపరోన్నత సౌఖ్యము లంద రెన్నఁడున్."

4-425-వచనము

అని మఱియు నిట్లనియె "యజ్ఞ పురుషుం డన నెవ్వం? డెవ్వని యందు మీకు భక్తి స్నేహంబు లుదయించె? భర్తృస్నేహ విదూర లైన కుయోషి ద్గణంబులు జారు నందుఁ జేయు భక్తి చందంబునఁ బలికెదరు; అదియునుం గాక.

4-426-కంద పద్యము

హరి హర హిరణ్యగర్భ
స్వరధీశ్వర వహ్ని శమన జలధిపతి మరు
న్నరవాహన శశి భూ రవి
సురముఖ్యులు నృపశరీర సూచకు లగుటన్.

4-427-కంద పద్యము

పరికించి నను భజింపుఁడు
ధరణీశుఁడు సర్వదేవతామయుఁ డగు; మ
త్పర ముడుగుఁడు; నాకంటెను
బురుషుఁడు మఱియెవ్వఁ డగ్రపూజార్హుఁ డిలన్?

4-428-వచనము

అదిగాన మీరు నాయందు బలివిధానంబులు చేయుండు;" అని పాప కర్ముండు, నసత్ప్రవర్తకుండు, నష్టమంగళుండు, విపరీతజ్ఞానుండు నగు వేనుండు పండితమాని యగుచుం బలికి మునుల వచనంబులు నిరాకరించి యూరకున్న; నమ్మునులు భగ్నమనోరథులై తమలో నిట్లనిరి "ఈ దారుణకర్ముం డయిన పాతకుండు హతుం డగుం గాక; వీఁడు జీవించెనేని వీనిచేత నీ జగంబులు భస్మంబులు గాఁగలవు; ఇది నిశ్చితంబు; దుర్వృత్తుం డగు వీడు మహారాజ సింహాసనంబున కర్హుండు గాఁడు; వీఁడు మున్ను నే సర్వేశ్వరు ననుగ్రహంబున నిట్టి విభూతి యుక్తుం డయ్యె నట్టి యజ్ఞపతి యైన శ్రీవిష్ణుని నిందించుచున్నవాఁడు; గావున నిర్లజ్జుండైన హరినిందకుని హననంబు చేయ వలయు" నని మును లుద్యోగించి యాత్మప్రకాశితంబైన క్రోధంబునం జేసి హుంకారమాత్రంబున నా యీశ్వరనిందాహతుం డగు వేనునిం బొలియించిరి; అంత.

4-429-కంద పద్యము

అరసి సునీథయు శోకా
తుర యై తన సుతుఁడు దనువుఁ దొఱఁగినఁ దదనం
తరమునను యోగశక్తిం
బరువడి నిజ తనయు తనువుఁ బరిపాలించెన్.

4-430-వచనము

అంత నొక్కనాఁడు.

4-431-సీస పద్యము

మునివరేణ్యులు భక్తి దనర సరస్వతీ;
సలిలంబులను గృతస్నాను లగుచు
మునుకొని తత్తీరమున నగ్నిహోత్రముల్;
వెలసిల్ల నియతిఁ గావించి యచటఁ
దవిలి సత్పురషకథా వినోదంబులు;
సలుపుచు నుండంగ సకలలోక
భయదంబు లగు మహోత్పాతముల్ దోఁచిన;
మసలి లోకంబు లమంగళములు

4-431.1-తేటగీతి

వొరయ కుండెడుఁ గా కని బుద్ధిలోనఁ
దలఁచుచుండఁగఁ బెలుచ నుదగ్ర మగుచు
సర్వ దిశలను బాంసువర్షంబు గురిసెఁ;
దస్కరులు సర్వజనుల విత్తములు గొనిరి.

4-432-వచనము

ఇట్టి లోకోపద్రవం బెఱింగి జననాథుం డుపరతుం డగుటం జేసి
జనపదంబు లరాజకంబులై యన్యోన్యహింసల నొందుచుం
దస్కరబాధితంబు లగుచు నుండుట యెంఱింగియుఁ
దన్నివారణంబునకు సమర్థు లయ్యును జోరాది బాధలం గనుంగొనుచు
మునులు వారింపక యుండిరి; మఱియు సమదర్శనుండు శాంతుండు
మననశీలుండు నగు బ్రాహ్మణుండు దీనుల నుపేక్షించిన నతని తపంబు
భిన్నభాండగతం బయిన క్షీరంబు చందంబున క్షయించుం; గావున నంగ
వసుధాధీశ వంశోద్భవులు హరిపదాశ్రయు లగుటం జేసియు నమోఘ
సత్త్వనిష్ఠులగుటం జేసియు వీరల వంశంబు విచ్ఛిత్తి నొందింప ననర్హంబు;
గాన స్థాపనీయం బగు నని నిశ్చయించి మృతుండైన వేనుని కళేబరంబు
డగ్గఱ వచ్చి తదూరు మథనంబు గావింప; నందు.

4-433-సీస పద్యము

ఘన కాక కృష్ణ సంకాశ వర్ణుండును;
 హ్రస్వావయవుఁడు మహాహనుండు
హ్రస్వబాహుండును హ్రస్వపాదుండును;
 నిమ్న నాసాగ్రుండు నెఱయ రక్త
నయనుండుఁ దామ్రవర్ణశ్మశ్రుకేశుండు;
 నతి దీన వదనుండు నైన యట్టి
యొక్క నిషాదకుం డుదయించి యేమి చే;
 యుదు నని పలుకుచున్నఁ జూచి

4-433.1-తేటగీతి

వరమునులు నిషీద యనుచుఁ బలుకుటయును
దాన వాఁడు నిషాదాభిదానుఁ డయ్యె;
నతని వంశ్యులు గిరికాననాళి వేను
కల్మషముఁ దెల్పుచుండిరి కడఁక మఱియు.

## 4-16-అర్చిపృథుల జననము

4-434-కంద పద్యము

కని వార నపత్యుం డగు
మనుజేంద్రుని బాహులంత మథియించిన నం
దనఘుం బగు నొక మిథునము
జనియించెను సకల జనులు సమ్మద మందన్.

4-435-వచనము

అందు లోకరక్షణార్థంబుగా నారాయణాంశంబున నొక్క పురుషుండును హరికి నిత్యానపాయిని యైన లక్ష్మీకళాకలితయు, గుణంబులను భూషణంబులకు నలంకార ప్రదాత్రియు నగు కామినియు జనియించె; అందుఁ బృథుశ్రవుండును బృథుయశుండు నగుట నతండు 'పృథు చక్రవర్తి' యనుపేరం బ్రసిద్ధుండయ్యె; అయ్యంగనయు 'నర్చి' యను నామంబునం దనరుచు నతని వరియించె; నా సమయంబున.

4-436-సీస పద్యము

అందంద కురియించి రమరులు మునినాథ!;
వితతి మోదం బంద విరులవానఁ;
బరమానురక్తి శుంభల్లీలఁ జూపట్టె;
సురపతి వీట నచ్చరల యాట;
కర్ణ రసాయన క్రమమున వీతెంచెఁ;
బర పైన తేట కిన్నరులపాట;
యనిమిషకరహతం బై చాలఁ జెలఁగెను;
విభవోత్సవంబు దుందుభిరవంబు;

4-436.1-తేటగీతి

మునినుతి చెలంగె శిఖి గుండముల వెలింగె
నంత నచటికి సరసీరుహాసనుండు
గరుడ గంధర్వ కిన్నర గణముతోడ
నర్థిఁ జనుదెంచె సమ్మోద మతిశయిల్ల.

4-437-వచనము

అంత.

4-438-కవిరాజ విరాజితము

అరయఁగ వైన్యుని దక్షిణహస్తము నందు రమారమణీసుమనో
హరులలితాయుధచిహ్నము లంఘ్రుల యందు సమగ్రహలాంకుశభా
స్వర కులిశధ్వజ చాప సరోరుహ శంఖ విరాజిత రేఖలు వి
స్ఫురగతి నొప్పఁ బితామహముఖ్యులు చూచి సవిస్మయులైరి తగన్.

4-439-వచనము

ఇతండు నారాయణాంశ సంభూతుండు నితని యంగన రమాంశ సంభూతయుం గానోపుదురు; అని తలంచి యయ్యవసరంబున బ్రహ్మవాదు లగు బ్రాహ్మణోత్తము లతనికి విధ్యుక్తప్రకారంబున రాజ్యాభిషేకంబు గావించిరి; తదనంతరంబ.

4-440-కంద పద్యము

సరిదంభోనిధి ఖగ మృగ
ధరణీ సురవర్త్మ పర్వతప్రముఖములై
పరఁగిన భూతశ్రేణులు
నరవరునకుఁ దగ నుపాయనము లిచ్చె నొగిన్.

4-441-తేటగీతి

సమధికఖ్యాతి నా పృథుచక్రవర్తి
దేవి యగు నర్చితోఁ గూడ దివ్యవస్త్ర
గంధ మాల్య విభూషణ కలితుఁ డగుచుఁ
బావకుఁడుఁ బోలె సత్ప్రభాభాసి యయ్యె.

4-442-సీస పద్యము

రాజరాజా పృథురాజుకు హేమము;
యంబైన వీరవరాసనంబు
జలపతి జలకణ స్రావకం బగు పూర్ణ;
చంద్ర సన్నిభ సితచ్ఛత్రము మఱి

పవమానుఁ డమలశోభన మగు వాలవ్య;
 జన సముంచిత సితచామరములు
ధర్ముండు నిర్మలోద్యత్కీర్తిమయ మగు;
 మహనీయ నవ పుష్ప మాలికయును

4-442.1-తేటగీతి

జంభవైరి కిరీటంబు శమనుఁ డఖిల
జన నియామక దండంబు జలజభవుఁడు
నిగమమయ కవచంబు వాణీలలామ
స్వచ్ఛ మగు నవ్యహార మొసఁగిరి మఱియు.

4-443-సీస పద్యము

దామోదరుండు సుదర్శన చక్రంబు;
 నవ్యాహతైశ్వర్య మబ్జపాణి
చంద్రార్ధధరుఁ డర్థచంద్ర రేఖాంకిత;
 కమనీయ కోశసంకలిత ఖడ్గ
మంబిక శతచంద్ర మను ఫలకముఁ జంద్రుఁ;
 డుయమృతమయ శ్వేతహయచయంబుఁ
ద్వష్ట రూపాశ్ర యోదాత్త రథంబును;
 భానుండు ఘృణిమయ బాణములును

4-443.1-తేటగీతి

శిఖియు నజగోవిషాణ సంచిత మహోజ
గవ మనందగు చాపంబు నవనిదేవి
యోగమయమైన పాదుకాయుగము గగన
చరులు గీతంబు లిచ్చిరి సంతసమున.

4-444-వచనము

వెండియుం; బ్రతిదివసంబు నాకాశంబు పుష్పంబులు గురియింప మహర్షులు సత్యంబులైన యాశీర్వచనంబులు సలుప సముద్రుండు శంఖంబును, నదంబులు పర్వతంబులు నదులును రథమార్గంబు నొసంగెఁ; దదనంతరంబ సూత మాగధ వంది జనంబులు దన్ను నుతియించినం బ్రతాపశాలి యగు నవ్వైన్యుండు మందస్మిత సుందర వదనారవిందుండై చతుర వచనుం డగుచు మేఘగంభీర భాషణంబుల వారల కిట్లనియె.

4-445-సీస పద్యము

" వందిమాగధ సూతవరులార! నా యందుఁ;
గమనీయగుణములు గలిగెనేని
నర్థంబు నుతిచేయ; నవి లేవు నా యందు;
నది గాన మీ నుతి వ్యర్థ మయ్యె;
నిటమీఁద గుణముల నేపారి యుండిన;
నపుడు నుతించెద రగుట మీరు
సభ్యనియుక్తులై చతురత నుత్తమ;
శ్లోకుని గుణము లస్తోకభూప్ర

4-445.1-తేటగీతి

సిద్ధములు గాన సన్నుతి చేయుఁ డజుని
నతని బహువిధ భావంబు లభినుతింప
నలవి గాకయె యుండుదు; రదియుఁ గాక;
చతురమతులార! మాగధ జనములార!

4-446-వచనము

మఱియు; మహాత్ముల గుణంబులు దనయందు సంభావితంబులు చేయ సామర్థ్యంబులు గలిగిన నందు మహాత్ముల గుణంబులు ప్రసిద్ధంబులు గావునం దత్సమంబుగా నెట్లు నుతింపవచ్చును? ఎవ్వండే నొకండు శాస్త్రాభ్యాసంబునం దనకు విద్యా తపో యోగ గుణంబులు గలుగు నని పలికిన వానిం జూచి సభ్యులు పరిహాసింతురు; అది కుమతి యగు వాఁ డెఱుంగండు; అదియునుం గాక.

4-447-కంద పద్యము

అతి విశ్రుతులు సులజ్జా
న్వితులు మహోదారు లధిక నిర్మలు లాత్మ
స్తుతి పరనిందలు దోషము
లతి హేయము లని తలంతు రాత్మల నెపుడున్.

4-448-కంద పద్యము

వంది జనంబులు లోకము
లందు నవిదిత వరకర్ము లగు భూపతులన్

నందించు టవశ్యంబై
నం దగదు నుతింప శిశుజనంబుల పగిదిన్."

4-449-కంద పద్యము

అన సూత వంది మాగధ
జను లా నరనాయకుని వచనములు వినియున్
మునిచోదితులై క్రమ్మఱ
ననురాగము లుప్పతిల్ల నమ్మనుజేంద్రున్.

4-450-వచనము

అమృతోపమానంబు లయిన మధుర వాక్యంబుల నిట్లనిరి.

4-451-కంద పద్యము

" వేనాంగ సంభవుండవు
శ్రీనాథ కళాంశజుఁడవు చిరతరగుణ స
మ్మానార్హుండ వతర్కిత
మైన భవన్మహిమఁ బొగడ నలవియె మాకున్."

4-452-కంద పద్యము

అని పెండియు నిట్లని "రై
నను నొక మార్గంబు గలదు నందింప భవ
ద్ఘన చరితామృతపానం
బునఁ జేసియు మునులవచనములఁ జేసి తగన్.

4-453-వచనము

శ్లాఘ్యంబులైన భవదీయ చరిత్రంబుల స్తుతియించెదము" అని యిట్లనిరి.

4-454-సీస పద్యము

" ఈ వైన్యుఁ డఖిలలోకావళి ధర్మాను;
వర్తనముల నెప్డు వఱలఁ జేసి
ఘనధర్మమార్గ వర్తనులలో ధన్యుఁడై;
ధర్మ సేతువుఁ బ్రీతిఁ దగిలి ప్రోచు;
ధర్మ శాత్రవులను దండించు నష్ట ది;
క్పాలకమూర్తి సంకలితుఁ డగుచు;
నయ్యయి కాలంబులందు భాషణదాన;
ములఁ బ్రజారంజనములఁ దనర్చు;

4-454.1-తేటగీతి

సవన సద్వృష్టి కరణాదిసక్తుఁ డగుట
నుభయలోకంబులకుఁ బ్రీతి నొదవఁ జేయు;
న్యాయమార్గంబునను భూజనాళి ధనముఁ
బుచ్చుకొను నిచ్చు సూర్యుఁడుఁ బోలె నితఁడు.

4-455-వచనము

మఱియును.

4-456-సీస పద్యము

సర్వభూతములకు సముఁడును బర్వతి;
క్రమమున లోకాపరాధములను
నతిశాంతి సంయుక్తుఁడై సహించుచు నార్తు;
లగు వారి యెడఁ గృపాయత్తుఁ డగుచు
నరరూపధారియౌ హరిమూర్తి గావున;
నింద్రుండు వర్షించి యెల్ల ప్రజల
రక్షించుగతిఁ దాను రక్షించు; నమృతాంశు;
సన్నిభ వదనాబ్జ సస్మితాను

4-456.1-తేటగీతి

రాగ మిళితావలోకన రాజిఁ జేసి
సకల జనులకు సంప్రీతి సంభవింపఁ
జేయు సంతతమును గూఢచిత్తుఁ డగుచు
శత్రువరుల కసాధ్యుఁడై సంచరించు."

4-457-వచనము

అని వెండియుఁ; బ్రవేశ నిర్గమ శూన్యమార్గ నిరూఢ కార్యుండును, నపరిమిత మహత్త్వాది గుణగణైక ధాముండును, సముద్రునిభంగి గంభీర చిత్తుండును, సుగుప్తవిత్తుండును, వరుణుండునుబోలె సంవృతాత్ముండును, శాత్రవాసహ్య ప్రతాప యుక్తుండును, దురాసదుండును, సమీపవర్తియయ్యును దూరస్థునిభంగి వర్తించుచు వేనారణిజనిత హుతాశనుండు గావున హుతాశను చందంబున నన్యదుస్స్పర్శనుండును నై, చారులవలన సకలప్రాణి బాహ్యాభ్యంతర

కర్మంబులం దెలియుచు, దేహధారులకు నాత్మభూతుండై సూత్రాత్మకుండైన వాయువు భంగి వర్తించుచు, నాత్మస్తుతి నిందలవలన నుదాసీనుం డగుచు, ధర్మపథంబున వర్తించుచు, నాత్మీయ సుహృద్బంధువుల వలనం దప్పు గలిగినను దండించుచు, నాత్మ శత్రువులనైన నదండ్యుల దండింపక ధర్మమార్గగతుం డగుచుఁ, దన యాజ్ఞాచక్రం బప్రతిహతం బగుచు, మానసాచలపర్యంతంబు వర్తింప సూర్యుండు నిజ కిరణంబులచేత నెంత పర్యంతంబు భూమిం బ్రకాశింపంజేయు నంత పర్యంతంబు నిజగుణంబులచేత లోకంబుల రంజిల్లం జేయు; అదియునుం గాక, ప్రకృతి రంజకంబులైన గుణంబులచేత దృఢవ్రతుండును, సత్య సంధుండును, బ్రహ్మణ్యుండును, సర్వభూతశరణ్యుండును, వృద్ధ సేవకుండును, మానప్రదుండును, దీనవత్సలుండును, బరవనితా మాతృభావనుండును, తన పత్ని నర్ధశరీరంబుగాఁ దలంచువాఁడును, నగుచుం బ్రజల యెడఁ దండ్రి వలెఁ బ్రీతి చేయుచు రక్షించుచుండు; మఱియును.

4-458-సీస పద్యము

తలపోయ బ్రహ్మవిద్యానిష్ఠ జనముల;
 కనయంబుఁ గింకరుం డైనవాఁడు;
నఖిలశరీరగుఁ డాప్త సుహృజ్జన;
 తానంద కరుఁ డన నలరువాఁడు;
సంసారఘనకర్మ సంగహీనుల యందు;
 సంగసంప్రీతుఁడై జరగువాఁడు;

దుర్మార్గమనుజ సందోహంబునకు నుగ్ర;
 దండధరుం డనఁ దనరువాఁడుఁ;

4-458.1-తేటగీతి

ప్రకృతి పురుష కావేశుఁడై పరఁగువాఁడు;
భగవదవతారయుక్తుఁడై నెగడువాఁడు;
నగుచు వర్తించు సమ్మోద మతిశయిల్లఁ
జారుతరమూర్తి యీ రాజచక్రవర్తి.

4-459-వచనము

మఱియుం; ద్ర్యధీశుండుఁ గూటస్థుండుఁ బరమాత్మయు బ్రహ్మకళా రూపుండు నగువాఁడునునై యుదయించెం; గావున నితని యందు నవిద్యారచితం బైన భేదంబు నిరర్థకం బగు" నని పెద్ద లగువారలు చూతురు; మఱియును.

4-460-సీస పద్యము

ఉదయాద్రి పర్యంత ముర్వీతలం బేక;
 వీరుఁడై రక్షించి వెలయు నీతఁ
డొకనాఁడు విజయ యాత్రోత్సవం బేపార;
 సన్నద్ధుఁడై మణి స్యందనంబు
నెక్కి చాపముఁ బూని దిక్కుల సూర్యుని;
 పగిదిని శత్రుభూపాలతమము

విరియింతు నని చాల వెలుఁ గొందుచును ధరా;
చక్ర ప్రదక్షిణశాలి యగుచుఁ

4-460.1-తేటగీతి

దిరుగునెడ సర్వ దిక్పాలవర సమేత
పార్థివోత్తమ నికర ముపాయనంబు
లిచ్చి తనుఁ జక్రపాణిని నెనయు నాది
ధరణివిభుఁ డని నుతియించి తలఁతు రెదల.

4-461-కంద పద్యము

ఈ నృపతి ధరాచక్రము
ధేనువుగాఁ జేసి పిదుకు ధృతి నఖిల పదా
ర్థానీకము విబుధులు స
న్మానింపఁగఁ బ్రజకు జీవనప్రదుఁ డగుచున్.

4-462-చంపకమాల

అమరవరేణ్యుఁ బోలి యనయంబు నితండును గోత్ర భేదన
త్వమునఁ జెలంగుఁ దా నజగవప్రదరాసన శింజనీ నినా
దమున విరోధిభూపతులు దల్లడ మంద నసహ్యసింహ వి
క్రమమున సంచరించు" నని కౌతుక మొప్పఁగఁ బల్కి రెండియున్.

4-463-వచనము

ఇట్లనిరి.

4-464-చంపకమాల

" సకలజగన్నుతుం డితఁడు చారుయశోనిధి యశ్వమేధముల్
ప్రకటముగా శతంబు దగఁ బావనమైన సరస్వతీతటీ
నికటధరిత్రిఁ జేయుతఱి నేర్పున నంతిమ యాగమందుఁ గొం
డొక మఖసాధనాశ్వమును జంభవిరోధి హరించు నుద్ధతిన్.

4-465-సీస పద్యము

ఒకనాఁడు నిజమందిరోపాంత వనముకుఁ;
 జని యందు సద్గుణశాలి యైన
ఘనుని సనత్కుమారునిఁ గాంచి యమ్ముని;
 వరు బ్రహ్మ తనయుఁగా నెఱిఁగి భక్తిఁ
బూజించి విజ్ఞానమును బొందు నచ్చట;
 బ్రహ్మవేత్తలు మునిప్రవరు వలన
మానిత లబ్ధవిజ్ఞానులై వర్తింతు,;
రిమ్మహారాజు మహీతలంబు

4-465.1-తేటగీతి

నందు విశ్రుతవిక్రముఁ డగుచు మిగులఁ
దన కథావళి భూ ప్రజాతతి నుతింప
నక్కడక్కడ వినుచు శౌర్యమున నఖిల
దిక్కులను గెల్చి వర్తించు ధీరయశుఁడు.

4-466-వచనము

ఇట్లు విపాటిత విరోధిమనశ్శల్యుండు, సురాసుర జేగీయమాన నిజవైభవుండు నై ధరాచక్రంబున కీతండు రాజయ్యెడి" నని యివ్విధంబున స్తోత్రంబు చేసిన వంది మాగధ సూత జనంబులం బృథుచక్రవర్తి పూజించి మఱియుం బ్రాహ్మణ భృత్యామాత్య పురోహిత పౌర జానపద తైలిక తాంబూలిక నియోజ్య ప్రము ఖాశేష జనంబులం దత్త దుచిత క్రియలం బూజించె" అని మైత్రేయుండు చెప్పిన విని విదురుం డిట్లనియె.

## 4-17-భూమినిబితుకుట

### 4-467-సీస పద్యము

" ఏమి నిమిత్తమై భూమి గోరూపిణి;
యయ్యె? దానికి వత్స మయ్యె నెద్ది?
గొనకొని దోహనమునకు నర్హంబైన;
పాత్ర మెయ్యది? దలఁపంగ దోగ్ధ
యైన యా పృథువే పదార్థముల్ పిదికెను?;
బరికింప నవని స్వభావమునను
విషమమై యుండియు వెలయంగ నే రీతి;
సమగతిఁ జెందెను జంభవైరి?

### 4-467.1-తేటగీతి

క్రతుహయంబును గొనిపోవఁ గార్య మెద్ది?
ధీరనిధి యైన బ్రహ్మకుమారు వలనఁ

గలిత విజ్ఞానుఁ డగుచు నే గతినిఁ బొందె?
ననఘచారిత్ర! మైత్రేయ! యదియుఁగాక.

4-468-వచనము

మఱియుఁ; బరబ్రహ్మంబును, భగవంతుండును, బుణ్యశ్రవణ కీర్తనుండును, సర్వనియామకుండును నగు కృష్ణుని యవతారాంతరాశ్రయం బగు దివ్యకథలను భగవంతుం డైన పుండరీకాక్షుండు పృథ్వవతారంబు ధరియించి గోరూపిణి యగు పృథివిం బిదికినది మొదలగు కథ లన్నియు నీకు నధోక్షజునకు దాసుండ నయిన నాకు నెఱింగింపుము;” అనిన వాసుదేవ కథా సంప్రీత చేతస్కుం డగు విదురుం బ్రశంసించి మైత్రేయుం డిట్లనియె “అట్లు బ్రాహ్మణ జనంబులచేత రాజ్యంబు నందభిషిక్తుం డగుచు సకలప్రజాపాలన నియుక్తుండై పృథువు రాజ్యంబు చేయుచుండు నంత నీరస యగు ధరిత్రియం దన్నరహితు లగుచుం బ్రజలు క్షుత్పీడాక్షీణ దేహులై వైన్యునిం జూచి యిట్లనిరి.

4-469-కంద పద్యము

అరయఁగ నేము బుభుక్షా
పరిపీడం బడితి మయ్య; పై కొని తరు కో
టర జనిత వహ్నిచేతను
దరికొను వృక్షములుఁ బోలె ధరణీనాథా!

4-470-కంద పద్యము

శరణ శరణ్యుఁడ వగు నిను
శరణము వేఁడెదము; మాకు సత్కృప నన్నుం
బరసి కృపచేసి ప్రోవుము
నరనాయక! యనుచుఁ బ్రజలు నతులై పలుకన్.

4-471-కంద పద్యము

విని దానికి సదుపాయము
జననాయకుఁ డాత్మఁ దలఁచి సక్రోధుండై
ధనువున బాణముఁ దొడిగెను
ఘనరౌద్రుండైన త్రిపుర ఘస్మరు పగిదిన్.

4-472-వచనము

ఇట్లు దొడిగిన.

4-473-కంద పద్యము

మహిపతి నప్పుడు గనుఁగొని
మహి గోరూపమునఁ గంప్యమానయు నగుచున్
గుహకుం డగు లుబ్ధకుఁ గని
గహనంబునఁ బాఱు హరిణికైవడిఁ బాఱెన్.

4-474-వచనము

ఇట్లు ధరణి పాఱిన నతండు కుపితారుణేక్షణుండై వెంటం దగిలి దిక్కులను విదిక్కులను భూభాగ నభోభాగంబుల నెక్కడఁ జనియె, నక్కడికి వెనుదగిలి యుద్యతాయుధుండై చనుచుండ నవ్వైన్యునిం గని

మృత్యుగ్రస్తులగు ప్రజల చందంబున ననన్యశరణ్యయై యతిభయంబునం బరితప్యమానహృదయ యగుచు "వైన్యా! ధర్మవత్సలుండవును, నాపన్నరక్షకుండవును, మహాత్ముండవును, సకలప్రాణి పరిపాలనావస్థితుండవును నయిన నీ వీ దీనయుం బాపరహితయుం గామినియు నగు నన్ను వధియింపం బూని యేల వెనుదగులుచున్న వాఁడవు? ధర్మతత్త్వం బెఱుంగువారు సతీజనంబులు గృతాపరాధ లైనం దీనవత్సలతం జేసి వధింప" రని పలికి మఱియు నా ధరణీదేవి పృథుచక్రవర్తి కిట్లనియె.

4-475-కంద పద్యము

జననాథచంద్ర! యీ భూ
జనకోటికి యాన పాత్ర సద్దృఢస్థితితో
ఘనదృఢశరీర యగు నే
ననయము నాధారభూత నగుచుఁ జరింతున్.

4-476-తేటగీతి

ఇట్టి నన్నుఁ గృపామతి యెడలి యిటు వి
పాటనము చేసి త్రుంచెదు? ప్రజలు నీట
మునుఁగకుండంగ నే రీతి ననఘచరిత!
యరసి రక్షింతు వన నతం డవని కనియె.

4-477-వచనము

“ధరిత్రీ! మదీయాజ్ఞోల్లంఘనంబు చేయుచున్న దానవు; అదియునుం గాక, నీవు యజ్ఞంబు లందు హవిర్భాగంబుల ననుభవించుచు ధాన్యాదికంబుల విస్తరింపం జేయక గోరూపంబు ధరియించి యనయంబుఁ దృణభక్షణంబు చేయుచుఁ బాలం బిదుకక నీ యంద యడంచికొంటివి; నీ యందున్న యోషధీ బీజంబులు బ్రహ్మచేతం బూర్వంబునందె కల్పింపంబడిన యవి; వానిని నీ దేహంబునంద యడంచికొని యిప్పు డీయక మూఢహృదయవు, మందంతివియు నై యపరాధంబు చేసిన దురాత్మురాల వగు; నిను నా బాణంబులచే జర్జరీ భూతశరీరం జేసి వధియించి నీ మేని మాంసంబునం జేసి క్షుద్బాధితులు దీనులు నగు నీ ప్రజల యార్తి నివారించెద; నీవు కామిని నంటివి; స్త్రీ పురుష నపుంసకులలో నెవ్వరేని భూతదయ లేక స్వమాత్ర పోషకు లగుచు నిరనుక్రోశంబుగ భూతద్రోహులై వర్తింతురు; వారిని రాజులు వధించినన్ వధంబు గాదు; గాన దానఁ బాపంబు వొరయదు; నీవు కామిని పైనను దుర్మదవు స్తబ్ధవు నగుచు మాయాగోరూపంబునం బాఱిపోవుచున్న నిన్నుఁ దిలలంతల ఖండంబులు చేసి నా యోగమహిమం బ్రాణికోటి నుద్ధరించెద;” నని పలికి రోషభీషణాకారంబు ధరియించి దండధరుని వడువున వర్తించు పృథునిం జూచి వడంకుచు మేదిని ప్రాంజలియై యిట్లని నుతియింపం దొడంగె.

4-478-కంద పద్యము

ఓనాథ! పరమపురుషుఁడ

పై నిజమాయా గుణంబు లందిన కతనన్

నానావిధ దేహములం
బూనుదు సగుణండ వగుచు బుధనుతచరితా!

4-479-వచనము

అట్టి నీవు.

4-480-కంద పద్యము

నను సకల జీవతతికిని
మును నీ వాధారభూతముగ నిర్మింపన్
విను నా యందుఁ జతుర్విధ
ఘన భూతవిసర్గ మర్థిఁ గైకొన వలసెన్.

4-481-వచనము

అట్లయి యుండ.

4-482-కంద పద్యము

నను నుద్యతాయుధుఁడవై
మనుజేంద్ర! వధింపఁ బూని మసలెదు; నీకం
టెను నన్యుని నెవ్వని నే
ఘనముగ శరణంబు జొత్తుఁ గరుణాభరణా!

4-483-వచనము

అదియునుం గాక.

4-484-సీస పద్యము

అనఘ! స్వకీయంబునై యతర్కితమునై;
 మహిమ నొప్పిన భవన్మాయచేత
సకల చరాచర సర్గంబు నిర్మించి;
 ధర్మార్థపరుఁడవై తనరు దీశ!
నీవిక్రమము నవనీరజలోచన!;
 సకల లోకులకు దుర్జయము; దలఁపఁ
దగు నట్టి నీవు స్వతంత్రుఁడ వగుటను;
 బ్రహ్మఁ బుట్టించి యా బ్రహ్మచేత

4-484.1-తేటగీతి

సకల జగములఁ జేయింతు సమతఁ బేర్చి;
యేక మయ్యు మహాత్మ! యనేక విధము
లగుచు వెలుఁగొందు చుందు వీ యఖిలమందుఁ
జారుతరమూర్తి! యో! పృథుచక్రవర్తి!

4-485-వచనము

మఱియు మహాభూతేంద్రియ కారక చేతనాహంకారంబులను శక్తులం జేసి యీ జగంబుల కుత్పత్తి స్థితి లయంబులఁ గావించుచు సముత్కట విరుద్ధ శక్తులు గల పురుషునకు నమస్కరించెద; నట్టి పరమ పురుషుండ వయిన నీవు నిజనిర్మితంబును భూతేంద్రియాంతఃకరణాత్మకంబును నైన యీ విశ్వంబు సంస్థాపింపం బూని.

4-486-సీస పద్యము

ఆదివరాహంబవై యా రసాతల;
గతనైన నన్ను నక్కటికతోడ
నుద్ధరించితి; వట్టి యుదకాగ్ర భాగంబు;
నం దర్థి నున్న నే ననెఁడి నావ
యందున్న నిఖిల ప్రజావళి రక్షింపఁ;
గోరి యీ పృథురూపధారి వైతి;
వట్టి భూభరణుండ వైన నీ విప్పుడు ప;
యో నిమిత్తంబుగా నుగ్రచరుఁడ

4-486.1-తేటగీతి

వగుచు నన్ను వధించెద ననుచు బుద్ధిఁ
దలఁచుచున్నాఁడ; విది విచిత్రంబుగాదె?
విశ్వసంపాద్య! నిరవద్య! వేదవేద్య!
భవ్యగుణసాంద్ర! వైన్య భూపాలచంద్ర!

4-487-వచనము

కావున నీశ్వరగుణ సర్గరూపంబైన మాయచే మోహితాంతఃకరణుల మైన మా వంటి వారలచేత హరిభక్తుల చేష్టితం బెఱుంగఁబడదన్న హరి చేష్టితం బెట్లెఱుంగంబడు? అట్టి జితేంద్రియ యశస్కరు లయిన వారలకు నమస్కరింతు" అనుచు నివ్విధంబునం గోపప్రస్ఫురితాధరుం డైన పృథుని నభినుతించి ధైర్యం బవలంబించి వెండియు నిట్లనియె.

4-488-కంద పద్యము

విమలాత్మ; నాకు నభయము
సమకూరెడు నట్లుగాఁగ సన్మతి నీ క్రో
ధము నుపశమించి కరుణిం
పుము; నా విన్నపము వినుము పురుషనిధానా!

4-489-కంద పద్యము

ధర విరులు గందకుండఁగ
సరసగతిం బూవుఁదేనెఁ జవిగొను నిందిం
దిరవిభు కైవడి బుధుఁడగు
పురుషుఁడు సారాంశ మాత్మఁబూని గ్రహించున్.

4-490-సీస పద్యము

వినవయ్య! తత్త్వదర్శనులైన యట్టి స;
న్మునులచే నైహికాముష్మికంబు
లైన ఫలప్రాప్తి కర్థిఁ గృష్యాద్యగ్ని;
హోత్రాద్యుపాయంబు లుర్విమీఁద
దృష్టంబులును నాచరితములు నగుచుఁ దా;
నెనయుఁదగు నుపాయ మెవ్వఁ డాచ
రించును వాఁడు ప్రాపించుఁ ద త్ఫలమును;
విద్వాంసుఁ డైనను వెలయ దీని

4-490.1-తేటగీతి

నాదరింపక తనయంత నాచరించె
నేని నాయాసమే యగుఁ గాని తత్ఫ
లమును బొందఁడు బహుళకాలమునకైన
వినుతగుణశీల! మాటలు వేయునేల?

4-491-వచనము

అని మఱియు మహి యిట్లనియె.

4-492-చంపకమాల

జలరుహగర్భుచేత మును చాల సృజింపఁగఁబడ్డ యోషధుల్
కలుషమతిన్ ధృతవ్రతులుగాని యసజ్జనభుజ్యమానమై
వెలయుటఁ జూచి యే నృపతివీరులు మాన్పమిఁ జోరబాధలన్
బలుమఱుఁ బొంది యే నపరిపాలితనై కృశియించి పెండియున్.

4-493-కంద పద్యము

అనుపమ మఖకర్మక్రియ
లనయము లేకుంట నే ననాదృత నగుచున్
జననాయక! యీ లోకము
ఘనచోరీభూత మగుటఁ గనుఁగొని యంతన్.

4-494-కంద పద్యము

సవనాది సిద్ధి కొఱకై
తవిలి తదీయౌషధీ వితతులను ధరణీ

ధవ! యే నపుడు గ్రసించితి
నవియును నా యందు జీర్ణమయ్యెఁ గడంకన్.

4-495-కంద పద్యము

వినుము వాని నొక యుపాయం
బునఁ గ్రమ్మఱఁ బడయవచ్చు భూవరచంద్రా!
విను మది యెఱిఁగించెద నీ
కును వత్సలురాల నగుట గురుతరచరితా!

4-496-కంద పద్యము

అనయము నా కొక వత్సము
ననురూప సుదోహనమ్ము ననురూపక దో
గ్ధను గల్పింపుమ యట్లయి
నను నీ భూతముల కవనినాయక! దానన్.

4-497-కంద పద్యము

పరఁగ నభీప్సితములు బల
కరములు నగు నన్ను దుగ్ధ కలితము లగు భా
సురకామంబులఁ బిదికెద
నరనాయకచంద్ర! వినుము నావచనంబుల్.

4-498-చంపకమాల

మనుజవరేణ్య! యేను విషమస్థలినై యుపు డున్నదాన; నో
యన్న జలదాగమోదిత పయః ప్రకరంబు తదాగమంబు వో

యునను దదంబువుల్ పుడమి నింకక యంతట నిల్చునట్లుగా
మనునిభ; నన్ను నిప్పుడు సమస్థలినై పెనుపొందఁ జేయవే."

4-499-కంద పద్యము

అని యివ్విధమున నా భూ
వనితామణి పలుకు మధుర వచనంబులు దా
విని యనురాగము దన మన
మునఁ గడలుకొనంగ రాజముఖ్యుం డంతన్.

4-500-చంపకమాల

మనువును దూడఁ జేసి గరిమన్ నిజపాణితలంబు లీల దో
హనముగఁ జేసి యందు సకలౌషధులం బిదికెం గ్రమంబునం
దనరఁగఁ దద్విధంబునను దత్పృథు వత్సలయైన భూమియం
దనయము వారువారును బ్రియంబగు కోర్కులు వొంది రున్నతిన్.

4-501-సీస పద్యము

బలసి ఋషుల్ బృహస్పతి వత్సకంబుగా;
 నర్థించి తమ యింద్రియంబు లందు
నంచితచ్ఛందోమయక్షీరమును దేవ;
 తలు సురరాజు వత్సంబు గాఁగఁ
గనక పాత్రము నందుఁ దనరు నోజోబల;
 వీర్యామృతంబునై వెలయు పయసు

దైత్య దానవులు దైత్యశ్రేష్ఠుఁ డగు గుణ;
శాలిఁ బ్రహ్లాదు వత్సంబుఁ జేసి

4-501.1-తేటగీతి

ఘన సురాసవ రూప దుగ్ధంబు వరుస
నప్సరోజన గంధర్వు లలరి యపుడు
దనర విశ్వావసువు వత్సమునుగఁ జేసి
పద్మమయ నిర్మితంబైన పాత్రమందు

4-502-వచనము

మాధుర్య సౌందర్య సహిత గాంధర్వక్షీరంబును బితృదేవతలు సూర్య వత్సకంబుగా నామ పాత్రంబునందుఁ గవ్యం బను దుగ్ధంబును, సిద్ధులు గపిల వత్సకంబుగా నాకాశ పాత్రమందు సంకల్పనారూపాణిమాది సిద్ధి యను క్షీరంబును, విద్యాధరాదులు తద్వత్సకంబును దత్పాత్రకంబునుంగా ఖేచరత్వాది వ్యాపారరూప క్షీరంబును, గింపురుషాదులు మయవత్సకంబును నాత్మ పాత్రంబునుంగా సంకల్పమాత్ర ప్రభవంబు నంతర్థానాద్భుతాత్మ సంబంధియు నగు మాయ యను క్షీరంబును, యక్షరక్షోభూత పిశాచంబులు భూతేశ వత్సకంబుఁ గపాల పాత్రంబునుంగా రుధిరాసవం బను క్షీరంబును, నహిదందశూక సర్ప నాగంబులు దక్షకవత్సంబును బిలపాత్రంబునుంగా విషరూప క్షీరంబును, బశువులు గోవృషవత్సకంబు నరణ్య పాత్రంబునుంగాఁ దృణం బను క్షీరంబును, గ్రవ్యాదమృగంబులు మృగేంద్ర వత్సకంబును నాత్మ కళేబర పాత్రకంబునుంగాఁ గ్రవ్యం బను

దుగ్ధంబును, విహంగంబులు సుపర్ణవత్సకంబు నిజకాయ పాత్రంబునుంగాఁ గీటకఫలాదికం బను దుగ్ధంబును, వనస్పతులు వటవత్సకంబుగా భిన్నరోహరూప పయస్సును, గిరులు హిమవద్వత్సకంబును నిజసాను పాత్రకంబునుంగా నానాధాతువులను, దుగ్ధంబునుంగా నివ్విధంబున సమస్త చరాచర వర్గంబు స్వముఖ్యవత్సకంబును స్వస్వపాత్రకంబునుంగా భిన్నరూపంబు లైన క్షీరంబులం బిదికె" అని చెప్పి మఱియును.

4-503-కంద పద్యము

క్రమమున నిటు పృథ్వాదులు
దమతమ కామితము లనఁగఁ దగు భిన్నక్షీ
రము దోహన వత్సక భే
దమునం దగఁ బిదికి; రంత ధరణీధవుఁడున్.

4-504-తేటగీతి

సముచితానందమును బొంది సర్వకామ
దుఘ యనం దగు భూమిని దుహితఁగాఁగఁ
గోరి కైకొని నిజధనుఃకోటిచేత
భూరిగిరి కూటములఁ జూర్ణములుగఁ జేసి.

4-505-తేటగీతి

చండ దోర్దండలీల భూమండలంబు
సమతలంబుగఁ జేసి శశ్వత్ప్రసిద్ధి

నొంది యవ్విభుఁ డీ లోకమందు నెల్ల
ప్రజకుఁ దండ్రియు జీవనప్రదుఁడు నగుచు.

4-506-తేటగీతి

అక్క డక్కడఁ బూర్వంబునందు లేని
గ్రామ పట్టణ దుర్గ ఖర్వట పుళింద
ఖేట శబరాలయవ్రజ వాట ఘోష
వివిధ నిలయము లర్థిఁ గావించె నంత.

4-507-కంద పద్యము

వారును భయవిరహితులై
బోరనఁ దత్తన్నివాసముల యందు సుఖ
శ్రీరుచి నొప్పుచు నుండిరి
వారక యా పృథునిఁ బొగడ వశమె ధరిత్రిన్?

## 4-18-పృథుని యజ్ఞకర్మములు

4-508-సీస పద్యము

అని చెప్పి మునినాథుఁ డైన మైత్రేయుఁ డ;
విదురున కిట్లను వేడ్కతోడ
ననఘాత్మ? రాజర్షి యైన వైన్యుం డశ్వ;
మేధశతంబు సన్మేధతోడఁ
గావింతు నని దీక్ష గైకొని వ్రతనిష్ఠఁ;
దివిరి బ్రహ్మావర్త దేశమందు

నలరు మనుక్షేత్ర మందు సరస్వతీ;
నది వొంతఁ దా మహోన్నతి నొనర్చు

4-508.1-తేటగీతి

సవన కర్మ క్రియకు నతిశయ విశేష
ఫలము గలిగెడి నని బుద్ధిఁ దలఁచి యచట
వరుసఁ గావించు నతిశయాధ్వర మహోత్స
వము సహింపక యుండె న య్యమరవిభుఁడు.

4-509-సీస పద్యము

అట్టి యధ్వర కర్మమందు సాక్షాద్భగ;
వంతుఁడు హరి రమేశ్వరుఁడు లోక
గురుఁడును సర్వాత్మకుండును విభుఁడును;
నీరజభవ భవాన్వితుఁడు లోక
పాలక నిఖిల సుపర్వానుగుండును;
యజ్ఞాంగుఁ డఖిలాధ్వరాది విభుఁడు
గంధర్వ ముని సిద్ధగణ సాధ్య విద్యాధ;
రాప్సరో దైత్య గుహ్యాళి దాన

4-509.1-తేటగీతి

వాది జేగీయ మానుఁ డత్యలఘుయశుఁడు
ప్రకట నందసునందాది పార్షదుండు

కపిల నారద సనకాదికప్రముఖ్య
మహిత యోగీంద్ర సంస్తూయమానుఁ డజుఁడు.

4-510-వచనము

మఱియుం బరమ భాగవత సేవితుండును నారాయణాంశ ప్రభవుండును నైన పృథుచక్రవర్తికి భూమి హవిరాదిదోగ్ధ్రి యయ్యును సర్వకామదుఘయై సమస్త పదార్థంబులం బిదుకుచుండె; మఱియుఁ దరువులు ఘనతరాకారంబులు గలిగి మకరంద స్రావు లగుచు నిక్షుద్రాక్షాది రసంబులును దధిక్షీరాజ్య తక్ర పానకాదికంబులును వర్షింప నవి యెల్ల నదులు వహించె; సముద్రంబులు హీరాది రత్న విశేషంబుల నీనుచుండె; పర్వతంబులు భక్ష్య భోజ్య లేహ్య చోష్యంబు లను చతుర్విధాన్నంబులు గురియుచుండె; లోకపాల సమేతులైన సకల జనంబులు నుపాయానంబులు దెచ్చి యిచ్చుచుండిరి; ఇట్టి పరిపూర్ణ విభవాభిరాముండై యధోక్షజసేవాపరాయణుండగు పృథుచక్రవర్తి యేకోనశతాశ్వమేధంబులు సన్మేధంబునం గావించి నూఱవ యాగంబునందు యజ్ఞపతి యైన పుండరీకాక్షుని యజించుచుండం దదీయ పరమోత్సవంబు సహింపం జాలక.

4-511-కంద పద్యము

అమరేంద్రుఁడు ఘనరోషో
ద్ధముఁడై పాషండ వేషకలితతిరోభా
వమునం దన్మఖపశువుం
గ్రమమేది హరించి చనియె గగనంబునకున్.

4-512-వచనము

అట్లు చను నప్పుడు.

4-513-కంద పద్యము

అనఘుం డగు నత్రి మహా
ముని చోదితుఁ డగుచుఁ బృథుని పుత్త్రుఁడు బాణా
సనతూణీర ధరుండై
యనిమిషపతి వెనుకఁ జనియె నతిదర్పమునన్.

4-514-వచనము

అట్లు చనిచని ముందట.

4-515-సీస పద్యము

యజ్ఞ సాధన పశుహారణుని వధియించు;
ధర్మంబునందు నధర్మ మనెడి
బుద్ధిఁ బుట్టఁగఁ జేయ భూరి మాయా వేష;
ధారియై యరుగు సుత్త్రాముఁ గదిసి
నిలు నిలు మని యార్చి నిజగుణధ్వని చేసి;
ఘన జటాభస్మాస్థి కలిత మయిన
మూర్తిఁ గనుంగొని మూర్తీభవించిన;
ధర్మంబ కా బుద్ధిఁ దలఁచి యమర

4-515.1-తేటగీతి

నాయకుని మీఁద సాయక మేయఁ జాల
కున్నఁ గనుఁగొని యత్రి విద్వన్నుతుండు
వైన్యజనకనె వాసవు వలను చూపి
మనములోపల రోషంబు మల్లడింప.

4-516-కంద పద్యము

విను మితఁడు యజ్ఞహంతయు
ననిమిషనికరాధిపుండు నగు నింద్రుఁడు గా
వున నితని జయింపుము నీ
వని ముమ్మా టుచ్చరింప నవ్వైన్యుఁడున్.

4-517-మత్తేభ విక్రీడితము

విను వీధిం జను దేవవల్లభునిపై వీరుండు గ్రోధాంతరం
గ నిరూఢిన్ మృగరా ట్కిశోరము మహాగంధద్విపేంద్రంబు మీఁ
దను లంఘించు విధంబునం బడిన నాతం డశ్వ చౌర్యైక సా
ధన రూపంబుఁ దదశ్వమున్ విడిచి యంతర్ధానముం బొందినన్.

4-518-కంద పద్యము

వీరుఁడు పృథు భూపాలకు
మారుఁడు నిజ యజ్ఞపశువు మరలం గొని దు
ర్వారబలుఁ డగుచు జనకుని
భూరి సవనరాజపుణ్యభూమికి వచ్చెన్.

4-519-వచనము

అయ్యవసరంబున నచ్చట నున్న పరమర్షిపుంగవు లతని యద్భుత కర్మంబు గనుంగొని యాశ్చర్యంబు నొంది యతనికి 'జితాశ్వుం' డను నన్వర్థ నామంబు పెట్టి యున్న సమయంబున.

4-520-చంపకమాల

మఱియును దేవతాపతి తమః పటలంబు జనింపఁ జేసి యె
వ్వరుఁ దనుఁ గానకుండ ననివారణఁ గాంచనపాశ బద్ధ మై
సురుచిరయూపదారు పరిశోభితమైన హయంబుఁ గొంచుఁ జె
చ్చెఱ వినువీధి నేగఁగ ఋషిప్రవరుం డగు నత్రి చెప్పినన్.

4-521-కంద పద్యము

విని పృథు భూవర తనయుఁడు
ఘన బలమునఁ జని కపాలఖట్వాంగము లో
లిని ధరియించి రయంబునఁ
జను నింద్రునిఁ గాంచి నొంపఁజాలక యంతన్.

4-522-ఉత్పలమాల

క్రమ్మఱ నత్రిచేఁ దెలుపఁగాఁబడి పైన్యతనూభవుండు రో
షమ్మునఁ దోఁకఁ ద్రొక్కిన భుజంగమపుంగవుఁ బోలి యుగ్రుఁడై
యమ్మరిఁబోసినం గని సురాధిపుఁ డెప్పటి యట్లఁ బాఱె న
శ్వమ్మును రూపమున్ విడిచి చాలఁ దిరోహితుఁడై రయంబునన్.

4-523-వచనము

అట్లు చనినం బశువుం గొని మరలి యవ్వీరోత్తముండు పితృ యజ్ఞ శాలకుం జనుదెంచె; నంత.

4-524-సీస పద్యము

హరిహయుం డధ్వర హయ హరణార్థమై;
మించి కైకొని విసర్జించి నట్టి
భూరి యమంగళ భూత మాయారూప;
ములను ధరించిరి మూఢజనులు;
పాషండ చిహ్నముల్ పఱఁగుట వారలు;
జగతిపై నగ్నవేషములు గలుగు
జైనులు భూరి కాషాయ వస్త్రంబులు;
ధరియించు బౌద్ధులుఁ దగ జటాస్థి

4-524.1-తేటగీతి

భస్మధారులు నయిన కాపాలికాదు
లనఁగ వెలసిరి లోకంబులందుఁ జాలఁ
దలఁప ధర్మోపమం బనఁదగు నధర్మ
మందు నభిరతి వొడమిన యజ్ఞజనులు.

4-525-వచనము

తదీయ చిహ్నంబులు పారంపర్యంబుగా ధరియింపం దొడంగిరి; తద్వృత్తాంతంబు భగవంతుం డయిన పృథుచక్రవర్తి యెఱింగి కుపితుండై యుద్యతకార్ముకుం డగుచు నింద్రుని మీఁద బాణంబుఁ నేయ

నుద్యమించిన ఋత్విక్కులు శక్రవధోద్యుక్తుండు నసహ్య రంహుండు
నయిన పృథు చక్రవర్తిం గనుంగొని యిట్లనిరి.

4-526-కంద పద్యము

" జననాయక! యజ్ఞములం
దనుపమ విధిచోదితంబు లనఁదగు పశు బం
ధన హింసల కా కితరుల
ఘనదీక్షితునకు వధింపఁ గాదండ్రు బుధుల్.

4-527-వచనము

కావున నీ విపు డింద్రవధోద్యోగం బుపసంహరింపుము; భవదీయ
ధర్మవిరోధి యైన యట్టి యింద్రుని.

4-528-కంద పద్యము

జనపాల! వీర్యవంతము
లనఁదగు మంత్రములచేత నాహ్వానము చే
సిన నతఁ డిచటికి వచ్చును
జనుదెంచిన యమరవిభుని సరభసత దగన్.

4-529-కంద పద్యము

ధృతి చెదరఁ బట్టి శిఖి కా
హుతిఁగా వేల్చెదము; దాన నుర్వీవర! నీ
వితత మహో హత వీర్యో
న్నతుఁడై చెడిపోవు నమరనాథుం డంతన్."

4-530-వచనము

అని పృథుని వారించి ఋత్విగ్జనంబులు గుపితస్వాంతులై హస్తంబుల స్రుక్స్రువంబులు ధరియించి వేల్చు సమయంబునం జతుర్ముఖుండు చనుదెంచి ఋత్విజులం గనుంగొని యిట్లనియె "యజ్ఞంబు లందు యజింపంబడు దేవత లెవ్వని యంశంబు; లెవ్వండు యజ్ఞ నామకంబగు భగవదంశంబగు, నట్టి యింద్రుండు మీచేత వధార్హుండు గాఁ డితండు భగవదంశ సంభవుం డగుట నీ యజ్ఞకర్మవిధ్వంసనేచ్ఛుం డయి కావించు ధర్మవ్యతికరంబులు చూచుచుండవలయుం గాని ప్రతీకారంబులు గర్తవ్యంబులు గావు; ఈ పృథుకీర్తి యగు నీ పృథునకు నేకోనశతంబగు నధ్వరప్రయోగ ఫలంబు సిద్ధించుం గాక" యని పృథు చక్రవర్తి కిట్లనియె.

4-531-సీస పద్యము

" మనుజేంద్ర! మోక్షధర్మము నెఱింగిన నీకు;
సవనముల్ చేయుట చాలు మఱియు
నే విధంబున నైన దేవేంద్రు మనమునఁ;
గైకొని రోషంబు గదురకుండ
వర్తింప వలయును; వాసవుండును నీవుఁ;
బూని సుశ్లోకులు గాన మీకు
మంగళం బగుఁ గాక; మానవనాథ! నీ;
చిత్తంబులోపలఁ జింతఁ దొఱఁగి

4-531.1-తేటగీతి

మించి మద్వాక్యముల నాదరించి వినుము
దైవ హితమగు యజ్ఞంబుఁ దగిలి చేయు
కొఱకు భవదీయ చిత్తంబు గుంది రోష
కలుషితంబైన నజ్ఞాన కలిత మగును.

4-532-వచనము

భవదీయ యజ్ఞహననార్థం బశ్వహరణుం డైన యింద్రుండు దేవతల లోనన్ దురాగ్రహుం డగుటం జేసి యతనిచేత నిర్మింపంబడి చిత్తాకర్షకంబులైన యీ పాషండ ధర్మంబుల చేత ధర్మ వ్యతికరంబు గలుగుం గాన యీ యజ్ఞంబు చాలింపుము;" అని మఱియు నిట్లనియె.

4-533-సీస పద్యము

" అది గాక వినుము; వేనాపచారంబునఁ;
బూని విలుప్తంబు లైన యట్టి
యలఘు నానా సమయానుధర్మంబులఁ;
బరిపాలనము చేయఁ బరఁగి వేను
దేహంబు వలనను దివిరి జనించి యు;
న్నాడవు; నారాయణాంశజుఁడవు;
గావున నీ నరకలితలోకంబునఁ;
బుట్టిన తెఱఁగు నీ బుద్ధిఁ దలఁచి

4-533.1-తేటగీతి

యెవరిచే నేమిటికి సృజియింప బడితి
వట్టి యా బ్రహ్మసంకల్ప మవనినాథ!
తప్పకుండఁగఁ బాలింపు ధర్మగతినిఁ
జారుశుభమూర్తి! యో! పృథుచక్రవర్తి!"

4-534-వచనము

అని మఱియు నిట్లనియె "ఉపధర్మ మాతయుం బ్రచండ పాషండ మార్గంబు నైన యీ యింద్రకృతం బగు మాయను జయింపుము" అని వనజసంభవుం డానతిచ్చినం బృథుచక్రవర్తియుఁ దదాజ్ఞాపితుండై దేవేంద్రునితోడ బద్ధ సఖ్యం డయ్యె; అంత నవభృథానంతరంబున.

4-535-చంపకమాల

సురుచిర లబ్ద దక్షిణల నొంపునఁ బొంపిరిపోయి భూసురుల్
వరుసను బెక్కు దీవన లవారణ నిచ్చిరి; సర్వదేవతల్
భరిత ముదంతరంగములఁ బాయనివేడ్క వరంబు లిచ్చి రా
నరవరుఁ డైన వైన్యునకు నందిత కీర్తికిఁ బుణ్యమూర్తికిన్.

4-536-వచనము

అంత నచ్చటి జనంబు లిట్లనిరి.

4-537-తేటగీతి

" అనఘ! నీ చేత నాదృతు లైరి సర్వ
జనులు మఱి దానమానోపచారములను

బిత్పు సుదేవర్షి మానవ వితతి పూజ
నొంది సంచిత మోదంబు నొందె నయ్య! "

4-538-వచనము

అని పలుకు సమయంబున యజ్ఞభోక్తయు యజ్ఞవిభుండును భగవంతుండును నైన సర్వేశ్వరుం డింద్ర సమేతుండై యచ్చటికిం జనుదెంచి యా పృథున కిట్లనియె.

4-539-కంద పద్యము

" జనవర! భవదీయంబై
జననుతమగు నశ్వమేధ శతమున కిపు డీ
యనిమిషపతి భంగము చే
సిన కతన క్షమాపణంబు చేసెడిఁ గంటే;

4-540-వచనము

కావున నితని క్షమింపుము; సత్పురుషు లగువారు దేహాభిమానులు గాకుండుటం జేసి భూతంబుల యెడ ద్రోహం బాచరింపరు; అట్లగుటం జేసి నీ వంటి మహాత్ములు దేవమాయా మోహితులై పరోపతాపంబులు చేసిరేని దీర్ఘతరంబైన వృద్ధజనసేవ వ్యర్థంబు గాదె; అదియునుం గాక, యీ శరీరం బవిద్యా కామకర్మంబుల చేత నారబ్ధం బని తెలిసిన పరమజ్ఞాని యీ దేహంబు నందు ననుషక్తుండు గాకుండుట సహజం బన, దేహోత్పాదితంబులైన గృహదారాదులయందు మమత్వంబు లేకుండుటం జెప్ప నేల? ఇట్టి దేహంబు నందున్న యాత్మ యేకంబును,

శుద్ధ స్వరూపంబును, స్వయంజ్యోతియు, నిర్గుణంబును, గుణాశ్రయంబును, వ్యాప్య వ్యాపకంబును, నసంవృతంబును, సాక్షిభూతంబును, నిరాత్మకంబును నగు; దీని దేహంబుకంటె వేఱుగా నెవ్వండు తెలియు వాఁడు మత్పరుడగుటం జేసి దేహధారియై యుండియుఁ దద్గుణంబులం బొరయక వర్తించు; మఱియు నెవ్వండేని స్వధర్మాచార పరుండును, నిష్కాముండును, శ్రద్ధాయుక్తుండునై నన్నెల్లప్పుడు భజియించు నట్టివాని మనంబు క్రమంబునం బ్రసన్నంబగు; నట్లు ప్రసన్న మనస్కుండును, ద్రిగుణాతీతుండును, సమ్యగ్దర్శనుండును నైన యతండు మదీయ సమవస్థాన రూపశాంతి నొందును; అదియ కైవల్యపదంబనంబడు; కూటస్థం బైన యీ యాత్మ యుదాసీన భూతం బైనను దీని ద్రవ్యజ్ఞాన క్రియామనంబులకు నీశ్వరుంగా నెవ్వండు దెలియు, వాఁడు భవంబు నొందకుండు; ఈ సంసారంబు ద్రవ్య క్రియా కారక చేతనాత్మకం బగుటంజేసి ప్రభిన్న దేహోపాధికంబు; గావునఁ బ్రాప్తంబు లైన యాపత్సంపదలయందు మత్పరులైన మహాత్ములు వికారంబు నొందరు; కావున నీవు సుఖదుఃఖంబుల యందు సమచిత్తుండవును, సమానోత్తమ మధ్యమాధముండవును, జితేంద్రియాశయుండవునునై వినిష్పాదితాఖిలామాత్యాది సంయుతుండవై, యఖిలలోక రక్షణంబు చేయు" మని వెండియు నిట్లనియె.

4-541-సీస పద్యము

" పార్థివోత్తములకుఁ బ్రజల రక్షించుట;
పరమ ధర్మం బగు నరవరేణ్య!
ధరణీశులకుఁ బ్రజాపరిపాలనంబునఁ;
బూని లోకులు చేయు పుణ్యమందు
షష్ఠాంశ మర్థిని సంప్రాప్త మగు నట్లు;
ప్రజలఁ బ్రోవని రాజు ప్రజలచేత
నపహృత సత్పుణ్యుఁడై వారు గావించు;
ఘనపాప ఫలముఁ దా ననుభవించు

4-541.1-తేటగీతి

కాన నీవును విప్రవరానుమతము
సాంప్రదాయిక విధమునై జరగు ధర్మ
మహిమఁ జేపట్టి యర్థకామముల యందు
సమత నమ్మోఁటి యందు నాసక్తి లేక.

4-542-వచనము

ఇవ్విధంబున.

4-543-కంద పద్యము

జనులకు ననురక్తుఁడవై
జననాయక! నీవు ధరణి సమచిత్తుఁడవై
యనయముఁ బరిపాలించిన
సనకాదులఁ గాంతు వాత్మ సదనము నందున్.

4-544-సీస పద్యము

భూవర! యోగ తపో మఖంబుల చేతఁ;
గైకొని సులభుండఁ గాని యేను
సమచిత్తు లైన సజ్జనుల చిత్తంబుల;
వర్తించుచుండెడివాఁడ నగుటఁ
జేసి తావక శమ శీల విమత్సర;
కీర్తనముల వశీకృతుఁడ నైతి;
నే నీకు నొక వరం బిచ్చెద వేఁడుము;"
నావుడు విని మేదినీ వరుండు

4-544.1-తేటగీతి

లోకగురుఁ డైన యప్పుండరీక నయనుఁ
డానతిచ్చిన మృదులలితామృతోప
మానవాక్యము లాత్మీయ మస్తకమునఁ
దాల్చి సమ్మోదితాత్ముఁడై ధరణి విభుఁడు.

4-545-కంద పద్యము

తన పాదములకు భక్తిన్
వినతుండై యాత్మకర్మ వితతికి లజ్జం
దనరుచు నున్న సురేంద్రునిఁ
గనుఁగొని సత్ప్రేమ మొదవఁ గౌఁగిటఁ జేర్చెన్.

4-546-వచనము

ఇట్లు గౌఁగిటం జేర్చి గతద్వేషుండై యున్న యనంతరంబ.

4-547-మత్తేభ విక్రీడితము

భగవంతుండును విశ్వరూపకుఁడునై భాసిల్లు నవ్విష్ణుఁ డా
జగతీనాథకృతార్చనా నతులచే సంప్రీత చేతస్కుఁడున్
నిగ్రహీతాంఘ్రి సరోరుహద్వయుఁడునై నిల్చెం బ్రయాణాభిము
ఖ్యగరిష్ఠాత్మకుఁ డయ్యు నా పృథునిపైఁ గారుణ్య మేపారఁగన్.

4-548-వచనము

ఇట్లు దనమీఁది యనుగ్రహంబునం జేసి విలంబితుం డగుటయు నయ్యాదిరాజన్యుం డైన పృథుచక్రవర్తి యమ్ముకుంద సందర్శనానంద బాష్పజలబిందు సందోహ కందళిత నయనారవిందుండై యవ్విభుమూర్తిం గనుంగొని కనుంగొన లేక గద్గదకంఠుండై పలుకలేక యుండియు నెట్టకేలకుఁ దన హృదయంబున నద్దేవుని నుపగూహనంబు గావించి తన్మూర్తి ధరియించి కన్నులం దొరఁగు నానంద బాష్పంబులు దుడిచికొని విలోకనంబు చేయుచు, నతృప్తదృగ్గోచరుండును, గరుడ స్కంధ విన్యస్త హస్తుండును, వసుధాతలస్థిత పాదకమలుండును నై యొప్పు నద్దివ్యపురుషున కిట్లనియె.

## 4-19-పృథుండు హరినిస్తుతించుట

4-549-కంద పద్యము

" వరదా! యీశ్వర! నిను స
త్పురుషుఁడు దేహాభిమాన భోగములకు నై

వరమెట్లు గోరు నిహసుఖ
వరములు నారకుల కైన వఱలవె చెప్పుమా.

4-550-చంపకమాల

ఘన మగు దేవ! యీ వరమె కాదు మహాత్మక వాగ్వినిర్గతం
బనఁదగు తావకీన చరణాంబుజ చారు మరందరూపమై
తనరిన కీర్తియున్ విని ముదంబును బొందఁగ లేని మోక్ష మై
నను మదిఁ గోర నొల్ల నఘనాశ! రమేశ! సరోజలోచనా!

4-551-కంద పద్యము

అదిగాన పద్మలోచన!
సదమల భవదీయ ఘనయశము వినుటకునై
పదివేల చెవులు కృప ని
మ్మదియే నా యభిమతంబు నిపుడు ముకుందా!

4-552-చంపకమాల

అనఘ! మహాత్మ వాగ్గళితమైన భవత్పద పంకజాత సం
జనిత సుధాకణానిలవశంబున విస్మృ తతత్త్వ మార్గవ
ర్తను లగు దుష్టయోగులకుఁ గ్రమ్మఱఁ దత్త్వముఁ జూపఁజాలు ని
ట్లొనరుట దక్క నన్య వర మొల్లఁ బయోరుహ పత్రలోచనా!

4-553-సీస పద్యము

వినుత మంగళ యశోవిభవ! సర్వేశ్వర!;
యిందిర గుణసంగ్రహేచ్ఛఁ జేసి

యే నీదు శివతరం బైన సత్కీర్తి ని;
నర్థిమై వరియించె నట్టి కీర్తి
కలిత సత్పురుష సంగమము గల్గుచు నుండ;
ధృతినెవ్వఁడేని యాదృచ్ఛికతను
జేసియునొకమాటు చెవులార విన్నవాఁ;
డనయంబును గుణజ్ఞుఁ డయ్యేనేని

4-553.1-తేటగీతి

విరతి నేరీతి బొందును ధరణిఁ బశువుఁ
దక్కఁ దక్కిన తజ్జుండు దనుజ భేది
గాన యుత్సుకమతి నైన యేను లక్ష్మి
కరణి నిన్ను భజింతు; నో! పరమపురుష!

4-554-వచనము

ఇట్లు భవదీయ సేవాతత్పరులమైన యిందిరయు నేను నేక పదార్థాభిలాషం జేసి స్పర్థమానుల మగుచున్న మా యిద్దఱకును బర్యాయసేవం జేసి కలహంబు లేకుండని;మ్మట్లు గాక భవదీయ చరణ సరోరుహ సేవాసక్త మనోవిస్తారుల మగుటం జేసి యేనయేన మున్ను భజియింతు నను తలంపులం గలహం బయిననుం గానిమ్ము దేవా;" యని వెండియు నిట్లనియె.

4-555-సీస పద్యము

" జగదీశ! దేవ! యుష్మత్పద కైంకర్య;
 పరతఁ దనర్చు సాగరతనూజ
కృత్యంబునందు నకిల్బిష బుద్ధి నేఁ;
 బ్రీతిఁ గోరుట జగన్మాత యైన
యా రమాసతితోడి పైర మవశ్యంబుఁ;
 గల్గు నైనను దయాకార! నీవు
దీనవత్సలుఁడవు గాన స్వల్పం బైన;
 నధికంబు చేయుదు! వట్లుగాన

4-555.1-తేటగీతి

భవ్యచరిత! నిజస్వరూపంబునందు
నభిరతుఁడ పైన నీవు నన్నాదరించు
పగిది నిందిర నాదరింపవు మహాత్మ!
భక్తజనలోక మందార! భవవిదూర!

4-556-వచనము

ఇట్లగుటం జేసి సత్పురుషు లైనవారలు నిరస్తమాయాగుణ సముదయంబు గల నిన్ను భజియింతురు; వారలు భవత్పాదానుస్మరణ రూపంబయిన ప్రయోజనంబు దక్క నితర ప్రయోజనంబుల నెఱుంగరు; దేవా! సేవక జనంబులను వరంబులు వేఁడు మని జగద్వ్యామోహనంబు లైన వాక్యంబులు పలుకుదువు; యట్టి భవదీయ వాక్యతంత్రీనిబద్ధులు లోకులు గాకుండిరేని ఫలకాములై కర్మంబుల నెట్టు లాచరింతురు; యీశా! భవదీయ మాయావిమోహితులై జను లేమి కారణంబున

నీకంటె నితరంబులఁ గోరుచుందు? రిట్లగుటం జేసి తండ్రి దనంతన బాలహితం బాచరించు నట్లు మాకు నీవ హితాచరణం బాచరింప నర్హుండ" వని పలికిన నాదిరాజర్షి యైన పృథుచక్రవర్తి యర్థవంతంబు లయిన వచనంబులు విని విశ్వద్రష్టయగు నారాయణుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె "మహారాజా! దైవప్రేరితుండవై నా యెడ నిట్టి బుద్ధి గలుగుటం జేసి యచలాచలం బగు భక్తి వొడము; దానిచే దుస్తరం బగు మదీయమాయం దరింతువు; నీవు నాచే నాదిష్టం బగు కృత్యం బప్రమత్తుండ వగుచు నాచరించిన సకల శుభంబులం బొందుదువు; మదీయ భక్తజనంబులు స్వర్గాపవర్గనరకంబులం దుల్యంబులుగా నవలోకింతురు; గావున నీ యధ్యవసాయంబు నట్టిదియ; మఱియు మదీ యాదేశంబున దుస్త్యజం బగు రోషంబును ద్యజించి నా యెడ భక్తి సలిపితివి గాన యదియె నాకుఁ బరమహర్షదం బగు" అని యభినందించి యనుగ్రహించి యతండు గావించు పూజలు గయికొని గమనోన్ముఖుం డయ్యె; అయ్యవసరంబున.

4-557-సీస పద్యము

నర సిద్ధ చారణ సుర ముని గంధర్వ;
కిన్నర పితృ సాధ్య పన్నగులును
నఖిల జనంబులు హరిపార్శ్వవర్తులు;
నానంద మగ్నాంగు లగుచు; వేడ్క
యజ్ఞేశ చింతనుం డైన యా పృథువుచే;
సత్కారములఁ బొంది; సమ్మదమునఁ

జనిరి నిజాధి వాసములకు; భగవంతుఁ;
డైన నారాయణుం డచ్యుతుండు

4-557.1-తేటగీతి

దగ నుపాధ్యాయ సహితుఁడై తనరు పృథుని
విమలమతు లయి చూచుచు నమరవరులు
దన్ను జయజయ కలిత శబ్దములఁ బొగడఁ
జనియె నప్పుడు వైకుంఠ సదనమునకు.

4-558-వచనము

అంతఁ బృథుచక్రవర్తియు నింద్రియాగోచరుం డయ్యును దర్శితాత్ముండును దేవదేవుండును నయిన వాసుదేవునకు నమస్కరించి నిజపురంబునకుం జనుదెంచు సమయంబున మౌక్తిక కుసుమ మాలికా దుకూల స్వర్ణతోరణాలంకృతంబును, లలిత సుగంధ ధూప విలసితంబును, రత్నమయ రంగవల్లికా విరాజితంబును, ఫలపుష్ప లాజాక్షత దీపమాలికా స్తంభ పూగపోతాభిరామ ప్రతిగృహ ప్రాంగణంబును, మృగ మద ఘనసార చందనాగరు వాఃపూర సంసిక్త రథ్యావళీ విభాసితంబును, దరుపల్లవాభి శోభితంబును నైన పురంబుఁ బ్రవేశించి రాజమార్గంబునం జనుదేర మండిత రత్నకుండలమణి మరీచులు గండఫలకంబులం దాండవంబులు సలుపం, బురకామినులు గనక పాత్ర విరచితంబు లయిన యశేష మంగళ నీరాజనంబుల నివాళింప, శంఖ దుందుభి ప్రముఖ తూర్యఘోషంబులును బుత్విజ్నికాయాశీర్వచనంబులును జెలంగ, వందిమాగధ జన

సంస్తూయమానుం డగుచు విగత గర్వుండై యంతఃపురంబుం బ్రవేశించి; యనంతరంబ.

4-559-సీస పద్యము

సమధికమతిఁ బౌరజన జానపదులచేఁ;
 దనరారు వివిధ పూజనము లొంది
రాజు సంతుష్టాంతరంగుండుఁ బ్రియవర;
 ప్రదుఁడునై వారల బహువిధములఁ
బూజించె; నివ్విధంబున మహత్తరములై;
 నట్టి కర్మంబుల నాచరించు
చును నిరవద్య చేష్టుండై మహత్త్వముఁ;
 డన నొప్పు నా పృథు మనుజవిభుఁడు

4-559.1-తేటగీతి

మించి భూమండలంబుఁ బాలించి విశద
యశము సర్వధరాచక్రమందు నిలిపి
చారు శుభమూర్తి రాజన్యచక్రవర్తి
పరమ మోదమునఁ బరమ పదము నొందె."

4-560-కంద పద్యము

అని మైత్రేయ మహాముని
యనఘుఁడు విదురునకుఁ జెప్పె" నని శుకుఁ డభిమ

న్యుని సుతునకుఁ జెప్పిన తెఱఁ
గని సూతుఁడు చెప్పె శౌనకాదుల తోడన్.

4-561-వచనము

అట్లెఱింగించి వెండియు నిట్లనియె "ఇవ్విధంబున నశేష గుణ విజృంభితంబును, నిర్దోషంబును, సత్పురుష సత్కృతంబును నగు పృథుచక్రవర్తి యశంబును బ్రకటంబుగాఁ జేయంజాలు మైత్రేయునిం జూచి మహా భాగవతుం డైన విదురుం డిట్లనియె.

4-562-సీస పద్యము

" మునినాథ; విను పృథు జనపాల చంద్రుండు;
 సొబఁగొప్ప మేదినీసురులచేత
రాజ్యాభిషేక సంపూజ్యుఁడై దేవతా;
 గణముచే లబ్ధార్థ గుణుఁడు నగుచు
వైష్ణవతేజంబు వలనొప్ప ధరియించి;
 యర్థి సేయే కర్మ మాచరించె
నది నాకు నెఱిఁగింపు మనఘాత్మ; భూమి యే;
 రూఢి గవాకృతి రూఢ యెవని

4-562.1-తేటగీతి

విక్రమోద్దీప్తమై యొప్పి వెలయునట్టి
కర్మమున నిప్డు రాజన్య గణము బ్రతుకు

నట్టి పృథుకీర్తి ధరలోన నతి వివేకి
దవిలి యెవ్వఁడు వినకుండు ధన్యచరిత;"

## 4-20-పృథుని రాజ్యపాలన

4-563-కంద పద్యము

నావుడు విని మైత్రేయుం
డా విదురునిఁ జూచి పలికె నతి వినయమునం
బావన చరితుఁడు పృథుఁడు ధ
రావర నుతుఁ డలఘు యశుఁడు ప్రమదం బలరన్.

4-564-సీస పద్యము

రంగ దుత్తుంగ తరంగ గంగా యము;
నా మధ్యమందు నున్నతి వసించి
కైకొని ప్రారబ్ధ కర్మ క్షయార్థమై;
యఖిల పుణ్యంబుల ననుభవించు
చును సర్వదేశంబులను దనయాజ్ఞ యు;
ప్రతిహత సత్ప్రతాపమునఁ జెల్లఁ
బూని సర్వద్వీపములకు దాఁనొక్కండ;
వైష్ణవ భూసురావళికిఁ దక్కఁ

4-564.1-తేటగీతి

దక్కుఁ గల్గిన ప్రజ కెల్ల దండధరునిఁ
బోలి వర్తించుచును గొంతకాల మరుగఁ

దవిలి యొకనాడు దీర్ఘసత్త్రంబు చేయ
నర్థిఁ గైకొని దీక్షితుం డయ్యె; నందు.

4-565-తేటగీతి

రాజఋషి దేవఋషి పితృ బ్రహ్మ ఋషులు
జనవరునిచేత విహిత పూజనము లొంది
సమధి కైశ్వర్యగతి నున్న సమయమునను
జిరశుభాకారుఁ డా రాజశేఖరుండు.

4-566-సీస పద్యము

ఉన్నతోన్నతుఁడు సముత్తుంగ భుజుఁడు స;
న్మహనీయతర శోభమాన ముఖుఁడుఁ
జారుసంపుల్ల కంజారుణేక్షణుఁడు సు;
నాసాపుటుండు మందస్మితుండు
వక్రసూక్ష్మస్నిగ్ధ వరనీల కేశుండుఁ;
గమనీయరుచి కంబు కంధరుండు
సుభగ విశాల వక్షుండును ద్రివళి శో;
భిత మధ్యభాగుండుఁ బృథునితంబ

4-566.1-తేటగీతి

మండలుండు నావర్త సమాన నాభి
వివరుఁడును గాంచనస్తంభ విలసదూరు

రాజితుండును నరుణచరణుఁడును ధృత
నవ దుకూ లోత్తరీయుఁ డున్నతయశుండు

4-567-వచనము

మఱియు, నియమనిమిత్తంబునం బరిత్యక్తభూషణుం డగుటం జేసి వ్యక్తాశేషగాత్రశ్రీకుండును, గృష్ణాజినధరుండును, శ్రీమంతుండును, గుశహస్తుండును, గృతోచితుండును, శిశిరస్నిగ్ధతారాక్షుండును నైన పృథుచక్రవర్తి సభామధ్యంబునం దారాగణమధ్య విభాసితుండును, సకలజనాహ్లాదకరుండును నగు సుధాకరుండునుం బోలె వెలుంగుచు లేచి నిలుచుండి సదస్య సంతోషదాయకంబులును, జిత్రపదవిరాజితంబులును, బ్రసన్నంబులును, బరిశుద్ధంబులును, గంభీరార్థంబులును, నవ్యాకులంబులును నైన భాషణంబుల నిట్లనియె.

4-568-కంద పద్యము

" వినుఁడీ సభ్యులు ధర్మము
ననయము నెఱుఁగంగఁ గోరు నట్టి జనుఁడు దాఁ
దన తలఁపునఁగల యర్థముఁ
జను నెఱిఁగింపంగ ధీర సత్పురుషులకున్.

4-569-సీస పద్యము

ఏను నీ లోకవితానంబు నెల్లను;
 శాసించి భూప్రజా సంతతులను
దత్త ద్విహిత వృత్తి దానంబులను జేసి;

రక్షింప వివిధ మర్యాదఁ దప్పి
పోకుండ నిలుపుటకై కమలజుచే ని;
యోగింపఁ బడితి; ని ట్లోనరియుండ
నట్టి ప్రజాపాలనా ద్యనుష్ఠాన వ;
శంబునఁ బ్రాక్కర్మ సాక్షి యీశుఁ

4-569.1-తేటగీతి

డెట్టివానికి సంతుష్టి నెసగుచుండు
నట్టివానికి నే లోకముండ్రు బుధులు
కామదుఘములు నైన లోకములు నాకు
సరవిఁ గలుగు ననుష్ఠానపరుఁడ నగుట.

4-570-వచనము

ఇట్లు ప్రజలను ధర్మంబుల యందు ననుశాసింపక యర్థకాముండై వారివలన నప్పనంబులు గొనెనేని వారల పాపంబు దనకుఁ బ్రాపింపం దేజోహీనుండై భూవిభుండు చెడుం; గావునం బ్రజలు భూపతి హితార్థంబునకు, స్వార్థంబునకు, నసూయారహితులై వాసుదేవార్పణ బుద్ధింజేసి ధర్మంబు నెప్పుడు నాచరింపవలయు; నిదియ నన్ను ననుగ్రహించుట; అదియునుం గాక పితృదేవర్షి తుల్యులగు మీర లనుమోదించి కర్తయు ననుశాసకుండు ననుజ్ఞాతయు నయిన నాకుఁ బరలోకంబున నే ఫలంబు గలుగు నట్టి ఫలంబునకు సదృశంబైన కర్మం బాచరింపవలయు; నట్లయిన సంతోషంబు నొందుదు" ననిన వార లా రాజేంద్రున కిట్లనిరి.

4-571-కంద పద్యము

" జననాయక! ప్రజ లిర వొం

దిన ధర్మము లెల్ల వాసుదేవార్పణ బు

ద్ధిని్ఁ జేయవలయు నంటివి

యనయంబును వాసుదేవుఁ డనఁ గలఁడె మహాన్?"

4-572-సీస పద్యము

అనవిని వారికి మనుజేశుఁ డను " నర్థ;

తములార! వినుఁడయ్య! తవిలి మీరు

యజ్ఞాధిపతియైన యఖిలేశ్వరుఁడు గొన్ని;

మతములఁ గలఁడు ధీమంతులార!

యట్లైన మీరలు నందుకు విప్రతి;

పత్తి గల్గుట నుబ్రపన్న మరయ

గా దంటిరేని నా ఘనునిచే రచితమై;

కాంతిమంత మగు జగంబు గానఁ

4-572.1-తేటగీతి

బడుచు నున్నది; యిట్టి ప్రపంచ రచిత

కర్మ వైచిత్ర్య మమ్మేటి గలుగకున్న

నమరు నను తదుక్తు లుపపన్నములు కావు;

కాన నవ్వాసుదేవుండు గలఁడు మఱియు.

4-573-వచనము

అదియునుం గాక యీ జగద్వైచిత్ర్యంబు కర్తయైన యీశ్వరుండు లేకున్నం గర్మవశంబునం జేసి యుపపన్నంబగు నంటిరేని.

4-574-సీస పద్యము

పూని ప్రియవ్రతోత్తానపాదధ్రువ;
 మనుల కస్మత్పితామహుఁ డనంగఁ
దగు నంగ మేదినీధవునకు మఱియును;
 వినుతి కెక్కిన పృథివీపతులకుఁ
బద్మసంభవ భవ ప్రహ్లాద బలిచక్ర;
 వర్తి ప్రముఖ భాగవతుల కర్థి
వర్గసుస్వర్గాపవర్గంబులకు నను;
 గతకారణుం డన ఘనత కెక్కి

4-574.1-తేటగీతి

హీను లగు మృత్యుదౌహిత్రుఁ డైన వేన
ముఖ దురాత్ములు ధర్మవిమోహితులును
దక్కఁ దక్కినవారికిఁ దాఁ బ్రసన్న
వరదుఁడై యిచ్చు నభిమతావళుల నతఁడు.

4-575-వచనము

ఇట్టి విద్వ దనుభవంబున భువన హితుండగు వాసుదేవుండు లేఁడనుట యుపపన్నంబు గాదు; అదియునుం గాక.

4-576-ఉత్పలమాల

భూరి తపోభిరాము ముని పూజన మెవ్వని పాదపద్మ సే
వారతి వృద్ధిఁ బొంది యనివారణఁ బూర్వభవానుసార సం
సార మహోగ్రతాపము భృశంబుగఁ బాపఁగ నోపుఁ దత్పదాం
భోరుహజాత దేవనదిఁ బోలి యశేష మనోఘ హారియై.

4-577-వచనము

మఱియు.

4-578-చంపకమాల

అనుపమ భక్తి నెవ్వని పదాంబుజమూలము మందిరంబుగా
ననయముఁ బొందు వాఁడు నిహతాఖిల భూరి మనోమలుండు స
ద్వినుత విరక్తి బోధ ధృతి వీర్య విశేష సమన్వితుండు దా
ననఁ దగి భూరి సంసృతి మహాత్తర దుఃఖము నందఁ డెన్నఁడున్.

4-579-కంద పద్యము

నారాయణుండు జగదా
ధారుండగు నీశ్వరుండు; దలఁప నతనికిన్
లేరెందు సములు నధికులు
ధీరోత్తముఁ డతఁడు నద్వితీయుం డగుటన్.

4-580-వచనము

అదియునుం గాక.

4-581-ఉత్పలమాల

కర్మవశంబునన్ జగము గల్గును హెచ్చు నడంగు నన్నచో
గర్మముఁ బుద్ధిఁ జూడ జడకార్యము; గాని ప్రపంచ కల్పనా
కర్మమునందుఁ గర్త యనఁగా విలసిల్లఁగఁ జాల; దీ జగ
త్కర్మక కార్య కారణము గావున నీశుఁడు విష్ణుఁ డారయన్.

4-582-వచనము

కావున మీర లవ్వాసుదేవుని నధికారానుసారంబున నిశ్చితార్థ ఫలసిద్ధి గల వారలై మనోవాక్కాయకర్మంబుల నిష్కపటవృత్తిం దగిలి వినుతి నతి పరిచర్యా పూర్వకంబుగాఁ గామదుఘంబు లయిన యతని పాదపంకజంబులు భజియింపుం; డదియునుం గాక.

4-583-సీస పద్యము

రూఢి నీశ్వరుఁడు స్వరూపంబునం జేసి;
పూని విశుద్ధ విజ్ఞానఘనుఁడు
నగుణుండు నయినఁ దా నరయని కర్మమా;
ర్గమునందు వ్రీహ్యాది ద్రవ్యములును
శుక్లాదిగుణము విస్ఫుర దవఘాతాది;
సత్క్రియలును మంత్రసంచయంబు
సంకల్పమును యాగసాధ్యమైనట్టి య;
ఖండోపకారంబు ఘనపదార్థ

4-583.1-తేటగీతి

శక్తియు మఱి జ్యోతిష్టోమ సవనముఖ్య
నామత బహు విశేష గుణతను మెఱయు
నట్టి యధ్వరరూపమై యఖిల జగము
నందు ననిశంబుఁ బ్రఖ్యాతి నొందుచుండు.

4-584-వచనము

అదియునుం గాక దారుస్థితంబైన యనలంబు తద్దారు గుణంబు లయిన దైర్ఘ్య వక్రత్వాదికంబుల ననుసరించు చందంబున నవ్యక్తంబు తతోక్షభకం బయిన కాలంబును వాసనయు నదృష్టంబు నను కారణంబుల చేతం బుట్టిన శరీరంబునందు విషయాకారం బయిన బుద్ధి నొంది తద్విషయాభివ్యంగ్యంబైన యానందస్వరూపుం డగుచుఁ గ్రియా ఫలంబునం బ్రసిద్ధి నొందును" అని చెప్పి వెండియు నిట్లను "మదీయ జనంబు లిమ్మేదినీతలంబున దృఢవ్రతులై యజ్ఞభుగీశ్వరుండును గురుండును నయిన సర్వేశ్వరుని, హరిని నిరంతరంబును స్వధర్మ యోగంబునం బూజించుచున్నవారలు; వారు నన్నాశ్చర్యకరంబుగా ననుగ్రహించువారు" అని హరిభక్తిరతులైన మహాత్ముల నుతియించి వెండియు నిట్లనియె.

4-585-మత్తేభ విక్రీడితము

" వర సంపద్విభవప్రతాప సుమహైశ్వర్యంబులం బొల్చు నీ
ధరణీనాథులతేజ మంచిత తపోదాంతిక్షమా విద్యలం
గర మొప్పారు ధరాసు పర్వ హరిభక్తశ్రేణులం దెప్పుడున్;
ధరలోనం బ్రభవింప కుండు" నని యద్ధాత్రీవిభుం డిట్లనున్.

4-586-చంపకమాల

" అరయఁగ నే ధరామర పదాంబుజరేణువు లర్థిఁ దాల్చి య
ప్పరమ పురాణ పూరుషుఁడు బ్రాహ్మణదేవుఁడు నైనయట్టి యీ
శ్వరుఁడు సదానపాయినిని సాగరకన్యను సర్వలోక వి
స్ఫురిత పవిత్రకీర్తియును బొంది విభూతిఁ దనర్చెఁ గావునన్.

4-587-సీస పద్యము

ఏ వసుధామర సేవను జేసి య;
శేషగుణాన్విత స్థితిఁ దనర్చు
సర్వేశ్వరుఁడు మఱి సంతుష్టుఁ డగు నట్టి;
ధరణిదివిజులఁ ద ద్ధర్మపరులు
నలఘు వినీతులునై యవశ్యంబును;
సేవింపరే ధరాదేవ నిత్య
సేవచేఁ బురుషుఁడు చిరతర జ్ఞానవి;
ద్యాభ్యాసి గాకున్న నైన నతఁడు

4-587.1-తేటగీతి

వేగమున నంతరంగంబు విశద మగుటఁ
జేసి కైవల్య పదమును జెందు; నట్లు
గాన లోకులు భూదేవతానికరముఁ
దగిలి భజియింప వలయు నుదాత్త మతిని.

4-588-వచనము

మఱియు.

4-589-సీస పద్యము

విజ్ఞాన ఘనుఁ డన వెలయు నీశ్వరుఁడు త;
త్త్వజ్ఞాన యుతులైన వారిచేత
దీపింప నింద్రాది దేవతోద్దేశంబు;
నను భూమిసుర ముఖంబున హుతంబు
లగు హవిస్సులఁ దృప్తి నందిన గతి నచే;
తన మైన యా హుతాశన ముఖంబు
వలన వేల్చిన హవిస్సులచేతఁ దృప్తుండు;
గాకుండు కావున లోకమందు

4-589.1-తేటగీతి

నగ్ని ముఖమునకంటె ధరామరేంద్ర
ముఖము పరిశుద్ధ మత్యంతముఖ్య మనఁగఁ
దనరు నది గాన భూసురార్చనము సకల
జనులుఁ గావింపఁ దగు నార్యజనములార!

4-590-వచనము

అదియునుం గాక.

4-591-సీస పద్యము

ఏ వేదమం దెని నీ విశ్వ మెల్లను;
దర్పణ ప్రతిబింబిత మగు వస్తు

నివహంబు క్రేవడిఁ దివిరి ప్రకాశించు;
 నట్టి విరజమును నవ్యయంబు
నగుచు సనాతనం బగు వేద మే ధరా;
 దేవతాజన మనుదినముఁ దగిలి
మహిత శ్రద్ధాతపో మంగళ మౌన సం;
 యమ సమాధులఁ బోలుపారుచుండి

4-591.1-తేటగీతి

యర్థి సదసద్వివిచారులై యధికరింతు
రట్టివారల పదరజం బర్థిఁ దాల్చు
నలఘులకు సర్వపాపక్షయంబు నఖిల
సద్గుణావాప్తియును నగుఁ జతురులార!

4-592-వచనము

కావున నట్టి విప్రపాద సరోజరేణువు లేనును గిరీటంబున ధరియింతు; ఇట్లు బ్రాహ్మణ భజనంబునంజేసి యవాప్త సకల గుణుండును శీలధనుండును గృతజ్ఞుండును శ్రద్ధాయుక్తుండును నైన మహాత్ము నఖిల సంపదలఁ బ్రాపించుం గావున గోబ్రాహ్మణకులంబును ననుచర సమేతుం డయిన జనార్దనుండును నా యెడం బ్రసన్ను లయ్యెదరు గాక” యని పలుకుచున్న పృథుచక్రవర్తిం గనుంగొని పితృదేవద్విజ సత్పురుషులు సంతుష్టాంతరంగులై సాధువాదంబుల నభినందించి యిట్లనిరి.

4-593-కంద పద్యము

" మనుజేంద్ర! నీ కతంబున
ననుపమ ఘన బ్రహ్మదండ హతుఁ డత్యఘు వ
ర్తనుఁడు నగునట్టి వేనుం
డనయము నరకంబు వలన నర్థిఁ దరించెన్.

4-594-వచనము

కావునం "బుత్త్రేణలోకాన్ జయతి" యను వేదవచనంబు నిశ్చయంబు; అదియునుం గాక.

4-595-చంపకమాల

పురుషవరేణ్య! హేమకశిపుండు రమా లలనేశు నిందచే
నరకమునొందఁ గోరియు గుణజ్ఞుఁడు భాగవతుండునైన యా
వర తనయప్రభావమున వాసికి నెక్కి విధూత పాపుఁడై
నిరయముఁ బొందఁ డయ్యెఁ; నతి నిర్మల కీర్తిఁ దనర్చెఁ గావునన్."

4-596-కంద పద్యము

అని పలికి వీరవర్యుం
డనఁదగు పృథుచక్రవర్తి నయుతాబ్దంబుల్
దనరఁగ జీవింతువుగా
కని తగ నాశీర్వదించి యభినుత మొప్పన్.

4-597-వచనము

వెండియు నిట్లనిరి "దేవా నీకు సకలలోకభర్త యగు నారాయణు నందు నిట్టి భక్తి వొడముటం జేసియు బ్రహ్మణ్యదేవుండు నుత్తమశ్లోకుండు నైన

సర్వేశ్వరుని సత్కథాజాలంబు వ్యక్తంబు చేయుచున్న నీవు మాకు నాథుండ వగుటం జేసియు నేము ముకుందదాసుల మైతిమి; భవదీయ ప్రజ్ఞానుశాసనంబు ప్రజానురాగంబు కారుణ్యమూర్తులైన మహాత్ములకు స్వభావంబులు; గావున నాశ్చర్యంబు గాదు; దైవసంజ్ఞితంబు లయిన కర్మంబులచేత వినష్టజ్ఞానులమై పరిభ్రమించు మాదగు తమఃపారంబుఁ గంటిమి; ఏ సర్వేశ్వరుండు బ్రాహ్మణ జాతి నధిష్ఠించి క్షత్రియులను క్షత్రియజాతి నధిష్ఠించి బ్రాహ్మణులను నీ యుభయంబు నధిష్ఠించి విశ్వంబును భరించు నట్టి, వివృద్ధసత్త్వుండు సర్వరూపుండు మహాపురుషుండునైన పృథునకు నీశ్వరబుద్ధింజేసి యేము నమస్కరింతుము;" అను సమయంబున.

## 4-21-పృథునిబరమపదప్రాప్తి

4-598-కంద పద్యము

వినువీథినుండి మెల్లన
చనుదెంచిరి బాలసూర్య సంకాశ తనుల్
జనవినుత! సిద్ధ వర్యులు
సనకాదులు శేముషీ విచక్షణు లంతన్.

4-599-వచనము

ఇట్లు చనుదెంచి.

4-600-కంద పద్యము

అనఘాత్ము లతిథి రూపం
బున రా గృహమేధి ప్రాణములు నుద్గతిచేఁ
దనరినఁ బ్రత్యుద్గతి వం
దనముల మరలం బ్రతిష్ఠితములగు ననుచున్.

4-601-కంద పద్యము

వినఁబడు వచనన్యాయం
బున నుద్గతములగు ప్రాణములఁ గ్రమ్మఱఁ బొం
దను గోరువాడునుం బలె
ననుచర ఋత్విక్సదస్యుఁడై పృథుఁ డంతన్.

4-602-తేటగీతి

ఇంద్రియేశుఁడు గంధాదికేష్ట గుణముఁ
గూర్చి యుద్ధమనక్రియఁ గోరి చేయు
పగిదిఁ బృథుచక్రవర్తి సంభ్రమముతోడ
మహితభక్తిని బ్రత్యుద్గమంబు చేసె.

4-603-కంద పద్యము

ఘనగౌరవమున నమ్ముని
జనచిత్త వశీకృతుండు సభ్యుఁడుఁ బ్రియుఁడున్
వినయానతకంధరుఁడై
జనవరుఁ డా పరమయోగిచంద్రుల నెలమిన్.

4-604-సీస పద్యము

పూని యర్ఘ్యాసనాసీనులఁ గావించి;
కర మర్థిఁ విధివత్ప్రకారమునను
బూజించి తత్పదాంభోరుహక్షాళన;
సలిలంబు లాత్మమస్తమునఁ దాల్చి
హాటక కలిత సింహాసనాసీనులై;
విహితాగ్నులను బోలి వెలుఁగుచున్న
శర్వాగ్ర జన్ముల సనకాదులను జూచి;
యతుల శ్రద్ధాసంయమాన్వితుండుఁ

4-604.1-తేటగీతి

బరమ సంప్రీత మతియునై పలికె రాజు
గోరి " యో మంగళాయనులార! పూర్వ
భవమునం దెద్ది మంగళప్రద సుకర్మ
మేను జేసితి? మిముఁ జూడ నిపుడు గలిగె."

4-605-వచనము

అని వెండియు.

4-606-కంద పద్యము

భువి నెవ్వని యెడ విప్రులు
భవుఁడును విష్ణుఁడుఁ దదీయ భక్తులును బ్రస
న్నవదను లగుదురు వానికి
భువి దివిని నసాధ్యకర్మములు లే వరయన్.

4-607-వచనము

అని మఱియున "నఘాత్ములార! లోకంబుల నీక్షించుచుం బర్యటనంబు చేయు మిమ్ము సర్వదర్శనుం డయిన యాత్మం గనుంగొనఁజాలని సర్వదృశ్యంబు చందంబున నీ లోకంబు గనుంగొనజాలకుండు; అట్టి మహాత్ముల రయిన మీ దర్శనంబునం జేసి యేను ధన్యుండ నైతి; అదియునుం గాక.

4-608-చంపకమాల

అరయ ధరిత్రి నెవ్వని గృహంబు మహార్హజనోపభోగ్య వి
స్ఫురిత తృణాంబు భృత్య గృహభూముల సారెఁ దనర్చు నట్టి మం
దిరపతి పేద యైన జగతిం గడు ధన్యుఁ డటండ్రు గాన సు
స్థిరమతి మీరు వచ్చుట నశేషశుభంబుల నేను బొందెదన్.

4-609-వచనము

అదియునుం గాక.

4-610-చంపకమాల

వరమతులార! యెవ్వని నివాసముఁ దీర్థపదాంతరంగులై
పరఁగినయట్టి భాగవత పాదజలంబులు సోఁక వేనిఁ ద
త్పురుషుఁడు భూరి సంపదలఁ బొంపిరిబోయిననైన వాని మం
దిర మురగప్రకీర్ణ జగతీజముఁ బోలు నటండ్రు కోవిదుల్."

4-611-వచనము

అని పలికి వెండియు నిట్లనియె.

4-612-సీస పద్యము

" పరమ పావనులార! బాల్యంబునందుండి;
మానిత శ్రద్ధా సమన్వితులును
గుణనిధుల్ ధైర్యయుక్తులు ముముక్షువులునై;
యధిక వ్రతంబుల నాచరింతు
రట్టి పుణ్యులు భవదాగమనంబు స్వా;
గతమయ్య! సత్కృపాకలితులార!
యనివారితవ్యసనార్ణవం బయినట్టి;
భూరి దుర్లంఘ్య సంసారమందు

4-612.1-తేటగీతి

మతివిహీన స్వకీయ కర్మములఁ జేసి
యడరి మగ్నులమై యింద్రియార్థములనె
తివిరి పురుషార్థములుఁగాఁగఁ దెలియు మాకుఁ
గుశల మున్నదె లోకైక కుశలులార!

4-613-వచనము

మీర లాత్మారాము లగుటం జేసి మీయందు గుశలాకుశల రూపంబు లయిన మతివృత్తులు సంభవింపవు గావునం; గుశలప్రశ్నం బుపపన్నంబు గాదు; కాన నేనుగృతవిశ్వాసుండనై సంతప్తు లయిన వారలకు సుహృత్తు లైన మిమ్ము నాకు నీ సంసారంబునందు నేమిట వేగంబె క్షేమంబు గలుగును యని యడిగెద; ఆత్మవంతులకు నాత్మయు నాత్మభావనుండు నయిన యీశ్వరుండు భక్తానుగ్రహంబు

కొఱకు నీ లోకంబున మీవంటి సిద్ధరూపంబున వర్తించుచుండు" నని పలికిన యతని గంభీరార్థ గౌరవంబులును, శుభకరంబులును, న్యాయసహితంబులును, మితాక్షరంబులును, శ్రోత్రప్రియంబులును నయిన వచనంబులు విని సంప్రీత చేతస్కుండును, మందస్మితుండును నై సనత్కుమారుం డిట్లనియె.

4-614-మత్తేభ విక్రీడితము

" ధరణీశోత్తమ! సర్వభూతహిత చేతస్కుండవై ధర్మ సు
స్థిర భాగ్యోదయశాలివై యెసఁగు నీచే సాధులోకోత్తరో
త్తరసంప్రశ్నము చేయఁగాఁబడె మహాత్మా! సాధులోకైక స
చ్చరితంబుం దలపోయ నిట్టిద కదా; చర్చింప లోకత్రయిన్.

4-615-తేటగీతి

ధరణి సజ్జనసంగంబుదలఁపనుభయ
సమ్మతంబగువారలు సలుపునట్టి
సరససంభాషణప్రశ్నసరణి నిఖిల
జనములకు సుఖకరమగు జనవరేణ్య!"

4-616-వచనము

అని యభినందించి మోక్షసాధనోపదేశ కాముండైన పృథుచక్రవర్తికి వెండియు నిట్లనియె.

4-617-సీస పద్యము

" ధరణీశ! మధునిషూదనుఁ డైనయట్టి నా;
 రాయణు లలిత పాదారవింద
వరగుణ ధ్యాన ధీపరిణతత్త్వంబున;
 సకలాత్మ మల విమోచనము లైన
రతియును నిత్య వైరాగ్యంబు మొదలుగా;
 లోకోత్తరుఁడవైన నీకుఁగలవు;
సమ్యగ్విచార శాస్త్రములందు జనులకు;
 సేమంబునకును నిశ్చితములయిన

4-617.1-తేటగీతి

యాత్మ వ్యతిరిక్త వస్తువులందు వీత
రాగతఁ దలంప నిర్గుణ బ్రహ్మ మయిన
యాత్మయందుల రతియును ననఁగ నివియ
హేతువులు బుద్ధిఁ జింతింప నిద్ధచరిత!

4-618-వచనము

కావున శ్రద్ధయు, భగవద్ధర్మచర్యయుఁ, దద్విశేష జిజ్ఞాసయు, నాధ్యాత్మిక యోగ నిష్ఠయు, యోగీశ్వరోపాస్తియుఁ, బుణ్యోపాశ్రయుండును బుణ్యశ్రవణుండును నైన నారాయణ కథాలాపంబులు, నర్థేంద్రియారాము లైన వారలతోడి సంగతి యందు విరక్తియు, వారల కభిమతంబు లైన యర్థ కామంబు లందు ననాకాంక్షయు, సర్వేశ్వరుని గుణ కీర్తనామృతపానంబు దక్క నితర పదార్థంబులందు వైరాగ్యంబు నొంది యాత్మారామత గలిగి విజన స్థలంబు లందు రుచిగలుగుటయును,

నహింసయు, శమాదిప్రధానవృత్తియు, నాత్మహితానుసంధానంబును, భగవత్కథానుస్మరణంబును, నకామ్యంబు లయిన యమనియమంబులును, నితరభక్తిమార్గాగర్హణంబును, యోగక్షేమార్థ క్రియారాహిత్యంబును, శీతోష్ణాది ద్వంద్వ సహిష్ణుతయు, భాగవత కర్ణాలంకార భూతం బగు భగవద్గుణాభిధానంబులు నను వీనిచేత విజృంభమాణంబైన భక్తియోగంబునం జేసి యనాత్మ యందు నసంగంబును, గార్యకారణ రూపంబగు నిర్గుణ బ్రహ్మంబు నందు రతియును నెప్పుడు గలుగు నప్పుడ సదాచార్యానుగ్రహవంతుం డయిన పురుషుండు బ్రహ్మనిష్ఠులతోడఁ జెలిమి చేయుచు నీషణత్రయంబు వర్జించి ప్రకృతిం జేరక జ్ఞాన వైరాగ్య వేగంబునం జేసి.

4-619-సీస పద్యము

అనఘ! సాక్షాత్కార మగు భక్తి యోగాగ్నిఁ;
 గడఁగి జీవాధారకమును బంధ
భూతాత్మకంబునై పొలుచు హృద్గ్రంథిని;
 బూని స్వకారణభూత మయిన
యరణి దహించు హుతాశను కైవడి;
 నిర్దహించిన నిట్లు నెఱసి దగ్ధ
చిత్తుఁడై ముక్తనిశ్శేషాత్మ గుణుఁడు స;
 ద్ధర్ముఁడు నైన యతండు మిగుల

4-619.1-తేటగీతి

నర్థి బాహ్యంబు లయిన ఘటాదికములు
నాంతరము లైన సౌఖ్యదుఃఖాదికములు
నను విభేదము లాత్మ భేదనము లగుట
నయ్యుపాధి వినాశంబు నందగలఁడు.

4-620-వచనము

అది యెట్లనిన.

4-621-చంపకమాల

పురుషుఁడు నిద్రపోఁ గలలఁ బొందిన యాత్మసుఖైక హేతువై
పరఁగిన రాజభృత్యజన భావగుణంబులు సంప్రబోధమం
దరయఁగ మిథ్య యైనగతి నాంతర బాహ్యగుణప్రభేదముల్
పరువడిఁ గానకుండు జనపాలనశీలన! నిత్యఖేలనా!

4-622-వచనము

మఱియును ద్రష్టయైన యాత్మయు దృశ్యంబయిన యింద్రియార్థంబు నను వీనికి నహంకారంబు సంబంధహేతు వగుటం జేసి యది యంతఃకరణంబునం గలుగుచుండు జాగ్రత్స్వప్నంబుల యందీ భేదంబు గనుంగొనుచుండు; ఇట్టి యంతఃకరణంబు లేనిది యగు సుషుప్తి కాలంబునం బురుషుండు జలదర్పణాది నిమిత్తాభావం బగునప్పుడు బింబప్రతిబింబ భేదంబు గనుంగొనని చందంబున దృశ్యభేదంబు గనుంగొనకుండుం; గావున నంతఃకరణ విలయంబు నొందిన బాహ్యాంతర భేదంబు గనకుండుట నిశ్చయం" బని వెండియు నిట్లనియె.

4-623-సీస పద్యము

భువి విష యాకృష్ట భూతంబు లయిన యిం;
ద్రియముల చేతను దివిరి మనము
దగ విషయాసక్తిఁ దగిలి యాంతరమైన;
మహిత విచార సామర్థ్య మెల్ల
శరకుశాదిస్తంబజాలంబు ప్రాదతోయ;
ములు గ్రోలుగతిఁ గ్రమంబున హరించు
నీ రీతి నంతర్విచార సామర్థ్యంబు;
నపహృతం బయినఁ బూర్వాపరాను

4-623.1-తేటగీతి

మేయ సంధానురూప సంస్మృతి నశించు
నది నశించిన విజ్ఞాన మంతఁ దొలఁగు;
నట్టి విజ్ఞాన నాశంబు నార్యజనులు
స్వాత్మకది సకలాపహ్నవం బటండ్రు.

4-624-వచనము

అదియునుం గాక "యాత్మనస్తుకామాయ సర్వం ప్రియం భవతి" యను వేదవచనంబునం జేసి విషయంబులకుం బ్రియతమత్వంబై యాత్మోపాధికంబు నొందిఁ యాత్మాపహ్నవంబునం బాటిల్లు స్వార్థనాశం బెద్ధి గలుగు దాని కంటె లోకంబున నధికంబైన స్వార్థనాశంబు లేదు; అది యెట్లనిన సర్వార్థ నాశంబునకు స్థైర్యంబు నొందించునట్టి యర్థకామాభిధ్యానంబునం దద్దేతుకంబైన స్వార్థనాశంబునం

బరోక్షాపరోక్షరూపజ్ఞానంబు నశించుం గావున నాత్మాపహ్నవంబున కంటె నధికతరంబైన సర్వార్థనాశంబు లే" దని వెండియు నిట్లనియె.

4-625-సీస పద్యము

" అనఘ! యీ సంసార మతిశయంబునఁ దరి;
 యింపంగ మది నిశ్చయించువాఁడు
గైకొని ధర్మార్థకామమోక్షములకు;
 నతి విఘాతుక మెద్ది యట్టి దాని
వలన సంగము చేయవలవ; దా ధర్మాదు;
 లందుఁ ద్రివర్గంబు నంతకోగ్ర
భయయుతం బగుటను బరమమోక్షంబె ము;
 ఖ్యార్థమై విలసిల్లు నండ్రు బుధులు;

4-625.1-తేటగీతి

భువి గుణవ్యతికరమునఁ బుట్టినట్టి
యబ్జజాతాదులకు నస్మదాదులకును
గాల విధ్వంసితాఖిల క్రమముగల్గుఁ
గలుగ దెన్నఁడు సేమంబుగాన వినుము.

4-626-వచనము

మోక్షంబె పరమపురుషార్థం" బని చెప్పి వెండియు నిట్లనియె "నరేంద్రా! దేహేంద్రియ ప్రాణ బుద్ధ్యహంకార పరివృతంబు లయిన యీ స్థావర జంగమంబుల హృదయంబులందు వ్యాపకుండుఁ బ్రత్యక్షభూతుండుఁ

బ్రత్యగ్రూపుండు భగవంతుండు నయిన యీశ్వరుం డంతర్యామి రూపంబునం బ్రకాశించుచుండు; అది నారాయణుని సద్రూపంబుగాఁ దెలియు" మని వెండియు నిట్లనియె.

4-627-ఉత్పలమాల

" భూవర! యే మహాపురుష భూషణు నందుల నీ సమస్త వి
శ్వావళి లీనమై సదసదాత్మక భావము నొంది భూరి మా
యావిభవంబులం దగి సమగ్రవివేక నిరోధి స్రగ్గ నా
శీవిషబుద్ధి దోఁచుచు విశేషగతిన్ వెలుఁ గొందు నెన్నఁడున్.

4-628-చంపకమాల

సుమహిత నిత్య ముక్త పరిశుద్ధ విబుద్ధ సుతత్త్వుఁడై యురు
క్రముఁ డభిభూత సత్ప్రకృతి కర్మకళంకుఁడు నైన యట్టి యు
త్తమచరితుం గృపాకరు నుదాత్తగుణోన్నతు నీశ్వరేశుఁ జి
త్తమునఁ దలంపుమయ్య! జనతాపరిరక్షణ! దుష్టశిక్షణా!

4-629-సీస పద్యము

వసుమతీనాథ! యెవ్వని పాదపద్మ ప;
లాశ విలాస సల్లలిత భక్తి
సంస్మరణంబుచే సజ్జన ప్రకరంబు;
ఘనకర్మ సంచయ గ్రథితమగు న
హంకార మను హృదయగ్రంథిఁ జెఱుతురు;
వివరింప నిట్లు నిర్విషయమతులు

మహి నిరుద్ధేంద్రియ మార్గులు నై నట్టి;
యతులకుఁ జేరంగ నలవి గాని

4-629.1-తేటగీతి

యట్టి పరమేశుఁ గేశవు నాదిపురుషు
వాసుదేవుని భువనపావన చరిత్రు
నర్థి శరణంబుగాఁ దత్పదాంబుజములు
భక్తి సేవింపు గుణసాంద్ర! పార్థివేంద్ర!

4-630-మత్తేభ విక్రీడితము

అరిషడ్వర్గమహోర్మి నక్రనికరవ్యాకీర్ణ సంసారసా
గర మబ్జోదరకీర్తనాతరణి సాంగత్యంబునం బాసి తా
మరుదారంగ నఘూపహప్రకట యోగాదిక్రియాయుక్తి చేఁ
దరియింపన్ మదిఁ గోరువారలకు దుర్దాంతంబగుం గావునన్.

4-631-మత్తేభ విక్రీడితము

ధరణీశోత్తమ! నీవు కేవల సముద్యద్భక్తి ధీయుక్తి మై
వరగోవింద పదారవింద యుగభాస్వన్నావ సంధించి దు
స్తర భూరివ్యసనాకరోల్ల సితదుర్దాంతోగ్ర గంభీర సం
సరణాంభోధిఁ దరింపవయ్య! పరమోత్సాహంబు దీపింపగన్.

4-632-కంద పద్యము

అని యీ గతిఁ బంకరుహా
సనసుతుఁడును బ్రహ్మబోధశాలియు నగు నా

ఘన యోగివల్లభునిచే
తను దెలియఁగఁ బడిన బ్రహ్మతత్త్వం డగుచున్.

4-633-కంద పద్యము

జనపతి మునిఁ బొగడి ముదం
బున నిట్లనుఁ బూర్వజన్మమున నే దీనా
వనుఁడైన యీశ్వరుని చే
తను నిక్క మనుగ్రహింపఁ దగితి మునీంద్రా!

4-634-కంద పద్యము

వినుఁ డట్టి యనుగ్రహ సా
ధనమునకై మీర లిపుడు దగ నిచ్చటికిం
జనుదెంచితిరి దయాళురు
ననఘులు భాగవతవరులు నగు నుత్తములున్.

4-635-సీస పద్యము

నిరతంబు నా యందు నిష్పాదితములగు;
దేహసమేత మదీయరాజ్య
సర్వసంపదలును సద్ద్విజ దత్తముల్;
గావునఁ బ్రాణకాంతా విభూతి
మందిర సుత రాజ్య మహి బల కోశ ప;
రిచ్ఛదంబుల నెల్ల ధృతిఁ దలంప

రాజుకు భృత్యుండు రాజకీయములగు;
తాంబూలముఖ పదార్థములఁ జేసి

4-635.1-తేటగీతి

రమణ సంతర్పణోపచారములు నడపు
గతిని వారల కవి నివేదితము లయ్యెఁ;
గాన మీ కుపచార మేగతి నొనర్తు
నతులగుణసాంద్రులార! మహాత్ములార!

4-636-వచనము

అది యెట్లు బ్రాహ్మణాధీనం బంటిరేని సేనాధిపత్య రాజ్యదండ నేతృత్వ సర్వలోకాధిపత్యంబులు వేదశాస్త్రవేది యైన బ్రాహ్మణునక కాని యితరులకు యోగ్యంబులు గావు; కావున బ్రాహ్మణులకు భోజనవసన దానంబులు స్వకీయంబులై యుండు; క్షత్రియాదులకు బ్రాహ్మణానుగ్రహంబున నన్నమాత్రంబు దక్కం దక్కిన వస్తుస్వాతంత్ర్యంబు లేదు; కావున మీకు గురుదక్షిణ యేమి సమర్పించువాఁడ? నదియునుం గాక స్వాతంత్ర్యంబు గలిగిన నిట్టి యధ్యాత్మ విచారులు వేదాంత వేదులు నై భగవద్భక్తి నుపదేశించెడు మీ వంటి పుణ్యాత్ములకుం బరిహాసాస్పదుండు దక్కఁ దక్కిన వాఁడెవ్వం డంజలి మాత్రంబు దక్కఁ దక్కిన ప్రత్యుపకారంబు చేయం దలంచును? అది గావున దయాళువు లైన మీరలు స్వకృతోపచారంబులం జేసి సంతుష్టాంతరంగు లగుదురుగా" కని పలుకుచున్న యాదిరాజయిన పృథుచక్రవర్తి చేతఁ బూజితులై యాత్మ యోగనిష్ఠులైన సనకాదు లతని

స్వభావంబు ప్రశంసించుచు సమస్తజనంబులుఁ జూచుచుండ నాకాశ గమనంబునం జనిరి; అయ్యవసరంబున.

4-637-ఆటవెలది

విను మహాత్మ! ముఖ్యుఁ డన నొప్పు వైన్యుఁడే
కాగ్రచిత్తుఁ డగుచు నాత్మనిష్ఠుఁ
డైనయట్టి తను నవాప్త కాముని గాఁగ
బుద్ధిలోనఁ దలఁచె భూవరుండు.

4-638-వచనము

అంత.

4-639-సీస పద్యము

కర్మంబులను యథాకాల దేశోచిత;
 బలవిత్తములు గాఁగ బరఁగు ధర్మ
ములను బ్రహ్మార్పణ బుద్ధినిఁ జేసి క;
 ర్మాసక్తుఁ డగుచు సమాహితుండు
ప్రకృతికంటెను దన్నుఁ బరమైన యాత్మను;
 గర్మసంచయ సాక్షిఁగాఁగ బుద్ధి
నర్థిఁ దలంచుచు నాచరించుచు నట్లు;
 మెఱసి సామ్రాజ్యలక్ష్మీ సమేత

4-639.1-తేటగీతి

మందిరోద్యాన వనభూములందు రాజ్య
గరిమ వర్తింపఁగా నహంకార రహితుఁ
డగుచుఁ దన చిత్తమున నింద్రియార్థములను
దగులకయ యుండె సన్మహోదారుఁ డగుచు.

4-640-వచనము

ఇట్లధ్యాత్మయోగనిష్ఠుండై కర్మంబుల నాచరించుచు నర్చి యను భార్య యందు విజితాశ్వుండు, ధూమ్రకేశుండు, హర్యశ్వుండు, ద్రవిణుండు, వృకుండు నను నాత్మసము లైన పుత్రుల నేవురం గనియె; అంత.

4-641-కంద పద్యము

జనవినుత! భూమివలనను
ధనముల మర్యాదఁ గొనుచు దాన నిమిత్తం
బునఁ గ్రమ్మఱఁ దా నిచ్చుచు
దిననాయకుఁ బోలి వసుమతీపతి యొప్పెన్.

4-642-వచనము

అతండు మఱియు నగ్ని చందంబునం దేజోదుర్ధర్షుండును, మహేంద్రుని పగిది దుర్జయుండును, ధరణి కరణి సతతక్షమా యుక్తుండును, స్వర్గంబునుం బోలె నభీష్టదుండును, బర్జన్యుని భాతిఁ గామిత ప్రవర్షణుండును, సముద్రు రీతి గాంభీర్య యుక్తుండును, మేరువు పోలికి సత్త్వవంతుండును, ధర్మరాజు కైవడి ననుశాసకుండును, మహేంద్రుని విధంబున నైశ్వర్యవంతుండును, గుబేరుని మాడ్కి ధనవంతుండును,

వరుణుని సరణి గుప్తార్థుండును, సర్వాత్మకుండగు వాయువు చెలువున బలౌజస్తేజో యుక్తుండును, రుద్రుని పగిది నసహ్యతేజుండును, గందర్పుని యనువున సౌందర్యవంతుండును, మృగరాజు నోజ నధిక శౌర్యోపేతుండును, మనువు ననువున వాత్సల్య యుక్తుండును, నజుని చందంబునం బ్రభుత్వ సమేతుండును, బృహస్పతి గరిమ బ్రహ్మవాదియు, సర్వేశ్వరుని జాడ జితేంద్రియుండునునై విష్వక్సేను నానువర్తను లైన గో గురు విప్ర జనంబులందు భక్తి గలిగి లజ్జావినయశీలంబు లందును, బరోపకారంబు నందును నిరుపముండై యివ్విధంబున సర్వలోక పాలక పృథగ్విధ గుణంబుల నన్నింటినిం దా నొక్కరుండ ధరియించి.

4-643-కంద పద్యము

అనఘాత్మక! లోకత్రయ
మున సజ్జన కర్ణ రంధ్రముల వినఁబడు నా
వినుత యశోమహనీయుఁడు
జనవినుతుం డైన రామచంద్రుని మాడ్కిన్.

4-644-చంపకమాల

సరస వచోర్థ సత్పురుష సంఘు సమంచిత గీయమాన సు
స్థిర వరకీర్తి పూరము సుధీజన కర్ణము లందు నించి తా
నిరుపమ సౌమ్య భాషణ మనీషల చేతఁ బ్రజానురక్తుఁడై
ధరణిని రాజనామమునఁ దాఁ దగు రెండవ చంద్రుఁడో యనన్.

4-645-వచనము

మఱియు నమ్మహాత్ముండు విజ్ఞానియు, వర్ధితాశేషస్వానుసర్గుండును, బ్రజాపాలకుండును, స్థావర జంగమ వృత్తి దాయకుండును, సత్పురుష ధర్మవర్తనుండును, నిష్పాదితేశ్వరాదేశికుండును నైన పృథుం డొక్కనాఁడు దన వార్ధకంబు నీక్షించి నిజాత్మజ నాత్మజుల యందు నిలిపి ప్రజలు చింతాతుర చిత్తులగుచుండ నిజభార్యాసమేతుండై యప్రతిహత నియమంబున వైఖానస సమ్మతంబైన యుగ్రతపంబు నందుఁ బూర్వంబున దిగ్విజయ ప్రవృత్తుండగు చందంబునం బ్రవృత్తుండై తపోవనంబునకుం జని; యందు.

4-646-మత్తకోకిలము

కందమూల ఫలాశియై బహుకాల ముగ్ర తపః పరి
స్పందుఁడై యటమీఁదటం దృణపర్ణ భక్షణ చేసి యా
చంద మేది జలాశి యై నృపసత్తముం డది మాని తా
మంద గంధవహాశి యయ్యెఁ గ్రమంబునన్ దృఢచిత్తుఁడై.

4-647-వచనము

ఇట్లు వర్తించుచు.

4-648-సీస పద్యము

మెండుగా మిటమిట మండు వేసవి యందుఁ;
దప్త పంచాగ్ని మధ్యమున నిలిచి
మానక జడిగొన్న వానకాలంబునఁ;

బైఁ గోక వేయక బయట నిలిచి
జనులు హూహూయను చలివేళఁ గుత్తుక;
బంటి తోయముల లోపల వసించి
శిశిరంబు చాల నల్దిశలఁ బర్వినవేళ;
వెలయ భూశయనుఁడై విశ్రమించి

4-648.1-తేటగీతి

మహిత నియతిఁ దితిక్షా సమన్వితుండు
నియత పరిభాషణుఁడు జితానిలుఁడు దాంతుఁ
డిద్ధమతి యీశ్వరార్పిత బుద్ధి యనఘుఁ
డూర్ధ్వరేతస్కుఁడునునై క్రమోచితముగ.

4-649-వచనము

అతి ఘోరం బయిన తపం బాచరించె; ఇవ్విధంబునం గ్రమానుసిద్ధం బయిన తపంబున విధ్వస్తాశేష కర్మమలాశయుండును బ్రాణాయామంబులచే జితారిషడ్వర్గుండును ఛిన్నబంధనుండును నై పురుషశ్రేష్ఠుం డైన పృథుచక్రవర్తి భగవంతుం డైన సనత్కుమారుం డెఱింగించిన యోగమార్గంబున సర్వేశ్వర భజనంబు గావించె; నిట్లు భగవద్ధర్మపరుండును సాధువర్తనుండును శ్రద్ధాసమన్వితుండును నైన పృథునకు నారాయణు నందు భక్తి, యనన్యవిషయంబై ప్రవృద్ధం బయ్యె; నవ్విధంబున.

4-650-కంద పద్యము

నరలోకోత్తర భగవ
త్పరిచర్యారాధనమునఁ బరిశుద్ధాంతః
కరణుండగు నా పృథునకు
సరసిరుహోదరు కథానుసంస్మరణమునన్.

4-651-కంద పద్యము

పరిపూర్ణంబగు భక్తిని
గర మనిశము సంశయాత్మకంబై చాలన్
వఱలిన హృదయగ్రంథిని
నిరసించు విరక్తి యుత మనీష జనించెన్.

4-652-వచనము

దానం జేసి యతండు సంఛిన్న దేహాత్మజ్ఞానుండు నధిగతాత్మ స్వరూ పుండునునై గదాగ్రజుం డయిన శ్రీకృష్ణుని కథాసక్తి నొంది సమస్త యోగ సిద్ధులందు నిస్పృహుం డగుటను హృదయగ్రంథి విచ్ఛేదకం బయిన జ్ఞానయోగంబును విడిచి యాత్మయందు నాత్మయోగంబుఁ గావించి బ్రహ్మభూతుండయి నిజకళేబరంబు విడువ నిశ్చయించి.

4-653-సీస పద్యము

కోరి మడమలచే గుదపీడనము చేసి;
పూని యుక్తాసనాసీనుఁ డగుచుఁ
దనరు మూలాధారమున నుండి వాయువు;
నొయ్యన నెగయించి యొనర నాభి

కలితంబు గావించి క్రమమున హృద్వత్స;
 కంఠ శిరః కోష్ఠకములఁ జేర్చి
కైకొని మూర్ధభాగమునకు నెగయించి;
 ప్రాణముల్ విడిచి యా పవనుఁ బవను

4-653.1-తేటగీతి

నందు నాకాశ మాకాశమందుఁ దేజ
మందుఁ దేజంబు నుదకంబునందు నుదక
మర్థిఁ గాయంబు మేదిని యందుఁ గలిపెఁ
బూని వాని యథోచితస్థానములుగ.

4-654-వచనము

మఱియు భూమి నుదకంబునందును, నుదకంబును దేజమందుఁ, దేజంబును వాయువున, వాయువు నాకాశంబునందు,నాకాశంబును మనంబున, మనంబు నింద్రియంబుల, నింద్రియంబుల తన్మాత్రలఁ, దన్మాత్రల భూతాదియైన యహంకారంబు నందు, నహంకారంబు మహత్తత్త్వంబు నందును గూర్చి, యట్టి సర్వకార్యహేతుభూతం బైన మహత్తత్వంబును జీవోపాధిభూతంబయిన ప్రకృతి యందుఁ గలిపి జీవభూతుం డయిన పృథుండు జ్ఞాన వైరాగ్యంబులచేత బ్రహ్మనిష్ఠుండై మాయోపాధిం బాసి ముక్తుండయ్యె;" అని చెప్పి వెండియు నిట్లనియె.

4-655-సీస పద్యము

" అంత నా పృథుని భార్యామణి యగు నర్చి;
పుడమిపై వడి నడుగిడినఁ గందు
సుకుమారపాదాబ్జ సుందరీరత్నంబు;
నతుల పతివ్రత యగుటఁజేసి
యాత్మేశకృత సువ్రతాచరణంబును;
సుమహిత భక్తి శుశ్రూషణమును
నార్షేయ మగు దేహయాత్రయు నను వీని;
చేత మిక్కిలిఁ గృశీ భూత దేహ

4-655.1-తేటగీతి

యయ్యుఁ బ్రియనాథ కృత కరుణావలోక
కరతలస్పర్శనాది సత్కారములను
నబల సుఖవృత్తిఁ బొంది య య్యడవులందుఁ
గృశత మదిఁ దోఁపకుండఁ జరించు నపుడు.

4-656-కంద పద్యము

తన మనమున నే దుఃఖము
ననయంబు నెఱుంగనట్టి యర్చి నిజాధీ
శుని ప్రాణరహిత దేహము
గనుఁగొని విలపించి విగతకౌతుక యగుచున్.

4-657-సీస పద్యము

మానిత మందర సానుప్రదేశంబు;
నందుఁ జితారోప మర్థిఁ జేసి
లలిత మహానదీ సలిల సుస్నాతయై;
కలిత మహోదార కర్ముఁ డయిన
నాథున కుదకదానక్రియల్ గావించి;
యతిభక్తి సురలకు నతు లొనర్చి
వహ్నికి ముమ్మాటు వలగొని పతిపాద;
కమల యుగంబుఁ జిత్తమున నిలిపి

4-657.1-తేటగీతి

వీరవరుఁడైన పృథు పృథివీతలేశు
నందు ననుగమనము చేయునట్టి సాధ్వి
నర్చిఁ గనుఁగొని దేవాంగనాళి యప్పు
డాత్మనాథులఁ గూడి నెయ్యంబుతోడ.

4-658-కంద పద్యము

పరమోత్కంఠను నమ్మం
దరగిరి సానుప్రదేశతలమున వరుసం
గురియించిరి నవ సురభిత
వర మందారప్రసూన వర్షము లంతన్.

4-659-కంద పద్యము

తరమిడి యచ్చర లాడిరి
మొరయించిరి శంఖతూర్యములు దివిజులు పా
డిరి కిన్నరజనులు పర
స్పర నుతు లొనరించి రా సుపర్వాంగనలున్."

4-660-వచనము

మఱియు నిట్లనిరి.

4-661-సీస పద్యము

" చర్చింప నిట్టి యాశ్చర్య మెందేనియుఁ;
గనుఁగొంటిరే యర్చి యను లతాంగి
ధన్యాత్మురాల్ గదా తన విభుతోఁ గూడి;
యిందిరా రమణి యజ్ఞేశుఁ గూడి
వెనుచను కైవడి ననుగమనము చేసె;
ని య్యమ నిజహృదయేశుఁ డయిన
ఘను వైన్యు నూర్ధ్వలోకమ్మును బొందును;
నేఁ డింతపట్టును నిశ్చితంబు

4-661.1-తేటగీతి

పరమ యోగీంద్రులకు దుర్విభావ్యమైన
దృఢ సుకర్మమువలన నతిక్రమించి
వైన్య భూమీశు వెనుచని వరుస నూర్ధ్వ
గామినియు నయ్యె నీ యింతి ఘనత నొంది.

4-662-వచనము

కాన పతివ్రతలకు నసాధ్యం బెందునుం గలదే?" యని మఱియును.

4-663-కంద పద్యము

" పరికింపఁగనే మనుజుఁడు
హరి పదమును బొందఁ జేయునట్టి వివేక
స్ఫురణం దనర్చు వానికిఁ
బరువడి నిలఁ బొందరాని పదముం గలదే?

4-664-తేటగీతి

అట్టి యపవర్గ సాధనమైన మనుజ
భావ మొందియు విషయ సంబద్ధుఁ డగుచు
వసుధ నెవ్వఁడు వర్తించు వాఁడు ధరణి
ననయము నిజాత్మవంచకుఁ డనఁగ బరఁగు."

4-665-కంద పద్యము

అని వారలు దన్నర్థిని
వినుతింపఁగ నర్చి యాత్మవిభు వెనువెంటం
జని యచ్యుతలోకంబున
ననుపమ విభవమును బొందె" నని విదురునకున్.

4-666-కంద పద్యము

మునివరుఁడగు మైత్రేయుఁడు
వినయంబున నెఱుఁగఁ జెప్పి వెండియుఁ దగ ని

ట్లను " నమ్మహానుభావుం
డనఘుఁడు భగవద్వరుండు నగుఁ బృథుఁ డనఘా!

4-667-కంద పద్యము

ఏ నీ కిప్పుడు చెప్పితి
మానుగ నీ పుణ్యకథను మహితశ్రద్ధా
ధీనుండై విస్ఫుర దవ
ధానుండై యెవ్వఁడేనిఁ దనరిన భక్తిన్.

4-668-కంద పద్యము

వినినఁ బఠించిన వ్రాసిన
వినిపించిన వాఁడు పృథుఁడు విమల గతిం బొం
దిన క్రియ హరిపద మొందెడు
ననయము నిర్ధూతపాపుఁ డగచు మహాత్మా!

4-669-సీస పద్యము

బ్రాహ్మణుఁ డంచిత భక్తిఁ బఠించిన;
బ్రహ్మవర్చసము సంప్రాప్త మగును;
క్షత్రియుం డర్థిమైఁ జదివిన విన్నను;
జగతీ విభుత్వంబు సంభవించు;
వైశ్యుండు విని ధనవంతుఁడై యొప్పును;
శూద్రుండు వినిన సుశ్లోకుఁ డగును;

మఱియును భక్తి ముమ్మాఱు పఠించిన;
విత్తవిహీనుండు విత్తపతియు

4-669.1-తేటగీతి

నప్రసిద్ధుఁడు ప్రఖ్యాత యశుఁడుఁ బ్రజలు
లేని యధముఁడు వితత సంతానయుతుఁడు
మూర్ఖచిత్తుండు విజ్ఞాన బోధమతియు
నగుచు నుతి కెక్కుదురు మహాత్మ! మఱియు.

4-670-వచనము

ఈ లోకంబునం బురుషులకు స్వస్త్యయనంబును నమంగళ నివారణంబును ధనప్రదంబును యశస్కరంబును నాయుష్కరంబును స్వర్గదాయకంబును గలిమలాపహంబును నైన యీ పుణ్యచరిత్రంబు చతుర్విధపురుషార్థ కాములైన వారికిఁ జతుర్విధపురుషార్థకారణం బగుం గావున వినందగు; సంగ్రామాభిముఖుం డైన రాజీచరిత్రంబు ననుసంధించి విరోధి నెదిర్చిన నవ్విరోధి పృథునకుం బోలెఁ గప్పంబు లిచ్చు; ముక్తాన్యసంగుండును భగవద్భక్తుండును నైన వాఁడు పుణ్యంబును వైన్యమహాత్మ్య సూచకంబును నైన యీ చరిత్రంబు వినుచుం బఠియించుచుం గృతమతియై దినదినంబును నాదరంబునం బ్రకటంబు చేయువాఁడు భవసింధుపోతపాదుండైన సర్వేశ్వరుని యందు నచలం బయిన భక్తిగలిగి పృథుచక్రవర్తి బొందిన విష్ణుపదంబుం బొందు" అని యిప్పుణ్యచరిత్రంబు మైత్రేయుండు విదురున కెఱింగించి వెండియు నిట్లనియె.

4-671-కంద పద్యము

" పృథునకు నర్చికిఁ బుట్టిన
పృథు కీర్తిధనుండు ఘనుఁడు పృథుతుల్యుండై
పృథు శౌర్య ధైర్య ధుర్యుఁడు
పృథివిన్విజితాశ్వుఁ డొప్పె పృథివీపతియై.

4-672-కంద పద్యము

విను మంతర్ధాన గతిం
దనరు సునాసీరు వలనఁ దగ విజితాశ్వుం
డును మఱి యంతర్ధానుం
డనుపేరఁ బ్రసిద్ధుఁ డయ్యె నతి చతురుండై.

4-673-సీస పద్యము

స్థిరమతి రాజ్యాభిషిక్తుఁడై యమ్మేటి;
సమమతి నయ్యనుజన్ములైన
హర్యశ్వునకు సమాదరమునఁ దూర్పు, ద;
క్షిణదిశఁ దగ ధూమ్రకేశునకును,
బరఁగంగ వృకునకుఁ బశ్చిమభాగంబు ,;
ద్రవిణున కర్థి నుత్తరపుదిశను,
గొమ రొప్ప నలువురకును బంచి యిచ్చె స్వ;
కాంత యైనట్టి శిఖండినికిని

4-673.1-తేటగీతి

మనుజ యోనిని జనియింపుఁ డనుచు మున్ను
పలికినట్టి వసిష్ఠు శాపమునఁ జేసి
పూని త్రేతాగ్ను లతనికిఁ బుత్రు లగుచు
జనన మొందిరి సజ్జనస్తవ్యచరిత!

4-674-వచనము

వారలు పావకుండుఁ బవమానుండు శుచియు నను నామంబుల మనుష్య యోనిం బుట్టియు నాత్మప్రభావంబునం గ్రమ్మఱ నగ్నులయి చనిరి; తదనంతరంబ.

4-675-కంద పద్యము

అతఁడు నభస్వతి యనియెడి
ద్వితీయ పత్ని వలనను హవిర్ధానుఁడు నా
సుతుఁగని విజితాశ్వుండా
నతవిమతుఁడు రాజ్యవర్తనము దలపోయన్.

4-676-కంద పద్యము

విమలాత్మ! కరాదానము
దమశుల్కాదికము గరము దారుణ మని ధై
ర్యమునన్ దీర్ఘమఖవ్యా
జమునం దద్వర్తనంబు సమమతి విడిచెన్.

4-677-వచనము

ఇట్లు విడిచి.

4-678-కంద పద్యము

అతఁ డాత్మదర్శనుం డయి
చతురతఁ బరమాత్ము హంసు సర్వేశ్వరుఁ ద
త్ప్రతువున యజించి కుశలా
ద్భుత యోగసమాధి ముక్తిఁ బొందె మహాత్మా!

## 4-22-ప్రాచీనబర్హి యజ్ఞములు

4-679-వచనము

అంత విజితాశ్వుండు పరలోకగతుం డయిన హవిర్ధానుండు హవిర్ధాని యను భార్యవలన బర్హిష్మదుండు గయుండు శుక్లుండుఁ గృష్ణుండు సత్యుండు జితవ్రతుండు నను పుత్రుల నార్వురం గాంచె; నందు బర్హిష్మదుండు.

4-680-సీస పద్యము

సంతత సవన దీక్షాశాలి యగుచు ధ;
రాతలం బెల్లను గ్రతువులకును
విలసిల్లు యజనశాలలు వేలువేల క;
ల్పించి యజ్ఞములు గావించుచుండి
చిరకీర్తి యతఁడు ప్రాచీనాగ్రకుశలచే;
క్షితితలం బెల్ల నా స్తృతము చేయ
వసుధ యెల్లను యజ్ఞవాటమై విలసిల్ల;
సత్క్రియాకాండ నిష్ణాఁతు డగుచు

4-680.1-తేటగీతి

సుభగయోగ సమాధి నిష్ఠుఁడు ప్రజాప
తి యగునని తన్ను జనము నుతింప వెలయు
నట్టి ఘనుఁడు హవిర్ధాని యఖిల జగతిఁ
బఱపి కుశలను బ్రాచీనబర్హి యయ్యె.

4-681-వచనము

మఱియు నతండు.

4-682-చంపకమాల

అలవడ నే సతీమణి సముంచితలీల వివాహవేళ ను
త్కలికఁ బ్రదక్షిణంబు లిడఁగాఁ గని హవ్యవహుండు దొల్లి యి
మ్ములఁ శుకిఁ జూచి మోహమును బొందినరీతి విమోహియయ్యె నా
లలిత వినూత్న భూషణ యలంకృత చారు శుభాంగి వెండియున్.

4-683-చంపకమాల

సురుచిర భంగి నా సతి కిశోర వయఃపరిపాకయై రణ
ద్వరమణి హేమనూపురరవంబు చెలంగఁగ నాడుచున్ దివా
కరరుచి రేఖ నొప్పెసఁగఁ గాంచి వినిర్జితు లైరి దేవ కి
న్నర నర సిద్ధ సాధ్య ముని నాగ నభశ్చర ముఖ్యు లందఱున్.

4-684-వచనము

అట్టి సౌందర్యఖనియు సముద్రపుత్రియు నయిన శతధృతి యను కన్యం
బ్రహ్మాదేశంబునం బాణిగ్రహణంబు చేసె; నా శతధృతి వలనం బ్రాచీనబర్హికిఁ

బదుగురు కొడుకులు జనియించిరి; వారలు తుల్యనామ వ్రతులును ధర్మపారగులును నయిన ప్రచేతసులు; వారు ప్రజాసర్గంబు నందుఁ దండ్రిచేత నాజ్ఞాపితులయి తపంబు గావింప వనంబునకుం జను సమయంబునం దన్మార్గంబునఁ బ్రసన్నుం డగుచు దృశ్యమానుండైన రుద్రునిచేత నేది యుపదేశింపబడె దాని జపధ్యాన పూజా నియమంబుల సేవించుచుఁ దపఃపతి యైన నారాయణుం బదివేల దివ్యవత్సరంబులు పూజించి;" రని చెప్పిన విని విదురుండు మైత్రేయున కిట్లనియె.

4-685-సీస పద్యము

" తాపసోత్తమ! ప్రచేతసులకు నా వన;
మార్గంబునందు నా భర్గుతోడ
సంగ మెట్లయ్యెఁ? బ్రసన్నుఁడై హరుఁ డెద్ధి;
తివుట వారల కుపదేశ మిచ్చె?
జీవరాశులకు నా శివుతోడి సంగంబు;
గడు దుర్లభం; బీ జగంబు నందుఁ
జర్చింప నమ్మేటి సన్మునీంద్రులకును;
సంచితధ్యానగోచరుఁడు గాని

4-685.1-తేటగీతి

పుడమిఁ బ్రత్యక్షమునఁ గానఁబడఁడు; మఱియు
నంచితాత్మ సదారాముఁ డఖిల లోక

రక్షణార్థంబుగా విరూపాక్షుఁ డాత్మ
శక్తితోఁ గూడి జగతిపై సంచరించు.

4-686-కంద పద్యము

కావున భగవంతుండును
దేవాధీశుండు నయిన దేవుని సంగం
బే వెరవున ఘటియించెనొ
యా విధ మంతయును దెలియ నానతి యీవే."

4-687-కంద పద్యము

అనవుడు విదురున కమ్ముని
జననాయకుఁ డనియె "నట్టి సాధుమనీషం
దనరు ప్రచేతసులును నిజ
జనకుని సద్భాషణములు సమ్మతి తోడన్

4-688-కంద పద్యము

శిరమున వహించి ప్రాగ్దిశ
కరిగెడి సమయమున నెదుర నంబుధికంటెం
బఱ పగు నొక సరసి మనో
హర నిర్మల సలిల పూర్ణయై యది మఱియున్.

4-689-సీస పద్యము

రక్తోత్పలేందీవరప్రఫుల్లాంభోజ;
కమనీయ కహ్లార కలితమగుచుఁ

గంజాత కింజల్క పుంజ విక్షేపక;
 మందగంధా నిలానంద మగుచు
రమణీయ హంస సారస చక్రవాక కా;
 రండవ నినదాభిరామ మగుచు
వరమత్త మధుప సుస్స్వర మోద పల్లవాం;
 కురిత లతా తరు భరిత మగుచు

4-689.1-తేటగీతి

సిద్ధచారణ గంధర్వ సేవ్య మగుచుఁ
బుణ్యముల కాలయం బయి పొలుపు మిగిలి
లలితమై చూడ నొప్పగు లక్షణములఁ
బరగి శుచి లఘు మధురాంబు భవ్య మగుచు.

4-690-తేటగీతి

సజ్జనుని హృదయముఁ బోలి స్వచ్ఛ మగుచు
హరిపదాకృతి దివిజవిహార మగుచు
ఘనుని సిరి భంగి నర్థజీవనము నగుచు
మానవతి వృత్తి గతిని నిమ్నంబు నగుచు.

4-691-తేటగీతి

శశికరంబులుఁ బోలి విశదము లగుచు
హరికథలఁ బోలి కల్మషహరము లగుచు

వహ్నులును బోలి భువన పావనము లగుచుఁ
బొగడఁ దగు నీరములచేఁ బ్రపూర్ణ మగుచు.

4-692-వచనము

ఒప్పునట్టి సరోవరంబుఁ బొడగని యందు నొక్క దివ్యపురుషునిం గనిరి; అతండును వారు.

4-693-మత్తేభ విక్రీడితము

సమదశ్రీక మృదంగ వేణుముఖ భాస్వన్నాదమై దివ్య మా
ర్గ మనోరంజకమై తనర్చు విలసద్గాంధర్వగానంబు నె
య్యము సంధిల్లఁగ వించుఁ దన్మహిమ కత్యాశ్చర్యముం బొంది వే
గమునం దత్కమలాకరంబు వెడలెం గౌతూహలోల్లాసియై.

4-694-వచనము

ఇట్లు వెడలి వచ్చిన.

4-695-మత్తేభ విక్రీడితము

కని రా తాపస పుంగవుల్ దివిజలోకశ్రేష్ఠునిం దప్తకాం
చన వర్ణున్ సనకాది యోగిజన భాస్వద్గీయమానుం ద్రిలో
చను భక్తానుగుణానుగున్ సుమహితైశ్వర్యుం బ్రసాదాభిశో
భనవక్త్రున్ నిహతాఘకర్తృజనసంపద్భద్రునిన్ రుద్రునిన్.

4-696-కంద పద్యము

కని వారలు దమ మనముల
ననురాగము నద్భుతంబు నానయముఁ బొడమన్
వినయము దోఁపఁగఁ దత్పద
వనజములకు మ్రొక్కి భక్తి వశగతు లగుచున్.

4-697-వచనము

భగవంతుండును నఖిల ధర్ముండును గృపాళుండును భక్తవత్సలుండును నఖిల పాపహరుండును నయిన హరుండు ప్రీతుం డగుచుం బ్రసన్నాంతఃకరణులు ధర్మజ్ఞులు శీలసంపన్నులు సంప్రీతులు నయిన వారల కిట్లనియె.

4-698-సీస పద్యము

" వినుఁడు నృపాల నందనులార! మీ మదిఁ;
గల తలం పెల్లను గానవచ్చె;
మీకు భద్రం బగు; మీ యెడ నే నను;
గ్రహబుద్ధిచే నిటు గానఁబడితిఁ;
గైకొని యిపుడు సూక్ష్మముఁ ద్రిగుణాత్మక;
ము నగు నా ప్రకృతికంటెను ధరణిని
బరఁగు జీవుని కంటెఁ బరుఁడైన వాసుదే;
వుని చరణాబ్జముల్ దనరు భక్తి

4-698.1-తేటగీతి

నర్థి నెవ్వరు భజియింతు రట్టివారు
నాకుఁ బ్రియతముల్; వారికి నయచరిత్రు
లార! యేను బ్రియుండనై భూరిమహిమ
వెలయు చుండుదు; నది గాక వినుఁడు మీరు.

4-699-వచనము

స్వధర్మ నిరతుండైన పురుషుం డనేక జన్మాంతర సుకృతవిశేషంబులం జతుర్ముఖత్వంబు నొంది, తదనంతరంబునం బుణ్యాతిరేకంబున నన్నుం బొంది యధికారాంతంబున నేనును దేవతాగణంబులును నవ్యాకృతంబైన యే హరిపదంబును బొందుదు; మట్టి పదంబు భాగవతుండు దనంతనె పొందుం; గావున మీరు భాగవతత్త్వంబు నొందుటం జేసి నాకుం బ్రియులై యుండుదురు; భాగవత జనంబులకు నాకంటె నధిక ప్రియుండు లేఁడు; గాన వివిక్తంబును జప్యంబును బవిత్రంబును మంగళంబును నిశ్శ్రేయస కరంబును నైన నా వచనంబు నాకర్ణింపుఁడు; సర్గాదిని బ్రహ్మ నిజనందనుల కెఱింగించిన శ్రీహరి స్తోత్రంబు మీకు నెఱింగింతు; వినుడు; అది యెట్టిదనిన.

4-700-కంద పద్యము

వనజాసనుఁ డాత్మజు లగు
సనకాదులఁ జూచి పలికె సమ్మతితోడన్
వినుఁడు కుమారకులారా!
వనజోదరు మంగళస్తవం బెఱిఁగింతున్."

4-701-వచనము

అని హరి నుద్దేశించి వారలు విన నిట్లనియె "నో! యీశా! యాత్మవేదు లైన వారలకు భవదీయోత్కర్షంబు స్వానందలాభకరంబు గావున నట్టి స్వానందలాభంబు మాకుం గలుగ వలయు; నీవు పరిపూర్ణానంద స్వరూపుండవు; ఇట్టి సర్వాత్మకుండవైన నీకు నమస్కరింతు" నని వెండియు నిట్లనియె.

4-702-సీస పద్యము

పంకజనాభాయ సంకర్షణాయ శాం;
తాయ విశ్వప్రబోధాయ భూత
సూక్ష్మేంద్రియాత్మనే సూక్ష్మాయ వాసుదే;
వాయ పూర్ణాయ పుణ్యాయ నిర్వి
కారాయ కర్మవిస్తారకాయత్రయీపా;
లాయ త్రైలోక్యపాలకాయ
సోమరూపాయ తేజోబలాఢ్యాయ స్వ;
యం జ్యోతిషే దురన్తాయ కర్మ

4-702.1-తేటగీతి

సాధనాయ పురాపురుషాయ యజ్ఞ
రేతసే జీవతృప్తాయ పృథ్వీరూప
కాయ లోకాయ నభసే నతకాయ విశ్వ
యోనయే విష్ణవే జిష్ణవే నమోస్తు.

4-703-సీస పద్యము

స్వర్గాపవర్గ సుద్వారాయ సర్వ ర;
 సాత్మనే పరమహంసాయ ధర్మ
పాలాయ సద్ధిత ఫలరూపకాయ కృ;
 ష్ణాయ ధర్మాత్మనే సర్వశక్తి
యుక్తాయ ఘన సాంఖ్య యోగీశ్వరాయ హి;
 రణ్య వీర్యాయ రుద్రాయ శిష్ట
నాథాయ దుష్ట వినాశాయ శూన్య ప్ర;
 వృత్తాయ కర్మణే మృత్యవే వి

4-703.1-తేటగీతి

రాట్ఛరీరాయ నిఖిల ధర్మాయ వాగ్వి
భూతయే నివృత్తాయ సత్సుణ్య భూరి
వర్చ సేఖిల ధర్మదేహాయ చాత్మ
నే నిరుద్ధాయ నిభృతాత్మనే నమోస్తు.

4-704-తేటగీతి

సర్వ సత్త్వాయ దేవాయ సన్నియామ
కాయ బహిరన్తరాత్మనే కారణాత్మ
నే సమస్తార్థ లిఙ్గాయ నిర్గుణాయ
వేధసే జితాత్మక సాధవే నమోస్తు.

4-705-వచనము

అని మఱియుఁ "బ్రద్యుమ్నుండవును నంతరాత్మవును సమస్త శేష కారణుండవును చాతుర్హోత్రరూపుండవును నంతకుండవును సర్వజ్ఞుండవును జ్ఞానక్రియారూపుండవును నంతఃకరణవాసివియును నైన నీకు నమస్కరింతు" నని.

4-706-కంద పద్యము

" అనఘా! దేవ! భవత్పద
వనరుహ సందర్శనేచ్ఛ వఱలిన మాకున్
విను వైష్ణవ సత్కృతమై
యెనయు భవద్దర్శనంబు నీవె మహాత్మా!

4-707-వచనము

అది యెట్టి దనిన.

4-708-కంద పద్యము

అనఘ! సకలేంద్రియగుణాం
జనమును భక్తప్రియంబు జలదశ్యామం
బును సౌందర్య సమగ్రము
ననుపమమును నిఖిల మంగళావహ మగుచున్.

4-709-వచనము

మఱియును.

4-710-సీస పద్యము

అళికులోపమ లసదలక శోభిత మగు;
 నమృతాంశు రేఖానిభాననమును
సమకర్ణ దివ్య భూషా ప్రభా కలితంబు;
 సుందర భ్రూనాస సురుచిరంబు
సలలిత కుంద కుట్మల సన్నిభద్విజ;
 పూరిత స్నిగ్ధ కపోల యుగము
పద్మ పలాశ శోభన లోచనంబును;
 మందస్మితాపాంగ సుందరమును

4-710.1-తేటగీతి

సస్మితాలోక సతత ప్రసన్న ముఖముఁ
గంబు సుందర రుచిర మంగళ గళంబు
హారమణి కుండలప్రభాపూర కలిత
చారు మృగరాజ సన్నిభ స్కంధ యుతము.

4-711-వచనము

వెండియు, శంఖ చక్ర గదా పద్మ కలితాయత బాహు చతుష్టయంబును, వైజయంతీ వనమాలికా కౌస్తుభమణి శ్రీవిరాజితంబును, నిత్యానపాయిని యయిన యిందిరాసుందరీరత్న పరిస్పందంబునం దనరి తిరస్కృత నికషోపలం బైన వక్షస్థ్సలంబును, యుచ్ఛ్వాస నిశ్వాసంబులం జంచలంబులైన వళిత్రయ రుచిర ప్రకాశమాన దళోదరంబును, పూర్వ వినిర్గత నిఖిల విశ్వంబునుం బ్రవిష్టంబుఁజేయురీతి నొందు సలిలావర్త సన్నిభ గంభీర నాభివివరంబును, పంకజ కింజల్క విభా సిత

దుకూలనిబద్ధ కనక మేఖలా కలాప శోభితశ్యామ పృథు నితంబ బింబంబును, నీలకదళీస్తంభరుచి రోరు యుగళంబును, సమచారు జంఘుంబును, నిమ్న జాను యుగళంబును, బద్మపత్ర భాసుర పాదద్వయంబును, మదీయాంతరంగ తమోనివారక నిర్మల చంద్రశకల సన్నిభనఖంబును, గిరీట కుండల గ్రైవేయహార కేయూర వలయ ముద్రికా మణినూపురాది వివిధ భూషణ భూషితంబును, నిరస్త సమస్త నతజన సాధ్వంసంబును, భక్తజన మనోహరంబును, సర్వ మంగళాకరంబును నైన భగవద్దివ్య రూపంబుఁ దామస జన సన్మార్గ ప్రదర్శకుండవైన నీవు మాకుం జూపి మమ్ముఁ గృతార్థులం జేయు" మని వెండియు నిట్లనియె.

4-712-సీస పద్యము

ఆత్మకుఁ బరిశుద్ధి నర్థించు వారికి;
ధ్యేయ వస్తువు భవద్దివ్యమూర్తి;
యంచిత స్వర్గరాజ్యాభిషిక్తున కైన;
సమధిక స్పృహణీయతముఁడ వీవు;
సద్భక్తియుత భక్త జన సులభుండవు;
దుష్టాత్ములకుఁ గడు దుర్లభుండ;
వాత్మదర్శనులకు నరయ గమ్యుండవు;
నై యర్థి విలసిల్లు దనఘచరిత!

4-712.1-తేటగీతి

యిట్టి నిఖిల దురారాధ్య నీశు నిన్ను
నెఱయ సుజనుల కైన వర్ణింపరాదు;
వఱల నెవ్వఁడు పూజించు వాఁడు విడువఁ
జాలునే? పద్మదళనేత్ర! సచ్చరిత్ర!

4-713-చంపకమాల

ఎనసిన భక్తియోగమున నే భవదీయపదాబ్జ మొందఁగా
ననయముఁ గోరువాఁడు చటులాగ్రహ భీషణ వీర్యశౌర్య త
ర్జనములచే ననూనగతి సర్వజగంబులు సంహరించు న
య్యనుపముఁడైన కాలునిభయంబును బొందఁడు సుమ్ము కావునన్.

4-714-తేటగీతి

ఇట్టి నీ పాదమూలంబు లెవ్వఁడేని
బొంది ధన్యాత్ముఁడౌ నట్టి పుణ్యుఁ డొండు
మనము లోపలఁ గోరునే మఱచియైన?
నవ్యయానంద! గోవింద! హరి! ముకుంద!

4-715-కంద పద్యము

హరి! నీ భక్తులతోడను
నిరుపమగతిఁ జెలిమిచేయు నిమిషార్థముతో
సరిగాదు మోక్ష మనిన న
చిరశుభ మగు మర్త్య సుఖముఁ జెప్పఁగ నేలా.

4-716-కంద పద్యము

దురిత వినాశక పదపం
కరుహా! భవత్కీర్తి తీర్థకణచయ బాహ్యం
తర సేక ధూత కల్మష
పురుషులు ధరమీఁదఁ దీర్ఘభూతులు గారే?

4-717-వచనము

అట్టి భూతదయా సమేతులును రాగాది విరహిత చిత్తులును నార్జవాది గుణ యుక్తులును నయిన భాగవత జనుల సంగంబు మాకుం గలుగఁ జేయుము; ఇదియ మ మ్మనుగ్రహించుట" యని వెండియు నిట్లనియె.

4-718-చంపకమాల

సరసిజనాభ! సత్పురుష సంగసమంచిత భక్తి యోగ వి
స్ఫురణ ననుగ్రహింపబడి శుద్ధము నొందినవాని చిత్తము
స్థిర బహిరంగముం గనదు; చెందదు భూరితమస్స్వరూప సం
సరణ గుహం జిరంబు గనఁజాలు భవన్మహనీయ తత్త్వమున్.

4-719-వచనము

అది యెట్టి దనిన.

4-720-సీస పద్యము

అరయంగ నేమిటి యందు నీ విశ్వంబు;
 విదితమై యుండు? నీ విశ్వమందు
నేది ప్రకాశించు? నెప్పుడు నట్టి స్వ;
 యంజ్యోతి నిత్యంబు నవ్యయంబు

నాకాశమును బోలి యవిరళ వ్యాపక;
మగు నాత్మతత్త్వంబు నధిక మహిమ
నమరు పరబ్రహ్మ మగు నని పల్కి యి;
ట్లనియె నవిక్రియుండైన వాఁడు

4-720.1-తేటగీతి

నెవ్వఁ డాతఁడు దనయందు నెపుడు నాత్మ
కార్యకరణ సమర్థంబు గాని భేద
బుద్ధి జనకంబు నాఁదగు భూరిమాయఁ
జేసి విశ్వంబు సత్యంబుగా సృజించె.

4-721-ఆటవెలది

మరలఁమరలఁ బెక్కుమాఱు లీ విశ్వంబు
జనన వృద్ధి విలయ సంగతులను
నందఁ జేయుచుండు నట్టి యీశ్వరుఁడవై
తనరు నిన్ను నాత్మ తత్త్వముగను.

4-722-వచనము

తెలియుదు” మని పెండియు నిట్లనియె “యోగపరాయణు లగువారు శ్రద్ధా సమన్వితులై క్రియాకలాపంబుల నంతఃకరణోపలక్షితం బయిన భవదీయ రూపంబు యజింతురు; వారు వేదాగమతత్త్వ జ్ఞానులు; నీ వాద్యుండవును ననాదియు నద్వితీయుండవును మాయాశక్తి యుక్తుండవును నై విలసిల్లు చుండుదు; వట్టి మాయాశక్తి చేత.

4-723-సీస పద్యము

చతురాత్మ! సత్త్వరజస్తమోగుణములు;
 వరుస జనించెను; వానివలన
మహదహంకార తన్మాత్ర నభోమరు;
 దనల జలావని ముని సుపర్వ
భూతగణాత్మక స్ఫురణ నీ విశ్వంబు;
 భిన్న రూపమున నుత్పన్న మయ్యె;
దేవ! యీ గతి భవదీయ మాయను జేసి;
 రూఢిఁ జతుర్విధ రూపమైన

4-723.1-తేటగీతి

పురము నాత్మాంశమునఁ జెందు పురుషుఁ డింద్రి
యములచే విషయ సుఖము లనుభవించు;
మహిని మధుమక్షికాకృత మధువుఁ బోలి
యతనిఁ బురవర్తి యగు జీవుఁ డండ్రు మఱియు.

4-724-వచనము

ఇట్టి జగత్స్రష్టకుండవైన నీవు.

4-725-కంద పద్యము

భూతగణంబుల చేతనె
భూతగణంబు లను మేఘపుంజంబుల ని

ర్ధూతముగఁ జేయు ననిలుని
భాతిని జరియింపఁ జేసి పౌరుష మొప్పన్.

4-726-తేటగీతి

రూఢిఁ దత్తత్రియాలబ్ధ రూపుడవును
సుమహితస్ఫురదమిత తేజుఁడవుఁ జండ
వేగుఁడవు నయి ఘన భుజా విపుల మహిమ
విశ్వసంహార మర్థిఁగావింతు వీశ!

4-727-వచనము

అది యెట్లనిన.

4-728-కంద పద్యము

ఇతి కర్తవ్య విచారక
మతిచేఁ దగ నెప్పుడుం బ్రమత్తుంబును సం
చిత విషయ లాలసము నూ
ర్జిత లోభము నైన యట్టి సృష్టి గడంకన్.

4-729-తేటగీతి

అప్రమత్తుండ వగుచుఁ బద్మాక్ష! నీవు
మ్రింగుదువు చాల నాఁకట మ్రేఁగు చుండి
నాలుకలు గ్రోయు భూరిపన్నగము వాతఁ
బడిన యెలుకను భక్షించు పగిది ననఘ!

4-730-చంపకమాల

అనిశము నస్మదీయగురుఁడైన సరోరుహ సంభవుండు న
మ్మనువులు నాత్మసంశయము మాని భజించు భవత్పదాబ్జముల్
మనమున నిల్పి యుష్మదవమాన మహావ్యథఁ బొందునట్టి స
జ్జనుఁడు పరిత్యజించునె? భుజంగమతల్పక! భక్తకల్పకా!

4-731-కంద పద్యము

కావున నాకును సూరి జ
నావళికిని సర్వసంశయంబులు వాపం
గావను బ్రోవను దగు గతి
నీ వని వినుతించి నట్టి యీ స్తవ మెలమిన్.

4-732-వచనము

రుద్రుండు ప్రచేతసుల కెఱిఁగించి వెండియు నిట్లనియె "ప్రచేతసులారా! యిట్టి యోగాదేశ నామకంబైన యీ స్తోత్రంబు బహువారావృత్తిచేఁ బఠించి మనంబున ధరియించి సమాహిత చిత్తులై మీరందఱు నాదరంబున విశ్వాసయుక్తులును, స్వధర్మాచారవంతులును, భగవదర్పితాశయులును నై జపియించుచు సర్వభూతావస్థితుండు నాత్మారాముండు నైన సర్వేశ్వరుని నుతించుచు ధ్యానంబు చేయుచుఁ బూజించుచుండుఁడు; తొల్లి యీ స్తోత్రంబు భగవంతుండైన పద్మసంభవుండు సిసృక్షు వగుచు నాత్మజులమైన మాకును సృజియింప నిచ్ఛగించు భృగ్వాదులకును నెఱింగించె; మేము నా భృగ్వాదులును బ్రజాసర్గంబు నందు బ్రహ్మచోదితులమై యీ

స్తోత్రంబునం జేసి విధ్వస్త సమస్త తమోగుణులమై వివిధ ప్రజాసర్గంబు గావించితిమి; కావున నీ స్తోత్రంబు నెల్లప్పుడు నేకాగ్రచిత్తుండును వాసుదేవ పరాయణుండు నై యెవ్వండు జపియించు, వాఁడు వేగంబె శ్రేయస్సును బొంది తదీయ జ్ఞాన ప్లవంబున వ్యసనార్ణవ రూపంబయిన సంసారంబును సుఖతరంబుగఁ దరియించు; అట్టి మదుపదిష్టం బయిన యీ శ్రీహరి స్తవంబు నెవ్వండు చదువుచు దురారాధ్యుం డైన శ్రీహరిం బూజించు, వాఁడు మదుక్త స్తోత్ర గాన సంతుష్టుండును శ్రేయస్సులకు నేకాశ్రయ భూతుం డును నగు; శ్రీమన్నారాయణుని వలన సమస్తాభీష్టంబులం బొందు; ఎవ్వండేనిఁ బ్రభాతంబున లేచి ప్రాంజలియు శ్రద్ధాసమన్వితుండు నై యీ మంగళస్తవరాజంబును వినిన వినిపించినం గర్మబంధ విముక్తుం డగును;" అని మఱియు నిట్లనియె.

4-733-కంద పద్యము

నరదేవతనయులారా!
పురుషాధీశుండు పరమ పురుషుఁడు నగు నీ
శ్వరు సుస్తోత్రము మీ కా
దరమునఁ దెలిపితిని; మీరుఁ దద్దయు భక్తిన్.

4-734-కంద పద్యము

ఏకాగ్రచిత్తులును సు
శ్లోకులునై జపము చేయుచును ఘనతపముం
గైకొని చేసిన మీకును
జేకురు మహితేప్సితార్థ సిద్ధి గడంకన్.

4-735-కంద పద్యము

అని యీ గతి నుపదేశం
బొనరించి సదాశివుండు నొగి వారలచే
తను బూజితుఁడై వారలు
గన నంతర్ధానుఁ డయ్యెఁ గౌతుక మొప్పన్.

4-736-వచనము

అంత.

4-737-తేటగీతి

తివుట వారలు రుద్రోపదిష్టమైన
యచ్యుతస్తవము జపించు చయుత సంఖ్య
వత్సరము లుగ్ర తపము దుర్వార వారి
మధ్యమునఁ జేయుచున్న సమయమునందు.

4-738-వచనము

ఘనకర్మాసక్త చిత్తుండై యున్న ప్రాచీనబర్హి కడకు నధ్యాత్మవేదియుం గృపాళువు నైన నారదుండు చనుదెంచి యా రాజునకు జ్ఞానబోధంబు చేయు కొఱకు నతనితో నిట్లనియె "రాజా! యీ కర్మంబునం జేసి యెట్టి శ్రేయస్సు నభిలషించుచున్నవాఁడ వట్టి యనిష్ట నిరసనంబు నభీష్ట ప్రాప్తి కరంబు నయిన శ్రేయం బీ కర్మంబు వలన లభింప" దనినం బ్రాచీనబర్హి నారదున కిట్లనియె.

4-739-సీస పద్యము

అనఘ! మునీంద్ర! మహాభాగ! యేను గ;
ర్మాపహతజ్ఞాని నగుచు మోక్ష
మెఱుఁగంగ లే నైతి నిట్టి నా కిప్పుడు;
గడు విమలంబును గర్మబంధ
నాశకంబును నగు జ్ఞానోపదేశంబు;
గావింపు మతిదయాకార! కూట
ధర్మంబులగు గేహతతులందుఁ జెంది జా;
యా తనూజాత ధనాదికములె

4-739.1-తేటగీతి

భూరి పురుషార్థములు గాఁగ బుద్ధిఁ దలఁచు
మతివిహీనుండు సంసార మార్గములను
దగఁ బరిభ్రామ్యమాణుఁడై యొగిని మోక్ష
పదము నొందగఁజాలఁడు భవ్యచరిత!

4-740-కంద పద్యము

అనవుఁడు నతనికి నతఁ డను
ననఘా! యీ యధ్వరంబులందును గృపమా
లిన నీచే విశసింపం
జని కూలిన పశుల వేల సంఖ్యలఁ గనుమా

4-741-వచనము

కావునం బశువ్రాతంబులు త్వదీయ వైశసంబును స్మరించుచున్నవై లోహయంత్రమయ శృంగంబులచేత నెప్పుడు నీవు పరలోకంబు నొందెద వప్పుడు నిన్ను హింసింతు మని భవదీయ మృతికి నెదురు చూచుచున్న; విట్టి సంకటంబు నొందంగల నీకు నిస్తారకం బయిన యొక్క యితిహాసంబు గల దెఱింగింతు విను" మని యిట్లనియె.

## 4-23-పురంజను కథ

### 4-742-సీస పద్యము

భూమీశ! విను మయ్య పూర్వకాలమునఁ బు;
 రంజనుం డను నొక్క రాజు గలఁడు;
అతని కవిజ్ఞాతుఁ డనుపేరఁ దగిలి వి;
 జ్ఞాతచేష్టితుఁ డగు సఖుఁడు కలఁడు;
ఆ పురంజనుఁడు పురాన్వేషియై ధరా;
 చక్రంబుఁ గలయంగ సంచరించి
తన కనురూపమై పెనుపొందు పుర మెందు;
 వీక్షింపఁ జాలక విమనుఁ డగుచు

### 4-742.1-తేటగీతి

నే పురము లుర్విఁ బొడఁగనె నా పురములు
గామములఁ గోరు తనకు న క్కామములను
బొందుటకు వానిని ననర్హములుగఁ దన మ
నమునఁ దలఁచి యొకానొకనాఁ డతండు.

4-743-వచనము

చనుచున్న సమయంబున హిమవత్పర్వత దక్షిణసానువు లందు.

4-744-సీస పద్యము

వర నవద్వార కవాట గవాక్ష తో;
 రణ దేహాళీగోపురముల నొప్పి
ప్రాకార యంత్రవప్రప్రతోళీ పరి;
 ఘట్టాల కోపవనాళిఁ దనరి
సౌవర్ణ రౌప్యాయస ఘన శృంగంబుల;
 రమణీయ వివిధ గేహముల మించి
రథ్యాసభా చత్వరధ్వజ క్రీడాయ;
 తన సుచైత్యాపణతతిఁ దనర్చి

4-744.1-తేటగీతి

మరకతస్ఫటిక విదూరమణి వినూత్న
మౌక్తికాయుత ఖచిత హర్మ్యములు గలిగి
విద్రుమద్రుమ వేదుల వెలయు నొక్క
పురముఁ గనియె భోగవతినిఁ బోలు దాని.

4-745-వచనము

ఇట్లు గనుంగొని యనంతరంబ ముందటం బురబాహ్యాంతరంబున దివ్యద్రుమ లతాకుంజ పుంజంబును, సమద నదద్విహంగ మత్త మధుకరకుల కోలాహల సంకుల జలాశయ శోభితంబును,

హిమనిర్ఝరబిందు సందోహ పరిస్పంద కందళిత మందమలయ మరుదుచ్చలిత ప్రవాళవిటప నళినీతటంబును, పాంథజన మనోరంజ నాహ్వాన బుద్ధిజనక కలహంస రాజకీర కోకిలాలాప విరాజమానంబును; మునివ్రత నానావిధ వనమృగవ్రాత బాధారహితంబును నైన పురబాహ్యోద్యానవనంబు నందు యాదృచ్ఛికంబుగ నేకైక శతనాయకం బైన యనుచర దశకంబును, బంచమస్తకసర్ప ప్రతీహారుండును, దోడరాఁ జనుదెంచుచున్న భర్తృన్వేషిణియుం గామరూపిణియు నవోఢయు నయినట్టి.

4-746-సీస పద్యము

ఘన సమవిన్యస్త కర్ణ కుండల రుచుల్;
 గండభాగంబుల నిండి పర్వఁ
దమ్మిఱేకులసిరిఁ దటమటింపఁగఁ జాలు;
 మెఱుఁగుఁ గన్నులు దలఁ దిరిగి రాఁగ
జఘన సంకలిత పిశంగ నీవీద్యుతి;
 కనక కాంచీరుచిఁ గరము పెనుపఁ
జరణ సరోజ భాసుర చలన్నూపుర;
 ఝణఝణ ధ్వని నర్మ సరణిఁ జూప

4-746.1-తేటగీతి

లలిత యౌవన లక్ష్మీవిలాస భాసు
రోదయవ్యంజితప్రభాయుక్త పీన

సమ నిరంతర కుచకుట్మలముల వ్రీడఁ
జెంది పయ్యెదఁ గప్పు బాలేందుముఖిని.

4-747-వచనము

మఱియును బాలయు సుదతియు గజగామినియు నయిన యొక్క ప్రమదోత్తమం గాంచి.

4-748-కంద పద్యము

తరమిడి ప్రేమోద్ధమమై
మరువిండ్లం బోలు కన్బొమలు గల తరుణీ
సరసాపాంగ విలోకన
శరపరివిద్ధాంగుఁ డగుచు జనవిభుఁ డనియెన్.

4-749-కంద పద్యము

ఎవ్వరి దానవు? జనకుం
డెవ్వఁడు? పేరేమి? భృత్యు లీ పదియొక రిం
దెవ్వరు? సతు లెవ్వరు? మఱి
యివ్వనమున నుండఁ గార్యమెద్ది? మృగాక్షీ!

4-750-కంద పద్యము

భవదీయ పురస్సరుఁ డగు
పవనాశనుఁ డెవ్వఁ? డతికృపామతి నాకున్
వివరింపు మనుచు వెండియు
ధవళేక్షణఁ జూచి ధరణిధవుఁ డిట్లనియెన్.

4-751-సీస పద్యము

తరళాక్షి! పతి యగు ధర్ము నన్వేషింపఁ;
 జరియించు ప్రియను సతివొ, కాక
రుద్రు నన్వేషించు రుద్రాణివో, కాక;
 బ్రహ్మను వెదకు భారతివొ, కాక
నారాయణుని భక్తిఁ గోరి యన్వేషించు;
 నిందిరవో, కాక యెవ్వ రీవు?
త్వత్పాద కామనత్వము నను సంప్రాప్త;
 సకల కాముండగు సరసు నెట్టి

4-751.1-తేటగీతి

వాని వెదకెదు? తరుణీ? భవత్కరాగ్ర
పద్మకోశంబు నేఁ డెందుఁ బతిత మయ్యె?
నాకు నెఱిఁగింపఁ దగుదు వివేకచరిత!
యని నృపాలుఁడు మఱియు నిట్లనియె సతికి.

4-752-కంద పద్యము

కర మొప్పఁగ నీ విటు భూ
చర వగుటను ప్రీవి శివవు శారదవును సా
గర కన్యవుఁ గాకుండుటఁ
దరుణీ! వొడగంటి నని పదంపడి పలికెన్.

4-753-సీస పద్యము

మొనసి యదభ్రకర్ముఁడ నైన నాచేత;
 నిపుడు పాలితమైన యీ పురంబు
సరసిజోదరుని భుజాపాలితోదాత్త;
 లలిత వైకుంఠ మలంకరించు
నిందిరా సుందరి చందంబునను నీ వ;
 లంకరింపఁ గడంగు పంకజాక్షి!
యది గాక తావకీనాపాంగరుచి మోహి;
 తాంతరంగుండ నైనట్టి నన్ను

4-753.1-తేటగీతి

మహిత సవ్రీడభావ సన్మందహాస
చారు విభ్రమ భ్రూలతా ప్రేరితుఁడుగఁ
దనరు భగవంతుఁ డగునట్టి మనసిజుండు
పడఁతి! యుడుగక పీడింపఁ దొడఁగె నిపుడు.

4-754-వచనము

కావున.

4-755-చంపకమాల

తరుణి! సుతారలోచన యుతంబును మంజుసుధాసమానభా
సుర మృదువాక్య యుక్తమును శోభిత కోమల లంబమాన సుం
దర చికురాభిరామము నుదారము నైన భవన్ముఖాబ్జమున్
సురుచిరలీల నెత్తి ననుఁ జూడుము; సిగ్గును జెంద నేటికిన్?

4-756-వచనము

అని యివ్విధంబున నధీరుండై పలుకు పురంజనుం జూచి యా ప్రమదోత్తమ వీరమోహితయై సస్మితానన యగుచు నానందంబునొంది యిట్లనియె.

4-757-కంద పద్యము

పురుషవర! నాకు నీకును
గురువును నామమును గులముఁ గోరి యెఱుఁగ నీ
పురమున నుండుదుఁగా; కీ
పురమును నిర్మించి నట్టి పురుషు నెఱుంగన్!

4-758-కంద పద్యము

వీరలు నా సఖు లీ లల
నారత్నము లార్యవినుత !నా చెలు; లీ వృ
ద్ధోరగ మే నిద్రింపఁగ
ధీరత మేల్కాంచి పురము ధృతిఁ బాలించున్.

4-759-వచనము

వెండియు నిట్లనియె.

4-760-సీస పద్యము

మనుజ నాయక; నీవు మద్భాగ్య వశమున;
నిటకు నేతెంచితి; విపుడు నీకు
మంగళంబగు; నీవు మహితేంద్రియగ్రామ;

భోగ్యంబులగు కామపుంజములను
నర్థి సంపాదింతు; వనఘాత్మ; యీ నవ;
ద్వార ప్రయుక్త మై తనరు పురము
నీవు గైకొని యేలు; నీ కంటె దీనికి;
నధిపుఁ డన్యుండు లేఁ డనఘ; యిందు

4-760.1-తేటగీతి

మదుపనీతములైన కామముల ననుభ
వింపఁగా సమాశత మధిష్ఠింపు మెలమిఁ;
గోరి నీకంటెఁ బ్రియులు నెవ్వారు నాకు?
నరసి చూడంగ మనుజేంద్ర; యదియుఁ గాక.

4-761-వచనము

మఱియు రతిజ్ఞాన విహీనుండు నకోవిదుండు నిహపరచింతాశూన్యుండుఁ బశుప్రాయుండుఁ ద్వదన్యుండు నైన వాని నెవ్వని వరియింతు? గృహస్థాశ్రమమందు ధర్మార్థ కామ మోక్ష ప్రజానందంబులును యశంబును యతివేద్యంబులు గాని రజస్తమో విహీన పుణ్యలోకంబులును గలుగు; పితృ దేవర్షి మర్త్య భూతగణంబులకుం దనకు నీ లోకంబున గృహస్థాశ్రమంబు సర్వక్షేమార్థం బయిన యాశ్రమంబండ్రు; గావున వదాన్యుండవు, వీరవిఖ్యాతుండవుఁ, బ్రియదర్శనుండవు, స్వయంప్రాప్తుండవు నయి భోగి భోగ సదృశ భుజాదండంబులచే నొప్పు భవాదృశుం దగిలి మాదృశ యగు కన్య వరియింపకుండునే" యని పెండియు.

4-762-కంద పద్యము

కరుణారస పరిపూర్ణ
స్ఫురితస్మిత రుచి విలోక పుంజముచేతం
గర మర్థి దీన జన భయ
హరణుఁడవై సంచరింపు మఖిల జగములన్.

4-763-కంద పద్యము

అని యీ గతిఁ బలికిన యా
వనజాక్షిఁ బురంజనుండు పరియించి ముదం
బున నన్యోన్యప్రీతిం
దనరుచుఁ దత్పురము చొచ్చి ధన్యుం డగుచున్

4-764-చంపకమాల

శతసమకాల మప్పురి నజస్రము భూరిసమస్త సౌఖ్య సం
గతులఁ దనర్చి వందిజన గాయక సద్వినుతోరు గాన మో
దిత మతి నొప్పి సుందరసతీ జనసేవితుఁడై నృపాల కో
చిత లలితస్థలంబుల వసించుచుఁ గ్రీడలు సల్పుచుండఁగన్.

4-765-కంద పద్యము

నరనాథుఁడు లోకభయం
కరగతి వర్తించు గ్రీష్మకాలము దోఁపం
దరళ లహరీ మనోహర
వర ప్రోదిని సలిలమందు వసియించెఁ దగన్.

4-766-వచనము

ఇట్లు వసియించి కతిపయ దినంబు లరుగు సమయంబున.

4-767-సీస పద్యము

అవనీశ్వరోత్తమ! యప్పురంబున నాల్గు;
 వంకలనున్న గవాక్షులు వినుము
తూర్పు దిక్కునకు నైదును దక్షిణోత్తరం;
 బుల రెండుఁ బశ్చిమంబు నను రెండు
గాఁగ నా తొమ్మిది గవాక్షుల నుపరి ది;
 క్కున నేఁడు గ్రింద దిక్కునను రెండు
నయి యుండు; మఱి వాని యందుఁ బృథగ్విధ;
 విషయ గత్యర్థమై వెలయు నీశ్వ

4-767.1-తేటగీతి

రుం డొకం డరయఁ గలండు రూఢిఁ దత్పు
రంబుఁ బాలించునట్టి పురంజనుండు
నా పురద్వార నవకంబు; నందులోన
నర్థిఁ బ్రాగ్ద్వార పంచకమందు వరుస.

4-768-వచనము

ఖద్యోతయు హావిర్ముఖియు నను నామంబులుగల ద్వారయుగంబున ద్యుమత్సఖుఁడై విభ్రాజితాఖ్య జనపదంబును బొందు; వెండియు నళినియు నాళినియు నను పేళ్ళు గల వాకిళ్లు రెంటి యందు నవధూత

సఖుండై సౌరభరూపంబు లయిన విషయంబులం బొందు; మఱియు ముఖ్యానామకం బైన ప్రధాన ప్రాగ్ద్వారంబున రసజ్ఞ విపణాన్వితుండై యాపణబహూదనంబులను విషయంబులనొందు; బితృహూ నామకం బయిన దక్షిణ ద్వారంబున శ్రుతధరాన్వితుం డై దక్షిణ పాంచాలంబను రాష్ట్రంబు నొందు; దేవహూ నామకంబయిన యుత్తరపు వాకిట శ్రుతధరాన్వితుండై యుత్తర పాంచాలంబను రాష్ట్రంబు నొందు; వెండియుం బడమటి వాకిళ్ళు రెంటియందు నాసురీ నామకం బైన వాకిట దుర్మదసమేతుండై గ్రామక నామకంబైన విషయంబును, నిర్ఋతి నామకం బయిన వాకిటయందు లుబ్ధక యుక్తుండై వైశసం బను విషయంబు నొందుచుండు; వెండియుం బురంజనుం డప్పురంబునం బౌరజనంబులందు నిర్వాక్పేశస్కరులను నిద్దఱంధులు గలరు; వారలచేత గమన కరణంబులను క్రియల నొందుచు నంతఃపురగతుం డగు నప్పుడు విషూచీ సమన్వితుండై జాయాత్మజోద్భవంబు లైన మోహ ప్రసాద హర్షంబుల నొందుచుండు; ఇవ్విధంబునం గర్మాసక్తుండుఁ గామాసక్తుండునై బుద్ధియను మహిషిచేత వంచితుం డయ్యె; అక్కామినియు.

4-769-సీస పద్యము

పానంబు చేసినఁ దానుఁ బానము చేయుఁ;

 గుడిచినఁ దానును గుడుచు; మఱియు

భక్షింపఁ దానును భక్షించు; నడచిన;

 నడచును; నవ్విన నవ్వు; నేడ్వ

నేడుచుఁ; బాడినఁ బాడు; విన్నను వినుఁ;
జూచినఁ జూచుఁ; గూర్చున్న నుండు;
దుఃఖింప దీనుఁడై దుఃఖించు; నిలిచిన;
నిలుచు; నిద్రింపఁగ నిద్రబోవు;

4-769.1-తేటగీతి

ముట్టినను ముట్టు; మూర్కొన్న మూరు కొనును;
బలుకఁ బలుకును; బవళింపఁ బవ్వళించు;
హర్షమును బొంద నాత్మను హర్ష మొందు;
మోదమును బొందఁ దాను మోద మందు.

4-770-వచనము

ఇవ్విధంబున నతండు మహిషీ విప్రలబ్ధుండును వంచిత స్వభావుండును నై పారవశ్యంబునంజేసి యజ్ఞుండును నితరేచ్ఛా విరహితుండును నై క్రీడామృగంబు చాడ్పున వర్తించుచు నా పురంబునఁ గాపురంబుండఁ గొన్ని దినంబుల కా పురంజనుం డొకానొక దినంబున ధనుర్ధరుండై.

4-771-సీస పద్యము

పంచాశ్వ యుక్తంబు పంచ బంధనముఁ జ;
క్రద్వితయమును యుగద్వయంబు
నాశు వేగంబు నేకాక్షంబు కూబర;
ద్వయముఁ బతాకాత్రితయ యుతంబు
నేక రశ్మి యుతంబు నేకసారథికంబు;

సప్తవరూథంబు స్వర్ణ భూష
మును బంచ విక్రమమును నేక నీడంబుఁ;
బ్రకట పంచప్రహరణము నయిన

4-771.1-తేటగీతి

రథము కాంచన రచిత వర్మము ధరించి
విలస దక్షయ తూణీర కలితుఁ డగుచుఁ
గడఁక దీపింప నెక్కి యేకాదశప్ర
సంఖ్య సేనాసమేతుఁడై సరభసముగ.

4-772-వచనము

పురంబు వెడలి పంచప్రస్థంబను వనంబునకుం జని యందు విడువరాని మహిషిని విడిచి మృగయాసక్తుండై దృప్తుండగుచు ధనుర్బాణంబులు ధరియించి సంచరించుచు నాసుర వర్తనంబునం దగిలి ఘోరాత్ముండు నదయుండునై నిశాతసాయకంబుల చేత నమ్మృగ వ్రాతంబులం బరిమార్చె; రాజులకు మృగయా వినోదంబు విహితానుష్ఠానం బగుచుండ నాసురవృత్తి యెట్లయ్యెఁ; నని యంటివేని; నిది రాగ ప్రాప్తం బగుటను విహితంబుగాదు; వినుము; శ్రాద్ధాదులందే ప్రఖ్యాత శ్రాద్ధదివసంబుల యందే రాజైన వాఁడే, మేధ్యంబులయిన పశువులనే వనంబునందే యథోపయుక్తంబుగానే వధియింపంజను నను నియమ మాత్రంబు గలదు; గావున జ్ఞాని యైన విద్వాంసుం డాచరింపడు; గాక యాచరించినం గర్మానుష్ఠానజనితంబయిన జ్ఞానంబునం జేసి యందుఁ బొరయండు; అట్లుగాక నియమోల్లంఘనంబునం గర్మాచరణుం డగువాఁ

డభిమానంబు నొంది కర్మబద్ధుండై గుణప్రవాహ పతితుండును నష్టప్రజ్ఞుండునునై యధోగతిం గూలు; నిట్లగుటం జేసి సాధుజనులకు సర్వప్రకారంబుల నాసురవృత్తి మానం దగు" నని వెండియు నిట్లనియె "అంతం బురంజనుం డవ్వనంబున.

4-773-కంద పద్యము

వర చిత్ర పక్ష సునిశిత
శరములచే శశ వరాహ చమరీ రురు కా
సర గవయ శల్య హరిణీ
కరి హరి వృక పుండరీక కపి ఖడ్గములన్.

4-774-వచనము

వధియించి మఱియును.

4-775-సీస పద్యము

వరుస మేధ్యా మేధ్య వనమృగంబుల ఘృణ;
 సన దుస్సహక్రీడ సంహరించి
శ్రమయుక్తుఁడై వేఁట చాలించి మరలి మం;
 దిరమున కర్థి నే తెంచి యందు
సముచిత స్నాన భోజన కృత్యములు దీర్చి;
 యతి పరిశ్రాంతి శయానుఁ డగుచుఁ
బరిమళ మిళిత ధూపవ్రాత వాసిత;
 సర్వాంగుఁ డగుచు స్రక్చందనములు

4-775.1-తేటగీతి

వివిధ భూషణ చేలముల్ వెలయఁ దాల్చి
తుష్టుఁడును హృష్టుఁడున్ మఱి ధృష్టుఁడై య
నన్యజాకృష్ట చిత్తుండునై రతిప్ర
సంగకౌతుక మాత్మను దొంగలింప.

4-776-వచనము

అంత స్వకీయ ప్రాణవల్లభ యగు మహిషియందు మనంబు నునిచి నా వరారోహయు గృహమేధినియు నయిన గృహిణిం గానక, విమనస్కుండై నిజాంతఃపుర కామినులం గనుంగొని యిట్లనియె.

4-777-కంద పద్యము

రామాజన సంఘము లా
రా! మానవతీ లలామ రామామణి సా
రామలకృపచే మెలఁగుదు
రా మానుగఁ గుశలమా? పరామర్శింపన్.

4-778-ఉత్పలమాల

సార వివేకలార! గృహసంపద లీ యెడఁ బూర్వరీతిచే
నారయఁగా రుచింపవు గృహస్థునకుం గృహమందు మాత గా
నీ రమణానుకూల రమణీ మణి యై తనరారు భార్య గా
నీ రుచి నొందకున్నఁ గన నేర్చునె తద్గృహమేధి సౌఖ్యముల్.

4-779-వచనము

అదియునుం గాక.

4-780-కంద పద్యము

పొగ డొందు జనని గానీ
తగవున వర్తించునట్టి దయితయు కానీ
తగ నుండని గృహమున నుం
టగుఁ జక్ర విహీన రథము నందుం టరయన్.

4-781-వచనము

కావున.

4-782-చంపకమాల

తలకొని నాకుఁ దాను సుపదంబునఁ బ్రజ్ఞ జనింపఁజేసి సం
చల దురు దుర్భరవ్యసన సాగరమగ్నుఁడ నైన నన్ను ని
శ్చలమతి నుద్ధరించి యనిశంబును మత్ప్రియ యైన భార్య యే
వలనఁ జరించుచున్న దనివారణ నా కెఱిఁగింపరే దయన్?

4-783-కంద పద్యము

అనవుడు విని యక్కాంతలు
జనపతి కిట్లనిరి రాజసత్తమ! యిదిగోఁ
దన కొంగైనను బఱపుగ
నొనరింపక నేలఁ బొరలుచున్నది వగలన్.

4-784-తేటగీతి

ఏమి కతమున నున్నదో యెఱుఁగ మేము
నీవు చూడు మ టన్న నా భూవరుండు
నేలఁ బడి పొరలెడు భార్యఁ బోలఁ జూచి
మనములో దుఃఖ తాపంబు మల్లడింప.

4-785-వచనము

అంత.

4-786-ఆటవెలది

జలజనేత్ర ప్రణయ సంజాత రోష భా
వమున నయిన యట్టి వక్రదృష్టి
జన విభుండు చూచి యనునయ కోవిదుఁ
డగుచు నప్పయోరుహాక్షిఁ జేరి.

4-787-కంద పద్యము

పొలఁతుకఁ దన యుత్సంగం
బుల నిడి తత్పాద యుగళమును నంటుచు మం
జుల మృదు భాషణముల నా
లలనామణిఁ జూచి పలికె లాలన మొప్పన్.

4-788-చంపకమాల

రమణిరో! భృత్యులందు నపరాధము గల్గిన నాయకుల్ స్వప
క్షముఁ దలపోసి యుగ్రతర శాసనముం దెగి చేయ రట్లు గా

క మనములోని కిన్కఁ దమకంబున నాజ్ఞ యొనర్చ్చరేని ని
క్కముగ ననుగ్రహించుటయ కాక తలంపఁగ నాజ్ఞ చేయుటే?

4-789-కంద పద్యము

కమలానన! బాంధవ కృ
త్యముఁ దలఁపక రోషచిత్తుఁ డగు కుటిలాత్ముబన్
సమదా మర్షుఁడు నీతి
క్రమరహితుఁడు నైన బాలుఁగా నెన్నఁ దగున్.

4-790-వచనము

అని వెండియు నిట్లనియె "సుదతీ హృదయేశ్వరి వైన నీవు.

4-791-మత్తేభ విక్రీడితము

సరసోదార సుధా రసోపమ వచశ్చాతుర్య సౌభాగ్యమై
హరినీలోపమ కోమలాలక యుతంబై విభ్రమభ్రూలతా
పరిజుష్టస్మిత సద్విలోకనమునై భాసిల్లు యుష్మన్ముఖాం
బురుహంబున్ భవదీయ దాసునకుఁ బూఁబోఁడీ! కృపం జూపవే.

4-792-కంద పద్యము

విను; వీరపత్ని! నీ యెడ
ననయంబును బ్రాహ్మణులును హరిభక్తులుఁ ద
క్కను నితరు లెగ్గు చేసిన
వనితా! శిక్షింతు నెంతవారల నయినన్.

4-793-కంద పద్యము

ఈ ముల్లోకము లందును
నా మనమున రోష మొదవినన్ భయ రహితుం
డై మదిలోఁ బరితోషము
తో మెలఁగెడువానిఁ గానఁ దోయజనేత్రా!

4-794-సీస పద్యము

ఇందీవరేక్షణ! యే నెందు భవదీయ;
తిలక విరహితము మలినయుతము
హార్ద శూన్యంబు నపాస్తరాగంబును;
సత్యమర్షయుతంబు నయిన ముఖము
గళితాశ్రుబిందు సంకలిత సంచిత శోభ;
మాన పీనస్తన మండలమును
రమణీయ తాంబూలరాగ విహీన మై;
నట్టి సుపక్వ బింబాధరంబు

4-794.1-తేటగీతి

గాఁగ నిట్లుంట కిపు డేమి కతము? నాకు
నర్థి నెఱిఁగింపవే మృగయాతిసక్తి
నబల; నీ కెఱిఁగింపక యరిగి నట్టి
తప్పు సైరించి కావంగఁ దగుదు నేను.

4-795-కంద పద్యము

వనితాజన పరవశుఁడై
మనసిజ శర బాధ్యమాన మానసుఁ డగు వా
నిని దగఁ గర్తవ్యార్థము
లను భజియింపక తొలంగు లలనలు గలరే?

4-796-వచనము

అనుచుం దదీయ విభ్రమ వశంగతుండై పలికిన విని.

4-797-కంద పద్యము

కంజాతపత్ర నేత్ర పు
రంజను దెస రోష ముడిగి రమణీయశ్రీ
మంజుల మృదూక్తుల మనము
రంజించుచుఁ బలికె సదనురాగ మెలర్పన్.

4-798-వచనము

అంత.

4-799-సీస పద్యము

అమ్మహాదేవి నెయ్యంబున మంగళ;
 స్నాతయై మృదుల వస్త్రములు గట్టి
స్రక్చందనాది భూషణములు ధరియించి;
 కమనీయ మోహనాకార యగుచుఁ
బతికడ నిలిచిన నతఁడు సంతుష్టాంత;
 రంగుఁడై యభ్యంతరమున నుండి

యన్యోన్య సరస గాఢాలింగనంబులు;
గావించి గోప్య వాక్యముల చేత

4-799.1-తేటగీతి

నతఁడు ప్రమదా పరిగ్రహ వ్యసనమునను
గడఁక నపకృష్ట ఘన వివేకంబు గలిగి
పగలు రే యని ప్రొద్దు లేర్పఱుప రాక
యెనసి యాయుర్వ్యయంబు దా నెఱుఁగఁ డయ్యె.

4-800-వచనము

మఱియు నతం డున్నద్ధ మదుండును మహామనుండును నర్హశయ్యా శయనుండును మహిషీ భుజోపధానుండును నై యజ్ఞానాభిభూతుం డగుటంజేసి స్వరూప భూత పరమ పురుషార్థంబు నెఱుంగక నిజ మహిషియె పరమ పురుషార్థంబుగాఁ దలంచుచు రమించుచుం గామ కశ్మలచిత్తుం డైన యతనికి నవయౌవనంబైన కాలంబు క్షణార్థం బునుం బోలె గతం బయ్యె; అంత.

4-801-కంద పద్యము

విశద యశోజలనిధి యా
శశిముఖి యగు భార్య వలన సమ్మతి నేకా
దశశత పుత్రుల రణక
ర్కశ దేహులఁ గాంచి కౌతుకంబున మఱియున్.

4-802-కంద పద్యము

గురు శీలౌదార్య గుణో
త్తరలను సల్లలిత గుణ కదంబలఁ బ్రియలన్
వరకుల పావనల దశో
త్తరశత దుహితలను గాంచెఁ దత్సతివలనన్.

4-803-వచనము

ఇట్లు పుత్ర పుత్రికా జనంబులం గని యున్నంత.

4-804-కంద పద్యము

విను మాతని యాయువులో
నను నర్థం బరిగె; నంత నరపతి కుల వ
ర్ధను లగు సుతులకుఁ బరిణయ
మొనరించెన్ సదృశ లయిన యువిదల తోడన్.

4-805-కంద పద్యము

నరనాథుఁ డాఁడు బిడ్డల
వరరూప వయో విలాస వైభవములచేఁ
బరఁగిన నిజతనయల సమ
వరులకు సంప్రీతితో వివాహము చేసెన్.

4-806-వచనము

అట్లు వివాహంబులు గావించి యున్న సమయంబున.

4-807-కంద పద్యము

విను తత్సుతు లొక్కకనికి
ననయముఁ బాంచాల దేశమందులఁ బౌరం
జన కులవర్ధను లగుచున్
జనియించిరి నూర్వురేసి శౌర్య బలాఢ్యుల్

4-808-ఆటవెలది

అనఘ! యట్టి రిక్థహారులు గేహకో
శాను జీవ యుతులు నయిన యట్టి
నందనాదులందుఁ జెందిన మమత ని
బద్ధుఁడయ్యె నంతఁ బార్థివుండు.

4-809-చంపకమాల

తిరమగు నిష్ఠతో నతఁడు దీక్షితుఁడై పశుమారకంబులున్
సరవి భయంకరంబులగు సన్మఖముల్ దగఁ బెక్కు చేసి యా
దరమున నీవునుం బలెను దత్తదనూన ఫలాప్తి కాముఁడై
సురపితృ భూత సంఘము నసూయఁ దనర్ప భజించె భూవరా!

4-810-వచనము

ఇట్లాత్మహితంబు లైన కర్మంబులయం దనవహితుండును గుటుంబాసక్త మానసుండునై యున్న యతనికి విరోధియై ప్రియాంగనా జనంబులకును నప్రియంబగు కాలంబు సంభవించినం జండవేగ విఖ్యాతుండను గంధర్వాధీశుండు షష్ట్యుత్తర శతత్రయ సంఖ్యాకులైన గంధర్వులును నందఱ గంధర్వీజనంబులును సితాసిత వర్ణంబులు గలిగి

మిథునీభూతు లగుచు ననుగమింపం జనుదెంచి స్వపరిభ్రమణంబు చేతనే సర్వకామంబుల నిర్మితంబగు నా పురంబు నిరోధించిన నప్పుడా చండవేగానుచరు లైన గంధర్వు లా పురంజను పురంబు వ్యాకులత్వంబు నొందించుచు నపహరింప నుపక్రమించు సమయంబునఁ బురంజన పురాధ్యక్షుండైన ప్రజాగరుం డనువాడు వింశత్త్యుత్తర సప్తశతంబులైన గంధర్వ గంధర్వీ జనంబుల నివారించి బలవంతుండై సంవత్సరశతంబు యుద్ధంబు గావించి యొక్కరుం డయ్యు నప్పెక్కండ్రతో నిట్లు పోరి క్షీణుండైనం బురంజనుండు దాన నిలిచి తత్పురంబున నల్ప సుఖంబు లనుభవించుచుఁ బాంచాల దేశంబు లందు నిజపార్షదుల చేత నానీతంబు లైన పదార్థంబుల నొందుచుం గామినీ జనసమేతుండై భయపర్యాలోచనంబు చేయ నేరక రాష్ట్ర పుర బాంధవ సమేతుండై యార్తి నొంది చింతాక్రాంతుండై యుండె; నంత.

4-811-కంద పద్యము

అనయంబుఁ గాల పుత్రిక
యను నొక కామిని వరేచ్ఛ నఖిల జగంబుం
దనయంతఁ గలయఁ దిరుగుచుఁ
జనిచని యొకనాడు రాజసత్తమ! వింటే.

4-812-సీస పద్యము

అనఘాత్మ! రాజర్షి యైన యయాతి కు;
మారకుం డయినట్టి పూరుచేత
వరియింపఁగాఁ బడి వలనొప్ప నతనికి;

వర మిచ్చి దౌర్భాగ్యవశత నొంది
ప్రఖ్యాతి గనుట దుర్భగ యనుపేరను;
బరఁగు న క్కాంత నే పురుషవరుఁడు
వరియింపఁ డయ్యె; నా తరుణియు నొకనాఁడు;
గర మొప్ప బ్రహ్మ లోకమున నుండి

4-812.1-తేటగీతి

వసుధ కేతెంచి విను బృహద్వ్రతుఁడ నయిన
నన్ను వరియింపఁ గోరి మనమునఁ గామ
శరవిమోహిత యై వేఁడఁ గరము నేను
సమ్మతింపక యున్న రోషమున నలిగి.

4-813-వచనము

ఇట్లను "మునీంద్ర! మదీయాశా విముఖుండవైన నీకు నేకత్రావస్థానంబు లేక యుండుంగాక" యని శపించి విహత సంకల్పయై మదుపదేశంబునం జని యవనేశ్వరుండును భయనామకుండును నయిన వానిం గదిసి యిట్లనియె.

4-814-కంద పద్యము

అవనీపతి! భయనామక
యవనకులాధీశ్వరుండ వగు నినుఁ బతిఁగాఁ
దవిలి వరింపఁగ వచ్చితి
సవినయముగ వినుము భూత సంకల్పమునన్.

4-815-వచనము

కలుగు మత్కామితంబు వృథగాదు; లోకంబున వేదంబు లందు దేయగ్రాహ్యరూపం బైన వస్తువు యాచ్యమానం బగుచుండ నెవ్వం డొసంగం; డెవ్వం డిందు దీయమానం బగుచుండం గోరం; డట్టి వీర లిద్దఱును జడస్వభావులని సత్పురుషులు శోకంబు నొందుదురు; కావున నిన్ను భజియించుచున్న నన్నుం గరుణార్ద్రచిత్తుండవై భజియింపు; మిట్టి యార్తానుకంపయుఁ బురుషధర్మం" బని పలికిన యక్కాలపుత్రిక వచనంబులు విని యవనేశ్వరుండు దేవగుహ్యచికీర్షు వగు దానిం గనుంగొని మందస్మిత వదనుం డగుచు నిట్లనియె.

4-816-కంద పద్యము

వినుఁ; తరుణి! యాచ్యమానం
బనఁదగు నీ లోకమందు నత్యశుభవు స
జ్జనముల కసమ్మతవు నగు
నిను నభినందింపకుండ్రు నెఱి నెవ్వారున్.

4-817-వచనము

కావున నేను జ్ఞానదృష్టిం జేసి నీకుం బతినిరూపణంబు చేసెద; అది యెట్లనిన మదీయసేనా సాహాయ్యంబు బడసి ప్రజానాశం బొనరించు నట్టి నీ వవ్యక్తగతివై కర్మనిర్మితంబైన లోకంబు ననుభవింపుము; ఈ ప్రజ్వారుం డనువాఁడు నాకు సహోదరుండు; నీవు మదీయ భగినివి; మీరిద్దఱుం గూడి యీ లోకంబునందు నవ్యక్తుండును భీమసైనికుండును నై యేను వర్తింతును" అనిన నా భయనామకుం డయిన యవనేశ్వరుని

దిష్టకారులైన సైనికులు ప్రజ్వార కాలకన్యా యుక్తులై భూమండలం బెల్లఁ దిరుగుచు నొక్కనాఁ డతివేగంబున భౌమ భోగాఢ్యంబును జరత్పన్నగ పాలితంబును నయిన పురంజను పురంబు నావరించి యున్నంత స్వాభిభూతుండయిన పురుషునకు నిస్సారత్వంబు గలిగించు నట్టి కాలకన్యక బలాత్కారంబున నా పురంజను పురంబు ననుభవించె; అట్లు కాలకన్య కోపభుజ్యమానం బైన పురంబు సర్వ ద్వారంబు లందును సర్వతోధికంబుగా నయ్యవనులు ప్రవేశించి తత్పురంబు సమస్తంబును బీడింప నిట్లు పురంబు ప్రపీడ్యమానం బగుచుండ నభిమానియైన పురంజనుండు.

4-818-సీస పద్యము

అనఘ! యెంతయు మమతాకుల చిత్తుఁడై;
 బహువిధ భూరితాపములఁ బొందె;
ఘనకుటుంబియుఁ గాలకన్యోపగూఢుండు;
 నష్టసంపదుఁడు వినష్టమతియు
విషయాత్మకుండును విని హతైశ్వర్యుండుఁ;
 గృపణుండు చాల నకించనుండు
నగు పురంజనుఁడు శోకావిలభావుఁడై;
 గంధర్వ యవన సంఘములచేత

4-818.1-తేటగీతి

నోజ చెడి వికలత నొందు నైజపురముఁ
దవిలి ప్రతికూలురును ననాదరణయుతులు

నయిన పుత్త్రులఁ బౌత్త్రుల ననుచరులను
సచివ పౌరోహితుల నిజసతినిఁ జూచి.

4-819-వచనము

మఱియుం గాలకన్యాగ్రస్తుం డయిన తన్నును నరిదూషితంబు లైన పాంచాల బలంబునుం జూచి యపారచింత నొంది తత్ప్రతీకారంబు చేయ నెఱుంగక కాలకన్యాపహృతవీర్యంబు లయినం గామంబుల నభిలషించుచు దీనుండును విగతాత్మ గతికుండును స్నేహంబునం జేసి పుత్త్రదారోపలాలన పరుండునునై కాలకన్యోపమర్దితంబును గంధర్వ యవనాక్రాంతంబును నైన పురంబు విడువ నిచ్చ లేకయు విడువ నుపక్రమించె; నప్పుడు.

4-820-కంద పద్యము

అనఘా! భయనామాగ్రజుఁ
డనఁగల ప్రజ్వారుఁ డపుడ యరుదెంచి పురం
బును సకలంబును భయనా
మునికిం బ్రీతిగ దహించె మునుకొని యంతన్.

4-821-వచనము

అట్లు పురంబు దహ్యమానం బగుచుండఁ బౌర భృత్యవర్గాది సమన్వితుండును, గౌటుంబికుండును, బుత్త్రాది సమన్వితుండును, యవనోపరుద్ధాలయుండును, గాలకన్యాగ్రస్తుండును నయిన పురంజనుం డప్పురంబునందుఁ బ్రజ్వార సంస్పృష్టుండై యనుతాపంబు నొంది

తత్పురపాలనంబు నందు సమర్థుండు గాక పురుకృచ్ఛ్రరువేపథుం
డయి యందుండ నశక్తుం డయ్యె; నంత.

4-822-కంద పద్యము

దవశిఖియుత తరుకోటర
నివసిత పన్నగము పగిది నిజపురి వెడలం
దివురుచు నతఁడు శిథిల దవ
యువుఁడును గంధర్వ గణ విహత శౌర్యుండున్.

4-823-సీస పద్యము

అయి చాల ఘురఘుర మను శబ్ద మడరంగ;
మనమునఁ జింతా నిమగ్నుఁ డగుచుఁ
గొడుకులఁ గోడండ్రఁ గూతుల నల్లుర;
మనుమల నాప్తుల ననుచరాళి
ననయంబు నల్పమాత్రావశిష్టం బైన;
గృహకోశనివహ పరిచ్ఛదముల
మసలు నహంకార మమకారములఁ జేసి;
మతిహీనుఁ డగుచు నెమ్మనములోనఁ

4-823.1-తేటగీతి

గడఁకఁ దలఁచుచు విప్రయోగమునఁ దాను
గటకటా! యిట్లు పరలోక గతుఁడ నైన

యిట్టి భార్య యనాథయై యీ కుమార
వరుల నేరీతిఁ బ్రోచునో యరసి యనుచు.

4-824-వచనము

మఱియు నిట్లని తలంచు.

4-825-సీస పద్యము

పడఁతి యే మును భుజింపక భుజింపదు; నేను;
నిద్ర వోవక మఱి నిద్ర వోదు;
నేను నీళ్ళాడక నీళ్ళాడ నొల్లదు;
పదరి యేఁ గోపింప భయము నొందు;
భర్జించినను మాఱుపలుకక వాయోడు;
బుద్ధిహీనుఁడనైన బుద్ధి చెప్పు;
లలి మీఱ నిట్టి కళత్రంబుతో నేను;
గడఁగి దేహాంతరగతుఁడ నైన

4-825.1-తేటగీతి

ననయమును దాను బుత్రిణి యగుటఁ జేసి
యాత్మశోచిని యగుచు గృహస్థ ధర్మ
మాచరించుచు నుండునో? యనుగమనము
చేయునో? యని మనమునఁ జింత నొంది.

4-826-కంద పద్యము

తన పుత్రులుఁ దన పౌత్రులు
ననయముఁ దాఁ జనినయెడ నిరాశ్రయు లగుచున్
వననిధి మధ్యంబున నవి
సిన కలముం బోలె నెట్లు జీవించెదరో ?

4-827-కంద పద్యము

అని యివ్విధమునఁ గృపణుని
యనువున ఘనదుఃఖ విహ్వలానర్థుం డ
య్యును దుఃఖించు పురంజను
ననయముఁ గొనిపోవ నిశ్చితాత్ముం డగుచున్.

4-828-కంద పద్యము

చనుదెంచెను భయనాముం
డనువాఁ డప్పుడు పురంజనాఖ్యుఁడు పెలుచన్
వినుతాత్మ! పశువు భంగిని
మనము గలఁగ యవన నీయమానుం డయ్యెన్.

4-829-వచనము

అనుచర వర్గంబు భృశాతురులును దుఃఖితులునై వెనుచనుచుండ నుపరుద్ధంబగు భుజంగమం బప్పురంబు నెప్పుడు వాసె నప్పు డా పురంబు పురంజను బాసి విశీర్ణంబై ప్రకృతిం బొందె; బలవంతుండయిన యవనునిచేత బలాత్కారంబున వికృష్యమాణుండైన పురంజనుండు దమఃపిహితుం డై పూర్వ సుహృత్తగు సఖు నీశ్వరు నెఱుంగకుండె;

అంతం బరలోకగతుండైన పురంజనుం గదిసి పూర్వంబున నదయుం డైన యతనిచేత హింసింప బడిన యజ్ఞపశువులు క్రోధోద్రేకంబునఁ గుఠారంబులనతని నఱకె; ఇవ్విధంబునఁ బ్రమదాసంగదోష ధూషితుండును, నపార తమోనిమగ్నుండును, నష్టజ్ఞానుండును నయి పురంజనుం డనేక కాలంబు పరలోకంబున నార్తి ననుభవించి తద్భార్యయైన ప్రమదోత్తమం జిత్తంబున నశ్రాంతంబును దలంచుచుండం దదీయ సంస్మరణంబునం జేసి తరవాతి జన్మంబున విదర్భరాజ గృహంబునం బ్రమదోత్తమ యై జన్మించె; నంత.

4-830-సీస పద్యము

అవనీశ! వీర్యపణాత్త యైనట్టి పై;
 దర్భిని మలయకేతనుఁ డనంగఁ
బరపురంజయుఁ డైన పాండ్యభూమీశుండు;
 దారుణ సంగర స్థలమునందు
శక్తి ననేక రాజన్యుల నిర్జించి;
 పరిణయం బయ్యె; నా గురుభుజుండు
నా విదర్భాత్మజయం దసితేక్షణ;
 యైన కూఁతును ద్రవిడాధినాథు

4-830.1-తేటగీతి

లైన కొడుకుల నేడ్వుర నర్థిఁ గనియె
వారలకు నెల్ల నొక్కొక్క వరుస నర్బు

దార్బుద సుతులు సంజాతు లైరి; యతని
సుత ధృతవ్రత నా యగస్త్యుఁడు వరించె.

4-831-కంద పద్యము

అతఁ డా కన్యక వలనను
జతురుండై యిధ్మవాహజనకుఁ డగు దృఢ
చ్యుతుఁడను మునీంద్రుఁ గనియెను
మతి నంత విరక్తుఁ డగుచు మలయధ్వజుఁడున్.

4-832-తేటగీతి

క్ష్మాతలంబెల్ల నిజతనూజాతులకును
బంచి యిచ్చి సరోజాక్ష పాదపంక
జార్చనాయత్తుఁ డగుచుఁ గులాద్రి కరుగ
నంత మదిరాక్షి సతి యగు నా విదర్భి.

4-833-తేటగీతి

కడఁక గృహములు నఖిల భోగములు విడిచి
చంద్రు వెనుచను చంద్రిక చందమునను
భక్తి దళుకొత్తఁ బాండ్యభూపాలుఁ డయిన
మలయకేతను వెనుకొని మగువ చనియె.

4-834-వచనము

అట్లు ధర్మపత్ని వెంటరాఁ జని యందుఁ జంద్రమసా తామ్రపర్ణీ నవోదక
లను నదుల పుణ్యజలంబుల సుస్నాతుం డయి ప్రక్షాళిత బాహ్యాభ్యంతర

మలుండును గందమూల ఫల బీజ పుష్ప పర్ణ తృణ తోయాహారుండునై కాయకర్శనంబైన తపం బాచరించుచు శీతోష్ణ వర్ష వాతంబులు క్షుత్పిపాసలుఁ బ్రియాప్రియంబులు సుఖదుఃఖంబులు నను ద్వంద్వంబుల సమదర్శనుండై జయించి తపోవిద్యాయమ నియమంబులం జేసి పక్వకషాయుండై బ్రహ్మంబునందు నిజాత్మ ననుసంధించి విజితేంద్రియ ప్రాణ చిత్తుండై స్థాణువుం బోలె దివ్యవర్ష శతంబు దపంబు చేసి భగవంతుం డయిన వాసుదేవుని యందుఁ బ్రీతి వహించుచు నన్యం బెఱుంగక వర్తించుచుఁ దన్ను స్వప్నమందు 'మమేదం శిరశ్ఛిన్నమితి' యను ప్రతీతియందుం బోలె వ్యతిరిక్తునిఁగా వ్యాపకునిఁగా నంతఃకరణవృత్తిసాక్షినింగా నెఱింగి.

4-835-సీస పద్యము

సాక్షాత్కృతుండును సర్వేశ్వరుండును;
 భగవంతుఁడును గృపాపరుఁడు నైన
హరి యను లోకైక గురునిచే నుక్తమై;
 సర్వతోముఖమును స్వప్రకాశి
తము నగు మహిత శుద్ధజ్ఞానదీపప్ర;
 భాతతిచేఁ బరబ్రహ్మమందు
దన్నును, దనయందుఁ దగఁ బరబ్రహ్మంబు;
 నెనయఁ గన్గొనుచు దగ్ధేంధనాగ్ని

4-835.1-తేటగీతి

భంగి నీషణములఁ; బెడఁబాసి భూరి
వ్యసన సాగర సంసృతి వలనఁ జాల
నుపరతుం డయ్యె; నా మహితోన్నతుండు
నవని నాయక! విను మప్పు డతని భార్య

4-836-కంద పద్యము

పతిదైవత శీల సమం
చిత వేణీ భూత చికుర చీరాంబర సు
వ్రత చర్యా క్షామాంగి వి
గతదోష విదర్భరాజ కన్యక యచటన్.

4-837-తేటగీతి

కమలలోచన నిఖిలభోగములఁ దొఱఁగి
మలయ కేతనుఁ బరమ ధర్మజ్ఞుఁ జేరి
నిరుపమైక పతివ్రతా నియమ మొప్ప
సాధ్వియై భక్తిఁ బరిచర్య సలుపు చుండె.

4-838-కంద పద్యము

విమలమతి నిజేశు సమీ
పమునన్ సతి ధూమరహిత పవమానసఖా
గ్రమున వెలుఁగొందు కీల వి
ధమునఁ బ్రకాశించు చుండెఁ దద్దయు వేడ్కన్.

4-839-కంద పద్యము

సతి దన ప్రాణేశ్వరుఁ డుప
రతుఁ డగుట మనంబులో నరయుకయి పూర్వ
స్థితి నుపచారక్రియ లం
చితమతిఁ గావింపఁ దలఁచి చిరతర భక్తిన్.

4-840-కంద పద్యము

అనుపమ సుస్థిర నియమా
సనుఁ డగు నిజనాథు డాయఁ జని పూర్వగతిన్
వినమిత యై సతి తత్పద
వనజము లర్చించు నపుడు వరుపాదములన్.

4-841-కంద పద్యము

విను మూష్మత లేకున్నను
గని యూథభ్రష్ట హరిణి కైవడి సతి నె
మ్మనమున బెగడుచు దీనత
ననయంబును బంధురహిత యై శోకించెన్.

4-842-చంపకమాల

అనయము నిట్లు శోకవిపులాశ్రు పయఃకణ సిక్త మానిత
స్తనయుగయై వియోగపరి తాపమునన్ హృదయంబు గంద శో
భనలలితాధరోష్ఠ నవపద్మము శోషిల సుస్వరంబుగా
వనజదళాక్షి యేడ్చె ననివారణఁ దద్విపినాంతరంబునన్.

4-843-ఉత్పలమాల

" హా! నరనాథ! హా! సుమహితాత్మక! హా! గుణశాలి! యింక నం
భోనిధి మేఖలాకలిత భూమి యధార్మిక రాజ చోర పీ
డా నిరతిం గృశింప నకటా! తగునయ్య యుపేక్షచేయ; శో
భానయశాలి! నీవు పరిపాలన చేయుదు, లెమ్ము భూవరా!"

4-844-చంపకమాల

అని విలపించుచున్ సరసిజాక్షి నిజేశు పదారవిందముల్
దన నిటలంబు సోఁకఁ బరితాపమునంబడి బిట్టు చాల రో
దన మొనరించుచుం దగిలి దారువులం జితిఁబేర్చి యందులోఁ
బెనుపగు తత్కళేబరముఁ బెట్టి శిఖిం దరికొల్పి యిమ్ములన్.

## 4-24-పూర్వ సఖుని ఉవాచ

4-845-కంద పద్యము

తా ననుగమనము చేయం
బూనుటయును నంతలోనఁ బూర్వసఖుఁడు వి
జ్ఞానస్వరూపుఁ డమలుఁడు
నైన ధరాదివిజుఁ డొక్క డబలం గనుచున్.

4-846-కంద పద్యము

చనుదెంచి యత్తలోదరి
సునయోక్తుల ననునయించుచుం దగ ననియెన్
" వనితా! నీవెవ్వతె? వె
వ్వని దాన? వితం డెవండు? వగచెద వేలా?"

4-847-కంద పద్యము

అని యడిగి వెండియును ని
ట్లనియెను " నీ సృష్టి పూర్వమందును నీ వె
వ్వనితోడి సఖ్య సౌఖ్యము
లనవరతము ననుభవించి తట్టి సఖుండన్.

4-848-కంద పద్యము

నన్నెఱుఁగు దేని మనమున
నన్నెఱుఁగక యున్న నైన నళినదళాక్షీ!
నన్నుఁ బురాతన సఖుఁగా
నెన్నంగలదాన; నైన నెఱుఁగవె చెపుమా?

4-849-వచనము

కావున, నీవును నేనునుం బూర్వంబునందు మానసనివాసులమైన హంసలమై యుండి గృహంబుఁ బాసి సహస్రవత్సరంబులు సఖులమై వర్తించు నంత నీవు నన్నుం బాసి భౌమభోగ రతుండవై పదంబు నిచ్ఛగించుచు మహీమండలంబు గలయం గ్రుమ్మరు నప్పు డొక్క కామినీ నిర్మితంబుం బంచారామంబు నవద్వారసమేతంబు నేకపాలకంబుఁ ద్రికోష్ఠంబు షట్కులంబుఁ బంచవిపణంబుఁ బంచప్రకృతియు స్త్రీనాయకంబు నైన యొక్క పురంబు వొడగంటివి; అది యెట్టి దనినం బంచారామంబులనం బంచేంద్రియార్థంబులు; నవద్వారంబులన నాసికాది ద్వారంబు; లేకపాలకంబనం ప్రాణపాలనంబు; త్రికోష్ఠంబులనం దేజో భిన్నంబులు; షట్కులంబులన

నింద్రియ సంగ్రహంబు; విపణంబులనఁ గర్మేంద్రియంబులు; పంచప్రకృతి యనం బంచ భూతంబులు; బ్రకృతి యను కామిని యన బుద్ధి; ఇట్టి పురంబునం బ్రవిష్టుండైన పురుషుం డంగనా పరతంత్రుఁడు నజ్ఞుండు నైన నీవ యప్పురంబునం గామినీ సంస్పృష్టుండవై రమియించుచుఁ దత్సంగమంబున నష్టస్మృతివై వైదర్భీ జనసంభావిత సుఖాభాసంబులగు దుఃఖంబులచే నిట్టి పాపిష్ఠంబైన దశం బొందితివి; కావున.

4-850-సీస పద్యము

నీవు వైదర్భివి గావు; వీరుఁ డితండు;
 వివరింపఁగాఁ గాఁడు విభుఁడు నీకు;
నొగి మున్ను పురమున నుపరుద్ధుఁ జేసిన;
 యా పురంజన పతి వరయఁ గావు;
మఱియు నీ వన్య సీమంతిని యనియును;
 జర్చింపఁగా బూర్వ జన్మమందుఁ
బురుషుం డవనియును బుద్ధిఁ దలంచుట;
 యరయంగ నీ యుభయము నసత్య;

4-850.1-తేటగీతి

మింతయును మామకీనమై యెసఁగు మాయఁ
జేసి కల్పిత మయ్యెఁ; జర్చింప మనము
పూర్వమున హంసలము యని పూని యెఱుఁగఁ
బలికితిఁ దెలియు మనల రూపంబుఁ జూడు.

4-851-వచనము

ఏనే నీవు గాని యన్యుండవు గావు; నీవే నేఁ గాని యన్యుండంగా; నిట్లని యెఱుంగుము; విద్వాంసులు మన యిద్దఱ యందు నంతరంబు నీక్షింపరు; పురుషుండు దన్నొక్కనినె యాదర్శ చక్షువులందు భిన్నరూపునింగాఁ దలంచు చందంబున మన యిద్దఱికిని భేదంబు గలిగిన యట్ల తోఁచు; నని యివ్విధంబున నతం డతనిచేత నీవు పూర్వంబున మదీయసఖుండవైన హంస" వని తెలుపంబడి స్వస్థుండై తద్వియోగ నష్టంబైన జ్ఞానంబు గ్రమ్మఱం బొందె" అని చెప్పి నారదుండు ప్రాచీనబర్హిం జూచి యీ యధ్యాత్మతత్త్వంబు రాజకథామిషంబున నీకు నెఱింగించితి;" అనిన.

4-852-కంద పద్యము

విని భూమీశుఁడు నారద
ముని కను "భవదీయవచనములు సూరులు ద
క్కను గర్మ మోహితులమై
వనరెడు నే మెట్లు దెలియువారము చెపుమా."

4-853-వచనము

అనిన యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె "నరేంద్ర! యేమి కతంబున నాత్మ చేత యేక ద్వి చతుష్పాదంబును బహుపాదంబును నపాదంబు నగుచుఁ బురంజను దేహంబు ప్రకటం బొనర్చు; నా కతంబున బురంజనుండు పురుషుం డయ్యె; అట్టి పురుషునకు నామ క్రియా గుణంబుల విజ్ఞాతుండు గాకుండుటం జేసి యవిజ్ఞాత శబ్దంబునం

జెప్పంబడు; సఖుం డీశ్వరుండు; పురుషుండు సాకల్యంబునం జేసి దేహపరిగ్రహంబు చేయ నిశ్చయించు నప్పుడు నవద్వార కలితంబును ద్విహస్త చరణ యుక్తంబును నయిన పురం బేది గల, దది లెస్స యని తలఁచి యప్పురం బను దేహంబునందుఁ బురుషుం డింద్రి యంబులం జేసి యే బుద్ధి నధిష్ఠించి విషయంబుల ననుభవించు; నహంకార మమకారంబులకు నే బుద్ధితత్త్వంబు గారణం బగు; నట్టి బుద్ధి ప్రమదోత్తమ యనంబడె; దానికి సఖులు జ్ఞానకర్మకారణంబులైన యింద్రియగుణంబులు; సఖీజనంబులు దదీయ వృత్తులు; పంచముఖోరగం బనం బంచవృత్తి యైన ప్రాణంబు; ఏకాదశ మహాభటులన బృహద్బలుండు నుభయేంద్రియ నాయకుండునైన మనంబు; నవద్వార సమేతంబైన యప్పురంబు చుట్టివచ్చిన పాంచాలదేశంబు లనం బంచవిషయంబులు; నవద్వారంబు లన నక్షి నాసికా కర్ణ ముఖ గుద శిశ్నంబులు; అందు నక్షినాసాస్యంబు లైదునుం బ్రాగ్ద్వార పురస్కృ తంబులు; దక్షిణోత్తర కర్ణంబులు దక్షిణోత్తరద్వారంబులు; గుద శిశ్నంబులు పశ్చిమద్వారంబులు; అందు నేకస్థల నిర్మితంబులైన ఖద్యోతా విర్ముఖులు నేత్రంబులు; విభ్రాజితం బన రూపంబు; ద్యుమంతు డనం జక్షురింద్రియంబు; నళినీ నాళిను లన నాసికా ద్వారంబులు; సౌరభం బన గంధంబు: అవధూత యన ఘ్రాణేంద్రియంబు; ముఖ్య యన నాస్యంబు; విపణం బన వాక్కు; రసజ్ఞుం డన రసంబు; ఆపణం బన వ్యవహారంబు; బాహూదనం బన వివిధాన్నంబు; పితృహు వన దక్షిణకర్ణంబు; దేవహూ వన నుత్తరకర్ణంబు; చండవేగుం డనం గాలోపలక్షకం బైన సంవత్సరంబు;

గంధర్వు లన దివంబులు; గంధర్వీ జనంబు లన రాత్రులు; పరీవర్తనం బన నాయుర్హరణంబు; గాలకన్యక యన జర; యవనేశ్వరుం డన మృత్యువు; అతని సైనికులన నాధివ్యాధులు; ప్రజ్వారుం డనం బ్రాణిహింస యందు శీఘ్రవేగంబు గలిగి శీతోష్ణ భేదంబులం ద్వివిధం బైన జ్వరంబు; దక్షిణ పాంచాలం బనం బితృలోక ప్రాపకంబును బ్రవృత్తి రూపకంబు నైన శాస్త్రంబు; ఉత్తర పాంచాలం బన దేవలోక ప్రాపకంబు నివృత్తి సంజ్ఞికంబు నయిన శాస్త్రంబు; శ్రుతధరుం డన శ్రోత్రంబు; ఆసురీ నామకం బనం బశ్చాద్ద్వారంబైన మేఢ్రంబు; గ్రామకం బన సురత సుఖంబు; దుర్మదుం డన గుహ్యేంద్రియంబు; నిర్ఋతి నామకం బైన పశ్చిమద్వారం బన గుదంబు; వైశసం బన నరకంబు; లుబ్ధకుం డనం బాయువు; నంధు లన హస్త పాదంబులు; అంతఃపురం బన హృదయంబు; విషూచి యన మనంబు;" అని వెండియు నిట్లనియె.

4-854-సీస పద్యము

అనఘాత్మ! వినుము జాయాత్మజులను గుణా;
క్తం బగు మఱి బుద్ధితత్త్వ మర్థి
వెలయ నేయే గతి వికృతి చేయం బడు;
నేయే తెఱంగుల నింద్రియములు
వికృతిని బొందు నా విధమునఁ దద్గుణా;
న్వితుఁడును వరుసఁ దద్వృత్తులకును
ఘనుఁడు నుపద్రష్టయును దగు నాత్మయుఁ;
దద్వృత్తులను బలాత్కారముననను

4-854.1-తేటగీతి

ననుకరింపంగ నర్థిఁ జేయంగఁ బడుట
ననవరత మాత్మమహిషిని ననుసరించు
టయు నెఱుఁగఁ జెప్పి యిట్టు లనియెను మఱియు
జనవరేణ్యునితో యోగిసత్తముండు.

4-855-వచనము

"మఱియు నరదం బన దేహంబు; దురంగంబు లన నింద్రియంబులు; ఈషాద్వయం బన సంవత్సరంబునుం దత్కృత వయస్సును; చక్రద్వయం బనం బుణ్యపాప కర్మద్వయంబు; వేణుత్రయం బన గుణత్రయంబు; పంచబంధనం బనం బంచప్రాణంబులు; రశ్మి యన మనంబు; సారథి యన బుద్ధి; రథికోపవేశస్థానం బన హృదయంబు; కూబరంబు లన శోకమోహంబులు; పంచప్రహరణంబు లనం బంచేంద్రి యార్థప్రక్షేపంబు; పంచవిక్రమం బనం గర్మేంద్రియంబులు; సప్తవరూధంబు లన ధాతువులు; హైమోపస్కరం బన రజోగుణంబు; అక్షయతూణీరం బన ననంతవాసనాహంకారోపాధి; ఏకాదశ చమూపతి యన నేకాదశేంద్రియంబైన మనంబు; ఆసురీవృత్తి యనం బాహ్యవిక్రమంబు; పంచేంద్రియంబులచేత మృగయా వినోదంబు చందంబున హింసాదులం జేసి విషయంబు లనుభవించుటయ మృగయాచరణంబు; ఈ విధంబున నుండ జీవుండు దేహంబున స్వప్న సుషుప్తి జాగ్రదవస్థల యందు నాధ్యాత్మి కాధిదైవి కాధిభౌతికంబులైన బహువిధ దుఃఖంబులం జేసి క్లేశంబు లననుభవించుచు

నజ్ఞానావృతుండయి వర్షశతంబు నిర్గుణుం డయ్యును బ్రాణేంద్రియ మనోధర్మంబులం దనయందు నధ్యవసించి కామలవంబుల ధ్యానంబు చేయుచు నహంకార మమకార సహితంబుగాఁ గర్మాచరణంబు చేయుచుండు.

4-856-కంద పద్యము

పురుషుఁడు నిజప్రకాశతఁ
బరగియు నలఘుఁడుఁ బరుండు భగవంతుండున్
గురుఁడును నగు నయ్యాత్మను
బరువడి నెఱుఁగంగ లేక ప్రకృతి గుణములన్.

4-857-కంద పద్యము

విను మెపుడు దగులు నప్పుడ
యొనరంగ గుణాభిమానియును గర్మవశుం
డనఁ దగు నా పురుషుఁడు దా
ఘనమగు త్రైగుణ్యకర్మ కలితుం డగుచున్.

4-858-సీస పద్యము

ధృతి నొప్పుచున్న సాత్త్విక కర్మమునను బ్ర;
కాశ భూయిష్ఠ లోకముల భూరి
రాజస ప్రకట కర్మమున దుఃఖోదర్క;
లోలక్రియా యాస లోకములను
గైకొని తామస కర్మంబునను దమ;

శ్లోక మోహోత్కట లోకములను
బొందుచుఁ బుం స్త్రీ నపుంసక మూర్తుల;
దేవ తిర్యఙ్మర్త్య భావములను

4-858.1-తేటగీతి

గలుగుఁ గర్మానుగుణములు గాఁగ జగతిఁ
బుట్టి చచ్చుచుఁ గ్రమ్మఱఁ బుట్టు చిట్లు
దివిరి కామాశయుం డైన దేహి యెప్డు
నున్న తానత పదముల నొందుచుండు.

4-859-వచనము

అని మఱియు నిట్లనియె.

4-860-మత్తేభ విక్రీడితము

ఎనయన్ క్షుత్పరిపీడఁ గుంది శునకం బింటింటికిం బోవఁ బూ
నినఁ దద్దైవిక మైన దండహతిఁ గానీ, కాక చౌర్యాన్న మై
నను గానీ తగఁ బొందు చందమున నెన్నన్ దైవయోగంబు పెం
పున నీ జీవుఁడు దాఁ బ్రియాప్రియములం బొందుం ద్రిలోకంబులన్.

4-861-చంపకమాల

గొనకొని యిట్టి దుఃఖములకుం బ్రతికారము మానవేంద్ర! క
ల్గిన విను తత్ప్రతిక్రియ యకించనవృత్తి జనుండు మస్తకం
బున నిడుమోపు మూఁపునను బూనినఁ దద్భరదుఃఖ మాత్మఁ బా
యని గతి జీవుఁడుం ద్రివిధమై తగు దుఃఖముఁ బాయఁ డెన్నడున్.

4-862-కంద పద్యము

ఘన దుఃఖ హేతు కర్మం
బును దత్ప్రతికార కర్మమును నివి మాయా
జననము లగుటను బురుషుఁడు
గనుఁ గలలోఁ దోఁచి నట్టి కల చందమునన్.

4-863-వచనము

సవాసనోచ్ఛేదకంబు గా" దని వెండియు నిట్లనియె.

4-864-సీస పద్యము

నరనాథ! వినుము స్వప్నంబు చందంబున;
 నజ్ఞాన విలసితం బగుటఁ జేసి
తివిరి మిథ్యాభూత దేహాదికమునకు;
 నరయ నివర్తనాయాస మేటి
కని యంటివేనియు నర్థంబు లేకున్న;
 నర్థి సోపాధికం బైన మనము
వాంఛతో స్వప్నము వర్తింపఁ బురుషునిఁ;
 బూని జాగ్రదోద్భధచే నుపాధి

4-864.1-తేటగీతి

చెడక స్వాప్నిక సంసృతి విడువనట్లు
తత్త్వ విజ్ఞానమున నవిద్యా నివృత్తి

దార దేహాదిక నివృత్తి దగులకున్నఁ
దివుట సంసృతి దా నివర్తింప కుండు.

4-865-చంపకమాల

ఘన పురుషార్థభూత మనఁగాఁ దగు నాత్మకు నే నిమిత్తమై
యొనర ననర్థహేతు వన నూల్కొను సంసృతి సంభవించు న
ట్లనయముఁ దన్నిమిత్త పరిహారక మర్థి జగద్గురుండు నాఁ
దనరిన వాసుదేవ పద తామరసస్ఫుటభక్తి యారయన్.

4-866-కంద పద్యము

పూనిన తద్భక్తి సమీ
చీనగతిం దెలియ ననఘ; చిర వైరాగ్య
జ్ఞాన జనక మగు భక్తి ని
ధానము గోవింద వరకథాశ్రయమ యగున్.

4-867-వచనము

కావున నది తత్కథాకర్ణన గాన నిరతుండు, విశ్వాస సంయుక్తుండు నైన వానికి సంభవించు మఱియును.

4-868-కంద పద్యము

ధర సాధులు విమలాంతః
కరణులు భగవద్గుణానుకథనశ్రవణ
స్ఫురితస్వాంతులు ననఘులు
వరధిషణులు నైన భాగవత జనుల సభన్.

4-869-కంద పద్యము

సరసోదార మహాత్మ ము
ఖరితము లగు మధువిరోధి కమనీయ గుణో
త్కర సురుచిర చరితామృత
పరిపూరిత వాహినులను బరమప్రీతిన్.

4-870-కంద పద్యము

మన మలరఁగ శ్రోత్రాంజలు
లను బానము చేయు పుణ్యులకు క్షుత్తృష్ణా
ఘన భయ శోక విమోహము
లనయంబును నోఁకకుండ నవనీనాథా!

4-871-వచనము

కావున నిట్టి భాగవత సహవాసంబు లేక తనంతన భగవద్భాగవత గుణాభి వర్ణన కథానుచింత నాదులయందుం బ్రవర్తించిన నాలస్యాది దోషంబు లొంది యీ జీవలోకంబు సహజక్షుధాదికంబున నుపద్రుతం బై సర్వేశ్వరకథామృత వాహిని యందు రతింజేయదు; ఇది నిశ్చితం" బని మఱియు నిట్లనియె.

4-872-సీస పద్యము

" పద్మ సంభవుఁడును భవుఁడును మనుకుల;
సమితి దక్షాది ప్రజాపతులును
నైష్ఠికులైన సనకముఖ్య మునులుఁ బు;

లస్త్యుండు భృగువుఁ బులహుఁడుఁ గ్రతువు
నత్రి మరీచియు నంగిరసుండు న;
రుంధతీవిభుఁడును రూఢి మెఱయ
బహు పుణ్యులే కడపల గాఁగ గల బ్రహ్మ
వాదుల నందఱు వాక్కులకును

4-872.1-తేటగీతి

నెనయ నీశ్వరులై యుండియును సమగ్ర
మతిఁ దపో యోగ విద్యా సమాధి వర వి
చారులై యుండియును సర్వసాక్షి యైన
యీశ్వరుని వెదకియుఁ గాన రిద్ధచరిత!

4-873-వచనము

అది యెట్లంటేని.

4-874-మత్తేభ విక్రీడితము

ఘనవిస్తార మపార మద్వయ మనంగా నొప్పు వేదంబు దా
మనువర్తించుచు మంత్రయుక్తి వివిధంబై నట్టి దేవాఖ్య శో
భనసామర్థ్యముచేత నింద్ర ముఖ రూపం బిష్టదైవంబుగాఁ
గని వేడ్కన్ భజియించు వారలు గనంగా నేర్తురే యీశ్వరున్.

4-875-కంద పద్యము

విను మాత్మ భావితుం డన
నెనసిన భగవంతుఁ డెప్పు డెవ్వనిఁ గరుణం

దనరుచు ననుగ్రహించును
మనుజేశ్వర! యపుడ వాఁడు మహితాత్మకుఁడై.

4-876-కంద పద్యము
ధీరత నీ లోకవ్యవ
హారంబును వైదికంబు ననఁదగు కర్మా
చారములందు వినిష్ఠిత
మై రూఢిఁ దనర్చు బుద్ధి నర్థిన్ విడుచున్.

4-877-సీస పద్యము
కావున రాజేంద్ర! నీవును బరమార్థ;
రూపంబు లగుచుఁ బ్రరోచమాన
ములును గర్ణప్రియంబులును సస్పృష్ట;
వస్తువులును నైన యీ వివిధ కర్మ
ములయందుఁ బురుషార్థబుద్ధి గావింపకు;
మతి ఘన స్వాంతు లై నట్టివారు
పరఁగు జనార్దన ప్రతిపాదకంబైన;
శ్రుతిఁ గర్మ పర మని చూపుచుండు

4-877.1-తేటగీతి
వారు వేదజ్ఞు లనఁ దగువారు గారు
రూఢి మఱి వారు నిత్యస్వరూపభూత

మైన యీ యాత్మతత్త్వంబు నలరు వేద
కలిత తాత్పర్య మని యాత్మఁ దెలియ లేరు

4-878-వచనము

కావునం; బ్రాగగ్రంబు లైన దర్భలచేత సకల క్షితిమండలాస్తరణంబు గావించి యహంకార యుక్తుండవు నవినీతుండవు నై పెక్కు పశువులఁ జంపనే కాని కర్మస్వరూపంబును విద్యాస్వరూపంబును నెఱుంగవు; ఆ కర్మ విద్యా స్వరూపంబు లెట్టి వనిన సర్వేశ్వర పరితోషకం బేది యదియ కర్మంబు; ఆ సర్వేశ్వరుని యందు నేమిట మతి సంభవించు నదియ విద్య; అతండే దేహులకు నాత్మయు నీశ్వరుండు నగుచుండుఁ గావునఁ బురుషులకు క్షేమకరంబయిన యాశ్రయంబు దత్పాద మూలంబ; అతండు ప్రియతముండును సేవ్యమానుం డును నగుచుండ నణుమాత్రం బయిన దుఃఖంబు లేదు; అట్టి యీ భగవత్స్వరూపం బెవ్వం డెఱుంగు వాఁడు విద్వాంసుండును గురుండును హరియు" నని చెప్పి వెండియు నిట్లనియె.

4-879-కంద పద్యము

" అవనీశ! యీ విధంబున
భవదీయప్రశ్న మిట్లు పరిహృత మయ్యెం;
దవిలి యిఁక నొక్క గోప్యము
వివరించెదఁ జిత్తగింపు విమలచరిత్రా!

4-880-సీస పద్యము

లలి సుమనో వాటికల యందు నల్ప ప్ర;
 సూన మరంద గంధాను మోద
సంచారియును మృగీసహితముఁ దన్నివే;
 శిత చిత్తమును మధువ్రత నినాద
మేదుర శ్రవణానుమోదితమును బురో;
 భాగ చరన్నిజ ప్రాణహారి
దీపిత వృక గణాధిష్ఠితమును లుబ్ధ;
 కక్రూర ఘన సాయకప్రభిన్న

4-880.1-తేటగీతి

పృష్ఠభాగంబునై తగ నెదను మృత్యు
భీతి వాటిల్ల నొండు దప్పింప వెరవు
గాన కడవిఁ జరించు మృగంబు పగిది
భూవరోత్తమ! వినవయ్య! పురుషుఁ డెపుడు.

4-881-వచనము

అంగనా నివాసంబుల యందు క్షుద్రతమంబగు కామ్యకర్మ పరిపాకజనితంబైన జిహ్వోపస్థాది కామజనిత సుఖలేశంబుల నన్వేషించుచుఁ, గామినీ యుక్తుండును, దన్నివేశిత మానసుండును నతి మనో హర వనితాజనాలాప శ్రవణతత్పర చిత్తుండును, బ్రత్యక్షంబున, నాయుర్హరణ కారణాహోరాత్రాది కాలవిశేషగణనాపరుండును గాక పరోక్షంబునం గృతాంత శరనిర్భిన్న గాత్రుండును నగుచు నీ జీవుండు విహరించుచుండు; గావున నీవు నీ

జీవుని మృగచేష్టితునిఁగా విచారించి శ్రోత్రాదు లందున్న శబ్దాదులం బోలె బాహ్య వృత్తులగు శ్రౌతస్మార్తాది రూపకర్మంబులను హృదయంబు నందు నియమించుచు నసజ్జనయూథ వార్తాసహితం బైన గృహాశ్రమంబు విడువుము; సకల జీవాశ్రయుండైన యీశ్వరుని భజియింపుము; ఇట్లు సర్వతో విరక్తుండవు గ"మ్మని నారదుండు పలికినం బ్రాచీనబర్హి యిట్లనియె.

4-882-కంద పద్యము

" మునివర! భగవంతుండవు
ననుపమ విజ్ఞాననిధివి ననఁదగు నీ చే
తను వివరింపంగాఁ దగి
యెనసిన యీ యాత్మతత్త్వ మిటు నాచేతన్.

4-883-వచనము

శ్రుతంబును విచారితంబును నయ్యె; గర్మనిష్ఠు లగు నుపాధ్యాయు లైనవార లీ యాత్మతత్త్వంబు నెఱుంగరు; ఎఱింగిరేని నుపదేశింపరు; కావునఁ దత్కృతంబైన మహాసంశయంబు నీ చేత నివృత్తం బయ్యె;" అని వెండియు నిట్లనియె.

4-884-సీస పద్యము

అనఘాత్మ! యేమిటి యందు నీ యింద్రియ;
వృత్తులు దగఁ బ్రవర్తింపకుండు
టను జేసి ఋషు లైన ఘనముగ మోహింతు;

రట్టి యర్థము నందు నాత్మ సంశ
యము గల్గుచున్నది; యది యెట్టి దనినను;
బురుషుఁ డేయే దేహమునను జేసి
కర్మముల్ చేసి తత్కాయంబు నీ లోక;
మందునే విడిచి తా నన్యదేహ

4-884.1-తేటగీతి

మర్థితో ఘటియించి లోకాంతరమును
బొంది తత్కర్మఫలమును బొందు ననుచుఁ
బ్రకటముగ వేదవేత్తలు పలుకు చుందు
రన్న నది యెట్లు విన నుపపన్న మగును?

4-885-వచనము

అదియునుం గాక యాచరితంబైన కర్మంబు తత్క్షణంబ వినష్టం బగుటంజేసి జీవుండు దేహాంతరంబున లోకాంతరగామి యైన ఫలం బెట్లు సంభవించును;" అనిన ప్రాచీనబర్హికి నారదుం డిట్లనియె "నరేంద్రా! స్వప్నావస్థ యందు లింగశరీరాధిష్ఠాత యైన జీవుండు జాగ్రద్దేహాభిమానంబు విడచి తాదృశంబ కాని యతాదృశంబ కాని యైన శరీరాంతరంబు నొంది మనంబునందు సంస్కార రూపంబున నాహితంబైన కర్మంబు ననుభవించు చందంబునం బురుషుండే లింగ శరీరంబునం జేసి కర్మంబు నాచరించు నా లింగశరీరంబున లోకాంతరంబున దేహవిభేదంబు నొందక తత్ఫలం బనుభవించును; అదియునుం గాక దాన ప్రతిగ్రహాదుల యందు స్థూలదేహంబునకుం

గర్తృత్వంబు గల దంటివేని నహంకార మమకార యుక్తుండయిన పురుషుండు మనంబునం జేసి యేయే దేహంబు పరిగ్రహించు, నాయా దేహంబున సిద్ధంబైన కర్మం బా జీవుం డనుభవించు; అట్లు గాకున్నఁ గర్మంబు పునరుద్భవ కారణం బగుట యుపపన్నంబు గాకుండుఁ; గావున మనఃప్రధానం బైన లింగశరీరంబునకే కర్తృత్వం బుపపన్నం బగు" నని వెండియు నిట్లనియె.

4-886-కంద పద్యము

క్షి**తి** నుభయేంద్రియ కర్మ
స్థి**తు** లనుభవ మందఁబడిన చిత్తము పగిదిన్
ధృ**తిఁ** జిత్తవృత్తులను ల
క్షి**త** మగుఁ దత్పూర్వ దేహకృత కర్మంబుల్.

4-887-వచనము

అది యెట్లనిన నీ దేహంబునం జేసి యే రూపంబు నే ప్రకారంబున నెప్పు డెచ్చట నగు; నది యననుభూతంబును నదృష్టంబును నశ్రుతంబునునై యుండు; నట్టిది యొకానొక కాలంబున వాసనాశ్రయుం డయిన పురుషునకుఁ దదనుభవాది యుక్తంబగు పూర్వదేహంబున ననుభూతంబును దృష్టంబును శ్రుతంబును నని విశ్వసింపుము; ఈ మనంబు నననుభూతార్థంబు గోచరింపఁజాలదు; ఈ మనంబె పురుషులకు శుభాశుభ నిమిత్తంబు లైన పూర్వాపరదేహంబులం బ్రకాశింపంజేయుచుండు; ఈ మనంబునందు నదృష్టంబు నశ్రుతంబునైన యర్థంబు స్వాప్నాదికమందుం దోఁచు నంటివేని నది దేశకాలక్రియా

శ్రయంబని తలంపందగు; ఈ సమస్త విషయంబులుఁ గ్రమానురోధంబున మనంబునంజేసి భోగ్యంబులగు" నని మఱియు నిట్లనియె.

4-888-చంపకమాల

సుమహిత శుద్ధ సత్త్వగుణ శోభితమున్ సరసీరుహోద రో
త్తమ గుణచింతనాపరము ధన్యము నైన మనంబునందు భూ
రమణ! సుధాంశునందు నుపరాగమునన్ దివిఁ దోచు రాహు చం
దమునను గోచరంబగు నుదారత నీ యఖిలప్రపంచమున్."

4-889-వచనము

అని వెండియు నిట్లనియె "లింగదేహమునకుఁ గర్తృత్వ భోక్తృత్వంబులు స్థూలదేహద్వారకంబు లగుటంజేసి స్థూలదేహ వినాశంబు గలుగం జీవునకుఁ గర్తృత్వ భోక్తృత్వంబులు లేకుండుటంజేసి ముక్తిగలుగు నంటివేని నీ స్థూలదేహ సంబంధంబు జీవుని యందు బుద్ధిమనో మోక్షార్థగుణవ్యూహరూపాది లింగ శరీర భంగ పర్యంతంబు గలుగు చుండును; సుషుప్తి మూర్ఛాదుల యందు నిష్టవియోగాది దుఃఖ మందు నహంకారంబు గలిగి యుండు; నది యింద్రియోపహతింజేసి యమావాస్య యందలి చంద్రుండునుం బోలెఁ దరుణ పురుషునకు గర్భబాల్యావస్థల యందు నింద్రియ పౌష్కల్యంబు లేకుండుటంజేసి యేకాదశేంద్రియ స్ఫురణ సమర్థంబైన యహంకారంబు గర్భాదులకుఁ బ్రకాశింపని చందంబునం దోఁపకుండుఁ గావున స్థూలదేహ విచ్ఛేదకంబు లేకుండుటంజేసి వస్తుభూతార్థంబు లేకున్న నీ సంసారంబు విషయంబులయం దాసక్తుండగు జీవునకు స్వాప్నికానర్థాగమనంబునుం

బోలె నివర్తింపదు; ఈ తీరునఁ బంచతన్మాత్రాత్మకంబును
ద్రిగుణాత్మకంబును షోడశ వికారాత్మకంబునై విస్తృతంబునునయిన
లింగశరీరంబు నధిష్ఠించి చేతనాయుక్తుండైన జీవుండని చెప్పంబడు;
మఱియును.

4-890-సీస పద్యము

తివిరి యప్పురుషుండు దేహంబుననుజేసి;
యనయంబుఁ బెక్కు దేహాంతరముల
నంగీకరించుచు నవి విసర్జించుచు;
సుఖ దుఃఖ భయ మోహ శోకములను
బొలుపొందు తద్దేహములనె పొందుచు నుండు;
నది యెట్లు లన్నను నగ్రభాగ
తృణమూఁది మఱి పూర్వతృణ పరిత్యాగంబు;
గావించు తృణజలూకయును బోలె

4-890.1-తేటగీతి

జీవుఁ డవనిఁ గొంత జీవించి మ్రియమాణుఁ
డగుచు నొండు దేహ మర్థిఁ జెంది
కాని పూర్వమైన కాయంబు విడువఁడు
గాన మనమె జన్మకారణంబు

4-891-తరళము

నరవరోత్తమ! యట్లు గాన మనంబె జీవుల కెల్ల సం
సరణకారణ; మట్టి కర్మవశంబునన్ సకలేంద్రియా
చరణుఁ డౌట నవిద్య గల్గును; సంతతంబు నవిద్యచేఁ
బరఁగుటన్ బహుదేహకర్మనిబంధముల్ గలుగుం జుమీ!

4-892-చంపకమాల

విను మది గాన భూవర! యవిద్య లయించుటకై రమాపతిన్
ఘన జననస్థితిప్రళయ కారణభూతునిఁ బద్మపత్రలో
చనుఁ బరమేశు నీశ్వరుని సర్వజగంబుఁ ద దాత్మకంబుగాఁ
గనుగొనుచుం దదీయపదకంజము లర్థి భజింపు మెప్పుడున్."

4-893-కంద పద్యము

అని యీ గతి భగవంతుం
డనఘుఁడు భాగవతముఖ్యుఁ డగు నారదుఁ డా
ఘనునకు జీవేశ్వర గతి
ఘనకృప నెఱిఁగించి సిద్ధ గతిఁ జనిన యెడన్.

4-894-సీస పద్యము

రాజర్షి యైనట్టి ప్రాచీనబర్హి దా;
దగఁ బ్రజాపాలనార్థంబు సుతుల
ధరకు నియోగించి తపము చేయుటకునై;
కపిలాశ్రమంబున కపుడు వోయి
యచ్చట నియతి నేకాగ్రచిత్తుండును;

ముక్తసంగుండును భూరిధైర్య
యుక్తుండు నగుచును భక్తియోగంబున;
ననఘ! గోవిందపదారవింద

4-894.1-తేటగీతి

చింతనామృత పాన విశేషచిత్తుఁ
డగుచు విధిరుద్ర ముఖ్యుల కందరాని
యవ్య యానందమయ పద మందె నవ్వ"
డనుచు మైత్రేయముని విదురునకుఁ జెప్పె.

4-895-వచనము

వెండియు నిట్లనియె "ఇట్లు ముకుందయశంబునం జేసి భువనపావనంబు, మనశ్శుద్ధికరంబు, సర్వోత్కృష్టఫలప్రదాయకంబు, దేవర్షివర్య ముఖ వినిస్సృతంబు నైన యీ యధ్యాత్మ పారోక్ష్యంబు నెవ్వండు పఠియించు నెవ్వండు విను నట్టివాఁరు లింగశరీరవిధూననంబు గావించి ముక్త సమస్త బంధుడయి విదేహకైవల్యంబు నొంది సంసారమునందుఁ బరిభ్రమింప" డనిన మైత్రేయునకు విదురుం డిట్లనియె.

## 4-25-ప్రచేతసుల తపంబు

4-896-కంద పద్యము

మునినాథ! ప్రచేతసు లా
ఘున మగు రుద్రోపదిష్ట కమలోదర కీ

ర్తనమున నే గతిఁ బొందిరి
వనజాక్షుఁడు సంతసింప వా రనఘాత్మా!

4-897-తేటగీతి

కడఁగి మఱి వారు యాదృచ్ఛికతను జేసి
హరికి నిత్యప్రియుం డగు హరునిఁ గాంచి
యతని వలన యనుగ్రహ మంది మోక్ష
మంది రని చెప్పఁ; దది నిశ్చయంబు మఱియు

4-898-కంద పద్యము

హరి దర్శన పూర్వం బిహ
పరలోకములందు నా నృపాల తనయు లం
దిరి యే ఫలముల నందఱు
నిరతి నెఱింగింపు; మన మునివరుఁడు పలికెన్.

4-899-కంద పద్యము

విను జనకాదేశము ముద
మునఁ దాల్చి నృపాత్మజులు సముద్రోదరమం
దనుపమ జపయజ్ఞంబున
నొనరఁ దపం బూని ముదము నొందుచు నుండన్.

4-900-కంద పద్యము

పదివే లేఁడులు నిష్ఠను
వదలక తప మాచరింప వారల కర్థిన్

సదయాంతరంగుఁ డభయ
ప్రదుఁడు సనాతనుఁడు నైన పద్మోదరుఁడున్.

4-901-కంద పద్యము

అనుపమ శాంతము లగు నిజ
తను రశ్మలచే నృపాల తనయ తపో వే
దనలు శమింపగఁ జేయుచు
ననయముఁ బ్రత్యక్ష మయ్యె; నచ్యుతుఁ డంతన్.

4-902-సీస పద్యము

ఘన మేరుశృంగ సంగత నీల మేఘంబు;
నైటి గరుడస్కంధ నివసితుండుఁ
గమనీయ నిజదేహకాంతి విపాటితా;
భీలాఖి లాశాంతరాళ తముఁడు
సుమహితాష్టాయుధ సుమనో మునీశ్వర;
సేవక పరిజన సేవితుండు
మండిత కాంచన కుండల రుచిరోప;
లాలిత వదన కపోలతలుఁడు

4-902.1-తేటగీతి

చారు నవరత్నదివ్యకోటీర ధరుఁడు
కౌస్తుభప్రవిలంబ మంగళగళుండు

లలిత పీతాంబరప్రభాలంకృతుండు
హార కేయూర వలయ మంజీర యుతుఁడు

4-903-కంద పద్యము

లలితాయ తాష్ట భుజ మం
డలమధ్యస్ఫురిత రుచివిడంబిత లక్ష్మీ
లలనా కాంతిస్పర్ధా
కలిత లసద్వైజయంతికా శోభితుఁడున్

4-904-కంద పద్యము

సుర గరుడ యక్ష కిన్నర
నిరుపమ జేగీయమాన నిఖిలాశా సం
భరిత యశోమహనీయ
స్ఫురణుండు నగు న పురాణ పురుషుం డెలమిన్

4-905-కంద పద్యము

కరుణావలోకనంబులు
నిరవొంద నృపాలసుతుల నీక్షించి రమా
వరుఁ డంబుద గంభీర మ
ధుర భాషలఁ బలికెఁ బ్రియము దూఁకొనుచుండన్

4-906-తేటగీతి

తాపసోత్తము లగు ప్రచేతసులు! వేడ్క
వినుఁడు మీరలు సౌహార్దమున నభిన్న

ధర్మ లగుట భవత్సౌహృదమున కేను
జాలఁ బరితోష మందితి సమత నేఁడు

4-907-కంద పద్యము

అనయమును మీ మనోరథ
మొనరింతు; నెఱుంగఁ బలుకుఁ; డుత్తము లగు మి
మ్మనుదినము నెవ్వఁడు సుఖశ
యనుఁడై మదిలోనఁ దలఁచు నా నరుఁ డెపుడున్.

4-908-కంద పద్యము

భ్రాతృజన సౌహృదంబును
భూతదయాగుణము విమల బుద్ధియు సుజన
ప్రీతియుఁ గల్గి సుఖించును
వీత సమస్తాఘుఁ డగుచు విశ్వములోనన్.

4-909-వచనము

మఱియు రుద్రగీతం బయిన మదీయస్తవం బెవ్వ రనుదినంబును
స్తోత్రంబు చేయుదురు, వారల కభిమతవరంబులు, శోభనకరం బగు
ప్రజ్ఞయు నిత్తు; మీరలు ముదన్వితులై జనకాదేశం బంగీకరించుటం జేసి
మీ కీర్తి లోకంబుల విస్తరిల్లు; మీకు ననూన బ్రహ్మగుణుండు
నాత్మసంతతిం జేసి లోకత్రయ పరిపూర్ణ గుణాకరుండు నైన పుత్రుండు
సంభవింపంగలండు; కండుమహాముని తపోవినాశార్థంబుగా నింద్రుని
చేతఁ బ్రేషిత యగు ప్రమ్లోచ యను నప్సరస గర్భంబు దాల్చి

యమ్ముక్కీంద్రుని వీడ్కొని దివంబునకుం జను సమయంబునం
బ్రసూతయై తత్పుత్రిని వృక్షంబు లందుఁ బెట్టి చనిన.

4-910-సీస పద్యము

ఆ శిశు వపుడు పేరాఁకలిచేఁ గుంది;
వావిచ్చి బిట్టు వాపోవు చుండ
నాలించి యటకు రాజైన సోముఁడు వచ్చి;
వలనొప్ప నవసుధావర్షి యైన
యాత్మీయ తర్జని నర్థిఁ బానమ్ము చే;
యింపంగఁ బెరిఁగి య య్యిందువదనఁ
గన్యా వరారోహఁ గడఁక మారిష యను;
చెలువఁ బుణ్యుండు ప్రాచీనబర్హి

4-910.1-తేటగీతి

యన్నృపునిచేఁ బ్రజా విసర్గావసరము
నందు వేడ్కఁ దదాదిష్టులైన మీర
లందఱును నెయ్యమున వివాహంబు గండ
యని సరోరుహనయనుఁ డిట్లనియె; మఱియు.

4-911-వచనము

"అనఘాత్ములారా! యభిన్న ధర్మశీలు రయిన మీకు నందఱకు నా
సుమధ్య యైన కన్య యభిన్న ధర్మశీలయు భవ దర్పితాశయయు
నయిన భార్య యగు; మీర లప్రతిహత తేజస్కులై దివ్యవర్ష సహస్రం

బులు భౌమ దివ్య భోగంబులు మదనుగ్రహంబులై యనుభవించెద; రంత నా యందుల భక్తిం జేసి నిర్మలాంతఃకరణులై యీ భోగంబులు నిరయ ప్రాయంబులుగాఁ దలంచి మదీయ స్థానంబు నొందెద" రని వెండియు నిట్లనియె.

4-912-చంపకమాల

అరయ గృహస్థు లయ్యును మదర్పిత కర్ములు నస్మదీయ సుం
దర చరితామృతశ్రవణ తత్పర మానస యాతయాములున్
సరస గుణాఢ్యు లై తనరు సాధుల కీ గృహముల్ దలంప దు
ష్కర భవబంధ హేతువులు గావు నృపాత్మజులార! యెన్నఁడున్.

4-913-వచనము

అది యెట్లంటిరేని.

4-914-చంపకమాల

అనుపమ బ్రహ్మవాదు లగు నంచిత యోగిజనానుగీయమా
న నిజకథా సముత్సుకుఁ డనందగు నేను మదీయులంద నూ
తనముగ నుందుఁ గావున నుదారత వారికి నీ గృహోపళుల్
ఘనభవబంధ హేతువులు గా; విది యంతయు నిక్క మారయన్.

4-915-కంద పద్యము

సరసుఁడ నగు ననుఁ బొందిన
పురుషులు ఘన శోక మోహ మోదంబులఁ బొం

దరు; గావున నెనయఁగను ద్రి
పురుషాధీశ్వరుఁడ బ్రహ్మభూతుఁడ నగుదున్."

4-916-వచనము

అని యిట్లు పలుకుచున్న పురుషార్థ భాజనుం డగు జనార్దనుని దర్శించి తద్దర్శన విధ్వస్త రజస్తమోగుణు లయిన ప్రచేతసులు.

4-917-చంపకమాల

కరసరసీరుహంబు లెసకం బెసఁగన్ ముకుళించి గద్గద
స్వరములఁజేసి యిట్లనిరి సర్వశరణ్యు నగణ్యు నిందిరా
వరు నజితున్ గుణాఢ్యు ననవద్యచరిత్రుఁ బవిత్రు నచ్యుతుం
బరుఁ బరమేశు నీశు భవబంధవిమోచనుఁ బద్మలోచనున్.

4-918-సీస పద్యము

కేశవ! సంతత క్లేశ నాశనుఁడవు;
 గురుసన్మనో వాగగోచరుఁడవు
నిర్ధమనోరథ హేతుభూతోదార;
 గుణనాముఁడవు సత్త్వగుణుఁడ వఖిల
విశ్వోద్భవస్థితి విలయార్థధృతనిత్య;
 విపులమాయాగుణ విగ్రహుఁడవు
మహితాఖిలేంద్రియ మార్గ నిరధిగత;
 మార్గుఁడ వతిశాంత మానసుఁడవు

4-918.1-తేటగీతి

తవిలి సంసార హారి మేధస్కుఁ డవును
దేవదేవుఁడవును వాసుదేవుఁడవును
సర్వభూత నివాసివి సర్వసాక్షి
వైన నీకు నమస్కారముయ్య! కృష్ణ!

4-919-వచనము

మఱియును.

4-920-ఉత్పలమాల

తోయరుహోదరాయ భవదుఃఖహరాయ నమో నమః పరే
శాయ సరోజకేసర పిశఙ్గ వినిర్మల దివ్య భర్మ వ
స్త్రాయ పయోజ సన్నిభ పదాయ సరోరుహ మాలికాయ కృ
ష్ణాయ పరాపరాయ సుగుణాయ సురారిహరాయ వేధసే.

4-921-వచనము

అని వినుతించి.

4-922-చంపకమాల

కమలదళాక్ష! దుఃఖలయ కారణమై తగు తావకీన రూ
పము ననివార్య దుర్భర విపద్దశ దుఃఖము నొందు మాకు నీ
సుమహిత సత్కృపా గరిమఁ జూపుట కంటె ననుగ్రహంబు లో
కమునఁ దలంప నొండొకటి గల్గునె? భక్తఫలప్రదాయకా!

4-923-ఉత్పలమాల

భూరిశివేతరాపహవిభూతి సమేత! మహాత్మ! దీనర
క్షారతి నొప్పు నీవు చిరకాలమునన్ సుఖవృత్తి వీరు మా
వార లటంచు బుద్ధి ననవద్య! తలంచిన యంతమాత్ర స
త్కారమె చాలు నట్లగుట గా కిటు సన్నిధి వైతి వీశ్వరా!

4-924-చంపకమాల

అరయఁగ క్షుద్రభూత హృదయంబుల యందుల నంతరాత్మవై
తిరముగ నుండు నీవు భవదీయ పదాంబురుహద్వయార్చనా
పరమతు లైన మాకును శుభప్రద భూరి మనోరథంబు లీ
వరుదుగ నీవె! భక్తహృదయప్రమదప్రద! ముక్తినాయకా!

4-925-సీస పద్యము

అయినను విను సరోజాయత లోచన;
వర మోక్ష మార్గ ప్రవర్తకుఁడవుఁ;
బురుషార్థ భూత విస్తరుఁడవు నగు నీవు;
దగిలి ప్రసన్నుఁ డవగుట మాకు
నర్థి మనోభీష్ట మైన వరం బయ్యె;
నైనను నాథ! పరాపరుండ
వైన నిన్నొక వరం బర్థింతు మనినను;
భువిఁ దావకీన విభూతు లెన్న

4-925.1-తేటగీతి

నంత మెఱుఁగంగ రామి ననంతుఁ డనుచుఁ
బలుకుదురు; నిన్ను నది గానఁ బరమపురుష!
యే వరం బని కోరుదు మేము? దప్పి
గొన్న బాలకుఁ డబ్ధి నీ ళ్ళెన్ని గ్రోలు?

4-926-వచనము

ఇదియునుం గాక.

4-927-ఉత్పలమాల

పూని భవత్పదాంబురుహ మూల నివాసులమైన మేము మే
ధానిధి! నీ విలోకనముఁ దక్కఁగ నన్యముఁ గోర నేర్తుమే?
మానిత పారిజాత కుసుమస్ఫుట నవ్యమరందలుబ్ధ శో
భానయశాలి యైన మధుపంబు భజించునె యన్యపుష్పముల్?

4-928-చంపకమాల

హరి భవదీయ మాయ ననయంబును జెందిన నేము నిచ్చలుం
గర మనురక్తి నేది తుదగా భవకర్ములమై ధరిత్రి పైఁ
దిరుగుదు, మంతదాఁక భవదీయజనంబులతోడి సంగతిన్
గురుమతి జన్మజన్మములకున్ సమకూరఁగ జేయు మాధవా!

4-929-మత్తేభ విక్రీడితము

కమలాధీశ్వర! తావకీన వరభక్తవ్రాత సంసర్గ లే
శముతోడన్ సరిగాఁ దలంప; మెలమిన్ స్వర్గాపవర్గాది సౌ

ఖ్యములన్నన్ వినుమానుషంబు లగు నీ కామంబులం జెప్ప నే
ల; మునీంద్రస్తుత పాదపద్మ! సుజనాలాపాను మోదాత్మకా!

4-930-వచనము

మఱియు భగవద్భక్త సంగంబుల యందుఁ దృష్టాప్రశమనంబులైన మృష్ట కథలు చెప్పఁబడుటచే భూతంబుల యందు వైరంబును నుద్వేగంబును లేకుండు నని.

4-931-చంపకమాల

వనముల ముక్తసంగు లగువారు నుతింపఁ దనర్తు వీవు; గా
వున నిలఁ బుణ్యతీర్థములఁ బోలఁ బవిత్రము చేయఁ బూని య
ర్థినిఁ బదచారులై ధరఁ జరించు భవత్పద భక్త సంగమం
బనుపమ భూరి సంసృతి భయస్థుని బుద్ధి రుచింపకుండునే?

4-932-వచనము

కావున.

4-933-చంపకమాల

వనరుహపత్రలోచన! భవత్సఖుఁడైన సుధాంశుమౌళితోఁ
డి నిమిషమాత్ర సంగతిఁ గడింది వ్రణంబును దుశ్చికిత్సము
న్ననఁ దగు జన్మరోగమున కర్మిలి వైద్యుఁడ వైన నిన్ను నే
మనయముఁ జూడఁ గంటిమి; కృతార్థులమై తగ మంటి మీశ్వరా!

4-934-వచనము

దేవా! మదీయ స్వాధ్యాయాధ్యయనంబులును, గురు ప్రసాదంబును, విప్రవృద్ధానువర్తనంబును, నార్యజననమస్కరణంబును, సర్వభూతా నసూయయు, నన్న విరహితంబుగా ననేక కాలం బుదకంబుల యందు సుతప్తంబయిన తపంబు చేయుటయు, నివి యన్నియును బురాణ పురుషుండ వైన భవదీయ పరితోషంబు కొఱకు నగుంగాక యని విన్నవించెదము;" అని వెండియు నిట్లనిరి.

4-935-మత్తేభ విక్రీడితము

" మను పద్మాసన ధూర్జటిప్రముఖ ధీమంతుల్ తపోజ్ఞాన స
త్త్వనిరూఢిం దగువారు నీ మహిమమున్ వర్ణింపఁ బారం బెఱుం
గనివా రయ్యును నోపినంత వినుతుల్ గావింతు; రట్లౌట నే
మును నిన్నర్థి నుతింతు మీశ! వరదా! బుద్ధ్యాదిమూలంబుగన్."

4-936-వచనము

అని మఱియు "సముండవు నాదిపురుషుండవుఁ బరుండవు శుద్ధుండవు వాసుదేవుండవు సత్త్వమూర్తివియు భగవంతుండవు నైన నీకు నమస్కరించెదము;" అని యిట్లు ప్రచేతసులచేత నుతింపంబడి శరణ్యవత్సలుండగు హరి సంతుష్టాంతరంగుండై వారల కోరిన యట్ల వరంబు లిచ్చిన.

4-937-తరళము

అనయ మా నృపనందనుల్ ముదమార సన్నుతిఁ జేయఁగాఁ
మనములోఁ బరితోష మంది రమాహృదీశుఁడు భక్త పా

లన కరుండు తదీయ దర్శన లాలసాత్మకు లాత్మలం
దనివి చాలక చూడ నాత్మపదంబు కేగె రయంబునన్.

4-938-వచనము

తదనంతరంబ ప్రచేతసులు భగవదాజ్ఞ శిరంబుల ధరియించి
సముద్రసలిల నిర్గతులయి.

4-939-కంద పద్యము

భూరి సమున్నతి నాక
ద్వార నిరోధంబు గాఁగఁ దగఁ బెరిఁగిన యా
భూరుహ సంఛన్నాఖిల
ధారుణి నీక్షించి రాజతనయులు వరసన్.

4-940-చంపకమాల

ఘన కుపితాత్ములై విలయకాల భయంకర హవ్యవాహ లో
చనుగతి నుగ్రులై ధరణి చక్రము నిర్వసుధారుహంబుగా
నన యముఁ జేయఁ బూనిన జనాధిపసూనుల మోములందుఁ దా
మనల సమీరముల్ జనన మంది కుజంబులఁ గాల్పఁ జొచ్చినన్.

4-941-కంద పద్యము

నలినభవుఁ డా మహీజ
ప్రళయముఁ గని వచ్చి ధరణిపాల తనూజా
తుల మధురోక్తుల నుపశాం
తులఁ గావించుచును నయము దూఁకొనఁ బలికెన్

4-942-వచనము

అట్లు పలికి వారల నుపశమిత క్రోధులం జేసిన యనంతరంబ.

4-943-సీస పద్యము

అవశిష్ట ధరణీరుహంబులు భయ మంది;
 తివిరి చతుర్ముఖాదేశమునను
మారిష యను సతీమణిఁ దమ కూఁతును;
 నా ప్రచేతసులకు నర్థి నిచ్చె;
నా నరపాలక సూనులు దక్షున;
 కరయంగ మున్నీశ్వరాపరాధ
మునఁ బ్రాప్త మైనట్టి జనపాల జన్మంబు;
 నకుఁ గారణం బైన నళిననయన

4-943.1-తేటగీతి

నాదరంబునఁ గమలజు నాజ్ఞఁ జేసి
కడఁక దీపింప విధివత్ప్రకారమునను
వరుస నందఱుఁ గూడి వివాహ మైరి
గడవ వచ్చునె దైవ సంకల్ప మెందు?

4-944-కంద పద్యము

కలదే జగతిం బదురు నృ
పులకి కిల నొక భార్య యెందుఁ బొసఁగునె? వినఁగా

నలినోదరు ఘనమాయా
కలితాద్భుతములకు నతులు గావింపఁ దగున్.

4-945-వచనము

అంతఁ జాక్షుషమన్వంతరంబున దైవచోదితుండై యిష్ట ప్రజాసర్గంబు గావించుచుఁ బ్రసిద్ధుండైన దక్షుండు పూర్వదేహంబు గాలవిద్రుతం బగుచుండం బ్రచేతసులకు నమ్మారిష యను భార్య యందు సంభవించి నిజకాంతింజేసి సమస్తతేజోధనుల తేజంబును బిహితంబుగాఁ జేయుచుఁ గర్మదాక్ష్యంబున దక్షుం డను నామంబు వహించి బ్రహ్మ చేతం బ్రజాసర్గరక్షయందు నియోగింపంబడి మరీచ్యాదులం దత్తద్వ్యాపారంబులందు నియోగించి యుండె; అంత.

## 4-26-ప్రచేతసులు ముక్తికింజనుట

4-946-సీస పద్యము

ఒనరఁ బ్రచేతసు లుత్పన్న విజ్ఞాను;
లగుచు వేగంబ నారాయణోక్తిఁ
దలఁచుచు నాత్మ నందను కడ నిజభార్య;
నిడి వనవాసులై కడఁగి మున్ను
జాబలి యను మునీశ్వరుఁడు సిద్ధుండైన;
భూరి పశ్చిమ వార్ధి తీరమునను
సర్వభూతాత్మ విజ్ఞానంబు గల యాత్మ;
ఘన విమర్శకృత సంకల్పు లైరి;

4-946.1-తేటగీతి

యంత నచటికి సమ్మోద మతిశయిల్ల
నర సురాసుర యక్ష కిన్నర వరేణ్య
మానితోన్నత సంపూజ్యమానుఁ డైన
నారదుండు వివేక విశారదుండు.

4-947-వచనము

చనుదెంచి నిర్జితప్రాణ మనో వాగ్దర్శనులును జితాసనులును శాంతు లును నసమాన విగ్రహులును నిర్మలంబైన పరబ్రహ్మంబు నందు నియోజితంబైన యంతఃకరణంబు గలవారును నైన రాజనందనుల కడ నిలిచిన.

4-948-కంద పద్యము

చనుదెంచిన నారదమునిఁ
గనుఁగొని నృపసుతులు లేచి కౌతుక మొప్పన్
వినమితులై సముచిత పూ
జనములఁ బరితుష్టుఁ జేసి సద్వినయమునన్.

4-949-చంపకమాల

అనఘ! మునీంద్రచంద్ర! భవదాగమనంబు సమస్తలోక శో
భనమగు; నస్మదీయమగు భాగ్యవశంబున నేఁడు విశ్వపా
వన! నినుఁ జూడఁగంటి మనివార్య భవద్భ్రమణంబు లోకలో
చను గతి పోలెఁ బ్రాణులకు సర్వ భయాపహరంబు గావునన్.

4-950-వచనము

అని మఱియు నిట్లనిరి.

4-951-సీస పద్యము

అనఘాత్మ! భగవంతులైన కేశవ వాము;
దేవులచే నుపదిష్టమైన
యాత్మతత్త్వంబు గృహస్థుల మగు మాకు;
ననయంబు విస్మృతం బయ్యె నట్టి
కలిత తత్త్వార్థ ప్రకాశకంబును భూరి;
ఘోర సంసారాబ్ధి తారకంబు
నై కర మొప్పారు నాత్మతత్త్వము నేఁడు;
చిరదయామతిఁ బ్రకాశింపఁ జేయు

4-951.1-తేటగీతి

మని ప్రచేతసు లర్థిఁ బల్కినఁ జెలంగి
భగవదాయత్త చిత్తుండు భవ్యగుణుఁడు
నఖిలలోక విహారుండు నైన యట్టి
నారదుఁడు పల్కె నా రాకుమారులకును.

4-952-సీస పద్యము

చర్చింప నరుల కే జన్మకర్మాయుర్మ;
నో వచనంబుల దేవదేవుఁ
డఖిల విశ్వాత్మకుం డైన గోవిందుండు;

విలసిల్లు భక్తి సేవింపఁబడెడు
నవియవో, జన్మ కర్మాయుర్మనో వచ;
నములను ధరణి నెన్నంగఁ దగును
వనరుహనాభ సేవా రహితము లైన;
జననోపనయన దీక్షాకృతంబు

4-952.1-తేటగీతి

లైన జన్మంబు లేల? దీర్ఘాయు వేల?
వేద చోదిత యగు కర్మ వితతి యేల?
జప తపశ్శ్రుత వాగ్విలాసంబు లేల?
మహిత నానావధాన సామర్థ్య మేల?

4-953-వచనము

మఱియు హరి విరహితంబైన యింద్రియ పాటవంబును నిపుణ యైన బుద్ధియు బ్రాణాయామాది యోగంబును దేహాది వ్యతిరిక్తాత్మ జ్ఞానంబును సన్న్యాసాధ్యాయనంబులును దక్కిన వ్రత వైరాగ్యాది శ్రేయస్సాధనంబులును నేల? సర్వేశ్వరుండును, సమస్త శ్రేయస్స్వరూపుండును, సమస్త శ్రేయోవధి భూతుండును, సర్వభూతావాసుండును, సర్వభూతాత్మప్రదుండును, సర్వభూతప్రియుండును, సర్వవ్యాపకుండునుం గావున.

4-954-మత్తేభ విక్రీడితము

క్రమలాధీశ్వరుఁ బూజ చేయుట సమగ్రప్రీతిఁ బ్రాణోపహా
రము సర్వేంద్రియ తృప్తి హేతువును సర్వక్ష్మాజమూలాభిషే
కము శాఖాభుజపుష్టిదంబు నగు రేఖన్ సర్వదేవార్హణ
క్రమమై యొప్పు ధరావరేణ్య సుతులారా! బుద్ధి నూహించినన్.

4-955-వచనము

అదియునుం గాక.

4-956-కంద పద్యము

పెను పగు వర్షాకాలం
బున దిననాయకుని వలనఁ బొడమిన సలిలం
బనయముఁ గ్రమ్మఱ గ్రీష్మం
బున సూర్యుని యందు డిందు పోలిక మఱియున్.

4-957-కంద పద్యము

ధరణిఁ జరాచర భూతము
లరయఁగ జనియించి యందె యడఁగిన పగిదిన్
హరిచేఁ బుట్టిన విశ్వము
హరి యందె లయంబు నొందు; నది యెట్లన్నన్.

4-958-మత్తేభ విక్రీడితము

అరుదౌ నభ్రతమఃప్రభల్ మును నభంబం దొప్పఁగాఁ దోఁచియున్
మఱలం జూడఁగ నందె లేనిగతి బ్రహ్మంబందు నీ శక్తులుం

బరికింపం ద్రిగుణప్రవాహమున నుత్పన్నంబులై క్రమ్మఱన్
విరతిం బొందుచు నుండుఁ గావున హరిన్ విష్ణున్ భజింపం దగున్.

4-959-వచనము

మఱియును సమస్త దేహులకు నాత్మయు, నిమిత్తభూతుండును, నద్వితీయుండును, శశ్వత్ప్రకాశుండును, బ్రధానపురుషుండును, స్వతేజో విధ్వస్త గుణప్రవాహుండును, మానస బుద్ధి సుఖేచ్ఛాద్వేషాది వికల్పరహితుండును, నగుణుండును, దేహాత్మభ్రమ నివృత్త్యుపలభ్యుండును, నాది మధ్యాంత రహితుండును, నిత్యానంద స్వరూపుండును, సర్వజ్ఞుండును, బరమేశ్వరుండును నైన నారాయణు నభేద బుద్ధిం జేసి భజింపుఁడు; అతండు సర్వభూత దయాళువులును, నెంతమాత్రంబు సంభవించు నంతమాత్రంబున సంతుష్టచిత్తులును, సర్వేంద్రియోపశాంతులును నగు పురుషుల యెడ సంతుష్టుం డగు" నని వెండియు నిట్లనియె.

4-960-చంపకమాల

చతురత నట్టి యీశ్వరుఁడు సజ్జనలోక నిరస్త సర్వ కా
మిత విమలాంతరంగమున మిశ్రిత భావనఁ జేసి సన్నిధా
పితుఁ డగుచున్ దయాకర గభీర గుణంబులఁ జాల నొప్పు యా
శ్రిత జన పారతంత్ర్యమును జేకొని పాయక యుండు నిచ్చలున్.

4-961-కంద పద్యము

శ్రుత ధన కుల కర్మ సము
న్నత మదములఁ జేసి సజ్జనప్రతతికి సం
తతమును సెగ్గొనరించు కు
మతు లర్థిం జేయు పూజ మతిఁ గొనఁ డెందున్.

4-962-వచనము

అది యెట్లనిన.

4-963-సీస పద్యము

వలనొప్పఁ దను ననువర్తించు నిందిరా;
కామినీమణిఁ దదాకాంక్షు లగుచు
ధృతి ననువర్తించు దేవేంద్రముఖ్యుల;
నైన నెవ్వఁడు చూడఁ డాత్మ నట్టి
నిత్య స్వతంత్రుని నిజభక్త వరదుని;
దీనవత్సలు గుణాధీశు నజునిఁ
బురుషోత్తముని జగద్భరితు సర్వేశ్వరు;
నారాయణునిఁ జిదానందమయుని

4-963.1-తేటగీతి

నజితు నచ్యుతుఁ బుండరీకాయతాక్షుఁ
దవిలి సేవింపకుండునే? ధర రసజ్ఞుఁ
డైన పురుషుండు సమ్మోదితాత్ముఁ డగుచుఁ
జారుమతులార! రాజకుమారులార!

4-964-వచనము

అని మఱియు నిట్లనియె; "భవదీయ వంశధుర్యుండుఁ జిత్రరథుండు నగు ధ్రువుండు సపత్నీమాతృ వాగ్బాణ భిన్నహృదయుండై పంచవర్షార్భకుం డగుచుఁ దపోవనంబున కరుగు నపుడు మార్గంబున నాచే నుపదిష్టంబైన క్రమంబున భగవంతుఁ డగు పుండరీకాక్షు నారాధించి యితరులచే నొందరాని సర్వోత్తమంబగు పదంబు నొందె; కాన మీరును రుద్రోపదేశ క్రమంబున సర్వభూతాంతర్యామి యగు నీశ్వరు భవచ్ఛేదంబునకై భజియింపుఁడు.

4-965-కంద పద్యము

అని యివ్విధమున నారద
ముని రాజకుమారులకును ముదము దలిర్పన్
వనజోదరు సచ్చరితము
వినిపించి సరోజభవుని వీటికిఁ జనియెన్.

4-966-వచనము

ఇట్లు నారదుండు చనిన యనంతరంబ.

4-967-చంపకమాల

నరవర నందనుల్ గడఁక నారద వక్త్ర వినిర్గతంబు సుం
దరమును మంగళావహము ధన్యము లోకమలాపహంబునై
పరఁగిన విష్ణు సద్యశము భక్తి నుతించి ముకుంద చింతనా
నిరుపమ భక్తిఁ జెంది హరినిత్య పదంబును బొంది రున్నతిన్.

4-968-వచనము

అని మైత్రేయుండు విదురున కిట్లనియె "మహాత్మ! నీవు నన్నడిగిన ప్రచేతోనారద సంవాద రూపంబైన హరికీర్తనంబు మను పుత్రుండైన యుత్తానపాదుని వంశప్రకారంబును జెప్పితిని;" అని వెండియు నిట్లనియె "నారదు వలనం బ్రియవ్రతుం డాత్మవిజ్ఞానంబు నొంది మహీమండలంబుఁ బరిపాలించి యనంతరంబునఁ బుత్రులకు రాజ్యంబుఁ బంచి యిచ్చి పరలోకగతుండయ్యె;" అనిన.

## 4-27-విదురుండు హస్తినకరుగుట

4-969-కంద పద్యము

విని విదురుం డా మునివరు
ఘున చరణము లాత్మ మస్తకంబున మధుసూ
దను చరణాంభోరుహములు
మనమునఁ దగఁ దాల్చి పలికె మైత్రేయునితోన్.

4-970-కంద పద్యము

మునినాథచంద్ర! కరుణా
వననిధి! నీ చేత భక్తవత్సలుఁడగు నా
వనజాక్షు తత్త్వ మెఱిఁగితి
నని తత్పదములకు వినతుఁడై వినయమునన్.

4-971-కంద పద్యము

ఆ మునిచే నా మంత్రితుఁ
డై మనమున బంధు దర్శనాకాంక్షితుఁడై
ధీ మహితుఁడైన విదురుఁడు
సామజ పురమునకుఁ జనియె సమ్మద మొప్పన్.

4-972-కంద పద్యము

అని శుకుఁడు పరీక్షిత్తున
కనుకంపం జెప్పె నీ యుపాఖ్యానంబున్
వినువాఁ డైశ్వర్యాయు
ర్ధన కీర్తిస్వస్తి గతులఁ దగఁ బ్రాపించున్.

4-973-కంద పద్యము

అని శుకయోగి పరీక్షి
జ్జనపాల సుధాపయోధి చంద్రున కర్థిన్
వినిపించిన కథ మోదం
బున సూతుఁడు శౌనకాది మునులకుఁ జెప్పెన్.

## 4-28-పూర్ణి

4-974-చంపకమాల

సరసవచో విలాస! గుణసాగర! సాగర మేఖలా మహీ
భరణ ధురంధరప్రకట భవ్య భుజాభుజగేంద్ర! రాజశే
ఖర! ఖర దూషణప్రముఖ గాఢ తమఃపటలప్రచండభా
స్కర! కలకంఠ కార్ముక విఖండన ఖేలన! భక్తపాలనా!

4-975-కంద పద్యము

శరవిదళిత సారంగా!
సరసదయాపాంగ! భక్త జలధితరంగా!
దురితధ్వాంత పతంగా!
వర జనకసుతానుషంగ! వననిధి భంగా!

4-976-మాలిని

సురవిమత విదారీ! సుందరీ శంబరారీ!
సరసవినుత సూరీ! సర్వలోకోపకారీ!
నిరుపమగుణ హారీ! నిర్మలానందకారీ!
గురుసమర విహారీ! ఘోరదైత్యప్రహారీ!

4-977-గద్యము

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీ మహాభాగవతం బను మహా పురాణంబునందు స్వాయంభువ మనువునకు నాకూతి, దేవహూతి, ప్రసూతి, ప్రియవ్ర, తోత్తానపాదులు జన్మించుటయు, నందు నాకూతిని రుచిప్రజాపతికి నిచ్చుటయు, నా రుచిప్రజాపతికి నాకూతిదేవి యందు శ్రీ విష్ణుమూర్త్యంశజుండైన యజ్ఞుండును, లక్ష్మీ కళాంశజ యగు దక్షిణ యను కన్యకయు నుద్భవించుటయు, మనుపుత్రి యైన దేవహూతినిఁ గర్దమున కిచ్చుటయుఁ, బ్రసూతిం దక్షప్రజాపతి కిచ్చుటయుఁ, బ్రసూతి దక్షుల వలనం బ్రజాపరంపరలు గలుగుటయు, మఱియుం గర్దమప్రజాపతి పుత్రికాసముదయంబును క్షత్త్ర బ్రహ్మర్షుల కిచ్చుటయుఁ,

గర్దమ పుత్రి యైన కళవలన మరీచికిఁ గశ్యపుం డను పుత్రుండును బూర్ణిమ యను కూఁతునుం బుట్టుటయును, బూర్ణిమవలన గంగయు విరజుం డనెడు కుమారుండును జన్మించుటయుఁ, గశ్యపప్రజాపతివలన నయిన ప్రజాపరంపరలచే ముల్లోకంబు లాపూర్ణంబు లగుటయు, అత్రిమహాముని తపంబును, నతనికి హరి హర బ్రహ్మలు ప్రత్యక్షం బగుటయు, అనసూయా పాతివ్రత్య మాహాత్మ్యంబువలన ననసూయాత్రులకుం ద్రిమూర్తుల కళాంశజు లయిన చంద్ర దత్తాత్రేయ దుర్వాసుల జన్మంబును, దక్షాత్మజల జన్మంబును, భృగువువలన ఖ్యాతి యను నంగనకు శ్రీమహాలక్ష్మి జన్మించుటయును, భృగు పౌత్రుం డయిన మార్కండేయ జన్మంబును, ధర్మునకు మూర్తివలన నరనారాయణులు సంభవించుటయును, సత్త్రయాగంబునందు దక్షుండు శివుని నిందించుటయును, దక్షాధ్వర ధ్వంసంబును, బ్రహ్మచేఁ బ్రార్థితుండై శివుండు దక్షాదుల ననుగ్రహించుటయును, దక్షాది కృత శ్రీహరి స్తవంబును, శ్రీహరి ప్రసన్నుండై దక్షుని యజ్ఞంబు సఫలంబుగా ననుగ్రహించుటయును, సతీదేవి హిమవంతునకు జనించి హరునకు బ్రాపించుటయు, నుత్తానపాదుని వృత్తాంతంబును, ధృవోపాఖ్యానంబును, ధృవుండు దండ్రిచేత నవమానితుండై నారదోపదేశంబున మధువనంబునకుం జని తపంబు చేయుటయును, హరి ప్రస న్నుండై యతని మనోరథంబు లిచ్చుటయును, నతండు మరలఁ బురంబునకు వచ్చుటయుఁ, గుబేరానుచరులైన యక్షులతోడి యుద్ధంబును, ధ్రువుండు యజ్ఞంబులు చేయుచు రాజ్యభోగంబులం దనిసి తనయు నుల్కలునిం బట్టంబుగట్టి హరి యనుగ్రహంబున ధ్రువక్షితిని

నిలుచుటయు, నుల్కలుండు వత్సరుం డను తన సుతునిఁ బట్టంబు గట్టి హరిం జేరుటయు, వత్సరుని వంశపరంపరయు, నందు నంగుని సుతుండయిన వేను కళేబరంబున లక్ష్మీనారాయణుల యంశంబున నర్చియుఁ బృథుండును జన్మించుటయుఁ, బృథుండు భూమిం గామధేనువు రీతి నఖిల వస్తువులుం బిదుక నియమించి సమస్థలిం జేసి యింద్రుండు వశవర్తియై యుండ బహుయజ్ఞంబులు చేసిన నతనికి హరి ప్రత్యక్షంబగుటయు, నధ్యాత్మ ప్రబోధంబును, నింద్రునివలనఁ బాషండ సంభవంబును, నింద్రుని జయించిన విజితాశ్వుని నతని తమ్ములను బృథివీపాలనంబునకు నిలిపి పృథుండు నర్చియుం బరమపదప్రాప్తు లగుటయు, వసిష్ఠుశాపంబునఁ ద్రేతాగ్నులు విజితాశ్వునికిఁ దనయులై జనియించుటయుఁ, బృథుని పౌత్రుండయిన ప్రాచీనబర్హి రాజ్యంబును నతని యజ్ఞంబు లసంఖ్యాతంబులైన నారదుండు మాన్పందలంచి పురంజను కథ నధ్యాత్మ ప్రపంచంబుగాఁ దెలుపుటయుఁ, బ్రాచీనబర్హి సుతులయిన ప్రచేతసులు పదువురకు శ్రీ మహాదేవుండు ప్రత్యక్షంబై హరి స్తవం బుపదేశించుటయుఁ, బ్రచేతసుల తపంబునకు మెచ్చి హరి బ్రత్యక్షంబగుటయు, వారికి మారిష వలన దక్షుండు పూర్వకాలంబున శివవిద్వేష ప్రయుక్త శాపంబునం బుత్రుండై జనియించుటయును, బ్రచేతసులు ముక్తికిం జనుటయును, విదురుండు మైత్రేయుని వీడ్కొని హస్తిపురంబు కరుగుటయు నను కథలు గల చతుర్థస్కంధము సమాప్తము.

# పోతన తెలుగు భాగవతము

## పంచమ స్కంధము - ప్రథమాశ్వాసము

### 5.1-1-ఉపోద్ఘాతము

5.1-1-కంద పద్యము

శ్రీకర కరుణా సాగర!
ప్రాకటలక్ష్మీ కళత్ర! భవ్య చరిత్రా!
లోకాతీతగుణాశ్రయ!
గోకులవిస్తార! నందగోపకుమారా!

5.1-2-వచనము

సకలపురాణార్థ జ్ఞాన విఖ్యాతుండగు సూతుండు శౌనకాది మహా మునుల కిట్లనియె.

### 5.1-2-ప్రియవ్రతునిబ్రహ్మదర్శనంబు

5.1-3-కంద పద్యము

భూనాథుఁ డుత్తరాత్మజుఁ
డైన పరీక్షిన్నరేంద్రుఁ డభిమన్యు సుతుం
డానందమంది ఘన సు
జ్ఞానుండగు శుకునిఁ గాంచి సరసతఁ బలికెన్.

5.1-4-వచనము

"మునీంద్రా! పరమభాగవతుండు నాత్మారాముండునైన ప్రియవ్రతుండు గృహంబున నుండి యెట్లు రమించె? కర్మబంధంబు లయిన పరాభవంబులు గల గృహంబుల యందు ముక్తసంబంధు లైన పురుషులకు సంతోషంబు గానేరదు; ఉత్తమ శ్లోకుం డైన పుండరీకాక్షుని పాదచ్ఛాయం జేసి నిర్వృతచిత్తులైన మహాత్ములు కుటుంబంబునందు నిస్పృహత చేయుదురు; గానఁ బ్రియవ్రతునికి సంసారంబునందుఁ దగులంబు గలుగు టెట్లు? దారాగారసుతాదు లందుఁ దగులంబు గలుగ వానికి నెట్లు సిద్ధి గలుగు? శ్రీహరియం దస్ఖలితమతి యెట్లు గలుగు? నీ సంశయంబుఁ దేట పఱపు" మని పరీక్షిన్నరేంద్రు డడిగిన శుకయోగీంద్రుం డిట్లనియె.

5.1-5-కంద పద్యము

హరి చరణాంబుజ మకరం
ద రసావేశిత మనః ప్రధానుండగు స
త్పురుషుఁ డొకవేళ విఘ్నముఁ
బొరసినఁ దన పూర్వ మార్గమును విడువఁ డిలన్

5.1-6-కంద పద్యము

ధరణీవల్లభ! విను మా
నరవరుఁడు ప్రియవ్రతుండు నారదముని స
చ్చరణోపసేవఁ జెందుచు
నరుదుగ నధ్యాత్మ సత్రయాగంబందున్.

5.1-7-సీస పద్యము

దీక్షితుండై ధరిత్రీపాలనముఁ దండ్రి;
పనిచిన సుజ్ఞాన భంగ మనుచు
నంగీకరింపమి నంతయుఁ దెలిసి ప;
ద్మాసనుఁ డతనికి నతుల రాజ్య
మందుల మిక్కిలి యాసక్తిఁ బుట్టింతు;
ననుచును దన చిత్తమందుఁ దలఁచి
తారకాపరివృతతారాధిపుని మాడ్కి;
శ్రుతులతోఁ గూడి యచ్యుత విభూతి

5.1-7.1-తేటగీతి

హంసవాహనుఁ డగుచు నింద్రాదు లెల్లఁ
గదిసి సేవింప బ్రహ్మలోకమున నుండి
సన్మునీంద్రులు దన్నుఁ బ్రశంసచేయ
నల్లనల్లన యుడువీధి నరుగు దెంచె.

5.1-8-వచనము

మఱియు నయ్యై మార్గంబుల యందు సిద్ధ సాధ్య గంధర్వ చారణ గరుడ కింపురుషు లిరుదెసల స్తోత్రంబులు చేయుచుండ గంధమాదనద్రోణులం బ్రకాశంబు నొందించుచు జనుదెంచిన పద్మాసనునకు నారదుండు స్వాయంభువ ప్రియవ్రతులతోఁ గూడి ముకుళిత కరకమలుండై యెదురు చనుదెంచి సంస్తుతి స్తబకంబులం బూజించిరి; విరించి సంతసించి ప్రియవ్రతునిం జూచి నవ్వుచు నిట్లనియె.

5.1-9-కంద పద్యము

హరి నా ముఖమున నీకును
గర మెఱిఁగింపంగఁ బనిచెఁ గావున నిదె సు
స్థిర మతి విను మంతయు శ్రీ
హరి వాక్యముగా నెఱింగి యవనీనాథా!

5.1-10-ఆటవెలది

కోరి వేడ్క నీవు నారదుండును నేను
నందఱమును నీశ్వరాజ్ఞఁ బూని
యుడుగ కెపుడు జేయనున్న వారము గాన
నతని యాజ్ఞఁ దప్ప నలవి గాదు.

5.1-11-వచనము

మఱియు శ్రీహరి యాజ్ఞను జీవుండు తపోవిద్యలను యోగ వీర్య జ్ఞానార్థ ధర్మంబులను దనచేత నొరులచేతం దప్పింప సమర్థుండు గాఁ; డుత్పత్తి స్థితి నాశంబులకు శోకమోహభయసుఖదుఃఖంబులకు నీశ్వరాధీనుండె కాని జీవుండు స్వతంత్రుండు గాఁడు; శ్రీహరి వాగ్రూపంబు లయిన శ్రుతులందు గుణత్రయం బను రజ్జువున బంధింపంబడిన యస్మదాదులము ముకుఁద్రాటిచేఁ బశువు మనుష్యులకు వశంబయిన చందంబున నీశ్వరాజ్ఞం బ్రవర్తించుచుందుము; నరుండు సుఖదుఃఖానుభవంబులకు నీశ్వరాధీనుండు; నేత్రంబులు గలవాని చేతఁ దివియంబడిన యంధుండును బోలె నీశ్వరుం డిచ్చిన సుఖదుఃఖంబు లనుభవించుచున్న వారము; స్వప్నంబునం గన్న పదార్థంబు మేల్కాంచి మిథ్యగాఁ దలంచిన చందంబున మోక్షార్థియైన సుజ్ఞానవంతుండు ప్రారబ్ధ సుఖదుఃఖంబు లనుభవించుచు దేహాంతరారంభ కర్మంబులం బాయనొల్లఁడు;

వనవాసి యైనను జితేంద్రియుండు గాకుండెనేనిఁ గామాది సహితుం డగుటంజేసి సంసారబంధంబులు గలుగు; గృహస్థాశ్రమంబందును జితేంద్రియుండై యాత్మ జ్ఞానంబుగల పురుషునకు మోక్షంబు సిద్ధించు; శత్రువుల గెలువ నిశ్చయించిన పురుషుండు దుర్గం బాశ్రయించి శత్రువుల జయించిన మాడ్కిని మోక్షార్థి యగు నీవును గృహాశ్రయుండ వగుచు శ్రీనారాయణ చరణారవిందంబు లను దుర్గం బాశ్రయించి యరిషడ్వర్గంబు జయించి ముక్తసంగుండవై యీశ్వర కల్పితంబు లగు భోగంబు లననుభవించి ముక్తింజెందు;" మనినఁ ప్రియవ్రతుండు త్రిభువన గురుండయిన చతురానను వాక్యంబు లవనతమస్తకుం డై బహుమాన పూర్వకంబుగ నంగీకరించె; అంత.

5.1-12-ఆటవెలది

సరసిజాసనుండు స్వాయంభువుని చేత
నధికమైన పూజలంది నార
దుండు నా ప్రియవ్రతుండును జూడంగఁ
జనియెఁ దనదు పూర్వ సదనమునకు.

5.1-13-ఆటవెలది

సత్యసంధుఁడైన స్వాయంభువుం డను
మనువు బ్రహ్మచేత మన్ననఁ దగ
నంది యంత నారదానుమతంబునఁ
దనదు సుతుని రాజ్యమునను నిలిపె.

5.1-14-వచనము

ఇట్లు స్వాయంభువమనువు భూచక్ర పరిపాలనంబునకుఁ బ్రియ వ్రతునిఁ బట్టంబు గట్టి విషమంబులగు విషయంబుల వలన విముక్తుండై వనంబునకుం జనియె; అంత.

5.1-15-మత్తేభ విక్రీడితము

ధరణీవల్లభుఁ డా ప్రియవ్రతుఁడు మోదం బందుచున్ లీల నీ
శ్వరవాక్యంబునఁ గర్మతంత్ర పరుఁడై సంగంబులం బాపు శ్రీ
హరిపాదాంబుజ చింతనం దగిలి నిత్యానందముం బొంది దు
ర్భర రాగాదులఁ బాఱఁదోలి ప్రజలం బాలించె నత్యున్నతిన్.

## 5.1-3-ఆగ్నీధ్రాదుల జన్మంబు

5.1-16-వచనము

ఇట్లు ప్రియవ్రతుండు రాజ్యంబు చేయుచు విశ్వకర్మ ప్రజాపతి పుత్రిక యగు బర్హిష్మతి యనుదానిం బత్నిగాఁ బడసి, యా సతివలన శీల వృత్త గుణ రూప వీర్యౌదార్యంబులం దనకు సమానులైన యాగ్నీధ్రే ధ్మజిహ్వ, యజ్ఞబాహు, మహావీర, హిరణ్యరేతో, ఘృతపృష్ట, సవన, మేధాతిథి, వీతిహోత్ర, కవు లను నామంబులు గల పుత్రదశకంబును; నూర్జస్వతి యను నొక్క కన్యకను గాంచె; నందుఁ గవి మహావీర సవనులు బాలకులయ్యు నూర్ధ్వరేతస్కులై బ్రహ్మవిద్యానిష్ణాతులై యుపశమనశీలు రగుచుం బారమహంస్యయోగం బాశ్రయించి, సర్వజీవనికా యావాసుండును, భవభీతజనశరణ్యుండును, సర్వాంతర్యామియు, భగవంతుండు నగు వాసుదేవుని చరణారవిందావిరత స్మరణానుగత పరమ భక్తియోగానుభావంబున విశోధితాంతఃకరణు లగుచు నీశ్వరుతాదాత్మ్యంబుఁ బొందిరి; అంత.

5.1-17-సీస పద్యము

వసుధేశ! యా ప్రియవ్రతుఁ డొండు కాంత యం;
 దధికుల మన్వంతరాధిపతుల
మఱియు నుత్తముఁడు తామసుఁడు రైవతుఁ డను;
 సుతులను బుట్టించె సుమహితులను;
మును్న జన్మించిన మువ్వురు పుత్రులు;
 నవ్యయ పదవికి నరుగుటయును
నంతఁ బ్రియవ్రతుఁ డఖిల శాత్రవకోటిఁ;
 దన బాహుబలముచేతను జయించి

5.1-17.1-తేటగీతి

యతఁడు బర్హిష్మతీ కాంతయందుఁ బ్రీతి
గలిగి యౌవన లీలా వికాస హాస
హేలనాదులఁ జిత్తంబు గీలుకొల్పి
గత వివేకుండుబోలె భోగములఁ బొందె.

5.1-18-వచనము

ఇట్లు ప్రియవ్రతుం డేకాదశార్బుద పరివత్సరంబులు రాజ్యంబు చేసి యొక్కనాడు మేరునగ ప్రదక్షిణంబు చేయు సూర్యునకు నపరభాగంబునం బ్రవర్తించు నంధకారంబు నివర్తింపంబూని భగవదుపాసనా జనితాతిపురుష ప్రభావుండై సవిత్ఱ రథసదృక్ష వేగంబు గలిగి తేజోమయం బైన రథంబు నారోహణంబు చేసి రాత్రుల నెల్ల దినంబు లొనర్తు నని సప్తరాత్రంబులు ద్వితీయ తపనుండునుం

బోలె నరదంబు పఱపుటయు నా రథనేమి మార్గంబులు సప్తసముద్రంబులును, నా మధ్య భూసంధులు సప్తద్వీపంబులు నయ్యె; నందు.

5.1-19-సీస పద్యము

సరస జంబూ ప్లక్ష శాల్మలిద్వీప కు;
 శక్రౌంచ శాక పుష్కరము లనఁగ
నలరు నా ద్వీపంబులందు జంబూద్వీప;
 మొనరంగ లక్షయోజనము లయ్యె;
నట యుత్తరోత్తరాయత సంఖ్యఁ దాద్విగు;
 ణిత మయి యొండొంటి కతిశయిల్లు
క్షారేక్షురస సు రాజ్యక్షీర దధ్యుద;
 కంబులు గలుగు సాగరము లేడు

5.1-19.1-తేటగీతి

ద్వీప పరిమాణములు గల్గి విస్తరిల్లు
సంధి సంధిని బరిఖల చందమునను
గ్రమము దప్పక యొండొంటిఁ గలయకుండు
సకల జీవుల కెల్ల నాశ్చర్యముగను.

5.1-20-వచనము

అట్టి ద్వీపంబుల యందుఁ బరిపాలనంబునకుం బ్రియవ్రతుం డాత్మభవులు నాత్మసమాన శీలురునైన యాగ్నీధ్రేధ్మజిహ్వ యజ్ఞబాహు హిరణ్యరేతో ఘృతపృష్ఠ మేధాతిథి వీతిహోత్రుల నొక్కొక్కని నొక్కొక ద్వీపంబునకుం బట్టంబుగట్టి యూర్జస్వతి యను కన్యకను భార్గవున కిచ్చిన, నా భార్గవునకు నూర్జస్వతి

యందు దేవయాని యను కన్యారత్నంబు జనించె; అట్టి బలపరాక్రమవంతుం డైన ప్రియవ్రతుండు విరక్తుండై యొక్కనాఁడు నిజ గురువగు నారదుని చరణానుసేవాను పతిత రాజ్యాది ప్రపంచ సంసర్గంబుఁ దలంచి యిట్లనియె.

## 5.1-4-వనంబునకుజనుట

5.1-21-సీస పద్యము

అక్కట! యే నింద్రియములచేఁ గట్టంగఁ;
 బడియుండి యందులఁ బాయలేక
యజ్ఞాన విరచితం బగు సర్వవిషయము;
 లను నంధకూపంబులందు నడఁగి
తరుణుల కే వినోదమృగంబనై యుంటి;
 యవి యెల్ల నే నొల్ల ననుచు రోసి
హరికృపచే నప్పు డబ్బిన యాత్మ వి;
 ద్యను గల్గి తనవెంట నరుగుదెంచు

5.1-21.1-తేటగీతి

కొడుకులకు నెల్ల రాజ్యము గుదురు పఱచి
తనదు పత్నుల దిగనాడి ధనము విడిచి
హరివిహారంబు చిత్తంబునందు నిలిపి
పరఁగ నల్లన నారదపదవి కరిగె.

5.1-22-వచనము

ఇట్లు దన రథమార్గంబులు సప్త ద్వీపసాగరంబులుగాఁ జేసి సూర్యునకుఁ బ్రతిసూర్యుండై సరిద్గిరివనాదులచే భూత నిర్వృత్తికొఱకుఁ బ్రతి ద్వీపంబునకు నవధులు గల్పించి ద్వీపవర్ష నిర్ణయంబులం బుట్టించి పాతాళ భూ స్వర్గాది సుఖంబులు నరకసమానంబులుగాఁ దలంచి విరక్తింబొంది నిరంతర భగవద్ధ్యాన విమలీకృతాశయుం డగుచు హరిభక్తి ప్రియుండయిన ప్రియవ్రతుని చరిత్రంబు లీశ్వరునకుఁ దక్క నన్యుల కెఱుంగఁ దరంబుగా; దతని మహిమంబులు నేడుఁనుం గొనియాడుదు" రని శుకుండు మఱియు నిట్లనియె.

5.1-23-కంద పద్యము

హరిసేవనా ప్రియవ్రతుఁ
డరయఁగఁ గైవల్యపదవి నందుట యరుదే?
ధరఁ జండాలుం డైనను
హరి నామస్మరణఁ జెందు నవ్యయపదమున్.

5.1-24-వచనము

అని పలికి శుకుండు మఱియు నిట్లనియె

## 5.1-5-వర్షాధిపతుల జన్మంబు

5.1-25-మత్తేభ విక్రీడితము

జనకుం డిట్లు విరక్తుఁడైనను దదాజ్ఞం జేసి యాగ్నీధ్రుఁ డే
పున ధర్మప్రతిపాలనుం డగుచు జంబూ ద్వీపమున్నేలుచుం
దన సత్పుత్రులమాడ్కి నెల్ల ప్రజలం దాత్పర్య చిత్తంబునన్
ఘనతం బ్రోచె ననేకకాల మిలఁ బ్రఖ్యాతంబుగా భూవరా!

5.1-26-వచనము

ఇట్లగ్నీధ్రుండు రాజ్యంబు చేయుచు నొక్కనాఁడు పుత్రకాముండై మందరాద్రి సమీపంబున నఖిలోపచారంబుల నేకాగ్రచిత్తుండై యర్చించినం గమలసంభవుండు సంతసిల్లి తన సమ్ముఖంబున సంగీతంబు చేయు పూర్వచిత్తి యను నప్సరోంగనం బంపుటయు నా యప్సరాంగన చనుదెంచి రమణీయ వివిధ నిబిడ విటపి విటప సమాశ్లిష్ట సమీప సువర్ణ లతికారూఢస్థల విహంగమ మిథునోచ్చార్యమాణ షడ్జాది స్వరంబులచే బోధ్యమాన సలిలకుక్కుట కారండవ బక కలహంసాది విచిత్ర కూజిత సంకులంబు లయిన నిర్మలోదక కమలాకరంబులు గల తదాశ్రమోపవనంబు నందు విహరించుచు విలాస విభ్రమ గతివిశేషంబులం జలనంబు నొందు స్వర్ణ చరణాభరణస్వనం బన్నరదేవకుమారుం డాలించి యోగసమాధిం జేసి ముకుళితనేత్రుండై యుండి యల్లన కనువిచ్చి చూచి తన సమీపంబున మధుకరాంగనయుంబోలెఁ బుష్పాఘ్రాణంబు చేయుచు దేవమానవుల మనోనయనంబుల కాహ్లాదంబు బుట్టించుచున్నగతి విహార వినయావలోకన సుస్వరావయవంబుల మన్మథ శరపరంపరంల నొందించుచు ముఖకమల విగళితామృత సమానహాసభాషణామోదమదాంధంబు లయిన మధుకర మిథునంబుల వంచించి, శ్రీఘ్ర గమనంబునం జలించు కుచ కచమేఖలలు గల దేవిం గనుంగొని చిత్తచలనంబు నొంది మన్మథపరవశుండై జడుని చందంబున నిట్లనియె.

5.1-27-కంద పద్యము

" సతి నీ వెవ్వతె వీ ప
ర్వతమున కేమైనఁ గోరివచ్చిన వనదే

వతవో? శారదవో? రతి
పతి పంచిన మాయవో? తపస్సారమవో?

5.1-28-ఉత్పలమాల

అంగజుఁ డెక్కుడించిన శరాసనమున్ ధరియించి యంత నా
యంగజు వేఁట మానవమృగావళి సూటిగఁ నేచు దానవో?
రంగగు నీ నిజాకృతి తెలం గెఱుఁగంగ నిజంబు పల్కుమా
యంగన నిన్నుఁ గన్గొనిన యంత ననంగుఁడు సందడించెడున్.

5.1-29-కంద పద్యము

పొలుపగుచున్న విలాసం
బుల నంగజు బాణములను బోలెడి నీ చం
చల సత్కటాక్షవీక్షణ
ముల నెవ్వని నింతి చిత్తమునఁ గలఁచెదవే?

5.1-30-చంపకమాల

చెదరఁగ వేదముల్ చదువు శిష్యులపైఁ దగఁ బుష్పవృష్టి స
మ్మదమున నంతలోఁ గురియు మాడ్కిని మన్మథసామగానముల్
చదివెడు శిష్యులో యనఁగ షట్పదపంక్తులు చేరి మ్రోయఁగాఁ
బదపడి మీఁద రాలుఁ గచభారము నందుల జాలు క్రొవ్విరుల్.

5.1-31-కంద పద్యము

అందియలు టిట్టిభంబుల
చందమునం బాదపంకజంబుల యందున్

యందందం దమ్రోయుచును నా
డెందంబునఁ దగిలి సందడించెడిఁ దరుణీ!

5.1-32-కంద పద్యము

పాయక కదంబ పుష్ప
చ్ఛాయం గల వస్త్రకాంతి చల్లెడుఁ గంటే
యా యెడ నితంబరోచులు
గాయుచు నెడతెగక తఱిమి కప్పెడుఁ దన్వీ!

5.1-33-కంద పద్యము

నిరతము నీ తనుమధ్యముఁ
గర మరుదుగ నరసి చూడఁ గానంబడ; దీ
కరికుంభంబులఁ బోలెడి
గురు కుచముల నెట్లు నిలుపు కొంటి లతాంగీ!

5.1-34-కంద పద్యము

పొంకములగు కుచములపైఁ
గుంకుమ పంకంబుఁ బూసికొని వాసనలం
గొంకక వెదచల్లెడు నీ
బింకం బగు చన్నుదోయి పెంపో! సొంపో!

5.1-35-శార్దూల విక్రీడితము

ఏ లోకంబున నుండి వచ్చితివి? నీ విచ్చోటికిన్ మున్ను నే
నే లోకంబునఁ జెప్పఁ జూప నెఱుఁగన్నీ సుందరాకారము

నీ్న లాలిత్యము లీ వినోదములు నీ కిట్లొప్పునే? కామినీ!
భూలోకంబున కెట్లు వచ్చితివి నా పుణ్యం బగణ్యంబుగన్?

5.1-36-కంద పద్యము

హాసావలోకనంబుల
భాసిల్లెడు నీ ముఖంబు పలుమఱు నిపుడే
యాసలు పుట్టింపఁగ నే
నాసగొనెద నిన్నుఁ జూచి యంబుజనేత్రా!

5.1-37-ఆటవెలది

కందులేని యిందుకళ మించి నెమ్మోము
కాంతి యుక్త మగుచుఁ గానుపించెఁ
గాన విష్ణుకళయుఁ గాఁబోలు నని నా మ
నంబునందుఁ దోఁచె నళిననేత్ర!

5.1-38-మత్తేభ విక్రీడితము

పటుతాటంక రథాంగ యుగ్మమునకుం బల్మాఱు భీతిల్లుచున్
నటనం బందెడు గండుమీనములతో నాసన్న నీలాలకో
త్కట భృంగావళితో ద్విజావళి లసత్కాంతిన్ విడంబించు మా
ఱట కాసారముఁ బోలి నెమ్మొగము దా రంజిల్లు నత్యున్నతిన్.

5.1-39-చంపకమాల

కరువలిఁ బాయు వస్త్రమును గట్ట నెఱుంగవు; చూడ్కి దిక్కులం
బఱపుచుఁ జంచరీకముల భాతిఁ జెలంగెడు కంధరంబునం

బోరలెడు ముక్తకేశభరముం దుఱుమంగఁ దలంప; విప్పు డి
ట్లరుదుగ రత్నకందుక విహారము సల్పెడు సంభ్రమంబునన్."

5.1-40-వచనము

మఱియు నిట్లనుఁ "దపోధనులగు వారల తపంబులను నీ రూపంబున నపహ్నవించిన దాన; వీ చక్కదనం బేమి తపంబున సంపాదించితివి? నా తోడంగూడి తపంబు చేయుము; సంసారంబు వృద్ధిఁ బొందం జేయుము; పద్మాసనుండు నాకుం బ్రత్యక్షంబై నిన్ను నిచ్చినవాఁడుఁ; గావున నిన్ను విడువంజాలను; నీ సఖీజనంబులు నా వాక్యంబులకు ననుకూలింతురుగాక; నీవు చనుచోటికి నన్నుం దోడ్కొని చను" మని స్త్రీలకు ననుకూలంబుగాఁ బలుక నేర్చిన యాగ్నీధ్రుండు పెక్కుభంగులం బలికిన నా పూర్వచిత్తియు నతని యనునయ వాక్యంబులకు సమ్మతించి వీరశ్రేష్ఠుండగు నా రాజవర్యుని బుద్ధి రూప శీలౌదార్య విద్యా వయశ్శ్రీలచేఁ బరాధీనచిత్త యగుచు జంబూద్వీపాధిపతి యగు నా రాజశ్రేష్ఠుని తోడంగూడి శతసహస్ర సంవత్సరంబులు భూస్వర్గ భోగంబు లనుభవించె; నంత నాగ్నీధ్రుం డా పూర్వచిత్తివలన నాభి కింపురుష హరివర్షేలావృత రమ్యక హిరణ్మయ కురు భద్రాశ్వ కేతు మాల సంజ్ఞలు గల కుమారులఁ బ్రతిసంవత్సరంబు నొక్కొక్కనిఁగఁ దొమ్మండ్రం గాంచె; అంత నా పూర్వచిత్తి యా యర్భకుల గృహంబున విడిచి యాగ్నీధ్రుం బాసి బ్రహ్మలోకంబునకుం జనిన నా యాగ్నీధ్ర పుత్రులు మాతృసామర్థ్యంబునం జేసి స్వభావంబునన శరీరబలయుక్తు లగుచుఁ దండ్రిచేత ననుజ్ఞాతులై తమ నామంబులఁ బ్రసిద్ధంబు లయిన జంబూద్వీపాది వర్షంబులం బాలించుచుండిరి; అంత నాగ్నీధ్రుండు నా పూర్వచిత్తి వలనం గామోపభోగంబులం దృప్తిం బొందక పూర్వచిత్తిం దలంచుచు వేదోక్తంబులగు కర్మంబులంజేసి తత్సలోకంబగు బ్రహ్మ

లోకంబునకుం జనియె; నిట్లు దండ్రి పరలోకంబునకుం జనిన నాభి ప్రముఖులగు నాగ్నీధ్రకుమారులు దొమ్మండ్రును మేరుదేవియుఁ, బ్రతిరూపయు, నుగ్రదంష్ట్రయు, లతయు, రమ్యయు, శ్యామయు, నారియు, భద్రయు, దేవవతియు నను నామంబులు గల మేరు పుత్రికలగు తొమ్మండ్రు కన్యకలను వివాహం బైరి; అంత.

## 5.1-6-ఋషభుని జన్మంబు

### 5.1-41-ఆటవెలది

నరవరేణ్యుఁడైన నాభి సంతానార్థ
మంగనయును దాను యజ్ఞ పురుషుఁ
డయిన వాసుదేవు నతుల భక్తిశ్రద్ధ
లను జెలంగి పూజ లొనరఁ జేసి.

### 5.1-42-వచనము

మఱియుం బ్రవర్గ్య సంజ్ఞికంబు లగు ధర్మంబులు శ్రద్ధా విశుద్ధద్రవ్య దేశ కాల మంత్రర్త్విగ్దక్షిణా విధాన యోగంబులం బరమేశ్వరుని మెప్పించిన నెవ్వరికిం బ్రసన్నుండు గాని పుండరీకాక్షుండు భక్తవత్సలుం డై సురుచిరావయవంబులతో యజనశీలం బయిన యాతని హృదయంబు నందుఁ బాయని రూపంబు గలిగి మనోనయనానందకరావయవంబులు గల తన స్వరూపం బాతనికిఁ జూపం దలంచి.

### 5.1-43-సీస పద్యము

అంత నావిష్కృత కాంత చతుర్భుజం;
 బులును బీతాంబరంబును వెలుంగ
శ్రీవత్సకౌస్తుభ శ్రీరమా చిహ్నంబు;
 లురమందురమ్యమై యురవు పడఁగ
శంఖ చక్ర గదాంబుజాత ఖడ్గాది ది;
 వ్యాయుధంబులు చేతులందు మెఱయ
నతులిత నవ రత్నహాట కాంకిత నూత్న;
 ఘనకిరీటద్యుతు ల్గడలుకొనఁగఁ

5.1-43.1-తేటగీతి

గర్ణ కుండల కటిసూత్ర కనకరత్న
హార కేయూర వరనూపురాది భూష
ణముల భూషితుఁడైన శ్రీనాయకుండు
దంపతుల కప్పు డెదురఁ బ్రత్యక్ష మయ్యె.

5.1-44-తేటగీతి

ఇట్లు ప్రత్యక్షమగు పరమేశ్వరునకుఁ
బెన్నిధానంబుఁ గనుఁగొన్న పేద మాడ్కి
హర్షమున ఋత్విగాది కులవనతాస్యు
లగుచు నభినుతి చేసి రిట్లనుచు నపుడు.

5.1-45-కంద పద్యము

పరిపూర్ణుఁడ వై యుండియు
మఱువక మా పూజ లెల్ల మన్నింతువు; నీ

చరణారవింద సేవయు
ధరఁ బెద్దలు వినిచి నటుల దగఁ జేసెదమౌ.

5.1-46-కంద పద్యము

ఏ మిపుడు చేయు సంస్తుతి
నీ మహిమ నెఱింగి కాదు; నిరతముఁ బెద్దల్
దా మెది యుపదేశించిరొ
యా మతమునఁ బ్రస్తుతింతు మయ్య! మహాత్మా!

5.1-47-వచనము

మఱియు నీవు సంసారాసక్తమతి గలిగిన వారికి వశ్యుండవుగావు; యీశ్వరుండవును బ్రకృతి పురుష వ్యతిరిక్తుండవును బరమ పురుషుండవును నయిన నిన్నుఁ బొందని ప్రపంచాంతర్గతంబు లయిన నామరూపంబులు గల యస్మదాదులచేత నిరూపింప నశక్యంబగు; సర్వజీవులం జెందిన దురిత సంఘంబుల నిరసించు స్వభావంబు గల నీ యుత్తమ గుణంబులందు నేకదేశంబ గాని సర్వగుణనిరూపణంబు చేయ శక్యంబుగానేరదు; నీ భక్తులు మిక్కిలి భక్తిం జేసి సంస్తుతించు గద్గదాక్షరంబులను సలిల శుద్ధ పల్లవ తులసీదళ దుర్వాంకురంబులను సంపాదించిన పూజను సంతసిల్లెడి నీకు బహువిధ ద్రవ్య సంపాదనంబు గలిగి విభవ యుక్తంబు లయిన యశ్వమేధాదులును దృష్టికరంబులు గానేరవు స్వభావంబున సర్వకాలంబులందును సాక్షాత్కరించి యతిశయంబై వర్తించుచు నశేషపురుషార్థ స్వరూపంబుఁ బరమానంద రూపంబు నైనవాఁడ వగుటం జేసి యజ్ఞాదుల యందు నీకుఁ దృష్టి లేక యున్న

నస్మదాదుల కోరికల కుపచరించు కతంబున యజ్ఞాదుల నొనరింతుము;" అని మఱియు నిట్లనిరి.

5.1-48-కంద పద్యము

బాలిశుల మగుచు మిక్కిలి
మే లెఱుగని మమ్ము నీదు మించిన దయచేఁ
బాలింతు విత్తు వెప్పుడుఁ
జాలఁగ నిహపరములందు సకల సుఖములున్.

5.1-49-ఆటవెలది

ఇపుడు మేము నీకు నిష్టంబు లగు పూజ
లాచరింపకున్న నైన నధిక
మయిన నీ కృపాకటాక్ష వీక్షణములఁ
జక్కఁ జూచి తగఁ బ్రసన్నుఁ డగుచు.

5.1-50-కంద పద్యము

వర మీయఁ దలఁచి మమ్ముం
గరుణించితి గాక; నిన్నుఁ గనుగొనుటకునై
యరసి నుతింపఁగ మాకుం
దర మగునే? వరద! నీరదశ్యామాంగా!

5.1-51-వచనము

మఱియు నిస్సంగులై నిశితజ్ఞానంబునంజేసి దోషరహితులై భగవత్స్వభావులు నాత్మారాములు నగు మునులకు స్తుతియింపఁ దగిన గుణంబులు గలవాడ

వగుచుండియుఁ బ్రసన్నుండవు; స్ఖలన క్షుత పతన జృంభణాది దురవస్థ లందును జరామరణాది దుర్దశలందును వివశుల మగు మాకుఁ గల్మష నాశకరంబులయిన భవద్దివ్యనామంబులు మా వచనగోచరంబులగుం గాక; మఱియు నీ రాజర్షి పుత్రకాముండై నీ తోడ సమానుండయిన కుమారునిం గోరి కామంబుల స్వర్గాపవర్గంబుల నీనోపిన నినుం బూజించి ధనకాముం డైనవాఁడు ధనవంతునిం జేరి తుషమాత్రం బడిగిన చందంబున మోక్షనాథుండ వైన నీవలన సంతానంబు గోరుచున్నవాఁడు; జయింపరాని నీ మాయ చేత నెవ్వండు మోహంబు నొంది విషయాసక్తుండు గాక యుండు? నర్థకాములము మదాంధులము నగు మేము నిన్ను నాహ్వానంబు చేసిన యపరాధంబు సర్వాత్మకుండ వగుటం జేసి సామ్యంబుచే మన్నింప దగుదువు; మమ్ము దయఁ జూడు" మని ప్రణమిల్లిన సర్వేశ్వరుండు వర్షాధిపతి యగు నాభిచేతను, ఋత్విక్కులచేతను, వంద్యమానుండై దయాకలితుం డగుచు యిట్లనియె.

5.1-52-కంద పద్యము

మునులార! వేదవాక్యము
లను బ్రస్తుతి చేసి సర్వలక్షణముల నా
కెన యగు పుత్రుని నిమ్మని
వినఁ బలికితి రిపుడు మిగుల వేడుకతోడన్

5.1-53-కంద పద్యము

నాకాది లోకములలో
నాకున్ సరివచ్చు నట్టి నందను నెటు నా

లోకింప లేరు; గావున
నాకున్ సరి నేన కా మనమున నెఱుఁగుఁడీ.

5.1-54-వచనము

అదియునుం గాక భూసురోత్తములు నా ముఖంబగుటం జేసి విప్రవాక్యంబు దప్పింపరాదు; మీరు నా యీడు కుమారు నడిగితిరి గావున నాభిపత్ని యగు మేరుదేవి యందు నేన పుత్త్రుండనై జనియించెద" నని పలికి పరమేశ్వరుం డాగ్నీధ్రీయపత్ని యగు మేరుదేవి చూచుచుండ నా యజ్ఞంబున నంతర్ధానంబు నొంది యా నాభిమీఁది దయం జేసి దిగంబరులును దపస్వులును జ్ఞానులును నూర్ధ్వరేతస్కులును నగునైష్ఠికులకు యోగధర్మంబుల నెఱింగింపం దలంచి పుండరీకాక్షుండు నాభిపత్నియగు మేరుదేవి గర్భాగారంబునం బ్రవేశించె; నంత.

5.1-55-ఆటవెలది

మేరుదేవియందు మేరుధీరుం డగు
హారి సమస్త లక్షణాన్వితుండు
శమదమాదిగుణ విశారదుం డుదయించె
సకలజనుల కపుడు సంతసముగ.

5.1-56-ఆటవెలది

ధవళ కాంతియుక్తిఁ దనరు దేహంబును
మహిత బలపరాక్రమంబు వీర్య
మును దలంచి చూచి జనకుండు పేరిడె
సుతుని ఋషభుఁ డనుచు సొంపుతోడ.

## 5.1-7-ఋషభుని రాజ్యాభిషేకము

### 5.1-57-కంద పద్యము

ధరణీసురులును మంత్రులుఁ
బరివారము హితులుఁ బ్రజలు బాంధవులును సు
స్థిరమతి నా బాలకునిం
గర మనురాగమున రాజుగాఁ జూచి రిలన్.

### 5.1-58-కంద పద్యము

పురుహూతుఁ డతని మహిమలు
సరగున విని చిత్తమునకు సహ్యము గామిం
బరికించి ఋషభుఁ డేలెడి
ధరణి ననావృష్టి మిగుల దట్టము చేసెన్.

### 5.1-59-ఆటవెలది

అది యెఱింగి ఋషభుఁ డంతట యోగ మా
యా బలంబు కతన నఖిల రాజ్య
మందుఁ గురియఁ జేసె నత్యంత సంపూర్ణ
వృష్టి దినదినంబు వృద్ధిఁ బొంద.

### 5.1-60-వచనము

ఇట్లు ఋషభుండు పురందరుండు చేయు దౌష్ట్యంబునకు నవ్వి యజనాభం బను తన మండలంబు సుభిక్షంబుగాఁ జేసె; నాభియుం దన కోరిన చందంబునం బుత్రుండు జనియించి వర్ధిల్లుటకు సంతసిల్లి తనచేత నంగీకరింపంబడు నరలోక

ధర్మంబు గల పుండరీకాక్షుని మాయా విలసితంబునం జేసి "బాలకా! నా తండ్రి!" యని మోహంబున నుపలాలించుచుఁ బ్రజానురాగంబున సర్వసమ్మతుం డయిన పుత్రుని సమయసేతు రక్షణంబునకుఁ బూజ్యంబయిన రాజ్యంబునం దభిషిక్తుం జేసి భూసురులకుఁ బ్రధానవర్గంబునకు నప్పగించి మేరుదేవిం గూడి నరనారాయణ స్థానం బయిన బదరికాశ్రమంబునకుం జని యచ్చట మహాయోగసమాధిచే నరనారాయణాఖ్యుండుఁ బురుషోత్తముండు నగు వాసుదేవు నారాధించి క్షీణదేహుండై యా నాభి హరి తాదాత్మ్యంబు నొందె; అంత.

5.1-61-చంపకమాల

సరసత నే నృపాలకుని జన్మమునందును భూసురోత్తముల్
సరసిజనాభునిం దగఁ బ్రసన్నతఁ బెట్టిన నంత మెచ్చి యీ
శ్వరుఁడు దనంత గర్భమున వచ్చి తనూభవుఁడై జనించె, నా
నరపతి నాభికిన్ సరి యనం దగునే నరనాథ! యన్యులన్.

5.1-62-వచనము

అంత.

## 5.1-8-భరతుని జన్మంబు

5.1-63-సీస పద్యము

భూవరుఁ డగు ఋషభుఁడు దన రాజ్యంబుఁ;
గర్మభూమిఁగ నాత్మఁ గాంచి జనుల
కందఱకును బ్రియం బగునట్లు కర్మ తం;
త్రంబెల్లఁ దెలుపంగఁ దలఁచి కర్మ

ములు చేయుటకు గురువులయొద్ద వేదంబు;
 చదివి వారల యనుజ్ఞను వహించి
శతమన్యుఁ డిచ్చిన సతి జయంతీ కన్యఁ;
 బరిణయంబై యట్టి పడఁతి వలన

5.1-63.1-తేటగీతి

భరతుఁ డాదిగ సుతుల నూర్వురను గాంచె
నట్టి భరతుని పేరను నవనితలము
పురవరాశ్రమ గిరితరుపూర్ణ మగుచు
నమరి భారత వర్ష నామమున మించె.

5.1-64-వచనము

ఆ మహాభారతవర్షంబునందుఁ దమతమ పేరంబరఁగు భూములకుఁ
గుశావర్తేలావర్త బ్రహ్మావర్తార్యావర్త మలయకేతు భద్రసేనేంద్ర స్పృగ్వి దర్భ
కీకటులను తొమ్మండ్రు కుమారులను దక్కంగల తొమ్మండ్రు పుత్రులకుఁ
బ్రధానులం జేసె; నంతం గవి హర్యంతరిక్ష ప్రబుద్ధ పిప్పలాయ నావిర్హోత్ర ద్రమీఢ
చమస కరభాజను లనువారు తొమ్మండ్రును భాగవత ధర్మప్రకాశకు లైరి;
భగవన్మహి మోపబృంహితంబు లగు వారల చరిత్రంబులు ముంద రెఱింగించెదఁ;
దక్కిన యెనుబదియొక్క కుమారులు పిత్రాదేశకరులు నతి వినీతులు
మహాశ్రోత్రియులు యజ్ఞశీలురుఁ గర్మనిష్ఠులు నయిన బ్రాహ్మణోత్తము లైరి;
ఋషభుండు స్వతంత్రుండై సంసారధర్మంబులం బొరయక కేవలానందానుభవుం
డయిన యీశ్వరుండై యుండియు బ్రాకృతుండునుం బోలెఁ గాలానుగతంబు లగు
ధర్మంబుల నాచరించుచు దర్మప్రవర్తకులకు సముండును నుపశాంతుండును

మైత్రుండును గారుణికుండును నై ధర్మార్థ యశః ప్రజానందామృతావరోధంబుచే గృహస్థాశ్రమంబులం బ్రజల నియమించుచుఁ గొంత కాలంబు నీతిమార్గంబు దప్పక ప్రజాపాలనంబు చేయుచు వేదరహస్యంబు లగు సకల ధర్మంబులును స్వవిదితంబు లయినను బ్రాహ్మణోపదేశ పూర్వకంబుగా ద్రవ్య దేశ కాల వయశ్శ్రద్ధర్త్విగ్వి ధోద్దేశోపచితంబులుగ నొక్కక్క క్రతువును శతవారంబు యథావిధిగఁ జేసి సుఖం బుండె; నంత.

5.1-65-కంద పద్యము

జనవర ఋషభుని రాజ్యం
బున నైహిక ఫలముఁ గోరు పురుషుని నొకనిం
గనుఁగొన నెఱుంగ మెన్నఁడు
నినతేజం డతనిమహిమ లేమని చెప్పన్.

## 5.1-9-ఋషభునిదపంబు

5.1-66-సీస పద్యము

ఆ ఋషభుండు రాజ్యంబు చేయుచు నుండి;
 యంతట నొక్కనాఁ డాత్మయందుఁ
దలపోసి భూలోక ఫల మపేక్షింపక;
 మోహంబు దిగనాడి పుత్రులకును
దనరాజ్య మెల్ల నప్పనజేసి వెనువెంటఁ;
 గొడుకులు మంత్రులుఁ గొలిచిరాఁగ
నల్లన యరిగి బ్రహ్మావర్త దేశంబు;
 నందుల నపుడు మహాత్ములయిన

5.1-66.1-తేటగీతి

యట్టి మునిజన సమ్ముఖంబందుఁ జేరి
తనదు పుత్రుల నందఱ డాయఁ బిలిచి
పరమ పుణ్యుండు ఋషభుండు ప్రణయ మొప్ప
హార్ద మందుచు నప్పు డిట్లనుచుఁ బలికె.

5.1-67-ఆటవెలది

తనయులార! వినుఁడు ధరలోనఁ బుట్టిన
పురుషులకును శునకములకు లేని
కష్టములను దెచ్చుఁ గానఁ గామంబుల
వలన బుద్ధి చేయవలదు మీరు

5.1-68-చంపకమాల

నరులకు నే తపంబు ననంత సుఖంబులు గల్గుచుండు, శ్రీ
కరమతి నా తపంబుఁ దగఁ గైకొని చేసిన బ్రహ్మసౌఖ్యముం
దిరముగఁ గల్గు; వృద్ధులను దీనులఁ బ్రోవుఁడు; దుష్ట వర్తనన్
జరుగుచునుండు కాముకుల సంగతిఁ బోకుఁడు; మీఁద మేలగున్.

5.1-69-వచనము

మఱియు నంగనాసక్తులగు కాముకుల సంగంబు నిరయరూపం బయిన సంసారంబగు; మహత్సంగంబు మోక్షద్వారం బగు; నట్టి మహాత్ము లెవ్వ రనిన శత్రు మిత్ర వివేకంబు లేక సమచిత్తులును శాంతులును గ్రోధరహితులును సకలభూత దయాపరులును సాధువులును నగువారలు మహాత్ము లనందగుదు; రట్టి మహాత్ములు నా యందలి స్నేహంబె ప్రయోజనంబుగాఁ గలిగి

యుండుటం జేసి విషయ వార్తాప్రవృత్తు లగు కుజనులందుఁ దమ దేహ గృహ మిత్ర దారాత్మజాదులందుఁ బ్రీతిలేక యుండుదురు; విషయాసక్తుఁ డయినవాఁడు వ్యర్థకర్మంబులం జేయు నట్టి దుష్కృత కర్మంబులం జేయువాఁ డెప్పుడును బాపకర్ముం డగుచుం గ్లేశదంబగు దేహంబు నొందుచుండుఁ; గావునఁ బాపమూలంబు లయిన కామంబులు గోరకుఁ; డీ జ్ఞానం బెంత కాలంబుఁ లేకయుండు నంతకాలంబు నాత్మతత్త్వం బెఱుంగంబడ; దా తత్త్వం బెఱుంగకుండుటజేసి దేహికి దుఃఖం బధికంబై యుండు; లింగదేహం బెంత దడ వుండు నంత దడవును మనంబు కర్మవశంబై జ్ఞానవంతంబుగాక యవిద్యం బాయకుండు; శరీరంబు గర్మమూలం బగుట వలనఁ గర్మంబులు చేయఁజనదు; వాసుదేవుం డగు నా యందుఁ బ్రీతి యెంత తడవు లేక యుండు నంతదడవును దేహధర్మంబులు బాధించు; విద్వాంసు డైనను దేహేంద్రియాదుల యందుఁ బ్రీతిచేసిన మిథునీభావ సుఖప్రధానం బగు గృహస్థాశ్రమంబు నంగీకరించి స్వరూప స్మృతి శూన్యుండై మూఢుం డగుచు, నందు సంసారతాపంబులఁ బొందుఁ; బురుషుండు స్త్రీతోడం గూడి యేకీభావంబు నొందుట దనకు హృదయ గ్రంథియై యుండు; నందు జనునకు గృహక్షేత్ర సుతాప్త విత్తంబులందు "నేను నాయది" యనియెడి మోహంబు గలుగు; నట్టి స్త్రీపురుష మిథునీ భావంబుచే సంతానంబు గలుగు; నా సంతాన కారణంబున గృహక్షేత్ర విత్తాదులు సంపాదింపంబడు; నందు మోహం బధికం బగుటంజేసి మోక్షమార్గంబు దవ్వగు; నిట్లు సంసారంబునం దుండియు మనంబున నెపుడు ముక్తిచింతం జేయు నప్పుడు సంసారంబును బాయు; మోక్షోపాయంబులు పరమగురుండనైన నా యందుల భక్తి చేయుటయు, విగతతృష్ణయు, ద్వంద్వ తితిక్షయు, సర్వలోకంబు లందుల జంతు వ్యసనావగతియు, నీశ్వరవిషయక జ్ఞానాపేక్షయుఁ, దపంబును,

విగతేచ్ఛయు, మత్కృతకర్మంబులు మత్కథలు వినుటయు, నన్నె దైవంబు గా నెఱుంగుటయు, నస్మద్గుణ కీర్తనంబులును, నిర్వైరత్వసామ్యోపశ మంబులును, దేహగేహంబులందు నాత్మబుద్ధి జిహాసయు, నధ్యాత్మ యోగంబును, నేకాంతసేవయుఁ, బ్రాణేంద్రియాత్మలఁ గెలుచుటయుఁ, గర్తవ్యాపరిత్యాగంబును, సచ్ఛ్రద్ధయు, బ్రహ్మచర్యంబును, గర్తవ్యకృత్యంబు లందుల నప్రమత్తుండగుటయు, వాఙ్నియమనంబును, సర్వంబు నన్నుగా దలంచుటయు, జ్ఞానంబును, విజ్ఞాన విజృంభితంబైన యోగంబును, ధృత్యుద్యమంబును, సాత్త్వికంబును నాదిగాఁ గల తెఱంగుల చేత లింగదేహంబు జయించి దేహి కుశలుం డగుచు నుండవలయు.

5.1-70-ఆటవెలది

అరయఁ గర్మరూప మగు నవిద్యాజన్మ
మైన హృదయబంధనాది లతల
నప్రమత్తయోగ మను మహాచ్ఛురికచేఁ
ద్రెంపవలయు నంతఁ దెంపుతోడ.

5.1-71-ఆటవెలది

ఒనర నిట్లు యోగయుక్తుండు గురుఁ డైన
భూపుఁ డైన శిష్యపుత్ర వరుల
యోగయుతులఁ జేయ నొప్పు గావలయును
గర్మపరులఁ జేయఁ గాదుకాదు.

5.1-72-సీస పద్యము

జనులెల్ల నర్థ వాంఛలఁ జేసి యత్యంత;
 మూఢులై యైహికంబులు మనంబు
లందును గోరుదు; రల్ప సౌఖ్యములకు;
 నన్యోన్యవైరంబు లంది దుఃఖ
ములఁ బొందుదురు; గాన మునుకొని గురుఁ డైన;
 వాఁడు మాయామోహవశుఁడు నెంత
జడుఁడు నైనట్టి యా జంతువునందును;
 దయ గల్గి మిక్కిలి ధర్మబుద్ధిఁ

5.1-72.1-ఆటవెలది

గన్ను లున్నవాఁడు గానని వానికి
దెరువుఁ జూపి నట్లు దెలియఁ బలికి
యతుల మగుచు దివ్యమైన యా మోక్ష మా
ర్గంబుఁ జూప వలయు రమణతోడ.

5.1-73-వచనము

మఱియుఁ బితృ గురు జననీ బంధు పతి దైవతంబులలో నెవ్వరైనను సంసార రూప మృత్యు రహితం బైన మోక్షమార్గంబుం జూపకుండిరేని వారెవ్వరును హితులు గా నేరరు; నాదు శరీరంబు దుర్విభావ్యంబు; నాదు మనంబు సత్త్వయుక్తంబును, ధర్మసమేతంబును, బాపరహితంబు నగుటంజేసి పెద్దలు నన్ను ఋషభు డండ్రు; గావున శుద్ధ సత్త్వమయం బైన శరీరంబునం బుట్టిన కుమారులైన మీర లందఱును సోదరుండును మహాత్ముండును నగ్రజుండును నైన భరతు నన్నెకాఁ జూచి యక్లిష్టబుద్ధిచే భజింపుం; డదియ నాకు

శుశ్రూషణంబు; ప్రజాపాలనంబు చేయుట మీకును బరమధర్మం" బని మఱియు నిట్లనియె.

5.1-74-సీస పద్యము

భూతజాలములందు భూజముల్ వర్యముల్;
 భూరుహముల కంటె భోగి కులము
భోగి సంతతి కన్న బోధనిష్ఠులు బోధ;
 మాన్యుల కన్నను మనుజవరులు
వీరికన్నను సిద్ధ విబుధ గంధర్వులు;
 వారి కన్న నసురుల్ వారి కన్న
నింద్రాది దేవత లిందఱి కన్నను;
 దక్షాది సన్మును ల్దలఁప నెక్కు

5.1-74.1-తేటగీతి

డంతకన్నను భర్గుఁ డా యభవు కన్నఁ
గమలభవుఁ డెక్కుఁ; డాతని కంటె విష్ణుఁ
డధికుఁ; డాతఁడు విప్రుల నాదరించుఁ
గాన విప్రుండు దైవంబు మానవునకు.

5.1-75-కంద పద్యము

భూసురులకు సరి దైవం
బీ సచరాచరమునందు నెఱుఁగను; నాకున్
భూసురులు గుడుచు నప్పటి
యా సంతోషంబు దోఁప దగ్నులయందున్.

5.1-76-సీస పద్యము

మంగళం బైన బ్రహ్మస్వరూపంబును;
 వేదరూపంబు ననాది రూప
మగుచున్న నాదు దేహము బ్రాహ్మణోత్తముల్;
 ధరియింతు రెప్పుడుఁ దత్త్వబుద్ధి
శమదమానుగ్రహ సత్యతపస్తితి;
 క్షలు గల్గు విప్రుండు సద్గురుండు;
గాన మిక్కిలి భక్తిగల్గి యకించను;
 లైన భూసురుల దేహముల వలన

5.1-76.1-తేటగీతి

నందుచుండును నాదు దేహంబు గాఁగ
నెఱిఁగి వరులగు విప్రుల నెల్ల భక్తిఁ
బూజ చేయుటయే నన్నుఁ బూజ చేయు
టనుచు వినిపించి మఱియు నిట్లనుచుఁ బలికె.

5.1-77-కంద పద్యము

ఈ **తె**ఱఁగుఁ దెలిసి భూసుర
జా**తిం** బూజించునట్టి జనుఁడును మాయా
తీ**తుం**డై నిక్కంబుగ
భూ**త**లమున మోక్షమార్గమును బొడగాంచున్.

## 5.1-10-భరతుని పట్టాభిషేకంబు

### 5.1-78-వచనము

ఇట్లు సదాచారు లగు కుమారులకు లోకానుశాసనార్థం బాచారంబు లుపదేశించి మహాత్ముండును బరమసుహృత్తును నగు భగవంతుండు ఋషభాపదేశంబునం గర్మత్యాగంబు చేసి యుపశమశీలురగు మునులకు భక్తిజ్ఞాన వైరాగ్య లక్షణంబులు గల పారమహంస్య ధర్మం బుపదేశింపఁ గలవా డగుచుఁ బుత్రశతంబునం దగ్రజుండును బరమభాగవతుండును భగవజ్జన పరాయణుండును నగు భరతుని ధరణీపాలనంబునకుఁ బట్టంబు గట్టి తాను గృహమందె దేహమాత్రావలనంబు చేసి దిగంబరుండై యున్మత్తాకారుం డగుచు బ్రకీర్ణ కేశుండై యగ్నుల నాత్మారోపణంబు చేసి బ్రహ్మావర్తదేశంబును బాసి జడాంధ బధిర మూక పిశాచోన్మాదులుం బోలె నవధూత వేషంబునొంది జనులకు మాఱు పలుకక మౌన వ్రతంబునం బుర గ్రామాకర జనప దారామ శిబిర వ్రజ ఘోష సార్థ గిరి వనాశ్రమాదుల యందు వెంటఁ జనుదెంచు దుర్జన తర్జన తాడనావమాన మేహన నిష్ఠీవన పాషాణ శకృద్రజః ప్రక్షే పణపూతి వాత దురుక్తులం బరిభూతుం డయ్యును గణనం బెట్టక వన మదేభంబు మక్షికాదికృతోపద్రవంబునుంబోలెఁ గైకొనక దేహాభిమానం బునం జిత్తచలనంబు నొందక యేకాకియై చరియించు చుండ నతి సుకుమారంబులగు కరచరణోరస్స్థలంబులు విపులంబులగు బాహ్వంస కంఠ వదనాద్యవయవ విన్యాసంబులుం గలిగి ప్రకృతి సుందరం బగుచు స్వతస్స్సిద్ధదరహాసరుచిర ముఖారవిందంబై నవ నళిన దళంబులం బోలి శిశిర కనీనికలం జెలువొంది, యరుణాయతంబు లగు నయనంబులచే నొప్పి యన్యూనాధికంబులగు కపోల కర్ణ కంఠ నాసాదండంబులచేఁ దేజరిల్లుచు నిగూఢస్మితవదన విభ్రమంబులం

బ్రకాశించు తన దివ్యమంగళ విగ్రహంబుచేఁ బురసుందరుల మనంబుల కత్యంత మోహంబు గలుగఁ జేయుచు.

5.1-79-ఆటవెలది

ధూళిచేత మిగుల ధూసరితంబునై
జడలుగట్టి కడుఁ బిశంగవర్ణ
ము నగు కేశపాశమును వెలిఁగించుచు
నితరు లెవరుఁ దన్నునెఱుఁగకుండ.

5.1-80-కంద పద్యము

అవధూత వేషమున ని
ట్లవనిన్ మలినంబు లైన యవయవములతోఁ
దవిలి చరించుచు నుండును
భువి భూతాక్రాంతుఁ డయిన పురుషుని మాడ్కిన్.

5.1-81-ఆటవెలది

జనుల కిట్లు యోగసంచార మెల్ల వి
రుద్ధ మనుచు నాత్మ బుద్ధిఁ జూచి
యజగరంబు మాడ్కి నవనిపై నుండె బీ
భత్సకర్మమునకుఁ బాలుపడుచు.

5.1-82-వచనము

ఇట్లు బీభత్సరూపంబున వసుంధరం బడియుండి యన్నంబు భుజించుచు నీరు ద్రావుచు మూత్రపురీషంబులు విడుచుచునవి శరీరంబు నంటం బొరలుచుండు;

మఱియుఁ దత్పురీష సౌగంధ్య యుక్తంబగు వాయువు దశదిశలన్ దశయోజన పర్యంతంబు పరిమళింపం జేయుచుండ గో మృగ కాక చర్యలం జరించుచు భగవదంశంబైన ఋషభుండు మహానందంబు ననుభవించుచుఁ దనయందు సర్వభూతాంతర్యామి యగు వాసుదేవునిం బ్రత్యక్షంబుగాఁ గనుంగొనుచు సిద్ధిం బొందిన వైహాయస మనోజవ పరకాయప్రవేశాంతర్ధాన దూరగ్రహణ శ్రవణాది యోగసిద్ధులు దమంత వచ్చినం గైకొనక యుండె;" అని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రు డిట్లనియె.

5.1-83-కంద పద్యము

మునివర! యోగజ్ఞానం

బునఁ జెలుపంబడ్డ కర్మములు గల పెద్దల్

కని యుండెడి యైశ్వర్యం

బును ఋషభుం డెఱిఁగి యేల పొందక యుండెన్?

5.1-84-వచనము

అనిన శుకుం డిట్లనియె.

5.1-85-మత్తేభ విక్రీడితము

ధరణీవల్లభ! నీదు వాక్యములు తథ్యం; బింతయుం దప్పు; దె

ట్లరయన్ వన్యమృగంబు పట్టుబడి తా నావేళ నా లుబ్ధకున్

ధర వంచించిన మాడ్కి నింద్రియములన్ దండించి చిత్తంబు ని

ర్భర కామాదుల కాస యిచ్చుఁ గడు సంరంభంబుతో గ్రక్కునన్.

5.1-86-కంద పద్యము

చిరకాల తపము నైనను
హరియింపఁగ నోపుఁ జిత్త మని పెద్దలు న
మ్మరు జారులకున్ జారిణి
కరణిని నడరించు మనసు కామాదులకున్.

5.1-87-కంద పద్యము

కామక్రోధాదికముల్
భూమీశ్వర! కర్మబంధములు మఱియును జే
తో మూలము లగుటను దా
రీ మహిలో మనసు నమ్మ రెప్పుఁడు పెద్దల్.

5.1-88-సీస పద్యము

అదిగాన యెన్నఁడు నైశ్వర్యములను జే;
 పట్టఁ జూడఁడు; లోకభవ్యు లైన
వారలచే నభివందనంబులు వొంది;
 వెలయంగ నవధూత వేష భాష
ణంబుల నెఱిఁగికొనఁగరాని భగవత్స్వ;
 రూపంబు గలిగి యా రూపమందుఁ
బరమ యోగధ్యాన పరులకు నెల్ల దే;
 హత్యాగ సమయంబు నంతలోనఁ

5.1-88.1-తేటగీతి

జూపు చుండియు దేహంబుఁ బాప నిచ్చ
గించె; నచ్చట దివ్యయోగీంద్రుఁ డాద్యుఁ

డతుల దివ్య ప్రకాశకుఁ డమరవరుడు
పరమపురుషుండు ఋషభుండు పార్థివేంద్ర!

5.1-89-వచనము

అంత విముక్త లింగుండు భగవంతుండునగు ఋషభుండు మనంబున దేహాభిమానంబు విసర్జించి కులాల చక్రంబు కులాలుని చేత భ్రమియింపంబడి విస్సృష్టంబయ్యు భ్రమించు గతిం బ్రాచీన సంస్కార విశేషం బగు నభిమానాభాసంబున దేహచలనాదికంబుల నొప్పి యుండియు యోగమాయా వాసనచే యుక్తుండయ్యె; మఱియు నా ఋషభుం డొక్క దినంబునం గోంకణ వంక పట కుటకంబులను దక్షిణ కర్ణాట దేశంబులకు యదృచ్ఛంజని కుటకాచ లోపవనంబున నిజాస్యకృత శిలాకబళుం డగుచు నున్మత్తుని చందంబున వికీర్ణ కేశుండు, దిగంబరుండునై సంచరింప వాయువేగ విధూత వేణుసంఘర్షణ సంజాతం బగు నుగ్రదావానలంబు తద్వనంబు దహింప నందు దగ్ధుండయ్యె; నంత నతని కృత్యంబులు తద్దేశవాసులగు జనంబులు చెప్ప నర్హన్నామకుండగు దద్రాష్ట్రాధిపతి విని, నిజధర్మంబులం బరిత్యజించి స్వదేశస్థుల తోడంగూడి, దానా యాచారంబుల నంగీకరించి యధర్మబహుళం బగు కలియుగంబున భవితవ్యతచే విమోహితుండై మనుజులనస మంజసం బగు పాషాండ మతాభినివేశులం జేసె; మఱియును గలియుగంబు నందు మనుజాధములు దేవమాయా మోహితులై శాస్త్రోక్త శౌచాచారంబులు విడిచి నిజేచ్ఛం జేసి దేవతాహేళనంబులు చేయుచు నస్నానానాచమనాశౌచ కేశోల్లుంఛనాది కాపవిత్ర వ్రతంబులం జేయుచు నధర్మ బహుళం బగు కలియుగంబునం జెఱుపంబడ్డ బుద్ధి ధర్మంబులం గలిగి వేద బ్రాహ్మణ యజ్ఞపురుషుల దూషించుచు లోకంబులం దమతమ మతంబులకుం దామే సంతసిల్లుచు నవేదమూలం బగు స్వేచ్ఛం జేసి ప్రవర్తించి యంధపరంపరచే

విశ్వాసంబు చేసి తమంతన యంధతమసంబునం బడుచు నుండుదు; రీ ఋషభుని యవతారంబు రజోవ్యాప్తులగు పురుషులకు మోక్షమార్గంబు నుపదేశించుటకు నయ్యె; నదియునుంగాక సప్త సముద్ర పరివృతంబు లగు నీ భూద్వీప వర్షంబులందలి జనంబులు దివ్యావతార ప్రతిపాదకంబు లతిశుద్ధంబులునగు నెవ్వని కృత్యంబులు గీర్తింతురు, మఱియు నెవ్వని యశంబున నతికీర్తిమంతుండగు ప్రియవ్రతుండు గలిగె, నెందు జగదాద్యుండగు పురాణపురుషుం డవతారంబు నొంది కర్మహేతుకంబులు గాని మోక్ష ధర్మంబులం దెలిపె, వెండియు నెవ్వండు యోగమాయా సిద్ధుల నసద్భూతంబు లగుటంజేసి నిరసించె నట్టి ఋషభునితోడఁ దత్సిద్ధికృత ప్రయత్నులగు నితరయోగీశ్వరులు మనోరథంబుననైన నెట్లు సరి యగుదు? రిట్లు సకలవేదలోక దేవ బ్రాహ్మణులకు గోవులకుం బరమగురుండు భగవంతుండు నగు ఋషభుని చరిత్రంబు వినినవారలకు దుశ్చరితంబులు దొలంగు మంగళంబులు సిద్ధించు మిక్కిలి శ్రద్ధతోడ నెవ్వండు విను వినిపించు వానికి హరిభక్తి దృఢంబగునట్టి హరి భక్తితాత్పర్యంబునం బెద్దలు భాగవతులగుటంజేసి సంప్రాప్త సర్వపురుషార్థులగుచు వివిధ వృజిన హేతుకంబగు సంసారతాపంబును బాసి యవిరతంబుఁ దద్భక్తియోగా మృతస్నానంబు చేసి పరమపురుషార్థం బయిన మోక్షంబునుబొందుదు;" రని సప్తద్వీపవాసులవారు నేఁడునుం గొనియాడుచుండుదురు.

5.1-90-ఆటవెలది

యాదవులకు మీకు నత్యంత కులగురు
వైన కృష్ణుఁ డెచట నైనఁ గలఁడు;

కొలుచువారి కెల్ల సులభుఁడై మోక్షంబు
నిచ్చుఁ; జింత చేయ నేల నీకు?

5.1-91-సీస పద్యము

నిత్యానుభూతమౌ నిజరూపలాభ ని;
వృత్తమై తగు మహాతృష్ణ గలిగి
యతులిత విపుల మాయారచితం బైన;
లాభంబునకుఁ దగులంబు లేని
మతి గల్గి లోకుల నతి వేడ్కఁ గరుణించి;
యభయదానం బిచ్చి యందఱ కిల
నవ్యయంబై దివ్యమై మహానందమై;
యత్యంత సేవ్యమై యతుల మైన

5.1-91.1-తేటగీతి

తనదు లోకంబు చూపంగఁ దగిన యట్టి
మోక్షమార్గంబు నెఱిఁగించి ముక్తదేహుఁ
డగుచుఁ దాదాత్మ్య మొందెఁ బ్రత్యక్ష విష్ణు
వైన ఋషభుండు జనులకు నద్భుతముగ.

5.1-92-మత్తేభ విక్రీడితము

భరతుం డంత ధరాతలంబుఁ గడఁకం బాలించుచున్ ధారుణీ
శ్వరచంద్రుండగు విశ్వరూపునకు మున్ సంజాతయై యుండి ని
ర్భరకాంతిన్ విలసిల్లు పంచజని పేరం గల్గు కాంతామణిం
గర మర్థిన్ ధరఁ బెండ్లియాడె శుభలగ్నంబందు భూవల్లభా!

5.1-93-వచనము

ఇట్లు వివాహితుండై యా పంచజని వలన నహంకారంబునం బంచతన్మాత్రలు జనించిన తెఱంగున సుమతి రాష్ట్రభృత్సుదర్శనావరణ ధూమ్రకేతువు లను నేవురు పుత్రులం బుట్టించె; నటమున్న యజనాభం బను పేరం బరఁగు వర్షంబు భరతుండు పాలించు కతంబున భారతవర్షంబు నాఁ బరగె; నంత.

5.1-94-కంద పద్యము

భరతుఁడు నిజపిత లేలిన
కరణిని గర్మముల నెల్లఁ గైకొని ప్రజలన్
హరికృప నొందుచు నేలెను
ధరణీసురవరులు పొగడ ధరణీనాథా!

5.1-95-సీస పద్యము

భగవంతుఁడగు జగద్భరితు నల్పంబులు;
నధికంబు లైన పె క్కధ్వరముల
దర్శపూర్ణిమలచేఁ దగను జాతుర్మాస్య;
ముల నగ్నిహోత్రమువలనఁ గడఁకఁ
బశుసోమములచేతఁ బలుమాఱుఁ బూజించి;
వేదోక్త మైన యా విమలకర్మ
ములఁ గల్గు ధర్మంబుఁ బురుషోత్త మార్పణం;
బుగఁ జేయుచును మఖంబులను మంత్ర

5.1-95.1-తేటగీతి

ములను బలికెడు నా దైవములను శ్రీశు
నవయవంబులు గాఁగ భూధవుఁడు ప్రేమ
ననుదినంబును బాయక ఘనతఁ దలఁచి
యఖిల రాజ్యానుసంధానుఁ డగుచు నుండె.

5.1-96-కంద పద్యము

ఈ రీతిఁ గర్మసిద్ధుల
నారయ నత్యంత శుద్ధ మగు చిత్తముతో
నా రాచపట్టి భరతుఁడు
ధారుణిఁ బాలించె నధిక ధర్మాన్వితుఁడై.

## 5.1-11-భరతుండు వనంబు జనుట

5.1-97-వచనము

మఱియు నా భరతుండు శ్రీవత్స కౌస్తుభ వనమాలాలంకృతుండును, సుదర్శనాద్యాయుధోపలక్షితుండును, నిజభక్తజనహృదయారవింద నివాసుండును, బరమపురుషుండును నైన వాసుదేవుని యందు నధికభక్తి ననుదినంబును జేయుచుఁ నేఁబదిలక్షలవేలేండ్లు రాజ్యంబు చేసి పితృ పితామహోద్యాయాతంబగు నా ధనంబును యథార్థంబుగఁ బుత్రులకుఁ బంచియిచ్చి బహువిధ సంపదలుగల గృహంబును బాసి పులహాశ్రమంబున కరిగె; నంత.

5.1-98-సీస పద్యము

ఏ యాశ్రమంబున నిందిరాధీశ్వరుఁ;
డచ్చటి వారల నాదరించి
ప్రత్యక్షమున నుండుఁ బాయక యెప్పుడు;
నట్టి రమ్యం బైన యాశ్రమమున
నిలిచి సాలగ్రామములు గల గండకీ;
నది యెందు నెంతయుఁ గదిసి యుండు
నచ్చోట నేకాకి యగుచును భరతుండు;
బహువిధ నవపుష్ప పల్లవముల

5.1-98.1-తేటగీతి

నతుల తులసీ దళంబుల నంబువులను
గందమూలాది ఫలములఁ గంజములను
ఘనత నర్పించి నిచ్చలుఁ దనివిలేక
సేవ చేయుచు నుండె నా శ్రీపు హరిని.

5.1-99-వచనము

దానం జేసి విగత విషయాభిలాషుండై శమదమాది గుణంబులు గలిగి యథేచ్ఛంజేసి యెడతెగక పరమపురుషుని పరిచర్యా భక్తిభరంబున శిథిలీకృత హృదయగ్రంథిఁ గలిగి సంతోషాతిశయంబునం బులకితాంగుండు, నానంద బాష్పనిరుద్ధావలోక నయనుండు నగుచు నిజస్వామి యైన హరిచరణారవిందానుధ్యాన పరిచిత భక్తియోగంబునం బరమానంద గంభీర హృదయంబను నమృతహ్రదంబున నిమగ్నుం డగుచుఁ దానపుడు పూజించు పూజ నెఱుంగక యిట్లు భగవద్వ్రతంబు ధరియించి యేణాజిన వాసస్త్రిషవణ

స్నానంబుల నార్ద్రకుటిల కపిశ వర్ణ జటాకలాపంబులు గలిగి మార్తాండాంతర్గతుం డయిన పరమేశ్వరుని హిరణ్మయ పురుషునింగాఁ దలంచుచు నిట్లనియె.

5.1-100-సీస పద్యము

కర్మఫలంబులఁ గడఁక నిచ్చుచు మనో;
వ్యాపారమున నిట్టి యఖిలలోక
ములఁ జేసి యా లోకములకు నంతర్యామి;
యగుచుఁ బ్రవేశించి యంత మీఁద
నానంద రూప మైనట్టి బ్రహ్మముఁ గోరు;
చున్న జీవునిఁ దనలోని యోగ
శక్తిచేఁ దగ ననిశంబుఁ బాలన చేయు;
చుండి యంతటను మార్తాండమధ్య

5.1-100.1-ఆటవెలది

వర్తి యగుచు నిట్లు వఱలుచు జగముల
యందు నుండి ప్రకృతిఁ బొంద కంత
నతుల దివ్యమూర్తియైన యానంద రూ
పమును శరణ మొందె భరతవిభుఁడు.

5.1-101-వచనము

అంత నా భరతుం డొక్కనాఁ డా మహానదిం గృతాభిషేకుండయి ముహూర్తత్రయం బంతర్జలంబులందుఁ బ్రణవోచ్చారణంబు చేయుచుండు సమయంబున, నిర్భరగర్భిణియగు నొక్క హరిణి జలార్థినియై యొంటి జలాశయ సమీపంబునకు వచ్చి, జలపానంబు చేయు నెడ నా సమీపంబున మృగపతి గర్జించి

లోకభయంకరంబుగ నాదంబుచే నా హరిణి స్వభావంబున భీత యగుటం జేసి బెగ్గడిలి హరి విలోకనవ్యాకుల చిత్తయై దిగ్గన నదిరి గగనంబునకు నెగిరి; యపగత తృష్ణ యగుచు నది నుల్లంఘించు నెడ నధిక భయంబునం జేసి యా గర్భంబు యోని ద్వారంబున గళితంబై జలంబులం బడియె; నా హరిణి యుల్లంఘనాది భయంబునం జేసి తత్తీరంబున నుండు గిరిదరిం బడి శరీరంబుఁ బాసె; నంత నా హరిణపోతంబు జలంబులం దేలుచున్న భరతుండు గను విచ్చి చూచి కరుణార్ద్ర చిత్తుండై మృతజనని యగు నా హరిణపోతంబును దన యాశ్రమంబునకుం గొంపోయి మిక్కిలి ప్రీతిం జేసి యుపలాలనంబు చేయుచుండఁ బోషణ పాలన ప్రీణన లాలనాను ధ్యానంబుల భరతునకు నాత్మనియమంబు లైన యష్టాంగయోగంబులును బరమపురుష పూజా పరిచర్యాదులు నొక్కొక్కటిగఁ గ్రమక్రమంబునం గొన్ని దినంబులకు సమస్తంబును నుత్సన్నం బయ్యె; అంత.

5.1-102-కంద పద్యము

ఘనతపము చలన మొందుట
యును భరతుం డెఱుఁగ కాత్మయోగంబునఁ జ
య్యనఁ బాసె హరిణపోతముఁ
దన మదిలో నిల్పి ప్రీతి దప్పక పలికెన్.

5.1-103-ఉత్పలమాల

అక్కట! తల్లిఁ బాసి హరిణార్భక మాప్తులు లేమిఁజేసి యే
దిక్కునులేక యున్న నిటఁ దెచ్చితి; నా యెడ నీ మృగార్భకం

బెక్కుడు ప్రేమ చేసి చరియించుచు నున్నది; నాదు సన్నిదిన్
మక్కువ చేసి దీనిఁ గడు మన్ననలం దగఁ బ్రోతు నెంతయున్.

5.1-104-కంద పద్యము

శరణని వచ్చిన జంతువుఁ
గరుణం గను విచ్చి చూచి కాచిన పుణ్యం
బరయఁగ నధికం బని ము
న్గర మెఱిఁగించిరి మునీంద్రగణములు ప్రేమన్.

5.1-105-వచనము

అని యిట్లు హరిణపోతంబుం దన యాశ్రమంబున నత్యాసక్తిం జేసి యాసన శయనాటన స్నాన సమిత్కుశ కుసుమ ఫల ఫలాశ మూలోదకాహరణ దేవపూజాజపాదుల యెడం దన యొద్దన యునిచి కొనుచు వృక సాలావృకాది క్రూరమృగంబుల వలని భయంబున వనంబుల వెనువెంటం దిరగుచు నధిక ప్రణయభరపరీతహృదయుం డగుచు నతి స్నేహంబునంజేసి కొంతసేపు స్కంధంబుల వహించుచు; మఱికొంతతడ వురంబున నుత్సంగంబున నుంచికొని లాలించుచు సంతసంబు నొందు; మఱియు నా భరతుండు నిత్యనైమిత్తికాది క్రియా కలాపంబు నిర్వర్తించు నెడ నంతనంత లేచి హరిణకుణకంబుఁ జూచుచుఁ గించిత్స్వస్థ హృదయుండై దాని నాశీఃపరంపరల నభినందించుచుఁ జుంబనాదులఁ బ్రీతిచేయుచు నతిమోహంబునం బెంచుచుండు నెడ.

5.1-106-చంపకమాల

గురువులు వాఱి బిట్టుఱికి కొమ్ములఁ జిమ్ముచు నంతనంత డ
గ్గఱుచును గాలు ద్రవ్వుచు నఖంబుల గీఱుచు గాసి చేయుచు

న్నొఅగుచు ధారుణీశ్వరుని యూరువులన్ శయనించి యంతలో
నటకడ మెక్కుచుం బొదిలి యాడుచు నా హరిణంబు లీలతోన్.

5.1-107-తేటగీతి

గరిమ నీ గతి మెల్లన కెరలు వొడిచి
చెలఁగి యాడంగ భరతుండు చిత్త మందు
సంతసిల్లుచు నుండె నాశ్రమముఁ బాసి
హరిణడింభక మంతలో నురిఁగి చనిన.

5.1-108-వచనము

భరతుం డంతం దన్మృగశాబకంబు గానంబడమికి వ్యాకులిత చిత్తుం డగుచు నష్టధనుండునుం బోలె నతిదీనుండై కరుణతోడం గూడి తద్విరహవిహ్వల మతియై దానిన తలంచుచు నతి శోకంబుతో మనంబున దుఃఖించి యిట్లనియె.

5.1-109-తేటగీతి

హరిణపోతంబ! నీకు వనాంతమందుఁ
గ్రూర మృగబాధ లేకుండఁ గోరుచుండఁ
దలఁగి పోయితె యనుచుఁ జిత్తంబునందు
రాజవృషభుండు భరతుఁ డారాట మంది.

5.1-110-తేటగీతి

తల్లిచచ్చిన హరిణపోతంబు వచ్చి
పుణ్యహీనుండ నగు నన్నుఁ బొంది పాసె;

నేమి చేయుదు? నే నింక నెట్లు గందుఁ?
జేరి యే రీతిఁ గాంచి రక్షించుకొందు?

5.1-111-కంద పద్యము

కట్టా! యీ యాశ్రమమునఁ
బుట్టిన తృణచయము మేసి పొదలిన హరిణం
బిట్టట్టుఁ దిరుగు చుండఁగఁ
బట్టి మృగేంద్రుండు గొట్టి బాధించెనొకో?

5.1-112-వచనము

ఇట్లు భరతుండు హరిణకుణక క్షేమంబు గోరుచు నెప్పుడు వచ్చి నన్ను సంతోషపఱచు? నానా ప్రకారంబులైన తన గతులచేత నన్ను నెప్పు డానందంబు నొందించు? ధ్యానసమాధి నున్నప్పుడు నన్నుఁ గొమ్ముల గోఁకుచు నుండు; నట్టి వినోదంబు లెప్పుడు గనుఁగొందు దేవ పూజాద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొనినం గోపించి చూచినం గుమారుడుంబోలె దూరంబునకుం జని నిలిచి మరల నేఁ బిలిచిన వెనుక నిలిచి యుండు; నిట్టి మెలఁకువ స్వభావంబులు గలుగుట యెట్టులు? ఈ భూదేవి యెంత తపంబు చేసినదియో? యీ హరిణ పాదస్పర్శంబులం బవిత్రయైన భూమి స్వర్గాపవర్గకాములైన మునులకు యజ్ఞార్హ యగు నట్టి హరిణపోతంబు నెట్లు గనుఁగొందు? అదియునుంగాక భగవంతుండగు చంద్రుండు మృగపతిభయంబున మృతజననియు, స్వాశ్రమపరిభ్రష్టంబునైన మృగశాబకంబును గొనిపోయి పెంచుచున్నవాఁడో? మున్ను పుత్రవియోగతాపంబునం జంద్రకిరణంబులం బాపుదు; ఇప్పుడు హరిణపోతంబు దన శరీర స్పర్శంజేసి చంద్రకిరణంబులకన్న నధికం బగుచుం బుత్ర

వియోగతాపంబు నివర్తింపం జేసె ననుచుం బెక్కు భంగుల హరిణ నిమిత్తంబులైన మనోరథంబులచేతం బూర్వకర్మవశంబున యోగభ్రష్టుండగు భరతుండు భగవదారాధనంబు వలన విభ్రంశితుం డగుచు నితరజాతిం బుట్టిన హరిణపోతంబుమీఁది మోహం బగ్గలం బగుచుండ నుండె;" అని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె.

5.1-113-సీస పద్యము

జననాథ! మున్ను మోక్షవిరోధ మని పాయఁ;
 గా రాని పుత్రాదికంబు నెల్లఁ
బాసి తపస్వియై భరతుండు హరిణ శా;
 బక పోషణంబునఁ బాలనమున
నతి లాలనప్రీణనానుషంగంబుల;
 మూషకబిల మతిరోషమునను
సర్పంబు చొచ్చిన చందంబునను యోగ;
 విఘ్నంబు మిక్కిలి విస్తరిల్లెఁ

5.1-113.1-ఆటవెలది

గాన యెంతవానికైనను గాలంబు
గడవ రామి నట్లు గాక పోదు
పరమమునుల కైనఁ బాయవు కర్మంబు
లొరు లనంగ నెంత? నరవరేణ్య!

5.1-114-వచనము

ఇట్లు భరతుండు మృగవియోగ తాపంబు నొందుచుండు నెడ నా మృగశాబకంబు చనుదెంచిన సంతసిల్లుచుండె; నంత నొక్కనాఁడు.

## 5.1-12-హరిణీగర్భంబున జనించుట

### 5.1-115-మత్తేభ విక్రీడితము

భరతుం డల్లన యంత్యకాలము వెసం బ్రాపింపఁగా నప్పు డా
హరిణంబుం గడు భక్తిఁ బుత్రగతి నత్యాసక్తి వీక్షింప నా
హరిణంబుం దన యాత్మలో నిలిపి దేహం బంతటం బాసి తా
హరిణీగర్భమునన్ జనించి హరిణంబై యొప్పెఁ బూర్వస్మృతిన్.

### 5.1-116-వచనము

ఇట్లు భరతుండు హరిణీగర్భంబునం బుట్టియు భగవదారాధన సామర్థ్యంబునం దన మృగజన్మ కారణంబుఁ దెలిసి కడుం దాపంబు నొందుచు నిట్లనియె.

### 5.1-117-ఉత్పలమాల

రాజులు ప్రస్తుతింప సురరాజసమానుఁడనై తనూజులన్
రాజులఁ జేసి తాపసులు రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ
దేజము నొంది యా హరిణదేహము నందలి ప్రీతిఁ జేసి నా
యోజ చెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన బేలనై.

### 5.1-118-వచనము

ఇట్లు శ్రీహరి శ్రవణ మనన సంకీర్తనారాధనానుసరణాభియోగంబులం జేసి యశూన్య సకలయామంబగు కాలంబు గల నాకు హరిణపోతస్మరణంబు కతంబున యోగవిఘ్నంబు ప్రాప్తంబయ్యె; మోక్షదూరుండ నైతి నని నిగూఢ

నిర్వేదుం డగుచుఁ దల్లిం బాసి క్రమ్మఱ నుపశమశీల మునిగణ సేవితంబయి భగవత్క్షేత్రంబైన సాలతరునిబిడతమ గ్రామ సమీప పులస్త్య పులహాశ్రమంబులకుం గాలాంజన పర్వతంబు వలనఁ జనుదెంచి యందు మృగ దేహత్యాగావసానంబు గోరుచు సంగంబు విడిచి యేకాకి యగుచు శుష్క పర్ణ తృణవీరు దాహారుఁడై మృగత్వ నిమిత్తం బగు నా నదీతీర్థంబునందు నవసానంబు గోరుచుఁ దత్తీర్థోదకక్లిన్నం బగుచు నుండు శరీరంబు విడిచె" నని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకు వినిపించి మఱియు నిట్లనియె.

## 5.1-13-విప్రసుతుండై జన్మించుట

### 5.1-119-సీస పద్యము

హరిణ దేహముఁ బాసి యంత నాంగిర సాహ్వ;
యుండు శుద్ధుఁడు పవిత్రుండు ఘనుఁడు
శమదమఘనతపస్స్వాధ్యాయ నిరతుండు;
గుణగరిష్ఠుఁడు నీతికోవిదుండు
నైన బ్రాహ్మణునకు నాత్మజుండై పుట్టి;
సంగంబు వలనను జకితుఁ డగుచుఁ
గర్మ బంధంబుల ఖండింపఁజాలు నీ;
శ్వరుని నచ్యుతు నజు శ్రవణ మనన

### 5.1-119.1-తేటగీతి

ములను హరిచరణధ్యానములను విఘ్న
భయమునను జేసి మనమందుఁ బాయనీక

నిలిపి సంస్తుతి చేయుచు నిలిచి యుండె
భరితయశుఁడైన భరతుండు పార్థివేంద్ర!

5.1-120-వచనము

ఇట్లాంగిరసుండు ప్రథమభార్య యందుఁ బుత్రనవకంబును, గనిష్ఠభార్య యందు స్త్రీపురుషుల నిద్దఱను గలుగంజేసిన నందుఁ బురుషుండు పరమ భాగవతుండును రాజర్షి ప్రవరుండును నుత్సృష్ట మృగశరీరుండునుం జరమశరీరంబునం బ్రాప్తవిప్రశరీరుండును నగు భరతుండయ్యె; అతం డా జన్మంబున నన్యజన సంగంబు జన్మపరంపరలకుఁ గారణం బని యత్యంత భయంబు నొంది కర్మబంధ విధ్వంసన శ్రవణ స్మరణాదుల శ్రీహరి యనుగ్రహంబునం బూర్వజన్మపరంపరల సంస్మరించుచుఁ దన స్వరూపంబు నున్మత్తజడాంధబధిర రూపంబుల లోకులకుం జూపుచుండె; అంత.

5.1-121-మత్తేభ విక్రీడితము

జనకుం డాంగిరసుండు నాత్మజుని వాత్సల్యంబునం బెంచుచుం
దనరం జౌలముఖాగ్ర్యకర్మముల చేతన్ సంస్కృతుం జేసి పా
యని మోహంబున నిచ్చలుం గడఁక శౌచాచారముల్ చెప్పినన్
ఘనుఁ డా భాగవతుం డసమ్మతిని దత్కర్మంబులం గైకొనెన్.

5.1-122-వచనము

ఇట్లు బ్రాహ్మణకుమారుండు గర్మంబుల యందు నిచ్ఛలేక యుండియును బితృనియోగ నిర్బంధంబునం బితృసన్నిధి యందు యసమీచీనంబుగా వ్యాహృతిప్రణవ శిరస్సహితం బగునట్లు గాయత్రీమంత్రంబు జపియించుచుఁ జైత్రాది చతుర్మాసంబుల సమవేతంబుగ వేదంబుల నధ్యయనంబు చేయుచుండె;

జనకుం డాత్మజుని శిష్టాచారంబుచే శిక్షింపవలయునను లోకాచారంబు ననువర్తించి యాత్మభూతుండగు నాత్మజునందు నభినివేశిత చిత్తుండగుచు శౌచాచమనాధ్యయన వ్రత నియమగుర్వనల శుశ్రూషణాదికంబు లనభియుక్తంబు లయినం బుత్రునిచే నొనరింపించుచు నప్రాప్తమనోరథుం డయ్యె; అంత.

5.1-123-కంద పద్యము

ఈ రీతిని గొడుకున కా
చారంబులు గఱపి చింత సద్గృహమున సం
సారి యగుచుండి విప్రుఁడు
ఘోరన దేహంబుఁ బాసి పోయిన మీఁదన్.

5.1-124-ఆటవెలది

తల్లి తండ్రితోడ దా నగ్నిఁ జొచ్చిన
నతని మహిమ లెఱుఁగ కంతలోన
సవితి తల్లి కొడుకు లవినీతు లగుచును
శాస్త్రవిద్య లతనిఁ జదువనీక.

5.1-125-వచనము

ఇట్లు బ్రహ్మణకుమారుని సవితి తల్లి కొడుకులు వేదవిద్య వలనం బాపి గృహకర్మంబుల నతని నియమించిన.

5.1-126-కంద పద్యము

ధరణీసురోత్తముఁడు దా
నరుదుగఁ దమవారు చెప్పినవి యెల్లను నే
మఱ కందుఁ బ్రీతిచేయక
నిరతము గృహకర్మమట్లు నెఱపుచు నుండెన్.

5.1-127-వచనము

ఇట్లు గృహకర్మప్రవర్తనుం డగుచు నుండ మూఢులగు ద్విపాత్పశువులచే నున్మత్త జడ బధిర యని యూహూయమానుం డగు నపుడు తదనురూపంబులగు సంభాషణంబుల నొనర్చుచుఁ బరేచ్ఛాయదృచ్ఛలం జేసి విష్టివేతన యాచ్ఞాదుల వలన నియుక్తకర్మంబులం బ్రవర్తించుచు.

5.1-128-తేటగీతి

అతుల దివ్యాన్నమైన మృష్టాన్నమైన
నెద్ది పెట్టిన జిహ్వకు హితముగాఁ
దలఁచి భక్షించుఁగా; కొండుఁ దలఁచి మిగులఁ
బ్రీతి చేయఁడు రుచులందుఁ బెంపుతోడ.

5.1-129-వచనము

మఱియు నా విప్రుం డాత్మనిత్యానంద సుఖలాభంబు గలిగి బాహ్య సుఖదుఃఖంబులయందు దేహాభిమానంబు చేయక శీతోష్ణ వాతవర్షా తపంబులకు నోడి పైచీరగప్పక వృషభంబునుం బోలెఁ బీనుండును గఠినాంగుండు నగుచు స్థండిలశాయియై రజఃపటలంబునం గప్పబడిన దివ్యమాణిక్యంబునుం బోలె ననభివ్యక్త బ్రహ్మవర్చసుం డై మలినాంబర పరీతకటితటుండు నతి మషీలిప్తయజ్ఞోపవీతుండు నగుటం జేసి యజ్ఞ జనంబు లతండు

బ్రహ్మణాభాసుండు మందుండు నని పలుక సంచరించుచుండం
గర్మమూలంబునం బరులవలన నాహారంబు గొను నపుడు దమవారును
వ్యవసాయకర్మంబునందు నియమించిన క్షేత్రవిహిత సమవిషమ
న్యూనాధికంబుల నెఱుంగక ప్రవర్తిల్లుచు నూక తవుడు తెలికపిండి పొట్టు మాఁడు
ద్రబ్బెడ యాదిగాఁ గల ద్రవ్యంబుల యందు నమృతంబు పగిది రుచిచేసి
భక్షించుచుం జేని కావలి యుండు నెడ నొక్కనాఁడు.

## 5.1-14-విప్రుడు బ్రతికివచ్చుట

5.1-130-కంద పద్యము

పురిలోన వృషలపతి దా
నరుదుగ సంతాన కాముఁడై వేడుకతోఁ
బురుషుఁడగు పశువుఁ గాళికి
దఱుముక గొనిపోవఁ బశువు దలఁగిన భృత్యుల్.

5.1-131-ఆటవెలది

అరసి కానలేక యా రాత్రి వీరాస
నమునఁ జేని కాఁపు విమల బుద్ధి
నెసఁగు విప్రయోగి నీతనిఁ బొడగాంచి
పశువు మంచి దనుచుఁ బట్టి రతని.

5.1-132-కంద పద్యము

ఆ రీతిని భూసురవరు
నారయ నా కాళికాగృహమునకు భృత్యుల్

బోరనఁ గొని చని సల్పిరి
చారుత రాభ్యంజనాది సంస్కారంబుల్.

5.1-133-వచనము

ఇట్లభ్యంజనాది కృత్యంబులు దీర్చి నూతన వసనంబు గట్ట నిచ్చి గంధ పుష్పాభరణాక్షతాలంకృతునిం జేసి మృష్టాన్నంబులు భుజియింపం బెట్టి ధూపదీప మాల్యలాజకిసలయాంకుర ఫలోపహారాదులు సమర్పించి మహావాద్యఘోషంబులతోడ నా పురుషపశువుం గాళికాదేవి సమ్ముఖంబున నాసీనుం గావించి యా వృషలపతి పురుషపశువు రక్తంబున భద్రకాళి సంతోషపెట్టం దలంచి కాళికామంత్రాభిమంత్రితంబు నతికరాళంబు నైన ఖడ్గం బంది నిజాభీష్ట సిద్ధికి హింసింపం దలంచిన.

5.1-134-సీస పద్యము

సర్వభూతములకు సఖుఁడును బ్రహ్మభూ;
 తాత్ముఁడు నిర్వైరుఁ డయిన బ్రహ్మ
సుతుని తేజం బంతఁ జూడ దుస్సహమైన;
 భయమంది వడఁకుచు భద్రకాళి
క్రోధంబు ముమ్మడిగొనఁగ హుంకారంబు;
 సలుపుచు నట్టహాసంబు చేసి
పాపాత్ములును దౌష్ట్యపరులును రాజస;
 తామస కర్మ సంధాను లగుచు

5.1-134.1-తేటగీతి

విప్రవరు నట్లు హింసించు వృషలపతిని
భృత్యవర్గంబుఁదోఁ దలల్ పృథ్విఁ గూల్చి
యపుడు వృషలాధిపుని శిరమంది లీలఁ
బాడి యాడుచు నందంద క్రీడ సలిపె.

5.1-135-కంద పద్యము

ధరలోన నెవ్వరేనియు
ధరణీసురవరుల కెగ్గు దగఁ దలచిన వా
రరయఁగఁ జెడుదురు; నిక్కము
హరి ధరణీసురవరేణ్యు లం దుండుటచేన్.

5.1-136-వచనము

మఱియును.

5.1-137-ఉత్పలమాల

అచ్చట విప్రసూనుఁడు భయం బొకయించుకలేక చంపఁగా
వచ్చిన వారియందుఁ గరవాలమునందును గాళియందుఁ దా
నచ్చుతభావ ముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోడ నిల్పి యనుమానము నొందక యుండె నెంతయున్.

5.1-138-వచనము

మఱియు నా విప్రవరుండు చండికాగృహంబు వెలువడి క్రమ్మఱం జేని కావలి యుండు నెడ.

## 5.1-15-సింధుపతి విప్రసంవాదంబు

### 5.1-139-సీస పద్యము

అంతటఁ గొన్ని హాయనములు చన సింధు;
 భూపాలనము చేయు భూవరుండు
ధీరత నిక్షునదీ తీరమున నున్న;
 కపిల మహామునిఁ గాంచి తత్త్వ
విజ్ఞాన మెఱిఁగెడు వేడ్క తోడుత శిబి;
 కారోహణము చేసి యరుగుచుండ
నాలోన నాశిబికావహు లా చేనఁ;
 గాపున్న విప్రునిఁ గాంచి తెచ్చి

### 5.1-139.1-తేటగీతి

శిబిక మోపింత మీతనిచేత ననుచుఁ
బట్టి మూపునఁ బల్లకిఁ బెట్టి మోపు
మనుచు మోపించునంత ధరామరుండు
శిబిక మూఁపున నిడి యందుఁ జింత లేక.

### 5.1-140-కంద పద్యము

తన మనసు కొలఁది నప్పుడు
మునుకొని యట్లప్రయత్నమున నడవఁగ నా
జనపతి నిమ్నోన్నతమై
చనుట యెఱిఁగి శిబిక మోచు జనులకు ననియెన్.

5.1-141-ఆటవెలది

మీర లిప్పు డిచటఁ జేరి మిక్కిలి ప్రయ
త్నంబుతోడఁ దగిలి నడచుచుండ
విషమ మగుచు గమనవేగంబు నను బాధఁ
బెట్టుచున్న దనిన బెస్త లనిరి.

5.1-142-వచనము

"దేవా! యీ విషమగమనంబు మావలన నైనది గా; దీ తురీయవాహకుండు సుఖగమనంబుగా నడవ నేరండు; వీనితోడ మేము నడవ నేరము" యనిన రహూగణుం డను నా రాజు పాసిత వృద్ధజనుం డైనను బలాత్కారంబునం బుట్టిన కోపంబునం గోపించి విమర్శ దప్పి నీఱుగప్పిన నిప్పునుం బోలె నెఱుంగరాని బ్రహ్మతేజంబుగల బ్రాహ్మణునికిం గంటకంబుగా నిష్ఠుర వాక్యంబుల నిట్లనియె.

5.1-143-చంపకమాల

" అలసితి; వెంతయున్ ముసలి; వాఁకట డస్సితి; వెన్ను మిక్కిలిం
బలుచన యున్న; దీ శిబిక భారము; దూరము మోసి; తే గతిన్
నిలిచెద?" వంచు భూవరుఁడు నిష్ఠురముల్దగ బల్క నా యెడం
బలుకక మోసె నా శిబిక బ్రాహ్మణవర్యుఁడు పార్థివేశ్వరా!

5.1-144-వచనము

అప్పు డా విప్రవరుండు దనకుం గడపటి శరీరం బయిన కళేబరంబు నందు నహంకార మమకారంబులం బొందనీక మిథ్యాజ్ఞానరహితుండై బ్రహ్మభూతుండై మౌనవ్రతంబున నా శిబిక మోయుచున్న విషమగమనంబుఁ జూచి యతి కుపితుం డగుచు నా భూవరుండు వెండియు నిట్లనియె.

5.1-145-సీస పద్యము

" ఓరి! దుర్మద! విన రోరి జీవన్మృత! ;
నా యాజ్ఞఁ దప్పించి నడచె దీవు;
ఈ వక్రమార్గంబు లిన్నియు విడిపించి;
నడపింతు నిన్ను సన్మార్గమందు"
నని రాజగర్వాంధుఁ డగుచు గుణత్రయం;
బున వృద్ధిఁ బొందిన భూవరుం డ
బద్ధప్రలాపము ల్పల్కుచుండినఁ జూచి;
శమదమాదులచేఁ ప్రశస్తుఁ డగుచు

5.1-145.1-తేటగీతి

జగతి బ్రహ్మస్వరూపమై సకలభూత
ములకునత్యంతహితుఁడైన భూసురుండు
యోగివర్తన దెలియ లేకున్న రాజు
నంత వీక్షించి యల్ల ని ట్లనుచుఁ బలికె.

5.1-146-వచనము

" నరేంద్రా! నీవు చెప్పునది సత్యంబు; భారం బీ శరీరంబునకే కాని నాకుం గలుగనేరదు; ఐనను స్థౌల్యకార్శ్యంబులు వ్యాధులు నాధులు క్షుత్తృష్ణలు నిచ్ఛావిరోధభయంబులు జరామరణంబులు రోషనిద్రాజాగరణంబులు నహంకార మమకార మదశోషణాదులు దేహంబుతోడన జనియించుం గాని నాకుం గలుగనేరవు; జీవన్మృతుండ నేన కాదాద్యంతంబులు గలుగుటం జేసి యందఱి యందును గలిగి యుండు; స్వామిభృత్య సంబంధంబులు విధికృతంబు లగుచు

వ్యవహారంబులం జేసి శరీరంబులకుం గలుగుంగాని జీవునికి లేక యుండును; అదియునుంగాక రాజాభిమానంబున నీవు నన్నాజ్ఞాపించెదవేనిం బ్రమత్తుండవైన నీకుం బూర్వస్వభావం బెట్లుండె; అట్లుగాక యేనేమి చేయుదు? నెఱింగింపుము; ఉన్మత్త మూకాంధ జడులు బోలె సహజస్వభావంబునుం బొందిన నాయందు నీ శిక్ష యేమి లాభంబుఁ బొందింప నేర్చు. అదియునుం గాక స్తబ్ధుండు మత్తుండు నైన నాకు నీ శిక్ష వ్యర్థంబగు" నని పలికి యుపశమశీలుండైన మునివరుండు పూర్వకర్మశేషంనం గల్గు భారవాహకత్వంబుం దలంగం ద్రోయుటకు భారంబు వహించి శిబిక మోచుచుం జనునెడ నా రాజవల్లభుండు దత్త్వజ్ఞానాపేక్షితుండై చని యెడివాఁ డగుటం దన హృదయ గ్రంథి విమోచకంబులును బహు యోగగ్రంథ సమ్మతంబులును నగు బ్రాహ్మణవాక్యంబులు విని యా శిబిక దిగ్గన డిగ్గనుఱికి యావిప్రునికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి సర్వ గర్వవర్జితుండై ముకుళిత హస్తుం డగుచు ని ట్లనియె.

5.1-147-సీస పద్యము

" ధరణీసురులలోనఁ దలఁప నెవ్వఁడవు నీ;
వవధూతవేషివై యవనియందు
నేమిటికై చరియింపంగ వచ్చి? తి;
చట నొక్కఁడవు నొంటి చనుట నేఁడు
ననుఁ గృతార్థునిఁ జేయ ననుకూలుఁ డగుచున్న;
యట్టి యా కపిలమహామునీంద్రుఁ
డవొ? నీ మహత్త్వంబు దవిలి విచారింప;
నెఱుఁగక చేసితిఁ; గరుణఁ జూడు

5.1-147.1-తేటగీతి

తప్పుసైరింపు; నే యమదండమునకు
హరుని శూలంబునకును వజ్రాయుధమున
కనల చంద్రార్క ధనదశస్త్రాస్త్రములకు
వెఱవ విప్రుని కే మది వెఱచినట్లు.

5.1-148-వచనము

మఱియు నిస్సంగుండవయి జడుండునుంబోలె నిగూఢ విజ్ఞానంబు గలిగి చరియించుచు నున్నవాఁడవు; నీ వచనంబులు యోగశాస్త్ర సమానంబులై వాఙ్మనసంబులకు నభేద్యంబులయి యున్న; వే నవ్విష్ణుకళావతీర్ణుండు సాక్షాద్ధరియు నగు కపిలమహాముని వలన బ్రహ్మవిద్య దెలియం గోరి చనుచున్నవాఁడ; నీవు లోకనిరీక్షణార్థం బవ్యక్తలింగుండవై చరియించుచున్న కపిలమహామునీంద్రుండవు గాఁబోలుదువు; మందుండైన గృహస్థుండు యోగీశ్వర చరిత్రంబు లెట్టు లెఱుంగనేర్చు? కర్మవశంబున దృష్టంబైన భ్రాంతి వహించుచు నడచుచునున్న యీ యాశ్రమంబు నాకునుం బోలె నీకు నగు నని తోఁచుచున్నది; అది యెట్లనిన ఘటంబు లేక జలంబు దేనేరని తెఱంగున లేనిది గలుగనేరదు; గావునం బ్రమాణమూలం బయిన లోక వ్యవహారంబు సత్పథంబున సమ్మతంబై యుండుటం జేసి నీ వాడు వాక్యంబులు నాకు సమ్మతంబు గానేర" వని సింధు దేశాధీశ్వరుండు వినిపించిన నా విప్రుండు లోకవ్యవహారంబునకు నిత్యత్వం బౌపాధికం బగుంగాని నిత్యంబు గానేరదని దృష్టాంత నిదర్శనంబుగా నిట్లనియె.

5.1-149-సీస పద్యము

పావక శిఖలచే భాండంబు దాఁ దప్త;
మగుఁ; దప్త ఘటముచే నందు నున్న
జలము తపించు; నా జలముచేఁ దండులం;
బులు తప్త మొంది యప్పుడు విశిష్ట
మైన యన్నం బగు; నా చందమునను దా;
దేహేంద్రియంబులఁ దెలివితోడ
నాశ్రయించుక యున్న యట్టి జీవునకు దే;
హంబునఁ బ్రాణేంద్రియాదికమున

5.1-149.1-తేటగీతి

జరుగుచుండు నిట్లు సంసారఘట వృత్తి
దుండు నయిన రాజు దుష్టమైన
కర్మములకుఁ బాసి కంజాక్షపద సేవఁ
జేసెనేని భవముఁ జెందకుండు.

5.1-150-ఆటవెలది

అనుచు ధారుణీసురాత్మజుఁ డీ రీతి
బలుకుటయును రాజు పరిణమించి
వినయవాక్యములను వినుతించి క్రమ్మఱఁ
బుణ్యుఁ డైన సింధు భూవరుండు.

5.1-151-వచనము

"మహాత్మ! నేను రాజ ననియెడి యభిమాన మదాంధుండనై మహాత్ములం దిరస్కరించిన నన్నుఁ గరుణింపుము; నీ వార్తబంధుండవు; నీ కృపాదృష్టింజేసి

మహాత్ముల నవమానంబు చేసిన దురితంబువలన విముక్తుండ నయ్యెద; విశ్వసుహృత్త పైన నీకుం గోపంబు గలుగనేరదు; అసమర్థులయిన మాబోఁటి వారలు మహాజనావమానంబున శీఘ్రంబె నశింతురు; గావున నీవు దయాళుండ వయి నన్ను మన్నింపు" మనిన నా విప్రుం డిట్లనియె.

5.1-152-కంద పద్యము

కడు వేడ్క నీ వవిద్వాం
సుఁడవై యుండియును మిగులఁ జోద్యము విద్వాం
సుఁడుఁ బోలెను బలికెద వి
ప్పుడు మేలనవచ్చుఁగొంత పురుషులలోనన్

5.1-153-ఆటవెలది

పరఁగఁ బెద్ద లీ ప్రపంచమంతయుఁ దథ్య
మనరు; నీవు తథ్య మనుచుఁ బలికి;
తట్లుగాన నిన్ను నధికుండ వని పల్క
రాదు నాకుఁ జూడ రాజచంద్ర!

5.1-154-సీస పద్యము

యజ్ఞాదికములందు నామ్నాయములయందుఁ;
దఱచుగాఁ దత్త్వవాదంబు లేదు
స్వప్నంబునందుల సౌఖ్యమాకారంబు;
నందుల నిత్యమై యంతలేని
యట్టి చందమున వేదాంత వాక్యంబులు;
తత్త్వంబు నెఱిఁగించి తలఁగుఁగాని

నిత్యంబులై యుండనేరవు; పురుషుని;
చిత్తంబు గుణములఁ జెంది యెంత

5.1-154.1-తేటగీతి

కాలముండును మఱి యంత కాలమందు
నరయ విజ్ఞాన కర్మేంద్రియములచేత
మరగి ధర్మంబులను నధర్మంబులట్లు
దగిలి పుట్టించుచుండు నత్యంత మహిమ.

5.1-155-వచనము

మఱియు ధర్మాధర్మవాసనాయుక్తంబు విషయానురక్తంబు నైన చిత్తంబు గుణ ప్రవాహంబులచేత వికారంబు నొంది దేవతిర్యఙ్మనుష్య రూపంబు లయిన దేహంబులం బుట్టించుచుఁ గాలప్రాప్తంబులైన సుఖదుఃఖ తదుభయ ఫలంబు లననుభవించుచు ననవరతంబు జీవునికిం బ్రత్యక్షం బగుచు స్థూల సూక్ష్మరూపంబుల నుండు; స్వాంతంబు గుణరహితంబైన ముక్తి కారణంబగు; ఘృతవర్తులుగల దీపంబు సధూమ శిఖలం బుట్టించు; ఘృతవర్తులు నాశంబు నొందిన స్వరూపంబుఁ బొందు; నీ తెఱంగున మనంబు గుణకర్మానుబంధంబైన జన్మాదులం బుట్టించు; గుణకర్మంబులం బాసెనేనిం బరతత్త్వంబు నొందు; జ్ఞానేంద్రియంబు లేనును విషయంబులమీఁదఁ దోఁచు; బుద్ధు లేనును నభి మానంబును నను నేకాదశవృత్తులం గూడిన మనంబు జీవునికి నసంఖ్యంబు లయిన జన్మంబుల బొందించు; మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరంజ్యోతియైన నారాయణ స్వరూపంబుగా నెఱుంగుము; స్థావర జంగమంబు లయిన జీవులకుం బవనుండు ప్రాణంబై యున్న చందంబున నీశ్వరుండు

సర్వభూతాంతర్యామి యగుచు జీవాత్మ స్వరూపంబున నుండు; జీవాత్ముండు జ్ఞానోదయంబునం జేసి మాయ నెంతకాలంబు గెలువకుండు నంతకాలంబు ముక్తసంగుండు గాఁడు; అరిషడ్వర్గంబును జయించి పరతత్త్వంబు నెఱింగిన నీశ్వరుం డగు; చిత్తం బెంత కాలంబు విషయాసక్తం బగు నంతదడవు సంసారచక్రంబు నందు సంచరించుం గావున మహావీరుండైనను దనకు శత్రువైన మనంబు నప్రమత్తుండయి యుపేక్షాబుద్ధింజేసి యిచ్ఛావిహారంబున జరగనీక పరమ గురుండైన శ్రీహరిచరణోపాసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం బరతత్త్వంబు నొందు" నని విప్రుండు పలికిన నతని మహిమకు వెఱఁ గంది బ్రాహ్మణునకు నమస్కారంబుచేయుచు భూవరుం డిట్లనియె.

5.1-156-ఉత్పలమాల

కారణ విగ్రహంబు నురుకాయము నీ యవధూతవేషమున్
భూరిధరామరత్వమును బూర్వసమాగమ మాత్మబావముం
జారువిహార మత్యతుల శాంతి గుణంబును గూఢ వర్తనం
బారయఁ గల్గు నీకు ననయంబును మ్రొక్కెదఁ బెక్కు భంగులన్.

5.1-157-మత్తేభ విక్రీడితము

జ్వరితార్తుం డగు రోగి కౌషధ మతీష్టంబైన చందంబునున్
ధరలో నాతపతప్త దేహి గడు శీతంబైన తోయంబునున్
గరిమం గోరినరీతి నెంతయు నహంకారాహి దష్టుండనై
పరఁగున్ నాకును నీ వచోమృతము దప్పన్ మందు వేఱున్నదే?

5.1-158-ఆటవెలది

విప్రవర్య! నేను వేడ్కతో నా సంశ
యంబులెల్ల నిన్ను నడిగి తెలియఁ
దలఁచి యున్నవాఁడ; దప్పక యెఱిఁగింపు
ముచితవృత్తిఁ దత్త్వయోగమెల్ల.

5.1-159-వచనము

అని యడిగిన యా రాజునకు విప్రుం డిట్లనియె.

5.1-160-తేటగీతి

కాన వచ్చిన ఫలములు కర్మమూల
ము లగుటను జేసి సంసారములను జిత్త
మెప్పుడు వర్తించుచుండఁగా నెఱుఁగ లేవు
తత్త్వయోగంబు మిగుల నిత్యం బటంచు.

5.1-161-వచనము

మఱియు నీ వసుంధర నున్న చరణంబులకు నెక్కుడు జంఘు లా మీఁద జానువు లా వొడవున నూరువు లందులకు నుపరిప్రదేశంబున మధ్యం బట మీఁద నుర మందులకు నెక్కున కంఠం బటమీఁద స్కంధం బందుల దారు వా దారువున శిబిక శిబిక యందు రాజ ననియెడి యభిమానంబుగలిగి నీవున్నవాడ విట్టి చోద్యంబయిన కష్టదశంబొందిన నీవు ప్రజాపాలనంబు చేయుచున్నవాఁడ; నను గర్వంబున మా వంటి మహాత్ముల సభలలోనం బూజ్యుండవుగాక యున్నవాడవు; ఈ స్థావర జంగమంబులకు నివాస స్థానంబు వసుంధర యైన చందంబున సత్క్రియలచేత నెఱుఁగం దగిన జగత్కారణంబైన తత్త్వంబు నెఱింగించెద; పరమాణు సముదయం బీ ధరిత్రియైన చందంబున

నవిద్యామనంబులచేతం గల్పితం బయిన కృశస్థూల బృహదణు సదసజ్జీవాజీవ ద్రవ్య స్వభావాశయ కాల నామ బుద్ధిరూపంబైన మాయచే జగత్తు రెండ వదియై కల్పింపంబడియె; బాహ్యాభ్యంతరంబులం గలిగి స్వప్రకాశంబై భగవచ్ఛబ్దవాచ్యంబును విశుద్ధంబును బరమార్థంబును జ్ఞానరూపంబును నైన బ్రహ్మంబు వొకటి సత్యంబు; జగత్తసత్యం బగును;" అని పలికి మఱియును

5.1-162-సీస పద్యము

ధరలోన బ్రహ్మంబుఁ దపమున దానంబు;
లను గృహధర్మంబులను జలాగ్ని
సోమసూర్యులచేత శ్రుతులచే నైనను;
బరమ భాగవతుల పాదసేవఁ
బొందిన మాడ్కిని బొందంగ రాదని;
పలుకుదు రార్యులుఁ బరమమునులు
ఘనతపోబాహ్య సౌఖ్యములకు విముఖులు;
నై పుణ్యులు హరిగుణానువాద

5.1-162.1-తేటగీతి

మోదితత్మ్ములు నగు బుధపాదసేవ
ననుదినంబును జేసిన నంతమీఁద
మోక్షమార్గంబునకును బద్మాక్షునందు
బట్టుపడి యుండు నెప్పుడుఁ బరఁగబుద్ధి.

5.1-163-వచనము

నరేంద్రా! యేను బూర్వంబున భరతుం డను రాజను; సర్వసంగపరిత్యాగంబు చేసి భగవదారాధనంబు చేయుచు మృగంబుతోడి స్నేహంబు కతన మృగంబనై పుట్టియు నందును హరిభక్తి దప్పకుండిన కతంబున నిప్పుడు మనుష్యుండనై మనుష్య సంసర్గంబును బాసి యేకాకి నై చరియించు చున్నవాఁడ; నరుండు వృద్ధసంసేవం జేసి సంసార మోహంబును బాసి హరిధ్యానకథలచే లబ్ధజ్ఞానుండై పుండరీకాక్షునిం బూజించుచుం బరలోకంబునుం బొందు" నని పలికి విప్రుండు మఱియు నిట్లనియె

5.1-164-సీస పద్యము

ధరణీశ! మాయచేతను దాఁటఁగారాని;
 పదమునఁ బుట్టంగఁబట్ట జీవుఁ
డెలమిమై గుణకర్మములఁ జేయుచును లాభ;
 మాశించి తిరుగు బేహారి మాడ్కి
ఫల మపేక్షించుచుఁ బాయక జీవుండు;
 సంసారగహన సంచారి యగుచు
ననవరతము నుండు నా మహావనమందుఁ;
 గ్రామ లోభాది తస్కరులుగూడి

5.1-164.1-తేటగీతి

ధరణి విజితేంద్రియుఁడు గాని నరునిఁబట్టి
ధర్మ మనియెడి యా మహాధనమునెల్ల
నరసి గొనిపోవుచుండుదు రనుదినంబుఁ
గాన సంసారమందు నాకాంక్ష వలదు.

5.1-165-కంద పద్యము

అరయఁగ సంసారాటవిఁ
దరలక యా పుత్రమిత్ర దారాదు లనం
బరఁగుచు నుండెడు వృకములు
పరువడి నరబస్తములను భక్షించు వడిన్.

5.1-166-తరళము

మఱసి సంసృతి ఘోరకానన మందిరంబుల నెల్లనుం
జెలఁగి గుల్మలతాతృణాదులచేత గహ్వరమైన ని
శ్చలనికుంజములందు దుర్జన సంజ్ఞలంగల మక్షికం
బుల నిరోధము దన్ను సోఁకినఁ బొందుచుండు విపద్దశన్.

5.1-167-ఆటవెలది

మఱియు నీ గృహస్థమార్గంబునం దెల్ల
విషయములను బొంది విశ్వమెల్లఁ
గడఁకతోడ నిట్లు గంధర్వలోకంబుఁ
గాఁ దలంచి మిగుల మోదమందు.

5.1-168-ఆటవెలది

మఱచి కాననమునఁ గొఱవిదయ్యముఁ గాంచి
యగ్నిఁగోరి వెంట నరుగుమాడ్కిఁ
గాంచనంబు గోరి కలవారియిండ్ల పం
చలను దిరుగు నరుఁడు చలనమంది.

5.1-169-ఆటవెలది

బహుకుటుంబి యగుచు బహుధనాపేక్షచే
నెండమావులఁగని యేగు మృగము
కరణిఁ బ్రేమఁజేసి గురువులు వాఱుచు
నొక్కచోట నిలువకుండు నెపుడు.

5.1-170-ఆటవెలది

మఱియు నొక్కచోట మత్తుఁ డై పవన ర
జోహతాక్షుఁ డగుచుఁ జూపు దప్పి
దిక్కెఱుంగ కొండుదిశ కేగు పురుషుని
కరణిఁ దిరుగు నరుఁడు నరవరేణ్య!

5.1-171-వచనము

మఱియు నొక్కచోట నులూక ఝిల్లీ స్వనంబులతోడ సమానంబు లయిన శత్రురాజి తిరస్కారంబులకు దుఃఖపడుచు, నొక్కచోట క్షుధార్దితుండై యపుణ్య ఫలవృక్షంబుల నాశించు మాడ్కిఁ బాపకర్ములు ద్రవ్యహీనులు నగు వారి నాశ్రయించుచు, నొక్క యెడం బిపాసాతురుండై జలహీనం బయిన నదికిఁ జనిన రీతి నిహపరదూరు లైన పాషండుల సేవించుచు, మఱియు నొక్క ప్రదేశంబునం దగ్నిచేతం దప్తుడయిన వాఁడు దావాగ్నిం జేరి వ్యథ నొందురీతి, నన్నార్థి యగుచు దాయాదులం జేరి దుఃఖించుచు, మఱియు నొక్కచోటఁ బరబాధం జేసి మున్ను గానక రాజ్యాభిలాషం బ్రాణసఖులైన పితృపుత్రభ్రాతృ జ్యేష్ఠుల నైనను వధియిం చుచు, మఱియు శూరులచేతం గొట్టుబడి సర్వధనంబును బోనాడి చింతాపరవశుండై దుఃఖించుచు నున్నంత గంధర్వనగర ప్రాయంబైన సంసార

సుఖంబు ననుభవించి మోదించుచు, మఱియు నగారోహణంబు చేయు నరుండు గంటక పాషాణాదులవలనం బాదపీడితుం డగుచు దుఃఖించు చందంబున గృహాశ్రమోచిత మహానుష్ఠానంబునకు నుపక్రమించి వ్యసన కంటక శర్కరాపీడితుండై దుఃఖించుచు, నొక్కచోటన్ జఠరాగ్నిపీడితుండై కుటుంబంబు మీఁద నాగ్రహించుచు, వనంబున నజగరగళితుండై జీర్ణితుండైన చందంబున రాత్రి గృహాటవి యందు నిద్రాపరవశుండై యెఱుంగక వర్తించుచు, మఱియును వనంబునఁ దృణచ్ఛన్న కూపపతితుం డగుచు సర్పదష్టుండైన తెఱంగున సంసారి యై దుర్జనులచేత వ్యధితహృదయుం డగుచు నంధుండై యజ్ఞానాంధ కూపంబునం బడుచు, నొక్క యెడ జుంటితేనియకునై మక్షికాబాధ నత్యంతదుఃఖితుం డయిన మాడ్కిని సంసారకాముండై పరదార ద్రవ్యా భిలాషి యగుచు భూపాలకులచేతనైనను గృహపతిచేతనైనను దాడితుండై నరకంబునం బడుచు యౌవనంబున సంపాదించిన ద్రవ్యంబులు పరులచేతం బోనాడిన విధంబున శీతవాతాద్యనేక ప్రయాస లబ్దంబైన ధనంబు బోనాడి సంసారి యతిచింతాక్రాంతుం డై యుండు; మఱియును వనంబున లుబ్ధకులు సంస్పృష్టంబయిన యల్పామిషంబునకు నన్యోన్య వైషమ్యంబునం గలహించిన విధంబున సంస్పృష్ట వ్యవహారియై యల్పద్రవ్యంబులకుం బోరాడుచుండు" నని భూపాలు నకు విప్రుండు సంసారాటవి తెఱం గెఱింగించి వెండియు నిట్లనియె.

5.1-172-ఆటవెలది

అల్పధనుఁడు విశ్రమాస్థానములఁ దృప్తిఁ
బొంద కొరుల ధనముఁ బొందఁ గోరి
యరిగి వారివలన నవమానములఁ బొంది
యధికమైన దుఃఖ మనుభవించు.

5.1-173-ఆటవెలది

అంతఁ గొందఱల్ల నన్యోన్యవిత్తాది
వినిమయమునఁ గడుఁ బ్రవృద్ధమైన
వైరములనుఁబొంది పోరాట మొందుదు
రాత్మచింత లేక యనుదినంబు.

5.1-174-సీస పద్యము

సంసారమార్గ సంచారులై యధిక ప్ర;
యాసంబునన గూర్చు నర్థములను
విహరించుచును గొంద ఱిహలోక ఫలములఁ;
గోరుచు మోక్షంబు గోర కంతఁ
జెడిపోవుచుందు; రెప్పుడు గాని యందుకుఁ;
గడపటి యోగంబుఁ గానలేరు;
మానవంతులు ననమానశౌర్యులు నగు;
వారు మిక్కిలియైన వైరబుద్ధి

5.1-174.1-తేటగీతి

నాహవంబున మడియుదు; రంతె కాని
మోక్షమార్గంబు గానరు మూఢవృత్తి
ననుచు సంసార గహన విహార మెల్లఁ
దెలిపి క్రమ్మఱ ననియె ధాత్రీసురుండు.

5.1-175-వచనము

"మఱియుం గాలచక్రనియంత్రితుండై చక్రాయుధునిం గొల్వక కాక గృధ్ర బకసమానులైన పాషండులతోడి సఖ్యంబునం జేసి వారలచేత వంచితుండై బ్రాహ్మణకులంబునంజేసి శ్రౌత స్మార్తకర్మానుష్ఠానపరుం డై విషయసుఖంబు లందుఁ దగులుబడి కాలంబు తుద నెఱుంగక వృక్షంబులుం బోలె నైహికార్థంబులయందుఁ దృష్ణ గలిగి మైథున నిమిత్తంబు సుతదారాదులయందు స్నేహంబు చేయుచుఁ బధికుండు మాతంగంబుల యందు భయంబున దీర్ఘనిమ్న కూపంబునం బడిన తెఱంగున సంసారమృత్యు గజ భయంబున గిరికంధరప్రాయం బయిన యజ్ఞాన తమంబునం బడుం గావున మాయచేత సంసారమార్గం బైన రాజ భావంబు విడిచి సర్వభూతమైత్రి గలిగి జితేంద్రియుండవై జ్ఞానాసిచే మార్గంబు కడపల గను" మని పలికిన భూపాలుం డిట్లనియె.

5.1-176-కంద పద్యము

అక్కట! మానుష జన్మము
పెక్కువయై యుండు నెపు డభేదమతిం బెం
పెక్కిన యోగిసమాగమ
మక్కజముగఁ గలిగెనేని నఖిలాత్మ్ములకున్.

5.1-177-కంద పద్యము

ధరణీసురవర! నీ శ్రీ
చరణాంబుజ యుగళ రేణు సంస్పర్శము నా
దురితంబు లడఁచె; నింతట
హరిభక్తియు నంతకంత కధికం బయ్యెన్.

5.1-178-వచనము

మఱియు విప్రవరులయందు యోగీశ్వరు లవధూత వేషంబునం జరియించు చుందురు; గావున విప్రులు పిన్న పెద్ద లనక యందఱకు నమస్కారం" బని స్తుతియించిన నా యోగీశ్వరుండును సింధుపతికిఁ గరుణాన్వితుం డగుచుఁ దత్త్వజ్ఞానం బుపదేశించి యారాజుచేత వందిత చరణుండై పూర్ణార్ణవంబునుం బోలె సంపూర్ణకరుణారసపూరిత స్వాంతుండై వసుంధరం జరియించుచుండె; సింధుభూపతియును సుజన సమాగమంబున లబ్ధతత్త్వజ్ఞానుండయి దేహాత్మభ్రమం బాసె;" అని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

5.1-179-చంపకమాల

అరయఁగ మక్షికంబు వినతాత్మజుఁ గూడఁగలేని రీతి యీ
భరతుని సచ్చరిత్రములు ప్రస్తుతి చేయఁగ నీ వసుంధరన్
నరపతు లెల్ల నోపరు మనంబున నైనను నెంచ; నింక నా
భరతుని పుణ్యవర్తనముఁ బ్రస్తుతిచేయఁగ నాకు శక్యమే?

5.1-180-వచనము

నరేంద్రా! భరతుండు సుతదారరాజ్యాదులను బూర్వకాలంబునంద విడిచి భగవత్పరుం డగుచు యజ్ఞరూపంబును ధర్మస్వరూపంబును సాంఖ్యయోగంబును బ్రకృతిపురుష స్వరూపంబును నైన నారాయణునకు నమస్కారం బనుచు మృగరూపంబును బాసె; నట్టి భరతుని చరిత్రం బెవ్వరు చెప్పిన నెవ్వరు వినిన నట్టివారలఁ బుండరీకాక్షుండు రక్షించు; ఆయు రభివృద్ధి యగు; ధనధాన్య సమృద్ధియు నగుచుండ స్వర్గోపభోగంబులం బొందుదురు; అని.

## 5.1-16-పూర్ణి

### 5.1-181-మత్తేభ విక్రీడితము

నరదేవాసుర యక్షరాక్షస మునీంద్రస్తుత్య! దివ్యాంబరా
భరణాలంకృత! భక్తవత్సల! కృపాపారీణ! వైకుంఠ మం
దిర! బృందావనభాసురప్రియధరిత్రీనాథ! గోవింద! శ్రీ
కర! పుణ్యాకర! వాసుదేవ! త్రిజగత్కల్యాణ! గోపాలకా!

### 5.1-182-కంద పద్యము

పరమపదవాస! దుష్కృత
హర! కరుణాకర! మహాత్మ! హతదితిసుత! భా
సురగోపికామనోహర!
సరసిజదళనేత్ర! భక్తజననుతగాత్రా!

### 5.1-183-మాలిని

సరసహృదయవాసా! చారులక్ష్మీవిలాసా!
భరితశుభచరిత్రా! భాస్కరాబ్జారినేత్రా!
నిరుపమఘనగాత్రా! నిర్మలజ్ఞానపాత్రా!
గురుతరభవదూరా! గోపికాచిత్తచోరా!

### 5.1-184-గద్యము

ఇది సకల సుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్యప్రణీ తంబైన శ్రీ మహాభాగవతపురాణమునందుఁ బ్రియవ్రతుని సుజ్ఞాన దీక్షయు, బ్రహ్మదర్శనంబును, నాగ్నీధ్రాదుల జన్మంబును, నుత్తమ తామస రైవతుల జన్మంబును, బ్రియవ్రతుండు

వనంబునకుం జనుట యు, నాగ్నీధ్రుం డప్సరసం బరిగ్రహించుటయు, వర్షాధిపతుల జన్మం బును, నాగ్నీధ్రుండు వనంబునకుం జనుటయు, నాభి ప్రముఖుల రాజ్యంబును, నాభి యజ్ఞంబును, ఋషభుని జన్మంబును, ఋషభుని రాజ్యభిషేకంబును, భరతుని జన్మంబును, ఋషభుండు దపంబునకుఁ జనుచు సుతులకు నతుల జ్ఞానం బుపదేశించుటయు, భరతుని పట్టా భిషేకంబును, భరతుండు వనంబునకుఁ జనుటయు, భరతుండు హరిణపోతంబునందలి ప్రీతింజేసి హరిణగర్భంబున జనించుటయు, మరల విప్రసుతుండై జనియించుటయు, విప్రుండు చండికాగృహంబున బ్రదికివచ్చుటయు, సింధుపతి విప్ర సంవాదంబును నను కథలు గల పంచమ స్కంధంబు నందుఁ ప్రథమాశ్వాసము సమాప్తము

# పోతన తెలుగు భాగవతము

## పంచమ స్కంధము - ద్వితీయాశ్వాసము

### 5.2-1-ఉపోద్ఘాతము

5.2-1-కంద పద్యము

శ్రీకాంతాహృదయప్రియ!
లోకాలోకప్రచార! లోకేశ్వర! సు
శ్లోక! భవభయనివారక!
గోకులమందార! నందగోపకుమారా!

5.2-2-వచనము

సకల పురాణార్థ జ్ఞాన విఖ్యాతుం డగు సూతుం డిట్లనియె.

### 5.2-2-సుమతి వంశవిస్తారము

5.2-3-కంద పద్యము

మునులార! బాదరాయణి
యనఘాత్మకుఁడైన యుత్త రాత్మజునకు స
ద్వనయోక్తి భరతుచరితము
వినిపించుచు మఱియు నిట్లు వినిపించెఁ దగన్.

5.2-4-ఆటవెలది

పార్థివేంద్ర! యిట్లు భరతాత్ముజుండైన
సుమతి ధర్మవర్తనమునఁ దిరుగ
నది యెఱింగి దుష్టులైన పాషాండులు
తమమతంబు మిగులఁ దలఁచి పొగడి.

5.2-5-కంద పద్యము

ధరణీవల్లభ! నిన్నును
నిరతంబును బుద్ధదేవునిం గొలిచిన యా
తెఱఁగునఁ గొలిచెద మని భా
సురమతి బోధించి రపుడు సుమతిం బ్రీతిన్

5.2-6-వచనము

ఇట్లు పాషాండబోధితుండైన సుమతికి ధ్రువసేన యందు దేవతాజిత్తను పుత్త్రుండు జనించె; వానికి దేవద్యుమ్నుండను సత్పుత్త్రుం డాసురి యందుదయించె; నమ్మహాత్మునకు ధేనుమతి యందుఁ బరమేష్ఠి జనియించె; నతనికి సువర్చలయందుఁ బ్రతీహుం డనువాఁడు సుతుం డయ్యె; యప్పరమ పురుషుండు సకలజనులకు బ్రహ్మోపదేశంబు జేసి తాను శుద్ధాత్ముండై హరిస్మరణ జేయుచు యజ్ఞకరణ నిపుణు లగు ప్రతిహర్త ప్రస్తోత యుద్గాత యను సత్పుత్త్రులం గాంచెను; ఆ ప్రతిహర్తకు నుతియందు వ్యోమ భూమనామక పుత్త్రద్వయం బుత్పన్నం బయ్యె; నందు భూమునకు ఋషికుల్యయందు నుద్గీథుం డను సుతుండు జనించె; నతనికి దేవకుల్యయందుఁ బ్రస్తోతగలిగె; యా ప్రస్తోతకు వరరుత్సయందు విభుం డను తనయుం డుద్భవించె; నతనికి భారతియందుఁ బృథుషుణుం డుదయించె; యతనికి నాకూతి యందు నక్తుండు

గలిగె; యా నక్తునకు రాజర్షి శ్రేష్ఠుండగు గయుం డను మహాకీర్తి సంపన్నుం డుదయించె.

## 5.2-3-గయుని చరిత్రంబు

### 5.2-7-ఆటవెలది

అట్టి గయునివలన నఖిలజీవులఁ బ్రోవఁ
దలఁచి సాత్త్వికప్రధానమయిన
యట్టి మేను దాల్చి యాత్మతత్త్వజ్ఞానుఁ
డగుచునుండె హరి నిజాంశమునను.

### 5.2-8-వచనము

ఇట్టి మహనీయ గుణాకరుండగు గయుని గాథానువర్ణనంబు పురావిదులగు మహాత్ములచే నీ తెఱంగున నుతింపంబడుచున్నది; సావధానమనస్కుండవై యాలకింపు" మని యిట్లనియె.

### 5.2-9-సీస పద్యము

ధర్మమార్గంబున ధారుణీజనులను;
 బ్రేమతోఁ బోషణ ప్రేషణోప
లాలనశాసనలక్షణాదులచేతఁ;
 బోషించుచును యజ్ఞమునను యజ్ఞ
పురుషు నీశ్వరుఁ జిత్తమున నిల్పి సేవించి;
 స్వాంతమందున్న యీశ్వరునిఁ గాంచి

యఖిలజీవతతికి నానంద మొసఁగుచు;
నిరభిమానతమెయి ధరణి నేలె

5.2-9.1-ఆటవెలది

సత్యమందు మిగులు సత్సేవయందును
ధర్మమందు యజ్ఞకర్మమందు
గయుఁడు వసుధలోనఁ గంజాక్షుఁడే కాని
మానవుండు గాఁడు మానవేంద్ర!

5.2-10-వచనము

అట్టి మహాపురుషగుణగణ పరిపూర్ణుండగు గయునికి దక్షకన్యక లగు శ్రద్ధా మైత్రీ దయాదులు దమయంతన వచ్చి కోరిక లొసంగ, నతని ప్రజలకు వసుంధర కామధేనువై పిదుక, వేదంబులు సకల కామంబుల నిచ్చుచుండ, సంగరంబున భంగంబు నొందిన రాజులప్పనంబు లొసంగ, విప్రులు ధర్మం బాఱవపాలు పంచియిడ, నిరంతర సోమపానంబును శ్రద్ధాభక్తి యోగంబుఁ గలిగి యొనర్చు యజ్ఞంబుల నింద్రాది దేవతలు దృప్తులై యజ్ఞ ఫలంబుల నొసంగ, బ్రహ్మాది తృణగుల్మలతాంతంబుగా సకలలోకంబుల వారినిం దృప్తిం బొందించుచు, శ్రీహరిం దృప్తిఁ బొందఁ జేయుచు, గయుండు పెక్కుకాలంబు రాజ్యంబు జేసె; నట్టి గయునికి జయంతియందుఁ జిత్రరథ స్వాత్యవరోధను లను ముగ్వురు గొడుకలు పుట్టిరి; యా చిత్రరథునికి నూర్ణయందు సామ్రాట్టును, వానికి నుత్కళ యందు మరీచియు, నా మేటికి బిందుమతియందు బిందుమంతుండును, నా బిందుమంతునకు సరఘయందు మధువును, మధువునకు సుమనస యనుదాని యందు వీరవ్రతుండును, నా వీరవ్రతునకు భోజయందు మన్న్య

ప్రమన్యువు లను నిరువురును, నందు మన్యువునకు సత్యయందు భువనుండును, నతనికి దోషయందుఁ ద్వష్టయు, నా త్వష్టకు విరోచనయందు విరజుం డను వాఁడును జనియించిరి; అంత.

5.2-11-కంద పద్యము

ఆ విరజున కుదయించిరి
భూవినుత! విషూచియందుఁ బుత్ర శతంబున్
ఆవల నొక కన్యకయున్
నావేళ సమస్త జనులు హర్షం బందన్

5.2-12-కంద పద్యము

ఘనుఁడు ప్రియవ్రతు వంశం
బునకుం దుదయై విరజుఁడు భూపతివంశం
బును దా నలంకరించెను
విను మింద్రావరజుఁ డయిన విష్ణుని మాడ్కిన్.

## 5.2-4-భూద్వీపవర్ష విస్తారములు

5.2-13-కంద పద్యము

అని పలికిన శుకయోగిం
గనుఁగొని యభిమన్యు సుతుఁడు గడు మోదముతో
వనజదళాక్షుని మహిమలు
విని సంతస మంది యనియె వేడుక మఱియున్.

5.2-14-వచనము

"మునీంద్రా! సూర్యరశ్మి యెంతదాఁకం బ్రవర్తిల్లు, నక్షత్రయుక్తంబైన చంద్ర కిరణంబు లెంతమేరఁ దిరుగు, నంత దూరంబు ప్రియవ్రతుని రథనేమి ఘట్టనలచేత సప్తద్వీపంబులును, సప్తసముద్రంబులు నయ్యె నని పలికితివి; ఆ ద్వీపసముద్రంబుల పరిమాణంబులు సవిస్తరంబుగా నెఱింగింపుము; గుణమయంబును స్థూలరూపంబును నయిన శ్రీహరి శరీరంబగు నీ లోకంబునందు నిలిపిన చిత్తంబగుణంబును, సూక్ష్మంబును, నాత్మజ్యోతియు, బ్రహ్మంబును నయిన వాసుదేవునియందు నిల్చుం గావున, ద్వీపవర్షాది విస్తారంబు వినిపింపుము" యనిన శుకయోగీంద్రు డిట్లనియె.

5.2-15-కంద పద్యము

ధరణీవల్లభ! విను శ్రీ
హరిమాయాగుణవిభూతు లగు జలనిధులుం
బరఁగిన దీవులు వర్షము
లరయంగా గొలఁదిపెట్ట నలవియె జగతిన్?

5.2-16-ఆటవెలది

తెలిసినంత నేను దెలిపెద సంక్షేప
మునను జిత్తగించి వినుము దెలియ
ననుచుఁ జెప్పఁదొడఁ గెనభిమన్యుసుతునకు
నింపుగాను శుకమునీంద్రుఁ డిట్లు.

5.2-17-వచనము

నరేంద్ర జంబుద్వీపంబు భూపద్మంబునకు మధ్యప్రదేశంబున లక్ష యోజనంబుల వెడల్పు నంతియ నిడుపునుం గలిగి కమలపత్రంబునుం బోలె వర్తులాకారంబు

నవసహస్ర యోజన పరిమితాయామంబు గల నవవర్షంబుల నష్ట మర్యాదా గిరులునుం గలిగి విభక్తం బయి యుండు; నందు మధ్యవర్షం బిలావృతవర్షం బగు; నందు మధ్యప్రదేశంబున సువర్ణమయంబయి.

5.2-18-కంద పద్యము

భూపద్మమునకు మేరువు
దీపించుచుఁ గర్ణికాకృతిని బెం పగుచుం
బ్రాపై కులగిరిరాజుగఁ
జూపట్టును సురగణాళి చోద్యం బందన్.

5.2-19-సీస పద్యము

మఱియును నా మేరుగిరి లక్ష యోజనో
న్నత మగుచుండి యా నడిమి దళము
విదితమై పదియాఱువేల యోజనములు;
నంతియ పాఁతునై యతిశయిల్లు;
నా మీఁద విస్తార మరయ ముప్పది రెండు;
వేల యోజనముల వెలసి యుండు
నాగిరి కుత్తరంబందు నీలశ్వేత;
శృంగ పర్వతములు నింగి ముట్టి

5.2-19.1-ఆటవెలది

యుండు; రెండువేల యోజనంబుల దాఁకఁ
బఱపు గలిగి పూర్వపశ్చిమాయ

తంబు దక్షిణోత్తరంబును విస్తార
మగుచు మిగుల రమ్యమై నరేంద్ర!

5.2-20-వచనము

ఇట్లు పూర్వపశ్చిమంబులు లవణసాగరాంతంబులై యున్న సీమాపర్వతంబుల యందు నీలశ్వేతశృంగవ త్పర్వతంబులు నిడివిని యథాక్రమంబుగా దశమాంశ న్యూనప్రమాణ యోజనంబులు గలవిగా నుండు; వీని మధ్య ప్రదేశంబున రమ్యక హిరణ్మయ కురువర్షంబు లను నామంబులు గల వర్షంబులుండు; వాని విస్తారంబులు నవ సహస్ర యోజనంబులు గలిగి లవణ సముద్రాంతంబులై క్రమంబున నీలాది పర్వతదీర్ఘ పరిమాణంబుల నుండు; ఇలావృత వర్షంబునకు దక్షిణంబున నిషధ హేమకూట హిమవత్పర్వతంబు లను సీమాపర్వతంబులును, బూర్వపశ్చిమంబులు నిడుపును, దక్షిణోత్తరంబులు విశాలంబును నగుచు, నా నీలాదిపర్వతంబుల తీరున నుండు; ఆ గిరుల మధ్యప్రదేశంబున హరివర్ష కింపురుషవర్ష భారతవర్షంబు లను నామంబులు గల వర్షంబు లుండు; ఆ యిలావృతవర్షంబునకుఁ బశ్చిమంబున మాల్యావత్పర్వతంబును, బూర్వభాగంబున గంధమాధనంబును, సీమాపర్వతంబులు; పూర్వపశ్చిమంబులు నిడుపును దక్షిణోత్తరంబులు విశాలంబును నగుచు నీలపర్వత నిషధపర్వతంబులం గదిసి, ద్విసహస్ర యోజనంబుల విస్తారంబై యుండు; మాల్యవత్పర్వతంబు పశ్చిమసముద్రాంతంబై కేతుమాలవర్షంబును, గంధమాధనపర్వతంబునకుఁ బూర్వభాగంబున సముద్రాంతం బగుచు భద్రాశ్వవర్షంబును, మేరువునకుం దూర్పున మందరపర్వతంబును, దక్షిణంబున మేరు మందర పర్వతంబులును, బడమటి పార్శ్వంబుల నుత్తరమునం గుముదపర్వతంబులు నను నామంబులు గలిగి

యయుత యోజనోన్నతంబులయి మేరునగం బను మధ్యోన్నత మేధి స్తంభంబునకుం జతుర్ముఖంబుల ప్రాస్వస్తంభములుం బోలె నుండు; ఆ చతుస్తంభంబుల యందును బర్వతశిఖరంబులఁ వెలుఁగొందు కేతువులబోలె చూత జంబూ కదంబ న్యగ్రోధంబు లను వృక్షరాజంబులు గ్రమంబున నొండొంటికి నేకాదశశత యోజనాయతంబును శత యోజన విస్తారంబును గలిగి యుండు; మఱియు నా పర్వత శిఖరంబులం గ్రమంబునం బయో మధ్వక్షు రస మృష్ట జలంబులు గలిగి శత యోజన విస్తారంబు లయిన సరోవరంబులు దేజరిల్లు; నందు సుస్నాతు లగు వారలకు యోగైశ్వర్యంబులు స్వభావంబునం గలుగు మఱియు నందన చైత్రరథ వైభ్రాజిక సర్వతోభద్రంబు లను నామంబులుగల దేవోద్యానంబు లా పర్వతశిఖరంబుల వెలుఁగొందుచుండు; నందు దేవతాగణంబులు దేవాంగనలం గూడి గంధర్వుల గీతనృత్యంబులు గనుంగొనుచు విహరింతురు; అంత.

5.2-21-ఉత్పలమాల

మందరపర్వతంబు తుది మామిడిపం డ్లమృతోపమానమై
మందర శైల శృంగ సుసమానములై గిరిమీఁద నట్టి మా
కందఫలామృతంబు గలఁగం బడి జాఱి మహాప్రవాహమై
యం దరుణోదనామమున నద్భుతమై విలసిల్లు నెంతయున్.

5.2-22-చంపకమాల

కడు మధురంబునన్ సురభిగంధముచే నరుణప్రకాశతన్
వడిగొని మందరాచలము వంతలచెంతల జాఱి యంతలోఁ

దొడితొడి నా యిలావృతముఁ దోఁచుచు వింతగఁ బూర్వవాహియై
యడరుఁ దరంగసంతతుల నందటి నచ్చటఁ జేయు ధన్యులన్.

5.2-23-ఆటవెలది

ఆనదీజలంబు లాడిన యచ్చటి
యంబికానుచరుల యంగగంధ
మంది పవనుఁ డంత మనుజేశ! పది యోజ
నములు జుట్టుఁ బరిమళముల నింపు.

5.2-24-ఆటవెలది

మేరు మందరముల మీఁద జంబూఫలం
బులు మహాగజోపములుగ వ్రాలి
యవిసి యంతఁ దద్రసామృతం బల్లన
యమ్మహానగంబునందుఁ బొడమి.

5.2-25-కంద పద్యము

అనుపమ మగు జంబూనది
యను పేరను వెలసి లీల నరుగుచు నంతన్
ఘనత నిలావృత వర్షము
పనుపడఁ దడుపుచును ధరణి బ్రవహించుఁ దగన్

5.2-26-ఉత్పలమాల

ఆ నదినీటఁ దోఁగి పదనై యటు మృత్తని లార్క సంగతిం
బూని కడున్ విపాకమునఁ బొందుచు శుద్ధసువర్ణజాతి జాం

బూనద నామ మొంది సురముఖ్యుల కెల్లను భూషణార్థమై
మానుగ వన్నె మించి కడు మంచిదియై విలసిల్లు నెంతయున్.

5.2-27-వచనము

మఱియు సుపార్శ్వ నగాగ్రంబునందుఁ బంచవ్యామ పరీణాహ బంధురంబు లగు నైదు మధుధారా ప్రవాహంబులు పంచముఖంబుల వెడలి సుపార్శ్వనగ శృంగంబులం బడి యిలావృత వర్షంబు పశ్చిమభాగంబుఁ దడపుచుం బ్రవహించు; ఆ తేనియ ననుభవించువారల ముఖమారుత సుగంధంబు శత యోజన పర్యంతంబు పరిమళించు.

5.2-28-సీస పద్యము

కుముద పర్వత శిఖాగ్రమున నుత్పన్నమై;
 కనుపట్టు వటతరు స్కంధమునను
నుదయించునట్టి పయో దధి ఘృత మధు;
 గుడ విశిష్టాన్నంబు లుడుగ కెపుడు
నంబర శయ్యాసనాభరణాది వ;
 స్తువులఁ గోరికలు దీర్చుచును గుముద
పర్వతాగ్రంబునఁ బడి యిలావృతవర్ష;
 మున జనులకు నెల్ల భోగ్యములను

5.2-28.1-ఆటవెలది

వదల కొసఁగు; వారి వళిపలితంబులు
దలఁగు దుష్టగంధములును బాయు

మరణభయము ముదిమి పొరయ దెన్నడును శీ
తోష్ణబాధ జెందకుండు నధిప!

5.2-29-ఆటవెలది

దేవదానవులును దివ్యమునీంద్ర గం
ధర్వు లాదిగాఁగఁ దగిలి యాత్ర
యుంచి యుందు; రా గిరీంద్ర మూలమునందు
హర్షమంది ఘన విహార లీల.

5.2-30-వచనము

నరేంద్రా! కురంగ కురర కుసుంభ వైకంకత త్రికూట శిశిర పతంగ రుచక నిషధ శితివాస కపిల శంఖాదులయిన పర్వతంబులు మేరుపర్వతకర్ణికకుఁ గేసరంబులయి పరివేష్టించి యుండు; నా మేరు నగేంద్రంబునకుఁ బూర్వభాగంబున జఠర దేవకూటంబులును, బశ్చిమంబునం బవన పారియాత్రంబులు నను పర్వతంబులు నాలుగు, దక్షిణోత్తరంబు లొండొంటికి నష్టాదశసహస్ర యోజనంబుల నిడుపును బూర్వపశ్చిమంబులు ద్విసహస్ర యోజనంబుల వెడల్పును నగుచు దక్షిణంబునఁ గైలాస కరవీరంబులు నుత్తరంబున ద్రిశృంగ మకరంబు లను నామంబులు గల పర్వతంబులు నాలుగును, బూర్వపశ్చిమంబుల నష్టాదశసహస్ర యోజనంబుల నిడుపును దక్షిణోత్తరంబుల ద్విసహస్ర యోజనంబుల వెడల్పు నగుచు నగ్నిపురుషునకుం బ్రదక్షిణం బగు పరిస్తరణంబుల చందంబున మేరువునకుం బ్రదక్షిణంబుగా నష్ట నగంబులు నిలిచి యుండు; మేరుశిఖరంబున దశసహస్ర యోజనంబుల నిడుపు నంతియ విస్తారంబు నగుచు సువర్ణమయం బైన బ్రహ్మపురంబు దేజరిల్లు

చుండు; నా పట్టణంబునకు నష్టదిక్కుల యందును లోకపాలుర పురంబు లుండు.

5.2-31-కంద పద్యము

పరమేష్ఠి పట్టణంబున
హరి మున్ను త్రివిక్రమణము లందన్ సర్వే
శ్వర చరణాగ్ర నఖాహతిఁ
బరువడి నూర్ధ్వాండ మంతఁ బగిలె నరేంద్రా!

5.2-32-వచనము

ఇట్లు చరణనఖస్పర్శం జేసి భేదింపబడ్డ యూర్ధ్వకటాహ వివరంబు వలన నంతఃప్రవేశంబు జేయుచున్న బాహ్యజలధార శ్రీహరిపాదోస్పర్శం జేయుచుఁ జనుదెంచి, సకలలోకజనంబుల దురితంబులు వాపుచు భగవత్పాదియను పేరం దేజరిల్లుచు దీర్ఘకాలంబు స్వర్గంబున విహరించు విష్ణుపదంబున నుత్తానపాద పుత్రుండును బరమ భాగవతుండును నైన ధ్రువుండు దన కులదేవత యైన శ్రీహరి పాదోదకంబుఁ బ్రతిదినంబును భక్తియోగంబున నిమీలితనేత్రుండై యానందబాష్పంబుల రోమాంచితగాత్రుండై యత్యాదరంబున నేఁడును శిరంబున ధరియించుచు నున్నవాఁడు; యతనికి నధోభాగంబున నుండు మండలాధిపతు లైన సప్తర్షులును హరిపాదోదక ప్రభావంబు నెఱింగి తాము పొందు తపస్సిద్ధి యాకాశగంగాజలంబుల స్నాతు లగుటయే యని సర్వభూతాంతర్యామి యగు నీశ్వరుని యందు భక్తి సలిపి యితరపదార్థాపేక్ష జేయక మోక్షార్థి ముక్తిమార్గంబు బహుమానంబు జేయు తెఱంగున బహుమానయుక్తంబుగాఁ దమ జటాజూటంబుల యందు నేడును ధరియించుచుండుదురు.

5.2-33-సీస పద్యము

అంత నసంఖ్యంబు లైన దివ్యవిమాన;

సంకులంబుల సువిశాలమైన

దేవమార్గంబున దిగి వచ్చి చంద్రమం;

డలముఁ దోఁచుచు మేరునగ శిఖాగ్ర

మునను నా బ్రహ్మదేవుని పట్టణమునకు;

వచ్చి యందులఁ జతుర్ద్వారములను

వరుసతో దీర్ఘప్రవాహంబు లగుచును;

బ్రవహించి యమల ప్రభావములను

5.2-33.1-ఆటవెలది

నరుగు లవణసాగరాంతంబులుగ నాల్గు

మోములందు నాల్గు నామములను

దన్నుఁ గన్నవారిఁ దన వారిఁదోగిన

వారి కెల్ల నమృతవారి యగుచు.

5.2-34-వచనము

ఇట్లు సీత యను పేర వినుతి నొందిన యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదన పూర్వద్వారంబున వెడలి కేసరావలయంబుఁ దడుపుచు గంధమాదనాద్రికిం జని భద్రాశ్వవర్షంబుం బావనంబు జేయుచుఁ బూర్వలవణసాగరంబునం బ్రవేశించు; చక్షు వను పేరం దేజరిల్లెడు దీర్ఘప్రవాహంబు పశ్చిమద్వారంబున వెడలి మాల్యవత్పర్వతంబు నుత్తరించి కేతుమాలవర్షంబుం బవిత్రంబు జేయుచుఁ బశ్చిమ లవణార్ణవంబునం గలయు; భద్ర యనుపేర వెలుఁగొందిన యతుల

ప్రవాహం బుత్తరద్వారంబున వెడలి కుముద నీల శ్వేతాఖ్య పర్వత శిఖరంబులం గ్రమంబునఁ బ్రవహించుచు శృంగ నగరంబునకుం జని మానసోత్తరంబు లగు నుత్తర కురుభూములఁ బవిత్రంబు జేయుచు నుత్తర లవణ సాగరంబుఁ జేరు; నలకనంద యనం బ్రఖ్యాతి గాంచిన యమ్మహానదీ ప్రవాహంబు బ్రహ్మ సదన దక్షిణద్వారంబున వెడలి యత్యంత దుర్గమంబు లైన భూధరంబులఁ గడచి హేమకూట హిమకూట నగంబుల నుత్తరించి యతివేగంబునఁ గర్మక్షేత్రంబగు భారతవర్షంబుఁ బావనంబు జేయుచు దక్షిణ లవణాంబుధిం గలయు; నంత.

5.2-35-సీస పద్యము

జగతిలో మేరు వాదిగఁ బర్వతములకుఁ;
 బుత్రిక లై నట్టి పుణ్యతీర్థ
ములు వేలసంఖ్యలు గలవు; జంబూద్వీప;
 మందు భారతవర్ష మరయఁ గర్మ
భూమి దక్కిన వర్షముల దివంబున నుండి;
 భువికి వచ్చినవారు పుణ్యశేష
ములు భుజించుచు నుండ్రు; భూస్వర్గమనఁ దగు;
 నా వర్షముల నుండునట్టి వార

5.2-35.1-ఆటవెలది

లయుతసంఖ్య వత్స రాయువు లయుత మా
తంగబలులు దేవతాసమాను
లతుల వజ్రదేహు లధిక ప్రమోదితు
లప్రమత్తు లార్యు లనఘు లధిప!

5.2-36-వచనము

మఱియు సురతసుఖానందంబున మోక్షంబు నైనం గైకొనక సత్కృత్ప్రసూతు లగుచు ననవరతంబును త్రేతాయుగకాలంబు గలిగి ప్రవర్తింతురు; ఈ యష్ట వర్షంబులయందు దేవతాగణంబులు దమ భృత్యువర్గంబు లత్యుపచారంబులు జేయుచుండ నెల్ల ఋతువుల యందుం గిసలయ కుసుమ ఫల భరితంబులైన లతాదుల శోభితంబు లగు వనంబులు గల వర్ష నిధి గిరిద్రోణుల యందును, వికచ వివిధ నవ గమలా మోదితంబు లగు రాజహంస కలహంసలు గల సరోవరంబుల యందును జలకుక్కుట కారండవ సారస చక్రవాకాది వినోదంబులు గలిగి మత్తాళిఝుంకృతి మనోహరంబులై నానావిధంబు లయిన కొలంకుల యందును దేవాంగనల కామోద్రేకజంబు లయిన విలాస హాస లీలావలోకనంబులం దివియంబడిన మనోదృష్టులు గలిగి దేవగణంబులు విచిత్ర వినోదంబులఁ దగిలి యిచ్ఛావిహారంబులు సలుపుచుండుదురు.

5.2-37-కంద పద్యము

ఈ నవవర్షంబుల యం
దా నారాయణుఁడు వచ్చి యనవరతము లో
కానుగ్రహమునకై సు
జ్ఞానం బీఁ దలఁచి లీలఁ జరియించుఁ దగన్.

5.2-38-సీస పద్యము

వసుధ నిలావృత వర్షాధిపతి యైన;
 పురహరుం డా వర్షమున వనంబు
నందు నుండుటకు నా యంబికాశాప వ;

శంబున నా వనస్థలములందు
నెవ్వరు వచ్చిన నింతులై యుందు రా;
వనమందుఁ బార్వతి యనుదినంబు
నంగనాజన సహస్రార్బుదంబులతోడ;
నసమలోచనుఁ గొల్చు నతుల భక్తి

5.2-38.1-ఆటవెలది

నట్టి శివునిఁ గోరి యా యిలావృతవర్ష
మునఁ జరించు జనులు మోదమునను
గదిసి తత్ప్రకాశకములైన మంత్ర తం
త్రములఁ బూజ జేసి తలఁతు రెపుడు.

5.2-39-కంద పద్యము

భద్రాశ్వవర్షమందుల
భద్రశ్రవు డనెడి పేరఁ బరఁగుచుఁ దపనీ
యాద్రిసమ ధైర్యుఁ డగుచు స
ముద్రాంతంబైన జగతిఁ బొలుపుగ నేలున్.

5.2-40-కంద పద్యము

ఆ నరవరునకుఁ బ్రియతముఁ
డైన హయగ్రీవమూర్తి ననవరతంబున్
ధ్యానస్తోత్రజపాను
ష్ఠానాదులఁ బూజచేసి సజ్జను లంతన్.

5.2-41-ఆటవెలది

తత్ప్రకాశకృత్ప్రధాన మంత్రార్థ సం
సిద్ధిఁ జేసి ముక్తిఁజెంది రప్పు
డట్టి వర్షమందు నా హయగ్రీవునిఁ
దలఁచి కొలిచి మిగుల ధన్యు లగుచు.

5.2-42-సీస పద్యము

హరివర్ష పతి యైన నరహరి ననిశంబు;
నందున్న జనులు మహాత్ము లయిన
దైత్యదానవ కులోత్తములు ప్రహ్లాదాది;
వృద్ధులఁ గూడి సంప్రీతితోడ
సుస్నాతులై భక్తిఁ జూచుచు నుందురు;
రమ్య దుకూలాంబరములు దాల్చి
తత్ప్రకాశక మంత్రతంత్రజపస్తోత్ర;
పఠన సుధ్యానతపః ప్రధాన

5.2-42.1-తేటగీతి

మైన సత్పూజలనుజేసి యచల బుద్ధి
శ్రీ నృసింహునిఁ జేరి పూజించి యతని
కరుణ నొందుచు నతుల ప్రకాశు లగుచు
భుక్తి ముక్తులఁ గైకొండ్రు భూపవర్య!

5.2-43-వచనము

మఱియుఁ గేతుమాల వర్షంబునందు భగవంతుండు శ్రీదేవికి సంతోషంబు నొసంగుటకుఁ గామదేవరూపంబున నుండును; అమ్మహాపురుషుని యస్త్రతేజః ప్రకాశంబునఁ బ్రజాపతి దుహితలగు రాత్ర్యధి దేవతల గర్భంబులు సంవత్సరాంతంబున నిర్జీవంబు లై స్రవించును; ఆ కామదేవుండును దన గతి విలాసలీలావిలోకన సుందర భ్రూమండల సుభగ వదనారవింద కాంతులంజేసి శ్రీరమాదేవిని రమింపం జేయు; భగవన్మాయారూపిణి యగు శ్రీదేవియుఁ బ్రజాపతి పుత్రికలును బుత్రులు నైన రాత్రులం బగళ్ళం గూడి కామదేవుని స్తోత్రపఠన పూజాధ్యానాదులం బూజించుచుండు; మఱియును.

5.2-44-కంద పద్యము

విమలమతిఁ జిత్తగింపుము
రమణీయంబైన విమల రమ్యక మను వ
ర్షమునకు నధిదేవత దా
నమరంగా మత్స్యరూపుఁడగు హరి దలపన్.

5.2-45-ఆటవెలది

అట్టి వర్షమునకు నధిపతి యగుచున్న
మనువు పుత్రపౌత్ర మంత్రివరులఁ
గూడి మత్స్యమైన కుంభినీధరుఁ జిత్త
మతుల భక్తియుక్తి హత్తఁ గొలుచు.

5.2-46-ఆటవెలది

తత్ప్రకాశ కృత్ప్రధాన మంత్రస్తోత్ర
ములను ధర్మకర్మములను హోమ

ములను జనులు చేసి పుణ్యులై భుక్తి ము
క్తులను బొందుచుందు రెలమితోడ.

5.2-47-కంద పద్యము

వినుము; హిరణ్మయ వర్షం
బునకుం గూర్మావతారమును దాల్చిన యా
వనజోదరుఁ డధిదేవత
యనఘుఁడు పితృపతి మహాత్ముఁ డర్యముఁడు నృపా!

5.2-48-కంద పద్యము

ఆ వర్షమందు నర్యముఁ
డా వర్షజనంబుగూడి హరిఁ జిత్తములో
భావించి సంస్తవంబులు
గావించుచుఁ గాంతు రతని కైవల్యంబున్.

5.2-49-కంద పద్యము

ఉత్తర కురుభూములఁ దను
హత్తుకొని వరాహదేవుఁ డధిపతియైనన్
సత్తుగ భూసతి యతనిం
జిత్తములో నిలిపి పూజ చేయుచు నుండున్.

5.2-50-కంద పద్యము

ఆ వర్షమందులను బ్రజ
లా విపుల వరాహమూర్తి ననవతరంబున్

సేవించి కొలిచి సంస్తుతిఁ
గావించుచుఁ గాంతు రంతఁ గైవల్యంబున్.

5.2-51-కంద పద్యము

అరయఁగ సీతాలక్ష్మణ
పరివృతుఁడై వచ్చి రామభద్రుఁడు గడిమిం
బరఁగు నధిదేవతగఁ గిం
పురుష మహావర్షమునకు భూపవరేణ్యా!

5.2-52-ఆటవెలది

అట్టి రామభద్రు నంజనీసుతుఁడు గిం
పురుషగణముఁ గూడి పూజ చేసి
తత్ప్రకాశకప్రధాన మంత్రస్తోత్ర
పఠనములను దగను ప్రాప్తి జేయు.

5.2-53-సీస పద్యము

భారతవర్షాధిపతియైన బదరికా;
శ్రమమున నున్న నారాయణుండు
భూనాథ! యా మహాత్ముని నారదాదులు;
భారతవర్షంబు ప్రజలఁ బ్రేమ
బాయక చేరి యుపాస్తి చేయుచు సాంఖ్య;
యోగంబు నుపదేశ ముచితవృత్తి
నంది యందఱును గృతార్థులై యట్టి నా;
రాయణదేవు నారాధనంబు

5.2-53.1-ఆటవెలది

చేసి యాత్మఁ జాలఁ జింతించి తత్ప్రకా
శకము లయిన మంత్ర సంస్తవములఁ
బూజ చేసి ముక్తిఁ బొందుచు నుండుదు
రచలమైన భక్తి ననుదినంబు,

5.2-54-కంద పద్యము

భారతవర్షము నందుల
సారాంశములైన పుణ్య శైలంబులు గం
భీరప్రవాహములుఁ గల
వారయ నెఱిఁగింతు వాని నవనీనాథా!

5.2-55-వచనము

మలయపర్వతంబును, మంగళప్రస్థంబును, మైనాకంబును, త్రికూటంబును, ఋషభపర్వతంబును, గూటరంబును, గోల్లంబును, సహ్యాపర్వతంబును, వేదగిరియును, ఋష్యమూకపర్వతంబును, శ్రీశైలంబును, వేంకటాద్రియును, మహేంద్రంబును, వారిధరంబును, వింధ్య పర్వతంబును, శుక్తిమత్పర్వతంబును, ఋక్షగిరియును, బారియాత్రంబును, ద్రోణపర్వతంబును, చిత్రకూటంబును, గోవర్ధనాద్రియును, రైవతకంబును, గకుంభంబును, నీలగిరియును, గాకముఖంబును, నింద్రకీలంబును, రామగిరియును నాదిగాఁ గల పుణ్య పర్వతంబు లనేకంబులు గలవా పర్వతపుత్రిక లైన చంద్రవటయు, దామ్రపర్ణియు, నవటోదయుఁ, గృతమాలయు, వైహాయసియుఁ, గావేరియు, వేణియుఁ, బయస్వినియుఁ, బయోదయు, శర్కరావర్తయుఁ, దుంగభద్రయుఁ, గృష్ణవేణియు,

భీమరథియు, గోదావరియు, నిర్వింధ్యయుఁ, బయోష్ణియుఁ, దాపియు, రేవానదియు, శిలానదియు, సురసయుఁ, జర్మణ్వతియు, వేదస్మృతియు, ఋషికుల్యయుఁ,ద్రిసమయుఁ, గౌశికయు, మందాకినియు, యమునయు, సరస్వతియుఁ, దృషద్వతియు, గోమతియు, సరయువును, భోగవతియు, సుషుమయు, శతద్రువును, జంద్రభాగయు, మరుద్వృథయు, వితస్తయు, నసిక్నియు, విశ్వయు నను నీ మహానదులును, నర్మద, సింధువు, శోణ యను నదంబులును నైన మహా ప్రవాహంబు లీ భారతవర్షంబునఁ గలవు; అందు సుస్నాతులైన మానవులు ముక్తిం జెందుదురు; మఱియు నీ భారత వర్షంబున జన్మించిన పురుషులు శుక్ల లోహిత కృష్ణవర్ణ రూపంబు లగు త్రివిధ కర్మంబులంజేసి క్రమంబుగ దేవ మనుష్య నరక గతులను త్రివిధ గతులం బొందుదురు; వినుము; రాగద్వేషాది శూన్యుండు, నవాఙ్మానసగోచరుండు, ననాధారుండు నగు శ్రీవాసుదేవమూర్తి యందుఁ జిత్తంబు నిలిపి భక్తియోగంబున నారాధించెడు మహాత్మ్ముల విద్యాగ్రంథి దహనంబు గావించుట జేసి పరమ భాగవతోత్తములు పొందెడు నుత్తమగతిం జెందుదురు; కావున భారత వర్షంబు మిగుల నుత్తమం బని మహాపురుషు లిట్లు స్తుతించు చుండుదురు;

5.2-56-ఉత్పలమాల

భారతవర్ష జంతువుల భాగ్యము లేమని చెప్పవచ్చు? నీ
భారతవర్షమందు హరి పల్మఱుఁ బుట్టుచు జీవకోటికిన్
ధీరతతోడఁ దత్త్వ ముపదేశము చేయుచుఁ జెల్మి జేయుచు
న్నారయ బాంధవాకృతిఁ గృతార్థులఁ జేయుచునుండు నెంతయున్.

5.2-57-కంద పద్యము

తన జన్మ కర్మములనుం
గొనియాడెడివారికెల్లఁ గోరిన వెల్లం
దనియఁగ నొసఁగుచు మోక్షం
బనయముఁ గృపచేయుఁ గృష్ణు డవనీనాథా!

5.2-58-వచనము

ఇట్లు భారత వర్షంబునందుల జనంబులకు నెద్ధియు నసాధ్యంబు లేదు; నారాయణ స్మరణంబు సకల దురితంబుల నడంచు; తన్నామస్మరణ రహితంబులైన యజ్ఞ తపో దానాదులు దురితంబుల నడంప లేవు; బ్రహ్మకల్పాంతంబు ప్రదికెడి యితర స్థానంబునం బునర్జన్మ భయంబున భీతిల్లుచు నుండుటకన్న భారతవర్షంబు నందు క్షణమాత్రంబు మనంబున సర్వసంగపరిత్యాగంబు చేసిన పురుషశ్రేష్ఠునకు శ్రీమన్నారాయణ పదప్రాప్తి యతి సులభంబుగ సంభవించుం; గావున నట్టి యుత్తమంబగు నీ భారతవర్షంబె కోరుచుండుదురు; మఱియు నెక్కడ వైకుంఠుని కథావాసన లేకుండు, నే దేశంబున సత్పురుషులైన పరమభాగవతులు లేకుండుదు, రే భూమిని యజ్ఞేశ్వరుని మహోత్సవంబులు లేక యుండు, నది సురేంద్రలోకంబైన నుండ దగదు; జ్ఞానానుష్ఠాన ద్రవ్యకలాపంబుల చేత మనుష్యజాతిం బొంది తపంబున ముక్తిం బొందకుండెనేని మృగంబుల మాడ్కి నతండు దనకుం దానె బంధనంబు నొందు భారతవర్షంబునందుఁ బ్రజలచేత శ్రద్ధాయుక్తంబుగా ననుష్ఠింపంబడిన యజ్ఞంబులయందు వేల్వంబడు హవిస్సులను బెక్కు నామంబులం బుండరీకాక్షుం డంది తనమీఁది భక్తి యధికంబుగాఁ జేయు; నట్టి భారతవర్షంబు నందలి ప్రజమీఁదం గరుణించి సర్వేశ్వరుం డిహపర సౌఖ్యంబుల నొసంగుచుండు; జంబూద్వీపంబున సగరాత్మజు లశ్వమేధాశ్వంబు నన్వేషింపం బూని

భూఖననంబు చేయుటంజేసి స్వర్ణప్రస్థ చంద్రశుక్లావర్తన రమణక మందేహారుణ పాంచజన్య సింహళ లంకాద్వీపంబు లన నెనిమిది యుపద్వీపంబులు గలిగె.

5.2-59-సీస పద్యము

లక్ష యోజనముల లవణాబ్ధి పరివృత;
 మగుచు జంబూద్వీప మతిశయిల్లు;
విను రెండు లక్షల విస్తృతముగను ప్ల;
 క్షద్వీప ముండు నా క్షార సాగ
రముఁ జుట్టి; యందుల రమ్యమై యొప్పెడు;
 వృక్షంబు ప్లక్షంబు విదితముగను;
దనరు నా ద్వీపంబు దరునామ మహిమచే;
 మిగులఁ బ్లక్షం బన మించి రహిని;

5.2-59.1-ఆటవెలది

నందు సంచరించు నట్టి వారల కగ్ని
దేవుఁ డమరు నాది దేవతయుఁగ;
నందులోన నా ప్రియవ్రత పుత్త్రుండు
నిధ్మజిహ్వుఁడగు మహీవరుండు.

5.2-60-వచనము

నరేంద్రా! యా యిధ్మజిహ్వుం డా ప్లక్షద్వీపంబు నేడు వర్షంబులుగ విభజించి యందు నా వర్షనామధారులుగా నుండు తన పుత్త్రు లగు శివ యశస్య సుభద్ర శాంత క్షేమాభయామృతు లనియెడు నేడుగుర నేడు వర్షంబుల కధిపతులం గావించి తపంబునకుం జనియె; ఆ వర్షంబుల యందు మణికూట వజ్రకూట

నింద్రసేన జ్యోతిష్మద్ధూమ్రవర్ణ హిరణ్యగ్రీవ మేఘమాల లను నామంబులు గల సప్త కులపర్వతంబులును, నరుణయు స్నమణయు నాంగీరసయు సావిత్రియు సుప్రభాతయు ఋతంభరయు సత్యంభరయు నన సప్తమహానదులును, నా నదులయందు సుస్నాతు లగుచు గత పాపు లైన హంస పతం గోర్ధ్వాయన సత్యాంగు లను నామంబులు గల చాతుర్వర్ణ్యంబును గలిగి యుండు; నందుఁ బురుషులు సహస్ర వత్సర జీవులును దేవతాసములును దృష్టిమాత్రంబునం గ్లమస్వేదాది రహితంబగు నపత్యోత్పాదనంబు గలవార లగుచు వేద త్రయాత్మకుండును, స్వర్గద్వార భూతుండును, భగవత్స్వరూపియు నగు సూర్యుని వేదత్రయమ్మున సేవింపుదురు; ప్లక్షద్వీపం బాదిగా మీఁదటి ద్వీపపంచకంబు నందలి పురుషులకు నాయు రింద్రియ పటుత్వంబులును దేజో బలంబులును దోడనె జనియించుచుండు.

5.2-61-కంద పద్యము

ప్లక్షద్వీపము ద్విగుణిత
లక్షేక్షురసాబ్ధి చుట్టిరా విలసిల్లు
న్నిక్షురసోదద్విగుణం
బక్షయముగ శాల్మలీ మహాద్వీప మిలన్.

5.2-62-వచనము

అందు శాల్మలీ వృక్షంబు ప్లక్షాయామంబై తేజరిల్లు; నా వృక్షరాజంబు నకు నధోభాగంబునం బతత్రిరాజుగా నుండు గరుత్మంతుండు నిలుకడగా వసించు; నా శాల్మలీ వృక్షంబు పేర నా ద్వీపంబు శాల్మలీ ద్వీపం బన విలసిల్లు; ఆ ద్వీపపతియైన ప్రియవ్ర తాత్మజుండగు యజ్ఞబాహువు దన పుత్రులగు సురోచన

సౌమనస్య రమణక దేవబర్హ పారిబర్హాప్యాయ నాభిజ్ఞాతు లనియెడు వారి పేర నేడు వర్షంబుల నేర్పఱచి యా వర్షంబుల యం దేడ్వురఁ గుమారుల నభిషిక్తులం జేసె; నా వర్షంబుల యందు స్వరస, శతశృంగ, వామదేవ, కుముద, ముకుంద, పుష్పవర్ష, శతశ్రుతు లను పర్వత సప్తకంబును ననుమతియు, సినీవాలియు, సరస్వతియుఁ, గుహువును, రజనియు, నందయు, రాకయు నను సప్త మహానదులును గలవు; నందు శ్రుతధర, విద్యాధర, వసుంధ, రేధ్మధర సంజ్ఞలగు నా వర్షపురుషులు భగవత్స్వరూపుండు, వేదమయుండు, నాత్మస్వరూపుండు నగు సోముని వేదమంత్రంబులచే నారాధింపుదు; రా ద్వీపంబు లక్షచతుష్టయపరిమిత యోజన విస్తృతం బయిన సురాసముద్రంబుచే నావృతంబై తేజరిల్లు; నందు.

5.2-63-సీస పద్యము

భూనాథ! యా సురాంభోధికిఁ జుట్టుగా;
 నుండు కుశద్వీప ముర్వీమీఁదఁ;
దోరమై తా ద్విచతుర్లక్ష యోజనం;
 బులను విస్తారమై పొలుపు మిగుల;
నందుఁ గుశస్తంభ మనిశంబు దేవతా;
 కల్పితం బైనట్టి కాంతిచేత
దిక్కులు వెలిఁగించు ద్వీపంబునకుఁ దన;
 పేరను సత్కీర్తి పెంపు జేయు

5.2-63.1-తేటగీతి

నట్టి దీవికి నధిపతి యగు ప్రియవ్ర
త తనయుండు హిరణ్యరేతసుఁ డనం ద
నరెడి భూపతి తన సుతనామములను
వర్షములఁ జేసె నత్యంత హర్షమునను

5.2-64-వచనము

ఇట్లు హిరణ్యరేతసుండు వసుదాన, దృఢరుచి, నాభి, గుప్త, సత్యవ్రత, విప్ర, వామదేవు,లను నామంబులుగల పుత్రుల,నామంబుల సప్త వర్షంబులం గావించి యా కుమారులనందు నిలిపి తాను దపంబు నకుం జనియె; నా వర్షంబునందు బభ్రు చతుశ్శృంగ కపిల చిత్రకూట దేవానీకోర్ధ్వరోమ ద్రవిణంబులను నామంబులు గల సప్తగిరులును, రసకుల్యయు, మధుకుల్యయు, శ్రుతవిందయు, మిత్రవిందయు, దేవగర్భయు, ఘృతచ్యుతయు, మంత్రమాలయు నను సప్త మహానదులును గల వా నదీజలంబులఁ గృతమజ్జను లగుచు భగవంతుండగు యజ్ఞపురుషునిఁ గుశల కోవిదాభియుక్త కులక సంజ్ఞలు గల వర్షపురుషు లారాధించుచుందురు.

5.2-65-సీస పద్యము

ఆ కుశద్వీపంబు నరికట్టుకొని యుండు;
నెనిమిదిలక్షల ఘన ఘృతాబ్ధి;
యా ఘృతసాగరం బవ్వల షోడశ;
లక్ష యోజనముల లలిత మగుచు
నుండుఁ గ్రౌంచద్వీప; ముర్వీశ! యందు మ;
ధ్యప్రదేశంబున నట్టి దీని

పేరుగాఁ దనపేరఁ బెద్దగాఁ జేసిన;
క్రౌంచాద్రి గల; దా నగంబు మున్ను

5.2-65.1-ఆటవెలది

షణ్ముఖుండు దివ్యశరమున ఘననితం
బంబు దూయ నేయఁ బాలవెల్లి
గరిమఁ దడుపుచుండు వరుణుండు రక్షింప
నందు మిగుల భయము నొందకుండె.

5.2-66-వచనము

నరేంద్రా యా క్రౌంచద్వీపపతి యగు ఘృతపృష్ఠుండు దన కుమారుల నా పేళ్ళుగల యామోద, మధువహ, మేఘపృష్ఠ, సుదామ, ఋషిజ్య, లోహితార్ణ, వనస్పతు లను వర్షంబుల కభిషిక్తులం జేసి పరమ కల్యాణ గుణ యుక్తుం డయిన శ్రీహరి చరణారవిందంబుల సేవించుచు దపంబు నకుం జనియె; నా వర్షంబుల యందు శుక్ల వర్ధమాన భోజ నోపబర్హణానంద నందన సర్వతోభద్రంబు లను సప్త సీమాపర్వతం బులును నభయయు, నమృతౌఘయు, నార్యకయు, తీర్థవతియుఁ, దృష్టిరూపయుఁ, బవిత్రవతియు, శుక్లయు నను సప్తనదులును గలవు; అందులఁ బవిత్రోదకంబు లనుభవించుచు గురు ఋషభ ద్రవిణక దేవక సంజ్ఞలు గలిగి వరుణదేవుని నుదకాంజలులం బూజించు చున్న చాతుర్వర్ణ్యంబు గలిగి యుండు.

5.2-67-సీస పద్యము

జగతీశ! వినుము; క్రౌంచద్వీపమును జుట్టి;
యుండు షోడశలక్ష యోజనముల

విస్తారమై పాలవెల్లి; యందునను శా;
 కద్వీప మతుల ప్రకాశ మొందు;
దండిమై ముప్పదిరెండులక్షల యోజ;
 నముల విస్తారమై యమరి యుండు;
నందుల శాకవృక్షామోద మా ద్వీప;
 మును సుగంధంబునఁ బెనఁగఁ జేసి

5.2-67.1-తేటగీతి

యంతఁ దనపేర దీవి ప్రఖ్యాత మగుటఁ
జేసి యందుల మిగులఁ బ్రసిద్ధికెక్కె;
నందు మేధాతిథియుఁ గర్త యగుచు నుండెఁ
దవిలి వేడుకఁ దనదు నందనులఁ జూచి.

5.2-68-వచనము

మఱియు; నా ప్రియవ్రతపుత్రుం డయిన మేధాతిథి దన పుత్రుల పేరం గల పురోజవ మనోజవ వేపమాన ధూమ్రానీక చిత్రరథ బహురూప విశ్వచారంబు లను సంజ్ఞలు గల సప్త వర్షంబుల యందు వారలకుఁ బట్టంబు గట్టి శ్రీహరి పాదసేవ జేయుచుఁ దపోవనంబునకుం జనియె; నా శాకద్వీపంబునందు నీశానోరుశృంగ బలభద్ర శతకేసర సహస్రస్రోతో దేవపాల మహానస నామంబులు గల సీమాగిరులును, ననఘాయు ర్దోభయస్సృ ష్ట్యపరాజిత పంచపదీ సహస్రస్సృతి నిజధృతు లను సప్త నదులును గల; వా నదీజలంబు లుపయోగించి యచ్చటి వారలు ప్రాణాయామంబు జేసి విధ్వస్త రజస్తమో గుణులయి పరమసమాధిని

వాయురూపంబైన భగవంతుని సేవింతురు; ఋతువ్రత సత్యవ్రత దానవ్రత సువ్రత నామంబులు గల చాతుర్వర్ణ్యం బందు గలిగి యుండు.

5.2-69-సీస పద్యము

అట్టి శాకద్వీప మరికట్టి తత్ప్రమా;
ణంబున దధిసముద్రంబు వెలుఁగు;
నందుకుఁ బరివృతంబయి పుష్కరద్వీప;
మిలఁ జతుష్షష్ఠిలక్షల విశాల;
మమ్మహాద్వీపమం దయుత కాంచన పత్ర;
ములు గల్గి కమలగర్భునకు నాస
నంబగు పంకేరుహంబుండు; నా ద్వీప;
మధ్యంబునను నొక్క మానసోత్త

5.2-69.1-ఆటవెలది

రం బనంగఁ బర్వతం; బుండుఁ దనకుఁ బూ
ర్వాపరముల నుండునట్టి వర్ష
ములకు రెంటి కట్టు నిలిచిన మర్యాద
నగ మనంగఁ జాలఁ బొగడ నెగడు.

5.2-70-వచనము

ఇట్లు దనకు లోపలి వెలుపలి వర్షంబులు రెంటికి మర్యాదాచలంబునుం బోలె నున్న మానసోత్తర పర్వతం బయుత యోజన విస్తారంబును నంతియ యౌన్నత్యంబునుం గలిగి యుండు; నా నగంబునకు నలుదిక్కుల యందు నాలుగు లోకపాలుర పురంబులుండు; నా మానసోత్తరపర్వతంబు తుద

సూర్యరథచక్రంబు సంవత్సరాత్మకం బయి యహోరాత్రంబుల యందు మేరు ప్రదక్షిణంబు జేయు; నందు నా పుష్కరద్వీపాధిపతియగు వీతిహోత్రుండు రమణక ధాతక నామంబులు గల పుత్రుల నిరువుర వర్షద్వయంబునం దభిషిక్తులం జేసి తాను బూర్వజు లేగిన తెఱంగున భగవత్కర్మశీలుం డగుచుఁ దపంబునకుం జనియె; అంత.

5.2-71-కంద పద్యము

మనుజేశ్వర; యా వర్షం
బున నప్పుడు సంచరించు పురుషులు పద్మా
సను దగ సకర్మ కారా
ధన చేయుదు రచల బుద్ధి తాత్పర్యమునన్.

5.2-72-కంద పద్యము

ధరణీవల్లభ! విను పు
ష్కర మను ద్వీపమున లేరు చాతుర్వర్ణ్యల్
పరగఁగ భేదము లేకే
సరసత సము లగుదు రందు సకల జనములున్.

5.2-73-వచనము

మఱియు; పుష్కరద్వీపంబు చతుష్షష్ఠిలక్ష యోజన విస్తారం బైన శుద్ధోదక సముద్ర ముద్రితం బగుచుండు; నవ్వల లోకాలోకపర్వతం బుండు; శుద్ధోదక సముద్ర లోకాలోకపర్వతంబుల నడుమ రెండుకోట్ల యోజన విస్తారంబయిన నిర్జన భూమి దర్పణోదర సమానంబై దేవతావాస యోగ్యంబుగా నుండు; నా భూమిం జేరిన పదార్థంబు మరలఁ బొంద నశక్యంబుగా నుండు; అటమీఁద

లోకాలోకపర్వతం బెనిమిది కోట్ల యోజనంబులు సువర్ణభూమియు సూర్యాది ధ్రువాంతంబు లగు జ్యోతిర్గణంబుల మధ్యంబున నుండుటంజేసి లోకాలోకపర్వతం బనందగి యుండు; పంచాశత్కోటి యోజనవిస్తృతం బగు భూమండల మానంబునకు దురీయాంశ ప్రమాణంబుగల యా లోకాలోక పర్వతంబు మీఁద నఖిల జగద్గురువగు బ్రహ్మచేతఁ జతుర్దిశల యందు ఋషభ పుష్కరచూడ వామ నాపరాజిత సంజ్ఞలుగల దిగ్గజంబులు నాలుగును లోకరక్షణార్థంబు నిర్మితంబై యుండు; మఱియును.

5.2-74-సీస పద్యము

తనదు విభూతులై తనరిన యా దేవ;
 బృంద తేజశ్శౌర్య బృంహణార్థ
మై భగవంతుండు నాదిదేవుండును;
 నైన జగద్గురుం డచ్యుతుండు
సరిలేని ధర్మ విజ్ఞాన వైరాగ్యాదు;
 లయిన విభూతుల నలరి యున్న
యట్టి విష్వక్సేను డాదిగాఁ గలుగు పా;
 ర్షదులతోఁ గూడి ప్రశస్తమైన

5.2-74.1-తేటగీతి

నిజవరాయుధ దోర్దండ నిత్య సత్త్వుఁ
డగుచు నా పర్వతంబుపై నఖిలలోక
రక్షణార్థంబు కల్పపర్యంత మతఁడు
యోగమాయా విరచితుఁడై యొప్పుచుండు.

5.2-75-వచనము

ఇట్లు వివిధమంత్ర గోపనార్థం బా నగాగ్రంబున నున్న భగవంతుండు దక్క లోకాలోకపర్వతంబునకు నవ్వల నొరులకు సంచరింప నశక్యంబయి యుండు; బ్రహ్మాండంబునకు సూర్యుండు మధ్య గతుండై యుండు; నా సూర్యునకు నుభయ పక్షంబుల యందు నిరువదేను కోట్ల యోజన పరిమాణంబున నండకటాహం బుండు; నట్టి సూర్యునిచేత నాకాశదిక్స్వర్గాపవర్గంబులును నరకంబులును నిర్ణయింపంబడు; దేవ తిర్యఙ్మనుష్య నాగ పక్షి తృణ గుల్మలతాది సర్వజీవులకును సూర్యుం డాత్మ యగుచు నుండు.

5.2-76-కంద పద్యము

కర మనురాగంబున నీ
ధరణీమండలము సంవిధానం బెల్ల
న్నెఱిఁగించితి నింతియ కా
దెఱిఁగించెద దివ్యమాన మెల్ల నరేంద్రా!

## 5.2-5-భగణ విషయము

5.2-77-ఆటవెలది

కమలజాండ మధ్యగతుఁడైన సూర్యుండు
భరితమైన యాతపంబుచేత
మూఁడు లోకములను ముంచి తపింపంగఁ
జేసి కాంతి నొందఁజేయుచుండు.

5.2-78-వచనము

ఇట్లు భాస్కరుం డుత్తరాయణ దక్షిణాయన విషువు లను నామంబులు గల మాంద్య తీవ్ర సమానగతుల నారోహణావరోహణ స్థానంబుల యందు దీర్ఘ హ్రస్వ సమానంబులుగాఁ జేయుచుండు.

5.2-79-ఆటవెలది

మేషతులల యందు మిహిరుం డహోరాత్ర
మందుఁ దిరుగు సమవిహారములను;
బరఁగఁగ వృషభాది పంచరాసులను నొ
క్కొక్క గడియ రాత్రి దక్కి నడచు.

5.2-80-ఆటవెలది

మించి వృశ్చికాది పంచరాసులను నొ
క్కొక్క గడియ రాత్రి నిక్కి నడచు;
దినములందు నెల్ల దిగజారు నొక్కొక్క
గడియ నెలకుఁ దత్ప్రకారముననను.

5.2-81-వచనము

మఱియు; నివ్విధంబున దివసంబు లుత్తరాయణ దక్షిణాయనంబుల వృద్ధిక్షయంబుల నొంద నొక్క యహోరాత్రంబున నేకపంచాశదుత్తరనవ కోటి యోజనంబుల పరిమాణంబు గల మానసోత్తర పర్వతంబున సూర్యరథంబు దిరుగుచుండు; నా మానసోత్తరపర్వతంబు నందుఁ దూర్పున దేవధాని యను నింద్రపురంబును, దక్షిణంబున సంయమని యను యమ నగరంబును, పశ్చిమంబున నిమ్లోచని యను వరుణ పట్టణంబును, నుత్తరంబున విభావరి యను సోముని పుటభేదనం బును దేజరిల్లుచుండు; నా పట్టణంబుల యందు

నుదయ మధ్యాహ్న స్తమయ నిశీథంబు లనియెడు కాలభేదంబులను, భూత ప్రవృత్తి నిమిత్తం బచ్చటి జనులకుఁ బుట్టించు చుండు; సూర్యం డెపు డింద్ర నగరంబున నుండి గమనించు నది యాదిగాఁ బదియేను గడియలను రెండుకోట్ల ముప్పదియేడులక్షల డెబ్బదియైదువేల యోజనంబులు నడచు; నివ్విధంబున నింద్ర యమ వరుణ సోమ పురంబుల మీఁదఁ జంద్రాది గ్రహ నక్షత్రంబులం గూడి సంచరించుచుం బండ్రెండంచులు, నాఱు గమ్ములును, మూఁడు దొలులుం గలిగి సంవత్సరాత్మకంబయి యేకచక్రం బయిన సూర్యుని రథంబు ముహూర్త మాత్రంబున ముప్పది నాలుగులక్షల నెనమన్నూఱు యోజనంబులు సంచరించు.

5.2-82-సీస పద్యము

ఇనురథంబున కున్న యిరుసొక్కటియ మేరు; శిఖరంబునందును జేరి యుండు;
నొనరఁ జక్రము మానసోత్తర పర్వతం; బందులఁ దిరిగెడు నా రథంబు
నిరుసున నున్న రెం డిరుసులు దగులంగఁ; బవన పాశంబుల బద్ధ మగుచు
ధ్రువమండలంబు నందుల నంటియుండఁగా; సంచరించుచునుండు సంతతంబు;

5.2-82.1-తేటగీతి

నట్టి యరదంబు ముప్పదియాఱులక్ష
లందు నంటిన కాడిఁయు నన్ని యోజ
నముల విస్తారమై తురంగముల కంధ
రములఁ దగులుచు వెలుఁగొందు రమణతోడ.

5.2-83-వచనము

ఆ రథంబునకు గాయత్రీచ్ఛందం బాదిగా సప్తచ్ఛందంబులు నశ్వంబులై సంచరించు; భాస్కరునకు నగ్రభాగంబున నరుణుండు నియుక్తుండై రథంబు గడపుచుండు; వెండియు నంగుష్ఠపర్వమాత్ర శరీరంబులుగల యఱువదివేల వాలఖిల్యాఖ్యు లగు ఋషివరులు సూర్యుని ముందట సౌరసూక్తంబుల స్తుతియింప, మఱియు ననేక మునులును గంధర్వ కిన్నర కింపురుష నాగాప్సరః పతంగాదులును నెలనెల వరుస క్రమంబున సేవింపం, దొమ్మిదికోట్ల నేబఁది యొక లక్ష యోజనంబుల పరిమాణంబు గల భూమండలంబు నం దొక క్షణంబున సూర్యుండు రెండువేలయేబది యోజనంబులు సంచరించుచు, నొక యహోరాత్రంబు నందె యీ భూమండలం బంతయు సంచరించు" ననిన శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

5.2-84-కంద పద్యము

మునివర! మేరుధ్రువులకు
నొనరఁ బ్రదక్షిణము దిరుగుచుండెడు నజుఁ డా
యినుఁ డభిముఖుఁడై రాసుల
కనుకూలత నేగు నంటి; వది యెట్లొప్పున్.

5.2-85-కంద పద్యము

అని పలికిన భూవరునిం
గనుగొని శుకయోగి మిగులఁ గరుణాన్వితుఁడై
మనమున శ్రీహరిఁ దలఁచుచు
విను మని క్రమ్మఱఁగ నిట్లు వినిపించెఁ దగన్.

5.2-86-వచనము

నరేంద్రా! యతి వేగంబునఁ దిరుగుచుండు కులాల చక్రంబు నందు జక్ర
భ్రమణంబునకు వేఱైన గతి నొంది బంతిసాగి తిరిగెడు పిపీలకాదుల చందంబున
నక్షత్రరాసులతోడం గూడిన కాలచక్రంబు ధ్రువమేరువులం బ్రదక్షిణంబు
దిరుగునపు డా కాలచక్రంబు నెదుర సంచరించు సూర్యాదిగ్రహంబులకు
నక్షత్రాంతరంబుల యందును రాశ్యంతరంబుల యందు నునునికి గలుగుటం జేసి
సూర్యాది గ్రహంబులకుఁ జక్రగతి స్వగతులవలన గతిద్వయంబు గలుగుచుండు;
మఱియు నా సూర్యుం డాదినారాయణమూర్తి యగుచు లోకంబుల
యోగక్షేమంబులకు వేదత్రయాత్మకంబై కర్మసిద్ధి నిమిత్తంబై దేవర్షి గణంబులచేత
వేదాం తార్థంబుల ననవరతంబు వితర్క్యమాణం బగుచున్న తన స్వరూపంబును
ద్వాదశ విధంబులుగ విభజించి వసంతాది ఋతువుల నాయా కాలవిశేషంబుల
యందుఁ గలుగఁ జేయుచుండు; నట్టి పరమ పురుషుని మహిమ నీ లోకంబున
మహాత్ములగు పురుషులు దమతమ వర్ణాశ్రమాచారముల చొప్పున వేదోక్త
ప్రకారంబుగా భక్త్యతిశయంబున నారాధించుచు క్షేమంబు నొందుచుందు; రట్టి
యాదినారాయణమూర్తి జ్యోతిశ్చక్రాంతర్వర్తియై స్వకీయ తేజఃపుంజదీపితాఖిల
జ్యోతిర్గణంబులు గలవాడై ద్వాదశరాసుల యందు నొక సంవత్సరంబున
సంచరించుచుండు; నట్టి యాదిపురుషుని గమన విశేషకాలంబును లోకు లయన
ఋతు మాస పక్ష తిథ్యాదులచే వ్యవహరించుచుందురు; మఱియు
నప్పరమపురుషుం డా రాసుల యందు షష్ఠాంశ సంచారంబు నొందిన
సమయంబును ఋతు వని వ్యవహరింపుదు; రా రాసుల యందు నర్థాంశ
సంచారమ్మున రాశిషట్కభోగల బొందిన తఱి యయనం బని చెప్పుదురు;
సమగ్రంబుగా రాశుల యందు సంచార మొందిన యెడల నట్టి కాలంబును
సంవత్సరం బని నిర్ణ యింపుదు; రట్టి సమగ్రరాశి సంచారంబునందు శీఘ్రగతి

మందగతి సమగతు లనియెడు త్రివిధగతి విశేషంబులవలన వేఱుపడెడు నా వత్సరంబును సంవత్సరంబు పరివత్సరం బిడావత్సరం బనువత్సరం బిద్వత్సరం బని పంచవిధంబులఁ జెప్పుదురు; చంద్రుండు నీ తెఱంగున నా సూర్యమండలంబు మీఁద లక్షయోజనంబుల నుండి సంవత్సర పక్ష రాశి నక్షత్ర భుక్తులు గ్రహించుచు నగ్రచారియై శీఘ్ర గతిం జరించునంత వృద్ధిక్షయరూపంబునం బితృగణంబులకుఁ బూర్వ పక్షాపరపక్షంబులచేత నహోరత్రంబులఁ గలుఁగఁ జేయుచు సకలజీవ ప్రాణంబై యొక్క నక్షత్రంబు త్రింశన్ముహూర్తంబు లనుభవించుచు షోడశ కళలు గలిగి మనోమయాన్నమ యామృతమయ దేహుండై దేవ పితృ మనుష్య భూత పశు పక్షి సరీసృప వీరుత్ప్ర భృతులకుఁ బ్రాణాప్యాయనశీలుం డగుటంజేసి సర్వసముం డనంబడు.

5.2-87-కంద పద్యము

చందురునకు మీఁదై యా

నందంబున లక్ష యోజనంబులఁ దారల్

క్రందుకొని మేరు శైలం

బంది ప్రదక్షిణము దిరుగు నభిజిద్భముతోన్.

5.2-88-సీస పద్యము

అట మీఁదఁ దారల కన్నిటి కుపరి యై;

రెండులక్షల శుక్రుఁ డుండి భాస్క

రుని ముందఱం బిఱుఁదను సామ్యమ్ముదు శీఘ్ర;

సంచారములను భాస్కరుని మాడ్కిఁ

జరియించుచుండును జనులకు ననుకూలుఁ;

డై వృష్టి నొసఁగుచు నంతనంతఁ
జతురత వృష్టి విష్కంభక గ్రహశాంతి;
నొనరించువారల కొసఁగు శుభము;

5.2-88.1-తేటగీతి

లుండు నా మీఁద సౌమ్యుండు రెండులక్ష
లను జరించుచు రవిమండలంబుఁ బాసి
కానఁబడినను జనులకు క్షామ డాంబ
రాది భయములఁ బుట్టించు నతుల మహిమ

5.2-89-సీస పద్యము

ధరణీతనూజుఁ డంతటిమీఁద రెండుల;
క్షల నుండి మూఁడు పక్షముల నొక్క
రాశి దాఁటుచు నుండుఁ; గ్రమమున ద్వాదశ;
రాసుల భుజియించు రాజసమున;
వక్రించియైన నవక్రత నైనను;
దఱచుగాఁ బీడలు నరుల కొసఁగు;
నంగారకుని టెంకి కావల రెండుల;
క్షల యోజనంబుల ఘనత మించి

5.2-89.1-ఆటవెలది

యొక్క రాశినుండి యొక్కొక్క వత్సరం
బనుభవించుచుండు నమరగురుఁడు

వక్రమందు నైన వసుధామరులకును
శుభము నొసఁగు నెప్పుడు నభినవముగ.

5.2-90-కంద పద్యము
సురగురునకు మీఁదై భా
స్కరసుతుఁ డిరు లక్షలను జగములకు బీడల్
జరపుచుఁ ద్రింశన్మాసము
లరుదుగ నొక్కొక్క రాశియందు వసించున్.

5.2-91-కంద పద్యము
ప్రాకటముగ రవి సుతునకు
నేకాదశలక్షలను మహీసురులకు నీ
లోకులకు మేలు గోరుచుఁ
జోకగ మునిసప్తకంబు నొంపు వహించున్.

5.2-92-కంద పద్యము
మునిసప్తకమున కెగువం
దనరుచు నా మీఁదఁ ద్రియుతదశలక్షలఁ బెం
పున శింశుమారచక్రం
బనఁగా నిన్నిఁటికి నుపరి యగుచుండు నృపా!

5.2-93-సీస పద్యము
ఆ శింశుమారాఖ్యమగు చక్రమున భాగ;
వతుఁడైన ధ్రువుఁ డింద్ర వరుణ కశ్య

పప్రజాపతి యమప్రముఖులతోఁ గూడి;
 బహుమానముగ విష్ణుపదముఁ జేరి
కణఁక నిచ్చలుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచుఁ;
 జెలఁగి యుండును గల్పజీవి యగుచు;
ననఘుఁ డుత్తాన పాదాత్మజుఁ డార్యుఁడు;
 నయిన యా ధ్రువుని మహత్త్వ మెల్లఁ

5.2-93.1-తేటగీతి

దెలిసి వర్ణింప బ్రహ్మకు నలవిగాదు
నే నెఱింగినయంతయు నీకు మున్న
తెలియఁ బలికితిఁ; గ్రమ్మఱఁ దలఁచికొనుము
జితరిపువ్రాత! శ్రీపరీక్షిన్నరేంద్ర!

5.2-94-వచనము

మఱియు నా ధ్రువుండు గాలంబుచేత నిమిషమాత్రం బెడలేక సంచరించు జ్యోతిర్గ్రహ నక్షత్రంబులకు నీశ్వరునిచేత ధాన్యాక్రమణంబునఁ బశువులకై యేర్పఱిచిన మేధిస్తంభంబు తెఱంగున మేటిగాఁ గల్పింపంబడి ప్రకాశించుచుండు; గగనంబు నందు మేఘంబులును శ్యేనాది పక్షులును వాయువశంబునం గర్మసారథులై చరించు తెఱంగున జ్యోతిర్గణంబులును బ్రకృతిపురుష యోగ గృహీతాశులై కర్మనిమిత్తగతి గలిగి వసుంధరం బడకుందురు.

5.2-95-కంద పద్యము

పొందుగ జ్యోతిర్గణముల
నందఱ నా శింశుమారమందుల నుండం

గొందఱు దఱచుగఁ జెప్పుచు
నుందురు; వినిపింతు, విను మనూనచరిత్రా!

5.2-96-కంద పద్యము

తల క్రిందై వట్రువ యై
సలలితమగు శింశుమార చక్రము నందున్
సెలకొని పుచ్ఛాగ్రంబున
నిలిచి ధ్రువుం డుండు నెపుడు నిర్మల చరితా!

5.2-97-వచనము

మఱియు; నా శింశుమార చక్రపుచ్ఛంబునఁ బ్రజాపతియు నగ్నీంద్ర ధర్ములును, బుచ్ఛమూలంబున ధాతృవిధాతలును, గటిప్రదేశంబున ఋషిసప్తకంబును, దక్షిణావర్తకుండలీభూతభూత శరీరంబునకు నుదగయన నక్షత్రంబులును, దక్షిణపార్శ్వంబున దక్షిణాయన నక్షత్రంబులును, బృష్ఠంబున దేవమార్గంబును, నాకాశగంగయు నుత్తర భాగంబునఁ బునర్వసు పుష్యంబులును, దక్షిణభాగంబున నార్ద్రాశ్లేష లును, దక్షిణ వామ పాదంబుల నభిజి దుత్తరాషాఢలును, దక్షిణ వామ నాసారంధ్రంబుల శ్రవణ పూర్వాషాఢలును, దక్షిణ వామ లోచనంబుల ధనిష్ఠా మూలలును, దక్షిణ వామ కర్ణంబుల మఘాద్యష్ట నక్షత్రంబులును, వామ పార్శ్వంబున దక్షిణాయనంబును, దక్షిణ పార్శ్వంబునఁ గృత్తికాది నక్షత్ర త్రయంబును, నుత్తరాయణంబును, వామ దక్షిణ స్కంధంబుల శతభిగ్జ్యేష్ఠలును, నుత్తర హనువున నగస్త్యుండును, నపర హనువున యముండును, ముఖంబున నంగారకుండును, గుహ్యంబున శనైశ్చర్యుండును, మేఢ్రంబున బృహస్పతియును, వక్షంబున నాదిత్యుండును,

నాభిని శుక్రుండును, మనంబునం జంద్రుండును, స్తనంబుల నాశ్వినులును, ఘ్రాణాపానంబుల బుధుండును, గళంబున రాహువును, సర్వాంగంబులఁ గేతుగ్రహంబును, రోమంబులఁ దారలును నుండు; నది సర్వదేవతామయంబైన పుండరీకాక్షుని దివ్యదేహంబు ధ్రువునింగా నెఱుంగుము.

5.2-98-సీస పద్యము

ఇట్టి దివ్యశరీర మెవ్వఁడు ప్రతిదినం;
 బందు సంధ్యాకాల మతులభక్తి
మనమందు నిలిపి యేమఱక మిక్కిలి ప్రయ;
 త్నంబున నియతుఁడై తత్త్వబుద్ధి
మౌనవ్రతంబునఁ బూని వీక్షించుచు;
 నీ సంస్తవంబు దానెంతొ ప్రేమ
జపియించి కడుఁ బ్రశస్తమును మునీంద్ర సే;
 వ్యమును జ్యోతిస్స్వరూపమున వెలుఁగు

5.2-98.1-ఆటవెలది

విపుల శింశుమార విగ్రహంబునకు వం
దనము వందనంబు లనుచు నిలిచి
సన్నుతించెనేని సకలార్థసిద్ధులఁ
బొందు మీఁద ముక్తిఁ జెందు నధిప!

5.2-99-కంద పద్యము

ఇనమండలంబునకుఁ గ్రిం
దను దశసాహస్ర యోజనంబుల స్వర్భా

నుని మండలంబు గ్రహమై
ఘనముగ నపసవ్యమార్గగతి నుండు నృపా!

5.2-100-కంద పద్యము

అసురాధముఁడగు రాహువు
బిసరుహసంభవుని వరము పెంపున నెంతో
పసయగు నమరత్వంబున
నసమానంబైన గ్రహవిహారముఁ బొందెన్

5.2-101-సీస పద్యము

జననాథ! రాహువు జన్మకర్మంబులు;
 వినిపింతు ముందఱ విస్తరించి
యయుత యోజన విస్తృతార్క మండలము ద్వి;
 షట్సహస్ర విశాల చంద్రమండ
లముఁ బర్వకాలంబులను ద్రయోదశ సహ;
 స్ర విశాలమై మీఁద రాహు గప్పు
నది చూచి యుపరాగ మనుచును బలుకుదు;
 రెల్ల వారును స్వధర్మేచ్ఛ లగుచు;

5.2-101.1-ఆటవెలది

నంతలోన నినశశాంక మండలములఁ
గరుణఁ బ్రోవఁదలచి హరిసుదర్శ
నంబు వచ్చునను భయంబున నై దాఱు
గడియలకును రాహు నడుఁకి తొలఁగు.

5.2-102-కంద పద్యము

నరవర! యా రాహువునకు
సరసత నా క్రింద సిద్ధ చారణ విద్యా
ధరు లయుత యోజనంబులఁ
దిరముగ వసియించి లీలఁ దిరుగుదు రచటన్.

5.2-103-కంద పద్యము

పరికింప సిద్ధ విద్యా
ధరులకుఁ బదివేలు క్రింద దరలక యక్షుల్
మఱియును భూతప్రేతలు
జరియింతురు రాక్షసులు పిశాచులు గొలువన్.

5.2-104-ఆటవెలది

వారి క్రిందఁ దగిలి వాయువశంబున
మలయుచుండు మేఘమండలంబు
మేఘమండలంబు మీఁ దగుచుండు భూ
మండలంబు క్రిందనుండు నధిప!

## 5.2-6-పాతాళ లోకములు

5.2-105-వచనము

అట్టి భూమండలంబు క్రింద యోజనాయుతాంతరంబున నండకటాహాయామంబు గలిగి క్రమంబున నొండొంటికిం గ్రిందగుచు నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళలోకంబు లుండు; నట్టి బిల స్వర్గంబుల యందు నుపరి

స్వర్గంబున కధికం బైన కామ భోగంబుల నైశ్వర్యానందంబులను సుసమృద్ధ వనోద్యాన క్రీడా విహార స్థానంబు లననుభవించుచు దైత్య దానవ కాద్రవేయాది దేవయోనులు నిత్య ప్రముదితానురక్తు లగుచుఁ గళత్రాపత్య సుహృద్బంధు దాసీదాస పరిజనులతోఁ జేరుకొని మణిగణ ఖచితంబులగు నతిరమణీయ గృహంబులయందు నీశ్వరునివలనం జేటు లేని కాయంబులు గలిగి వివిధ మాయావిశేష వినిర్మిత నూతన కేళీసదన విహారణమండప విచిత్రోద్యానాదుల యందుఁ గేళీవినోదంబులు సలుపుచుఁ జరియింతురు; అంత.

5.2-106-సీస పద్యము

అట్టి పాతాళంబులందును మయకల్పి; తములగు పుటభేదనముల యందు
బహురత్ననిర్మిత ప్రాకార భవన గో; పుర సభా చైత్య చత్వరవిశేష
ముల యందు నాగాసురుల మిథునములచే; శుక పిక శారికానికర సంకు
లముల శోభిల్లు కృత్రిమ భూములను గల; గృహములచే నలంకృతము లగుచు

5.2-106.1-ఆటవెలది

కుసుమచయ సుగంధి కిసలయ స్తబక సం
తతులచేత ఫలవితతులచేత
నతులరుచిర నవలతాంగనాలింగిత
విటపములను గలుగు విభవములను.

5.2-107-వచనము

మఱియు మానసేంద్రియంబుల కానందకరంబులైన నానావిధ జలవిహంగమ మిథునంబులు గలిగి నిర్మలజలపూరితంబులై మత్స్యకుల సంచార క్షుభితంబులైన కుముద కువలయ కహ్లార లోహిత శతపత్రాదికంబులఁ

దేజరిల్లెడు సరోవరంబులుగల యుద్యానవనంబుల యందుఁ గృతనికేతనులై స్వర్గభూముల నతిశయించిన వివిధ విహారంబులు గలిగి యహోరాత్రాది కాలవిభాగ భయంబులు లేక మహాహిప్రవరుండయిన శేషుని శిరోమణి దీధితులచే నంధకారోపద్రవంబు లేక యెల్లప్పుడు దివసాయమానంబుగా నుండు; నా లోకంబు నందు నఖిల జనులు దివ్యౌషధి రస రసాయనంబుల ననవరతంబు నన్నపానంబులుగా సేవించుటం జేసి యచ్చటివారలకు నాధివ్యాధులును, వలితపలితంబులును, జరారోగంబులును, శరీరవైవర్ణ్యంబులును, స్వేదదౌర్గం ధ్యంబులును, గలుగక పరమకల్యాణమూర్తు లగుచు హరిచక్రభయంబు దక్క నన్యంబగు మృత్యుభయంబు నొందక యుందురు; అదియునుం గాక.

5.2-108-తేటగీతి

అట్టి పాతాళలోకంబునందు విష్ణు
చక్ర మెప్పుడేనిని బ్రవేశంబు నొందు
నప్పుడెల్లను దైత్యకులాంగనలకు
గర్భసంపద లందంద కరఁగుచుండు.

5.2-109-చంపకమాల

అతలమునందు నమ్మయుని యాత్మజుఁడైన బలాసురుండు స
మ్మతిఁ జరియించు షణ్ణవతి మాయలఁ గూడి వినోద మందుచుం
గుతలములందు నేఁడు నొక కొందఱు నచ్చటి మాయఁ జెంది సం
తతముఁ జరించుచుండుదురు దప్పక మోహనిబద్ధ చిత్తులై.

5.2-110-వచనము

అట్టి బలుని యావలింతలను స్వైరిణులు కామినులు పుంశ్చలు లను స్త్రీ గణంబులు జనియించి; రా కామినీ జనంబులు పాతాళంబుఁ బ్రవేశించిన పురుషునికి హాటకరసం బనియెడు సిద్ధరసఘుటిక నిచ్చి రససిద్ధునిం గావించి యతనియందు స్వవిలాసావలోక నానురాగ స్మిత సల్లాపోపగూహ నాదుల నిచ్ఛా విహారంబులు సలుపుచుండ నా పురుషుండు మదాంధుండై తానె సిద్ధుండ ననియును నాగాయుత బలుండ ననియును దలంచి నానావిధ రతిక్రీడలఁ బరమానందంబు నొందుచుండు.

5.2-111-సీస పద్యము

హాటకేశ్వరుఁడైన యంబికాధీశుండు;
 వితలంబునందుల వేడ్క నిలిచి
తనదు పార్షద భూతతతులతో బ్రహ్మస;
 ర్గోపబృంహణమున నొక్కచోటఁ
బార్వతీ సంభోగపరుఁ డగుచుండఁగా;
 వారల వీర్యంబువలనఁ బుట్టి
నట్టిది హాటకి యనియెడు నది యని;
 లాగ్నులు భక్షించి యందు నుమియ

5.2-111.1-తేటగీతి

నదియు హాటక మను పేర నతిశయిల్లి
వన్నె మీఱుచు శుద్ధ సువర్ణమయ్యె
నా సువర్ణంబు నా లోకమందు నున్న
జనుల కెల్లను వినుత భూషణము లయ్యె.

5.2-112-సీస పద్యము

ఆ క్రింది సుతలంబు నందు మహాపుణ్యుఁ;
డగు విరోచనపుత్త్రుఁడైన యట్టి
బలిచక్రవర్తి యా పాకశాసనునకు;
ముద మొసంగఁగఁగోరి, యదితి గర్భ
మున వామనాకృతిఁ బుట్టి యంతటఁ ద్రివి;
క్రమ రూపమునను లోకత్రయంబు
నాక్రమించిన దానవారాతిచేత ముం;
దటన యీఁబడిన యింద్రత్వ మిట్లు

5.2-112.1-ఆటవెలది

గలుగువాఁడు పుణ్యకర్మసంధానుండు
హరిపదాంబుజార్చ నాభిలాషుఁ
డగుచు శ్రీరమేశు నారాధనము చేయు
చుండు నెపుడు నతి మహోత్సవమున.

5.2-113-వచనము

నరేంద్రా! సకలభూతాంతర్యామియు దీర్ఘభూతుండును నయిన వాసుదేవుని యందుఁ జిత్తంబు గలిగి యిచ్చిన భూదానంబునకు సాక్షాత్కరించిన మోక్షంబు ఫలం బగుం; గాని పాతాళస్వర్గ రాజ్యంబులు ఫలంబులు గానేరవు; అయిన నెవ్వరికిని మోక్షంబు సాక్షాత్కృతంబు గాకుండుటంజేసి లోకప్రదర్శనార్థంబు పాతాళ స్వర్గరాజ్యంబుల నిచ్చె; క్షుత పతన ప్రస్థలనాదు లందును వివశుండైన యెడల నామస్మరణంబు చేయు పురుషుండు గర్మబంధంబువలన విముక్తుం

డగుచు సుజ్ఞానంబునం బొందు; నట్టి వాసుదేవుం డాత్మజ్ఞాన ప్రవోషణంబు జేయు మాయామయంబు లైన భోగైశ్వర్యంబుల నెల్ల నెట్లొసంగు ననవలదు; భగవంతుండు యాచనజేసి సకల సంపదలఁ జేకొని శరీరమాత్రావశిష్టునిం జేసి వారుణ పాశంబులం గట్టి విడిచినప్పుడు బలీంద్రు డిట్లనియె.

5.2-114-సీస పద్యము

పరమేశ్వరునకు నెప్పటి పదార్థములందు;
 దృష్ణ లేకుండుట దెలిసినాఁడ
నింద్రాదులెల్ల నుపేంద్రునిఁ బ్రార్థించి;
 యడిగిరి గాని శ్రీహరికిఁ గోరి
కలు లేవు; మిక్కిలి గంభీరమగు మహా;
 కాల స్వభావంబు గలుగుచుండు
నరయంగ మన్వంతరాధిపత్యమును లో;
 కత్రయంబును నెంత గాన తలప

5.2-114.1-ఆటవెలది

మత్పితామహుండు మానవంతుండు ప్ర
హ్లాద విభునిఁ జూచి హర్షమంది
యొద్దియైనఁ గోరు మిచ్చెద ననుటకు
నంతలోన నీశ్వరాజ్ఞఁ దెలిసి.

5.2-115-వచనము

ఇట్లు కృతార్థుండై పిత్ర్యం బయిన రాజ్యంబు నొల్లక పరమేశ్వరు దాస్యంబ కోరె, నా ప్రహ్లాద చరిత్ర కథనావసరమ్మున నీ తండ్రికిని నీకును విశేషంబుగా నే

పురుషుండు భగవదనుగ్రహంబుఁ బొంద నోపు" నని పుండరీకాక్షుం డానతిచ్చిన వాక్యంబులు వక్ష్యమాణ గ్రంథంబున విస్తరించెద; నా బలిచక్రవర్తి గృహద్వారంబున నఖిలలోకగురుం డయిన శ్రీమన్నారాయణుండు గదాపాణియును నిజజనానుకంపితుండును శంఖచక్రాద్యాయుధ ధరుండును, నగుచు నిప్పుడును దేజరిల్లుచుండు; నట్టి బలిద్వారంబున లోకంబుల గెలువ నిచ్చగొన్న దశగ్రీవుం డుల్లంఘిత శాసనుండై ప్రవేశంబు గావింప నయ్యాది పురుషుండు దన పాదాంగుష్ఠంబున యోజనాయు తాయుతంబులం బాఱం జిమ్మె; వినుము.

5.2-116-కంద పద్యము

ఆ సుతలమునకుఁ గ్రిందై
భాసిల్లుఁ దలాతలంబు; ప్రభు వందు మయుం
డా సురపుర నిర్మాతగ
వాసిగఁ బొగడొంది యేలు వసుధాధీశా!

5.2-117-చంపకమాల

పురహరుచే రమేశ్వరుఁడు భూతహితార్థముగాఁ బురత్రయం
బరుదుగ నీఱు జేసె; శరణాగతు నా మయుఁ గాచి యెంతయుం
గరుణఁ దలాతలంబునకుఁ గర్తగ నిల్పిన నున్నవాఁడు శ్రీ
ధరుని సుదర్శనంబునకుఁ దప్పి విముక్తభయుండు గాఁ దగన్.

5.2-118-కంద పద్యము

తలఁపఁగ నా క్రింద మహా
తలమునఁ గద్రువవధూటి తనయులు సర్పం

బులు గలవు పెక్కు శిరములు
నలరంగాఁ గ్రోధవశగణావళి యనఁగన్.

5.2-119-వచనము

మఱియును గుహక తక్షక కాళియ సుషేణాది ప్రధాను లయిన వార లతుల శరీరంబులు గలిగి యాదిపురుషుని వాహనం బైన పతగరాజ భయంబున ననవరతంబు నుద్వేజితు లగుచు స్వకళత్రా పత్య సుహృద్బాంధవ సమేతు లయి యుండుదు; రా క్రింద రసాతలంబున దైత్యులు దానవులు నగు నివాత కవచ కాలకేయు లను హిరణ్యపుర నివాసులగు దేవతాశత్రువులు మహా సాహసులును దేజోధికులును నగుచు సకల లోకాధీశ్వరుండైన శ్రీహరితేజంబునం బ్రతిహతులై వల్మీకంబు నందు నడంగి యున్న సర్పంబుల చందంబున నింద్రదూత యగు సరమచేఁ జెప్పబడెడు మంత్రాత్మక వాక్యంబులకు భయంబు నొందు చుండుదురు.

5.2-120-కంద పద్యము

ఇందుకులోద్భవ! వినుమా
క్రిందటి పాతాళమునను గ్రీడించుచు నా
నందము నొందుచు నుండును
సందడిఁబడి నాగకులము చతురత తోఁడన్.

5.2-121-వచనము

ఇట్లు వాసుకి ప్రముఖులైన శంఖ కుళిక మహాశంఖ శ్వేత ధనంజయ ధృతరాష్ట్ర శంఖచూడ కంబళాశ్వతర దేవదత్తాదు లయిన మహానాగంబు లైదు నేడు పది

నూఱు వేయి శిరంబులు గలిగి ఫణామణికాంతులం జేసి పాతాళ తిమిరంబును బాపుచుండురు.

5.2-122-సీస పద్యము

పాతాళలోకంబు పాఁతున శేషుండు;
వెలయంగ ముప్పదివేల యోజ
నంబుల వెడలుపునను దోఁకఁ జుట్టగా;
జుట్టుక యుండు; విష్ణుని మహోగ్ర
మైన శరీరంబు; దానై యనంతాఖ్య;
సంకర్షణుం డుండు సంతతంబు;
నట్టి యనంత నామాభిధానుని మస్త;
కమున సిద్ధార్థంబు కరణి ధరణి;

5.2-122.1-ఆటవెలది

యుంత నా విభుండు నఖిలలోకంబుల
సంహరింపఁగోరి చండకోప
వశత సృజనఁ జేయు వరుస నేకాదశ
రుద్రమూర్తు లనెడు రౌద్రమతుల.

5.2-123-ఆటవెలది

అట్టి రుద్రమూర్తు లతుల త్రినేత్రులు
నఖిలశూల హస్తు లగుచు నుందు;
రందు నున్న ఫణికులాధిపుల్ శేషుని
పాదపంకజముల భక్తిఁ జేరి.

5.2-124-ఆటవెలది

నమ్రు లగుచు ననుదినంబును మౌళి ర
త్న ములచేతఁ గడు ముదంబు నొంది
కోరికలు దలిర్ప నీరాజనంబుల
నిచ్చుచుండు రెపుడు మచ్చికలను.

5.2-125-వచనము

మఱియు; నా సంకర్షణమూర్తిం జేరి నాగకన్యకలు కోరికలు గల వార లగుచు నొప్పెడి శరీర విలాసంబులం జేసి యగరు చందన కుంకుమ పంకంబు లనులేపనంబులు చేయుచు సంకర్షణమూర్తి దర్శన స్పర్శనాదులను నుద్బోధిత మకరధ్వజావేశిత చిత్తంబుల గలిగి చిఱునవ్వు లొలయ నధికాభిలాషం జేసి స్మితావలోకనంబుల సవ్రీడితలై యవలోకించుచుండ ననంత గుణంబులు గల యనంతదేవుం డుపసంహరింపం బడిన క్రోధంబు గలిగి లోకంబులకు క్షేమంబు గోరుచు సురాసుర సిద్ధ గంధర్వ విద్యాధర ముని గణంబులనవరతంబు ధ్యానంబు జేయ సంతత సంతోషాతిశయంబున మ్రాఁగన్నుబెట్టుచు, సలలిత గీతావాద్యంబుల నానందంబు నొందుచుఁ దన పరిజనంబుల నతిస్నేహంబున నవలోకించుచు నవతులసీగంధ పుష్పరసామోదిత మధుకరవ్రాత మధుర గీతంబులు గల వైజయంతీవనమాలికల ధరియించుచు నీలాంబర ధరుండును హలధరుండును నగుచు నితండు మహేంద్రుండో? హరుండో? యనుచు జనంబులు పలుకుచుండఁ గాంచనాంబర ధరుం డై ముముక్షువులు ధ్యానంబులు చేయ నధ్యాత్మ విద్యా యుక్తం బయిన యానంద హృదయ గ్రంథిని భేదించు నట్టి శేషుని స్వాయంభువుండగు నారదుండు తుంబురు ప్రభృతు లగు

ఋషిశ్రేష్ఠులతోఁ జేరుకొని కమలాసనుని సభాస్థానమునందు నిట్లు స్తుతియించుచుండు.

5.2-126-సీస పద్యము

ఒలిమై నెవ్వని లీలావినోదముల్;
 జన్మ సంరక్షణ క్షయములకును
హేతువు లగుచుండు, నెవ్వని చూపుల;
 జనియించె సత్త్వరజస్తమంబు
లెవ్వని రూపంబు లేకమై బహువిధం;
 బులను జగత్తులఁ బ్రోచుచుండు,
నెవ్వని నామంబు లెఱుఁగక తలఁచిన;
 యంతన దురితంబు లఁడఁగుచుండు,

5.2-126.1-తేటగీతి

నట్టి సంకర్షణాఖ్యుండు నవ్యయుండు
నైన శేషుని వినుతి జేయంగఁ దరమె?
తలఁప నెప్పుడు వాఙ్మనంబులకు నింక
మూఁడు లోకంబులందును భూతతతికి.

5.2-127-ఆటవెలది

మఱియుఁ బెక్కుగతుల మాబోఁటి వారలఁ
బ్రోవ దలఁచి శేషమూర్తి సాత్త్వి
కస్వభావ మొందెఁ గడఁకతో నట్టి శే
షునకు మ్రొక్కుచుందు ననుదినంబు.

5.2-128-వచనము

మఱియు; నా శేషుని నెవ్వండేని నాకస్మికంబుగ నయినను నార్తుం డగుచు నయినను స్మరించినమాత్రన యఖిల పాపంబులం బాసి సకలశ్రేయస్సులం బొందు; నట్టి శేషునినే ముముక్షువు లాశ్రయించి ధ్యానం బొనర్చి భవబంధ నిర్ముక్తు లగుదురు; అతని ఫణంబుల యందు భూగోళం బణుమాత్రం బగుచు నుండు; నతని మహామహిమలు గణుతింప సహస్రజిహ్వాలు గల పురుషుండైన నోపం డని పలుకు చుందు; రా యనంతుండు పాతాళంబున నుండి సకల లోకహితార్థంబు భూమిని ధరియించు" నని లోకతిర్యఙ్మనుష్య గతులను లోకస్థితియును శుకయోగీంద్రుండు వినిపించి "యింక నేమి వినిపింతు నెఱింగింపు" మనినం బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె.

5.2-129-కంద పద్యము

మునివర! లోకచరిత్రం
బనుపమము మహావిచిత్ర మగునట్లుగ నా
కును వినిపించితి వంతయుఁ
బనుపడి నా చిత్తమందుఁ బాయక నిలిచెన్.

5.2-130-వచనము

అనిన శుకయోగీంద్రుం డిట్లనియె.

5.2-131-ఆటవెలది

జంతుజాలములకు శ్రద్ధలు త్రిగుణాత్మ
కములు గాన వారి కర్మగతుల

తారతమ్యములును దగిలి యున్నియు వివి
ధంబు లగుచు సంతతంబు నుండు.

5.2-132-వచనము

నరేంద్రా! ప్రతిషిద్ధలక్షణంబగు నధర్మం బాచరించు నరుని శ్రద్ధ విపరీతంబుగాఁ బ్రవర్తిల్లు నట్టివానికిఁ గలిగెడి కర్మఫలంబును విపరీతంబుగనే యుండుం గావున ననాద్యవిద్యాకామప్రవర్తనల వలనఁ బెక్కు తెఱంగులఁ గలిగెడి కర్మగతుల సంగ్రహంబుగ నెఱింగించెద" ననిన శుకునితోఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

5.2-133-ఆటవెలది

మునివరేణ్య! నరకములు ముజ్జగంబుల
యందొ? యంతరాళమందొ? వెలినొ?
యదియుఁ గాక దేశమందుండు భూవిశే
షముల యందొ? తెలుపు సంతసమున.

5.2-134-వచనము

అనిన శుకయోగీంద్రుం డిట్లనియె.

## 5.2-7-నరక లోక విషయములు

5.2-135-కంద పద్యము

ఎడతెగక ముజ్జగంబుల
కడపల నయ్యామ్యదిశను గదలక నిలుచుం
గడు ఘోరములుగ నరకము
లడరంగా నంతరాళమందుల నధిపా!

5.2-136-వచనము

మఱియును; దక్షిణంబున నగ్నిష్వాత్తాది పితృగణంబులు దమ గోత్రజులకు మేలుగలుగుట కొఱకు సత్యంబులగు నాశీర్వాదంబుల నొసంగుచుండుదు; రచ్చటి పితృపతి యగు శమనుండు దన లోకంబునకుం జనుదెంచు జంతువుల కర్మంబులకుం దగిన ఫలంబుల నిచ్చి శిక్షించుచు నుండు; నందుఁ దామిస్రంబును నంధతామిస్రంబును రౌరవంబును మహారౌరవంబును గుంభీపాకంబును కాలసూత్రంబును నసిపత్రవనంబును సూకర ముఖంబును నంధకూపంబును గ్రిమిభోజనంబును సందంశంబును దప్తోర్మియు వజ్రకంటకశాల్మలియు వైతరణియుఁ బూయోదంబును బ్రాణరోధంబును విశసనంబును లాలాభక్షంబును సారమేయాదనంబును నవీచిరయంబును రేతఃపానంబును నను నేకవింశంతి మహానరకంబులును; మఱియును క్షారకర్దమంబును రక్షోగణభోజనంబును శూలప్రోతంబును దందశూకంబును నవటనిరోధనంబును నపర్యావర్తనంబును సూచీముఖంబును నన సప్తవిధ నరకంబుల తోడం గూడి యష్టావింశతి నరకంబులు గల వని కొందఱు నొడువుదురు; అందు.

5.2-137-కంద పద్యము

పరపుత్రకళత్రంబులఁ
బరికింపక యపహసించు పాపాత్ముఁడు దు
ష్కరపాశబద్ధుఁడై యము
పురుషులచే నధిక బాధఁ బొందుచు నుండున్.

5.2-138-వచనము

మఱియు; నవ్విధంబున బాధితుం డగుచుఁ దామిస్రనరకంబునం బడి యనశనాద్రిపాతన దండతాడన తర్జనాది బాధలం జెంది కడు భయంబున మూర్ఛలం బొందుచుండు.

5.2-139-కంద పద్యము

పరకాంత నెవ్వఁడేనిం
బురుషుం డుండంగ మొఱఁగి పొందిన యమకిం
కరు లతనిఁ బట్టి వడిఁ ద
త్తఱమునఁ బడవైతు రంధతామిస్రమునన్.

5.2-140-వచనము

నరేంద్రా! యెవ్వఁడేనిం గుటుంబపోషణార్థంబు పరులకు ద్రోహంబు జేయు నా నరుండు రౌరవాదినరకంబునం బడు; నెవ్వం డిహలోకంబు నందు స్వేచ్ఛావిహారంబున సంచరించుచుఁ బరోపద్రవ పరాఙ్మఖంబు లయి యుండు పశుపక్షి మృగాదుల బాధించు నాయా మృగంబులు రురురూపంబులఁ దాల్చి యట్టి పాపజనుల నానావిధ యాతనల బాధించుటం జేసి మహా రౌరవ రౌరవనరకంబు లనంబడు; నెవ్వండేని దేహపోషణార్థంబు మూషకాదుల బిలనిరోధంబు జేసి వధించు, నా నిష్కరుణుం డైన పురుషునిం గుంభీపాకనరకంబుల యందుఁ గల తప్తతైలంబులం బెక్కు బాధలం బొందింతురు.

5.2-141-సీస పద్యము

తల్లిదండ్రులకును ధరణీసురులకును;
నహితంబు జేసిన యట్టివాడు

కాలసూత్రం బను కడుఁ దీవ్ర నరకంబు;
నందును నందంద యయుత యోజ
నాయత పాత్రాదు లందుల సూర్యుఁ డా;
మీఁద గ్రిందను వహ్ని మిగుల మండ
నత్యంత క్షుత్పిపాసాదులచేతను;
బాధితుం డగుచుండుఁ బాయ కెపుడుఁ

5.2-141.1-ఆటవెలది

బరువు పెట్టుచున్నఁ బడియున్న నిలిచినఁ
గదలకున్నఁ జాల నొదిగి యున్న
బాధఁ బొందుచుండఁ బశురోమముల లెక్క
వరుస నపరిమేయ వత్సరములు.

5.2-142-వచనము

మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబు లాచరించు పురుషుని నసిపత్రవనంబు నందు యమకింకరులు తఱట్ల నడచుచుఁ బరిహసించుచుం దోలునెడ నా యసిపత్రంబు లిరుగెలంకుల శరీరంబుఁ ద్రెంచుచుండ నడుగడుగున బిట్టు మొఱపెట్టుచుండ బాధించుచుండుదురు.

5.2-143-కంద పద్యము

దండింప దగని వారల
దండించిన విప్రవరుల తనువులు ముట్టం
దండించిన దుర్మతులం
దండింతురు కాలసూత్ర నరకము లందున్.

5.2-144-ఆటవెలది

మఱియు నట్టి దుష్టమానవుఁ గింకరుల్
విఱిచి చెఱకుఁగోల విఱిచినట్లు
బాధపెట్టుచుండఁ బడి మూర్ఛఁ జెందుచు
మొఱలు పెట్టుచుండు భూపవర్య!

5.2-145-వచనము

నరేంద్రా! యెవ్వండేని నీశ్వరకల్పితవృత్తి గల జంతువుల హింసించు నట్టివాని నంధకూపం బను నరకంబునం బడ వైచిన నందు నతండు దొల్లి తాను జేసిన భూత ద్రోహంబున నచ్చట వివిధ క్రూర పక్షి మృగ పశు సర్ప మశక మత్కుణ మక్షికాదులచేత హింసంబొందుచు మహాంధకారంబునందు నిద్రానుభవ సుఖలేశంబును లేక కుశరీరంబు నందుల జీవుండునుం బోలె మృతప్రాయుండై యుండు; అంత.

5.2-146-కంద పద్యము

తన కలిమి నెవ్వఁడేనియుఁ
దన బాంధవవరులఁగూడి తగఁ గుడువక తా
నును వాయసంబు భక్షిం
చిన మాడ్కిం దిన్నవాని శీఘ్రమె యచటన్.

5.2-147-కంద పద్యము

క్రిమిభోజన మనియెడి నర
కమునం బడి క్రిములె కూడుగాఁ గుడుచుచుఁ దాఁ

గ్రిమి యగుచు లక్ష పరిమా
ణముఁ గల క్రిమిగుండ మందు నాఁటుక యుండున్.

5.2-148-వచనము

మఱియు నీ భూలోకంబున నెవ్వఁడేని నవిపన్నుండై చౌర్యవృత్తిచే బ్రాహ్మణాదుల హిరణ్యరత్నాది ద్రవ్యంబుల నపహరించు, నట్టి పురుషుని నగ్ని వర్ణంబులగు నయఃపిండంబుల నగ్ని తప్తంబు లగు శూలంబుల నతని శరీరంబునం దివియుచుండుదురు; మఱియును మదనాతురు లగుచు స్త్రీపురుషు లగమ్యాగమనంబు జేసిరేని నట్టి వారిని యమలోకంబున నతితీక్ష్ణ కశాతాడితులం జేసి యగ్నిమయంబు లయిన యుక్కు ప్రతిమల నాలింగనంబు చేయింతురు.

5.2-149-ఆటవెలది

సర్వజంతుజాల సంగము మొందెడు
వానిఁ బట్టి కట్టి వజ్ర దంష్ట్ర
కములు గలుగునట్టి ఘనతర శాల్మలీ
తరువులందుఁ జేర్చి దంతు రెపుడు.

5.2-150-ఆటవెలది

పార్థివేంద్ర! నరుఁడు పాషండదర్శనుఁ
డగుచు ధర్మమార్గ మడఁచెనేని
వాఁడు నరకమందు వైతరణీనది
నుడుగ కెపుడుఁ బొరలి పడుచునుండు.

5.2-151-వచనము

మఱియు నట్టి వైతరణీనది యందు జలగ్రాహంబులు దిగిచి భక్షింపం బ్రాణంబులు నిర్గమింపఁ దన పాపంబు లుచ్చరించుచు విణ్మూత్ర పూయ శోణిత కేశ నఖాస్థి మేదోమాంస వసా వాహిని యందుఁ దప్తుం డగుచునుండు; విప్రుండు శూద్రకామినులం బొంది శౌచాచారంబులం బాసి గతలజ్జుండై పశువుంబోలె జరియించెనేని నతండు నరకంబునుం బొంది యందుఁ బూయ విణ్మూత్ర లాలా శ్లేష్మ పూర్ణార్ణవమందు ద్రొబ్బంబడి యతి భీభత్సితంబు లగు నా ద్రవ్యంబుల భుజియించుచుండు.

5.2-152-కంద పద్యము

శునకములఁ బెంచి యెవ్వం
డనయంబును వేఁట సలిపి యాత్మార్థముగా
వనమృగములఁ జంపును నా
మనుజాధము నస్త్రములను మర్దింతు రొగిన్.

5.2-153-ఆటవెలది

ద్రవ్యలోభమునను దంభార్థమై పశు
వులను జంపి జన్నములను జేయు
వానిఁబట్టి యమునివారలు గోయుచు
నుందు రెపుడు మిగుల సందడిలుచు.

5.2-154-వచనము

కామమోహితుండై యెవ్వండేనిఁ దన భార్యచేత రేతఃపానంబు చేయించు నా పాపాత్ముని రేతోప్రవాదంబునం ద్రోచి యా రేతంబునె పానంబు జేయింపుదురు;

రాజపుత్రు లైనను జోరు లైనను ధనికుల గ్రామంబులపైఁ బడి యందు గృహదాహంబు జేయువారలను విషాదుల వలన నన్యులఁ జంపెడు వారలను వజ్రదంష్ట్రలు గల వింశత్యుత్తర సప్తశత శునకంబు లెడతెగక తిగిచి భక్షించుచుండు.

5.2-155-సీస పద్యము

లంచంబుఁ గొని సాక్షి వంచించి యనృతంబు;
 పలికెడు పాపాత్ముఁ బట్టి కట్టి
యంత మానకవీచి యను నరకమునందు;
 శతయోజనోన్నత శైల శిఖర
మునఁ దలక్రిందుగా నునిచి యధోముఖం;
 బుగఁ బడద్రొబ్బిన బొబ్బలిడుచుఁ
గల్లోలములు లేని కమలాకరముఁబోలెఁ;
 జదరమై యున్న పాషాణ మందుఁ

5.2-155.1-తేటగీతి

బడిన యంతన దేహంబు పగిలి పెక్కు
తునకలై పాసి యది గూడుకొనుచునుండ
దండి యాకులతను బొందుచుండుఁ గాని
చావులేకుండు నా దుష్ట జంతువునకు.

5.2-156-ఆటవెలది

సోమయాజి భార్యఁ గామించి పొందిన
వానిఁ గపట మద్యపాన సోమ

పాన మనుదినంబుఁ బానంబు జేయు వి
టక్షత్రియులను బట్టి సంభ్రమమున.

5.2-157-ఆటవెలది

ఱొమ్ముఁ దొక్కి మోము ఱిమ్మపట్టఁగ మోది
యనలముఖమునందు నగ్నివర్ణ
ముగను గాఁచి వక్త్రమున నిండఁగా నుక్కు
నీరు వోతు రేచి నిష్ఠురముగ.

5.2-158-వచనము

మఱియు; నీచవర్ణుండు నిష్ఠ సలుపుచుఁ దపోదాన విద్యాచారంబులఁ బెద్దల కవమానంబు జేయువాఁడు క్షారకర్దమంబను నరకంబు నందు నధోముఖుం డగుచు బాధలంబొందు; స్త్రీ పురుషు లెవ్వరేని శరీరరక్షణార్థంబు పశువుల మానవుల బలి యిచ్చిరేని; వారల నిరయంబునందు యమకింకరులు సురియలం దునిమి తద్రక్తంబు పానంబు జేయుచుం బాఱాడుచుందురు; గ్రామారణ్యంబులయందు జంతువుల శూలప్రోతంబులం గావించి హింసించుచు హర్షించుచున్న వారలను శూలసూత్రంబను నరకంబు నందు శూలప్రోతులం జేసిన క్షుత్పిపాసా పరవశులగుచుండఁగంక గృధాదులుదీక్ష్ణతుండాగ్రంబులం దిగిచి భక్షించుచుండు మఱియు ధూర్తస్వభావంబున జంతు పీడనంబుఁ గావించెడు పాపాత్ముల దందశూకం బను నరకంబు నందు పైవ నైదు నేడు ముఖంబుల సర్పంబులు గఱచుచుండు.

5.2-159-ఆటవెలది

ఎనయ దొడ్డిలోన నిండ్లలో నైనను
బశు పతంగ హరిణ పంక్తి నెల్లఁ
బట్టి హింసజేయు పాపాత్ము విషవహ్ని
ధూమశిఖల ద్రొబ్బుదురు నృపాల!

5.2-160-కంద పద్యము

తన యింటికి వచ్చిన మను
జుని నతిథిం గ్రోధదృష్టిఁ జూచిన వానిం
గనుఁగవల వజ్రదంష్ట్రలఁ
దనరిన యా కంక గృధ్రతతి భక్షించున్.

5.2-161-మత్తేభ విక్రీడితము

ధనవంతుండగు మానవుండు గడఁకన్ ధర్మోపకారంబులన్
ఘనతం జేయక యుండెనేని యమలోకంబందు సూచీముఖం
బను నా దుర్గతిఁ బట్టి త్రోఁచి నిధిగా పై యున్న భూతం బటం
చును బాశంబులఁ బట్టి కట్టి వడితో నొప్పింతు రత్యుగ్రులై.

5.2-162-ఆటవెలది

నరవరేణ్య! యిట్టి నరకముల్ యమలోక
మందుఁ గలవు మఱి సహస్ర సంఖ్య;
లందు శమనదూత లనిశంబు బాధింతు
రవని ధర్మదూరు లయిన నరుల.

5.2-163-ఆటవెలది

ధర్మవంతులెల్ల దప్పక స్వర్గంబు
నందు భోగసమితిఁ బొందుచుందు;
రెలమిఁ బుణ్యపాపముల శేషములవల్లఁ
బుట్టుచుందు రవనిఁ బుణ్యచరిత.

5.2-164-వచనము

నరేంద్రా! మోక్షమార్గంబు మున్నె వినిపించితి; నిప్పుడు నీ కెఱింగించిన యెల్లను బ్రహ్మాండకోశంబునం జతుర్దశ కోశంబులుఁ గల వని పురాణంబులు పలుకుచుండు; నట్టి బ్రహ్మాండంబు శ్రీ మన్నారాయణుని స్థూలశరీరం బగుటంజేసి బ్రహ్మాండం బెవ్వరు వర్ణింతు రెవ్వరు విందురు వారలకు సకల శ్రేయస్సులుం గలుగు; నీశ్వర స్థూలశరీరంబుఁ దెలిసిన వారికి శ్రద్ధాభక్తులంజేసి సూక్ష్మదేహంబు నెఱుంగవచ్చు; భూ ద్వీప వర్ష సరిదద్రి నభస్సముద్ర పాతాళ దిఙ్నరక తారాగణ లోకసంస్థితంబైన సకల జీవనికాయ్యంబై యద్భుతంబైన శ్రీహరి స్థూలశరీరప్రకారంబు వినిపించితి" నని

## 5.2-8-పూర్ణి

5.2-165-చంపకమాల

జలజభవాది దేవ ముని సన్నుత తీర్థపదాంబుజాత! ని
ర్మల నవరత్న నూపుర విరాజిత! కౌస్తుభ భూషణాంగ! యు
జ్జ్వల తులసీ కురంగ మదవాసనవాసిత దివ్యదేహ! శ్రీ
నిలయ శరీర! కృష్ణ! ధరణీధర! భాను శశాంకలోచనా!

5.2-166-కంద పద్యము

శ్రీ తరుణీ హృదయస్థిత!
పాతకహర! సర్వలోకపావన! భువనా
తీతగుణాశ్రయ! యతి వి
ఖ్యాత! సురార్చిత పదాబ్జ! కంసవిదారీ!

5.2-167-మత్తకోకిలము

దండితారిసమూహ! భక్తనిధాన! దాసవిహార! మా
ర్తాండమండల మధ్యసంస్థిత! తత్త్వరూప! గదాసి కో
దండ శంఖ సుదర్శనాంక! సుధాకరార్క సునేత్ర! భూ
మండలోద్ధరణార్థ పోషణ! మత్తదైత్య నివారణా!

5.2-168-గద్యము

ఇది శ్రీ సకల సుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్య ప్రణీతంబైన శ్రీమద్భాగవత మహాపురాణంబునందు భరతాత్మజుం డైన సుమతికి రాజ్యాభిషేకంబును, పాషండదర్శనంబును, సుమతి పుత్ర జన్మ విస్తారంబును, గయుని చరిత్రంబును, గయుని సంస్తుతియు, భూ ద్వీప వర్ష సరిదద్రి నభస్సముద్ర పాతాళ దిఙ్నరక తారాగణ సంస్థితియు నను కథలు గల పంచమస్కంధంబు నందు ద్వితీయాశ్వాసము సమాప్తము.

# పోతన తెలుగు భాగవతము

## షష్ఠ స్కంధము

### 6-1- ఉపోద్ఘాతము

6-1-శార్దూల విక్రీడితము

శ్రీవత్సాంకిత కౌస్తుభస్ఫురిత లక్ష్మీచారు వక్షస్థల
శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభు రాజీవాక్షుఁ గంజాత భూ
దేవేంద్రాది సమస్తదేవ మకుటోద్దీప్తోరు రత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపావాసుం బ్రశంసించెదన్.

6-2-ఉత్పలమాల

నిండుమతిం దలంతుఁ గమనీయ భుజంగమరాజమండలీ
మండనుఁ జంద్రఖండ పరిమండితమస్తకుఁ దారమల్లికా
పాండురవర్ణుఁ జండతరభండను హేమగిరీంద్రచారు కో
దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్.

6-3-ఉత్పలమాల

హంసతురంగముం బరమహంసము నంచితదేవతా కులో
త్తంసము నాగమాంత విదితధ్రువపుణ్యరమావతంసమున్
కంసజిఘాంసు నంశమును గర్బురసూత్ర సమావృతాంసమున్
హింస నడంచు బ్రహ్మము నహీనశుభంబులకై భజించెదన్.

6-4-ఉత్పలమాల

మోదకహస్తునిన్ సమదమూషకవాహను నేకదంతు లం
బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యు గణేశు దేవతా
హ్లాదగరిష్ఠు దంతిముఖు నంచిత భక్తఫలప్రదాయకున్
మోదముతోడ హస్తములుమోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్.

6-5-ఉత్పలమాల

కల్లతనంబు గాక పొడగట్టిన పూర్వపురీతి నేఁడు నా
యుల్లమునందు నుండుము సమున్నత తేజముతోడ భక్తి రం
జిల్లిన చూపుగూడ విధిఁజెందిన ప్రోడ బుధాళి నీడ మా
తల్లి దయామతల్లి ప్రణతద్రుమకల్పకవల్లి భారతీ!

6-6-కంద పద్యము

విలసత్కంకణరవరవ
కలితం బగు నభయ వరద కరముల బెరయం
జెలరేఁగి భక్తులకు నల
కలుములు దయచేయు జలధికన్యకఁ దలతున్.

6-7-కంద పద్యము

కాళికి బహుసన్నుత లో
కాళికిఁ గమనీయ వలయ కరకీలిత కం
కాళికిఁ దాపస మానస
కేళికి వందనము చేసి కీర్తింతు మదిన్.

6-8-వచనము

అని యిష్టదేవతాప్రార్థనంబు జేసి.

6-9-చంపకమాల

పరమసమాధిధుర్యుఁ బటు పావనకర్మ విధేయు దేవతా
వర నర వంద్యు సద్విమలవాక్యు జనార్థనకీర్తనక్రియా
భరణ సమర్థు వేద చయ పారగు భవ్యుఁ ద్రికాలవేది భా
సురమతిఁ గొల్చుటొప్పు బుధశోభితుఁ బుణ్యుఁ బరాశరాత్మజున్,

6-10-కంద పద్యము

వ్యాసుని భగవత్పద సం
వాసుని నాగమ పురాణ వర విష్ణుకథా
వాసుని నిర్మల కవితా
భ్యాసుని పదపద్మయుగము భావింతు మదిన్.

6-11-సీస పద్యము

వరకవితోద్రేకి వాల్మీకిఁ గొనియాడి;
భాగవతార్థ వైభవముఁ బలుకు
శుకమంజులాలాపు శుకయోగిఁ బ్రార్థించి;
బాణ మయూరుల ప్రతిభ నొడివి
భాస సౌమిల్లిక భారవి మాఘుల;
ఘన సుధా మధుర వాక్యములఁ దలఁచి
కాళిదాసుఁ గవీంద్రకల్పవృక్షముఁ గొల్చి;
నన్నపాచార్యు వర్ణనలఁ బొగడి

6-11.1-తేటగీతి

వెలయఁ దిక్కన సోమయాజుల భజించి
యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చఁ గొల్చి
సుకవిసోముని నాచనసోమునెఱిఁగి
కవిమనోనాథు శ్రీనాథు ఘనత మెచ్చి.

6-12-ఉత్పలమాల

ఎమ్మెలు చెప్పనేల? జగమెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు చేసినవాని భక్తి లో
నమ్మినవాని భాగవత నైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
బమ్మెఱ పోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్.

6-13-వచనము

అని సకల సుకవి నికరంబులకు ముకుళిత కరకమలుండనై.

## 6-2- కృతిపతి నిర్ణయము

6-14-ఉత్పలమాల

ఎయ్యది కర్మబంధముల నెల్ల హరించు విభూతికారణం
బెయ్యది సన్మునీంద్రులకు నెల్లఁ గవిత్వసమాశ్రయంబు ము
న్నెయ్యది సర్వమంత్రముల నేలిన దెయ్యది మోక్షలక్ష్మి రూ
పెయ్యది దానిఁ బల్కెద సుహృద్యము భాగవతాఖ్య మంత్రమున్.

6-15-వచనము

అని శ్రీమహాభాగవత పురాణంబునందు షష్ఠస్కంధం బాంధ్రభాష రచియింపంబూని యీ కృతికిం బతిగా నద్దేవుండు గలం డని వితర్కించి నాకుం గవిత్వమహత్త్వంబు సంప్రాప్తంబగు కాలంబు దలంచి నారాయణుండే దైవం బని యెఱింగి మనోరథంబు సఫలంబయ్యె నని యీ కృతిఁ గృష్ణార్పణంబు చేసితిని; అది యెట్లనిన నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండొక నై యుండ నొక్కనాఁడు దివంబున.

6-16-చంపకమాల

కలిత విశేషవస్త్రములు గట్టి హిమాంబు సుగంధ చందనం
బలఁది వినూత్న భూషణము లారఁగఁ దాల్చి వినోదలీల నిం
పుల మృదుశయ్య నిద్రఁదగఁ బొందినచోఁ గనుపట్టెఁ బల్మఱుం
దలమునఁ గమ్ము క్రొమ్మెఱుఁగుదండము రూపున నిల్చు పోలికిన్.

6-17-సీస పద్యము

ఉరవడిఁ బ్రాగ్వీధి నుదయించు మార్తాండ;
కోటిబింబచ్ఛాయ గూడినట్లు
హరిహర బ్రహ్మల యాత్మలలో నుబ్బి;
కరుణ యొక్కట మూర్తి బెరసినట్లు
ఖరకర కర తీవ్ర గతినిఁ గరంగుచు;
హేమాద్రి చెంతఁ బె ల్లెగసినట్లు
ఫణిరాజ ఫణరాజి మణిగణ విస్ఫూర్తి;
సుషిరంపు వెలిఁదల చూపినట్లు

6-17.1-తేటగీతి

లుట్టిపడ్డట్లు కట్టెట్ల నూఁదినట్లు
తేజ మెసఁగంగ నా ప్రోల దివ్యవాణి
పూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టిఁ
జూచి యిట్లని పలికె మంజులముగాను

6-18-ఉత్పలమాల

ఆటలుఁ బాటలుం జదువు లద్భుతముల్ వినసొంపు వాద్యముల్
సాటి దలంపరాని బలుసాములు మున్నగు విద్యలెల్ల నీ
కాటఁలు బాట లయ్యె విను మన్నిటికిన్ మెఱుఁగిడ్డభంగి నా
చాటునఁ జాటుకారపద సాధుకవిత్వముఁ జెప్పు మింపుగన్

6-19-వచనము

అని యానతిచ్చు జగన్మాతృ కృపావలోకన సుశ్లోకుండనై యే నొక్క శ్లోకంబు నా క్షణంబ నుడివితి; నది యెట్టి దనిన.

6-20-శ్లోకము

హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ
సత్సంగ్రహాయ సగుణాయ సదీశ్వరాయ
సంపూర్ణ పుణ్యపతయే హరయే నమస్తే.

6-21-వచనము

ఈ శ్లోకం బద్దేవి యంగీకరించె; అంత మేలుకాంచి యానంద భరితుండ నై నాఁటనుండి, చంద్రానుగత యగు చంద్రికయుం బోలె, నారాయణాంకితం బయిన

కవిత్వ తత్త్వజ్ఞానంబు గోచరం బయ్యె; దానికి ఫలంబుగా గోపికావల్లభుని నుల్లంబున నిడికొని.

6-22-ఆటవెలది

పలుకఁ గలిగె మొదల భాగవతార్థంబు
భర్త గృష్ణుఁ డయ్యె భాగ్య మొదవె
నమృతరసముఁ గోర నలరు చింతామణి
పాత్ర సంభవించు భంగి నిపుడు.

6-23-ఆటవెలది

భాగవతము దేటపఱుప నెవ్వఁడు జాలు
శుకుఁడు దక్క నరుని సకుఁడు దక్క
బుద్ధిఁ దోచినంత బుధులచే విన్నంత
భక్తి నిగిడినంత పలుకువాఁడ.

6-24-ఉత్పలమాల

పుట్టిననాఁటనుండియును, బుట్టద యెట్టియ దట్టు నైనఁ జేఁ
పట్టి నుతింపఁ జిత్తము శుభం బగు మద్వరవాక్యసీమకుం
బట్టము గట్టినాఁడ హరిఁబాయక తత్కథనామృతంబు నే
నుట్టిపడంగఁ జెప్పెదు బుధోత్తము లానుఁడు శ్రోత్రపద్ధతిన్.

6-25-వచనము

అని.

## 6-3- గ్రంథకర్త వంశవర్ణనము

6-26-సీస పద్యము

శ్రీవత్స గోత్రుండు శివభక్తి యుక్తుఁ డా;
 పస్తంబ సూత్రుఁ డపార గుణుఁడు
నేర్చూరి శాసనుం డెట్టన ప్రెగ్గడ;
 పుత్రుండు వీరన పుణ్యమూర్తి
కాత్మజుం డగు నాదయామాత్యునకుఁ బోల;
 మాంబకు నందను లమితయశులు
కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి;
 సింగధీమణియు నంచితగుణాఢ్యు

6-26.1-తేటగీతి

లుద్భవించిరి తేజంబు లూర్జితముగ
సౌరది మూర్తి త్రయం బన శుభ్రకీర్తిఁ
బరఁగి రందులఁ గసువనప్రభువునకును
ముమ్మడమ్మను సాధ్వి యిమ్ములను వెలసె.

6-27-ఉత్పలమాల

ఆడదు భర్తమాట కెదురాడదు వచ్చినవారి వీఁడగా
నాడదు పెక్కుభాష లెడనాడదు వాకిలి వెళ్ళి, కల్ల మా
టాడదు మిన్నకేని సుగుణావళి కిందిరగాక సాటి యే
చేడియ లేదు చూరికుల శేఖరు కస్వయ ముమ్మడమ్మకున్.

6-28-కంద పద్యము

ఆ కసువయమంత్రికిఁ బు
ణ్యాకల్పశుభాంగి ముమ్మడమ్మ మమున్న
వ్యాకుల చిత్తుల నిరువుర
శ్రీకర గుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్.

6-29-కంద పద్యము

అంగజసమ లావణ్య శు
భాంగులు హరి దివ్యపదయుగాంబుజ విలస
ద్భృంగాయమాన చిత్తులు
సింగయ తెలగయలు మంత్రిశేఖరు లనగన్.

6-30-కంద పద్యము

అందగ్రజుండ శివపూ
జం దనరినవాఁడ విష్ణుచరితామృత ని
ష్యంది పటు వాగ్విలాసా
నందోచిత మానసుండ నయకోవిదుఁడన్

6-31-వచనము

కావునం గృష్ణపాదారవింద సందర్శ నాదర్శతలాయమాన చిత్తుండ నై.

## 6-4- షష్ఠ్యంతములు

6-32-కంద పద్యము

శ్రీపతికి మత్పతికి నుత
గోపతికిఁ ద్రిలోకపతికి గురుజనబుధ సం
తాప నివారణ మతికిని
బ్రాపితసనకాది తతికి బహుతర ధృతికిన్,

6-33-కంద పద్యము

హరికి గురు కలుషకుంజర
హరికి బలాభీలహరికి నంతస్స్థిత గ
హ్వరికి నరహరికి రక్షిత
కరికిఁ గరాగ్రస్థగిరికి ఘనతరకిరికిన్.

6-34-కంద పద్యము

గుణికి సమాశ్రిత చింతా
మణికి మహేంద్రాది దివిజమండల చూడా
మణికిఁ బ్రకల్పితశయ్యా
ఫణికి నురోభాగ కౌస్తుభప్రియమణికిన్,

6-35-కంద పద్యము

కంసాసుర సంహారున
కంసాంచిత కర్ణకుండ లాభరణునకున్
హింసాపర పరమస్తక
మాంసకరాళిత గదాభిమత హస్తునకున్.

6-36-కంద పద్యము

వర యోగిమాన సాంతః
కరణ సుధాంభోధి భావకల్లోల లస
త్పరతత్త్వశేషశాయికిఁ
జిరదాయికి సకలభక్తచింతామణికిన్

## 6-5- కథాప్రారంభము

### 6-37-వచనము

సమర్పింతంబుగా నా యొనర్పం బూనిన షష్ఠస్కంధంబునకుఁ గథాప్రారంభక్రమం బెట్టిదనిన, హరి చరణస్మరణ పరిణామ వినోదులయిన శౌనకాదులకు నిఖిల పురాణేతిహాస నిర్ణయ విఖ్యాతుండైన సూతుం డిట్లనియె.

### 6-38-కంద పద్యము

శ్రీరమణీ రమణక థా
పారాయణ చిత్తుఁడగుచుఁ బలికెఁ బరీక్షి
ద్భూరమణుఁ డాదరంబున
సూరిజనానందసాంద్రు శుకయోగీంద్రున్.

### 6-39-సీస పద్యము

షడ్గుణైశ్వర్య శాశ్వతమూర్తి వయినట్టి;
 మునినాథ! దయతోడ ముక్తిపదము
మున్నుగా నేమార్గమున వినిపించితి;
 వారయ నపవర్గ భూరిమహిమఁ
గ్రమయోగసంభవ బ్రహ్మంబుతోఁగూడ;

ననుబొంద నగు నని వినుతి కెక్క
మఱియు సత్త్వరజ స్తమః ప్రభావంబులఁ;
గడిఁదియై యున్నట్టి కర్మచయము

6-39.1-తేటగీతి

నప్పటప్పటి కడఁగని యట్టి ప్రకృతి
గలుగు పురుషుని భోగార్థఘటన దేహ
కారణా రంభ రూపమార్గంబు మొదలు
మాటిమాటికి నన్నియుఁ దేటపడఁగ

6-40-వచనము

మఱియు ననేక పాపలక్షణంబులగు నానావిధ నరకంబులును వాని కాద్యంతంబులును, స్వాయంభువ సంబంధి యగు మన్వంతరంబును, బ్రియవ్రతోత్తానపాదుల వంశంబును, దచ్చరిత్రంబును, ద్వీప వర్ష సముద్రాద్రి నద్యుద్యానవనస్పతులును, భూమండల సంస్థాపనంబును, వాని పరిమాణంబును, జ్యోతిశ్చక్రచలన ప్రకారంబును, విభుండయిన పరమేశ్వరుం డెవ్విధంబున నిర్మించె నా విధంబంతయు నెఱింగించినాడవు; ఇప్పుడు.

6-41-ఆటవెలది

కడిఁది వేదనలకుఁ గారణంబై యుండు
గుఱుతులేని నరక కూపరాశి
పాలుగాక నరుఁడు బ్రతికెడు మార్గంబు
పరమపుణ్య! తెలియఁ బలుకవయ్య!

6-42-వచనము

అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

6-43-కంద పద్యము

కట్టా! త్రికరణ మెఱుఁగక
పుట్టిన దురితముల నపుడ పొలియింపని యా
కట్టఁడి దేహం బుడిగినఁ
గొట్టాడును బిట్టు నరకకూపంబులలోన్.

6-44-ఉత్పలమాల

కావునఁ గాలకింకర వికారము గానకమున్న మృత్యు దు
ర్భావనఁ జిత్తమున్ వెడఁగుపాటును జెందకమున్న మేనిలో
జీవము వెల్లుచుండఁ దన చెల్వము దప్పకమున్న పన్నుగాఁ
బావనచిత్తుఁడై యఘముఁ బాయు తెఱం గొనరింపఁ గాఁదగున్.

6-45-కంద పద్యము

కాలం బెడగని పాపము
మూలముఁ జెఱుపంగవలయు మును రోగములం
దేలిన దోషము నెఱుఁగుచు
వాలాయము దాని నడఁచు వైద్యుని భంగిన్.

6-46-సీస పద్యము

అనవుడు నాతని కనియె భూకాంతుండు;
 కనుకలి వినుకలి గలిగినట్టి

పాపము దనకు నొప్పని దని కని చాలఁ;
బరితప్తుఁడయ్యుఁ గ్రమ్మఱ నొనర్చు
మూఢాత్మునకు దోషమోచనం బెయ్యది;
యారయ నెఱిఁగింపు మదియుఁగాక
కలుష మొక్కొకచోటఁ గావించు నొకచోటఁ;
గావింపకుండుఁ దత్కర్మ మెఱిఁగి

6-46.1-ఆటవెలది

యిట్టి జనుఁడు పుణ్య మేరీతిఁ జేసిన
నది ఫలింపనేర దని తలంతు
సలిలమందు మేని మలినంబుఁ బోకుండ
గజము గ్రుంకుబెట్టు గతియుఁ బోలె.

6-47-వచనము

అనిన శుకుం డిట్లనియె.

6-48-కంద పద్యము

కర్మము కర్మముచేతను
నిర్మూలము గాదు తెలియనేరక తా నే
కర్మము జేసినఁ దత్ప్రతి
కర్మం బొనరింప వలయుఁ గలుషవిదూరా!

6-49-కంద పద్యము

హితవు గల కుడుపు మఱి రు
గ్వితతులఁ బొడమంగ నీని విధమున నతి స
ద్వ్రతుఁ డైనవాఁడు నిర్మల
మతిచే నఘరాశి నెల్ల మట్టము జేయున్.

6-50-చంపకమాల

తపమున బ్రహ్మచర్యమున దానమునన్ శమ సద్దమంబులన్
జపమున సత్యశౌచముల సన్నియమాది యమంబులం గృపా
నిపుణులు ధర్మవర్తనులు నిక్కము హృత్తను వాక్యజంపు పా
పపుగురిఁ ద్రుంతు రగ్ని శతపర్వ వనంబుల నేర్చుకైవడిన్.

6-51-వచనము

అదియుం గాక.

6-52-ఉత్పలమాల

కొందఱు పుణ్యవర్తనులు గోపకుమార పదారవింద జా
నంద మరందపాన కలనారత షట్పదచిత్తు లౌచు గో
వింద పరాయణుల్ విమలవేషులు దోష మడంతు రాత్మలం
జెందిన భక్తిచేత రవి చేకొని మంచు నడంచు కైవడిన్.

6-53-కంద పద్యము

హరిభక్తిచేతఁ గొందఱు
పరిమార్తురు మొదలుముట్ట పాపంబుల ని

ష్ఠురతర కరముల సూర్యుం
డరదుగఁ బెనుమంచుఁ బింప మడఁచిన భంగిన్.

6-54-కంద పద్యము

దంతిపురనాథ! విను మొక
మంతన మెఱిఁగింతు శమ దమంబులు నంపో
వంతు శుభవంతుఁ జేయవు
కంతుని గురుభక్తి ముక్తిఁ గలిగించు గతిన్.

6-55-సీస పద్యము

హరికి నర్థముఁ బ్రాణ మర్పితంబుగ నుండు;
 వాని కైవల్య మెవ్వనికి లేదు
వనజలోచను భక్తపరుల సేవించిన;
 వాని కైవల్య మెవ్వనికి లేదు
వైకుంఠ నిర్మల వ్రతపరుండై నట్టి;
 వాని కైవల్య మెవ్వనికి లేదు
సరసిజోదరు కథాశ్రవణ లోలుం డైన;
 వాని కైవల్య మెవ్వనికి లేదు

6-55.1-తేటగీతి

లేదు తపముల బ్రహ్మచర్యాది నియతి
శమ దమాదుల సత్యశౌచముల దాన
ధర్మ మఖముల సుస్థిర స్థానమైన
వైష్ణవజ్ఞాన జనిత నిర్వాణపదము.

6-56-తేటగీతి

అరయ నెన్నఁడుఁ జేటు లేనట్టి ముక్తి
వర్త్మ మీ లోకమందు నెవ్వరికిఁ గలదు?
సాధులును బుణ్యశీలురు సజ్జనులును
హరిపరాయణ తత్పరు లయినఁ గాక.

6-57-కంద పద్యము

అరుదుగ నరహరి భక్తిం
బోరయని యా పురుషు సుకృత పుంజంబులు వేఁ
మఱుఁ బుణ్యుఁ జేయ నేరవు
నరవర మధుఘటముఁ బెక్కు నదులుం బోలెన్.

6-58-చంపకమాల

సతతముఁ గృష్ణపాదజలజంబుల యందు మనంబు నిల్పు సు
వ్రతులు దదీయ శుద్ధ గుణరాగులుఁ గాలుని యుగ్రపాశ సం
హతుల ధరించు తత్సుభటకౌఘములం గలలోనఁ గాన రే
గతులను దుష్టకర్మములు గైకొని వారలఁ జెందనేర్చునే?

6-59-వచనము

కావున నీ యర్థంబునకుం బురాతనంబగు నొక్క యితిహాసంబు గలదు; అది విష్ణుదూత యమదూత సంవాదం బనంబడు; దాని నెఱింగింతు; ఆకర్ణింపుము

## 6-6- అజామిళోపాఖ్యానము

6-60-సీస పద్యము

నరనాథ! వినుము కన్యాకుబ్జపురమునఁ;
 గలఁడు బ్రాహ్మణుఁ డజామిళుఁ డనంగఁ
బాతకుం డతుల నిర్భాగ్యుం డవజ్ఞుండు;
 నష్టసదాచారి కష్టరతుఁడు
జూదంబులందు దుర్వాదంబు లందును;
 జౌర్యంబునందు మచ్చరము గలిగి
తొత్తాత్మ పత్నిగా మత్తుఁడై వరియించి;
 కొడుకులఁ బదుగురఁ బడసి చాల

6-60.1-ఆటవెలది

మోహజలధిలోన మునిఁగి ముచ్చట దీఱ
బాల లాలనాది లీలఁ దగిలి
పెద్దకాల మతఁడు పెంపార సుఖియించి
ఫలిత మెల్ల వదిలి పతితుఁడయ్యె.

6-61-సీస పద్యము

నిర్మలం బనఁ జాలనెఱయు చిత్తం బన;
 నల్లని పెండ్రుకల్ తెల్లనయ్యెఁ;
దగు మోహపాశ బంధంబు జాఱినమాడ్కిఁ;
 బొదలిన యంగముల్ వదలి వ్రేలె;
నింద్రియంబుల కోర్కులిఁక నొల్ల నను భంగి;
 నుడుగక తల చాల వడఁక జొచ్చెఁ;

దమకంబు ప్రాయంబుఁ దగిలిపోయిన మాడ్కి;
లోచనంబుల చూడ్కి నీచమయ్యె;

6-61.1-ఆటవెలది

వగరు పుట్టె; నంతఁ బొగలె దంతంబులు;
నుక్కిసయును దగ్గుఁ బిక్కటిల్లె;
శిరసు నొవ్వఁ దొడఁగెఁ; జెదరె మనం; బంతఁ
గడఁది యైన ముప్పు కాలమునకు.

6-62-ఆటవెలది

ఎనయ నతని కెనుబ దెనిమిది వర్షంబు
లంత నరుగుటయును భ్రాంతుఁ డగుచుఁ
గోరి పిన్నకొడుకు నారాయణాఖ్యుండు
బాలుఁ డగుట మిగుల భక్తిఁ జేసి.

6-63-కంద పద్యము

తన సతియుఁ దాను గూరిమి
మనమునఁ బెనఁగొనఁగ నక్కుమారుని ననిశం
బును ముద్దు జేయుచుండెను
జనవర! వాత్సల్య మాత్మ సందడిఁ గొనఁగన్.

6-64-కంద పద్యము

బాలుని ముగ్ధ వచో బుజు
ఫాలుని నిజ జనక బంధు పరిణామ కళా

శీలుని లోలతఁ గనుఁగొని
యాలరి బ్రాహ్మణుఁడు నందితాత్ముం డగుచున్.

6-65-కంద పద్యము

అత్యంత పాన భోజన
కృత్యంబులఁ బొత్తు గలిగి క్రీడలఁ దత్సాం
గత్యంబు వదల కాగత
మృత్యువుఁ గన నేరఁ డయ్యె మిక్కిలి జడుఁడై.

6-66-తేటగీతి

తెలియ కీ రీతి నతఁడు వర్తించుచుండ
భయద మగు మృత్యుకాలంబు ప్రాప్తమైన
భూరి వాత్సల్యవృత్తి న పుత్త్రుఁ దలఁచి
యాత్మఁ బ్రలపించె నారాయణా యటంచు.

6-67-వచనము

అప్పుడు.

6-68-కంద పద్యము

కింకరుల ధర్మరాజ వ
శంకరుల దురంత దురిత సమధిక జన నా
శంకరుల సకలలోక భ
యంకరులం గనియె నింద్రియాకులుఁ డగుచున్.

6-69-కంద పద్యము

ఘాతుకుల దండ దండిత
పాతకుల మహోగ్ర కర్మ భర నిష్కరుణా
జాతకులఁ బ్రేతనాయక
దూతక సంతతుల నతఁడు దూరమునందున్.

6-70-మత్తేభ విక్రీడితము

కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీఁకన్ రోషనిష్ఠ్యూతులన్
ఘనపీనోష్ఠ వికారవక్త్ర విలసద్ఘర్వేక్షణోపేతులన్
జన సంత్రాస కరోద్యతాయత సుపాశశ్రేణికా హేతులన్
హననవ్యాప్తి విభీతులన్ మువుర నాత్మానేతలన్ దూతలన్.

6-71-వచనము

ఇట్లతి వికృత తుండ గండాభోగ విభాగ విషమ వివృత్త నేత్రులు, నతి పుష్ట నిష్ఠుర తనుయష్టి సంవేష్టిత మహోర్ధ్వరోములు, నభ్యస్త సమస్త జీవాపహారణ కరణ ప్రశస్త హస్త విన్యస్త పాశధారులు నగు యమభటుల ముప్పురం గనుంగొని యజామిళుండు వికలేంద్రియుండును, వికంపిత ప్రాణుండును, వికృత లోచనుండును, విహ్వలాత్మకుండునై.

6-72-కంద పద్యము

దూరమున నాడు బాలుఁడు
బోరనఁ దన చిత్తసీమఁ బొడగట్టిన నో!
నారాయణ! నారాయణ!
నారాయణ! యనుచు నాత్మనందను నొడివెన్.

6-73-చంపకమాల

మరణపువేళ నద్దనుజమర్దను సంస్మరణంబు జేయఁ ద
త్పరిసరవర్తు లాత్మపరిపాలకు నామము నాలకించి ని
ష్ఠురగతి నేగుదెంచి పొడచూపి యదల్చిరి కాలుదాసులన్
ఖరతరభాషులన్ వికట కల్పిత వేషుల దీర్ఘరోషులన్.

6-74-కంద పద్యము

దాసీభర్త నజామిళ
భూసురుఁ దత్తనువువలన బోరన వెలికిం
దీసిన యమభటులఁ దొలఁగఁ
ద్రోసిరి శ్రీవరుని కూర్మిదూతలు కడిమిన్.

6-75-వచనము

ఇట్లు విష్ణుదూతల వలన నిర్ధూత ప్రయత్నులై యమదూత లిట్లనిరి.

6-76-కంద పద్యము

ఎవ్వనివారలు? మాతోఁ
జివ్వకుఁ గత మేమి? యిట్లు చిక్కినవానిం
గ్రొవ్వున విడిపించితి; రిఁక
నవ్వలకో? జముని శాసనంబులు జగతిన్.

6-77-వచనము

అదియునుం గాక.

6-78-సీస పద్యము

ఎవ్వరు మీ రయ్య? యీ భవ్యరూపముల్;
 గన్నుల కద్భుతక్రమ మొనర్చె;
దివిజులో? భువిజులో? దేవతాప్రవరులో? ;
 సిద్ధులో? సాధ్యులో? చెప్పరయ్య;
దళిత పాండుర పద్మదళ దీర్ఘ నేత్రులు, ;
 వర పీత కౌశేయ వాసు లరయ
గండమండల నట త్కుండల ద్వయులును, ;
 బటు కిరీటప్రభా భాసితులును,

6-78.1-తేటగీతి

భూరి పుష్కర మాలికా చారువక్షు,
లమిత కోమల నవయౌవ నాధికులును,
బాహు కేయూర మణిగణ భ్రాజమాన
ఘన చతుర్భుజు, లభ్రసంకాశ రుచులు.

6-79-కంద పద్యము

ధనువులు, నిషంగచయములుఁ,
గన దంబుజ, శంఖ, చక్ర, ఖడ్గ, గదా, సా
ధనములు ధరియించిన మీ
తనువులు లోకముల కద్భుతం బొనరించెన్.

6-80-కంద పద్యము

శాంతంబు లయిన మీ తను
కాంతులు జగములను దిశలఁ గలిగిన బహుళ

ధ్వాంతములఁ బాఱఁదోలుచు
సంతస మొనరించె నిపుడు సర్వంకషమై.

6-81-వచనము

ఇ ట్లఖిల లోకానందకర కమ్రాకారులు, నఖిల విభ్రాజమాన తేజో దుర్నిరీక్ష్యమాణులును, నిఖిలధర్మపాలురును నగు మీరు ధర్మ పరి పాలుర మమ్ము నడ్డపెట్టం గతం బేమి?" యనిన ధర్మరాజానుచరులు గారను తలంపున మందస్మిత కందళిత ముఖారవిందులయి గోవిం దుని కందువ మందిరంబు కావలివారలు వారివాహ గంభీర నిర్ఘోష పరిపోషణంబు లైన విశేషభాషణంబుల ని ట్లనిరి.

6-82-ఉత్పలమాల

మీరు పరేతనాయకుని మేలిమి దూత లఁటేనిఁ బల్కుఁ డా
తీరపుఁ బుణ్యలక్షణము, దుష్కృతభావము, దండకృత్యమున్
బేరముతోడ నీతని కభీష్టనివాసము, నోలి దండ్య లె
వ్వారలొ? సర్వభూతములొ? వారొక కొందఱు పాపకర్ములో?

6-83-వచనము

అనిన యమభటు లిట్లనిరి.

6-84-కంద పద్యము

వేదప్రణిహితమే యను
మోదంబుగ ధర్మ మయ్యె మున్ను; త దన్యం

బేది యగునది యధర్మం
బాదియు హరిరూపు వేద మని విను కతనన్.

6-85-సీస పద్యము

ఎవ్వనిచేఁ దన యురవొందు త్రిగుణ స్వ;
భావమైనట్టి యీ ప్రాణిచయము
లనుగుణ నామక్రియారూపములచేత;
నేర్పడుగతిఁ దాన యెఱుఁగఁబడును
నర్యముం డనలంబు నాకాశమును బ్రభం;
జనుఁడు గోచయమును శశధరుండు
సంధ్యలు దివములు శర్వరీచయములుఁ;
గాలంబు వసుమతీ జాలములును

6-85.1-తేటగీతి

దేహధారికి సాక్షులై తెలుపుచుండు
దండనస్థాన విధము సద్ధర్మగతియుఁ
దగులు మీఱి క్రమానురోధనముఁ జేసి
యఖిల కర్ములు దండార్హు లరయ నెపుడు.

6-86-తేటగీతి

కోరి కర్మంబు నడపెడు వారి కెల్ల
గలిత శుభములు నశుభము ల్గలుగుచుండు;
నరయఁగా దేహి గుణసంగి యైన యపుడె
పూని కర్మంబు జేయక మానరాదు.

6-87-కంద పద్యము

ప్రకృతమునఁ దా నొనర్చిన
సుకృతము దుష్కృతము నెంత చూడఁగ నంతే
వికృతిఁ గని యనుభవించు
న్నకృతమతిం దత్ఫలంబు నతి నిపుణుండై.

6-88-వచనము

మఱియు వినుండు, జన్మంబు శాంత ఘోర మూఢ గుణంబులచేత నైనను, సుఖదుఃఖ గుణంబులచేత నైనను, ధార్మికాది గుణంబులచేత నైనను, సకల భూతంబులుఁ ద్రైవిధ్యంబు నే ప్రకారంబునం బొందు, నా ప్రకారంబున జన్మాంతరంబునం బొందుచుండు; దేవుండైన యముండు సర్వ జీవాంతర్యామియై ధర్మాధర్మయుక్తం బయిన పూర్వ రూపంబుల మనస్సుచే విశేషంబుగఁ జూచుచుండి, వాని కనురూపంబులఁ జింతించుచుండు; అవిద్యోపాధి జీవుండు తమోగుణయుక్తుం డై ప్రాచీన కర్మంబులచేత నేర్పడిన వర్తమాన దేహంబు, నే నని తలంచుచుండి, నష్ట జన్మ స్మృతి గలవాడై పూర్వాపరంబు లెఱుంగం జాలకుండు; మఱియుఁ గర్మేంద్రియంబులచేతఁ గర్మంబులం జేయుచుండి, జ్ఞానేంద్రియముల చేతఁ దమోవిషయంబు లయిన శబ్ద స్పర్శ రూప రస గంధంబుల నెఱుంగుచుండి, పదియాఱవది యైన మనంబుతోఁ గూడి, పదియేడవవాఁ డగుచుండి, షోడశోపాధ్యంతర్గతుం డై యొక్కరుం డైన జీవుండు, సర్వేంద్రియ విషయ ప్రతిసంధానంబు కొఱకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయంబులఁ బొందుచుండి, షోడశ కళలు గలిగి, లింగ శరీరం బనం బరఁగి గుణత్రయకార్యం బను నిమిత్తంబున హ ర్ష శోక భయంబుల నిచ్చుచున్న సంసారంబు ధరియించుచుండు; విజిత షడ్వర్గం డైన దేహి కర్మంబు లొల్లని బుద్ధి

నెఱింగియు, వినియుఁ, గర్మంబులు జేయుచుండి, తన సంచార కర్మంబునం జుట్టుకొన్న పసిడికాయ పురువునుం బోలె నిర్గమోపాయం బెఱుంగక నాశంబు నొందుచుండు, వర్తమాన వసంతాది కాలంబు, భూత భావి వసంతాది కాలయోగ్యం బైన పుష్ప ఫలాదులు తత్కాల జ్ఞాపకంబు నెట్లు జేయు, నట్లు భూత భావి జన్మంబులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు జేయుచుండు; ఒక్క నరుండు నొక క్షణంబును గర్మంబు జేయకుండువాఁడు లేఁడు; పూర్వసంస్కారంబులం గల గుణంబులచేతఁ బురుషుం డవశుండు గావున బలిమిఁ గర్మంబులు చేయింపంబడుచుండు; అవ్యక్తనిమిత్తంబు నొంది తదనురూపంబు లయిన స్థూల సూక్ష్మ శరీరంబులు మాతా పితృ సదృశంబు లగుచుండు; ఇట్టి విపర్యయంబు పురుషునికిఁ బ్రకృతి సంగమంబునం గలుచుండు; ఆ ప్రకృతి పురాణపురుషుం డయిన యప్పరమేశ్వరుని సేవించినం దలంగుచుండు.

6-89-సీస పద్యము

కావున నితఁడు సత్కర్మ వర్తనమున;
 భూదేవకులమునఁ బుట్టినాడు;
దాంతుఁడై శాంతుఁడై ధర్మసంశీలుఁడై;
 సకల వేదంబులఁ జదివినాఁడు;
అనయంబు గురువుల నతిథులఁ బెద్దలఁ;
 జేరి శుశ్రూషలఁ జేసినాఁడు;
సర్వభూతములకు సమబుద్ధియై చాల;
 బహు మంత్ర సిద్ధులఁ బడసినాఁడు;

6-89.1-తేటగీతి

సత్యభాషణ నియమంబుఁ జరపినాఁడు;
నిత్యనైమిత్తికాదుల నెఱపినాఁడు;
దండి లోభాది గుణములఁ దరపినాఁడు;
మంచిగుణములు దనయందు మరపినాఁడు.

6-90-కంద పద్యము

సతతాచార సమంచిత
మతియై సుజ్ఞానమునకు మరగెడు తఱి నా
యతగతి నాతని కంగజ
మతమై నవయౌవనాగమం బెడ జొచ్చెన్.

6-91-సీస పద్యము

కడకంట యౌవనగర్వంబు వొడగట్టె;
మదిలోన నుద్రేక మదము దొట్టెఁ;
గడుమేనఁ గామ వికారంబు దలచూపె;
ముఖమునఁ జిరునవ్వు మొలక లెత్తె;
నతి పుష్టి నిష్ఠురం బయ్యె; దేహం బెల్లఁ;
గచ భారమున నెఱికప్పు మెఱసెఁ;
గటిభారమున నూరు కాండముల్ జిగి మీఱె;
బాహుశాఖలు దీర్ఘ భంగిఁ దోఁచె;

6-91.1-ఆటవెలది

నురము విపుల మయ్యె; నుల్లస ద్వర కాంతి
పూర మంగళమునఁ బొందు పడియె;
భూరితేజుఁ డయిన భూసురాన్వయునకు
నభినవైక యౌవనాగమమున.

6-92-కంద పద్యము

హృదయమునఁ బొడము యౌవన
మదము వెలిం దోచు భంగి మానిత రుచిఁ ద
ద్వదనమున నూగుమీసలు
పొదలుచుఁ గప్పడరి చూడఁ బొంకం బయ్యెన్.

6-93-వచనము

మఱియును.

6-94-కంద పద్యము

తమ్మివిరి మీఁద వ్రాలిన
తుమ్మెద పంక్తియును బోలెఁ దోరపు లీలం
గ్రమ్ముకొని విప్రతనయుని
నెమ్మొగమునఁ గానబడియె నెఱిమీసంబుల్.

6-95-వచనము

అంత ననంగబ్రహ్మ తంత్రమునకు వసంతు డొనర్చు నంకురార్ప ణారంభంబునుం బోలె లలిత కిసలయ విసర ప్రసార భాసుర బహు పాదపాది పురోపవన పవన జనన ప్రభావ పరికంపిత విటవిటపీ జన హృదయ ప్రఫుల్ల పల్లవ భల్లంబును,

అనూన ప్రసూన నిర్భర గర్భావిర్భూత సురభి పరాగపటల పటఘటిత నభోమండలంబును, నమంద నిష్యంద మరంద బిందు సందోహ కందళిత చిత్త మత్త మధుప సంకుల ఝుంకార ముఖరిత సకల దిశావలయంబును, నిరంతర ధారాళ రసభరిత పరిపక్వ ఫలానుభవ ప్రభావ సమ్మోదవాద శుక ప్రముఖ పతంగ కోలాహలంబునునై, మధుమాసంబు సర్వ జన మనోహరంబునునై, నిఖిల వనపాదపంబుల నలంకరించె; అయ్యవసరంబున నజామిళుండు పితృనిర్దేశంబునం గుశ సమిత్పుష్ప ఫలార్థంబు వనంబున కరిగి, తిరిగి వచ్చు సమయంబున, నొక్క లతాభవనంబున.

6-96-కంద పద్యము

బద్ధానురాగయై స్మర
యుద్ధంబున కలరు బుద్ధి నురు కామకళా
సిద్ధి యగు వృషలితోఁ బ్రియ
వృద్ధిం దగఁ గూడియున్న విటు నొరుఁ గాంచెన్.

6-97-కంద పద్యము

భటునిన్ రతిశాస్త్ర కళా
ర్భటునిన్ వర యౌవనానుభవ మదవిభవో
ద్భటునిన్ సురతేచ్ఛా సం
ఘటునిన్ విగతాంబరోరుకటునిన్ విటునిన్.

6-98-శార్దూల విక్రీడితము

హేలా ఘూర్ణిత నేత్రతో మదన తంత్రారంభ సంరంభతో
ఖేలాపాలన యోగ్య భ్రూవిభవతోఁ గీర్ణాలకాజాలతో

హేలాలింగన భంగి వేషవతితోఁ నిచ్ఛావతీమూర్తితోఁ
గేళిం దేలుచునున్నవానిఁ గనెఁ బుంఖీభూత రోమాంచుఁడై.

6-99-కంద పద్యము

కలికి వరు మదన కదనపుఁ
బలుకుల కలకలము బెడఁగు పడు మేఖల ము
వ్వల రవళిఁ దగిలి గతిగొనఁ
గలకంఠి రతంబు సలుపు గమకముఁ గనియెన్.

6-100-కంద పద్యము

కవకవనై పదనూపుర
రవరవ లాగుబ్బుకొన్న రతిపతి గతులం
జివచివనై విటు చెవులకు
రవళిన్ రతిసల్పు రతుల రవరవ గనియెన్.

6-101-చంపకమాల

కురు లళికంబుపై నెగయఁ గ్రొమ్ముడి వీడఁగ గుబ్బదోయిపై
సరములు చౌకళింపఁ గటిసంగతి మేఖల తాళగింప స
త్కర వర కంకణావళులు గర్జిలఁ గౌ నసియాడ మీఁదుగా
మరుని వినోదముల్ సలిపె మానిని యౌవ్వన గర్వరేఖతోన్.

6-102-కంద పద్యము

మవ్వపు సుకుమారాంగిని
జవ్వని నుపగూహనాది సముచిత రతులన్

నివ్వటిలుదానిఁ గని మది
నువ్విళ్లూరంగ మన్మథోద్దీపనుఁడై.

6-103-తరళము

బహుళ దృక్పరిపాక మోహ నిబద్ధుఁ డౌచు మనంబులో
సహజ కర్మము వేదశాస్త్రము సాత్త్వికంబుఁ దలంచి త
న్నిహిత చిత్తము పట్టి పట్టఁగ నేరఁ డయ్యె సదా మనో
గహనమందు మరుండు పావకు కైవడిం జరియింపగాన్.

6-104-శార్దూల విక్రీడితము

ఆ లీలావతి గండపాళికలపై హాసప్రసాదంబు పై
నాలోలాలక పంక్తి పై నళికపై నాకర్ణ దృగ్భాతి పై
హేలాపాది కుచద్వ యోరు కటిపై నిచ్చల్ పిసాళింపఁగా
జాలిం బొందుచు నాత్మఁ గుందుచు మనోజాతానలోపేతుఁడై.

6-105-తేటగీతి

మఱి కులాచార వర్తన మాటు చేసి
పరఁగు పిత్రర్థములు దాని పాలు చేసి
సాధు లక్షణ గుణవృత్తిఁ జాలు చేసి
లోలలోచన పసఁ జెంది లోలుఁ డయ్యె.

6-106-కంద పద్యము

శ్యామను సుమాస్త్ర ఖేలన
కామను సుగుణాభిరామఁ గమనీయగుణ

స్తోమ నిజభామ నొల్లక
ధామమున నటించెఁ గ్రించుఁ దనమున జడుఁడై.

6-107-ఉత్పలమాల

బంధులఁ దిట్టి సజ్జనులఁ బాధలఁ బెట్టి యనాథకోటిఁ బెం
బందెలు చుట్టి యీరములు పట్టి పథంబులు గొట్టి దిట్టయై
నిందల కోర్చి సాధులకు నిందితుఁడై గడియించు విత్త మా
సుందరి కిచ్చి మచ్చికలు సొంపెదఁ గూర్చి వసించెఁ దత్కృపన్.

6-108-సీస పద్యము

సముచిత శ్రుతిచర్చఁ జర్చింప నొల్లక;
 సతి కుచద్వయచర్చఁ జర్చ జేయు;
దర్క కర్కశ పాఠ తర్కంబు గాదని;
 కలికితోఁ బ్రణయ తర్కంబు జేయు;
స్మృతి పదవాక్య సంగతి గాక తత్సతి;
 పదవాక్య సంగతి పరఁగ జేయు;
నాటకాలంకార నైపుణం బుడిగి త;
 న్నాటకాలంకార పాటిఁ దిరుగుఁ;

6-108.1-తేటగీతి

బరఁగఁ జిరకాల మీ రీతిఁ బాపనియతి
రమణ దాసీ కుటుంబ భారము వహించి
యది కుటుంబి నిగాఁగఁ బాపాత్ముఁ డగుచు
నశుచియును దుష్టవర్తనుఁ డై మెలంగె.

6-109-కంద పద్యము

అటు గాన పాపకర్ముని\
గుటిలుని సుజనార్తు ధూర్తుఁ గ్రూరుని నే మా\
రటమునఁ గొని యేగెద మం\
తట దండమువలన నితఁడు ధన్యత నొందున్.

6-110-వచనము

ఇట్లు పలుకుచున్న యమదూతల వారించి, నయకోవిదు లైన భగవద్దూత లిట్లనిరి.

6-111-కంద పద్యము

అవురా! ధర్మవివేక\
ప్రవరుల పస గానఁబడియెఁ బాపము పుణ్యో\
ద్భవుల యదండ్యుల దండన\
వివరం బొనరింపఁ బడియె విధి యెఱుఁగమిచేన్.

6-112-చంపకమాల

సములును సాధులున్ విహితశాసనులున్సదయాళురున్ శుభో\
త్తమగుణులైన యట్టి తలిదండ్రులు బిడ్డల కెగ్గు జేయుచోఁ\
గ్రమమున వార లెవ్వరికిఁ గైకొని కుయ్యిడఁజాలువారు సం\
భ్రమమున మీ మనంబులఁ దిరంబుగఁ జర్చయొనర్చి చూడుఁడా;

6-113-ఆటవెలది

ఎఱుక గలుగు నాతఁ డేది యొనర్చిన
నది యొనర్తు రితరు లైన వార
లతఁడు సత్య మిట్టి దనె నేని లోకంబు
దత్ప్రవర్తనమునఁ దగిలి యుండు.

6-114-ఆటవెలది

నెమ్మిఁ దొడలమీఁద నిద్రించు చెలికాని
నమ్మఁదగినవాఁడు నయము విడిచి
ద్రోహబుద్ధిఁ జంప దొడరునే? యెందైనఁ
బ్రీతి లేక ధర్మదూతలార!

6-115-ఆటవెలది

చిత్తమెల్ల నిచ్చి చెలితనంబున వచ్చి
నచ్చి కలయ మెచ్చి నమ్మువానిఁ
గరుణ గలుగువాఁడు కడుసౌమ్యుఁ డగువాఁడు
చింతజేయ కెట్లు చెఱుప నేర్చు?

6-116-వచనము

అదియునుం గాక

6-117-ఉత్పలమాల

ఈతఁడు కోటిసంఖ్యలకు నెక్కుడు పుట్టువులందుఁ జెంది యా
యాతము లైన పాప నివహంబుల నన్నిటిఁ బాఱఁ దోలెఁ బ్ర

ఖ్యాతమతిన్ మహా మరణ కాలమునన్ హరిపుణ్యనామ సం
భూత సుధామయాద్భుత విభూతిక రాక్షర సంగ్రహంబునన్.

6-118-సీస పద్యము

బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్ని;
 కీలలు హరినామ కీర్తనములు;
గురుతల్ప కల్మష క్రూరసర్పములకుఁ;
 గేకులు హరినామ కీర్తనములు;
తపనీయ చౌర్య సంతమసంబునకు సూర్య;
 కిరణముల్ హరినామ కీర్తనములు;
మధుపాన కిల్బిష మదనాగ సమితికిఁ;
 గేసరుల్ హరినామ కీర్తనములు;

6-118.1-తేటగీతి

మహిత యోగోగ్ర నిత్యసమాధి విధుల
నలరు బ్రహ్మాది సురలకు నందరాని
భూరి నిర్వాణ సామ్రాజ్య భోగభాగ్య
ఖేలనంబులు హరినామ కీర్తనములు;

6-119-సీస పద్యము

ముక్తికాం తైకాంత మోహన కృత్యముల్;
 కేలిమై హరినామ కీర్తనములు;
సత్యలోకానంద సౌభాగ్యయుక్తముల్;
 కేలిమై హరినామ కీర్తనములు;

మహిత నిర్వాణ సామ్రాజ్యాభిషిక్తముల్;
 కేలిమై హరినామ కీర్తనములు;
బహుకాల జనిత తపఃఫల సారముల్;
 కేలిమై హరినామ కీర్తనములు;

6-119.1-తేటగీతి

పుణ్యమూలంబు లనపాయ పోషకంబు
లభిమతార్థంబు లజ్ఞాన హరణ కరము
లాగమాం తోపలబ్ధంబు లమృతసేవ
లార్తశుభములు హరినామ కీర్తనములు;

6-120-కంద పద్యము

కామంబు పుణ్యమార్గ
స్థేమంబు మునీంద్ర సాంద్రచే తస్సరసీ
ధామంబు విష్ణు నిర్మల
నామంబుఁ దలంచువాఁడు నాథుఁడు గాడే?

6-121-కంద పద్యము

డెందంబు పుత్త్రు వలనం
జెందిన దని తలఁప వలదు శ్రీపతి పే రే
చందమున నైనఁ బలికిన
నందకధరుఁ డందుఁ గలఁడు నాథుం డగుచున్.

6-122-ఆటవెలది

బిడ్డపేరు పెట్టి పిలుచుట విశ్రామ
కేళి నైన మిగులఁ గేలి నయినఁ
బద్య గద్య గీత భావార్థముల నైనఁ
గమలనయనుఁ దలఁపఁ గలుషహరము.

6-123-ఉత్పలమాల

కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట మహాజ్వరాదులం
బ్రేలినచోట సర్పముఖ పీడల నందినచోట నార్తులై
తూలినచోట విష్ణు భవదూరునిఁ బేర్కొనిరేని మీఁద న
క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్.

6-124-సీస పద్యము

అతిపాపములకుఁ బ్రయత్న పూర్వకముగఁ;
 దనుపాపముల కమితంబు గాఁగ
సన్ముని వరులచే సంప్రోక్తమై యుండు;
 నిర్మలం బగు పాప నిష్కృతములు
గ్రమరూపమున నుపశమనంబులగుఁ గాని;
 తత్పాపచయములు దరువ లేవు;
సర్వకర్మంబుల సంహార మొనరించి;
 చిత్తంబునకుఁ దత్తసిద్ధి నొసఁగు

6-124.1-ఆటవెలది

నొనర నీశు సేవ, యోగిమానస సరో
వాసు సేవ, హేమవాసు సేవ,

వేదవేద్యు సేవ, వేదాంత విభు సేవ,
పరమపురుష పాదపద్మ సేవ.

6-125-కంద పద్యము

హరి నెఱుగని యా బాలుఁడు
హరిభక్తులతోడఁ గూడి హరి యను వాఁడున్
సరియై దోషము లడఁచును
గరువలితో నగ్ని దృణముఁ గాల్చిన భంగిన్.

6-126-ఉత్పలమాల

ఆరయ వీర్యవంత మగు నౌషధమెట్లు యదృచ్ఛఁ గొన్న ద
చ్చారు గుణంబు రోగములఁ జయ్యనఁ బాపెడు మాడ్కిఁ బుణ్య వి
స్తారుని నంబుజోదరునిఁ బామరుఁ డజ్ఞుఁ డవజ్ఞఁ బల్కినన్
వారక తత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే?

6-127-కంద పద్యము

ధృతి దప్పిన తఱినిఁ బురా
కృతమునఁ గాకెట్లు దోఁచుఁ గేశవుఁడు మదిన్
మితి లేని జగముఁ దాల్చిన
యతఁ డొక్కని మనములోన నడఁగెడు వాఁడే?

6-128-మత్తేభ విక్రీడితము

నిరతంబై నిరవద్యమై నిఖిల చిన్నిర్మాణమై నిత్యమై
నిరహంకార గుణాఢ్యమై నియమమై నిర్దోషమైనట్టి శ్రీ

హరి నామస్మర ణామృతం బితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా
మరణాంతంబున నిట్టి సజ్జనుని ధర్మంబేల వ్యర్థం బగున్.

6-129-వచనము

అని యిట్లు భగవద్దూతలు భాగవతధర్మంబు నిర్ణయించి, ఈ యర్థంబున మీకు సంశయంబు గలదేని మీ రాజు నడుఁగుడు; పొం" డని పలికి బ్రాహ్మణుని నతిఘోరం బైన యామ్యపాశబంధ నిర్ముక్తునిం గావించి, యమభటుల వలని యుదుటు వాపి; రంత నా యమదూత లా భగవద్దూతల సంభాషణ ప్రభావంబునఁ దమ మనంబుల శాంతి నొంది భగవత్తత్త్వ జిజ్ఞాసులై చేయునది లేక నిరాకృతులై, యమలోకంబునకుం జని, పితృపతికి సర్వంబును నెఱింగించిరి; అంత.

6-130-కంద పద్యము

అతఁడును బాశచ్యుతుఁడై
గతభయుఁడై ప్రకృతినొంది కడునుత్సవ సం
గతిఁ జూచి మ్రొక్కి మదిలో
నతులిత ముద మొదవి పొదలి హరిదాసులకున్.

6-131-ఆటవెలది

నిలిచి కేలు మొగచి పలుక నుద్యోగించి
చెలఁగుచున్న లోనితలఁపు దెలిసి
చక్రధరుని కూర్మి సహచరు లరిగి ర
దృశ్యు లగుచు దేవదేవు కడకు.

6-132-కంద పద్యము

వేదత్రయ సంపాద్యము

మోదంబు గుణాశ్రయంబు మొుగి భగవద్ధ

ర్మాదేశంబగు తద్భట

వాదంబు నజామిళుండు వదలక వినుచున్.

6-133-కంద పద్యము

శ్రీమన్నారాయణ పద

తామరసధ్యానసలిల ధౌత మహాఘ

స్తోముండై సద్భక్తికి

ధామం బగుచుండెఁ దెలిసి తత్క్షణమాత్రన్.

6-134-కంద పద్యము

పరవసమున నరికట్టిన

దురితంబులఁ దలఁచి దలఁచి తుదిఁ దాపమునన్

హరి నీకు నాశ్రయించుచుఁ

బరితాపము నొంది పలికె బ్రాహ్మణుఁ డంతన్.

6-135-సీస పద్యము

వృషలియం దనురాగ వృద్ధిఁ బిడ్డలఁ గని;

కులము గోదావరిఁ గూలఁ ద్రోచి

రచ్చల కెక్కి పెన్ రజ్జుచేఁతల సరి;

వారిలోపలఁ దలవంపు చేసి

కట్టఁడిముదుక నై కర్మబంధంబుల;

పుట్టనై నిందల ప్రోవ నగుచుఁ
దరుణుల రోఁతలఁ దవిలి భోగించిన;
కడిఁది నా జన్మంబు గాలిపోయె;

6-135.1-ఆటవెలది

చదువు చట్టుబడియె; శాస్త్రంబు మన్నయ్యె;
బుద్ధి పురువు మేసెఁ బుణ్య మడఁగె;
నీతి మట్టుబడియె నిర్మలజ్ఞానంబు
మొదలి కుడిగె బోధ మూరిఁ బోయె.

6-136-కంద పద్యము

చిక్కని చక్కని చన్నుల
మక్కువ యిల్లాలి విడిచి మాయలుగల యీ
వెక్కసపు మద్యపానపు
డొక్కపసం దగిలి దుర్విటుఁడనై చెడితిన్.

6-137-ఉత్పలమాల

అక్కట! ఘోర దుష్కృత మహానలకీలలు నన్ను ముట్టి పే
రుక్కడఁగింప కిట్లు ధృతి నుండఁగ నిచ్చెనహో! దురాత్మునిం
గ్రక్కునఁ దల్లిదండ్రుల నకల్మషచిత్తులఁ బెద్దలన్ మఱే
దిక్కును లేనివారిఁ బలు త్రిక్కులఁ బెట్టుచుఁ బాఱఁ దోలితిన్.

6-138-కంద పద్యము

అకృతజ్ఞుఁడ నై విడిచితిఁ
బ్రకృతిం గల బంధువులను బాల్యమున ననున్
వికృతిఁ గనకుండఁ బెంచిన
సుకృతుల మజ్జనకవరుల శోభనకరులన్.

6-139-వచనము

అప్పుడు.

6-140-ఆటవెలది

పెక్కు పాతకముల భృశదారుణం బైన
దొడ్డ నరకమందుఁ బడ్డ నున్న
నాపదలకుఁ బాపి యరికట్టి రక్షించి
రిట్టి ధర్మపురుషు లెందు వారొ?

6-141-శార్దూల విక్రీడితము

చోద్యంబై కలవోలె నీ క్షణమునం జూడంగఁ బ్రత్యక్షమై
వేద్యం బయ్యెను నన్ను నీడ్చిన మహావీరుల్ భృశోదగ్రు లా
యుద్యోగంబులవారు పాశధరు లీ యుత్సాహముల్ మాని సం
పాద్యానేక వికారరూప కుటిలప్రఖ్యాతు లెందేగిరో?

6-142-ఉత్పలమాల

దారుణ పాశబంధన విధానములన్ నరకార్ణవంబులోఁ
గూరిన నన్ను నేఁడు చెడకుండ నొనర్చిన పుణ్యమూర్తు లం

భోరుహనేత్రు లుజ్జ్వల నభోమణితేజులు లోచనోత్సవుల్
చారుదయా సమంచిత విచారులు నల్వురు నెందు నేఁగిరో?

6-143-మత్తేభ విక్రీడితము

నను రక్షించిన పుణ్యవంతులు కనన్నాళీకపత్రాక్షు లం
జనసంకాశులు శంఖచక్రధరు లాజానూరుబాహుల్ స్మితా
నను లాలంబిత కర్ణవేష్టన సువర్ణచ్ఛాయ దివ్యాంబరుల్
ఘన కారుణ్య రసైకపూర్ణులు సమగ్రస్ఫూర్తి నెం దేఁగిరో?

6-144-వచనము

పాతకుండ నగు నాకు నవ్విబుధోత్తమ దర్శనంబు పురాకృతంబగు మదీయ పుణ్య విశేషంబునం గాని పొంద శక్యంబు గాదు; తత్సందర్శనం బాత్మకు నతిసుప్రసన్నంబయి యొప్పె; నట్లు గాకుండెనేనిఁ గలుషవర్తనంబున వృషలీభర్తనై యుండి మృతిఁ బొందుచున్న నాదు జిహ్వకు శ్రీమన్నారాయణనామ గ్రహణంబు సంభవింప నేరదు; మఱియును.

6-145-ఆటవెలది

పాతకుండ జడుఁడ బ్రహ్మఘాతుకుఁడను
మాన లోభ మోహ మత్సరుండ
నాకు నెట్లు దొరకు? నారాయణుని దివ్య
నామ విమల కీర్తనంబు మదికి.

6-146-సీస పద్యము

దారుణ మోహాంధకార పూరితుఁడను;
 హరి విస్మయస్మరణార్హ మతినె?
పంచ మహాతీవ్ర పాతకోపేతుఁడ;
 హరి విస్మయస్మరణార్హ మతినె?
కౌటిల్య కితవ వికార పారీణుండ;
 హరి విస్మయస్మరణార్హ మతినె?
యఖిల దుఃఖైక ఘోరార్ణవ మగ్నుండ;
 హరి విస్మయస్మరణార్హ మతినె?

6-146.1-తేటగీతి

నిందలకు నెల్ల నెలవైన నిర్గుణుండ
మందభాగ్యుండ నే నేఁడ? మధువిదారి
దివ్య గుణనామ కీర్తన తెఱఁ గదేఁడఁ?
బూర్వ సుకృతంబు లే కెట్లు పొందఁ గలుగు?

6-147-వచనము

అని వితర్కించి.

6-148-మత్తేభ విక్రీడితము

యత చిత్తేంద్రియమారుతుండ నగుచున్ యత్నం బొనర్తున్ హరి
వ్రత సంపత్తికిఁ బుణ్యవృత్తికిఁ జిదానోన్ము ఖాసక్తికిన్
యుత నిర్వాణ పదానురక్తికి సుఖోద్యోగక్రియాశక్తికిన్
ధృతి లబ్ధోత్తమ ముక్తికిన్ సకల ధాత్రీధుర్య సద్భక్తికిన్.

6-149-కంద పద్యము

విడిచితి భవబంధంబుల
నడఁచితి మాయావిమోహ మైన తమంబు
న్విడిచితి నరివర్గంబులఁ
గడచితి నా జన్మ దుఃఖ కర్మార్ణవమున్.

6-150-కంద పద్యము

యోషిద్రూపంబున నను
నేషణ ముఖగహ్వరమున నెగ మ్రింగి కడున్
ద్వేషమున గోతి సేసిన
దోషద యగు నాత్మ మాయఁ దొలఁగం గంటిన్.

6-151-వచనము

అని యిట్లు వైష్ణవజ్ఞానదీపం బాత్మస్నేహంబునం దోఁచిన నా బ్రాహ్మణుండు.

6-152-మత్తేభ విక్రీడితము

భగవద్ధర్మపరాయ ణోత్తముల సంభాషైక మంత్రంబులన్
మిగులన్ జ్ఞానము పుట్ట మోహ భవ సమ్మిశ్రాత్మ బంధంబులన్
తెగ ఖండించి సబంధు మిత్ర సుత పత్నీ మోహ విశ్రాంతుఁడై
జగతీనాథు రమేశు కృష్ణుని దయైశ్వర్యంబులం గోరుచున్.

6-153-కంద పద్యము

హరిభక్తులతో మాటలు
ధర నెన్నఁడుఁ జెడని పుణ్యధనముల మూటల్

వర ముక్తికాంత తేటలు
నరిషడ్వర్గంబు చొరని యరుదగు కోటల్.

6-154-సీస పద్యము

అనుచు నా బ్రాహ్మణుం డతి తత్త్వవేదియై;
 భవబంధముల నెల్లఁ బాఱఁ దోలి
మొనసి గంగాద్వారమున కేగి యచ్చటఁ;
 బ్రబ్బిన దేవతాభవనమందు
నాసీనుఁడై యోగ మాశ్రయించి చెలంగు;
 దేహేంద్రియాదుల తెరువువలన
దనుఁ బాపుకొని పరతత్త్వంబుతోఁ గూర్చి;
 మానుగా నాత్మసమాధిచేత

6-154.1-ఆటవెలది

గుణగణంబుఁ బాసి కొమ రొప్పిన భగవ
దనుభవాత్మయందు నాత్మఁ గలిపి
రమణఁ దన్ను మొదల రక్షించినట్టి యా
పురుషవరులఁ గాంచి పొసఁగ మ్రొక్కె.

6-155-వచనము

అట్లజామిళుండు యోగమార్గంబున దేహంబు విడిచి పుణ్య శరీరుండై యగ్రభాగంబునం బ్రాగుపలబ్ధులైన మహాపురుష కింకరులం గాంచి, సముంచిత రోమాంచిత చలచ్చటాపింజరిత స్వేదబిందుసందోహ మిష నిష్యంద మహానందవల్లీకామతల్లికాంకుర సంకుల పరిశోభిత తనుండును, హర్ష నికర్షమాణ

మానసోద్వేగ యోగప్రభావోత్సాహ విస్మయ మందస్మిత కందళిత ముఖారవిందుండును, నిఖిల జగజ్జేగీయమానాఖండ శుభప్రద శుభాకార సందర్శన సమాసాదిత కుతూహల మానసుండును నై, ప్రణామంబు లాచరించుచు భాగీరథీ తీరంబునఁ గళేబరంబు విడిచి, తత్క్షణంబ హరిపార్శ్వవర్తు లైన దాసవరుల స్వరూపంబుఁ దాల్చి, యా విష్ణుసేవకులతోడం గూడి దివ్య మణిగణఖచితంబై సువర్ణమయంబైన యసమాన విమానం బెక్కి, నిఖిలానంద భోగభాగ్యానుభ వాకుంఠితం బైన వైకుంఠనగరంబునకు శ్రీమన్నారాయణ పదారవింద సేవాచరణ పరిమాణ స్థితికిం జనియెను; ఇట్లు విప్లావిత సర్వధర్ముండైన దాసీపతి, గర్హిత కర్మంబులచేతఁ బతితుండును, హతప్రభుండును నై నరకంబునం గూలుచుండి భగవన్నామ గ్రహణంబున సద్యోముక్తుం డయ్యె; కావున.

6-156-కంద పద్యము

కర్మంబు లెల్లఁ బాయను
మర్మము దెలియంగ లేదు మధురిపు పేరే
పేర్మిని నొడువుటకంటెను
దుర్మదమునఁ జిత్త మెన్ని త్రోవలఁ జన్నన్.

6-157-ఉత్పలమాల

పాండవవంశపావన! నృపాలక! యీ యితిహాస మెవ్వఁడే
నొండొక భక్తి లేక విను నోర్పుమెయిం బఠియించు నాతఁ డు
ద్దండత ముక్తికామినికిఁ దానకమై దనుజారిలోకమం
దుండు మహావిభూతి యమదూతల చూడ్కికగోచరాకృతిన్.

6-158-తేటగీతి

అరయఁ బుత్త్రోపచారిత మైన విష్ణు
నామ మవసానకాలంబు ననుభవించి
శార్ఙ్గి నిలయంబుఁ జేరె నజామిళుండు
నిట్లు సద్భక్తిఁ దలఁచిన నేమిచెప్ప?

6-159-కంద పద్యము

కోరినవారల కెల్లను
జేరువ కైవల్యపదము శ్రీవరుని మదిం
గోరనివారల కెల్లను
దూరము మోక్షాప్తి యెన్ని త్రోవలనైనన్.

6-160-వచనము

అనినం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె "మునీంద్రా! యాజ్ఞాభ్రష్టుం డై యమధర్మరాజు శ్రీవిష్ణు నిర్దేశకులచే విహతులైన భటులచేత వర్ణింపం బడిన నారాయణుని నామప్రభావం బాకర్ణించి, వారల కేమనియె? మఱియు, నెన్నఁడేని యమదండంబు విఫలం బై పోయిన తెఱంగు గలదేని వినవలయు; నీ సందేహంబుఁ బాప మహాత్మా! నీవు దక్కఁ దక్కిన వారలు సమర్థులు గారని తలంచుచున్నవాఁడ; చిత్తంబును బ్రసాదాయత్తంబుగా భవదీయ వచన సుధాధారలం బ్రసాదింపవలయు;" అనిన శుకుం డిట్లనియె.

6-161-కంద పద్యము

శ్రీకృష్ణభటులచేత ని
రాకృతులై యామ్యభటులు యమునకు నాత్మ

స్వీకృత విప్రకథా క్రమ
మీ క్రియ ము న్దెలిపి రదియు నెఱింగింతుఁ దగన్.

6-162-తేటగీతి

చేరి త్రైవిధ్యమున మించు జీవతతికిఁ
గర్మఫలములఁ దెలిపెడు కారణంబు
లగుచు శిక్షించువార లీ యవనిమీఁద
దేవ! యెందఱు గలరయ్య! తెలియవలయు.

6-163-కంద పద్యము

దక్షిణదిశాధినాయక!
శిక్ష దగం జేయువారు క్షితిఁ బెక్కండ్రే
నీ క్షయమును నక్షయమును
సాక్షాత్తుగ నెందు రెండు సంపన్న మగున్?

6-164-తేటగీతి

దట్టమైనట్టి కర్మబంధముల నెల్ల
నాజ్ఞ బెట్టెడువారు పెక్కైన చోట
నకట! శాస్తృత్వ ముపచార మయ్యెఁ గాదె?
శూరులై నట్టి మండలేశులకుఁ బోలె.

6-165-ఉత్పలమాల

కావున నీవ యొక్కఁడవ కర్తవు మూఁడు జగంబులందు సం
భావిత భూతకోటిఁ బరిపాకవశంబున శిక్షజేయఁగా

నీ వర శాసనం బఖిలనిర్ణయమై తనరారుచుండ నేఁ
డీవలఁ గ్రమ్మఱింప మఱి యెవ్వఁడు శక్తుఁడు? ధర్మపాలనా!

6-166-కంద పద్యము

చండ కర తనయ! యొరులకు
దండధరత్వంబు గలదె? తగ జగమున ను
ద్దండధరవృత్తి నొత్తిలి
దండింతువు నిన్ను దండధరుఁడని పొగడన్.

6-167-సీస పద్యము

ఇట్టి నీ దండంబ యీ మూఁడుజగములఁ;
దెగువమై నేఁడు వర్తిల్లుచుండ
మనుజలోకంబున మహితాద్భు తాకార;
సిద్ధుల మిగులఁ బ్రసిద్ధు లైన
వారు నల్వురు వేగ వచ్చి నిర్దేశంబు;
భంగించి మమ్మంత చెంగఁదోలి
నీ శాసనంబున నే మీఁడ్చి కొనువచ్చు;
క్రూరచిత్తునిఁ బుచ్చికొని యదల్చి

6-167.1-తేటగీతి

పాశబంధంబు లీసునఁ బట్టి త్రెంచి
బలిమి మిగులంగ మమ్మును బాఱఁదోలి
యిచ్చఁ జనినారు వారు దా మెచటివార
లాదరమ్మున మాకు నేఁ డానతిమ్ము.

6-168-వచనము

అని" రని మఱియు శుకుం డిట్లనియె "నట్లు దూతలు పరితాప సమేతులై పలికిన, దండధరుఁడు పుండరీకాక్షుని చరణకమలంబులు దన మానసంబున సన్నిహితంబుగఁ జేసికొని, వందనం బాచరించి, పరమ భక్తిపరుండై వారల కిట్లనియె.

6-169-సీస పద్యము

కలఁడు మదన్యుండు ఘనుఁ డొక్కఁ డతఁ డెందు;
 వెలికిఁ గానఁగరాక విశ్వమెల్లఁ
నతిలీనమై మహాద్భుత సమగ్రస్ఫూర్తి;
 నుండును గోకఁ నూలున్న భంగి
దామెనఁ బశువులు దగిలి యుండెడు మాడ్కి;
 నామసంకీర్తన స్థేమగతుల
విహరించు నెవ్వఁడు విలసిత మత్ప్రజ;
 లెవ్వని పదముల నివ్వటిల్లుఁ

6-169.1-ఆటవెలది

గనుట మనుట చనుట గల్గు నెవ్వని లీల
లందు లోక మెవనియందుఁ బొందు
నెన్నఁబడుచుఁ బుడమి నెవ్వని నామముల్
కర్మబంధనముల పేర్మి నడఁచు.

6-170-తరళము

వినుఁడు నేను మహేంద్రుఁ డప్పతి వీతిహోత్రుఁడు రాక్షసుం
డనిలుఁ డర్కుఁడు చంద్రుఁడుం గమలాసనుండు మరుద్గణం
బును మహేశుఁడు రుద్రవర్గము భూరి సంయమి సిద్ధులున్
మొనసి కన్గొనజాల రెవ్వని మూర్తి విశ్రుతకీర్తిమై.

6-171-కంద పద్యము

సత్త్వేతర గుణపాశ వ
శత్వంబునఁ బొంద వీరు జలజాక్షు సదై
కత్వంబు గాన నోపరు
సత్త్వప్రాధాన్యు లితర జనముల తరమే?

6-172-చంపకమాల

అభవు నమేయు నవ్యయు ననంతు ననారతుఁ బూని మేనిలో
నుభయము నై వెలుంగు పురుషోత్తముఁ గానరు చిత్తకర్మ వా
గ్విభవ గరిష్ఠులై వెదకి వీఁడి ప్రాణులు; సర్వవస్తువుల్
శుభగతిఁ జూడనేర్చి తనుఁ జూడఁగనేరని కంటిపోలికన్.

6-173-చంపకమాల

పరముని భక్తలోక పరిపాలన శీలుని దుష్టలోక సం
హరుని పతంగపుంగవ విహారుని కూరిమిదూత లామనో
హరులు సురేంద్రవందితులు నా హరిరూప గుణస్వభావులై
తిరుగుచునుందు రెల్లడలఁ దిక్కులఁ దేజము పిక్కటిల్లఁగన్.

6-174-ఉత్పలమాల

లెక్కకు నెక్కువై కసటులేని మహాద్భుత తేజ మెల్లెడం
బిక్కటిలం జరింతు రతి భీమబలాఢ్యులు విష్ణుదూత లా
చక్కని ధర్మశాంతు లతిసాహసవంతులు దేవపూజితుల్
గ్రిక్కిఱియన్ జగంబునను గేశవసేవక రక్షణార్థమై.

6-175-కంద పద్యము

నా వలనను మీ వలనను
దేవాసుర గణము వలనఁ ద్రిజగంబులలో
నే వగలఁ బొందఁకుండఁగఁ
గావం గలవారు పుడమిఁ గల వైష్ణవులన్.

6-176-కంద పద్యము

భగవత్ప్రణిహిత ధర్మం
బగపడ దెవ్వారి మతికి ననిమిష గరుడో
రగ సిద్ధ సాధ్య నర సుర
ఖగ తాపస యక్ష దివిజ ఖచరుల కైనన్.

6-177-కంద పద్యము

ఎన్నఁడుఁ దెలియఁగ నేరరు
పన్నగపతిశాయి తత్త్వభావము మేనం
గన్నుల వేల్పును డాపలఁ
జన్నమరిన వేల్పు ముదుక చదువుల వేల్పున్.

6-178-సీస పద్యము

వర మహాద్భుత మైన వైష్ణవజ్ఞానంబుఁ;
 దిరముగా నెవ్వరు దెలియఁగలరు?
దేవాదిదేవుండు త్రిపురసంహరుఁ డొండెఁ;
 గమలసంభవుఁ డొండెఁ గార్తికేయ
కపిల నారదు లొండె గంగాత్మజుం డొండె;
 మను వొండె బలి యొండె జనకుఁ డొండెఁ
బ్రహ్లాదుఁ డొండె నేర్పాటుగా శుకుఁ డొండె;
 భాసురతరమతివ్యాసుఁ డొండెఁ

6-178.1-తేటగీతి

గాక యన్యుల తరమె? యీ లోకమందు
నీ సుబోధంబు సద్బోధ మీ పదార్థ
మీ సదానంద చిన్మయ మీ యగమ్య
మీ విశుద్ధంబు గుహ్యంబు నీ శుభంబు.

6-179-కంద పద్యము

ఈ పన్నిద్దఱు దక్కఁగ
నోపరు తక్కొరులు దెలియ నుపనిష దుచిత
శ్రీపతినామ మహాద్భుత
దీపిత భాగవత ధర్మ దివ్యక్రమమున్.

6-180-తేటగీతి

ఏది జపియింప నమృతమై యెసఁగుచుండు
నేది సద్ధర్మపథ మని యెఱుఁగ దగిన

దదియె సద్భక్తి యోగంబు నావహించు
మూర్తిమంతంబు దా హరికీర్తనంబు.

6-181-తేటగీతి

కంటిరే మీరు సుతులార! కమలనేత్రు
భవ్య మగు నామకీర్తన ఫలము నేఁడు
దవిలి మృత్యువు పాశబంధములవలన
జాణతనమున నూడె నజామిళుండు.

6-182-ఉత్పలమాల

ఏటికి జాలిఁ బొంద? నరులే క్రియఁ గృష్ణుని కీర్తనంబు పా
పాటవులన్ దహింపఁ గల దౌటకు సందియ మేల? యిప్పు డీ
తూఁటరి దోషకారి పెనుదోషి యజామిళుఁ డంతమొందుచుం
బాటిగ విష్ణునామ సుతుఁ బల్కుచుఁ గేవలముక్తి కేఁగఁడే?

6-183-కంద పద్యము

ఇంతయును దథ్య మని మది
నింతయుఁ దెలియంగలేరు హీనాత్ములు దు
ర్దాంతతర ఘటిత మాయా
క్రాంతాత్యంతప్రకాశ గౌరవ జడులై.

6-184-కంద పద్యము

ఇంతయును దథ్య మని మది
నింతయుఁ దెలియంగలేరు హీనాత్ములు దు

ర్ధాంతతర ఘటిత మాయా
క్రాంతాత్యంతప్రకాశ గౌరవ జడులై.

6-185-ఉత్పలమాల

ఎవ్వరు సిద్ధ సాధ్య ఖచరేశ లసత్పరిగీత గాధలం
దెవ్వరు ముక్తిభోగతల హేమ మనోహర చంద్రశాలలం
దెవ్వరు శంఖచక్ర గురుహేతి గదా రుచిరోగ్రపాణు లా
మవ్వపు రూపవంతు లసమానులు వో ధరలోని వైష్ణవుల్.

6-186-సీస పద్యము

శ్రుత్యంత విశ్రాంత మత్యనుక్రమణీయ;
 భగవత్ప్రసంగతుల్ భాగవతులు;
సనకాది ముని యోగిజన సదానందైక;
 పరమ భాగ్యోదయుల్ భాగవతులు;
కృష్ణపదధ్యాన కేవలామృతపాన;
 పరిణామ యుతులు శ్రీభాగవతులు;
బహుపాత కానీక పరిభవ ప్రక్రియా;
 పరుషోగ్ర మూర్తులు భాగవతులు;

6-186.1-తేటగీతి

భావ తత్త్వార్థవేదులు భాగవతులు;
బ్రహ్మవా దానువాదులు భాగవతులు;
సిరులు దనరంగ నెన్నఁడుఁ జేటులేని
పదవి నొప్పారువారు వో భాగవతులు.

6-187-కంద పద్యము

అదిగాన విష్ణుభక్తులఁ
గదియఁగఁ జనవలదు మీరు కరివరదు లస
త్పదపద్మ వినతి విముఖులఁ
దుది నంటఁగఁ గట్టి తెండు ధూర్తులు వారల్.

6-188-సీస పద్యము

ఏకసక్కెమున కైన నిందిరారమణునిఁ;
బలుకంగలేని దుర్భాషితులను
గలలోన నైన శ్రీకాంతుని సత్పాద;
కమలముల్ చూడని కర్మరతుల
నవ్వుచు నైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిఁ;
దార్పనేరని దుష్కథా ప్రవణుల
యాత్రోత్సవంబుల నైన నీశుని గుడి;
త్రోవఁ ద్రొక్కఁగలేని దుష్పదులను

6-188.1-ఆటవెలది

బరమ భాగవతుల పాదధూళి సమస్త
తీర్థసార మనుచుఁ దెలియలేని
వారి వారివారి వారిఁ జేరినవారిఁ
దొలుతఁ గట్టి తెండు దూతలార!

6-189-ఆటవెలది

ఎల్ల పాపములకు నిల్లైన యింటిలో
బద్ధతృష్ణు లగుచు బుద్ధి దలఁగి
పరమహంసకులము గుఱిదప్పి వర్తించు
ధూర్తజనులఁ దెండు దూతలార!

6-190-ఆటవెలది

అరయఁ దనదు జిహ్వ హరిపేరు నుడువదు
చిత్త మతని పాదచింతఁ జనదు;
తలఁపఁ దమకు ముక్తి తంగేటి జన్నొకో
సకల విష్ణు భక్తులకును బోలె?

6-191-ఆటవెలది

పద్మనయను మీఁది భక్తి యోగం బెల్ల
ముక్తి యోగ మనుచు మొద లెఱుంగు
వారి వారివారి వారిఁ జేరినవారి
త్రోవఁ బోవ వలదు దూతలార!

6-192-వచనము

అని పలికె" నని చెప్పి మఱియు శుకుం డిట్లనియె "శ్రీకృష్ణనామ కీర్తనంబు జగన్మంగళం బనియును, జగన్మోహనం బనియును, జగజ్జేగీయమానం బనియును, నిఖిలపాపైక నిష్కృతి యనియును, నిఖిల దుఃఖ నివారణం బనియును, నిఖిలదారిద్ర్య నిర్మూలనం బనియును, నిఖిల మాయా గుణవిచ్ఛేదకం బనియును, నుద్దామంబు లగు హరి వీర్యంబుల నాకర్ణించు వారల చిత్తంబు లతి నిర్మలంబులగు భంగిం దక్కిన వ్రతాచరణంబులం

గావనియును, శ్రీకృష్ణ పదపద్మంబులు హృత్పద్మంబుల నిలుపు వార లన్య పాపకర్మంబు లగు నవిద్యా వ్యసనంబులం బొరయ నేరరనియును, నిజస్వామియైన యమధర్మ రాజుచేతఁ గీర్తింపంబడిన భగవన్మహాత్త్వంబు నాకర్ణించి, విస్మితులై కాలకింకరులు నాఁటనుండియు వైష్ణవజనంబులం దేఱిచూడ వెఱతురు; నరేంద్రా! పరమగుహ్యంబగు నీ యితిహాసంబును బూర్వకాలంబున సకల విజ్ఞానగోచరుండైన కుంభసంభవుండు సకలదుఃఖ విలయంబును సకలపుణ్య నిలయంబును నైన మలయంబునఁ బురాణపురుషుండైన పురుషోత్తము నారాధనంబు చేయుచుండి నాకెఱింగించెను;" అని చెప్పిన విని విస్మయానంద హృదయుండై పరీక్షిజ్జనపాలుం డిట్లనియె.

## 6-7- చంద్రుని ఆమంత్రణంబు

### 6-193-కంద పద్యము

స్వాయంభువ మనువేళల
నోయయ్య! సురాసు రాండ జోరగ నర వ
ర్గాయత సర్గము దెలిపితి
పాయక యది విస్తరించి పలుకం గదవే.

### 6-194-కంద పద్యము

ఉత్తర కొడు కిట్లడిగిన
నుత్తరమును నమ్మునీంద్రుఁ డుత్తమచేతో
వృత్తి ముదమంది పలికెను
దత్తఱపా టుడిగి వినుఁడు తాపసవర్యుల్!

6-195-సీస పద్యము

పూని ప్రచేతసుపుత్రులు పదుగురు;
 ప్రాచీనబర్హిష ప్రాఖ్య గలుగు
వారు మహాంబోధి వలన వెల్వడి వచ్చి;
 తగ వృక్ష వృతమైన ధరణిఁ జూచి
మేదినీజములపై మిక్కలి కోపించి;
 మదిలోన దీపితమన్యు లగుచు
వక్త్రంబులను మహావాయు సంయుతమైన;
 యనలంబుఁ గల్పించి యవనిజములఁ

6-195.1-తేటగీతి

బెల్లువడఁ గాల్పఁ దొడఁగినఁ దల్లడిల్లి
వారి కోపంబు వారించువాఁడ పోలెఁ
బలికెఁ జందురుఁ డో మహాభాగులార!
దీనమగు వృక్షముల మీఁదఁ దెగుట దగునె?

6-196-తేటగీతి

మొదల వర్ధిష్ణు లగు మిమ్ము సదయ హృదయు
లగు ప్రజాపతు లనుచు సర్వాత్ముఁ డనియె;
నట్టి మీరు ప్రజాసృష్టి కైన వార
లీ వనస్పతి తతుల దహింపఁ దగునె?

6-197-సీస పద్యము

ఆదికాలంబున నా ప్రజాపతి పతి;
యైన లోకేశ్వరుం డచ్యుతుండు
పద్మనేత్రుఁడు వనస్పతుల నోషధి ముఖ్య;
జాతంబు నిషము నూర్జంబుఁ గోరి
కల్పించె; నందు ముఖ్యంబైన యన్నంబు;
నచరంబు లై నట్టి యపద మెల్లఁ
బాదచారులకును బాల్వెట్టి యిరుగాళ్ళ;
చేతులు గలిగిన జీవతతికి

6-197.1-తేటగీతి

ప్రాణులొగి లేని యా చతుష్పాత్తు లెల్ల
నన్నముగఁ బూని గావించె నదియుఁగాక
నా మహాభాగుఁ డచ్యుతుఁ డాదరమున
మీకు ననఘాఖ్య విఖ్యాతి జోకపఱిచె.

6-198-కంద పద్యము

నిజముగ దేవాధీశ్వరుఁ
డజుఁడు ప్రజాసర్గమునకు ననఘుల మిమ్మున్
సృజియించె నిట్టివారికిఁ
గుజదహనము చేయ నెట్లు గోరిక వొడమెన్?

6-199-చంపకమాల

సతతమహాత్త్వ సత్త్వ గుణ సత్పురుషస్మృతిఁ బొందరయ్య! మీ
పితరులునుం బితామహులుఁ బెద్దలు నెన్నఁడుఁ బొందనట్టి దు

ష్కృతమతమైన కోపమునఁ గిల్బిషభావము మానరయ్య! సం
భృత కరుణావలోకమున భీత తరుప్రకరంబు జూచుచున్.

6-200-ఉత్పలమాల

తప్పక యర్భకావళికిఁ దల్లియుఁ దండ్రియు నేత్రపంక్తికిన్
ఱెప్పలు నాతికిం బతియు ఱేఁడు ప్రజావళి కెల్ల నర్థి కిం
పొప్ప గృహస్థు మూఢులకు నుత్తము లెన్న సమస్తబాంధవుల్
ముప్పునఁ గావలేని కడుమూర్ఖులు గారు నిజాల చుట్టముల్.

6-201-సీస పద్యము

అఖిల భూతముల దేహాంతస్థమగునాత్మ;
యీశుఁ డచ్యుతుఁడని యెఱుఁగవలయు;
నెఱిఁగి సర్వం బైన యిందిరారమణు లోఁ;
జూపులఁ దనివిగాఁ జూడవలయు;
జూచిన చిద్రూప శుద్ధాత్ము లగు మిమ్ము;
నెలసిన వేడ్కతో నిచ్చమెచ్చు;
మెచ్చిన సర్వాత్ము మీ రెఱింగినచోటఁ;
గోపగుణంబులఁ బాపవలయు;

6-201.1-ఆటవెలది

బాపి దగ్ధశేష పాదపజాలంబు
దియ్య మెసఁగ బ్రతుకనియ్యవలయు;
ననఘులార! మీర లస్మదీయప్రార్థ
నంబు పరఁగఁ జేకొనంగవలయు.

6-202-కంద పద్యము

ఇదె వృక్ష సముద్భవ యగు
మదిరేక్షణ నాప్సరసిఁ గుమారిక నిత్తున్
వదలక పత్నిఁగఁ జేకొని
ముద మందుఁడు పాదపముల మోసమువాయన్.

6-203-వచనము

అని యిట్లామంత్రణంబు జేసి, మారిష యను కన్యకను వారల కిచ్చి చంద్రుండు చనియె; అప్పుడు.

6-204-కంద పద్యము

వారలు పర్యాయంబున
నీరేజముఖిన్ వరించి నెఱి రమియింపన్
ధీరుఁడు ప్రాచేతసుఁడై
వారక దక్షుండు పుట్టె వనజజ సముఁడై.

6-205-కంద పద్యము

ఎవ్వని సంతానంబులు
నివ్వటిలెన్ వసుధ నెల్ల నెఱి నా దక్షుం
డెవ్వలన జగము లన్నిటఁ
బ్రవ్వ జలము నిలిపినట్లు ప్రజఁ బుట్టించెన్.

6-206-ఉత్పలమాల

వారని వేడ్కతో దుహితృ వత్సలదక్షుఁడు దక్షుఁడాత్మచేఁ
గోరి సృజించెఁ గొన్నిటి నకుంఠిత వీర్యముచేతఁ గొన్నిటిన్
బోరన ఖేచరంబులను భూచరముఖ్య వనేచరంబులన్
నీరచరవ్రజంబు రజనీచరజాల దివాచరంబులన్.

6-207-కంద పద్యము

నర సుర గరు డోరగ కి
న్నర దానవ యక్ష పక్షి నగ వృక్షములం
దరమిడి సృష్టి యొనర్చెను
దిరముగ దక్షప్రజాపతి వితతకీర్తిన్.

6-208-కంద పద్యము

బహువిధముల బహుముఖముల
బహురూపములైన ప్రజల బహులోకములన్
బహుళముగఁ జేసి మదిలో
బహుమానము నొందఁ డయ్యె బ్రఖ్యాతముగన్.

6-209-తేటగీతి

ఆ ప్రజాసర్గ బృంహితం బయిన జగము
దక్షుఁ డీక్షించి మదిలోనఁ దాప మొంది
మఱియు జననంబు నొందించు మతము రోసి
పరమపురుషుని నాశ్రయింపంగఁ దలఁచె.

6-210-వచనము

ఇట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు చాలక చింతించి మంతనంబున లక్ష్మీకాంతుని సంతుష్టస్వాంతుంజేయువాఁడై.

6-211-కంద పద్యము

మోదం బై పరిదూషిత
ఖేదం బై శాబరీద్ధ కిలికించిత దృ
గ్భేదం బై బహుసౌఖ్య
పాదం బై యొప్పు వింధ్యపాదంబునకున్.

6-212-వచనము

అరిగి, యం దఘమర్షణం బను తీర్థంబు సర్వదురితహరం బయి యొప్పుదాని ననుసవనంబు సేవించి, యతి ఘోరం బయిన తపంబు చేయుచు హరిం బ్రసన్నుం జేసి, హంసగుహ్యం బను స్తవరాజంబున నిట్లని స్తుతియించె.

## 6-8- హంసగుహ్య స్తవరాజము

6-213-తేటగీతి

పరమునికి వందన మొనర్తుఁ బరిఢవించి
మున్న వితథానుభూతికి మ్రొక్కికొందు;
మెఱయు గుణములఁ దేలు నిమిత్తమాత్ర
బంధువై నట్టి వానికిఁ బ్రణతు లిడుదు.

6-214-ఆటవెలది

తవిలి గుణుల చేతఁ దత్త్వబుద్ధులచేత
నిగిడి కానరాని నెలవువాని

మొదలఁ దాన కలిగి ముక్తి మానావధి
రూపమైనవాని ప్రాపుఁ గందు.

6-215-ఆటవెలది

ఎల్ల తనువులందు నిరవొంది తనతోడఁ
బొందు చేసినట్టి పొందుకాని
పొందు పొందలేఁడు పురుషుండు గుణము నా
గుణినిఁ బోలు నట్టి గుణి భజింతు.

6-216-ఉత్పలమాల

ప్రాని మనంబునుం దనువు భూతములున్ మఱి యింద్రియంబులుం
బ్రాణములున్ వివేక గతిఁ బాయక యన్యముఁ దమ్ముఁ నెమ్మియిం
గానఁగనేర వా గుణనికాయములం బరికించునట్టి స
ర్వానుగతున్ సమస్తహితు నాదిమపూరుషు నాశ్రయించెదన్.

6-217-వచనము

మఱియు; ననేకవిధ నామ రూప నిరూప్యంబగు మనంబునకు దృష్టస్మృతుల నాశంబువలనఁ గలిగెడు నుపరామం బగు సమాధి యందుఁ గేవల జ్ఞానస్వరూపంబునఁ దోఁచు నిర్మల ప్రతీతిస్థానంబైన హంసస్వరూపికి నమస్కరింతు; దారువందు నతి గూఢంబైన వీతిహోత్రుని బుద్ధిచేతం బ్రకాశంబు నొందించు భంగి, బుద్ధిమంతులు హృదంతరంబున సన్నివేశుం డయిన పరమపురుషుని నాత్మశక్తిత్రయంబులచేతం దేజరిల్లఁ జేయుదురు; అట్టి దేవుండు, సకల మాయావిచ్ఛేదకం బయిన నిర్వాణ సుఖానుభవంబునం గూడి యుచ్చరింపం గొలఁదిగాని శక్తిగల విశ్వరూపుండు నాకుం బ్రసన్నుండగుంగాక;

వాగ్బుద్ధీంద్రియ మానసంబులచేతం జెప్పను, నిట్టి దని నిరూపింపను, నలవిగాక యెవ్వని గుణరూపంబులు వర్తించు, నెవ్వండు నిర్గుణుండు, సర్వంబు నెవ్వనివలన నుత్పన్నంబగు, నెవ్వనివలన స్థితిం బొందు, నెవ్వని వలన లయంబగు, నట్టి పరాపరంబులకుం బరమంబై, యనన్యంబై, ప్రాక్ప్రసిద్ధంబై, సర్వవ్యాపకంబై, యాదికారణంబై యున్న తత్త్వంబు నాశ్రయింతు; ఎవ్వని ప్రభావంబు మాటలాడెడు వారలకు, వాదంబు చేయువారలకు వివాద సంవాదస్థలంబు లగుచు నప్పటప్పటికి మోహంబు నొందించుచుండు, నట్టి యనంతగుణంబులు గల మహాత్మునకుం బ్రణామంబు చేయుదు; అస్తి నాస్తి యను వస్తుద్వయ నిష్ఠలం గలిగి, యొక్కటన యుండి విరుద్ధ ధర్మంబులుగఁ గనంబడు నుపాసనా శాస్త్ర సాంఖ్యశాస్త్రంబులకు సమంబై, వీక్షింపఁదగిన పరమంబు నాకు ననుకూలంబగు గాక, ఎవ్వఁడు జగదనుగ్రహంబుకొఱకు జన్మ కర్మంబులచేత నామరూపంబు లెఱుంగంబడ కుండియు, నామరూపంబులు గలిగి తేజరిల్లు, నట్టి యనంతుడయిన భగవంతుండు ప్రసన్నుండగుం గాక; ఎవ్వండు జనులకుఁ బురాకృత జ్ఞాన పదంబుల చేత నంతర్గతుండై, మేదినిం గలుగు గంధాది గుణంబుల నాశ్రయించిన వాయువు భంగి మెలంగుచుండు నా పరమేశ్వరుండు మదీయ మనోరథంబు సఫలంబు జేయు గాక" యనుచు భక్తి పరవశుండయి యుక్తి విశేషంబున స్తుతియించుచున్న దక్షునికి భక్తవత్సలుం డైన శ్రీవత్సలాంఛనుండు ప్రాదుర్భావంబు నొందె; అప్పుడు.

6-218-సీస పద్యము

భర్మాచలేంద్ర ప్రపాతద్వయంబునఁ;
 గలిగిన నీలంపు గను లనంగ
మొనసి తార్క్ష్యని యిరుమోపు పై నిడినట్టి;

పదముల కాంతులు పరిఢవిల్లఁ
జండ దిక్కుండల శుండాల కరముల;
కైవడి నెనిమిది కరము లమరఁ
జక్ర కోదండాసి శంఖ నందక పాశ;
చర్మ గదాదుల సరవిఁ బూని

6-218.1-ఆటవెలది

నల్లమేను మెఱయ నగుమొగం బలరంగఁ
జల్ల చూపు విబుధ సమితిఁ బ్రోవ
బసిఁడికాసెఁ బూని బహు భూషణ కిరీట
కుండలముల కాంతి మెండు కొనఁగ.

6-219-సీస పద్యము

కుండల మణిదీప్తి గండస్థలంబులఁ;
బూర్ణేందురాగంబుఁ బొందుపఱుప
దివ్యకిరీట ప్రదీప్తులంబర రమా;
సతికి గౌసుంభవస్త్రంబు గాఁగ
వక్షస్థలంబుపై వనమాలికాశ్రీలు;
శ్రీవత్స కౌస్తుభ శ్రీల నొఱయ
నీలాద్రిఁ బెనఁగొని నిలిచిన విద్యుల్ల;
తల భాతిఁ గనకాంగదంబు మెఱయ

6-219.1-ఆటవెలది

నఖిలలోక మోహనాకార యుక్తుఁడై
నారదాది మునులు జేరి కొలువఁ
గదిసి మునులు పొగడ గంధర్వ కిన్నర
సిద్ధ గాన రవము చెవుల నలర.

6-220-కంద పద్యము

సర్వేశుఁడు సర్వాత్ముఁడు
సర్వగతుం డచ్యుతుండు సర్వమయుండై
సర్వంబుఁ జేరి కొలువఁగ
సర్వగుఁడై దక్షునకుఁ బ్రసన్నుం డయ్యెన్.

6-221-వచనము

ఇట్లు ప్రసన్నుండయిన సర్వేశ్వరుని సర్వంకషంబును మహాశ్చర్యధుర్యంబును నయి తేజరిల్లు దివ్యరూపంబుఁ గాంచి, భయంబును హర్షంబును విస్మయంబును జిత్తంబున ముప్పిరిగొని చొప్పు దప్పింపం దెప్పఱి, కప్పురపాటునం బుడమిపైఁ జాగిలంబడి, దండ ప్రణామంబు లాచరించి, కరకమలంబులు మొగిడ్చి సెలయేఱుల తొట్టునఁ గొట్టుపడి, యిట్టట్టుఁ బట్టుచాలక నిట్టవొడిచి, మున్నీరుదన్ని నిలచిన పెన్నీరునుం బోలె, సర్వాంగంబులుం దొంగిలింపఁ, జిత్తంబు నాత్మాయత్తంబుజేసి, పిక్కటిల్లిన సంతోషంబుచేత భగవంతుం బలుకను, నత్యంత మంగళ సందోహాపాదకంబు లైన తన్నామంబు లుగ్గడింపను, నతి నిర్మలంబులైన తదీయకర్మంబులు దడవను, విబుధ హర్షకరంబులైన తత్పౌరుషంబులు పొగడను, నాత్మీయ మనోరథంబు వాక్రువ్వను నోపక ప్రజాకాముండై యూరకున్న ప్రజాపతిం జూచి, సర్వజీవ దయాపరుండును,

సర్వసత్త్వ హృదంతరస్థుండును, సర్వ జ్ఞుండునుం, గావున నతని భావంబు దెలిసి, జగన్నాథుం డార్తపోషణంబులైన భాషణంబుల నిట్లనియె.

6-222-కంద పద్యము

మెచ్చితిఁ బ్రాచేతస! తప
మిచ్చట ఫలసిద్ధి యయ్యె నిట్లతిభక్తిన్
హెచ్చగు మద్వరవిభవము
నచ్చుపడం బొంద నెవ్వఁ డర్హుఁడు? జగతిన్.

6-223-ఆటవెలది

తపము చాలు నింకఁ దగ భూతతతికి వి
భూతు లొనరుఁ గాక పొందుపడఁగ;
నిదియ సుమ్ము మాకు నిచ్చలోఁ గల కోర్కి
పొసఁగ నీదువలనఁ బొందుపడియె.

6-224-వచనము

వినుము, బ్రహ్మయు, భర్గుండును, బ్రజాపతులును, మనువులును, నింద్రులును, నిఖిల భూతంబులకు భూతిహేతువులయిన మద్భూతి విభవంబులు; మఱియు, నాకు యమ నియమాది సహిత సంధ్యావందనాది రూపంబగు తపంబు హృదయంబు; సాంగ జపవద్ధ్యానరూపం బగు విద్య శరీరంబు; ధ్యానాది విషయంపు వ్యాపారంబుగా నుండు భావనాది శబ్దవాచ్యంబగు క్రియ యాకృతి; క్రతు జాతంబు లంగంబులు; ధర్మం బాత్మ; దేవతలు ప్రాణంబులు; నిగమంబు మత్స్వరూపంబు; జగదుత్పత్తికి నాది యందు నే నొక్కండన తేజరిల్లుచుంటి; బహిరంతరంబుల వేఱొక్కటి లేక సుషుప్త వ్యవస్థ

యందు సర్వంబు లీనం బగుటం జేసి సంజ్ఞామాత్రుండును, నవ్యక్తుండునుగా
నుండు జీవుని భంగి నొక్కఁడన యుండుదు; ననంతుండ నై
యనంతగుణంబులు గల మాయా గుణంబువలన గుణ విగ్రహం బగు
బ్రహ్మాండంబును, నయోనిజుండు స్వయంభువు నగు బ్రహ్మయును
నుదయించిరి; మదీయ వీర్యోపబృంహితుండయి మహా దేవుం డగు నా బ్రహ్మ
యసమర్థుండునుంబోలె నకృతార్థమ్మన్యమాన మనస్కుండయి, సృజింప
నుద్యమించు తఱి తపం బాచరింపు మని నాచేత బోధితుండై, ఘోరంబైన తపం
బాచరించి తొలుత సృష్టికర్తృత్వంబు వహించిన మిమ్ము సృజియించె; నంతఁ
బంచజన ప్రజాపతి తనూజయగు యసిక్ని యను పేరిట వినుతినొంది యున్న
యిక్కన్యకను నీ కిచ్చితి; దీనిం బత్నిఁగాఁ గైకొని మిథునవ్యవాయ ధర్మంబు
గలవాఁడవై మిథునవ్యవాయధర్మంబు గల యీ నాతి యందుఁ బ్రజాసర్గంబు నతి
విపులంబుగ గావింపం గలవాఁడవు. మఱియు నీకుఁ బిదప నీ క్రమంబున నిఖిల
ప్రజలును మన్మాయా మోహితులై మిథునవ్యవాయధర్మంబునఁ బ్రజావృద్ధి
నొందించి మదారాధనపరులై యుండ గలవా" రని పలికి, విశ్వభావనుండైన హరి,
స్వప్నోపలబ్ధార్థంబునుం బోలె నంతర్ధానంబు నొందె; నప్పుడు దక్షుండు
విష్ణుమాయోపబృంహితుం డై పాంచజని యగు నసక్ని యందు హర్యశ్వసంజ్ఞల
వినుతిఁ జెందియున్న యయుతసంఖ్యాపరిగణితు లైన పుత్రులం గాంచె;
అప్పుడా ధర్మశీలు రైన దాక్షాయణులు పితృనిర్దేశంబునం బ్రజాసర్గంబు కొఱకుఁ
దపంబుచేయువారై పశ్చిమ దిశకుం జని, యచ్చట సింధు సముద్ర
సంగమంబున సమస్త దేవ ముని సిద్ధగణ సేవితంబై, దర్శనమాత్రంబున
నిర్ధూతకల్మషులను నిర్మలచిత్తులనుం జేయుచున్న నారాయణ సరస్సనం
బరగు తీర్థరాజంబున నవగాహనంబు చేసి, నిర్మలాంతరంగులై

పరమహంసధర్మంబు నందు నుత్పన్నమతు లై ప్రజాసర్గంబు కొఱకుఁ దండ్రి యనుమతంబున నుగ్రతపంబు చేయుచుండ, వారికడకు నారదుండు వచ్చి, యిట్లనియె.

6-225-సీస పద్యము

మీ రతిమూఢులు మీఁదఁటి గతి గాన;
రెన్నంగఁ బసిబిడ్డ లన్నలార!
పుడమిఁ దా నింతని కడఁ బరికింపరు;
ప్రజలఁ బుట్టింప నే ప్రతిభ గలదు?
అట్లైన నొక్క మహాత్ముఁడు పురుషుండు;
బహురూపములు గల భామ యొకతె
పుంశ్చలి గర్తంబు బురణింప నుభయ ప్ర;
వాహంబు గల నది వఱలఁ గదల

6-225.1-ఆటవెలది

నంచ యొకటి యిరువదైదింటి మహిమలఁ
గలిగియుండు తెరువు గానరాక
వజ్రనిబిడ మగుచు వరుసఁ దనంతన
తిరుగుఁ గాష్ఠబిలము దేటపడఁగ.

6-226-కంద పద్యము

వినుఁ డందుల ననురూపము
నను వొందఁగ నెఱుఁగ కాత్మ నాత్మ గురూక్తిం

గొనసాగించెద మను మి
మ్మున నేమియు లేదు మూఢు లని తెలిసి తగన్.

6-227-వచనము

అని నారదుండు బోధించిన హర్యశ్వులు సహజబుద్ధిచేత నారద వాక్యంబులఁ దమలోన నిట్లని వితర్కించిరి.

6-228-తేటగీతి

నొరిది క్షేత్రజ్ఞుఁడన నతిసూక్ష్మ బుద్ధి
నరయ నజ్ఞానబంధనం బగుచు లింగ
దేహమన నెద్ది గల దది దెలియకున్నఁ
గలదె? మోక్షంబు దుష్కర్మ గతులచేత.

6-229-తేటగీతి

కలఁడు జగదేక సన్నుత కారణుండు
స్వామి భగవంతుఁ డభవుండు స్వాశ్రయుండు
పరముఁ డాతనిఁ జూడక బ్రహ్మ కైనఁ
గలుగునే? ముక్తిపదము దుష్కర్మగతుల.

6-230-ఆటవెలది

పురుషుఁ డెట్టులేనిఁ బూని బిలస్వర్గ
గతుఁడుఁ బోలె వర్తకంబు మాను
నట్టి బ్రహ్మ మెఱుఁగు నయ్యకు స్వర్భోగ
కర్మగతుల నేమి గానఁబడును?

6-231-శార్దూల విక్రీడితము

తన్నిష్ఠాగతి లేనివానికి నసత్కర్మప్రచారంబుచే
మున్నే మయ్యెడి నాత్మబుద్ధి గుణ సమ్మోహంబునం దోఁచుచున్
వన్నెల్ పెట్టుక వింతబాగుల తఱిన్ వర్తించు దౌర్గుణ్య సం
పన్నస్త్రీయును బోలె నెల్లగతులం బ్రఖ్యాతమై యుండగన్.

6-232-సీస పద్యము

అనువొంద సృష్టిన వ్యయముగఁ జేయుచుఁ;
 బ్రచురప్రవాహ సంపతిత మైన
నెఱయఁ గూలం బను నిర్గమ స్థానంబు;
 నందు వేగముగల క్రందు మాయ
గదిలి యహంకార గతివశంబునఁ జాల;
 వివశుఁడై బోధకు విపరి యైన
వానికి నీరీతి వలవంత కర్మ ప్ర;
 చారంబులను మీఁదఁ జక్కనైన

6-232.1-ఆటవెలది

జన్మ మరణ ముఖ్య జాడ్యంబుతోఁ బాసి
నిఖిల సౌఖ్య పదవి నెఱసి కమ్ర
మార్గమైనయట్టి మహనీయ ధామంబు
జిత్త మార నెట్లు చేరఁ గలడు?

6-233-తేటగీతి

దాని సంసర్గ గుణములు దప్పి నడచు
కుచ్చితపు భార్యఁ జేకొన్న కుమతిబోలె
దివిరి సుఖదుఃఖములఁ గూడి తిరిగి జీవ
రూప మెఱుఁగని వారికిఁ బ్రాపు గలదె?

6-234-మత్తకోకిలము

పంచవింశతి తత్త్వరాశి కపారదర్పణ మయ్యుఁ దాఁ
గొంచమై పురుషుండు తత్త్వముఁగోరి పట్టఁగ నేర కే
మంచుఁ గించుఁ దలంచువాఁడు కదధ్వ కర్మము జేయఁగా
మంచిలోకము వానికేటికి మానుగా సమకూరెడిన్?

6-235-కంద పద్యము

బంధాను మోక్షణక్రమ
సంధా నైశ్వర్యధుర్య శాస్త్ర సమగ్ర
గ్రంథంబు మాను చిద్రూ
పాంధునకును గర్మగతుల నగునే శుభముల్.

6-236-మత్తకోకిలము

చూడ నీ జగమంతయున్ వెసఁ జుట్టి పట్టుక లీల నే
జోడులేక రయంబునం గుడి సుట్టుపట్టి స్వతంత్రముం
గూడి యుండిన కాలచక్రముఁ గోరి చూడని వారి కే
జాడఁగల్గును గర్మ సంగతిఁ జారుమోక్షపదం బిలన్.

6-237-ఆటవెలది

జన్మ హేతు వైన జనకునిర్దేశంబు
తనకుఁ జేయరాని దనుచుఁ దెలిసి
గుణమయప్రవృత్తి ఘోరాధ్వ నిశ్వాస
నిరతుఁ డగుచుఁ జేయ నేరఁ డతఁడు.

6-238-వచనము

అని తమలో వితర్కించి యా కుమారు లప్పుడు.

6-239-సీస పద్యము

వినవయ్య! భూపాల! మునివరేణ్యుని మాట;
 లనువొందఁ దలపోసి వినయ మలర
వలగొని యతనికి వందనంబు లొనర్చి;
 తిరిగి యెన్నఁడు రాని తెరువు పట్టి
చయ్యన నేగిరి సహజ సత్త్వబ్రహ్మ;
 మయమైన పంకజనయను పాద
పద్మ మరందంబు పానంబు జేయుచు;
 మత్తిల్లి నిలిచిన మానసాళి

6-239.1-ఆటవెలది

బరిణమింప విష్ణుఁ బాడుచుఁ దత్కీర్తి
సరణి మ్రోయు మహతి సంఘటించి
నారదుండు గుణవిశారదుం డెందేనిఁ
జనియెఁ దన్ను జగము సన్నుతింప.

6-240-కంద పద్యము

అప్పుడు దక్షుఁడు దనయులు
దప్పి మహాపథము గనుటఁ దగ నారదుఁడే
చెప్పినఁ గప్పిన శోకము
ముప్పిరిగొని చిత్తవృత్తి మూరిం బోవన్.

6-241-చంపకమాల

అడలుచు నున్న వచ్చి కమలాసనుఁ డూఱడిలంగఁ బల్కె మున్
పడసిన లీలఁ బుత్రుల నపార గుణాఢ్యులఁ గాంచుమన్న నా
పడఁతుక యందుఁ బల్వురను బన్నుగఁ దా శబళాశ్వ సంజ్ఞలం
బెడఁగగు వారిఁ బుణ్యముల చేర్చినవారి సహస్ర సంఖ్యులన్.

6-242-కంద పద్యము

పుట్టించిన జనకుని మదిఁ
బుట్టిన తలఁ పెఱిగి వారు పూనికఁ బ్రజలం
బుట్టించు వ్రతముఁ గైకొనిఁ
గట్టిగఁ దప మాచరింపఁగాఁ జనిరి వెసన్.

6-243-వచనము

ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబు కొఱకుఁ దండ్రి పంపునం దపంబు జేయువారై యే తీర్థంబు తీర్థరాజం బై సకలతీర్థఫలంబు నాలోకన మాత్రంబునన నుగ్రహించుచు సకలపాపంబుల నిగ్రహించు, నే తీర్థ ప్రభావంబున నగ్రజన్ములు ఫలసిద్ధిం బొందుదు, రట్టి నారాయణసర స్సను పుణ్యతీర్థంబునకుం జని, త దుపస్పర్శమాత్రంబున నిర్ధూత మలాశయులై.

6-244-శార్దూల విక్రీడితము

బ్రహ్మేంద్రాదులు నందనేరని పరబ్రహ్మంబుఁ జింతించుచున్
బ్రహ్మానందముఁ బొంది జిహ్వకలపై బ్రహ్మణ్యమంత్రంబులన్
బ్రహ్మలోకనవాంఛతో నిలుపుచున్ బ్రహ్మం బితండంచు మున్
బ్రహ్మజ్ఞాన గురున్ హరిం దపమునం బాటించి రబ్బాలకుల్.

6-245-సీస పద్యము

ఏకపాదాంగుష్ఠ మిలమీఁద సవరించి;
 నిశ్చల కాయులై నిక్కి నిలిచి
కరములు గీలించి సరవి మీఁదికి నెత్తి;
 గుఱుతుగాఁ బెనుబయల్ గుట్టిపట్టి
నిడివిగాఁ గ్రూరమై నిగిడిన చూడ్కులఁ;
 గఁడు దీవ్రభానునిఁ బొడిచిపట్టి
వడిఁ గొంతకాలంబు వాయువు భక్షించి;
 యంతనుండియు నిరాహారు లగుచు

6-245.1-ఆటవెలది

సకలలోకములకు సంహారకరమును
బేర్చి దేవతలకు భీతికరము
గాఁగ ఘోరతపముఁ గావింపఁ దొడఁగిరి
మహిత చిత్తు లక్కుమారవరులు.

## 6-9- శబళాశ్వులఁబోధించుట

6-246-వచనము

ఇట్లతి భయంకరంబైన తపంబు చేయుచు, నెడతెగక భగవన్మంత్రంబులు నుడువుచుఁ బ్రజాసర్గ కాములై యున్న య చ్చిన్నబాలుర కడకు నారదుండు చనుదెంచి, పూర్వవిధంబునం బలుకుచు నిట్లనియె; భ్రాతృవత్సలులై యున్న మీరలు వేదాంతసారం బొలుకు చున్న నా వచనంబు లాదరించి, తోఁబుట్టువులు చనిన మార్గంబునఁ జనుండు; ఎవ్వరేనిం దమ యగ్రజులు చనిన మార్గంబునం దామునుం దప్పక వర్తింతు రేని నట్టివారిని విశేషధర్మం బెఱింగిన వారండ్రు; సతతంబును బుణ్యబంధువు లైన దేవతలం గూడి సుఖంబుండుం" డని పల్కి, నారదుండు చనియె; వారలును సర్వకర్మంబుల యందు నిర్మోహితులై పరమపదంబునకు నాస్పంబు లైన దేవర్షి వాక్యంబుల నాశ్రయించి.

6-247-ఉత్పలమాల

అప్పుడు లజ్జతోడ శబళాశ్వులు పూర్వజు లేగినట్టి యా
చొప్పున నెన్నఁడుం దిరిగి చూడని త్రోవ విశేష పద్ధతిం
దప్పక పోయిరయ్య! గుణధాములు; నేఁడును మళ్ళరేమి నేఁ
జెప్పెదఁ గాక రాక కడ చేరిన రాత్రులఁ బోలి భూవరా!

6-248-కంద పద్యము

దక్షున కా కాలంబున
లక్షితమై యుండెఁ బెక్కు లాగుల నుత్పా
తక్షోభంబులు వానికి
రూక్షవ్యధ నొంది యా పురుష నాశంబున్.

6-249-కంద పద్యము

నారదకృత మని యెఱిఁగి మ
హారోషముతోడ నేగి యాతనిఁ గని దుః
ఖారూఢ చిత్తుఁడై మది
నూఱడిలం దెరువు లేక యుగ్రుం డగుచున్.

6-250-ఆటవెలది

మోము జేవుఱింప ముడిపడ బొమదోయి
చూపు వెంట మంట సుడిగొనంగఁ
బెదవు లడరఁ బండ్లు పెటపెటఁ గొఱుకుచు
దక్షుఁ డాగ్రహించి తపసిఁ బలికె.

6-251-చంపకమాల

నెఱయఁగ సాధురూపమున నీ వతిబాలుర కాత్మజాళికిం
గఱుకున భిక్షుమార్గ మగు కందువ చెప్పితి వేల? ధూర్తవై
మఱుఁగక యుండవచ్చునె? కుమారుల నీ దురితంబు వొంద; ని
న్నొఱలఁగఁ ద్రోతు నాదు సమదోగ్ర మహోగ్రహ శాపవహ్నులన్.

6-252-వచనము

అది యెట్లంటేని, దేవర్షి పితృ ఋణంబులు దీర్పక కర్మవిచారంబు చేయని బాలుర మనంబులకు నైహికేచ్ఛలయందు నైరాశ్యంబు గలుగంజేసి నివృత్తిమార్గం బుపదేశించి, వారలకు నుభయలోకముల యందుఁ జెందఁ గల శ్రేయోహాని నొనర్చితి; విట్టి పాతకంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండవై యశోహానిం బొంది చరింపుదు గాక; నిరపరాధులై వైరంబులేని నా పుత్రుల పట్ల ద్రోహకృత్యం

బొనర్చిన నీవు దప్పఁ దక్కిన భాగవతోత్తములు సకల భూతానుగ్రహ పరవశులు; అతి కుతూహలంబున నీచేత స్నేహపాశ నికృంతనంబైన మిత్రభేదంబె కాని తదుపశమనంబు గాకుండెడు; ఇంతనుండియుఁ బురుషుండు విషయ తీక్ష్ణత్వంబు లనుభవింపక కాని తెలియకుండెడు; జ్ఞానంబు తనంతటనె కాని యొరులచే బోధింపఁబడి తెలియరాకుండెడి; నిరంతరంబును లోకసంచారియైన నీకు నే లోకంబునను నునికిపట్టు లేకుండుం గాక" యని నిర్దయుండై శాపం బిచ్చె; నంత నారదుండు తత్క్రోధవాక్యంబుల కలుగక "యట్ల కాని" మ్మని సమ్మతించి చనియె; నిట్టి శాంతభావం బెవ్వనివలనం గలుగు, నతండు సర్వాతీతుండయిన సర్వేశ్వరుం డనంబడు; మఱియు దక్షుండు దన మనోరథంబు విఫలంబగుటం జేసి యతి దుఃఖిత మనస్కుండై వొగలుచున్నఁ, బితామహుండు చనుదెంచి, మఱియుఁ బ్రజాసర్గోపాయం బుపదేశించిన నా ప్రజాపతి ప్రియభామయైన యసిక్ని యందుఁ బితృవత్సల లైన పుత్రికల నఱువదుండ్రం బుట్టించి; వారిలో ధర్మునకుం బదువురను, కశ్యపునకుం బదమువ్వురను, జంద్రునకు నిఱువదేడ్వురను, భూతునకు నాంగిరసునకుఁ గృశాశ్వునకు నిద్దఱేసిచొప్పున నార్వురను, తార్క్ష్యుండను నామాంతరంబుఁ దాల్చిన కశ్యపునకు మరలఁ గడమ నలువురను నీ క్రమంబున నిచ్చె వారి నామంబు లాకర్ణింపుము.

6-253-ఆటవెలది

ఎట్టి పుణ్యవతులొ? యీ చేడియలు చెప్ప
సవతు లేనియట్టి సవతులయ్యుఁ
గడుప పడసి రెట్టి కడుపునఁ బుట్టిరో
కడిఁది త్రిజగ మెల్లఁ గడుపు గాఁగ.

6-254-వచనము

వార లెవ్వ రనిన భానువు, లంబయుఁ, గకుప్పు, జామియు, విశ్వయు, సాధ్యయు, మరుత్వతియు, వసువు, ముహూర్తయు, సంకల్పయు, ననం బదుగురు ధర్మునకుఁ బత్నులై కొడుకులం బడసిరి; వార లెవ్వ రంటేని భానువునకు వేదఋషభుండు పుట్టె; నతనికి నింద్ర సేనుం డుదయించె; లంబకు విద్యోతుండు గలిగె; నతనికి స్తనయిత్నువు లనువారు పుట్టిరి; కకుబ్దేవికి సంకటుండు పుట్టె; సంకటునకుం గీటకుండు పుట్టె; కీటకునకు దుర్గాభిమానిను లయిన దేవతలు జన్మించిరి; జామిదేవికి దుర్గ భూముల కధిష్ఠాన దేవతలు జనియించిరి; వారికి స్వర్గుండును, నందియు జన్మించిరి; విశ్వ యను దానికి విశ్వేదేవగణంబు జనియించె; వార లపుత్రుకులనం బరఁగిరి; సాధ్య యనుదానికి సాధ్యగణంబులు పుట్టె; వానికి నర్థసిద్ధి యను వాఁడు పుట్టె; మరుత్వతి యనుదానికి మరుత్వంతుఁడు, జయంతుం డను వార లుదయించి; రందు జయంతుండు వాసుదేవాంశజుం డైన యుపేంద్రుం డనంబడి వినుతి నొందె; ముహూర్త యనుదానికి సకల భూతంబులకు నాయాకాలంబులం గలిగెడు నాయా ఫలాఫలం బుల నిచ్చు మౌహూర్తికు లనియెడు దేవగణంబులు పుట్టిరి; సంకల్ప యనుదానికి సంకల్పుం డుదయించె; నా సంకల్పునకుఁ గాముండు జనియించె; వసు వనుదానికి ద్రోణుండును, బ్రాణుండును, ధ్రువుండును, నర్కుండును, నగ్నియు, దోషుండును, వస్తువును, విభావసువును నన నెనమండ్రు వసువు లుదయంబు నొంది; రందు ద్రోణునకు నభిమతి యను భార్య యందు హర్ష శోక భయాదులు పుట్టిరి; ప్రాణునకు భార్య యైన యూర్జస్వతి యందు సహుఁడును, నాయువును, బురోజవుండును ననువారలు గలిగిరి; ధ్రువునకు భార్య యగు ధరణి యందు వివిధంబులగు పురంబులు పుట్టె;

నర్కునకు భార్య యగు వాసన యందుఁ దర్షాదు లుదయించి; రగ్నికి భార్యయైన వసుధార యందు ద్రవిణకాదులు పుట్టిరి; మఱియుఁ గృత్తికలకు స్కందుండు గలిగె; నా స్కందునకు విశాఖాదు లుదయించిరి; దోషునకు శర్వరి యను భార్య యందు హరికళ యగు శింశుమారుం డుదయించె వస్తువునకు నాంగిరస యందు విశ్వకర్మ యను శిల్పాచార్యుం డుదయించెను; నా విశ్వకర్మకు నాకృతి యను సతియందుఁ జాక్షుషుం డను మనువు జనియించె; నా మనువు వలన విశ్వులు సాధ్యు లనువారలు పుట్టిరి; విభావసునకు నుష యను భార్య యందు వ్యుష్టియు, రోచియు, నాతపుండును జనించి; రందు నాతపునికిఁ బంచయాముం డను దివసాభిమాన దేవత జనియించె; శంకరాంశజుం డయిన భూతునకు సరూప యను భార్య యందుఁ గోట్ల సంఖ్యలైన రుద్రగణంబు లుదయించిరి; మఱియు రైవతుండు, నజుండు, భవుండు, భీముండు, వాముండు, నుగ్రుండు, వృషాకపియు నజైకపాత్తు, నహి ర్బుధ్న్యుండు, బహురూపుండు, మహాంతుండు ననువారలును, రుద్రపారిషదులును నతిభయంకరు లయిన ప్రేతులును వినాయకులును బుట్టి; రంగిరసుం డను ప్రజాపతికి స్వధ యను భార్యయందుఁ బిత్రుగణంబులు పుట్టిరి; సతి యను భార్యకు నధ్వర వేదాభిమాన దేవతలు పుట్టిరి; కృశాశ్వునకు నర్చి యను భార్యయందు ధూమ్రకేశుం డను పుత్రుం డుదయించె; వేదశిరునకు ధిషణ యను భార్య యందు దేవలుఁడును, వయనుండును, మనువునుం బుట్టిరి; తార్క్ష్యునకు వినత కద్రువ పతంగి యామిని యన నలువురు భార్య లందుఁ బతంగికిఁ బక్షులు పుట్టె; యామినికి శలభంబులు పుట్టె; వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధిపతికి వాహనం బయిన గరుడుండును, సూర్యునకు సారథి యైన యనూరుండును జనియించిరి; కద్రువకుఁ బెక్కు తెఱంగు లగు భుజంగమంబులు పుట్టె; చంద్రునకుఁ గృత్తికాది

నక్షత్రంబులు భార్యలయినను వారల యందుఁ జంద్రుండు రోహిణి యందు మాత్రము మోహితుం డగుటంజేసి దక్షశాపంబున క్షయరోగగ్రస్తుండై సంతానంబు పడయనేరఁ డయ్యె; నంత దక్ష ప్రసాదంబున క్షయపీడితంబు లగు షోడశకళల మరలం బొందె; మఱియును.

6-255-సీస పద్యము

కామితప్రదుఁ డైన కశ్యపు కౌఁగిఁట;
 ముచ్చట దీర్తు రే ముద్దరాండ్రు;
యఖిల లోకములకు నవ్వలై జగ మెల్లఁ;
 బూజింప నుందు రే పువ్వుఁబోండ్లు;
బలియు రై పుత్రులు పౌత్రులు త్రిజగంబు;
 లేలంగఁ జూతు రే యిందుముఖులు;
ముంగొంగు పసిడి యై మూల్లు పుణ్యంబుల;
 విల్లువీఁగుదు రెట్టి వింతరాండ్రు;

6-255.1-తేటగీతి

వారి కలగంప కడుపుల నేరుపఱప
నరిది బిడ్డలఁ బడసిన బిరుదు సతుల
నామములు నన్వయంబులు నీ మనంబు
పూనఁ జెప్పెద వినవయ్య! మానవేంద్ర!

6-256-తరళము

అదితియున్ దితి గాష్ఠయున్ దను వయ్యరిష్టయుఁ దామ్రయు
న్నదనఁ గ్రోధవశాఖ్యయున్ సురసాఖ్యయున్ సురభిన్ మునిన్

మొదలుగాఁ దిమియున్నిళాఖ్య సుముఖ్య యా సరమాదిగా
ముదిత లెన్నఁగఁ గన్న సంతతి ముజ్జగంబుల భూవరా!

6-257-సీస పద్యము

చాలంగఁ దిమికిని జలచరంబులు పుట్టె;
శ్వాపదంబులు పుట్టె సరమ యందు;
సురభికి మహిషాది సురభులు జనియించెఁ;
దామ్రకు శ్యేన గృధ్రములు గలిగె;
మునికి నప్సరసల మూఁకలు జనియించె;
నిళ గనె భూరుహములను; గ్రోధ
వశ కుద్భవిల్లె దుర్వార సర్పంబులు;
సరి యాతుధానులు సురస కరయ

6-257.1-తేటగీతి

నుప్పతిల్లిరి; గంధర్వ లోక్క మొగి న
రిష్టకు సుతు; ల్దనువునకుఁ ద్రిదశ రిపులు
పదియునెనమండ్రు సై నట్టి విదితబలులు
వారి నామాన్వయంబులఁ గోరి వినుము.

6-258-వచనము

ద్విమూర్ధుండును, శంబరుండును, నరిష్టుండును, హయగ్రీవుండును, విభావసుండును, నయోముఖుండును, శంకుశిరుండును, స్వర్భానుండును, గపిలుండును, నరుణియుఁ, బులోముండును, వృషపర్వుండును, నేకచక్రుండును, ననుతాపకుండును, ధూమ్రకేశుండును, విరూపాక్షుండును,

దుర్జయుండును, విప్రచిత్తియు ననువారలు వీరలలోన స్వర్భానునకు సుభద్ర యను కన్యక పుట్టె; దాని నముచి వివాహం బయ్యె; వృషపర్వునకు శర్మిష్ఠ యను కూఁతురు పుట్టె; దాని నహుష పుత్రుండైన యయాతి పెండ్లియయ్యె; వైశ్వానరునకు నుపదానవి, హయశిరస, పులోమ, కాలక యను నలువురు పుత్రిక లుదయించె; రందు నుపదానవి హిరణ్యాక్షునకుం బత్ని యయ్యె; హయశిరసను గ్రతువు వివాహంబయ్యె; పులోమ కాలకలను నిరువురను గశ్యపప్రజాపతి చతుర్ముఖుని వాక్యంబునఁ గైకొనియె; నా యిరువురకును సమరకోవిదు లయిన దానవులు పౌలోమ కాలకేయు లనం బుట్టిరి; మఱియు నా యిరువురకును నఱువదివేల రాక్షసులు జన్మించిరి; వారు యజ్ఞకర్మంబులకు విఘాతకులై వర్తింప వారి నింద్రునకుం బ్రియంబుగా నీ పితామహుం డగు నర్జునుండు వధించె మఱియు విప్రచిత్తి సింహిక యనుదాని యందు రాహు ప్రముఖంబుగాఁ గల కేతు శతంబును బడసె; వారలు గ్రహత్వంబుఁ గైకొనిరి; మఱియుం బురాణపురుషుండైన శ్రీమన్నారాయణుండు దన యంశంబునఁ బరమభాగ్యవతి యయిన యదితి గర్భంబున నుదయించె; నా యదితి వంశంబును విదితంబుగా వినిపించెద సావధానుండవై వినుము; వివస్వంతుడును, నర్యముండును, బూషుండును, ద్వష్టయు, సవితయు, భగుండును, ధాతయు, విధాతయు, వరుణుండును, మిత్రుండును, శక్రుండును, నురుక్రముండును నను ద్వాదశాదిత్యులు జన్మించి రందు వివస్వంతునకు శ్రాద్ధదేవుం డను మనువు సంజ్ఞాదేవి యందు నుదయించె; మఱియు యముండు యమియు నను నిరువురు మిథునంబుగా నుదయంబు నొందిరి. వెండియు నా సంజ్ఞాదేవి బడబా స్వరూపంబు నొంది యశ్వనీదేవతలం గనియె; ఛాయాదేవి యందు శనైశ్చరుండును, సావర్ణి యను మనువును దపతి యను

కన్యకయుం బుట్టిరి; యా తపతిని సంవరణుండు వరియించె; అర్యమునకు మాతృక యను పత్నియందుఁ జర్షణు లుదయించిరి; వారి మూలంబున మనుష్యజాతి యీలోకంబున స్థిరంబుగా నుండు నట్లు బ్రహ్మదేవునిచేఁ గల్పింపంబడె; పూషుండు భర్గునిఁ జూచి దంతంబులు వివృతంబులుగా నగిన, నతండు క్రోధించి దంతంబు లూడనడచిన నాఁటనుండియు, భగ్నదంతు డయి యనపత్యుండయి పిష్టాదులు భక్షించుచుండె; త్వష్టకు దైత్యానుజ యైన రచన యను కన్యకకు నధిక బలాఢ్యుం డగు విశ్వరూపుండు పుట్టె; నంత నా దేవతలు, బృహస్పతి గోపించి తలంగి పోయినం, దమకు నా విశ్వరూపుని నాచార్యునింగా వరియించి" రని చెప్పిన విని శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

## 6-10- బృహస్పతి తిరస్కారము

### 6-259-సీస పద్యము

అరయంగ యోగీంద్ర! యద్భుతం బయ్యెడు;
 సురలపై నేటికి సురగురుండు
గోపించె? నీతండు గురుభావమున దేవ;
 తల కేమి యాపదఁ దలఁగఁ జేసె?
నెఱిఁగింపు మనవుడు నింద్రుండు త్రిభువనై;
 శ్వర్య మదంబున సత్పథంబు
గానక వసు రుద్ర గణములు నాదిత్య;
 మరుదశ్వి దేవాది మండలములు

### 6-259.1-తేటగీతి

సిద్ధ చారణ గంధర్వ జిహ్మగాది
సురులు మునులును రంభాది సుందరాంగు
లాడఁ బాడంగ వినుతి చేయంగఁ గొలువఁ
బ్రొక్క భద్రాసనంబున నుక్కుమీఱి.

6-260-సీస పద్యము

నిండు పున్నమనాఁడు గండరించిన చంద్ర;
మండల శ్రీలతో మాఱుమలయు
భద్రవిద్యోతాతపత్రంబు గ్రాలుచు;
మిన్నేటి తరఁగల మేలుకొలుపఁ
గలిత దివ్యాంగనా కరతల చాతుర్య;
చామీరికశ్రేణి జాడపఱుపఁ
జింతామణిస్ఫుట కాంత రత్నానేక;
ఘటిత సింహాసనాగ్రంబు నందు

6-260.1-తేటగీతి

నూరుపీఠంబుపై శచి యుండ నుండి
వరుస దిక్పాలకాది దేవతలు గొలువ
చాటి చెప్పంగరాని రాజసముతోడ
నింద్రుఁ డొప్పారె వైభవసాంద్రుఁ డగుచు.

6-261-వచనము

అయ్యవసరంబున

6-262-కంద పద్యము

గురుతర ధర్మక్రియ నయ
గురుఁడున్ గురుమంత్ర విషయ గురుఁడు వచశ్శ్రీ
గురుఁడు సమస్తామరగణ
గురుఁడు గురుం డరుగుదెంచెఁ గొల్వునకు నృపా!

6-263-చంపకమాల

అమిత తపఃప్రభావుఁ గరుణాత్ముని గీష్పతిఁ జూచి రాజ్యదు
ర్దమ మదరేఖ నింద్రుఁడు వృథా తనగద్దియ లేవకుండె నె
య్యమున నెదుర్కొనం జనక యాసన మీయక గౌరవోప చా
రములఁ బ్రసన్నుఁ జేయక తిరంబుగ దివ్యసభాంతరంబునన్.

6-264-కంద పద్యము

అప్పుడు సురపతి గన్నులఁ
గప్పిన సురరాజ్య మదవికారంబునకుం
జప్పుడు జేయక గృహమున
కప్పుణ్యుఁడు దిరిగిపోయె నతిఖిన్నుండై.

6-265-చంపకమాల

ఎఱుఁగమిఁ జేసినట్టి గురుహేళన మంత నెఱింగి యింద్రుఁ డ
చ్చెరుపడి భీతినొంది యతిచింతితుఁడై తలపోసి పల్కె న
ప్పరమపవిత్రు లోకనుతభవ్యచరిత్ర విశేషు పాదపం
కరుహముఁ బూజ చేయక యకర్మముఁ జేసితి నల్పబుద్ధి నై.

6-266-కంద పద్యము

త్రిభువన విభవ మదంబున
సభలో మద్గురువునకుఁ బ్రసన్నునకు లస
త్ప్రభువునకు నెగ్గు జేసితి
శుభములు దొలఁగంగ నే నసురభావముననన్.

6-267-ఆటవెలది

పారమేష్ఠ్య మయిన పదవి నొందిన భూపు
లెట్టివారి కైన లేవవలదు;
విబుధు లిట్లు చెప్పు విధమెన్న వారలు
ధర్మవేత్త లనుచుఁ దలఁపబడరు.

6-268-ఆటవెలది

కుపథవర్తు లగుచుఁ గుత్సిత దుర్వచో
నిపుణు లైనవారు నిడివి దెలిసి
తొలఁగలేక వా రధోగతిఁ బడుదురు
తప్పులేక రాతి తెప్ప భంగి.

6-269-ఉత్పలమాల

కావున లోకవందితుని కార్యవిచారుని యింటి కేగి త
త్పావన పాదపద్మములపై మకుటంబు ఘటిల్ల మ్రొక్కి స
త్సేవ యొనర్చి చిత్తము వసింపఁ బ్రసన్ను నొనర్తు నంచు న
ద్దేవవిభుండు పోయె నతితీవ్రగతిన్ గురుధామ సీమకున్.

## 6-11- దేవాసుర యుద్ధము

6-270-సీస పద్యము

ఈరీతిఁ దనయింటి కేతెంచు దేవతా;
 పతి రాక యా బృహస్పతి యెఱింగి
యధ్యాత్మమాయచే నడఁగి యదృశ్యుఁ డై;
 పోయె నప్పుడు దేవపుంగవుండు
సకలంబుఁ బరికించి జూడఁ గానక గురు;
 జింతించి తలపోసి చిన్నపోయెఁ;
బోయిన విధ మెల్ల దాయలు రాక్షస;
 వీరులు వేగులవారివలనఁ

6-270.1-తేటగీతి

దెలిసి మిక్కలి తమలోనఁ దెలివినొంది
యందఱును గూడి భార్గవు నాశ్రయించి
తత్ప్రసాదదృష్టిఁ దమశక్తి దట్టమైన
దేవతలమీఁది దాడికిఁ దెరువు పెట్టి.

6-271-కంద పద్యము

ధూర్తులు సమస్త కిల్బిష
మూర్తులు వర ధర్మ కర్మ మోచిత మార్గా
వర్తులు దుర్జయ నిర్మిత
కీర్తులు దానవులు చనిరి గీర్వాణులపై.

6-272-స్రగ్ధర

దండిం గోదండ కాండోద్ధత రథ హయ వేదండ దండంబుతోడన్
దండెత్తెన్ మెండుగా నద్దనుజనికరముల్ దైవవర్గంబు మీఁదం
జండబ్రహ్మాండ భేదోచ్చ్రయ జయరవముల్ సర్వదిక్ క్షోభగా ను
ద్దండప్రఖ్యాత లీలం దలపడిరి సురల్ దర్పులై వారితోడన్.

6-273-చంపకమాల

మదమున దేవదానవులు మచ్చరముల్గడుఁ బిచ్చలింప సం
పదలను గోరి పోరునెడ భార్గవ మంత్రకళా విశేషులై
యెదురులువాఱు నస్త్రముల చేయ మహాసురు లేచియేసి పెం
గుదులుగఁ గ్రువ్వ దేవతలు క్రోల్తల క్రోర్వక వీఁగి రయ్యెడన్.

6-274-ఆటవెలది

దనుజవీరు లేయు దారుణ దివ్యాస్త్ర
దళితదేహు లగుచుఁ దలలు వీడ
నోడి పాఱి రద్భుతోపేత బలులైన
త్రిదశవరులు బిట్టు దిట్టినట్లు.

6-275-కంద పద్యము

ఒక మొగము గాక దివిజులు
తికమక గొని పైరులెల్ల ఢీకొనఁ దమ్ముం
బికపిక లై నకనక లై
లుకలుకఁ బరువెత్తి రోడి లోగొను భీతిన్.

6-276-చంపకమాల

దనుజుల గర్వరేఖయును దానవవీరుల యంపజోకయున్
మనుజవిశేష భోజనుల మచ్చరికంబు నిశాటకోటి యే
చిన బల శౌర్యముం దమకు సిగ్గును హాని మహాభయంబు ని
ర్గుణతను జేయు నుమ్మలికఁ గోల్తల కోర్వక పాఱిరార్తు లై.

6-277-కంద పద్యము

అమరులు విస్పష్ట దానవ
సమరులు శరభిన్న దేహ సంతాపగుణ
భ్రమరులు దైత్య కిరాతక
చమరులు కమలజుని కడఁకుఁ జనిరి భయార్తిన్.

6-278-ఉత్పలమాల

ధాతకు దేవతా విభవదాతకుఁ బుణ్యజనానురాగ సం
ధాతకు సర్వలోకహితదాతకు వైదిక ధర్మమార్గ ని
ర్ణేతకు నుల్లసద్విభవ నేతకు సర్వ జగజ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్యయోగిజనభావ విధాతకు మ్రొక్కిరయ్యెడన్.

6-279-కంద పద్యము

ఆఖండలుండు మొదలుగ
లేఖానీకముల బ్రహ్మ లేనగవున ని
త్యాఖండ సత్కృపారస
శేఖర వాక్యముల వారి సేదలు దేర్చెన్.

6-280-వచనము

ఇట్లు బ్రహ్మదేవుండు దేవేంద్రప్రముఖు లయిన దేవతల కనుకంపాతిశయ విభవంబున నభయం బొసంగి యిట్లనియె.

6-281-ఉత్పలమాల

నెట్టన పాపకర్మమున నేరమిఁ జేసితి రేమి చెప్ప; మీ
పుట్టిన నాఁటనుండియును బుద్ధులు జెప్పి జగంబు లేలఁగాఁ
బట్టముఁ గట్టి పెంచిన కృపానిధి బ్రహ్మకళావిధిజ్ఞుఁ జే
పట్టక గుట్టు జాఱి సిరిపట్టునఁ దొట్టిన పొట్ట క్రొవ్వునన్.

6-282-వచనము

బ్రహ్మిష్ఠుం డైన బ్రాహ్మణు నాచార్యుం గైకొనక గురుద్రోహంబు చేసితిరి; తద్దోషం బిపుడు మీకుఁ జేసేఁత శత్రుకృతం బై యనుభవింపం జేసె; నతి బలవంతులయిన మిమ్ము నతి క్షీణులైన యారాక్షసులు జయించుట దమ యాచార్యుండైన శుక్రు నారాధించి తన్మంత్ర ప్రభావంబునఁ బునర్లబ్ధ వీర్యు లగుటచేతనే; ఇప్పుడు మదీయంబైన నిలయంబు నాక్రమింపం గలవారై మదోద్రేకంబున నెదురు లేక వర్తిల్లుచున్న రక్షోనాయకులకుం ద్రిదివంబు గొనుట తృణప్రాయంబు; అభేద్య మంత్ర బలంబుగల భార్గవునకు వారు శిష్యులగుటంజేసి విప్ర గోవింద గణేశ్వరానుగ్రహంబు గలవారలకుఁ దక్కం దక్కిన రాజుల కరిష్టంబగుం; గావున మీ రిప్పుడు త్వష్ట యను మను పుత్త్రుండగు విశ్వరూపుం డను ముని నిశ్చల తపో మహత్త్వ సత్త్వ స్వభావుం డతని నారాధించిన, మీకు నభీష్టార్థంబుల నతండు సంఘటిల్లఁ జేయు; నిట్టి దుర్దశల నతం డడంచు" నని

చెప్పిన దిక్పాలకాదులు డెందంబులు డిందుపడి కమలగర్భుని వీడ్కొని విశ్వరూపు కడకుం జని యిట్లనిరి.

6-283-తేటగీతి

అన్న మేలగు నీకు నిన్నడుగఁ గోరి
వచ్చినారము భవదీయ వనమునకును;
దండ్రులకు నేఁడు సమయోచితంబు లైన
కోర్కి లొడఁగూడఁ జేసి చేకొనుము యశము

6-284-కంద పద్యము

సుతులకుఁ బితృశుశ్రూషణ
మతిపుణ్యము జేయుచుండు నాత్మజులు గుణో
న్నతి బ్రహ్మచారు లైనను
మతిలో గురుసేవకన్న మఱియుం గలదే?

6-285-వచనము

అదియునుం గాక

6-286-సీస పద్యము

అరయ నాచార్యుండు పరతత్త్వరూపంబు;
దండ్రి దలంపఁగ ధాతరూపు;
రూపింప భ్రాత మరుత్పతి రూపంబు;
దెలియంగఁ దల్లి భూదేవిరూపు;
భగిని కరుణరూపు; భావంబు ధర్మ స్వ;

రూపంబు దా నర్థిరూపు మొదల
నభ్యాగతుఁడు మున్న యగ్ని దేవునిరూపు;
సర్వభూతములుఁ గేశవుని రూపు;

6-286.1-ఆటవెలది

గాన తండ్రి వేగ కడు నార్తులగు పితృ
జనులమైన మమ్ముఁ జల్లఁ జూచి
పరభయంబు వాపి నిరుపమం బగు తపో
మహిమచేత మెఱసి మనుపవయ్య!

6-287-వచనము

ఇప్పుడు బ్రహ్మనిష్ఠుండ వైన నిన్నాచార్యునింగా వరియించి, భవదీయ తేజోవిశేషంబు చేత వైరివీరులం బరిమార్చెద; మాత్మీయార్థం బైన యుష్మత్పాదాభివందనంబు నిందితంబు గాదని వేదవాక్యంబు గలదు; గావున నీకు నమస్కరించుచున్న దేవతలం గైకొని పౌరోహిత్యంబు జేయు" మనినఁ బ్రహసితవదనుండై యమ్మునీశ్వరుం డిట్లనియె.

6-288-తేటగీతి

బ్రహ్మతేజంబు వోయెడి ప్రార్థనంబు
ధర్మగుణ గర్హితం బని తా నెఱింగి
సొరిది ననుబోఁటి తపసి యీ సురలచేతఁ
బ్రకట మధురోక్తి నేఁటికిఁ బలుకఁబడియె.

6-289-వచనము

విశేషించి

6-290-కంద పద్యము

గురుధనముఁ గూర్ప నేటికి
గురుశిక్షం దగిలి మంత్రకోవిదులై స
ద్గురుధర్మ నిరతు లేనిన్
గురువులకును శిష్యవరులె కూర్చిన ధనముల్.

6-291-సీస పద్యము

అరయ నకించను లై నట్టివారికిఁ;
దగు శిలోంఛనవృత్తి ధనము సుమ్ము;
దానిచే నిర్వర్తితప్రియసాధు స;
త్రియ గలవారలై ప్రీతినొందె
దరు గాన సద్ధర్మితాచారమైన యా;
చార్యత్వ మిపుడు మీ శాసనమునఁ
గైకొంటి; గురువుల కామంబు ప్రాణార్థ;
వంచనములు లేక వడి నొనర్తు

6-291.1-ఆటవెలది

ననుచు విశ్వరూపుఁ డనియెడు ముని ప్రతి
జ్ఞోక్తిఁ బలికె వారి నూఱడించి
మహితమైన తత్సమాధిచే గురుభావ
మమరఁ జేసె దేవసమితి కపుడు.

6-292-కంద పద్యము

భార్గవవిద్యా గుప్త
స్వర్గశ్రీ ద్విగుణ దనుజ సమధిక సంప
ద్వర్గముల విష్ణుమాయా
నర్గళగతిఁ దెచ్చి యింద్రునకు నిచ్చె నృపా!

6-293-కంద పద్యము

ఏ విద్యచేత రక్షితుఁ
డై వజ్రి దురంబులోన నసురలఁ ద్రుంచెన్
భావింప నట్టి విద్యను
శ్రీవరమాయామతంబుఁ జెప్పెను హరికిన్.

6-294-ఉత్పలమాల

నావుడు పాండవాన్వయుఁడు నమ్మికభక్తి జగన్నివాసు రా
జీవదళాక్షుఁ గృష్ణుఁ దన చిత్తమునన్ భజియించి పల్కె నో
దేవగణార్చితాంఘ్రియుగ! దివ్యమునీశ్వర! విశ్వరూపుఁడ
ప్పావనమైన విద్య సురపాలున కే క్రియ నిచ్చెఁ? జెప్పవే.

6-295-ఉత్పలమాల

ఎందును రక్షితుం డగుచు నింద్రుఁడు లీలయ పోలె వైరి సే
నం దునుమాడి దేవతలు నమ్మి సుఖింపఁగ నిష్టసంపదం
జెంది సమస్తలోకముల జేకొని యేలె మునీంద్ర! దాని నే
విందు సుఖంబుఁ గందు నిఁక వీనులు సంతస మందఁ బల్కవే.

## 6-12- శ్రీమన్నారాయణ కవచము

6-296-కంద పద్యము

వర నారాయణ కవచము

నరిభీకర వజ్రకవచ మాశ్రిత సంప

త్పరిణామ కర్మకవచము

పురుహూతున కెట్లు మౌని బోధించె? దగన్.

6-297-వచనము

అనినం బరీక్షిజ్జనపాలునకు మునినాథుం డిట్లనియె.

6-298-సీస పద్యము

వినవయ్య! నరనాథ! మునినాథుఁ డింద్రున;

 కనువొంద నారాయణాఖ్య మైన

కవచంబు విజయ సంకల్పంబు నప్రమే;

 యస్వరూపంబు మహాఫలంబు

మంత్రగోప్యము హరిమాయావిశేషంబు;

 సాంగంబుగాఁగ నెఱుంగఁ జేసె;

దాని నే వినిపింతుఁ బూని తదేకాగ్ర;

 చిత్తంబుతోడుతఁ జిత్తగింపు;

6-298.1-తేటగీతి

మొనర ధౌతాంఘ్రిపాణి యై యుత్తరంబు

ముఖముగా నుత్తమాసనమున వసించి

కృత నిజాంగ కరన్యాస మతిశయిల్ల
మహిత నారాయణాఖ్య వర్మము నొనర్చె.

6-299-వచనము

ఇట్లు నారాయణకవచంబు ఘటియించి, పాదంబులను, జానువులను, నూరువులను, నుదరంబునను, హృదయంబునను, నురంబునను, ముఖంబునను, శిరంబునను నట్లష్టాంగంబులం బ్రణవపూర్వకంబైన యష్టాక్షరీ మంత్రరాజంబు విన్యాసంబుచేసి ద్వాదశాక్షర విద్యచేతం గరన్యాసంబు చేసి, మంత్రమూఁర్తియై భగవచ్ఛబ్ద వాచ్యం బైన ప్రణవాది యకారాంత మహామంత్రంబు చేత నంగుళ్యంగుష్ఠ పర్వసంధులయం దుపన్యసించి, మఱియు హృదయంబున నోంకారంబు, వికారంబు మూర్ధంబున, షకారంబు భ్రూమధ్యంబు నందు, ణకారంబు శిఖ యందు, వేకారంబు నేత్రంబులయందు, నకారంబు సర్వ సంధులయందు మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబు నుపన్యసించె నేని మంత్రమూర్తి యగు; మఱియును "అస్త్రాయఫట్" అను మంత్రంబున దిగ్బంధనంబుచేసి, పరమేశ్వరునిం దన భావంబున నిల్పి విద్యామూర్తియుఁ, దపోమూర్తియు నగు షట్ఛక్తి సంయుతం బైన నారాయణ కవచాఖ్య మైన మంత్రరాజంబు నిట్లని పఠియించె.

6-300-చంపకమాల

గరుడుని మూఁపుపై బదయుగంబు ఘటిల్లఁగ శంఖచక్ర చ
ర్మ రుచిర శార్ఙ్గ ఖడ్గ శర రాజితపాశ గదాది సాధనో
త్కర నికరంబు లాత్మకరకంజములన్ ధరియించి భూతి సం
భరిత మహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁ గావుతన్.

6-301-ఆటవెలది

ప్రకట మకర వరుణ పాశంబు లందును
జలములందు నెందుఁ బొలియ కుండఁ
గాచుఁగాక నన్ను ఘనుఁడొక్కఁ డై నట్టి
మత్స్యమూర్తి విద్యమానకీర్తి.

6-302-కంద పద్యము

వటుఁడు సమాశ్రిత మాయా
నటుఁడు బలిప్రబల శోభనప్రతిఘటనో
ద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు
చటులస్థలమందు నన్ను సంరక్షించున్.

6-303-చంపకమాల

అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్ని కీలలం
దెడరుల నెల్ల నాకు నుతి కెక్కఁగ దిక్కగుఁగాక శ్రీనృసిం
హుఁడు సురశత్రుయూధప వధోగ్రుఁడు విస్ఫురి తాట్టహాస వ
క్త్రుఁడు ఘన దంష్ట్ర పావక విధూత దిగంతరుఁ డప్రమేయుఁడై.

6-304-చంపకమాల

అరయఁగ నెల్ల లోకములు నంకిలి నొంద మహార్ణవంబులో
నొరిగి నిమగ్న మైన ధర నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టి యా
కిరిపతి యగ్ని కల్పుఁ డురుఖేలుఁడు నూర్జిత మేదినీ మనో
హరుఁడు గృపావిధేయుఁడు సదాధ్వములన్ననుఁ గాచుఁగావుతన్.

6-305-కంద పద్యము

రాముఁడు రాజకులైక వి
రాముఁడు భృగు సత్కులాభిరాముఁడు సుగుణ
స్తోముఁడు నను రక్షించును
శ్రీమహితోన్నతుఁడు నద్రి శిఖరములందున్.

6-306-సీస పద్యము

తాటక మర్దించి తపసి జన్నముఁ గాచి;
హరువిల్లు విఱిచి ధైర్యమున మెఱసి
ప్రబలు లైనట్టి విరాధ కబంధోగ్ర;
ఖరదూషణాది రాక్షసులఁ దునిమి
వానరవిభు నేలి వాలిఁ గూలఁగ నేసి;
జలరాశి గర్వంబుఁ జక్కఁజేసి
సేతువు బంధించి చేరి రావణ కుంభ;
కర్ణాది వీరులఁ గడిమిఁ ద్రుంచి

6-306.1-తేటగీతి

యల విభీషణు లంకకు నధిపుఁ జేసి
భూమిసుతఁ గూడి సాకేత పురము నందు
రాజ్యసుఖములు గైకొన్న రామవిభుఁడు
వరుస ననుఁ బ్రోచుచుండుఁ బ్రవాసగతుల.

6-307-వచనము

మఱియు; నఖిల ప్రమాదంబు లైన యభిచార కర్మంబుల వలన నారాయణుండును, గర్వంబు వలన నరుండును, యోగభ్రంశంబువలన యోగనాథుఁ డయిన దత్తాత్రేయుండును, గర్మబంధంబులవలన గణేశుం డైన కపిలుండును, గామదేవునివలన సనత్కుమారుండును మార్గంబుల దేవహేళనంబు చేయుటవలన శ్రీహయగ్రీవమూర్తి యును, దేవతానమస్కార తిరస్కార దేవపూజా చ్ఛిద్రంబులవలన నారదుండును, నశేష నిరయంబులవలనఁ గూర్మంబును, నపథ్యంబు వలన భగవంతుం డైన ధన్వంతరియును, ద్వంద్వంబువలన నిర్జితాత్ముం డయిన ఋషభుండును, జనాపవాదంబువలన నగ్నిదేవుండును, జనన మరణాదులం గలుగఁ జేయు కర్మంబులవలన బలభద్రుండును, గాలంబువలన యముండును, సర్పగణంబులవలన శేషుండును, నప్రబోధంబువలన ద్వైపాయనుండును, బాషాండ సమూహంబువలన బుద్ధదేవుండును, శనైశ్చరునివలనఁ గల్కియునై, దర్మరక్షణపరుం డయిన మహావతారుండు నన్ను రక్షించుంగాత; ప్రాత స్సంగమ ప్రాహ్ణ మధ్యాహ్నపరాహ్ణ సాయంకాలంబులను ప్రదోషార్ధరాత్రాపరాత్ర ప్రత్యూషానుసంధ్యలను గదాద్యాయుధంబుల ధరియించి, కేశవ, నారాయణ, గోవింద, విష్ణు, మధుసంహార, త్రివిక్రమ, వామన, హృషికేశ, పద్మనాభ, శ్రీవత్సధామ, సర్వేశ్వరేశ, జనార్దన, విశ్వేశ్వర, కాలమూర్తు లను నామ రూపంబులు గల దేవుండు నన్ను రక్షించుంగాక; ప్రళయకాలాన లాతితీక్ష్ణ సంభ్రమ భ్రమణ నిర్వక్రవిక్రమ వక్రీకృత దనుజచక్రం బైన సుదర్శన నామ చక్రంబ! మహావాయు ప్రేరితుండై హుతాశనుండు నీరస తృణాటవుల భస్మీభూతంబు చేయు భంగి, భగవత్ప్రయుక్తంబవై మద్వైరి సైన్యంబుల దగ్దంబు గావింపుము; జగత్సంహారకాల పటు ఘటిత చటుల మహోత్పాత గర్జారవ తర్జన దశదిశాభి

వర్జిత ఘనఘనాంతర నిష్ఠ్యూత నిష్ఠురకోటి శతకోటిసం స్పర్శ స్ఫుర ద్విస్ఫులింగ నిర్గమనానర్గళ భుగ భుగాయమాన మూర్తి విస్ఫూర్తి! నారాయణకరకమలవర్తి! గదాయుధోత్తమ మదీయవైరి దండోపదండంబుల భండనంబునం జండ గతిం బిండిపిండిగాఁ గూశ్మాండ వైనాయక రక్షో భూత గ్రహంబులు చూర్ణంబులుగాఁ గొండొక వినోదంబు సలుపుము; దరేంద్రంబ వైన పాంచజన్యంబ! సర్వ లోక జిష్ణుండైన శ్రీకృష్ణునిఁ నిఖిల పుణ్యైక సదన వదన నిష్ఠ్యూత నిశ్వాసాధర వేణు పూరితంబవై యున్మత్త భూత, ప్రేత, పిశాచ, విప్ర గ్రహాది క్రూర దుర్గ్రహంబులు విద్రావణంబులుగా, నస్మ త్పరవీరమండ లంబుల గుండియలతోఁ దదీయమానినీ దుర్భర గర్భంబులు గర్భస్థార్భక వివర్జితంబులుగా నవియ, బ్రహ్మాండభాండ భీకరంబయిన భూరి నాదంబున మోదింపు; మతి తీవ్రధారా దళిత నిశాతకోటి కఠోర కంఠ కరాళ రక్తధారా ధౌత మలీమస విసరంబవయిన నందక మహాసి శేఖరంబ! జగదీశ ప్రేరితంబవై మద్విద్వేషి విషమ వ్యూహంబుల మెండు ఖండములుగ ఖడించి చెండాడుము; నిష్కళంక నిరాంతక సాంద్ర చంద్రమండల పరిమండిత సర్వాంగ లక్షణ విచక్షణ ధర్మనిరతం బవయిన చర్మంబ! దుర్మద మద్వైరిలోకంబులకు భీకరాలోకంబులను సమాకుల నిబిడ నిరీంధ్ర నిష్ఠుర తమః పటల పటు ఘటనంబులం గుటిల పఱుపుము; నిఖిల పాపగ్రహంబుల వలనను సకల నర మృగ సర్ప క్రోడ భూతాదులవలనను నగు భయంబులు వొందకుండ భగవన్నామ రూప యాన దివ్యాస్త్రంబుల రక్షించుం గాక; బృహద్రథంతరాది సామంబులచేత స్తోత్రంబు చేయం బడుచున్న ఖగేంద్రుండు రక్షణ దక్షుండై నన్ను రక్షించుఁగాక; శ్రీహరి నామ రూప వాహన దివ్యాయుధ పారిషదోత్తమ ప్రముఖంబు లస్మదీయ బుద్ధీంద్రియ మనఃప్రాణంబుల సంరక్షించు; భగవంతుండయిన శేషుండు సర్వోపద్రవంబుల నాశంబు చేయు; జగ

ద్వైక్యభావంబయిన ధ్యానంబు గలవానికి వికల్పరహితుండై, భూషణాయుధ లింగాఖ్యలగు శక్తులం దన మాయ చేత ధరియించి తేజరిల్లు చుండు లక్ష్మీకాంతుండు వికల్ప విగ్రహంబులవలన నన్ను రక్షించుఁగాక; లోకభయంకరాట్టహాస భాసుర వదనగహ్వరుం డగుచు, సమస్త తేజోహరణ ధురీణ తేజః పుంజ సంజాత దివ్య నృసింహావతారుం డగు నప్పరమేశ్వరుండు సర్వ దిగ్భాగంబు వలన, సమస్త బహిరంతరంబుల వలన నన్ను రక్షించుచుండుఁ గాత" మని నారాయణాత్మక కవచ ప్రభావం బితిహాస రూపంబున నింద్రుండు దెలిసికొని, ధ్యానంబు చేసి, తద్విద్యాధారణ మహిమవలన నరాతుల నిర్జించెం; గావున నెవ్వరేని నిర్మలాత్ము లగు వార లే తద్విద్యా ధారణులై యనుదినంబును బఠియించిన; నతి ఘోర రణంబుల నత్యుత్కట సంకటంబులను, సర్వ గ్రహ నిగ్రహ కర్మ మారణకర్మాది దుష్కర్మ జన్య క్లేశంబులను వదలి, యవ్యాకుల మనస్కులై, విజయంబు నొందుదురు; మఱియును, సర్వ రోగంబులకు నగమ్యశరీరులై సుఖంబు నొందుదురు; అదియునుం గాక.

6-308-సీస పద్యము

అతిభక్తిఁ గౌశికుం డను బ్రాహ్మణుఁడు దొల్లి; యీ విద్య ధరియించి యెలమి మించి
మరుభూమియందు నిర్మలచిత్తుఁడై యోగ; ధారణంబున బిట్టు తనువు విడిచె
దానిపై నొకఁడు గంధర్వవరేణ్యుండు; చిత్రరథాఖ్యుఁ డజేయుఁ డొంటి
చదలఁ జనంగఁ దచ్ఛాయ తదస్థిపైఁ; గదసిన నాతఁడు గళవళించి

6-308.1-ఆటవెలది

యువిద పిండుతోడ నవ విమానముతోడఁ
దనదు విద్యతోడ ధరణిఁ ద్రెళ్ళి
తిరిగి లేవలేక తికమక గుడువంగ
వాలఖిల్యమౌని వానిఁ జూచి.

6-309-కంద పద్యము

నారాయణ కవచ సమా
ధారణ పుణ్యాస్థి దీని దగ్గఱ నీకుం
గూరెడినె? విష్ణుభక్తుల
వారక చేరంగ నెట్టివారికిఁ దరమే?

6-310-ఇంద్రవ్రజము

సంధించి నీ యంగక సంధులెల్లన్
బంధించి తన్మంత్రబలంబు పేర్మి
న్నందంబు మాన్పింపఁ దదన్యమేదీ?
సింధుప్రవాహోన్నతిచేతఁ దీరున్.

6-311-వచనము

కావున నీ పుణ్యశల్యంబులు భక్తియుక్తుండ వై కొనిపోయి ప్రాఙ్ముఖంబునఁ బ్రవహించెడు సరస్వతీ జలంబుల నిక్షేపణంబు జేసి కృతస్నానుండవై యాచనంబు చేసిన, నీ సర్వాంగబంధనంబు లుడుగు ననిన నతం డట్ల చేసి, తన విమానం బెక్కి నిజస్థానంబున కరిగెఁ; గావున.

6-312-కంద పద్యము

అనుదినము దీని నెవ్వరు
వినిరేనిఁ బఠించిరేని విస్మయ మొదవన్
ఘన భూతజాల మెల్లను
మునుకొని వారలను గాంచి మ్రొక్కుచు నుండున్.

6-313-ఆటవెలది

విశ్వరూపువలన నైశ్వర్యకరమైన
యిట్టి విద్యఁ దాల్చి యింద్రుఁ డపుడు
మూఁడులోకములకు ముఖ్యమైనట్టి శ్రీ
ననుభవించి మించె నధికమహిమ.

6-314-సీస పద్యము

భూపాల! యా విశ్వరూపున కరుదైన;
తలలు మూఁ డనువొందఁ గలిగి యుండు;
సౌరిది సురాపాన సోమపానంబులు;
నన్నాద మనఁగను నమరవరుల
తోఁగూడి భుజియించి తూకొని వారితో;
యజ్ఞభాగంబు ప్రత్యక్ష మొంది
కైకొనుచుండి దుష్కర్ముఁడై యా యజ్ఞ;
భాగంబు రాక్షస ప్రవరులకును

6-314.1-ఆటవెలది

దల్లిమీఁద గలుగు తాత్పర్యవశమున
దివిజవరుల మొఱఁగి తెచ్చి యిచ్చు

నది యెఱింగి యింద్రుఁ డతిభీతచిత్తుఁడై
తనకుఁగాని యతని తలలు ద్రుంచె.

6-315-కంద పద్యము

భాసురుఁ డనక మహాత్మా
గ్రేసరుఁ డన కతఁడు పూర్వకృత కర్మగతిన్
వేసరుఁ డనక మహేంద్రుఁడు
భూసురు తల లపుడు రోషమునఁ దెగ నడిచెన్.

6-316-వచనము

ఇట్లయ్యింద్రుఁడు క్రోధంబు సహింపంజాలక విశ్వరూపుతలలు ఖడ్గంబునం దెగనడచిన సోమపానంబు చేయు శిరంబు కపింజలం బయ్యె; సురాపానంబు చేయు శిరంబు కలవింకం బయ్యె; అన్నంబు భక్షించు శిరంబు తిత్తిరి యయ్యె; నిట్లు త్రివిధ పక్షిస్వరూపంబు దాల్చి, బ్రహ్మహత్య యేతెంచి యింద్రునిఁ జుట్టుకొని తమ్ముఁ బరిగ్రహింపు మని నిర్బంధింప నపు డింద్రు డతి భీతచిత్తుండై త్రిలోకనాయకుం డైనన్ దానిం దప్పించుకొనంజాలక యంజలి యొగ్గి, యమ్మహా దోషంబుఁ గైకొని, తద్దోషం బొక్క సంవత్సరం బనుభవించి, యంతం బాపుకొను వాఁడై భూ జల వృక్ష స్త్రీలం బ్రార్థించి, మద్దురితంబు చతుర్విధంబు కొలంబుచ్చికొనుం డనిన, భూమి తనయందుఁ జేయంబడిన ఖాతంబు తనంతన పూఁడునట్టి వరంబును, జలంబు సర్వంబు దనయందు బ్రక్షాళితంబైనం బావనం బగునట్టి వరంబును, వృక్షంబులు భేదింపం బడి పునఃప్రరోహంబు గలుగు వరంబును, స్త్రీ లెల్లపుడుం దమకు గామసుఖంబు గలుగునట్టి వరంబును గోరిన నతం డట్ల కా నొసంగిన నతని దుష్కృతంబు ధరణి నెఱియ లూషర క్షేత్రంబుల

విధంబునను, నుదకంబు బుద్బుద ఫేన రూపంబునను, మహీరుహంబులు నిర్యాస భావంబునను, నింతులు రజో వికారంబునను నిట్లు చతుర్భాగంబులం బంచికొనిరి; అంత.

## 6-13- వృత్రాసుర వృత్తాంతము

### 6-317-మత్తేభ విక్రీడితము

హతపుత్రుం డగు విశ్వరూపజనకుం డా త్వష్ట దుఃఖాయతో
ద్ధత రోషానల దహ్యమానుఁ డగుచుం దా నింద్రుపై మారణ
క్రతు హోమం బొనరింప నందుఁ బొడమెం గల్పాంతకాకార వి
శ్రుత కీలానల నిష్ఠురేక్షణగుణక్షుభ్యత్త్రిలోకోగ్రుఁడై.

### 6-318-సీస పద్యము

యుగము ద్రుంగెడునాఁడు జగములు పొలియించు;
 నంతకుమూర్తిపై నింత యగుచుఁ;
బలుపును బొడువును బ్రతిదినంబును నొక్క;
 శరపాత మంగంబు విరివిగొనుచుఁ,
గడు దగ్ధ శైల సంకాశ దేహము నందుఁ;
 గరము సంధ్యారాగకాంతి బెరయ;
మును గాఁక రాగిచేఁ గనుమించు మించులఁ;
 గఱకుమీసలు కచాగ్రములు మెఱయఁ;

### 6-318.1-తేటగీతి

జండ మధ్యాహ్న మార్తాండ మండ లోగ్ర
చటుల నిష్ఠుర లోచనాంచల విధూత
దశ దిశాభాగుఁ డుజ్జ్వలతర కరాళ
భిదుర సునిశిత దంష్ట్రోరు వదనగుహుఁడు.

6-319-ఉత్పలమాల

నింగికి నేలకుం బొడవు నిచ్చలమై శిఖలందుఁ బర్వ ను
త్తుంగత రాగ్ని జాలములఁ దొట్రిలుచున్ గ్రహపంక్తి జాఱ ని
స్సంగ కరాళ శాత ఘన సద్ఘృణి మండల చండ శూలము
ప్పొంగుచుఁ గేల లీలఁ గొని భూమిచలింపఁగ నోలియాడుచున్.

6-320-సీస పద్యము

వదలక విరివిగా వదనంబుఁ దెఱచుచు;
 నాకాశమంతయు నప్పళించుఁ;
గడనాల్క నిగిడించి గ్రహతారకంబుల;
 నయ మెల్ల దిగజాఱ నాకి విడుచు;
నలవోకయునుబోలె నట్టహాసము చేసి;
 మెఱసి లోకములెల్ల మ్రింగఁ జూచుఁ;
దనరు దిగ్దంతి దంతములు చెక్కలువాఱ;
 నుగ్రదంష్ట్రలు ద్రిప్పు నుక్కుమిగిలి;

6-320.1-తేటగీతి

త్వష్ట బలితంపుఁ దపమునఁ బుష్టినొంది
యఖిల లోకంబు లెల్లఁ దా నాక్రమించి

వృత్రనాముండు దేవతాశత్రుఁ డగుచు
దారుణాకారుఁ డఖిల దుర్దముఁడు మెఱసె.

6-321-మత్తకోకిలము

అట్టి వృత్రునిమీఁద దేవత లల్కతోఁ బెనుమూఁక లై
చుట్టిముట్టి మహాస్త్రవిద్యలు చూపి యేపున నేయ నా
గొట్టువీరుఁడు వార లేసిన క్రూరశస్త్రము లన్నియుం
జుట్టి పట్టుక మ్రింగి శూరత జోక నార్చె మహోగ్రుఁడై.

6-322-కంద పద్యము

భక్షితదివ్యాస్త్రుం డగు
రక్షోనాయకుని నమరరాజప్రముఖుల్
వీక్షింప వెఱచి పఱచిరి
రక్షకుఁ జింతించు కొనుచు రయ మొప్పారన్.

6-323-వచనము

ఇట్లు సర్వసాధనంబులతోడ సాధుజనంబుల వృత్రాసురుండు మ్రింగిన, నచ్చెరుపడి చేయునది లేక త త్తేజోవిశేష విభవంబునకు భయంబునొంది, కందిన డెందంబునం గుందుచుం, బురందర ప్రముఖు లార్తరక్షకుండగు పుండరీకాక్షునకుం గుయ్యిడు వారలై.

6-324-లయగ్రాహి

వీఁడు కడు దుర్దముఁడు పాడు మన కైదువులు;
వాఁడి చెడఁగా మెసవి యాడు గనకున్నాఁ;

డేఁడ బ్రతుకింకఁ? బెనుఁగీడు వొడమెన్ మనకుఁ;
దోడుపడ నొక్కరుఁడు లేఁడు హరి దక్కన్;
వేఁడుదము శ్రీధరునిఁ; గూడుదుము సద్భటులఁ;
బాడుదము గీతముల; జాడపడు నంతన్
వీఁడు చెడు త్రోవ దయతోడ నెఱిఁగించు ఘనుఁ;
డోడక సురాలయము పాడుపడ దింకన్.

6-325-కంద పద్యము

అని తలపోయుచుఁ దమలో
మునుకుచుఁ దికమకలు గొనుచు మురరిపు కడకున్
గునుకుచుఁ దినుకుచుఁ నేగిరి
ఘనరాక్షసుఁ గన్న కన్నుఁగవ బెగ్గిలఁగన్.

6-326-వచనము

ఇట్లు భయార్తులై యమర్త్యవ్రాతంబు చనిచని ముందట నభంగ భంగ రంగ దుత్తుంగ డిండీర మండల సముద్దండాడంబర విడంబిత నారాయణ నిరంతర కీర్తిలతా కుసుమగుచ్ఛ స్వచ్ఛంబును, అనవరత గోవింద చరణారవింద సేవా సమాకుల కలకలఫలిత మహాపుణ్య ఫలాయమాన సముద్దీపితావర్తవర్తిత దక్షిణావర్త రుచిర శంఖమండల మండితంబును, నతినిష్ఠుర కఠిన పాఠీన పృథురోమ రాజిసంకుల తిమి తిమింగిల కర్కట కమఠ కచ్ఛప మకర నక్ర వక్రగ్రహ గ్రహణ ఘుమఘుమారావ దారుణగమన విషమిత విషమ తరంగఘట్టన ఘట్టిత సముద్ధూత శీకర నికర నీరంధ్ర తారకిత తారాపథంబును, మహోచ్ఛ్రయ శిలోచ్చయ శిఖరాగ్ర ప్రవహిత దుగ్ధనిర్ఝర సమ్మార్జిత పురాణపురుష విశుద్ధ

శుద్ధాంత విహారణధురీణ నవవసుధాధౌత ధావళ్య ధగద్ధగాయమాన రమ్య హర్మ్య నిర్మాణ కర్మంబును, నతి పవిత్రగుణ విచిత్ర నిజకళత్ర ప్రేమానంద సందర్శిత ముకుంద పరిస్రవదంతరంగ కరుణారస పరిమిళిత భావబంధుర విద్రుమ వల్లీమతల్లి కాంకుర శోభితంబును, ప్రసిద్ధ సిద్ధరసాంబువాహ సంగమ సముత్థిత గంభీర ఘోష పరిదూషిత సకల రోదోంతరాళంబును, సముద్రమేఖలాఖిల ప్రదేశ విలసిత నవీన దుకూలాయమానంబును, హరిహర ప్రముఖ దేవతానిచయ పరిలబ్ధామృత మహైశ్వర్య దానధౌరేయ మహానిధానంబును, వైకుంఠపుర పౌరవర కామ్యఫలఫలిత మందార పారిజాత సంతాన కల్పవృక్ష హరిచందన ఘన వనానుకూలంబు నునై యొప్పుచుఁ గుబేరు భాండాగారంబును బోలెఁ బద్మ, మహా పద్మ, శంఖ, మకర, కచ్ఛప, ముకుంద, కుంద, నీల, వర సమగ్రంబై, విష్ణు కరకమలంబునుం బోలె సుదర్శనావర్త ప్రగల్భంబై, కైలాస మహీధరంబునుం బోలె, నమృతకళాస్థాన శేఖరపదార్పణంబై, యింద్ర వైభవంబునుం బోలెఁ గల్పవృక్ష, కామధేను, చింతామణి జనితంబై, సుగ్రీవసైన్యంబునుం బోలె నపరిమిత నిబిడ హరిసంచారంబై, నారా యణోదరంబునుం బోలె నఖిల భువన భారభరణ సమర్థంబై, శంకరు జటాజూటంబును బోలె గంగాతరంగిణీ సమాశ్రయం బై, బ్రహ్మలోకంబునుం బోలె బరమహంసకుల సేవ్యంబై, పాతాళ లోకంబునుం బోలె ననంత భోగి భోగయోగ్యంబై, నందనవనంబునుం బోలె నైరావత మాధవీ రంభాది సంజననకారణంబై, సౌదామినీ నికరంబునుం బోలె నభ్రంకషంబై, విష్ణునామకీర్తనంబునుం బోలె నిర్మలస్వభావంబై, క్రతు శతగతుండునుం బోలె హరిపదభాజనంబై యొప్పుచున్న దుగ్ధవారాశి డాసి, శ్వేతద్వీపంబున

వసియించి, యందు సకల దిక్పాలకాది దేవతలు దేవదేవు నాశ్రయించి యిట్లని స్తుతియించి; రంత.

6-327-సీస పద్యము

పంచమహాభూత పరినిర్మితంబైన;
 ముజ్జగంబుల కెల్ల నొజ్జ యైన
బ్రహ్మయు నేమును బరఁగ నందఱుఁ గూడి;
 యెవ్వనికై పూజలిత్తు మెపుడు
నట్టి సర్వేశ్వరుం డాగమ వినుతుండు;
 సర్వాత్మకుఁడు మాకు శరణ మగును
అతిపూర్ణకాము నహంకారదూరుని;
 సముని శాంతునిఁ గృపాస్పదుని గురుని

6-327.1-తేటగీతి

మాని యన్యుని సేవింపఁ బూనునట్టి
కపటశీలుని నతి పాపకర్మబుద్ధి
శునక వాలంబు పట్టుక ఘనతరాబ్ధి
దరియఁ జూచుట గాదె? తాఁ దామసమున.

6-328-చంపకమాల

ఉదకమయంబునన్ వసుధ నోడగఁ జేసి తనర్చు కొమ్మునన్
వదలక యంటఁగట్టి మనువల్లభుఁ గాచిన మత్స్యమూర్తి స
మ్మదమున మమ్ము బ్రోచు ననుమానము మానఁగ వృత్రుచేతి యా
పద దొలగించి నేఁడు సురపాలుర పాలిటి భాగ్య దైవమై.

6-329-మత్తకోకిలము

రంతు చేయుచు వాతధూత కరాళ భంగుర భంగ దు
ర్దాంత సంతత సాగరోదక తల్ప మొంది వసించు బ
ప్మాంతవానిని బొడ్డుఁదమ్మిని నాఁచి కాచిన ప్రోడ యిం
తంతవాఁ డనరాని యొంటరి యాదరించు మముం గృపన్.

6-330-తేటగీతి

దేవతలమైన మే మిట్టి దేవదేవు
సర్వలోక శరణ్యుని శరణు చొచ్చి
బలితమైనట్టి వీని యాపదలఁ బాసి
మీఱి శుభములఁ జేకొనువార మిపుడు.

6-331-వచనము

ఇట్లు స్తుతియించుచున్న దేవతలకు భక్తవత్సలుండైన వైకుంఠుండు ప్రసన్నుం డయ్యె నప్పుడు.

6-332-సీస పద్యము

తగు శంఖ చక్ర గదా ధరుం డగువానిఁ;
శ్రీవత్స కౌస్తుభ శ్రీల వానిఁ
గమనీయ మాణిక్య ఘన కిరీటమువాని;
దివ్యవిభూషణ దీప్తివాని
మండిత కేయూర కుండలంబులవాని;
సిరి యురస్థలమునఁ జెలఁగు వానిఁ

దనుఁబోలు సేవకదండంబు గలవానిఁ;
 జిలుగైన పచ్చని వలువవాని

6-332.1-ఆటవెలది

దెల్ల దమ్మివిరులఁ దెగడు కన్నులవాని
నవసుధాద్రవంపు నవ్వువానిఁ
గనియె వేల్పుపిండు కప్పురపాటుతోఁ
గన్నులందు నున్న కఱవు దీఱ.

6-333-సీస పద్యము

తన సేవకులలోనఁ దడఁబడు రూపంబు;
 శ్రీవత్స కౌస్తుభ శ్రీలఁ దెలుప
వికచాబ్జములతోడ వీడ్వడు కన్నుల;
 కడలు దైవాఱెడు కరుణఁ దెలుప
నెల్ల లోకములకు నిల్లైన భాగ్యంబుఁ;
 గాపురం బుండెడు కమల దెలుప
మూఁడుమూర్తులకును మొదలైన తేజంబు;
 ధాతఁ బుట్టించిన తమ్మి దెలుప

6-333.1-ఆటవెలది

బుద్ధిఁ బోల్పరాని పుణ్యంబుఁ దత్పాద
కమల జనిత యైన గంగ దెలుప
నప్రమేయుఁ డభవు డవ్యక్తుఁ డవ్యయు
డాదిపురుషుఁ డఖిలమోది యొప్పె.

6-334-వచనము

ఇట్లు జగన్మోహనాకారుండయిన నారాయణుని కృపావలోక నాహ్లాద చకిత స్వభావ చరితులై సాష్టాంగదండప్రణామంబు లాచరించి ఫాలభాగ పరికీలిత కరకమలులై యిట్లనిరి.

6-335-ఆటవెలది

దుర్గమంబు లయిన స్వర్గాది ఫలములఁ
బుట్టఁజేయఁ జాలునట్టి గుణము
గలిగి మెలఁగుచున్న ఘనుఁడ వై నట్టి నీ
కరయ మ్రొక్కువార మాదిపురుష!

6-336-సీస పద్యము

దండంబు యోగీంద్రమండల నుతునకు;
దండంబు శార్ఙ్గ కోదండునకును;
దండంబు మండిత కుండల ద్వయునకు;
దండంబు నిష్ఠుర భండనునకు;
దండంబు మత్తవేదండ రక్షకునకు;
దండంబు రాక్షసఖండనునకు;
దండంబు పూర్ణేందు మండల ముఖునకు;
దండంబు తేజః ప్రచండునకును;

6-336.1-తేటగీతి

దండ మద్భుత పుణ్యప్రధానునకును;
దండ ముత్తమ వైకుంఠధామునకును;

దండ మాశ్రిత రక్షణ తత్పరునకు;
దండ మురు భోగినాయక తల్పునకును.

6-337-ఉత్పలమాల

చిక్కిరి దేవతావరులు చిందఱ వందఱలైరి ఖేచరుల్;
స్రుక్కిరి సాధ్యసంఘములు; సోలిరి పన్నగు లాజి భూమిలో;
మ్రుక్కిరి దివ్యకోటి; గడు మ్రగ్గిరి యక్షులు వృత్రుచేత నీ
చిక్కినవారి నైన దయచేయుము నొవ్వకయుండ నో! హరీ!

6-338-కంద పద్యము

మొదలాఱిన రక్కసులకు
మొదలై మా కాపదలకు మూలం బగుచుం
దుద మొదలు లేని రక్కసు
తుది చూపఁ గదయ్య! తుదకుఁ దుది యైన హరీ!

6-339-తేటగీతి

అకట! దిక్కుల కెల్ల దిక్కైన మాకు
నొక్క దిక్కును లేదు కాలూనఁ నైన;
దిక్కుగావయ్య! నేఁడు మా దిక్కుఁ జూచి
దిక్కు లేకున్నవారల దిక్కు నీవ.

6-340-కంద పద్యము

నీ దిక్కు గానివారికి
నే దిక్కును లేదు వెదక యిహపరములకున్

మోదింపఁ దలఁచువారికి
నీ దిక్కే దిక్కు సుమ్ము; నీరజనాభా!

6-341-తేటగీతి

అరయ మాతేజములతోడ నాయుధములు
మ్రింగి భువన త్రయంబును మ్రింగుచున్న
భీకరాకారు వృత్రునిఁ బీచ మడఁచి
యెల్ల భంగుల మా భంగ మీఁగు మభవ!

6-342-ఆటవెలది

పరమపురుష! దుఃఖభంజన! పరమేశ!
భక్తవరద! కృష్ణ! భవవిదూర!
జలరుహాక్ష! నిన్ను శరణంబు వేఁడెద
మభయ మిచ్చి కావవయ్య! మమ్ము.

6-343-వచనము

నమస్తే భగవన్నారాయణ! వాసుదేవ! యాదిపురుష! మహానుభావ! పరమమంగళ! పరమకళ్యాణ! దేవ! పరమకారుణికు లయిన పరమహంస లగు పరివ్రాజకులచేత నాచరితంబు లగు పరమసమాధి భేదంబులఁ బరిస్ఫుటం బయిన పరమహంస ధర్మంబుచేత నుద్ఘాటితం బగు తమః కవాటద్వారంబున రసావృతంబయిన యాత్మలోకంబున నుపలబ్ధమాత్రుండవై, నిజ సుఖానుభవుండ వై యున్న నీ వాత్మ సమవేతంబు లై యపేక్షింపఁ బడని శరీరంబులకు నుత్పత్తి స్థితి లయ కారణుండ వై యుండుదువు; గుణసర్గ భావితుండవై యపరిమిత గుణగణంబులుగల నీవు, దేవదత్తుని మాడ్కిఁ

బారతంత్ర్యంబున నబ్బిన కుశల ఫలంబుల ననుభవించి చింతింతువు; షడ్గుణైశ్వర్యసంపన్నుండవైన నీ వాత్మారాముండ వయి యుండుదువు; గుణసర్గ భావితుండవయి యపరిమిత గుణగణంబు లర్వాచీన వితర్క విచార ప్రమాణభావంబులగు తర్కశాస్త్రంబులఁ గర్కశంబు లయిన ప్రజ్ఞలు గలిగి, దురవగ్రహవాదు లయిన విద్వాంసుల వివాదానుసరణంబుల యందు నుపరతంబులగు నస్తినాస్తీత్యాది వాక్యంబుల సమస్త మాయామయుండ వై నిజ మాయచేతఁ గానంబడక యుక్తిగోచరుండవై, సమస్త విషమ రూపంబులఁ బ్రవర్తింతువు; దేవా! రజ్జువు నందు సర్పభ్రాంతి గలుగునట్లు ద్రవ్యాంతరంబులచేత బ్రహ్మం బయిన నీ యందుఁ బ్రపంచ భ్రాంతి గలుగుచుండు సర్వేశ్వరా! సర్వజగత్కారణరూపం బైన నీవు సర్వభూత ప్రత్యగాత్మ వగుటంజేసి సర్వగుణాభావభాసోపలక్షితుడవై కానంబడుదువు, లోకేశ్వరా! భవన్మహిమ మహామృతసముద్ర విప్రుట్సకృత్పాన మాత్రంబున సంతుష్టచిత్తులై, నిరంతర సుఖంబున విస్మారిత దృష్ట శ్రుత విషయ సుఖ లేశాభాసులైన పరమభాగవతులు భవచ్చరణకమల సేవాధర్మంబు విడువరు; త్రిభువనాత్మభవ! త్రివిక్రమ! త్రిణయన! త్రిలోక మనోహరానుభావ! భవదీయ వైభవ విభూతి భేదంబు లైన దనుజాదులకు ననుపమక్రమ సమయం బెఱింగి, నిజమాయాబలంబున సుర నర మృగ జలచరాది రూపంబులు ధరియించి, తదీయావతారంబుల ననురూపంబైన విధంబున శిక్షింతువు; భక్తవత్సలా! భవన్ముఖ కమల నిర్గత మధుర వచనామృత కళావిశేషంబుల, నిజ దాసులమైన మా హృదయతాపం బడంగింపుము; జగదుత్పత్తి స్థితి లయకారణ ప్రధాన దివ్య మాయా వినోదవర్తివై సర్వజీవనికాయంబులకు బాహ్యాభ్యంతరంబుల యందు బ్రహ్మ ప్రత్యగాత్మ స్వరూప ప్రధానరూపంబుల దేశకాల దేహావస్థాన విశేషంబులఁ,

దదుపాదాను భవంబులు గలిగి, సర్వప్రత్యయసాక్షివై, సాక్షాత్పరబ్రహ్మస్వరూపుండవై యుండెడి నీకు నేమని విన్నవించువారము? జగదాశ్రయంబై, వివిధ వృజిన సంసార పరిశ్రమోపశమనం బైన భవదీయ దివ్యచరణ శతపలాశచ్ఛాయ నాశ్రయించెదము;" అని పెక్కువిధంబుల వినుతించి యిట్లనిరి.

6-344-కంద పద్యము

తేజంబు నాయువును వి
భ్రాజిత దివ్యాయుధములుఁ బరువడి వృత్రుం
డాజి ముఖంబున మ్రింగెను
మా జయ మింకెందుఁ? జెప్పుమా; జగదీశా!

6-345-వచనము

అని యి ట్లతిమనోహర చతుర వచనంబుల భక్తిపరవశులయి వినుతి చేయుచున్న దేవతలం జూచి, య ప్పరమేశ్వరుండమృత ప్రాయంబు లగు గంభీరభాషణంబుల ని ట్లనియె.

6-346-కంద పద్యము

మ దుపస్థానం బగు మీ
సదమల సుజ్ఞానమునకు సంతోషమునం
బొదలెద మదిఁ బ్రీతి నొందితి
వదలక నా భక్తి పొడమి వ్యర్థం బగునే?

6-347-వచనము

మఱియును, బ్రీతుండనైన నాయందు భక్తులకుం బొందరాని యర్థంబు లేదు,
విశేషించి నాయందునేకాంతమతి యైన తత్త్వవిదుం డన్యంబులం గోరకుండు;
గుణంబుల యందుఁ దత్త్వజ్ఞానగోచరుం డైన వాఁడు విషయనివృత్తచిత్తుండై
సంసార మార్గంబు నిచ్ఛింపడు; కావున మీకు శుభం బయ్యెడు; దధీచియను
ఋషి సత్తముండు గలం డతని శరీరంబు మద్విద్యాతిశయ మహత్త్వంబునను
దేజోవిశేషంబు నను సారవంతంబై యున్నయది; నతని నడిగి, తచ్ఛరీరంబుఁ
బుచ్చికొనుండు; అతండు పూర్వకాలంబున యశ్వినీదేవతలకు నశ్వశిరోనామం
బను బ్రహ్మస్వరూపం బగు నిష్కళంకం బయిన విద్య యుపదేశించిన; వారలు
జీవన్ముక్తిత్త్వంబు నొందిరి మఱియు త్వష్టపుత్రుండయిన విశ్వరూపునకు
మదాత్మకం బయిన యభేద్య కవచంబు నిచ్చెఁ; గావున నతం డతివదాన్యుండు;
దేహంబు వంచింపక మీకిచ్చు; నతని శల్యంబులు విశ్వకర్మ నిర్మితంబు లై,
శతధారలు గల యాయుధ శ్రేష్ఠంబయి, మత్తేజోపబృంహితం బయి
వృత్రాసురశిరోహరణ కారణం బయి యుండు; దానం జేసి మీరు పునర్లబ్ద
తేజోస్త్రాయుధ సంపదలు గలిగి వెలింగెదరు; విశేషించియు మద్భక్తవరులైన వార
లే లోకంబుల నెవ్వరికి నజయ్యులు; కావున మీకు భద్రం బయ్యెడు" మని
భూతభావనుం డైన భగవంతుం డదృశ్యుం డయ్యె; నప్పుడు దేవతలు
దధీచిముని కడకుం జనిరి; అ త్తఱి నింద్రుం డిట్లనియె.

6-348-ఆటవెలది

దేహి సుఖము గోరి దేహంబు ఘటియించి
దేహి విడువ లేఁడు దేహ మెపుడు;
దేహి! యస్మదీయ దేహంబుకొఱకునై
దేహ మీఁగదయ్య! దేవతలకు.

6-349-ఉత్పలమాల

ఎక్కడ నెల్ల లోకముల నెవ్వరు గోరని కోర్కి, నేఁడు మా
తెక్కలిపాటునన్ దివిరి దేహము వేఁడగ వచ్చినారఁ; మే
మెక్కడ? తీవ్ర కర్మగతి యెక్కడ? దైవకృతంబు గాక; యీ
రొక్కపు దాన మీ వరుస రోయక వేఁడుదురే జగంబులన్?

6-350-కంద పద్యము

నీచగతి యెల్లభంగుల
యాచన యని తెలిసి తగని దడుగుదు రేనిన్
యాచక వర్గము లోపల
నీచకులనఁ బడరె? యెంత నేర్పరులైనన్.

6-351-కంద పద్యము

అడుగంగరాని వస్తువు
లడుగరు బతిమాలి యెట్టి యర్థులు నిను నే
మడిగితిమి దేహమెల్లను
గడు నడిగెడు వారికేడ కరుణ? మహాత్మా!

6-352-ఉత్పలమాల

నావుడునా దధీచియు మనంబున సంతసమంది నవ్వి సం
భావిత వాక్య పద్ధతులఁ బల్కుచు నిట్లనెఁ బేర్మితోడ నో!
దేవతలార! ప్రాణులకుఁ దెక్కలి మృత్యుభయంబు పూనుటే
భావములం దలంపరు కృపామతి నెన్నఁడు మీ మనంబులన్.

6-353-ఆటవెలది

ఎలమి బ్రదుక నిచ్చు నెనసిన వారికి
దేహ మెల్లభంగిఁ దీపు గాదె?
యచ్యుతుండు వచ్చి యర్థించె నేనిని
దన్ను నిచ్చునట్టి దాత గలఁడె?

6-354-వచనము

అదియునుం గాక

6-355-సీస పద్యము

అర్థంబు వేఁడెడు నర్థులు గలరు గా;
కంగంబు వేఁడెడి యర్థి గలఁడె?
తగు కోరికల నిచ్చు దానశీలుఁడు గల్గుఁ;
దన దేహ మీ నేర్చు దాత గలఁడె?
యీ నేర్చువాఁడు దన్నిచ్చిన రోయక;
చంపెడునట్టి యాచకుఁడు గలఁడె?
చంపియుఁ బోవక శల్యంబు లన్నియు;
నేఱి పంచుక పోవువారు గలరె?

6-355.1-ఆటవెలది

రమణ లోకమెల్ల రక్షించు వారికి
హింస చేయుబుద్ధి యెట్లు వొడమె?
బ్రాంతి యైనయట్టి ప్రాణంబుపైఁ దీపు
తమకుఁ బోలె నెదిరిఁ దలఁప వలదె?

6-356-వచనము

అనిన నింద్రుం డిట్లనియె.

6-357-తేటగీతి

సర్వ భూతదయాపర స్వాంతులకును
బుణ్యవర్తను లగు మిమ్ముబోఁటి వారి
కమిత సత్కీర్తి కాముల కలఘుమతుల
కియ్యరాని పదార్థంబు లెవ్వి గలవు?

6-358-ఆటవెలది

అడుగరాని సొమ్ము నడుగ రాదని మానఁ
డడుగువాని మాట లడుగ నేల?
భ్రాంతి నడుగుచోటఁ బ్రాణంబు లేనియు
నిచ్చువాఁడు దాఁపఁ డిచ్చుఁ గాని.

6-359-వచనము

అని పరసంకటంబు దలంపక నిలింపులు గార్యపరతన్ సవినయ వాక్యపరంపరలఁ బ్రార్థించిన, నతండు దరహాసితవదనుండై, యఖిల లోకధర్మం బెఱింగియు నొక్కింత కాలంబు ప్రతివాక్యం బిచ్చితి; దీని సహింపదగుదురు; మీయట్టి వారలకుం బ్రియం బగునేని నెప్పుడైన విడువందగిన శరీరంబు విడుచుట యేమి దుర్లభంబు? నధ్రువం బైన యీ దేహంబుచేతం గీర్తి సుకృతంబుల నెవ్వం డార్జింపకుండు నతండు పాషాణాదులకంటె నతి కఠినుండు; మీయట్టి పుణ్యశ్లోకులచేతఁ గాంక్షింపబడిన శరీరం బప్రమేయ ధర్మార్జితంబు; ఏ దేహంబుచేత సకలభూతంబులు శోకానుభవంబున శోకించు; హర్షానుభవంబున

హర్షించునట్టి మహాకష్ట దైన్యాకరం బైన శరీరంబు కాక శునకసృగాలాదుల పాలు గాకుండ మేలయ్యె; నని నిశ్చితాత్ముం డయి దధీచి దత్త్వాలోకనంబుచేత నిరసిత బంధనుండై, బుద్ధీంద్రియ మానసంబు లతోఁ గూడిన క్షేత్రజ్ఞునిఁ బరబ్రహ్మస్వరూపంబైన భగవంతు నందు నేకీభూతంబు చేసి, యోగజ్ఞానంబున శరీరంబు విడిచె; నప్పుడింద్రుం డతని శల్యంబుల విశ్వకర్మ నిర్మితం బైన, నిశిత శతధారా సమావృతంబై వెలుంగు వజ్రాయుధంబుఁ గైకొని, భగవత్తేజోపబృంహితుం డై, యైరావతారూఢుండై, సకలదేవోత్తమ గరుడ గంధర్వ ఖచర కిన్నర కింపురుష సిద్ధ విద్యాధర పరిసేవితు డై సకల ముని జనంబులు వినుతింపఁ ద్రిలోక హర్షకారియై, భగవదనుగ్రహ సంప్రాప్త మహోత్సాహ వికసిత వదనారవిందుండై వృత్రాసురుపై నడచె; నప్పుడు.

6-360-ఉత్పలమాల

వృత్రుఁడు దాన వాన్వయ పవిత్రుఁడు లోకజిఘాంసకక్రియా
సూత్రుఁడు నిగ్రహాగ్రహణ సుస్థిర వాక్య వివేక మాన చా
రిత్రుఁడు దేవతోరగ దరీకృత వక్త్రుఁడు రోష దూషితా
మిత్రుఁడు శత్రురాకఁ గని మిక్కలియైన యుగాంతకాకృతిన్.

6-361-కంద పద్యము

మెండు గల దనుజ నాయక
మండలములు గొల్వ నడచె మహితోద్ధతి వే
దండముల నడుమ జను నడ
గొండయునుం బోలె నిబిడ గోపోద్ధతుఁడై.

6-362-కంద పద్యము

కాలగళుఁ డడిరి కడువడిఁ
గాలునిపైఁ గవయు మాడ్కి ఖరతర రవ సం
చాలిత పూర్వ దిగంతరుఁ
డై లీల మహేంద్రుమీఁద నతఁ డరిగె నృపా!

6-363-వచనము

ఇట్లు రుద్రగణంబులు, మరుద్గణంబులు, నాదిత్యగణంబులు, నశ్వినీదేవతలుఁ, బితృదేవతలు, విశ్వేదేవులు, వహ్ని, యమ, నైరృతి, వరుణ వాయు, కుబే, రేశానాదులు, సిద్ధ, సాధ్య, కిన్నర, కింపురుష, గరుడ, గంధర్వ, ఖేచరప్రముఖంబులగు నింద్ర సైన్యంబులతోడ నముచియు, శంబరుండును, ననుర్వుండును, ద్విమూర్ధండును, వృషభుండును, నంబరుండును, హయగ్రీవుండును, శంకుశిరుండును, విప్రచిత్తియు, నయోముఖుండును, బులోముండును, వృషపర్వుండును, హేతియుఁ, బ్రహేతియు, నుత్కటుండును, ధూమ్రకేశుండును, విరూపాక్షుండును, గపిలుండును, విభావసుండును, నిల్వలుండును, బల్వలుండును, దందశూకుండును, వృషధ్వజుండును, గాలనాభుండును, మహానాభుండును, భూతసంతాపనుండును, వృకుండును, సుమాలియు, మాలియు మున్నగు దైతేయ దానవ యక్ష రాక్షసాద్యసంఖ్యంబు లగు వృత్రాసురు బలంబు లంతం దలపడి, సమరంబు చేస; రప్పుడు.

6-364-చంపకమాల

అసురులకున్ సురావళికి నయ్యె మహారణ మప్పు డొండొరుల్
ముసల గదాసి కుంత శర ముద్గర తోమర భిందిపాల ప

ట్టిస పటుశూల చక్రముల రేవలు చూపి యదల్చి యార్చుచున్
మసలక కప్పి రస్త్రముల మార్కొని మంటలు మింట నంటగన్.

6-365-కంద పద్యము

ఒండొరులఁ గడవ నేసిన
కాండము లాకాశపథముఁ గప్పి మహోల్కా
దండంబు లొలసి నిష్ఠుర
భండన ముఖ మొప్పెఁ జూడఁ బ్రళయోచితమై.

6-366-చంపకమాల

సురవరు లేయు బాణములు చూడ్కి కగోచరమై నభస్థలం
బఱిముఱి గప్పి రేసి దివసాంతముఁ జేసిన లీల నా సురే
శ్వర బలయూధ వీరులను సాయక పంక్తుల చేత వాని రూ
పఱ శతధూళిఁ జేసి పఱపైన తమం బొనరించి రార్చుచున్.

6-367-చంపకమాల

సమరమదాంధు లై సుర నిశాచర వీరులు సైనికాంఘ్రి సం
క్రమిత మహీపరాగములు గ్రమ్మిన నుమ్మలికంపుఁ జీకటుల్
తమ కనుదోయి కడ్డముగఁ దార్కొనినం జల మేది పోరి రా
క్రమిత నిజాంతరంగ పరిఘట్టిత రోష మహాగ్ని పెంపునన్.

6-368-కంద పద్యము

అతిగళిత రక్తధారా
క్షతములతోఁ గానఁబడిరి సైనికులు మహో

ద్ధత రోషవహ్ని కీలలు
వితతం బై పెల్లగిల్లి వెడలెడి భంగిన్.

6-369-సీస పద్యము

రవణించు శింజినీ టంకార రవములు;
 భట సింహనాదంబుఁ బరిఢవింప
భీషణోత్తమ హయ హేషావిఘోషంబు;
 కరి బృంహితస్ఫూర్తిఁ గ్రందుకొలుప
సమర నిశ్శంకాంశ శంఖ నినాదంబు;
 నేమి స్వనంబుల నిహ్నవింపఁ
దుములమై చెలఁగెడు దుందుభి ధ్వానంబు;
 లట్టహాసంబుల నాక్రమింప

6-369.1-తేటగీతి

ఘటిత శస్త్రాస్త్ర నిష్ఠుర ఘట్టనోత్థ
ఖర కఠోర రోరు విస్ఫులింగంబు లడరి
దివ్య కోటీర మణిఘృణి దిక్కరింప
సమర మొనరించి రసురులు నమరవరులు.

6-370-వచనము

ఇట్లు ప్రళయసంరంభ విజృంభిత సముత్తుంగ రంగత్తరంగిత భైరవారావ నిష్ఠ్యూత నిష్ఠుర మహార్ణవంబునుం బోలె యుగాంత సంక్రాంత ఝుంఝూపవన పరికంపిత దీర్ఘ నిర్ఘాత నిబిడ నిష్ఠుర నీరదంబుం బోలె, నుభయ సైన్యంబులు గలసి సంకుల సమరంబు సలుపు సమయంబున, యుగాంత కృతాంత సకలప్రాణి సంహార

కారణలీలయుం బోలెఁ, బదాతిరాతి మావంత రథిక మహారథిక వీరు లొండురులు చండగతిం గాండంబులు పఱపుచు, గదలం జదుపుచుఁ, గత్తులఁ గత్తళంబులఁ జినుఁగం బొడుచుచు, నడిదంబుల నఱకుచుఁ, గుంతలంబులం గ్రుచ్చుచు, గుఠారంబుల వ్రచ్చుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబులం బాఁదుచుఁ, జక్రంబులం ద్రుంచుచు, సబళంబుల నొంచుచు, చురియల మెఱుముచు, శూలంబులఁ దుఱుముచు, వాజుల కుఱికియు, వాలంబుల నఱికియుఁ, దొడలు తుండించియుఁ, దొండంబులు ఖండించియు, మెడ లెడయించియు, మెదళ్ళు గెడయించియు, నములు ద్రుంచియు, నాసికలు ద్రెంచియుఁ, బదంబుల విఱిచియుఁ, బార్శ్వంబులం జఱచియు, గజంబులఁ బఱపియు, గాత్రంబుల మఱపియుఁ, గుంభంబులఁ బగిలించియుఁ, గొమ్ములఁ బెకలించియు, హస్తంబులఁ దుండించియు, నంగంబులఁ జించియు, రథంబుల చలియించియు, రథికుల బొలియించియు, సారథుల జంపియు, సైంధవంబులఁ దంపియు, శిరంబు నొగిలించియు, సీసకంబు లగిలించియు, ఛత్రంబుల నుఱుమాడియుఁ, జామరంబులం దునుమాడియు, సైన్యంబులఁ జిదిపియు, సాహసుల మెదిపియు, నడుములు ద్రుంచియు, మఱియును బరస్పర గుణవిచ్ఛేదనంబున, నన్యోన్య కోదండ ఖండన పటుత్వంబు నుభయ సైంధవ ధ్వజ సారథి రథిక రథ వికలనంబును, నొండొరుల పాద జాను జంఘా హస్త మస్తక నిర్దళనంబును, రక్త మాంసమేదః పంకసంకలిత సమరాంగణంబునునై యతి ఘోర భంగిం బెనంగిరి; అప్పుడు.

6-371-చంపకమాల

సమజయమున్ సమాపజయ సామ్య పరిశ్రమమున్ సమోరు వి
క్రమము సమాస్త్రశస్త్రబల గర్వము నై కడు ఘోర భంగి నా

నముచి విరోధి సైన్య గణనాథులతోడ నిశాచరేశ్వ రో
త్తములు దురంబుజేసి రొగిఁ దార్కొని వృత్రుబలంబు ప్రాపునన్.

6-372-వచనము

అప్పుడు.

6-373-లయగ్రాహి

మొత్తముగఁ బాఱు పెనునెత్తురు మహానదులఁ;
దత్తరముతో నుఱికి కుత్తుకలు మోవం
జిత్తముల నుబ్బి వెస నెత్తుకొను భూతముల;
నత్తుకొని శాకినులు జొత్తిలుచు మాంసం
బుత్తలముతో మెసఁగి నృత్తములు జేయు మద;
మత్తఘన ఢాకినులు వృత్తగతిఁ బ్రేవుల్
బిత్తరములం దిగిచి మెత్తమెదడుల్ మొనసి;
గుత్తగొనుచుండ భయవృత్తిఁ గల నొప్పెన్.

6-374-వచనము

ఇట్లు దేవదానవులు నర్మదాతీరంబునఁ గృతయుగంబునం దలపడి
త్రేతాయుగంబు చొచ్చునంత కాలంబుఁ బోరు దారుణంబుగాఁ జేయు చుండ;
నంత వృత్రాసురు భుజబలంబు పెంపునఁ దెంపుచేసి కంపిం పక నిలింపులపై
రక్కసులు గుంపులై పెంపు చూపి మహా వృక్ష పాషాణ గిరిశిఖరంబులు వర్షించిన.

6-375-మత్తేభ విక్రీడితము

గిరి పాషాణ మహీజముల్ గురియఁగా గీర్వాణులన్నింటి ని
ష్ఠుర నారాచపరంపరల్ పఱపుచున్ జూర్ణంబుఁ గావింప ని
ర్భర లీలం దమచేయు సత్త్వములు దోర్భంగంబు లై పోవఁగాఁ
దెరలన్ రాక్షస యోధవీరుల మదోద్రేకంబు సంఛిన్నమై.

6-376-కంద పద్యము

ప్రచురముగ రాక్షసావళి
ఖచరులపై నేయు నిబిడకాండావళి దు
ర్వచనముఁ డెడ నాడు మాటలు
సుచరిత్రుని యందుఁ బోలెఁ జొరవయ్యె నృపా!

6-377-వచనము

అప్పుడు.

6-378-వనమయూరము

అంత సురలేయు నిబిడాస్త్రములపాలై
పంతములు దక్కి హత పౌరుషముతో ని
శ్చింతగతి రక్కసులు సిగ్గుడిగి భూమిం
గంతుగొని పాఱి రపకారపరు లార్వన్.

6-379-కంద పద్యము

కొండలఁ బోలెడు రక్కసు
లొండొరులం గడవఁ బాఱి రుక్కఱి పటు కో

దండముఖ సాధనంబులు
భండనమున వైచి దివిజపతు లార్వంగన్.

6-380-వచనము

ఇట్లు సమరతలంబువాసి తన ప్రాపుమాసి, తీసిపఱచుచుండు దండనాయకులం జూచి, యకుటిలమతిం బకపక నగి వృత్రాసురుండు, ఇట్లనియె

6-381-ఉత్పలమాల

క్షుల్లతవృత్తి మీ కగునె? శూరుల కిమ్మెయిఁ గీర్తి భోగముల్
గొల్లగఁ జేయు చావు మదిఁ గోరినవారల కైనఁ గల్గునే?
తల్లడ మంది యీ సమరధర్మము మాని తలంగఁ బాడియే?
మల్లుఁడు దుర్దమప్రధనమత్తుఁడు వృత్రుని పాటెఱుంగరే?

6-382-కంద పద్యము

చావు ధ్రువమైన ప్రాణికిఁ
జావులు రెం డరసికొనుఁడు సమరమునందున్
భావింప యోగమందును
జావంగా లేని చెడుగుచావుం జావే?

6-383-వచనము

అని వాసుదేవ తేజోవిశేష విశేషితుల్లై దవానలకీలలం బోలె వెలుంగుచు వెఱచి వెన్నిచ్చి పాఱెడు నసురుల వెనుకొని తఱుము సురవీరులం జూచి హుంకరించి స్వర్గానుభవంబున నిచ్చలేకుండె నేని మదవలోకన స్పర్శన మాత్రంబు ముందర నిలుతురు గాక; యని యేచి కల్పాంతానల్ప ఘనఘనాటోపంబునుం బోలెఁ

గఠోరకంఠ హుంకార తర్జనంబులన్ గర్జిల్లుచుఁ, బ్రళయకాల పవన పరిభావిత మహాశిఖిశిఖావళులఁ దృణీకరించు కుటిలావలోకనంబుల నాలోకించుచుం, గాల పరిపక్వ లీలాలోలుండయిన శూలి పోలిక నాభీలమూర్తి యై సకల జీవభార భరణ దుర్భర భగ్న బ్రహ్మాండ మహాధ్వానంబు భంగి నాస్ఫోటించిన.

6-384-ఉత్పలమాల

కూడె జగంబు లన్నియును; గ్రుంకిరి సూర్య సుధాంశు; లద్రు లూ
టాడె; నభస్స్థలం బగిలె; నంబుధు లింకె; నుడుగ్రహాళి ప
ట్టూడె; వడిం దిశల్ పగిలె; నుర్వర క్రుంగె; నజాండభాండ మ
ల్లాడె; విధాత బెగ్గడిలె; నార్చుచు వృత్రుఁడు బొబ్బపెట్టినన్.

6-385-లయగ్రాహి

కూలిరి వియచ్చరులు; సోలిరి దిశాధిపులు;
వ్రాలి రమరవ్రజము; దూలి రురగేంద్రుల్;
ప్రేలిరి మరుత్తు; లెద జాలిగొని రాశ్వినులు;
కాలుడిగి రుద్రు లవలీల బడి రార్తిన్;
వ్రేలిరి దినేశ్వరులు; కీలెడలినట్లు సుర;
జాలములు పెన్నిదుర పాలగుచు ధారా
భీల గతితోడఁ దమ కేలిధనువుల్ విడిచి;
నేలఁబడి మూర్ఛలను దేలిరి మహాత్మా!

6-386-వచనము

ఇట్లు కఠోర కంఠనాదం బొనర్చిన నశనిపాతంబునం గూలు ప్రాణిచయంబు భంగి నంగంబు లెఱుంగక రణరంగంబునం బడి బిట్టు మూర్ఛిల్లిన,

దివిజరాజసైన్యంబుల వృత్రాసురుండు సంగరరంగ దుర్దముండై మహీవలయంబు పదాహతంబుల గడగడ వడంక, నిశితశూలంబు గేల నంకించుచు, మదించిన భద్రమాతంగంబు కమల వనంబు చొచ్చి, మట్టిమల్లాడు విధంబున నిమీలితాక్షుండయి, తన పదతలంబుల రూపంబులు మాయం జమురుచు, వెక్కసంబుగఁ గ్రీడించు వానింగని వజ్రి వజ్రశతోపమ నిష్ఠుర గదాదండం బాభీల భంగిఁ బ్రళయకాల మార్తాండ చండపరివేష ప్రేరితంబుగాఁ ద్రిప్పి వైచిన.

6-387-మత్తేభ విక్రీడితము

అది మింటం బెనుమంట లంటఁ బఱపై యాభీల వేగంబునం
గదియన్ వచ్చిన లీల వామకర సంక్రాంతంబు గావించి, బె
ట్టిదుఁడై చేరి సురారి దానిఁ గొని కాఠిన్యోరు పాతంబులం
జదియన్ మోఁదె గజేంద్ర మస్తకము నుత్సాహైక సాహయ్యుఁడై.

6-388-ఆటవెలది

అగ్గజంబు గులిశహతిఁ గూలు కులమహీ
ధ్రంబుఁ బోలె రక్తధార లురల
మస్తకంబు పగిలి మదమఱి జిరజిరఁ
దిరిగి భీతితోడఁ దెరలి పఱచె.

6-389-ఉత్సాహవృత్తము

గజము దెరలి దాని కొఱలి కంప మొంది పాఱఁగా
భజన నింద్రుఁ డంకుశమునఁ బట్టి బిట్టు నిల్పుచున్
నిజసుధారసైకపాన నిర్గ యార్ద్ర కరమునన్
బుజత మీఱ నిమిఱె నదియు రీతి మెఱసి క్రమ్మఱన్.

6-390-వచనము

ఇవ్విధంబున నైరావతంబును సేదదేర్చుచు, నెదురనిలుచున్న భిదురపాణింగని, తోఁబుట్టువుఁ జంపిన తెంపుఁ దలంచి, మోహాశోకంబున విపర్యాసంబుగా నవ్వుచు నాహవకామ్యార్థి యై వృత్రుం డిట్లనియె.

6-391-శార్దూల విక్రీడితము

నాకుం బెద్దయు నీకు సద్గురువు దీనవ్రాత రక్షున్ శుభా
లోకుం జంపితి విట్లు పాపమతివై లోభంబుతో నియ్యెడన్
లోకుల్ నవ్వఁగ మద్భుజాపటిమకున్ లోనైతి వీ శూలమం
దాకంపింపఁగ నిన్ను గ్రుచ్చి ఋణముక్తాత్ముండనై పేర్చెదన్.

6-392-కంద పద్యము

ఎట్టి తులు వయినఁ గానీ
నెట్టన తన బ్రదుకుకొఱకు నీవలె గురువుం
జట్టమును బుణ్యు బ్రాహ్మణుఁ
బట్టి వధింపంగఁ గలఁడె? పశువుం బోలెన్.

6-393-చంపకమాల

దయయును సత్యమున్ విడిచి ధర్మముమాని యశంబుఁబాసి శ్రీ
జయములఁ బాఱఁదోలి పురుషత్వము గానక లోకనిందితా
హ్వాయుఁ డగువాని చావునకు నార్యులు గుందుదురే? సృగాలముల్
ప్రియమున నంటునే శవముఁ? బ్రేలక చేరునె? కంకగృధ్రముల్.

6-394-కంద పద్యము

నిక్కమగు పాపములచేఁ
జిక్కితివి నిశాత శూల శిఖరాగ్రమునన్
మక్కించి నీదు మాంసము
నక్కలుఁ గుక్కలును జేరి నమల నొనర్తున్.

6-395-ఉత్పలమాల

దీకొని నీకు నేఁ డిచట దిక్కని వచ్చినవారు గల్గిరే?
నేకమతిం బిశాచముల కెల్లను దృష్టిగ మన్ని శాత శూ
లైక మహాగ్ని కీలల ననేకవిధంబుల సోమయాజి నై
మేఁకల జేసి వ్రేల్చెద నమేయ మదోద్ధతి వ్రాలి యియ్యనిన్.

6-396-కంద పద్యము

కాక ననుఁ గులిశధారల
దీకొని నిర్జింపఁ గలిగి తేనిఁ బ్రభూతో
ద్రేకంబు చేసి శూరుల
ప్రాకట పదపద్మ ధూళి భాగంగగుదున్.

6-397-సీస పద్యము

సందేహ మేటికి జంభారి వేవేగ;
భిదురంబు వ్రేయు మాభీల భంగి
నతిలోభి నడిగిన యర్థరాశియుఁ బోలె;
గడపకు మిది వృథ గాదు సుమ్ము;
మురమర్దనుని తేజమున నా దధీచి వీ;
ర్యాతిశయంబున నధికమయిన

యదిగాన హరిచే నియంత్రి తోన్నతుఁడ వై;
 గెలువుము శత్రుల గీ టడంచి

6-397.1-ఆటవెలది

యెందుఁ గలఁడు విష్ణు డందు జయశ్రీలు
పొందు గాఁగ వచ్చి పొందుచుండు;
గాన భక్తవరదుఁ గమలాక్షు సర్వేశు
పదములందు మనముఁ బదిలపఱతు.

6-398-వచనము

ఇప్పుడు వజ్రధారలం ద్రెంపబడిన విషయ భోగంబులు గలవాఁడ నయి, శరీరంబు విడిచి, భగవద్ధామంబు నొందెద; నారాయణుని దాసుండ నైన నాకు స్వర్గమర్త్యపాతాళంబులం గల సంపద్భోగంబులు నిచ్చగింపంబడవు; త్రివర్గికాయాస రహితంబైన మహైశ్వర్యంబు ప్రసాదించుం గావున ననుపమేయం బైన భగవత్ప్రసాదం బన్యుల కగోచరం; బద్దేవుని పాదైక మూలంబుగా నుండు దాసులకు దాసానుదాసుండ నగుచున్నవాఁడ" నని యప్పరమేశ్వరు నుద్దేశించి.

6-399-చంపకమాల

అరయఁగ భక్తపాలనము లైన భవద్గుణజాల మాత్మ సం
స్మరణము చేయ వాక్కు నిను సన్నుతి చేయ శరీరమెల్లఁ గిం
కర పరివృత్తి చేయ మదిఁ గాంక్ష యొనర్చెదఁ గాని యొల్ల నే
నరిది ధ్రువోన్నతస్థలము నబ్జజు పట్టణ మింద్ర భోగమున్.

6-400-ఉత్పలమాల

ఆఁకలి గొన్న క్రేపులు రయంబున నీకలురాని పక్షులున్
దీకొని తల్లికిన్ మఱి విదేశగతుండగు భర్త కంగజ
వ్యాకులచిత్త యైన జవరాలును దత్తఱ మందు భంగి నో!
శ్రీకర! పంకజాక్ష! నినుఁ జేరఁగ నామది గోరెడుం గదే.

6-401-కంద పద్యము

నాకును సఖ్యము పుణ్య
శ్లోకులతోఁగాని తత్త్వశూన్యులు సంసా
రైక విమోహులతోడం
గాకుండనొనర్పుమయ్య కంజదళాక్షా

6-402-వచనము

అని పలుకుచు.

6-403-మహాస్రగ్ధర

హరిపై సర్వాత్ముపై నత్యగణితగుణుపై నంతరంగంబు పర్వన్
సరిమేనుప్పొంగఁ జావుంజయమును సరిగాసంతసంబందుచుం భీ
కరుఁడై కాలాగ్ని పోలెం గనులుచుఁ గవిసెన్ గర్వదుర్వారుఁడై దు
ర్భరలీలన్ భూమి గంపింపఁగ దిశల ద్రువన్ భండనోద్దండవృత్తిన్.

6-404-కంద పద్యము

దొరఁకొని ప్రళయోదకమున
హరిపైఁ గైటభుఁడు గవియు హుంకారమునన్

సురనాథు మీఁద వృత్రా
సురుఁడు మదోద్వృత్తి నడచె శూలాయుధుఁడై.

6-405-శార్దూల విక్రీడితము

కల్పాంతాగ్నియుబోలె నుల్కలెగయంగాఁ ద్రిప్పుచున్ దీన నో!
యల్పా! చావు మటంచు శూలము రయం బారంగఁ బైవైచినం
బోల్పం గోటిరవిప్రకాశత దివిం బోవంగ వీక్షించి యా
వేల్పుల్ వొంగఁగ వజ్రధారఁ దునిమెన్ విన్నాణ మొప్పారఁగన్.

6-406-ఆటవెలది

శూల మప్పు డతఁడు స్రుక్కక ఖండించి
పూని తోన కదిసి భుజము ద్రుంచె;
నసుర గనలి యేకహస్తుఁడై పరిఘంబు
గొని మహేంద్రుఁ గిట్టి హనువు లడిచె.

6-407-వచనము

ఇట్లు ప్రళయకాల భీషణ పరివేష పోషంబుగా రోషంబునం బరిఘంబుఁ ద్రిప్పి కుప్పించి గజ కుంభస్థలంబు భగ్నంబు చేసి యింద్రు హనుప్రదేశంబును నిష్ఠురాహతి నొప్పించిన.

6-408-కంద పద్యము

గజము మద ముడిగి తిరుగుచు
గుజగుజనై గీఁకపెట్టఁ గులిశము నేలన్

భజన చెడి విడిచె నింద్రుఁడు
గజిబిజితో బెగడె నసుర కడిమి జగంబుల్.

6-409-కంద పద్యము

గరుడుఁడు పొదవిన నాగము
కరణిన్ వృత్రాసురేంద్రు కడిమికి లోనై
తిరుగుడు పడ్డ హరిం గని
పురపుర నాహా! యటంచుఁ బొగిలె జగంబుల్.

6-410-వచనము

అప్పుడు.

6-411-ఆటవెలది

గజముపాటు చూచి కడు దీనగతిఁ జూచి
పరికరంబు జాఱి పడుటఁ జూచి
యుద్ధధర్మ మెఱిఁగి యున్న శత్రునిఁ జూచి
సిగ్గుతోడ వజ్రి శిరము వాంచె.

6-412-వచనము

ఇట్లు యుద్ధంబున శత్రు సన్నిధిం గరంబు జాఱిపడిన వజ్రంబుఁ బుచ్చికొనక నివ్వెఱపడి, లజ్జించి యున్న పాకశాసనుం జూచి వృత్రుం డిట్లనియె.

6-413-కంద పద్యము

దురమునఁ గైదువు వదలిన
శరణన్నను వైరిజనులఁ జంపరు వీరుల్

వెఱఁగంద నేల? కులిశము
కర మరుదుగఁ బుచ్చికొనుము కాచితి నింద్రా!

6-414-సీస పద్యము

వజ్రంబుఁ గైకొని వైరి నిర్జింపు; మి;
ట్లడలంగ వేళ గా దమరనాథ!
యమర దేహాధీను లైన మూర్తుల కెల్ల;
నీశు లక్ష్మీశు సర్వేశుఁ బాసి
కడతేఱ జయములు గల్గునె యెందైనఁ? ;
దలపోసి చూడుమా; తత్త్వబుద్ధి
నీ లోకపాలకు లెవ్వని వశగతి;
వలఁ బడ్డ పక్షుల వర్తనమునఁ

6-414.1-తేటగీతి

జిక్కి చేష్టలు చేయుచుఁ జింతగాంతు
రట్టి మృత్యు బలంబుల నాత్మజయము
తమదిగాఁ గోరి యజ్ఞాన తంత్రు లగుచుఁ
గమలలోచను లీలా వికారములను.

6-415-తేటగీతి

మెఱయ యంత్రమయం బైన మృగము భంగి
దారునిర్మితమైనట్టి తరణిపోల్కి
శక్ర! యెఱుఁగుమ యీ భూతజాల మెల్ల
దళిత పంకేరుహాక్షు తంత్రంబు గాఁగ.

6-416-వచనము

మఱియు; భూతంబులచేతను, నింద్రియంబులచేతను, నవశుండైన పురుషుండు ప్రకృతిచేత వేఱుచేయంబడిన యాత్మం బరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖియించుచుండు; నవిద్వాంసుండైన వాఁ డనవరతంబుఁ దన్ను స్వతంత్రుంగాఁ దలంచుచుండు; భూతంబుల వలన భూతంబులు పుట్టుచుండును; నా భూతంబులు భూతంబులచేత భక్షింపబడుచుండు; పురుషున కాయువు, శ్రీయును, గీర్తియు, నైశ్వర్యంబును మొదలైనవి యనుభవింప నెంతగాలంబు ప్రాప్తం బంత గాలంబు నివసించు, ప్రాప్తంబు దీఱినఁ బురుషుండు జాలిం బొందిన నవి యుండక పోవుచుండును; కావున గుణంబును నవగుణంబును గీర్తప గీర్తులును, జయాపజయంబులును, సుఖదుఃఖంబులును, జావుబ్రతుకులును, సమంబులై కలుగుచుండు; నజ్ఞాని యైన వానికి సత్త్వరజస్తమో గుణంబులు గలిగి యుండు; నట్టివానికి గుణమయంబులైన యింద్రియాదులే యాత్మ యని తోఁచుచుండును; కావున వాఁ డా గుణంబులచేత బద్ధుం డగు; నా గుణంబులకు సాక్షి మాత్రంబగు శరీరంబు వేఱని యెవ్వఁ డెఱుంగనోపు, వాఁ డా గుణంబులచేత బద్ధుండు గాఁడు; కావున గుణంబులును, గుణియు, భోక్తయును, భోగ్యంబును, జయంబును, నపజయంబును, హర్తయును, హార్యంబును, నుత్పత్తిస్థితిలయకర్తయై, సర్వోత్కృష్టుండైన యప్పరమేశ్వరుండె కాని యన్యంబు లేదు; ఇప్పు డొక్క హస్తంబు నాయుధంబునుం బోయినను భవత్ప్రాణాహరణంబునకు సమర్థుండ నగుచున్న నన్నుం జూడు" మని వృత్రాసురుండు మఱియు నిట్లనియె.

6-417-తేటగీతి

వాహనంబులు సారెలు వాఁడిశరము
లూర్జి తాక్షము లసువులె యొడ్డణములు
గాఁగఁ బోరెఁడు నీ ద్యూతకర్మమందు
నెసఁగ జయమును నపజయ మెవ్వఁ డెఱుఁగు?

6-418-చంపకమాల

అనవుడు వృత్రుమాటలకు నద్భుత మంది సురేంద్రుఁ డెంతయుం
దన మదిఁ గుత్సితం బుడిగి దైవముగా నతనిన్ భజించి కై
కొనియెఁ గరంబునన్ దిగువఁ గూలిన వజ్రము, నప్పు డాత్మలోఁ
దనరె జగంబు లన్నియు ముదంబునఁ బొందిరి ఖేచరావళుల్.

6-419-కంద పద్యము

రాహుగ్రహ వక్త్ర గుహా
గేహాంతము వాసి వచ్చి కిరణావళి స
ద్బాహుళ్య మొప్ప వెలిఁగెడు
నా హరిదశ్వుండుఁ బోలె హరి యొప్పె నృపా!

6-420-వచనము

ఇట్లు కరకలిత వజ్రాయుధ రుక్మండల మండిత దిఙ్మండలుం డైన జంభారి గంభీర వాక్యంబుల విస్మయ మందస్మిత ముఖారవిందుం డయి వృత్రున కిట్లనియె.

6-421-కంద పద్యము

ఓ! దానవేంద్ర! నీ మతి
వేదాంతముఁ బోలెఁ దత్త్వ విజ్ఞాన కళా

మోదము నీ వతిభక్తుఁడ
వాదిమ పురుషునకు హరికి నబ్జాక్షునకున్.

6-422-ఉత్పలమాల

లోకములెల్ల నిండి తన లోనుగ సర్వముఁ జేసి ప్రాణులన్
దీకులఁ బెట్టి యెల్లడలఁ దీప్తులు చూపెడి విష్ణుమాయ నేఁ
డేకమతిం దలంచి తిది యేల? మహాసురు రూపుమాని సు
శ్లోకుఁ బురాణపూరుషుని శోభనమూర్తి ధరింపు మింపునన్.

6-423-ఉత్పలమాల

ఏ నియమంబు సల్పితివొ? యెట్టి మహాతప మాచరించితో
పూని రజోగుణాభిరతిఁ బొందిన నీ మతి శాంతి దాంతి స
మ్మానస మానసానుభవ మత్తమరాళముఁ డరోష భావ స
మ్మానుఁ డమేయుఁ డా దనుజమర్దను భక్తి వొసంగె నెంతయున్.

6-424-కంద పద్యము

నారాయణ రూ పామృత
పారావారమునఁ దేలు భక్తుఁడు దా భూ
దారకరఖాత కోదక
పూరంబులు నేల తృప్తిఁ బొందు మహాత్మా!

6-425-వచనము

ఇట్లు పలుకుచున్న యింద్రు నుపలక్షించి, వృత్రాసురుం డా యోధన దుర్మర్షణ సంఘుర్ష మానసుండై పైరిం బురికొల్పు కొని, వామహస్తంబునం బరిఘంబుఁ

ద్రిప్పుచు నుప్పరంబునం గుప్పించుచు, బ్రహ్మాండ కర్పరంబు నిష్ఠుర భైరవారావంబునం బగిలించుచు, సముత్తుంగ మత్తమాతంగ పుంగవంబు వృషభంబుపైఁ గవియు భంగి సుర వృషభు పేరురంబుపలక్షించి, భీషణాశని నిపాత వేగంబునం గొట్టిన నింద్రుండు కులిశ ధార నప్పరిఘంబుఁ దునిమితోడన శేష ఫణా విశేష భాసురం బయిన బాహుదండంబు ఖండించె; నప్పుడు వృత్రుండు భిన్న బాహు ద్వయ మూలుండై రక్తధారలం దోఁగుచు వజ్రిచేతఁ బక్షహతం బై దివంబుననుండి జాఱుచున్న కులపర్వతంబునుం బోలెఁ జూపట్టి ప్రళయకాల సంహార నిటలచ్ఛటచ్ఛటార్భట కఠోర కీలా భీలాగ్ని సమాన క్రూర కుటిల నిరీక్ష దుర్నిరీక్షుండయి, భూనభో మండలంబులఁ గ్రింది మీఁది దౌడల హత్తించి, నభోమండలంబునుం బోలెఁ దుది మొదల లెఱుంగ రాక, వికృతంబుగా వక్త్రంబు దెఱచి, మందర మథన మధ్యమాన విషధర విషమజిహ్వాభీలం బగు నాలుక నభంబు నాకుచుఁ గాలసంహారకారణుం డయిన కాలుని భుజదండ మండితంబగు దండంబునుం బోలిన దంష్ట్రలచేత జగత్త్రయంబును మ్రింగెడువాఁడునుం బోలె నతిమాత్ర మహాకాయుం డయి, పర్వతంబులం దలంగ మీటుచు నడగొండయుం బోలె నభోభాగ భూభాగంబుల నాక్రమించి; యప్పుడు.

6-426-ఉత్పలమాల

కాలమునాటి మృత్యువుముఖంబునఁ బోలెను విస్ఫులింగముల్
గ్రాలఁగ దేవసంఘములు గంపమునొంద జగంబు లెల్ల నా
హా లుఠి తారవం బెసఁగ నభ్రగజంబును నాయుధంబుతో
నాలుకఁ జుట్టి పట్టి సురనాథుని మ్రింగె మహాద్భు తాకృతిన్.

6-427-ఆటవెలది

లోక మెల్ల నపుడు చీఁకాకు పడెఁ దమం
బడరె నుడుగణంబు లవనిఁ బడియె;
సోనవాన గురిసె సూర్యచంద్రాగ్నుల
రశ్మ లడఁగె దిశలు రభస మయ్యె.

6-428-వచనము

అప్పుడు.

6-429-ఉత్పలమాల

కందఁడు భీతి గుందఁడు ప్రకంపనమొందఁడు పెద్దనిద్దురం
జెందఁడు తత్తఱింపఁడు విశేషముఁ జొప్పఁడు వైష్ణవీ జయా
నందపరైక విద్యను మనంబునఁ దాల్చుచు నుండెఁ గాని సం
క్రందనుఁడా నిశాచరుని గర్భములో హరిరక్షితాంగుఁడై.

6-430-వచనము

ఇట్లు కవచరూప శ్రీనారాయణ కృపాపాలితుండై యోగబలంబున బలభేది యతని యుదరంబు వజ్రాయుధంబున భేదించి యైరావణ సహితుండై వెడలి, యతని కంధరంబు తెగనడువ వజ్రంబుఁ బ్రయో గించిన, నతి నిష్ఠురవేగంబున వృత్రు హరణార్థంబుగం దిరుగుచు సూర్యాది గ్రహ నక్షత్రంబులకు దక్షిణోత్తర గతి రూపంబయిన సంవత్సర సంధియందు నహోరాత్ర మధ్యంబున వృత్రు శిరంబు పర్వత శిఖరం బునుం బోలెఁ ద్రుంచి కూలం ద్రోచె; నప్పుడు.

6-431-మత్తేభ విక్రీడితము

మొరసెన్ దుందుభు లంబరంబునఁ గడున్ మోదించి గంధర్వులున్
సురలున్ సాధ్యులు సిద్ధులున్ మునివరుల్ సొంపార వృత్రఘ్ను భీ
కర తేజోవిభవప్రకాశకర విఖ్యాతైక మంత్రంబులం
దిర మొప్పం బఠియించుచుం గురిసి రెంతేఁ గ్రొత్త పూ సోనలన్.

6-432-ఆటవెలది

ఏమి చెప్ప నప్పు డింద్రారి తనువున
నొక్క దివ్యతేజ ముబ్బి వెడలి
లోకమెల్లఁ జూడ లోకులు చూడని
లోక మరసి విష్ణులోను చొచ్చె.

6-433-వచనము

ఇట్లు లోకభీకరుండైన వృత్రాసురుండు గూలిన, నఖిల లోకంబులు బరితాపంబు లుడిగి సుస్థితిం బొందె; దేవర్షి పితృగణంబులు దానవుల తోడంగూడి, యింద్రునకు జెప్పక తమతమ స్థానంబులకుం జనిరి;" అనిన విని, పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె.

6-434-ఆటవెలది

ఏమి కారణమున నింద్రుతోఁ బలుకక
సురలు పోయి? రట్టి సురగణంబు
లెందుచేత సుఖముఁ జెందిరి? వజ్రికిఁ
జేటు గలుగు టెట్లు? చెప్పవయ్య!

6-435-వచనము

అనిన శుకుం డిట్లనియె "వృత్రపరాక్రమ చకితులయిన నిఖిల దేవతలును, మహర్షి గణంబులును, మున్ను వృత్రవధార్థం బింద్రునిం బ్రార్థించిన నతండు బ్రహ్మహత్యకుం జాలక, "తొల్లి విశ్వరూపునిం జంపిన పాపంబు స్త్రీలయందును, భూమియందును, జలంబులందును, ద్రుమంబులందును విభజించి పెట్టితిని; ఇప్పు డీ హత్య యేరీతిం బాపుకొనువాఁడ? నా కశక్యం" బనిన మహర్షు "లశ్వమేధ యజ్ఞంబు చేయించి, యజ్ఞపురుషుం డైన శ్రీ నారాయణదేవుని సంతుష్టునిం జేసి యీ హత్యం బాపంగలవారము; స్వభావంబున బ్రాహ్మణ పితృ గో మాతృ సజ్జన హంతలైనవార లే దేవునిం గీర్తించి శుద్ధాత్ము లగుదు; రద్దేవుని నశ్వమేధ మహామఖంబున శ్రద్ధాన్వితుండవై సేవించిన నీకు ఖలుండైన యిద్దురాత్ముని హింసించిన హత్య యేమి చేయంగల?" దని యొడంబఱిచిన, నింద్రుండు వల్లె యని యివ్విధంబున మార్తునిం బరిమార్చి, బ్రహ్మహత్యం బొంది, యత్తాపంబు భరియింప నోపక దుర్దశం బొందె; అప్పుడు.

6-436-సీస పద్యము

పాపంబుఁ జండాలరూపంబు గలదాని;
ముదిమిచే నొడలెల్ల గదలుదాని
క్షయకుష్ఠరోగ సంచయకృతం బగుదాని;
నురురక్తపూరంబు దొరఁగుదాని
నరసిన వెండ్రుకల్ నెరసిన తలదాని;
నటఁ బోకుపో కుండు మనెడుదానిఁ
గదరు కంపునఁ ద్రేవు లద రఁజేసెడుదానిఁ;
దా నెందుఁ బాఱిన దఱుముదాని

6-436.1-ఆటవెలది

నా గుణంబు లెల్ల భోగింప కేరీతి
నరుగ నెంతవాఁడ వనెడుదాని
బిట్టు దిరిగి చూచి భీతిల్లి సిగ్గుతో
దేవనాయకుండు దెరలి పఱచె.

6-437-వచనము

ఇట్లతి వికృతత్వంబుతో బ్రహ్మహత్య వెనుతగుల నింద్రుండు నభోభాగ భూభాగ దిగ్భాగంబు లెల్లం దిరిగి, చొరం దెరువులేక దీర్ఘ నిర్ఘాతాటోప నిశ్వాస దూషితుండై, యీశాన్య భాగంబునకుం బఱచె; యద్దెస నమేయపుణ్యాగణ్యంబైన మానస సరస్సునం బ్రవేశించి, యం దొక్క కమలనాళంబు చొచ్చి తంతువులం గలసి రూపంబు లేక యలబ్ధభోగుం డై, బ్రహ్మహత్యా విమోచనంబుఁ జింతించికొనుచు, సహస్ర వర్షంబు లుండె నా చండాలియు నది పరమేశ్వర దిగ్భాగం బగుటం జేసి, యందు జొరరాక కాచియుండె, నంతకాలంబుఁ ద్రిదివంబున నహుషుండు విద్యాబల తపోబల యోగబలంబులం బాలించుచుండి, సంప దైశ్వర్య మదాంధుండై, యింద్ర పత్నిం గోరి, యింద్రుండు వచ్చునందాక నాకుం బత్నివి గమ్మనిన, నా శచీదేవి బృహస్పతి ప్రేరితయై, బ్రహ్మర్షి వాహ్యాశిబిక నెక్కి వచ్చి, నన్ను భోగింపు మనిన నతం డట్ల చేసి, కుంభ సంభవ శాపహతుండై, యజగర యోనియందుఁ బుట్టె; అంత నింద్రుండు బ్రహ్మర్షి గణోపహూతుండై, త్రిదివంబునకు వచ్చె, నంత కాలంబు నారాయణ చరణారవింద ధ్యానపరుండై యుండుటం జేసియు, దిశాధినాథుం డైన శంకరుచేత రక్షింపఁబడ్డవాఁడై యుండుటం జేసియు, దద్దోష బలంబు దఱిఁగి సహస్రాక్షుం బీడింప లే దయ్యె; అప్పు డింద్రుండు నిజైశ్వర్యంబునుం బొంది బ్రహ్మర్షి

పరివృతుండై, మహాపురుషారాధనంబు చేసి, హయమేధా ధ్వరంబునకు దీక్షఁ గైకొని, బ్రహ్మవాదులచేత నాదరింపఁ బడుచున్న వాఁడై, సర్వదేవతామయుండైన నారాయణుం బరితృప్తుం జేసి, మంచు విరయించు మార్తాండుని చందంబునఁ ద్వాష్ట్రవధరూప పాపంబు నాశంబు నొందించి, సకల దివిజ యక్ష గంధర్వ సిద్ధ మునిజన సంస్తూయ మానుండయి, త్రిభువనైశ్వర్య భోగభాగ్యంబులం గైకొనియె; అప్పుడు.

6-438-చంపకమాల

సతత మరీచిముఖ్య మునిసంఘముచేత యథోచితంబుగాఁ
గృత ఘన వాజిమేధమునఁ గేశవు నీశుఁ బురాణపూరుషున్
హితు జగదీశు యజ్ఞపతి నిష్టఫలప్రదు నంతరంగ సం
గతు భజియించి వజ్రి గతకల్మషుఁడై నెగడెన్ మహీశ్వరా!

6-439-సీస పద్యము

మఱియుఁ బుట్టింపంగ మనసు పెట్టిన యట్టి;
క్రూరకర్మాంబోధి కుంభజుండు
అంగారములు చేయ నాహుతిఁ గన నోపు;
బహు పాపకానన పావకుండు
కందక దిగ మ్రింగి గట్టునఁద్రేపంగఁ;
గల్మషగరళ గంగాధరుండు
ఘనగుహాంతరములఁ గాలూన నియ్యని;
కలుష దుస్తర తమో గ్రహ విధుండు

6-439.1-ఆటవెలది

సకల ముక్తిలోక సామ్రాజ్య సమధిక
సహజ భోగ భాగ్య సంగ్రహైక
కారణాప్రమేయ కంజాక్ష సర్వేశ
కేశవాది నామ కీర్తనంబు.

6-440-సీస పద్యము

అఖిల దుఃఖైక సంహారాది కారణం;
బఖిలార్థ సంచ యాహ్లాదకరము
విమల భక్త్యుద్రేక విభవ సందర్శనం;
బనుపమ భక్త వర్ణనరతంబు
విబుధహర్షానేక విజయ సంయుక్తంబు;
గ్రస్తామరేంద్ర మోక్షక్రమంబు
బ్రహ్మహత్యానేక పాపనిస్తరణంబు;
గమనీయ సజ్జన కాంక్షితంబు

6-440.1-తేటగీతి

నైన యీ యితిహాసంబు నధిక భక్తి
వినినఁ జదివిన వ్రాసిన ననుదినంబు
నాయు రారోగ్య విజయ భాగ్యాభివృద్ధి
కర్మనాశము సుగతియుఁ గల్గు ననఘ!

6-441-సీస పద్యము

నావుడు యోగీంద్ర! నామనం బీ వృత్రు;
వివరంబు నీచేత విన్న మొదలు

కడు నద్భుతంబునఁ గళవళం బందెడుఁ;
 గోరి రజస్తమోగుణములందు
వర్తించు నీ పాపవర్తికి నే రీతి;
 మాధవ పదభక్తి మది వసించె?
సత్త్వ స్వభావు లై సమబుద్ధు లై తపో;
 నియమ ప్రయత్ను లై నిష్ఠచేత

6-441.1-తేటగీతి

నిర్మలాత్మకు లై నట్టి ధర్మపరుల
కమరులకుఁ బుణ్యమునులకు నంబుజాక్షు
భూరి కైవల్య సంప్రాప్తి మూలమైన
భక్తి వీనికిఁ బోలె నేర్పాటుగాదు.

6-442-సీస పద్యము

భూస్థలిఁ గల రేణువులకన్న దట్టమై;
 కడు నొప్పు జీవసంఘములు గలవు;
ఆ జీవములలో ననరయ ధర్మాయత;
 మతి వసించినవారు మనుజజాతి;
ఆ మనుష్యులలోనఁ గామంబుఁ బెడఁబాసి;
 మోక్షార్థు లగువారు మొదల నరిది;
మోక్షమార్గం బాత్మమూలంబుగా నుండు;
 వారిలో ముక్తులు లేరు తలఁచు;

6-442.1-తేటగీతి

ముక్తు లై నట్టి వారిలో యుక్తిఁ దలఁపఁ
జాల దుర్లభుఁ డమిత ప్రశాంతి పరుఁడు
పరమ సుజ్ఞాన నిరతుండు భద్రగుణుఁడు
రమణ శ్రీవాసుదేవపరాయణుండు.

6-443-తేటగీతి

సకలలోకాపకారి దుస్సంగతుండు
వృత్రుఁ డే క్రియ సుజ్ఞాన వేది యయ్యె?
సమరమునఁ బౌరుషంబుచే నమరవిభుని
నెట్లు మెప్పించె? దీని నాకెఱుఁగఁ జెపుమ.

## 6-14- చిత్రకేతోపాఖ్యానము

6-444-వచనము

అని పరీక్షన్నరేంద్రుండు శుకయోగీంద్రు నడిగె నని సూతుండు శౌనకాది మునులకుం జెప్పి, మఱియు నిట్లనియె నట్లు గజపుర వల్ల భుండు సంప్రశ్నంబు చేసిన, బాదరాయణి హరిస్మరణ శ్రద్ధాపరుం డయి "తొల్లి కృష్ణద్వైపాయన నారద దేవల మహర్షులు నా కెఱింగించిన యితిహాసంబు గలదు; దాని నెఱింగించెద సావధానుండవై యాకర్ణింపు" మని యిట్లనియె.

6-445-చంపకమాల

అమిత విభూతిఁ జాల నమరాధిపుఁ బోలుచు శూరసేన దే
శములకు భర్తయై ప్రజలు సంతస మందఁగ సార్వభౌముఁడై

క్షమ దమ కెల్ల కాలమును గామ దుహంబుగఁ జిత్రకేతు నా
మమునఁ బ్రసిద్ధి కెక్కె గుణమండనుఁ డంచిత కీర్తికాముఁడై.

6-446-సీస పద్యము

మానిత తారుణ్య మదనతురంగులు;
 కందర్ప విజయైక ఖడ్గలతలు
మదన సమ్మోహన మంత్రాధి దేవతల్;
 పంచశిలీముఖు బందెకత్తె
లసమాస్త్రుఁ డఖిలంబు నడకించు బొమ్మలు;
 నాత్మసంభవుని కట్టాయితములు
పుండ్రేక్షుకోదండు భూరితేజంబులు;
 శంబర విద్వేషి సాయకములు

6-446.1-తేటగీతి

నాగఁ బొలుపారు నొకకోటి నలినముఖులు
దనకుఁ బత్నులు గాఁగ నత్యంత విమల
కీర్తి వైభవ సన్మార్గవర్తి యగుచు
జగతిఁ బాలించుచుండె నా జనవిభుండు.

6-447-తేటగీతి

కలిమి వేవేలు భార్యలు గలిగియుండఁ
బరఁగ సంతతి యొక్కండుఁ బడయ లేక
చిత్తమునఁ జాల బాయని చింత పొడమి
బడలఁ జొచ్చెను వేసవి మడువుఁ బోలె.

6-448-ఉత్పలమాల

రూపము సత్ప్రతాపము మరుత్పతిభోగము యౌవనంబు సం
దీపిత చారువర్తనము దిగ్విజయంబును సత్యమున్ జగ
ద్వ్యాపిత కీర్తియున్ సతులు వైభవముఖ్యములెల్ల మాన్పగా
నోపక యుండె నా నృపతి నొందిన సంతతిలేని దుఃఖమున్.

6-449-వచనము

ఇట్లు, సంతతి లేక అతి దుఃఖమానసుండయిన యా నరేంద్రుని మందిరంబున కంగిరస మహాముని వచ్చి, యతనిచేత నతిధి సత్కారంబులు బడసి, కుశలం బడిగి "రాజ్యంబు భవద ధీనంబ కదా! పృథ్వ వ్యప్తేజో వాయ్వాకాశ మహదహంకారంబు లనియెడి యేడింటిచేత రక్షింపంబడ్డ జీవుండునుం బోలె నమాత్య జనపద దుర్గ ద్రవిణ సంచ య దండ మిత్రంబు లనెడి సప్తప్రకృతులచేత రక్షితుండ వై, ప్రకృతి పురుషుల యందు భారంబు పెట్టి, రాజ్యసుఖంబు లనుభవింతువు గదా? మఱియు దార ప్రజా మాత్య భృత్య మంత్రి పౌర జానపద భూపాలురు నీకు వశవర్తులుగదా? సర్వంబునుం గలిఁగి సార్వభౌముండ వైన నీ వదనంబున విన్నఁదనంబు గలిగి యున్నయది; కతంబేమి?" యనిన నా మునిప్రవరునకు నతం డిట్లనియె; మీ తపోబలంబున మీకు నెఱుంగరాని యదియుం గలదే? యని తలవంచి యూరకున్న, నతని యభిప్రాయం బెఱింగి యా భగవంతుం డైన యంగిరసుండు దయాళుండై, పుత్రకామేష్టి వ్రేల్చి యజ్ఞశేషం బతని యగ్ర మహిషి యయిన కృతద్యుతి కిచ్చి "నీకుం బుత్రుండు గలిగెడి, నతని వలన సుఖదుఃఖంబు లనుభవింపగల" వని చెప్పి యమ్మహాత్ముండు చనియె; ఆ కృతద్యుతి యనుదేవి గర్భంబు ధరియించి, నవమాసంబులు నిండినం గుమారునిం గనియె; నా కాలంబున రాజును, సమస్త

భృత్యామాత్య జనంబులుఁ బరమానందంబుఁ బొందిరి; అపుడు చిత్రకేతుండు కృతస్నానుండై, సకల భూషణ భూషితుండై, సుతునకు జాతకర్మంబు నిర్వర్తించి, బ్రాహ్మణులకు నపరిమిత హిరణ్య రజత దానంబులును, వస్త్రాభరణంబులును, గ్రామంబులును, గజంబులును, వాహనంబులును, ధేనువులును నాఁటేసి యర్బుదంబుల ద్రవ్యంబును దానంబు చేసి, ప్రాణిసముదాయంబునకుం బర్జన్యుండునుం బోలెఁ దక్కిన వారలకు నిష్టకామంబులు వర్షించి, పరమానంద హృదయుండై యుండెఁ; గుమారుండును మాతృపితృ జనంబులకు సంతోషము చేయుచు, దినదినప్రవర్ధమానుండై పెరుగుచుండె; నంతం బుత్రమోహంబునం గృతద్యుతి యందు బద్ధాను రాగుండై మహీధవుండు వర్తించుచుండం; దక్కిన భార్యలు సంతాన సంతోష వికలలై, యీ మోహంబునకుం గారణంబు పుత్రుండ యని యీర్ష్యం జేసి, దారుణ చిత్తలై, కుమారునకు విషం బిడిన సుఖనిద్రితుండునుం బోలె బాలుండు మృతి బొందె; అప్పుడు వేగుటయు దాది బోధింపం జని యా కుమారుని వికృతాకారంబుఁ జూచి, విస్మయ శోకభయార్త యై పుడమింబడి యాక్రందించె; అప్పుడు.

6-450-తరళము

పుడమి నిట్టక నిల్వనం బడి పొక్కుచుం గడు దీన యై
యడఁకు వేమియు లేని వాక్కుల నావు రంచు విలాపమం
దెడరు దోఁప భృశాతురోన్నతి నేడ్చునన్ విని భీతితోఁ
గడుపు బిట్టవియంగ భూపతి కాంత గ్రక్కున నేగుచున్.

6-451-ఆటవెలది

బాలుఁ డొక్కరుండు పరిణామశీలుండు
వంశకర్త తపసి వరము వలనఁ
బుట్టి మిన్న కట్లు పొలిసి యున్నట్టి యా
కొడుకుఁ జూచి తల్లి యడలఁ జొచ్చె

6-452-ఉత్పలమాల

కుంకుమరాగ రమ్య కుచకుంభములం గడుఁ గజ్జలంబుతోఁ
బంకిలమైన బాష్పముల పాల్పడ మజ్జన మాచరించుచుం
గంకణపాణి పల్లవయుగంబున వక్షము మోఁదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చెఁ బరిభావిత పంచమ సుస్వరంబునన్.

6-453-కంద పద్యము

ఆ యార్తరవమునకు భూ
నాయకుఁడు భయంబు నొంది నయ ముడిగి సుతున్
డాయఁగ వేగంబునఁ జని
పాయని మోహంబు తోడ బాలుని మీఁదన్.

6-454-స్రగ్విణి

వ్రాలి యో పుత్ర! నీ వార్త దంభోళియై
కూలఁగా ప్రేయ కీ కొల్ది నన్నేటికిన్
జాలి నొందించె? నా జాడ యింకెట్టిదో?
తూలు మీ తల్లికిన్ దుఃఖ మెట్లాఱునో?

6-455-వచనము

అని తలమొల యెఱుంగక పలవించుచు, భృత్యామాత్య బంధుజనంబులం గూడి యడలుచు నున్న యా రాజు దుఃఖం బెఱింగి, యంగిరసుండు నారదునితోడం గూడి చనుదెంచి, మృతుండైన పుత్రుని పదతలంబున మృతుండునుం బోలెఁ బడియున్న యా రాజుం గనుంగొని, యిట్లనియె

6-456-సీస పద్యము

నీకు వీఁ డెవ్వడు? నీ వెవ్వనికి శోక;
 సంతాప మందెదు? సార్వభౌమ!
పుత్ర మిత్రాదులు పూర్వజన్మంబున;
 నెవ్వని వారలో యెఱుఁగఁ గలవె?
మొదల నదీవేగమున నాడ కాడకు;
 సికతంబు గూడుచుఁ జెదరుచుండు;
నారీతిఁ బ్రాణుల కతికాల గతిచేతఁ;
 బుట్టుట చచ్చుట పొసగుచుండుఁ;

6-456.1-ఆటవెలది

గాన భూతములకుఁ గలుగు భూతంబులు
మమత తోడ విష్ణుమాయఁ జేసి
దీని కడల నేల? ధృతిఁ దూలఁగా నేల?
బుద్ధిఁ దలఁప వలదె? భూత సృష్టి.

6-457-వచనము

మఱియు నేము, నీవును దక్కినవారలును బ్రవర్తమాన కాలంబునం గలిగిన జన్మంబు నొంది, మృత్యువువలన విరామంబు నొందంగల వారమై యిపుడ

లేకపోవుదము; చావు పుట్టువులకు నిక్కువంబు లేదు; ఈశ్వరుండు దన మాయచేత భూతజాలంబుల వలన భూతంబులం బుట్టించు, వాని నా భూతంబులచేతన రక్షించు; వాని నా భూతంబులచేతన హరించు; స్వతంత్రంబు లేని తన సృష్టిచేత బాలుండునుం బోలె నపేక్షలేక యుండు; దేహి యైన పితృదేహంబు చేత దేహి యైన పుత్రదేహంబు మాతృదేహంబు వలనం గలుగుచుండు నా ప్రకారంబున బీజంబు వలన బీజంబు పుట్టుచుండు; దేహికి నివి శాశ్వతంబై జరుగుచు నుండు; పూర్వకాలంబున సామాన్య విశేషంబులు సన్మాత్రంబైన వస్తువులం దే విధంబునం గల్పింపంబడియె నా ప్రకారాంబున దేహంబునకు జీవునకు నన్యోన్య విభాగంబు పూర్వకాలంబున నజ్ఞాన కల్పితం బయ్యె; జన్మఫలంబులను జూచుచున్నవారికి దహనక్రియల నగ్ని పెక్కురూపంబులం గానంబడు భంగి, నొక్కండైన జీవుండు పెక్కు భంగుల వెలుంగుచుండు; నివి యన్నియు నాత్మజ్ఞానంబు చాలక దేహిదేహ సంయోగంబున స్వప్నంబునందు భయావహం బైన ప్రయోజనంబు నడుపుచుండి, మేల్కాంచి, యా స్వప్నార్థంబైన ప్రయోజనంబు తనదిగాదని యెఱుంగు భంగి, జీవుండే తానని జ్ఞానగోచరుండైన వాఁడెఱుంగుం గావున; నన్నియును మనోమాత్రం బని తెలిసి, మోహతమంబు వాసి, భగవంతుండైన వాసుదేవుని యందుఁ జిత్తంబు పెట్టి, నిర్మలాత్మకుండ వగు" మని బోధించినఁ జిత్రకేతుండు లేచి వారల కిట్లనియె.

6-458-సీస పద్యము

యతివేషములు పూని యతి గూఢగతి నిందు;
 నేతెంచినట్టి మీ రెవ్వరయ్య?
కడఁగి నన్ బోలిన గ్రామ్యబుద్ధుల నెల్ల;

బోధింప వచ్చిన పుణ్యమతులో?
రమణఁ గుమార నారద ఋషి భాదులో? ;
దేవ లాసితు లను ధీరమతులో?
వ్యాస వసిష్ఠ దుర్వాస మార్కండేయ;
గౌతమ శుక రామ కపిల మునులో?

6-458.1-తేటగీతి

యాజ్ఞవల్క్యుండుఁ దరణియు నారుణియును
చ్యవన రోమశు లాసురి జాతుకర్ణ
దత్త మైత్రేయ వర భరద్వాజ బోధ్య
పంచశిఖులో? పరాశర ప్రభృతి మునులో?

6-459-కంద పద్యము

వీరలలో నెవ్వరు? సుర
చారణ గంధర్వ సిద్ధ సంఘంబులలో
వారలో? యీ సుజ్ఞానము
కారణమై యెవరి యందు గలదు తలంపన్?

6-460-కంద పద్యము

పొందుగ గ్రామ్య పశుత్వముఁ
బొంది మహాశోకతమముఁ బొందిన నాకున్
ముందఱ దివ్యజ్ఞానముఁ
జెందించినవారి మిమ్ముఁ జెప్పుడు తెలియన్.

6-461-వచనము

అనిన నంగిరసుం డిట్లనియె "నేను బుత్రకాంక్షివైన నీకుఁ బుత్రుం బ్రసాదించిన యంగిరసుండ; నితండు బ్రహ్మపుత్రుం డైన నారదభగవంతుండు; దుస్తరంబైన పుత్రశోకంబున మగ్నుండ వైన నిను ననుగ్రహించి, పరమజ్ఞానం బుపదేశింప వచ్చితిమి; నీ దుఃఖం బెఱింగి, పుత్రు నిచ్చితిమేనిఁ బుత్రవంతులైన వారి తాపంబు నీ చేత ననుభవింపం బడు; నీ ప్రకారంబున లోకంబున సతులును, గృహంబులును, సంపదలును, శబ్దాదులైన విషయంబులును, రాజ్యవైభవంబును జంచలంబులు; మఱియు రాజ్యంబును, భూమియును, బలంబును ధనంబును, భృత్యామాత్య సుహృజ్జనంబులును మొదలైనవి శోక మోహ భయ పీడలం జేయుచుండుఁ; గాని సుఖంబుల నీ నేరవు గంధర్వ నగరంబునుం బోలె స్వప్నలబ్ద మనోరథంబునుం బోని యర్థంబుఁ బాసి కానంబడుచు, మనోభవంబులయిన యర్థంబులం గూడి, స్వార్థంబులై కానంబడ నేరవు; కర్మంబులచేత ధ్యానంబులు చేయుచుండు మనంబులు నానాకర్మంబు లగుచు నుండు నీ దేహి దేహంబు ద్రవ్యజ్ఞానక్రియాత్మకంబై దేహికి వివిధ క్లేశసంతాపంబులం జేయుచుండు; గావున నీవు నిర్మలంబైన మనంబు చేత నాత్మగతి వెదకి ధ్రువం బయిన పదవి నొందు" మనియె; అప్పుడు నారదుం డిట్లనియె "ఉపనిషద్గోప్యంబగు నే నిచ్చుమంత్రం బెవ్వడేని సప్తరాత్రంబులు పఠియించు, నతండు సంకర్షణుండైన భగవంతునిం జూచును; ఎవ్వని పాదమూలంబు సర్వాశ్రయంబై యుండు నట్టి శ్రీమన్నారాయణుని పాదంబులు సేవించి, యీ మోహంబు వదలి యతి శీఘ్రంబున నుత్తమ పదంబు నొందు; మిప్పు డిక్కుమారునకు నీకును బ్రయోజనంబు గలదేనిం జూడు" మని నారదుండు మృతబాలకుని కళేబరంబుఁ జూచి "యో జీవుండ! నీకు శుభం

బయ్యేడు; నిందుఁ బ్రవేశించి మీ తల్లిదండ్రుల బంధుజనులం జూచి వీరల దుఃఖంబు లార్చి యీ కళేబరంబునందుఁ బ్రవేశించి యాయుశ్శేషంబు ననుభవించి పిత్రధీనం బైన రాజ్యాసనంబునఁ గూర్చుండు" మనిన నబ్బాలుం డిట్లనియె.

6-462-తేటగీతి

కర్మవశమున నెందు సుఖంబు లేక
దేవతిర్యఙ్నృ యోనులఁ దిరుగు నాకు
నెలయ నే జన్మమందునో వీరు తల్లి
దండ్రు లయినారు చెప్పవే తాపసేంద్ర!

6-463-తేటగీతి

బాంధవజ్ఞాతిసుతులును బగతు రాత్మ
వరు లుదాసీన మధ్యస్థ వర్గములును
సరవిఁ గనుచుండు రొక్కక్క జన్మమునను
నెఱయఁ బ్రాణికి నొక వావి నిజము గలదె?

6-464-తేటగీతి

రత్నములు హేమములు ననురాగలీల
నమ్మకంబుల నీవల నావల నగు
భంగి నరులందు జీవుండు ప్రాప్తుఁ డగుచు
నెలమిఁ దిరుగుచు నుండుఁ; దా నెందుఁ జెడఁడు.

6-465-సీస పద్యము

ఒక్కఁడై నిత్యుఁడై యొక్కఁడు గడలేక;
 సౌరిది జన్మాదుల శూన్యుఁ డగుచు
సర్వంబు నందుండి సర్వంబుఁ దనయందు;
 నుండంగ సర్వాశ్రయుం డనంగ
సూక్ష్మమై స్థూలమై సూక్ష్మాధికములకు;
 సామ్యమై స్వప్రకాశమున వెలిగి
యఖిలంబుఁ జూచుచు నఖిల ప్రభావుఁడై;
 యఖిలంబుఁ దనయందు నడఁచి కొనుచు

6-465.1-తేటగీతి

నాత్మమాయాగుణంబుల నాత్మమయము
గాఁగ విశ్వంబుఁ దనసృష్టి ఘనతఁ జెందఁ
జేయుచుండును సర్వసంజీవనుండు
రమణ విశ్వాత్ముఁ డయిన నారాయణుండు.

6-466-కంద పద్యము

సతు లెవ్వరు? సుతు లెవ్వరు?
పతు లెవ్వరు? మిత్రశత్రు బంధుప్రియ సం
గతు లెవ్వరు? సర్వాత్మక
గతుఁడై గుణసాక్షి యైన ఘనుఁ డొక్కనికిన్.

6-467-వచనము

మఱియు సుఖదుఃఖంబులం బొందక సర్వోదాసీనుండై పరమాత్మ యై యుండు న ప్పరమేశ్వర రూపుండు నయిన, నాకును మీకు నెక్కడి సంబంధంబు? మీకు

దుఃఖంబునకుం బని లే" దని పలికి యా జీవుండు వోయినం జిత్రకేతుండును బంధువులు నతి విస్మిత చిత్తులై శోకంబులు విడిచి మోహంబులం బాసి యమునా నది యందు న క్కుమారునకు నుత్తరకర్మంబులు నిర్వర్తించిరి చిత్రకేతుండు గాఢ పంకంబునంబడిన యేనుంగునుం బోలె గృహాంధకూపంబు నం దుండి వెడలి కాళిందీనదికిం బోయి యందు విధిపూర్వకంబుగఁ గృతస్నానుండై, మౌనంబుతోడ నారదునకు నమస్కరించిన, నతండు ప్రసన్నుండై భగవన్మంత్రంబు విధిపూర్వకంబుగా నతనికిం నుపదే శించి యంగిరసుతోడం గూడి బ్రహ్మలోకంబునకుం జనియె; చిత్ర కేతుండును నార దోపదేశ మార్గంబున నిరాహారుండై సమాధినియ తుండై నారాయణ రూపంబయిన యా విద్య నారాధించి సప్తరాత్రం బున నప్రతిహతం బయిన విద్యాధరాధిపత్యంబును భాస్వద్రత్న దివ్య విమానంబునుం బడసి, నారాయణానుగ్రహంబునుం బొంది, మనోగమనంబునం ద్రిజగంబులం జరియించుచుండఁ గొన్ని దినంబు లకు నొక్కచోట.

6-468-సీస పద్యము

తారహార పటీర ధవళ దేహమువాని;
 రమణీయ నీలాంబరంబువాని;
మణికిరీటస్ఫురన్మస్తకంబులవానిఁ;
 గంకణ కేయూర కరమువానిఁ;
గర్పూరమయదీప్త కటిసూత్రములవానిఁ;
 దరళ యజ్ఞోపవీతములవాని;
నతి సుప్రసన్న వక్త్రాంబుజంబులవానిఁ;
 దరుణవివృత్త నేత్రములవాని;

6-468.1-ఆటవెలది

సిద్ధమండలంబు సేవింపఁ బుణ్యప్ర
సిద్ధి వెలసినట్టి యుద్ధచరితుఁ;
బద్మలోచనునకుఁ బాదపీఠంబైన
ఘనునిఁ, బన్నగేంద్రుఁ గాంచె నతఁడు.

6-469-ఆటవెలది

కన్నమాత్ర నతఁడు కల్మషంబులఁ బాసి
విమలచిత్తుఁ డగుచు విశదభక్తి
నిట్టరోమములకుఁ బట్టగు చానంద
బాష్పనేత్రుఁ డగుచుఁ బ్రణుతి చేసె

6-470-కంద పద్యము

సంతోషాశ్రులచేత న
నంతునిఁ బరిషిక్తుఁ జేసి యతఁడు ప్రమోదం
బెంతయు నరికట్టిన నొక
కొంతయుఁ బలుకంగలేక కొండొక వడికిన్.

6-471-చంపకమాల

మదినొక యింతమాత్రన సమంబుగఁ జేయుచు బాహ్యవర్తనం
గదిసిన యింద్రియంబుల నొకంతకుఁ దెచ్చి మనంబు వాక్కునుం
గుదురుగఁ ద్రోచి తత్వమునఁ గూర్చుచు శాశ్వత విగ్రహంబు నా
సదయుఁ బ్రశాంతు లోకగురు సన్నుతి చేయఁ దొడం గెనిమ్ములన్.

6-472-కంద పద్యము

అజితుఁడవై భక్తులచే
విజితుం డై నాఁడ విపుడు వేడుక వారున్
విజితులు నీచేఁ గోర్కులు
భజియింపనివారు నిన్నుఁ బడయుదురె? హరీ!

6-473-ఉత్పలమాల

నీ విభవంబు లీ జగము నిండుట యెండుట నాశ మొందుటల్
నీ విమలాంశజాతములు నెమ్మి జగంబు సృజించువార, లో
దేవ! భవద్గుణాంబుధుల తీరముఁ గానక యీశ! బుద్ధితో
వావిరిఁ జర్చ చేయుదురు వారికి వారలు దొడ్డవారలై.

6-474-కంద పద్యము

పరమాణువు మొదలుగఁ గొని
పరమము దుదిగాఁగ మధ్యపరికీర్తనచే
స్థిరుఁడవు త్రయీవిదుఁడవై
సరి సత్త్వాద్యంత మధ్య సదృశగతుఁడవై.

6-475-తేటగీతి

ఉర్వి మొదలైన యేడు నొండొకటికంటె
దశగుణాధికమై యుండు; దాని నండ
కోశమందురు; నా యండకోటి యెవ్వఁ
డందు నణుమాత్రమగున నంతాఖ్యుఁ డతఁడు.

6-476-వచనము

మఱియు, నొక్కచోట విషయతృష్ణాపరులైన నరపశువులు పరతత్త్వంబవైన నిన్ను మాని యైశ్వర్యకాములై తక్కిన దేవతల భజియింపుదురు; వారిచ్చు సంపదలు రాజకులంబునుంబోలె వారలంగూడి నాశంబునం బొందుచుండు; విషయకామములేని నిన్ను సేవించినవారు వేఁచిన విత్తనంబునుంబోలె దేహాంతరోత్పత్తి నొందకుండుదురు; నిర్గుణుండవై జ్ఞానవిజ్ఞాన రూపంబు నొందియున్న నిన్ను గుణసమేతునింగా జ్ఞానులు భావింపుదురు; నీ భజనం బే రూపున నయిన మోక్షంబు ప్రసాదించు; జితమతివైన నీవు భాగవత ధర్మం బే ప్రకారంబున నిర్ణయించితి; వా ప్రకారంబున సర్వోత్కృష్టుండ వైన నిన్ను సనత్కుమారాదులు మోక్షంబు కొఱకు సేవించుచున్నారు; ఈ భాగవత ధర్మంబునందు జ్ఞానహీనుం డొక్కండును లేఁ; డన్య కామ్యధర్మంబులందు విషమబుద్ధిచేత నేను నీవు నాకు నీకు నని వచియించుచున్నవాఁ డధర్మనిరతుండై క్షయించుచుండు; స్థావర జంగమ ప్రాణిసమూహంబునందు సమంబైన భాగవతధర్మంబుల వర్తించుచున్న మనుజునికి భవద్దర్శనంబువలనఁ బాపంబు క్షయించుట యేమి చిత్రం; బిపుడు భవత్పాదావలోకనంబున నిరస్తాశుండ నైతి; మూఢుండ నయిన నాకుఁ బూర్వ కాలంబున నారదుం డనుగ్రహించి, భగవద్ధర్మంబు దయచేసె; నది నేఁడు నాకు వరదుండ వయిన నీ కతంబున దృష్టంబయ్యె; ఖద్యోతంబులచేత సూర్యుండు గోచరుండు గానిమాడ్కి జగదాత్మకుండవయిన నీ మహా త్త్వంబు మనుజులచేత నాచరింపబడి ప్రసిద్ధంబైనది గాదు; అం దుత్పత్తి స్థితి లయ కారణుండవై భగవంతుండ వైన నీకు నమస్కరించెద; అని మఱియును.

6-477-తేటగీతి

అరయ బ్రహ్మదు లెవ్వని ననునయించి
భక్తియుక్తుల మనమునఁ బ్రస్తుతింతు?
రవని యెవ్వని తలమీఁద నావగింజఁ
బోలు? నా వేయుశిరముల భోగిఁ గొల్తు.

6-478-కంద పద్యము

ఈ విధమున వినుతింపఁగ
నా విద్యాధరుల భర్త కనియె ననంతుం
డో! విమలబుద్ధి! నీ దగు
ధీవిభవంబునకు మెచ్చితిం బ్రియమారన్.

6-479-ఆటవెలది

అరయ నారదుండు నంగిరసుండును
దత్త్వ మొసఁగినారు; దాని కతన
నన్నుఁ జూడఁగల్గె నా భక్తి మదిఁ గల్గె
నా పథంబు నీకు నమ్మఁ గలిగె.

6-480-సీస పద్యము

పూని నా రూపంబు భూతజాలంబులు;
భూతభావనుఁడ నేఁ బొందుపడఁగ;
బ్రహ్మంబు మఱియు శబ్దబ్రహ్మమును శాశ్వ;
తంబైన తనువులు దగిలె నాకు;
నఖిలలోకంబులు ననుగతంబై యుండు;
లోకంబు నాయందు జోకఁ జెందు;

నుభయంబు నా యందు నభిగతంబై యుండు;
యభిలీ నమయ్యె న య్యుభయమందు;

6-480.1-తేటగీతి

వెలయ నిద్రించువాఁ డాత్మ విశ్వమెల్ల
జూచి మేల్కాంచి తా నొక్క చోటివానిఁ
గా వివేకించు మాడ్కినీ జీవితేశ
మాయ దిగనాడి పరమధర్మంబుఁదెలియు.

6-481-ఆటవెలది

నిద్రవోవు వేళ నిరతుఁడై దేహిదా
నెట్టి గుణముచేత నింద్రియములఁ
గడచినట్టి సుఖముఁ గను నట్టి బ్రహ్మంబుఁ
గడిమి మెఱయ నన్నుఁగా నెఱుంగు.

6-482-ఆటవెలది

స్వప్న మందు నెట్లు సంచార మొనరించు
మేలుకాంచి దృష్ట మోలి నెఱఁగు
నుభయ మెఱుఁగునట్టి యుత్తమ జ్ఞానంబు
తత్త్వ; మట్టిదైన తలఁపు నేను

6-483-సీస పద్యము

అరయంగ నెవ్వని కలవిగానట్టి యీ;
సలలిత మానుషజాతిఁ బుట్టి

యాత్మతత్త్వజ్ఞాన హేతుఁడైన వానికిఁ;
 గలుగునె యెందు సుఖం బొకింత?
వెలయఁ బ్రవృత్తి నివృత్తి మార్గంబుల;
 సుఖదుఃఖచయముల నొరిదిఁ దెలిసి
పనిచెడి సంకల్పఫలమూలమునఁ బాఱు;
 కడు సుఖదుఃఖ మోక్షములకొఱకు

6-483.1-ఆటవెలది

దంపతిక్రియామతంబు వర్తింతురు
దాన మోక్ష మేల దక్కు యుండు?
నఖిల దుఃఖహేతు వయిన యీ కర్మంబు
నెఱిఁగి నన్నుఁ దలఁప రిచ్చలోన.

6-484-వచనము

మఱియు విజ్ఞానాభిమాను లైన మనుష్యులకు నతిసూక్ష్మం బైన యాత్మగతి నిజస్థానత్రయలక్షణంబునఁ జతుర్థాంశంబు నెఱింగి యైహికాముష్మిక విషయంబులచేతను వివేకబలంబులచేతను నియుక్తుండై జ్ఞానవిజ్ఞాన సంతృప్తుండైన పురుషుండు నాకు భక్తుం డగు; నీ విధంబులు గలవారలు యోగనైపుణ్యబుద్ధిగలవారలునై స్వార్థంబయిన యాత్మచేతం బరమాత్మను దెలియుచుందురు; నీవు నీ క్రమంబున మద్భక్తిశ్రద్ధాపరుండవై విజ్ఞాన సంపన్నంబులైన వాక్కులచేత నన్ను స్తోత్రంబు చేసి ముక్తుండ వైతి" వని యా శేషభగవంతుండు విద్యాధరపతి యైన చిత్రకేతుం బలికి యతని కదృశ్యుం డైపోయె; ఏ దిక్కున సర్వాత్మకుండైన యనంతుం డంతర్ధానంబు నొందె. నా

దిక్కునకు విద్యాధర భర్త నమస్కరించి గగనచరుండై చని లక్షలసంఖ్య లైన దివ్యవర్షంబు లవ్యాహత బలేంద్రియుండై పరమయోగిపురుషులును, దివ్యమునీంద్రులును, సిద్ధ చారణ గంధర్వులును, వినుతి చేయం గులద్రోణాదిశైలంబులను రమ్యప్రదేశంబులను సంకల్పసిద్ధ ప్రదేశంబులను వినోదించుచు, శ్రీనారాయణదత్తంబగు దివ్యవిమానంబునందుఁ జరియించుచునుండె.

6-485-శార్దూల విక్రీడితము

ఆడించున్ హరి దివ్యనాటక గుణవ్యాపార నృత్యంబులం;
బాడించున్ జలజాతనేత్ర బిరుదప్రఖ్యాత గీతంబులం;
గూడించున్ సతతంబు జిహ్వలతుదిన్ గోవిందనామావళుల్
క్రీడం గిన్నర యక్ష కామినులచేఁ గృష్ణార్పితస్వాంతుఁడై.

6-486-సీస పద్యము

వాసించు నాత్మఁ టో వైష్ణవజ్ఞానంబు;
నాశించు భాగవతార్చనంబు;
భూషించు నే ప్రొద్దుఁ బుండరీకాక్షుని;
భాషించు హరికథాప్రౌఢి మెఱసి;
ఘోషించు హరినామగుణనికాయంబులు;
పోషించుఁ బరతత్త్వ బోధ మరసి;
సేవించు శ్రీకృష్ణ సేవక నికరంబు;
సుఖమునఁ జేయు నీశునకు బలులు;

6-486.1-తేటగీతి

పాడుఁ బాడించు వైకుంఠభర్త నటన
రూప వర్తన గుణ నామ దీపి తోరు
గీతజాత ప్రబంధ సంగీత విధుల
గేశవప్రీతిగాఁ జిత్రకేతుఁ డపుడు.

6-487-మత్తేభ విక్రీడితము

హరిఁ గీర్తించుచు నల్లనల్ల మదిలో నబ్జాక్షు సేవించుచుం
బరమానందము నొందుచున్ జగములం బ్రఖ్యాతి వర్తించుచున్
సురరాజోపమమూర్తి యక్షగణముల్ సొంపార విద్యాధరా
ప్సరసల్ గొల్వఁగఁ బాడఁగా సితగిరిప్రాంతంబునన్నేగుచున్.

6-488-శార్దూల విక్రీడితము

ఆ విద్యాధరభర్త గాంచె హరనీహా రామృతాహాసమున్
శ్రీవిభ్రాజితమున్ నిరస్త గిరిజా సేవాగతాయాసమున్
దేవానీక వికాసమున్ శుభమహాదేవాంఘ్రి సంవాసమున్
భూవిఖ్యాత విలాసముం ద్రిభువనీ పూతంబుఁ గైలాసమున్.

6-489-కంద పద్యము

ఆ రజత భూధరంబున
నీరేజభవామరాది నికరము గొల్వం
బేరోలగమున నుండిన
గౌరీయుతుఁ డయిన హరునిఁ గనియె నరేంద్రా!

6-490-సీస పద్యము

తన దగు రూప మింతయు నేని దెలియక;
 వాదంబు చేసెడు వేదరవముఁ
గరుణావలోకనాకాంక్షితులై యున్న;
 బ్రహ్మాది సనకసంప్రణుతిరవము
సారశివానందసల్లాపముల నొప్పు;
 ప్రమథగణాళి యార్భటరవంబు
డమరుమృదంగాది ఢమఢమధ్వనితోడి;
 పటుభృంగి నాట్య విస్ఫారరవము

6-490.1-తేటగీతి

మానుగాఁ జామరులు వీచు మాతృకాది
కామినీజన మహిత కంకణరవంబు
మెండుఁ జెలఁగంగఁ గన్నుల పండు వయ్యెఁ
గొండరాచూలి పెనిమిటి నిండుకొలువు.

6-491-వచనము

ఇట్లు బ్రహ్మాది సురనికర సేవితుండై యూరుపీఠంబుననున్న భవానిం గౌగిటం జేర్చుకొని యొడ్డోలగంబున నున్న పరమేశ్వరుం జూచి చిత్రకేతుండు పకపక నగి యద్దేవి వినుచుండ నిట్లనియె.

6-492-సీస పద్యము

కొమరొప్పఁగా లోకగురుఁడును గడలేని;
 ధర్మస్వరూపంబుఁ దాన యగుచు
జడలు ధరించియు సరిలేని తపమునఁ;

బోడపైన యీ యోగిపుంగవులును
బ్రహ్మవాదులుఁ గొల్వ భాసిల్లు కొల్వులో;
మిథునరూపంబున మెలఁతతోడఁ
బ్రాకృతుండునుబోలె బద్ధానురాగుఁడై;
లాలితుం డయ్యె నిర్లజ్జత నిట;

6-492.1-ఆటవెలది

నకట! ప్రకృతిపురుషుఁ డైనఁ దా నేకాంత
మందు సతులతోడ నలరుఁగాని
యిట్లు ధర్మసభల నింతులతోఁగూడి
పరిఢవింపలేఁడు భ్రాంతి నొంది.

6-493-కంద పద్యము

అన విని సర్వేశ్వరుఁ డా
తని నేమియు ననక నవ్వెఁ దత్సభవారుం
గనుగొని యూరక యుండిరి
మనుజేశ్వర! యీశుధైర్య మది యెట్టిదియో?

6-494-వచనము

ఇట్లు దన పూర్వకర్మశేషంబున నింద్రియ జయుండ నని పుట్టిన యహంకారంబున, జగద్గురువుం బెక్కు ప్రల్లదంబు లాడుచున్న చిత్రకేతుం జూచి భవాని యిట్లనియె.

6-495-కంద పద్యము

మముబోఁటి లజ్జ లుడిగిన
కుమతులకుం గర్త యగుచుఁ గోపింపంగా
నమితాజ్ఞానిపుణుం డగు
శమనుండా నేఁడు వీఁడు జగముల కెల్లన్?

6-496-కంద పద్యము

భృగు నారద కపిలాదులు
నిగమాంతజ్ఞులును యోగనిర్ణయ నిపుణుల్
త్రిగుణాతీతు మహేశ్వరు
నగ రెన్నఁడు వారు ధర్మనయ మెఱుఁగరొకో?

6-497-సీస పద్యము

ఎవ్వని పదపద్మ మింద్రాది విబుధుల;
 చూడాగ్రపంక్తుల నీడఁ జూచు,
నెవ్వని తత్త్వంబ దెనయంగ బ్రహ్మాది;
 యోగిమానసపంక్తి నోలలాడు,
నెవ్వని రూపంబు నేర్పాటు గానక;
 వేదంబు లందంద వాద మడఁచు,
నెవ్వని కారుణ్య మీ లోకముల నెల్లఁ;
 దనిపి యొంతయు ధన్యతములఁ జేయు,

6-497.1-తేటగీతి

నట్టి సర్వేశుఁ బాపసంహారు ధీరు
శాశ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశు

నెగ్గు పల్కిన పాపాత్ముఁ డెల్ల భంగి
దండనార్హుండు గాకెట్లు దలఁగఁ గలడు?

6-498-తేటగీతి

నిఖిలలోకాశ్రయంబు సన్నిహితసుఖము
సకలభద్రైక మూలంబు సాధుసేవ్య
మైన కంజాక్షుపాదపద్మార్చనంబు
ననుసరింపంగ ఖలుఁడు వీఁ డర్హుఁ డగునె?

6-499-వచనము

కావున, నోరి! దురాత్మక! యీ పాపంబునం బాపస్వరూపంబైన రాక్షసయోనిం బుట్టు" మని శపియించి "యింతనుండి మహాత్ములకు నవజ్ఞ చేయకుండు" మని పలికినఁ జిత్రకేతుండు విమానంబు డిగ్గి వచ్చి, యద్దేవికి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు దోయిలించి యిట్లనియె "ఓ జగన్మాతా! భవచ్ఛాప వాక్యంబు లట్ల కైకొంటి ప్రాచీన కర్మంబులం బ్రాప్తం బైన సంసార చక్రంబు చేత నజ్ఞాన మోహితులై తిరుగుచున్న జంతువులకు సుఖదుఃఖంబులు నైజంబులై ప్రవర్తిల్లుచుండు; నిందులకుఁ బరతంత్రులైనట్టి వా రాత్మ సుఖదుఃఖంబులకు నెవ్వరు కర్తలు; ఈ గుణంబుల నిమిత్తమై శాపానుగ్రహంబులును స్వర్గ నరకంబులును, సుఖదుఃఖంబులును సమంబులు; భగవంతుం డొక్కండ తన మాయ చేత జగంబులు సృజియించుచు వారి వారికి బద్ధానురాగంబులు గలుగం జేయుచుఁ దాను వానికి లోను గాక నిష్కళుండై యుండు; నీ విధంబునం బుట్టుచున్న నరునకుం బత్ని బంధు శత్రు మిత్రోదాసీనత్వంబు లెక్కడివి? వారివారి కర్మ వశంబునం బరమేశ్వరుండు కల్పించుచు సర్వసముండై యుండు;

నప్పరమేశ్వరునకు సుఖదుఃఖంబుల చేత రాగంబు లేదు రాగానుబంధంబైన రోషంబును లే; దతని మాయా గుణవిసర్గంబు జంతువులకు సుఖదుఃఖంబులను, బంధమోక్షంబులను గల్పించుచుండును; కావున, నీకు నమస్కరించుచున్న నన్ను ననుగ్రహింపుము; శాపభయశంకితుండంగాను; జగన్మాతవైన నిన్నుఁ బలికిన దోషంబునకు శంకించుచున్నవాఁడ" నని దండప్రణామంబు లాచరించి పార్వతీ పరమేశ్వరులం బ్రసన్నులం జేసి తన విమానం బెక్కి చనియె; నప్పుడు పరమేశ్వరుండు బ్రహ్మాది దేవర్షి దైత్య దానవ ప్రమథ గణంబులు వినుచుండఁ బార్వతికి నిట్లనియె "నీకు నిప్పుడు దృష్టం బయ్యెఁ గదా నారాయణదాసానుచరుల నిస్పృహాభావంబు; హరి తుల్యార్థదర్శనులై నిస్పృహులైన భాగవతులకు స్వర్గాపవర్గ నరక భేదభావంబులు లేవు; ప్రాణులకు దేహసంయోగంబు వలన నారాయణలీలం జేసి యుండి ద్వంద్వాది సుఖదుఃఖంబు లాత్మ యందు నజ్ఞానంబున భేదంబు చేయం బడియె; నట్టి విపర్యయంబులు భగవంతుండైన వాసుదేవునిభక్తి గలవారిం జెందవు; మఱియును.

6-500-ఉత్పలమాల

నేనుఁ, గుమారనారదులు, నీరజగర్భుఁడు, దేవసంఘమున్,
మానిత యోగివర్య ముని మండల, మిట్లగు వార మందఱున్
దానవవిద్విడంశ జనితంబులమయ్యుఁ దదీయ తత్త్వముం
గానఁగ నేర; మీశు ఘనగర్వమునం దలపోసి చూచుచున్.

6-501-కంద పద్యము

ఆతనికిం బ్రియుఁ డప్రియుఁ
డే తెఱఁగున లేడు నిఖిల మెల్లను దానై
భూతముల కాత్మ యగుటయు
భూతప్రియుఁ డొక్కఁ డాదిపురుషుఁడు తన్వీ!

6-502-ఆటవెలది

అరయఁ జిత్రకేతుఁ డతిశాంతుఁ డతిలోక
సముఁడు విష్ణుభక్తి సంగతుండు
నితని నేమిచెప్ప? నీశుండ నగు నేను
నువిద! యచ్యుతప్రియుండఁ జుమ్మి.

6-503-కంద పద్యము

కావున భగవద్భక్తుల
భావమునకు విస్మయంబు పనిలేదు మహా
ధీ విభవశాంత చిత్తులు
పావన పరతత్త్వనిపుణ భవ్యులు వారల్.

6-504-వచనము

అనిన విని యద్రితనయ విస్మయంబు మాని శాంతచిత్త యయ్యె; నట్లు పరమభాగవతుండయిన చిత్రకేతుం డద్దేవికిం బ్రతిశాపం బియ్య సమర్థుం డయ్యును, మరల శపింపక యతి శాంతరూపంబున శాపంబు శిరంబున ధరియించె; నిట్టి సాధులక్షణంబులు నారాయణ పరాయణులైన వారలకుం గాక యొరులకుం గలుగ నేర్చునే? యట్లు శాపహతుండైన చిత్రకేతుండు త్వష్ట చేయు

యజ్ఞంబున దక్షిణాగ్ని యందు దానవ యోనిం బుట్టి వృత్రాసురుం డన విఖ్యాతుం డయి భగవద్ధ్యాన పరిణతుం డయ్యెం; గావున.

6-505-సీస పద్యము

నరనాథ! యీ వృత్రునకు రాక్షసాకృతి;
గలిగిన యీ పూర్వకారణంబు
చిరపుణ్యుఁ డయినట్టి చిత్రకేతు మహాను;
భావంబు భక్తితోఁ బరఁగ విన్న
చదివినవారికి సకల దుష్కర్మముల్;
శిథిలంబులై కడుఁ జెదరిపోవు
సకలవైభవములు సమకూరుఁ దనయంతఁ;
దొల్కాడు కోర్కులతోడఁ గూడి

6-505.1-ఆటవెలది

నిర్మలాత్ము లగుచు నిత్యసత్యజ్ఞాన
నిరతు లగుచు విగత దురితు లగుచు
బంధు మిత్ర పుత్ర పౌత్రాదులను గూడి
యనుభవించుచుందు రధిక సుఖము.

## 6-15- సవితృవంశ ప్రవచనాది కథ

6-506-సీస పద్యము

వినవయ్య! నరనాథ! విశదంబుగాఁ ద్వష్టృ;
వంశంబు చెప్పితి; వాని వెనుక

సవిత్రుండు పృశ్నియు సావిత్రి వ్యాహృతి;
 యను భార్యలందు నింపారు వేడ్క
నగ్ని హోత్రంబుల నరయంగఁ బశుసోమ;
 పంచయజ్ఞంబులఁ బరఁగఁ గనియె;
భగుఁడు సిద్ధిక యను భార్యకు మహిమాను;
 భవుల విభవులఁ దాఁ బడసె మువురఁ;

6-506.1-ఆటవెలది

దనయ నొకతెఁ గాంచెఁ ద దనంతరమున నా
తరళనేత్ర సద్వ్రతస్వధామ
పుణ్యశీల సుగుణ పూరిత చారిత్ర
యఖిలలోకపూజ్య యాశిషాఖ్య.

6-507-వచనము

మఱియు, ధాతకుఁ గల కుహూ సినీవాలీ రాకానుమతు లనియెడు నలువురు భార్యలలోఁ గుహూదేవి సాయమను సుతునిం గాంచె; సినీవాలి దర్శాఖ్యునిం బడసె; రాక ప్రాతరాఖ్యునిఁ గాంచె; ననుమతి పూర్ణిమాఖ్యునిఁ బడసె; విధాత క్రియ యను భార్యయందు నగ్నిపురీష్యాదులం గనియె; వరుణునకుఁ జర్షిణి యను భార్యయందుఁ బూర్వకాలంబున బ్రహ్మపుత్రుం డయిన భృగువును వల్మీకంబునం జనియించిన వాల్మీకియు నుదయించిరి; మిత్రావరుణులకు నూర్వశి యందు రేతోద్గమంబైన, దానిఁ గుంభంబునం బ్రవేశింప జేయ నందు నగస్త్యుండును, వసిష్ఠుండును జనియించిరి; ప్రత్యేకంబ మిత్రునకు రేవతియందు నుత్సర్గ సంభవులైన యరిష్టయుఁ, బిప్పలుండును నను వారలు జనియించిరి;

శక్రునకుఁ బౌలోమి యందు జయంత ఋషభ విదుషులన ముగ్గురు పుట్టిరి; వామనుం డయిన యురుక్రమ దేవునకుఁ గీర్తి యను భార్యయందు బృహశ్లోకుండు పుట్టె; నా బృహశ్లోకునకు సౌభగాదులు పుట్టిరి; మఱియు, మహానుభావుం డయిన కశ్యపప్రజాపతికి నదితి యందు శ్రీమన్నారాయణుం డవతరించిన ప్రకారంబు వెనుక వివరించెద; దితిసుతులైన దైతేయుల వంశంబు చెప్పెదను; ఏ దైతేయ వంశంబు నందు బ్రహ్లాద బలులు పరమ భాగవతులై దైత్యదానవవందితులై వెలసిరి; దితి కొడుకులు హిరణ్యకశిపు హిరణ్యాక్షులనఁ బ్రసిద్ధి నొంది; రందు హిరణ్యకశిపునకుఁ జంభాసుర తనయ యైన దత్తకుఁ బ్రహ్లాదానుహ్లాద సంహ్లాద హ్లాదులను నలుగురు గొడుకులును సింహిక యను కన్యకయు జన్మించి; రా సింహికకు రాహువు జనియించె; నా రాహువు శిరం బమృతపానంబు చేయ, హరి దన చక్రంబునం ద్రుంచె; సంహ్లాదునకు గతి యను భార్య యందుఁ బంచజనుండు పుట్టె; హ్లాదునకు దమని యను భార్య యందు వాతాపీల్వలులు పుట్టిరి; వారల నగస్త్యుండు భక్షించె; ననుహ్లాదునకు సూర్మి యను భార్యయందు బాష్కల మహిషులు గలిగిరి; ప్రహ్లాదునకు దేవి యను భార్యయందు విరోచనుండు పుట్టె; నతనికి బలి జన్మించె; నా బలికి నశన యను భార్య యందు బాణుండు జ్యేష్ఠుండుగా నూర్వురు గొడుకులు పుట్టి; రా బలి ప్రభావంబు వెనుక వివరించెద; బాణాసురుండు పరమేశ్వరు నారాధించి ప్రమథగణంబులకు ముఖ్యుం డయ్యెను; మఱియు, నా దితి సంతానంబులగు మరుత్తు లేకోనపంచదశకంబులు గలవార లందఱున నపత్యులై యింద్రుతోఁ గూడి దేవత్వంబు నొంది" రనిన విని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె.

## 6-16- మరుద్గణంబుల జన్మంబు

6-508-ఆటవెలది

ఏమి కారణమున నింద్రునికిని మరు
చ్ఛయము లాప్తు లగుచు శాంతి నొంది?
ధరయఁ దత్సమాను లగుచు వర్తించిరి?
దీని వినఁగవలయుఁ దెలుపవయ్య!

6-509-వచనము

అనిన శుకుం డిట్లనియె.

6-510-సీస పద్యము

నరనాథ! విను తన నందను లందఱు;
నమరేంద్రుచే హతు లగుచు నుండఁ
గోపశోకంబులఁ గ్రుళ్ళుచుఁ దనలోన;
మండుచు దితి చాల మఱుఁగఁ దొడఁగె;
భ్రాతృ హంతకుఁ డతి పాతకుం డీ యింద్రుఁ;
జంపక నా కేల సొంపు గలుగు?
వీని భస్మము చేయువానిఁగా నొక సుతుఁ;
బడసెద నని చాల భర్తఁ గోరి

6-510.1-ఆటవెలది

ప్రియము చేయఁదొడఁగెఁ బెక్కు భావంబుల
భాషణముల నధికపోషణముల

భక్తియుక్తిచేతఁ బరిచర్యగతిచేత
నుతులచేత నతుల రతులచేత.

6-511-చంపకమాల

కలికి కటాక్షవీక్షణ వికారములన్ హృదయానురాగ సం
కలిత విశేషవాఙ్మధుర గర్జనలన్ లలితాననేందు మం
డల పరిశోభితామృత విడంబిత సుస్మిత సుప్రసన్న తా
ఫల రుచిరప్రదానముల భామిని భర్తమనంబు లోఁగొనెన్.

6-512-తేటగీతి

అఖిల మెఱిఁగిన కశ్యపు నంతవాని
హితవు తలకెక్క రతుల సంగతులచేత
నవశుఁ గావించె ప్రేల్మిడి నబ్జవదన
పతుల భ్రమియింప నేరని సతులు గలరె?

6-513-కంద పద్యము

ఏ తలఁ పెఱుఁగక నిలిచెడు
భూతంబులఁ జూచి ధాత పురుషుల మనముల్
భీతి గొలుపంగ యువతి
వ్రాతంబు సృజించెఁ; బతులు వారల కరుదే?

6-514-వచనము

ఇట్లు నిజసతిచేత నుపలాలితుండై కశ్యపప్రజాపతి యా సతికిం బరమప్రీతుం డై యిట్లనియె "నో తన్వీ! నీకుఁ బ్రసన్నుండ నైతి; వరంబు గోరు మిచ్చెద; నాథుండు

ప్రసన్నుండైన స్త్రీలకుం గోరిక సంభవించుట కేమి గొఱంత? సతికిం బతియె దైవంబు సర్వభూతంబుల మానసంబులకు వాసుదేవుండె భర్త; నామరూప కల్పితులైన సకల దేవతామూర్తులచేతను ఋషులచేతను భర్తృరూపధరుం డయిన భగవంతుండు సేవింపబడుచుండు; స్త్రీలచేతఁ బతిరూపంబున భజియింపంబడుఁ; గావునం బతివ్రత లైన సుందరులు శ్రేయస్కామలై యేక చిత్తంబున నాత్మేశ్వరుం డయిన యప్పరమేశ్వరుని భర్తృభావంబున సేవించుచుండుదురు; నేనును నీదు భావంబున వరదుండ నైతి; దుశ్శీల లయిన వనితలకుం బొందరాని వరంబు నీ కిచ్చెద; వేఁడు" మనిన నా కశ్యపునకు దితి యిట్లనియె.

6-515-ఆటవెలది

వరము గోర నాకు వరదుండ వేనిని
నింద్రుఁ ద్రుంచునట్టి యుద్ధబలుని
నమిత తేజుఁ దనయు నమరత్వసంప్రాప్తు
నెందుఁ జెడనివాని నిమ్ము నాథ!

6-516-వచనము

అనవుడు

6-517-కంద పద్యము

ఉట్టిపడునట్టి వర మీ
కట్టఁడి నన్నెట్టు వేఁడెఁ? గటకట! యనుచున్
మిట్టిపడి యతఁడు మదిలోఁ
బుట్టిన తల్లడముతోడఁ బొక్కుచు నుండెన్.

6-518-చంపకమాల

ప్రకృతిని గర్మపాశముల బద్ధుఁడ నైతిఁ గదయ్య! నేఁడు నే
వికటసతీ స్వరూపమున వేఁదుఱు గొల్పిన మాయ నింద్రియా
ధికమతి యైనవాఁడు దన తెంపునఁ జిత్తము పెచ్చుపెట్టి పా
తకములఁ గూలకున్నె? నను దైవము నవ్వదె లోలితాత్మునిన్?

6-519-సీస పద్యము

ఖండ శర్కరతోడఁ గలహించు పలుకులుఁ;
 బద్మవిలాస మేర్పఱచు మోముఁ,
దుహినాంశు కళలతోఁ దులఁదూఁగు చెయ్వులుఁ;
 జెమటఁ గ్రొన్నెత్తురు చేయు మేను,
నిలువెల్లఁ గరఁగించు నేర్పుల యింపులుఁ;
 బువ్వుల కరుదైన ప్రోది చేఁత,
తమకంబు రెట్టించు తరితీపు తలఁపులు;
 నెనసిన మదిలోని యిచ్చగింత,

6-519.1-ఆటవెలది

గలిగి కఱవనున్న కాలాహిపోలికిఁ
జెలఁగుచున్న సతుల చిత్తవృత్తిఁ
దెలియవశమె? యెంత ధృతి గలవారికి
నాక కాదు నిఖిలలోకములకు.

6-520-ఆటవెలది

కోరి సతుల కెల్లఁ గూర్చువా రెవ్వరు?
పతులనైన సుతుల హితులనైన
బలిమిఁ జెలిమి నైనఁ బరహస్తమునవైన
హింసబఱతు రాత్మ హితము కొఱకు.

6-521-వచనము

అని చింతించి; "దీనికి నేమని ప్రతివాక్యం బిచ్చువాఁడ? మద్వచనం బెందు నమోఘంబు; త్రిలోకపరిపాలనశీలుం డయిన భిదురపాణి వధార్హుండె? యేను దీనికి నైనది యొకటి గల్పించెద" నని దితిం జూచి, యో! తనుమధ్య! నీకు నట్ల దేవబాంధవుండయిన యింద్రహంత యగు పుత్త్రుండు గలిగెడు; నొక్క సంవత్సరంబు వ్రతంబునం జరియింపుము; దాని ప్రకారంబెల్ల నేను జెప్పెద, విను; మెల్ల జీవులవలన హింసాభావంబు లేక, యతిధ్వనివాక్యంబు లుడిగి, కోపంబు మాని, యనృతంబులు పలుకక, నఖరోమచ్ఛేదనంబు చేయక, యస్థికపాలాదు లయిన యమంగళంబుల నంటక, నదీతటాకాదులన కాని ఘటోదక కూపోదకంబుల స్నానంబు చేయక, దుర్జన సంభాషణంబు వర్జించి, కట్టిన కోకను ముడిచిన పువ్వులను గ్రమ్మఱ ధరియింపక, భోజనంబుల యందు నుచ్ఛిష్టాన్నంబును జండికా నివేదితాన్నంబును కేశ శునక మార్జార కంక క్రిమి పిపీలికాది విదూషితాన్నంబును నామిషాన్నంబును వృషలాహితాన్నంబును నను నీ పంచవిధ నిషిద్ధాన్నంబును వర్జించి, దోయిట నీళ్ళు ద్రావక, సంధ్యాకాలంబుల ముక్తకేశిగాక, మితభాషిణియై, యలంకారవిహీనగాక, వెలుపలం దిరుగక, పాదప్రక్షాళనంబు చేసికొని కాని శయనింపక, యార్ద్రపాదయై పవ్వళింపక, పశ్చిమ శిరస్కయయ్యును నగ్నయయ్యును సంధ్యాకాలంబులను నిద్రింపక, నిత్యంబును ధౌతవస్త్రంబులుగట్టి, శుచియై, సర్వమంగళ సంయుక్తయై,

ప్రాతఃకాలంబున లక్ష్మీనారాయణుల నారాధించి, యావాహనార్ఘ్యపాద్యోపస్పర్శన సుస్నాన వాసోపవీత భూషణ పుష్ప ధూప దీపోపహారాద్యుపచారంబుల నర్చించి, హవిశ్శేషంబు ద్వాదశాహుతుల వేల్చి దండప్రణామంబు లాచరించి, భగవన్మంత్రంబును దశవారంబు లనుసంధించి స్తోత్రంబు చేసి, గంధ పుష్పాక్షతంబుల ముత్తైదువలం బూజించి, పతిని సేవించి, పుత్రుం గుక్షిగతుంగా భావించి యివ్విధంబున మార్గశీర్ష శుద్ధ ప్రతిపదారంభంబుగా నొక్క సంవత్సరంబు సలిపి, యా ద్వాదశ మాసాంత్యదివసంబున విధ్యుక్తంబుగా నుద్యాపనంబు చేయవలయును; నీ వీ పుంసవనం బనియెడి వ్రతంబు ద్వాదశమాస పర్యంతం బేమఱక సల్పిన, నీవు గోరిన కుమారుండు గలిగెడు" ననిన దితి యా వ్రతంబుతోడనె గర్భంబు ధరియించి వ్రతంబు సలుపుచునుండ నింద్రుండు మాత్రభిప్రాయం బెఱింగి, యా యమ్మ నహరహంబును రహస్యంబున సేవించుచు; వ్రతంబునకుం దగిన పుష్ప ఫల సమిత్కుశ పత్రాంకురంబులు మొదలయిన వస్తు వితతిం ద్రికాలంబులం దెచ్చి యిచ్చుచుఁ, బుండరీకంబు హరిణికిం బొంచి యున్న భంగి నా యమ్మ వ్రత భంగంబునకై కాచి శుశ్రూష చేయుచునా యమ్మ ధరియించిన తేజో విశేషంబునకు బెగ్గలించుచుఁ గృశించుచు నుండె; అంత నొక్కనాడు.

6-522-సీస పద్యము

వామాక్షి యనుదిన వ్రతధార ణోన్నత;
 పరిచర్య విధులచే బడలి యలసి
యొంటి సంధ్యావేళ నుచ్ఛిష్ట యై పద;
 ప్రక్షాళ నాదులఁ బాసి మఱచి
తనకర్మ మోహంబు దవిలి నిద్రింపంగ;

నింద్రుండు సయ్యన నెడరు గాంచి
యోగమాయా బలోద్యుక్తుఁడై యా యింతి;
యుదరంబుఁ జొరఁబడి యుగ్రుఁ డగుచుఁ

6-522.1-తేటగీతి

దివిరి దేదీప్యమానమై తేజరిల్లు
నర్భకుని వజ్రధారల నడిచె నేడు
దునుకలుగ వాఁడు దునిసియుఁ దునుక దునుక
చెడక యొక్కొక్క బాలుఁడై చెలఁగుచున్న.

6-523-కంద పద్యము

వా డేర్వ రగుచుఁ గుయ్యిడ
నోరి యఱవ కనుచుఁ ద్రుంచె నొక్కొక్కని నా
శూరుం డేడ్గురఁ దునుకలు
గా రయమున వారు చెడక ఖండితు లయ్యున్.

6-524-కంద పద్యము

ఖండము లన్నియు నందఱుఁ
జండాంశు సమప్రకాశ శాశ్వతు లగుచున్
మెండుకొని నిల్చి యని రా
ఖండలునకుఁ గరుణ పుట్టుగతి మతి దోపఁన్.

6-525-వచనము

అందఱు ముకుళిత కరకమలులై "నీకుం దోడుబుట్టువులము; మమ్ము హింసింపంబనిలేదు; నీకుం బారిషదులమై మరుద్గణములమై నిన్ను సేవించెదము; మమ్ము రక్షింపు" మనిన నారాయణ ప్రసాదంబునం జెడని మరుద్గణంబుల పలుకులం గృపాళుండై, యింద్రుండు వారల సహోదరులంగాఁ గైకొని మఱి హింసింపక మానె; అశ్వత్థామశరాగ్నివలన నారాయణ రక్షితుండ వయిన నీవునుం బోలెఁ గులిశధారల శకలంబు లయిన కుమారుం డన్నిరూపంబులై సంవత్సరంబునకు నొక్కింత కడమగా హరి బూజించినవారు గావున, నింద్రుతోడం గూఁడ బంచాశద్దేవత లయిన మరుద్గణంబులు దితి గర్భంబు వెలువడి; రంత దితి మేల్కాంచి యనలప్రకాశులై యింద్రు తోడం గూడి వెలుంగుచున్న కుమారులం జూచి, సంతోషింపక యింద్రుంజూచి నీకు "మృత్యురూపంబయిన పుత్రుం గోరి దుస్తరంబయిన వ్రతంబు సలిపితి; సంకల్పించిన పుత్రుం డొక్కరుం డీ సప్త సంఖ్య గల కుమారు లగుట కేమి కతంబు? నీ వెఱింగిన భంగిన తథ్యంబు పలుకు" మనిన నింద్రుం డిట్లనియె "తల్లీ భవద్వ్రతంబుఁ జింతించి సమయ విచ్ఛేదనంబున గర్భంబుఁ జొచ్చి పాప చిత్తుండనై వజ్రధారల గర్భంబు విదళనంబు చేసిన నా శకలంబులు చెడక మహాశ్చర్యంబుగా నివ్విధంబునం గుమారు లైరి; మహాపురుష పూజాసంసిద్ధి కార్యానుషంగి కాకుండునే? భగవదారాధనంబు గోరికలఁ బాపి యెవ్వరు గావింతురు; వారిహాపరంబుల సర్వార్థకుశలు లగుదు; రమ్మహాపురుష వ్రతసముత్పన్న తేజంబు నడంప నెవ్వం డోపుఁ? గావున దుర్మదంబున బాలిశ స్వభావుండనై దోషంబు చేసిన నా దౌర్జన్య కర్మంబు సహింపఁ దల్లికన్న నెవ్వరు సమర్థులు? పాపాత్ముండ నగు నన్నుం గావుము; నేను వీరలతోడివాఁడ నని నిష్కపటంబుగాఁ బ్రార్థించిన నద్దేవి "యట్టకాక" యని శాంతచిత్త యయ్యె;

నింద్రుండును వారలం గూడి త్రిదివంబునకుం బోయి సోమపాన హవిర్భాగంబులు వారలకుం బంచిపెట్టి సుఖంబుండె" నని చెప్పి పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వెండియు నిట్లనియె.

6-526-కంద పద్యము

హరి వరదుఁ డయిన వ్రతమట;
హరి యంశజు లగుచు నెగడు నమరుల జన్మ
స్ఫురణం బఁట; పఠియించిన
నరయఁగ నురుదీర్ఘపాప హరమగు టరుదే.

6-527-వచనము

అని విష్ణుకథాశ్రవణ కుతూహలాయమానమానసులైన శౌనకాది మహామునులకు సూతుండు చెప్పె నని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పె ననుటయు.

## 6-17- పూర్ణి

6-528-కంద పద్యము

రాజీవరాజపూజ్య
శ్రీజిత గోపీకటాక్ష సేవాంతర వి
భ్రాజితమూర్తి! మదోద్ధత
రాజకులోత్సాద రామరాజాఖ్యనిధీ!

6-529-తరళము

మురవిదారణ ముఖ్యకారణ! మూలతత్త్వవిచారణా!
దురితతారణ దుఃఖవారణ! దుర్మదాసురమారణా!
గిరివిహారణ! కీర్తిపూరణ! కీర్తనీయమహారణా!
ధరణిధారణ! ధర్మతారణ తాపసస్తుతిపారణా!

6-530-తోటకము

కరుణాకర! శ్రీకర! కంబుకరా!
శరణాగతసంగతజాడ్యహరా!
పరిరక్షితశిక్షితభక్తమురా!
కరిరాజశుభప్రద! కాంతిధరా!

6-531-గద్యము

ఇది సకల సుకవి జనమిత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర కసువయామాత్య పుత్ర బుధజనప్రసంగానుషంగ సింగయ నామధేయ ప్రణీతంబైన శ్రీ మహాభాగవత పురాణంబునందు నజామిళోపాఖ్యానంబును, బ్రచేతసులం జంద్రు డామంత్రణంబు చేయుటయు, దక్షోత్పత్తియు, ప్రజాసర్గంబును, దక్షుండు శ్రీహరింగూర్చి తపంబు చేయుటయు, నతనికి నప్పరమేశ్వరుండు ప్రత్యక్షం బగుటయు, హర్యశ్వ శబళాశ్వుల జన్మంబును, వారలకు నారదుండు బోధించుటయు, నారదు వచన ప్రకారంబునవారు మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబు నారదు వలన విని దక్షుండు దుఃఖాక్రాంతుం డగుటయుఁ, దదనంతరంబ బ్రహ్మవరంబున దక్షుండు శబళాశ్వసంజ్ఞల సహస్ర సంఖ్యాకు లగు పుత్రులం గాంచుటయును, సృష్టినిర్మాణేచ్ఛా నిమిత్తంబున దక్షు పంపున వార లగ్రజన్ములు సిద్ధింబొందిన

తీర్థరాజంబైన నారాయణ సరస్సునకుం జనుటయు, వారికి నారదభగవంతుండు బ్రహ్మజ్ఞానంబు నుపదేశించుటయు, వారు పూర్వజు లేగిన ప్రకారంబున మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబును దక్షుండు దివ్యజ్ఞానంబున నెఱింగి నారదోపదిష్టం బని తెలిసి నారదుని శపించుటయు, నారదుండు దక్షుశాపంబు ప్రతిగ్రహించుటయు, దక్షునకు బ్రహ్మవరంబున సృష్టివిస్తారంబు కొఱకుఁ గూతులఱువండ్రు జనియించుటయు, నందు గశ్యపునకు నిచ్చిన పదమువ్వురు వలన సకల లోకంబులు నిండుటయు, దేవాసుర నర తిర్యఙ్మృగ ఖగాదుల జన్మంబులును, దేవేంద్ర తిరస్కారంబున బృహస్పతి యధ్యాత్మమాయచేతం గాన రాకుండుటయుఁ, దద్వృత్తాంతంబు రాక్షసులు విని శుక్రోపదిష్టులై దేవతలపై నెత్తివచ్చుటయు, దేవాసుర యుద్ధంబును, నాచార్యతిరస్కారంబున దివిజరాజపలాయనంబును, బలాయమానులైన దేవతలు బ్రహ్మసన్నిధికిం జనుటయును, బ్రహ్మవాక్యంబునఁ ద్వష్ట కుమారుండయిన విశ్వరూపు నాచార్యునింగా దేవతలు వరించుటయును, విశ్వరూపు ప్రసాదంబున నింద్రుండు నారాయణ వర్మం బను మంత్రకవచంబు ధరియించి రాక్షసుల జయించుటయుఁ, బరోక్షంబున రాక్షసులకు ననుకూలుం డయిన విశ్వరూపు నింద్రుండు వధియించుటయు, విశ్వరూపు వధానంతరంబున నింద్రునకు బ్రహ్మ హత్య సంప్రాప్తం బయిన నింద్రుండు స్త్రీ భూ జల ద్రుమంబుల యందుఁ బంచిపెట్టుటయు, విశ్వరూపుండు హతుండగుటకుఁ ద్వష్ట గోపించి యింద్రవదార్థంబు మారణహోమంబు చేయ వృత్రాసురుండు జనించుటయు, వృత్రాసుర యుద్ధంబునఁ బరాజితులై యింద్ర సహితు లయిన దేవతలు

శ్వేతద్వీపంబునకుం జనుటయు, నందు శ్రీహరి ప్రసన్నుండయి దధీచి వలన భిదురంబు గైకొన; నుపదేశించుటయు, నింద్రుండు వజ్రాయుధంబున వృత్రుని సంహరించుటయు, నింద్రుండు బ్రహ్మహత్యా పీడితుండయి మానససరస్సు ప్రవేశించుటయును, నహుషుండు శతాశ్వమేధంబులం జేసి యింద్రాధిపత్యంబు బడయుటయు, నహుషుండు డగస్త్యశాపంబున సురరాజ్యచ్యుతుండై యజగర యోనిం బుట్టుటయు, యింద్రాగమనంబును, యశ్వమేధంబును, యింద్రుండు మరలఁ ద్రిలోకాధిపత్యంబు బడయుటయును, జిత్రకేతూపాఖ్యానంబును, మరుద్గణంబుల జన్మప్రకారంబును నను కథలు గల షష్ఠస్కంధము సమాప్తము.

# పోతన తెలుగు భాగవతము

## సప్తమ స్కంధము

### 7-1-ఉపోద్ఘాతము

7-1-కంద పద్యము

శ్రీ మద్విఖ్యాతిలతా
క్రామితరోదోంతరాళ! కమనీయమహా
జీమూతతులితదేహా
శ్యామలరుచిజాల! రామచంద్రనృపాలా!

7-2-వచనము

మహనీయగుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీసమేతుం డయిన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుం డయిన పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రు నవలోకించి.

### 7-2-నారాయణునివైషమ్యాభావం

7-3-సీస పద్యము

సర్వభూతములకు సముఁడు నెచ్చలి ప్రియుం;
 డైన వైకుంఠుఁ డనంతుఁ డాద్యుఁ
డింద్రునికొఱకు దైత్యేంద్రుల నేటికి;
 విషముని కైవడి వెదకి చంపె?
నసురులఁ జంపంగ నమరులచేఁ దన, ;

 కయ్యెడి లాభ మింతైనఁ గలదె?
నిర్వాణనాథుండు నిర్గుణుం డగు తన, ;
 కసురుల వలని భయంబుఁ బగయుఁ

7-3.1-ఆటవెలది

గలుగనేర వట్టి ఘనుఁడు దైత్యులఁ జంపి
సురులఁ గాచు చునికి చోద్య మనుచు
సంశయంబు నాకు జనియించె మునినాథ!
ప్రజ్ఞమెఱసి తెలియఁ బలుకవయ్య!

7-4-వచనము

అనిన శుకుం డిట్లనియె.

7-5-శార్దూల విక్రీడితము

నీ సంప్రశ్న్నము వర్ణనీయము గదా నిక్కంబు రాజేంద్ర! ల
క్ష్మీసంభావ్యుని సచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపఁ ద
ద్దాసాఖ్యానము లొప్పు విష్ణుచరణధ్యానప్రధానంబు లై
శ్రీసంధానములై మునీశ్వరవచోజేగీయమానంబు లై.

7-6-కంద పద్యము

చిత్రంబులు త్రైలోక్య ప
విత్రంబులు భవలతాలవిత్రంబులు స

న్మిత్రంబులు మునిజన వన
చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్.

7-7-వచనము

నరేంద్రా! కృష్ణద్వైపాయనునకు నమస్కరించి హరికథనంబులు జెప్పద వినుము; వ్యక్తుండుగాక గుణంబులు లేక ప్రకృతిం జెందక, భవంబుల నొందక, పరమేశ్వరుండు దన మాయవలన నయిన గుణంబుల నావేశించి, బాధ్యబాధకత్వంబుల నొందు; నతండు గుణరహితుండు; సత్త్వరజస్తమంబులు ప్రకృతిగుణంబు; లా గుణంబులకు నొక్కొక్క కాలంబున హానివృద్ధులు గల; వా యీశ్వరుండు సత్త్వంబున దేవఋషులను, రజోగుణంబున నసురులను, దమోగుణంబున యక్ష రక్షోగణంబులను, విభజించె; సూర్యుండు పెక్కెడలం గానంబడియు నొక్కరుం డైన తెఱంగునఁ దద్విభుండును సర్వగతుండయ్యును భిన్నుండు గాఁడు; తత్త్వవిదులైన పెద్దలు దమలోనం బరమాత్మ స్వరూపంబున నున్న యీశ్వరు నివ్విధంబున నెఱుంగుదురు; జీవాత్మకుఁ బరుండైన సర్వమయుండు తన మాయచేత రజంబును విశ్వంబు సృజింపం గోరి, సత్త్వంబును గ్రీడింపం గోరి, తమంబును నిద్రింపం గోరి యుత్పాదించి, చరమైన కాలంబును సృజియించు; నా కాలంబున సర్వదర్శనుం డైన యీశ్వరుండును గాలాహ్వయుండును నై హరి సత్త్వగుణం బయిన దేవానీకంబునకు వృద్ధియు, రజ స్తమోగుణులయిన రాక్షసులకు హానియుం జేయుచుండు.

7-8-కంద పద్యము

జననాయక! యీ యర్థము
ఘనయశుఁ డగు ధర్మజునకుఁ గ్రతుకాలమునన్

మును నారదుండు చెప్పెను
వినిపించెద వినుము చెవులు విమలత నొందన్.

7-9-వచనము

మున్ను ధర్మరాజు చేయు రాజసూయయాగంబున బాలుండైన శిశుపాలుండు హరిని నిందించి నిశితనిర్వక్రచక్రధారాదళితమస్తకుం డయి తేజోరూపంబున వచ్చి హరిదేహంబు జొచ్చినం జూచి వెఱఁగు పడి ధర్మజుండు సభలోనున్న నారదునిం జూచి యిట్లనియె.

7-10-ఆటవెలది

ఎట్టివారి కైన నేకాంతులకు నైన,
వచ్చి చొరఁగ రాని వాసుదేవు
తత్త్వమందుఁ జేది ధరణీశుఁ డహితుఁడై,
యెట్లు జొచ్చె? మునివరేణ్య! నేఁడు.

7-11-ఉత్పలమాల

వేనుఁడు మాధవుం దెగడి విప్రులు దిట్టిన భగ్నుఁడై తమో
లీనుఁడు గాఁడె తొల్లి; మదలిప్తుఁడు చైద్యుఁడు పిన్ననాటనుం
డేనియు మాధవున్ విన సహింపఁడు భక్తి వహింపఁ డట్టివాఁ
డే నిబిడప్రభావమున నీ పరమేశ్వరునందుఁ జొచ్చెనో?

7-12-మత్తేభ విక్రీడితము

హరిసాధింతు హరిన్ గ్రసింతు హరిఁ బ్రాణాంతంబు నొందింతుఁ దా
హరికిన్ వైరినటంచు వీఁడు పటురోషాయత్తుఁడై యెప్పుడుం

దిరుగుం, బ్రువ్వదు నోరు, ప్రీలిపడ దా దేహంబు, దాహంబుతో
నరకప్రాప్తియు నొందఁ, డే క్రియ జగన్నాథుం బ్రవేశించెనో?

7-13-వచనము

అదియునుం గాక, దంతవక్త్రుండును వీఁడును నిరంతరంబు గోవిందు నింద జేయుదురు; నిఖిలజనులు సందర్శింప నేఁడు వీనికి విష్ణు సాయుజ్యంబు గలుగుట కేమి హేతువు? వినిపింపుము; పవన చలితదీపశిఖయునుం బోలె నా హృదయంబు సంచలించుచున్న" దనిన, ధర్మనందనునకు నారదుం డిట్లనియె; "దూషణభూషణతిరస్కా రంబులు శరీరంబునకుం గాని పరమాత్మకు లేవు; శరీరాభిమానంబునం జేసి దండవాక్పారుష్యంబులు హింసయై తోఁచు తెఱంగున; నేను నాయది యనియెడు వైషమ్యంబును భూతంబులకు శరీరంబు నందు సంభవించు; అభిమానంబు బంధంబు; నిరభిమానుండై వధించినను వధంబుగాదు; కర్తృత్వ మొల్లనివానికి హింసయు సిద్ధింపదు; సర్వభూతాత్మకుండైన యీశ్వరునికి వైషమ్యంబు లేదు; కావున.

7-14-ఆటవెలది

అలుక నైనఁ జెలిమి నైనఁ గామంబున
నైన బాంధవమున నైన భీతి
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁ డగు హరిఁ
జేర వచ్చు వేఱు జేయఁ డతఁడు.

7-15-కంద పద్యము

వైరానుబంధనంబునఁ
జేరిన చందమున విష్ణుఁ జిరతర భక్తిం

జేరఁగ రాదని తోఁచును
నారాయణభక్తి యుక్తి నా చిత్తమునన్.

7-16-కంద పద్యము

కీటకముఁ దెచ్చి భ్రమరము
పాటవమున బంభ్రమింప భ్రాంతంబై త
త్కీటకము భ్రమరరూపముఁ
బాటించి వహించుఁ గాదె భయయోగమునన్.

7-17-వచనము

ఇవ్విధంబున.

7-18-శార్దూల విక్రీడితము

కామోత్కంఠత గోపికల్, భయమునం గంసుండు, వైరక్రియా
సామాగ్రిన్ శిశుపాలముఖ్య నృపతుల్, సంబంధులై వృష్ణులుం,
ప్రేమన్ మీరలు, భక్తి నేము, నిదె చక్రింగంటి; మెట్లైన ను
ద్ధామధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా!

7-19-వచనము

మఱియుం బెక్కండ్రు కామ ద్వేష భయ స్నేహ సేవాతిరేకంబులఁ జిత్తంబు హరిపరాయత్తంబుగాఁ జేసి తద్గతిం జెందిరి; హరి నుద్దేశించి క్రోధాదులైన యేనింటిలోపల నొక్కటి యైన వెన్నునికి లేని నిమిత్తంబున నతండు వ్యర్థుం డయ్యె; మీ తల్లి చెలియలి కొడుకు లయిన శిశుపాల దంతవక్త్రులు దొల్లి

విష్ణుమందిర ద్వారపాలకులు విప్రశాపంబునఁ బదభ్రష్టులై భూతలంబున జన్మించిరి;" అనిన విని యుధిష్ఠిరుండు నారదున కిట్లనియె.

7-20-మత్తేభ విక్రీడితము

అలుగం గారణ మేమి విప్రులకు? మున్నా విప్రు లెవ్వారు? ని
శ్చలు లేకాంతులు నిర్జితేంద్రియులు నిస్సంసారు లీశాను వ
ర్తులు వైకుంఠపురీనివాసు లన విందున్ వారి కెబ్భంగి నీ
ఖలజన్మంబులు వచ్చె? నారద! వినం గౌతూహలం బయ్యెడిన్.

## 7-3-హిరణ్యాక్షహిరణ్యకశిపులకథ

7-21-వచనము

అనిన నారదుం డిట్లనియె "నొక్కనాఁడు బ్రహ్మమానసపుత్త్రు లైన సనకసనందనాదులు దైవయోగంబున భువనత్రయంబు నందును సంచరించుచు నైదాఱేండ్లప్రాయంపు బాలకులభావంబున దిగంబరు లయి హరిమందిరంబునకు వచ్చి చొచ్చునెడ మొగసాల నున్న పురుషు లిరువురు వారలం జూచి.

7-22-కంద పద్యము

డింభకుల ననర్గళవి
స్రంభకుల రమాధినాథసల్లాప సుఖా
రంభకుల ముక్తమానస
దంభకులం జొరఁగనీక తఱిమి రధీశా!

7-23-కంద పద్యము

వారించిన తమకంబున
వారించుక నిలువలేక వడిఁ దిట్టిరి దౌ
వారికుల నసురయోని న
వారితులై పుట్టుఁ డనుచు వసుధాధీశా!

7-24-వచనము

మఱియు నా పిన్నపెద్దలు వారలం జూచి "మీర లియ్యెడనుండ నర్హులు గారు; నారాయణచరణకమలంబు విడిచి రజస్తమోగుణులై రాక్షసయోనిం బుట్టుం" డని శపియించిన, వారు నా శాపవశంబునఁ బదభ్రష్టులై కూలుచు మొఱలిడిన నమ్మహాత్ములు దయాళులై క్రమ్మఱం గరుణించి "మూఁడు జన్మంబులకు వైరంబున భగవత్సన్నిధానంబు గలిగెడు" మని నిర్దేశించి చని; రివ్విధంబున శాపహతు లై హరి పార్శ్వచరులైన పురుషు లిరువురు హిరణ్యకశిపు హిరణ్యాక్షు లన దితికి జన్మించి; రందుఁ గనిష్ఠుఁడైన హిరణ్యాక్షుని హరి వరాహ రూపంబున సంహరించె; నగ్రజుండయిన హిరణ్యకశిపుండు నరసింహ మూర్తి యయిన శ్రీహరిచేత విదళితుం డయ్యెఁ; నతని కొడుకు ప్రహ్లాదుండు దండ్రిచేత హింసితుఁడయ్యును నారాయణపరాయణుండై శాశ్వతుం డయ్యెఁ; రెండవ భవంబునఁ గైకశి యను రాక్షసికి రావణ కుంభకర్ణులయి సంభవించిన, విశ్వంభరుడు రఘుకులంబున రాఘవుండయి యవతరించి వారల వధియించె; నమ్మహాత్ముని పరాక్రమంబులు మార్కండేయ ఋషి వలన నెఱింగెదవు; తృతీయ జన్మంబున మీ తల్లి చెలియలికి శిశుపాలదంతవక్త్రు లన నుద్భవించి.

7-25-శార్దూల విక్రీడితము

వక్రం బింతయు లేక పాయని మహావైరంబునన్ నిత్యజా
తక్రోధస్మరణంబులన్ విదళితోద్యత్పాపసంఘాతులై
చక్రచ్ఛిన్న శిరస్కులై మునివచశ్శాపావధిప్రాప్తులై
చక్రిం జెందిరి వారు పార్శ్వచరులై సారూప్యభావంబునన్.

7-26-వచనము

అనిన విని ధర్మనందనుం డిట్లనియె.

7-27-కంద పద్యము

బాలున్ హరిపదచింతా
శీలున్ సుగుణాలవాలు శ్రీమన్మేధా
జాలున్ సంతోషింపక
యేలా శిక్షించె రాక్షసేంద్రుం డనఘా!

7-28-కంద పద్యము

పరిభూతవ్యధనంబులు,
నిరుపమసంసారజలధినిర్మథనంబుల్
నరకేసరికథనంబులు,
పరిరక్షిత దేవయక్షఫణిమిథునంబుల్.

7-29-వచనము

మునీంద్రా! వినిపింపు" మనిన నారదుం డిట్లనియె "కమలోదరుచేతం దన సహోదరుండు హతమయ్యె నని విని హిరణ్యకశిపుండు రోష శోక దందహ్యమానమానసుం డయి ఘూర్ణిల్లుచు నాభీలదావదహన

జ్వాలాకరాళంబులయిన విలోకనంబుల గగనంబునం బొగలెగయ నిరీక్షించుచుఁ దటిల్లతాంకురసంకాశధగద్ధగిత దంతసందష్టదశనచ్ఛదుండును, నదభ్రభయంకరభ్రుకుటిత ఫాలభాగుండును, నిరంతరాక్రాంతదురంత వైరవేగుండునునై మహాప్రభాజాల జటాలంబగు శూలంబుఁ గేలనందుకొని సభామండపంబున నిలువంబడి త్రిమస్తక, త్రిలోచన, శకుని, శంబర, శతబాహు, నముచి, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తిప్రముఖులైన దైత్యదానవుల నాలోకించి యిట్లనియె.

7-30-శార్దూల విక్రీడితము

నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి రణన్యాయైకదక్షుండు బా
హాకుంఠీకృతదేవయక్షుఁడు హిరణ్యాక్షుండు వానిన్ మహా
సౌకర్యాంగము దాల్చి దానవవధూసౌకర్యముల్ నీఱుగా
వైకుంఠుండు వధించిపోయెనఁట యీ వార్తాస్థితిన్ వింటిరే.

7-31-చంపకమాల

వనములనుండుఁ జొచ్చు ముని వర్గములోపల ఘోణిగాఁడు సం
జనన మెఱుంగ రెవ్వరును జాడ యొకింతయు లేదు తన్ను డా
సిన మఱి డాయు వెంటఁబడి చిక్కక చిక్కఁడు వీని నొక్క కీ
లున మన మెల్ల లోఁబడక లోఁబడఁ బట్టుకొనంగవచ్చునే?

7-32-సీస పద్యము

భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి;
మున్నీట మునిఁగిన మునుఁగుఁ గాక;
అలయించి పెనఁగు నా యచలసంభ్రమమున;

కెఱఁగి వెన్నిచ్చిన నిచ్చుఁ గాక;
జగడంబు సైఁపక సౌకర్యకాంక్షియై;
యిల క్రింద నీఁగిన నీఁగుఁ గాక;
క్రోధించి యటుగాక కొంత పౌరుషమున;
హరి భంగి నడరిన నడరు గాక;

7-32.1-ఆటవెలది

కఠినశూలధారఁ గంఠంబు విదళించి,
వాని శోణితమున వాఁడి మెఱసి,
మత్సహోదరునకు మహిఁ దర్పణము జేసి,
మెఱసివత్తు మీకు మేలు దెత్తు.

7-33-కంద పద్యము

ఖండిత మూలద్రుమమున
నెండిన విటపములభంగి నితఁడు పడిన, నా
ఖండలముఖ్యులు పడుదురు,
భండనమున నితఁడు దమకుఁ బ్రాఁణము లగుటన్.

7-34-సీస పద్యము

పొండు దానవులార! భూసురక్షేత్ర సం;
గతయైన భూమికి గములు గట్టి
మఖతపస్స్వాధ్యాయ మౌనవ్రతస్థుల;
వెదకి ఖండింపుఁడు విష్ణుఁ డనఁగ
నన్యుఁ డొక్కఁడు లేఁడు యజ్ఞంబు వేదంబు;

 నతఁడె భూదేవ క్రి యాదిమూల
మతఁడు దేవర్షి పిత్రాదిలోకములకు;
 ధర్మాదులకు మహాధార మతఁడె

7-34.1-తేటగీతి

యే స్థలంబుల గో భూసురేంద్ర వేద
వర్ణధర్మాశ్రమంబులు వరుస నుండు
నా స్థలంబుల కెల్ల మీ రరిగి చెఱచి
దగ్ధములు జేసి రండు మీ దర్ప మొప్ప.

7-35-వచనము

అని యిట్లు నిర్దేశించిన దివిజమర్దను నిర్దేశంబులు శిరంబుల ధరియించి రక్కసులు పెక్కండ్రు భూతలంబునకుం జని.

7-36-సీస పద్యము

గ్రామ పురక్షేత్ర ఖర్వటఖేట ఘో;
 షారామ నగరాశ్రమాదికములు
గాల్చి, కొలఁకులు గలఁచి, ప్రాకార గో;
 పుర సేతువులు త్రవ్వి, పుణ్య భూజ
చయములు ఖండించి, సౌధ ప్రపా గేహ;
 పర్ణశాలాదులు పాడుచేసి,
సాధు గో బ్రాహ్మణ సంఘంబులకు హింస;
 గావించి, వేదమార్గములు జెఱచి,

7-36.1-ఆటవెలది

కుతల మెల్ల నిట్టు కోలాహలంబుగా
దైత్యు లాచరింపఁ దల్లడిల్లి
నష్టమూర్తు లగుచు నాకలోకము మాని
యడవులందుఁ జొచ్చి రమరవరులు.

7-37-వచనము

అంత హిరణ్యకశిపుండు దుఃఖితుండై, మృతుం డయిన సోదరునకు నుదక ప్రదానాదికార్యంబు లాచరించి, యతని బిడ్డల శకుని, శంబర, కాలనాభ, మదోత్కచప్రముఖుల నూఱడించి, వారల తల్లితోఁ గూడ హిరణ్యాక్షుని భార్యల నందఱ రావించి, తమ తల్లియైన దితి నవలోకించి యిట్లనియె.

7-38-శార్దూల విక్రీడితము

నీరాగారనివిష్టపాంథుల క్రియన్ నిక్కంబు సంసారసం
చారుల్ వత్తురు గూడి విత్తురు సదా; సంగంబు లే దొక్కచో;
శూరుల్ పోయెడి త్రోవఁ బోయెను భవత్పుత్రుండు దల్లీ! మహా
శూరుం డాతఁడు తద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్.

7-39-సీస పద్యము

సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుం;
 డమలుండు సత్యుఁ డనంతుఁ డాఢ్యుఁ
డాత్మరూపంబున నశ్రాంతమును దన;
 మాయాప్రవర్తన మహిమవలన
గుణములఁగల్పించి గుణసంగమంబున;

లింగశరీరంబు లీలఁ దాల్చి
కంపితజలములోఁ గదలెడి క్రియఁ దోచు;
పాదపంబులభంగి భ్రామ్యమాణ

7-39.1-ఆటవెలది

చక్షువుల ధరిత్రి చలితయై కానంగఁ
బడినభంగి, వికల భావరహితుఁ
డాత్మమయుఁడు గంపితాంతరంగంబునఁ
గదలినట్లు తోఁచుఁ గదల కుండు.

## 7-4-సుయజ్ఞోపాఖ్యానము

7-40-వచనము

అవ్వా! యివ్విధంబున లక్షణవంతుండు గాని యీశ్వరుండు లక్షితుండై కర్మసంసరణంబున యోగవియోగంబుల నొందించు సంభవ వినాశ శోక వివేకావివేక చింతా స్మరణంబులు వివిధంబు; లీ యర్థంబునకుఁ బెద్దలు ప్రేతబంధు యమ సంవాదం బను నితిహాసంబు నుదాహరింతురు; వినుండు, చెప్పెద; నుశీనరదేశంబు నందు సుయజ్ఞుండను రాజు గలం; డతండు శత్రువులచేత యుద్ధంబున నిహతుం డయి యున్నయెడ.

7-41-సీస పద్యము

చిరిఁగిన బహురత్న చిత్రవర్మముతోడ;
రాలినభూషణ రాజితోడ
భీకరబాణ నిర్భిన్న వక్షముతోడఁ;

దఱచుఁ గాఱెడు శోణితంబుతోడఁ
గీర్ణమై జాఱిన కేశబంధముతోడ;
రయరోషదష్ట్రాధరంబుతోడ
నిమిషహీనంబైన నేత్రయుగ్మముతోడ;
భూరజోయుత ముఖాంబుజముతోడఁ

7-41.1-ఆటవెలది

దునిసిపడిన దీర్ఘ దోర్దండములతోడ
జీవరహితుఁ డగు నుశీనరేంద్రుఁ
జుట్టి బంధుజనులు సొరిది నుండఁగ భయా
క్రాంత లగుచు నతని కాంత లెల్ల.

7-42-శార్దూల విక్రీడితము

స్రస్తాకంపితకేశబంధములతో సంఛిన్నహారాళితో
హస్తాబ్జంబులు సాఁచి మోఁదికొనుచున్ హా నాథ! యంచున్ బహు
ప్రస్తావోక్తులతోడ నేడ్చిరి వగం బ్రాణేశుపాదంబుపై
నస్తోకస్తనకుంకమారుణ వికీర్ణాస్రంబు వర్షించుచున్.

7-43-మత్తేభ విక్రీడితము

అనఘా! నిన్ను నుశీనరప్రజల కర్థానందసంధాయిగా
మును నిర్మించిన బ్రహ్మ నిర్దయత నున్మూలించెనే వీరికిం
దనయశ్రేణికి మాకు దిక్కు గలదే ధాత్రీశ! నీబోఁటికిం
జనునే పాసి చనంగ భాతృజనులన్ సన్మిత్రులం బుత్రులన్.

7-44-మత్తేభ విక్రీడితము

జనలోకేశ్వర! నిన్నుఁ బాసిన నిమేషంబుల్ మహాబ్దంబులై
చను లోకాంతరగామిపై మరల కీ చందంబునన్ నీవు పో
యిన మే మెట్లు చరింతు మొల్లముగదా యీ లోకవృత్తంబు నేఁ
డనలజ్వాలలఁ జొచ్చి వచ్చెదము నీ యంఘ్రిద్వయిం జూడగన్.

7-45-వచనము

అని యిట్లు రాజభార్య లా రాజశవంబు డగ్గఱి విలపింపం బ్రొద్దు గ్రుంకెడు సమయంబున వారల విలాపంబులు విని బ్రాహ్మణబాలకుం డై యముండు చనుదెంచి ప్రేతబంధువులం జూచి యిట్లనియె.

7-46-ఉత్పలమాల

మచ్చిక వీరికెల్ల బహుమాత్రముఁ జోద్యము దేహి పుట్టుచుం
జచ్చుచు నుంటఁ జూచెదరు చావక మానెడువారిభంగి నీ
చచ్చినవారి కేడ్చెదరు చావున కొల్లక డాఁగ వచ్చునే?
యెచ్చటఁ బుట్టె నచ్చటికి నేఁగుట నైజము ప్రాణికోటికిన్.

7-47-కంద పద్యము

జననీజనకులఁ బాసియు,
ఘనవృకముల బాధపడక కడుఁ బిన్నలమై
మనియెద మెవ్వఁడు గర్భం
బున మును పోషించె వాఁడె పోషకుఁ డడవిన్.

7-48-కంద పద్యము

ఎవ్వఁడు సృజించుఁ బ్రాణుల,
నెవ్వఁడు రక్షించుఁ ద్రుంచు నెవ్వఁ డనంతుం
డెవ్వఁడు విభుఁ డెవ్వఁడు వాఁ
డివ్విధమున మనుచుఁ బెనుచు హేలారతుఁడై.

7-49-ఆటవెలది

ధనము వీధిఁ బడిన దైవవశంబున
నుండు; పోవు మూల నున్న నైన;
నడవి రక్ష లేని యబలుండు వర్ధిల్లు;
రక్షితుండు మందిరమునఁ జచ్చు.

7-50-కంద పద్యము

కలుగును మఱి లేకుండును
గల భూతము లెల్లఁ గాలకర్మవశములై
నిలుఁవడు ప్రకృతిం దద్గుణ
కలితుఁడు గాఁ డాత్మమయుఁ డగమ్యుఁడు దలపన్.

7-51-సీస పద్యము

పాంచభౌతికమైన భవనంబు దేహంబు;
పురుషుఁడు దీనిలోఁ బూర్వకర్మ
వశమున నొకవేళ వర్తించు దీపించుఁ;
దఱియైన నొకవేళఁ దలఁగి పోవుఁ
జెడనేని దేహంబు జెడుఁగాని పురుషుండు;
చెడ డాతనికి నింత చేటులేదు

పురుషునకిని దేహపుంజంబునకు వేఱు;
 గాని యేకత్వంబు గానరాదు

7-51.1-ఆటవెలది

దారువులఁ వెలుంగు దహనుని క్రైవడిఁ
గాయములఁ జరించు గాలిభంగి
నాళలీనమైన నభము చాడ్పున వేఱు
దెలియవలయు దేహి దేహములకు.

7-52-వచనము

అని మఱియు నిట్లనియె.

7-53-సీస పద్యము

భూపాలకుఁడు నిద్రపోయెడి నొండేమి;
 విలపింప నేటికి వెఱ్ఱులార!
యెవ్వఁడు భాషించు నెవ్వఁ డాకర్ణించు;
 నట్టి వాఁ డెన్నఁడో యరిగినాఁడు,
ప్రాణభూతుం డైన పవనుఁ డాకర్ణింప;
 భాషింప నేరఁడు, ప్రాణి దేహ
ములకు వేఱై తాన ముఖ్యుఁడై యింద్రియ;
 వంతుఁడై జీవుండు వలను మెఱయు,

7-53.1-ఆటవెలది

ప్రాభవమున భూతపంచకేంద్రియమనో
లింగదేహములను లీలఁ గూడు
విడుచు నన్యుఁ డొకఁడు విభుఁడు దీనికి మీరు
పొగల నేల? వగలఁ బొరల నేల?

7-54-కంద పద్యము

ఎందాఁక నాత్మ దేహము
నొందెడు నందాఁకఁ గర్మయోగము; లటపైఁ
జెందవు; మాయాయోగ
స్పందితులై రిత్త జాలిఁ బడ నేమిటికిన్?

7-55-మత్తేభ విక్రీడితము

చెలులుం దల్లులు దండ్రు లాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారు ని
ర్మలగేహంబు లటంచుఁ గూర్తురు మహామాయాగుణభ్రాంతులై
కలలోఁ దోచిన యోగముల్ నిజములే కర్మానుబంధంబులం
గలుగున్ సంగము లేక మానుఁ బిదపం గర్మాంతకాలంబునన్.

7-56-వచనము

మఱియు, మాయాగుణప్రపంచంబు నెఱింగెడు తత్త్వజ్ఞులు నిత్యానిత్యంబులం
గూర్చి సుఖదుఃఖంబులం జెంద; రజ్ఞులు గొందఱు యోగ వియోగంబులకు

సుఖదుఃఖంబుల నొందుదురు; తొల్లి యొక్క మహా గహనంబున విహగంబులకు నంతకభూతుం డైన యెఱుక గల డతం డొక్కనాఁడు ప్రభాతంబున లేచి వాటంబైన వేఁటతమకంబున,

7-57-కంద పద్యము

వల, లురులు, జిగురుఁ గండెలుఁ,
జలిదియు, జిక్కంబు, ధనువు, శరములుఁ గొనుచుం
బులుఁగులఁ బట్టెడు వేడుక
యలుఁగులు వెడలంగఁ గదలి యడవికిఁ జనియెన్.

7-58-వచనము

ఇట్లడవికిం జని తత్ప్రదేశంబు నందు.

7-59-కంద పద్యము

కట్టలుకఁ దడుకుచాటునఁ
బిట్టల నురిగోలఁ దిగిచి, బిఱుసున ఱెక్కల్
పట్టి విఱిచి, చిక్కములోఁ
బెట్టుచు విహరించె లోకభీకరలీలన్.

7-60-వచనము

మఱియు నానావిధంబు లగు శకుంతలంబుల నంతంబు నొందించుచు సకల పక్షి సంహారసంరబ్ధకుం డైన లుబ్ధకుండు దన ముందటఁ గాలచోదితుండై సంచరించుచున్న కుళింగపక్షి మిథునంబు గనుంగొని యందుఁ గుళింగి నురిం దిగిచి యొక్క చిక్కంబులో వైచినం జూచి దుఃఖించి కుళింగపక్షి యిట్లనియె.

7-61-చంపకమాల

అడవులమేఁత మేసి మనమున్యుల కెన్నఁడు నెగ్గు జేయ కి
క్కడ విహరింప నేఁ డకట కట్టిఁడి బ్రహ్మ కిరాతు చేతిలోఁ
బడు మని వ్రాసెనే నుదుటఁ బాపపు దైవము కంటి కింత యె
క్కుడు బరువయ్యెనే బ్రదుకు గోమలి! యే మన నేర్తుఁ జెల్లరే.

7-62-కంద పద్యము

ఒకమాటు మనల నందఱఁ
బ్రకటించి కిరాతువలలఁ బడఁజేయక ని
న్నొకతిన్ వలఁబడఁ జేసిన
వికటీకృతదక్ష మైన విధి నే మందున్.

7-63-ఉత్పలమాల

ఱెక్కలు రావు పిల్లలకు ఱేపటినుండియు మేఁత గానమిం
బొక్కెడు గూటిలో నెగసి పోవఁగ నేరవు; మున్ను తల్లి యీ
దిక్కుననుండి వచ్చు నని త్రిప్పని చూడ్కుల నిక్కినిక్కి న
ల్దిక్కులుఁ జూచుచున్న వతిదీనత నెట్లు భరింతు నక్కటా!

7-64-వచనము

అని యివ్విధంబున.

7-65-కంద పద్యము

కుంఠితనాదముతోడను
గంఠము శోషింప వగచు ఖగమును హననో
త్కంఠుండైన కిరాతుఁ డ
కుంఠితగతి నేసె నొక్క కోలం గూలన్.

7-66-కంద పద్యము

కాలము వచ్చిన శబరుని
కోలను ధరఁగూలె ఖగము ఘోషముతోడం

గాలము డాసిన నేలం

గూలక పో వశమె యెట్టి గుణవంతులకున్.

7-67-ఉత్పలమాల

కావున మీఱు చచ్చుతఱిఁ గానరు చచ్చి ధరిత్రిఁ బడ్డ ధా

త్రీవిభుదేహముం గదిసి దీనత నేడువ నేల? పొందు చిం

తావతులార! వత్సర శతంబుల కైన నిజేశు చక్కికిం

బోవుట దుర్లభంబు; మృతిఁ బొందినవారలు చేర వత్తురే.

7-68-వచనము

అని యిట్లు కపటబాలకుండై క్రీడించుచున్న యముని యుపలాల నాలాపంబులు విని సుయజ్ఞుని బంధువు లెల్ల వెఱఁగుపడి సర్వప్రపంచంబు నిత్యంబుగాదని తలంచి శోకింపక సుయజ్ఞునికి సంపరాయిక కృత్యంబులు జేసి చని;రంత నంతకుం డంతర్హితుం డయ్యె" నని చెప్పి హిరణ్యకశిపుండు దన తల్లిని దమ్ముని భార్యలం జూచి యిట్లనియె.

7-69-కంద పద్యము

పరులెవ్వరు దా మెవ్వరు

పరికింపఁగ నేక మగుట భావింపరు త

త్పరమజ్ఞానము లేమిని
బరులును నే మనుచుఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్.

7-70-వచనము

అని తెలియం బలికిన హిరణ్యకశిపుని వచనంబులు విని దితి గోడండ్రును దానును శోకంబు మాని తత్త్వవిలోకనంబు గలిగి లోకాంతరగతుండైన కొడుకునకు వగవక చనియె" నని చెప్పి నారదుండు ధర్మనందనున కిట్లనియె.

7-71-కంద పద్యము

అజరామరభావంబును
ద్విజగద్రాజ్యంబు నప్రతిద్వంద్వము దో
ర్విజితాఖిలశాత్రవమును
గజరిపుబలమును హిరణ్యకశిపుఁడు గోరెన్.

7-72-వచనము

ఇట్లు గోరి మందరాచల ద్రోణికిం జని; యందుఁ గాలి పెనువ్రేల నేల నిలువంబడి, యూర్ధ్వబాహుండయి మిన్ను చూచుచు, వాఁడి మయూఖంబులతోడి ప్రళయకాల భానుండునుం బోలె దీర్ఘజటారుణ ప్రభాజాలంబులతోడ నెవ్వరికిం దేఱిచూడరాక పరమదారుణంబైన తపంబు జేయుచుండె; నిర్జరులు నిజస్థానంబుల నుండిరి; అంత.

7-73-మత్తేభ విక్రీడితము

అదిరెం గుంభుని, సాద్రియై కలఁగె నే డంభోనిధుల్, తారకల్
చెదరెన్ సగ్రహసంఘులై, దిశలు విచ్ఛిన్నాంతలై మండెఁ, బె
ల్లదరెన్ గుండెలు జంతుసంహతికి, నుగ్రాచార దైత్యేంద్రమూ
ర్ధదిశోద్ధూతసధూమ హేతిపటలోదంచత్తపోవహ్నిచేన్.

7-74-వచనము

ఇట్లు త్రైలోక్యసంతాపకరంబైన దైత్యరాజతపోవిజృంభణంబు సైరింపక నిలింపులు నాకంబు విడిచి బ్రహ్మలోకంబునకుం జని లోకేశ్వరుండయిన బ్రహ్మకు వినతులయి యిట్లని విన్నవించిరి.

7-75-కంద పద్యము

దితికొడుకు తపము వేఁడిమి
నతితప్తుల మైతి మింక నలజడి నమరా
వతి నుండ వెఱతు; మెయ్యది
గతి మాకును? దేవదేవ! కారుణ్యనిధీ!

7-76-శార్దూల విక్రీడితము

శంకాలేశము లేదు దేవ! త్రిజగత్సంహారమున్ దేవతా
సంకోచంబును వేదశాస్త్రపదవీసంక్షేపమున్ లేక యే
వంకన్ లేవ నటంచు దుస్సహతపోవ్యావృత్తి చిత్తంబులో
సంకల్పించె నిశాచరుండు ప్రతిసంస్కారంబు చింతింపవే.

7-77-శార్దూల విక్రీడితము

నీ వేరీతిఁ దపోబలంబున జగన్నిర్మాణముం జేసి యీ
దేవాధీశులకంటె నెక్కుడు సిరిం దీపించి తిబ్బంగిఁ దా
నీ విశ్వంబుఁ దపస్సమాధిమహిమన్ హింసించి వేఱొక్క వి
శ్వావిర్భావకరత్వశక్తి మదిలో నర్థించినాఁ డీశ్వరా!

7-78-వచనము

అదియునుం గాక, కాలాత్మకులగు జీవాత్మల కనిత్యత్వంబు గలుగుటం జేసి తపోయోగసమాధిబలంబునం దనకు నిత్యత్వంబు సంపాదింతు నని తలంచినా" డని మఱియు నిట్లనిరి.

7-79-మత్తేభ విక్రీడితము

భవదీయంబగు నున్నతోన్నత మహాబ్రహ్మైకపీఠంబు సం
స్తవనీయం బగు భూతియున్ విజయమున్ సౌఖ్యంబు సంతోషమున్

భువనశ్రేణికి నిచ్చి దైత్యుని తపస్స్ఫూర్తిన్ నివారించి యో
భువనాధీశ్వర! కావవే భువనముల్ పూర్ణప్రసాదంబునన్.

## 7-5-బ్రహ్మ వరములిచ్చుట

### 7-80-వచనము

అని దేవతలు విన్నవించిన స్వయంభూతుండును భగవంతుండును నైన నలుమొగంబులప్రోడ భృగుదక్షాదులతోడ మందరపర్వతంబునకు వచ్చి యందు నియమయుక్తుండును, బిపీలకావృత మేదోమాంసచర్మరక్తుండును, వల్మీకతృణవేణు పరిచ్ఛన్నుండును, మహాతపఃప్రభావ సంపన్నుండును నై నీరంధ్ర నిబిడ నీరద నికర నివిష్ట నీరజబంధుండునుం బోలె నివసించి యున్న నిర్జరారాతిం జూచి వెఱఁగుపడి నగుచు నిట్లనియె.

### 7-81-మత్తకోకిలము

ఓ! సురారికులేంద్ర! నీ క్రియ నుగ్రమైన తపంబు మున్
చేసి చూపినవారు లే; రిఁకఁ జేయువారును లేరు; నే
నీ సమాధికి మెచ్చితిన్ విను నీ యభీష్టము లిత్తు నా
యాస మేటికి లెమ్ము లెమ్ము మహాత్మ! కోరుము కోరికల్

### 7-82-శార్దూల విక్రీడితము

దంశవ్రాతములుం బిపీలికలు మేదః క్రవ్య రక్తంబులన్
సంశీర్ణంబులు జేసి పట్టితినఁగా శల్యావశిష్టుండ వై
వంశచ్ఛన్న తృణావళీయుత మహావల్మీకమం దింద్రియ
భ్రంశం బింతయు లేక నీకు నిలువం బ్రాణంబు లెట్లుండెనో?

7-83-ఉత్పలమాల

ఉత్సుకతన్ జలాన్నముల నొల్లక యీ క్రియ నూఱుదివ్య సం
వత్సరముల్ శరీరమున వాయువులన్ నిలుపంగ వచ్చునే
యుత్సవమయ్యెఁ జూచి మము నుగ్రతపంబున గెల్చి తీవు నే
వత్సలతన్ నినుం గదియ వచ్చితిఁ గోరిక లెల్ల నిచ్చెదన్.

7-84-వచనము

అని పలికి వనమక్షికాపిపీలికాభక్షితం బైన రక్షోవిభుని దేహంబు మీఁదం గమండలు జలంబులు ప్రోక్షించిన నద్దానవేంద్రుండు గమలాసనకరకమల కమనీయ కనకమయ దివ్యామోఘ కమండలు నిర్గత నిర్మల నీరధారా బిందుసందోహ సంసిక్త సకలాంగుం డయి తపంబు చాలించి సాంద్రకీచకసంఘాత సంఛాదిత వామలూరుమధ్యంబు వెలువడి మహాప్రభావ బలసౌందర్యతారుణ్య సహితుండును, వజ్రసంకాశ దేహుండును, దప్తసువర్ణుండును నై నీరసేంధననికర నిర్గత వహ్నియునుంబోలె వెలుంగుచుం జనుదెంచి.

7-85-మత్తేభ విక్రీడితము

దివిజానీకవిరోధి మ్రొక్కెఁ, గని వాగ్దేవీమనోనేతకున్
సవిశేషోత్సవ సంవిధాతకు, నమత్సంత్రాతకున్, సత్తపో
నివహాభీష్టవరప్రదాతకు, జగన్నిర్మాతకున్, ధాతకున్,
వివిధప్రాణిలలాట లేఖన మహావిద్యాను సంధాతకున్.

7-86-వచనము

ఇట్లు దైత్యేశ్వరుండు దివి నున్న హంసవాహానునకు ధరణీతలంబున దండప్రణామంబు లాచరించి సంతోషబాష్పసలిలసంవర్ధిత పులకాంకురుండై యంజలి జేసి కంజాతగర్భునిమీఁద దృష్టి యిడి గద్గదస్వరంబున నిట్లని వినుతించె.

7-87-సీస పద్యము

కల్పాంతమున నంధకారసంవృత మైన;
జగము నెవ్వఁడు దన సంప్రకాశ
మున వెలిగించుచు మూఁడుభంగుల రజ;
స్సత్త్వతమోగుణసహితుఁ డగుచుఁ
గల్పించు రక్షించుఁ గడపటఁ బ్రహరించు;
నెవ్వఁ డాద్యుఁడు సర్వహేతు వగుచు

శోభితుండై స్వయంజ్యోతియై యొక్కట;
విలసిల్లు నెవ్వఁడు విభుత మెఱసి

7-87.1-ఆటవెలది

సమయ మయిన మానసప్రాణబుద్ధీంద్రి
యములతోడ నెవ్వఁ డలఘు మహిమ
నడరు నట్టి సచ్చిదానందమయునకు,
మహితభక్తి నే నమస్కరింతు.

7-88-వచనము

దేవా! నీవు ముఖ్యప్రాణం బగుటంజేసి ప్రజాపతివి; మనోబుద్ధి చిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు; మహాభూతగణంబులకు నాధారభూతుండవు; త్రయీతనువునం గ్రతువులు విస్తరింతువు; సకల విద్యలు నీ తనువులు; సర్వార్థసాధకులకు సాధనీయుండ; వాత్మనిష్ఠాగరిష్ఠులకు ధ్యేయంబగు నాత్మవు; కాలమయుండవై జనులకు నాయుర్నాశంబు జేయుదువు; జ్ఞానవిజ్ఞానమూర్తి; వాద్యంతరహితుండ; వంతరాత్మవు; మూఁడు మూర్తులకు మూలంబగు పరమాత్మవు; జీవలోకంబునకు జీవాత్మవు; సర్వంబును నీవ నీవుగానిది లేశంబును లేదు; వ్యక్తుండవు గాక పరమాత్మవై పురాణపురుషుండవై యనంతుడవైన నీవు ప్రాణేంద్రియ మనోబుద్ధి గుణంబుల నంగీకరించి, పరమేష్ఠిపద విశేషంబున నిలిచి, స్థూలశరీరంబునం జేసి యింతయుం బ్రపంచింతువు; భగవంతుఁడవైన నీకు మ్రొక్కెద" నని మఱియు నిట్లనియె.

7-89-కంద పద్యము

కోరినవారలకోర్కులు
నేరుపుతో నిచ్చి మనుప నీ క్రియ నన్యుల్
నేరరు కరుణాకర నేఁ
గోరెద నీ విచ్చెదేనిఁ గోరిక లభవా!

7-90-శార్దూల విక్రీడితము

గాలిం, గుంభిని, నగ్ని, నంబువుల, నాకాశస్థలిన్, దిక్కులన్,
రేలన్, ఘస్రములం, దమఃప్రభల, భూరిగ్రాహ, రక్షో, మృగ
వ్యాళాదిత్య, నరాది జంతు కలహవ్యాప్తిన్, సమస్తాస్త్ర శ
స్త్రాళిన్, మృత్యువులేని జీవనము లోకాధీశ! యిప్పింపవే.

7-91-వచనము

అని మఱియు రణంబులందుఁ దన కెదురులేని శౌర్యంబును, లోకపాలుర నతిక్రమించు మహిమయును, భువనత్రయజయంబును, హిరణ్యకశిపుండు గోరిన నతని తపంబునకు సంతోషించి దుర్లభం బయిన వరంబు లన్నియు నిచ్చి కరుణించి విరించి యిట్లనియె.

7-92-శార్దూల విక్రీడితము

అన్నా! కశ్యపపుత్ర! దుర్లభము లీ యర్థంబు లెవ్వారికిన్;
మున్నెవ్వారలుఁ గోర రీ వరములన్; మోదించితిన్ నీ యెడన్
నన్నుం గోరిన వెల్ల నిచ్చితిఁ బ్రవీణత్వంబుతో బుద్ధి సం
పన్నత్వంబున నుండు మీ సుమతిపై భద్రైకశీలుండవై.

7-93-వచనము

అని యిట్లమోఘంబు లయిన వరంబు లిచ్చి దితినందనుచేతం బూజితుండై యరవిందసంభవుండు బృందారకసందోహ వంద్యమానుం డగుచు నిజమందిరంబునకుం జనియె; ఇవ్విధమ్మున నిలింపారాతి వరపరంపరలు సంపాదించుకొని.

7-94-కంద పద్యము

సోదరుఁ జంపిన పగ కై
యాదర మించుకయు లేక యసురేంద్రుఁడు కం
జోదరుపై వైరము దు
ర్మాదరతుం డగుచుఁ జేసె మనుజాధీశా!

7-95-సీస పద్యము

ఒకనాఁడు గంధర్వయూథంబుఁ బరిమార్చు;
దివిజుల నొకనాఁడు దెరలఁ దోలు;
భుజగుల నొకనాఁడు భోగంబులకుఁ బాపు;
గ్రహముల నొకనాఁడు గట్టివైచు;
నొకనాఁడు యక్షుల నుగ్రత దండించు;
నొకనాఁడు విహగుల నొడిసిపట్టు;
నొకనాఁడు సిద్ధుల నోడించి బంధించు;
మనుజుల నొకనాఁడు మద మడంచు;

7-95.1-తేటగీతి

గడిమి నొకనాఁడు కిన్నర ఖచర సాధ్య
చారణప్రేత భూతపిశాచ వన్య
సత్త్వ విద్యాధరాదుల సంహరించు
దితితనూజుండు దుస్సహతేజుఁ డగుచు.

7-96-కంద పద్యము

అట్టళ్ళతోడఁ గోటలఁ
గట్టలుకం గూలఁ ద్రోచి క్రవ్యాదులతోఁ

జుట్టు విడిసి దిక్పాలుర
పట్టణములు గొనియె; నతఁడు బలమున నధిపా!

7-97-కంద పద్యము

కృశలై సంప్రాపిత దు
ర్దశలై సర్వంకషోగ్ర దైతేయాజ్ఞా
వశలై నిశలును దివములు
దిశ లెల్లను గట్టుబడియె దీనత ననఘా!

7-98-వచనము

మఱియు నద్దానవేంద్రుండు విద్రుమ సోపానంబులును, మరకత మణిమయప్రదేశంబులును, వైడూర్యరత్న స్తంభ సముదయంబులును, జంద్రికాసన్నిభ స్ఫటికసంఘటిత కుడ్యంబులును, పద్మరాగపీఠ కనక కవాట గేహాళీ విటంక వాతాయనంబులును, విలంబమాన ముక్తాఫల దామవితానశోభిత ధవళ పర్యంకంబులును, వివిధ చిత్ర విమానంబులును, నిరంతర సురభికుసుమఫలభరిత పాదపమహోద్యానంబులును, హేమారవిందసౌగంధికబంధుర సరోవరంబులును, రమణీయ రత్న ప్రసాదవిశేషంబులును మనోహరపరిమళ శీతల మందమారుతంబులును, మృదుమధురనినద కీరకోకిలకుల కోలాహలంబును గలిగి విశ్వకర్మనిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీ శోభితంబైన మహేంద్ర భవనంబు చొచ్చి.

7-99-మత్తేభ విక్రీడితము

దితిపుత్రుండు జగత్త్రయైకవిభుఁడై దేవేంద్రసింహాస నో
ద్ధతుఁడై యుండ హరాచ్యుతాంబుజభవుల్ దప్పించి భీతిన్ సమా
గతులై తక్కిన యక్ష కిన్నర మరుద్గంధర్వ సిద్ధాదు లా
నతులై కానుక లిచ్చి కొల్తు రతనిన్ నానా ప్రకారంబులన్.

7-100-శార్దూల విక్రీడితము

ఏ దిక్పాలురఁ జూచి నేఁ డలుగునో యే దేవు బంధించునో
యే దిగ్భాగముమీఁద దాడి చనునో యే ప్రాణులం జంపునో
యీ దైత్యేశ్వరుఁ డంచు నొండొరులు దా రింద్రాదు లాస్థాన భూ
వేదిన్ మెల్లన నిక్కి చూతురు భయావిర్భూత రోమాంచు లై.

7-101-సీస పద్యము

కోలాహలము మాని కొలువుఁడీ సురలార! ;
తలఁగి దీవింపుఁడీ తపసులార!
ఫణు లెత్తకుఁడు నిక్కి పన్నగేంద్రములార! ;
ప్రణతులై చనుఁడి దిక్పాలులార!
గానంబు చేయుఁడీ గంధర్వవరులార! ;
సందడిఁ బడకుఁడీ సాధ్యులార!

యాడుఁడీ నృత్యంబు లప్సరోజనులార! ;
చేరిక మ్రొక్కుఁడీ సిద్ధులార!

7-101.1-తేటగీతి

శుద్ధకర్పూర వాసిత సురభిమధుర
భవ్య నూతన మైరేయపాన జనిత
సుఖవిలీనత నమరారి సొక్కినాఁడు
శాంతి లేదండ్రు నిచ్చలుఁ జారు లధిప!

7-102-శార్దూల విక్రీడితము

లీలోద్యాన లతా నివాసములలో లీలావతీయుక్తుఁడై
హాలాపానవివర్ధమాన మదలోలావృత్త తామ్రాక్షుఁడై
కేళిం దేలఁగ నేనుఁ దుంబురుఁడు సంగీతప్రసంగంబులన్
వాలాయంబుఁ గరంగఁ జేయుదుము దేవద్వేషి నుర్వీశ్వరా!

7-103-కంద పద్యము

యాగములు బుధులు ధరణీ
భాగములం జేయుచుండఁ బఱతెంచి హవి
ర్భాగములు దాన కైకొనుఁ
జాగింపఁడు దైత్యుఁ డమరసంఘంబునకున్.

7-104-సీస పద్యము

సకల మహాద్వీప సహిత విశ్వంభరా;
 స్థలిని దున్నక పండు సస్యచయము;
కామధేన్వాదుల కరణి నర్థులు గోరు;
 కోర్కులు గగనంబు గురియుచుండు;
వననిధు లేడును వాహినీసందోహ;
 ములును వీచుల రత్నములు వహించు;
నుర్వీరుహంబులు నొక్కకాలంబున;
 నఖిలర్తు గుణముల నతిశయిల్లు;

7-104.1-తేటగీతి

నంబుసంపూరితద్రోణులగుచు నొప్పుఁ
బర్వతంబులు; సర్వదిక్పాల వివిధ
గుణము లెల్లను తానె కైకొనుచు దైత్య
విభుఁడు త్రైలోక్యరాజ్యసంవృద్ధి నుండ.

7-105-వచనము

ఇట్లు సకల దిక్కులు నిర్జించి లోకైకనాయకుండై తన యిచ్ఛాప్రకారంబున నింద్రియసుఖంబు లనుభవించుచుఁ దనియక శాస్త్రమార్గంబు నతిక్రమించి విరించి

వరజనిత దుర్వారగర్వాతిరేకంబున సుపర్వారాతి యైశ్వర్యవంతుండై పెద్దకాలంబు రాజ్యంబు జేయునెడ.

7-106-ఉత్పలమాల

ఎన్నఁడు మాకు దిక్కు గల, దెన్నఁడు దైత్యునిబాధ మాను, మే
మెన్నఁడు వృద్ధిఁ బొందఁ గల, మెవ్వరు రక్షకు లంచు దేవతా
కిన్నర సిద్ధ సాధ్య ముని ఖేచరనాయకు లాశ్రయించి రా
పన్నగతల్పు భూరిభవబంధవిమోచనుఁ బద్మలోచనున్.

7-107-వచనము

ఇట్లు దానవేంద్రుని యుగ్రదండంబునకు వెఱచి యనన్యశరణ్యులై రహస్యంబున నందఱుం గూడికొని.

7-108-ఉత్పలమాల

ఎక్కడ నున్నవాఁడు జగదీశ్వరుఁ డాత్మమయుండు మాధవుం
డెక్కడి కేఁగె శాంతులు మునీశులు బిక్షులు రారు క్రమ్మఱన్
దిక్కుల నెల్ల నెక్కుడు తుదిం జొర దిక్కగు నట్టి దిక్కుకై
మ్రొక్కెద మేము హస్తయుగముల్ ముకుళించి మదీయరక్షకున్.

7-109-వచనము

అని మఱియు నాహారాదులు మాని చిత్తంబులు పరాయత్తంబులు గానీక సమాహితబుద్ధులై భగవంతుఁడును మహాపురుషుండును మహాత్ముండును విశుద్ధజ్ఞానానందమయుండును నైన హృషీకేశు నకు నమస్కరించుచున్న యెడ, మేఘరవసమాన గంభీర నినదంబున దిశలు మ్రోయించుచు సాధులకు నభయంబు గావించుచు దృశ్యమానుండు గాక పరమేశ్వరుండైన హరి యిట్లనియె.

7-110-మత్తేభ విక్రీడితము

భయముం జెందకుఁ డయ్య! నిర్జరవరుల్! భద్రంబు మీ కయ్యెడున్
జయమున్ లాభము భూతసంతతికి మత్సందర్శనప్రాప్తి న
వ్యయమై చేరు; నెఱుంగుదున్ దితిసుతవ్యాపారభాషా విప
ర్యయముల్; కాలము గూడఁ జంపెదఁ జనుం డందాఁక మీ త్రోవలన్.

7-111-ఆటవెలది

శుద్ధసాధు లందు, సురల లందు, శ్రుతు లందు,
గోవు లందు, విప్రకోటి యందు,
ధర్మపదవి యందుఁ దగిలి నా యందు వాఁ
డెన్నఁ డలుగు నాఁడె హింస నొందు.

7-112-కంద పద్యము

కన్నకొడుకు శమదమ సం
పన్నుఁడు నిర్వైరుఁ డనక ప్రహ్లాదుని వాఁ
డెన్నఁడు రోషంబున నా
పన్నత నొందించు నాఁడె పట్టి వధింతున్.

7-113-శార్దూల విక్రీడితము

వేధోదత్త వరప్రసాద గరిమన్ వీఁ డింతవాఁడై మిమున్
బాధంబెట్టుచు నున్నవాఁ డని మదిన్ భావింతు, భావించి నే
సాధింపం దఱిగాదు; కావునఁ గడున్ సైరించితిన్, మీఁదటన్
సాధింతున్ సురలార! నేఁడు చనుఁడా శంకింప మీ కేటికిన్.

7-114-వచనము

అని యిట్లు దనుజమర్దనుండు నిర్దేశించిన నిలింపులు గుంపులుగొని మ్రొక్కి రక్కసుండు మ్రగ్గుట నిక్కం బని తమతమ దిక్కులకుం జనిరి; హిరణ్యకశిపునకు విచిత్రచరిత్రులు నలువురు పుత్త్రు లుద్భవించిరి; అందు.

## 7-6-ప్రహ్లాద చరిత్రము

7-115-సీస పద్యము

తన యందు నఖిల భూతము లందు నొకభంగి;
 సమహితత్వంబున జరుగువాఁడు;
పెద్దలఁ బొడగన్న భృత్యునికైవడిఁ;
 జేరి నమస్కృతుల్ చేయువాఁడు;
కన్నుదోయికి నన్యకాంత లడ్డం బైన;
 మాతృభావము జేసి మరలువాఁడు;
తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను;
 దీనులఁ గావఁ జింతించువాఁడు;

7-115.1-తేటగీతి

సఖుల యెడ సోదరస్థితి జరుపువాఁడు;
దైవతము లంచు గురువులఁ దలఁచువాఁడు
లీల లందును బొంకులు లేనివాఁడు;
లలితమర్యాదుఁ డైన ప్రహ్లాదుఁ డధిప!

7-116-వచనము

మఱియును.

7-117-సీస పద్యము

ఆకార జన్మ విద్యార్థ వరిష్ఠుఁడై;
 గర్వసంస్తంభ సంగతుఁడు గాఁడు
వివిధ మహానేక విషయ సంపన్నుఁడై;
 పంచేంద్రియములచేఁ బట్టుబడఁడు
భవ్య వయోబల ప్రాభవోపేతుఁడై;
 కామరోషాదులఁ గ్రందుకొనఁడు
కామినీ ప్రముఖ భోగము లెన్ని గలిగిన;
 వ్యసన సంసక్తి నావంకఁ బోఁడు

7-117.1-ఆటవెలది

విశ్వమందుఁ గన్న విన్న యర్థము లందు
వస్తుదృష్టిఁ జేసి వాంఛ యుడఁడు
ధరణినాథ! దైత్యతనయుండు హరిపర
తంత్రుఁ డై హతాన్యతంత్రుఁ డగుచు.

7-118-ఆటవెలది

సద్గుణంబు లెల్ల సంఘంబు లై వచ్చి
యసురరాజతనయ నందు నిలిచి
పాసి చనవు విష్ణుఁ బాయని విధమున
నేఁడుఁ దగిలి యుండు నిర్మలాత్మ!

7-119-మత్తేభ విక్రీడితము

పగవారైన సురేంద్రులున్ సభలలోఁ బ్రహ్లాదసంకాశులన్
సుగుణోపేతుల నెందు నే మెఱుఁగ మంచున్ వృత్తబంధంబులం
బొగడం జొత్తురు సత్కవీంద్రుల క్రియన్ భూనాథ! మీబోఁటి స
ద్భగవద్భక్తులు దైత్యరాజతనయుం బాటించి కీర్తింపరే?

7-120-కంద పద్యము

గుణనిధి యగు ప్రహ్లాదుని
గుణము లనేకములు గలవు గురుకాలమునన్
గణుతింప నశక్యంబులు
ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్.

7-121-వచనము

ఇట్లు సద్గుణగరిష్ఠుం డయిన ప్రహ్లాదుండు భగవంతుం డయిన వాసుదేవుని యందు సహజ సంవర్ధమాన నిరంతర ధ్యానరతుండై.

7-122-సీస పద్యము

శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరిన యట్లైన, ;
 జెలికాండ్ర నెవ్వరిఁ జేర మఱచు;
నసురారి దన ముంగల నాడిన యట్లైన, ;
 నసురబాలురతోడ నాడ మఱచు;
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైన, ;
 బరభాషలకు మాఱుపలుక మఱచు;
సురవంద్యుఁ దనలోనఁ జూచినయట్లైనఁ, ;
 జొక్కి సమస్తంబుఁ జూడ మఱచు;

7-122.1-తేటగీతి

హరిపదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండినట్లైన, నతఁడు
నిత్య పరిపూర్ణుఁ డగుచు నన్నియును మఱచి
జడత లేకయు నుండును జడుని భంగి.

7-123-శార్దూల విక్రీడితము

పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు చేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డే తద్విశ్వమున్ భూవరా!

7-124-సీస పద్యము

వైకుంఠచింతావివర్జిత చేష్టుఁ డై;
 యొక్కఁడు నేడుచు నొక్కచోట;
నశ్రాంత హరిభావనారూఢచిత్తుఁ డై;
 యుద్ధతుఁ డై పాడు నొక్కచోట;
విష్ణుఁడింతియ కాని వేఱొండు లేదని;
 యొత్తిలి నగుచుండు నొక్కచోట;
నళినాక్షుఁ డను నిధానముఁ గంటి నే నని;
 యుబ్బి గంతులువైచు నొక్కచోటఁ;

7-124.1-ఆటవెలది

బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయహర్ష జనిత బాష్పసలిల
మిళితపులకుఁ డై నిమీలితనేత్రుఁ డై
యొక్కచోట నిలిచి యూరకుండు.

7-125-వచనము

ఇట్లు పూర్వజన్మ పరమభాగవత సంసర్గసమాగతం బైన ముకుంద చరణారవింద సేవాతిరేకంబున నఖర్వ నిర్వాణభావంబున విస్తరించుచు నప్పటప్పటికి దుర్జన

సంసర్గ నిమిత్తంబునం దన చిత్తం బన్యాయత్తంబుగానీక నిజాయత్తంబు చేయుచునప్రమత్తుండును, సంసార నివృత్తుండును, బుధజనవిధేయుండును, మహాభాగధేయుండును, సుగుణమణిగణగరిష్ఠుండును, పరమభాగవతశ్రేష్ఠుండును, కర్మబంధలతాలవిత్రుండును, పవిత్రుండును నైన పుత్రుని యందు విరోధించి సురవిరోధి యనుకంపలేక చంపం బంపె" నని పలికిన నారదునకు ధర్మజుం డిట్లనియె.

7-126-శార్దూల విక్రీడితము

పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడున్
మిత్రత్వంబున బుద్ధి చెప్పి దురితోన్మేషంబు వారింతు రే
శత్రుత్వంబుఁ దలంప రెట్టి యెడ నా సౌజన్యరత్నాకరుం
బుత్రున్ లోకపవిత్రుఁ దండ్రి నెగులుంబొందింప నెట్లోర్చెనో.

7-127-ఉత్పలమాల

బాలుఁ బ్రభావిశాలు హరిపాదపయోరుహచింతనక్రియా
లోలుఁ గృపాళు సాధుగురులోకపదానతఫాలు నిర్మల
శ్రీలు సమస్త సభ్యనుతశీలు విఖండితమోహవల్లికా
జాలు న దేల? తండ్రి వడిఁ జంపఁగఁ బంపె మునీంద్ర! చెప్పవే.

7-128-వచనము

అనిన నారదుం డిట్లనియె.

7-129-శార్దూల విక్రీడితము

లభ్యం బైన సురాధిరాజపదమున్ లక్షింపఁ డశ్రాంతమున్
సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁడై జాడ్యంబుతో వీఁడు వి
ద్యాభ్యాసంబునఁ గాని తీవ్రమతి గాఁ డంచున్ విచారించి దై
త్యేభ్యుం డొక్క దినంబునం బ్రియసుతున్ వీక్షించి నోత్కంఠుఁడై.

7-130-కంద పద్యము

చదువనివాఁ డజ్ఞుం డగు
జదివిన సదసద్వివేక చతురత గలుగుం
జదువఁగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ!

7-131-వచనము

అని పలికి యసురలోకపురోహితుండును భగవంతుండును నయిన శుక్రాచార్యకొడుకులఁ బ్రచండవితర్కులఁ జండామార్కుల రావించి సత్కరించి యిట్లనియె.

7-132-శార్దూల విక్రీడితము

అంధప్రక్రియ నున్నవాఁడు, పలుకండస్మత్ప్రతాపక్రియా
గంధం బించుక లేదు, మీరు గురువుల్ కారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు, మముంబాటించి యీబాలకున్
గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం గావించి రక్షింపరే.

7-133-వచనము

అని పలికి వారలకుఁ బ్రహ్లాదు నప్పగించి తోడ్కొని పొం డనిన వారును దనుజరాజకుమారునిం గొనిపోయి యతనికి సవయస్కులగు సహశ్రోతల నసురకుమారులం గొందఱం గూర్చి.

7-134-ఉత్పలమాల

అంచితభక్తితోడ దనుజాధిపు గేహసమీపమునం బ్రవే
శించి సురారిరాజసుతుఁ జేకొని శుక్రకుమారకుల్ పఠిం
పించిరి పాఠయోగ్యములు పెక్కులు శాస్త్రము లా కుమారుఁ డా
లించి పఠించె నన్నియుఁ జలింపని వైష్ణవభక్తిపూర్ణుఁడై.

7-135-కంద పద్యము

ఏ పగిది వారు చెప్పిన
నా పగిదిం జదువుఁగాని యట్టిట్టని యా
క్షేపింపఁడు తా నన్నియు
రూపించిన మిథ్య లని నిరూఢమనీషన్.

7-136-శార్దూల విక్రీడితము

అంతం గొన్ని దినంబు లేగిన సురేంద్రారాతి శంకాన్విత
స్వాంతుండై నిజనందనున్ గురువు లే జాడం బఠింపించిరో
భ్రాంతుం డేమి పఠించెనో పిలిచి సంభాషించి విద్యాపరి
శ్రాంతిం జూచెదఁ గాక నేఁ డని మహాసౌధాంతరాసీనుఁడై.

7-137-ఉత్పలమాల

మోదముతోడ దైత్యకులముఖ్యుడు రమ్మని చీరఁ బంచె బ్ర
హ్లాదకుమారకున్ భవమహార్ణవతారకుఁ గామ రోష లో
భాది విరోధివర్గ పరిహారకుఁ గేశవచింతనామృతా
స్వాద కఠోరకుం గలుషజాల మహోగ్రవనీకుఠారకున్.

7-138-వచనము

ఇట్లు చారులచేత నాహూయమానుం డై ప్రహ్లాదుండు చనుదెంచిన.

7-139-శార్దూల విక్రీడితము

ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమే యుద్యోగ? మారూఢ సం
విత్సంపన్ను(డ వైతివే? చదివితే వేదంబులున్ శాస్త్రముల్?
వత్సా రమ్మని చేర( జీరి కొడుకున్ వాత్సల్యసంపూర్ణు( డై
యుత్సంగాగ్రము( జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపగన్.

7-140-కంద పద్యము

అనుదిన సంతోషణములు,
జనితశ్రమతాపదుఃఖ సంశోషణముల్,
తనయుల సంభాషణములు,
జనకులకుం గర్ణయుగళ సద్భూషణముల్.

7-141-వచనము

అని మఱియు( "బుత్రా నీ కెయ్యది భద్రంబై యున్నది; చెప్పు" మనిన( గన్నతండ్రికి( బ్రియనందనుం డిట్లనియె.

7-142-ఉత్పలమాల

ఎల్ల శరీరధారులకు నిల్లను చీఁకటినూతిలోపలం
ద్రెళ్ళక మీరు నే మను మతిభ్రమణంబున భిన్ను లై ప్రవ
ర్తిల్లక సర్వమున్నతని దివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ!

7-143-వచనము

అని కుమారకుం డాడిన ప్రతిపక్షానురూపంబు లయిన సల్లాపంబులు విని దానవేంద్రుండు నగుచు నిట్లనియె.

7-144-కంద పద్యము

ఎట్టాడిన నట్టాడుదు
రిట్టట్టని పలుక నెఱుఁగ రితరుల శిశువుల్
దట్టించి యెవ్వ రేమని
పట్టించిరొ బాలకునకుఁ బరపక్షంబుల్

7-145-శార్దూల విక్రీడితము

నాకుం జూడఁగఁ జోద్య మయ్యెడిఁ గదా నా తండ్రి! యీ బుద్ధి దా
నీకున్ లోపలఁ దోఁచెనో? పరులు దుర్నీతుల్ పఠింపించిరో?
యేకాంతంబున భార్గవుల్ పలికిరో? యీ దానవశ్రేణికిన్
వైకుంఠుండు గృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కేటికిన్?

7-146-మత్తేభ విక్రీడితము

సురలం దోలుటయో, సురాధిపతులన్ స్రుక్కించుటో, సిద్ధులం
బరివేధించుటయో, మునిప్రవరులన్ బాధించుటో, యక్ష కి
న్నర గంధర్వ విహంగ నాగపతులన్ నాశంబు నొందించుటో,
హరి యంచున్ గిరియంచు నేల చెడ మోహాంధుండవై పుత్రకా!

7-147-వచనము

అనినఁ దండ్రిమాటలకుఁ బురోహితు నిరీక్షించి ప్రహ్లాదుం డిట్లనియె "మోహనిర్మూలనంబుజేసి యెవ్వనియందుఁ దత్పరులయిన యెఱుకగల పురుషులకుం బరులు దా మనియెడు మాయాకృతం బయిన యసద్గ్రాహ్యంబగు భేదంబు గానంబడ దట్టి పరమేశ్వరునకు నమస్కరించెద.

7-148-శార్దూల విక్రీడితము

అజ్ఞుల్ కొందఱు నేము దా మనుచు మాయం జెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలభ్యు దురన్వయక్రమణునిన్ భాషింపఁగా నేర రా
జిజ్ఞాసాపథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మాది వే
దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ దర్శింపఁగా నేర్తురే?

7-149-తేటగీతి

ఇను మయస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నా విధమునఁ
గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంత మగుచు.

7-150-సీస పద్యము

మందారమకరందమాధుర్యమునఁ దేలు;
 మధుపంబు వోవునే మదనములకు?
నిర్మల మందాకినీవీచికలఁ దూఁగు;
 రాయంచ జనునె తరంగిణులకు?
లలిత రసాలపల్లవ ఖాదియై చొక్కు;
 కోయిల చేరునే కుటజములకుఁ?
బూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరక;
 మరుగునే సాంద్రనీహారములకు?

7-150.1-తేటగీతి

నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త

చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు?
వినుతగుణశీల! మాటలు వేయునేల?

7-151-వచనము

అనిన విని రోషించి రాజసేవకుండైన పురోహితుండు ప్రహ్లాదుం జూచి తిరస్కరించి యిట్లనియె.

7-152-ఉత్పలమాల

పంచశరద్వయస్కుఁడవు బాలుఁ డవించుక గాని లేవు భా
షించెదు తర్కవాక్యములు, చెప్పిన శాస్త్రములోని యర్థ ము
క్కించుక యైనఁ జెప్ప వసురేంద్రుని ముందట, మాకు నోఁదలల్
వంచుకొనంగఁ జేసితివి వైరివిభూషణ! వంశదూషణా!

7-153-చంపకమాల

తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు దైత్య చం
దనవనమందుఁ గంటకయుతక్షితిజాతము భంగిఁ బుట్టినాఁ
డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి చేయుచుండు, దం
డనమునఁ గాని శిక్షలకు డాయఁడు పట్టుఁడు కొట్టుఁ డుద్ధతిన్.

7-154-కంద పద్యము

ఈ పాపనిఁ జదివింతుము
నీ పాదము లాన యింక నిపుణతతోడం
గోపింతుము దండింతుము
కోపింపకు మయ్య దనుజకుంజర! వింటే.

7-155-వచనము

అని మఱియును నారాచపాపనికి వివిధోపాయంబులం బురోహితుండు వెఱపుఁజూపుచు రాజసన్నిధిం బాపి తోడికొనిపోయి యేకాంతంబున.

7-156-కంద పద్యము

భార్గవనందనుఁ డతనికి
మార్గము చెడకుండఁ బెక్కు మాఱులు నిచ్చల్
వర్గత్రితయము చెప్పె న
నర్గళ మగు మతివిశేషమున నరేంద్రా!

7-157-వచనము

మఱియు గురుండు శిష్యునకు సామదానభేదదండోపాయంబు లన్నియు నెఱింగించి నీతికోవిదుండయ్యె నని నమ్మి నిశ్చయించి తల్లికి నెఱింగించి తల్లిచేత నలంకృతుం డయిన కులదీపకు నవలోకించి.

7-158-ఉత్పలమాల

త్రిప్పకు మన్న మా మతము, దీర్ఘములైన త్రివర్గపాఠముల్
దప్పకు మన్న, నేఁడు మన దైత్యవరేణ్యుని ముౘల నేము మున్
చెప్పినరీతి గాని మఱి చెప్పకు మన్న విరోధిశాస్త్రముల్,
విప్పకుమన్న దుష్టమగు విష్ణుచరిత్రకథార్థజాలముల్.

7-159-వచనము

అని బుజ్జగించి దానవేశ్వరుని సన్నిధికిం దోడితెచ్చిన.

7-160-సీస పద్యము

అడుగడ్డునకు మాధవానుచింతనసుధా;
మాధుర్యమున మేను మఱచువాని;
నంభోజగర్భాదు లభ్యసింపఁగ లేని;
హరిభక్తిపుంభావ మైనవాని;
మాతృగర్భముజొచ్చి మన్నది మొదలుగాఁ;
జిత్త మచ్యుతుమీఁదఁ జేర్చువాని;

నంకించి తనలోన నఖిలప్రపంచంబు;
శ్రీవిష్ణుమయ మని చెలఁగువాని;

7-160.1-తేటగీతి

వినయకారుణ్యబుద్ధివివేకలక్ష
ణాదిగుణముల కాటపట్టయినవాని;
శిష్యు బుధలోకసంభావ్యుఁ జీరి గురుఁడు
ముందటికి దొబ్బి తండ్రికి మ్రొక్కు మనుచు.

7-161-కంద పద్యము

శిక్షించితి మన్యము లగు
పక్షంబులు మాని నీతిపారగుఁ డయ్యెన్
రక్షోవంశాధీశ్వర!
వీక్షింపుము; నీ కుమారు విద్యాబలమున్.

7-162-వచనము

అని పలికిన శుక్రకుమారకు వచనంబు లాకర్ణించి దానవేంద్రుండు దనకు దండప్రణామంబుచేసి నిలుచున్న కొడుకును దీవించి బాహుదండంబులు చాచి దిగ్గనన్ డగ్గఱం దిగిచి గాఢాలింగనంబు చేసి తన తొడలమీఁద నిడుకొని చుంచు దువ్వి చిబుకంబుఁ బుడికి చెక్కిలి ముద్దుగొని శిరంబు మూర్కొని

ప్రేమాతిరేకసంజనిత బాష్ప సలిలబిందుసందోహంబుల నతని వదనారవిందంబుఁ దడుపుచు మందమధురాలాపంబుల నిట్లనియె.

7-163-శార్దూల విక్రీడితము

చోద్యంబయ్యెడి నింతకాల మరిగెన్ శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు చెప్పిరో? గురువు లేవెంటం బఠింపించిరో?
విద్యాసార మెఱుంగఁ గోరెద భవద్విజ్ఞాతశాస్త్రంబులోఁ
బద్యం బొక్కటి చెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా.

7-164-శార్దూల విక్రీడితము

నిన్నున్ మెచ్చరు నీతిపారమహిమన్ నీతోటి దైత్యార్భకుల్
కన్నా రన్నియుఁ జెప్ప నేర్తురు గదా గ్రంథార్థముల్ దక్షులై
యున్నా! యెన్నఁడు నీవు నీతివిదుఁ డౌ దంచున్ మహావాంఛతో
నున్నాఁడన్ ననుఁ గన్నతండ్రి భవదీయోత్కర్షముం జూపవే.

7-165-వచనము

అనినం గన్నతండ్రికిఁ బ్రియనందనుం డయిన ప్రహ్లాదుం డిట్లనియె.

7-166-కంద పద్యము

చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్య శాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మ మెల్లఁ జదివితిఁ దండ్రీ!

7-167-మత్తేభ విక్రీడితము

తనుహృద్భాషలసఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముఁ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలతున్ సత్యంబు దైత్యోత్తమా!

7-168-శార్దూల విక్రీడితము

అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థసంసారముల్.

7-169-సీస పద్యము

కమలాక్షు నర్చించు కరములు కరములు;
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ;

సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు;
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము;
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు;
మధువైరిఁ దవిలిన మనము మనము;
భగవంతు వలగొను పదములు పదములు;
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి;

7-169.1-తేటగీతి

దేవదేవుని చింతించు దినము దినము;
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు;
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు;
తండ్రి! హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి.

7-170-సీస పద్యము

కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే? ;
పవన గుంఫిత చర్మభస్త్రి గాక;
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే? ;
ఢమఢమధ్వనితోడి ఢక్క గాక;
హరిపూజనము లేని హస్తంబు హస్తమే? ;
తరుశాఖనిర్మిత దర్వి గాక?

కమలేశుఁ జూడని కన్నులు కన్నులే? ;
 తనుకుడ్యజాలరంధ్రములు గాక;

7-170.1-ఆటవెలది

చక్రిచింత లేని జన్మంబు జన్మమే?
తరళసలిలబుద్బుదంబు గాక;
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే?
పాదయుగముతోడి పశువు గాక.

7-171-సీస పద్యము

సంసారజీమూతసంఘంబు విచ్చునే? ;
 చక్రిదాస్యప్రభంజనము లేక;
తాపత్రయాభీలదావాగ్ని లాఱునే? ;
 విష్ణుసేవామృతవృష్టి లేక;
సర్వంకషాఘౌఘజలరాసు లింకునే? ;
 హరిమనీషాబడబాగ్ని లేక;
ఘనవిపద్గాఢాంధకారంబు లడగునే? ;
 పద్మాక్షునుతిరవిప్రభలు లేక;

7-171.1-తేటగీతి

నిరుపమాపునరావృత్తి నిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే? ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక
తామరసగర్భునకు నైన దానవేంద్ర!

7-172-వచనము

అని యివ్విధంబున వెఱపు మఱపు నెఱుంగక యులుకుచెడి పలికెడు కొడుకునుడువులు చెవులకు ములుకుల క్రియ నొదవినఁ గటములదరఁ బెదవులం గఱచుచు నదిరిపడి గురుసుతునిం గనుంగొని "విమతకథనంబులు గఱపినాఁడ" వని దానవేంద్రుం డిట్లనియె.

7-173-చంపకమాల

పటుతరనీతిశాస్త్రచయ పారగుఁ జేసెద నంచు బాలు నీ
వటు గొనిపోయి వానికి ననర్థము లైన విరోధిశాస్త్రముల్
కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండ వటంచు నమ్మితిన్
కటకట! బ్రాహ్మణాకృతివి గాక యథార్థపు బ్రాహ్మణుండవే?

7-174-కంద పద్యము

ధర్మేతరవర్తనులును
దుర్మంత్రులు నైన జనుల దురితము లొందున్

మర్మములు గలఁచి కల్మష
కర్ములఁ రోగములు వొందు కైవడి విప్రా!

7-175-వచనము

అనిన రాజునకుఁ బురోహితుం డిట్లనియె.

7-176-ఉత్పలమాల

తప్పులు లేవు మావలన దానవనాథ! విరోధిశాస్త్రముల్
చెప్పము క్రూరులై పరులు చెప్పరు మీ చరణంబులాన సు
మ్మెప్పుడు మీ కుమారునకు నింతయు నైజమనీష యెవ్వరుం
జెప్పెడిపాటి గాదు ప్రతిచింతఁ దలంపుము నేర్పుకైవడిన్.

7-177-కంద పద్యము

మిత్రులము పురోహితులము
పాత్రుల మే మదియుఁ గాక భార్గవులము నీ
పుత్రుని నిటువలెఁ జేయఁగ
శత్రులమే దైత్యజలధిచంద్రమ! వింటే.

7-178-వచనము

అనిన గురునందనుం గోపింపక దైత్యవల్లభుండు గొడుకు నవలోకించి యిట్లనియె.

7-179-కంద పద్యము

ఒజ్జలు చెప్పని యీ మతి
మజ్జాతుఁడవైన నీకు మఱి యెవ్వరిచే
నుజ్జాత మయ్యె బాలక!
తజ్జనులం బేరుకొనుము తగ నా మ్రోలన్.

7-180-వచనము

అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుం డిట్లనియె.

7-181-ఉత్పలమాల

అచ్చపుఁ జీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణు లైనవారికిం
జెచ్చరఁ బుట్టునే పరులు చెప్పిన నైన నిజేచ్ఛ నైన నే
మిచ్చిన నైనఁ గానలకు నేఁగిన నైన హరిప్రబోధముల్.

7-182-ఉత్పలమాల

కానని వాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్
గానని భంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁ, గొంద ఱటఁ గందుఁ రకించన వైష్ణవాంఘ్రిసం
స్థాన రజోభిషిక్తు లగు సంహృతకర్ములు దానవేశ్వరా!

7-183-శార్దూల విక్రీడితము

శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ! వే యేటికిన్
గాథల్ మాధవశేముషీతరణిసాంగత్యంబునం గాక దు
ర్మ్మధన్ దాఁటఁగ వచ్చునే సుతవధూమీనోగ్రవాంఛామద
క్రోధోల్లోల విశాల సంసృతిమహాఘోరామితాంభోనిధిన్.

7-184-వచనము

అని పలికిన కొడుకును ధిక్కరించి మక్కువచేయక రక్కసుల ఱేఁడు దన తొడలపై నుండనీక గొబ్బున దిగద్రొబ్బి నిబ్బరంబగు కోపంబు దీపింప వేఁడిచూపుల మింట మంట లెగయ మంత్రులం జూచి యిట్లనియె.

7-185-శార్దూల విక్రీడితము

క్రోడంబై పినతండ్రిఁ జంపె నని తాఁ గ్రోధించి చిత్తంబులో
వీడం జేయఁడు బంటుభంగి హరికిన్ విద్వేషికిన్ భక్తుఁడై

యోడం డక్కట! ప్రాణవాయువులు వీఁ డొప్పించుచున్నాఁడు నా
తోడన్ వైరముపట్టె నిట్టి జనకద్రోహిన్ మహిం గంటిరే.

## 7-7-ప్రహ్లాదుని హింసించుట

7-186-వచనము

అని రాక్షసుల నీక్షించి యిట్లనియె.

7-187-శార్దూల విక్రీడితము

పంచాబ్దంబులవాఁడు తండ్రి నగు నా పక్షంబు నిందించి య
త్యంచిద్భృతియు లేక విష్ణు నహితుం గీర్తించుచున్నాఁడు వ
ల్దంచుం జెప్పిన మానఁ డంగమునఁ బుత్త్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్ వీని వధించి రండు దనుజుల్ మీమీ పటుత్వంబులన్.

7-188-శార్దూల విక్రీడితము

అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్ష చేయు క్రియ నీ యజ్ఞుం గులద్రోహి దు
స్సంగుం గేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదం గులము నిర్దోషంబు గావించెదన్.

7-189-కంద పద్యము

హంతవ్యుఁడు రక్షింపను
మంతవ్యుఁడు గాడు యముని మందిరమునకున్
గంతవ్యుఁడు వధమున కుప
రంతవ్యుం డనక చంపి రం డీ పడుచున్.

7-190-వచనము

అని దానవేంద్రుం డానతిచ్చిన వాఁడికోఱలు గల రక్కసులు పెక్కండ్రు శూలహస్తులై వక్త్రంబులు దెఱచికొని యుబ్బి బొబ్బలిడుచు ధూమసహిత దావదహనంబునుం బోలె దామ్రసంకాశంబు లయిన కేశంబులు మెఱయ ఖేదనచ్ఛేదనవాదంబులు జేయుచు.

7-191-ఉత్పలమాల

బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్యసం
శీలుఁడు వీఁ డవధ్యుఁ డని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములం దదంగముల సుస్థిరులై ప్రహరించి రుగ్ర వా
చాలత నందఱున్ దివిజశత్రుఁడు వల్దనఁ డయ్యె భూవరా!

7-192-చంపకమాల

పలువురు దానవుల్ పొడువ బాలుని దేహము లేశమాత్రమున్
ఒలియదు లోపలన్ రుధిర ముబ్బదు కందదు శల్యసంఘమున్
నలియదు దృష్టివైభవము నష్టము గాదు ముఖేందుకాంతియుం
బొలియదు నూతనశ్రమము పుట్టదు పట్టదు దీనభావమున్.

7-193-ఉత్పలమాల

తన్నుఁ నిశాచరుల్ పొడువ దైత్యకుమారుఁడు మాటిమాటి కో!
పన్నగశాయి! యో! దనుజభంజన! యో! జగదీశ! యో! మహా
పన్నశరణ్య! యో! నిఖిలపావన! యంచు నుతించుఁ గాని తాఁ
గన్నుల నీరు దేఁడు భయకంపసమేతుఁడు గాఁడు భూవరా!

7-194-ఉత్పలమాల

పాఱఁడు లేచి దిక్కులకు; బాహువు లొడ్డఁడు; బంధురాజిలోఁ
దూఱఁడు; ఘోరకృత్య మని దూఱఁడు; తండ్రిని మిత్రవర్గముం
జీరఁడు; మాతృసంఘము వసించు సువర్ణగృహాంబులోనికిం
దాఱఁడు; కావరే యనఁడు; తాపము నొందఁడు; కంటగింపఁడున్.

7-195-వచనము

ఇట్లు సర్వాత్మకంబై యిట్టిదట్టి దని నిర్దేశింప రాని పరబ్రహ్మంబు దానయై యమ్మహావిష్ణుని యందుఁ జిత్తంబుజేర్చి తన్మయుం డయి పరమానందంబునం బొంది యున్న ప్రహ్లాదుని యందు రాక్షసేంద్రుండు దన కింకరులచేతం జేయించుచున్న మారణకర్మంబులు పాపకర్ముని యందుఁ బ్రయుక్తంబు లైన సత్కారంబులుం బోలె విఫలంబు లగుటం జూచి.

7-196-ఉత్పలమాల

శూలములన్ నిశాచరులు స్రుక్కక దేహము నిగ్రహింపఁగా
బాలుఁడు నేలపైఁ బడఁడు ప్రాణముఁ జావఁడు తండ్రినైన నా
పాలికి వచ్చి చక్రధరు పక్షము మానితి నంచుఁ బాదముల్
ఫాలము సోఁక మ్రొక్కఁ డనపాయత నొందుట కేమి హేతువో?

7-197-వచనము

అని శంకించుచు.

7-198-సీస పద్యము

ఒకమాటు దిక్కుంభియూధంబుఁ దెప్పించి;
 కెరలి డింభకునిఁ ద్రొక్కింపఁ బంపు;
నొకమాటు విషభీకరోరగశ్రేణుల;
 గడువడి నర్భకుఁ గఱవఁ బంపు;
నొకమాటు హేతిసంఘోగ్రానలములోన;
 విసరి కుమారుని ప్రేయఁ బంపు;
నొకమాటు కూలంకషోల్లోలజలధిలో;
 మొత్తించి శాబకు ముంపఁ బంపు;

7-198.1-ఆటవెలది

విషముఁ బెట్టఁ బంపు; విదళింపఁగాఁ బంపు;
దొడ్డకొండచఱులఁ ద్రోయఁ బంపుఁ;
బట్టి కట్టఁ బంపు; బాధింపఁగాఁ బంపు;
బాలుఁ గినిసి దనుజపాలుఁ డధిప!

7-199-సీస పద్యము

ఒకవేళ నభిచార హోమంబు చేయించు;
 నొకవేళ నెండల నుండఁ బంచు;
నొకవేళ వానల నుపహతి నొందించు;
 నొకవేళ రంధ్రంబు లుక్కఁ బట్టు;
నొకవేళఁ దన మాయ నొదవించి బెగడించు;

నొకవేళ మంచున నొంటి నిలుపు;
నొకవేళఁ బెనుగాలి కున్ముఖుఁ గావించు;
నొకవేళఁ బాఁతించు నుర్వి యందు;

7-199.1-తేటగీతి
నీరు నన్నంబు నిడనీక నిగ్రహించు;
గశల నడిపించు; ఉవ్వించు గండశిలల;
గదల వ్రేయించు; వేయించు ఘనశరములఁ;
గొడుకు నొకవేళ నమరారి క్రోధి యగుచు.

7-200-వచనము
మఱియు ననేక మారణోపాయంబులఁ బాపరహితుం డైన పాపని రూపుమాపలేక యేకాంతంబున దురంతచింతాపరిశ్రాంతుండయి రాక్షసేంద్రుండు దన మనంబున.

7-201-ఉత్పలమాల
ముంచితి వార్ధులన్, గదల మొత్తితి, శైలతటంబులందు ద్రొ
బ్బించితి, శస్త్రరాజిఁ బొడిపించితి, మీఁద నిభేంద్రపంక్తి ద్రొ
ప్పించితి; ధిక్కరించితి; శపించితి; ఘోరదవాగ్నులందుఁ ద్రో
యించితిఁ; బెక్కుపాట్ల నలయించితిఁ; జావఁ డి దేమి చిత్రమో

7-202-చంపకమాల

ఎఱుఁగఁడు జీవనౌషదము; లెవ్వరు భర్తలు లేరు; బాధలం
దఱలఁడు నైజ తేజమునఁ; దథ్యము జాడ్యము లేదు; మిక్కిలిన్
మెఱయుచు నున్నవాఁ; డొక నిమేషము దైన్యము నొందఁ డింక నే
తెఱఁగునఁ ద్రుంతు? వేసరితి; దివ్యము వీని ప్రభావ మెట్టిదో?

7-203-వచనము

అదియునుం గాక తొల్లి శునశ్శేఫుం డను మునికుమారుండు దండ్రి చేత యాగపశుత్వంబునకు దత్తుం డయి తండ్రి తనకు నపకారి యని తలంపక బ్రదికిన చందంబున.

7-204-కంద పద్యము

ఆగ్రహమునఁ నేఁ జేసిన
నిగ్రహములు పరులతోడ నెఱి నొకనాఁడున్
విగ్రహము లనుచుఁ బలుకఁ డ
నుగ్రహములుగా స్మరించు నొవ్వఁడు మదిలోన్.

7-205-వచనము

కావున వీఁడు మహాప్రభావసంపన్నుండు వీనికెందును భయంబు లేదు; వీనితోడి విరోధంబునం దనకు మృత్యువు సిద్ధించు నని నిర్ణయించి చిన్నఁబోయి ఖిన్నుండై ప్రసన్నుండు గాక క్రింది జూచుచు విషణ్ణుండై చింతనంబు జేయుచున్న రాజునకు మంతనంబునఁ జండామార్కు లిట్లనిరి.

7-206-శార్దూల విక్రీడితము

శుభ్రఖ్యాతివి నీ ప్రతాపము మహాచోద్యంబు దైత్యేంద్ర! రో
షభ్రూయుగ్మవిజృంభణంబున దిగీశవ్రాతముం బోరులన్
విభ్రాంతంబుగఁ జేసి యేలితి గదా విశ్వంబు వీఁ డెంత? యీ
దభ్రోక్తుల్ గుణదోషహేతువులు చింతం బొంద నీ కేటికిన్?

7-207-శార్దూల విక్రీడితము

వక్రుండైన జనుండు వృద్ధగురుసేవం జేసి మేధానయో
పక్రాంతిన్ విలసిల్లు మీఁదట వయఃపాకంబుతో బాలకున్
శక్రద్వేషణబుద్ధిఁ జేయుము మదిం జాలింపు మీ రోషమున్
శుక్రాచార్యులు వచ్చునంత కితఁడున్ సుశ్రీయుతుం డయ్యెడున్.

7-208-వచనము

అని గురుపుత్రులు పలికిన రాక్షసేశ్వరుండు "గృహస్థులైన రాజులకు నుపదేశింపఁ దగిన ధర్మార్థకామంబులు ప్రహ్లాదునకు నుపదేశింపుఁ" డని

యనుజ్ఞ జేసిన, వారు నతనికిఁ ద్రివర్గంబు నుపదేశించిన నతండు రాగద్వేషంబులచేత విషయాసక్తులైన వారలకు గ్రాహ్యంబు లైన ధర్మార్థకామంబులుఁ దనకు నగ్రాహ్యంబు లనియును వ్యవహార ప్రసిద్ధికొఱకైన భేదంబు గాని యాత్మభేదంబు లేదనియును ననర్థంబుల యందర్థకల్పన చేయుట దిగ్భ్రమం బనియు నిశ్చయించి, గురూపదిష్టశాస్త్రంబులు మంచివని తలంపక గురువులు దమ గృహస్థకర్మానుష్ఠానంబులకుం బోయిన సమయంబున.

7-209-కంద పద్యము

ఆటలకుఁ దన్ను రమ్మని
పాటించి నిశాటసుతులు భాషించిన దో
షాటకులేంద్రకుమారుఁడు
పాటవమున వారిఁ జీరి ప్రజ్ఞాన్వితుఁడై.

7-210-కంద పద్యము

చెప్పఁ డొక చదువు మంచిది
చెప్పెడిఁ దగులములు చెవులు చిందఱ గొనఁగాఁ
జెప్పెడు మన యెడ నొజ్జలు
చెప్పెద నొక చదువు వినుఁడు చిత్తము లలరన్.

7-211-వచనము

అని రాజకుమారుండు గావునఁ గరుణించి సంగడికాండ్రతోడ నగియెడి చందంబునఁ గ్రీడలాడుచు సమానవయస్కులైన దైత్యకుమారుల కెల్ల నేకాంతంబున నిట్లనియె.

7-212-ఉత్పలమాల

బాలకులార రండు మన ప్రాయపు బాలురు కొంద ఱుర్విపైఁ
గూలుట గంటిరే? గురుఁడు క్రూరుఁ డనర్థచయంబునందు దు
శ్శీలత నర్థకల్పనముఁ జేసెడి గ్రాహ్యము గాదు శాస్త్రమున్
మే లెఱిఁగించెదన్ వినిన మీకు నిరంతర భద్ర మయ్యెడిన్.

7-213-వచనము

వినుండు సకల జన్మంబు లందును ధర్మార్థాచరణకారణం బయిన మానుషజన్మంబు దుర్లభం; బందుఁ బురుషత్వంబు దుర్గమం; బదియు శతవర్షపరిమితంబైన జీవితకాలంబున నియతంబై యుండు; నందు సగ మంధకారబంధురం బయి రాత్రి రూపంబున నిద్రాది వ్యవహారంబుల నిరర్థకంబయి చను; చిక్కిన పంచాశద్వత్సరంబు లందును బాల కైశోర కౌమారాది వయోవిశేషంబుల వింశతి హాయనంబులు గడచు; కడమ ముప్పది యబ్దంబులు నింద్రియంబుల చేతఁ బట్టుపడి దురవగాహంబు లయిన కామ క్రోధ

లోభ మోహ మద మాత్సర్యంబులను పాశంబులం గట్టుపడి విడివడ సమర్థుండు గాక ప్రాణంబులకంటె మధురాయమాన యైన తృష్ణకు లోనై భృత్య తస్కర వణిక్కర్మంబులఁ బ్రాణహాని యైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు, రహస్యసంభోగచాతుర్య సౌందర్యవిశేషంబుల ధైర్యవల్లికాలవిత్రంబు లయిన కళత్రంబులను, మహనీయమంజుల మధురాలాపంబులు గలిగి వశులయిన శిశువులను, శీలవయోరూపధన్య లగు కన్యలను, వినయవివేకవిద్యాలంకారు లయిన కుమారులను, గామిత ఫలప్రదాతలగు భ్రాతలను, మమత్వప్రేమద్దైన్యజనకు లయిన జననీజనకులను, సకలసౌజన్యసింధువు లయిన బంధువులను, ధన కనక వస్తు వాహన సుందరంబు లయిన మందిరంబులను, సుకరంబు లైన పశు భృత్య నికరంబులను, వంశపరంపరాయత్తంబు లయిన విత్తంబులను వర్జింపలేక, సంసారంబు నిర్జించు నుపాయంబుఁ గానక, తంతువర్గంబున నిర్గమద్వారశూన్యం బయిన మందిరంబుఁ జేరి చుట్టుపడి వెడలెడి పాటవంబు చాలక తగులుపడు కీటకంబు చందంబున గృహస్థుండు స్వయంకృతకర్మ బద్ధుండై శిశ్నోదరాది సుఖంబుల బ్రమత్తుండయి నిజకుటుంబపోషణ పారవశ్యంబున విరక్తిమార్గంబు దెలియనేరక, స్వకీయపరకీయభిన్న భావంబున నంధకారంబునం బ్రవేశించుం; గావునఁ గౌమార సమయంబున మనీషా గరిష్ఠుండై పరమ భాగవతధర్మంబు లనుష్ఠింప వలయు; దుఃఖంబులు వాంఛితంబులు గాక చేకుఱుభంగి సుఖంబులును గాలానుసారంబులై లబ్దంబులగుం; గావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు జేయం జనదు; హరిభజనంబున మోక్షంబు సిద్ధించు; విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు; ముముక్షువైన దేహికి దేహావసానపర్యంతంబు నారాయణచరణారవింద సేవనంబు కర్తవ్యంబు.

7-214-సీస పద్యము

కంటిరే మనవారు ఘనులు గృహస్థులై;
 విఫలులై కైకొన్న వెట్టితనము;
భద్రార్థులై యుండి పాయరు సంసార;
 పద్ధతి నూరక పట్టుబడిరి;
కలయోనులం దెల్ల గర్భాద్యవస్థలఁ;
 బురుషుండు దేహి యై పుట్టుచుండుఁ
దన్నెఱుంగఁడు కర్మతంత్రుఁడై కడపట;
 ముట్టఁడు భవశతములకు నయిన

7-214.1-ఆటవెలది

దీన శుభము లేదు దివ్యకీర్తియు లేదు
జగతిఁ బుట్టి పుట్టి చచ్చి చచ్చి
పొరల నేల మనకుఁ బుట్టని చావని
త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి.

7-215-శార్దూల విక్రీడితము

హాలాపానవిజృంభమాణ మదగర్వాతీత దేహోల్లస
ద్బాలాలోకన శృంఖలానిచయ సంబద్ధాత్ముఁడై లేశమున్

వేలానిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడుం గామినీ
హేలాకృష్ట కురంగశాబక మగున్ హీనస్థితిన్ వింటిరే.

7-216-ఆటవెలది

విషయసక్తులైన విబుధాహితులతోడి
మునికి వలదు ముక్తిమార్గవాంఛ
నాదిదేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త
సంగజనులఁ గూడి శైశవమున.

7-217-వచనము

కావున విషయంబులఁ జిక్కుపడిన రక్కసులకు హరిభజనంబు శక్యంబుగాదు; రమ్యమయ్యును బహుతరప్రయాసగమ్య మని తలంచితిరేనిఁ జెప్పెద; సర్వభూతాత్మకుండై సర్వదిక్కాలసిద్ధుండై బ్రహ్మ కడపలగాఁగల చరాచరస్థూల సూక్ష్మజీవసంఘుంబులందును నభోవాయు కుంభినీ సలిలతేజంబు లనియెడు మహాభూతంబుల యందును భూతవికారంబు లయిన ఘటపటాదుల యందును గుణసామ్యం బయిన ప్రధానమందును గుణవ్యతికరంబైన మహత్తత్త్వాది యందును రజస్సత్త్వతమోగుణంబుల యందును భగవంతుం డవ్యయుం డీశ్వరుండు పరమాత్మ పరబ్రహ్మ మనియెడు వాచకశబ్దంబులు గల్గి కేవలానుభవానంద స్వరూపకుండు నవికల్పితుండు ననిర్దేశ్యుండు నయిన పరమేశ్వరుండు త్రిగుణాత్మకంబైన తన దివ్యమాయచేత నంతర్హితైశ్వరుండై వ్యాప్యవ్యాపకరూపంబులం జేసి దృశ్యుండును ద్రష్టయు, భోగ్యుండును భోక్తయు

నయి నిర్దేశింపందగి వికల్పితుండై యుండు; తత్కారణంబున నాసురభావంబు విడిచి సర్వభూతంబు లందును దయాసుహృద్భావంబులు గర్తవ్యంబులు; దయాసుహృద్భావంబులు గల్గిన నధోక్షజుండు సంతసించు; అనంతుం డాద్యుండు హరి సంతసించిన నలభ్యం బెయ్యదియు లేదు; జనార్దన చరణసరసీరుహాయుగళ స్మరణ సుధారస పానపరవశుల మైతిమేని మనకు దైవవశంబున నకాంక్షితంబులై సిద్ధించు ధర్మార్థ కామంబులుఁ గాంక్షితంబై సిద్ధించు మోక్షంబు నేల? త్రివర్గంబును నాత్మవిద్యయుం దర్క దండనీతి జీవికాదు లన్నియుఁ ద్రైగుణ్య విషయంబులైన వేదంబువలనం బ్రతిపాద్యంబులు; నిస్త్రైగుణ్యలక్షణంబునం బరమపురుషుండైన హరికి నాత్మసమర్పణంబుజేయుట మేలు; పరమాత్మతత్త్వ జ్ఞానోదయంబునం జేసి స్వపరభ్రాంతి జేయక పురుషుండు యోగావధూతత్త్వంబున నాత్మవికల్పభేదంబునం గలలోఁ గన్న విశేషంబులభంగిం దథ్యం బనక మిథ్య యని తలంచు" నని మఱియు ప్రహ్లాదుం డిట్లనియె.

7-218-మత్తేభ విక్రీడితము

నరుఁడుం దానును మైత్రితో మెలఁగుచున్ నారాయణుం డింతయున్
వరుసన్ నారదసంయమీశ్వరునకున్ వ్యాఖ్యానముం జేసె మున్;
హరిభక్తాంఘ్రిపరాగ శుద్ధతను లేకాంతుల్ మహాకించనుల్
పరతత్త్వజ్ఞులు గాని నేరరు మదిన్ భావింప నీ జ్ఞానమున్.

7-219-వచనము

తొల్లి నేను దివ్యదృష్టి గల నారదమహామునివలన సవిశేషంబయిన యీ జ్ఞానంబును బరమభాగవతధర్మంబును వింటి" ననిన వెఱఁగు పడి దైత్యబాలకు లద్దనుజరాజకుమారున కిట్లనిరి.

7-220-ఉత్పలమాల

మంటిమి కూడి, భార్గవకుమారకులొద్ద ననేకశాస్త్రముల్
వింటిమి. లేఁడు సద్గురుఁడు వేఱొకఁ డెన్నఁడు, రాజశాల ము
క్కంటికి నైన రాదు చొరఁగా, వెలికిం జన రాదు, నీకు ని
ష్కంటకవృత్తి నెవ్వఁడు ప్రగల్భుఁడు చెప్పె? గుణాఢ్య! చెప్పుమా.

7-221-కంద పద్యము

సేవింతుము నిన్నెప్పుడు
భావింతుము రాజ వనుచు బహుమానములం
గావింతుము తెలియము నీ
కీ వింతమతిప్రకాశ మే క్రియఁ గలిగెన్.

7-222-వచనము

అని యిట్లు దైత్యనందనులు దన్నడిగినఁ బరమభాగవతకులాలంకారుండైన ప్రహ్లాదుండు నగి తనకుఁ బూర్వంబునందు వినంబడిన నారదు మాటలు దలంచి యిట్లనియె.

## 7-8-ప్రహ్లాదుని జన్మంబు

### 7-223-శార్దూల విక్రీడితము

అక్షీణోగ్రతపంబు మందరముపై నర్థించి మా తండ్రి శు
ద్ధక్షాంతిం జని యుండఁ జీమగమిచేతన్ భోగి చందంబునన్
భక్షింపం బడెఁ బూర్వపాపములచేఁ బాపాత్మకుం డంచు మున్
రక్షస్సంఘముమీఁద నిర్జరులు సంరంభించి యుద్ధార్థులై.

### 7-224-శార్దూల విక్రీడితము

ప్రస్థానోచిత భేరిభాంకృతులతోఁ బాకారియుం దారు శౌ
ర్యస్థైర్యంబుల నేగుదెంచినఁ దదీయాటోపవిభ్రాంతులై
స్వస్థేమల్ దిగనాడి పుత్రధనయోషామిత్రసంపత్కళా
ప్రస్థానంబులు డించి పాఱి రసురుల్ ప్రాణావనోద్యుక్తులై.

### 7-225-మత్తకోకిలము

ప్రల్లదంబున వేల్పు లుద్ధతిఁ బాఱి రాజనివాసముం
గొల్ల బెట్టి సమస్తవిత్తముఁ గ్రూరతం గొని పోవఁగా
నిల్లు చొచ్చి విశంకుఁడై యమరేశ్వరుం డదలించి మా
తల్లిఁ దాఁ జెఱఁబట్టె సిగ్గునఁ దప్తయై విలపింపఁగాన్.

7-226-వచనము

ఇట్లు సురేంద్రుండు మా తల్లిం జెఱగొని పోవుచుండ నమ్ముగుద కురరి యను పులుఁగుక్రియ మొఱలిడినఁ దెరువున దైవయోగంబున నారదుండు పొడఁగని యిట్లనియె.

7-227-ఉత్పలమాల

స్వర్భువనాధినాథ! సురసత్తమ! వేల్పులలోన మిక్కలిన్
నిర్భరపుణ్యమూర్తివి సునీతివి మానినిఁ బట్ట నేల యీ
గర్భిణి నాతురన్ విడువు కల్మషమానసురాలు గాదు నీ
దుర్భరరోషమున్ నిలుపు దుర్జయుఁ డైన నిలింపవైరి పై.

7-228-వచనము

అనిన వేల్పుఁ దపసికి వేయిగన్నులు గల గఱువ యిట్లనియె.

7-229-ఉత్పలమాల

అంతనిధాన మైన దితిజాధిపువీర్యము దీని కుక్షి న
త్యంతసమృద్ధి నొందెడి మహాత్మక! కావునఁ దత్ప్రసూతి ప

ర్యంతము బద్ధఁ జేసి జనితార్భకు వజ్రముధారఁ ద్రుంచి ని
శ్చింతుఁడనై తుదిన్ విడుతు సిద్ధము దానవరాజవల్లభన్.

7-230-వచనము

అని పలికిన వేల్పులఱేనికిం దపసి యిట్లనియె.

7-231-శార్దూల విక్రీడితము

నిర్భీతుండు ప్రశస్తభాగవతుఁడున్ నిర్వైరి జన్మాంతరా
విర్భూతాచ్యుతపాదభక్తి మహిమావిష్టుండు దైత్యాంగనా
గర్భస్థుం డగు బాలకుండు బహుసంగ్రామాద్యుపాయంబులన్
దుర్భావంబునఁ బొంది చావఁడు భవద్దోర్దండవిభ్రాంతుఁ డై.

7-232-వచనము

అని దేవముని నిర్దేశించిన నతని వచనంబు మన్నించి తానును హరిభక్తుండు గావున దేవేంద్రుండు భక్తి బాంధవంబున మా యవ్వను విడిచి వలగొని సురలోకంబునకుం జనియె; మునీంద్రుండును మజ్జనని యందుఁ బుత్రికాభావంబు జేసి యూఱడించి; నిజాశ్రమంబునకుం గొనిపోయి "నీవు పతివ్రతవు, నీ యుదరంబునఁ బరమభాగవతుండయిన ప్రాణి యున్నవాఁడు తపోమహత్త్వంబునం గృతార్థుండై నీ పెనిమిటి రాఁగలం; డందాక నీ విక్కడ నుండు" మనిన సమ్మతించి.

7-233-శార్దూల విక్రీడితము

యోషారత్నము నాథదైవత విశాలోద్యోగ మా తల్లి ని
ర్దోషమ్యంబున నాథురాక మదిలో వాంఛించి నిర్దోష యై
యూషద్భీతియు లేక గర్భపరిరక్షేచ్ఛన్ విచారించి శు
శ్రూషల్ చేయుచు నుండె నారదునకున్ సువ్యక్తశీలంబునన్.

7-234-వచనము

ఇట్లు దనకుఁ బరిచర్య జేయుచున్న దైత్యరాజకుటుంబినికి నాశ్రితరక్షావిశారదుం డైన నారదుండు నిజసామర్థ్యంబున నభయం బిచ్చి గర్భస్థుండ నైన నన్ను నుద్దేశించి ధర్మతత్త్వంబును నిర్మలజ్ఞానంబును నుపదేశించిన, నమ్ముద్దియ దద్దయుం బెద్దకాలంబునాఁటి వినికి గావున నాడుది యగుటం జేసి పరిపాటి దప్పి సూటి లేక మఱచె; నారదుఁడు నా యెడఁ గృప గల నిమిత్తంబున.

7-235-కంద పద్యము

వెల్లిగొని నాఁటనుండియు
నుల్లసితం బైన దైవయోగంబున శో
భిల్లెడు మునిమత మంతయు
నుల్లంబున మఱపు పుట్ట దొకనాఁ డైనన్.

7-236-ఆటవెలది

వినుఁడు నాదు పలుకు విశ్వసించితిరేని
సతుల కయిన బాల జనుల కయినఁ
దెలియ వచ్చు మేలు దేహాద్యహంకార
దళననిపుణ మైన తపసిమతము.

7-237-వచనము

అని నారదోక్త ప్రకారంబున బాలకులకుఁ బ్రహ్లాదుం డిట్లనియె; ఈశ్వరమూర్తి యైన కాలంబునం జేసి వృక్షంబు గలుగుచుండ ఫలంబునకు జన్మసంస్థానవర్ధనాపచయక్షీణత్వ పరిపాకనాశంబులు ప్రాప్తంబు లయిన తెఱంగున దేహంబులకుం గాని షడ్భావవికారంబు లాత్మకు లేవు; ఆత్మ నిత్యుండు క్షయరహితుండు శుద్ధుండు క్షేత్రజ్ఞుండు గగనాదులకు నాశ్రయుండుఁ గ్రియాశూన్యుండు స్వప్రకాశుండు సృష్టిహేతువు వ్యాపకుండు నిస్సంగుండుఁ బరిపూర్ణుండు నొక్కండు నని వివేకసమర్థంబు లగు నాత్మలక్షణంబులు పండ్రెండు నెఱుంగుచు, దేహాదులందు మోహజనకంబు లగు నహంకారమమ కారంబులు విడిచి పసిండిగనులు గల నెలవున విభ్రాజమానకనక లేశంబులైన పాషాణాదులందుఁ బుటంబుపెట్టి వహ్నియోగంబున గరంగ నూది హేమకారకుండు పాటవంబున హాటకంబుఁ బడయు భంగి నాత్మకృత కార్యకారణంబుల నెఱింగెడి నేర్పరి దేహంబునం దాత్మసిద్ధికొఱకు నయిన యుపాయంబునం జేసి బ్రహ్మభావంబుఁ బడయు; మూలప్రకృతియు

మహదహంకారంబులును బంచతన్మాత్రంబులు నివి యెనిమిదియుం బ్రకృతు లనియును, రజస్సత్త్వతమంబులు మూఁడును బ్రకృతిగుణంబు లనియుఁ, గర్మేంద్రియంబులయిన వాక్పాణిపాదపాయూపస్థంబులును జ్ఞానేంద్రియంబులైన శ్రవణ నయనరసనాత్వగ్ఘ్రాణంబులును మనంబును మహీసలిలతేజో వాయుగగనంబులును నివి పదాఱును వికారంబు లనియును, గపిలాది పూర్వాచార్యులచేతఁ జెప్పఁబడియె; సాక్షిత్వంబున నీ యిరువదే డింటిని నాత్మగూడి యుండు; పెక్కింటి కూటువ దేహ; మదియు జంగమస్థావరరూపంబుల రెండువిధంబు లయ్యె; మూలప్రకృతి మొదలయిన వర్గంబునకు వేఱై మణిగణంబులఁ జొచ్చి యున్న సూత్రంబు చందంబున నాత్మ యన్నింటి యందునుంజొచ్చి దీపించు; ఆత్మకు జన్మస్థితిలయంబులు గల వంచు మిథ్యాతత్పరులు గాక వివేకశుద్ధమైన మనంబునం జేసి దేహంబునం దాత్మ వెదకవలయు; ఆత్మకు నవస్థలు గలయట్లుండుఁ గాని యవస్థలు లేవు జాగరణ స్వప్నసుషుప్తులను వృత్తు లెవ్వనిచేత నెఱుంగంబడు నతం డాత్మ యండ్రు; కుసుమ ధర్మంబు లయిన గంధంబుల చేత గంధాశ్రయు డయిన వాయువు నెఱింగెడు భంగిం ద్రిగుణాత్మకంబులయి కర్మ జన్యంబు లయిన బుద్ధి భేదంబుల నాత్మ నెఱుంగం దగు" నని చెప్పి.

7-238-సీస పద్యము

సంసార మిది బుద్ధిసాధ్యము గుణకర్మ;

గణబద్ధ మజ్ఞానకారణంబుఁ

గలవంటి దింతియుకాని నిక్కముగాదు;

సర్వార్థములు మనస్సంభవములు
స్వప్న జాగరములు సమములు గుణశూన్యుఁ;
డగు పరమునికి, గుణాశ్రయమున
భవవినాశంబులు వాటిల్లి నట్లుండుఁ;
బట్టి చూచిన లేవు బాలులార!

7-238.1-తేటగీతి

కడఁగి త్రిగుణాత్మకము లైన కర్మములకు
జనకమై వచ్చునజ్ఞానసముదయమును
ఘనతరజ్ఞానవహ్నిచేఁ గాల్చి పుచ్చి
కర్మవిరహితు లై హరిఁ గనుట మేలు.

7-239-వచనము

అది గావున, గురుశుశ్రూషయు సర్వలాభసమర్పణంబును సాధుజన సంగమంబును నీశ్వరప్రతిమా సమారాధనంబును హరికథా తత్పరత్వంబును వాసుదేవుని యందలి ప్రేమయు నారాయణ గుణకర్మకథానామకీర్తనంబును వైకుంఠచరణకమలధ్యానంబును విశ్వంభరమూర్తి విలోకనపూజనంబును మొదలయిన విజ్ఞానవైరాగ్య లాభసాధనంబు లైన భాగవతధర్మంబులపై రతి గలిగి సర్వభూతంబుల యందు నీశ్వరుండు భగవంతుం డాత్మ గలండని సమ్మానంబు జేయుచుఁ గామక్రోధలోభమోహమదమత్సరంబులం గెలిచి యింద్రియవర్గంబును బంధించి భక్తి చేయుచుండ నీశ్వరుం డయిన విష్ణుదేవుని యందలి రతి సిద్ధించు.

7-240-సీస పద్యము

దనుజారి లీలావతారంబు లందలి;
 శౌర్యకర్మంబులు సద్గుణములు
విని భక్తుఁ డగువాఁడు వేడ్కతోఁ బులకించి;
 కన్నుల హర్షాశ్రుకణము లొలుక
గద్గదస్వరముతోఁ గమలాక్ష! వైకుంఠ! ;
 వరద! నారాయణ! వాసుదేవ!
యనుచు నెత్తిలిపాడు నాడు నాక్రోశించు;
 నగుఁ జింతనము జేయు నతి యొనర్చు

7-240.1-తేటగీతి

మరులు కొని యుండుఁ దనలోన మాటలాడు
వేల్పు సోఁకిన పురుషుని వృత్తి దిరుగు
బంధములఁ బాసి యజ్ఞానపటలిఁ గాల్చి
విష్ణుఁ బ్రాపించుఁ దుది భక్తి వివశుఁ డగుచు.

7-241-వచనము

కావున, రాగాదియుక్తమనస్కుం డయిన శరీరికి సంసారచక్రనివర్తకం బయిన హరిచింతనంబు బ్రహ్మమందలి నిర్వాణసుఖం బెట్టిదట్టిదని బుధులు

దెలియుదురు; హరిభజనంబు దుర్గమంబుగాదు; హరి సకల ప్రాణిహృదయంబుల యందు నంతర్యామియై యాకాశంబు భంగి నుండు; విషయార్జనంబుల నయ్యెడిది లేదు; నిమిషభంగుర ప్రాణు లయిన మర్త్యులకు మమతాస్పదంబులును జంచలంబులును నైన పుత్ర మిత్ర కళత్ర పశు భృత్య బల బంధు రాజ్య కోశ మణి మందిర మంత్రి మాంతంగ మహీ ప్రముఖ విభవంబులు నిరర్థకంబులు; యాగ ప్రముఖపుణ్యలబ్ధంబులైన స్వర్గాదిలోక భోగంబులు పుణ్యానుభవక్షీణంబులు గాని నిత్యంబులు గావు; నరుండు విద్వాంసుండ నని యభిమానించి కర్మంబు లాచరించి యమోఘంబు లయిన విపరీత ఫలంబుల నొందు; కర్మంబులు గోరక చేయవలయు; కోరి చేసిన దుఃఖంబులు ప్రాపించు; పురుషుండు దేహంబుకొఱకు భోగంబుల నపేక్షించు; దేహంబు నిత్యంబు కాదు తోడ రాదు; మృతం బైన దేహంబును శునకాదులు భక్షించు; దేహి కర్మంబు లాచరించి కర్మబద్ధుండయి క్రమ్మఱం గర్మానుకూలంబయిన దేహంబుఁ దాల్చు; అజ్ఞానంబునం జేసి పురుషుండు కర్మదేహంబుల విస్తరించు; అజ్ఞాన తంత్రంబులు ధర్మార్థ కామంబులు; జ్ఞాన లభ్యంబు మోక్షంబు; మోక్షప్రదాత యగు హరి సకల భూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు; తన చేత నయిన మహాభూతంబులతోడ జీవసంజ్ఞితుండై యుండు; నిష్కాములై హృదయగతుం డయిన హరిని నిజభక్తిని భజింపవలయు.

7-242-కంద పద్యము

దానవ దైత్య భుజంగమ
మానవ గంధర్వ సుర సమాజములో ల
క్ష్మీనాథుచరణకమల
ధ్యానంబున నెవ్వఁడయిన ధన్యత నొందున్.

7-243-కంద పద్యము

చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచశీలతపములం
జిక్కఁడు యుక్తిని భక్తిని
జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ!

7-244-కంద పద్యము

చాలదు భూదేవత్వము
చాలదు దేవత్వ మధిక శాంతత్వంబుం
జాలదు హరి మెప్పింప వి
శాలోద్యములార! భక్తి చాలిన భంగిన్.

7-245-ఆటవెలది

దనుజ భుజగ యక్ష దైత్య మృగాభీర
సుందరీ విహంగ శూద్ర శబరు

లైనఁ బాపజీవు లైన ముక్తికిఁ బోదు
రఖిలజగము విష్ణుఁ డనుచుఁ దలఁచి.

7-246-కంద పద్యము

గురువులు దమకును లోఁబడు
తెరువులు చెప్పెదరు విష్ణు దివ్యపదవికిం
దెరువులు చెప్పరు; చీఁకటిఁ
బరువులు పెట్టం గనేల బాలకులారా!

7-247-కంద పద్యము

తెం డెల్ల పుస్తకంబులు
నిం డాచార్యునకు మరల నేకతమునకున్
రండు విశేషము చెప్పెదఁ
బొం డొల్లనివారు కర్మపుంజము పాలై.

7-248-కంద పద్యము

ఆడుదము మనము హరిరతిఁ
బాడుద మే ప్రొద్దు విష్ణుభద్రయశంబుల్
వీడుదము దనుజసంగతిఁ
గూడుదము ముకుందభక్తికోటిన్ సూటిన్.

7-249-కంద పద్యము

విత్తము సంసృతిపటలము
వ్రత్తము కామాదివైరివర్గంబుల నేఁ
డిత్తము చిత్తము హరికిని
జొత్తము నిర్వాణపదము శుభ మగు మనకున్.

7-250-వచనము

అని యిట్లు ప్రహ్లాదుండు రహస్యంబున నయ్యైవేళల రాక్షస కుమారులకు నపవర్గమార్గం బెఱింగించిన; వారును గురుశిక్షితంబులైన చదువులు చాలించి నారాయణభక్తి చిత్తంబులం గీలించి యుండుటం జూచి వారల యేకాంతభావంబు దెలిసి వెఱచి వచ్చి శుక్రనందనుండు శక్రవైరి కిట్లనియె.

7-251-శార్దూల విక్రీడితము

రక్షోబాలుర నెల్ల నీ కొడుకు చేరం జీరి లోలోన నా
శిక్షామార్గము లెల్ల గల్ల లని యాక్షేపించి తా నందఱన్
మోక్షాయత్తులఁ జేసినాఁడు మనకున్ మోసంబు వాటిల్లె; నీ
దక్షత్వంబునఁ జక్కఁజేయవలయున్ దైతేయవంశాగ్రణీ!

7-252-కంద పద్యము

ఉల్లసిత విష్ణుకథనము
లెల్లప్పుడు మాఁకు జెప్పఁ డీ గురుఁ డని న
న్నుల్లంఘించి కుమారకు
లొల్లరు చదువంగ దానవోత్తమ! వింటే.

7-253-కంద పద్యము

ఉడుగఁడు మధురిపుకథనము
విడివడి జడుపగిదిఁ దిరుగు వికసనమున నే
నొడివిన నొడువులు నొడువఁడు
దుడుకనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా!

7-254-కంద పద్యము

చొక్కపు రక్కసికులమున
వెక్కురు జన్మించినాఁడు విష్ణునియందున్
నిక్కపు మక్కువ విడువం
డెక్కడి సుతుఁ గంటి రాక్షసేశ్వర! వెట్టిన్.

7-255-వచనము

అని యిట్లు గురుసుతుండు చెప్పినఁ గొడుకువలని విరోధవ్యవహారంబులు గర్ణరంధ్రంబుల ఖడ్గప్రహారంబులయి సోఁకిన; బిట్టు మిట్టిపడి పాదాహతంబైన భుజంగంబు భంగిఁ బవనప్రేరితంబైన దవానలంబు చందంబున దండతాడితంబయిన కంఠీరవంబుకైవడి భీషణ రోషరసావేశ జాజ్వల్యమానచిత్తుండును బుత్రసంహారోద్యోగాయత్తుండును గంపమానగాత్రుండును నరుణీకృతనేత్రుండునునై కొడుకును రప్పించి సమ్మానకృత్యంబులు దప్పించి నిర్దయుండై యశనిసంకాశ భాషణంబుల నదల్చుచు.

7-256-శార్దూల విక్రీడితము

సూనున్ శాంతగుణప్రధాను నతి సంశుద్ధాంచితజ్ఞాను న
జ్ఞానారణ్యకృశాను నంజలిపుటీ సంభ్రాజమానున్ సదా
శ్రీనారాయణపాదపద్మయుగళీ చింతామృతాస్వాద నా
ధీనున్ ధిక్కరణంబుజేసి పలికెన్ దేవాహితుం డుగ్రతన్.

7-257-సీస పద్యము

అస్మదీయం బగు నాదేశమునఁ గాని;
మిక్కిలి రవి మింట మెఱయ వెఱచు;

నన్ని కాలములందు ననుకూలుఁడై కాని;
 విద్వేషి యై గాలి వీవ వెఱచు;
మత్ప్రతాపానలమందీకృతార్చి యై;
 విచ్చలవిడి నగ్ని వెలుఁగ వెఱచు;
నతిశాత యైన నా యాజ్ఞ నుల్లంఘించి;
 శమనుండు ప్రాణులఁ జంప వెఱచు;

7-257.1-తేటగీతి

నింద్రుఁ డాదల నా మ్రోల నెత్త వెఱచు;
నమర కిన్నర గంధర్వ యక్ష విహగ
నాగ విద్యాధరావళి నాకు వెఱచు;
నేల వెఱువవు పలువ! నీ కేది దిక్కు.

7-258-శార్దూల విక్రీడితము

ప్రజ్ఞావంతులు లోకపాలకులు శుంభద్ద్వేషు లయ్యున్ మదీ
యాజ్ఞాభంగము చేయ నోడుదురు రోషాపాంగదృష్టిన్ వివే
కజ్ఞానచ్యుత మై జగత్త్రితయముం గంపించు నీ విట్టిచో
నాజ్ఞోల్లంఘన మెట్లు చేసితివి సాహంకారతన్ దుర్మతీ!

7-259-శార్దూల విక్రీడితము

కంఠక్షోభము గాఁగ నొత్తిలి మహాగాఢంబుగా డింభ! పై
కుంఠుం జెప్పెదు దుర్జయుం డనుచు వైకుంఠుండు వీరవ్రతో
త్కంఠాబంధురుఁ డేని నే నమరులన్ ఖండింప దండింపఁగా
గుంఠీభూతుఁడు గాక రావలదె మద్ఘోరాహవక్షోణికిన్.

7-260-శార్దూల విక్రీడితము

ఆచార్యోక్తముగాక బాలురకు మోక్షాసక్తిఁ బుట్టించి నీ
వాచాలత్వముఁ జూపి విష్ణు నహితున్ వర్ణించి మద్దైత్యవం
శాచారంబులు నీఱు చేసితివి మూఢాత్ముం గులద్రోహినిన్
నీచుం జంపుట మేలు చంపి కులమున్ నిర్దోషముం జేసెదన్.

7-261-కంద పద్యము

దిక్కులు గెలిచితి నన్నియు
దిక్కెవ్వఁడు? రోరి! నీకు దేవేంద్రాదుల్
దిక్కుల రాజులు వేఱొక
దిక్కెఱుఁగక కొలుతు రితఁడె దిక్కని నన్నున్.

7-262-కంద పద్యము

బలవంతుఁడ నే జగముల
బలములతోఁ జనక వీరభావమున మహా

బలుల జయించితి నెవ్వని
బలమున నాడెదవు నాకుఁ బ్రతివీరుఁడ వై.

7-263-వచనము

అనినఁ దండ్రికి మెల్లన వినయంబునఁ గొడు కిట్లనియె.

7-264-కంద పద్యము

బలయుతులకు దుర్బలులకు
బల మెవ్వఁడు? నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును
బల మెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా!

7-265-కంద పద్యము

దిక్కులు కాలముతో నే
దిక్కున లే కుండుఁ గలుగుఁ దిక్కుల మొదలై
దిక్కుగల లేని వారికి
దిక్కయ్యెడు వాఁడు నాకు దిక్కు మహాత్మా!

7-266-సీస పద్యము

కాలరూపంబులఁ గ్రమవిశేషంబుల;
నలఘుగుణాశ్రయుం డయిన విభుఁడు
సత్త్వబలేంద్రియ సహజప్రభావాత్ముఁ;
డై వినోదంబున నఖిలజగముఁ
గల్పించు రక్షించు ఖండించు నవ్యయుం;
డన్ని రూపము లందు నతఁడు గలఁడు
చిత్తంబు సమముగాఁ జేయుము మార్గంబుఁ;
దప్పి వర్తించు చిత్తంబుకంటె

7-266.1-తేటగీతి

పైరు లెవ్వరు చిత్తంబు పైరి గాఁక?
చిత్తమును నీకు వశముగాఁ జేయ వయ్య!
మదయుతాసురభావంబు మానవయ్య!
యయ్య! నీ మ్రోల మేలాడ రయ్య! జనులు.

7-267-ఉత్పలమాల

లోకము లన్నియున్ గడియలోన జయించినవాఁడ వింద్రియా
నీకముఁ జిత్తమున్ గెలువ నేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకర శత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేయుము ప్రాణికోటిలో
నీకు విరోధి లేఁ డొకఁడు నేర్పునఁ జూడుము దానవేశ్వరా!

7-268-కంద పద్యము

పాలింపుము శేముషి ను

న్మూలింపుము కర్మబంధముల సమదృష్టిం

జాలింపుము సంసారముఁ

గీలింపుము హృదయ మందుఁ గేశవభక్తిన్.

7-269-వచనము

అనినఁ బరమభాగవతశేఖరునకు దోషాచరశేఖరుం డిట్లనియె.

7-270-కంద పద్యము

చంపినఁ జచ్చెద ననుచును

గంపింపక యోరి! పలువ! కరినోక్తుల నన్

గుంపించెదు చావునకుం

దెంపరి యై వదరువాని తెఱఁగునఁ గుమతీ!

7-271-శార్దూల విక్రీడితము

నాతోడం బ్రతిభాషలాడెదు జగన్నాథుండ నా కంటె నీ

భూతశ్రేణికి రాజు లేఁ డొకఁడు; సంపూర్ణప్రభావుండు మ

ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిం బల్మాఱు నారాయణుం
డే తద్విశ్వములోన లేఁడు; మఱి వాఁ డెందుండురా? దుర్మతీ!

7-272-కంద పద్యము

ఎక్కడఁ గలఁ డే క్రియ నే
చక్కటి వర్తించు నెట్టి జాడను వచ్చుం
జక్కడఁతు నిన్ను విష్ణునిఁ
బెక్కులు ప్రేలెదవు వాని భృత్యుని పగిదిన్.

7-273-వచనము

అనిన హరికింకరుండు శంకింపక హర్షపులకాకుంర సంకలిత విగ్రహుండై యాగ్రహంబు లేక హృదయంబున హరిం దలంచి నమస్కరించి బాలవర్తనంబున నర్తనంబు జేయుచు నిట్లనియె.

7-274-మత్తేభ విక్రీడితము

కలఁ డంభోధిఁ, గలండు గాలిఁ, గలఁ డాకాశంబునం, గుంభినిం
గలఁ, డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం
గలఁ, డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గలఁ, డీశుండు గలండు, తండ్రి! వెదకంగా నేల యీ యా యెడన్.

7-275-కంద పద్యము

ఇందు గలఁ డందు లేఁ డని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెం దెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి! వింటే.

7-276-వచనము

అని యివ్విధంబున.

7-277-మత్తేభ విక్రీడితము

హరి సర్వాకృతులం గలం డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప స
త్వరుఁడై యెందును లేఁడు లేఁ డని సుతున్ దైత్యుండు తర్జింప శ్రీ
నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానా జంగమస్థావరో
త్కర గర్భంబుల నన్ని దేశముల నుద్దండప్రభావంబునన్.

7-278-వచనము

అయ్యవసరంబున నద్దానవేంద్రుండు.

7-279-కంద పద్యము

డింభక సర్వస్థలముల
నంభోరుహనేత్రుఁ డుండు ననుచు మిగుల సం
రంభంబునఁ బలికెద వీ
స్తంభంబునఁ జూపఁ గలవె చక్రిన్ గిక్రిన్.

7-280-కంద పద్యము

స్తంభమునఁ జూపవేనిం
గుంభిని నీ శిరముఁ ద్రుంచి కూల్పఁగ రక్షా
రంభమున వచ్చి హరి వి
స్రంభంబున నడ్డపడఁగ శక్తుండగునే.

7-281-వచనము

అనిన భక్తవత్సలుని భటుం డిట్లనియె.

7-282-శార్దూల విక్రీడితము

అంభోజాసనుఁ డాదిగాఁగ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబున నుండు ప్రోడ విపులస్తంభంబునం దుండడే?

స్తంభాంతర్గతుఁ డయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడు బ్రత్యక్షస్వరూపంబునన్.

7-283-వచనము

అనిన విని కరాళించి గ్రద్దన లేచి గద్దియ డిగ్గనుఱికి యొఱఁబెట్టిన ఖడ్గంబు పెఱికి కేల నమర్చి జళిపించుచు మహాభాగవతశిఖామణి యైన ప్రహ్లాదుని ధిక్కరించుచు.

7-284-మత్తేభ విక్రీడితము

వినరా డింభక! మూఢచిత్త! గరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం
డని భాషించెద; వైన నిందుఁ గలఁడే యంచున్ మదోద్రేకియై
దనుజేంద్రుం డరచేత వ్రేసెను మహోదగ్రప్రభాశుంభమున్
జనదృగ్భీషణదంభమున్ హరిజనుస్సంరంభమున్ స్తంభమున్.

## 7-9-నృసింహరూపావిర్భావము

7-285-వచనము

ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణ వైరుండును, వైరానుబంధ జాజ్వల్యమాన రోషానలుండును, రోషానలజంఘన్యమాన విజ్ఞాన వినయుండును, వినయగాంభీర్యధైర్య జేగీయమాన హృదయుండును హృదయ చాంచల్యమాన తామసుండును, తామస గుణచంక్రమ్యమాణ స్థైర్యుండును నై విస్రంభంబున

హుంకరించి బాలుని ధిక్కరించి హరి నిందుఁ జూపు మని
కనత్కనకమణిమయకంకణక్రేంకార శబ్దపూర్వకంబుగా దిగ్దంతిదంత భేదన పాటవ
ప్రశస్తం బగు హస్తంబున సభామండప స్తంభంబు వ్రేసిన వ్రేటుతోడన దశదిశలను
మిడుంగురులు చెదరం జిటిలి పెటిలిపడి బంభజ్యమానం బగు
నమ్మహాస్తంభంబువలనఁ బ్రళయవేళాసంభూత సప్తస్కంధబంధుర సమీరణ
సంఘటితఘోరరజోఘుష్యమాణ మహావలాహకవర్గనిర్గత నిబిడ
నిష్ఠురదుస్సహనిర్ఘాతసంఘనిర్ఘోషనికాశంబు లయిన ఛటచ్ఛట స్ఫటస్ఫటధ్వని
ప్రముఖ భయంకరారావపుంజంబులు జంజన్య మానంబులై యెగసి
యాకాశకుహరాంతరాళంబు నిరవకాశంబు జేసి నిండినం బట్టుచాలక
దోధూయమానహృదయంబులయి పరవశంబులైన పితామహ మహేంద్ర వరుణ
వాయు శిఖిముఖర చరాచర జంతుజాలంబులతోడ బ్రహ్మాండకటాహంబు పగిలి
పరిస్ఫోటితంబుగాఁ బ్రఫుల్లపద్మయుగళ సంకాశభాస్వర చక్ర చాప హల కులిశ
జలచర రేఖాంకిత చారు చరణతలుండును, చరణచంక్రమణ ఘునవినమిత
విశ్వంభరాభార ధౌరేయదిక్కుంభికుంభీనస కుంభినీధర కూర్మకులశేఖరుండును,
దుగ్ధజలధిజాత శుండాల శుండా దండమండిత ప్రకాండ ప్రచండ మహోరుస్తంభ
యుగళుండును, ఘుణఘుణాయమాన మణికింకిణీగణముఖరిత
మేఖలావలయవలయిత పీతాంబరశోభితకటిప్రదేశుండును,
నిర్జరనిమ్నగావర్తవర్తుల కమలాకరగంభీర నాభివివరుండును,
ముష్టిపరిమేయవినుత తనుతరస్నిగ్ధ మధ్యుండును, కులాచల సానుభాగ సదృశ
కర్కశవిశాల వక్షుండును, దుర్జనదనుజభట ధైర్యలతికాలవిత్రాయమాణ రక్షోరాజ
వక్షోభాగ విశంకటక్షేత్ర విలేఖనచంగలాంగలాయమాన ప్రతాపజ్వల
జ్వాలాయమాన శరణాగతనయనచకోరచంద్రరేఖాయమాణ వజ్రాయుధ ప్రతిమాన

భాసమాన నిశాతనఖరతర ముఖనఖరుండును, శంఖ చక్ర గదా ఖడ్గ కుంత తోమర ప్రముఖ నానాయుధమహిత మహోత్తుంగ మహీధరశృంగసన్నిభ వీరసాగరవేలాయమాన మాలికా విరాజమాన నిరర్గళానేకశత భుజార్గళుండును, మంజు మంజీర మణిపుంజ రంజిత మంజుల హార కేయూర కంకణ కిరీట మకర కుండలాది భూషణభూషితుండును, త్రివళీయుత శిఖరిశిఖరాభ పరిణద్ధ బంధురకంధరుండును, ప్రకంపనకంపిత పారిజాతపాదపల్లవ ప్రతీకాశ కోపావేశ సంచలితాధరుండును, శరత్కాల మేఘజాలమధ్య ధగద్ధగాయమాన తటిల్లతాసమాన దేదీప్యమాన దంష్ట్రాంకురుండును, కల్పాంతకాల సకలభువనగ్రసన విజృంభమాణ సప్తజిహ్వ జిహ్వాతులిత తరళతరాయమాణ విభ్రాజమానజిహ్వుండును, మేరు మందర మహాగుహాంతరాళవిస్తార విపుల వక్త్రనాసికారంధ్రుండును, నాసికారంధ్ర నిస్సరన్నిబిడనిశ్వాసనికర సంఘట్టన సంక్షోభిత సంతప్యమాన సప్తసాగరుండును, పూర్వపర్వత విద్యోతమాన ఖద్యోత మండలసదృక్ష సముంచితలోచనుండును, లోచనాంచలసముత్కీర్యమాణ విలోలకీలాభీల విస్ఫులింగ వితానరోరుధ్యమాన తారకాగ్రహమండలుండును, శక్రచాప సురుచిరాదభ్ర మహాభ్రూలతా బంధ బంధురభయంకర వదనుండును, ఘనతర గండశైలతుల్య కమనీయగండభాగుండును, సంధ్యారాగ రక్తధారాధర మాలికాప్రతిమ మహాభ్రంకష తంతన్యమాన పటుతర సటాజాలుండును సటాజాల సంచాలసంజాత వాత డోలాయమాన వైమానిక విమానుండును, నిష్కంపిత శంఖవర్ణమహోర్ధ్వ కర్ణుండును, మంథదండాయమాన మందరవసుంధరాధర పరిభ్రమణవేగ సముత్పద్యమాన వియన్మండల మండిత సుధారాశికల్లోల శీకారాకారభాసుర కేసరుండును, పర్వాఖర్వ శిశిరకిరణ మయూఖ గౌర తనూరుహుండును నిజగర్జా నినద నిర్దళిత కుముద సుప్రతీక వామ నైరావణ

సార్వభౌమ ప్రముఖ దిగిభరాజ కర్ణకోటరుండును, ధవళధరాధరదీర్ఘ దురవలోకనీయ దేహుండును, దేహప్రభాపటల నిర్మథ్యమాన పరిపంథి యాతుధాన నికురంబ గర్వాంధకారుండును, బ్రహ్లాద హిరణ్యకశిపు రంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణావీరరస సంయుతుండును, మహాప్రభావుండును నయిన శ్రీనృసింహదేవుం డావిర్భవించినం, గనుంగొని.

7-286-కంద పద్యము

నరమూర్తిగాదు కేవల
హరిమూర్తియుఁ గాదు మానవాకారముఁ గే
సరియాకారము నున్నది
హరిమాయారచిత మగు యథార్థము చూడన్.

7-287-ఉత్పలమాల

తెంపున బాలుఁ డాడినను, ధీరత సర్వగతత్వముం బ్రతి
ష్ఠింపఁ దలంచి యిందు నరసింహశరీరముఁ దాల్చి చక్రి శి
క్షింపఁగ వచ్చినాఁడు; హరిచే మృతి యంచుఁ దలంతు నైన నా
సొంపును బెంపు నందఱును జూడఁ జరింతు హరింతు శత్రువున్.

7-288-వచనము

అని మెత్తంబడని చిత్తంబున గద యెత్తికొని తత్తఱంబున నార్చుచు నకుంఠిత కంఠీరవంబు డగ్గఱు గంధసింధురంబు చందంబున నక్తంచరకుంజరుండు నరసింహదేవున కెదురునడచి తదీయదివ్యతేజోజాలసన్నికర్షంబునం జేసి దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబునుం బోలెఁ గర్తవ్యాకర్తవ్యంబులు దెలియక నిర్గతప్రభుండయి యుండె; అప్పుడు.

7-289-మత్తేభ విక్రీడితము

ప్రకటంబై ప్రళయావసానమున మున్ బ్రహ్మాండభాండావరో
ధక మై యున్న తమిస్రమున్ జగము నుత్పాదించుచోఁ ద్రావి సా
త్త్విక తేజోనిధి యైన విష్ణు నెడ నుద్దీపించునే? నష్టమై
వికలంబై చెడుఁగాక తామసుల ప్రావీణ్యంబు రాజోత్తమా!

7-290-వచనము

అంత నద్దానవేంద్రుండు మహోద్దండంబగు గదాదండంబు గిరగిరం ద్రిప్పి నరమృగేంద్రుని వ్రేసిన; నతండు దర్పంబున సర్పంబు నొడిసి పట్టు సర్పపరిపంథినేర్పున దితిపట్టిం బట్టికొనిన, మిట్టిపడి దట్టించి బిట్టుకట్టలుక నయ్యసురవరుండు దృఢబలంబున నిట్టట్టు జడిసి పట్టుదప్పించుకొని, విడివడి దిటదప్పక కుప్పించి యుప్పరం బెగసి విహంగకులరాజ చరణనిర్గళితభుజంగంబు తెఱంగునం దలంగనుఱికి తన భుజాటోపంబున నరకంఠీరవుండు కుంఠితుం; డయ్యెడి నని తలంచి, కలంగక చెలంగుచుఁ దన్ను నిబిడనీరద నికరంబుల మాటున నిలింపులు గుంపులు గొని డాఁగి మూఁగి క్రమ్మఱ నాత్మీయ

జీవనశంకాకళంకితు లై మంతనంబులఁ జింతనంబులు చేయుచు నిరీక్షింప నక్షీణ సమరదక్షతా విశేషంబుపలక్షించి ఖడ్గవర్మంబులు ధరియించి, భూనభోభాగంబుల వివిధ విచిత్ర లంఘన లాఘవంబులం బరిభ్రమణభేదంబులం గరాళవదనుం డయి, యంతరాళంబునఁ దిరుగు సాళువపు డేగ చందంబున సంచరించిన; సహింపక.

7-291-సీస పద్యము

పంచాననోద్ధూత పావకజ్వాలలు;
 భూనభోంతరమెల్లఁ బూరితముగ;
దంష్ట్రాంకురాభీల ధగధగాయితదీప్తి;
 నసురేంద్రు నేత్రము లంధములుగఁ;
గంటకసన్నిభోత్కట కేసరాహతి;
 నభ్రసంఘము భిన్నమై చలింపఁ;
బ్రళయాభ్రచంచలాప్రతిమ భాస్వరములై;
 ఖరనఖరోచులు గ్రమ్ముదేర;

7-291.1-తేటగీతి

సటలు జళిపించి గర్జించి సంభ్రమించి
దృష్టి సారించి బొమలు బంధించి కెరలి
జిహ్వ యాడించి లంఘించి చేతనొడిసి
పట్టె నరసింహుఁ డా దితిపట్టి నధిప!

7-292-కంద పద్యము

సరకుగొనక లీలాగతి
నురగేంద్రుఁడు మూషికంబు నొడసిన పగిదిన్
నరకేసరి దను నొడిసిన
సురవిమతుఁడు ప్రాణభీతి సుడివడియె నృపా!

7-293-కంద పద్యము

సురరాజవైరి లోఁబడెఁ
బరిభావితసాధుభక్త పటలాంహునకున్
నరసింహునకు నుదంచ
త్తరతరజిహ్వున కుదగ్రఘనరంహునకున్.

7-294-వచనము

అంత.

7-295-మత్తేభ విక్రీడితము

విహగేంద్రుం డహి వ్రచ్చుకైవడి మహోద్వృత్తిన్ నృసింహుండు సా
గ్రహుఁడై యూరువులందుఁ జేర్చి నఖసంఘాతంబులన్ వ్రచ్చె దు

స్స్పహు దంభోళికఠోరదేహు నచలోత్సాహున్ మహాబాహు నిం
ద్రహుతాశాంతకభీకరున్ ఘనకరున్ దైత్యాన్వయశ్రీకరున్.

7-296-శార్దూల విక్రీడితము

చించున్ హృత్కమలంబు, శోణితము వర్షించున్ ధరామండలిం,
ద్రెంచుం గర్కశనాడికావళులు, భేదించున్ మహావక్షముం,
ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా, దుష్టాసురున్ వ్రచ్చి ద
ర్పించుం, బ్రేవులు కంఠమాలికలు గల్పించున్ నఖోద్భాసియై.

7-297-సీస పద్యము

వక్షకవాటంబు వ్రక్కలు చేయుచో, ;
 ఘనకుఠారంబుల కరణి నొప్పు;
గంభీర హృదయ పంకజము భేదించుచోఁ, ;
 గుద్దాలముల భంగిఁ గొమరు మిగులు;
ధమనీవితానంబు దవిలి ఖండించుచోఁ, ;
 బటు లవిత్రంబుల పగిది మెఱయు;
జఠర విశాలాంత్రజాలంబుఁ ద్రెంచుచోఁ, ;
 గ్రకచసంఘంబుల గరిమఁ జూపు;

7-297.1-తేటగీతి

నంకగతుఁడైన దైత్యుని నాగ్రహమున
శస్త్రచయముల నొంపక సంహరించి
యమరు నరసింహునఖరంబు లతి విచిత్ర
సమర ముఖరంబులై యుండె జనవరేణ్య!

7-298-కంద పద్యము

స్ఫురితవిబుధజన ముఖములు
పరివిదళిత దనుజనివహపతి తనుముఖముల్
గురురుచి జిత శిఖిశిఖములు
నరహరిఖరనఖము లమరు నతజనసఖముల్.

7-299-వచనము

ఇట్లు కేవలపురుషరూపంబును మృగరూపంబునుం గాని నరసింహరూపంబున, రేయునుం బవలునుం గాని సంధ్యాసమయంబున, నంతరంగంబును బహిరంగంబునుం గాని సభాద్వారంబున, గగనంబును భూమియునుం గాని యూరుమధ్యంబునఁ, బ్రాణసహితంబులును బ్రాణరహితంబులునుం గాని నఖంబులం, ద్రైలోక్యజనహృదయ భల్లుం డయిన దైత్యమల్లుని వధియించి, మహాదహనకీలాభీల దర్శనుండును, గరాళవదనుండును, లేలిహానభీషణజిహ్వుండును, శోణితపంకాంకిత కేసరుండును నై ప్రేవులు కంఠమాలికలుగ ధరించి కుంభికుంభ విదళనంబు చేసి చనుదెంచు పంచాననంబునుం బోలె, దనుజకుంజర హృదయకమల విదళనంబు చేసి,

తదీయ రక్తసిక్తంబు లైన నఖంబులు సంధ్యారాగ రక్తచంద్రరేఖల చెలువు వహింప సహింపక, లేచి తన కట్టెదుర నాయుధంబు లెత్తుకొని తత్తఱంబున రణంబునకు నురవడించు రక్కసులఁ బెక్కుసహస్రంబులం జక్రాధిక నిర్వక్రసాధనంబుల నొక్కనిఁ జిక్కకుండం జక్కడిచె; ఇవ్విధంబున.

7-300-శార్దూల విక్రీడితము

రక్షోవీరుల నెల్లఁ ద్రుంచి రణసంరంభంబు చాలించి దృ
ష్టిక్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనారూఢుఁడై
యక్షీణాగ్రహుఁడై నృసింహుఁడు కరాళాస్యంబుతో నొప్పెఁ దన్
వీక్షింపం బలికింప నోడి యితరుల్ విభ్రాంతులై డాఁగఁగన్.

7-301-కంద పద్యము

సుర చారణ విద్యాధర
గరుడోరగ యక్ష సిద్ధగణములలో నొ
క్కరుఁ డైన డాయ వెఱచును
నరహరి నయ్యవసరమున నరలోకేశా!

7-302-కంద పద్యము

తర్షంబుల నరసింహుని
హర్షంబులఁ జూచి నిర్జరాంగనలు మహో

త్కర్షంబులఁ గుసుమంబుల
వర్షంబులు గురిసి రుత్సవంబుల నధిపా!

7-303-వచనము

మఱియు నయ్యవసరంబున మింట ననేక దేవతావిమానంబులును గంధర్వగానంబులును, నప్సరోగణ నర్తన సంవిధానంబులును, దివ్యకాహళ భేరీ పటహ మురజాది ధ్వానంబులును బ్రకాశమానంబు లయ్యె;
సునందకుముదాదులయిన హరిపార్శ్వచరులును, విరించి మహేశ్వర మహేంద్ర పురస్సరులగు త్రిదశ కిన్నర కింపురుష పన్నగ సిద్ధ సాధ్య గరుడ గంధర్వ చారణ విద్యాధరాదులును, ప్రజాపతులును, నరకంఠీరవదర్శనోత్కంఠు లయి చనుదెంచి.

## 7-10-దేవతల నరసింహ స్తుతి

7-304-కంద పద్యము

కరకమలయుగళ కీలిత
శిరులై డగ్గఱక భక్తిఁ జేసిరి బహుసం
సరణాబ్ధితరికి నఖరికి
నరభోజనహాస్తిహరికి నరకేసరికిన్.

7-305-వచనము

ఆ సమయంబున దేవత లందఱు వేఱువేఱ వినుతించిరి; అందుఁ గమలాసనుం డిట్లనియె.

7-306-మత్తేభ విక్రీడితము

ఘనలీలాగుణచాతురిన్ భువనముల్ కల్పించి రక్షించి భే
దనముం జేయు దురంతశక్తికి ననంతజ్యోతికిం జిత్ర వీ
ర్యునికిన్ నిత్యపవిత్రకర్మునికి నే నుత్కంఠతో నవ్యయా
త్మునికిన్ వందన మాచరించెదఁ గృపాముఖ్యప్రసాదార్థి నై.

7-307-వచనము

రుద్రుం డిట్లనియె.

7-308-చంపకమాల

అమరవరేణ్య! మీఁదట సహస్రయుగాంతమునాఁడు గాని కో
పమునకు వేళ గాదు సురబాధకుఁ డైన తమస్వినీచరున్
సమరమునన్ వధించితివి చాలుఁ ద దాత్మజుఁ డైన వీఁడు స
ద్విమలుఁడు నీకు భక్తుఁడు పవిత్రుఁడు గావుము భక్తవత్సలా!

7-309-వచనము

ఇంద్రుం డిట్లనియె.

7-310-సీస పద్యము

ప్రాణిసంఘముల హృత్పద్మమధ్యంబుల;
నివసించి భాసిల్లు నీవ యెఱుఁగు;
దింతకాలము దానవేశ్వరుచే బాధ;
పడి చిక్కి యున్న యాపన్నజనుల
రక్షించితివి మమ్ము; రాక్షసుఁ జంపితి;
క్రతుహవ్యములు మాకుఁ గలిగె మరల;
మంటిమి; నీ సేవ మరిగినవారలు;
కైవల్యవిభవంబు కాంక్ష చేయ

7-310.1-ఆటవెలది

రితరసుఖము లెల్ల నిచ్చగింపఁగ నేల?
యస్థిరంబులివి, యనంతభక్తిఁ
గొలువ నిమ్ము నిన్ను ఘోరదైత్యానీక
చిత్తభయదరంహ! శ్రీనృసింహ!

7-311-వచనము

ఋషు లిట్లనిరి.

7-312-మత్తేభ విక్రీడితము

భవదీయాదరలీల లోకముల నుత్పాదించి రక్షింప నేఁ
డవి దైత్యేశునిచేత భేదితములై హ్రాస్వంబులై యుండ నీ
యవినీతున్ నరసింహరూపమున సంహారంబు నొందించి వే
దవిధిం గ్రమ్మఱ నుద్ధరించితి గదా ధర్మానుసంధాయివై.

7-313-వచనము

పితృదేవత లిట్లనిరి.

7-314-శార్దూల విక్రీడితము

చండక్రోధముతోడ దైత్యుఁడు వడిన్ శ్రాద్ధంబులన్ మత్సుతుల్
పిండంబుల్ సతిలోదకంబులుగ నర్పింపంగ మా కీక యు
ద్దండత్వంబునఁ దాన కైకొను మహోదగ్రుండు; వీఁ డిక్కడన్
ఖండింపంబడె నీ నఖంబుల నుతుల్ గావింతు మాత్మేశ్వరా!

7-315-వచనము

సిద్ధు లిట్లనిరి.

7-316-కంద పద్యము

క్రుద్ధుండై యణిమాదిక
సిద్ధులుగైకొనిన దైత్యుఁ జీరితివి; మహా
యోద్ధవు నీ కృప మాకును
సిద్ధులు మరలంగఁ గలిగె శ్రీనరసింహా!

7-317-వచనము

విద్యాధరు లిట్లనిరి.

7-318-కంద పద్యము

దానవునిఁ జంపి యంత
ర్ధానాదికవిద్య లెల్ల దయతో మరలం
గా నిచ్చితివి విచిత్రము
నీ నిరుపమ వైభవంబు నిజము నృసింహా!

7-319-వచనము

భుజంగు లిట్లనిరి.

7-320-కంద పద్యము

రత్నములను మత్కాంతా
రత్నంబుల బుచ్చికొన్న రక్కసు నురమున్
యత్నమున వ్రచ్చి వైచితి;
పత్నులు రత్నములుఁ గలిగి బ్రతికితి మీశా!

7-321-వచనము

మనువు లిట్లనిరి.

7-322-కంద పద్యము

దుర్ణయుని దైత్యుఁ బొరిగొని
వర్ణాశ్రమధర్మసేతువర్గము మరలం
బూర్ణము చేసితి వే మని
వర్ణింతుము? కొలిచి బ్రతుకువారము దేవా!

7-323-వచనము

ప్రజాపతు లిట్లనిరి.

7-324-మత్తేభ విక్రీడితము

ప్రజలం జేయుటకై సృజించితి మముం బాటించి; దైత్యాజ్ఞచేఁ
బ్రజలం జేయక యింతకాలము మహాభారంబుతో నుంటి; మీ
కుజనున్ వక్షముఁ జీరి చంపితివి; సంకోచంబు లే కెల్ల చోఁ
బ్రజలం జేయుచు నుండువారము జగద్భద్రాయమాణోదయా!

7-325-వచనము

గంధర్వు లిట్లనిరి.

7-326-కంద పద్యము

ఆడుదుము రేయుఁబగలుం
బాడుదుము నిశాటు నొద్ద, బాధించు దయం
జూడఁడు నీచే జమునిం
గూడె మహాపాతకునకుఁ గుశలము గలదే.

7-327-వచనము

చారణు లిట్లనిరి.

7-328-కంద పద్యము

భువనజనహృదయభల్లుఁడు
దివిజేంద్రవిరోధి నేఁడు దెగె నీచేతన్
భవరోగనివర్తక మగు
భవదంఘ్రియుగంబుఁ జేరి బ్రదికెద మీశా!

7-329-వచనము

యక్షు లిట్లనిరి.

7-330-ఉత్పలమాల

భ్రంశము లేని నీ భటుల భంగవిముక్తుల మమ్ము నెక్కి ని
స్సంశయవృత్తి దిక్కులఁ బ్రచారము చేయుచు నుండు వీఁడు ని
స్త్రింశముతోడ; వీనిఁ గడతేర్చితి వాపద మానె నో! చతు
ర్వింశతితత్త్వశాసక! త్రివిష్టపముఖ్యజగన్నివాసకా!

7-331-వచనము

కింపురుషు లిట్లనిరి.

7-332-కంద పద్యము

పురుషోత్తమ నేరము కిం
పురుషుల మల్పులము నిన్ను భూషింపఁగ దు
ష్పురుషున్ సకల సుజనహృ
త్పురుషుం జంపితివి జగము బ్రదికె నధీశా!

7-333-వచనము

వైతాళికు లిట్లనిరి.

7-334-కంద పద్యము

త్రిభువనశత్రుఁడు పడియెను
సభలందును మఖము లందు జగదీశ్వర! నీ
శుభగీతములు పఠించుచు
నభయులమై సంచరింతు మార్తశరణ్యా!

7-335-వచనము

కిన్నర లిట్లనిరి.

7-336-కంద పద్యము

ధర్మము దలఁపడు లఘుతర
కర్మము చేయించు మమ్ముఁ గలుషాత్మకు దు
ష్కర్ముని( జంపితి; వున్నత
శర్ములమై నీదు భక్తి సలిపెదము హరీ!

7-337-వచనము

విష్ణుసేవకు లిట్లనిరి.

7-338-ఉత్పలమాల

సంచిత విప్రశాపమునఁ జండనిశాచరుఁ డైన వీని శి
క్షించుట కీడు గాదు కృప జేసితి వీశ్వర! భక్తితోడ సే
వించుటకంటె వైరమున వేగమ చేరఁగ వచ్చు నిన్ను; నీ
యంచిత నారసింహ తను వద్భుత మాపదఁ బాసి రందఱున్.

7-339-వచనము

ఇట్లు బ్రహ్మరుద్రేంద్ర సిద్ధ సాధ్య పురస్సరులైన దేవముఖ్యులందఱు నెడగలిగి యనేక ప్రకారంబుల వినుతించి; రందు రోషవిజృంభమాణుం డయిన నరసింహదేవుని డగ్గఱఁ జేర వెఱచి లక్ష్మీదేవిం బిలిచి; యిట్లనిరి.

7-340-కంద పద్యము

హరికిం బట్టపుదేవివి
హరిసేవానిపుణమతివి హరిగతివి సదా
హరిరతివి నీవు చని నర
హరిరోషము డింపవమ్మ! హరివరమధ్యా!

7-341-వచనము

అనిన నియ్యకొని మహోత్కంఠతోడ నా కలకంఠకంఠి నరకంఠీరవుని యుపకంఠంబునకుం జని.

7-342-సీస పద్యము

ప్రళయార్కబింబంబు పగిది నున్నది గాని;
నెమ్మోము పూర్ణేందు నిభము గాదు;
శిఖిశిఖాసంఘంబు చెలువు చూపెడుఁ గాని;
చూడ్కిఁ ప్రసాద భాసురము గాదు;
వీరరౌద్రాద్భుతావేశ మొప్పెడుఁ గాని;

భూరి కృపారస స్ఫూర్తి గాదు;
భయద దంష్ట్రాకుర ప్రభలు గప్పెడుఁ గాని;
దరహాసితాంబుజాతంబు గాదు;

7-342.1-తేటగీతి

కఠిన నఖర నృసింహవిగ్రహము గాని
కామినీజన సులభ విగ్రహము గాదు;
విన్నదియుఁ గాదు; తొల్లి నే విష్ణువలన
గన్నదియుఁ గాదు; భీషణాకార మనుచు.

7-343-కంద పద్యము

పలికెద నని గమకముఁ గొను;
బలికినఁ గడు నలుగు విభుఁడు ప్రతివచనములం
బలుకఁ డని నిలుచు; శశిముఖి
బలువిడి హృదయమునఁ జనవు భయమును గదురన్.

7-344-వచనము

ఇట్లు నరహరిరూపంబు వారిజనివాసిని వీక్షించి శంకించి శాంతుడైన వెనుక డగ్గఱెదనని చింతించుచున్న వారిజసంభవుం డద్దేవుని రోషంబు నివారింప నితరుల కలవిగాదని ప్రహ్లాదుం జీరి యిట్లనియె.

7-345-కంద పద్యము

తీండ్ర మగు రోషమున మీ
తండ్రి నిమిత్తమునఁ జక్రి దారుణమూర్తిన్
వేండ్రము విడువఁడు మెల్లన
తండ్రీ! శీతలునిఁ జేసి దయచేయఁగదే.

7-346-వచనము

అనిన "నౌఁ గాక" యని మహాభాగవతశేఖరుం డయిన బాలకుండు కరకమలంబులు ముకుళించి మందగమనంబున నమంద వినయ వివేకంబుల నరసింహదేవుని సన్నిధికిం జని సాష్టాంగదండప్రణామంబు జేసిన భక్తపరాధీనుం డగు నయ్యీశ్వరుం డాలోకించి కరుణాయత్తచిత్తుండై.

7-347-ఉత్పలమాల

ప్రాభవ మొప్ప నుత్కటకృపామతియై కదియంగఁ జీరిఁ సం
శోభిత దృష్టిసంఘములఁ జూచుచు బాలుని మౌళి యందు లో
కాభినుతుండు పెట్టె నసురాంతకుఁ డుద్భటకాలసర్పభీ
తాభయదానశస్తము ననర్గళమంగళహేతు హస్తమున్.

7-348-వచనము

ఇట్లు హరికరస్పర్శనంబున భయవిరహితుండును, బ్రహ్మజ్ఞాన సహితుండును, బులకితదేహుండును, సముత్పన్నసంతోషబాష్పసలిలధారా సమూహుండును, బ్రేమాతిశయగద్గదభాషణుండును, వినయ వివేక భూషణుండును, నేకాగ్రచిత్తుండును, భక్తిపరాయత్తుండును నయి యద్దేవుని చరణకమలంబులు దన హృదయంబున నిలిపికొని కరకమలంబులు ముకుళించి యిట్లని వినుతించె.

## 7-11-ప్రహ్లాదుడు స్తుతించుట

7-349-మత్తేభ విక్రీడితము

అమరుల్ సిద్ధులు సంయమీశ్వరులు బ్రహ్మాదుల్ సతాత్పర్య చి
త్తములన్ నిన్ను బహుప్రకారముల నిత్యంబున్ విచారించి పా
రము ముట్టన్ నుతిచేయ నోపరఁట; నే రక్షస్తనూజుండ గ
ర్వమదోద్రిక్తుఁడ బాలుఁడన్ జడమతిన్ వర్ణింప శక్తుండనే?

7-350-మత్తేభ విక్రీడితము

తపమున్ వంశముఁ దేజమున్ శ్రుతము సౌందర్యంబు నుద్యోగమున్
నిపుణత్వంబుఁ బ్రతాపపౌరుషములున్ నిష్ఠాబలప్రజ్ఞలున్
జపహోమంబులుఁ జాల వీశ్వర! భవత్సంతుష్టికై దంతియూ
థపు చందంబున భక్తిజేయవలయుం దాత్పర్య సంయుక్తుఁడై.

7-351-మత్తేభ విక్రీడితము

అమలజ్ఞాన సుదాన ధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర
త్వములన్ యజ్ఞ తపోనసూయలఁ గడున్ దర్పించు ధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోర్థప్రాణవాక్కర్మముల్
సమతన్ నిన్ను నయించెనేని, నిజవంశశ్రీకరుండౌఁ దుదిన్.

7-352-సీస పద్యము

అజ్ఞుండు చేసిన యారాధనములఁ జే;
పట్టఁ డీశ్వరుఁడు కృపాళుఁ డగుటఁ;
జేపట్టు నొకచోట; సిద్ధ మీశ్వరునకు;
నర్థంబు లేకుండ నతఁడు పూర్ణు
డైన నర్థము లీశ్వరార్పణంబులు గాఁగఁ;
జేయుట ధర్మంబు; చేసెనేని
నద్దంబుఁ జూచిన నళికలలామంబు;
ప్రతిబింబితం బగు పగిది మరల

7-352.1-తేటగీతి

నర్థములు దోఁచుఁ; గావున నధిక బుద్ధి
భక్తి జేయంగవలయును భక్తిఁ గాని

మెచ్చఁ డర్థంబు లొసఁగెడు మేరలందుఁ
బరమకరుణుండు హరి భక్తిబాంధవుండు.

7-353-కంద పద్యము

కావున నల్పుఁడ సంస్తుతి
గావించెద వెఱపు లేక కలనేరుపునన్;
నీ వర్ణనమున ముక్తికిఁ
బోవు నవిద్యను జయించి పురుషుఁ డనంతా!

7-354-సీస పద్యము

సత్త్వాకరుఁడ వైన సర్వేశ! నీ యాజ్ఞ;
 శిరముల నిడుకొని చేయువారు
బ్రహ్మాదు లమరులు భయ మందుచున్నారు;
 నీ భీషణాకృతి నేఁడు చూచి;
రోషంబు మాను నీ రుచిరవిగ్రహములు;
 కల్యాణకరములు గాని భీతి
కరములు గావు లోకములకు వృశ్చిక;
 పన్నగంబుల భంగి భయముఁ జేయు

7-354.1-తేటగీతి

నసుర మర్దించితివి; సాధుహర్ష మయ్యె;
నవతరించిన పనిదీఱె నలుక యేల?
కలుషహారివి సంతోషకారి వనుచు
నిన్నుఁ దలఁతురు లోకులు నిర్మలాత్మ!

7-355-మత్తేభ విక్రీడితము

ఖరదంష్ట్రా భ్రుకుటీ సటా నఖయు నుగ్రధ్వానయున్ రక్త కే
సరయున్ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయున్నైన నీ
నరసింహాకృతిఁ జూచి నే వెఱవఁ బూర్ణక్రూరదుర్వారదు
ర్భర సంసార దవాగ్నికిన్ వెఱతు నీ పాదాశ్రయుం జేయవే.

7-356-వచనము

దేవా! సకల యోను లందును సుఖవియోగ దుఃఖసంయోగసం జనితంబైన శోకానలంబున దందహ్యమానుండనై దుఃఖనివారకంబు గాని దేహాద్యభిమానంబున మోహితుండనై పరిభ్రమించుచున్న యేను నాకుం బ్రియుండవు సఖుండవుఁ బరదేవతవు నైన నీవగు బ్రహ్మగీతంబు లయిన లీలావతారకథావిశేషంబులఁ బఠియించుచు రాగాదినిర్ముక్తుండనై దుఃఖపుంజంబులఁ దరియించి భవదీయచరణ కమలస్మరణ సేవానిపుణులైన భక్తులం జేరి యుండెద; బాలునిఁ దల్లిదండ్రులును, రోగిని వైద్యదత్తంబయిన యౌషధంబును, సముద్రంబున మునింగెడు వాని నావయును, దక్కొరులు రక్షింపనేరని తెఱంగున సంసారతాపసంతప్యమానుండై నీచేత నుపేక్షితుం డయిన

వాని నుద్ధరింప నీవు దక్క నన్యుండు సమర్థుండు గాఁడు; జగంబుల నెవ్వం డేమి కృత్యంబు నెవ్వనిచేతం బ్రేరితుండై యేయింద్రియంబులం జేసి యేమిటికొఱకు నెవ్వనికి సంబంధి యై యే స్థలంబున నే సమయంబునం దేమిరూపంబుననే గుణంబున నపరంబయిన జనకాది భావంబున నుత్పాదించి పరంబయిన బ్రహ్మాదిభావంబున రూపాంతరంబు నొందించు నట్టి వివిధప్రకారంబు లన్నియు నిత్యముక్తుండవు రక్షకుండవు నైన నీవ; నీ యంశంబైన పురుషునికి నీ యనుగ్రహంబునఁ గాలంబుచేతం బ్రేరితయై కర్మమయంబును బలయుతంబును బ్రధానలింగంబును నైన మనంబును నీ మాయ సృజియించు; అవిద్యార్పితవికారంబును వేదోక్తకర్మప్రధానంబును సంసారచక్రాత్మకంబైన యీ మనమున నిన్ను సేవింపక నియమించి తరియింప నొక్కరుండును సమర్థుండు లేడు; విజ్ఞాననిర్జిత బుద్ధిగుణుండవు; నీ వలన వశీకృతకార్యసాధనయైన కాలంబు మాయతోడం గూడ షోడశవికారయుక్తం బయిన సంసారచక్రంబుఁ జేయుచుండు; సంసారదావదహన తంతప్యమానుండ నగు నన్ను రక్షింపుము.

7-357-సీస పద్యము

జనులు దిక్పాలుర సంపదాయుర్విభ;
వములు గోరుదురు భవ్యంబు లనుచు;
నవి యంతయును రోషహాసజృంభితమైన;
మాతండ్రి బొమముడిమహిమఁ జేసి
విహతంబులగు; నట్టి వీరుండు నీ చేత;
నిమిషమాత్రంబున నేఁడు మడిసె;

కావున ధ్రువములు గావు బ్రహ్మాదుల;
శ్రీవిభవంబులు జీవితములుఁ;

7-357.1-తేటగీతి

గాలరూపకుఁ డగు నురుక్రమునిచేత
విదళితములగు; నిలువవు; వేయునేల
యితర మే నొల్ల నీ మీఁది యెలుక గొంత
గలిగియున్నది గొలుతుఁ గింకరుఁడ నగుచు.

7-358-మత్తకోకిలము

ఎండమావులవంటి భద్రము లెల్ల సార్థము లంచు మ
ర్త్యుండు రోగనిధానదేహముతో విరక్తుఁడుగాక యు
ద్దండమన్మథవహ్ని నెప్పుడుఁ దప్తుఁడై యొకనాఁడుఁ జే
రండు పారము దుష్టసౌఖ్య పరంపరాక్రమణంబునన్.

7-359-ఉత్పలమాల

శ్రీమహిళా మహేశ సరసీరుహగర్భుల కైన నీ మహో
ద్దామకరంబుచే నభయదానము జేయవు; నేను బాలుఁడం
దామసవంశ సంభవుఁడ దైత్యుఁడ నుగ్రరజోగుణుండ ని
స్సీమదయం గరాంబుజము శీర్షముఁజేర్చుట చోద్య మీశ్వరా!

7-360-వచనము

మహాత్మా! సుజనులయిన బ్రహ్మాదు లందును దుర్జనులైన మా యందును సేవానురూపంబుగం బక్షాపక్షంబులు లేక కల్పవృక్షంబు చందంబున ఫలప్రదానంబు జేయుదువు; కందర్ప సమేతం బగు సంసారకూపంబునం గూలుచున్న మూఢజనులం గూడి కూలెడు నేను భవదీయభృత్యుం డగు నారదుని యనుగ్రహంబునం జేసి నీ కృపకుం బాత్రుండ నైతి; నన్ను రక్షించి మజ్జనకుని వధియించుట నా యందులఁ బక్షపాతంబు గాదు; దుష్టదనుజ సంహారంబును శిష్ట భృత్య మునిజన రక్షాప్రకారంబును నీకు నైజగుణంబులు; విశ్వంబు నీవ; గుణాత్మకం బయిన విశ్వంబు సృజియించి యందుం బ్రవేశించి హేతుభూతగుణయుక్తుండవై రక్షకసంహారకారాది నానారూపంబుల నుండుదువు; సదసత్కారణకార్యాత్మకం బయిన విశ్వంబునకు పరమకారణంబు నీవ; నీ మాయచేత వీఁడు దా ననియెడి బుద్ధి వికల్పంబు దోఁచుగాని నీకంటె నొండెద్దియు లేదు; బీజంబు నందు వస్తుమాత్రభూత సౌక్ష్మ్యంబును వృక్షంబు నందు నీలత్వాది వర్ణంబునుం గలుగు తెఱంగున; విశ్వంబునకు నీ యంద జన్మ స్థితి ప్రకాశ నాశంబులుం గలుగు; నీ చేత నయిన విశ్వంబు నీ యంద నిలుపు కొని తొల్లి ప్రళయకాలపారావారంబునఁ బన్నగేంద్రపర్యంకంబునఁ గ్రియారహితుండవై నిజసుఖానుభవంబు జేయుచు నిద్రితుని భంగి యోగనిమీలితలోచనుండవై మెలంగుచుఁ గొంత కాలంబునకు నిజ కాలశక్తిచేతం బ్రేరితంబులై ప్రకృతిధర్మంబు లయిన సత్త్వాదిగుణంబుల నంగీకరించి సమాధిచాలించి విలసించుచున్న నీనాభి యందు వటబీజంబువలన నుద్భవించు వటంబు తెఱంగున నొక్క కమలంబు సంభవించె; నట్టి కమలంబువలన నాల్గుమోముల బ్రహ్మ జన్మించి దిశలు వీక్షించి

కమలంబునకు నొండయిన రూపంబు లేకుండుటఁ జింతించి జలాంతరాళంబుఁ బ్రవేశించి జలంబు లందు నూఱు దివ్యవత్సరంబులు వెదకి తన జన్మంబునకు నుపాదానకారణం బైన నిన్ను దర్శింప సమర్థుండు గాక, మగిడి కమలంబుకడకుం జని విస్మయంబు నొంది చిరకాలంబు నిర్భరతపంబు జేసి పృథివి యందు గంధంబు గను చందంబునఁ దన యందు నానాసహస్రవదన శిరో నయన నాసా కర్ణ వక్త్ర భుజ కర చరణుండును బహువిధాభరణుండును మాయాకలితుండును మహాలక్షణలక్షితుండును నిజప్రకాశదూరీకృత తముండును బురుషోత్తముండును నయిన నిన్ను దర్శించె; అయ్యవసరంబున.

7-361-కంద పద్యము

ఘోటకవదనుఁడ వై మధు
కైటభులం ద్రుంచి నిగమగణముల నెల్లం
బాటించి యజున కిచ్చిన
కూటస్థుఁడ వీశ్వరుఁడవు కోవిదవంద్యా!

7-362-వచనము

ఇవ్విధంబున గృత త్రేతా ద్వాపరంబులను మూఁడు యుగంబు లందును దిర్యఙ్మానవ ముని జలచరాకారంబుల నవతరించి లోకంబుల నుద్ధరించుచు ధరించుచు హరించుచు యుగానుకూలధర్మంబులం బ్రతిష్ఠించుచు నుండుదువు; దేవా! యవధరింపుము.

7-363-సీస పద్యము

కామహర్షాదిసంఘటితమై చిత్తంబు;
భవదీయచింతనపదవి చొరదు;
మధురాదిరసముల మరగి చొక్కుచు జిహ్వ;
నీ వర్ణనమునకు నిగుడనీదు;
సుందరీముఖములఁ జూడఁగోరెడి జూడ్కి;
తావకాకృతులపైఁ దగులుపడదు;
వివిధదుర్భాషలు వినఁ గోరు వీనులు;
వినవు యుష్మత్కథావిరచనములు;

7-363.1-తేటగీతి

ఘ్రాణ మురవడిఁ దిరుగు దుర్గంధములకు
దవులు గొలుపదు వైష్ణవధర్మములకు;
నడఁగి యుండవు కర్మేంద్రియములు పురుషుఁ
గలఁచు, సవతులు గృహమేధిఁ గలఁచు నట్లు.

7-364-వచనము

ఇవ్విధంబున నింద్రియంబులచేతఁ జిక్కుపడి స్వకీయపరకీయశరీరంబు లందు మిత్రామిత్ర భావంబులు జేయుచు జన్మమరణంబుల నొందుచు

సంసారవైతరణీనిమగ్నం బైన లోకంబు నుద్ధరించుట లోక సంభవస్థితిలయకారణుండ వైన నీకుం గర్తవ్యంబు; భవదీయ సేవకులమైన మా యందుఁ బ్రియభక్తులయిన వారల నుద్ధరింపుము.

7-365-మత్తేభ విక్రీడితము

భగవద్దివ్య గుణానువర్తన సుధాప్రాప్తైక చిత్తుండ నై
బెగడన్ సంసరణోగ్రవైతరణికిన్; భిన్నాత్ముల్తై తావకీ
యగుణస్తోత్ర పరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్యభావంబులన్
సుగతిం గానని మూఢులం గని మదిన్ శోకింతు సర్వేశ్వరా!

7-366-వచనము

దేవా! మునీంద్రులు నిజవిముక్తకాములయి విజనస్థలంబులం దపంబు లాచరింతురు; కాముకత్వంబు నొల్లక యుండువారికి నీ కంటె నొండు శరణంబు లేదు గావున నిన్ను సేవించెదరు; కొందఱు కాముకులు కరద్వయకండూతిచేతం దనియని చందంబునఁ దుచ్ఛంబయి పశు పక్షి క్రిమి కీట సామాన్యం బయిన మైథునాది గృహ మేధి సుఖంబులం దనియక కడపట నతి దుఃఖవంతు లగుదురు; నీ ప్రసాదంబు గల సుగుణుండు నిష్కాముం డయియుండు. మౌనవ్రత జప తప శ్రుతాధ్యయనంబులును నిజధర్మవ్యాఖ్యాన విజనస్థల నివాస సమాధులును మోక్షహేతువులగు; నయిన నివి పదియు నింద్రియజయంబు లేనివారికి భోగార్థంబులయి విక్రయించువారికి జీవనోపాయంబులయి యుండు; డాంభికులకు వార్తాకరంబులయి

సఫలంబులుగావు; భక్తి లేక భవదీయజ్ఞానంబు లేదు; రూపరహితుండ వైన నీకు బీజాంకురంబులకైవడిఁ గారణకార్యంబు లయిన సదసద్రూపంబులు రెండును బ్రకాశమానంబు లగు; నా రెంటి యందును భక్తియోగంబున బుద్ధిమంతులు మథనంబున దారువులందు వహ్నిం గనియెడు తెఱంగున నిన్నుఁ బొడఁగందురు; పంచభూత తన్మాత్రంబులును ప్రాణేంద్రియంబులును మనోబుద్ధ్యహంకార చిత్తంబులును నీవ; సగుణంబును నిర్గుణంబును నీవ; గుణాభిమాను లయిన జననమరణంబుల నొందు విబుధు లాద్యంతంబులు గానక నిరుపాధికుండవైన నిన్నెఱుంగరు; తత్త్వజ్ఞులయిన విద్వాంసులు వేదాధ్యయనాది వ్యాపారంబులు మాని వేదాంతప్రతిపాద్యుండ వగు నిన్ను సమాధివిశేషంబుల నెఱింగి సేవింతురు; అదిగావున.

7-367-సీస పద్యము

నీ గృహాంగణభూమి నిటలంబు మోవంగ;
 మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని
నీ మంగళస్తవ నికర వర్ణంబులు;
 పలుమాఱు నాలుకఁ బలుకఁడేని
నీ యధీనములుగా నిఖిలకృత్యంబులు;
 ప్రియభావమున సమర్పింపఁడేని
నీ పదాంబుజముల నిర్మల హృదయుఁడై;
 చింతించి మక్కువఁ జిక్కఁడేని

7-367.1-తేటగీతి

నిన్నుఁ జెవులార వినఁడేని నీకు సేవ
చేయరాఁడేని బ్రహ్మంబు జెందఁ గలఁడె?
యోగి యైనఁ దపోవ్రతయోగి యైన
వేది యైన మహాతత్త్వవేది యైన.

7-368-వచనము

కావున భవదీయ దాస్యయోగంబుఁ గృపజేయు" మని ప్రణతుండైన ప్రహ్లాదుని వర్ణనంబునకు మెచ్చి నిర్గుణం డయిన హరి రోషంబు విడిచి యిట్లనియె.

7-369-శార్దూల విక్రీడితము

సంతోషించితి నీ చరిత్రమునకున్ సద్భద్ర మౌఁగాక నీ
యంతర్వాంఛితలాభ మెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదం
జింతం జెందకు భక్తకామదుఁడ నే సిద్ధంబు దుర్లోక్యుఁడన్
జంతుశ్రేణికి నన్నుఁ జూచినఁ బునర్జన్మంబు లే దర్భకా!

7-370-ఆటవెలది

సకలభావములను సాధులు విద్వాంసు
లఖిల భద్రవిభుఁడ నైన నన్నుఁ
గోర్కు లిమ్మటంచుఁ గోరుదు రిచ్చెదఁ
గోరు మెద్ది యైనఁగుఱ్ఱ! నీవు.

7-371-వచనము

అని పరమేశ్వరుండు ప్రహ్లాదునియందుఁ గల సకామత్వంబుఁ దెలియుకొఱకు వంచించి యిట్టానతిచ్చిన; నతండు నిష్కాముండైన యేకాంతి గావునఁ గామంబు భక్తియోగంబునకు నంతరాయం బని తలంచి యిట్లనియె; "ఉత్పత్తి మొదలు కామాద్యనుభవాసక్తి లేని నాకు వరంబు లిచ్చెదనని వంచింపనేల? సంసారబీజంబులును హృదయబంధకంబులు నయిన గామంబులకు వెఱచి ముముక్షుండనై సేమంబుకొఱకు నేమంబున నిన్నుం జేరితి; కామంబులును నింద్రియంబులును మనశ్శరీర ధైర్యంబులు మనీషా ప్రాణ ధర్మంబులును లజ్జాస్మరణలక్ష్మీసత్యతేజోవిశేషంబులును నశించు; లోకంబు లందు భృత్యు లర్థకాము లయి రాజుల సేవింతురు రాజులుం బ్రయోజనంబు లర్థించి భృత్యులకు నర్థంబు లొసంగుదు; రవ్విధంబు గాదు; నాకుం గామంబు లేదు; నీకుం బ్రయోజనంబు లే; దయినను దేవా! వరదుండ వయ్యెద వేనిఁ గామంబులు వృద్ధిఁబొందని వరంబుఁ గృపజేయుము; కామంబులు విడిచిన పురుషుండు నీతోడ సమాన విభవుం డగు నరసింహా! పరమాత్మ! పురుషోత్తమ!" యని ప్రణవ పూర్వకంబుగా నమస్కరించిన హరి యిట్లనియె.

7-372-సీస పద్యము

నీ యట్టి సుజ్ఞాన నిపుణు లేకాంతులు;
 గోర్కులు నా యందుఁ గోర నొల్ల;
రట్లైనఁ బ్రహ్లాద! యసురేంద్రభర్తవై;
 సాగి మన్వంతర సమయ మెల్ల
నిఖిలభోగంబులు నీవు భోగింపుము;
 కల్యాణబుద్ధి నా కథలు వినుము;
సకలభూతములందు సంపూర్ణుఁ డగు నన్ను;
 యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి

7-372.1-ఆటవెలది

కర్మచయము లెల్ల ఖండించి పూజన
మాచరింపు మీశ్వరార్పణముగ;
భోగముల నశించుఁ బుణ్యంబు; వ్రతములఁ
బాప సంచయములు పాయు నిన్ను.

7-373-వచనము

మఱియు మీఁదటఁ గాలవేగంబునం గళేబరంబు విడిచి త్రైలోక్యవిరాజమానంబును దివిజరాజగేయమానంబును బరిపూరిత దశదిశంబును నయిన యశంబుతోడ ముక్తబంధుండవై నన్ను డగ్గఱెదవు; వినుము.

7-374-ఆటవెలది

నరుఁడు ప్రియముతోడ నాయవతారంబు,
నీ యుదారగీత నికరములను
మానసించునేని మఱి సంభవింపఁడు
కర్మబంధచయముఁ గడచిపోవు.

7-375-వచనము

అనినఁ బ్రహ్లాదుం డిట్లనియె.

7-376-సీస పద్యము

దంష్ట్రవై తొల్లి సోదరుని హిరణ్యాక్షు;
నీవు చంపుటఁ జేసి నిగ్రహమున
మా తండ్రి రోషనిర్మగ్నుఁడై సర్వలో;
కేశ్వరుఁ బరము ని న్నెఱుఁగ లేక
పరిపంథి పగిది నీ భక్తుండ నగు నాకు;
నపకారములు జేసె నతఁడు నేఁడు

నీ శాంతదృష్టిచే నిర్మలత్వము నొందెఁ;
గావున బాప సంఘుంబువలనఁ

7-376.1-తేటగీతి

బాసి శుద్ధాత్మకుఁడు గాఁగ భవ్యగాత్ర!
వరము వేఁడెద నా కిమ్ము వనజనేత్ర!
భక్తసంఘాతముఖపద్మపద్మమిత్ర!
భక్తకల్మషవల్లికాపటులవిత్ర!

7-377-వచనము

అనిన భక్తునికి భక్తవత్సలుం డిట్లనియె.

7-378-మత్తేభ విక్రీడితము

నిజభక్తుండవు నాకు నిన్నుఁ గనుటన్ నీ తండ్రి త్రిస్సప్త పూ
ర్వజులం గూడి పవిత్రుఁడై శుభగతిన్ వర్తించు విజ్ఞానదీ
పజితానేక భవాంధకారు లగు మద్భక్తుల్ వినోదించు దే
శజనుల్ దుర్జనులైన శుద్ధులు సుమీ సత్యంబు దైత్యోత్తమా!

7-379-సీస పద్యము

ఘనసూక్ష్మ భూతసంఘాతంబులోపల;
 నెల్ల వాంఛలు మాని యెవ్వ రయిన
నీ చందమున నన్ను నెఱయ సేవించిన;
 మద్భక్తు లగుదురు మత్పరులకు
గుఱి జేయ నీవ యోగ్యుఁడ వైతి విటమీఁద;
 వేదచోదిత మైన విధముతోడఁ
జిత్తంబు నా మీఁదఁ జేర్చి మీ తండ్రికిఁ;
 బ్రేతకర్మములు సంప్రీతిఁ జేయు

7-379.1-తేటగీతి

మతఁడు రణమున నేఁడు నా యంగమర్శ
నమున నిర్మల దేహుఁడై నవ్యమహిమ
నపగతాఖిలకల్మషుఁ డైఁ తనర్చి
పుణ్యలోకంబులకు నేఁగుఁ బుణ్యచరిత!

7-380-వచనము

అని యిట్లు నరసింహదేవు డానతిచ్చిన హిరణ్యకశిపునకుం బ్రహ్లాదుండు పరలోకక్రియలు జేసి, భూసురోత్తములచేత నభిషిక్తుండయ్యె నయ్యెడం బ్రసాద సంపూర్ణ ముఖుండైన శ్రీనృసింహదేవుని జూచి దేవతాప్రముఖసహితుం డైన బ్రహ్మదేవుం డిట్లనియె,

7-381-సీస పద్యము

దేవదేవాఖిలదేవేశ! భూతభా;
 వన! వీఁడు నా చేత వరముపడసి
మత్సృష్టజనులచే మరణంబు నొందక;
 మత్తుఁడై సకలధర్మములుఁ జెఱచి
నేఁడు భాగ్యంబున నీచేత హతుఁ డయ్యెఁ;
 గల్యాణ మమరె లోకముల కెల్ల
బాలు నీతని మహాభాగవతశ్రేష్ఠుఁ;
 బ్రతికించితివి మృత్యు భయముఁ బాపి

7-381.1-తేటగీతి

వరముఁ గృపజేసితివి మేలు వారిజాక్ష!
నీ నృసింహావతారంబు నిష్ఠతోడఁ
దగిలి చింతించువారలు దండధరుని
బాధ నొందరు మృత్యువు బారిఁ పడరు.

7-382-వచనము

అనిన నరసింహదేవుం డిట్లనియె.

7-383-కంద పద్యము

మన్నించి దేవశత్రుల
కెన్నఁడు నిటువంటి వరము లీకుము పా వో
త్పన్నులకు వరము లిచ్చుట
పన్నగముల కమృత మిడుట పంకజగర్భా!

7-384-వచనము

అని యిట్లానతిచ్చి బ్రహ్మాదిదేవతాసమూహంబుచేఁ బూజితుఁడై భగవంతుండైన శ్రీనృసింహదేవుండు తిరోహితుండయ్యె; ప్రహ్లాదుండును శూలికిఁ బ్రణమిల్లి తమ్మిచూలికి వందనంబులు జేసి బ్రజాపతులకు మ్రొక్కి భగవత్కళలైన దేవతలకు నమస్కరించినం జూచి బ్రహ్మదేవుండు శుక్రాది మునీంద్ర సహితుండై దైత్యదానవరాజ్యంబునకుం బ్రహ్లాదుం బట్టంబు గట్టి యతనిచేతం బూజితుండై దీవించె; నంత నీశానాది నిఖిల దేవతలు వివిధంబులగు నాశీర్వాదంబులచేత నా ప్రహ్లాదునిఁ గృతార్థుం జేసి తమ్మిచూలిని ముందట నిడుకొని నిజస్థానంబునకుఁ జనిరి; ఇట్లు విష్ణుదేవుండు నిజపార్శ్వచరు లిరువురు బ్రాహ్మణశాపంబునం జేసి బ్రథమ జన్మంబున దితిపుత్రులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపు లను వరాహ నారసింహ రూపంబుల నవతరించి వధియించె; ద్వితీయ భవంబున రాక్షస జన్మంబు దాల్చిన రావణ కుంభకర్ణులను శ్రీరామ రూపంబున సంహరించె; తృతీయ జన్మంబున శిశుపాల దంతవక్త్రులను పేరులం బ్రసిద్ధి నొందిన వారలను శ్రీకృష్ణ రూపంబున ఖండించె; నివ్విధంబున మూఁడు జన్మంబుల గాఢ

వైరానుబంధంబున నిరంత రసంభావిత ధ్యానులై వారలు నిఖిల కల్మష విముక్తులై హరిం గదిసి" రని చెప్పి నారదుం డిట్లనియె.

7-385-ఉత్పలమాల

శ్రీ రమణీయమైన నరసింహ విహారము నింద్రశత్రు సం
హారముఁ బుణ్య భాగవతుఁడైన నిశాచరనాథపుత్ర సం
చారము నెవ్వఁడైన సువిచారత విన్నఁ బఠించినన్ శుభా
కారముతోడ నే భయముఁ గల్గని లోకముఁ జెందు భూవరా!

7-386-మత్తేభ విక్రీడితము

జలజాతప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిం
బలుకన్ లేని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబు నీ యింటిలోఁ
జెలి యై మేనమఱంది యై సచివుఁడై చిత్తప్రియుండై మహా
ఫలసంధాయకుఁడై చరించు టది నీ భాగ్యంబు రాజోత్తమా!

## 7-12-త్రిపురాసుర సంహారము

7-387-కంద పద్యము

బహుమాయుఁడైన మయుచే
విహతం బగు హరుని యశము విఖ్యాత జయా

వహముగ నీ భగవంతుఁడు
మహితాత్ముఁడు మున్నొనర్చె మనుజవరేణ్యా!

7-388-వచనము
అనిన ధర్మనందనుం డిట్లనియె.

7-389-కంద పద్యము
ఏ కర్మంబున విభుఁడగు
శ్రీకంఠుని యశము మయునిచే సుడివడియెన్
వైకుంఠుఁ డెవ్విధంబునఁ
గైకొని తత్కీర్తి చక్కఁగా నొనరించెన్.

7-390-వచనము
అనిన నారదుం డిట్లనియె.

7-391-కంద పద్యము
చక్రాయుధబలయుతు లగు
శక్రాదుల కోహటించి శ్రమమున నసురుల్

సాక్రోధంబున నరిగిర
విక్రమములు మాని మయుని వెనుకకు నధిపా!

7-392-వచనము

ఇట్లు రక్కసులు దన వెనుకఁ జొచ్చిన మాయానిలయుండును దుర్ణయుండును నైన మయుండు దన విద్యాబలంబున నయోరజత సువర్ణమయంబులై యెవ్వరికిని లక్షింపరాని గమనాగమనంబులును వితర్కింపరాని కర్కశపరిచ్ఛదంబులును గలిగిన త్రిపురంబుల నిర్మించి యిచ్చిన, నక్తంచరు లందఱు నందుం బ్రవేశించి కామసంచారులై పూర్వవైరంబుఁ దలంచి సనాయకంబు లయిన లోకంబుల నస్తోకంబయిన నిజబలాతిరేకంబున శోకంబు నొందించిన.

7-393-కంద పద్యము

లోకాధినాథు లెల్లను
శోకాతురు లగుచు శరణు జొచ్చిరి దుష్టా
నీక విదళనాకుంఠున్
శ్రీకంఠున్ భువనభరణచిత్తోత్కంఠున్.

7-394-వచనము

ఇట్లు సకలలోకేశ్వరుం డగు మహేశ్వరుం జేరి లోకపాలకులు ప్రణతులై పూజించి కరకమలంబులు ముకుళించి.

7-395-కంద పద్యము

త్రిపురాలయు లగు దానవు
లపరాజితు లగుచు మాకు నశ్రాంతంబున్
వపురాదిపీడఁ జేసెద
రపరాధికులను వధింపు మగజాధీశా!

7-396-కంద పద్యము

దీనులము గాక యుష్మద
ధీనులమై యుండు మేము దేవాహితదో
ర్లీనుల మైనారము బల
హీనుల మగు మమ్ముఁ గావు మీశాన! శివా!

7-397-వచనము

అనిన భక్తవత్సలుం డగు పరమేశ్వరుండు శరణాగతు లైన గీర్వాణుల వెఱవకుం డని దుర్వారబలంబున బాణాసనంబుఁ గేల నందికొని యొక్క దివ్యబాణంబు సంధించి త్రిపురంబులపయి నేసిన మార్తాండమండలంబున వెలువడు మయూఖజాలంబుల చందంబునఁ దద్బాణంబువలన దేదీప్యమానంబులై యనేక

బాణసహస్రంబులు సంభవించి భూ నభోంతరాళంబులు నిండి మండి తెప్పలుగాఁ గుప్పలు గొని త్రిపురంబుల పయిఁ గప్పె; నప్పుడు తద్బాణపావక హేతిసందోహ దందహ్యమాను లై గతాసు లయిన త్రిపురపుర నివాసులం దెచ్చి మహాయోగి యైన మయుండు సిద్ధరసకూపంబున వైచిన.

7-398-కంద పద్యము

సిద్ధామృతరస మహిమను
శుద్ధమహావజ్రతుల్య శోభిత తను లై
వృద్ధిం బొందిరి దానవు
లుద్ధత నిర్ఘాత పావకోపము లగుచున్.

7-399-కంద పద్యము

కూపామృత రససిద్ధిని
దీపితులై నిలిచి యున్న దేవాహితులన్
రూపించి చింత నొందెడు
గోపధ్వజుఁ జూచి చక్రి కుహనాన్వితుఁడై.

7-400-శార్దూల విక్రీడితము

ఉత్సాహంబున నొక్క పాఁడిమొదవై యూథంబు ఘ్రాణించుచున్
వత్సంబై తనవెంట బ్రహ్మ నడవన్ వైకుంఠుఁ డేతెంచి యు

ద్యత్సత్త్వంబునఁ గూపమధ్య రసముం ద్రావెన్ విలోకించుచుం
దత్సౌభాగ్యనిమగ్ను లై మఱచి రా దైత్యుల్ నివారింపఁగన్.

7-401-వచనము

ఇట్లు విష్ణుండు మోహనాకారంబున ధేను వయి వచ్చి త్రిపుర మధ్య కూపామృతరసంబు ద్రావిన నెఱింగి శోకాకులచిత్తు లయిన రసకూపపాలకులం జూచి మహాయోగి యైన మయుండు వెఱఁగుపడి దైవగతిం జింతించి శోకింపక యిట్లనియె.

7-402-ఆటవెలది

అమరు లైన దనుజు లైనను నరు లైన
నెంత నిపుణు లైన నెవ్వరైన
దైవికార్థచయముఁ దప్పింపఁగా లేరు
వలదు దనుజులార! వగవ మనకు.

7-403-వచనము

అని పలికె; అంత విష్ణుండు నైజంబు లైన ధర్మవిజ్ఞానవిద్యాతపో విరక్తి సమృద్ధి క్రియాశక్తివిశేషంబుల శంభునికిఁ బ్రాధాన్యంబు సమర్పించి రథసూత కేతు వర్మ బాణాసన ప్రముఖ సంగ్రామ సాధనంబులు చేసినం గైకొని.

7-404-మత్తేభ విక్రీడితము

శరి యై కార్ముకి యై మహాకవచి యై సన్నాహి యై వాహి యై
సరథుండై సనియంత యై సబలుఁడై సత్కేతనచ్ఛత్రుఁ డై
పరమేశుం డొక బాణమున్ విడిచెఁ దద్బాణానలజ్వాలలం
బురముల్ గాలె ఛటచ్ఛటధ్వని నభోభూమధ్యముల్ నిండగన్.

7-405-వచనము

ఇట్లు హరుండు దురవగాహంబు లైన త్రిపురంబుల నభిజిన్ముహూర్తంబున భస్మంబు చేసి కూల్చిన, నమర గరుడ గంధర్వ సాధ్య యక్ష వల్లభులు వీక్షించి జయజయశబ్దంబులు జేయుచుఁ గుసుమ వర్షంబులు వర్షించిరి; ప్రజలు హర్షించిరి; బ్రహ్మాదులు గీర్తించి; రప్సరసలు నర్తించిరి; దివ్య కాహళ దుందుభి రవంబులును మునిజనోత్సవంబులును బ్రచురంబు లయ్యె; నిట్లు విశ్వజనీనం బగు త్రిపురాసురసంహారంబున నఖిలలోకులును సంతసిల్లి యుండ నయ్యవసరంబున.

7-406-ఆటవెలది

తృణకణముల భంగి ద్రిపురంబుల దహించి
పరముఁ డవ్యయుండు భద్రయశుఁడు

శివుఁడు పద్మజాది జేగీయమానుఁ డై
నిజనివాసమునకు నెమ్మిఁ జనియె.

7-407-వచనము

ఇట్లు నిజమాయావిశేషంబున మర్త్యలోకంబున విడంబించుచున్న విష్ణుని పరాక్రమవిధానంబులు మునిజనవంద్యమానంబు లై సకలలోకకల్యాణ ప్రధానంబులై యుండు" ననిన విని నారదునకు ధర్మనందనుం డిట్లనియె.

## 7-13-వర్ణాశ్రమ ధర్మంబులు

7-408-సీస పద్యము

అనఘాత్మ! సకల వర్ణాశ్రమాచార స;
మ్మత ధర్మ మెయ్యది మానవులకు?
నే ధర్మమున నరుం డిద్ధ విజ్ఞానము;
భక్తియుఁ బ్రాపించుఁ? బద్మజనకు
సాక్షాత్సుతుండవు సర్వజ్ఞుఁడవు నీకు;
నెఱుఁగరానిది ధర్మ మింత లేదు;
నారాయణపరాయణస్వాంతు లనఘులు;
శాంతులు సదయులు సాధువృత్తి

7-408.1-ఆటవెలది

మెఱయుచున్న ఘనులు మీవంటి వా రెద్ది
పరమధర్మ మనుచు భక్తిఁ దలఁతు
రట్టి ధర్మరూప మఖిలంబు నెఱిఁగింపు;
వినఁగ నిచ్చ గలఁదు విమలచరిత!

7-409-వచనము

అనిన నారదుండు ధర్మరాజుం జూచి "దాక్షాయణి యందు నిజాంశంబున నవతరించి భువనశోభనంబుకొఱకు బదరికాశ్రమంబునఁ దపోనిరతుండయి యున్న నారాయణునివలన సనాతనంబగు ధర్మంబు వింటి; నది చెప్పెద; సకల వర్ణంబుల జనులకు సత్యంబును, దయయును, నుపవాసాది తపంబును, శౌచంబును, సైరణయును, సదసద్వివేకంబును, మనోనియమంబును, బహిరింద్రియ జయంబును, హింసలేమియును, బ్రహ్మచర్యంబును, దానంబును, యథోచితజపంబును, సంతోషంబును, మార్దవంబును, సమదర్శనంబును, మహాజనసేవయు, గ్రామ్యంబులయిన కోరికలు మానుటయు, నిష్ఫలక్రియలు విడుచుటయు, మితభాషిత్వంబును, దేహంబు గాని తన్ను వెదకికొనుటయు, నన్నోదకంబులు ప్రాణులకుం బంచి యిచ్చుటయుఁ, బ్రాణులందు దేవతాబుద్ధియు, నాత్మబుద్ధింజేయుటయు, శ్రీనారాయణచరణస్మరణ కీర్తన శ్రవణ సేవార్చన నమస్కార దాస్యాత్మసమర్పణ సఖ్యంబు లనియెడి త్రింశల్లక్షణంబులు గలుగ వలయు; నందు సత్కులాచారుం డయి మంత్రవంతంబు లయిన గర్భాదానాదిసంస్కారంబు లవిచ్ఛిన్నంబులుగాఁ గలవాఁడు ద్విజుండు ద్విజనకు యజన యాజనాధ్యయ నాధ్యాపన దానప్రతిగ్రహంబు లను షట్కర్మంబులు

విహితంబులు రాజునకుఁ బ్రతిగ్రహ వ్యతిరిక్తంబు లయిన యజనాది కర్మంబులయిదును బ్రజాపాలనంబును బ్రాహ్మణులుగానివారివలన దండశుల్కాదులు గొనుటయు విహిత కర్మంబులు; వైశ్యునికిఁ గృషి వాణిజ్య గోరక్షణాది కర్మంబులును బ్రాహ్మణకులానుసరణంబులును విహితంబులు; శూద్రునకు ద్విజ శుశ్రూష జేయవలయు.

7-410-సీస పద్యము

విను కర్షణాదికవృత్తికంటెను మేలు;
యాచింపనొల్లని యట్టివృత్తి;
ప్రాప్తంబు గైకొని బ్రతుకుకంటెను లెస్స;
యనుదినంబును ధాన్య మడిగికొనుట;
యాయయవారముకంటె నధిక కళ్యాణంబు;
పఱిగ యెన్నుల ధాన్యభక్షణంబు;
శిలవృత్తికంటెను శ్రేయ మాపణముల;
బడ్డగింజలు దిని బ్రదుకుఁ గనుట

7-410.1-ఆటవెలది

యెడరుచోట నృపతికీ నాల్గువృత్తులుఁ
దగుఁ; బ్రతిగ్రహంబు దగదు; తలఁప
నాపదవసరముల నధముఁ డెక్కువజాతి
వృత్తి నున్న దోషవిధముగాదు.

7-411-వచనము

వినుము; శిలవృత్తియు నుంఛవృత్తియు ఋత మనియు నయాచిత వృత్తి యమృతమనియు యాచ్ఞావృత్తి మృతమనియుఁ గర్షకవృత్తి ప్రమృత మనియు నెన్నుదురు; అట్టి వృత్తు లెఱింగి జీవించుట మేలు; వాణిజ్యంబు సత్యానృతమనియు; శ్వవృత్తి నీచసేవ యనియుఁ బలుకుదురు; సర్వవేదమయుండు బ్రాహ్మణుండు; సర్వదేవ మయుండు క్షత్రియుండు; బ్రాహ్మణ క్షత్రియులకు నీచసేవనంబు కర్తవ్యంబు గాదు.

7-412-కంద పద్యము

దమమును శౌచముఁ దపమును
శమమును మార్దవముఁ గృపయు సత్యజ్ఞాన
క్షమలును హరిభక్తియు హ
ర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా!

7-413-ఉత్పలమాల

శౌర్యము దానశీలముఁ బ్రసాదము నాత్మజయంబుఁ దేజమున్
ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థముఁ గామమున్ బుధా
చార్యముకుందసేవలును సత్కృతియుం బరితోషణంబు స
ద్వీర్యము రక్షణంబుఁ బృథివీవరశేఖర! రాజచిహ్నముల్.

7-414-కంద పద్యము

ధర్మార్థకామవాంఛయు
నిర్మల గురుదేవ విప్ర నివహార్చనముల్
నిర్మదభావముఁ బ్రమదము
శర్మకరత్వమును వైశ్యజనలక్షణముల్.

7-415-ఉత్పలమాల

స్తేయము లేనివృత్తియు శుచిత్వము సన్నుతియున్ నిజేశులన్
మాయలు లేక డాయుటయు మంత్రము జెప్పక పంచయజ్ఞముల్
చేయుటయున్ ధరామరుల సేవయు గోవులరక్షణంబు న
న్యాయములేమియున్ మనుజనాథ! యెఱుంగుము శూద్రధర్మముల్.

7-416-సీస పద్యము

నిలయము పాటించి నిర్మలదేహ యై;
శృంగార మేప్రొద్దుఁ జేయవలయు
సత్యప్రియాలాపచతురయై ప్రాణేశు;
చిత్తంబు ప్రేమ రంజింపవలయు
దాక్షిణ్య సంతోష ధర్మ మేధాదుల;
దైవత మని ప్రియుఁ దలఁపవలయు

నాథుఁ డే పద్ధతి నడచు నా పద్ధతి;
 నడచి తద్బంధుల నడపవలయు

7-416.1-ఆటవెలది

మార్దవమునఁ బతికి మజ్జన భోజన
శయన పాన రతులు జరపవలయు
విభుఁడు పతితుఁడైన వెలఁది పాతివ్రత్య
మహిమఁ బుణ్యుఁ జేసి మనుపవలయు.

7-417-కంద పద్యము

తరుణి దన ప్రాణవల్లభు
హరిభావముగా భజించి యతఁడున్ తానున్
సిరికైవడి వర్తించును
హరిలోకము నందు సంతతానందమునన్.

7-418-కంద పద్యము

ఉపవాసంబులు వ్రతములు
దపములు వేయేల భర్త దైవత మని ని
ష్కపటతఁ గొల్చిన సాధ్వికి
నృపవర! దుర్లభము లేదు నిఖిలజగములన్.

7-419-వచనము

మఱియు సంకరజాతు లయిన రజక చర్మకారక నట బురడ కైవర్తక మ్లేచ్ఛ భిల్లు లను నంత్యజాతు లేద్వురకును జండాల పుల్కస మాతంగ జాతులకును నాయా కులాగతంబు లైన వృత్తులఁ జౌర్యహింసాదులు వర్జించి సంచరింపవలయు; మానవులకుఁ బ్రతియుగంబున నైసర్గికంబులైన ధర్మంబులు రెండు లోకంబు లందును సుఖకరంబు లని వేదవిదులైన పెద్దలు చెప్పుదురు; కారుకారున దున్నెడు క్షేత్రంబు లావు చెడు; నందు జల్లిన బీజంబులు నిస్తేజంబు లై యుండి లెస్సగ నంకురింపవు; నిరంతంర ఘృతధారావర్షంబున దహనునకు దాహకత్వంబు లేక శాంతిం జెందు; నందు వేల్చిన హవ్యంబులు ఫలింపవు; తద్విధంబున ననవరతకామానుసంధానంబునఁ గామోన్ముఖంబైన చిత్తంబు కామంబులం దనిసి నిష్కా మంబై విరక్తి నొందుం; గావున సత్త్వస్వభావంబుతోడ నెప్పుడుఁ దప్పక నిజవంశానుగత విహితధర్మంబున వర్తించు నరుండు మెల్లన స్వాభావికకర్మపరత్వంబు విడిచి ముక్తి నొందు; జాతి మాత్రంబునఁ బురుషునికి వర్ణంబు నిర్దేశింపం బనిలేదు; శమదమాది వర్ణలక్షణ వ్యవహారంబులఁ గనవలయు" నని మఱియు నారదుం డిట్లనియె.

7-420-కంద పద్యము

క్రమమున వర్ణంబుల చి

హ్నా ము లెల్లను జెప్పఁబడియె నాశ్రమముల ధ

ర్మము లెఱిఁగించెద నన్నియు
సమదాహితహృదయశూల! సదమలశీలా!

7-421-వచనము

వినుము; బ్రహ్మచారి మౌంజీ కౌపీన యజ్ఞోపవీత కృష్ణాజిన పాలాశ దండ కమండలు ధరుండును, సంస్కారహీన శిరోరుహుండును, దర్భహస్తుండును, శీలప్రశస్తుండును, మౌనియు నై త్రిసంధ్యంబును బ్రహ్మగాయత్రి జపియించుచు సాయంప్రాతరవసరంబులు నర్క పావక గురు దేవతోపాసనంబులు చేయుచు గురుమందిరంబునకుం జని దాసుని చందంబున భక్తి వినయ సౌమనస్యంబులు గలిగి వేదంబు చదువుచు నధ్యయ నోపక్రమావసానంబుల గురుచరణంబులకు నమస్కరించుచు రేపుమాపును విహిత గృహంబుల భిక్షించి భైక్ష్యంబు గురువునకు నివేదించి యనుజ్ఞ గొని మితభోజనంబు కావించుచు నర్హకాలంబుల నుపవసించుచు నంగనలందు నంగనాసక్తులందుం బ్రయోజనమాత్ర భాషణంబు లొనర్చుచు గురు పరాంగనలవలన నభ్యంగ కేశప్రసాధన శరీరమర్దన మజ్జన రహస్య యోగంబులు వర్జించుచు గృహంబున నుండక జితేంద్రియత్వంబున సత్యభాషణుం డయి సంచరింపవలయు.

7-422-ఆటవెలది

పొలఁతి దావవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు
కరఁగ కుండ రాదు కదిసెనేని

బ్రహ్మ యైనఁ గూఁతుఁ బట్టకమానఁడు
వడుగు కింతి పొత్తు వలదు వలదు.

7-423-వచనము

వినుము; స్వరూపసాక్షాత్కారంబున దేహ బహిరింద్రియాదికం బయిన యింతయు నాభాసమాత్రంబుగా నిశ్చయించి యెందాఁక జీవుండు స్వతంత్రుఁ డయిన యీశ్వరుండు గాకుండు నంతదడవు నంగన యిది పురుషుండ నే ననియెడి భేదబుద్ధి మానుట కర్తవ్యంబు గాదు; బ్రహ్మచారి యతి గృహస్థులం దెవ్వఁ డైనఁ జిత్తంబు పరి పక్వంబు గాక యద్వైతానుసంధానంబుజేసిన మూఢుండగుంగావున రహస్యంబునఁ బుత్రిక నైనం డాయకుండవలయు.

7-424-చంపకమాల

శిరమున మేన సంస్కృతులు చేయక చందనభూషణాద్యలం
కరణము లెల్ల మాని ఋతుకాలములన్ నిజభార్యఁ బొందుచుం
దరుణుల జూడఁ బాఱక ధృతవ్రతుఁడై మధు మాంస వర్జి యై
గురుతరవృత్తితో మెలఁగు కోవిదుఁ డొక్క గృహస్థు భూవరా!

7-425-వచనము

మఱియు ద్విజుండు గృహస్థుండై గురువువలన నుపనిషదంగ సహితంబైన వేదత్రయంబును బఠియించి నిజాధికారానుసారంబుగ నర్థవిచారంబు జేసి తన

బలంబుకొలంది గురువులకు నభీష్టంబు లొసంగి గృహంబున నొండె వనంబున నొండె నైష్ఠికత్వంబు నాశ్రయించి యొండె బ్రాణులతోడ జీవించుచు గురువు నందు నగ్ని యందు నాత్మ యందు సర్వభూతంబు లందు నచ్యుతదర్శనంబు జేయుచు నింద్రియవ్యసనాది మగ్నుండుగాక యెఱుక గలిగి వర్తించుచు పరబ్రహ్మంబు నొందు.

7-426-కంద పద్యము

వినుము; వనప్రస్థునకున్
మునికథితము లైన నియమములు గల వా చొ
ప్పున వనగతుఁడై మెలఁగెడి
ఘనుఁడు మహర్లోకమునకు గమనించు నృపా!

7-427-వచనము

అటమీఁద గృహస్థాశ్రమంబు విడిచి వనంబునకుం జని దున్నక పండెడి నీవారాదికంబు లగ్నిపక్వంబు జేసి యొండె నామంబులు చేసి యొండె నర్కపక్వంబులైన ఫలాదు లొండె భక్షింపుచు వన్యాహారంబుల నిత్యకృత్యంబులయిన చరుపురోడాంశంబు లొనర్చుచుఁ బ్రతిదినంబును బూర్వ సంచితంబులు పరిత్యజించి నూతన ద్రవ్యంబులు సంగ్రహించుచు నగ్నికొఱకుఁ బర్ణశాల యైనఁ బర్వతకందరం బయిన నాశ్రయించుచు హిమ వాయు వహ్ని వర్షాతపంబులకు సహించుచు నఖశ్మశ్రు కేశతనూరుహంబులు ప్రసాధితంబులు జేయక జటిలుండై వసియించుచు దండాజిన కమండలు వల్కల పరిచ్ఛదంబులు

ధరియించి పండ్రెండైన నెనిమిదైన నాలుగైన రెండైన నొక వత్సరంబయినఁ దపః ప్రయాసంబున బుద్ధి నాశంబు గాకుండ ముని యై చరించుచు దైవవశంబున జరారోగంబులచేతఁ జిక్కి నిజ ధర్మానుష్ఠాన సమర్థుండు గాని సమయంబున నిరశన వ్రతుం డయి యగ్నుల నాత్మారోపణంబు జేసి సన్యసించి యాకాశంబు నందు శరీరరంధ్రంబులును, గాలి యందు నిశ్శ్వాసంబును, దేజంబు లోపల నూష్మంబును, జలంబుల రసంబును, ధరణి యందు శల్య మాంస ప్రముఖంబులును, వహ్ని యందు వ్యక్తంబుతోడ వాక్కును, నింద్రుని యందు శిల్పంబుతోడఁ గరంబులును, విష్ణుని యందు గతితోడఁ బదంబులును, బ్రజాపతి యందు రతితోడ నుపస్థంబును, మృత్యువందు విసర్గంబుతోడఁ బాయువును, దిక్కులందు శబ్దంబు తోడ శ్రోత్రంబును, వాయు వందు స్పర్శంబుతోడ ద్వక్కును, సూర్యు నందు రూపంబుతోడఁ జక్షువులును, సలిలంబు లందుఁ బ్రచేతస్స హిత యయిన జిహ్వయు, క్షితి యందు గంధ సహితం బయిన ఘ్రాణంబును, జంద్రుని యందు మనోరథంబులతోడ మనంబును, గవియైన బ్రహ్మ యందు బోధంబుతోడ బుద్ధియు, రుద్రుని యందహంకారంబుతోడ మమత్వంబును, క్షేత్రజ్ఞుని యందు సత్త్వంబు తోడ జిత్తంబును. బరంబు నందు గుణంబులతోడ వైకారికంబును, డిందించి యటమీఁదఁ బృథివి యందుఁ బృథివిని జలంబునందు జలంబును దేజంబు నందుఁ దేజంబును వాయువు నందు వాయువును గగనంబు నందు గగనంబును నహంకారతత్త్వంబు నందు నహంకారంబును మహత్తత్త్వంబు నందు మహత్తత్త్వంబును బ్రకృతి యందు బ్రకృతిని నక్షరుండైన పరమాత్మ యందు లయంబు నొందించి చిన్మాత్రావశేషితుం డయిన క్షేత్రజ్ఞుని నక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుండై దగ్ధకాష్ఠుండైన వహ్ని చందంబున బరమాత్మ యైన నిర్వికారబ్రహ్మంబునందు లీనుండ గావలయు.

7-428-కంద పద్యము

అనఘ! వనప్రస్థుండై
చని తద్ధర్మంబు లిట్లు సలుపుచు మఱియున్
మనెనేని సన్న్యసింపం
జను నటమీఁదటను ముక్త సంగత్వమునన్.

7-429-వచనము

ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరపి సన్న్యసించి దేహమాత్రావశిష్టుండును నిరపేక్షుండును భిక్షుండును నిరాశ్రయుండును నాత్మారాముండును సర్వభూతసముండును శాంతుండును సమచిత్తుండును నారాయణపరాయణుండును నై కౌపీనం బను నాచ్ఛాదకమాత్రం బయిన వస్త్రంబు ధరియించి దండాదివ్యతిరిక్తంబులు విసర్జించి యాత్మపరంబులుగాని శాస్త్రంబులు వర్జించి గ్రహనక్షత్రాది విద్యల జీవింపక భేదవాదంబులయిన తర్కంబులు దర్కింపక యెందును బక్షీకరింపక శిష్యులకు గ్రంథంబులు వంచించి యుపన్యసింపక బహువిద్యల జీవింపక మత్తాదివ్యాపారంబుల నుల్లసిల్లక పెక్కుదినంబు లొక్కయెడ వసియింపక యూరూర నొక్కొక్క రాత్రి నిలుచుచుఁ గార్యకారణవ్యతిరిక్తం బయిన పరమాత్మ యందు విశ్వంబు దర్శించుచు సదసన్మయంబయిన విశ్వంబు నందు బరబ్రహ్మంబయిన యాత్మ నవలోకించుచు జాగరణ స్వప్న సంధి సమయంబుల నాత్మనిరీక్షణంబు చేయుచు నాత్మకు బంధమోక్షణంబులు యామాత్రంబులుగాని వస్తుప్రకారంబున

లేవనియును దేహంబునకు జీవితంబు ధ్రువంబు గాదనియును మృత్యువు ధ్రువంబనియును నెఱుంగుచు భూతదేహంబుల సంభవనాశంబులకు మూలంబయిన కాలంబు బ్రతీక్షించుచు నివ్విధంబున జ్ఞానోత్పత్తి పర్యంతంబుఁ జరియించి యటమీఁద విజ్ఞానవిశేషంబు సంభవించినఁ బరమహంసుండయి దండాదిచిహ్నంబులు ధరియించి యుండె ధరియింపక యుండె బహిరంగవ్యక్తచిహ్నుండు గాక యంతరంగవ్యక్తంబయిన యాత్మానుసంధానంబు గలిగి మనీషియై బాహ్యానుసంధానభావంబున మనుష్యులకుఁ దనవలన నున్మత్త బాలమూకల తెఱంగుఁ జూపుచుండవలయు.

## 7-14-ప్రహ్లాదాజగర సంవాదము

### 7-430-కంద పద్యము

ముని వల్లభుఁ డజగరుఁ డను
సునయుండు హిరణ్యకశిపు సూనుండును ము
న్నొనరించిన సంవాదము
వినుమీ యర్థంబునందు వెలయు నరేంద్రా!

### 7-431-వచనము

తొల్లి భగవత్ప్రియుం డయిన ప్రహ్లాదుండు కతిపయామాత్య సమేతుండై లౌకికతత్త్వంబు నెఱింగెడికొఱకు లోకంబుల సంచరించుచు నొక్కనాఁడు కావేరీతీరంబున సహ్యపర్వతతటంబున ధూళిధూసరితంబు లయిన కరచరణాద్యవయవంబులతోడ గూఢంబైన నిర్మల తేజంబుతోఁ గర్మాకారవచోలింగ

వర్ణాశ్రమాదుల నెవ్వరికి నెఱుంగఁ బడక నేల నింద్రించుచు నజగర వ్రతధరుండైన మునిం గని డాయం జని విధివత్ప్రకారంబున నర్చించి మునిచరణంబులకు శిరంబు మోపి మ్రొక్కి యతని చరిత్రంబు దెలియ నిచ్ఛయించి యిట్లనియె.

7-432-సీస పద్యము

భూమి నుద్యోగి యై భోగి యై యుండెడి;
నరుని కైవడి మునినాథ! నీవు
ఘనశరీరము దాల్చి కదలవు చిత్ర ము;
ద్యమయుక్తునకుఁ గాని ధనము లేదు
ధనవంతునకుఁ గాని తగు భోగములు లేవు;
భోగికిఁ గాని సంపూర్ణమైన
తనువు లే దుద్యోగధనభోగములు లేక;
నేల నూరక పడి నిద్ర వోవు

7-432.1-ఆటవెలది

నీకు నెట్లు గలిగె నిరుపమ దేహంబు
సముఁడ వార్యుఁడవు విశారదుఁడవు
బుద్ధినిధివి జనులఁ బొగడవు దెగడవు
నిద్ర ప్రతిదినంబు నిలుప నేల?

7-433-వచనము

అని యిట్లు ప్రహ్లాదుం డడిగిన వికసితముఖుం డయి మునీంద్రుండు తదీయ మధురాలాపసుధారసప్రవాహంబులు కర్ణంబులఁ బరిపూర్ణంబులైన నతని నవలోకించి యిట్లనియె.

7-434-సీస పద్యము

ఆంతరంగికదృష్టి నంతయు నెఱుఁగుదు;
వార్యసమ్మతుఁడ వీ వసురవర్య!
విశ్వజంతువుల ప్రవృత్తి నివృత్తిల;
క్షణముల నీ యెఱుంగనివి లేవు
భగవంతుఁ డగు హరి బాయక నీ మనో;
వీథి రాజిల్లుచు వెలుఁగుఁగాని
క్రమమున బహుళాంధకారంబు బరిమార్చుఁ;
బరమ సాత్వికుఁడవు భద్రబుద్ధి

7-434.1-ఆటవెలది

పైన నీవు నన్ను నడిగెదు గావున
విన్న ధర్మ మెల్ల విస్తరింతు

నిన్నుఁ జూడఁ గలిగె నీతోడి మాటలు
నాత్మశుద్ధి గలిగె ననఘచరిత!

7-435-వచనము

వినుము; ప్రవాహకారిణి యై విషయంబులచేతం బూరింపరాని తృష్ణచేతం బడి కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండ నైన నేను నానావిధ యోనుల యందుఁ బ్రవేశించుచు వెడలుచు నెట్టకేలకు మనుష్య దేహంబు ధరియించి యందు ధర్మంబున స్వర్గద్వారంబును నధర్మంబున శునకసూకరాది తిర్యగ్జంతు యోని ద్వారంబుల నొంది క్రమ్మఱ మనుష్యుండై పుట్టవలయు నని వివేకించి సుఖరక్షణదుఃఖ మోక్షంబులకొఱకు ధర్మంబు చేయు దంపతుల వ్యవహారంబు గని సర్వక్రియానివృత్తి గలిగిన జీవుండు స్వతంత్రుండై ప్రకాశించు నని నిర్ణయించి భోగంబులు మనోరథజాతమాత్రంబులు గాని శాశ్వతంబులు గావని పరీక్షించి నివృత్తుండనై యుద్యోగంబు లేక నిద్రించుచుఁ బ్రారబ్ధభోగంబు లననుభవించుచు నుండుదు; ఇవ్విధంబునఁ దనకు సుఖరూపంబైన పురుషార్థంబు దన యందుఁ గలుగుట యెఱుంగక పురుషుండు శైవాలజాల నిరుద్ధంబు లైన శుద్ధజలంబుల విడిచి యెండమావులు జలంబు లని పాఱెడు మూఢుని వడువున సత్యంబుగాని ద్వైతంబుఁ జొచ్చి ఘోరసంసారచక్ర పరిభ్రాంతుం డై దైవతంత్రంబు లైన దేహాదులచేత నాత్మకు సుఖంబును దుఃఖనాశంబునుం గోరుచు నిరీశుం డైనవాని ప్రారంభంబులు నిష్ఫలంబు లగు; అదియునుం గాక మర్త్యునకు ధనంబు ప్రాప్తంబయిన నది దుఃఖకరంబు గాని సుఖకరంబు గాదు; లోభవంతు లయిన ధనవంతులు నిద్రాహారంబులు లేక రాజ చోర యాచక శత్రు మిత్రాది

సర్వస్థలంబు లందును శంకించుచు దానభోగంబులు మఱచి యుండుదురు; ప్రాణార్థవంతులకు భయంబు నిత్యంబు; శోకమోహ భయక్రోధ రాగ శ్రమాదులు వాంఛామూలంబులు; వాంఛ లేకుండవలయును.

7-436-మత్తేభ విక్రీడితము

సరఘుల్ గూర్చిన తేనె మానవులకున్ సంప్రాప్త మైనట్లు లో
భ రతుల్ గూర్చిన విత్తముల్ పరులకుం బ్రాపించుఁ బ్రాప్తాశి యై
తిరుగం బోని మహోరగంబు బ్రదుకున్ దీర్ఘాంగమై యుండియుం
జిరకాలం బగు వాని వర్తనములం జింతించి యేకాంతి నై.

7-437-కంద పద్యము

అజగరమును జుంటీఁగయు
నిజగురువులుగాఁ దలంచి నిశ్చింతుఁడ నై
విజనస్థలిఁ గర్మంబుల
గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్.

7-438-సీస పద్యము

అజిన వల్కల దుకూలాంబరంబులు గట్టి;
యైన గట్టక యైన నలరుచుందు;
నాందోళికా రథ హయ నాగములనెక్కి;

యైన నెక్కక యైన నరుగుచుండుఁ;
గర్పూర చందన కస్తూరికా లేప;
మైన భూరజ మైన నలదికొందు;
భర్మ శయ్యల నైనఁ బర్ణ శిలా తృణ;
భస్మంబులం దైన బండు చుందు;

7-438.1-ఆటవెలది
మానయుక్త మైన మానహీనం బైనఁ
దీయ నైన మిగులఁ దిక్త మైన
గుడుతు సగుణ మైన గుణవర్జితం బైన
నల్ప మైనఁ జాల నధిక మైన

7-439-కంద పద్యము
లే దని యెవ్వరి నడుగను
రా దని చింతింపఁ బరులు రప్పించినచోఁ
గా దని యెద్దియు మానను
ఖేదము మోదమును లేక క్రీడింతు మదిన్.

7-440-కంద పద్యము

నిందింప బరుల నెన్నఁడు
వందింప ననేక పీడ వచ్చిన మది నా
క్రందింప విభవముల కా
నందింపఁ బ్రకామ వర్తనంబున నధిపా!

7-441-వచనము
ఇట్లు గోరికలు లేక యొక్క సమయంబున దిగంబరుఁడనై పిశాచంబు చందంబున నుండుచుఁ బెక్కు దినంబులుం గోలెఁ బెనుఁబాఁప వర్తనంబుఁ గైకొని నిమీలితలోచనత్వంబున నేకాంతభావంబు విష్ణుని యందు జేర్చి వికల్పంబు భేదగ్రాహకచిత్తవృత్తులఁ జిత్తంబు నర్థరూప విభ్రమంబు గల మనంబు నందు మనంబును నహంకారంబు నందు నహంకారంబును మాయ యందు మాయను నాత్మానుభూతి యందు లయంబు నొందించి సత్యంబు దర్శించుచు విరక్తి నొంది స్వానుభవంబున నాత్మస్థితుండనై యుండుదు; నీవు భగవత్పరుండవు గావున రహస్యం బైన పరమహంసధర్మంబు స్వానుభవగోచరం బైన తెఱంగున నీకు హృద్గోచరంబగు నట్లు చెప్పితి" ననిన విని.

7-442-కంద పద్యము
ఘను నజగరమునివల్లభు
దనుజేంద్రుఁడు పూజ చేసి తగ వీడ్కొని నె
మ్మనమున సంతోషించుచుఁ
జనియెన్ నిజ గేహమునకు శశికులతిలకా!

7-443-వచనము

అనిన యుధిష్ఠరుం డిట్లనియె.

7-444-కంద పద్యము

ననుఁ బోటి జడగృహస్థుఁడు
మునివల్లభ! యిట్టి పదవి మోదంబున నే
యనువునఁ జెందును వేగమ
వినిపింపుము నేఁడు నాకు విజ్ఞాననిధీ!

## 7-15-ఆశ్రమాదుల ధర్మములు

7-445-వచనము

అనిన నారదుం డిట్లనియె "గృహస్థుం డయినవాఁడు వాసుదేవార్పణంబుగా గృహోచితక్రియ లనుసంధించుచు మహామునుల సేవించి వారల వలన నారాయణ దివ్యావతార కథాకర్ణనంబు చేయుచు నయ్యైవిహితకాలంబుల శాంతజనులం గూడి మెలంగుచు బుత్రమిత్ర కళత్రాది సంగంబులు గలల వంటి వని యెఱుంగుచు లోపల నాసక్తి లేక సక్తునికైవడి వెలుపలఁ బురుషకారంబు లొనర్చుచుఁ దగులంబు లేక విత్తంబు లిచ్చి జనక సుత సోదర సఖ జ్ఞాతిజనుల చిత్తంబులు సమ్మదాయత్తంబులు గావించుచు ధనధాన్య విధాన దైవ లబ్ధంబులవలన నభిమానంబు మాని యనుభవించుచు గృహక్షేత్రంబులఁ జొచ్చి యుదరపూరణమాత్రంబు దొంగిలినవాని దండింపక భుజగ మృగ మూషిక

మర్కట మక్షికా ఖరోష్ట్రంబుల హింసింపక పుత్రుల భంగి నీక్షించుచు దేశకాలదైవంబుల కొలందిని ధర్మార్థ కామంబులఁ బ్రవర్తించుచు శునక పతిత చండాలాదులకైన భోజ్య పదార్థంబులు దగిన భంగి నిచ్చుచు నిజవృత్తిలబ్ధంబు లగు నశనాదులచేత దేవ ఋషి పితృ భూత మానవుల సంతర్పించుచుఁ బంచ మహాయజ్ఞావశేషంబుల నంతర్యామి పురుష యజనంబును నాత్మ జీవనోపాయంబును సమర్థించుచు నుండవలయు.

7-446-ఆటవెలది

జనక గురుల నైనఁ జంపు నర్థమున కై
ప్రాణమైన విడుచు భార్యకొఱకు
నట్టి భార్యఁ బురుషుఁ డతిథి శుశ్రూష చే
యించి గెలుచు నజితు నీశు నైన.

7-447-ఆటవెలది

పరముఁ డీశ్వరుండు బ్రాహ్మణముఖమున
నాహరించి తుష్టుఁ డయిన భంగి
నగ్నిముఖము నందు హవ్యరాసులు గొని
యైనఁ దుష్టి నొందఁ డనఘచరిత!

7-448-వచనము

కావున గృహస్థుండు బ్రాహ్మణు లందును దేవత లందును మర్త్య పశుప్రముఖ జాతులందును నంతర్యామియు బ్రాహ్మణాననుండును నైన క్షేత్రజ్ఞు నందు నయ్యై కోరికలు సమర్పించి సంతర్పణంబు జేయవలయు బాద్రపదంబునఁ గృష్ణపక్షంబు నందును దక్షిణోత్తరాయణంబు లందును రేయింబగలు సమమైనకాలంబు లందును వ్యతీపాతంబు లందును దినక్షయంబు నందును సూర్యచంద్రగ్రహణంబు లందును శ్రవణ ద్వాదశి యందును వైశాఖ శుక్ల తృతీయ యందును గార్తిక శుక్ల నవమి యందును హేమంత శిశిరంబుల లోను నాలుగష్టక లందును మాఘ శుక్ల సప్తమి యందును మాస నక్షత్రంబులతోడం గూడిన పున్నము లందును ద్వాదశితోడం గూడిన యుత్తరాత్రయ శ్రవణానురాధ లందును నుత్తరాత్రయ సహితంబు లయిన యేకాదశుల యందును జన్మనక్షత్రయుక్త దివసంబు లందును మఱియుఁ బ్రశస్తకాలంబు లందును జననీజనకబంధు జనులకు శ్రాద్ధంబులును జప హోమ స్నాన వ్రతంబులును దేవ బ్రాహ్మణసమారాధనంబులును నాచరింపవలయు భార్యకుఁ బుంసవనాదికంబును నపత్యంబునకు జాతకకర్మాదికంబును దనకు యజ్ఞదీక్షాదికంబును బ్రేతజనులకు దహనాదికంబును మృతదివసంబున సాంవత్సరికంబును జరుపవలయు.

7-449-మత్తేభ విక్రీడితము

వినుమే దేశములన్ దయాగుణతపోవిద్యాన్వితం బైన వి
ప్రనికాయంబు వసించు, నే స్థలములన్ భాగీరథీముఖ్య వా

హీనులుండున్, హరిపూజ లెయ్యెడల భూయిష్ఠప్రకారంబులం
దనరున్, భూవర! యట్టి చోటులఁ దగున్ ధర్మంబులం జేయఁగన్.

7-450-కంద పద్యము

హరి యందు జగము లుండును
హరిరూపము సాధుపాత్ర మందుండు శివం
కర మగు పాత్రము గలిగిన
నరయఁగ నది పుణ్యదేశ మనఘచరిత్రా!

7-451-వచనము

మఱియు గురుక్షేత్రంబును, గయాశీర్షంబును, బ్రయాగంబును, బులహాశ్రమంబును, నైమిశంబును, ఫాల్గుణంబును, సేతువును, బ్రభాసంబును, గుశస్థలియును, వారణాసియు, మధురాపురియును, బంపా బిందు సరోవరంబులును, నారాయణాశ్రమంబును, సీతారామాశ్రమంబును, మహేంద్ర మలయాదులయిన కులాచలంబులును, హరిప్రతిమార్చన ప్రదేశంబులును, హరిసేవాపరులయిన పరమభాగవతులు వసించెడి పుణ్యక్షేత్రంబులును శుభకాముండైనవాఁడు సేవింపవలయు.

7-452-ఆటవెలది

భూవరేంద్ర! యిట్టి పుణ్యప్రదేశంబు
లందు నరుడు చేయు నట్టి ధర్మ
మల్పమైన నది సహస్రగుణాధిక
ఫలము నిచ్చు హరికృపావశమున.

7-453-వచనము

వినుము; చరాచరంబయిన విశ్వమంతయు విష్ణుమయం బగుటఁ జేసి పాత్ర నిర్ణయ నిపుణులైన విద్వాంసులు నారాయణుండు ముఖ్యపాత్రంబని పలుకుదురు; దేవఋషులును బ్రహ్మపుత్రులైన సనకాదులును నుండ భవదీయ రాజసూయంబున నగ్రపూజకు హరి సమ్మతుం డయ్యె; ననేక జంతుసంఘాతకీర్ణంబైన బ్రహ్మాండపాదపంబునకు నారాయణుండు మూలంబు; తన్నిమిత్తంబు నారాయణ సంతర్పణంబు సకలజంతుసంతర్పణం బని యెఱుంగుము; ఋషి నర తిర్య గమర శరీరంబులు పురంబులు వాని యందుఁ దారత మ్యంబులతోడ జీవరూపంబున భగవంతుడయిన హరి వర్తించుటం జేసి పురుషుండనఁ బ్రసిద్ధుం డయ్యె; నందుఁ దిర్యగ్జాతుల కంటె నధికత్వంబు పురుషుని యందు విలసిల్లుటం జేసి పురుషుండు పాత్రంబు; పురుషులలోన హరి తనువైన వేదంబును ధరించుచు సంతోషవిద్యాతపోగరిష్ఠుండైన బ్రాహ్మణుండు పాత్రంబు; బ్రాహ్మణులలోన నాత్మజ్ఞాన పరిపూర్ణుండయిన యోగి ముఖ్యపాత్రం బని పలుకుదురు; పరస్పర పాత్రంబులకు సహింపని మనుష్యులకుఁ బూజనార్థంబుగాఁ ద్రేతాయుగంబు నందు హరి ప్రతిమలు గల్పింప బడియె; కొందఱు ప్రతిమార్చనంబు చేయుదురు; పాత్రపురుషద్వేషు

లైనవారలకు నట్టి ప్రతిమార్చనంబు ముఖ్యార్థప్రదంబు గాదు; మందాధికారులకుఁ బ్రతిమార్చనంబు పురుషార్థప్రదం బగును.

7-454-ఆటవెలది

అఖిలలోకములకు హరి దైవతము చూడ
హరికి దైవతము ధరాధినాథ!
పదపరాగలేశ పంక్తిచేఁ ద్రైలోక్య
పావనంబు జేయు బ్రాహ్మణుండు.

7-455-వచనము

అట్టి బ్రాహ్మణజను లందుఁ గర్మనిష్ఠులుఁ దపోనిష్ఠులు వేదశాస్త్రనిష్ఠులు జ్ఞానయోగనిష్ఠులు నై కొందఱు వర్తింతు; రందు జ్ఞాననిష్ఠునికి ననంతఫలకామి యైన గృహస్థుండు పితృజనుల నుద్దేశించి కవ్యంబులును దేవతల నుద్దేశించి హవ్యంబులును బెట్టుట ముఖ్యంబు; దైవకార్యంబునకు నిరువుర నైన నొకరి నైన బిత్రుకార్యంబునకు ముగ్వురి నైన నొకరినైన భోజనంబు చేయింప వలయు; ధనవంతున కైనను శ్రాద్ధవిస్తారంబు కర్తవ్యంబు గాదు; దేశకాలప్రాప్త కందమూలఫలాదికం బయిన హరి నైవేద్యంబున విధిచోదిత ప్రకారంబుగా శ్రద్ధతోడఁ బాత్రంబు నందుఁ బెట్టిన యన్నంబు గామదుహంబయి యక్షయ ఫలకారి యగు; ధర్మతత్త్వవేది యైనవాఁడు శ్రాద్ధంబులందు మాంస ప్రదానంబు జేయక భక్షింపక చరింపవలయు; కంద మూలాది దానంబున నయ్యెడి ఫలంబు పశుహింసనంబున సంభవింపదు; ప్రాణహింస చేయక వర్తించుట కంటె మిక్కిలి

ధర్మంబు లేదు; యజ్ఞవిదు లైన ప్రోడలు నిష్కాములై బాహ్యకర్మంబులు విడిచి యాత్మ జ్ఞాన దీపంబులందుఁ గర్మమయంబు లయిన యజ్ఞంబుల నాచరింతురు.

7-456-కంద పద్యము

పశువులఁ బొరిగొని మఖములు
విశదములుగఁ జేయు బుధుని వీక్షించి తమున్
విశసనము చేయునో యని
క్రశిమన్ బెగడొందు భూతగణము నరేంద్రా!

7-457-వచనము

అదిగావున; ధర్మవేది యయినవాఁడు దైవప్రాప్తంబు లయిన కంద మూలాదికంబులచేత నిత్యనైమిత్తికక్రియలఁ జేయవలయు; నిజధర్మబాధకం బయిన ధర్మంబును, బరధర్మప్రేరితంబయిన ధర్మంబును, నాభాసధర్మంబును, బాషండధర్మంబును, గపటధర్మంబును ధర్మజ్ఞుండయినవాఁడు మానవలయు; నైసర్గికధర్మంబు దురితశాంతి సమర్థం బగు; నిర్ధనుండు ధర్మార్థంబు యాత్ర జేయుచు నైన ధనంబు గోరవలదు జీవనోపాయంబునకు నిట్టట్టుఁ దిరుగక కార్పణ్యంబు లేక జీవించుచు మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముండై యెద్దియుం గోరక బ్రదికెడి సుగుణునికిం గల సుఖంబు గామ లోభంబుల దశదిశలం బరిధావనంబు చేయువానికి సిద్ధింపదు; పాదరక్షలు గలవానికి శర్కరాకంటకాదుల వలన భయంబు లేక మెలంగ నలవడు భంగిఁ గామంబులవలన నివృత్తి గలవానికి నెల్లకాలంబును భద్రంబగు;

ఉపస్థమునకును జిహ్వాదైన్యంబునకును బురుషుండు
గృహపాలకశునకంబుకైవడి సంచరించుచు సంతుష్టి లేక చెడు; సంతోషిగాని
విప్రుని విద్యా తపో విభవ యశంబులు నిరర్థకంబు లగు; ఇంద్రియలోలత్వంబున
జ్ఞానంబు నశించు; సకల భూలోక భోగంబులు భోగించియు దిగ్విజయంబు
చేసియు బుభుక్షా పిపాసలవలనఁ గామపారంబును హింసవలనఁ గ్రోధపారంబును
జేరుట దుర్లభంబు; సంకల్పవర్జనంబునం గామంబును, గామవర్జనంబునఁ
గ్రోధంబును, నర్థానర్థదర్శనంబున లోభంబును, నద్వైతాను సంధానంబున
భయంబును, నాత్మానాత్మ వివేకంబున శోకమోహంబులును,
సాత్త్వికసేవనంబున దంభంబును, మౌనంబున యోగాంతరాయంబును, శరీర
వాంఛ లేమిని హింసయు, హితాచరణంబున భూతజంబయిన దుఃఖంబును,
సమాధిబలంబున దైవికవ్యధయు, బ్రాణాయామాదికంబున మన్మథవ్యధయు,
సాత్త్వికాహారంబుల నిద్రయు, సత్త్వగుణంబున రజస్తమంబులును,
నుపశమంబున సత్త్వంబును గురుభజనశలుఁడై శీలంబున జయింపవలయు.

7-458-కంద పద్యము

హరిమహిమ దనకుఁ జెప్పిన
గురువున్ నరుఁ డనుచుఁ దలఁచి కుంఠితభక్తిం
దిరుగు పురుషు శ్రమ మెల్లను
కరిశౌచము క్రియ నిరర్థకం బగు నధిపా!

7-459-ఉత్పలమాల

ఈ వనజాతనేత్రుఁ బరమేశు మహాత్ముఁ బ్రధానపూరుషున్
దేవశరణ్యు సజ్జనవిధేయు ననంతుఁ బురాణయోగ సం
సేవితపాదపద్ముఁ దమ చిత్తమునన్ నరుఁ డంచు లోకు లి
చ్ఛావిధిఁ జూచుచుండుదురు; సన్మతి లేక నరేంద్రచంద్రమా!

7-460-వచనము

వినుము; షడింద్రియంబులలోన నొకటియందుఁ దత్పరులై యిచ్ఛాపూరణ విధానంబులఁ జరితార్థుల మైతి మనువారలు ధారణాభ్యాస సమాధియోగంబుల సాధింప లేరు; కృషిప్రముఖంబులు సంసారసాధనంబులు గాని మోక్ష సాధనంబులు గావు; కుటుంబ సంగంబునఁ జిత్తవిక్షేపం బగు; చిత్తవిజయ ప్రయత్నంబున సన్న్యసించి సంగంబు వర్జించి మితంబయిన భిక్షాన్నంబు భక్షించుచు శుద్ధవివిక్త సమప్రదేశంబున నొక్కరుండు నాసీనుండై సుస్థిరత్వంబున బ్రణవోచ్చారణంబు చేయుచు రేచకపూరకకుంభకంబులఁ బ్రాణాపానంబుల నిరోధించి కామహతం బయిన చిత్తంబున బరిభ్రమణంబు మాని కామవిసర్జనంబు చేసి మరలు నంతకు నిజ నాసాగ్ర నిరీక్షణంబు చేయుచు నివ్విధంబున యోగాభ్యాసంబు చేయువాని చిత్తంబు కాష్ఠరహితంబయిన వహ్ని తెఱంగున శాంతిం జెందు కామాదుల చేత వేధింపఁబడక ప్రశాంత సమస్తవృత్తంబయిన చిత్తంబు బ్రహ్మసుఖ సమ్మర్శనంబున లీనంబై మఱియు నెగయ నేరదు.

7-461-మత్తేభ విక్రీడితము

ధరణీదేవుఁడు సన్న్యసించి యతియై ధర్మార్థకామంబులం
బరివర్జించి పునర్విలంబమునఁ దత్ప్రారంభి యౌనేని లో
భ రతిం గ్రక్కిన కూడు మంచి దనుచున్ భక్షించి జీవించు దు
ర్నరు చందంబున హాస్యజీవనుఁ డగున్ నానాప్రకారంబులన్.

7-462-కంద పద్యము

మలమునఁ గ్రిమియును బడు క్రియ
నిలబడు నొడ లాత్మ గాదు హేయం బనుచుం
దలఁతురు తజ్జ్ఞులు పొగడుదు
రలసత నొడ లాత్మ యనుచు నజ్ఞ లిలీశా!

7-463-ఆటవెలది

వ్రతము మానఁదగదు వడుగు గుఱ్ఱనికిని
గ్రియలు మానఁదగదు గృహగతునికి
దపసి కూర నుండదగదు సన్న్యాసికిఁ
దరుణితోడి పొత్తు తగదు తగదు.

7-464-సీస పద్యము

రథము మేనెల్ల, సారథి బుద్ధి, యింద్రియ;
గణము గుఱ్ఱములు, పగ్గములు మనము,

ప్రాణాది దశవిధ పవనంబు లిరుసు, ధ;
ర్మాధర్మగతులు రథాంగకములు,
బహుళతరంబైన బంధంబు చిత్తంబు, ;
శబ్దాదికములు సంచారభూము,
లభిమాన సంయుతుం డయిన జీవుఁడు రథి, ;
ఘనతరప్రణవంబు కార్ముకంబు,

7-464.1-తేటగీతి

శుద్ధజీవుండు బాణంబు, శుభదమైన
బ్రహ్మ మంచిత లక్ష్యంబు, పరులు రాగ
భయ మదద్వేష శోక లోభప్రమోహ
మాన మత్సర ముఖములు మానవేంద్ర!

7-465-వచనము

ఇట్లు మనుష్య శరీరరూపం బయిన రథంబు దన వశంబు చేసికొని మహాభాగవతచరణకమలసేవానిశితం బయిన విజ్ఞానఖడ్గంబు ధరియించి శ్రీమన్నారాయణకరుణావలోకనబలంబున రాగాదిశత్రు నిర్మూలనంబు గావించి ప్రణవబాణాసనంబున శుద్ధజీవశరంబును సంధించి బ్రహ్మ మనియెడి గుఱి యందుఁ బడవేసి యహంకారరథికుండు రథికత్వంబు మాని నిజానందంబున నుండవలయు; నట్టి విశేషంబు సంభవింపని సమయంబున బహిర్ముఖంబు లయిన యింద్రియఘోటకంబులు బుద్ధిసారథిసహితంబులై స్వాభిమాన రథికుని

ప్రమత్తత్వంబుం దెలిసి ప్రవృత్తిమార్గంబు నొందించి విషయ శత్రుమధ్యంబునం గూల్చిన.

7-466-ఆటవెలది

విషయ శత్రు లెల్ల విక్రాంతితోడ సా
రథిసమేతుఁ డయిన రథికుఁ బట్టి
యుగ్ర తిమిరమృత్యుయుత మగు సంసార
కూపమధ్యమందుఁ గూల్తు రధిప!

7-467-వచనము

వినుము; వైదికకర్మంబు ప్రవృత్తంబును నివృత్తంబును నన రెండు దెఱంగు లయ్యె; నందు బ్రవృత్తంబునఁ బునరావర్తనంబును నివృత్తంబున మోక్షంబును సిద్ధించు; ప్రవృత్త కర్మంబులోన నిష్టాపూర్తంబులన రెండుమార్గంబులు గల; వందు హింసాద్రవ్యమయ కామ్యరూపంబు లయిన దర్శ పూర్ణమాస పశు సోమయాగ వైశ్వదేవ బలిహరణ ప్రముఖంబు లయిన యాగాదికంబు లిష్టంబులు; దేవతాలయ వన కూప తటాక ప్రముఖంబులు పూర్తంబులు; ప్రవృత్త కర్మంబున దేహంబు విడిచి దేహాంతరారంభంబు నొందు దేహి హృదయాగ్రంబు వెలుంగు వానితోడ నింద్రియంబులం గూడి భూతసూక్ష్మయుక్తుం డై ధూమదక్షిణాయన కృష్ణపక్ష రాత్రిదర్శంబుల వలన సోమలోకంబుఁ జేరి భోగావసానంబున విలీనదేహుండై వృష్టి ద్వారంబునఁ గ్రమంబున నోషధి లతాన్న శుక్ల రూపంబులం బ్రాపించి భూమి యందు జన్మించు; నిది పునర్భవరూపం బయిన

పితృమార్గంబు; నివృత్తకర్మ నిష్ఠుం డయినవాఁడు జ్ఞానదీప్తంబు లయిన యింద్రియంబు లందుఁ గ్రియాయజ్ఞంబులు యజించి యింద్రియంబుల దర్శనాది సంకల్ప మూలంబయిన మనంబునందు వికారయుక్తంబయిన మనంబును, వాక్కు నందు విద్యా విలక్షణ యయిన వాక్కును వర్ణ సముదా యము నందు వర్ణ సముదాయంబును, అకారాది సర్వత్రయాత్మకం బయిన యోంకారంబు నందు నోంకారంబును, బిందు వందు బిందువును, నాదంబు నందు నాదంబును, బ్రాణంబు నందు బ్రాణంబును, బ్రహ్మ మందు నిలుపవలయును; దేవమార్గంబయిన యుత్తరాయణ శుక్లపక్ష దివాప్రాహ్ణపూర్ణిమా రాకలవలన సూర్యద్వారంబున బ్రహ్మలోకంబు నందుఁ జేరి భోగావసానంబున స్థూలోపాధియైన విశ్వుండై స్థూలంబును సూక్ష్మంబు నందు లయించి సూక్ష్మోపాధి యైన తైజసుండై సూక్ష్మంబును గారణంబు నందు లయించి కారణోపాధి యైన ప్రాజ్ఞుండై కారణంబును సాక్షిస్వరూపంబు నందు లయించి తుర్యుండై సూక్ష్మలయంబునందు శుద్ధాత్ముండై యివ్విధంబున ముక్తుం డగును.

7-468-ఆటవెలది

అమరనిర్మితంబు లై యొప్పు పితృదేవ
సరణు లెవ్వఁ డెఱుఁగు శాస్త్రదృష్టి
నట్టివాఁడు దేహి యై మోహమున నొందఁ
డతిశయించు బుద్ధి నవనినాథ!

7-469-వచనము

వినుము; దేహాదులకుఁ గారణత్వంబున నాదియందును నవధి త్వంబు ననంతమందును గలుగుచు బహిరంగంబున భోగ్యంబును నంతరంగంబున భోక్తయు బరంబు నఁనపరంబును జ్ఞానంబున జ్ఞే యంబును వచనంబున వాచ్యంబును నప్రకాశంబున బ్రకాశంబును నైన వస్తువునకు వేఱొండు లేదు; ప్రతిబింబాదికంబు వస్తుత్వం బునం జేసి వికల్పితంబై తలంపంబడు భంగి నైంద్రియకంబైన సర్వం బును నర్థత్వంబున వికల్పితం బయి తోఁచుం గాని పరమార్థంబు గాదు; దేహాదికంబులు మిథ్యాత్మకంబులు; వానికి హేతువు లయిన క్షితిప్రముఖంబులకును మిథ్యాత్వం బగుట సిద్ధంబు; పర మాత్మకు నవిద్యచేత నెంతదడవు వికల్పంబుదోఁచు; నంతదడవును భ్రమంబునుం దోఁచు; అవిద్యానివృత్తి యైన సర్వంబును మిథ్య యని శాస్త్రవిధినిషేధంబులు కలలోపల మేలుగన్న తెఱంగగు; భావా ద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతంబులు మూఁడు గల; వందుఁ బట తంతు న్యాయంబునఁ గార్యకారణంబు లందు వస్త్వైకత్వాలోచనంబు చేసి వికల్పంబు లేదని భావించుట భావాద్వైతంబు; మనోవాక్కాయ కృతంబు లైన సర్వ కర్మంబులను ఫల భేదంబు జేయక పరబ్రహ్మా ర్పణంబు జేయుట క్రియాద్వైతంబు; పుత్ర మిత్ర కళత్రాది సర్వ ప్రాణులకుం దనకును దేహంబునకుం బంచభూతాత్మకత్వంబున భోక్త యొక్కం డను పరమార్థత్వంబున నర్థకామంబుల యెడ నైక్య దృష్టిఁ జేయుట ద్రవ్యాద్వైతంబు; నేర్పున నాత్మతత్త్వానుభవంబున నద్వైతత్రయంబును విలోకించి వస్తుభేదబుద్ధియుఁ గర్మభేదబుద్ధి యు స్వకీయపరకీయబుద్ధియు స్వప్నంబులుగాఁ దలంచి ముని యైనవాఁడు మానవలయు.

7-470-కంద పద్యము

వాదములు వేయు నేటికి
వేదోక్త విధిం జరించు విబుధుఁడు గృహమం
దాదరమున నారాయణ
పాదంబులు గొలిచి ముక్తిపదమున కేగున్.

7-471-శార్దూల విక్రీడితము

భూపాలోత్తమ! మీరు భక్తిగరిమస్ఫూర్తిన్ సరోజేక్షణ
శ్రీ పాదాంబుజయుగ్మమున్ నియతులై సేవించి కాదే మహో
గ్రాపత్సంఘములోనఁ జిక్కక సమస్తాశాంత నిర్జేతలై
యేపారంగ మఖంబు చేసితిరి దేవేంద్రప్రభావంబునన్.

## 7-16-నారదుని పూర్వజన్మంబు

7-472-వచనము

వినుము; పోయిన మహాకల్పంబునందు గంధర్వులలోన నుపబర్హణుం డను పేర గంధర్వుండ నైన నేను సౌందర్య మాధుర్య గాంభీర్యాది గుణంబుల సుందరులకు బ్రియుండనై క్రీడించుచు నొక్కనాఁడు; విశ్వస్రష్టలైన బ్రహ్మలు దేవసత్రమనియెడి యాగంబులోన నారాయణకథలు గానంబు చేయుకొఱకు నప్పరోజనులను గంధర్వులనుం జీరిన.

7-473-ఆటవెలది

క్రతువులోని కేను గంధర్వగణముతోఁ
గలసి పోయి విష్ణుగాథ లచట
గొన్ని పాడి సతులఁ గూడి మోహితుఁడ నై
తలఁగి చనితి నంత ధరణినాథ!

7-474-కంద పద్యము

వారిజగంధుల పొత్తున
వారిం గైకొనక తలఁగి వచ్చిన బుద్ధిన్
వా రెఱిఁగి శాప మిచ్చిరి
వారింపఁగరాని రోషవశమున నధిపా!

7-475-ఆటవెలది

పంకజాక్షు నిచటఁ బాడక కామినీ
గణము గూడి చనిన కల్మషమున
దగ్ధకాంతి వగుచు ధరణీ తలంబున
శూద్రజాతిసతికి సుతుఁడ వగుము.

7-476-వచనము

అని యిట్లు విశ్వస్రష్టలు శపించిన నొక బ్రాహ్మణదాసికిఁ బుత్రుండ నై జన్మించి యందు బ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూష చేసిన భాగ్యంబున నిమ్మహాకల్పంబునందు బ్రహ్మపుత్రుండనై జన్మించితి.

7-477-ఆటవెలది

కౌశలమున మోక్షగతికి గృహస్థుఁ డే
ధర్మ మాచరించి తగిలి పోవు
నట్టి ధర్మ మెల్ల నతి విశదంబుగాఁ
బలుకఁ బడియె నీకు భవ్యచరిత!

7-478-మత్తేభ విక్రీడితము

అఖిలాధారుఁ డజాది దుర్లభుఁడు బ్రహ్మంబైన విష్ణుండు నీ
మఖమం దర్చితుఁడై నివాసగతుఁ డై మర్త్యాకృతిన్ సేవ్యుఁ డై
సఖి యై చారకుఁ డై మనోదయితుఁ డై సంబంధి యై మంత్రి యై
సుఖదుండయ్యె భవన్మహామహిమ దాఁ జోద్యంబు ధాత్రీశ్వరా!

7-479-వచనము

అని యిట్లు నారదుండు చెప్పిన వృత్తాంతం బంతయు విని ధర్మనందనుండు ప్రేమవిహ్వలుండయి వాసుదేవునిం బూజించె; వాసుదేవ ధర్మనందనులచేతఁ బూజితుండై నారదముని దేవమార్గంబునం జనియె" నని శుకయోగీంద్రుండు పాండవపౌత్రునకుం జెప్పె నని సూతుండు శౌనకాదులకుం జెప్పిన.

## 7-17-పూర్ణి

7-480-కంద పద్యము

రాజీవసదృశలోచన!
రాజీవభవాదిదేవరాజివినుతవి
భ్రాజితకీర్తిలతావృత
రాజీవభవాండభాండ! రఘుకులతిలకా!

7-481-మాలిని

ధరణిదుహితృరంతా! ధర్మమార్గానుగంతా!
నిరుపమనయవంతా! నిర్జరారాతిహంతా!
గురుబుధసుఖకర్తా! కుంభినీచక్రభర్తా!
సురభయపరిహర్తా! సూరిచేతోవిహర్తా!

7-482-చంపకమాల

హరపటుచాపఖండన! మహాద్భుతవిక్రమశౌర్యభండనా!
శరనిధిగర్వభంజన! రసాతనయాహృదయాబ్జరంజనా!
తరుచరసైన్యపాలన! సుధాంధసమౌనిమనోజ్ఞఖేలనా!
సరసిజగర్భసన్నుత! నిశాచరసంహార! త్రిజగన్నుతా!

7-483-గద్యము

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బయిన శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబు నందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల పూర్వజన్మ వృత్తాంతంబు చెప్పుటయు, హిరణ్యకశిపు దితి సంవాదంబును, సుయజ్ఞోపాఖ్యానంబును, ప్రేతబంధు యమసల్లాపంబును, బ్రహ్మవరలాభగర్వితుండైన హిరణ్యకశిపు చరిత్రంబును, ప్రహ్లాదవిద్యాభ్యాస కథయును, ప్రహ్లాద హిరణ్యకశిపు సంవాదంబును, ప్రహ్లాదవచనంబు ప్రతిష్ఠింప హరి నరసింహరూపంబున నావిర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకు నభయం బిచ్చి నిఖిలదేవతానివహ ప్రహ్లాదాది స్తూయమానుండై తిరోహితుం డగుటయుఁ, ద్రిపురాసుర వృత్తాంతంబును, నీశ్వరుండు త్రిపురంబుల దహించుటయు, వర్ణాశ్రమధర్మ వివరణంబును, ప్రహ్లాదాజగర సంవాదంబును, స్వధర్మ ప్రవర్తకుఁ డగు గృహస్థుండు ముక్తుం డగు మార్గంబు నారదుండు ధర్మరాజునకుఁ దెలుపుటయు, నారదుని పూర్వజన్మ వృత్తాంతంబును, నను కథలు గల సప్తమస్కంధము సంపూర్ణము.

# పోతన తెలుగు భాగవతము

## అష్టమ స్కంధము

### 8-1- ఉపోద్ఘాతము

8-1-కంద పద్యము

శ్రీమన్నామ! పయోద
శ్యామ! ధరాభృల్లలామ! జగదభిరామా!
రామాజనకామ! మహో
ద్ధామ! గుణస్తోమధామ! దశరథరామా!

8-2-వచనము

మహనీయ గుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; అట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని.

### 8-2- స్వాయంభువాదిచరిత్ర

8-3-కంద పద్యము

వినఁబడియెను స్వాయంభువ
మనువంశము వర్ణ ధర్మ మర్యాదలతో
మనుజుల దనుజుల వేల్పుల
జననంబులు స్రష్ట లెల్ల జనియించుటయున్.

8-4-ఉత్పలమాల

ఏ మనుకాలమందు హరి యీశ్వరుఁ డేటికి సంభవించె? నే

మేమి యొనర్చె? నమ్మనువు లే? రతఁ డే క్రియఁ జేయుచున్నవాఁ?
డేమి నటించు మీఁద? గత మెయ్యది? సజ్జనులైనవారు ము
న్నేమని చెప్పుచుందురు? మునీశ్వర! నా కెఱిఁగింపవే దయన్.

8-5-వచనము

అనిన శుకుం డిట్లనియె.

8-6-కంద పద్యము

ఈ కల్పంబున మనువులు
ప్రాకటముగ నార్వురైరి పదునలువురలో;
లోకముల జనుల పుట్టువు
లాకథితము లయ్యె వరుస నఖిలములు నృపా!

## 8-3- 1స్వాయంభువమనువుచరిత్ర

8-7-వచనము

ప్రథమ మనువువైన స్వాయంభువునకు నాకూతి దేవహూతు లను నిరువురుఁ గూతులు గలరు; వారికి గ్రమంబునఁ గపిల యజ్ఞ నామంబుల లోకంబులకు ధర్మజ్ఞాన బోధంబు జేయుకొఱకు హరి పుత్రత్వంబు నొందె; నందుఁ గపిలుని చరిత్రంబు మున్నఁ జెప్పంబడియె; యజ్ఞుని చరిత్రంబు చెప్పెద వినుము.

8-8-మత్తేభ విక్రీడితము

శతరూపాపతి గామభోగ విరతిన్ సంత్యక్త భూ భారుఁడై
సతియుం దాను గాన కేఁగి శతవర్షంబుల్ సునందానదిన్
వ్రతియై యేక పదస్థుఁడై నియతుఁడై వాచంయమస్ఫూర్తితో

గతదోషుండు తపంబుజేసె భువనఖ్యాతంబుగా భూవరా.

8-9-వచనము

ఇట్లు తపంబు జేయుచు స్వాయంభువ మనువు తన మనంబులోన.

8-10-సీస పద్యము

సృష్టిచే నెవ్వఁడు చేతనపడకుండు?;
 సృష్టి యెవ్వని చేఁతచే జనించు?
జగములు నిద్రింప జాగరూకత నొంది;
 యెవ్వఁడు బ్రహ్మండ మెఱుఁగుచుండు?
నాత్మ కాధారంబు నఖిలంబు నెవ్వఁడౌ?;
 నెవ్వని నిజధనం బింతవట్టుఁ
బొడగాన రాకుండఁ బొడఁగను? నెవ్వేడే;
 నెవ్వని దృష్టికి నెదురులేదు

8-10.1-ఆటవెలది

జనన వృద్ధి విలయ సంగతిఁ జెందక
యెవ్వఁ డెడపకుండు నెల్ల యెడలఁ?
దన మహత్త్వతత్త్వ సంజ్ఞ నెవ్వఁడు దాన
విశ్వరూపుఁ డనఁగ విస్తరిల్లు?

8-11-వచనము

అని మఱియు "నిరహంకృతుండును నిర్గతబుద్ధుండును నిరాశియుఁ
బరిపూర్ణుండును ననన్య ప్రేరితుండును నృశిక్షాపరుండును నిజమార్గ

సంస్థితుండును నిఖిలధర్మ భావనుండును నైన పరమేశ్వరునకు నమస్కరించెద" నని యుపనిషదర్థంబులు పలుకుచున్న మనువుం గనుంగొని.

8-12-కంద పద్యము

రక్కసులు దినఁగఁ గడఁగిన
వెక్కసముగ యజ్ఞనామ విష్ణుఁడు వారిం
జక్కడిచెఁ జక్రధారల
మిక్కుటముగ వేల్పులెల్ల మేలని పొగడన్.

8-13-వచనము

అది ప్రథమ మన్వంతరం బింక ద్వితీయ మన్వంతరంబు వినుము.

## 8-4- 2స్వారోచిషమనువుచరిత్ర

8-14-సీస పద్యము

స్వారోచిషుం డన సప్తార్చిబిడ్డఁడు; మనువు;
వానికి నా ద్యుమత్సుషేణ
రోచిష్మదాదు లారూఢ పుత్రులు ధాత్రి;
నేలిరి; రోచనుఁ డింద్రుఁ డయ్యె;
నధికులు తుషితాదు లమరు లూర్జస్తంబ;
ముఖ్యు లాఢ్యులు సప్తమునులు నాఁడు;
వేదశిరుం డను విప్రుని దయితకుఁ;
దుషితకుఁ బుత్రుఁడై తోయజాక్షుఁ

8-14.1-ఆటవెలది

డవతరించెను విభుఁ డన నశీత్యష్ట స
హస్ర మునులు నధికు లయినవారు;
ఘను లనుగ్రహింపఁ గౌమారకబ్రహ్మ
చారి యగుచు నతఁడు సలిపె వ్రతము.

8-15-వచనము

తదనంతరంబ.

## 8-5- 3ఉత్తమమనువు చరిత్ర

8-16-సీస పద్యము

మనువు మూఁడవవాఁడు మనుజేంద్ర! యుత్తముం;
 డనఁ బ్రియవ్రతునకు నాత్మజుండు
పాలించె నిల యెల్లఁ బవన సృంజయ యజ్ఞ;
 హోత్రాదు లాతని పుత్రు లధిక
గుణులు; వసిష్ఠుని కొడుకులు ప్రమథాదు;
 లైరి సప్తర్షులు; నమరవిభుఁడు
సత్యజిత్తనువాఁడు; సత్యభద్రాద్యులు;
 సురలు; ధర్మునికిని సూనృతకును

8-16.1-ఆటవెలది

బుట్టి సత్యనియతిఁ బురుషోత్తముఁడు సత్య
సేనుఁ డనఁగ దుష్టశీలయుతుల
దనుజ యక్షపతుల దండించె సత్యజి
న్మిత్రుఁ డగుచు జగము మే లనంగ.

## 8-6- 4తామసమనువు చరిత్ర

8-17-వచనము

చతుర్థమనువు కాల ప్రసంగంబు వివరించెద.

8-18-సీస పద్యము

మానవాధీశ్వర! మనువు నాలవవాఁడు;
 తామసుం డనఁగ నుత్తముని భ్రాత
పృథ్వీపతులు కేతు వృష నర ఖ్యాత్యాదు;
 లతని పుత్రులు పద్గు రధికబలులు;
సత్యకహరి వీర సంజ్ఞలు వేల్పులు;
 త్రిశిఖనామమువాఁడు దేవవిభుఁడు;
మునులు జ్యోతిర్వ్యోమ ముఖ్యులు; హరి పుట్టె;
 హరిమేధునకుఁ బ్రీతి హరిణియందు;

8-18.1-ఆటవెలది

గ్రాహబద్ధుఁ డయిన గజరాజు విడిపించి
ప్రాణభయము వలనఁ బాపి కాచె
హరి దయాసముద్రుఁ డఖిలలోకేశ్వరుఁ
డనిన శుకునిఁ జూచి యవనివిభుఁడు.

## 8-7- గజేంద్రమోక్షకథాప్రారంభము

8-19-కంద పద్యము

నీరాట వనాటములకుఁ

బోరాటం బెట్లు కలిగెఁ? బురుషోత్తముచే
నారాట మెట్లు మానెను
ఘోరాటవిలోని భద్ర కుంజరమునకున్.

8-20-కంద పద్యము

మునినాథ! యీ కథాస్థితి
వినిపింపుము వినఁగ నాకు వేడుక పుట్టెన్;
వినియెదఁ గర్ణేంద్రియముల
బెనుఁబండువు చేయ మనముఁ బ్రీతిం బొందన్.

8-21-కంద పద్యము

ఏ కథల యందుఁ బుణ్య
శ్లోకుఁడు హరి చెప్పఁబడును సూరిజనముచే
నా కథలు పుణ్యకథలని
యాకర్ణింపుదురు పెద్ద లతి హర్షమునన్.

8-22-వచనము

ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగె" నని చెప్పి సభాసదులైన మునుల నవలోకించి సూతుండు పరమహర్ష సమేతుండై చెప్పె; "నట్లు శుకుండు రాజున కిట్లనియె.

## 8-8- త్రికూటపర్వతవర్ణన

8-23-సీస పద్యము

రాజేంద్ర! విను సుధారాశిలో నొక పర్వ;

తము త్రికూటం బనఁ దనరుచుండు;
యోజనాయుతమగు నున్నతత్వంబును;
నంతియ వెడలుపు నతిశయిల్లుఁ;
గాంచనాయస్సారకలధౌతమయములై;
మూఁడు శృంగంబులు మొనసియుండుఁ;
దట శృంగబహురత్న ధాతుచిత్రితములై;
దిశలు భూనభములుఁ దేజరిల్లు;

8-23.1-తేటగీతి

భూరి భూజ లతా కుంజ పుంజములును
మ్రోసిపఱతెంచు సెలయేటి మొత్తములును
మరఁగి తిరిగెడు దివ్యవిమానములును
జలులఁ గ్రీడించు కిన్నరచయముఁ గలిగి.

8-24-వచనము

అది మఱియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాత కామ్రాతక సరళ పనస బదరీ వకుళ వట కుటజ కుంద కురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సింధువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కర వీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశు పాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంతసమయ సౌభాగ్య సంపదంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరున్నివహాలంకృతంబును; మణివాలుకానేక విమల

పులినతరంగిణీ సంగత విచిత్ర విద్రుమలతా మహోద్యాన శుక పిక నికర నిశిత సమంచిత చంచూపుట నిర్ధళిత శాఖిశాఖాంతర పరిపక్వ ఫలరంధ్ర ప్రవర్షిత రసప్రవాహ బహుళంబును; కనకమయ సలిల కాసార కాంచన కుముద కల్హార కమల పరిమళ మిళిత కబళాహార సంతతాంగీంకార భార పరిశ్రాంత కాంతా సమాలింగిత కుమార మత్త మధుకర విటసముదయ సమీపసంచార సముదంచిత శకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాక బక బలాక కోయష్టిక ముఖర జలవిహంగ విసర వివిధ కోలాహల బధిరీ భూత భూనభోంతరాళంబును; తుహినకరకాంత మరకత కమల రాగ వజ్ర వైఢూర్య నీల గోమేధిక పుష్యరాగ మనోహర కనక కల ధౌత మణిమయానేక శిఖరతట దరీవిహరమాణ విద్యాధర విబుధ సిద్ధ చారణ గరుడ గంధర్వ కిన్నర కింపురుష మిథున సంతత సరస సల్లాప సంగీత ప్రసంగ మంగళాయతనంబును; గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ కంఠీరవ శరభ శార్దూల శశ చమర శల్య భల్ల సారంగ సాలావృక వరాహ మహిష మర్కట మహోరగ మార్జాలాది నిఖిల మృగనాథ సమూహ సమర సన్నాహ సంరంభ సంచకిత శరణాగత శమన కింకరంబునై యొప్పు నప్పర్వత సమీపము నందు.

8-25-కంద పద్యము

భిల్లీ భిల్ల లులాయక
భల్లుక ఫణి ఖడ్గ గవయ వలిముఖ చమరీ
ఝిల్లీ హరి శరభక కిటి
మల్లాద్భుత కాక ఘూక మయమగు నడవిన్.

### 8-9- త్రికూటమందలి గజములు

8-26-శార్దూల విక్రీడితము

అన్యాలోకన భీకరంబులు జితాశానేకపానీకముల్
వన్యేభంబులు కొన్ని మత్తతనులై వజ్యావిహారాగతో
దన్యత్వంబున భూరి భూధరదరీ ద్వారంబులందుండి సా
జన్యక్రీడల నీరుగాలిపడి కాసారావగాహార్థమై.

8-27-ఆటవెలది

అంధకార మెల్ల నద్రిగుహాంతర
వీథులందుఁ బగలు వెఱచి డాఁగి
యెడరు వేచి సంధ్య నినుఁడు వృద్ధత నున్న
వెడలె ననఁగ గుహలు వెడలెఁ గరులు.

8-28-కంద పద్యము

తలఁగవు కొండలకైనను
మలఁగవు సింగములకైన మార్కొను కడిమిం
గలఁగవు పిడుగుల కైనను
నిల బలసంపన్న వృత్తి నేనుఁగు గున్నల్.

8-29-సీస పద్యము

పులుల మొత్తంబులు పొదరిండ్లలోఁ దూఱు;
ఘోరభల్లూకముల్ గుహలు దొచ్చు;
భూదారములు నేల బొఱియలలో డాఁగు;
హరిదంతముల కేఁగు హరిణచయము;
మడువులఁ జొరఁబాఱు మహిషసంఘంబులు;

గండశైలంబులఁ గపులు ప్రాఁకు;
వల్మీకములు జొచ్చు వనభుజంగంబులు;
నీలకంఠంబులు నింగి కెగయు;

8-29.1-తేటగీతి

వెఱచి చమరీమృగంబులు విసరు వాల
చామరంబుల విహారణశ్రమము వాయ
భయదపరిహేల విహరించు భద్రకరుల
గాలివాఱిన మాత్రాన జాలిఁ బొంది.

8-30-కంద పద్యము

మదగజ దానామోదముఁ
గదలని తమకములఁ ద్రావి కడుపులు నిండం
బొదలుచుఁ దుమ్మెదకొదమల
కదుపులు జుం జుమ్మటంచు గానము చేసెన్.

8-31-కంద పద్యము

తేటి యొకటి యొరు ప్రియకును
మాటికి మాటికిని నాగ మదజల గంధం
బేటి కని తన్నుఁ బొందెడి
బోటికి నందిచ్చు నిండు బోఁటు దనమునన్.

8-32-కంద పద్యము

అంగీకృత రంగన్మా

తంగీ మదగంధ మగుచు దద్దయు వేడ్కన్
సంగీత విశేషంబుల
భృంగీగణ మొప్పె ద్రుగ్రానుపెట్టెడి మాడ్కిన్.

8-33-కంద పద్యము

వల్లభలు పాటి మునుపడ
వల్లభ మని మునరి రేని వారణదానం
బొల్లక మధుకరవల్లభు
లుల్లంబులఁ బొందిరెల్ల యుల్లాసంబుల్.

8-34-వచనము

అప్పుడు.

8-35-మత్తేభ విక్రీడితము

కలభంబుల్ చెరలాడుఁ బల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్
ఫలభూజంబులు రాయుచుం జివురు జొంపంబుల్ వడిన్ మేయుచుం
బులులం గాఱెనుపోతులన్ మృగములం బోనీక శిక్షించుచుం
గొలఁకుల్ జొచ్చి కలంచుచున్ గిరులపై గొబ్బిళ్ళు గోరాడుచున్.

8-36-కంద పద్యము

తొండంబుల మదజలవృత
గండంబులఁ గుంభములను ఘట్టన చేయం
గొండలుదల క్రిందై పడు
బెండుపడున్ దిశలు చూచి బెగడున్ జగముల్.

## 8-10- గజేంద్రుని వర్ణన

### 8-37-కంద పద్యము

ఎక్కడఁ జూచిన లెక్కకు
నెక్కువ యై యడవి నడచు నిభయూథములో
నొక్క కరినాథుఁ డెడతెగి
చిక్కె నొక కరేణుకోటి సేవింపంగన్.

### 8-38-వచనము

ఇట్లు వెనుక ముందట నుభయ పార్శ్వంబులఁ దృషార్దితంబులై యరుగుదెంచు నేనుంగు గములం గానక తెఱంగుదప్పి తొలంగుడుపడి యీశ్వరాయత్తంబైన చిత్తంబు సంవిత్తంబు గాకుండుటంజేసి తానును దన కరేణుసమూహంబును నొక్కతెరువై పోవుచు.

### 8-39-సీస పద్యము

పల్వలంబుల లేఁత పచ్చిక మచ్చికఁ;
 జెలుల కందిచ్చు నచ్చికము లేక;
నివురుజొంపములఁ గ్రొవ్వెలయు పూఁగొమ్మలఁ;
 బ్రాణవల్లభలకుఁ బాలువెట్టు;
ఘనదానశీతల కర్ణతాళంబుల;
 దయితల చెమటార్చుఁ దనువు లరసి;
మృదువుగాఁ గొమ్ముల మెల్లన గళములు;
 నివురుచుఁ బ్రేమతో నెఱపు వలపు;

8-39.1-తేటగీతి

పిఱుదు చక్కట్ల డగ్గఱి ప్రేమతోడ
డాసి మూర్కొని దివికిఁ దొండంబు జాఁచు
వెద వివేకించుఁ గ్రీడించు విశ్రమించు
మత్తమాతంగ మల్లంబు మహిమతోడ.

8-40-సీస పద్యము

తన కుంభముల పూర్ణతకు డిగ్గి యువతుల;
 కుచములు పయ్యెదకొంగు లీఁగఁ;
దన యానగంభీరతకుఁ జాల కబలల;
 యానంబు లందెల నండగోనఁగఁ;
దన కరశ్రీఁ గని తలఁకి బాలల చిఱు;
 దొడలు మేఖలదీప్తిఁ దోడు పిలువఁ;
దన దంతరుచికోటి తరుణుల నగవులు;
 ముఖచంద్ర దీప్తుల ముసుఁగు దిగువఁ;

8-40.1-తేటగీతి

దనదు లావణ్యరూపంబుఁదలఁచి చూఁడ
నంజనాభ్రము కపిలాది హరిదిభేంద్ర
దయిత లందఱుఁ దనవెంటఁ దగిలినడవఁ;
గుంభివిభుఁ డొప్పెనొప్పుల కుప్ప బోలె.

8-41-వచనము

మఱియు నానాగహన విహరణ మహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి పిపాసాపరాయత్త చిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానునుం జని చని.

8-42-మత్తేభ విక్రీడితము

అటఁ గాంచెం గరిణీవిభుండు నవఫుల్లాంభోజకల్హారమున్
నటదిందిందిర వారముం గమఠ మీనగ్రాహ దుర్వారమున్
వట హింతాల రసాల సాల సుమనో వల్లీకుటీతీరముం
జటులోద్ధూత మరాళ చక్ర బక సంచారంబుఁ గాసారమున్.

## 8-11- గజేంద్రుని కొలను ప్రవేశము

8-43-వచనము

ఇట్లనన్య పురుష సంచారంబై నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁ బొడగని.

8-44-సీస పద్యము

తోయజగంధంబుఁ దోఁగిన చల్లని;
 మెల్లని గాడ్పుల మేను లలరఁ
గమల నాళాహార విమలవాక్కలహంస;
 రవములు చెవుల పండువులు చేయ
ఫుల్లదిందీవరాంభోరుహా మోదంబు;
 ఘ్రాణరంధ్రంబుల గారవింప
నిర్మల కల్లోల నిర్గతాసారంబు;
 వదన గహ్వరముల వాడు దీర్ప

8-44.1-తేటగీతి

త్రిజగ దభినవ సౌభాగ్య దీప్తమైన
విభవ మీక్షణములకును విందు చేయ
నరిగి పంచేంద్రియవ్యవహారములను
మఱచి మత్తేభయూథంబు మడుఁగుఁజొచ్చె.

8-45-కంద పద్యము

తొండంబులఁ బూరించుచు
గండంబులఁ జల్లుకొనుచు గళగళరవముల్
మెండుకొన వలుఁదకడుపులు
నిండన్ వేదండకోటి నీటిం ద్రావెన్.

8-46-వచనము

అప్పుడు.

8-47-మత్తేభ విక్రీడితము

ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీరెక్కించి పూరించి చం
డభ మార్గంబున కెత్తి నిక్కి వడి నుద్గాడించి పింజింప నా
రభటిన్ నీరములోనఁ బెల్లెగసి నక్రగ్రాహ పాఠీనముల్
నభమం దాడెడు మీన కర్కటము లన్నాట్టెన్ సురల్ మ్రాన్పడన్.

8-48-వచనము

మఱియు నగ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున.

8-49-సీస పద్యము

కరిణీకరోజ్ఝిత కంకణచ్ఛటఁ దోఁగి;
సెలయేటి నీలాద్రి చెలువుఁ దెగడు
హస్తినీ హస్త విన్యస్త పద్మంబుల;
వేయిగన్నులవాని పెరవు చూపుఁ
గలభసముత్కీర్ణ కల్హార రజమునఁ;
గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చు
గుంజరీ పరిచిత కుముద కాండంబుల;
ఫణిరాజ మండన ప్రభ వహించు

8-49.1-ఆటవెలది

మదకరేణు ముక్త మౌక్తిక శుక్తుల
మెఱుఁగుమొగిలుతోడ మేలమాడు
నెదురులేని గరిమ నిభరాజ మల్లంబు
వనజగేహకేళి వ్రాలునపుడు.

8-50-వచనము

మఱియు నా సరోవరలక్ష్మి మదగజేంద్ర వివిధ విహారవ్యాకులిత నూతన లక్ష్మీవిభవయై యనంగ విద్యానిరూఢ పల్లవ ప్రబంధపరికంపిత శరీరాలంకార యగు కుసుమ కోమలియునుం బోలె వ్యాకీర్ణ చికుర మత్తమధుకర నికరయు; విగతరస వదనకమలయు; నిజస్థాన చలిత కుచరథాంగయుగళయు; లంపటిత జఘనపులినతలయునై యుండె; అంత.

## 8-12- కరిమకరులయుద్ధము

8-51-సీస పద్యము

భుగభుగాయితభూరి బుద్బుదచ్ఛటలతోఁ;
 గదలుచు దివికి భంగంబు లెగయ;
భువన భయంకరఫూత్కార రవమున;
 ఘోరనక్రగ్రాహకోటి బెగడ;
వాలవిక్షేప దుర్వార ఝుంఝూనిల;
 వశమున ఘుమఘుమావర్త మడరఁ;
గల్లోలజాల సంఘట్టనంబులఁ దటీ;
 తరులమూలంబులై ధరణిఁ గూల;

8-51.1-తేటగీతి

సరసిలోనుండి వెడలి సంభ్రమించి
యుదరి కుప్పించి లంఘించి హుంకరించి
భానుఁ గబళించి పట్టు స్వర్భానుపగిది
నొక్క మకరేంద్రుఁ డిభరాజు నొడిసిపట్టె.

8-52-కంద పద్యము

వడిఁ దప్పించి కరీంద్రుఁడు
నిడుదకరం బెత్తి వ్రేయ నీరాటంబుం
బొడ వడఁగినట్లు జలముల
బడి కదువడిఁ బట్టెఁ బూర్వపదయుగళంబున్.

8-53-చంపకమాల

పదములఁ బట్టినం దలకుబా టొకయింతయు లేక శూరతన్
మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంత ఘట్టనం

జెదరఁగఁ జిమ్మె నమ్మకరిచిప్పలు పాదులు దప్పనొప్పఱన్
వదలి జలగ్రహంబు కరివాలముమూలముఁ జీరెఁ గోరులన్.

8-54-కంద పద్యము

కరిఁ దిగుచు మకరి సరసికిఁ
గరి దరికిని మకరిఁ దిగుచు గరకరి బెరయన్
గరికి మకరి మకరికిఁ గరి
భర మనుచును నతల కుతల భటు లరుదు పడన్.

8-55-వచనము

ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండదండంబులై తలపడి నిఖిల లోకాలోకన భీకరంబులై; యన్యోన్య విజయశ్రీ వశీకరంబులై; సంక్షోభిత కమలాకరంబులై; హరి హరియును; గిరి గిరియునుం దాఁకి పెఱుతివియక పెనంగు తెఱంగున నీరాటం బయిన పోరాటంబునం బట్టుచు వెలికి లోనికిం దిగుచుచుఁ గొలంకు గలంకంబొందఁ గడువడి నిట్టట్టుఁబడి తడఁబడక బుడబుడానుకారంబులై బుగులు బుగు ల్లను చప్పుళ్ళతో నురువులుఁ గట్టుచు జలంబు లుప్పరం బెగయం జప్పరించుచుఁ దప్పక వదనగహ్వరంబుల నప్పళించుచు నిశితనితాంత దురంతదంత కుంతలంబుల నింతింతలు తునియ లయి నెప్పళంబునం బునుక చిప్పలుఁ గుదుళ్ళుఁ దప్పి రక్తంబులుఁ గ్రమ్ముదేర హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచు నితరేతర సమాకర్షణంబులం గదలక పదంబుల మొదలిపట్టు వదలక కుదురై వర్తించుచు బరిభ్రమణ వేగంబున జలంబులం దిరుగుచు మకర కమఠ కర్కట గండక మండూకాది సలిల నిలయంబుల ప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిం దాఁకు రభసంబున

నిక్కలుబడ మ్రక్కంద్రొక్కుచు మెండుచెడి బెండుపడి నాఁచు గుల్లచిప్ప తండంబులఁ బరస్పర తాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు నేలమాసగొనక గెలుపు దలంపులు బెట్టిదంబులై రెట్టింప నహోరాత్రంబులుం బోలెఁ గ్రమక్రమ విజృంభమాణంబులై బహుకాల కలహ విహారంబులయి నిర్గత నిద్రాహారంబులై యవక్రపరాక్రమ ఘోరంబులై పోరుచున్న సమయంబున.

8-56-కంద పద్యము

జవమును జలమును బలమును
వివిధములుగఁ బోరు కరటివీరతకు భువిన్
దివి మకర మీన కర్కట
నివహము లొక్కటన మిత్రనిలయముఁ బొందెన్.

8-57-శార్దూల విక్రీడితము

ఆటోపంబునఁ జిమ్ము బొమ్మగల వజ్రాభీల దంతంబులం
దాటించున్ మెడఁ జుట్టిపట్టి హరి దోర్దండాభ శుండాహతిన్
నీటన్ మాటికిమాటికిం దిగువఁగా నీరాటమున్ నీటి పో
రాటన్నోటమిపాటుఁ జూపుట కరణ్యాటంబు వాచాటమై.

8-58-వచనము

అప్పుడు.

8-59-ఆటవెలది

మకరితోడఁ బోరు మాతంగవిభుని నొ
క్కరుని డించి పోవఁ గాళ్ళు రాక

గోరి చూచు చుండెఁ గుంజరీయూథంబు
మగలు దగులుఁ గారె మగువలకును.

8-60-వచనము

అంత.

8-61-ఆటవెలది

జీవనంబు దనకు జీవనంబై యుంట
నలవుఁ జలము నంతకంత కెక్కి
మకరమొప్పెఁ డస్సె మత్తేభమల్లంబు
బహుళపక్ష శీతభాను పగిది.

8-62-మత్తేభ విక్రీడితము

ఉఱుకుం గుంభయుగంబుపై హరి క్రియన్ హుమ్మంచుఁ; బాదంబులం
నెఱయం గంఠము వెన్నుదన్ను; నెగయున్ హేలాగతిన్; వాలముం
జఱచుం నుగ్గుగఁదాఁకు ముంచు మునుగుం శల్యంబులుందంతముల్
విఱుఁగన్ వ్రేయుచుఁ బొంచిపొంచి కదియున్ వేదండ యూథోత్తమున్.

8-63-మత్తేభ విక్రీడితము

పొడగానం బడకుండ డాఁగు వెలికిం బోవంగ దా నడ్డమై
పొడచూపుం జరణంబులం బెనగొనున్ పో రాక రా రాక బె
గ్గడిలం గూలఁగ దాఁచు లేచుతఱి నుద్ఘాటించు లంఘించుఁ బ
ల్విడిఁ జీరుం దలఁగున్ మలంగు నొడియన్ వేధించుఁ గ్రోధించుచున్.

8-64-వచనము

ఇట్లు విస్మృతనక్రచక్రంబయి నిర్వక్రవిక్రమంబున నల్పహృదయజ్ఞాన దీపంబు నతిక్రమించు మహా మాయాంధకారంబునుంబోలె నంతకంతకు నుత్సాహ కలహసన్నాహ బహువిధ జలావగాహం బయిన గ్రాహంబు మహాసాహసంబున.

8-65-శార్దూల విక్రీడితము

పాదద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మూలాకు హత్తించి ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనరతిం గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంతనిర్వక్రమై.

8-66-ఆటవెలది

వనగజంబు నెగచు వనచారిఁ బొడగని
వనగజంబ కాన వజ్రిగజము
వెల్ల నై సురేంద్రు వేచి సుధాంధులు
పట్టఁ బట్టనీక బయలు ప్రాఁకె.

8-67-ఉత్పలమాల

ఊహ గలంగి జీవనపుటోలమునం బడి పోరుచున్ మహా
మోహలతా నిబద్ధపదముున్ విడిపించుకొనంగ లేక సం
దేహముఁ బొందు దేహి క్రియ దీనదశన్ గజ ముండె భీషణ
గ్రాహ దురంత దంత పరిఘట్టిత పాదఖురాగ్ర శల్యమై.

8-68-వచనము

ఇవ్విధంబున.

8-69-కంద పద్యము

అలయక సొలయక వేసట

నొలయకఁ గరి మకరితోడ నుద్దండత రా

త్రులు సంధ్యలు దివసంబులు

సలిపెం బో రొక్క వేయి సంవత్సరముల్.

## 8-13- గజేంద్రుని దీనాలాపములు

8-70-మత్తేభ విక్రీడితము

పృథుశక్తిన్ గజ మా జలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి సం

శిథిలంబై తన లావు పైరిబలముం జింతించి మిథ్యామనో

రథమిం కేటికి? దీని గెల్వ సరి పోరం జాలరా దంచు స

వ్యథమై యిట్లనుఁ బూర్వపుణ్యఫల దివ్యజ్ఞాన సంపత్తితోన్.

8-71-శార్దూల విక్రీడితము

ఏ రూపంబున దీని గెల్తు? నిటమీఁ దేవేల్పుఁ జింతింతు? నె

వ్వారిం జీరుదు? నెవ్వరడ్డ? మిఁక నివ్వారిప్రచారోత్తమున్

వారింపం దగువార లెవ్వ? రఖిలవ్యాపారపారాయణుల్

లేరే? మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్.

8-72-శార్దూల విక్రీడితము

నానానేకపయూథముల్ వనములోనం బెద్దకాలంబు స

న్మానింపన్ దశలక్షకోటి కరిణీనాథుండనై యుండి మ

ద్ధానాంభః పరిపుష్ట చందన లతాంతచ్ఛాయలం దుండ లే

కీ నీరాశ నిటేల వచ్చితి? భయం బెట్లోకదే యీశ్వరా!

8-73-ఉత్పలమాల

ఎవ్వనిచే జనించు జగ; మెవ్వని లోపల నుండు లీనమై;
యెవ్వని యందు డిందుఁ; బరమేశ్వరుఁ డెవ్వఁడు; మూలకారణం
బెవ్వఁ; డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు; సర్వముఁ దానయైనవాఁ
డెవ్వఁడు; వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్.

8-74-కంద పద్యము

ఒకపరి జగములు వెలినిడి
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై
సకలార్థ సాక్షి యగు న
య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్.

8-75-కంద పద్యము

లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినఁ దుది నలోకం బగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డే కాకృతి వెలుఁగు నతని నే సేవింతున్.

8-76-కంద పద్యము

నర్తకుని భంగిఁ బెక్కగు
మూర్తులతో నెవ్వఁ డాడు? మునులు దివిజులుం
గీర్తింప నేర? రెవ్వని
వర్తన మొరు లెఱుఁగ? రట్టివాని నుతింతున్.

8-77-ఆటవెలది

ముక్తసంగులైన మునులు దిదృక్షులు
సర్వభూత హితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కు నాకు.

8-78-సీస పద్యము

భవము దోషంబు రూపంబుఁ గర్మంబు నా;
హ్వాయమును గుణము లెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించు కొఱకునై;
నిజమాయ నెవ్వఁ డిన్నియునుఁ దాల్చు
నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ;
కిద్ధరూపికి రూపహీనునకును
జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికినిఁ;
బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు

8-78.1-ఆటవెలది

మాటలను నెఱుకల మనములఁ జేరంగఁ
గాని శుచికి సత్త్వగమ్యుఁ డగుచు
నిపుణుఁ డైనవాని నిష్కర్మతకు మెచ్చు
వాని కే నొనర్తు వందనములు.

8-79-సీస పద్యము

శాంతున కపవర్గ సౌఖ్య సంవేదికి;

నిర్వాణ భర్తకు నిర్విశేషు
నకు; ఘోరునకు గూఢునకు గుణధర్మికి;
సౌమ్యున కధిక విజ్ఞాన మయున
కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహు;
క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మ మూలున కఖిలేంద్రి;
యజ్ఞాపకునకు దుఃఖాంత కృతికి

8-79.1-ఆటవెలది

నెఱి నసత్య మనెడి నీడతో వెలుఁగుచు
నుండు నెక్కటికి మహోత్తరునకు
నిఖిలకారణునకు నిష్కారణునకు న
మస్కరింతు నన్ను మనుచు కొఱకు.

8-80-కంద పద్యము

యోగాగ్ని దగ్ధకర్ములు
యోగీశ్వరు లే మహాత్ము నొం డెఱుఁగక స
ద్యోగ విభాసిత మనముల
బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్.

8-81-సీస పద్యము

సర్వాగమామ్నాయ జలధికి నపవర్గ;
మయునికి నుత్తమ మందిరునకు
సకలగుణారణిచ్ఛన్న బోధాగ్నికిఁ;

దనయంత రాజిల్లు ధన్యమతికి
గుణలయోద్దీపిత గురు మానసునకు సం;
వర్తితకర్మనిర్వర్తితునకు
దిశ లేని నా బోఁటి పశువుల పాపంబు;
లడఁచువానికి సమస్తాంతరాత్ముఁ

8-81.1-ఆటవెలది

డై వెలుంగువాని కచ్ఛిన్ను నకు భగ
వంతునకుఁ దనూజ పశు నివేశ
దారసక్తు లయినవారి కందఁగరాని
వాని కాచరింతు వందనములు.

8-82-వచనము

మఱియును.

8-83-సీస పద్యము

వరధర్మకామార్థ వర్జితకాములై;
విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు? చేరి కాంక్షించువారి క;
వ్యయ దేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ?
ముక్తాత్ము లెవ్వని మునుకొని చింతింతు?;
రానందవార్ధి మగ్నాంతరంగు
లేకాంతు లెవ్వని నేమియు గోరక;
భద్రచరిత్రంబుఁ బాడుచుందు?

8-83.1-ఆటవెలది

రా మహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్ము
బ్రహ్మమయిన వానిఁ బరుని నతీంద్రియు
నీశు స్థూలు సూక్ష్ము నే భజింతు.

8-84-వచనము

అని మఱియు నిట్లని వితర్కించె.

8-85-సీస పద్యము

పావకుండర్చుల భానుండు దీప్తుల;
నెబ్భంగి నిగిడింతు రెట్ల డంతు
రా క్రియ నాత్మకరావళిచేత బ్ర;
హ్మాదుల వేల్పుల నఖిలజంతు
గణముల జగముల ఘన నామ రూప భే;
దములతో మెఱయించి తగ నడంచు
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియంబులుఁ దాన;
యై గుణ సంప్రవాహంబు నెఱపు

8-85.1-తేటగీతి

స్త్రీ నపుంసక పురుష మూర్తియునుఁ గాక
తిర్య గమర నరాది మూర్తియునుఁ గాక
కర్మ గుణ భేద స దసత్ప్రకాశిఁ గాక
వెనుక నన్నియుఁ దా నగు విభుఁ దలంతు.

8-86-కంద పద్యము

కలఁ డందురు దీనుల యెడఁ

గలఁ డందురు పరమయోగి గణముల పాలం

గలఁ డందు రన్ని దిశలను

గలఁడు కలం డనెడి వాఁడు గలఁడో లేఁడో?

8-87-సీస పద్యము

కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁ;

గలిమిలేములు లేకఁ గలుగువాఁడు?

నా కడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁ;

బడిన సాధుల కడ్డపడెడువాఁడు?

చూడఁడే నా పాటుఁ జూపులఁ జూడకఁ;

జూచువారలఁ గృపఁ జూచువాఁడు?

లీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల;

మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు?

8-87.1-తేటగీతి

అఖిల రూపముల్ దనరూప మైనవాఁడు

ఆదిమధ్యాంతములు లేక యడరువాఁడు

భక్తజనముల దీనుల పాలివాఁడు

వినఁడె? చూడఁడె? తలఁపడె? వేగ రాఁడె?

8-88-కంద పద్యము

విశ్వకరు విశ్వదూరుని

విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు
నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్.

8-89-వచనము

అని పలికి తన మనంబున నగ్గజేంద్రుం డీశ్వర సన్నిధానంబు కల్పించుకొని యిట్లనియె.

8-90-శార్దూల విక్రీడితము

లా వొక్కింతయు లేదు; ధైర్యము విలోలంబయ్యె; బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను; మూర్ఛ వచ్చెఁ; దనువున్ డస్సెన్; శ్రమంబయ్యెడిన్;
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ; మన్నింపందగున్ దీనునిన్;
రావే! యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

8-91-కంద పద్యము

విను దఁట జీవుల మాటలు
చను దఁట చనరానిచోట్ల శరణార్థుల కో
యను దఁట పిలిచిన సర్వముఁ
గను దఁట సందేహ మయ్యెఁ గరుణావార్ధీ!

8-92-ఉత్పలమాల

ఓ! కమలాప్త! యో! వరద! యో! ప్రతిపక్షవిపక్షదూర! కు
య్యో! కవియోగివంద్య! సుగుణోత్తమ! యో! శరణాగతామరా
నోకహ! యో! మునీశ్వర మనోహర! యో! విమలప్రభావ! రా

వే కరుణింపవే తలఁపవే శరణార్థిని నన్నుఁగావవే.

8-93-వచనము

అని పలికి మఱియు నరక్షిత రక్షకుండైన యీశ్వరుం డాపన్నుఁడైన నన్నుఁ గాచుఁ గాక యని నింగి నిక్కి చూచుచు నిట్టూర్పులు నిగడించుచు బయ లాలకించుచు నగ్గజేంద్రుండు మొఱచేయుచున్న సమయంబున.

## 8-14- విష్ణువు ఆగమనము

8-94-ఆటవెలది

విశ్వమయత లేమి వినియు నూరక యుండి
రంబుజాసనాదు లడ్డపడక
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు
భక్తియుతున కడ్డపడఁ దలంచె.

8-95-మత్తేభ విక్రీడితము

అల వైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబు దా
పల మందారవనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై.

8-96-మత్తేభ విక్రీడితము

సిరికిం జెప్పఁడు; శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబునుఁ జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు; వివాదప్రోత్థితశ్రీకుచో

పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

8-97-వచనము

ఇట్లు భక్తజనపాలన పరాయణుండును; నిఖిల జంతు హృదయారవింద సదన సంస్థితుండును నగు నారాయణుండు కరికులేంద్ర విజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి; లక్ష్మీకాంతా వినోదంబులం దగులు చాలించి; సంభ్రమించి దిశలు నిరీక్షించి; గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి; నిజపరికరంబు మరల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయు నప్పుడు.

8-98-మత్తేభ విక్రీడితము

తనవెంటన్ సిరి; లచ్చివెంట నవరోధవ్రాతమున్; దాని వె
న్కనుఁ బక్షీంద్రుఁడు; వాని పొంతను ధనుఃకౌమోదకీ శంఖ చ
క్రనికాయంబును; నారదుండు; ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.

8-99-వచనము

తదనంతరంబ ముఖారవింద మకరందబిందు సందోహ పరిష్యందమానానందేందిందిరయగు నయ్యిందిరాదేవి గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవ్యానచేలాంచల యై పోవుచు.

8-100-మత్తేభ విక్రీడితము

తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁ; డనాథస్త్రీ జనాలాపముల్
వినెనో? మ్రుచ్చులు మ్రుచ్చలించిరో ఖలుల్ వేదప్రపంచంబులన్?
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో? భక్తులం

గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁ డని ధిక్కారించిరో? దుర్జనుల్.

8-101-వచనము

అని వితర్కించుచు.

8-102-శార్దూల విక్రీడితము

తాటంకాచలనంబుతోఁ; భుజనటద్ధమ్మిల్లబంధంబుతోఁ;
శాటీముక్త కుచంబుతోఁ; నదృఢచంచత్కాంచితోఁ; శీర్ణలా
లాటాలేపముతోఁ; మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ;
గోటీందుప్రభతోఁ; నురోజభర సంకోచద్విలగ్నంబుతోన్.

8-103-కంద పద్యము

అడిగెద నని కడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడుగఁ డని నడ యుడుగున్
వెడవెడ సిడిముడి తడఁబడ
నడు గిడు; నడుగిడదు జడిమ నడు గిడునెడలన్.

8-104-సీస పద్యము

నిటలాలకము లంట నివుర జుంజుమ్మని;
 ముఖసరోజము నిండ ముసురుఁ దేంట్లు;
నళులఁ జోపఁగఁ జిల్క లల్ల నల్లన చేరి;
 యోష్ఠబింబద్యుతు లొడియ నుఱుకు;
శుకములఁ దోలఁ జక్కుర్మీనములకు మం;
 దాకినీ పాఠీనలోక మెసఁగు;

మీన పంక్తుల దాఁట మెయిదీఁగతో రాయ;
శంపాలతలు మింట సరణిఁ గట్టు;

8-104.1-ఆటవెలది

శంపలను జయింపఁ జక్రవాకంబులుఁ
గుచయుగంబుఁ దాఁకి క్రొవ్వుజూపు;
మెలఁత మొగిలు పిఱిఁది మెఱుఁగుఁదీవయుఁ బోలె
జలదవర్ణు వెనుకఁ జనెడునపుడు.

8-105-మత్తేభ విక్రీడితము

వినువీథిన్ జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతి జీ
వనసంపత్తి నిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణుఁ యోగీంద్ర హృ
ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలంకరి
ష్ణు నవోఢోల్ల సదిందిరా పరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్.

8-106-వచనము

ఇట్లు వొడగని.

8-107-మత్తేభ విక్రీడితము

చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె; హరి పజ్జం గంటిరే లక్ష్మి? శం
ఖ నినాదం బదె; చక్ర మల్లదె; భుజంగధ్వంసియున్ వాఁడె; క్ర
న్నన యేతెంచె నటంచు వేల్పులు నమోనారాయణాయేతి ని
స్స్వనులై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్.

8-108-వచనము

అయ్యవసరంబునఁ గుంజరేంద్రపాలన పారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక మనస్సమానసంచారుండై పోయిపోయి కొంతదూరంబున శింశుమారచక్రంబునుం బోలె గురుమకరకుళీర మీనమిథునంబై; కిన్నరేంద్రుని భాండాగారంబునుంబోలె స్వచ్ఛ మకరకచ్ఛపంబై; భాగ్యవంతుని భాగధేయంబునుంబోలె సరాగ జీవనంబై; వైకుంఠపురంబునుంబోలె శంఖచక్ర కమలాలంకృతంబై; సంసార చక్రంబునుంబోలె ద్వంద్వసంకుల పంక సంకీర్ణంబై యొప్పు నప్పంకజాకరంబుఁ బొడగని.

## 8-15- గజేంద్రరక్షణము

### 8-109-మత్తేభ విక్రీడితము

కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్త్వరితాకంపిత భూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబర శుక్రమున్ బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిల సుధాంధశ్చక్రముం జక్రమున్.

### 8-110-వచనము

ఇట్లు పంచిన.

### 8-111-శార్దూల విక్రీడితము

అంభోజాకరమధ్య నూతన నళిన్యాలింగనక్రీడనా
రంభుం డైన వెలుంగుఱేని చెలువారన్ వచ్చి నీటన్ గుభుల్
గుంభద్ధ్వానముతోఁ గొలంకును కలంకం బొందఁగా జొచ్చి దు
ష్టాంభోవర్తి వసించు చక్కటికి డాయంబోయి హృద్వేగమై.

8-112-శార్దూల విక్రీడితము

భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్రమా శుక్రియన్
హేమక్ష్మాధర దేహముం జకితవన్యేభేంద్ర సందోహముం
గామక్రోధన గేహమున్ గరటి రక్తస్రావ గాహంబు ని
స్సీమోత్సాహము వీత దాహము జయశ్రీ మోహమున్ గ్రాహమున్.

8-113-వచనము

ఇట్లు నిమిష స్పర్శనంబున సుదర్శనంబు మకరితలఁ ద్రుంచు నవసరంబున.

8-114-కంద పద్యము

మకర మొకటి రవిఁ జొచ్చెను;
మకరము మఱియొకటి ధనదు మాటున డాఁగెన్;
మకరాలయమునఁ దిరిగెఁడు
మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్.

8-115-మత్తేభ విక్రీడితము

తమముం బాసిన రోహిణీవిభు క్రియన్ దర్పించి సంసారదుః
ఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిన్ గ్రాహంబు పట్టూడ్చి పా
దము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం
భ్రమదాశాకరిణీ కరోజ్ఝిత సుధాంభస్స్నాన విశ్రాంతుఁడై.

8-116-శార్దూల విక్రీడితము

పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వాన చలాచలీకృత మహాభూతప్రచైతన్యమున్

సారోదారసితప్రభాచకిత పర్జన్యాది రాజన్యమున్
దూరీభూత విపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్.

8-117-మత్తేభ విక్రీడితము

మొరసెన్ నిర్జరదుందుభుల్; జలరుహామోదంబులై వాయువుల్
దిరిగెం; బువ్వులవానజల్లుఁ గురిసెన్; దేవాంగనాలాస్యముల్
పరఁగెన్; దిక్కులయందు జీవజయశబ్దధ్వానముల్ నిండె; సా
గర ముప్పొంగెఁ దరంగ చుంబిత నభోగంగాముఖాంభోజమై.

8-118-కంద పద్యము

నిడుద యగు కేల గజమును
మడువున వెడలంగఁ దిగిచి మదజల రేఖల్
దుడుచుచు మెల్లన పుడుకుచు
నుడిపెన్ విష్ణుండు దుఃఖ మూర్వీనాథా!

8-119-కంద పద్యము

శ్రీహరి కర సంస్పర్శను
దేహము దాహంబు మాని ధృతిఁ గరిణీసం
దోహంబుఁ దాను గజపతి
మోహన ఘీంకార శబ్దములతో నొప్పెన్.

8-120-కంద పద్యము

కరమున మెల్లన నివురుచుఁ
గర మనురాగమున మెఱసి కలయం బడుచుం

గరి హరికతమున బ్రతికినఁ
గరపీడన మాచరించెఁ గరిణుల మరలన్.

## 8-16- గజేంద్రునిపూర్వజన్మకథ

### 8-121-సీస పద్యము

జననాథ! దేవలశాప విముక్తుఁడై;
 పటుతర గ్రాహరూపంబు మాని
ఘనుఁడు హూహూ నామ గంధర్వుఁ డప్పుడు;
 తన తొంటి నిర్మల తనువుఁ దాల్చి
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి;
 తవిలి కీర్తించి గీతములు పాడి
యా దేవు కృప నొంది యందంద మఱియును;
 వినత శిరస్కుఁడై వేడ్కతోడ

### 8-121.1-ఆటవెలది

దళిత పాపుఁ డగుచు దనలోకమున కేగె
నపుడు శౌరి కేల నంటి తడవ
హస్తి లోకనాథుఁ డజ్ఞాన రహితుఁడై
విష్ణురూపుఁ డగుచు వెలుఁగుచుండె.

### 8-122-మత్తేభ విక్రీడితము

అవనీనాథ! గజేంద్రుఁడా మకరితో నాలంబుఁ గావించె మున్
ద్రవిళాధీశుఁ డతండు పుణ్యతముఁ డింద్రద్యుమ్న నాముండు పై
ష్ణవ ముఖ్యుండు గృహీతమౌననియతిన్ సర్వాత్ము నారాయణున్

సవిశేషంబుగఁ బూజ చేసెను మహాశైలాగ్రభాగంబునన్.

8-123-మత్తేభ విక్రీడితము

ఒకనాఁడా నృపుఁ డచ్యుతున్ మనసులో నూహించుచున్ మౌనియై
యకలంకస్థితి నున్నచోఁ గలశజుం డచ్చోటికిన్ వచ్చి లే
వక పూజింపక యున్న మౌనిఁ గని నవ్యక్రోధుఁడై మూఢ! లు
బ్ధ! కరీంద్రోత్తమ యోనిఁ బుట్టు మని శాపం బిచ్చె భూవల్లభా!

8-124-కంద పద్యము

మునిపతి నవమానించిన
ఘనుఁ డింద్రద్యుమ్న విభుఁడుఁ గౌంజరయోనిం
జననం బందెను విప్రులఁ
గని యవమానింపఁ దగదు ఘన పుణ్యులకున్.

8-125-కంద పద్యము

కరినాథుఁ డయ్యె నాతఁడు
కరులైరి భటాదులెల్ల; గజముగ నయ్యున్
హరిచరణ సేవ కతమునఁ
గరి వరునకు నధికముక్తిఁ గలిగె మహాత్మా!

8-126-ఆటవెలది

కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు
నుభయ నియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన

ప్రభలమైన విష్ణుభక్తి చెడదు.

8-127-కంద పద్యము

చెడుఁ గరులు హరులు ధనములుఁ

జెడుదురు నిజసతులు సుతులుఁ జెడు చెనఁటులకుం;

జెడక మనునట్టి గుణులకుఁ

జెడని పదార్థములు విష్ణుసేవా నిరతుల్.

## 8-17- లక్ష్మీనారాయణసంభాషణ

8-128-వచనము

అప్పుడు జగజ్జనకుండగు నప్పరమేశ్వరుండు దరహసిత ముఖకమల యగు నక్కమల కిట్లనియె.

8-129-కంద పద్యము

బాలా! నా వెనువెంటను

హేలన్ వినువీథినుండి యేతెంచుచు నీ

చేలాంచలంబుఁ బట్టుట

కాలో నేమంటి నన్ను నంభోజముఖీ!

8-130-కంద పద్యము

ఎఱుఁగుదు తెఱవా! యెప్పుడు

మఱవను సకలంబు నన్ను మఱచిన యెడలన్

మఱతు నని యెఱిఁగి మొఱఁగక

మఱవక మొఱ యిడిర యేని మఱి యన్యములన్.

8-131-వచనము

అని పలికిన నరవిందమందిర యగు నయ్యిందిరాదేవి మందస్మితచంద్రికా సుందరవదనారవింద యగుచు ముకుందున కిట్లనియె.

8-132-కంద పద్యము

దేవా! దేవర యడుగులు
భావంబున నిలిపి కొలచు పని నా పని గా
కో వల్లభ! యే మనియెద
నీ వెంటను వచ్చుచుంటి నిఖిలాధిపతీ!

8-133-కంద పద్యము

దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు దీవనఁ బొందన్
దీనావన! నీ కొప్పును.
దీనపరాధీన! దేవదేవ! మహేశా!

8-134-వచనము

అని మఱియును సముచిత సంభాషణంబుల నంకించుచున్న యప్పరమ వైష్ణవీరత్నంబును సాదర సరససల్లాప మందహాస పూర్వకంబుగా నాలింగనంబు గావించి సపరివారుండై గరుడ గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుండై గరుడారూఢుం డగుచు హరి నిజసదనంబునకుం జనియె" నని చెప్పి శుకయోగీంద్రుం డిట్లనియె.

## 8-18- గజేంద్రమోక్షణకథాఫలస్మృతి

8-135-సీస పద్యము

నరనాథ! నీకును నాచేత వివరింపఁ;
 బడిన యీ కృష్ణానుభావమైన
గజరాజమోక్షణకథ వినువారికి;
 యశము లిచ్చును గల్మషాపహంబు;
దుస్స్వప్న నాశంబు దుఃఖ సంహారంబుఁ;
 బ్రొద్దున మేల్కాంచి పూతవృత్తి
నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్ములైన;
 విప్రులకును బహువిభవ మమరు;

8-135.1-తేటగీతి

సంపదలు గల్గుఁ; బీడలు శాంతిఁ బొందు;
సుఖము సిద్ధించు; వర్ధిల్లు శోభనములు;
మోక్ష మఱచేతిదై యుండు; ముదము చేరు
ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె.

8-136-వచనము

అని మఱియు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె "ఎవ్వరేని నపర రాత్రాంతంబున మేల్కాంచి సమాహిత మనస్కులయి నన్నును; నిన్నును; నీ సరోవరంబును; శ్వేతద్వీపంబును; నాకుం బ్రియంబైన సుధాసాగరంబును; హేమనగంబును; నిగ్గిరి కందర కాననంబులను; వేత్ర కీచక వేణు లతాగుల్మ సురపాదపంబులను; నేనును బ్రహ్మయు ఫాలలోచనుండును నివసించియుండు నక్కొండ శిఖరంబులను; గౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను;

శ్రీదేవిని; శేష గరుడ వాసుకి ప్రహ్లాద నారదులను; మత్స్య కూర్మ వరాహాద్యవతారంబులను; దదవతారకృత కార్యంబులను; సూర్య సోమ పావకులను; బ్రణవంబును; ధర్మతపస్సత్యంబులను; వేదంబును; వేదాంగంబులను శాస్త్రంబులను; గో భూసుర సాధు పతివ్రతా జనంబులను; జంద్ర కాశ్యపజాయా సముదయంబును; గౌరీ గంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీ నిచయంబును; నమరులను; నమరతరువులను; నైరావతంబును; నమృతంబును; ధ్రువుని; బ్రహ్మర్షి నివహంబును; బుణ్యశ్లోకులైన మానవులను; సమాహితచిత్తులై తలంచువారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయంబగు విమలగతి నిత్తు" నని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి సకలామర వందితచరణారవిందుఁడై విహగపరివృఢ వాహనుండై వేంచేసె విబుధానీకంబు సంతోషించె" నని చెప్పి శుకుండు రాజున కిట్లనియె.

8-137-కంద పద్యము

గజరాజమోక్షణంబును
నిజముగఁ బఠియించునట్టి నియతాత్మ్ములకున్
గజరాజ వరదుఁ డిచ్చును
గజ తురగస్యందనములుఁ గైవల్యంబున్.

## 8-19- 5రైవతమనువుచరిత్ర

8-138-కంద పద్యము

తామసు తమ్ముఁడు రైవత
నామకుఁడై వెలసె మనువు; నలువురమీదన్

భూమికిఁ బ్రతివింధ్యార్జున
నామాదులు నృపులు మనువు నందనులు నృపా!

8-139-సీస పద్యము

మునులు హిరణ్యరోముఁడు నూర్ధ్వబాహుండు;
 వేదశీర్షుండను వీరు మొదలు
నమరులు భూతరయాదులు శుభ్రుని;
 పత్ని వికుంఠాఖ్య పరమసాధ్వి;
యా యిద్దఱకుఁ బుత్త్రుఁడై తన కళలతో;
 వైకుంఠుఁ డనఁ బుట్టి వారిజాక్షు
డవనిపై వైకుంఠ మనియెడి లోకంబుఁ;
 గల్పించె నెల్లలోకములు మ్రొక్క;

8-139.1-తేటగీతి

రమ యెదుర్కోలు చేకొనె రాజముఖ్య!
తదనుభావంబు గుణములుఁ దలఁపఁ దరమె?
యీ ధరారేణు పటలంబు నెఱుఁగవచ్చుఁ
గాని రాదయ్య హరిగుణగణము సంఖ్య.

8-140-వచనము

తదనంతరంబ.

## 8-20- 6చాక్షుసమనువుచరిత్ర

8-141-సీస పద్యము

చక్షుస్తనూజుండు చాక్షుషుం డను వీరుఁ;
డాఱవ మనువయ్యె నవనినాథ!
భూమీశ్వరులు పురుః పురుష సుద్యుమ్నాదు;
లాతని నందను; లమరవిభుఁడు
మంత్రద్యుమాఖ్యుఁ; డమర్త్యు లాప్యాదికు;
లాహవిష్మద్వీరకాది ఘనులు
మునులందు విభుఁడు సంభూతికి వైరాజు;
నకుఁ బుట్టి యజితుండు నాఁగ నొప్పె;

8-141.1-ఆటవెలది

నతఁడు కాఁడె కూర్మమై మందరాద్రిని
నుదధి జలములోన నుండి మోచె;
నతఁడు చువ్వె దివిజు లర్థింప నమృతాబ్ధిఁ
ద్రచ్చి యిచ్చె నా సుధారసంబు.

## 8-21- సముద్రమథనకథాప్రారంభం

8-142-వచనము

అని పలికినం బరీక్షిన్నరేంద్రుండు మునీంద్రున కిట్లనియె.

8-143-మత్తేభ విక్రీడితము

విను మున్నేటికిఁ ద్రచ్చె పాలకడలిన్ విష్ణుండు? కూర్మాకృతిన్
వనధింజొచ్చి యదెట్లు మోచె బలుకవ్వంబైన శైలంబు? దే
వనికాయం బమృతంబు నెట్లు పడసెన్? వారాశి నేమేమి సం
జనితం బయ్యె? మునీంద్ర! చోద్యము గదా సర్వంబుఁ జెప్పంగదే.

8-144-కంద పద్యము

అప్పటినుండి బుధోత్తమ!
చెప్పెడు భగవత్కథా విశేషంబులు నా
కెప్పుడుఁ దనవి జనింపదు
చెప్పఁగదే చెవులు నిండ శ్రీహరికథలున్.

8-145-వచనము

అని మఱియు నడుగం బడినవాఁడై యతని నభినందించి హరి ప్రసంగంబు జెప్ప నుపక్రమించె" నని సూతుండు ద్విజుల కిట్లనియె "నట్లు శుకుండు రాజుం జూచి.

## 8-22- సురలుబ్రహ్మశరణుజొచ్చుట

8-146-కంద పద్యము

కసిమసఁగి యసుర విసరము
లసి లతికల సురల నెగవ నసువులు వెడలం
బసఁ జెడిరి; పడిరి; కెడసిరి
యసమ సమర విలసనముల నసమెడలి నృపా!

8-147-కంద పద్యము

సురపతి వరుణాదులతో
సురముఖ్యులు గొంద ఱరిగి సురశైలముపై
సురనుతుఁడగు నజుఁ గని యా
సుర దుష్కృతిఁ జెప్పి రపుడు సొలయుచు నతులై.

8-148-కంద పద్యము

దుర్వాసు శాపవశమున
నిర్వీర్యత జగము లెల్ల నిశ్శ్రీకములై
పర్వతరిపుతోఁ గూడ న
పర్వము లయి యుండె హతసుపర్వావళులై.

8-149-ఆటవెలది

నెలవు వెడలి వచ్చి నిస్తేజులై నట్టి
వేల్పుగములఁ జూచి వేల్పుఁ బెద్ద
పరమపురుషుఁ దలఁచి ప్రణతుఁడై సంఫుల్ల
పద్మవదనుఁ డగుచుఁ బలికెఁ దెలియ.

8-150-కంద పద్యము

ఏనును మీరును గాలము
మానవ తిర్యగ్లతాద్రుమస్వేదజముల్
మానుగ నెవ్వని కళలము
వానికి మ్రొక్కెదముగాక వగవఁగ నేలా?

8-151-కంద పద్యము

వధ్యుండు రక్షణీయుఁడు
సాధ్యుఁడు మాన్యుఁడని లేక సర్గత్రాణా
వధ్యాదు లొనర్చు నతం
డాధ్యంత విధానమునకు నర్హుఁడు మనకున్.

8-152-కంద పద్యము

వరదునిఁ బరము జగద్గురు
కరుణాపరతంత్రు మనము గనుఁగొన దుఃఖ
జ్వరములు చెడు నని సురలకు
సరసిజజని చెప్పి యజితు సదనంబునకున్.

## 8-23- బ్రహ్మాదులహరిస్తుతి

8-153-వచనము

అంత దానును దేవతాసమూహంబును నతిరయంబునం జని వినయంబునఁ గానంబడని యవ్విభు నుద్దేశించి దైవికంబులగు వచనంబుల నియతేంద్రియుండై యిట్లని స్తుతియించె.

8-154-సీస పద్యము

ఎవ్వని మాయకు నింతయు మోహించుఁ;
దఱిమి యెవ్వని మాయ దాఁట రాదు;
తన మాయ నెవ్వఁ డింతయు గెల్చినట్టివాఁ;
డెవ్వనిఁ బొడగాన రెట్టి మునులు;
సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు;
చరియించుఁ దనచేత జనితమయిన;
ధరణి పాదములు చిత్తము సోముఁ డగ్ని ము;
ఖంబు గన్నులు సోమకమలహితులు;

8-154.1-తేటగీతి

చెవులు దిక్కులు; రేతంబు సిద్ధజలము;
మూఁడు మూర్తులపుట్టిల్లు; మొదలి నెలవు

గర్భమఖిలంబు; మూర్ధంబు గగన మగుచు;
మలయు నెవ్వఁడు వాని నమస్కరింతు.

8-155-వచనము

మఱియు నెవ్వని బలంబున మహేంద్రుండును; బ్రసాదంబున దేవతలును; గోపంబున రుద్రుండును; బౌరుషంబున విరించియు; నింద్రియంబులవలన వేదంబులును మునులును; మేఢ్రంబునఁ బ్రజాపతియును; వక్షంబున లక్ష్మియు; ఛాయవలనఁ బిత్రుదేవతలును; స్తనంబులవలన ధర్మంబును; బృష్ఠంబువలన నధర్మంబును; శిరంబువలన నాకంబును; విహారంబువలన నప్సరోజనంబులును; ముఖంబువలన విప్రులును; గుహ్యంబున బ్రహ్మంబును; భుజంబులవలన రాజులును బలంబును; నూరువులవలన వైశ్యులును నైపుణ్యంబును; బదంబులవలన శూద్రులును నవేదంబును; నధరంబున లోభంబునును; పరిరదచ్ఛదనంబువలన బ్రీతియు; నాసాపుటంబువలన ద్యుతియు; స్పర్శంబునఁ గామంబును; భ్రూయుగళంబున యమంబును; బక్షంబునఁ గాలంబును సంభవించె; నెవ్వని యోగ మాయావిహితంబులు ద్రవ్యవయః కర్మగుణ విశేషంబులు; చతుర్విధ సర్గం బెవ్వని యాత్మతంత్రం; బెవ్వనివలన సిద్ధించి లోకంబులును లోకపాలురును బ్రతుకుచుందురు పెరుగుచుందురు; దివిజులకు నాయువు నంధంబు బలంబునై జగంబులకు నీశుండై ప్రజలకుఁ బ్రజనుండై ప్రజావన క్రియాకాండ నిమిత్త సంభవుండగు జాతవేదుం డై; యంతస్సముద్రంబున ధాతుసంఘాతంబులం బ్రపచించుచు బ్రహ్మమయుండై; ముక్తికి ద్వారంబై; యమృత మృత్యు స్వరూపుండై; చరాచరప్రాణులకుఁ బ్రాణంబై; యోజస్సహోబల వాయురూపంబులైన ప్రాణేంద్రి

యాత్మ శరీర నికేతనుండై పరమ మహాభూతి యగు నప్పరమేశ్వరుండు మాకుం బ్రసన్నుండగుం గాక" యని మఱియును.

8-156-కంద పద్యము

మొదల జల మిడిన భూజము
దుది నడుమను జల్లదనము దొరకొను మాడ్కిన్
మొదలను హరికిని మ్రొక్కిన
ముద మొందుదు మెల్ల వేల్పుమూకలు నేమున్.

8-157-కంద పద్యము

ఆపన్నులగు దిదృక్షుల
కో! పుణ్య! భవన్ముఖాబ్జ మొయ్యన తఱితోఁ
బ్రాపింపఁ జేయు సంపద
నో! పరమదయానివాస! యుజ్జ్వలతేజా!

## 8-24- విశ్వగర్భుని ఆవిర్భావము

8-158-వచనము

అని యిట్లు దేవగణసమేతుండై యనేక విధంబులం గీర్తించుచు నున్న పరమేష్ఠి యందుఁ గరుణించి దయాగరిష్ఠుండగు విశ్వగర్భుం డావిర్భవించె.

8-159-మత్తేభ విక్రీడితము

ఒకవేయర్కులు గూడిగట్టి కదుపై యుద్యత్ప్రభాభూతితో
నొకరూపై చనుదెంచుమాడ్కి హరి దా నొప్పారె; నా వేలుపుల్
వికలాలోకనులై; విషణ్ణమతులై; విభ్రాంతులై మ్రోలఁ గా

నక శంకించిరి కొంత ప్రొద్దు; విభుఁ గానం బోలునే వారికిన్.

8-160-వచనము

అప్పుడు.

8-161-సీస పద్యము

హార కిరీట కేయూర కుండల పాద;
 కటక కాంచీలతా కంకణాది
కౌస్తుభోపేతంబుఁ గౌమోదకీ శంఖ;
 చక్ర శరాసన సంయుతంబు
మరకతశ్యామంబు సరసిజ నేత్రంబుఁ;
 గర్ణాభరణ కాంతి గండ యుగముఁ
గలిత కాంచనవర్ణ కౌశేయవస్త్రంబు;
 శ్రీ వన మాలికా సేవితంబు

8-161.1-ఆటవెలది

నై మనోహరంబునై దివ్యసౌభాగ్య
మైన యతని రూపు హర్ష మెసఁగ
జూచి బ్రహ్మ హరుఁడు సురలును దానును
బొంగి నమ్రుఁ డగుచుఁ బొగడఁ దొడఁగె.

8-162-కంద పద్యము

జననస్థితిలయ దూరుని
మునినుతు నిర్వాణసుఖ సముద్రుని సుగుణుం

దనుతనునిఁ బృథుల పృథులుని
ననఘాత్ము మహానుభావు నభినందింతున్.

8-163-కంద పద్యము

పురుషోత్తమ! నీ రూపము
పరమశ్రేయంబు భువన పంక్తుల కెల్లన్
స్థిరవైదిక యోగంబున
వరుసను మీ యంద కానవచ్చెను మాకున్.

8-164-కంద పద్యము

మొదలును నీలోఁ దోఁచెను;
దుదియును నటఁ దోఁచె; నడుమ దోఁచెను; నీవే
మొదలు నడుమ దుది సృష్టికిఁ
గదియఁగ ఘటమునకు మన్ను గతి యగు మాడ్కిన్.

8-165-కంద పద్యము

నీ మాయ చేత విశ్వము
పేమాఱు సృజింతు వనుచు విష్ణుఁడ వనుచున్
ధీమంతులు గుణపద విని
నేమంబున సగుణుఁడైన నినుఁ గాంతు రొగిన్.

8-166-ఆటవెలది

అన్న మవని యందు నమృతంబు గోవుల
యందు వహ్ని సమిధలందు నమర

యోగవశతఁ బొంది యోజను బుద్ధిచే
నగుణు నిన్నుఁ గాంతు రాత్మవిదులు.

8-167-మత్తకోకిలము

పట్టులేక బహుప్రకార విపన్న చిత్తులమైతి; మే
మెట్టకేలకు నిన్నుఁ గంటి మభీప్సితార్థము వచ్చుఁ; బె
న్వెట్టయైన దవానలంబున వేఁగు నేనుఁగు మొత్తముల్
నిట్టవేర్చిన గంగలోపల నీరు గాంచిన చాడ్పునన్.

8-168-మత్తకోకిలము

నీకు నే మని విన్నవింతుము నీవు సర్వమయుండవై
లోకమెల్లను నిండి యుండగ లోకలోచన! నీ పదా
లోకనంబు శుభంబు మాకును లోకపాలకు లేను నీ
నాకవాసులు నీవ వహ్నిఁ దనర్చు కేతుతతిక్రియన్.

8-169-వచనము

అని కమలసంభవ ప్రముఖులు వినుతి చేసి రని" చెప్పి నరేంద్రునకు శుకుం డిట్లనియె.

## 8-25- విష్ణుని అనుగ్రహవచనము

8-170-శార్దూల విక్రీడితము

ఈ రీతిం జతురాననాది నుతుఁడై యేపార జీమూత గం
భీరంబైన రవంబునం బలికె సంప్రీతాత్ముఁడై యీశ్వరుం
డా రోమాంచిత కాయులన్ నవవిముక్తాపాయులం బ్రేయులం

బ్రారబ్ధోగ్ర మహార్ణవోన్మథన వాంఛానల్పులన్ పేల్పులన్.

8-171-కంద పద్యము

ఓ! నలువ! యో! సురేశ్వర!
యో! నిటలతటాక్ష! యో! సురోత్తములారా!
దానవులతోడ నిప్పుడు
మానుగ బోరామి గలిగి మనుటే యొప్పున్.

8-172-వచనము

అది యెట్లంటి రేని.

8-173-కంద పద్యము

ఎప్పుడు దనకును సత్త్వము
చొప్పడు నందాఁక రిపులఁ జూచియుఁ దనమైఁ
గప్పికొని యుండవలయును
నొప్పుగ నహి మూషకమున కొదిఁగిన భంగిన్.

8-174-కంద పద్యము

అమృతోత్పాదన యత్నము
విమల మతిం జేయు టొప్పు; వేల్పులు! వినుఁడీ
యమృతంబుఁ ద్రావి జంతువు
లమృతగతిన్ బ్రతుకుచుండు నాయుర్వృద్ధిన్.

8-175-సీస పద్యము

పాలమున్నీటి లోపల సర్వతృణలతౌ;

షధములు దెప్పించి చాల పైచి
మందరశైలంబు మంథానముగఁ జేసి;
తనర వాసుకిఁ దరిత్రాడు జేసి
నా సహాయతచేత నలి నందఱును మీరు;
తరువుఁడు వేగ మతంద్రు లగుచు;
ఫలము మీఁదయ్యెడు; బహుళ దుఃఖంబులఁ;
బడుదురు దైత్యులు పాపమతులు;

8-175.1-ఆటవెలది

అలసటేమి లేక యఖిలార్థములుఁగల్లు;
విషధిలోన నొక్క విషము పుట్టుఁ;
గలఁగి వెఱవ వలదు కామరోషంబులు
వస్తుచయము నందు వలదు చేయ.

8-176-వచనము

అని యాదేశించి.

8-177-కంద పద్యము

అంతాది రహితుఁ డచ్యుతుఁ
డంతర్ధానంబు నొందె; నజ ఫాలాక్షుల్
సంతోషంబునఁ దమతమ
కాంతాలయములకుఁ జనిరి గౌరవ మొప్పన్.

## 8-26- సురాసురలుస్నేహము

8-178-కంద పద్యము

కయ్యంబు జేయ నొల్లక
నెయ్యంబున నతులు పెట్టి నిర్జర నికరం
బియ్యప్పనములు పెట్టుచుఁ
దియ్యంబునఁ గొల్చె బలిని దేవద్వేషిన్.

8-179-కంద పద్యము

పస చెడి తనకును వశమై
సుసరముతో గొల్చుచున్న సురసంఘములన్
గసిమసిఁగి చంపఁ బూనిన
నసురుల వారించె బలియు నతినయయుక్తిన్.

8-180-వచనము

అటు వారించి వైరోచని రాక్షస సముదయంబున కిట్లనియె.

8-181-కంద పద్యము

పగవారు శరణు చొచ్చిన
మగతనములు నెఱపఁ దగునె మగవారలకున్
తగు సమయ మెఱుఁగ వలదే
మగటిమిఁ బాటింప వల దమర్త్యులతోడన్.

8-182-వచనము

అని పలికి కొలువు కూటంబున నసుర నికర పరివృతుండై నిఖిల లోకరాజ్యలక్ష్మీ సహితుండై యఖిల విబుధ వీర విజయాహంకార నిజాలంకారుండై సుఖంబునం

గొలువున్న విరోచన నందనుంగని శచీవిభుం డుత్తమ సచివుండునుం బోలె స్వాంతఁ వచనంబుల శాంతిం బొందించి పురుషోత్తమ శిక్షితంబైన నీతిమార్గంబున శంబరునికిం బ్రియంబు చెప్పి; యరిష్టనేమి ననునయించి త్రిపురవాసులగు దానవుల నొడంబఱచి; జంభుని సమ్మతంబు చేకొని; హయగ్రీవుని విగ్రహంబు మాన్చి; నముచి తారక బాణాదులతో సఖ్యంబు నెఱపి; విప్రచిత్తికిం బొత్తు హత్తించి; శకుని విరోచన ప్రహేతులకుఁ బోరామి చూపి మయ మాలి సుమాలి ప్రముఖులకు మైత్రి యెఱింగించి; కుంభ నికుంభులకు సౌజన్యంబుఁ గైకొలిపి; పౌలోమ కాలకేయ నివాత కవచాదుల యెడ బాంధవంబు ప్రకటించి; వజ్రదంష్ట్రికి వశుండై; యితర దానవ దైత్య సమూహంబువలన నతిస్నేహంబు సంపాదించి; మనకు నక్క చెలియండ్ర బిడ్డలకు నొడ్డారంబు లేమిటికి? నేక కార్యపరత్వంబున నడ్డంబు లేక బ్రదుకుద; మన్యోన్య విరోధంబు లేల? తొల్లి యన్యోన్య విరోధంబున నలంగితి; మిది మొదలు దనుజ దివిజ సముదయంబులకు రాజు విరోచననందనుండ; మన మందఱ మతని పంపు చేయంగలవార; ముభయ కులంబును వర్ధిల్లు నట్టి యుపాయం బెఱింగింతు నని యమృతజలధిమథన ప్రారంభ కథనంబు దెలియం జెప్పి; నట్లు సురాసుర యూథంబులు బలారాతి బలిప్రముఖం బులై పరమోద్యోగంబున సుధాసంపాదనాయత్త చిత్తులై యైకమత్యంబు నొంది యమందగమనంబున మందరనగంబునకుం జని.

## 8-27- మంధరగిరిని తెచ్చుట

8-183-సీస పద్యము

వాసవ వర్ధకి వాఁడిగాఁ జఱచిన;
కుద్దాలముఖములఁ గొంత ద్రవ్వి
ముసలాగ్రముల జొన్పి మొదలి పాఁ తగలించి;

దీర్ఘ పాశంబులఁ ద్రిండు చుట్టి
పెకలించి బాహుల బీడించి కదలించి;
పెల్లార్చి తమతమ పేరు వాడి
పెటికి మీఁదికి నెత్తి పృథుల హస్తంబులఁ;
దలల భుజంబులఁ దరలకుండ

8-183.1-తేటగీతి

నాని మెల్లన కుఱుతప్పుటడుగు లిడుచు
భార మధికంబు మఱవక పట్టుఁ డనుచు
మందరనగంబుఁ దెచ్చి రమందగతిని.
దేవ దైత్యులు జలరాశి తెరువు పట్టి.

8-184-కంద పద్యము

మందరము మోవ నోపమి
నందఱపైఁబడియె నదియు నతిచోద్యముగాఁ;
గొందఱు నేలం గలిసిరి
కొందఱు నుగ్గయిరి; చనిరి కొందఱు భీతిన్.

8-185-కంద పద్యము

ఏలా హరికడ కేఁగితి?
మేలా దొరఁకొంటి మధిక హేలన శైలో
న్మూలనము జేసి తెచ్చితి?
మేలా పెక్కండ్రు మడిసి రేలా నడుమన్?

8-186-కంద పద్యము

ఏటికి మముఁ బని బంచెను?
నేటికి మనఁ బోఁటివారి కింతలు పను? లిం
కేటికి రాఁడు రమేశ్వరుఁ?
డేటి కుపేక్షించె? మఱవ నేటికి మనలన్?

8-187-వచనము

అని కులకుధర పతనజన్యంబగు దైన్యంబు సహింప నోపక పల వించుచున్న దివిజ దితిజుల భయంబు మనంబున నెఱింగి సకల వ్యాపకుండగు హరి దత్సమీపంబున.

8-188-మత్తేభ విక్రీడితము

గరుడారోహకుఁడై గదాదిధరుఁడై కారుణ్యసంయుక్తుఁడై
హరికోటిప్రభతో నొహో వెఱవకుం డంచుం బ్రదీపించి త
ద్గిరిఁ గేలన్ నలువొంద గందుకము మాడ్కిం బట్టి క్రీడించుచు
న్గరుణాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్ సమర్థించుచున్.

8-189-కంద పద్యము

వారలు గొలువఁగ హరియును
వారాన్నిధి కరుగు మనఁగ వసుధాధరమున్
వారిజనయనునిఁ గొంచు న
వారితగతిఁ జనియె విహగవల్లభుఁ డెలుతన్.

8-190-కంద పద్యము

చని జలరాశి తటంబున
వనజాక్షుని గిరిని డించి వందనములు స
ద్వినుతులు జేసి ఖగేంద్రుఁడు
పనివినియెను భక్తి నాత్మభవనంబునకున్.

8-191-వచనము

అప్పుడు.

## 8-28- సముద్రమథనయత్నము

8-192-సీస పద్యము

భూనాథ! వినవయ్య భోగీంద్రు వాసుకిఁ;
బిలిపించి యతనికిఁ బ్రియము జెప్పి
ఫలభాగ మీ నొడఁబడి సమ్మతునిఁ జేసి;
మెల్లన చేతుల మేను నివిరి
నీవ కా కెవ్వరు నేర్తు? రీ పని కియ్య;
కొమ్మని యతని కైకోలు పడసి
కవ్వంపుఁ గొండ నిష్కంటకంబుగఁ జేసి;
ఘూర్ణించి యతని భోగంబుఁ జుట్టి

8-192.1-ఆటవెలది

కడఁగి యమృతజలధిఁ గలశంబుఁ గావించి
త్రచ్చు నవసరమునఁ దలఁపు లమర
బద్ధవస్త్రకేశభారులై యా రెండు
గములవారు తరువఁ గదిసి రచట.

8-193-వచనము

తదనంతరంబ.

8-194-కంద పద్యము

హరియును దేవానీకము
సురగేంద్రుని తలలు పట్టనుద్యోగింపన్
హరిమాయా పరవశులై
సురవిమతులు కూడి పలుకఁ జొచ్చిరి కడిమిన్.

8-195-మత్తకోకిలము

స్వచ్ఛమైన ఫణంబు మీరలు చక్కఁబట్టి మథింపఁగాఁ
బుచ్ఛ మేటికి మాకుఁ బట్టఁగఁ? బూరుషత్వము గల్గి మే
మచ్ఛమైన తపోబలాఢ్యయనాన్వయంబుల వారమై
యుచ్ఛయింతుమె తుచ్ఛవృత్తికి? నిండు మాకు ఫణాగ్రముల్ .

8-196-వచనము

అని పలుకు దనుజులం జూచి.

8-197-కంద పద్యము

విస్మయముఁ బొంది దానవ
ఘస్మరుఁ డహిఫణము విడువఁ గైకొని యసురుల్
విస్మితముఖులై యార్చి ర
విస్మితముగఁ గొనిరి సురలు వీఁకం దోఁకన్.

8-198-వచనము

ఇట్లు సమాకర్షణస్థానభాగనిర్ణయంబు లేర్పఱచుకొని దేవతలు పుచ్ఛంబును; బూర్వదేవతలు ఫణంబులుం బట్టి పయోరాశి మధ్యంబునం బర్వతంబు పెట్టి; పరమాయత్తచిత్తులై యమృతార్థంబు ద్రచ్చుచున్న సమయంబున.

8-199-కంద పద్యము

విడు విడుఁ డని ఫణి పలుకఁగఁ

గడుభరమున మొదలఁ గుదురు గలుగమి గెడఁపై

బుడబుడ రవమున నఖిలము

వడవడ వడఁకఁగ మహాద్రి వనధి మునింగెన్.

8-200-ఉత్పలమాల

గౌరవమైన భారమునఁ గవ్వపుఁగొండ ధరింప లేక దో

స్సార విహీనులై యుభయ సైనికులుం గడు సిగ్గుతోనకూ

పారతటంబునం బడిరి పౌరుషముం జెడి పాండవేయ! యె

వ్వారికి నేరఁబోలు బలవంతపు దైవము నాక్రమింపగన్?

## 8-29- కూర్మావతారము

8-201-కంద పద్యము

వననిధి జలముల లోపల

మునిఁగెడి గిరిఁ జూచి దుఃఖమునఁ జింతాబ్ధిన్

మునిఁగెడి వేల్పులఁ గనుఁగొని

వనజాక్షుఁడు వార్ధినడుమ వారలు చూడన్.

8-202-సీస పద్యము

సవరనై లక్ష యోజనముల వెడలుపై;
 కడుఁ గఠోరమునైన కర్పరమును
నదనైన బ్రహ్మాండమైన నాహరించు;
 ఘనతరంబగు ముఖగహ్వరంబు
సకల చరాచర జంతురాసుల నెల్ల;
 మ్రింగి లోఁగొనునట్టి మేటి కడుపు
విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁబడ్డ;
 నాఁగినఁ గదలని యట్టి కాళ్ళు

8-202.1-తేటగీతి

వెలికి లోనికిఁ జనుదెంచు విపుల తుండ
మంబుజంబులఁ బోలెడు నక్షి యుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి
కూర్మి చెలువొంద నొక మహా కూర్మ మయ్యె.

8-203-మత్తేభ విక్రీడితము

కమఠంబై జలరాశిఁ జొచ్చి లఘు ముక్తాశుక్తి చందంబునన్
సమదద్రీంద్రము నెత్తె వాసుకి మహానాగంబుతో లీలతో
నమరేంద్రాదులు మౌళికంపములతో నౌనౌఁగదే! బాపురే!
కమలాక్షా! శరణంచు భూదిశలు నాకాశంబునున్ మ్రోయఁగన్.

8-204-వచనము

ఇవ్విధంబున.

8-205-కంద పద్యము

తరిగాండ్రలోన నొకఁడట
తరి గడవకుఁ గుదురు నాఁక ద్రాఁడఁట చేరుల్;
దరి గవ్వంబును దా నఁట
హరిహరి! హరిచిత్రలీల హరియే యెఱుఁగున్.

8-206-ఆటవెలది

జలధిఁ గడవ చేయ శైలంబుఁ గవ్వంబు
చేయ భోగిఁ ద్రాడు చేయఁ దరువ
సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడుఁ దక్క
నొరుఁడు శక్తిమంతుఁ డొకఁడు గలఁడె?

8-207-ఆటవెలది

గొల్లవారి బ్రతుకు గొఱఁతన వచ్చునె
గొల్లరీతిఁ బాలకుప్ప ద్రచ్చి
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు
చేటు లేని మందు సిరియుఁ గనిరి.

## 8-30- సముద్రమథన వర్ణన

8-208-వచనము

ఇట్లు సురాసురయూథంబులు హరిసనాథంబులయి కవచంబులు నెట్టంబులు పెట్టికొని; పుట్టంబులు పిరిచుట్లు చుట్టుకొని; కరంబులుఁ గరంబుల నప్పళించుచు; భుజంబులు భుజంబుల నొరయుచు; లెండు లెండు దరువఁ దొడంగుఁడు రండని యమందగతిం బెరుగుఁ ద్రచ్చు మందగొల్లల చందంబున

మహార్ణవమధ్యంబున మంథాయమాన మందరమహీధర విలగ్న భోగి
భోగాద్యంతంబులం గరంబులం దెమల్చుచుఁ; బెనుబొబ్బలం బ్రహ్మాండ
కటాహంబు నిర్భరంబయి గుబ్బుగుబ్బని యురులు కొండకవ్వంబుగుత్తి
జిఱజిఱందిరుఁగు వేగంబున ఛటచ్ఛటాయ మానంబులయి బుగులుబుగుళ్ళను
చప్పుళ్ళుప్పరం బెగసి లెక్కకు మిక్కిలి చుక్కల కొమ్మల చెక్కుల నిక్కలుపడు
మిసిమిగల మీఁది మీఁగడ పాలతేట నిగ్గుఁ దుంపరల పరంపరలవలన
నిజకరక్రమ క్రమాకర్షణపరిభ్రాంత ఫణిఫణాగర్భ సముద్భూత నిర్భర విష కీలి
కీలాజాలంబుల నప్పటప్పటికి నుప్పతిల్లిన దప్పిం గొండొక మందగతిం జెందక
యకూపార వేలా తట కుటజ కుసుమగుచ్ఛ పిచ్ఛిల స్వచ్ఛ మకరంద సుగంధి
గంధవహంబులం గ్రొంజెమట నీటి పెను వఱదగము లొడళ్ళ నిగుర నొండొరు
లంబరిహాసించుచుఁ బేరువాడి విలసించుచు; మేలు మేలని యుగ్గడించుచుఁ;
గాదు కాదని భంగించుచు; నిచ్ఛ మెచ్చని మచ్చరంబుల వలన వనధి వలమాన
వైశాఖ వసుంధరాధర పరివర్తన సముజ్జనిత ఘుమఘుమారావంబును; మథన
గుణాయమాన మహాహీంద్రప్రముఖ ముహుర్ముహురుచ్ఛలిత భూరి ఘోర
ఫూత్కార ఘోషంబును; గులకుధర పరిక్షేపణ క్షోభిత సముల్లంఘున
సమాకులితంబులై వెఱచఱచి గుబురుగుబురలై యొరలు కమఠ కర్కట కాకోదర
మకర తిమి తిమింగిల మరాళ చక్రవాక బలాహక భేక సారసానీకంబుల
మొఱలునుం గూడికొని ముప్పిరిగొని; దనుజ దివిజ భటాట్టహాస
తర్జనగర్జనధ్వనులు నలుపురియై మొత్తినట్లైన దిశదిగంతభిత్తులును; బేఁటెత్తి
పెల్లగిలం ద్రుళ్ళుచుఁ గికురు వొడుచుచు నొక్కఁడొకనికంటె వడియునుం
గడపునుం గలుగఁ ద్రచ్చుచుఁ బంతంబు లిచ్చుచు సుధాజననంబుఁ జింతించుచు
నూతనపదార్థంబులకు నెదుళ్ళు చూచుచు నెంతదడవు ద్రత్తుమని హరి

నడుగుచు నెడపడని తమకంబుల నంతకంతకు మురువుడింపక త్రచ్చు సమయంబున.

8-209-కంద పద్యము

అప్పాలవెల్లి లోపల
నప్పటికప్పటికి మందరాగము దిరుగం
జప్పుడు నిండె నజాండము
చెప్పెడి దే మజుని చెవులు చిందఱగొనియెన్.

8-210-వచనము

అంత నప్పయోరాశి మధ్యంబున.

8-211-కంద పద్యము

ఎడమఁ గుడి మునుపు దిరుగుచు
గుడి నెడమను వెనుకఁ దిరుగు కులగిరి గడలిం
గడ లెడల సురలు నసురులుఁ
దొడితొడి ఫణి ఫణము మొదలుఁ దుదియును దిగువన్.

8-212-కంద పద్యము

వడిగొని కులగిరిఁ దరువఁగ
జడనిధి ఖగ మకర కమఠ ఝుష ఫణి గణముల్
సుడివడుఁ దడఁబడుఁ గెలఁకులఁ
బడు భయపడి నెగసి బయలఁ బడు నురలిపడున్.

8-213-కంద పద్యము

అమరాసుర కర విపరి
భ్రమణ ధరాధరవరేంద్ర భ్రమణంబును దాఁ
గమఠేంద్రు వీపు తీఁటను
శమియింపఁగఁ జాలదయ్యె జగతీనాథా!

8-214-వచనము

తదనంతరంబ

## 8-31- కాలకూటవిషముపుట్టుట

8-215-కంద పద్యము

ఆలోల జలధి లోపల
నాలో నహి విడిచి సురలు నసురులుఁ బఱవం
గీలా కోలాహలమై
హాలాహల విషము పుట్టె నవనీనాథా!

8-216-వచనము

అదియునుం బ్రళయకాలాభీల ఫాలలోచన లోచనానలశతంబు చందంబున నమందంబై; విలయ దహన సహస్రంబు కైవడి వడియై; కడపటి పట్టపగలింటి వెలుంగుల లక్ష తెఱంగున దుర్లక్షితంబై; తుదిరేయి వెలింగిన మొగిలుగముల వలనం బడు బలు పిడుగుల వడువున బెడిదంబై; పంచభూతంబులుం దేజోరూపంబులైన చాడ్పున దుస్సహంబై; భుగభుగాయమానంబులైన పొగలును; చిటచిటాయమానంబులైన విస్ఫులింగంబులును; ధగధగాయమానంబు లైన సెఱమంటలును; గలిగి మహార్ణవ మధ్యంబున మందరనగం బమంథరంబుగం దిరుగునెడ జనియించి పటపటాయమానంబై

నింగికిం బొంగి దిశలకుం గేలు చాఁచి బయళ్ళు ప్రబ్బికొని తరిగవ్వంపుఁ గొండ నండ గొనక; నిగిడి కడలి నలుగడలకుం బఱచి; దరుల కుఱికి; సురాసుర సముదయంబులం దరిగొని; గిరివర గుహాగహ్వరంబుల సుడిపడక కులశిఖరి శిఖరంబుల నెరగలివడి; గహనంబుల దహించి కుంజమంజరీ పుంజంబుల భస్మంబుజేసి; జనపదంబు లేర్చి; నదీ నదంబు లెరియించి; దిక్కుంభికుభంబులు నిక్కలుపడ నిక్కి; తరణి తారామండలంబులపై మిట్టించి; మహర్లోకంబు దరికొని; యుపరిలోకంబునకు మాఱుగొనలిడి సుడిపడి ముసురుకొని; బ్రహ్మాండ గోళంబు చిటిలి పడన్ దాఁటి; పాతాళాది లోకంబులకు వేళ్ళుబాఱి; సర్వలోకాధికంబై శక్యంబుగాక యెక్కడఁ జూచినం దానయై; కురంగంబు క్రియం గ్రేళ్ళుఱుకుచు; భుజంగంబు విధంబున నొడియుచు; సింగంబు భంగి లంఘించుచు; విహంగంబు పగిది నెగయుచు; మాతంగంబు పోలికి నిలువంబడుచు నిట్లు హాలాహల దహనంబు జగంబులం గోలాహలంబు చేయుచున్న సమయంబున; మెలకు సెగల మిడుకం జాలక నీఱైన దేవతలును; నేలంగూలిన రక్కసులును; డుల్లిన తారకలును; గీటడంగిన కిన్నర మిథునంబులును; గమరిన గంధర్వవిమానంబులును; జీకాకుపడిన సిద్ధచయంబులును; జిక్కుపడిన గ్రహంబులును జిందఱవందఱ లయిన వర్ణాశ్రమంబులును; నిగిరిపోయిన నదులును; నింకిన సముద్రంబులును; గాలిన కాననంబులును బొగిలిన పురంబులును; బొనుఁగుపడిన పురుషులును; బొక్కిపడిన పుణ్యాంగనా జనంబులును; బగిలిపడిన పర్వతంబులును భస్మంబులైన ప్రాణి సంఘంబులును; వేఁగిన లోకంబులును; వివశలైన దిశలును; నొడ్డగెడవులైన భూజచయంబులును; నఱవఱలైన భూములునునై యకాల విలయకాలంబై తోచుచున్న సమయంబున.

8-217-కంద పద్యము

ఒడ్డారించి విషంబున
కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిన్
గొడ్డేటి మ్రంది రా లన
బిడ్డన నెడలేక జనులు పృథ్వీనాథా!

8-218-వచనము

అప్పుడు

## 8-32- శివునిగరళభక్షణకైవేడుట

8-219-మత్తేభ విక్రీడితము

చని కైలాసముఁ జొచ్చి శంకరుని వాసద్వారముం జేరి యీ
శుని దౌవారికు లడ్డపడ్డఁ దల మంచుం జొచ్చి కుయ్యో మొఱో
విను; మాలింపుము; చిత్తగింపుము; దయన్ వీక్షింపు మం చంబుజా
సనముఖ్యుల్ గని రార్తరక్షణ కళాసంరంభునిన్ శంభునిన్.

8-220-కంద పద్యము

వారలు దీనత వచ్చుటఁ
గూరిమితో నెఱిఁగి దక్షుకూఁతురుఁ దానుం
బేరోలగమున నుండి ద
యారతుఁడై చంద్రచూడుఁ డవసర మిచ్చెన్.

8-221-వచనము

అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగ దండప్రణామంబులు గావించి ప్రజాపతి ముఖ్యు లిట్లని స్తుతించిరి.

8-222-సీస పద్యము

భూతాత్మ! భూతేశ! భూత భావనరూప!;
 దేవ! మహాదేవ! దేవవంద్య!
యీ లోకముల కెల్ల నీశ్వరుండవు నీవ;
 బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ;
యార్త శరణ్యుండ వగు గురుండవు నిన్నుఁ;
 గోరి భజింతురు కుశలమతులు;
సకల సృష్టిస్థితిసంహారకర్తవై;
 బ్రహ్మ విష్ణు శివాఖ్యఁ బరఁగు దీవ;

8-222.1-ఆటవెలది

పరమ గుహ్య మయిన బ్రహ్మంబు సదసత్త
మంబు నీవ శక్తిమయుఁడ వీవ;
శబ్దయోని వీవ; జగదంతరాత్మవు
నీవ; ప్రాణ మరయ నిఖిలమునకు.

8-223-కంద పద్యము

నీ యంద సంభవించును
నీ యంద వసించి యుండు నిఖిల జగములున్
నీ యంద లయముఁ బొందును
నీ యుదరము సర్వభూత నిలయము. రుద్రా!

8-224-సీస పద్యము

అగ్ని ముఖంబు; పరాపరాత్మక మాత్మ;
 కాలంబు గతి; రత్నగర్భ పదము;
శ్వసనంబు నీ యూర్పు; రసన జలేశుండు;
 దిశలుఁ గర్ణంబులు; దివము నాభి;
సూర్యుండు గన్నులు; శుక్లంబు సలిలంబు;
 జఠరంబు జలధులు; చదలు శిరము;
సర్వౌషధులు రోమచయములు; శల్యంబు;
 లద్రులు; మానస మమృతకరుఁడు;

8-224.1-తేటగీతి

ఛందములు ధాతువులు; ధర్మసమితి హృదయ;
మాస్య పంచక ముపనిష దాహ్వయంబు;
నయిన నీ రూపు పరతత్త్వమై శివాఖ్య
మై స్వయంజ్యోతి యై యొప్పునాద్య మగుచు.

8-225-కంద పద్యము

కొందఱు గలఁ డందురు నినుఁ;
గొందఱు లేఁ డందు; రతఁడు గుణి గాఁ డనుచుం
గొందఱు; గలఁ డని లేఁ డని
కొందల మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా!

8-226-సీస పద్యము

తలఁపఁ బ్రాణేంద్రియ ద్రవ్యగుణస్వభా;

వుఁడవు; కాలక్రతువులును నీవ;
సత్యంబు ధర్మ మక్షరము ఋతంబును;
నీవ ముఖ్యుండవు నిఖిలమునకు;
ఛందోమయుండవు సత్త్వరజస్తమ;
శ్చక్షుండవై యుందు; సర్వరూప
కాము పురాధ్వర కాలగరాది భూ;
తద్రోహభయము చోద్యంబు గాదు;

8-226.1-తేటగీతి

లీలలోచనవహ్ని స్ఫులింగ శిఖల
నంతకాదులఁ గాల్చిన యట్టి నీకు
రాజఖండావతంస! పురాణ పురుష!
దీన రక్షక! కరుణాత్మ! దేవ దేవ!

8-227-ఆటవెలది

మూఁడు మూర్తులకును మూఁడు లోకములకు
మూఁడు కాలములకు మూల మగుచు
భేద మగుచుఁ దుది నభేదమై యొప్పారు
బ్రహ్మ మనఁగ నీవ ఫాలనయన!

8-228-కంద పద్యము

సదసత్తత్త్వ చరాచర
సదనం బగు నిన్నుఁ బొగడ జలజభవాదుల్
పెదవులుఁ గదలుప వెఱతురు

వదలక నినుఁ బొగడ నెంతవారము రుద్రా!

8-229-మత్తకోకిలము

బాహుశక్తి సురాసురుల్ చని పాలవెల్లి మథింప హా
లాహలంబు జనించె నేరి కలంఘ్యమై భువనంబు గో
లాహలంబుగఁ జేసి చిచ్చును లాగముం గొని ప్రాణిసం
దోహమున్ బ్రతికింపవే దయ దొంగలింపఁగ నీశ్వరా!

8-230-కంద పద్యము

లంపటము నివారింపను
సంపదఁ గృపజేయ జయము సంపాదింపం
జంపెడివారి వధింపను
సొంపారఁగ నీక చెల్లు సోమార్ధధరా!

8-231-కంద పద్యము

నీకంటె నొండెఱుంగము;
నీకంటెం బరులు గావ నేరరు జగముల్;
నీకంటె నొడయఁ డెవ్వఁడు
లోకంబుల కెల్ల నిఖిలలోకస్తుత్యా!

## 8-33- గరళభక్షణము

8-232-వచనము

అని మఱియు నభినందించుచున్న ప్రజాపతి ముఖ్యులం గని సకల భూత సముండగు నద్దేవదేవుండుఁ దన ప్రియసతి కిట్లనియె.

8-233-కంద పద్యము

కంటే జగముల దుఃఖము;
వింటే జలజనిత విషము వేఁడిమి; ప్రభుపై
యుంటకు నార్తుల యాపద
గెంటింపఁగ ఫలము గాదె కీర్తి మృగాక్షీ!

8-234-కంద పద్యము

ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన
ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లం
బ్రాణుల కిత్తురు సాధులు
బ్రాణంబులు నిమిష భంగురము లని మగువా!

8-235-కంద పద్యము

పరహితము జేయ నెవ్వఁడు
పరమ హితుం డగును భూత వంచకమునకుం
బరహితమె పరమ ధర్మము
పరహితునకు నెదురులేదు పర్వేందుముఖీ!

8-236-కంద పద్యము

హరి మది నానందించిన
హరిణాక్షీ జగంబులెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చఁగ
గరళము వారించు టొప్పుఁ గమలదళాక్షీ!

8-237-కంద పద్యము

శిక్షింతు హాలహలమును
భక్షింతును మధురసూక్ష్మ ఫలరసము క్రియన్
రక్షింతుఁ బ్రాణి కోట్లను
వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ!

8-238-వచనము

అని పలికిన ప్రాణవల్లభునకు వల్లభ "దేవా! దేవర చిత్తంబు కొలంది నవధరింతురు గాక!" యని పలికె" నని చెప్పిన యమ్మునీంద్రునకు నరేంద్రుం డిట్లనియె.

8-239-మత్తేభ విక్రీడితము

అమరన్ లోకహితార్థమంచు నభవుం డౌఁ గాక యం చాడెఁ బో
యమరుల్ భీతిని మ్రింగవే యనిరి వో యంభోజగర్భాదులుం
దముఁ గావన్ హర! లెమ్ము లెమ్మనిరి వో తాఁ జూచి కన్గంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానలజ్వాలలన్.

8-240-వచనము

అనిన శుకుం డిట్లనియె.

8-241-కంద పద్యము

మ్రింగెడి వాఁడు విభుం డని
మ్రింగెడిదియు గరళ మనియు మే లని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ

మంగళసూత్రంబు నెంత మది నమ్మెనదో?

8-242-మత్తేభ విక్రీడితము

తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బిడన్
ఘన గంభీర రవంబుతో శివుఁడు లోకద్రోహి! హుం! పోకు ర
మ్మని కెంగేలఁ దెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలం
బని సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్.

8-243-వచనము

అయ్యవిరళ మహాగరళదహన పాన సమయంబున.

8-244-మత్తేభ విక్రీడితము

కదలం బాఱవు పాఁప పేరు; లొడలన్ ఘర్మాంబుజాలంబు పు
ట్టదు; నేత్రంబులు నెఱ్ఱ గావు; నిజజూటా చంద్రుఁడుం గందఁడున్;
వదనాంభోజము వాడ; దా విషము నాహ్వానించుచో డాయుచోఁ
బదిలుండై కడి జేయుచోఁ దిగుచుచో భక్షించుచో మ్రింగుచోన్.

8-245-కంద పద్యము

ఉదరము లోకంబులకును
సదనం బగు టెఱిఁగి శివుఁడు చటుల విషాగ్నిం
గుదురుకొనఁ గంఠబిలమున
బదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసము క్రియన్.

8-246-కంద పద్యము

మెచ్చిన మచ్చిక గలిగిన

నిచ్చిన నీవచ్చుఁ గాక యిచ్చ నొరులకుం
జిచ్చుఁ గడిగొనఁగ వచ్చునె
చిచ్చఱరూ పచ్చుపడిన శివునకుఁ దక్కన్.

8-247-ఆటవెలది

హరుఁడు గళమునందు హాలహలము బెట్టఁ
గప్పుఁ గలిగి తొడవు కరణి నొప్పె;
సాధురక్షణంబు సజ్జనులకు నెన్న
భూషణంబు గాదె భూవరేంద్ర!

8-248-వచనము

తదనంతరంబ

8-249-కంద పద్యము

గరళంబుఁ గంఠబిలమున
హరుఁడు ధరించుటకు మెచ్చి యౌ నౌ ననుచున్
హరియు విరించియు నుమయును
సురనాథుఁడుఁ బొగడి రంత సుస్థిరమతితోన్.

8-250-కంద పద్యము

హాలాహల భక్షణ కథ
హేలాగతి విన్న వ్రాయ నెలమిఁ బఠింపన్
వ్యాళానల వృశ్చికముల
పాలై చెడ రెట్టిజనులు భయవిరహితులై.

## 8-34- సురభి ఆవిర్భావము

8-251-వచనము

మఱియు నా రత్నాకరంబు సురాసురులు ద్రచ్చునెడ.

8-252-కంద పద్యము

తెల్లని మేనును నమృతము
జిల్లున జల్లించు పొదుఁగు శితశృంగములుం
బెల్లుగ నర్థుల కోర్కులు
వెల్లిగొలుపు మొదవు పాలవెల్లిం బుట్టెన్.

8-253-ఆటవెలది

అగ్నిహోత్రి యనుచు నా సురభిని దేవ
మునులు పుచ్చికొనిరి మున్నెఱింగి
విబుధ సంఘములకు వెరవుతో నధ్వర
హవులు పెట్టుకొఱకు నవనినాథ!

8-254-వచనము

మఱియు నా జలరాశి యందు.

## 8-35- ఉచ్చైశ్రవావిర్భవము

8-255-కంద పద్యము

సచ్చంద్రపాండురంబై
యుచ్చైశ్రవ మనఁగ దురగ మొగి జనియించెం
బుచ్చి కొనియె బలి దైత్యుం

డిచ్చ గొనం డయ్యె నింద్రుఁ డీశ్వరశిక్షన్.

8-256-కంద పద్యము

ఒఱ పగు నురమును బిఱుఁదును
నెఱిఁ దోఁకయు ముఖముసిరియు నిర్మలఖరముల్
కుఱచచెవులుఁ దెలిఁగన్నులు
దఱచగు కంద పద్యములుఁ జూడఁ దగు నా హరికిన్.

8-257-వచనము

అంత నా పాలకుప్ప యందు.

## 8-36- ఐరావతావిర్భావము

8-258-కంద పద్యము

దంతచతుష్టాహతి శై
లాంతంబులు విఱిగి పడఁగ నవదాత కుభృ
త్కాంతంబగు నైరావణ
దంతావళ ముద్భవించె ధరణీనాథా!

8-259-కంద పద్యము

తడ లేని నడపు వడి గల
యొడలును బెను నిడుదకరము నురుకుంభములున్
బెడఁగై యువతుల మురిపపు
నడకలకున్ మూలగురు వనన్ గజ మొప్పెన్.

8-260-వచనము

మఱియు నత్తరంగిణీవల్లభు మథించు నయ్యెడ.

## 8-37- కల్పవృక్షావిర్భావము

8-261-ఆటవెలది

ఎల్ల ఋతువులందు నెలరారి పరువమై
యింద్రువిరులతోఁట కేపు దెచ్చి
కోరి వచ్చు వారి కోర్కుల నీనెడు
వేల్పు మ్రాను పాలవెల్లిఁ బుట్టె.

## 8-38- అప్సరావిర్భావము

8-262-వచనము

మఱియునుం గొండకవ్వంబునం గడలి మథింప నప్సరోజనంబు జనించె నంత.

8-263-కంద పద్యము

క్రొక్కారు మెఱుఁగు మేనులు
గ్రిక్కిరిసిన చన్నుఁగవలుఁ గ్రిస్సన నడుముల్
పిక్కటిలి యున్న తుఱుములుఁ
జక్కని చూపులును దివిజసతులకు నొప్పెన్.

8-264-వచనము

వెండియు నా రత్నాకరంబు నందు సుధాకరుం డుద్భవించి; విరించి యనుమతంబునఁ దన యథాస్థానంబునం బ్రవర్తించుచుండె; నంత.

## 8-39- లక్ష్మీదేవి పుట్టుట

8-265-కంద పద్యము

తొలుకారు మెఱుఁగు కైవడి
తళతళ మని మేను మెఱవ ధగధగ మనుచున్
గలుముల నీనెడు చూపులఁ
జెలువంబుల మొదలి టెంకి సిరి పుట్టె నృపా!

8-266-సీస పద్యము

పాలమున్నీటి లోపలి మీఁది మీఁగడ;
మిసిమి జిడ్డునఁ జేసి మేను పడసి
క్రొక్కారు మెఱుఁగుల కొనల క్రొత్తళుకుల;
మేనిచే గలనిగ్గు మెఱుఁగు జేసి
నాఁటి నాఁటికిఁ బ్రోది నవకంపుఁదీవల;
నునుఁ బోద నెయ్యంబు నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి కొలఁకునఁ బ్రొద్దునఁ;
బొలసిన వలపులఁ బ్రోది పెట్టి

8-266.1-తేటగీతి

పసిడి చంపక దామంబు బాగుఁగూర్చి
వాలు క్రొన్నెల చెలువున వాడిఁ దీర్చి
జాణతనమునఁ జేతుల జడ్డు విడిచి
నలువ యీ కొమ్మ నొగిఁ జేసినాఁడు నేఁడు.

8-267-కంద పద్యము

కెంపారెడు నధరంబును
జంపారెడి నడుము సతికి శంపారుచులన్

నొం పారు మోముఁ గన్నులుఁ
బెంపారుచు నొప్పుగొప్పు పిఱుఁదును గుచముల్.

8-268-వచనము

అని జనులు పొగడుచుండ

8-269-సీస పద్యము

తరుణికి మంగళస్నానంబు చేయింత;
 మని పెట్టె నింద్రుఁ డనర్ఘమైన
మణిమయ పీఠంబు; మంగళవతులైన;
 వేలుపు గరితలు విమల తోయ
పూర్ణంబులై యున్న పుణ్యాహ కలశంబు;
 లిడిరి; పల్లవముల నిచ్చె భూమిఁ;
గడిమి గోవులు పంచగవ్యంబులను నిచ్చె;
 మలసి వసంతుండు మధు వొసంగె;

8-269.1-తేటగీతి

మునులు గల్పంబుఁ జెప్పిరి; మొగిలుగములు
పణవ గోముఖ కాహళ పటహ మురజ
శంఖ వల్లకీ వేణు నిస్వనము లిచ్చెఁ;
బాడి రాడిరి గంధర్వ పతులు సతులు.

8-270-కంద పద్యము

పండిత సూక్తుల తోడుతఁ

దుండంబులు చాఁచి తీర్థ తోయములెల్లం
దుండముల ముంచి దిగ్వే
దండంబులు జలక మార్చెఁ దరుణీ మణికిన్.

8-271-సీస పద్యము

కట్టంగఁ బచ్చని పట్టుఁబుట్టపు దోయి;
ముదితకుఁ దెచ్చి సముద్రుఁ డిచ్చె;
మత్తాళి నికరంబు మధ్వాశ మూఁగిన;
వైజయంతీమాల వరుణుఁ డిచ్చెఁ;
గాంచన కేయూర కంకణ కింకిణీ;
కటకాదులను విశ్వకర్మ యిచ్చె;
భారతి యొక మంచి తారహారము నిచ్చె;
బాణిపద్మము నిచ్చెఁ బద్మభవుఁడు;

8-271.1-ఆటవెలది

కుండలివ్రజంబు గుండలముల నిచ్చె;
శ్రుతులు భద్రమైన నుతులు జేసె;
నెల్ల లోకములకు నేలిక సానివై
బ్రతికె దనుచు దిశలు పలికె నధిప!

8-272-వచనము

మఱియును

8-273-సీస పద్యము

పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితోఁ;
భాషించె వాఁడెవో బ్రహ్మ యనఁగ
నెలయించి కెంగేల నెవ్వని వరియించె;
వాఁడె లోకములకు వల్లభుండు
మెయిదీఁగ నెవ్వని మేనితోఁ గదియించె;
వాఁడెవో పరమ సర్వజ్ఞమూర్తి
నెలతుక యెప్పుడు నివసించె నేయింట;
నాయిల్లు పరమగు నమృత పదము

8-273.1-ఆటవెలది

నింతి చూపు వాలె నెచ్చోటి కచ్చోటు
జిష్ణుధనద ధర్మ జీవితంబు
గొమ్మ చిన్న నగవు గురుతర దుఃఖ ని
వారణంబు సృష్టి కారణంబు.

8-274-వచనము

మఱియు నక్కొమ్మ నెమ్మనంబున.

8-275-సీస పద్యము

భావించి యొకమాటు బ్రహ్మాండ మంతయు;
నాటల బొమ్మరిల్లని తలంచుఁ
బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ;
దన యింటిలో దొంతులని తలంచుఁ
బాటించి యొకమాటు బ్రహ్మాది సురులను;

దన యింటిలో బొమ్మలని తలంచు
గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు;
నలవడ బొమ్మపీఁటని తలంచు

8-275.1-ఆటవెలది

నొలసి యొక్కమాటు సూర్యేందురోచుల
నచటి దీపకళిక లని తలంచు
భామ యొక్క మాటు భారతీదుర్గల
నాత్మసఖు లటంచు నాదరించు.

8-276-వచనము

తదనంతరంబ.

8-277-ఆటవెలది

చంచరీకనికర ఝుంకార నినదంబు
దనరు నుత్పలముల దండ పెట్టి
మేఘకోటి నడిమి మెఱుఁగుఁ బుత్తడి మాడ్కి
సురల నడుమ నిల్చె సుందరాంగి.

8-278-కంద పద్యము

ఆ కన్నులు నా చన్నులు
నా కురు లా పిఱుఁదు నడుము నా ముఖమా న
వ్యాకారముఁ గని వేల్పులు
చీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్.

## 8-40- లక్ష్మీదేవిహరినివరించుట

8-279-వచనము

అట్లు నిలిచి దశదిశలం బరివేష్టించి యున్న యక్ష రక్షస్సిద్ధ సాధ్య దివిజ గరుడ గంధర్వ చారణ ప్రముఖ నిఖిల యూథంబులం గనుం గొని య ప్పురాణ ప్రౌఢకన్యకారత్నం బుఁ దన మనంబున నిట్లని వితర్కించె.

8-280-సీస పద్యము

ఐదువనై యుండ నలవడ దొక చోట;
 నొకచోట సవితితో నోర్వ రాదు
తగ నొకచోట సంతత వైభవంబుఁ గా;
 దొకచోట వేఁడిమి నుండఁ బోల
దొకచోటఁ గరుణ లే దొక్కింత వెదకిన;
 నొకచోట డగ్గఱి యుండఁ బెట్ట
నెఱయంగ నొకచోట నిలుకడ చాలదు;
 చర్చింప నొకచోట జడత గలదు

8-280.1-ఆటవెలది

కొన్నిచోట్ల కామగుణ గరిష్ఠంబులు
క్రోధ సంయుతములుఁ గొన్ని యెడలు
గొన్ని మోహలోభకుంఠితంబులుఁ గొన్ని
ప్రమద మత్సరాను భావకములు.

8-281-వచనము

అని సకల సత్పురుష జనన వర్తనంబులు మానసించి పరిహరించి.

8-282-సీస పద్యము

అమర ముత్తైదువనై యుండ వచ్చును;
 వరుసకు సవతు లెవ్వరును లేరు
వెలయంగ నశ్రాంత విభవ మీతని యిల్లు;
 శృంగార చందన శీతలుండు
గలఁగఁ డెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి;
 విమలుండు గదిసి సేవింప వచ్చు
నెఱి నాఁడి తిరుగఁడు నిలుకడఁ గలవాఁడు;
 సకల కార్యములందు జడత లేదు;

8-282.1-ఆటవెలది

సాధురక్షకుండు షడ్వర్గ రహితుండు
నాథుఁ డయ్యె నేని నడప నోపు
నితఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ
బుష్ప దామకమునఁ బూజచేసె.

8-283-కంద పద్యము

ఇందీవర దామమున ము
కుందునిఁ బూజించి తనకుఁ గూడి వసింపన్
మందిరముగఁ దద్వక్షము
నందంద సలజ్జదృష్టి నాలోకించెన్.

8-284-ఆటవెలది

మోహరుచుల వలన ముద్దియ దల యెత్తు
సిగ్గువలన బాల శిరము వంచు
నింతి వెఱపు వలన నెత్తదు వంపదు
తనదు ముఖము ప్రాణదయితుఁ జూచి.

8-285-కంద పద్యము

హరి చూచిన సిరి చూడదు
సిరి చూచిన హరియుఁ జూఁడ సిగ్గును బొందున్
హరియును సిరియునుఁ దమలో
సరిఁజూపులఁజూడ మరుఁడు సందడి పెట్టెన్.

8-286-చంపకమాల

జగముల తండ్రియై తనరు శౌరి జగంబుల తల్లి నిందిరం
దగ నురమందుఁ దాల్చె; నటఁ దత్కరుణారసదృష్టిచేఁ బ్రజల్
మగుడఁగఁ దొంటి భంగి నతిమంగళసాధ్వి పతిత్వసంపదన్
నెగడిన లోకముల్ గని; రనేక శుభంబులఁ బొంది రత్తఱిన్.

8-287-వచనము

అటమున్న యబ్ధిరాజు దనయందు నున్న యమూల్యంబైన కౌస్తుభంబు పేరిటి మణిరాజంబు నయ్యంబుజాక్షునకు సమర్పించిన దానిం దన వక్షస్థలంబున ధరియించె; నప్పు డయ్యాదిలక్ష్మియు శ్రీవత్స కౌస్తుభ వైజయంతీవనమాలికా తారహారాద్యలంకృతంబైన పుండరీకాక్షు వక్షంస్థలంబున వసియించె నయ్యవసరంబున.

8-288-శార్దూల విక్రీడితము

మ్రోసెన్ శంఖ మృదంగ వేణురవముల్ మున్నాడి; పెంజీఁకటుల్
వాసెన్; నర్తన గాన లీలల సురల్ భాసిల్లి; రార్యుల్ జగ
ద్వాసుల్ విష్ణుని బ్రహ్మ రుద్ర ముఖరుల్ తల్లింగమంత్రంబులం
బ్రాసక్తిన్ వినుతించి రుల్లసిత పుష్పశ్రేణి వర్షించుచున్.

8-289-కంద పద్యము

ఆ పాలవెల్లి కూఁతురు
దీపుల చూపులను దోఁగి తిలకింపఁ బ్రజల్
చేపట్టిరి సంపదలనుఁ;
బ్రాపించెను మేలు; జగము బ్రతికె నరేంద్రా!

8-290-కంద పద్యము

పాలేటి రాచకన్నియ
మే లారెడు చూపులేక మిడు మిడు కంచున్
జాలిం బురపురఁ బొక్కుచుఁ
దూలిరి రక్కసులు కీడు దోఁచిన నధిపా!

## 8-41- వారుణి ఆవిర్భావము

8-291-కంద పద్యము

వారిధిఁ దరువఁగ నంతట
వారుణి యన నొక్క కన్య వచ్చిన నసురుల్
వారిజలోచను సమ్మతి
వారై కైకొనిరి దాని వారిజనేత్రన్.

## 8-42- ధన్వంతర్యామృతజననము

8-292-వచనము

మఱియుం దరువం దరువ నప్పయోరాశి యందు.

8-293-సీస పద్యము

తరుణుండు దీర్ఘ దోర్దండుండు గంబుకం;
 ధరుఁడు పీతాంబరధారి స్రగ్వి
లాసిత భూషణాలంకృతుం డరుణాక్షుఁ;
 డున్నతోరస్కుఁ డత్యుత్తముండు
నీలకుంచిత కేశ నివహుండు జలధర;
 శ్యాముండు మృగరాజ సత్త్వశాలి
మణికుండలుఁడు రత్నమంజీరుఁ డచ్యుతు;
 నంశాంశ సంభవుం డమలమూర్తి

8-293.1-ఆటవెలది

భూరియాగభాగ భోక్త ధన్వంతరి
యనఁగ నమృత కలశ హస్తుఁ డగుచు
నిఖిలవైద్యశాస్త్ర నిపుణుఁ డాయుర్వేది
వేల్పు వెజ్జుఁ గడలి వెడలి వచ్చె.

8-294-వచనము

తదనంతరంబ

8-295-ఆటవెలది

అతనిచేత నున్న యమృత కుంభము చూచి
కెరలు వొడిచి సురలఁ గికురుపెట్టి
పుచ్చికొనిరి యసుర పుంగవు లెల్లను
మాఱులేని బలిమి మానవేంద్ర!

8-296-వచనము

వెండియు.

8-297-ఆటవెలది

చావులేని మందు చక్కఁగ మన కబ్బె
ననుచుఁ గడవ నసుర లాఁచి కొనిన
వెఱచి సురలు హరికి మొఱలు పెట్టిరి సుధా
పూర్ణఘటము వోయెఁ బోయె ననుచు.

8-298-వచనము

ఇట్లు శరణాగతులైన వేల్పుల దైన్యంబు వొడగని భృత్యుజన కాముదుండగు నప్పరమేశ్వరుండు "మీరలు దుఃఖింప వలవ దేను నా మాయాబలంబునంజేసి మీ యర్థంబు మరల సాధించెద" నని పలికె; దత్సమయంబున న య్యమృతపూరంబు నేమ త్రావుదు మని తమకించు దైత్యదానవ జనంబుల లోపల నమంగళంబగు కలి సంభవించిన కతంబునఁ బ్రబలులగు రక్కసులు విలోకించి సత్త్రయాగంబు నందు నడచు చందంబునఁ దుల్యప్రయాస హేతువులగు సురలును సుధా భాగంబున కర్హు లగుదురు గావునఁ బంచి కుడుచుట కర్తవ్యం; బిది సనాతనంబగు ధర్మంబగుటంజేసి య య్యమృత

కుంభంబు విడువుండని దుర్బలులగు నిశాచరులు జాతమత్సరులై ప్రబలు లైన తమవారల వారించుచున్న సమయంబున.

8-299-ఆటవెలది

ఒకని చేత నుండ నొకఁడు బలిష్ఠుఁడై
పుచ్చికొనిన వానిఁ బొదుగఁ బట్టి
యంతకంటె నధికుఁ డమృత కుంభము నెత్తి
కొంచుఁ బాఱెఁ బరులుఁ గుయ్యిడంగ.

## 8-43- జగన్మోహిని వర్ణన

8-300-వచనము

అంత.

8-301-సీస పద్యము

మెత్తని యడుగుల మెఱుఁగారు జానువు;
లరఁటి కంబములదో యైన తొడలు
ఘనమగు జఘనంబుఁ గడు లేత నడుమును;
బల్లవారుణకాంతి పాణియుగము
గడు దొడ్డ పాలిండ్లుఁ గంబుకంఠంబును;
బింబాధరముఁ జంద్రబింబముఖముఁ
దెలిగన్నుఁ గవయును నలికుంతలంబును;
బాలేందు సన్నిభ ఫాలతలము

8-301.1-తేటగీతి

నమరఁ గుండల కేయూర హార కంక
ణాదు లేపార మంజీర నాద మొప్ప
నల్ల నవ్వులఁ బద్మదళాక్షుఁ డసుర
పతుల నడగింప నాఁడు రూపంబుఁ దాల్చె.

8-302-వచనము

అయ్యవసరంబున జగన్మోహనాకారంబున.

8-303-సీస పద్యము

పాలిండ్లపై నున్న పయ్యెద జాఱించు;
 జాఱించి మెల్లన చక్క నొత్తు
దళ్కు దళ్కను గండఫలకంబు లొలయించు;
 నొలయించి కెంగేల నుజ్జగించుఁ
గటు మెఱుంగులు వాఱు కడకన్ను లల్లార్చు;
 నల్లార్చి ఱెప్పల నండఁ గొలుపు
సవరని దరహాస చంద్రికఁ జిలికించుఁ;
 జిలికించి కెమ్మోవిఁ జిక్కుపఱచు

8-303.1-తేటగీతి

దళిత ధమ్మిల్ల కుసుమ గంధమ్ము నెఱపుఁ
గంకణాది ఝుణంకృతుల్ గడలు కొలుపు
నొడలి కాంతులు పట్టులే కులుకఁ బాఱు
సన్నవలిపంపుఁ బయ్యెద చౌకళింప.

8-304-వచనము

ఇవ్విధంబున న క్కపట యువతీరత్నంబు జగన్మోహన దేవతయునుంబోలె నెమ్మొగంబు తావికి మత్తిల్లిన తేఁటి మొత్తంబులన్ గెలిచి చిగురు జొంపంబుల నెడగలుగ జడియుచు ముఱియుచుండ రాక్షసవరులు గనుంగొని.

8-305-సీస పద్యము

అవుఁగదే లావణ్య; మవుఁగదే మాధుర్య;
 మవుఁగదే సతి! నవయౌవనాంగి!
యెటనుండి వచ్చితి? వేమి యిచ్చించెదు?;
 నీ నామమెయ్యది? నీరజాక్షి!
యమర గంధర్వ సిద్ధాసుర చారణ;
 మనుజకన్యలకు నీ మహిమ గలదె?
ప్రాణ చిత్తేంద్రియ పరిణామ దాయియై;
 నిర్మించెఁ బో విధి నిన్ను గరుణ;

8-305.1-తేటగీతి

వనిత! గశ్యపు సంతతి వార మేము
భ్రాతలము సురలకు నిద్ధపౌరుషులము
జ్ఞాతులకు మాకు నేకార్థసంగతులకుఁ
బాలు దీరని యర్థంబు బంచి యిమ్ము.

8-306-కంద పద్యము

సభ యై యుండెద మిందఱ
మభయంబున వచ్చు కొలఁది నమృతంబును నీ

విభరాజగమన! తప్పక
విభజింపు విపక్షపక్ష విరహితమతి పై.

8-307-వచనము

అని మందలించిన దైత్యులం గని మాయాయువతి రూపుం డగు హరి తన వాఁడి వాలు జూపుటంపఱలవలన వారల తాలుముల నగలించి చిఱునగవు లెగయ మొగమెత్తి యిట్లనియె.

8-308-కంద పద్యము

సుందరులగు పురుషులఁగని
పొందెడు నాయందు నిజము పుట్టునె మీకున్?
బృందారకరిపులారా!
చెందరు కామినుల విశ్వసింపరు పెద్దల్.

8-309-కంద పద్యము

పలుకులు మధురసధారలు
దలఁపులు నానా ప్రకార దావానలముల్
చెలుములు సాలావృకములు
చెలువల నమ్ముటలు వేదసిద్ధాంతములే?

## 8-44- అమృతము పంచుట

8-310-కంద పద్యము

నా నేర్చుకొలది మీకును
మానుగ విభజించి యిత్తు; మానుఁడు శంకన్

కా నిం డనవుడు నిచ్చిరి
దానవు లమృతంపుఁ గడవఁ దరుణీమణికిన్.

8-311-కంద పద్యము

ఆ శాంతా లోకనములు
నా శీతల భాషణములు నా లాలితముల్
రాశి పరంపర లగుచుం
బాశములై వారి నోళ్ళు బంధించె నృపా!

8-312-వచనము

ఇట్లు సుధాకలశంబు కేల నందికొని మందస్మిత భాషణంబుల సుందరీ రూపుఁ డగు ముకుందుండు "మేలుఁ గీ డనక నేనుఁ బంచియిచ్చిన తెఱంగున నంగీకరించుట కర్తవ్యం" బనవుడు "నగుంగాక" యని సురాసుర దైత్యదానవ సమూహం బుపవసించి కృతస్నానులై హోమంబు లాచరించి విప్రులకు గోభూహిరణ్యాది దానంబులు చేసి తదాశీః ప్రవచనంబులు గైకొని ధవళపరిధానులై గంధమాల్య ధూపదీపాలంకృతం బగు కనకరత్నశాలా మధ్యంబునఁ బ్రాగగ్రకుశ పీఠంబులం బూర్వదిశా ముఖులై పంక్తులుఁ గొని యున్న సమయంబున.

8-313-కంద పద్యము

శ్రోణీభర కుచయుగ భర
వేణీభరములను డస్సి వివిధాభరణ
క్వాణ యయి యువిద వచ్చెను
బాణి సరోజమున నమృతభాండముఁ గొంచున్.

8-314-కంద పద్యము

భాసుర కుండల భాసిత

నాసాముఖ కర్ణ గండ నయనాంచల యై

శ్రీసతి యగు సతిఁ గని దే

వాసుర యూధంబు మోహ మందె నరేంద్రా!

8-315-వచనము

అప్పుడు

8-316-కంద పద్యము

అసురుల కమృతము వోయుట

పొసగదు పాములకుఁ బాలు వోసిన మాడ్కిన్

దొసఁగగు నంచును వేఱొక

దెసఁ గూర్చుండంగఁ బెట్టె దేవాహితులన్.

8-317-వచనము

ఇట్లు రెండు పంక్తులుగా నేర్పరచి.

8-318-సీస పద్యము

వేగిర పడకుడీ వినుఁడు దానవులార!;

తడవు చేయక వత్తు దైత్యులార!

యటు ప్రక్కఁ గూర్చుండుఁ డని కన్ను లల్లార్చి;

చనుగవ పయ్యెద జాఱఁ దిగిచి

వదినె మఱందలి వావులు కల్పించి;

మర్మంబు లెడలించి మఱుఁగు జేసి
మెల్లని నగవుల మేనులు మఱపించి;
కడు జాణ మాటలఁ గాకు పఱచి

8-318.1-ఆటవెలది

యసుర వరుల నెల్ల నడకించి సురలను
దడవు జేయ వలదు; ద్రావుఁ డనుచు
వచ్చు కొలఁది నమృతవారి విభాగించెఁ
దరుణి దివిజు లెల్లఁ దనిసి పొగడ.

8-319-వచనము

అయ్యవసరంబున.

8-320-సీస పద్యము

మనకు వేల్పులకును మందట లేకుండఁ;
బంచి పెట్టెద నని పడఁతి పూనెఁ
దానేల తప్పును? తప్పదు తరళాక్షి;
గాక రమ్మనుచును గడకఁ బిల్వ
మఱుమాట లాడదో మఱి చూడకుండునో;
చను గవఁ గప్పునో చాలు ననుచు
నొండాడఁ గలుగుచు నొక్కింత నొలయునో;
మనయెడఁ గందునో మగువ యనుచు

8-320.1-ఆటవెలది

నెలతఁ చూడ్కి గముల నీరై కరంగుచుఁ
బ్రణయ భంగ భీతి బద్ధు లగుచు
నూరకుండ్రు గాని యువిద తే తెమ్మని
యడుఁగ జాలరైరి యసుర వరులు.

## 8-45- రాహువువృత్తాంతము

8-321-వచనము

అప్పుడు

8-322-మత్తేభ విక్రీడితము

అమరవ్రాతములోన జొచ్చి దివిజుండై రాహు పీయూష పా
నము జేయం గని చంద్రభాస్కరులు సన్నల్ చేయ నారాయణుం
డమరారాతిశిరంబు చక్రహతిఁ దున్మాడెన్ సుధాసిక్త మై
యమరత్వంబును జెందె మూర్ధముఁ దదన్యాంగంబు నేలం బడెన్.

8-323-ఆటవెలది

అజుఁడు వాని శిరము నంబరవీథిని
గ్రహము జేసి పెట్టి గారవించె;
వాఁడు పర్వములను వైరంబు దప్పక
భానుచంద్రములను బట్టు చుండు.

8-324-కంద పద్యము

ఒకబొట్టుఁ జిక్క కుండఁగ
సకల సుధారసము నమర సంఘంబులకుం

బ్రకటించి పోసి హరి దన
సుకరాకృతిఁ దాల్చె నసుర శూరులు బెగడన్.

8-325-మత్తేభ విక్రీడితము

అమరుల్ రక్కసులుం బ్రయాసబలసత్త్వార్థా భిమానంబులన్
సములై లబ్ధవికల్పు లైరి యమరుల్ సంశ్రేయముం బొంది ర
య్యమరారుల్; బహుదుఃఖముల్ గనిరి తా మత్యంత దోర్గర్వులై;
కమలాక్షున్ శరణంబు వేఁడని జనుల్ కల్యాణ సంయుక్తులే.

8-326-కంద పద్యము

దానవు లమృతము ద్రావం
బూని పయోరాశిఁ ద్రచ్చి పొగిలిన మాడ్కిన్
శ్రీనాథ పరాఙ్ముఖులగు
హీనులు పొందంగఁజాల రిష్టార్థంబుల్.

8-327-కంద పద్యము

శోధించి జలధి నమృతము
సాధించి నిలింపవైరి చక్షుర్గతులన్
రోధించి సురల కిడి హరి
బోధించి ఖగేంద్రు నెక్కి పోయె నరేంద్రా!

## 8-46- సురాసుర యుద్ధము

8-328-కంద పద్యము

శుద్ధముగ సురల కమృతము

సిద్ధించిన నసుర వరులు సిడిముడిపడుచున్
క్రుద్ధులు నానాయుధ స
న్నద్ధులు నయి యుద్ధమునకు నడచిరి బలిమిన్.

8-329-కంద పద్యము

ధన్యులు వైరోచని శత
మన్యుప్రముఖులు మదాభిమానులు దమలో
నన్యోన్యరణము బాహా
సిన్యాసంబులను బేర్చి చేసిరి కడిమిన్.

8-330-మత్తేభ విక్రీడితము

అరుదై కామగమై మయాసురకృతంబై లోకితాలోక్యమై
వరశస్త్రాస్త్ర సమేతమై తరళమై వైహాయసంబై మహా
సురయోధాన్వితమైన యానమున సంశోభిల్లెఁ బూర్ణేందు సు
స్థిరకాంతిన్ బలి చామరధ్వజ చమూదీప్తస్థితిన్ ముందటన్.

8-331-వచనము

మఱియు నముచి శంబర బాణ ద్విమూర్ధ కాలనాభ శకుని జంభాయోముఖ ప్రహేతి హేతి భూతసంత్రాస హయగ్రీవ కపిలేల్వలోత్కళ మేఘదుందుభి మయత్రిపురాధిప విప్రచిత్తి విరోచన వజ్ర దంష్ట్ర తారకారిష్టారిష్టనేమి శుంభ నిశుంభ శంకుశిరః ప్రముఖులును బౌలోమ కాలకేయులును, నివాత కవచ ప్రభృతులును, దక్కిన దండయోధులునుం గూడికొని యరదంబులం దురగంబుల మాతంగంబుల హరిణంబుల హరి కిరి శరభ మహిష గవయ ఖడ్గ గండభేరుండ చమరీ జంబుక శార్దూల గో వృషాది మృగంబులను, గంక గృధ్ర కాక

కుక్కుట బక శ్యేన హంసాది విహంగంబులను, దిమి తిమింగ లాది జలచరంబులను, నరులను, నసుర సుర నికర వికృత విగ్రహ రూపంబులగు జంతువులను నారోహించి తమకు నడియాలంబులగు గొడుగులు పడగలు జోడుఁగైదువలు పక్కెరలు బొమిడికంబులు మొదలగు పోటుము ట్లాయితంబుగఁ గైకొని వేఱు వేఱ మొనలై విరోచననందనుం డగు బలిముందట నిలువంబడిరి; దేవేంద్రుండును నైరావతారూఢుండై వైశ్వానర వరుణ వాయు దండధరాద్యనేక నిర్జర వాహినీ సందోహంబునుం, దాను నెదురుపడి పిలిచివియక మోహరించె; నట్లు సంరంభసన్నాహ సముత్సాహంబుల రెండుదెఱంగుల వారునుం బోరాడు వేడుకల మీఁటగు మాటల సందడించుచున్న సమయంబున.

8-332-సీస పద్యము

వజ్రదంష్ట్రాంచిత వ్యజనంబులును బర్హ;
 చామరంబులు సితచ్ఛత్రములును
జిత్రవర్ణధ్వజచేలంబులును వాత;
 చలితోత్తరోష్ణీష జాలములును
జప్పుళ్ళ నెసఁగు భూషణ కంకణంబులుఁ;
 జండాంశురోచుల శస్త్రములును
వివిధ ఖేటకములు వీరమాలికలును;
 బాణపూర్ణములైన తూణములును

8-332.1-ఆటవెలది

నిండి పెచ్చురేఁగి నిర్జరాసురవీర
సైన్యయుగ్మకంబు చాల నొప్పె

గ్రాహతతుల తోడఁ గలహంబునకు వచ్చు
సాగరములభంగి జనవరేణ్య!

8-333-కంద పద్యము

భేరీ భాంకారంబులు
వారణ ఘీంకారములును వరహరి హేషల్
భూరి రథనేమి రవములు
ఘోరములై పెల్లగించెఁ గులశైలములన్.

8-334-వచనము

ఇవ్విధంబున నుభయబలంబులును మోహరించి బలితో నింద్రుండును, దారకునితో గుహుండును, హేతితో వరుణుండును, బ్రహేతితో మిత్రుండును, గాలనాభునితో యముండును, మయునితో విశ్వకర్మయు, శంబరునితోఁ ద్వష్టయు, విరోచనితో సవితయు, నముచితోఁ బరాజితుండును, వృషపర్వునితో నశ్విదేవతలును, బలిసుతబాణాది పుత్రశతంబుతో సూర్యుండును, రాహువుతో సోముండును, బులోమునితో ననిలుండును, శుంభ నిశుంభులతో భద్రకాళీదేవియు, జంభునితో వృషాకపియును, మహిషునితో విభావసుండును, నిల్వల వాతాపులతో బ్రహ్మపుత్రులును, దుర్మర్షణునితోఁ గామదేవుండును, నుత్కలునితో మాతృకాగణంబును, శుక్రునితో బృహస్పతియు, నరకునితో శనైశ్చరుండును, నివాత కవచులతో మరుత్తులును, గాలేయులతో వసువులు, నమరులును, బౌలోములతో విశ్వేదేవగణంబును, గ్రోధవశులతో రుద్రులును, నివ్విధంబునం గలిసి పెనంగి ద్వంద్వయుద్ధంబు చేయుచు మఱియు రథికులు రథికులను, పదాతులు పదాతులను, వాహనారూఢులు వాహనారూఢులనుం,

దాఁకి సింహనాదంబులు చేయుచు, నట్టహాసంబు లిచ్చుచు, నాహ్వానంబు లొసంగుచు, నన్యోన్యతిరస్కారంబులు చేయుచు, బాహునాదంబుల విజృంభించుచుఁ, బెనుబొబ్బల నుబ్బిరేగుచు, హుంకరించుచు, నహంకరించుచు, ధనుర్గుణంబులఁ డంకరించుచు, శరంబుల నాటించుచుఁ, బరశువుల నఱకుచుం, జక్రంబులం జెక్కుచు, శక్తులం దునుముచుఁ, గశలంబెట్టుచుఁ, గుఠారంబులఁ బొడుచుచు, గదల నడచుచుఁ, గరంబులఁ బొడుచుచుఁ, గరవాలంబుల వ్రేయుచుఁ, బట్టిసంబుల నొంచుచుఁ, బ్రాసంబులం ద్రెంచుచుఁ, బాశంబులం గట్టుచుఁ, బరిఘంబుల మొత్తుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబుల జదుపుచు, ముష్టివలయంబుల ఘట్టించుచుఁ, దోమరంబుల నుఱుముచు శూలంబులఁ జిమ్ముచు, నఖంబులం జీరుచుఁ, దరు శైలంబుల ఱువ్వుచు, నుల్ముకంబులం జూఁడుచు నిట్లు బహువిధంబులం గలహ విహారంబులు సలుపు నవసరంబున భిన్నంబు లయిన శిరంబులును, విచ్ఛిన్నంబులైన కపాలంబులును, వికలంబులైన కపోలంబులును, జిక్కుపడిన కేశబంధంబులును, భగ్నంబులైన దంతంబులును, గృత్తంబులైన భుజంబులును, ఖండితంబులైన కరంబులును, విదళితంబు లైన మధ్యంబులును, వికృతంబులైన వదనబింబంబులును, వికలంబు లైన నయనంబులును, వికీర్ణంబు లయిన కర్ణంబులును, విశీర్ణంబు లైన నాసికలును, విఱిగిపడిన యూరుదేశంబులును, విసంధులయిన పదంబులునుఁ, జిరిగిన కంకటంబులును, రాలిన భూషణంబులును, వ్రాలిన కేతనంబులును, గూలిన ఛత్రంబులును, మ్రగ్గిన గజంబులును, నుగ్గయిన రథంబులును, నుఱుమైన హయంబులునుఁ, జిందఱవందఱలైన భటసమూహంబులును, నొఱలెడు కొఱప్రాణంబులును, బొఱలెడు మేనులును, నుబ్బి యాడెడు భూతంబులును,

బాఱెడు రక్త ప్రవాహంబులును, గుట్టలుగొన్న మాంసంబులును, నెగసి తిరిగెడి కబంధంబులునుఁ, గలకలంబులు జేయు కంక గృధ్రాది విహంగంబులు, నయి యొప్పు నవ్వోరతిఘోరంబయ్యె నప్పుడు.

## 8-47- బలిప్రతాపము

### 8-335-శార్దూల విక్రీడితము

నాకాధీశుఁ బదింట, మూఁట గజమున్, నాల్గింట గుఱ్ఱంబులన్,
ఏకాస్త్రంబున సారథిం జొనిపె, దైత్యేంద్రుండు దా నాకస
ల్లోకాధీశుఁడు ద్రుంచి యన్నిటిని దోర్దర్పంబు తో నన్ని భల్లంబులన్
రాకుండన్ రిపువర్గముం దునిమె గీర్వాణారి యగ్గింపఁగన్.

### 8-336-సీస పద్యము

తన తూపులన్నియుఁ దరమిడి శక్రుండు;
 నఱికిన జోదు విన్ననువు మెఱసి
బలి మహాశక్తిచేఁ బట్టిన నదియును;
 నతఁడు ఖండించె నత్యద్భుతముగ;
మఱి ప్రాస శూల తోమరములు గైకొన్న;
 దోర్దోడ నవియును దునిమివైచె;
నంతటఁ బోక యెయ్యది వాఁడు సాగించెఁ;
 దొడరి తా నదియును దురుము జేసె;

### 8-336.1-ఆటవెలది

నసురభర్త విరథుఁడై తన పగఱకుఁ
గానఁబడక వివిధ కపట వృత్తి

నేర్పు మెఱసి మాయ నిర్మించె మింటను
పేల్పుగములు చూచి పెఱఁగు పడఁగ.

8-337-వచనము

ఇట్లు దానవేంద్రుని మాయావిశేషవిధానంబున సురానీకంబులపైఁ బర్వతంబులు పడియె; దావాగ్ని దందహ్యమాన తరువర్షంబులు గురిసె సటంక శిఖర నికర శిలాసారంబులు గప్పె; మహోరగ దందశూకంబులు గఱచె; వృశ్చికంబులు మీటె; వరాహ వ్యాఘ్ర సింహంబులు గదిసి విదళింపన్ దొరఁకొనియె; వనగజంబులు మట్టిమల్లాడం జొచ్చె; శూలహస్తులు దిగంబరులునై రండు రండని బలురక్కసులు శతసహస్రసంఖ్యులు భేదనచ్ఛేదన భాషణంబు చేయం దొడంగిరి; వికృత వదనులు గదాదండధారులు నాలంబిత కేశభారులునై యనేక రాక్షస వీరులు "పోనీకు పోనీకుఁడు; తునుము తునుముం" డని వెనుతగిలిరి; పరుష గంభీర నిర్ఘాత సమేతంబులయిన జీమూత సంఘాతంబులు వాతాహతంబు లై యుప్పతిల్లి నిప్పుల కుప్పలు మంటల ప్రోవులుం గురిసె; మహాపవన విజృంభితంబైన కార్చిచ్చు ప్రళయానలంబు చందంబునం దరికొనియె; ప్రచండ ఝుంఝూనిల ప్రేరిత సముత్తుంగ తరంగావర్త భీషణంబయిన మహార్ణవంబు చెలియలి కట్ట దాఁటి వెల్లివిరిసిన ట్లమేయంబయి యుండె; నా సమయంబునం బ్రళయకాలంబునుం బోలె మిన్ను మన్నును రేయింబగలు నెఱుంగ రాదయ్యె; అయ్యవసరంబున.

8-338-కంద పద్యము

ఆ యసురేంద్రుని బహుతర
మాయాజాలంబులకును మా టెఱుఁగక వ

జ్రాయుధ ముఖరాదిత్యుల
పాయంబును బొంది చిక్కుపడిరి నరేంద్రా!

8-339-వచనము

అప్పుడు

8-340-కంద పద్యము

ఇయ్యసురుల చేఁ జిక్కితి
మెయ్యది దెరు? వెందుఁ జొత్తుఁ? మిటు పొలయఁ గదే
యయ్యా! దేవ! జనార్దన!
కుయ్యో! మొఱ్ఱో! యటంచుఁ గూయిడి రమరుల్

## 8-48- హరి అసురులశిక్షించుట

8-341-వచనము

అట్లు మొఱయిడు నవసరంబున.

8-342-మత్తేభ విక్రీడితము

విహగేంద్రాశ్వ నిరూఢుఁడై మణిరమా విభ్రాజితోరస్కుఁడై
బహుశస్త్రాస్త్ర రథాంగ సంకలితుఁడై భాస్వత్కిరీటాది దు
స్సహుఁడై నవ్యపిశంగచేల ధరుఁడై సంఫుల్లపద్మాక్షుఁడై
విహితాలంకృతితోడ మాధవుఁడు దా వేంచేసె నచ్చోటికిన్.

8-343-చంపకమాల

అసురుల మాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్
గసిబిసియై నిరర్థమయి గ్రక్కునఁ బోయెను; నిద్రబొంది సం

తసమున మేలుకొన్నగతిఁ దాల్చి చెలంగిరి వేల్పు లందఱుం;
బస చెడ కేలయుండు హరిపాద పరిష్కృతిచేయ నాపదల్?

8-344-వచనము

అయ్యెడ

8-345-ఆటవెలది

కాలనేమి ఘోర కంఠీరవము నెక్కి
తార్క్ష్య శిరము శూలధారఁ బొడువ
నతని పోటుముట్టు హరి గేల నంకించి
దానఁ జావఁ బొడిచె దైత్యవరుని.

8-346-కంద పద్యము

పదపడి మాలి సుమాలులు
బెదరించినఁ దలలుఁ ద్రుంచెఁ బృథు చక్రహతిన్;
గదఁగొని గరుడుని ఱెక్కలు
చెదరించిన మాల్యవంతు శిరమున్ ద్రెసెన్.

8-347-వచనము

ఇట్లు పరమపురుషుండగు హరి కరుణాపరత్వంబునం బ్రత్యుపలబ్ధ మనస్కులయిన వరుణ వాయు వాసవ ప్రముఖులు పూర్వంబున నెవ్వరెవ్వరితోఁ గయ్యంబు జేయుదురు, వారు వారలం దలపడి నొప్పించి; రయ్యవసరంబున.

8-348-కంద పద్యము

బాహుబలంబున నింద్రుఁడు
సాహసమున బలిని గెలువ సమకట్టి సము
త్సాహమున వజ్ర మెత్తిన
హాహానినదంబు జేసి రఖిల జనములున్.

8-349-వచనము

ఇట్లు సముద్యత భిదుర హస్తుండై యింద్రుండుఁ దన పురోభాగంబునం బరాక్రమించుచున్న విరోచననందను నుపలక్షించి యిట్లనియె.

8-350-మత్తేభ విక్రీడితము

జగతిన్ వైరి మొఱంగి గెల్చుటదియున్ శౌర్యంబె ధైర్యంబె? తా
మగవాఁడయ్యును దన్నుఁ దా నెఱిఁగి సామర్థ్యంబునుం గల్గియున్
బగవానిం గని డాఁగెనేని మెయి చూపం జాలఁడేనిం గటా!
నగరే బంధులు? దిట్టరే బుధులుఁ? గన్యల్ గూర్తురే? దానవా!

8-351-శార్దూల విక్రీడితము

మాయల్ చేయఁగ రాదు వో; నగవులే మాతోడి పోరాటముల్?
దాయా! చిక్కితి; ద్రక్కలించెదఁ గనద్దంభోళి ధారాహతిన్;
నీ యిష్టార్థము లెల్లఁ జూడుము వెసన్ నీ వారలం గూడుకో
నీ యాటోపము నిర్జరేంద్రుఁ డడఁచున్ నేఁడాజిలో దుర్మతీ!

8-352-వచనము

అని యుపాలంభించిన విని విరోచననందనుం డిట్లనియె.

8-353-శార్దూల విక్రీడితము

నీవే పోటరివే? సురేంద్ర! తెగడన్ నీకేల? గెల్పోటముల్
లేవే? యెవ్వరి పాలఁ బోయినవి? మేల్గీడుల్ విరించాదులుం
ద్రోవం జాలుదు రెవ్విధానమున సంతోషింప శోకింప నా
దైవం బేమి? కరస్థలామలకమే? దర్పోక్తులుం బాడియే?

8-354-ఆటవెలది

జయము లపజయములు సంపద లాపద
లనిల చలిత దీపికాంచలములు
చంద్రకళలు మేఘచయములు దరఁగలు
మెఱుఁగు లమరవర్య! మిట్టిపడకు.

8-355-వచనము

అని యి ట్లాక్షేపించి.

8-356-కంద పద్యము

వీరుఁడు దానవ నాథుఁడు
నారసముల నింద్రు మేన నాటించి మహా
ఘోరాయుధ కల్పములగు
శూరాలాపములు చెవులఁ జొనిపెన్ మరలన్.

8-357-వచనము

ఇట్లు తథ్యవాది యైన బలిచే నిరాకృతుండై

8-358-కంద పద్యము

శత్రువు నాక్షేపంబునఁ

దోత్త్రాహత గజము భంగిఁ ద్రుళ్ళుచు బలి నా
వృత్త్రారి వీచి వైచిన
గోత్త్రాకృతి నతఁడు నేలఁగూలె నరేంద్రా!

## 8-49- జంభాసురుని వృత్తాంతము

8-359-కంద పద్యము

చెలికాని పాటుఁ గనుఁగొని
బలి సఖుఁడగు జంభుఁ డతుల బాహాశక్తిం
జలితనము చాల నెఱపుచు
నిలునిలు మని వీఁకఁ దాఁకె నిర్జర నాథున్.

8-360-కంద పద్యము

పంచానన వాహనుఁడై
చంచద్గద జంభుఁ డెత్తి శైలారిని దాఁ
కించి సురేభంబును నొ
ప్పించి విజృంభించి యార్చిపేర్చెం గడిమిన్.

8-361-కంద పద్యము

వీఁక చెడి ఘనగదాహతిఁ
దోఁకయు గదలింపలేక దుస్సహపీడన్
మోఁకరిలఁ బడియె నేలను
సోఁ కోర్వక దిగ్గజంబు సుడిసుడి గొంచున్.

8-362-వచనము

అయ్యెడ

8-363-కంద పద్యము

సారథి వేయు హయంబుల

తే రాయిత పఱచి తేర దేవేంద్రుఁడు దా

నారోహించెను దైత్యుఁడు

దారత మాతలిని శూలధారం బొడిచెన్.

8-364-ఆటవెలది

శూల నిహతి నొంది స్రుక్కక యార్చిన

సూతు వెఱకు మంచు సురవిభుండు

వాని శిరముఁ దునిమె వజ్రఘాతంబున

దైత్య సేన లెల్ల దల్ల డిల్ల.

8-365-చంపకమాల

చని సురనాథుచేఁ గలన జంభుఁడు చచ్చుట నారదుండు చె

ప్పిన విని వాని భ్రాతలు గభీర బలాధికుఁ డా బలుండు పా

కనముచు లా పురందరునిఁ గాంచి ఖరోక్తులఁ దూలనాడుచున్

ఘనజలధారలన్ నగముఁ గప్పిన చాడ్పునఁ గప్పి రమ్ములన్.

8-366-సీస పద్యము

విబుధలోకేంద్రుని వేయుగుఱ్ఱంబుల;

నన్ని కోలల బలుఁ డదర నేసె

నిన్నూట మాతలి నిన్నూట రథమును;

నా రీతి నింద్రు ప్రత్యంగకమును
వేధించెఁ; బాకుండు వింట వాఁ డస్త్రంబు;
లేయుటఁ దొడుగుట యెఱుఁగరాదు;
కనక పుంఖంబుల కాండంబు లొక పది;
యేనింట నముచియు నేసి యార్చె;

8-366.1-ఆటవెలది

బలిమి నిట్లు ముగురు పగవాని రథ సూత
సహితు ముంచి రస్త్ర జాలములను
వనజలోక సఖుని వాన కాలంబున
మొగిలు గములు మునుఁగ మూఁగినట్లు.

8-367-వచనము

అయ్యవసరంబున.

8-368-మత్తేభ విక్రీడితము

అమరారాతుల బాణజాలముల పాలై పోయితే చెల్లరే!
యమరాధీశ్వర! యంచు ఖిన్నతరులై యంభోధిలోఁ జంచల
త్వమునం గ్రుంకు వణిగ్జనంబుల క్రియన్ దైత్యాధిపవ్యూహ మ
ధ్యమునం జిక్కిరి వేల్పు లందఱు విపద్ధ్వానంబులం జేయుచున్.

8-369-శార్దూల విక్రీడితము

ఓహో! దేవతలార! కుయ్యిడకుఁ; డే నున్నాఁడ 'నం చంబుభృ
ద్వ్యూహం బా శరబద్ధ పంజరము నంతం జించి తేజంబునన్

వాహోపేత రథంబుతోడ వెలికిన్ వచ్చెన్ నిశాంతోల్ల స
న్మాహాత్మ్యంబునఁ దూర్పునం బొడుచు నా మార్తాండు చందంబునన్.

8-370-వచనము

ఇట్లు వెలువడి.

8-371-చంపకమాల

విఱిగిన సేనఁ గాంచి సురవీరుఁ డొహో యని బిట్టు చీరి క్ర
మ్మఱఁ బురికొల్పి పాకబల మస్తకముల్ నిశితాస్త్రధారలన్
నెఱసిన తీక్ష్ణవజ్రమున నేలకు వ్రాల్చెను వాని చుట్టముల్
వెఱచిరి; తచ్చమూపతులు విహ్వలులై చెడి పాఱి రార్తితోన్.

## 8-50- నముచివృత్తాంతము

8-372-వచనము

అప్పుడు నముచి నిలువంబడి.

8-373-మత్తేభ విక్రీడితము

తన చుట్టంబులఁ జంపె వీఁడనుచు నుద్యత్క్రోధ శోకాత్ముఁడై
కనకాంతంబును నశ్మసారమయమున్ ఘంటాసమేతంబునై
జనదృగ్దుస్సహమైన శూలము నొగిన్ సారించి వైచెన్ సురేం
ద్రునిపై దీన హతుండవౌ దని మృగేంద్రుంబోలి గర్జించుచున్.

8-374-శార్దూల విక్రీడితము

ఆకాశంబున వచ్చు శూలమును జంభారాతి ఖండించి నా
నా కాండంబుల వాని కంఠము దెగన్ దంభోళియున్ వైచె న

స్తోకేంద్రాయుధమున్ సురారిగళముంద్రుంపంగ లేదయ్యె; వా
డాకంపింపక నిల్చె దేవవిభుఁ డత్యాశ్చర్యముం బొందఁగన్.

8-375-వచనము

ఇట్లు నిలిచి యున్న నముచిం గనుంగొని వజ్రంబు ప్రతిహతంబగుటకు శంకించి బలభేది దన మనంబున.

8-376-సీస పద్యము

కొండల ఱెక్కలు ఖండించి వైచుచోఁ;
 వజ్ర మెన్నఁడు నింత వాఁడి చెడదు;
వృత్రాసురాదుల విదళించుచో నిది;
 దిరుగ దెన్నఁడు పనిఁ దీర్చికాని;
యింద్రుండఁ గానొకో యేను దంభోళియుఁ;
 గాదొకో యిది ప్రయోగంబు చెడెనొ
దనుజాధముఁడు మొనతాఁకుఁ దప్పించెనో;
 భిదురంబు నేఁ డేల బెండుపడియె;

8-376.1-ఆటవెలది

ననుచు వజ్రి వగవ నార్ద్ర శుష్కంబులఁ
జావకుండఁ దపము సలిపె నీతఁ
డితర మెద్ది యైన నింద్ర! ప్రయోగింపు
మైళ మనుచు దివ్యవాణి పలికె.

8-377-వచనము

ఇట్లాదేశించిన దివ్యవాణి పలుకు లాకర్ణించి పురందరుండు.

8-378-ఆటవెలది

ఆత్మబుద్ధిఁ దలఁచి యార్ద్రంబు శుష్కంబు
గాని సాధనంబు ఫేన మనుచు
నది యమర్చి దాన నమరులు మెచ్చంగ
నముచి శిరముఁ ద్రుంచె నాకవిభుఁడు.

8-379-వచనము

అయ్యవసరంబున.

8-380-సీస పద్యము

పురుహూతు నగ్గించి పుష్పాంజలులు చేసి;
మునులు దీవించిరి ముదము తోడ;
గంధర్వముఖ్యులు ఘనులు విశ్వావసుఁ;
డును బరావసుఁడు నింపెనయఁ బాడి;
రమరాంగనాజను లాడిరి; దేవతా;
దుందుభులును మ్రోసె దురములోన;
వాయు వహ్ని కృతాంత వరుణాదులును బ్రతి;
ద్వంద్వుల గెల్చి రుద్దండ వృత్తి;

8-380.1-తేటగీతి

నల్ప మృగముల సింహంబు లట్ల తోలి
రమరవర్యులు దనుజుల నదటు వాయ

నజుఁడు పుత్తేర నారదుఁ డరుగుఁ దెంచె
దైత్యహరణంబు వారింప ధరణినాథ!

8-381-వచనము

వచ్చి సురలకు నారదుం డిట్లనియె.

8-382-శార్దూల విక్రీడితము

సిద్ధించెన్ సురలార! మీ కమృతమున్; శ్రీనాథ సంప్రాప్తులై
వృద్ధిం బొందితి రెల్ల వారలును; విద్వేషుల్ మృతిం బొంది; రీ
యుద్ధం బేటికి ?నింకఁ జాలుఁ; బనిలే దోహో పురే' యంచు సం
బద్ధాలాపము లాడి మాన్పె సురలం బాండవ్యవంశాగ్రణీ!

8-383-వచనము

ఇట్లు నారద వచన నియుక్తులై రాక్షసులతోడి సంగ్రామంబు చాలించి సకల దేవ ముఖ్యులును త్రివిష్టపంబునకుం జనిరి' హతశేషు లైన దైత్యదానవులు విషణ్ణుండైన బలిం దోడ్కొని పశ్చిమ శిఖిశిఖరంబుఁ జేరిరి; విధ్వంసమానకంధరులై వినష్టదేహులగు యామినీచరుల నెల్లను శుక్రుండు మృతసంజీవని యైన తన విద్య పెంపునం జేసి బ్రతికించె; బలియును భార్గవానుగ్రహంబున విగత శరీర వేదనుండై పరాజితుండయ్యును లోకతత్త్వ విచక్షణుం డగుటం జేసి దుఃఖింపక యుండె" నని చెప్పి రాజునకు శుకుం డిట్లనియె.

## 8-51- హరిహరసల్లాపాది

8-384-సీస పద్యము

కైలాసగిరి మీఁద ఖండేందు భూషణుం;
 డొకనాఁడు గొలువున నున్న వేళ
నంగన యై విష్ణుఁ డసురుల వంచించి;
 సురలకు నమృతంబు సూఱ లిడుట
విని దేవియును దాను వృషభేంద్ర గమనుఁడై;
 కడు వేడ్క భూత సంఘములు గొలువ
మధుసూదనుం డున్న మందిరంబున కేగి;
 పురుషోత్తమునిచేతఁ బూజ పడసి

8-384.1-తేటగీతి

తానుఁ గూర్చుండి పూజించె దనుజ వైరిఁ
గుశలమే మీకు మాకునుఁ గుశల మనుచు
మధురభాషల హరిమీఁద మైత్రి నెఱపి
హరుఁడు పద్మాక్షుఁజూచి యిట్లనియెఁ బ్రీతి.

8-385-సీస పద్యము

దేవ! జగన్మయ! దేవేశ! జగదీశ!;
 కాలజగద్వ్యాపకస్వరూప!
యఖిల భావములకు నాత్మయు హేతువు;
 నైన యీశ్వరుఁడ వాద్యంతములకు
మధ్యంబు బహియును మఱి లోపలయు లేక;
 పూర్ణమై యమృతమై భూరిసత్య
మానంద చిన్మాత్ర మవికార మాద్య మ;

నన్య మశోకంబు నగుణ మఖిల

8-385.1-తేటగీతి

సంభవస్థితిలయముల దంభకంబు
నైన బ్రహ్మంబు నీవ; నీ యంఘ్రియుగము
నుభయ సంగ విస్పృష్టులై యున్నమునులు
గోరి కైవల్యకాములై కొల్తు రెపుడు.

8-386-సీస పద్యము

భావించి కొందఱు బ్రహ్మంబు నీ వని;
తలపోసి కొందఱు ధర్మ మనియుఁ
జర్చించి కొందఱు సదసదీశ్వరుఁడని;
సరవిఁ గొందఱు శక్తి సహితుఁ డనియుఁ
జింతించి కొందఱు చిరతరుం డవ్యయుఁ;
డాత్మతంత్రుఁడు పరుం డధికుఁ డనియు
దొడరి యూహింతురు తుది నద్వయద్వయ;
సదసద్విశిష్ట సంశ్రయుఁడ వీవు;

8-386.1-తేటగీతి

తలఁప నొక్కింత వస్తుభేదంబుఁ గలదె
కంకణాదులు బసిఁడి యొక్కటియ కాదె?
కడలు పెక్కైన వార్ధి యొక్కటియ కాదె?
భేద మందును నిను వికల్పింప వలదు.

8-387-సీస పద్యము

యద్విలాసము మరీచ్యాదు లెఱుంగరు;
 నిత్యుఁడ నై యున్న నేను నెఱుఁగ
యన్మాయ నంధులై యమరాసురాదులు;
 వనరెద రఁట! యున్న వారలెంత?
యే రూపమునఁ బొంద కేపారుదువు నీవు;
 రూపిపై సకలంబు రూపుచేయ
రక్షింపఁ జెఱుపఁ గారణమైన సచరాచ;
 రాఖ్యమై విలసిల్లు దంబరమున

8-387.1-తేటగీతి

ననిలుఁ డే రీతి విహరించు నట్ల నీవు
గలసి వర్తింతు సర్వాత్మకత్వ మొప్ప;
జగములకు నెల్ల బంధమోక్షములు నీవ
నీవ సర్వంబుఁ దలపోయ నీరజాక్ష!

8-388-మత్తేభ విక్రీడితము

ఘనతన్ నీ మగపోఁడుముల్ పలుమఱుం గన్నారఁ గన్నార; మే
నిను విన్నారము చూడమెన్నఁడునుమున్ నీయాఁడుఁజందంబు మో
హినిపై దైత్యులఁ గన్నుఁ బ్రామి యమృతం బింద్రాది దేవాళి కి
చ్చిన నీ రూపముఁ జూపుమా; కుతుకముం జిత్తంబునం బుట్టెడిన్.

8-389-కంద పద్యము

మగవాఁడ వై జగంబులఁ

దగిలించి చిక్కులను బెట్టు దంటకు నీకున్
మగువ తనంబున జగములఁ
దగులము బొందింప నెంతదడవు ముకుందా!

8-390-వచనము

అని పలుకుచున్న శూలపాణిచే నపేక్షితుండై విష్ణుండు భావ గంభీరంబగు నవ్వు నివ్వటిల్ల న వ్వామదేవున కిట్లనియె.

8-391-శార్దూల విక్రీడితము

శ్రీకంఠా! నిను నీవ యేమఱకు మీ చిత్తంబు రంజించెదన్;
నాకద్వేషుల డాఁగురించుటకునై నాఁ డేను గైకొన్న కాం
తాకారంబు జగద్విమోహనము నీకై చూచెదేఁ జూపెదం;
గైకో నర్హము లండ్రు కాముకులు సంకల్పప్రభావంబులన్.

8-392-వచనము

అని పలికి కమలలోచనుం డంతర్హితుండయ్యె; అ య్యుమాసహితుండైన భవుండు విష్ణుఁ డెటు వోయెనో యెందుఁ జొచ్చెనో యని దశదిశలం గలయ నవలోకించుచుండం దన పురోభాగంబున.

## 8-52- జగనమోహిని కథ

8-393-సీస పద్యము

ఒక యెలదోటలో నొకవీథి నొకనీడ;
గుచకుంభముల మీఁదఁ గొంగుఁ దలఁగఁ
గబరికాబంధంబుఁ గంపింప నుదుటిపైఁ;

జికురజాలంబులు జిక్కుపడఁగ
ననుమానమై మధ్య మల్లాడఁ జెక్కులఁ;
గర్ణకుండల కాంతి గంతు లిడఁగ
నారోహభరమున నడుగులుఁ దడఁబడ;
దృగ్దీప్తి సంఘంబు దిశలఁ గప్ప

8-393.1-తేటగీతి

వామకరమున జాఱిన వలువఁ బట్టి
కనక నూపుర యుగళంబు గల్లనంగఁ
గంకణంబుల ఝుణఝుణత్కార మెసఁగ
బంతిచే నాడు ప్రాయంపుటింతిఁ గనియె.

8-394-వచనము

కని మున్ను మగువ మరగి సగమయిన మగవాఁ డమ్మగువ వయో రూప గుణ విలాసంబులు దన్ను నూరింపం గనుఱెప్ప వ్రేయక తప్పక చూచి మెత్తనయిన చిత్తంబున.

8-395-శార్దూల విక్రీడితము

ఈ కాంతాజనరత్న మెవ్వరిదొకో? యీ యాడురూపంబు ము
న్నే కల్పంబుల యందుఁ గాన; మజుఁ డీ యింతిన్ సృజింపంగఁ దా
లేకుం టెల్ల నిజంబు; వల్లభత నీ లీలావతిం జేరఁగా
నే కాంతుండుఁ గలండొ? క్రీడలకు నాకీ యింతి సిద్ధించునే?

8-396-వచనము

అని మఱియుం జెఱకువిలుతుని మెఱవడిఁ దరపిన నెఱబిరుదు వెఱంగుపడం దెఱవ దుఱిమికొనిన తుఱుము బిగిముడి వదలి కదలి భుజముల మెడల నొడల నదరి చెదరిన కురులు నొసలి మృగమద తిలకంపుటసలు మసల, విసవిస నగుమొగము మెఱుంగులు దశదిశలం బసలు కొలుపఁ, జిఱునగవు మెఱయ, నునుఁ జెమటం దడంబడి పులకరములు గులకరములు గొన, హృదయానందకంద పద్యము బగు కందుకంబు గరారవిందంబునం దమర్చి, యక్కునం జేర్చి, చెక్కున హత్తించి, చుబుకంబు మోపి, చూచుకంబులం గదియించి, నఖంబుల మీటుచు, మెల్లమెల్లన గెల్లాడు కరకమలంబులం గనక మణి వలయంబులు ఝుణఝుణ యనం గుచకలశంబు లొండొంటి నొరయ, నెడమఁ గుడిం దడంబడఁ గ్రమ్మన నెగురఁ జిమ్ముచు, నెగురఁ జిమ్మి తనకుఁదానె కొన్ని చిన్నపన్నిదంబులు చేసికొని బడుగు నడుము బెడఁకి వడవడ వడంక నఱితి సరులుఁ గలయంబడఁ దిరుగుచు, తిరుఁగు నెడఁ బెనఁకువలుగొనఁ జెవుల తొడవుల రుచులు గటముల నటనములు సలుపఁ బవిరి తిరిగి యొడియుచు, నొడిచి కెలంకులన్ జడియుచు, జడిసి జడను పడక వలువ నెలవు వదలి దిగంబడం, గటిస్థలంబునఁ గాంచీ కనకమణి కింకిణులు మొరయఁ జరణకటకమ్ములు గల్లుగల్లుమనం, గరకంకణమణి గణములు మెఱయ మితితప్పిన మోహాతిరేకం బుప్పొంగ వెనుకొని యుఱుకి పట్టుచుఁ, బట్టి పుడమిం బడవైచి, పాటు వెంటన మింటికెగసి గెంటక కరంబునం గరంబు దిరంబయి పలుమఱు నెగయ నడుచుచు, నెగయు నెడం దిగంబడు తఱిని నీలంపు మెఱుంగు నిగ్గుసోగ పగ్గంబుల వలలువైచి రాఁ దిగిచిన పగిది వెనుకొనంగ, విలోకన జాలంబులు నిగిడించుచు, మగిడించుచుఁ గరలాఘవంబున నొకటి, పది, నూఱు, వేయి చేసి నేర్పులు వాటించుచు, నరుణ చరణకమల రుచుల

నుదయ శిఖరి శిఖర తరణి కరణి చేయుచు, ముఖచంద్ర చంద్రికలఁ జంద్రమండలంబులు గావించుచు, నెడనెడ నురోజ దుర్గ నిర్గత చేలాంచలంబు జక్క నొత్తుచుం, గపోలఫల కాలోల ఘర్మ జలబిందు బృందంబుల నఖాంకురంబుల నోసరించుచు, అరుణాధరబింబఫల భ్రాంత సమాగత రాజకీరంబులం జోపుచు, ముఖసరోజ పరిమళాసక్త మత్తమధుపంబుల నివారించుచు, మందగమనాభ్యాస కుతూహలాయత్త మరాళ యుగ్మంబులకుం దలంగుచు, విలాస వీక్షణా నందిత మయూర మిథునంబులకు నెడగలుగుచుఁ, బొదఱిండ్ల యీఱములకుం బోక మలంగుచు, కరకిసలయాస్వాద కాముక కలకంఠ దంపతులకు దూరమగుచు, దీఁగ యుయ్యేలల నూగుఁచు, మాధవీ మండపంబు లెక్కుచుఁ, గుసుమరేణు పటలంబుల గుబ్బళ్ళు ప్రాకుచు మకరందస్యంద బిందుబృందంబు నుత్తరించుచుఁ, గృతక శైలం బుల నారోహించుచుఁ, బల్లవ పీఠంబులం బథిశ్రమంబు పుచ్చుచు, లతాసౌధభాగంబులఁ బొడచూపుచు, నున్నత కేతకీ స్తంభంబుల నొరగుచుఁ, బుష్పదళఖచిత వాతాయనంబులం దొంగిచూచుచుఁ, గమలకాండపాలికల నాలంబించుచుఁ, జంపక గేహాళీ మధ్యంబుల నిలువంబడుచుఁ, గదళికాపత్ర కవాటంబుల నుద్ఘాటించుచుఁ, బరాగ నిర్మిత సాలభంజికా నివహంబుల నాదరించుచు, మణికుట్టిమంబుల మురియుచుఁ, జంద్రకాంత వేదికల నొలయుచు, రత్నపంజర శారికానివహంబులకుం జదువులు చెప్పుచుఁ, గోరిన క్రియంజూచుచు చూచిన క్రియ మెచ్చుచు, మెచ్చిన క్రియ వెఱఁగుపడుచు, వెఱఁగుపడిన క్రియ మఱచుచు, మఱవక యేకాంతం బగు నవ్వనాంతం బున ననంత విభ్రమంబుల జగన్మోహినియై విహరించుచు నున్న సమయంబున.

8-397-ఆటవెలది

వాలుఁగంటి వాఁడి వాలారుఁజూపుల
శూలి ధైర్యమెల్లఁ గోలుపోయి
తఱలి యెఱుకలేక మఱచె గుణంబుల
నాలి మఱచె నిజగణాలి మఱచె.

8-398-వచనము

అప్పుడు

8-399-ఆటవెలది

ఎగురపైచి పట్ట నెడలేమి చే దప్పి
వ్రాలు బంతి గొనఁగ వచ్చునెడను
బడతి వలువ వీడి పడియె మారుతహతిఁ
జంద్రధరుని మనము సంచలింప.

8-400-మత్తేభ విక్రీడితము

రుచిరాపాంగిని వస్త్రబంధనపరన్ రోమాంచ విభ్రాజితం
గుచభారానమితం గరద్వయపుటీ గూఢీకృతాంగిం జల
త్కచ బంధం గని మన్మథాతురత నాకంపించి శంభుండు ల
జ్జ చలింపం దనకాంత చూడఁ గదిసెం జంద్రాస్య కేల్దమ్మికిన్.

8-401-ఆటవెలది

పదము చేరవచ్చు ఫాలకుఁ బొడగని
చీర వీడిపడిన సిగ్గుతోడ
మగువ నగుచుఁ దరుల మాటున డాఁగెను

వేల్పుఱేఁడు నబల వెంటఁ బడియె.

8-402-మత్తేభ విక్రీడితము

ప్రబలోద్యత్కరిణిం గరీంద్రుఁడు రమింపన్ వచ్చు లీలన్ శివుం
డబలా పోకుము పోకుమీ యనుచు డాయం బాఱి కెంగేలఁ ద
త్కబరీ బంధము పట్టి సంభ్రమముతోఁ గౌగిళ్ళ నోలార్చె నం
త బహిః ప్రక్రియ సెట్టకేనిఁ గదియం దద్బాహునిర్ముక్త యై.

8-403-సీస పద్యము

వీడి వెన్నాడు వేణీభరంబుతోఁ;
 జఘన భారాగత శ్రాంతితోడ
మాయావధూటి యై మరలిచుచుచుఁ బాఱు;
 విష్ణు నద్భుతకర్ము వెంటఁదగిలి
యీశాను మరల జయించె మరుం డనఁ;
 గరిణి వెన్కను కరి కరణిఁ దాల్చి
కొండలు నేఱులుఁ గోలఁకులు వనములు;
 దాఁటి శంభుఁడు చనం దన్మహాత్ము

8-403.1-తేటగీతి

నిర్మలామోఘ వీర్యంబు నేలమీఁదఁ
బడిన చోటెల్ల వెండియుఁ బైడి యయ్యె
ధరణి వీర్యంబు పడఁ దన్నుఁదా నెఱింగి
దేవ మాయా జడత్వంబు దెలిసె హరుఁడు.

8-404-కంద పద్యము

జగదాత్మకుఁడగు శంభుఁడు
మగిడెను హరి నెఱిఁగి తనదు మాహాత్మ్యమునన్
విగతత్రపుఁడై నిలిచెను
మగువతనం బుడిగి హరియు మగవాఁ డయ్యెన్.

8-405-ఆటవెలది

కాము గెలువవచ్చుఁ గాలారి గావచ్చు
మృత్యుజయముఁ గలిగి మెఱయవచ్చు
నాఁడువారి చూపుటంపఱ గెలువంగ
వశము గాదు త్రిపురవైరి కైన.

8-406-వచనము

ఇట్లు పురుషాకారంబు వహించిన హరి హరున కిట్లనియె.

8-407-సీస పద్యము

నిఖిలదేవోత్తమ! నీ వొక్కరుఁడు దక్క;
నెవ్వఁడు నా మాయ నెఱుఁగ నేర్చు?
మానిని యైన నా మాయచే మునుఁగక;
ధృతి మోహితుండవై తెలిసి తీవు
కాలరూపంబునఁ గాలంబుతోడ నా;
యందును నీ మాయ యధివసించు
నీ మాయ నన్ను జయింప నేరదు నిజ;
మకృతాత్ములకు నెల్ల ననుపలభ్య

8-407.1-తేటగీతి

మిపుడు నీ నిష్ఠ పెంపున నెఱిఁగి తనుచు
సత్కరించిన సఖ్యంబు చాల నెఱిపి
దక్షతనయ గణంబులుఁ దన్నుఁ గొలువ
భవుఁడు విచ్చేసెఁదగ నిజ భవనమునకు.

8-408-శార్దూల విక్రీడితము

పారావారము ద్రచ్చుచోఁ గిరి సముద్యద్భారమై కచ్ఛ పా
కారుండైన రమేశువర్తనము నాకర్ణింపఁ గీర్తింప సం
సారాంభోనిధిలోఁ మునుంగు కుజనుల్ సంశ్రేయముం బొంది వి
స్తారోదార సుఖంబుఁ జెందుదురు తథ్యం బెంతయున్ భూవరా!

8-409-మత్తేభ విక్రీడితము

ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషముం
జలితాపన్నులకున్ సురోత్తములకుం జక్కన్ విభాగించి ని
ర్మల రేఖన్ విలసిల్లు శ్రీవిభునిఁ దన్మాయావధూరూపముం
దలఁతున్ మ్రొక్కుదు నాత్మలోన దురితధ్వాంతార్క రూపంబుగన్.

8-410-వచనము

అని చెప్పి శుకుం డిట్లనియె.

## 8-53- 7వైవశ్వతమనువు చరిత్ర

8-411-తేటగీతి

నరవరాధీశ! యిప్పుడు నడచుచున్న

వాఁడు సప్తమ మనువు వైవస్వతుండు;
శ్రాద్ధదేవుం డనందగు జనవరేణ్య!
పదురు నందను లతనికిఁ బ్రకట బలులు.

8-412-వచనము

వారలిక్ష్వాకుండును, నభంగుండును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుండును, నాభాగుండును, దిష్టుండును, గరూశకుండును, బృషద్ధ్రుండును, వసుమంతుండును నను వారు పదుగురు రాజులు; పురందరుండను వాడింద్రుం; డాదిత్య మరుదశ్వి వసు రుద్ర సంజ్ఞలుఁ గలవారు దేవతలు; గౌతమ కశ్య పాత్రి విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ వసిష్ఠు లనువారు సప్తర్షులయి యున్నవారు; అందుఁ గశ్యపున కదితి గర్భంబున విష్ణుండు వామనరూపుండై జనియించి యింద్రావరజుం డయ్యె; ఇప్పు డేడు మన్వంతరంబులు చెప్పంబడియె; రాఁగల మన్వంతరంబులును శ్రీహరి పరాక్రమంబునుం జెప్పెద దత్తావధానుండవై విను" మని శుకుం డిట్లనియె.

## 8-54- 8సూర్యసావర్ణిమనువుచరిత్ర

8-413-సీస పద్యము

జననాథ సంజ్ఞయు ఛాయయు ననువారు;
గల రర్కునకు విశ్వకర్మతనయ
లిరువురు వల్లభ లిటమున్న చెప్పితిఁ;
బరఁగు దృతీయము బడబ యనఁగ
సంజ్ఞకు యముఁడును శ్రాద్ధదేవుండును;
యమునయుఁ బుట్టిరి హర్ష మెసఁగ;

ఛాయకుఁ దపతియు సావర్ణియును శనీ;
 శ్వరుఁడునుఁ గలిగిరి; సంవరణుఁడు

8-413.1-తేటగీతి

దపతి నాలిఁగఁ గైకొనెఁ దా వరించె;
యశ్వి యుగళంబు బడబకు నవతరించె;
వచ్చు నష్టమ వసువు సావర్ణి వాఁడు
తపము చేయుచునున్నాఁడు ధరణినాథ!

8-414-కంద పద్యము

ఒకపరి చూచిన వెండియు
నొకపరి చూడంగ లేకయుండు సిరులకై
యొక నొకని చేటు వేళకు
నొకఁ డొక్కఁడు మనువుఁ గాచి యుండు నరేంద్రా!

8-415-వచనము

సూర్యసావర్ణి మన్వంతరంబున నతని తనయులు నిర్మోహ విరజస్కాద్యులు రాజులును; సుతపోవిరజోమృత ప్రభు లనువారు దేవతలును గాఁగలరు; గాలవుండును, దీప్తిమంతుండును, బరశురాముండును, ద్రోణపుత్రుఁడగు నశ్వత్థామయుఁ, గృపుండును, మజ్జనకుం డగు బాదరాయణుండును, ఋష్యశృంగుండును సప్తర్షు లయ్యెదరు; వార లిప్పుడుఁ దమతమ యోగబలంబుల నిజాశ్రమ మండలంబులఁ జరియించుచున్నవారు; విరోచన నందనుం డగు బలి యింద్రుం డయ్యెడు" నని చెప్పి శుకుం డిట్లనియె.

8-416-సీస పద్యము

బలిమున్ను నాకంబు బలిమిమైఁ జేకొన్న;
వామనుండై హరి వచ్చి వేఁడఁ
బాదత్రయం బిచ్చి భగవన్నిబద్ధుఁడై;
సురమందిరము కంటె సుభగమైన
సుతల లోకంబున సుస్థితి నున్నాఁడు;
వెతలేక యట మీఁద వేదగుహికి
నా సరస్వతికిఁ దా నట సార్వభౌముండు;
నాఁ బ్రభువయి హరి నాకవిభునిఁ

8-416.1-ఆటవెలది

బదవిహీనుఁ జేసి బలిఁదెచ్చి నిలుపును;
బలియు నిర్జరేంద్రు పదము నొందు;
నింద్రపదము హరికి నిచ్చిన కతమున
దానఫలము చెడదు ధరణినాథ!

## 8-55- 9దక్షసావర్ణిమనువుచరిత్ర

8-417-వచనము

అట మీఁదటి కాలంబున వరుణ నందనుండగు దక్షసావర్ణి తొమ్మిదవ మను వయ్యెడు; నతని కొడుకులు ధృతకేతు, దీప్తకేతు, ప్రముఖులు రాజులును; బరమరీచి గర్గాదులు నిర్జరులును; నద్భుతుం డను వాఁడింద్రుండును; ద్యుతిమత్ప్రభృతులగు వారలు ఋషులును నయ్యెదరు; అందు.

8-418-ఆటవెలది

దనుజహరణుఁ డంబుధార కాయుష్మంతు
నకు జనించి రక్షణంబు చేయ
మూఁడు లోకములను మోదంబుతో నేలు
నద్భుతాఖ్య నొప్పు నమర విభుఁడు.

## 8-56- 1బ్రహ్మసావర్ణిమనువుచరిత్ర

8-419-వచనము

మఱియు నుపశ్లోక సుతుం డగు బ్రహ్మసావర్ణి దశమ మనువయ్యెడి; తత్పుత్రులు భూరిషేణాదులు భూపతులును; హవిష్మత్ప్రముఖులు మునులును; శంభుం డను వాఁ డింద్రుండును; విబుద్ధాద్యులు నిర్జరులును నయ్యెదరు; అందు.

8-420-ఆటవెలది

విశ్వసృజుని యింట విభుఁడు విషూచికి
సంభవించు నంశ సహితుఁ డగుచుఁ
జెలిమి శంభుతోడఁ జేయు విష్వక్సేనుఁ
డనఁగ జగముఁ గాచు నవనినాథ!

## 8-57- 11ధర్మసావర్ణిమనువుచరిత్ర

8-421-వచనము

మఱియుం దదాగమిష్యత్కాలంబున ధర్మసావర్ణి పదునొకండవ మనువయ్యెడి; మనుతనూజులు సత్యధర్మాదులు పదుండ్రు; ధరణీపతులును; విహంగమ కామగమన నిర్వాణరుచు లనువారు సురులును; వైధృతుఁడను వాఁ డింద్రుండును; నరుణాదులు ఋషులును నయ్యెదరు; అందు.

8-422-ఆటవెలది

అంబుజాత నేత్రుఁడా సూర్య సూనుఁడై
ధర్మసేతు వనఁగఁ దగ జనించి
వైభవాఢ్యుఁ డగుచు వైధృతుఁ డలరంగఁ
గరుణఁ ద్రిజగములనుఁ గావఁ గలఁడు.

## 8-58- 12భద్రసావర్ణిమనువుచరిత్ర

8-423-వచనము

మఱియుఁ దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పండ్రెండవ మను వయ్యెడి; నతని నందనులు దేవవ దుపదేవ దేవజ్యేష్ఠాదులు వసుధాధిపతులును; ఋతుధాముం డను వాఁ డింద్రుండును హరితాదులు వేల్పులునుఁ; దపోమూర్తి తపాగ్నీధ్ర కాదులు ఋషులును నయ్యెదరు; అందు.

8-424-ఆటవెలది

జలజలోచనుండు సత్యతపస్సూనృ
తలకు సంభవించుఁ దనయుఁ డగుచు
ధరణిఁ గాచు నంచితస్వధామాఖ్యుఁడై
మనువు సంతసింప మానవేంద్ర!

## 8-59- 13దేవసావర్ణిమనువుచరిత్ర

8-425-వచనము

మఱియుం దదేష్యత్కాలంబున నాత్మవంతుండగు దేవసావర్ణి పదుమూఁడవ మనువయ్యెడి; మనుకుమారులు చిత్రసేన విచిత్రాదులు జగతీనాయకులును;

సుకర్మ సుత్రామ సంజ్ఞలు గలవారు బృందారకులును; దివస్పతి యను వా డింద్రుండును; నిర్మోహ తత్త్వదర్శా ద్యులు ఋషులును నయ్యెదరు; అందు.

8-426-ఆటవెలది

ధరణి దేవహోత్ర దయితకు బృహతికి
యోగవిభుఁడు నాఁగ నుద్భవించి
వనజనేత్రుఁ డా దివస్పతి కెంతయు
సౌఖ్య మాచరించు జగతినాథ!

## 8-60- 14ఇంద్రసావర్ణిమనువుచరిత్ర

8-427-వచనము

మఱియు నట వచ్చు కాలంబున నింద్రసావర్ణి పదునాలవ మను వయ్యెడి; మను నందనులు గభీరవస్వాదులు రాజులును; బవిత్ర చాక్షుష లనువారు దేవగణంబులును; శుచి యనువాఁ డింద్రుండును; నగ్ని బాహు శుచి శుక్ర మాగధాదులు ఋషులును నయ్యెదరు; అందు.

8-428-తేటగీతి

తనర సత్రాయణునకు వితాన యందు
భవము నొందెడి హరి బృహద్భానుఁ డనఁగ
విస్తరించుం గ్రియాతంతు విసరములను
నాకవాసులు ముదమంద నరవరేణ్య!

8-429-కంద పద్యము

జగతీశ! త్రికాలములనుఁ

బొగడొందు మనుప్రకారములు చెప్పఁబడెం;
దగఁ బదునలువురు మనువులుఁ
దెగ యుగములు వేయు నడవ దివ మజున కగున్.

8-430-వచనము

అనినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె.

8-431-ఆటవెలది

ఈ పదంబులందు నీ మను ప్రముఖుల
నెవ్వఁ డునుచు? వార లేమి కతన
నధిక విభవులైరి? హరి యేల జనియించె?
నెఱుఁగఁ బలుకు నాకు నిద్ధచరిత!

8-432-వచనము

అనినం బారాశర్య కుమారుం డిట్లనియె.

8-433-సీస పద్యము

మనువులు మునులును మనుసుతు లింద్రులు;
నమరులు హరి యాజ్ఞ నడఁగువారు
యాజ్ఞాదు లందఱు హరిపౌరుషాకృతు;
లా మనువులు దత్ప్రహోయశక్తి
జగముల నడుపుదు రొగి నాల్గుయుగముల;
కడపటఁ గాల సంగ్రస్తమైన
నిగమచయంబును నిజతపోబలముల;

మరలఁ గాంతురు ఋషివరులు; దొంటి

8-433.1-తేటగీతి

పగిది ధర్మంబు నాలుగు పాదములను
గలిగి వర్తిల్లు; మనువులు గమల నేత్రు
నాజ్ఞఁ దిరుగుదు; రేలుదు రవని పతులు
జగతి భాగించి తమతమ సమయములను.

8-434-వచనము

మఱియుం బ్రాప్తులయిన వారల నింద్రపదంబులను, బహుప్రకారంబుల దేవపదంబులను, హరి ప్రతిష్ఠించుచుండు; వారలు విహిత కర్మంబుల జగత్త్రయంబునుం బరిపాలింతురు; లోకంబులు సువృష్టులై యుండు.

8-435-సీస పద్యము

యోగీశరూపుఁడై యోగంబుఁ జూపుచు;
మౌని రూపమునఁ గర్మంబుఁ దాల్చు
సర్గంబు చేయుఁ బ్రజాపతి రూపుఁడై;
యింద్రుఁడై దైత్యుల నేపడంచు
జ్ఞానంబు నెఱిఁగించుఁ జతుర సిద్ధాకృతిఁ;
గాలరూపమునఁ బాకంబు చేయు
నానావిధములైన నామరూపంబులఁ;
గర్మలోచనులకుఁ గానఁబడఁడు

8-435.1-ఆటవెలది

చనిన రూపములనుఁ జనురూపముల నింక
జనఁగనున్న రూపచయము నతఁడు
వివిధుఁడై యనేక వృత్తుల వెలిఁగించు
విష్ణుఁ డవ్యయుండు విమలచరిత!

8-436-వచనము

అనిన భూవరుం డిట్లనియె.

8-437-మత్తేభ విక్రీడితము

బలి నంభోరుహ నేత్రుఁ డేమిటికినై పాదత్రయిన్ వేఁడె? ని
శ్చలుఁడున్ బూర్ణుఁడు లబ్ధకాముఁడు రమా సంపన్నుఁడై తాఁ బర
స్థలికిన్ దీనునిమాడ్కి నేల చనియెం? దప్పేమియున్ లేక ని
ష్కలుషున్ బంధన మేల చేసెను? వినం గౌతూహలం బయ్యెడిన్.

## 8-61- బలియుద్ధయాత్ర

8-438-వచనము

అనిన శుకుం డిట్లనియె.

8-439-సీస పద్యము

పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే;
బలి యెట్టకేలకు బ్రతికి వారి
చిత్తంబురాఁ గొల్చి శిష్యుఁడై వర్తింప;
వారు నాతని భక్తి వలన మెచ్చి
విశ్వజిద్యాగంబు విధితోడఁ జేయింప;

భవ్యకాంచనపట్ట బద్ధ రథము
నర్క్యవాజులఁ బోలు హరులుఁ గంఠీరవ;
ధ్వజము మహాదివ్యధనువుఁ బూర్ణ

8-439.1-తేటగీతి

తూణయుగళంబుఁ గవచంబుఁ దొలుత హోమ
పావకుం డిచ్చె; నమ్లాన పద్మమాలఁ
గలుష హరుఁడగు తన తాత కరుణ నొసఁగె;
సోమ సంకాశ శంఖంబు శుక్రుఁ డిచ్చె.

8-440-వచనము

ఇవ్విధంబున

8-441-కంద పద్యము

పాణియు, రథియుఁ, గృపాణియుఁ,
దూణియు, ధన్వియును, స్రగ్వి తురగియు, దేహ
త్రాణియు, ధిక్కృత విమత
ప్రాణియు, మణి కనక వలయ పాణియు నగుచున్.

8-442-మత్తేభ విక్రీడితము

పలుదానంబుల విప్రులం దనిపి తద్భద్రోక్తులం బొంది పె
ద్దలకున్ మ్రొక్కి విశిష్టదేవతల నంతర్భక్తిఁ బూజించి ని
ర్మలుఁ బ్రహ్లాదునిఁ జీరి నమ్రశిరుఁడై రాజద్రథారూఢుఁడై
వెలిఁగెన్ దానవ భర్త శైల శిఖరోద్వేల్లద్దవాగ్నిప్రభన్.

8-443-కంద పద్యము

దండిత మృత్యు కృతాంతులు
ఖండిత సుర సిద్ధ సాధ్య గంధర్వాదుల్
పిండిత దిశు లమరాహిత
దండాధీశ్వరులు సములు దన్నుం గొలువన్.

8-444-కంద పద్యము

చూపుల గగనము మ్రింగుచు
నేపున దివి భువియు నాత లీతల చేయన్
రూపించుచు దనుజేంద్రుఁడు
ప్రాపించెను దివిజనగర పథము నరేంద్రా!

## 8-62- స్వర్గవర్ణనము

8-445-వచనము

ఇట్లు బలవంతుఁడగు బలి సురేంద్రుని సాధింప సమకట్టి దండ గమనంబులు జేసి, నిడుద పయనంబులం జనిచని.

8-446-మత్తేభ విక్రీడితము

కనియెం బుణ్యజనౌకమున్ విగతరోగస్స్వప్న పీడాన్న ఖా
దన సంశోకముఁ బుష్ప పల్లవ ఫలోద్దామద్రుమానీకమున్
స్వనితోద్ధూత పతాకముం బ్రవిచరద్వ్యైమానికానీకమున్
ఘన గంగాసలి లైకమున్ మఘవయుక్తశ్రీకమున్ నాకమున్.

8-447-వచనము

కని రక్కసులతోఁడు వెక్కసంబై చాల్పుగల వేల్పుల నెలవు దఱియం జొచ్చి, చెచ్చెర ముందటికిం జనిచని, ముందట నెడపడక మొన మోపి, యిగురుచు చిగురు తలిరాకు జొంపంబు ననమొగుడు మొగ్గ యరవిరి నెఱవిరి గుత్తి పిందె పూఁప దోరకాయ పండు గెలలతండంబుల ప్రేగు లాఁగలేక మూఁగి వీఁగి ప్రేఁకలగు మ్రాకుల ప్రోక లకుఁ బేఁట లగు పెందోఁటలును; దోఁటల గాటంబులై నివ్వటిల్లు మవ్వంపుఁ గ్రొవ్విరులకుఁ గవలువివ్వక కసిమసలు కలిగి ముసిరి కొసరి పూనిపోని తేనియ లాని విసరు గలిగి మసరు కవిసి క్రొవ్వి రిమ్మ గొని జుమ్ము జుమ్మనుచు జంజాటించు తేఁటి దాటులును; దాఁటు పడక నాఁటుకొని పూవిడుచు కూడి జోడువీడక క్రోమ్మావుల కమ్మని కొమ్మల నిమ్ముల ముసరి పసిమి గల కిసలయమ్ములు వొసగంగ మెసంగి కిసరుపడక కసరుచెడి బిట్టు రట్టడితనంబు లలమి మించి కరాళించు కోయిలల మొత్తంబులును; మొత్తంబులయి చిత్తంబుల మత్తంబులుగఁ దత్తఱంబున దియ్యని పండ్లకుఁ గయ్యంబులు చేసి చయ్యన నేసరేఁగి బేసంబులు గాసంబులుగొని వాసికెక్కి పలుబాస లాడుచు బహుప్రకారంబులగు కీరంబులునుఁ; గీరంబులకు సరిఁగడచి మింటనంట నెగసి పెట్టలం బట్టి చీరి యిట్టట్టు చనక నెట్టుకొని నెలవుల వ్రాలుచు నింపుగల రవమ్ములుఁ గలుఁగు కలరవమ్ములును గలరవమ్ము లలరం దొలంకుల కొలంకుల కెలంకులఁ గడంకల బ్రియల నిడుకొని క్రమ్మిదొమ్మిచేసి యెలదమ్మి తూఁడులవాఁడు లగు చంచువులం జించి మెక్కి చొక్కి మిక్కలి కలఁకలం బడుచు నలబలంబులు చేయు కలహంసంబులును; హంసరుచి జనిత వికసనముల వికవిక నగుచుం బసఁగలిగి మిసమిస మెఱచు పసిఁడి కెందమ్ము లిందిరా మందిరమ్ముల చందమ్ములుగ నందమ్ములగు కొలంకులును; కొలంకుల కరళ్ళఁ దడిసి వడవడ వడంకుచు నల్లిబిల్లులుగొని సాఁగిన తీగెయిండ్ల గండ్ల

యూఱములం దోరములుచెడి పలువిరుల కమ్మ వలపుల ప్రేఁగునం దూఱలేక యూడిగలంబడు గాడ్పులును, గాడ్పుల వలన నెగసి గగనమున విరిసి పలువన్నెలం జెనగు మేలుకట్టుఁ బుట్టంబుల తెఱంగున దట్టంబులయిన కుసుమ పరాగంబులును; బరాగంబుల సరాంగంబులగు వాఁగు వ్రంతల చెంతల గుంపులుగొని గఱికి జొంపంబుల లంపులు దిని మంపులుగొని పెల్లు నెమర్లుపెట్టుచు నొదుఁగుల పొదుగులు గదల వాడల వాడల జాడలం బరుగులిడు దూడల క్రీడల వేడుకలం గూడుకొని యిండ్ల వాకిండ్లకుం జేరి పౌరుల కోరికల కనుసారికలగుచు నమృతం బుఁగురియు కామధేనువులునుఁ; గామధేనువులకు నిలువ నీడ లగుచు నడిగిన జనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగఁ బుడుకు కల్పతరువులును; కల్పతరువుల పల్లవ మంజరులఁ గుంజరులకు విఱిచి యిచ్చుచు మచ్చికల కలిమి నిచ్చమెచ్చుచు గృతక గిరుల చఱుల సిరుల నడరు పడఁతుల నడకలకు గురువులగుచు మెఱయు మురువుల నొత్తరించు మత్తేభంబులును, నిభంబుల సరస నొరసికొని వరుసఁ బరుసఁదనములెడలి సుకరములగు మకరతోరణ స్తంభంబులును; తోరణస్తంభంబుల చేరువ నిలిచి చెఱకువిలుతుం డొఱపెఱికిన బెడిదము లగు నవకంపు మెఱుఁగుం జిగురు టడి దముల తెఱంగున నిలుకడ సంపదలు గలుగు శంపల నొంపునం గరచరణాది శాఖలుగల చంద్రరేఖల పోఁడిమిని వాహిని గల మోహినీ విద్యల గ్రద్దనఁ జూపులకుం దీపు లొదవించుచు మర్మకర్మంబు వశంబు లరయు యశంబులు గలిగి యనూనంబులగు విమానంబు లెక్కి చచ్చివచ్చిన సచ్చరిత్రులకుం జెచ్చెర నెదురు చని తూకొని తోడ్కొని పోవు రంభాది కుంభికుంభకుచల కలకలంబులును; గల హంస కారండవ కోక సారసబృంద సుందర సుందరియు; నిందీవరార విందనందదిందిందిరయు; నభంగయు సభంగయునగు గంగ నింగి

కిం బొంగెనో యని మిగుల దిగులుపడఁ బొగడ్తల కెక్కిన యగడ్తలును నగడ్తల మిన్నేటి తేటనీట నీటులీను పాటి సూటిచల్లులాటల మేటి కూటువలు గొనుచు నేచిన ఖేచర కన్యకావారంబులును; వారవనితా సుపూజిత విరాజిత దేహళీ పాటవంబు లగు గోపుర కనక కవాటంబులును; గవాట వేదికాఘటిత మణిగణ కిరణోదారంబులగు నింద్రనీల స్తంభ గంభీరతలును; గంభీర విమల కమలరాగ పాలికా వారంబులగు చతుర్ద్వారంబులును; ద్వారదేశంబుల చావిళ్ళం గావళ్ళుండి ప్రొద్దు పోక పెద్ద రక్కసుల వేల్పుల కయ్యంబులు నెయ్యంబులం జెప్పికొనుచున్న యస్త్ర శస్త్ర ధారులు శూరులు నయిన మహాద్వార పాలక వీరులును; వీర రస జలధి వేలోదారంబులయి శుద్ధస్ఫటిక బద్ధ మహోత్తానంబులగు సోపాన సుభగాకారంబులును; సుభగాకార ప్రదీపంబు లగు వజ్ర మహారజిత వప్రంబులును; వ ప్రోపరి వజ్ర కుడ్య శిరోభాగ చంద్రకాంత తరుణ హిమకరకిరణ ముఖరంబులగు సాలశిఖరంబులును, శిఖర స్తోమధామ నికృత్త తారకంబులును, దార తార మణి శిలా కఠోరంబులగుచు మిగుల గరిత యగు నగరిసిరి మీఱ నమరు మొగులు పొడగని నిలుకడలకు నలువ నడిగికొని పడసిన పసిఁడి తెరల వలువల బెడంగునం దోరంబులగు ప్రాకారం బులునుఁ; బ్రాకార కాంచనాంచిత యుద్ధసన్నద్ధ మహాఖర్వ గంధర్వ వాహినీ పాలకంబులగు మరక తాట్టాలకంబులును; నట్టాలకోత్తుంగ వజ్రమయ స్తంభోదంచనంబులునుఁ; బరభట ప్రాణ వంచనంబులు సముదంచనంబులు నగు దంచనంబులును; దంచనంబుల తుదలు రథంబుల యిరుసులు నొరసికొనం, గోట యీవలి యావలి తివియని దివియల కరణి రుచిరము లగుచుఁ బచరించు నహిమకర హిమ కర మండలంబులును; హిమకర మండలంబు నిద్దంపు టద్దంబని మూఁగి తొంగి చూచుచు నలిక ఫలకంబులఁ గులకములుఁగొను నలకములం దరపి

తిలకములం దెఱంగు పఱచుకొను సమయ ముల వెనుక నొదిఁగి కదిసి
ముకురంబులం బ్రతిఫలితులైన పతు లితర సతుల రతుల కనుమతులని
కనుకనిన్ మరలి నీడ తలం గినఁ గలంగి చని కాంతులు వొలయ నలయు
ముగుదలకు నేకాం తంబులై గగన సముత్సేధంబు లైన రాజ సౌధంబులును;
సౌధం బుల సీమల ముత్తియంపు సరుల తోడి నిబ్బరపు గుబ్బచన్నులకు
చెన్నులం బ్రక్కలం జుక్కలపదవులుండ మండిత సౌధశిఖరంబుల
శృంగారంబులయిన భృంగారంబులును; భృంగారశయన జాలక డోలికా నిశ్రేణికాది
విశేష రమ్యంబులయిన హర్మ్యంబులును; హర్మ్య కనక గవాక్షరంధ్ర నిర్గత
కర్పూర కుంకుమాగరు ధూపధూమంబు లును; ధూమంబులు జీమూత
స్తోమంబులని ప్రేమంబు లుబ్బ గొబ్బునం డబ్బాటు పబ్బంబు లబ్బె నని
మరులుఁగొని పురుల వన్ని యల సిరులు సరులు గొనం గుట విటపములఁ
దటపెట నటించుచుఁ బలుకులు విరిసి కికురువొడుచు వలఁతేని మఱుపుఁ
జదువుల టీక లనం గేక లిడు నెమిళ్ళును; నెమిళ్ళ పురుల నారలు నారులగు
రతనంపు విండ్ల నినదములను తలంపులం దోఁకలు జడిసి వీఁకలు మెఱసి
మూఁకలుఁగొని దివికెగిరి రవికిం గవిసిన రాహువు క్రియం దివిఁ దడంబడు
పడగలును; బడగలును గొడుగులును దమకునాలం బులకు
నడియాలంబులుగఁ దోరంబులైన సారంబుల బీరంబులు మెఱసి బెబ్బులుల
గబ్బునం గరుల సిరుల సింగంబుల భంగుల శరభంబుల రభసంబుల ధూమ
కేతువుల రీతుల వైరిం జీరికిం గొనక శంకలుడిగి అంకె లిడుచు లంకెలై లెక్కకు
మిక్కలి యగుచు రక్కసుల చక్కటి యెక్కటి కయ్యముల డయ్యము లెఱుంగం
దిరుగు వీరభటకదంబులును; గదంబ కరవాల శూలాదుల మెఱుం గులు
మెఱపుల తెఱంగులం దిశల చెఱంగులం దుఱంగలింప నేమి నినదంబులు

దరములగు నుఱుములుగ నడ మొగిళ్ళ పెల్లునం బ్రవర్షిత రథిక మనోరథంబు లగు రథంబుల గములును; గములుఁ గొని గమన వేగంబు వలన హరిహరుల నగి గాలిం జాలింబడం గేలికొని ఘనంబులగు మనంబులం దెగడి నెగడు సురంగంబు లగు తురంగంబులును; రంగదుత్తుంగ విశద మదకల కరటి కటతట జనిత మదసలిల కణగణ విగళిత దశశతనయన భుజ సరళ మిళిత లలిత నిఖిలదిగధిపతి శుభకర కరకనక కటకఘటిత మణి సముదయ సముదిత రేణువర్గదుర్గమంబు లయిన నిర్వక్ర మార్గం బులును; మార్గస్థలోపరిగతాగత శతశతాయతానేక గణనాతీత రోహణాచలతట విరాజమానంబులగు విమానంబులును; విమాన విహరమాణ సుందర సుందరీ సందోహ సంవాదిత భూరిభేరీ వీణా పణవ మృదంగ కాహళ శంఖాది వాదనా నూన గాన సాహిత్య నృత్య విశేషంబులును; విశేషరత్నసంఘటిత శృంగార శృంగాటక వాటికా దేహ దేహళీ ప్రదీపంబులును, దీపాయమాన మానిత సభామం డప ఖచిత రుచిర చింతారత్నంబులునుం, గలిగి రత్నాకరంబునుం బోలె ననిమిష కౌశిక వాహినీ విశ్రుతంబయి, శ్రుతివాక్యంబునుంబోలె నకల్మష సువర్ణ ప్రభూతంబయి భూతపతి కంఠంబునుం బోలె భోగిరాజకాంతంబయి, కాంతాకుచంబునుం బోలె సువృత్తం బయి, వృత్తజాతంబునుంబోలె సదా గురులఘు నియమాభిరామం బయి, రామచంద్రుని తేజంబునుం బోలె ఖరదూషణాది దోషాచరా నుపలబ్ధంబయి, లబ్ధవర్ణుచరిత్రంబునుం బోలె విమలాంతరంగ ద్యోత మానం బయి మానధనుని నడవడియునుం బోలె సన్మార్గ భాతి సుందరం బయి సుందరోద్యానంబునుం బోలె రంభాంచితాశోక పున్నాగంబయి, పున్నాగంబునుం బోలె సురభిసుమనోవిశేషం బయి, శేషాహి మస్తకంబునుంబోలె నున్నత క్షమా విశారదంబయి, శారద సముదయంబునుంబోలె ధవళ జీమూత ప్రకాశితంబయి,

సితేతర రాజిన దానంబునుం బోలె సరస తిలోత్తమంబయి, యుత్తమ పురుష వచనంబునుం బోలె ననేక సుధారస ప్రవర్షంబై, వర్షాదియు నుంబోలె నుల్లసదింద్ర గోపంబయి, గోపతి మూఃపురంబునుంబోలె విచక్షురార్యాలంకృతంబై, కృతార్థం బయిన యమరావతీ నామ నగరంబు చేరం జని కోటచుట్టునుం బట్టు గలుగ బలంబులఁ జలంబున విడియం బంచి పొంచి మార్గంబు లెల్ల నరికట్టుకొని యేమఱక యుండెను; అంత.

8-448-కంద పద్యము

మాయరు నగవులకును గను
మూయరు కాలంబు కతన ముదియరు ఖలులన్
డాయరు పుణ్యజనంబుల
బాయరు సురరాజ వీటి ప్రమదాజనముల్.

## 8-63- దుర్భరదానవప్రతాపము

8-449-వచనము

అప్పుడు

8-450-కంద పద్యము

దుర్భర దానవ శంఖా
విర్భూతధ్వనులు నిండి విబుధేంద్రవధూ
గర్భములు పగిలి లోపలి
యర్భకతతు లావు రనుచు నాక్రోశించెన్.

8-451-వచనము

అంత

8-452-సీస పద్యము

బలి వచ్చి విడియుట బలభేది వీక్షించి;
 గట్టిగాఁ గోటకుఁ గాపు పెట్టి
దేవవీరులుఁ దాను దేవతామంత్రిని;
 రప్పించి సురవైరి రాకఁ జెప్పి
ప్రళయానలుని భంగి భాసిల్లుచున్నాఁడు;
 ఘోరరాక్షసులను గూడినాఁడు
మన కోడి చని నేఁడు మరల వీఁ డేతెంచె;
 నే తపంబున వీని కింత వచ్చె?

8-452.1-ఆటవెలది

నీ దురాత్మకునకు నెవ్వఁడు దోడయ్యె?
నింక వీని గెల్వ నేది త్రోవ?
యేమి చేయువార? మెక్కడి మగఁటిమి?
నెదురు మోహరింప నెవ్వఁ డోపు?

8-453-కంద పద్యము

మ్రింగెడు నాకాశంబునుఁ
బొంగెడు నమరాద్రి కంటెఁ బొడపై వీఁడున్
మ్రింగెడుఁ గాలాంతకు క్రియ
భంగించును మరలఁ బడ్డ బంకజగర్భున్.

8-454-కంద పద్యము

ఈరాదు రాజ్య మెల్లనుఁ

బోరాదు రణంబు చేయఁ బోయితి మేనిన్

రారాదు దనుజచేతను

జారా దిట మీఁద నేమిజాడ మహాత్మా!

## 8-64- బృహస్పతిమంత్రాంగము

8-455-వచనము

అనిన సురరాజునకు సురాచార్యుం డిట్లనియె.

8-456-సీస పద్యము

వినవయ్య దేవేంద్ర వీనికి సంపద;

బ్రహ్మవాదులు భృగుప్రవరు లర్థి

నిచ్చిరి; రాక్షసు నెదురను నిలువంగ;

హరి యూశ్వరుఁడు దక్క నన్యజనులు

నీవును నీ సముల్ నీకంటె నధికులుఁ;

జాలరు; రాజ్యంబు చాలు; నీకు

విడిచి పోవుట నీతి విబుధనివాసంబు;

విమతులు నలఁగెడువేళ చూచి

8-456.1-తేటగీతి

మరలి మఱునాఁడు వచ్చుట మా మతంబు;

విప్రబలమున వీనికి వృద్ధివచ్చె

వారిఁ గైకొన కిటమీఁద వాఁడి చెడును;

దలఁగు మందాక రిపుఁ బేరు దలఁపరాదు.

8-457-కంద పద్యము

పరు గెలువ వలయు నొండెను
సరిపోరగ వలయు నొండె జా వలె నొండెన్
సరి గెలుపు మృతియు దొరకమి
సరసంబుగ మున్న తొలఁగి చనవలె నొండెన్.

8-458-వచనము

అనినఁ గార్యకాల ప్రదర్శి యగు బృహస్పతి వచనంబులు విని కామరూపులై దివిజులు త్రివిష్టపంబు విడిచి తమతమ పొందుపట్లకుం జనిరి; బలియునుం బ్రతిభట వివర్జిత యగు దేవధాని నధిష్ఠించి జగత్త్రయంబునుం దన వశంబు జేసికొని విశ్వవిజయుండై పెద్ద కాలంబు రాజ్యంబు జేయుచుండె, శిష్యవత్సలులగు భృగ్వాదు లతని చేత శతాశ్వమేధంబులు చేయించిరి; తత్కాలంబున.

8-459-శార్దూల విక్రీడితము

అర్థుల్ వేఁడరు; దాతలుంజెడరు; సర్వారంభముల్ పండుఁ; బ్ర
త్యర్థుల్ లేరు; మహోత్సవంబులను దేవాగారముల్ పొల్చుఁ; బూ
ర్ణార్థుల్ విప్రులు; వర్షముల్ గురియుఁ గాలార్హంబులై; ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్.

## 8-65- దితికశ్యపులసంభాషణ

8-460-వచనము

అంత

8-461-సీస పద్యము

తన తనూజుఁబ్రోలు దనుజులు గొనుటయు;
 వేల్పు లెల్లను డాఁగ వెడలుటయును
భావించి సురమాత పరితాపమునఁ బొంది;
 వగ ననాథాకృతి వనరుచుండ
నా యమ్మ పెనిమిటి యగు కశ్యపబ్రహ్మ;
 మఱి యొకనాఁడు సమాధి మాని
తన కుటుంబిని యున్న ధామమునకు నేగి;
 నాతిచే విహితార్చనములు పడసి

8-461.1-ఆటవెలది

వంది వ్రాలి కుంది వాడిన యిల్లాలి
వదనవారిజంబు వడువుఁ జూచి
చేరఁ దిగిచి మగువ చిబుకంబు పుడుకుచు
వారిజాక్షి యేల వగచె దనుచు.

8-462-వచనము

ఆ మహాత్ముం డిట్లనియె.

8-463-మత్తేభ విక్రీడితము

తెఱవా! విప్రులు పూర్ణులే? చెలగునే దేవార్చనాచారముల్?
తఱితో వేలుతురే గృహస్థులు? సుతుల్ ధర్మానుసంధానులే?

నెఱి నభ్యాగత కోటి కన్న మిడుదే? నీరంబునుం బోయుదే?
మఱి లే కర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే? పైదలీ!

8-464-ఆటవెలది

అన్నమైనఁ దక్రమైనఁ దోయంబైన
శాకమైన దనకుఁ జరగు కొలఁది
నతిథి జనుల కడ్డ మాడక యిడరేని
లేము! వారు కలిగి లేనివారు.

8-465-వచనము

మఱియు

8-466-ఆటవెలది

నెలఁత! విష్ణునకును నిఖిలదేవాత్మున
కాననంబు శిఖియు నవనిసురులు;
వారు దనియఁ దనియు వనజాతలోచనుం
డతఁడుఁ దనియ జగము లన్నిఁ దనియు.

8-467-కంద పద్యము

బిడ్డలు వెఱతురె నీకఱ
గొడ్డంబులు జేయ కెల్ల కోడండ్రును మా
టొడ్డారింపక నడతురె
యొడ్డము గాకున్నదే మృగేక్షణ! యింటన్.

8-468-వచనము

అని పలికినం బతికి సతి యి ట్లనియె.

8-469-ఉత్పలమాల

ప్రేమ యొకింత లేక దితి బిడ్డలు బిడ్డలబిడ్డలున్ మహా
భీమ బలాఢ్యులై తనదుబిడ్డల నందఱఁ దోలి సాహసా
క్రామిత వైరులయ్యు నమరావతి నేలుచు నున్నవారు; నీ
కే మని విన్నవింతు? హృదయేశ్వర! మేలుఁ దలంచి చూడవే?

8-470-కంద పద్యము

అక్కా చెల్లెండ్రయ్యును
దక్కరు నాతోడి పోరుఁ; దానున్ దితియున్
రక్కసులు సురల మొత్తఁగ
నక్కట! వల దనదు చూచు నౌనౌ ననుచున్.

8-471-సీస పద్యము

ఎండకన్నెఱుగని యింద్రుని యిల్లాలు;
పలుపంచలను జాలిఁ బడియె నేఁడు
త్రిభువన సామ్రాజ్య విభవంబుఁ గోల్పోయి;
దేవేంద్రుఁ డడవులఁ దిరిఁగె నేఁడు
కలిమి గారాబు బిడ్డలు జయంతాదులు;
శబరార్భకుల వెంటఁ జనిరి నేఁడు
నమరుల కాధారమగు నమరావతి;
యసురుల కాటపట్టయ్యె నేఁడు

8-471.1-ఆటవెలది

బలి జగముల నెల్ల బలియుచు నున్నాఁడు
వాని గెలువరాదు వాసవునకు
యాగభాగమెల్ల నతఁ డాహరించుచుఁ
గడఁగి సురల కొక్క కడియుఁ నీఁడు.

8-472-కంద పద్యము

ప్రజలకు నెల్లను సముఁడవు
ప్రజలను గడుపారఁ గన్న బ్రహ్మవు నయ్యుం
బ్రజలందు దుష్టమతులను
నిజముగ శిక్షింప వలదె నీవు? మహాత్మా!

8-473-మత్తేభ విక్రీడితము

సురలన్ సభ్యుల నార్తులన్ విరథులన్ శోకంబు వారించి ని
ర్జరధానిన్ నిలుపంగ రాత్రిచరులన్ శాసింప సత్కార్య మే
పెర వేరీతి ఘటిల్లు నట్టి క్రమమున్ వేగంబ చింతింపవే?
కరుణాలోక సుధారుఁరిం దనుపవే? కళ్యాణ సంధాయకా!

8-474-వచనము

అనిన మనోవల్లభ పలుకు లాకర్ణించి ముహూర్తమాత్రంబు చింతించి విజ్ఞానదృష్టి నవలంబించి భావికాల కార్యంబు విచారించి కశ్యప బ్రహ్మ యిట్లనియె.

8-475-మత్తేభ విక్రీడితము

జనకుం డెవ్వడు? జాతుఁ డెవ్వఁడు? జనిస్థానంబు లెచ్చోటు? సం

జననం బెయ్యది? మేను లేకొలఁదిఁ? సంసారంబు లేరూపముల్?
వినుమా యింతయు విష్ణుమాయ దలఁపన్వేఱేమియున్ లేదు; మో
హ నిబంధంబు నిదాన మింతటికి జాయా! విన్నఁబో నేటికిన్?

## 8-66- పయోభక్షణవ్రతము

8-476-వచనము

అగున యిననుం గాలోచిత కార్యంబు చెప్పెద.

8-477-మత్తేభ విక్రీడితము

భగవంతుం బరముం జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరి సేవజేయు మతఁడున్ సంతుష్టనిం బొంది నీ
కగు నిష్టార్థము లెల్ల నిచ్చు; నిఖిలార్థావాప్తి చేకూరెడిన్
భగవత్సేవలఁ బొందరాదె బహుసౌభాగ్యంబులం బ్రేయసీ!

8-478-వచనము

అనిన గృహస్థునకు గృహిణి యిట్లనియె.

8-479-కంద పద్యము

నారాయణుఁ బరమేశ్వరు
నేరీతిఁ దలంతు? మంత్ర మెయ్యది? విహితా
చారంబు లే ప్రకారము?
లారాధన కాల మెద్ది? యానతి యీవే.

8-480-వచనము

అనినఁ గశ్యప ప్రజాపతి సతికిఁ బయోభక్షణంబను వ్రతంబుపదేశించి తాత్కాలంబునుఁ, దన్మంత్రంబును, దద్విధానంబును, దదుపవాస దాన భోజన ప్రకారంబులును నెఱింగించెను. అదితియును ఫాల్గుణ మాసంబున శుక్లపక్షంబునఁ బ్రథమదివసంబునన్ దొరకొని పండ్రెండు దినంబులు హరి సమర్పణంబుగా వ్రతంబు జేసి వ్రతాంతంబున నియత యై యున్న యెడఁ జతుర్బాహుండునుఁ బీతవాసుండును శంఖ చక్ర గదాధరుండునునై, నేత్రంబుల కగోచరుండైన నారాయణదేవుండు ప్రత్యక్షంబైనం గనుంగొని.

8-481-కంద పద్యము

కన్నుల సంతోషాశ్రులు
చన్నులపైఁ బఱవఁ బులక జాలము లెసగన్
సన్నతులును సన్నుతులును
నున్నత రుచిఁ జేసి నిటల యుక్తాంజలియై.

8-482-కంద పద్యము

చూపుల శ్రీపతి రూపము
నాపోవక త్రావి త్రావి హర్షోద్ధతయై
వాపుచ్చి మంద మధురా
లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్.

8-483-సీస పద్యము

యజ్ఞేశ! విశ్వంభరాచ్యుత! శ్రవణ మం;
గళనామధేయ! లోకస్వరూప!
యాపన్న భక్త జనార్తి విఖండన!;

దీనలోకాధార! తీర్థపాద!
విశ్వోద్భవస్థితి విలయకారణభూత!;
సంతతానంద! శశ్వద్విలాస!
యాయువు దేహంబు ననుపమ లక్ష్మియు;
వసుధయు దివముఁ ద్రివర్గములును

8-483.1-తేటగీతి

వైదికజ్ఞాన యుక్తియు వైరిజయము
నిన్నుఁ గొలువని నరులకు నెఱయఁ గలదె
వినుతమందార! గుణహార! వేదసార!
ప్రణత వత్సల! పద్మాక్ష! పరమపురుష!

8-484-ఆటవెలది

అసురవరులు సురల నదలించి బెదరించి
నాక మేలుచున్న నాఁట నుండి
కన్న కడుపుఁ గాన కంటఁ గూరుకు రాదు
కడుపుఁబొక్కు మాన్పి కావవయ్య.

8-485-వచనము

అనిన విని దరహాసితవదనుండయి యాశ్రితకామధేనువైన యప్పరమేశ్వరుం
డిట్లనియె.

8-486-శార్దూల విక్రీడితము

నీ కోడండ్రును, నీ కుమారవరులున్, నీ నాథుఁడున్, నీవు సం

శోకింపన్ సతులుం బతుల్ మిగుల సమ్మోదింప రాత్రించరుల్
శోకింపన్, భవదీయ గర్భమునఁ దేజోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుక పుట్టు నీ సుతుఁడనై నర్తించి వర్తింపఁగాన్.

8-487-మత్తేభ విక్రీడితము

బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయోపాయంబునం గాని; సం
చలనం బొందకు; నేను నీ నియతికిన్ సద్భక్తికిన్ మెచ్చితిన్;
బలి విద్వేషియు నా నిలింపగణముం బౌలోమియున్ మెచ్చ దై
త్యుల రాజ్యంబు హరింతు; నింద్రునికి నిత్తున్; దుఃఖమింకేటికిన్?

8-488-కంద పద్యము

నీ రమణుని సేవింపుము
నా రూపము మానసించి నళినీ! గర్భా
గారంబు వచ్చి చొచ్చెద
గారామునఁ బెంపవమ్మ కరుణన్ నన్నున్.

8-67- వామనుడుగర్భస్తుడగుట

8-489-కంద పద్యము

ఏలింతు దివము సురలనుఁ
బాలింతు మహేంద్రయువతి భాగ్యశ్రీలం
దూలింతు దానవుల ని
ర్మూలింతు రిపుప్రియాంగముల భూషణముల్.

8-490-వచనము

అని యిట్లు భక్తజనపరతంత్రుండగు పురాణపురుషుం డానతిచ్చి తిరోహితుడయ్యె; అ య్యదితియుఁ గృతకృత్య యై సంతోషంబునఁ దన మనోవల్లభుండగు కశ్యపు నాశ్రయించి సేవించుచుండె; అంత నొక్క దివసంబున.

8-491-ఆటవెలది

ఘన సమాధినుండి కశ్యపుఁ డచ్యుతు
నంశ మాత్మనొలయ నదితి యందుఁ
దనదు వీర్య మధికతరము సేర్చెను గాలి
శిఖిని దారువందుఁజేర్చినట్లు.

8-492-వచనము

ఇట్లు కశ్యప చిరతర తపస్సంభృత వీర్యప్రతిష్ఠిత గర్భయై సురల తల్లి యుల్లంబున నుల్లసిల్లుచు నుండె; నంత.

8-493-కంద పద్యము

చలచలనై పిదపిదనై
గలలంబై కరుడు గట్టి గళనాళముతోఁ
దల యేర్పడి గర్భంబై
నెలమసలం జీరచిక్కె నెలఁతకు నధిపా!

8-494-కంద పద్యము

నెలతకుఁ జూలై నెల రె
న్నెలలై మఱి మూఁడు నాల్గు నెలలై వరుసన్
నెల లంతకంత కెక్కఁగ

నెలలును డగ్గఱియె నసుర నిర్మూలతకున్.

8-495-కంద పద్యము

మహితతర మేఘమాలా
పిహితాయుత చండభాను బింబప్రభతో
విహితాంగంబులఁ గశ్యపు
గృహిణీగర్భమున శిశువుఁ గ్రీడించె నృపా!

8-496-కంద పద్యము

తన కడుపున నొక యిరువునఁ
వనరుహ గర్భాండభాండ వనధిచయంబుల్
గొనకొని జగములు నిడుకొని
తనుగతిఁ గడు నడఁగి మడిఁగి తనరెన్ బెడఁగై.

8-497-వచనము

అంత న క్కాంతాతిలకంబు క్రమక్రమంబున.

8-498-మత్తేభ విక్రీడితము

నిలిపెన్ ఱెప్పల బృందిమన్, విశదిమన్ నేత్రంబులం, జూచుకం
బుల నాకాళిమ, మేఖలం ద్రఢిమ, నెమ్మోమారఁగాఁ బాండిమన్
బలిమిం జన్నుల, శ్రోణిపాళిగరిమన్, మధ్యంబునన్ బృంహిమ
న్లలితాత్మన్ లఘిమన్, మహామహిమ మేనన్ గర్భదుర్వారమై.

8-499-కంద పద్యము

పెట్టుదురు నుదుట భూతిని

బొట్టిడుదురు మేఁన బట్టుఁ బుట్టపుదోయిం
బెట్టుదురు వేల్పు లమ్మకుఁ
గట్టుదురు సురక్ష పడఁతుగర్భంబునకున్.

8-500-వచనము

ఇవ్విధంబున

8-501-తేటగీతి

విశ్వగర్భుఁడు దన గర్భ వివరమందు
బూటపూటకుఁ బూర్ణుఁడై పొటకరింప
ప్రేఁక జాలాలితనమున వేల్పుఁ బెద్ద
పొలఁతి కంతట నీళ్ళాడు ప్రొద్దులయ్యె.

### 8-68- గర్భస్థవామనునిస్తుతించుట

8-502-వచనము

తదనంతరంబునం జతురాననుం డరుగుదెంచి యదితిగర్భపరిభ్రమ విభ్రముం డగు నప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె.

8-503-సీస పద్యము

త్రిభువన జయరూఢ! దేవ! త్రివిక్రమ!;
పృథులాత్మ! శిపివిష్ట! పృశ్నిగర్భ;
ప్రీత త్రినాభ! త్రిపృష్ఠ! జగంబుల;
కాద్యంత మధ్యంబు లరయ నీవ;
జంగమ స్థావర జననాది హేతువు;

నీవ; కాలంబువై నిఖిల మాత్మ
లోపల ధరియింతు లోని జంతుల నెల్ల;
స్రోతంబులోఁ గొను చొప్పు దోఁప;

8-503.1-తేటగీతి

బ్రహ్మలకు నెల్ల సంభవ భవన మీవ;
దివమునకుఁ బాసి దుర్దశ దిక్కులేక
శోకవార్ధి మునింగిన సురలకెల్లఁ
దేల నాధార మగుచున్న తెప్ప నీవ.

8-504-కంద పద్యము

విచ్చేయు మదితి గర్భము
చెచ్చెర వెలువడి మహాత్మ! చిరకాలంబున్
విచ్చలవిడి లే కమరులు
ముచ్చటపడి యున్నవారు ముద మందింపన్.

8-505-వచనము

అని యిట్లు కమలసంభవుండు వినుతిచేయు నయ్యవసరంబున.

## 8-69- వామనుడవతరించుట

8-506-మత్తేభ విక్రీడితము

రవి మధ్యాహ్నమునం జరింప గ్రహతారాచంద్రభద్రస్థితిన్
శ్రవణద్వాదశినాఁడు శ్రోణ నభిజిత్సంజ్ఞాత లగ్నంబునన్
భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్

దివిజాధీశ్వరు మాతకుం బరమపాతివ్రత్య విఖ్యాతకున్.

8-507-వచనము

మఱియు నద్దేవుండు శంఖచక్రగదా కమల కలిత చతుర్భుజుండునుఁ బిశంగవర్ణవస్త్రుండును. మకరకుండల మండిత గండభాగుండును, శ్రీవత్సవక్షుండును, నళినచక్షుండును, నిరంతర శ్రీవిరాజిత రోలంబ కదంబాలంబిత వనమాలికా పరిష్కృతుండును, మణికనకాంచిత కాంచీవలయాంగద కిరీటహార నూపురాలంకృతుండునుఁ, గమనీయ కంఠ కౌస్తుభాభరణుండును, నిఖిలజన మనోహరణుండునునై యవతరించిన సమయంబున.

8-508-శార్దూల విక్రీడితము

చింతం బాసిరి యక్ష తార్క్ష్య సుమనస్సిద్ధోరగాధీశ్వరుల్
సంతోషించిరి సాధ్య చారణ మునీశబ్రహ్మ విద్యాధరుల్
గాంతిం జెందిరి భానుచంద్రములు; రంగద్గీత వాద్యంబులన్
గంతుల్ పైచిరి మింటఁ గింపురుషులున్ గంధర్వులుం గిన్నరుల్.

8-509-కంద పద్యము

దిక్కులకావిరి వాసెను
నెక్కువ నిర్మలత నొందె నేఁడు పయోధుల్
నిక్కమెయి నిలిచె ధరణియుఁ
జుక్కల త్రోవయును విప్రసుర సేవ్యములై.

8-510-కంద పద్యము

ముంపుఁగొని విరుల వానల
జొంపంబులు గురియు సురలు, సమనోమధువుల్
తుంపర లెగయఁ బరాగపు
రొంపుల భూభాగమతి నిరూపిత మయ్యెన్.

8-511-వచనము

తదనంతరంబ

8-512-ఆటవెలది

ఈ మహానుభావుఁ డెట్లింత కాలంబు
నుదర మందు నిలిచి యుండె ననుచు
నదితి వెఱఁగుపడియె నానంద జయశబ్ద
ములను గశ్యపుండు మొగి నుతించె.

8-513-వచనము

అంత నవ్విభుండు సాయుధసాలంకారంబగు తన దివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటు చందంబున నుపనయనవయస్కుండైన వామన బాలకుండై తల్లి ముంగటఁ గుమార సముచితాలాపంబు లాడుఁచు గ్రీడించు సమయంబున నదితియుం దనయ విలోకన పరిణామ పారవశ్యంబున.

8-514-కంద పద్యము

నన్నుఁ గన్న తండ్రి! నా పాలి దైవమ!
నా తపఃఫలంబ! నా కుమార!
నాదు చిన్ని వడుగ! నా కులదీపిక!

రాఁగదయ్య; భాగ్య రాశి వగుచు

8-515-కంద పద్యము

అన్నా! రమ్మని డగ్గఱి
చన్నుల పాలేఱువాఱ సంశ్లేషిణి యై
చిన్నారి మొగము నివురుచుఁ
గన్నారం జూచెఁ గన్నకడుపై యుంటన్.

8-516-కంద పద్యము

పురు డీ బోటికి నిందిర
పురు డంబిక గాక యొరులు పురుడే? యనుచున్
బురుటాలికిఁ బది దినములు
పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపు గరితల్.

8-517-వచనము

అంత నబ్బాలునకు సంతసంబున మహర్షులు కశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచితోపనయనకర్మ కలాపంబులు చేయించిరి; సవిత సావిత్రి నుపదేశించె, బృహస్పతి యజ్ఞోపవీతధారణంబునుఁ, గశ్యపుండు ముంజియుఁ, గౌపీనం బదితియు, ధరణి కృష్ణాజినంబును, దండంబు వనస్పతి యగు సోముండును, గగనాధిష్ఠానదేవత ఛత్రంబునుఁ, గమండలువు బ్రహ్మయు, సరస్వతి యక్షమాలికయు, సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి; మఱియును.

8-518-కంద పద్యము

బిక్షాపాత్రిక నిచ్చెను

యక్షేశుఁడు వామనునకు; నక్షయ మనుచున్
సాక్షాత్కరించి పెట్టెను
భిక్షునకు భవాని పూర్ణభిక్ష నరేంద్రా!

8-519-కంద పద్యము

శుద్ధబ్రహ్మర్షి సమా
రాద్ధుండై విహితమంత్రరాజిఁ జదువుచుం
బ్రోద్ధంబగు ననలంబున
వృద్ధాచారమున వటుఁడు వేల్చెన్ గడకన్!

## 8-70- వామనునివిప్రులసంభాషణ

8-520-వచనము

ఇట్లు కృతకృత్యుండైన మాయామాణవకుండు దేశాంతర సమాగతు లగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె.

8-521-కంద పద్యము

వత్తురె విప్రులు? వేఁడఁగ
నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం?
దెత్తురె మీరును సంపద?
లిత్తెఱఁగున దాన వీరుఁ డెవ్వఁడొ చెప్పుడా.

8-522-వచనము

అనిన నఖిల దేశీయు లగు భూసురు లిట్లనిరి.

8-523-మత్తేభ విక్రీడితము

కలరున్ దాతలు; నిత్తురున్ ధనములుం; గామ్యార్థముల్ గొంచు వి
ప్రులు నేతెంతురు; గాని యీవిని బలిం బోలన్ వదాన్యుండు లేఁ
డలఘుండై యొనరించె నధ్వరశతం బా భార్గవానుజ్ఞచే;
బలి వేఁడం బడయంగ వచ్చు బహుసంపల్లాభముల్ వామనా!

8-524-వచనము

అని తెలియంజెప్పిన బ్రాహ్మణులవచనంబు లాలకించి లోకంబులకుం బ్రీతి పుట్టింపఁ బయనంబై లాభవచనంబులుఁ గైకొని తల్లిఁదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం గదిలి.

## 8-71- వామనునిబిక్షాగమనము

8-525-కంద పద్యము

ప్రక్షీణ దివిజ వల్లభ
రక్షాపరతంత్రుఁ డగుచు రాజీవాక్షుం
డా క్షణమున బలి యింటికి
బిక్షాగమనంబు జేసెఁ బేదటికముతోన్.

8-526-కంద పద్యము

హరిహరి; సిరి యురమునఁ గల
హరి హరిహయుకొఱకు దనుజ నడుగం జనియెన్;
బరహితరత మతియుతులగు
దొరలకు నడుగుటయు నొడలి తొడవగుఁ బుడమిన్.

8-527-కంద పద్యము

సర్వప్రపంచ గురుభర
నిర్వాహకుఁ డగుటఁజేసి నెఱిఁ జనుదేరన్
ఖర్వుని ప్రేఁగు సహింపక
నుర్వీస్థలి గ్రుంగె; మ్రొగ్గె నురగేంద్రుండున్.

8-528-వచనము

ఇట్లు చనిచని

8-529-కంద పద్యము

శర్మద, యమదండక్షత
వర్మద, నతి కఠిన ముక్తి వనితాచేతో
మర్మద, నంబునివారిత
దుర్మద, నర్మదఁ దరించెఁ ద్రోవన్ వటుఁడున్.

8-530-వచనము

దాటి తత్ప్రవాహంబున కుత్తరతటంబు నందు.

8-531-శార్దూల విక్రీడితము

చండస్ఫూర్తి వటుండుఁ గాంచె బహుధాజల్పన్నిశాటంబు, ను
ద్దండాహూత మునీభ్యబిభ్యదమృతాంధస్స్పిద్ధకూటంబు, వే
దండాశ్వధ్వజనీ కవాటము, మహోద్యద్ధూమ సంఛన్న మా
ర్తాండస్యందన ఘోటమున్, బలిమఖాంతర్వేది కావాటమున్.

## 8-72- వామనుడుయజ్ఞవాటికచేరుట

8-532-వచనము

కని దానవేంద్రుని హయమేధ వాటి దఱియం జొచ్చు నయ్యవసరంబున.

8-533-శార్దూల విక్రీడితము

శంభుండో హరియో పయోజభవుఁడో చండాంశుఁడో వహ్నియో
దంభాకారత వచ్చెఁ గాక ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁడీ
శుంభద్ద్యోతనుఁ డీ మనోజ్ఞ తనుఁ డంచున్ విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబుగన్.

8-534-కంద పద్యము

గుజగుజలు పోవువారును
గజిబిజిఁ బడువారు చాలఁ గలకల పడుచున్
గజిబిజి యైరి సభాస్థలిఁ
బ్రజ లెల్లను బొట్టివడుగు పాపని రాకన్.

8-535-వచనము

ఆ సమయంబున బలిసభామండపంబుఁ దఱియం జొచ్చి.

8-536-సీస పద్యము

చవులుగాఁ జెవులకు సామగానంబులు;
 చదువు నుద్గాతల చదువు వినుచు
మంత్ర తంత్రార్థ సంబంధభావములు పే;
 ర్కొనెడి హోతలతోడఁ గూడికొనుచు
హోమకుండంబులం దున్న త్రేతాగ్నుల;
 వెలిఁగించు యాజక వితతిఁ గనుచు

దక్షులై బహువిధాధ్వర విధానంబులు;
చెప్పెడు సభ్యులఁ జేరఁ జనుచుఁ

8-536.1-తేటగీతి

బెట్టుగోరెడు వేడుక పట్టుపలుచు
నదితి పుట్టువు లచ్చికి నాటపట్టు
కోరి చరియించె సభలోనఁ గొంతఁదడవు
పుట్టు వెన్నఁడు నెఱుగని పొట్టివడుఁగు.

8-537-వచనము

మఱియును.

8-538-కంద పద్యము

వెఱచుచు వంగుచు వ్రాలుచు
నఱిముఱిఁ గఱురులకుఁ జనుచు హరిహరి యనుచున్
మఱుఁగుచు నులుకుచు దిఱదిఱఁ
గురుమట్టపుఁ బడుచు వడుగుఁ గొంత నటించెన్.

8-539-కంద పద్యము

కొందఱతోఁజర్చించును
గొందఱతో జటలు చెప్పు గోష్ఠిం జేయుం
గొందఱతోఁ దర్కించును
గొందఱతో ముచ్చటాడుఁ; గొందఱ నవ్వున్.

8-540-వచనము

మఱియు ననేక విధంబుల నందఱకు నన్ని రూపులై వినోదించుచు.

8-541-కంద పద్యము

వెడవెడ నడకలు నడచుచు

నెడనెడ నడు గిడక నడరి యిల దిగఁబడగా

బుడిబుడి నొడువులు నొడువుచుఁ

జిడిముడి తడఁబడగ వడుగు చేరెన్ రాజున్.

8-542-వచనము

ఇట్లు డగ్గఱి మాయాబిక్షుకుండు రక్షోవల్లభుం జూచి యిట్లనియె.

8-543-మత్తేభ విక్రీడితము

ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్నికాలాది ది

క్పతి గర్వాపనయప్రవర్తి, గతలోభస్ఫూర్తి, నానా మఖ

వ్రతదానప్రవణానువర్తి, సుమనోరామామనోఖేదనో

ద్ధత చంద్రాతపకీర్తి, సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తి దాన్.

8-544-వచనము

అని కుశ పవిత్రాక్షత సంయుతం బయిన దక్షిణహస్తంబు సాఁచి యిట్లనియె.

8-545-ఉత్పలమాల

స్వస్తి జగత్త్రయీ భువన శాసన కర్తకు హాసమాత్ర వి

ధ్వస్త నిలింపభర్తకు, నుదారపదవ్యవహర్తకున్, మునీం

ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు, నిర్జరీగళ

న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు, దానవలోక భర్తకున్.

8-546-వచనము

అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరించిన వేదరాశియుం బోలె ముందట నకుటిలుండును, జటిలుండును, సదండఛత్రుండునుఁ, గక్షలంబిత బిక్షాపాత్రుండునుఁ, గరకలిత జల కమండలుండును, మనోహరవదన చంద్రమండలుండును, మాయావాదన నటుండును నగు వటునిం గని దినకర కిరణ పిహితంబులైన గ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులుఁ గూర్చున్న యెడల లేచి క్షేమం బడిగి తియ్యని మాటల నాదరించిరి; బలియును నమస్కరించి తగిన గద్దియ నునిచి, పాదంబులుఁ దుడిచి తన ప్రాణవల్లభ పసిండి గిండియల నుదకంబు వోయ వడుగు కొమరుని చరణంబులఁ గడిగి తడి యొత్తి తత్సమయంబున.

8-547-ఆటవెలది

వటుని పాద శౌచవారి శిరంబునఁ
బరమ భద్ర మనుచు బలి వహించె
నే జలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ
దేవుఁ డుద్వహించె ధృతి శిరమున.

## 8-73- వామనునిబిక్షకోరుమనుట

8-548-వచనము

మఱియు నయ్యజమానుం డభ్యాగతున కిట్లనియె.

8-549-మత్తేభ విక్రీడితము

వడుగా! యెవ్వరివాఁడ? వెవ్వఁడవు? సంవాసస్థలంబెయ్యె? ది
య్యెడకున్ నీ వరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మముం;

గడు ధన్యాత్ముఁడనైతి; నీ మఖము యోగ్యంబయ్యె; నా కోరికల్
గడతేఱన్; సుహుతంబులయ్యె శిఖులుం; గల్యాణ మిక్కాలమున్.

8-550-మత్తేభ విక్రీడితము

వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీ ఖండము కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా!

8-551-వచనము

అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచని వచనంబులు విని సంతోషించి యీశ్వరుం డిట్లనియె.

## 8-74- వామనునిసమాధానము

8-552-సీస పద్యము

ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు? ;
నొక చో టనక యెందు నుండ నేర్తు;
నెవ్వనివాఁడ నం చేమని నుడువుదు? ;
నా యంతవాఁడనై నడవనేర్తు;
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ? ;
బూని ముప్పోకల బోవ నేర్తు;
నదినేర్తు నిదినేర్తు నని యేలఁ జెప్పంగ? ;
నేరుపు లన్నియు నేన నేర్తు;

8-552.1-తేటగీతి

నొరులుఁ గారు నాకు నొరులకు నే నౌదు
నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నా టెంకి
సుజనులందుఁ దఱచు చొచ్చియుందు.

8-553-వచనము

అది యట్లుండ నిమ్ము.

8-554-సీస పద్యము

జననాథ! నీ మాట సత్యంబు సత్కీర్తి;
దంబు గులార్హంబు ధర్మయుతముఁ
గరుణానువర్తులు ఘనసత్త్వమూర్తులు;
కాని మీ కులమందుఁ గలుగ రొరులు
రణభీరువులు వితరణభీరువులు లేరు;
ప్రత్యర్థు లర్థులు ప్రబ్బికొనిన
దానశౌండిమమునఁ దనుపుదు రధికులై;
మీ తాత లందఱు మేటిమగలు

8-554.1-ఆటవెలది

మీ కులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు
మింటి చంద్రుమాడ్కి మేలి రుచులఁ
బ్రథిత కీర్తితోడ భవదీయవంశంబు
నీరరాశి భంగి నెగడు చుండు.

8-555-వచనము

తొల్లి మీ మూఁడవ తాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు జేసి గదాయుధుండై భూతలంబునఁ బ్రతివీరులం గానక సంచరింప విష్ణుండు వరాహరూపంబున నతని సమయించె; తద్భ్రాత యగు హిరణ్యకశిపుఁ డది విని హరిపరాక్రమంబునకు నాశ్చర్యంబు నొంది తన జయంబును బలంబునుం బరిహసించి గ్రద్దన నుద్దవిడి నద్దనుజమర్దను మందిరంబునకుం జనియె; అప్పుడు.

8-556-కంద పద్యము

శూలాయుధహస్తుండై
కాలాకృతి వచ్చు దనుజుఁ గని విష్ణుండుం
గాలజ్ఞత మాయాగుణ
శీలత నిట్లని తలంచెఁ జిత్తములోనన్.

8-557-మత్తేభ విక్రీడితము

ఎదురై పోర జయింప రా దితనిఁ; గా కెందేనియుం బోవ భీ
ప్రదుఁడై ప్రాణులఁ దోలు మృత్యువు క్రియం బైవచ్చు నంచుం గ్రియా
విదుఁ డబ్జాక్షుఁడు సూక్ష్మరూపమున నావేశించె నిశ్శ్వాస రం
ధ్ర దిశన్ దైత్యు హృదంతరాళమునఁ బ్రత్యక్షక్రియాభీరుఁడై.

8-558-వచనము

అంత నద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు జొచ్చి వెదకి హరిం గానక కోపంబు మానక మిన్ను మన్ను నన్వేషించి త్రిదివంబు నరసి, దిశలం బరికించి, భూ వివరంబులు వీక్షించి, సముద్రంబులు వెదకి, పురంబులు శోధించి, వనంబులు

విమర్శించి, పాతాళంబు పరీక్షించి, జగంబున నదృష్టశత్రుండై మార్గణంబు చాలించి, తనలో నిట్లనియె.

8-559-కంద పద్యము

పగవాఁడు మడియ నోపును
దెగడేనియు నెదురుపడఁడె? దేహధరులకుం
దెగిన యెడఁ బగఱ మీఁదనుఁ
బగఁ గొనఁ దగ ద నుచు నుడిగెఁ బ్రాభవశక్తిన్.

8-560-వచనము

అతండు మీ ప్రపితామహుం; డతని గుణంబు లనేకంబులు గలవు; అవి యట్లుండనిమ్ము.

8-561-కంద పద్యము

ఆతుర భూసురగతిఁ బురు
హూతాదులుఁ దన్ను వేఁడ నొగిఁ గొం డనుచున్
మీ తండ్రి యిచ్చె నాయువు
నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్?

8-562-కంద పద్యము

ఏలితివి మూఁడు జగములుఁ;
దోలితి వింద్రాది సురలఁ; దొల్లిటివారిం
బోలితివి దానగుణముల;
సోలితివి పిశాచరాక్షసుల రక్షింపన్.

## 8-75- వామనుడుదానమడుగుట

8-563-వచనము

అదియునుం గాక

8-564-కంద పద్యము

రాజ్యంబు గలిగె నేనిం
బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్
భాజ్యముగ బ్రతుక డేనిం
ద్యాజ్యంబులు వాని జన్మ ధన గేహంబుల్.

8-565-కంద పద్యము

మున్నెన్నడురు వదాన్యుల
నెన్నెడుచో నిన్నుఁ ద్రిభవనేశుం డనుచున్;
ఇన్ని దినంబుల నుండియు
నెన్నఁడు నినుఁ బెట్టు మనుచు నీంద్రము జేయన్.

8-566-ఆటవెలది

ఒంటివాఁడ నాకుఁ నొకటి రెం డడుగుల
మేర యిమ్ము సొమ్ము మేర యొల్ల;
గోర్కిఁదీర బ్రహ్మకూకటి ముట్టెద
దానకుతుకసాంద్ర! దానవేంద్ర!

8-567-వచనము

అనిన బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె.

8-568-ఆటవెలది

ఉన్నమాటలెల్ల నొప్పును విప్రుండ!
సత్య గతులు వృద్ధ సమ్మతంబు;
లడుగఁ దలఁచి కొంచె మడిగితివో చెల్ల;
దాత పెంపు సొంపుఁ దలఁపవలదె.

8-569-వచనము

అని మఱియు ని ట్లనియె.

8-570-మత్తేభ విక్రీడితము

వసుధాఖండము వేఁడితో? గజములన్ వాంఛించితో? వాజులన్
వెసనూహించితొ? కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో?
పసి బాలుండవు; నేర వీ వడుగ; నీ భాగ్యంబు లీపాటి గా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ యల్పంబు నీ నేర్చునే?

8-571-వచనము

అనిన మొగంబునం జిఱునగవు మొలకలెత్త గృహమేధికి మేధావి యి ట్లనియె.

8-572-మత్తేభ విక్రీడితము

గొడుగో. జన్నిదమో, కమండలువొ. నాకున్ ముంజియో, దండమో,
వడుఁ గే నెక్కడ భూమి లెక్కడ? కరుల్, వామాక్షు, లశ్వంబు లె
క్కడ? నిత్యోచిత కర్మ మెక్కడ? మదాకాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్.

8-573-వచనము

అదియునుంగాక.

8-574-కంద పద్యము

వ్యాప్తిం బొందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ బదివే లనుచుం
దృప్తిం జెందని మనుజుఁడు
సప్తద్వీపముల నయినఁ జక్కంబడునే?

8-575-శార్దూల విక్రీడితము

ఆశాపాశము దాఁ గడున్ నిడుపు; లే దంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు చేకూడియుం
గాశిం బొందిరిఁ గాక వైన్య గయ భూకాంతాదులున్నర్థకా
మాశం బాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే.

8-576-సీస పద్యము

సంతుష్టుఁడీ మూఁడు జగములఁ బూజ్యుండు;
సంతోషి కెప్పుడుఁ జరఁగు సుఖము
సంతోషిఁ గాకుంట సంసార హేతువు;
సంతసంబున ముక్తిసతియు దొరకుఁ
బూఁటపూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ;
తుష్టిని దేజంబు తోన పెరుఁగుఁ
బరితోష హీనతఁ బ్రభ చెడిపోవును;
జలధార ననలంబు సమయునట్లు

8-576.1-ఆటవెలది

నీవు రాజ వనుచు నిఖిలంబు నడుగుట
దగవు గాదు నాకుఁ; దగిన కొలఁది
యేను వేఁడికొనిన యీ పదత్రయమునుఁ
జాల దనక యిమ్ము; చాలుఁజాలు.

### 8-76- శుక్రబలిసంవాదంబును

8-577-వచనము

అని యిట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీదానంబు చేయం దలంచి కరకలిత సలిల కలశుండైన య వ్వితరణగుణముఖరునిం గని, నిజ విచారయుక్త దనుజ రాజ్య చక్రుండగు శుక్రుం డిట్లనియె.

8-578-సీస పద్యము

దనుజేంద్ర! యీతఁడు ధరణీసురుఁడుఁ గాడు;
దేవకార్యంబు సాధించుకొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితి గర్భంబునఁ;
గశ్యపసూనుఁడై కలిఁగె; నకట;
యెఱుగ కీతని కోర్కి నిచ్చెద నంటివి;
దైత్య సంతతి కుపద్రవము వచ్చు
నీ లక్ష్మిఁ దేజంబు నెలవు నైశ్వర్యంబు;
వంచించి యిచ్చుఁ దా వాసవునకు;

8-578.1-ఆటవెలది

మొనసి జగము లెల్ల మూఁడు పాదంబుల

నఖిలకాయుఁ డగుచు నాక్రమించు
సర్వ ధనము విష్ణు సంసర్జనము చేసి
బడుగు పగిది నెట్లు బ్రతికె దీవు?

8-579-కంద పద్యము

ఒక్కపదంబున భూమియు
నొక్కటఁ ద్రిదివంబు దొక్కి యున్నతమూర్తిన్
దిక్కులు గగనముఁ దానై
వెక్కసమై యున్న నెందు పెడలెదు? చెపుమా.

8-580-సీస పద్యము

ఇచ్చెద నని పల్కి యీకున్న నరకంబు; ద్రోవ నీవును సమర్థుఁడవుఁ గావ;
యే దానమున నాశ మేతెంచు నదియును; దానంబుఁ గా దండ్రు తత్త్వవిదులు;
దానంబు యజ్ఞంబుఁ దపముఁ గర్మంబును; దా విత్తవంతుఁడై తలఁపవలయుఁ;
దన యింటఁ గల సర్వధనమును నైదు భా; గములుగా విభజించి కామమునకు

8-580.1-ఆటవెలది

నర్థమునకు ధర్మయశముల కాశ్రిత
బృందములకు సమతఁ బెట్టునట్టి
పురుషుఁ డిందు నందు బూర్ణుఁడై మోదించుఁ
దన్ను మాని చేఁత దగవుఁ గాదు.

8-581-వచనము

అదియునుం గాక యీ యర్థంబునందు బహుభంగి బహ్వృచ గీతా ర్థంబుఁ గల దొక్కటి; సావధానుండవై యాకర్ణింపుము.

8-582-సీస పద్యము

అంగీకరించిన నఖిలంబుఁ బోవుచో;
 నన్నృతంబుఁగాదు లే దనిన నధిప!
యాత్మ వృక్షము మూల మన్నృతంబు నిశ్చయ;
 మన్నృత మూలముఁ గల్గ నాత్మ చెడదు;
పుష్పఫలము లాత్మ భూజంబునకు సత్య;
 మాత్రాను బ్రతుకమి నదియుఁ జెడును;
ఫలపుష్పములు లేక పస చెడి వృక్షంబు;
 మూలంబుతో వృద్ధిఁ బొందుఁ గాదె?

8-582.1-తేటగీతి

చేటుఁ గొఱతయు లఘిమయుఁ జెందకుండ
నిచ్చు పురుషుండు చెడకుండు నిద్ధచరిత!
కాక యంచిత సత్య సంగతి నటంచు
నిజధనం బర్థి కిచ్చిన నీకు లేదు.

8-583-ఆటవెలది

సర్వమయినచోట సర్వధనంబులు
నడుగ లే దటంచు నన్నృతమాడు
చెనటి పందనేమి చెప్పఁ బ్రాణము తోడి
శవము వాఁడు; వాని జన్మ మేల?

8-584-వచనము

మఱియు నిం దొక్క విశేషంబు గలదు; వివరించెద.

8-585-ఆటవెలది

వారిజాక్షులందు వైవాహికము లందుఁ
బ్రాణవిత్తమానభంగమందుఁ
జకిత గోకులాగ్ర జన్మరక్షణ మందు
బొంకవచ్చు నఘము పొందఁ దధిప!

8-586-మత్తేభ విక్రీడితము

కులమున్ రాజ్యముఁ దేజమున్ నిలుపు మీ కుబ్జుండు విశ్వంభరుం
డలతిం బోఁడు; త్రివిక్రమస్ఫురణ వాఁడై నిండు బ్రహ్మాండముం;
గలఁడే మాన్ప నొకండు? నా పలుకు లాకర్ణింపు కర్ణంబులన్;
వలదీ దానము గీనముం బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా!

8-587-వచనము

అని యిట్లు హితంబు పలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీలిత లోచనుండయి యశస్వి యిట్లనియె.

8-588-సీస పద్యము

నిజ మాన తిచ్చితి వీవు మహాత్మక! ;
మహిని గృహస్థధర్మంబు నిదియ
యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు;
నెయ్యది ప్రాపింప నిత్తు ననియు

నర్థ లోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు?;
పలికి లే దనుకంటెఁ బాప మెద్ది?
యెట్టి దుష్కర్ముని నే భరించెదఁ గాని;
సత్యహీనుని మోవఁ జాల ననచుఁ

8-588.1-తేటగీతి

పలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరముననుండి తిరుగక చచ్చుకంటె
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె
మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె.

8-589-కంద పద్యము

ధాత్రిని హలికునకును సు
క్షేత్రము బీజములు నొకటఁ జేకుఱు భంగిం
జిత్రముగ దాత కీవియుఁ
బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే?

8-590-శార్దూల విక్రీడితము

కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వారేరీ సిరిమూటఁగట్టుకొని పోవం జాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశః కాములై
యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్? భార్గవా!

8-591-కంద పద్యము

ఉడుగని క్రతువులఁ వ్రతములఁ
బొడగనఁ జన నట్టి పొడవు పొడవునఁ గుఱుచై
యడిగెడినఁట; ననుబోఁటికి
నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్.

8-592-శార్దూల విక్రీడితము

ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ, దనువుపైఁ, నంసోత్తరీయంబుపై,
బాదాబ్జంబులపైఁ, గపోలతటిపై, బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు గ్రిం దగుట మీఁదై నా కరంబుంట మేల్
గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే?

8-593-మత్తేభ విక్రీడితము

నిరయంబైన, నిబంధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము; కానిమ్ము పో;
హరుఁడైనన్, హరియైన, నీరజభవుం డభ్యాగతుండైన నౌఁ;
దిరుగన్ నేరదు నాదు జిహ్వ; వినుమా; ధీవర్య! వే యేటికిన్?

8-594-ఆటవెలది

నొడివినంత పట్టు నుసలక యిచ్చుచో
నేల కట్టు విష్ణుఁ డేటి మాట?
గట్టెనేనిఁ దాన కరుణించి విడుచును
విడువకుండ నిమ్ము విమలచరిత!

## 8-77- బలిదాననిర్ణయము

8-595-కంద పద్యము

మేరువు దల క్రిం దైనను
బారావారంబు లింకఁ బాఱిన లోలో
ధారుణి రజమై పోయినఁ
దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్.

8-596-మత్తకోకిలము

ఎన్నఁడుం బరువేఁడఁ బోఁడట; యేకలుం డట; కన్న వా
రన్నదమ్ములు నైన లేరఁట; యన్నివిద్యల మూల గో
ష్ఠిన్నెఱింగిన ప్రోడ గుజ్జఁట; చేతు లొగ్గి వసింప నీ
చిన్ని పాపనిఁ ద్రోసిపుచ్చఁగ జిత్త మొల్లదు సత్తమా!

8-597-వచనము

అని యిట్లు సత్య పదవీ ప్రమాణ తత్పరుండును, వితరణ కుతూహల సత్త్వరుండును, విమల యశస్కుండును, దృఢ మనస్కుండును, నియతసత్యసంధుండును, నర్థిజన కమలబంధుండును నైన బలిం జూచి శుక్రుండు గోపించి "మదీయ శాసనం బతిక్రమించితివి గావున శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవుఁ గ" మ్మని శాపం బిచ్చె బలియును గురుశాపతప్తుండయ్యు నన్నృతమార్గంబు నకభిముఖుండుఁ గాకుండె; అప్పుడు.

8-598-ఆటవెలది

బ్రతుక వచ్చుఁగాక బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక

మాటఁ దిరుఁగ లేరు మానధనులు.

## 8-78- వామనునికిదానమిచ్చుట

8-599-వచనము

అ య్యవసరంబున.

8-600-ఆటవెలది

దనుజలోకనాథు దయిత వింధ్యావళి
రాజవదన మదమరాళ గమన
వటుని కాళ్ళుఁ గడుగ వరహేమ ఘటమున
జలముఁ దెచ్చె భర్త సన్న యెఱిఁగి.

8-601-వచనము

అయ్యవసరంబునఁ గపటవటునకు న ద్దానవేంద్రుం డిట్లనియె.

8-602-కంద పద్యము

రమ్మా మాణవకోత్తమ!
లెమ్మా నీ వాంఛితంబు లే దన కిత్తుం
దెమ్మా యడుగుల నిటు రా
నిమ్మా కడుగంగవలయు నేటికిఁ దడయన్?

8-603-వచనము

అనిన విని

8-604-మత్తేభ విక్రీడితము

బలి దైత్యేంద్ర కరద్వయీ కృత జలప్రక్షాళనవ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు చాఁచె యోగి సుమనస్సంప్రార్థితశ్రీదముం
గలితానమ్ర రమా లలాటపదవీ కస్తూరికా శాదమున్
నలినామోదము రత్ననూపురిత నానావేదముం బాదమున్.

8-605-కంద పద్యము

సురలోక సముద్ధరణము
నిరతశ్రీకరణ మఖిల నిగమాంతాలం
కరణము భవసంహరణము
హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముడున్.

8-606-వచనము

ఇట్లు ధరణీసుర దక్షిణ చరణ ప్రక్షాళనంబు చేసి వామపాదంబు గడిగి తత్పావన జలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశ కాలాది పరిగణ నంబు చేసి.

8-607-శార్దూల విక్రీడితము

విప్రాయప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాద ధరణిం దాస్యామి! యంచుం గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జే సాఁచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందగన్.

8-608-వచనము

తత్కాలంబున.

8-609-ఆటవెలది

నీరధారఁ బడఁగ నీక యడ్డంబుగాఁ
గలశరంధ్ర మాఁపగాను దెలిసి
హరియుఁ గావ్య నేత్ర మటఁ గుశాగ్రంబున
నడువ నేకనేత్రుఁ డయ్యె నతఁడు.

8-610-వచనము

అంత

8-611-మత్తేభ విక్రీడితము

అమరారాతి కరాక్షతోజ్ఝిత పవిత్రాంభః కణశ్రేణికిం
గమలాధీశ్వరుఁ డొడ్డె ఖండిత దివౌకస్స్వామిజిన్మస్తముం
గమలాకర్షణ సుప్రశస్తము రమాకాంతాకుచోపాస్తమున్
విమలశ్రీ కుచశాత చూచుక తటీవిన్యస్తమున్ హస్తమున్.

8-612-కంద పద్యము

మునిజన నియమాధారను
జనితాసుర యువతి నేత్రజలకణ ధారన్
దనుజేంద్ర నిరాధారను
వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్.

8-613-ఆటవెలది

కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రు మాట లెఱిగి నాశ
మెఱిఁగి పాత్ర మనుచు నిచ్చె దానము బలి

మహా వదాన్యుఁ డొరుఁడు మఱియుఁ గలఁడె.

8-614-కంద పద్యము

బలి చేసిన దానమునకు
నళినాక్షుఁడు నిఖిలభూత నాయకుఁ డగుటం
గలకల మని దశదిక్కులు
బళిబళి యని పొగడె భూతపంచక మనఘా!

8-615-కంద పద్యము

క్షితి దానమిచ్చు నతఁడును
నతికాంక్షఁ బరిగ్రహించు నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు
శతమఖ లోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్.

8-616-వచనము

అట్లుగావున నే దానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు; గావున వసుంధరా దానం బిచ్చితి; వుభయలోకంబులం గీర్తి సుకృతం బులు పడయు" మని పలికి య మ్మాయావటుం డిట్లనియె.

8-617-కంద పద్యము

ఇది యేమి వేఁడితని నీ
మది వగవక ధారవోయుమా; సత్యము పెం
పొదవఁగ గోరిన యర్థం
బిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్.

8-618-వచనము

అని పలికిన వటుని పలుకులకు హర్ష నిర్భర చేతస్కుండై వైరోచ నుండు.

8-619-ఆటవెలది

పుట్టి నేర్చుకొనెనొ పుట్టక నేర్చెనో
చిట్టి బుద్ధు లిట్టి పొట్టివడుగు
పొట్ట నున్న వెల్ల బూమెలు నని నవ్వి
యెలమి ధరణి దాన మిచ్చె నపుడు.

8-620-ఆటవెలది

గ్రహ మునీంద్ర సిద్ధ గంధర్వ కిన్నర
యక్ష పక్షి దేవతాహి పతులు
పొగడి రతని పెంపుఁ; బుష్పవర్షంబులు
గురిసె దేవతూర్యకోటి మొరసె.

8-621-వచనము

ఇట్లు ధారా పరిగ్రహంబు చేసి.

## 8-79- త్రివిక్రమస్ఫురణంబు

8-622-శార్దూల విక్రీడితము

ఇంతింతై, వటుఁడింతయై మఱియుఁ దా నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.

8-623-మత్తేభ విక్రీడితము

రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.

8-624-వచనము

ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకంబగు విశ్వరూపంబు ధరియించి భువియును, నభంబును, దివంబును, దిశలును, దిశాఛిద్రంబు లును, సముద్రంబులునుఁ, జలదచల భూతనివహంబులుం దానయై యేకీభవించి, క్రమక్రమంబున భూలోకంబునకుం బొడవై భువర్లో కంబు నతిక్రమించి, సువర్లోకంబును దలకడచి, మహర్లోకంబు దాఁటి, జనలోకంబునకు మీఁదై, తపంబునకు నుచ్ఛ్రితుండై, సత్యలోకంబు కంటె నౌన్నత్యంబు వహించి, యెడ లిఱుములు సందులు రంధ్ర ములు లేకుండ నిండి, మహాదేహ మహితుండై చరణతలంబున రసాతలంబునుఁ, బాదంబుల మహియును, జంఘుల మహీధ్రంబు లును, జానువులఁ బతత్రిసముదయంబులును, నూరువుల నింద్రసేన మరుద్గణంబులును, వాసస్థ్సలంబున సంధ్యయు, గుహ్యంబునఁ బ్రజాపతులును, జఘనంబున దనుజులును, నాభిని నభంబును, నుదరంబున నుదధిసప్తకంబును, నురంబున దారకానికరంబును, హృదయంబున ధర్మంబును, నురోజంబుల బుతసత్యంబులును, మనంబునఁ జంద్రుండును, వక్షంబున గమలహస్త యగు లక్ష్మియుఁ, గంఠంబున సామాది సమస్త వేదంబులును, భుజంబులఁ బురంద రాది దేవతలునుఁ, గర్ణంబుల దిశలును, శిరంబున నాకంబును, శిరో జంబుల మేఘంబులును, నాసాపుటంబున వాయువును, నయ నంబుల సూర్యుండును,

వదనంబున వహ్నియు, వాణి నఖిలచ్ఛంద స్సముదయంబును, రసనంబున జలేశుండును, భ్రూయుగళం బున విధినిషేధంబులును, ఱెప్పల నహోరాత్రంబులును, లలాటం బునఁ గోపంబును, నధరంబున లోభంబును, స్పర్శంబునఁ గామం బును, రేతంబున జలంబును, బృష్ఠంబున నధర్మంబును, గ్రమణం బుల యజ్ఞంబులును, ఛాయల మృత్యువును, నగవులవలన ననేక మాయావిశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశం బుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, బ్రాణం బుల దేవర్షిగణంబులును, గాత్రంబున జంగమ స్థావర జంతు సంఘం బులును గలవాఁడయి, జలధరనినద శంఖ శార్ఙ్గ సుదర్శన గదాదండ ఖ డ్గాక్షయ బాణతూణీర విభ్రాజితుండును, మకరకుండల కిరీట కే యూర హార కటక కంకణ కౌస్తుభమణి మేఖలాంబర వనమాలికా విరాజితుండును, సునంద నంద జయ విజయ ప్రముఖ పరిచర వాహినీ సందోహ పరివృతుండును, నమేయ తేజోవిరాజితుండును, నై బ్రహ్మండంబు దన మేనికప్పు తెఱంగున నుండ విజృంభించె.

8-625-మత్తేభ విక్రీడితము

ఒక పాదంబున భూమి గప్పి దివి వే ఱొంటన్ నిరోధించి యొం
డొకటన్ మీఁది జగంబు లెల్లఁ దొడి, నొండొంటిన్ విలంఘించి. ప
ట్టక బ్రహ్మండకటాహముం బెటిలి వేండ్రంబై పరుల్ గానరా
కొకఁడై వార్ధ్రుగలభ్యుఁడై హరి విభుం డొప్పారె విశ్వాకృతిన్.

8-626-ఆటవెలది

ఒక పదంబు క్రింద నుర్వి పద్మము నంటి

కొన్న పంకలవము కొమరుఁ దాల్చె;
నొకటి మీఁదఁ దమ్మి కొదిఁగిన తేఁటినా
వెలసె మిన్ను నృప! త్రివిక్రమమున.

8-627-వచనము

తత్సమయంబున.

8-628-ఆటవెలది

జగము లెల్ల దాఁటి చనిన త్రివిక్రము
చరణనఖర చంద్ర చంద్రికలను
బొనుఁగు పడియె సత్యమున బ్రహ్మతేజంబు
దివసకరుని రుచుల దివియ బోలె.

8-629-సీస పద్యము

భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ;
గాపురంబులు చేయు ఘనులు రాజు
లా మరీచ్యాదులు, నా సనందాదులు;
నా దివ్యయోగీంద్రు లచట నెపుడు
మూర్తిమంతంబులై మ్రాయు పురాణ త;
ర్కామ్నాయ నియమేతిహాస ధర్మ
సంహితాదులు గురుజ్ఞానాగ్ని నిర్దగ్ధ;
కర్ములై మఱియును గలుగునట్టి

8-629.1-తేటగీతి

వారల లెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు
నంఘ్రిఁ జూచి మ్రొక్కి రధిక భక్తిఁ
దమ మనంబు లందుఁ దలచు నిధానంబుఁ
గంటి మనుచు నేఁడు మంటి మనుచు.

8-630-మత్తేభ విక్రీడితము

తన పుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం
బు నిరీక్షించి నటించి యున్నత పదంబుం జూచి తత్పాదసే
చనముం జేసెఁ గమండలూదకములం జల్లించి; తత్తోయముల్
వినువీథిం బ్రవహించె దేవనదినా విశ్వాత్మకీర్తిప్రభన్.

8-631-వచనము

తత్సమయంబున.

8-632-సీస పద్యము

యోగమార్గంబున నూహించి బహువిధ;
పుష్పదామంబులఁ బూజ చేసి
దివ్యగంధంబులుఁ దెచ్చి సమర్పించి;
ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి
భూరి లాజాక్షతంబులు జల్లి ఫలములుఁ;
గానిక లిచ్చి రాగములఁ బొగడి
శంఖాదిరవములు జయఘోషములుఁ జేసి;
కరుణాంబునిధి! త్రివిక్రమ! యటంచు

8-632.1-ఆటవెలది

బ్రహ్మ మొదలు లోకపాలురుఁ గొనియాడి;
రెల్ల దిశల వనచరేశ్వరుండు
జాంబవంతుఁ డరిగి చాటె భేరిధ్వని
వెలయఁ జేసి విష్ణు విజయ మనుచు.

8-633-కంద పద్యము

అన్నిజగంబులఁ దానై
యున్న జగన్నాథుఁ జూడ నొగి భావింపం
గన్నందక మన మందక
సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియున్.

## 8-80- దానవులువామనుపైకెళ్ళుట

8-634-వచనము

అంత నయ్యన పూర్వప్రకారంబున వామనాకారంబు వహించి యున్న వామనునిం గని "పదత్రయ వ్యాజంబున నితండు సకల మహీ మండలంబు నాక్రమించె కపటవటురూప తిరోహితుండగు విష్ణుండని యెఱుంగక మన దానవేంద్రుఁడు సత్యసంధుండు గావున మాటఁ దిరుగక యిచ్చె నతని వలన నేరంబు లేదు ఈ కుబ్జుం డప్రతిహాత తేజః ప్రభావంబున సజ్జకట్టుగా ని జ్జగంబులం బరిగ్రహించి, పర్జన్యా దులకు విసర్జనంబు చేయందలంచి యున్నవాఁ, డీ పాఱునిం దూఱి పాఱనీక నిర్జించుటఁ గర్జం" బని తర్జనంబులును గర్జనంబులునుఁ జేయుచు, వజ్రాయుధాధి మరుజ్జేతలగు హేతి ప్రహేతి విప్రచిత్తిము ఖ్యులయిన రక్కసులు పెక్కం డ్రుక్కుమిగిలి యుద్ధంబునకు సన్న

ధులై పరశు పట్టిస భల్లాది సాధనంబులు ధరియించి కసిమెసంగి ముసిరికొని దశదిశలఁ బ్రసరించినఁ జూచి హరిపరిచరులు సునంద నంద జయ జయంత విజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్క్ష్య పుష్పదంత విష్వక్సేన శ్రుతదేవ సాత్వత ప్రముఖులగు దండనాథు లయుత వేదండ సముద్దండ బలులుఁ దమతమ యూ థంబుల నాయుధంబులతోడం గూర్చుకొని దానవానీకంబులం బర లోకంబున కనుచువారలై వారల నెదుర్కొని కదనంబునకున్ బర వసంబు చేయుచున్నం గనుంగొని శుక్రుశాపంబుఁ దలంచి దనుజ వల్లభుం డిట్లనియె.

8-635-సీస పద్యము

రాక్షసోత్తములార! రండు పోరాడక;
 కాలంబు గాదిది కలహమునకు;
సర్వభూతములకు సంపదాపదలకు;
 బ్రభువైన దైవంబుఁ బరిభవింప
మన మోపుదుమె? తొల్లి మనకు రాజ్యంబును;
 సురలకు నాశంబు నొరిది నిచ్చి
విపరీతముగఁ జేయు వేల్పు నే మందము;
 మనపాలి భాగ్యంబు మహిమ గాక;

8-635.1-తేటగీతి

వెఱచి పలుమాఱుఁ బాఱెడి విష్ణుభటులు
మిమ్ము నెగచుట దైవంబు మేర గాదె?
మనకు నెప్పుడు దైవంబు మంచిదగును

నాఁడు గెలుతుము పగవారి నేఁడు వలదు.

8-636-వచనము

అదియునుం గాక.

8-637-కంద పద్యము

పలు దుర్గంబులు సచివులు
బలములు మంత్రౌషధములు బహు శేముషియుం
గలిగియు సామోపాయం
బులఁ గాల మెఱింగి నృపుడు పోరుట యొప్పున్.

## 8-81- బలినిబంధించుట

8-638-వచనము

అట్లు గావున రణంబున శత్రుల కిప్పు డెదురు మోహరించుట కార్యంబుఁ గాదు; మనకుం దగు కాలంబున జయింతము; నలంగక తొలంగుం డనిన దలంగి భాగవత భట భీతులై చిక్కి రక్కసులు రసా తలంబునకుం జని; రంత హరి హృదయం బెఱింగి తార్క్ష్యనందనుండు యాగసుత్యాహంబున వారుణ పాశంబుల నసురవల్లభుని బంధించెను; అంత.

8-639-కంద పద్యము

బాహులుఁ బదములుఁ గట్టిన
శ్రీహరి కృపగాక యేమి జేయుదు నని సం
దేహింపక బలి నిలిచెను
హాహారవ మెసఁగె దశ దిగంతములందున్.

8-640-కంద పద్యము

సంపద చెడియును దైన్యము
గంపంబును లేక తొంటికంటెను బెంపుం
దెంపును నెఱుకయు ధైర్యము
వంపని సురవైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్.

8-641-సీస పద్యము

దానవ! త్రిపదభూతల మిత్తు నంటివి;
ధరణిఁ జంద్రార్కు లెందాఁక నుందు
రంత భూమియు నొక్క యడుగయ్యె నాకును;
స్వర్లోకమును నొక్క చరణమయ్యె;
నీ సొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు;
గడమ పాదమునకుఁ గలదె భూమి?
యిచ్చెద నన్నర్థ మీని దురాత్ముండు;
నిరయంబు బొందుట నిజముగాదె?

8-641.1-తేటగీతి

కాన దుర్గతికినిఁ గొంత కాల మరుగు
కాక యిచ్చెదవేని వేగంబ నాకు
నిపుడ మూఁడవ పదమున కిమ్ముఁ జూపు
బ్రాహ్మణాధీనములు ద్రోవ బ్రహ్మవశమె?

8-642-వచనము

అని యిట్లు వామనుండు పలుక సత్యభంగ సందేహ విషదిగ్ధ శల్య నికృత్త హృదయుం డయ్యును విషణ్ణుండుఁ గాక వైరోచని ప్రసన్న వదనంబుతోడఁ జిన్ని ప్రోడ వడుగున కి ట్లనియె.

8-643-ఆటవెలది

సూనృతంబుఁ గాని నుడియదు నా జిహ్వ
బొంకఁజాల; నాకు బొంకు లేదు;
నీ తృతీయపదము నిజము నా శిరమున
నెలవు జేసి పెట్టు నిర్మలాత్మ!

8-644-ఆటవెలది

నిరయమునకుఁ బ్రాప్త నిగ్రహంబునకును
బదవిహీనతకును బంధనమున
కర్థ భంగమునకు నఖిల దుఃఖమునకు
వెఱవ దేవ! బొంక వెఱచినట్లు.

8-645-వచనము

అదియునుం గాక.

8-646-సీస పద్యము

తల్లిదండ్రులు నన్నదమ్ములు జెలికాండ్రు;
గురువులు శిక్షింపఁ గొఱతపడునె?
పిదప మేలగుఁ గాక; పృథుమదాంధులకును;
దానవులకు మాకుఁ దఱియెఱింగి

విభ్రంశచక్షువు వెలయ నిచ్చుటఁ జేసి;
 గురువులలోనాదిగురువ వీవ;
నీవు బంధించిన నిగ్రహమో లజ్జ
 యో నష్టియో బాధయో తలంప

8-646.1-తేటగీతి

నిన్ను నెదిరించి పోరాడి నిర్జరాదు
లాదియోగీంద్రు లందెడు నట్టి టెంకి
నందరే తొల్లి పెక్కండ్రు? హర్షమూర్తి!
యీశ! నీ యెడ దుర్లభ మేమి కలదు?

8-647-మత్తేభ విక్రీడితము

చెలియే మృత్యువు? చుట్టమే యముఁడు? సంసేవార్థులే కింకరుల్?
శిలలం జేసెనె బ్రహ్మదన్ను? దృఢమే జీవంబు? నో చెల్లరే;
చలితం బౌట యెఱుంగ కీ కపట సంసారంబు నిక్కంబుగాఁ
దలఁచున్ మూఢుఁడు సత్యదాన కరుణాధర్మాదినిర్ముక్తుఁడై.

8-648-సీస పద్యము

చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు;
 కాంతలు సంసార కారణములు;
ధనము లస్థిరములు; దను వతి చంచల;
 గార్హ్యార్థు లన్యులు; గడచుఁగాల
మాయువు; సత్వర మైశ్వర్య మతి శీఘ్రు;
 మని కాదె తమ తండ్రి నతకరించి

మా తాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు;
నీ పాదకమలంబు నియతిఁ జేరె

8-648.1-తేటగీతి

భద్రుఁ డతనికి మృతి లేని బ్రతుకుఁ గలిగె
పైరులై కాని తొల్లి మా వారుఁ గాన
రర్థిపై వచ్చి నీవు న న్నడుగు టెల్ల
బద్మలోచన! నా పుణ్య ఫలము గాదె?

8-649-వచనము

అని యిట్లు పలుకుచున్న యవసరంబున.

8-650-శార్దూల విక్రీడితము

ఆ దైత్యేంద్రుఁడు పీనవక్షు, నవపద్మాక్షుం, బిశంగాంబరా
చ్ఛాదున్. నిర్మలసాధువాదు. ఘనసంసారాదివిచ్ఛేదు. సం
శ్రీదున్, భక్తిలతాధిరోహిత హరిశ్రీపాదు, నిఃఖేదుఁ, బ్ర
హ్లాదున్ బోధకళావినోదుఁ గనియెన్ హర్షంబుతో ముందటన్

## 8-82- ప్రహ్లాదాగమనము

8-651-వచనము

ఇట్లు సమాగతుండైన తమ తాతం గనుఁగొని విరోచన నందనుండు వారుణపాశబద్ధుండుఁ గావునఁ దనకుం దగిన నమస్కారంబు జేయ రామింజేసి సంకులాశ్రువిలోల లోచనుండై సిగ్గుపడి నత శిరస్కుండై నమ్రభావంబున మ్రొక్కు చెల్లించె; నంతఁ బ్రహ్లాదుఁడు ముఖమండ పంబున సునందాది పరిచర సమేతుండై

కూర్చున్న వామనదేవునిం గని యానంద బాష్పజలంబులుఁ బులకాకుంరంబులున్ నెరయ దండప్రణామం బాచరించి యిట్లని విన్నవించె.

8-652-సీస పద్యము

ఇతనికి మున్ను నీ వింద్రపదం బిచ్చి;
 నేఁడు త్రిప్పుటయును నెఱయమేలు
మోహనా హంకృతి మూలంబు గర్వాంధ;
 తమస వికారంబు దాని మాన్పి
కరుణ రక్షించుటఁగాక బంధించుటే?;
 తత్త్వజ్ఞునకు మహేంద్రత్వమేల?
నీ పాదకమలంబు నియతిఁ గొల్చిన దాని;
 బోలునే సురరాజ్య భోగపరత?

8-652.1-తేటగీతి

గర్వ మేపారఁ గన్నులు గానరావు;
చెవులు వినరావు; చిత్తంబు చిక్కుపడును;
మఱచు నీ సేవలన్నియు మహిమ మాన్పి
మేలు చేసితి నీ మేటి మేర చూపి.

8-653-వచనము

అని పలికి జగదీశ్వరుండును నిఖిలలోక సాక్షియు నగు నారాయణ దేవునకు నమస్కరించి, ప్రహ్లాదుండు పలుకు చున్న సమయం బున.

8-654-మత్తేభ విక్రీడితము

తతమత్తద్విపయాన యై కుచ నిరుంధచ్చోళ సంవ్యానయై
ధృత భాష్పాంబు వితాన యై కరయుగాధీ నాలిక స్థానయై
పతిభిక్షాం మమ దేహి కోమలమతే! పద్మాపతే! యంచుఁ ద
త్సతి వింధ్యావళి చేరవచ్చెఁ ద్రిజగ ద్రక్షామనున్ వామనున్.

8-655-వచనము

వచ్చి యచ్చేడియ తచ్చరణ సమీపంబునం బ్రణతయై నిలువంబడి యిట్లనియె.

8-656-కంద పద్యము

నీకుం గ్రీడార్థము లగు
లోకంబులఁ జూచి పరులు లోకులు కుమతుల్
లోకాధీశుల మందురు
లోకములకు రాజవీవ లోకస్తుత్యా!

8-657-కంద పద్యము

కా దనఁడు పొమ్ము లే దీ
రా దనఁడు జగత్త్ర యైక రాజ్యము నిచ్చెన్
నా దయితుఁ గట్టనేటికి?
శ్రీదయితాచిత్తచోర! శ్రితమందారా!

## 8-83- హిరణ్యగర్భాగమనము

8-658-వచనము

అని యిట్లు వింధ్యావళియుం బ్రహ్లాదుండును విన్నవించు నవసరం బున హిరణ్యగర్భుండు చనుదెంచి యిట్లనియె.

8-659-సీస పద్యము

భూతలోకేశ్వర! భూతభావన! దేవ!;
 దేవ! జగన్నాథ! దేవవంద్య!
తన సొమ్ము సకలంబుఁ దప్పక నీ కిచ్చె;
 దండయోగ్యుఁడు గాడు దానపరుఁడుఁ;
గరుణింప నర్హుండు గమలలోచన! నీకు;
 విడిపింపు మీతని వెరపు దీర;
తోయపూరము చల్లి దూర్వాంకురంబులఁ;
 జేరి నీ పదము లర్చించునట్టి

8-659.1-తేటగీతి

భక్తియుక్తుఁడు లోకేశుపదము నందు
నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేఁడ
నెఱిఁగి తన రాజ్య మంతయు నిచ్చి నట్టి
బలికిఁ దగునయ్య! దృఢపాశబంధనంబు?

8-660-వచనము

అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డిట్లనియె.

8-661-సీస పద్యము

ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛయించితి వాని;
 యఖిల విత్తంబు నే నపహరింతు
సంసార గురుమద స్తబ్ధుఁడై యెవ్వఁడు;
 దెగడి లోకము నన్ను ధిక్కరించు

నతఁ డెల్ల కాలంబు నఖిల యోనుల యందుఁ;
 బుట్టుచు దుర్గతిఁ బొందుఁ బిదప
విత్త వయో రూప విద్యా బలైశ్వర్య;
 కర్మ జన్మంబుల గర్వ ముడిగి

8-661.1-తేటగీతి

యేక విధమున విమలుఁడై యెవ్వఁ డుండు
వాఁడు నా కూర్చి రక్షింపవలయువాఁడు;
స్తంభ లోభాభిమాన సంసార విభవ
మత్తుఁడై చెడ నొల్లఁడు మత్పరుండు.

8-662-శార్దూల విక్రీడితము

బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధుప్రజత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవక్షీణుండునై పేదయై
శుద్ధత్వంబును సత్యముం గరుణయున్ సొంపేమియుం దప్పఁ డు
ద్బుద్ధుండై యజయాఖ్యమాయ గెలిచెం బుణ్యుం డితం డల్పుఁడే.

8-663-ఆటవెలది

అసురనాథుఁ డనుచు ననఘుని మర్యాద
యేను జూత మనుచు నింత వలుక
నిజము పలికె నితఁడు నిర్మలాచారుండు
మేలుమేలు నాకు మెచ్చువచ్చు.

8-84- రాక్షసుల సుతలగమనంబు

8-664-కంద పద్యము

సావర్ణి మనువు వేళను
దేవేంద్రుండగు నితండు దేవతలకు; దు
ర్భావిత మగు నా చోటికి
రావించెద; నంతమీఁద రక్షింతు దయన్.

8-665-కంద పద్యము

వ్యాధులుఁ దప్పులు నొప్పులు
బాధలుఁ జెడి విశ్వకర్మభావిత దనుజా
రాధిత సుతలాలయమున
నేధిత విభవమున నుండు నితఁ డందాకన్.

8-666-వచనము

అని పలికి బలిం జూచి భగవంతుం డి ట్లనియె.

8-667-సీస పద్యము

సేమంబు నీ కింద్రసేన మహారాజ!;
వెఱవకు మేలు నీ వితరణంబు;
వేలుపు లం దుండ వేడుక పడుదురు;
దుఃఖంబు లిడుములు దుర్మరణము
లాతురతలు నొప్పు లందుండు వారికి;
నొందవు సుతల మందుండు నీవు;
నీ వంపు జేయని నిర్జరారాతుల;
నా చక్ర మేతెంచి నఱకుచుండు;

8-667.1-ఆటవెలది

లోకపాలకులకు లోనుగా వక్కడ
నన్ను లెంతవార లచట? నిన్ను
నెల్ల ప్రొద్దు వచ్చి యేను రక్షించెదఁ
గరుణతోడ నీకుఁ గానవత్తు.

8-668-కంద పద్యము

దానవ దైత్యుల సంగతిఁ
బూనిన నీ యసురభావమును దోడ్తో మ
ద్ధ్యానమునఁ దలఁగి పోవును
మానుగ సుతలమున నుండుమా మా యాజ్ఞన్.

8-669-వచనము

అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తుల ముదుకవేల్పు తియ్యని నెయ్యంపుఁ పలుకుఁ జెఱకు రసంపుసోనలు వీనుల తెరువులం జొచ్చి లోను బయలు నిండి కప్పల కప్పు దప్పం ద్రోచికొని కనుఁ గవ కొలంకుల నలుగులు వెడలిన చందంబున సంతసంబునం గన్నీరు మున్నీరై పఱవ, నురః ఫలకంబునం బులకంబులు కులకం బులయి తిలకంబు లొత్తఁ, గేలు మొగిడ్చి నెక్కొన్న వేడుకం ద్రొక్కుడు పడుచుఁ జిక్కని చిత్తంబునఁ జక్కని మాటల రక్కసుల ఱేఁ డిట్లనియె.

8-670-ఉత్పలమాల

ఎన్నఁడు లోకపాలకుల నీ కృపఁ జూడని నీవు నేఁడు న
న్నున్నతుఁ జేసి నా బ్రతుకు నోజయు నానతి యిచ్చి కాచి తీ

మన్నన లీ దయారసము మాటలు పెద్దఱికంబుఁ జాలవే?
పన్నగతల్ప! నిన్నెఱిఁగి పట్టిన నాపదఁ గల్గనేర్చునే?

8-671-వచనము

అని పలికి హరికి నమస్కరించి బ్రహ్మకుం బ్రణామంబు జేసి, యిందు ధరునకు వందనం బాచరించి, బంధవిముక్తుండై తన వారలతోఁ జేరికొని బలి సుతలంబునకుం జనియె; నంత హరి కృపావశంబునం గృతార్థుండై కులోద్ధారకుం డయిన మనుమనిం గని సంతోషించి ప్రహ్లాదుండు భగవంతున కిట్లనియె.

8-672-సీస పద్యము

చతురాననుఁడు నీ ప్రసాదంబు గానఁడు;
 శర్వుఁడీ లక్ష్మల జాడఁ బొందఁ,
డన్యుల కెక్కడి? దసురులకును మాకు;
 బ్రహ్మదిపూజితపదుఁడ వయిన
దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడ వైతి;
 పద్మజాదులు భవత్పాదపద్మ
మకరంద సేవన మహిమ నైశ్వర్యంబు;
 లందిరి కాక యే మల్పమతుల

8-672.1-తేటగీతి

మధిక దుర్యోనులము కుత్సితాత్మకులము
నీ కృపాదృష్టిమార్గంబు నెలవు చేర
నేమి తప మాచరించితి మెన్నఁగలమె?
మమ్ముఁ గాచుట చిత్రంబు మంగళాత్మ!

8-673-వచనము

అదియునుం గాక.

8-674-ఆటవెలది

సర్వగతుఁడ వయ్యు సమదర్శనుఁడ వయ్యు
నొకట విషమవృత్తి నుండు దరయ
నిచ్ఛలేనివారి కీవు భక్తులు గోరు
తలఁపు లిత్తు కల్పతరువు మాడ్కి.

8-675-వచనము

అని విన్నవించుచున్న ప్రహ్లాదుం జూచి పరమ పురుషుం డిట్లనియె.

8-676-తేటగీతి

వత్స! ప్రహ్లాద! మేలు నీ వారు నీవు
సొరిది మనుమనిఁ దోడ్కొని సుతలమునకుఁ
బయనమై పొమ్ము నే గదాపాణి నగుచుఁ
జేరి రక్షింప దురితంబు చెంద దచట.

8-677-వచనము

అని యిట్లు నియమించినం బరమేశ్వరునకు నమస్కరించి వలగొని కరకమల పుట ఘటిత నిటల తటుండయి, వీడ్కొని, బలిం దోడ్కొని సక లాసురయూథంబునుం దాను నొక్క మహాబిలద్వారంబు చొచ్చి ప్రహ్లాదుండు సుతల లోకంబునకుం జనియె; నంత బ్రహ్మవాదు లయిన యాజకుల సభామధ్యంబునం గూర్చున్న శుక్రునిం జూచి నారాయణుం డి ట్లనియె.

## 8-85- బలియజ్ఞమువిస్తరించుట

8-678-ఆటవెలది

ఏమిఁ గొఱత పడియె నీతని జన్నంబు
విస్తరింపు కడమ విప్రవర్య!
విషమ మయిన కర్మ విసరంబు బ్రాహ్మణ
జనులు చూచినంత సమతఁ బొందు.

8-679-వచనము

అనిన శుక్రుం డి ట్లనియె.

8-680-సీస పద్యము

అఖిల కర్మంబుల కధినాథుఁడవు నీవ;
యజ్ఞేశుఁడవు నీవ యజ్ఞపురుష!
ప్రత్యక్షమున నీవు పరితుష్టి నొందినఁ;
గడ మేలఁ కల్గు నే కర్మములకు?
ధనదేశకాలార్హతంత్రమంత్రంబులఁ;
గొఱఁతలు నిన్నుఁ బేర్కొనిన మాను;
నయినఁ గావింతు నీ యానతి భవదాజ్ఞ;
మెలఁగుట జనులకు మేలుఁ గాదె?

8-680.1-తేటగీతి

యింతకంటెను శుభము నా కెచటఁ గలుగు
ననుచు హరిపంపు శిరమున నావహించి

కావ్యుఁ డసురేంద్రు జన్నంబు కడమఁ దీర్చె
మునులు విప్రులు సాహాయ్యమునఁ జరింప.

8-681-వచనము

ఇ వ్విధంబున వామనుం డయి హరి బలి నడిగి, మహిం బరిగ్రహించి, తనకు నగ్రజుండగు నమరేంద్రునకుం ద్రిదివంబు సదయుం డయి యొసంగె; న త్తరి దక్ష భృగు ప్రముఖ ప్రజాపతులును, భవుండును, గుమారుండును, దేవర్షి, పితృగణంబులును, రాజులును, దానును గూడికొని చతురాననుండు గశ్యపునకు నదితికి సంతోషంబుగా లోకంబులకు లోకపాలురకు "వామనుండు వల్లభుం" డని నియమించి యంత ధర్మంబునకు యశంబునకు లక్ష్మికి శుభంబులకు దేవత లకు వేదంబులకు వ్రతంబులకు స్వర్గాపవర్గంబులకు "నుపేంద్రుండు ప్రధానుం" డని సంకల్పించె నా సమయంబున.

8-682-కంద పద్యము

కమలజుఁడు లోకపాలురు
నమరేంద్రునిఁగూడి దేవయానంబున న
య్యమరావతికిని వామను
నమరం గొనిపోయి రంత నట మీఁద నృపా!

8-683-ఆటవెలది

బల్లిదంపుదోడు ప్రాపున నింద్రుని
కింద్రపదము చేరు టిట్లు గలిగెఁ;
దనకు నాఢ్యుఁడైన తమ్ముఁడుఁ గలిగినఁ
గోర్కులన్న కేల కొఱఁత నొందు?

8-684-కంద పద్యము

పా లడుగఁడు మే లడుగం
డేలఁడు బిక్షించి యన్నకిచ్చెఁ ద్రిజగమున్
వేలుపులతల్లి కడపటి
చూలుం బోలంగఁ గలరె సొలయని తమ్ముల్.

8-685-ఆటవెలది

కడుపు బదరగాఁగ గొడుకులఁ గనుకంటె
దల్లి కొకఁడె చాలు బల్లిదుండు;
త్రిదశగణముఁ గన్న యదితి గానుపు దీఱఁ
జిన్న మేటివడుగుఁ గన్న యట్లు.

8-686-వచనము

ఇట్లు దేవేంద్రుండు వామన భుజపాలితం బగు త్రిభువనసామ్రాజ్య విభవంబు మరల నంగీకరించె; నప్పుడు బ్రహ్మయు, శర్వుండునుఁ, గుమారుండును, భృగు ప్రముఖులయిన మునులునుఁ, బితృదేవత లును, దక్షాది ప్రజాపతులును, సిద్ధులును, వైమానికులును మఱి యుం దక్కిన వారలును బరమాద్భుతబైన విష్ణుని సుమహాకర్మం బులకు నాశ్చర్యంబు నొందుచుఁ, బ్రశంసించుచు, నాడుచుం, బాడుచు, తమతమ నివాసంబులకుం జని;" రని చెప్పి శుకుం డి ట్లనియె.

8-687-తేటగీతి

మనుజనాథ! త్రివిక్రము మహిమ కొలఁది
యెఱుఁగఁ దర్కింప లెక్కింప నెవ్వఁడోపుఁ?

గుంభినీ రేణుకణములు గుఱుతు పెట్టు
వాఁడు నేరఁడు; తక్కిన వారి వశమె?

8-688-కంద పద్యము

అద్భుత వర్తనుఁడగు హరి
సద్భావితమైన విమలచరితము వినువాఁ
డుద్భట విక్రముఁడై తుది
నుద్భాసితలీలఁ బొందు నుత్తమ గతులన్.

8-689-తేటగీతి

తగిలి మానుష పైతృక దైవ కర్మ
వేళలందుఁ ద్రివిక్రమ విక్రమంబు
లెక్క డెక్కడఁ గీర్తింతు రెవ్వరేనిఁ
బొందుదురు నిత్య సౌఖ్యంబు భూవరేంద్ర!

8-690-మత్తేభ విక్రీడితము

జడులై నాకముఁ గోలుపోవు సురలం జంభారినిం బ్రోవఁగా
వడుగై భూమి బదత్రయం బిడుటకై వైరోచనిన్ వేఁడి రెం
డడుగుల్ సాఁచి త్రివిక్రమస్ఫురణ బ్రహ్మాండంబుఁ దా నిండుచుం
గడు మోదంబున నుండు వామనున కెక్కాలంబునన్ మ్రొక్కెదన్.

8-691-వచనము

అని యిట్లు శుకుండు రాజునకు వామనావతారచరితంబు చెప్పెనని సూతుండు మునులకుం జెప్పిన విని, వార లతని కిట్లనిరి.

## 8-86- మత్స్యావతారకథాప్రారంభం

8-692-సీస పద్యము

విమలాత్మ! విన మాకు వేడ్క యయ్యెడి; మున్ను;
 హరి మత్స్యమైన వృత్తాంతమెల్లఁ;
గర్మబద్ధుని భంగి ఘనుఁ డీశ్వరుఁడు లోక;
 నిందితంబై తమోనిలయమైన
మీనరూపము నేల మే లని ధరియించె?;
 నెక్కడ వర్తించె? నేమి చేసె?
నాద్యమై వెలయు న య్యవతారమునకు నె;
 య్యది కారణంబు? గార్యాంశ మెట్లు?

8-692.1-ఆటవెలది

నీవు దగుదు మాకు నిఖిలంబు నెఱిఁగింపఁ
దెలియఁ జెప్పవలయు, దేవదేవు
చరిత మఖిలలోక సౌభాగ్య కరణంబు
గాదె? విస్తరింపు క్రమముతోడ.

8-693-వచనము

అని మునిజనంబులు సూతు నడిగిన నతం డిట్లనియె మీర లడిగిన యీ యర్థంబుఁ బరీక్షిన్నరేంద్రుం డడిగిన భగవంతుం డగు బాదరా యణి యిట్లనియె.

8-694-సీస పద్యము

విభుఁ డీశ్వరుఁడు వేదవిప్రగోసురసాధు;

ధర్మార్థములఁ గావఁ దనువుఁ దాల్చి,
గాలిచందంబున ఘనరూపములయందుఁ;
దనురూపములయందుఁ దగిలియుండు;
నెక్కువఁ దక్కువ లెన్నఁడు నొందక;
నిర్గుణత్వంబున నెఱియు ఘనుఁడు;
గురుతయుఁ గొఱఁతయు గుణసంగతివహించు;
మనుజేశ! చోద్యమే మత్స్య మగుట?

8-694.1-తేటగీతి

వినుము పోయిన కల్పాంతవేళఁ దొల్లి
ద్రవిళదేశపురాజు సత్యవ్రతుండు
నీరు ద్రావుచు హరిఁగూర్చి నిష్ఠతోడఁ
దపముఁ గావించె నొకయేటి తటము నందు.

8-695-వచనము

మఱియు, నొక్కనాఁ డమ్మేదినీ కాంతుండు గృతమాలిక యను నేటి పొంత హరిసమర్పణంబుగా జలతర్పణంబు జేయు చున్న సమ యంబున నా రాజు దోసిట నొక్క మీనుపిల్ల దవిలివచ్చిన నులికిపడి, మరలం దరంగిణీ జలంబు నందు శకుల శాబకంబు విడిచె; నట్లు విడి వడి నీటిలో నుండి జలచరపోతంబు భూతలేశ్వరున కి ట్లనియె.

8-696-మత్తకోకిలము

పాటువచ్చిన జ్ఞాతి ఘాతులు పాపజాతి ఝషంబు లీ
యేటఁ గొండొక మీనుపిల్లల నేఱి పట్టి వధింప న

చ్చోటు నుండక నీదు దోసిలి చొచ్చి వచ్చిన నన్ను న
ట్టేటఁ ద్రోవఁగఁ బాడియే? కృప యింత లేక దయానిధీ!

8-697-ఆటవెలది

వలలు దారు నింక వచ్చి జాలరి వేఁట
కాలు నేలు గలఁచి కారపెట్టి
మిడిసి పోవనీక మెడఁ బట్టుకొనియెద;
రప్పు డెందుఁ జొత్తు? ననఘచరిత!

8-698-కంద పద్యము

భక్షించు నొండె ఝుషములు
శిక్షింతురు ధూర్తు లొండెఁ; జెడకుండ ననున్
రక్షింపు దీనవత్సల!
ప్రక్షీణులఁ గాచుకంటె భాగ్యము గలదే?

8-699-వచనము

అనిన విని కరుణాకరుండగు న వ్విభుండు మెల్లన య య్యంభశ్చర డింభకంబునుఁ గమండలు జలంబునం బెట్టి తన నెలవునకుం గొని పోయె, నదియు నొక్క రాత్రంబునం గుండిక నిండి తనకు నుండ నిమ్ము చాలక రాజన్యున కి ట్లనియె.

8-700-కంద పద్యము

ఉండ నిదిఁ గొంచె మెంతయు
నొండొకటిం దెమ్ము భూవరోత్తమ! యనుడున్

గండకముఁ దెచ్చి విడిచెను
మండలపతి సలిల కలశ మధ్యమున నృపా!

8-701-వచనము

అదియును ముహూర్తమాత్రంబునకు మూఁడు చేతుల నిడుపై యుదంచంబు నిండి పట్టు చాలక వేఁటొండుఁ దె మ్మనవుడు నా రాచ పట్టి కరుణాగుణంబునకు నాటపట్టుఁ గావున గండకంబు నొండొక్క చిఱుతమడుఁగున నునిచె; నదియు నా సరోవర జలంబునకు నగ్గలం బై తనకు సంచరింప నది గొంచెం బని పలికినం బుడమిఱేడు మంచి వాఁడగుటం జేసి యా కంచరంబు నుదంచిత జలాస్పదంబైన హ్రదం బునందు నిడియె; నదియు నా సలిలాశయంబునకును నధికంబై పెరుఁగ నిమ్ము చాలదని చెప్పికొనిన నప్పుణ్యుం డొప్పెడి నడవడిం దప్పని వాఁడైన కతంబున న మ్మహామీనంబును మహార్ణవంబున విడిచె; నదియును మకరాకరంబునం బడి రాజున కిట్లను "పెను మొ సళ్ళు ముసరికొని కసిమసంగి మ్రింగెడి; నింతకాలంబు నడపి కడ పట దిగవిడువకు వెడలఁ దిగువు" మని యెలింగింప దెలిసి కడపట యన్నిటితిరుగుడు ప్రోడకుం బుడమిఱేఁ డిట్లనియె.

8-702-సీస పద్యము

ఒక దినంబున శతయోజనమాత్రము;
 విస్తరించెదు నీవు; వినము చూడ
మిటువంటి ఝుషముల నెన్నఁడు నెఱుఁగము;
 మీనజాతుల కిట్టి మేను గలదె?
యేమిటి కెవ్వఁడ? వీ లీలఁ ద్రిప్పెదు;
 కరుణ నా పన్నులఁ గావ వేఁడి

యంభశ్చరంబైన హరివి నే నెఱిఁగితి;
 నవ్యయ నారాయణాభిధాన

8-702.1-తేటగీతి

జనన సంస్థితి సంహార చతురచిత్త!
దీనులకు భక్తులకు మాకు దిక్కు నీవ;
నీదు లీలావతారముల్ నిఖిలభూత
భూతి హేతువుల్ మ్రొక్కెదఁ బురుషవర్య!

8-703-కంద పద్యము

ఇతరులముఁ గాము చిత్సం
గతులము మా పాలి నీవుఁ గలిగితి భక్త
స్థితుఁడవగు నిన్ను నెప్పుడు
నతి చేసినవాని కేల నాశముఁ గలుగన్.

8-704-కంద పద్యము

శ్రీలలనాకుచవేదికఁ
గేళీపరతంత్రబుద్ధిఁ గ్రీడించు సుఖా
లోలుఁడవు దామసాకృతి
నేలా మత్స్యంబ వైతి వెఱిఁగింపు హరీ!

## 8-87- మీనావతారుని ఆనతి

8-705-వచనము

అని పలుకు సత్యవ్రత మహారాజునకు నయ్యుగంబు కడపటఁ బ్రళయ వేళ సముద్రంబున నేకాంతజన ప్రీతుండయి విహరింప నిచ్చించి మీన రూపధరుండైన హరి యిట్లనియె.

8-706-సీస పద్యము

ఇటమీఁద నీ రాత్రికేడవదినమునఁ;
 బద్మగర్భున కొక్క పగలు నిండు;
భూర్భువాదిక జగంబులు మూఁడు విలయాబ్ధి;
 లోన మునుంగు; నాలోనఁ బెద్ద
నావ చేరఁగ వచ్చు; నా పంపు పెంపున;
 దానిపై నోషధితతులు బీజ
రాసులు నిడి పయోరాశిలో విహరింపఁ;
 గలవు సప్తర్షులుఁ గలసి తిరుఁగ

8-706.1-ఆటవెలది

మ్రోలఁ గాన రాక ముంచు పెంజీఁకటి
మిడుకుచుండు మునుల మేనివెలుఁగుఁ
దొలకుచుండు జలధి దోధూయమాన మై
నావ దేలుచుండు నరవరేణ్య!

8-707-వచనము

మఱియు న న్నావ మున్నీటి కరళ్ళకు లోనుఁ గాకుండ, నిరుఁ గెలం కుల వెనుక ముందట నేమఱకుండఁ, బెన్నెఱుఁలగు నా గఱులన్ జడి యుచుఁ బొడువ వచ్చిన బలుగ్రాహంబుల నొడియుచు సంచరించెద; ఒక్క పెనుఁబాము చేరువ నా

యనుమతిం బొడచూపెడు దానంజేసి సుడిగాడ్పుల కతంబున నావ వడిం దిరుగంబడకుండ నా కొమ్ము తుదిం పదిలము చేసి నీకునుఁ దపసులకును నలజడి చెందకుండ మున్నీట ని ప్పాటం దమ్మిచూలి రేయి వేగునంతకు మెలంగెద; నది కారణంబుగా జలచర రూపంబుఁ గయికొంటి; మఱియు నొక ప్రయోజనంబుఁ గలదు; నా మహిమ పరబ్రహ్మం బని తెలియుము; నిన్ను ననుగ్రహించితి" నని సత్యవ్రతుండు చూడ హరి తిరోహితుం డయ్యె; అయ్యవసరంబున.

8-708-ఆటవెలది

మత్స్యరూపి యైన మాధవు నుడుగులుఁ
దలఁచికొనుచు రాచతపసి యొక్క
దర్భశయ్యఁ దూర్పుఁ దలగడగాఁ బండి
కాచి యుండె నాఁటి కాలమునకు.

8-709-వచనము

అంతఁ గల్పాంతంబు డాసిన

8-710-కంద పద్యము

ఉల్లసిత మేఘ పంక్తులు
జల్లించి మహోగ్రవృష్టి జడిగొని కురియన్
వెల్లి విరిసి జలరాసులు
చెల్లెలి కట్టలను దాఁటి సీమల ముంచెన్.

## 8-88- కల్పాంతవర్ణన

8-711-వచనము

తదనంతరంబ

8-712-తేటగీతి

మున్ను పోయిన కల్పాంతమున నరేంద్ర!
బ్రహ్మ మనఁగ నైమిత్తిక ప్రళయ వేళ
నింగిపై నిట్టతొలఁకు మున్నీటిలోనఁ
గూలె భూతాళి జగముల కోలఁదు లెడలి.

8-713-వచనము

అంత న మ్మహారాత్రి యందు

8-714-మత్తేభ విక్రీడితము

నెటి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయమున్ నిర్మించి నిర్మించి వీఁ
పిఱయన్ నీల్గుచు నావులించుచు నజుం డే సృష్టియున్ మాని మే
నొఱఁగన్ ఱెప్పలు మూసి కేల్ దలగడై యుండంగ నిద్రించుచున్
గుఱు పెట్టం దొడఁగెం గలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా!

8-715-ఆటవెలది

అలసి సొలసి నిదుర నందిన పరమేష్ఠి
ముఖము నందు వెడలె మొదలి శ్రుతులు
నపహరించె నొక హయగ్రీవుఁ డను దైత్య
భటుఁడు; దొంగఁ దొడర బరుల వశమె?

8-716-కంద పద్యము

చదువులుఁ దన చేఁ బడినం
జదువుచుఁ బెన్ బయల నుండ శంకించి వడిం
జదువుల ముదుకఁడు గూరుకఁ
జదువుల తస్కరుఁడు చొచ్చె జలనిధి కడుపున్.

8-717-వచనము

ఇట్లు వేదంబులు దొంగిలి దొంగరక్కసుండు మున్నీట మునింగిన, వాని జయింపవలసియు, బ్రానుదీఁగెల విత్తనంబుల పొత్తరలు పె న్నీట నాని చెడకుండ మనుపవలసియు నెల్ల కార్యంబులకుం గావలి యగునా పురుషోత్తముం డ ప్పను రేయి చొరుదల యందు.

8-718-కంద పద్యము

కుఱుగఱులు వలుఁద మీసలు
చిఱుదోకయుఁ బసిఁడి యొడలు సిరిగల పొడలున్
నెఱి మొగము నొక్క కొమ్మును
మిఱుచూపులుఁ గలిగి యొక్క మీనం బయ్యెన్.

## 8-89- గురుపాఠీనవిహారణము

8-719-వచనము

ఇట్లు లక్ష యోజనాయతం బయిన పాఠీనంబై విశ్వంభరుండు జలధి చొచ్చి.

8-720-సీస పద్యము

ఒకమాటు జలజంతుయూథంబులోఁగూడు;
నొకమాటు దరులకు నుఱికి వచ్చు;

నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు;
 నొకమాటు లోపల నొదిఁగి యుండు;
నొకమాటు వారాశి నొడలు ముంపమిఁ జూచు;
 నొకమాటు బ్రహ్మాండ మొరయఁ దలఁచు;
నొకమాటు ఋషకోటి నొడిసి యాహారించు;
 నొకమాటు జలముల నుమిసి వైచు;

8-720.1-తేటగీతి

గఱులు సారించు; మీసాలుఁ గడలు కొలుపుఁ;
బొడలు మెఱయించుఁ; గన్నులఁ బొలప మార్చు;
నొడలు జళిపించుఁ దళతళ లొలయ మీన
వేషి పెన్నీట నిగమ గవేషి యగుచు.

## 8-90- కడలిలో నావనుగాచుట

8-721-వచనము

అంతకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీవలయంబు ముంచు నవసరంబున భక్త పరాధీనుం డగు హరిఁ దలంచుచు నుండ నారాయణ ప్రేరితయై యొక్క నావ వచ్చినం గనుంగొని.

8-722-మత్తేభ విక్రీడితము

చని సత్యవ్రతమేదినీదయితుఁ డోజం బూని వ్రాల్దీఁగె వి
త్తనముల్ పెక్కులు నావపై నిడి హరిధ్యానంబుతో దానిపై
ముని సంఘంబులుఁ దాను నెక్కి వెఱతో మున్నీటిపైఁ దేలుచుం
గనియెన్ ముందట భక్తలోక హృదలంకర్మీణమున్ మీనమున్.

8-723-వచనము

కని జలచరేంద్రుని కొమ్మున నొక్క పెనుఁ బాపత్రాటన నావఁ గట్టి, సంతసించి డెందంబు నివురుకొని తపస్వులుం దాను నా రాచపెద్ద మీనాకారుండగు వేల్పుఁతేని నిట్లని పొగడం దొడంగె.

8-724-మత్తేభ విక్రీడితము

తములోఁ బుట్టు నవిద్య గప్పికొనుడుం దన్మూలసంసార వి
భ్రములై కొందఱు దేలుచుం గలఁగుచున్ బల్వెంటలన్ దైవ యో
గమునం దే పరమేశుఁ గొల్చి ఘనులై కైవల్య సంప్రాప్తులై
ప్రమదంబందుదు రట్టి నీవు కరుణం బాలింపు మమ్మీశ్వరా!

8-725-ఉత్పలమాల

కన్నులు గల్గువాఁడు మఱి కాననివారికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు మూఢునకు సన్మతిఁ దా గురుఁడౌట సూర్యుఁడే
కన్నులుగాఁగ భూతములఁ గాంచుచు నుండు రమేశ! మాకు ను
ద్యన్నయమూర్తివై గురువవై యల సద్గతిజాడఁ జూపవే.

8-726-కంద పద్యము

ఇంగలముతోడి సంగతి
బంగారము వన్నె గలుగు భంగిని ద్వత్సే
వాంగీకృతుల యఘంబులు
భంగంబులఁ బొందు ముక్తి ప్రాపించు హరీ!

8-727-కంద పద్యము

హృదయేశ! నీ ప్రసన్నత
పదివేలవపాలి లేశభాగము కతనం
ద్రిదశేంద్రత్వము గలదఁట;
తుది నిను మెప్పింప నేది దొరకదు శ్రీశా!

8-728-కంద పద్యము

పెఱవాఁడు గురు డటంచును
గొఱగాని పదంబు చూపఁ గుజనుండగు నీ
నెఱ త్రోవ నడవ నేర్చిన
నఱమఱ లేనట్టిపదమునందు దయాబ్ధీ!

8-729-మత్తేభ విక్రీడితము

చెలిపై చుట్టమువై మనస్థితుఁడవై చిన్మూర్తివై యాత్మవై
వలనై కోర్కులపంటవై విభుఁడవై వర్తిల్లు నిన్నొల్లకే
పలువెంటంబడి లోక మక్కట; వృథా బద్ధాశమై పోయెడిన్
నిలువన్ నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ డంభశ్శయా!

8-730-ఆటవెలది

నీరరాశిలోన నిజకర్మ బద్ధమై
యుచితనిద్రఁ బొంది యున్న లోక
మే మహాత్ముచేత నెప్పటి మేల్కాంచు
నట్టి నీవు గురుఁడ వగుట మాకు.

8-731-కంద పద్యము

ఆలింపుము విన్నప మిదె
వేలుపు గమిఁజేని నిన్ను వేఁడికొనియెదన్
నాలోని చిక్కు మానిచి
నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా!

8-732-వచనము

అని యిట్లు సత్యవ్రతుండు పలికిన సంతసించి మత్స్యరూపంబున మహాసముద్రంబున విహరించు హరి పురాణపురుషుం డగుటం జేసి సాంఖ్యయోగక్రియాసహితయగు పురాణసంహిత నుపదేశించె; నమ్మహారాజు ముని సమేతుండై భగవన్నిగదితంబై సనాతనంబగు బ్రహ్మస్వరూపంబు విని కృతార్థుం డయ్యె; నతం డిమ్మహాకల్పంబున వివస్వతుం డనం బరఁగిన సూర్యునకు శ్రాద్ధదేవుండన జన్మించి శ్రీహరి కృపావశంబున నేడవ మనువయ్యె; అంత నవ్విధంబున బెనురేయి నిండునంతకు సంచరించి జలచరాకారుండగు నారాయణుండు తన్నిశాంత సమయంబున.

8-733-మత్తేభ విక్రీడితము

ఉఁబ కంబోనిధి రోసి వేదముల కుయ్యున్ దైన్యముం జూచి వేఁ
గఁబు లల్లార్చి ముఖంబు సాఁచి బలువీఁకందోఁక సారించి మే
న్మెఱయన్ దౌడలు దీటి మీస లదరన్ మీనాకృతిన్ విష్ణుఁ డ
క్కఁటిటం దాఁకి వధించె ముష్టిదళితగ్రావున్ హయగ్రీవునిన్.

## 8-91- ప్రళయావసానవర్ణన

8-734-వచనము

అంతం బ్రళయావసాన సమయంబున.

8-735-సీస పద్యము

ఎప్పుడు వేగు నం చెదురు చూచుచునుండు;
 మునుల డెందంబులం ముదము నొందఁ,
దెలివితోఁ బ్రక్క నిద్రించు భారతి లేచి;
 యొారపయ్యెదఁ జక్క నొత్తి కొనఁగ,
మలినమై పెనురేయి మ్రుక్కిన తేజంబుఁ;
 దొంటి చందంబునఁ దొంగలింపఁ
బ్రాణుల సంచితభాగధేయంబులుఁ;
 గన్నుల కొలకులఁ గానఁబడఁగ,

8-735.1-తేటగీతి

నవయవంబులుఁ గదలించి, యావులించి
నిదురఁ దెప్పఱి, మేల్కాంచి, నీల్గి, మలఁగి,
యొడలు విఱుచుచుఁ గనుఁగవ లుసుముకొనుచు.
ధాత గూర్చుండె సృష్టి సంధాత యగుచు.

8-736-వచనము

అయ్యవసరంబున.

8-737-ఆటవెలది

వాసవారిఁ జంపి వాని చేఁ బడియున్న
వేదకోటి చిక్కు విచ్చి తెచ్చి
నిదుర మాని యున్న నీరజాసనునకు
నిచ్చెఁ గరుణతోడ నీశ్వరుండు.

8-738-కంద పద్యము

జలరుహనాభుని కొఱకై
జలతర్పణ మాచరించి సత్యవ్రతుఁ డా
జలధి బ్రతికి మను వయ్యెను;
జలజాక్షునిఁ గొలువ కెందు సంపదఁ గలదే?

## 8-92- మత్స్యావతారకథాఫలస్సృతి

8-739-ఆటవెలది

జనవిభుండు దపసి సత్యవ్రతుండును
మత్స్యరూపి యైన మాధవుండు
సంచరించినట్టి సదమలాఖ్యానంబు
వినిన వాఁడు బంధ విరహితుండు.

8-740-కంద పద్యము

హరి జలచరావతారముఁ
బరువడి ప్రతిదినముఁ జదువఁ బరమపదంబున్
నరుఁ డొందు వాని కోర్కులు
ధరణీశ్వర! సిద్ధిఁ బొందుఁ దథ్యము సుమ్మీ.

8-741-మత్తేభ విక్రీడితము

ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రంజెందు వాణీశు మో
ముల వేదంబులుఁ గొన్న దైత్యుని మృతిం బొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మము మాటలం దెలిపి సర్వాధారుఁడై మీనమై
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్.

8-742-వచనము

అని చెప్పి.

## 8-93- పూర్ణి

8-743-కంద పద్యము

రాజేంద్ర! దైత్యదానవ

రాజమహాగహన దహన! రాజస్తుత్యా!

రాజావతంస! మానిత

రాజధరార్చిత! గుణాఢ్య! రాఘువరామా!

8-744-మాలిని

దివిజరిపువిదారీ! దేవలోకోపకారీ!

భువనభరనివారీ! పుణ్యరక్షానుసారీ!

ప్రవిమలశుభమూర్తీ! బంధుపోషప్రవర్తీ!

ధవళబహుళకీర్తీ! ధర్మనిత్యానువర్తీ!

8-745-గద్యము

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవత పురాణం బను మహాప్రబంధంబు నందు స్వాయంభువ స్వారోచిషోత్తమ తామస మనువుల చరిత్రంబును, గరిమకరంబుల యుద్ధంబును, గజేంద్ర రక్షణంబును, రైవత చాక్షుష మనువుల వర్తనంబును, సముద్ర మథనంబును, కూర్మావతారంబును, గరళ భక్షణంబును, అమృతాది సంభవంబును, దేవాసుర కలహంబును, హరి కపటకామినీ రూపంబున నసురుల వంచించి దేవతల కమృతంబు పోయుటయు, రాక్షస

వధంబును, హరిహర సల్లాపంబును, హరి కపటకామినీరూప విభ్రమణంబును, వైవశ్వత సూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణీంద్రసావర్ణి మనువుల వృత్తాంతంబులును, బలి యుద్ధయాత్రయును, స్వర్గవర్ణనంబును, దేవ పలాయనంబును, వామనావతారంబును, శుక్ర బలి సంవాదంబునుఁ, త్రివిక్రమ విస్ఫురణంబును, రాక్షసుల సుతల గమనంబును, సత్యవ్రతోపాఖ్యానంబును, మీనావతారంబును నను కథలుఁ గల యష్టమ స్కంధము.

# పోతన తెలుగు భాగవతము

## నవమ స్కంధము

### 9-1- ఉపోద్ఘాతము

9-1-కంద పద్యము

శ్రీరాజిత! మునిపూజిత!

వారిధి గర్వాతిరేక వారణ బాణా!

సూరిత్రాణ! మహోజ్జ్వల

సారయశస్సాంద్ర! రామచంద్ర నరేంద్రా!

9-2-వచనము

మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుం డయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని.

### 9-2- సూర్యవంశారంభము

9-3-సీస పద్యము

మనువుల నడవళ్ళు మర్యాదలును వింటి;

మన్వంతరంబున మాధవుండు

దిరిగిన జాడలు దెలిసె సత్యవ్రతుం;

డను రాజు ద్రవిళదేశాధిపుండు

పోయిన కల్పాంతమున విష్ణు సేవించి;

విజ్ఞానమును బొంది వెలుఁగుఁ జేని

కతఁడు వైవస్వతుండై పుట్టి మను వయ్యె;
 నతనికి నిక్ష్వాకుఁడాదిగాఁగఁ

9-3.1-తేటగీతి

బదురు గొడుకులు గల రండ్రు పరఁగ వారి
వంశ మేరీతి వర్తించె? వారిలోనఁ
జనినవారిని జనువారిఁ జనెడువారిఁ
జెప్పవే వ్యాసనందన! చిత్తగించి.

9-4-కంద పద్యము

చెవులార నేఁడు వినియెద
రవివంశమునందుఁ గలుగు రాజుల కీర్తుల్
వివరింపు వరుసతోడను
భువిఁ బుణ్యుల కీర్తి వినినఁ బుణ్యము గాదే!

9-5-వచనము

అనినం బరాశరమునిమనుమం డిట్లనియె.

9-6-ఆటవెలది

వినుము మనువుకులము వేయి నూఱేండ్లును
బరఁగ విస్తరించి పలుకరాదు
నాకుఁ దోచినంత నరనాథ! వేగంబ
యెఱుకపడఁగఁ బ్రీతి నేర్పరింతు.

9-7-కంద పద్యము

ఎక్కువ దక్కువ వొడవుల
కెక్కటి మొదలయిన పురుషుఁ డింతయుఁ జెడఁ దా
నొక్కఁడుఁ గల్పాంతంబున
నక్కజమై నిల్చె విశ్వ మతఁడై యుంటన్.

## 9-3- వైవస్వతమనువు జన్మంబు

9-8-సీస పద్యము

భూమీశ! యమ్మహాపురుషుని నాభిమ;
ధ్యమున బంగారుఁ గెందమ్మి మొలిచె;
నా దమ్మిపూవులో నటమీఁదఁ దనయంత;
నాలుగు మోముల నలువ పుట్టె;
నాబ్రహ్మమనమున నట మరీచి జనించెఁ;
గశ్యపుం డతనికిఁ గలిగెనంత;
నా కశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ;
గోమరుఁడై చీఁకటి గొంగ వొడమె;

9-8.1-తేటగీతి

జలజ బంధుని పెండ్లాము సంజ్ఞ యందు
శ్రాద్ధదేవుండు మనువు సంజాతుఁ డయ్యె;
మనువునకు శ్రద్ధ యనియెడి మగువ యందుఁ
బదురు గొడుకులు గలిగిరి భద్రయశులు.

9-9-వచనము

వార లిక్ష్వాకుండును, నృగుండును, శర్యాతియు, దిష్టుండును, ధృష్టుండును, గరూశకుండును, నరిష్యంతుడును, బృషద్ధ్రుండును, నభగుండును, గవియు నన నెగడి; రటమున్ను మనువు గొడుకులు లేని వాఁడయి, మిత్రావరుణుల నుద్దేశించి.

## 9-4- సుద్యుమ్నాదుల చరిత్ర

9-10-సీస పద్యము

మనువు బిడ్డలు పుట్ట మఖ మాచరించుచోఁ;
నతని భార్యయు హోత నాశ్రయించి
కూఁతురు పుట్ట నాకుం జేయు మని పల్కి;
వరభక్తితోఁ బయోవ్రతము సలిపె;
నా సతి చెప్పిన ట్లధ్వర్యుఁడును హోత;
నగుఁగాక! వేలుపు మనుచుఁ బలికె;
హవి సందుకొని కూఁతు రయ్యెడు మని వష;
ట్కారంబు చెప్పుచుఁ గదిసి వేల్వ

9-10.1-తేటగీతి

హోత పెడచేత నిల యను నువిద పుట్టె
దానిఁ బొడగని మనువు సంతాప మంది
కొడుకుమేల్ గాక; యేటికిఁ గూఁతు? రకట
చెప్పవే యని పోయె వసిష్ఠుకడకు.

9-11-వచనము

చని యిట్లనియె.

9-12-కంద పద్యము

అయ్యా! కొడుకుల కొఱకై
యియ్యాగము నీ యనుజ్ఞ నేఁ జేయంగా
నియ్యాఁడు దేల పుట్టెను?
మియ్యంతటివారి కొండు మేరయుఁ గలదే!

9-13-వచనము

అదియునుంగాక; మీరు బ్రహ్మవాదులరు; మంత్రవాదులరుఁ; బాపంబు లందకుండం జేయించువా; రిది యేమి?" యనవుడు మా తాత వసిష్ఠుండు హోతృవ్యభిచారం బెఱింగి, మనువున కిట్లనియె.

9-14-తేటగీతి

అధిప! సంకల్ప వైషమ్య మగుటఁ జేసి
హోతకల్లతనంబుననువిదగలిగె
నైనఁగలిగింతు నీకుఁబ్రియాత్మజునిగ
నీవు మెచ్చంగఁజూడు నా నేర్పుబలిమి.

9-15-వచనము

అని పలికి భగవంతుండగు వసిష్ఠుండు గీర్తితత్పరుండు గావున మనువు కూఁతు మగతనంబు కొఱకు నేక చిత్తంబున నాదిపురుషుం డగు హరిం బొగడిన నప్పరమేశ్వరుండు మెచ్చి తపసి కోరిన వరం బిచ్చె; నది నిమిత్తంబుగా నిలాకన్యక సుద్యుముండను కుమారుండయి రాజ్యంబు చేయుచు.

9-16-సీస పద్యము

ప్రొద్దు వో కొకనాఁడు పోయి పేరడవుల;
 వెంట వేఁటాడుచు వేడ్కతోడఁ
గొందఱు మంత్రులుగూడ రా సైంధవం;
 బయిన గుఱ్ఱము నెక్కి యందమైన
బలువిల్లు గ్రొవ్వాడి బాణంబులును దాల్చి;
 పెను మెకంబులవెంట బిఱుసుతోడ
నుత్తరదిశను మహోగ్రుఁడై చనిచని;
 మేరువు వొంతఁ గుమారవనముఁ

9-16.1-తేటగీతి

జేరె నందు మహేశుండు శివయు నెపుడు
రతి సలుపుచుందు రందుఁ జొరంగఁ బోవ
నాఁడుదయ్యెను రాజు; రాజానుచరులుఁ
బడఁతులైరి; తదశ్వంబు బడబ యయ్యె.

9-17-వచనము

ఇట్లు మగతనంబు చెడి మగువలై యొండొరుల మొగంబులు చూచి మఱుఁగుచుండి; రనిన విని శుకునకు రాజిట్లనియె.

9-18-ఆటవెలది

రాజుఁ తోటివారు రమణు లై రంటివి;
కాంత లగుట యేమి కారణమున?
నిట్టి దేశ మెఱుఁగ మెన్నఁడు నా కథల్
వేడ్కదీర నాకు విస్తరింపు.

9-19-వచనము

అదియునుం గాక.

9-20-ఆటవెలది

మగువతనము మాని మగవాఁడు గావచ్చుఁ;
గాక పేరుఁ బెంపు గాసి గాఁగ
మగతనంబు మాని మగువ గావచ్చునె
మానవంతుఁ డైన మానవునకు?

9-21-వచనము

అని యడిగిన నర్జునపౌత్రునకు వ్యాసపుత్రుం డిట్లనియె.

9-22-సీస పద్యము

పురవైరి యొకనాఁడు పొడచూపు వేడుకఁ;
దద్దయు దిక్కుల తమము లెల్లఁ
దమతమ వెలుఁగులు దగిలి గొందులు చొరఁ;
గొందఱు మౌనులు గోరి రాఁగఁ
బ్రాణేశు తొడలపై భాసిల్లు నంబిక;
వారలఁ జూచి మై వలువ లేమి
సిగ్గు పుట్టిన లేచి చీరఁ గట్టినఁ జూచి;
దేవియు దేవుండు దీర్ఘ లీల

9-22.1-తేటగీతి

నొంటి దమలోనఁ గ్రీడించుచున్నవారు

మనకు సమయంబు గా దని మరలి మునులు
నరుఁడు నారాయణుండు ననారతంబు
మెలఁగు చోటికి నడచిరి మేదినీశ!

9-23-వచనము

అది కారణంబుగా, భగవంతు డగు శివుండు దన ప్రియురాలి వేడుకల కొఱకు నిట్లని వక్కాణించె.

9-24-కంద పద్యము

ఈ నెల వెవ్వఁడు జొచ్చిన
మానిని యగు ననిన తొంటి మాట కతమునన్
మానవుఁడు మగువ పోఁడిమి
మానక పేరడవులందు మఱియుం దిరిగెన్.

9-25-వచనము

ఇట్లు చెలికత్తియల మొత్తంబులుం దానును నా రాచపూఁబోఁడి వాఁడిచూపుల నాఁడు పోఁడిమి నెఱపుచు దైవయోగంబున సోమ సుతుండును, భగవంతుడును నగు బుధుని యాశ్రమంబు జేరి మెలఁగుచున్న యెడ.

9-26-ఆటవెలది

రాజు కొడుకుఁ జూచె రాజీవదళనేత్ర
రాజవదనఁ జూచె రాజుపట్టి
దొంగ కాముఁ డంత దొందడిఁ జిగురాకు
వాలు వెఱికి యుఱికి వారి మొత్తె.

9-27-వచనము

ఇట్లలరువిల్తుని సెలబిరుదు చిగురు టడిదంబు మొనకు నోహటించి, వారలిరువురుం బైపడి వేడుకలకుం జొచ్చిన వారలకుం బురూరవుం డను కుమారుండు పుట్టె నివ్విధంబున.

9-28-ఆటవెలది

మనుసుతుండు ఘనుఁడు మగనాలి తనమునఁ
గొడుకుఁ గాంచి విసివి కుందికుంది
చింతఁ బొంది గురు వసిష్ఠుని భావించె
నతని తలఁపుతోన యతఁడు వచ్చె.

9-29-వచనము

వచ్చి సుద్యుమ్నుండు మగవాఁడగు కొఱకు నమ్మునిపుంగవుండు శంకరు నారాధింప నీశ్వరుండును దపసి ప్రయాసంబునకు సంతసిల్లి యిట్లనియె.

9-30-మత్తేభ విక్రీడితము

తను మున్నాడిన మాటయున్ నిజముగాఁ దన్మానికిం బ్రీతిగా
మనుజుండున్ నెల యొ నెలం బురుషుఁడై మాసాంతరంబైనఁ గా
మినియై యీ గతి వీడు పాటమర భూమిం దాన రక్షించుఁ బొ
మ్మనినన్ వచ్చె వసిష్ఠుఁ; డా మనుసుతుండారీతి రాజ్యస్థుఁడై.

9-31-ఆటవెలది

మగువ యగుచు మరల మగవాఁడు నగుచును
భూతధాత్రి యంత నాతఁ డేలెఁ

బ్రజలు సంతసింప బాహాబలముతోడఁ
గురుని కరుణఁ జేసి కువలయేశ!

9-32-వచనము

అతనికి నుత్కళుండును, గయుండును, విమలుండును నను కొడుకులు ముగ్గురు గలిగి ధర్మపరులై యుత్తరాపథంబునకు రాజులైరి; సుద్యుమ్నుండు ముదుసలి యయి ప్రతిష్ఠానపురంబు విడిచి పురూరవునకు భూమి నిచ్చి వనంబునకుం జనియె నివ్విధంబున.

9-33-సీస పద్యము

కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవుల కేఁగ;
వందుచు మనువు వైవస్వతుండు
దనకు బిడ్డలు గల్గఁ దప మాచరించెను;
హరిఁగూర్చి నూఱేండ్లు యమునలోన
హరి యంత నిక్ష్వాకుఁ డాదిగాఁ బదుగురు;
పుత్త్రుల నిచ్చెను బోసఁగ; వారి
యందుఁ బృషధ్రాఖ్యుఁ డనువాఁడు గురునాజ్ఞ;
విమల ధర్మంబులు వెలయఁబూని

9-33.1-తేటగీతి

పసుల కదుపులఁ గాచుచు బలుమొగిళ్ళు
వచ్చి నడురేయి జోరున వాన గురియ
మంద విడియించి చుట్టు నేమఱక యుండె
నడవి మొకములు చొరకుండ నరసికొనుచు.

9-34-వచనము

అంత.

9-35-కంద పద్యము

ప్రబ్బికొనిన పెంజీఁకటి
నిబ్బరముగ నడిఁకినడిఁకి నింగికి వడితో
గొబ్బున నెగసి తటాలున
బెబ్బులి మందావుఁ బట్టెఁ బెలుకుటి యఱవన్.

9-36-కంద పద్యము

ఉల్లములు గలఁగి మొదవుల
వెల్లువ లన్నియును లేచి విచ్చలవిడితోఁ
జెల్లాచెదురై పాఱెను
బెల్లుగ నంబే యటంచు బెబ్బులి గాలిన్.

9-37-వచనము

అయ్యవసరంబున.

9-38-శార్దూల విక్రీడితము

ఆ పెంజీకటి మ్రోలఁ గాన కడిదం బంకించి శార్దూల మం
చా పుల్లావు శిరంబుఁ ద్రుంచి తెగదో యంచుం, బులిన్ వెండియున్
వాపోవం దెగ వ్రేసి భూవరుఁడు ద్రోవన్ ఖడ్గరక్తంబుచేఁ
బైపై గీయుచుఁ జేరి చూచెఁ దల ద్రెవ్వంబడ్డ యద్ధేనువున్.

9-39-వచనము

చూచి దుఃఖితుండయి యున్న పృషద్ధ్రునిం గని కులగురుం డగు వసిష్ఠుండు కోపించి "నీవు రాజత్వంబునకుఁ బాసి యీ యపరాధంబున శూద్రుండవు గ" మ్మని శపియించె; నతండును గృతాంజలి యయి తన కులాచార్యుని వలన మరలం గైకోలు బడసి యతని యనుమతంబున.

9-40-సీస పద్యము

అఖిలాత్ముఁ డగుచున్న హరియందుఁ బరునందు;
 భక్తితోఁ జాలఁ దత్పరత మెఱసి
యూర్ధ్వరేతస్కుఁ డై యున్న ప్రాణులకెల్ల;
 నాప్తుఁడై సర్వేంద్రియములు గెల్చి
సంగంబునకుఁ బాసి శాంతుండు నపరిగ్ర;
 హుండునై కోరక యుండి తనకు
వచ్చిన యదియ జీవనము గావించుచుఁ;
 దనుఁదాన నిలుపుచు ధన్యబుద్ధి

9-40.1-తేటగీతి

జడుని తెఱగున నంధుని చందమునను
జెవిటి భంగిని మహి నెల్లఁ జెల్లఁ దిరిగి
యడవులకు నేఁగి కార్చిచ్చునందుఁ జొచ్చి
చిక్కి నియతుఁడై బ్రహ్మంబుఁ జెందె నతఁడు.

9-41-కంద పద్యము

కవి యను కడపటి కొమరుఁడు
భవనము రాజ్యంబు విడిచి బంధులతో నేఁ

గి వనమునఁ బరమపురుషునిఁ
బ్రవిమలమతిఁ దలఁచితలఁచి పరముం బొందెన్.

9-42-వచనము

మఱియుఁ గరూశుండను మానవునివలనం గొందఱు కారూశులు క్షత్రియులు గలిగి, ధర్మంబుతోడి ప్రియంబున బ్రహ్మణ్యులై యుత్తరాపథంబునకు రక్షకులైరి; దృష్టుని వలన ధార్ష్టం బను వంశంబు గలిగి భూతలంబున బ్రహ్మభూయంబు నొంది నెగడె; నృగుని వంశంబున సుమతి పుట్టె; నతనికి భూతజ్యోతి పుట్టె; నతనికి వసువు జనించె; వసువునకుం బ్రతీతుండు గలిగెఁ; బ్రతీతునికి నోఘవంతుండు జనించె; నతని కూఁతు నోఘవతి యను కన్యకను సుదర్శనుండు వివాహంబయ్యె; నరిష్యంతుండను మనుపుత్రునికి జిత్రసేనుం; డా విభునకు దక్షుం; డా పుణ్యునకు మీఢ్వాంసుం; డా సుజనునికి శర్వుం; డమ్మహాత్మునికి నింద్రసేనుం; డా రాజునకు వీతిహోత్రుం; డా సుమతికి సత్యశ్రవుం; డా ఘనునికి నురుశ్రవుం; డా వీరునకు దేవదత్తుం; డా పండితునకు నగ్నివేశుండు సుతు లయి జనియించి; రయ్యగ్నివేశుండు గానీనుం డన నెగడి జాతకర్ణుండను మహర్షి యై వెలసె; నతని వలన నాగ్నివేశ్యాయనం బను బ్రహ్మకులంబు గలిగెను. ఇవ్విధంబున.

9-43-కంద పద్యము

తెలుపఁబడె నరిష్యంతుని
కుల మెల్లను నీకు దిష్టకులముం దెలియం
దెలిపెద రాజేంద్రోత్తమ!
తెలియుము సర్వంబు నీకుఁ దేటపడంగన్.

## 9-5- మరుత్తుని చరిత్ర

### 9-44-వచనము

దిష్టుని కొడుకు నాభాగుం డనువాఁడు కర్మవశంబున వైశ్వత్వంబు నొందె; నా నాభాగునికి హలంధనుండు కలిగె; నతనికి వత్సప్రీతియు, వత్సప్రీతికిఁ బ్రాంశువు, నతనికిఁ బ్రమతియుఁ, బ్రమతికి ఖమిత్రుండు, ఖమిత్రునికిఁ జాక్షుషుండు, నతనికి వివింశతియు, వివింశతికి రంభుండు, రంభునికి ధార్మికుండైన ఖనినేత్రుండు, నతనికిఁ గరంధనుండు, గరంధనున కవిక్షిత్తు, నా యవిక్షిత్తునకు మరుత్తుండు జనియించి; రా మరుత్తుండు చక్రవర్తి యయ్యె; నతని చరిత్రంబు వినుము.

### 9-45-సీస పద్యము

అంగిరస్సుతుఁడు మహాయోగి సంవర్తుఁ;
 డతని యాగమునకు యాజకుండు;
దిరిగి యుండెడివారు మరుదాఖ్యగణము; లొ;
 ప్పారు విశ్వేదేవు లచటి సభ్యు;
లధిక దక్షిణల బ్రాహ్మణకోటిఁ దనిపెను;
 సోమపానంబున సురవరుండు
మది నుబ్బి బంగారు మయము గావించెను;
 యాగవస్తువులెల్ల; నధిక నియతి

### 9-45.1-తేటగీతి

నా మరుత్తుఁడు జేసిన యట్టిభంగి
ధీరభావంబుఁ జాగంబుఁ దెంపు గలిగి

మఖము జేసినవారిని మఱియు నెఱుఁగ
మెల్ల లోకములందు నరేంద్రముఖ్య!

9-46-వచనము

ఆమరుత్తునకు దముండును, దమునకు రాజవర్ధనుండును, రాజ వర్ధనునకు సుధృతియు, సుధృతికి సౌధృతేయుండును, సౌధృతే యునకు గేవలుండును, కేవలునకు బంధుమంతుడును, నతనికి వేదవంతుండును, వేదవంతునికి బంధుండును, బంధునకుఁ దృణ బిందుండును సంభవించిరి; అంత.

9-47-కంద పద్యము

అచ్చరకన్య యలంబుస
గ్రచ్చఱఁ దృణబిందుఁ జూచి కామించి తుదిం
బచ్చవిలుకాని యమ్ముల
ముచ్చిచ్చున వచ్చిపొందె మోహాతురయై

## 9-6- తృణబిందు వంశము

9-48-వచనము

ఆ దంపతులకు నిలబిల యనుగూఁతురుం జన్మించె; నా కొమ్మను విశ్రవసుండు పొందిన నైలబిలుండనం గుబేరుండు పుట్టె; మఱియు నా తృణబిందునకు విశాలుండును, శూన్యబంధుండును, ధూమ్రకేతుండును నను వారు ముగ్గురు గొడుకులు గలిగి రందు విశాలుండు వంశవర్ధనుండయి వైశాలి యను నగరంబు నిర్మించె; నా రాజునకు హేమచంద్రుం, డా నరేంద్రునకు ధూమ్రాక్షుం, డా పుడమిఱేనికి సహదేవుం; డా బలిష్ఠునకుఁ గృశాశ్వుం; డాతనికి సోమదత్తుండు జన్మించె; నతండు.

9-49-ఆటవెలది

అమరవిభుఁడు మెచ్చ నశ్వమేధము జేసి
భూరిపుణ్యగతికిఁ బోయె నెలమి;
సోమదత్తుకొడుకు సుమతికి జనమేజ
యుం డనంగఁ గొమరు డుప్పతిల్లె.

9-50-వచనము

వీరలు వైశాలు రనం బరఁగి తృణబిందుని కీర్తివహించి, రాజ్యంబు జేసిరి; మఱియును.

## 9-7- శర్యాతి వృత్తాంతము

9-51-సీస పద్యము

శర్యాతి యను రాజు జనియించె బ్రహ్మోప;
రుండైన మనువుకు రూఢితోడ;
నతఁ డంగిరుని సత్త్రమందు రెండవనాఁటి;
విహితకర్మము లెల్ల వెలయఁ జెప్పె;
నతని కూఁతురు సుకన్యక యను వనజాక్షి;
దన తండ్రితోఁ దపోవనికి నరిగి
చ్యవనాశ్రమముఁ జేరి సఖులును దానును;
ఫలపుష్పములు గోయఁ బాఱి తిరిగి

9-51.1-ఆటవెలది

యొక్కపుట్టలోన నొప్పారు జ్యోతుల
రెంటిఁ గాంచి వాఁడి ముంటఁ బొడిచెఁ;

గన్య ముగుద మఱచి ఖద్యోతయుగ మంచు
దైవవశముకతనఁ దమకి యగుచు.

9-52-కంద పద్యము

జ్యోతుల ముంటం బొడిచిన
వాతుల నెత్తురులు గురిసె వసుధేశభట
వ్రాతముల కెల్ల నచ్చట
నా తఱి మలమూత్రబంధమయ్యె; నరేంద్రా!

9-53-వచనము

వారలంజూచి రాజర్షి యగు శర్యాతి విస్మితుండై "మీర లియ్యాశ్రమ దూషణంబు చేయనోపుదు; రది కారణంబుగా మీకీ నిరోధంబు సిద్ధించె" నని పలుకు నవసరంబునఁ దండ్రికి సుకన్యక యిట్లనియె.

9-54-తేటగీతి

అయ్య! యీ పుట్టచేరువ నాడి యాడి
యిందులో రెండు జ్యోతుల నేను గాంచి
కంటకంబునఁ బొడువ రక్తంబు గురిసె
నే విధంబునఁ గురిసెనో యెఱుఁగు మీవు.

9-55-వచనము

అనిన శర్యాతి భీతుండై కూఁతుం దోడ్కొని వల్మీకంబు కడకుం జని యందుఁ దపంబు జేయుచున్న చ్యవనునిం గని తన నేర్పున నతని వలనఁ బ్రసన్నత

పడసి తపసి చిత్తంబు నెఱింగి తన పుత్రిక నిచ్చి యెట్టకేలకుం బ్రదికినవాఁడై మునీశ్వరుని వీడ్కొని పురంబునకుం జనియె; అంత.

9-56-ఆటవెలది

పరమకోపుఁ డయిన భార్గవుఁ బతిఁ జేరి
మిగులఁ బనుల యెడల మెచ్చఁ దిరిగి
యతని పర్ణశాల నా సుకన్యక యను
మగువ గొన్ని యేండ్లు మనువు మనియె.

9-57-వచనము

అంత నొకనాఁ డయ్యాశ్రమంబునకు వేల్పువెజ్జులైన నాసత్యు లిద్దఱు వచ్చిన వారలం బూజించి తన ముదిమి జూపి చ్యవనుం డిట్లనియె "మీకు మున్ను యాగభాగంబుల లేని సోమపానంబు నేఁడు గల్పించి యిచ్చెద; సోమపాన సమయంబునఁ బానపాత్రంబు మీకు నందిచ్చెద నా ముదిమి మానుపుం" డని యిట్లనియె.

9-58-కంద పద్యము

నవకంబగు ప్రాయంబున
జవరాండ్రఁ గరంచు మేని చక్కఁదనంబున్
శివతరముగఁ గృప జేయుఁడు
దివిజాధిప వైద్యులార! దీవింతు మిమున్.

9-59-వచనము

అనిన నశ్వినిదేవతలు సంతోషించి “సిద్ధనిర్మితంబయిన యీ మడుఁగున మునుఁగు” మని పలికి.

9-60-సీస పద్యము

ముసలితాపసుఁ బట్టి మొగి నెత్తుకొనిపోయి;
 ముగురు నా మడుఁగున మునిఁగి లేచి
వనితాజనుల నెల్ల వలపించువారలై;
 సుందర మూర్తులై సుభగు లగుచుఁ
గమలమాలికలతోఁ గనకకుండలముల;
 తోఁ బుష్పసాయకుతోడఁ దుల్యు
లై సూర్యతేజస్కులై యున్నవారల;
 ముక్వురఁ బొడగాంచి ముగుద బాల

9-60.1-తేటగీతి

యిందుఁ బెనిమిటి వీఁ డని యెఱుఁగ లేక
గరిత గావున నిజనాథుఁ గానఁ గోరి
సుభగమతులార! నా నాథుఁ జూపుఁ డనుచు
నశ్విదేవతల కపు డ య్యబల మ్రొక్కె.

9-61-వచనము

వార లా పతివ్రత నిజమరితనంబునకు మెచ్చి వయోరూపసంపన్నుం డయిన చ్యవనుం జూపి, దంపతుల వీడ్కొని విమానారూఢులై వేలుపుల ప్రోలికిం జనిరి; అంత.

9-62-సీస పద్యము

యాగంబు చేయంగ నర్థించి శర్యాతి;
 చ్యవనమునీంద్రు నాశ్రమము కడకుఁ
గూఁతు నల్లునిఁ దోడుకొనిపోవు వేడుక;
 వచ్చి పుత్రికకుఁ బార్శ్వంబు నందు
సూర్యతేజంబున నొంపారు వరుఁ గని;
 వీ డెవ్వఁడో దీని విభుఁడు గాఁడు
చెల్లరే! యని పుత్రి చేసిన ప్రియములు;
 మొక్కులు నొల్లక మోము వాంచి

9-62.1-తేటగీతి

మాఱుమాటాడ దీవింప మనసు రోసి
చ్యవనుఁ డధికుండు మునిజన సత్తముండు
భువన సన్నుతుఁ డతఁ డెందు బోయె నాతఁ
డెట్లు వంచింపఁబడియె? వీఁడెవ్వఁ? డబల!

9-63-మత్తేభ విక్రీడితము

తగవే? ధర్మమె? శీలమే? కులజ వై దర్పించి మోదింప నా
జగదారాధ్యునిఁ బుణ్యశీలుఁ దపసిన్ సాధ్వీమనస్సమ్మతున్
మగనిన్ మాని భుజంగుఁ బొందఁ దగునే మానంబు వాటింపఁగా
దగదే! దుర్గతిఁ ద్రోచితే కఠిన వై తండ్రిం బతిం గూఁతురా!

9-64-ఆటవెలది

పద్మనయన! మగఁడు ప్రాయంపు వాడైనఁ

గాపు పెట్టి కొంతఁ గావ నేర్చుఁ
గడఁగి ముసలి తపసి గావంగ నేర్చునే
యువతి ముదుకఁ గూర్ప నొప్ప దెందు.

9-65-వచనము

అని పలికిన నప్పరమప్రతివ్రతాలలామంబు చిఱునగవు చెక్కుటద్దంబులఁ జిడిముడిపడఁ దండ్రి కిట్లనియె.

9-66-కంద పద్యము

నియ్యల్లు డితఁడు భార్గవుఁ
డయ్యా! జారుండు గాఁడు; హర్షముతోడన్
నెయ్యంబు నిల్వ మంచును
దొయ్యలి సర్వంబుఁ దండ్రితో వినిపించెన్.

9-67-వచనము

అంత శర్యాతియు నప్రమత్తుండై కూఁతుం గౌగలించుకొని గారవంబున "నయిదువవు గ" మ్మని దీవించె; నంత భార్యాసహితుండై చ్యవనుండు చని తన మామకు యాగంబు చేయించి యొక్క పాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజ తపోబలంబున నశ్విదేవతల కర్పించినం జూచి.

9-68-కంద పద్యము

కోపముతోడను వాసవుఁ
డేపున ముని పైని వజ్రమెత్తిన మరలం
దాపసుఁడు వజ్రిభుజమున

నా పవి నిలిపెన్ జగంబు లాశ్చర్యపడన్.

9-69-వచనము

ఇవ్విధంబున నశ్విదేవత లిద్దఱు వైద్యులై సోమపానంబు లేని వారయ్యుఁ జ్యవను సామర్థ్యంబునఁ బ్రాప్తభాగులయి చనిరి; శర్యాతికి నుత్తానబర్హియు, నానర్తుండును భూరిషేణుండు నను మువ్వురు గొడుకులు గలిగిరి; అందు.

## 9-8- రైవతుని వృత్తాంతము

9-70-సీస పద్యము

ఆనర్తునకు రైవతాహ్వయుం డుదయించె;
 నతఁడు కుశస్థలి యను పురంబు
నీరధిలోపల నిర్మించెఁ; బెంపుతో;
 నానర్తముఖ విషయంబులేలె;
గనియెఁ గకుద్మి ముఖ్యంబైన నందన;
 శతము; రైవతుఁడు విశాలయశుడు
దన కూఁతు రేవతి ధాత ముందటఁ బెట్టి;
 తగు వరు నడిగెడి తలఁపుతోడఁ

9-70.1-తేటగీతి

గన్యఁ దోడ్కొని బ్రహ్మలోకమున కేగి
యచట గంధర్వ కిన్నరు లజుని మ్రోల
నాటపాటలు సలుపఁగ నవసరంబు
గాక నిలుచుండె నతఁ డొక్క క్షణము తడవు.

9-71-వచనము

అంత నవసరంబయిన నజునికి నమస్కరించి రైవతుండు రేవతిం జూపి యిట్లనియె.

9-72-ఆటవెలది

చాల ముద్దరాలు జవరాలుఁ గోమరాలు
నీ శుభాత్మురాలి కెవ్వఁ డొక్కొ
మగఁడు? చెప్పు మనిన యది చూచి పకపక
నవ్వి భూమిపతికి నలువ పలికె.

9-73-సీస పద్యము

మనుజేశ! దీనికై మదిలోనఁ దలఁచిన;
వార లెల్లను గాలవశతఁ జనిరి;
వారల బిడ్డల వారల మనుమల;
వారల గోత్రంబు వారినైన
వినము మేదిని మీఁద; వినుము నీ వచ్చిన;
యాలోన నిరువదియేడు మాఱు
లొండొండ నాలుగు యుగములుఁ జనియె; నీ;
వటు గాన ధరణికి నరుగు మిపుడు

9-73.1-తేటగీతి

దేవదేవుండు హరి బలదేవుఁ డనఁగ
భూమి భారంబు మాన్పంగఁ బుట్టినాఁడు;
సకలభూతాత్మకుఁడు నిజాంశంబుతోడ

యువతిమణి నిమ్ము జనమణి కున్నతాత్మ!

9-74-వచనము

అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి భూలోకమునకుఁ జనుదెంచి సోదర స్వజన హీనంబగు తన నగరంబున కా రాజు వచ్చి బలభద్రుం గాంచి రేవతీకన్య నతని కిచ్చి నారాయణాశ్రమంబగు బదరికావనంబునకు నియమంబునఁ దపంబు జేయం జనియె.

## 9-9- నాభాగుని చరిత్ర

9-75-కంద పద్యము

నభగుఁడను మనుజపతికిని
శుభమతి నాభాగుఁ డనఁగ సుతుఁ డుదయించెం;
బ్రభులై కవి యను తలఁపున
విభజించిరి భ్రాత లతని విత్తము నధిపా!

9-76-వచనము

అంత నాభాగుండును బ్రహ్మచారియై తన తోడంబుట్టువులను ధనంబుల పాలడిగిన వారలు "దండ్రి చెప్పిన క్రమంబున నిచ్చెద" మనిన నాభాగుండు తండ్రి యగు నభగు కడకుం జని "విభాగంబు చేయు" మని పలికిన నతం "డిందు నంగిరసులు మేధ గలవారయ్యును సత్త్ర యాగంబు చేయుచు నాఱవ దినంబున నర్హకర్మంబులు దోఁపక మూఢులయ్యెదరు; వారలకు నీవు వైశ్వదేవసూక్తంబులు రెండెఱింగించినఁ గవి యనం బ్రసిద్ధి కెక్కెదవు; దానంజేసి వారు కృతకృత్యు లై స్వర్గంబునకు బోవుచు, సత్త్రపరిశేషితంబైన ధనంబు నీకిచ్చెద" రని పలికినం

దండ్రి వీడ్కొని నాభాగుండు చని యట్ల చేసిన, నంగిరసులు సత్త్ర పరిశేషితధనంబు లతని కిచ్చి నాకంబునకుం జనిరి; అంత.

9-77-కంద పద్యము

అంగిరసు లిచ్చు పసిఁడికి
మంగళమతిఁ జేరు నృపుని మానిచి యొకఁ డు
త్తుంగుఁడు గృష్ణాంగుఁడు దగ
ముంగల నిలుచుండి విత్తముం జేకొనియెన్.

9-78-వచనము

వానింజూచి నాభాగుండు దనకు మును లిచ్చుటం జేసి తన ధనం బని పలికిన నమ్మహాపురుషుండు "మీ తండ్రి చెప్పిన క్రమంబ కర్తవ్యం" బనిన నాభాగుండు నభగు నడిగిన నతండు "యజ్ఞమందిర గతం బయిన యుచ్ఛిష్టం బగు ధనంబు దొల్లి మహామునులు రుద్రున కిచ్చి; రది కారణంబుగా నా దేవుండు సర్వధనంబునకు నర్హుం" డనిన విని, వచ్చి నాభాగుండు మహాదేవునకు నమస్కరించి "దేవా! యీ ధనంబు నీ యధీనం బని మా తండ్రి చెప్పె; నే నపరాధంబు చేసితి; సహింపు" మనవుడు భక్తవత్సలుండగు నమ్మహాపురుషుండు నభగు సత్యవచనంబునకు నాభాగుని నిజంబునకు మెచ్చి "నీవు దప్పక పలికితివి కావున, సత్త్రపరిశేషితం బగు ధనంబు నీకు నిచ్చితి" నని పలికి యంతర్ధర్శిత్వంబును సనాతనం బగు బ్రహ్మజ్ఞానంబు నుపదేశించి తిరోహితుండయ్యె; ఇవ్విధంబున.

9-79-కంద పద్యము

భువిలో నాభాగునికథ

దవిలి మతిన్ రేపు మాపుఁ దలఁచినమాత్రం
గవి యగు; మంత్రజ్ఞుం డగుఁ
బ్రవిమలగతిఁ బొందు నరుఁడు భద్రాత్మకుఁడై.

## 9-10- అంబరీషోపాఖ్యానము

9-80-వచనము

అంత నాభాగునకు నంబరీషుండు జనియించె; నతని యందు జగ
దప్రతిహతంబైన బ్రాహ్మణశాపంబు నిరర్థకం బయ్యె" ననిన విని "యేమి
కారణంబున దురంతంబైన బ్రహ్మదండంబు వలన నతండు విడువంబడియె"
ననిన నప్పుడమిఱేనికి శుకుం డిట్లనియె.

9-81-శార్దూల విక్రీడితము

సప్తద్వీప విశాలభూభరము దోస్తంభంబునం బూని సం
ప్రాప్తశ్రీయుతుఁడై మహావిభవసంపచ్చాతురిం గల్గి దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనలమేరం గాలముం బుచ్చుచున్
సుప్తిం బొందక యొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుం డిలన్.

9-82-సీస పద్యము

చిత్తంబు మధురిపు శ్రీపాదముల యంద; పలుకులు హరిగుణపఠనమంద;
కరములు విష్ణుమందిర మార్జనములంద; శ్రవములు హరికథాశ్రవణమంద;
చూపులు గోవింద రూపవీక్షణమంద; శిరము కేశవ నమస్కృతుల యంద;
పదము లీశ్వరగేహపరిసర్పణములంద; కామంబు చక్రికైంకర్యమంద;

9-82.1-తేటగీతి

సంగ మచ్యుతజన తనుసంగమంద;
ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలమంద;
రసనఁ దులసీదళములంద; రతులు పుణ్య
సంగతుల యంద యా రాజచంద్రమునకు.

9-83-వచనము

మఱియు నమ్మహీవిభుండు.

9-84-సీస పద్యము

ఘన వైభవంబునఁ గల్మషదూరుఁడై; యజ్ఞేశు నీశు నధ్యాక్షుఁ గూర్చి
మొనసి వసిష్ఠాది మునివల్లభులతోడఁ; దగిలి సరస్వతీ తటమునందు
మేధతో బహువాజిమేధంబు లొనరించె; గణుతింపరాని దక్షిణలు వెట్టి;
సమలోష్టహేముఁడై సర్వకర్మంబులు; హరిపరంబులు గాఁగ నవని యేలె;

9-84.1-ఆటవెలది

విష్ణుభక్తులందు విష్ణువునందుఁ గ
లంక యెడల మనసు లంకె పెట్టి
విహితరాజ్యవృత్తి విడువనివాఁడునై
యతఁడు రాచతపసి యనఁగ నొప్పె.

9-85-వచనము

వెండియు నమ్మహాభాగవతుండు

9-86-కంద పద్యము

హరి యని సంభావించును;

హరి యని దర్శించు; నంటు; నాఘ్రాణించున్;
హరి యని రుచిగొనఁ దలఁచును;
హరిహరి; ఘను నంబరీషు నలవియె పొగడన్?

9-87-వచనము

ఇట్లు పుణ్యచిత్తుండు, నీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు చేయుచున్న సమయంబున.

9-88-ఆటవెలది

అతని కీహ మానె హరులందుఁ గరులందు
ధనములందుఁ గేళివనములందుఁ
బుత్రులందు బంధుమిత్రుల యందును
బురమునందు నంతిపురమునందు.

9-89-వచనము

అంతఁ గొంతకాలంబున కమ్మేదినీకాంతుండు సంసారంబువలని తగులంబు విడిచి నిర్మలుండై యేకాంతంబున భక్తిపరవశుండై యుండ నా రాచతపసికి భక్తలోకవత్సలుండగు పురుషోత్తముండు ప్రతిభటశిక్షణంబును, నిజజనరక్షణంబును, నిఖిలజగదవక్రంబును నగు చక్రంబు నిచ్చి చనియె; అంత.

9-90-కంద పద్యము

తన తోడినీడ కైవడి
ననురూప గుణాఢ్య యైన యాత్మమహిషితో
జనవిభుఁడు ద్వాదశీవ్రత

మొనరన్ హరిఁగూర్చి చేసె నొక యేఁ డధిపా!

9-91-వచనము

ఇట్లు వ్రతంబు చేసి, యా వ్రతాంతంబునం గార్తికమాసంబున మూఁడు రాత్రు లుపవసించి, కాళిందీజలంబుల స్నాతుండయి, మధువనంబున మహాభిషేక విధానంబున విహిత పరికర సుసంపన్నుం డయి, హరి నభిషేకంబు జేసి, మనోహరంబు లయిన గంధాక్షతంబులు సమర్పించి యభినవామోదంబులైన పుష్పంబులం బూజించి తదనంతరంబ.

9-92-శార్దూల విక్రీడితము

పా లేఱై ప్రవహింప నంగరుచులం బ్రాయంబులున్ రూపము
ల్మేలై ధూర్తులుగాక వెండిగొరిజల్లేమోరు శృంగంబులుం
గ్రాలం గ్రేపుల యట్లు నాఁకుచును రంగచ్చేలలై యున్న మం
దాలన్ న్యర్బుదషట్క మిచ్చె విభుఁ డుద్యద్వేదికశ్రేణికిన్

9-93-కంద పద్యము

పెక్కండ్రు విప్రవరులకు
గ్రక్కున నతిభక్తితోడఁ గడుపులు నిండం
జొక్కపు టన్నంబిడి విభుఁ
డొక్కెడఁ బారణము చేయ నుద్యోగింపన్.

9-94-వచనము

అయ్యవసరంబున.

9-95-కంద పద్యము

భాసుర నిగమ పదోప
న్యాసుఁడు సుతపోవిలాసుఁ డనుపమ యోగా
భ్యాసుఁడు రవిభాసుఁడు దు
ర్వాసుఁ డతిథి యయ్యెఁ దన్నివాసంబునకున్.

9-96-వచనము

అట్లతిథి యై వచ్చిన నమ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు చేసి, కూర్చుండ గద్దియ యిడి పాదంబులు గడిగి పూజించి క్షేమం బరసి తన యింట నన్నంబు గుడువు మని నమస్కరించిన నమ్మహాత్ముండు సంతసించి భోజనంబునకు నంగీకరించి, నిర్మలంబులగు కాళిందీజలంబులం బరమధ్యానంబు చేయుచు, మునింగి లేచి రాక తడవు చేసిన, ముహూర్తార్ధావశిష్ట యగు ద్వాదశి యందుఁ బారణ చేయవలయుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారల నుద్దేశించి.

9-97-కంద పద్యము

ముని నీరు జొచ్చి వెడలడు
చనియెడు ద్వాదశియు నింత చనియెన్నిలో
నన పారణయున్ వలయును
వినిపింపుం డర్థధర్మవిధ మెట్టిదియో?

9-98-వచనము

అని పలికిన నా రాజునకు బ్రాహ్మణజను లిట్లనిరి.

9-99-ఆటవెలది

అతిథి వోయిరామి నధిప! యీ ద్వాదశి
పారణంబు మానఁ బాడి గాదు
గుడువకుంట గాదు కుడుచుటయును గాదు
సలిలభక్షణంబు సమ్మతంబు.

## 9-11- దూర్వాసుని కృత్య కథ

### 9-100-వచనము

అని ధర్మసందేహంబు పాపిన, నా రాజర్షిశ్రేష్ఠుండును మనంబున హరిం దలంచి నీరు పారణంబు చేసి, జలంబుల మునింగిన తపసి రాక కెదురుచూచుచున్న సమయంబున.

### 9-101-సీస పద్యము

యమునలోఁ గృతకృత్యుఁడై వచ్చి రాజుచే;
సేవితుండై రాజుచేష్టితంబు
బుద్ధిలో నూహించి బొమముడి మొగముతో;
నదరెడి మేనితో నాగ్రహించి
రెట్టించి యాఁకలి గొట్టుమిట్టాడంగ;
నీ సంపదున్మత్తు నీ నృశంసు
నీ దురహంకారు నిందఱుఁ గంటిరే? ;
విష్ణుభక్తుఁడు గాడు వీఁడు; నన్నుఁ

### 9-101.1-తేటగీతి

గుడువ రమ్మని మునుముట్టఁ గుడిచినాఁడు
ధర్మభంగంబు చేసి దుష్కర్ముఁ డయ్యె;

నయిన నిప్పుడు చూపెద నన్ని దిశల
నేను గోపింప మాన్పువాఁ డెవ్వఁ? డనుచు.

9-102-చంపకమాల

పెటపెటఁ బండ్లు గీఁటుచును భీకరుఁడై కనుఁ గ్రేవ నిప్పుకల్
పొటపొటరాల గండములుపొంగ మునీంద్రుఁడు హుంకరించుచున్
జట మొదలంటఁగాఁ బెఱికి చక్కన దానన కృత్య నాయుధో
త్కట వరశూల హస్తయుతఁగా నొనరించి కవించె రాజుపైన్.

9-103-వచనము

అంత.

9-104-కంద పద్యము

కాలానల సన్నిభయై
శూలాయుధహస్త యగుచు సుఱసుఱ స్రుక్కన్
నేలఁ బదంబులఁ ద్రొక్కుచు
వాలి మహాకృత్య మనుజవల్లభుఁ జేరెన్.

9-105-ఆటవెలది

ఆ ప్రకార మెఱిఁగి హరి విశ్వరూపుండు
పెట్టి తపసి చేయు పేడబంబుఁ
జక్కఁబెట్టు మనుచుఁ జక్రంబుఁ బంచిన
వచ్చె నదియుఁ బ్రళయవహ్ని పగిది.

9-106-వచనము

వచ్చి మునిపంచిన కృత్యను దహించి, తనివిచనక ముని వెంటం బడిన, మునియును మేరుగుహ జొచ్చిన నదియు నురగంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోన చొచ్చి మఱియును.

9-107-మత్తేభ విక్రీడితము

భువిఁదూఱన్ భువిదూఱు; నబ్ధిఁ జొర నబ్ధుల్ జొచ్చు; నుద్వేగియై
దివిఁ బ్రాకన్ దివిఁ బ్రాకు; దిక్కులకుఁ బో దిగ్వేధులం బోవుఁ; జి
క్కి వెసం గ్రుంగినఁ గ్రుంగు; నిల్వ నిలుచుం; గ్రేడింపఁ గ్రేడించు; నొ
క్కవడిన్ దాపసు వెంటనంటి హరిచక్రం బన్యదుర్వక్రమై.

9-108-శార్దూల విక్రీడితము

ఏ లోకంబున కైన వెంటఁబడి తోనేతెంచు చక్రానల
జ్వాలల్ మానుపువారు లేమిఁ జని దేవజ్యేష్ఠు లోకేశు వాఁ
డాలోకించి విధాత! విశ్వజననవ్యాపారపారీణరే
ఖాలీలేక్షణ! కావవే కరుఁణ జక్రంబున్ నివారింపవే.

9-109-వచనము

అనిన బ్రహ్మ యిట్లనియె.

9-110-మత్తేభ విక్రీడితము

కర మర్థిన్ ద్విపరార్థ సంజ్ఞ గల యీ కాలంబుఁ గాలాత్ముఁడై
సౌరిదిన్ నిండఁగఁ జేసి లోకములు నా చోటున్ విభుం డెవ్వఁడో
పరిపూర్తిన్ గనుఁ గ్రేవఁ గెంపుగదురన్ భస్మంబుగాఁజేయు నా
హరి చక్రానల కీల కన్యుఁ డొకరుం డడ్డంబు గా నేర్చునే?

9-111-ఆటవెలది

ఏను భవుఁడు దక్షుఁ డింద్రాదులును బ్రజా

పతులు భృగుఁడు భూతపతులు శిరము

లందుఁ దాల్తు మతని యాజ్ఞ జగద్ధితం

బంచు భూరికార్యమతుల మగుచు.

9-112-వచనము

కావున సుదర్శనానల నివారణంబునకు నోప” నని విరించి పలికిన దుర్వాసుండు కైలాసంబునకుం జనుదెంచి, శర్వు నాలోకించి చక్రా నలంబు తెఱం గెఱింగించిన నమ్మహాదేవుం డిట్లనియె.

9-113-సీస పద్యము

వినవయ్య! తండ్రి! ఈ విశ్వేశ్వరుని యందుఁ;

జతురాస్య జీవకోశములు పెక్కు

వేల సంఖ్యలు గూడి వేళతో నిబ్బంగి;

నగుచుండుఁ జనుచుండు; నదియుఁగాక

యెవ్వానిచే భ్రాంతి నేమందుచున్నార;

మేను దేవలుఁ డసురేంద్ర సుతుఁడు,

నారదుఁ డజుఁడు సనత్కుమారుఁడు ధర్ముఁ;

డా కపిలుఁడు మరీచ్యాదు లన్య

9-113.1-ఆటవెలది

పారవిదులు సిద్ధపతులు నెవ్వని మాయ

నెఱుఁగలేము దాన నింత పడుదు

మట్టి నిఖిలనాథు నాయుధశ్రేష్ఠంబుఁ
దొలఁగఁ జేయ మాకు దుర్లభంబు.

9-114-వచనము

మునీంద్ర! నీవు నమ్మహాత్ముని శరణంబు వేఁడుము; అతండు మేలు చేయంగలవా" డని పలికిన నీశ్వరునివలన నిరాశుండై దుర్వాసుండు వైకుంఠనగరంబునకుం జని.

9-115-శార్దూల విక్రీడితము

ఆ వైకుంఠములోని భర్మ మణి సౌధాగ్రంబు పై లచ్చితోఁ
గ్రేవన్ మెల్లన నర్మభాషణములం గ్రీడించు పుణ్యున్ హరిన్
దేవాధీశ్వరుఁ గాంచి యో వరద! యో దేవేశ! యో భక్తర
క్షావిద్యాపరతంత్ర! మానుపఁగదే చక్రానలజ్వాలలన్,

9-116-ఉత్పలమాల

నీ మహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుఁగంగ లేక నీ
ప్రేమకు వచ్చు దాసునకుఁ గ్రించుతనంబున నెగ్గు చేసితిన్
నా మఱపున్ సహింపు మట నారకుఁడైన మనంబులో భవ
న్నామము చింత చేసిన ననంత సుఖస్థితి నొందకుండనే?

9-117-వచనము

అని పలికి పాదకమలంబులకు మ్రొక్కి, లేవక యున్న దుర్వాసునిం గని హరి యి ట్లనియె.

9-118-చంపకమాల

చలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీల దొం
గిలి కొనిపోవుచుండుదు రకిల్బిషభక్తిలతాచయంబులన్
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికైవడిన్;
వలలకుఁ జిక్కి భక్తజన వత్సలతం జనకుందుఁ దాపసా!

9-119-ఆటవెలది

నాకు మేలు గోరు నా భక్తుఁ డగువాఁడు
భక్తజనుల కేన పరమగతియు;
భక్తుఁడెందు జనినఁ బఱతెంతు వెనువెంట
గోవు వెంటఁ దగులు కోడె భంగి.

9-120-వచనము

అదియునుం గాక.

9-121-ఆటవెలది

తనువు మనువు విడిచి, తనయులఁ జుట్టాల
నాలి విడిచి, సంపదాలి విడిచి,
నన్నుఁ గాని యన్య మెన్నఁడు నెఱుఁగని
వారి విడువ నెట్టివారి నైన.

9-122-కంద పద్యము

పంచేంద్రియముల తెరువుల
వంచించి మనంబునందు వరమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నన్నును

మంచివరుం బుణ్యసతులు మరగిన భంగిన్.

9-123-కంద పద్యము

సాధుల హృదయము నాయది;

సాధుల హృదయంబు నేను; జగముల నెల్లన్

సాధుల నేన యెఱుంగుదు

సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా!

9-124-ఆటవెలది

ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు

ముక్తి చేయుచుండు ముదముతోడ;

దుర్వినీతులగుచు దుర్జనులగువారి

కివియుఁ గీడు జేయ కేల యుండు? .

9-125-కంద పద్యము

నా తేజము సాధులలో

నాతతమై యుండు వారి నలఁచు జనులకున్

హేతి క్రియ భీతి నిచ్చుం

జేతోమోదంబుఁ జెఱచు సిద్ధము సుమ్మీ.

9-126-కంద పద్యము

అదె వో బ్రాహ్మణ! నీకును

సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుత గుణా

స్పదుఁ డిచ్చు నభయ మాతని

మది సంతసపడఁచి వేఁడుమా శరణంబునన్.

9-127-మత్తేభ విక్రీడితము

అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహోద్యచ్చక్రకీలావళీ
జనితాయాసుఁడు నిర్వికాసుఁ డుదితశ్వాసుండు దుర్వాసుఁడ
ల్లన యేతెంచి సుభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్య వేషున్ విదో
షు నయోదారమనీషు మంజుమితభాషున్ నంబరీషున్ వెసన్.

9-128-వచనము

కని దుఃఖితుండయి, యమ్మహీవల్లభు పాదంబులు పట్టి విడువకున్న నా నరేంద్రచంద్రుండు చరణస్పర్శనంబునకు నోడుచుఁ గరుణారసభరిత హృదయుండయి, హరిచక్రంబు నిట్లని స్తుతియించె.

9-129-సీస పద్యము

నీవ పావకుఁడవు; నీవ సూర్యుండవు;
నీవ చంద్రుండవు; నీవ జలము;
నీవ నేలయు; నింగి నీవ; సమీరంబు;
నీవ; భూతేంద్రియ నికర మీవ;
నీవ బ్రహ్మంబును; నీవ సత్యంబును;
నీవ యజ్ఞంబును; నీవ ఫలము;
నీవ లోకేశులు; నీవ సర్వాత్మయు;
నీవ కాలంబును; నీవ జగము;

9-129.1-తేటగీతి

నీవ బహుయజ్ఞభోజివి; నీవ నిత్య
మూలతేజంబు; నీకు నే మ్రొక్కువాఁడ
నీరజాక్షుండు చాల మన్నించు నట్టి
శస్త్రముఖ్యమ! కావవే చాలు మునిని.

9-130-మత్తేభ విక్రీడితము

హరిచే నీవు విసృష్టమై చనఁగ మున్నాలించి నీ ధారలన్
ధరణిన్ వ్రాలుట నిక్కమంచు మునుపే దైత్యేశ్వరవ్రాతముల్
శిరముల్ పాదములున్ భుజాయుగళముల్ చేతుల్ నిజాంగంబులం
దురులన్ బ్రాణసమీరముల్ వదలు నీ యుద్ధంబులం జక్రమా!

9-131-ఆటవెలది

కలఁగి నిద్రవోవఁ గలలోన వచ్చిన
నిన్నుఁ జూచి దీర్ఘనిద్ర వోదు
రసురవరులు శయ్యలం దున్న సతులు ప్ర
భాతమందు లేచి పలవరింప.

9-132-ఉత్పలమాల

చీఁకటిఁ బాపుచున్ వెలుఁగు జేయుచు సజ్జనకోటినెల్ల స
శ్రీకను జేయు నీరుచులు చెల్వగ ధర్మసమేతలై నినున్
వాకున నిట్టి దట్టిదని వర్ణన చేయ విధాత నేరఁ డ
స్తోకము నీదు రూపు గలదుం దుది లేదు పరాత్పరాద్యమై.

9-133-ఆటవెలది

కమలలోచనుండు ఖలుల శిక్షింపంగఁ
బాలు చేయ నీవు పాలు పడితి
వైన నింకఁజాలు నాపన్నుఁడై యున్న
తపసిఁ గావు మీవు ధర్మవృత్తి.

9-134-వచనము

అని వినుతించి కేలుఁ దమ్మిదోయి నొసలం బొసంగించి యిట్లనియె.

9-135-ఆటవెలది

ఏ నమస్కరింతు నింద్రశాత్రవ ధూమ
కేతువునకు ధర్మ సేతువునకు
విమల రూపమునకు విశ్వదీపమునకుఁ
జక్రమునకు గుప్త శక్రమునకు.

9-136-వచనము

అని మఱియు నిట్లనియె.

9-137-ఆటవెలది

విహిత ధర్మమందు విహరింతు నేనియు
నిష్టమైన ద్రవ్యమిత్తునేని
ధరణిసురుఁడు మాకు దైవతం బగునేని
విప్రునకు శుభంబు వెలయుఁగాక.

9-138-కంద పద్యము

అఖిల గుణాశ్రయుఁ డగు హరి

సుఖియై నా కొలువు వలనఁ జొక్కెడి నేనిన్
నిఖిలాత్మమయుం డగుటకు
సుఖమందుం గాక భూమిసురుఁ డిప్పేళన్.

9-139-వచనము

అని యివ్విధంబునం బొగడు పుడమితేనివలన మన్నించి, తపసిని దాహంబు నొందింపక, రక్కసులగొంగచక్రంబు తిరిగి చనియె; అంత దుర్వాసుండు శాంతిం బొంది మెల్లని మేలి మాటల నా రాజుం దీవించి, యిట్లనియె.

9-140-మత్తేభ విక్రీడితము

నరనాథోత్తమ! మేలు చేసితి కదా! నా తప్పు మన్నించి శ్రీ
హరి పాదాబ్జము లింత ముట్టఁగొలుతే? యాశ్చర్యమౌనెన్నుచో
నరుదండ్రే నినుబోఁటి సాధునకుఁ దాసై యిచ్చుటల్ గాచుటల్
సౌరిదిన్ నైజగుణంబులై సరస వచ్చుం గాదె మిత్రాకృతిన్.

9-141-వచనము

అదియునుం గాక.

9-142-మత్తేభ విక్రీడితము

ఒక మాటెవ్వని పేరు కర్ణములలో నొయ్యారమై సోకినన్
సకలాఘంబులు పల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టి స
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశుని
న్నకలంకస్థితిఁ గొల్చు భక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ!

9-143-మత్తకోకిలము

తప్పు లోఁగొని చక్రపావక దాహముం బెడఁబాపి తా
నొప్పునొప్పు భవద్దయారస మో నరేశ్వర! ప్రాణముల్
చెప్ప మున్నను పోయి క్రమ్మఱఁ జేరె ధన్యుఁడ నైతి నీ
కెప్పుడున్ శుభ మేను గోరెద నింకఁ బోయెద భూవరా!

9-144-కంద పద్యము

అనిన విని రాజముఖ్యుఁడు
మునివల్లభు పాదములకు మ్రొక్కి కడున్ మ
న్ననచేసి యిష్ట భోజన
మనువుగఁ బెట్టించెఁ దృప్తుఁ డయ్యె నతండున్.

9-145-వచనము

మఱియు నమ్మునీంద్రుం డిట్లనియె.

9-146-శార్దూల విక్రీడితము

కంటిన్ నేఁటికి నిన్ను నీ వచనముల్ కర్ణద్వయిం బ్రీతిగా
వింటిన్నన్నముఁ గొంటి నీ గృహమునన్ వేడ్కన్ ఫలం బందె నే
మంటిం బోయెద; నీ చరిత్ర మమరుల్ మర్త్యుల్ సుఖాసీనులై
మింటన్ మేదిని సన్నుతింపఁగల రీమీఁదన్ నరేంద్రాగ్రణీ!

9-147-వచనము

అని చెప్పి దుర్వాసుం డంబరీషుని దీవించి కీర్తించి మింటి తెరువున
బ్రహ్మలోకంబునకుం జనియె, మునీశ్వరుండు వచ్చి మగుడం జనువేళకు
నొక్కవత్సరంబు నిండి వ్రతంబు పరిపూర్ణం బైన.

9-148-ఆటవెలది

అవనిసురుఁడు గుడువ నతి పవిత్రంబైన
వంటకంబు భూమివరుఁడు గుడిచెఁ
దపసి సెగులు మాన్పఁ దానెంత వాఁడను
హరి కృపామహత్వ మనుచుఁ దలఁచి.

9-149-వచనము

మఱియును.

9-150-కంద పద్యము

హరి గొల్చుచుండువారికిఁ
బరమేష్ఠిపదంబు మొదలు పదభోగంబుల్
నరకసమము లను తలఁపున
ధరణీ రాజ్యంబుతోడి తగులము మానెన్.

9-151-వచనము

ఇట్లు విరక్తుండై.

9-152-ఆటవెలది

తనకు సదృశులైన తనయుల రావించి
ధరణి భరము వారిఁ దాల్పఁ బంచి
కాననంబు చొచ్చెఁ గామాది విజయుఁడై
నరవిభుండు హరి సనాథుఁ డగుచు.

9-153-కంద పద్యము

ఈ యంబరీషు చరితముఁ
దీయంబున విన్నఁ జదువ ధీసంపన్నుం
డై యుండును భోగపరుం
డై యుండును నరుఁడు పుణ్యుఁడై యుండు నృపా!

9-154-వచనము

విను మయ్యంబరీషునకు విరూపుండును, గేతుమంతుండును, శంభుండును నను వారు మువ్వురు గొడుకు; లందుఁ గేతుమంతుడును శంభుండును హరింగూర్చి తపంబు చేయువారై వనంబునకుం జనిరి; విరూపునికిఁ బృషదశ్వుండును, బృషదశ్వునకు రథీతరుండును గలిగి; రమ్మహాత్మునికి సంతతి లేకున్న నంగిరసుఁ డను మునీంద్రుం డతని భార్యయందు బ్రహ్మతేజోనిధు లయిన కొడుకులం గలిగించె వారలు రథీతరగోత్రులు నాంగిరసులను బ్రాహ్మణులునై యితరు లందు ముఖ్యులయి ప్రవర్తిల్లి రని చెప్పి శుకుం డిట్లనియె.

## 9-12- ఇక్ష్వాకుని వంశము

9-155-కంద పద్యము

ఒకనాఁడు మనువు దుమ్మిన
వికలుఁడు గా కతని ఘ్రాణవివరము వెంటం
బ్రకటయశుం డిక్ష్వాకుం
డకలంకుఁడు పుట్టె రవికులాధీశుండై.

9-156-సీస పద్యము

ఇక్ష్వాకునకుఁ బుత్రు లెలమిఁ బుట్టిరి నూర్వు;

రమర వికుక్షియు నిమియు దండ
కుండు నాతని పెద్దకొడుకులు ముప్వ రా;
ర్యావర్త మందు హిమాచలంబు
వింధ్యాద్రిమధ్య ముర్వీమండలము గొంత;
యేలిరి యిరువదియేవు రొక్క
పొందున నా తూర్పుభూమి పాలించిరి;
యందఱు పడమటి కధిపులైరి

9-156.1-తేటగీతి

యున్న నలువది యేడ్వురు నుత్త రోర్వి
దక్షిణోర్వియుఁ గాచిరి తండ్రి యంత
నష్టకాశ్రాద్ధ మొనరింతు ననుచు నగ్ర
సుతు వికుక్షి నిరీక్షించి శుద్ధమైన
మాంసఖండంబు దెమ్మనె మహితయశుఁడు.

## 9-13- వికుక్షి చరితము

9-157-మత్తేభ విక్రీడితము

అగుఁగా కంచు వికుక్షి వేఁటజని ఘోరారణ్యభూమిం దగన్
మృగసంఘంబులఁ జంపి బిట్టలసి తా; మే నొల్లఁబో నాకటన్
సగమై యొక్క శశంబుఁ బట్టి తిని శేషంబైన మాంసంబు శీ
ఘ్రగతిం దండ్రికిఁ దెచ్చి యిచ్చె నకలంకస్ఫూర్తి వర్థిల్లగాన్.

9-158-తరళము

కులగురుండు వసిష్ఠుఁ డంత వికుక్షి కుందెలు దింట లో

పల నెఱింగి యనర్థ మెంగిలి పైతృకం బొనరింపఁగా
వలదు వీఁడు దురాత్మకుం డన వాని తండ్రియు వానిఁ జెం
తలను జేరఁగనీక దేశము దాఁటి పో నడిచెన్ వడిన్.

9-159-ఆటవెలది

కొడుకు వెడలఁగొట్టి గుణవంతుఁ డిక్ష్వాకుఁ
డా వసిష్ఠుఁ డేమి యానతిచ్చె
నదియుఁ జేసి యోగి యై వనంబునఁ గళే
బరము విడిచి ముక్తి పదము నొందె.

9-160-చంపకమాల

జనకుఁడు ముక్తి కేఁగ నయశాలి వికుక్షి శశాదుఁ డంచు భూ
జనులు నుతింప నీ ధరణిచక్ర మశేషము నేలి యాగముల్
గొనకొని చేసెఁ బ్రీతి హరిఁగూర్చి పురంజయుఁ బుత్రుఁ గాంచెఁ బే
ర్కొనె నమరేంద్ర వాహుఁడుఁ గకుత్స్థుఁడు నంచును వాని లోకముల్.

9-161-సీస పద్యము

కృతయుగాంతంబున దితిసుతామరులకు;
రణ మయ్యె; నందు నా రాక్షసులకు
నమర వల్లభుఁ డోడి హరితోడఁ జెప్పిన;
జలజనేత్రుఁడు పురంజయుని యందు
వచ్చి నే నుండెద వాసవ! వృషభంబ;
పై మోవు మని పల్క నమరవిభుఁడు
గోరాజమూర్తిఁ గకుత్ప్రదేశంబున;

నా పురంజయు మోచె నంత నతఁడు

9-161.1-తేటగీతి

విష్ణుతేజంబు దనయందు విస్తరిల్ల
దివ్యచాపంబు చేఁబట్టి దీర్ఘ నిశిత
బాణములఁ బూని వేల్పులు ప్రస్తుతింప
నంతఁ గాలాగ్ని చాడ్పున ననికి నడచె.

9-162-చంపకమాల

నడచి శరావళిన్ దనుజనాథుల మేనులు చించి కంఠముల్
దొడిఁదొడిఁ ద్రుంచి కాలుపురి త్రోవకుఁ గొందఱఁ బుచ్చి కొందఱన్
వడి నురగాలయంబున నివాసము చేయఁగ దోలి యంతనూ
అడక నిశాచరేంద్రుల పురంబులు గూల్చెఁ బురంజయాఖ్యతన్.

9-163-వచనము

ఇవ్విధంబున శశాదపుత్త్రుండు రాక్షసుల పురంబులు జయించిన కతనం బురంజయుండును, వృషభరూపుండైన యింద్రుండు వాహనంబగుటం జేసి యింద్రవాహనుండును, నతని మూఁపురం బెక్కి రణంబు చేసిన కారణంబునఁ గకుత్థ్సుండును నన నీ మూఁడు నామంబులం బ్రసిద్ధికెక్కి, దైత్యుల ధనంబుల నింద్రున కిచ్చె నప్పురంజయుని పుత్త్రుం డనేనసుం, డతని పుత్త్రుండు పృథుండు; పృథుని కొడుకు విశ్వగంధుండు; విశ్వగంధునకు నందనుండు చంద్రుండు; చంద్రుసుతుండు యవనాశ్వుండు; యవనాశ్వతనూభవుండు శవస్తుం; డతడు శావస్తి నామ నగరంబు నిర్మించె; శవస్త తనయుండు బృహదశ్వుండు; బృహదశ్వతనూజుండు గువలయాశ్వుండా నరేంద్రుండు.

9-164-కంద పద్యము

లావు మెఱసి యిరువది యొక
వేవురు నందనులుఁ దాను వీరుఁ డతఁడు భూ
దేవుఁ డుదంకుడు పనుప దు
రావహుఁడై చంపె ధుంధు నమరాబంధున్.

9-165-వచనము

అది కారణంబుగా ధుంధుమారుం డన నెగడె నయ్యసురముఖానలంబునఁ గువలయాశ్వకుమారు లందఱు భస్మం బైరి; రందు దృఢాశ్వుండును, గపిలాశ్వుండును, భద్రాశ్వుండును నను వారలు ముగ్గురు చిక్కి; రందు దృఢాశ్వునకు హర్యశ్వుండును, హర్యశ్వునకు నికుంభుండును, నికుంభునకు బర్హిణాశ్వుండును, బర్హిణాశ్వునకుఁ గృతాశ్వుండును, గృతాశ్వునకు సేనజిత్తును, సేనజిత్తునకు యువనాశ్వుండును, జనించి; రయ్యువనాశ్వుండు గొడుకులు లేక నూర్వురు భార్యలుం దానును నిర్వేఱ పడియుండ నా రాజునకు మునులు గృపచేసి యింద్రుని గూర్చి సంతతికొఱకు నైంద్రయాగంబు చేయించిరి; అందు.

## 9-14- మాంధాత కథ

9-166-సీస పద్యము

భూమీశు భార్యకుఁ బుత్రలాభమునకై;
పోయు తలంపున భూమిసురులు
జలములు మంత్రించి జలకలశము దాఁచి;
నియమంబుతోఁ గూడి నిద్రవోవ
ధరణీశ్వరుఁడు పేరుదప్పితోఁ నా రాత్రి;

ధృతి లేక యజ్ఞమందిరముఁ జొచ్చి
యానీరు ద్రావిన నంత మేల్కని వార;
లెవ్వఁడు ద్రావె నీరెందుఁ బోయె;

9-166.1-ఆటవెలది

ననుచు రాజు ద్రావు టంతయు భావించి
యెఱిఁగి చోద్య మంది యీశ్వరాజ్ఞ
యెవ్వఁ డోపుఁ గడవ; నీశ్వరునకు నమ
స్కార మనుచు నేది కార్య మనుచు.

9-167-వచనము

వారలు దుఃఖించుచుండు నంతఁ గొంత తడవునకు యువనాశ్వుని కడుపు వ్రక్కలించుకొని చక్రవర్తి చిహ్నంబులు గల కుమారుండు జన్మించి తల్లి లేని కతంబునఁ గడుపునకు లేక యేడ్చుచుండ, నింద్రుండు వచ్చి, శిశువునకు నాకఁలి దీఱుకొఱకు వాని నోటం దన ప్రేలిడినం, ద్రావిన కతంబున వాని పేరు మాంధాత యని నిర్దేశించి చనియె; ఇవ్విధంబున.

9-168-ఆటవెలది

కడుపు పగుల ముద్దుకొడుకు జన్మించినఁ
దీఱఁ డయ్యెఁ దండ్రి దేవ విప్ర
కరుణ యట్లకాదె? కడిఁది దైవములావు
కలుగువాఁడు బ్రతుకుఁ గాక చెడునె?

9-169-వచనము

ఇట్లు బ్రతికి యున్న యువనాశ్వుండు గొంతకాలంబునకుఁ దపంబుచేసి సిద్ధిం బొందె; నంత.

9-170-సీస పద్యము

పడమటఁ బొడమెడు బాలచంద్రుని మాడ్కిఁ;
 బూటపూటకు వృద్ధిఁబొందె బాలుఁ;
డల్లన పరిపూర్ణ యౌవనారూఢుఁడై;
 రావణాది రిపుల రాజవరుల
దండించి తనుఁ ద్రసదస్యుఁ డంచు సురేంద్రుఁ;
 డంకింప శూరుఁడై యఖిలదేవ
మయు నతీంద్రియు విష్ణు మాధవు ధర్మాత్ము;
 నజుని యజ్ఞాధీశు నాత్ముఁ గూర్చి

9-170.1-తేటగీతి

చేసెఁ గ్రతువులు భూరిదక్షిణల నిచ్చి
ద్రవ్య యజమాన విధి మంత్ర ధర్మ యజ్ఞ
కాల ఋత్వి క్ప్రదేశ ముఖ్యంబు లెల్ల
విష్ణురూపంబు లనుచు భావించి యతఁడు.

9-171-కంద పద్యము

బలిమి నడంచుచు నరులం
జలి వెలుఁగున్ వేఁడివెలుఁగుఁ జనుచో ట్లెల్లన్
జలరుహనయనుని కరుణను
జెలువుగ మాంధాత యేలె సిరి నిండారన్.

9-172-వచనము

అంతనా రాజునకు శతబిందుని కూఁతురగు బిందుమతి యందుఁ బురుకుత్సుండును, నంబరీషుండును, ముచుకుందుండును, నను వారు ముగ్గురు గొడుకులు నేబండ్రు గూఁతులును జనియించి పెరుఁగుచున్న యెడ.

9-173-సీస పద్యము

యమునాజలములోన నధికుఁడు సౌభరి;
 తపము చేయుచు జలస్థలమునందుఁ
బిల్లలుఁ దన ప్రాణవల్లభయును గూడి;
 మెలఁగ నానందించు మీనరాజుఁ
గనుఁగొని సంసారకాంక్షియై మాంధాత;
 నొక కన్య నడుగ నృపోత్తముండు
దరుణి నిత్తును స్వయంవరమునఁ జేకొను;
 మనవుడు ననుఁ జూచి యౌవనాంగి

9-173.1-ఆటవెలది

యేల ముసలిఁ గోరు నిట్టట్టు వడఁకెడి
వాఁడఁ జాల నరసినాఁడ నొడల
జిగియు బిగియు లేని శిథిలుండఁ గరఁగింప
బాలఁ దిగిచికొను నుపాయ మెట్లు?

9-174-వచనము

అదియునుం గాక.

9-175-ఆటవెలది

బాల పువ్వుఁబోఁడి ప్రాయంపు వానిని
వెన్నువాని ధనము జేర్చువాని
మరిగెనేనిఁ గొంత మరుగుఁగా కెదిరిఁ ద
న్నెఱిఁగి ముసలితపసి నేల మరుగు?

9-176-వచనము

అని విచారించి సౌభరి దన తపోబలంబునం జేసి ముసలితనంబు విడిచి యెల ప్రాయంపుఁ గొమరుం డయి యలంకరించుకొని ముందట నిలువంబడిన మాంధాతయుఁ గన్నియల నగరు గాచికొని యున్నవారికి సెలవు జేసిన వా రమ్మునీంద్రుని నా రాజపుత్రిక లున్న యెడకుఁ గొనిపోయి చూపిన.

9-177-ఉత్పలమాల

కోమలులార వీఁడు నలకూబరుఁడో; మరుఁడో; జయంతుఁడో;
యేమఱి వచ్చె; వీనిఁ దడవేల వరింతుము నేమ యేమ యం
చా మునినాథుఁ జూచి చలితాత్మకలై సొరదిన్ వరించి రా
భామిను లందఱుం గుసుమబాణుఁడు గీ యని ఘంట ప్రేయఁగన్.

9-178-వచనము

ఇట్లు రాజకన్యకల నందఱం జేకొని సౌభరి నిజతపఃప్రభావంబున ననేక లీలావినోదంబులఁ గల్పించి.

9-179-సీస పద్యము

గృహరాజముల యందుఁ గృతకాచలములందుఁ;

గలువలు విలసిల్లు కొలఁకులందుఁ
గలకంఠ శుక మధుకర నినాదములచే;
వర్ణనీయములైన వనములందు
మణివేదికలయందు మహనీయ పర్యంక;
పీఠ లీలాశైల బిలములందు
శృంగారవతులగు చెలువలు పలువురు;
తనపంపు చేయ సుస్థలములందు

9-179.1-తేటగీతి

వస్త్ర మాల్యానులేప సువర్ణహార
భూరి సంపద నిష్టాన్న భోజి యగుచుఁ
బూఁటపూఁటకు నొక వింత పొలుపుఁ దాల్చి
రాజకన్యల నందఱ రతులఁ దేల్చె.

9-180-కంద పద్యము

పెక్కండ్రు రాజముఖులకు
నొక్కఁడు మగఁ డయ్యుఁ దనియకుండె మునీంద్రుం
డెక్కుడు ఘృతధారలచే
నక్కజమై తృప్తి లేని యనలుని భంగిన్.

9-181-వచనము

ఇవ్విధంబున.

9-182-కంద పద్యము

ఆరామంబున మునివరుఁ
డా రామలతోడ బహువిహారమయుండై
గారాములఁ దన కిట్టటు
పోరాములు చేసి కొన్ని ప్రొద్దుల్ పుచ్చెన్.

9-183-వచనము

అంత నొక్కనాఁడు మాంధాతృమేదినీవల్లభుండు "మునీశ్వరుం డెందుఁ బోయెఁ గూఁతు లెక్కడ నలజడి పడుచున్నవారలో" యని తలంచి వెదకవచ్చి, యొక్క మహాగహనంబున మణిమయ సౌధంబులం జక్రవర్తియుంబోలెఁ గ్రీడించుచున్న తాపస రాజుం గని, సంతసించి, వెఱఁగుపడి, మన్ననలం బొంది మెల్లన కూఁతులం బొడగని సత్కరించి యిట్లనియె.

9-184-కంద పద్యము

నాతోడులార! మీ పతి
మీ తోడే? పనుల యెడల మే లే యనుడున్
నాతోడిదె నాతోడిదె
తాతా మే లనుచు ననిరి తరుణులు వరుసన్.

9-185-వచనము

అంతఁ గొంతకాలమునకు బహుభార్యాచర్యుండగు సౌభరి యేకాంతంబునఁ దన్నుఁ దాన చింతించుకొని, మీనమిథున సంగదోషంబునం గాఁపురంబు దనకు నగపడుట యెఱింగి, పశ్చాత్తాపంబున నిట్లనియె.

9-186-మత్తేభ విక్రీడితము

ఉపవాసంబుల డయ్యుటో? విషయసంయోగంబు వర్జించుటో?
తపముం బూని చరించుటో? హరిపదధ్యానంబునన్ నిల్చుటో?
యుపలాపంబున నేల పొందితి? హతంబయ్యెం దపంబెల్ల నీ
కపటస్త్రీపరిరంభముల్ మునులకుం గైవల్య సంసిద్ధులే?

9-187-చంపకమాల

మునినఁట; తత్త్వవేదినఁట; మోక్షముకాని సుఖంబులెవ్వియుం
జనవఁట; కాంత లేఁబదట; సాధచయంబఁట; వాసదేశముం,
దనయులు నైదువేలఁట; నిదానము మీనకుటుంబి సౌఖ్యముం
గనుటఁట; చెల్లరే! నగవుగాక మహాత్ములు చూచి మెత్తురే?

9-188-ఆటవెలది

తపము జేయువాఁడు తత్త్వజ్ఞుడగువాఁడు
నెలమి మోక్ష మిచ్ఛయించువాఁడు
నేకతంబు విడిచి యేర్పడనేరఁడు
కాఁపురంబు జేయుఁ గఱటి తపసి.

9-189-వచనము

అని దుఃఖించి, తన్నుం దాన నిందించుకొని, తన వేడబంబు వివేకించుచు, నిహపరసాధకుండై, కాపురంబువిడిచి, సతులుం దానును వానప్రస్థధర్మంబున నడవికిం జని, ఘోరతపంబు జేసి, శరీరంబు గుదియించి, యగ్నిసహితుండై, పరబ్రహ్మంబు జొచ్చె; అంత.

9-190-కంద పద్యము

మునిపతి వనమున కరిగిన
వనితలుఁ దోనరిగి ప్రాణవల్లభు గతికిం
జనిరి పెనుతవిలి విడువక
యనలము చన శిఖలు నిలువ కరిగిన భంగిన్.

## 9-15- పురుకుత్సుని వృత్తాంతము

### 9-191-వచనము

అంత మాంధాత పెద్దకొడుకగు నంబరీషునిం దత్పితామహుండగుటంజేసి యువనాశ్వుండు దనకుఁ బుత్త్రుండు గావలయునని కోరి పుచ్చుకొనియె; నయ్యంబరీషునకు యౌవనాశ్వుం, డతనికి హారితుండు జనియించి రది కారణంబుగా నంబరీష యౌవనాశ్వ హారితులు మాంధాతృ గోత్రంబునకు ప్రవరు లయిరి; మాంధాత రెండవ కొడుకు పురుకుత్సుఁ; డతని నురగలోకంబునకుఁ గొనిపోయి నాగకుమారులు దమ చెల్లెలు నర్మదయను కన్యకను వివాహంబు చేసిరి; పురుకుత్సుండు నక్కడ ననేక గంధర్వ నాథుల వధించి తన నాగ లోకసంచరణంబు దలంచువారికి నురగభయము లేకుండ వరంబు పడసి తిరిగి వచ్చె; ఆ పురుకుత్సునకుఁ ద్రసదస్యుండుఁ, ద్రసదస్యునకు ననరణ్యుండు, నా యనరణ్యునకు హర్యశ్వుండు, హర్యశ్వునకు నరుణుండును, యరుణునకుఁ ద్రిబంధనుండుఁ, ద్రిబంధనునకు సత్యవ్రతుండును జన్మించి రా సత్యవ్రతుండ త్రిశంకుం డనం బరగె; అతండు.

## 9-16- హరిశ్చంద్రుని వృత్తాంతము

### 9-192-సీస పద్యము

గురుశాపవశమునఁ గూలి చండాలుఁడై;

యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి;
యతని లావున దివిజాలయంబున కేఁగ;
మన్నింప కమరులు మరలఁ ద్రోయఁ;
దల క్రిందుగాఁ బడి దైన్యంబుతో రాఁగఁ;
గౌశికుఁ డెప్పటి ఘనత మెఱసి
నిలిపె నాకసమున; నేఁడు నున్నాఁడు త్రి;
శంకుఁ; డాతఁడు హరిశ్చంద్రుఁ గనియె;

9-192.1-తేటగీతి

నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁ జేరి
యాగదక్షిణామిషమున నఖిలధనముఁ
గొల్ల గొని మీఁదఁ గులహీనుఁ గొలువఁ బెట్టఁ;
బొంక కలజడిఁ బొందె నా భూవరుండు.

9-193-వచనము

ఇట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నెగులపఱచుట విని వసిష్ఠుండు విశ్వామిత్రునిఁ గృధ్రమ్మవు గమ్మని శపించె; విశ్వామిత్రుండును వసిష్ఠుని బకంబవు గమ్మని శపించె; పక్షిరూపు లయ్యును వైరంబు మానక యియ్యిరువురును యుద్ధంబు చేసి రంత హరిశ్చంద్రుండు పుత్రులు లేక నారదు నుపదేశంబున వరు ణోపాసనంబు నతి భక్తితోఁ జేయ నా వరుణుండు ప్రత్యక్షంబైన నతనిక మ్రొక్కి యిట్లనియె.

9-194-ఆటవెలది

వరుణదేవ! నాకు వరవీరగుణముల

కొడుకు పుట్టెనేని కొడుకుఁ బట్టి
పశువుఁ జేసి నీవు పరిణమింపఁగ వేల్తుఁ
గొడుకు నీఁ గదయ్య కొసరు లేక.

9-195-వచనము

అని పలికినం గుమారుండు గలిగెడు మని వరంబిచ్చి వరుణుండు చనియె; నంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున రోహితుఁడను కుమారుండు జన్మించె; వరుణుండును హరిశ్చంద్రకుమారు నుద్దేశించి.

9-196-సీస పద్యము

పురిటిలోపల వచ్చి పుత్త్రు వేలుపు మన్నఁ;
బురుడు వోయినగాని వొసఁగ దనియె;
బలురాకమును వచ్చి బాలు వేలుపు మన్న;
బండ్లు లేకుండ నభావ్యఁ డనియెఁ;
బండ్లు రాఁజూచి డింభకుని వేలుపు మన్నఁ;
బడి పండ్లురామి నభావ్యుఁ డనియె;
బడిపండ్లు వొడమినఁ గొడుకు వేలుపు మన్నఁ;
బోరుల కొదవక పోల దనియెఁ;

9-196.1-ఆటవెలది

దొడరి యిట్లు గొడుకుతోడి మోహంబునఁ
బ్రొద్దు గడుపుచుండె భూవరుండు
దండ్రి తలఁపుకొలఁది దనలోనఁ జింతించి
యింట నుండ కడవి కేఁగెఁ గొడుకు.

9-197-వచనము

ఇట్లు వనంబునకుఁ జని శరశరాసన ధరుండయి రోహితుండు దిరుగుచుండి వరుణగ్రస్తుండై హరిశ్చంద్రుండు మహోదరవ్యాధిచేఁ బీడితుండుగా నుండుట విని పురంబునకుం దిరిగిరా గమకింప నింద్రుండు ముసలి తపసియై వచ్చి నిట్లనియె.

9-198-కంద పద్యము

పుణ్యభూము లరుగు; పుణ్యతీర్థంబులఁ
గ్రుంకు; పుణ్యజనులఁ గోరి చూడు;
పుణ్యకథలు వినుము భూపాలపుత్త్రక!
మేలు గలుగునట్టి మేర గలదు.

9-199-వచనము

అని యిట్లు మగిడించినం దిరిగి చని రోహితుం డొక్క యేఁ డవ్వనంబునం దిరిగి క్రమ్మఱఁ జనుదేర నింద్రుండు వచ్చి తొంటి యట్ల నివారించె; ఇవ్విధంబున.

9-200-సీస పద్యము

ఐదేండ్లు మరలించె నమరేంద్రుఁ డా బాలు;
నాఱవ యేఁటఁ దా నడవినుండి
యింటికి వచ్చుచు నెలమి నజీగర్తు;
మధ్యమ పుత్త్రు సన్మాన్యచరితు
ఘను శునశ్శేపునిఁ గొని యాగపశువుగ;
నా హరిశ్చంద్రున కాతఁ డిచ్చెఁ;
బురుషమేధము చేసి భూపాల వర్యుఁడు;
వరుణాది నిఖిల దేవతలఁ దనిపె

9-200.1-తేటగీతి

హోత కౌశికుఁ; డధ్వర్యుఁ డొనర భృగువు;
బ్రహ్మ జమదగ్ని; సామంబు పాడువాడు
ముని వసిష్ఠుఁ; డా మఖమున ముదముఁ బొంది
కనకరథ మిచ్చె నింద్రుఁ డా మనుజపతికి.

9-201-వచనము

శునశ్శేపుని ప్రభావంబు వెనుక వివరించెద; నంత భార్యాసహితుం డైన హరిశ్చంద్రు వలనం బ్రీతుండై విశ్వామిత్రుండు నిరస్తదోషుం డైన యతనికి ముఖ్యజ్ఞానంబు గృప జేసిన మనం బన్నమయంబు గావున, మనంబున నన్నరూపి యైన పృథివి నెఱింగి, పృథివిని జలంబువలన నడంచి, జలంబుఁ దేజంబువలన నింకించి, తేజంబు వాయువు వలనం జేరిచి, వాయువు నాకాశంబునం గలిపి, యాకాశంబుఁ దామసాహంకారంబునందు లయంబు చేసి, యహంకార త్రయంబు మహత్తత్త్వంబునందు డిందించి, పరతత్త్వంబునకు లోకంబులు సృజించెద నను తలంపైన మహత్త త్త్వంబు నందు విషయాకారంబు నివర్తించి, విషయవర్జితంబైన మహత్తత్త్వంబును బరతత్త్వంబుగా నెఱుంగుచు నయ్యెఱుకవలన సంసారహేతువైన ప్రకృతిని భస్మంబు చేసి, యయ్యెఱుకను నిర్వాణసుఖపారవశ్యంబునం బరిహరించి, సకలబంధవిముక్తుండై హరిశ్చంద్రుం డవాఙ్మనస గోచరంబయిన నిజరూపంబుతో వెలుంగుచుండె; అతని కుమారునకు లోహితునకు హరితుండు పుట్టె; హరితునకుఁ జంపనామ ధేయుఁడు జనియించె; అతండు దనపేర జంపానగరంబు నిర్మించె; ఆ చంపునికి సుదేవుండు, సుదేవునికి విజయుండు, విజయునకు రురుకుండు, రురుకునకు వృకుండు, వృకునకు బాహుకుండు జనియించిరి; అందు బాహుకుండు.

## 9-17- సగరుని కథ

9-202-సీస పద్యము

దండించి పగవారు దనభూమిఁ జేకొన్న;
 నంగనలును దాను నడవి కేఁగి
యడవిలో ముసలియై యాతఁడు చచ్చిన;
 నాతని భార్య దా ననుగమింపఁ
గదియుచో నా స్త్రీకి గర్భంబు గలుగుట;
 యౌర్వమునీశ్వరుఁ డాత్మ నెఱిఁగి
వారించె; నంత నవ్వనజాక్షి సవతులు;
 చూలు నిండారినఁ జూడఁ జాల

9-202.1-తేటగీతి

కర్థి నన్నంబు గుడుచుచో నందుఁ గలిపి
విషము పెట్టిరి; పెట్టిన విరిసి పడక
గరముతోఁ గూడ సగరుండు ఘనుఁడు పుట్టి
వరయశస్ఫూర్తితోఁ జక్రవర్తి యయ్యె.

9-203-శార్దూల విక్రీడితము

చండస్ఫూర్తి నతండు తండ్రిపగకై సంగ్రామరంగంబులం
జెండెన్ హైహయబర్బరాదుల; వధించెం దాళజంఘాదులన్;
ముండీభూతులుగా నిరంబరులుగా మూర్తుల్ సబీభత్సులై
యుండంజేసె, నిజారులన్ సగరనామోర్వీవిభుం డల్పుఁడే.

9-204-కంద పద్యము

ఖగరాజరుచులు గల యిల

పగరాజుల నడఁచి యేలె బాహాశక్తిన్

నగరాజధీరు శూరున్

సగరున్ హతవిమతనగరుఁ జను వినుతింపన్.

9-205-సీస పద్యము

ఔర్వుండు చెప్పంగ నమర వేదాత్మకు;

హరి నీశు నమృతు ననంతుఁగూర్చి

వాజిమేధంబులు వసుధేశ్వరుఁడు చేసె;

నందొక్క మఖమున హయము విడువ

నగభేది గొనిపోయి నాగలోకంబునఁ;

గపిలుని చేరువఁ గట్టి తొలఁగెఁ;

నంత గుఱ్ఱముఁ గాన కా రాజు దన పుత్ర;

నివహంబు దిశలకు నెమకఁ బంప

9-205.1-తేటగీతి

వారు నిల యేడు దీవుల వరుస వెదకి

మఖతురంగంబు లేకున్న మగిడి రాక

ప్రాభవంబున దోర్దండబలము మెఱసి

గ్రొచ్చి కోరాడి త్రవ్విరి కుతల మెల్ల.

9-206-వచనము

ఇట్లు సుమతికొడుకులు నేలంద్రవ్వి పాతాళంబునం దూర్పుముట్టి యున్న నుత్తరభాగంబునం గపిలమునిపొంతనున్న తురగంబుఁ గని.

9-207-చంపకమాల

ఎఱిఁగితి మద్దిరయ్య తడవేటికి? గుఱ్ఱపుదొంగ చిక్కె; నీ
జఱభుని బట్టి చంపుఁ; డతిసాధుమునీంద్రుఁడుఁబోలె నేత్రము
ల్దెఱవక బాకినోరు మెదలింపక బైసుక పట్టె నంచు న
య్యఱువది వేవురున్ నిజకరాయుధముల్ జళిపించి డాయుచోన్.

9-208-చంపకమాల

కపిలుఁడు నేత్రముల్ దెఱవఁగాఁ దమ మేనుల మంట పుట్టి తా
రపగతధైర్యులై పడి యఘూళికతంబున మూఢచిత్తులై
నృపసుతు లందఱున్ ధరణి నీఱయి రా క్షణమంద; సాధులం
దపసులఁ గాసిఁ బెట్టెడి మదస్ఫురితాత్మలు నిల్వనేర్తురే? .

9-209-సీస పద్యము

కొందఱు కపిలుని కోపానలంబున;
 వ్రందిరి సగరకుమారు లనుచు
నందు రా ముని శాంతుఁ డానందమయమూర్తి;
 తొడరి కోపించునే? దువ్వ నేలఁ
గాక జన్మించునే గగనస్థలంబున? ;
 నే సాంఖ్యమతమున నిద్ధమతులు
భవసముద్రము మృత్యుపదమును లంఘింతు;
 రా బుద్ధిఁ జేయు పరాత్మభూతుఁ

9-209.1-తేటగీతి

డఖిలబోధకుఁ డతనికి నరసిచూడ
సఖు లమిత్రులు నెవ్వరు? సగరసుతులు
దాము దయచేయు నేరమిఁ దనువులందు
ననలకీలలు పుట్టి నీఱైరి గాక.

9-210-వచనము

మఱియు సగరుండు గేశిని యందు గన్న పుత్త్రుం డసమంజసుం డనువాఁడు, సమంజస గుణంబులు లేక పూర్వజన్మంబున యోగీశ్వరుండై యుండి, సంగదోషంబువలన యోగభ్రష్టుండయి సగరునకు జన్మించి, జాతిస్మరజ్ఞానంబు గలిగి లోకంబువారలకుఁ దమ వారలకు నప్రియంబగు వర్తనంబునం దిరుగుచు నొక్కనాఁడు.

9-211-చంపకమాల

వరుస నయోధ్యలోనఁ గలవారల నాడెడు పిన్నవాండ్ర నా
సరయువులోనఁ ద్రైచి జనసంఘముఁ దండ్రియుఁ దిట్టుచుండ వాఁ
డురుమతిఁ గొన్ని ప్రొద్దులకు యోగబలంబునఁ జేసి బాలురం
దిరిగి పురంబు లోపలికిఁ దెచ్చిన నివ్వెఱఁ గంది రందఱున్.

9-212-వచనము

అయ్యసమంజసుని కొడు కంశుమంతుం డనువాఁడు వినీతుండై తన యొద్దఁ బనులు జేయుచుండు నంత; సగరుండమ్మనుమని నంశుమంతు నశ్వంబు వెదకి తెమ్మనిపంచిన నతండు దనతండ్రుల చొప్పునం జని, వారలు ద్రవ్విన మహాఖాతంబుచొచ్చి, యందు భస్మరాసులపొంత నున్న హయంబుఁ గని, యా

సమీపంబు నందున్న కపిలాఖ్యుం డయిన విష్ణుదేవునికి దండప్రణామంబు చేసి, యిట్లని స్తుతియించె.

9-213-సీస పద్యము

మతిచిక్కఁబట్టి సమాధి గౌరవమున;
 వాసిగాఁ దనకు నవ్వల వెలుంగు
నినుఁ గానఁ డొకనాఁడు నిన్నెఱుంగునె? బ్రహ్మ;
 యజుని మనంబున నవయవముల
బుద్ధి జన్మించిన భూరిజంతువులందు;
 హీనులమైన మా కెఱుఁగ వశమె?
తమలోన నీ వుండఁ దా మెఱుంగరు నిన్ను;
 గుణములఁ జూతురు గుణములైనఁ

9-213.1-తేటగీతి

గాన రొకవేళఁ జీఁకటిఁ గందు రాత్మ
లందుఁ దెలియరు వెలుపల నమరు బొందు
లరయుదురు దేహధారు లత్యంధు లగుచుఁ
గడిఁది నీ మాయ నెన్నఁడుఁ గడువ లేక.

9-214-వచనము

అని వినుతి చేయుచు, హయంబు విడువు మని చెప్పక తన తండ్రులు నీఱగుటం దడవక, మ్రొక్కి నిలుచున్న యంశుమంతునికిఁ గరుణావిపులుం డగు కపిలుం డిట్లనియె.

9-215-కంద పద్యము

గుఱ్ఱముఁ గొనిపో బుద్ధుల
కుఱ్ఱఁడ! మీ తాతయొద్దకున్ నీతండ్రుల్
వెఱ్ఱులు నీఱై రదె! యీ
మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభమగున్.

9-216-వచనము

అని పలికిన నమస్కరించి, తురంగంబుఁ గొనివచ్చి, యా సగరుని కిచ్చిన సగరుడా పశువువలన జన్నంబు కడమ నిండించి యంశుమంతునకు రాజ్యంబిచ్చి, ముక్తబంధనుండై, యౌర్వుండు చెప్పిన మార్గంబున నుత్తమ గతికిం జనియెను; అంత.

9-217-కంద పద్యము

జనకులు మ్రగ్గినచోటికి
ననిమిషనదిఁ దెత్తు ననుచు నటవీస్థలికిం
జని తపము చేయఁ జాలక
మనమున వగ లొలయ నంశుమంతుఁడు దీఱెన్.

9-218-కంద పద్యము

ఆతని కొడుకు దిలీపుఁడు
భూతలమున గంగ దెచ్చి పొందించుటకై
ప్రీతిం దపంబు చేయుచు
భాతిగఁ దేలేక కాలపరవశుఁ డయ్యెన్.

## 9-18- భగీరథుని చరితంబు

9-219-కంద పద్యము

అతని సుతుండు భగీరథుఁ
డతి తప మొనరించి కనియె నమృతాపాంగన్
సుతరంగన్ ముఖవనరుహా
రతభృంగన్ శివజటాగ్రరంగన్ గంగన్.

9-220-వచనము

కని నమస్కరించిన గంగ గృపజేసి, వరంబు వేఁడు మనిన నా రాచపట్టి యిట్లనియె.

9-221-కంద పద్యము

మా వారి భస్మరాసుల
నీ వారిం గలిపికొనుము; నెఱి మావారల్
నీ వారిఁ గలయ నాకము
మావారికిఁ గలుగు నిది ప్రమాణము తల్లీ!

9-222-ఇంద్రవ్రజము

చెల్లన్ మదిన్ నిన్ను భజింతు గంగన్
ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగం
గల్లోలలక్ష్మీజితకాశమల్లిం
దల్లిన్ సుధీకల్పలతామతల్లిన్.

9-223-వచనము

అని వినుతి చేయుచున్న రాజకుమారునకు లోకపావ నిట్లనియె.

9-224-మత్తేభ విక్రీడితము

వినువీథిం బఱతెంచి నేలఁబడు నా వేగంబునున్ నిల్ప నో
పినవాఁ డెవ్వఁడు? మేదినీతలము నే భేదించి పాతాళముం
జనుదున్; వచ్చితినేని నా జలములన్ సంస్నాతులై మానవుల్
ననుఁ బొందించు నఘవ్రజం బెచట నే నాశంబుఁ బొందించెదన్.

9-225-వచనము

అది కారణంబుగా విచారించెద” నని పలుకుచున్న లోకమాతకు
రాజన్యవర్యుండగు భగీరథుం డిట్లనియె.

9-226-మత్తేభ విక్రీడితము

పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తపః పారీణు లార్యుల్ ఘనుల్
బురుషశ్రేష్ఠులు వచ్చి తల్లి! భవదంభోగాహముల్ చేయఁగా
నరసంఘాఘము నిన్నుఁ బొందునె జగన్నాథుండు నానాఘ సం
హరుఁ డా విష్ణుఁడు వారిచిత్తములఁ దా నై యుంట మందాకినీ.

9-227-మత్తేభ విక్రీడితము

తనలో నిన్ని జగంబులుం గలుగుటం దా నిన్నిటం గల్గుటన్
జననీ! తంతువులందుఁ జీర గల యా చందంబునన్ విశ్వభా
వనుఁడై యొప్పు శివుండు గాక మఱి నీ వారిన్ నివారింప నే
ర్చిన వారెవ్వరు? నిన్ ధరించుకొఱకై శ్రీకంఠునిం గొల్చెదన్.

9-228-వచనము

అని యెఱింగించి వీడ్కొని, చని, భగీరథుండు మహేశ్వరు నుద్దేశించి గ్రద్దనఁ దపంబు చేసిన.

9-229-ఆటవెలది

భక్తవత్సలుండు ఫాలాక్షుఁ డా భగీ
రథుని మెచ్చి నిజ శిరంబునందు
శౌరిపాదపూత సలిల మై దివి నుండి
ధరకు వచ్చు గంగఁ దాల్చె నపుడు.

## 9-19- గంగాప్రవాహ వర్ణన

9-230-వచనము

ఇట్లమ్మహానదీప్రవాహంబు, పురారాతిజటాజూటరంధ్రంబుల వలన వెలువడి, నిరర్గళాయమానంబై, నేలకుఁ జల్లించి, నెఱసి నిండి పెల్లు వెల్లిగొని, పెచ్చు పెరిగి విచ్చలవిడిం గ్రేపువెంబడి నుఱక క్రేళ్ళుఱుకు మఱక ప్రాయంపుఁ గామధేనువు చందంబున ముందఱికి నిగుడు ముద్దుఁ జందురు తోడి నెయ్యంబునఁ గ్రయ్య నడరి చొప్పుదప్పక సాఁగి చనుదెంచు సుధార్ణవంబు కైవడిఁ బెంపుఁ గలిగి మహేశ్వరు వదనగహ్వరంబు వలన నోంకారంబు పిఱుంద వెలువడు శబ్దబ్రహ్మంబు భంగి నదభ్రవిభ్రమంబై య మ్మహీపాల తిలకంబు తెరువు వెంటనంటి వచ్చు వెలియేనుఁగు తొండంబుల ననుకరించి పఱచు వఱదమొగంబులును, వఱదమొగంబుల పిఱుందనందంద క్రందుకొని వొడచూపి తొలంగు బాలశారదా కుచకుంభంబులకు నగ్గలం బైన బుగ్గలును, బుగ్గలసంగడంబునం బారిజాతకుసుమ స్తబకంబుల చెలువంబులం దెగడు వెలినురువులును, వెలినురువుల చెంగట నర్థోన్మీలిత

కర్పూరతరుకిసలయంబులఁ చక్కందనముఁ గేలిగొను సుళ్ళును, సుళ్ళ
కెలంకుల ధవళజలధరరేఖాకారంబుల బాగు మెచ్చని నిడుద యేఱులును,
నేఱులం గలసి వాయువశంబున నొండొంటిం దాఁకి బిట్టు మిట్టించి, మీఁది కెగయు
దురితభంగంబులైన భంగంబులును, భంగంబులకొనల ఛిన్నభిన్నంబులై
కుప్పించి, యుప్పరం బెగసి, ముత్తియంపు సరుల వడుపున,
మల్లికాదామంబుల తెఱంగునఁ గర్పూరఖండకదంబంబుల చెలువంబున
నిందుశకలంబుల తేజంబునఁ, దారకానికరంబుల పోలుపున మెఱయుచు, ముక్తి
కన్యా వశీకరంబులైన శీకరంబులునుం గలిగి, మధ్యమలోక శ్రీకరంబై, శ్రీకరంబు
తెఱంగున విష్ణుపదంబు ముట్టి, విష్ణుపదంబు భాతి నుల్లసితహంసరుచిరంబై,
రుచిరపక్షంబురీతి నతిశోభితకువలయంబై, కువలయంబు చెన్నున
బహుజీవనంబై, జీవనంబులాగున సుమనోవికాసప్రధానంబై, ప్రధాన పర్వంబు
పోలుపున నేకచక్ర బక భీమ మహాభంగ సుభద్రార్జున చరిత్రారామంబై,
రామచిత్తంబు మెలఁపువం దనవారిలోఁజొచ్చిన దోషాచరుల కభయప్రదాన
చణంబై, ప్రదానచణ వర్తనంబు భాతి సముపాసిత మృత్యుంజయంబై,
మృత్యుంజయురూపంబుపోలిక విభూతి సుకుమారంబై, కుమారచరిత్రంబురేవను
గ్రౌంచప్రముఖవిజయంబై, విజయ రథంబుభాతి హరిహయామంథరంబై,
మంథరవిచారంబు గ్రద్దన మహారామగిరివనప్రవేశకామంబై, కామకేతనంబు
పెల్లున నుద్దీపిత మకరంబై మకరకేతను బాణంబు కైవడి విలీనపరవాహినీకలిత
శంబరంబై, శంబరారాతి చిగురు గొంతంబుసూటి నధ్వగవేదనాశమనంబై,
శమనదండంబు జాడ నిమ్నోన్నత సమవృత్తంబై, వృత్తశాస్త్రంబు విధంబున
వడిగలిగి సదా గురులఘువాక్యచ్ఛటా పరిగణితంబై, గణితశాస్త్రంబు కొలఁదిని
ఘనఘనమూల వర్గమూల సంకలిత భిన్నమిశ్ర ప్రకీర్ణఖాతభీష్మంబై,

భీష్మపర్వంబు పెంపున ననేక భగవద్గీతంబై, గీతశాస్త్రంబు నిలుకడను మహాసుషిరతను ఘన నానాశబ్దంబై, శబ్దశాస్త్రంబు మర్యాద నచ్చువడి హల్లు గలిగి, మహాభాష్యరూపావతారవృత్తి వృద్ధిగుణసమర్థంబై, యర్థశాస్త్రంబు మహిమను బహుప్రయోజన ప్రమాణ దృష్టాంతంబై, దృష్టాంతంబు తెఱంగున సర్వసామాన్య గుణవిశేషంబై, శేషవ్యాపారంబు కరణిని సుస్థిరోద్ధరణతత్పరంబై, పరబ్రహ్మంబుగరిమ నతిక్రాంతానేక నిగమంబై, నిగమంబు నడవడిని బ్రహ్మవర్ణపదక్రమసంగ్రహంబై, గ్రహశాస్త్రంబు పరిపాటిని గర్కట మీన మిథున మకరరాశి సుందరంబై, సుందరి ముఖంబు పోఁడిమిని నిర్మల చంద్రకాంతంబై, కాంతాధరంబు రుచిని శోణచ్ఛాయావిలాసంబై, విలాసవతి కొప్పునొప్పునఁ గృష్ణనాగాధికంబై, యధికమతిశాస్త్రసంవాదంబు సొంపున నపార సరస్వతీ విజయ విభ్రమంబై, విభ్రమవతిచనుదోయి పగిది నిరంతర పయో వ్యాప్తాఖిలలోక జీవనప్రద తుంగభద్రాతిరేఖా సలలితంబై, లలితవతి నగవు మించున నపహసిత చంద్రభాగధేయంబై, భాగధేయవంతుని వివాహంబు లీల మహామేఖలకన్యకావిస్తారంబై, తారకెంగేలి యొడికంబున నాక్రాంత సూర్యతనయంబై, సూర్యతనయు శరవర్షంబు పోలిక భీమరథ్యాటోపవారణంబై, వారణంబు పరుసునం బుష్కరోన్నత సంరంభంబై, రంభ నెమ్మోము డాలున సురసాతిశయ దశం బై, దశరథ తనయు బొమముడి చాడ్పున సింధుగర్వ ప్రభంజనం బై, ప్రభంజతనయు గదపెట్టు మాడ్కిని సమీపగత దుశ్శాసన దుర్మద నివారకరంబై, వారకన్యక ముంజేతి గతిని ముహుర్ముహురుచ్ఛలిత కంకణాలంకృతంబై, కృతయుగంబు నోజ నపంకంబై, పంకజాసనుముఖంబు నొఱపునఁ బ్రభూతముఖ్యవర్ణంబై, వర్ణగుణితంబు తెఱకువను బహుదీర్ఘబిందు విసర్గంబై, సర్గబంధకావ్యంబు విన్నువున గంభీరభావమధురంబై,

మథురాపురంబు నొబగున మహానందనందనంబై, నందనవనంబు వొందున విహరమాణ కౌశికంబై, కౌశికహయంబు రీతి సుదశద్ధ్రువంబై, ధ్రువు తలంపు క్రియం గ్రియాబరిశీలిత విశ్వంభరంబై, విశ్వంభరుని శంఖంబు రూపున దక్షిణావర్తోత్తరంబై, యుత్తరావివాహంబు చందంబునఁ బ్రముదిత నరంబై, నరసింహు నఖరంబుల భాతి నాశ్రిత ప్రహ్లాద గురువిభవ ప్రదానంబై, దానకాండంబు సిరిం గామధేను కల్పలతాద్యభివనంబై, నవసూతికాకుచంబు పేర్మిని నిరంతర పయోవర్ధనంబై, ధనదు నిలయంబు తూనికను సంభృత మకర పద్మ మహాపద్మ కచ్ఛపంబై, కచ్ఛప కర్పరంబు బలిమిని బలితశైలసముద్ధరణంబై, ధరణీధరంబు సాటి నుత్తుంగ తటముఖ్యంబై, ముఖ్యవరాహంబు గరిమ నున్నత క్షమంబై, క్షమాసుర హస్తంబు గరగరికను సత్పవిత్ర మనోరామం బై, రామచంద్రుని బాణంబుకడింది నభాగ్యత ఖరదూషణ మదాపహరణ ముఖరంబై, ముఖర రామ కుఠారంబు రీతిని భూభృన్మూలచ్ఛే దన ప్రబలంబై, బలరామహలంబుభాతిని బ్రతికూలసన్నికర్షణ ప్రబుద్ధంబై, బుద్ధదేవునిమేని యొఱపున నభియాతి రక్షోదార మనోహరం బై, హరతాండవంబు మేర నుల్లసితానిమిషంబై, యనిమిషావతారంబు కీర్తిని శ్రుతి మంగళప్రదంబై, ప్రదాత యీగి సూటినర్థ పరంపరా వామనంబై, వామనచరణరేఖను బలివంశవ్యపనయంబై, నయశాస్త్రంబు మార్గంబున సామభేదమాయోపాయ చతురంబై, చతురాన నాండంబు భావంబున నపరిమిత భువన జంతుజాల సేవ్యమానం బై, మానినియన లోఁతు చూపక, గరితయన చడిచప్పుడు చేయక, ముగుద యన బయలు పడక, ప్రమద యన గ్రయ్యంబాఱుచుఁ, బతివ్రత యన నిట్టట్టుఁ జనక, తల్లియన నెవ్వియైన

లోఁగొనుచు, దైవంబన భక్త మనోరథంబు లిచ్చుచు, నంతకంతకు విస్తరించి గుఱిగడచి, యవాఙ్మానస గోచరంబై ప్రవహించి.

9-231-మత్తేభ విక్రీడితము

జగతీనాథు రథంబుపజ్జ బహుదేశంబుల్ వడిన్ దాఁటి త
త్సగరక్ష్మాపకుమార భస్మముల మీఁదన్ ముంచి పాఱన్ మరు
న్నగరావాసము వారు పొందిరి నవీనశ్రీలతో గంగ నీ
రుగతిం గాక మహాదురంత సుజనద్రోహానలం బాఱునే.

9-232-మత్తేభ విక్రీడితము

హరు మెప్పించి మహా తపో నియతుఁడై యాకాశగంగానదిన్
ధరకుం దెచ్చి నితాంత కీర్తిలతికా స్తంభంబుగా నవ్య సు
స్థిర లీలం బితృకృత్య మంతయు నొనర్చెన్ వారితానేక దు
స్తర వంశవ్యధుఁ డా భగీరథుఁడు నిత్యశ్రీకరుం డల్పుఁడే?

9-233-కంద పద్యము

హరిఁ దమ మనముల లోనిడి
హరి పాదాంభోజ జనితమైన నదిన్ సు
స్థిరులై క్రుంకి మునీంద్రులు
హరిఁ గలిసిరి త్రిగుణరహితులై యవ్వేళన్.

9-234-వచనము

అంత నా భగీరథునకు శ్రుతుండును, శ్రుతునకు నాభావరుండును, నాభావరునకు సింధుద్వీపుండును, సింధుద్వీపునికి నయుతాయువును, నయుతాయువునకు ఋతుపర్ణుండును జనియించెను; అతండు.

9-235-ఆటవెలది

నయ విశాలబుద్ధి నలచక్రవర్తితో
సంగడీనితనము చాలఁ జేసి
యక్షహృదయ మతని కవ్యస్తముగ నిచ్చి
యశ్వవిద్య నేర్చె నతనివలన.

## 9-20- కల్మాషపాదుని చరిత్రము

9-236-వచనము

ఆ ఋతుపర్ణునకు సర్వకాముండును, సర్వకామునకు మదయంతీ వల్లభుండైన సుదాసుండును, బుట్టె నా రాజశేఖరుని మిత్రసహుండును, గల్మాషపాదుండు నని చెప్పుదు రా భూవరుండు వసిష్ఠుని శాపంబున రాక్షసుడయి, తన కర్మంబున నపత్యుండయ్యె," ననిన విని పరీక్షిన్నరేంద్రు డేమి కారణంబున సుదాసునకు గురుశాపంబు ప్రాప్తంబయ్యె" నని యడిగిన శుకుం డిట్లనియె.

9-237-సీస పద్యము

ఆ సుదాసుఁడు వేఁటకై వనంబున కేగి;
గర్వించి యొక్క రక్కసునిఁ జంపి
వానితోఁ బుట్టిన వానిఁ బో విడిచిన;
వాఁడును దనతోడివాని చావు
పోనీక కపటియై భూపాలుగృహమున;

నడబాలతనమున నర్థిఁ గొలిచి
యుండ వసిష్ఠున కుర్వీశుఁ డొక్కనాఁ;
డన్నంబు జేయంగ నతనిఁ బనుప

9-237.1-తేటగీతి

వాఁడు మానవ మాంసంబు వండి తెచ్చి
మునికి వడ్డింపఁ గోపించి ముని నరేంద్రుఁ
బిలిచి మనుజామిషంబును బెట్టి తనుచు
నలుకతో రాక్షసుఁడవు గమ్మని శపించె.

9-238-వచనము

ఇట్లు శపియించి పదంపడి, రాక్షసుండు వండి తెచ్చుటయు, సుదాసుం డెరుంగమియుఁ దన మనంబున నెఱింగి, వసిష్ఠుఁడు పండ్రెండేండ్లు రక్కసుండవయి యుండుమని నియమించెను; అయ్యవసరంబున.

9-239-మత్తేభ విక్రీడితము

గురువున్ మాఱుశపింతు నంచు జలముల్ గోపంబుతో దోయిటన్
నరనాథుండు ధరింపఁ దత్సతి పతిన్వారింప మిన్నుం దిశల్
ధరయున్ జీవమయంబకా నిఖిలముం దాఁ జూచి చల్లెన్ ధరా
వరుఁ డాత్మీయపదంబులం గరపుటీవాఃపూరముం బొక్కుచున్.

9-240-వచనము

ఇట్లు మిత్రసహుండు గావునఁ గళత్రానుకూలుండై శపియింప నొల్లక సుదాసుండు రాక్షస భావంబు నొంది, కల్మషవర్ణంబు లయిన పాదంబులతో నడవులం దిరుగుచు.

9-241-కంద పద్యము

ఆఁకట మలమల మాఁడుచు
వీఁక నతం డడవి నున్న విప్ర మిథునముం
దాఁకి తటాలున విప్రునిఁ
గూఁకటి చేఁబట్టి మ్రింగఁ గొనిపోవుతఱిన్.

9-242-వచనము

అంత నా బ్రాహ్మణుని భార్య మోఁదికొనుచుం బెగ్గడిల్లి, డగ్గుత్తికతోఁ బతికి నడ్డంబు వచ్చి, యేడ్చుచు రాచరక్కసున కిట్లనియె.

9-243-కంద పద్యము

మానుషదేహము గలుగుట
భూనాయక! దుర్లభంబు పుట్టినమీదఁన్
దానముఁ బరోపకారము
భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్?

9-244-మత్తేభ విక్రీడితము

రవి వంశాగ్రణివై సమస్తధరణీరాజ్యాను సంధాయివై
భువనస్తుత్యుఁడవై పరార్థరతివై పుణ్యానుకూలుండవై
వివరంబేమియు లేక నా పెనిమిటిన్ విప్రుం దపశ్శీలు స

త్త్వవరున్ బ్రహ్మవిదున్ జగన్నుతగుణున్ భక్షింపఁగాఁ బాడియే?

9-245-శార్దూల విక్రీడితము

తండ్రీ! మీకు దినేశవంశజులకున్ దైవం బగున్ బ్రాహ్మణుం
డండ్రా మాటలు లేవె? భూమిసుర గోహత్యాభిలాషంబు గై
కొండ్రే మీ యటువంటి సాధువులు? రక్షోభావ మిట్లేల? మీ
తండ్రిం దాతలఁ బూర్వులం దలఁపవే ధర్మంబునుం బోఁగదే.

9-246-శార్దూల విక్రీడితము

అన్నా! చెల్లెల నయ్యెదన్; విడువు నీకన్నంబు బెట్టింతు; నా
ప్రాణాన్నాథున్ ద్విజు గంగికుట్టి నకటా! హింసింప నేలయ్య? నీ
వెన్నం డింతులతోడఁ బుట్టవె? నిజం బిట్టైన మున్నుట్ట నా
పన్నన్ నన్ను శిరంబు ద్రుంచి మఱి మత్ప్రాణేశు భక్షింపవే.

9-247-కంద పద్యము

అని కరుణ పుట్ట నాడుచు
వనితామణి పలవరింప వసుధాదేవుం
దినియె నతఁడు పులి పశువుం
దిను క్రియ శాపంబు కతన ధీరహితుండై.

9-248-వచనము

అంత నా బ్రాహ్మణి గోపించి “కామార్తనయిన నాదు పెనిమిటిని భక్షించితివి గావున నీవు నెలఁతలంబొందఁ జేరినవేళ మరణంబుఁ బొందు” మని

కల్మాషపాదుని శపించి, పతిశల్యంబులతో నగ్నిప్రవేశంబు జేసి సుగతికిం జనియె; నంతఁ బండ్రెండేండ్లు చనిన నా రాజు మునిశాపనిర్ముక్తుండై.

9-249-ఆటవెలది

రతులకొలకు నాలి రావింప నదియును
బెదరి విప్రసతి శపించు టెఱిఁగి
మగని నడ్డపెట్టి మైథునకర్మంబు
మాన్చె సతుల గోష్ఠి మానె నతడు.

9-250-కంద పద్యము

అది కారణముగఁ బుత్రా
భ్యుదయము లేదా సుదాసభూపాలునకుం
దదనుమతి నవ్వసిష్ఠుఁడు
మదయంతికిఁ గడుపుజేసె మదనక్రీడన్.

9-251-వచనము

ఇట్లు సుదాసుని భార్య యగు మదయంతి వసిష్ఠునివలన గర్భిణి యై యేడేండ్లు గర్భంబు ధరించి నీళ్ళాడ సంకటపడుచున్న వసిష్ఠుండు వాఁడి యగు నశ్మంబున నా గర్భంబుఁ జీరిన నశ్మకుం డను కుమారుండు పుట్టె; నతనికి మూలకుండు పుట్టె; నతండు.

9-252-కంద పద్యము

వీరుఁడగు పరశురాముఁడు
ఘోర కుఠారమున నృపులఁ గూలుచు వేళన్

నారీజనములు దాఁచిన
నారీకవచుం డనంగ నలి నుతి కెక్కెన్.

## 9-21- ఖట్వాంగుని చరిత్రము

9-253-వచనము

ఆ నారీకవచుండు నిర్మూలం బయిన రవివంశంబునకు మూలం బగుటంజేసి మూలకుండనం బరఁగెనా మూలకునకు విశ్వసహుండు పుట్టె విశ్వసహునకు ఖట్వాంగుడు పుట్టి చక్రవర్తి యయ్యెను; అతండు.

9-254-సీస పద్యము

అమరులు వేఁడిన నసురనాథులఁ జంపి;
 త్రిదశులతోఁ దన బ్రతుకుకాల
మెంతని యడిగిన నిదె నిండుచున్నది;
 తడవులే దేమైన నడుగు మనిన
వరములు గోరక వరవిమానం బెక్కి;
 తనపురికేతెంచి తత్త్వబుద్ధిఁ
బరమేశ్వరుని యంద భావంబుఁ గీలించి;
 కులదైవతద్విజకులముకంటె

9-254.1-తేటగీతి

నంగనా ప్రాణ రాజ్య పుత్త్రాదు లెల్ల
గావు ప్రియములు ధర్మంబు గడచి నాదు
మతి ప్రవర్తింప దెన్నఁడు మది నెఱుంగ
నన్య మా యీశ్వరునిఁ దక్క ననుచు మఱియు.

9-255-మత్తేభ విక్రీడితము

ఇలమీఁదన్ బ్రదుకేల? వేల్పులవరం బేలా? ధనం బేల? చం
చల గంధర్వపురీ విడంబనము లైశ్వర్యంబు లేలా? జగం
బులఁ బుట్టించు తలంపునం బ్రకృతితోఁ బొత్తై తుదిం బాసి ని
ర్మలమై వాఙ్మనసామితం బగు పరబ్రహ్మంబు నేఁ జెందెదన్.

9-256-వచనము

అని నిశ్చయించి.

9-257-మత్తేభ విక్రీడితము

కలసెన్ సంగములెల్లఁ బాసి నియతిన్ ఖట్వాంగు డశ్రాంతమై
కల దయ్యున్ మఱిమీఁద లే దనెడిదై కల్యాణమై యాత్మలోఁ
దలఁపం బల్కఁగరానిదై పరమమై తత్త్వజ్ఞు లూహించి హృ
జ్జలజాతంబుల వాసుదేవుఁ డని సంస్థాపించు నా బ్రహ్మమున్.

## 9-22- శ్రీరాముని కథనంబు

9-258-వచనము

అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు, దీర్ఘబాహునకు రఘువు, రఘువునకుఁ బృథుశ్రవుండుఁ, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండును, పుట్టి; రా దశరథునకు సురప్రార్థితుండై పరబ్రహ్మమయుండైన హరి నాల్గువిధంబులై శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్న నామంబుల నిజాంశ సంభూతుండై జన్మించె; తచ్చరిత్రంబు వాల్మీకి ప్రముఖులైన మునులచేత వర్ణితంబైనది; యైననుం జెప్పెద సావధానమనస్కుండవై యాకర్ణింపుము.

9-259-మత్తేభ విక్రీడితము

అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుండై నట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధ రావణశిరస్సంఘాతసంఛేదన
క్రమణోద్దాముఁడు రాముఁ డా గరితకుం గౌసల్యకున్ సన్నుతా
సమనైర్మల్య కతుల్య కంచితజనుస్సంసారసాఫల్యకున్.

9-260-మత్తేభ విక్రీడితము

సవరక్షార్థము దండ్రి పంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడరా
నవలీలం దునుమాడె రాముఁ డదయుండై బాలుఁడై కుంతల
చ్ఛవిసంపజ్జితహాటకం గపటభాషావిస్ఫురన్నాటకన్
జవభిన్నార్యమఘోటకం గరవిరాజత్ఖేటకం దాటకన్.

9-261-కంద పద్యము

గారాముననఁ గౌశిక మఖ
మా రాముఁడు గాచి దైత్యు నధికు సుబాహున్
ఘోరాజిఁ ద్రుంచి తోలెన్
మారీచున్ నీచుఁ గపటమంజులరోచున్.

9-262-మత్తేభ విక్రీడితము

ఒక మున్నూఱుఱు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు బా
లకరీంద్రంబు సులీలమైఁ జెఱకుఁగోలం ద్రుంచు చందంబునన్
సకలోర్వీశులు చూడఁగా విఱిచె దోశ్శక్తిన్ విదేహాక్షమా
పక గేహంబున సీతకై గుణమణిప్రస్ఫీతకై లీలతోన్.

9-263-కంద పద్యము

భూతలనాథుఁడు రాముఁడు
ప్రీతుండై పెండ్లియాడెఁ బృథుగుణమణి సం
ఘాతన్ భాగ్యోపేతన్
సీతన్ ముఖకాంతివిజిత సితఖద్యోతన్.

9-264-కంద పద్యము

రాముఁడు నిజబాహుబల
స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో
ద్దామున్ విదళీకృతన్నృప
భామున్ రణరంగభీము భార్గవరామున్.

9-265-కంద పద్యము

దశరథుఁడు మున్ను గైకకు
వశుఁడై తానిచ్చి నట్టి వరము కతన వా
గ్దశ చెడక యడివి కనిచెను
దశముఖముఖకమలతుహినధామున్ రామున్.

9-266-కంద పద్యము

జనకుఁడు పనిచిన మేలని
జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్
జనపతి రాముఁడు విడిచెను
జనపాలారాధ్య ద్విషదసాధ్య నయోధ్యన్.

9-267-కంద పద్యము

భరతున్ నిజపదసేవా
నిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యెక్కెన్
సురుచిర రుచి పరిభావిత
గురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్.

9-268-ఉత్పలమాల

పుణ్యుఁడు రామచంద్రుఁ డట పోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యముఁ దాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హి బర్హ లా
వణ్యము గౌతమీ విమల వాఃకణ పర్యటనప్రభూత సా
ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజ వరేణ్యము నగ్రగణ్యమున్.

9-269-సీస పద్యము

ఆ వనంబున రాముఁ డనుజ సమేతుడై;
 సతితోడ నొక పర్ణశాల నుండ
రావణు చెల్లలు రతిఁ గోరి వచ్చిన;
 మొగి లక్ష్మణుఁడు దాని ముక్కు గోయ
నది విని ఖరదూషణాదులు పదునాల్గు;
 వేలు వచ్చిన రామవిభుఁడు గలన
బాణానలంబున భస్మంబు గావింప;
 జనకనందన మేని చక్కఁదనము

9-269.1-తేటగీతి

విని దశగ్రీవుఁ డంగజ వివశుఁ డగుచు

నర్థిఁ బంచినఁ బసిఁడిఱ్ఱి యై నటించు
నీచు మారీచు రాముఁడు నెఱి వధించె
నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు.

9-270-ఉత్పలమాల

ఆ యసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాతనూజ న
న్యాయము చేసి నిష్కరుణుఁడై కొనిపోవఁగ నడ్డమైన ఘో
రాయతహేతిఁ ద్రుంచె నసహాయత రామనరేంద్రకార్యద
త్తాయువుఁ బక్షవేగపరిహాసితవాయువు నజ్జటాయువున్.

9-271-వచనము

అంతనా రామచంద్రుండు లక్ష్మణసహితుండై, సీత వెదక నరుదెంచి, నిజకార్యనిహతుండైన జటాయువునకుఁ బరలోకక్రియలు గావించి, ఋశ్యమూకంబునకుం జని.

9-272-కంద పద్యము

నిగ్రహము నీకు వల దిఁక
నగ్రజు వాలిన్ వధింతు నని నియమముతో
నగ్రేసరుఁగా నేలెను
సుగ్రీవుం జరణఘాతచూర్ణగ్రావున్.

9-273-కంద పద్యము

లీలన్ రామవిభుం డొక
కోలం గూలంగ నేసె గురు నయశాలిన్

శీలిన్ సేవితశూలిన్
మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మూల్మిన్.

9-274-కంద పద్యము

ఇలమీఁద సీత వెదకఁగ
నలఘుఁడు రాఘవుఁడు పనిచె హనుమంతు నతి
చ్చలవంతున్, మతిమంతున్,
బలవంతున్, శౌర్యవంతు, బ్రాభవవంతున్.

9-275-కంద పద్యము

అలవాటు కలిమి మారుతి
లలితామిత లాఘవమున లంఘించెను శై
వలినీగణసంబంధిన్
జలపూరిత ధరణి గగన సంధిం గంధిన్.

9-276-వచనము

ఇట్లు సముద్రంబు దాఁటి సీతం గని, హనుమంతుండు దిరిగి చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి.

9-277-కంద పద్యము

సముదగ్రత ననిలసుతుం
డమరారాహిత దత్త వాల హస్తాగ్నుల భ
స్మము చేసె నిరాతంకన్
సముదాసురసుభటవిగతశంకన్ లంకన్.

9-278-వచనము

ఇట్లు లంకాదహనంబు చేసివచ్చి వాయుజుండు సీతకథనంబు చెప్పిన విని రామచంద్రుండు వనచరనాథ యూథంబులుం దానును చనిచని.

9-279-శార్దూల విక్రీడితము

ఆ రాజేంద్రుఁడు గాంచె భూరివిధరత్నాగారమున్ మీన కుం
భీరగ్రాహకఠోరమున్ విపుల గంభీరంబు నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్యవిభిన్న భంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణ
ప్రారుద్ధాంబరపారమున్ లవణపారావారముం జేరువన్.

9-280-వచనము

కని తనకుఁ ద్రోవ యిమ్మని వేఁడిన నదియు మార్గంబు చూపక మిన్నందిన నా రాచపట్టి రెట్టించిన కోపంబున.

9-281-కంద పద్యము

మెల్లని నగవున నయనము
లల్లార్చి శరంబు విల్లు నందిన మాత్రన్
గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ
బెల్లలునై జలధి పెద్ద బీడై యుండెన్.

9-282-వచనము

ఇట్లు విపన్నుండగు సముద్రుండు నదులతోఁ గూడి మూర్తి మంతుండయి చనుదెంచి రామచంద్రుని చరణంబులు శరణంబు జొచ్చి యిట్లని స్తుతియించె.

9-283-శార్దూల విక్రీడితము

ఓ కాకుత్స్థకులేశ! యోగుణనిధీ! యో దీనమందార! నే
నీ కోపంబున కెంతవాఁడ? జడధిన్; నీవేమి భూరాజవే?
లోకాధీశుఁడ; వాదినాయకుఁడ; వీ లోకంబు లెల్లప్పుడున్
నీ కుక్షిం బ్రభవించు; నుండు; నడఁగున్; నిక్కంబు సర్వాత్మకా!

9-284-కంద పద్యము

ధాతల రజమున దేవ
వ్రాతము సత్త్వమున భూతరాశిఁ దమమునన్
జాతులఁగా నొనరించు గు
ణాతీతుఁడ వీవు గుణగణాలంకారా!

9-285-కంద పద్యము

కట్టుము సేతువు; లంకం
జుట్టుము; నీ బాణవహ్ని సురవైరితలల్
గొట్టుము నేలంబడఁ; జే
పట్టుము నీ యబల నధికభాగ్యప్రబలన్.

9-286-ఆటవెలది

హరికి మామ నగుదు; నటమీఁద శ్రీదేవి
తండ్రి; నూరకేల తాగడింప?
గట్టఁ గట్టి దాఁటు కమలాప్తకులనాథ!
నీ యశోలతలకు నెలవుగాఁగ

9-287-వచనము

అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునిం బూర్వప్రకారంబున నుండు పొమ్మని వీడుకొల్పెను; అంత.

9-288-కంద పద్యము

ఘన శైలంబులుఁ దరువులు
ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్
ఘనజలరాశిం గట్టిరి
ఘనవాహప్రముఖదివిజగణము నుతింపన్.

9-289-వచనము

ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణు తమ్ముం డైన విభీషణుండు శరణంబు వేఁడిన నభయం బిచ్చి; కూడుకొని లంకకుఁ జని విడిసి వేడెపెట్టించి లగ్గలుపట్టించిన.

9-290-సీస పద్యము

ప్రాకారములు ద్రవ్వి పరిఖలు పూడిచి;
 కోటకొమ్మలు నేలఁ గూలఁ ద్రోచి
వప్రంబు లగలించి వాకిళ్ళు పెకలించి;
 తలుపులు విఱిచి యంత్రములు నెఱిచి
ఘనవిటంకంబులు ఖండించి పడవైచి;
 గోపురంబులు నేలఁ గూలఁ దన్ని
మకరతోరణములు మహిఁ గూల్చి కేతనం;
 బులు చించి సోపానములు గదల్చి

9-290.1-ఆటవెలది

గృహము లెల్ల వ్రచ్చి గృహరాజముల గ్రొచ్చి
భర్మకుంభచయము పాఱవైచి
కరులు కొలను చొచ్చి కలఁచిన కైవడిఁ
గపులు లంకఁ జొచ్చి కలఁచి రపుడు.

9-291-వచనము

అంత నయ్యసురేంద్రుండు పంచినఁ గుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, నరాంతక, దుర్ముఖ, ప్రహస్త, మహాకాయ ప్రముఖులగు దనుజవీరులు శర శరాసన తోమర గదాఖడ్గ శూల భిందిపాల పరశు పట్టిస ప్రాస ముసలాది సాధనంబులు ధరించి మాతంగ తురంగ స్యందన సందోహంబుతో బవరంబు చేయ సుగ్రీవ, పవనతనయ, పనస, గజ, గవయ, గంధమాదన, నీలాంగద, కుముద, జాంబవదాదు లా రక్కసుల నెక్కటి కయ్యంబు లందుఁ దరుల గిరులఁ గరాఘాతంబుల నుక్కడించి త్రుంచి; రంత.

9-292-కంద పద్యము

ఆ యెడ లక్ష్మణుఁ డుజ్జ్వల
సాయకములఁ ద్రుంచె శైలసమకాయు సురా
జేయు ననర్గళమాయో
పాయున్ నయగుణ విధేయు నయ్యతికాయున్.

9-293-ఆటవెలది

రామచంద్రవిభుఁడు రణమున ఖండించె
మేటికడిమి నీలమేఘవర్ణు

బాహుశక్తిపూర్ణుఁ బటుసింహనాదసం
కుచిత దిగిభకర్ణుఁ గుంభకర్ణు.

9-294-కంద పద్యము

అలవున లక్ష్మణుఁ డాజి
స్థలిఁ గూల్చెన్ మేఘనాదుఁ జటులాహ్లాదున్
బలభేదిజయవినోదున్
బలజనితసుపర్వసుభటభావవిషాదున్.

9-295-వచనము

అంత.

9-296-కంద పద్యము

తనవా రందఱు మ్రగ్గిన
ననిమిషపతివైరి పుష్పకారూఢుండై
యనికి నడచి రామునితో
ఘనరౌద్రముతోడ నంపకయ్యము చేసెన్.

9-297-వచనము

అ య్యవసరంబున.

9-298-కంద పద్యము

సురపతిపంపున మాతలి
గురుతరమగు దివ్యరథముఁ గొనివచ్చిన, నా
ధరణీవల్లభుఁ డెక్కెను

ఖరకరుఁ డుదయాద్రి నెక్కు కైవడి దోఁపన్.

9-299-వచనము

ఇట్లు దివ్యరథారూఢుండయి రామచంద్రుండు రావణున కిట్లనియె.

9-300-మత్తేభ విక్రీడితము

చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో
కపటబ్రాహ్మణమూర్తివై యబల నా కాంతారమధ్యంబునం
దపలాపించుటయో మదీయశితదివ్యామోఘబాణాగ్ని సం
తపనం బేగతి నోర్చువాఁడవు? దురంతం బెంతయున్ రావణా!

9-301-కంద పద్యము

నీ చేసిన పాపములకు
నీచాత్మక! యముఁడు వలదు నేఁడిట నా నా
రాచముల ద్రుంచి వైచెద
ఖేచర భూచరులు గూడి క్రీడం జూడన్.

9-302-వచనము

అని పలికి.

9-303-మత్తేభ విక్రీడితము

బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండ భీమంబుగా
బ్రళయోగ్రానలసన్నిభం బగు మహాబాణంబు సంధించి రా
జలలాముండగు రాముఁడేసె ఖరభాషాశ్రావణున్ దేవతా
బలవిద్రావణు వైరిదారజనగర్భస్రావణున్ రావణున్.

9-304-కంద పద్యము

దశరథసూనుండేసిన

విశిఖము హృదయంబుఁదూఱ వివశుం డగుచున్

దశకంధరుండు గూలెను

దశవదనంబులను రక్తధారలు దొరఁగన్.

9-305-వచనము

అంతనా రావణుండు దెగుట విని.

9-306-సీస పద్యము

కొప్పులు బిగి వీడి కుసుమమాలికలతోఁ;

నంసభాగంబుల నావరింప

సేసముత్యంబులు చెదరఁ గర్ణిక లూడఁ;

గంఠహారంబులు గ్రందుకొనఁగ

వదనపంకజములు వాడి వాతెఱ లెండఁ;

గన్నీళ్ళవఱద లంగములు దడుప

సన్నపు నడుములు జవ్వాడఁ బాలిండ్ల;

బరువులు నడుములఁ బ్రబ్బికొనఁగ

9-306.1-ఆటవెలది

నెత్తి మోఁదికొనుచు నెఱేఁ బయ్యెదలు జాఱ

నట్టు నిట్టుఁ దప్పటడుగు లిడుచు

నసురసతులు వచ్చి రట భూతభేతాళ

సదనమునకు ఘోరకదనమునకు.

9-307-వచనము

ఇట్లు వచ్చి తమతమ నాథులం గని, శోకించి; రందు మండోదరి రావణుం జూచి యిట్లనియె.

9-308-ఉత్పలమాల

హా! దనుజేంద్ర! హా! సురగణాంతక! హా! హృదయేశ! నిర్జరేం
ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రునికోలల కోర్వలేక సో
న్మాదముగన్ రఘుప్రవరుమానిని నేటికిఁ దెచ్చి? తప్పుడేఁ
గాదని చెప్పినన్ వినక కాలవశంబునఁ బొంది తక్కటా.

9-309-ఆటవెలది

ఎండఁ గాయ వెఱచు నినుడు వెన్నెలఁ గాయ
వెఱచు విధుఁడు గాలి వీవ వెఱచు
లంకమీఁద; నిట్టి లంకాపురికి మాకు
నధిప! విధవభావ మడరె నేఁడు.

9-310-కంద పద్యము

దురితముఁ దలపరు గానరు
జరుగుదు రెట కైన నిమిష సౌఖ్యంబుల కై
పరవనితాసక్తులకును
బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే?

9-311-వచనము

అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపుపడసి, రావణునకు దహనాది క్రియలు గావించె; నంత రాఘువేంద్రుండు నశోకవనంబున కేఁగి, శింశుపాతరు సమీపంబు నందు.

9-312-శార్దూల విక్రీడితము

దైతేయప్రమదా పరీత నతిభీతన్ గ్రంథి బంధాలక
వ్రాతన్ నిశ్శ్వసనానిలాశ్రుకణ జీవం జీవదారామ భూ
జాతన్ శుష్కకపోల కీలిత కరాబ్జాతం బ్రభూతం గృశీ
భూతం బ్రాణసమేత సీతఁ గనియెన్ భూమీశుఁ డా ముందటన్.

9-313-వచనము

కని రామచంద్రుండును దాపంబు నొంది, భార్యవలన దోషంబు లేకుంట వహ్నిముఖంబునం బ్రకటంబుజేసి, దేవతల పంపున దేవిం జేకొని.

9-314-ఉత్పలమాల

శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రాక్షసేంద్రతా
శేషవిభూతిఁ గల్పసమజీవివి గమ్మని నిల్పె నర్థి సం
తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా
భాషణు నార్యపోషణుఁ గృపాగుణభూషణు నవ్విభీషణున్.

9-315-వచనము

ఇట్లు విభీషణసంస్థాపనుండయి రామచంద్రుఁడు సీతాలక్ష్మణ సమేతుండయి సుగ్రీవ హనుమదాదులం గూడికొని, పుష్పకారూఢుం డయి, వేల్పులు గురియు

పువ్వులనోనలం దడియుచుఁ దోల్లి వచ్చిన తెరువుజాడలు సీతకు నెఱిఁగించుచు, మరలి నందిగ్రామంబునకు వచ్చెను; అయ్యవసరంబున.

9-316-ఆటవెలది

రామచంద్రవిభుని రాక వీనుల విని
భరతుఁ డుత్సహించి పాదుకలను
మోచికొనుచు వచ్చి ముదముతోఁ బురజను
లెల్ల గొలువ నన్న కెదురువచ్చె.

9-317-వచనము

వచ్చి పాదుకల ముందట నిడికొని, యెడనెడ సాష్టాంగదండప్రణామంబులు చేయుచు, మెల్లమెల్లన డాసి, రామచంద్రుని పాదంబులు దన నొసలం గదియించి, తచ్చరణరేణువులు దుడిచి, శిరంబునం జల్లికొని, తనివి చనక, మఱియు నప్పదకమలంబు లక్కున మోపి కొనుచు, సంతసంపుఁ గన్నీటం గడిగి, క్షేమంబు లరయుచుండె; నంత సీతాలక్ష్మణ సహితుండయి విభుండును, దన కెదురువచ్చిన బ్రాహ్మణ జనంబులకు నమస్కరించి, తక్కినవారలచేత మన్ననలు వొంది, వారల మన్నించెను; అయ్యవసరంబున.

9-318-చంపకమాల

నృపవర! పెక్కునాళ్ళఁగొలె నిన్ గనకుండిన యట్టి నేఁడు మా
తపములుపండె నిందఱము ధన్యులమైతి మటంచుఁ బుట్టముల్
చపలతఁ ద్రిప్పి పువ్వుల వసంతములాడుచుఁ బాడుచున్ గత
త్రపులయి యాడుచుం బ్రజలు దద్దయుఁ బండుగ జేసి రెల్లెడన్.

9-319-సీస పద్యము

కవ గూడి యిరుదెసఁ గపిరాజు రాక్షస;
 రాజు నొక్కటఁ జామరములు వీవ
హనుమంతుఁ డతిధవళాతపత్రముఁ బట్ట;
 బాదుకల్ భరతుండు భక్తిఁ దేర
శత్రుఘ్ను డమ్ములుఁ జాపంబుఁ గొనిరాఁగ;
 సౌమిత్రి భృత్యుఁడై చనువుచూప
జలపాత్రచేఁబట్టి జనకజ గూడిరాఁ;
 గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ

9-319.1-ఆటవెలది

బసిఁడి కేడె మర్థి భల్లూకపతి మోచి
కొలువఁ బుష్పకంబు వెలయ నెక్కి
గ్రహము లెల్లఁ గొలువఁ గడు నొప్పు సంపూర్ణ
చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె.

9-320-వచనము

ఇట్లు పుష్పకారూఢుండై, కపి బలంబులు చేరికొలువ. శ్రీరాముం డయోధ్యకుం జనియె; నంతకు మున్న యప్పురంబునందు.

9-321-సీస పద్యము

వీథులు చక్కఁ గావించి తోయంబులు;
 చల్లి రంభా స్తంభచయము నిలిపి
పట్టుజీరలు చుట్టి బహుతోరణంబులుఁ;

గలువడంబులు మేలుకట్లుఁ గట్టి
వేదిక లలికించి వివిధరత్నంబుల;
మ్రుగ్గులు పలుచందములుగఁ బెట్టి
కలయ గోడల రామకథలెల్ల వ్రాయించి;
ప్రాసాదముల దేవభవనములను

9-321.1-తేటగీతి

గోపురంబుల బంగారు కుండ లెత్తి
యెల్ల వాకిండ్ల గానిక లేర్పరించి
జనులు గైచేసి తూర్యఘోషములతోడ
నెదురు నడతెంచి రా రాఘువేంద్రుకడకు.

9-322-కంద పద్యము

సమద గజదానధారల
దుమదుమలై యున్న పెద్ద త్రోవలతోడన్
రమణీయ మయ్యె నప్పురి
రమణుఁడు వచ్చినఁ గరంగు రమణియపోలెన్.

9-323-ఆటవెలది

రామచంద్రవిభుని రాకఁ దూర్యములతో
రథ గజాశ్వ సుభటరాజితోడ
నమరెఁ బురము చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు
జంతుభంగమిలిత జలధిభంగి.

9-324-వచనము

ఇట్లొప్పుచున్న యప్పురంబు ప్రవేశించి, రాజమార్గంబున రామచంద్రు డరుగుచున్న సమయంబున.

9-325-మత్తేభ విక్రీడితము

ఇతఁడే రామనరేంద్రుఁ డీ యబలకా యింద్రారి ఖండించె న
ల్లతఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివరుం డా ప్రొంతవాఁడే మరు
త్సుతుఁ డా చెంగట నా విభీషణుఁ డటంచుం జేతులం జూపుచున్
సతులెల్లం బరికించి చూచిరి పురీసౌధాగ్రభాగంబులన్.

9-326-వచనము

ఇట్లు సమస్తజనంబులు చూచుచుండ రామచంద్రుండు రాజమార్గంబునం జనిచని.

9-327-సీస పద్యము

పటికంపు గోడలు బవడంపు వాకిండ్లు;
నీలంపుటరుగులు నెఱయఁ గలిగి
కమనీయ వైడూర్య స్తంభచయంబుల;
మకరతోరణంబుల మహిత మగుచు
బడగల మాణిక్యబద్ధ చేలంబులఁ;
జిగురుఁ దోరణములఁ జెలువు మీఱి
పుష్పదామకముల భూరివాసనలను;
బహుతరధూపదీపముల మెఱసి

9-327.1-తేటగీతి

మాఱువేల్పులభంగిని మలయుచున్న
సతులుఁ బురుషులు నెప్పుడు సందడింప
గుఱుతు లిడరాని ధనముల కుప్ప లున్న
రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు.

9-328-వచనము

ఇట్లు వచ్చి.

9-329-ఉత్పలమాల

తల్లులకెల్ల మ్రొక్కి తమ తల్లికి వందన మాచరించి య
ల్లల్ల బుధాళికిన్ వినతుఁడై చెలికాండ్రను దమ్ములం బ్రసం
పుల్లతఁ గౌగలించుకొని భూవరుఁ డోలిఁ గృపారసంబు రం
జిల్లఁగఁ జాల మన్ననలు చేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్.

9-330-వచనము

తత్సమయంబునఁ దల్లులు

9-331-చంపకమాల

కొడుకులుఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నెత్తి చేతులం
బుడుకుచు మోములుందలలుబోరన ముద్దులుగొంచునవ్వుచుం
దొడలకు వారి రాఁదిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధారలన్
వెడలిన ప్రాణముల్ దగఁ బ్రవిష్టములయ్యె నటంచు నుబ్బుచున్.

9-332-వచనము

అంత వసిష్ఠుం డరుగుదెంచి. శ్రీరామచంద్రుని జటాబంధంబు విడిపించి, కులవృద్ధులుం దానును సమంత్రకంబుగ దేవేంద్రుని మంగళస్నానంబు చేయించు బృహస్పతి చందంబున, సముద్రనదీజలంబుల నభిషేకంబు చేయించె; రఘువరుండును, సీతాసమేతుండై, జలకంబులాడి, మంచి పుట్టంబులు గట్టికొని, కమ్మని పువ్వులు దుఱిమి, సుగంధంబు లలందికొని, తొడవులు దొడిగికొని, తనకు భరతుఁడు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి, యతని మన్నించి కౌసల్యకుఁ బ్రియంబు చేయుచు, జగత్పూజ్యంబుగ రాజ్యంబు జేయుచుండెను; అప్పుడు.

9-333-సీస పద్యము

కలఁగు టెల్లను మానెఁ జలధు లేడింటికి;
జలనంబు మానె భూచక్రమునకు;
జాగరూకత మానె జలజలోచనునకు;
దీనభావము మానె దిక్పతులకు;
మాసి యుండుట మానె మార్తాండవిధులకుఁ;
గావిరి మానె దిగ్గగనములకు;
నుడిగిపోవుట మానె నుర్వీరుహంబుల;
కడఁగుట మానె ద్రేతాగ్నులకును;

9-333.1-ఆటవెలది

గడిఁది ప్రేఁగు మానెఁ గరి గిరి కిటి నాగ
కమఠములకుఁ బ్రజల కలఁక మానె;
రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు

ధరణిభరణరేఖఁ దాల్చు నపుడు.

9-334-వచనము

మఱియును.

9-335-సీస పద్యము

పొలతుల వాలుచూపుల యంద చాంచల్య;
 మబలల నడుముల యంద లేమి;
కాంతాలకములంద కౌటిల్యసంచార;
 మతివల నడపుల యంద జడిమ;
ముగుదల పరిరంభముల యంద పీడన;
 మంగనాకుచముల యంద పోరు;
పడతుల రతులంద బంధసద్భావంబు;
 సతులఁబాయుటలంద సంజ్వరంబు;

9-335.1-తేటగీతి

ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్పు
లంద చౌర్యంబు; వల్లభు లాత్మ సతుల
నాఁగి క్రొమ్ముళ్ళు పట్టుటం దక్రమంబు;
రామచంద్రుఁడు పాలించు రాజ్యమందు.

9-336-కంద పద్యము

తండ్రి క్రియ రామచంద్రుఁడు
తండ్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపన్

తండ్రుల నందఱు మఱచిరి
తండ్రిగదా రామచంద్రధరణిపుఁ డనుచున్.

9-337-వచనము

మఱియు, నా రామచంద్రుండు రాజర్షిచరితుండును, నిజధర్మనిరతుండును, నేకపత్నీవ్రతుండును, సర్వలోకసమ్మతుండును నగుచు ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక లనుభవించుచుఁ ద్రేతాయుగంబైన గృతయుగధర్మంబుఁ గావించుచు, బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుఁ గలుగకుండ రాజ్యంబుచేయుచుండె; నయ్యెడ.

9-338-ఆటవెలది

సిగ్గుపడుట గల్గి సింగారమును గల్గి
భక్తిగల్గి చాల భయముఁ గలిగి
నయముఁ బ్రియముఁ గల్గి నరనాథు చిత్తంబు
సీత దనకు వశము చేసికొనియె.

9-339-వచనము

అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

9-340-ఆటవెలది

భ్రాతృజనుల యందు బంధువులందును
ప్రజల యందు రాజభావ మొంది
యెట్లు మెలఁగె? రాఘవేశ్వరుం డెవ్వనిఁ
గూర్చి క్రతువు లెట్లు గోరి చేసె?

9-341-వచనము

అనిన శుకుం డిట్లనియె.

9-342-సీస పద్యము

భగవంతుఁడగు రామభద్రుండు ప్రీతితోఁ;
 దేవోత్తముని సర్వదేవమయునిఁ
దనుఁదాన కూర్చి యధ్వరములు చేసెను;
 హోతకుఁ దూరుపు నుత్తరంబు
సామగాయకునికి శమనదిగ్భాగంబు;
 బ్రహ్మకుఁ గ్రమమునఁ బడమ రెల్ల
నధ్వర్యునకు శేష మాచార్యునకు నిచ్చి;
 సొమ్ములఁ బంచి భూసురుల కొసఁగి

9-342.1-తేటగీతి

తనదు రెండు పుట్టంబులు దనకు నయిన
మెలఁత మంగళసూత్రంబు మినుకుఁ దక్క
వినతుఁడై యుండె; నా రాము వితరణంబు
పాండవోత్తమ! యేమని పలుకవచ్చు?

9-343-వచనము

అంత నా రామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్రవరులు దమతమ భూములు మరల నిచ్చి యిట్లనిరి.

9-344-ఆటవెలది

ధరణి వలదు మాకుఁ దపసుల కేల? నీ
వఖిలలోక గురుఁడవైన హరివి;
మా మనంబు లందు మలయు చీఁకటిఁ బాపు
భవ దుదారరుచులఁ బార్థివేంద్ర!

9-345-వచనము

అని పలికి బ్రహ్మణ్యదేవుండైన రామచంద్రుని వినయోక్తులం బూజించి మునులు చని; రిట్లు పెద్దకాలంబు రాజ్యంబుచేసి, రాఘవేంద్రుం డొక్కదినంబున.

## 9-23- శ్రీరామాదుల వంశము

9-346-సీస పద్యము

వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించు;
కొఱకునై రాముండు గూఢవృత్తి
నడురేయి దిరుగుచో నాగరజనులలో;
నొక్కఁడు దన సతి యొప్పకున్న
నొరునింటఁ గాపురంబున్న చంచలురాలిఁ;
బాయంగలేక చేపట్ట నేమి
తా వెఱ్ఱి యగు రామధరణీశ్వరుండనే;
బేల! పొమ్మను మాట బిట్టు పలుక

9-346.1-ఆటవెలది

నాలకించి మఱియు నా మాట చారుల
వలన జగములోనఁ గలుగఁ దెలిసి
సీత నిద్రపోవఁ జెప్పక వాల్మీకి

పర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి.

9-347-వచనము

అంత; సీతయు గర్భిణి గావునఁ గుశలవు లనియెడి కొడుకులం గనియె; వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె లక్ష్మణునకు నంగ దుండును, జంద్రకేతుండును భరతునకుఁ దక్షుండును, బుష్కలుం డును శత్రుఘ్నునకు సుబాహుండును, శ్రుతసేనుండును సంభ వించిరి; అయ్యెడ.

9-348-కంద పద్యము

బంధురబలుఁడగు భరతుఁడు
గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స
ద్బంధుఁ డగు నన్న కిచ్చెను
బంధువులును మాతృజనులుఁ బ్రజలున్ మెచ్చన్.

9-349-ఆటవెలది

మధువనంబులోన మధునందనుం డగు
లవణుఁ జంపి భుజబలంబు మెఱసి
మధుపురంబు చేసె మధుభాషి శత్రుఘ్నుఁ
డన్న రామచంద్రుఁ డౌ ననంగ.

9-350-వచనము

అంతఁ గొంతకాలంబునకు రామచంద్రుని కొమారులయిన కుశ లవులిద్దఱును వాల్మీకివలన వేదాదివిద్యల యందు నేర్పరులై పెక్కు సభల సతానంబుగా రామకథాశ్లోకంబులు పాడుచు నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని.

9-351-మత్తకోకిలము

వట్టి మ్రాకులు పల్లవింప నవారియై మధుధార దా
నుట్టఁబాడిన వారిపాటకు నుర్వరాధిపుఁడుం బ్రజల్
బిట్టు సంతస మంది; రయ్యెడఁ బ్రీతిఁ గన్నుల బాష్పముల్
దొట్ట నౌఁదల లూఁచి వారలతోడ మక్కువ పుట్టఁగాన్.

9-352-వచనము

అంతనా రామచంద్రుండు కుమారుల కిట్లనియె.

9-353-ఆటవెలది

చిన్నయన్నలార! శీతాంశుముఖులార!
నళినదళవిశాలనయనులార!
మధురభాషులార! మహిమీఁద నెవ్వరు
దల్లిదండ్రి మీకు ధన్యులార?

9-354-వచనము

అనిన వార "లేము వాల్మీకి పౌత్రులము; రాఘువేశ్వరుని యాగంబు చూడ వచ్చితి" మనవుడు; మెల్లన నగి " యెల్లి ప్రొద్దున మీ తండ్రి నెఱింగెద; రుండుం" డని యొక్క నివాసంబునకు సత్కరించి పనిచె; మఱునాఁడు సీతం దోడ్కొని కుశలవుల ముందట నిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునిం గని యనేక ప్రకారంబుల వినుతించి యిట్లనియె.

9-355-ఆటవెలది

సీత సుద్దరాలు, చిత్తవాక్కర్మంబు

లందు సత్యమూర్తి యమలచరిత
పుణ్యసాధ్వి విడువఁ బోలదు చేకొను
రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర!

9-356-వచనము

అని వాల్మీకి పలుక, రామచంద్రుండు పుత్రార్థి యై విచారింపఁ, గుశ లవులను వాల్మీకికి నొప్పగించి, రామచంద్రచరణధ్యానంబు చేయుచు నిరాశ యై సీత భూవివరంబు జొచ్చెను; అయ్యెడ.

9-357-మత్తేభ విక్రీడితము

ముదితా! యేటికిఁ గ్రుంకి తీవు మనలో మోహంబు చింతింపవే
వదనాంభోజము చూపవే మృదువు నీ వాక్యంబు విన్పింపవే
తుది చేయం దగ దంచు నీశ్వరుఁడునై దుఃఖించె భూపాలుఁ డా
పదగాదే ప్రియురాలిఁ బాసిన తఱిన్ భావింప నెవ్వారికిన్?

9-358-వచనము

అని వగచి, రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి, పదుమూఁడువేల యేం డ్లెడతెగకుండ నగ్నిహోత్రంబు చెల్లించి తా నీశ్వరుండు గావునఁ దన మొదలినెలవుకుం జనియె నివ్విధంబున.

9-359-ఆటవెలది

ఆదిదేవుఁడైన యా రామచంద్రుని
కబ్ధి గట్టు టెంత యసురకోటి
జంపు టెంత కపుల సాహాయ్య మది యెంత

సురల కొఱకుఁ గ్రీడ జూపెఁగాక.

9-360-చంపకమాల

వశుఁడుగ మ్రొక్కెదన్ లవణవార్ధి విజృంభణతా నివర్తికిన్
దశదిగధీశమౌళిమణి దర్పణమండిత దివ్యకీర్తికిన్
దశశతభానుమూర్తికి సుధారుచిభాషికి సాధుపోషికిన్
దశరథరాజుపట్టికిని దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్.

9-361-ఉత్పలమాల

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులున్
విల్లును దాల్చువాఁడు గడు విప్పగు వక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డిచ్చుత మా కభీష్టముల్.

9-362-ఆటవెలది

రామచంద్రుఁ గూడి రాకలఁ బోకలఁ
గదిసి తిరుగువారుఁ గన్నవారు
నంటికొన్నవారు నా కోసలప్రజ
లరిగి రాదియోగు లరుగు గతికి.

9-363-కంద పద్యము

మంతనములు సద్గతులకుఁ
బొంతనములు ఘనములైన పుణ్యముల కిదా
నీంతనపూర్వమహాఘ ని

కృంతనములు రామనామ కృతి చింతనముల్.

9-364-వచనము

ఆ రామచంద్రునకుఁ గుశుండును, గుశునకు నతిథియు, నతిథికి నిషధుండును, నిషధునకు నభుండును, నభునికిఁ బుండరీకుండును బుండరీకునకు క్షేమధన్వుండును, క్షేమధన్వునకు దేవానీకుండును, దేవానీకునకు నహీనుండును, నహీనునకుఁ బారియాత్రుండును, బారియాత్రునకు బలుండును, బలునకుఁ జలుండును, జలునకు నర్కసంభవుం డగు వజ్రనాభుండును, వజ్రనాభునకు శంఖణుండును, శంఖణునకు విధృతియు, విధృతికి హిరణ్యనాభుండును జనియించి; రతండు జైమిని శిష్యుండైన యాజ్ఞవల్క్యముని వలన నధ్యాత్మయోగంబు నేర్చి, హృదయకలుషంబులం బాసి యోగచర్యుండయ్యె నా హిరణ్యనాభునకుఁ బుష్యుండును, బుష్యునకు ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుండును, సుదర్శనునకు నగ్నివర్ణుండును, నగ్నివర్ణునకు శీఘ్రుండును, శీఘ్రునకు మరువను రాజశ్రేష్ఠుండును బుట్టి: రా రాజయోగి సిద్ధుండయి కలాపగ్రామంబున నున్నవాఁడు కలియుగాంతంబున నష్టంబయ్యెడు సూర్యవంశంబుఁ గ్రమ్మఱఁ బుట్టింపంగలవాఁ; డా మరువునకుఁ బ్రశుశ్రుకుండును, నా ప్రశుశ్రుకునకు సంధియు, నతనికి నమర్షణుండును, నా యమర్షణునికి మహస్వంతుండును, నా మహస్వంతునకు విశ్వసాహ్యుండును, నా విశ్వసాహ్యునకు బృహద్బలుండును, జనియించి; రా బృహద్బలుఁడు భారతయుద్ధంబున మీ తండ్రి యగు నభిమన్యు చేత హతుండయ్యె; వినుము.

## 9-24- భవిష్యద్రాజేతిహాసము

9-365-తేటగీతి

పరఁగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలు
దుదయుఁ గాఁగల రాజులఁ దోడుతోడ
నెఱుఁగఁ జెప్పితి నీవారి; నింకమీఁదఁ
బుట్టఁ గలవారిఁ జెప్పెద భూవరేంద్ర!

9-366-వచనము

ఆ బృహద్బలునకు బృహద్రణుండును బృహద్రణునకు నురుక్షతుండును, నాతనికి వత్సప్రీతుండును, వత్సప్రీతునకుఁ బ్రతివ్యోముండును, బ్రతివ్యోమునకు భానుండును, భానునకు సహదేవుండును, సహదేవునకు బృహదశ్వుండును, బృహదశ్వునకు భానుమంతుండును, భానుమంతునకుఁ బ్రతీకాశ్వుండును, బ్రతీకాశ్వునకు సుప్రతీకుండును, సుప్రతీకునకు మేరుదేవుండును, మేరుదేవునకు సుతక్షత్రుండును, సుతక్షత్రునకు ఋక్షకుండును, ఋక్షకునకు నంతరిక్షుండును, నంతరిక్షునకు సుతపుండును, సుతపునకు నమిత్రజిత్తును, నతనికి బృహద్వాజియు, నతనికి బర్హియు, బర్హికి ధనంజయుండును, ధనంజయునకు రణంజయుండును, నతనికి సృంజయుండును, సృంజయునకు శాక్యుండును, శాక్యునకు శుద్ధాదుండును, శుద్ధాదునకు లాంగలుండును, లాంగలునకుఁ బ్రసేనజిత్తును, నతనికి క్షుద్రకుండును, క్షుద్రకునకు ఋణకుండును, ఋణకునకు సురథుండును, సురథునకు సుమిత్రుండును బుట్టుదురు; సుమిత్రుని యనంతర కాలంబున సూర్యవంశంబు నశింపఁ గలదు వీరలు బృహద్బలునినుండి క్రమంబునం బుట్టం గలవార" లని చెప్పి శుకుం డిట్లనియె.

## 9-25- నిమి కథ

9-367-సీస పద్యము

ధన్యుఁడా యిక్ష్వాకు తనయుఁడౌ నిమి యాగ;
మాచరింపఁగఁ గోరి యా వశిష్ఠు
నార్త్విజ్యమునకుఁ దా నర్థింపఁ గని యాతఁ;
డింద్రునిమఖము చేయింప నియ్య
కొనినాఁడ మఱి వత్తుఁ గొదవలే దన వచ్చి;
సంసార మెంతయు చంచలంబు
కాలయాపనమేల? క్రతువు చేసెద నని;
యన్య ఋత్విక్కుల నతఁడు గూర్చి

9-367.1-తేటగీతి

చేయ నింద్రుని యాగంబు చెల్లఁజేసి
గురుఁడు చనుదెంచి శిష్యుపైఁ గోప మెత్తి
యోరి నా వచ్చునందాక నుండ వనుచు.
నతని దేహంబు పడుఁగాత మని శపించె

9-368-వచనము

ఇట్లు వశిష్ఠుండు శపించిన, నిమియును వశిష్ఠుని దేహంబు పడుఁ గాక యని మరల శపియింప, నవ్వశిష్ఠుండు మిత్రావరుణుల వలనఁ గడపట నూర్వశికి జన్మించె; గురుశాపంబున బ్రహ్మజ్ఞాని యైన నిమి విగతదేహుండైన, నతని దేహంబు మునీశ్వరులు గంధ వస్తువులం బొదివి, దాఁచి దొరకొన్న సత్త్రయాగంబు చెల్లించిరి; కడపట దేవగణంబులు మెచ్చి వచ్చిన వారలకు

నిమిదేహంబు చూపి "బ్రదుకం జేయుం" డనవుడు వారలు "నిమిప్రాణంబు వచ్చుం గాక" యని పలికిన నిమి తనదేహంబు చొరనొల్లక యిట్లనియె.

9-369-మత్తేభ విక్రీడితము

అతి మోహాకులితంబు సాంద్రమమతాహంకారమూలంబు సం
తత నానాసుఖదుఃఖపీడిత మనిత్యం; బిట్టి దేహంబు సం
కృతి నా కేటికి? మీనజీవనము భంగిన్ భీతి బాహుళ్య మం
చితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశున్ హరిం గొల్చుచున్.

9-370-వచనము

అని పలికిన నిమిమాటలు క్రమ్మఱింపనేరక "శరీరులు గన్నులు దెఱచినప్పుడును, మూసినప్పుడును నిమి గానవచ్చుంగాక" యని పల్కి దేవతలు చని; రంత.

9-371-ఆటవెలది

పెద్దలైన మునులు పృథివీస్థలికి రాజు
లేమిఁ జూచి నిమికళేబరంబు
దరువ నొకఁడు పుట్టెఁ దనయుండు వానిని
జనకుఁ డనుచుఁ బలికె జగము లెల్ల.

9-372-వచనము

మఱియు నతండు విదేహజుండు గావున వైదేహుం డనియు మథనజాతుండు గావున మిథిలుం డనియు ననం బరగె; నమ్మిథులుని చేత నిర్మితం బయినది మిథిలానగరంబు నాఁ బరగె; నా జనకునకు నుదావసుండును, నుదావసునకు

నందివర్ధనుండును, నందివర్ధనునకు సుకేతుండును, సుకేతునకు దేవరాతుండును, దేవరాతునకు బృహద్రథుండును బుట్టిరి; ఆతనికి మహావీర్యుండును, నతనికి సుధృతియు, నతనికిఁ ధృష్టకేతుండును, నతనికి హర్యశ్వుండును, నతనికి మరువును, నతనికిఁ బ్రతింధకుండును, నతనికిఁ గృతర యుండును, నతనికి దేవమీఢుఁడును, నతనికి విధృతుండును, నతనికి మహాధృతియు, నతనికి గీర్తిరాతుండును, నతనికి మహారోముండును, నతనికి స్వర్ణరోముండును, నతనికి హ్రాస్వరోముండును, నత నికి సీరధ్వజుండును పుట్టిరి.

9-373-ఆటవెలది

అతఁడు మఖము చేయ నవని దున్నింపంగ
లాగలంబుకొనను లక్షణాంగి
సీత జాత యయ్యె సీరధ్వజుం డనఁ
దానఁ జెప్పఁబడియె ధన్యుఁ డతఁడు.

9-374-వచనము

ఆ సీరధ్వజునకుఁ గుశధ్వజుండును, గుశధ్వజునకు ధర్మధ్వజుండు, ధర్మధ్వజునకుఁ గృతధ్వజ మితధ్వజులను వారిద్దఱుఁ బుట్టి; రందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుం డుదయించె నతండు తన్నుఁ దానెఱింగెడి విద్య యందు నేర్పరి యయ్యె; మితధ్వజునకు ఖాండిక్యుం డనువాఁడు జన్మించి తండ్రివలన నెఱుక గలవాఁడయి, కర్మతంత్రంబు నేర్చి కేశిధ్వజునివలన భీతుండయి యేఁగె; ఖాండిక్యునకు భానుమంతుండును, భానుమంతునకు శతద్యుమ్నుండును శతద్యుమ్నునికి శుచియు, శుచికి సనద్వాజుండు,

సనద్వాజునకు నూర్ధ్వకేతుండును, నూర్ధ్వకేతునకు నజుండును, నజునకుఁ గురుజిత్తును, గురుజిత్తునకు నరిష్టనేమియు, నరిష్టనేమికి శ్రుతాయువును, శ్రుతాయువునకుఁ బార్శ్వకుండును, బార్శ్వకునకుఁ జిత్రరథుండును, చిత్రరథునకు క్షేమాపియు, క్షేమాపికి హేమరథుండును, హేమరథునకు సత్యరథుండును, సత్యరథునకు నుపగురుండును, నుపగురునకు నగ్నిదేవు ప్రసాదంబున నుపగుర్వుండును, నుపగుర్వునకు సావనుండును, సావనునకు సువర్చసుండును, గల్గి; రతండె సుభూషణుండని వినంబడు; నా సుభూషణునకు జయుండును, జయునకు విజయుండును, విజయునకు ధృతుండును, ధృతునకు ననఘుండును, ననఘునకు వీతిహవ్యుండును, వీతిహవ్యునకు ధృతియు, ధృతికి బహుళాశ్వుండును, బహుళాశ్వునకుఁ గృతియుఁ, గృతికి మహావశియును జన్మించిరి; వీరలు మైథిలులగు రాజులని చెప్పంబడుదురు; యోగీశ్వరప్రసాదంబున గృహస్థులయి యుండియు, బంధనిర్ముక్తులయి, యాత్మజ్ఞానంబు గలిగి నిరంతర బ్రహ్మానుసంధానంబు చేయుచునుండుదు" రని పలికి శుకయోగీంద్రుం డిట్లనియె.

## 9-26- చంద్రవంశారంభము

9-375-ఆటవెలది

చంద్రగౌరమైన చంద్రవంశమునందుఁ
జంద్రకీర్తితోడ జనిత మైన
యట్టి పుణ్యమతుల నైళాది రాజుల
నింక వినుము మానవేంద్రచంద్ర!

9-376-సీస పద్యము

ఒక వేయితలలతో నుండు జగన్నాథు;
బొడ్డుఁ దమ్మిని బ్రహ్మ పుట్టె; మొదల
నతనికి గుణముల నతనిఁ బోలిన దక్షుఁ;
డగు నత్రి సంజాతుఁ డయ్యె; నత్రి
కడగంటి చూడ్కులఁ గలువలసంగడీఁ;
డుదయించి విప్రుల కోషధులకు
నమరఁ దారాతతి కజని పంపున నాథుఁ;
డై యుండి రాజసూయంబు చేసి

9-376.1-తేటగీతి

మూఁడులోకములను గెల్చి మోఅకమున
జని బృహస్పతి పెండ్లాముఁ జారుమూర్తిఁ
దార నిలుచొచ్చి కొనిపోయి తన్ను గురుఁడు
వేడినందాక నయ్యింతి విడువఁ డయ్యె.

9-377-వచనము

అంత వేల్పులతో రక్కసులకుఁ గయ్యం బయ్యె; బృహస్పతితోడి వైరంబునం జేసి, రాక్షసులుం దానును శుక్రుండు చంద్రునిం జేపట్టి సురాచార్యునిం బోఁదోలిన, హరుండు భూతగణసమేతుండై, తన గురుపుత్రుండైన బృహస్పతిం జేపట్టె; దేవేంద్రుండు సురగణంబులుం దానును బృహస్పతికి నడ్డంబు వచ్చె; నయ్యవసరంబున బృహస్పతి భార్యానిమిత్తంబున రణంబు సురాసుర వినాశకరం బయ్యె; నాలోన బృహస్పతి తండ్రి యగు నంగిరసుండు చెప్పిన విని,

బ్రహ్మదేవుండు వచ్చి చంద్రుని గోపించి, గర్భిణియైన తారను మరల నిప్పించినం జూచి బృహస్పతి దాని కిట్లనియె.

9-378-ఉత్పలమాల

సిగ్గొకయింతలేక వెలచేడియ కైవడి ధర్మకీర్తులన్
బొగ్గులు చేసి జారు శశిఁ బొంది కటా! కడుపేల దెచ్చుకొం
టెగ్గుదలంపఁగా వలదె? యిప్పుడు గర్భము దించుకొమ్ము నిన్
మ్రుగ్గఁగఁ జేసెదం, జెనటి! మానవతుల్ నినుఁ జూచి మెత్తురే?

## 9-27- బుధుని వృత్తాంతము

9-379-వచనము

అని కోపించుచుండ నా చెలువకుఁ బసిండిచాయమేనుగల కుఱ్ఱండు పుట్టె. వానింజూచి మోహంబు చేసి, బృహస్పతిదన కొడుకనియునుం, జంద్రుండు దనకన్న వాఁడనియునుం జగడించి రప్పుడు.

9-380-ఆటవెలది

వారివాదు చూచి వారింపఁగా వచ్చి
యేర్పరింప లేక యెల్ల మునులు
నమరవరుల నడుగ నా వేడుకలకత్తె
యెఱుఁగుఁ గాని యితరు లెఱుఁగ రనిరి.

9-381-వచనము

ఆ పలుకులు విని సిగ్గుపడియున్న తారం జూచి చిన్ని కొమరుం డిట్లనియె.

9-382-కంద పద్యము

ఇలువరుస చెడఁగ బంధులు
దలవంపఁగ మగఁడు రోయఁ దల్లీ! కట్టా!
వెలినేల నన్నుఁ గంటివి
కలిగించినవాఁడు శీతకరుఁడో గురుఁడో.

9-383-వచనము

అని పలుకుచున్న కొడుకునకు మఱుమాటలాడనేరకూరక యున్న తార నేకాంతంబునకుంజీరి మంతనంబున బ్రహ్మ యిట్లనియె.

9-384-మత్తేభ విక్రీడితము

చెలువా! నీ యెలసిగ్గు వాసి, గురుఁడో శీతాంశుఁడో యెవ్వఁడీ
లలితాకారుఁ గుమారుఁ గన్న యతఁ? డేలా దాఁప? నీపాటు నీ
తలనేపుట్టెనె? పెచ్చునూర్పకుము? కాంతల్ గాముకల్ గారె? మా
టల నిందేమియుఁ బోదు వో యొరులతోడం జెప్పఁ; విన్పింపవే.

9-385-వచనము

అని పలికిన బ్రహ్మకు నెదురుమాటాడ వెఱచి, మంతనంబున నయ్యింతి "చంద్రునికిం గన్నదాన" ననవుడు నా బాలకునకు బుధుం డని పేరు పెట్టి; చంద్రున కిచ్చి బ్రహ్మ చనియె; నంత.

9-386-ఆటవెలది

బుద్ధిమంతుఁడయిన బుధుఁడు పుత్రుండైన
మేను పెంచి రాజు మిన్నుముట్టె;
బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి

మిన్ను ముట్టకేల మిన్నకుండు?

## 9-28- పురూరవుని కథ

9-387-వచనము

ఆ బుధునకుఁ దొల్లి చెప్పిన యిళాకన్యకవలనఁ బురూరవుండు పుట్టె; నా పురూరవునకుం గల శౌర్యసౌందర్యగాంభీర్యాది గుణంబులు నారదునివలన నింద్రసభలోన నూర్వశి విని; మిత్రావరుణశాపంబున మనుష్యస్త్రీరూపంబు దాల్చి, భూలోకంబునకు వచ్చి, యప్పురూరవు ముందట నిలువంబడి.

9-388-తరళము

సరసిజాక్షు మృగేంద్రమధ్యు విశాలవక్షు మహాభుజున్
సురుచిరాననచంద్రమండలశోభితున్ సుకుమారు నా
పురుషవర్యుఁ బురూరవుం గని పువ్వుటంపఱజోదుచేఁ
దొరఁగు క్రొవ్విరితూపులన్ మది దూలిపోవఁగ భ్రాంతయై.

9-389-వచనము

ఊర్వశి నిలిచి యున్నంత.

9-390-ఉత్పలమాల

భావజుదీమమో? మొగులుఁబాసి వెలుంగు మెఱుంగో? మోహినీ
దేవతయో? నభోరమయొ? దీనికరగ్రహణంబు లేనిచో
జీవన మేటి కంచు మరుచేఁ జిగురా కడిదమ్ము జిమ్ములం
దావడఁకెం బురూరవుఁడు దామరపాకు జలంబు కైవడిన్.

9-391-వచనము

ఇట్లా రాచపట్టి చెలుకువింటివాని దాడికి నోడి, యెట్టకేలకు సైరణ జేసి నిలుకడఁ దెచ్చికొని, యచ్చెలువ కిట్లనియె.

9-392-ఉత్పలమాల

ఎక్కడనుండి రాక? మన కిద్ధబకుం దగు నీకు దక్కితిన్
మ్రుక్కడి వచ్చెనే యలరుమ్ముల్కులవాఁ డడిదంబుఁ ద్రిప్పుచే
దిక్కు నెఱుంగ జూడు నను దేహము దేహముఁ గేలుఁ గేల నీ
చెక్కునఁ జెక్కు మోపి తగుచెయ్వుల నన్ను విపన్నుఁ గావవే.

9-393-వచనము

అనినం బ్రోఁడ చేడియ యిట్లనియె.

9-394-మత్తేభ విక్రీడితము

ఇవె నాకూర్చు తగళ్ళు రెండు దగ నీ పెల్లప్పుడుం గాచెదే
ని వివస్త్రుండవుగాక నాకడఁ దగన్ నీవుండుదేనిన్ విశే
షవిలాసాధిక! నీకు నా ఘృతము భక్ష్యంబయ్యెనేనిన్ మనో
జవినోదంబుల నిన్నుఁ దేల్తు నగునే చంద్రాన్వయగ్రామణీ!

9-395-వచనము

అని పలికిన వేల్పులవెలయాలి ప్రతినమాటల కియ్యకొని తన మనంబున.

9-396-కంద పద్యము

మంచిదఁట రూపు సంతతి
నంచిత యౌ దేవగణిక యఁట మరుచేతన్
సంచలితచిత్త యై కా

మించిన దఁట యింతకంటె మేలుం గలదే.

9-397-వచనము

అని నిశ్చయించుకొని.

9-398-ఆటవెలది

రాజు రాజముఖిని రతిఁదేల్చె బంగారు
మేడలందుఁ దరుల నీడలందుఁ
దోఁటలందు రత్నకూటంబులందును
గోలఁకులందు గిరులకెలఁకులందు.

9-399-వచనము

అంత న య్యుద్ధళకుం దగులంబు నెలకొనిన.

9-400-కంద పద్యము

ఒకదిక్క కాని చనఁటో
రొకచోటన కాని నిలిచి యుండరు దమలో
నొకటియ కాని తలంపరు
నొకనిమిషముఁ బాయలేరు నువిదయు ఱేఁడున్.

9-401-కంద పద్యము

దయ్యు మెఱుంగున్ వారల
నెయ్యంబులు మక్కువలును నిజమరితనముల్
వియ్యములును నెడసందిని
బయ్యదకొం గడ్డమైనఁ బ్రాణము వెడలున్.

9-402-వచనము

ఇ ట్లూర్వశియుం బురూరవుండు నొండొరులవలన మక్కువలు చెక్కులొత్త బగళ్ళు రేలు సెల్లడల విహరింప నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు గొలువుండుతఱిఁ గొలువున నూర్వశిలేకుండుటం జూచి.

9-403-కంద పద్యము

ఇన్ని దినంబులకును మన
మున్న సభామధ్యవేది యూర్వశి లేమిన్
విన్నఁదనంబున నున్నది
వన్నె దఱిఁగియున్న బసిఁడివడువున ననుచున్.

9-404-వచనము

ఇంద్రుండు గంధర్వులం బనిచిన వారు నడురేయిం జని చీఁకటి నూర్వశి పెంచుచున్న యేడకంబులం బట్టిన నవి రెండును మొఱపెట్టిన; వాని మొఱ విని రతిఖిన్నుండై మేను మఱచి కూరుకుచున్న పురూరవు కౌఁగిటనుండి యూర్వశి యిట్లనియె.

9-405-మత్తేభ విక్రీడితము

అదె నా బిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు ను
న్మదులై పోయెద; రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై
కదలం డీ మగపంద కూరుకుగతిం గన్మూసి గుర్వెట్టుచున్
వదలం జాలఁడు నాదుకౌఁగిలియు దా వంధ్యాత్ముఁడై చెల్లరే.

9-406-కంద పద్యము

పగతురు దొంగల రేఁపఁగ
మగఁటిమి పాటింపలేక మగతన మెల్లన్
మగువల కౌఁగిటఁ జూపెడు
మగవాఁ డగుకంటె మగఁడు మగువగు టొప్పున్.

9-407-ఆటవెలది

అధముఁడైనవాని కా లగుకంటె న
త్యధికునింట దాసి యగుట మేలు;
హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల?
యువతిజనుల కూరకుంట లెస్స.

9-408-కంద పద్యము

ఏటికి నీ రాచఱికం
బాఁటది మొఱపెట్టఁ బశువులాతురపడ నో
యాఁటదని లేచి దొంగల
గీఁటవు వెడలంగ శవము క్రియనుండె దిదే.

9-409-కంద పద్యము

వినియు వినవు రణభీరువు
మనుజాధము నిదురపోతు మందుని నకటా!
నినుఁ జక్రవర్తిఁ జేసిన
వనజాసనుకంటె వెఱ్ఱివాఁడును గలఁడే.

9-410-వచనము

అని పెక్కుభంగుల నయ్యింతి పరుషపుపలుకులను కఱకువాలమ్ములు చెవులఁజొనుప, నా రాజశేఖరుం డంకుశంబువోట్లనడరు మదగజంబు చందంబునఁ జీర మఱచి దిగంబరుండై లేచి వాలు కేలనంకించి, యా నడురేయి దొంగల నటికిపైచి మేషంబుల విడిపించుకొని, తిరిగివచ్చు నెడ.

9-411-ఆటవెలది

చీరలేనిమగని జెలువ దా నీక్షించి
కన్నుమొఱఁగిపోయెఁ గడక నతఁడు
వెట్టివానిభంగి వివశుఁడై పడిలేచి
పొరలి తెరలి స్రుక్కి పొక్కపడియె.

9-412-వచనము

మఱియుఁ బురూరవుండు మదనాతురుండై, వెదకుచు, సరస్వతీ నదీతీరంబునం జెలికత్తెలతోఁ గూడియున్న యూర్వశింగని, వికసిత ముఖకమలుండై యిట్లనియె.

9-413-మత్తేభ విక్రీడితము

తనుమధ్యా! యిది యేల వచ్చె తకటా! ధర్మంబె శర్మంబె మున్
మనలో నుంకుగనాడికొన్న పలుకుల్ మర్యాదలుం దప్పెనే
నిను నేఁ బాసిన యంతనుండి తనువున్నేలం బడంబాఱె మే
దినిపై వ్రాలకమున్న నన్నుఁ గరుణాదృష్టిన్ విలోకింపవే.

9-414-వచనము

అనిన నూర్వశి యిట్లనియె.

9-415-కంద పద్యము

మగువలకు నింత లోఁగెదు
మగవాఁడవె నీవు పశువుమాడ్కిన్ వగవం
దగవే మానుషపశువును
మృగములుఁ గని రోయుఁగాక మేలని తినునే.

9-416-వచనము

అదియునుం గాక.

9-417-మత్తేభ విక్రీడితము

తలఁపుల్ చిచ్చులు మాట లుజ్వలసుధాధారల్ విభుండైన పు
వ్విలితున్ మెచ్చర యన్యులన్ వలఁతురే విశ్వాసముంలేదు క్రూ
రలు తోడుంబతినైనఁ జంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాండ్రెక్కడ వారి వేడబము లా వేదాంతసూక్తంబులే.

9-418-ఉత్పలమాల

ఇంకొక యేఁడు పోయిన నరేశ్వర! యాతలిరేయి నీవు నా
లంకకు వచ్చి యాత్మజుల లక్షణవంతులఁ గాంచె దేమియుం
గొంకక పొమ్ము నీ వనుడుఁ గొమ్మను గర్భిణిఁగాఁ దలంచుచున్
శంక యొకింతలేక నృపసత్తముఁ డల్లన పోయె వీటికిన్.

9-419-వచనము

ఇట్లు మరలి, తన పురంబున నొక్క యేఁడుండి, పిదప నూర్వశి కడ కేఁగి యొక్క రేయి పురూరవుం డ య్యింతికడ నున్న నా వెలందియు గంధర్వవరుల

వేఁడికొనుము నన్నిచ్చెద; రనవుడు నతండు గంధర్వవరులం బ్రార్థించిన వార లతండు పొగడుటకు మెచ్చి యగ్నిస్థాలి నిచ్చిన, నయ్యగ్నిస్థాలి నూర్వశింగా దలంచుచు దానితో నడవిం దిరుగుచుండి యొక్కనాఁ డది యూర్వశిగాదగ్నిస్థాలి యని యెఱింగి; వనంబున దిగవిడిచి, యింటికిఁ జనుదెంచి, నిత్యంబు రాత్రి దానిన చింతించుచుండఁ ద్రేతాయుగంబు చొచ్చిన నా రాజు చిత్తంబునఁ గర్మబోధంబులయి వేదంబులు మూఁడు మార్గంబులం దోఁచిన, నా భూవరుండు స్థాలికడకుం జని యందు శమీగర్భజాతం బైన యశ్వత్థంబుఁ జూచి, యా యశ్వత్థంబుచేత నరణులు రెండు గావించి, ముందటి యరణి దానును, వెనుకటి యరణి యూర్వశియును, రెంటినడుమ నున్న కాష్టంబు పుత్త్రుండు నని, మంత్రంబు చెప్పుచుం ద్రచ్చుచుండ, జాతవేదుండను నగ్ని సంభవించి విహితారాధన సంస్కారంబునం జేసి యాహవనీయాది రూపియై నెగడి, పురూరవుని పుత్త్రుండని కల్పింపం బడియె; నా యగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబునకుఁ బనుపం గారణం బగుటం జేసి.

9-420-కంద పద్యము

ఆ యగ్నిచేఁ బురూరవుఁ  
డా యజ్ఞేశ్వరు ననంతు హరి వేదమయున్  
శ్రీయుతుఁ గూర్చి యజించె గు  
ణాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడు కోఱికై.

9-421-ఉత్పలమాల

ఒక్కఁడవహ్ని వేల్పు పురుషోత్తముఁ డొక్కఁడ సర్వవాఙ్మయం  
బొక్కఁడ వేద మా ప్రణవ మొక్కఁడ వర్ణము దొల్లి త్రేతయం

దెక్కటిమాన్చి మూఁడుగను నేర్పఱిచెం దనబుద్ధిపెంపుచేఁ
జక్కఁగ నా పురూరవుఁ డశక్తులకున్ సులభంబులౌ గతిన్.

9-422-వచనము

ఇట్లు వేదవిభాగంబు గల్పించి, యాగంబుచేసి, పురూరవుం డూర్వశి యున్న గంధర్వలోకంబునకుం జనియె నతనికి నూర్వశి గర్భంబున నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుండు, జయుండు, విజయుం డన నార్గురు పుత్రులు గలిగి; రందు శ్రుతాయువునకు వసుమంతుండును, సత్యాయువునకు శ్రుతంజయుండును, రయునకు శ్రుతుండు నేకుం డన నిరువును, జయునకు నమితుండును, విజయునకు భీముండును జనించి రా భీమునకుఁ గాంచనుండు, కాంచనునకు హోత్రకుండు, హోత్రకునకు గంగాప్రవాహంబు పుక్కిటం బెట్టిన జహ్నుండు, జహ్నునకుఁ బూరుండు పూరునకు బాలకుండు, బాలకునకు నజకుం, డజకునకుఁ గుశుండు, కుశునకుఁ గుశాంబుండు ధూర్తయుండు వసువు కుశనాభుం డన నలువురును సంభవించి; రందు గుశాంబునకు గాధి యను వాఁడు గలిగె నా గాధి రాజ్యంబు చేయుచుండ.

## 9-29- జమదగ్ని వృత్తాంతము

9-423-సీస పద్యము

సత్యవతిని గాధిజాతను గన్యను;
 విప్రుఁడు ఋచికుండు వేఁడికొనిన
గాధియు సుత కీడు గాఁడని తెల్లని;
 నవకంపు మేనులు నల్లచెవులు
గల గుఱ్ఱములు వేయి కన్యకు నీ వుంకు;

విచ్చినఁ గూతు నే నిత్తు ననిన
వసుధామరుండును వరుణుని కడ కేఁగి;
హరులఁ దెచ్చినఁ గూతు నాఁత డిచ్చె

9-423.1-ఆటవెలది

నా మహాత్ము సతియు నత్తయుఁ గొడుకులఁ
గోరి యడుగ నియ్యకొని యతండు
విప్రరాజ మంత్రవితతుల వేల్పించి
చరువు చేసి క్రుంక నరిగె నదికి.

9-424-వచనము

అయ్యెడం దల్లి యడిగిన, సత్యవతి బ్రహ్మమంత్రంబులఁ దనకు వేల్పించిన చరువు దల్లి కిచ్చి క్షాత్రమంత్రంబులం దల్లికి వేల్పించిన చరువు దా నందుకొని యుండ నా ముని చనుదెంచి చరువు వీడ్వడుట యెఱింగి భార్య కిట్లనియె.

9-425-ఆటవెలది

తల్లి చరువు నీవు దాల్చి నీ చరు వేల
తల్లిపాల నిడితి తరళనేత్ర!
కొమ్మ! యింక నీకుఁ గ్రూరుఁడు పుట్టు మీ
యమ్మ బ్రహ్మవిదుని ననఘుఁ గాంచు.

9-426-వచనము

అనిన నయ్యింతి వెఱచి మ్రొక్కి వినయంబులాడినం బ్రసన్నుండై నీ కొడుకు సాధువై, నీ మనుమండు క్రూరుం డగుంగాక యని ఋచికుం డనుగ్రహించిన నా

సత్యవతికి జమదగ్ని సంభవించె; సత్యవతియుం గౌశకీనది యై లోకపావని యై ప్రవహించె; నా జమదగ్నియు రేణువు కూఁతురయిన రేణుకను వివాహంబై వసుమనాది కుమారులం గనియెను; అందు.

## 9-30- పరశురాముని కథ

9-427-కంద పద్యము

పురుషోత్తము నంశంబున
ధర జమదగ్నికి జనించి ధన్యుఁడు రాముం
డిరువదియొకపరి నృపతుల
శిరములఁ జక్కడిచెఁ దనదు చేగొడ్డంటన్.

9-428-వచనము

అనిన విని భూవరుండు శుకున కిట్లనియె.

9-429-ఉత్పలమాల

ఏటికి జంపె రాముఁడ వనీశులఁ బల్వుర వారి యందు ద
ప్పేటికిఁ గల్గె విప్రుఁ డతఁ డేటికి రాజస తామసంబులన్
వాటముఁ బొందె భూభరము వారిత మౌ టది యేవిధంబు నా
మాటకు మౌనిచంద్ర! మఱుమాట ప్రకాశముగాఁగఁ జెప్పవే.

9-430-వచనము

అనిన విని శుకుం డిట్లనియె.

9-431-సీస పద్యము

హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు;

ధరణీశ్వరులలోనఁ దగినవాఁడు
పురుషోత్తమాంశాంశుఁ బుణ్యు దత్తాత్రేయు;
నారాధనముచేసి యతనివలన
బరపంథిజయమును బాహుసహస్రంబు;
నణిమాదిగుణములు యశము బలము
యోగీశ్వరత్వంబు నోజయుఁ దేజంబుఁ;
జెడనియింద్రియములు సిరియుఁ బడసి

9-431.1-తేటగీతి

గాలికైవడి సకలలోకంబు లందుఁ
దనకుఁ బోరాని రారాని తావులేక
యెట్టిచో నైనఁ దనయాజ్ఞ యేపు మిగుల
ధరణి వెలుఁగొందె వినువీథిఁ దరణి మాడ్కి.

9-432-మత్తేభ విక్రీడితము

ఒకనాఁ డా మనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁడై వీట నుం
డక రేవానది కేఁగి యందుఁ దెలినీటం జల్లులాడి దీ
ర్ఘకరాబ్జంబుల నా నదీజలములం గట్టెన్ వడిన్ నీరు మ్రో
లకుఁ బెల్లుబ్బి రణాగతుండయిన యా లంకేశుపైఁ దొట్టఁగన్.

9-433-వచనము

ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చిన రావణుం డా రాజుచే కట్టందొట్టిన యేటినీటికి సహింపక రోషంబునం బోటరియుంబోలె నమ్మేటిమగని తోడి పోరాటకుం దొడరినఁ బాటింపకఁ దన బాహుపాటవంబున.

9-434-కంద పద్యము

వీఁకమెయి నతఁడు రావణుఁ

గూఁకటులగలించి పట్టికొని మోకాళ్ళం

దాఁకించి కోఁతికైవడి

నాఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్.

9-435-వచనము

అంత నర్జునుండు మహిష్మతీపురంబున కేతెంచి.

9-436-కంద పద్యము

ఆ రాజేంద్రుఁడు రావణు

నోరీ! యిటమీఁద నూరకుండుము; జగతిన్

వీరుఁడ ననకుము; కాచితిఁ

బోరా! యని సిగ్గు పఱచి పుచ్చెన్ మరలన్.

9-437-వచనము

అంత.

9-438-సీస పద్యము

ధరణీశుఁ డొకనాఁడు దైవయోగంబున;

వేఁటకై కాంతారవీథి కేఁగి

తిరిగి యాఁకట శ్రాంతదేహుఁడై జమదగ్ని;

ముని యాశ్రమముఁజేరి మ్రొక్కి నిలువ

నా మునీంద్రుఁడు రాజు నర్థితోఁ బూజించి;

యా రాజునకు రాజుననుచరులకుఁ
దన హోమధేనువుఁ దడయక రప్పించి;
యిష్టాన్నములు గురియింప నతఁడు

9-438.1-తేటగీతి

గుడిచి కూర్చుండి మొదవుపై గోర్కిఁ జేసి
సంపద యదేల యీ యావు చాలుఁగాక
యిట్టి గోవుల నెన్నండు నెఱుఁగ మనుచుఁ
బట్టి తెండని తమ యొద్ది భటులఁ బనిచె.

9-439-వచనము

పంచిన వారలు దర్పంబునం జని.

9-440-కంద పద్యము

క్రేపుం బాపకుఁ డంచును
నాపదలం బడితి మనుచు నంబా యనుచుం
జూపోవరు నృపు లంచును
వాపోవన్ మొదవుఁ గొనుచు వచ్చిరి పురికిన్.

9-441-వచనము

అంత నర్జునుండు మహిష్మతీపురంబునకు వచ్చునెడ రాముండా శ్రమంబున కేతెంచి, తద్వృత్తాంతం బంతయు విని.

9-442-ఆటవెలది

అద్దిరయ్య! యింట నన్నంబు గుడిచి మా

యయ్యు వల దనంగ నాక్రమించి
క్రొవ్వి రాజు మొదవు గొనిపోయినాఁ డంట
యేను రాముఁ డౌట యెఱుఁగఁ డొక్కొ.

9-443-వచనము

అని పలికి.

9-444-మత్తేభ విక్రీడితము

ప్రళయాగ్నిచ్ఛట భంగిఁ గుంభి విదళింపం బాఱు సింహాకృతిం
బెలుచన్ రాముఁ డిలేశు వెంట నడచెం బృథ్వీతలంబెల్ల నా
కులమై క్రుంగఁ గుఠారియై కవచియై కోదండియై కాండియై
ఛలియై సాహసియై మృగాజినమనోజ్ఞశ్రోణియై తూణియై.

9-445-వచనము

చని మహిష్మతీపురద్వారంబుఁ జేరి నిలుచున్న సమయంబున.

9-446-మత్తేభ విక్రీడితము

కనియెన్ ముందటఁ గార్తవీర్యుఁడు సమిత్కాముం బ్రకామున్ శరా
సన తూణీర కుఠార భీము నతిరోషప్రోచ్చలద్భ్రూయుగా
నన నేత్రాంచల సీము నైణపట నానామాలికోద్దాము నూ
తన సంరంభ నరేంద్రదార శుభసూత్రక్షామునిన్ రామునిన్.

9-447-వచనము

కని కోపించి.

9-448-ఉత్పలమాల

బాలుఁడు వెట్టి బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుకైవడి నుంట మాని భూ
పాలురతోడ భూరిబలభవ్యులతోడ భయంబు దక్కి క
య్యాలకు వచ్చినాఁడు మన యందిఁకఁ బాపము లేదు లెండులెం
డేల సహింప భూసురుని నేయుఁడు ప్రేయుఁడు గూల్పుఁ డిమ్మహిన్.

9-449-వచనము

అని కదలించి దండనాయకులఁ బురికొల్పిన, వారు రథ గజ తురగ పదాతి సమూహంబులతో లెక్కకుం బదియేడక్షౌహిణులతో నెదురునడచి శర చక్ర గదాఖడ్గ భిండిపాల శూల ప్రముఖ సాధనంబుల నొప్పించిన నవ్విప్రవరుండు గన్నులకొలకుల నిప్పులుగుప్పలు కొన రెట్టించిన కట్టల్క మిట్టిపడి, యజ్ఞోపవీతంబు చక్కనిడికొని కరాళించి బిట్టు దట్టించి కఠోరం బగు కుఠారంబు సారించి మూఁకల పై కుఱికి, తొలకరి మొగంబునం గ్రొచ్చెలికపట్టునం జెట్టులు గొట్టు కృషీవలుని తెఱంగునఁ బదంబులు ద్రెంచుచుఁ, ననటికంబంబులఁ దెగనడచు నారామకారుని పగిది మధ్యంబులఁ ద్రుంచుచుఁ, దాళఫలంబులు రాల్చు వృక్షారోహకునికైవడి శిరంబులు ద్రుంచుచు, మృగంబుల వండం దుండించు సూపకారుని భంగి నవయవంబులం జెక్కుచు, నంతటం దనివిజనక విలయకాలకీలి కేలిని మంట లుమియుచు, విల్లంది యెల్లడం బిడుగుల సోనలు గురియు బలుమొగిళ్ళువడువున నప్రమాణంబు లగు బాణంబుల బఱపి, సుభటసైన్యంబుల దైన్యంబు నొందించుచు, నడ్డంబులేని యార్భాటంబులు గల బాణవర్షప్భుతంబులతో రాహుతులం గోపానలంబున కాహుతులుచేయుచు, తురంగంబుల నిరంగంబులఁ గావించుచు, రథంబుల విశ్లథంబులఁగా నొనర్చుచు

ద్విరదంబుల నరదంబులపైఁ బఱవం ద్రోలుచు నివ్విధంబున సేనల నంపవానల ముంచి రూపుమాపిన.

9-450-కంద పద్యము

మత్తిల్లి భూతజాలము
చిత్తంబులఁ జొక్కి వేడ్కఁ జిందులుబాఱన్
జొత్తిల్లి సమిత్తలమున
నెత్తురు మేదంబు పలలనికరం బయ్యెన్.

9-451-వచనము

అయ్యవసరంబున.

9-452-కంద పద్యము

మేలీ బ్రాహ్మణుఁ డొక్కఁడు
నేలం బడఁగూల్చె సైన్యనిచయము సెల్లన్
బాలార్చ నేల యీతనిఁ
దూలించెదఁగాక నాదు దోర్బలము వడిన్.

9-453-వచనము

అని పలికి

9-454-మత్తేభ విక్రీడితము

ఒక యేనూఱుకరంబులన్ ధనువు లత్యుల్లాసియై తాల్చి వే
ఱొక యేనూట గుణధ్వనుల్ నిగుడ శాతోగ్రాస్త్రముల్ గూర్చి వి
ప్ర! కుఠారంబును నిన్నుఁ గూల్తు ననుచున్ భర్జించి పుంఖానుపుం

ఖకరోరంబుగ నేసి యార్చె రయరేఖా ధామునిన్ రామునిన్.

9-455-కంద పద్యము

వడిఁదూపు లెగయ గుడుసులు
పడి కార్ముకపంచశతము పరగ విభుఁడు నొం
పడరెఁ బరివేషమండలి
నడుమఁ గరద్యుతుల వెలయు నళినాప్తు క్రియన్.

9-456-వచనము

ఇట్లర్జునుండు బాహువిలాసంబు చూపిన.

9-457-మత్తేభ విక్రీడితము

ధరణీదేవుఁడు రాముఁ డాఢ్యుఁడు జగద్ధానుష్కరత్నంబు దు
ష్కర చాపం బొక టెక్కుపట్టి శరముల్ సంధించి పెల్లేసి భూ
వరు కోదండము లొక్కచూడ్కిఁ దునిమెన్ వాఁడంతటం బోక వే
తరువుల్ బువ్వఁ గుఠారధార నఱకెం దద్బాహుసందోహమున్.

9-458-కంద పద్యము

కరములు దునిసిన నతనికి
శిర మొక్కటి చిక్క శైలశిఖరముభంగిం
బరశువున నదియుఁ ద్రుంచెను
బరసూదనుఁ డైన ఘనుఁడు భార్గవుఁడు వడిన్.

9-459-ఆటవెలది

తండ్రి పడిన నతని తనయులు పదివేలు

దలఁగిపోయి రతనిఁ దాకలేక
పరభయంకరుండు భార్గవుం డంత నా
గోవుఁ గ్రేపుతోడఁ గొనుచుఁ జనియె.

9-460-వచనము

ఇట్లు హోమధేనువు మరలం దెచ్చియిచ్చి తన పరాక్రమంబు దండ్రి దోఁబుట్టువులకుం దెలియం జెప్పిన జమదగ్ని రామున కిట్లనియె.

9-461-కంద పద్యము

కలవేల్పు లెల్లఁ దమతమ
చెలువంబులు దెచ్చి రాజుఁ జేయుదు రకటా!
బలువేల్పు రాజు వానిం
జలముననిట్లేల వోయి చంపితి పుత్రా!

9-462-కంద పద్యము

తాలిమి మనకును ధర్మము
తాలిమి మూలంబు మనకు ధన్యత్వమునం
దాలిమి గలదని యీశుం
డేలించును బ్రహ్మపదము నెల్లన్ మనలన్.

9-463-కంద పద్యము

క్షమ గలిగిన సిరి గలుగును
క్షమ గలిగిన వాణి గలుగు సౌరప్రభయున్
క్షమ గలుగఁ దోన కలుగును

క్షమ గలిగిన మెచ్చు శౌరి సదయుఁడు దండ్రీ!

9-464-కంద పద్యము

పట్టపురాజును జంపుట
గట్టలుకన్ విప్రుఁ జంపు కంటెను బాపం
బట్టిట్టనకుము నీవీ
చెట్టజెడం దీర్థసేవచేయుము దనయా!

9-465-కంద పద్యము

అని తన్నుఁ దండ్రి పనిచినఁ
బనిపూని ప్రసాద మనుచు భార్గవుఁడు రయం
బున నొకయేఁడు ప్రయాణము
చని తీర్థము లెల్ల నాడి చనుదెంచె నృపా!

9-466-ఉత్పలమాల

ఆ యెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక గంగలోనికిం
బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమపిండుతోఁ
దోయవిహారముల్ సలుపు దుర్లభుఁ జిత్రరథున్ సరోజమా
లాయుతుఁ జూచుచుండెఁ బతి యాజ్ఞ దలంపక కొంత ప్రేమతోన్.

9-467-వచనము

ఇట్లు గంధర్వవల్లభునిం జూచు కారణంబున దడసి.

9-468-ఉత్పలమాల

అక్కట వచ్చి పెద్దతడ వయ్యెను; హోమమువేళ దప్పె; నే

నిక్కడనేల యుంటి; ముని యేమనునో యని భీతచిత్త యై
గ్రక్కునఁ దోయకుంభము శిరస్థలమందిడి తెచ్చియిచ్చి వే
మ్రొక్కి కరంబు మోడ్చి పతి ముందట నల్లన నిల్చె నల్కుచున్.

9-469-వచనము

అప్పుడు.

9-470-కంద పద్యము

చిత్తమున భార్య దడసిన
వృత్తాంతం బెఱిఁగి తపసి పేకని సుతులన్
మత్తం దీనిం జావఁగ
మొత్తుం డన మొత్తరైరి మునుకుచు వారల్.

9-471-కంద పద్యము

కొడుకులు పెండ్లముఁ జంపమిఁ
గొడుకులఁ బెండ్లాముఁ జంప గురు డానతి యీ
నడుగులకు నెఱిఁగి రాముం
డడుగిడకుండంగఁ ద్రుంచె నన్నలఁ దల్లిన్.

9-472-శార్దూల విక్రీడితము

తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపు మనుచోఁ దాఁ జంపి రాకున్నఁ బెం
పెల్లంబోవ శపించుఁ దండ్రి తన పంపేఁ జేయుడున్ మెచ్చి దా
తల్లిన్ భ్రాతల నిచ్చు నిక్కము తపోధన్యాత్మకుం డంచు వే
తల్లిన్ భ్రాతలఁ జంపె భార్గవుఁడు లేదా చంపఁ జేయాడునే?

9-473-వచనము

ఇవ్విధంబున.

9-474-కంద పద్యము

అడ్డము జెప్పక కడపటి
బిడ్డఁడు రాముండు సుతులఁ బెండ్లము నచటన్
గొడ్డంటం దెగ నడచిన
జడ్డనఁ దలయూఁచి మెచ్చె జమదగ్ని మదిన్.

9-475-కంద పద్యము

మెచ్చిన తండ్రిని గనుఁగొని
చెచ్చెర నీ పడినవారి జీవంబులు నీ
విచ్చితి నను మని మ్రొక్కిన
నిచ్చెన్ వారలును లేచి రెప్పటి భంగిన్.

9-476-ఆటవెలది

పడినవారి మరల బ్రతికింప నోపును
జనకుఁ డనుచుఁ జంపె జామదగ్న్యుఁ
డతఁడు చంపె ననుచు నన్నలఁ దల్లిని
జనకునాజ్ఞ యైనఁ జంపఁ దగదు.

9-477-సీస పద్యము

పరశురాముని కోడి పరుగులు పెట్టిన;
యర్జునుపుత్రకు లాత్మ యందుఁ

దండ్రి మ్రగ్గుటకు సంతప్తులై పొగలుచు;
 నింతట నంతట నెడరు వేచి
తిరిగి యాడుచు నొక్క దివసమం దా రాముఁ;
 డడవి కన్నలతోడ నరుగఁ బిదప
బగఁదీర్పఁ దఱి యని పఱతెంచి హోమాల;
 యంబున సర్వేశు నాత్మ నిలిపి

9-477.1-తేటగీతి

నిరుపమధ్యానసుఖవృత్తి నిలిచియున్న
పుణ్యు జమదగ్నినందను బోదివి పట్టి
కుదులకుండంగఁ దలఁ ద్రెంచి కొనుచుఁ జనిరి
యడ్డ మేతెంచి రేణుక యడచికొనఁగ.

9-478-వచనము

మఱియును.

9-479-మత్తేభ విక్రీడితము

జనకుం జంపిన వైరముం దలఁచి రాజన్యాత్మజుల్ నేఁడు మీ
జనకుం జంపిరి రామ! రామ! రిపులన్ శాసింతు రమ్మంచు న
మ్మునిపైవ్రాలి లతాంగి మోఁదికొనియెన్ ముయ్యేడుమాఱులుఱయం
బున రాముం డరుదెంచి యెన్నికొన నాపూర్ణాపదాక్రాంతయై.

9-480-వచనము

అప్పుడుఁ దల్లి మొఱ విని, జమదగ్ని కుమారులు వచ్చి యిట్లని విలపించిరి.

9-481-కంద పద్యము

వాకిలిపెడలవు కొడుకులు
రాకుండఁగ నట్టి నీవు రాజసుతులచేఁ
జీకాకు నొంది పోవఁగ
నీకా ళ్లెట్లాడెఁ దండ్రి! నిర్జరపురికిన్.

9-482-వచనము

అని విలపించుచున్న యన్నలఁ జూచి రాముం డిట్లనియె.

9-483-ఉత్పలమాల

ఏడువనేల తండ్రి తను పేమఱకుండుఁడు తోడులార! నే
సూడిదె తీర్తునంచుఁ బరశుద్ద్యుతిభీముఁడు రాముఁ డుగ్రుఁడై
యోడక యర్జునాత్మభవులున్నపురంబున కేఁగి చొచ్చి గో
డాడఁగఁ బట్టి చంపె వడి నర్జునజాతుల బ్రహ్మఘాతులన్.

9-484-కంద పద్యము

ఖండించి రిపుల శిరములు
గొండలుగాఁ బ్రోగు లిడియె గురురక్తనదుల్
నిండికొని పాఱ నుబ్బుచు
భండనమున విప్రరిపులు భయమంద నృపా!

9-485-వచనము

మఱియు నంతటఁ బోక.

9-486-ఆటవెలది

అయ్యు పగకు రాముఁ డలయక రాజుల
నిరువదొక్కమాఱు నరసి చంపె;
జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ
నూడు దీర్పలేని సుతుఁడు సుతుఁడె?

9-487-వచనము

మఱియు నా రాముండు శమంతపంచకంబున రాజరక్తంబులం దొమ్మిది మడుఁగులు గావించి తండ్రిశిరంబు దెచ్చి, శరీరంబుతో సంధించి, సర్వదేవమయుండగు దేవుండు దాన కావునఁ దన్నునుద్దేశించి యాగంబుంజేసి, హోతకుం దూర్పును, బ్రహ్మకు దక్షిణ భాగంబును, నధ్వరునకుఁ బడమటి దిక్కును, నుద్గాత్రునకునుత్తర దిశయు, నున్నవారల కవాంతరదిశలును, గశ్యపునకు మధ్యదేశంబును, నుపద్రష్టకు నార్యావర్తంబును, సదస్యులకుం దక్కిన యెడలును గలయనిచ్చి బ్రహ్మనది యైన సరస్వతియం దవబృథస్నానంబు చేసి, కల్మషంబులం బాసి, మేఘవిముక్తుండయిన సూర్యుండునుం బోలె నొప్పుచుండెను; అంత.

9-488-కంద పద్యము

ఆప్తుఁడగు పుత్త్రువలనను
బ్రాప్తతనుం డగుచుఁ దపము బలిమిని మింటన్
సప్తర్షిమండలంబున
సప్తముఁడై వెలుఁగుచుండె జమదగ్ని నృపా!

9-489-కంద పద్యము

ఆ జమదగ్నితనూజుఁడు

రాజీవాక్షుండు ఘనుఁడు రాముఁ డధికుఁడై
యోజను సప్తర్షులలో
రాజిల్లెడు మీఁది మనువు రా నవ్వేళన్.

9-490-ఆటవెలది

శాంతచిత్తుఁ డగుచు సంగవిముక్తుఁడై
భవ్యుఁడై మహేంద్రపర్వతమున
నున్నవాఁడు రాముఁ డోజతో గంధర్వ
సిద్ధవరులు నుతులు చేయుచుండ.

9-491-కంద పద్యము

భగవంతుఁడు హరి యీ క్రియ
భృగుకులమునఁ బుట్టి యెల్ల పృథివీపతులన్
జగతీభారము వాయఁగఁ
బగగొని పలుమాఱుఁ జంపె బవరమున నృపా!

## 9-31- విశ్వామిత్రుని వృత్తాంతము

9-492-వచనము

అంత గాధికి నగ్నితేజుండగు విశ్వామిత్రుండు జన్మించి, తపోబలంబున రాజధర్మంబును దిగనాడి, బ్రహ్మర్షియై యేకశతసంఖ్యాగణితు లగు కొడుకులం గనియె; నయ్యెడ భృగుకులజాతుండైన యజీగర్తునికొడుకు శునశ్శేఫుండు దల్లిదండ్రులచేత హరిశ్చంద్రుని యాగపశుత్వంబునకు నమ్ముడుపడి, బ్రహ్మదిదేవతల వినుతిచేయుచు మెప్పించి, దేవతలచేత బంధవిముక్తుండయిన వానియందుఁ గృపగలిగి విశ్వామిత్రుండు పుత్రుల కిట్లనియె.

9-493-కంద పద్యము

కన్నులఁ గంటిని వీనిని
మన్నన కొమరుండు నాకు మక్కువ మీరో
యన్నన్న యనుచు నీతని
మన్నింపుం డనినఁ జూచి మదసంయుతులై.

9-494-కంద పద్యము

ఇతఁ డన్నఁటపో మాకును
గృతకృత్యుల మయితి మనుచు గేలి యొనర్పన్
సుతులన్ మ్లేచ్ఛులు గండని
ధృతిలేక శపించెఁ దపసి తిరుగుడుపడఁగన్.

9-495-వచనము

అయ్యెడ నతని శాపంబునకు వెరచి, యా నూర్వురయందు మధ్యముండైన మధుచ్ఛందుం డేఁబండ్రు దమ్ములుం దానును నమస్కరించి “తండ్రీ నీచెప్పిన క్రమంబున శునశ్శేపుండు మా కన్న యని మన్నింపంగలవార” మనవుడు సంతసించి మంత్రదర్శియైన శునశ్శేపుని వారల యందుఁ బెద్దఁజేసి, మధుచ్ఛందున కిట్లనియె.

9-496-ఆటవెలది

పాడి చెడక వీఁడు నేఁడు మీకతమునఁ
గొడుకు గలిగె నాకుఁ గొడుకులార!
కడుపులార! మీరు గొడుకులఁ గనుఁ డింక
బ్రీతితోడ దేవరాతుఁ గూడి.

9-497-వచనము

అని పలికె; నట్లు శునశ్శేఫుండు దేవతలచేత విడివడుటం జేసి దేవరాతుండయ్యె; మధుచ్ఛందుండు మొదలయిన యేఁబండ్రు నా దేవరాతునకుఁ దమ్ము లైరి పెద్దలయిన యష్టక, హారీత, జయంత సుమదాదు లేఁబండ్రును వేఱై చనిరి; ఈ క్రమంబున విశ్వామిత్రు కొడుకులు రెండు విధంబులయినం, బ్రవరాంతంబు గలిగె" నని చెప్పి శుకుం డిట్లనియె "నా పురూరవు కొడుకగు నాయువునకు నహుషుండును, క్షత్త్రవృద్ధుండును, రజియును, రంభుండును, ననేనసుండును ననువారు పుట్టి; రందు క్షత్త్రవృద్ధునకుఁ గుమారుండగు సుహోత్రునకుఁ గాశ్యుండుఁ గుశుఁడు గృత్స్నమదుండు నన ముగ్గురు గలిగి; రా కృత్స్నమదునకు శునకుండును, శునకునకు శౌనకుండును, నమ్మహాత్మునికి బహ్వృచప్రవరుండును జన్మించి; రా బహ్వృచప్రవరుండు దపోనియతుండై చనియె; కాశ్యునకుఁ గాశియుఁ గాశికి రాష్ట్రుండును, రాష్ట్రునకు దీర్ఘతపుండును జనించిరి.

9-498-కంద పద్యము

ఆ దీర్ఘతపుని కధికుఁడు
శ్రీదయితాంశమునఁ బుట్టె సేవ్యుం డాయు
ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి
ఖేదంబులు వాయు నతనిఁ గీర్తనచేయన్.

9-499-వచనము

వాసుదేవాంశసంభూతుండగు నా ధన్వంతరి యజ్ఞభాగంబున కర్హుం; డతనికిఁ గేతుమంతుండు, గేతుమంతునకు భీమరథుఁడు నతనికి దివోదాసుండనం

బరఁగు ద్యుమంతుండు నుదయించి; రా ద్యుమంతునకుఁ బ్రతర్దనుండు జన్మించె; నా ప్రతర్దనుండు శత్రుజిత్తనియును ఋతధ్వజుండనియుం జెప్పంబడె; నాతనికిఁ గువలయాశ్వుండు సంభవించె.

9-500-ఆటవెలది

వసుమతీశ! విను కువలయాశ్వభూభర్త
లలితపుణ్యు ఘను నలర్కుఁ గనియె
నాతఁ డేలె నేల నఱువదియాఱు వే
లేండ్లు వాని భంగి నేల రెవరు.

9-501-వచనము

అయ్యలర్కునకు సన్నతియును, నతనికి సునీతుండును, నతనికి సుకేతనుండును, నతనికి ధర్మకేతువు, నతనికి సత్యకేతువును, నాతనికి ధృష్టకేతువును, నా ధృష్టకేతువునకు సుకుమారుండును, సుకుమారునకు వీతిహోత్రుండు, వీతిహోత్రునకు భర్గుండును, భర్గునకు భార్గభూమియు జనియించిరి.

9-502-ఆటవెలది

వాఁడు తుదయుఁ గాశ్యవసుమతీశుం డాది
యైనవారు కాశు లనఁగ నెగడి
రవనిమీఁద వార లా క్షత్రవృద్ధుని
వంశజాతు లగుచు వంశవర్య!

9-503-వచనము

మఱియు, క్షత్రవృద్ధునికి రెండవకొడుకగు కుశునికిఁ బ్రీతియును, వానికి సంజయుండును, సంజయునికి జయుండును, జయునికిఁ గృతుండును, గృతునికి హర్యధ్వనుండును, హర్యధ్వనునకు, సహదేవుండును, సహదేవునికి భీముండును, భీమునకు జయత్సేనుండును, జయత్సేనునకు సంకృతియు, సంకృతికి జయుండును, జయునికి, క్షత్రధర్మండును బుట్టిరి; వీరలు క్షత్రవృద్ధుని వంశంబునం గల రాజులు; రంభునికి రభసుండును, రభసునికి గంభీరుండును గంభీరునికిఁ గృతుండును గల్గి; రా గృతునికి బ్రహ్మకులంబు పుట్టె; న య్యనేనునకు శుద్ధుండును, శుద్ధునకు శుచియు, శుచికి బ్రహ్మసారథి యైన త్రికకుత్తును జనించి; రతనికి శాంతరజుండు పుట్టె; నతండు విజ్ఞానవంతుండుఁ, గృతకృత్యుండు, విరక్తుండు నయ్యె.

9-504-సీస పద్యము

రజియను వానికి రాజేంద్ర! యేనూఱు;
 కొడుకులు గలిగిరి ఘోరబలులు
వేల్పులెల్లను వచ్చి వేఁడిన నా రజి;
 దైత్యులఁ బెక్కండ్ర ధరణిఁ గూల్చి
నాకంబు దేవేంద్రునకు నిచ్చె నిచ్చిన;
 రజికాళ్ళకెఱఁగి సురప్రభుండు
వెండియు నతనికి విబుధగేహము నిచ్చి;
 సంతోషబుద్ధి నర్చన మొనర్చె

9-504.1-ఆటవెలది

నంతనా రజి మృతుఁడైన నతని పుత్రు

లమరవిభుఁడు తమ్ము నడిగికొనిన
నీక యింద్రలోక; మేలిరి యాగభా
గములు పుచ్చికొనిరి గర్వమంది.

9-505-కంద పద్యము

వేలుపులఱేఁడు గురుచే
వేలిమి వేల్పించి బలిమి పెలయఁగ నిజ దం
భోళిని రజిసుతులను ని
ర్మూలము గావించి స్వర్గముం గైకొనియెన్.

## 9-32- నహుషుని వృత్తాంతము

9-506-వచనము

అది యట్లుండె; నహుషునకు యతియు, యయాతియును, సంయాతియు, నాయాతియు, living వియతియుఁ, గృతియు నన నార్గురు గొడుకులు దేహికి నింద్రియంబుల చందంబున సంభవించి; రందుఁ బెద్దకొడుకగు యతికి రాజ్యం బిచ్చిన నతండు విరక్తుండై.

9-507-కంద పద్యము

రాజ్యంబు పాపమూలము
రాజ్యముతో నొడలెఱుంగ రాదు సుమతియున్
రాజ్యమునఁ బూజ్య నెఱుఁగడు
రాజ్యము గీజ్యమ్ము ముక్తిరతునకు నేలా?

9-508-వచనము

అని పలికి వాఁడు రాజ్యంబునకుం బాసి చనియె.

9-509-కంద పద్యము

ఆ నహుషుఁడు మఖశతమును

మానుగఁ నొనరించి యింద్రమానిని గవయం

బూని మునీంద్రులు మోచిన

యానముపై నుండి కూలె నహి యై నేలన్.

## 9-33- యయాతి కథ

9-510-ఉత్పలమాల

అన్నయుఁ దండ్రియుం జన, యయాతి మహీపతి యై చతుర్దిశల్

పన్నుగఁ గావఁ దమ్ములకుఁ బాలిడి శుక్రుని కూఁతురున్ సుసం

పన్నగుణాభిరామ వృషపర్వుని కూఁతురు నోలి నాండ్రుగా

నన్నయశాలి యీ ధరణిచక్రధురంధరుఁ డయ్యెఁ బేర్మితోన్.

9-511-వచనము

అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

9-512-ఆటవెలది

పార్థివుఁడు యయాతి బ్రహ్మర్షి భార్గవుఁ

డల్లుఁ డగుట మామ యగుట యెట్లు?

రాజు రాచకూఁతు రతిజేయుఁ దగు గాక

విప్రకన్య నొంద విహిత మగునె?

9-513-వచనము

అనిన శుకుం డిట్లనియె.

9-514-సీస పద్యము

దనుజేంద్రు కూఁతురు తరళాక్షి శర్మిష్ఠ;
 పురములో నొకనాఁడు ప్రొద్దుపోక
వేవురుబోటులు వెంటరా గురుసుత;
 యగు దేవయానితో నాట మరిగి
పూచిన యెలదోఁట పొంత జొంపముగొన్న;
 క్రొమ్మావి చేరువ కొలఁకుఁ జేరి
యందుఁ దుమ్మెలతేనె లాని చొక్కుచు మ్రోయు;
 నళుల ఝుంకృతులకు నదిరిపడుచు

9-514.1-ఆటవెలది

వలువ లూడ్చి కొలఁకు వడిఁ జొచ్చి తమలోన
బెల్లు రేఁగి నీటఁ జల్లులాడ
నందినెక్కి మౌళి నిందురోచులు పర్వ
శూలి వచ్చెఁ గొండచూలితోడ.

9-515-చంపకమాల

మలహరుఁ జూచి సిగ్గుపడి మానిను లందఱు సంభ్రమంబునన్
వలువలు గట్టుచో దనుజవల్లభుకూఁతురు దేవయాని దు
వ్వలువ ధరించి వేగమున వచ్చినఁ జూచి యెఱింగెఱింగి నా
వలు విది యెట్లు కట్టికొనివచ్చిన దానవు యంచుఁ దిట్టుచున్.

9-516-వచనము

దేవయాని యిట్లనియె.

9-517-శార్దూల విక్రీడితము

ఆ లోకేశుముఖంబునం గలిగె బ్రాహ్మణ్యంబు బ్రహ్మంబునా
మేలై వైదికమార్గముల్ దెలుపుచున్; మిన్నంది యందున్ మహా
శీలుర్ భార్గవు; లందు శుక్రుఁడు సుధీసేవ్యుండు; నే వానికిం
జూలన్ నా వలువెట్లు గట్టితివి రక్షోజాతవై చేటికా!

9-518-కంద పద్యము

మహిమవతులైన భూసుర
మహిళల విత్తమ్ములు పెఱమగువల కగునే?
మహిఁ బసిఁడిగొలుసు లిడినన్
విహితములే కుక్కలకు హవిర్భాగంబుల్?

9-519-కంద పద్యము

మీ తండ్రి మాకు శిష్యుఁడు
మా తండ్రి గురుండు గొంతమాత్రం బైనం
బ్రీతిం గావింపక పరి
భూతం జేయుదువె తులువ పోఁడిమిఁ జెనఁటీ!

9-520-వచనము

అని భర్జించుచున్న దేవయాని పలుకులు విని, కరాళించి, మ్రోగుచున్న భుజంగి చందంబున నిట్టూర్పులు నిగిడించి, పెదవులు గొఱుకుచు శర్మిష్ఠ యిట్లనియె.

9-521-శార్దూల విక్రీడితము

భిక్షుండై తమ తండ్రి మా జనకునిన్ భిక్షించినం దన్ను సం
రక్షింపం దుది నింత యై మఱపుతో రాజప్రసూనాకృతి
న్రక్షోరాజతనూజతో సుగుణతో నాతో సమం బాడెడిం
గుక్షిస్ఫోటముగాఁగ దీనిఁ జెలు లీ కూపంబునం ద్రోవరే.

9-522-వచనము

అని పలికి

9-523-ఆటవెలది

బోటిపిండుచేతఁ బోదువంగఁ బట్టించి
రాజసమున దైత్యరాజతనయ
దొడరి దేవయానిఁ ద్రోపించె వలు వీక
క్రుంకి నూతిలోనఁ గుతిలఁకొనఁగ.

9-524-వచనము

ఇట్లు చేసి శర్మిష్ఠ పోయిన వెనుక, యయాతిభూపాలుండు వేఁట మార్గంబున నడవిం దిరుగుచు, దైవయోగంబున నా దేవయాని యున్న నూయి జేరం జనుదెంచి యందు.

9-525-కంద పద్యము

బంధువుల నెల్లఁ జీరుచు
నంధు జలామగ్నన్న యై వగచుచు ని
ర్బంధమునఁ జిక్కి వ్రీడా

సింధువున మునింగి యున్న చేడియఁ గనియెన్.

## 9-34- దేవయాని యయాతివరించుట

9-526-వచనము

కనుంగొని

9-527-శార్దూల విక్రీడితము

సప్తాంభోనిధిమేఖలావృతమహాసర్వంసహాకన్యకా
ప్రాప్తోద్యద్వరదక్షదక్షిణకరప్రాలంబముం జేసి ప్రో
త్క్షిప్తం జేసె యయాతి గట్టుకొనఁ బై చేలంబు మున్నిచ్చి ప
ర్యాప్తస్వేదజలాంగి నాళిసముదాయస్వర్గవిన్ భార్గవిన్.

9-528-వచనము

ఇట్లు నూయి వెడలించిన రాజునకు రాజవదన యిట్లనియె.

9-529-మత్తేభ విక్రీడితము

ననుఁ బాణిగ్రహణం బొనర్చితికదా నా భర్తవున్ నీవ దై
వ నియోగం బిది తప్పదప్పురుషతా వాక్యంబు సిద్ధంబు సౌ
ఖ్యనివాసున్ నిను మాని యొండువరునిం గాంక్షింప నే నేర్తునే?
వనజం బానెడి తేఁటి యన్యకుసుమావాసం బపేక్షించునే?

9-530-వచనము

అదియునుం గాక.

9-531-సీస పద్యము

సుగుణాఢ్య! విను నేను శుక్రుని కూఁతుర;
దేవయానిని దొల్లి దేవమంత్రి
తనయుండు కచుఁడు మా తండ్రిచేత మృతసం;
జీవినిఁ దా నభ్యసించువేళ
నతనిఁ గామించిన నత డొల్ల ననవుడు;
నతఁడు నేర్చిన విద్య యడఁగి పోవ
నతని శపించిన నతఁడు నా భర్త బ్రా;
హ్మణుఁడు గాకుండెడు మని శపించె

9-531.1-తేటగీతి

నది నిమిత్తంబు నాకు బ్రాహ్మణుఁడు గాఁడు
ప్రాణనాథుఁడ వీ వని పడఁతి పలుకఁ
దనదు హృదయంబు నెలఁతపైఁ దగులుపడినఁ
దమక మొక యింతయును లేక తలఁచి చూచి.

9-532-మత్తకోకిలము

దైవయోగముగాక విప్రసుతన్ వరించునె నా మనం
బే విధంబున నీశ్వరాజ్ఞయు నిట్టి దంచు వరించె ధా
త్రీవరుండును దేవయానిని ధీరబుద్ధులకున్ మనో
భావ మొక్కటియే ప్రమాణ మభావ్యభావ్య పరీక్షకున్.

9-533-వచనము

ఇట్లు వరించి, యయాతి చనిన వెనుక దేవయాని శుక్రునికడకుం జని, శర్మిష్ఠ చేసిన వృత్తాంతం బంతయు జెప్పి కన్నీరుమున్నీరుగా వగచిన.

9-534-కంద పద్యము

క్రూరాత్ముల మందిరములఁ
బౌరోహిత్యంబు కంటె పాపం బీ సం
సారముకంటె శిలల్ దిని
యూరక కాపోతవృత్తి నుండుట యొప్పున్.

9-535-వచనము

అని వృషపర్వుకడ నుండుట నిందించుచు శుక్రుం డా కూఁతుం దోడ్కొని పురంబు వెడలి చన; నయ్యసురవల్లభుం డెఱింగి శుక్రుని వలనం దేవతల గెలువఁదలంచి తెరువున కడ్డంబువచ్చి, పాదంబులపైఁ బడి, ప్రార్థించి ప్రసన్నుం జేసిన, నా కోపంబు మాని శుక్రుండు శిష్యున కిట్లనియె.

9-536-తరళము

చెలులు వేవురుఁ దాను నీ సుత చేటికైవడి నా సుతం
గొలుచు చుండినఁ దీఱుఁ గోపము గొల్వఁ బెట్టెదవేని నీ
వెలఁదిఁ దోడ్కొని వత్తు నావుడు వేగ రమ్మని భార్గవిం
గొలువఁ బెట్టె సురారివర్యుఁడు గూఁతు నెచ్చెలిపిండుతోన్.

9-537-మత్తేభ విక్రీడితము

చలమింకేలని తన్నుఁ దండ్రి పనుపన్ శర్మిష్ఠ సన్నిష్ఠతో
జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబున్న జస్రంబుఁ ద
న్నలమన్ దాసి సుదాసి యయ్యెఁ బగవాయన్ భూరికోపానలా
కలితగ్లానికి దేవయానికి మహాగర్వోద్యమస్థానికిన్.

9-538-వచనము

అంత.

9-539-ఉత్పలమాల

ఆతతమైన వేడ్కఁ దనుజాధిపమంత్రి సురారినందనో
పేతఁ దనూభవం బిలిచి పెండ్లి యొనర్చె మహావిభూతికిం
బ్రీతి మహోగ్రజాతికి నభీతికి సాధువినీతికిన్ సిత
ఖ్యాతికి భిన్నదుఃఖబహుకార్యభియాతికి నయ్యయాతికిన్.

9-540-వచనము

ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి శుక్రుండు శర్మిష్ఠాసంగమంబు చేయకు మని యతని నియమించి పనిచె; పిదప దేవయానియు న య్యయాతివలన యదు తుర్వసులను కుమారులం గనియెను; ఒక్క రేయి చెఱంగుమాసి, దేవయాని వెలుపలనున్నయెడ శర్మిష్ఠ యెడరు వేచి యేకాంతంబున యయాతి కడకుం జని, చెఱకువింటి జోదు పువ్వుటంపఱ కోహటించి తన తలంపు జెప్పెన.

## 9-35- యయాతి శాపము

9-541-ఉత్పలమాల

ఆ జవరాలిఁ జూచి మన మాఁపగ లేక మనోభవార్తుఁడై
యా జనభర్త మున్ను కవి యాడిన మాట దలంచి యైనఁ జే
తోజసుఖంబులం దనిపెఁ ద్రోవఁగవచ్చునె దైవయోగముల్
రాజఁట సద్రహస్యమఁట రాజకుమారిని మాన నేర్చునే?

9-542-వచనము

ఇట్లు యయాతివలన శర్మిష్ఠ గర్భంబై క్రమంబున ద్రుహ్యుండు, ననువుఁ, బూరువు నన ముగ్గురు తనయులం గాంచె; నంత దేవ యాని తద్వృత్తాంతంబంతయు నెఱింగి, కోపించి, శుక్రుకడకుం జని క్రోధమూర్ఛిత యై యున్న సమయంబున యయాతి వెంట జని, యిట్లనియె.

9-543-ఆటవెలది

మామకేల చెప్ప మాను సరోజాక్షి
దనుజతనయఁ బొంది తప్పుపడితిఁ
గామినయిన నన్నుఁ గరుణింపు పతిమాట
తండ్రిమాటకంటెఁ దగును సతికి.

9-544-వచనము

అని పలికి పాదంబుల కెఱఁగిన నయ్యింతి యొడంబడక యుండె; నంత నది యెఱింగి శుక్రుం డిట్లనియె.

9-545-కంద పద్యము

నామాటఁ ద్రోచి దానవ
భామను బొందితివి ధరణిపాలక! తగవే?
యేమాట యేది రూపము
కాముకులకు లోలుపులకుఁ గలవే నిజముల్.

9-546-వచనము

అని పలికి "నిన్ను వనితాజనహేయంబయిన ముదిమి పొందెడు" మని శపియించిన యయాతి యిట్లనియె.

9-547-కంద పద్యము

మామా నా పైఁ గోపము
మామా నీ పుత్రియందు మానవు నాకుం
గామోపభోగవాంఛలు
ప్రేమన్ రమియించి ముదిమిఁ బిదపం దాల్తున్.

9-548-వచనము

అని పలికి యనుజ్ఞగొని, దేవయానిందోడ్కొని పురంబునకుం జని, పెద్దకొడుకగు యదువుం బిలిచి యయాతి యిట్లనియె.

9-549-శార్దూల విక్రీడితము

నీ తల్లిం గనినట్టి శుక్రువలనన్ నేఁడీ జరంబొందితిన్;
నా తండ్రీ యదునామధేయ! తనయా! నా వృద్ధతం దాల్పవే;
నీ తారుణ్యము నాకు నీవె; తనివో నిండార గొన్నాళ్ళు నేఁ
జేతోజాతసుఖంబులం దిరిగెదన్ శృంగారినై పుత్రకా!

9-550-వచనము

అనిన విని తండ్రికి యదుండిట్లనియె.

9-551-శార్దూల విక్రీడితము

కాంతాహేయము దుర్వికారము దురాకండూతి మిశ్రంబు హృ
చ్చింతామూలము పీనసాన్వితము ప్రస్వేదవ్రణాకంపన
శ్రాంతిస్ఫోటకయుక్త మీ ముదిమి వాంఛం దాల్చి నానాసుఖ
ప్రాంతంబైన వయోనిధానమిది యయ్యా! తేర యీ వచ్చునే?

## 9-36- పూరువు వృత్తాంతము

9-552-వచనము

అని యదుం డొడంబడకున్న యయాతి దుర్వసు ద్రుహ్యాదుల నడిగిన వారును యదువు పలికినట్ల పలికినఁ గడగొట్టు కుమారుండైన పూరువున కిట్లనియె.

9-553-ఉత్పలమాల

పిన్నవుగాని నీవు కడుఁబెద్దవు బుద్ధుల యందు రమ్ము నా
యన్న! మదాజ్ఞ దాఁటవుగ దన్న! వినీతుఁడ వన్న! నీవు నీ
యన్నలు చెప్పినట్లు పరిహారము చెప్పకు మన్న! నా జరన్
మన్నన దాల్చి నీ తరుణిమం బొనగూర్చుము నాకుఁ బుత్రకా!

9-554-వచనము

అనిన విని గురుభక్తిగుణాధారుండయిన పూరుం డిట్లనియె.

9-555-శార్దూల విక్రీడితము

అయ్యా నన్నిటు వేఁడనేల? భవదీయాజ్ఞాసముల్లంఘనం
బయ్యుండం బరిహారమున్నుడువ నే నన్యాయినే? నీ జరన్
నెయ్యం బొప్పఁగఁ దాల్చి, నా తరుణిమన్ నీకిచ్చెదం, బంపినం
గయ్యం బాడెడి పుత్రకుండు క్రిమిసంకాశుండు గాకుండునే?

9-556-వచనము

అదియునుం గాక.

9-557-కంద పద్యము

మునివృత్తి డయ్యె నేఁటికి
జనపాలక! సుగతిఁ గోరు సత్పురుషులకుం
దనుఁ గన్న తండ్రిఁజెప్పిన
పని చేసిన సుగతి గొంగుపసిఁడియ కాదే?

9-558-కంద పద్యము

పనుపక చేయుదు రధికులు
పనిచిన మధ్యములు పొందుపఱతురు తండ్రుల్
పని చెప్ప కోరి పనిచిన
ననిశము మాఱాడు పుత్రు లధములు దండ్రీ!

9-559-వచనము

అని పలికి పూరుండు ముదిమి చేకొని తన లేబ్రాయంబు యయాతి కిచ్చెను; అ య్యయాతియుం దరుణుండై.

9-560-శార్దూల విక్రీడితము

ఏడా ద్వీపము లేడు వాడలుగ సర్వేలాతలంబెల్లఁ బె
న్వీడై పోఁడిమి నేలుచుం బ్రజల నన్వేషించి రక్షించుచుం
దోడన్ భార్గవి రా మనోజసుఖసంతోషంబులం దేలుచుం
గ్రీడించెన్ నియతేంద్రియుం డగుచు నా క్రీడాతిరేకంబులన్.

9-561-కంద పద్యము

మర్మంబుల నతిసాధ్వి
ధర్మంబుల దేవయాని దన ప్రాణేశున్

నర్మముల మనోవాక్తను
కర్మంబుల నొండులేక కడు మెప్పించెన్.

9-562-శార్దూల విక్రీడితము

ఆకాశంబున మేఘబృందము ఘనంబై సన్నమై దీర్ఘమై
యేకంబై బహురూపమై యడఁగు నట్లేదేవుగర్భంబులో
లోకశ్రేణి జనించుచున్ మెలఁగుచున్ లోపించు నా దేవు సు
శ్రీకాంతున్ హరిఁగూర్చి యాగములు చేసెన్ నాహుషుం డిమ్ములన్.

9-563-వచనము

మఱియును.

9-564-ఉత్పలమాల

చెలికాండ్రం గరులన్ రథమ్ముల భటశ్రేణిం దురంగంబులం
గలలోఁగన్న ధనావళిన్ సమములంగాఁ జూచుచున్ భార్యతో
బలు వేలేండ్లు మనోజభోగలహరీపర్యాప్తుఁడై తేలియున్
బలుతృష్ణం గడఁగాన కెంతయు మహాబంధంబులన్ స్రుక్కుచున్.

## 9-37- యయాతి బస్తోపాఖ్యానము

9-565-వచనము

ఒక్క దినంబున నాత్మజ్ఞానంబునంజేసి కాంతానిమిత్తంబున మోసపోవుట యెఱింగి యయాతి యతివిషాదంబునొంది దేవయాని కిట్లనియె.

9-566-కంద పద్యము

మన చారిత్రమువంటిది

విను మితిహాసంబు గలదు; వృద్ధజనములున్
మునులును మెత్తురు; నీవును
మనమున నంగీకరింపు మంజులవాణీ!

9-567-వచనము

అది యెట్టిదనిన.

9-568-సీస పద్యము

అజ మొకం డడవిలో నరుగుచుం దాఁ గర్మ;
ఫలమున నూతిలోపలికి జాఱి
లోఁగెడి ఛాగి నాలోకించి కామి యై;
కొమ్మున దరిఁ గొంత గూలఁ ద్రోచి
వెడలింపనచ్చాగి విభునిఁగాఁ గోరిన;
నగుఁగాక యని తాను నదియుఁ దిరుగ
నెన్నియేనిని దన్ను నెంత కామించిన;
నన్నిటికిని భర్త యై తనర్చి

9-568.1-తేటగీతి

వాని నే ప్రొద్దు రతులకు వశలఁ జేసి
సౌరిదిఁ గ్రీడించి క్రీడించి చొక్కిచొక్కి
కాముఁ డనియెడి దుస్స్వహగ్రహముకతన
జిత్త మేమఱి మత్తిల్లి చెల్లఁ జిక్కి .

9-569-కంద పద్యము

వెడ విలుతుకేళిఁ జిగురా
కడిదపు ప్రేటునకు లోఁగి యతి మోహితుఁడై
విడువక సతులం దగిలెడు
జడునకు నెక్కడివి బుద్ధిచాతుర్యంబుల్?

9-570-వచనము

అంత నచ్ఛాగంబు దన పిదపం దగిలిన ఛాగినీనివహంబు లోపలం జూడనొప్పెడి ఛాగి యందుఁ దగిలి క్రీడింపం గని, నూతిలోపలంబడి వెలువడిన ఛాగి, తన పతివలని నెయ్యంబు లేకుండుటకు విన్ననై తన మనంబున.

9-571-కంద పద్యము

పలికినఁ బలుకులు పలుకఁడు
కలఁచున్ నవకాంతఁ జూచి కడు సంచలుఁడై
నిలిచిన చోటన్ నిలువఁడు
నిలువెల్లను గల్ల కామి నిజమరి గలఁడే.

9-572-వచనము

అని పలికి విడిచి చనిన నయ్యజవల్లభుండు సురతపరతంత్రుండై, మిసిమిసి యను శబ్దంబుచేయుచుఁ, దచ్ఛాగి వెంటంజని, యొడంబఱుపంజాలకుండె; నంత దానికిఁ గర్త యైన బ్రాహ్మణుండు రోషంబున రతిసమర్థంబు గాకుండ నల్లాడుచుండ ఛాగవృషణంబులు ద్రెంచివేసిన, నచ్ఛాగంబు గ్రిందఁబడి వేడుకొనినఁ, బ్రయోజనంబు వొడగని యోగవిదుండు గావున బ్రాహ్మణోత్తముండు గ్రమ్మఱ నయ్యజవృషణంబులు సంధించిన.

9-573-కంద పద్యము

వృషణములు మరలఁ గలిగిన
సుషముండై ధాగవిభుఁడు సుందరితోడన్
విషయసుఖంబులఁ బొందుచుఁ
దృష తుదిఁ గనఁ డయ్యెఁ బెక్కు దివసము లయ్యున్.

9-574-వచనము

అని యివ్విధంబున యయాతి దేవయానికి నిజవృత్తాంతంబు గథారూపంబున నెఱింగించి యిట్లనియె.

9-575-మత్తేభ విక్రీడితము

అబలా! నీ నిబిడాతిదుర్జయ సలజ్జాపాంగభల్లంబులం
బ్రబలంబైన మనంబు భగ్నముగ నా ప్రావీణ్యముం గోలుపో
యి బలిష్ఠుండగు కాముబారిఁ బడి నే నెట్లోర్తునే బందిక
త్తె బడిం బాపపుఁ దృష్ణ యిప్పు డకటా! దీర్ఘాకృతిన్ రొప్పెడిన్.

9-576-కంద పద్యము

అదలదు ప్రాణము లదలినఁ
గదలదు సర్వాంగకములుఁ గదలుచు నుండన్
వదలదు బిగువులు వదలినఁ
దుదిలే దీ తృష్ణ దీనిఁ ద్రుంపఁగవలయున్.

9-577-కంద పద్యము

వెయ్యేం డ్లయ్యెను నీతోఁ

గ్రయ్యంబడి యున్న వాఁడఁ గామసుఖములం
గ్రుయ్య దొక యించుకైన
న్డయ్యదు కొనలిడియెఁ దృష్ణ నవపద్మముఖీ!

9-578-కంద పద్యము

ముదిసెను దంతావళియును
ముదిసెను గేశములు దనువు ముదిసెం దనకున్
ముదియ నివి రెండు చిక్కెను
బ్రదికెడి తీపియును విషయపక్షస్పృహయున్.

9-579-కంద పద్యము

కడలే దాశాలతకుం
గడఁ జూడఁగఁ గానరాదు కడఁ గనిరేనిన్
గడు ముదమున సంసారము
గడఁ గందురు తత్త్వవిదులు గమలదళాక్షీ!

9-580-కంద పద్యము

మండన హాటక పశు వే
దండాశ్వ వధూ దుకూల ధాన్యాదులు పె
క్కుండియు నాశాపాశము
ఖండింపఁగ లేవు మఱియుఁ గడమయ చుమ్మీ.

9-581-కంద పద్యము

కామోపభోగసుఖములు

పేమాఱును బురుషుఁ డనుభవించుచు నున్నం
గామంబు శాంతిఁ బొందదు
ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ ద్రుంగుడు పడునే?

9-582-ఆటవెలది

అక్క తల్లి చెల్ల లాత్మజ యెక్కిన
పాను పెక్కఁ జనదు పద్మనయన!
పరమయోగికైన బలిమిని నింద్రియ
గ్రామ మధికపీడఁ గలుగఁ జేయు.

9-583-కంద పద్యము

వెంగలివిత్తయి తిరుగుచుఁ
గంగారై చెడక ముక్తిఁ గాంక్షించు నతం
డంగనలతోడ విడువని
సంగడములు వదలవలయు జలజాతముఖీ!

9-584-వచనము

అదిగావున నేఁడు మొదలు తృష్ణాఖండనంబు చేసి, నిర్విషయుండనయి, యహంకారంబు విడిచి, మృగంబులం గలసి, వనంబున సంచరించెద; పరబ్రహ్మంబునందుఁ జిత్తంబుజేర్చెద బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశానివారిణి యగుటం జేసి యే నందుఁ దత్పరుండనై యాహారనిద్రాదియోగంబులం బరిహరించెద నాత్మవిదుండనై సంసార నాశంబులఁ దలంచినవాఁడె విద్వాంసుఁ” డని పలికి, పూరుని యౌవనం బతని కిచ్చి ముదిమి దాను గైకొని విగతలోభుండై, నిజ భుజ శక్తిపాలితం బగు భూమండలంబు విభాగించి,

ద్రుహ్యునకుఁ బూర్వభాగంబును, యదువునకు దక్షిణభాగంబును, దుర్వసునకుఁ బశ్చిమదిగ్భాగంబును, ననువునకు నుత్తరదిగ్భాగంబును సంరక్షింపుండని యిచ్చి వారల సమక్షంబున.

9-585-కంద పద్యము

నాలుగుచెఱగుల నేలయుఁ
బాలింపుం డనుచు నగ్రభవులను బంచెన్
భూలోక మేలు మనుచును
బాలార్కోదారుఁ బూరుఁ బట్టము గట్టెన్.

9-586-వచనము

ఇట్లు పూరునికి రాజ్యంబిచ్చి పెక్కువర్షంబులందు ననుభూతంబు లయిన యింద్రియసుఖంబులు వర్జించి.

9-587-కంద పద్యము

మిక్కలి సుజ్ఞానంబునఁ
జక్కగఁ దెగనడచి వైరిషడ్వర్గంబున్
ఱెక్కలు వచ్చిన విహగము
గ్రక్కున నీడంబు విడుచు కరణి నుదితుఁడై.

9-588-కంద పద్యము

కారుణికోత్తముఁడగు హరి
కారుణ్యముకతన నతఁడు ఘనుఁడై గెలిచెం
గ్రూరములగు విషయంబుల

నూరక గెలువంగ శక్తుఁ డొక్కఁడు గలఁడే?

9-589-వచనము

మఱియు నిర్మూలితసకలసంగుండై సత్త్వరజస్తమోగుణంబుల దిగనాడి నిర్మలంబయి, పరమంబయిన వాసుదేవాభిధానబ్రహ్మంబునందు యయాతిభూపాలుండు స్వతస్సిద్ధయయిన భాగవతగతిం జెందెను; అంత.

9-590-సీస పద్యము

ప్రాణేశుఁ డాడిన పలుకులు నగవులు;
 గాఁ జూడ కంతరంగమున నిలిపి
పథికులై పోవుచుఁ బానీయశాలలఁ;
 జల్లగా నుండెడి జనుల యట్ల
సంసారమునఁ గర్మసంబంధులై వచ్చి;
 యాలు బిడ్డలు మగం డనుచుఁ గూడి
యుండుట గాని సంయోగంబు నిత్యంబు;
 గా దీశమాయాప్రకల్పితంబు

9-590.1-తేటగీతి

దీని విడుచుట దగ వని తెగువ మెఱసి
నిద్రచాలించి మేల్కొన్న నేర్పు చాల
గలిగి భార్గవి సర్వసంగముల విడిచి
హరిపరాధీన యై ముక్తి కరిగె నధిప!

9-591-వచనము

అని యిట్లు యయాతిచరితంబు చెప్పి "భగవంతుండును సర్వభూతనివాసుండును, శాంతుండును, వేదమయుండును నైన వాసుదేవునికి నమస్కరించెద" నని శుకుం డిట్లనియె.

## 9-38- పూరుని చరిత్ర

### 9-592-కంద పద్యము

భారత! నీవు జనించిన
పూరుని వంశంబునందుఁ బుట్టినవారిం
జారు యశోలంకారుల
ధీరుల వినిపింతు నధిక తేజోధనులన్.

### 9-593-వచనము

పూరునకు జనమేజయుండు, జనమేజయునకుఁ బ్రాచీన్వాంసుండు, నా ప్రాచీన్వాంసునకుఁ బ్రవిరోధనమన్యువు, నతనికిఁ జారువుఁ బుట్టె; రా చారువునకు సుద్యువు, సుద్యువునకు బహుగతుండును, బహుగతునకు శర్యాతియు, శర్యాతికి సంయాతియు, సంయాతికి రౌద్రాశ్వుండును, రౌద్రాశ్వునకు ఘృతాచి యను నచ్చరలేమ యందు ఋతేపువుఁ, గక్షేపువు, స్థలేపువుఁ, గృతేపువు, జలేపువు, సన్నతేపువు, సత్యేపువు, ధర్మేపువు, వ్రతేపువు, వనేపువు నను వారు జగదాత్మభూతుండైన ప్రాణునకు నింద్రియంబుల చందంబునఁ బదుగురు గొడుకులు జన్మించి; రందు ఋతేపువునకు నంతిసారుండును, నంతిసారునకు సుమతియు, ధ్రువుండు, నప్రతిరథుండునన ముువ్వురు పుట్టి; రందు నప్రతిరథునికిఁ గణ్వుండును,

గణ్వునికి మేధాతిథియు, నతనికి బ్రస్కందుండు మొదలగు బ్రాహ్మణులును జన్మించి; రా సుమతికి రైభ్యుండు పుట్టె; రైభ్యునకు దుష్యంతుడు పుట్టె.

## 9-39- దుష్యంతుని చరిత్రము

9-594-కంద పద్యము

పారావారపరీతో
దార ధరాభారదక్ష దక్షిణహస్త
శ్రీ రాజిల్లఁగ నొకనాఁ
డా రాజేంద్రుండు వేఁటయం దభిరతుఁడై.

9-595-కంద పద్యము

గండక కంఠీరవ భే
రుండ శశవ్యాళ కోల రోహిష రురు వే
దండవ్యాఘ్ర మృగాదన
చండ శరభ శల్య భల్ల చమరాటవులన్.

9-596-కంద పద్యము

చప్పుడు చేయుచు మృగముల
రొప్పుచు నీరముల యందు రోయుచు వలలం
ద్రిప్పుకొని పడఁగఁ బోవుచుఁ
దప్పక వ్రేయుచును వేఁటతమకం బొప్పన్.

9-597-కంద పద్యము

మృగయూథంబుల వెంటను

మృగలాంఛన సన్నిభుండు మృగయాతురుఁడై
మృగయులు గొందఱు గొలువఁగ
మృగరాజపరాక్రమంబు మెఱయఁగ వచ్చెన్.

9-598-వచనము

ఇట్లు వచ్చివచ్చి దైవయోగంబునఁ గణ్వమహాముని తపోవనంబు చేరం జని.

9-599-సీస పద్యము

ఉరుతర శ్రాంతాహి యుగళంబులకుఁ బింఛ;
ములు విసరెడి కేకిముఖ్యములను
గరుణతో మదయుక్త కలభంబులకు మేఁత;
లిడుచు ముద్దాడు మృగేంద్రములును
ఘనమృగాదనములు గాపుగా లేళ్ళతో;
రతులు సాగించు సారంగములను
నునుపుగా హోమధేనువుల కంఠంబులు;
దువ్వుచు నాడు శార్దూలములను

9-599.1-తేటగీతి

దార కలహించు నుందురు దంపతులకు
మైత్రి నంకించు మార్జాలమల్లములను
మతిని జాతివైరంబులు మాని యిట్లు
గలసి క్రీడించు మృగములఁ గాంచె నతఁడు.

9-600-కంద పద్యము

ఇత్తెఱఁగున మృగజాతుల
పొత్తులు మే మెఱుఁగ మనుచు భూవల్లభుఁడుం
జిత్తములోపల నా ముని
సత్తము సద్వృత్తమునకు సంతసపడుచున్.

9-601-కంద పద్యము

హల్లక బిసురుహ సరసీ
కల్లోలోత్ఫుల్ల యూథికా గిరిమల్లీ
మల్లీ మరువక కురువక
సల్లలితానిలమువలన సంతుష్టుండై

9-602-వచనము

దుష్యంతుండు వచ్చు నవసరంబున.

9-603-కంద పద్యము

ఇందిందిరాతిసుందరి
యిందిందిరచికుర యున్న దిందింద; శుభం
బిం దిందువంశ; యను క్రియ
నిందీవరవీథి మ్రోసె నిందిందిరముల్.

9-604-కంద పద్యము

మా కందర్పుని శరములు
మాకందము లగుటఁ జేసి మా కందంబుల్
మాకందము లను కైవడి

మాకందాగ్రములఁ బికసమాజము లులిసెన్.

9-605-వచనము

అంత.

9-606-కంద పద్యము

ఇందున్న కణ్వమునికిని
వందన మొనరించి తిరిగి వచ్చెద ననుచుం
బొందుగ ననుచరులను దా
నందఱ నందంద నిలిపి యటఁ జని ప్రైలన్.

9-607-శార్దూల విక్రీడితము

ఆ కణ్వాశ్రమమందు నీరజనివాసాంతప్రదేశంబులన్
మాకందంబులనీడఁ గల్పలతికా మధ్యంబులన్ మంజు రం
భాకాండాంచితశాలలోఁ గుసుమ సంపన్నస్థలిం జూచె నా
భూకాంతుండు శకుంతలన్ నవనటద్భ్రూపర్యటత్కుంతలన్.

9-608-కంద పద్యము

దట్టపుఁ దుఱుమును మీఁదికి
మిట్టించిన చన్నుఁగవయు మిఱుమిఱు చూడ్కుల్
నట్టాడునడుముఁ దేనియ
లుట్టెడు మోవియును మనము నూరింపంగన్.

9-609-వచనము

అంతనా రాజకుమారుం డలరుటమ్ముల విలుకాని వెడవింట ఘణఘణాయమానలయి ప్రోయు ఘంటలకుం బంటించి, తన మనంబున.

9-610-శార్దూల విక్రీడితము

వన్యాహారములన్ జితేంద్రియత నావాసించు నా కణ్వుఁ డీ
కన్యారత్నము నే గతిం గనియెడిం; గా దీ కురంగాక్షి రా
జన్యాపత్యముగాఁగనోపు; నభిలాషం బయ్యెఁ; గాదేని నే
యన్యాయక్రియలందుఁ బౌరవుల కెం దాశించునే చిత్తముల్?

9-611-కంద పద్యము

అడిగిన నృపసుతుఁ గానని
నొడివెడినో యిది మనంబు నొవ్వ నని విభుం
డుడురాజవదన నడుగక
తడుమన యొక కొంత ప్రొద్దు దడఁబడ జొచ్చెన్.

9-612-వచనము

మఱియు నెట్టకేలకుఁ దన చిత్తసంచారంబు సత్యంబుగాఁ దలంచి యిట్లనియె.

9-613-కంద పద్యము

భూపాలక కన్యక వని
నీ పయిఁ జిత్తంబు నాఁటె; నీవా రేరీ?
నీ పేరెవ్వరు? నిర్జన
భూపర్యటనంబు దగవె? పూర్ణేందుముఖీ!

9-614-వచనము

అని పలుకుచున్న రాజకుమారుని వదనచంద్రికారసంబు నేత్ర చకోరంబులవలనం ద్రావుచు, నయ్యువిద విభ్రాంతయై యున్న సమయంబున.

9-615-కంద పద్యము

కంతేకాలునిచేతం
గుంఠితుఁడగు టెట్లు మరుఁడు? కుసుమాస్త్రంబుల్
లుంఠించి గుణనినాదము
ఠంఠమ్మన బాల నేసె ఠవఠవ గదురన్.

9-616-వచనము

ఇట్లు వలరాచవాని క్రొవ్విరికోలలవేఁడిమిఁ దాలిమిపోఁడిమి చెడి, యా వాలుఁగంటి యిట్లనియె.

9-617-మత్తేభ విక్రీడితము

అనివార్యప్రభ మున్ను మేనకయు విశ్వామిత్రభూభర్తయుం
గని; రా మేనక డించిపోయెనడవిం; గణ్వుండు నన్నింతగా
మనిచెన్; సర్వము నామునీంద్రుఁ డెఱుఁగున్; మద్భాగధేయంబునన్
నినుఁగంటిం బిదపం గృతార్థ నగుచున్ నేఁడీ వనాంతంబునన్.

9-618-కంద పద్యము

నీ వారము ప్రజలేమును
నీవారము పూజగొనుము నిలువుము నీవున్
నీవారును మా యింటను
నీవారాన్నంబుగొనుఁడు నేఁడు నరేంద్రా!

9-619-వచనము

అని పలికిన, దుష్యంతుండు మెచ్చి, మచ్చెకంటి యిచ్చ యెఱింగి యిట్లనియె.

9-620-ఆటవెలది

రాజతనయ వగుదు రాజీవదళనేత్ర!
మాట నిజము లోనిమాటలేదు
తనకు సదృశుఁడయిన తరుణునిఁ గైకొంట
రాజసుతకుఁ దగవు రాజవదన!

9-621-వచనము

అని మఱియుఁ దియ్యని నెయ్యంపుం బలుకులవలన నయ్యువిద నియ్యకొలిపి.

9-622-కంద పద్యము

బంధురయశుఁడు జగన్నుత
సంధుఁడు దుష్యంతుఁ డుచిత సమయజ్ఞుండై
గంధగజగమన నప్పుడు
గాంధర్వవిధిన్ వరించె గహనాంతమునన్.

## 9-40- భరతుని చరిత్ర

9-623-వచనము

ఇవ్విధంబున నమోఘవీర్యుండగు నా రాచపట్టి, దపసిరాచూలికిఁ జూలు నెక్కొలిపి, మఱునాఁడు తన వీటికిం జనియె; నయ్యింతియుఁ గొంతకాలంబునకుఁ గొడుకుం గనినఁ గణ్వమునీంద్రుం డా రాచపట్టికి జాతకర్మాది మంగళాచారంబు

లొనర్చె; నా డింభకుండును దినదినంబునకు బాలచంద్రుఁడునుం బోలె నెదుగుచు.

9-624-కంద పద్యము

కుంఠితుఁడుగాక వాఁడు
త్కంఠం దన పిన్ననాఁడె కణ్వవనచర
త్కంఠీరవ ముఖ్యంబుల
కంఠములం బట్టి యడుచుఁ; గట్టున్; విడుచున్.

9-625-వచనము

అంత నా కణ్వమునీంద్రుండు బాలకుం జూచి శకుంతల కిట్లనియె.

9-626-ఉత్పలమాల

పట్టపురాజు నీ మగఁడు; పాపఁడు నన్నిట నెక్కు డంతకుం;
బట్టపుదేవిపై గఱువ బాగున నుండక పాఱువారితో
గట్టువనంబులో నవయఁగాఁ బనిలే దిటఁ దర్లిపోఁగదే
పుట్టిన యిండ్ల మానినులు పోరచిగా ననిశంబు నుందురే?

9-627-వచనము

అనిన నియ్యకొని.

9-628-కంద పద్యము

ఆ పిన్నవాని నతుల
వ్యాపారు నుదారు వైష్ణవాంశోద్భవునిం
జూపెద నంచు శకుంతల

భూపాలునికడకు వచ్చెఁ బుత్రుని గొనుచున్.

9-629-వచనము

వచ్చి దుష్యంతుండున్న సభామండపంబునకుం జని నిలిచి యున్న యెడ.

9-630-మత్తేభ విక్రీడితము

వల కేలన్ గురుచక్రరేఖయుఁ బదద్వంద్వంబునం బద్మరే
ఖలు నొప్పారఁగ నందు వచ్చిన రమాకాంతుండు నాఁ గాంతి న
గ్గలమై యున్న కుమారు మారసదృశాకారున్ విలోకించి తాఁ
బలుకం డయ్యె విభం డెఱింగి సతి విభ్రాంతాత్మ యై యుండగన్.

9-631-వచనము

ఆ సమయంబున.

9-632-మత్తేభ విక్రీడితము

అదె నీ వల్లభ; వాఁడు నీ సుతుఁడు; భార్యాపుత్రులం బాత్రులన్
వదలంగా; దలనాఁటి కణ్వవనికా వైవాహికారంభముల్
మది నూహింపు; శకుంతలావచనముల్ మాన్యంబుగా భూవరేం
ద్ర! దయం జేకొనుమంచు మ్రోసెను వియద్వాణీవధూవాక్యముల్.

9-633-వచనము

ఇట్లశరీరవాణి సర్వభూతంబులకుఁ దేటపడ భరింపు మని పలికిన, నా కుమారుండు భరతుండయ్యెఁ; నంత నా రాజు రాజవదన నంగీకరించి తనూభవుం జేకొని కొంతకాలంబు రాజ్యంబుజేసి పరలోకంబునకుం జనియె; తదనంతరంబ.

9-634-కంద పద్యము

రెండవహరి క్రియ ధరణీ
మండలభారంబు నిజసమంచితబాహా
దండమున నిలిపి తనకును
భండనమున నెదురులేక భరతుం డొప్పెన్.

9-635-వచనము

మఱియునా దౌష్యంతి, యమునాతటంబున దీర్ఘతపుండు పురోహితుండుగా డెబ్బదియెనిమిదియును, గంగాతీరంబున నేఁబది యయిదును, నిట్లు నూటముప్పదిమూఁడశ్వమేధయాగంబులు సదక్షిణంబులుగా నొనర్చి; దేవేంద్రవిభవంబున నతిశయించి, పదుమూఁడువేలునెనుబదినాలుగు కదుపుధేనువులుగలయది ద్వంద్వంబనం బరఁగు, నట్టి వేయి ద్వంద్వంబుల పాఁడిమొదవులఁ గ్రేపులతోడ నలంకారసహితలం జేసి వేవురు బ్రాహ్మణుల కిచ్చి, మష్కార తీర్థకూలంబున విప్రముఖ్యులకుఁ బుణ్యదినంబున గనక భూషణ శోభితంబులయి ధవళదంతంబులు గల నల్లని యేనుంగులం బదునాలుగులక్షల నొసంగె; దిగ్విజయకాలంబున శక, శబర, బర్బర, కష, కిరాతక, హూణ, మ్లేచ్ఛ దేశంబుల రాజులఁ బీచంబడంచి, రసాతలంబున రాక్షస కారాగృహంబులందున్న వేల్పుల గరితలం బెక్కండ్ర విడిపించి తెచ్చి, వారల వల్లభులం గూర్చె; త్రిపురదానవుల జయిచి; నిర్జరుల నిజమందిరంబుల నునిచె; నతని రాజ్యంబున గగన ధరణీతలంబులు ప్రజలుగోరిన కోరిక లిచ్చుచుండె; నివ్విధంబున.

9-636-ఆటవెలది

సత్యచరితమందుఁ జలమందు బలమందు

భాగ్యమందు లోకపతులకంటె
నెక్కుడైన పేర్మి నిరువదియేడువే
లేండ్లు ధరణి భరతుఁ డేలె నధిప!

9-637-కంద పద్యము

అర్థపతికంటెఁ గలిమిఁ గృ
తార్థుండై యతుల శౌర్య మలవడియు నతం
డర్థములను బ్రాణములను
వ్యర్థము లని తలఁచి శాంతుఁ డయ్యె నరేంద్రా!

9-638-కంద పద్యము

భరతుని భార్యలు ముచ్చురు
వరుసం బుత్రకులఁ గాంచి వల్లభుతోడన్
సరిగారని తోడ్తోడను
శిరములు దునుమాడి రాత్మ శిశువుల నధిపా!

9-639-వచనము

ఇట్లు విదర్భరాజపుత్రికలు శిశువులం జంపిన భరతుం డపుత్రకుండై మరుత్
స్తోమంబను యాగంబు పుత్రార్థియై చేసి, దేవతల మెప్పించెను;
అయ్యవసరంబున.

9-640-సీస పద్యము

అన్న యిల్లాలిఁ జూలాలిని మమతాఖ్యఁ;
 జూచి బృహస్పతి సురతమునకుఁ

దొరఁకొని పైబడ్డఁ దొల్లి గర్భంబున;
 నున్న బాలుఁడు భయం బొదవి వలదు
తగదని మొఱజేయఁదమకంబుతో వాని;
 నంధుండ వగుమన్న నలిగి వాఁడు
యోనిలోపలి వీర్య మూడఁ దన్నిన నేలఁ;
 బడి బిడ్డఁడై యున్నఁ బాయ లేక

9-640.1-ఆటవెలది

నితని పెంపు; కొడుకు లిరువురు జన్మించి
రనుచు వెలయఁ జేయు మనిన మమతఁ
బెంపఁజాల; నీవ పెంపు; భరింపు; మీ
ద్వాజు ననుచుఁ జనియె దాని విడిచి.

9-641-వచనము

ఇట్లు చథ్యుని భార్య యగు మమతయు బృహస్పతియు శిశువుం గని, ద్వాజుండైన వీని నీవ నీవ భరింపుమని, వదినె మఱఁదులు దమలో నొండొరువులం బలికిన కారణంబున వాఁడు భరద్వాజుండయ్యె; గర్భస్థుండయిన వాఁడు బృహస్పతి శాపంబున దీర్ఘతముండయ్యె; నంత నా బృహస్పతియు మమతయు నుదయించిన వాని విడిచి నిజేచ్ఛం జనిన, మరుత్తులు వానిం బోషించి పుత్రార్థి యయిన భరతున కిచ్చిరి; భరతుండు వానిం జేకొనియె; వితథంబయిన భరతవంశంబునకు నా భరద్వాజుండు వంశకర్త యగుటం జేసి వితథుండనం బరఁగె నా వితథునికి మన్యువు, మన్యువునకు బృహత్క్షత్త్ర జయ

మహావీర్య నర గర్గు లను వారేవురు సంభవించి; రందు నరునికి సంకృతి, సంకృతికి గురుండు, రంతిదేవుం డన నిరువురు జన్మించిరి; అందు.

## 9-41- రంతిదేవుని చరిత్రము

9-642-సీస పద్యము

రాజవంశోత్తమ! రంతిదేవుని కీర్తి;
 యేల చెప్పఁగ? విను మిందు నందు
నా రాజు దన సంచితార్థంబు లన్నియు;
 నెడపక దీనుల కిచ్చియిచ్చి
సకుటుంబుఁడై ధైర్యసంయుతుండై పేద;
 యై కూడు నీరులే కధమవృత్తి
నెందేని నలువదియెనిమిది దివసముల్;
 చరియింప నొకదివసంబు రేపు

9-642.1-ఆటవెలది

నెయ్యి పాయసంబు నీరును గలిగిన
బహుకుటుంబభారభయముతోడ
నలసి నీరుపట్టు నాకలియును మిక్కి
లొదవఁ జూచి కుడువ నుత్సహించె.

9-643-వచనము

అయ్యవసరంబున.

9-644-సీస పద్యము

అతిథి భూసురుఁ డొక్కఁ డాహార మడిగినఁ;
గడపక ప్రియముతో గారవించి
హరిసమర్పణ మంచు నన్నంబులో సగ;
మిచ్చిన భుజియించి యేఁగె నాతఁ;
డంతలో నొక శూద్రుఁ డశనార్థి యై వచ్చి;
పొడసూప లేదనఁ బోక తనకు
నున్న యన్నములోన నొక భాగమిచ్చిన;
సంతుష్టుఁడై వాఁడు చనిన వెనుక

9-644.1-ఆటవెలది

కుక్కగమియుఁ దాను నొక్కఁ డేతేర నా
యన్న శేష మిచ్చి సన్నయంబు
లాడి మ్రొక్కి పంప నోడక చండాలుఁ
డొక్క డరుగుదెంచి చక్క నిలిచి.

9-645-కంద పద్యము

హీనుఁడఁ జండాలుండను
మానవకులనాథ! దప్పి మానదు; నవలం
బోనేర; నీకుఁ జిక్కిన
పానీయము నాకుఁ బోసి బ్రతికింపఁగదే.

9-646-వచనము

అనిన వాని దీనాలాపంబులకుఁ గరుణించి రా జిట్లనియె.

9-647-ఉత్పలమాల

అన్నము లేదు కొన్ని మధురాంబువు లున్నవి; త్రావు మన్న! రా
వన్న! శరీరధారులకు నాపద వచ్చిన వారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు చేయుటకన్న నొండు మే
లున్నదె? నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ చుమ్ము పుల్కసా!

9-648-వచనము

అని పలికి

9-649-మత్తేభ విక్రీడితము

బలవంతంబగు నీరుపట్టున నిజప్రాణాంతమై యున్నచో
నలయం డేమియు; వీని హృజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా
జలదానంబున నేఁడు మాను ననుచున్ సర్వేశ్వరాధీనుఁడై
జలముం బోసెను రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్.

9-650-వచనము

తదనంతరంబ; బ్రహ్మాది దేవతలు సంతోషించి, రంతిదేవునికి మేలుచేయం దలఁచి, నిజాకారంబులతో ముందట నిలువంబడి యా రాజు ధైర్యపరీక్షార్థంబు దమ చేసిన వృషలాది రూపంబులగు విష్ణుమాయ నెఱింగించిన, నా నరేంద్రుం డందఱకు నమస్కరించి.

9-651-కంద పద్యము

వారల నేమియు నడుగక
నారాయణభక్తి దన మనంబున వెలుఁగన్

ధీరుం డాతఁడు మాయా
పారజ్ఞుం డగుచు బరమపదముం బొందెన్.

9-652-కంద పద్యము

ఆ రాజర్షిని గొలిచిన
వారెల్లఁ దదీయ యోగవైభవమున శ్రీ
నారాయణ చింతనులై
చేరిరి యోగీశులగుచు సిద్ధపదంబున్.

9-653-వచనము

ఇట్లు రంతిదేవుండు విజ్ఞానగర్భిణి యగు భక్తివలనఁ బరమపదంబునకుం జనియె; నంత గర్గునకు శిని జన్మించె. శినికి గార్గ్యుండు గలిగె; నాతనినుండి బ్రాహ్మణకులంబయ్యె; మహావీర్యునికి నురుక్షయుండును, నురుక్షయునకుఁ ద్రయారుణియుఁ గవియుఁ బుష్కరారుణియు నను ముువ్వురు సంభవించిరి; వారును బ్రాహ్మణులయి చనిరి; బ్రహ్మక్షత్రునికి సుహోత్రుండు, సుహోత్రునకు హస్తియు జనించి రా హస్తి దన పేర హస్తినాపురంబు నిర్మించె నా హస్తికి నజమీఢుండును ద్వమీఢుండును బురుమీఢుండును నన ముువ్వురు జనియించి; రం దజమీఢుని వంశంబునం బ్రియమేధాదులు గొందరు పుట్టి బ్రాహ్మణులయి చని; రయ్యజమీఢునికి బృహదిషుడు నతని పుత్రుండు బృహద్ధనువు, నతనికి బృహత్కాయుండు, నతనికి జయద్రథుండు, నతనికి విశ్వజిత్తు, విశ్వజిత్తునకు సేనజిత్తు, సేనజిత్తునకు రుచిరాశ్వుండు, దృఢహనువుఁ గాశ్యుండు వత్సుండునన నలువురు జనించి; రందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండును, నతనికిఁ బృథుసేనుండును, బృథుసేనునికిఁ

బారుండును, వానికి నీపుండు, నీపునికి నూర్వురు గొడుకులును బుట్టిరి; మఱియును.

9-654-ఆటవెలది

శుకుని కూఁతురైన సుందరి సత్కృతిఁ
బొంది వేడ్క నీపభూవిభుండు
విమల యోగవిత్తు విజ్ఞానదీపితో
దారచిత్తు బ్రహ్మదత్తుఁ గనియె.

9-655-వచనము

ఆ బ్రహ్మదత్తుండు జైగిషవ్యోపదేశంబున, యోగతంత్రంబునం జేసి గోదేవియను భార్యవలన విష్వక్సేనుండను కుమారునిం గనియె; విష్వక్సేనునకు నుదక్సేనుండును, దక్సేనునకు భల్లాదుండు గల్గి, వీరలు బార్హదిషవులను రాజులైరి; ద్విమీఢునకు యమీనరుండు, యమీనరునికిఁ గృతిమంతుండు, గృతిమంతునికి సత్యధృతి, సత్యధృతికి దృఢనేమి, దృఢనేమికి సుపార్శ్వకృత్తు, సుపార్శ్వకృత్తునకు సుపార్శ్వుండును, సుపార్శ్వునకు సుమతి, సుమతికి సన్నతిమంతుండు, సన్నతిమంతుని కొడుకు కృతి యనువాఁడు హిరణ్యనాభునివలన యోగమార్గం బెఱింగి, శోకమోహంబులు విడిచి తూర్పుదేశంబున సామసంహిత పఠియించె; నతనికి నుగ్రాయుధుండును, నుగ్రాయుధునకు క్షేమ్యుండు. క్షేమ్యునకు సువీరుండు, సువీరునకుఁ బురంజయుండుఁ, బురంజయునకు బహురథుండు జన్మించిరి; హస్తి కొడుకు పురుమీఢునికి సంతతి లేదయ్యె; నయ్యజమీఢునికి నళిని యను భార్య యందు నీలుండు నీలునికి శాంతియు, శాంతికి సుశాంతియు, సుశాంతికిఁ బురుజుండు,

బురుజునికి నర్మ్యుండు, నర్మ్యునికి భర్మ్యాశ్వుండు, భర్మ్యాశ్వునకు ముద్గల యవీనర బృహదిషు కాంపిల్య స్పంజయులను వారేరువురుం బుట్టిరి.

9-656-కంద పద్యము

మించిన భర్మ్యాశ్వుఁడు సుత
పంచకమును జూచి విషయపంచకమును వ
ర్జించితిఁ దల మని పల్కినఁ
బాంచాలురు నాఁగ సుతులు పరఁగిరి ధరణిన్.

9-657-వచనము

అంత ముద్గలునినుండి బ్రాహ్మణకులంబై, ముద్గల గోత్రంబు నా నెగడె; భర్మ్యాశ్వపుత్రుండైన యా ముద్గలునికి దివోదాసుండు, నహల్యయను కన్యకయునుం బుట్టి; రా యహల్య యందు గౌతమునికి శతానందుండు పుట్టె; శతానందునికి ధనుర్వేద విశారదుండయిన సత్యధృతి పుట్టె; నతం డొకనాఁడు వనంబున నూర్వశిం గనిన నతనికి రేతఃపాతంబై, తద్వీర్యంబు శరస్తంబంబునం బడి మిథునం బయ్యె; నా సమయంబున.

9-658-కంద పద్యము

చపలరతి శంతనుం డను
నృపవరుఁ డడవికిని వేఁట నెపమునఁ జనుచుం
గృపతో శిశుయుగముం గని
కృపియుఁ గృపుం డనుచుఁ దెచ్చి గృహమునఁ బెంచెన్.

## 9-42- పాంచాలాదుల వంశము

9-659-వచనము

ఆ కృపి ద్రోణునకు భార్య యయ్యె; దివోదాసునకు మిత్రాయువు, మిత్రాయువునకుఁ జ్యవనుఁడుఁ, జ్యవనునకు సుదాసుండు, సుదాసునకు సహదేవుండు, సహదేవునకు సోమకుండు, సోమకునకు సుజన్మకృత్తు సుజన్మకృత్తునకు నూర్వురు కొడుకులుం గలిగిరి; వారిలో జంతు వనువాఁడు జ్యేష్ఠుండు కడచూలు పృషతుండు పృషతునకు ద్రుపదుండు, ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదులయిన కొడుకులును ద్రౌపది యను కూఁతురుం గలిగిరి; ధృష్టద్యుమ్నునకు ధృష్టకేతువు పుట్టె; వీరలు పాంచాలరాజులని యెఱుంగుము; మఱియు నయ్యజమీఢుని కొడుకు ఋక్షుండు, ఋక్షునకు సంవరణుండా సంవరణుండు తపతి యనియెడి సూర్యకన్య యందుఁ గురువుం గనియె; నా కురువు పేరం గురుక్షేత్రంబయ్యె; నా కురువునకుఁ బరీక్షిత్తు సుధనువు జహ్నువు నిషధుండు ననువారు నలువురు పుట్టి; రందుఁ బరీక్షిత్తు కొడుకులులేక చనియె; సుధనువునకు సుహోత్రుం, డతనికిఁ జ్యవనుండు, చ్యవనునకుఁ గృతి, గృతికి వసువు వసువునకు బృహద్రథ, కుసుంభ, మత్స్య, ప్రత్యగ్ర, చేదిపాదులు పుట్టి; రందు బృహద్రథునకుఁ గుశాగ్రుండు, గుశాగ్రునికి ఋషభుండు, ఋషభునికి సత్యహితుండు, సత్యహితునికిఁ పుష్పవంతుండు పుష్పవంతునకు జహ్ను వనువాఁడు మఱియును.

## 9-43- బృహద్రథుని వృత్తాంతము

9-660-సీస పద్యము

ఆ బృహద్రథునకు నన్య భార్యాగర్భ;
 మున రెండు తనుఖండములు జనించె
దునుకలుగని తల్లి తొలఁగంగ పైచిన;

సంధించె నొకటిగా జర యనంగ
నొక దైత్యకాంత; వాఁడొప్పె జరాసంధుఁ;
డన; గిరివ్రజపుర మాతఁ డేలె;
నతనికి సహదేవుఁ; డతనికి సోమాపి;
తనయుఁ; డాతనికి శ్రుతశ్రవుండు

9-660.1-తేటగీతి

జహ్ను పుత్రుండు సురథుండు జనవరేణ్య!
యతని కొడుకు విదూరథుఁ; డతని పట్టి
సార్వభౌముండు; వానికి సంభవుండు
విను జయత్సేనుఁ డనువాఁడు విమలకీర్తి! .

9-661-వచనము

ఆ జయత్సేనునికి రథికుండు, రథికునకు నయుతాయువు, నయుతాయువునకుఁ గ్రోధనుండు, గ్రోధనునకు దేవాతిథియు, దేవాతిథికి ఋక్షుండు, ఋక్షునికి భీమసేనుండు, వానికిఁ బ్రతీపుండుఁ, బ్రతీపునకు దేవాపి శంతను బాహ్లికు లన ముగ్గురు గొడుకులు పుట్టిరి; అందు.

## 9-44- శంతనుని వృత్తాంతము

9-662-సీస పద్యము

దేవాపి రాజ్యంబు దీర్పనొల్లక వనం;
బునకేఁగెఁ దమ్ముండు పూర్వజన్మ
మందు మహాభిషుఁ డనియెడు వాఁడు శం;
తనుఁ డయ్యె వాఁడె యీ ధాత్రినెల్ల

నేలుచుఁ గరముల నే వృద్ధు ముట్టిన;
వాఁడెల్ల నిండు జవ్వనము నొందు;
నతఁడు శాంతిప్రాప్తుఁడై యున్నదానఁ బం;
డ్రెండేండ్లు వజ్రి వర్షింపకున్న

9-662.1-ఆటవెలది

వృష్టి లేని చొప్పు విప్రుల నడిగిన
నన్న యుండఁ దమ్ముఁ డగ్నిహోత్ర
దార సంగ్రహంబు దాల్చినఁ బరివేత్త
యండ్రు గాన నీవ యతఁడ వైతి.

9-663-వచనము

అది కారణంబుగా నన్న యుండఁ దమ్ముండుఁ రాజ్యార్హుండుగాఁడు; నీవు పరివేత్తవు; మీ యన్నకు రాజ్యంబిచ్చిన, ననావృష్టిదోషంబు చెడు" నని బ్రాహ్మణులు పల్కిన, శంతనుండు వనంబునకుం జని, దేవాపికిఁ బ్రియంబు జెప్పి, రాజ్యంబు చేకొమ్మని పల్కె; నంతకు మున్న వానిమంత్రి దేవాపిని రాజ్యంబున కర్హుంజేయందలంచి విప్రులం బిలిచిన నా విప్రులు పాషాండమత వాక్యంబులు దేవాపికి నుపదేశించిన, దేవాపి వేదంబుల నిందించిన పాషాండుండును దేవదూషకుండును నయ్యెం గావున దేవాపికి రాజ్యంబు లేదని బ్రాహ్మ ణులు జెప్పిన శంతనుండు మగిడి వచ్చి రాజ్యంబుఁ జేకొనియె; నంత వర్షంబును గురిసెను; ఇవ్విధంబున.

9-664-కంద పద్యము

దేవాపి కలాపపురం

బావాసము గాఁగ యోగి యై యున్నాఁ డు
ర్వీవర! కలి నష్టంబగు
జై వాత్మకకులముమీఁద సంస్థాపించున్.

9-665-వచనము

బాహ్లీకుం డనువానికి సోమదత్తుండు పుట్టె; సోమదత్తునకు భూరియు భూరిశ్రవసుఁడును శలుండు ననువారు ముగ్వురు పుట్టిరి.

## 9-45- భీష్ముని వృత్తాంతము

9-666-కంద పద్యము

భాతిగ శంతనునకు గం
గాతటికిని వైష్ణవాగ్రగణ్యుఁడు ఘోరా
రాతినయననీలోత్పల
భీతికరగ్రీష్ముఁడైన భీష్ముఁడు పుట్టెన్.

9-667-ఆటవెలది

పరశురాముతోడఁ బ్రతిఘటించి జయింప
నన్యు నొకనిఁ గాన మతనిఁ దక్క
వీరయూథపతి వివేకధర్మజ్ఞుండు
దివిజనది సుతుండు దేవసముఁడు.

9-668-వచనము

ఆ శంతనునకు దాశకన్యక యైన సత్యవతి యందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులు పుట్టి; రందుఁ జిత్రాంగదుండు గంధర్వులచే నిహతుండయ్యె మఱియును.

9-669-ఉత్పలమాల

సత్యవతీవధూటి మును శంతనుపెండ్లముగాని నాఁడు సాం
గత్యమునం బరాశరుఁడు గర్భముజేసిన బాదరాయణుం
డత్యధికుండు శ్రీహరికళాంశజుఁడై ప్రభవించె నిత్యముల్
సత్యములైన వేదముల సాంగములన్ విభజింపఁ దక్షుఁడై.

9-670-ఆటవెలది

బాదరాయణుండు భగవంతుఁ డనఘుండు
పరమగుహ్యమైన భాగవతము
నందనుండ నయిన నాకుఁ జెప్పెను శిష్య
జనుల మొఱఁగి యేను జదువుకొంటి.

## 9-46- పాండవ కౌరవుల కథ

9-671-వచనము

ఆ విచిత్రవీర్యునికిఁ గాశిరాజుకూఁతుల, నంబికాంబాలికల భీష్ముండు బలాత్కారంబున దెచ్చి వివాహంబు చేసిన విచిత్రవీర్యుండు వారలం దగిలి మనోజరాగమత్తుండై, చిరకాలంబు నానావిధక్రీడల విహరించుచు, రాజయక్ష్మ పీడితుండై, మృతుం డయ్యె; నంత.

9-672-కంద పద్యము

అతని సతులవలన సుతుల
సుత! కను మని తల్లి పనుప సౌరిదిం గనియెన్
ధృతరాష్ట్ర పాండు విదురుల
నుతచరితుఁడు బాదరాయణుండు నరేంద్రా!

9-673-వచనము

అంత, ధృతరాష్ట్రునికి గాంధారి యందు దుర్యోధనాదులగు కొడుకులు నూర్వురును, దుశ్శలయను కన్యకయును జన్మించిరి; మృగశాప భయంబునం జేసి, భార్యలం బొంద వెఱచిన పాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్రుల ప్రసాదంబున యుధిష్ఠిర భీమార్జునులను మువ్వురును, మాద్రిదేవివలన నాసత్యప్రసాదంబున నకుల సహదేవులను వారిద్దఱునుగా నేవురు పుట్టి; రయ్యేవురకును ద్రుపదరాజపుత్రి యైన ద్రౌపది యందుఁ గ్రమంబునం బ్రతివింధ్యుండును, శ్రుతసేనుండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రుతకర్ముండును నన నేవురు పుట్టిరి; మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతి యందు దేవకుండును, భీమసేనునికి హిడింబయందు ఘటోత్కచుండును, గాళి యందు సర్వగతుండును, సహదేవునికి విజయ యందు సుహ్రోత్రుండును, నకులునకు రేణుమతి యందు నిరమిత్రుండును, నర్జునునకు నులూపి యను నాగకన్యక యందు నిలావంతుండును, మణలూరుపతిపుత్రి యయిన చిత్రాంగద యందు బభ్రువాహనుండును, సుభద్రయందు శౌర్యధైర్య తేజోవిభవంబుల నఖిలరాజనికరంబునం బ్రఖ్యాతుండైన యభిమన్యుండును జన్మించి; రందు బభ్రువాహనుం డర్జుననియోగంబున మాతామహుని గోత్రంబునకు వంశకర్త యయ్యె.

9-674-ఉత్పలమాల

అన్యసుపూజ్య! నీ జనకుఁడై యభిమన్యుఁడు భూవరేంద్రమూ
ర్ధన్యుఁడు ధన్యమార్గణ కదంబవిదారితవైరివీర రా
జన్యుఁడు జన్యభీత గురుసైన్యుఁడు సైన్యసమూహనాథదృ
ఙ్మాన్యుఁడు మాన్యకీర్తి మహిమం దనరెం గురువంశకర్త యై.

9-675-వచనము

ఆ అభిమన్యునకు నుత్తర యందు నీవు జన్మించితివి.

9-676-కంద పద్యము

ద్రోణసుతు తూపువేఁడిమి
బ్రాణంబులఁ బాసి హరికృపాదర్శన సం
త్రాణంబున బ్రతికితికా
క్షోణీశ్వర! మున్ను నీ శిశుత్వమువేళన్.

9-677-వచనము

నీ కుమారులు జనమేజయ, శ్రుతసేన, భీమసే, నోగ్రసేను లను నల్వురు వీరల యందు.

9-678-ఆటవెలది

నీవు తక్షకాహి నిహతుండ వని విని
సకలసర్పలోక సంప్లుతముగ
సర్పయాగ మింక జనమేజయుఁడు చేయఁ
గలఁడు పూర్వరోషకలితుఁ డగుచు.

9-679-వచనము

మఱియు నతండు సర్వధరణీమండలంబును జయించి, కావషేయుండు పురోహితుండుగానశ్వమేధంబు చేయంగలవాఁడు. వానికి శతానీకుండు జనియించి, యాజ్ఞవల్క్యునితోడ వేదంబులు పఠించి, కృపాచార్యునివలన విలువిద్యనేర్చి, శౌనకునివలననాత్మ జ్ఞానంబు బడయఁగలవాఁ; డా శతానీకునికి

సహస్రానీకుండు వానికి నశ్వమేధజుం, డశ్వమేధజునికి నాసీమకృష్ణుం; డాసీమకృష్ణునకు నిచకుం; డా నిచకుండు గజాహ్వయంబు నదిచే హృతంబుగాఁ, గౌశంబి యందు వసియించు; నాతనికి నుప్తుం; డుప్తునికిఁ జిత్రరథుండు, చిత్రరథునకు శుచిరథుండు, శుచిరథునికి వృష్టిమంతుండు, వృష్టిమంతునికి సుషేణుండు, సుషేణునికి సుపీతుండు, సుపీతునికి నృచక్షువు, నృచక్షువునకు సుఖానిలుండు, సుఖానిలునికిఁ బరిప్లవుండు, బరిప్లవునకు మేధావి, మేధావికి సునయుండు, సునయునికి నృపంజయుండు, నృపంజయునికి దూర్వుండు, దూర్వునికి నిమి, నిమికి బృహద్రథుండు, బృహద్రథునకు సుదాసుండు, సుదాసునికి శతానీకుండు, శతానీకునకు దుర్దమనుండు, దుర్దమనునికి విహీనరుండు, విహీనరునికి దండపాణి, దండపాణికి మితుండు, మితునకు క్షేమకుండు, క్షేమకునకు బ్రహ్మక్షత్రుండు; వాఁడు నిర్వంశుండై, దేవర్షి సత్కృతుండై, కలియుగంబు నందు జనంగలవాఁడు.

9-680-కంద పద్యము

జగతి నిటమీఁదఁ బుట్టెడు
మగధాధీశ్వరుల నిఖిలమనుజేశ్వరులన్
నిగమాంతవిదులఁ జెప్పెద
సుగుణాలంకార! ధీర! సుభగవిచారా!

9-681-వచనము

జరాసంధపుత్రుండయిన సహదేవునికి మార్జాలి, మార్జాలికి శ్రుతశ్రవుండు, శ్రుతశ్రవునకు నయుతాయువు, నయుతాయువునకు నిరమిత్రుండు, నిరమిత్రునకు సునక్షత్రుండు, సునక్షత్రునికి బృహత్సేనుండు, బృహత్సేనునికిఁ

గర్మజిత్తు, గర్మజిత్తునకు శ్రుతంజయుండు, శ్రుతంజయునకు విప్రుండు, విప్రునకు శుచి, శుచికి క్షేముండు, క్షేమునికి సువ్రతుండు, సువ్రతునకు ధర్మనేత్రుండు, ధర్మనేత్రునకు శ్రుతుండు, శ్రుతునకు దృఢసేనుండు, దృఢసేనునికి సుమతి, సుమతికి సుబలుండు, సుబలునకు సునీతుండు, సునీతునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తునకుఁ బురంజయుండును జన్మించెద" రని చెప్పి మఱియు నిట్లనియె.

9-682-ఆటవెలది

వినుము మగధదేశవిభులు జరాసంధ
ప్రముఖ ధరణిపతులు ప్రబలయశులు
వీరు కలియుగమున వేయేండ్ల లోపలఁ
బుట్టి గిట్టఁగలరు భూవరేంద్ర!

9-683-వచనము

యయాతికొడు కనువునకు సభానరుండుఁ, జక్షువుఁ బరోక్షుండు నను వారు ముువ్వురు పుట్టి; రందు సభానరునికిఁ గాలనాథుండు, గాలనాథునకు సృంజయుండు, సృంజయనకుఁ బురంజయుండు, పురంజయునకు జనమేజయుండు, జనమేజయునకు మహాశాలుండు, మహాశాలునికి మహామనసుండు, మహామనసునకు సుశీనరుండు తితిక్షువన నిరువురు జన్మించి; రందు సుశీనరునకు శిబి వన క్రిమి దర్పు లన నలువురు జన్మించి; రందు శిబికి వృష దర్ప సువీర మద్ర కేకయులు నలువురు పుట్టిరి; తితిక్షునకు రుశద్రథుండు, రుశద్రథునకు హేముండు, హేమునకు సుతపుండు, సుతపునకు బలియుఁ, బుట్టి; రా బలివలన నంగ వంగ కళింగ సింహ పుండ్రాంధ్రులను

పేర్లుగలవా రార్వురు కుమారులు పుట్టిరి; వారలు దూర్పు దేశంబులకు రాజులయి దేశంబులకుఁ దమ తమ నామ ధేయంబు లిడి, యేలిరి; సువీరునకు సత్యరథుండు సత్యరథునికి దివిరథుండు, దివిరథునికి ధర్మరథుఁడు, ధర్మరథునకుఁ జిత్రరథుండుఁ బుట్టి; రా చిత్రరథుండు రోమపాదుండు నాఁ బరఁగె.

## 9-47- ఋశ్యశృంగుని వృత్తాంతము

9-684-కంద పద్యము

సంతతిలేనితనంబునఁ
జింతించుచునుండ నతని చెలికాఁ డగు ధీ
మంతుఁడు దశరథుఁ డతనికి
సంతతిగా నిచ్చె నాత్మజను శాంతాఖ్యన్.

9-685-వచనము

అంత రోమపాదుండు, దన కూఁతురు శాంత యని కైకొని మెలంగుచుండ, నా రాజు రాజ్యంబునఁ గొంతకాలంబు వర్షంబు లేమికిం జింతించి, విభాండకసుతుండైన ఋశ్యశృంగుండు వచ్చిన వర్షంబు గురియు నని పెద్దలవలన నెఱింగి.

9-686-కంద పద్యము

ఆ రాజు ఋశ్యశృంగుని
ఘోరతపోనియముఁ దెచ్చుకొఁ బనిచెన్
వారసతుల నేర్పరుల ను
దారస్తనభారభీరుతరమధ్యగలన్.

9-687-వచనము

వారలుఁ జని.

9-688-తేటగీతి

కాంతలార మెకము గన్నది మొదలుగా
నాఁడువారి నెఱుఁగఁ డడవిలోన
గోఁచి బిగియఁగట్టుకొనిన యా వడుగని
మత్తికాని రతికి మరపవలయు.

9-689-వచనము

అని పలుకుచు.

9-690-కంద పద్యము

ఆడుచుఁ జెవులకు నింపుగఁ
బాడుచు నాలోక నిశితబాణౌఘములన్
వీడుచు డగ్గఱ నోడుచుఁ
జేడియ లా తపసికడకుఁ జేరిరి కలఁపన్.

9-691-వచనము

అయ్యవసరంబున వారలం జూచి.

9-692-సీస పద్యము

మిళితాళినీల ధమ్మిల్లభారంబులు;
చారుజటావిశేషంబు లనియు,
భర్మాంచ లోజ్వలప్రభ దుకూలంబులు;

తతచర్మవస్త్రభేదంబు లనియు,
బహు రత్నకీలిత భాసురహారంబు;
లధికరుద్రాక్షమాలాదు లనియు,
మలయజ మృగనాభి మహిత లేపంబులు;
బహువిధ భూతి లేపంబు లనియు,

9-692.1-తేటగీతి

మధురగానంబు శ్రుతియుక్తమంత్రజాతు
లనియు, వీణెలు దండంబు లనియు, సతుల
మూర్తు లెన్నఁడు నెఱుఁగని ముగుద తపసి
వారిఁ దాపసులని డాయవచ్చి మ్రొక్కె.

9-693-వచనము

ఇట్లు వచ్చి మ్రొక్కిన ఋశ్యశృంగుం జూచి, నగుచు డగ్గఱి.

9-694-సీస పద్యము

క్షేమమే యని సతుల్ చేతుల గ్రుచ్చి క;
ర్కశకుచంబులు మోవఁ గౌఁగలించి
చిరతపోనియతి డస్సితిగదా యని మోముఁ;
గంఠంబు నాభియుఁ గలయఁ బుడికి
క్రొత్తదీవన లివి గొనుమని వీనుల;
పొంత నాలుకలఁ జప్పుళ్ళు చేసి
మా వనంబుల పండ్లు మంచివి తినుమని;
పెక్కు భక్ష్యంబులు ప్రీతి నొసఁగి

9-694.1-ఆటవెలది

నూతనాజినంబు నునుపిది మేలని
గోఁచి విడిచి మృదు దుకూలమిచ్చి
మౌని మరగఁజేసి మా పర్ణశాలకుఁ
బోద మనుచుఁ గొంచుఁబోయి రతని.

9-695-వచనము

ఇట్లు హరిణీసుతుండు కాంతాకటాక్షపాశబద్ధుండై, వారల వెంటం జని, రోమపాదుకడకుం బోయిన, నతండు దన ప్రియనందన యైన శాంతనిచ్చి పురంబు నను నిచికొనియె; నమ్మునీశ్వరుండు వచ్చిన వర్షప్రతిబంధదోషంబు చెడి వర్షంబు గురిసెను; అంత.

9-696-ఆటవెలది

ఆ నృపాలచంద్రుఁ డనపత్యుఁడై యుండ
నెఱిఁగి మునికులేంద్రుఁ డింద్రుఁగూర్చి
యిష్టి చేసి సుతుల నిచ్చె నాతని కృపఁ
బంక్తిరథుఁడు పిదపఁ బడసె సుతుల.

9-697-వచనము

ఆ రోమపాదునకుఁ జతురంగుఁడును, జతురంగునకుఁ బృథులాక్షుండును, బృథులాక్షునికి బృహద్రథుండు, బృహత్కర్ముండు బృహద్భానుండు ననువారు మువ్వురు పుట్టి; రందు బృహద్రథునకు బృహన్మనసుఁడు, బృహన్మనసునకు జయద్రథుండు, జయద్రథునకు విజయుండు, విజయునకు సంభూతి యను

భార్యయందు ధృతియు, నా ధృతికి ధృతవ్రతుండు, ధృతవ్రతునకు సత్యకర్ముండు, సత్యకర్మునకు నతిరథుండును జన్మించిరి.

9-698-ఆటవెలది

కుంతి పిన్ననాఁడు గోరి సూర్యునిఁ బొంద
బిడ్డఁ డుదితుఁడైనఁ బెట్టెఁ బెట్టి
గంగ నీట విడువఁ గని యతిరథుఁ డంత
గర్ణుఁ డనుచుఁ గొడుకు గారవించె.

## 9-48- ద్రుహ్యానుతుర్వసులవంశము

9-699-వచనము

ఇట్లతిరథునకుఁ గానీనుండైన కర్ణుండు కొడుకయ్యెఁ; గర్ణునకు వృషసేనుండు పుట్టెను; అయ్యయాతి కొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు, బభ్రుసేతువునకు నారబ్ధుండు, నారబ్ధునకు గాంధారుండు, గాంధారునకు ఘర్ముండు, ఘర్మునకు ఘృతుండు, ఘృతునకు దుర్మదుండు, దుర్మదునకుఁ బ్రచేతసుండు, బ్రచేతసునకు నూర్గురు పుట్టి, మ్లేచ్ఛాధిపతులయి, యుదగ్దిశ నాశ్రయించిరి; తుర్వసునకు వహ్ని, వహ్నికి భర్గుండు, భర్గునకు భానుమంతుండు, భానుమంతునకుఁ ద్రిసానువు, ద్రిసానువునకుఁ గరంధముండును, గరంధమునకు మరుత్తుండు, నతనికి యయాతిశాపంబున సంతతి లేదయ్యె; వినుము.

## 9-49- యదువంశ చరిత్రము

9-700-చంపకమాల

అనఘ యయాతి పెద్దకొడుకైన యదుక్షితిపాలు వంశమున్

వినినఁ బఠించినన్ నరుఁడు వెండియుఁ బుట్టఁడు ముక్తిఁ బొందు న
య్యనుపమమూర్తి విష్ణుఁడు నరాకృతిఁ బొంది జనించెఁ గావునన్
వినుము నరేంద్ర! నా పలుకు వీనుల పండువుగాఁగఁ జెప్పెదన్.

9-701-వచనము

యదువునకు సహస్రజిత్తుఁ గ్రోష్టువు నలుండు రిపుండు నను వారు నలువురు సంభవించి; రందుఁ బెద్దకొడుకయిన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగె; నా శతజిత్తునకు మహాహయ వేణుహయ హైహయు లనువారు మువ్వురు జనించి;రందు హైహయునకు ధర్ముండు ధర్మునకు నేత్రుండు నేత్రునకుఁ గుంతి గుంతికి మహిష్మంతుండు మహిష్మంతునికి భద్రసేనుండు, భద్రసేనునకు దుర్మదుండు, దుర్మదునికి ధనికుండు, ధనికునికిఁ గృతవీర్య కృతాగ్ని కృతవర్మ కృతౌజులను నలువురు సంభవించి; రందు గృతవీర్యునికి నర్జునుండు జనియించె; నతండు మహాబుద్ధిబలంబున.

## 9-50- కార్తవీర్యుని చరిత్ర

9-702-సీస పద్యము

హరికళాసంజాతుఁడైన దత్తాత్రేయు;
 సేవించి సద్యోగసిద్ధిఁ బొంది
బహు యజ్ఞ దాన తపంబులు గావించి;
 సకలదిక్కులు గెల్చి జయముతోడ
సతతంబు హరినామ సంకీర్తనము చేసి;
 ధనముల నొంది యుదారవృత్తి
యెనుబదియైదువే లేండ్లు భూచక్రంబు;

ఘనకీర్తిఁ దనపేరుగాఁగ నేలె;

9-702.1-ఆటవెలది

ముదిమిలేక తరుణమూర్తి యై యురుకీర్తి
నమరెఁ గార్తవీర్యుఁ డనఁగ విభుఁడు
నిజము వానిభంగి నేల యేలినయట్టి
రాజు నెఱుఁగ మెందు రాజముఖ్య!

9-703-వచనము

అయ్యర్జుననకుం గల పుత్రసహస్రంబునం బరశురామునిబారికిం దప్పి జయధ్వజుండు, శూరసేనుండు, వృషణుండు, మధువు, నూర్జితుండు నను వారేవురు బ్రతికిరి; జయధ్వజునకుఁ దాళజంఘుండును, దాళజంఘునకు నౌర్వముని తేజంబున నూర్వురు గొడుకులును గలిగి; రందుఁ బ్రథముండు వీతిహోత్రుండు మధువునకు వృష్ణుండు, వృష్ణునకుఁ బుత్రశతంబు పుట్టె; నందుఁ బ్రథముఁడు వృష్ణి; మఱియు మధు వృష్ణి యదువుల యా వంశంబులవారు మాధవులు వృష్ణులు యాదవులు ననం బరఁగిరి; యదుపుత్రుం డైన క్రోష్ణువునకు వృజినవంతుండు, వృజినవంతునకు శ్వాహితుండు, శ్వాహితునకు భేరుశేకుండు, భేరుశేకునకుఁ జిత్రరథుండు, చిత్రరథునకు శశిబిందుండుం బుట్టిరి.

## 9-51- శశిబిందుని చరిత్ర

9-704-మత్తేభ విక్రీడితము

కృశమధ్యల్ పదివేవు రంగనలతోఁ గ్రీడం బ్రమోదింప స
త్కుశలుండై పదివేలలక్షలు సుపుత్రుల్ భక్తిజేయం జతు
ర్దశ రత్నుండును యోగినాఁ బరఁగి సప్తద్వీపరాజేంద్రుఁడై

శశిబిందుం డురునీతిమంతుఁ డమరన్ సత్కాంతిపూర్ణేందుఁడై.

9-705-వచనము

అతని కొడుకుల మొత్తంబునకు ముఖరులయిన యార్వురలోఁ బృథుశ్రవుండను వానికి ధర్ముండు పుట్టె; ధర్మునకు నుశనుండు పుట్టి, నూఱశ్వమేధంబులుజేసె; నయ్యుశనునకు రుచికుండు పుట్టె; నా రుచికునకుఁ బురుజిత్తు, రుక్ముండు, రుక్మేషువుఁ, బృథువు, జ్యాముఖుండు నను వారేవురు పుట్టి; రందు జ్యాముఖుండు.

9-706-సీస పద్యము

తొట్రుకొల్పెడు శైబ్యతోడి ప్రేమంబున;
నపత్యుఁ డయ్యును నన్యభార్యఁ
గైకొన కొక కొంతకాలంబునకుఁ బోయి;
పగవారి యింటను బలిమిఁ బట్టి
యొకకన్యఁ దేరిపై నునిచి తోడ్తేరంగ;
జననాథుఁగన్యను శైబ్య చూచి
కోపించి మానవకుహక! యీ పడుచును;
దెచ్చియు నేనుండఁ దేరిమీఁద

9-706.1-ఆటవెలది

బెట్టినాఁడ వనుచు బిఱుసులు పలుకంగ
నతడు పలికె నంత నతివతోడ
నాకుఁ గోడ లింత నమ్మ్క మీ లలితాంగి
సవతిగాదు నీకు సత్య మనుచు.

9-707-వచనము

అయ్యవసరంబున శైబ్య కొడుకుం గాంచు నని యెఱింగి విశ్వేదేవతలును బిత్రుదేవతలును సంతసించిరి; వారల ప్రసాదంబున.

9-708-కంద పద్యము

తన సవతి మొఱఁగి పెనిమిటి
తనుఁ బొందిన శైబ్య మఱి విదర్భునిఁ గనియెం
దనయుఁ గని జ్యాముఖుండును
దనతెచ్చిన కన్యఁ దెచ్చి తనయున కిచ్చెన్.

9-709-వచనము

ఆ కన్యక యందు విదర్భునకుఁ గుశుండును గ్రథుండును రోమపాదుండునుం బుట్టి; రా రోమపాదునకు బభ్రువు బభ్రువునకు విభువు విభువునకుఁ గృతి గృతికి నుశికుండు నుశికునకుం జేది చేది కిఁ జైద్యాదులు పుట్టరి; కృథునకుఁ గుంతి, గుంతికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుండు, దశార్హునకు వ్యోముండు, వ్యోమునకు జీమూతుండు, జీమూతునకు వికృతి, వికృతికి భీమరథుండు, భీమరథునకు నవరథుండు, నవరథునకు దశరథుండు, దశరథునకు శకుని, శకునికిఁ గుంతి, గుంతికి దేవరాతుండు, దేవరాతునకు దేవక్షత్రుండు దేవక్షత్రునకు మధువు మధువునకుఁ గురువశుండు, కురువశునకు ననువు, అనువునకుఁ బురుహోత్రుం, డతనికి నంశు, వతనికి సాత్వతుండు సాత్వతునకు భజమానుండును భజియును దివ్యుండును వృష్ణియు దేవావృధుండును నందకుండును మహాభోజుండును నన నేడ్వురు పుట్టి; రందు భజమానునకుఁ బ్రథమభార్య యందు నిమ్రోచి కంకణ వృష్ణులు

మువ్వురును, రెండవ భార్య యందు శతజిత్తు సహస్రజిత్తు నయుతజిత్తునన మువ్వురు బుట్టి; రందు దేవాపృథునికి బభ్రువు పుట్టె; వీర లిరువుర ప్రభావంబులఁ బెద్దలు శ్లోకరూపంబునఁ బఠియింతు; రట్టి శ్లోకార్థం బెట్టిదనిన.

9-710-తేటగీతి

వినుము దూరంబునం దేమి వినుచు నుందు
మదియ చూతుము డగ్గఱ నరుగుదేర
నరులలో బభ్రుకంటె నున్నతుఁడు లేడు
యోజ దేవాపృథున కెన యొరుఁడు గలఁడె?

9-711-కంద పద్యము

పదునాలుగు వేవురు నఱు
వదియేవురు నరులు ముక్తి పడసిరి బభ్రుం
డుదితుఁడు దేవాపృథుఁడును
బదపడి యోగంబుఁ దెలియఁబలికినకతనన్.

9-712-వచనము

మహాభోజుం డతిధార్మికుండు; వాని వంశంబువారు భోజులని పలుకంబడిరి; వృష్టికి సుమిత్రుండు, యుధాజిత్తును జన్మించి; రందు యుధాజిత్తునకు శినియు, ననమిత్రుండును జనించిరి; అనమిత్రునికి నిమ్నుండు, నిమ్నునికి సత్రాజితుండు, బ్రసేనుండు నన నిరువురు పుట్టిరి; మఱియు ననమిత్రునికి శిని యనువాఁడు వేఱొకండు గలం; డతనికి పుత్రుండు సత్యకుండును; నతనికి యుయుధానుం డనంబరఁగిన సాత్యకియు, నా సాత్యకికి జయుండును, జయునకుఁ గుణియు, నా కుణికి యుగంధరుండునుం బుట్టరి; మఱియు

ననమిత్రునకుఁ బృశ్ని యను వేఱొక కొడుకు గలఁడు; వానికి శ్వఫల్క చిత్రకులు గలిగి; రందు శ్వఫల్కునకు గాందినియం దక్రూరుండును, నసంగుండును, సారమేయుండును, మృదుకుండును, మృదుపచ్ఛివుండును, వర్మదృక్కును, ధృష్టవర్మ్ముండును, క్షత్రోపేక్షుండును, నరిమర్దనుండును, శత్రుఘ్నుండును, గంధమాదనుండును, బ్రతిబాహువును నను వారు పన్నిద్దఱు గొడుకులును సుచారు వను కన్యకయు జనించిరి; వారియం దక్రూరునికి దేవలుండును, ననుపదేవుండునుం బుట్టరి; మఱియుఁ జిత్రునకుఁ బృథుండును విడూరథుండును మొదలుగాఁ గలవారు పెక్కండ్రు వృష్ణివంశజాతు లైరి; భజమానుండు, కుకురుఁడు, శుచి, కంబళబర్హిషుండు నన నలువు రంధకునకుఁ బుట్టిరి; కుకురునికి వృష్ణి వృష్ణికి విలోమతనయుండు, విలోమతనయునుకిఁ గపోతరోముండు గపోతరోమునికి దుంబురు సఖుండైన యనువును, ననువునకు దుందుభి దుందుభికి దవిద్యోతుండు, దవిద్యోతునకుఁ బునర్వసువు, నతనికి నాహుకుండను కుమారుండు, నాహుకి యనుకన్యయుం గలిగి; రా యాహుకునికి దేవకుం, డుగ్రసేనుండు నన నిరువురు జనించి; రందు దేవకునికి దేవలుండు, నుపదేవుండును, సుదేవుండు, దేవవర్ధనుం డన నలుగురు గలిగరి; వారలకు ధృతదేవయు, శాంతిదేవయు, నుపదేవయు, శ్రీదేవయు, దేవరక్షితయు, సహదేవయు, దేవకియు ననఁ దోబుట్టవు లేడ్వురు గలిగిరి; వినుము.

9-713-కంద పద్యము

అసదృశ లలితాకారలఁ
గిసలయ కరతలల దేవకీముఖ్యల నా
బిసరుహనయనల నందఱ

వసుదేవుఁడు పెండ్లియాడె వసుధాధీశా!

9-714-వచనము

ఉగ్రసేనునకుఁ గంసుండును, న్యగ్రోధుండును, సునామకుండును, కహ్వుండును, శంకుండును, సుభువును, రాష్ట్రపాలుండును, విస్పృష్టుండును, దుష్టిమంతుండును ననువారు దొమ్మండ్రు కొడుకులును, కంసయుఁ, గంసవతియు, సురాభువును, రాష్ట్రపాలికయు నను కూఁతులుం బుట్టరి; వారు వసుదేవానుజభార్యలైరి; భజమానునికి విడూరథుండును, విడూరథునికి శినియు, నతనికి భోజుండు భోజునికి హృదికుండును గలిగి; రందు హృదికునికి దేవమీఢుండు, శతధనువు కృతవర్మయు నను కొడుకులు గలిగి; రా దేవమీఢుండు శూరుండు ననంబడు శూరునికి మారిష యను భార్య యందు వసుదేవుండును దేవభాగుండును దేవశ్రవుండును నానకుండును సృంజయుండును శ్యామకుండును గంకుండును ననీకుండును వత్సకుండును వృకుండును ననువారు పదుగురు గొడుకులును బృథయు శ్రుతదేవయు శ్రుతకీర్తియు శ్రుతశ్రవసయు రాజాధిదేవియు నను కూఁతు లేవురును బుట్టిరి; అందు.

## 9-52- వసుదేవుని వంశము

9-715-ఉత్పలమాల

ధీనయశాలి యైన వసుదేవుఁడు పుట్టినవెంట మింటిపై
నానక దుందుభుల్ మొరసె నచ్యుతుఁ డీతనికిం దనూజుఁడై
మానుగఁ బుట్టునంచు గరిమంబున దేవత లుబ్బ రాజపం
చానన! తన్నిమిత్తమున నానకదుందుభి యయ్యె వాఁడిలన్.

9-716-కంద పద్యము

తన చెలికాఁడగు కుంతికిఁ
దనయులు లేకున్నఁ జూచి తన తనయఁ బృథం
దనయఁగ నిమ్మన శూఁరుడు
దన యందలి మైత్రి నిచ్చె ధరణీనాథా!

9-717-వచనము

అయ్యింతి కుంతిభోజునింటం బెరుగుచుండ, నొకనాఁడు దుర్వాసుం డరుగుదెంచిన, నమ్మహాత్మునకుఁ గొన్ని దినంబులు పరిచర్యలు చేసి వేల్పులం జేరంజీరు విద్యం బడసి, యా విద్య లావెఱుంగ నొక్కనా డేకాంతంబున వెలుంగుఱేని నాకర్షించిన నా దేవుండు వచ్చినం జూచి వెఱఁగుపడి, యిట్లనియె.

9-718-కంద పద్యము

మంత్ర పరీక్షార్థం బభి
మంత్రించితిఁ గాని దేవ! మదనక్రీడా
తంత్రంబుఁ గోరి చీరను
మంత్రించిన తప్పు సైఁచి మరలు దినేశా!

9-719-వచనము

అనిన నయ్యువిదకుఁ బద్మినీవల్లభుం డిట్లనియె.

9-720-మత్తేభ విక్రీడితము

తెఱవా! నీ పలుకట్లయౌ నసదులే దేవోత్తమాహ్వానముల్
మొఱఁగంబోలునె? వేల్పులం బడయుటల్ మోఘంబులే నీకు నీ

తఱి గర్భం బగుఁ బుత్రుఁడుం గలుగు; నీ తారుణ్యముం బూజ్యమౌ
వెఱవం గార్యములేదు; సిగ్గుదగునే? వ్రీడావినమ్రాననా!

9-721-చంపకమాల

అని తగ నియ్యకొల్పి లలితాంగికి గర్భము చేసి మింటికిం
జనియె దినేశ్వరుం డపుడు చక్కని రెండవసూర్యుడో యనం
దనరెడు పుత్రుఁ గాంచి కృప దప్పి జగజ్జనవాదభీతయై
తనయుని నీటఁ బోవిడిచి తా నరిగెం బృథదండ్రి యింటికిన్.

9-722-వచనము

అ య్యువిదను నీ ప్రపితామహుండైన పాండురాజు వివాహంబయ్యె; నయ్యంగనకుఁ బాండురాజువలన ధర్మజ, భీమార్జునులు పుట్టి; రమ్మగువ చెల్లెలగు శ్రుతదేవయనుదానిం గారూషకుం డైన వృద్ధ శర్మ పెండ్లియాడె; నయ్యిద్దఱకు మునిశాపంబున దంతవక్త్రుండను దానవుండు జన్మించె; దాని తోడంబుట్టువగు శ్రుతకీర్తిని గేకయరాజైన ధృష్టకేతుండు పెండ్లియాడె; నా దంపతులకుఁ బ్రతర్దనాదులేవురు పుట్టరి; దాని భగిని యైన రాజాధిదేవిని జయత్సేనుండు పరిణయంబయ్యె; నా మిథునంబునకు విందానువిందులు సంభవించిరి; చేదిదేశాధిపతి యైన దమఘోషుండు శ్రుతశ్రవసను బరిగ్రహించె; వారలకు శిశుపాలుం డుదయించె. వసుదేవుని తమ్ముఁడైన దేవభాగునికిఁ గంసయందుఁ జిత్రకేతుబృహద్బలు లిరువురు జనించిరి; వాని భ్రాతయగు దేవశ్రవుండనువానికిఁ గంసవతి యందు వీరుండును నిషుమంతుండును నుప్పతిల్లిరి; వాని సోదరుండయిన కంకునికిఁ గంక యనుదానికి బకుండు, సత్యజిత్తు, పురుజిత్తు, ననువారుద్భవిల్లిరి; వాని సహజుండయిన సృంజయునికి

రాష్ట్రపాలి యందు వృషదుర్మర్షణాదు లావిర్భవించిరి; వాని యనుజాతుం డయిన శ్యామకునకు సురభూమి యందు హరికేశ హిరణ్యాక్షులు ప్రభవించిరి; వాని తమ్ముండైన వత్సుండు మిశ్రకేశియను నప్సరస యందు వృకాది సుతులం గనియె; వాని యనుజుండైన వృకుండు దూర్వాక్షి యందుఁ దక్ష పుష్కర సాళ్వాదుల నుత్పాదించె; వాని జఘన్యజుండయిన యనీకుండు సుదామని యనుదాని యందు సుమిత్రానీక బాణాదులయిన గొడుకులం బడసె; వాని యనుజుం డైన యానకుండు గర్ణికయందు ఋతుధామ జయులం గాంచె; వసుదేవునివలన రోహిణి యందు బలుండును గదుండును సారణుండును దుర్మదుండును విపులుండును ధ్రువుండును గృతాదులును, బౌరవి యందు సుభద్రుండును భద్రబాహుండును దుర్మదుండును భద్రుండును భూతాదులుం గూడ బన్నిద్దఱును, మదిర యందు నందోపనంద కృతక శ్రుత శూరాదులును గౌసల్య యందుఁ గేశియు, రోచన యందు హస్త హేమాంగాదులును, నిళ యందు యదు ముఖ్యులయిన యురువల్కలాదులును, ధృతదేవ యందుఁ ద్రిపృష్ఠుండును, శాంతిదేవ యందుఁ బ్రశమ ప్రశ్రితాదులును, నుపదేవ యందుఁ గల్ప వృష్ట్యాదులు పదుండ్రును, శ్రీదేవ యందు వసుహంస సుధన్వాదు లార్గురును, దేవరక్షిత యందు గదాదులు దొమ్మండ్రును, సహదేవయందుఁ బురూఢ శ్రుతముఖ్యు లెనమండ్రును, దేవకి యందుఁ గీర్తిమంతుండును సుషేణుండును భద్రసేనుండును ఋజువును సమదనుండును భద్రుండును సంకర్షణుండును నను వా రేడ్వురును బుట్టిరి; మఱియును.

## 9-53- శ్రీకృష్ణావతార కథాసూచన

9-723-కంద పద్యము

దుష్టజన నిగ్రహంబును

శిష్టజనానుగ్రహంబు చేయుట కొఱకై
యష్టమగర్భమున గుణో
త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్.

9-724-ఆటవెలది

విష్ణుఁ డుదితుఁడైన వెనుక నా దేవకి
భద్రమూర్తి యగు సుభద్రఁ గనియె;
నా గుణాఢ్య ముత్తవగు నీకు నర్జును
దయిత యగుటఁ జేసి ధరణినాథ!

9-725-కంద పద్యము

ఎప్పుడు ధర్మక్షయ మగు
నెప్పుడు పాపంబుపొడము నీ లోకములో
నప్పుడు విశ్వేశుఁడు హరి
దప్పక విభుఁ డయ్యుఁ దన్నుఁ దా సృజియించున్.

9-726-కంద పద్యము

తనమాయ లేక పరునకు
ఘనునకుఁ నీశ్వరున కాత్మకర్తకు హరికిన్
జననములకుఁ గర్మములకు
మనుజేశ్వర! కారణంబు మఱియును గలదే?

9-727-కంద పద్యము

తలఁపఁగ నెవ్వని మాయా

విలసనములు జననవృద్ధి విలయంబులకుం
గలిమి కనుగ్రహ మోక్షం
బులకును జీవునికి మూలములు నా నెగడున్.

9-728-సీస పద్యము

అట్టి సర్వేశ్వుని కరయంగ జన్మాది;
పరతంత్రభావ మెప్పాటఁ గలదు
రాజలాంఛనముల రాక్షసవల్లభు;
లక్షౌహిణీశులై యవనిఁ బుట్టి
జనులను బాధింప శాసించు కొఱకునై;
సంకర్షణునితోడ జననమంది
యమరుల మనముల కైన లెక్కింపంగ;
రాకుండు నట్టి కర్మములఁ జేసి

9-728.1-తేటగీతి

కలియుగంబున జన్మింపఁ గలుగు నరుల
దుఃఖజాలంబు లన్నిటిఁ దొలఁగ నడచి
నేల ప్రేఁగెల్ల వారించి నిఖిలదిశల
విమలకీర్తులు వెదచల్లి వెలసె శౌరి.

9-729-కంద పద్యము

మంగళహరికీర్తి మహా
గంగామృత మించుకైనఁ గర్ణాంజలులన్
సంగతము జేసి ద్రావఁ దొ

లంగును గర్మంబు లావిలం బగుచు నృపా!

9-730-కంద పద్యము

వనజాక్షుని మందస్మిత

ఘనకుండలదీప్తిగండ కలితాననమున్

వనితలుఁ బురుషులుఁ జూచుచు

ననిమిషభావంబు లేమి కలయుదు రధిపా!

9-731-సీస పద్యము

జనకుని గృహమున జన్మించి మందలోఁ;

బెరిఁగి శత్రులనెల్లఁ బీఁచ మడఁచి

పెక్కండ్రు భార్యలఁ బెండ్లియై సుతశతం;

బులఁ గాంచి తను నాదిపురుషుఁ గూర్చి

క్రతువులు పెక్కులు గావించి పాండవ;

కౌరవులకు నంతఁ గలహ మయిన

నందఱ సమయించి యర్జును గెలిపించి;

యుద్ధవునకుఁ దత్త్వ మొప్పఁ జెప్పి

9-731.1-ఆటవెలది

మగధ పాండవ సృంజయ మధు దశార్హ

భోజ వృష్ణ్యంధకాది సంపూజ్యుఁ డగుచు

నుర్విభరము నివారించి, యుండ నొల్ల

కా మహామూర్తి నిజమూర్తి యందుఁ బొందె.

9-732-చంపకమాల

నగుమొగమున్ సుమధ్యమును నల్లనిదేహము లచ్చి కాటప
ట్టగు నురమున్ మహాభుజము లంచితకుండలకర్ణముల్ మదే
భగతియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁ డి
మ్ముగఁ బొడసూపుఁగాత గనుమూసిన యప్పుడు విచ్చునప్పుడున్.

9-733-వచనము

అని చెప్పి.

## 9-54- పూర్ణి

9-734-కంద పద్యము

జనకసుతాహృచ్చోరా!
జనకవచోలబ్ధవిపిన శైలవిహారా!
జనకామితమందారా!
జనకాది మహీశ్వరాతిశయసంచారా!

9-735-మాలిని

జగదవనవిహారీ! శత్రులోకప్రహారీ!
సుగుణవనవిహారీ! సుందరీమానహారీ!
విగతకలుషపోషీ! వీరవిద్యాభిలాషీ!
స్వగురుహృదయతోషీ! సర్వదా సత్యభాషీ!

9-736-గద్యము

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబు నందు సూర్యవంశారంభంబును, వైవస్వతమనువు జన్మంబును, హైమచంద్రకథనంబును, సుద్యుమ్నాదిమను సూనుల చరిత్రంబును, మరుత్తు, తృణబిందు, శర్యాతి, కకుద్మి, సగర, నాభాగ ప్రముఖుల చరిత్రంబులును, నంబరీషుని యందుఁ బ్రయోగింపబడిన దుర్వాసుని కృత్యనిరర్థక యగుటయు, నిక్ష్వాకు వికుక్షి మాంధాతృ పురుకుత్స హరిశ్చంద్ర సగర భగీరథ ప్రముఖుల చరిత్రంబులును, భాగీరథీప్రవాహ వర్ణనంబును, గల్మాషపాద ఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతంబును, శ్రీరామచంద్ర కథనంబును, దదీయ వంశపరంపరా గణనంబును, నిమికథయును, చంద్రవంశారంభంబును, బుధ పురూరవుల కథయును, జమదగ్ని పరశురాముల వృత్తాంతంబును, విశ్వామిత్ర నహుష యయాతి పూరు దుష్యంత భరత రంతిదేవ పాంచాల బృహద్రథ శంతను భీష్మ పాండవ కౌరవ ప్రముఖుల వృత్తాంతంబును, ఋశ్యశృంగ వ్రతభంగంబును, ద్రుహ్యానుతుర్వసుల వంశంబును, యదు కార్తవీర్య శశి బిందు జామదగ్న్యాదుల చరిత్రంబును, శ్రీకృష్ణావతార కథాసూచనంబును నను కథలుగల నవమ స్కంధము సంపూర్ణము.

# పోతన తెలుగు భాగవతము

## దశమ స్కంధము – పూర్వ భాగము

### 10.1-1- ఉపోద్ఘాతము

10.1-1-కంద పద్యము

శ్రీకంఠచాప ఖండన!

పాకారిప్రముఖ వినుత భండన! విలస

త్కాకుత్స్థవంశమండన!

రాకేందు యశోవిశాల! రామనృపాలా!

10.1-2-వచనము

మహనీయ గుణగరిష్ఠులగు నమ్ముని శ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుం డయిన సూతుం డిట్లనియె; అట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని.

### 10.1-2- పరీక్షిత్తు కృష్ణలీలలడుగుట

10.1-3-కంద పద్యము

తెలిపితివి సోమసూర్యుల

కులవిస్తారంబు; వారి కులము ధరిత్రీ

శుల నడవళ్ళును వింటిమి;

కలరూపము లెల్ల మాకుఁ గడు వెలుఁగులుగన్.

10.1-4-కంద పద్యము

శీలముగల యదుకులమున

నేలా పుట్టెను మహాత్ముఁ డీశుఁడు విష్ణుం?
డే లీల మెలఁగె? నెయ్యె
వేళల నే మేమి చేసె? వివరింపు తగన్.

10.1-5-కంద పద్యము

భవములకు మందు; చిత్త
శ్రవణానందము; ముముక్షుజన పదము; హరి
స్తవము పశుఘ్నుఁడు దక్కను
జెవులకుఁ దని వయ్యె ననెడి చెనఁటియుఁ గలఁడే.

10.1-6-కంద పద్యము

మా పెద్దలు మును వేల్పులు
నోపని భీష్మాది కురుకులోత్తమ సేనా
కూపారము నే కోలము
ప్రాపున లంఘించి రొక్క బాలపదముగాన్.

10.1-7-కంద పద్యము

మా యమ్మ కుక్షి గురుసుత
సాయక పీడితుఁడ నైన జడు నన్నుం గొం
తేయ కురుకులము నిలుపఁగ
నా యుత్తముఁ డాత్త చక్రుఁడై రక్షించెన్.

10.1-8-ఆటవెలది

కలసి పురుషమూర్తి కాలరూపములను

లోకజనుల వెలిని లోన నుండి
జన్మ మృత్యువులను సంసారముక్తుల
నిచ్చు నతని చరిత మెల్లఁ జెపుము.

10.1-9-సీస పద్యము

ఊహించి రాముఁడు రోహిణి కొడు కంచు;
నప్పుడు యోగీంద్ర! చెప్ప తీవు
దేవకి కడుపున నే వెరవున నాతఁ;
డుండెను దేహంబు నొండులేక?
తన తండ్రి యిలువాసి వనజాక్షుఁ డేరీతి;
మందకుఁ బోయె? నే మందిరమున
నుండి యెయ్యది చేయుచుండెను? దన మేన;
మామ కంసుని నేల నామ మడఁచె?

10.1-9.1-ఆటవెలది

నెన్ని యేండ్లు మనియె నిలమీఁద మనుజుఁడై?
యెంద ఱైరి భార్య? లెట్లు మెలఁగె?
మఱియు నేమి చేసె? మాధవు చారిత్ర
మెంత గలదు? నాకు నేర్పరింపు.

10.1-10-వచనము

అని మఱియు ని ట్లనియె.

10.1-11-ఆటవెలది

నీ ముఖాంబుజాత నిర్ముక్త హరికథా
మృతముఁ ద్రావఁ ద్రావ మేను వొదలె;
వంత మానె; నీరుపట్టు నాఁకలియును
దూరమయ్యె; మనము తొంగలించె.

10.1-12-వచనము

అని పలుకుచున్న రాజు మాటలు విని, వైయాసి యిట్లనియె.

10.1-13-కంద పద్యము

విష్ణు కథా రతుఁ డగు నరు
విష్ణుకథల్ చెప్పు నరుని వినుచుండు నరున్
విష్ణుకథా సంప్రశ్నము
విష్ణుపదీ జలము భంగి విమలులఁ జేయున్.

10.1-14-సీస పద్యము

రాజేంద్ర! విను తొల్లి రాజలాంఛనముల;
వేలసంఖ్యల దైత్యవిభులు దన్ను
నాక్రమించిన భార మాఁగఁజాలక భూమి;
గోరూపయై బ్రహ్మఁ జేరఁ బోయి
కన్నీరుమున్నీరుగా రోదనము చేయఁ;
గరుణతో భావించి కమలభవుఁడు
ధరణి నూఱడఁ బల్కి ధాత్రియు వేల్పులుఁ;
గదలిరా విష్ణునిఁ గాన నేఁగి

10.1-14.1-తేటగీతి

పురుషసూక్తంబుఁ జదివి యద్భుత సమాధి
నుండి యొకమాట విని వారిజోద్భవుండు
వినుఁడు వేల్పులు ధరయు నే విన్నయట్టి
పలుకు వివరింతు నని ప్రీతిఁ బలికెఁ దెలియ.

10.1-15-కంద పద్యము

యాదవకులమున నమరులు!
మేదినిపైఁ బుట్టఁ జనుడు; మీ యంశములన్
శ్రీదయితుఁడు వసుదేవున
కాదరమునఁ బుట్టి భార మంతయుఁ బాపున్.

10.1-16-కంద పద్యము

హరి పూర్వజుఁడును పుట్టుఁడు
సురకన్యలు! భూమియందు సుందరతనులై
హరి కగ్రజుఁడై శేషుఁడు
హరికళతోఁ బుట్టు దత్ప్రియారంభుండై.

10.1-17-ఆటవెలది

ఈ ప్రపంచ మెల్ల నే మాయచే మోహి
తాత్మ యగుచు నుండు నట్టి మాయ
కమలనాభు నాజ్ఞఁ గార్యార్థమై నిజాం
శంబు తోడఁ బుట్టు జగతి యందు.

10.1-18-వచనము

అని ఇట్లు వేల్పుల నియ్యకొలిపి పుడమి ముద్దియ నోడంబఱచి తమ్మిచూలి దన మొదలి నెలవునకుం జనియె; నంత యదు విభుం డయిన శూరసేనుం డనువాఁడు మథురాపురంబు తనకు రాజధానిగా మాథురంబులు శూరసేనంబు లనియెడు దేశంబు లేలెం; బూర్వకాలంబున.

10.1-19-కంద పద్యము

ఏ మథుర యందుఁ నిత్యము
శ్రీమన్నారాయణుండు చెలగు, బ్రియముమై
నా మథుర సకల యాదవ
భూమీశుల కెల్ల మొదలి పురి యయ్యె నృపా!

## 10.1-3- వసుదేవదేవకీల ప్రయాణం

10.1-20-సీస పద్యము

ఆ శూరసేనున కాత్మజుం డగు వసు;
దేవుఁ డా పురి నొక్క దినమునందు
దేవకిఁ బెండ్లియై దేవకియును దానుఁ;
గడువేడ్క రథమెక్కి కదలువేళ
నుగ్రసేనుని పుత్త్రుఁ డుల్లాసి కంసుండు;
చెల్లెలు మఱఁదియు నుల్లసిల్ల
హరుల పగ్గములఁ జేనందు రొప్పఁ దొడంగె;
ముందట భేరులు మురజములును

10.1-20.1-ఆటవెలది

శంఖ పటహములును జడిగొని మ్రోయంగఁ
గూఁతుతోఁడి వేడ్క కొనలుసాఁగ
దేవకుండు సుతకు దేవకీదేవికి
నరణ మీఁ దలంచి యాదరించి.

10.1-21-వచనము

సార్ధంబు లయిన రథంబుల వేయునెనమన్నూటిని, గనకదామ సముత్తుంగంబు లయిన మాతంగంబుల నన్నూటిని, బదివేల తురంగంబులను, విలాసవతు లయిన దాసీజనంబుల నిన్నూటి నిచ్చి, యనిచినం గదలి వరవధూయుగళంబు తెరువునం జను సమయంబున.

10.1-22-కంద పద్యము

పగ్గములు వదలి వేగిర
మగ్గలముగ రథముఁ గడపు నా కంసుడు లో
బెగ్గలి యొగ్గని తలఁపగ
దిగ్గన నశరీరవాణి దివి నిట్లనియెన్.

10.1-23-కంద పద్యము

తుష్ట యగు భగిని మెచ్చఁగ
నిష్టుఁడ వై రథము గడపె; దెలుగవు మీఁదన్
శిష్ట యగు నీతలోదరి
యష్టమగర్భంబు నిన్ను హరియించుఁ జుమీ.

## 10.1-4- కంసుని అడ్డగించుట

10.1-24-వచనము

అని యిట్లాకాశవాణి పలికిన నులికిపడి భోజకుల పాంసనుండైన కంసుండు సంచలదంసుండై యడిదంబు బెడిదంబుగాఁ బెఱికి, జళిపించి దెప్పరంబుగ ననుజ కొప్పుఁ బట్టి కప్పరపాటున నొప్పఱం దిగిచి యొడిసి పట్టి, తోఁబుట్టువని తలంపక తెంపుఁ జేసి తెగవ్రేయ గమకించు సమయంబున వసుదేవుండు డగ్గఱి.

10.1-25-కంద పద్యము

ఆ పాపచిత్తు మత్తుం

గోపాగ్ని శిఖానువృత్తుఁ గొనకొని తన స

ల్లాపామృతధారా వి

క్షేపణమునఁ గొంత శాంతుఁ జేయుచుఁ బలికెన్.

10.1-26-ఉత్పలమాల

అన్నవు నీవు చెల్లెలికి; నక్కట! మాడలు చీర లిచ్చుటో?

మన్నన చేయుటో? మధుర మంజుల భాషల నాదరించుటో?

మిన్నుల మ్రోతలే నిజము, మేలని చంపకు మన్న మాని రా

వన్న! సహింపు మన్న! తగ దన్న! వధింపకు మన్న! వేడెదన్.

10.1-27-వచనము

అదియునుం గాక.

## 10.1-5- వసుదేవుని ధర్మబోధ

10.1-28-మత్తేభ విక్రీడితము

చెలియల్; కన్నియ; ముద్దరా; లబల; నీ సేమంబె చింతించు ని

ర్మల; దీనిన్ బయలాడుమాటలకు నై మర్యాదఁ బోఁదట్టి, స
త్కుల జాతుండవు పుణ్యమూర్తి వకటా! కోపంబు పాపంబు; నె
చ్చెలి నోహో! తెగ ప్రేయఁ బాడి యగునే? చింతింపు భోజేశ్వరా!

10.1-29-సీస పద్యము

మేనితోడనపుట్టు మృత్యువు జనులకు;
 నెల్లి నేఁ డైన నూఱేండ్ల కైనఁ
దెల్లంబు మృత్యువు దేహంబు పంచత;
 నందఁ గర్మానుగుఁడై శరీరి
మాఱుదేహముఁ నూఁది, మఱి తొంటి దేహంబుఁ;
 బాయును దన పూర్వ భాగమెత్తి
పేఱొంటిపైఁ బెట్టి వెనుకభాగం బెత్త;
 గమకించు తృణజలూకయునుబోలె;

10.1-29.1-ఆటవెలది

వెంటవచ్చు కర్మవిసరంబు; మును మేలు
కన్నవేళ నరుడు గన్న విన్న
తలఁపఁబడిన కార్యతంత్రంబు కలలోనఁ
బాడితోడఁ గానఁబడిన యట్లు.

10.1-30-కంద పద్యము

తన తొంటి కర్మరాశికి
ననుచరమై బహువికారమై మనసు వడిం
జను; నింద్రియముల తెరువులఁ

దనువులు పెక్కైనఁ జెడవు తన కర్మంబుల్.

10.1-31-ఆటవెలది

జలఘటాదులందుఁ జంద్రసూర్యాదులు
గానబడుచు గాలిఁ గదలు భంగి
నాత్మకర్మ నిర్మితాంగంబులను బ్రాణి
గదలుచుండు రాగకలితుఁ డగుచు.

10.1-32-కంద పద్యము

కర్మములు మేలు నిచ్చును;
గర్మంబులు గీడు నిచ్చు; గర్తలు దనకుం
గర్మములు బ్రహ్మ కైనను;
గర్మగుఁ డై పరులఁ దడవఁగా నేమిటికిన్?

10.1-33-కంద పద్యము

కావునఁ బరులకు హింసలు
గావింపఁగ వలదు తనకుఁ గల్యాణముగా
భావించి పరుల నొంచినఁ
బోవునె? తత్ఫలము పిదపఁ బొందక యున్నె?

10.1-34-మత్తకోకిలము

వావిఁ జెల్లెలు గాని పుత్రికవంటి దుత్తమురాలు; సం
భావనీయచరిత్ర; భీరువు; బాల; నూత్నవివాహ సు
శ్రీవిలాసిని; దీన; కంపితచిత్త; నీ కిదె మ్రొక్కెదన్;

కావవే; కరుణామయాత్మక; కంస! మానవవల్లభా!

10.1-35-వచనము

అని మఱియు సామభేదంబులగు పలుకులు పలికిన వినియు వాఁడు వేఁడిచూపుల రాలు నిప్పులుకుప్పలు గొన ననుకంపలేక, తెంపుఁ జేసి చంపకగంధిం జంపఁజూచుట యెఱింగి మొఱంగెడి తెఱంగు విచారించి తనలో నిట్లనియె.

10.1-36-కంద పద్యము

ఎందును గాలము నిజ మని
పందతనంబునను బుద్ధిఁ బాయక ఘనులై
యెందాఁక బుద్ధి నెగడెడి
నందాఁకఁ జరింపవలయు నాత్మబలమునన్.

10.1-37-వచనము

అని నిశ్చయించి.

10.1-38-సీస పద్యము

ఆపన్నురాలైన యంగన రక్షింప;
సుతుల నిచ్చెద నంట శుభము నేడు;
మీఁ దెవ్వ డెఱుగును? మెలఁత ప్రాణంబుతో;
నిలిచిన మఱునాడు నేరరాదె?
సుతులు పుట్టిర యేని సుతులకు మృత్యువు;
వాలాయమై వెంట వచ్చెనేని

బ్రహ్మచేతను వీఁడు పా టేమియును లేక;
యుండునే? సదుపాయ మొకటి లేదె?

10.1-38.1-తేటగీతి

పొంత మ్రాఁకులఁ గాల్పక పోయి వహ్ని
యెగసి దవ్వులవాని దహించు భంగి
గర్మవశమున భవమృతికారణంబు
దూరగతిఁ బొందు; నిఁక నేల తొట్రుపడఁగ?

10.1-39-కంద పద్యము

కొడుకుల నిచ్చెద నని సతి
విడిపించుట నీతి; వీఁడు విడిచిన మీఁదన్
కొడుకులు పుట్టినఁ గార్యము
తడఁబడదే? నాటి కొక్క దైవము లేదే?

10.1-40-కంద పద్యము

ఎనిమిదవ చూలు వీనిం
దునుమాడెడి నంచు మింటఁ దోరపుఁ బలుకుల్
వినఁబడియె; నేల తప్పును?
వనితను విడిపించు టొప్పు వైళం బనుచున్,

10.1-41-కంద పద్యము

తిన్నని పలుకులు పలుకుచుఁ
గ్రన్నన తగఁ బూజ చేసి కంసు నృశంసున్

మన్నించి చిత్త మెరియఁ బ్ర
సన్నాననుఁ డగుచుఁ బలికె శౌరి నయమునన్.

10.1-42-కంద పద్యము

లలనకుఁ బుట్టెడి కొమరుని
వలనం దెగె దనుచు గగనవాణి పలికె నం
చలిగెద వేని మృగాక్షికిఁ
గల కొడుకులఁ జంప నిత్తుఁ గ్రమమున నీకున్.

10.1-43-వచనము

అని యిట్లు పలికిన విని కంసుడు కంపితావతంసుండై సంతసించి గుణగ్రాహిత్వంబుఁ గైకొని కొందలమందు చెలియలిమందల విడిచి చనియె; వసుదేవుండును బ్రదుకుమందలఁ గంటి ననుచు సుందరియుం దానును మందిరంబునకుం బయి డెందంబున నానందంబు నొందియుండె; నంతఁ గొంత కాలంబు చనిన సమయంబున.

10.1-44-కంద పద్యము

విడువక కంసుని యొగ్గులఁ
బడి దేవకి నిఖిలదేవభావము తన కే
ర్పడ నేఁట నొకని లెక్కను
గొడుకుల నెనమండ్ర నొక్క కూతుం గనియెన్.

10.1-45-వచనము

అందు.

10.1-46-ఆటవెలది

సుదతి మున్ను గన్న సుతుఁ గీర్తిమంతుని
పుట్టుఁ దడవు కంసభూవరునకుఁ
దెచ్చి యిచ్చెఁ జాల ధృతి గల్గి వసుదేవుఁ
డాసపడక సత్యమందు నిలిచి.

10.1-47-కంద పద్యము

పలికిన పలుకులు దిరుగక
సొలయక వంచనము లేక సుతుల రిపునకున్
కలఁగక యిచ్చిన ధీరుం
డిల వసుదేవుండు దక్క నితరుఁడు కలడే?

10.1-48-ఆటవెలది

మానవేంద్ర! సత్యమతికి దుష్కరమెయ్య?
దెఱుఁకగలుగు వాని కిష్ట మెయ్య?
దీశభక్తిరతుని కీరాని దెయ్యది?
యెఱుకలేనివాని కేది కీడు?

10.1-49-వచనము

ఇట్లు సత్యంబు దప్పక కొడుకు నొప్పించిన వసుదేవుని పలుకులు విని నిలుకడకు మెచ్చి కంసుం డిట్లనియె.

10.1-50-ఆటవెలది

కొడుకు నీవు మరలఁ గొనిపొమ్ము వసుదేవ!

వెఱపులేదు నాకు వీనివలన;
నల్ల వీనికి; భవ దష్టమ పుత్రుండు
మృత్యు వఁట; వధింతు మీఁద నతని.

10.1-51-వచనము

అనిన నానకదుందుభి నందనుం గొని చనియు నానందంబు నొందక, దుష్టస్వభావుండగు బావపలుకులు వినియు నులుకుచుండె; అంత

## 10.1-6- మథురకునారదుడువచ్చుట

10.1-52-సీస పద్యము

ఒకనాఁడు నారదుం డొయ్యన కంసుని;
యింటికిఁ జనుదెంచి యేకతమున
మందలోపలనున్న నందాదులును, వారి;
భార్యలుఁ బుత్రులు బాంధవులును
దేవకి మొదలగు తెఱవలు వసుదేవుఁ;
డాదిగాఁగల సర్వ యాదవులును,
సురలుగాని, నిజంబు నరులు గా రని చెప్పి;
కంసుండ! నీవు రక్కసుడ వనియు

10.1-52.1-ఆటవెలది

దేవమయుడు చక్రి దేవకీదేవికిఁ
బుత్రుడై జనించి భూతలంబు
చెఱుపఁ బుట్టినట్టి చెనఁటి దైత్యుల నెల్లఁ
జంపు ననుచుఁ జెప్పి చనియె దివికి.

10.1-53-కంద పద్యము

నారదు మాటలు విని పె

ల్లారాటముఁ బొంది యదువు లనిమిషు లనియున్

నారాయణకరఖడ్గవి

దారితుఁ డగు కాలనేమి దా ననియు మదిన్.

## 10.1-7- దేవకీవసుదేవుల చెరసాల

10.1-54-మత్తేభ విక్రీడితము

కలఁగంబాఱి మఱందిఁ జెల్లెలి నుదగ్రక్రోధుడై పట్టి బ

ద్ధులఁ గావించి హరిం దలంచి వెస తోడ్తో వారు గన్నట్టి పు

త్రులఁ జంపెన్; గురు నుగ్రసేను యదుఁ దద్భోజాంధకాధీశు ని

ర్మలు బట్టెం గడు వాలి యేలెఁ జల మారన్ శూరసేనంబులన్.

10.1-55-ఆటవెలది

తల్లిఁదండ్రి నైనఁ దమ్ము లనన్నల

సఖుల నైన బంధుజనుల నైన

రాజ్యకాంక్షఁ జేసి రాజులు చంపుదు

రవనిఁ దఱచు జీవితార్థు లగుచు.

10.1-56-వచనము

మఱియును బాణ భౌమ మాగధ మహాశన కేశి ధేనుక బక ప్రలంబ తృణావర్త చాణూర ముష్టి కారిష్ట ద్వివిధ పూతనాది సహాయ సమేతుండై కంసుండు కదనంబున మదంబు లడంచిన వదనంబులు వంచికొని, సదనంబులు విడిచి యదవలై, యదువులు, పదవులు వదలి నిషధ కురు కోసల విదేహ విదర్భ

కేకయ పాంచాల సాల్వ దేశంబులుఁ జొచ్చిరి; మచ్చరంబులు విడిచి కొందరు కంసునిం గొలిచి నిలిచి; రంత.

10.1-57-కంద పద్యము

తొడితొడిఁ గంసుడు దేవకి
కొడుకుల నార్వుర వధింప గురుశేషాఖ్యం
బొడవగు హరిరుచి యా సతి
కడుపున నేడవది యైన గర్భం బయ్యెన్.

## 10.1-8- యోగమాయనాజ్ఞాపించుట

10.1-58-వచనము

అయ్యవసరంబున విశ్వరూపుం డగు హరి దన్ను నమ్మిన యదువులకుఁ గంసునివలన భయంబు గలుగు నని యెఱింగి యోగమాయాదేవి కిట్లనియె.

10.1-59-సీస పద్యము

గోపికా జనములు గోపాలకులు నున్న;
పసులమందకుఁ బొమ్ము భద్ర! నీవు
వసుదేవుభార్యలు వరుసఁ గంసుని చేత;
నాఁకల బడియుండ నందుఁ జొరక
తలఁగి రోహిణి యను తరళాక్షి నంద గో;
కుల మందు నున్నది గుణగణాఢ్య
దేవకికడుపున దీపించు శేషాఖ్య;
మైన నా తేజ మీ వమరఁ బుచ్చి

10.1-59.1-ఆటవెలది

నేర్పు మెఱసి రోహిణీదేవి కడుపునఁ
జొనుపు దేవకికిని సుతుఁడ నగుదు
నంశభాగయుతుఁడనై యశోదకు నందు
పొలఁతి కంత మీఁద బుట్టె దీవు.

10.1-60-కంద పద్యము

నానావిధ సంపదలకుఁ
దానకమై సర్వకామదాయిని వగు నిన్
మానవులు భక్తిఁ గొలుతురు
కానికలును బలులు నిచ్చి కల్యాణమయీ!

10.1-61-వచనము

మఱియు నిన్ను మానవులు దుర్గ భద్రకాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి కన్యక మాయ నారాయణి యీశాన శారద యంబిక యను పదునాలుగు నామంబులం గొనియాడుదు రయ్యె స్థానంబుల యం"దని యెఱింగించి సర్వేశ్వరుండగు హరి పొమ్మని యానతిచ్చిన మహాప్రసాదం బని యయ్యోగనిద్ర యియ్యకొని మ్రొక్కి చయ్యన నియ్యెల కయ్యెడ బాసి వచ్చి.

## 10.1-9- రోహిణి బలభద్రుని కనుట

10.1-62-తేటగీతి

దేవకీదేవికడుపులోఁ దేజరిల్లు
దీప్త గర్భంబు మెల్లనఁ దిగిచి యోగ
నిద్ర రోహిణికడుపున నిలిపి చనియెఁ;

గడుపు దిగె నంచుఁ బౌరులు గలఁగఁ బడఁగ.

10.1-63-వచనము

అంత.

10.1-64-ఆటవెలది

బలము మిగులఁ గలుగ బలభద్రుఁ డన లోక
రమణుఁ డగుటఁ జేసి రాముఁ డనగ
సతికిఁ బుట్టె గర్భసంకర్షణమున సం
కర్షణుం డనంగ ఘనుఁడు సుతుఁడు.

10.1-65-వచనము

తదనంతరంబ.

10.1-66-కంద పద్యము

ఆనకదుందుభి మనమున
శ్రీనాథుం డంశభాగశిష్టతఁ జొరఁగన్
భానురుచి నతఁడు వెలిఁగెను
గానఁగఁ బట్టయ్యె భూతగణములకు నృపా!

10.1-67-ఉత్పలమాల

ఆ వసుదేవుఁ డంతఁ దన యం దఖిలాత్మక మాత్మ భూతముం
బావనరేఖయున్ భువనభద్రమునై వెలుఁగొందుచున్న ల
క్ష్మీవిభుతేజ మచ్చుపడఁ జేర్చినఁ దాల్చి నవీనకాంతితో
దేవకి యొప్పెఁ బూర్వయగు దిక్సతి చంద్రునిఁ దాల్చు కైవడిన్.

10.1-68-వచనము

అనిన విని తర్వాతి వృత్తాంతం బెట్లయ్యె నని రా జడిగిన శుకుం డిట్లనియె.

10.1-69-కంద పద్యము

గురుతరముగఁ దన కడుపునఁ
సరసిజగర్భాండభాండ చయములు గల యా
హరి దేవకికడుపున భూ
భరణార్థము వృద్ధిఁబొందె బాలార్కు క్రియన్.

10.1-70-వచనము

అంత.

10.1-71-సీస పద్యము

విమతులమోములు వెలవెలఁ బాఱంగ;
 విమలాస్యమోము వెల్వెలకఁ బాఱె;
మలయు వైరులకీర్తి మాసి నల్లనగాఁగ;
 నాతిచూచుకములు నల్లనయ్యె;
దుష్టాలయంబుల ధూమరేఖలు పుట్ట;
 లేమ యారున రోమలేఖ మెఱసె;
నరి మానసముల కాహారవాంఛలు దప్ప;
 వనజాక్షి కాహారవాంఛ దప్పె;

10.1-71.1-తేటగీతి

శ్రమము సంధిల్లె రిపులకు శ్రమము గదుర

జడత వాటిల్లె శత్రులు జడను పడఁగ;
మన్ను రుచియయ్యెఁ బగతురు మన్ను చొరఁగ;
వెలఁది యుదరంబులో హరి వృద్ధిఁబొంద.

10.1-72-వచనము

మఱియును.

10.1-73-సీస పద్యము

సలిల మా యెలనాఁగ జఠరార్భకునిఁ గానఁ;
 జనిన కైవడి ఘర్మసలిల మొప్పె;
నొగిఁ దేజ మా యింతి యుదరడింభకు గొల్వఁ;
 గదిసిన క్రియ దేహకాంతి మెఱసెఁ;
బవనుఁ డా కొమ్మ గర్భస్థుని సేవింప;
 నొలసెనా మిక్కిలి యూర్పు లమరెఁ;
గుంభిని యా లేమ కుక్షిగు నర్చింపఁ;
 జొచ్చుభంగిని మంటి చొరవ దనరెఁ;

10.1-73.1-ఆటవెలది

గగన మిందువదనకడుపులో బాలు సే
వలకు రూపుమెఱసి వచ్చినట్లు
బయలువంటి నడుము బహుళ మయ్యెను; బంచ
భూతమయుఁడు లోనఁ బొదల సతికి.

10.1-74-వచనము

తదనంతరంబ.

10.1-75-సీస పద్యము

అతివకాంచీగుణం బల్లన బిగియంగ;
 వైరివధూగుణవ్రజము వదలె;
మెల్లన తన్వంగి మెయిదీవ మెఱుఁ గెక్క;
 దుష్టాంగనాతనుద్యుతు లడంగె;
నాతి కల్లన భూషణములు పల్లవనగాఁ;
 బరసతీభూషణ పంక్తు లెడలె;
గలకంఠి కొయ్యన గర్భంబు దొడ్డుగాఁ;
 బరిపంథిదారగర్భములు పగిలెఁ;

10.1-75.1-తేటగీతి

బోలఁతి కల్లన నీళ్ళాడు ప్రొద్దు లెదుగ
నహితవల్లభ లైదువలై తనర్చు
ప్రొద్దు లన్నియుఁ గ్రమమున బోవఁ దొడగెఁ;
నువిదకడుపున నసురారి యుంటఁజేసి.

10.1-76-వచనము

ఇ వ్విధంబున.

10.1-77-ఆటవెలది

జ్ఞానఖలునిలోని శారదయును బోలె
ఘటములోని దీపకళిక బోలె

భ్రాతయింట నాఁకఁబడియుండె దేవకీ
కాంత విశ్వగర్భగర్భ యగుచు.

10.1-78-వచనము

అంత నక్కాంతాతిలకంబు నెమ్మొగంబు తెలివియును, మేనిమెఱుంగును, మెలంగెడి సొబగునుం జూచి వెఱఁగుపడి తలఁచు వెఱచుచుఁ గంసుండు తనలో నిట్లనియె.

10.1-79-కంద పద్యము

కన్నులకుఁ జూడ బరుపై
యున్నది యెలనాఁగగర్భ ముల్లము గలగన్
మున్నెన్నఁడు నిట్లుండదు
పెన్నుఁడు చొరఁ బోలు గర్భవివరములోనన్.

10.1-80-ఉత్పలమాల

ఏమి దలంచువాఁడ? నిఁక నెయ్యదికార్యము? నాఁడునాఁటికిం
గామిని చూలు పెంపెసఁగె; గర్భిణిఁ జెల్లెలి నాఁడు పేద నే
నేమని చంపువాఁడఁ? దగవేలని చంపితినేని శ్రీయు ను
ద్దామయశంబు నాయువును ధర్మమునుం జెడిపోవకుండునే?

10.1-81-కంద పద్యము

వావి యెఱుంగని క్రూరుని
జీవన్మృతుఁ డనుచు నిందఁ జేయుదు; రతడుం
బోవును నరకమునకు; దు

ర్భావముతో బ్రదుకు టొక్క బ్రదుకే తలఁపన్?

10.1-82-వచనము

అని నిశ్చయించి క్రౌర్యంబు విడిచి, ధైర్యంబు నొంది, గాంభీర్యంబు వాటించి, శౌర్యంబు ప్రకటించికొనుచు, దిగ్గనం జెలియలిం జంపు నగ్గలిక యెగ్గని యుగ్గడించి మాని, మౌనియుం బోలెనూర కుండియు.

10.1-83-ఆటవెలది

పాపరాని దొడ్డ పగపుట్టె నిక నెట్టు
లిందుముఖికిఁ జక్రి యెపుడు పుట్టుఁ?
బుట్టినపుడె పట్టి పురిటింటిలోఁ దెగఁ
జూతు ననుచు నెదురుచూచుచుండె.

10.1-84-వచనము

మఱియు వైరానుబంధంబున నన్యానుసంధానంబు మఱచి యతండు.

10.1-85-కంద పద్యము

తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు
నరుగుచుఁ గూర్చుండి లేచు చనవరతంబున్
హరిఁ దలఁచితలఁచి జగ మా
హరిమయ మని చూచెఁ గంసుఁ డాఅని యలుకన్.

10.1-86-వచనము

వెండియు.

10.1-87-సీస పద్యము

శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు;
 నది హరిరవ మని యాలకించు;
నక్షిమార్గమున నెయ్యది చూడఁబడు నది;
 హరిమూర్తి గానోపు నంచుఁ జూచుఁ;
దిరుగుచో దేహంబు తృణమైన సోఁకిన;
 హరికరాఘాతమో యనుచుఁ నులుకు;
గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన;
 హరిమాలికాగంధ మనుచు నదరుఁ;

10.1-87.1-తేటగీతి

బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరిపేరు
పలుకఁబడియె ననుచు భ్రమసి పలుకుఁ;
దలఁపు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు
హరితలంపు లనుచు నలుగఁ దలఁచు.

## 10.1-10- బ్రహ్మాదుల స్తుతి

10.1-88-వచనము

అ య్యవసరంబున ననుచరసమేతులైన దేవతలును, నారదాది మునులునుం గూడ నడవ నలువయును, ముక్కంటియు నక్కడకు వచ్చి దేవకీదేవిగర్భంబున నర్భకుండై యున్న పురుషోత్తము నిట్లని స్తుతియించిరి.

10.1-89-సీస పద్యము

సత్యవ్రతుని నిత్యసంప్రాప్త సాధనుఁ;

గాలత్రయమునందు గలుగువాని
భూతంబు లైదును బుట్టుచోటగు వాని;
నైదుభూతంబులం దమరువాని
నైదుభూతంబులు నడఁగిన పిమ్మట;
బరఁగువానిని సత్యభాషణంబు
సమదర్శనంబును జరిపెడువానిని;
నిన్నాశ్రయింతుము; నీ యధీన

10.1-89.1-ఆటవెలది

మాయచేత నెఱుకమాలిన వారలు
పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు;
రెఱుగనేర్చు విబుధు లేకచిత్తంబున
నిఖిలమూర్తు లెల్ల నీవ యండ్రు.

10.1-90-వచనము

అదియునుం గాక.

10.1-91-సీస పద్యము

ప్రకృతి యొక్కటి పాదు; ఫలములు సుఖదుఃఖ;
ములు రెండు; గుణములు మూఁడు వేళ్ళు;
తగు రసంబులు నాల్గు ధర్మార్థ ముఖరంబు;
లెఱిగెడి విధములై దింద్రియంబు;
లాఱు స్వభావంబు లా శోక మోహాదు;
లూర్ములు; ధాతువులొక్క యేడు;

పైపొరలెనిమిది ప్రంగలు; భూతంబు;
లైదు బుద్ధియు మనోహంకృతులును;

10.1-91.1-తేటగీతి

రంధ్రములు తొమ్మిదియుఁ గోటరములు; ప్రాణ
పత్త్రదశకంబు; జీవేశ పక్షియుగముఁ
గలుగు సంసారవృక్షంబు గలుగఁ జేయఁ
గావ నడఁగింప రాజ వొక్కరుఁడ వీవ.

10.1-92-కంద పద్యము

నీదెసఁ దమచిత్తము లిడి
యే దెసలకుఁ బోక గడతు రెఱుక గలుగువా;
రా దూడయడుగు క్రియ నీ
పాదం బను నావకతన భవసాగరమున్.

10.1-93-ఆటవెలది

మంచివారి కెల్ల మంగళ ప్రద లయ్యుఁ
గల్లరులకు మేలుగాని యట్టి
తనువు లెన్ని యైనఁ దాల్చి లోకములకు
సేమ మెల్ల ప్రొద్దు చేయు దీవు.

10.1-94-కంద పద్యము

ఎఱిఁగినవారల మనుచును
గొఱమాలిన యెఱుక లెఱిఁగి కొందఱు నీ పే

రెఱిగియు దలఁపగ నొల్లరు
పఱతు రధోగతులజాడఁ బద్మదళాక్షా!

10.1-95-కంద పద్యము

నీ వారై నీ దెసఁ దమ
భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై
యే విఘ్నంబులఁ జెందక
నీ వఱలెడి మేటిచోట నెగడుదు రీశా!

10.1-96-కంద పద్యము

నిను నాలుగాశ్రమంబుల
జనములు సేవింప నఖిల జనముల సత్త్వం
బును శుద్ధంబును శ్రేయం
బును నగు గాత్రంబు నీవు పొందుదువు హరీ!

10.1-97-సీస పద్యము

నలినాక్ష! సత్త్వగుణంబు నీ గాత్రంబు;
గాదేని విజ్ఞానకలిత మగుచు
నజ్ఞానభేదనం బగు టెట్లు? గుణముల;
యందును వెలుఁగ నీవనుమతింపఁ
బడుదువు; సత్త్వరూపంబు సేవింపంగ;
సాక్షాత్కరింతువు సాక్షి వగుచు
వాఙ్మనసముల కవ్వలయైన మార్గంబు;
గలుగు; నీగుణజన్మకర్మరహిత

10.1-97.1-తేటగీతి

మైన రూపును బేరు నత్యనఘుబుద్ధు
లెఱుగుదురు; నిన్నుఁ గొల్వ నూహించుకొనుచు
వినుచుఁ దలచుచుఁ బొగడుచు వెలయువాఁడు
భవము నొందఁడు నీ పాద భక్తుఁడగును.

10.1-98-కంద పద్యము

ధరణీభారము వాసెను
బురుషోత్తమ! యీశ! నీదు పుట్టువున; భవ
చ్చరణాంబుజముల ప్రాపున
ధరణియు నాకసముఁ గాంచెదము నీ కరుణన్.

10.1-99-ఉత్పలమాల

పుట్టువు లేని నీ కభవ పుట్టుట క్రీడయె కాక పుట్టుటే?
యెట్టనుడున్ భవాదిదశ లెల్లను జీవులయం దవిద్య దాఁ
బుట్టుచు నుండుఁగాని నినుఁ బుట్టినదింబలెఁ బొంతనుండియుం
జుట్టఁగ లేని తత్త్రియలఁ జొక్కని యెక్కటి వౌదు వీశ్వరా!

10.1-100-ఉత్పలమాల

గురు పాఠీనమవై, జలగ్రహమవై, కోలంబవై, శ్రీనృకే
సరివై, భిక్షుఁడవై, హయాననుఁడవై, క్ష్మాదేవతాభర్తవై,
ధరణీనాథుడవై, దయాగుణగణోదారుండవై, లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద; మిలాభారంబు వారింపవే.

10.1-101-కంద పద్యము

ముచ్చిరి యున్నది లోకము
నిచ్చలుఁ గంసాదిఖలులు నిర్దయు లేఁపన్;
మచ్చికఁ గావఁగవలయును
విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా!

10.1-102-వచనము

అని మఱియు దేవకీదేవిం గనుంగొని యిట్లనిరి.

10.1-103-మత్తకోకిలము

తల్లి! నీ యుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ డున్నవాఁ
డెల్లి పుట్టెడిఁ; గంసుచే భయ మింత లేదు; నిజంబు; మా
కెల్లవారికి భద్రమయ్యెడు; నింక నీ కడు పెప్పుడుం
జల్లగావలె యాదవావళి సంతసంబునఁ బొంగఁగన్.

10.1-104-వచనము

అని యివ్విధంబున హరిం బొగడి దేవకీదేవిని దీవించి దేవత లీశాన బ్రహ్మల
మున్నిడుకొని చని; రంత

## 10.1-11- దేవకి కృష్ణుని కనుట

10.1-105-కంద పద్యము

పంకజముఖి నీ భ్యాడఁను
సంకటపడ ఖలులమానసంబుల నెల్లన్
సంకటము దోఁచె; మెల్లన

సంకటములు లేమి తోఁచె సత్పురుషులకున్.

10.1-106-సీస పద్యము

స్వచ్ఛంబులై పొంగె జలరాసు లేడును;
 గలఘోషణముల మేఘంబు లుఱిమె;
గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె;
 దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ;
గమ్మని చల్లని గాలి మెల్లన వీఁచె;
 హోమానలంబు చెన్నొంది వెలిఁగెఁ;
గొలఁకులు కమలాళి కులములై సిరి నొప్పెఁ;
 బ్రవిమలతోయలై పాఱె నదులు;

10.1-106.1-తేటగీతి

వరపురగ్రామఘోషయై వసుధ యొప్పెఁ;
విహగ రుత పుష్ప ఫలముల వెలసె వనము;
లలరునోనలు గురిసి ర య్యమరవరులు;
దేవదేవుని దేవకీదేవి గనఁగ.

10.1-107-కంద పద్యము

పాడిరి గంధర్వోత్తము;
లాడిరి రంభాది కాంత; లానందమునన్
గూడిరి సిద్ధులు; భయముల
వీడిరి చారణులు; మొరసె వేల్పులభేరుల్.

10.1-108-వచనము

అ య్యవసరంబున.

10.1-109-కంద పద్యము

సుతుఁ గనె దేవకి నడురే
యతి శుభగతిఁ దారలును గ్రహంబులు నుండన్
దితిసుత నిరాకరిష్ణున్
శ్రితవదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్.

10.1-110-కంద పద్యము

వెన్నుని నతిప్రసన్నునిఁ
గ్రన్నన గని మెఱుఁగుఁ బోఁడి గడు నొప్పారెం
బున్నమనాఁడు కళానిధిఁ
గన్న మహేంద్రాశచెలువుగలిగి నరేంద్రా!

10.1-111-వచనము

అప్పుడు.

10.1-112-సీస పద్యము

జలధరదేహు నాజానుచతుర్బాహు;
 సరసీరుహాక్షు విశాలవక్షుఁ
జారు గదా శంఖ చక్ర పద్మ విలాసుఁ;
 గంఠకౌస్తుభమణికాంతిభాసుఁ
గమనీయ కటిసూత్ర కంకణ కేయూరు;

శ్రీవత్సలాంఛనాంచిత విహారు
సురుకుండలప్రభాయుత కుంతలలలాటు;
వైడూర్యమణిగణ వరకిరీటు

10.1-112.1-తేటగీతి

బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోక
పాలు సుగుణాలవాలుఁ గృపావిశాలుఁ
జూచి తిలకించి పులకించి చోద్య మంది
యుబ్బి చెలరేఁగి వసుదేవు డుత్సహించె.

10.1-113-కంద పద్యము

స్నానముచేయఁగ రామిని
నానందరసాబ్ధిమగ్నుఁడై విప్రులకున్
ధేనువులం బదివేలను
మానసమున ధారవోసె మఱి యిచ్చుటకున్.

10.1-114-వచనము

మఱియు వసుదేవుండు.

10.1-115-కంద పద్యము

ఈ పురిటియింటి కుద్య
ద్దీపంబును బోలి చాల దీపించె నిజం
బీ పాపఁడు నలుమొగముల
యా పాపని గనిన మేటి యగు నని భక్తిన్.

## 10.1-12- వసుదేవుడుకృష్ణునిపొగడుట

### 10.1-116-ఆటవెలది

చాఁగి మ్రొక్కి లేచి సరగున నొసలిపైఁ
గేలుదమ్మిదోయిఁ గీలుకొలిపి
పాపఁ డనక వెఱక పాపని మొదలింటి
పోకలెల్లఁ దలఁచి పొగడఁ దొడఁగె.

### 10.1-117-కంద పద్యము

ఏ నిన్ను నఖిలదర్శను
జ్ఞానానందస్వరూపు సంతతు నపరా
ధీనుని మాయాదూరుని
సూనునిఁగాఁ గంటి; నిట్టి చోద్యము గలదే?

### 10.1-118-కంద పద్యము

అచ్చుగ నీ మాయను మును
చెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగముల్
చొచ్చిన క్రియఁ జొరకుందువు
చొచ్చుటయును లేదు; లేదు చొరకుండుటయున్.

### 10.1-119-సీస పద్యము

అదియు నెట్లన మహదాదులఁ బోలెడి;
దై వేఱు వేఱ యై యన్నివిధము
లగు సూక్ష్మభూతంబు లమర షోడశ వికా;

రములతోఁ గూడి విరాట్టనంగఁ
బరమాత్మునకు నీకు బఱపైన మేను సం;
పాదించి యందు లోఁబడియుఁ బడక
యుండు సృష్టికి మున్న యున్న కారణమున;
వానికి లోనిభవంబు గలుగ;

10.1-119.1-ఆటవెలది

దట్లు బుద్ధి నెఱుఁగ ననువైన లాగునఁ
గలుగు చింద్రియముల కడలనుండి
వాని పట్టులేక వరుస జగంబులఁ
గలసి యుండి యైనఁ గలయ వెపుడు.

10.1-120-కంద పద్యము

సర్వము నీలోనిదిగా
సర్వాత్ముఁడ; వాత్మవస్తుసంపన్నుఁడవై
సర్వమయుఁడ వగు నీకును
సర్వేశ్వర! లేవు లోను సందులు వెలియున్.

10.1-121-ఆటవెలది

ఆత్మ వలనఁ గలిగి యమరుదేహాదుల
నాత్మకంటె వేఱు లవి యటంచు
దలఁచువాఁడు మూఢతముఁడు గావునఁ నీశ!
విశ్వ మెల్ల నీవ వేఱు లేదు.

10.1-122-వచనము

అదియునుం గాక.

10.1-123-సీస పద్యము

గుణము వికారంబుఁ గోరికయును లేని;
నీ వలన జగంబు నెఱి జనించుఁ;
బ్రబ్బు; లేదగు; నంచుఁ బలుకుట తప్పుగా;
దీశుండవై బ్రహ్మ మీవ యైన
నినుఁ గొల్చు గుణములు నీ యానతులు చేయు, ;
భటులశౌర్యంబులు పతికి వచ్చు
పగిది నీ గుణముల బాగులు నీ వని;
తోఁచును నీ మాయతోడఁ గూడి

10.1-123.1-ఆటవెలది

నీవు రక్త ధవళ నీల వర్ణంబుల
జగము చేయఁ గావ సమయఁ జూడఁ
దనరు; దట్లు నేఁడు దైత్యుల దండింపఁ
బృథివి గావ నవతరించి తీశ!

10.1-124-శార్దూల విక్రీడితము

మింటన్ మ్రోసిన మ్రోత తాలిమిని లోమేండ్రింప మున్ నీవు నా
యింటం బుట్టెద వంచుఁ గంసుడు దొడిన్ హింసించె నీ యన్నలం;
గంటం గూరుకుఁ దేఁడు; నీ యుదయ మీ కారాజనుల్ చెప్పగాఁ
బంటింపం; డెదురేఁగుదెంచు వడి నీపై నేఁడు సన్నద్ధుఁడై.

10.1-125-వచనము

అనుచుండ దేవకీదేవి మహాపురుషలక్షణుండును, విచక్షణుండును, సుకుమారుండునునైన కుమారునిం గని, కంసునివలని వెఱపున శుచిస్మితయై యిట్లనియె.

## 10.1-13- దేవకి చేసిన స్తుతి

10.1-126-సీస పద్యము

అట్టిట్టి దనరానిదై మొదలై నిండు;
కొన్నదై వెలుఁగుచు గుణములేని
దై యొక్క చందంబుదై కలదై నిర్వి;
శేషమై క్రియలేక చెప్పరాని
దేరూపమని శ్రుతు లెప్పుడు నొడివెడి;
యా రూప మగుచు నధ్యాత్మదీప
మై బ్రహ్మ రెండవ యర్థంబు తుది జగం;
బులు నశింపఁగఁ బెద్దభూతగణము

10.1-126.1-ఆటవెలది

సూక్ష్మభూతమందుఁ జొరఁగఁ నా భూతంబు
ప్రకృతిలోనఁ జొరఁగఁ బ్రకృతి పోయి
వ్యక్త మందుఁ జొరఁగ వ్యక్త మడంగను
శేషసంజ్ఞ నీవు చెలువ మగుదు.

10.1-127-ఉత్పలమాల

విశ్వము లీల ద్రిప్పుచు నవిద్యకు జుట్టమ వైన నీకు దా

శాశ్వతమైన కాలమిది సర్వము వేడబమందు; రట్టి వి
శ్వేశ్వర! మేలుకుప్ప! నిను నెవ్వఁడుఁ గోరి భజించు వాడె వో
శాశ్వతలక్ష్మి మృత్యుజయ సౌఖ్యయుతుం డగువాడు మాధవా!

10.1-128-మత్తకోకిలము

ఒంటి నిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై
కంటిమందురు గాని, నిక్కము గాన; రీ భవదాకృతిం
గంటి భద్రముఁ గంటి; మాంసపుఁ గన్నులం గనబోల; దీ
తొంటిరూపుఁ దొలంగఁ బెట్టుము తోయజేక్షణ! మ్రొక్కెదన్.

10.1-129-తేటగీతి

విలయకాలమందు విశ్వంబు నీ పెద్ద
కడుపులోన దాఁచు కడిమి మేటి
నటుఁడ వీవు; నేఁడు నా గర్భజుఁడ వౌట
పరమపురుష! వేడబంబు గాదె?

10.1-130-తరళము

నళినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెద వంచు నీ
ఖలుఁడు కంసుఁడు పెద్దకాలము కారయింట నడంచె; దు
ర్మలినచిత్తుని నాజ్ఞజేయుము; మమ్ముఁ గావుము భీతులన్;
నులుసు లేక ఫలించె నోచిన నోము లెల్లను నీవయై.

## 10.1-14- దేవకీవసుదేవులపూర్వజన్మ

10.1-131-వచనము

అని యిట్లు దేవకీదేవి విన్నవించిన నీశ్వరుం డిట్లనియె; “నవ్వా! నీవు తొల్లి స్వాయంభువ మన్వంతరంబున పృశ్ని యను పరమపతివ్రతవు; వసుదేవుఁడు సుతపుఁ డను ప్రజాపతి; మీ రిరువురును సృష్టికాలంబున బ్రహ్మపంపునం, బెంపున నింద్రియంబులం జయించి తెంపున వాన గాలి యెండ మంచులకు సైరించి యేకలములై యాకలములు దిని యే కలంకంబును లేక వేండ్రంబుగఁ బండ్రెండువేల దివ్యవర్షంబులు తపంబుల నెపంబున మీ రూపంబులు మెఱయ యోజనాజపంబులు జేసి, డాసి, పేర్చి, యర్చింప మీకు నాకుఁ గలరూపుఁ జూపి యేను తిరంబులగు వరంబులు వేఁడుఁ డనిన మీరు నా మాయం బాయని మోహంబున బిడ్డలు లేని దొడ్డయడ్డంబున దుర్గమం బగు నపవర్గంబుఁ గోరక నా యీడు కొడుకు నడిగిన మెచ్చి యట్ల వరం బిచ్చి మీ కేను పృశ్నిగర్భుం డను నర్భకుండనైతి; మఱియును.

10.1-132-కంద పద్యము

అదితియు కశ్యపుఁ డనగా
విదితుల రగు మీకుఁ గుఱుచవేషంబున నే
నుదయించితి వామనుఁ డన
త్రిదశేంద్రానుజుడనై ద్వితీయభవమునన్

10.1-133-కంద పద్యము

ఇప్పుడు మూఁడవ బాముున
దప్పక మీ కిరువురకునుఁ దనయుఁడ నైతిం
జెప్పితిఁ బూర్వము మీయం
దెప్పటికిని లేదు జన్మమిటపై నాకున్

10.1-134-కంద పద్యము

నందనుఁ డనియుం బరమా
నందంబగు బ్రహ్మ మనియు ననుఁ దలచుచు నా
పెందెరువు నొందెదరు; నా
యందుల ప్రేమమున భవము నందరు మీరల్

### 10.1-15- కృష్ణుడు శిశురూపియగుట

10.1-135-వచనము

అని యిట్లు పలికి యీశ్వరుం డా రూపంబు విడిచి.

10.1-136-కంద పద్యము

ఆప్ప లిడక తలిదండ్రులు
తప్పకఁ దనుఁ జూడ మాయఁ దనరి లలితుఁడై
యుప్పు డటు గన్న పాపని
యొప్పున వేడుకలు చేసె నొకకొన్ని నృపా!

### 10.1-16- కృష్ణుని వ్రేపల్లెకుతరలించుట

10.1-137-వచనము

అంత వసుదేవుండు తనకుం జేయవలసిన పను లీశ్వరుండైన హరివలన నెఱింగిన వాఁడు గావున.

10.1-138-కంద పద్యము

ఆ పురిటి యిల్లు వెలువడి
పాపనిఁ దరలించుకొనుచుఁ బఱచెద ననుచున్

రూపింప నందుభార్యకుఁ

బాప యగుచు యోగమాయ బ్రభవించె నృపా!

10.1-139-వచనము

అయ్యవసరంబున

10.1-140-కంద పద్యము

బిడ్డనిఁ గరముల ఁబొమ్మ్కన

నడ్డంబుగ బట్టి పదము లల్లన యిడుచున్

జడ్డనఁ గావలి వారల

యొడ్డుగడచి పురిటిసాల యొయ్యన వెడలెన్.

10.1-141-వచనము

అంత నట.

10.1-142-కంద పద్యము

నందుని సతికి యశోదకుఁ

బొందుగ హరి యోగమాయ పుట్టిన మాయా

స్పందమున నొక్క యెఱుఁగమి

క్రందుకొనియె నూరివారిఁ గావలివారిన్.

10.1-143-వచనము

అప్పుడు చప్పుడు కాకుండఁ దప్పుటడుగు లిడుచు, నినుప గొలుసుల మెలుసులు వీడిన దాలంబులు మహోత్తాలుండైన బిడ్డనికి నడ్డంబు గాక కీలూడి వీడిపడి, యరళంబులు విరళంబు లయిన సరళంబులగు మొగసాలలం గడచి,

పాఁపఱేఁడు వాకిళ్ళు మరల మూయుచుఁ బడగ లెడగలుగ విప్పి, కప్పి, యేచి, కాచికొని వెంట నంటి రాఁగ దూఁగి నడచునెడ.

10.1-144-కంద పద్యము

ఆ శౌరికిఁ దెరువొసఁగెఁ బ్ర
కాశోద్ధత తుంగ భంగ కలిత ధరాశా
కాశ యగు యమున మును సీ
తేశునకుఁ బయోధి త్రోవ యిచ్చిన భంగిన్.

## 10.1-17- శయ్యననుంచుట

10.1-145-వచనము

ఇట్లు యమున దాఁటి, దూఁటి, చని నందునిమందం జేరి, యందమంద నిద్రంబొంది, యొడ లెఱుంగని గొల్లలం దెలుపనొల్లక , నిత్యప్రసాద యగు యశోదశయ్య నొయ్యన చిన్నినల్లనయ్య నునిచి, చయ్యన నయ్యవ్వ కూఁతు నెత్తుకొని మరల నింటికిఁ బంటింపక వచ్చి యచ్చిఱుతపాపను దేవకి ప్రక్కం జక్క నిడి.

10.1-146-కంద పద్యము

పదముల సంకెల లిడుకొని
మదిఁ దలఁకుచు శూరసుతుడు మందుఁడు బోలెన్
బెదరుగలరీతి దేహము
గదలించుచు నొదిఁగియుండె గఱువతనమునన్

10.1-147-కంద పద్యము

వనజాక్షునిఁ దెచ్చుటయును
దనసుతఁ గొనిపోవుటయును దా నెఱుఁగక మూఁ
గిననిద్ర జొక్కియుండెను
వనజాక్షి యశోద రేయి వసుధాధీశా!

10.1-148-సీస పద్యము

అంత బాలిక యావు రని యేడ్చు చిఱుచప్పు;
డాలించి వేకన నాఁకయింటి
కావలివారు మేల్కని చూచి తలుపుల;
తాళముల్ తొంటివిధమున నుండఁ
దెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్ళాడె;
రమ్ము రమ్మని భోజరాజుతోడఁ
జెప్పిన నాతఁడు చిడిముడి పాటుతోఁ;
దల్పంబుపై లేచి తత్తఱమున

10.1-148.1-తేటగీతి

వెండ్రుకలు వీడఁ బైచీర వ్రేలియాడ
తాల్మి కీలూడ రోషాగ్ని దర్పమాడ
భూరివైరంబుతోఁ గూడఁ బురిటియింటి
జాడఁ జనుదెంచి యా పాపఁ జంపఁ గదియ.

## 10.1-18- దేవకి బిడ్డనువిడువవేడుట

10.1-149-వచనము

అంత దేవకీదేవి యడ్డంబు వచ్చి యిట్లనియె.

10.1-150-ఉత్పలమాల

అన్న! శమింపుమన్న! తగ దల్లుఁడు గాఁ డిది మేనగోడ లౌ
మన్నన జేయు మన్న! విను మానినిఁ జంపుట రాచపాడి గా
దన్న! సుకీర్తివై మనఁగ దన్న! మహాత్ములు పోవు త్రోవఁ బో
వన్న! భవత్సహోదరిఁ గదన్న! నినున్ శరణంబు వేడెదన్.

10.1-151-కంద పద్యము

కట్టా; యార్గురు కొడుకులఁ
బట్టి వధించితివి; యాఁడుఁబడుచిది; కోడల్;
నెట్టన చంపఁగ వలెనే?
కట్టేఁడివి గదన్న! యన్న! కరుణింపఁ గదే.

10.1-152-కంద పద్యము

పుత్రుడు నీ బ్రతుకునకును
శత్రుండని వింటిగాన సమయింపఁ దగున్;
పుత్రులకు నోమ నైతిని
పుత్రీ దానంబు జేసి పుణ్యముఁ గనవే.

## 10.1-19- మాయమింటనుండిపలుకుట

10.1-153-వచనము

అని పయ్యెదఁ జక్కఁగ సవరించుకొనుచుఁ బలవరించుచు; భ్రాంతిపడి కూఁతుం గ్రక్కున నక్కునం జక్క హత్తుకొని, చెక్కుచెక్కున మోపి చక్కన నుత్తరీయాంచలంబున సంచలతం గప్పి చప్పుడుగాఁ గుయ్యిడ; నయ్యెడం గయ్యం బడి వాఁడు పోఁడిమి చెడఁ దోబుట్టువుం దిట్టి, చిట్టిపట్టి నావురని వాపోవఁ

గావరంబున నడుగు లొడిసి తిగిచి వడిం బెడిసిపడం బుడమిపైం బడవ్రేసిన నబ్బాలయు నేలంబడక లీల నెగసి నవ్య దివ్య మాలికా గంధ బంధుర మణి హారాంబరాద్యలంకార మనోహారిణియు, గదా శంఖ చక్ర పద్మ శర చాపాసి శూలధారిణియునై యెనిమిది కరంబులం గరంబొప్పుచు, సిద్ధ చారణ కిన్నర గరుడ గంధర్వాది వైమానిక నికాయంబుకానుకలిచ్చి పొగడ, నెగడుచు నచ్చరల యాట పాటలకు మెచ్చుచు, మింటనుండి కంటఁబడి కంటుపడఁ గంసుని కిట్లనియె.

10.1-154-ఉత్పలమాల

తెంపరివై పొరిం బొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం
జంపితి వింకనైన నుపశాంతి వహింపక ఱాలమీఁద నొ
ప్పింపితి విస్సిరో! యిదియు బీరమె? నా సరసన్ జనించి నిన్
జంపెడు వీరుఁ డొక్క దెస సత్కృతి నొందెడువాడు దుర్మతీ!

10.1-155-వచనము

అని పలికి.

10.1-156-కంద పద్యము

మహనీయ గుణాస్పదయై
మహిలో నా దేవి జనము మన్నింపంగా
బహు నామ నివాసంబుల
బహునామములం జరించె భద్రాత్మికయై.

10.1-157-వచనము

అంత నాఁబోటి పలికిన కలికి పలుకులు ములుకులై, చెవులఁ జిలికిన, నులికిపడి జళుకు గదిరిన మనంబున ఘనంబుగ వెఱఁగంది, కంది, కుందెడు దేవకీవసుదేవుల రావించి, యాద రంబున గారవించి, చేరి వారితో నిట్లనియె.

10.1-158-ఉత్పలమాల

పాపుఁడ; బాలఘాతకుఁడ; బంధు విరక్తుఁడ; దుష్ట చిత్తుఁడన్;
గోపనుఁడన్; జరన్మృతుఁడఁ; గ్రూరుఁడ; బ్రాహ్మణహంత భంగి మీ
పాపల జంపితిన్ బయలి పల్కుల నమ్మితి సాధులార! నా
పాపము లుగ్గడింపక కృపాపరులై కనరే శమింపరే.

10.1-159-ఉత్పలమాల

ఒక్కెడఁ బ్రాణులందఱు నిజోచితకర్మము లోలిఁ ద్రిప్పఁగా
నొక్కొక మేనితో బొడమి యొక్కొక త్రోవను రాకపోకలం
జిక్కులఁ బొందుచుండుదురు; చెల్మిని సంసృతితోడఁ బాయ రే
నెక్కడి హంత? మీ శిశువులెక్కడి హన్యులు? దూఱనేటికిన్.

10.1-160-కంద పద్యము

పగతురఁ జెఱిచితి ననియును
బగతురచేఁ జెడితి ననియు బాలుఁడు తలఁచున్;
బగ చెలుములు లే వాత్మకుఁ
బగచెలుముల కీలు కర్మబంధము సుండీ.

10.1-161-వచనము

అని పలికి కన్నీరు నించి, వగచి, వెఱచుచు, దేవకీవసుదేవుల పాదంబులఁ బట్టుకొని, సంకెలలు విప్పించి, మిక్కిలి యక్కఱ గల వాక్యంబుల నైక్యంబులు నెఱపిన, వారును బరితప్తుం డైన కంసునిఁ జూచి, రోషంబును బాసి; రంత నా వసుదేవుండు బావ కిట్లనియె.

10.1-162-శార్దూల విక్రీడితము

బావా! నీ వచనంబు నిక్కము సుమీ; ప్రాణుల్ గతజ్ఞాను లై
నీవే నంచును లోభ మోహ మద భీ నిర్మిత్రతామోద శో
కావేశంబుల నొండొరుం బొడుతు రేకాకారుఁడై సర్వరూ
పావిష్టుండగు నీశ్వరుం దెలియలే రన్యోన్యవిభ్రాంతులై

## 10.1-20- కంసునికి మంత్రుల సలహా

10.1-163-వచనము

అని యిట్లు బ్రసన్నులైన దేవకీవసుదేవుల యనుజ్ఞ బడసి కంసుం డింటికిం జని యా రేయి గడపి, మఱునాఁడు ప్రొద్దునం గ్రద్దనం దనకుం బరతంత్రులగు మంత్రుల రావించి, యోగనిద్ర వలనం దా వినిన వృత్తాంతం బంతయు మంతనంబున నెఱింగించిన, నపుడు వార లతని కిట్లనిరి.

10.1-164-కంద పద్యము

ఇట్టయినఁ దడయ నేటికి?
పట్టణముల మందలందుఁ బల్లెల నెల్లన్
బుట్టెడి పెరిఁగెడి శిశువులఁ
బట్టి వధించెదము మమ్ముఁ బంపు మధీశా!

10.1-165-మత్తేభ విక్రీడితము

భవదీయోజ్జ్వల బాహు చాప విలసద్బాణావళీ భగ్నులై
దివిజాధీశ్వరు లే క్రియంబడిరొ యే దేశంబులం డాఁగిరో
శివునిం జొచ్చిరొ బ్రహ్మఁ జెందిరొ హరిన్ సేవించిరో మౌని వృ
త్తి వనాంతంబుల నిల్చిరో మనకు శోధింపం దగున్ వల్లభా!

10.1-166-కంద పద్యము

నొచ్చిరి శాత్రవు లనుచును
విచ్చలవిడిఁ దిరుగ వలదు వివిధాకృతులన్
మ్రుచ్చిలివత్తురు వారలు
సచ్చినయందాఁక మఱవఁ జన దధిపునకున్.

10.1-167-కంద పద్యము

ఒత్తికొనుచురానీఁ జనఁ
దెత్తిన రోగముల రిపుల నింద్రియముల ను
త్తృత్తి సమయములఁ జెఱుపక
మెత్తన గారాదు రాదు మీఁద జయింపన్.

10.1-168-మత్తేభ విక్రీడితము

అమరశ్రేణికి నెల్లఁ జక్రి ముఖరుం డా చక్రి యేధర్మమం
దమరున్; గోవులు భూమిదేవులు దితిజ్ఞామ్నాయ కారుణ్య స
త్యములున్ యాగతపోదమంబులును శ్రద్ధాశాంతులున్విష్ణుదే
హము లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్.

10.1-169-వచనము

కావున.

10.1-170-ఉత్పలమాల

చంపుదు మే నిలింపులను? జంకెల అంకెలఁ దాపసావళిం
బంపుదు మే కృతాంతకునిపాలికిఁ? గ్రేపులతోడ గోవులన్
ద్రుంపుదు మే? ధరామరులఁ దోలుదు మే? నిగమంబులన్ విదా
రింపుదు మే? వసుంధర హరింపుదు మే? జననాథ! పంపుమా.

10.1-171-వచనము

అని పలుకు మంత్రుల మంత్రంబుల నిమంత్రితుండై బ్రాహ్మణ నిరోధంబు నిషేధం బని తలంపక కాలపాశబద్ధుండయి విప్రాది సాధుమానవులఁ జంప దానవులం బంపి యంతిపురంబునకుం జనియె; ననంతరంబ యా రక్కసులు వెక్కసంబు లగు మొక్కలంబుల సజ్జనులపజ్జలంబడి తర్జన గర్జన భర్జనాది దుర్జనత్వంబులం జేసి నిర్జించి పాపంబు లార్జించిరి.

10.1-172-ఆటవెలది

వెదకి వెదకి దైత్యవీరులు సాధుల
నడఁప వారి బలము లణఁగిపోయె
యశము సిరియు ధర్మ మాయువు భద్రంబు
నార్యహింసచేయ నడఁగుఁగాదె.

## 10.1-21- కృష్ణునికి జాతకర్మ చేయుట

10.1-173-వచనము

అంత మందలో నందుండు నందనుండు పుట్టుట యెఱింగి మహానందంబున నెఱవాదులగు వేదవిదులం బిలిపించి, జలంబులాడి, శుచియై శృంగారించుకొని, స్వస్తి పుణ్యాహ వచనంబులు చదివించి, జాతకర్మంబు జేయించి, పితృదేవతల నర్చించి క్రేపులతోడఁగూడఁ గైజేసిన పాఁడిమొదవుల రెండులక్షలను గనక కలశ మణి వసన విశాలంబులైన తిల శైలంబుల లేడింటిని భూదేవతల కిచ్చిన.

10.1-174-కంద పద్యము

ఈ యాభీరకుమారుఁడు
శ్రీయుతుడై వీరవైరిజేతయునై దీ
ర్ఘాయుష్మంతుం డగు నని
పాయక దీవించి రపుడు బ్రాహ్మణ జనముల్.

10.1-175-కంద పద్యము

దుందుభులు మొరసె; గాయక
సందోహము పాడె; సూత సముదాయముతో
వందిజనులు కీర్తించిరి
క్రందుగ వీతెంచె భద్రకాహళ రవముల్.

10.1-176-కంద పద్యము

పల్లవ తోరణసురుచిర
వల్లీధ్వజరాజిధూపవాసనములతో
సల్లలితములై యొప్పెను
వల్లవవల్లభుల యిండ్ల వాకిం డ్లెల్లన్

10.1-177-కంద పద్యము

పసుపులు నూనెలు నలఁదిన
పసఁ దనరి సువర్ణబర్హిబర్హప్రభతోఁ
మిసిమి గలిగి వెలుగొందుచుఁ
బసు లన్నియుఁ మందలందుఁ బ్రసరించె నృపా!

10.1-178-కంద పద్యము

క్రేళ్ళుఱికి మసలె లేఁగలు;
మల్లడిగొని ఱంకె లిడియె మదవృషభంబుల్;
పెల్లుగ మొదవులు పొదుఁగుల
జల్లించెం బాలు బాలుసంభవవేళన్

10.1-179-కంద పద్యము

ఆరఁగఁ జదివెడి పొగడెడి
వారికి విద్యలను బ్రతుకువారికి లేమిం
జేరిన వారికి నెల్లను
గోరక మును నందు డిచ్చె గోధనచయముల్.

10.1-180-వచనము

ఆ సమయంబున.

10.1-181-కంద పద్యము

కంచుకములు తలచుట్లును
కాంచన భూషాంబరములుఁ గడు మెఱయఁగ నే

తెంచిరి గోపకు లందఱు
మంచిపదార్థములు గొనుచు మాధవుఁ జూడన్.

10.1-182-కంద పద్యము

ఏతెంచి చూచి చెలఁగుచు
నేతులఁ బెరుఁగులను బాల నీళ్ళను వెన్నం
బ్రీతి వసంతము లాడిరి
యాతురులై సరసభాష లాడుచు గొల్లల్.

10.1-183-వచనము

తదనంతరంబ.

10.1-184-ఆటవెలది

ఏమినోము ఫలమొ యింత ప్రొ ద్దొక వార్త
వింటి మబలలార! వీను లలర
మన యశోద చిన్నిమగవానిఁ గనె నట
చూచి వత్త మమ్మ! సుదతులార!

10.1-185-వచనము

అని యొండొరుల లేపికొని గోపిక లోపికలు లేని చిత్తంబుల నెత్తిన తత్తఱంబు లొత్తుకొన నుదారంబులగు శృంగారంబులతో నిండ్లు వెలువడి.

10.1-186-కంద పద్యము

జడగతులును బలుపిఱుదులుఁ
బిడికెడు నడుములును వలుఁద బిగి చనుఁగవలున్

వెడఁద నయనములు సిరి తడఁ

బడు మోములు భ్రమరచికురభరములు నమరన్.

10.1-187-ఉత్పలమాల

వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ గుచోపరిహారరేఖ ల

ల్లాడఁ గపోలపాలికల హాటకపత్త్రరుచుల్ వినోదనం

బాడఁ బటాంచలంబు లసియాడఁగఁ జేరి యశోద యింటికిన్

జేడియ లేగి చూచి రొగి జిష్ణుని విష్ణునిఁ జిన్నికృష్ణునిన్.

10.1-188-వచనము

చూచి సంతసించి తెచ్చిన కానుక లిచ్చి.

## 10.1-22- జలకమాడించుట

10.1-189-తేటగీతి

పాపనికి నూనెఁ దలయంటి పసుపుఁ బూసి

బోరుకాడించి హరిరక్ష యొమ్మటంచు

జలము లొక కొన్ని చుట్టి రాఁజల్లి తొట్ల

నునిచి దీవించి పాడి ర య్యువిద లెల్ల.

10.1-190-కంద పద్యము

జోజో కమలదళేక్షణ!

జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!

జోజో పల్లవకరపద!

జోజో పూర్ణేందువదన! జోజో యనుచున్.

10.1-191-వచనము

ఇవ్విధంబున.

10.1-192-కంద పద్యము

పలు తోయంబులు జగములఁ

బలు తోయములందు ముంచి భాసిల్లెడి యా

పలుతోయగాఁడు వల్లవ

లలనా కరతోయములఁ జెలంగుచుఁ దడియున్.

10.1-193-కంద పద్యము

లోకములు నిదుర బోవఁగ

జోకొట్టుచు నిదురబోని సుభఁగుడు రమణుల్

జోకొట్టి పాడ నిదురం

గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱవకయున్.

10.1-194-సీస పద్యము

ఏ బాము లెఱుగక యేపారు మేటికిఁ;

బసుల కాపరియింటఁ బాము గలిగె;

నే కర్మములు లేక యెనయు నెక్కటికిని;

జాత కర్మంబులు సంభవించె;

నే తల్లి చనుఁబాలు నెఱుఁగని ప్రోఢ య;

శోద చన్నులపాల చొరవ నెఱిఁగె;

నే హాని వృద్ధులు నెఱుఁగని బ్రహ్మంబు;

పొదిఁగిటిలో వృద్ధిఁ బొందఁ జొచ్చె;

10.1-194.1-తేటగీతి

నే తపములనైన నెలమిఁ బండనిపంట
వల్లవీ జనముల వాడఁ బండె;
నే చదువుల నైన నిట్టిట్టి దనరాని
యర్థ మవయవముల నంద మందె.

10.1-195-మత్తేభ విక్రీడితము

చెయువుల్ చేయుతఱిన్ విధాతకరణిం జెన్నొందు సంతోష దృ
ష్టియుతుండై నగుచున్ జనార్దనుని మాడ్కిం బొల్చు రోషించియు
న్న యెడన్ రుద్రునిభంగి నొప్పును సుఖానందంబునం బొంది త
న్మయుడై బ్రహ్మముభాతి బాలుఁడమరున్నాభీరుల బాల్యంబునన్.

10.1-196-వచనము

అయ్యవసరంబున

10.1-197-ఆటవెలది

కొడుకుఁ గన్న వేడ్క కొనసాగ రోహిణిఁ
జీరఁ బంచి చిత్రచేలములను
మండనముల నిచ్చి మన్నించె నందుఁ డా
యంబుజాక్షి ప్రీతయై చరించె.

## 10.1-24- నందుడువసుదేవునిచూచుట

10.1-198-వచనము

అది మొదలు మొదవుల కదుపులు పొదువులు గలిగి యుండె; నంత నందుండు గోపకుల ననేకుల గోకులరక్షకు దక్షులైన వారిని నియమించి మధురకుం జని కంసునకు నేఁటేఁటం బెట్టెడి యరింబెట్టి వీడ్కొని వసుదేవుని కడకుం జని యథోచితంబుగా దర్శించిన.

10.1-199-కంద పద్యము

నందుని గనుఁగొని ప్రాణముఁ
బొందిన బొందియునుఁ బోలెఁ బొలుపారుచు నా
నందాశ్రులు గడకన్నుల
గ్రందుకొనం గేలుసాఁచి కౌఁగిటఁ జేర్చెన్.

10.1-200-వచనము

మఱియుఁ గౌఁగిలించుకొని, సుఖాసీనునింగాఁజేసి, వసుదేవుండు దన కొడుకువలని మోహంబు దీపింప నందుని కిట్లనియె.

10.1-201-కంద పద్యము

సంతతి లేదని మును ఘన
చింతనముల మునిఁగి ముదిసి చిక్కిన నీకున్
సంతతి గలిగెను భాగ్యము;
సంతతిహీనునికి సౌఖ్యసంతతి గలదే?

10.1-202-కంద పద్యము

పొడగంటి నిన్ను బ్రతికితిఁ
గడచితి నాపదల నింకఁ గార్యములం దే

యొడమడుగు లేని నెచ్చెలిఁ
బోడగాంచుట చచ్చి మరలఁ బుట్టుటగాదే.

10.1-203-కంద పద్యము

పలుపాటులఁబడు జనులకు
నిల నొకచో నుండఁ గలదె? యేఱులవెంటం
గలసి చను ప్రాఁకు లన్నియుఁ
బలువెంటలఁ బోవుఁగాక పాయక యున్నే?

10.1-204-మత్తేభ విక్రీడితము

పలు రోగంబుల నొందకున్నవె పసుల్? పాలిచ్చునే ధేనువుల్?
గొలఁకుల్ వాగులు వారిపూరితములే? గోష్ఠప్రదేశంబులం
బులులున్ దుప్పులు సంచరింపవుగదా; పొల్పారునే ఘోషముల్?
కలవే పచ్చని పూరిజొంపములు తత్కాంతార భాగంబులన్?

10.1-205-కంద పద్యము

తన పుత్ర మిత్ర ముఖరులఁ
దనుపక చూడకయు వారు దఱిఁగి నశింపన్
మనుచు గృహమేధియాశ్రమ
మున నుండెడువాని కొక్క మోదము గలదే?

10.1-206-కంద పద్యము

నీ కాంతయొద్ద నీవును
నీ కాంతయు గారవింప నినుఁ దండ్రిగ నా

లోకించుచు నీ మందను
నా కొడు కున్నాఁడె? నంద! నందాన్వితుఁడై.

## 10.1-25- వసుదేవనందులసంభాషణ

10.1-207-వచనము

అనిన నందుం డిట్లనియె.

10.1-208-శార్దూల విక్రీడితము

నీకున్ దేవకికిన్ జనించిన సుతానీకంబుఁ దోడ్తోడ ము
న్నీకంసుండు వధించె; మీ సుతఁ దుదిన్ హింసింపఁ జే తప్పి తా
నాకాశంబున కేగె; బాల యిది; దైవాధీనమాపద్దశన్
శోకంబందునె తజ్ఞుఁ; డూఱడిలు నా సూనుండు నీ సూనుఁడే.

10.1-209-వచనము

అనిన వసుదేవుండు నందునికి మఱియు నిట్లనియె.

10.1-210-కంద పద్యము

జనపతి కరి యుడితివి; మముఁ
గనుఁగొంటివి; మేము నిన్నుఁ గంటిమి; మేల
య్యెను; బొమ్మింకను గోకుల
మున నుత్పాతములు దోఁచు మునుకొనవలయున్.

10.1-211-వచనము

అని పలికి వసుదేవుండు నందాదులైన వల్లవుల వీడ్కొలిపిన వారలు గొబ్బున
వడిగల గిబ్బలం బూనిన శకటంబులు ప్రకటంబులుగ నెక్కి తమతమ

పల్లెలత్రోవలుపట్టి చని రా నందుండు ప్రతీతంబులైన యుత్పాతంబులు ముందరఁ బొడగని శౌరి తనతోఁ బలికిన పలుకులు తప్పవనుచుఁ దలంచుచుండె; నంత.

## 10.1-26- పూతన వ్రేపల్లెకొచ్చుట

10.1-212-సీస పద్యము

కంసుపంపున బాలఘాతని పూతన;

పల్లెల మందలఁ బట్టణముల

నిల యెల్లచో బాలహింస గావించుచుఁ;

జనుచు నెవ్వని పేరు శ్రవణవీధిఁ

బడిన యంతన సర్వభయనివారణ మగు;

నట్టి దైత్యాంతకుం డవతరించి

యున్న నందునిపల్లె కొకనాడు ఖేచరి;

యై వచ్చి యందు మాయాప్రయుక్తిఁ

10.1-212.1-తేటగీతి

గామరూపిణి యై చొచ్చి కానకుండ

నరిగి యిల్లిల్లు దప్పక యరసికొనుచు

నందగృహమున బాలునినాద మొకటి

విని ప్రమోదించి సుందరీవేష యగుచు.

10.1-213-మత్తకోకిలము

క్రాలుకన్నులు గుబ్బచన్నులుఁ గందుఁబొందని చందురుం

బోలు మోమును గల్గు లేదను బుద్ధి దూఱని కౌను హే

రాళమైన పిఱుందు పల్లవరాగ పాద కరంబులుం

జాల దొడ్డగు కొప్పు నొప్పగ సర్వమోహనమూర్తితోన్

10.1-214-మానినీ

కాంచనకుండలకాంతులు గండయుఁ;
 గంబునఁ గ్రేళ్ళుఱుకన్ జడపై
మించినమల్లెల మేలిమి తావులు;
 మెచ్చి మదాళులు మింటను రా
నంచిత కంకణహారరుచుల్ చెలు;
 వారఁగఁ బైవలు వంచల నిం
చించుక జారఁగ నిందునిభానన;
 యేగెఁ గుమారుని యింటికినై.

10.1-215-వచనము

ఆ సమయంబునన్.

## 10.1-27- పూతన బాలకృష్ణునిచూచుట

10.1-216-మత్తేభ విక్రీడితము

సిరి మమ్ముఁన్ బ్రతుకంగఁజూచుకొఱకై శృంగారవేషంబుతో
నరుదేనొప్పు నటంచు గోపికలు జిహ్వాల్ రాక మోహించి త
త్పరులై చూడ లతాంగి పోయి కనియెం బర్యంకమధ్యంబునం
బరు భస్మానలతేజు దుర్జనవధప్రారంభకున్ డింభకున్.

10.1-217-వచనము

కని కదియవచ్చు సమయంబున.

10.1-218-శార్దూల విక్రీడితము

ఆ లోకేశ్వరుఁ డా చరాచరవిభుం డా బాలగోపాలుఁ డా
బాలధ్వంసిని గొంటు కంటిడి వెసన్ బాలింతచందంబునన్
బాలిండ్లన్ విష మూని వచ్చుట మదిన్ భావించి లో నవ్వుచున్
గాలుం గేలు నెఱుంగకున్న కరణిం గన్మోడ్చి గుర్వెట్టుచున్.

## 10.1-28- పూతన కృష్ణునిముద్దాడుట

10.1-219-కంద పద్యము

ఆ పాపజాతి సుందరి
యా పాపని పాన్పుఁ జేర నరిగి కరములన్
లేపి చనుంగవ శిశువున్
మోపుచు ముద్దాడి శిరము మూర్కొని పలికెన్.

10.1-220-కంద పద్యము

చను నీకు గుడుపఁజాలెడి
చనువారలు లేరు; నీవు చనవలె ననుచుం
జనుఁగుడుపి మీఁద నిలుకడఁ
జనుదాన ననంగ వేడ్కఁ జనుఁ జనుఁ గుడుపన్.

10.1-221-కంద పద్యము

నా చనుఁబా లొక గ్రుక్కెఁడు
నో! చిన్నికుమార! త్రావు మెయ్యన పిదపన్
నీ చెలువ మెఱుఁగ వచ్చును
నా చెలువము సఫల మగును నళినదళాక్షా!

10.1-222-వచనము

అని బాలు నుద్దేశించి ముద్దాడెడి భంగి మాటలాడెడి చేడియం జూచి.

## 10.1-29- పూతన కృష్ణునికిపాలిచ్చుట

10.1-223-మత్తేభ విక్రీడితము

వనితా! ముట్టకుమమ్మ; చన్నుఁగుడుపన్వల్దమ్మ; నీ చన్నుమా
తనయుం డొల్లఁడు; పాసిపొమ్మని యశోదా రోహిణుల్ చీరఁ గై
కొన కీక్షించుచు మాయఁ బన్ని పెలుచంగోశంబులో వాలు మె
ల్పున రాజిల్లుచు మాటమెత్తఁదనమున్ లోవాడియున్నేర్పడన్.

10.1-224-వచనము

కదిసి కలికి పలుకులు పలుకుచు నులుకుచెడి జళుకు చొరక యెదుర నిదురంగదిరిన ఫణిని ఫణియని యెఱుంగక గుణమతిం దిగుచు జడమతి బెడంగునఁ గఱటిజఱభితెఱవ వెరవునం జనుదెంచి పఱపునడుమ నొఱపు గలిగి మెఱయుచుఁ గనుంగవం దెఱవక వెఱపుమఱపునెఱుంగక కొమరుమిగులు చిఱుతకొమరునిం దిగిచి తొడలనడుమనిడుకొని యొడలు నివురుచు నెడ నెడ మమతం గడలుకొలుపుచు నాఁకొన్న చిన్నియన్న! చన్ను గుడువు మని చన్నిచ్చు సమయంబున.

## 10.1-30- పూతనసత్తువ పీల్చుట

10.1-225-సీస పద్యము

మేల్కొన్న తెఱఁగున మెల్లనఁ గనువిచ్చి;
క్రేగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి
యావులించుచుఁ జేతు లాకసంబునఁ జాఁచి;

యొదిఁగిలి యాఁకొన్న యోజనూది
బిగిచన్నుఁగవఁ గేలఁ బీడించి కబళించి;
గ్రుక్క గ్రుక్కకు గుటుగుటుకు మనుచు
నొక రెండు గ్రుక్కల నువిద ప్రాణంబులు;
సైతము మేనిలో సత్వ మెల్లఁ

10.1-225.1-తేటగీతి

ద్రావె నదియును గుండెలు దల్లడిల్లఁ
జిమ్మ దిరుగుచు నిలువక శిరము వ్రాల
నితర బాలుర క్రియవాఁడ వీవు గావు
చన్ను విడువుము విడువుము చాలు ననుచు.

## 10.1-31- పూతననేలగూలుట

10.1-226-కంద పద్యము

నిబ్బరపు దప్పి మంటలు
ప్రబ్బిన ధృతి లేక నేత్ర పద హస్తంబుల్
గొబ్బున వివృతములుగ నా
గుబ్బనుచున్నట్టి కూఁతఁ గూలెన్నేలన్.

10.1-227-మత్తేభ విక్రీడితము

అదరెం గొండలతోడ భూమి; గ్రహతారానీకముల్ మింటిపై
బెదరెన్; దిక్కుల మారు మ్రోత లెసఁగెన్; భీతిల్లి లోకంబులుం
గదలం బాఱెను; వజ్రభిన్నగిరిరేఖం బూర్వదేహంబుతోఁ
ద్రిదశధ్వంసిని గూలి కుయ్యిడిన దద్దీర్ఘోరుఘోషంబునన్.

10.1-228-కంద పద్యము

అప్పుడు దెప్పరమగు నా
చప్పుడు హృదయములఁ జొచ్చి సందడిపెట్టన్
ముప్పిరిఁగొనిపడి రెఱుకలు
దప్పి ధరన్ గొల్ల లెల్లఁ దల్లడపడుచున్

10.1-229-కంద పద్యము

ఆ జలధి రండ రక్కసి
నైజశరీరంబు నేల నలియంబడినన్
యోజనమున్నర మేర ధ
రాజంబులు నుగ్గులయ్యె రాజవరేణ్యా!

10.1-230-సీస పద్యము

దారుణ లాంగూలదండ దంతంబులు;
నగ గహ్వరముఁ బోలు నాసికయును
గండశైలాకృతి గల కుచయుగమును;
విరిసి తూలెడు పల్ల వెండ్రుకలును
జీఁకటినూతులఁ జెనయు నేత్రంబులుఁ;
బెనుదిబ్బఁ బోలెడి పెద్ద పిఱుఁదుఁ
జాఁగుకట్టలఁ బోలు చరణోరుహస్తంబు;
లింకినమడువుతో నెనయు కడుపుఁ

10.1-230.1-తేటగీతి

గలిగి షట్క్రోశ దీర్ఘమై కదిసి చూడ

భయదమగు దాని ఘనకళేబరముఁ జూచి
గోపగోపీజనంబులు గుంపుగూడి
బెగడుచుండిరి మనముల బెదురు గదిరి.

10.1-231-వచనము

ఇవ్విధంబునన్.

10.1-232-కంద పద్యము

ఆ తఱిఁ గుడువఁగ నడచెను
నూతనఫుల్లాబ్జలోచనుఁడు హరి మృత్యు
ద్యోతనఁ గృతమునిసముదయ
యాతనఁ బూతన నెఱింగి యాతనలీలన్.

10.1-233-కంద పద్యము

విషధరరిపుగమనునికిని
విషగళసఖునికిని విమల విషశయనునికిన్
విషభవభవజనకునికిని
విషకుచచనువిషముఁగొనుట విషమే తలపఁన్?

10.1-234-వచనము

అంత నా గోపగోపీజనంబులు దెలిసి రోహిణీయశోదలం గూడుకొని బెగ్గడిలక డగ్గఱి.

10.1-235-శార్దూల విక్రీడితము

నేలంగూలిన దాని పెన్నురముపై నిర్భీతిఁ గ్రీడించు నో!

బాలా! రమ్మని మూపుఁ జేర్చుకొని సంస్పర్శించి యూరార్చుచున్
గోలాంగూలముఁ ద్రిప్పి గోపురజమున్ గోమూత్రముం జల్లి త
ద్బాలాంగంబుల గోమయం బలఁది రా పండ్రెండు నామంబులన్.

10.1-236-వచనము

మఱియు నంతటం దనియక గోపిక లాచమనంబు జేసి దక్షులై, మునుపుగాఁ దమకు రక్షాకరంబగు బీజన్యాసంబుచేసికొని, చిన్నియన్న నీ యడుగు లజుండును జానువు లననిలుండును దొడల యజ్ఞుండును, గటితలం బచ్యుతుండును, గడుపు హయాస్యుండును, హృదయంబు కేశవుండు, నురము నీశుండును, గంఠంబు నినుండును, భుజంబుల జతుర్భుజుండును, ముఖంబు త్రివిక్రముండును, శిరం బీశ్వరుండును రక్షింతురు; ముందు చక్రియు, వెనుక గదాధరుండైన హరియుఁ, బార్శ్వంబుల ధనుర్ధరుండైన మధువైరియు నసిధరుండగు జనార్దనుండును, గోణంబుల శంఖచక్ర గదాధరుండైన యురుగాయుండును, మీఁదు నుపేంద్రుడును గ్రిందు దార్క్ష్యుండు, నంతటను హలధరుండగు పురుషుండును గాతురు; నీ యింద్రియంబుల హృషీకేశుండును, బ్రాణంబుల నారాయణుండును, జిత్తంబు శ్వేతద్వీపపతియును, మనంబు యోగీశ్వరుండును, బుద్ధిని బృశ్నిగర్భుండు, నహంకారంబున భగవంతుండైన పరుండును బాలనంబుచేయుదురు; నీవు క్రీడించునెడ గోవిందుండును, శయనించు తఱి మాధవుండును, నడచువేళ వైకుంఠుండును, గూర్చున్న సమయంబున శ్రీపతియును, గుడుచు కాలంబున సర్వభక్షకుం డయిన యజ్ఞభుజుండు నే మఱకుండుదురు; నిన్నుఁ బేర్కొనిన దుస్స్వప్న వృద్ధబాలగ్రహంబులును, గూశ్మండ, డాకినీ, యాతుధానులును భూత ప్రేత యక్ష రాక్షస పిశాచ వినాయకులును, గోటరాదులును జ్యేష్ఠాది భూతనాథులును,

మాతృకాదిగణంబులు నశియింతురు; నీ యందుఁ బ్రాణేంద్రియ శరీరనిరోధంబు లైన యున్మాదంబులు నపస్మారంబులును మహోత్పాతంబులును బొందకుండుంగావుత యని రక్షచేసి దీవించి రంత.

10.1-237-కంద పద్యము

ఆ పెద్ద వేడబంబుల
పాపనికిని జన్నుఁగుడిపి పానుపుపై సం
బ్రాపించి కప్పి కూరుకు
మో పాపఁడ! యని యశోద యెయ్యనఁ బాడెన్.

10.1-238-వచనము

అంత నందుండు మొదలయిన గోపకులు మధురనుండి వచ్చి రక్కసి మేనుఁ గని వెఱఁగుపడి "మున్ను వసుదేవుం డుత్పాతంబు లెఱింగి చెప్పె; నతండు మహాయోగి" యని పొగిడి కఠోరం బగు పూతన యొడలు గుఠారంబుల నఱికి తమ కుటీరంబులకుం దవ్వగు ప్రదేశంబున పటీరంబుల దహనంబు సంగ్రహించి దహించిరి; అంత.

10.1-239-ఆటవెలది

పొగలిపొగిలి కాలు మగువదేహంబున
నగరు పరిమళముల పొగలు వెడలె
దేహకల్మషములు శ్రీహరి ముఖమునఁ
ద్రావఁబడుటఁ జేసి భూవరేణ్య!

10.1-240-కంద పద్యము

హరి దనమీఁదం బదములు
గరములు నిడి చన్నుగుడిచి కదిసినమాత్రన్
హరిజనని పగిదిఁ బరగతి
కరిగెను దురితములు బాసి యసురాంగనయున్.

10.1-241-కంద పద్యము

వెన్నుని కొకమఱి విషమగు
చన్నిచ్చిన బాలహంత్రి చనెనట దివికిన్
వెన్నునిఁ గని పెంచుచుఁ దన
చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే?

10.1-242-కంద పద్యము

హరిఁగని చన్నులు గుడిపెడి
తరుణులు ప్రాపించు పదము తలఁపఁగ వశమే?
హరి యారగించుటకుఁ బా
ల్గురిసిన ధేనువులు ముక్తి కొనలఁ జరించున్.

10.1-243-కంద పద్యము

ఆ పూతన మెయిగంధము
గోపాలు రెఱింగి యిట్టి కువనిత యొడలం
దీపాటి స్వాదుగంధము
ప్రాపించెనె యనుచుఁ జనిరి పల్లెల కధిపా!

10.1-244-వచనము

అంత నందుండు పరమానందంబున నింటికిఁ జని ప్రేతలచేత రక్కసిచేత లన్నియు నెఱింగి వెఱఁగుపడి పాపని లేపి శిరంబు మూర్కొని ముద్దాడి ముదంబున నుండె;" నని చెప్పిన విని పరీక్షిన్నరేంద్రుఁ డిట్లనియె.

10.1-245-కంద పద్యము

ఏయే యవతారంబుల
నే యే కర్మములు జేసె నీశుఁడు హరి భ
ద్రాయతనము లన్నియు వినఁ
బాయదు చిత్తంబు చెవులపండువు లయ్యెన్.

10.1-246-కంద పద్యము

ఉరుసంసారపయోనిధి
తరణంబులు పాపపుంజ దళనంబులు శ్రీ
కరణంబులు ముక్తి సమా
చరణంబులు బాలకృష్ణు సంస్మరణంబుల్.

10.1-247-వచనము

అని "తరువాత బాలకృష్ణుం డేమి చేసె నా యందుఁ గృపగలదేనిం జెప్పవే" యని యడిగిన రాజునకు శుకుం డిట్లనియె.

## 10.1-32- యశోద కృష్ణుని తొట్లనిడుట

10.1-248-సీస పద్యము

బాలకుం డొదిగిలఁ బడనేర్చెనని జన్మ;
నక్షత్రమం దొకనాడు నందు

పొలతి వేడుకతోడఁ బొరుగు ప్రేతలఁ జీరి;
వాదిత్రగీతారవంబు చెలఁగ
విప్రులతోఁగూడ వేదమంత్రంబుల;
నభిషేచనాదిక మాచరించి
వారి దీవెన లొంది వారికి మొదవులు;
నన్నంబు చీరలు నడిగినట్టు

10.1-248.1-తేటగీతి

లిచ్చి బాలుఁ దియ్య మెసఁగఁ బానుపుఁ జేర్చి
నిదురఁబుచ్చి గోపనివహమునకు
గోపికలకుఁ బూజ గొమరారఁ జేయుచు
జనని కొడుకు మఱచె సంభ్రమమున.

## 10.1-33- కృష్ణుడు శకటము దన్నుట

10.1-249-వచనము

ఆ సమయంబున.

10.1-250-కంద పద్యము

నిదురించిన శిశు వాకొని
కిదుకుచుఁ జనుఁ గోరి కెరలి కిసలయ విలస
న్మృదు చక్రచాపరేఖా
స్పద పదమునఁ దన్నె నొక్క బండిన్ దండిన్.

10.1-251-కంద పద్యము

శకటము హరి దన్నిన దివి
బ్రకటం బై యెగసి యిరుసు భరమునఁ గండ్లున్
వికటంబుగ నేలంబడె
నకటా! యని గోపబృంద మాశ్చర్యపడన్.

10.1-252-వచనము

అప్పు డందున్న సరసపదార్థంబులు వ్యర్థంబులై నేలంగూలుటం జూచి యశోదానంద ముఖ్యులైన గోపగోపికాజనంబులు పనులు మఱచి పల్బంబులు మాని యుబ్బుచెడి వెఱపులు ఘనంబులుగ మనంబులందుఁ గదుర.

10.1-253-కంద పద్యము

మిన్నున కూరక సెగయదు
తన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డీ
చిన్నికుమారుఁడు తేరే
విన్నునువున నెగసె దీని విధ మెట్టిదియో.

10.1-254-వచనము

అని వితర్కించు సమయంబున

10.1-255-కంద పద్యము

బాలకుఁ డాకొని యేడ్చుచు
గా లెత్తినఁ దాఁకి యెగసెఁ గాని శకట మే
మూలమున నెగయ దని త
ద్బాలుని కడ నాడుచుండి పలికిరి శిశువుల్.

10.1-256-వచనము

ఇట్లు శిశువులు పలికిన పలుకులు విని.

10.1-257-శార్దూల విక్రీడితము

బాలుం డెక్కడ? బండి యెక్కడ? నభోభాగంబుపైఁ జేడ్పడం
గాలం దన్నుట యెక్క? డేల పడుచుల్ గల్లాడి? రీ జడ్డు ప
ల్కే లోకంబున నైనఁ జెప్పఁబడునే? యే చందమో కాక యం
చాలాపించుచుఁ బ్రేలు ప్రేతలు ప్రభూతాశ్చర్యలై రంతటన్.

10.1-258-వచనము

అప్పుడా బాలుని రోదనంబు విని యశోద పఱతెంచి.

10.1-259-ఆటవెలది

అలసితివి గదన్న! యాకొంటివి గదన్న!
మంచి యన్న! యేడ్వ మాను మన్న!
చన్నుఁగుడువు మన్న! సంతసపడు మన్న!
యనుచుఁ జన్నుఁగుడిపె నర్భకునకు.

10.1-260-వచనము

అంత నబ్బాలునిమీన బాలగ్రహంబు సోఁకునుగదా యని శంకించి గోపకు లనేకు లనేక బలి విధానంబులు చేసిరి; బ్రాహ్మణులు దధికుశాక్షతంబుల హోమంబు లాచరించిరి; ఋగ్యజు స్సామ మంత్రంబుల నభిషేచనంబులు చేయించి స్వస్తిపుణ్యాహ వచనంబులు చదివించి కొడుకున కభ్యుదయార్థంబు నందుం

డలంకరించిన పాఁడిమొదవుల విద్వజ్జనంబుల కిచ్చి వారల యాశీర్వాదంబులు గైకొని ప్రమోదించె" నని చెప్పి శుకుం డిట్లనియె.

10.1-261-కంద పద్యము

కొడుకు నొకనాడు తొడపై
నిడుకొని ముద్దాడి తల్లి యెలమి నివురుచోఁ
గడుదొడ్డ కొండ శిఖరము
వడువున వ్రేఁ గయ్యె నతఁడు వసుధాధీశా!

10.1-262-కంద పద్యము

బరువైన కొడుకు మోవను
వెరవిడి యిలమీఁదఁ బెట్టి వెఱచి జనని దా
ధరఁ గావఁ బుట్టిన మహా
పురుషుఁడు గాఁబోలు ననుచు బుద్ధిఁ దలంచెన్.

## 10.1-35- తృణావర్తుడు కొనిపోవుట

10.1-263-వచనము

అప్పుడు.

10.1-264-కంద పద్యము

ఖరుఁడగు కంసునిపంపున
నరిగి తృణావర్తుఁ డవని కవచాటముగాఁ
సురకరువలి యై బిసబిస
నరు దరు దన ముసరి విసరి హరిఁ గొనిపోయెన్.

10.1-265-కంద పద్యము

సుడి యెఱుఁగని హరి సుడివడ
సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడి యా
సుడిగాలి ధూళి కన్నుల
సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా!

10.1-266-వచనము

మఱియు నవ్వలయపవనదనుజుండు విలయపవనుని తెఱంగునం గసిమసంగి ముసరి మసరుకవిసి విసిరెడి సురకరువలిం బొడమిన పుడమిరజంబు వడి నెగసి గగనమున మెఱసి తరణి కిరణములకు మఱుఁగుపడిన నిబిడ మగు బెడిదంపు తిమిరమున దశదిశ లెఱుంగఁబడక గోకులం బాకులంబు నొంద నొండొరుల నెఱుంగక బెండుపడుచున్న జనంబుల మనంబుల ఘనంబగు భయంబు రయంబునం జెంద నదభ్రపరిభ్రమణ శబ్దంబున దిగంతంబులు చెవుడుపడి పరిభ్రాంతంబులుగ నొక్క ముహూర్తమాత్రంబున భువనభయంకరత్వంబు దోఁచె; నా సమయంబున.

10.1-267-ఉత్పలమాల

పాపనిఁ జూడఁ గానక విపద్దశ నొంది కలంగి తల్లి యో
పాపఁడ! బాలసూర్యనిభ! బాలశిరోమణి! నేడు గాలికిం
జేపడిపోయితే యనుచుఁ జీరుచు దైవముఁ జాల దూఱుచుం
దాపము నొంది నెవ్వగలడయ్యుచుఁ గుందుచు బిట్టు గూయుచున్

10.1-268-కంద పద్యము

సుడిగాలి వచ్చి నిన్నున్

సుడిగొని కొనిపోవ మింట సుడిసుడి గొనుచున్
బెడఁ గడరెడు నా ముద్దుల
కొడుకా! యేమంటి వనుచు ఘోరం బనుచున్

10.1-269-ఉత్పలమాల

ఇక్కడఁ బెట్టితిం దనయుఁ డిక్కడ నాడుచు నుండె గాలి దా
నెక్కడినుండి వచ్చె శిశు వెక్కడి మార్గము పట్టిపోయె నే
నెక్కడఁ జొత్తు నంచుఁ గమలేక్షణ గ్రేపుఁ దొఱంగి ఖిన్నయై
పొక్కుచు వ్రాలు గోవు క్రియ భూస్థలి వ్రాలె దురంత చింతయై

10.1-270-కంద పద్యము

పాపనికై యిటు పొగిలెడి
యా పాపని తల్లిఁ జూచి యారటపడుచున్
గోపాలసతులు బాష్పజ
లాపూరితనయన లైరి యార్తిం బడుచున్

10.1-271-శార్దూల విక్రీడితము

ఆలోఁ జక్రసమీరదైత్యుఁడు మహాహంకారుఁడై మింటికిన్
బాలుం దోకొని పోయిపోయి తుదిఁ దద్భారంబు మోవన్ బల
శ్రీ లేమిం బరిశాంత వేగుఁ డగుచుం జేష్టింపఁగా లేక ము
న్నీలా గర్భకుఁ జూడ నంచు నిటమీఁ దెట్లంచుఁ జింతించుచున్.

10.1-272-వచనము

అట్లు దనుజుండు చింతించుచున్న సమయంబున.

10.1-273-కంద పద్యము

బాలద్విరద కరంబులఁ
బోలెడి కరములను దనుజ బొందుగు బిగియం
గీలించి వ్రేలఁ బడియెను
బాలకుఁ డొక కొండభంగి బరు పై యధిపా!

10.1-274-కంద పద్యము

మెడ బిగియఁబట్టుకొని డిగఁ
బడియెడి బాలకునిచేతఁ బర్వతనిభుచే
విడివడఁజాలక వాఁ డురిఁ
బడి బెగడెడు ఖగము భంగి భయముం బొందెన్.

10.1-275-కంద పద్యము

హరి కరతల పీడనమునఁ
బరవశుఁడై ఱాలమీఁద భగ్నాంగకుఁ డై
సురవైరిభటుఁడు గూలెను
బురభంజను కోలఁ గూలు పురముం బోలెన్.

10.1-276-వచనము

అంత గోపకాంత లంతయుం గని రోదనంబులు మాని సమ్మోదంబున విక్కవిరిసి రక్కసుని యురమున మురువు గలిగి బరువులేక వ్రేలు బాలునిం గొనివచ్చి ముచ్చిరుచున్న తల్లి కిచ్చి రప్పుడు గోపగోపికాజనంబు లందఱు దమలో నిట్లనిరి.

10.1-277-కంద పద్యము

రక్షణము లేక సాధుఁడు
రక్షితుఁ డగు సమతఁ జేసి రాయిడు లందున్
రక్షణములు వెయి గలిగిన
శిక్షితుఁ డగు ఖలుఁడు పాపచిత్తుం డగుటన్.

10.1-278-మత్తేభ విక్రీడితము

గత జన్మంబుల నేమి నోఁచితిమొ? యాగశ్రేణు లేమేమి చే
సితిమో? యెవ్వరి కేమి పెట్టితిమొ? యే చింతారతింబ్రొద్దు పు
చ్చితిమో? సత్యము లేమి పల్కితిమొ? యే సిద్ధప్రదేశంబుఁ ద్రొ
క్కితిమో? యిప్పుడు చూడఁగంటిమిచటంగృష్ణార్భకున్నిర్భయున్.

## 10.1-36- పాలుతాగివిశ్వరూపప్రదర్శన

10.1-279-వచనము

అని పలికి రంత నందుండు మున్ను దనకు వసుదేవుండు జెప్పిన మాటలకు వెఱంగుపడుచుండె మఱియును.

10.1-280-సీస పద్యము

జననాథ! యొకనాడు చన్ను చేపినఁ దల్లి;
చిన్నిముద్దులకృష్ణుఁ జేరఁ దిగిచి
యెత్తి పెందొడలపై నిడికొని ముద్దాడి;
చన్నిచ్చి నెమ్మోము చక్క నివిరి
యల్లని నగవుతో నావులించిన బాలు;
వదన గహ్వరమున వారినిధులు

దిశలు భూమియు వనద్వీపశైలంబులు;
నేఱులు గాలియు నినుడు శశియు

10.1-280.1-ఆటవెలది

దహనుఁ డాకసంబు దారలు గ్రహములు
నఖిలలోకములు చరాచరంబు
లైన భూతగణము లన్నియు నుండుటఁ
జూచి కన్నుమోడ్చి చోద్యపడియె.

10.1-281-వచనము

అంత నొక్కనాడు వసుదేవు పంపున యాదవ పురోహితుం డైన గర్గుండు మందకుం జనుదెంచిన నందుం డతనిఁ గనుంగొని లేచి నిలిచి కృతాంజలి యై.

10.1-282-కంద పద్యము

కోరి భజించెను నందుఁడు
సారగుణాచారమార్గు సత్సంసర్గు
న్నారాధితభర్గున్ మతి
దూరితషడ్వర్గుఁ గుజన దుర్గున్ గర్గున్.

10.1-283-వచనము

మఱియుఁ దగిన సత్కారంబులు చేసి ఇట్లనియె.

10.1-284-కంద పద్యము

ఊరక రారు మహాత్ములు
వా రథముల యిండ్లకడకు వచ్చుట లెల్లం

గారణము మంగళములకు
నీ రాక శుభంబు మాకు నిజము మహాత్మా!

10.1-285-శార్దూల విక్రీడితము

జ్యోతిశ్శాస్త్రుల కెల్ల మేటరివి తేజోమూర్తి వాశాంతవి
ఖ్యాతస్ఫూర్తివి బ్రహ్మబోధనుఁడ వాకర్ణింపు నా పల్కు ని
ర్ణీతుండైన గురుండు మానవులకున్ విప్రోత్తముం డండ్రు నీ
చాతుర్యంబున నీ కుమారులకు సంస్కారంబుఁ గావింపవే.

## 10.1-38- రామకృష్ణుల నామకరణం

10.1-286-వచనము

అని రామకృష్ణులం జూపిన గర్గుండు మున్ను కంసునిచేత ప్రేటుపడి దివికెగసిపోయిన తెఱవ చెప్పిన తెఱంగు తేటపఱచి దేవకీదేవి కొడుకని కృష్ణుని కంసుండు దలంచుఁ గావున రహస్యంబున సంస్కారంబు చేయుట కార్యం బని నందానుమతంబున రోహిణీకుమారు నుద్దేశించి.

10.1-287-కంద పద్యము

జనులు రమియింపఁ దిరిగెడి
యనువు కలిమి రాముఁ డనియు యదు సంకర్షం
బున సంకర్షణుఁ డనియును
ఘన బలమున బలుడు ననియు గణుతించె నృపా!

10.1-288-వచనము

మఱియుం గృష్ణు నుద్దేశించి తొల్లి యీ శిశువు ధవళారుణపీత వర్ణుండై యిప్పుడు నల్లనైన కతంబునఁ గృష్ణుం డయ్యె; వసుదే వునకు నొక్కెడ జన్మించిన కారణంబున వాసుదేవుండయ్యె; నీ పాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటం జేసి నామంబు లనేకంబులు గల; వీ శాబకునివలన మీరు దుఃఖంబులఁ దరియింతు; రీ యర్భకునిచేత దుర్జనశిక్షణంబు సజ్జనరక్షణంబు నగు నీ కుమారుండు నారాయణ సమానుం" డని చెప్పి; తన గృహంబునకు నమ్మునీశ్వరుండు చనియె; నందుండును బరమానందంబున నుండె; అంత.

## 10.1-39- కృష్ణబలరాములక్రీడాభివర్ణన

10.1-289-సీస పద్యము

జానుభాగముల హస్తములు వీడ్వడఁ జేసి;
 నిగుడు చల్లనఁ బోదు రింత నంత
నవ్వల పయ్యెద లంది జవ్వాడుదు;
 రాల క్రేపుల తోఁక లలమి పట్టి
విడువ నేరక వాని వెనువెంట జరుగుదు;
 రప్పంకముల దుడు కడర జొత్తు
రెత్తి చన్నిచ్చుచో నిరుదెస పాలిండ్లు;
 చేతులఁ బుడుకుచుఁ జేపు గలుగ

10.1-289.1-తేటగీతి

దూటుదురు గ్రుక్క గ్రుక్కకు దోర మగుచు
నాడుదురు ముద్దుపలుకు లవ్యక్తములుగఁ

గరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు
రామకృష్ణులు శైశవరతులఁ దగిలి.

10.1-290-కంద పద్యము

తడ వాడిరి బలకృష్ణులు
దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్
దడవాడి రరులు భయమునఁ
దడ వాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్.

10.1-291-సీస పద్యము

తల లెత్తి మెల్లనఁ దడవి యాడెడు వేళ;
పన్నగాధీశులపగిదిఁ దాల్తు;
రంగసమ్మృష్ట పంకాంగరాగంబుల;
నేనుగుగున్నల నెత్తువత్తు;
రసమంబులైన జవ్వాడు లేఖంబుల;
సింగంపుఁగొదమల సిరి వహింతు;
రాననంబుల కాంతు లంతకంతకు నెక్క;
బాలార్క చంద్రుల పగిదిఁ దోతు;

10.1-291.1-తేటగీతి

రెలమిఁ దల్లుల చన్నుఁబా లెల్లఁ ద్రావి
పరమయోగోద్భవామృత పానలీల
సోలి యెఱుగని యోగుల సొంపు గందు
రా కుమారులు జనమనోహారు లగుచు.

10.1-292-కంద పద్యము

చూడని వారల నెప్పుడు
జూడక లోకములు మూఁడు చూపులఁ దిరుగం
జూడఁగ నేర్చిన బాలక
చూడామణి జనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్.

10.1-293-కంద పద్యము

నగవు లనవిద్య వోఁడిమి
నగుబాటుగఁ జేయనేర్చు నగవరి యంతన్
నగుమొగముతోడ మెల్లన
నగుమొగముల సతులఁ జూచి నగ నేర్చె నృపా!

10.1-294-కంద పద్యము

అవ్వల నెఱుఁగక మువ్వురి
కవ్వల వెలుఁగొందు పరముఁ డర్భకుఁడై యా
యవ్వలకు సంతసంబుగ
నవ్వా! యవ్వా! యనంగ నల్లన నేర్చెన్.

10.1-295-కంద పద్యము

అడుగులు వే గలిగియు రెం
డడుగులనే మన్నుమిన్ను నలమిన బాలుం
డడుగిడఁ దొడఁగెను శాత్రవు
లడుగులు సడుగులును వదలి యడు గవనిఁబడన్.

## 10.1-40- హరిహరాభేదము చూపుట

10.1-296-వచనము

మఱియును.

10.1-297-సీస పద్యము

తనువున నంటిన ధరణీ పరాగంబు;
 పూసిన నెఱిభూతి పూఁతగాఁగ;
ముందఱ వెలుగొందు ముక్తాలలామంబు;
 తొగలసంగడికాని తునుకగాఁగ;
ఫాలభాగంబుపైఁ బరగు కావిరిబొట్టు;
 కాముని గెల్చిన కన్నుగాఁగఁ;
గంఠమాలికలోని ఘననీల రత్నంబు;
 కమనీయ మగు మెడకప్పుగాఁగ;

10.1-297.1-ఆటవెలది

హారవల్లు లురగ హారవల్లులుగాఁగ;
బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును
వేఱులేమిఁ దెలుప వెలయునట్లు.

10.1-298-కంద పద్యము

ఆ పాపల విహరణములు
తీపులు పుట్టింప మరిగి తేఁకువ లే కా
గోపాల సతులు మక్కువ
నే పనులును మఱచి యుండి రీక్షణపరలై.

10.1-299-వచనము

ఆ సమయంబున బాలకుల తల్లులు గోఱ గోరు కొమ్ములు గల జంతువులవలన నేమఱక, జలదహనకంటకాదుల యెడ మోసపోక, బాలసంరక్షణంబు చేయుచు నుల్లంబుల మొల్లంబు లైన ప్రేమంబు లభిరామంబులుగా విహరించుచుండి రంత.

10.1-300-కంద పద్యము

తన యీడు గోపబాలురు
తనుఁ గొలువఁగ రాముఁ గూడి తనువు గలుగుచుం
దను గమనంబులఁ గృష్ణుఁడు
తనుమధ్యలు మెచ్చ నీల తనురుచి మెఱసెన్.

10.1-301-వచనము

మఱియు నా కుమారుండు దినదినంబునకు సంచార సంభాషణ దక్షుండై.

10.1-302-ఉత్పలమాల

చప్పుడు చేయకుండు మని జంకె యొనర్చిన నల్గిపోవఁగా
నప్పుడు బార చాఁచి తన యర్మిలి విందులు వచ్చి రంచు న
వ్వొప్పఁగఁ జీరు తల్లి దెస కొత్తిలి కృష్ణుఁడు రంతు జేయుచు
న్నెప్పటియట్ల చన్గుడుచు నింపొలయన్ మొలగంట మ్రోయఁగన్.

10.1-303-కంద పద్యము

వల్లవగృహనవనీతము
లెల్లను భక్షించి వచ్చి యెఱుఁగని భంగిం

దల్లిఁ గదిసి చిట్టాడుచు
నల్లనఁ జను బువ్వఁ బెట్టుమవ్వా! యనుచున్.

10.1-304-వచనము

మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు.

10.1-305-సీస పద్యము

గోవల్లభుఁడ నేను; గోవులు మీ రని;
వడి అంకె వైచుచు వంగి యాడు;
రాజు నే; భటులు మీరలు రండురం డని;
ప్రాభవంబునఁ బెక్కు పనులుపనుచు;
నేఁదస్కరుండ; మీరింటివా రని నిద్ర;
పుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు;
నే సూత్రధారి; మీ రిందఱు బహురూపు;
లని చెలంగుచు నాటలాడఁ బెట్టు;

10.1-305.1-తేటగీతి

మూల లుఱుకును; డాఁగిలిమూఁతలాడు;
నుయ్యలల నూఁగుఁ జేబంతు లొనరవైచు;
జార చోరుల జాడలఁ జాల నిగుడు;
శౌరి బాలురతో నాడుసమయమందు.

## 10.1-45- గోపికలుకృష్ణుయల్లరిచెప్పుట

10.1-306-వచనము

మఱియు నా కుమారశేఖరుండు కపట శైశవంబున దొంగజాడలం గ్రీడింప గోపికలోపికలు లేక యశోదకడకు వచ్చి యిట్లనిరి.

10.1-307-కంద పద్యము

బాలురకుఁ బాలు లే వని
బాలింతలు మొఱలుపెట్టఁ బకపక నగి యీ
బాలుం డాలము చేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ!

10.1-308-కంద పద్యము

పడఁతీ! నీ బిడ్డడు మా
కడవలలో నున్న మంచి కాఁగిన పా లా
పడుచులకుఁ బోసి చిక్కిన
కడవలఁ బో నడిచె నాజ్ఞ కలదో లేదో?

10.1-309-కంద పద్యము

మీ పాపఁడు మా గృహముల
నా పోవఁగఁ బాలు ద్రావ నగపడ కున్నన్
గోపింపఁ బిన్నపడుచుల
వాపోవఁగఁ జిమ్ము కొనుచు వచ్చెం దల్లీ!

10.1-310-మత్తకోకిలము

పుట్టిపుట్టఁడు నేడు దొంగిలఁ బోయి మా యిలు జొచ్చి తా
నుట్టి యందక ఱోలు పీఁటలు నొక్క ప్రోవిడి యెక్కి చై

పెట్టఁ జాలక కుండ క్రిం దొక పెద్ద తూఁ టొనరించి మీ
పట్టి మీఁగడపాలు చేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ!

10.1-311-కంద పద్యము

ఆడం జని వీరల పెరు
గోడక నీ సుతుఁడు ద్రావి యొక యించుక తాఁ
గోడలి మూఁతిం జరిమినఁ
గోడలు మ్రుచ్చనుచు నత్త గొట్టె లతాంగీ!

10.1-312-కంద పద్యము

వా రిల్లు చొచ్చి కడవలఁ
దోరంబగు నెయ్యిఁ ద్రావి తుది నా కడవల్
వీరింట నీ సుతుం డిడ
వారికి వీరికిని దొడ్డ వా దయ్యె సతీ!

10.1-313-కంద పద్యము

వేలుపులఁటె; నా కంటెను
వేలుపు మఱి యెవ్వఁ డనుచు వికవిక నగి మా
వేలుపుల గోడపై నో
హేలావతి! నీ తనూజుఁ డెంగిలిఁ జేసెన్.

10.1-314-కంద పద్యము

వెన్నఁ దినఁగఁ బొడగని మా
పిన్నది యడ్డంబు వచ్చి పిఱిఁదికిఁ దివియన్

జన్నొడిసి పట్టి చీఱెను
జిన్ని కుమారుండె యితఁడు? శీతాంశుముఖీ!

10.1-315-కంద పద్యము

ఇమ్మగువ తన్ను వాకిటఁ
గ్రుమ్మరుచోఁ జీరి నిలిపికొని పే రడుగం
గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె
నమ్మా! యీ ముద్దు కుఱ్ఱఁ డల్పుఁడె? చెపుమా.

10.1-316-కంద పద్యము

చేబంతి తప్పి పడెనని
ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్
మా బిడ్డ జలక మాడఁగ
నీ బిడ్డఁడు వలువఁ దెచ్చె నెలఁతుక! తగునే?

10.1-317-కంద పద్యము

ఇచ్చెలువఁ జూచి ముచ్చిలి
యచ్చుగ నుఱికించుకొనుచు నరిగెద; నాతో
వచ్చెదవా? యని యనినాఁ
డిచ్చిఱుతఁడు; సుదతి! చిత్ర మిట్టిది గలదే?

10.1-318-కంద పద్యము

కొడుకులు లేరని యొక సతి
కడు వగవఁగఁ దన్ను మగనిఁగాఁ గైకొనినం

గొడుకులు గలిగెద రని పైఁ
బడినాఁ డిది వినుము శిశువు పనులే? తల్లీ!

10.1-319-కంద పద్యము

తలఁగినదానం దల మనఁ
దలఁగక యా చెలికి నాన తలయెత్తఁగ నీ
తలఁగిన చోటెయ్యది యని
తల యూఁచెన్ నీ సుతుండు తగవె? మృగాక్షీ!

10.1-320-కంద పద్యము

వ్రాలఁగ వచ్చిన నీ సతి
చూలాలం దలఁగు మనుఁడు జూ లగుటకు నే
మూలంబు చెప్పు మనె నీ
బాలుఁడు; చెప్పుదురె సతులు? పర్వేందుముఖీ!

10.1-321-కంద పద్యము

మగువా! నీ కొమరుఁడు మా
మగవా రటు పోవఁ జూచి మంతనమునకుం
దగఁ జీరి పొందు నడిగెను
జగముల మున్నిట్టి శిశువు చదువంబడెనే?

10.1-322-కంద పద్యము

నమ్మి నిదురబోవ నా పట్టిచుంచు మా
లేఁగతోఁకతోడ లీలఁ గట్టి

వీథులందుఁ దోలె వెలది! నీ కొమరుండు;
రాచబిడ్డఁ డైన నవ్వ మేలె?

10.1-323-కంద పద్యము

నా పట్టి పొట్ట నిండఁగఁ
బై పడి నీ పట్టి పెన్న బాసెం డిడినాఁ;
డూపిరి వెడలదు; వానిం
జూపెద నేమైన నీవ సుమ్ము లతాంగీ!

10.1-324-కంద పద్యము

తెఱవ యొకతె నిద్రింపఁగ
నెఱిఁ గట్టిన వలువ వీడ్చి నే టగు తేలుం
గఱపించి నీ కుమారుఁడు
వెఱచుచు నది పఱవ నగియె విహితమె? సాధ్వీ!

10.1-325-కంద పద్యము

నా కొడుకును నా కోడలు
నేకతమునఁ బెనఁగ బాము నీతఁడు వైవం
గోక లెఱుంగక పాఱినఁ
గూఁక లిడెన్ నీ సుతుండు గుణమె? గుణాఢ్యా!

10.1-326-ఆటవెలది

తరుణి యొకతె పెరుగుఁ దరుచుచుఁ దుది వంగి
వెన్నదీయ నొదిఁగి వెనుకఁ గదిసి

మగువ! నీ సుతుండు మగపోఁడుములు చేయ
సాఁగినాఁడు తగదె? చక్కఁజేయ.

10.1-327-సీస పద్యము

కలకంఠి! మా వాడ గరితల మెల్ల నీ;
 పట్టి రాఁగల డని పాలు పెరుగు
లిండ్లలోపల నిడి యే మెల్లఁ దన త్రోవఁ;
 జూచుచో నెప్పుడు చొచ్చినాఁడొ?
తలుపుల ముద్రల తాళంబులును బెట్టి;
 యున్న చందంబుననున్న వరయ;
నొక యింటిలోఁ బాడు నొక యింటిలోఁ నాడు;
 నొక యింటిలో నవ్వు నొకటఁ దిట్టు;

10.1-327.1-ఆటవెలది

నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ
పక్షి ఘోషణములు పరఁగఁ జేయు
నిట్లు చేసి వెనుక నెక్కడఁ బోవునో
కాన రాఁడు రిత్త కడవ లుండు.

10.1-328-కంద పద్యము

కడు లచ్చి గలిగె నేనిం
గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచున్
బడుగుల వాడలపైఁ బడ
విడుతురె రాకాంత లెందు? విమలేందుముఖీ!

10.1-329-కంద పద్యము

ఓ యమ్మ! నీ కుమారుఁడు
మా యిండ్లను బాలు పెరుగు మననీ డమ్మా!
పోయెద మెక్కడి కైనను
మా యన్నల సురభులాన మంజులవాణీ!

## 10.1-47- యశోదగోపికలనొడంబరచుట

10.1-330-వచనము

అని మఱియు ననేకవిధంబుల బాలకృష్ణుండు చేయు వినోదంబులు దమ యందుఁ జేయు మహాప్రసాదంబు లని యెఱుంగక దూఱుచున్నయట్టి గోపికలకు యశోద యిట్లనియె.

10.1-331-కంద పద్యము

చన్ను విడిచి చనఁ డిట్టటు
నెన్నఁడుఁ బొరిగిండ్ల త్రోవ లెఱుఁగఁడు నేఁడుం
గన్నులు దెఱవని మా యీ
చిన్ని కుమారకుని నవ్వ చేయం దగునే?

10.1-332-కంద పద్యము

అన్య మెఱుఁగఁడు; తన యంత నాడుచుండు;
మంచివాఁ డీత; డెగ్గులు మానరమ్మ!
రామలార! త్రిలోకాభిరామలార!
తల్లులార! గుణవతీమతల్లులార!

10.1-333-వచనము

అని యశోద వారల నొడంబఱచి పంపి కొడుకుం గోపింపఁజాలక యుండె; నిట్లు.

10.1-334-ఉత్పలమాల

కాంతలు దల్లితోఁ దన వికారము లెల్ల గణింప భీతుఁ డై
శాంతుని సొంపునం బరమ సాధుని పెంపున గోలమాడ్కి వి
భ్రాంతునికైవడిన్ జడుని భంగిఁ గుమారకుఁ డూరకుండె నే
వింతయు లేక దల్లికుచవేదికపైఁ దల మోపి యాడుచున్.

## 10.1-48- కృష్ణుడుమన్నుదినెననుట

10.1-335-వచనము

అంత నొక్కనాడు బలభద్రప్రముఖులైన గోపకుమారులు వెన్నుండు మన్ను దినె నని చెప్పిన యశోద బాలుని కేలు పట్టుకొని యిట్లనియె.

10.1-336-కంద పద్యము

మన్నేటికి భక్షించెదు?
మన్నియమము లేల నీవు మన్నింపవు? నీ
యన్నయు సఖులును జెప్పెద
రన్నా! మన్నేల మఱి పదార్థము లేదే?

10.1-337-వచనము

అని పలికిన ముగుదతల్లికి నెఱదంట యైన కొడు కిట్లనియె.

10.1-338-శార్దూల విక్రీడితము

అమ్మా! మన్నుదినంగ నే శిశువునో? యాఁకొంటినో? వెఱ్ఱినో?

నమ్మం జూడకు వీరి మాటలు మదిన్; నన్నీ వుగొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు; కాదేనిన్ మదీయాస్య గం
ధమ్మాఘ్రాణము చేసి నా వచనముల్ తప్పైన దండింపవే.

## 10.1-49- నోటిలో విశ్వరూపప్రదర్శన

10.1-339-వచనము

అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నియ్యకొలిపి క్రీడామనుజబాలకుండైన యీశ్వరుండు తన నోరు దెఱచి ముఖంబుఁ జూపిన

10.1-340-కంద పద్యము

ఆ లలితాంగి గనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్.

10.1-341-వచనము

కనుంగొని.

10.1-342-కంద పద్యము

కలయో! వైష్ణవ మాయయో! యితర సంకల్పార్థమో! సత్యమో!
తలఁపన్ నేరక యున్నదాననొ! యశోదాదేవిఁ గానో! పర
స్థలమో! బాలకుఁడెంత? యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువొ! మహాశ్చర్యంబు చింతింపఁగన్

10.1-343-ఆటవెలది

బాలమాత్రుఁడగు సలీలుని ముఖమందు
విశ్వ మెల్ల నెట్లు వెలసి యుండు
బాలు భంగి నితఁడు భాసిల్లుఁ గాని స
ర్వాత్ముఁ డాది విష్ణుఁ డగుట నిజము.

10.1-344-వచనము

అని నిశ్చయించి.

10.1-345-ఆటవెలది

ఏ మహాత్మువలన నీ విశ్వరూపంబు
గానఁబడిన బుద్ధి కంప మయ్యె
నా మహాత్మ్ము విష్ణు నఖిలలోకాధారు
నార్తులెల్లఁ బాయ నాశ్రయింతు.

10.1-346-కంద పద్యము

నా మగడు నేను గోవులు
నీ మందయు గోపజనులు నిబ్బాలుని నె
మ్మోముమున నున్న విధముఁ గని
యేమఱితిమి గాక యీశుఁ డీతఁడు మాకున్.

10.1-347-వచనము

అని తన్ను పరమేశ్వరుండని తలంచుచున్న యశోద యందు నా కృష్ణుండు వైష్ణవమాయం బొందించిన.

10.1-348-కంద పద్యము

జడనుపడి యెఱుక చెడి యా
పడతుక సర్వాత్ముఁ డనుచుఁ బలుకక యతనిం
గొడుకని తొడపై నిడుకొని
కడు వేడుకతోడ మమతఁ గావించె నృపా!

## 10.1-50- నందయశోదలపూర్వజన్మ

10.1-349-వచనము

అనిన విని రాజిట్లనియె.

10.1-350-ఆటవెలది

జగదధీశ్వరునకుఁ జన్నిచ్చు తల్లి గా
నేమి నోము నోఁచె నీ యశోద!
పుత్త్రుఁ డనుచు నతనిఁ బోషించు తండ్రి గా
నందుఁ డేమి చేసె! నందితాత్మ.

10.1-351-కంద పద్యము

ప్రబ్బిన భక్తిని హరిపైఁ
గబ్బంబులు చెప్పి కవులు కైవల్యశ్రీ
కబ్బుదు రఁట హరిపోషణ
మబ్బిన తలిదండ్రు లెచటి కబ్బుదురొ? తుదిన్.

10.1-352-వచనము

అనిన విని రాజయోగికి శుకయోగి యిట్లనియె.

10.1-353-సీస పద్యము

అవనీశ! విను ద్రోణుఁ డనువాఁడు వసువుల;
యందు ముఖ్యుఁడు; ధర యతని భార్య;
వారి నిద్దఱ బ్రహ్మ వసుధపై జన్మించు;
డంచుఁ బంపిన వార లతనిఁ జూచి
విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి;
మా కిచ్చితేనిని మహి జనింతు
మనవుడు నట్ల కా కనియె వేల్పులపెద్ద;
యా ద్రోణుఁ డీ నందుఁడై జనించె

10.1-353.1-ఆటవెలది

ధర యశోదయయ్యెఁ; దనుజేంద్రవైరియుఁ
గమలగర్భుమాట గారవించి
తల్లిదండ్రు లనుచుఁ దగ వారి మన్నించె;
నధిక భక్తితోడ నలరి నట్లు.

## 10.1-51- చిలుకుతున్న కవ్వంపట్టుట

10.1-354-వచనము

అంతనొక్కనాఁడు తనయింటికడ పాపలందఱు నయ్యేపనులందుఁ బంపుపడిపోయిన నందసుందరి సంరంభంబునం దరికంబంబు కడఁ గుదురుగా నొక్క దధికుంభంబు పెట్టి మిసిమిగల మీఁగడపెరుగు కూడంబోసి వీఁక నాఁక త్రాడు కవ్వంబున నలంవరించి.

10.1-355-సీస పద్యము

కరకమలారుణ కాంతిఁ గవ్వపు త్రాడు;

పవడంపు నునుఁదీఁగె పగిది మెఱయఁ;
గ్రమముతో రజ్జు వాకర్షింపఁ బాలిండ్లు;
వీడ్వడ నొండొంటి వీఁక నొత్తఁ;
గుచకుంభములమీఁది కొంగుజాఱఁగ జిక్కు;
పడుచు హారావళుల్ బయలుపడగఁ;
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము;
మంచుపైఁ బడిన పద్మంబుఁ దెగడఁ;

10.1-355.1-తేటగీతి

గౌను నులియంగఁ; గంకణ క్వణన మెసఁగఁ;
దుఱుము బిగివీడఁ; గర్ణికాద్యుతులు మెఱయ;
బాలు నంకించి పాడెడి పాట వలనఁ
దరువు లిగురొత్త పెరు గింతి దరువఁ జొచ్చె.

10.1-356-వచనము

ఆ సమయంబున.

10.1-357-కంద పద్యము

సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు
సడి గొట్టుచు నమ్మ రమ్ము; చన్నిమ్మనుచున్
వెడవెడ గంతులు వైచుచుఁ
గడవఁ గదిసి బాలకుండు గవ్వముఁ బట్టెన్.

10.1-358-కంద పద్యము

కవ్వముఁ బట్టిన ప్రియసుతు
నవ్వనరుహనేత్ర దిగిచి యంకతలమునన్
నవ్వుచు నిడుకొని కూఁకటి
దువ్వుచుఁ జన్నిచ్చెఁ; నతఁడు దూఁటుఁచుఁ గుడిచెన్.

10.1-359-మత్తేభ విక్రీడితము

కడుపారం జనుబాలు ద్రావని సుతుం గంజాక్షి పీఠంబుపై
నిడి పొంగారెడు పాలు డించుటకునై యేగంగఁ దద్బాలుఁ డె
క్కుడు కోపంబున వాఁడిఱాత దధిమత్కుంభంబుఁ బోగొట్టి తెం
పడరం గుంభములోని వెన్నఁ దినె మిథ్యా సంకులద్బాష్పుఁడై.

10.1-360-వచనము

అంత నా లోలలోచన పాలు డించి వచ్చి వికలంబు లయిన దధికుంభ శకలంబులఁ బొడఁగని తుంటకొడుకు వెన్నదింట యెఱింగి నగుచు నా కలభగామిని యతనిం గానక చనిచని.

10.1-361-ఆటవెలది

వికచకమలనయన వే ఱొక యింటిలో
వెలయ ఱోలు దిరుగవేసి యెక్కి
యుట్టిమీఁది వెన్న నులుకుచు నొక కోఁతి
పాలు చేయుచున్న బాలుఁ గనియె.

## 10.1-53- యశోదకృష్ణుని అదిలించుట

10.1-362-మత్తేభ విక్రీడితము

కని చేతన్ సెలగోలఁ బట్టికొనుచుం గానిమ్ము కానిమ్ము రా
తనయా! యెవ్వరి యందుఁ జిక్కుపడ నే దండంబునుం గాన నే
వినివారంబును బొంద నే వెఱపు నే విభ్రాంతియుం జెంద ము
న్ననియో నీవిటు నన్నుఁ గైకొనమి నేఁడారీతి సిద్ధించునే.

10.1-363-వచనము

అని యదలించుచు కొడుకునడవడిం దలంచి తనుమధ్య తన మనంబున.

10.1-364-సీస పద్యము

బాలుఁ డీతండని భావింతు నందునా;
 యే పెద్దలును నేర రీక్రమంబు
వెఱ పెఱుంగుటకు నై వెఱపింతు నందునా;
 కలిగి లే కొక్కఁడుగాని లేఁడు
వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా;
 తనుదాన యై బుద్ధిఁ దప్పకుండు
నొండెఱుంగక యింట నుండెడి నందునా;
 చొచ్చి చూడని దొకచోటు లేదు

10.1-364.1-ఆటవెలది

తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బాటెడి
యోజ లేదు భీతి యొక టెఱుంగఁ
డెలమి నూరకుండఁ డెక్కసక్కెము లాడుఁ
బట్టి శాస్తిజేయు భంగి యెట్లు?

10.1-365-వచనము

అని వితర్కించి.

10.1-366-కంద పద్యము

లాలనమున బహుదోషము
లోలిం బ్రాపించుఁ దాడనోపాయములన్
జాల గుణంబులు గలుగును
బాలురకును దాడనంబ పథ్యం బరయన్.

10.1-367-వచనము

అని నిశ్చయించి కేలనున్న కోల జళిపించి బాలా! నిలునిలు మని బగ్గుబగ్గున నదల్చుచు దల్లి డగ్గఱిన బెగ్గడిలిన చందంబున నగ్గలికచెడి ఱోలు డిగ్గనుఱికి.

10.1-368-కంద పద్యము

గజ్జలు గల్లని మ్రోయఁగ
నజ్జలు ద్రొక్కుటలు మాని యతిజవమున యో
షిజ్జనములు నగఁ దల్లియుఁ
బజ్జం జనుదేర నతఁడు పరువిడె నధిపా!

10.1-369-వచనము

అప్పుడు.

10.1-370-మత్తేభ విక్రీడితము

స్తనభారంబున డస్సి గ్రుస్సి యసదై జవ్వాడు మధ్యంబుతో
జనితస్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో

వనజాతేక్షణ గూడ పాఱి తిరిగెన్ వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్రమనంబులున్ వెనుకొనంగాలేని లీలారతున్.

## 10.1-54- కృష్ణుని ఱోలుకి కట్టుట

10.1-371-వచనము

ఇట్లు గూడం జని.

10.1-372-సీస పద్యము

స్తంభాదికంబులు దనకు నడ్డం బైన;
నిట్టట్టు చని పట్టనీనివాని
నీ తప్పు సైరింపు మింక దొంగిలఁ బోవ;
నే నని మునుముట్ట నేడ్చువాని
గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు;
వెడలు కన్నీటితో వెగచువాని
నే దెసవచ్చునో యిది యని పలుమాఱు;
సురుగుచుఁ గ్రేగంటఁ జూచువానిఁ

10.1-372.1-ఆటవెలది

గూడఁ బాఱి పట్టుకొని వెఱపించుచుఁ
జిన్న వెన్నదొంగ చిక్కె ననుచు
నలిగి కొట్టఁ జేతు లాడక పూఁబోఁడి
కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి.

10.1-373-వచనము

ఇట్లనియె.

10.1-374-కంద పద్యము

వీరెవ్వరు? శ్రీకృష్ణులు

గారా? యెన్నడును వెన్నఁ గానరఁట కదా!

చోరత్వం బించుకయును

నేర రఁట! ధరిత్రి నిట్టి నియతులు గలరే?

10.1-375-కంద పద్యము

పట్టినఁ బట్టుపడని నినుఁ

బట్టెద నని చలముఁగొనినఁ బట్టుట బెట్టే?

పట్టువడ వండ్రు పట్టీ

పట్టుకొనన్ నాఁకుఁగాక పరులకు వశమే?

10.1-376-కంద పద్యము

ఎక్కడనైనను దిరిగెద;

నొక్క యెడన్ గుణము గలిగి యుండవు; నియమం

బెక్కడిది నీకు? మఱచినఁ

జక్కగఁ బోయెదవు పెక్కు జాడలఁబుత్రా!

10.1-377-సీస పద్యము

తోయంబు లివి యని తొలగక చొచ్చెదు;

తలఁచెదు గట్టినఁ దరల నెత్త;

మంటితో నాటలు మానవు; కోరాడె;

దున్నత స్తంభంబు లూఁపఁ బోయె;
దన్యుల నల్పంబు లడుగంగఁ బాఱెదు;
రాచవేఁటలఁ జాల అవ్వఁదెచ్చె;
దలయవు నీళ్ళకు నడ్డంబు గట్టెదు;
ముసలిపై హాలివృత్తి మొనయఁ; జూచె

10.1-377.1-ఆటవెలది

దంబరంబు మొలకు నడుగవు తిరిగెద
వింకఁ గలికి చేఁత లేల పుత్ర!
నిన్ను వంప వ్రాల్చ నే నేర ననియొ నీ
విట్టు క్రిందు మీఁదు నెఱుఁగ కునికి.

10.1-378-వచనము

అని మర్మంబు లెత్తి పలికి.

10.1-379-కంద పద్యము

ఆ లలన గట్టె ఱోలన్
లీలన్ నవనీతచౌర్యలీలుం బ్రియవా
గ్జాలుం బరివిస్మిత గో
పాలున్ ముక్తాలలామ ఫాలున్ బాలున్.

10.1-380-కంద పద్యము

ఱోలను కట్టుపడియు న
బ్బాలుఁడు విలసిల్లె భక్త పరతంత్రుండై

యాలాన సన్నిబద్ధ వి
శాలమదేభేంద్రకలభ సమరుచి నధిపా!

10.1-381-కంద పద్యము

వెలి లోను మొదలు తుది నడు
ములు లేక జగంబు తుదియు మొదలున్ నడుమున్
వెలియున్ లో నగు నీశ్వరు
నలవడునే కట్టఁ బ్రణతురాల్ గాకున్నన్?

10.1-382-ఆటవెలది

పట్టి యెల్లబోఁటి పట్టి యీతం డని
గట్టితలఁపుతోడఁ గట్టెఁ గాక
పట్టికడుపు పెక్కు బ్రహ్మాండములు పట్టు
టెఱిఁగి నేనిఁ దల్లి యేల కట్టు?

10.1-383-కంద పద్యము

చిక్కఁడు సిరికౌఁగిలిలోఁ
జిక్కఁడు సనకాదియోగిచిత్తాబ్జములం
జిక్కఁడు శ్రుతిలతికావళిఁ
జిక్కె నతఁడు లీలఁ దల్లి చేతన్ ఱోలన్

10.1-384-వచనము

ఇట్లు గ్రద్దన నా ముద్దియ ముద్దులపట్టి యుదరంబు గట్టనడరుచుఁ జతురంబుగఁ జక్క నొక్కత్రాడు చుట్టిన నది రెండంగుళంబులు కడమపడియె; మఱియు నొక్క

బంధంబు సంధించి వలగొనిన నంతియ కొఱంతయయ్యె; వెండియు
నొక్కపాశంబు గూర్చి పరివేష్టించిన వెల్తిఁజూపె; నిట్లు.

10.1-385-కంద పద్యము

తజ్జనని లోఁగిటం గల
రజ్జుపరంపరలఁ గ్రమ్మ ఱన్ సుతుఁ గట్టన్
బొజ్జ దిరిగి రా దయ్యె జ
గజ్జాలము లున్న బొజ్జఁ గట్టన్ వశమే?

10.1-386-వచనము

అప్పు డా యవ్వయు గోపికలును వెఱంగుపడిరి; తదనంతరంబ

10.1-387-ఆటవెలది

ఒడలఁ జెమట లెగయ నుత్తరీయము జాఱ
వీడి యున్న తుఱుము విరులు రాలఁ
గట్టరాని తన్నుఁ గట్టెద నని చింతఁ
గట్టుకొనిన తల్లిఁ గరుణఁ జూచి.

10.1-388-కంద పద్యము

బంధవిమోచనుఁ డీశుఁడు
బంధింపఁ బెనంగు జనని పాటోర్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ
బంధంబునఁ గట్టుపడియెఁ బాటించి నృపా!

10.1-389-కంద పద్యము

సంగడిఁ దిరిగెడు శంభుఁడు
నంగాశ్రయ యైన సిరియు నాత్మజుఁడై యు
ప్పొంగెడు పద్మజుఁడును గో
పాంగన క్రియఁ గరుణ పడయ రఖిలేశ్వరుచేన్.

10.1-390-కంద పద్యము

జ్ఞానులచే మౌనులచే
దానులచే యోగ సంవిధానులచేతం
బూని నిబద్ధుం డగునే
శ్రీనాథుఁడు భక్తియుతుల చేతం బోలెన్?

10.1-391-వచనము

అంత నయ్యశోద యింటికడఁ బనులవెంటందిరుగఁ గృష్ణుఁడు తొల్లి నారదు శాపంబున నిరుమద్దులై యున్న నలకూబర మణిగ్రీవు లను గుహ్యకుల నిద్దఱం గని తో లీడ్చుకొని చనియె" నని చెప్పిన శుకయోగివరునకు భూవరుం డిట్లనియె.

## 10.1-55- గుహ్యకుల నారదశాపం

10.1-392-కంద పద్యము

నారదుఁ డేల శపించెను?
వా రా వృక్షత్వమునకు వచ్చినపనికిం
గారణ మెయ్యది? యోగికు
లారాధ్య! యెఱుంగఁ జెప్పు మయ్య! వినియెదన్.

10.1-393-వచనము

అనిన శుకుండిట్లనియె "మున్ను కుబేరుని కొడుకు లిరువురు శంకరకింకరులై యహంకరించి వెండికొండమీఁద విరులతోఁటలం బాడెడి చేడియలం గూడికొని కరేణు సంగతంబు లైన యేనుం గుల భంగి సురంగంబు లైన మందాకినీతరంగంబులం గ్రీడింప నారదుండు వచ్చిన న చ్చెలువలు చెచ్చెర వలువలు ధరియిం చిరి; మదిరాపాన పరవశులు గావున వార లిరువురు వివ స్త్రులై మెలంగుచున్న నా మునీశ్వరుండు చూచి శపియించు వాఁడై ప్రతీతంబగు గీతంబు బాడె; వినుము.

10.1-394-శార్దూల విక్రీడితము

సంపన్నుండొరుఁగాన లేఁడు తనువున్ సంసారమున్నమ్మి హిం
సింపం జూచు దరిద్రుఁ డెత్తుబడి శుష్కీభూతుఁడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సముల కాఁ జింతించు నట్లౌటఁ ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్.

10.1-395-వచనము

అని గీతంబు పాడి తన మనంబున.

10.1-396-కంద పద్యము

కలవాని సుతుల మనుచును
గలకంఠులతోడఁ గూడి కానరు పరులం
గలలో నైనను; వీరికిఁ
గల క్రొవ్వడఁగించి బుధులఁ గలపుట యొప్పున్.

10.1-397-వచనము

అని చింతించి విజ్ఞాన విశారదుండగు నారదుండు నలకూబర మణిగ్రీవులఁ జూచి మీరలు స్త్రీమదాంధులరు గావున భూలోకంబున నర్జున తరువులై నూఱుదివ్యవర్షంబు లుండుం డటమీఁద గోవిందచరణారవింద పరిస్పందంబున

10.1-398-కంద పద్యము

ముక్తులరై నారాయణ
భక్తులరై పరమసాధుభావశ్రీ సం
సక్తులరై సురలోక
వ్యక్తుల రయ్యెదరు నాదువాక్యము కతనన్.

## 10.1-56- కృష్ణుడుమద్దిగవనుగూల్చుట

10.1-399-వచనము

అని యిట్లు పలికి నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె వారిరువురు సంగడిమద్దులైరి, పరమభాగవతుండైన నారదు మాటలు వీటింబుచ్చక పాటించి.

10.1-400-కంద పద్యము

ముద్దుల తక్కరిబిడ్డఁడు
మద్దులఁ గూల్పంగ దలఁచి మసలక తా నా
మద్దికవ యున్న చోటికిఁ
గ్రద్దన ఱో లీడ్చుకొనుచుఁ గడకం జనియెన్.

10.1-401-వచనము

చని యా యూర్జిత మహాబలుండు నిజోదరదామ సమాకృష్యమాణ తిర్యగ్భవదులూఖలుండై యా రెండు మ్రాకుల నడుమం జొచ్చి ముందరికి నిగుడుచు.

10.1-402-కంద పద్యము

బాలుఁడు ఱో లడ్డము దివ
మూలంబులు పెకలి విటపములు విఱిగి మహా
భీలధ్వనిఁ గూలెను శా
పాలస్య వివర్జనములు యమళార్జునముల్

### 10.1-57- గుహ్యకులుకృష్ణునిపొగడుట

10.1-403-వచనము

ఇట్లు నిర్మూలంబు లై పడిన సాలంబులలోనుండి కీలికీలలు వెల్వడు పోలిక నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్రసిద్ధు లైన సిద్ధు లిద్దఱు వెడలివచ్చి ప్రబుద్ధులై భక్తలోకపాలకుండైన బాలకునకు మ్రొక్కి లేచి కరకమలంబులు మొగిడ్చి యిట్లనిరి.

10.1-404-కంద పద్యము

బాలుఁడవె నీవు? పరుఁడ వ
నాలంబుఁడ వధికయోగి వాద్యుడవు తను
స్థూలాకృతి యగు విశ్వము
నీ లీలారూప మండ్రు నిపుణులు కృష్ణా!

10.1-405-సీస పద్యము

ఎల్లభూతంబుల కింద్రియాహంకృతి;
ప్రాణంబులకు నధిపతివి నీవ;
ప్రకృతియుఁ బ్రకృతిసంభవమహత్తును నీవ;
వీని కన్నిటికిని విభుఁడ వీవ;
ప్రాకృతగుణవికారములఁ బొందక పూర్వ;
సిద్ధుఁడ వగు నిన్నుఁ జింత చేయ
గుణయుతుం డోపునే? గుణహీన! నీ యంద;
కల గుణంబుల నీవ కప్పఁబడుదు;

10.1-405.1-తేటగీతి

మొదల నెవ్వని యవతారములు శరీరు
లందు సరిదొడ్డు లేని వీర్యముల తనువు
లడర జన్మించి వారల యందుఁ జిక్క;
వట్టి పరమేశ! మ్రొక్కెద మయ్య! నీకు.

10.1-406-కంద పద్యము

భువనములు చేయఁ గావఁగ
నవతీర్ణుఁడ వైతి కాదె యఖిలేశ్వర! యో
గివరేణ్య! విశ్వమంగళ!
కవిసన్నుత! వాసుదేవ! కల్యాణనిధీ!

10.1-407-ఉపేంద్రవజ్రము

తపస్వివాక్యంబులు దప్పవయ్యెన్;
నెపంబునం గంటిమి నిన్నుఁ జూడన్

దపంబు లొప్పెన్; మముఁ దావకీయ
ప్రపన్నులం జేయుము భక్తమిత్రా!

10.1-408-శార్దూల విక్రీడితము

నీ పద్యావళు లాలకించు చెవులన్ నిన్నాడు వాక్యంబులన్
నీ పేరం బనిచేయు హస్తయుగముల్ నీ మూర్తిపైఁ జూపులన్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపైఁ జిత్తముల్
నీ పై బుద్ధుల మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా!

10.1-409-వచనము

అని యిట్లు కీర్తించిన గుహ్యకులం జూచి నగుచు నులూఖల బద్ధుండైన హరి యిట్లనియె.

10.1-410-కంద పద్యము

తమతమ ధర్మముఁ దప్పక
సములై నను నమ్మి తిరుగు సభ్యులకును బం
ధము నను జూచిన విరియును
గమలాప్తుఁడు పొడమ విరియు ఘనతమము క్రియన్.

10.1-411-కంద పద్యము

కారుణ్యమానసుండ గు
నారదువచనమునఁ జేసి ననుఁ బొడఁగనుటన్
మీరు ప్రబుద్ధుల రైతిరి
చేరెన్ నామీఁది తలఁపు సిద్ధము మీకున్.

10.1-412-వచనము

అని యీశ్వరుండు మీరు "మీ నెలవులకుంబొం" డని యానతిచ్చిన మహాప్రసాదం బని వలగొని పెక్కు మ్రొక్కులిడి నలకూబర మణిగ్రీవు లుత్తర భాగంబున కరిగి రంత; నందాదు లైన గోపాల కులు నిర్మూలంబులై పడిన సాలంబుల చప్పుడు పిడుగు చప్పు డని శంకించి వచ్చి చూచి.

10.1-413-కంద పద్యము

ఈ పాదపములు గూలఁగ
నీ పాపఁ డులూఖలమున నిట బద్ధుండై
యే పగిది బ్రతికెఁ? గంటిరె;
వాపోవఁడు; వెఱవఁ; డెట్టివాఁడో యితఁడున్.

10.1-414-తేటగీతి

పిడుగు పడదు; గాక పెనుగాలి విసరదు;
ఖండితంబు లగుట గానరాదు;
బాలుఁ డితఁడు; పట్టి పడఁ ద్రోయఁజాలఁడు;
తరువు లేల గూలె ధరణిమీఁద

10.1-415-వచనము

అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయు నని శంకింప నక్కడ నున్న బాలకు లిట్లనిరి.

10.1-416-కంద పద్యము

నందుని కొమరుఁడు వినుఁ డీ

సందున ముసు దూఱి ఱోలు సరి యడ్డముగా
ముందఱి కీడ్చిన మద్దులు
గ్రందుకొనం గూలె; జనులఁ గంటి మిరువురన్.

10.1-417-వచనము

అని యిట్లు పలికిన బాలకాలాపంబులు విని మిథ్యారూపంబు లని కొందఱనిరి; కొందఱు నానావిధంబుల సందేహించిరి; అంత నందుండు వికసిత వదనారవిందుం డగుచుఁ బట్టి కట్లు విడిచెను; అట్టి యెడఁ దన తెఱం గెవ్వరు నెఱుంగ కుండవలె నని రవర కుమారుండు.

10.1-418-శార్దూల విక్రీడితము

పాడున్ మందుని భంగి; గోపవనితల్ పాణిధ్వనుల్ సేయఁగా
నాడున్ జంత్రముకైవడిం; బరవశుండై హస్తముల్ త్రిప్పుచుం;
జూడన్ నేరని వాని భంగి జనులం జూచున్; నగున్; బాలురం
గూడుం బెద్దలపంపు చేయఁజను; డాగున్; మట్టిఁ జిట్టాడుచున్.

## 10.1-58- కపటబాలలీలలు

10.1-419-కంద పద్యము

చుంచోదవుఁ బాలు ద్రావు ము
దంచితముగ ననుఁడుఁ బాలు ద్రావి జననితోఁ
జుం చోదవ దనుచు లీలా
చుంచుం డై యతఁడు చుంచుఁ జూపె నరేంద్రా!

10.1-420-కంద పద్యము

సెలగోల పట్టుకొని జల
కలశములో నీడఁ జూచి కలశయుతుండై
సెలగోలఁ పాపఁ డొకఁ డిదె
తలచెన్ ననుఁ గొట్ట ననుచుఁ దల్లికి జెప్పెన్.

10.1-421-కంద పద్యము

బిక్షులు వచ్చెద రేడ్చిన;
బిక్షాపాత్రమున వైచి బెగడించి నినున్
శిక్షించెద; రని చెప్పిన
బిక్షులఁ గని, తల్లిఁ గనియు భీతిల్లె నృపా!

10.1-422-వచనము

ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప, బృహద్వనంబున నందాదు లైన గోపవృద్ధులు మహోత్పాతంబు లగుటయు, వానివలన బాలుఁ డుత్తరించుటయుఁ జూచి యే కాంతంబున నొక్కనాడు విచారింప నుపనందుం డను వృద్ధగోప కుండు తన యెఱుక మెఱసి యిట్లనియె.

## 10.1-59- బృందావనముబోవతలచుట

10.1-423-ఉత్పలమాల

ఇక్కడనుందురే మనుజు? లీ మన కృష్ణున కెగ్గు చేయఁగా
రక్కసురాలు చన్నొసఁగె; ఱాలపయిన్ సుడిగాలి వీచెఁ; బై
గ్రక్కిరియం దరుల్ వడియెఁ; గేశవు సత్కృపఁ దప్పెఁ; జాలు నేఁ
డెక్కడి కైనఁ బోవలయు నిం కిట గోపకులార! వింటిరే?

10.1-424-కంద పద్యము

కసవుగల దిరవు పసులకు
లస దద్రి నదీ మహీజ లతికావళిఁ బెం
పెసఁగును, గాపురమునకును
బొసఁగును బృందావనంబు పోదఁ డచ్చటికిన్.

## 10.1-60- బృందావనమునకుబోవుట

10.1-425-వచనము

అని పలుకు నుపనందుని పలుకుల కార్యులైన గోపకు "లిది యకార్యంబు మందల" యని కొందల మందక యాలమందల నమంద గమనంబున ముందఱ నడవం బనిచి పిఱుందం గ్రందుకొనకుండ, బాల వృద్ధనారు లెక్కిన తేరులు సాగించి తారు తను త్రాణ తూణీర బాణధరులై విండ్లు పట్టుకొని నడవ, బండ్లవెనుకఁ గొమ్ములిమ్ములం బూరించుచు నవార్యంబులగు తూర్యరవంబుల నార్య పురోహిత సమేతులై వేడుకలు కొనలు నిగుడ మొనలేర్పఱచుకొని పావనం బగు బృందావనంబునకుం జని రప్పుడు.

10.1-426-తరళము

పసుపు లాడి యురోజకుంకుమ పంకశోభితలై లస
ద్వసనలై కచభారచంపకదామలై సులలామలై
పసిఁడిమాడల కాంతు లట్టులఁ బర్వఁ దేరులమీఁద బెం
పెసఁగ బాడిరి వ్రేత లా హరిహేల లింపగు నేలలన్.

## 10.1-61- బృందావనముజొచ్చుట

10.1-427-వచనము

అప్పుడు రోహిణీయశోద లేక రథంబునఁ బరిపూర్ణమనోరథలై రామకృష్ణుల ముందట నిడుకొని వారల వినోదంబులకుఁ బ్రమోదంబు నొందుచుండి; రిట్లు గోపకులు బృందావనంబు జొచ్చి యందర్ధచంద్రాకారంబుగ శకట సందోహంబు నిలిపి మందలు విడియించి వసియించిరి.

10.1-428-కంద పద్యము

చెందిరి బలమాధవు లభి
నందించుచుఁ బరమపావనము సంచిత కా
ళిందీ సంజీవనమున్
బృందావనమున్ మునీంద్ర బృందావనమున్.

10.1-429-వచనము

ఇట్లు బృందావనంబు చేరి కొంత కాలంబునకు రామకృష్ణులు సమానవయస్కులైన గోపబాలకులం గూడుకొని వేడుక లూదుకొన దూడలఁ గాచుచు.

10.1-430-సీస పద్యము

వేణువు లూఁదుచు వివిధరూపములతో;
 గంతులు వైతురు గౌతుకమున;
గురుకంబళాదుల గోవృషంబులఁ బన్ని;
 పరవృషభము లని ప్రతిభటింతు;
రల్లులు దట్టించి యంఘ్రుల గజ్జలు;
 మొలయఁ దన్నుదు రోలి ముమ్మరముగఁ
బన్నిదంబులు వైచి ఫలమంజరులు గూల్చి;

వేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప;

10.1-430.1-తేటగీతి

వన్య జంతు చయంబుల వానివాని
పదురు పదురుచు వంచించి పట్టఁబోదు;
రంబుజాకారములఁ జల్లులాడఁ జనుదు;
రా కుమారులు బాల్యవిహారు లగుచు.

10.1-431-కంద పద్యము

పోరుదురు గికురు పొడుచుచు;
దూఱుదురు భయంబు లేక తోరపుటిరవుల్;
జాఱుదురు ఘనశిలాతటి;
మీఱుదు రెన్నంగరాని మెఁలకువల నృపా!

## 10.1-62- వత్సాసురవధ

10.1-432-వచనము

అంత నొక్కనాడు యమునాతీరంబున నా కుమారులు గోపకుమా రులుం దారును గ్రేపుల మేప నొక్క రక్కసుండు క్రేపు రూపున వచ్చి వారల హింసింపం దలంచి.

10.1-433-కంద పద్యము

క్రేపుల యఱ్ఱులు నాకుచుఁ
గ్రేపులలో నిదియె మంచి క్రేపనఁగఁ గడుం
జూపట్టి భక్త సంగతిఁ

గ్రేపై చనువాని మ్రోలఁ గ్రేపై తిరిగెన్.

10.1-434-వచనము

వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పి

10.1-435-చంపకమాల

ఇది యొక మంచిలేగ; వినుఁ డెంతయు నొప్పెడి నంచు దాని త
త్పదములు తోఁకయున్ బిగియఁబట్టి చెలంగి వెలంగ మ్రానితోఁ
జదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం
గుదులుకొనంగ బాలకులు కోయని యార్వ నఖర్వ లీలతోన్.

10.1-436-వచనము

ఇట్లు రక్కసుండు ప్రేటుపడి విశాలంబగు సాలంబుతో నేలం గూలెను; అప్పుడు

10.1-437-కంద పద్యము

గొంగడు లెగురఁగ వైచుచుఁ
జంగున దాఁటుచును జెలఁగి చప్పట లిడుచుం
బొంగుచుఁ గృష్ణుని బొగడుచు
ద్రుంగిన రక్కసునిఁ జూచి త్రుళ్ళిరి కొమరుల్.

10.1-438-వచనము

ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించి రివ్విధంబున.

10.1-439-కంద పద్యము

వత్సముల పగిది జగముల

వత్సలతన్ మనుపఁ జూచువాఁడై యుంటన్
వత్సముల మేపు చుండియు
వత్సాసురుఁ జంపె భక్తవత్సలుఁ డధిపా!

10.1-440-వచనము

మఱియు నొక్కనాడు రేపకడ గోపకుమారులు క్రేపులంగొంచు నడవికిం జని యెండంబడి మెండుకొనిన దప్పిని బెండుపడిన తమ తమ లేఁగకదుపుల నేర్పరించి నిలువరించుకొని కలంకంబు లేని యొక్క కొలంకున నీరు ద్రావించి తారును జలపానంబు జేసి వచ్చునెడ నందు.

## 10.1-64- బకాసుర వధ

10.1-441-కంద పద్యము

అకలంకులు బాలురు గని
రకుటిలదంభోళిహతసితాద్రి శిఖర రూ
పకమున్ హరిహింసారం
భకమున్ బకమున్ విశాలభయదాంబకమున్.

10.1-442-వచనము

కని దాని యొడలిపొడవునకు వెఱఁగుపడి చూచుచుండ.

10.1-443-ఆటవెలది

ఎల్ల పనులు మాని యేకాగ్రచిత్తుఁ డై
మౌనివృత్తి నితర మతము విడిచి
వనములోన నిలిచి వనజాక్షుపైఁ దృష్టి

చేర్చి బకుఁడు తపసి చెలువుఁ దాల్చె.

10.1-444-వచనము

ఇవ్విధంబున నొదుగు పెట్టుకొని యుండి.

10.1-445-ఉత్పలమాల

చంచువు దీఁటి పక్షములు జల్లున విచ్చి పదంబు లెత్తి కు
ప్పించి నభంబుపై కెగసి, భీషణ ఘోషణ వక్త్రుడై విజృం
భించి గరుత్సమీరమున భిన్నము లై తరులోలిఁ గూలఁగా
మించి బకాసురుం డొడిసి మ్రింగె సహిష్ణునిఁ జిన్నికృష్ణునిన్.

10.1-446-కంద పద్యము

సంగడి లోకము లన్నియు
మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచు ను
ప్పొంగెడు వేడుకకాఁ డటు
మ్రింగుడుపడె బకునిచేత మీఁ దెఱిఁగి నృపా!

10.1-447-కంద పద్యము

దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ
గనలేక బలాది బాలకప్రముఖు లచే
తనులై వెఱఁ గందిరి చ
య్యనఁ బ్రాణములేని యింద్రియంబుల భంగిన్.

10.1-448-వచనము

అట్లు మ్రింగుడుపడి లోనికిం జనక.

10.1-449-శార్దూల విక్రీడితము

కంఠోపాంతము దొడలున్ మెఱముచుం గాలాగ్ని చందంబునం
కుంఠీభూతుఁడు గాక వేంద్రమగు నా గోపాలబాలున్ జయో
త్కంఠున్ బ్రహ్మగురున్మహామహిముఁ జక్కం ద్రింగ రాదంచు నో
ల్లుంఠం బాడుచు వాఁడు గ్రక్కె వెడలన్ లోకం బశోకంబుగన్.

10.1-450-కంద పద్యము

క్రక్కి మహాఘోషముతోఁ
జక్కఁగఁ దనుఁ బొడువరాఁగఁ జంచులు రెండున్
స్రుక్కఁగఁ బట్టి తృణము క్రియ
గ్రక్కున హరి చీరె బకునిఁ గలహోత్సుకునిన్.

10.1-451-వచనము

అప్పు డా నందనందనుమీఁద వేలుపులు చాలపులుగా నందన మల్లికాది కుసుమవర్షంబులు హర్షంబునం గురియించిరి; దేవవాద్యంబులు మొరసె; రామాది గోపకుమారులు ప్రాణంబులతోఁ గూడిన యింద్రియంబులుం బోలెఁ గ్రమ్మఱ కృష్ణునిం గని రమ్మని కౌఁగిలించుకొని కృష్ణసహితులయి లేఁగదాఁటుల మరల దాఁటించుకొని మందగమనంబున మంద కరిగిరి; వారలచేత నా వృత్తాంతం బంతయు విని వెఱంగుపడి గోపగోపికాజనంబులు.

10.1-452-కంద పద్యము

ఆపదలమీఁద నాపద
లీ పాపనిఁ జెంది తొలఁగె; నీ యర్భకుపై
వే పడిన ఖలులు దహనుని

వైపున శలభముల పగిదిఁ బడిరి ధరిత్రిన్.

10.1-453-వచనము

అని పలికిరి; మఱియు నా రామకృష్ణులు క్రేపులం గాచు తఱి.

10.1-454-సీస పద్యము

కపులమై జలరాశిఁ గట్టుదమా యని;
 కట్టుదు రడ్డంబు కాలువలకు;
మునులమై తపములు మొనయుదమా యని;
 మౌనులై యుందురు మాటలేక;
గంధర్వవరులమై గానవిద్యలు మీఱఁ;
 బాడుదమా యని పాడఁ జొత్తు;
రప్సరోజనులమై యాడుదమా యని;
 యాఁడు రూపముఁ దాల్చి యాఁడఁ జనుదు;

10.1-454.1-ఆటవెలది

రమర దైత్యవరులమై యబ్ధిఁ ద్రత్తమా
యని సరోవరముల యందు హస్త
దండచయముఁ ద్రిప్పి తరుతురు తమ యీడు
కొమరు లనుచరింపఁ గొమరు మిగుల.

## 10.1-65- చల్దులుగుడుచుట

10.1-455-వచనము

అంత నొక్కనాఁడు రామకృష్ణులు కాంతారంబున బంతిచల్దులు గుడువ నుద్యోగించి ప్రొద్దునలేచి, గ్రద్దనం దమ యింటిలేఁగకదుపులం గదలించి, సురంగంబులగు శృంగంబులు పూరించిన విని, మేలుకని, సంరంభంబున గోపడింభకులు చలిది కావడులు మూఁపున వహించి, సజ్జంబులగు కజ్జంబులు గట్టుకొని పదత్రాణ వేత్రదండంధరులయి, లెక్కకు వెక్కసంబైన తమతమ క్రేపుకదుపులం జప్పుడించి రొప్పుకొనుచు, గాననంబు జొచ్చి, కాంచన మణి పుంజ గుంజాది భూషణ భూషితులయ్యును, ఫల కుసుమ కోరక పల్లవ వల్లరులు తొడవులుగా నిడుకొని, కొమ్ములి మ్ముగఁ బూరించుచు వేణువు లూఁదుచుఁ, దుమ్మెదలం గూడి పాడుచు, మయూరంబులతోడం గూడి యాడుచుఁ, బికంబులం గలసి కూయుచు, శుకంబులం జేరి రొదలు జేయుచుఁ, బులుగుల నీడలం బాఱుచుఁ, బొదరిండ్లందూఱుచు సరాళంబులగు వాఁగులు గడచుచు, మరాళంబుల చెంత నడచుచు, బకమ్ములం గని నిలుచుచు, సారసంబులం జోపి యలంచుచు, నదీజలంబులం దోఁగుచుఁ, దీగె యుయ్యెలల నూఁగుచు, పల్లంబులం డాగుచు, దూరంబుల కేగుచుఁ, గపుల సంగడిఁ దరువులెక్కుచు ఫలంబులు మెక్కుచు రసంబులకుంజొక్కుచు నింగికిన్నిక్కుచు నీడలు చూచి నవ్వుచుఁ, గయ్యంబులకుఁ గాలుదువ్వుచు, చెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు బహుప్రకారంబుల శరీర వికారంబులు జేయుచు మఱియును.

10.1-456-కంద పద్యము

ఒకనొకని చల్దికావిడి  
నొకఁ డొకఁ డడకించి దాఁచు; నొకఁ డొకఁ డది వే  
ఱొక డొకని మొఱఁగికొని చను

నొక డొకఁ డది దెచ్చి యిచ్చు నుర్వీనాథా!

10.1-457-కంద పద్యము

ఒక్కఁడు మున్నే మఱి చన
నొక్కఁడు బలుబొబ్బ వెట్టు నులికిపడన్; వే
ఱొక్కఁడు మిట్టి తటాలున
నొక్కని కనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్.

10.1-458-కంద పద్యము

తీపుగల కజ్జ మన్యుఁడు
కోపింపఁగ నొడిసి పుచ్చుకొని త్రోపాడం
బైపడి యది గొని యొక్కఁడు
క్రేపులలో నిట్టునట్టుఁ గికురించు నృపా!

10.1-459-కంద పద్యము

వనజాక్షుఁడు మున్నరిగిన
మునుపడఁగా నతని నేనె ముట్టెద ననుచుం
జని మునుముట్టనివానిన్
మునుముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా!

10.1-460-వచనము

ఇవ్విధంబున.

10.1-461-ఉత్పలమాల

ఎన్నఁడునైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయుం

గన్నులఁగాన రట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టపట్టుచుం
దన్నుచు గ్రుద్దుచున్నగుచుఁ దద్దయుఁబైఁపడి కూడి యాడుచుం
మున్నన జేయ వల్లవకుమారుల భాగ్యము లింత యొప్పునే?

10.1-462-కంద పద్యము

విందులకును బ్రహ్మసుఖా
నందం బై భక్తగణమునకు దైవత మై
మందులకు బాలుఁ డగు హరి
పొందుఁ గనిరి గొల్ల; లిట్టి పుణ్యులు గలరే?

## 10.1-66- అఘాసుర వధ

10.1-463-వచనము

అని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె.

10.1-464-కంద పద్యము

అమరు లమృతపానంబున
నమరిన వా రయ్యు నే నిశాటుని పంచ
త్వమునకు నెదుళ్ళు చూతురు
తము నమ్మక యట్టి యఘుఁడు దర్పోద్ధతుఁడై.

10.1-465-కంద పద్యము

బకునికిఁ దమ్ముఁడు గావున
బకమరణముఁ దెలిసి కంసు పంపున గోపా
లక బాలురఁతోఁ గూఁడను

బకవైరినిఁ ద్రుంతు ననుచుఁ బటురోషమునన్.

10.1-466-కంద పద్యము

బాలురు ప్రాణంబులు గో
పాలురకు; మదగ్రజాతు ప్రాణము మా రీ
బాలురఁ జంపిన నంతియ
చాలును; గోపాలు రెల్ల సమసిన వారల్.

10.1-467-వచనము

అని నిశ్చయించి, యోజనంబు నిడుపును, మహాపర్వతంబు పొడుపును, గొండతుదల మీఱిన కోఱలును, మిన్నుదన్ని పన్నిన నల్ల మొగిళ్ళ పెల్లుగల పెదవులును, బిలంబులకు నగ్గలంబులయిన యిగుళ్ళ సందులు, నంధకారబంధురంబయిన వదనాంతరాళంబును, దావానల జ్వాలాభీలంబయిన దృష్టిజాలంబులును, వేఁడిమికి నివాసంబులయిన యుచ్ఛ్వాస నిశ్వాసంబులును మెఱయ, నేల నాలుకలు పఱచుకొని ఘోరంబగు నజగ రాకారంబున.

10.1-468-కంద పద్యము

జాపిరము లేక యిప్పుడు
గ్రేపుల గోపాలసుతులఁ గృష్ణునితోడన్
గీపెట్టఁగ మ్రింగెద నని
పాపపు రక్కసుఁడు త్రోవఁ బడి యుండె నృపా!

10.1-469-వచనము

ఆ సమయంబున.

10.1-470-మత్తేభ విక్రీడితము

ఒక వన్యాజగరేంద్ర మల్లదె గిరీంద్రోత్సేధ మై దావపా
వక కీలా పరుషప్రచండతర నిశ్వాసంబుతో ఘోర వ
హ్ని కరాళాతతజిహ్వతోడ మనలన్ హింసింప నీక్షించుచున్
వికటంబై పడి సాగి యున్నది పురోవీధిం గనుంగొంటిరే?

10.1-471-వచనము

అని యొండొరులకుం జూపుచు.

10.1-472-మత్తేభ విక్రీడితము

బకునిం జంపిన కృష్ణుఁ డుండ మనకుం బాముంచుఁ జింతింప నే
టికి? రా పోదము దాఁటి; కాక యది కౌటిల్యంబుతో మ్రింగుడున్
బకువెంటంజనుఁ గృష్ణుచేత ననుచుం బద్మాక్షు నీక్షించి యు
త్సుకులై చేతులు వ్రేసికొంచు నగుచున్ దుర్వారులై పోవగన్.

10.1-473-వచనము

వారలం జూచి హరి తన మనంబున.

10.1-474-మత్తేభ విక్రీడితము

అర్భకు లెల్లఁ బాము దివిజాంతకుఁ డౌట యెఱుంగ; రక్కటా!
నిర్భయులై యెదుర్కొనిరి నేఁ గల నంచు విమూఢు లంచు నా
విర్భవదాగ్రహత్వమున వెందగులన్ తమలేఁగపిండుతో
దుర్భర ఘోర సర్ప ఘన తుండ బిలాంతముఁ జొచ్చి రందఱున్.

10.1-475-వచనము

అయ్యవసరంబున.

10.1-476-శార్దూల విక్రీడితము

వేల్పుల్ చూచి భయంబు నొంద గ్రసనావేశంబుతో నుజ్జ్వల
త్కల్పాంతోజ్జ్వలమాన జిహ్వ దహనాకారంబుతో మ్రింగె న
స్వల్పాహీంద్రము మాధవార్పిత మనోవ్యాపార సంచారులన్
యల్పాకారుల శిక్యభారులఁ గుమారాభీరులన్ ధీరులన్.

10.1-477-వచనము

ఇట్లు పెనుబాముచేత మ్రింగుడుపడు సంగడికాండ్ర గమిం జూచి కృష్ణుండు.

10.1-478-ఉత్పలమాల

పడుచులు లేఁగలుం గలసి పైకొని వత్తురు తొల్లి కృష్ణ! మా
కొడుకు లదేల రా; రనుచు గోపిక లెల్లను బల్క నే క్రియన్
నొడివెద? నేఁడు పన్నగము నోరికి వీరికి నొక్క లంకెగా
దొడఁబడ నేలచేసె? విధి యోడక జేయుఁగదయ్య! క్రౌర్యముల్.

10.1-479-వచనము

అని తలపోసి, నిఖిలలోచనుండును, నిజాశ్రిత నిగ్రహమోచనుండు నైన తమ్మికంటి, మింటి తెరువరులు మొఱలిడ రక్కసు లుక్కుమిగుల వెక్కసంబగు నజగరంబయి యున్న యన్నరభోజను కుత్తుకకుం బొత్తుగొని మొత్తంబు వెంటనంటం జని తమ్ము నందఱఁ జిందఱ వందఱ చేసి మ్రింగ నగ్గలించు

నజగరంబు కంఠద్వారంబున సమీరంబు వెడలకుండఁ దన శరీరంబుఁ బెంచి గ్రద్దన మిద్దెచఱచి నట్లుండ.

10.1-480-కంద పద్యము

ఊపిరి వెడలక కడుపున
వా పొదవినఁ బాము ప్రాణవాతంబులు సం
తాపించి శిరము వ్రక్కలు
వాపికొనుచు వెడలి చనియెఁ బటు ఘోషముతోన్.

10.1-481-శార్దూల విక్రీడితము

క్రూరవ్యాళ విశాలకుక్షిగతులన్ గోవత్ససంఘంబుతో
గారుణ్యామృతవృష్టిచేత బ్రతుకంగాఁ జూచి వత్సంబులున్
వారుం దాను దదాస్యవీధి మగుడన్ వచ్చెన్ ఘనోన్ముక్తుఁడై
తారానీకముతోడ నొప్పెసఁగు నా తారేశు చందంబునన్.

10.1-482-ఆటవెలది

అమరవరులకొఱకుఁ గమలజాండం బెల్ల
బలిఁ దిరస్కరించి బలియు వడుగు
గోపసుతులకొఱకుఁ బాపపుఁ బెనుబాము
గళము దూఁటుగట్ట బలియకున్నె?

10.1-483-ఉత్పలమాల

ఆ పెనుబాము మేన నొక యద్భుతమైన వెలుంగు దిక్తటో
ద్దీపకమై వడిన్ వెడలి దేవపథంబునఁ దేజరిల్లుచున్

క్రేపులు బాలురున్ బెదరఁ గృష్ణుని దేహము వచ్చి చొచ్చె నా
పాపఁడు చొచ్చి ప్రాణములఁ బాపిన యంతన శుద్ధసత్త్వమై.

10.1-484-కంద పద్యము

తన రూపొకమా రైనను
మనమున నిడుకొనినఁ బాపమయు నైనను లోఁ
గొనిచను హరి తను మ్రింగిన
దనుజునిఁ గొనిపోవకున్నె తనలోపలికిన్?

### 10.1-67- సురలు పూలుగురియించుట

10.1-485-వచనము

తదవసరంబున, సురలు కుసుమ వర్షంబులు గురియించిరి; రంభాదు లాడిరి; గంధర్వాదులులు పాడిరి; మేఘంబులు మృదంగం బుల భంగి ఘోషించె; సిద్ధ గణంబులు జయజయ భాషణంబులు భాషించి; రంత.

10.1-486-శార్దూల విక్రీడితము

ఆ వాద్యంబులు, నా మహాజయరవం, బా పాట, లా యాటలుం
దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని ప్రీతిన్ భూమి కేతెంచి నే
డీ వత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం
డేవెంటన్ బ్రతికించె? మే, లనుచు నూహించెం గడుం నివ్వెఱన్.

10.1-487-వచనము

అంత న య్యజగర చర్మంబు కొన్ని దివసంబుల కెండి పెద్దకాలం బు గోపాలబాలురకు కేళీబిలంబై యుండె; నిట్లు కౌమార విహా రంబుల నైదవ యేటఁ

గృష్ణుం డఘాసురునిం దెగఁ జూచుటయుఁ దమ్ముం గాచుటయు నాఱవయేటిదైన పౌగండవృత్తాంతంబని చిత్తంబుల గోపకుమారులు దలంచుచుందు" రని చెప్పిన నప్పుడమిఱేఁ డప్పరమయోగీంద్రునకిట్లనియె.

10.1-488-సీస పద్యము

అయిదేండ్లు కౌమార; మటమీఁద నయిదేండ్లు;
 పౌగండ మనియెడు ప్రాయ మందు;
నయిదేండ్లవాఁడైన యఘ్జాక్షుచరితంబు;
 పౌగండ మని గోపబాలు రెల్లఁ
దలఁతు రంటివి యెట్లు తలతురు వారలు? ;
 నిరుడు చేసిన పని నేటి దనఁగ
వచ్చునే? యిది నాకు వరుసతో నెఱిఁగింపు;
 మనవుడు యతిచంద్రుఁడైన శుకుఁడు

10.1-488.1-ఆటవెలది

యోగ దృష్టిఁజూచి యొక్కింత భావించి
వినుము రాజవర్య! వినయధుర్య!
పరమగుహ్య మనుచుఁ బలుకుదు రార్యులు
శిష్యజనుల కీవు చేయు తలఁపు.

10.1-489-కంద పద్యము

ప్రియురాలివలని వార్తలు
ప్రియజనులకు నెల్ల ప్రొద్దుఁ బ్రియ మగు భంగిన్
ప్రియుఁడగు హరిచరితంబులు

ప్రియభక్తుల కెల్లయెడలఁ బ్రియములు గావే?

10.1-490-వచనము

అని పలికి యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె; నట్లఘాసురు మొగంబువలనం గడచి చనిన లేఁగల గోపకుమారులం బ్రతికించి వారును దానునుం జనిచని.

10.1-491-మత్తేభ విక్రీడితము

కనియెం గృష్ణుఁడు సాధునీరము మహాగంభీరముం బద్మకో
కనదాస్వాదు వినోదమోద మదభృంగద్వంద్వ ఝుంకారమున్
ఘనకల్లోల లతావితాన విహరత్కాదంబ కోలాహల
స్వనవిస్ఫారము మందవాయుజ కణాసారంబుఁ గాసారమున్.

10.1-492-వచనము

కని తమ్మికంటి తమ్ముల యింటి సొబగునకు నిచ్చ మెచ్చుచుఁ జెచ్చెర గాలి నోలిం గదలెడు కరళ్ళ తుంపురుల జల్లు పెల్లున నొడళ్ళు గగుర్పొడువఁ గొలంకు కెలంకులఁ గాయ పండుల గెలల వ్రేగున వీఁగి పట్టుగల చెట్టుతుటము నీడల నొప్పుచున్న యిసుక తిప్పల విప్పుఁ జూచి వేడుక పిచ్చలింప నెచ్చెలుల కిట్లనియె.

## 10.1-68- చల్దులారగించుట

10.1-493-శార్దూల విక్రీడితము

ఎండన్ మ్రగ్గితి రాఁకటం బడితి రింకేలా విలంబింపఁగా
రండో బాలకులార! చల్ది గుడువన్ రమ్యస్థలం బిక్క డీ
దండన్ లేఁగలు నీరు ద్రావి యిరవందం బచ్చికల్ మేయుచుం

దండంబై విహరించుచుండఁగ నముందప్రీతి భక్షింతమే?

10.1-494-వచనము

అనిన "నగుఁగాక" యని వత్సంబుల నుత్సాహంబున నిర్మలంబు లగు జలంబులు ద్రావించి, పచ్చికల మొల్లంబులుగల పల్లంబుల నిలిపి చొక్కంబులగు చల్దిచిక్కంబులు చక్కడించి.

10.1-495-మత్తేభ విక్రీడితము

జలజాంతస్థిత కర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న ఆే
కుల చందంబునఁ గృష్ణునిం దిరిగిరాఁ గూర్చుండి వీక్షించుచున్
శిలలుం బల్లవముల్తృణంబులు లతల్ చిక్కంబులుం బువ్వు లా
కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా!

10.1-496-సీస పద్యము

మాటిమాటికి వ్రేలు మడిఁచి యూరించుచు;
నూరుఁగాయలు దినుచుండు నొక్క;
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి;
చూడు లేదని నోరు చూపునొక్కఁ;
డేగు రార్గురి చల్దు లెలమిఁ బన్నిదమాడి;
కూర్కొనికూర్కొని కుడుచు నొక్కఁ;
డిన్నియుండఁగఁ బంచి యిడుట నెచ్చలితన;
మనుచు బంతెనగుండు లాడు నొకఁడు;

10.1-496.1-ఆటవెలది

కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి వడి మ్రోల
మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు;
నవ్వు నొకఁడు; సఖుల నవ్వించు నొక్కఁడు;
ముచ్చటాడు నొకఁడు; మురియు నొకఁడు.

10.1-497-వచనము

అయ్యవసరంబున.

10.1-498-సీస పద్యము

కడుపున దిండుగాఁ గట్టిన వలువలో;
 లాలిత వంశనాళంబు చొనిపి
విమల శృంగంబును వేత్రదండంబును;
 జాఱి రానీక డాచంక నిఱికి
మీఁగడ పెరుగుతో మేళవించిన చల్ది;
 ముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేగి కొసరి తెచ్చిన యూరుగాయలు;
 వ్రేళ్ళ సందులయందు వెలయ నిఱికి

10.1-498.1-ఆటవెలది

సంగడీల నడుమఁ జక్కగఁ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద
శైశవంబు మెఱసి చల్ది గుడిచె.

10.1-499-వచనము

ఇట్లు కృష్ణసహితు లయిన గోపకుమారులు చల్దులు గుడుచునెడఁ గ్రేపులు మేపులకుం జొచ్చి, పచ్చని గఱికిజొంపంబుల గుంపుల కుఱికి, లంపులు మేయుచు, ఘోరంబగు నరణ్యంబు నడుమం దోరంబగు దూరంబు చనిన, వానింగానక వెఱచుచున్న గోపడింభకులకు నంభోజనయనుం డిట్లనియె.

## 10.1-69- క్రేపుల వెదకబోవుట

10.1-500-మత్తేభ విక్రీడితము

వినుఁ డో! బాలకులార! క్రేపు లటవీ వీధిన్ మహా దూరముం
జనియెన్ కోమల ఘాసఖాదనరతోత్సాహంబుతో నెందుఁ బో
యెనొ? యేమయ్యెనొ క్రూరజంతువులచే నే యాపదం బొందెనో?
కని తెత్తుం గుడువుండు చల్దిగొఱఁతల్ గాకుండ మీరందఱున్.

10.1-501-వచనము

అని చెప్పి,

10.1-502-శార్దూల విక్రీడితము

కర్ణాలంబిత కాక పక్షములతో గ్రైవేయహారాళితో
స్వర్ణాభాసిత వేత్రదండకముతో సత్పింఛదామంబుతో
పూర్ణోత్సాహముతో ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతో
తూర్ణత్వంబున నేఁగె లేఁగలకునై దూరాటవీ వీధికిన్.

10.1-503-వచనము

ఇట్లేగుచు.

10.1-504-కంద పద్యము

ఇచ్చోఁ బచ్చిక మేసిన;
విచ్చోఁ ద్రావినవి తోయ; మేగిన విచ్చో;
నిచ్చోట మంద గొన్నవి;
యిచ్చోఁ బాసినవి; జాడ యిదెయిదె యనుచున్.

10.1-505-కంద పద్యము

కంజదళాక్షుఁడు వెదకెను
గొంజక లేఁగల నపార గురుతృణవనికా
పుంజంబుల భీకర మృగ
కుంజంబుల దరుల గిరులఁ గొలఁకుల నదులన్.

10.1-506-వచనము

అంత.

## 10.1-70- బ్రహ్మ వత్సబాలకులదాచుట

10.1-507-శార్దూల విక్రీడితము

బాలుం డయ్యు నితండఘాసురుఁడు ద్రుంపన్ బాలురం గ్రేపులన్
యేలీలన్ బ్రతికించెనొక్కొ? భువి నూహింపం గడుం జోద్య మం
చాలో నంబుజసంభవుండు చని మాయా బాలు శుంభద్బలం
బాలోకింపఁ దలంచి డాఁచె నొకచో నా లేఁగలన్ బాలురన్.

10.1-508-వచనము

ఆ సమయంబున, దూడలు వోయిన జాడ యెఱుంగక, తప్పి య ప్పద్మలోచనుం డెప్పటి కొలంకుకడకు వచ్చి, యచ్చోట నె నెచ్చెలులం గానక వారింజీరి, లేకుండుట నిశ్చయించి గోవిం దుండు విశ్వవిదుండు గావున నిది విరించి మొఱంగని యెఱింగి తిరిగి వోవుచు.

10.1-509-శార్దూల విక్రీడితము

వంచింపం బనిలేదు బ్రహ్మ కిచటన్ వత్సంబులన్ బాలురన్
వంచించెం గనుఁ బ్రామి; తన్ను మరలన్ వంచించు టాశ్చర్యమే?
వంచింపం దన కేల? తెచ్చుటకునై వర్ధించు బ్రహ్మాండము
ల్వంచింపన్ మరలింప నేర్చు హరి లీలన్ మందహాసాస్యుఁడై.

10.1-510-కంద పద్యము

గోపాలసుతులు లే రని
గోపికలకుఁ జెప్ప నేల? గోపాలకులున్
గోపికలు నలర బాలుర
క్రేపుల రూపముల నేఁ జరించెద ననుచున్.

## 10.1-71- వత్సబాలకులరూపుడగుట

10.1-511-మత్తేభ విక్రీడితము

కరముల్ పాదములున్ శిరంబు లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాం
తరముల్ ముక్కులు గన్నులుం శ్రవణముల్ దంతాదులుం దండకాం
బర స్రగ్వేణు విషాణ భూషణ వయో భాషా గుణాఖ్యాన త
త్పరతల్ వీడ్వడకుండఁ దాల్చె విభుఁడా వత్సార్భకాకారముల్.

10.1-512-కంద పద్యము

రూపంబు లెల్ల నగు బహు
రూపకుఁ డీటు బాలవత్స రూపంబులతో
నేపారు టేమి చోద్యము?
రూపింపఁగ నతని కితర రూపము గలదే?

10.1-513-కంద పద్యము

మరలుపు మనియెడు కర్తయు
మరలించు కుమారకులును మరలెడి క్రేపుల్
పరికింపఁ దానయై హరి
మరలం జనె లీలతోడ మందకు నధిపా!

10.1-514-వచనము

ఇట్లు బాల వత్స రూపంబులతో విహరించుచు మందకు వచ్చి వారివారి దొడ్ల నయ్యై వత్సంబుల ముందరికందువల నిలిపి, త త్తద్బాలరూపంబుల నందఱి గృహంబులం బ్రవేశించి వేణునాదం బులు చేసిన.

10.1-515-చంపకమాల

కొడుకుల వేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబు లై
ముడిపడ లేచి యెత్తుకొని మూర్కొని తల్లులు గౌగలించుచుం
జడిగొనఁజేపు వచ్చి తమ చన్నుల యందు సుధాసమంబు లై
వెడలెడి పాలు నిండుకొనువేడుక నిచ్చిరి తత్సుతాళికిన్.

10.1-516-వచనము

మఱియుఁ దల్లు లుల్లంబులం బెల్లుగ వెల్లిగొనిన వేడుకలం దమ నందనులకు నలుంగు లిడి, మజ్జనంబులు గావించి, గంధంబు లలంది తొడవులు దొడిగి నిటలతటంబుల రక్షాతిలకంబులు పెట్టి, సకల పదార్థసంపన్నంబు లైన యన్నంబు లొసంగి సన్నములు గాని మన్ననలు చేసిరి.

10.1-517-కంద పద్యము

ఏ తల్లుల కే బాలకు
లే తెఱఁగునఁ దిరిగి ప్రీతి నెసగింతురు ము
న్నా తల్లుల కా బాలకు
లా తెఱఁగునఁ బ్రీతిఁ జేసి రవనీనాథా!

10.1-518-వచనము

ఆ సమయంబున.

10.1-519-ఉత్పలమాల

పాయని వేడ్కతో నునికిపట్టులకుం జని గోవు లెల్ల నం
బే యని చీరి హుమ్మనుచుఁ బేరిచి మూర్కొని పంచితిల్లి పె
ల్లై యతిరేకమై పొదుగులం దెడలేక స్రవించుచున్న పా
లాయెడ నాకుచున్ సుముఖలై యొసఁగెన్ నిజవత్సకోటికిన్.

10.1-520-కంద పద్యము

వ్రేతలకును గోవులకును
మాతృత్వము చాలఁ గలిగె మఱి మాధవుపై
మాత లని హరియు నిర్మల

కౌతూహల మొప్పఁ దిరిగెఁ గడు బాల్యమునన్.

10.1-521-ఆటవెలది

ఘోషజనుల కెల్లఁ గుఱ్ఱలపై వేడ్క
పూఁటపూఁట కెలమిఁ బోటకరించె
నిచ్చ క్రొత్త యగుచు నీరజాక్షునిమీఁద
వేడ్క దమకుఁ దొల్లి వెలసినట్లు.

10.1-522-వచనము

ఇట్లు కృష్ణుండు బాలవత్స రూపంబులు దాల్చి తన్నుఁ దాన రక్షించుకొనుచు, మందను వనంబున నమంద మహిమంబున నొక్క యేఁడు గ్రీడించె, నా యేటికి నైదాఱు దినంబులు కడమపడి యుండ నందొక్కనాఁడు బలభద్రుండునుం దానును వనంబునకుం జని మందచేరువ లేఁగల మేప నతి దూరంబునం గోవర్ధన శైలశిఖరంబున ఘాసంబులు గ్రాసంబులు గొనుచున్న గోవు లా లేఁగలం గని.

10.1-523-చంపకమాల

ముదమునహుంకరించుచును; మూఁపులపైమెడలెత్తి చాఁచుచున్
బదములు నాల్గు రెండయిన బాగునఁ గూడఁగ బెట్టి దాఁటుచున్
వదనములన్ విశాలతర వాలములన్ వడి నెత్తి పాఱి యా
మొదవులు చన్నులంగుడిపె మూఁతుల మ్రింగెడిభంగి నాకుచున్.

10.1-524-వచనము

అంత గోపకులు గోవుల వారింప నలవి గాక దిగ్గన నలుకతోడి సిగ్గు లగ్గలంబుగ దుర్గమ మార్గంబున వానివెంట నంటి వచ్చి లేఁగల మేపుచున్న కొడుకులం గని.

10.1-525-ఉత్పలమాల

అయ్యలఁ గంటి మంచుఁ బులకాంకురముల్ వెలయంగఁ గుఱ్ఱలం
జయ్యన డాసి యెత్తికొని సంతస మందుచుఁ గౌగలింపఁ దా
రయ్యెడ నౌదలల్ మనములారఁగ మూర్కొని ముద్దు చేయుచున్
దయ్యమెఱుంగు; గోపకులు దద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్.

10.1-526-వచనము

ఇట్లు బాలకాలింగనంబుల నానందభాష్పపూరితనయనులై గోపకులు గోవుల మరలించుకొని తలంగిచన వారలం జూచి బలభ ద్రుండు తనలోఁ నిట్లని తలంచె.

## 10.1-72- బలరాముడన్నరూపెరుగుట

10.1-527-సీస పద్యము

చన్ను మానిన యట్టి శాబకశ్రేణిపై;
 గోగణంబులకును గోపకులకు
నిబ్బంగి వాత్సల్య మెబ్బంగి నుదయించె? ;
 హరిఁ దొల్లి మన్నించునట్లు వీరు
మన్నించు చున్నారు మమతఁ జేయుచుఁ బ్రీతి;
 నంబుజాక్షునిఁ గన్న యట్లు నాకుఁ
బ్రేమయయ్యెడి, డింభబృందంబుఁ గనుఁగొన్న;
 నిది మహాద్భుత మెందు నెఱుఁగరాదు

10.1-527.1-తేటగీతి

మనుజ దైవత దానవ మాయ యొక్కొ?
కాక నా భర్త యగుచున్న కమలనయను
మాయయో గాక యితరుల మాయ నన్నుఁ
గలఁప నోపదు; విభుమాయ కాఁగ నోపు.

10.1-528-కంద పద్యము

అని మున్ను ముగ్ధుఁ డయ్యును
దన యందుల దివ్యదృష్టిఁ దప్పక బుద్ధిన్
తన చెలికాండ్రను గ్రేపుల
వనజాక్షుం డనుచుఁ జూచె వసుధాధీశా!

10.1-529-వచనము

ఇట్లు విజ్ఞానదష్టిం జూచి యెఱింగియు నమ్మక బలదేవుండు గొందలపడుచుఁ గృష్ణుం జూచి "మహాత్మా! తొల్లి యెల్ల క్రేపులును ఋషుల యంశం బనియును గోపాలకులు వేల్పుల యంశం బనియును దోచుచుండు; నిపుడు వత్సబాలకసందోహంబు సందేహంబు లేక నీవ యని తోఁచుచున్నది; యిదియేమి?" యని యడిగిన యన్నకు నున్నరూపంబు వెన్నుండు మన్ననఁ జేసి క్రన్నన నెఱింగించె నతండు నెఱింగె; యివ్విధంబున హరి బాలవత్సంబులుదానయై సంచరించిన యేఁడు విరించికిఁ దన మానంబున నొక్క త్రుటిమాత్రం బైన విరించి చనుదెంచి వత్సబాలకాకారుం డైన కృష్ణబాలకుం జూచి వెఱంగుపడి యిట్లని వితర్కించె.

## 10.1-73- బ్రహ్మ తర్కించుకొనుట

10.1-530-శార్దూల విక్రీడితము

మందం గల్గిన వత్సబాలకులు నా మాయా గుహాసుప్తులై
యెందుం బోవరు; లేవ రిప్పుడును; వేఱే చేయ నా కన్యులొం
డెందున్ లేరు; విధాతలుం బరులు; వీ రెవ్వార లెట్లైరొకో?
యెందేతెంచిరొ కృష్ణుతో మెలఁగువా? రేఁడయ్యెడిన్ నేఁటికిన్.

10.1-531-మత్తకోకిలము

బ్రహ్మపంపునఁ గాని పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడున్
బ్రహ్మ నొక్కఁడ గాని వేఱొక బ్రహ్మ లేఁడు సృజింపఁగా
బ్రహ్మ నేను సృజింప నొండొక బాలవత్సకదంబ మే
బ్రహ్మ యందు జనించె? నొక్కట బ్రహ్మమౌనది చూడఁగాన్.

10.1-532-వచనము

అని యిట్లు సకలంబును సుకరంబుగ నెఱింగెడి నెఱవాది ముదుక యెఱుకగలప్రోడ వెఱంగుపడి గ్రద్దనఁ బెద్దప్రొద్దు తద్దయుం దలపోసి కర్జంబు మందల యెఱుంగక కొందలపడుచు నాందోళనంబున.

10.1-533-కంద పద్యము

మోహము లేక జగంబుల
మోహింపఁగఁ జేయ నేర్చు మొనసిన విష్ణున్
మోహింపించెద ననియెడు
మోహమున విధాత తాన మోహితుఁ డయ్యెన్.

10.1-534-తేటగీతి

పగలు ఖద్యోతరుచి చెడుపగిది రాత్రి
మంచు చీఁకటి లీనమై మాయుమాడ్కి
విష్ణుపై నన్య మాయలు విశద మగునె?
చెడి నిజేశుల గరిమంబుఁ జెఱుచుఁ గాక.

10.1-535-వచనము

మఱియును.

10.1-536-కంద పద్యము

పుట్టితి; బుద్ధి యెఱింగితిఁ;
బుట్టించితి జగము; సగము పోయెను బ్రాయం;
బిట్టివి నూతన సృష్టులు
పుట్టుట లే; దౌర! యిట్టి బూమెలు భూమిన్.

10.1-537-వచనము

అని యిట్లు తలవాకిట వాణి గల పోఁడిమిచే వాఁడిమికెక్కిన నలుమొగంబుల తక్కరిగొంటు పెనుదంట పలువెంటలైన తనమనంబున వితర్కించి, విచారించు నెడ, నతండు కనుగొనుచుండ నబ్బాలకులు మేఘశ్యాములును, హార కుండల కిరీట వనమాలికాభిరాములును, శ్రీవత్స మంగళాంగద నూపుర కనక కటక కంకణ కటిఘటిత కాంచీగుణోద్దాములును, నాపాదమస్తక తులసీదళదాములును, విలసదంగుళీయకస్తోములును, శంఖ చక్ర గదా కమల హస్తులును, జతుర్భుజ ప్రశస్తులును పీతకౌశే యవాసులును, చంద్రికాధవళహాసులును, కరుణాకటాక్షవీక్షణ విలాసులును, రవికోటిభాసులును, ననంత సచ్చిదానందరూప మహితులును, యణిమాదిగుణోపేతులును,

విజాతీయభేదర హితులును, శ్రీమన్నారాయణప్రతిమాన విగ్రహస్వరూపులునై తమకుఁ బరతంత్రులగుచు నృత్తగీతాది సేవావిశేషంబులకుం జొచ్చి మెలంగుచు మూర్తిమంతంబు లయిన బ్రహ్మాదిచరాచరంబులు, నణిమాదిసిద్ధులును, మాయాప్రముఖంబులయిన శక్తులును, మహదాది చతుర్వింశతి తత్వంబులును, గుణక్షోభకాల పరిణామ హేతుసంస్కారకామ కర్మగుణంబులును సేవింప వేదాంతవిదులకయిన నెఱుంగరాని తెఱంగున మెఱయుచుఁ గానబడిన వారలం గనుంగొని.

10.1-538-ఉత్పలమాల

బాలురఁ గంటి నా చెయిది బాసిన వారిని మున్ను వారి నేఁ
బోలఁగఁ జూచునంతటన భూరినిరర్గళదుర్గమప్రభా
జాలముతోడఁ జూపులకుఁ జాలమిఁ దెచ్చుచు నున్నవార; లే
మూలమొ మార్గమెయ్యదియొ? మోసమువచ్చెఁగదే విధాతకున్.

10.1-539-వచనము

అని సకలేంద్రియంబులకు వెక్కసంబైన స్రుక్కి.

10.1-540-ఉత్పలమాల

ఏ పరమేశు తేజమున నీ సచరాచరమైన లోక ము
ద్దీపిత మయ్యె నట్టి విభుతేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా
నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం
డై పరమేష్ఠి మైమఱచె నప్పుడు చిత్రపురూపుకైవడిన్.

10.1-541-వచనము

ఇట్లు మాయాతీతుండును, వేదాంతవిజ్ఞాన దుర్లభుండును, స్వప్రకాశానందుండునునైన తన బాహుళ్యంబుఁ జూచి నివ్వెఱ పడిన బ్రహ్మంగని యీశ్వరుండు.

10.1-542-శార్దూల విక్రీడితము

బాలుండై చతురాననుండు తన యీ బ్రహ్మాభిమానంబునన్
లోలుండై మతిదప్పి నా మహిమ నాలోకింప నేతెంచెఁ దా
నాలోకింపఁగ నెంతవాఁ? డనుచు మాయాజాలమున్ విప్పి త
ల్లీలా రూపము లెల్ల డాఁచె నటఁ గేళీచాతురీధుర్యుఁడై.

10.1-543-వచనము

అంతలోన నజీవుండు సజీవుండైన తెఱంగున నెనిమిది కన్నులు గల వేల్పుగమికాఁడు తేఱితెప్పఱి కాలుగేలుగదలించి చెచ్చెరం గన్నులు విచ్చిచూడ సమర్థుండై ముందటఁగని వెనుకఁజూచి, దివి విలోకించి దిక్కులు వీక్షించి, యెల్లయెడలం గలయదర్శించి తన పురోభాగంబున హరి సంచరించుటం జేసి జాతివైరంబు లేని నర పక్షి మృగాదులకు నాటపట్టయి సిరి గలిగి కామ క్రోధాది రహితులకు జీవనంబైన బృందావనంబుఁ బొడగాంచి; యందు.

10.1-544-సీస పద్యము

తన కన్యములు లేక తనరారి ముమ్మూల;
 విభుడయ్యుఁ గ్రేపుల వెదకువాని
నఖిలజ్ఞుఁడై యొక్కఁడయ్యు నజ్ఞాకృతిఁ;
 జెలికాండ్రఁ బెక్కండ్రఁ జీరువాని
బహిరంతరాద్యంత భావశూన్యుండయ్యు;

నంతంత నడుగు చొప్పరయువాని
గురుగభీరుండయ్యుఁ గురువులు వాఱుచు;
నట్టిట్టు పాతరలాడువాని

10.1-544.1-ఆటవెలది
జాతిరహితుఁ డయ్యుఁ జతురగోపార్భక
భావ మెల్ల నచ్చుపడిన మేటి
చెలువువాని హస్త శీతాన్నకబళంబు
వానిఁ గాంచె నపుడు వాణిమగఁడు.

10.1-545-వచనము
కని సంభ్రమించి విరించి రాయంచ డిగ్గనుఱికి కనకదండను కుమారంబైన శరీరముతోడ నేలం జాగిలంబడి మణిగణసుప్రకా శంబులైన తన కిరీటశిఖరప్రదేశంబు లా కుమారుని పాదపద్మం బులు మోవ మ్రొక్కి తోరంబులగు నానందభాష్పజలపూరం బుల నతని యడుగులు గడిగి మఱియును.

10.1-546-కంద పద్యము
అడుగులపైఁ బడు లేచున్
పడుఁ గ్రమ్మఱఁ లేచు, నిట్లు భక్తిన్ మును దాఁ
బొడగనిన పెంపుఁ దలఁచుచు
దుడుకని మహిమాబ్ధి నజుఁడు దుడు కడఁచె నృపా!

10.1-547-వచనము

అంత నల్లనల్లన లేచి నిలుచుండి నయనారవిందంబులు దెఱచి, గోవిందుని సందర్శించి చతుర్ముఖుండు ముఖంబులు వంచి కృతాంజలియై దిగ్గన డగ్గుతిక యిడుచు నేకచిత్తంబున చతుర్ముఖంబుల నిట్లని స్తుతియించె.

## 10.1-74- బ్రహ్మ పూర్ణిజేయుట

10.1-548-సీస పద్యము

శంపాలతికతోడి జలదంబు కైవడిఁ;
 మెఱుఁగు టొల్లియతోడి మేనివానిఁ
కమనీయ మృదులాన్నకబళ వేత్ర విషాణ;
 వేణుచిహ్నంబుల వెలయువాని
గుంజా వినిర్మిత కుండలంబులవాని;
 శిఖిపింఛవేష్టిత శిరమువానిఁ
వనపుష్పమాలికావ్రాత కంఠమువాని;
 నళినకోమల చరణములవానిఁ

10.1-548.1-ఆటవెలది

గరుణ గడలుకొనిన కడకంటివాని గో
పాలబాలుభంగిఁ బరగువాని
నగుమొగంబువాని నను(గన్న తండ్రిని
నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష!

10.1-549-మత్తేభ విక్రీడితము

నను మన్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించు నీ
తను రూపంబిదె నా మనంబున కచింత్యంబయ్యె; నీ యుల్లస

ర్థన విశ్వాకృతి నెవ్వఁ డోపు? నెఱుఁగన్ కైవల్యమై యొప్పు నా
త్మ నివేద్యంబగు నీదు వైభవము చందం బెట్టిదో? యీశ్వరా!

10.1-550-కంద పద్యము

విజ్ఞాన విధము లెఱుఁగక
తజ్ఞులు నీ వార్త చెప్పఁ దను వాఙ్మనముల్
యజ్ఞేశ! నీకు నిచ్చిన
యజ్ఞులు నినుఁబట్టి గెలుతు రజితుఁడవైనన్.

10.1-551-కంద పద్యము

శ్రేయములు గురియు భక్తిని
జేయక కేవలము బోధ సిద్ధికిఁ దపమున్
చేయుట విఫలము; పొల్లున
నాయము చేకుఱునె తలఁప నధికం బైనన్.

10.1-552-కంద పద్యము

నిజముగ నిన్నెఱుఁగఁగ మును
నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీ కథ వినుచున్
నిజకర్మలబ్ధ భక్తిన్
సుజనులు నీ మొదలిటెంకిఁ జొచ్చి రధీశా!

10.1-553-సీస పద్యము

విక్రియాశూన్యమై విషయత్వమును లేని;
దగుచు నాత్మాకారమై తనర్చు

నంతఃకరణ మొక్క యధిక సాక్షాత్కార;
విజ్ఞానమునఁ బట్టి వే ఱొరులకుఁ
నెఱుఁగంగ రానిదై యేపారి యుండుటఁ;
జేసి నీ నిర్గుణ శ్రీవిభాతి
బహిరంగవీధులఁ బాఱక తిరములై;
యమలంబు లగు నింద్రియములచేత

10.1-553.1-ఆటవెలది

నెట్టకేలకైన నెఱుఁగంగ నగుగాని
గుణవిలాసి వగుచుఁ గొమరుమిగులు
నీ గుణవ్రజంబు నేర రా దెఱుఁగంగ
నొక్క మితము లేక యుంట నీశ!

10.1-554-కంద పద్యము

తారా తుషార శీకర
భూరజములకైన లెక్క బుధు లిడుదురు; భూ
భారావతీర్ణకరుఁ డగు
నీ రమ్యగుణాలి నెన్న నేర రగణ్యా!

10.1-555-శార్దూల విక్రీడితము

ఏ వేళం గృపఁ జూచు నెన్నఁడు హరిన్ వీక్షింతు నం చాడ్యుఁడై
నీ వెంటంబడి తొంటి కర్మచయమున్ నిర్మూలముం జేయుచున్
నీ వాఁడై తను వాఙ్మనోగతుల నిన్ సేవించు విన్నాణి వో
కైవల్యాధిపలక్ష్మి నుద్దవడిఁ దాఁ గైకొన్న వాఁ డీశ్వరా!

10.1-556-ఉత్పలమాల

మాయలు గల్గువారలను మాయలఁ బెట్టెడి ప్రోడ నిన్ను నా
మాయఁ గలంచి నీ మహిమ మానముఁ జూచెద నంచు నేరమిం
జేయఁగఁ బూనితిం; గరుణచేయుము; కావుము; యోగిరాజ వా
గ్గేయ దవాగ్నిఁ దజ్జనిత కీలము గెల్చి వెలుంగ నేర్చునే.

10.1-557-సీస పద్యము

సర్వేశ! నే రజోజనితుండ; మూఢుండఁ;
 బ్రభుఁడ నేనని వెట్టి ప్రల్లదమున
గర్వించినాఁడను; గర్వాంధకారాంధ;
 నయనుండ గృపఁజూడు ననుఁ; బ్రధాన
మహదదహంకృతి నభో మరుదగ్ని జల భూమి;
 పరివేష్టితాండకుంభంబులోన
నేడు జేనల మేన నెనయు నే నెక్కడ? ;
 నీ దృగ్విధాండంబు లేరి కైన

10.1-557.1-తేటగీతి

సంఖ్య చేయంగ రానివి; సంతతంబు
నోలిఁ బరమాణవుల భంగి నొడలి రోమ
వివరముల యందు వర్తించు విపులభాతి
నెనయుచున్న నీ వెక్కడ? నెంతకెంత?

10.1-558-తరళము

కడుపులోపల నున్న పాపఁడు కాలఁ దన్నినఁ గిన్కతో

నడువఁ బోలునె క్రాఁగి తల్లికి? నాథ! సన్నము దొడ్డునై
యడఁగి కారణ కార్యరూపమునైన యీ సకలంబు నీ
కడుపులోనిదె గాదె? పాపఁడఁ గాక నే మఱి యెవ్వఁడన్?

10.1-559-కంద పద్యము

భూరి లయ జలధినిద్రిత
నారాయణనాభికమలనాళమున నజుం
డారఁయఁ బుట్టె ననుట నిజ
మో! రాజీవాక్ష! పుట్టెనోటు తలంపన్.

10.1-560-సీస పద్యము

నళినాక్ష! నీ వాది నారాయణుండవు;
జలము నారము జీవచయము నార
మందు నీవుంట నీ యం దవి యుంటను;
నారాయణుండను నామ మయ్యె
సకల భూతములకు సాక్షివధీశుండ;
వబ్ధి నిద్రించు నారాయణుండ
నీ మూర్తి యిది నీకు నిజమూర్తి యనరాదు;
నళిననాళము త్రోవ నడచి మున్ను

10.1-560.1-తేటగీతి

కడఁగి నూఱేండ్లు వెదికి నేఁ గాననయితి
నేక దేశస్థుఁడవు గా వనేక రుచివి
జగములోనుందు; నీలోన జగములుండు

నరుదు; నీ మాయ నెట్లైన నగుచునుండు.

10.1-561-మత్తేభ విక్రీడితము

వినుమో; యీశ్వర! పెల్ల్పలన్వేలుఁగు నీ విశ్వంబు నీ మాయ గా
క నిజంబైన యశోద యెట్లుగనియెం? గన్నార నీ కుక్షిలోఁ
గనెఁ బోఁ గ్రమ్మఱఁ గాంచెనే? భవదపాంగశ్రీఁ బ్రపంచంబు చ
క్కన లోనౌ; వెలి యౌను; లోను వెలియుం గాదేఁ దదన్యంబగున్;

10.1-562-మత్తేభ విక్రీడితము

ఒకఁడై యుంటివి; బాలవత్సములలో నొప్పారి తీ వంతటన్
సకలోపాసితులౌ చతుర్భుజులునై సంప్రీతి నేఁ గొల్వఁగాఁ
బ్రకటశ్రీగలవాఁడవైతి; వటపై బ్రహ్మాండముల్ చూపి యొ
ల్లక యిట్లొక్కఁడవైతి; నీ వివిధ లీలత్వంబుఁ గంటింగదే?

10.1-563-కంద పద్యము

ఎఱిఁగిన వారికిఁ దోఁతువు
నెఱిఁ బ్రకృతింజేరి జగము నిర్మింపఁగ నా
తెఱఁగున రక్షింపఁగ నీ
తెఱఁగున బ్రహరింప రుద్రు తెఱఁగున నీశా!

10.1-564-వచనము

అదియునుం గాక.

10.1-565-కంద పద్యము

జలచర మృగ భూసుర నర

కులముల జన్మించి తీవు కుజనులఁ జెఱుపన్
చెలిమిని సుజనుల మనుపను
దలపోయఁగరాదు నీ విధంబు లనంతా!

10.1-566-ఆటవెలది

మబ్బుగొలిపి యోగమాయ నిద్రించిన
యోగి! పరాత్మభూమ! యోగిరాజ!
యే తెఱంగు లెన్ని యెంత యెచ్చోట నీ
హేల లెవ్వఁ డెఱుఁగు నీశ్వరేశ!

10.1-567-సీస పద్యము

అదిగాన నిజరూప మనరాదు; కలవంటి;
దై బహువిధదుఃఖమై విహీన
సంజ్ఞానమై యున్న జగము సత్సుఖబోధ;
తనుఁడవై తుదిలేక తనరు నీదు
మాయచేఁ బుట్టుచు మనుచు లే కుండుచు;
నున్న చందంబున నుండుచుండు;
నొకఁడ; వాత్ముఁడ; వితరోపాధి శూన్యుండ;
వాద్యుండ; వమృతుండ; వక్షరుండ;

10.1-567.1-ఆటవెలది

వద్వయుండవును; స్వయంజ్యోతి; వాపూర్ణుఁ
డవు; పురాణపురుషుఁడవు; నితాంత
సౌఖ్యనిధివి; నిత్యసత్యమూర్తివి; నిరం

జనుఁడ వీవు; తలఁపఁ జనునె నిన్ను. ?

10.1-568-వచనము

దేవా! యిట్టి నీవు జీవాత్మ స్వరూపకుఁడవు, సకలాత్మలకు నాత్మయైన పరమాత్మ స్వరూపకుఁడవని యెవ్వ రెఱుంగుదురు, వారుగదా గురువనియెడు దినకరునివలనఁ బ్రాప్తంబైన యుపనిషదర్థజ్ఞానం బను సునేత్రంబునంజేసి సంసార మిథ్యాసాగరంబుఁ దరించిన చందంబున నుండుదురు; రజ్జువందు రజ్జువని యెఱింగెడి యెఱుక లేకుండ, నయ్యెఱుంగమి నది సర్పరూపంబయి తోఁచిన పిదప నెఱింగిన వారివలన రజ్జువు రజ్జువని యెఱుంగుచుండ, సర్పరూపంబు లేకుండు కైవడి, నాత్మ యప్పరమాత్మ యని యెవ్వ రెఱుంగరు వారి కయ్యెఱుంగమివలన సకల ప్రపంచంబు గలిగి తోఁచు; నాత్మ యప్పరమాత్మ యని యెవ్వరెఱుంగుదురు, వారి కయ్యెఱుకవలనఁ బ్రపంచంబు లేకుండు నజ్ఞాన సంభావిత నామకంబులైన సంసారబంధమోక్షంబులు, జ్ఞాన విజ్ఞానంబులలోనివి గావు; కావునఁ గమలమిత్రున కహోరాత్రంబులు లేని తెఱంగునఁ, బరిపూర్ణ జ్ఞానమూర్తి యగు నాత్మ యందు నజ్ఞానంబులేమిని బంధంబును సుజ్ఞానంబు లేమిని మోక్షంబు లే; వాత్మవయిన నిన్ను దేహాదికంబని తలంచియు, దేహాదికంబు నిన్నుఁగాఁ దలంచియు, నాత్మ వెలినుండునంచు మూఢులు మూఢత్వంబున వెదకుచుందురు; వారిమూఢత్వంబుఁ జెప్పనేల? బుద్ధిమంతులయి పరతత్వంబు గాని జడంబును నిషేధించుచున్న సత్పురుషులు తమతమ శరీరంబుల యంద నిన్నరయుచుందు రదిగావున.

10.1-569-శార్దూల విక్రీడితము

**దేవా!** నీ చరణప్రసాదకణలబ్ధిం గాక లేకున్న నొం

డేవెంటం జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్?
నీ వారై చనువారిలో నొకఁడనై నిన్ గొల్చు భాగ్యంబు నా
కీవే యిప్పటి జన్మమం దయిన నొండెం దైన నో! యీశ్వరా!

10.1-570-తరళము

క్రతుశతంబునఁ బూర్ణ కుక్షివి; గాని నీ విటు క్రేపులున్
సుతులునై చనుఁబాలు ద్రావుచుఁ జొక్కి యాడుచుఁ గౌతుక
స్థితిఁ జరింపఁగఁ దల్లులై విలసిల్లు గోవుల గోపికా
సతుల ధన్యత లెట్లు చెప్పఁగఁ జాలువాఁడఁ గృపానిధీ!

10.1-571-కంద పద్యము

పరిపూర్ణంబుఁ బురాణముఁ
బరమానందంబునైన బ్రహ్మమె చెలికాఁ
డరు దరుదు నందఘోష
స్థిరజనముల భాగ్యరేఖ చింతింపంగన్

10.1-572-సీస పద్యము

ఏకదశేంద్రియాధీశులు చంద్రాదు;
లేను ఫాలాక్షుండు నిట్లు గూడఁ
బదుమువ్వురము నెడపడక యింద్రియ పాత్ర;
ముల నీ పదాంభోజముల మరంద
మమృతంబుగాఁ ద్రావి యమర నేకై కేంద్రి;
యాభిమా నులుమయ్యు నతి కృతార్థ
భావుల మైతిమి; పరఁగ సర్వేంద్రియ;

వ్యాప్తులు నీ మీఁద వాల్చి తిరుగు

10.1-572.1-తేటగీతి

గోప గోపికాజనముల గురు విశిష్ట
భాగ్య సంపద తలపోసి ప్రస్తుతింప
నలవిగా దెవ్వరికి నైన నంబుజాక్ష!
భక్తవత్సల! సర్వేశ! పరమపురుష!

10.1-573-శార్దూల విక్రీడితము

ఏలా బ్రహ్మపదంబు? వేదములకున్ వీక్షింపఁగారాని ని
న్నేలోకంబున నీ వనాంతరమునం దీ మందలోఁ గృష్ణ యం
చాలాపాది సమస్త భావములు నీ యందే సమర్పించు నీ
ప్రేలం దొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే?

10.1-574-మత్తేభ విక్రీడితము

నిను హింసించిన పూతనాదులకు మున్ నీ మేటి సంకేత మి
చ్చిన నీకుం బుర దార పుత్ర గృహ గో స్త్రీ ప్రాణ దేహాదు లె
ల్లను వంచింపక యిచ్చు గోపకులకున్ లక్షింప నే మిచ్చెదో?
యని సందేహము దోఁచుచున్నది ప్రపన్నానీకరక్షామణీ!

10.1-575-కంద పద్యము

దేహము కారాగేహము
మోహము నిగళంబు; రాగముఖరములు రిపు
వ్యూహములు భక్తితో ని

న్నూహింపఁని యంతదడవు నో! కమలాక్షా!

10.1-576-ఆటవెలది

ఆశ్రయించు జనుల కానందసందోహ
మీఁ దలంచి వివిధ హేలతోడ
నప్రపంచకుండవయ్యుఁ బ్రపంచంబు
వెలయఁజేయు దీవు విశ్వమూర్తి!

10.1-577-కంద పద్యము

ఎఱిఁగిన వార లెఱుంగుదు
రెఱుఁగన్ బహు భాషలేల? నీశ్వర! నీ పెం
పెఱుఁగ మనోవాక్కులకున్
గుఱి చేయం గొలది గాదు గుణరత్ననిధీ!

10.1-578-కంద పద్యము

సర్వము నీవ యెఱుంగుదు
సర్వవిలోకనుఁడ వీవ; జగదధిపతివిన్;
సర్వాపరాధి నను నో!
సర్వేశ! యనుగ్రహింపు; చనియెద నింకన్.

10.1-579-కంద పద్యము

జిష్ణు! నిశాటవిపాటన!
వృష్ణికులాంభోజసూర్య! విప్రామర గో
వైష్ణవ సాగర హిమకర!

కృష్ణా! పాషండధర్మగ్రహదావాగ్నీ!

## 10.1-75- పులినంబునకుతిరిగివచ్చుట

10.1-580-వచనము

దేవా! నీకుఁ గల్పపర్యంతంబు నమస్కరించెద"నని యివ్విధంబున సంస్తుతించి ముమ్మాఱు వలగొని పాదంబులపైఁ బడి వీడ్కొని బ్రహ్మ తన నెలవునకుం జనియె; నతని మన్నించి భగవంతుండైన హరి తొల్లిచెడి తిరిగి వచ్చిన వత్సబాలకులం గ్రమ్మఱం గైకొని పులినంబుకడఁ జేర్చె; నిట్లు.

10.1-581-కంద పద్యము

క్రించు దనంబున విధి దము
వంచించిన యేఁడు గోపవరనందను లో
క్కించుక కాలంబుగ నీ
కించిరి రాజేంద్ర! బాలకృష్ణుని మాయన్.

10.1-582-ఆటవెలది

ఏ మహాత్ము మాయ నీ విశ్వమంతయు
మోహితాత్మక మయి మునిఁగి యుండు
నట్టి విష్ణుమాయ నర్భకు లొక్క యేఁ
డెఱుఁగ కుండి రనుట యేమి వెఱఁగు?

10.1-583-వచనము

అప్పుడు.

10.1-584-మత్తేభ విక్రీడితము

చెలికాఁడా! యరుదెంచితే యిచటికిన్? క్షేమంబునం గ్రేపులున్
నెలవుల్ చేరె నరణ్యభూమివలనన్ నీ వచ్చునం దాకఁ జ
ల్లులు వీరించుక యెవ్వరుం గుడువ ;రా లోకింపు; రమ్మంచు నా
జలజాక్షుండు నగన్ భుజించి రచటన్ సంభాషలన్ డింభకుల్.

10.1-585-వచనము

ఇట్లు బాలకులతోడఁ జల్ది గుడిచి వారలకు నజగర చర్మంబు చూపుచు వనంబున నుండి తిరిగి.

10.1-586-పంచచామరము

ప్రసన్నపింఛమాలికా ప్రభావిచిత్రితాంగుఁడుం
బ్రసిద్ధ శృంగ వేణునాద పాశబద్ధ లోకుఁడుం
బ్రసన్న గోప బాలగీత బాహువీర్యుఁ డయ్యు ను
ల్లసించి యేగె గోపకుల్ చెలంగి చూడ మందకున్.

10.1-587-వచనము

ఆ సమయంబున.

10.1-588-కంద పద్యము

పెనుఁబాము దమ్ము మ్రింగిన
మన నందసుతుండు పాము మర్దించి మమున్
మనిచె నరణ్యములోపల
నని ఘోషించిరి కుమారు లా ఘోషములోన్.

10.1-589-వచనము

అనిన విని నరేంద్రుం డిట్లనియె

## 10.1-76- కృష్ణుడుఅత్మీయుడగుట

10.1-590-కంద పద్యము

కని మనిచి యెత్తి పెంచిన
తనుజన్ములకంటె నందతనయుం డా ఘో
షనివాసులకు మనోరం
జనుఁ డెట్లయ్యెను? బుధేంద్ర! చనునెఱిఁగింపన్

10.1-591-వచనము

అనిన శుకుం డిట్లనియె.

10.1-592-సీస పద్యము

అఖిల జంతువులకు నాత్మవల్లభమైన;
భంగి బిడ్డలు నిండ్లుఁ బసిఁడి మొదలు
వస్తువు లెవ్వియు వల్లభంబులు గావు;
సకలాత్మకుండైన జలజనేత్రు
డఖిల జంతువులకు నాత్మ గావున ఘోష;
వాసుల కెల్లను వల్లభత్వ
మున మిక్కిలొప్పెను మూడులోకములకు;
హితము చేయఁగ జలజేక్షణుండు

10.1-592.1-ఆటవెలది

మాయతోడ మూర్తిమంతుడై యొప్పారు;

గలఁ డతండు నిఖిలగణము లందు
భవతిధాతు వెట్లు భావార్థమై సర్వ
ధాతు గణమునందుఁ దనరు నట్లు.

10.1-593-కంద పద్యము

శ్రీపతి పదమను నావను
ప్రాపించి భవాబ్ధి వత్సపదముగ ధీరుల్
రూపించి దాఁటి చేరుదు
రాపత్పదరహితు లగుచు నమృతపదంబున్.

10.1-594-ఆటవెలది

అఘునిఁ జంపి కృష్ణుఁ డాప్తులు దానును
జల్డి గుడిచి జలజసంభవునకుఁ
జిద్విలాసమైన చెలువుఁ జూపిన కథఁ
జదువ వినినఁ గోర్కి సంభవించు.

10.1-595-వచనము

అని చెప్పి మఱియు వ్యాసనందనుం డిట్లనియె

10.1-596-కంద పద్యము

రాగంబున బలకృష్ణులు
పౌగండవయస్కు లగుచుఁ బశుపాలకతా
యోగంబున బృందావన
భాగంబునఁ గాఁచి రంతఁ బశువుల నధిపా!

## 10.1-77- ఆలకదుపుల మేపబోవుట

### 10.1-597-వచనము

అయ్యెడఁ గృష్ణుం డొక్కనాడు రేపకడలేచి, వేణువు పూరించి బలభద్ర సహితుండై గోపకుమారులు దన్ను బహువారంబులు గైవారంబులు చేయ మ్రోల నాలకదుపుల నిడుకొని నిరంతర ఫల కిసలయ కుసుమంబులును, కుసుమ నిష్యంద మకరందపానానంద దిందింర కదంబంబును, కదంబాది నానాతరులతా గుల్మ సంకులంబును, కులవిరోధరహిత మృగపక్షిభరితంబును, భరిత సరస్సరోరుహాపరిమళమిళితపవనంబును నైన వనంబుఁ గని యందు వేడుకం గ్రీడింప నిశ్చయించి వెన్నుం డన్న కిట్లనియె.

### 10.1-598-శార్దూల విక్రీడితము

శాఖాపుష్పఫలప్రభారనతలై చర్చించి యో! దేవ! మా
శాఖిత్వంబు హరింపు; మంచు శుకభాషన్ నీకెఱింగించుచున్
శాఖాహస్తములం బ్రసూనఫలముల్ చక్కన్ సమర్పించుచున్
శాఖిశ్రేణులు నీ పదాబ్జముల కోజన్ మ్రొక్కెడిం జూచితే.

### 10.1-599-సీస పద్యము

నిఖిల పావనమైన నీ కీర్తిఁ బాడుచు;
నీ తుమ్మెదలు వెంట నేగుదెంచె
నడవిలో గూఢుండవైన యీశుఁడ వని;
మునరి కొల్వఁగ వచ్చె మునిగణంబు
నీలాంబరముతోడి నీవు జీమూతమ;
వని నీలకంఠంబు లాడఁ దొడఁగెఁ

బ్రియముతోఁ జూచు గోపికలచందంబున;
నిన్నుఁ జూచె నదె హరిణీచయంబు

10.1-599.1-ఆటవెలది

నీవు విందవనుచు నిర్మలసూక్తులు
పలుకుచున్న విచటఁ బరభృతములు
నేడు విపినచరులు నీవు విచ్చేసిన
ధన్యులైరి గాదె తలఁచి చూడ.

10.1-600-సీస పద్యము

నీ పాదములు సోఁకి నేడు నీరును దృణ;
పుంజంబుతో భూమి పుణ్య యయ్యె
నీ నఖంబులు దాఁకి నేడు నానాలతా;
తరుసంఘములు గృతార్థంబు లయ్యె
నీ కృపాదృష్టిచే నేడు నదీ శైల;
ఖగ మృగంబులు దివ్యకాంతిఁ నందె
నీ పెన్నురము మోవ నేడు గోపాంగనా;
జనముల పుట్టువు సఫల మయ్యె;

10.1-600.1-ఆటవెలది

నని యరణ్యభూమి నంకించి పసులను
మిత్రజనులు దాను మేపు చుండి
నళినలోచనుండు నదులందు గిరులందు
సంతసంబు మెఱయ సంచరించె.

10.1-601-వచనము

మఱియు నయ్యీశ్వరుండు.

## 10.1-78- ఆవులమేపుచువిహరించుట

10.1-602-సీస పద్యము

ఒకచోట మత్తాళియూధంబు ఝమ్మని;
 మ్రోయంగ ఝమ్మని మ్రోయుచుండు
నొకచోటఁ గలహంసయూధంబు గూడి కేం;
 కృతులు చేయంగఁ గేంకృతులు చేయు
నొకచోట మదకేకియూధంబు లాడంగ;
 హస్తాబ్జములు ద్రిప్పి యాడఁ దొడఁగు
నొకచోట వనగజయూధంబు నడవంగ;
 నయముతో మెల్లన నడవఁజొచ్చు

10.1-602.1-ఆటవెలది

క్రౌంచ చక్ర ముఖర ఖగము లొక్కొకచోటఁ
బలుక వానియట్ల పలుకుఁ గదిసి
పులుల సింహములను బొడగని యొకచోటఁ
బఱచు మృగములందుఁ దఱచు గూడి.

10.1-603-వచనము

మఱియును.

10.1-604-సీస పద్యము

రా పూర్ణచంద్రిక! రా గౌతమీగంగ! ;
రమ్ము భగీరథరాజతనయ!
రా సుధాజలరాశి! రా మేఘబాలిక! ;
రమ్ము చింతామణి! రమ్ము సురభి!
రా మనోహారిణి! రా సర్వమంగళ! ;
రా భారతీదేవి! రా ధరిత్రి!
రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి! ;
రమ్ము మందాకిని! రా శుభాంగి!

10.1-604.1-ఆటవెలది

యనుచు మఱియుఁ గలుగు నాఖ్యలు గల గోవు
లడవిలోన దూరమందు మేయ
ఘనగభీరభాషఁ గడునొప్పఁ జీరు నా
భీరజనులు వొగడఁ బెంపు నెగడ.

10.1-605-కంద పద్యము

కాంతార విహారమ్ముల
శ్రాంతుండై గోపకాంకశయుఁడగు నన్నన్
సంతుష్టిఁ బొందఁజేయు ని
రంతర కరచరణ మర్ధనాదుల నధిపా!

10.1-606-కంద పద్యము

పాడుచు నాడుచు ముచ్చట
లాడుచు నొండొరులఁ దాఁకు నాప్తులఁ గని బి

ట్టాడుచుఁ జేతులు వ్రేయుచుఁ
గ్రీడింతురు నగుచు బలుఁడుఁ గృష్ణుఁడు నొకచోన్.

10.1-607-వచనము

ఇవ్విధంబున.

10.1-608-సీస పద్యము

వేదాంత వీధుల విహరించు విన్నాణి;
విహరించుఁ గాంతారవీధులందు;
ఫణిరాజశయ్యపైఁ బవళించు సుఖభోగి;
వల్లవ శయ్యలఁ బవ్వళించు;
గురుయోగి మానసగుహలఁ గ్రుమ్మరు మేటి;
గ్రుమ్మరు నద్రీంద్ర గుహలలోనఁ;
గమలతోడఁ బెనంగి కడు డయ్యు చతురుఁ డా;
భీరజనులతోడఁ బెనఁగి డయ్యు;

10.1-608.1-ఆటవెలది

నఖిల లోకములకు నాశ్రయుండగు ధీరుఁ
డలసి తరులనీడ నాశ్రయించు
యాగభాగచయము లాహరించు మహాత్ముఁ
డడవిలోని ఫలము లాహరించు

10.1-609-వచనము

ఆ సమయంబున.

10.1-610-సీస పద్యము

అలసినచోఁ గొంద ఱతిమోదమున వీపు;

లెక్కించుకొని పోదు రేపు మెఱసి;

సొలసి నిద్రించినచోఁ నూరుతల్పంబు;

లిడుదురు కొందఱు హితవు గలిగి;

చెమరించి యున్నచోఁ జిగురుటాకులఁ గొంద;

ఱొయ్యన విసరుదు రుత్సహించి;

దవ్వేగి నిలుచుచోఁ దడయకఁ గొందఱు;

పదము లొత్తుదు రతిబాంధవమున;

10.1-610.1-ఆటవెలది

గోపవరులు మఱియుఁ గొందఱు ప్రియమున

మాధవునకుఁ బెక్కుమార్గములను

బనులు చేసిరెల్ల భవములఁ జేసిన

పాపసంచయములు భస్మములుగ.

## 10.1-79- ధేనుకాసుర వధ

10.1-611-వచనము

అయ్యవసరంబున శ్రీదామ నామధేయుండయిన గోపాలకుండు రామకేశవులం

జూచి యిట్లనియె.

10.1-612-కంద పద్యము

దూరంబునఁ దాలతరు

స్ఫారం బగు వనము గలదు; పతితానుపత

దూ్బరిఫలసహిత మది యే
ధీరులుఁ జొర వెఱతు రందు ధేనుకుఁ డుంటన్.

10.1-613-వచనము

ఆ ధేనుకాసురుండు మహాశూరుండును, ఖరాకారుండు నై సమా
నసత్త్వసమేతులైన జ్ఞాతులుం దానును మనుష్యులం బట్టి భక్షించుచుండు;
నయ్యెడఁ బరిమళోపేతంబులైన నూతన ఫల వ్రాతంబు లసంఖ్యాతంబులు
గలవు; వినుఁడు.

10.1-614-కంద పద్యము

ఫలగంధము నాసాపుట
ముల జొచ్చి కలంచి చిత్తములఁ గొనిపోయెన్
ఫలముల నమలింపుఁడు మము;
బలియురకును మీకు దైత్యభటు లడ్డంబే?

10.1-615-వచనము

అని పలికిన చెలికాని పలుకు లాదరించి విని నగి వారునుం దారును
నుత్తాలంబగు తాలవనంబునకుం జని; యంత.

10.1-616-కంద పద్యము

తత్తఱమున బలభద్రుఁడు
దత్తాలానోకహములఁ దనభుజబలసం
పత్తిఁ గదల్చుచు గ్రక్కున
మత్తేభము భంగిఁ బండ్లు మహిపైఁ రాల్చెన్.

10.1-617-వచనము

అప్పుడు పండ్లు రాల్చిన చప్పుడు చెవులకు దెప్పరంబయిన నదిరిపడి రిపుమర్దన కుతుకంబున గార్దభాసురుండు

10.1-618-మత్తేభ విక్రీడితము

పదవిక్షేపములన్ సవృక్షధరణీభాగంబు గంపింపఁగా
రదముల్ దీటుచుఁ గత్తిరించిన చెవుల్ రాజిల్ల వాలంబు భీ
తిదమై తూలఁగఁ గావరంబున సముద్దీపించి గోపాలకుల్
బెదరన్ రాముని ఱొమ్ముఁ దన్నె వెనుకై బీరంబు తోరంబుగన్.

10.1-619-కంద పద్యము

మఱియును దనుజుఁడు రామునిఁ
గఱవఁగ గమకించి తెఱపిఁ గానక యతనిం
జుఱచుఱఁ జూచుచు శౌర్యము
పఱిబోవఁగ నింత నంతఁ బదములఁ దన్నెన్

10.1-620-వచనము

అంత బలభద్రుండు రౌద్రాకారంబున గర్దభాసురుపదంబులు నాలుగు నొక్క కేల నంటంబట్టి బెట్టుదట్టించి త్రిప్పి విగతజీవుం జేసి.

10.1-621-మత్తేభ విక్రీడితము

ఒక తాలాగ్రముఁ దాఁక వైవ నది కంపోద్రిక్తమై త్రుళ్ళి వే
ఱొక తాలాగ్రము పైఁబడన్నదియు నయ్యుగ్రాహతిన్ నిల్వ కొం
డొక తాలాగ్రముపైఁ బడన్ విఱిగి యిట్లొండొంటిపైఁ దాలవృ

క్షకముల్గూలెఁ బ్రచండ మారుతముదాఁకం గూలు చందంబునన్.

10.1-622-ఉత్పలమాల

తంతువులందుఁ జేలము విధంబుననే పరమేశుమూర్తి యం
దింతయుఁ బుట్టునట్టి జగదీశుఁ డనంతుఁడు దైత్యమాత్రుని
ట్లంతము చేయు టెంతపని? యద్భుతమే వినుమంతలోన వాఁ
డంతముఁ బొందు టెల్లఁ గని యాతని బంధులు గార్దభంబులై.

10.1-623-కంద పద్యము

బలకృష్ణులపైఁ గదిసిన
బలియుర ఖరదైత్యభటులఁ బశ్చిమపాదం
బుల బట్టి తాల శిఖరం
బుల కెగురఁగ వైచి వారు పొరిగొని రధిపా!

10.1-624-వచనము

అప్పుడు.

10.1-625-కంద పద్యము

ఆలమున నేలిఁ గూలిన
తాలద్రుమఖండ దైత్యతనుఖండములన్
కీలితమై ధర జలధర
మాలావృతమైన మింటి మాడ్కిన్ వెలిగెన్

10.1-626-కంద పద్యము

ధేనుకవనమున నమలిరి

మానవు లావేళఁ దాఁటి మ్రాకుల ఫలముల్;
ధేనువులు మెసఁగెఁ గసవులు;
ధేనుకహరభక్తకామధేనువు గలుగన్.

10.1-627-వచనము

ఆ సమయంబున సురలు విరులవానలు గురియించి దుందు భులు మొరయించి; రంతఁ గమలలోచనుండు గోపజనజేగీయ మానవర్తనుండై, యన్నయుం దానును గోగణంబులం దోలుకొని మందకు జనియె; న య్యెడ.

10.1-628-ఉత్పలమాల

గోపదరేణుసంకలితకుంతలబద్ధమయూరపింఛు ను
ద్దీపితమందహాసశుభదృష్టిలసన్ముఖు వన్యపుష్పమా
లాపరిపూర్ణు గోపజనలాలితవేణురవాభిరాము నా
గోపకుమారునిం గనిరి గోపసతుల్ నయనోత్సవంబుగన్.

10.1-629-ఆటవెలది

కమలనయను వదనకమల మరందంబు
దవిలి నయనషట్పదములవలనఁ
ద్రావి దినవియోగతాపంబు మానిరి
గోపకాంతలెల్లఁ గోర్కు లలర.

10.1-630-వచనము

ఇట్లు గోపికలు సాదరంబుగంజూడ వ్రీడాహాసవినయంబులంజూచుచుం గ్రీడాగరిష్ఠుండైన ప్రోడ గోష్ఠంబు ప్రవేశించె; నంత రోహిణీయ శోదలు కుఱ్ఱలవలని

మచ్చికలు పిచ్చలింప నిచ్చకువచ్చినట్లయ్యె వేళల దీవించిరి; వారును మజ్జనోన్మర్దనాదు లంగీకరించి, సురభికుసుమ గంధంబులు గైకొని, రుచిర చేలంబులు గట్టికొని, రసోపపన్నంబులయిన యన్నంబులు గుడిచి, తృప్తులయి, మంజులశయ్యల సుప్తులై యుండి; రందు.

## 10.1-80- విషకలిత కాళిందిగనుగొనుట

10.1-631-సీస పద్యము

ఒకనాడు బలభద్రుఁ డొక్కఁడు రాకుండ;
 గోపాలకులు దానుఁ గూడి కృష్ణుఁ
డడవికిఁ జని యెండ నా గోవులును గోప;
 కులు నీరుపట్టునఁ గుంది డస్సి
కాళిందిలో విషకలిత తోయముఁ ద్రావి;
 ప్రాణానిలంబులు పాసి పడిన
యోగీశ్వరేశుండు యోగివంద్యుఁడు గృష్ణుఁ;
 డీక్షణామృతధార లెలమిఁ గురిసి

10.1-631.1-ఆటవెలది

పశుల గోపకులను బ్రతికించె మరలంగ;
వారుఁ దమకుఁ గృష్ణువలన మరలఁ
బ్రతుకు గలిగెనంచు భావించి సంతుష్ట
మానసములఁ జనిరి మానవేంద్ర!

10.1-632-కంద పద్యము

కాళియఫణిదూషిత యగు

కాళిందిఁ బవిత్రఁ జేయఁగా నుత్సుకుఁడై
కాళిందీజలవర్ణుఁడు
కాళియు వెడలంగ నడిచెఁ గౌరవముఖ్యా!

10.1-633-వచనము

అనిన "నయ్యగాధజలంబుల వలన మాధవుం డెట్టి నేర్పున సర్పంబు దర్పంబు మాపి వెడలించె, నందుఁ బెద్దకాలంబా వ్యాళం బేల యుండె? నెఱిఁగింపుము.

10.1-634-కంద పద్యము

తొట్టులఁ గాచిన నందుని
కుట్టని చరితామృతంబు గొనకొని చెవులన్
జుట్టంగఁ దనివి గల్గునె;
వెట్టుల కైనను దలంప? విప్రవరేణ్యా!

10.1-635-వచనము

అనిన శుకుం డిట్లనియె.

10.1-636-సీస పద్యము

మానవేశ్వర! యొక్క మడుఁగు కాళిందిలోఁ;
గల; దది యెప్పుడుఁ గాళియాహి
విషవహ్ని శిఖలచే వేచు చుండును; మీఁదఁ;
పఱతెంచినంతన పక్షులైనఁ
బడి మ్రగ్గు; నందుఁ దద్భంగశీకరయుక్త;
పవనంబు సోఁకినఁ బ్రాణు లెవ్వి

యైన నప్పుడ చచ్చు; నట్టి యా మడుఁగులో;
నుదకంబు పొంగుచు నుడుకు చుండుఁ

10.1-636.1-తేటగీతి

జూచి వెఱగంది కుజనుల స్రుక్కఁ జేయ
నవతరించిన బలువీరుఁ డాగ్రహించి
భుజగవిషవహ్ని దోషంబుఁ బొలియఁజేసి
సుజలఁ గావించి యా నదిఁ జూతు ననుచు.

10.1-637-వచనము

కృతనిశ్చయుండై, పూర్వజన్మ భాగ్యంబునం దన చరణ సంస్పర్శనంబునకు యోగ్యంబై, తత్సమీపంబున విశాల విటపశాఖా కదంబంబుతోనున్న కదంబభూజంబు నెక్కి.

## 10.1-81- కాళిందిలో దూకుట

10.1-638-మత్తేభ విక్రీడితము

కటిచేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పు బంధించి దో
స్తట సంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబుఁ గీలించి త
త్కుటశాఖాగ్రము మీఁదనుండి యుఱికెన్ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుభగుభధ్వానం బనూనంబుగన్.

10.1-639-ఉత్పలమాల

భూరి మహాప్రతాప పరిపూర్ణ భయంకర గోపబాల కం
ఠీరవపాతవేగవికటీకృత దుర్విషభీషణోర్మి సం

పూరితమై వడిం గలఁగి పొంగి ధనుశ్శతమాత్రభాగ వి
స్తారము పొందె నమ్మడుఁగు తప్తపయఃకణ ముద్భుదోగ్రమై.

10.1-640-శార్దూల విక్రీడితము

పాతీనాకృతిఁ దోయరాశినడుమన్ భాసిల్లి మున్నాధ్యుఁడై
కాఠిన్యక్రియ నీదుసేర్పు దనకుం గల్మిన్ భుజంగేంద్ర హృ
త్పీఠాగ్రంబున రోషవహ్ని లెగయన్ భీమంబుగా నీదె ను
ల్లోలోత్తుంగతరంగమై మడుఁగు దుర్లోక్యంబుగా బాహులన్.

10.1-641-వచనము

ఆ సమయంబున.

10.1-642-శార్దూల విక్రీడితము

బాలుం డొక్కఁడు వీఁడు నా మడుఁగు విభ్రాంతోచ్చలత్కర్ణ క
ల్లోలంబై కలఁగం జరించె నిట నే లోనుంటఁ జూడండు; మ
త్కీలాభీలవిశాలదుస్సహవిషాగ్ని జ్వాలలన్ భస్మమై
కూలంజేసెద నేడు లోకులకు నా కోపంబు దీపింపఁగన్.

10.1-643-వచనము

అని తలంచి విజృంభించి.

10.1-644-ఉత్పలమాల

ఘోరవిషానలప్రభలు గొబ్బునఁ గ్రమ్మఁగ సర్పసైన్య వి
స్ఫారుఁడు గాళియోరగుఁడు పాఱివడిం గఱచెన్ పయోధరా
కారుఁ బయోవిహారు భయకంప విదూరు మహాగభీరు నా

భీరకుమారు వీరు నవపీత శుభాంబరధారు ధీరునిన్.

10.1-645-కంద పద్యము

కఱచి పిఱుతివక మఱియును
వెఱవక నిజవదనజనిత విషదహనశిఖల్
మెఱయఁ దన నిడుద యొడలిని
నెఱి హరిఁ బెనగొనియె భుజగనివహపతి వడిన్.

10.1-646-వచనము

ఇట్లు భోగిభోగపరివేష్టితుండై, చేష్టలు లేనివాని తెఱంగునఁ గానంబడుచున్న ప్రాణసఖునిం గనుంగొని తత్ప్రభావంబు లెఱుంగక, తత్సమర్పిత ధనదారమనోరథమానసులు గావున.

10.1-647-చంపకమాల

అదె మన కృష్ణునిం గఱచి; యంతటఁ బోక భుజంగమంబు దు
ర్మదమున మేనఁ జుట్టుకొని మానక యున్నది; యింక నేమి చే
యుద? మెటఁజొత్త? మే పురుషు లోపుదు రీ యహినడ్డపెట్ట నె
య్యది సదుపాయ? మంచుఁ బడి రార్తరవంబులఁ దూలి గోపకుల్.

10.1-648-కంద పద్యము

గోపకుమారకశేఖరు
నేపున సర్పంబు గఱచు టీక్షించి వగన్
మేపులకుఁ దొలఁగి గోవులు
వాపోవుచునుండె వృషభవత్సంబులతోన్.

10.1-649-కంద పద్యము

భూతలము వడఁకె నుల్కా
పాతంబులు మింటఁ గానబడె ఘోషములో
ప్రేతలకును గోపక సం
ఘాతములకు నదరె గీడుకన్ను లిలేశా!

10.1-650-వచనము

అంత నా దుర్నిమిత్తంబులు వొడగని బెగడు గదిరిన చిత్తంబుల నుత్తలపడుచు మందనున్న నంద యశోదాదులైన గోపగోపికా జనంబులు హరి దళసరి యెఱుంగక గోపాల గోగణ పరివృతుం డైన కృష్ణుం డెక్కడ నైనం జిక్కనోపునని పొక్కుచుం బెక్కువలైన మక్కువలు చెక్కులొత్త నొక్కపెట్ట బాలవృద్ధసమేతులై మహాఘో షంబున నా ఘోషంబు వెలువడి.

10.1-651-కంద పద్యము

వారిబ్భంగి నెఱుంగని
వారై హరిఁ జూడఁబోవ వడిగొని నగుచున్
వారింపఁ డయ్యె రాముఁడు
వారిని హరి లా వెఱుంగువాఁ డయ్యు నృపా!

10.1-652-వచనము

అంతలోన వారునుం దానును గాంతారమార్గంబు పట్టిపోవుచు నెడనెడ గోపగోష్పదంబుల సందుల నింతనంత నక్కడక్కడ యవాంకుశ హల కమల కులిశ చక్ర చాప కేతనాది రేఖాలంకృతంబులై మార్గాభరణంబులయిన హరిచరణంబుల జాడఁ గని చొప్పుదప్పక చని దుర్ఘటంబైన యమునా తటంబుఁ

జేరి వారిమధ్యంబున నితరుల కసాధ్యం బయిన సర్పంబుచేతఁ గాటుపడి దర్పంబుఁజూపక భోగిభోగపరివృతుండయిన శ్రీకృష్ణునిం గని కృష్ణ కృష్ణేతి విలాపంబులఁ దాపంబులం బొందుచు తత్కాలంబునఁ బ్రతికూలంబయ్యె ననుచు దైవంబుఁదిట్టు గోపికలును గోపకులం గలసి మేతలుడిగి ఱెప్పలిడక కృష్ణునిం దప్పకచూచుచు నొఱలుచున్న గోవులం గని; రందు గోపికలు యశోదం బట్టుకొని విలపించుచుఁ గృష్ణు నుద్దేశించి యిట్లనిరి.

## 10.1-82- గోపికలు విలపించుట

### 10.1-653-సీస పద్యము

ఎదురువచ్చినఁ జాల నెదురుగా జనుదెంతు;
 వెదురువచ్చిన నే డదేల రావు?
చూచినఁ గృపతోడఁ జూచు చుందువు నీవు;
 చూచినఁ గనువిచ్చి చూడ వేల?
డాసిన నఱలేక డాయంగ వత్తువు;
 డాసిన నేటికి డాయ విచటఁ?
జీరిన నో! యని చెలరేగి పలుకుదు;
 విది యేమి చీరిన నెఱుఁగకుంట?

### 10.1-653.1-ఆటవెలది

తలఁపు చేయునంతఁ దలపోయుచుందువు
తలఁపు చేయ నేడు తలఁప వకట;
యనుచు భక్తివివశు లాడెడి కైవడి
వ్రేత లెల్ల నాడి వివశలైరి.

10.1-654-వచనము

ఆ సమయంబున నంద యశోదాదులు హరిం జూచి యధికం బయిన శోకంబున నిట్లనిరి.

10.1-655-కంద పద్యము

విషకుచయుగ యగు రక్కసి
విషకుచదుర్గంబుఁ ద్రావి విషవిజయుఁడ పై
విషరుహలోచన! యద్భుత
విషయుండగు నీకు సర్వవిష మెక్కెఁ గదా!

10.1-656-కంద పద్యము

కట్టా! క్రూర భుజంగము
గట్టలుకన్ నిన్నుఁ గఱవఁ గంపించితివో?
తిట్టితివో పాపపు విధిఁ?
బట్టి మముం దలఁచి కాఁక పలవించితివో?

10.1-657-కంద పద్యము

పన్నగము మమ్ముఁ గఱవక
నిన్నేటికిఁ గఱచెఁ గుఱ్ఱ! నెమ్మి గలిగి నీ
వున్నను మము రక్షింతువు;
నిన్నున్ రక్షింప నేము నేరము తండ్రీ!

10.1-658-ఉత్పలమాల

చూడ వదేమి గౌరవపుఁజూపుల మమ్ము; సఖాలితోడ మా

టాడ వదేమి? మర్మముగ నందెలు పాదములందు మ్రోయ నే
డాడ వదేమి నర్తనము? లవ్వల మ్రోలను గోపికావళిం
గూడ వదేమి నవ్వులను? గోపకుమారవరేణ్య! చెప్పుమా;

10.1-659-సీస పద్యము

శ్రవణరంధ్రంబులు సఫలతఁ బొందంగ;
 నెలమి భాషించు వా రెవ్వ రింకఁ?
గరచరణాదుల కలిమి ధన్యత నొంద;
 నెరిగి పైఁ బ్రాఁకు వా రెవ్వ రింక?
నయనయుగ్మంబు లున్నతిఁ గృతార్థములుగా;
 నవ్వులు చూపు వా రెవ్వ రింక?
జిహ్వలు గౌరవశ్రీఁ జేరఁ బాటల;
 యెడఁ బలికించు వా రెవ్వ రింక

10.1-659.1-ఆటవెలది

తండ్రి! నీవు సర్పదష్టుండవై యున్న
నిచట మాకుఁ బ్రభువు లెవ్వ రింక?
మరిగి పాయ లేము; మాకు నీతోడిద
లోక మీవు లేని లోక మేల?

10.1-660-వచనము

అని యొండొరులం బట్టుకొని విలపించుచుఁ "గృష్ణునితోడన మడుఁగుఁ జొత్తము చత్త" మనుచుఁ గృష్ణవిరహవేదనానలభార తప్తులై మడుఁగు చొరఁబాఱుచున్న

వారలం గనుంగొని భగవం తుండైన బలభద్రుండు “మీరు మీఁ దెఱుఁగరు; ధైర్యంబు విడుచుట కార్యంబు గాదు సహించి చూడుం” డనుచు వారిని వారించె.

10.1-661-కంద పద్యము

తనుఁ గూర్చి యివ్విధంబున
వనితలు బిడ్డలును దారు వాపోయెడి ఘో
షనివాసులఁ గని కృష్ణుఁడు
మనుజుని క్రియ నొక ముహూర్తమాత్రము జరపెన్.

## 10.1-83- కాళియ మర్దనము

10.1-662-శార్దూల విక్రీడితము

అంతం గృష్ణుఁడు మేను పెంప భుజగుం డావృత్తులం బాసి తా
సంతప్తాయతభోగుఁ డై కఱచుటల్ చాలించి నిట్టూర్పుతో
శ్రాంతుండై తల లెత్తి దుర్విషము నాసావీథులం గ్రమ్మ దు
శ్చింతన్ దిక్కులు చూచుచుం దలగి నిల్చెన్ ధూమకాష్ఠాకృతిన్.

10.1-663-చంపకమాల

వెఱ మఱలేని మేటి బలువీరుఁడు కృష్ణకుమారుఁ డొక్క చేఁ
జఱచి ఖగేంద్రుచందమునఁ జక్కన దౌడలు పట్టి కన్నులం
జొఱజొఱ దుర్విషానలము జొబ్బిలుచుండఁగ నెత్తి లీలతోఁ
జిఱజిఱఁ ద్రిప్పి వైచెఁ బరిశేషిత దర్పముఁ గ్రూరసర్పమున్.

10.1-664-వచనము

ఇట్లు వేగంబుగ నాగంబు వీచిపైచి జగజ్జెట్టియైన నందునిపట్టి రెట్టించిన సంభ్రమంబున.

10.1-665-సీస పద్యము

ఘన యమునానదీ కల్లోల ఘోషంబు;
సరసమృదంగఘోషంబు గాఁగ
సాధుబృందావనచరచంచరీక గా;
నంబు గాయక సుగానంబు గాఁగ
కలహంస సారస కమనీయమంజు శ;
బ్దంబులు తాళశబ్దములు గాఁగ
దివినుండి వీక్షించు దివిజ గంధర్వాది;
జనులు సభాసీనజనులు గాఁగ

10.1-665.1-తేటగీతి

పద్మరాగాది రత్నప్రభాసమాన
మహితకాళియ ఫణిఫణామండపమున
నళినలోచన విఖ్యాత నర్తకుండు
నిత్యనైపుణమునఁ బేర్చి నృత్య మాడె.

10.1-666-శార్దూల విక్రీడితము

కుక్షిన్ లోకములున్న గౌరవముతో గోపాకృతిన్నున్న యా
రక్షోహంత వడిన్ మహాఫణిఫణారంగప్రదేశంబుపై
నక్షీణోద్ధత నాడుఁ; బాడుఁ; జెలఁగున్; హాసంబుతోడం బద
ప్రక్షేపంబులు చేయుఁ గేళిగతులం బ్రాణైకశేషంబుగన్.

10.1-667-కంద పద్యము

ఘనతర సుషిరానంద
స్వనములతో సిద్ధ సాధ్య చారణ గంధ
ర్వ నిలింప మునిసతులు చ
య్యన గురిసిరి విరులవాన లాడెడు హరిపై.

10.1-668-వచనము

ఇట్లు దుష్టజన దండధరావతారుండైన హరి వడిగలిగిన పడగల మీఁదఁ దాండవంబు సలుప, బెండుపడి యొండొండ ముఖంబుల రక్తమాంసంబు లుమియుచుఁ గన్నుల విషంబుగ్రక్కుచు నుక్కుచెడి చిక్కి దిక్కులుచూచుచుఁ గంఠగతప్రాణుండై ఫణీంద్రుండు తన మనంబున.

10.1-669-ఉత్పలమాల

వేలుపులైన లావుచెడి వేదనఁ బొందుచు నా విషానల
జ్వాలలు సోఁకినంతటన చత్తురు; నేడిది యేమి చోద్య? మా
భీలవిషాగ్ని హేతిచయపీడకు నోర్చియుఁ గ్రమ్మఱంగ నీ
బాలుఁడు మత్ఫణాశతము భగ్నముగా వెసఁ ద్రొక్కి యాడెడున్.

10.1-670-కంద పద్యము

ఈతఁడు సర్వచరాచర
భూతేశుండైన పరమపురుషుఁడు సేవా
ప్రీతుఁడు శ్రీహరి యగు నని
భీతిన్ శరణంబు నొందె బిట్టలసి నృపా!

10.1-671-వచనము

ఇట్లు క్రూరంబులయిన హరిచరణ ప్రహారంబులం బడగ లెడసి నొచ్చి చచ్చినక్రియం బడియున్న పతింజూచి నాగకాంతలు దురంతంబయిన చింతాభరంబున నివ్వటిల్లెడు సెవ్వగల నొల్లొంటోయి పల్లటిల్లిన యుల్లంబుల.

10.1-672-మత్తేభ విక్రీడితము

కచబంధంబులు వీడ భూషణము లాకంపింపఁ గొఁదీవియల్
కుచయుగ్మంబుల ప్రేగునం గదలఁ బైకొంగుల్ వడిన్ జారఁగాఁ
బ్రచురభ్రాంతిఁ గలంగి ముందట రుదద్బాలావళిం గొంచు స్రు
క్కుచు, భక్తింజని కాంచి రా గుణమణిన్ గోపాలచూడామణిన్.

## 10.1-84- నాగకాంతలు స్తుతించుట

10.1-673-వచనము

కని దండప్రణామంబు లాచరించి నిటలతటఘటిత కరకమలలై యిట్లనిరి.

10.1-674-కంద పద్యము

క్రూరాత్ముల దండింపఁగ
ధారుణిపై నవతరించి తనరెడి నీ కీ
క్రూరాత్ముని దండించుట
క్రూరత్వము గాదు సాధుగుణము గుణాఢ్యా!

10.1-675-కంద పద్యము

పగవారి సుతుల యందును
బగ యించుక లేక సమతఁ బరగెడి నీకుం

బగగలదె? ఖలుల నణఁచుట
జగదవనముకొఱకుఁ గాదె జగదాధారా!

10.1-676-కంద పద్యము

నిగ్రహమె మము విషాస్యుల
నుగ్రుల శిక్షించు టెల్ల? నూహింప మహా
నుగ్రహము గాక మాకీ
నిగ్రహము విషాస్యభావనిర్గతిఁ జేసెన్.

10.1-677-ఉత్పలమాల

ఎట్టి తపంబు చేసెనొకొ? యెట్టి సుకర్మములాచరించెనో?
యెట్టి నిజంబు పల్కెనొకొ? యీఫణి పూర్వభవంబునందు ము
న్నెట్టి మహానుభావులకు నెన్నఁడుఁ జేరువగాని నీవు నేఁ
డిట్టి వినోదలీలఁ దల లెక్కి నటించెద వీ ఫణీంద్రుపై.

10.1-678-మత్తేభ విక్రీడితము

బహు కాలంబు తపంబు చేసి వ్రతముల్ పాటించి కామించి నీ
మహనీయోజ్జ్వల పాదరేణుకణసంస్పర్శాధికారంబు శ్రీ
మహిళారత్నము తొల్లి కాంచెనిదె నేమం బేమియున్ లేక నీ
యహి నీ పాదయుగాహతిం బడసె నే డత్యద్భుతం బీశ్వరా!

10.1-679-ఉత్పలమాల

ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా
నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము

న్నొల్లరు యోగసిద్ధి మఱియొండు భవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రిరేణువులసంగతి నొందిన ధన్యు లెప్పుడున్.

10.1-680-కంద పద్యము

ఘన సంసారాహతులగు
జను లాకాంక్షింపఁ గడు నశక్యం బగు శో
భనము సమక్షంబున నహి
గనియెం దామనుఁడు రోషకలితుం డయ్యున్

10.1-681-వచనము

దేవా! సకల పురుషాంతర్యామి రూపత్వంబు వలనఁ బరమ బురుషుండ వయ్యు, నపరిచ్ఛిన్నత్వంబువలన మహాత్ముండవయ్యు, నాకాశాది భూతసమాశ్రయత్వంబువలన భూతావాసుండవయ్యును, భూతమయత్వంబు వలన భూతశబ్ద వాచ్యుండవయ్యుఁ, గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండవయ్యును, జ్ఞాన విజ్ఞాన పరిపూర్ణత్వంబు గలిగి నిర్గుణత్వ నిర్వికారత్వంబు వలన బ్రహ్మంబవయ్యుఁను, బ్రకృతి ప్రవర్తకత్వంబువలన ననంతశక్తిపై యప్రాకృతుండవయ్యుఁ, గాలచక్రప్రవర్తకత్వంబువలనఁ గాలుండవయ్యుఁ, గాలశక్తి సమాశ్రయత్వంబువలన గాలనాభుండవయ్యు, సృష్టి జీవన సంహారాది దర్శిత్వంబువలనం గాలావయవసాక్షివయ్యు నొప్పు నీకు నమస్కరించెదము; మఱియును.

10.1-682-సీస పద్యము

విశ్వంబు నీవయ్యు విశ్వంబుఁ జూచుచు;
 విశ్వంబుఁ జేయుచు విశ్వమునకు

హేతువవై పంచభూతమాత్రేంద్రియ;
 ములకు మనః ప్రాణ బుద్ధి చిత్త
ముల కెల్ల నాత్మవై మొనసి గుణంబుల;
 నావృత మగుచు నిజాంశభూత
మగు నాత్మచయమున కనుభూతి చేయుచు;
 మూ డహంకృతులచే ముసుఁగుబడక

10.1-682.1-తేటగీతి

నెఱి ననంతుఁడవై దర్శనీయరుచివి
గాక సూక్ష్ముఁడవై నిర్వికారమహిమఁ
దనరి కూటస్థుఁడన సమస్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ!

10.1-683-వచనము

మఱియుఁ గలండు లేఁడు; సర్వంబు నెఱుంగు; నించుకనెఱుంగు బద్ధుండు; విముక్తుండొకం; డనేకుఁడు నను నివి మొదలుగాఁగల వాదంబులు మాయవలన ననురోధింపుదురు గావున నానావాదానురోధకుండ వయ్యు, నభిధానాభిధేయ శక్తిభేదంబులవలన బహుప్రభావప్రతీతుండ వయ్యుఁ, జక్షురాది రూపంబులవలనఁ బ్రమాణ రూపకుండవయ్యు, నిరపేక్షజ్ఞానంబు గలిమిం గవివయ్యు, వేదమయనిశ్వాసత్వంబువలన శాస్త్రయోనివయ్యు, సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ రూపంబులవలనఁ జతుర్మూర్తివయ్యు, భక్తజనపాలకుండవయ్యు, నంతఃకరణ ప్రకాశత్వంబుగలిగి సేవకజన ఫలప్రదానంబుకొఱకు గుణాచ్ఛాదకుండవయ్యుఁ, జిత్తాదివర్తనంబులఁ గానందగిన

గుణంబులకు సాక్షివై యొరుల కెఱుంగరామి నగోచరుండవయ్యుఁ, దర్కింపరాని పెంపు వలన నవ్యాహతవిహారుండవయ్యు, సకలకార్య హేతువయ్యు, నంతఃకరణప్రవర్తకత్వంబువలన హృషీకేశుండవయ్యును, సాధనవశంబుగాని యాత్మారామత్వంబువలన మునివయ్యు, స్థూల సూక్ష్మగతుల నెఱుంగుచు నెందుం జెందక నీవు విశ్వంబుగాకయు విశ్వంబు నీ వయ్యును, విశ్వభావాభావ సందర్శనంబు చేయుచు విద్యావిద్యలకు హేతువైన నీకుం బ్రణామంబు లాచరించెదము; అవధరింపుము.

10.1-684-కంద పద్యము

లోక జనిస్థితిలయములు
గైకొని చేయుదువు త్రిగుణకలితుఁడవై కా
లాకారమున నమోఘ
శ్రీకలితుఁడ వగుచు నిచ్చ చెందక యీశా!

10.1-685-కంద పద్యము

ఈ శాంతులు గాని తనువు
లీశా! యీ మూఢజాతు లీ సజ్జాతుల్
ఈశాంత తనువులందుఁ బ్ర
కాశింతువు ధర్మహితముగా సుజనులలోన్.

10.1-686-ఉత్పలమాల

నేరము లెన్న నెక్కడివి? నేము దలంచు తలంపు లోపలన్
నేరుపు లున్నవే? సుతుల నేరమిఁ దండ్రులు ద్రోచిపుచ్చరే?
నేరము చేయువారి ధరణీపతు లొక్కకమాటు గావరే?

నేరము గల్గు మద్విభుని నే డిటఁ గావఁగదే కృపానిధీ!

10.1-687-శార్దూల విక్రీడితము

బాలుం డీతఁడు మంచివాఁడనుచుఁ జెప్పన్రాము క్రూరుండు దు
శ్శీలుండౌ నవునైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్య దు
ష్టాలంకారముఁ బొంద నోడెద మనాథాలాప మాలింపవే?
చాలున్ నీ పద తాండవంబు; పతిబిక్షం బెట్టి రక్షింపవే?

10.1-688-ఉత్పలమాల

ఆకులమయ్యె భోగమిదె యౌదల లన్నియు వ్రస్సెఁ బ్రాణముల్
రాకలఁబోకలం బొలిసె రాయిడి పెట్టక మా నిజేశుపై
నీ కరుణాకటాక్షములు నిల్పఁగదే తగ నో! సమస్తలో
కైకశరణ్య! యో! యభయకారణ! యో! కమలామనోహరా!

10.1-689-ఆటవెలది

మమ్ముఁ బెండ్లి చేయు మా ప్రాణవల్లభు
ప్రాణమిచ్చి కావు భక్తవరద!
నీవు చేయు పెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాటి పెండ్లి పెండ్లి కాదు.

10.1-690-ఇంద్రవ్రజము

నీయాన; యెవ్వారిని నిగ్రహింపం
డా యుగ్ర పాపాకృతి నంద డింకన్;
నీ యాజ్ఞలో నుండెడు నేఁటఁగోలెన్

మా యాశు ప్రాణంబులు మాకు నీవే.

10.1-691-వచనము

అని యిట్లు తమ పెనిమిటి బ్రతుకుఁ గోరెడి భుజగసతుల యందు శరణాగతవత్సలుండైన పుండరీకాక్షుండు కరుణించి, చరణ ఘట్టనంబు చాలించి, తలంగిన నెట్టకేలకుఁ బ్రాణేంద్రియముల మరలం బడసి చిదిసినలఁగిన తలలు సవరించుకొని వగర్చుచు భుజగపతి జలజనయనునికి నంజలిచేసి మెల్లన యిట్లనియె.

## 10.1-85- కాళిందుని విన్నపము

10.1-692-చంపకమాల

మలఁకలుమాప్రచారములు మాముఖముల్విషవహ్ని ఘోరముల్;
ఖలులము; రోషజాతులము; గర్వుల; మే మొక మంచివారమే?
నళినదళాక్ష! ప్రాణులకు నైజగుణంబులు మాన నేర్చునే?
వెలయవె? మా వికారములు వింతలె? మేలొనరించి తీశ్వరా!

10.1-693-సీస పద్యము

వివిధ భావాకార వీర్యబీజాశయ;
 జవయోనియుతముగా జగము లెల్ల
నీవ చేసితి మున్న; నే మా జగంబులో;
 సహజకోపనులము సర్పములము;
దుర్వారమైన నీ తోరంపు మాయ నే;
 మెఱిఁగి దాఁటెడు పని కెంతవార;
మంతకుఁగారణ మఖిలేశ్వరుండవు;

సర్వజ్ఞుఁడవు నీవు జలజనయన!

10.1-693.1-తేటగీతి

మనిచె దేనిని మన్నించి మనుపు నన్ను
నిగ్రహించెద వేనిని నిగ్రహింపు;
మింక సర్వేశ! మాయిమ్ము లెందుఁ గలవు
చిత్తమందున్న క్రమమునఁ జేయఁదగును.

10.1-694-కంద పద్యము

నా పుణ్య మేమి చెప్పుదు?
నీ పాదరజంబుఁ గంటి నే; సనకాదుల్
నీ పాదరజముఁగోరుదు
రే పదమందున్న నైన నిట మేలు హరీ!

## 10.1-86- కాళిందుని శాసించుట

10.1-695-వచనము

అని విన్నవించిన కాళియు పలుకులు విననవధరించి కారుణ్యమానసుండైన సర్వేశ్వరుం డతని కిట్లనియె

10.1-696-కంద పద్యము

గోవర్గముతో మనుజులు
ద్రావుదు రీ మడుఁగు నీరుఁ; దగ దిం దుండన్;
నీవును నీ బాంధవులును
నీ వనితలు సుతులుఁ జనుఁడు నేఁ డంబుధికిన్.

10.1-697-కంద పద్యము

నిను నే శాసించిన కథ
మనమునఁ జింతించి రేపుమాపును గీర్తిం
చిన మనుజులు నీ భయమును
విను మెన్నఁడు బొంద రెందు విషవిజయముతోన్.

10.1-698-మత్తేభ విక్రీడితము

ఇది మొద లెవ్వరైన నరు లీ యమునాతటినీ ప్రదంబులో
వదలక తోఁగి నన్ను నుపవాసముతోడఁ దలంచి కొల్చుచుం
గదలక దేవతాదులకుఁ గా జలతర్పణ మాచరించినన్
సదమలచిత్తులై దురితసంఘముఁ బాయుదు రా క్షణంబునన్.

10.1-699-ఆటవెలది

గరుడభీతి రమణకద్వీప మొల్ల కీ
మడువుఁ జొచ్చి తీవు; మత్పదాబ్జ
లాంఛనములు నీ తలను నుంటఁజూచి యా
పక్షిరాజు నిన్నుఁ బట్ట డింక.

10.1-700-వచనము

అని యిట్లు విచిత్రవిహారుండైన గోపాలకృష్ణకుమారుం డానతిచ్చిన, నియ్యకొని, చయ్యన నయ్యహీంద్రుండు తొయ్యలులుం దానును నెయ్యంబున నయ్యీశ్వరునకు నవ్యదివ్యాంబరాభరణ రత్నమాలికానులేపనంబులు సమర్పించి, తేఁటితండంబులకు దండ యగు నీలోత్పలంబుల దండ యిచ్చి,

పుత్ర మిత్ర కళత్ర సమేతుండై, బహువారంబులు కైవారంబుచేసి, వలగొని, మ్రొక్కి లేచి, వీడ్కొని రత్నాకరద్వీపంబునకుం జనియె; నిట్లు.

10.1-701-కంద పద్యము

వారిజలోచనుఁ డెవ్వరు

వారింపగలేని ఫణినివాసత్వంబున్

వారించిన యమున సుధా

వారిం బొలుపారె నెల్లవారికిఁ బ్రియమై.

## 10.1-87- కాళియునిపూర్వకథ

10.1-702-వచనము

అనినవిని "మునీంద్రా! యేమి కారణంబునఁ గాళియుండు భుజగ నివాసంబైన రమణకద్వీపంబు విడిచె? నతం డొక్కరుండును గరుడున కేమి తప్పుఁ దలంచె?" నని నరవరుం డడిగిన మునివరుం డిట్లనియె.

10.1-703-సీస పద్యము

సర్పభీరువులైన జనులెల్ల నెలనెల;

సరసభక్ష్యములు వృక్షముల మొదల

సర్పంబులకుఁ బెట్ట, సర్పంబులును మును;

సర్పాంతకుఁడు దమ్ముఁ జంప కుండఁ

బ్రతిమాసమును దమ భాగ భక్ష్యంబు లా;

పక్షిరాజున కిచ్చి బ్రతుకు చుండ,

విషవీర్యదుర్మదావిష్టుఁడై కాళియుఁ;

డహికులాంతకుని పా లపహరించి

10.1-703.1-తేటగీతి

యీక తనపాలి బలి భాగ మెల్లఁ దినిన
విని ఖగేంద్రుఁడు కోపించి వీని తలలు
చీఱి చెండాడి భోగంబు చించివైచి
ప్రాణములఁ బాపి వచ్చెదఁ బట్టి యనుచు.

10.1-704-కంద పద్యము

అక్షీణ కనకసన్నిభ
పక్షయుగోద్భూత ఘోర పవమాన మహా
విక్షేప కంపితానే
కక్షోణిధరేంద్రుఁ డగుచు గరుడుఁడు వచ్చెన్.

10.1-705-ఉత్పలమాల

వచ్చిన సర్పవైరిఁ గని వ్రాలక లేచి మహాఫణావళుల్
విచ్చి దృగంచలంబుల నవీనవిషాగ్నికణంబు లొల్కఁగా
నుచ్చలదుగ్రజిహ్వాలు మహోద్ధతిఁ ద్రిప్పుచు నూర్పు లందుఁ గా
ర్చిచ్చెగయంగఁ బాఱి కఱచెన్ విహగేంద్రు నహీంద్రుఁ డుగ్రతన్.

10.1-706-కంద పద్యము

కఱచిన భుజగము రదములు
విఱుగఁగ వదనముల విషము వెడలఁగ శిరముల్
పఱియలుగ నడిచె గరుడుఁడు
తఱిమి కనకరుచులు గలుగు తన డాఱెక్కన్.

10.1-707-వచనము

ఇట్లహికులారాతి చేత వ్రేటుపడి వెఱచి పఱతెంచి కాళియుం డీ గభీరంబైన మడుఁగుఁ జొచ్చె; మఱియు నొక్కవిశేషంబు గలదు.

10.1-708-సీస పద్యము

మున్ను సౌభరి యను ముని యీ హ్రదంబునఁ;
 దపము చేయుచునుండ ధరణిలోన
నాకలిగొని పన్నగాంతకుఁ డొకనాఁడు;
 చనుదెంచి యందుల జలచరేంద్రు
నొడిసి భక్షించిన నున్న మీనము లెల్ల;
 ఖిన్నంబులై వగఁ గ్రిస్సి యున్నఁ
జూచి యా మునిరాజు శోకించి కోపించి;
 గరుడుఁడు నేఁడాది గాఁగ నిందుఁ

10.1-708.1-తేటగీతి

జొచ్చి మీనంబులను మ్రింగఁజూచెనేనిఁ
జచ్చుఁగావుత మని యుగ్రశాప మిచ్చెఁ
గాళియుం డొక్కఁడా శాపకథ నెఱుంగు
నితర భుజగంబు లెవ్వియు నెఱుఁగ వధిప!

10.1-709-వచనము

అది కారణంబుగాఁ గాళియుం డా మడుఁగు చొచ్చియున్న, గో మనుజ రక్షణార్థంబు కృష్ణుం డతని వెడలించెను; ఇట్లు దివ్య గంధాంబర సువర్ణ మణిగణ మాలికాలంకృతుండయి, మడుఁగు వెడలివచ్చిన మాధవుం గని,

ప్రాణలాభంబులం బొందిన యింద్రియంబులుం బోలె, యశోదారోహిణీ సమేతలయిన గోపికలును, నందసునందాదులయిన గోపకులును మూర్ఛలం బాసి, తేఱి, తెప్పఱిలి, లేచి పరమానందంబులం బొందిరి; బలభద్రుండు తమ్ముని యాలింగనంబుఁ జేసె; నప్పుడు.

10.1-710-కంద పద్యము

అంకెలు వైచె వృషభము ల
హంకారముతోడ; లేఁగ లట్టిట్టుఱికెం;
బొంకముల నొప్పె ధేనువు;
లంకురితము లయ్యె దరువు లా హరి రాకన్.

10.1-711-కంద పద్యము

నీ సుతుఁడహిచే విడివడె
నీ సురుచిరభాగ్యమహిమ నిశ్చల మనుచున్
భూసురులు సతులుఁ దారును
భాసుర వచనముల నందుఁ బలికి రిలేశా!

10.1-712-శార్దూల విక్రీడితము

నిన్నా యుగ్ర భుజంగమంబు గఱవన్ నీ వాపదం బొందుచున్
నన్నేమంటి తనూజ! యోడవుగదా నా కూన! నా తండ్రి! రా
వన్నా యంచు శిరంబుమూర్కొని నిజాంకాగ్రంబుపై నిల్పుచున్
కన్నీ రొల్కఁగఁ గౌగలించెఁ దనయున్ గారాముతోఁ దల్లి దాన్.

## 10.1-88- కార్చిచ్చు చుట్టుముట్టుట

10.1-713-వచనము

ఇట్లు పరమ సంతోషులై ఘోషజను లా రేయి కాళిందీతటంబున నాఁకలి నీరుపట్టుల డస్సి క్రుస్సి, గోవులుం దారు నుండ నగణ్యంబగు నయ్యరణ్యంబున నొక్కదవానలంబు పుట్టి చుట్టుముట్టుకొని నడురేయి నిద్రింతంబైన వ్రజంబుమీఁద గదిసిన నదిరిపడి లేచి, దందహ్యమానదేహులై సకలజనులును మాయా మనుజబాలకుండైన హరికి శరణాగతులై యిట్లనిరి.

10.1-714-మత్తేభ విక్రీడితము

అదె వచ్చెన్ దవవహ్ని ధూమకణ కీలాభీల దుర్వారమై
యిదె కప్పెన్ మమునెల్లవారినిట మీఁ దేలాగు రక్షింపు; నీ
పదపద్మంబులకాని యొండెఱుఁగ; మో పద్మాక్ష! యో కృష్ణ! మ్రొ
క్కెద మో! రామ! మహాపరాక్రమ! దవాగ్నిన్ వేగ వారింపవే.

10.1-715-కంద పద్యము

నీ పాదంబులు నమ్మిన
నాపద లెక్కడివి? జనుల కత్యుగ్ర మహా
దీపిత తాపజ్వలనము
పైఁబడ కుండెడి విధంబు భావింపఁగదే.

10.1-716-వచనము

అని ఘోషించు ఘోషజనులం గరుణించి జగదీశ్వరుండగు ననంతు డనంతశక్తియుక్తుం డై గహనంబు నిండిన దావదహనంబు పానంబు చేసిన, విజయగానంబు దశదిశల నిగిడె; నంత రామకృష్ణులు గోగణ జ్ఞాతి సహితులై

మందయానంబున మందకుం జని; రిట్లు రామకేశవులు గోపాలబాల వేషంబులఁ గ్రీడించు సమయంబున.

## 10.1-89- గ్రీష్మఋతువర్ణనము

### 10.1-717-సీస పద్యము

దినము లంతంతకు దీర్ఘంబులై యుండె;
 దిననాథుఁ డుత్తుర దిశఁ జరించె;
నాఁటినాటికి నెండ నవ్యమై ఘన మయ్యె;
 వెచ్చని గాడ్పులు విసరఁ జొచ్చె;
మేదినీరేణువుల్ మింట సంకుల మయ్యె;
 సేఱులుఁ గొలఁకులు నిగిరిపోయెఁ;
బానీయ శాలలఁ బథిక సంఘము నిల్చెఁ;
 జప్పరంబుల భోగిచయము డాఁగెఁ;

### 10.1-717.1-ఆటవెలది

దరులఁ గుసుమ చయము దళములతో వాడె;
మిథునకోటికి రతి మెండు దోఁచె;
నఖిలజంతుభీష్మమైన గ్రీష్మము రాకఁ
గీలి యడవులందుఁ గేలి సలిపె.

### 10.1-718-ఆటవెలది

వాఁడిరుచులు గలుగువానివేఁడిమి గ్రీష్మ
కాలమందు జగము గలయఁబడియె
బ్రహ్మ జనులకొఱకు బ్రహ్మాండఘటమున

నుష్ణరసముఁ దెచ్చి యునిచె ననఁగ.

10.1-719-వచనము

ఇట్లాభీలంబైన నిదాఘకాలంబు వర్తింప బృందావనంబు రామ గోవింద మందిరంబైన కతంబున నిదాఘకాలలక్షణంబులంబాసి, నిరంతర గిరినిపతిత నిర్ఝర శీకర పరంపరా భాసిత పల్లవిత కుసుమిత తరుతలం బయ్యును, దరు లతా కుసుమ పరిమళ మిళిత మృదుల పవనం బయ్యును, బవనచలిత కమల కల్హార సరోవర మహాగభీర నదీప్రాదం బయ్యును, నదీప్రాద కల్లోలకంకణప్రభూత పంకం బయ్యును, బంక సంజనిత హరితాయమాన తృణనికుంజ బయ్యును, జనమనోరంజనంబయిన వసంతకాల లక్షణంబులు గలిగి లలితమృగపక్షి శోభింతంబై యొప్పుచుండె; మఱియు నందు.

10.1-720-కంద పద్యము

పికముల కోలాహలమును,
శుకసంఘము కలకలంబు, సుభగ మయూర
ప్రకరము కేకారవ, మళి
నికరము రొదయును జెలంగె నెఱి నయ్యడవిన్.

10.1-721-కంద పద్యము

ఆతత యమునా సరసీ
జాత తరంగాభిషిక్త జలరుహ గంధో
పేతానిల మడఁచె నిదా
ఘాతత దావాగ్నిపీడ నవ్వనమందున్.

10.1-722-వచనము

ఇట్లామని కందువ తెఱంగు గలిగి సుందరంబైన బృందావనంబునకు బలకృష్ణులు గోవుల రొప్పికొని చని గోపకులుం దారును నొండొరులతో నగుచుఁ, దెగడుచుఁ, జెలంగుచుఁ, దలంగుచు. జిఱజిఱందిరుగుచుఁ, దరులసందుల కరుగుచు, దాఁగిలిమూఁతలాడుచు, గీతంబులు పాడుచు, వేణునాదంబులు ఘటియించుచు, నటియించుచు, గతులు దప్పనక్రియ నొరగుచుఁ, గుప్పల కుఱుకుచుఁ జప్పటలుగొట్టుచుఁ, గందుకంబులఁదట్టుచు నుప్పరంబెగసి దర్దురంబుల చందంబున దాఁటుచు, నామలకబిల్వాది ఫలంబుల మీఁటుచుఁ, గుటవిటపంబులుఁ గదల్చుచు, మృగంబుల నదల్చుచుఁ, బెరలరేఁపుచు, మధుమక్షికలఁ జోఁపుచుఁ,దేనియలు ద్రావుచు, సొమ్మసిలంబోవుచు, గురుశిష్యకల్పనంబులం బనులు చేయుచుఁ, గాకపక్షధరులై ముష్టియుద్ధంబుల డాయుచుఁ, బన్నిదంబులు చఱచుచుఁ, బులుగుల భంగి నఱచుచు, బహురూపంబులు పన్నుచు, నెగిరి తన్నుచు, సేవ్యసేవక మిత్రామిత్రభావంబులు వహించుచు, నుత్సహించుచు మఱియు ననేకవిధంబులఁ గ్రీడించిరి; అందు.

10.1-723-కంద పద్యము

మా పాలికి బలకృష్ణులు
భూపాలకు లంచు నెగిరి బొబ్బ లిడుచు నా
గోపాలురు మోతురు బ్రమ
దాపాదకు లగుచు వల్లికాందోళికలన్.

10.1-724-కంద పద్యము

గోపకు లందఱు నాడుచు

దీపింపఁగ రామవాసుదేవుల వెనుకం
బై పడి పాఠక గాయక
రూపంబులఁ బొగడుదురు నిరూఢాత్మకులై.

10.1-725-కంద పద్యము

ప్రీతిన్ గోపకు లందఱు
గీతంబులు పాడఁ దరుల క్రిందను నగుచుం
జేతులు ద్రిప్పుచు వెడవెడ
బాతర లాడును యశోదపాపం డడవిన్.

10.1-726-మత్తేభ విక్రీడితము

జలజాక్షుండును రాముఁడున్ నటనముల్సల్పంగ గోపాల మూ
ర్తులతో వారలఁ గొల్చి నిర్జరులు సంతోషించి, వేణుస్వనం
బులుగావించుచుఁగొమ్ములూదుచు శిరంబుల్ద్రిప్పుచుంబాడుచున్
వలనొప్పన్ వినుతించి రప్పుడు నటుల్ వర్ణించు చందంబునన్.

## 10.1-90- ప్రలంబాసురవధ

10.1-727-వచనము

ఇట్లు రామకృష్ణులు నదనదీ తీరంబులఁ, గొలంకుల సమీపంబుల, గిరులచఱుల సెలయేఱుల పొంతల మడుఁగులచెంతలఁ, బొదలక్రేవలఁ, బసిమి గల కసవుజొంపంబులఁ బసుల మేపుచుండఁ బ్రలంబుడను రక్కసుం డుక్కుమిగిలి గోపాలరూపంబున వచ్చి వారల హింసజేయ దలంచుచుండ నయ్యఖిలదర్శనుం డగు సుదర్శనధరుం డెఱింగియు నెఱుంగని తెఱంగున.

10.1-728-కంద పద్యము

ఆ రాముని సహజన్ముఁడు
రా రమ్మని వానిఁజీరి రాకం బోకన్
గారాము చేసి మెల్లన
పోరామి యొనర్చెఁ బిదపఁ బోరిగొనుకొఱకున్.

10.1-729-వచనము

ఇట్లు ప్రలంబునితోఁ జెలిమి చేయుచుఁ, గృష్ణుండు గోపాలకులకు, యిట్లనియె.

10.1-730-ఆటవెలది

మనకుఁ బ్రొద్దుపోదు మన మిందఱము రెండు
గములవార మగుచుఁ గందుకముల
శిలలు గుఱులు చేసి చేరి క్రీడింతము
రండు వలయు జయపరాజయములు.

10.1-731-వచనము

అని యిట్లుపలికి, తానును బలభద్రుండును బెన్నుద్దులై యితర వల్లవు లెల్ల నుద్దించుకొని చిట్టుద్దు లై వచ్చిన సమంబుగ విభజించికొని, రెండు గములవారై మార్గంబులందుఁ దృణ దారు శిలా కల్పితంబు లగు గుఱులొడ్డి, కందుక శిలాది ప్రక్షేపణంబుల లక్ష్యంబులఁ దాఁక వైచి, జయ పరాజయ నిర్ణయంబులు గైకొని వాహ్యవాహక లక్షణంబుల నిర్జితులు జేతలవహించి క్రీడించుచు, బలరామునికి వాని చందంబు రహస్యంబున నెఱింగించి పసుల బిల్చుచు, భాండీరకం బను వటంబు జేరి రా సమయంబున; క్రీడయందుఁ శ్రీదామనామధేయండైన

గోపకుండు శ్రీకృష్ణుని వహించె; భద్రసేనుండు వృషభు నెక్కించుకొనియె; బలభద్రుండు ప్రలంబు నారోహించె నప్పుడు.

10.1-732-మత్తేభ విక్రీడితము

వనజాక్షున్ బలిమిన్బలాఢ్యుఁడు తృణావర్తుండు మున్మింటికిం
గొనిపోఁ జాలక చిక్కనాఁ డతని నాకున్ మోవరా దంచు నా
దనుజారిన్ గొనిపోఁ దలంపక వడిన్ దైత్యేశుఁ డయ్యాటలోఁ
గొనిపోయెన్ గిరి దాఁటి రాము నఖిలక్రూరక్షయోద్దామునిన్.

10.1-733-వచనము

ఇట్లు క్రీడాకల్పిత వాహనుం డయిన ప్రలంబుండు బలభద్రునిం గొనిపోవుచు.

10.1-734-మత్తేభ విక్రీడితము

గురుశైలేంద్రసమానభారుఁ డగు నా గోపాలకున్ మోవలే
క రయోద్రేకము మాని దైత్యుఁడు నరాకారంబు చాలించి భీ
కర దైత్యాకృతి నేగె హేమకటకాకల్పంబుతో రాముతో
మురు వొప్పంగఁ దటిల్లతేందుయుత జీమూతంబు చందంబునన్.

10.1-735-ఉత్పలమాల

మోసము లేక వాని పెనుమూఁపుననుండుచు నా హలాయుధుం
డా సమయంబునం గనియె హాటక రత్న కిరీట కుండలో
ద్భాసితమస్తకున్ భ్రుకుటి భాసుర దారుణ నేత్రు నుగ్ర దం
ష్ట్రా సహితుం బ్రలంబు నురు శౌర్యవిలంబు మదావలంబునిన్.

10.1-736-వచనము

కని నక్తంచరుం డని యించుక శంకించి వెఱవక.

10.1-737-కంద పద్యము

కడువడిఁ దను దివికిం గొని
వడిఁ జనియెడు దనుజు శిరము వ్రయ్య హలధరుం
డడరి పటు చటులతర మగు
పిడికిట వెసఁ విసరి వోడిచె బిఱుసున నలుకన్.

10.1-738-కంద పద్యము

హలధరు బలుపిడికిట హతిఁ
దల పగిలిన రుధిరజలము తనువివరములం
దొలఁక మొఱయిడుచు దనుజుఁడు
బలరిపుపవి నిహత నగము పగిదిం బడియెన్.

10.1-739-మత్తకోకిలము

మేలుమేలుగదయ్య! రాముఁడు మేటి రక్కసు నొక్కఁడున్
నేలఁ గూలిచె నొక్క వోటున నేడు విస్మయ మంచు గో
పాలకుల్ గని చచ్చి వచ్చిన భ్రాతఁ గన్న విధంబునం
జాల దీవన లిచ్చి రాముని సత్కరించిరి వేడుకన్.

10.1-740-కంద పద్యము

బలవంతుఁ డగు ప్రలంబుఁడు
బలుముష్టిన్ నిహతుఁడైన బ్రతికితి మనుచున్
బలసూదనాది దివిజులు

బలుపైఁ గుసుమముల వాన పరఁగించి రొగిన్.

## 10.1-91- దావాగ్ని తాగుట

10.1-741-వచనము

ఇట్లు గోపకులు క్రీడింప గోవు లంతంతం గాంతారంబున వింత కసవులు మెసవుచు, మేఁతపడి నొండడవికి దూరంబు చని యందు దవదహనపవన సంస్పర్శంబు సైరింపక కంపించి దప్పి నొప్పుజెడి ఘోషించిన.

10.1-742-శార్దూల విక్రీడితము

ఆ గోపాలకు లందఱుం బసుల కుయ్యాలించి కౌమార కే
ళీ గాఢత్వము మాని గోఖురరదాళిచ్ఛిన్న ఘాసంబుతో
బాగై యున్న పథంబునం జని దవాపన్నంబు గాకుండ వే
వేగన్ గోగణమున్ మరల్చి రటవీ వీధిన్ జవం బొప్పఁగన్.

10.1-743-కంద పద్యము

జలధర గభీరరవమున
నళినదళాక్షుండు దమ్ము నామాంకములం
బిలిచిన విని ప్రతి ఘోషణ
ములు జేయుచుఁ బసులు దిరిగె ముదమున నధిపా!

10.1-744-వచనము

అంత నవ్వనంబున దైవయోగంబునం బుట్టిన గార్చిచ్చు బిట్టు విసరెడి కరువలి వలన మిన్నుముట్ట మిట్టిపడి, గట్టు చెట్టనక దరికొని, యట్టె క్రాలుచుఁ జుట్టుకొని,

పరవం గని పల్లటిల్లిన యుల్లంబులతో వల్లవులెల్లఁ దల్లడిల్లి సబలుండైన హరికి మృత్యు భీతుల రీతిం జక్క మ్రొక్కి యిట్లనిరి.

10.1-745-కంద పద్యము

అభ్రంకష ధూమాయిత
విభ్రాంత మహాస్ఫులింగ విసరోగ్రశిఖా
విభ్రష్ట దగ్ధలోకా
దభ్రంబై వచ్చెఁ జూడు దవశిఖి కృష్ణా!

10.1-746-శార్దూల విక్రీడితము

నీ చుట్టాలకు నాపదల్ గలుగునే? నే మెల్ల నీ వార మ
న్యాచారంబు లెఱుంగ; మీశుడవు; మా కాభీలదావాగ్ని నే
డే చందంబున నింక దాఁటుదుము? మమ్మీక్షించి రక్షింప వ
న్నా! చంద్రాభ! విపన్నులన్ శిఖివితానచ్ఛన్నులన్ ఖిన్నులన్.

10.1-747-వచనము

అని విన్నవించి రంత.

10.1-748-ఉత్పలమాల

బంధుజనంబుచేత నిటు ప్రార్థితుఁడై హరి విశ్వరూపు డో!
బంధువులార! మీ నయనపంకజముల్ ముకుళింపుఁ డగ్ని నీ
సంధి నడంతు నే ననినఁ జక్కన వారలు నట్ల చేయుఁడున్,
బంధురదావపావకముఁ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్.

10.1-749-వచనము

ఇట్లు నిజయోగవైభవంబున దావదహనంబుఁ బానంబుచేసి నిమిషమాత్రంబున గోపకుల నందఱ భాండీరక వటసమీపంబునకుం దెచ్చి విడిచిన వారు వికసితనయనకమలులై కృష్ణుని యోగమాయాప్రభావంబున నెరగలిచిచ్చు మ్రగ్గె నని యగ్గించుచుఁ దమ మనంబులందు.

10.1-750-కంద పద్యము

కార్చిచ్చార్చు పటుత్వము
నేర్చునె నరుఁ డొకఁడు? శౌరి నేడిదె కార్చి
చ్చార్చి మనలఁ రక్షింపఁగ
నేర్చె; నితం డజుఁడొ హరియొ నిటలాక్షుండో.

10.1-751-వచనము

అని వితర్కించి; రంతఁ గృష్ణుండు సాయాహ్న సమయంబున రామ సహితుండై వంశనాళంబు పూరించుచు గోపగణజేగీయమానుండై గోష్ఠంబు ప్రవేశించె; నప్పుడు.

10.1-752-కంద పద్యము

కమలాక్షు నొద్ద నుండని
నిమిషము యుగశతముగాఁగ నెగడిన గోప
ప్రమదలు సంభ్రమమున నా
కమలాక్షునిఁ జూచి ముదముఁ గనిరి మహీశా!

10.1-753-వచనము

ఆ సమయంబున గోపకు లిండ్లకడనున్న వృద్ధకాంతాజనంబులకు రామకృష్ణుల చిత్రచరిత్రంబులు చెప్పిన, విని వారు వారిని కార్యార్థులై వచ్చిన వియచ్చరవరులని తలంచి; రంత.

## 10.1-92- వర్షర్తువర్ణనము

10.1-754-సీస పద్యము

పూర్వవాయువులు ప్రభూతంబులై వీచెఁ;
బడమట నింద్రచాపంబు దోఁచెఁ
బరివేషయుక్తమై భానుమండల మొప్పె;
మెఱపు లుత్తరదిశ మెఱవఁ దొడగె
దక్షిణగాములై తనరె మేఘంబులు;
జలచరానీకంబు సంతసించెఁ
జాతకంబుల పిపాసలు కడపలఁ జేరెఁ;
గాంతారవహ్నుల గర్వ మడఁగె

10.1-754.1-ఆటవెలది

నిజకరాళివలన నీరజబంధుండు
దొల్లి పుచ్చుకొనిన తోయ మెల్ల
మరల నిచ్చుచుండె మహిఁ గర్షకానంద
కందమైన వాన కందు వందు.

10.1-755-కంద పద్యము

వర్షాకాలభుజంగుఁడు
హర్షముతో నిడిన నవ నఖాంకము లని యు

త్కర్షింప భూమిసతిపైఁ
కర్షక హలరేఖ లమరె గహనాంతములన్.

10.1-756-కంద పద్యము

చెలువుడు ప్రావృట్కాలుఁడు
పొలసినఁ బులకించు భూమి పులకము లనఁగా
మొలచి తల లెత్తి నిక్కుచు
సలలితగతిఁ జాలువారె సస్యము లధిపా!

10.1-757-వచనము

మఱియుఁ జటులపవనచలితంబులై మిన్నుదన్ని, లెక్కకు మిక్కిలియై, ఱెక్కలు గల నీలగిరుల సిరుల మీఱి, కాఱుకొని తెఱపిపడక, నిబిడంబులై, శిశిరకిరణ తరణి మండలంబుల చొప్పుదప్పించి, విప్పుగలిగి, చదలుగప్పుకొనిన లీలం గ్రాలు నీలమేఘంబులును, మేఘవిముక్తంబులై జలదసమయవిటుండు సరసగతి ధరణిసతి యురమ్మున దర్పించి, నేర్పున సమర్పించు కర్పూరఖండంబుల వడువునఁ బుడమిం బడు కరకలును, గరకానుగతంబులై యసిత భోగిభోగంబుల బాగున నీలమణిమాలికా విశేషంబుల విధంబున నెడపడక పడు సలిలధారలును, ధారాధరవిగళిత విమల సలిలంబులం దోఁగుచు మదజలాభిషిక్త మాతంగంబుల నొబగున నుండు కొండలును, గొండల తుదలనుండి గండ శైలంబులపైఁ బడి వికీర్యమాణంబులగు గిరినిర్ఝరంబుల శీకరంబులును, శీకరపరంపరల చొదుకులు మడుగులుగొనినఁ బిద పిద నగుచుఁ జిదుకుచిదుకుమను రొంపులును, రొంపులుగ్రొచ్చి క్రచ్చర నుచ్చలితంబులై పఱచు వఱదలును, వఱదల వలన మెదలి కదలిపాఱెడి యేఱులును

నేఱులవెంట గఱులుత్రిప్పుచు గములుగొని క్రొన్నీటి కెదురునడచు మీనంబులును, మీననయనల మేనుల మెఱుంగు నొంపు పెంపు సైరింపక కంపించి తిరిగి సురిఁగి చనియెడు కరణి మేఘ మధ్యంబులం బొలసి మలసి నిలువక మరలిచను క్రొమ్మెఱుంగులును, మెఱుంగుల తెఱంగునఁ దెఱవలు పురుషులం దగిలి నిలువరని జనుల కెఱుంగ నలువ మొఱయిడిన వడువున మొరయు నుఱుములును, నుఱుముల కులికిపడక కికురుపొడుచుచుఁ బింఛంబులు కొంచెంబులు జేయక విప్పి దెప్పరంబుగ ఱొప్పుచు నర్తనంబులు చేయు మయూరంబులును, మయూర ఘోషంబులు భీషణంబులై చెవులు సోఁకిన ననూనంబులైన మానంబుల నాసలు చెడి యొం డొరులకుం గ్రిందుపడి క్రందుకొను విరహిజనులును, జనులకు రేపు మాపని రూపింప రాక మాలతీ కుసుమ విసర వికసన విదితావసానంబులగు దుర్దినంబులును, దినావసానసమయంబున మినుకుమినుకు మని మెఱయుచుం దిరుగు ఖద్యోతంబులును, ఖద్యోత సందర్శనంబు గోరుచు నుడుగక విడువక గురియు జడింబడి వలిగొని వడఁకుచు నశనయత్నంబులు వర్జించి ఖర్జూర జంబూఫల భక్షణంబుల దేహసంరక్షణంబు లాచరించు వనచరులును, వనచరానందకారిణులై వారరమణులరుచి ననవరత భుజగ సమేతలగు కేతకులును, కేతకీ కదంబ యూధికా కుటజ కుసుమ పరిమళమిళితంబు లగు విపిన మార్గంబులును మార్గనిరోధంబు లగుచుం బెరిగి రసికంబులై పసరు దొలంకుచు హరిన్మణికిరణపుంజంబులభంగి రంజిల్లి తొంగలించుచు జొంపంబులు గొనిన కసువులును, గసువులు మెసవి మిస మిసం దనువులు మెఱయ వలుద పొదుఁగుల బరువునం కదలక నిల్చి నెమరమరనిడు ధేనువులును, గలిగి ధేనువ్రజంబుకైవడిఁ బయఃకణమనోహరం బై, హరకరంబు భంగిఁ బరిపూర్ణ సారంగ

భాసురంబై, సురగిరి చెలువున హరి శరాసన విభీషణం బై, విభీషణ హృదయంబు పోలికఁ బ్రకటిత హరిశబ్దవైభవంబై, భవపూజనబు చందంబున నింద్ర గోపాది విభవజనకం బయి, జనకయాగంబు భాతి సీతాప్రకరణాలంకృతం బయి, కృతయుగంబు నొంపున బహువర్షంబునై వర్షాగమంబు చెలువొందె నప్పుడు.

10.1-758-కంద పద్యము

వాడక వ్రాలక తెవుళులఁ
గూడక తగ నల్ల గెఱలుగొని నవకములై
చూడఁగ భద్రము లగుచును
వీడెన్ సస్యంబు లిడుమ వీడెం బ్రజకున్.

10.1-759-కంద పద్యము

జీవనము చాలఁ గలిగియుఁ
గావరమున మిట్టిపడని ఘనుని క్రియ నదీ
జీవనములు చొర జలనిధి
ప్రావృట్కాలమున డిందుపడి యుండె నృపా!

## 10.1-93- వర్షాగమవిహారంబు

10.1-760-శార్దూల విక్రీడితము

ఆ వర్షాగమమందు గోవుల నరణ్యాంతంబులన్ మేపుచున్
గోవిందుండు ప్రలంబవైరి యుతుఁడై గోపాలవర్గంబుతోఁ
బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్ భక్షించుచున్ మంజుల
గ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్దిగుడిచెం గాసారతీరంబులన్.

10.1-761-వచనము

ఆ సమయంబున.

10.1-762-సీస పద్యము

విశ్వమోహనమైన వేణు నినాదంబు;
 సరసగంభీరగర్జనముగాఁగ
మహనీయ నిర్మల మందహాసద్యుతి;
 లలిత సౌదామనీ లతికగాఁగఁ
దలచుట్టు బాగుగఁ దనరు పింఛపుదండ;
 శైలభేదనుశరాసనముఁగాఁగఁ
గరుణాకటాక్షవీక్షణ సుధావర్షంబు;
 సలిలధారా ప్రవర్షంబుగాఁగఁ

10.1-762.1-తేటగీతి

జాడ నేతెంచు గోపాలజన మునీంద్ర
చాతకంబుల దురవస్థఁ జక్కఁ జేసి
కృష్ణమేఘంబు బహుతరకీర్తి నొప్పె
విమల బృందావనాకాశవీధి యందు.

10.1-763-కంద పద్యము

గోవుల వృషవత్సంబుల
వావిరిఁ బూజించి పిదప వర్షాకాల
శ్రీవనితను బూజించెను
శ్రీవల్లభుఁ డయ్యు గోపశేఖరుఁ డధిపా!

## 10.1-94- శరదృతువర్ణనము

10.1-764-వచనము

ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబుఁ బుచ్చె; నంత.

10.1-765-కంద పద్యము

జొంపములు గొనియె వనములు;

రొంపు లిగిరె; నెమలిగముల రొద లుడిగె; నదుల్

పెంపులకుఁ బాసె; నుఱుముల

శంపల సంపదలు మానె శారదవేళన్.

10.1-766-వచనము

మఱియు జీవనంబులు విడిచి, విమలజ్ఞానవశంబున ముక్తులగు పురుషరత్నంబులచెన్నునఁ జెన్ను వదలి, మిన్ను విడిచి, వాయువశంబులై, వెల్లివిరిసి చను మేఘంబులును, మేఘపటల రహితంబును, గలశభవముని సహితంబునునయి, విజ్ఞానదీప విలసితం బగు యోగిహృదయంబు చందంబున శుభం బైన నభంబును, నభంబున నీలదుకూలవితానసంయుక్త ముక్తాఫలంబుల వడువున నెగడు నుడుగణంబులును, నుడుగణమయూఖంబు క్రొవ్వులువ్వెత్తుగఁగొని నివ్వటిల్లుచు బ్రహ్మాంకరండకర్పూరఖండాయమానంబు లగు చంద్రకిరణంబులును, జంద్రకిరణ సమ్మూర్ఛనంబున సగర్భంబులై భూమికి దుర్భరంబు లగుచు నిండి పండి హాలిక కర నిశితలవిత్ర ధారా సంరంభంబుఁ దలంచి తల్లడిల్లి వెలవెలకంబాఱుచుఁ దల్లియగు విశ్వంభరకు మునుకొని ప్రణతంబు లై వడంకుచు నెఱుంగ మొఱయిడుచున్న పెంపున సంపన్నంబులైన యెన్నులవ్రేగున వ్రాలి గాలిందూలుచు మర్మర ధ్వనుల సారస్యంబు లగు

కలమాది సస్యంబులును సస్య మంజరీ పుంజంబులం గొంచక చంచువులఁ ద్రుంచి కబళించి పిల్లపెంటి తండంబులంగూడి కడుపులునిండ మెక్కి విక్కవిరిసి చొక్కుచుఁ ద్రిక్కలుగొని మహోత్తుంగ సమంచిత మంచప్రదేశంబు లెక్కి సంచరించుచు వెన్నుల కావలియున్న యన్నుల కెమ్మోవులు బింబఫలంబు లని కఱచి తత్కరాస్ఫాలనంబుల నులికి పడి యెగసిచను శుకనికరంబుల కలకలంబులును, గలహంస కోక సారస కోలాహల మండితంబులై నిండిన నిర్మలజలంబులు గల జలాశయంబులును, జలాశయముల జలము లనుదినము నిగుర గృహములఁబ్రతుకుదినములు చనుట యెఱుంగని మనుజుల గమనికం దిరుగు జలచరములును, జలచర హృదయముల బెగడుగదుర డొంకి యుంకిన నదులును, నదులందుఁ గర్పూరమండపంబుల తెఱంగున, మణికుట్టిమంబుల మాడ్కిని సౌధసోపానమార్గంబుల జాడను, విలోకితంబులగు నూతన సైకతంబులును సైకత ప్రదేశంబుల నుదయ వేళల నిత్యకర్మానుష్ఠాన నిరతులగు మునులును, మునికన్యకాకర కలశ సలిలా భిషిక్తమూలంబులగు తపోవన బాలసాలంబులును, సాలవిటపి వాసంతికా కుంజపుంజంబుల తఱచున నిముడుకొని దినకర కిరణములకుం గరువలికిం జొర వెరవుపడని వనములును వన ములం దరులకొమ్మల నాకలమ్ముల నేకలమ్ము లై మెసంగి మసరుకవిసి క్రొవ్వి కొమ్ముకొనల సూటి యేటిదరులు త్రవ్వి చిమ్మి కుమ్మి కోరాడెడు వనగజంబులును, గజకుంభ కనకకుంభ రుచిర కుచభార భీరుమధ్యసమంచిత లగు చెంచితలును, జెంచితల క్రూరమ్ము లగు వాలమ్ముల సారములుచెడి బెడిదంబుగఁ బాదంబులు దొట్రుపడఁ బెనగాధంబులఁబడు వరాహ పుండరీకంబులును, బుండరీక కుంద కుముద కురంటకాది కుసుమ మకరందంబు గ్రోలి తేలి సోలి వాలి మహాహంకృతుల

ఝుంకృతులు చేయు తేఁటికదుపులును, గదుపులం గలయక యెదగలిగి మదమున నదనుపద నెఱింగి మదనమార్గణ ప్రేరితంబులై పెంటితుటుముల వెంటం జని యొండొంటి గెంటించుచుఁ దగుల నెక్కి గర్భంబులు నెక్కొలుపు మృగవృషభరాజంబులునుగలిగి రాజరాజ గృహంబు పగిది విలసిత కుంద పద్మ సౌభాగ్యం బై, భాగ్యహీను కర్మంబు రేఖ నశ్రుత నీలకంఠ శబ్దంబై, శబ్దశాస్త్రవేది హృదయంబు బాగున విశదప్రకాశాభిరామంబై, రామసంగ్రామంబు కైవడి బాణా సనాలంకృతం బై, కృతాంత హృదయంబు కరణి నపంకం బై, పంకజాసను గేహంబు సొంపున రాజహంస విరాజమానం బై, మానధనుని చరిత్రంబు సొబగున నకల్మషజీవనం బై, వననిధి పోలుపున సమ్మిళిత భూభృద్వాహినీ సంకులంబై, కులవధూరత్నంబు చెలువున నదృష్ట పయోధరంబై ధరణికిం దొడ వగుచు శరత్కాలంబు వచ్చె; నందు.

10.1-767-కంద పద్యము

వాజుల నీరాజనములు
రాజుల జయగమనములును రాజిత లక్ష్మీ
పూజలు దేవోత్సవములు
రాజిల్లెను జగతి యందు రాజకులేంద్రా!

10.1-768-కంద పద్యము

చేగ గల చెఱకువింటను
బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం
యోగంబు చేసి మదనుఁడు
వేగంబున విరహిజనుల వేటాడె నొగిన్.

10.1-769-వచనము

ఇట్లు భాసురంబైన శరద్వాసరంబుల గోవిందుండు గోబృంద సమేతుండై బృందావనంబునం బసులఁ బొసంగ మేపుచు.

## 10.1-95- వేణువిలాసంబు

10.1-770-సీస పద్యము

కర్ణావతంసిత కర్ణికారప్రభ;
 గండభాగద్యుతిఁ గడలుకొలుప
భువనమోహనమైన భ్రూవిలాసంబుతో;
 వామభాగానతవదన మొప్ప
నపసవ్యకరమృదులాంగుళీ చాతురి;
 షడ్జధ్వనికి మర్మ సరణిఁ జూప
డాకాలిమీఁద నడ్డము చాఁచి నిల్చిన;
 పదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ

10.1-770.1-తేటగీతి

మౌళిపింఛముఁ గంఠదామమును మెఱయ
విలసితగ్రామముగ నొక్క వేణువందు
బ్రహ్మగాంధర్వగీతంబు పరఁగఁ జేసెఁ
జతురనటమూర్తి గోపాలచక్రవర్తి.

10.1-771-వచనము

ఇట్లు హరి వేణునాదంబు పూరింపఁగ మారవికారహేతు వగు తద్గీతం బాలించి సిగ్గులు చాలించి మక్కువలు చెక్కులొత్త గోపిక లోపికలు లేక తమతమ

పొత్తుకత్తెలుం దారును దత్తఱంబునం బదుగురు నేగురుం దుటుములు గట్టి జిలిబిలి ముచ్చటలకుం జొచ్చి తమలోన.

## 10.1-96- గోపికలవేణునాదునివర్ణన

### 10.1-772-మత్తేభ విక్రీడితము

శ్రవణోదంచితకర్ణికారమునతో స్వర్ణాభ చేలంబుతో
నవతంసాయిత కేకిపింఛమునతో నంభోజ దామంబుతో
స్వవశుండై మధురాధరామృతముచే వంశంబుఁ బూరించుచు
న్నువిదా! మాధవుఁ డాలవెంట వనమం దొప్పారెడిం జూచితే?

### 10.1-773-శార్దూల విక్రీడితము

రావే సుందరి! యేమె బోటి! వినవే; రాజీవనేత్రుండు బృం
దావీథిం దగ వేణు వూఁదుచు లసత్సవ్యానతాస్యంబుతో
భ్రూవిన్యాసములంగుళీక్రమములుంబొల్పార షడ్జంబుగాఁ
గావించెన్ నటుభంగి బ్రహ్మమగు దద్గాంధర్వ సంగీతమున్.

### 10.1-774-కంద పద్యము

తలఁకెను గొబ్బునఁ జిత్తము
నళినాక్షుని మధుర వేణునాదము నా వీ
నులు సోఁకినంత మాత్రన
చెలియా! యిఁక నేటిపెఱపు చింతింపఁ గదే.

### 10.1-775-కంద పద్యము

నాతోడ పెఱవ వలదే?

నాతోడనె గొనుచుఁ బోయి నళినదళాక్షున్
నీతోడుతఁ బలికించెద
నీతోడి జనంబు మెచ్చ నీతోడు సుమీ.

10.1-776-వచనము

అని పెక్కు భంగుల నోర్తోర్తు నుద్దేశించి పలుకుచు గోపసుందరులు బృందావనంబునకు గోవిందుని కెదురు చని పరమానందంబున నతనిం దమ మనంబులఁ బ్రతిపదంబును నాలింగనంబు చేసిన వార లగుచు, రామకృష్ణు లనుద్దేశించి.

10.1-777-మత్తేభ విక్రీడితము

నవగోస్థానక రంగమందుఁ బరమానందంబునం జూడఁ బ
ల్లవ నీలోత్పల పింఛ పద్మదళ మాలా వస్త్ర సంపన్నులై
కవయై వేణువులూఁదుచున్ బహునటాకారంబులం గేళితాం
డవముల్ చేసెద రీ కుమారకులు; వేడ్కం గామినుల్ గంటిరే.

10.1-778-కంద పద్యము

ఓ చెలువలార! వినుఁడీ
వాచా శతకంబులేల? వర్ణింపంగా
లోచనముల కలిమికి ఫల
మీ చెలువురఁ జూడఁగలుగు టింతియ సుండీ.

10.1-779-వచనము

అని పలికి; రందుఁ గొందఱు గోవిందు నుద్దేశించి.

10.1-780-మత్తేభ విక్రీడితము

ఒనరన్ ప్రేతల కించుకేనియును లేకుండంగ గోపాలకృ
ష్ణుని కెమ్మోవి సుధారసంబు గొనుచుం జోద్యంబుగా మ్రోఁగుచుం
దన పర్వంబులు నేత్ర పర్వములుగా దర్పించెఁ, బూర్వంబునన్
వనితా! యెట్టి తపంబు చేసెనొకొ యీ వంశంబు వంశంబులోన్.

10.1-781-మత్తేభ విక్రీడితము

ముదితా! యేతటినీపయఃకణములన్ మున్ వేణు వింతయ్యె నా
నది సత్పుత్రునిఁ గన్న తల్లి పగిదిన్ నందంబుతో నేఁడు స
మ్మద హంసధ్వని పాటగా వికచపద్మశ్రేణిరోమాంచమై
యొదవం దుంగతరంగ హస్తనటనోద్యోగంబు గావింపదే?

10.1-782-కంద పద్యము

నళినోదరు భక్తునిఁ గని
కులజులు ప్రమదాశ్రుజలము గురియు తెఱఁగు మ్రాఁ
కులు పూదేనియ లొలికెడు
నళినాక్షుని చేతి వంశనాళము మ్రోతన్.

10.1-783-శార్దూల విక్రీడితము

నా మోసంబున కెద్ది మేర? విను నే నా పూర్వజన్మంబులన్
లేమా! నోములు నోచుచో నకట! కాళిందీతటిన్ వేణువై
భూమిం బుట్టెద నంచుఁ గోరఁ దగదే? బోధిల్లి యెట్లైన నీ
బామం దిప్పుడు మాధవాధరసుధాపానంబు గల్గుంగదే?

10.1-784-కంద పద్యము

కాళిందీ కూలంబున
నాళీ! యీ నందతనయు నధరామృతముం
గ్రోలెడి వేణువు నగు నో
మేలాగున నోమవచ్చు నెఱిఁగింపఁగదే?

10.1-785-కంద పద్యము

వనితా! కృష్ణుఁడు నల్లని
ఘన మనియున్ వేణురవము గర్జన మనియున్
మనమునఁ దలంచి రొప్పుచు
ననవరతము నెమలితుటుముటులాడెడిఁ గంటే?

10.1-786-కంద పద్యము

గిరిచరమిథునము లోలిం
బరికింపఁగఁ గృష్ణపాదపద్మాంకితమై
సురరాజునగరికంటెను
ధరుణీ! బృందావనంబు తద్దయునొప్పెన్.

10.1-787-మత్తేభ విక్రీడితము

అమరేంద్రాంగన లాకసంబున విమానారూఢులై పోవుచుం
గమలాక్షున్ శుభమూర్తిఁగాంచి మురళీగానంబు లందందఁ గ
ర్ణములన్ నిల్పుచు మేఖలల్ వదలఁగా నాథాంకమధ్యంబులం
బ్రమదా! వ్రాలిరి చూచితే వివశలై పంచాశుగభ్రాంతలై?

10.1-788-ఉత్పలమాల

కానలనుండుచున్ సరసగాన వివేకవిహీనజాతలై
వీనులనేడు కృష్ణముఖవేణురవామృతధార నోఁకినన్
మేనులు మేఁతలున్ మఱచి మెత్తనిచూడ్కి మృగీమృగావళుల్
మానిని! చూడవమ్మ; బహుమానము చేసెఁ గృతార్థచిత్తలై.

10.1-789-ఉత్పలమాల

తల్లుల చన్నుఁబాలు మును ద్రావుతఱిం దమకర్ణవీధులం
వల్లభమైన మాధవుని వంశరవామృతధార చొచ్చినం
ద్రుళ్ళక పాలురాఁ దివక దూఁటక మానకఁ గృష్ణుమీఁద దృ
గ్వల్లులు చేర్చి నిల్చె నదె; వత్సము లంగనలార! గంటిరే?

10.1-790-మత్తేభ విక్రీడితము

మమతం మోములు మీఁది కెత్తుకొని రోమంథంబు చాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి మురళీగానామృతశ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేఁతమాని గళితానందాశ్రులై చిత్రితో
పములై గోవులు చూచుచున్న వవిగో పద్మాక్షి! వీక్షించితే?

10.1-791-మత్తేభ విక్రీడితము

జగతీజంబుల శాఖలెక్కి మురళీశబ్దామృతస్యందమున్
మిగులన్ వీనులఁ ద్రావి ప్రేఁగుపడి నెమ్మిం గృష్ణు రూపంబు చి
త్తగమై యుండఁగ నడ్డపెట్టు క్రియ నేత్రంబుల్ దగన్ మూసి యీ
ఖగముల్ చొక్కెడిఁ జూచితే? మునిజనాకారంబులం గామినీ!

10.1-792-మత్తేభ విక్రీడితము

క్రమమొప్పన్ నదులెల్ల వంశరవ మాకర్ణించి సంజాత మో
హములన్ మన్మథసాయకక్షతవిశాలావర్తలై హంసవా
క్యములం జీరి తరంగహస్తముల నాకర్షించి పద్మోపహా
రములం గృష్ణపదార్చనంబు సలిపెన్ రామా! విలోకించితే?

10.1-793-ఆటవెలది

వనిత! నేడు కృష్ణు వంశనినాదంబు
విని పయోధరంబు విరులు గురిసి
తన శరీర మెల్ల ధవళాతపత్రంబుఁ
జేసి మింట నీడఁ జేసెఁ గంటె?

10.1-794-కంద పద్యము

మంచి ఫలంబులు హరిచే
నించి కరాలంబనముల నెగడుచు నిదె క్రీ
డించెద, రంగన! చూడుము
చెంచెతలం బింఛ పత్ర చేలాంచితలన్.

10.1-795-కంద పద్యము

ఉల్లసితకుచభరంబున
నల్లాడెడి నడుముతోడ నలరుల దండన్
భిల్లి యొకతె హరి కిచ్చెను
హల్లోహలకలిత యగుచు నంగన! కంటే?

10.1-796-కంద పద్యము

గిరు లెల్ల జలము లయ్యెను

దరు లెల్లను బల్లవించె ధరణి గగన భూ

చరులెల్లను జొక్కిరి హరి

మురళిరవామృతము సోఁకి ముద్దియ! కంటే?

10.1-797-మత్తేభ విక్రీడితము

బలకృష్ణాంఘ్రిసరోజసంగమముచే భాసిల్లుచున్ ధన్యమై

ఫలపుష్పంబులఁ గానికల్ గురిసి సంభావించి మిన్నందుచున్

జలఘాసంబుల గోవులం దనిపి చంచద్భూజరోమాంచమై

వెలసెం జూడఁ గదమ్మ! యీ గిరిపురోవీధిన్ సరోజాననా!

10.1-798-వచనము

అని యిట్లు బృందావన విహారియైన గోవిందుని సందర్శించి పంచబాణభల్లభగ్నహృదయలై వల్లవకాంత లేకాంతంబులఁ జింతించుచుఁ దత్పరతంత్రలై యుండి; రంత.

## 10.1-97- హేమంతఋతువర్ణనము

10.1-799-కంద పద్యము

శామంతికా ప్రగంచిత

సీమంతవతీ కుచోష్ణజితశీతభయ

శ్రీమంతంబై గొబ్బున

హేమంతము దోఁచె; మదనుఁ డేఁచె విరహులన్.

10.1-800-కంద పద్యము

ఉత్తరపుగాలి విసరె వి
యత్తలమునఁ దుహినకిరణుఁ డహితుం డయ్యెం
బొత్తు జరిగె మిథునములకు
నెత్తమ్ములు దఱిగె హిమము నెలకొనియె నృపా!

10.1-801-కంద పద్యము

అహములు సన్నము లయ్యెను
దహనము హితమయ్యె దీర్ఘదశలయ్యె నిశల్;
బహు శీతోపేతంబై
యుహుహూయని వడఁకె లోకముర్వీనాథా!

10.1-802-కంద పద్యము

అన్నుల చన్నుల దండ వి
పన్నులు గా కెల్లవారు బ్రతికిరిగా కీ
చన్నుల మీఁటిన వలి నా
పన్నులు గా కుండఁ దరమె బ్రహ్మాదులకున్.

10.1-803-ఆటవెలది

పొడుపుకొండ మీఁద పొడిచిన మొదలుగాఁ
బరువుపెట్టి యినుఁడు పశ్చిమాద్రి
మఱుఁగుఁ జొచ్చెఁ గాక మసలినఁ జలిచేతఁ
జిక్కఁజిక్కె ననఁగఁ జిక్కకున్నె.

10.1-804-కంద పద్యము

చెంగల్వ విరుల గంధము

మంగళముగఁ గ్రోలుచున్న మధుపము లొప్పె

న్నంగజవపహ్నులపై ను

ప్పొంగి విజృంభించు పొగల పోలిక నధిపా!

10.1-805-ఆటవెలది

శంభుకంట నొకటి జలరాశి నొక్కటి

మఱియు నొకటి మనుజమందిరముల

నొదిగెఁగాక మెఱసియున్న మూడగ్నులు

చలికి యులికి భక్తి సలుపకున్నె?

10.1-806-శార్దూల విక్రీడితము

ఈ హేమంతము రాకఁ జూచి రమణీహేలాపరీరంభ స

త్స్వాహాయ్యంబునఁగాని దీని గెలువన్ శక్యంబుగా దంచుఁ దా

రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీయుక్తాంగులైనారు గా

కోహో! వారలదేమి సంతతవధూయోగంబు రాఁ గందురే?

10.1-807-కంద పద్యము

ఈ హేమంతము రాకకు

శ్రీహరి యొక్కింత వడఁకి చింతింపంగా

నోహో! వెఱవకు మని తా

మా హరికిని శ్రీకుచంబు లభయం బిచ్చెన్.

## 10.1-98- గోపికలకాత్యాయనిసేవనంబు

10.1-808-వచనము

ఇట్టి నితాంతంబగు హేమంతంబున మొదలినెల తొలిదినంబు నందు నందుని మందంగల గోపకుమారికలు రేపకడ లేచిచని కాళిందీజలంబులం దోఁగి; జలతీరంబున నిసుమునం గాత్యాయనీ రూపంబుఁ జేసి, సురభి కుసుమ గంధంబులిడి, ధూపదీపంబు లిచ్చి, బహువిధోపచారంబులు సమర్పించి.

10.1-809-కంద పద్యము

ఓ! కాత్యాయని! భగవతి!
నీకున్ మ్రొక్కెదము మేము నే డనుకంపన్
మా కిందఱకును వైళమ
శ్రీకృష్ణుఁడు మగఁడుగాఁగఁ జేయుము తల్లీ!

10.1-810-కంద పద్యము

ఓ తల్లి! మాకుఁగృష్ణుఁడు
చేతోవిభుఁ డైననాడు చెలువల మెల్లన్
నేతివసంతము లాడుచు
జాతర చేసెదము భక్తి చాతురితోడన్.

10.1-811-వచనము

అని నమస్కరించి హవిష్యంబులు గుడుచుచు నివ్విధంబున మాసవ్రతంబు సల్పి; రందొక్కనాడు.

10.1-812-మత్తేభ విక్రీడితము

రమణుల్ ప్రొద్దున మేలుకాంచి సఖులన్ రండంచు నాత్మీయ నా

మములం జీరి, కుచద్వయీభరములన్ మధ్యంబు లల్లాడఁగా
భ్రమదోద్దామ గజేంద్రయాన లగుచుం బద్మాక్షునిం బాడుచున్
యమునాతీరముఁ జేరఁబోయిరి గృహీతాన్యోన్య హస్తాబ్జలై.

## 10.1-99- గోపికావస్త్రాపహరణము

10.1-813-వచనము

అట్లా నదీతీరంబు చేరం జని గజగమనలు విజన ప్రదేశంబున వలువలు విడిచి యిడి మది శంకలేక యకలంకలై గ్రుంకులిడఁ జలంబున జలంబు జొచ్చి.

10.1-814-కంద పద్యము

వారిజలోచనుఁ బాడుచు
వారిజలోచనలు వారివారికి వేడ్కన్
వారివిహారము సలిపిరి
వారి విహారములు జగతివారికిఁ గలవే?

10.1-815-వచనము

ఆ సమయంబున.

10.1-816-కంద పద్యము

తోయజనయనలు యమునా
తోయములం దుండు టెఱిఁగి దూరగుఁ డయ్యున్
తోయజనయనుఁడు హరి తన
తోయము వారలును దానుఁ దోతెంచె నృపా!

10.1-817-తరళము

కదలకుం డని తోడివారలఁ గన్నుసన్నల నిల్పుచుం
బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ బద్మనేత్రుఁడు మౌనియై
పొదల మాటున నల్లనల్లనఁ బొంచిపొంచి నతాంగుఁడై
యదను గోరుచు డాసి ప్రేతల యంబరంబులు దొంగిలెన్.

10.1-818-వచనము

ఇట్లు దొంగిలి.

10.1-819-శార్దూల విక్రీడితము

ఉద్యద్గంధ గజేంద్ర గౌరవముతో యోషాంబరంబుల్ విభుం
డాద్యుం డర్భకు భంగి నర్భకులతో హాసార్థియై కొంచు ద
న్నాద్యంభఃకణ శీతవాత జనితానందంబుతో నెక్కెఁ దా
సద్యోముక్త దురంతపాదపజనుస్సంతాపమున్ నీపమున్.

10.1-820-వచనము

అప్పు డయ్యింతు లిట్లనిరి.

10.1-821-కంద పద్యము

మామా వలువలు ముట్టకు
మామా! కొనిపోకుపోకు మన్నింపు తగన్
మా మానమేల కొనియెదు?
మా మానసహరణ మేల? మానుము కృష్ణా!

10.1-822-సీస పద్యము

బహుజీవనముతోడ భాసిల్లి యుండుటో? ;

గోత్రంబు నిలుపుటో కూర్మితోడ?
మహి నుద్ధరించుటో? మనుజసింహంబవై;
ప్రజలఁ గాచుటొ? కాక బలిఁదెరల్చి
పిన్నవై యుండియుఁ బెంపు వహించుటో? ;
రాజుల గెలుచుటో రణములోన?
గురునాజ్ఞ చేయుటో? గుణనిధి వై బల;
ప్రఖ్యాతిఁ జూపుటో భద్రలీల?

10.1-822.1-ఆటవెలది

బుధులు మెచ్చ భువిఁ బ్రబుద్ధత మెఱయుటో?
కలికితనము చేయ ఘనత గలదె?
వావి లేదు వారివారు నావా రని
యెఱుఁగ వలదె? వలువ లిమ్ము కృష్ణ!

10.1-823-కంద పద్యము

కొంటివి మా హృదయంబులు;
గొంటివి మా మనము; లజ్జఁగొంటివి; వలువ
ల్గొంటి; విఁక నెట్లు చేసెదొ;
కొంటెవుగద; నిన్నునెఱిఁగికొంటిమి కృష్ణా!

10.1-824-సీస పద్యము

రాజసంబున నీవు రంజిల్లు టెఱుఁగమే;
చెలరేఁగి వింతలు చేయుచుండ?
సత్త్వసంపద గల్గి జరుగుటఁ దలపమే;

సిరి గల్గి యన్యులఁ జెనకుచుండ?
గురుతర శక్తి యుక్తుఁడ వౌట యెఱుఁగమే;
తామసంబున నెగ్గు దలఁచుచుండ?
నొకభంగితో నుండకుంట చింతింపమే;
మాయావియై మాఱుమలయుచుండ?

10.1-824.1-ఆటవెలది

నేమి జాడవాఁడ? వేపాటి గలవాఁడ?
వే గుణంబు నెఱుఁగ? వెల్ల యెడల
నొదిగి యుండ నేర వోరంత ప్రొద్దును?
బటము లీగదయ్య! పద్మనయన!

10.1-825-కంద పద్యము

రాజుల నెఱుఁగవు బలిమిని
రాజిల్లెదు చీర లీవు రమణుల మింకన్
రాజున కెఱిఁగించెద; మో
రాజీవదళాక్ష! నీవు రాజవె ధరకున్?

10.1-826-వచనము

అని పలికిన కన్నియల పలుకు లాలించి మందహాస సుందర వదనారవిందుండై గోపాలబాలకులకరంబులం గరంబులు ప్రేసి యమ్ముద్దియల నుద్దేశించి నెఱవాది చతురుం డిట్లనియె.

10.1-827-శార్దూల విక్రీడితము

రామల్ రామలతోడి నీ పనికిగా రాగింతురే మీ క్రియన్
మోమోటేమియు లేక దూఱెదరు మీ మోసంబు చింతింప రం
భో మధ్యంబుననుండి వెల్వడి వెసం బూర్ణేందుబింబాననల్
మీమీ చీరలు వచ్చి పుచ్చుకొనుఁడా; మీకిచ్చెదం జెచ్చెరన్.

10.1-828-వచనము

అనిన నమ్మానవతు లొండొండురుల మొగంబులుచూచి నగుచు, మర్మంబులు నాటిన మాటలకు మగుడం బలుక సిగ్గుపడుచు, నగ్గలం బైన చలిని వలిగొని కంఠప్రమాణజలంబులందుండి డోలాయమానమానస లై యిట్లనిరి.

10.1-829-కంద పద్యము

మా వలువ లాగడంబున
నీ వేటికిఁ బుచ్చుకొంటి? నీ వల్పుఁడవే?
నీ వెఱుఁగని దేమున్నది?
నీ వందఱిలోన ధర్మనిరతుఁడవు గదే?

10.1-830-శార్దూల విక్రీడితము

ఇంతుల్ తోయము లాడుచుండ మగవారేతెంతురే? వచ్చిరా
యింతల్ చేయుదురే? కృపారహితులై యేలోకమందైన నీ
వింతల్ నీ తలఁబుట్టెఁగాక; మఱి యేవీ కృష్ణ! యోచల్ల! నీ
చెంతన్ దాసులమై చరించెదము మా చేలంబులిప్పింపవే.

10.1-831-కంద పద్యము

వచ్చెదము నీవు పిల్చిన;

నిచ్చెద మేమైనఁగాని; నెటు చొరు మనినం
జొచ్చెదము; నేడు వస్త్రము
లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా!

10.1-832-వచనము

అనిన దరహాసితవదనుండై హరి యిట్లనియె.

10.1-833-కంద పద్యము

ఏ తరుణుఁడు మగఁ డౌటకు
మీ తపములు చెప్పుఁ డింక మీ యానలు సుం
డీ తప్పిన నీ కూరిమి
మీ తలలనె పుట్టెనోటు మేదిని లేదే?

10.1-834-కంద పద్యము

ఎవ్వనిఁగని మోహించితి?
రెవ్వఁడు మీ మానధనములెల్ల హరించెన్?
నివ్వటిలె మీకుఁ గూరిమి
యెవ్వనిపైఁ? బలుకరాదె? యేనన్యుఁడనే?

10.1-835-వచనము

అనిన విని సుందరు లన్యోన్య సందర్శనంబులు చేయుచు,
హృదయారవిందంబులఁ గందర్పుండు సందడింప నగుచు నిరుత్తరలయి యున్న
లోకోత్తరుం డిట్లనియె.

10.1-836-కంద పద్యము

నా యింటికి దాసులరై
నా యాజ్ఞ వహించి మీరు నడచెదరేనిన్
మీ యంబరంబు లిచ్చెదఁ
దోయంబులు వెడలి రండు తొయ్యలులారా!

10.1-837-వచనము

అనిన విని హరిమధ్యలు చలికి వెఱచి సలిలమధ్యంబున నిలువ నోపక.

10.1-838-కంద పద్యము

కొందఱు వెడలుద మందురు;
కొందఱు వెడలుటయు సిగ్గుఁగొను గోవిందుం
డందురు; కొందఱు దమలోఁ
గొందల మందుదురు వడఁకుఁగొని మనుజేంద్రా!

10.1-839-వచనము

మఱియు నెట్టకేలకుఁ జిత్తంబులు గట్టిపఱచుకొని తనుమధ్యలు తోయ మధ్యంబు వెలువడి.

10.1-840-కంద పద్యము

చంచత్పల్లవ కోమల
కాంచన నవరత్న ఘటిత కంకణరుచిరో
దంచిత కరసంఛాదిత
పంచాయుధగేహ లగుచుఁ బడతులు వరుసన్.

10.1-841-వచనము

చని ప్రౌఢలైన సుందరుల ముందట నిడుకొని మందగమనలు మందహాసంబుతోడ నెదుర నిలిచిన నరవిందనయనుం డిట్లనియె.

10.1-842-సీస పద్యము

శృంగారవతులార! సిగ్గేల? మిముఁ గూడి;
పిన్ననాటను గోలెఁ బెరిగినాఁడ;
నెఱుఁగనే మీలోన నెప్పుడు నున్నాఁడ;
నేను జూడని మర్మ మెద్ది గలదు?
వ్రతనిష్ఠలై యుండి వలువలు గట్టక;
నీరు జొత్తురె మీరు నియతిఁ దప్పి?
కాత్యాయనీదేవిఁ గల్ల చేయుట గాక;
నీ రీతి నోమువా రెందుఁ గలరు?

10.1-842.1-ఆటవెలది

వ్రతము ఫలము మీకు వలసినఁ జక్కఁగఁ
నింతు లెల్లఁ జేతు లెత్తి మ్రొక్కి
చేరి పుచ్చుకొనుఁడు చీరలు; సిగ్గు పో
నాడనేల? యెగ్గు లాడనేల?

10.1-843-వచనము

అనిన విని మానవతులు తమలోన.

10.1-844-మత్తేభ విక్రీడితము

వ్రతముల్ చేయుచు నొక్క మాటయిన నెవ్వానిన్ విచారించినన్

వ్రతభంగంబులు మానునట్టి వరదున్ వామాక్షు లీక్షించియున్
గతచేలాప్లవనంబు నేడు వ్రతభంగం బంచు శంకించి ఫా
లతటన్యస్తకరాబ్జలై సరసలీలన్ మ్రొక్కి రట్లందఱున్.

## 10.1-100- గోపికలయెడప్రసన్నుడగుట

10.1-845-కంద పద్యము

బాలలకు హస్తకీలిత
ఫాలలకు నితాంతశీతపవనాగమ నా
లోలలకు నంబరములు గృ
పాలుఁడు హరి యిచ్చె భక్తపాలకు డగుటన్.

10.1-846-ఆటవెలది

చీర లపహరించి సిగ్గులు విడిపించి
పరిహసించి యైన బరఁగ మనకు
ఘనుఁడు నోము కొఱఁతగాకుండ మ్రొక్కించె
ననుచు హరి నుతించి రబలలెల్ల

10.1-847-కంద పద్యము

ఉల్లములు నొవ్వ నాడిన
గల్లలు చేసినను నగినఁ గలఁచిన నైనన్
వల్లభులు చేయు కృత్యము
వల్లభలకు నెగ్గుగాదు; వల్లభ మధిపా!

10.1-848-వచనము

ఇట్లు హరి వలువ లిచ్చినఁ గట్టుకొని సతు లతని యందు బద్ధానురాగులై యుచ్చరింపక ఱెప్పలిడక తప్పక చూడ నా ప్రోడ యెఱింగి చేరి వారి కిట్లనియె.

10.1-849-సీస పద్యము

లక్షణవతులార! లజ్జించి చెప్పరు;
 గాని మీ మర్మముల్ గానఁబడియె;
ననుఁ గొల్వఁ జింతించినారు నాచేతను;
 సత్యంబు మీ నోము సఫల మగును;
గామితార్థంబులు కలిమిఁ జెప్పఁగ నేల? ;
 ననుఁ గొల్వ ముక్తికి నడవవచ్చుఁ;
గడమ కూడఁగ నంబికాదేవి నోమంగ;
 నటమీఁద రాత్రుల యందు మీకు

10.1-849.1-ఆటవెలది

నన్నుఁ బొందఁ గల్గు నమ్మి పొం డని హరి
పల్క నింతు లెల్ల భ్రాంతిఁ జనిరి
తపము పండె ననుచుఁ దత్పదాంభోజముల్
మానసించి కొనుచు మందకడకు.

10.1-850-వచనము

ఇట్లు గోపకన్యక లందుఁ బ్రసన్నుండయి గోవిందుండు బృందావనంబు దాఁటి దూరంబున ధేనువుల మేపుచుండఁ; జండకిరణుని యెండంబడి దండిచెడి తరుల దండ నండగొనుచు నాతపత్రాకారంబులయి నీడలు చేయుచున్న వృక్షంబుల

నీక్షించి కృష్ణ బలరామ శ్రీదామ దేవప్రస్థ విశాలార్జున ప్రముఖులకుం దక్కిన గోపకు లిట్లనిరి.

10.1-851-మత్తేభ విక్రీడితము

అపకారంబులు చేయ వెవ్వరికి నేకాంతంబు లం దుండు నా
తప శీతానిల వర్ష వారకములై త్వగ్గంధ నిర్యాస భ
స్మ పలాశాగ్ర మరంద మూల కుసుమచ్ఛాయా ఫలశ్రేణిచే
నుపకారంబులు చేయు నర్థులకు నీ యుర్వీజముల్ గంటిరే.

10.1-852-వచనము

అని చిగురాకు పువ్వు కాయ పండు తండంబుల వ్రేఁగున వీఁగిన తరువుల నడిమి తెరువునం బసుల దాఁటుల దాఁటించి, యమునకుం జని, పెడఁదమడుఁగుల మెల్లనఁ జల్లని నీరుఁ ద్రావించి, తత్సమీపంబున మేపుచు, వల్లవు లెల్ల మూఁకలుగొని, యాఁకలి గొంటిమని విన్నవించినఁ దనకు భక్తురాండ్రగు విప్రభార్యలవలనం బ్రసన్నుం డయి వారలం జూచి రామసహితుం డయిన హరి యిట్లనియె.

10.1-853-సీస పద్యము

వల్లవులార! యీ వనమున విప్రులు;
బ్రహ్మవాదులు దేవభవనమునకు
నరుగుట కాంగిరిసాహ్వయ సత్త్రంబు;
సలుపుచునున్నారు చనుఁడు మీరు
మా నామములు చెప్పి మైత్రితో నడిగిన;
నన్నంబుఁ బెట్టెద రనుచుఁ బలుక

వారలు చని విప్రవరుల కెల్లను మ్రొక్కి;
పసుల మేపుచు బలభద్ర కృష్ణు

10.1-853.1-తేటగీతి

లలసి పుత్తెంచి రిట మమ్ము నన్న మడుగ
ధర్మవిదులార! యర్థిప్రదాతలార!
పెట్టు డన్నంబు; శ్రాంతులఁ బిలిచి తెచ్చి
పెట్టుదురు గాదె మిముబోఁటి పెద్ద లెల్ల.

10.1-854-కంద పద్యము

ఘన దీక్షితునకు నైనం
జనుఁ గుడువఁగ; బశువధంబు సౌత్రామణియుం
జనిన వెనుక దోషము లే
దనఘాత్మకులార! పెట్టు డన్నము మాకున్.

10.1-855-వచనము

అని గోపకులు పలికిన.

10.1-856-మత్తేభ విక్రీడితము

క్రతువున్మంత్రముఁ దంత్రమున్ ధనములుం గాలంబు దేశంబు దే
వతయున్ ధర్మము నన్యముల్దలఁప నెవ్వాఁ డట్టి సర్వేశ్వరున్
మతి నూహింపక గోపబాలుఁ డనుచున్ మందస్థితిం జూచి దు
ర్మతులై యన్నము లేదు లే దనిరి సన్మాన్యక్రియాశూన్యులై.

10.1-857-వచనము

అంత గోపకులు నిరాశులై వచ్చి యెఱింగించిన హరి లౌకికానుసారి యగుచు "మీరయ్యార్యుల నడుగక, వారి భార్యలకు మారాకఁ జెప్పుఁ; డన్నంబు పెట్టుదు" రని పంచిన వారు చని బ్రాహ్మణసతుల దర్శించి నమస్కరించి సంపూజితులై యిట్లనిరి.

10.1-858-కంద పద్యము

గోవుల మేపుచు నాఁకొని
గోవిందుం డన్న మడిగికొని రండని మ
మ్మీవేళను బుత్తెంచెను
ధీవిలసితలార! రండు తెం డన్నంబుల్.

## 10.1-101- విప్రవనితాదత్తాన్నభోజనంబు

10.1-859-వచనము

అనిన విని గోవింద సందర్శనకుతూహలలై ధరణీసురసుందరులు సంభ్రమానందంబులు డెందంబుల సందడింప, భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయ భేదంబులుం గలిగి, సంస్కార సంపన్నంబు లైన యన్నంబులు కుంభంబుల నిడికొని సంరంభంబున సముద్రంబునకు నడచు నదుల తెఱంగున.

10.1-860-కంద పద్యము

బిడ్డలు మగలును భ్రాతలు
నడ్డము చని వల దనంగ నటు తలఁడని మా
టొడ్డుచు జగదీశ్వరునకు
జడ్డన నన్నంబు గొనుచు జని రా సుదతుల్.

10.1-861-వచనము

చని యమునాసమీపంబున నవపల్లవాతిరేకంబును విగతవనచరశోకంబును నైన యశోకంబుక్రింద నిర్మలస్థలంబున.

10.1-862-సీస పద్యము

ఒక చెలికానిపై నొక చేయి చాఁచి వే;
 ఱొక చేత లీలాబ్జ మూఁచువానిఁ
గొప్పున కందని కొన్ని కుంతలములు;
 చెక్కుల నృత్యంబు చేయువానిఁ
గుఱుచ చుంగులు పుచ్చి కొమరారఁ గట్టిన;
 పసిఁడి వన్నియ గల పటమువానిఁ
నొదలఁ దిరిగిరా నలవడఁ జుట్టిన;
 దట్టంపు పింఛపుదండవాని

10.1-862.1-తేటగీతి

రాజితోత్పల కర్ణపూరములవాని
మహిత పల్లవ పుష్ప దామములవాని
భువన మోహన నటవేష భూతివానిఁ
గనిరి కాంతలు గన్నుల కఱవు దీఱ.

10.1-863-కంద పద్యము

కని లోచనరంధ్రంబుల
మునుమిడి హరిలలితరూపమును లోఁగొని నె
మ్మనములఁ బరిరంభించిరి

తనుమధ్యలు హృదయజనితతాపమువాయన్.

10.1-864-వచనము

ఇవ్విధంబున.

10.1-865-కంద పద్యము

వారిత సర్వస్పృహలై
వా రందఱుఁ దన్నుఁ జూడ వచ్చుట మదిలో
వారిజనయనుఁడు వొడగని
వారికి నిట్లనియె నగి యవారితదృష్టిన్.

10.1-866-శార్దూల విక్రీడితము

కాంతారత్నములార! మీ గృహములం గల్యాణమే యేమి గా
వింతున్ మీ? కిటు రండు; మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచినా
రెంతో వేడుకతో; నెఱుంగుదుము; నిర్ద్వైతుస్థితిన్ నన్ను ధీ
మంతుల్ మీ క్రియఁ జేరి కందురుగదా మత్సేవలన్ సర్వమున్.

10.1-867-వచనము

కావున గృహస్థులయిన మీ పతులు మిమ్ముంగూడి క్రతువు నిర్విఘ్నంబుగా సమాప్తిం జేసెదరు; మీరు యాగవాటంబున కుం జనుఁ" డనిన విప్రభార్య లిట్లనిరి.

10.1-868-మత్తేభ విక్రీడితము

తగునే మాధవ! యిట్టి వాఁడిపలుకుల్ ధర్మంబులే మా యెడన్?
మగలుం బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్నివారింప మ
చ్చిగ నీ యంఘ్రులు చేరినార; మటఁ బోఁ జేకొందురే వార లా

పగి దే మొల్లము; కింకరీజనులఁగా భావించి రక్షింపవే.

10.1-869-వచనము

అనిన జగదీశ్వరుండు.

10.1-870-సీస పద్యము

నా సమీపమున నున్నా రంచు నలుగరు;
 బంధులు భ్రాతలు పతులు సుతులు
మిమ్ము దేవతలైన మెత్తు రంగనలార! ;
 నా దేహసంగంబు నరుల కెల్ల
సౌఖ్యానురాగ సంజనకంబు గాదు; ము;
 క్తిప్రదాయకము; నా కీర్తనమున
దర్శనాకర్ణన ధ్యానంబులను గర్మ;
 బంధ దేహంబులఁ బాసి మీరు

10.1-870.1-తేటగీతి

మానసంబులు నా యందు మరుగఁజేసి
నన్నుఁ జేరెద రటమీఁద నమ్ము డనుచుఁ
బలికి వారలు దెచ్చిన భక్షణాదు
లాప్తవర్గంబుతో హరి యారగించె.

10.1-871-కంద పద్యము

పరమేశ్వరార్పణంబుగఁ
బరజనులకు బిక్ష యిడినఁ బరమపదమునం

బరఁగెద రఁట; హరి సాక్షా
త్పరమేశ్వర బిక్ష చేయు ఫలమెట్టిదియో?

## 10.1-102- విప్రులవిచారంబు

### 10.1-872-వచనము

ఇట్లు సర్వేశ్వరుండైన హరికి బిక్షయిడి తమ భార్య లతని వలనం గృతార్థు లగుట యెఱింగి భూసురులు తమలో నిట్లనిరి.

### 10.1-873-చంపకమాల

కటకట! మోసపోయితిమి; కాంతల పాటియు బుద్ధి లేదు; నే
డిట హరిఁ గానఁబో నెఱుఁగ; మేము దురాత్ముల; మేము గల్మషో
ద్భటులము; విష్ణుదూరగుల ప్రాజ్ఞతలేల? తపంబులేల? ప
ర్యటనములేల? శీలములు యాగములున్ మఱియేల కాల్పనే?

### 10.1-874-కంద పద్యము

జపహోమాధ్యయనంబులు
తపములు వ్రతములును లేని తరుణులు హరి స
త్కృపఁ బడసి రిన్ని గిలిగియుఁ
జపలతఁ బొందితిమి భక్తి సలుపమి నకటా!

### 10.1-875-కంద పద్యము

సుర గురులగు యోగీంద్రుల
నరుదుగ మోహితులఁజేయు హరిమాయ మమున్
నర గురుల మూఢవిప్రుల

నురవడి మోహితులఁ జేయ నోపక యున్నే?

10.1-876-మత్తేభ విక్రీడితము

క్రతువుల్ ధర్మము మంత్రతంత్రధనముల్ కాలంబు దేశంబు దే
వతయున్ వహ్నులు మేదినీసురులు నెవ్వాఁ డట్టి సర్వేశుఁ డీ
క్షితి రక్షింప జనించినాఁ; డెఱుఁగ; మా శ్రీభర్తకుం గర్తకుం
గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షోనాథ సంహర్తకున్.

## 10.1-103- యాగముచేయయోచించుట

10.1-877-వచనము

అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబునం బొంది హరిం దలంచి శమింపుమని మ్రొక్కి బ్రాహ్మణులు కంసభీతులై కృష్ణ సందర్శనంబు జేయం జన రైరి; అంత నక్కడ నఖిలదర్శనుం డైన హరి యింద్రయాగంబు జేయం దలంచి తనకడకు వచ్చిన నందాది గోపవృద్ధులం గని నందున కిట్లనియె.

10.1-878-సీస పద్యము

యాగంబు జేయంగ నర్థించి వచ్చితి;
రీ యాగమున ఫల మేమి గలుగు?
నెవ్వాఁడు దీనికి నీశ్వరుం? డధికారి;
యెవ్వఁడు? సాధన మెంత వలయు?
శాస్త్రీయమో, జనాచారమో కార్యంబు? ;
వైరుల కెఱిఁగింప వలదు గాని
యెఱిఁగెడి మిత్రుల కెఱిఁగింపఁ దగుఁ జేరి;
యెఱిఁగి చేసినఁ గోర్కు లెల్లఁ గలుగుఁ

10.1-878.1-ఆటవెలది

బగయుఁ జెలిమి లేక పరఁగిన మిముబోఁటి
మంచివారి కేల మంతనంబు?
తలఁపు లెల్ల మాకుఁ దగ నెఱిఁగింపవే
తాత! వాక్సుధాప్రదాత వగుచు.

10.1-879-వచనము

అనినఁ బ్రౌఢకుమారునికిఁ దండ్రి యిట్లనియె.

10.1-880-సీస పద్యము

పర్జన్యుఁ డధిపుండు భగవంతుఁ డమరేంద్రుఁ;
డతనికిఁ బ్రియమూర్తు లగుచునున్న
మేఘ బృందంబులు మేదినీ తలముపై;
నతని పంపున భూతహర్షణముగ
జలములు గురియుఁ, దజ్జలపూరములఁ దోఁగి;
పండు సస్యంబు లా పంట దమకు
ధర్మార్థకామప్రదాయకములు లోకు;
లెల్లను బ్రతుకుదు; రింత యెఱిఁగి

10.1-880.1-తేటగీతి

మేఘవిభుఁడైన యింద్రుఁడు మెచ్చుకొఱకు
నింద్రమఖములు జేయుదు రెల్ల నృపులుఁ
గామలోభ భయద్వేషకలితు లగుచుఁ
జేయ కుండిన నశుభంబు చెందుఁ బుత్ర!

10.1-881-వచనము

అదియునుం గాక.

10.1-882-ఆటవెలది

మఖము జేయ వజ్రి మది సంతసించును
వజ్రి సంతసింప వాన గురియు
వాన గురియఁ గసవు వసుమతిఁ బెరుగును
గసవు మేసి ధేనుగణము బ్రతుకు.

10.1-883-కంద పద్యము

ధేనువులు బ్రతికెనేనియు
మానక ఘనమైన పాఁడి మందలఁ గలుగున్;
నూనముగ బాఁడి గలిగిన
మానవులును సురలుఁ దనిసి మనుదురు పుత్రా!

## 10.1-104- ఇంద్రయాగనివారణంబు

10.1-884-వచనము

అని యిట్లు నొడివిన నందుని పలుకులు విని యింద్రునికిఁ గోపంబు దీపింప దనుజదమనుండు తండ్రి కిట్లనియె.

10.1-885-కంద పద్యము

కర్మమునఁ బుట్టు జంతువు
కర్మముననె వృద్ధి బొందుఁ గర్మమునఁ జెడుం
గర్మమె జనులకు దేవత

కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా!

10.1-886-కంద పద్యము

కర్మములకుఁ దగు ఫలములు
కర్ములకు నిడంగ రాజు గాని సదా ని
ష్కర్ముఁ డగు నీశ్వరుండును
గర్మవిహీనునికి రాజు గాఁడు మహాత్మా!

10.1-887-వచనము

కావునఁ గర్మానుయాతంబులైన భూతంబులకుఁ బురుహూతుని వలని భీతి యేటికిఁ? బురాతన జన్మసంస్కారంబులు కుప్పలుగొని కప్పినఁ గర్మంబులఁ దప్పించి పెంపు వడయ నప్పరమేశ్వరుండును నేరం; డితరులం జెప్పనేల? సురాసురనరానీకంబులతో లోకంబు నిజసంస్కారవశంబై యంద డిందియున్నది; సందేహంబు లేదు; దేహి కర్మవశంబున గురుతను దేహంబులం జొచ్చి వెడలు; నొజ్జ, వేలుపు, నెచ్చలి, పగఱు, చుట్టంబులు కర్మంబు జీవుండు కర్మంబుతోడ వర్తించు; నతనికిఁ గర్మంబు దైవతంబు కర్మంబునం బ్రతుకుచు నితర సేవజేయుట సతి పతివిడిచి జారుం జేరిన చందంబగు; విప్రుండు వైదిక కర్మంబున మెలంగు; నృపతి ధరణీ పాలనంబున సంచరించు; వైశ్యుండు వాణిజ్య కృషి కుసీదగోరక్షాదుల వర్తించు శూద్రుం డగ్రజన్ముల సేవించి బ్రతుకు; రజస్సత్వ తమోగుణంబు లుత్పత్తి స్థితి లయ కారణంబు లందు రజంబున జగంబు జన్మించు; రజోగుణప్రేరితంబులై మేఘంబులు వర్షించు; వర్షంబునం బ్రజావృద్ధి యగు; నింద్రుం డేమి చేయంగలవాఁడు; అదియునుం గాక.

10.1-888-శార్దూల విక్రీడితము

కోపింపం బనిలేదు శక్రునికిఁ; దాఁ గోపించుఁగా కేమి సం
క్షేపం బయ్యెడి దేమి? పట్టణములున్ గేహంబులున్ దేశముల్
వ్యాపారంబులు మీకుఁ బోయెడినె? శైలారణ్యభాగంబులన్
గోపత్వంబున నుండుచున్ మనకు సంకోచింపఁగా నేటికిన్?

10.1-889-సీస పద్యము

పసులకుఁ గొండకు బ్రాహ్మణోత్తములకు;
మఖము గావించుట మంచిబుద్ధి
యింద్రయాగంబున కేమేమి దెప్పింతు;
రవి యెల్లఁ దెప్పింపుఁ డరసి మీరు
పాయసంబులు నపూపములు సైఁదపుఁబిండి;
వంటలుఁ బప్పును వలయు నట్టి
ఫలశాకములు వండఁ బంపుఁడు; హోమంబు;
జేయుఁడు; ధేనుదక్షిణల నిచ్చి

10.1-889.1-తేటగీతి

బహురసాన్నంబు పెట్టుఁడు బ్రాహ్మణులకు
నచలులై పూజ యొనరిపు డచలమునకు;
నధమ చండాల శునక సంహతికిఁ దగిన
భక్ష్యములు పెట్టి కసవులు పసుల కిండు.

10.1-890-శార్దూల విక్రీడితము

గంధాలంకరణాంబరావళులచేఁ గైచేసి యిష్టాన్నముల్
బంధుశ్రేణియు మీరలుం గుడిచి నా భాషారతిన్ వేడుకల్

సంధిల్లన్, గిరి గో ద్విజానల నమస్కారంబు గావింపుఁడా;
సంధిల్లున్ సకలేప్సితంబులును మీ జన్మంబు ధన్యంబగున్.

10.1-891-వచనము

అని మఱియు నిలింపపతి సొంపు దింపుతలంపున నిమ్మఖంబు తనకు సమ్మతం బని గోవిందుండు పలికిన నందాదులు మేలుమేలని తద్వచన ప్రకారంబునం బుణ్యాహవాచనంబులు చదివించి ధరణీసురులకు భోజనంబులిడి పసులకుం గసవు లొసంగిరి; అప్పుడు.

## 10.1-105- పర్వతభజనంబు

10.1-892-మత్తేభ విక్రీడితము

సకలాభీరులు వీఁడె కృష్ణుఁ డన నైజంబైన రూపంబుతో
నకలంకస్థితినుండి శైల మిదె మీరర్చింప రం డంచుఁ దా
నొక శైలాకృతిఁదాల్చి గోపకులతో నొండొండఁ బూజించి గో
పకదత్తాన్నము లాహరించె విభుఁ డా ప్రత్యక్ష శైలాకృతిన్.

10.1-893-మత్తేభ విక్రీడితము

వినుఁ డీ శైలము కామరూపి; ఖలులన్ వేధించు; నాజ్యాన్నముల్
మన మొప్పింపఁగ నాహరించె; మనలన్ మన్నించెఁ; జిత్తంబులో
ననుకంపాతిశయంబు చేసె మనపై నంచున్ సగోపాలుఁడై
వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ వందారుమందారుఁడై.

10.1-894-వచనము

ఇట్లు గోపకులు హరిసమేతులై గిరికిం బూజనోపహారంబులు సమర్పించి, గోధనంబులం బురస్కరించుకొని భూసురాశీర్వాద వచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు చేసి, రా సమయంబున.

10.1-895-కంద పద్యము

గుట్టముల పరువు మెచ్చని
నట్టల గట్టిన రథంబు నందప్రముఖుల్
గుట్టల యార్పులు చెలఁగఁగఁ
దొట్టలగమి వెంట నంటఁ దోలి రిలేశా!

10.1-896-కంద పద్యము

పాటించి గానవిద్యా
పాటవమునఁ దేరు లెక్కి బహుతానములం
బాటలగంధులు కృష్ణుని
బాటలు పాడిరి విరోధిపాటనుఁ డనుచున్.

10.1-897-కంద పద్యము

కుండ నిభాపీనంబులు
మండితవర్ణములు వివిధమహితాకృతులున్
నిండిన కడుపులుఁ గన్నుల
పండువులుగఁ బాఁడి కుట్టిపదువులు జరగెన్.

10.1-898-కంద పద్యము

పొగరెక్కిన మూఁపురములు;

దెగ గల వాలములు, శైల దేహంబులు, భూ
గగనములు నిండు ఱంకెలు
మిగుల మెఱయు వృషభగణము మెల్లన నడచెన్.

## 10.1-106- పాషాణసలిలవర్షంబు

10.1-899-వచనము

ఇట్లు పర్వత ప్రదక్షిణంబు చేసి గోపకులు మాధవసమేతులై మందకుం జని; రంత మహేంద్రుం డంతయునెఱింగి మహాకోపం బునఁ బ్రళయ ప్రవర్తకంబులగు సంవర్తకాది మేఘంబులం జీఱి యిట్లనియె.

10.1-900-మత్తేభ విక్రీడితము

పెరుగుల్ నేతులు ద్రావి క్రొవ్వి, భువి నాభీరుల్ మదాభీరులై
గిరిసంఘాత కఠోరపత్రదళనక్రీడా సమారంభ దు
ర్భర దంభోళిధరుం బురందరు ననుం బాటించి పూజింప క
గ్గిరికిం బూజలు చేసి పోయి రిదిగో కృష్ణుండు ప్రేరేపఁగన్.

10.1-901-కంద పద్యము

గురు దేవ హీను బాలుని
గిరిభూజప్రముఖ వాసుఁ గృష్ణు ననీశుం
బరిమాణశీల కుల గుణ
విరహితుఁ జేపట్టి యింద్రు విడిచిరి గొల్లల్.

10.1-902-ఆటవెలది

విమల ఘనతరాత్మవిజ్ఞానవిద్యచే

నిగుడలేక యుడుప నిభము లగుచుఁ
గర్మమయములైన క్రతువుల భవ మహా
ర్ణవముఁ గడవఁ గోరినారు వీరు.

10.1-903-శార్దూల విక్రీడితము

ఉద్యత్సంపద నమ్మి నందతన యోద్యోగంబునన్ వెట్టులై
మద్యాగంబు విసర్జనీయ మని రీ మర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యుద్వల్లులఁ గప్పి గర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
సద్యోమృత్యువుఁ బొంద బా ల్గురియుఁడీ; శౌర్యంబ వార్యంబుగన్.

10.1-904-కంద పద్యము

మీవెంట వత్తు నే నై
రావణనాగంబు నెక్కి రయ మొప్పంగా
దేవగణంబులతోడను
గోవిందుని మంద లెల్లఁ గొందలపెట్టన్.

10.1-905-వచనము

అని యిట్లు పలికి జంభవైరి సంరంభంబున దంభోళి జళిపించి, బింకంబున శంకింపక, కిన్కతోడ సంకెలలు విప్పించిన, మహానిలప్రేరితంబులై చని, నందుని మందమీఁద నమోఘంబులైన మేఘంబులు మహౌఘంబులై పన్ని, ప్రచండగతిఁ జండమరీచి మండలంబుఁ గప్పి, దివినిండి, దిశ లావరించి, రోదోంతరాళంబు నిరంతరనీరంధ్ర నిబిడాంధకారబంధురంబుగ నిరోధించి, బలిభం జన ద్వితీయ పాదపల్లవభగ్నంబైన బ్రహ్మాండభాండంబు చిల్లుల జల్లించినఁ, దొరఁగు బహిస్సముద్రసలిలనిర్ఝరంబుల వడుపున నెడతెగక తోరంబులైన నీరధారలం

గురియుచు శిలల వర్షించుచు, బిడుగుల ఉవ్వుచు, మిట్టపల్లంబులు సమతలంబులై, యేకార్ణవంబు రూపునచూపి, నందు దుడు కడఁచుచు విలయ శిఖిశిఖాసంరంభ విజృంభమాణవిద్యుల్లతావిలోకనంబుల మిఱు మిట్లుగొని, సొమ్మసిలంబోవు లేగలును, లేఁగలకు మూతుల డ్డంబులిడి ప్రళయభైరవ భేరీభాంకారభీషణంబులగు గర్జనఘోష ణంబులఁ జెవుడుపడి చిందఱవందఱ లైన డెందంబులం గంది కుంది వ్రాలు ధేనువులును, ధేనువుల వెనుక నిడుకొని దురంత కల్పాంత కాలకేళీవిశాల కాలకంఠ గదా ఘాత ప్రభూతంబు లైన నిర్ఘాతపాతంబులకు భీతంబులై హరికి మ్రొక్కి, రక్షరక్షేతి శబ్దం బులు చేయు కైవడి విడువని జడింబడి, సైరింపక శిరంబులు వంచుకొని, గద్గదకంఠంబుల నంభారవంబులు చేయు వృషభం బులును, వృషభాది గోరక్షణంబు చేయుచు దుర్వారఘోర శిలా సారంబుల సారంబులు జెడి శరీరంబులు భారంబులైన మ్రాను పడు గోపకులును, గోపకులం బట్టుకొని దట్టంబైన వానగొట్టునం బెట్టుపడి బడుగునడుములు నుసులుపడ వడవడ వడంకుచు గోవిందునిం జీరు గోపికలును, గోపికాజన కఠినకుచకలశయుగ ళంబుల మఱుంగునం దలలు పెట్టుకొని పరవశులైన శిశువు లుంగలిగి, మహాఘోషంబుతోడ నష్టంబైన ఘోషంబుఁ జూచి ప్ర బుద్ధులైన గోపవృద్ధులు కొందఱు దీనజనరక్షకుండైన పుండరీ కాక్షునకు మ్రొక్కి యిట్లనిరి.

10.1-906-ఉత్పలమాల

అక్కట! వానఁ దోగి వ్రజ మాకుల మయ్యెఁ గదయ్య! కృష్ణ! నీ
వెక్కడనుంటి? వింతదడవేల సహించితి? నీ పదాబ్జముల్
దిక్కుగ నున్న గోపకులు దీనత నొంద భయాపహారివై
గ్రక్కునఁ గావ కిట్లునికి కారుణికోత్తమ! నీకుఁ బాడియే?

10.1-907-కంద పద్యము

ఈ యఱుములు నీ మెఱుములు
నీ యశనీఘోషణములు నీ జలధారల్
నీ యాన తొల్లి యెఱుఁగము
కూయాలింపం గదయ్య! గుణరత్ననిధీ!

10.1-908-కంద పద్యము

వారి ఒరు వయ్యె మందల
వారికి; నిదె పరులు లేరు వారింపంగా;
వారిద పటల భయంబును
వారిరుహదళాక్ష! నేడు వారింపఁగదే.

10.1-909-వచనము

అనిన విని సర్వజ్ఞుండైన కృష్ణుం డంతయు నెఱింగి.

10.1-910-ఉత్పలమాల

తన్నొక యింతగైకొనరు; తప్పిరి; యాగము చేసి రంచుఁ దా
మిన్నుననుండి గోపకులమీఁద శిలల్ గురియించుచున్న వాఁ
డున్నత నిర్జరేంద్రవిభవోద్ధతి గర్వనగాధిరూఢుడై
కన్నులఁ గానఁ డింద్రుఁ డిటు; గర్వపరుం డొరుఁగాన నేర్చునే?

10.1-911-కంద పద్యము

దేవత లందఱు నన్నునె
సేవింతురు; రాజ్యమదముఁ జెందరు; చెఱుపం

గా వలదు; మానభంగముఁ
గావింపఁగ వలయు శాంతి గలిగెడుకొఱకై.

10.1-912-వచనము

అని చింతించి శిలావర్షహతులై శరణాగతులైన ఘోషజనుల రక్షించుట తగవని, సకలలోకరక్షకుండైన విచక్షణుండు.

10.1-913-చంపకమాల

కలఁగకుఁడీ వధూజనులు; కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్;
తలఁగకుఁడీ కుమారకులు; తక్కినవారలు ఱాలవానచే
నలయకుఁడీ; పశువ్రజము నక్కడ నక్కడ నిల్వనీకుఁడీ;
మెలుపున మీకు నీశ్వరుఁడు మేలొసఁగుం గరుణార్ద్రచిత్తుఁడై.

## 10.1-107- గోవర్ధనగిరినెత్తుట

10.1-914-వచనము

అని చెప్పి.

10.1-915-కంద పద్యము

కిరి యై ధర యెత్తిన హరి
కరి సరసిజముకుళ మెత్తుగతిఁ ద్రిభువన శం
కరకరుఁడై గోవర్ధన
గిరి నెత్తెం జక్క నొక్క కేలన్ లీలన్.

10.1-916-కంద పద్యము

దండిని బ్రహ్మాండంబులు

చెండుల క్రియఁ బట్టి యెగురఁ జిమ్మెడు హరికిన్
గొండఁ బెకలించి యెత్తుట
కొండొకపని గాక యొక్క కొండా తలఁపన్?

10.1-917-వచనము

ఇట్లు గిరి యెత్తి.

10.1-918-శార్దూల విక్రీడితము

బాలుం డాడుచు నాతపత్ర మని సంభావించి పూగుత్తి కెం
గేలందాల్చినలీల లేనగవుతోఁ గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపులచ్ఛత్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుత దుశ్శిలాచకిత గోపీ గోప గోపంక్తికిన్.

10.1-919-వచనము

ఇట్లు గోత్రంబు ఛత్రంబుగాఁ బట్టి గోపజనులకు గోపాలశేఖరుం డిట్లనియె.

10.1-920-కంద పద్యము

రా తల్లి! రమ్ము తండ్రీ!
ప్రేతలు గోపకులు రండు; వినుఁ; డీ గర్త
క్ష్మాతలమున నుండుఁడు గో
వ్రాతముతో మీరు మీకు వలసిన యెడలన్.

10.1-921-శార్దూల విక్రీడితము

బాలుం డీతఁడు; కొండ దొడ్డది; మహాభారంబు సైరింపఁగాఁ
జాలండో; యని దీని క్రింద నిలువన్ శంకింపఁగాబోల; దీ

శైలాంభోనిధి జంతు సంయుత ధరాచక్రంబు పైఁబడ్డ నా
కేలల్లాడదు; బంధులార! నిలుఁ డీ క్రిందం బ్రమోదంబునన్.

10.1-922-వచనము

ఇట్లు పలుకుచున్న హరిపలుకులు విని నెమ్మనమ్ముల నమ్మి కొండ యడుగున తమతమ యిమ్ములం బుత్ర మిత్ర కళత్రాది స మేతులై గోవులుం దారును గోపజనులు జనార్దనకరుణావలోక నామృతవర్షంబున నాఁకలి దప్పుల చొప్పెఱుంగక కృష్ణకథావినో దంబులనుండిరి; యివ్విధంబున.

10.1-923-మత్తేభ విక్రీడితము

హరిదోర్దండము కామ, గుబ్బశిఖరం, బాలంబి ముక్తావళుల్
పరఁగం జారెడు తోయబిందువులు, గోపాలాంగ నాపాంగ హా
సరుచుల్ రత్నచయంబు గాఁగ, నచలచ్ఛత్రంబు శోభిల్లెఁ ద
ద్గిరిభిద్దుర్మదభంజి యై జలధరాఖిన్నప్రజారంజి యై.

10.1-924-కంద పద్యము

రాజీవాక్షునిచే నొక
రాజీవముభంగి శైలరాజము మెఱసెన్;
రాజేంద్ర! మీఁద మధుకర
రాజి క్రియన్ మేఘరాజి రాజిల్లెఁ గడున్.

10.1-925-కంద పద్యము

వడిగొని బలరిపు పనుపున
నుడుగక జడి గురిసె నే డహోరాత్రము; ల

య్యెడ గోపజనులు బ్రతికిరి
జడిఁ దడియక కొండగొడుగు చాటున నధిపా!

10.1-926-వచనము

ఇట్లు హరి యే డహోరాత్రంబులు గిరి ధరించిన గిరిభేది విసిగి వేసరి కృష్ణు చరితంబులువిని వెఱఁగుపడి విఫలమనోరథుండై మేఘంబుల మరలించుకొనిచనియె నంత నభోమండలంబు విద్యో తమాన ఖద్యోతమండలం బగుట విని గోవర్ధనధరుండు గోపాలకు లకు యిట్లనియె.

10.1-927-కంద పద్యము

ఉడిగెను వానయు గాలియు
వడిచెడి నదులెల్లఁబొలుప వఱదలిగిరెఁ; గొం
డడుగున నుండక వెడలుఁడు
కొడుకులుఁ గోడండ్రు సతులు గోవులు మీరున్.

10.1-928-వచనము

అనిన విని సకల గోపజనులు శకటాద్యుపకరణ సమేతులై గోవులుం దారును గొండ యడుగు విడిచివచ్చి రచ్యుతుండును జెచ్చెరఁ దొల్లింటి యట్ల నిజస్థానంబున గిరినిలిపె; నంత వల్లవులెల్లం గృష్ణునిఁ గౌగలించుకొని సముచిత ప్రకారంబుల సంభావించి దీవించిరి; గోపికలు సేసలిడి, దధ్యన్నకబళంబు లొసంగుచు నాశీర్వదించిరి; నంద బలభద్ర రోహిణీ యశోద లాలింగనంబుజేసి భద్రవాక్యంబులు పలికిరి సిద్ధసాధ్యగంధర్వవరులు విరులుగురియించిరి సురలు శంఖ దుందుభులు మ్రోయించిరి; తుంబురు ప్రముఖులయిన గంధర్వులు పాడి; రప్పుడు.

10.1-929-కంద పద్యము

వల్లవకాంతలు దన కథ

లెల్లను బాడంగ నీరజేక్షణుఁ డంతన్

వల్లవబలసంయుతుఁడై

యల్లన గోష్ఠంబుఁ జేరె నవనీనాథా!

## 10.1-108- గోపకులు నందునికిజెప్పుట

10.1-930-వచనము

అయ్యవసరంబునఁ గృష్ణుచరిత్రంబులు తలంచి వెఱఁగుపడి గోపజనులు నందున కిట్లనిరి.

10.1-931-సీస పద్యము

కన్నులు దెఱవని కడుచిన్ని పాపఁడై;

దానవిఁ జనుఁబాలు ద్రాగి చంపె;

మూఁడవ నెలనాఁడు ముద్దుల బాలుఁడై;

కోపించి శకటంబుఁ గూలఁ దన్నె;

నేఁడాది కుఱ్ఱఁడై యెగసి తృణావర్తు;

మెడఁ బట్టుకొని కూల్చి మృతునిఁ జేసెఁ;

దల్లి వెన్నలకునై తను ఱోలఁ గట్టినఁ;

గొమరుఁడై మద్దులు గూల నీడ్చెఁ;

10.1-931.1-తేటగీతి

బసుల క్రేపులఁ గాచుచు బకునిఁ జీఱె;

వెలఁగతో వత్సదైత్యుని వ్రేసి గెడపె;

సబలుఁడై ఖరదైత్యుని సంహరించె;
నితఁడు కేవల మనుజుఁడే యెంచి చూడ.

10.1-932-కంద పద్యము

తెంపరి యై రామునిచేఁ
జంపించెఁ బ్రలంబు; మ్రింగెఁ జటుల దవాగ్నిన్;
సొంపు చెడఁ ద్రొక్కి గాళియుఁ
ద్రుంపక కాళింది వెడలఁ దోలెన్ లీలన్.

10.1-933-కంద పద్యము

ఏడేండ్ల బాలుఁ డెక్కడ?
క్రీడం గరి తమ్మి యెత్తు క్రియ నందఱముం
జూడ గిరి యెత్తు టెక్కడ?
వేడుక నొక కేల నేడు వెఱ గౌఁ గాదే.

10.1-934-కంద పద్యము

ఓ! నంద! గోపవల్లభ!
నీ నందనుఁ డాచరించు నేర్పరితనముల్
మానవులకు శక్యంబులె;
మానవమాత్రుండె నీ కుమారుఁడు తండ్రీ!

10.1-935-వచనము

అనిన విని నందుండు వారలం జూచి మున్ను తనకు గర్గమహాముని చెప్పిన సంకేతంబు తెలిపి "శంకలేదు; కృష్ణుండు లోకరక్షకుండైన పుండరీకాక్షుని

నిజాంశంబనుచు నంతరంగంబునం జింతింతు" నని పలికిన వెఱఁగుపడి గోపకులు కృష్ణుం డనంతుండని పూజించి; రంత.

## 10.1-109- ఇంద్రుడు పొగడుట

10.1-936-మత్తేభ విక్రీడితము

హరి కేలన్ గిరి యెత్తి వర్షజలభిన్నాభీర గోరాజికిన్
శరణంబైనఁ ద్రిలోక రాజ్యమదముం జాలించి నిర్గర్వుఁడై
సురభిం గూడి బలారివచ్చి కనియెన్ సొంపేది దుష్టప్రజే
శ్వరదుర్మాన నిరాకరిష్ణు కరుణావర్ధిష్ణు శ్రీకృష్ణునిన్.

10.1-937-కంద పద్యము

కని యింద్రుఁడు పూజించెను
దినకరనిభ నిజ కిరీటదీధితిచేతన్
ముని హృదలంకరణంబులు
సునతోద్ధరణములు నందసుతుచరణంబుల్.

10.1-938-వచనము

ఇట్లు నమస్కరించి కరకమలంబులు ముకుళించి హరికి హరి హయుండు యిట్లనియె.

10.1-939-సీస పద్యము

పరమ నిధానంబు; భాసుర సత్త్వంబు;
శాంతంబు; హత రజస్తమము; నిత్య
మధిక తపోమయ; మట్లు గావున మాయ;

నెగడెడి గుణములు నీకు లేవు
గుణహీనుఁడవు గాన గుణముల నయ్యెడి;
లోభాదికములు నీలోనఁ జేర
వైన దుర్జననిగ్రహము శిష్టరక్షయుఁ;
దగిలి జేయఁగ దండధారి వగుచు

10.1-939.1-తేటగీతి

జగముభర్తవు; గురుడవు; జనకుఁడవును
జగదధీశుల మను మూఢజనులు దలఁక
నిచ్చపుట్టిన రూపంబు లీవు దాల్చి
హితము జేయుదు గాదె లోకేశ్వరేశ!

10.1-940-కంద పద్యము

నావంటి వెట్టివారిని
శ్రీవల్లభ! నీవు శాస్తి చేసితివేనిం
గావరము మాని పెద్దల
త్రోవన్ జరుగుదురు బుద్ధితోడుత నీశా!

10.1-941-కంద పద్యము

ఒక్కొక లోకముఁ గాచుచు
నెక్కుడు గర్వమున నేమె యీశుల మనుచుం
జొక్కి ననుబోటి వెట్టులు
నిక్కము నీ మహిమ దెలియనేర రనంతా!

10.1-942-ఆటవెలది

వాసుదేవ! కృష్ణ! వరద! స్వతంత్ర! వి
జ్ఞానమయ! మహాత్మ! సర్వపుణ్య
పురుష! నిఖిలబీజభూతాత్మకబ్రహ్మ!
నీకు వందనంబు నిష్కళంక!

10.1-943-శార్దూల విక్రీడితము

నీ సామర్థ్య మెఱుంగ మేఘములచే నీ ఘోషమున్ భీషణో
గ్రాసారంబున ముంచితిన్ మఖము నాకై వల్లవుల్ చేయ రం
చో సర్వేశ! భవన్మహత్త్వమున నా యుద్యోగ మిట్లయ్యె; నీ
దాసున్ నన్నుఁ గృతాపరాధుఁ గరుణన్ దర్శింపవే మాధవా!

10.1-944-మత్తేభ విక్రీడితము

నిను బ్రహ్మాదు లెఱుంగలేరు; జడతానిష్ఠుండ లోకత్రయా
వనదుర్మానగరిష్ఠుఁడన్; విపులదుర్వైదుష్యభూయిష్ఠుఁడన్;
వినయత్యాగకనిష్ఠుడం; గుజన గర్వశ్రేష్ఠుఁడన్; దేవ! నీ
ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియంగా నెవ్వఁడన్? సర్వగా!

10.1-945-వచనము

అనిన విని నగుచు జలధరగంభీర రవంబున శక్రునకుం జక్రి యిట్లనియె.

10.1-946-మత్తేభ విక్రీడితము

అమరాధీశ్వర! లక్ష్మితోఁ దగిలి యిట్లంధుండవై యున్న నీ
సమదోద్రేకముఁ ద్రుంచిపైచుటకు నీ జన్నంబుఁ దప్పించితిం

బ్రమదశ్రీరత దండధారినగు నన్ భావింపఁ; డెవ్వాఁడు ని
క్కము శిక్షింపఁ దలంతు వాని నధనుం గావింతు జంభాంతకా!

10.1-947-కంద పద్యము

నా యాజ్ఞ జేయు చుండుము
నీ యధికారంబునందు నిలువు; సురేంద్రా!
శ్రీయుతుఁడవై మదింపకు
శ్రేయంబులు గల్గుఁ; బొమ్ము సితకరిగమనా!

## 10.1-110- కామధేనువు పొగడుట

10.1-948-వచనము

అని యిట్లు జిష్ణునిం బలుకుచున్న కృష్ణునికి మ్రొక్కి గోగణసమేత యయిన కామధేనువు భక్తజనకామధేనువైన యీశ్వరునకు యిట్లనియె.

10.1-949-కంద పద్యము

విశ్వేశ! విశ్వభావన!
విశ్వాకృతి! యోగివంద్య! విను నీచేతన్
శాశ్వతుల మైతి మిప్పుడు
శాశ్వతముగఁ గంటి మధిక సౌఖ్యంబు హరీ!

10.1-950-వచనము

దేవా! మాకుం బరమదైవంబ వింద్రుండవు భూసురగోసురసాధు సౌఖ్యంబులకొఱకు నిన్నింద్రునిం జేసి పట్టముగట్టుమని విరించి నియమించి

పుత్తెంచె నీవు భూతలభూరిభారనివారణంబు చేయ నవతరించిన హరి” వని పలికి యంత.

10.1-951-మత్తేభ విక్రీడితము

సురభిక్షీరములన్ సురద్విపమహాశుండాలతానీత ని
ర్జరగంగాంబువులన్ నిలింపజననీ సన్మౌనిసంఘంబుతో
సురనాథుం డభిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార గోవిందుఁ డం
చు రణాక్రాంతవిపక్షుఁ దోయజదళాక్షున్ సాధుసంరక్షణున్!

10.1-952-సీస పద్యము

తుంబుర నారదాదులు సిద్ధచారణ;
గంధర్వులును హరికథలు పాడి
రమరకాంతలు మింట నాడిరి వేల్పులు;
కురియించి రంచిత కుసుమవృష్టి
జగములు మూఁడును సంతోషమును బొందెఁ;
గుఱ్ఱుల చన్నులం గురిసెఁ బాలు
నవజలంబులతోడ నదులెల్లఁ బ్రవహించె;
నిఖిల వృక్షములు దేనియలు బడిసె

10.1-952.1-తేటగీతి

సర్వలతికల ఫల పుష్ప చయము లమరెఁ
బర్వతంబులు మణిగణప్రభల నొప్పెఁ
బ్రాణులకునెల్ల తమలోని పగలుమానె
వాసుదేవుని యభిషేక వాసరమున.

10.1-953-వచనము

ఇట్లు గోపగోగణపతిత్వంబునకు గోవిందు నభిషిక్తుంజేసి వీడ్కొని పురందరుండు, దేవగణంబులతో దివంబున కరిగె నంత.

## 10.1-111- వరుణునినుండితండ్రిదెచ్చుట

10.1-954-సీస పద్యము

నందుఁ డేకాదశినాఁ డుపవాసంబు;
చేసి శ్రీహరిఁబూజ చేసి దనుజ
వేళ యెఱుంగక వేగక ముందర;
ద్వాదశీస్నానంబుఁ దగ నొనర్ప
యమునాజలము చొర నందొక్క దైత్యుండు;
నందుని వరుణుని నగరమునకుఁ
గొనిపోవఁ దక్కిన గోపకు లందఱు;
నందగోపకునిఁ గానక కలంగి

10.1-954.1-తేటగీతి

రామకృష్ణులఁ బేర్కొని రవము జేయఁ
గృష్ణుఁ డీశుండు తమ తండ్రిఁ గికురుపెట్టి
వరుణభృత్యుండు గొనిపోయి వరుణుఁ జేర్చు
టెఱిఁగి రయమున నచ్చోటి కేఁగె నధిప!

10.1-955-వచనము

అప్పుడు.

10.1-956-కంద పద్యము

వచ్చిన మాధవుఁ గనుఁగొని
చెచ్చెర వరుణుండు పూజ చేసి వినతుఁడై
యచ్చుగ నిట్లని పలికెను
విచ్చేసితి దేవ! నా నివేశంబునకున్,

10.1-957-ఉత్పలమాల

ఏ విభు పాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొందలేని పెం
ద్రోవఁ జరింతు రట్టి బుధతోషక! నీ వరుదెంచుటం బ్రమో
దావృతమయ్యెఁ జిత్తము కృతార్థత నొందె మనోరథంబు నీ
సేవఁ బవిత్రభావమును జెందె శరీరము నేఁడు మాధవా!

10.1-958-ఉత్పలమాల

ఏ పరమేశ్వరున్ జగములిన్నిటిఁ గప్పిన మాయ గప్పఁగా
నోపక పారతంత్ర్యముననుండు మహాత్మక! యట్టి నీకు ను
ద్దీపితభద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ
తాపము వాయ మ్రొక్కెద నుదారతబోధనచక్రవర్తికిన్.

10.1-959-చంపకమాల

ఎఱుఁగఁడు వీఁడు నా భటుఁ డొకించుకయైన మనంబులోపలం
దెఱుకువలేక నీ జనకుఁదెచ్చె; దయంగొనిపొమ్ము ద్రోహమున్
మఱవుము నన్ను నీ భటుని మన్నన చేయుము నీదు సైరణన్
వఱలుదుఁగాదె యో! జనకవత్సల! నిర్మల! భక్తవత్సలా!

10.1-960-వచనము

అని యిట్లు పలుకుచున్న వరుణునిం గరుణించి, తండ్రిం దోడ్కొని హరి తిరిగివచ్చె; నంత నందుండు తన్ను వెన్నుండు వరుణనగరంబుననుండి విడిపించి తెచ్చిన వృత్తాంతబంతయు బంధువుల కెఱింగించిన వారలు కృష్ణుం డీశ్వరుండని తలంచి; రఖిలదర్శనుం డీశ్వరుండును వారల తలంపెఱింగి వారి కోరిక సఫలంబు చేయుదునని వారి నందఱి బ్రహ్మహ్రదంబున ముంచి యెత్తి.

10.1-961-ఆటవెలది

ప్రకృతిఁ గామకర్మ పరవశమై యుచ్చ
నీచగతులఁ బొంది నెఱయ భ్రమసి
తిరుగుచున్న జనము తెలియనేరదు నిజ
గతి విశేష మీ జగంబు నందు.

10.1-962-మత్తేభ విక్రీడితము

అని చింతించి దయాళుఁడైన హరి మాయాదూరమై, జ్యోతి యై,
యనిరూప్యంబయి, సత్యమై, యెఱుకయై, యానందమై, బ్రహ్మమై,
యనఘాత్ముల్ గుణనాశమందుఁ గను నిత్యాత్మీయ లోకంబు గ్ర
క్కునఁ జూపెం గరుణార్ద్రచిత్తుఁ డగుచున్ గోపాలకశ్రేణికిన్.

10.1-963-వచనము

ఇట్లు హరి మున్నక్రూరుండు పొందిన లోకమంతయుం జూపి, బ్రహ్మలోకంబునుం జూపినం జూచి, నందాదులు పరమానందంబునుం బొంది వెఱఁగుపడి హంసస్వరూపకుండైన, కృష్ణునిం బొడగని పొగడి పూజించి; రంత.

## 10.1-112- శరద్రాత్రి గోపికలుజేరవచ్చుట

10.1-964-చంపకమాల

కలువలమేలికందువలు, కాముని కయ్యపు నేలలున్, విర
క్తులు దలడించువేళలు, చకోరక పంక్తుల భోగకాలముల్,
చెలువలు సైరణల్ విడిచి చిక్కుతఱుల్, ఘనచంద్ర చంద్రికా
జ్వలిత దిశల్, శరన్నిశలు, జారకదుర్దశ లయ్యె నయ్యెడన్.

10.1-965-ఆటవెలది

కామతంత్రటీక, కలువల జోక, కం
దర్పుడాక, విటులతాల్మి పోక,
చకితచక్రవాక, సంప్రీతజనలోక,
రాక వచ్చె మేలురాక యగుచు.

10.1-966-కంద పద్యము

పతి తన కరముల కుంకుమ
సతి మొగమున నలఁదుభంగి సముదయవేళాం
చితకరరాగమున నిశా
పతి రంజించెన్ నరేంద్ర! ప్రాక్సతి మొగమున్.

10.1-967-సీస పద్యము

విటసేనపై దండువెడలెడు వలరేని;
గొల్లెనపై హేమకుంభ మనఁగఁ
గాముకధృతివల్లికలు ద్రెంపనెత్తిన;
శంబరాంతకు చేతి చక్ర మనఁగ
మారుండు పాంథుల మానాటవులు గాల్పఁ;

గూర్చిన నిప్పుల కుప్ప యనఁగ
విరహిమృగమ్ముల వేటాడ మదనుండు;
దెచ్చిన మోహంపు దీమ మనఁగ

10.1-967.1-ఆటవెలది

వింతనునుపు గల్గి వృత్తమై యరుణమై
కాంతితోఁ జకోరగణము లుబ్బఁ
బొడుపుకొండ చక్కిఁ బొడిచె రాకాచంద్ర
మండలంబు గగనమండలమున.

10.1-968-వచనము

ఇట్లు పొడమి నవకుంకుమాంకిత రమాముఖమండలమండనం బై యఖండంబైన చంద్రమండలంబు పొడగని పుండరీకనయనుండు యమునాతటంబున జగన్మోహనంబుగ నొక్క గీతంబు పాడిన విని, పరాయత్తచిత్తలై తత్తఱంబున వ్రేతలే పనులకుంజేతు లాడకయు, గోవులకుం గ్రేపులవిడువకయు విడిచి విడిచియు నీడకయు నీడి యీడియు, నీడినపాలు కాఁపకయుఁ గాఁచి కాఁచియుఁ, గాఁగిన పాలు డింపకయు డించి డించియు, డించినపాలు బాలుర కుఁ బోయకయుఁ బోసి పోసియుఁ, బతులకుఁ బరిచర్యలు చేయకయుఁ జేసి చేసియు, నశనంబులు గుడువకయుఁ గుడిచి కుడిచియుఁ, గుసుమంబులు ముడువకయు ముడిచి ముడిచియుఁ, దొడవులు దొడగకయు దొడిగి తొడిగియు, గోష్ఠంబుల పట్టుల నుండకయుఁ, బాయసంబు నెఱయ వండకయు, నయ్యెయెడల నిలువం బడకయుఁ, గాటుకలు సూటినిడకయుఁ, గురులు చక్కనొత్తకయుఁ, గుచంబుల గంధంబులు కలయ మెత్తకయుఁ, బయ్యెదలు విప్పి

కప్పకయు, సఖులకుం జెప్పకయు, సహోదరులు మగలు మామలు మఱందులు బిడ్డలు నడ్డంబుచని నివారింపం దలారింపక సంచలించి, పంచభల్లుని భల్లంబుల మొల్లంపు జల్లుల పెల్లునం దల్లడిల్లి డిల్లపడి, మొగిళ్ళగమి వెలువడి; యుల్లసిల్లు తటిల్లతల పొందున మందగమన లమందగమనంబుల మంద వెలువడి గోవిందసందర్శనంబునకుం జనిరి; అప్పుడు.

10.1-969-మత్తేభ విక్రీడితము

తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త
ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీధిన్ విభున్ మాధవుం
బరిరంభంబులు చేసి జారుఁ డనుచున్ భావించియుం జొక్కి పొం
దిరి ముక్తిన్ గుణదేహముల్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై.

10.1-970-వచనము

అనిన నరేంద్రుం డిట్లనియె.

10.1-971-కంద పద్యము

జారుఁడని కాని కృష్ణుఁడు
భూరిపరబ్రహ్మ మనియు బుద్ధిఁ దలంపన్
నేరరు; గుణమయదేహము
లే రీతిన్ విడిచి రింతు? లెఱిఁగింపు శుకా!

10.1-972-వచనము

అనిన శుకుం డిట్లనియె.

10.1-973-మత్తేభ విక్రీడితము

మును నేఁజెప్పితిఁ జక్రికింబగతుఁడై మూఢుండు చైద్యుండు పెం
పునఁ గైవల్యపదంబు నొందెఁ; బ్రియులై పొందంగ రాకున్న దే?
యనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డగుణుం డైనట్టి గోవిందమూ
ర్తి నరశ్రేణికి ముక్తిదాయియె సుమీ! తెల్లంబు భూవల్లభా!

10.1-974-ఆటవెలది

భాంధవమున నైనఁ బగనైన వగనైనఁ
బ్రీతినైనఁ బ్రాణభీతినైన
భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు
జనులు మోక్షమునకుఁ జనుదు రధిప!

10.1-975-వచనము

అటు గావునఁ బరమపురుషుండు, నజుండును, యోగీశ్వరేశ్వరుండు నైన హరిని నోకిఁన స్థావరం బైన ముక్తంబగు; వెఱఁగుపడ వలవదు, యివ్విధంబున.

## 10.1-113- గోపికలకు నీతులు చెప్పుట

10.1-976-కంద పద్యము

ఘన మధుర గీత నినదము
విని వచ్చిన గోపికలను వీక్షించి నయం
బున మేటి సుగుణి నేర్పరి
తన వాగ్వైభవము మెఱయఁ దగ నిట్లనియెన్.

10.1-977-శార్దూల విక్రీడితము

మేలా మీకు భయంబు పుట్టదుగదా మీ మందకున్? సింహశా
ర్దూలానేకప ముఖ్యముల్ దిరిగెడిన్ దూరంబు లేతెంతురే?
యేలా వచ్చితి? రీ నిశా సమయమం దిచ్చోట వర్తింతురే?
చాలుంజాలు లతాంగులార! చనుఁడీ సంప్రీతితో మందకున్.

10.1-978-శార్దూల విక్రీడితము

మీరేతెంచినజాడఁ గానక వగన్ మీ తల్లులుం దండ్రులున్
మీ రాముల్ మఱదుల్తనూజులు గురుల్ మీసోదరుల్బంధువుల్
మేరల్ మీఱిరి లేరు వోయి రనుచున్ మీ ఘోష భూభాగమం
దేరీతిం బరికించిరో తగవులే యీ సాహసోద్యోగముల్?

10.1-979-చంపకమాల

ఇలువడి సున్న చేసి, హృదయేశుల సిగ్గులఁ జంపి, యత్తమా
మల నెరియించి, సోదరులమానము సూఱలుపుచ్చి, తల్లిదం
డ్రుల రుచిమాన్చి, బంధులకు రోఁత యొనర్చుచు జారవాంఛలన్
వలనఱి సత్కులాంగనలు వత్తురె? లోకులు చూచి మెత్తురే?

10.1-980-సీస పద్యము

ప్రాణేశుఁ డెఱిఁగినఁ బ్రాణంబునకుఁ దెగు;
దండించు నెఱిఁగిన ధరణివిభుఁడు
మామ యెఱింగిన మనువెల్లఁ జెడిపోవుఁ;
దలవరి యెఱిఁగినఁ దగులు జేయు
తలిదండ్రు లెఱిఁగినఁ దలలెత్తకుండుదు;
రేరాలెఱింగిన నెత్తిపొడుచు

నాత్మజు లెఱిఁగిన నాదరింపరు చూచి;
బంధువు లెఱిఁగిన బహి యొనర్తు

10.1-980.1-ఆటవెలది

రితరు లెఱిఁగిరేని నెంతయుఁ జుల్కఁగాఁ
జూతు; రిందు నందు సుఖము లేదు;
యశము లేదు నిర్భయానందమును లేదు
జారుఁ జేరఁ జనదు చారుముఖికి.

10.1-981-కంద పద్యము

నడవడి కొఱ గాకున్నను
బడుగైనఁ గురూపియైనఁ బామరుఁ డైనన్
జడుడైన రోగియైనను
విడుచుట మర్యాద గాదు విభు నంగనకున్.

10.1-982-చంపకమాల

ఇది యమునానదీజల సమేధిత పాదప పల్లవప్రసూ
నదళవిరాజితంబగు వనంబు; మనంబుల మేర దప్పెనో?
పొదిఁగిట నేడ్చు బిడ్డలకుఁ బోయుఁడు పాలు; విడుండు లేఁగలన్
మొదవులకున్; నిజేశ్వరుల ముద్దియలార! భజింపుఁ డొప్పుగన్.

10.1-983-చంపకమాల

వనితలు నన్నుఁ గోరి యిట వచ్చితి, రింతఁ గొఱంత లేదు మే
లొనరె; సమస్త జంతువులు నోలిఁ బ్రియంబులుగావె? నాకు నై

నను నిలువంగఁ బోలదు, సనాతన ధర్మము లాఁడువారికిం
బెనిమిటులన్ భజించుటలు పెద్దలు చెప్పుచు నుందు రెల్లెడన్.

10.1-984-కంద పద్యము

ధ్యానాకర్ణన దర్శన
గానంబుల నా తలంపు గలిగినఁ జాలుం
బూనెదరు కృతార్థత్వము
మానవతుల్! చనుఁడు మరలి మందిరములకున్;

10.1-985-వచనము

అనిన విని.

## 10.1-114- గోపికల దీనాలాపములు

10.1-986-సీస పద్యము

విరహాగ్ని శిఖలతో వెడలు నిట్టూర్పుల;
ముమ్మరంబులఁ గంది మోములెండఁ
గన్నుల వెడలెడి కజ్జలధారలఁ;
గుచ కుంకుమంబులు గ్రుస్సి పాఱఁ
జెక్కులఁ జేర్చిన చేతుల వేఁడిమి;
మోముఁదమ్ముల మేలిమురువు డిందఁ
బొ రిఁబొ రిఁ బుంఖానుపుంఖంబులై తాఁకు;
మదనుకోలల ధైర్యమహిమ వెడల

10.1-986.1-తేటగీతి

దుఃఖభరమున మాటలు దొట్రుపడఁగఁ
బ్రియము లాడని ప్రియుఁజూచి బెగ్గడిల్లి
చరణములు నేల వ్రాయుచు సంభ్రమమునఁ
గాంత లెల్లను వగల నాక్రాంత లగుచు.

10.1-987-వచనము

ఇట్లనిరి.

10.1-988-మత్తేభ విక్రీడితము

అకటా! నమ్మితిమేము; క్రూరుఁడన నిన్నుర్వంబె? మా యిండ్లలో
సకలవ్యాప్తుల డించి నీ పదసరోజాతంబు లర్చింపఁ జి
క్కక యేతెంచితి, మీశుఁ; డాఢ్యుఁడవు; మోక్షాసక్తులం గాచు వో
లికఁ గావందగు గావవే? విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్.

10.1-989-మత్తేభ విక్రీడితము

పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం బాటించుటే ధర్మప
ద్ధతి యౌ నంటివి; దేహధారిణులకున్ ధర్మజ్ఞ! చింతింపుమా;
పతి పుత్రాదిక నామమూర్తి వగుచున్ భాసిల్లు నీ యందుఁ ద
త్పతి పుత్రాదిక వాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే?

10.1-990-మత్తకోకిలము

నీ పయిన్ రతి చేయుచుందురు నేర్పరుల్; సతతప్రియో
ద్దీపకుండవు; గాన నెవ్వగ దెచ్చు నాథ సుతాదులం
జూప నేటికి? మన్మహాశలు చుట్టి నీకడ నుండఁగాఁ

బాపనేల? మదీయ తాపముఁ బాపఁ బోలుఁ గృపానిధీ!

10.1-991-సీస పద్యము

నీ పాదకమలంబు నెమ్మి డగ్గఱఁ గాని;
 తరలి పోవంగఁ బాదములు రావు;
నీ కరాబ్జంబులు నెఱి నంటితివఁ గాని;
 తక్కిన పనికి హస్తములు చొరవు;
నీ వాగమృతధార నిండఁ గ్రోలనె గాని;
 చెవులన్య భాషలఁ జేరి వినవు;
నీ సుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని;
 చూడ వన్యంబులఁ జూడ్కికవలు;

10.1-991.1-ఆటవెలది

నిన్నెకాని పలుకనేరవు మా జిహ్వ;
లొల్ల నను చుఁ బలుకనోడ వీవు
మా మనంబు లెల్ల మరపించి దొంగిలి
తేమి చేయువార మింకఁ? గృష్ణ!

10.1-992-చంపకమాల

సిరికి నుదార చిహ్నములు చేయు భవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర! మా తపము సంపదఁ జేరితి మెట్టకేలకున్
మరలఁగ లేము మా మగల మాటల నొల్లము; పద్మగంధముల్
మరగినతేఁటు లన్య కుసుమంబుల చెంతను జేరనేర్చునే?

10.1-993-ఆటవెలది

సవతు లేక నీ విశాల వక్షస్థలిఁ
దొళసితోడఁ గూడఁ దోయజాక్ష!
మనుపుమనుచు లక్ష్మి మాన్యైన నీ పాద
కమలరజముఁ గోరుఁగాదె కృష్ణ!

10.1-994-ఉత్పలమాల

అత్తలు మామలున్ వగవనాఁడి కోడక నాథులన్ శుగా
యత్తులఁజేసి యిల్వరుస లాఁడి పోవఁగ నీదునవ్వులన్
మెత్తనిమాటలన్ మరుఁడుమేల్కొని యేఁచిన వచ్చినార మే
పొత్తుల నొల్లమో పురుషభూషణ! దాస్యము లిచ్చి కావవే.

10.1-995-మత్తేభ విక్రీడితము

మగువల్ చిక్కరె తొల్లి వల్లభులకున్? మన్నించి తద్వల్లభుల్
మగపంతంబు తలంపరే? తగులముల్ మా పాలనే పుట్టెనే?
మగవారాడెడి మాటలే తగవు నీ మాటల్ మనోజాగ్నిచేఁ
బొగలంజాలము; కౌఁగలింపుము మముం బుణ్యంబు పుణ్యాత్మకా!

10.1-996-ఉత్పలమాల

కుండలదీప్త గండమును గుంచిత కుంతల ఫాలమున్ సుధా
మండితపల్లవాధరము మంజులహాసవిలోకనంబునై
యుండెడు నీ ముఖంబుఁగని యుండఁగ వచ్చునె? మన్మథేక్షు కో
దండవిముక్త బాణముల దాసుల మయ్యెద; మాదరింపవే.

10.1-997-సీస పద్యము

నీ యధరామృతనిర్ఝరంబులు నేడు;
 చేరి వాతెరలపైఁ జిలుకకున్న
నీ విశాలాంతర నిర్మలవక్షంబుఁ;
 గుచకుట్మలంబులఁ గూర్పకున్న
నీ రమ్యతర హస్తనీరజాతంబులు;
 చికురబంధంబులఁ జేర్పకున్న
నీ కృపాలోకననివహంబు మెల్లన;
 నెమ్మొగంబుల మీఁద నిలుపకున్న

10.1-997.1-ఆటవెలది

నీ నవీన మాననీయసల్లాపంబు
కర్ణరంధ్రదిశలఁ గప్పకున్న
నెట్లు బ్రతుకువార? మెందుఁ జేరెడువార?
మధిప! వినఁగఁ దగదె యాఁడుకుయులు

10.1-998-మత్తేభ విక్రీడితము

భవదాలోకన హాస గీతజములై భాసిల్లు కామాగ్నులన్
భవదీయాధరపల్లవామృతముచేఁ బాఁపం దగుం, బాఁపవే
ని వియోగానలహేతిసంహతులచే నీఱై, భవచ్చింతలన్
భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీ పాదంబులానప్రియా!

10.1-999-కంద పద్యము

తరు మృగ ఖగ గో గణములు

కర మొప్పెడు నిన్నుఁ గన్నఁ గానము విన్నం
గరఁగి పులకించు, నబలలు
కరఁగరె నినుఁ గన్న నీదు గానము విన్నన్?

## 10.1-115- ఆత్మారాముడై రమించుట

10.1-1000-సీస పద్యము

ఈ పంచబాణాగ్ని నేమిట నార్తుము;
నీ మంజు వాగ్వృష్టి నెగడదేని?
నీ మన్మథాంబోధి నే త్రోవఁ గడతుము;
నీ దృష్టి నావ యై నిలువదేని?
నీ చిత్తజధ్వాంత మే జాడఁ జెఱుతుము;
నీ హాసచంద్రిక నిగుడదేని?
నీ దర్పకజ్వర మే భంగి నడఁతుము;
నీ నవాధరసుధ నింపవేని?

10.1-1000.1-ఆటవెలది

నెట్లు నిర్వహింతు? మేలాగు మాలాగు;
కరుణ చేయవేనిఁ గదియవేని
మరుఁడు నిర్దయుండు మన నిచ్చునే? యశో
దాకుమార! యువతిధైర్యచోర!

10.1-1001-కంద పద్యము

అమరులఁ గాచిన హరి క్రియఁ
గమలేక్షణ! నీవు నేడు కరుణ నభయహ

స్తము మా యురముల శిరములఁ
బ్రమదంబున నిడుము మూర్ఛ పాల్పడకుండన్.

10.1-1002-కంద పద్యము

కట్టా తలమునకలునై
దట్టపు విరహాగ్ని శిఖలు తరుణుల నేఁపన్
నెట్టుం బలుకవు చూడవు
కట్టిఁడివి గదా కుమార! కరుణోదారా!

10.1-1003-వచనము

అని యిట్లు కుసుమశరుని శరపరంపరాపరవశలై యోపికలులేక పలికిన గోపికల దీనాలాపంబులు విని, నవ్వి యోగీశ్వరేశ్వరుండైన కృష్ణుం డాత్మారాముండై వారలతో రమించె నప్పుడు.

10.1-1004-మత్తేభ విక్రీడితము

కరుణాలోకములం బటాంచల కచాకర్షంబులన్ మేఖలా
కరబాహుస్తన మర్శనంబుల నఖాంకవ్యాప్తులన్, నర్మవా
క్పరిరంభంబుల మంజులాధరసుధాపానంబులం గాంతలం
గరగించెన్ రతికేళిఁ గృష్ణుడు గృపం గందర్పుఁ బాలార్చుచున్.

10.1-1005-కంద పద్యము

మక్కువ వికసిత వదనలు
చక్కఁగఁ దనుఁ గొల్వ హాసచంద్రికతోడన్
మిక్కలి మెఱసెను గృష్ణుఁడు

చుక్కలగమి నడిమి పూర్ణసోముని భంగిన్.

10.1-1006-ఆటవెలది

సతులు దన్నుఁబాడ సంప్రీతి నాడుచు
నలుతనున్న పైజయంతితోడ
వనజలోచనుండు వనభూషణుం డయ్యె
యువతిజనశతంబు లోలిఁ గొలువ

10.1-1007-ఉత్పలమాల

చిక్కక యీశుఁడై యెదిరిఁ జిక్కులఁ బెట్టెడు మాయలానికిం
జిక్కి కృతార్థలై మరుని చిక్కులఁ జొక్కి లతాంగు లుండగా
మక్కువశాంతి చేయుటకు మన్ననఁజేసి ప్రసన్నుఁడౌటకుం
జక్కన నా విభుండు గుణశాలి తిరోహితుఁడయ్యె నయ్యెడన్.

10.1-1008-వచనము

ఇట్లు హరి కనుమొఱంగి చనినఁ గరిం గానకతిరుగు కరేణువుల పెల్లున నుల్లంబులు దల్లడిల్ల వల్లవకాంతలు తదీయగమనహాస విలాస వీక్షణ విహార వచన రచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి, వివిధ చేష్టలకుం బాల్పడి, తదాత్మకత్వంబున నేన నేన కృంష్ణుండ నని కృష్ణాగుణావేశంబులం జరియించుచు.

## 10.1-116- గోపికలు కృష్ణుని వెదకుట

10.1-1009-కంద పద్యము

భూతముల లోన వెలిఁ బ్ర

ఖ్యాతుం డగునట్టివానిఁ; గాంతలు కాళిం
దీతీరవనాంతరముల
భ్రాంతిన్ వెదుకంగఁ జనిరి పాడుచు నధిపా!

10.1-1010-సీస పద్యము

పున్నాగ కానవే! పున్నాగవందితుఁ;
దిలకంబ! కానవే తిలకనిటలు;
ఘనసార! కానవే ఘనసారశోభితు;
బంధూక! కానవే బంధుమిత్రు;
మన్మథ! కానవే మన్మథాకారుని;
వంశంబ! కానవే వంశధరునిఁ;
జందన! కానవే చందనశీతలుఁ;
గుందంబ! కానవే కుందరదను;

10.1-1010.1-తేటగీతి

నింద్రభూజమ! కానవే యింద్రవిభవుఁ;
గువల వృక్షమ! కానవే కువలయేశుఁ;
బ్రియకపాదప! కానవే ప్రియవిహారు;
ననుచుఁ గృష్ణుని వెదకి ర య్యబ్జముఖులు.

10.1-1011-వచనము

మఱియును.

10.1-1012-ఉత్పలమాల

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు గృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిస్సర్పిత పింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో!
మల్లియలార! మీ పొదలమాటున లేఁడు గదమ్మ! చెప్పరే!

10.1-1013-ఉత్పలమాల

అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరఁగించు వాఁడు శ్రీ
రంగదురంబువాఁడు, మధురంబగు వేణురవంబు వాఁడు మ
మ్మంగజపువ్వుఁదూపులకునగ్గము చేసె లవంగ! లుంగ నా
రంగములార! మీకడకు రాఁడుగదా కృప యుంచి చూడరే.

10.1-1014-సీస పద్యము

మానినీమన్మథు మాధవుఁ గానరే;
సలలితోదార వత్సకములార!
సలలితోదారవత్సక వైరిఁ గానరే;
సుందరోన్నత లతార్జునములార!
సుందరోన్నతలతార్జునభంజుఁ గానరే;
ఘనతరలసదశోకంబులార!
ఘనతరలసదశోకస్ఫూర్తిఁ గానరే;
నవ్యరుచిరకాంచనంబులార!

10.1-1014.1-ఆటవెలది

నవ్య రుచిర కాంచన కిరీటుఁ గానరే
గహనపదవిఁ గురవకంబులార!

గహనపదవి గురవక నివాసిఁ గానరే
గణికలార! చారు గణికలార!

10.1-1015-సీస పద్యము

అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ;
బాటలీతరులార! పట్టరమ్మ!
హేలావతులఁ గృష్ణ! యేల పాసితి వని;
యైలేయలతలార! యడుగరమ్మ!
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా;
చూతమంజరులార! చూడరమ్మ!
మానినీమదనుతో మారాక యెఱిఁగించి;
మాధవీలతలార! మనుపరమ్మ!

10.1-1015.1-ఆటవెలది

జాతిసతులఁ బాయ నీతియె హరి కని
జాతులార! దిశలఁ జాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖిపింఛ
జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ!

10.1-1016-కంద పద్యము

హరి చరణములకుఁ బ్రియమై
హరి నిను మన్నింప భద్రమందెడు తులసీ!
హరి నీ దెస రాఁడు గదా
హరి చొప్పెఱిఁగించి శుభము నందింపఁగదే.

10.1-1017-తేటగీతి

పొగడఁ దగువానిఁ గానరే పొగడలార!
యీ డెఱుంగని విభుఁ జూపుఁ డీడెలార!
మొల్లమగు కీర్తివాఁడేడి మొల్లలార!
శుక నిగదితునిఁ జెప్పుఁడు కింశుకములార!

10.1-1018-కంద పద్యము

తరుణీకుచకుంకుమయుత
హారికంధరదామగంధ మడరెడు చూడ్కిన్
హారిఁ గనిన పగిదిఁ దనరెడి
హారిణీ! హరి జాడఁ బుణ్యమయ్యెడిఁ జెపుమా!

10.1-1019-కంద పద్యము

కిటి యై కౌఁగిటఁ జేర్చెను
వటుడై వర్ధిల్లి కొలిచె వడిఁ గృష్ణుండై
యిటు పదచిహ్నము లిడెఁ గ్రిం
దటి బాముున నేమి నోచి తమ్మ ధరిత్రీ!

## 10.1-117- గోపికల తాదాన్యతోన్మత్తత

10.1-1020-వచనము

అనుచు నున్మత్తచిత్తలై తదాత్మకత్వకంబునఁ గృష్ణు లీలల ననుకరించుచు.

10.1-1021-సీస పద్యము

పూతన యై యొక్క పొలఁతి చరింపంగ;

శౌరి యై యొక కాంత చన్నుగుడుచు;
బాలుఁడై యొక భామ పాలకు నేడ్చుచో;
బండి నేనను లేమఁ బాఱఁదన్ను;
సుడిగాలి నని యొక్క సుందరి గొనిపోవ;
హరి యని వర్తించు నబ్జముఖియు;
బకుఁడ నే నని యొక్క పడఁతి సంరంభింపఁ;
బద్మాక్షుఁడను కొమ్మ పరిభవించు;

10.1-1021.1-ఆటవెలది

నెలమి రామకృష్ణు లింతు లిద్దఱు గాఁగ
గోపవత్సగణము కొంద ఱగుదు
రసురవైరి ననుచు నబల యొక్కతె చీరుఁ
బసుల మనెడి సతుల భరతముఖ్య!

10.1-1022-ఆటవెలది

లోకమెల్లఁ గుక్షిలోపల నున్నట్టి
మాధవుండ నేను మాత వీవు
చూడు మనుచు నొక్క సుందరి యొకతెకు
ముఖము దెఱచి చూపు ముఖ్యచరిత!

10.1-1023-కంద పద్యము

వెన్నలు దొంగిలి తినియెడి
వెన్నుఁడ నని యొకతె నుడువ వేఱొక్కతె చే
సన్నల యశోద నంచును

గ్రన్ననఁ గుసుమముల దండఁ గట్టు నిలేశా!

10.1-1024-కంద పద్యము

కాళియఫణి యిది వీరలు
కాళియఫణి సతులు మ్రొక్కఁ గడఁగిరి నే గో
పాలకుమారుఁ డననుచును
లీలాగతి నాడు నొక్క లేమ నరేంద్రా!

10.1-1025-కంద పద్యము

తరుణులు గోపకు లందఱు
హరిహయుఁ డిదె వాన గురిసె హరి నే నని భా
సుర చేలాంచల మెుక్కతె
గిరి నెత్తెద ననుచు నెత్తుఁ గెంగేల నృపా!

10.1-1026-కంద పద్యము

మీరలు గోపకులే నను
రారని దావాగ్ని వచ్చె నటు చూడకుఁడీ
వారించెద నని యొక్కతె
చేరి బయల్ కబళనంబు చేయు నరేంద్రా!

10.1-1027-వచనము

ఇట్లు తన్మయత్వంబున గోపసుందరులు బృందావనంబునంగల తరులతాదుల హరి నడుగుచు, నిరర్గళంబులయిన విపినమార్గంబుల సరోజాత కేతన హల

కులిశాంకుశాది లక్షణలక్షితంబులై మనోహరంబులయిన హరిచరణంబుల చొప్పుఁగని తప్పక చెప్పి కొనుచుఁ దమలో యిట్లనిరి.

10.1-1028-సీస పద్యము

కొమ్మకుఁ బువ్వులు కోసినాఁ డిక్కడ;
మొనసి పాదాగ్రంబు మోపినాఁడు
సతి నెత్తుకొని వేడ్క జరిగినాఁ డిక్కడఁ;
దృణములోఁ దోపఁడు తెలవ జాడ
ప్రియకు ధమ్మిల్లంబు పెట్టినాఁ డిక్కడఁ;
గూర్చున్న చొప్పిదె కొమరు మిగులు
నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ;
వెలఁది నిక్కిన గతి విశదమయ్యె

10.1-1028.1-ఆటవెలది

సుదతితోడ నీరు చొచ్చినాఁ డిక్కడఁ
జొచ్చి తో వెడలిన చోటు లమరెఁ
దరుణిఁ గాముకేళిఁ దనిపినాఁ డిక్కడఁ
ననఁగి పెనఁగియున్న యంద మొప్పె.

10.1-1029-వచనము

మఱియును.

10.1-1030-సీస పద్యము

ఒక యెలనాగ చెయ్యూఁదినాఁ డిక్కడ;

సరస నున్నవి నాల్గు చరణములును
నొక నీలవేణితో నొదిఁగినాఁ డిక్కడ;
మగ జాడలో నిదె మగువ జాడ
యొక లేమ మ్రొక్కిన నురివినాఁ డిక్కడ;
రమణి మ్రొక్కిన చొప్పు రమ్యమయ్యె
నొక యింతి కెదురుగా నొలసినాఁ డిక్కడ;
నన్యోన్యముఖములై యంఘ్రు లొప్పె

10.1-1030.1-ఆటవెలది

నొకతె వెంటఁ దగుల నుండక యేగినాఁ
డడుగుమీఁదఁ దరుణి యడుగు లమరె
నబల లిరుగెలంకులందు రాఁ దిరిగినాఁ
డాఱు పదము లున్నవమ్మ! యిచట.

10.1-1031-సీస పద్యము

ఈ చరణంబులే యిందునిభానన! ;
సనకాది ముని యోగ సరణి నొప్పు;
నీ పాదతలములే యెలనాగ! శ్రుతివధూ;
సీమంతవీధులఁ జెన్నుమిగులు;
నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన! ;
పాలేటిరాచూలి పట్టుకొమ్మ;
లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ! ;
ముక్తికాంతామనోమోహనంబు;

10.1-1031.1-ఆటవెలది

ఈ యడుగుల రజమె యింతి! బ్రహ్మేశాది
దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు
రనుచుఁ గొంద ఱబల లబ్జాక్షుఁ డేగిన
క్రమముఁ గనియు నతనిఁ గానరైరి.

10.1-1032-వచనము

అప్పుడు.

10.1-1033-సీస పద్యము

పతుల దైన్యంబును భామల క్రౌర్యంబుఁ;
జూపుచు విభుఁ డొక్క సుదతితోడ
విహరింప నది యెల్ల వెలఁదుల వర్జించి;
నా యొద్దనున్నాఁడు నాథుఁ డనుచు
గర్వించి రాఁ జాలఁ గమలాక్ష! మూఁపున;
నిడుకొను మనుఁడు న య్యీశ్వరుండు
మొఱఁగి పోయినఁ దాపమును బొంది యో! కృష్ణ! ;
యెక్కడఁ జనితి ప్రాణేశ! రమణ!

10.1-1033.1-తేటగీతి

నీకు వరవుడ నయ్యెద నిలువు మనుచు
వగవఁ గొందఱు కాంతలా వనితఁ జూచి
వరుఁడు మన్నింప గర్వించి వనజనేత్ర
చిక్కె నేఁ డని వెఱఁగును జెంది రపుడు.

10.1-1034-వచనము

మఱియును.

10.1-1035-సీస పద్యము

ఈ పొదరింటిలో నిందాఁకఁ గృష్ణుండు;
నాతోడ మన్మథనటన మాడె
నియ్యేల మగుచోట నిందాఁకఁ జెలువుండు;
గాఢంబుగా నన్నుఁ గౌఁగలించె
నీ మహీజము నీడ నిందాఁక సుభగుండు;
చిట్టంబు చేతల సిగ్గుగొనియె
నీ పుష్పలత పొంత నిందాఁక దయితుండు;
నను డాసి యధరపానంబు చేసె

10.1-1035.1-ఆటవెలది

నీ ప్రసూనవేది నిందాఁక రమణుండు
కుసుమ దామములను గొప్పుఁ దీర్చె
ననుచుఁ గొంద ఱతివ లంభోజనయనుని
పూర్వలీలఁ దలఁచి పొగడి రధిప!

10.1-1036-మత్తేభ విక్రీడితము

అని యిబ్బంగి లతాంగు లందఱును బృందారణ్య మందీశ్వరున్
వనజాక్షుం బరికించి కానక విభున్ వర్ణించుచుం బాడుచున్
మనముల్ మాటలు చేష్టలుం గ్రియలు నమ్మానాథుపైఁ జేర్చి వే
చని రయ్యామున సైకతాగ్రమునకున్ సంత్యక్త గేహేచ్ఛలై.

10.1-1037-వచనము

చని గోపికలు హరి నుద్దేశించి యిట్లనిరి.

## 10.1-118- గోపికల విరహపు మొరలు

10.1-1038-కంద పద్యము

నీవు జనించిన కతమున

నో! వల్లభ! లక్ష్మి మంద నొప్పె నధికమై

నీ వెంటనె ప్రాణము లిడి

నీ వా రరసెదరు చూపు నీ రూపంబున్.

10.1-1039-కంద పద్యము

శారదకమలోదరరుచి

చోరకమగు చూపువలన సుందర! మమ్ముం

గోరి వెల యీని దాసుల

ధీరత నొప్పించు టిది వధించుట గాదే?

10.1-1040-ఆటవెలది

విషజలంబువలన విషధరదానవు

వలన ఱాలవానవలన వహ్ని

నున్నవానివలన నోగి మమ్ము రక్షించి

కుసుమశరుని బారిఁ గూల్పఁ దగునె?

10.1-1041-ఉత్పలమాల

నీవు యశోదబిడ్డడవె? నీరజనేత్ర! సమస్తజంతు చే

తోవిదితాత్మ; వీశుఁడవు; తొల్లి విరించి దలంచి లోకర
క్షావిధ మాచరింపు మని సన్నుతి చేయఁగ సత్కులంబునన్
భూవలయంబుఁ గావ నిటు పుట్టితి గాదె మనోహరాకృతిన్.

10.1-1042-ఆటవెలది

చరణ సేవకులకు సంసార భయమును
బాఁపి శ్రీకరంబు పట్టు గలిగి
కామదాయి యైన కరసరోజంబు మా
మస్తకముల నునిచి మనుపు మీశ!

10.1-1043-ఉత్పలమాల

గోవుల వెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారల పాప సంఘముల్
ద్రోవఁగఁజాలి శ్రీఁదనరి దుష్టభుజంగఫణాలతాగ్ర సం
భావితమైన నీ చరణపద్మము చన్నులమీఁద మోపి త
ద్భావజపుష్పభల్లభవబాధ హరింపు వరింపు మాధవా!

10.1-1044-కంద పద్యము

బుధ రంజనియును సూక్తయు
మధురయునగు నీదు వాణి మరిగించెను నీ
యధరామృత సంసేవన
విధి నంగజతాపమెల్ల విడిపింపఁ గదే.

10.1-1045-కంద పద్యము

మగువల యెడ నీ క్రౌర్యము

తగునే? నిజభక్తభీతిదమనుఁడ వకటా!
తగదు భవద్దాసులకును
నగు మొగముం జూపి కావు నళినదళాక్షా!

10.1-1046-మత్తేభ విక్రీడితము

ఘనలక్ష్మీయుతమై మహా శుభదమై కామాది విధ్వంసి యై
సనకాదిస్తుతమై నిరంతరతపస్స్వాంతప్త పున్నాగ జీ
వనమై యొప్పెడు నీ కథామృతము ద్రావం గల్గునే భూరిదా
ననిరూఢత్వము లేనివారలకు మానారీమనోహారకా!

10.1-1047-కంద పద్యము

నీ నగవులు నీ చూడ్కులు
నీ నానావిహారణములు నీ ధ్యానంబుల్
నీ నర్మాలాపంబులు
మానసముల నాటి నేడు మగుడవు కృష్ణా!

10.1-1048-ఆటవెలది

ఘోషభూమి వెడలి గోవుల మేపంగ
నీరజాభమైన నీ పదములు
కసవు శిలలు దాఁకి కడునొచ్చునో యని
కలఁగు మా మనములు కమలనయన!

10.1-1049-ఉత్పలమాల

మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడి వచ్చి గోష్పద

ప్రాపితధూళిధూసరితభాసితకుంతలమై సరోరుహో
ద్దీపితమైన నీ మొగము ధీరజనోత్తమ! మాకు వేడ్కతోఁ
జూపి మనంబులన్ మరునిఁ జూపుదుగాదె క్రమక్రమంబునన్.

10.1-1050-ఆటవెలది

భక్త కామదంబు బ్రహ్మ సేవిత మిలా
మండనంబు దుఃఖమర్దనంబు
భద్రకరమునైన భవదంఘ్రియుగము మా
యురములందు రమణ యునుపఁదగదె?

10.1-1051-ఆటవెలది

సురతవర్ధనంబు శోకాపహారణంబు
స్వనిత వంశనాళ సంగతంబు
నన్యరాగజయమునైన నీ మధురాధ
రామృతమునఁ దాప మార్పు మీశ!

10.1-1052-ఉత్పలమాల

నీవడవిం బగల్ దిరుగ నీ కుటిలాలకలాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రు లైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర! ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల? విధాత క్రూరుఁడై

10.1-1053-ఉత్పలమాల

అక్కట! బంధులున్ మగలు నన్నలు దమ్ములుఁ బుత్రకాదులున్

నెక్కొని రాత్రిఁబోకుఁడన నీ మృదుగీతరవంబు వీనులన్
వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహము నొంది నాథ! నీ
వెక్కడఁబోయితో? యెఱుఁగ మీ క్రియ నిర్దయుఁ డెందుఁ గల్గునే?

10.1-1054-తేటగీతి

మదనుఁ డార్వంగ నీ వాడు మంతనములు
నవరసాలోకనంబగు నగుమొగంబు
కమల కిరవైన మహితవక్షస్థలంబు
మా మనంబుల లోఁగొని మరపెఁ గృష్ణ!

10.1-1055-మత్తేభ విక్రీడితము

అరవిందంబులకంటెఁ గోమలములై యందంబులై యున్న నీ
చరణంబుల్ కఠినంబులై మొనయు మా చన్నుంగవల్ మోవఁగా
నెఱియంబోలు నటంచుఁ బొక్కుదుము నీ యీ కర్కశారణ్యభూ
పరిసంచారము కృష్ణ! నీ ప్రియలకుం బ్రాణవ్యథం జేయదే?

10.1-1056-కంద పద్యము

కట్టా! మన్మథు కోలలు
నెట్టన నో నాఁట బెగడి నీ పాదంబుల్
పట్టికొనఁగ వచ్చిన మము
నట్టడవిని డించిపోవ న్యాయమె? కృష్ణా!

10.1-1057-కంద పద్యము

హృదయేశ్వర! మా హృదయము

మృదుతరముగఁ జేసి తొల్లి మిక్కిలి కడ నీ
హృదయము కఠినముఁ జేసెను
మదీయ సౌభాగ్య మిట్టి మందము గలదే?

10.1-1058-ఉత్పలమాల

క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడిఁదాఁకి వీఁక వా
లమ్ముల తెట్టెలన్ పఱవ నడ్డము వచ్చి జయింతు వండ్రు నిన్
నమ్మిన ముగ్ధలన్ రహితనాథల నక్కట! నేఁడు రెండు మూ
డమ్ముల యేటుకాఁ డెగువ నడ్డము రాఁ దగదే కృపానిధీ!

10.1-1059-కంద పద్యము

తియ్యవిలుకాఁడు డీకొని
వ్రయ్యలుగా దూఱనేసె వనితల మనముల్
నియ్యాన యింక నైనం
గుయ్యాలింపం గదయ్య! గోవింద! హరీ!

## 10.1-119- గోపికలకు ప్రత్యక్షమగుట

10.1-1060-మత్తేభ విక్రీడితము

అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం బాడుచుం
దను రావే యని చీరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్య మో
హనుఁడై మన్మథమన్మథుండయి మనోజ్ఞాకారియై యంతటన్
ఘనపీతాంబరధారియై పొడమెఁ దత్కాంతాసమీపంబునన్.

10.1-1061-కంద పద్యము

వచ్చిన వల్లభుఁ గనుగొని
విచ్చేసె నటంచు సతులు వికసిత ముఖులై
యచ్చుగ నిల్చిరి ప్రాణము
వచ్చిన నిలుచుండు నవయవంబుల భంగిన్.

10.1-1062-సీస పద్యము

అతివ యొక్కతె భక్తి నంజలి గావించి;
ప్రాణేశు కెంగేలుఁ బట్టుకొనియె
నింతి యొక్కతె జీవితేశ్వరు బాహువు;
మూపున నిడుకొని ముదము నొందె
వనిత యొక్కతె తన వల్లభు తాంబూల;
చర్విత మాత్మ హస్తమునఁ దాల్చెఁ
బడతి యొక్కతె ప్రియుపదములు విరహాగ్ని;
తప్తకుచంబులఁ దాఁపుకొనియె

10.1-1062.1-ఆటవెలది

భామ యొకతె భ్రుకుటిబంధంబు గావించి
ప్రణయభంగ రోషభాషణమున
దష్టదశన యగుచు దండించుకైవడి
వాఁడి చూడ్కిగముల వరునిఁ జూచె.

10.1-1063-కంద పద్యము

హరిముఖకమలముఁ జూచుచుఁ
దరుణి యొకతె ఱెప్పలిడక తనియక యుండెన్

హరిపదకమలముఁ జూచుచు
మరిగి తనివి లేని సుజను మాడ్కి నరేంద్రా!

10.1-1064-ఉత్పలమాల

ఒక్క లతాంగి మాధవుని యుజ్జ్వలరూపము చూడ్కిఁతీఁగలం
జిక్కఁగఁబట్టి హృద్గతముఁజేసి వెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కునమూసి మేనఁ బులకంబులు క్రమ్మఁగఁ గౌగలించుచుం
జొక్కములైన లోచవులఁ జొక్కుచునుండెను యోగికైవడిన్.

10.1-1065-సీస పద్యము

ఎలయించి ప్రాణేశ! యెందుఁ బోయితి వని;
తోరంపుటలుకతో దూఱె నొకతె
జలజాక్ష! ననుఁబాసి చనఁగ నీ పాదంబు;
లెట్లాడెనని వగ నెదిరె నొకతె;
నాథ! నీ వరిగిన నా ప్రాణ మున్నది;
కూర్మియే యిది యని కుందె నొకతె
యీశ్వర! నిను నన్ను నిందాఁక పాపెనే;
పాపపు విధి యని పలికె నొకతె

10.1-1065.1-ఆటవెలది

తలఁగి పోవు నట్టి తప్పేమి చేసితి
నధిప! పలుకు ధర్మ మనియె నొకతె
యేమినోము ఫలమొ హృదయేశ! నీ మోము
మరలఁ గంటి ననుచు మసలె నొకతె.

10.1-1066-కంద పద్యము

పలికిన ప్రతిజ్ఞ దప్పెడిఁ

బలికించినఁ గాని రమణుఁ బలుక నటంచుం

గలకంఠి యొకతె చెలితోఁ

బలుకుల నమృతములు గురియు పలుకులఁ బలికెన్.

10.1-1067-కంద పద్యము

పట్టినఁ గాని మనోవిభుఁ

బట్టఁగదా? యంచుఁ నొక్క బాలిక సఖి చే

పట్టుకొని చెప్పె ధైర్యము

పట్టెల్లను మరుని టెంకి పట్టుగ నధిపా!

10.1-1068-కంద పద్యము

చెలువుఁడు చెప్పక పోయిన

నొలపున నొక ముగ్ధ మున్ను చూడననుచు నౌ

దల వంచి యుండఁ జాలక

తల యెత్తెను లోన మరుఁడు తలయెత్త నృపా!

10.1-1069-వచనము

ఇవ్విధంబున.

10.1-1070-కంద పద్యము

హరిసురుచిర లలితాకృతిఁ

దరుణులు గని ముక్తవిరహతాపజ్వరలై

పరమోత్సవంబు సలిపిరి
పరమేశ్వరుఁ గనిన ముక్తబంధులభంగిన్.

10.1-1071-వచనము

అంత నక్కాంతుండు కాంతాజనపరిక్రాంతుండై వనాంతరంబున శక్తి నికర సంయుక్తుండైన పరమపురుషుడునుంబోలె వారలం దోడ్కొని మందార కుంద కుసుమపరిమళ మిళిత పవమానమానిత మధుకరనికర ఝుంకార సుకుమారంబును, శరత్కాలచంద్రకిరణ సందోహ సందళితాంధకారంబును యమునాతరంగసంగత కోమల వాలుకాస్ఫారంబు నై యమలినం బైన పులినంబు ప్రవేశించె; వారును జ్ఞానకాండంబున నీశ్వరుంగని శ్రుతులు ప్రమోదంబునం గామానుబంధంబుల విడిచిన విధంబున హరిం గని విరహవేదనల విడిచి పరిపూర్ణమనోరథలై.

10.1-1072-కంద పద్యము

పాఠీననయన లెల్ల న
కాఠిన్య పటాంచలములఁ గౌతుకములు హృ
త్పీఠముల సందడింపఁగఁ
బీఠముఁ గల్పించి రంతఁ బ్రియునకు నధిపా!

10.1-1073-ఆటవెలది

పరమయోగి హృదయ భద్రపీఠంబుల
నుండు మేటి వ్రజవధూత్తరీయ
పీఠమున వసించి పెంపారెఁద్రిభువన
దేవి లక్ష్మి మేనఁ దేజరిల్ల

10.1-1074-మత్తేభ విక్రీడితము

మదనోద్దీపితుఁడైన నాథునికి సన్మానంబు గావించుచున్
ముదితల్ హాసవిలోకవిభ్రమములన్ మోదించుచుం జేరి త
త్పదముల్ హస్తతలంబులం బిసుకుచుం బైముట్టుచున్దూఱుచుం
జదురుల్ పల్కుచుఁ గూర్మి నిట్లనిరి యూషత్కోపదీప్తాస్యలై.

10.1-1075-కంద పద్యము

కొలచినఁ గొలుతురు కొందఱు
గొలుతురుఁ దముఁ గొలువకున్నఁ గొందఱు పతులం
గొలిచినను గొలువకున్నను
గొలువరు మఱి కొంద ఱెలమి గోపకుమారా!

## 10.1-120- గోపికలతో సంభాషించుట

10.1-1076-వచనము

అని తన్నునుద్దేశించి రహస్యంబుగాఁ బల్కిన సుందరుల పలుకులు విని గోపాలసుందరుం డిట్లనియె.

10.1-1077-సీస పద్యము

కొలిచినఁ గొలుతురు కొందఱు పశువుల;
 భజనము భంగిని ఫలము కొఱకు
నై; సఖ్యధర్మములందు సిద్ధింపవు;
 కొందఱు తండ్రుల గుణముఁ దాల్చి
దయ గలవారును దగిన సుహృత్తులు;
 గొలువని వారలఁ గొల్తు రెపుడు

ధర్మకామంబులు తలరంగఁ గొందఱు;
కొలువని వారినిఁ గొలుచువారిఁ

10.1-1077.1-ఆటవెలది

గొలుచు తలఁపులేమిఁ గొలువ రాత్మారాము
లాప్తకాము లజ్ఞు లతికఠినులు
వారి యందుఁ బిదపవానిఁగాఁ జింతించి
యే లతాంగులార! యిట్టు లనుట.

10.1-1078-కంద పద్యము

ఏనిం దెవ్వఁడ నైనం
గా నంగనలార! పరమకారుణికుండన్
మానసబంధుఁడ నిత్య
ధ్యానము మీ కొనరవలసి తలఁగితిఁ జుండీ.

10.1-1079-మత్తేభ విక్రీడితము

నను సేవించుచునున్నవారలకు నే నా రూపముం జూపఁ జూ
చినఁ జాలించి మదించి వారు మది నన్ సేవింపరో యంచు ని
ర్ధనికుం డాత్మధనంబు చెడ్డ నెపుడుం దత్పారవశ్యంబుఁ దా
ల్చినభంగిన్ననుఁబాసి మత్ప్రియుఁడుదాఁజింతించు నా రూపమున్

10.1-1080-తరళము

తగవు ధర్మముఁ జూడనొల్లక దల్లిదండ్రుల బంధులన్
మగల బిడ్డలఁ బాసి వచ్చిన మన్నిషక్తల మిమ్ము నేఁ

దగదు; పాసితిఁ దప్పుఁ జెప్పుఁడు; తద్వియోగభరంబునన్
వగలఁ బొందుచు మీర లాడిన వాక్యముల్ వినుచుండితిన్.

10.1-1081-ఉత్పలమాల

పాయని గేహశృంఖలలఁ బాసి నిరంతర మత్పరత్వముం
జేయుచునున్న మీకుఁ బ్రతిజేయ యుగంబుల నైన నేర; నన్
బాయక గొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచి నా
పాయుట దప్పుగాఁ గొనక భామినులార! కృపన్ శమింపరే.

10.1-1082-కంద పద్యము

చక్కఁగ హరి యిటు పలికిన
చక్కని వాక్యముల నతని సంగమమున లో
నిక్కిన వియోగతాపము
లొక్కట విడిచిరి లతాంగు లుర్వీనాథా!

## 10.1-121- రాసక్రీడావర్ణనము

10.1-1083-ఉత్పలమాల

ఆ సమయంబునన్ విభుఁ డనంతుఁడు కృష్ణుఁడు చిత్రమూర్తి యై
చేసెను మండలభ్రమణశీలపరస్పరబద్ధబాహు కాం
తా సువిలాసమున్ బహువిధస్ఫురితానన హస్త పాద వి
న్యాసము రాసముం గృత వియచ్చరనేత్ర మనోవికాసమున్.

10.1-1084-వచనము

ఇట్లు బహుగతులం దిరుగ నేర్పరి యగు హరి దర్పించి తన యిరుకెలంకుల నలంకృతలై కళంకరహితచంద్రవదన లిద్దఱు ముద్దియలందుకొని వీణలం బ్రవీణలై, సొంపుమెఱసి యింపుగ వాయించుచు నానందలహరీ నిధానంబగు గానంబు చేయ నవిరళంబై తరళంబుగాని వేడుక సరళంబగు మురళంబు లీలంగేల నందుకొని మధురంబగు నధరంబునం గదియించి మించి కామినీజన కబరికా సౌగంధిక గంధ బంధుర కరాంగుళీకిసలయంబులు యతిలయంబులం గూడి వివరంబుగ మురళీవివరంబుల సారించి పూరించుచు సరిలేని భంగిం ద్రిభంగి యై కమల కర్ణికాకారంబున నడుమ నిలిచి, మఱియు గోపసుందరు లెందఱందఱకు నందఱయి సుందరుల కవలి యెడలం దానును దన కవలి యెడల సుందరులును దేజరిల్ల, నృత్యవిద్యా మహార్ణవ వేలావలయవలయితంబై, విస్మితా ఖండలంబైన రాసమండలంబుఁ గల్పించి, వేల్పులు హర్షంబునం గుసుమవర్షంబులు గురియ నందుఁ బ్రసూనమంజరీ సహచరంబు లైన చంచరీకంబుల మించుఁ బ్రకటించుచు, సువర్ణమణిమధ్యగంబు లైన మహేంద్రనీలంబుల తెఱంగు నెఱపుచుఁ, గరణీవిహారబంధురంబులైన సింధురంబుల చెలువుఁ గైకొలుపుచుఁ బల్లవిత కుసుమిత లతానుకూలంబులైన తమాలంబుల సొబగు నిగుడించుచు మెఱుపుతీఁగల యెడనెడల బెడం గడరు నల్లమొగిళ్ళ పెల్లుచూపుచుఁ దరంగిణీసంగతంబులైన రోహణాచల శృంగంబులబాగు లాగించుచు, జగన్మోహనుండై యుండి రక్తకమలారుణంబులును, జంద్రశకలనిర్మలనఖర సంస్ఫురణంబులును, శ్రుతి నితంబినీ సీమంత వీధికాలంకరణంబులును, సనకసనందనాది యోగీంద్ర మానసాభరణంబులునునైన చరణంబులు గదియనిడి సమస్థితి నంజలి పుటంబులంబుష్పంబు లుల్లసిల్లఁ జల్లి, సల్లలితకమలప్రశ స్తంబులైన హస్తంబులు

వల్లవీజనుల కంఠంబులపై నిడి, గీతానుసారంబుగ విచిత్ర పాదసంచారంబులు సలుపుచు, వర్తులాకార రాసబంధంబుల నర్తనంబునంబ్రవర్తించి వెండియు వ్రేతలుం దానును శంఖ పద్మ వజ్ర కందుక చతుర్ముఖ చక్రవాళ చతుర్భద్ర సౌభద్ర నాగ నంద్యావర్త కుండలీకరణ ఖరళీ ప్రముఖంబులైన విశేష రాస బంధంబులకుం జొక్కి, యేకపాద సమపాద వినివర్తిత గతాగత వలిత వైశాఖ మండల త్రిభంగి ప్రముఖంబులైన తానకంబుల నిలుచుచుఁ, గనకకింకిణీమంజుల మంజీరశింజనంబులు జగజ్జనకర్ణ రంజనంబులై చెలంగ, ఘట్టిత మర్దిత పార్శ్వగ ప్రముఖంబులైన పాదకర్మభేదంబులు చేయుచు, సమపాద శకటవదన మతల్లి శుక్తి ప్రముఖంబులైన పార్థివచారి విశేషంబులును నపక్రాంత డోలాపాదసూచీ ప్రముఖంబులైన వ్యోమచారి విశేషంబులం జూపుచు, సురేంద్రశాఖిశాఖా మనోహరంబులు, నపహసిత దిక్కరీంద్రకరంబులును ద్రిలోక క్షేమకరంబులును నగు కరంబులం దిరంబులగు రత్నకటకంబుల మెఱుంగులు నింగి చెఱంగులం దఱచుకొన నర్ధచంద్ర కర్తరీముఖ కపిత్థకటకాముఖ శుకతుండ లాంగూల పద్మకోశ పతాక ప్రముఖంబులైన స్వస్వభావసూచక నానావిధ కరభావంబు లాచరించుచుఁ గటినిబద్ధ సువర్ణవర్ణచేలాంచల ప్రభానికరంబులు సుకరంబులై దిశాంగనాముఖంబులకు హరిద్రాలేపన ముద్రాలంకారంబు లొసంగుచు, నాస్కందిత భ్రమర శకటాసన ప్రముఖంబు లైన జానుమండల భేదంబులు నలాత దండలాత లలిత విచిత్ర ప్రముఖంబులైన దైవమండలంబు లొనర్చుచుఁ గమనీయ కంబుకంఠాభిరామంబులు నుద్దామ తేజోస్తోమంబులును నైన నీల మౌక్తిక వజ్ర వైఢూర్య దామంబుల రుచు లిందిరాసుందరికి మందిరంబులై సుందరంబులయిన యురంబులం దిరుగుడుపడి కలయంబడనంగాంతర వాహ్యాలకు ఛత్ర ప్రముఖంబులైన భ్రమణ విశేషంబుల విలసించుచు నిద్దంబులగు

చెక్కుటద్దంబుల నుద్దవిడిఁ దద్దయుం బ్రభాజిత చంద్రమండలంబులగు
కుండలంబుల మెఱుంగు మొత్తంబులు నృత్యంబు లొనరింపఁ గటిభ్రాంత
దండరచిత లలాట తిలక మయూర లలిత చక్రమండలనికుంచిత గంగావతరణ
ప్రముఖంబులైన కరణంబు లెఱింగించుచు వెలిదమ్మి విరుల సిరుల
చెన్నుమిగులు కన్నులవలని దీనజనదైన్యకర్కశంబులై తనరు కటాక్షదర్శన
జాలంబులు జాలంబులై కామినీజన నయనమీనంబుల నావరింప లలితకుంచిత
వికాస ముకుళ ప్రముఖంబు లైన చూడ్కులఁ దేజరిల్లుచు, ననేక
పరిపూర్ణచంద్రసౌభాగ్య సదనంబులగు వదనంబులఁ బ్రసన్నరాగంబుఁబ్రకటించుచు
నుదంచిత పింఛమాలికా మయూఖంబు లకాల శక్రచాపంబుల నొంపు
సంపాదింప, నికుంచితాకుంచిత కంపితాకంపిత పరివాహిత పరావృత్త
ప్రముఖంబులైన శిరోభావంబులు నెఱపుచు మృగనాభి తిలకం బులుగల
నిటలఫలకంబులఁ జికురంబుల నికరంబులుగప్ప, నప రాజిత
సూచికావిద్ధపరిచ్ఛిన్న విష్కంభ రేచిత ప్రముఖంబులగు నంగహారంబుల
విలసిల్లు చరణ కటి కరకంఠ రేచకంబులా చరించుచు నొప్పెదు; నప్పు డా
రాసంబు సంజనిత సకలజనమాననోల్లాసకరంబై సుధార్ణవంబునుం బోలె
నుజ్జ్వలరసాభిరామంబై రామరాజ్యంబునుబోలె రాగపరిపూర్ణంబై,
పూర్ణచంద్రమండలంబునుం బోలెఁ గువలయానందంబై, నందనవనంబునుంబోలె
భ్రమరవిరాజమానంబై, మానధనుని చిత్తంబునుంబోలెఁ బ్రధానవృత్తి సమర్థంబై,
సమర్థకవివిలసనంబునుంబోలె బహుప్రబంధభాసురంబై, సుర లోకంబునుంబోలె
వసుదేవనందన విశిష్టంబై, శిష్టచరితంబునుం బోలె ధరణీగగనమండల
సుందరంబై, సుందరీరత్నంబునుంబోలె నంగహారమనోహరంబై,

హారవధూనిలయంబునుంబోలె ననేకచారి సుకుమారంబై, సుకుమార వృత్తంబునుంబోలె నుద్దీపితవంశంబై, యుండె; నందు.

10.1-1085-చంపకమాల

నడుములు వీగియాడఁ, జిఱునవ్వులు నివ్వటిలంగ, హారముల్
సుడివడ, మేఖలల్ వదలఁ, జూడ్కిమెఱుంగులు పర్వ ఘర్మముల్
పొడమఁ, గురుల్ చలింప, శ్రుతిభూషణముల్ మెఱయన్, సకృష్ణలై
పడతుక లాడుచుం జెలఁగి పాడిరి మేఘతటిల్లతాప్రభన్.

10.1-1086-కంద పద్యము

అంకరహితేందు వదనలు
పంకజలోచనునిఁ గూడి పరఁగ నటింపం
గింకిణుల నూపురంబుల
కంకణముల మ్రోఁత లెసఁగెఁ గర్ణోత్సవమై.

10.1-1087-కంద పద్యము

హరిణీనయనలతోడను
హరి రాసక్రీడ చేయ నంబరవీధిన్
సురనాథులు భార్యలతో
సొరిది విమానంబు లెక్కి చూచి రిలేశా!

10.1-1088-కంద పద్యము

కురిసెం బువ్వుల వానలు
మొరసెన్ దుందుభులు మింట ముదితలు దారున్

సరసన్ గంధర్వపతుల్
వరుసన్ హరిఁ బాడి రపుడు వసుధాధీశా!

10.1-1089-కంద పద్యము

రామలతోడను రాసము
రామానుజుఁ డాడఁ జూచి రాగిల్లి మనో
రాములమీఁద వియచ్చర
రాములు మూర్ఛిల్లిపడిరి రామవినోదా!

10.1-1090-కంద పద్యము

తారాధిపనిభవదనలు
తారాధిపవంశుఁ గూడి తారు నటింపం
దారలునిల్చి సుధాంశుఁడుఁ
దారును వీక్షింప రేయి తడవుగ జరగెన్.

10.1-1091-మత్తేభ విక్రీడితము

యమునాకంకణచారియై వనజపుష్పామోదసంచారియై
రమణీఘర్మనివారియై మదవతీరాసశ్రమోత్తారియై
ప్రమదామానస నవ్యభవ్య సుఖ సంపత్కారియై చేరి యా
కమలాక్షుం డలరంగ గాలి విసరెం గల్యాణభావంబునన్.

10.1-1092-వచనము

అప్పుడు.

## 10.1-122- గోపికలవద్ద పాడుట

10.1-1093-చంపకమాల

ప్రమద యొకర్తు మాధవుఁడు పాడ విపంచి ధరించి కేల సం
భ్రమమునఁ దంత్రి మీటుచుఁ దిరంబుగ ఠాయముచేసి యొక్క రా
గముఁ దగ నాలపించి సుభగస్వరజాతులు వేఱువేఱు కా
నమరఁగఁ బాడెఁ దన్ రమణుఁ డౌనన దారువు లంకురింపఁగన్.

10.1-1094-కంద పద్యము

ఆడుచుఁ బాడుచు నందొక
చేడియ మంజీరమంజుశింజిత మమరం
గూడి హరికరము చనుగవ
పై డాయఁగఁ దిగిచె జఘనభారాలసయై.

10.1-1095-కంద పద్యము

చందనలిప్తంబై యర
విందామోదమున నొప్పు విపులభుజము గో
విందుఁ డొక తరుణి మూపునఁ
బొందించిన నది దెమల్చి పులకించె నృపా!

10.1-1096-సీస పద్యము

చెలువ యొక్కతె చెక్కుఁజెక్కుతో మోపిన;
విభుఁడు తాంబూలచర్వితముఁ బెట్టె
నాడుచు నొక లేమ యలసినఁ బ్రాణేశుఁ;
డున్నత దోస్తంభ మూఁతఁ జేసెఁ
జెమరించి యొకభామ చేరినఁ గడగోరఁ;

జతురుఁడు గుచఘుర్మజలముఁ బాపె
నలకంబు లొక యింతి కళిక చిత్రకరేఖ;
నంటినఁ బ్రియుఁడు పాయంగ దువ్వెఁ

10.1-1096.1-ఆటవెలది

బడతి యొకతె పాటపాడి డస్సిన యధ
రామృతమున నాథుఁ డాదరించె
హారమొక్క సతికి నంసావృతంబైనఁ
గాంతుఁ డురముఁ జేర్చి కౌఁగలించె.

10.1-1097-కంద పద్యము

హాసంబులఁ గరతల వి
న్యాసంబుల దర్శనముల నాలాపములన్
రాసశ్రాంతల నా హరి
జేసెన్ మన్ననలు కరుణఁ జేసి నరేంద్రా!

10.1-1098-కంద పద్యము

హరితను సంగసుఖంబున
బరవశలై ప్రేత లెల్లఁ బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె?
సురసతు లీక్షించి కరఁగి చొక్కిరి మింటన్.

10.1-1099-వచనము

ఇట్లు భగవంతుండైన కృష్ణు డాత్మారాముం డయ్యును గోపసతు లెందఱందఱకు నందఱై నిజప్రతిబింబంబులతోడం గ్రీడించు బాలు పోలిక రాసకేళి సలిపిన.

10.1-1100-కంద పద్యము

తగఁ గూడి యాడి మనముల
నగఁ జూచెం బలికె నందనందనుఁ డనుచున్
మగువలు పెద్దఱికముతోఁ
బొగడిరి తమ పూర్వజన్మపుణ్యశ్రేణిన్.

## 10.1-123- గోపికలతో జలక్రీడలాడుట

10.1-1101-వచనము

ఇట్లు హరి రాసకేళి చాలించి, తలంగు తటిల్లతల చెలువున ఘర్మ సలిలకణాక్రాంతలగు కాంతలంగూడి జలక్రీడాకుతూహలుండై యమునాజలంబుఁ జొర, నందు ముందర సుందరులు జొచ్చి పదప్రమాణంబు, జానుదఘ్నంబు, కటిద్వయసంబు, మధ్యమాత్రంబు, కుచంబులబంటి యని పలుకుచుం గుచ నయన నాభివివర కుంతలంబులు చక్రవాక జలచరావర్త శైవాలంబుల చందంబుననందంబుగ నీడుపొందిన యేఱులని కళిందనందన కరంబులు చాచి పరిరంభంబులకు నారంభించుకైవడి నెదురు చనుదెంచి తాఁకు తరంగంబులకు నులుకుచు, సారసంబులకుం గరంబులు చాఁచుచు మరాళంబులంజోపుచుఁ జెన్నుమిగిలిన చన్నుల యెత్తువత్తు మను నెపంబులఁ దపంబుల నీటఁ గావించు మాడ్కిని సంచరించు చక్రవాకంబులందోలుచు నితాంతకాంతిసదనంబులగు వదనంబులకునోడి వ్రీడంజెంది కంది చందురుఁడు చలమ్ముడిగి జలమ్మునం బడి కంపించు కరణి, నిజకరచలితజలప్రతిఫలితుండై కదలు చంద్రునిం గని మెచ్చి

నోలుచు, సలిలావగాహసమయ సముచ్చలిత వారిశీ కర పరంపరలవలన మకరందపానమత్తమధుకర పక్షవిక్షేపణసం జాతవాత సముద్ధూత కుముదాది పరాగపటలంబులం జేరుచు మోముదమ్ముల కమ్మఁదనమ్ములకు మూఁగి, జుమ్మురను తుమ్మెదలకు వెఱచుచుఁ గరంబుల నీ రెగయం జఱచుచు నీలనీరద నిపతిత పయోబిందు సందోహంబులం దడియు పువ్వుదీవియల బాగునఁ గృష్ణుకరద్వయంబునంజిలుకు తోయంబులం దడియుచుఁ గ్రందుకొని సుడియుచు, నసమబాణుని పులుకడిగినకుసుమబాణంబుల పగిది మేనులు మెఱయ సలిలావగాహనపరాయత్త చిత్త లగుచు మొత్తంబులై సరస భాషణంబులం ద్రుళ్ళుచు బాహుల నీరు నించుచు హరిమీఁదం జల్లుచుఁ జల్లునెడం దడఁబడ దాఁటుచు దాఁటి చనక నిలువరించుచు వినోదింప, హరియుం గరేణుకర వికీర్ణ నీరధారాభిషిక్తంబగు శుండాలంబు లీల నాభీరకామినీకర సముజ్ఝిత జలాసారంబులం దోఁగుచు, వ్రజవధూజన హస్తప్రయుక్త కల్హార కైరవ పరాగపటలంబువలన భూతిభూషణసిరి వహించుచు గోపికాజన పాణికిసలయ సమున్ముక్త కమలదళంబుల వలన సహస్రనయనుని రూపుఁ జూపుచు గోపాలబాలికా కుచకలశకుం కుమపంకంబువలనఁ బ్రభాతబాలభానుని భంగి భాసిల్లుచు, ఘోష యోషాకటాక్ష విక్షేపణంబులవలన మధుపపరివృత హరిచందన సౌందర్యంబు నొందుచు, వల్లవీహాసరుచుల వలనఁ జంద్రికాప్రభా భాసిత నీలశైలంబు క్రియ నమరెః నంత.

## 10.1-124- గోపికలతోడ క్రీడించుట

### 10.1-1102-మత్తేభ విక్రీడితము

సతులుందానును నీటిలో వెడలి భూషా గంధ చేలాద్యలం
కృతుఁడై కుంభికరేణుయూధములతోఁ గ్రీడించు చందంబునన్

లతలందుం దరులందుఁ బుష్పమయ లీలాశయ్యలందున్ సుఖో
న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్.

10.1-1103-వచనము

ఇట్లు శరత్కాలంబున వెన్నుం డింద్రియస్ఖలనంబు చేయక గోపికల తోడ రమించె" నని చెప్పిన మునివరునకు భూవరుం డిట్లనియె.

10.1-1104-మత్తకోకిలము

ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స
త్కర్ముఁ డీశుఁడు ధర్మశిక్షయు ధర్మరక్షయు చేయఁగా
నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి పరాంగనాజనసంగ మే
ధర్మమంచుఁ దలంచి చేసె? నుదాత్తమానస! చెప్పుమా.

10.1-1105-వచనము

అనిన శుకుండిట్లనియె.

10.1-1106-ఆటవెలది

సర్వభక్షుఁ డగ్ని సర్వంబు భక్షించి
దోషిగాని పగిది దోష మైనఁ
జేసి దోషపదముఁ జెందరు తేజస్వు
లగుటఁ జంద్ర వాసవాదుఁ లధిప!

10.1-1107-కంద పద్యము

ఈశ్వరుఁడు గానివాఁడు న
రేశ్వర! పరకాంతఁ దలఁచి యెట్లు బ్రదుకు? గా

రీశ్వరుఁడు దక్క నన్యుఁడు
విశ్వభయదవిషము మ్రింగి వెలయంగలఁడే?

10.1-1108-కంద పద్యము

సత్యము ప్రభువుల వచనము
నిత్యము తద్వచన వీధి నిలుతురు పెద్దల్;
సత్యాసత్యము గావున
సత్య మనఁగఁ జనదు వారి చరితమును నృపా!

10.1-1109-మత్తేభ విక్రీడితము

ఘనులై యెవ్వని పాదపంకజపరాగధ్యానసంప్రాప్త యో
గ నిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం
ధ నిరోధంబులు లేక విచ్చలవిడిం దర్పింతు, రా దివ్య శో
భనుఁ డెట్లుండిన నుండెఁ గాక; కలవే బంధంబు లుర్వీశ్వరా!

10.1-1110-ఆటవెలది

గోపజనములందు గోపికలందును
సకలజంతులందు సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు?
సర్వమయుఁడు లీల సలిపెఁ గాక.

10.1-1111-వచనము

అని చెప్పి శుకుం డిట్లనియె "నంత బ్రాహ్మ్యముహూర్తంబునం గృష్ణు వీడ్కొని గోపికలిచ్చలేకయు నిండ్ల కడకేగినం గృష్ణమాయామోహితులై గోపకులు వారలం గోపింప నేరరైరి.

10.1-1112-ఇంద్రవ్రజము

గోపాలకృష్ణుండును గోపకాంతల్
ప్రాపించి క్రీడించిన భంగు లెల్లన్
రూపించి వర్ణించి నరుండు హృత్సం
తాపంబులం బాయును దత్ప్రసక్తిన్.

**10.1-125- సర్వరూపి శాపవిమోచనము**

10.1-1113-వచనము

అంత నొక్కనాడు నందాదులైన గోపకు లంబికావనంబునకు శకటంబు లెక్కి జాతరకుం జని సరస్వతీనదీజలంబుల స్నానంబులు చేసి, యుమామహేశ్వరుల నర్చించి కానికలిచ్చి బ్రాహ్మణులకు గో హిరణ్య వస్త్రాన్న దానంబు లొసంగి, జలప్రాశనంబు చేసి, నియమంబున నుండ దైవయోగంబున నాఁకొని యొక్క మహోరగంబు నిదురబోయిన నందునిం గఱచిమ్రింగనగ్గలింప నతఁడు కృష్ణకృష్ణేతి వచనంబులం దన్ను విడిపింపు మని మొఱయిడిన విని.

10.1-1114-కంద పద్యము

గోపకు లందఱు మేల్కొని
కోపముతోఁ బెద్దగుదెలఁ గొఱవుల మొత్తన్
తాపము నొందియు వదలక
పాపపు పెనుఁబాము నందుఁ బట్టె నృపాలా!

10.1-1115-వచనము

అయ్యవసరంబునఁ గృష్ణుండు దర్పించి పాద తాడనంబు చేసి త్రొక్కిన సర్పంబు సర్పరూపంబు విడిచి విద్యాధరేంద్ర రూపంబుఁ దాల్చి హరికిఁ మ్రొక్కిన నతనికి హరి యిట్లనియె.

10.1-1116-ఉత్పలమాల

మండిత మూర్తితోఁ గనక మాలికతో శుభలక్షణుండవై
యుండెడు నీకు దుష్టపు మహోరగదేహ మిదేల వచ్చె? నె
వ్వండవు? నామ మెయ్యది? భవంబునకెద్దిమిషంబు? నాకునొం
డొండ యెఱుంగఁ జెప్పుము బుధోత్తమ! నీపని చోద్యమయ్యెడిన్

10.1-1117-వచనము

అనిన వాఁడిట్లనియె "దేవా యేను సుదర్శనుండను విద్యాధరుండ విమానారూఢుండ నై రూపసంపద్గర్వంబులం జొక్కి దిక్కులం జరించుచు నొక్కయెడ నాంగిరసులైన ఋషులం గురూపులైన వారలం గని నగిన వారు నీవు రూపదర్పంబునం మమ్ము నగితివి గావున మహాసర్పంబ వై యుండు మని శపించి పిదప నే వేడు కొనిన యిట్లనిరి.

10.1-1118-చంపకమాల

యదుకులమందు భక్తుల భయంబు హరించుటకున్ జనార్దనుం
డుదయము నొంది యీ యడవి కొక్క దినంబున రాఁగలండు త
త్పదమున నీవు దన్నఁబడి పన్నగ దేహముతోడఁ బాసి నీ
మొదలిటి మేనుఁ గాంచెదవు మూఢుఁడ! పొమ్మని రో! దయానిధీ!

10.1-1119-మత్తేభ విక్రీడితము

నినుఁ జింతించిన విన్నఁ బేరుకొనినన్ నిర్మూలమై క్రుస్సి పా
పనికాయంబు వినష్టమౌ నఁట; భవత్పాదంబు నా మీఁదఁ బె
ట్టినఁ దద్బ్రాహ్మణశాపసంజనిత కౌటిల్యంబు దా నిల్చునే?
వనజాతేక్షణ! నేడు బాసె నురగత్వం బెల్ల నేఁ బోయెదన్.

10.1-1120-వచనము

అని విన్నవించి హరికిఁ బ్రదక్షిణంబువచ్చి మ్రొక్కి, సుదర్శనుండు దివంబునకుం జనియె, సర్పంబు వలన నందుండు విముక్తుండయ్యెఁ; దత్ప్రకారంబు విని వెఱఁగుపడి గోపకులు దేవతామహోత్సవంబు సమాప్తి నొందించి కృష్ణకీర్తనంబు చేయుచు మరల మందకుం జనిరి; అంత.

10.1-1121-చంపకమాల

మఱి యొకనాటి రాత్రి బలమాధవు లుజ్జ్వల వస్త్రమాలికా
ధరులును లేపనాభరణధారులునై చని మల్లికాది పు
ష్పరసనిమగ్నమైన మధుపంబుల గీతము వించుఁ దద్వనాం
తరమున వెన్నెలన్ వ్రజనితంబిను లుండఁగఁ బాడి రింపుగన్.

10.1-1122-కంద పద్యము

ఆ పాట చెవుల సోఁకిన
నేపాటియు దేహలతల నెఱుఁగక దృగ్వ్యా
చాపాటవములు చెడి పడి
రా పాటల గంధు లెల్ల నటవీవీధిన్.

**10.1-127- శంఖచూడుని వధ**

10.1-1123-వచనము

ఇట్లు సకలభూతసమ్మోహనంబగు గానంబు జేయుచు, నిచ్చావర్తనంబులం బ్రమత్తుల చందంబున రామకృష్ణులు గ్రీడింపఁ గుబేరభటుండు శంఖచూడుం డనువాఁడు రామకృష్ణ రక్షితులగు గోపికలం దన యోగబలంబున నుత్తరపు దిక్కునకుం గొనిపోవ నయ్యోషిజ్జనంబులు రామకృష్ణేతి భాషణంబులు పలుకుచుఁ బులికి నగపడిన మొదవుల క్రియ మొఱయిడిన విని.

10.1-1124-ఉత్పలమాల

గ్రద్దన సాలవృక్షములు గైకొని బల్లిదు లన్నదమ్ము లా
యుద్దఱు కాలమృత్యువుల యేపున వే చని యోడకుండుఁ డో!
ముద్దియలార! యంచుఁ దనుముట్టినఁ జూచి కలంగి గుహ్యకుం
డుద్దవడిం దగం బఱచె నుత్తర మింతుల డించి భీతుఁడై.

10.1-1125-వచనము

ఇట్లు గుహ్యకునిచేత విడివడిన గోపికలను రక్షించుకొని యుండు మని బలభద్రునిం బలికి.

10.1-1126-శార్దూల విక్రీడితము

ఓరీ! గుహ్యక! పోకుపోకు మని రోషోక్తిం బకారాతి వాఁ
డే రూపంబున నెందుఁ జొచ్చె నెటు బోయెం దోడఁ దా నేగి దు
ర్వారోదంచిత ముష్టి వాని తలఁ ద్రెవ్వంబెట్టి తద్వీరు కో
టీరభ్రాజిత రత్నముం గొనియె దండిన్ గోపికల్ చూడగన్.

10.1-1127-వచనము

ఇట్లు శంఖచూడునిం జంపి వాని శిరోరత్నంబుఁ దెచ్చి బలభద్రున కిచ్చి మెప్పించె మఱియు నొక్కదినంబునం గృష్ణుండు వనంబునకుం జనిన నతని లీలలు పాడుచు నిండ్లకడఁ దద్విరహవేదనానల భరంబు సహింపక గోపికలు తమలో నిట్లనిరి.

## 10.1-128- గోపికల విరహాలాపములు

### 10.1-1128-శార్దూల విక్రీడితము

భ్రూవిక్షేపముతోడ దాపలిభుజంబుం జెక్కుఁగీలించి కె
మ్మోవిన్ వేణువుఁ గూర్చి సుస్వరముగా మ్రోయించుచున్నంగుళీ
ప్రావీణ్యంబు విభుండు చూపఁ గని సప్రాణేశలై యుండియున్
నీవీబంధములూడఁ జొక్కుదురుపో నింగిన్ నిలింపాంగనల్.

### 10.1-1129-మత్తేభ విక్రీడితము

నవమాధుర్యము గల్గు కృష్ణు మురళీ నాదామృతస్యందముల్
చెవులం జొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబులై
యువిదా! మేపులకుం దొఱంగి మృగ గోయూధంబు లుత్కంఠతో
దివికిం గంఠము లెత్తి లోవదలుఁబో దేహేంద్రియవ్యాప్తులన్.

### 10.1-1130-శార్దూల విక్రీడితము

ఓ! కంజేక్షణ! కృష్ణుఁ డుజ్జ్వలిత హారోద్దాముఁడై గానవి
ద్యాకౌతూహలతన్ మనోజ్ఞమురళీధ్వానంబు గావింపఁగా
నాకర్ణించి సశంపమై మొరయు నీలాభ్రంబుగాఁ జూచుచుం
గేకారావము లిచ్చుచున్ మురియుఁబో కేకీంద్రసంఘాతముల్.

10.1-1131-మత్తేభ విక్రీడితము

లలనా! యేటికి తెల్లవాఱె? రవి యేలా దోఁచెఁ బూర్వాద్రిపైఁ?
గలకాలంబు నహంబుగాక నిశిగాఁ గల్పింపఁ డా బ్రహ్మ దా
వలఁ డేఁడుం గృపలేఁడు; కీరములు దుర్వారంబు; లెట్లోకదే;
కలదే మాపటికాల మందు మనకుం గంజాక్షు సంభోగముల్.

10.1-1132-ఉత్పలమాల

ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు? హరి యెప్పుడు గోవులమేపివచ్చు? నా
కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణ మబ్బు? నతండు వచ్చిన
న్నెప్పుడు గారవించుఁ? దుది యెప్పుడు మద్విరహాగ్నిరాశికిం?
జెప్పఁగదమ్మ; బోటి! మరుచేఁతల నుల్లము తల్లడిల్లెడిన్.

10.1-1133-మత్తేభ విక్రీడితము

చెలియా! కృష్ణుఁడు నన్నుఁబాసి వనముం జేరంగ నయ్యాక్షణం
బులు నా కన్నియు నుండనుండగఁ దగం బూర్ణంబులై సాగి లో
పలఁ దోఁచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై
నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై.

10.1-1134-వచనము

అని మఱియుఁ గృష్ణవిరహదుఃఖంబున బహువిధంబుల బశ్చాత్తాపంబు నొందుచు గోపిక లోపికలు లేక నెట్టకేలకు దివంబు గడిపి దినాంతసమయంబు నందు.

10.1-1135-మత్తేభ విక్రీడితము

అదె భానుం డపరాద్రిఁ జేరె; నిదె సాయంకాల మేతెంచె; న
ల్లదె గోపాదపరాగ మొప్పెసఁగె; బృందారణ్య మార్గంబునం
దిదె వీతెంచె వృషేంద్రఘోషము; ప్రియుం డేతెంచె రం డంచుఁ దా
మెదు రేతెంతురు మాపు కృష్ణునికి నయ్యింతుల్ పరిభ్రాంతలై.

10.1-1136-వచనము

ఇట్లు తనకెదురు వచ్చిన మచ్చిక నచ్చెలువల నచ్యుతుం డిచ్ఛానువర్తనంబుల గారవించె నంత నొక్కనాడు.

## 10.1-129- వృషభాసుర వధ

10.1-1137-సీస పద్యము

ఎవ్వని మూఁపుర మీక్షించి మేఘంబు;
లద్రి శృంగంబని యాశ్రయించు;
నెవ్వని ఱంకె కర్ణేంద్రియంబులు సోఁక;
గర్భపాతనమగు గర్భిణులకు;
నెవ్వని పదహతి నెగయు పరాగంబు;
లంధకారారాతి నావరించు;
నెవ్వఁడు కొమ్ముల నెదిరించి చిమ్మినఁ;
బృథ్వీధరంబులు పెల్లగిల్లు;

10.1-1137.1-తేటగీతి

నట్టి వృషభాసురేంద్రుఁ డహంకరించి
వాలలత నెత్తి పెనుఱంకె వైచి నేలఁ
గాలఁ ద్రవ్వుచు నిశితశృంగములు చాఁచి

మంద బెదరంగఁ గవిసె నమంద గతిని.

10.1-1138-వచనము

ఇట్లు వృషభాకారంబున నరిష్టుండు హరికి నరిష్టంబు చేయం దలంచి పై కుఱికిన.

10.1-1139-ఉత్పలమాల

క్రేపులు పాఱె గోవులకుఁ; గ్రేపులు గోవులు గోవృషంబులం
బైపడె; వత్సధేనువృషభంబులు గోపకులందుఁజొచ్చె; నా
గోపకులా వృషేంద్రములు గోవులు లేఁగలు విచ్చిపాఱఁగా
గోపచమూవిభుండు గనె గోవృషదైత్యుఁడు వెంటనంటఁగన్.

10.1-1140-వచనము

ఇట్లు భయభ్రాంతులై కాంతలుం దారును గృష్ణకృష్ణ! “రక్షింపు రక్షింపు” మని తన్ను వేఁడుకొనెడు గోపకులకు నడ్డంబువచ్చి దీనజనరక్షకుండయిన పుండరీకాక్షుం డిట్లనియె.

10.1-1141-ఉత్పలమాల

బాలురఁ గాంతలం బసులఁ బాఱఁగఁ దోలుట బంటు పంతమే
చాలు; వృషాసురేంద్ర! బలసంపదఁ జూపఁగ నెల్లఁబాడి గో
పాలురమందఁగాదు; చను పైఁబడితేని ప్రచండ కృష్ణశా
ర్దూలము నేడు నీ గళము త్రుంపక చంపక పోవనిచ్చునే?

10.1-1142-ఆటవెలది

అనుచు ధిక్కరించి హస్తతలంబునఁ
జప్పళించి నగుచు సఖునిమీఁదఁ

బన్నగేంద్రభయదబాహుదండము చాఁచి
దండి మెఱసి దనుజదండి నిలిచె.

10.1-1143-వచనము

అప్పుడు.

10.1-1144-చంపకమాల

ఖురముల నేలఁ ద్రవ్వుచు నకుంఠిత వాల సమీరణంబులన్
విరవిరఁబోయి మేఘములు విప్ప విషాణము లొడ్డికొంచు దు
స్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు కన్నుల నిప్పు లొల్కఁగా
దురతుర వచ్చి తాఁకె రిపుదుర్మదమోచనుఁ బద్మలోచనున్.

10.1-1145-ఉత్పలమాల

యాదవకుంజరుండు వృషభాసురు కొమ్ములు రెండుఁ బట్టి య
ష్టాదశపాదమాత్రము గజంబు గజంబును ద్రొబ్బుకైవడిన్
భేదిల ద్రొబ్బ నయ్యసుర పిమ్మటనొంది చమర్చి మ్రొగ్గి దు
ర్మాదముతోడ డీకొనెఁ బ్రమత్తవిమర్దను నా జనార్దనున్.

10.1-1146-ఆటవెలది

అంత గోపసింహుఁ డసురఁ గొమ్ములు పట్టి
ధరణి ద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల
కొమ్ము వీఁగ సురలకొమ్ము వర్ధిల వాని
కొమ్ము పెఱికి మొత్తి కూల్చె నధిప!

10.1-1147-కంద పద్యము

ఉక్కుచెడి రోఁజి నెత్తురు
ముక్కున వాతను స్రవింప మూత్ర శకృత్తుల్
మిక్కిలి విడుచుచుఁ బసరపు
రక్కసుఁ డని సమసెఁ బ్రజకు రాగము లమరన్.

10.1-1148-వచనము

ఇట్లు వృషభాసురుం జంపిన నిలింపులు గుంపులుగొని విరులు వర్షింప గోపకులు హర్షింప గోపసతు లుత్కర్షింప బలభద్రుండును వారును గోవిందుండును బరమానందంబున మందకుం జని; రంత.

## 10.1-130- కంసునికి నారదుడుజెప్పుట

10.1-1149-చంపకమాల

ఘనుఁడొకనాడు నారదుఁడు కంసునితోడ యశోద కూఁతు తాఁ
గనుటయుఁ జక్రి దేవకికి గర్భజుఁడౌటయు మున్ను రోహిణీ
తనయుఁడు రాముఁడౌటయును దద్విభులిద్దఱు మందనున్నవా
రని యెఱుఁగంగఁ జెప్పిన మహాద్భుత మంచుఁ జలించి గిన్కతోన్.

10.1-1150-చంపకమాల

కొడుకుల మందలోననిడి గొంటుతనంబున మోసపుచ్చె నీ
బడుగును బట్టి చంపు టిది భావ్యమటంచుఁ గృపాణపాణి యై
వడి వసుదేవునిం దునుమ వచ్చిన కంసునిఁ జూచి నారదుం
డుడుగుము చంపఁబోల దని యోడక మానిచి పోయె మింటికిన్.

## 10.1-131- కంసుని మంత్రాలోచన

10.1-1151-వచనము

మఱియు నలుక దీఱక కంసుండు దేవకీవసుదేవుల లోహపాశ బద్ధులంజేసి కేశియనువానిం బిలిచి రామకేశవులం జంపుమని పంపి మంత్రి భట గజారోహక చాణూర ముష్టిక సాల్వ కోసల ప్రముఖుల రావించి యిట్లనియె.

10.1-1152-శార్దూల విక్రీడితము

ఎందున్ నన్నెదిరించి పోరుటకు దేవేంద్రాదులుం జాల రీ
బృందారణ్యము మంద నిప్పుడు మదాభీరార్భకుల్ రామగో
విందుల్ వర్ధిలుచున్న వారఁట రణోర్విం గంసు నొప్పింతు మం
చుం దర్పంబులు పల్కుచుండు రఁట యీ చోద్యంబులన్ వింటిరే?

10.1-1153-కంద పద్యము

పట్టణజనములు చూతురు
దట్టంబుగ మల్లరంగతలపార్శ్వములం
బెట్టింపుఁడు తమగంబులు
పుట్టింపుఁడు వీట మల్లుపో రను మాటన్.

10.1-1154-శార్దూల విక్రీడితము

విన్నాణంబులఁ బోరనేర్తురు మహా వీర్యప్రతాపాది సం
పన్నుల్ మీరలు మేటిమంతనములం బ్రఖ్యాతులై పెంపుతో
మన్నా రా బలకృష్ణులం బెనఁకువన్ మర్దించి మత్ప్రీతి కా
సన్నుల్ గండు పురీజనుల్ పొగడనో! చాణూర! యో! ముష్టికా!

10.1-1155-శార్దూల విక్రీడితము

రారా హస్తిపకేంద్ర! గండమదధారాగంధలోభాంధ గం
భీరాళివ్రజమైన మత్కువలయాపీడద్విపేంద్రంబు మ
ద్వారోదంచిత దేహళీపరిసరస్తంభంబు డాయంగ నా
భీరుల్ రా నదలించి డీకొలుపు మీ బీరంబు తోరంబుగన్.

10.1-1156-కంద పద్యము

పశువిశసనములు చేయుఁడు
పశుపతికిం బ్రియముగాఁగ భావించి చతు
ర్దశినాఁడు ధనుర్యాగము
విశదంబుగఁ జేయవలయు విజయముకొఱకున్.

## 10.1-132- కంసుడక్రూరునితోమాట్లాడుట

10.1-1157-వచనము

అని తనవారి నందఱ నయ్యైపనులకు నియమించి యదుశ్రేష్ఠుం డగు నక్రూరునిం బిలిచి చెట్టపట్టుకొని యిట్లనియె.

10.1-1158-శార్దూల విక్రీడితము

అక్రూరత్వముతోడ నీవు మనఁగా నక్రూరనామంబు ని
ర్వక్రత్వంబున జెల్లె మైత్రి సలుపన్ వచ్చున్ నినుం జేరి నీ
వక్రోధుండవు మందలోన బలకృష్ణాభీరు లస్మద్వినా
శక్రీడారతులై చరింతురఁట యోజందెచ్చి యొప్పింపవే.

10.1-1159-ఆటవెలది

నాకు వెఱచి సురలు నారాయణుని వేఁడి

కొనిన నతఁడు వచ్చి గోపకులము
నందు గృష్ణమూర్తి నానకదుందుభి
కుదితుఁ డయ్యె ననఁగ నొకటి వింటి.

10.1-1160-వచనము

కావున నీవు గోపకులచేత నరులుగొని ధనుర్యాగంబు చూడరండని వారలం దోడ్కొనిరమ్ము తెచ్చిన.

10.1-1161-శార్దూల విక్రీడితము

కొండల్గూలఁగఁ ద్రొబ్బు కొమ్ముల తుదిం గోపించి కోరాడుచో
దండిన్ దండి నధఃకరించు నొకవేదండంబు నా యింట బ్ర
హ్మాండంబైనఁ గదల్పనోపు బలకృష్ణాభీరులం బోరిలో
ఖండింపం దడవెంత? దాని కదియుం గాదేని యక్రూరకా!

10.1-1162-శార్దూల విక్రీడితము

చాణూరుండును ముష్టికుండును సభాసంఖ్యాతమల్లుల్ జగ
త్ప్రాణున్ మెచ్చరు సత్త్వసంపదల బాహాబాహి సంగ్రామపా
రీణుల్ వారలు రామకృష్ణుల బలోద్రేకంబు సైరింతురే?
క్షీణప్రాణులఁ జేసి చూపుదురు సంసిద్ధంబు యుద్ధంబునన్.

10.1-1163-సీస పద్యము

ఆ రామకేశవు లంతరించిన వసు;
దేవ ముఖ్యులఁ జంపి తెగువ మెఱసి
వృష్టి భోజ దశార్హ వీరులఁ దెగటార్చి;

ముదుకఁడు రాజ్యకాముకుఁడు ఖలుఁడు
నగు నుగ్రసేను మా యయ్య గీటడగించి;
పినతండ్రి దేవకుఁ బిలుకుమార్చి
మఱియు వైరులనెల్ల మర్దించి నే జరా;
సంధ నరక బాణ శంబరాది

10.1-1163.1-ఆటవెలది
సఖులతోడ భూమిచక్ర మేలెదఁ బొమ్ము
తెమ్ము వేగమ వసుదేవసుతుల
మఖము పేరు చెప్పి మంత్రభేదము చేయ
వలయుఁ బెంపఁ జనదు వైరి జనుల.

10.1-1164-వచనము
అనిన నక్రూరుం డిట్లనియె.

10.1-1165-ఉత్పలమాల
పంపినఁ బోనివాఁడనె నృపాలక! మానవులైన తమ్ము నూ
హింపరు దైవయోగముల నించుక గానరు తోఁచినట్లు ని
ష్కంపగతిన్ చరింతు రది గాదన వచ్చునె? యీశ్వరేచ్ఛఁ ద
ప్పింపఁగ రాదు నీ పగతుబిడ్డలఁ దెచ్చెదఁ బోయి వచ్చెదన్.

10.1-1166-వచనము
అని పలికి రథంబెక్కి యక్రూరుండు చనిన సకలజనులను వీడుకొలిపి కంసుం డంతిపురంబునకుం జనియె నంతఁ; గంసప్రేరితుండై.

## 10.1-133- కేశిని సంహారము

10.1-1167-సీస పద్యము

ఖురపుటాహతిఁ దూలి కుంభినీచక్రంబు;

 ఫణిరాజఫణలకు బరువుసేయ

భీషణహేషావిభీషితులై మింట;

 నమృతాంధు లొండొరు నండఁ గొనఁగఁ

జటులచంచలసటాచ్ఛటలగాడ్పుల మేఘ;

 ములు విమానములపై ముసుఁగు పడఁగ

వివృతాస్యగహ్వర విపులదంతంబులు;

 ప్రళయాగ్ని కీలల పగిది మెఱయఁ

10.1-1167.1-ఆటవెలది

గాలపాశలీలగా వాల మేపార

వాహ మగుచు గంధవాహగతుల

విజితశక్రపాశి వీర్యపయోరాశి

కేశి వచ్చె మంద క్లేశ మంద.

10.1-1168-వచనము

మఱియును.

10.1-1169-కంద పద్యము

భీషణ ఘోటక దానవ

హేషానిర్ఘోషభిన్నహృదయ నిఖిల గో

యోషా పురుషార్భకమై
ఘోషము హరి చూడ దైన్యఘోషం బయ్యెన్.

10.1-1170-వచనము

అయ్యవసరంబున.

10.1-1171-ఉత్పలమాల

పేదల ఘోషగోపకుల బిట్టదలించుట వీరధర్మమా?
కాదు; వ్రజంబులో దనుజఘస్మరుఁ డేడని తన్ను రోయు క్ర
వ్యాదునిఁ జూచి గోపకుల కడ్డమువచ్చి నిశాట! యింకఁ బో
రాదని శౌరి చీరె మృగరాజు క్రియన్నెదిరించె దైత్యుఁడున్.

10.1-1172-ఆటవెలది

నిష్ఠురోగ్ర సింహ నినదంబుతో నింగి
మ్రింగు భంగి నోరు మిగులఁ దెఱచి
కఱవరాగ నతఁడు కాటు తప్పించినఁ
దన్నె నెగసి తురగదానవుండు.

10.1-1173-ఉత్పలమాల

తన్నిన తన్నునంబడక దానవహంత సమీకరంతయై
కన్నులఁ గెంపు పెంపెనయ గ్రక్కున ఘోటనిశాటు పాదముల్
వన్నె చెడంగఁ బట్టి పడపైచె ధనుశ్శతమాత్రదూరమున్
పన్నగడింభమున్ విసరి పాఱఁగవైచు ఖగేంద్రు కైవడిన్.

10.1-1174-ఉత్పలమాల

పైచిన మ్రొగ్గి లేచి పెస వాజినిశాటుఁడు హుంకరించి సం
కోచము లేక పైఁ బడిన గోపకులేంద్రుఁడు దిగ్గజేంద్ర శుం
డాచటులప్రభాబల విడంబకమైన భుజార్గళంబు దో
షాచరునోటిలోన నిడెఁ జండఫణిన్ గుహ నుంచుకైవడిన్.

10.1-1175-శార్దూల విక్రీడితము

దంభోళిప్రతిమాన కర్కశ మహోద్యద్వామ దోఃస్తంభమున్
శుంభల్లీల నఘారి వాని రదముల్ చూర్ణంబులై రాలఁగా
గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి వీఁకన్ వృద్ధిఁ బొందించుచున్
గుంభించెం బవనంబు పిక్కటిలఁ దత్కుక్షిన్ నరేంద్రోత్తమా!

10.1-1176-కంద పద్యము

వాయువు వెడలక నిలిచిన
గాయంబు చెమర్పఁ గన్నుఁగవ వెలి కుఱకన్
మాయచెడి తన్నుకొనుచును
గూయుచు నశ్వాసురుండు గూలెన్ నేలన్.

10.1-1177-ఆటవెలది

ఘోటకాసురేంద్రు కుక్షిలోఁ గృష్ణుని
బాహువధికమైనఁ బట్టలేమిఁ
బగిలి దోసపండు పగిదిఁ దద్దేహంబు
వసుమతీశ రెండు వ్రయ్య లయ్యె.

10.1-1178-కంద పద్యము

నళినాక్షుఁడు లీలాగతి
విలయముఁ బొందించె నిట్లు వీరావేశిన్
బలలాశిన్ జగదభినవ
బలరాశిన్ విజితశక్రపాశిం గేశిన్.

## 10.1-134- నారదుడు కృష్ణునిదర్శించుట

10.1-1179-వచనము

ఆ సమయంబునం బుష్పవర్షంబులు గురియించి సురలు వినుతించి; రంత హరిభక్తివిశారదుండైన నారదుండు వచ్చి గోవిందుని సందర్శించి రహస్యంబున నిట్లనియె.

10.1-1180-సీస పద్యము

జగదీశ! యోగీశ! సర్వభూతాధార! ;
 సకలసంపూర్ణ! యీశ్వర! మహాత్మ!
కాష్ఠగతజ్యోతికైవడి నిఖిల భూ;
 తము లందు నొకఁడవై తనరు దీవు
సద్గూఢుఁడవు; గుహాశయుఁడవు సాక్షివి;
 నీ యంతవాఁడవై నీవు మాయఁ
గూడి కల్పింతువు గుణములు; వానిచేఁ;
 బుట్టించి రక్షించి పొలియఁజేయుఁ

10.1-1180.1-ఆటవెలది

దీ ప్రపంచ మెల్ల నిట్టి నీ విప్పుడు
రాజమూర్తులైన రాక్షసులను

సంహారించి భూమిచక్రంబు రక్షింప
నవతరించినాఁడ వయ్య! కృష్ణ!

10.1-1181-వచనము

దేవా! నీచేత నింక చాణూర ముష్టిక గజ శంఖ కంస యవన ముర నరక పౌండ్రక శిశుపాల దంతవక్త్ర సాల్వ ప్రముఖులు మడిసె దరు పారిజాతం బపహృతం బయ్యెడిని నృగుండు శాపవిముక్తుం డగు శ్యమంతకమణి సంగ్రహంబగు మృతబ్రాహ్మణపుత్రప్రదానంబు సిద్ధించు నర్జునసారథివై యనేకాక్షౌహిణీ బలంబుల వధియించె దవు; మఱియును.

10.1-1182-శార్దూల విక్రీడితము

**కృష్ణా!** నీ వొనరించు కార్యములు లెక్కింపన్ సమర్థుండె? వ
**ర్ధిష్ణుం**డైన విధాత మూడుగుణముల్ దీపించు లోపించు రో
**చిష్ణు**త్వంబుననుండు నీవలన; నిస్సీమంబు నీ రూపునిన్
**విష్ణున్** జిష్ణు సహిష్ణు నీశు నమితున్ విశ్వేశ్వరున్ మ్రొక్కెదన్.

## 10.1-135- వ్యోమాసురుని సంహారించుట

10.1-1183-వచనము

అని వినుతించి వీడుకొని నారదుం డరిగె; నంత నొక్కనాడు కృష్ణ సహితులై గోపకుమారు లడవికిం జని పసుల మేపుచు నొక్క కొండదండ నిలాయనక్రీడ చేసి; రందు.

10.1-1184-కంద పద్యము

కొం**ద**ఱు గొఱియల మంచును

గొందలు పాలకుల మంచుఁ గుటిలత్వమునం
గొందలు దొంగల మనుచును
జెంది కుమారకులు క్రీడఁజేసిరి తమలోన్.

10.1-1185-శార్దూల విక్రీడితము

ఆలో దొంగలలో మయాసురసుతుం డాద్యుండు వ్యోముండు గో
పాలుండై చని మేషకల్పనలతో భాసిల్లి క్రీడించు త
ద్బాలవ్రాతము నెల్ల మెల్లనఁ జతుఃపంచావశిష్టంబుగా
శైలాంతర్గుహలోనికిం గొనిచనెం జౌర్యం బవార్యంబుగన్.

10.1-1186-వచనము

ఇట్లు కొండగుహలోనఁ గ్రమక్రమంబున గోపకుమారుల నిడి యొక్క పెనుఱాతఁ దద్ద్వారంబుఁ గప్పి యెప్పటియట్ల వచ్చిన.

10.1-1187-ఉత్పలమాల

వీరుఁడు మాధవుం డఖిలవేది నిశాచరభేది నవ్వుతో
నౌర! నిశాట! దొంగతన మచ్చుపడెన్ నెఱదొంగ వౌదు; వా
భీరుల నెల్ల శైలగుహఁ బెట్టితి చిక్కినవారిఁ బెట్టరా;
రార యటంచుఁ బట్టె మృగరాజు వృకాఖ్యముఁ బట్టు కైవడిన్.

10.1-1188-ఉత్పలమాల

పంకజలోచనుం డొడిసి పట్టిన శైలనిభాసురాకృతిన్
బింకముతోడఁ బొంగి విడిపించుకొనంగ బలంబు లేమి లో
శంకిలి బిట్టు తన్నుకొనఁ జక్కన నా రణభీము వ్యోమునిం

గొంకకఁ గూల్చె నవ్విభుఁడు కోయని మింట సుపర్వు లార్వఁగన్.

10.1-1189-ఆటవెలది

ఘోర దనుజ నేల గూల్చి పర్వతగుహా
వాత నున్న ఊయి వ్రయ్యఁ దన్ని
గుహఁ జరించుచున్న గోపాలకులఁ గొంచు
బల్లిదుండు గోపపల్లి కరిగె.

## 10.1-136- అక్రూరుడు వ్రేపల్లెకొచ్చుట

10.1-1190-వచనము

అంత నా రాత్రి మథురానగరంబున నక్రూరుండు వసియించి మరునాడు రేపకడ లేచి నిత్యకృత్యంబు లాచరించి రథంబెక్కి కదలి నందగోకులంబునకుం బోవుచుం దెరువునం దనలో నిట్లనియె.

10.1-1191-ఉత్పలమాల

ఎట్టి తపంబుఁ జేయఁబడె? నెట్టి చరిత్రము లబ్ధమయ్యెనో?
యెట్టి ధనంబు లర్థులకు నీఁబడెనో తొలిబాමునందు; నా
యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టఁగలేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁ జూడఁ గల్గెడిన్.

10.1-1192-ఉత్పలమాల

సూరులు దొల్లి యే విభుని శోభితపాదనఖప్రభావళిం
జేరి భవాంధకారములఁ జిక్కక దాఁటుదు రట్టి దేవునిన్
వైరముతోడనైనఁ బిలువన్ ననుఁ బంచి శుభంబుఁ జేసె ని

ష్కారణ ప్రేమతోడ; నిదె కంసునిఁ బోలు సఖుండు గల్గునే.

10.1-1193-మత్తేభ విక్రీడితము

ఇతడాఁ కంసునిచేతఁ బంపువడి నన్ హింసింప నేతెంచినాఁ
డతిదుష్టుం డని చూచునో? సకలభూతాంతర్బహిర్మధ్య సం
గతుఁ డౌటం దలపోసి నన్ను సుజనుంగాఁ జూచునో? యెట్టి యు
న్నతిఁ గావించునొ? యేక్రియం బలుకునో? నా భాగ్య మెట్లున్నదో?

10.1-1194-వచనము

అని మఱియును.

10.1-1195-మత్తేభ విక్రీడితము

అలకభ్రాజితమై సుధాంశునిభమై హాసప్రభోద్దామమై
జలజాక్షంబయి కర్ణకుండలవిరాజద్గండమై యున్న యా
జలజాతాక్షు ముఖంబు చూడఁగలుగున్ సత్యంబుపో నాకు నా
వలదిక్కేగుచు నున్న వీ వనమృగవ్రాతంబు లీ త్రోవలన్.

10.1-1196-ఉత్పలమాల

మాపటివేళ నేను చని మాధవుపాదసమీప మందు దం
డాపతితుండనైన నతఁ డాశుగకాలభుజంగవేగ సం
తాపిత భక్తలోకభయదారణమైన కరాబ్జ మౌదలన్
మోపి హసించి నా కభయముం గృపతోడుత నీయకుండునే?

10.1-1197-వచనము

అని మఱియు నక్రూరుం డనేకవిధంబుల గోవింద సందర్శనంబు గోరుచు నమంద గమనంబున సుందర స్యందనారూఢుండయి చనిచని.

## 10.1-137- అక్రూరుడుబృందావనంగనుట

10.1-1198-కంద పద్యము

ముందటఁగనె ఘనచందన
కుంద కుటజ తాల సాల కురవక వట మా
కందన్ నందిత బల గో
విందన్ వికచారుణారవిందన్ బృందన్.

10.1-1199-వచనము

కని బృందావనంబుఁ దఱియంజొచ్చి యందు సాయంకాలంబున నడవికి నెఱిగల మేతల వెంబడి దిగంబడి రాకచిక్కిన కుఱ్ఱకోడె పడ్డ తండంబులం గానక పొద యిరువు మిట్టు పల్లంబనక తూఱి పాఱి వెదకి కానక చీరెడు గోపకుల యాహ్వానశబ్దంబు లాకర్ణించుచుఁ గోమలఘాసఖాదన కుతూహలంబులం జిక్కి మక్కువం గ్రేపులం దలంచి తలారింపక తమకంబులం దమతమ యంత నంభారావంబులు చేయుచు మూత్రంబులు స్రవింపఁ బరువులిడు ధేనువులును, ధేనువులకు నోసరించుచు సద్యోజాతంబులగు తర్ణకంబుల వహించి నవసూతికలు వెనుతగులుటవలన దామహస్తులై చను వల్లవుల మెల్లన విలోకించుచు, మంద యిరుకెలంకులం గళంకరహితులై పులి శివంగి వేఁగి లోనగు వాలుమెకంబుల మొత్తంబుల వలన నప్రమత్తులై కుఠారకుంత శరాసనప్రముఖాయుధంబులు ధరియించి కావలితిరుగు ప్రేలం గడచి; నానావిధ సరసతృణకబళ ఖాదనగరిష్ఠలై గోష్ఠంబులు ప్రవేశించి రోమంథలీలాలసలై యున్న

ధేనువులును, జన్నులుగుడిచి తల్లుల మ్రోలఁ బెల్లురేఁగి క్రేళ్ళుఱుకు లేగలుఁను, వెదలైన మొదవులం బైకొని పరస్పర విరుద్ధంబులై డీకొని కొమ్ములయుద్ధంబులు సలుపు వృషభంబులును, నకుంఠితబలంబులఁ కంఠరజ్జువులం ద్రెంచుకొని పొదలుఱికి దాఁటి తల్లులం దూటికుడుచు తఱపిదూడల దట్టించి పట్టనోపక గ్రద్దనఁ బెద్దలంజీరు గోపకుమారులును, గొడుకుల మగల మామలు మఱందుల వంచించి పంచాయుధభల్లభగ్నహృదయలయి గృహకృత్యంబులు మఱచి శంకిలక సంకేతస్థలంబులఁ గృష్ణాగమ తత్పరలయి యున్న గోపకామినులును, గోష్ఠప్రదేశంబుల గోవులకుఁ గ్రేపుల విడిచి యొడ్డుచు మరలం గట్టుచు నీడ్చుచుం గ్రీడించు గోపకులును, గోఖుర సముద్ధూత కరీషపరాగపటలంబులవలన నుల్లారి దులదుల నైన ధేనుదోహనవేళా వికీర్ణ పయోబిందు సందోహ పరంపరా సంపాదిత పంకంబులును, దోహనసమయ గోపకరాకృష్ట గోస్తన నిర్గతంబులయి కలశంబులందుఁ బడియెడు క్షీరధారల చప్పుళ్ళును, మహోక్షకంఠ సంస్పర్శనస్నిగ్ధంబులయిన మందిరద్వార దారుస్తంభంబుల పొంతలనుండి యులికిపడి నలుదిక్కులు గనుంగొని నూతనజనవిలోన కుపితంబులయి కరాళించు సారమేయంబులునుఁ గలిగి బలకృష్ణబాహుదండ ప్రాకారరక్షావిశేషభూషణంబైన ఘోషంబు బ్రవేశించి; అందు.

10.1-1200-కంద పద్యము

జలజాంకుశాది రేఖలు
గల హరిపాదముల చొప్పుఁ గని మోదముతో
బులకించి రథము డిగి యు
త్కలికన్ సంతోషబాష్పకలితాక్షుండై.

### 10.1-138- అక్రూరుడు బలకృష్ణులగనుట

10.1-1201-మత్తేభ విక్రీడితము

కని నక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రులన్ ధేనుదో
హనవాటీగతులన్ నలంకృతుల నుద్యద్భాసులం బీత నీ
ల నవీనోజ్జ్వలవాసులం గుసుమమాలాధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్యక్రమోద్దాములన్.

10.1-1202-కంద పద్యము

కని వారల పాదములకు
వినయంబున మ్రొక్కి భక్తి వివశుం డగుచుం
దనువునఁ బులకాంకురములు
మొనయఁగ నానందబాష్పములు జడిఁ గురియన్.

10.1-1203-వచనము

తదనంతరంబ.

10.1-1204-కంద పద్యము

అక్రూరులైన జనుల న
వక్రగతిం గాచు భక్తవత్సలుఁ డంత
న్నక్రూరుఁ గౌగలించెను
జక్రాంకిత హస్తతలముఁ జాచి నరేంద్రా.

10.1-1205-వచనము

మఱియు నక్రూరుఁడు బలభద్రునికిం బ్రణతుం డయినఁ నతండు గౌగలించి
చెట్టపట్టుకొని కృష్ణసహితుండై గృహంబునకుం గొనిపోయి మేలడిగి గద్దియనిడి

పాదప్రక్షాళనంబు చేసి మధుపర్కంబు సమర్పించి గోవునిచ్చి యాదరంబున రసవదన్నంబు పెట్టించి తాంబూల గంధ మాల్యంబు లొసంగె; నయ్యవసరంబున నందుం డుపవిష్టుండై యక్రూరుని సత్కరించి యిట్లనియె.

## 10.1-139- అక్రూరనందాదులసంభాషణ

### 10.1-1206-కంద పద్యము

చెలియలు మొఱయిడ నల్లుర
ఖలుఁడై పొరిగొనిన యట్టి కంసుఁడు బ్రదుకం
గలదే మనకి దశార్హుల
కిలపై? మీ క్షేమమింక నేమని యడుగన్?

### 10.1-1207-వచనము

అని పలికె నంత నక్రూరుం డొక పర్యంకంబున సుఖోపవిష్టుండై యుండ హరి యిట్లనియె.

### 10.1-1208-మత్తేభ విక్రీడితము

శుభమే నీకుఁ? బ్రమోదమే సఖులకుం? జుట్టాలకున్ క్షేమమే?
యుభయంబే ప్రజకెల్ల? గోత్రజులకత్యానందమే? మామ ము
క్తభయుండే? వసుదేవ దేవకులు తత్కారాగృహంబందు మ
త్ప్రభవవ్యాజనిబద్ధులై బ్రతికిరే ప్రాణానిలోపేతులై?

### 10.1-1209-మత్తేభ విక్రీడితము

నెఱి నేడిక్కడ నీవు రాఁగ వగతో నీతోడ నేమైన నా
కెఱుఁగం జెప్పుమటంచుఁ జెప్పరు గదా యేమందు? రా వార్త యే

తెఱఁగున్ లేదని డస్సిరో వగచిరో దీనత్వముండెందిరో
వెఱతో నా తలిదండ్రులెట్లు పడిరో? విన్పింపు మక్రూరకా!

10.1-1210-వచనము

మఱియు నీవేమి కారణంబున వచ్చి" తని హరి యడిగిన నతండు కంసునికి నారదుండు వచ్చి చెప్పిన వైరానుబంధ ప్రకారంబును గంసుండు దేవకీ వసుదేవుల వధియింపం గమకించి మానిన తెఱంగును ధనుర్యాగంబు పేరుచెప్పి పుత్తెంచిన ప్రకారంబు నెఱింగించిన రామకృష్ణులు నగి తమ్ముఁ బరివేష్టించిన నందాది గోపకులం జూచి కృష్ణుం డిట్లనియె.

10.1-1211-శార్దూల విక్రీడితము

భూనాథుండు మఖంబుఁ జూడఁ బిలువం బుత్తెంచినాఁ డవ్విభుం
గానం బోవలెఁ బాలు నెయ్యి పెరుగుల్లట్నంబులుం గానుకల్
మీ నేర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తగన్ మీమీ నివాసంబులన్
యానంబుల్గొనిరండు పోందు మధురాయాత్రాభిముఖ్యంబుగన్.

## 10.1-140- ప్రేతలు కలగుట

10.1-1212-వచనము

అని నియమించె నంత నక్రూరుండు మధురకు హరిం గొనిపోయెడి నని యెఱింగి ప్రేతలు గలంగి.

10.1-1213-మత్తేభ విక్రీడితము

హరినవ్వుల్ హరిమాటలున్ హరిమనోజ్ఞాలాపముల్ లీలలున్
హరివేడ్కల్ హరిమన్ననల్ హరికరాబ్జాలంబనాహ్వానముల్

హరిణీలోచన లందఱున్ మఱి యుపాయం బెట్లొకో యంచు లో
నెరియన్ ముచ్చట లాడిరంత గములై యేకాంత గేహంబులన్.

10.1-1214-వచనము

మఱియుం దమలో నిట్లనిరి.

10.1-1215-ఉత్పలమాల

మేటి గృహస్థు బ్రహ్మ యని మిక్కలి నమ్మితి మమ్మ చూడ నే
పాటియు లేదు మాకుఁ బరిపాలకుఁడైన సరోజనేత్రు ని
చ్చోట వసింపనీక నొకచోటికిఁ బో విధియించి పిన్నబి
డ్డాటలు చేసె నీ దుడుకు లక్కట! భారతికైనఁ జెప్పరే.

10.1-1216-వచనము

అని విధిం దూఱుచు మదనతాపాయత్త చిత్తలై.

10.1-1217-ఉత్పలమాల

రమ్మని చీరినంతనె పురంబున కేగెడుఁ గాని నన్ను నీ
కొమ్మలు నమ్మినారు మరుకోలల కగ్గము చేసి పోవఁగా
ముమ్మరమైన తాపమున మ్రొగ్గుదురో యనఁ డంబుజాక్షుఁ డా
యమ్మలు గోపవృద్ధులు ప్రయాణము వల్దనరైరి చెల్లరే!

10.1-1218-శార్దూల విక్రీడితము

అక్రూరుం డని పేరుపెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం
జక్రిన్ మాకడఁ బాపికొంచు నరుగం జర్చించి యేతెంచినాఁ
డక్రూరుం డఁట క్రూరుఁ డీతఁడు నిజం బక్రూరుఁ డౌనేని ని

ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి తన త్రోవంబో విచారింపఁడే?

10.1-1219-ఉత్పలమాల

ఫుల్లసరోజలోచనలు పూర్ణసుధాంశుముఖుల్ పురాంగనల్
మెల్లనె యెల్లి పట్టణము మేడలనుండి సువర్ణ లాజముల్
చల్లఁగ వారిఁ జూచి హరి సంగతి చేయఁదలంచుఁ గాక ప్రే
పల్లె వసించు ముద్దియలపైఁబడ నేల తలంచు నక్కటా!

10.1-1220-కంద పద్యము

పురసతుల విలోకనములు
సరసాలాపములు నర్మసంభోగములున్
మరిగి హరి మనల నొల్లఁడు;
నరవరు లో! యమ్మ! నూతనప్రియులు గదే.

10.1-1221-కంద పద్యము

పుట్టిన్నఁడు హరి నెఱుఁగని
పట్టణసుందరుల కితనిఁ బతిఁ జేసి కడున్
దట్టపు విరహాగ్నులకును
గట్టిఁడి దైవంబు ఘోషకాంతల వెదకెన్.

10.1-1222-మత్తేభ విక్రీడితము

హరినేలా కొనిపోయె దంచు మన మా యక్రూరుఁ బ్రార్థింతమా?
హరిఁ బోనీకుఁడు నిల్పరే యనుచు నేఁ డర్చింతమా పేల్పులన్?
హరిపాదంబుల కడ్డముల్ పడుదమా; హా దైవమా యంచు నా

తరుణుల్ కొప్పులుఁ జీరలున్ మఱచి కందర్పజ్వరభ్రాంతలై.

10.1-1223-మత్తేభ విక్రీడితము

ఉవిదల్ సిగ్గులుమాని కన్గవల నీ రొండొండ వర్షించుచున్
వివశత్వంబులతోఁ గపోలతట సంవిన్యస్త హస్తాబ్జలై
పవనోద్ధూతలతాభలై మముఁ గృపం బాలింపు గోవింద! మా
ధవ! దామోదర! యంచునేడ్చిరి సుజాతంబైన గీతంబులన్.

## 10.1-141- కృష్ణుడు మథురకుచనుట

10.1-1224-వచనము

అంత మఱునాడు సూర్యోదయకాలంబునం దనతోడఁ బయనంబునకు గమకించి నడచు గోపికలను “మరలివత్తు” నని దూతికా ముఖంబున నివర్తించి, కృష్ణుండు శకటంబులందుఁ గానుకలును గోరసంబు నిడికొని నందాదులైన గోపకులు వెనుదగుల నక్రూరచోదితంబైన రథంబెక్కి మథురాభిముఖుండై చను సమయంబున.

10.1-1225-చంపకమాల

అదె చనుచున్నవాఁడు ప్రియుఁ డల్లదె తేరదె పైజయంతి య
ల్లదె రథ ఘోటకాంఘ్రి రజమా దెస మార్గము చూడుఁ డంచు లో
నొదవెడి మక్కువన్ హరిరథోన్ముఖలై గములై వ్రజాంగన
ల్గదలక నిల్చిచూచి రటు కన్నుల కబ్బినయంత దూరమున్.

10.1-1226-వచనము

ఇట్లు నక్రూర రామ సహితుండై చనిచని.

10.1-1227-కంద పద్యము

అవలోకించెను గృష్ణుఁడు
ప్రవిమలకల్లోలపవన భాసితజన్య
న్నవసన్నపాపసైన్యం
గవిజనమాన్యం గళిందకన్యన్ ధన్యన్.

10.1-1228-వచనము

కని తత్కాళింది యందుఁ బరిక్షుణ్ణమణిగణసముజ్జ్వలంబులగు జలంబులు ద్రావి, తరుసమూహ సమీపంబున రామసహితుండై కృష్ణుండు రథంబు ప్రవేశించె; నంత నక్రూరుండు వారలకు మ్రొక్కి వీడ్కొని కాళిందీహ్రదంబు జొచ్చి విధిపూర్వకంబుగా వేదమంత్రంబులు జపియించుచు.

## 10.1-142- అక్రూరుని దివ్యదర్శనములు

10.1-1229-ఉత్పలమాల

స్నానము చేసిచేసి నది చల్లని నీటను రామకృష్ణులన్
మానుగఁ జూచి వారు రథమధ్యముపై వసియించి యున్నవా
రీ నది నీటిలోపలికి నెప్పుడు వచ్చి? రటంచు లేచి మే
ధానిధి చూచె వారిని రథస్థుల భక్తమనోరథస్థులన్.

10.1-1230-వచనము

చూచి వెఱఁగుపడి.

10.1-1231-శార్దూల విక్రీడితము

కంటిన్ మున్ను రథంబుపై; జలములోఁ గంటిం దుదిం గ్రమ్మఱం

గంటిం దొంటి రథంబుమీఁద; నిదె యీ కల్యాణచారిత్రు లే
వెంటం దోఁచిరి రెండుదిక్కుల; మనోవిభ్రాంతియో? నీటిలో
నుంటాశ్చర్యము చూతునంచుమఱియున్నూహించిమగ్నాంగుఁడై.

10.1-1232-ఉత్పలమాల

పోషిత బాంధవుండు యదుపుంగవుఁ డా జల మందుఁ గాంచె స
ద్భాషు సహస్రమస్తకవిభాసితభూషు నహీశు భూమిభృ
ద్వేషుఁ గృపాభిలాషుఁ బ్రతివీరచమూవిజిగీషు నిత్యసం
తోషు నరోషు నిర్దళితదోషు ననేకవిశేషు శేషునిన్.

10.1-1233-వచనము

మఱియు నీలాంబరసంయుతుండును సిద్ధోరగాది సన్నుతుండునునై యొప్పు నప్పాపఱేనిం దప్పక కనుంగొని.

10.1-1234-సీస పద్యము

ఆ భోగి భోగపర్యంకమధ్యంబున;
వలనొప్పు పచ్చని వలువవాని
మేఘంబుపై నున్న మెఱుఁగు చందంబున;
నురమున శ్రీదేవి యొప్పువాని
ముసురు తేఁటులు విప్ప ముఖచతుష్కముగల;
తనయుఁ డాడెడి బొడ్డుదమ్మివానిఁ
గదలని బహుపదక్రమవిశేషంబుల;
రవము చూపెడి నూపురములవాని

10.1-1234.1-ఆటవెలది

జలజగర్భ రుద్ర సనక సనందన
సద్ద్విజామరప్రశస్యమాన
చరితుఁడైనవాని సౌందర్యఖనియైన
వాని నొక్క పురుషవర్యుఁ గాంచె.

10.1-1235-వచనము

మఱియుఁ జారు లక్షణలక్షిత నఖ పాద గుల్ఫ జాను జంఘోరు కటి నాభి మధ్యోదరుండును, సాదరుండును, శ్రీవత్స కౌస్తుభ వనమాలికా విరాజిత విశాలవక్షుండును, బుండరీకాక్షుండును, శంఖ చక్ర గదా పద్మ హస్తుండును, సత్వగుణ ప్రశస్తుండును, బ్రహ్మసూత్ర కటిసూత్ర హార కేయూర కటక కంకణ మకరకుండల కిరీటాది విభూషణుండును, భక్తజనపోషణుండును, సుందరకపోల ఫాల నాసాధర వదన కర్ణుండును, నీలనీరదవర్ణుండును, గంబుకంధరుండును, గరుణాగుణబంధురుండును, ప్రహ్లాద నారద సునంద నంద ప్రముఖ సంభావితుండును, శ్రీ పుష్టి తుష్టి కీర్తి కాంతీలోర్జా విద్యాశక్తి మాయాశక్త్యాది సేవితుండునునై యొప్పు నప్పరమేశ్వరునకు మ్రొక్కి భక్తి సంభ్రమంబు లగ్గంబులుగ గద్గదకంఠుండై దిగ్గనం గరంబులు ముకుళించి యిట్లని వినుతించె.

## 10.1-143- శ్రీమానినీచోరదండము

10.1-1236-దండకము

" శ్రీమానినీమానచోరా! శుభాకార! వీరా! జగద్ధేతుహేతుప్రకారా! సమస్తంబు నస్తంగతంబై మహాలోలకల్లోలమాలాకులాభీల పాథోనిధిం గూలఁగా బాలకేళీగతిందేలి నారాయణాఖ్యం బటుఖ్యాతిఁ శోభిల్లు నీ నాభికంజంబులో

లోకపుంజంబులం బన్న విన్నాణి యై మన్న యా బమ్మ యుత్పన్నుఁ డయ్యెంగదా పావకాకాశవాతావనీవార్యహంకార మాయామహామానసాదుల్ హృషీకాదులున్ లోకముల్ లోకబీజంబులున్ నిత్యసందోహమై నీ మహాదేహమం దుల్లసించున్; వసించున్; నశించున్; జడత్వంబు లేకాత్మ యై యొప్పు నీ యొప్పిదం బెల్ల నోచెల్ల; చెల్లన్ విచారింపఁ దారెంత; వారెంత వారైన మాయాదులున్ మాయతోఁ గూడి క్రీడించు లోకానుసంధాత యౌ ధాత నిర్ణేతలే నీ కళారాశికిం గొంద ఱంభోజగర్భాదు లధ్యాత్మ లందున్న శేషాధిభూతంబు లందున్న నేకాధిదైవంబు లందున్ సదా సాక్షివై యుందువంచుం దదంతర్గతజ్యోతి వీశుండ వంచుం ద్రయీ పద్ధతిం గొంద ఱింద్రాదిదేవాభిదానంబులన్, నిక్కదొక్కండవంచున్ మఱిం గొంద ఱారూఢకర్మంబులం ద్రెంచి సంసారముం ద్రుంచి సన్యస్తులై మించి విజ్ఞానచక్షుండ వంచున్, మఱిం బాంచరాత్రానుసారంబునం దన్మయత్వంబుతోఁ గొందఱీ వాత్మ వంచున్, మఱిం గొందఱా వాసుదేవాది భేదంబులన్ నల్వురై చెల్వుబాటింతు వంచున్; మఱిన్నీవు నారాయణాఖ్యుండ వంచున్; శివాఖ్యుండ వంచున్; మఱిం బెక్కుమార్గంబులన్ నిన్ను నగ్గింతు;రెగ్గేమి; యేఱుల్ పయోరాశినే రాసులై కూడు క్రీడన్ విశేషంబు లెల్లన్ విశేషంబులై డింది నీ యందనూనంబు లీనంబులౌ; నేక రాకేందుబింబంబు కుంభాంతరంభంబులం బింబితంబైన వేఱున్నదే? యెన్నలా ఘటాంతర్గతాకాశముల్దద్ఘటాంతంబులం దేకమౌ రేఖ లోకావధిన్ వీకనే పోకలంబోక; యేకాకివై యుండు; దీశా! కృశానుండు నెమ్మోము, సోముండు భానుండు కన్నుల్ దిశల్ కర్ణముల్ భూమి పాదంబు లంభోనిధుల్గుక్షి, శల్యంబు లద్రుల్, లతాసాలముల్ రోమముల్, గాలి ప్రాణంబు, బాహుల్ సురేంద్రుల్, ఘనంబుల్ కచంబుల్, నభోవీధి నాభిప్రదేశంబు, రేలుంబగళ్ళున్ నిమేషంబు,

లంభోజగర్భుండు గుహ్యంబు, వర్షంబు వీర్యంబు, నాకంబు మూర్ధంబు గానేకమై యున్న నీమేని దండం బయోజాత గర్భాండముల్ మండితోదుంబరానేకహానేక శాఖా ఫలాపూరితానంత జంతుప్రకాండంబు లీలం బ్రసిద్ధోదరాశిష్ట జంతుప్రకారంబుగా నిండి యుండున్; మహారూప! నీ రూపముల్ వెగ్గలం బుగ్గడింపన్; లయాంభోధిలో మీనుమేనన్ విరోధిన్ నిరోధించి సాధించి మున్ వేధకున్ వేదరాశిం బ్రసాదింపవే; ద్రుంపవే కైటభశ్రీమధుం జక్రివై మొత్తవే; యెత్తవే మందరాగంబు రాగంబుతోఁ గూర్మలీలాపరిష్పందివై పందివై మేదినిన్ మీదికిం ద్రోచి దోషాచరుం గొమ్ములన్ నిమ్ములం జిమ్ముచుం గ్రువ్వవే త్రెవ్వవే ఘోరవైరిన్ నృసింహుండవై దండివై, దండి వైరోచనిం జూచి యాచింపవే, పెంపవే మేను బ్రహ్మాండమున్నిండఁ, బాహుండవై రాజకోటిన్ విపాటింపవే, రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్ విదారింపవే నొంపవే క్రూరులన్ వాసుదేవాది రూపంబులన్, శుద్ధ బుద్ధుండవై వైరిదా రాంతరంగంబులన్నంతరంగంబులుంగాఁ గరంగింపవే పెంపు దీపింపవే కల్కిమూర్తిం బ్రవర్తించు నిన్నెన్న నేనెవ్వఁడన్ నన్ను మాయావిపన్నున్ విషణ్ణుం బ్రపన్నుం బ్రసన్నుండవై ఖిన్నతం బాపి మన్నింపవే పన్నగాధీశతల్పా! కృపాకల్ప! వందారుకల్పా! నమస్తే నమస్తే నమస్తే నమః.

10.1-1237-మత్తేభ విక్రీడితము

కలలం బోలెడి పుత్రమిత్ర వనితాగారాది సంయోగముల్
జలవాంఛారతి యెండమావులకునాసల్ చేయు చందంబునం
దలఁతున్నిత్యములంచు; మూఢుఁడ వృథాతత్త్వజ్ఞుఁడన్నాకు నీ
విలసత్పాదయుగంబుఁ జూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ!

10.1-1238-వచనము

అని మఱియును వినుతింప నక్రూరునికి యమునాజలంబుల లోనం దన మొదలి మేను చూపి చాలించి నటునికైవడిఁ దిరోహితుండైన నక్రూరుండు నీరు వెడలి వెఱంగుపడుచు వచ్చి రథారోహణంబు చేసిన హరి యిట్లనియె.

10.1-1239-కంద పద్యము

జలములు చేరువ నున్నవి
తలవోయఁగ నీవు వోయి తడ వయ్యె; నదీ
జలమున నభమున ధరణిం
గలుగని చోద్యములు నీకుఁ గానంబడెనే?

10.1-1240-వచనము

అనిన నతం డిట్లనియె.

10.1-1241-కంద పద్యము

నీలోన లేని చోద్యము
లే లోకములందుఁ జెప్ప రీశ్వర! నీటన్
నేలన్ నింగిని దిక్కుల
నీలో చోద్యంబు లెల్ల నెగడు మహాత్మా!

10.1-1242-వచనము

అని పలికి సాయంకాలంబునకు నక్రూరుండు మధురానగరంబు చేర రథంబు గడపె నంతట నటమున్న చని నందాదులు పురోపవనంబున విడిసి యుండ వారలం గూడుకొని కృష్ణుం డక్రూరునిం జూచి “నీవు రథంబు గొనుచు నగరంబునకుం జనుము మేము వెనుక వచ్చెద” మనిన నతం డిట్లనియె.

10.1-1243-కంద పద్యము

నా యింటికి విచ్చేయుము

నీ యంఘ్రి సరోజరేణునికరము సోకన్

నా యిల్లు పవిత్రం బగు

శ్రీయుత! నీ భటునిఁ బెద్ద జేయం దగదే.

10.1-1244-వచనము

అని మఱియుం బ్రార్థించిన హరి యిట్లనియె.

10.1-1245-కంద పద్యము

యదుకుల విద్వేషణుఁడై

మదమున వర్తించు కంసు మర్దించి భవ

త్సదనంబుఁ జూడ వచ్చెదఁ

బొద యీ స్యందనముఁ గొనుచుఁ బురమున కనఘా!

10.1-1246-వచనము

అని పలికిన నక్రూరుండు పురంబునకుం జని రామకృష్ణులు వచ్చిరని కంసున కెఱింగించి తన గృహంబునకుం జనియె; నంత నపరాహ్ణంబున బలభద్ర గోపాల సహితుండై కృష్ణుండు.

## 10.1-144- కృష్ణుడు మథురనుగనుట

10.1-1247-మత్తేభ విక్రీడితము

పరిఖల్గోటలు కొమ్మలుం బడగలుం బ్రాసాదముల్ వీధులున్

హరులుందేరులువీరులుంగజములుంహర్మ్యంబులుం వాద్యముల్

తరుణుల్ ధాన్యములుం ధనంబులు మహోద్యానంబులుం దీర్ఘికల్
గర మాశ్చర్యరుచిం దనర్చు మధురం గాంచెన్ విభుం డంతటన్.

10.1-1248-వచనము

కని యప్పురంబు ప్రవేశించి వచ్చు సమయంబున.

10.1-1249-ఉత్పలమాల

నంద తపఃఫలంబు సుగుణంబుల పుంజము; గోపకామినీ
బృందము నోముపంట; సిరివిందు దయాంబుధి యోగిబృందముల్
డెందము లందుఁ గోరెడు కడింది నిధానము చేరవచ్చె నో!
సుందరులార! రండు చని చూతము కన్నుల కోర్కిదీరఁగన్.

10.1-1250-వచనము

అని మఱియు గోవింద సందర్శన కుతూహలంబునం బౌరసుందరులు పరస్పరాహూయమానలై భుంజానలై భోజన భాజనంబులు దలంగఁ ద్రోచియు, శయానలై లేచియు, నభ్యంజమానలై జలంబులాడకయు, గురుజనశిక్ష్యమాణలై యోడకయు, గృహకార్యప్రవర్త మానలై పరిభ్రమింపకయు, రమణరమమాణలై రమింపకయు, శిశుజనబిభ్రాణలై డించియు నలంకుర్వాణలై యన్యోన్య వస్త్రాభరణ మాల్యానులేపనంబులు వీడ్వడ ధరించియు నరిగి.

10.1-1251-కంద పద్యము

వీటఁ గల చేడె లెల్లను
హాటకమణిఘటితతుంగహర్మ్యాగ్రములం
గూటువులు గొనుచుఁ జూచిరి

పాటించి విశాలవక్షుఁ బద్మదళాక్షున్.

10.1-1252-సీస పద్యము

వీఁడటే రక్కసి విగతజీవగఁజన్నుఁ;
 బాలు ద్రావిన మేటిబాలకుండు;
వీఁడటే నందుని వెలఁదికి జగమెల్ల;
 ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు;
వీఁడటే మందలో వెన్నలు దొంగిలి;
 దర్పించి మెక్కిన దాఁపరీఁడు;
వీఁడటే యెలయించి ప్రేతల మానంబు;
 చూఱలాడిన లోకసుందరుండు;

10.1-1252.1-తేటగీతి

వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు
వీనిఁ బొందని జన్మంబు విగత ఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగ రుతము
వీనిఁ జూడని చూడ్కులు వృథలువృథలు;

10.1-1253-మత్తేభ విక్రీడితము

చెలియా గోపిక లీ కుమారతిలకుం జింతించుచుం బాడుచుం
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షించుచున్ హస్తగా
మలకక్రీడకుఁదెచ్చి నిచ్చలును సమ్మానంబులం బొందఁగాఁ
దొలి జన్మంబుల నేమి నోఁచిరొ కదే దుర్గప్రదేశంబులన్. ?

10.1-1254-కంద పద్యము

అని మఱియుఁ బౌరకాంతలు
మునుకొని హరిరూపు నేత్రముల వెంటను లోఁ
గొని తాల్చిరి హృదయములను
జనితప్రమదమున విరులు చల్లుచు నధిపా!

10.1-1255-వచనము

మఱియును.

10.1-1256-కంద పద్యము

నానావిధ గంధములు ప్ర
సూనఫలాదులును హరితశుభలాజములుం
గానుక లిచ్చుచు విప్రులు
మానుగఁ బూజించి రా కుమారోత్తములన్.

### 10.1-145- రజకునివద్ద వస్త్రముల్గొనుట

10.1-1257-వచనము

ఆ సమయంబున నగర ద్వారంబుననుండి వచ్చు రాగకారుం డగు నొక్క రజకునిం గాంచి హరి యిట్లనియె.

10.1-1258-ఉత్పలమాల

విందులమై నరేశ్వరుని వీటికి వచ్చితి మేము; మాకు మా
మందలలోనఁ గట్టికొన మంచి పటంబులు లేవు; నీ ముడిన్
సుందరధౌత చేలములు శోభిలుచున్నవి; తెమ్ము నిన్ను మే

లందెడు; నిమ్ము రాజుదెస నల్లుర; మో! రజకాన్వయాగ్రణీ!

10.1-1259-వచనము

అనిన రోషించి వాఁ డిట్లనియె.

10.1-1260-శార్దూల విక్రీడితము

ఎట్టెట్రా? మనుజేంద్రు చేలములు మీకీఁ బాడియే? మీరలుం
గట్టం బోలుదురే? పయోఘృతదధిగ్రాసంబులన్ మత్తులై
యిట్టాడం జనెఁగాక గొల్లలకు మీ కిట్లాడ నోరాడెడిం;
గట్టా! ప్రాణముఁ గోలుపోయెదు సుమీ కంసోద్ధతిన్ బాలకా!

10.1-1261-కంద పద్యము

మా రాజుసొమ్ము గైకొన
నే రాజులు వెఱతు; రింత యెల్లిదమే; నీ
కీ రాజరాజగృహమున
నీ రాజసమేల? గొల్ల! యేగుము తలఁగన్.

10.1-1262-వచనము

అనిన విని రోషించి.

10.1-1263-కంద పద్యము

ఘోర కరాగ్రతలంబున
ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁ గొట్టెం
బౌరుల గుండెలు పగులఁగ
వీరోద్రేకిన్ మదావివేకిం జాకిన్.

10.1-1264-వచనము

అంత భగ్నశిరుం డైన రజకుం జూచి వానివారలు వెఱచి పటంబులు డించి పఱచిన రామకృష్ణులు వలసిన వస్త్రంబులు ధరియించి కొన్ని గోపకుల కొసంగి చనుచుండ.

10.1-1265-కంద పద్యము

అంతట నొక వాయకుఁ డా
క్రంతన్ వసుదేవసుతులఁ గని బహువర్ణా
త్యంతమృదుపటాభరణము
లెంతయు సంతసముతోడ నిచ్చెన్ మెచ్చన్.

10.1-1266-శార్దూల విక్రీడితము

కారుణ్యంబున వానిఁ గైకొని యలంకారంబు గావించి శృం
గారోదంచిత దిగ్గజేంద్ర కలభాకారంబులం బొల్చి రా
శూరుల్; మాధవుఁ డంత వాయకుని శుశ్రూషన్ మహాప్రీతుఁడై
సారూప్యంబును లక్ష్మియున్నొసఁగె నైశ్వర్యాది సంధాయియై.

## 10.1-147- సుదామునిమాలలుగైకొనుట

10.1-1267-వచనము

అంత నా రామకృష్ణులు సుదాముం డను మాలాకారుగృహంబునకుం జనిన; నతండు గని లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన నర్ఘ్యపాద్యాదికంబు లాచరించి; సానుచరులయిన వారలకుఁ దాంబూల కుసుమ గంధంబు లొసంగి యిట్లనియె.

10.1-1268-ఉత్పలమాల

పావనమయ్యె నా కులము; పండెఁ దపంబు; గృహంబు లక్ష్మికిన్
సేవితమయ్యె; నిష్టములు చేకుఱె; విశ్వనిదానమూర్తులై
భూవలయంబుఁగావ నిటు పుట్టిన మీరలు రాకఁ జేసి నే
నే విధ మాచరింతుఁ? బను లెయ్యవి? బంట; నెఱుంగ జెప్పరే.

10.1-1269-వచనము

అని పలికి.

10.1-1270-కంద పద్యము

దామోదర రాముల కు
ద్దామయశోహసితతుహినధాములకు వధూ
కాములకుఁ దెచ్చి యిచ్చె సు
దాముఁడు ఘనసురభికుసుమదామము లధిపా!

10.1-1271-కంద పద్యము

వారును మాలికుఁ డిచ్చిన
భూరి కుసుమ దామములను భూషితులై నీ
కోరిన వరమిచ్చెద మని
కారుణ్యము చేయ నతఁడు గని యిట్లనియెన్.

10.1-1272-కంద పద్యము

నీ పాదకమలసేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును

దాపసమందార! నాకు దయచేయఁ గదే.

10.1-1273-వచనము

అని వేఁడికొనిన నిచ్చి మఱియు మాధవుండు మ్మాలికునకు బలాయుః కాంతి కీర్తిసంపద లొసంగి వాని గృహంబు వెడలి రాజవీధిం జనిచని.

## 10.1-148- కుబ్జననుగ్రహించుట

10.1-1274-కంద పద్యము

ఆ నళినాక్షుఁడు గాంచెను
నానా లేపముల భాజనముఁ జేఁగొనుచుం
బూని చనుదెంచు దానిని
నాననరుచినిచయ వినమితాబ్జం గుబ్జన్.

10.1-1275-వచనము

కని యిట్లనియె.

10.1-1276-కంద పద్యము

ఎవ్వరిదానవు? లేపము
లెవ్వరికిం గోరి కొనుచు నేగెదు? నీ పే
రెవ్వరు మా కిమ్మిన్నియు
నివ్వటిలెదు చక్క నగుచు నీరజనేత్రా!

10.1-1277-వచనము

అని నయ్యబల యిట్లనియె.

10.1-1278-ఉత్పలమాల

చక్కనివాఁడ వౌదు; సరసంబుల నొంపకు; మెల్ల వారికిం
జక్కఁదనంబు లెక్కుడివి; చారుశరీర! త్రివక్ర యండ్రు; నే
నిక్కము కంసుదాసిని; వినిర్మలలేపనవిద్యదాన; నన్
మిక్కలి రాజుమెచ్చుఁ; దగ మీరు విలేపనముల్ ధరింపరే.

10.1-1279-కంద పద్యము

అని పలికి యా కుమారుల
తనువులు నగవులును వీక్షితమ్ములు మాటల్
తన చిత్తముఁ గరఁగించిన
ననులేపము లిచ్చె వారి కబల ప్రియముతోన్.

10.1-1280-సీస పద్యము

ఇవ్విధంబునఁ గుబ్జ యిచ్చిన లేపంబు;
లన్నియుఁ దాను దేహమున నలఁది
కొని ప్రసన్నత నొంది కుబ్జ మువ్వంకల;
యొడలు చక్కఁగ నొత్తి యునుపఁ దలఁచి
తత్పదంబుల మీఁదఁ దన పదంబులు ద్రొక్కి;
హస్తాంగుళద్వయ మబల గవుద
క్రింద విప్పుగ నిడి కృష్ణుఁడు మీఁదికి;
నెత్తఁగ వక్రత లెల్ల మాని

10.1-1280.1-ఆటవెలది

చక్కనైన చిత్తజన్ము బాణము క్రియఁ

గోమరు మిగులఁ బిఱుఁదుఁ గుచయుగంబు
సొంపుఁ జేయఁ దరుణి సుందరమూర్తి యై
కమలనయనుఁ జూచి కాంక్షతోడ.

10.1-1281-కంద పద్యము

వేంచేయుము నా యింటికిఁ
బంచశరాకార! యనుచుఁ బైకొం గాక
ర్షించి హరిఁ దిగిచెఁ గామిని
పంచాశుగబాణజాల భగ్నహృదయయై.

10.1-1282-కంద పద్యము

కామిని తిగిచినఁ గృష్ణుఁడు
రాముని వీక్షించి నగుచు రాజానన మ
త్కామితముఁ దీర్చి పిదపన్
నీ మందిరమునకు వత్తు నే డలుగకుమీ.

10.1-1283-వచనము

అని వీడుకొలిపి కృష్ణుండు విపణిమార్గంబునం జనిచని తాంబూల మాలికాగంధంబులును బహువిధంబు లయిన కానుకలు పౌరు లిచ్చినఁ బరిగ్రహించుచు ధనుశ్శాల కరిగి యందు.

## 10.1-149- విల్లువిరుచుట

10.1-1284-కంద పద్యము

సురరాజు వింటికైవడి

గురుతరమై భూరివీరగుప్తంబై దు
స్తరమైన విల్లు వొడగని
నరులు వల దనంగ బిట్టు నగి వికసితుఁడై.

10.1-1285-శార్దూల విక్రీడితము

బంధుల్ మేలన వామహస్తమునఁ జాపంబెత్తి మౌర్వీలతా
సంధానం బొనరించి కొంచెపు తెగన్ శబ్దించుచున్ ధీరతా
సింధుం డా హరి దాని ఖండితముగాఁ జేసెన్ జనుల్ చూడగా
గంధేభంబు రసాలదండము నొగిన్ ఖండించు చందంబునన్.

10.1-1286-కంద పద్యము

కోదండభగ్న నిర్గత
నాదము వీనులకు భీషణం బై యాశా
రోదోంతరములు నిండుచు
భేదించెన్ భోజవిభుని బింకము నధిపా!

10.1-1287-వచనము

అప్పుడు.

10.1-1288-ఉత్పలమాల

అద్దిర రాచవిల్విఱిచె నర్భకుఁ డింతయు శంకలేక నే
డుద్ధవిడిన్ సహింపఁ దగ దుగ్రతఁ బట్టుద మంచుఁ గ్రుద్ధులై
గ్రద్దన లేచి తద్ధనువు కావలివా రరుదేర వారి న
య్యుద్ధఱుఁ గూడిఁబట్టి మడియించిరి కార్ముకఖండహస్తులై.

10.1-1289-వచనము

ఇట్లు రామకృష్ణులు మథురాపురంబున విహరించి వెడలి విడిదులకుం జనిరి అంత.

## 10.1-150- సూర్యాస్తమయవర్ణన

10.1-1290-మత్తేభ విక్రీడితము

గగనారణ్యచరాంధకారగజముం గాలాహ్వయవ్యాధుఁ డ
చ్ఛగఁ బట్టం గమకించి మచ్చిడుటకై చూతాంకురశ్రేణిచే
నొగిఁ గల్పించిన కందుకం బనఁగ సూర్యుం డంత వీక్షింపఁగాఁ
దగె మందప్రభతోడఁ బశ్చిమ మహాధాత్రీధరేంద్రంబునన్.

10.1-1291-కంద పద్యము

తరుణుఁడగు శీతకిరణుని
మరిగి వియల్లక్ష్మి తన్ను మాని ముదుకఁడున్
ఖరకరుఁడు ననుచుఁ ద్రోబ్బిన
కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా!

10.1-1292-ఆటవెలది

కళలు గలుగుఁ గాక; కమల తోడగుగాక;
శివునిమౌళిమీఁదఁ జేరుఁ గాక;
యన్య నొల్లఁ దపనుఁ డైన మత్పతి యని
సాధ్విభంగిఁ గమలజాతి మొగిడె.

10.1-1293-కంద పద్యము

సుందర సాయంసంధ్యా
వందన విప్రార్ఘ్యతోయ వజ్రహతోద్య
న్మందేహాసుర రక్త
స్యందము క్రియఁ గెంపునొంపె సఁగె నపరదిశన్.

10.1-1294-ఆటవెలది

భూమి నిండి మింటఁ బూర్ణమై కర్కట
మకర మీనరాశి మహితమైన
హరియశస్సుధాబ్ధి యందుల తుంపురు
లనఁగఁ జుక్క లొప్పె నాకసమున.

10.1-1295-కంద పద్యము

ఎల్లదిశలు నిండిన శ్రీ
వల్లభుగుణమహిమ బ్రహ్మ వాసించుటకై
చల్లిన మృగమద మనఁగా
పెల్లివిరిసెఁ దమము గగనవీథుల నెల్లన్.

10.1-1296-కంద పద్యము

ఆ చీఁకటి వెనుదగిలినఁ
బ్రాచీదిశనుండి గంతు పరువున రవి భ
ర్మాచలము మలఁక త్రోవను
వే చనియెంగాక నిలిచి విఱుఁగక యున్నే.

10.1-1297-ఉత్పలమాల

మీకును వైరి; యెప్పుడును మిక్కలి మాకును వైరి; రాజు దో
షాకరుఁ; డింక వచ్చు జలజాతములార! మదీయ బాలురం
జేకొనుఁ డంచు బాలకులఁ జీఁకటి దాఁచిన భంగిఁ జిక్కి రా
రాక వసించెఁ దుమ్మెదలు రాత్రి సరోరుహకుట్మలంబులన్.

## 10.1-151- చంద్రోదయవర్ణన

10.1-1298-సీస పద్యము

ప్రాచీదిశాంగనా ఫాలతలంబున;
దీపించు సింధూరతిలక మనఁగ
దర్పించి విరహుల ధైర్యవల్లులు త్రెంప;
దర్పకుం డెత్తిన దాత్ర మనఁగ
నలిగి కాలకిరాతుఁ డంధకారమృగంబు;
ఖండింప మెఱయించు ఖడ్గ మనఁగ
గగనతమాలవృక్షము తూర్పుకొమ్మను;
లలితమై మెఱయు పల్లవ మనంగఁ

10.1-1298.1-తేటగీతి

దొగలు సంతసిల్ల దొంగలు భీతిల్లఁ
గడలి మిన్నుముట్టి కడలుకొనఁగఁ
బొడిచె శీతకరుఁడు భూరిచకోరక
ప్రీతికరుఁడు జారభీతికరుఁడు.

10.1-1299-కంద పద్యము

దర్పిత తారాధిప పరి

సర్పిత కిరణౌఘమిళిత సకలదిశంబై
యేర్పడి కమలభవాండము
కర్పూరపు క్రోవి భంగిఁ గనుపట్టె నృపా.

10.1-1300-కంద పద్యము

ఆ రేయి గోపయుతులై
క్షీరాన్నముఁ గుడిచి రామకృష్ణులు మదిఁ గం
సారంభ మెఱిఁగి యిష్ట వి
హారంబుల నప్రమత్తులై యుండి రిటన్

## 10.1-152- కంసుడుదుశ్శకునముల్గనుట

10.1-1301-కంద పద్యము

తన పురికి రామకృష్ణులు
చనుదెంచి నిజానుచరులఁ జంపుటయు మహా
ధనువుఁ గదిసి విఱుచుటయును
విని కంసుఁడు నిద్రలేక విహ్వాలమతియై.

10.1-1302-సీస పద్యము

కర్ణరంధ్రములు చేఁ గప్పిన లోపలి;
 ప్రాణ ఘోషము వినఁబడక డిందెఁ
దోయాదికములందుఁ దొంగిచూచుచు నుండ;
 తల గానరాదయ్యెఁ దనువుమీఁదఁ
గరశాఖ నాసికాగ్రంబుపై నిడి చూడ;
 గ్రహతారకలు రెంటఁ గానబడియె

వెలుఁగున నిలుచుండి వీక్షింపఁగా మేని;
 నీడ సరంధ్రమై నేలఁ దోఁచె

10.1-1302.1-ఆటవెలది

నడుగుజాడ దృష్టమౌట లే దయ్యెను
దరువులెల్ల హేమతరువు లగుచు
మెఱయుచుండెఁ గాలమృత్యువు డగ్గఱ
బుద్ధి యెల్లఁ గలఁగె భోజపతికి.

10.1-1303-కంద పద్యము

గరళముఁ దినుటయుఁ బ్రేతము
బరిరంభించుటయు నగ్నభావుఁ డవుటయున్
శిరమునఁ దైలము పడుటయు
ఖరపతి నెక్కుటయు నతఁడు కలలోఁ గనియెన్.

10.1-1304-వచనము

మఱియు రక్త కుసుమమాలికాధరుండై యొక్కరుండును నెక్కడేనియుం జనుచున్నవాఁడ నని కలఁ గాంచి మరణహేతుకభీతిం జింతాక్రాంతుండై నిద్రఁజెందక వేగించుచున్న సమయంబున.

10.1-1305-కంద పద్యము

అరుణ హరినఖర విదళిత
గురుతిమిరేభేంద్రకుంభకూట వినిర్ము
క్త రుధిర మౌక్తికముల క్రియ

సురపతిదిశఁ గెంపుతోడి చుక్కలు మెఱసెన్.

## 10.1-153- సూర్యోదయవర్ణన

10.1-1306-సీస పద్యము

పౌలోమి తన బాలు పాన్పుపైఁ గనుపట్టఁ;
 బన్నిన పవడంపుబంతి యనఁగ
నాయురర్థముల వ్యయంబు లొత్తులి చాటు;
 కాలశాంఖికు చేతి ఘంట యనఁగ
ఘనజంతుజీవితకాలరాసుల విధి;
 గొల్వనెత్తిన హేమకుంభ మనఁగఁ
బశ్చిమదిక్కాంత పరఁగఁ గైసేయుచో;
 ముందర నిడుకొన్న ముకుర మనఁగఁ

10.1-1306.1-తేటగీతి

గోకతాపోపశమదివ్యఘుటిక యనఁగఁ
బద్మినీకాంత నోములఫల మనంగ
మూఢుమూర్ఖుల సారంపు ముద్ద యనఁగ
మిహిరమండల ముదయాద్రిమీఁద నొప్పె.

10.1-1307-కంద పద్యము

వచ్చెం జల్లని గాడ్పులు
విచ్చెం గమలములు; దమము విరిసి బిలంబుల్
చొచ్చెం; బద్మమరందము
మెచ్చెం దుమ్మెదలు గ్రోలి మిహిరుఁడు పొడమన్.

10.1-1308-కంద పద్యము

సంకాశితోదయాచల

పంకజసఖ కిరణరాగ పరిపూర్ణంబై

పంకేరుహగర్భాండము

కుంకుమసలిలంబు ద్రోవి గ్రొమ్మరున నొప్పెన్.

10.1-1309-వచనము

తదనంతరంబ.

## 10.1-154- మల్లరంగవర్ణన

10.1-1310-సీస పద్యము

పాషాణ వల్మీక పంకాది రహితంబు;

మృదులకాంచననిభ మృణ్మయంబు

గమనీయ కస్తూరికా జలసిక్తంబు;

బద్ధచందనదారు పరివృతంబు

మహనీయ కుసుమదామధ్వజ తోరణ;

మండితోన్నత మంచ మధ్యమంబు

బ్రాహ్మణ క్షత్రాది పౌరకోలాహలం;

బశ్రాంత తూర్యత్రయాంచితంబు

10.1-1310.1-ఆటవెలది

నిర్మలంబు సమము నిష్కంటకంబునై

పుణ్యపురుషుమనముఁ బోలి కంస

సైన్య తుంగ మగుచు సంతుష్ట లోకాంత

రంగమైన మల్లరంగ మొప్పె.

10.1-1311-కంద పద్యము

ఆ మల్లరంగ పరిసర
భూమిస్థిత మంచమందు భోజేంద్రుఁడు మా
న్యామాత్యసంయుతుండై
భూమీశులు గొలువ నుండె బొ్క్కుచు నధిపా.

10.1-1312-మత్తేభ విక్రీడితము

సకలాంభోనిధి మేఖలావహనముం జాలించి యేతెంచు నా
గకులాగంబుల భంగి నొప్పుచుఁ దగం గైసేసి చాణూర ము
ష్టికకూటుల్ చలకోసలుల్ గురువులన్ సేవించుచున్ రంగధా
త్రికి నేతెంచిరి తూర్యఘోషముల నుద్రేకం బనేకంబుగన్.

10.1-1313-కంద పద్యము

నందాదులైన గోపకు
లందఱు చని కానుకలు సమర్పించి నృపున్
సందర్శించి తదనుమతిఁ
జెంది మహామంచమున వసించిరి వరుసన్.

10.1-1314-వచనము

అంత నా రామకృష్ణులు నలంకృతులై మల్లదుందుభి నినదంబు విని సందర్శన కుతూహలంబున.

10.1-1315-కంద పద్యము

ఓడక రంగద్వారము
జాడం జని వారు గనిరి సమద కువలయా
పీడంబున్ భిన్నపరా
క్రీడంబుం బ్రమదకంటకిత చూడంబున్.

## 10.1-155- కరిపాలకునితోసంభాషణ

10.1-1316-వచనము

కని తత్కరిపాలకశ్రేష్ఠుండైన యంబష్ఠునికి మేఘనాదగంభీర భాషణంబుల రిపుభీషణుం డగు హరి యిట్లనియె.

10.1-1317-శార్దూల విక్రీడితము

ఓరీ! కుంజరపాల! మా దెసకు నీ యుద్యన్మదేభేంద్రముం
బ్రేరేపం బనిలేదు; ద్రిప్పు మరలం బ్రేరేపినన్ నిన్ను గం
భీరోగ్రాశనితుల్య ముష్టిహతులన్ భేదించి నే డంతకుం
జేరంబుత్తు మహత్తరద్విపముతో సిద్ధంబు యుద్ధంబునన్.

10.1-1318-వచనము

అని పలికి.

10.1-1319-మత్తేభ విక్రీడితము

మించిన కొప్పుఁ జక్కనిడి మేలనఁ బచ్చనిచీర కాశ బం
ధించి లలాట కుంతలతతిన్ మరలించుచు సంగరక్రియా
చుంచుతఁ బేర్చి బాలకుఁడు చూచు జనంబులు దన్ను బాపురే!
యంచు నుతింప డగ్గఱియె హస్తజితాగము గంధనాగమున్.

## 10.1-156- కువలయాపీడముతోఁబోరుట

10.1-1320-కంద పద్యము

**అంజక బాలకుఁ డనియును**

**గొంజక దయమాలి రాజకుంజర! యంతన్**

**గుంజరమును డీకొలిపెను**

**గుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁదన్.**

10.1-1321-వచనము

మఱియు నయ్యనేకపం బనేకపపాలక ప్రేరితంబై, మహావాత సంఘాత సముద్ధూతంబగు విలయకాల కీలి కేళిని బిట్టుమిట్టిపడి, మృత్యుదేవత యెత్తునం, గాలు వోలిక శమను గమనిక నెదిరి మదసలిల పరిమళ లుబ్ధ పరిభ్రమదదభ్ర భ్రమర గాయక ఝుంకృతుల హుంకృతి నొంపు సంపాదింపం గులకుంభినీధర గుహాకుంభ గుంభనంబుగ ఘీంకరించి, రోషభీషణ శేషభోగిభోగ భయంకరంబగు కరంబున శౌరింజీరి, చీరికింగొనక, పట్టఁ నందుపట్టి యట్టిట్టు గెంటి, విధుంతుద వదన గహ్వరంబువలన విడివడి యుఱుకు తరణి కరణి దర్పించి కుప్పించి, పాదమధ్యంబునకు నసాధ్యుండై దూఁటి, దాఁటి మాటుపడినం సింధురంబు గ్రోధబంధురంబై మహార్ణవమధ్య మంథాయమాన మంథరమహీధరంబుకైవడి జిఱజిఱం దిరిగి కానక భయానకంబై కాలివెరవునం గని వొంగి చెంగటం బ్రళయదండడిదండ ప్రశస్తంబగు హస్తంబువంచి వంచించి చుట్టిపట్టి పడవేయం గమకించినం జలింపక తెంపున హరి కరి పిఱింది కుఱికి మహారాహు వాలవల్లికాకర్షణోద్దీర్ణుండగు సుపర్ణు తెఱంగున నెగిరి శుండాలంబు వాలంబు లీలం గేల నొడిసిపట్టి జళిపించి పంచవింశతి బాణాసనప్రమాణ

దూరంబున జిఱజిఱం ద్రిప్పి పైవ, నవ్వారణంబు దుర్నివారణంబై రణంబున కోహటింపక సవ్యాపసవ్యపరిభ్రమణంబుల నవక్రంబై కవిసిన నపసవ్యసవ్యక్రమణంబులఁ దప్పించి యొప్పి కుప్పించి యెదుర్కొని కర్కశుండై మేచకాచలతుంగ శృంగ నిభంబగు కుంభికుంభంబు చక్కటి వ్రక్కలై చెక్కులెగయ దురంత కల్పాంత జీమూత ప్రభూత నిర్ఘాత నిష్ఠురంబగు ముష్టి సారించి యూఁచి పొడిచినం దద్వికీర్ణపూర్ణ రక్తసిక్త మౌక్తికంబులు వసుంధరకు సంధ్యారాగ రక్త తారకాచ్ఛన్నం బగు మిన్ను చెన్నులవరింప నిలువరింపక మ్రొగ్గి మోఁకరిలి మ్రగ్గక దిగ్గన నగ్గజంబు లేచి చూచి త్రోచి నడచి, సంహారసమయ సముద్ర సంఘాత సంభూత సముత్తుంగ భంగ సంఘటితంబగు కులాచలంబుక్రియఁ గ్రమ్మఱ నమ్మహాభుజుని భుజాదండంబువలన ఘట్టితంబై, కట్టలుక ముట్టి నెట్టి డీకొని ముమ్మరమ్ముగం గొమ్ములంజిమ్మిన నమ్మేటి చేసూటి మెఱసి హస్తాహస్తిసంగరంబునఁ గరంబొప్పి దప్పింబడ నొప్పించిన నకుంఠితకాలకంఠ కఠోర భల్లభగ్నంబగు పురంబు పగిది జలధిం జటుల ఝుంఝానిలవికలంబగు కలంబుకైవడి నమ్మదకలభంబు బలంబు దక్కి చిక్కి స్రుక్కిపడి లోభికరంబునుంబోలె దానసలిల ధారావిరహితంబై విరహి తలంపునుం బోలె నిరంతర చిత్తజాతజనక నిగ్రహంబై గ్రహణకాలంబునుబోలెఁ బరాధీనఖరకరంబై ఖరకరోదయంబునుంబోలె భిన్నపుష్కరంబై పుష్కరవైరి విలసనంబునుం బోలె నభాసిత పద్మకంబై యున్న సమయంబున.

10.1-1322-ఉత్పలమాల

కాలం ద్రొక్కి సలీలుఁడై నగవుతోఁ గంఠీరవేంద్రాకృతిం
గేలన్ భీషణ దంతముల్ పెఱికి సంక్షీణంబుగా మొత్తి గో
పాలగ్రామణి వీరమౌళిమణియై ప్రాణంబులం బాపె నా

శైలేంద్రాభముఁ బ్రాణలోభము నుఁదంచత్సారగంధేభమున్.

## 10.1-158- మల్లావనీప్రవేశము

10.1-1323-వచనము

మఱియు దంతిదంత తాడనంబుల దంతావళపాలకుల హరించి తత్ప్రదేశంబుఁ బాసి.

10.1-1324-మత్తేభ విక్రీడితము

కరిదంతంబులు మూఁపులందు మెఱయన్ ఘర్మాంబువుల్మోములన్
నెరయన్ గోపకు లంతనంత మెలయన్ నిత్యాహవస్థేము లా
హరిరాముల్ చనుదెంచి కాంచిరి మహోగ్రాడంబరాపూరితా
మరమర్త్యాది జనాంతరంగము లసన్మల్లావనీరంగమున్.

10.1-1325-సీస పద్యము

మహితరౌద్రంబున మల్లుర కశనియై;
నరుల కద్భుతముగ నాథుఁ డగుచు
శృంగారమునఁ బురస్త్రీలకుఁ గాముఁడై;
నిజమృత్యువై కంసునికి భయముగ
మూఢులు భీభత్సమును బొంద వికటుఁడై;
దండ్రికి దయరాఁగఁ దనయు డగుచు
ఖలులకు విరసంబుగా దండియై గోప;
కులకు హాస్యంబుగాఁ గులజుఁ డగుచు

10.1-1325.1-ఆటవెలది

బాంధవులకుఁ బ్రేమ భాసిల్ల వేలుపై
శాంత మొనర యోగి జనుల కెల్లఁ
బరమతత్త్వ మగుచు భాసిల్లె బలునితో
మాధవుండు రంగమధ్య మందు.

10.1-1326-వచనము

అప్పుడు.

10.1-1327-కంద పద్యము

చచ్చిన కుంభీంద్రంబును
వచ్చిన బలమాధవులను వరుసం గని తా
నొచ్చిన చిత్తముతోడుతఁ
జెచ్చెరఁ గడు వెఱచె భోజసింహుం డధిపా.

10.1-1328-ఉత్పలమాల

ధీరుల వస్త్రమాల్యమణిదీప్త విభూషణధారులన్ నటా
కారుల సర్వలోకశుభకారుల మానవమానినీ మనో
హారుల రంగభూతల విహారుల గోపకుమారులన్ మహా
వీరులఁ జూచిచూచి తనివిం దుదిముట్టక లోకు లందఱున్.

10.1-1329-ఉత్పలమాల

సన్నుత రామకృష్ణముఖచంద్రమయూఖ సుధారసంబులం
గన్నులఁ ద్రావు చందమునఁ గాంచుచు జిహ్వల నంటి చూచు లీ
లన్నుతి చేయుచుం గరములం బరిరంభము చేయు భంగి న

త్త్యున్నతిఁ జూపుచుం దగిలి యొండొరుతోడ రహస్యభాషలన్.

10.1-1330-కంద పద్యము

వసుదేవు నివాసంబున

వసుధన్ రక్షింప వీరు వైష్ణవతేజో

ల్లసనమునఁ బుట్టినారఁట

పసిబిడ్డ లనంగఁ జనదు పరదేవతలన్.

10.1-1331-సీస పద్యము

చంపె రక్కసిఁ బట్టి; చక్రవాకునిఁగూల్చెఁ;

బడ ద్రొబ్బె మద్దుల; బకునిఁ జీఱె;

నఘుదైత్యుఁ బొరిగొనె; నడరి వత్సకుఁ ద్రుంచె;

గిరి యెత్తి దేవేంద్రుఁ గ్రిందుపఱిచెఁ;

గాళియు మర్దించె; గహనానలముఁ ద్రావెఁ;

గేశి నంతకుపురి క్రేవ కనిచె;

మయుపుత్రుఁ బరిమర్చె; మఱియు దానవ భటు;

ల హరించి గోపకులంబుఁగాచె;

10.1-1331.1-తేటగీతి

గోపకాంతల మనముల కోర్కిదీర్చె;

నీ సరోరుహలోచనుండీ శుభాంగుఁ

డీ మహామహుఁడీ దిగ్గజేంద్ర మడఁచె;

మనుజమాత్రుఁడె తలపోయ మాధవుండు.

10.1-159- చాణూరునితో సంభాషణ

10.1-1332-వచనము

అని పలుకుచు సకలజనులును జూచుచుండ రామకృష్ణులకుఁ జాణూరుండు యిట్లనియె.

10.1-1333-మత్తేభ విక్రీడితము

వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచుం
బెనఁగన్ మిక్కలి నేర్చినా రనుచు నీ పృథ్వీజనుల్ చెప్ప మా
మనుజేంద్రుం డిట మిమ్ముఁ జీరఁ బనిచెన్ మల్లాహవక్రీడకుం;
జనదే కొంత పరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపఁగన్.

10.1-1334-మత్తేభ విక్రీడితము

జవసత్వంబులు మేలె? సాము గలదే? సత్రాణమే మేను? భూ
ప్రవరుం డౌనని మిమ్మనంగ వలెనే? ప్రాఁళీ లభీష్టంబులే?
పవివో? కాక కృతాంతదండకమవో? ఫాలాక్షు నేత్రాగ్నివో?
నవనీతంబుల ముద్దగాదు; మెసఁగన్ నా ముష్టి గోపార్భకా.

10.1-1335-కంద పద్యము

జనములు నేర్చిన విద్యలు
జననాథునికొలకుఁ గాదె; జననాథుఁడు నీ
జనములు మెచ్చఁగ యుద్ధం
బున మనముం గొంత ప్రొద్దు పుత్తమె? కృష్ణా?

10.1-1336-వచనము

అనిన విని హరి యిట్లనియె.

10.1-1337-ఉత్పలమాల

సాములు లేవు; పిన్నలము; సత్త్వము గల్గనరాదు; మల్ల సం
గ్రామ విశారదుల్ కులిశకర్కశదేహులు మీరు; మీకడన్
సేము చరించు టెట్లు; ధరణీశుని పేడ్కలు చేయువారముం
గాము; వినోదముల్ సలుపఁ గాదనవచ్చునె యొక్కమాటికిన్.

10.1-1338-కంద పద్యము

నీ తోడుత నేఁ బెనఁగెదఁ
బ్రీతిన్ ముష్టికునితోడఁ బెనగెడి బలుఁ డు
గ్రాతత మల్లాహవమున
భూతలనాథునికి మెచ్చు పుట్టింతు సభన్.

10.1-1339-వచనము

అనిన విని రోషించి చాణూరుం డిట్లనియె.

10.1-1340-శార్దూల విక్రీడితము

నాతోఁ బోరఁగ నెంతవాఁడ? విసిరో! నాపాటియే నీవు? వి
ఖ్యాతుండం; గులజుండ; సద్గుణుఁడ; సత్కర్మస్వభావుండ; నీ
కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే; యీ వీటఁ బోరాడుటల్
ప్రేతల్ చూడఁగఁ గుప్పిగంతు లిడుటే? వీక్షింపు గోపార్భకా!

10.1-1341-శార్దూల విక్రీడితము

స్థాణున్ మెచ్చఁడు; బ్రహ్మఁ గైకొనఁడు; విష్వక్సేను నవ్వున్; జగ
త్ప్రాణున్ రమ్మనఁ డీడుగాఁ డని; మహా బాహాబలప్రౌఢి న

క్షీణుం; డాజికి నెల్లి నే డనఁడు; వైచిత్రిన్ వినోదించు న
చ్చాణూరుం డొక గోపబాలు పనికిన్ శక్తుండు గాకుండునే?

10.1-1342-కంద పద్యము

ప్రల్లద మేటికి గోపక
బల్లిదుఁడను; లోకమందుఁ బ్రఖ్యాతుఁడ; నా
చల్లడము క్రింద దూఱని
మల్లురు లే రెందు ధరణిమండలమందున్.

10.1-1343-సీస పద్యము

చలమున నను డాసి జలరాశిఁ జొరరాదు;
నిగిడి గోత్రముదండ నిలువరాదు;
కేడెంచి కుంభిని క్రిందకిఁ బోరాదు;
మనుజసింహుఁడ నని మలయరాదు;
చేరినఁ బడవైతుఁ జెయ్యి చాపఁగరాదు;
బెరసి నా ముందరఁ బెరుగరాదు;
భూనాథ హింసకుఁ బోరాదు నను మీఱి;
శోధింతుఁ గానలఁ జొరఁగరాదు;

10.1-1343.1-ఆటవెలది

ప్రబలమూర్తి ననుచు భాసిల్లఁగారాదు;
ధరఁ బ్రబుద్ధుఁడ నని దఱుమరాదు;
కలికితనము చూపి గర్వింపఁగారాదు;
తరముగాదు; కృష్ణ! తలఁగుతలఁగు.

10.1-1344-వచనము

అదిగాక నీవు శ్రీహరి నంటేని.

10.1-1345-సీస పద్యము

మహిమతో నుండగ మథురాపురము గాని;
 పొలుపారు వైకుంఠపురము గాదు
గర్వంబుతో నుండఁ గంసుని సభ గాని;
 సంసారరహితుల సభయుఁ గాదు
ప్రకటించి వినఁగ నా బాహునాదము గాని;
 నారదు వీణాస్వనంబు గాదు
చదురు లాడఁగ మల్లజన విగ్రహము గాని;
 రమతోడి ప్రణయ విగ్రహము గాదు

10.1-1345.1-తేటగీతి

వెలసి తిరుగంగ వేదాంతవీధి గాదు
మొఱఁగిపో ముని మనముల మూల గాదు
దాఁగి నడువంగ భక్తుల జాడ గాదు
శౌరి! నా ప్రోల నీ వెందు చనియె దింక.

10.1-1346-వచనము

అని పలికి.

10.1-1347-సీస పద్యము

రోషాగ్ని ధూమప్రరోహంబుకైవడి;

శిరమున సన్నపు సిక వెలుంగ
నాశామదేభేంద్ర హస్తసన్నిభములై;
బాహుదండంబులు భయదములుగ
లయసమయాంతకోల్లసిత దంష్ట్రల భంగిఁ;
జాఁగిన కోఱ మీసములు మెఱయ
నల్లని తెగఁగల నడకొండ చాడ్పున;
నాభీల నీల దేహంబు వెలయఁ

10.1-1347.1-ఆటవెలది

జరణహతుల ధరణి సంచలింపఁగ నభో
మండలంబు నిండ మల్ల చఱచి
శౌరి దెసకు నడచెఁ జాణూర మల్లుండు
పౌరలోకహృదయభల్లుఁ డగుచు.

## 10.1-160- చాణూరముష్టికులతో పోరు

10.1-1348-వచనము

ఇట్లగ్గలంబగు నగ్గలిక డగ్గఱిన మల్లునిం గని మెల్లన మొల్లంబగు బీరంబు వెల్లిగొన, వల్లవీవల్లభుం డుల్లసిల్లి బాహునాదంబున రోదోంతరాళంబు పూరించి మించి కవిసెన ట్లిద్దఱు నుద్దవిడి నున్నత విషమంబులగు ఠాణలిడి, కరి కరియును, హరి హరియును గిరి గిరియునుం దాఁకు వీఁకం దలపడి యితరేతర హేతిహింసితంబులగు దవానలంబుల తెఱంగునఁ బరస్పర దీర్ఘనిర్ఘాత ఘట్టితంబులగు మహాభ్రంబుల విభ్రమంబున నన్యోన్యతుంగతరంగ తాడితంబు లగు కల్పాంతకాల సముద్రంబుల రౌద్రంబున నొండరుల ముష్టి ఘట్టనంబుల

ఘుట్టితశరీరులై దద్దరిలక డగ్గఱి గ్రద్దన నయ్యుద్ధఋం దిరుగు నెడ హరి చొచ్చి పేర్చి యార్చి జెట్టింబట్టి పడం దిగిచి పాదంబుల జాడించి సముల్లాసంబున నెసకంబునకు వచ్చిన మెచ్చి నొచ్చి యచ్చపలుండు మీఱి మోర సారించి తెరలక పొరలం ద్రొబ్బిన నబ్బలానుజుండుబ్బి గొబ్బున మేను వర్ధిల్ల నర్ధాంగకంబు ననుండి జానువుల నొత్తుచు నురవడింగరవడంబున నున్న నా దుర్నయుండును "బాల మేలుమే"లని లీలంగాలు చొరనిచ్చి త్రోచినం జూచి యేచి ఖేచరు లగ్గించి యుగ్గడింప నగ్గోపకుమారుండు పాటవంబున రాటవంబునకుంజని వెన్నెక్కి నిక్కిన నక్కంసభటుండు మదజల రేఖాబంధురంబగు గంధసింధురంబు చందంబునఁ పదంబును బదంబునం జాఁపి కరంబునుగరంబున గ్రహించి సహించి వహించి నైపుణ్యంబున లోపలం దిరిగి యట్టిట్టు దట్టించిన దిట్టతనంబునం దిటవు దప్పక న ప్పద్మలోచనుండు కేడించి యేచి సమతలంబున వైచి ప్రచండం బగు వాని పిచండంబు వాగించి కాలఁధిక్కరించి డొక్కరంబు గొనిన నయ్యభ్యాసి సభ్యులు సన్నుతింపం గ్రమ్మరించి జడ్డనఁ గాలడ్డగించి రక్షించుకొనిన నా రక్షోవైరి వైరికటిచేలంబు పట్టి యెత్తి యొత్తి నడుమ రాగెయిడి, సందుబెట్టి నవ్విన, నవ్విరోధి కాలుకాలిలోనిడి వేధించి నిరోధించిన నిరోధంబుఁ బాసి తిరిగిన వసుదేవుపట్టి పట్టిసంబుఁ గొని దట్టించిన నుబ్బరిక చేసి చాణూరుండు హరికరంబుపట్టి హుమ్మని నెమ్మొగంబునం గాలిడి మీఁదైనం గేళీ బాలకుండు కాలుగాల నివారించి మీఁదై నెగడియుండనీయక దుర్వారబలంబున విదలించిలేచి గృహీతపరిపంథి చరణుండయి విపక్షుని వక్షంబు వజ్రివజ్ర సన్నిభంబగు పిడికిటం బొడిచిన వాఁడు వాఁడిచెడక విజృంభించి యంభోరాశి మధనంబు నందిరుగు శైలంబు పోలిక నేల జిఱజిఱందిరిగి తన్నిన వెన్నుండు కుప్పించి యుప్పరం

బెగసి మీఁద నుఱికిన నతండు కృష్ణపాద సంధి పరిక్షిప్తపాదుండై యెగసి లేచి సముద్ధతుండయ్యె నయ్యెడ.

10.1-1349-కంద పద్యము

బలభద్రుఁడు ముష్టికుఁడును
బలములు మెఱయంగఁ జేసి బాహాబాహిం
బ్రళయాగ్నుల క్రియఁ బోరిరి
వెలయఁగ బహువిధములైన విన్నాణములన్.

10.1-1350-వచనము

ఇవ్విధంబున.

10.1-1351-కంద పద్యము

వల్లవులు పెనఁగి రున్నత
గల్లులతో భిన్నదిగిభకరవల్లులతో
మల్లురతో రిపుమానస
భల్లులతో భీతగోపపల్లులతోడన్.

## 10.1-161- పౌరకాంతలముచ్చటలు

10.1-1352-వచనము

ఆ సమయంబునం బౌరకాంతలు మూఁకలు గట్టి పెచ్చనూర్చుచు ముచ్చటలకుం జొచ్చి తమలో నిట్లనిరి.

10.1-1353-ఉత్పలమాల

మంచి కుమారులం గుసుమ మంజు శరీరులఁ దెచ్చి చెల్లరే

యంచిత వజ్రసారులు మహాద్రి కఠోరులు నైన మల్లురం
గ్రించులఁ బెట్టి రాజు పెనఁగించుచుఁ జూచుచు నున్నవాఁడు; మే
లించుకలేదు; మాను మనఁ డిట్టి దురాత్ముని మున్ను వింటిమే?

10.1-1354-కంద పద్యము

చూచెదరు గాని సభికులు
నీ చిన్నికుమారకులకు నీ మల్లురకుం
నో చెల్ల! యీడు గాదని
సూచింపరు పతికిఁ దమకు శోకము గాదే?

10.1-1355-సీస పద్యము

వేణునాళములపై వెలసిన మాధవుం;
డధరామృతము లిచ్చి యాదరించుఁ
బింఛదామములపై పెరిగిన వెన్నుండు;
మస్తకంబునఁ దాల్చి మైత్రి నెఱపుఁ
బీతాంబరములపై బెరిసిన గోవిందుఁ;
డంసభాగములఁ బాయక ధరించు
వైజయంతికలపై వ్రాలినఁ గమలాక్షుఁ;
డతి కుతూహలమున నఱుతఁ దాల్చుఁ

10.1-1355.1-తేటగీతి

దనరు బృందావనంబునఁ దరులమైనఁ
గృష్ణుఁ డానందమునఁ జేరి క్రీడ సల్పు
నెట్టి నోముల నైన ము న్నిట్టి విధము

లేల కామైతిమో యమ్మ! యింక నెట్లు?

10.1-1356-ఉత్పలమాల

పాపపు బ్రహ్మ; గోపకుల పల్లెలలోన సృజింపరాదె; ము
న్నీ పురిలోపలన్ మనల నేల సృజించె? నటైన నిచ్చలుం
జేపడుఁ గాదె; యీ సుభగుఁ జెందెడి భాగ్యము సంతతంబు నీ
గోపకుమారుఁ బొంద మును గోపకుమారిక లేమి నోఁచిరో?

10.1-1357-కంద పద్యము

గోపాలకృష్ణుతోడను
గోపాలన వేళలందుఁ గూడి తిరుగు నా
గోపాలు రెంత ధన్యులొ
గోపాలుర కైన నిట్టి గురురుచి గలదే?

10.1-1358-కంద పద్యము

శ్రమజలకణసిక్తంబై
కమలదళేక్షణుని వదనకమలము మెఱసెన్
హిమజలకణసిక్తంబై
కమనీయం బగుచు నున్న కమలము భంగిన్.

10.1-1359-ఆటవెలది

సభకుఁ బోవఁ జనదు; సభవారి దోషంబు
నెఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న
నెఱిఁగి యుండియైన నిట్టట్టు పలికినఁ

బ్రాఙ్మఁ డైనఁ బొందుఁ బాపచయము.

10.1-1360-వచనము

అని పెక్కండ్రు పెక్కువిధంబులం బలుకుచుండఁ దద్బాహు యుద్ధంబున.

## 10.1-162- చాణూరముష్టికులవధ

10.1-1361-కంద పద్యము

ధృతిచెడి లోఁబడె మల్లుం
డతులిత భవజలధితరికి హతరిపు పురికిన్
హితకరికిన్ ధృతగిరికిం
దద హరిరవభరిత శిఖరిదరికిన్ హరికిన్.

10.1-1362-కంద పద్యము

హరికిని లోఁబడి బెగడక
హరి యురము మహోగ్రముష్టి నహితుఁడు వొడువన్
హరి కుసుమమాలికాహత
కరి భంగిఁ బరాక్రమించెఁ గలహోద్ధతుఁడై.

10.1-1363-కంద పద్యము

శౌరి సెలఁగొచ్చి కరములఁ
గ్రూరగతిం బట్టి త్రిప్పి కుంభిని వైచెన్
శూరుం గలహ గభీరున్
వీరుం జాణూరు ఘోరు వితతాకారున్.

10.1-1364-కంద పద్యము

శోణితము నోర నొలుకఁగఁ
జాణూరుం డట్లు కృష్ణు సంభ్రమమున సం
క్షీణుండై క్షోణిం బడి
ప్రాణంబులు విడిచెఁ గంసు ప్రాణము గలఁగన్.

10.1-1365-కంద పద్యము

బలభద్రుండును లోకులు
బలభద్రుం డనఁగఁ బెనఁగి పటుబాహుగతిన్
బలభేది మెచ్చఁ ద్రిప్పెను
బలవన్ముష్టికునిఁ గంసు బలములు బెగడన్.

10.1-1366-ఆటవెలది

త్రిప్పి నేలపైవ దిగ్గన రక్తంబు
వదనగహ్వరమున వఱదవాఱ
ముష్టికుండు ఘోరముష్టి సత్వము చెడి
గూలెఁ గాలిఁ దరువు గూలునట్లు.

10.1-1367-వచనము

మఱియును.

10.1-1368-కంద పద్యము

పాటవమునఁ బలుపిడికిట
సూటిం బడఁబొడిచె బలుఁడు శోభిత ఘన బా
హాటోప నృపకిరీటుం

గూటున్ వాచాటు నధిక ఘోరలలాటున్.

10.1-1369-వచనము

అంత న ద్దనుజాంతకుండు చరణప్రహరణంబుల భిన్నమస్తకులం జేసి వాని చెలుల నంతకాంతికంబున కనిచిన.

10.1-1370-కంద పద్యము

వల్లవ బాలకు లని మన
మల్లవరులు పెనఁగి నేడు మడిసిరి వీరల్
బల్లిదులు; తలఁడుతలఁ డని
చెల్లాచెదరైరి పాఱి చిక్కిన మల్లుల్.

10.1-1371-ఉత్పలమాల

మల్లురఁ జంపి గోపక సమాజములో మృగరాజు రేఖ శో
భిల్లఁగఁ బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయ వచ్చు నా
వల్లవరాజనందనుల వారక చూచి మహీసురాదుల
ల్లల్లన సంస్తుతించిరి ప్రియంబుగఁ గంసుఁడు దక్క నందఱున్.

10.1-1372-వచనము

అంత సభాజనంబుల కలకలంబు నివారించి మంత్రులనుఁ జూచి కంసుం డిట్లనియె.

10.1-1373-ఉత్పలమాల

వల్లవ బాలురన్ నగరి వాకిటికిన్ వెడలంగఁ ద్రొబ్బుఁ; డీ
గొల్లల ముట్టికోల్గొనుఁడు; క్రూరుని నందునిఁ గట్టు; డుర్వికిం

దెల్లముగాఁగ నేడు వసుదేవునిఁ జంపుఁడు; తండ్రిగాఁడు వీఁ
డెల్లవిధంబులం; బరుల కిష్టుఁడు కావకుఁ డుగ్రసేనునిన్.

10.1-1374-వచనము

అని పలుకు సమయంబున.

## 10.1-163- కంసవధ

10.1-1375-శార్దూల విక్రీడితము

జంఘాలత్వముతో నగోపరిచరత్స్వారంగ హింసేచ్ఛను
ల్లంఘింపన్ గమకించు సింహము క్రియన్ లక్షించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణహింసార్థి యై
లంఘించెం దమగంబు మీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్.

10.1-1376-కంద పద్యము

తమగమున కెగురు యదు స
త్తమగణ్యునిఁ జూచి ఖడ్గధరుఁడై యెదిరెం
దమ గమివారలు వీరో
త్తమగణవిభుఁడనఁగఁ గంసధరణీపతియున్.

10.1-1377-శార్దూల విక్రీడితము

పక్షీంద్రుం డురగంబుఁ బట్టు విధ మొప్పం గేశ బంధంబు లో
కక్షోభంబుగఁ బట్టి మౌళిమణు లా కల్పాంతవేళాపత
న్నక్షత్రంబుల భంగి రాల రణసంరంభంబు డిందించి రం
గక్షోణిం బడఁ ద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం గంసున్ నృపోత్తంసునిన్.

10.1-1378-శార్దూల విక్రీడితము

మంచాగ్రంబుననుండి రంగధరణీమధ్యంబునం గూలి యే

సంచారంబును లేక చిక్కి జను లాశ్చర్యంబునుం బొందఁగా

బంచత్వంబును బొంది యున్న విమతుం బద్మాక్షుఁ డీడ్చెన్ వడిం

బంచాస్యంబు గజంబు నీడ్చు పగిదిన్ బాహాబలోల్లాసియై.

10.1-1379-కంద పద్యము

రోషప్రమోద నిద్రా

భాషాశన పాన గతులఁ బాయక చక్రిన్

దోషగతిఁ జూచి యైన వి

శేషరుచిం గంసుఁ డతనిఁ జెందె నరేంద్రా.

10.1-1380-వచనము

ఆ సమయంబున.

## 10.1-164- కంససోదరులవధ

10.1-1381-కంద పద్యము

గోపాలుఁ డొక్కఁ డద్దిర

భూపాలకుఁ జంపె వీనిఁ బొడువుం డేత

ద్భూపాలస్యము లేలని

తాపాలఘురోషు లగుచు దర్పోద్ధతులై.

10.1-1382-శార్దూల విక్రీడితము

న్యగ్రోధుండును గహ్వుఁడున్ మొదలుగా నానాయుధానీక సా

మగ్రిం గంసుని సోదరుల్గవియుఁడున్ మాద్యద్గజేంద్రాభుఁడై
యుగ్రుండై పరిఘాయుధోల్లసితుఁడై యొండొండఁ జెండాడి కా
లాగ్రక్షోణికిఁ బంచె రాముఁడు గరీయస్థేముఁడై వారలన్.

10.1-1383-వచనము

అయ్యవసరంబున.

10.1-1384-కంద పద్యము

చేతులఁ దాళము లొత్తుచు
చేతోమోదంబుతోడ సిగముడి వీడం
బాతర లాడుచు మింటను
గీతము నారదుఁడు పాడెఁ గృష్ణా! యనుచున్.

10.1-1385-కంద పద్యము

వారిజభవ రుద్రాదులు
భూరికుసుమవృష్టిఁ గురిసి పొగడిరి కృష్ణున్
భేరులు మ్రోసెను నిర్జర
నారులు దివి నాడి రధిక నటనముల నృపా!

## 10.1-165- కంసునిభార్యలువిలపించుట

10.1-1386-వచనము

అంతం గంసాదుల కాంతలు భర్తృమరణదుఃఖాక్రాంతలై కరంబుల శిరంబులు మోదికొనుచు నశ్రుసలిలధారాపరిషిక్త వదనలై సదనంబులు వెలువడి వచ్చి

వీరశయ్యా నిద్రితులైన విభులం గౌగలించుకొని సుస్వరంబుల విలపించి; రందుఁ గంసు భార్య లిట్లనిరి.

10.1-1387-సీస పద్యము

గోపాలసింహంబు గోపించి వెల్వడి;
నిను గజేంద్రుని భంగి నేడు గూల్చె
యాదవేంద్రానిల మాభీల జవమున;
నిను మహీజము మాడ్కి నేల వ్రాల్చె
వాసుదేవాంభోధి వారి యుద్వేలమై;
నిను దీవికైవడి నేడు ముంచె
దేవకీసుతవజ్రి దేవత లలరంగ;
నినుఁగొండ క్రియ నేడు నిహతుఁ జేసె

10.1-1387.1-తేటగీతి

హా! మనోనాథ! హా! వీర! హా! మహాత్మ!
హా! మహారాజ! నీ విట్లు హతుఁడవైన
మనుచు నున్నార మక్కట! మమ్ముఁ బోలు
కఠినహృదయలు జగతిపైఁ గలరె యెందు?

10.1-1388-కంద పద్యము

భూతముల కెగ్గుచేసిన
భూతంబులు నీకు నెగ్గు పుట్టించె వృథా
భూతముగ మనికి యెల్లను
భూతద్రోహికిని శుభము పొందదధీశా!

10.1-1389-కంద పద్యము

గోపాలకృష్ణుతోడను
భూపాలక! మున్ను తొడరి పొలిసిన వారిన్
నీపాల బుధులు చెప్పరె
కోపాలస్యములు విడిచి కొలువం దగదే.

## 10.1-166- దేవకీవసుదేవుల విడుదల

10.1-1390-వచనము

అని విలపించుచున్న రాజవల్లభల నూరార్చి, జగద్వల్లభుండైన హరి కంసాదులకుం బరలోకసంస్కారంబులు చేయం బనిచి దేవకీ వసుదేవుల సంకలియలు విడిపించి, బలభద్ర సహితుండై వారలకుం బ్రణామంబులు చేసిన.

10.1-1391-మత్తేభ విక్రీడితము

కని లోకేశులుగాని వీరు కొడుకుల్గారంచుఁ జిత్తంబులన్
జనయిత్రీ జనకుల్ విచారపరులై శంకింపఁ గృష్ణుండు దా
జనసమ్మోహినియైన మాయఁ దదభిజ్ఞానంబు వారించి యి
ట్లనియెన్ సాగ్రజుఁడై మహావినతుఁడై యానందసంధాయియై.

10.1-1392-సీస పద్యము

మమ్ముఁ గంటిరిగాని మా బాల్య పౌగండ;
కైశోర వయసులఁ గదిసి మీర
లెత్తుచు దించుచు నెలమి మన్నించుచు;
నుండు సౌభాగ్యంబు నొంద రైతి;
రాకాంక్ష గలిగియున్నది దైవయోగంబు;

తల్లిదండ్రుల యొద్ద తనయు లుండి
యే యవసరమున నెబ్బంగి లాలితు;
లగుచు వర్ధిల్లుదు రట్టి మహిమ

10.1-1392.1-తేటగీతి

మాకు నిన్నాళ్ళు లే దయ్యె మఱియు వినుఁడు
నిఖిల పురుషార్థహేతువై నెగడుచున్న
మేని కెవ్వార లాఢ్యులు మీ రకారె
యా ఋణముఁ దీర్ప నూఱేండ్లకైనఁ జనదు.

10.1-1393-కంద పద్యము

చెల్లుబడి గలిగి యెవ్వఁడు
తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్
చెల్లింపఁ డట్టి కష్టుఁడు
ప్రల్లదుఁ డామీఁద నాత్మపలలాశి యగున్.

10.1-1394-కంద పద్యము

జననీజనకుల వృద్ధులఁ
దనయుల గురువిప్రసాధుదారాదులనే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక
వనరును జీవన్మృతుండు వాఁడు ధరిత్రిన్.

10.1-1395-వచనము

అదియునుం గాక.

10.1-1396-శార్దూల విక్రీడితము

కారాశాలల మా నిమిత్తము మిముం గంసుండు గారింపఁగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపఁగా లేక ని
ష్కారుణ్యాత్ముఁలమైన క్రూరుల మహాకౌటిల్యసంచారులన్
సారాతిక్రములార! మమ్ముఁ గొఱతల్ సైరించి రక్షింపరే.

10.1-1397-వచనము

అని యిట్లు మాయామనుష్యుండైన హరి పలికిన పలుకులకు మోహితులై వారల నంకపీఠంబుల నిడుకొని కౌగలించుకొని వారి వదనంబులు కన్నీటం దడుపుచుఁ బ్రేమపాశబద్ధులై, దేవకీవసుదేవు లూరకుండి; రంత మాతామహుండైన యుగ్రసేనుం జూచి.

## 10.1-167- ఉగ్రసేనుని రాజుగ చేయుట

10.1-1398-చంపకమాల

అనఘ! యయాతి శాపమున యాదవ వీరులకున్ నరేశ్వరా
సనమున నుండరాదు; నృపసత్తమ! రాజవు గమ్ము భూమికిన్;
నినుఁ గొలువంగ నిర్జరులు నీ కరిఁ బెట్టుదు రన్య రాజులం
బనిగొనుటెంత; రమ్ము జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్.

10.1-1399-వచనము

అని పలికి.

10.1-1400-కంద పద్యము

మన్నించి రాజుఁ జేసెను

వెన్నుఁడు సత్యావధాను విశ్రుతదానున్
సన్నుతమానున్ గదన
చ్ఛిన్నాహితసేను నుగ్రసేనున్ దీనున్.

10.1-1401-వచనము

తదనంతరంబ తొల్లి కంసభీతులై విదేశంబులం గృశియించుచున్న యదు వృష్టి భోజ మరు దశార్హ కకురాంధక ప్రముఖు లగు సకల జ్ఞాతి సంబంధులను రావించి చిత్తంబు లలర విత్తంబు లిచ్చి వారి వారి నివాసంబుల నుండ నియమించె; నివ్విధంబున.

10.1-1402-కంద పద్యము

మధుసూదన సత్కరుణా
మధురాలోకన విముక్త మానస భయులై
మధురవచనములఁ దారును
మథురానగరంబు ప్రజలు మనిరి నరేంద్రా!

## 10.1-168- నందుని వ్రేపల్లెకు పంపుట

10.1-1403-వచనము

అంత నొక్కనాడు సంకర్షణసహితుండై నందునిం జేరి గోవిందుండు యిట్లనియె.

10.1-1404-శార్దూల విక్రీడితము

తండ్రిం జూడము తల్లిఁ జూడము యశోదాదేవియున్నీవు మా
తండ్రిం దల్లియు నంచు నుండుదుము సద్ధర్మంబులం దొల్లి యే
తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి? భవత్సొజన్య భావంబులం

దండ్రీ! యింతటివార మైతిమిగదా! తత్తద్వయోలీలలన్.

10.1-1405-ఉత్పలమాల

ఇక్కడ నున్న బాంధవుల కెల్లను సౌఖ్యము చేసి వత్తు మే
మక్కడికిన్; మదీయులకు నందటికిన్ వినుపింపు మయ్య యే
మెక్కడ నున్న మాకు మది నెన్నఁడు పాయవు మీ వ్రజంబులో
మక్కువతోడ మీరు కృప మా కొనరించు క్రియావిశేషముల్.

10.1-1406-వచనము

అని పలికి వస్త్రభూషణాదు లొసంగి సాదరంబుగం గౌగలించుకొని గోవిందుం డనిచిన నందుండు ప్రణయవిహ్వలుండై బాష్పజలపూరితలోచనుం డగుచు వల్లవులుం దానును వ్రేపల్లెకుం జనియె; నంత

## 10.1-169- రామకృష్ణుల ఉపనయనము

10.1-1407-కంద పద్యము

గర్గాది భూసురోత్తమ
వర్గముచే నుపనయనము వసుదేవుఁడు స
న్మార్గంబునఁ జేయించెను
నిర్గర్వచరిత్రులకును నిజ పుత్రులకున్.

10.1-1408-కంద పద్యము

ద్విజరాజ వంశవర్యులు
ద్విజరాజ ముఖాంబుజోపదిష్టవ్రతులై
ద్విజరాజత్వము నొందిరి

ద్విజరాజాదిక జనంబు దీవింపంగన్.

10.1-1409-వచనము

ఉపనయ నానంతరంబున వసుదేవుండు బ్రాహ్మణులకు సదక్షిణంబులుగా ననేక గో హిరణ్యాది దానంబు లొసంగి తొల్లి రామకృష్ణుల జన్మసమయంబు లందు నిజమనోదత్తలైన గోవుల నుచ్చరించియిచ్చి కామితార్థంబుల నర్థులకుం బెట్టె నిట్లు బ్రహ్మచారులై.

10.1-1410-శార్దూల విక్రీడితము

ఉర్విన్ మానవు లెవ్వరైన గురువా క్యోద్యుక్తులై కాని త
త్త్వా ర్వారంభము చేయఁ బోల దనుచున్ బోధించు చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియున్
గుర్వంగీకరణంబు చేయఁ జని; రా గోవిందుఁడున్ రాముఁడున్.

## 10.1-170- సాందీపుని వద్ద శిష్యులగుట

10.1-1411-వచనము

చని మహావైభవరాశియైన కాశిం జేరి తత్తీరంబున నవంతీపుర నివాసియు సకలవిద్యావిలాసియు నైన సాందీపుం డను బుధవర్యునిఁ గని యథోచితంబుగ దర్శించి, శుద్ధభావవర్తనంబుల భక్తి జేయుచునుండ, వారలవలన సంతుష్టుండై.

10.1-1412-శార్దూల విక్రీడితము

వేదశ్రేణియు నంగకంబులు ధనుర్వేదంబుఁ దంత్రంబు మ
న్వాదివ్యాహృత ధర్మశాస్త్రములు నుద్యన్న్యాయముం దర్కవి
ద్యాదక్షత్వము రాజనీతియును శబ్దప్రక్రియం జెప్పె నా

భూదేవాగ్రణి రామకృష్ణులకు సంభూతప్రమోదంబునన్.

10.1-1413-కంద పద్యము

అఱువదినాలుగు విద్యలు
నఱువదినాలుగు దినంబు లంతన వారల్
నెఱవాదులైన కతమున
నెఱి నొక్కొక నాటి వినికి నేర్చి రిలేశా!

10.1-1414-కంద పద్యము

గురువులకు నెల్ల గురులై
గురులఘుభావములు లేక కొమరారు జగ
ద్గురులు త్రిలోకహితార్థము
గురుశిష్యన్యాయలీలఁ గొలిచిరి పేర్కన్.

10.1-1415-వచనము

ఇట్లు కృతకృత్యులైన శిష్యులం జూచి వారల మహాత్మ్యంబునకు వెఱఁగుపడి సభార్యుండైన సాందీపుం డిట్లనియె.

10.1-1416-శార్దూల విక్రీడితము

అంభోరాశిఁ బ్రభాసతీర్థమున మున్నస్మత్తనూసంభవుం
డంభోగాహము చేయుచున్ మునిఁగి లేఁ డయ్యెం గృపాంభోనిధుల్
శుంభద్వీర్యులు మీరు మీ గురునకుం జోద్యంబుగా శిష్యతన్
గాంభీర్యంబునఁ బుత్రదక్షిణ యిడం గర్తవ్య మూహింపరే.

10.1-1417-కంద పద్యము

శిష్యులు బలాఢ్యులైన వి
శేషస్థితి నొంది గురువు జీవించును ని
ర్దూష్యగుణ బలగరిష్ఠులు
శిష్యులరై గురుని కోర్కి జేయం దగదే?

## 10.1-171- గురుపుత్రుని తేబోవుట

10.1-1418-వచనము

అనిన విని రామకృష్ణులు గుర్వర్థంబుగా దుర్వారరథారూఢులై రయంబునం జని రౌద్రంబున సముద్రంబుఁ జేరి యిట్లనిరి.

10.1-1419-కంద పద్యము

సాగర! సుబుద్ధితోడను
మా గురుపుత్రకునిఁ దెమ్ము మా ఆడిన నీ
వాగడ మవుదువు దుస్సహ
వేగరణాభీలనిశితవిశిఖాగ్నులకున్.

10.1-1420-వచనము

అనిన వారలకు జలరాశి యిట్లనియె.

10.1-1421-ఉత్పలమాల

వంచన యేమి లేదు యదువల్లభులార! ప్రభాసతీర్థమం
దంచితమూర్తి విప్రసుతుఁ డాఢ్యుఁడు తోయములాడుచుండ ను
త్పంచలితోర్మి యొక్కటి ప్రచండగతిం గొనిపోయెఁ బోవఁగాఁ
బంచజనుండు మ్రింగె నతిభాసురశీలుని విప్రబాలునిన్.

10.1-1422-వచనము

అని వాని వసియించు చో టెఱింగించిన.

10.1-1423-శార్దూల విక్రీడితము

శంఖారావముతోడఁ బంచజనుఁ డాశంకించి చిత్తంబులో
వంఖిన్నుండయి వార్థిఁ జొచ్చె దహనజ్వాలాభ హేమోజ్జ్వల
త్పుంఖాస్త్రంబునఁ గూల్చి వాని జఠరంబున్ వ్రచ్చి గోవిందుఁ డ
ప్రేంఖచ్చిత్తుఁడు బాలుఁ గానక గురుప్రేమోదితోద్యోగుఁడై.

10.1-1424-కంద పద్యము

దానవుని దేహజం బగు
మానిత శంఖంబుఁ గొనుచు మసలక బలుఁడుం
దో నేతేరఁగ రథి యై
దానవరిపుఁ డరిగె దండధరుపురికి నృపా!

10.1-1425-వచనము

చని సంయమనీనామ నగరంబు చేరి తద్వారంబునఁ బ్రళయకాల మేఘగంభీర నినద భీషణం బగు శంఖంబు పూరించిన విని వెఱఁగుపడి.

10.1-1426-శార్దూల విక్రీడితము

అస్మద్బాహుబలంబుఁ గైకొనక శంఖారావమున్ మానసా
పస్మారంబుగ నెవ్వఁ డొక్కొ నగరప్రాంతంబునం జేసె? మ
ద్విస్మేరాహవరోషపావకునిచే విధ్వస్తుఁడై వాఁడు దా
భస్మంబై చెడు నంచు నంతకుఁడు కోపప్రజ్వలన్మూర్తియై.

10.1-1427-వచనము

వచ్చి రామకృష్ణులం గని వారు లీలామనుష్యు లైన విష్ణుమూర్తు లని యెఱింగి; భక్తితోడ శుశ్రూష చేసి సర్వభూతమయుం డగు కృష్ణునకు నమస్కరించి "యేమి చేయుదు నానతి" మ్మనిన నమహోత్ముండు యిట్లనియె.

10.1-1428-కంద పద్యము

చెప్పెద మా గురునందనుఁ
దప్పుగలుగఁ జూచి నీవు దండనమునకుం
దెప్పించినాఁడ వాతని
నొప్పింపుము మాకు వలయు నుత్తమచరితా!

## 10.1-172- గురుపుత్రునితెచ్చిఇచ్చుట

10.1-1429-కంద పద్యము

అనిన విని వీఁడె వీనిం
గొనిపొం డని భక్తితోడ గురునందను ని
చ్చెనఁ గృష్ణుఁడు వీడ్కొలిపెను
ఘనదుర్జనదమను మహిషగమనున్ శమనున్.

10.1-1430-వచనము

ఇట్లు జము నడగి తెచ్చి రామకృష్ణులు సాందీపునికిం బుత్రుని సమర్పించి "యింకనేమి చేయవలయు నానతిం" డనిన నమహోత్ముండు యిట్లనియె.

10.1-1431-కంద పద్యము

గురునకుఁ గోరిన దక్షిణఁ

గరుణన్ మున్నెవ్వఁ డిచ్చెఁ? ఘనులార! భవ
ద్గురునకుఁ గోరిన దక్షిణఁ
దిరముగ నిచ్చితిరి మీరు దీపితయశులై.

10.1-1432-కంద పద్యము

కాలుని వీటికిఁ జని మృత
బాలకుఁ దే నొరుల వశమె? భవదీయ కృపన్
మేలు దొరఁకొనియె మాకు; వి
శాల మగుంగాత మీ యశము లోకములన్.

10.1-1433-వచనము

మహాత్ములార! యేను కృతార్థుండ నైతి నని దీవించిన సాందీపుని వీడ్కొని కృతకృత్యులై రామకృష్ణులు రథారోహణంబు చేసి మధురకుఁ జనుదెంచి పాంచజన్యంబుఁ బూరించిన విని నష్టధనంబులు గనినవారి భంగిం బ్రజలు ప్రమోదించిరంత నొక్కనాఁ డేకాంతంబున.

10.1-1434-శార్దూల విక్రీడితము

నా పైఁ జిత్తము లెప్పుడున్ నిలుపుచున్ నా రాకఁ గాంక్షించుచున్
నా పేరాత్మల నావహించుచు వగన్ నానాప్రకారంబులన్
గోపాలాంగన లెంత జాలిఁ బడిరో? కోపించిరో? దూఱిరో?
ప్రేపల్లెన్ నిజధర్మ గేహములలో విభ్రాంతచైతన్యలై.

10.1-1435-వచనము

అని చింతించి.

## 10.1-173- గోపస్త్రీలకడకుద్ధవునిబంపుట

10.1-1436-కంద పద్యము

సిద్ధవిచారు గభీరున్
వృద్ధవచోవర్ణనీయు వృష్టిప్రవరున్
బుద్ధినిధి నమరగురుసము
నుద్ధవునిం జూచి కృష్ణుఁ డొయ్యనఁ బలికెన్.

10.1-1437-శార్దూల విక్రీడితము

రమ్మా యుద్ధవ! గోపకామినులు నా రాకల్ నిరీక్షించుచున్
సమ్మోహంబున నన్నియుం మఱచి యే చందంబునం గుందిరో
తమ్మున్ నమ్మినవారి డిగ్గవిడువన్ ధర్మంబు గాదండ్రు; వే
పొమ్మా; ప్రాణము లే క్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్.

10.1-1438-కంద పద్యము

లౌకిక మొల్లక నన్నా
లోకించు ప్రపన్నులకును లోఁబడి కరుణా
లోకనములఁ బోషింతును
నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్.

10.1-1439-కంద పద్యము

సందేహము మానుం డర
విందాననలార! మిమ్ము విడువను వత్తున్
బృందావనమున కని హరి

సందేశము పంపె ననుము సంకేతముననన్.

10.1-1440-వచనము

అని మందహాససుందరవదనారవిందుండై కరంబు కరంబున నవలంబించి, సరసవచనంబు లాడుచు వీడుకొల్పిన నుద్ధవుండును రథారూఢుండై సూర్యాస్తమయసమయంబునకు నందవ్రజంబు జేరి వనంబులనుండి వచ్చు గోవుల చరణరేణువులంబ్రచ్ఛన్న రథుండై చొచ్చి నందుమందిరంబు ప్రవేశించిన.

## 10.1-174- నందోద్ధవ సంవాదము

10.1-1441-శార్దూల విక్రీడితము

ఆ పుణ్యాత్ముని@ గౌగలించుకొని నందాభీరు@ డానంది యై
మా పాలింటికి@ గృష్ణు డీత@ డనుచున్ మన్నించి పూజించి వాం
ఛాపూర్ణంబుగ మంజులాన్నమిడి మార్గాయాసముం బాపి స
ల్లాపోత్సాహముతోడ నిట్లనియె సంలక్షించి మోదంబునన్.

10.1-1442-కంద పద్యము

నా మిత్రు@డు వసుదేవు@డు
సేమంబుగ నున్నవా@డె? చెలువుగ@ బుత్రుల్
నేమంబున సేవింప మ
హామత్తుండైన కంసు@ డడగిన పిదపన్.

10.1-1443-శార్దూల విక్రీడితము

అన్నా! భద్రమె? తల్లిదండ్రుల మమున్ హర్షించి చింతించునే?
తన్నుం బాసిన గోపగోపికల మిత్రవ్రాతమున్ గోగణం

బున్నిత్యంబు దలంచునే? వన నదీ భూముల్ ప్రసంగించునే?
వెన్నుం డెన్నఁడు వచ్చు నయ్య! యిట మా వ్రేపల్లెకున్నుద్ధవా?

10.1-1444-కంద పద్యము

అంకిలి గలుగక మా కక
లంకేందుని పగిదిఁ గాంతిలలితంబగు న
ప్పంకజనయనుని నెమ్మొగ
మింక విలోకింపఁ గలదె యీ జన్మమునన్?

10.1-1445-కంద పద్యము

అని హరి మున్నొనరించిన
పను లెల్లను జెప్పిచెప్పి బాష్పాకుల లో
చనుఁడై డగ్గుత్తికతో
వినయంబున నుండె గోపవీరుం డంతన్.

10.1-1446-కంద పద్యము

పెనిమిటి బిడ్డని గుణములు
వినిపింప యశోద ప్రేమవిహ్వలమతియై
చనుమొనలఁ బాలు గురియఁగఁ
గనుఁగొనలను జలము లొలుకఁగా బెగ్గిలియెన్.

10.1-1447-వచనము

ఇట్లు గోవింద సందర్శనాభావవిహ్వలురైన యశోదానందులకు నుద్ధవుండు యిట్లనియె.

10.1-1448-కంద పద్యము

జననీజనకుల మిమ్ముం
గనుఁగొన శీఘ్రంబె వచ్చుఁ గని భద్రంబుల్
వనజాక్షుం డొనరించును
మనమున వగవకుఁడు ధైర్యమం డనులారా?

10.1-1449-మత్తేభ విక్రీడితము

బలుడుం గృష్ణుఁడు మర్త్యులే? వసుమతీ భారంబు వారింప వా
రలరూపంబులఁ బుట్టినాఁడు హరి నిర్వాణప్రదుం డిప్పు; డు
జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ దత్సర్వేశుఁ జింతించువాఁ
డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁడై యర్కాభుఁడై నిత్యుఁడై

10.1-1450-సీస పద్యము

అట్టి నారాయణుం డఖిలాత్మభూతుండు;
కారణమానవాకారుఁడైనఁ
జిత్తంబు లతనిపైఁ జేర్చి సేవించితి;
రతికృతార్థులరైతి; రనవరతము
శోభిల్లు నింధనజ్యోతి చందంబున;
నఖిల భూతములందు నతఁ; డతనికి
జననీజనక దార సఖి పుత్ర బాంధవ;
శత్రు ప్రియాప్రియజనులు లేరు

10.1-1450.1-ఆటవెలది

జన్మకర్మములును జన్మంబులును లేవు

శిష్టరక్షణంబు చేయుకొఱకు
గుణవిరహితుఁడయ్యు గుణియగు సర్వ ర
క్షణ వినాశకేళి సలుపుచుండు.

## 10.1-175- గోపికలు యుద్ధవునిగనుట

10.1-1451-వచనము

అని మఱియుఁ బెక్కు విధంబుల హరి ప్రభావంబు లుపన్యసించుచు నారేయి గడపి మఱునాఁడు దధిమథనశబ్దంబు లాకర్ణించుచు లేచి కృతానుష్ఠానుండై యుద్ధవుం డొక్క రహస్యప్రదేశంబున నున్న సమయంబున.

10.1-1452-శార్దూల విక్రీడితము

రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోరస్కుండు పీతాంబరుం
డాజానుస్థిత బాహుఁ డంబురుహమాలాలంకృతుం డుల్లస
ద్రాజత్కుండలుఁ డొక్క వీరుఁ డిచటన్ రాజిల్లుచున్నాఁడు మా
రాజీవాక్షుని భంగి నంచుఁ గనిరా రాజాన్వయున్ గోపికల్.

10.1-1453-వచనము

కని లజ్జాసహిత హాసవిలోకనంబులు ముఖంబులకుం జెలువొసంగను యిట్లనిరి.

10.1-1454-చంపకమాల

ఎఱుఁగుదు మేము నిన్ను వనజేక్షణమిత్రుఁడ వీవు; కూరిమిన్
మెఱయుచుఁ దల్లిదండ్రులకు మే లెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా
వఱలెడు భక్తి వచ్చితివి; వారలనైన మనంబులోపలన్
మఱవఁడు శౌరి మేలు; మఱి మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్.

10.1-1455-కంద పద్యము

మునివరులైనను బంధుల
ఘనసఖ్యము విడువలేరు గాక విడువరే
యనిమిత్తసఖ్య మాఁకటి
పనిదీరిన నళులు విరులఁ బాయునొ లేదో.

## 10.1-176- భ్రమరగీతములు

10.1-1456-చంపకమాల

అని యిటు గోపికల్ పలుక నం దొక గోపిక కృష్ణపాదచిం
తనమునఁ జొక్కి చేరువను దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల
త్ననిశిత సద్వివేకముఁ బ్రసూనమరందమదాతిరేకమున్
ఘనమృదునాదసంచలిత కాముకలోకముఁ జంచరీకమున్.

10.1-1457-వచనము

కని హరి దన్నుం బ్రార్థింపఁ బుత్తెంచిన దూతయని కల్పించుకొని యుద్ధవునికి నన్యాపదేశంబై యెఱుకపడ నయ్యళికిం దొయ్యలి యిట్లనియె.

10.1-1458-మత్తేభ విక్రీడితము

భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మా పాదాబ్జముల్ నాగర
ప్రమదాళీకుచకుంకుమాంకిత లసత్ప్రాణేశదామప్రసూ
న మరందారుణితాననుండ వగుటన్ నాథుండు మన్నించుఁగా
క మమున్నేఁపుచుఁ బౌరకాంతల శుభాగారంబులన్నిత్యమున్.

10.1-1459-మత్తేభ విక్రీడితము

ఒక పువ్వందలి తేనెఁ ద్రావి మధుపా! యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెడి భంగి మమ్ము ధరపియ్యూషంబునం దేల్చి మా
యకలం కోజ్జ్వల యౌవనంబు గొని యన్యాసక్తుఁ డయ్యెన్ విభుం
డకటా! యాతని కెట్లు దక్కె సిరి? మిథ్యాకీర్తి యయ్యెంజుమీ.

10.1-1460-శార్దూల విక్రీడితము

భృంగా! కృష్ణుఁడు మంచివాఁ డనుచు సంప్రీతిం బ్రశంసించె; దీ
సంగీతంబున నేము చొక్కుదుమె? తచ్చారిత్రముల్ వింతలే?
యంగీకారముగావు మాకుఁ; బురకాంతాగ్రప్రదేశంబులన్
సంగీతం బొనరింపు వారిడుదు రోజన్నికు నిష్టార్థముల్.

10.1-1461-శార్దూల విక్రీడితము

సమదాళీశ్వర! చూడు ముజ్జ్వలిత హాసభ్రూవిజృంభంబులన్
రమణీయుండగు శౌరిచేఁ గరఁగరే రామల్ త్రిలోకంబులం?
బ్రమదారత్నము లక్ష్మి యాతని పదాబ్జాతంబు సేవించు ని
క్కము నే మెవ్వర మా కృపాజలధికిం గారుణ్యముం జేయఁగన్?

10.1-1462-శార్దూల విక్రీడితము

రోలంబేశ్వర! నీకు దూత్యము మహారూఢంబు; నీ నేరుపుల్
చాలున్; మచ్చరణాబ్జముల్ విడువు మస్మన్నాథపుత్రాదులన్
లీలం బాసి పరంబు డించి తనకున్ లీనత్వముం బొందు మ
మ్మేలా పాసె విభుండు? ధార్మికులు మున్నీ చందముల్ మెత్తురే.

10.1-1463-శార్దూల విక్రీడితము

వాలిం జంపెను వేటగాని పగిదిన్ వంచించి; దైత్యానుజన్
లోలం బట్టి విరూపిఁ జేసెను; బలిన్ లోభంబుతోఁగట్టి యీ
త్రైలోక్యంబు మొఱంగి పుచ్చుకొనియెన్; ధర్మజ్ఞుఁడే మాధవుం?
డేలా షట్పద! యెగ్గు మా వలన నీ కెగ్గింపఁగా నేటికిన్.

10.1-1464-ఉత్పలమాల

పన్నుగ మింటిపై కెగసి పాఱు విహంగములైన వీనులం
దన్నిక మాటు విన్న గృహ దార సుతాదులఁ బాసి విత్తసం
పన్నత డించి సంసరణ పద్ధతిఁ బాపెడువాఁడు నిత్యకాం
క్షన్నెఱి నున్న మా బ్రతుకు సైఁచునె యేల మధువ్రతోత్తమా!

10.1-1465-మత్తేభ విక్రీడితము

కమనీయంబగు వేఁటకానిపలు కాకర్ణించి నిక్కంబుగాఁ
దమ చిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ దద్బాణ నిర్భిన్నలై
యమితోగ్రవ్యథ నొందుభంగి హరిమాయాలాపముల్ నమ్మి దుః
ఖములం జెందితి మంగజాస్త్రజనితోగ్రశ్రాంతి నిందిందిరా!

10.1-1466-ఉత్పలమాల

బంధుల బిడ్డలన్ మగల భ్రాతలఁ దల్లులఁదండ్రులన్ మనో
బాంధతఁ జేసి డించి తను నమ్మిన మమ్ము వియోగదుర్దశా
సింధువులోనఁ ద్రోచి యిటు చేరక పోవుట పాడిగాదు; పు
ష్పంధయ! మీ యధీశునకుఁ బాదములంబడి యొత్తి చెప్పవే.

10.1-1467-సీస పద్యము

కాంచనరత్న సంఘటిత సౌధంబులే;
మా కుటీరంబులు మాధవునకు?
వివిధ నరేంద్రసేవిత రాజధానియే;
మా పల్లె యదువంశమండనునకు?
సురభిపాదప లతాశోభితారామమే;
మా యరణ్యము సింహమధ్యమునకుఁ?
గమనీయ లక్షణ గజ తురంగంబులే;
మా ధేనువులు కంసమర్దనునకు?

10.1-1467.1-తేటగీతి

రూప విభ్రమ నైపుణ్య రూఢలైన
మగువలమె మేము మన్మథమన్మథునకు?
నేల చింతించు మముఁ? గృష్ణుఁ డేల తలఁచుఁ?
బృథివి నధిపులు నూతన ప్రియులు గారె. ?

## 10.1-177- ఉద్ధవుడుగోపికలనూరార్చుట

10.1-1468-వచనము

అని మఱియు నిట్లనేక విధంబులఁ గృష్ణసందర్శన లాలసలై పలుకుచున్న గోపికల వచనంబులు విని యుద్ధవుండు మధురాలాపంబుల నూరార్చుచు యిట్లనియె.

10.1-1469-మత్తేభ విక్రీడితము

జపదానవ్రత హోమసంయమ తపస్స్వాధ్యాయ ముఖ్యంబులన్
నిపుణుల్గోరియునే విభున్ మనములన్ నిల్పంగ లే రట్టి స

ద్వీపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై మీ కజ
స్ర పటుధ్యానము లిట్లు నిల్చునె? భవచ్చారిత్రముల్ చిత్రముల్.

10.1-1470-కంద పద్యము

నను మీకడకుం గృష్ణుఁడు
పనిపంపెడు వేళఁ బిలిచి పలికిన పలుకుల్
వినుఁ; డన్నియు వివరించెద
వనజేక్షణలార! మీరు వగవకుఁ డింకన్.

10.1-1471-వచనము

అని హరివచనంబులుగా నిట్లనియె.

10.1-1472-సీస పద్యము

ఎల్లకార్యములకు నేను ప్రధానకా;
రణము గావున మీకు రమణులార!
కలుగదు మద్వియోగము చరాచరరూప;
ములలో మహాభూతములు వసించు
కరణి నుండుదు సర్వగతుఁడనై నే మనః;
ప్రాణబుద్ధిగుణేంద్రియాశ్రయుండ
నాత్మయం దాత్మచే నాత్మఁ బుట్టింతు ర;
క్షింతును ద్రుంతు హృషీకభూత

10.1-1472.1-తేటగీతి

గుణగణాకార మాత్మలోఁ గొమరుమిగుల

నిబిడ మాయానుభవమున నిత్యశుద్ధ
మాత్మ విజ్ఞానమయము వేఱయ్యు గుణము
ప్రకృతికార్యమనోవృత్తిఁ బట్టి పొందు.

10.1-1473-చంపకమాల

కలఁగని లేచి మున్ను కలఁ గన్న సమస్తవిధంబు కల్ల గా
దలఁచిన భంగి మానసపదార్థముచే నిఖిలేంద్రియార్థముల్
బలమునఁ గట్టి తద్జ్ఞుఁడు ప్రపంచము లేదనుఁ దన్మనంబుఁ దా
రలయక గట్టుడున్ బుధుల కవ్వల నొండొక భేదమున్నదే?

10.1-1474-ఆటవెలది

సాంఖ్య యోగ నిగమ సత్య తపో దమ
ములు మనోనిరోధమును గడపల
గాఁగ నుండు జలధి కడపలగాఁ గల
నదుల భంగి నళిననయనలార!

10.1-1475-మత్తేభ విక్రీడితము

చెలువల్ దవ్వుల నున్న వల్లభులపైఁ జిత్తంబులం గూర్తు రు
త్కలికం జేరువవారికంటె నదియుంగా దెప్పుడున్ నన్ను మీ
రలు చింతించుచు నుండఁగోరి యిటు దూరస్థత్వముం బొందితిం
దలకం బోలదు నన్నుఁ బొందెదరు నిత్యధ్యానపారీణులై.

## 10.1-178- ఉద్ధవునికడగోపికలువగచుట

10.1-1476-వచనము

అని మీకుం జెప్పు మని కృష్ణుండు చెప్పె" ననవుడు నుద్ధవునికి గోపికలు సంతసించి యిట్లనిరి.

10.1-1477-ఉత్పలమాల

ఇమ్ములనున్నవాఁడె హరి? యిక్కడి కెన్నడు వచ్చు వచ్చి మా
యుమ్మలికంబు బాపునె ప్రియుం డిట వచ్చెదనన్న సైఁతురే?
యమ్మథురాపురీ రమణు లడ్డము వత్తురుగాక చెల్లరే!
మమ్ము విధాత నిర్దయుఁడు మన్మథవేదన పాలు చేసెనే.

10.1-1478-చంపకమాల

మఱచునొకో మదిం దలఁచి మాధవుఁ డా యమునాతటంబునం
దఱచగు దివ్యసౌరభ లతా గృహసీమల నేము రాగ; మా
మఱువులనుండి నీడలకు మమ్మెలయించి కలంచి దేహముల్
మఱచినఁ దేర్చి నూల్కొలిపి మన్మథలీలలఁ దేల్చు చందముల్.

10.1-1479-శార్దూల విక్రీడితము

నీతో నర్మగృహంబులం బలుకునే నే మెల్ల వంశోల్ల స
ద్గీతభ్రాంతలమై కళిందతనయా తీరంబునం జేరినం
జేతోజాతసుఖంబులం దనిపి మా చిత్తస్థితుల్ చూడ లీ
లాతంత్రజ్ఞతఁ దాఁగి మెల్లన మదాలాపంబు లాలించుటల్.

10.1-1480-కంద పద్యము

ముచ్చట వేళలఁ జెప్పనె
యచ్చుగ మును నేము నోమునప్పుడు జలము

ల్లొచ్చిన మా చేలంబులు
మ్రుచ్చిలి యిచ్చిన విధంబు మూలం బెల్లన్.

10.1-1481-శార్దూల విక్రీడితము

ఏకాంతంబున నీదుపైఁ నొరిగి తా నేమేని భాషించుచో
మా కాంతుండు వచించునే రవిసుతామధ్యప్రదేశంబునన్
రాకాచంద్రమయూఖముల్ మెఱయఁగా రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం గ్రీడించు విన్నాణముల్.

10.1-1482-సీస పద్యము

తనుఁబాసి యొక్కింతతడవైన నిటమీఁద;
 నేలపై మేనులు నిలువ వనుము
నేలపై మేనులు నిలువక యటమున్న;
 ధైర్యంబు లొక్కటఁ దలగు ననుము
ధైర్యంబు లొక్కటఁ దలఁగిన పిమ్మటఁ;
 జిత్తంబు లిక్కడఁ జిక్క వనుము
చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చినఁ;
 బ్రాణంబు లుండక పాయు ననుము

10.1-1482.1-తేటగీతి

ప్రాణములుపోవ మఱి వచ్చి ప్రాణవిభుఁడు
ప్రాణిరక్షకుఁ డగు తన్నుఁ బ్రాణులెల్ల
జేరి దూఱంగ మఱి యేమి జేయువాఁడు
వేగ విన్నప మొనరింపవే మహాత్మ!

10.1-1483-కంద పద్యము

తగులరె మగలను మగువలు?
దగులదె తను మున్ను గమల? దగవు విడిచియుం
దగిలిన మగువల విడుచుట
దగుదఁగ దని తగవు బలుకఁ దగుదువు హరికిన్.

10.1-1484-సీస పద్యము

విభుఁడు మా ప్రేపల్లె వీధుల నేతేరఁ;
జూతుమే యొకనాడు చూడ్కు లలరఁ?
బ్రభుఁడు మాతో నర్మభాషలు భాషింప;
విందుమే యొకనాఁడు వీను లలరఁ?
దనువులు పులకింప దయితుండు డాసినఁ;
గలుగునే యొకనాఁడు కౌఁగలింపఁ?
బ్రాణేశు! మమ్మేల పాసితి వని దూఱఁ;
దొరకునే యొకనాఁడు తొట్రుపడఁగ?

10.1-1484.1-తేటగీతి

వచ్చునే హరి మే మున్న వనముఁ జూడఁ?
దలఁచునే భర్త మాతోడి తగులు తెలఁగుఁ?
దెచ్చునే విధి మన్నాథుఁ దిట్టువడక?
యెఱుఁగ బలుకు మహాత్మ! నీ కెఱుఁగ వచ్చు.

10.1-1485-వచనము

అని "దుఃఖార్ణవమగ్నులైన గోపకులంబు నుద్ధరింపుము రమానాథ" యని గోపికలు వగచి తదనంతరంబ మఱియు నుద్ధవ నిగదితంబు లయిన కృష్ణసందేశంబులవలన విరహవేదనలు విడిచి యుద్ధవునిం బూజించి; రిట్లు కృష్ణలీలావర్ణనలు చేయుచు వ్రేపల్లె నుద్ధవుండు గొన్ని నెల లుండి నందాదుల వీడ్కొని మరలి రథారూఢుండై చనిచని.

10.1-1486-కంద పద్యము

సారమతిఁ బ్రణుతి జేయుచు
నారయ నుద్ధవుఁడు గాంచె నఘసంహారిన్
హారిన్ మథురానగర వి
హారిన్ రిపుజన మదాపహారిన్ శౌరిన్.

10.1-1487-వచనము

కని యథోచితంబుగా భాషించుచుఁ దనచేత నందాదులు పుత్తెంచిన కానుకలు బలకృష్ణులకు నుగ్రసేనునికి వేఱువేఱ యిచ్చె నని చెప్పి శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

## 10.1-179- కుబ్జగృహంబునకేగుట

10.1-1488-మత్తేభ విక్రీడితము

తను మున్నంగజకేళిఁ గోరిన లతాతన్విన్ రతిక్రీడలం
దనుపం గోరి జనార్దనుం డరిగె రత్నస్వర్ణ మాల్యాను లే
పన భూషాంబర ధూపదీప పరిదీప్తంబై మనోజప్రదీ
పనమై యున్న తదీయ గేహమునకుం బంచేషుపంచేషుఁడై.

10.1-1489-వచనము

ఇట్లరిగి తద్గేహంబున.

10.1-1490-ఆటవెలది

కాము శరముబోలెఁ గమలారి కళబోలె
మెలఁగి యాడనేర్చు మెఱుఁగుబోలె
నిఖిలభువనమోహినీదేవతయుఁ బోలెఁ
జెలువు మెఱసియున్న చెలువఁ గనియె.

10.1-1491-మత్తేభ విక్రీడితము

హరి యేతెంచిన లేచి సంభ్రమముతో నాళీ సమూహంబుచే
సిరి యొప్పన్ విహితోపచారములు తాఁ జేయించి సౌవర్ణ సుం
దరతల్పస్థితుఁ జేసి యుద్ధవుని నుద్యత్ప్రీతిఁ బూజించి భా
సుర పీఠంబున నుండఁ బంచి మది నౌత్సుక్యంబు శోభిల్లఁగన్.

10.1-1492-కంద పద్యము

ఆళీనివహ నివేదిత
మాలా మృగనాభిపంక మణిమయభూషా
చేలాలంకృత యగుచును
హేలావతి గోరె వనరుహేక్షణుఁ గవయన్.

## 10.1-180- కుబ్జతో క్రీడించుట

10.1-1493-కంద పద్యము

లీలావతి సుకృతోల్లస

దేలాకర్పూరమిళిత హిత మధుర మహా
హాలారసపాన మద
శ్రీలాలిత యగుచు నబల చేరెం గృష్ణున్.

10.1-1494-మత్తేభ విక్రీడితము

సరసాలోకనవృష్టి పైఁ గురియుచున్ సమ్యగ్వచో వైఖరిం
గరఁగం జేసి సువర్ణకంకణసమగ్రం బైన సైరంధ్రి కే
ల్గరపద్మంబునఁ బట్టి తల్పమున కాకర్షించి గంభీరతం
బరిరంభాదుల నానపుచ్చి మరుసంభావించుచున్ వేడుకన్.

10.1-1495-ఉత్పలమాల

జాతియుఁ గాలముం గళయు సత్త్వము దేశము భావచేష్టలున్
ధాతువుఁ బ్రాయముంగుణముఁదద్దశయుంహృదయంబుఁజూడ్కియుం
బ్రీతి విశేషముం దెలిసి పెక్కువిధంబులఁ దొయ్యలిన్ మనో
జాత సుఖంబులం దనిపె శౌరి వధూహృదయాపహారియై.

10.1-1496-కంద పద్యము

కరపద్మంబుల మాధవుఁ
గరమొప్పం గౌగలించి కామానలముం
గరభోరువు వర్జించెను
గర మరు దని తోడిశీతకరముఖు లలరన్.

10.1-1497-మత్తేభ విక్రీడితము

సనకాదుల్ దలపోసి కానని విభున్ సర్వప్రభున్ దుర్లభున్

మును దా నిచ్చిన యంగరాగ సుకృతామోదంబునం గూడియున్
ఘన నిర్వాణవిభూతి యిమ్మనక నా కంజాక్షి యేఁ బాయఁజా
ల ననుం గొన్ని దినంబు లంగభవకేళిం దేల్పవే? నావుడున్.

10.1-1498-ఆటవెలది

వనిత గోరుకొనిన వరమిచ్చి యా శౌరి
యుద్ధవుండు దాను నువిద యిల్లు
వెడలె నపుడు తియ్యవిలుకాఁడు సురభితోఁ
దీఁగ యిల్లు వెడలు తెఱఁగు మెఱయ.

10.1-1499-కంద పద్యము

ఏ వేదంబులఁ గానని
దేవోత్తముఁ గాంచి ముక్తి తెరు వడుగక రా
జీవేక్షణ రతి యడిగెను
భావింపఁ దదీయ కర్మఫల మెట్టిదియో.

10.1-1500-కంద పద్యము

కారుణ్యంబునఁ గృష్ణుఁడు
దారుణ్యము మెఱసి మదనతంత్రంబుల లీ
లారణ్యవీధిఁ దేల్చెను
సైరంధ్రిన్ విభవవిజిత శక్రపురంధ్రిన్.

10.1-1501-వచనము

తదనంతరంబ కృష్ణుం డుద్ధవ రామ సహితుండై హస్తినాపురంబునకు నక్రూరునిం బనుపందలంచి తద్గృహంబునకుం జనిన నతండు వారలం గని లేచి రామకృష్ణులకు నమస్కరించి యుద్ధవుం గౌఁగలించుకొని వారి నందఱ యధావిధిం బూజించి హరిపాదంబులు తన తొడలమీఁద నిడుకొని యిట్లనియె.

10.1-1502-కంద పద్యము

అనుచరులుఁ దానుఁ గంసుఁడు
చనియెన్ మీచేత జమునిసదనంబునకున్
ఘనులార! మీ బలంబున
నొనరఁగ యాదవకులంబు నుద్ధృత మయ్యెన్.

## 10.1-181- అక్రూరుడు పొగడుట

10.1-1503-వచనము

మహాత్ములార! మీరు విశ్వాదిపురుషులరు, విశ్వకారణులరు, విశ్వమయులరగుట మీకుఁ గార్యకారణంబులు లేవ వధరింపుము; పరమేశ్వరా! నీవు రజోగుణంబున నఖిలంబు సృజియించి కారణరూపంబునఁ దదనుపవిష్టుండవై కృతదృష్టకార్యరూప ప్రపంచాకారంబున దీపింపుదువు; కార్యరూప చరాచర దేహంబులకుం గారణంబులైన భూప్రముఖంబులనుగతంబులైనఁ గార్యరూప దేహంబులునై ప్రకాశించు చందంబున నొక్కండవుఁ గారణరహితుండవు నాత్మతంత్రుండవునై యుండియు విశ్వాకారంబునఁ బెక్కగుదువు సృష్టిస్థితిలయంబులఁ జేయుచుండియును విజ్ఞానమూర్తి వగుటం బరిభ్రాంతుండైన జీవుని భంగి గుణకర్మబద్ధుండవు కావు; కావున సిద్ధంబు తన్నిమిత్తంబున బంధహేతువు సిద్ధింపదు.

10.1-1504-సీస పద్యము

పరఁగ జీవునికైన బంధమోక్షము లంట;
వంటునే పరతత్త్వమైన నిన్ను
నంటునే యీశ! దేహాద్యుపాధులు నని;
ర్వచనీయములుగాన వరుస నీకు
జన్మంబు జన్మసంశ్రయ భేదమును లేదు;
కావున బంధమోక్షములు లేవు;
గణుతింప నిన్నులూఖలబద్ధుఁడనుటయు;
నహిముక్తుఁ డనుటయు నస్మదీయ

10.1-1504.1-ఆటవెలది

బాలబుద్ధిఁగాదె? పాషండముఖర మా
ర్గములచేత నీ జగద్ధితార్థ
మైన వేదమార్గ మడఁగిపో వచ్చిన
నవతరించి నిలుపు దంబుజాక్ష.

10.1-1505-కంద పద్యము

ఆ నీవు ధరణిభారము
మానిచి రక్కసుల నెల్ల మర్దించుటకై
యానకదుందుభి యింటను
మానక జన్మించితివి సమంచితకీర్తిన్.

10.1-1506-మత్తేభ విక్రీడితము

త్రిజగత్పావనపాదతోయములచే దీపించి వేదామర

ద్విజ ముఖ్యాకృతివైన నీవు కరుణన్ విచ్చేయుటం జేసి మా
నిజగేహంబులు ధన్యతం దనరెఁ బో; నిన్నార్య్య లర్చింపఁగా
నజితత్వంబులు వారి కిత్తు వనుకంపాయత్త చిత్తుండవై.

10.1-1507-శార్దూల విక్రీడితము

ఏ పుణ్యాతిశయప్రభావముననో యీ జన్మమం దిక్కడన్
నీ పాదంబులు గంటి నిన్నెఱిఁగితిన్ నీవుం గృపాళుండవై
నాపై నర్మిలిఁజేసి మాన్పఁ గదవే నానా ధనాగార కాం
తా పుత్రాదులతోడి బంధనము భక్తవ్రాతచింతామణీ.

10.1-1508-వచనము

అని పలికిన నగుచు నక్రూరుని మాటలవలన సంసారబంధం బగు మోహంబు గీలుకొలుఁపుచు హరి యిట్లనియె.

10.1-1509-కంద పద్యము

బంధుండవు సద్ద్వేహిత
సంధుండవు వావిఁ జూడ జనకుఁడవు కృపా
సింధుండ వెల్ల గుణముల
నంధుండవుగావు ప్రోవ నర్హుల మెందున్.

10.1-1510-చంపకమాల

కొలుతురు మర్త్యు లిష్టములు గోరి శిలామయదేవసంఘమున్
జలమయ తీర్థసంఘమును సంతతమున్నటు వారు గొల్వఁగా
వలదనరాదుగాక భగవత్పదభక్తులరైన మీ క్రియన్

సొలయక దేవతీర్థములు చూచిన యంతనె కోర్కు లిచ్చునే.

## 10.1-182- అక్రూరుని హస్తిన పంపుట

### 10.1-1511-వచనము

మహాత్మా! పరమభాగవతుండవైన నీవు మాకభీష్టంబు లొనరింప నర్హుండవు; వినుము పాండురాజు పరలోకగతుండైనఁ గుంతీ సహి తులైన పాండవులు ధృతరాష్ట్రు శాసనంబున నేతెంచి కరిపురం బున నున్నవారఁట; నిజపుత్రమోహితుం డగు న య్యంధ నృపతి వారి యందు సమత్వంబునం జరింపం డటుగావున.

### 10.1-1512-కంద పద్యము

వారలు బంధులు గావున
వారలకును మే లొనర్చి వా రలరంగా
వారింప వలయు దుస్థితి
వారిజరిపువంశ! పొమ్ము వారిం జూడన్.

### 10.1-1513-వచనము

అని పలికి సంకర్షణోద్ధవసహితుండై హరి నిజగృహంబునకుంజనుటయు నక్రూరుండు కౌరవరాజధాని యగు కరిపురికరిగి యందు ధృతరాష్ట్ర భీష్మ విదుర బాహ్లిక భారద్వాజ గౌతమ దుర్యోధన కర్ణాశ్వత్థామాదులం గుంతీసహితులైన పాండవులం దక్కిన బంధువులనుం గని యథోచిత సత్కారంబుల నొంది తత్తద్వర్తనంబు లెఱింగికొనుచుఁ గొన్నిదినంబు లుండ నొక్కనాడు విదురుండు విన నేకతంబున నక్రూరునికిఁ గుంతి యిట్లనియె.

## 10.1-183- అక్రూరునితో కుంతిసంభాషణ

10.1-1514-శార్దూల విక్రీడితము

అన్నా తల్లులుఁదండ్రులున్ భగినులున్నల్లుండ్రు మద్భ్రాతలున్
నిన్నుం బొమ్మనువేళ నే మనిరి? మా నెవ్వల్ విచారింతురే?
యున్నారా సుఖయుక్తులై? మృగివృకవ్యాహంబులోనున్న రే
ఖన్నే నిక్కడ నున్నదానఁ గుమనః కౌరవ్యమధ్యంబునన్.

10.1-1515-మత్తేభ విక్రీడితము

కలిపించెన్ ఫణికోటిచే లతికలం గట్టించి గంగానదిన్
నెలిఁ ద్రోపించె విషాన్వితాన్న మొసఁగెన్ నిద్రారతిం జెంది యే
మఱియుండం బొడిపించె నాయుధములన్మత్పుత్రులం దేమియుం
గొఱగాఁ డీ ధృతరాష్ట్రసూనుఁడు మహాక్రూరుండు క్రౌర్యంబునన్.

10.1-1516-మత్తేభ విక్రీడితము

బలుఁడుం గృష్ణుఁడు నెన్నఁడైనఁ దమలో భాషించి మేనత్త బి
డ్డలకున్ మేలు తలంతురే? వగపులన్ డయ్యంగఁ బా లయ్యెనే
జలజాతాక్షుఁడు భక్తవత్సలుఁ డిలాచక్రంబు భాగించి యి
మ్ముల నిప్పించునె నా కుమారకులకున్ ముఖ్యప్రకారంబునన్.

10.1-1517-వచనము

అని పలికి కృష్ణునిఁ జిత్తంబున నిల్పి నమస్కరించి సంకీర్తనంబు చేసి “సర్వాత్మ! సర్వపాలక! పుండరీకాక్ష! శరణాగతనైన నన్ను రక్షింపు రక్షింపు” మని వగచుచున్న కుంతికి నక్రూరుండు విదురసమేతుండై ప్రియవచనంబుల దుఃఖోపశమనంబు చేసి వీడ్కొని బంధుమిత్రమధ్యంబున సుఖోపవిష్టుండైన ధృతరాష్ట్రున కిట్లనియె.

## 10.1-184- అక్రూరధృతరాష్ట్రులసంభాషణ

10.1-1518-ఉత్పలమాల

నీ యనుజుండు పాండుధరణీవిభుఁ డీల్గిన నీవు భూమి ధ
ర్మాయతబుద్ధి నేలుచుఁ బ్రజావళిఁ గాచుచు గౌరవంబుతోఁ
బాయక లోకులందు సమభావతఁ జేసితివేనిఁ గీర్తియున్
శ్రేయముఁ గల్గు వేఱొకటి చేసిన దుర్గతిగల్గు భూవరా!

10.1-1519-సీస పద్యము

అవనీశ! పాండవులందు నీ నందను;
 లందు సమానుండ వగుట బుద్ధి
యెవ్వనితో యోగ మిం దెవ్వనికి నిత్య;
 మంగనాగార పుత్రాదికముల
వలన నయ్యెడి దేమి? వసుమతి నొక జంతు;
 వుదయింప నొక జంతు వుక్కడంగు
నొకఁడు పుణ్యము జెందు నొకఁడు పాపము నొందు;
 మీనజీవనభూత మిళిత జలముఁ

10.1-1519.1-ఆటవెలది

దత్తనూజు లెట్లు ద్రావుదు రట్లు మూ
ఢాత్ము విత్త మెల్ల నపహరింతు
రహితులైన కొడుకు లటమీఁద మనియైనఁ
జచ్చియైనఁ దండ్రి జూడఁ జనరు

10.1-1520-కంద పద్యము

కావున మూఢాత్ముఁడవై
నీ వార్జించిన ధనంబు నీ పుత్రులు దుః
ఖావహులు పంచుకొనఁగా
భూవర! నిందితుఁడ వగుదు భూనాకములన్.

10.1-1521-శార్దూల విక్రీడితము

నిందం బొందకు మయ్య! యీ తనువు దా నిద్రా కళా దృష్టమౌ
సందోహంబు విధంబు నిల్వదు సుమీ; జాత్యంధతం బొందియున్
మందప్రజ్ఞత లేల చేసెదవు సమ్యగ్జ్ఞాన చక్షుండవై
సందేహింపక యిమ్ము పాండవులకున్ సర్వంసహా భాగమున్.

10.1-1522-వచనము

అనిన ధృతరాష్ట్రుం డిట్లనియె.

10.1-1523-సీస పద్యము

నీ మాట మంచిది నిశ్చయ మగు; నైన;
నస్థిరంబైన నా యంతరంగ
మందు నిల్వదు సుదామాచలస్పటిక శి;
లాతత ద్యుతి తటిల్లతిక భంగి;
నమృతంబు నొందియు నానందితుఁడు గాని;
నరుమాడ్కి నేను నానంద మొంద;
నీశ్వ రాజ్ఞావిధ మెవ్వఁడు దప్పింప;
నోపు విజ్ఞాని యై యుండి యైన

10.1-1523.1-ఆటవెలది

విశ్వమెల్లఁ జేసె విభజించి గుణముల
నెవ్వఁ డనుసరించె నెవ్వఁ డవని
భారమెల్లఁ బాపఁ బ్రభవించె దేవకి
కెవ్వఁ డాత్మతంత్రుఁ డీశ్వరుండు.

10.1-1524-వచనము

అట్టి కృష్ణునకు నమస్కరించెద; నా నందనందనుని దివ్యచిత్తంబునం గల తెఱంగునన్నృతుకం గలవార" మని వీడ్కొలిపిన నక్రూరుం డతని తలంపెఱింగి "నీతలంపుఁ గనుగొంటి నీకిష్టం బగునట్లు వర్తింపు" మని పలికి మరలి మథురకుం జనుదెంచి తదీయ వృత్తాంతంబు రామకృష్ణుల కెఱింగించె; అంతఁ గంసుభార్యలగు నస్తియు బ్రాప్తియు విధవలయి దుఃఖించుచుం దమ తండ్రి యయిన జరాసంధుని కడకుం జని.

## 10.1-185- అస్తిప్రాస్తులు మొరపెట్టుట

10.1-1525-శార్దూల విక్రీడితము

వాండ్రున్ వీండ్రును రాజులే యనుచు గర్వప్రౌఢితో యాదవుల్
వేండ్రంబైన బలంబుతో మథురకున్ వే వచ్చి నిష్కారణం
బాండ్రున్ బిడ్డలు బంధులున్ వగవఁ గంసాదిక్షమానాథులం
దండ్రీ! చంపిరి కృష్ణుచేత నిటు వైధవ్యంబు వచ్చెం జుమీ.

10.1-1526-వచనము

అనిన విని, ప్రళయకాలానలంబు తెఱంగున మండిపడి శోకరోషంబులు బంధురంబులుగా జరాసంధుం డిట్లనియె.

10.1-1527-శార్దూల విక్రీడితము

ఏమీ? కంసునిఁ గృష్ణుఁడే రణములో హింసించె నోచెల్ల! నా
సామర్థ్యంబు దలంప డించుకయు మచ్చండప్రతాపానలో
ద్దామార్చుల్ వడి నేడు గాల్చు యదుసంతానాటవీవాటికన్
భూమిం గ్రుంగిన నింగిఁ బ్రాకిన మహాంభోరాశిలోఁ జొచ్చినన్.

10.1-1528-కంద పద్యము

యాదవ విరహిత యగుఁ బో
మేదిని నాచేత నేడు మీఁదుమిగిలి సం
పాదిత బలులై హరి రు
ద్రద్రుహిణేంద్రాదు లెవ్వ రడ్డం బైనన్.

10.1-1529-వచనము

అని పలికి సమరసన్నాహ సంకులచిత్తంబునఁ గోపంబు దీపింప సంగరభేరి వ్రేయించి కదలి.

10.1-1530-కంద పద్యము

దక్షుండై యిరువదిమూ
డక్షౌహిణులైన బలము లనుగతములుగా
నాక్షణము జరాసంధుఁడు
ప్రక్షోభముతోడ మధురపైఁ జనియె నృపా!

10.1-1531-కంద పద్యము

గంధేభ తురగ రథ భట

బంధుర చరణోత్థితోగ్రపాంసుపటల యో
గాంధీభూతములై దివి
మంధర గతి నడచె నపుడు మార్తాండ హరుల్.

## 10.1-186- జరాసంధుని మథురముట్టడి

### 10.1-1532-వచనము

ఇట్లు చని నిరంతర కిసలయపత్రకోరకకుసుమఫలభారవినమిత వృక్షవిలసిత మహోద్యానంబును, నుద్యానవనభాగ వలమాన జలోన్నయన దారుయంత్ర లతానిబద్ధ కలశ విముక్త సలిలధారా శీకరపరంపరాసంపాదిత వర్షాకాలంబును, గాలకింకర సదృశ వీర భట రథ తురగ సామజ సంకులంబును, గులాచార ధర్మప్రవీణ పౌరజన భాసురంబును, సురాభేద్యమాన మహోన్నతాట్టాలక యంత్ర భయంకర ప్రాకారచక్రంబును, జక్రసారసహంసాదికలకలరవకలిత సరోవరంబును, సరోవర సంఫుల్ల హల్లక కమల పరిమళమిళిత పవనవిరాజితంబును, జితానేక మండలేశ్వర భూషణ మణిగణ రజోనివారిత మదగజేంద్రదానజలప్రభూత పంకంబును బంకరహిత యాదవేంద్ర దత్త సువర్ణాచల కల్పతరు కామధేను సమ్మర్ధిత విద్వజ్జన నికేతనంబును గేతన సన్నిబద్ధ చామర మయూర చాప శింజనీనినద పరిపూరితాభ్రంబును, నభ్రంలిహ మహాప్రాసాద సౌధ గవాక్షరంధ్ర నిర్గత ఘనసార ధూపధూమపటల విలోకన సంజనిత జలధర విభ్రాంత శిఖండితాండవ రుచిరంబును, జిరతరానేక దేవాలయ జోఘుష్యమాణ తూర్యనినద పరిభావిత పారావార కల్లోల ఘోషంబును, ఘోషకామినీ ప్రాణవల్లభ బాహుదండపరిరక్షితంబునై, పరులకు నలక్షితంబైన మథురానగరంబు చేరి, వేలాలంఘనంబు చేసి, వెల్లివిరిసిన మహార్ణవంబు తెఱంగునఁ బట్టణంబునకు

ముట్టణంబుచేసి, చుట్టును విడిసిన జరాసంధుని బలౌఘంబుఁగని వేళావిదుం డగు హరి తన మనంబున.

10.1-1533-మత్తేభ విక్రీడితము

ఐదున్నాలుగునాలురెండునిరుమూ డక్షౌహిణుల్పట్టి సం
ఛాదించెం బురమెల్ల మాగధునెడన్ సామంబు దానంబు సం
భేదంబుం బనిలేదు దండవిధి శోభిల్లం బ్రయోగించి యీ
భూదేవీ గురుభార మెల్ల నుడుపం బోలున్ జయోద్భాసినై.

10.1-1534-కంద పద్యము

ఏ నవతరించు టెల్లను
మానుగఁ జతురంత ధరణిమండలభరమున్
మానుపుకొఱకుం గాదే
పూనెద నిది మొదలు దగిలి భూభర ముడుపన్.

10.1-1535-ఆటవెలది

మగధనాథుఁ బోర మడియింపఁ బోలదు
మడియకున్న వీఁడు మరలమరల
బలముఁ గూర్చుకొనుచుఁ బఱతెంచుఁ బఱతేరఁ
ద్రుంపవచ్చు నేల దొసఁగు దొఱఁగ.

10.1-1536-వచనము

అని యిట్లు చింతించుచున్న సమయంబున నభోభాగంబుననుండి మహాప్రభా సమేతంబులును, సపరిచ్ఛదసూతంబులును, ననేక బాణ బాణాసన చక్రాది

వివిధాయుధోపేతంబులునైన రథంబులు రెండు మనోరథంబులు పల్లవింప దైవయోగంబునం జేరవచ్చినం జూచి హరి సంకర్షణున కిట్లనియె.

10.1-1537-శార్దూల విక్రీడితము

కంటే రామ! రథంబు లాయుధములున్ గాఢప్రకాశంబులై
మింటన్ వచ్చెను వీనిఁ గైకొని సురల్ మెచ్చన్ నృపశ్రేణులం
బంటింపం బనిలేదు చంపుము ధరాభారంబు వారింపు మీ
వెంటన్ నీ యవతారమున్ సఫలమౌ వేవేగ లెమ్మాజికిన్.

10.1-1538-వచనము

అని పలికి.

## 10.1-187- జరాసంధునితోఁ పోర వెడలుట

10.1-1539-కంద పద్యము

ఖరులై దృఢకవచ ధను
శ్ఛరులై యధిగత రథానుచరులై మదవ
త్కరులై ఘన హరులై బల
హరు లయ్యెడ నాజి కేగి రతిభీకరులై.

10.1-1540-వచనము

ఇట్లు సమరసన్నాహంబునం బురంబు వెడలి.

10.1-1541-ఉత్పలమాల

అన్యులు తల్లడిల్ల దనుజాంతకుఁ డొత్తె గభీరఘోష కా
ఠిన్య మహాప్రభావ వికటీకృత పద్మభవాండ జంతు చై

తన్యము ధన్యమున్ దివిజతాపసమాన్యముఁ బ్రీత భక్త రా
జన్యము భీతదుశ్చరితశాత్రవసైన్యముఁ బాంచజన్యమున్.

10.1-1542-కంద పద్యము

సింధుర భంజనపూరిత

బంధురతర శంఖనినద భారమున జరా

సంధునికిం గల సైన్యము

లంధములై సంచలించె నాహవభూమిన్.

### 10.1-188- జరాసంధుని సంవాదము

10.1-1543-వచనము

అయ్యవసరంబున మాగధుండు మాధవున కిట్లనియె.

10.1-1544-సీస పద్యము

అదలించి రొప్పంగ నాలమందలు గావు;

గంధగజేంద్ర సంఘములు గాని

పరికించి వినఁగ నంభారవంబులు గావు;

వాజీంద్ర హేషారవంబు గాని

పదహతిఁ గూల్పంగఁ బాత బండ్లివి గావు;

నగసమానస్యందనములు గాని

ప్రియము లాడంగ నాభీరలోకము గాదు;

కాలాభ వైరివర్గంబు గాని

10.1-1544.1-తేటగీతి

యూర్వ వనవహ్ని గాదు బాణాగ్ని గాని
మురియ బృందావనము గాదు మొనలు గాని
యమున గాదు నటింప ఘోరాజి గాని
పోరు నీకేల గోపాల! పొమ్ముపొమ్ము.

10.1-1545-మత్తేభ విక్రీడితము

తరుణిం జంపుటయో బకున్ గెడపుటో ధాత్రీజముల్ గూల్చుటో
ఖరునిం ద్రుంచుటయో ఫణిం బఱపుటో గాలిన్ నిబంధించుటో
గిరి హస్తంబునఁ దాల్చుటో లయమహాగ్నిస్ఫార దుర్వార దు
ర్భర బాణాహతి నెట్లు నిల్చెదవు సప్రాణుండవై గోపకా!

10.1-1546-వచనము

అదియునుం గాక.

10.1-1547-సీస పద్యము

గోపికావల్లకీ ఘోషణంబులు గావు;
 శింజనీరవములు చెవుడుపఱచు
వల్లవీకరముక్త వారిధారలు గావు;
 శరవృష్టి ధారలు చక్కుచేయు
ఘోషాంగనాపాంగ కుటిలాహతులు గావు;
 నిశితాసి నిహతులు నిగ్రహించు
నాభీరకామినీ హస్తాబ్జములు గావు;
 ముష్టి ఘాతంబులు మురువడంచు

10.1-1547.1-తేటగీతి

నల్ల ప్రేపల్లెగాదు ఘోరావనీశ
మకరసంఘాత సంపూర్ణ మగధరాజ
వాహినీసాగరం బిది వనజనేత్ర!
నెఱసి నిను దీవి కైవడి నేడు ముంచు.

10.1-1548-వచనము

అనిన శ్రీహరి యిట్లనియె.

10.1-1549-ఉత్పలమాల

పంతములేల తొల్లి జనపాలురఁ బోరుల గెల్చినాఁడ వం
ద్రంతియ చాలదే? బిరుదు లాడుట బంటుతనంబు త్రోవయే?
యింతటదీఱనే? మగధ! యేటికి ప్రేలెదు? నీవ యేల క
ల్పాంత మహోగ్రపావకునినైన హరింతు వరింతు సంపదన్.

10.1-1550-కంద పద్యము

గోపాలుఁడ వని పలికితి
భూపాలక! దీననేమి? పోరాడంగా
గోపాల మహీపాల
వ్యాపారాంతరము దెలియవచ్చుం బోరన్.

10.1-1551-వచనము

అనిన రోషబంధురుండై జరాసంధుం డిట్లనియె.

10.1-1552-ఉత్పలమాల

బాలుఁడ వీవు కృష్ణ! బలభద్రునిఁ బంపు రణంబు జేయ; గో
పాలక! బాలుతోడ జనపాలశిఖామణి యైన మాగధుం
డాలము చేసె నంచు జను లాడెడి మాటకు సిగ్గు పుట్టెడిం
జాలుఁ దొలంగు దివ్యశరజాలుర మమ్ము జయింపవచ్చునే?

10.1-1553-వచనము

అనిన నగధరుం డిట్లనియె.

10.1-1554-కంద పద్యము

పొగడుకొనుదురే శూరులు;
మగటిమిఁ జూపుదురు గాక మాగధ! నీకున్
మగతనము గలిగెనేనియుఁ
దగు మెఱయ వికత్థనములు దగ దీ పోరన్.

10.1-1555-వచనము

అనిన రోషించి.

10.1-1556-చంపకమాల

పవనుఁడు మేఘరేణువుల భానుకృశానులఁ గప్పు కైవడిన్
వివిధబలౌఘముం బనిచి వేగము మాగధుఁ డావరించె భూ
మ్యవన చరిష్ణులన్ విమతమానవనాథ నిరాకరిష్ణులన్
దివిషదలంకరిష్ణుల నతిస్థిరజిష్ణుల రామకృష్ణులన్.

10.1-1557-మత్తేభ విక్రీడితము

హయహేషల్ గజబృంహితంబులు రథాంగారావముల్ శింజనీ

చయ టంకారములున్ వివర్ధిత గదా చక్రాస్త్ర నాదంబులున్
జయశబ్దంబులు భేరి భాంకృతులు నిస్సాణాది ఘోషంబులున్
భయదప్రక్రియ నొక్కవీఁక నెగసెన్ బ్రహ్మాండభేద్యంబుగన్.

## 10.1-189- జరాసంధునిసేన పోరాటము

### 10.1-1558-వచనము

మఱియు నయ్యెడ మాగధ మాధవ వాహినులు రెండు నొండొంటిం దాఁకి రౌద్రంబున సంవర్తసమయ సముద్రంబుల భంగి నింగికిం బొంగి చెలంగి చలంబునం దలపడి పోరునెడ మసరుకవిసి మహారణ్యంబులు వెలువడి మార్కొను మదగజంబుల మాడ్కిని, మహోత్కంఠంబులగు కంఠీరవంబుల గ్రద్దన, దుర్లభంబులగు శరభంబుల చాడ్పునం, బ్రచండంబులగు గండభేరుండంబుల గమనికం దమతమ మొనలకుం దలకడచి వీరరసంబుల వివిధరూపంబులైన విధంబునం బదుగురు నూర్వు రేవురు గములై కులకుధర గుహాంతరాళంబులు నిండ సింహనాదంబు లొనర్చుచు, నార్చుచు నట్టహాసంబులు జేయుచు, నరివీరుల రోయుచు పటహకాహళభేరీశంఖ శబ్దంబులకు నుబ్బుచు, గర్వంబులం బ్రబ్బుచు, గదల వ్రేయుచుఁ గాండంబు లేయుచు, ముద్గరంబుల నొత్తుచు, ముసలంబుల మొత్తుచుఁ, గుంతంబుల గ్రుచ్చియెత్తుచుఁ గరవాలంబులం ద్రెంచుచు, జక్రంబులం ద్రుంచుచు శస్త్రంబులఁ దఱుగుచుఁ, జిత్రంబులం దిరుగుచు పరిఘంబులఁ ద్రిప్పికొట్టుచుఁ, బ్రాసంబులఁ బెట్టుచు, శూలంబులఁ జిమ్ముచు, సురియల గ్రుమ్ముచు బహుభంగులఁ బరాక్రమించు వీరభటులును, నిబిడనీరంధ్రంబేమి నిర్ఘోషంబుల నాకాశంబు నిరవకాశంబుగ ననర్గళ చక్రమార్గణంబులం బడు పదాతులును జదియు నరదంబులును వివిధాయుధ ప్రయోగంబుల పైరుల వ్రచ్చి వందఱలాడు రథికులును, రథికశరపరంపరలఁ

గంపింపక మహామోఘ మేఘధారలకుఁ జలింపని ధరణీధరంబుల చాడ్పున రథంబులకుం గవిసి కల్పాంతకాల దండిదండ ప్రచండంబులగు శుండాదండంబులు సాఁచి యూఁచి కడనొగ లొడిసి తిగిచి కుదిచి విఱిచి కూబరములు నుఱుములుగ జిఱజిఱంద్రిప్పి వైచియు, భటులం జటుల గతి బంతుల క్రియ నెగుర వైచి దంతంబుల గ్రుచ్చియు ఘోటకంబుల వ్రచ్చియు విచ్చలవిడిం దిరుగు కరులును, వజ్రి వజ్రధారలకుం దప్పి కకుప్పులకు నెగయు ఱెక్కలుగల గిరుల సిరులం బక్కెరల తోడ హేషారవ భీషణంబులయి మనోజవంబులగు తురంగంబులం బఱపి తురంగ పదపాంసుపటల ప్రభూత బహుళాంధకారంబులు కరకలిత కఠోర ఖడ్గ మరీచి జాలంబుల నివారించుచు నానాప్రకారంబులం బ్రతివ్యూహంబులం జించి చెండాడు రాహుత్తులుం గలిగి సంగ్రామంబు భీమం బయ్యె నందు.

10.1-1559-కంద పద్యము

చెడు రథములుఁ దెగు హరులును
బడు కరులును మడియు భటులుఁ బఱచు రుధిరమున్
మడియు తల లొఱగు తనువులుఁ
బొడియగు తొడవులును మధురిపుని దెసఁగలిగెన్.

10.1-1560-కంద పద్యము

భీతంబై హతసుభట
వ్రాతంబై భగ్న తురగ వారణ రథ సం
ఘాతంబై విజయశ్రీ
పీతంబై యదుబలంబు విఱిగె నరేంద్రా!

10.1-1561-శార్దూల విక్రీడితము

యోధాగ్రేసరుఁ డా హలాయుధుఁడు లోకోత్కృష్ట బాహాబల
శ్రీ ధౌరేయుఁడు గృష్ణుఁ డిట్టి ఘనులం జిత్రంబు; నే డిట్లు సం
రోధించెన్; బలముం దెరల్చెఁ; మగధేంద్రుం డంచు నీక్షించుచున్
సౌధాగ్రంబులఁ బౌరకాంతలు మహాసంతప్తలై రెంతయున్.

## 10.1-190- కృష్ణుడు విజృంభించుట

10.1-1562-వచనము

ఇట్లు తన మొనలు విఱిగి పాఱినం గనుంగొని, సమరసంరంభంబున హరి విశ్వంభరాభరణ వేదండ తుండాభంబులగు బాహుదండంబులం బెంచి, విజృంభించి, బ్రహ్మాండకుహరకుంభ పరిస్ఫోటనం బగు పాంచజన్యనినదంబు నిబిడ నిర్ఘాతశబ్దంబులుగ నుదంచిత పింఛదామంబు సంక్రందన చాపంబుగఁ, బ్రశస్త హస్తలాఘవంబున శరాకర్షణ సంధాన మోక్షణంబు లేర్పడక, నిర్వక్ర చక్రారాంబుతోడ మార్తాండమండలప్రభాప్రచండంబగు శార్ఙ్గ కోదండంబు క్రొమ్మెఱుంగులు మెఱుంగులుగ, దిగ్గజేంద్ర కర్ణభీషణంబులగు గుణఘోషంబులు ఘుమఘుమారావ దుస్సహంబు లయిన గర్జనంబులుగ రథ తురంగమ రింఖా సముద్ధూత పరాగపటల పరంపరా సంపాదిత పుంజీభూతంబగు పెంజీఁకటి యిరులుగ నసమసమరసన్నాహ చాతురీ విశేషంబులకుం జొక్కి నిక్కి కరంబు లెత్తి నర్తనంబులం బ్రవర్తించు నారాదాదులు లీలాతాండవమండిత మహోత్కంఠంబు లగు నీలకంఠంబులుగ సుందరస్యందననేమి నిర్ఘోషభీతులై కుంభి కుంభంబులపై వ్రాలు వీరులు మత్తమయూర కేకారవ చకితులై యువతీ కుచకుంభంబుల మీఁద వ్రాలెడు కాముకులుగ నానా నరేంద్ర రక్తపిపాసా పరవశంబులై వాచఱచుచున్న భూతవ్రాతంబులు వర్షవర్షేతి నిస్వనంబు లొసంగు

చాతకంబులుగ నభంగ సంగర ప్రేరకుండగు హలాయుధుండు వృష్టికారణంబగు మందసమీరణంబుగ, ననల్ప కల్పాంతకాల నీలవలాహకంబు భాతిం బరఁగు మేని చాయతోడం దోయజనాభుండరాతి చతురంగదేహక్షేత్రంబులం బుంఖానుపుంఖంబులుగ నసంఖ్యాత బహువిధ దివ్యబాణవర్షంబు గురియునెడ శస్త్రాస్త్రపరంపరా సంఘట్టనజనితంబులగు మిడుఁగుఱులు వర్షాకాలవిహిత విద్యోతమాన ఖద్యోతంబులుగ, విశిఖవికీర్ణ కోటిరఘట్టిత పద్మరాగశకలంబు లింద్రగోపంబులుగ, మహితమార్గణవిదళిత మత్తమాతంగ కుంభమౌక్తికంబులు వడగండ్లుగఁ, జటు లార్ధచంద్రశరచ్ఛిన్నంబులై కృష్ణ కృష్ణ నిలునిలు మని పలుకుచుం గూలెడి మేనులు కృషీవల కర పరశుధారా విదళిత మూలవిశాల సాలంబులుగ, భాసురభల్లభగ్నంబులైన వదనగహ్వరంబులవలన డుల్లెడు దంతపుంజంబులు మాలతీకుసుమ మంజరులుగ నవ్య నారాచభిన్న దేహంబులయి దిగ్గనఁ గ్రొగ్గండ్లవలన వెడలు రక్త స్యందసందోహంబులతో సంచరింపక ప్రాణంబులు విడుచు శుండాలంబులు సెలయేఱులతోడి కొండలుగఁ గరోరకాండ ఖండితంబు లైన భుజాదండంబులతోడం గలసిపడిన వజ్రమయ కంఠికాభరణంబులు భోగిభోగసమేత కేతకీ కుసుమంబులుగఁ బ్రళయార్ణవ కల్లోల శబ్దసన్నిభంబులైన భేరీరవంబులు భీకర భేకీరవంబులుగ దారు ణేషు విలూన వాహ వారణ మనుజ మస్త మస్కిష్కంబు రొంపియునై నొంపుమెఱయ నాభీల కీలాల ప్రవాహంబులు ప్రవహించె; నందు భుజంబులు భుజంగంబులుగఁ, గపాలంబులు కమఠంబులుగ, శిరోజంబులు శైవలంబులుగఁ, గరంబులు మీనంబులుగ, హయంబులు నక్రంబులుగ గజంబులు దీవులుగ ధవళఛత్రంబులు నురువులుగఁ, జామరంబులు కలహంసంబులుగ, భూషణరత్నరేణురాసులు పులినంబులుగ నొప్పె; నప్పుడు.

## 10.1-191- బలరాముడు విజృంభించుట

10.1-1563-లయవిభాతి

హసిత హరినీలనిభ వసనము విశాలకటి;
నసమ నయనాద్రి పరిహసితమగు మేఘో
ల్లసనము వహింపఁ గరకిసలయము హేమ మణి;
విసర వలయద్యుతులు దెసల తుదలందుం
బసలఁగురియంగ సరభసమున బలుండు దర;
హసితము ముఖాబ్జమున నెసఁగ ఘనకాలా
యసమయ మహోగ్రతర ముసలము వడిన్ విసరి;
కసిమసఁగి శత్రువుల నసువులకుఁ బాపెన్.

10.1-1564-లయవిభాతి

ప్రళయసమయాంతకుని చెలువునఁ గటాక్షముల;
నలఘు చటులాగ్ని కణములు చెదరఁ గోలా
హలముగ సువర్ణమణివలయ నిచయోజ్జ్వలిత;
హలము వడిఁజాఁచి శిరములు నురములున్ని
ర్దళితములుగన్ శకలములుగ నొనరింపఁ గని;
బెలుకుఱి జరాసుతుని బలము రణవీధిన్
జలిత దనుజావళికి బలికి భయభీత సుర;
ఫలికిఁ ద్రిజగచ్ఛలికి హలికిఁ దలడించెన్.

10.1-1565-శార్దూల విక్రీడితము

రోషోద్రేకకళాభయంకర మహారూపంబుతో నొక్క చే
నీషాదండము సాఁచి లాంగలము భూమీశోత్తమగ్రీవలన్

భూషల్ రాలఁ దగిల్చి రాఁదిగిచి సంపూర్ణోద్ధతిన్ రోఁకటన్
వేషంబుల్ చెడమొత్తె రాముఁడు రణోర్విన్ నెత్తురుల్ జొత్తిలన్.

10.1-1566-కంద పద్యము

హాలిహాలహృత కరికుంభ
స్థల ముక్తాఫలము లోలిఁ దనరెఁ గృషిక లాం
గల మార్గ కీర్ణ బీజా
వలి క్రైవడి నద్భుతాహవక్షేత్రమునన్.

10.1-1567-కంద పద్యము

తఱిమి హాలి హలము విసరుచు
నెఱిఁ గదిసిన బెగడి విమతనికరము లెడలై
వెఱఁగుపడు నొదుఁగు నడఁగును
మఱుపడుఁ జెడు మడియుఁ బొరలు మరలుం దెఱలున్.

10.1-1568-కంద పద్యము

హరి తిగ్మగోశతంబుల
హరిదంతర మెల్లఁ గప్పునాకృతిఁ గడిమిన్
హరి తిగ్మగోశతంబుల
హరిదంతర మెల్లఁ గప్పి నతిభీకరుఁడై.

10.1-1569-సీస పద్యము

పదుగురేగురు దీర్ఘబాణము ల్గాఁడిన;
 గుదులు గ్రుచ్చిన భంగిఁ గూలువారుఁ;

దలలు ద్రవ్విన మున్ను దారు వీక్షించిన;
వారల నొప్పించి వ్రాలువారుఁ;
బదములు దెగిబడ్డ బాహులఁ బోరి ని;
ర్మూలిత బాహులై మ్రొగ్గువారు;
క్షతముల రుధిరంబు జల్లింప నిర్ఝర;
యుతశైలములభంగి నుండువారు;

10.1-1569.1-ఆటవెలది

భ్రాతృ పుత్ర మిత్ర బంధువుల్ వీఁగిన
నడ్డమరుగుదెంచి యడఁగువారు;
వాహనములు దెగిన వడి నన్యవాహనా
ధిష్ఠులగుచు నెదిరి ద్రెళ్ళువారు.

10.1-1570-శార్దూల విక్రీడితము

ఈ కాయంబులఁ బాసినంతటనె మా కెగ్గేమి? జేతృత్వమున్
నీకుం జెల్లదు కృష్ణ! నిర్జరులమై నిన్నోర్తు మీమీఁదటన్
వైకుంఠంబున నంచుఁ బల్కు క్రియ దుర్వారాస్త్రభిన్నాంగులై
యాకంపింపక గొందఱాడుదురు గర్వాలాపముల్గృష్ణునిన్.

10.1-1571-వచనము

ఇవ్విధంబున.

10.1-1572-కంద పద్యము

జగతీశ! యేమిచెప్పుదు?

నగణితలయవార్ధి భయదమై మూఁగిన య
మ్మగధేశు బలము నెల్లను
దెగఁ జూచిరి హరియు హలియుఁ దీవ్రక్రీడన్.

10.1-1573-కంద పద్యము

భువన జనుస్థితవిలయము
లవలీలం జేయు హరికి నరినాశన మెం
త విషయమైన మనుజుఁడై
భవ మొందుటఁ జేసి పొగడఁ బడియెం గృతులన్.

10.1-1574-వచనము

ఆ సమయంబున.

10.1-1575-శార్దూల విక్రీడితము

అంహఃకర్ములు దల్లడిల్ల భయదాహంకారుఁడై సీరి దో
రంహం బొప్ప హలాహతిన్ రథ ధనూరథ్యంబులం గూల్చి త
త్సంహారస్పృహఁ జొచ్చి పట్టెను జరాసంధున్ మదాంధున్ మహా
సింహంబుం బ్రతిసింహముఖ్యము బలశ్రీఁ బట్టు నేర్పేర్పడన్.

10.1-1576-వచనము

ఇట్లు పట్టుకొని.

## 10.1-192- జరాసంధుని విడుచుట

10.1-1577-ఉత్పలమాల

కుంఠితులై పరుల్ బెగడ ఘోరబలుండు బలుండు వాని నో

ల్లుంఠము లాడుచుం దిగిచి లోకభయంకరమైన ముష్టిచేఁ
గంఠగతాసుఁ జేసి తమకంబున మొత్తఁగ భూభరక్షయో
త్కంఠుఁడు చక్రి మీఁదెఱిఁగి కార్యము గల్దని మాన్పి యిట్లనున్.

10.1-1578-శార్దూల విక్రీడితము

దుఃఖింపం బనిలేదు; పొమ్ము; బలసందోహంబులం దెమ్ము; చే
తఃఖేదం బెడలంగ రమ్ము; రిపులం దండింపు; కాదేని భూ
స్వఃఖేల్లజ్జన మెల్ల మెచ్చ నృప! నీ శౌర్యోన్నతుల్చూపి మే
దఃఖండంబులు భూతముల్దినఁ దనుత్యాగంబు చేయం దగున్.

10.1-1579-వచనము

అని నగుచు విడిపించిన విడివడి చిడిముడికి నగ్గలంబైన సిగ్గున మ్రుగ్గి నెమ్మొగంబు చూపక, కోప కపట భావంబులు మనంబునం బెనంగొనఁ దపంబు చేసి యైన వీరలం జయించెద నని పలాయితులైన రాజులం గూడుకొనుచు జరాసంధుండు విరిగి చనియె; సురలు కుసుమవర్షంబులు గురియ హాలియు హరియును మధురానగర జన వందిమాగధ జేగీయమానులై వీణా వేణు మృదంగ శంఖ దుందుభి నినదంబు లాకర్ణించుచు, మృగమద జలసిక్త విమల వీధికాశతంబును, వివిధ విచిత్ర కేతనాలంకృతంబును సువర్ణ మణిమయ జయస్తంభ నిబద్ధ తోరణ సంయుతంబును, వేద నాద నినాదితంబును, సంతుష్టజన సంకుల గోపురంబునునైన పురంబుఁ బ్రవేశించి; రందు.

10.1-1580-ఉత్పలమాల

వెల్లువలైన వైరినృపవీరుల నెల్ల జయించి వీటికిన్
బల్లిదులైన కృష్ణబలభద్రులు వచ్చుచున్నవారు రం;

డుల్లములారఁ జూత మని యున్నత సౌధము లెక్కి వారిపైఁ
బల్లవ పుష్ప లాజములఁ బౌరపురంధ్రులు చల్లి రెల్లెడన్.

10.1-1581-వచనము

ఇట్లు పురంబు ప్రవేశించి యుద్ధప్రకారంబెల్ల నుగ్రసేనున కెఱింగించి కృష్ణుం డిచ్ఛావిహారంబుల నుండె; మఱియు నెక్కువ మత్సరంబున నమ్మాగధుండు మహీమండలంబునంగల దుష్టమహీపతుల నెల్లం గూడుకొని సప్తదశ వారంబులు సప్తదశాక్షౌహిణీ బల సమేతుండై మథురానగరంబుపై విడిసి మాధవ భుజాప్రాకార రక్షితు లగు యాదవులతోడ నాలంబు చేసి నిర్మూలిత బలుండై పోయి క్రమ్మఱ నష్టాదశ యుద్ధంబునకు వచ్చునెడం గలహ విద్యావిశారదుం డగు నారదుండు కాలయవను కడకుం జని యిట్లనియె.

## 10.1-193- కాలయవనునికినారదుని బోధ

10.1-1582-మత్తేభ విక్రీడితము

యవనా! నీవు సమస్త భూపతుల బాహాఖర్వగర్వోన్నతిం
బవనుం డభ్రములన్ హరించు పగిదిన్ భంజించియున్నేల యా
దవులన్ గెల్వవు? వారలన్ మఱచియో దర్పంబు లేకుండియో?
యవివేకస్థితి నొందియో? వెఱచియో? దైన్యంబునుం జెందియో?

10.1-1583-కంద పద్యము

యాదవులలోన నొక్కఁడు
మేదినిపై సత్త్వరేఖ మెఱసి జరాసం
ధాదులఁ దూలం దోలెను
దాదృశుఁ డిలలేడు వినవె తత్కర్మంబుల్.

10.1-1584-వచనము

అనిన విని, కాలయవనుం డిట్లనియె.

10.1-1585-శార్దూల విక్రీడితము

ఏమీ; నారద! నీవు చెప్పిన నరుం డే రూపువాఁ? డెంతవాఁ?
డే మేరన్ విహరించు? నెవ్వఁడు సఖుం? డెందుండు? నేపాటి దో
స్సామర్థ్యంబునఁ గయ్యములె సలుపు నస్మద్బాహు శౌర్యంబు సం
గ్రామక్షోణి భరించి నిల్వఁ గలఁడే? గర్వాఢ్యుఁడే? చెప్పుమా.

10.1-1586-వచనము

అనిన విని దేవముని యిట్లనియె.

10.1-1587-సీస పద్యము

నీలజీమూత సన్నిభ శరీరమువాఁడు;
తామరసాభ నేత్రములవాఁడు
పూర్ణేందుబింబంబుఁ బోలెడి మోమువాఁ;
డున్నత దీర్ఘ బాహువులవాఁడు
శ్రీవత్సలాంఛనాంచిత మహోరమువాఁడు;
కౌస్తుభమణి పతకంబువాఁడు
శ్రీకర పీతకౌశేయ చేలమువాఁడు;
మకరకుండల దీప్తి మలయువాఁడు

10.1-1587.1-తేటగీతి

రాజ! యింతంతవాఁ డనరానివాఁడు

మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁడు
తెలిసి యే వేళలందైనఁ దిరుగువాఁడు
పట్టనేర్చినఁ గాని లోఁబడనివాఁడు.

10.1-1588-వచనము

అని మఱియు నితర లక్షణంబులుం జెప్పిన విని, సరకుజేయక.

10.1-1589-ఉత్పలమాల

యాదవుఁ డెంతవాఁడు ప్రళయాంతకుఁడైన నెదిర్చ్చేనియుం
గాదనఁ బోర మత్కులహ కర్కశ బాహు ధనుర్విముక్త నా
నా దృఢ హేమపుంఖ కఠినజ్వలదస్త్ర పరంపరా సము
త్పాదిత వహ్ని కీలముల భస్మము చేసెదఁ దాపసోత్తమా!

## 10.1-194- కాలయవనుని ముట్టడి

10.1-1590-వచనము

అని పలికి కాలయవనుండు మూడుకోట్ల మ్లేచ్ఛవీరులం గూడుకొని, శీఘ్రగమనంబున దాడివెడలి, మథురాపురంబుమీఁద విడిసినం జూచి, బలభద్ర సహితుండై కృష్ణుం డిట్లని వితర్కించె.

10.1-1591-సీస పద్యము

యవనుండు పుర మెల్ల నావరించెను నేఁటి;
యెల్లిటి యెల్లుండి యీ నడుమను
మాగధుండును వచ్చి మనమీఁద విడియును;
యవన మాగధులు మహాప్రబలులు

పురి రెండువంకలఁ బోరుదు రట్టిచో;
 నోపిన భంగి నొక్కొక్కచోట
మనము యుద్ధము చేయ మఱియు నొక్కఁడు వొచ్చి;
 బంధుల నందఱఁ బట్టి చంపు

10.1-1591.1-తేటగీతి

నొండె గొనిపోయి చెఱఁబెట్టు నుగ్రకర్ముఁ
డైన మాగధుఁ; డదిగాన యరివరులకు
విడియఁ బోరాడఁగా రాని విషమభూమి
నొక్క దుర్గంబుఁ జేసి యం దునుపవలయు.

10.1-1592-వచనము

అని వితర్కించి సముద్రు నడిగి సముద్రమధ్యంబునం బండ్రెండు యోజనంబుల నిడుపు నంతియ వెడల్పుంగల దుర్గమ ప్రదేశంబు సంపాదించి, తన్మధ్యంబునం గృష్ణుండు సర్వాశ్చర్యకరంబుగ నొక్క నగరంబు నిర్మింపు మని విశ్వకర్మం బంచిన.

## 10.1-195- ద్వారకానగర నిర్మాణము

10.1-1593-ఆటవెలది

వరుణుపురముకంటె వాసవుపురికంటె
ధనదువీటికంటె దండధరుని
నగరికంటె బ్రహ్మ నగరంబుకంటెఁ బ్ర
స్ఫుటముగాఁగ నొక్క పురముఁ జేసె.

10.1-1594-వచనము

అందు.

10.1-1595-కంద పద్యము

ఆకసముతోడిచూ లనఁ
బ్రాకారము పొడవు గలదు పాతాళమహా
లోకముకంటెను లోఁ తెం
తో కలదా పరిఖ యెఱుఁగ దొరక దొకరికిన్.

10.1-1596-కంద పద్యము

కోటయు మిన్నును దమలోఁ
బాటికి జగడింప నడ్డపడి నిల్చిన వా
చాటుల రుచిఁ దారకములు
కూటువలై కోటతుదలఁ గొమరారు పురిన్.

10.1-1597-శార్దూల విక్రీడితము

సౌధద్వార కవాటకుడ్య వలభిస్తంభార్గళాగేహాళీ
వీధీవేది గవాక్షచత్వర సభావేశ్మప్రఘాణప్రపా
సౌధాట్టాలక సాలహర్మ్య విశిఖా సోపానసంస్థానముల్
శ్రీధుర్యస్థితి నొప్పుఁ గాంచన మణిస్నిగ్ధంబులై యప్పురిన్.

10.1-1598-కంద పద్యము

కూడి గ్రహంబులు దిరుగఁగ
మేడలతుద నెలవులందు మెలఁగెడి బాలల్

క్రీడింపరు పురుషులతో
ప్రీడం దద్వేళ లందు వినుమా వీటన్.

10.1-1599-ఉత్పలమాల

ఆయత వజ్ర నీలమణి హాటక నిర్మిత హర్మ్య సౌధ వా
తాయనరంధ్ర నిర్యదసితాభ్ర మహాగరు ధూపధూమముల్
తోయద పంక్తులో యనుచుఁ దుంగమహీరుహ రమ్యశాఖలం
జేయుచునుండుఁ దాండవవిశేషము లప్పురి కేకి సంఘముల్.

10.1-1600-ఆటవెలది

సరస నడచుచుండి సౌధాగ్ర హేమ కుం
భములలోన నినుఁడు ప్రతిఫలింప
నేర్పరింపలేక నినులు పెక్కం డ్రంచుఁ
బ్రజలు చూచి చోద్యపడుదు రందు.

10.1-1601-ఉత్పలమాల

శ్రీరమణీయ గంధములఁ జెన్నువహించుఁ బురీవనంబులం
గోరక జాలకస్తబక కుట్మల పుష్పమరందపూర వి
స్ఫార లతా ప్రకాండ విటపచ్ఛద పల్లవవల్లరీ శిఖా
సారపరాగ మూల ఫల సంభృత వృక్షలతావిశేషముల్.

10.1-1602-కంద పద్యము

శీకరములు జనహృదయ వ
శీకరములు మందపవనశీర్ణమహాంభ

శ్రీకరములు హంసవిహం
గాకరములు నగరి కువలయాబ్జాకరముల్.

10.1-1603-కంద పద్యము

నవకుసుమామోద భరా
జవనము రతిఖిన్న దేహజస్స్వేదాంభో
లవనము సమధిగతవనము
పవనము విహరించుఁ బౌరభవనము లందున్.

10.1-1604-కంద పద్యము

బ్రహ్మత్వము లఘు వగు నని
బ్రహ్మయు బిరుదులకు వచ్చి పట్టఁడుగా కా
బ్రహ్మది కళలఁ దత్పురి
బ్రహ్మజనుల్ బ్రహ్మఁ జిక్కఁ బరుపరె చర్చన్

10.1-1605-కంద పద్యము

నగరీభూసుర కృత లస
దగణిత మఖధూమ పిహితమై గాక మహా
గగనము నీలం బగునే?
మిగులఁగ బెడ గగునె గ్రహసమృద్ధం బయ్యున్.

10.1-1606-కంద పద్యము

తిరుగరు పలు కర్థులకును
సురుఁగరు ధన మిత్తు రితర సుదతీమణులన్

మరుగరు రణమునఁ బిఱిఁదికి
నరుగరు రాజన్యతనయు లా నగరమునన్.

10.1-1607-కంద పద్యము

రత్నాకరమై జలనిధి
రత్నము లీ నేర దద్ది రత్నాకరమే?
రత్నములఁ గొనుదు రిత్తురు
రత్నాకరజయులు వైశ్యరత్నములు పురిన్.

10.1-1608-కంద పద్యము

తుంగంబులు కరహత గిరి
శృంగంబులు దానజలవశీకృత భంగీ
భృంగంబులు శైలాభ స
మాంగంబులు నగరి మత్తమాతంగంబుల్.

10.1-1609-కంద పద్యము

ప్రియములు జితపవన మనో
రయములు కృతజయము లధికరమణీయ గుణా
న్వయములు సవినయములు ని
ర్భయములు హతరిపుచయములు పట్టణ హయముల్.

10.1-1610-కంద పద్యము

పులుల పగిదిఁ గంఠీరవ
ముల క్రియ శరభముల మాడ్కి ముదిత మదేభం

బుల తెఱఁగున నానావిధ
కలహమహోద్భటులు భటులు గల రా వీటన్.

10.1-1611-కంద పద్యము

ఆ వీట నుండువారికి
భావింపఁగ లేవు క్షుత్పిపాసాదులు త
ద్గోవింద కృపావశమున
దేవప్రతిమాను లగుచు దీపింతు రిలన్.

10.1-1612-సీస పద్యము

ఆసక్తి కృష్ణముఖావలోకనమంద;
హరిపాదసేవనమంద చింత
వెఱపు నారాయణవిముఖకార్యములంద;
పారవశ్యము విష్ణుభక్తి యంద
బాష్పనిర్గతి చక్రిపద్యసంస్తుతులంద;
పక్షపాతము శార్ఙ్గిభక్తులంద
లేమి గోవిందాన్యలీలాచరణమంద;
శ్రమము గోవిందపూజనములంద

10.1-1612.1-తేటగీతి

బంధ మన్యుతపరదుష్టపథములంద
జ్వరము మాధవవిరహితక్షణములంద
మత్సరము లీశు కైంకర్యమతములంద
నరవరోత్తమ! వినుము త న్నాగరులకు.

10.1-1613-వచనము

మఱియు హరికిం బారిజాతమహీజంబును సుధర్మ మనియెడి దేవసభను దేవేంద్రుం డిచ్చెఁ గర్ణైకదేశంబుల నలుపు గలిగి మనోజవంబులును శుక్లవర్ణంబులునైన తురంగంబుల వరుణుం డొసంగె, మత్స్య కూర్మ పద్మ మహాపద్మ శంఖ ముకుంద కచ్ఛప నీలంబు లను నెనిమిది నిధులఁ గుబేరుండు సమర్పించె, నిజాధికార శుద్ధికొఱకుఁ దక్కిన లోకపాలకులును దొల్లి తమకు భగవత్కరుణా కటాక్షవీక్షణంబుల సంభవించిన సర్వసంపదల మరల నతిభక్తితో సమర్పించి రివ్విధంబున.

10.1-1614-కంద పద్యము

దర్పించి చేసి పురము స
మర్పించెను విశ్వకర్మ మంగళగుణ సం
తర్పితగహ్వారికిని గురు
దర్పిత దుఃఖప్రవాహతరికిన్ హరికిన్.

## 10.1-196- పౌరులను ద్వారకకుతెచ్చుట

10.1-1615-వచనము

ఇట్లు విశ్వకర్మ నిర్మితంబైన ద్వారకానగరంబునకు నిజయోగ ప్రభావంబున మధురాపురజనుల నందఱం జేర్చి, బలభద్రున కెఱింగించి; తదనుమతంబున నందనవనంబు నిర్గమించు పూర్వదిగ్గజంబు పెంపున, మేరుగిరిగహ్వరంబు వెలువడు కంఠీరవంబు తెఱంగున హరిహయదిగంతరాళంబున నుదయించు నంధకారపరిపంథికైవడి మథురానగరంబు వెలువడి నిరాయుధుండై యెదుర వచ్చుచున్న హరిం గని.

10.1-1616-మత్తేభ విక్రీడితము

కరి సంఘంబులు లేవు; రావు తురగౌఘంబుల్; రథవ్రాతముల్
పరిసర్పింపవు; రారు శూరులు ధనుర్బాణాసి ముఖ్యాయుధో
త్కరముం బట్టఁడు; శక్రచాపయుతమేఘస్ఫూర్తితో మాలికా
ధరుఁ డొక్కం డదె నిర్గమించె నగరద్వారంబునం గంటిరే.

10.1-1617-శార్దూల విక్రీడితము

ఎన్నే నయ్యె దినంబు లీ నగరిపై నే నుండి పోరాటకున్
మున్నెవ్వండును రాఁడు వీఁడొకఁడు నిర్ముక్తాయుధుం డేగు దెం
చెన్నన్నోర్వఁగనో ప్రియోక్తులకునో శ్రీఁగోరియో చూడుఁ డం
చున్నాత్మీయ జనంబుతోడ యవనేశుం డిట్లు తర్కింపఁగన్.

10.1-1618-కంద పద్యము

విభులగు బ్రహ్మప్రముఖుల
కభిముఖుఁడై నడవకుండు నట్టి గుణాఢ్యుం
డిభరాజగమన మొప్పఁగ
నభిముఖుఁడై నడిచెఁ గాలయవనున కధిపా.

10.1-1619-వచనము

ఆ సమయంబు న య్యాదవేంద్రుని నేర్పడం జూచి.

10.1-1620-మత్తేభ విక్రీడితము

వనజాతాక్షుఁడు సింహమధ్యుఁడు రమావక్షుండు శ్రీవత్సలాం
ఛనుఁ డంభోధరదేహుఁ డిందుముఖుఁ డంచద్దీర్ఘబాహుండు స

ద్వనమాలాంగద హార కంకణ సముద్యత్కుండలుం డీతఁ డా
ముని సూచించిన వీరుఁ డౌ ననుచు నమ్ముగ్ధుండు గాఢోద్ధతిన్.

### 10.1-197- కాలయవనుడు వెంటజనుట

10.1-1621-సీస పద్యము

చటులవాలాభీల సైంహికేయుని భంగి;
లాలితేతరజటాలతిక దూలఁ
బ్రళయావసర బృహద్భాను హేతిద్యుతిఁ;
బరుషారుణశ్మశ్రుపటలి వ్రేలఁ
గాదంబినీఛన్న కాంచనగిరిభాతిఁ;
గవచసంవృతదీర్ఘ కాయ మమర
వల్మీకసుప్త దుర్వారాహి కైవడిఁ;
గోశంబులో వాలు కొమరు మిగుల

10.1-1621.1-ఆటవెలది

నార్చి పేర్చి మించి యశ్వంబుఁ గదలించి
కమలసంభవాది ఘనులకైనఁ
బట్టరాని ప్రోడఁ బట్టెద నని జగ
దవనుఁ బట్టఁ గదిసె యవనుఁ డధిప!

10.1-1622-కంద పద్యము

ఇటు దన్నుఁ బట్టవచ్చినఁ
బటుతర జవరేఖ మెఱసి పట్టుబడక ది
క్తటము లదుర హరి పాఱెం

జటులగతిన్ వాఁడు దోడఁ జనుదేరంగన్.

10.1-1623-వచనము

అప్పుడు కాలయవనుం డిట్లనియె.

10.1-1624-మత్తేభ విక్రీడితము

యదువంశోత్తమ! పోకుపోకు రణ మీ నర్హంబు; కంసాదులం
గదనక్షోణి జయించి తీ వని సమిత్కామంబునన్ వచ్చితిన్;
విదితఖ్యాతులు వీటిపోవ నరికిన్ వెన్నిచ్చి యిబ్భంగి నే
గుదురే రాజులు? రాజమాత్రుఁడవె? పైగుణ్యంబు వచ్చెంజుమీ?

10.1-1625-మత్తేభ విక్రీడితము

బలిమిన్ మాధవ! నేడు నిన్ను భువనప్రఖ్యాతిగాఁ బట్టుదున్
జలముల్జొచ్చిన, భూమి క్రిందఁ జనినన్, శైలంబుపై నెక్కినన్,
బలిదండన్ విలసించినన్, వికృతరూపంబుం బ్రవేశించినన్,
జలధిం దాఁటిన, నగ్రజన్ము హలి కాశ్వాటాకృతుల్ దాల్చినన్.

10.1-1626-వచనము

అదియునుం గాక.

10.1-1627-మత్తేభ విక్రీడితము

శరముల్ దూఱవు; మద్ధనుర్గుణలతాశబ్దంబు లేతేర; వీ
హరిరింఖోద్ధతిధూళి గప్పు; దకటా! హాస్యుండవై పాఱె; దు
ర్వరపై నే క్రియఁ బోరితో కదిసి మున్ వాతాశితోఁ గేశితో
గరితో మల్లురతో జరాతనయుతోఁ గంసావనీనాథుతోన్.

10.1-1628-వచనము

అని పలుకుచుఁ గాలయవనుండు వెంట నరుగుదేర సరకుచేయక మందహాసంబు ముఖారవిందంబునకు సౌందర్యంబు నొసంగ "వేగిరపడకు; రమ్ము ర" మ్మనుచు హరియును.

10.1-1629-సీస పద్యము

అదె యిదె లోఁబడె నని పట్టవచ్చినఁ;
 గుప్పించి లంఘించుఁ గొంతదడవు
పట్టరా; దీతని పరువవగ్గలం బని;
 భావింపఁ దన సమీపమున నిలుచు
నడరి పార్శ్వంబున కడ్డంబు వచ్చినఁ;
 గేడించి యిట్టట్టు గికురుపెట్టు;
వల్మీక తరు సరోవరము లడ్డంబైన;
 సవ్యాపసవ్యసంచరతఁ జూపుఁ;

10.1-1629.1-తేటగీతి

బల్లముల డాఁగు; దిబ్బల బయలుపడును;
నీడలకుఁ బోవు; నిరవుల నిగిడి తాఁకు
నన్నుఁ బట్టిన నీవు మానవుఁడ వనుచు
యవనుఁ డెగువంగ బహుజగద్దవనుఁ డధిప!

10.1-1630-వచనము

మఱియును.

10.1-1631-సీస పద్యము

సకలభూతవ్రాతసంవాసుఁ డయ్యును;
వనములు నగములు వరుస దాఁటు;
లోకోన్నతుండును లోకచక్షుఁడు నయ్యు;
మాటిమాటికి నిక్కి మగిడి చూచుఁ;
బక్ష విపక్ష సంబంధశూన్యుం డయ్యుఁ;
దనుఁ విపక్షుఁడు వెంటఁ దగుల నిగుడు;
విజయాపజయభావ విరహితుం డయ్యుఁ దా;
నపజయంబును జెందినట్లు చేయు;

10.1-1631.1-ఆటవెలది

నభయ భయ విహీనుఁ డయ్యు భీతుని మాడ్కిఁ
గానఁబడును సర్వకాలరూపుఁ
డయ్యుఁ గాలచకితుఁడైన కైవడి వన
మాలి పఱచు వెఱపుమాలి యధిప!

10.1-1632-వచనము

ఇవ్విధంబున.

10.1-1633-కంద పద్యము

దారిత శాత్రవ భవను న
పార మహావేగ విజిత పవనునున్ యవనున్
దూరఁము గొనిచని కృష్ణుఁడు
ఘోరంబగు నొక్క శైలగుహ వడిఁ జొచ్చెన్.

10.1-1634-కంద పద్యము

అదె లోఁబడె నిదె లోఁబడె
నదె యిదె పట్టెద నటంచు నాశావశుఁడై
యదుసింహుని పదపద్ధతి
వదలక గిరగహ్వరంబు వాఁడుం జొచ్చెన్.

10.1-1635-వచనము

ఇట్లు చొచ్చి మూఢహృదయంబునుం బోలెఁ దమఃపూర్ణంబయిన గుహాంతరాళంబున దీర్ఘతల్పనిద్రితుండయి గుఱక లిడుచున్న యొక్క మహాపురుషునిం గని శ్రీహరిగాఁ దలంచి.

10.1-1636-ఉత్పలమాల

ఆలము చేయలేక పురుషాధమ! దుర్లభ కంటకద్రుమా
భీల మహాశిలాసహిత భీకర కుంజర ఖడ్గ సింహ శా
ర్దూల తరక్షుసంకలిత దుర్గపథంబునఁ బాఱుదెంచి యీ
శైలగుహన్ సనిద్రు క్రియఁ జాఁగి నటించినఁ బోవనిత్తునే?

10.1-1637-కంద పద్యము

ఎక్కడ నెవ్వారలకును
జిక్క వనుచు నారదుండు చెప్పెను; నాకుం
జిక్కితి వెక్కడఁ బోయెదు?
నిక్కముగా నిద్రపుత్తు నిన్నిటికొండన్.

10.1-198- కాలయవనుడు నీరగుట

10.1-1638-ఆటవెలది

అనుచు యవనుఁ డట్టహాసంబు గావించి
చటుల కఠిన కులిశ సదృశమైన
పాదమెత్తి తన్నెఁ బాఱి తద్దేహంబు
నగగుహం బ్రతిస్వనంబు నిగుడ.

10.1-1639-ఉత్పలమాల

తన్నిన లేచి నీల్గి కనుదమ్ములు మెల్లన విచ్చి లోపలన్
సన్నపు గిన్కవర్ధిల దిశల్గని దృష్టిసమిద్ధవిగ్రహో
త్పన్న మహాగ్నికీలముల భస్మముచేసె నతండు సాయక
చ్ఛిన్నవిరోధికంఠవను శ్రీభవనున్ యవనున్ లఘుక్రియన్.

10.1-1640-వచనము

ఇట్లేక క్షణమాత్రంబున యవనుండు నీఱయ్యె" ననిన విని రాజు యిట్లనియె.

10.1-1641-ఆటవెలది

ఎవ్వఁడాతఁ డతని కెవ్వండు దండ్రి? ఘో
రాద్రిగుహకు నేటి కతఁడు వచ్చి
నిద్రవోయె? యవను నిటు గాల్ప నెట్లోపెఁ?
దెలియఁ బలుకు నాకు ధీవరేణ్య!

10.1-1642-వచనము

అనినం బరీక్షిన్నరేంద్రునకు నతికుతూహలంబుతో శుకయోగివర్యుం డిట్లనియె
"నిక్ష్వాకు కులసంభవుండు మాధాత కొడుకు ముచికుందుం డను రాజు

రాక్షసభీతులైన వేల్పులం బెద్దగాలంబు సంరక్షించిన మెచ్చి
వారమరలోకరక్షకుండైన యా రాజకుమారుని కడకుం జేరి వరంబు వేఁడు మనిన
వారలం గనుంగొని మోక్షపదం బడిగిన వార లతని కిట్లనిరి.

10.1-1643-మత్తేభ విక్రీడితము

జగతిన్ నిర్గతకంటకం బయిన రాజ్యంబున్ విసర్జించి శూ
రగణాగ్రేసర! పెద్దకాలము మమున్ రక్షించి తీలోన నీ
మగువల్పుత్రులు బంధులున్సుతులు సంబంధుల్ భువిన్లేరు కా
లగతిం జెందిరి; కాల మెవ్వరికి దుర్లంఘ్యంబు దా నారయన్.

10.1-1644-కంద పద్యము

కాలము ప్రబలురకును బలి
కాలాత్ముం డీశ్వరుం డగణ్యుఁడు జనులం
గాలవశులఁగాఁ జేయును
గాలముఁ గడవంగలేరు ఘను లెవ్వారున్.

10.1-1645-కంద పద్యము

వర మిచ్చెద మర్థింపుము
ధరణీశ్వర! మోక్షపదవి దక్కను మే మె
వ్వరమును విభులముగా మీ
శ్వరుఁ డగు హరి దక్క మోక్షసంగతిఁ జేయన్.

10.1-1646-వచనము

అని పలికిన దేవతలకు, నమస్కరించి ముచికుందుఁడు నిద్రఁ గోరి దేవదత్త నిద్రావశుండయ్యె పర్వతగుహాంతరాళంబున శయనించి యుండె; యవనుండు నీఱయిన పిమ్మట హరి ముచికుందుని ముందఱ నిల్చిన.

10.1-1647-సీస పద్యము

వనరుహాలోచను వైజయంతీదామ;
 శోభితు రాకేందు సుందరాస్యు
మకరకుండలకాంతి మహితగండస్థలుఁ;
 గౌస్తుభగ్రైవేయు ఘనశరీరు
శ్రీవత్సలాంఛనాంచితవక్షు మృగరాజ;
 మధ్యుఁజతుర్బాహు మందహాసుఁ
గాంచనసన్నిభకౌశేయవాసు గాం;
 భీర్యసౌందర్యశోభితుఁ బ్రసన్ను

10.1-1647.1-ఆటవెలది

నమ్మహాత్ముఁ జూచి యాశ్చర్యమును బొంది
తన్మనోజ్ఞదీప్తిఁ దనకుఁ జూడ
నలవిగాక చకితుఁడై యెట్టకేలకుఁ
బలికెఁ బ్రీతి నవనిపాలకుండు.

10.1-1648-మత్తేభ విక్రీడితము

శశివో? యింద్రుఁడవో? విభావసుఁడవో? చండప్రభారాశివో?
శశిచూడామణివో? పితామహుఁడవో? చక్రాంకహస్తుండవో?
దిశలున్ భూమియు మిన్ను నిండె నిదె నీ తేజంబుఁ జూడంగ దు

ర్వశ; మెవ్వండ విటేల వచ్చి తిచటన్ వర్తించె దేకాకివై.

10.1-1649-కంద పద్యము

ఈ యడవి విషమకంటక
భూయిష్ఠము ఘోరసత్త్వపుంజాలభ్యం
బో! యయ్య! యెట్లు వచ్చితి?
నీ యడుగులు కమలపత్రనిభములు జూడన్.

10.1-1650-వచనము

మహాత్మ! యేను నీకు శుశ్రూషణంబుజేయం గోరెద నీ జన్మగోత్రం బు లెఱింగింప నే నర్హుండనైన నెఱింగింపు; నే నిక్ష్వాకువంశ సంభ వుండను; మాంధాతృ నందనుండను; ముచికుందుం డనువాఁడ; దేవహితార్థంబు చిరకాల జాగరశ్రాంతుండనై నిద్ర నొంది యింద్రియ సంచారంబులు మఱచి.

10.1-1651-శార్దూల విక్రీడితము

ఏ నిద్రించుచు నుండ నొక్క మనుజుం డేతెంచి దుష్కర్ముఁడై
తా నీట్లై చెడె నాత్మకిల్బిషమహాదావాగ్నిచే నంతటన్
శ్రీనాథాకృతివైన నిన్నుఁ గని వీక్షింపన్న శక్తుండనై
దీనత్వంబును జెందితిన్ ననుఁ గృపాదృష్టిన్ విలోకింపవే.

10.1-1652-వచనము

అనిన విని మేఘగంభీరభాషల హరి యిట్లనియె.

10.1-1653-సీస పద్యము

భూరజంబులనైన భూనాథ! యెన్నంగఁ;

జనుఁ గాని నా గుణ జన్మ కర్మ
నామంబు లెల్ల నెన్నంగ నెవ్వరుఁ జాల;
రదియేల; నాకును నలవిగాదు
నేలకు వ్రేగైన నిఖిల రాక్షసులను;
నిర్జించి ధర్మంబు నిలువఁబెట్ట
బ్రహ్మచే మున్ను నేఁ బ్రార్థింపఁబడి వసు;
దేవునింటను వాసుదేవుఁడనఁగ

10.1-1653.1-ఆటవెలది

గరుణ నవతరించి కంసాఖ్యతో నున్న
కాలనేమిఁ జంపి ఖలుల మఱియు
ద్రుంచుచున్నవాఁడఁ దొడరి నీ చూడ్కి నీ
ఱైనవాఁడు కాలయవనుఁ డనఘ!

10.1-1654-వచనము

వినుము; తొల్లియు నీవు నన్ను సేవించిన కతంబున నిన్ననుగ్రహింప నీ శైలగుహకు నేతెంచితి; నభీష్టంబులైన వరంబు లడుగు మిచ్చెద మద్భక్తులగు జనులుగ్రమ్మఱ శోకంబున కర్హులు గారనిన హరికి ముచికుందుండు నమస్కరించి, నారాయణదేవుం డగుట యెఱింగి యిరువదియెనిమిదవ మహాయుగంబున నారాయణుం డవతరించు నని మున్ను గర్గుండు చెప్పుటఁ దలచి.

## 10.1-199- ముచికుందుడు స్తుతించుట

10.1-1655-కంద పద్యము

నీ మాయ జిక్కి పురుష
స్త్రీమూర్తిక జనము నిన్ను సేవింపదు; వి
త్తామయగృహగతమై సుఖ
తామసమై కామవంచితంబై యీశా!

10.1-1656-ఉత్పలమాల

పూని యనేకజన్మములఁ బొంది తుదిం దన పుణ్యకర్మ సం
తానము పేర్మిఁ గర్మ వసుధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుఁడై
మానవుఁడై గృహేచ్ఛఁబడు మందుఁ డజంబు తృణాభిలాషి యై
కానక పోయి నూతఁబడు కైవడి నీ పదభక్తిహీనుఁడై.

10.1-1657-కంద పద్యము

తరుణీ పుత్ర ధనాదుల
మరిగి మహారాజ్యవిభవ మదమత్తుఁడనై
నరతనులుబ్ధుఁడ నగు నా
కరయఁగ బహుకాల మీశ! యాఅడిబోయెన్.

10.1-1658-కంద పద్యము

ఘట కుడ్య సన్నిభం బగు
చటుల కళేబరముఁ జొచ్చి జనపతి నంచుం
బటు చతురంగంబులతో
నిటునటుఁ దిరుగుదును నిన్ను నెఱుఁగమి నీశా!

10.1-1659-ఆటవెలది

వివిధ కామ లోభ విషయ లాలసు మత్తు
నప్రమత్తవృత్తి నంతకుండ
పైన నీవు వేళ యరసి త్రుంతువు సర్ప
మొదిఁగి మూషకంబు నొడియునట్లు.

10.1-1660-కంద పద్యము

నరవరసంజ్ఞితమై రథ
కరిసేవితమైన యొడలు కాలగతిన్ భీ
కరమృగభక్షితమై దు
స్తరవిట్క్రిమిభస్త్రిసంగతం బగు నీశా!

10.1-1661-ఆటవెలది

సకల దిశలు గెలిచి సములు వర్ణింపంగఁ
జారుపీఠమెక్కి సార్వభౌముఁ
డైన సతులగృహము లందుఁ గ్రీడాసక్తి
వృత్తినుండు; నిన్ను వెదకలేఁడు.

10.1-1662-ఆటవెలది

మానసంబు గట్టి మహితభోగంబులు
మాని యింద్రియముల మదము లడఁచి
తపము చేసి యింద్రతయ గోరుఁ గాని నీ
యమృత పదముఁ గోరఁ డజ్ఞుఁ డీశ!

10.1-1663-సీస పద్యము

సంసారి యై యున్న జనునకు నీశ్వర! ;
 నీ కృప యెప్పుడు నెఱయఁ గల్గు
నప్పుడ బంధంబు లన్నియుఁ దెగిపోవు;
 బంధమోక్షంబైనఁ బ్రాప్త మగును
సత్సంగమంబు; సత్సంగమంబున నీదు;
 భక్తి సిద్ధించు; నీ భక్తివలన
సన్ముక్తి యగు; నాకు సత్సంగమునకంటె;
 మును రాజ్యబంధనిర్మూలనంబు

10.1-1663.1-తేటగీతి
గలిగినది దేవ! నీ యనుగ్రహము గాదె?
కృష్ణ! నీ సేవగాని తక్కినవి వలదు;
ముక్తి సంధాయి వగు నిన్ను ముట్టఁ గొలిచి
యాత్మబంధంబు గోరునే యార్యుఁ డెందు?

10.1-1664-వచనము
కావున రజస్తమస్సత్త్వగుణంబుల ననుబంధంబు లగు నైశ్వర్య శత్రు మరణ ధర్మాది విశేషంబులు విడిచి యీశ్వరుండును విజ్ఞాన ఘనుండును, నిరంజనుండును, నిర్గుణుండును, నద్వయుఁడును నైన పరమపురుషుని నిన్నాశ్రయించెదఁ; జిరకాలంబు కర్మఫలంబులచేత నార్తుండనై క్రమ్మఱం దద్వాసనల సంతుష్టుండనై తృష్ణం బాయక శత్రువులైన యింద్రియంబు లాఱింటిని గెలువలేని నాకు శాంతి యెక్కడిది? విపన్నుండ నైన నన్ను నిర్భయుం జేసి రక్షింపు" మనిన ముచికుందునికి హరి యిట్లనియె.

10.1-1665-ఉత్పలమాల

మంచిది నీదు బుద్ధి నృపమండన! నీవు పరార్థ్య మెట్లు వ
ర్తించిన నైనఁ గోరికల దిక్కునఁ జిక్కవు మేలు నిర్మలో
దంచితవృత్తి నన్గొలుచు ధన్యుల బద్ధులు నెట్లు నీకు ని
శ్చంచలభక్తి గల్గెడిని సర్వము నేలుము మాననేటికిన్.

10.1-1666-వచనము

నరేంద్రా! నీవు తొల్లి క్షత్రధర్మంబున నిలిచి, మృగయావినోదంబుల జంతువుల వధియించినాఁడవు; తపంబునఁ దత్కర్మవిముక్తుండవై తర్వాతి జన్మంబున సర్వభూతసఖిత్వంబుగలిగి బ్రాహ్మణ శ్రేష్ఠుండవై నన్నుఁ జేరెద"వని వీడ్కొలిపిన హరికిఁ బ్రదక్షిణంబు వచ్చి నమస్కరించి గుహ వెడలి సూక్ష్మప్రమాణదేహంబులతో నున్న మనుష్య పశు వృక్షలతాదులం గని కలియుగంబు ప్రాప్తం బగు నని తలంచి యుత్తరాభిముఖుండై తపోనిష్ఠుం డగుచు సంశయంబులు విడిచి, సంగంబులు పరిహరించి విష్ణుని యందుఁ జిత్తంబు చేర్చి గంధమాదనంబు ప్రవేశించి మఱియు నరనారాయణ నివాసంబైన బదరికాశ్రమంబు చేరి, శాంతుండై హరినారాధించుచుండె, నిట్లు ముచికుందుని వీడ్కొని.

10.1-1667-శార్దూల విక్రీడితము

అచ్ఛిద్రప్రకటప్రతాపరవిచే నాశాంతరాళంబులన్
ప్రచ్ఛాదించుచుఁ గ్రమ్మఱన్ మధురకుం బద్మాక్షుఁ డేతెంచి వీ
డాచ్ఛాదించి మహానిరోధముగఁ జక్రాకారమై యున్న యా
మ్లేచ్ఛవ్రాతము నెల్లఁ ద్రుంచె రణభూమిం బెంపు సొంపారఁగన్.

**10.1-200- జరసంధుడుగ్రమ్మరవిడియుట**

10.1-1668-వచనము

ఇట్లు మ్లేచ్ఛులం బొరిగొని మఱియు నమ్మధురానగరంబునం గల ధనంబు ద్వారకానగరంబునకుం బంచిన మనుష్యులు గొనిపోవు నెడ.

10.1-1669-సీస పద్యము

ఘోటకసంఘాత ఖురసమున్నిర్గత;
 ధూళి జీమూత సందోహముగను
మహనీయ మదకల మాతంగకటదాన;
 ధారలు కీలాలధారలుగను
నిరుపమ స్యందననేమి నిర్ఘోషంబు;
 దారుణగర్జితధ్వానముగను
నిశితశస్త్రాస్త్రమానిత దీర్ఘరోచులు;
 లలితసౌదామినీ లతికలుగను

10.1-1669.1-తేటగీతి

శత్రురాజ ప్రతాపాగ్ని శాంతముగను
వృష్టికాలము వచ్చు న వ్విధముఁ దోఁప
నేగుదెంచె జరాసంధుఁ డిరువదియును
మూఁడు నక్షౌహిణులు దన్ను మొనసి కొలువ.

10.1-1670-చంపకమాల

ఇటు చనుదెంచి యున్న మగధేశ్వరవాహినిఁ జూచి యుద్ధ సం
ఘటనము మాని మానవుల కైవడి భీరుల భంగి నోడి ముం
దటి ధనమెల్ల డించి మృదుతామరసాభపదద్వయుల్ క్రియా

పటువులు రామకేశవులు పాఱిరి ఘోరవనాంతరంబులన్.

10.1-1671-వచనము

ఇట్లు పఱచుచున్న కృష్ణబలభద్రులం జూచి వారల ప్రభావంబు లెఱుంగక పరిహాసించి.

10.1-1672-ఉత్పలమాల

ఓ యదువీరులార! రభసోద్ధతిఁ బాఱకుఁ; డిట్లు పాఱినం
బోయెడువాఁడఁ గాను; మిము భూమి నడంగిన మిన్ను ప్రాకినం
దోయధిఁ జొచ్చినం దగిలి త్రుంచెద నంచు సమస్త సేనతోఁ
బాయక వచ్చె వెంటఁబడి బాహుబలాఢ్యుఁడు మాగధేశుఁడున్.

## 10.1-201- ప్రవర్షణపర్వతారోహణంబు

10.1-1673-వచనము

మఱియుం బలాయమానులై బహుయోజనంబుల దూరంబు చని విశ్రాంతులై తమకు డాఁగ నెల వగునని యింద్రుండు మిక్కలి వర్షింపఁ బ్రవర్షణాఖ్యంబై పదునొకండు యోజనంబుల పొడవును నంతియ వెడలుపునుం గల గిరి యెక్కి రంత.

10.1-1674-శార్దూల విక్రీడితము

ఆ శైలేంద్రము చుట్టి రా విడిసి రోషావిష్టుఁడై మాగధో
ర్వీశుం డా వసుదేవనందనులఁ దా వీక్షింపఁగా లేక త
న్నాశేచ్ఛన్ బిల సాను శృంగములఁ బూర్ణక్రోధుఁడై కాష్ఠముల్
రాసుల్గానిడి చిచ్చుపెట్టఁ బనిచెన్ రౌద్రంబుతో భృత్యులన్.

10.1-1675-వచనము

ఇట్లు జరాసంధపరిజన ప్రదీపితంబైన మహానలంబు దరికొనియె అందు.

10.1-1676-కంద పద్యము

పొగ లెగసెఁ బొగల తుదలను
మిగులుచు మిడుఁగుఱులు నిగిడె మిడుఁగుఱుఁగమి ము
న్నుగ బ్రహ్మాండము నిండను
భగభగ యని మంట లొదివె భయదము లగుచున్.

10.1-1677-వచనము

మఱియు నమ్మహానలంబు బిలసాను శృంగవృక్ష లతాకుంజపుంజంబుల దరికొని శిఖలు కిసలయంబులుగ విస్ఫులింగంబులు విరులుగ, సముద్ధూత ధూమపటలంబులు బంధురస్కంధశాఖా విసరంబులుగ, ననోహకంబు కైవడి నభ్రంకషం బై ప్రబ్బి కఠోరస మీరణ సమున్నత మహోల్కాజాల తిరోహిత వియచ్చర విమానంబును, వివిధ విధూమవిస్ఫులింగ విలోకనప్రభూత నూతనతారకా భ్రాంతి విభ్రాంతి గగనచరంబును, సంతప్తమాన సరోవర సలిలంబును, విశాలజ్వాలాజాలజాజ్వల్యమాన తక్కోల చందనాగరు కర్పూరధూమవాసనావాసిత గగనకుహరంబును, గరాళకీలాజాల దందహ్యమాన కీచకనికుంజపుంజసంజనిత చిటచిటారావ పరిపూరిత దిగంతరాళంబును, భయంకర బహుళతరశాఖాభిద్యమాన పాషాణఘోషణపరిమూర్ఛిత ప్రాణిలోకంబును సంతప్యమాన శాఖిశాఖాంతర నిబిడ నీడనిహిత శాబకవియోగ దుఃఖ డోలాయమాన విహంగకులంబును, మహాహేతిసందీప్యమాన కటిసూత్ర

సంఘటిత మయూరపింఛ కుచకలశయుగళ భారాలస శబరకామినీసమాశ్రిత నిర్ఝరంబును, దగ్ధానేక మృగమిథునంబునునై యేర్పనెడ.

10.1-1678-కంద పద్యము

ఇల నేకాదశ యోజన
ములు పొడవగు శైలశిఖరమున నుండి వడిన్
బలకృష్ణులు రిపుబలముల
వెలి కుటికిరి కానఁబడక విలసితలీలన్.

10.1-1679-వచనము

ఇట్లు శత్రువుల వంచించి యాదవేంద్రులు సముద్రపరిఖంబైన ద్వారకానగరంబునకుం జనిరి; జరాసంధుండు వారలు దగ్ధులై రని తలంచుచు బలంబులుం దానును మగధదేశంబునకు మరలి చనియె" నని చెప్పి శుకుండు వెండియు నిట్లనియె.

## 10.1-202- రుక్మిణీకల్యాణ కథారంభము

10.1-1680-కంద పద్యము

ఆ వనజగర్భు పంపున
రైవతుఁ డను రాజు దెచ్చి రామున కిచ్చెన్
రేవతి యనియెడు కన్యను
భూవర! మును వింటిగాదె బుద్ధిం దెలియన్.

10.1-1681-వచనము

తదనంతరంబ.

10.1-1682-మత్తేభ విక్రీడితము

ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్ గైకొన్న చందంబునన్
జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ సాళ్వాదులన్ గెల్చి భ
ద్రగుఁడై చక్రి వరించె భీష్మకసుతన్ రాజీవగంధిన్ రమా
భగవత్యంశభవన్ మహాగుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్.

10.1-1683-వచనము

అనిన రాజిట్లనియె "మున్ను రాక్షసవివాహంబున స్వయంవరమునకు వచ్చిన హరి రుక్మిణిం గొనిపోయెనని పలికితివి; కృష్ణుం డొక్కరుం డెవ్విధంబున సాళ్వాదుల జయించి తన పురంబునకుం జనియె; అదియునుం గాక.

10.1-1684-శార్దూల విక్రీడితము

కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్త పై
కల్యం డెవ్వఁడు తృప్తుఁడౌ; నది వినంగాఁ గ్రొత్త లౌచుండు సా
కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుంగం బల్కవే; రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్.

10.1-1685-కంద పద్యము

భూషణములు చెవులకు బుధ
తోషణము లనేక జన్మదురితౌఘ విని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను గుణభాషణముల్.

10.1-1686-వచనము

అని రా జడిగిన శుకుం డిట్లనియె.

## 10.1-203- రుక్మిణీ జననంబు

10.1-1687-చంపకమాల

వినుము; విదర్భదేశమున వీరుఁడు కుండినభర్త భీష్మకుం
డను నొక దొడ్డరాజు గలఁ; డాతని కేవురు పుత్త్రు లగ్రజుం
డనయుఁడు రుక్మినాఁ బరఁగు; నందఱకుం గడగొట్టు చెల్లెలై
మనుజవరేణ్య! పుట్టె నొక మానిని రుక్మిణినాఁ బ్రసిద్ధయై.

10.1-1688-కంద పద్యము

బాలేందురేఖ దోఁచిన
లాలిత యగు నపరదిక్కులాగున ధరణీ
పాలుని గేహము మెఱసెను
బాలిక జన్మించి యెదుగ భాసుర మగుచున్.

10.1-1689-వచనము

మఱియును నానాదినప్రవర్ధమాన యై.

10.1-1690-సీస పద్యము

పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు చేయుచు;
నబలలతోడ వియ్యంబు లందు;
గుజ్జెనఁ గూళులు గొమరొప్ప వండించి;
చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱసి;
రమణీయ మందిరారామ దేశంబులఁ;

బువ్వుఁ దీగెలకును బ్రోది చేయు;
సదమల మణిమయ సౌధభాగంబుల;
లీలతో భర్మడోలికల నూఁగు

10.1-1690.1-తేటగీతి

బాలికలతోడఁ జెలరేగి బంతు లాడు
శారికా కీర పంక్తికిఁ జదువుఁ జెప్పు
బర్హి సంఘములకు మురిపములు గరపు
మదమరాళంబులకుఁ జూపు మందగతులు.

10.1-1691-వచనము

అంత.

10.1-1692-సీస పద్యము

దేవకీసుతు కోర్కి తీఁగలు వీడంగ;
వెలఁదికి మైదీఁగ వీడఁ దొడఁగెఁ;
గమలనాభుని చిత్త కమలంబు వికసింపఁ;
గాంతి నింతికి ముఖకమల మొప్పెఁ;
మధువిరోధికి లోన మదనాగ్ని పొడచూపఁ;
బోలఁతికి జనుదోయి పొడవు జూపె;
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ;
జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె;

10.1-1692.1-ఆటవెలది

హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ గేశ
బంధ మధికమగుచు బాలకమరెఁ;
బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార
నెలఁత యౌవనంబు నిండి యుండె.

10.1-1693-వచనము

ఇట్లు రుక్మి రుక్మరథ రుక్మబాహు రుక్మకేశ రుక్మనేత్రు లను నేవురకుం జెలియలైన రుక్మిణీదేవి దన యెలప్రాయంబున.

10.1-1694-కంద పద్యము

తన తండ్రి గేహమునకుం
జనుదెంచుచున్న యతిథిజనులవలనఁ గృ
ష్ణుని రూప బల గుణాదులు
విని కృష్ణుఁడు దనకుఁ దగిన విభుఁడని తలఁచెన్.

10.1-1695-కంద పద్యము

ఆ లలనరూపు బుద్ధియు
శీలము లక్షణము గుణముఁ జింతించి తగన్
బాలారత్నముఁ దన కి
ల్లాలుగఁ జేకొందు ననుచు హరియుం దలఁచెన్.

10.1-1696-వచనము

అంత.

10.1-1697-ఉత్పలమాల

బంధువు లెల్లఁ గృష్ణునకు బాలిక నిచ్చెద మంచు శేముషీ
సింధువులై విచారములు చేయఁగ వారల నడ్డపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ జాల విరోధముఁ జేసి మత్త పు
ష్పంధయవేణి నిత్తు శిశుపాలున కంచుఁ దలంచె నంధుఁడై.

## 10.1-204- రుక్మిణి సందేశము పంపుట

10.1-1698-ఉత్పలమాల

అన్న తలంపు తా నెఱిఁగి యన్నవనీరజగంధి లోన నా
పన్నత నొంది, యాప్తుఁడగు బ్రాహ్మణు నొక్కనిఁ జీరి గర్వసం
ఛన్నుఁడు రుక్మి నేడు ననుఁ జైద్యున కిచ్చెద నంచు నున్నవాఁ
డెన్నివిధంబులం జని బుధేశ్వర! చక్రికి విన్నవింపవే.

10.1-1699-కంద పద్యము

అయ్యా! కొడుకు విచారము
లయ్యయు వారింపఁ జాలఁ డటు గాకుండన్
నెయ్య మెఱిఁగించి చీరుము
చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్.

10.1-1700-వచనము

అని కొన్ని రహస్యవచనంబులు చెప్పిన విని బ్రాహ్మణుండు ద్వార
కానగరంబునకుం జని, ప్రతిహారుల వలనఁ దనరాక యెఱింగించి యన్నగధరుం
డున్న నగరు ప్రవేశించి, యందుఁ గనకాసనాసీనుండయి యున్న
పురుషోత్తముం గాంచి "పెండ్లికొడుకవుగ" మ్మని దీవించిన ముసిముసి నగవులు
నగుచు బ్రహ్మణ్యదేవుండైన హరి తన గద్దియ దిగ్గనడిగ్గి, బ్రాహ్మణుం గూర్చుండ

నియోగించి, తనకు దేవతలు చేయు చందంబునం బూజలు చేసి, సరసపదార్థ సంపన్నంబైన యన్నంబుఁ బెట్టించి, రెట్టించిన ప్రియంబున నయంబున భాసురుండైన భూసురుం జేరి లోకరక్షణ ప్రశస్తంబైన హస్తంబున నతని యడుగులు పుడుకుచు మెల్లన నతని కిట్లనియె.

10.1-1701-సీస పద్యము

జగతీసురేశ్వర! సంతోషచిత్తుండ;
 వై యున్న నీ ధర్మ మతిసులభము
వృద్ధసమ్మత మిది విత్త మెయ్యది యైనఁ;
 బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు
తన ధర్మమున నుండుఁ దరలఁ డా ధర్మంబు;
 గోరిక లతనికిఁ గురియుచుండు
సంతోషిగాఁడేని శక్రుఁడైన నశించు;
 నిర్ధనుండైనను నిద్రబోవు

10.1-1701.1-ఆటవెలది

సంతసించెనేని, సర్వభూతసుహృత్త
ములకుఁ బ్రాప్తలాభ ముదితమాన
సులకు శాంతులకును సుజనులకును గర్వ
హీనులకును వినతు లే నొనర్తు.

10.1-1702-ఉత్పలమాల

ఎవ్వని దేశమం దునికి యెవ్వనిచేఁ గుశలంబు గల్గు మీ
కెవ్వని రాజ్యమందుఁ బ్రజలెల్ల సుఖింతురు వాఁడు మత్ప్రియుం

డివ్వనరాశి దుర్గమున కే లరుదెంచితి రయ్య! మీరు? లే
నవ్వులుగావు; నీ తలఁపునం గల మే లొనరింతు ధీమణీ.

10.1-1703-వచనము

అని యిట్లు లీలాగృహీతశరీరుండైన య ప్పరమేశ్వరుం డడిగిన ధరణీసురవరుం డతనికి సవినయంబుగ నిట్లనియె "దేవా! విదర్భదేశాధీశ్వరుండైన భీష్మకుండను రాజుగలం; డా రాజకూఁతురు రుక్మిణి యను కన్యకామణి; గల ద య్యిందువదన నీకుం గైంకర్యంబు జేయం గోరి వివాహమంగళ ప్రశస్తంబయిన యొక్క సందేశంబు విన్నవింపు మని పుత్తెంచె నవదరింపుము.

10.1-1704-సీస పద్యము

ఏ నీ గుణములు గర్ణేంద్రియంబులు సోఁక;
దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల;
కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీ చరణసేవ యే ప్రొద్దు చేసిన;
భువనోన్నతత్వంబుఁ బొందఁ గలుగు
నే నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితోఁ;
దడవిన బంధసంతతులు వాయు

10.1-1704.1-తేటగీతి

నట్టి నీ యందు నా చిత్త మనవరతము
నచ్చి యున్నది నీ యాన నాన లేదు,
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!

శ్రీయుతాకార! మానినీచిత్తచోర!

10.1-1705-శార్దూల విక్రీడితము

ధన్యున్ లోకమనోభిరాముఁ గుల విద్యా రూప తారుణ్య సౌ
జన్యశ్రీ బల దాన శౌర్య కరుణాసంశోభితున్ నిన్ను నే
కన్యల్గోరరు? కోరదే మును రమాకాంతాలలామంబు రా
జన్యానేకపసింహ! నా వలననే జన్మించెనే మోహముల్.

10.1-1706-ఉత్పలమాల

శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ! సింహముపాలి సొమ్ము గో
మాయువు గోరు చందమున మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ
ధ్యాయిని యైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ
డా యధమాధముం డెఱుఁగఁ డద్భుతమైన భవత్ప్రతాపమున్

10.1-1707-మత్తేభ విక్రీడితము

వ్రతముల్ దేవగురుద్విజన్మ బుధసేవల్ దానధర్మాదులున్
గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కళ్యాణుఁ గాంక్షించి చే
సితి నేనిన్ వసుదేవనందనుఁడు నా చిత్తేశుఁ డౌఁ గాక ని
ర్జితు లై పోదురుగాక సంగరములోఁ జేదీశముఖ్యాధముల్.

10.1-1708-ఉత్పలమాల

అంకిలి జెప్పలేదు; చతురంగబలంబులతోడ నెల్లి యో!
పంకజనాభ! నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షసవివాహమునన్ భవదీయశౌర్యమే

యుంకువ చేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొనిపొమ్ము వచ్చెదన్.

10.1-1709-సీస పద్యము

లోపలి సౌధంబులోన వర్తింపంగఁ;
దేవచ్చునే నిన్నుఁ దెత్తునేని
గావలివారలఁ గల బంధువులఁ జంపి;
కాని తేరా దని కమలనయన!
భావించెదేని యుపాయంబు చెప్పెద;
నాలింపు కులదేవయాత్రఁ జేసి
నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్కఁ;
బెండ్లికి మునుపడఁ బెండ్లికూఁతుఁ

10.1-1709.1-తేటగీతి

నెలమి మావారు పంపుదు రేను నట్లు
పురము వెలువడి యేతెంచి భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు నా సమయమందు
వచ్చి గొనిపొమ్ము నన్ను నవార్యచరిత!

10.1-1710-మత్తేభ విక్రీడితము

ఘను లాత్మీయ తమోనివృత్తికొఱకై గౌరీశుమర్యాద నె
వ్వని పాదాంబుజతోయమందు మునుఁగన్ వాంఛింతు రే నట్టి నీ
యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూఱుజన్మంబులున్
నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా!

10.1-1711-సీస పద్యము

ప్రాణేశ! నీ మంజు భాషలు వినలేని;
 కర్ణరంధ్రంబుల కలిమి యేల?
పురుషరత్నమ! నీవు భోగింపఁగాలేని;
 తనులతవలని సౌందర్య మేల?
భువనమోహన! నిన్నుఁ బొడగానఁగా లేని;
 చక్షురింద్రియముల సత్వ మేల?
దయిత! నీ యధరామృతం బానఁగాలేని;
 జిహ్వకు ఫలరససిద్ధి యేల?

10.1-1711.1-ఆటవెలది

నీరజాతనయన! నీ వనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణ మేల?
ధన్యచరిత! నీకు దాస్యంబుజేయని
జన్మ మేల? యెన్ని జన్మములకు.

10.1-1712-వచనము

అని యిట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును, రూప సౌంద ర్యాది విశేషంబులును బ్రాహ్మణుండు హరికి విన్నవించి "కర్తవ్యం బెద్ది చేయ నవధరింపు" మని సవర్ణనంబుగా మఱియు నిట్లనియె.

10.1-1713-సీస పద్యము

పల్లవ వైభవాస్పదములు పదములు;
 కనకరంభాతిరస్కారు లూరు;

లరుణప్రభామనోహరములు గరములు;
కంబుసౌందర్యమంగళము గళము;
మహిత భావాభావమధ్యంబు మధ్యంబు;
చక్షురుత్సవదాయి చన్నుదోయి;
పరిహసితార్ధేందు పటలంబు నిటలంబు;
జితమత్త మధుకరశ్రేణి వేణి;

10.1-1713.1-ఆటవెలది

భావజాశుగముల ప్రాపులు చూపులు;
కుసుమశరుని వింటి కొమలు బొమలు;
చిత్తతోషణములు చెలువభాషణములు;
జలజనయన ముఖము చంద్రసఖము.

10.1-1714-ఉత్పలమాల

ఆ యెలనాగ నీకుఁ దగు; నంగనకుం దగు దీవు మా యుపా
ధ్యాయుల యాన పెండ్లి యగుఁ; దప్పదు జాడ్యములేల? నీవు నీ
తోయమువారిఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తుగాని వి
చ్చేయుము; శత్రులన్నుఱుముఁజేయుముచేయుముశోభనం బిలన్.

## 10.1-205- వాసుదేవాగమన నిర్ణయము

10.1-1715-వచనము

అని యిట్లు పలికిన బ్రాహ్మణునివలన విదర్భరాజతనయ పుత్తెంచిన సందేశంబును, రూప సౌందర్యాదివిశేషంబులును విని, యవధరించి నిజకరంబున నతని కరంబుఁబట్టి నగుచు న య్యాదవేంద్రుండు; యిట్లనియె

10.1-1716-ఉత్పలమాల

కన్నియమీఁద నా తలఁపు గాఢము; కూరుకురాదు రేయి నా
కెన్నఁడు; నా వివాహము సహింపక రుక్మి దలంచు కీడు నే
మున్నె యెఱుంగుదున్; బరులమూఁక లడంచి కుమారిఁ దెత్తు వి
ద్వన్నుత! ప్రొనుఁ దెచ్చి నవవహ్నిశిఖన్ వడిఁదెచ్చు కైవడిన్.

10.1-1717-కంద పద్యము

వచ్చెద విదర్భభూమికిఁ;
జొచ్చెద భీష్మకుని పురము; సురుచిరలీలన్
దెచ్చెద బాలన్ ప్రేల్మిడి
వ్రచ్చెద నడ్డంబు రిపులు వచ్చినఁ బోరన్.

10.1-1718-వచనము

అని పలికి, రుక్మిణీదేవి పెండ్లినక్షత్రంబుఁ దెలిసి, దన పంపున రథసారథి యైన దారకుండు సైబ్య సుగ్రీవ మేఘ పుష్పవలాహకంబు లను తురంగంబులం గట్టి రథమాయత్తంబు చేసి తెచ్చిన నమోఘ మనోరథుండైన హరి తానును, బ్రాహ్మణుండును రథారోహణంబు జేసి యేకరాత్రంబున నానర్తకదేశంబులు గడచి, విదర్భదేశంబునకుఁ జనియె; నందు కుండినపురీశ్వరుండైన భీష్మకుండు కొడుకునకు వశుండై కూఁతు శిశుపాలున కిత్తునని తలంచి, శోభనోద్యోగంబులు చేయించె; నప్పుడు.

10.1-1719-సీస పద్యము

రచ్చలు గ్రంతలు రాజమార్గంబులు;
విపణి దేశంబులు విశదములుగఁ

జేసిరి; చందనసిక్త తోయంబులు;
 గలయంగఁ జల్లిరి; కలువడములు
రమణీయ వివిధతోరణములుఁ గట్టిరి;
 సకల గృహంబులు చక్కఁ జేసి;
కర్పూరకుంకుమాగరుధూపములు పెట్టి;
 రతివలుఁ బురుషులు నన్ని యెడల

10.1-1719.1-ఆటవెలది

వివిధవస్త్రములను వివిధమాల్యాభర
ణానులేపనముల నమరి యుండి
రఖిల వాద్యములు మహాప్రీతి మ్రోయించి
రుత్సవమున నగర మొప్పియుండె.

10.1-1720-వచనము

అంత నా భీష్మకుండు విహితప్రకారంబునం బితృదేవతల నర్చించి బ్రాహ్మణులకు భోజనంబులు పెట్టించి, మంగళాశీర్వచనంబులు చదివించి, రుక్మిణీదేవి నభిషిక్తంజేసి వస్త్రయుగళభూషితం గావించి రత్నభూషణంబు లిడంజేసి, ఋగ్యజుస్సామధర్వణ మంత్రంబుల మంగళాచారంబు లొనరించి, భూసురులు రక్షాకరణంబు లాచరించిరి; పురోహితుండు గ్రహశాంతికొఱకు నిగమనిగదితన్యాయంబున హోమంబు గావించె; మఱియు నా రాజు దంపతుల మేలుకొఱకుఁ దిల ధేను కలధౌత కనక చేలాది దానంబులు ధరణీదేవతల కొసంగెను; అయ్యవసరంబున.

10.1-1721-మత్తేభ విక్రీడితము

భటసంఘుంబులతో రథావళులతో భద్రేభయూథంబుతోఁ
బటువేగాన్విత ఘోటకవ్రజముతో బంధుప్రియశ్రేణితోఁ
గటుసంరంభముతో విదర్భతనయం గైకొందు నంచున్ విశం
కటవృత్తిం జనుదెంచెఁ జైద్యుఁడు గడున్ గర్వించి యవ్వీటికిన్.

10.1-1722-ఉత్పలమాల

బంధులఁ గూడి కృష్ణబలభద్రులు వచ్చినఁ బాఱదోలి ని
ర్బంధర వృత్తిఁ జైద్యునికి మానినిఁ గూర్చెద మంచు నుల్లస
త్సింధుర వీర రథ్య రథ సేనలతోఁ జనుదెంచి రా జరా
సంధుఁడు దంతవక్త్రుఁడును సాల్వ విదూరక పౌండ్రకాదులున్.

10.1-1723-వచనము

మఱియు నానాదేశంబుల రాజు లనేకు లేతెంచి; రందు శిశుపాలు నెదుర్కొని పూజించి భీష్మకుం డొక్కనివేశంబున నతని విడియించె; నంతఁ దద్వృత్తాంతంబు విని.

10.1-1724-చంపకమాల

హరి యొకఁ డేగినాఁడు మగధాదులు చైద్యహితానుసారులై
నరపతు లెందఱేని చనినారు కుమారికఁ దెచ్చుచోట సం
గరమగుఁ దోడు గావలయుఁ గంసవిరోధికి నంచు వేగఁ దా
నరిగె హలాయుధుండు గమలాక్షుని జాడ ననేక సేనతోన్.

10.1-1725-కంద పద్యము

ఆలోపల నేకతమున

నాలోలవిశాలనయనయగు రుక్మిణి ద
న్నా లోకలోచనుఁడు హరి
యాలోకము చేసి కదియఁ డని శంకితయై.

10.1-1726-శార్దూల విక్రీడితము

లగ్నం బెల్లి వివాహముం గదిసె నేలా రాఁడు గోవిందుఁ? డు
ద్విగ్నం బయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతమున్? బ్రాహ్మణుం
డగ్నిద్యోతనుఁ డేటికిం దడసె? నా యత్నంబు సిద్ధించునో?
భగ్నంబై చనునో? విరించికృత మెబ్బంగిం బ్రవర్తించునో?

10.1-1727-మత్తేభ విక్రీడితము

ఘను డా భూసురు డేగెనో? నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో?
విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో? విచ్చేసెనో? యీశ్వరుం
డనుకూలింపఁ దలంచునో తలఁపడో? యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో? నా భాగ్య మెట్లున్నదో?

10.1-1728-వచనము

అని వితర్కించుచు.

10.1-1729-ఉత్పలమాల

పోఁ డను బ్రాహ్మణుండు యదుపుంగవు వీటికి; వాసుదేవుఁడున్
రాఁ డను; నింకఁ బోయి హరి రమ్మని చీరెడి యిష్టబంధుడున్
లేఁ డను; రుక్మికిం దగవు లేదిటఁ జైద్యున కిత్తు నంచు ను
న్నాఁ డను; గౌరి కీశ్వరికి నావలనం గృపలేదు నే డనున్.

10.1-1730-ఉత్పలమాల

చెప్పదు తల్లికిం దలఁపు చిక్కు; దిశల్ దరహాస చంద్రికల్
గప్పదు; వక్త్రతామరసగంధ సమాగత భృంగసంఘమున్
రొప్పదు; నిద్ర గైకొన; దురోజపరస్పరసక్త హారముల్
విప్పదు; కృష్ణమార్గగతవీక్షణపంక్తులు ద్రిప్ప దెప్పుడున్.

10.1-1731-చంపకమాల

తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు; కొప్పు చక్కఁగా
ముడువదు; నెచ్చలిం గదిసి ముచ్చటకుం జన; దన్న మేమియుం
గుడువదు; నీరముం గొనదు; కూరిమి కీరముఁ జేరి పద్యముం
నొడువదు; వల్లకీగుణవినోదము చేయదు; డాయ దన్యులన్.

10.1-1732-సీస పద్యము

మృగనాభి యలఁదదు మృగరాజమధ్యమ;
జలకము లాడదు జలజగంధి;
ముకురంబు చూడదు ముకురసన్నిభముఖి;
పువ్వులు దుఱుమదు పువ్వుఁబోఁడి;
వనకేళిఁ గోరదు వనజాతలోచన;
హంసంబుఁ బెంపదు హంసగమన;
లతలఁ బోషింపదు లతికాలలితదేహ;
తొడవులు తొడువదు తొడవుతొడవు

10.1-1732.1-ఆటవెలది

తిలకమిడదు నుదుటఁ దిలకినీతిలకంబు

గమలగృహముఁ జొరదు కమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁ గైకొన వన
మాలి రాఁడు తగవుమాలి యనుచు.

10.1-1733-వచనము

మఱియును.

10.1-1734-మత్తేభ విక్రీడితము

మలఁగున్ మెల్లని గాలికిం; బటునటన్మత్తద్విరేఫాలికిం
దలఁగుం; గోయిల మ్రోఁతకై యలఁగు; నుద్యత్కీరసంభాషలం
గలఁగున్; వెన్నెలఁవేడిమిం నలఁగు; మాకందాంకురచ్ఛాయకుం
దొలఁగుం; గొమ్మ మనోభవానలశిఖాదోధూయమానాంగియై.

## 10.1-206- వాసుదేవాగమనంబు

10.1-1735-వచనము

ఇట్లు హరిరాక కెదురుచూచుచు సకల ప్రయోజనంబులందును విరక్త యయి మనోజానలంబునం బొగులు మగువకు శుభంబు చెప్పు చందంబున వామోరులోచనభుజంబులదరె; నంతఁ గృష్ణు నియోగంబున బ్రాహ్మణుండు చనుదెంచిన నతని ముఖలక్షణం బుపలక్షించి యా కలకంఠకంఠి మహోత్కంఠతోడ నకుంఠిత యై మొగంబునం జిఱునగవు నిగుడ నెదురు జని నిలువంబడిన బ్రాహ్మణుం డిట్లనియె.

10.1-1736-ఉత్పలమాల

మెచ్చె భవద్గుణోన్నతి; కమేయ ధనావళు లిచ్చె నాకుఁ; దా

వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె; సురాసురు లెల్ల నడ్డమై
వచ్చిననైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను; నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వము నేడు ఫలించెఁ గన్యకా!

10.1-1737-వచనము

అనిన వైదర్భి యిట్లనియె.

10.1-1738-మత్తేభ విక్రీడితము

జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశముం జెప్పి; నన్
నిలువం బెట్టితి; నీ కృపన్ బ్రతికితిన్ నీ యంత పుణ్యాత్మకుల్
గలరే; దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింప నే నేర; నం
జలిఁ గావించెద; భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ!

10.1-1739-వచనము

అని నమస్కరించె; నంత రామకృష్ణులు దన కూఁతు వివాహంబునకు వచ్చుట విని, తూర్యఘోషంబులతో నెదుర్కొని, విధ్యుక్తప్రకారంబునం బూజించి, మధుపర్కంబు లిచ్చి, వివిధాంబరాభరణంబులు మొదలైన కానుక లొసంగి, భీష్మకుండు బంధుజనసేనాసమేతులైన వారలకుం దూర్ణంబున సకల సంపత్పరిపూర్ణంబులైన నివేశంబులు కల్పించి విడియించె; యిట్లు కూడిన రాజుల కెల్లను వయోవీర్య బలవిత్తంబు లెట్లట్ల కోరినపదార్థంబు లెల్ల నిప్పించి పూజించె, నంత విదర్భపురంబుప్రజలు హరిరాక విని వచ్చి చూచి నేత్రాంజలులం దదీయ వదనకమలమధుపానంబుఁ జేయుచు.

10.1-1740-మత్తేభ విక్రీడితము

తగు నీ చక్రి విదర్భరాజసుతకుం; దథ్యంబు వైదర్భియుం
దగు నీ చక్రికి; నింత మంచి దగునే? దాంపత్య మీ యిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరిగదా; దర్పాహతారాతియై
మగఁడౌఁ గావుతఁ జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్.

10.1-1741-వచనము

అని పలికె రా సమయంబున.

10.1-1742-సీస పద్యము

సన్నద్ధులై బహు శస్త్ర సమేతులై;
బలిసి చుట్టును వీరభటులు గొలువ
ముందఱ నుపహారములు కానుకలు గొంచు;
వర్గంబులై వారవనిత లేఁగఁ
బుష్ప గంధాంబర భూషణ కలితలై;
పాడుచు భూసురభార్య లరుగఁ
బణవ మర్దళ శంఖ పటహ కాహళ వేణు;
భేరీధ్వనుల మిన్ను పిక్కటిలఁగఁ

10.1-1742.1-ఆటవెలది

దగిలి సఖులు గొల్వఁ దల్లులు బాంధవ
సతులు దోడ రాఁగ సవినయముగ
నగరు వెడలి నడచె నగజాతకును మ్రొక్క
బాల చికురపిహితఫాల యగుచు.

10.1-1743-వచనము

మఱియు, సూత మాగధ వంది గాయక పాఠక జను లంతంత నభినందించుచుఁ జనుదేర మందగమనంబున, ముకుందచరణారవిందంబులు డెందంబునం దలఁచుచు నిందుధరసుందరీ మందిరంబు చేరి సలిల ధౌత చరణకరారవింద యై వార్చి శుచియై, గౌరీసమీపంబునకుం జనియె నంత ముత్తైదువలగు భూసురోత్తమభార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి, గంధాక్షత లిడి, వస్త్రమాల్యాది భూషణంబుల నలంకరించి ధూపదీపంబు లొసంగి నానావిధోపహారంబులు సమర్పించి, కానుకలిచ్చి, దీపమాలికల నివాళించి రుక్మిణీదేవిని మ్రొక్కించి; రప్పుడు.

10.1-1744-ఉత్పలమాల

నమ్మితి నా మనంబున సనాతను లైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ! మేటి పె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతిఁ జేయుమమ్మ! ని
న్నమ్మినవారి కెన్నటికి నాశము లేదు గదమ్మ! యీశ్వరీ!

10.1-1745-వచనము

అని గౌరీదేవికి మ్రొక్కి పతులతోడం గూడిన బ్రాహ్మణభార్యలకు లవణాపూపంబులును, తాంబూల కంఠసూత్రంబులును, ఫలంబులు, నిక్షుదండంబులు నిచ్చి రుక్మిణీదేవి వారలం బూజించిన.

10.1-1746-ఆటవెలది

వార లుత్సహించి వలనొప్ప దీవించి
సేస లిడిరి యువతి శిరమునందు;

సేస లెల్లఁ దాల్చి శివవల్లభకు మ్రొక్కి
మౌననియతి మాని మగువ వెడలె.

10.1-1747-వచనము

ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కారు మెఱుంగు తెఱంగున, మృగధరమండలంబు నిర్గమించి చరించు మృగంబు చందంబునఁ, గమలభవ నర్తకుం డెత్తిన జవనిక మఱుఁగు దెరలి పొడచూపిన మోహినీదేవత కైవడి, దేవదానవ సంఘాత కరతల సవ్యాపసవ్య సమాకృష్యమాణ పన్నగేంద్ర పాశ పరివలయిత పర్యాయ పరిభ్రాంత మంథరాచల మంథాన మథ్యమాన ఘూర్ణిత ఘుమఘుమాయత మహార్ణవమధ్యంబున నుండి చనుదెంచు నిందిరాసుందరీ వైభవంబున, బహువిధ ప్రభాభాసమానయై యిందుధరసుందరీ మందిరంబు వెడలి మానసకాసార హేమకమల కానన విహరమాణ మత్తమరాళంబు భంగి మందగమనంబునఁ గనకకలశ యుగళ సంకాశ కర్కశ పయోధరభార పరికంప్యమాన మధ్యయై, రత్నముద్రికాలంకృతంబైన కెంగేల నొక్క సఖీలలామంబు కైదండఁ గొని, రత్ననివహ సమంచిత కాంచన కర్ణపత్ర మయూఖంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప నరవింద పరిమళ కుతూహలావతీర్ణ మత్తమధుకరంబుల మాడ్కి నరాళంబులైన కుంతలజాలంబులు ముఖమండలంబునఁ గ్రందుకొన, సుందర మందహాస రోచులు దిశలందు బాలచంద్రికా సౌందర్యంబు నావహింప నధర బింబఫలారుణ మరీచిమాలికలు రదనకుందకుట్మలంబుల కనురాగంబు సంపాదింప, మనోజాతకేతన సన్నిభంబైన పయ్యెదకొంగు దూఁగ; సువర్ణమేఖలాఘటిత మణి కిరణపటలంబు లకాల శక్రచాప జనకంబులై మెఱయఁ జెఱుకువిలుతుం డొరబెఱికి వాఁడి యిడి జళిపించిన ధగధగాయమానంబులగు బాణంబుల పగిది,

సురుచిర విలోకన నికరంబులు రాజవీరుల హృదయంబులు భేదింప, శింజాన మంజు మంజీర నినదంబులు చెవుల పండువు చేయఁ, బాద సంచారంబున హరిరాక కెదురుచూచుచు వీరమోహినియై చనుదెంచుచున్న సమయంబున.

10.1-1748-మత్తేభ విక్రీడితము

అలినీలాలకఁ బూర్ణచంద్రముఖి, నేణాక్షిం, బ్రవాళాధరిం,
గలకంఠిన్, నవపల్లవాంఘ్రియుగళన్, గంధేభకుంభస్తనిం,
బులినశ్రోణి నిభేంద్రయాన, నరుణాంభోజాతహస్తన్, మహో
త్పలగంధిన్, మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములై రందఱున్.

10.1-1749-వచనము

మఱియు నయ్యింతి దరహాస లజ్జావలోకంబులం జిత్తంబు లేమఱి ధైర్యంబులు దిగనాడి, గాంభీర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలు మాని, యెఱుక లుడిగి, యాయుధంబులు దిగవైచి, గజ తురగ రథారోహణంబులు చేయనేరక, రాజులెల్ల నేలకు వ్రాలి; రా యేణీలోచన తన వామకర నఖంబుల నలకంబులు దలంగఁ ద్రోయుచు నుత్తరీయంబు చక్కనొత్తుచుఁ గడకంటి చూపులం గ్రమంబున నా రాజలోకంబు నాలోకించుచు.

10.1-1750-మత్తేభ విక్రీడితము

కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం, గంఠీరవేంద్రావల
గ్నుఁ, నవాంభోజదళాక్షుఁ, జారుతరవక్షున్, మేఘసంకాశదే
హు, నగారాతిగజేంద్రహస్తనిభబాహుం, జక్రిఁ, బీతాంబరున్,
ఘనభూషాన్వితుఁ గంబుకంఠు, విజయోత్కంఠున్ జగన్మోహనున్.

## 10.1-207- రుక్మిణీ గ్రహణంబు

10.1-1751-వచనము

కని తదీయ రూప వయో లావణ్య వైభవ గాంభీర్య చాతుర్య తేజో విశేషంబులకు సంతసించి, మనోభవశరాక్రాంతయై రథారోహణంబు గోరుచున్న యవ్వరారోహం జూచి, పరిపంథి రాజలోకంబు చూచుచుండ మందగమనంబున గంధసింధురంబు లీలం జనుదెంచి ఫేరవంబుల నడిమిభాగంబుఁ గొనిచను కంఠీరవంబు కైవడి నిఖిల భూపాలగణంబుల గణింపక తృణీకరించి రాజకన్యకం దెచ్చి హరి తన రథంబుమీఁద నిడికొని భూనభోంతరాళంబు నిండ శంఖంబు పూరించుచు బలభద్రుండు తోడ నడవ, యాదవవాహినీ పరివృతుండై ద్వారకానగరమార్గంబు పట్టి చనియె; నంత జరాసంధవశు లైన రాజు లందఱు హరిపరాక్రమంబు విని సహింప నోపక.

10.1-1752-మత్తేభ విక్రీడితము

ఘన సింహంబుల కీర్తి నీచమృగముల్ గైకొన్న చందంబునన్
మన కీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచు నున్మాదంబుతో గోపకుల్
చనుచున్నా రదె; శౌర్య మెన్నటికి? మీ శస్త్రాస్త్రముల్ గాల్పనే?
తనుమధ్యన్ విడిపింపమేని నగరే ధాత్రీజనుల్ క్రంతలన్.

10.1-1753-వచనము

అని యొండొరులఁ దెలుపుకొని, రోషంబులు హృదయంబుల నిలుపుకొని, సంరంభించి, తనుత్రాణంబులు వహించి, ధనురాది సాధనంబులు ధరియించి, పంతంబులాడి, తమతమ చతురంగబలంబులం గూడి, జరాసంధాదులు యదువీరుల వెంటనంటఁ దాఁకి, నిలునిలుమని ధిక్కరించి పలికి, యుక్కుమిగిలి, మహీధరంబుల మీఁద సలిలధారలు కురియు ధారాధరంబుల చందంబున బాణ

వర్షంబులు గురియించిన యాదవసేనలం గల దండనాయకులు కోదండంబు లెక్కిడి, గుణంబులు మ్రోయించి; రప్పుడు.

10.1-1754-కంద పద్యము

అరిబల భట సాయకముల
హరిబలములు గప్పఁబడిన నడరెడు భీతిన్
హరిమధ్య సిగ్గుతోడను
హరివదనముఁ జూచెఁ జకితహరిణేక్షణయై.

10.1-1755-వచనము

ఇట్లు చూచిన.

10.1-1756-కంద పద్యము

వచ్చెద రదె యదువీరులు
ప్రచ్చెద రరిసేన నెల్ల వైరులు పెలుచన్
నొచ్చెదరును విచ్చెదరును
జచ్చెదరును నేడు చూడు జలజాతాక్షీ!

10.1-1757-వచనము

అని రుక్మిణీదేవిని హరి యూరడించె; నంత బలభద్ర ప్రముఖులైన యదువీరులు ప్రళయవేళ మిన్నునం బన్ని బలుపిడుగు లడరించు పెనుమొగుళ్ళ వడువున జరాసంధాది పరిపంథిరాజచక్రంబు మీఁద నవక్ర పరాక్రమంబున శిఖిశిఖా సంకాశ నిశిత శిలీముఖ నారాచ ప్రముఖంబులైన బహువిధ బాణపరంపరలు గురియ నదియును విదళిత మత్త మాతంగంబును, విచ్ఛిన్న తురంగంబును విభిన్న

రథవరూథంబును, వినిహత పదాతియూథంబును, విఖండిత వాహ వారణ రథారోహణ మస్తకంబును, విశకలిత వక్షోమధ్య కర్ణ కంఠ కపోల హస్తంబును, విస్ఫోటిత కపాలంబును, వికీర్ణ కేశజాలంబును, విపాటిత చరణ జాను జంఘంబును, విదళిత దంత సంఘంబును, విఘటిత వీరమంజీర కేయూరంబును, విభ్రష్ట కుండల కిరీట హారంబును, విశ్రుత వీరాలాపంబును, విదార్యమాణ గదాకుంత తోమర పరశు పట్టిస ప్రాస కరవాల శూల చక్ర చాపంబును, వినిపాతిత కేతన చామర ఛత్రంబును, విలూన తనుత్రాణంబును, వికీర్యమాణ ఘోటకసంఘ రింఖాసముద్ధూత ధరణీపరాగంబును, వినష్ట రథ వేగంబును, వినివారిత సూత మాగధ వంది వాదంబును, వికుంఠిత హయహేషా పటహ భాంకార కరటిఘటా ఘీంకార రథనేమి పటాత్కార తురగ నాభిఘంటా ఘణఘణాత్కార వీరహుంకార భూషణ ఝణఝణాత్కార నిస్సాణ ధణధణాత్కార మణినూపుర క్రేంకార కింకిణీ కిణకిణాత్కార శింజనీటంకార భట పరస్పరధిక్కార నాదంబును, వినిర్భిద్యమాన రాజసమూహంబును, విద్యమాన రక్తప్రవాహంబును, విశ్రూయమాణ భూతబేతాళ కలకలంబును, విజృంభమాణ భైరవ కాక కంకాది సంకులంబును, ప్రచలిత కబంధంబును ప్రభూత పలల గంధంబును ప్రదీపిత మేదో మాంస రుధిర ఖాదనంబును, ప్రవర్తిత డాకినీ ప్రమోదంబును, నయి యుండె; నప్పుడు.

## 10.1-208- రాజలోక పలాయనంబు

10.1-1758-చంపకమాల

మగిడి చలించి పాఱుచును మాగధ ముఖ్యులు గూడి యొక్కచో
వగచుచు నాలిఁ గోల్పడినవాని క్రియం గడు వెచ్చనూర్చుచున్
మొగమునఁ దప్పిదేరఁ దమ ముందఱఁ బొక్కుచునున్న చైద్యుతోఁ

బగతుర చేతిలోఁ బడక ప్రాణముతోడుత నున్నవాఁడవే.

10.1-1759-వచనము

అని మఱియును.

10.1-1760-ఆటవెలది

బ్రతుకవచ్చు నొడలఁ బ్రాణంబు లుండినఁ;
బ్రతుకు గలిగెనేని భార్య గలదు;
బ్రతికితీవు; భార్యపట్టు దైవమెఱుంగు;
వగవ వలదు చైద్య! వలదువలదు.

10.1-1761-వచనము

వినుము, దేహధారి స్వతంత్రుండు గాఁడు, జంత్రగానిచేతి జంత్రపుబొమ్మ కైవడి నీశ్వరతంత్ర పరాధీనుండై, సుఖదుఃఖంబులందు నర్తనంబులు సలుపుఁ; దొల్లి యేను మధురాపురంబుపైఁ బదియేడు మాఱులు పరాక్రమంబున విడిసి, సప్తదశవారంబులు చక్రిచేత నిర్మూలిత బలచక్రుండనై కామపాలుచేతం బట్టుబడి కృష్ణుండు గరుణ చేసి విడిపించి పుచ్చిన వచ్చి క్రమ్మఱ నిరువదిమూ డక్షౌహిణులం గూడుకొని పదునెనిమిదవ మాఱు దాడిచేసి శత్రువులం దోలి విజయంబు చేకొంటిని యిట్టి జయాపజయంబులందు హర్షశోకంబులం జెంద నే నెన్నండు; నేటి దినంబున నీ కృష్ణు నెదిరి పోర మనరాజలోకంబెల్ల నుగ్రాకుం గూడికొని పోరిన నోడుదు మింతియ కాక దైవయుక్తంబైన కాలంబునం జేసి లోకంబులు పరిభ్రమించుచుండును; అదియునుం గాక.

10.1-1762-మత్తేభ విక్రీడితము

తముకుం గాలము మంచిదైన మనలం ద్రైలోక్య విఖ్యాతి వి
క్రములన్ గెల్చిరి యాదవుల్ హరి భుజాగర్వంబునన్ నేడు; కా
లము మేలై చనుదెంచెనేని మనమున్ లక్షించి విద్వేషులన్
సమరక్షోణి జయింత; మింతపనికై శంకింప నీకేటికిన్.

## 10.1-209- రుక్మి యనువాని భంగంబు

### 10.1-1763-వచనము

అని యిట్లు జరాసంధుండు నతని యొద్ది రాజులును శిశుపాలుని పరితాపంబు నివారించి, తమతమ భూములకుం జనిరి; శిశుపాలుండు ననుచర సేనాసమేతుండయి తన నగరంబునకుం జనియె నంత రుక్మి యనువాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబునం దన చెలియలిం గొనిపోవుటకు సహింపక, యేకాక్షౌహిణీబలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదగిలి వోవుచుఁ దన సారథితో యిట్లనియె.

### 10.1-1764-ఉత్పలమాల

బల్లిదు, నన్ను భీష్మజనపాలకుమారకుఁ జిన్న చేసి నా
చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ జిక్కని నిక్కపు బంటుబోలె నీ
గొల్లఁడు వోయెడిన్; రథము గూడఁగఁ దోలుము; తేజితోల్లస
ద్భల్ల పరంపరన్ మదముఁ బాపెదఁ జూపెద నా ప్రతాపమున్.

### 10.1-1765-వచనము

అని యిట్లు రుక్మి హరి కొలంది యెఱుంగక సారథి నదలించి రథంబుఁ గూడందోలించి గోపాలక! వెన్నముచ్చ! నిమిషమాత్రంబు నిలు నిలు” మని

ధిక్కరించి, బలువింట నారి యెక్కించి మూడు వాఁడి తూపుల హరి నొప్పించి యిట్లనియె.

10.1-1766-సీస పద్యము

మా సరివాఁడవా మా పాపఁ గొనిపోవ? ;
 నేపాటి గలవాఁడ? వేది వంశ?
మెందు జన్మించితి? వెక్కడఁ బెరిగితి? ;
 వెయ్యది నడవడి? యెవ్వఁ డెఱుఁగు?
మానహీనుఁడ వీవు; మర్యాదయును లేదు;
 మాయ గైకొని కాని మలయ రావు;
నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు;
 వసుధీశుఁడవు గావు వావి లేదు;

10.1-1766.1-ఆటవెలది

కొమ్ము నిమ్ము; నీవు గుణరహితుండవు
విడువు; విడువవేని విలయకాల
శిఖిశిఖా సమాన శితశిలీముఖముల
గర్వ మెల్లఁ గొందుఁ గలహమందు.

10.1-1767-వచనము

అని పలికిన నగధరుండు నగి, యొక్క బాణంబున వాని కోదండంబు ఖండించి, యాఱు శరంబుల శరీరంబు దూఱనేసి, యెనిమిది విశిఖంబుల రథ్యంబులం గూల్చి, రెండమ్ముల సారథింజంపి, మూడువాఁడి తూపులం గేతనంబుఁ ద్రుంచి మఱియు నొక్క విల్లందినం ద్రుంచి, వెండియు నొక్క ధనువు పట్టిన విదళించి

క్రమంబునఁ బరిఘ పట్టిస శూల చర్మాసి శక్తి తోమరంబులు ధరియించినం దునుకలు చేసి క్రమ్మఱ నాయుధంబు లెన్ని యెత్తిన నన్నియు శకలంబులు గావించె; నంతటం దనివిజనక వాఁడు రథంబు డిగ్గి ఖడ్గహస్తుండై దవానలంబుపైఁ బడు మిడుత చందంబునం గదిసిన ఖడ్గ కవచంబులు చూర్ణంబులు చేసి, సహింపక మెఱుంగులు చెదర నడిదంబు పెఱికి జళిపించి వాని శిరంబు తెగవ్రేయుదునని గమకించి, నడచుచున్న నడ్డంబు వచ్చి రుక్మిణీదేవి హరిచరణారవిందంబులు పట్టుకొని యిట్లనియె.

10.1-1768-మత్తకోకిలము

నిన్ను నీశ్వరు దేవదేవుని నిర్ణయింపఁగ లేక యో
సన్నుతామలకీర్తిశోభిత! సర్వలోకశరణ్య! మా
యన్న యీతఁడు నేడు చేసె మహాపరాధము నీ యెడన్
నన్ను మన్నన చేసి కావు మనాథనాథ! దయానిధీ!

10.1-1769-మత్తకోకిలము

కల్ల లేదని విన్నవించుట గాదు వల్లభ! యీతనిన్
బ్రల్లదుం దెగఁజూచితేనియు భాగ్యవంతుల మైతి మే
మల్లుఁ డయ్యె ముకుందుఁ డీశ్వరుఁ డంచు మోదితు లైన మా
తల్లిదండ్రులు పుత్ర శోకము దాల్చి చిక్కుదు రీశ్వరా!

10.1-1770-మత్తేభ విక్రీడితము

అని డగ్గుత్తికతో మహాభయముతో నాకంపితాంగంబుతో
వినతశ్రాంత ముఖంబుతో శ్రుతిచలద్వేణీకలాపంబుతోఁ
గనుదోయిన్ జడిగొన్న బాష్పములతోఁ గన్యాలలామంబు మ్రొ

క్కన రుక్మిం దెగ వ్రేయఁబోక మగిడెం గృష్ణుండు రోచిష్ణుఁడై.

10.1-1771-వచనము

ఇట్లు చంపక బావా! రమ్మని చిఱునగవు నగుచు వానిం, బట్టి బంధించి, గడ్డంబును మీసంబునుం దలయును నొక కత్తివాతి యమ్మున రేవులువాఱఁ గొఱిగి విరూపిం జేసె; నంతట యదువీరులు పరసైన్యంబులం బాఱఁదోలి, తత్సమీపంబునకు వచ్చి; రప్పుడు హతప్రాణుండై కట్టుబడియున్న రుక్మిం జూచి కరుణజేసి, కామపాలుండు వాని బంధంబులు విడిచి హరి డగ్గఱి యిట్లనియె.

10.1-1772-కంద పద్యము

తలమనక భీష్మనందనుఁ
దలయును మూతియును గొఱుగఁ దగవే? బంధుం
దలయును మూతియు గొఱుగుట
తల తఱుఁగుటకంటెఁ దుచ్ఛతరము మహాత్మా!

10.1-1773-కంద పద్యము

కొందఱు రిపులని కీడును;
గొందఱు హితులనుచు మేలుగూర్పవు; నిజ మీ
వందఱి యందును సముఁడవు;
పొందఁగ నేలయ్య విషమబుద్ధి? ననంతా!

10.1-1774-వచనము

అని వితర్కించి పలికి రుక్మిణీదేవి నుపలక్షించి యిట్లనియె.

10.1-1775-శార్దూల విక్రీడితము

తోడంబుట్టినవాని భంగమునకున్ దుఃఖించి మా కృష్ణు నె
గ్గాడం జూడకు మమ్మ పూర్వభవకర్మాధీనమై ప్రాణులం
గీడున్ మేలునుజెందు; లేఁ డొకఁడు శిక్షింపంగ రక్షింప నీ
తోడంబుట్టువు కర్మశేష పరిభూతుం డయ్యె నే డీ యెడన్.

10.1-1776-కంద పద్యము

చంపెడి దోషము గలిగినఁ
జంపఁ జనదు బంధుజనులఁ జను విడువంగాఁ
జంపిన దోషము సిద్ధము
చంపఁగ మఱి యేల మున్న చచ్చిన వానిన్.

10.1-1777-ఆటవెలది

బ్రహ్మచేత భూమిపతుల కీ ధర్మంబు
గల్పితంబు రాజ్యకాంక్షఁ జేసి
తోడిచూలు నైనఁదోడఁబుట్టినవాఁడు
చంపుచుండుఁ గ్రూర చరితుఁ డగుచు.

10.1-1778-కంద పద్యము

భూమికి ధన ధాన్యములకు
భామలకును మానములకుఁ బ్రాభవములకుం
గామించి మీఁదుఁ గానరు
శ్రీ మదమున మానధనులు చెనఁకుదు రొరులన్.

10.1-1779-వచనము

వినుము, దైవమాయం జేసి దేహాభిమానులైన మానవులకుం బగవాఁడు బంధుండు దాసీనుండు నను భేదంబు మోహంబున సిద్ధం బయి యుండు జలాదుల యందుఁ జంద్రసూర్యాదులును ఘటాదులందు గగనంబును బెక్కులై కానంబడు భంగి దేహధారుల కందఱకు నాత్మ యొక్కండయ్యును బెక్కండై తోఁచు; నాద్యంతంబులు గల యీ దేహంబు ద్రవ్య ప్రాణ గుణాత్మకంబై, యాత్మ యందు నవిద్య చేతఁ గల్పితంబై, దేహిని సంసారంబునం ద్రిప్పు సూర్యుండు తటస్థుండై యుండం బ్రకాశమానంబులైన దృష్టి రూపంబులుంబోలె నాత్మ తటస్థుండై యుండ దేహేంద్రియంబులు ప్రకాశమానంబు లగు నాత్మకు వేఱొక్కటితోడ సంయోగవియోగంబులు లేవు వృద్ధి క్షయంబులు చంద్రకళలకుంగాని చంద్రునికి లేని క్రైవడి జన్మనాశంబులు దేహంబునకుంగాని యాత్మకుఁ గలుగనేరవు; నిద్రబోయిన వాఁడాత్మను విషయఫలానుభవంబులు చేయించు తెఱంగున నెఱుక లేని వాఁడు నిజము గానియర్థంబు లందు ననుభవము నొందుచుండు కావున.

10.1-1780-కంద పద్యము

అజ్ఞానజ మగు శోకము
విజ్ఞానవిలోకనమున విడువుము నీకుం
బ్రజ్ఞావతికిం దగునే
యజ్ఞానుల భంగి వగవ నంభోజముఖీ!

10.1-1781-వచనము

ఇట్లు బలభద్రునిఁచేతఁ దెలుపంబడి రుక్మిణీదేవి దుఃఖంబు మాని యుండె; నట రుక్మి యనువాఁడు ప్రాణావశిష్టుండై, విడువంబడి తన విరూపభావంబునకు

నెరియుచు హరిం గెలిచికాని కుండినపురంబు చొరనని ప్రతిజ్ఞచేసి, తత్సమీపంబున నుండె; నివ్విధంబున.

## 10.1-210- రుక్మిణీ కల్యాణంబు

10.1-1782-కంద పద్యము

రాజీవలోచనుఁడు హరి
రాజసమూహముల గెల్చి రాజస మొప్పన్
రాజిత యగు తన పురికిని
రాజాననఁ దెచ్చె బంధురాజి నుతింపన్.

10.1-1783-వచనము

అంత నయ్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధ వివాహ కృత్యంబును బ్రవర్తమాన గీత వాద్య నృత్యంబును, బ్రతిగృహాలంకృతాశేష నరనారీ వర్గంబును, బరిణయమహోత్సవ సమాహూయమాన మహీపాల గజఘటా గండమండల దానసలిలధారాసిక్త రాజమార్గంబును బ్రతిద్వార మంగళాచార సంఘటిత క్రముక కదళికా కర్పూర కుంకుమాగరు ధూపదీప పరిపూర్ణకుంభంబును, విభూషిత సకల గృహవేదికా కవాట దేహళీ స్తంభంబును, విచిత్ర కుసుమాంబర రత్నతోరణ విరాజితంబును, సముద్ధూత కేతన విభ్రాజితంబును నై యుండె; నవ్వసరంబున.

10.1-1784-మత్తేభ విక్రీడితము

ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజ చేతోహారిణిన్ మాన పై
భవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం
ధవ సత్కారిణిఁ బుణ్యచారిణి మహాదారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబర ధారిణిన్ గుణవతీచూడామణిన్ రుక్మిణిన్.

10.1-1785-కంద పద్యము

సతులుం దారును బౌరులు
హితమతిఁ గానుకలు దెచ్చి యిచ్చిరి కరుణో
న్నత వర్ధిష్ణులకును మా
నిత రోచిష్ణులకు రుక్మిణీకృష్ణులకున్.

10.1-1786-కంద పద్యము

హరి పెండ్లికిఁ గైకేయక
కురు సృంజయ యదు విదర్భ కుంతి నరేంద్రుల్
పరమానందముఁ బొందిరి
ధరణీశులలోన గాఢతాత్పర్యమునన్.

10.1-1787-కంద పద్యము

హరి యీ తెఱఁగున రుక్మిణి
నరుదుగఁ గొనివచ్చి పెండ్లియాడుట విని దు
ష్కరకృత్య మనుచు వెఱగం
దిరి రాజులు రాజసుతులు దిక్కుల నెల్లన్.

10.1-1788-ఆటవెలది

అనఘ! యాదిలక్ష్మి యైన రుక్మిణితోడఁ
గ్రీడ సలుపుచున్న కృష్ణుఁ జూచి
పట్టణంబులోని ప్రజ యుల్లసిల్లిరి
ప్రీతు లగుచు ముక్తభీతు లగుచు.

10.1-1789-వచనము

అని చెప్పి.

## 10.1-211- పూర్ణి

10.1-1790-కంద పద్యము

కువలయరక్షాతత్పర!
కువలయదళనీలవర్ణకోమలదేహా!
కువలయనాథశిరోమణి!
కువలయజనవినుత విమలగుణసంఘాతా!

10.1-1791-మాలిని

సరసిజనిభహస్తా! సర్వలోకప్రశస్తా!
నిరుపమ శుభమూర్తీ! నిర్మలారూఢకీర్తీ!
పరహృదయవిదారీ! భక్తలోకోపకారీ!
గురుబుధజనతోషీ! ఘోరదైతేయశోషీ!

10.1-1792-గద్యము

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగతం బను మహాపురాణంబునందు దేవకీదేవి వివాహంబును, గగనవాణీశ్రవణంబును, గంసోద్రేకంబును, వసుదేవ ప్రార్థనయును యోగమాయా ప్రభావంబును, బలభద్రుని జన్మంబును, బ్రహ్మాది సురస్తోత్రంబును, గృష్ణావతారంబును, ఘోషప్రవేశంబును, యోగనిద్రాచరితంబును, నందపుత్రోత్సవంబును, బూతనా సంహారంబును, శకటభంజనంబును, దృణావర్తు మరణంబును, గర్గాగమనంబును, నారాయణాది

నామనిర్దేశంబును, బాలక్రీడయును, మృద్భక్షణంబును, వాసుదేవ వదనగహ్వరవిలోక్యమానాఖిల లోకాలోకనంబును, నవనీత చౌర్యంబును, యశోదారోషంబు, నులూఖలబంధనంబు, నర్జునతరుయుగళ నిపాతనంబును, నలకూబర మణిగ్రీవుల శాపమోక్షణంబును, బృందావన గమనంబును, వత్సపాలనంబును, వత్సాసుర వధయును, బకదనుజ విదారణంబు, నఘాసుర మరణంబును, వత్సాపహరణంబును, నూతన వత్సబాలక కల్పనంబును, బ్రహ్మ వినుతియు, గోపాలకత్వంబును, గార్దభాసుర దమనంబును, కాళియఫణి మర్దనంబును, గరుడ కాళియ నాగ విరోధ కథనంబును, బ్రలంబాసుర హింసనంబును, దవానలపానంబును, వర్షర్తు వర్ణనంబును, శరత్కాల లక్షణంబును, వేణు విలాసంబును, హేమంత సమయ సమాగమంబును, గోపకన్యాచరిత హవిష్య వ్రతంబును, గాత్యాయనీ సేవనంబును, వల్లవీవస్త్రాపహరణంబును, విప్రవనితా దత్తాన్న భోజనంబు, నింద్రయాగ నివారణంబును నందముకుంద సంవాదంబును, పర్వత భజనంబును, బాషాణసలిలవర్షంబును, గోవర్ధనోద్ధరణంబును, వరుణకింకరుండు నందునిగొనిపోయిన హరి తెచ్చుటయును, వేణుపూరణంబును, గోపికాజన ఘోషనిర్గమంబును, యమునాతీర వనవిహరణంబును, గృష్ణాంతర్ధానంబును, ఘోషకామనీ గణాన్వేషణంబును, గోపికాగీతలును, హరి ప్రసన్నతయును, రాసక్రీడనంబును, జలకేళియును, సర్పరూపకుండైన సుదర్శన విద్యాధరుండు హరిచరణతాడనంబున నిజరూపంబు పడయుటయును, శంఖచూడుండను గుహ్యకుని వధించుటయును, వృషభాసుర విదళనంబును, నారదోపదేశంబున హరి జన్మకథ నెఱింగి కంసుండు దేవకీవసుదేవుల బద్ధులం జేయుటయును, ఘోటకాసురుండైన కేశియను దనుజుని వధియించుటయును, నారద

స్తుతియును, వ్యోమదానవ మరణంబు, నక్రూరాగమంబు, నక్రూర రామకృష్ణుల సల్లాపంబును, ఘోషనిర్గమంబును, యమునా జలాంతరాళంబున నక్రూరుండు హరి విశ్వరూపంబును గాంచుటయు, నక్రూర స్తవంబును, మధురానగర ప్రవేశంబును, రజక వధయును, వాయక మాలికులచే సమ్మానంబునొందుటయును, కుబ్జా ప్రసాదకరణంబును, ధనుర్భంగంబును, గంసు దుస్స్వప్నంబును, గువలయాపీడ పీడనంబును, రంగస్థల ప్రవేశంబును, జాణూర ముష్టికుల వధయును, గంస వధయును, వసుదేవదేవకీబంధ మోక్షణంబు, నుగ్రసేను రాజ్యస్థాపనంబును, రామకృష్ణులు సాందీపుని వలన విద్యలభ్యసించుటయును, సంయమనీనగర గమనంబును, గురుపుత్ర దానంబు, నుద్ధవుని ఘోషయాత్రయును, భ్రమరగీతలును, గుబ్జావాస గమనంబును, గరినగరంబునకు నక్రూరుండు చని కుంతీదేవి నూరార్చుటయును, గంసభార్యలగు నస్తి ప్రాస్తులు జరాసంధునకుఁ గంసుమరణం బెఱింగించుటయును, జరాసంధుని దండయాత్రయును, మధురానగర నిరోధంబును, యుద్ధంబున జరాసంధుండు సప్తదశ వారంబులు పలాయితుండగుటయును, నారదప్రేరితుండై కాలయవనుండు మధురపై దాడివెడలుటయును, ద్వారకానగర నిర్మాణంబును, మధురాపురనివాసులం దన యోగబలంబున హరి ద్వారకానగరంబునకుం దెచ్చుటయును, కాలయవనుడు హరి వెంటజని గిరిగుహ యందు నిద్రితుండైన ముచికుందునిదృష్టివలన నీఱగుటయును, ముచికుందుండు హరిని సంస్తుతి చేసి తపంబునకుం జనుటయును, జరాసంధుండు గ్రమ్మఱ రామకృష్ణులపై నేతెంచుటయును, బ్రవర్షణ పర్వతారోహణంబును, గిరిదహనంబును, గిరిడిగ్గనుఱికి రామకృష్ణులు ద్వారకకుం జనుటయును, రుక్మిణీ జననంబును,

రుక్మిణీ సందేశంబును, వాసుదేవాగమనంబును, రుక్మిణీ గ్రహణంబును, రాజలోక పలాయనంబును, రుక్మి యనువానిభంగంబును, రుక్మిణీకల్యాణంబును యను కథలుఁ గల దశమస్కంధంబు నందుఁ బూర్వభాగము సమాప్తము.

# పోతన తెలుగు భాగవతము

## దశమ స్కంధము – ఉత్తర భాగము

### 10.2-1- ఉపోద్ఘాతము

10.2-1-కంద పద్యము

శ్రీకర! పరిశోషిత ర

త్నాకర! కమనీయగుణగణాకర! కారు

ణ్యాకర! భీకరశర ధా

రాకంపితదానవేంద్ర! రామనరేంద్రా!

10.2-2-వచనము

మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు రుక్మిణీపరిణయానంతరంబున నైన కథావృత్తాంతం బంతయు వినిపింపు మనిన శుకయోగీంద్రుం డిట్లనియె.

### 10.2-2- ప్రద్యుమ్న జన్మంబు

10.2-3-ఉత్పలమాల

తామరసాక్షునంశమున దర్పకుఁ డీశ్వరుకంటిమంటలం

దా మును దగ్ధుఁడై; పిదపఁ దత్పరమేశుని దేహలబ్ధికై

వేమఱు నిష్ఠఁ జేసి హరి వీర్యమునం బ్రభవించె రుక్మిణీ

కామిని గర్భమం దసురఖండను మాఱట మూర్తియో యనన్.

10.2-4-వచనము

అంత నా డింభకుండు ప్రద్యుమ్నుండను పేర విఖ్యాతుం డయ్యె; నా శిశువు సూతికాగృహంబునం దల్లి పొదిఁగిట నుండం దనకు శత్రుండని యెఱింగి శంబరుండను రాక్షసుండు దన మాయాబలంబునం గామరూపి యై వచ్చి కొనిపోయి సముద్రంబులో వైచి జనియె; నంత నా శాబకుండు జలధిజలంబున దిగఁబడ నొడిసి యొక మహామీనంబు మ్రింగె; నందు.

10.2-5-కంద పద్యము

జాలిఁ బడి పాఱు జలచర
జాలంబులఁ బోవనీక చని రోషాగ్ని
జ్వాలలు నిగుడఁగ నూరక
జాలంబులు వైచిపట్టు జాలరు లంతన్.

10.2-6-వచనము

సముద్రంబులోన నా మీనంబును దత్సహచరంబులైన మీనంబులనుం బట్టికొని తెచ్చి శంబరునకుం గానికఁగా నిచ్చిన నతండు "వండి తెండ"ని మహానస గృహంబునకుం బంచిన.

10.2-7-కంద పద్యము

రాజునగరి యడబాలలు
రాజీవముకడుపు వ్రచ్చి రాజనిభాస్యున్
రాజశిశువుఁ గని చెప్పిరి
రాజీవదళాక్షియైన రతికి నరేంద్రా!

10.2-8-వచనము

అంత నారదుండు వచ్చి బాలకుని జన్మంబును శంబరోద్యోగంబును మీనోదరప్రవేశంబునుం జెప్పిన విని యా రతి మాయావతి యను పేర శంబరునియింట బాతివ్రత్యంబు సలుపుచు దహన దగ్ధుండయిన తన పెనిమిటి శరీర ధారణంబు సేయుట కెదురు చూచుచున్నది గావున; నయ్యర్భకుండు దర్పకుండని తెలిసి మెల్లన పుత్రార్థినియైన తెఱంగున శంబరుని యనుమతి వడసి సూపకారుల యొద్ద నున్న పాపనిం దెచ్చి పోషించుచుండె; నా కుమారుండును శీఘ్రకాలంబున నారూఢ యౌవనుండై.

10.2-9-కంద పద్యము

సుందర మగు తన రూపము
సుందరు లోకమాఱు దేఱి చూచినఁ జాలున్
సౌందర్య మేమి చెప్పను?
బొందెద మని డాయు బుద్ధిఁ బుట్టించు, నృపా!

10.2-10-సీస పద్యము

చక్కని వారల చక్కఁ దనంబున;
 కుపమింప నెవ్వండు యోగ్యుఁ డయ్యె!
మిక్కిలి తపమున మెఱయు నంబికకు నై;
 శంకరు నెవ్వండు సగము సేసె!
బ్రహ్మత్వమును బొంది పరఁగు విధాతను;
 వాణికై యెవ్వఁడు వావి సెఱిచె!
వేయిడాఁగులతోడి విబుధ లోకేశుని;

మూర్తికి నెవ్వఁడు మూల మయ్యె!

10.2-10.1-తేటగీతి

మునుల తాలిమి కెవ్వఁడు ముల్లు సూపు
మగల మగువల నెవ్వండు మరులుకొలుపు!
గుసుమధనువున నెవ్వండు గొను విజయము
చిగురువాలున నెవ్వండు సిక్కువఱుచు?

10.2-11-వచనము

అని తన్ను లోకులు వినుతించు ప్రభావంబులు గలిగి పద్మదళలోచనుండును, బ్రలంబబాహుండును, జగన్మోహనాకారుండును నైన పంచబాణునిం గని లజ్జాహాస గర్భితంబు లైన చూపులం జూచుచు మాయావతి సురత భ్రాంతిఁ జేసినం జూచి ప్రద్యుమ్నుం డిట్లనియె.

10.2-12-మత్తకోకిలము

నా తనూభవుఁ డీతఁ డంచును నాన యించుక లేక యో!
మాత! నీ విది యేమి? నేఁ డిటు మాతృ భావము మాని సం
ప్రీతిఁ గామినిభంగిఁ జేసెదు పెక్కు విభ్రమముల్? మహా
ఖ్యాత వృత్తికి నీకు ధర్మము గాదు మోహము సేయఁగాన్.

10.2-13-వచనము

అనిన రతి యిట్లనియె; "నీవు నారాయణనందనుండ వైన కందర్పుండవు; పూర్వకాలంబున నేను నీకు భార్య నైన రతిని; నీవు శిశువై యుండునెడ నిర్దయుండై దొంగిలి తల్లిం దొఱంగఁజేసి శంబరుండు కొని వచ్చి నిన్ను నీరధిలో

వైచిన నొక్క మీనంబు మ్రింగె; మీనోదరంబు వెడలి తీవు; మీఁదటి కార్య మాకర్ణింపుము.

10.2-14-కంద పద్యము

మాయావి వీఁడు దుర్మతి
మాయుఁడు సంగరములం దమర్త్యుల గెలుచున్
మాయికరణమున వీనిన్
మాయింపుము మోహనాది మాయలచేతన్.

10.2-15-మత్తకోకిలము

పాపకర్ముఁడు వీఁడు నిన్నిటుఁ బట్టి తెచ్చిన లేచి నా
పాపఁ డెక్కడఁ బోయెనో? సుతుఁ బాపితే విధి యంచుఁ దా
గ్రేపుఁ బాసిన గోవు భంగిని ఖిన్నయై పడి గాఢ సం
తాపయై నిను నోఁచి కాంచిన తల్లి కుయ్యిడ కుండునే?

10.2-16-వచనము

అనిపలికి మాయావతి మహానుభావుండైన ప్రద్యుమ్నునికి సర్వ శత్రు మాయా వినాశిని యైన మహామాయ విద్య నుపదేశించె; నివ్విధంబున.

## 10.2-3- శంబరోద్యగంబు

10.2-17-మత్తేభ విక్రీడితము

గురు మాయారణవేదియై, కవచియై, కోదండియై, బాణియై
హరిజం డోరి! నిశాట! వైచితివి నాఁ డంభోనిధిన్ నన్ను, ఘో
రరణాంభోనిధి వైతు నిన్ను నిదె వే రమ్మంచుఁ జీరెన్ మనో

హర దివ్యాంబరు నుల్లసద్దనుజ సేనాడంబరున్ శంబరున్.

10.2-18-చంపకమాల

అదలిచి యిట్టు కృష్ణసుతుఁ డాడిన నిష్ఠుర భాషణంబులం
బదహతమై వడిం గవియు పన్నగరాజముఁ బోలి శంబరుం
డదరుచు లేచి వచ్చి గద నచ్యుతనందను ప్రేసె నుజ్జ్వల
ద్భిదురకఠోరఘోష సమభీషణనాదము చేసి యార్చుచున్.

10.2-19-కంద పద్యము

దనుజేంద్రుఁడు ప్రేసిన గదఁ
దన గదచేఁ బాయ నడిచి దనుజులు బెదరన్
దనుజాంతకుని కుమారుఁడు
దనుజేశుని మీఁద నార్చి తన గద వైచెన్.

10.2-20-వచనము

అంత నా రక్కసుండు వెక్కసంబగు రోషంబునఁ దనకు దొల్లి మయుం డెఱింగించిన దైతేయమాయ నాశ్రయించి మింటికి నెగసి, పంచబాణునిపై బాణవర్షంబు గురిసిన; నమ్మహారథుండు నొచ్చియు సంచలింపక మచ్చరంబున సర్వమాయా వినాశిని యైన సాత్త్విక మాయం బ్రయోగించి దనుజుని బాణవృష్టి నివారించె; మఱియు వాఁడు భుజగ గుహ్యక పిశాచ మాయలు పన్ని నొప్పించిన నన్నియుం దప్పించి.

10.2-21-కంద పద్యము

దండధర మూర్తిఁ గైకొని

యొండాడక చక్రిసూనుఁ డుగ్రతరాసిన్

ఖండించె శంబరుని తలఁ

గుండల కోటీర మణులు గుంభిని రాలన్.

10.2-22-కంద పద్యము

చిగురాకడిదపు ధారను

జగములఁ బరవశము సేయు చలపాదికి దొ

డ్డగు నుక్కడిదంబునఁ దన

పగతుం దెగ వ్రేయు టెంత పని చింతింపన్?

10.2-23-కంద పద్యము

బెగడుచు నుండఁగ శంబరుఁ

దెగడుచు బూవింటిజోదు ధీరగుణంబుల్

వొగడుచు గురిసిరి ముదమున

నెగడుచుఁ గుసుమముల ముసురు నిర్జరు లధిపా!

## 10.2-4- రతీప్రద్యుమ్నులాగమనంబు

10.2-24-వచనము

ఇట్లు శంబరుని వధియించి విలసిల్లుచున్న యించువిలుకానిం గొంచు నాకాశచారిణియైన యా రతీదేవి, గగనపథంబుఁబట్టి ద్వార కానగరోపరిభాగమునకుం జనుదెంచిన.

10.2-25-ఆటవెలది

మెఱుఁగుఁదీగెతోడి మేఘంబు కైవడి

యువిదతోడ మింటి నుండి కదలి
యరుగుదెంచె మదనుఁ డంగనాజనములు
మెలఁగుచున్న లోనిమేడకడకు.

10.2-26-మత్తేభ విక్రీడితము

జలదశ్యాముఁ బ్రలంబబాహుయుగళుం జంద్రాననున్ నీల సం
కులవక్రాలకుఁ బీతవాసు ఘనవక్షున్ సింహమధ్యున్ మహో
త్పలపత్త్రేక్షణు మందహాసలలితుం బంచాయుధున్ నీరజా
క్షులు దారేమఱుపాటఁ జూచి హరి యంచుం డాఁగి రవ్వేయెడన్.

10.2-27-కంద పద్యము

కొందఱు హరి యగు నందురు,
కొందఱు చిహ్నములు కొన్నికొన్ని హరికి లే
వందురు, మెల్లనె తెలియుద
మందురు మరుఁ జూచి కొంద ఱబలలు గుములై.

10.2-28-కంద పద్యము

హరి యని వెనుచని పిదపన్
హరిఁ బోలెడువాఁడు గాని హరి గాఁ డనుచున్
హరిమధ్య లల్లనల్లన
హరినందను డాయ వచ్చి రాశ్చర్యమునన్.

10.2-29-ఉత్పలమాల

అన్నులు సేర వచ్చి మరు నందఱుఁ జూడఁగఁ దాను వచ్చి సం

పన్న గుణాభిరాము హరిపట్టపుదేవి విదర్భపుత్రి క్రే
గన్నుల నా కుమారకుని కైవడి నేర్పడఁ జూచి బోటితోఁ
జన్నులు సేఁప నిట్లనియె సంభ్రమదైన్యము లుల్లసిల్లఁగన్.

10.2-30-శార్దూల విక్రీడితము

ఈ కంజేక్షణుఁ డీ కుమారతిలకుం డీ యిందుబింబాననుం
డీ కంఠీరవమధ్యుఁ డిచ్చటికి నేఁ డెందుండి యేతెంచెనో
యీ కల్యాణునిఁ గన్న భాగ్యవతి మున్నే నోములన్ నోఁచెనో
యే కాంతామణియందు వీని కనెనో యేకాంతుఁ డీ కాంతునిన్.

10.2-31-శార్దూల విక్రీడితము

ఆళీ! నా తొలుచూలి పాపనికి బోర్కాడించి నే సూతికా
శాలామధ్య విశాలతల్పగత నై చన్నిచ్చి నిద్రింప నా
బాలున్ నా చనుఁబాలకుం జెఱిచి యే పాపాత్ముఁడో త్రోవ ము
న్నే లీలం గొనిపోయెరో? శిశువుఁ దా నే తల్లి రక్షించెనో!

10.2-32-కంద పద్యము

కొడుకఁడు నా పొదిగిఁటిలోఁ
జెడిపోయిన నాఁటనుండి చెలియా! తెలియం
బడ దే వార్తయు నతఁడే
వడువున నెచ్చోట నిలిచి వర్తించెడినో!

10.2-33-కంద పద్యము

ఇందాఁక వాఁడు బ్రదికిన

సందేహము లేదు దేహచాతుర్యవయ
స్సౌందర్యంబుల లోకులు
వందింపఁగ నితనియంతవాఁ డగుఁ జుమ్మీ!

10.2-34-మత్తేభ విక్రీడితము

అతివా! సిద్ధము నాఁటి బాలకున కీ యాకార మీ వర్ణ మీ
గతి యీ హాసవిలోకనస్వరము లీ గాంభీర్య మీ కాంతి వీఁ
డతఁడే కాఁదగు నున్నవారలకు నా యాత్మేశు సారూప్య సం
గతి సిద్ధింపదు; వీనియందు మిగులం గౌతూహలం బయ్యెడిన్.

10.2-35-కంద పద్యము

పొదలెడి ముదమునఁ జిత్తము
గదలెడి నా యెడమమూఁపు, గన్నుల వెంటం
బొదలెడి నానందాశ్రులు
మెదలెడిఁ బాలిండ్లఁ బాలు; మేలయ్యెడినో!

10.2-36-వచనము

అని డోలాయమాన మానసయై వితర్కించుచు.

10.2-37-కంద పద్యము

తనయుఁ డని నొడువఁ దలఁచును;
దనయుఁడు గా కున్న మిగులఁ దతిగొని సవతుల్
తను నగియెద రని తలఁచు; న
తను సంశయ మలమికొనఁగఁ దనుమధ్య మదిన్.

10.2-38-వచనము

ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ లోపలినగరి కావలివారివలన విని కృష్ణుండు దేవకీవసుదేవులం దోడ్కొని చనుదెంచి సర్వజ్ఞుం డయ్యు నేమియు వివరింపక యూరకుండె; నంత నారదుండు సనుదెంచి శంబరుఁడు గుమారునిం గొనిపోవుట మొదలైన వార్త లెఱింగించిన.

10.2-39-కంద పద్యము

చచ్చినబాలుఁడు గ్రమ్మఱ
వచ్చిన క్రియ వచ్చెఁ బెక్కువర్షములకు నీ
సచ్చరితు నేఁడు గంటిమి;
చెచ్చెర మున్నెట్టి తపము సేయంబడెనో?

10.2-40-వచనము

అని యంతఃపుర కాంతలును, దేవకీవసుదేవ రామకృష్ణులును యథోచితక్రమంబున నా దంపతుల దివ్యాంబరాభరణాలంకృతుల సత్కరించి సంతోషించిరి; రుక్మిణీదేవియు నందనుం గౌఁగిలించు కొని.

10.2-41-శార్దూల విక్రీడితము

అన్నా! నా చనుఁ బాపి నిన్ను దనుజుం డంభోనిధిన్ వైచెనే
యెన్నే వర్షము లయ్యెఁ బాసి సుత! నీ వేరీతి జీవించి యే
సన్నాహంబున శత్రు గెల్చితివొ? యాశ్చర్యంబు సంధిల్లెడిన్
నిన్నుం గాంచితి నింతకాలమునకున్ నే ధన్యతం జెందితిన్.

10.2-42-వచనము

అని కొడుకుం జూచి సంతోషించి కోడలిగుణంబులు కైవారంబు సేసి, వినోదించుచుండె; నంత ద్వారకానగరంబు ప్రజలు విని హర్షించి; రందు.

10.2-43-కంద పద్యము

సిరిపెనిమిటి పుత్త్రకుఁ డగు
మరుఁ గని హరిఁ జూచినట్ల మాతలు దమలోఁ
గరఁగుదు రఁట, పరకాంతలు
మరుఁ గని మోహాంధకార మగ్నలు గారే?

10.2-44-వచనము

అని చెప్పి శుకుం డిట్లనియె

10.2-45-కంద పద్యము

సత్రాజిత్తు నిశాచర
శత్రునకుం గీడు సేసి సద్వినయముతోఁ
బుత్త్రి, శమంతకమణియును
మైత్త్రిం గొని తెచ్చి యిచ్చె మనుజాధీశా!

10.2-46-వచనము

అనిన విని రా జిట్లనియె.

10.2-47-ఆటవెలది

శౌరి కేమి తప్పు సత్రాజితుఁడు సేసెఁ?
గూఁతు మణిని నేల కోరి యిచ్చె?
నతని కెట్లు కలిగె నా శమంతకమణి

విప్రముఖ్య! నాకు విస్తరింపు.

## 10.2-5- శమంతకమణి పొందుట

### 10.2-48-వచనము

అనిన విని శుకయోగివర్యుం డిట్లనియె; సత్రాజిత్తనువాఁడు సూర్యునకు భక్తుండై చెలిమి సేయ నతనివలన సంతసించి సూర్యుండు శమంతకమణి నిచ్చె; నా మణి కంఠంబున ధరియించి సత్రాజిత్తు భాస్కరుని భంగి భాసమానుం డై ద్వారకానగరంబునకు వచ్చిన దూరంబున నతనిం జూచి జనులు మణిప్రభాపటల తేజోహృతదృష్టులయి సూర్యుం డని శంకించి వచ్చి హరి కిట్లనిరి.

### 10.2-49-కంద పద్యము

నారాయణ! దామోదర!
నీరజదళనేత్ర? చక్రి! నిఖిలేశ! గదా
ధారణ! గోవింద! నమ
స్కారము యదుపుత్త్ర! నిత్యకల్యాణనిధీ!

### 10.2-50-మత్తేభ విక్రీడితము

దివిజాధీశ్వరు లిచ్చగింతురు గదా దేవేశ! నిన్ జూడ యా
దవ వంశంబున గూఢమూర్తివి జగత్త్రాణుండవై యుండఁగా
భవదీయాకృతిఁ జూడ నేఁడిదె రుచిప్రచ్ఛన్న దిగ్భాగుఁడై
రవియో, నీరజగర్భుఁడో యొకఁడు సేరన్ వచ్చె మార్గంబునన్.

### 10.2-51-వచనము

అని యిట్లు పలికిన మూఢజనులఁ జూచి గోవిందుండు నగి మణి సమేతుండైన సత్రాజితుండుగాని సూర్యుండు గాఁడని పలికె; నంత సత్రాజితుండు శ్రీయుతంబయి మంగళాచారంబైన తన గృహంబునకుం జని, మహీసురులచేత నిజదేవతా మందిరంబున నమ్మణి శ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె; నదియును బ్రతిదినంబు నెనిమిది బారువుల సువర్ణంబు గలిగించు చుండు.

10.2-52-కంద పద్యము

ఏ రా జేలెడు వసుమతి
నా రత్నము పూజ్యమానమగు నక్కడ రో
గారిష్ట సర్వ మాయిక
మారీ దుర్భిక్ష భయము మాను; నరేంద్రా!

10.2-53-కంద పద్యము

అమ్మణి యాదవ విభునకు
నిమ్మని హరి యడుగ నాతఁ డీక ధనేచ్ఛం
బొమ్మని పలికెను, జక్రికి
నిమ్మణి యీకున్న మీఁద నేమౌ ననుచున్.

## 10.2-6- ప్రసేనుడు వధింపబడుట

10.2-54-వచనము

అంత.

10.2-55-చంపకమాల

అడరెడు వేడ్కఁ గంఠమున నమ్మణిఁ దాల్చి ప్రసేనుఁ డొక్క నాఁ

డడవికి ఘోరవన్యమృగయారతి నేగిన వానిఁ జంపి పైఁ
బడి మణిఁ గొంచు నొక్క హరి పాఱఁగ దాని వధించి డాసి యే
ర్పడఁ గనె జాంబవంతుఁడు ప్రభాత్తదిగంతము నా శమంతమున్.

10.2-56-కంద పద్యము

కని జాంబవంతుఁ డా మణిఁ
గొనిపోయి సమీప శైలగుహఁ జొచ్చి ముదం
బునఁ దన కూరిమిసుతునకు
ఘనకేళీకందుకంబుగాఁ జేసె, నృపా!

## 10.2-7- సత్రాజితుని నిందారోపణ

10.2-57-వచనము

అంత సత్రాజితుండు తన సహోదరుండైన ప్రసేనునిం గానక దుఃఖించుచు.

10.2-58-మత్తేభ విక్రీడితము

మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో మావాఁడు వర్తింపఁగా
మణికై పట్టి వధించినాఁడు హరికిన్ మర్యాద లే దంచు దూ
షణముం జేయఁగ వాని దూషణముఁ గంసధ్వంసి యాలించి యే
వ్రణమున్ నా యెడ లేదు, నింద గలిగెన్ వారించు టే రీతియో?

10.2-59-వచనము

అని వితర్కించి.

10.2-60-మత్తేభ విక్రీడితము

తనవారెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపం దర్కించుచున్ వచ్చి త
ద్వనవీథిం గనె నేలఁ గూలిన మహాశ్వంబుం బ్రసేనుం బ్రసే
నుని హింసించినసింహమున్ మృగపతిన్ నొప్పించిఖండించి యేఁ
గిన భల్లూకము సొచ్చియున్న గుహయుం గృష్ణుండు రోచిష్ణుఁడై.

10.2-61-వచనము

కని తన వెంట వచ్చిన ప్రజల నెల్ల గుహాముఖంబున విడిచి, సాహసంబున మహానుభావుం డైన హరి నిరంతర నిబిడాంధకార బంధురంబయి, భయంకరంబై, విశాలంబయిన గుహాంతరాళంబు సొచ్చి; చని యక్కడ నొక్క బాలున కెదురు దర్శనీయ కేళీకందుకంబుగా వ్రేలంగట్టఁబడిన యమ్మణి శ్రేష్ఠంబుఁ గని హరింప నిశ్చయించి.

10.2-62-కంద పద్యము

మెల్లన పదము లిడుచు యదు
వల్లభుఁ డా శిశువుకడకు వచ్చిన గుండెల్
జల్లనఁగఁ జూచి కంపము
మొల్లంబుగ దానిదాది మొఱపెట్టె నృపా!

## 10.2-8- జాంబవతి పరిణయంబు

10.2-63-వచనము

అంత నా ధ్వని విని బలవంతుండైన జాంబవంతుఁడు వచ్చి తన స్వామి యని కృష్ణు నెఱుంగక ప్రాకృత పురుషుండని తలంచి కృష్ణునితో రణంబు చేసె; నందు.

10.2-64-కంద పద్యము

పలలమునకుఁ బోరెడు డే
గల క్రియ శస్త్రములఁ దరులఁ గరముల విజయే
చ్ఛల నిరువదియెనిమిది దిన
ములు వోరిరి నగచరేంద్రముఖ్యుఁడు హరియున్.

10.2-65-కంద పద్యము

అడిదములుఁ దరులు విఱిగిన
బెడిదము లగు మగతనములు బిఱుతివక వడిం
బిడుగులవడువునఁ బడియెడి
పిడికిటిపోటులను గలన బెరసి రిరువురున్.

10.2-66-శార్దూల విక్రీడితము

స్పష్టాహంకృతు లుల్లసిల్ల హరియున్ భల్లూకలోకేశుఁడున్
ముష్టాముష్టి నహర్నిశంబు జయసమ్మోహంబునం బోరుచోఁ
బుష్టిం బాసి ముకుంద ముష్టిహతులం బూర్ణశ్రమోపేతుఁడై
పిష్టాంగోరు శరీరుఁడై యతఁడు దా భీతాత్ముఁడై యిట్లనున్.

10.2-67-వచనము

"దేవా! నిన్నుఁ బురాణపురుషు నధీశ్వరు విష్ణుం బ్రభవిష్ణు నెఱుంగుదు; సర్వభూతంబులకుం బ్రాణ ప్రతాప ధైర్యబలంబులు నీవ; విశ్వంబునకు సర్గస్థితిలయంబు లెవ్వరాచరింతురు, వారికి సర్గ స్థితిలయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ; యాత్మవు నీవ" యని మఱియును.

10.2-68-సీస పద్యము

బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి;
 నింకించి బంధించి యేపు మాపెఁ
బరఁగ నెవ్వఁడు ప్రతాపప్రభారాశిచే;
 దానవగర్వాంధతమస మడఁచెఁ
గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వఁడు;
 దశకంఠుకంఠబృందములు ద్రుంచె
నా చంద్రసూర్యమై యమరు లంకారాజ్య;
 మునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె

10.2-68.1-తేటగీతి

నన్ను నేలిన లోకాధినాథుఁ డెవ్వఁ
డంచితోదారకరుణారసాబ్ధి యెవ్వఁ
డాతఁడవు నీవ కావె; మహాత్మ! నేఁడు
మాఱుపడి యెగ్గు సేసితి మఱవవలయు.

10.2-69-వచనము

అని యిట్లు పరమభక్తుండయిన జాంబవంతుండు వినుతించిన నతని శరీర నిగ్రహ నివారణంబుగా భక్తవత్సలుండైన హరి దన కరంబున నతని మేను నిమిరి గంభీరభాషణంబుల నిట్లనియె.

10.2-70-కంద పద్యము

ఈ మణి మాచేఁ బడె నని
తామసు లొనరించు నింద దప్పెడు కొఱకై
నీ మందిర మగు బిలమున

కే మరుదెంచితిమి భల్లుకేశ్వర! వింటే!

10.2-71-వచనము

అనిన విని సంతసించి జాంబవంతుఁడు మణియునుం, దన కూఁతు జాంబవతి యను కన్యకామణియునుం దెచ్చి హరికిం గానికఁగా సమర్పించె; నటమున్న హరివెంట వచ్చిన వారలు బిలంబువాకిటం బండ్రెండు దినంబులు హరిరాక కెదురుచూచి వేసరి వగచి పురంబునకుం జని; రంత దేవకీవసుదేవులును రుక్మిణియును మిత్ర బంధు జ్ఞాతి జనులును గుహ నొచ్చి కృష్ణుండు రాక చిక్కె నని శోకించి.

10.2-72-కంద పద్యము

దుర్గమ మగు బిలమున హరి
నిర్గతుఁడై చేరవలయు నేఁ డని పౌరుల్
వర్గములై సేవించిరి
దుర్గం గృతకుశలమార్గఁ దోషితభర్గన్.

10.2-73-కంద పద్యము

డోలాయిత మానసులై
జాలింబడి జనులు గొలువఁ జండిక పలికెన్
బాలామణితో మణితో
హేలాగతి వచ్చు నంబుజేక్షణుఁ డనుచున్.

10.2-74-కంద పద్యము

యత్నము సఫలం బయిన స

పత్న సమూహములు బెగడఁ బద్మాక్షుం డా
రత్నముతోఁ గన్యాజన
రత్నముతోఁ బురికి వచ్చె రయమున నంతన్.

10.2-75-కంద పద్యము

మృతుఁ డైనవాఁడు పునరా
గతుఁడైన క్రియం దలంచి కన్యామణి సం
యుతుఁడై వచ్చిన హరిఁ గని
వితతోత్సవ కౌతుకముల వెలసిరి పౌరుల్.

## 10.2-9- సత్రాజితుకు మణితిరిగిచ్చుట

10.2-76-వచనము

ఇట్లు హరి దన పరాక్రమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి, రాజసభకు సత్రాజిత్తుం బిలిపించి, తద్వృత్తాంతం బంతయు నెఱిగించి, సత్రాజిత్తునకు మణి నిచ్చె; నతండును సిగ్గువడి మణిం బుచ్చుకొని పశ్చాత్తాపంబు నొందుచు బలవద్విరోధంబునకు వెఱచుచు నింటికిఁ జని.

10.2-77-కంద పద్యము

పాపాత్ముల పాపములం
బాపంగా నోపునట్టి పద్మాక్షునిపైఁ
బాపము గల దని నొడివిన
పాపాత్ముని పాపమునకుఁ బారము గలదే?

10.2-78-మత్తేభ విక్రీడితము

మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు సే
సితిఁ? బాపాత్ముఁడ నర్థలోభుఁడను దుశ్చిత్తుండ మత్తుండ దు
ర్మతి నీ దేహముఁ గాల్పనే? దురితమే మార్గంబునం బాయు? నే
గతిఁ గంసారి ప్రసన్నుఁ డై మనుచు నన్ గారుణ్య భావంబునన్?

10.2-79-ఆటవెలది

మణిని గూఁతు నిచ్చి మాధవు పదములు
పట్టుకొంటినేని బ్రదుకు గలదు
సంతసించు నతఁడు సదుపాయమగు నిది
సత్య మితర వృత్తిఁ జక్కఁబడదు.

## 10.2-10- సత్యభామా పరిణయంబు

10.2-80-మత్తేభ విక్రీడితము

అని యిబ్భంగి బహుప్రకారముల నేకాంతస్థుఁడై యింటిలోఁ
దన బుద్ధిం బరికించి నీతి గని, సత్రాజిత్తు సంప్రాప్త శో
భనుఁడై యిచ్చె విపత్పయోధితరికిన్ భామామనోహారికిన్
దనుజాధీశవిదారికిన్ హరికిఁ గాంతారత్నమున్ రత్నమున్.

10.2-81-ఉత్పలమాల

తామరసాక్షుఁ డచ్యుతుఁ డుదారయశోనిధి పెండ్లియాడె నా
నా మనుజేంద్ర నందిత గుణస్థితిలక్షణ సత్యభామ ను
ద్దామ పతివ్రతాత్వ నయ ధర్మ విచక్షణతా దయా యశః
కామను సత్యభామను ముఖద్యుతినిర్జితసోమ నయ్యెడన్.

10.2-82-కంద పద్యము

మణి యిచ్చినాఁడు వాసర

మణి నీకును; మాకుఁ గలవు మణులు; కుమారీ

మణి చాలు నంచుఁ గృష్ణుఁడు

మణి సత్రాజిత్తునకును మరలఁగ నిచ్చెన్.

10.2-83-వచనము

అంత నక్కడఁ గుంతీసహితులయిన పాండవులు లాక్షాగారంబున దగ్ధులైరని విని నిఖిలార్థ దర్శనుండయ్యును, గృష్ణుండు బలభద్ర సహితుండై కరినగరంబునకుం జని కృప విదుర గాంధారీ భీష్మ ద్రోణులం గని దుఃఖోపశమనాలాపంబు లాడుచుండె; నయ్యెడ.

## 10.2-11- శతధన్వుఁడుమణిగొనిపోవుట

10.2-84-సీస పద్యము

జగతీశ! విన వయ్య శతధన్వుఁ బొడగని;

యక్రూర కృతవర్మ లాప్తవృత్తి

మన కిత్తు ననుచు సమ్మతిఁ జేసి తన కూఁతుఁ;

బద్మాక్షునకు నిచ్చి పాడి దప్పె

ఖలుఁడు సత్రాజిత్తుఁ, డలయ కే క్రియ నైన;

మణిపుచ్చుకొనుము నీమతము మెఱసి

యని తన్నుఁ బ్రేరేప నా శతధన్వుఁడు;

పశువుఁ గటికివాఁడు పట్టి చంపు

10.2-84.1-ఆటవెలది

కరణి నిదురవోవఁ గడఁగి సత్రాజిత్తుఁ

బట్టి చంపి, వాని భామ లెల్ల

మొఱలువెట్ట లోభమునఁ జేసి మణి గొంచుఁ

జనియె నొక్క నాఁడు జనవరేణ్య!

10.2-85-వచనము

ఇట్లు హతుం డైన తండ్రిం గని శోకించి సత్యభామ యతనిం దైలద్రోణియందుఁ బెట్టించి హస్తిపురంబునకుం జని సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తు మరణంబు విన్నవించిన హరియును బలభద్రుండు నీశ్వరులయ్యును మనుష్య భావంబుల విలపించి; రంత బలభద్ర సత్యభామా సమేతుండై హరి ద్వారకా నగరంబునకు మరలివచ్చి శతధన్వుం జంపెద నని తలంచిన; నెఱింగి శతధన్వుండు ప్రాణభయంబునఁ గృతవర్మ నింటికిం జని తనకు సహాయుండవు గమ్మని పలికినం గృతవర్మ యిట్లనియె.

10.2-86-ఉత్పలమాల

అక్కట! రామకృష్ణులు మహాత్ములు వారల కెగ్గు సేయఁగా

నిక్కడ నెవ్వఁ డోపు? విను మేర్పడఁ గంసుఁడు బంధుయుక్తుఁడై

చిక్కఁడె? మున్ను మాగధుఁడు సేనలతోఁ బదియేడు తోయముల్

దిక్కులఁ బాఱఁడే! మనకు దృష్టము, వారల లావు వింతయే?

10.2-87-వచనము

అని యుత్తరంబు సెప్పిన విని శతధన్వుం డక్రూరుని యింటికిం జని హరితోడ పగకుందోడు రమ్మని చీరిన నక్రూరుండు హరి బలపరాక్రమ ధైర్యస్థైర్యంబు లుగ్గడించి మఱియు నిట్లనియె.

10.2-88-సీస పద్యము

ఎవ్వఁడు విశ్వంబు నెల్ల సలీలుఁడై;
పుట్టించు రక్షించుఁ బొలియఁ జేయు,
నెవ్వనిచేష్టల నెఱుఁగరు బ్రహ్మాదు;
లెవ్వని మాయ మోహించు భువన,
మేడేండ్లపాపఁడై యే విభుఁ డొకచేత;
గో రక్షణమునకై కొండ నెత్తె,
నెవ్వఁడు కూటస్థుఁ డీశ్వరుఁ డద్భుత;
కర్ముఁ డనంతుండు కర్మసాక్షి,

10.2-88.1-తేటగీతి

యట్టి ఘనునకు శౌరికి ననవరతము
మ్రొక్కెదము గాక; విద్వేషమునకు నేము
వెఱతు మొల్లము నీ వొండు వెంటఁ బొమ్ము
చాలు పదివేలువచ్చె నీ సఖ్యమునను.

## 10.2-12- శతధన్వునిద్రుంచుట

10.2-89-వచనము

అని యిట్లక్రూరుం డుత్తరంబు పలికిన నమ్మహామణి యక్రూరుని యొద్ద నునిచి, వెఱచి శతధన్వుండు తురగారూఢుండై శతయోజన దూరంబు సనియె; గరుడ కేతనాలంకృతంబైన తేరెక్కి రామ కృష్ణులు వెనుచని; రంత నతండును మిథిలానగరంబుఁజేరి తత్సమీపంబు నందు.

10.2-90-చంపకమాల

తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై
పరువిడఁ బోకు పోకు మని పద్మదళాక్షుఁడు గూడఁ బాఱి భీ
కరగతి వాని మస్తకము ఖండితమై పడ ద్రేసెఁ జక్రముం
బరిహతదైత్యచక్రముఁ బ్రభాచయ మోదితదేవశక్రమున్.

10.2-91-వచనము

ఇట్లు హరి శతధన్వుని వధియించి వాని వస్త్రంబులందు మణి వెదకి లేకుండటఁ దెలిసి బలభద్రునికడకు వచ్చి “శతధన్వుం డూరక హతుం డయ్యె, మణి లే” దనిన బలభద్రుం డిట్లనియె.

10.2-92-సీస పద్యము

ఆ మణి శతధన్వుఁ డపహరించుట నిక్క;
మెవ్వరిచే దాఁప నిచ్చినాఁడొ?
వేగమె నీ వేఁగి వెదకుము పురిలోన;
వైదేహు దర్శింప వాంఛ గలదు,
పోయి వచ్చెద, నీవు పొమ్మని వీడ్కొని;
మెల్లన రాముండు మిథిలఁ జొచ్చి
పోయిన జనకుండు పొడగని హర్షించి;

యెంతయుఁ బ్రియముతో నెదురు వచ్చి

10.2-92.1-తేటగీతి

యర్ఘ్యపాద్యాది కృత్యంబు లాచరించి
యిచ్చగించిన వస్తువు లెల్ల నిచ్చి
యుండు మని భక్తి చేసిన నుండె ముసలి;
కువలయేశ్వర! మిథిలలోఁ గొన్ని యేండ్లు.

10.2-93-వచనము

అంత దుర్యోధనుండు మిథిలానగరంబునకుం జనుదెంచి జనకరాజుచేత సమ్మానితుండై.

## 10.2-13- దుర్యోధగదావిద్యాభ్యాసము

10.2-94-కంద పద్యము

చలమున గాంధారేయుఁడు
లలిత గదాయుద్ధగౌశలము నేర్చెఁ దగన్
హలిచే నాశ్రితనిర్జర
ఫలిచేఁ ద్రైలోక్యవీరభటగణబలిచేన్.

10.2-95-వచనము

అటఁ గృష్ణుండును ద్వారకానగరంబునకుం జని శతధన్వుని మరణంబును మణి లేకుండుటయును, సత్యభామకుం జెప్పి, సత్యభామాప్రియకరుండు గావున సత్రాజిత్తునకుఁ బరలోకక్రియలు సేయించె; నక్రూర కృతవర్మలు శతధన్వ మరణంబు విని వెఱచి ద్వారకానగరంబు వెడలి బహుయోజన దూరభూమికిం

జని; రక్రూరుండు లేమిం జేసి వానలు లేక మహోత్పాతంబులును, శరీర మానస తాపంబులును ద్వారకావాసులకు సంభవించిన నందుల వృద్ధజనులు బెగడి హరి కిట్లనిరి.

10.2-96-సీస పద్యము

కమలాక్ష! వినవయ్య! కాశీశుఁ డేలెడి;
 కుంభిని వానలు గురియకున్నఁ
గోరి శ్వఫల్కునిఁ గొనిపోయి యతనికిఁ;
 గాందిని యనియెడు కన్య నిచ్చి
కాశీవిభుండు సత్కారంబు సేసిన;
 వానలు గురిసె నా వసుధమీఁద;
నాతని పుత్త్రకుఁ డయిన యక్రూరుండు;
 నంతటివాఁడు, మహాతపస్వి

10.2-96.1-ఆటవెలది

మరలి వచ్చెనేని మాను నుత్పాతంబు
లెల్ల; వాన గురియు నీ స్థలమున;
దేవ! యతనిఁ దోడితెప్పింపు; మన్నింపు;
మానవులయుఁ బీడ మానవులకు.

10.2-97-వచనము

అని పలుకు పెద్దల పలుకు లాకర్ణించి దూతలం బంపి కృష్ణుం డక్రూరుని రావించి పూజించి ప్రియకథలు కొన్ని సెప్పి సకలలోకజ్ఞుండు గావున మృదుమధుర భాషణంబుల నతని కిట్లనియె.

10.2-98-సీస పద్యము

తా నేగుతఱి శతధన్వుండు మణిఁ దెచ్చి;
నీ యింటఁ బెట్టుట నిజము తెలిసి
నాఁడ, సత్రాజిత్తునకుఁ బుత్త్రకులు లేమి;
నతనికిఁ గార్యంబు లాచరించి
విత్తంబు ఋణమును విభజించుకొనియెద;
రతని పుత్త్రిక లెల్ల, నతఁడు పరుల
చేత దుర్మరణంబుఁ జెందినాఁ, డతనికై;
సత్కర్మములు మీఁద జరుపవలయు,

10.2-98.1-ఆటవెలది

మణి గ్రహింపు మీవ, మా యన్న నను నమ్మఁ
డెలమి బంధుజనుల కెల్లఁ జూపు
మయ్య! నీ గృహమున హాటక వేదికా
సహితమఖము లమరు సంతతమును.

10.2-99-వచనము

అని యిట్లు సామవచనంబులు హరి పలికిన నక్రూరుండు వస్త్రచ్ఛన్నంబైన మణిం దెచ్చి హరి కిచ్చిన.

10.2-100-ఉత్పలమాల

సంతసమంది బంధుజనసన్నిధికిన్ హరి దెచ్చి చూపె; న
శ్రాంతవిభాసమాన ఘృణిజాలపలాయిత భూనభోంతర
ధ్వాంతము, హేమభారచయవర్షణవిస్మిత దేవ మానవ

స్వాంతముఁ, గీర్తి పూరితదిశావలయాంతము నా శమంతమున్.

10.2-101-కంద పద్యము

చక్రాయుధుఁ డీ క్రియఁ దన
యక్రూరత్వంబు జనుల కందఱకును ని
ర్వక్రముగఁ దెలిపి క్రమ్మఱ
నక్రూరుని కిచ్చె మణిఁ గృపా కలితుండై.

10.2-102-కంద పద్యము

ఘనుఁడు భగవంతుఁ డీశ్వరుఁ
డనఘుఁడు మణి దెచ్చి యిచ్చినట్టి కథనమున్
వినినఁ బఠించినఁ దలఁచిన
జనులకు దుర్యశముఁ బాపసంఘముఁ దలఁగున్.

## 10.2-14- ఇంద్రప్రస్థంబున కరుగుట

10.2-103-వచనము

అంత నొక్కనాఁడు పాండవులం జూడ నిశ్చయించి సాత్యకి ప్రముఖ యాదవులు గొలువఁ బురుషోత్తముం డింద్రప్రస్థపురంబునకుం జనినం బ్రాణంబులంగనిన యింద్రియంబులభంగి వారఖిలేశ్వరుం డైన హరిం గని కౌఁగిలించుకొని; కృష్ణుని దివ్యదేహసంగమంబున నిర్ధూతకల్మషులై యనురాగహాసవిభాసితం బైన ముకుందము ఖారవిందంబు దర్శించి యానందంబు నొందిరి; గోవిందుండును యుధిష్ఠిర భీమసేనుల చరణంబులకు నభివందనంబులు సేసి యర్జును

నాలింగనంబున సత్కరించి, నకుల సహదేవులు మ్రొక్కిన గ్రుచ్చియెత్తి, యుత్తమ పీఠంబున నాసీనుండై యుండె; నప్పుడు.

10.2-104-కంద పద్యము

చంచద్ఘనకుచభారా
కుంచితయై క్రొత్త పెండ్లికూఁతు రగుట నిం
చించుక సిగ్గు జనింపఁగఁ
బాంచాలతనూజ మ్రొక్కెఁ బద్మాక్షునకున్.

10.2-105-వచనము

అంత సాత్యకి పాండువులచేతం బూజితుండై యొక్క పీఠంబున నాసీనుండై యుండెఁ; దక్కిన యనుచరులును వారిచేతఁ బూజితులై కొలిచి యుండిరి; హరియుం గుంతీదేవి కడకుం జని నమస్కరించి యిట్లనియె.

10.2-106-కంద పద్యము

అత్తా! కొడుకులుఁ గోడలుఁ
జిత్తానందముగఁ బనులు సేయఁగ నాత్మా
యత్తానుగవై యాజ్ఞా
సత్తాదులు గలిగి మనుదె సమ్మోదమునన్?

10.2-107-చంపకమాల

అనవుడుఁ బ్రేమ విహ్వలత నందుచు గద్గదభాషణంబులం
గనుఁగవ నశ్రుతోయములు గ్రమ్మఁగఁ గుంతి సుయోధనుండు సే
సిన యపచారముం దలఁచి చెందిన దుఃఖములెల్లఁ జెప్పి యా

దనుజవిరోధి కిట్లనియెఁ దద్దయుఁ బెద్దఱికంబు సేయుచున్.

10.2-108-సీస పద్యము

అన్న! నీ చుట్టాల నరయుదు! మఱవవు;
నీవు పుత్తెంచిన నెమ్మితోడ
మా యన్న యేతెంచి మముఁ జూచి పోయెను;
నిల్చి యున్నారము నీ బలమున;
నా పిన్నవాండ్రకు నాకు దిక్కెవ్వరు;
నేఁ డాదిగా నింక నీవె కాక?
యఖిల జంతువుల కీ వాత్మవు గావునఁ;
బరులు నా వారని బ్రాంతి సేయ;

10.2-108.1-తేటగీతి

వయ్య! నా భాగ్యమెట్టిదో? యనవరతముఁ
జిత్తమున నుండి కరుణ మా చిక్కులెల్లఁ
వాపుచుందువు గాదె! యో! పరమపుణ్య!
యదుకుమారవరేణ్య! బుధాగ్రగణ్య! .

10.2-109-వచనము

అనిన యుధిష్ఠిరుం డిట్లనియె.

10.2-110-మత్తేభ విక్రీడితము

పట్టఁగ లేరు నిన్నుఁ దమభావము లందు సనందనాదు లే
పట్టునసైన, నట్టి గుణభద్రచరిత్రుఁడ వీవు, నేఁడు మా

చుట్టము వంచు వచ్చెదవు; చూచెద వల్పులమైన మమ్ము; నే
మెట్టి తపంబు చేసితి మధీశ్వర! పూర్వశరీర వేళలన్?

10.2-111-వచనము

అని ధర్మజుండు దన్నుఁ బ్రార్థించిన నింద్రప్రస్థపురంబు వారలకు
నయనానందంబు సేయుచు హరి గొన్ని నెలలు వసియించి యుండె;
నందొక్కనాఁడు.

## 10.2-15- అర్జునితోమృగయావినోదంబు

10.2-112-మత్తేభ విక్రీడితము

తురగశ్రేష్ఠము నెక్కి కంకటధనుస్తూణీశరోపేతుఁడై
హరితోడన్ వనభూమి కేగి విజయుం డాసక్తుఁడై చంపె శం
బర శార్దూల తరక్షు శల్య చమరీ భల్లూక గంధర్వ కా
సర కంఠీరవ ఖడ్గ కోల హరిణీ సారంగ ముఖ్యంబులన్.

10.2-113-కంద పద్యము

అచ్చోటఁ బవిత్రములై
చచ్చిన మృగరాజి నెల్ల జననాథునకుం
దెచ్చి యొసంగిరి మెచ్చఁగఁ
జెచ్చెర నరుఁ గొల్చి యున్న సేవకు లధిపా!

10.2-114-వచనము

అంత నర్జునుండు నీరుపట్టున డస్సిన, యమునకుం జని, య మ్మహారథులైన
నరనరాయణు లందు వార్చి జలంబులు ద్రావి, యొక పులినప్రదేశంబున నుండి.

10.2-115-ఉత్పలమాల

ఉపగతు లైన యట్టి పురుషోత్తమ పార్థులు గాంచి రాపగా
విపుల విలోల నీలతర వీచికలందు శిరోజభార రు
చ్యపహసితాళిమాలిక నుదంచిత బాల శశిప్రభాలికం
దపనుని బాలికన్ మదనదర్పణతుల్య కపోలపాలికన్.

10.2-116-వచనము

కని యచ్యుతుండు పంచిన విచ్చ్యుండు సని యా కన్య కిట్లనియె.

10.2-117-మత్తేభ విక్రీడితము

సుదతీ! యెవ్వరి దాన? వేమికొఱ కిచ్చోటం బ్రవర్తించె? దె
య్యది నీ నామము? కోర్కి యెట్టిది? వివాహాకాంక్షతోఁగూడి యీ
నదికిన్ వచ్చినజాడ గానఁబడె? ధన్యంబయ్యె నీ రాక, నీ
యుదయాదిస్థితి నెల్లఁ జెప్పు మబలా! యుద్యత్కురంగేక్షణా!

10.2-118-వచనము

అనిన నర్జుననకుఁ గాళింది యిట్లనియె.

10.2-119-మత్తేభ విక్రీడితము

నరవీరోత్తమ! యేను సూర్యుని సుతన్; నాపేరు కాళింది; భా
స్కర సంకల్పితగేహమందు నదిలోఁ గంజాక్షు విష్ణుం బ్రభున్
వరుగాఁ గోరి తపంబుసేయుదు; నొరున్ వాంఛింపఁ; గృష్ణుండు వ
న్యరతిన్ వచ్చి వరించునంచుఁ బలికెన్ నా తండ్రి నాతోడుతన్.

10.2-120-వచనము

అనిన విని ధనంజయుఁ డా నీలవేణి పలుకులు హరికిం జెప్పిన విని సర్వజ్ఞుండైన హరియు హరిమధ్యను రథంబుమీఁద నిడుకొని ధర్మరాజు కడకుం జని వారలు గోరిన విశ్వకర్మను రావించి వారి పురం బతివిచిత్రంబు సేయించె.

10.2-121-కంద పద్యము

దేవేంద్రుని ఖాండవ మ
ప్పావకునకు నీఁ దలంచి పార్థుని రథికుం
గావించి సూతుఁ డయ్యెను
గోవిందుఁడు మఱఁదితోడఁ గూరిమి వెలయన్.

10.2-122-వచనము

ఇట్లు నర నారాయణులు సహాయులుగా దహనుండు ఖాండవవనంబు దహించిన సంతసించి విజయునకు నక్షయ తూణీరంబులు, నభేద్యకవచంబును, గాండీవమనియెడి బాణాసనంబును దివ్యరథంబును ధవళరథ్యంబులను నిచ్చె నందు.

10.2-123-ఉత్పలమాల

వాసవసూనుచేఁ దనకు వహ్ని శిఖాజనితోగ్రవేదనల్
పాసినఁ జేసి యొక్క సభ పార్థున కిచ్చె మయుండు ప్రీతుఁడై
యా సభలోనఁ గాదె గమనాగమనంబులఁ గౌరవేంద్రుఁ డు
ల్లాసముఁ బాసి యుండుట జలస్థలనిర్ణయ బుద్ధి హీనుఁడై.

## 10.2-16- కాళింది మిత్రవిందల పెండ్లి

10.2-124-వచనము

అంతం గృష్ణుండు ధర్మరాజప్రముఖుల వీడుకొని, సాత్యకిప్రముఖ సహచరులు గొలువ, మరలి తనపురంబునకుం జని బంధుజనంబులకుఁ బరమానందంబు సేయుచు నొక్క పుణ్య దివసంబున శుభలగ్నంబునం గాళిందిం బెండ్లి యయ్యె; మఱియు నవంతి దేశాధీశ్వరులయిన విందానువిందులు దుర్యోధనునకు వశులై హరికి మేనత్తయైన రాజాధిదేవి కూఁతురైన తమ చెలియలిని వివాహంబు సేయనుద్యోగించి స్వయంవరంబుఁ జాటించిన.

10.2-125-కంద పద్యము

భూ రమణులు సూడఁగ హరి
వీరతఁ జేకొనియె మిత్రవిందను నిత్యా
పూరిత సుజనానందం
జారు చికురకాంతి విజిత షట్పదబృందన్.

## 10.2-17- నాగ్నజితి పరిణయంబు

10.2-126-సీస పద్యము

జననాథ! వినుము కోసలదేశ మేలెడి;
నగ్నజిత్తను నరనాథుఁ డొకడు
సుమతి ధార్మికుఁడు దత్సూత నాగ్నజితి యను;
కన్యక గుణవతి గలదు దానిఁ
బెండ్లియాడుటకునై పృథివీశు లేతెంచి;
వాఁడికొమ్ములు గల వాని, వీర
గంధంబు సోఁకినఁ గాలు ద్రవ్వెడివాని, ;
నతిమదమత్తంబు లయిన వాని

10.2-126.1-తేటగీతి

గోవృషంబుల నేడింటిఁ గూర్చి తిగిచి
బాహుబలమున నెవ్వఁడు పట్టి కట్టు
నతఁడు కన్యకుఁ దగు వరుం డనిన వానిఁ
బట్టఁజాలక పోదురు ప్రజలు బెగడి.

10.2-127-వచనము

ఇట్లు గోవృషంబుల జయించినవాఁడ కన్యకు వరుండనిన భగవంతుండైన హరి విని సేనాపరివృతుండై కోసలపురంబునకుం జనినం గోసలాధీశ్వరుండును హరి నెదుర్కొని యర్ఘ్యపాద్యాది విధులం బూజించి పీఠంబు సమర్పించి ప్రతివందితుండై యున్న యెడ.

10.2-128-కంద పద్యము

ఆ రాజకన్య ప్రియమున
నా రాజీవాక్షు మోహనాకారుఁ ద్రిలో
కారాధితు మాధవుఁ దన
కారాధ్యుండైన నాథుఁ డని కోరె నృపా!

10.2-129-వచనము

మఱియు న క్కన్యకారత్నంబు తన మనంబున.

10.2-130-ఆటవెలది

విష్ణుఁ డవ్యయుండు విభుఁడు గావలె నని
నోఁచినట్టి తొంటి నోముఫలము

సిద్ధ మయ్యెనేనిఁ జేకొనుఁ టో నన్నుఁ
జక్రధరుఁడు వైరిచక్రహరుఁడు.

10.2-131-మత్తేభ విక్రీడితము

సిరియుం బద్మభవేశ దిక్పతులు మున్ సేవించి యెవ్వాని శ్రీ
చరణాంభోజపరాగముల్ శిరములన్ సమ్యగ్గతిం దాల్తుఁ; రీ
ధరణీచక్రభరంబు వాపుటకు నుద్యత్కేళిమూర్తుల్ దయా
పరుఁడై యెవ్వఁడు దాల్చు నట్టి హరి యెబ్భంగిం బ్రవర్తించునో!

10.2-132-వచనము

అని యిట్లు నాగ్నజితి విచారించు నెడఁ గృష్ణుం డా రాజుం జూచి మేఘగంభీర నినదంబున నిట్లనియె.

10.2-133-కంద పద్యము

అన్యుల యాచింపరు రా
జన్యులు సౌజన్యకాంక్షఁ జనుదెంచితి నీ
కన్యన్ వేఁడెద నిమ్మా!
కన్యాశుల్కదుల మేము గాము నరేంద్రా!

10.2-134-వచనము

అనిన రాజిట్లనియె.

10.2-135-శార్దూల విక్రీడితము

కన్యం జేకొన నిన్నిలోకముల నీ కన్నన్ ఘనుండైన రా
జన్యుం డెవ్వఁడు? నీ గుణంబులకు నాశ్చర్యంబునుం బొంది తా

నన్యారంభము మాని లక్ష్మి భవదీయాంగంబునన్ నిత్యయై
ధన్యత్వంబునుఁ జెంది యున్నది గదా తాత్పర్యసంయుక్తయై.

10.2-136-శార్దూల విక్రీడితము

చంచద్గోవృషసప్తకంబుఁ గడిమిన్ సైరించి యెవ్వాఁడు భం
జించున్ వానికిఁ గూఁతు నిత్తు నని యేఁ జీరించినన్ వైభవో
దంచద్గర్వులు వచ్చి రాజతనయుల్ తత్పాద శృంగాహతిం
గించిత్కాలము నోర్వ కేగుదు రనిం గేడించి భిన్నాంగులై.

10.2-137-శార్దూల విక్రీడితము

ఉష్ణాంశుండు తమంబుఁ దోలు క్రియ నీ వుగ్రాహవక్షోణిలోఁ
గృష్ణా! వైరులఁ దోలినాఁడవు, రణక్రీడావిశేషంబులన్
నిష్ణాతుండవు, సప్తగోవృషములన్ నేఁ డాజి భంజించి రో
చిష్ణుత్వంబున వచ్చి చేకొనుము మా శీతాంశుబింబాననన్.

10.2-138-వచనము

అని నగ్నజిత్తు తన కూఁతు వివాహంబునకుం జేసిన సమ యంబు సెప్పిన విని.

10.2-139-చంపకమాల

కనియె నఘారివత్సబకకంసవిదారి ఖలప్రహారి దా
ఘనతర కిల్బిషంబుల నగణ్య భయంకర పౌరుషంబులన్
సునిశిత శృంగ నిర్దళితశూరసమూహ ముఖామిషంబులన్
హనన గుణోన్మిషంబుల మహా పరుషంబుల గోవృషంబులన్.

10.2-140-ఉత్పలమాల

చేలము చక్కఁ గట్టుకొని చిత్రగతిన్ వడి నేడు మూర్తులై
బాలుఁడు దారురూపములఁ బట్టెడు కైవడిఁ బట్టి వీర శా
ర్దూలుఁడు గ్రుద్ది నేలఁ బడఁ ద్రోచి మహోద్ధతిఁ గట్టి యీడ్చె భూ
పాలకులెల్ల మెచ్చ వృషభంబులఁ బర్వత సన్నిభంబులన్.

10.2-141-వచనము

ఇట్లు వృషభంబుల నన్నింటినిం గట్టి యీడ్చినం జూచి హరికి నగ్నజిత్తు నాగ్నజితి నిచ్చిన విధివత్ప్రకారంబునం బెండ్లి యయ్యె; నా రాజసుందరు లానందంబును బొంది; రా సమయంబున బ్రాహ్మణాశీర్వాదంబులును, గీత పటహ శంఖ కాహళ భేరీ మృదంగ నినదంబులును జెలంగె; నంతనా కోసలేంద్రుండు దంపతుల రథారోహణంబు సేయించి పదివేల ధేనువులును, విచిత్రాంబరాభరణ భూషితలైన యువతులు మూఁడువేలును, దొమ్మిదివేల గజంబులును, గజంబులకు శతగుణంబులైన రథంబులును, రథంబులకు శతగుణంబులైన హయంబులును, హయంబులకు శతగుణాధికంబైన భట సమూహంబును నిచ్చి పుత్తెంచిన; వచ్చునప్పుడు.

10.2-142-ఉత్పలమాల

భూతి యెలర్పఁ గోసలుని పుత్త్రికకై చనుదెంచి తొల్లి యాఁ
బోతులచేత నోటువడి పోయిన భూపతులెల్ల మాధువుం
డా తరుణిన్ వరించుట చరావలిచే విని త్రోవ సైన్య సం
ఘాతముతోడఁ దాఁకి రరిగర్వవిమోచనుఁ బద్మలోచనున్.

10.2-143-ఉత్పలమాల

దండి నరాతు లెల్ల హరిఁ దాఁకిన నడ్డము వచ్చి వీఁకతో

భండన భూమియందుఁ దన బాంధవులెల్లను సన్నుతింపఁగా
గాండివచాపముక్త విశిఖంబుల వైరుల నెల్లఁ జంపె నా
ఖండలనందనుండు శశకంబుల సింహము చంపుకైవడిన్.

10.2-144-వచనము

ఇట్లు హరి నాగ్నజితిం బెండ్లియై, యరణంబులు పుచ్చుకొని, ద్వారకానగరంబునకు వచ్చి సత్యభామతోడం గ్రీడించుచుండె; మఱియును.

## 10.2-18- భద్ర లక్షణల పరిణయంబు

10.2-145-మత్తేభ విక్రీడితము

జనవంద్యన్ శ్రుతకీర్తినంద్యఁ దరుణిన్ సందర్శనక్షోణి పా
ద్యనుజన్ మేనమఱందలిన్ విమలలోలాపాంగఁ గైకేయి ని
ద్ధనయోన్నిద్రఁ బ్రపూర్ణసద్గుణసముద్రన్ భద్ర నక్షుద్ర నా
వనజాతాక్షుఁడు పెండ్లియాడె నహితవ్రాతంబు భీతిల్లఁగన్.

10.2-146-వచనము

మఱియును.

10.2-147-చంపకమాల

అమరులఁ బాఱఁదోలి భుజ గాంతకుఁడైన ఖగేశ్వరుండు ము
న్నమృతముఁ దెచ్చుకైవడి మదాంధుల రాజుల నుక్కడంచి యా
కమలదళాయతేక్షణుఁడు గైకొని తెచ్చెను మద్రకన్యకన్
సమదమృగేక్షణన్ నయవిచక్షణ లక్షణఁ బుణ్యలక్షణన్.

10.2-148-వచనము

ఇట్లు హరికి రుక్మిణియు, జాంబవతియు, సత్యభామయుఁ, గాళిందియు, మిత్రవిందయు, నాగ్నజితియు, భద్రయు, మద్ర రాజనందనయైన లక్షణయు ననంగ నెనమండ్రు భార్య లైరి; మఱియు నరకాసురుని వధియించి తన్నిరుద్ధకన్యల షోడశసహస్ర కన్యల రోహిణి మొదలైనవారిం బరిగ్రహించె" నన విని.

10.2-149-కంద పద్యము

ధరకుం బ్రియనందనుఁ డగు
నరకుని హరి యేల చంపె? నరకాసురుఁ డా
వరకుంతల లగు చామీ
కర కుంభస్తనుల నేల కారం బెట్టెన్?

## 10.2-19- నరకాసురవధకేగుట

10.2-150-వచనము

అనిన నరేంద్రునకు మునీంద్రుం డిట్లనియె; నరకాసురునిచేత నదితి కర్ణకుండలంబులును, వరుణచ్ఛత్రంబును, మణిపర్వత మనియెడు నమరాద్రి స్థానంబును గోలుపడుటయు నింద్రుండు వచ్చి హరికి విన్నవించిన హరి నరకాసుర వధార్థంబు గరుడవాహనారూఢుండై చను సమయంబున హరికి సత్యభామ యిట్లనియె.

10.2-151-శార్దూల విక్రీడితము

దేవా! నీవు నిశాటసంఘముల నుద్దీపించి చెండాడ నీ

ప్రావీణ్యంబులు సూడఁ గోరుదుఁ గదా! ప్రాణేశ! మన్నించి న
న్నీ వెంటం గొనిపొమ్ము నేఁడు కరుణన్; నేఁ జూచి యేతెంచి నీ
దేవీ సంహతికెల్లఁ జెప్పుదు భవద్దీప్తప్రతాపోన్నతుల్,

10.2-152-వచనము

అనినఁ బ్రాణవల్లభకు వల్లభుం డిట్లనియె.

10.2-153-సీస పద్యము

సమద పుష్పంధయ ఝుంకారములు గావు;
భీషణకుంభీంద్ర బృంహితములు
వాయునిర్గత పద్మవనరేణువులు గావు;
తురగ రింఖాముఖోద్ధూతరజము
లాకీర్ణజలతరం గాసారములు గావు;
శత్రుధనుర్ముక్త సాయకములు
గలహంస సారస కాసారములు గావు;
దనుజేంద్రసైన్య కదంబకములు

10.2-153.1-తేటగీతి

కమల కహ్లార కుసుమ సంఘములు గావు;
చటుల రిపు శూల ఖడ్గాది సాధనములు
కన్య! నీ వేడ? రణరంగ గమన మేడ?
వత్తు వేగమ; నిలువుము; వలదు వలదు.

10.2-154-వచనము

అనినఁ బ్రియునకుం బ్రియంబు జనియింప డగ్గఱి.

10.2-155-ఉత్పలమాల

దానవులైన నేమి? మఱి దైత్యసమూహములైన నేమి? నీ
మానితబాహు దుర్గముల మాటున నుండగఁ నేమి శంక? నీ
తో నరుదెంతు నంచుఁ గరతోయజముల్ ముకుళించి మ్రొక్కె న
మ్మానిని దన్ను భర్త బహుమాన పురస్సరదృష్టిఁ జూడఁగన్.

10.2-156-వచనము

ఇట్లు తనకు మ్రొక్కిన సత్యభామను గరకమలంబులఁగ్రుచ్చి యెత్తి తోడ్కొని గరుడారూఢుండై హరి గగన మార్గంబునం జని, గిరి శస్త్ర సలిల దహన పవన దుర్గమంబై మురాసురపాశ పరివృతం బయిన ప్రాగ్జ్యోతిషపురంబు డగ్గఱి.

10.2-157-మత్తేభ విక్రీడితము

గదచేఁ బర్వతదుర్గముల్ శకలముల్ గావించి సత్తేజిత
ప్రదరశ్రేణుల శస్త్రదుర్గచయమున్ భంజించి చక్రాహతిం
జెదరన్ వాయుజలాగ్ని దుర్గముల నిశ్శేషంబులం జేసి ధీ
ప్రదుఁడై వాలునఁ ద్రుంచెఁ గృష్ణుఁడు మురప్రచ్ఛన్న పాశంబులన్.

10.2-158-వచనము

మఱియును.

10.2-159-శార్దూల విక్రీడితము

ప్రాకారంబు గదా ప్రహారముల నుత్పాటించి యంత్రంబులున్
నాకారాతుల మానసంబులును భిన్నత్వంబు సెందంగ న

స్తో కాకారుఁడు శౌరి యొత్తె విలయోద్ధూతాభ్ర నిర్ఘాత రే
ఖాకారిన్యముఁ బాంచజన్యము విముక్తప్రాణి చైతన్యమున్.

10.2-160-వచనము

అంత లయకాల కాలాభ్రగర్జనంబు పగిది నొప్పు నమ్మహా ధ్వని విని పంచశిరుం డైన మురాసురుండు నిదుర సాలించి యావులించి నీల్గి లేచి జలంబులు వెడలివచ్చి హరిం గని ప్రళయకాల కీలికైవడి మండుచు దుర్నిరీక్ష్యుండై కరాళించుచుం దన పంచముఖంబులం పంచభూతమయం బయిన లోకంబుల మ్రింగ నప్పళించు చందంబునం గదిసి యాభీల కీలాజటాలంబగు శూలంబున గరుడుని పైచి భూనభోంతరంబులు నిండ నార్చుచు.

10.2-161-కంద పద్యము

దురదురఁ బరువిడి బిరుసున
హరి హరి! నిలు నిలువు మనుచు నసురయుఁ గదిసెన్
మురమురఁ! దివిజుల హృదయము
మెరమెర యిదె యడఁగు ననుచు మెఱసెన్ హరియున్.

10.2-162-వచనము

అప్పుడు.

10.2-163-కంద పద్యము

గరుడునిపైఁ బడ వచ్చిన
మురశూలము నడుమ నొడిసి ముత్తునియలుగాఁ
గరముల విఱిచి ముకుందుఁడు

మురముఖముల నిశితవిశిఖములు వడిఁ జొనిపెన్.

10.2-164-మత్తేభ విక్రీడితము

గద వ్రేసెన్ మురదానవుండు హరిపైఁ; గంసారియుం దద్గదన్
గదచేఁ ద్రుంచి సహస్రభాగములుగాఁ గల్పించె; నాలోన వాఁ
డెదురై హస్తము లెత్తికొంచు వడి రా నీక్షించి లీలాసమ
గ్రదశన్ వాని శిరంబులైదును వడిన్ ఖండించెఁ జక్రాహతిన్.

10.2-165-వచనము

ఇట్లు శిరంబులు చక్రిచక్రధారాచ్ఛిన్నంబు లయిన వజ్రివజ్రధారా దళితశిఖరంబై కూలెడి శిఖరిచందంబున మురాసురుండు జలంబులందుఁ గూలిన, వాని సూనులు జనకవధజనిత శోకాతురులై జనార్దను మర్దింతు మని రణకుర్దనంబునం దామ్రుండు, నంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, నరుణుండు నననేడ్వురు యోధులు సక్రోధులై కాలాంతకచోదితం బైన ప్రళయపవన సప్తకంబు భంగి నరకాసుర ప్రేరితులై రయంబునఁ బీఠుండనియెడు దండనాథుం బురస్కరించుకొని, పఱతెంచి హరిం దాఁకి శర శక్తి గదా ఖడ్గ కరవాల శూలాది సాధనంబులు ప్రయోగించిన.

10.2-166-ఉత్పలమాల

ఆ దనుజేంద్రయోధ వివిధాయుధసంఘము నెల్ల నుగ్రతన్
మేదినిఁ గూలనేయుచు సమిద్ధనిరర్గళ మార్గణాళిఁ గ్ర
వ్యాదకులాంతకుండసుర హస్త భుజానన కంఠ జాను జం
ఘాదులఁ ద్రుంచివైచెఁ దిలలంతలు ఖండములై యిలం బడన్.

10.2-167-వచనము

మఱియు హరి శరజాలచక్రనిహతులయి తనవారలు మడియుటకు వెఱంగుపడి రోషించి గరుడగమనుని దూషించి తన్ను భూషించుకొని సరకు సేయక నరకుండు వరకుండలప్రముఖాభరణభూషితుండయి దానసలిలధారాసిక్త గండంబులును, మహోద్దండశుండాదండంబులు నైన వేదండంబులు తండంబులై నడువ వెడలి భండనంబునకుం జని.

10.2-168-మత్తేభ విక్రీడితము

బలవంతుండు ధరాసుతుండు గనె శుంభద్రాజ బింబోపరి
స్థల శంపాన్వితమేఘమో యన ఖగేంద్రస్కంధపీఠంబుపై
లలనారత్నముఁ గూడి సంగరకథాలాపంబులం జేయు ను
జ్జ్వలనీలాంగుఁ గనన్నిషంగుఁ గుహనాచంగున్ రణాభంగునిన్.

10.2-169-వచనము

కని కలహంబునకు నరకాసురుండు గమకింపం దమకింపక విలోకించి సంభ్రమంబున.

## 10.2-20- సత్యభామ యుద్ధంబు

10.2-170-శార్దూల విక్రీడితము

వేణిం జొల్లెము పెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండల మరీచీజాలముల్ పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కగాఁ దుఱిమి శుంభద్వీరసంరంభయై
యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్ర భాగంబునన్.

10.2-171-కంద పద్యము

జన్యంబున దనుజుల దౌ
ర్జన్యము లుడుపంగఁ గోరి చనుదెంచిన సౌ
జన్యవతిఁ జూచి యదురా
జన్యశ్రేష్ఠుండు సరససల్లాపములన్.

10.2-172-కంద పద్యము

లేమా! దనుజుల గెలువఁగ
లేమా? నీ వేల కడఁగి లేచితి? విటు రా
లే మాను మాన వేనిన్
లే మా విల్లందికొనుము లీలం గేలన్.

10.2-173-వచనము

అని పలికి.

10.2-174-కంద పద్యము

హరిణాక్షికి హరి యిచ్చెను
సురనికరోల్లాసనమును శూరకరోరా
సురసైన్యత్రాసనమును
బరగర్వనిరాసనమును బాణాసనమున్.

10.2-175-శార్దూల విక్రీడితము

ఆ విల్లంది బలంబు నొంది తదగణ్యానంత తేజోవిశే
షావిర్భూత మహాప్రతాపమున వీరాలోక దుర్లోకయై

తా వేగన్ సగుణంబుఁ జేసె ధనువుం దన్వంగి దైత్యాంగనా
గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణక్రీడా మహోత్కంఠతోన్.

10.2-176-కంద పద్యము

నారి మొరయించె రిపు సే
నా రింఖణ హేతువైన నాదము నిగుడన్
నారీమణి బలసంప
న్నారీభాదికము మూర్ఛనంద నరేంద్రా!

10.2-177-సీస పద్యము

సౌవర్ణ కంకణ ఝణఝణ నినదంబు;
 శింజినీరవముతోఁ జెలిమి సేయఁ
దాటంక మణిగణ ధగధగ దీప్తులు;
 గండమండలరుచిఁ గప్పికొనఁగ
ధవళతరాపాంగ ధళధళ రోచులు;
 బాణజాలప్రభాపటలి నడఁప
శరపాత ఘుమఘుమశబ్దంబు పరిపంథి;
 సైనిక కలకల స్వనము నుడుప

10.2-177.1-తేటగీతి

వీర శృంగార భయ రౌద్ర విస్మయములు
గలసి భామిని యయ్యెనో కాక యనఁగ
నిషువుఁ దొడుగుట దివుచుట యేయుటెల్ల
నెఱుఁగరా కుండ నని సేసె నిందువదన.

10.2-178-మత్తేభ విక్రీడితము

పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్, రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగం; గన్నులఁ గెంపు సొంపుఁ బరఁగం జండాస్త్రసందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచుం, జంద్రాస్య హేలాగతిన్.

10.2-179-మత్తేభ విక్రీడితము

అలినీలాలక చూడ నొప్పెసఁగెఁ బ్రత్యాలీఢ పాదంబుతో
నలికస్వేద వికీర్ణకాలకలతో నాకర్ణికానీత స
ల్లలితజ్యానఖపుంఖ దీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకార ధనుర్విముక్త విశిఖవ్రాతాహతారాతియై.

10.2-180-సీస పద్యము

బొమ్మ పెండిండ్లకుఁ బోనొల్ల నను బాల;
రణరంగమున కెట్లు రాఁ దలంచె?
మగవారిఁ గనినఁ దా మఱుఁగు జేరెడు నింతి;
పగవారి గెల్వనే పగిదిఁ జూచెఁ?
బసిఁడియుయ్యెల లెక్క భయ మందు భీరువు;
ఖగపతి స్కంధమే కడఁది నెక్కె?
సఖుల కోలాహల స్వనము లోర్వని కన్య;
పటహభాంకృతుల కెట్ళంగి నోర్చె?

10.2-180.1-ఆటవెలది

నీలకంఠములకు నృత్యంబుఁ గఱపుచుఁ

నలసి తలఁగిపోవు నలరుఁబోఁడి
యే విధమున నుండె నెలమి నాలీఢాది
మానములను రిపులమాన మడఁప?

10.2-181-సీస పద్యము

వీణెఁ జక్కఁగఁ బట్ట వెర వెఱుంగని కొమ్మ;
బాణాసనం బెట్లు పట్ట నేర్చె?
మ్రాఁకునఁ దీగెఁ గూర్పంగ నేరని లేమ;
గుణము నే క్రియ ధనుఃకోటిఁ గూర్చె?
సరవి ముత్యము గ్రువ్వఁ జాలని యబల యే;
నిపుణత సంధించె నిశితశరముఁ?
జిలుకకుఁ బద్యంబు సెప్ప నేరని తన్వి;
యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ?

10.2-181.1-ఆటవెలది

బలుకు మనినఁ బెక్కు పలుకని ముగుద యే
గతి నొనర్చె సింహగర్జనములు?
ననఁగ మెఱసెఁ ద్రిజగదభిరామ గుణధామ
చారుసత్యభామ సత్యభామ.

10.2-182-శార్దూల విక్రీడితము

జ్యావల్లీధ్వని గర్జనంబుగ; సురల్ సారంగయూథంబుగా;
నా విల్లింద్రశరాసనంబుగ; సరోజాక్షుండు మేఘంబుగాఁ;
దా విద్యుల్లతభంగి నింతి సురజిద్దావాగ్ని మగ్నంబుగాఁ

బ్రావృట్కాలము సేసె బాణచయ మంభశ్శీకరశ్రేణిగాన్.

10.2-183-సీస పద్యము

రాకేందుబింబమై రవిబింబమై యొప్పు;
నీరజాతేక్షణ నెమ్మొగంబు;
కందర్పకేతువై ఘన ధూమకేతువై;
యలరుఁ బూఁబోఁడి చేలాంచలంబు;
భావజు పరిధియై ప్రళయార్క పరిధియై;
మెఱయు నాకృష్టమై మెలఁత చాప;
మమృత ప్రవాహమై యనల సందోహమై;
తనరారు నింతిసందర్శనంబు;

10.2-183.1-తేటగీతి

హర్షదాయియై మహారోషదాయియై
పరఁగు ముద్దరాలి బాణవృష్టి;
హరికి నరికిఁ జూడ నందంద శృంగార
వీరరసము లోలి విస్తరిల్ల.

10.2-184-వచనము

ఇవ్విధంబున.

10.2-185-కంద పద్యము

శంపాలతాభ బెడిదపు
టంపఱచే ఘోరదానవానీకంబుల్

పెంపఱి సన్నాహంబుల
సొంపఱి భూసుతుని వెనుకఁ జొచ్చెన్ విచ్చెన్.

## 10.2-21- నరకాసురుని వధించుట

10.2-186-వచనము

అయ్యవసరంబునం గంససంహారి మనోహారిణిం జూచి సంతోషకారియుం, గరుణారసావలోకన ప్రసారియు, మధురవచన సుధారస విసారియుం, దదీయ సమరసన్నాహ నివారియునై యిట్లనియె.

10.2-187-కంద పద్యము

కొమ్మా! దానవ నాథుని
కొమ్మాహవమునకుఁ దొలఁగె గురువిజయముఁ గై
కొమ్మా! మెచ్చితి నిచ్చెదఁ
గొమ్మాభరణములు నీవు గోరిన వెల్లన్.

10.2-188-వచనము

అని పలికి సమ్మానరూపంబులును, మోహనదీపంబులును, దూరీకృత చిత్తవిక్షేపంబులునైన సల్లాపంబులం గళావతిం దద్దయుఁ బెద్దఱికంబు సేసి, తత్కరకిసలయోల్లసిత బాణాసనంబు మరల నందుకొనియె; నప్పుడు సురవైరి మురవైరి కిట్లనియె.

10.2-189-కంద పద్యము

మగువ మగవారి ముందఱ
మగతనములు సూప రణము మానుట నీకున్

మగతనము గాదు; దనుజులు

మగువల దెసఁ జనరు మగలమగ లగుట హరీ!

10.2-190-వచనము

అనిన హరి యిట్లనియె.

10.2-191-కంద పద్యము

నరకా! ఖండించెద మ

త్కరకాండాసనవిముక్త ఘనశరముల భీ

కరకాయు నిన్ను సుర కి

న్నరకాంతలు సూచి నేఁడు నందం బొందన్.

10.2-192-వచనము

అని పలికి హరి నరకాసురయోధులమీఁద శతఘ్ని యను దివ్యాస్త్రంబు ప్రయోగించిన నొక్క వరుసను వారలందఱు మహావ్యథం జెందిరి; మఱియును.

10.2-193-మత్తేభ విక్రీడితము

శర విచ్ఛిన్న తురంగమై పటుగదాసంభిన్న మాతంగమై,

యురుచక్రాహత వీరమధ్యపద బాహుస్కంధ ముఖ్యాంగమై,

సురభిత్సైన్యము దైన్యముం బొరయుచున్ శోషించి హైన్యంబుతో

హరి మ్రోలన్ నిలువంగ లేక పఱచెన్ హాహానినాదంబులన్.

10.2-194-వచనము

అప్పుడు.

10.2-195-ఆటవెలది

మొనసి దనుజయోధముఖ్యులు నిగుడించు
శస్త్రసముదయముల జనవరేణ్య!
మురహరుండు వరుస మూఁడేసి కోలలం
ఖండితంబు సేసె గగన మందు.

10.2-196-కంద పద్యము

వెన్నుని సత్యను మోచుచుఁ
బన్నుగఁ బద నఖర చంచు పక్షాహతులన్
భిన్నములు సేసె గరుడుఁడు
పన్నిన గజసముదయములఁ బౌరవముఖ్యా!

10.2-197-వచనము

మఱియును విహగరాజపక్షవిక్షేపణసంజాతవాతంబు సైరింపం జాలక హతశేషంబైన సైన్యంబు పురంబు సొచ్చుటం జూచి, నరకాసురుండు మున్ను వజ్రాయుధంబుం దిరస్కరించిన తనచేతి శక్తిం గొని గరుడుని పైచె; నతండును విరులదండ వ్రేటునఁ జలింపని మదోద్దండ వేదండంబునుంబోలె విలసిల్లె; నయ్యవసరంబున గజారూఢుండై కలహరంగంబున

10.2-198-మత్తేభ విక్రీడితము

సమదేభేంద్రము నెక్కి భూమిసుతుఁ డా చక్రాయుధున్ పైవ శూ
లము చేఁబట్టిన, నంతలోన రుచిమాలాభిన్న ఘోరాసురో
త్తమ చక్రంబగు చేతిచక్రమున దైత్యధ్వంసి ఖండించె ర
త్నమయోదగ్ర వినూత్నకుండల సమేతంబైన తన్మూర్ధమున్.

10.2-199-శార్దూల విక్రీడితము

ఇల్లాలం గిటియైన కాలమున మున్నే నంచు ఘోషింతు వో!
తల్లీ! నిన్నుఁ దలంచి యైన నిచటం దన్నుం గృపం గావఁడే!
చెల్లంబో! తలఁ ద్రుంచె నంచు నిల నాక్షేపించు చందంబునన్
ద్రెళ్లెం జప్పుడు గాఁగ భూమిసుతుఁ డుద్దీప్తాహవక్షోణిపై.

10.2-200-కంద పద్యము

కంటిమి నరకుడు వడఁగా
మంటిమి నేఁ డనుచు వెస నమర్త్యులు మునులున్
మింటం బువ్వులు గురియుచుఁ
బంటింపక పొగడి రొలిఁ బద్మదళాక్షున్.

10.2-201-వచనము

అంత భూదేవి వాసుదేవుని డగ్గఱ నేతెంచి జాంబూనదరత్న మండితంబైన కుండలంబులును, వైజయంతియను వనమాలయును, వరుణదత్తంబయిన సితచ్ఛత్త్రంబును, నొక్క మహారత్నంబును సమర్పించి మ్రొక్కి భక్తి తాత్పర్యంబులతోడం గరకమలంబులు ముకుళించి, విబుధవందితుండును, విశ్వేశ్వరుండునునైన దేవదేవుని నిట్లని వినుతించె.

10.2-202-సీస పద్యము

అంభోజనాభున కంభోజనేత్రున;
కంభోజమాలాసమన్వితునకు
నంభోజపదున కనంతశక్తికి వాసు;
దేవునకును దేవదేవునకును

భక్తులు గోరినభంగి నే రూపైనఁ;
 బొందువానికి నాదిపురుషునకును
నఖిల నిదానమై యాపూర్ణవిజ్ఞానుఁ;
 డయినవానికిఁ, బరమాత్మునకును,

10.2-202.1-ఆటవెలది

ధాతఁ గన్న మేటితండ్రికి, నజునికి,
నీకు వందనంబు నే నొనర్తు
నిఖిలభూతరూప! నిరుపమ! యీశ! ప
రాపరాత్మ మహిత! యమితచరిత!

10.2-203-వచనము

దేవా! నీవు లోకంబుల సృజియించుటకు రజోగుణంబును, రక్షించుటకు సత్త్వగుణంబును, సంహరించుటకుఁ దమోగుణంబును ధరియింతువు; కాలమూర్తివి, ప్రధానపూరుషుండవు, పరుండవు, నీవ; నేనును, వారియు, ననిలుండు, వహ్నియు, నాకాశంబుఁ, భూతతన్మాత్రలును, నింద్రియంబులును, దేవతలును, మనంబును, గర్తయును, మహత్తత్త్వంబును, జరాచరంబైన విశ్వంబును, నద్వితీయుండవైన నీ యంద సంభవింతుము.

10.2-204-చంపకమాల

దయ నిటు సూడుమా! నరకదైత్యుని బిడ్డఁడు వీఁడు; నీ దెసన్
భయముననున్నవాఁడు; గడుబాలుఁ; డనన్యశరణ్యుఁ; డార్తుఁ; డా
శ్రయరహితుండు; దండ్రి క్రియ శౌర్యము నేరఁడు; నీ పదాంబుజ
ద్వయిఁ బొడఁగాంచె భక్తపరతంత్ర! సువీక్షణ! దీనరక్షణా!

10.2-205-వచనము

అని యిట్లు భూదేవి భక్తితోడ హరికిం బ్రణమిల్లి వాక్కుసుమంబులం బూజించిన నర్చితుండై భక్తవత్సలుం డయిన పరమేశ్వరుండు నరకపుత్త్రుం డయిన భగదత్తున కభయంబిచ్చి, సర్వసంపదలొసంగి నరకాసురగృహంబు ప్రవేశించి యందు.

## 10.2-22- కన్యలంబదాఱువేలందెచ్చుట

10.2-206-ఉత్పలమాల

రాజకులావతంసుఁడు పరాజిత కంసుఁడు నొచ్చి కాంచె ఘో
రాజుల రాజులం బటుశరాహతి నోంచి ధరాతనూజుఁ డు
త్తేజిత శక్తిఁ దొల్లిఁ జెఱదెచ్చినవారిఁ బదాఱువేల ధా
త్రీజన మాన్యలన్ గుణవతీ వ్రతధన్యల రాజకన్యలన్.

10.2-207-మత్తేభ విక్రీడితము

కని రా రాజకుమారికల్ పరిమళత్కౌతూహలాక్రాంతలై
దనుజాధీశ చమూవిదారు నతమందారున్ శుభాకారు నూ
తనశృంగారు వికారదూరు సుగుణోదారున్ మృగీలోచనా
జన చేతోధనచోరు రత్నమకుటస్ఫారున్ మనోహారునిన్.

10.2-208-వచనము

కని యతని సౌందర్య గాంభీర్య చాతుర్యాది గుణంబులకు మోహించి, తమకంబులు జనియింప, ధైర్యంబులు సాలించి, సిగ్గులు వర్జించి, పంచశరసంచలిత హృదయలై, దైవయోగంబునం బరాయత్తంబులైన చిత్తంబుల

నమ్మత్తకాశినులు దత్తరంబున మనోజుండుత్తలపెట్ట నతండు దమకుఁ బ్రాణవల్లభుండని వరియించి.

10.2-209-ఉత్పలమాల

పాపపురక్కసుండు సెఱపట్టె నటంచుఁ దలంతుఁ మెప్పుడుం
బాపుఁడె? వాని ధర్మమునఁ బద్మదళాక్షునిఁ గంటి మమ్మ! ము
న్నీ పురుషోత్తముం గదియ నేమి వ్రతంబులు సేసినారమో?
యా పరమేష్ఠి పుణ్యుఁడుగదమ్మ! హరిన్ మముఁగూర్చె నిచ్చటన్

10.2-210-కంద పద్యము

ఉన్నతి నీతఁడు గౌఁగిట
మన్నింపఁగ నింక బ్రదుకు మానిని మనలో
మున్నేమి నోము నోఁచెనొ
సన్నుతమార్గముల విపిన జల దుర్గములన్.

10.2-211-కంద పద్యము

విన్నారమె యీ చెలువముఁ?
గన్నారమె యిట్టి శౌర్యగాంభీర్యంబుల్?
మన్నార మింతకాలముఁ
గొన్నారమె యెన్నఁ డయినఁ గూరిమి చిక్కన్.

10.2-212-సీస పద్యము

వనజాక్షి! నేఁ గన్న వైజయంతిక నైన;
గదిసి వ్రేలుదు గదా కంఠమందు;

బింబోష్ఠి! నేఁ గన్క బీతాంబరము నైన;
మెఱసి యుండుదు గదా మేనునిండఁ;
గన్నియ! నేఁ గన్క గౌస్తుభమణి నైన;
నొప్పు సూపుదుఁ గదా యురమునందు;
బాలిక! నేఁ గన్కఁ బాంచజన్యము నైన;
మొనసి చొక్కుదుఁ గదా మోవిఁ గ్రోలి;

10.2-212.1-ఆటవెలది

పద్మగంధి! నేను బర్హదామము నైనఁ
జిత్ర రుచుల నుందు శిరమునందు
ననుచుఁ బెక్కుగతుల నాడిరి కన్యలు
గములు గట్టి గరుడగమనుఁ జూచి.

10.2-213-శార్దూల విక్రీడితము

భూనాథోత్తమ! కన్యకల్ వరుస నం భోజాతనేత్రుండు న
న్నే నవ్వెం దగఁ జూచె డగ్గఱియె వర్ణించెన్ వివేకించె స
మ్మానించెం గరుణించెఁ బే రడిగె సన్మార్గంబుతోఁ బెండ్లి యౌ
నేనే చక్రికి దేవి నంచుఁ దమలో నిర్ణీత లై రందఱున్.

10.2-214-వచనము

ఇట్లు బహువిధంబులం దమతమ మన్ననలకు నువ్విళ్ళూరు కన్నియలం బదాఱువేల ధవళాంబరాభరణ మాల్యానులేపనంబు లొసంగి, యందలంబుల నిడి, వారలను నరకాసుర భాండాగారంబులం గల నానావిధంబు లయిన మహాధనంబులను, రథంబులను, దురంగంబులను, ధవళంబులై వేగవంతంబులై

యైరావతకులసంభవంబులైన చతుర్దంత దంతావళంబులను, ద్వారకానగరంబునకుం బనిచి; దేవేంద్రుని పురంబునకుం జని యదితిదేవి మందిరంబు సొచ్చి, యా పెద్దమ్మకు ముద్దు సూపి, మణికిరణ పటల పరిభావితభానుమండలంబులైన కుండలంబు లొసంగి, శచీసమేతుండైన మహేంద్రునిచేత సత్యభామతోడం బూజితుండై, పిదప సత్యభామ కోరిన నందనవనంబు సొచ్చి.

## 10.2-23- పారిజాతాపహరణంబు

### 10.2-215-మత్తేభ విక్రీడితము

హరి కేలం బెకలించి తెచ్చి భుజగేంద్రారాతిపైఁ బెట్టి సుం
దరగంధానుగతభ్రమద్భ్రమరనాదవ్రాతముం బల్లవాం
కుర శాఖా ఫల పర్ణ పుష్ప కలికా గుచ్ఛాది కోపేతమున్
గిరిభిత్త్రాతముఁ బారిజాతముఁ ద్రిలోకీయాచకాఖ్యాతమున్.

### 10.2-216-వచనము

ఇట్లు పారిజాతంబును హరించి యదువల్లభుండు వల్లభయుం దానును విహగవల్లభారూఢుండై చనుచున్న సమయంబున.

### 10.2-217-సీస పద్యము

నరకాసురుని బాధ నలఁగి గోవిందుని;
కడ కేగి తత్పాదకమలములకుఁ
దన కిరీటము సోఁక దండప్రణామము;
ల్గావింప నా చక్రి కరుణ సేసి

చనుదెంచి భూసుతు సమయించి తనవారిఁ;
దన్ను రక్షించుటఁ దలఁప మఱచి
యింద్రుండు బృందారకేంద్రత్వ మదమునఁ;
బద్మలోచన! పోకు పారిజాత

10.2-217.1-ఆటవెలది

తరువు విడువు మనుచుఁ దాఁకె నడ్డము వచ్చి
తఱిమి సురలు నట్లు దాఁకి రకట!
యెఱుకవలదె నిర్జరేంద్రత కాల్పనే?
సురల తామసమును జూడ నరిది.

10.2-218-వచనము

ఇట్లు దనకు నొడ్డారించి యడ్డంబు వచ్చిన నిర్జరేంద్రాదుల నిర్జించి తన పురంబునకుం జని, నిరంతర సురభి కుసుమ మకరంద మాధురీ విశేషంబులకుఁ జొక్కిచిక్కక నాకలోకంబుననుండి వెంటనరుగుదెంచు తుమ్మెదలకు నెమ్మిదలంచుచున్న పారిజాతమ్ము నాశ్రితపారిజాతుం డయిన హరి మహాప్రేమాభిరామ యగు సత్య భామతోఁ గ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి, నరకాసురుని యింటం దెచ్చిన రాజకన్యక లెందఱందఱకు నన్ని నివాసంబులు గల్పించి గృహోపకరణంబులు సమర్పించి.

## 10.2-24- పదాఱువేలకన్యలపరిణయం

10.2-219-చంపకమాల

అమితవిహారుఁ డీశ్వరుఁ డనంతుఁడు దా నొక నాఁడు మంచి ల

గృమునఁ బదాఱువేల భవనంబులలోనఁ బదాఱువేల రూ
పములఁ బదాఱువేల నృపబాలలఁ బ్రీతిఁ బదాఱువేల చం
దముల విభూతినొందుచు యథావిధితో వరియించె భూవరా!

10.2-220-ఉత్పలమాల

దానములందు సమ్మద విధానములం దవలోకభాషణా
హ్వానములందు నొక్క క్రియ నా లలితాంగుల కన్ని మూర్తు లై
తా ననిశంబు గానఁబడి తక్కువ యెక్కువలేక యుత్తమ
జ్ఞాన గృహస్థధర్మమునఁ జక్రి రమించెఁ బ్రపూర్ణకాముఁడై.

10.2-221-కంద పద్యము

తరుణులు బెక్కం డ్రయినను
బురుషుఁడు మనలేఁడు సవతి పోరాటమునన్,
హరి యా పదాఱువేవురు
తరుణులతో సమత మనియె దక్షత్వమునన్.

10.2-222-శార్దూల విక్రీడితము

ఎన్నే భంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదు లీక్షించుచున్
మున్నే దేవునిఁ జూడఁగానక తుదిన్ మోహింతు; రా మేటి కే
విన్నాణంబుననో సతుల్ గృహిణులై విఖ్యాతి సేవించి ర
చ్ఛిన్నాలోకన హాస భాషణ రతిశ్లేషానురాగంబులన్.

10.2-223-సీస పద్యము

ఇంటికి వచ్చిన నెదురేగుదెంచుచు;

నానీత వస్తువులందుకొనుచు
సౌవర్ణమణిమయాసనములు వెట్టుచుఁ;
బదములు గడుగుచు భక్తితోడ
సంవాసితస్నానజలము లందించుచు;
సద్గంధవస్త్రభూషణము లొసఁగి
యిష్ట పదార్థంబు లిడుచుఁ దాంబూల మిడుచు;
లొసఁగుచు విసరుచు నోజ మెఱసి

10.2-223.1-తేటగీతి

శిరము దువ్వుచు శయ్యపైఁ జెలువు మిగుల
నడుగు లొత్తుచు దాసీసహస్రయుక్త
లయ్యుఁ గొలిచిరి దాసులై హరి నుదారుఁ
ద్వారకాధిప వదనలు దారు దగిలి.

10.2-224-శార్దూల విక్రీడితము

నన్నే పాయఁడు; రాత్రులన్ దివములన్ నన్నే కృపం జెందెడిన్;
నన్నే దొడ్డగఁ జూచు వల్లభలలో నాథుండు నా యింటనే
యున్నాఁ డంచుఁ బదాఱువేలుఁ దమలో నూహించి సేవించి రా
యన్నుల్ గాఢ పతివ్రతాత్వ పరిచర్యా భక్తియోగంబులన్.

10.2-225-కంద పద్యము

ఆ రామలతో నెప్పుడుఁ
బోరాములు సాల నెఱపి పురుషోత్తముఁడున్
గారామునఁ దిరిగెను సౌ

ధారామ లతాసరోవిహారముల నృపా!

10.2-226-కంద పద్యము

ఏ దేవుఁడు జగముల ను
త్పాదించును మనుచుఁ జెఱుచుఁ బ్రాభవమున మ
ర్యాదారక్షణమునకై
యా దేవుం డట్లు మెఱసె యాదవులందున్.

10.2-227-వచనము

అంత నొక్కనాఁడు రుక్మిణీదేవి లోఁగిట మహేంద్రనీల మరకతాది మణిస్తంభ వలభి విటంకపటల దేహళీకవాట విరాజమానంబును, శాతకుంభ కుడ్య గవాక్ష వేదికా సోపానంబును, విలంబమాన ముక్తాఫలదామ విచిత్ర కౌశేయవితానంబును, వివిధ మణిదీపికా విసర విభ్రాజమానంబును, మధుకరకులకలిత మల్లికాకుసుమ మాలికాభిరామంబును, జాలకరంధ్ర వినిర్గత కర్పూరాగరుధూప ధూమంబును, వాతాయన విప్ర కీర్ణ శిశిరకర కిరణస్తోమంబును, బారిజాతప్రసవామోద పరిమిళితపవనసుందరంబు నయిన లోపలిమందిరంబున శరచ్చంద్రచంద్రికా ధవళపర్యంక మధ్యంబున, జగదీశ్వరుం డయిన హరి సుఖాసీనుండై యుండ, సఖీజనంబులుం దాను డగ్గఱి కొలిచి యుండి.

10.2-228-సీస పద్యము

కుచకుంభములమీఁది కుంకుమతో రాయు;
హారంబు లరుణంబు లగుచు మెఱయఁ;
గరపల్లవము సాఁచి కదలింప నంగుళీ;
యక కంకణప్రభ లావరింపఁ;

గదలిన బహురత్న కలిత నూపురముల;
 గంభీర నినదంబు గడలుకొనఁగఁ;
గాంచన మణికర్ణికా మయూఖంబులు;
 గండపాలికలపై గంతు లిడఁగ;

10.2-228.1-తేటగీతి

గురులు నర్తింపఁ బయ్యెద కొంగు దూఁగ;
బోటిచే నున్న చామరఁ బుచ్చుకొనుచు
జీవితేశ్వరు రుక్మిణి సేర నరిగి
వేడ్క లిగురొత్త మెల్లన వీవఁ దొడఁగె.

10.2-229-వచనము

అప్పుడు.

## 10.2-25- రుక్మిణీదేవి విప్రలంభంబు

10.2-230-మత్తేభ విక్రీడితము

పతి యే రూపము దాల్చినంద దనురూపంబైన రూపంబుతో
సతి దా నుండెడు నట్టి రూపవతి నా చంద్రాస్య నా లక్ష్మి నా
సుతనున్ రుక్మిణి నా యనన్యమతి నా శుద్ధాంతరంగం గళా
చతురత్వంబున శౌరి యిట్లనియెఁ జంచన్మందహాసంబుతోన్.

10.2-231-మత్తేభ విక్రీడితము

బలశౌర్యంబుల భోగమూర్తి కులరూపత్యాగ సంపద్గుణం
బుల దిక్పాలురకంటెఁ జైద్యముఖరుల్ పూర్ణుల్ ఘనుల్; వారికిన్

నెలఁతా! తల్లియుఁదండ్రియుం సహజుఁడున్ నిన్నిచ్చినంటోక యీ
బలవద్వీరుల వార్ధిలీనుల మముం బాటింప నీ కేటికిన్?

10.2-232-సీస పద్యము

లోకుల నడవడిలోని వారము గాము;
పరులకు మా జాడ బయలు పడదు;
బలమదోపేతులు పగగొండ్రు మా తోడ;
రాజపీఠములకు రాము తఱచు;
శరణంబు మాకు నీ జలరాశి సతతంబు;
నిష్కించనుల మేము; నిధులు లేవు;
కలవారు చుట్టాలు గారు; నిష్కించన;
జనబంధులము; ముక్తసంగ్రహులము;

10.2-232.1-ఆటవెలది

గూఢవర్తనులము; గుణహీనులము; భిక్షు
లైన వారిఁ గాని నాశ్రయింప;
మిందుముఖులు దగుల; రిటువంటి మముబోఁటి
వారి నేల దగుల వారిజాక్షి!

10.2-233-కంద పద్యము

సిరియును వంశము రూపును
సరియైన వివాహసఖ్య సంబంధంబుల్
జరుగును; సరి గాకున్నను
జరగవు; లోలాక్షి! యెట్టి సంసారులకున్.

10.2-234-కంద పద్యము

తగదని యెఱుఁగవు మమ్ముం
దగిలితివి మృగాక్షి! దీనఁ దప్పగు; నీకుం
దగిన మనుజేంద్రు నొక్కనిఁ
దగులుము; గుణహీనజనులఁ దగునే తగులన్?

10.2-235-సీస పద్యము

సాల్వ జరాసంధ చై ద్యాది రాజులు;
 చెలఁగి నన్ వీక్షించి మలయుచుండ
నది గాక రుక్మి నీ యన్నయు గర్వించి;
 వీర్యమదాంధుఁ డై పెలయుచున్న
వారి గర్వంబులు వారింపఁగాఁ గోరి;
 చెలువ! నిన్నొడిచి తెచ్చితిమి; గాని
కాంతా తనూజార్థ కాముకులము గాము;
 కామమోహాదులఁ గ్రందుకొనము;

10.2-235.1-తేటగీతి

విను; ముదాసీనులము; క్రియావిరహితులము
పూర్ణులము మేము; నిత్యాత్మబుద్ధితోడ
వెలుఁగుచుందుము గృహదీపవిధము మెఱసి;
నవలతాతన్వి! మాతోడ నవయ వలదు.

10.2-236-వచనము

అని యిట్లు భగవంతుడైన హరి దన్నుఁ బాయక సేవించుటం బ్రియురాలను, పట్టంపుదేవి ననియెడి రుక్మిణి దర్పంబు నేర్పున నుపసంహరించి యూరకుండిన నమ్మానవతి యప్రియంబులు నపూర్వంబులు నైన మనోవల్లభు మాటలు విని దురంతంబైన చింతాభరంబున సంతాపంబు నొందుచు.

10.2-237-సీస పద్యము

కాటుక నెఱయంగఁ గన్నీరు వరదలై;
 కుచకుంభయుగళ కుంకుమము దడియ
విడువక వెడలెడు వేఁడినిట్టూర్పుల;
 లాలితాధర కిసలయము గందఁ
జెలువంబు నెఱిదప్పి చిన్నఁవోవుచు నున్న;
 వదనారవిందంబు వాడు దోఁప
మారుతాహతిఁ దూలు మహిత కల్పకవల్లి;
 వడువున మేన్ వడవడ వడంకఁ

10.2-237.1-తేటగీతి

జిత్త మెఱియంగఁ జెక్కిటఁ జేయి సేర్చి
కౌతుకం బేది పదతలాగ్రమున నేల
వ్రాసి పెంపుచు మో మరవాంచి వగలఁ
బొందె మవ్వంబు గందిన పువ్వుఁబోలె.

10.2-238-చంపకమాల

అలికుల వేణి తన్నుఁ బ్రియుఁ డాడిన యప్రియభాష లిమ్మెయిన్
సొలవక కర్ణరంధ్రముల సూదులు చొచ్చిన రీతిఁగాఁగ బె

బ్బులి రొద విన్న లేడి క్రియఁ బొల్పఱి చేష్టలు దక్కి నేలపై
వలనఱి వ్రాలెఁ గీ లెడలి వ్రాలిన పుత్తడిబొమ్మ కైవడిన్.

10.2-239-వచనము

ఇట్లు వ్రాలిన.

10.2-240-మత్తేభ విక్రీడితము

ప్రణతామ్నాయుఁడు కృష్ణుఁ డంతఁ గదిసెన్ బాష్పావరుద్ధారుణే
క్షణ విస్రస్త వినూత్న భూషణ దురుక్తక్రూర నారాచ శో
షణ నాలింగితధారుణిన్ నిజకులాచారైక సద్ధర్మ చా
రిణి విశ్లేషిణి వీతతోషిణిఁ బురంధ్రీగ్రామణిన్ రుక్మిణిన్.

10.2-241-సీస పద్యము

కని సంభ్రమంబునఁ దనువునం దనువుగా;
నునువునఁ జందనం బల్ల నలఁది
కన్నీరు పన్నీటఁ గడిగి కర్పూరంపుఁ;
బలుకులు సెవులలోఁ బాఱ నూఁది
కరమొప్ప ముత్యాలసరుల చి క్కడలించి;
యురమునఁ బొందుగా నిరవుకొలిపి
తిలకంబు నునుఫాలఫలకంబుపైఁ దీర్చి;
వదలిన భూషణావళులఁ దొడిగి

10.2-241.1-తేటగీతి

కమలదళ చారు తాలవృంతమున విసరి

పొలుచు పయ్యెదఁ గుచములఁ బొందుపఱిచి
చిత్త మిగురొత్త నొయ్యన సేదఁదీర్చి
బిగియఁ గౌఁగిటఁ జేర్చి నె మ్మొగము నిమిరి.

10.2-242-తేటగీతి

నెరులు గలమరునీలంపు టురుల సిరుల
నరులుగొనఁ జాలి నరులను మరులు కొలుపు
యురులు గెలిచిన తుమ్మెద గఱులఁ దెగడు
కురుల నులిదీర్చి విరు లిడి కొప్పువెట్టి.

10.2-243-కంద పద్యము

మురసంహరుఁ డిందిందిర
గరుదనిలచలత్ప్రసూనకలికాంచిత సుం
దరశయ్యఁ జేర్చె భీష్మక
వరపుత్రిన్ నుతచరిత్ర వారిజనేత్రన్.

10.2-244-వచనము

ఇట్లు పానుపునం జేర్చి మృదుమధుర భాషణంబుల ననునయించిన.

10.2-245-కంద పద్యము

పురుషోత్తము ముఖకోమల
సరసిజ మయ్యిందువదన సవ్రీడా హా
సరుచిస్నిగ్ధాపాంగ
స్ఫుర దవలోకనము లొలయఁ జూ చిట్లనియెన్.

## 10.2-26- రుక్మిణీదేవి స్తుతించుట

10.2-246-కంద పద్యము

మురహర! దివసాగమ దళ
దరవిందదళాక్ష! తలఁప నది యట్టి దగున్
నిరవధిక విమలతేజో
వరమూర్తివి; భక్తలోకవత్సల! యెందున్.

10.2-247-తేటగీతి

సంచితజ్ఞాన సుఖ బలైశ్వర్య శక్తు
లాదిగాఁ గల సుగుణంబు లమరు నీకు;
నేను దగుదునె? సర్వలోకేశ్వరేశ!
లీలమై సచ్చిదానందశాలి వనఘ!

10.2-248-సీస పద్యము

రూఢిమైఁ బ్రకృతి పూరుష కాలములకు నీ;
శ్వరుఁడవై భవదీయ చారుదివ్య
లలితకళా కౌశలమున నభిరతుఁడై;
కడఁగు నీ రూప మెక్కడ మహాత్మ!
సత్త్వాది గుణసముచ్చయయుక్త మూఢాత్మ;
నయిన నే నెక్కడ? ననఘచరిత!
కోరి నీ మంగళ గుణభూతి గానంబు;
సేయంగఁబడు నని చెందు భీతి

10.2-248.1-తేటగీతి

నంబునిధి మధ్యభాగమం దమృత ఫేన
పటల పాండుర నిభమూర్తి పన్నగేంద్ర
భోగశయ్యను బవ్వళింపుచును దనరు
నట్టి యున్నతలీల దివ్యంబు దలఁప.

10.2-249-వచనము

శబ్ద స్పర్శ రూప రస గంధంబు లనియెడు గుణంబులచేతఁ బరిగ్రహింపఁబడిన మంగళ సుందర విగ్రహుండవై, యజ్ఞానాంధకార నివారకంబైన రూపంబుఁ గైకొని, భవదీయులైన సేవకులకు ననుభావ్యుండ వైతి; భవత్పాదారవింద మకరందరసాస్వాద లోలాత్ములైన యోగీంద్రులకైనను భవన్మార్గంబు స్ఫుటంబు గా; దట్లగుటం జేసి యీ మనుజపశువులకు దుర్విభావ్యంబగుట యేమిసెప్ప? నిట్టి యీశ్వరుండవైన నీకు నిచ్ఛ స్వతంత్రంబు గావున నదియును నా కభిమతంబు గావున నిన్ను నే ననుసరింతు; దేవా! నీవకించనుఁడవైతేని బలిభోక్తలయిన బ్రహ్మేంద్రాదు లెవ్వనికొఱకు బలిసమర్పణంబు సేసిరి? నీవు సమస్త పురుషార్థమయుండ వనియును, ఫలస్వరూపి వనియును నీ యందలి ప్రేమాతిశయంబులం జేసి విజ్ఞానదీపాంకురంబున నిరస్త సమస్త దోషాంధకారులై యిహసౌఖ్యంబులు విడిచి సుమతులు భవదీయదాస సంగంబు గోరుచుండుదు; రట్లు సేయనేరక నిజాధికారాంధకారమగ్ను లైన వారు భవత్తత్త్వంబు దెలిసి బలిప్రక్షేపణంబులు సేయంజాలక మూఢులై సంసారచక్రంబునం బరిభ్రమింతు; రదియునుంగాక.

10.2-250-ఆటవెలది

వరమునీంద్ర యోగివర సురకోటిచే
వర్ణితప్రభావవైభవంబు
గలిగి యఖిలచేతనులకు విజ్ఞాన ప్ర
దుండ వగుదు వభవ! దురితదూర!

10.2-251-వచనము

దేవా! భవదీయ కుటిల భ్రూవిక్షేపోదీరిత కాలవేగంబుచేత విధ్వస్తమంగళు లగు కమలభవ భవ పాకశాసనాదులం దిరస్కరించినట్టి మదీయ చిత్తంబున.

10.2-252-చంపకమాల

నిను వరియించినం బెలుచ నీరజలోచన! శార్ఙ్గ సాయకా
సన నినదంబులన్ సకల శత్రుధరాపతులన్ జయించి బో
రన పశుకోటిఁ దోలు మృగరాజు నిజాంశము భూరిశక్తిఁ గై
కొనిన విధంబునన్ నను నకుంఠిత శూరతఁ దెచ్చి తీశ్వరా!

10.2-253-ఉత్పలమాల

అట్టి నృపాల కీటముల నాజి నెదుర్పఁగ లేనివాని య
ట్లొట్టిన భీతిమై నిటు పయోధిశరణ్యుఁడ వైతి వింతయున్
నెట్టన మాయ గాక యివి నిక్కములే? భవదీయ భక్తు లై
నట్టి నరేంద్రమౌళిమణు లంచిత రాజఋషుల్ ముదంబునన్.

10.2-254-ఆటవెలది

వితత రాజ్యగరిమ విడిచి కాననముల
నాత్మలందు మీ పదాబ్జయుగము

వలఁతి గాఁగ నిలిపి వాతాంబు పర్ణాశ
నోగ్రనియతు లగుచు నుందు రభవ!

10.2-255-మత్తేభ విక్రీడితము

విమలజ్ఞాననిరూఢులైన జనముల్ వీక్షింప మీ పాద కం
జమరందస్ఫుట దివ్యసౌరభము నాస్వాదించి నిర్వాణ రూ
పము సత్పూరుష వాగుదీరితము శోభాశ్రీనివాసంబు నౌ
మిము సేవింపక మానవాధముని దుర్మేధాత్ము సేవింతునే?

10.2-256-వచనము

మఱియును దేవా! భూలోకంబునందును, నిత్యనివాసంబునందును, సకల ప్రదేశంబులందును జగదీశ్వరుండ వయిన నిన్ను నభిమతంబులయిన కామరూపంబులు గైకొని వరియింతు; భవదీయ చరణారవింద మకరందాస్వాదన చాతుర్యధుర్యభృంగియైన కామిని యతి హేయంబైన త్వక్ శ్మశ్రు రోమ నఖ కేశంబులచేతఁ గప్పంబడి యంతర్గతంబయిన మాంసాస్థి రక్త క్రిమి విట్కఫ పిత్త వాతంబుగల జీవచ్ఛవంబయిన నరాధముని మూఢాత్మయై కామించునే? యదియునుంగాక.

10.2-257-సీస పద్యము

నీరదాగమమేఘనిర్ముక్తపయః పాన;
చాతకం బేగునే చౌటి పడెకుఁ?
బరిపక్వ మాకంద ఫలరసంబులు గ్రోలు;
కీరంబు సనునె దుత్తూరములకు?
ఘనరవ వాకర్ణనోత్కలిక మయూరము;

గోరునే కఠిన ఝిల్లీరవంబుఁ?
గరికుంభ పిశిత సద్గ్రాస మోదిత సింహ;
మరుగునే శునక మాంసాభిలాషఁ

10.2-257.1-తేటగీతి

బ్రవిమలాకార! భవదీయ పాదపద్మ
యుగ సమాశ్రయ నైపుణోద్యోగచిత్త
మన్యుఁ జేరునె తన కుపాస్యంబు గాఁగ?
భక్తమందార! దుర్భర భవవిదూర!

10.2-258-కంద పద్యము

వాసవవందిత! భవ కమ
లాసన దివ్యప్రభా సభావలి కెపుడున్
నీ సమధిక చారిత్ర క
థా సురుచిరగాన మవితథం బయి చెల్లున్.

10.2-259-కంద పద్యము

ధరణీనాథులు దమతమ
వరవనితామందిరముల వసియించుచు గో
ఖర మార్జాలంబుల గతి
స్థిరబద్ధు లగుదురు నిన్నుఁ దెలియని కతనన్.

10.2-260-ఆటవెలది

జలజనాభ! సకల జగ దంతరాత్మవై

నట్టి దేవ! నీ పదారవింద
యుగళి సానురాగయుక్తమై నా మదిఁ
గలుగునట్లు గాఁగఁ దలఁపు మనఘ!

10.2-261-ఆటవెలది

పృథు రజోగుణప్రవృద్ధమైనట్టి నీ
దృష్టిచేత నన్నుఁ దేఱుకొనఁగఁ
జూచు టెల్ల పద్మలోచన! నా మీఁద
ఘనదయార్ద్రదృష్టిగాఁ దలంతు.

10.2-262-వచనము

అదియునుంగాక, మధుసూదనా! నీవాక్యంబులు మిథ్యలుగావు; తల్లి వచనంబు కూఁతున కభిమతంబుగాదె? యౌవనారూఢమదంబున స్వైరిణి యగు కామిని పురుషాంతరాసక్త యగుట విచారించి పరిజ్ఞాని యైనవాఁడు విడుచు; నవివేకి యయిన పురుషుం డింద్రియలోలుండై రతిం దగిలి దాని విడువనేరక పరిగ్రహించి యుభయలోకచ్యుతుండగు; నట్లుగావున నీ యెఱుంగని యర్థంబు గలదే?" యని విన్నవించిన రుక్మిణీదేవి వచనంబులకుఁ గృష్ణుండు సంతసిల్లి యిట్లనియె.

## 10.2-27- రుక్మిణీదేవినూరడించుట

10.2-263-చంపకమాల

అలికులవేణి! నవ్వులకు నాడినమాటల కింత నీ మదిం
గలఁగఁగ నేల? వేటలను గయ్యములన్ రతులందు నొవ్వఁగాఁ
బలికినమాట లెగ్గు లని పట్టుదురే? భవదీయ చిత్తముం

దెలియఁగఁ గోరి యేఁ బలికితిన్ మదిలో నిటు గుంద నేఁటికిన్?

10.2-264-వచనము

అదియునుం గాక.

10.2-265-ఉత్పలమాల

కింకలు ముద్దుఁబల్కులును గెంపుఁగనుంగవ తియ్యమోవియున్
జంకెలు తేఱిచూపు లెకసక్కెములున్ నెలవంక బొమ్మలుం
గొంకక వీడనాడుటలుఁ గూరిమియుం గల కాంతఁ గూడుటల్
అంకిలి లేక జన్మఫల మబ్బుట గాదె కురంగలోచనా!

10.2-266-వచనము

అని మఱియు నిట్లనియె.

10.2-267-ఉత్పలమాల

నీవు పతివ్రతామణివి నిర్మల ధర్మవివేక శీల స
ద్భావవు నీ మనోగతులఁ బాయక యెప్పుడు నస్మదీయ సం
సేవయ కాని యన్యము భజింపవు; పుట్టిన నాఁటనుండి నీ
భావ మెఱింగి యుండియును బల్కిన తప్పు సహింపు మానినీ!

10.2-268-వచనము

అని వెండియు నిట్లనియె "నీవాక్యంబులు శ్రవణసుఖంబుగావించె; నీవు వివిధంబులైన కామంబులు గోరితివేని, నవియన్నియు నాయంద యుండుటం జేసి యేకాంతసేవాచతుర వైన నీకు నవి యన్నియు నిత్యంబులై యుండు; నీ పాతివ్రత్యంబును, నా యందలి స్నేహంబు నతివిశదంబు లయ్యె;

నావాక్యములచేత భవ దీయచిత్తంబు చంచలంబు గాక నా యందలి బుద్ధి దృఢంబగుం గావున సకలసంపద్విలసితంబైన ద్వారకానగర దివ్యమందిరంబు లందు నీదు భాగ్యంబునం జేసి సంసారికైవడి నీ యందు బద్ధానురాగుండనై వర్తింతుఁ; దక్కిన ప్రాణేంద్రియ పరవశత్వంబున వికృత శరీరధారిణియైన సతి నన్నుం జెందుట దుష్కరం; బదియునుం గాక మోక్షప్రదుండనైన నన్నుఁ గామాతురలైన యల్పమతులు వ్రతతపోమహిమలచేత దాంపత్య యోగంబుకై సేవింతు; రదియంతయు నా మాయా విజృంభితంబు; దానంజేసి వారు మందభాగ్యలై నిరయంబు నొందుదు; రట్లుగావున నీ సమానయైన కాంత యే కాంతలందైనఁ గలదె? నీ వివాహకాలంబు ననేక రాజన్యవర్యులఁ గైకొనక భవదీయ మధురాలాప శ్రవణాత్మకుండనైన నా సన్నిధికి "నా శరీరం బితర యోగ్యంబు గాదు; నీకు శేషంబనయి యున్న దాన" నని యేకాంతంబునం బ్రాహ్మణుం బుత్తెంచిన నేనును జనుదెంచి, నీ పరిణయసమయంబున భవత్సహోదరుంబట్టి విరూపుం గావించిన నది గనుంగొనియును నా యందలి విప్రయోగ భయంబున నూరకుండితి; వదిగావున బహుప్రకారంబులై వర్తించు నీ సద్గుణంబులకు సంతసింతు!"నని యివ్విధంబున దేవకీసుతుండు నరలోక విడంబనంబుగ గృహస్థునిభంగి నిజగృహకృత్యంబు లాచరించుచుండె"నని శుకుండు మఱియు నిట్లనియె.

10.2-269-కంద పద్యము

అని యిట్లు కృష్ణుఁ డాడిన
వినయ వివేకానులాప వితతామృత సే
చన ముదిత హృదయయై య
వ్వనితామణి వికచ వదన వనరుహ యగుచున్.

10.2-270-కంద పద్యము

నగ వామతించు చూపులు
నగధరు మోమునను నిలిపి నయమునఁ గరముల్
మొగిచి వినుతించెఁ గృష్ణున్
ఖగవాహున్ రుచిరదేహుఁ గలితోత్సాహున్.

10.2-271-చంపకమాల

అతుల విరాజమానముఖుఁడై వివిధాంబర చారుభూషణ
ప్రతతులతోఁడ గోరిన వరంబులు దద్దయుఁ నిచ్చెగృష్ణుఁ డు
న్నతశుభమూర్తి దేవగణనందితకీర్తి దయానువర్తియై
యతిమృదువాణికిం గిసలయారుణపాణికి నీలవేణికిన్.

10.2-272-వచనము

ఇట్లుసమ్మానించి కృష్ణుండు రుక్మిణియుందానును దదనంతరంబ.

10.2-273-చంపకమాల

ఎలమి ఘటింపఁగాఁ గలసి యూడెల నీడల మల్లికా లతా
వలిఁ గరవీరజాతి విరవాదుల వీథులఁ గమ్మ దెమ్మెరల్
వొలయు నవీనవాసములఁ బొన్నలఁ దిన్నెలఁ బచ్చరచ్చలం
గొలఁకుల లేఁగెలంకులను గోరిక లీరిక లొత్తఁ గ్రొత్తలై.

10.2-274-కంద పద్యము

ఆరామభూములందు వి
హారామల సౌఖ్యలీల నతిమోదముతో

నా రామానుజుఁ డుండెను
నా రామామణియుఁ దాను నభిరామముగన్.

## 10.2-28- కృష్ణకుమారోత్పత్తి

10.2-275-వచనము

మఱియు, ననేకవిధ విచిత్రమణివితానాభిశోభిత ప్రాసాదోపరిభాగంబులను, లాలిత నీలకంఠ కలకంఠ కలవింక శుక కలాప కలిత తీరంబులను, మకరందపానమదవదిందిందిర ఝుంకార సంకుల కమల కహ్లార సుధాసార నీహా పూరిత కాసారంబులను, ధాతు నిర్ఝర రంజిత సానుదేశగిరి కుంజపుంజంబులను, గృతకశైలంబులను, గ్రీడాగృహంబులనుం జెలంగి నందనందనుండు విదర్భరాజనందనం దగిలి కందర్పకేళీలోలాత్ముం డయ్యె; ననంతరంబా సుందరీలాలామంబువలనఁ బ్రద్యుమ్నుండు, చారుదేష్ణుండు, చారుదేవుండు, సుదేష్ణుండు, సుచారువు, చారుగుప్తుండు, భద్రచారువు, చారుభద్రుండు, విచారువు, చారువు ననియెడు పదుగురు తనయులం బడసె; నట్లు సత్యభామా జాంబవతీ నాగ్నజితీ కాళిందీ మాద్రి మిత్రవిందా భద్రలకు వేఱువేఱ పదుగురేసి భద్రమూర్తు లైన కుమారు లుదయించి; రవ్విధంబున మఱియును.

10.2-276-చంపకమాల

అనఘ! పదాఱువేల సతులందు జనించిరి వేఱువేఱ నం
దన దశకంబు తత్సుత వితానము గాంచి రనేక సూనుల
న్ననయముఁగ నిట్లు పిల్లచెఱ కీనిన కైవడిఁ బుత్త్ర పౌత్త్ర వ
ర్ధనమున నొప్పెఁ గృష్ణుఁడు ముదంబునఁ దామరతంపరై భువిన్.

10.2-277-తేటగీతి

అట్లు యదు వృష్ణి భోజాంధకాది వివిధ
నామధేయాంతరముల నెన్నంగ నూట
యొక్కటై చాల వర్ధిల్లె నక్కులంబు
నృపకుమారులఁ జదివించు నేర్పు గలుగు.

10.2-278-తేటగీతి

గురుజనంబులు విను మూఁడుకోట్లమీఁద
నెనుబదెనిమిదివేలపై నెసఁగ నూర్వు
రన్నఁ దద్బాలకావలి నెన్నఁదరమె
శూలికైనను దామరచూలికైన?

10.2-279-వచనము

అందు గోవిందనందనుండయిన ప్రద్యుమ్ననకు రుక్మి కూఁతు వలన ననిరుద్ధుండు సంభవించె ననిన మునివరునకు భూవరుం డిట్లనియె.

10.2-280-కంద పద్యము

బవరమునఁ గృష్ణుచే ము
న్నవమానము నొంది రుక్మి యచ్యుతు గెలువం
దివురుచుఁ దన సుత నరిసం
భవునకు నెట్లిచ్చె? నెఱుఁగఁ బలుకు మునీంద్రా!

## 10.2-29- ప్రద్యుమ్న వివాహంబు

10.2-281-సీస పద్యము

నావుడు శుకయోగి నరనాయకోత్తమ! ;
నీవు చెప్పిన యట్ల నెమ్మనమునఁ
బద్మాయతాక్షుచేఁ బడిన బన్నమునకుఁ;
గనలుచు నుండియు ననుజతోడి
నెయ్యంబునను భాగినేయున కిచ్చెను;
గూఁతు నంచితపుష్ప కోమలాంగిఁ
దన పూన్కి దప్పినఁ దగ విదర్భేశుండు;
విను మెఱింగింతు న వ్విధము దెలియఁ

10.2-281.1-తేటగీతి

బరఁగ రుక్మవతీ స్వయంవరమున కొగి
నరుగుదెం డని భీష్మభూవరసుతుండు
వరుస రప్పించె రాజన్యవర కుమార
వరుల నను వార్త కలరి యా హరిసుతుండు.

10.2-282-చంపకమాల

వర మణిభూషణప్రభలవర్గ మనర్గళ భంగిఁ బర్వఁ బ్ర
స్ఫురిత రథాధిరోహణవిభూతి దలిర్ప మనోహరైక సు
స్థిరశుభలీల నేగె యదుసింహకిశోరము రాజకన్యకా
పరిణయవైభవాగత నృపాలక కోటికి రుక్మివీటికిన్.

10.2-283-చంపకమాల

చని పురిఁజొచ్చి వృష్ణికులసత్తముఁ డచ్చట మూఁగియున్న య
మ్మనుజవరేణ్యనందనుల మానము దూలి భయాకులాత్ము లై

చనఁగ ననేక చండతర సాయకసంపదఁ జూపి రుక్మి నం
దనఁ గొనివచ్చి పేడ్క నిజధామము నొచ్చె నవార్యశౌర్యుఁ డై.

10.2-284-వచనము

ఇట్లు తెచ్చి ప్రద్యుమ్నుండు హరినయనం బరిణయంబంది నిఖిల సుఖంబు లనుభవింపుచుండె; యనంతరంబ.

10.2-285-కంద పద్యము

ధీరుఁడు కృతవర్మని సుకు
మారుఁడు వరియించె రుచిరమండనయుత నం
భోరుహముఖి రుక్మిసుతం
జారుమతీకన్యఁ బ్రకటసజ్జనమాన్యన్.

10.2-286-తేటగీతి

ప్రకటచరితుండు భీష్మభూపాలసుతుఁడు
మనము మోదింపఁ దన కూర్మిమనుమరాలి
రుక్మలోచన నసమాన రుక్మకాంతిఁ
జెలిమి ననిరుద్ధునకు బెండ్లి సేయు నపుడు.

10.2-287-కంద పద్యము

పొలుపుగ రత్నవిభూషో
జ్జ్వలులయి శుభవేళ నవ్వివాహార్థము ని
ర్మల బహు వైభవ శోభన
కలితవిదర్భావనీశ కటకంబునకున్.

10.2-288-చంపకమాల

హరియును రుక్మిణీసతియు నా బలభద్రుఁడు శంబరారియు
న్నరిమదభేది సాంబుఁడును నాదిగ రాజకుమారకోటి సిం
ధుర రథవాజి సద్భటులతోఁ జని యందు సమగ్రవైభవా
చరిత వివాహయుక్త దివసంబులు వేడుకఁ బుచ్చి యంతటన్.

10.2-289-కంద పద్యము

ఒకనాఁడు యదుకుమారకు
లకలంక సమగ్ర వైభవాటోప మహో
త్సుకులై యుండఁగఁ జూపో
పక యొకసెక్కెమున నవనిపాలురు వరుసన్.

10.2-290-ఉత్పలమాల

ఎచ్చరికం గళింగధరణీశుఁడు రుక్మిమొగంబు సూచి నీ
యొచ్చెముఁ దీర్చుకో నిదియ యొప్పగువేళ బలుండు జూదమం
దిచ్చ గలండు; గాని పొలుపెక్కనసేర్పరి గాఁడు; గాన నీ
కిచ్చు నవశ్యమున్ జయము నీఁగుము తొల్లిటఁబడ్డ బన్నమున్.

10.2-291-కంద పద్యము

అని పురికొల్పిన రుక్మియుఁ
దన చేటు దలంప లేక తాలాంకునితో
డను జూదమాడఁ దివిరెను
వనజాసను కృతము గడచు వారెవ్వ రిలన్?

10.2-292-వచనము

అంత.

10.2-293-కంద పద్యము

కోరి విదర్భుఁడు కుటిల వి
హారుండై పిలిచె జూదమాడ జితారిన్
హారిన్ సన్నుతసూరిన్
సీరిన్ రైవతసుతార్ద్ర చిత్తవిహారిన్.

## 10.2-30- రుక్మిబలరాములజూదంబు

10.2-294-ఆటవెలది

పూని మనము గొంత ప్రొద్దుపోకకు రామ!
నెత్త మాడ నీవు నేర్తు వనఁగ
విందు; మిపుడు గొంత పెల యొడ్డి యాడుద
మనిన బలుఁడు లెస్స యని చెలంగె.

10.2-295-కంద పద్యము

మదిలోని చలము డింపక
పది యిరువది నూఱు వేయి పదివే లిడె ప
న్నిద మని యొడ్డుచు నాడిరి
మదమున నిద్దఱును దురభిమానము పేర్మిన్.

10.2-296-ఉత్పలమాల

ఆడిన యాట లెల్లను హలాయుధుఁ డోడిన రుక్మి గెల్చుడున్

దోఁడి నృపాల కోటి పరితోషముఁ బొందఁ గళింగభూవిభుం
డోడె బలుం డటంచుఁ బ్రహసోక్తుల నెంతయు రాముఁ జుల్కఁగా
నాడెను దంతపంక్తి వెలి యై కనుపట్టఁగఁ జాల నవ్వుచున్.

10.2-297-తేటగీతి

బలుఁడు కోపించి యొక లక్ష పణము సేసి
యాడి ప్రకటంబుగా జూద మపుడు గెల్చె;
గెల్చె నను రుక్మి యిది యేను గెల్చియుండ
గెలుపు నీ దని కికురింప నలవి యగునె?

10.2-298-కంద పద్యము

అనవుడు హలధరుఁ డచ్చటి
జనపాలకసుతులఁ జూచి సత్యము పలుకుం
డని యడిగిన వారలు రు
క్మని హితులై పలుక రైరి మొగమోటమునన్.

10.2-299-ఉత్పలమాల

అప్పటి యట్ల యొడ్డి ముసలాయుధుఁ డేపున నాడి జూదముం
జొప్పఁడ గెల్చి యీ గెలుపు సూడగ నాదియొ వానిదో జనుల్
తప్పక చెప్పుఁ డన్న విదితధ్వనితో నశరీరవాణి తా
నిప్పటియాట రాముఁడె జయించె విదర్భుఁడె యోడె నావుడున్.

10.2-300-వచనము

అనినవిని సకలజనంబులు నద్భుతానందనిమగ్న మానసులైరి; కుటిలస్వభావులయిన భూవరులు రుక్మిం గైకొల్పిన నతండు తన తొల్లింటి పరాభవము దలంచి యెదిరిందన్న నెఱుంగక బలాబల వివేకంబు సేయనేరక విధివశానుగతుండై చలంబున బలునిం గని యిప్పటి యాటయు నేన గెల్చియుండ వృథాజల్పకల్పనుండ వయి 'గెల్చితి' నని పల్కెద; వక్షవిద్యా నైపుణ్యంబు గల భూపకుమారులతోఁ బసులకాపరు లెత్తువత్తురే యని క్రొవ్వున నవ్వుచుం బలికిన, నప్పలుకులు సెవులకు ములుకుల క్రియం దాఁకినఁ గోపోద్దీపితమానసుండై పెటపెటం బండ్లుగొఱకుచుం గన్నులనిప్పు లుప్పతిల్లం గినుకం దోఁకత్రొక్కిన మహోరగంబు నోజ రోఁజుచు దండతాడితంబయిన పుండరీకంబులీల హుమ్మని మ్రోయుచుఁ బ్రచండ బాహుదండంబులు సాఁచి పరిఘం బందుకొని పరిపంథి యైన రుక్మిని నతని కనుకూలంబయిన రాజలోకంబును బడలుపడ నడిచె; నయ్యవసరంబున.

10.2-301-కంద పద్యము

మును దంతపంక్తి వెలిగాఁ

దను నవ్విన యక్కళింగుఁ దల వట్టి రయం

బునఁ బడఁదిగిచి వదన మే

పునఁ బెడచే వ్రేసి దంతములు వెస డులిచెన్.

10.2-302-కంద పద్యము

అంతం బోవక రుక్మిని

దంతంబులు మున్న డులిచి తను వగలింప

న్నంతకుపురి కేగెను వాఁ

డెంతయు భయ మంది రాజు లెల్లం గలఁగన్.

10.2-303-వచనము

అట్లుచేసి యయ్యాదవసింహం బసహ్యవిక్రమంబునం జెలంగె నంత.

10.2-304-కంద పద్యము

భూవర! పద్మాక్షుఁడు దన
బావ హతుం డగుట గనియుఁ బలుకక యుండెన్
భావమున రుక్మిణీ బల
దేవుల కే మనఁగ నెగ్గు దేఖునొ? యనుచున్.

10.2-305-వచనము

అంత నా విదర్భానగరంబు నిర్గమించి.

10.2-306-కంద పద్యము

పరమానురాగరస సం
భరితాంతఃకరణు లగుచుఁ బాటించి వధూ
వరులను రథమం దిడి హల
ధర హరి రుక్మిణులఁ గొల్చి తగ యదువీరుల్.

10.2-307-ఉత్పలమాల

మంగళతూర్యఘోషము లమందగతిం జెలఁగంగ మత్త మా
తంగ తురంగ సద్భట కదంబముతోఁ జని కాంచి రంత నా
రంగ లవంగ లుంగ విచరన్మదభృంగ సురంగనాద స
త్సంగ తరంగిణీకలిత సంతతనిర్మల నా కుశస్థలిన్.

10.2-308-వచనము

ఇట్లు పురోపవనోపకంఠంబునకుం జని.

10.2-309-కంద పద్యము

అందు వసించిరి నందిత
చందన మందార కుంద చంద్ర లసన్మా
కందముల నీడ హృదయా
నందము సంధిల్ల నందనందనముఖ్యుల్.

10.2-310-వచనము

తదనంతరంబ పురప్రవేశంబు సేసి" రని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

## 10.2-31- బాణునకీశ్వర ప్రసాదలబ్ధి

10.2-311-తేటగీతి

అనఘ! బలినందనులు నూర్వు రందులోన
నగ్రజాతుండు బాణుఁ డత్యుగ్రమూర్తి
చిర యశోహారి విహితపూజిత పురారి
యహిత తిమిరోష్ణకరుఁడు సహస్రకరుఁడు.

10.2-312-కంద పద్యము

బాణుఁడు విక్రమజిత గీ
ర్వాణుఁడు సని కాంచె భక్తి వశుఁ డై సగణ
స్థాణున్ నిర్దళి తాసుమ

బాణుం దాండవధురీణు భక్తత్రాణునన్.

10.2-313-కంద పద్యము

కని యనురాగ వికాసము
దన మనమునఁ గడలుకొనఁగ ధరఁ జాఁగిలి వం
దన మాచరించి మోదము
దనరఁగఁ దాండవము సలుపు తఱి నయ్యభవున్.

10.2-314-ఉత్పలమాల

సంచిత భూరిబాహుబలసంపద పెంపున నారజంబు వా
యించి యనేకభంగుల నుమేశుఁ ద్రిలోకశరణ్యు నాత్మ మె
చ్చించి ప్రమోదియై నిజవశీకృత నిశ్చలితాంతరంగుఁ గా
వించి తదాననాంబురుహ వీక్షణుఁడై తగ మ్రొక్కి యిట్లనున్.

10.2-315-ఉత్పలమాల

శంకర! భక్తమానసవశంకర! దుష్టమదాసురేంద్ర నా
శంకర! పాండునీలరుచిశంకరవర్ణ నిజాంగ! భోగి రా
ట్కంకణ! పార్వతీహృదయకైరవ కైరవమిత్ర! యోగిహృ
త్పంకజ పంకజాప్త! నిజతాండవఖేలన! భక్తపాలనా!

10.2-316-వచనము

అని వినుతించి.

10.2-317-ఉత్పలమాల

దేవ! మదీయ వాంఛితము తేటపడన్నిటు విన్నవించెదన్

నీవును నద్రినందనయు నెమ్మిని నా పురి కోటవాకిటం
గావలియుండి నన్నుఁ గృపఁ గావుము భక్తఫలప్రదాత! యో
భావభవారి! నీ చరణపద్మము లెప్పుడు నాశ్రయించెదన్.

10.2-318-వచనము

అని యభ్యర్థించినం బ్రసన్నుండై భక్తవత్సలుం డగు పురాంతకుండు గౌరీసమేతుండై తారకాంతక గజాననాది భూతగణంబుల తోడ బాణనివాసం బగు శోణపురంబు వాకిటం గాఁపుండెఁ; బదంపడి యొక్కనాఁడ బ్బలినందనుండు.

10.2-319-తేటగీతి

దర్పమునఁ బొంగి రుచిర మార్తాండ దీప్త
మండలముతోడ మార్పడు మహితశోణ
మణికిరీటము త్రిపురసంహరుని పాద
వనజములు సోఁక మ్రొక్కి యిట్లని నుతించె.

10.2-320-సీస పద్యము

దేవ! జగన్నాథ! దేవేంద్రవందిత! ;
 వితతచారిత్ర! సంతత పవిత్ర!
హాలాహలాహార! యహిరాజకేయూర! ;
 బాలేందుభూష! సద్భక్తపోష!
సర్వలోకాతీత! సద్గుణసంఘాత! ;
 పార్వతీహృదయేశ! భవవినాశ!
రజతాచలస్థాన! గజచర్మపరిధాన! ;
 సురవైరివిధ్వస్త! శూలహస్త!

10.2-320.1-తేటగీతి

లోకనాయక! సద్భక్తలోకవరద!

సురుచిరాకార! మునిజనస్తుతవిహార!

భక్తజనమందిరాంగణపారిజాత!

నిన్ను నెవ్వఁడు నుతిసేయ నేర్చు నభవ!

10.2-321-వచనము

అని స్తుతియించి.

10.2-322-మత్తేభ విక్రీడితము

అనిలో నన్ను నెదిర్చి బాహుబలశౌర్యస్ఫూర్తిఁ బోరాడఁ జా

లిన వీరుం డొకఁ డైన బందెమునకున్ లేఁడయ్యె భూమండలి

న్ననయంబున్ భవదగ్రదత్తకరసాహస్రంబు కండూతి వా

యునుపాయంబునులేద యీభరము నెట్లోర్తున్నుమానాయకా!

10.2-323-సీస పద్యము

హుంకార కంకణ క్రేంకార శింజినీ;

టంకార నిర్ఘోషసంకులంబు

చండ దోర్దండ భాస్వన్మండలాగ్ర ప్ర;

కాండ ఖండిత రాజమండలంబు

శూలాహతక్షతోద్వేల కీలాల క;

ల్లోల కేళీ సమాలోకనంబు

శుంభ దున్మద కుంభి కుంభస్థలధ్వంస;

సంభూత శౌర్య విజృంభణంబు

10.2-323.1-తేటగీతి

గలుగు నుద్దామ భీమ సంగ్రామ కేళి
ఘన పరాక్రమ విక్రమక్రమము గాఁగ
జరపలేనట్టి కరములు కరము దుఃఖ
కరము లగుఁ గాక సంతోషకరము లగునె?

10.2-324-ఉత్పలమాల

కాన మదీయ చండభుజగర్వ పరాక్రమ కేళికిన్ సముం
డీ నిఖిలావనిం గలఁడె యిందుకళాధర! నీవు దక్కఁగా;
నా నిటలాంబకుండు దనుజాధిపు మాటకుఁ జాల రోసి లో
నూనిన రోషవార్ధి గడ లొత్తఁ గ నిట్లని పల్కె భూవరా!

10.2-325-కంద పద్యము

విను మూఢహృదయ! నీ కే
తన మెప్పు డకారణంబ ధారుణిపైఁ గూ
లును నపుడ నీ భుజావలి
దునియఁగ నా యంత వానితో నని గల్గున్.

10.2-326-వచనము

అని పలికిన నట్లు సంప్రాప్తమనోరథుండై నిజభుజవినాశకార్య ధురీ ణుండగు బాణుండు సంతుష్టాంతరంగుం డగుచు నిజనివాసంబు నకుం జని, తన ప్రాణవల్లభల యుల్లంబులు పల్లవింపఁ జేయుచు నిజధ్వజనిపాతంబు నిరీక్షించుచుండె, తదనంతరంబ.

## 10.2-32- ఉషాకన్య స్వప్నంబు

10.2-327-సీస పద్యము

ఆ దానవేశ్వరు ననుఁగుఁ గుమారి యు;
 షాకన్య విమలసౌజన్యధన్య
రూపవిభ్రమ కళారుచిర కోమలదేహ;
 యతను నాఱవబాణ మనఁగఁ బరఁగు
సుందరీరత్నంబు నిందునిభానన;
 యళినీలవేణి పద్మాయతాక్షి
యొకనాఁడు రుచిరసౌధోపరివేదికా;
 స్థలమున మృదుశయ్య నెలమిఁ గూర్కి

10.2-327.1-తేటగీతి

మున్ను దన చౌల నెన్నఁడు విన్న యతఁడుఁ
గన్నులారంగఁ దాఁ బొడగన్న యతఁడుఁ
గాని యసమానరూపరేఖావిలాస
కలితు ననిరుద్ధు నర్మిలిఁ గవిసినటులు.

10.2-328-చంపకమాల

కలగని యంత మేలుకని కన్నుల బాష్పకణంబు లొల్కఁగాఁ
గలవలెఁ గాక నిశ్చయముగాఁ గమనీయ విలాస విభ్రమా
కలిత తదీయరూపము ముఖంబున ప్రేలిన యట్ల దోఁచినం
గళవళ మందుచున్ బిగియఁ గౌఁగిటిచే బయ లప్పళించుచున్

10.2-329-వచనము

మఱియును.

10.2-330-చంపకమాల

సరసమృదూక్తులుం గుసుమసాయకకేళియు శాటికా కచా
కరషణముల్ నఖక్రియలుఁ గమ్రకపోల లలాట మేఖలా
కర కుచ బాహుమూలములుఁ గైకొని యుండుట లాదిగాఁ దలో
దరి మది గాఢమై తగిలె దర్పకుఁ డచ్చుననొత్తినట్లయై.

10.2-331-సీస పద్యము

కలికిచేష్టలు భావగర్వంబు లైనను;
ప్రియుమీఁది కూరిమి బయలుపఱుపఁ
బిదపిదనై లజ్జ మదిఁ బద నిచ్చినఁ;
జెలిమేనఁ బులకలు చెక్కు లొత్త
మదనాగ్ని సంతప్త మానస యగుటకు;
గురుకుచహారవల్లరులు గందఁ
జిత్తంబు నాయకాయత్తమై యుంటకు;
మఱుమాట లాడంగ మఱపు గదుర

10.2-331.1-తేటగీతి

నతివ మనమున సిగ్గు మోహంబు భయముఁ
బొడమ నునుమంచు నెత్తమ్మిఁ బొదువు మాడ్కిఁ
బ్రథమచింతాభరంబునఁ బద్మనయన
కోరి తలచీర వాటింప నేరదయ్యె.

10.2-332-వచనము

ఇట్లు విరహవేదనా దూయమాన మానసయై యుండె; నంత నెచ్చెలులు డాయం జనుదెంచినం దన మనంబునం బొడము మనోజవికారంబు మఱువెట్టుచు నప్పుడు.

10.2-333-చంపకమాల

పొరిఁబొరిఁ బుచ్చు నూర్పుగమిఁ బుక్కిటనుంచి కుచాగ్రసీమపై
బెరసిన సన్న లేఁజెమటబిందువు లొయ్యన నార్చుఁ గన్నులం
దొరఁగెడు బాష్పపూరములు దొంగలిఱెప్పల నాని చుక్కలం
దరుణులు రండు చూతమని తా మొగ మెత్తును గూఢరాగ యై.

10.2-334-వచనము

ఇవ్విధంబునం జరియించుచుండె నట్టియెడ.

10.2-335-తేటగీతి

అంతకంతకు సంతాప మతిశయించి
వలుఁద చన్నులు గన్నీటి వఱదఁ దడియఁ
జెలులదెసఁ జూడఁ జాల లజ్జించి మొగము
వాంచి పలుకక యుండె న వ్వనరుహాక్షి.

10.2-336-వచనము

అంత.

10.2-337-తేటగీతి

బలితనూభవుమంత్రి కుంభాండుతనయ

తన బహిఃప్రాణ మిది యనఁ దనరునట్టి
కామినీ మణి ముఖపద్మకాంతి విజిత
శశిరకర చారు రుచిరేఖ చిత్రరేఖ.

10.2-338-వచనము

కదియవచ్చి య బ్బాల నుపలక్షించి.

10.2-339-తేటగీతి

భామినీమణి! సొబగుని బయల వెదకు
విధమునను నాత్మ విభుఁ బాసి విహ్వలించు
వగను జేతికి లోనైనవానిఁ బాసి
భ్రాంతిఁ బొందిన భావంబు ప్రకటమయ్యె.

10.2-340-తేటగీతి

వనిత! నా కన్న నెనరైన వారు నీకుఁ
గలుగ నేర్తురె? నీ కోర్కిఁ దెలియఁ జెప్పు
కున్న మీయన్నతో డన్నఁ గన్నుఁగవను
నలరు నునుసిగ్గుతో నగ వామతింప.

10.2-341-వచనము

ఇవ్విధంబునఁ జిత్రరేఖం గనుంగొని యిట్లనియె.

10.2-342-చంపకమాల

చెలి కలలోన నొక్క సరసీరుహనేత్రుఁడు రత్నహార కుం
డల కటకాంగుళీయక రణన్మణినూపురభూషణుండు ని

ర్మల కనకాంబరుండు సుకుమారతనుండు వినీలదేహుఁ డు
జ్జ్వలరుచి నూతనప్రసవసాయకుఁ డున్నతవక్షుఁ డెంతయున్.

10.2-343-చంపకమాల

నను బిగియారఁ గౌఁగిట మనం బలరారఁగఁ జేర్చి మోదముం
దనుకఁగ నంచితాధరసుధారస మిచ్చి మనోజకేళికిం
బనుపడఁ జేసి మంజుమృదుభాషలఁ దేలిచి యంతలోననే
చనియెను దుఃఖవార్ధిఁ బెలుచన్ ననుఁ ద్రోచి సరోరుహాననా!

10.2-344-వచనము

అనుచు నమ్మత్తకాశిని చిత్తంబు చిత్తజాయత్తంబయి తత్తరంబున విరహానలం బుత్తలపెట్టఁ గన్నీరుమున్నీరుగా వగచుచు విన్ననైన వదనారవిందంబు వాంచి యూరకున్నఁ జిత్రరేఖ దన మనంబున న య్యంతి సంతాపంబు చింతించి యిట్లనియె.

10.2-345-చంపకమాల

సరసిజనేత్ర! యేటికి విచారము? నా కుశలత్వ మేర్పడన్
నర సుర యక్ష కింపురుష నాగ నభశ్చర సిద్ధ సాధ్య కి
న్నరవర ముఖ్యులం బటమునన్ లిఖియించినఁ జూచి నీ మనో
హరుఁ గని వీడె పొమ్మనిన నప్పుడె వానిని నీకుఁ దెచ్చెదన్.

## 10.2-33- చిత్రరేఖ పటంబున చూపుట

10.2-346-వచనము

అని యొడంబఱిచి మిలమిలని మంచుతోడం బురుడించు ధళధళ మను మెఱుంగులు దుఱంగలిగొను పటంబు నావటంబు సేసి, వజ్రంబున మేదించి, పంచవన్నియలు వేఱువేఱ కనక రజత పాత్రంబుల నించి కేలం దూలిక ధరించి యొక్క విజనస్థలంబునకుం జని ముల్లోకంబులం బేరు గలిగి వయో రూప సంపన్నులైన పురుషముఖ్యుల నన్వయ గోత్ర నామధేయంబులతోడ వ్రాసి, యాయితంబయిన యప్పటంబు దన ముందటఁ దెచ్చి పెట్టి, “యిప్పటంబునం దగులని వారు లేరు; వారిం జెప్పెద, సావధానంబుగ నాకర్ణింపు” మని యిట్లనియె.

10.2-347-సీస పద్యము

కమనీయ సంగీత కలిత కోవిదులు కిం;
 పురుష గంధర్వ కిన్నరులు వీరె
సతత యౌవన యదృచ్ఛావిహారులు సిద్ధ;
 సాధ్య చారణ నభశ్చరులు వీరె
ప్రవిమల సౌఖ్య సంపద్వైభవులు సుధా;
 శన మరు ద్యక్ష రాక్షసులు వీరె
నిరుపమ రుచి కళాన్వితా కామరూపులై;
 పొగడొందునట్టి పన్నగులు వీరె

10.2-347.1-తేటగీతి

చూడు మని సేర్పుఁ దీపింపఁ జూపుటయును
జిత్తము నిజమనోరథసిద్ధి వడయఁ
జాలకుండిన మధ్యమ క్ష్మాతలాధి

పతులఁ జూపుచు వచ్చె న ప్పద్మనయన.

10.2-348-ఉత్పలమాల

మాళవ కొంకణద్రవిడ మత్స్య పుళింద కళింగ భోజ నే
పాళ విదేహ పాండ్య కురు బర్బర సింధు యుగంధ రాంధ్ర బం
గాళ కరూశ టేంకణ త్రిగర్త సుధేష్ణ మరాట లాట పాం
చాల నిషాద ఘూర్జరక సాళ్వ మహీశులు వీరె కోమలీ!

10.2-349-ఉత్పలమాల

సింధురవైరివిక్రముఁడు శీతమయూఖ మరాళికా పయ
స్సింధుపటీర నిర్మలవిశేష యశోవిభవుండు శౌర్య ద
ర్పాంధ రిపుక్షితీశ నికరాంధతమః పటలార్కుఁ డీ జరా
సంధునిఁ జూడు మాగధుని సద్బృహదశ్వసుతుం గృశోదరీ!

10.2-350-మత్తేభ విక్రీడితము

సకలోర్వీతలనాథ సన్నుతుఁడు శశ్వద్భూరి బాహాబలా
ధికుఁడుగ్రాహవకోవిదుండు త్రిజగద్విఖ్యాతచారిత్రకుం
డకలంకోజ్జ్వల దివ్యభూషుఁడు విదర్భాధీశ్వరుండైన భీ
ష్మక భూపాలకుమారుఁ జూడు మితనిన్ మత్తద్విరేఫాలకా!

10.2-351-ఉత్పలమాల

సంగరరంగ నిర్దళిత చండవిరోధి వరూధినీశ మా
తంగ తురంగ సద్భట రథప్రకరైక భుజావిజృంభణా
భంగ పరాక్రమప్రకట భవ్యయశోమహనీయమూర్తి కా

ళింగుఁడు వీఁడె చూడు తరళీకృత చారుకురంగలోచనా!

10.2-352-మత్తేభ విక్రీడితము

సుగుణాంభోనిధి ఫాలలోచను నుమేశున్నాత్మ మెప్పించి శ
క్తి గరిష్ఠంబగు శూలముం బడసె నక్షీణప్రతాపోన్నతిన్
జగతిన్ మిక్కిలి మేటివీరుఁడు రణోత్సాహుండు భూపౌత్త్రుఁ డీ
భగదత్తుం గనుఁగొంటె! పంకజముఖీ! ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్.

10.2-353-మత్తేభ విక్రీడితము

వికచాంభోరుహపత్రనేత్రుఁ డగు గోవిందుండు దాఁ బూను నం
దక చక్రాబ్జ గదాది చిహ్నములచేతన్ వాసుదేవాఖ్య ను
త్సుకుఁడై యెప్పుడుమచ్చరించు మదిఁగృష్ణుండన్న నేమేటి పౌం
డ్రకుఁ గాశీశసఖుం గనుంగొనుము వేడ్కం జంద్రబింబాననా!

10.2-354-మత్తేభ విక్రీడితము

ద్విజ శుశ్రూషయు సూనృతవ్రతము నుద్వృత్తిన్ భుజాగర్వమున్
విజయాటోపముఁ జాప నైపుణియు ధీవిస్ఫూర్తియుం గల్గు నీ
రజనీనాథకులప్రదీపకులఁ బాఱం జూడు పద్మాక్షి! ధ
ర్మజ భీమార్జున మాద్రినందనుల సంగ్రామైకపారీణులన్.

10.2-355-మత్తేభ విక్రీడితము

బలిమిన్ సర్వనృపాలురన్నదిమి కప్పంబుల్ దగం గొంచు ను
జ్జ్వల తేజో విభవాతిరేకమున భాస్వత్కీర్తి శోభిల్లఁగాఁ
బొలుపొందం దను రాజరా జన మహా భూరిప్రతాపంబులుం

గల దుర్యోధనుఁ జూడు సోదరయుతుం గంజాతపత్త్రేక్షణా!

10.2-356-వచనము

అని యిట్లు సకలదేశాధీశ్వరులగు రాజవరుల నెల్లఁ జూపుచు యదువంశసంభవులైన శూరసేన వసుదేవోద్ధవాదులం జూపి మఱియును.

10.2-357-ఉత్పలమాల

శారద నీరదాభ్ర ఘనసార సుధాకర కాశ చంద్రికా
సార పటీరవర్ణు యదుసత్తము నుత్తమనాయకుం బ్రమ
త్తారి నృపాల కానన హుతాశనమూర్తిఁ బ్రలంబదైత్య సం
హారునిఁ గామపాలుని హలాయుధుఁ జూడుము దైత్యనందనా!

10.2-358-సీస పద్యము

కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రుఁ;
వసుధాకళత్రుఁ బావనచరిత్రు
సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు;
నతపన్నగాకల్పు నాగతల్పుఁ
గౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు;
శ్రితజనపోషు నంచితవిశేషు
నీలనీరదకాయు నిర్జితదైతేయు;
ధృతపీతకౌశేయు నతవిధేయు

10.2-358.1-తేటగీతి

నఘుమహాగదవైద్యు వేదాంతవేద్యు

దివ్యమునిసన్నుతామోదుఁ దీర్ఘపాదు
జిష్ణు వర సద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ
జూడు దైతేయకులబాల! సుభగ లీల!

10.2-359-చంపకమాల

స్ఫుర దళి శింజినీ రవ విభూషితపుష్పధనుర్విముక్త భా
స్వర నవచూత కోరక నిశాత శిలీముఖ పాతభీత పం
కరుహభవాది చేతన నికాయు మనోజనిజాంశు రుక్మిణీ
వరసుతు రాజకీరపరివారుని మారునిఁ జూడు కోమలీ!

10.2-360-వచనము

ఇవ్విధంబునం జూపిన.

10.2-361-మత్తేభ విక్రీడితము

వనితారత్నము కృష్ణనందనుని భావప్రౌఢిఁ దాఁ జూచి గ్ర
ద్ధనఁ దన్నర్థి వరించి చన్న సుగుణోత్తంసంబ కా నాత్మలో
ననుమానించి యనంతరంబ యనిరుద్ధాఖ్యున్ సరోజాక్షు నూ
తన చేతోభవమూర్తిఁ జూచి మది సంతాపించుచున్నిట్లనున్.

10.2-362-ఉత్పలమాల

ఇంతి మదీయ మానధనమెల్ల హరించిన మ్రుచ్చు నిమ్మెయిం
బంత మెలర్ప వ్రాసి పటభాగనిరూపితుఁ జేసినట్టి నీ
యంతటి పుణ్యమూర్తిఁ గొనియాడఁగ నేర్తునె? నీ చరిత్రముల్
వింతలె నాకు? నీ మహిత వీరకులంబు బలంబుఁ జెప్పుమా!

10.2-363-చంపకమాల

అనవుడుఁ జిత్రరేఖ జలజాక్షికి నిట్లను నీ కుమారకుం
డనఘుఁడు యాదవాన్వయ సుధాంబుధి పూర్ణసుధాకరుండునాఁ
దనరిన కృష్ణపౌత్త్రకుఁ డుదారచరిత్రుఁడు భూరిసింహ సం
హననుఁ డరాతి సైన్య తిమిరార్కుఁడు, పే రనిరుద్ధుఁ డంగనా!

## 10.2-34- చిత్రరేఖ అనిరుద్ధునిదెచ్చుట

10.2-364-వచనము

అని చెప్పి "యే నతిత్వరితగతిం జని యక్కుమారరత్నంబుఁ దొడ్కొనివచ్చు నంతకు సంతాపింపకుండు" మని యా క్షణంబ వియద్గమనంబునం జని ముందట.

10.2-365-కంద పద్యము

సరసిజముఖి గనుఁగొనె శుభ
భరిత విలోకన విధూత భవ వేదనముం
బరసాధనమును సుకృత
స్ఫురణాపాదనముఁ గృష్ణు పుటభేదనమున్.

10.2-366-వచనము

కని డాయం జని తదీయ సుషమావిశేషంబులకుం బరితోషంబు నొందుచుం గామినీచరణ రణితమణినూపుర ఝుణంఝుణధ్వనిత మణిగోపురంబును, నతి విభవ విజితగోపురంబునునగు ద్వారకాపురంబు నిశాసమయంబునం బ్రచ్ఛన్నవేషంబునం జొచ్చి కనకకుంభకలితసౌధాగ్రంబున మణిదీపనిచయంబు

ప్రకాశింపఁ జంద్ర కాంత శిలాభవనంబున సుధాధామ రుచిరరుచి నిచయంబున పహసించు హంసతూలికాతల్పంబున నిజాంగనా రతిశ్రమంబున నిద్రాసక్తుండై యున్న యనిరుద్ధుం జేరి తన యోగవిద్యా మహత్త్వంబున నతని నెత్తుకొని మనోవేగంబున శోణపురంబునకుం జని బాణాసురనందనయగు నుషాసుందరి తల్పంబునం దునిచి యిట్లనియె.

10.2-367-కంద పద్యము

వనజాక్షి! చూడు నీ విభు
ననిమిషనగధీరు శూరు నభినవమారున్
వనధి గభీరు నుదారుని
ననిరుద్ధకుమారు విదళితాహితవీరున్.

10.2-368-కంద పద్యము

అనిన నుషాసతి దన మన
మున ననురాగిల్లి మేనఁ బులకాంకురముల్
మొనయఁగ నానందాశ్రులు
గనుఁగవ జడి గురియ ముఖవికాస మెలర్పన్.

10.2-369-వచనము

ఇట్లు మనంబున నుత్సహించి చిత్రరేఖం గనుంగొని యయ్యింతి యిట్లనియె.

10.2-370-సీస పద్యము

అతివ! నీ సాంగత్య మను భానురుచి నాకుఁ;
గలుగుటఁ గామాంధకార మడఁగెఁ

దరలాక్షి! నీ సఖిత్వం బను నావచేఁ;
 గడిఁది వియోగాబ్ధిఁ గడవఁ గంటి
నబల! నీ యనుబంధ మను సుధావృష్టిచే;
 నంగజ సంతాప మార్పఁ గంటి
వనిత! నీ చెలితనం బను రసాంజనముచే;
 నా మనోహర నిధానంబుఁ గంటిఁ

10.2-370.1-తేటగీతి

గలలఁ దోఁచిన రూపు గ్రక్కన లిఖించు
వారు నౌ నన్నఁ దోడ్తెచ్చు వారు గలరె?
నీటిలో జాడఁ బుట్టించు నేర్పు నీక
కాక గల్గునె మూఁడు లోకములయందు?

10.2-371-వచనము

అని వినుతించి చిత్రరేఖను నిజమందిరమునకుఁబోవం బనిచినం జనియె; నంనంతరంబ వింతజనులకెవ్వరికింబ్రవేశింపరాని యంతఃపుర సౌధాంతరంబున ననిరుద్ధుండు మేల్కని యయ్యింతిం గనుంగొని, యప్పుడు.

10.2-372-కంద పద్యము

సురుచిర మృదుతల్పంబునఁ
బరిరంభణ సరసవచన భావకళా చా
తురి మెఱయ రాకుమారుఁడు
తరుణీమణిఁ బొందె మదనతంత్రజ్ఞుండై.

10.2-373-వచనము

ఇవ్విధంబున నతిమనోహర విభవాభిరామంబులగు దివ్యాంబరాభరణ మల్యానులేపనంబులను, గర్పూర తాంబూలంబులను, వివిధాన్నపానంబులను, సురుచిర మణిదీప నీరాజనంబులను, సుగంధబంధురాగరుధూపంబులను, నాటపాటల వీణావినోదంబులను, బరితుష్టిం బొంది కన్యాకుమారకు లానంద సాగరాంతర్ని మగ్నమానసులై యుదయాస్తమయ నిరూపణంబుసేయనేరక, ప్రాణంబు లొక్కటియైన తలంపులం గదిసి యిష్టోపభోగంబుల సుఖియించుచుండి; రంత.

10.2-374-కంద పద్యము

ఆలోనన నతిచిర మగు
కాలము సుఖలీల జరుగఁగా వరుస నుషా
బాలాలలామ కొయ్యనఁ
జూ లేర్పడి గర్భ మొదవె సురుచిరభంగిన్.

10.2-375-కంద పద్యము

ఆ చిన్నె లంగజాలలు
సూచి భయాకులత నొంది స్రుక్కుచుఁ దమలో
నో చెల్ల! యెట్టులో? యీ
రా చూలికిఁ జాలు నిలిచెరా! యిబ్బంగిన్

10.2-376-కంద పద్యము

అని గుజగుజ వోవుచు ని
ప్పని దప్పక దనుజలోక పాలునితోడన్

వినిపింపవలయు నని వే
చని బాణునిఁ జేరి మ్రొక్కి సద్వినయమునన్.

10.2-377-కంద పద్యము

మంతనమున దేవర! క
న్యాంతఃపుర మేము గాచి యరయుచు నుండన్
వింతజనములకుఁ జొరఁగ దు
రంతము విను పోతుటీఁగకైన సురారీ!

10.2-378-తేటగీతి

ఇట్టిచోఁ గావలున్న మే మెవ్వరమును
నేమి కనుమాయయో కాని యెఱుఁగ మధిప!
నీ కుమారిక గర్భంబు నివ్వటిల్ల
యున్న దన్నను విని రోషయుక్తుఁ డగుచు.

10.2-379-వచనము

అట్టియెడ దానవేంద్రుండు రోషభీషణాకారుండై, కటము లదర, బొమలుముడివడం, గనుంగవల ననలకణంబు లుప్పతిల్ల, సటలు వెఱికినం జటులగతి నెగయు సింగంబు విధంబున లంఘించుచు, భీకర కరవాలంబు గేలందాల్చి సముద్దండగతిం గన్యాసౌధాంతరంబునకుం జని.

## 10.2-35- అనిరుద్ధుని నాగపాశబద్ధంబు

10.2-380-సీస పద్యము

కనియె శుభోపేతుఁ గందర్పసంజాతు;

మానితదేహు నాజానుబాహు
మకరకుండలకర్ణు, మహితప్రభాపూర్ణుఁ;
జిరయశోల్లాసుఁ గౌశేయవాసుఁ
గస్తూరికాలిప్తు ఘనకాంతికుముదాప్తు;
హారశోభితవక్షు నంబుజాక్షు
యదువంశతిలకు మత్తాలినీలాలకు;
నవపుష్పచాపుఁ బూర్ణప్రతాపు

10.2-380.1-తేటగీతి

నభినవాకారు నక్షవిద్యావిహారు
మహితగుణవృద్ధు మన్మథమంత్రసిద్ధుఁ
గలితపరిశుద్ధు నఖిలలోకప్రసిద్ధు
జతురు ననిరుద్ధు నంగనాజననిరుద్ధు.

10.2-381-చంపకమాల

కని కన లగ్గలింప సురకంటకుఁ డుద్ధతి సద్భటావళిం
గనుఁగొని యీనరాధముని గట్టుఁడు; పట్టుఁడు; కొట్టుఁడన్న వా
రనుపమ హేతిదీధితు లహర్పతి తేజము మాయఁ జేయ డా
సిన నృపశేఖరుండు మదిఁ జేవయు లావును నేర్పు దర్పమున్.

10.2-382-చంపకమాల

కలిగి మహోగ్రవృత్తిఁ బరిఘుంబు గరంబున లీలఁ దాల్చి దో
ర్బల ఘనవిక్రమప్రళయభైరవు భంగి విజృంభణక్రియా
కలన నెదిర్చె దానవ నికాయముతోఁ దలపాటుఁ బోటునుం

జలములబలంబు ధైర్యమునుశౌర్యము ప్రేటునువాటుఁజూపుచున్

10.2-383-చంపకమాల

పదములుబాహులుందలలు ప్రక్కలుచెక్కులుజానుయుగ్మముల్
రదములుగర్ణముల్ మెడలురంబులుమూఁపులువీఁపులూరువుల్
చిదురుపలై ధరం దొఱఁగఁ జిందఱవందఱ సేయ సైనికుల్
కదన పరాఙ్ముఖక్రమముఁ గైకొని పాఱిరి కాందిశీకులై.

10.2-384-వచనము

ఇవ్విధంబున సైన్యంబు దైన్యంబునొంది వెఱచియుం, బఱచియు, విచ్చియుం, జచ్చియుఁ, గలంగియు, నలంగియు, విఱిగియు, నురిఁగియుఁ, జెదరియుబెదరియుఁ, జేవదఱిఁగి నుఱుములై తన మఱుఁగు నొచ్చిన, బాణుండు శౌర్యధురీణుండును, గోపోద్దీపిత మానసుండునై కదిసి యేసియు, వ్రేసియుఁ, బొడిచియు, నడిచియుఁ, బెనంగి

10.2-385-కంద పద్యము

క్రుద్ధుండై యహిపాశ ని
బద్ధుం గావించె నసురపాలుఁడు రణ స
న్నద్ధున్ శరవిద్ధున్నని
రుద్ధున్ మహితప్రబుద్ధు రూపసమృద్ధున్.

10.2-386-వచనము

ఇట్లు కట్టిత్రోచిన నుషాసతి శోకవ్యాకులితచిత్తయై యుండె నంత.

10.2-387-కంద పద్యము

నీలపటాంచితమై సువి
శాలంబై వాయునిహతిఁ జండధ్వని నా
భీలమగు నతని కేతన
మాలోన నకారణంబ యవనిం గూలెన్.

10.2-388-కంద పద్యము

అది చూచి దనుజపాలుఁడు
మదనాంతకుఁ డాడినట్టి మాట నిజముగాఁ
గదనంబు గలుగు ననుచును
నెదురెదురే చూచుచుండె నెంతయుఁ బ్రీతిన్.

10.2-389-వచనము

అంత నక్కడ.

10.2-390-కంద పద్యము

ద్వారకలో ననిరుద్ధకు
మారుని పోకకును యదుసమాజము వగలం
గూరుచు నొకవార్తయు విన
నేరక చింతింప నాల్గునెల లరిగె నృపా!

## 10.2-36- బాణాసురునితో యుద్ధంబు

10.2-391-వచనము

అయ్యవసరంబున.

10.2-392-కంద పద్యము

శారద నిర్మల నీరద
పారద రుచి దేహుఁ డతుల భాగ్యోదయుఁ డా
నారదముని యేతెంచె న
పార దయామతి మురారిభజనప్రీతిన్.

10.2-393-వచనము

ఇట్లు సనుదెంచిన యద్దివ్యమునికి నిర్మల మణివినిర్మిత సుధర్మాభ్యంతరంబున యదువృష్టిభోజాంధక వీరులు గొలువం గొలువున్న గమలలోచనుండు ప్రత్యుత్థానంబు చేసి, యర్ఘ్యపాద్యాది విధులం బూజించి, సముచిత కనకాసనాసీనుం జేసిన నత్తాపసోత్తముండు పురుషోత్తము నుదాత్తతేజోనిధిం బొగడి, యనిరుద్ధు వృత్తాంతం బంతయుఁ దేటపడ నెఱింగించి, యప్పుండరీకాక్షుని చేత నామంత్రణంబు వడసి, యంతర్ధానంబు నొందెఁ; దదనంతరంబ కృష్ణుండు శుభముహూర్తంబున దండయాత్రాభిముఖుండై ప్రయాణభేరి వ్రేయించి, బలంబుల వెడలింప బ్రద్దలవారిం బనిచి; తానును గట్టాయితంబయ్యె; నంత.

10.2-394-సీస పద్యము

హార కిరీట కేయూర కంకణ కటి;
కాంగుళీయక నూపురాది వివిధ
భూషణప్రతతిచేఁ బొలుపారు కరముల;
ఘనగదా శంఖ చక్రములు దనర
సురభి చందన లిప్త సురుచి రోరస్స్థలిఁ;

బ్రవిమల కౌస్తుభ ప్రభలు నిగుడఁ
జెలువారు పీత కౌశేయచేలము కాసె;
వలనుగా రింగులువాఱఁ గట్టి

10.2-394.1-తేటగీతి

శైబ్య సుగ్రీవ మేఘ పుష్పక వలాహ
కములఁ బూన్చిన తే రాయితముగఁ జేసి
దారుకుఁడు దేర నెక్క మోదం బెలర్ప
భానుఁ డుదయాచలం బెక్కు పగిది మెఱసి.

10.2-395-వచనము

ఇట్లు రథారోహణంబు సేసి, భూసురాశీర్వచన పూతుండును, మహితదుర్వాంకు రాలంకృతుండును, లలితపుణ్యాంగనా కరకిసలయకలిత శుభాక్షత విన్యాస భాసురమస్తకుండును, మాగధ మంజుల గానానుమోదితుండును, వందిజనసంకీర్తనా నందితుండును, బాఠక పఠనరవ వికాసిత హృదయుండును నయి వెడలు నవసరంబున.

10.2-396-సీస పద్యము

బలభద్ర సాత్యకి ప్రద్యుమ్న ముఖ యదు;
వృష్ణి భోజాంధక వీరవరులు
దుర్వార పరిపంథి గర్వ భేదన కళా;
చతురబాహాబలోత్సాహలీల
వారణ స్యందన వాజి సందోహంబు;
సవరణ సేయించి సంభ్రమమున

సముచిత ప్రస్థాన చటుల భేరీ భూరి;
ఘోష మంభోనిధి ఘోష మడఁప

10.2-396.1-తేటగీతి

ద్వాదశాక్షౌహిణీ బలోత్కరము లోలి
నడచెఁ గృష్ణునిరథము వెన్నంటి చెలఁగి
పృథులగతి మున్ భగీరథు రథము వెనుక
ననుగమించు వియన్నది ననుకరించి.

10.2-397-వచనము

ఇవ్విధంబునం గదలి కతిపయప్రయాణంబుల శోణపురంబు సేరంజని వేలాలంఘనంబు సేసి యదువీరు లంత.

10.2-398-మత్తేభ విక్రీడితము

సరిదారామ సరోవరోపవన యజ్ఞస్థానముల్ మాపి వే
పరిఖల్ పూడిచి యంత్రముల్ దునిమి వప్రవ్రాతముల్ ద్రొబ్బి గో
పురముల్ గూలఁగఁ ద్రోచి సౌధ భవనంబుల్ నూకి ప్రాకారముల్
ధరణిం గూల్చి కవాటముల్ విటిచి రుద్దండక్రియాలోలురై.

10.2-399-వచనము

ఇట్లనేక ప్రకారంబులు గాసిచేసి, పురంబు నిరోధించి పేర్చి యార్చినంజూచి యాగ్రహసమగ్రోగ్రమూర్తియై బాణుండు సమరసన్నాహసంరంభ విజృంభమాణుండై సంగరభేరి వ్రేయించిన.

10.2-400-సీస పద్యము

దర్పాంధచేతస్కుండై ద్వారకానగరంబుపైఁజని నిజసేనాసమేతంబుగాఁ దత్పురంబు నిరోధించి.

10.2-838-సీస పద్యము

సరిదుపవన సరోవరములు మాయించి;
 బావులు గలఁచి కూపములు సెఱిచి
కోటలు వెస వీటతాటముల్ గావించి;
 పరిఖలు పూడ్చి వప్రములు ద్రొబ్బి
యట్టళ్లు ధరఁ గూల్చి యంత్రముల్ దునుమాడి;
 కాంచనధ్వజపతాకములు నఱికి
భాసుర గోపుర ప్రాసాదహర్మ్యందు;
 శాలాంగణములు భస్మములు చేసి

10.2-838.1-తేటగీతి

విమల కాంచనరత్నాది వివిధవస్తు
కోటి నెల్లను నందంద కొల్లపుచ్చి
ప్రజలఁ జెఱపట్టి దొరలను భంగపెట్టి
తఱిమి యుబ్బంగిఁ బెక్కుబాధల నలంచి.

10.2-839-చంపకమాల

మదమున నంతఁ బోవక విమానయుతంబుగ నభ్రవీథికిన్
గొదకొని యేపుమై నెగసి క్రొంకక శక్తి శిలా మహీరుహ
ప్రదరము లోలిమైఁ గురిసి బంధురభూమిపరాగ శర్కరల్
వదలక చల్లుచున్ వలయవాయువుచే దిశ లావరించుచున్.

10.2-840-వచనము

అట్టియెడ.

10.2-841-కంద పద్యము

చటులపురత్రయదనుజో

త్కటదుస్తర బాధ్యమానధారుణిగతి న

ప్పుటభేదన మెంతయు వి

స్ఫుటపీడం జెంది వగల సుడివడుచుండన్.

10.2-842-చంపకమాల

కని భగవంతుఁడున్ రథిశిఖామణియున్నగు రౌక్మిణేయుఁ డ

జ్జనముల నోడకుండుఁ డని సంగరకౌతుక మొప్ప దివ్య సా

ధనములఁ బూని సైనిక కదంబము గొల్వ ననూన మీన కే

తన రుచి గ్రాల నున్నతరథస్థితుఁడై వెడలెన్ రణోర్వికిన్.

10.2-843-వచనము

అయ్యవసరంబున.

10.2-844-చంపకమాల

సమధిక బాహుశౌర్యజితచండవిరోధులు వెల్లి రున్నత

క్షమ గద భానువింద శుక సాత్యకి సారణ చారుదేష్ణ సాం

బ మకరకేతనాత్మజ శ్వఫల్కతనూభవ తత్సహోదర

ప్రముఖ యదూత్తముల్ విమతభంజనులై కృతవర్మమున్నుగన్

10.2-845-కంద పద్యము

వారణ వాజిస్యందన
వీరభటావలులు సనిరి విశ్వము వడఁకన్
ఘోరాకృతి వివిధాయుధ
భూరిద్యుతు లర్కబింబము గబళింపన్.

## 10.2-64- యదు సాల్వ యుద్ధంబు

### 10.2-846-వచనము

చని యా గోవిందనందన స్యందనంబుం బలసందోహంబునుం దలకడచి, యదు సైన్యంబులు సాల్వబలంబులతోడం దార్కొని పెరయునప్పుడు దేవదానవ సంకులసమర విధంబునం దుములం బయ్యె; నయ్యెడ.

### 10.2-847-మత్తేభ విక్రీడితము

వితతజ్యాచయ టంకృతుల్ మదజలావిర్భూతశుండాల ఘీం
కృతు లుద్యద్భటహుంకృతుల్ మహితభేరీభాంకృతుల్ భీషణో
ద్ధతనిస్సాణధణంకృతుల్ ప్రకటయోధవ్రాతసాహంకృతుల్
కుతలంబున్ దివి నిండ మ్రోసె రిపుసంక్షోభంబుగా భూవరా!

### 10.2-848-మత్తేభ విక్రీడితము

హరిరింఖారథనేమి సద్భటపదవ్యాఘట్టనోద్ధూత దు
స్తరధూళీపటలప్రభూత నిబిడధ్వాంతప్రవిధ్వంస కృ
త్కర శాతాసి గదాది హేతిరుచు లాకాశంబు నిండన్ వియ
చ్చర దృక్కుల్ మిఱుమిట్లు గొల్ప సమరోత్సాహంబు సంధిల్లఁగన్.

### 10.2-849-చంపకమాల

తలకొని సైనికుల్ గవిసి తార్కొని పేర్కొని పాసి డాసి యం
కిలి గొనకెమ్ములమ్ములఁ బగిల్చి నొగిల్చితరేతరుల్ తలల్
నలియఁగ మొత్తి యొత్తి నయనంబులు నిప్పులు రాల లీల నొ
దలలు లలాటముల్ ఘనగదాహతి నొంచి కలంచి పోరఁగన్.

10.2-850-వచనము

అయ్యవసరంబునం బ్రద్యుమ్నుండు గనుంగొని.

10.2-851-మత్తేభ విక్రీడితము

అనయంబుం గలుషించి సౌభపతి మాయాకోట్లు చంచచ్ఛరా
సన నిర్ముక్త నిశాత దివ్యమహితాస్త్రశ్రేణిచేఁ దత్క్షణం
బున లీలాగతి నభ్రగుల్ మనములన్ భూషింప మాయించె న
వ్వనజాతాప్తుఁడు భూరి సంతమసమున్ వారించు చందంబునన్

10.2-852-వచనము

మఱియును.

10.2-853-చంపకమాల

అతిరథికోత్తముం డన నుదంచితకాంచనపుంఖ పంచ విం
శతివిశిఖంబులన్నతని సైనికపాలుని నొంచి యుగ్రుఁడై
శత శతకోటికోటినిభసాయకముల్ పరఁగించి సాల్వభూ
పతి కకుదంబు నొంచి లయభైరవుకైవడిఁ బేర్చి వెండియున్.

10.2-854-చంపకమాల

పదిపది యమ్ములన్ మనుజపాలవరేణ్యుల నొంచి రోషముం

గదురఁగ మూఁడుమూఁడు శితకాండములన్ రథదంతివాజులం
జదియఁగ నేసి యొక్కొక నిశాతశరంబున సైనికావలిన్
మదము లడించి యిట్లతఁ డమానుషలీలఁ బరాక్రమించినన్.

10.2-855-కంద పద్యము

దుర్మానవహరు నద్భుత
కర్మమునకు నుభయ సైనికప్రకరంబుల్
నిర్మలమతి నుతియించిరి
భర్మాచలధైర్య విగతభయుఁ బ్రద్యుమ్నున్.

10.2-856-వచనము

అయ్యవసరంబున.

10.2-857-ఉత్పలమాల

సాంబుని సాల్వభూవిభుఁడు సాయకజాలము లేసి నొంచినన్
జాంబవతీతనూభవుఁడు చాపము సజ్యము సేసి డాసి సా
ల్వుం బదియేను తూపుల నవోన్నతవక్షము గాఁడనేసి శా
తాంబకవింశతిన్నతని సౌభక మల్లలనాడ నేసినన్.

10.2-858-చంపకమాల

గదుఁడు మహోగ్రవృత్తి నిజకార్ముక నిర్గతవిస్ఫురద్విధుం
తుదవదనాభబాణవితతుల్ పరఁగించి విరోధిమస్తముల్
గుదులుగ గ్రుచ్చియెత్తుచు నకుంఠిత విక్రమకేళిలోలుఁడై
చదల సురల్ నుతింప రథిసత్తముఁ డొప్పె నరేంద్రచంద్రమా!

10.2-859-ఉత్పలమాల

సాత్యకి చండరోషమున సాల్వమహీవరు భూరిసౌభ సాం
గత్య చతుర్విధోగ్రబలగాఢతమఃపటలంబు భాసురా
దిత్యమయూఖపుంజరుచితీవ్రశరంబులఁ జూపి సైనిక
స్తుత్యపరాక్రమప్రకటదోర్బలుఁడై విలసిల్లె భూవరా!

10.2-860-ఉత్సాహవృత్తము

భానువిందుఁ డుద్ధతిన్ విపక్షపక్షసైన్య దు
ర్మాన కాననానలోపమాన చండ కాండ సం
తాన మూన నేసి చూర్ణితంబు చేసెఁ జూప వి
ద్యా నిరూఢి దేవతావితాన మిచ్చ మెచ్చఁగాన్.

10.2-861-ఉత్సాహవృత్తము

చారుదేష్ణుఁ డాగ్రహించి శత్రుభీషణోగ్ర దో
స్సారదర్ప మేర్పడన్ నిశాత బాణకోటిచే
దారుణప్రతాప సాల్వదండనాథమండలిన్
మారి రేఁగినట్లు పిల్కుమార్చి పేర్చి యార్చినన్.

10.2-862-కంద పద్యము

శుకుఁ డా యోధన విజయో
త్సుకమతి బాహాబలంబు సొప్పడ విశిఖ
ప్రకరంబులఁ దను శౌర్యా
ధికుఁ డన విద్వేషిబలతతిం బరిమార్చెన్.

10.2-863-ఉత్పలమాల

సారణుఁ డేపుమైఁ గదిసి శాత్రవవీరులు సంచలింప దో

స్సార మెలర్పఁ గుంత శర శక్తి గదా క్షురికాది హేతులన్

వారక వాజి దంతి రథవర్గములం దునుమాడి కాల్వురన్

వీరముతోడఁ బంపె జమువీటికిఁ గాఁపుర ముగ్రమూర్తియై.

10.2-864-కంద పద్యము

అక్రూరుఁడు దదనుజులు న

వక్రపరాక్రమము మెఱసి వైరుల బాహా

విక్రమమున వధియించిరి

చక్రప్రాసాది వివిధ సాధనములచేన్.

10.2-865-మత్తేభ విక్రీడితము

కృతవర్మక్షితినాయకుండు విశిఖశ్రేణిం బ్రమత్తార్యధి

శ్రితవర్మంబులఁ జించి మేనుల శతచ్ఛిద్రంబులం జేయ న

ద్భుతకర్మం బని సైనికుల్ వొగడ శత్రుల్ దూలుచో సంగర

క్షితిధర్మంబుఁ దలంచి కాచె రథికశ్రేష్ఠుండు భూమీశ్వరా!

10.2-866-వచనము

అయ్యవసరంబున సాల్వుండు గోపోద్దీపితమానసుండై యుండ

మాయావిడంబకంబైన సౌభకం బప్పుడు.

10.2-867-సీస పద్యము

ఒకమాటు నభమునఁ బ్రకటంబుగాఁ దోఁచు;

నొకమాటు ధరణిపై నొయ్య నిలుచు
నొకమాటు శైలమస్తకమున వర్తించు;
నొకపరిఁ జరియించు నుదధినడుమ
నొక్క తోయంబున నొక్కటియై యుండు;
నొక్కెడఁ గనుఁగొనఁ బెక్కు లగును
నొకమాటు సాల్వసంయుక్తమై పొడసూపు;
నొక తోయ మన్నియు నుడిగి తోఁచు

10.2-867.1-ఆటవెలది
నొక్కతేప కొఱవి యుడుగక త్రిప్పిన
గతి మహోగ్రవృత్తిఁ గానవచ్చు
మఱియుఁ బెక్కుగతుల నరివరుల్ గలఁగంగఁ
దిరిగె సౌభకంబు ధీవరేణ్య!

10.2-868-వచనము
ఇవ్విధంబున సౌభకంబు వర్తించుటం జేసి యదుసైన్యంబులచే దైన్యంబు నొందిన నిజసైన్యంబుల మరలం బురికొల్పి సాల్వుం డప్పుడు.

10.2-869-కంద పద్యము
స్ఫురదనలాభశరంబులు
పొరిఁబొరి బుంఖానుపుంఖములుగా నేయం
దెరలియు మరలియు మురిసియు
విరిసియుఁ బిఱుతివక పోరె పెస యదుబలముల్.

10.2-870-కంద పద్యము

అయ్యెడ మానము వదలక
డయ్యక మగపాడితో దృఢంబుగఁ బోరన్
దయ్య మెఱుంగును? నెక్కటి
కయ్యం బపుడయ్యెఁ బేరుగల యోధులకున్.

10.2-871-కంద పద్యము

మును ప్రద్యుమ్నకుమారుని
ఘననిశితాస్త్రములచేతఁ గడు నొచ్చిన సా
ల్వుని మంతిరి ద్యుమనాముఁడు
సునిశిత గదచే నమర్చి సుమహితశక్తిన్.

10.2-872-చంపకమాల

పెరవును లావుఁ జేవయును వీరముఁ బీరము గల్గి డాసి యా
సరసిజనాభనందను విశాలభుజాంతరముం బగిల్చినన్
విరవిరవోయి మేను నిడుపెంగ్రుక పెట్టఁగఁ జేతిఁ సాధనో
త్కరములు దేరిపై వదలి కన్నులుమూయుచు మూర్ఛనొందినన్

10.2-873-ఆటవెలది

సమరధర్మ వేది సమధిక నయవాది
దారుకుని సుతుండు ధైర్యయుతుఁడు
రథముఁ దోలికొనుచు రణభూమి వెడలి వే
చనియె మూర్ఛదేఱ శంబరారి.

10.2-874-ఉత్పలమాల

సారిథిఁ జూచి యిట్లనియె శాత్రవవీరులు సూచి నవ్వఁగాఁ
దేరు రణక్షితిన్ వెడలఁ దెచ్చితి తెచ్చితి దుర్యశంబు పం
కేరుహనాభుఁడున్ హలియు గేలికొనన్ యదువంశసంభవుల్
బీరము దప్పి యిప్పగిదిఁ బెల్కుఱి వోవుదురే రణంబునన్.

10.2-875-వచనము

అనిన నతం డతని కిట్లనియె.

10.2-876-కంద పద్యము

రథి రిపుచే నొచ్చిన సా
రథియును, సారథియు నొవ్వ రథియును గావం
బృథుసమర ధర్మ; మిఁక న
వ్యథచిత్తుఁ డవగుచుఁ గడఁగు పైరుల గెలువన్.

10.2-877-వచనము

అనిన విని.

10.2-878-ఉత్పలమాల

సంచితభూరిబాహుబల శౌర్యుఁడు సారథిమాట కాత్మ మో
దించి యుదాత్తకాండ రుచిదీపితచాపముఁ దాల్చి మౌర్వి సా
రించి గుణధ్వనిన్ బృహదరిప్రకరంబుల భీతి ముంచి తో
లించె రథంబు మేదిని చలింపఁగ నా ద్యుముమీఁద నేర్పునన్.

10.2-879-వచనము

అట్లు డగ్గఱి.

10.2-880-చంపకమాల

అరితను వష్ట బాణముల నాగ్రహవృత్తిఁ బగిల్చి నాల్గిటం
దురగములన్ వధించి యొక తూపున సారథిఁ ద్రుంచి రెంటని
ష్ఠురతర కేతుచాపములు చూర్ణముచేసి యొకమ్మునన్ భయం
కరముగఁ ద్రుంచె నా ద్యుమునికంఠ మకుంఠిత విక్రమోద్ధతిన్.

10.2-881-మత్తేభ విక్రీడితము

కని సాంబప్రముఖాది యోధవరు లుత్కంఠాత్ములై మీన కే
తను నగ్గించి సువర్ణపుంఖ నిశితాస్త్రశ్రేణి సంధించి సా
ల్వుని సైన్యావలి మస్తముల్ వెరవు లావున్ మీఱఁగా నొక్క యె
త్తున వేత్రుంచిరి తాటిపండ్లు ధరఁ దోడ్తో రాల్చు చందంబునన్.

10.2-882-వచనము

అట్టి యెడ.

10.2-883-స్రగ్ధర

కూలున్ గుఱ్ఱంబులేనుంగులు ధరఁగె;
డయుంగుప్పలై; నుగ్గునూచై
వ్రాలున్దేరుల్ హతంబై వడిఁబడుసు;
భటవ్రాతముల్; శోణితంబుల్
గ్రోలున్, మాంసంబునంజుంగొఱకు,నెము;
కలన్నుంపులైసోలుచున్నే

తాలక్రవ్యాదభూతోత్కరములు, జ;
 తలై తాళముల్ దట్టి యాడున్.

10.2-884-వచనము

మఱియు నొక్కయెడ.

10.2-885-సీస పద్యము

ఖండిత శుండాల గండముల్ నక్రముల్;
 భూరితుండంబులు భుజగ సమితి;
పదతలంబులు గచ్ఛపంబులు; దంతముల్;
 శుక్తులు; గుంభనిర్ముక్త మౌక్తి
కములు రత్నములు; వాలములు జలూకముల్;
 మెదలు భేకంబులు; మెదడు రొంపి;
ప్రేవులు పవడంపుఁ దీవెలు; నరములు;
 నాఁచు; మజ్జంబు ఫేనంబు; లస్థి

10.2-885.1-ఆటవెలది

సైకతములు; రక్తచయము తోయంబులు;
నొరగు నెడల నొరలు మొఱలు ఘన త
రంగరవముగా మతంగజాయోధన
స్థలము జలధిఁ బోల్పఁ దగె నరేంద్ర!

10.2-886-వచనము

ఇవ్విధంబున యదుసాల్వబలంబులు చలంబునఁ బరస్పర జయకాంక్షలం దలపడి పోరు పూర్వపశ్చిమ సముద్రంబుల వడువున నిరువదియేడు దినంబు లతిఘోరంబుగాఁ బోరునెడ నింద్రప్రస్థపురంబు నుండి ద్వారకానగరంబునకు నగధరుండు సనుదేర ముందటం గానవచ్చు దుర్నిమిత్తంబులం గనుంగొని కృష్ణుండు దారుకునిం జూచి యిట్లనియె.

## 10.2-65- కృష్ణ సాళ్వ యుద్ధంబు

### 10.2-887-శార్దూల విక్రీడితము

**కంటే** దారుక! దుర్నిమిత్తము లనేకంబుల్ మహాభీలముల్
**మింటన్** మేదినిఁ దోఁచుచున్నయవి; నెమ్మిన్ ఖాండవప్రస్థ మే
**నుంటం** జైద్యహితక్షితీశ్వరులు మాయోపాయులై మత్పురిం
**గెంటిం**పం జనుదేరఁ బోలుదురు; పోనీ తేరు వేగంబునన్.

### 10.2-888-వచనము

అని యతిత్వరితగతిం జనుదెంచి తత్పురంబు డగ్గఱి మహాబల పరాక్రమంబులం బ్రతిపక్షబలంబులతోడం దలపడి పోరు యదు బలంబులును నభోవీథి నభేద్య మాయా విడంబనంబునం బ్రతివీరు లెంతకాలంబునకు నే యుపాయంబునను సాధింప నలవి గాని సౌభకవిమానంబు నందున్న సాల్వునిం గని తద్విమానంబు డాయం దన తేరు దోల సారథిని నియమించి కదియంజను మురాంతకుని వీక్షించి యదు సైనిక ప్రకరంబులు పరమానందంబునం బొందిరి; మృతప్రాయంబులై యున్న సైన్యంబులం గనుంగొని సౌభకపతి విక్రమక్రియాకలాపుం డగుచు నురవడించి.

10.2-889-చంపకమాల

మిడుఁగురులు లెల్లెడం జెదర; మింటను మంటలు పర్వ; ఘుంటికా
ఘణఘణ భూరినిస్వన నికాయమునన్ హరిదంతరాళముల్
వణఁక; మహోగ్రశక్తిఁ గొని వారక దారుకుమీఁద వైవ దా
రుణగతి నింగినుండి నిజరోచులతోఁ బడు చుక్కకైవడిన్.

10.2-890-కంద పద్యము

వడిఁ జనుదేరఁగఁ గని య
ప్పుడు నగధరుఁ డలతి లీలఁ బోలెన్ దానిం
బొడిపొడియై ధరఁ దొరఁగఁగఁ
నడుమన వెసఁ ద్రుంచె నొక్క నారాచమునన్.

10.2-891-చంపకమాల

గురుభుజుఁ డంతఁ బోవక యకుంఠిత శూరత శత్రుసైన్యముల్
దెరలఁగ నుగ్రతం గొలవిఁ ద్రిప్పిన కైవడి మింట దిర్దిరం
దిరుగుచు దుర్నిరీక్ష్యమగు దీపితసౌభము సాల్వుఁ జండభా
స్కర కిరణాభ షోడశ నిశాతశరంబులఁ గాఁడ నేసినన్.

10.2-892-చంపకమాల

కడు వడి నల్గి వాఁడు నిజకార్ముకమున్ జలదస్వనంబుకై
వడి మొరయించుచున్ వెడఁద వాతి శరంబులఁ బద్మలోచను
న్నడమభుజంబు గాఁడ వడి నేసినఁ దెంపటి చేతి శార్ఙ్గమున్
విడిచె రథంబుపై గగనవీథి సురల్ భయమంది చూడఁగన్.

10.2-893-కంద పద్యము

హాహా యని భూతావళి
హాహాకారములు సేయ నంతట దేవ
న్నాహరిఁ గనుఁగొని యతఁ డు
త్సాహంబునఁ బలికె బాహుశౌర్యస్ఫూర్తిన్.

10.2-894-చంపకమాల

నళినదళాక్ష! మత్సఖుఁడు నాఁ దగు చైద్యుఁడు గోరినట్టి కో
మలి నవినీతిమైఁ దగవుమాలి వరించితి; వంతఁ బోక దో
ర్బలమున ధర్మనందును సభాస్థలి నేమఱి యున్న వాని న
చ్చలమునఁ జంపి తట్టి కలుషంబున నేఁడు రణాంగణంబునన్.

10.2-895-కంద పద్యము

తల చెడి పాఱక బాహా
బల మొప్పఁగ నాదు దృష్టిపథమున ధృతితో
నిలిచిన నిష్ఠుర విశిఖా
ర్భుల ముంచి మదీయసఖుని సూ డిటు దీర్తున్.

10.2-896-చంపకమాల

అనిన మురాంతకుండు దరహాసము మోమునఁ దొంగలింప నా
ల్పునిఁ గని యోరి! లావు బలుపుంగల పోటరి పోలెఁ బ్రేలె దే
మనినను బాటు సన్నిహితమౌట యెఱుంగవు మూఢచిత్త! వా
మ్మని గదఁ గేలఁ ద్రిప్పి యభియాతిని శత్రుని వ్రేసె నుద్ధతిన్.

10.2-897-వచనము

అట్లు వ్రేసిన.

10.2-898-కంద పద్యము

పెనుమూర్ఛ నొంది వెస ము
క్కున వాతను నెత్తురొల్కఁ గొంతవడికి నొ
య్యన తెలిసి నిలువరింపక
చనె వాఁడు నదృశ్యుఁ డగుచు సౌభముఁ దానున్.

10.2-899-వచనము

అయ్యవసరంబున.

10.2-900-తేటగీతి

గగన మందుండి యొకఁ డార్తుఁ డగుచు వచ్చి
నందనందను పాదారవిందములకు
వందనము సేసి యానకదుందుభిని మ
హోగ్రుఁడై పట్టితెచ్చె సాల్వుండు గడఁగి.

10.2-901-తేటగీతి

దేవ! మీ కెఱిఁగింపఁగాఁ దివిరి యిటకు
దేవకీదేవి నన్నుఁ బుత్తెంచె ననఁగ
విని సరోరుహనాభుఁడు ఘన విషాద
మగ్నుఁ డయ్యెను గురుమీఁది మమతఁ జేసి.

10.2-902-కంద పద్యము

నర గంధర్వ సురాసుర
వరులకు నిర్జింపరాని వాఁడు బలుం డే
మఱి కరయ హీనబలుచేఁ
బరికింపఁగ నెట్లు పట్టువడు నొకొ యనుచున్

10.2-903-వచనము

మఱియును.

10.2-904-కంద పద్యము

భావంబు గలఁగ నాహా!
దైవకృతం బెవ్వరికిని దప్పింపఁగ రా
దే విధి నైనను నని శో
కావిలమతిఁ బలుకుచున్న నత్తఱి వాఁడున్.

10.2-905-వచనము

తన మాయాబలంబునఁ గ్రమ్మఱం దోఁచి కృతక వసుదేవునిం గల్పించి యతనిం బంధించి కొనితెచ్చి "పుండరీకాక్ష! నిరీక్షింపు భవజ్జనకుండు వీఁడె; యిప్పుడు నీవు గనుంగొన వీని తలఁద్రుంతు నింక నెవ్వనికింగా మనియెదు? కావంగల శక్తిగలదేనిం గావు" మని దురాలాపంబు లాడుచు మృత్యుజిహ్వాకరాళంబైన కరవాలంబు గేలంబూని జళిపించుచు నమ్మాయావసుదేవుని శిరంబు దునిమి తన్మస్తకంబు గొని వియద్వర్తి యై చరియించు సౌభక విమానంబు సొచ్చె; నంత గోవిందుండు గొంతతడవు మనంబున ఘనంబగు శోకంబునం గుందుచుండి యాత్మసైనికులు దెలుపం దెలివొంది యది మయోదితంబైన సాల్వుని మాయోపాయం బని యెఱింగె; నంతం దనకు వసుదేవుండు పట్టువడె నని

చెప్పిన దూతయు నమ్మాయాకళేబరంబును నా క్షణంబ విచిత్రంబుగా మాయంబై పోయె; ననంతరంబ.

10.2-906-కంద పద్యము

మును లపుడు గొంద ఱచటికిఁ
జనుదెంచి విమోహియైన జలజదళాక్షుం
గనుఁగొని సమధికభక్తిన్
వినయంబునఁ బలికి రంత విష్ణున్ జిష్ణున్.

10.2-907-సీస పద్యము

కమలాక్ష! సర్వలోకములందు సర్వ మా;
నవులు సంసార నానావిధైక
దుఃఖాబ్ధిమగ్నులై తుదిఁ జేరనేరక;
వికలత్వమునఁ బొందు వేళ నిన్నుఁ
దలఁచి దుఃఖంబులఁ దరియింతు రట్టి స;
ద్గుణనిధి వై దేవకోటికెల్లఁ
బట్టుగొమ్మై పరబ్రహ్మాఖ్యఁ బొగడొంది;
పరమయోగీశ్వర ప్రకరగూఢ

10.2-907.1-తేటగీతి

పరచిదానంద దివ్యరూపమున వెలుఁగు
దనఘ! నీ వేడ? నీచజన్మాత్మ జనిత
ఘన భయస్నేహ మోహాశోకంబు లేడ?
ననుచు సంస్తుతి సేసి వారరిగి రంత.

## 10.2-66- సాళ్వుని వధించుట

10.2-908-చంపకమాల

హరి దనమీఁద ఘోరనిశితాశుగజాలము లేయు సాల్వభూ
వరు వధియింపఁ గోరి బహువారిద నిర్గతభూరివృష్టి వి
స్ఫురణ ననూన తీవ్రశరపుంజములన్ గగనంబుఁ గప్పి క
చ్ఛఱ రిపుమౌళిరత్నమునుఁజాపమువర్మముఁ ద్రుంచివెండియున్.

10.2-909-మత్తేభ విక్రీడితము

వితతక్రోధముతోడఁగృష్ణుఁడు జగద్విఖ్యాతశౌర్యక్రియో
ద్ధతశక్తిన్ వడిఁ ద్రిప్పి మింట మెఱుఁగుల్ దట్టంబుగాఁ బర్వ ను
గ్రతఁ బంచద్గద వైచి త్రుంచె వెసఁ జూర్ణంబై ధరన్ రాల నా
యతభూరిత్రిపురాభమున్ మహితమాయాశోభమువ్ సౌభమున్.

10.2-910-వచనము

అట్లు కృష్ణుం డమ్మయనిర్మిత మాయావిమానంబు నిజగదాహతి నింతింతలు తునియలై సముద్రమధ్యంబునం దొరంగం జేసిన సాల్వుండు గోఱలు వెఱికిన భుజంగంబు భంగి గండడంగి విన్ననై విగతమాయాబలుం డయ్యును బొలివోవని బీరంబున వసుధా తలంబునకు డిగ్గి యాగ్రహంబున.

10.2-911-కంద పద్యము

కరమునఁ బవినిభ మగు భీ
కర గద ధరియించి కదియఁగాఁ జనుదేరన్
మురహరుఁ డుద్ధతి సాల్వుని

కరము గదాయుక్తముగను ఖండించె నృపా!

10.2-912-కంద పద్యము

అంతం బోవక కినుక న

నంతుఁడు విలయార్కమండలాయతరుచి దు

ర్దాంతంబగు చక్రంబు ని

తాంతంబుగఁ బూన్చి సాల్వధరిణిపుమీఁదన్.

10.2-913-కంద పద్యము

గురుశక్తి పైచి వెస భా

సురకుండలమకుటరత్నశోభితమగు త

చ్ఛిరము వడిఁ ద్రుంచె నింద్రుఁడు

వరకులిశముచేత వృత్రు వధియించు క్రియన్.

## 10.2-67- దంతవక్త్రుని వధించుట

10.2-914-వచనము

ఇట్లు మాయావి యైన సాల్వుండును సౌభకంబును గృష్ణుచేతం బొలియుటఁ గనుంగొని నిజసఖులగు సాల్వ పౌండ్రక శిశుపాలురకుఁ బారలౌకికక్రియలు మైత్రిం గావించి దంతవక్త్రుం డతి భీషణాకారంబుతో నప్పుడు.

10.2-915-చంపకమాల

పెట పెటఁ బండ్లు గీఁటుచును బెట్టుగ మ్రోయుచుఁ గన్ను గ్రేవలం

జిటచిట విస్ఫులింగములు సింద మహోద్ధతపాదఘట్టన

న్నటనిటనై ధరిత్రి వడఁకాడ వడిన్ గద కేలఁ ద్రిప్పుచున్

మిటమిట మండు వేసవిని మించు దివాకరుఁ బోలి యుగ్రతన్.

10.2-916-చంపకమాల

వడిఁ జనుదేరఁ జూచి యదువల్లభుఁ డుల్లము పల్లవింప న
ప్పుడు గదఁ గేలఁబూని రథమున్ రయమొప్పఁగ డిగ్గి యుగ్రతం
గడఁగి విరోధికిన్నెదురుగాఁ జన వాఁ డతినీచవర్తియై
యడరుచు నట్టహాసముఖుడై వలచే గదఁ ద్రిప్పుచున్ హరిన్.

10.2-917-వచనము

కనుంగొని పరిహాసోక్తులుగా నిట్లనియె, "నీవు మదీయభాగ్యంబునం జేసి నేఁడు నా దృష్టిపథంబునకు గోచరుండవైతివి; మిత్రద్రోహివైన నిన్ను మాతులేయుండ వని మన్నింపక దేహంబు నందు వర్తించు నుగ్రవ్యాధి నౌషధాదిక్రియల నివర్తింపఁజేయు చికిత్సకుని చందంబున బంధురూపశాత్రవుండవు గావున నిన్ను దంభోళి సంరంభ గంభీరంబైన మదీయ గదాదండహతిం బరేత నివాసంబున కనిచి మున్ను నీచేత నిహతులైన నాదు సఖుల ఋణంబుఁ దీర్తు" నని దుర్భాషలాడుచు డగ్గఱి.

10.2-918-చంపకమాల

పెనుగదఁ బూన్చి కృష్ణుతల బెట్టుగ మొత్తిన నంకుశాహతిం
గనలెడి గంధసింధురముకైవడి సింధురభంజనుండు పెం
పున పవిభాసమానగదఁ బూని మహోగ్రతఁ ద్రిప్పి దంతవ
క్త్రుని యురముంబగిల్చినఁగుదుల్కొనుచున్రుధిరంబు గ్రక్కుచున్

10.2-919-వచనము

తత్క్షణంబ పర్వతాకారంబగు దేహంబుతో నొఱలుచు నేలంగూలి కేశపాశంబులు సిక్కువడఁ దన్నుకొనుచుఁ బ్రాణంబులు విడిచె; నప్పుడు నిఖిల భూతంబులు నాశ్చర్యంబు వొందఁ దద్గాత్రంబున నుండి యొక్క సూక్ష్మతేజంబు వెలువడి గోవిందునిదేహంబుఁ బ్రవేశించె; నయ్యవసరంబున నగ్రజు మరణంబు గనుంగొని కుపితుండై కనుఁగవల నిప్పులుప్పతిల్ల విదూరథుండు గాలానల జ్వాలాభీలకరాళంబైన కరవాలంబును బలకయుం గేలందాల్చి దామోదరు దెసకుఁ గవయుటయుం గనుంగొని.

10.2-920-చంపకమాల

జలరుహలోచనుండు నిజసాధనమై తనరారు చక్రమున్
వలనుగఁ బూన్చి పైవ నది వారక వాని శిరంబు ద్రుంచె న
బ్బలియుఁడు సౌభ సాల్వ శిశుపాల సహోదర తత్సహోదరా
వలుల వధించి తత్కులము వారి ననేకులఁ ద్రుంచె నీ గతిన్.

10.2-921-వచనము

అయ్యవసరంబున.

10.2-922-కంద పద్యము

నర ముని యోగి సురాసుర
గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ
శ్చర కిన్నర కింపురుషులు
హరిమహిమ నుతించి రద్భుతానందములన్.

10.2-923-వచనము

మఱియు నప్సరోజనంబులు నృత్యంబులు సలుప, వేల్పులు కుసుమ వర్షంబులు గురియ, దేవతూర్యంబు లవార్యంబులై మొరయ, యదు వృష్ణి ప్రవరులు సేవింపఁ, బరమానందంబును బొంది నిజవిజయాంకితంబు లైన గీతంబుల వందిజనంబులు సంకీర్తనంబులు సేయ, నతి మనోహర విభవాభిరామంబును, నూతనాలంకారంబును నైన ద్వారకానగరంబు శుభముహూర్తంబునం బ్రవేశింపం జనునెడ.

10.2-924-కంద పద్యము

పురసతులు విరులు లాజలు

గురుసౌధాగ్రములనుండి కురియఁగ వికచాం

బురుహాక్షుం డంతఃపుర

వర మర్థిం జొచ్చె వైభవం బలరారన్.

10.2-925-వచనము

అట్లు యోగీశ్వరేశ్వరుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును, నిఖిలజగదీశ్వరుండును నైన పురుషోత్తముండు సుఖంబుండె; నంత.

10.2-926-కంద పద్యము

కౌరవ పాండవ పృథు సమ

రారంభ మెఱింగి తీర్థయాత్ర నెపముగా

సీరాంకుఁ డుభయకులులకు

నారయ సముఁ డగుటఁ జేసి యరిగె నరేంద్రా!

## 10.2-68- బలరాముని తీర్థయాత్ర

### 10.2-927-వచనము

అట్లు సని మొదలం ప్రభాసతీర్థంబున నవగాహంబు సేసి, యందు దేవర్షిపితృతర్పణంబులు సంప్రీతిం గావించి విమలతేజోధను లగు భూసురప్రవరులు దనతో నరుగుదేరం గదలి చని క్రమంబున సరస్వతియు బిందుసరోవరంబును వజ్రతీర్థంబును విశాలానదియు సరయువును యమునయు జాహ్నవీతీర్థంబును గనుంగొనుచు నచటనచట నవగాహన దేవర్షిపితృతర్పణ బ్రాహ్మణ సంతర్పణంబు లను భూసుర యుక్తుండై నడపుచుం జని సకలలోకస్తుత్యంబును నిఖిలముని శరణ్యంబు నగు నైమిశారణ్యంబు నొచ్చి; యందు దీర్ఘసత్త్రంబు నడపుచున్న ముని జనంబులం గనుం గొనిన; వారును ప్రత్యుత్థానంబు సేసి రామునకు వినతులై యాసన పూజా విధానంబులు గావించిన నతండును బ్రముదిత మానసుం డగుచు సపరివారంబుగాఁ గూర్చున్న యెడ.

### 10.2-928-కంద పద్యము

ఆ నెఱిఁ దనుఁ గని ప్రత్యు
త్థాన నమస్కారవిధులు దగ నడపక పెం
పూనిన పీఠముపై నా
సీనుండగు సూతు శేముషీవిఖ్యాతున్.

### 10.2-929-వచనము

కనుంగొని యతని సమీపంబున నున్న విప్రవరులం జూచి రాముండు రోషించి "వీఁడు నన్నుఁ గని లేవకుండుటకు హేతు వెయ్యదియొకో? ఈ

ప్రతిలోమజాతుండు మునిగణ సభాస్థలంబునఁ దానొక్క ముఖ్యుండ పోలె దురభిమానంబున శక్తిమను మని వలనంగొన్ని కథలు గాథలు గఱచి విద్వద్గణ్యుని విధంబున విఱ్ఱవీఁగెడును; నీచాత్ముం డభ్యసించు విద్య లెల్లను మనంబున విచారించి చూచిన మదకారణంబులు గాని సత్త్వగుణగరిష్ఠంబులు గావు; ధర్మసంరక్షణంబు సేయ నవతరించిన మాకు నిట్టి దుష్టమర్దనం బవశ్యకర్తవ్యం, బని తలఁచి హస్తంబున ధరించిన కుశాగ్రంబున నా సూతుని వధించిన నక్కడి మునీంద్రు లెల్ల హాహాకారంబులతోడం దాలాంకునిఁ జూచి యిట్లనిరి.

10.2-930-కంద పద్యము

అనఘా! యితనికి బ్రహ్మా
సన మే మిచ్చుటను నీవు సనుదే నితఁ డా
సనము దిగఁడయ్యె నింతయు
మును నీమది నెఱుఁగ నర్థముం గలదె? హలీ!

10.2-931-కంద పద్యము

ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యా
దురితంబున నీమనంబు దూకొనెఁ బాపో
త్తరణప్రాయశ్చిత్తము
దొరఁకొని కావింపు మయ్య దుర్జనహరణా!

10.2-932-వచనము

అదియునుం గాక పరమపావనుండవైన నీవు ధర్మంబుదప్పిన నెవ్వరు మాన్పంగలరు? కావునఁ బ్రాయశ్చిత్తంబు గైకొని నడపకున్న ధర్మంబు నిలువ;

దట్లుగావున దీనికిఁ బ్రతీకారంబు పుట్టింపు" మనిన నతండు వారలం గనుంగొని "తామసంబున నిట్టి పాపంబు సేయంబడియె; దీనికి ముఖ్యపక్షంబునఁ బ్రతికృతి యెఱింగింపుండు, వీనికి నాయువును బహుసత్త్వంబును నొసంగిన మీకిష్టంబగునే నట్లు నాయోగమాయచేఁ గావింతు" నన నమ్మునులు నీయస్త్రమాహాత్మ్యంబునకు మృత్యువునకు మాకు నెవ్విధంబున వైకల్యంబు నొందకుండునట్లు గావింపుమనిన నతం డందఱం జూచి యప్పుడు.

10.2-933-కంద పద్యము

ధాత్రీవర సమధిక చా

రిత్రుఁడు హలపాణి పలికె ధృతి నాత్మ పై

పుత్రక నామాసి యను ప

విత్రశ్రుతి వాక్యసరణి విశదం బగుటన్.

10.2-934-కంద పద్యము

ఈ సూతసూనుఁ డిపుడు మ

హాసత్త్వము నాయువును ననామయమును వి

ద్యా సామర్థ్యము గలిగి సు

ధీసత్తములార! యూక్తితిన్ విలసిల్లున్.

10.2-935-వచనము

అని సూతుం బునర్జీవితుంగాఁ జేసి మునులం జూచి యిట్లనియె.

10.2-936-తేటగీతి

ఏ నెఱుంగక చేసిన యీ యవజ్ఞ

శాంతి వొంద నేయది యభీష్టంబు మీకు
దానిఁ గావింతు ననిన మోదంబు నొంది
పలికి రత్తాపసులు హలపాణిఁ జూచి.

10.2-937-చంపకమాల

హలధర! యిల్వలుండను సురారితనూజుఁడు పల్వలుండు నాఁ
గలఁడొక దానవుండు బలగర్వమునం బ్రతిపర్వమందు న
చ్చలమున వచ్చి మా సవనశాలల మూత్ర సురాస్ర పూయ వి
ట్చలలము లోలిమైఁ గురిసి పాడఱఁ జేయును యజ్ఞవాటముల్.

10.2-938-వచనము

కావున దుష్టదానవుం ద్రుంచుటయు మాకుం గరంబు సంతసం బగు; నంతమీఁద నీవు విమలచిత్తుండవై భారతవర్షంబునం గల తీర్థంబుల ద్వాదశమాసంబు లవగాహనంబు సేయు; మట్లయిన సర్వపాపనిష్కృతి యగునని పలుకునంతఁ బర్వసమాగమంబైన.

10.2-939-సీస పద్యము

మునులు యజ్ఞక్రియోన్ముఖు లౌటఁ గనుఁగొని;
పఱతెంచి యసుర తద్భవనములను
రక్త విణ్మూత్ర సురామాంసజాలంబు;
నించి హేయంబు గావించి పెలుచఁ
బెంధూళి ఱాలును బెల్లలు నురలెడు;
చక్రానిలము వీఁచి చదల నపుడు
గాటుకకొండ సంగతిఁ బొల్చు మేను తా;

మ్రుశ్మశ్రు కేశ సమాజములును

10.2-939.1-తేటగీతి

నవ్యచర్మాంబరము భూరినాసికయును
గలకు మిడి గ్రుడ్లు నిప్పులు గ్రక్కు దృష్టి
వ్రేలు పెదవులు దీర్ఘకరాళ జిహ్వ
కయును ముడివడ్డబొమలును గలుగువాని.

10.2-940-మహాస్రగ్ధర

కనియెం దాలాంకుఁ డుద్యత్కటచటు;
ల నటత్కాలదండాభశూలున్
జనరక్తాసిక్తతాలున్ సమధిక;
సమరోత్సాహలోలుం గరోరా
శనితుల్యోదగ్ర దంష్ట్రా జనిత శి;
ఖకణాచ్ఛాదితాశాంతరాళున్
హననవ్యాపారశీలున్నతి;
దృఢ ఘనమస్తాస్థిమాలుం గరాళున్

10.2-941-ఉత్పలమాల

వెండియుఁ గ్రొమ్మెఱుంగు లుడువీధి వెలుంగఁగ నుల్లసద్గదా
దండముఁ గేలఁ ద్రిప్పుచు నుదారత రా బలభద్రుఁ డాసురో
ద్దండవిఘాతులౌ ముసలదారుణలాంగలముల్ దలంప మా
ర్తాండనిభంబులై యెదురఁ దత్క్షణమాత్రన తోఁచినన్ వెసన్.

10.2-942-వచనము

అట్లు సన్నిహితంబులైన తన కార్యసాధనంబులగు నిజసాధనంబులు ధరియించి యప్పుడు.

## 10.2-69- బలుడు పల్వలుని వధించుట

10.2-943-చంపకమాల

గగనమునం జరించు సురకంటకు కంఠము చేఁతినాగటం
దగిలిచి రోఁక లెత్తి బెడిదం బడరన్ నడునెత్తి మొత్తినన్
బుగబుగ నెత్తు రొల్క నిల బోరగిలం బడె వజ్రధారచేఁ
దెగి ధరఁ గూలు భూరి జగతీధరముం బురుడింప బెట్టుగాన్.

10.2-944-వచనము

అట్లు పల్వలుండు మడిసిన.

10.2-945-కంద పద్యము

మునివరులు గామపాలుని
వినుతించిరి వేయువేల విధముల వృత్రుం
దునిమిన యింద్రుని నమరులు
వినుతించిన రీతి నపుడు విమలచరిత్రా!

10.2-946-తేటగీతి

అంత నభిషిక్తుఁ జేసి యత్యంత సురభి
మంజులామ్లాన కంజాత మాలికయును
నంచితాభరణములు దివ్యాంబరములు

నర్థి నిచ్చినఁ దాల్చి యా హాలధరుండు.

10.2-947-కంద పద్యము

దేవేంద్రుఁ బోలి యొప్పెను
ధీవిలసితుఁ డగుచు మునితతిన్ వీడ్కొని తన్
సేవించుచుఁ గతిపయ వి
ప్రావలి సనుదేరఁ గౌశికాఖ్యంబునకున్.

10.2-948-వచనము

చని యమ్మహానదిం గృతస్నానుండై యచ్చోటు వాసి సరయువు నందుఁ గ్రుంకులిడి ప్రయాగ నవగాహనంబు సేసి దేవర్షి పితృతర్పణంబు లాచరించి పులస్త్యాశ్రమంబు నొచ్చి గోమతిం దర్శించి గండకీనది నుత్తరించి విదళితభవపాశయగు విపాశయందుఁదోఁగి శోణనదంబున నాప్లావితుండై గయనాడి గంగాసాగరసంగమంబు దర్శించి మహేంద్రనగంబున కరిగి.

10.2-949-కంద పద్యము

రాముఁడు గనుఁగొనె భార్గవ
రామున్ రజనీశ కులధరావరనగ సు
త్రామున్ సన్నుత సుగుణ
స్తోమున్ గారుణ్యసీము సుజనలలామున్.

10.2-950-ఆటవెలది

కని నమస్కరించి కౌతుకం బలరార
నతని వీడుకొని హలాయుధుండు

గోమరుమిగిలి సప్తగోదావరికి నేఁగి
యందుఁ దీర్థమాడి యచటు గదలి.

10.2-951-వచనము

వేణీపంపాసరస్సులంజూచి, భీమనదికేఁగి యందుఁ గుమారస్వామిని దర్శించి, శ్రీశైలంబునకుఁ జని, వేంకటాచలంబు దర్శించి, కామకోటి శక్తిని నిరీక్షించి, కాంచీపురంబుం గాంచి, కావేరికిం జని యమ్మహావాహిని నవగాహనంబు సేసి.

10.2-952-స్రగ్ధర

సేవించెన్ రంగధామున్ శ్రితనివహపయస్సింధుసంపూర్ణసోముం
గావేరీ మధ్యసీమున్ ఘనకలుష మహాకాలకూటోగ్ర భీమున్
దేవారిశ్రీ విరామున్ దివిజవినుత సందీపితానంత నామున్
ధీవిజ్ఞానాభిరాముం ద్రిభువన విలసద్దేవతా సార్వభౌమున్.

10.2-953-వచనము

అచ్చోటు వాసి వృషభాద్రి నెక్కి, హరిక్షేత్రంబు ద్రొక్కి, మధురాపురంబున కరిగి, సేతుబంధనంబు మెట్టి, యచటం బదివేల పాఁడిమొదవుల భూసురుల కిచ్చి, రామేశ్వరుం దర్శించి, తామ్రపర్ణికిం జని, మలయాచలంబెక్కి, యగస్త్యునింగని నమస్కరించి, దక్షిణసముద్రంబు దర్శించి, కన్యాఖ్యదుర్గాదేవి నుపాసించి, పంచాప్సరంబను తీర్థంబున నాప్లవనం బాచరించి, గోకర్ణంబున నిందుమౌళిని దర్శించి, ద్వీపవతి యైన కామదేవిని వీక్షించి, తాపింబయోష్ణిని దర్శించి, నిర్వింధ్యంబు గడచి, దండకావనంబున కరిగి, మాహిష్మతీపురంబున వసియించి, మనుతీర్థం బాడి, క్రమ్మఱం బ్రభాసతీర్థంబునకు వచ్చి యచ్చటి బ్రాహ్మణ జనంబుల వలన బాండవధార్తరాష్ట్రుల భండనంబునందు సకలరాజలోకంబు

పరలోకగతు లగుటయు, వాయునందన సుయోధనులు గదాయుద్ధ సన్నద్ధులై యుండుటయు నెఱింగి వారల వారించు తలంపున నచటికిం జని.

10.2-954-తేటగీతి

ధర్మనందనుఁ దనకు వందనము సేయు
కృష్ణు నరు మాద్రిసుతుల నీక్షించి యేమి
పలుక కుగ్ర గదాదండపాణు లగుచుఁ
గ్రోధమునఁ బోరు భీమ దుర్యోధనులను.

10.2-955-వచనము

చూచి వారల డాయం జని యిట్లనియె.

10.2-956-సీస పద్యము

వీరపుంగవులార! వినుఁడు; మీలోపల;
భూరిభుజాసత్త్వమున నొకండు
ప్రకటితాభ్యాస సంపద్విశేషంబున;
నొక్కండు యధికుఁడై యుంటఁ జేసి
సమబలు; లటు గాన చర్చింపఁగా నిందు;
జయ మొక్కనికి లేదు సమరమందుఁ;
గాన యూరక పోరఁగా నేల మీకని;
వారింప నన్యోన్య వైరములను

10.2-956.1-తేటగీతి

నడరి తొల్లింటి దుర్భాష లాత్మలందుఁ

దలఁచి తద్భాషణము లపథ్యములు గాఁగ
మొక్కలంబునఁ బోర నా ముష్టికాసు
రారి వీక్షించు వీరి శుభాశుభములు,

10.2-957-వచనము

ఎట్లుగావలయు నట్ల యయ్యెడుం గాక యని; యచ్చోట నిలువక యుగ్రసేనాది బంధుప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన ద్వారకాపురంబు నొచ్చి; యందుండి మగిడి నైమిశారణ్యంబు నకుంజని; యందుల మునిపుంగవు లనుమతింప నచ్చట నొక మఖంబు గావించి బహుదక్షిణ లొసంగి; యంచితజ్ఞానపరిపూర్ణు లగునట్లుగా వరంబిచ్చి; రేవతియునుం దానును బంధు జ్ఞాతి యుతంబుగానవభృథస్నానం బాచరించి; యనంతరంబ.

10.2-958-చంపకమాల

విలసిత మాల్య చందన నవీన విభూషణ రత్న వస్త్రముల్
పొలుపుగఁ దాల్చి యంచిత విభూతిఁ దలిర్చెను బూర్ణచంద్రికా
కలిత సుధాంశురేఖ నెసకం బెసఁగన్ నిజబంధులోచనో
త్పలచయ ముల్లసిల్లఁ బరిపాండుర చారు యశోవిలాసుఁడై.

10.2-959-వచనము

ఇవ్విధంబున ననంతుండు నప్రమేయుండును మాయామానుష విగ్రహుండు నసంఖ్యబలశాలియు నైన బలదేవుం డతివైభవంబున నిజపురంబు ప్రవేశించి సుఖంబుండె” నని చెప్పి యిట్లనియె.

## 10.2-70- కుచేలోపాఖ్యాన ప్రారంభంబు

10.2-960-కంద పద్యము

హలధరుఁ డమర్త్య చరితుం
డలఘు భుజాబలుఁ డొనర్చు నద్భుత కర్మం
బులు పెక్కు నాల్గు మోములు
గల మేటియు లెక్క పెట్టఁ గలఁడె నరేంద్రా!

10.2-961-చంపకమాల

అనిన మునీంద్రుఁ గన్గొని ధరాధిపుఁ డిట్లను పద్మపత్రలో
చనుని యనంత వీర్యగుణ సంపద వేమఱు విన్న నైననుం
దనియదు చిత్త మచ్యుతకథావిభవం బొకమాటు వీనులన్
వినిన మనోజపుష్ప శరవిద్ధుఁడు నైన విరామ మొందునే?

10.2-962-వచనము

అదియునుం గాక.

10.2-963-చంపకమాల

హరిభజియించుహస్తములుహస్తము; లచ్యుతుఁగోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు; చక్రధరుఁ జేరిన చిత్తము చిత్త; మిందిరా
వరుఁగను దృష్టి దృష్టి; మురవైరి నుతించిన వాణి వాణి; య
క్షరుకథ లాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁబో భువిన్.

10.2-964-కంద పద్యము

హరిపాదతీర్థ సేవా

పరుఁడై విలసిల్లునట్టి భాగవతుని వి
స్ఫురితాంగము లంగము; లా
పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకు మునీంద్రా!

10.2-965-సీస పద్యము

అనుడు వేదవ్యాసతనయుఁ డా యభిమన్యు;
తనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి
జనవర! గోవింద సఖుఁడు కుచేలుండు;
నా నొప్పు విప్రుండు మానధనుఁడు
విజ్ఞాని రాగాది విరహితస్వాంతుండు;
శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు
విజితేంద్రియుఁడు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు;
బాధింప నొరులఁ గార్పణ్యవృత్తి

10.2-965.1-తేటగీతి

నడుగఁ బోవక తనకుఁ దా నబ్బినట్టి
కాసు పదివేల నిష్కముల్ గాఁ దలంచి
యాత్మ మోదించి పుత్రదారాభిరక్ష
యొక విధంబున నడుపుచు నుండు; నంత

10.2-966-సీస పద్యము

లలితపతివ్రతా తిలకంబు వంశాభి;
జాత్య తద్భార్య దుస్స్సహ దరిద్ర
పీడచేఁ గడు నొచ్చి పెదవులు దడుపుచు;

శిశువు లాఁకటి చిచ్చుచేఁ గృశించి
మలమల మాఁడుచు మానసం బెరియంగఁ;
బట్టెఁ డోరెము మాకుఁ బెట్టు మనుచుఁ
బత్త్రభాజనధృతపాణులై తనుఁ జేరి;
వేఁడిన వీనులుసూఁడినట్ల

10.2-966.1-ఆటవెలది

యైన నొకనాఁడు వగచి నిజాధినాథుఁ
జేరి యిట్లని పలికె నో జీవితేశ!
తట్టుముట్టాడు నిట్టి పేదఱిక మిట్లు
నోంప దీని కుపాయ మూహింప వైతి.

10.2-967-వచనము

అని మఱియు నిట్లనియె.

10.2-968-తేటగీతి

బాలసఖుఁడైన యప్పద్మపత్త్రనేత్రుఁ
గాన నేఁగి దారిద్ర్యాంధకార మగ్ను
లైన మము నుద్ధరింపుము; హరికృపా క
టాక్ష రవిదీప్తి వడసి మహాత్మ! నీవు.

10.2-969-వచనము

మఱియును.

10.2-970-చంపకమాల

వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు దాఁ గుశస్థలీ
పురమున యాదవప్రకరముల్ భజియింపఁగ నున్నవాఁడు; నీ
వరిగిన నిన్నుఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు ననూన సంపదల్.

10.2-971-మత్తేభ విక్రీడితము

కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడై నట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁపన్నంతన మెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్; సుని
శ్చలభక్తిన్ భజియించు వారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్?

10.2-972-కంద పద్యము

అని చెప్పిన నమ్మానిని
సునయోక్తుల కలరి భూమిసురుఁ డా కృష్ణుం
గన నేఁగుట యిహపర సా
ధనమగు నని మదిఁ దలంచి తన సతితోడన్.

10.2-973-తేటగీతి

నీవు సెప్పిన యట్ల రాజీవనేత్రు
పాదపద్మంబు లాశ్రయింపంగఁ జనుట
పరమశోభన మా చక్రపాణి కిపుడు
గాను కేమైనఁ గొంపోవఁ గలదె మనకు?

10.2-974-తేటగీతి

అనిన నయ్యింతి యౌఁగాక యనుచు విభుని
శిథిల వస్త్రంబు కొంగునఁ బృథుక తండు
లముల నొకకొన్ని ముడిచి నెయ్యమున ననుపఁ
జనియె గోవింద దర్శనోత్సాహి యగుచు.

10.2-975-వచనము

అట్లు సనుచుం దన మనంబున.

10.2-976-సీస పద్యము

ద్వారకానగరంబు నే రీతిఁ జొత్తును? ;
 భాసురాంతఃపురవాసి యైన
యప్పుండరీకాక్షు నఖిలేశు నెబ్భంగిఁ;
 దర్శింపఁ గలనొ? తద్ద్వారపాలు
రెక్కడి విప్రుఁడ? విం దేల వచ్చెద? ;
 వని యడ్డ పెట్టిరే నపుడు వారి
కే మైనఁ బరిదాన మిచ్చి చొచ్చెద నన్న;
 నూహింప నర్థశూన్యుండ నేను;

10.2-976.1-తేటగీతి

నయిన నా భాగ్య; మతని దయార్ద్రదృష్టి
గాక తలపోయఁగా నొండు గలదె? యాతఁ
డేల నన్ను నుపేక్షించు? నేటిమాట?
లనుచు నా ద్వారకాపుర మతఁడు సొచ్చి.

10.2-977-వచనము

ఇట్లు ప్రవేశించి రాజమార్గంబునం జనిచని కక్ష్యాంతరంబులు గడచి చని ముందట.

10.2-978-సీస పద్యము

విశదమై యొప్పు షోడశసహస్రాంగనా;
 కలితవిలాస సంగతిఁ దనర్చి
మహనీయ తపనీయ మణిమయగోపుర;
 ప్రాసాద సౌధ హర్మ్యములు సూచి,
మనము బ్రహ్మానందమును బొందఁ గడు నుబ్బి;
 సంతోషబాష్పముల్ జడిగొనంగఁ
బ్రకటమై విలసిల్లు నొక వధూమణి మంది;
 రమున నింతులు చామరములు వీవఁ

10.2-978.1-తేటగీతి

దనరు మృదుహంసతూలికా తల్పమందుఁ
దానుఁ బ్రియయును బహు వినోదములఁ దనరి
మహితలావణ్య మన్మథమన్మథుండు
ననఁగఁ జూపట్టు పుండరీకాయతాక్షు.

10.2-979-సీస పద్యము

ఇందీవరశ్యాము, వందితసుత్రాముఁ;
 గరుణాలవాలు, భాసుర కపోలుఁ
గౌస్తుభాలంకారుఁ, గామితమందారు;
 సురచిరలావణ్యు, సుర శరణ్యు

హర్యక్షనిభమధ్యు, నఖిలలోకారాధ్యు;
ఘనచక్రహస్తు, జగత్ప్రశస్తు,
ఖగకులాధిపయాను, గౌశేయపరిధాను;
బన్నగశయను, నబ్జాతనయను,

10.2-979.1-తేటగీతి

మకరకుండల సద్భూషు, మంజుభాషు
నిరుపమాకారు, దుగ్ధసాగరవిహారు,
భూరిగుణసాంద్రు, యదుకులాంభోధి చంద్రు,
విష్ణు, రోచిష్ణు, జిష్ణు, సహిష్ణుఁ, గృష్ణు.

## 10.2-71- కుచేలుని ఆదరించుట

10.2-980-మత్తేభ విక్రీడితము

కని డాయం జనునంతఁ గృష్ణుఁడు దళత్కంజాక్షుఁ డప్పేద వి
ప్రుని నశ్రాంత దరిద్రపీడితుఁ గృశీభూతాంగు జీర్ణాంబరున్
ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయున్ ఖండోత్తరీయుం గుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమ విలోలుండై దిగెం దల్పమున్.

10.2-981-కంద పద్యము

కర మర్థి నెదురుగాఁ జని
పరిరంభణ మాచరించి, బంధుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి, సమా
దరమునఁ గూర్చుండఁ బెట్టెఁ దన తల్పమునన్.

10.2-982-తేటగీతి

అట్లు గూర్చుండఁ బెట్టి నెయ్యమునఁ గనక
కలశ సలిలంబుచేఁ గాళ్ళు గడిగి భక్తిఁ
దజ్జలంబులు దనదు మస్తమునఁ దాల్చి
లలిత మృగమద ఘనసార మిళిత మైన.

10.2-983-తేటగీతి

మలయజము మేన జొబ్బిల్ల నలఁది యంత
శ్రమము వాయంగఁ దాళవృంతమున విసరి
బంధురామోదకలిత ధూపంబు లొసఁగి
మించు మణిదీపముల నివాళించి మఱియు.

10.2-984-వచనము

సురభికుసుమ మాలికలు సిగముడిం దుఱిమి, కర్పూరమిళిత తాంబూలంబు నిడి, ధేనువు నొసంగి, సాదరంబుగా స్వాగతం బడిగిన నప్పు డవ్విప్రుండు మేనం బులకాంకురంబు లంకురింప నానందబాష్ప జలబిందు సందోహం డయ్యె; నట్టియెడం బద్మలోచనుండు మన్నించు నంగనామణి యగు రుక్మిణి కరకంకణ రవంబు లొలయం జామరలు వీవం దజ్జాత వాతంబున ఘర్మసలిలంబు నివారించుచుండఁ జూచి శుద్ధాంత కాంతానివహంబులు దమ మనంబుల నద్భుతం బంది యిట్లనిరి.

10.2-985-ఉత్పలమాల

ఏమి తపంబు సేసెనొకొ! యీ ధరణీదివిజోత్తముండు తొల్
బామున! యోగివిస్ఫుర దుపాస్యకుఁడై తనరారు నీ జగ

త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవాఁ
డీ మహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్?

10.2-986-వచనము

అదియునుం గాక.

10.2-987-చంపకమాల

తన మృదుతల్పమందు వనితామణి యైన రమాలలామ పొం
దును నెడఁగాఁ దలంపక యదుప్రవరుం డెదురేఁగి మోదముం
దనుకఁగఁ గౌఁగిలించి యుచితక్రియలం బరితుష్టుఁ జేయుచున్
వినయమునన్ భజించె; ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుడో?

10.2-988-వచనము

అను నయ్యవసరంబున

10.2-989-కంద పద్యము

మురసంహారుఁడు కుచేలుని
కరము గరంబునఁ దెమల్చి కడఁకన్ మన మా
గురుగృహమున వర్తించిన
చరితము లని కొన్ని నుడివి చతురత మఱియున్.

10.2-990-సీస పద్యము

బ్రాహ్మణోత్తమ! వేదపాఠనలబ్ధ ద;
క్షత గల చారువంశంబు వలనఁ
బరిణయంబైనట్టి భార్య సుశీలవ;

ర్తనములఁ దగభవత్సదృశ యగునె?
తలఁప గృహక్షేత్ర ధనదార పుత్త్రాదు;
లందు నీ చిత్తంబు సెందకుంట
తోఁచుచున్నది; యేనుదుది లోకసంగ్రహా;
ర్థంబు కర్మాచరణంబుసేయు

10.2-990.1-తేటగీతి

గతి, మనంబులఁ గామమోహితులు గాక
యర్థిమై యుక్తకర్మంబు లాచరించి
ప్రకృతి సంబంధములు వాసి భవ్యనిష్ఠ
దవిలియుందురు కొంద ఱుత్తములు భువిని.

10.2-991-వచనము

అని మఱియు నిట్లనియె.

10.2-992-కంద పద్యము

ఎఱుఁగుదువె? మనము గురు మం
దిరమున వసియించి యతఁడు దెలుపఁగ వరుస
న్నెఱుఁగఁగ వలసిన యర్థము
లెఱిఁగి పరిజ్ఞానమహిమ లెఱుఁగుట లెల్లన్.

10.2-993-వచనము

అని మఱియు గురుప్రశంస సేయం దలంచి యిట్లనియె.

## 10.2-72- గురుప్రశంస చేయుట

10.2-994-తేటగీతి

తివిరి యజ్ఞానతిమిర ప్రదీపమగుచు
నవ్యయంబైన బ్రహ్మంబు ననుభవించు
భరితసత్త్వుండు సత్కర్మనిరతుఁ డతుల
భూసురశ్రేష్ఠుఁ డలఘుండు బుధనుతుండు.

10.2-995-వచనము

అమ్మహాత్మునివలన సకల వర్ణాశ్రమంబులవారికి నేను విజ్ఞానప్రదుండ నగు గురుండనై యుండియు గురుభజనంబు పరమధర్మం బని యాచరించితి; నదిగావున.

10.2-996-కంద పద్యము

భూసురులకెల్ల ముఖ్యుఁడ
నై సకల కులాశ్రమంబు లందును నెపుడున్
ధీసుజ్ఞానప్రదుఁ డన
దేశికుఁ డన నొప్పుచుందు ధృతి నెల్లెడలన్.

10.2-997-తేటగీతి

అట్టి వర్ణాశ్రమంబులయందు నర్థ
కుశలు లగువారు నిఖిలైక గురుఁడ నైన
నాదు వాక్యంబుచే భవార్ణవము పెలుచ
దాఁటుదురు మత్పదాంబుజ ధ్యానపరులు.

10.2-998-వచనము

అదియునుం గాక, సకల భూతాత్మకుండ నైన యేను దపోవ్రత యజ్ఞ దాన శమ దమాదులచేత సంతసింపను; గురుజనంబులఁ బరమభక్తి సేవించువారలం బరిణమింతు" ననిచెప్పి మఱియు "మనము గురుమందిరమున నున్న యెడ నొక్కనాఁడు గురుపత్నీ నియుక్తులమై యింధనార్థం బడవికిం జనిన నయ్యవసరంబున.

10.2-999-సీస పద్యము

ఘుమఘుమారావ సంకుల ఘోర జీమూత;
 పటల సంఛన్నాభ్రభాగ మగుచుఁ
జటుల ఝుంఝూనిలోత్కట సముద్ధూత నా;
 నావిధ జంతుసంతాన మగుచుఁ
జండ దిగ్వేదండ తుండ నిభాఖండ;
 వారిధారాపూర్ణ వసుధ యగుచు
విద్యోతమానోగ్రఖద్యోత కిరణజి;
 ద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు

10.2-999.1-తేటగీతి

నడరి జడిగురియఁగ నినుఁ డస్తమింప
భూరినీరంధ్రనిబిడాంధకార మేచి
సూచికాభేద్యమై వస్తుగోచరంబు
గాని యట్లుండ మనము న వ్వానఁ దడిసి.

10.2-1000-తేటగీతి

బయలు గొందియుఁ బెను మిట్టపల్లములును
రహిత సహితస్థలంబు లేర్పఱుపరాక
యున్న యత్తఱి మనము నొండొరుల చేతు
లూతఁగాఁ గొని నడచుచు నుండునంత.

10.2-1001-కంద పద్యము

బిసబిస నెప్పుడు నుడుగక
విసరెడి వలిచేత వడఁకు విడువక మనముం
బస చెడి మార్గముఁ గానక
మసలితి మంతటను నంశుమంతుఁడు పొడిచెన్.

10.2-1002-కంద పద్యము

తెలతెలవాఱెడి వేళం
గలకల మని పలికెఁ బక్షిగణ మెల్లెడలన్
మిలమిలని ప్రొద్దుపొడువున
ధళధళ మను మెఱుఁగు దిగ్వితానము నిండెన్.

10.2-1003-కంద పద్యము

అప్పుడు సాందీపని మన
చొప్పరయుచు వచ్చి వానసోఁకునను వలిం
దెప్పిఱిలుటఁ గని ఖేదం
బుప్పతిలం బలికె నకట! యో! వటులారా!

10.2-1004-చంపకమాల

కటకట! యిట్లు మా కొఱకుఁగాఁజనుదెంచి మహాటవిన్ సము
త్కటపరిపీడ నొందితిరి; గావున శిష్యులు! మీ ఋణంబు నీఁ
గుట కిది కారణంబు సమకూరెడిఁ బో; యిట మీఁద మీకు వి
స్ఫుట ధనబంధుదారబహుపుత్త్ర విభూతి జయాయురున్నతుల్.

10.2-1005-కంద పద్యము

కని గారవించి యాయన
మనలం దోడ్కొనుచు నాత్మమందిరమునకుం
జనుదెంచుట లెల్లను నీ
మనమునఁ దలఁతే యటంచు మఱియుం బలికెన్.

10.2-1006-వచనము

"అనఘ! మన మధ్యయనంబు సేయుచు నన్యోన్య స్నేహ వాత్స ల్యంబులం జేయు కృత్యంబులు మఱవవు గదా!" యని యవి యెల్లం దలంచి యాడు మాధవు మధురాలాపంబులు విని యతనిం గనుంగొని కుచేలుం డిట్లనియె.

10.2-1007-కంద పద్యము

వనజోదర! గురుమందిర
మున మనము వసించునాఁడు ముదమునఁ గావిం
పని పను లెవ్వియుఁ గలవే?
విను మవి యట్లుండనిమ్ము విమలచరిత్రా!

10.2-1008-కంద పద్యము

గురుమతిఁ దలఁపఁగఁ ద్రిజగ

ద్ధురుఁ డవనం దగిన నీకు గురుఁ డనఁగా నొం
డొరుఁ డెవ్వ? డింతయును నీ
కరయంగ విడంబనంబ యగుఁ గాదె హరీ!

10.2-1009-వచనము

అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని సమస్త భావాభిజ్ఞుండైన పుండరీకాక్షుండు మందస్మితవదనారవిందుం డగుచు నతనిం జూచి “నీవిచ్చటికి వచ్చునప్పుడు నాయందుల భక్తింజేసి నాకు నుపాయనంబుగ నేమి పదార్థంబు దెచ్చితి? వప్పదార్థంబు లేశమాత్రంబైనఁ బదివేలుగా నంగీకరింతు; నట్లుగాక నీచవర్తనుండై మద్భక్తిం దగులని దుష్టాత్ముండు హేమాచలతుల్యంబైన పదార్థంబు నొసంగిన నది నా మనంబునకు సమ్మతంబు గాదు; కావున.

10.2-1010-కంద పద్యము

దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ బాయని భక్తిం
గొలిచిన జను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్.

10.2-1011-కంద పద్యము

అని పద్మోదరుఁ డాడిన
వినియోక్తుల కాత్మ నలరి విప్రుఁడు దాఁ దె
చ్చిన యడుకులు దగ నర్పిం
పను నేరక మోము వాంచి పలుకక యున్నన్.

## 10.2-73- అటుకులారగించుట

### 10.2-1012-వచనము

అవ్విప్రుండు సనుదెంచిన కార్యంబు కృష్ణుండు దన దివ్యచిత్తంబున నెఱింగి "యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపండైన నిక్కుచేలుండు నిజకాంతాముఖోల్లాసంబుకొఱకు నా యొద్దకుఁ జనుదెంచిన వాఁ; డితనికి నింద్రాదులకుం బడయ రాని బహువిధంబులైన సంపద్విశేషంబు లీక్షణంబ యొడఁగూర్పవలయు" నని తలంచి యతండు జీర్ణవస్త్రంబు కొంగున ముడిచి తెచ్చిన యడుకుల ముడియఁ గని "యిది యేమి" యని యొయ్యన నమ్ముడియఁ దనకరకమలంబుల విడిచి యయ్యడుకులు కొన్ని పుచ్చుకొని "యివియ సకల లోకంబులను, నన్నును బరితృప్తిం బొందింపఁ జాలు" నని యప్పుడు.

### 10.2-1013-కంద పద్యము

మురహరుఁడు పిడికెఁ డడుకులు
గర మొప్పఁగ నారగించి కౌతూహలియై
మఱియును బిడికెఁడు గొనఁ ద
త్కర మప్పుడు పట్టెఁ గమల కరకమలములన్.

### 10.2-1014-కంద పద్యము

సొం పారఁగ నతనికి బహు
సంపద లందింప నివియ చాలును నీక భ
క్షింపఁగ వలవదు త్రిజగ
త్సంపత్కర! దేవదేవ! సర్వాత్మ! హరీ!

10.2-1015-వచనము

అని యిట్లు వారించె; నక్కుచేలుండును నా రాత్రి గోవిందు మందిరంబునఁ దనకు హృదయానందకరంబు లగు వివిధ పదార్థంబు లనుభవించి, మృదుల శయ్యాతలంబున నిద్రించి తన మనంబునం దన్ను సమధిక స్వర్గభోగానుభవుంగాఁ దలంచుచు మఱునాఁ డరుణోదయంబున మేల్కని కాలోచితకృత్యంబులు దీర్చి, యిందిరారమణుండు దన్నుఁ గొంత దవ్వనిపి యామంత్రితుం జేయఁజనుచు నందనందన సందర్శనానంద లోలాత్ముండై తన మనంబున నిట్లనియె.

10.2-1016-కంద పద్యము

నా పుణ్య మరయ నెట్టిదొ
యా పుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యునిఁ జి
ద్రూపకుఁ బురుషోత్తమునిఁ బరుం గనుఁగొంటిన్.

10.2-1017-సీస పద్యము

పరికింపఁ గృపణస్వభావుండ నై నట్టి;
యే నేడ? నిఖిలావనీశ్వరి యగు
నిందిరాదేవికి నెనయంగ నిత్య ని;
వాసుఁడై యొప్పు న వ్వాసుదేవుఁ
డేడ? న న్నర్థిమైఁ దోడఁబుట్టిన వాని;
కైవడిఁ గౌఁగిటఁ గదియఁ జేర్చి
దైవంబుగా నన్ను భావించి నిజతల్ప;

మున నుంచి సత్క్రియల్ పూనినడపి

10.2-1017.1-తేటగీతి

చారు నిజవధూ కరసరోజాత కలిత
చామరానిలమున గతశ్రమునిఁ జేసి
శ్రీకుచాలిప్త చందనాంచితకరాబ్జ
తలములను నడ్గు లొత్తె వత్సలత మెఱసి.

10.2-1018-వచనము

కావున.

10.2-1019-ఉత్పలమాల

శ్రీనిధి యిట్లు నన్నుఁ బచరించి ఘనంబుగ విత్త మేమియు
న్నీని తెఱంగు గానఁబడె; నెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరఁ డని కాక శ్రితార్తి హరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తుపరిపూర్ణునిఁగా ననుఁ జేయకుండునే?

10.2-1020-వచనము

అని తన మనంబున వితర్కించుచు నిజపురంబునకుఁ జనిచని ముందట.

10.2-1021-సీస పద్యము

భానుచంద్రప్రభా భాసమానస్వర్ణ;
చంద్రకాంతోపల సౌధములును
గలకంఠ శుక నీలకంఠ సముత్కంఠ;
మానిత కూజితోద్యానములును

ఫుల్లసితాంభోజ హల్లక కహ్లార;
 కైరవోల్లసిత కాసారములును
మణిమయ కనక కంకణ ముఖాభరణ వి;
 భ్రాజిత దాసదాసీజనములుఁ

10.2-1021.1-తేటగీతి

గలిగి చెలువొందు సదనంబుఁ గాంచి విస్మ
యమును బొందుచు నెట్టి పుణ్యాత్ముఁ డుండు
నిలయ మొక్కొ! యపూర్వమై నెగడె మహిత
వైభవోన్నత లక్ష్మీనివాస మగుచు.

10.2-1022-వచనము

అని తలపోయుచున్న యవసరంబున.

10.2-1023-తేటగీతి

దివిజ వనితలఁ బోలెడు తెఱవ లపుడు
డాయ నేతెంచి యిందు విచ్చేయుఁ డనుచు
విమల సంగీత నృత్య వాద్యములు సెలఁగ
గరిమఁ దోడ్కొని చని రంతిపురమునకును.

10.2-1024-వచనము

ఇట్లు సనుదేర నతని భార్య యైన సతీలలామంబు దన మనంబున నానందరసమగ్న యగుచు.

10.2-1025-సీస పద్యము

తన విభురాక ముందటఁ గని మనమున;
హర్షించి వైభవం బలర మనుజ
కామినీరూపంబు గైకొన్న యిందిరా;
వనిత చందంబునఁ దనరుచున్న
కలకంఠి తన వాలుఁగన్నుల క్రేవల;
నానందబాష్పంబు లంకురింప
నతని పాదంబుల కాత్మలో మ్రొక్కి భా;
వంబున నాలింగనంబు సేసె

10.2-1025.1-తేటగీతి

నా ధరాదేవుఁ డతుల దివ్యాంబరాభ
రణ విభూషితల్లై రతిరాజు సాయ
కముల గతి నొప్పు పరిచారికలు భజింప
లలిత సౌభాగ్య యగు నిజ లలనఁ జూచి.

10.2-1026-కంద పద్యము

ఆ నారీరత్నంబును
దానును ననురాగరసము దళుకొత్తఁగ ని
త్యానందము నొందుచుఁ బెం
పూనిన హరిలబ్ధ వైభవోన్నతి మెఱయన్.

10.2-1027-సీస పద్యము

కమనీయ పద్మరాగస్తంభకంబులుఁ;
గోమరారు పటికంపుఁ గుడ్యములును

మరకత నవరత్నమయ కవాటంబులుఁ;
గీలిత హరి నీల జాలకములు
దీపిత చంద్రకాంతోపల వేదులు;
నంచిత వివిధ పదార్థములును
దగు హంసతూలికా తల్పంబులును హేమ;
లాలిత శయనస్థలములుఁ దనరు

10.2-1027.1-తేటగీతి

సమధికోత్తుంగ భద్రపీఠముల సిరులు
మానితోన్నత చతురంతయానములును
వలయు సద్వస్తు పరిపూర్ణ వాటికలును
గలిగి చెలువొందు మందిరం బెలమిఁ జొచ్చి.

10.2-1028-వచనము

సుఖంబున నుండు నట్టియెడం దనకు మనోవికారంబులు వొడమకుండ వర్తించుచు, నిర్మలంబగు తన మనంబున నిట్లను; "నింతకాలం బత్యంత దురంతంబగు దారిద్ర్యదుఃఖార్ణవంబున మునింగి యున్న నాకుం గడపటఁ గలిగిన విభవంబున నిప్పుడు.

10.2-1029-ఆటవెలది

ఎన్నఁ గ్రొత్త లైన యిట్టి సంపదలు నా
కబ్బె టెల్ల హరిదయావలోక
నమునఁ జేసి కాదె! నళినాక్షుసన్నిధి
కర్థి నగుచు నేను నరుగుటయును.

10.2-1030-కంద పద్యము

నను నా వృత్తాంతంబును
దన మనమునఁ గనియు నేమి దడవక నను఼ బొ
మ్మని యీ సంపద లెల్లను
నొనరఁగ నొడఁగూర్చి నన్ను నొడయనిఁ జేసెన్.

10.2-1031-వచనము

అట్టి పురుషోత్తముండు భక్తినిష్ఠులైన సజ్జనులు లేశమాత్రంబగు పదార్థంబైన భక్తి పూర్వకంబుగా సమర్పించిన నది కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిదియ దృష్టాంతంబు గాదె! మలిన దేహుండును, జీర్ణాంబరుండు నని చిత్తంబున హేయంబుగాఁ బాటింపక నా చేనున్న యడుకు లాదరంబున నారగించి నన్నుం గృతార్థునిం జేయుట యతని నిర్హేతుక దయయ కాదె! యట్టి కారుణ్యసాగరుండైన గోవిందుని చరణారవిందంబుల యందుల భక్తి ప్రతిభవంబునఁ గలుగుంగాక!" యని యప్పుండరీకాక్షుని యందుల భక్తి తాత్పర్యంబునం దగిలి పత్నీసమేతుండై నిఖిల భోగంబులయందు నాసక్తిం బొరయక, రాగాది విరహితుండును నిర్వికారుండును నై యఖిలక్రియలందు ననంతుని యనంత ధ్యాన సుధారసంబునం జొక్కుచు విగత బంధనుండై యపవర్గ ప్రాప్తి నొందె; మఱియును.

10.2-1032-ఆటవెలది

దేవదేవుఁ డఖిల భావజ్ఞుఁ డాశ్రిత
వరదుఁ డైన హరికి ధరణిసురులు
దైవతములు గాన ధారుణీదివిజుల

కంటె దైవ మొకఁడు గలడె భువిని?

10.2-1033-కంద పద్యము

మురహరుఁ డిట్లు కుచేలుని

చరితార్థునిఁ జేసినట్టి చరితము విను స

త్పురుషుల కిహపరసుఖములు

హరిభక్తియు యశముఁ గలుగు నవనీనాథా!

## 10.2-74- శమంతకపంచకమునకరుగుట

10.2-1034-వచనము

అనిన మఱియుం బరాశరపౌత్రున కర్జునపౌత్రుం డిట్లనియె.

10.2-1035-ఆటవెలది

దుష్టశిక్షణంబు దురితసంహారణంబు

శిష్టరక్షణంబుఁ జేయఁ దలఁచి

భువిని మనుజుఁ డగుచుఁ బుట్టిన శ్రీ కృష్ణు

విమలచరిత మెల్ల విస్తరింపు.

10.2-1036-వచనము

అనిన శుకుం డిట్లనియె.

10.2-1037-సీస పద్యము

ధరణీశ! బలుఁడును సరసిజోదరుఁడు న;

వోన్నతసుఖలీల నుండునంతఁ

జటులోగ్రకల్పాంత సమయమందును బోలె;
దృగసహ్యమై సముద్దీప్త మగుచు
రాజిల్లు సూర్యోపరాగంబు సనుదెంచు;
టెఱిఁగి భూజను లెల్ల వరుసఁ గదలి
మును జమదగ్ని రాముఁడు పూని ముయ్యేడు;
మాఱులు ఘనబలోదారుఁ డగుచు

10.2-1037.1-తేటగీతి

నిజభుజాదండ మండిత నిబిడ నిశిత
చటుల దంభోళిరుచిరభాస్వత్కుఠార
మహితధారావినిర్భిన్న మనుజపాల
దేహనిర్ముక్త రుధిర ప్రవాహములను.

10.2-1038-తేటగీతి

ఏను మడువులు గావించె నెచటనేని
నట్టి పావనసుక్షేత్రమగు శమంత
పంచకంబున కపుడు సంభ్రమముతోడఁ
జనిరి బలకృష్ణులును సంతసం బెలర్ప.

10.2-1039-వచనము

ఇట్లు నిష్కర్మలైన రామకృష్ణులు లోక ధర్మానుపాలన ప్రవర్తనులై ద్వారకానగర రక్షణంబునకుం బ్రద్యుమ్న గద సాంబ సుచంద్ర శుక సార ణానిరుద్ధ కృతవర్మాది యోధవరుల నియమించి తాము నక్రూర వసుదేవోగ్రసేనాది సకల యాదవులుం గాంతాసమేతులై స్రక్చందన నాభరణ వస్త్రాదులు ధరియించి,

శోభనాకారంబులతోడం బుష్పక విమానంబులనం బొలుచు నరదంబులను, మేఘంబుల ననుకరించు గజంబులను, మనోవేగంబులైన తురగంబుల నెక్కి వియచ్చరులం బురుడించు పురుషులు దమ్ముం సేవింపం జని య పుణ్య తీర్థంబుల నవగాహనంబు సేసి యుపవసించి, యనంతరంబ.

10.2-1040-కంద పద్యము

భూసురవరులకు ననుపమ
వాసోలంకార ధేను వసు రత్న ధరి
త్రీ సుమహిత వస్తువు లు
ల్లాసంబున దాన మిచ్చి లాలితు లగుచున్.

10.2-1041-కంద పద్యము

పునరవగాహనములు పెం
పొనరం గావించి బంధుయుక్తముగా భో
జనకృత్యంబులు దీర్చి స
దనురాగము ుల్లసిల్ల నచ్చోటఁ దగన్.

10.2-1042-కంద పద్యము

ఘనశాఖాకీర్ణములై
యినరశ్ములు దూఱనీక యెసకం బెసఁగన్
ననిచిన పొన్నల నీడల
ననిచిన వేడుకల నందనందన ముఖ్యుల్.

10.2-1043-కంద పద్యము

తనరిన పల్లవ రుచిరా
సనముల నాసీను లగుచు సత్సుఖగోష్ఠిం
బెనువొందఁగ నట వసియిం
చినచోఁ దత్పుణ్యతీర్థ సేవారతులై.

10.2-1044-వచనము

మున్న చనుదెంచి యున్న మత్స్యోశీనర కోసల విదర్భ కురు సృంజయ కాంభోజ కేకయ మద్ర కుంత్యారట్ట కేరలాది భూపతులును, మఱియుం దక్కిన రాజవరులును, హితులును, నంద గోపాది గోపాలురును, గోపికాజనంబులును, ధర్మరాజానుగతులై వచ్చిన భీష్మ ద్రోణ ధృతరాష్ట్ర గాంధారీ కుంతీ పాండవ తద్దార నివహ సంజయ విదుర కృప కుంతిభోజ విరాట భీష్మక నగ్నజి ద్రుపద శైబ్య ధృష్టకేతు కాశిరాజ దమ ఘోష విశాలాక్ష మైథిల యుధామన్యు సుశర్మలును, సపుత్త్రకుండైన బాహ్లీకుండును మొదలుగాననేకులు నుగ్రసేనాది యాదవ ప్రకరంబులం బూజలం దృప్తులం జేసిన వారునుం బ్రముదితాత్ములై; రయ్యెడ.

10.2-1045-కంద పద్యము

ఆ రాజులు గాంచిరి నిజ
నారీయుతు లగుచు నంగనాపరివారున్
ధీరున్ దానవకులసం
హారున్ గోపీమనోవిహారు నుదారున్.

10.2-1046-వచనము

కని య మ్మాధవ బలదేవులు సేయు సముచిత పూజావిధానంబులం బరితృప్తులై, యమ్ముకుందు సాన్నిధ్యంబు గలిగి, తదీయ సంపద్విభవాభిరాము

లై విలసిల్లుచున్న యుగ్రసేనాది యదు వృష్ణి పుంగవులం జూచి, వారలతోడ నా రాజవరులు మాధవుండు విన నిట్లనిరి.

10.2-1047-మత్తేభ విక్రీడితము

మనశాస్త్రంబులువాక్కులున్మనములున్మాంగల్యముంబొందిపా
వనమై యొప్పెడి నే రమావిభుని భాస్వత్పాదపంకేజ సే
చనతోయంబుల నే మహాత్ముని పదాబ్జాతంబు లెందేని నోఁ
కినచో టెల్లను ముక్తి హేతువగు, నీ కృష్ణుండె వో! చూడఁగన్.

10.2-1048-చంపకమాల

సనక సనందనాది మునిసత్తము లంచిత యోగదృష్టిచేఁ
బనివడి యాత్మలన్ వెదకి పట్ట నగోచరమైన మూర్తి యి
ట్లనవరతంబు మాంస నయనాంచల గోచరుఁ డయ్యెనట్టె! యే
మన నగు? వీరిపుణ్యమున కాదట నెట్టితపంబు సేసిరో?

10.2-1049-మత్తేభ విక్రీడితము

నిరయస్స్వర్గము లాత్మఁ గైకొనక తా నిర్వాణమూర్తైన యీ
హరిఁ జూడన్, హరితోడఁ బల్కు, హరిమే నంటన్, హరిం బాడఁగా
హరితో నేఁగ, సహాసనాస్తరణ శయ్యావాసులై యుండఁగన్
హరి బంధుత్వసఖిత్వముల్ గలుగు భాగ్యం బెట్లు సిద్ధించెనో?

10.2-1050-తేటగీతి

అనుచు యాదవ వృష్ణి భోజాంధకులును
హరిదయాలబ్ధనిఖిలార్థు లగుచు నున్న

మనికిఁ దమ చిత్తములఁ బలుమాఱుఁ బొగడి
పరిణమించిరి; యంత న ప్పాండుమహిషి.

10.2-1051-వచనము

అప్పుడు.

10.2-1052-కంద పద్యము

తన సుతులకు గాంధారీ
తనయులు గావించు నపకృతంబుల కాత్మన్
ఘనముగ నెరియుచు నచ్చటఁ
గనుఁగొనె వసుదేవు విగతకల్మషభావున్.

10.2-1053-వచనము

అట్లు గనుంగొని యతనితో నిట్లనియె.

## 10.2-75- కుంతీదేవి దుఃఖంబు

10.2-1054-కంద పద్యము

ఓ యన్న! పాండుతనయులు
నీ యల్లుం డ్రడవులందు నెఱి మృగములతోఁ
బాయని యిడుమలఁ బడఁ గరు
ణాయత్తుల రగుచు మీర లరయఁగ వలదే?

10.2-1055-వచనము

అని బహుప్రకారంబుల సంతాపించుచు మఱియు నిట్లనియె.

10.2-1056-కంద పద్యము

అతిబలవంతము విధి దాఁ
బ్రతికూలంబైనఁ గలరె బంధువు? లనుచున్
ధృతి గలఁగ బాష్పజలపూ
రితలోచన యగు సహోదరిం జూచి యనెన్.

10.2-1057-సీస పద్యము

తల్లి! నీ కేల సంతాపింప మనమునఁ;
 దలవఁక విధినేల సొలసె? దింత
యఖిల నియామకుండగు నీశ్వరుఁడు మాయ;
 యవనికాంతరుఁడైన యట్టి సూత్ర
ధారుని కైవడిఁ దగిలి నటింపఁగ;
 మనుజులు కీలుబొమ్మలు దలంపఁ;
గావున విధిసేఁతఁ గడిచి వర్తింపంగ;
 దేవతలకునైనఁ దీఱ; దట్లు

10.2-1057.1-తేటగీతి

క్రోధచిత్తుండు కంసుఁడు బాధవఱుప
నిలయములు దప్పి నే మడవులఁ జరింప
ఘనకృపానిధి యీ హరి గలుగఁబట్టి
కోరి మా కిండ్లు గ్రమ్మఱఁ జేరఁ గలిగె.

10.2-1058-వచనము

అని యూరడిలం బలుకు నవసరంబున.

## 10.2-76- నందాదులు చనుదెంచుట

10.2-1059-కంద పద్యము

నందయశోదలు గోపక
బృందంబులు గోపికలును బిరిగొని పరమా
నందంబునఁ జనుదెంచిరి
మందరధరుఁ జూచువేడ్క మనములఁ బొడమన్.

10.2-1060-వచనము

ఇట్లు సనుదెంచి.

10.2-1061-కంద పద్యము

అతిచిరకాల సమాగతు
నతని నిరీక్షించి వృష్ణి యాదవ భోజ
ప్రతతులు నెదురేఁగి సము
న్నతితో నాలింగనములు నడపిరి వరుసన్.

10.2-1062-కంద పద్యము

వసుదేవుఁడు వారికి సం
తసమునఁ గావించె సముచితక్రియ లంతన్
ముసలియు హరియును మ్రొక్కిరి
వెస నందయశోదలకును వినయం బెసఁగన్.

10.2-1063-వచనము

అట్లు నమస్కృతులుసేసి, యాలింగనంబులు గావించి, నయనారవిందంబుల నానందబాష్పంబుల దొరఁగ నఱలేని స్నేహంబులు చిత్తంబుల నత్తమిల్ల నేమియుం బలుకకుండె; రంత నయ్యశోదాదేవి రామకృష్ణుల నిజాంకపీఠంబుల నునిచి యక్కునం గదియందిగిచి, చెక్కిలి ముద్దుగొని, శిరంబులు మూర్కొని, చిబుకంబులు పుడుకుచుఁ, బునఃపునరాలింగనంబులు గావించి, పరమానందంబునం బొందుచు నున్నంతఁ బదంపడి.

10.2-1064-చంపకమాల

స్థిరమతితోడ రోహిణియు దేవకియుం దగ నందగోప సుం
దరిఁ గని కౌఁగిలించికొని తత్కృతులెల్లఁ దలంచి యింతి! నీ
వరుఁడును నీవు బంధుజనవత్సలతన్ మును చేయుసత్కృతుల్
మఱవఁగ వచ్చునే? తలఁప మా కిఁక నెన్నఁటికిం దలోదరీ!

10.2-1065-కంద పద్యము

జననం బందుట మొదలుగ
ఘనమోహముతోడఁ బెంచు కతమునఁ దమకున్
జననీ జనకులు వీరని
మనమునఁ దలపోయలేరు మము నీ తనయుల్.

10.2-1066-కంద పద్యము

అంటిన ప్రేమను వీరిం
గంటికి ఱెప్పడ్డమైన గతిఁ బెంపఁగ మా
కంటెన్ నెన రౌటను మీ
యింటన్ వసియించి యుండి రిన్నిదినంబుల్.

10.2-1067-వచనము

అని యిట్లు ప్రియాలాపంబులు పలుకుచుండు నవసరంబున గోపాలసుందరు లమందానంద కందళితహృదయ లయి హృదయేశ్వరుం డైన గోవిందుఁడు చిరకాలసమాగతుం డగుటం జేసి, యతనిం జూచు తలంపు లుల్లంబుల వెల్లిగొనం జేరి.

10.2-1068-చంపకమాల

నళినదళాక్షుఁ జూచి నయనంబులు మోడ్వఁగఁ జాల కాత్మలన్
వలచి తదీయమూర్తి విభవంబు దలంచుచుఁ గౌఁగిలించుచుం
బులకలు మేన జాదుకొనఁ బొల్తులు సొక్కిరి బ్రహ్మమున్ మనం
బులఁ గని చొక్కు యోగిజనముం బురుడింపఁగ మానవేశ్వరా!

10.2-1069-చంపకమాల

పొలఁతుల భావ మాత్మఁ గని ఫుల్లసరోరుహలోచనుండు వా
రలనపు డేకతంబునకు రమ్మని తోకొని పోయి యందు న
ర్మిలిఁ బరిరంభణంబు లొనరించి లసద్దరహాసచంద్రికా
కలిత కపోలుఁడై పలికెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్.

10.2-1070-చంపకమాల

వనజదళాక్షులార! బలవద్రిపు వర్గములన్ జయింపఁగాఁ
జని తడవయ్యెఁ; దీనికి భృశంబుగ మీ మది నల్లకుండుఁడీ!
యనయము దైవ మిట్లు సచరాచరజాలము నొక్కవేళఁ గూ
ర్చును నొకవేళఁ బాపును మరుద్ధతతూల తృణంబులం బలెన్.

10.2-1071-సీస పద్యము

తరలాక్షులార! మద్భక్తి చేతనులకుఁ;
 దనరు మోక్షానందదాయకంబు
జప తపో వ్రత దాన సత్కర్మముల ముక్తిఁ;
 కలుగంగ నేరదు కానఁ దలఁప
విధి శివ సనకాది విమలచిత్తంబులఁ;
 బొడమని భక్తి మీ బుద్ధులందు
జనియించె మీ పూర్వ సంచితసౌభాగ్య;
 మెట్టిదో యది తుదముట్టె నింక

10.2-1071.1-తేటగీతి

నటమటము గాదు మీకు నెన్నఁటికి నైనఁ
గలుగనేరవు నిరయసంగతములైనఁ
జన్మకర్మము లిటమీఁద మన్మనీష
సుమహితధ్యానలార! యో! రమణులార!

10.2-1072-సీస పద్యము

అఖిలభూతములకు ననయంబు నాది మ;
 ధ్యాంతరాంతర్బహిర్వ్యాప్తి నైన
ఘటపటాదిక భూతకార్యంబులకు నుపా;
 దానకారణములై తనరునట్టి
గగనానిలానలకక్ష్మోణులను భూత;
 పంచకం బైక్యత వడయుఁ గాదె

లోకంబులందుఁ బంచీకరణవ్యవ;
స్థలచేత నట్టి భూతముల రీతి

10.2-1072.1-తేటగీతి

గగనముఖభూత తత్కార్యకారణములఁ
దగిలి యాధార హేతుభూతంబ నైన
నాకుఁ బర మన్య మొక్కఁ డెన్నంగ లేడు
విమలమతులార! మాటలు వేయునేల?

10.2-1073-తేటగీతి

అనినఁ దెలివొంది వారు దేహాభిమాన
ములు సమస్తంబు విడిచి యో! నలిననాభ!
నిఖిలజగదంతరాత్మ! మానిత చరిత్ర!
భక్తజనమందిరాంగణపారిజాత!

10.2-1074-తేటగీతి

ఘోరసంసారసాగరోత్తారణంబు
ధీయుతజ్ఞానయోగి హృద్ధ్యేయవస్తు
వగుచుఁ జెలువొందు నీ చరణాంబుజాత
యుగళమును మా మనంబులఁ దగుల నీవె.

10.2-1075-కంద పద్యము

అని వేడినఁ గృష్ణుఁడు ముని
వినతుఁడు కరుణించి వల్లవీజనములుగో

రిన యట్ల యిచ్చెఁ గరుణా
వననిధి సద్భక్త లోకవత్సలుఁ డంతన్.

10.2-1076-ఉత్పలమాల

ధర్మతనూభవుం గని పదంబులకున్ నతుఁడై సపర్యలన్
నిర్మలభక్తిమై నడపి నీవును దమ్ములు బంధుకోటి స
త్కర్మ చరిత్రులై తగు సుఖంబుల నొప్పుచునున్న వారె నా
నర్మిలిఁ బాండవాగ్రజుఁడు నమ్మధుసూదనుతోడ నిట్లనున్.

10.2-1077-కంద పద్యము

సరసిజనాభ! భవత్పద
సరసీరుహ మాశ్రయించు జను లతిసౌఖ్య
స్ఫురణం బొలుపారుచు భువిఁ
జరియింపరె! భక్త పారిజాత! మురారీ!

10.2-1078-వచనము

అదియునుం గాక,

10.2-1079-సీస పద్యము

సుమహిత స్వప్న సుషుప్తి జాగరములన్;
మూఁడవస్థలఁ బాసి వాఁడి మిగిలి
వెలినుందు లో నుందు; విశ్వమై యుందువు;
విశ్వంబు నీయందు వెలుఁగుచుండు;
భవదీయ మహిమచేఁ బాటిల్లు భువనంబు;

లుదయించు నొక వేళ నుడిగి మఱుగు;
సంచితా ఖండిత జ్ఞానివై యొప్పుచు;
నవిహత యోగమాయాత్మఁ దనరి

10.2-1079.1-తేటగీతి

దురితదూరులు నిత్యముక్తులకుఁ జెంద
నలవియై పెంపు దీపింతు వంబుజాక్ష!
ఘనకృపాకర! నఖిలవికారదూర!
నీకు మ్రొక్కెద సర్వలోకైకనాథ!

10.2-1080-కంద పద్యము

అని వినుతించిన నచ్చటి
జనపాలక బంధుమిత్ర సకలజనములున్
విని యనురాగిల్లిరి నె
మ్మనముల నానంద జలధిమగ్నులు నగుచున్.

10.2-1081-తేటగీతి

అట్టి యొప్పుగువేళ నెయ్యంబు మెఱసి
యొక్కచోటను సంతోషయుక్తు లగుచు
దానవాంతక సతులును ద్రౌపదియును
గూడి తమలోన ముచ్చట లాడుచుండి.

## 10.2-77- లక్షణ ద్రౌపదీ సంభాషణంబు

10.2-1082-వచనము

అట్టియెడఁ గృష్ణకథావిశేషంబులు పరితోషంబున నుగ్గడించుచుఁ బ్రసంగ వశంబున నా రుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణుభార్యలం గనుంగొని పాంచాలి యిట్లనియె. "మిమ్ముఁ బుండరీకాక్షుండు వివాహంబయిన తెఱంగులు వినిపింపుఁడన వారును దమ పరిణయంబుల తెఱంగులు మున్ను నే నీకుం జెప్పిన విధంబున వినిపించి; రందు సవిస్తరంబుగాఁ దెలియం బలుకని మద్రరాజకన్యకా వృత్తాంతం బా మానిని పాంచాలికిం జెప్పిన విధంబు విను మని శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

10.2-1083-సీస పద్యము

పాంచాలితో మద్రపతిసుత యిట్లను;
 సంగీతవిద్యా విశారదుండు
నారదుచేతి వీణాస్వనకలిత మై;
 నట్టి గోవింద కథామృతంబు
దవిలి యేఁ గ్రోలి చిత్తము దన్మయత్వంబు;
 నొంది మోదించుచు నుండునంత
దుహితృవత్సలుఁడు మద్గురుఁడు దా నది విని;
 సదుపాయ మొక్కటి మదిఁ దలంచి

10.2-1083.1-తేటగీతి

చదల నెబ్బంగి నైన గోచరము గాక
వారి మధ్యములో నభివ్యాప్తి దోఁచు
మత్స్యయంత్రంబు కల్పించి మనుజు లెంత
వారి కైనను దివ్వ మోవంగరాని.

10.2-1084-తేటగీతి

ధనువుఁ బవిచండ నిష్ఠురాస్త్రంబు నచట
సంచితంబైన గంధపుష్పాక్షతలను
బూజగావించి యునిచి యే పురుషుఁ డేని
నిద్ధబలమున నీ చాప మెక్కు వెట్టి.

10.2-1085-కంద పద్యము

ఈ సాయకంబు నారిం
బోసి వెసన్ మత్స్యయంత్రమున్ ధరఁ గూలన్
వేసిన శౌర్యధురీణుఁడు
నా సుత వరియించు నని జనంబులు వినఁగన్.

10.2-1086-కంద పద్యము

చాటించిన నవ్వార్తకుఁ
బాటించిన సంభ్రమముల బాణాసన మౌ
ర్వీ టంకార మహారవ
పాటితశాత్రవులు బాహుబల సంపన్నుల్.

10.2-1087-కంద పద్యము

సుందరతనులు దదుత్సవ
సందర్శనకుతుకు లమిత సైన్యులు భూభృ
న్నందను లేతెంచిరి జన
నందితయశు లగుచు మద్రనగరంబునకున్.

10.2-1088-కంద పద్యము

చనుదెంచిన వారికి మ

జ్జనకుఁడు వివిధార్చనములు సమ్మతిఁ గావిం

చిన నా బాహుబలాఢ్యులు

ధనువుం జేరంగ నరిగి ధైర్యస్ఫూర్తిన్.

10.2-1089-వచనము

ఇట్లు డగ్గఱి యద్ధనువుం గనుంగొని.

10.2-1090-ఉత్పలమాల

కొందఱు పూనలేక చనఁ గొందఱు పూని కదల్పలేక పోఁ,

గొంద ఱొకింత యెత్త నొక కొందఱు మోపిడలేక దక్కఁగాఁ,

గొంద ఱొకింత యెక్కిడుచుఁ గోరి నృపాలకు లిట్లు సిగ్గునుం

జెంది తలంగి పోవుచును సీ యిటకేఁగుట నీతి తప్పనన్.

10.2-1091-వచనము

అట్టియెడ.

10.2-1092-కంద పద్యము

భీముఁడు రాధేయుఁడు ను

ద్దామగతిన్నెక్కు ద్రోఁచి తగ నమ్మినం

బేమఱక దిరుగుచుంటయుఁ

దామేమియు నెఱుఁగలేక తలఁగిన పిదపన్.

10.2-1093-కంద పద్యము

